# ఆంధ్రదేశ చరిత్ర - భూగోళ సర్వస్వము




## ముఖ చిహ్నము

సర్వస్వము ముఖచిహ్నమును గూర్చి రెండు మూడుమాటలు నడుమనున్న పూర్ణకుంభము అమరావతీశిల్పములందలి చిత్రము లతలు పద్మములు దాని కంఠసీమను శోభిల్లచేయుచున్నవి ఇదివర్తమాన ఆంధ్రప్రదేశ రాజ్యచిహ్నము దీనిని వామభాగమునుండి ఆదివరాహమును కుడివైపునుండి వివృతాస్యమైన సింహమును రక్షాదక్షులై అభివీక్షించుచున్నవి ప్రాచీనరాజన్యులైన ఇక్ష్వాకువంశము వారికిని విష్ణుకుండినులకును సింహము రాజలాంఛనమని చెప్పబడుచున్నది తూర్పుచాళుక్యులు కాకతీయులు మున్నగు వారిది వరాహలాంఛనము ప్రాచీనరాజచిహ్నములు వర్తమాన రాజ్యచిహ్నముపై శుభవీక్షణములువరపుట ఆంధ్రసంస్కృతి యుగయుగీన విజయ యాత్రకు ప్రతీక ఆంధ్రత్వమాంధ్ర భాషాచ। నాఽల్పస్యతపసః ఫలమ్॥ అనునది మహా విద్వాంసులైన అప్పయ్యదీక్షితులవారి సూక్తియని పెద్దలవలన వినికిడి

| | |
|---|---|
| భావకల్పన | శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం |
| సామగ్రీసేకరణ | శ్రీ కొమాండూరి వెంకటాచారి |
| చిత్రనిర్మాణము | శ్రీ వి మధుసూదనరావు |
| బ్లాకుతయారీ | శ్రీ డాన్ & కంపెనీ సికింద్రాబాదు |

ఆంధ్రత్వ మాంధ్రభాషాచ
నాల్పస్య తపసః ఫలమ్

ఆంధ్రదేశ చరిత్ర

# భూగోళ సర్వస్వము

మొదటి సంపుటము

అం - అల్లా

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం ఎం. ఏ.
అధ్యక్షులు సంపాదకీయవర్గము

భారత ప్రభుత్వ ఆంధ్రప్రదేశ ప్రభుత్వముల
ధనసహాయముతో ప్రచురింపబడినది

ప్రకాశకులు
ఆంధ్ర రచయితల సంఘము
విద్యానగరు హైదరాబాదు (44)
*1971*

# తొలిపలుకు

ఆంధ్రదేశపు ప్రాచీనమును అధునికమును అయిన ప్రాభవమునకు విజయపతాక మైన ఆంధ్రులచరిత్ర - భూగోళ - సర్వస్వము మొదటి సంపుటమును ఆంధ్రావళి మ్రోల ఉంచుటకు సంతసించుచున్నాము ఆంధ్రరచయితలసంఘమువారి చిరకాల వాంఛాలత ఆలస్యముగనైనను ఒక మొగ్గ తొడుగుట ఆనందదాయకముగా ఉన్నది కాలమును దైవమును అనుకూలించినచో అచిరకాలములోనే ఈ పందిరి పూవులతో కళ కళలాడునని ఆశించుచున్నాము

*ఉద్దేశము*

ఆంధ్ర సంస్కృతికిని ఆంధ్రదేశమునకును ఆంధ్ర ప్రజానీకమునకును నివాళులు పట్టుటయే ఈ సర్వస్వముయొక్క ముఖోద్దేశము ఎట్లు? ఒంటరితనము లోనా? కాదు భారతదేశంలో భారతప్రజానీకంలో అంతర్భాగముగా అలనాడు తీర్థ యాత్రా సందర్భముగా అర్జునుడు ఇంద్రప్రస్థ పురమునుండి దక్షిణాంబునిధి తీరము వరకు విజయయాత్ర సాగించినా ఈ నాడు శ్రీకానూరులక్ష్మణరావు మహాశయుడు దేశమునందు అన్నసమృద్ధిని గోరి గంగా జలమును కావేరీ తరంగములతో సంగమింప చేయవలెనని సంకల్పించినా వారికిగాని వీరికిగాని వేంగి దేశమును సేవింపకుండ వెళ్ళు టకు వీలులేదు గదా వేగి దేశమనగా ఆంధ్రదేశమే ఇట్లు సహస్రాబ్దముల భారత దేశ చరిత్రలో ఆంధ్రదేశము అపరిహార్యము మనము తరించి ఇతరులను తరింప జేయ వలెనని పెద్దలు చెప్పుదురు మన పుట్టు పూర్వోత్తరములు మన సత్యచరిత్రమును ముందుగా మనము ఎరుగవలెను తరువాత మృదువుగా ఇతరులకు తెలియజెప్ప వలెను కావుననే మేము ఇట్లాలపింతుము

ఆంధ్రదేశపు మట్టి - అది మాకు కనకము ఆంధ్రదేశపు నీరు - అది మాకు అమృతము ఇక్కడ మనకు మన ప్రాచీనకవులే ప్రమాణము నన్నయభట్టారకుడు (ఆంధ్రమహాభారతము ఆదిపర్వము - ఆశ్వా - 8 పద్య-189) దక్షిణగంగనాదద్దయు" శ్రీనాథకవీంద్రుడు (భీమేశ్వరపురాణము ఆశ్వా - 4-పద్య 25) తనతీరంబును బాయ కున్న తెనాలిరామకృష్ణుడు (పాండురంగమాహాత్మ్యము ఆశ్వా - 1 పద్య - 189) గగా సంగమ మిచ్చగించునె ఇది ఆంధ్రమహాకవుల సంప్రదాయమే కాదు భారత దేశపు ప్రాచీన మహర్షుల సంప్రదాయము కూడ

ఇమమ్ మే గంగే యమునే సరస్వతి
శుతుద్రిస్తోమగ్ం సచతాపరుష్ణియా"

ఆంధ్రుల యశోగీతిని గానము చేయుటకు మనకును విని ఆనందించుటకు లోకమునకును అరమరికలు లేకుండుగాక

ఉద్దేశాంకురము ఇట్టి సర్వస్వమును సంగ్రహించవలెనను ఉద్దేశము ఆంధ్ర రచయితల సంఘమువారికి ఎట్లు కలిగినది జనరల్ కన్నింగుహాము బి.సి. లా మొదలగు మహావిద్వాంసులు భారతదేశపు పురాన స్థలములను గుర్తించి అధునిక పరిభాషలో చెప్పుటకు ప్రాచీన భరతదేశ భూగోళములను శ్రమపడి నిర్మించిరి వాటిని చూచినప్పుడు ఆంధ్రదేశమునకు గూడ ఇట్టి సేవ చునన బాగుండును అను భావము మాకు కలిగెను ఆంధ్రదేశచరిత్ర కూడ కడు ప్రాచీన మగుటచే ఇట్టి గుర్తింపు అవశ్యకము అనిపించెను మాకన్న ముందే ఈ శుభ సంకల్పము కలిగి స్వర్గీయ కుందూరిఈశ్వరదత్తుగారు ప్రాచీనాంధ్రభూగోళము" అను గ్రంథమును సమకూర్చి ప్రకటించిరి వారు మార్గదర్శకమును ప్రశంసనీయమును అగు కృషి గావించిరనుట నిశ్చయము అయినను ఆ గ్రంథము అసమగ్రమైనదిగా గోచరించినది ఈశ్వరదత్తుగారే కాక మన ప్రముఖ చారిత్రకులందరును ముఖ్యముగా మల్లంపల్లి సోమశేఖరశర్మగారు డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు డాక్టరు మారేమండరామారావుగారు మున్నగువారు ఆ యా సందర్భములలో ప్రాచీనాంధ్ర భౌగోళిక విశేషములను నిరూపించుచునే వచ్చిరి వీని నన్నిటిని ఏకముఖము చేయ వలసిన ప్రమేయమును మాకు స్ఫురించెను

ప్రాచీన మహాపురుషులు

ఆంధ్రదేశ వైభవము దాని ప్రాచీన స్థలములందే కాదు ఆ రంగస్థలములందు నటించిన మహావ్యక్తుల చరిత్రను కూడ తిరిగి చెప్పవలెననే ఉద్దేశమును మాకు కలిగినది

వర్తమాన వైభవము

మంచిదే ఆంధ్రదేశపు ప్రాచీన వైభవమును సంస్తుతించుచున్నాము కాని వర్తమానము మాటేమిటి ? ఆంధ్రదేశముయొక్క ఆధునిక భూగోళము మాత్రము తక్కువ రంగులు కలదియా అసలు వర్తమానము లేని భూతము ఎట్లు ? గోడ ఉన్న కదా చిత్రలేఖనము మనకు తెలియకుండగనే మన కనుల యెదుటనే ఆంధ్రసంస్కృతి మహత్తర పరిణామమునకు లోనగుచున్నది మహనీయమైన ఆంధ్రచరిత్ర యావద్భారత చరిత్రలో అంతర్వాహినిగా జలజల ప్రవహించుచున్నది దీనిని ఉపేక్షించు టెట్లు ?

కావున ఆంధ్రదేశపు వర్తమాన భూగోళము కూడ ఈ సర్వస్వములో ఉపాదేయమైనది వాస్తవమునకు చరిత్ర - భూగోళము అనునవి ఈనాటివి కావు అవి

బ్రహ్మాండ సృష్టి యందలి మహాభావములకు ప్రతీకలు అవ్యక్తమునుండి వ్యక్తము ప్రభవించుచున్నది వ్యక్త పదార్థమునకు నామరూపములు వ్యవహార చిహ్నములు అశోకుడు గౌతమీపుత్రశాతకర్ణి శ్రీకృష్ణదేవరాయలు మొదలగు నామములే చరిత్రకు మూలాధారము నదులు కొండలు చెరువులు మున్నగు స్థలవికారములే రూపము ఈ రెంటిని తెలియక పదార్థ తత్త్వమే అవగతము కాదు

అది యట్లుండె వర్తమాన ఆంధ్రభూగోళమును ఎట్లు ప్రదర్శించుట అను సమస్య ఎర్పడెను స్థలము అన్నపుడు మేము నగరములు పల్లెలు నదులు వాగులు పర్వతపంక్తులు గుట్టలు చెరువులు కాలువలు రేవు స్థానములు రైల్వే కూడలులు విమానాశ్రయములు పారిశ్రామిక కేంద్రములు మొదలగు పెక్కు భూగోళ సన్నివేశములను ప్రదర్శింప బూనినాము ఆంధ్రదేశములోని నగరములు పల్లెలు అన్నింటిని ఈ గ్రంథములో ప్రవేశపెట్టుట సాధ్య మనిపించలేదు అట్టి విస్తృత కార్యక్రమమునకై కావలసిన ఆర్థిక స్తోమత ఈ సంఘమునకు లేకపోవుటచే కార్యక్షేత్రమును కొంచెము సంకుచింప చేయుట అనివార్య మయ్యెను ఇప్పటి ఎర్పాటును బట్టి మూడు వేల జనాభాగాని అంతకు మించిన జనాభాగాని కల పట్టణము లను గ్రామములను ఈ సర్వస్వములో వర్ణింప దలచినాము 1961 సంవత్సరపు జనాభా పరిగణనము ఆధారముగా ప్రకటింపబడిన గ్రామముల పట్టికలను మేము ప్రాతి పదికగా తీసుకొన్నాము ఆ పట్టికలు ఆంగ్లభాషలో మాత్రమే లభించుటచే గ్రామ ముల పేర్ల ఉచ్చారణము నందు లోపములు సంభవించినవి వాటిని యథాసాధ్య ముగ దిద్దినాము ఈ గ్రామ పట్టికలను ప్రభుత్వమువారు తెలుగులో ప్రకటించినచో పరిశోధకులకు ఉపకారకముగా నుండును

ఇటీవల 1971 సంవత్సరములో మరియొక జనాభా పరిగణనము జరిగినది మేము ప్రాతిపదికగా తీసుకొన్న సంవత్సరమునకును ఇప్పటికిని పది సంవత్సరముల వార ఏర్పడి నది ఇదివరలో మూడు వేల జనాభాకు లోబడిన గ్రామములు ఎన్నియో ఇప్పుడు ఆపరిమితిని మించి యుండును అట్టివానిని గూర్చి ఆయా గ్రామవాసులు దయతో మా కార్యాలయమునకు తెలిపినచో వాటి వృత్తాంతములను గూడ చేర్చుటకు యత్నింతుము మాకు లభించిన సమాచారము ప్రకారము మొత్తము ఆంధ్రప్రదేశ్ లో ఆధు నికమైన నగరములు గ్రామములు 2169 ఉన్నవి వీనిలో 5000 జనాభాకు లోబడినవి 1488 5 వేలనుండి లక్షవరకు జనసంఖ్యగల పట్టణములు 676 లక్షకు మించిన జనాభాకల నగరములు మహానగరములు 10 అందును తెలంగాణాజిల్లాలలోని గ్రామ సంఖ్య 521 రాయలసీమలో 440 సర్కారు జిల్లాలలో 1208 గ్రామములని మేము చెప్పినప్పుడు మూడు వేల జనసంఖ్యగలవి మాత్రమే యని పాఠకులు గమనింప ప్రార్థన అంతకు తక్కువ జనాభాగల చిన్న గ్రామములు పల్లెలు పాలెములు గూడెములు

అసంఖ్యాకముగా ఉన్నవనుట మేము మరచలేదు వానిపై న్యచరిత్ర ఇప్పట్లో వ్రాయలేనందుకు చింతించుచున్నాము

జీవగ్రామముల విషయమున మూడువేల జనసంఖ్యా నియమము మేము పెట్టు కొన్నను చారిత్రక ప్రసిద్ధి గల్గి కాలగర్భమునందు మాటు మణిగి పోయిన స్థల విశేష ముల సందర్భమున ఈ నియమమును విడిచిపెట్టినాము అవి నేడు కుగ్రామము లైనను వాటి వర్ణనము ఈ సర్వస్వమునందు చేయ యత్నించినాము కొండాపురము వేగి మోటుపల్లి వంటి ప్రదేశము లీనాడు నామమాత్రావశిష్టములు కొన్ని నగరము లిప్పటి రాజకీయ విభాగములను బట్టి ఆంధ్రప్రదేశ్‌కు వెలుపల నుండవచ్చును అట్టి వానికి ఆంధ్రచరిత్రతో సంబంధముండుటచే వానిని గూడ గ్రహించినాము ఇది చరిత్ర దృష్టితో చేసినదియే కాని రాజకీయ వివాదములను సృష్టించుటకు కాదు

***వృత్తాంత సేకరణము*** మేము గ్రహించిన గ్రామముల నగరముల యున్నగువాని వర్తమాన పరిస్థితిని గురించి కైఫియతు సంపాదించు బాధ్యత మమ్మెదుర్కొనెను మేము ఉద్దేశించినరీతిలో వానిని గూర్చిన భోగట్టా ప్రభుత్వప్రచురణములందును లభించ లేదు కావున ఆంధ్రరచయితలసంఘమువారు దేశవ్యాప్తంగా వృత్తాంత సంగ్రాహకు లను(ఎన్యూమరేటర్లు)పంపించి ఆయా గ్రామముల ఇప్పటి పరిస్థితిని సర్వే చేయించిరి ఇట్లు నియమింపబడిన యువకులందరునూ శ్రద్ధతోను ఉత్సాహముతోను తమ కార్య భారమును నిర్వహించి ఒక అపూర్వ విజయమును సాధించినారు వారికి మేము ఇవ్వగలిగిన పారితోషిక మల్పము గ్రామవృత్తాంత సేకరణకై మా భూగోళవిభాగ సంపాదకులు సమగ్రమైన ప్రశ్నావళిని సిద్ధము చేసిరి ఈ ప్రశ్నావళి ఆధారముగ గ్రామముల పరిగణనము జరిగెను తెలంగాణము రాయలసీమలయందు మేము పెట్టు కొన్న మేరకు పరిగణనము పూర్తి అయినది గ్రామ సమగ్రముగా కొన్ని సర్కారు జిల్లాలలో ఈ పరిగణనము ఇంకను జరుగుచున్నది

గ్రామ వృత్తాంత సేకరణమునందు ప్రభుత్వాధికారుల సహకార సౌజన్యములు మాసంగ్రాహకులకు అవసరమనిపించెను ఈసందర్భమున స్థానికాధికారులకు తగుసూచన లిచ్చుటకై అప్పుడు రెవెన్యూశాఖామాత్యులైన శ్రీవల్లూరిబసవరాజుగారిని కోరగా వారు దయతో అట్టి అధికార పత్రమును జారీ చేయించిరి వారికిని మాకు తోడ్పడిన ఆయా జిల్లాకలెక్టరు మహాశయులకును మేము కృతజ్ఞతలు తెలుపుచున్నాము ఈ విధ ముగా సర్క్యులర్లు ఇప్పించి మా సంగ్రాహకుల పనిని సఫలము చేసినవారిలో అర్థిక గణాంకశాఖ బ్యూరో వారున్నూ కొన్ని బ్యాంకులవారును పేర్కొనదగియున్నారు తర్వాత తరువాత గ్రామ వృత్తాంత సేకరణమును తమ బ్లాకు అభివృద్ధి ఉద్యోగుల ద్వారా చేయించుకొనుటకు ప్రభుత్వమువారు రచయితలసంఘమునకు అనుమతి ప్రసా

దించిరి ఈ విధముగా ఒక అనధికారసంస్థ దేశవ్యాప్తముగా పరిమితపరిధిలోనైనను గ్రామ వృత్తాంత సేకరణ చేయగల్గుట ఒక అపూర్వ సన్నివేశముగనే మేము భావించు చున్నాము

పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమున కర్నలు మెకంజీగారు పండితులను పంపించి గ్రామ వృత్తాంత సేకరణము చేయించిరి మెకంజీ సంగ్రాహకులు సేకరించిన విష యములు మెకంజీ సంపుటములలో నిక్షిప్తములై యున్నవి అవి ప్రధానముగా ఆయా గ్రామముల పూర్వచరిత్రకు సంబంధించినవిగా గోచరించును చరిత్ర రచనకు ఆధారము కాగల విస్తారమైన ముడి సరుకు వానిలో భద్రపరుపబడి యున్నది ఆంధ్రరచయితల సంఘమువారి సంగ్రాహకులు ఆయా గ్రామముల వర్తమాన జీవితమును నవ్యచైతన్య మును ప్రధానముగ దృష్టిలో పెట్టుకొని పరిగణనము చేసిరి ఆగ్రామముల ఆర్థిక విద్యా వ్యావసాయిక పారిశ్రామిక విశేషములను సేకరించుటకు వీరు కృషి చేసిరి ఒక గ్రామ జీవితము ఆధునిక ప్రమాణముల ద్వారా ఎట్లు అభివృద్ధి ఉన్ముఖముగా ఉన్నది అభ్యుదయమునకు కావలసిన వనరులు ఎంతవరకు ఆగ్రామమునందు కలవు - మున్నగు విషయములను మేము సంకలనము చేయించుటకుయత్నించితిమి విద్యుదీకరణము జరిగినదా? జలసౌకర్యము విద్య వైద్య సంబంధమైన సౌకర్యములు ఎంతవరకు ఉన్నవి ఇత్యాది వివరములు కూర్చబడినవి ఇట్టి వృత్తాంతములు ప్రభుత్వమువారి అభివృద్ధి ప్రణాళికలకు ఆధార విషయములను సమకూర్చగలవని మాఆశ మరియు అభ్యుదయ పథమున నడచుచున్న గ్రామవృత్తాంతములను ఈసర్వస్వమునందు చదివి వెనుకబడియున్న గ్రామములవారును చైతన్యవంతులై తమతమ గ్రామముల ప్రగతికిని నడుము కట్టుదురని మాఆశయము

భూగోళ సందర్భమున మ్యాపుల ఆవశ్యకము వేరుగా చెప్పనక్కరలేదు భూగోళ పటములను ప్రామాణికమైనవానిని సేకరించుటయు మిక్కిలి శ్రమసాధ్య మయ్యెను సైనికావసరముల కొరకు తయారు చేయింపబడిన పటములను ముద్రిం చుటకు అనుమతియే దొరకదు ఆంధ్రదేశపు జిల్లాల పటములను తెలుగుభాషాసమితి వారు తమ తెలుగువిజ్ఞానసర్వస్వమునందును సంగ్రహాంధ్రవిజ్ఞానకోశసమితివారు తమ విజ్ఞానకోశ సంపుటములందును ప్రకటించిరి మేము మరికొంచెము ముందుకు పోయి ఆంధ్రదేశమునందలి తాలూకాల పటములను గూడ గీయించి ప్రచురించుటకు యత్నించుచున్నాము గ్రామ వృత్తాంతములతో పాటు తాలూకా జిల్లా వృత్తాంత ములను ఈ సర్వస్వమునందు చేర్చుటకు కృషి చేయుచున్నాము క్రొత్తగా ఏర్పడిన ఒంగోలుజిల్లా సరిహద్దులను సాధికారముగా నిర్దేశించు పటమునకై మేము చాల

కృషి చేసితిమి అట్టి పటము లభించలేదు ఎట్టకేలకు ఎవరో జౌత్తరాహులు ప్రక టించిన పటమును శరణ్యముగా తీసుకొనవలసివచ్చెను

మా యనుభవమును బట్టి మేము ఇట్లు భావించుచున్నాము ఆధునికాభివృద్ధికి కావలసిన వనరుల దృష్ట్యా ఇప్పటి ప్రగతిని చూపించు వివిధరకముల పటములు ఆంధ్ర దేశమునకు సంబంధించినవి మనకు కావలెను జలము విద్యుత్తు రోడ్లు ఖనిజములు అటవీసంపద ప్రాజెక్టులు యాత్రా స్థలములు మున్నగువానికి సంబంధించిన వేర్వేరు పటములు ఉండవలెను బహుశా ఇట్టివి ప్రభుత్వమువారి కడ ఉండియే యుండును లేనిచో ప్రభుత్వ వ్యవహారమే జరగదు కాని ఇట్టివేవియు సామాన్య జనులకును పరి శోధకులకును అందుబాటులో లేకుండుటచే వారు చీకటిలో దేవులాడుకొనువారి వలె ఉన్నారు ఆయాపటములను తెలుగు పేర్లతోను సమగ్రమైన గ్రామావళి పట్టికను తెలుగునందును ప్రకటించి ఆంధ్రదేశమును గురించిన జౌత్సుక్యము పరిజ్ఞానము ఆంధ్ర ప్రజానీకమునందు వ్యాపింపజేయు భారము ప్రభుత్వమువారిపై ఉన్నదని మనవి చేయుచున్నాము

గ్రామవృత్తాంతములే కాక కొన్ని గ్రామ సమూహముల ధనమును చెప్ప వలసియుండును ఈనాడు కొన్ని గ్రామములను కలిపి ఫర్కా సర్కిలు పంచాయతి సమితి మున్నగు విభాగములు ఏర్పరచినట్లే ప్రాచీన కాలమునందు కొన్ని గ్రామ సమూహములు ప్రాంతములు పరిపాలనా సౌకర్యమునకై ఏర్పాటు చేసినట్లు కాన్పించును వీటిని అహారము మండలము విషయము సీమ నాడు మున్నగు పేర్లతో వ్యవహరించుచుండిరి వీని సరియైన పరిహద్దులు నిర్ణయించుట ఈనాడు నికరముగ సాధ్యము కాకపోయినను స్థూలముగ వాటి వ్యాప్తినిగూర్చి చెప్పవలసి యుండును పూర్వకాలపు చరిత్రను సరిగా అవగతము చేసుకొనుటకు ఈనాడులు మున్నగువాని గుర్తింపు అవసరము ఇదియు సాధ్యమైనంతవరకు ఈగ్రంథములో చేసినాము

*చారిత్రక వృత్తాంతములు*

ఆంధ్రదేశపు చరిత్ర కథనమునకై అపారమైన ఆధారసామగ్రి లభించి యున్నది ఇప్పుడును లభించుచున్నది భవిష్యత్తులో ఎంతయో ఆధారసామగ్రి బయట పడగలదు చరిత్ర అన్నప్పుడు మేము పరిగ్రహించినవారు - రాజులు రాణులు మంత్రులు సేనానులు తత్వవేత్తలు విద్వాంసులు కవులు కళా విదులు శిల్పులు మున్నగువారు మతములను గూర్చియు వాఙ్మయము కవులను గూర్చియు వేరుగా గ్రంథసంచయము ఏర్పడియుండుటచే వాటిని గూర్చి ఈసర్వస్వము సంక్షిప్తముగ వ్రాయదలచితిమి ఆంధ్రేతరులైనను ఆంధ్రదేశాభ్యుదయము

నకు తోడ్పడిన మహనీయుల వృత్తాంతములను ఇందు చేర్చితిమి  చారిత్రకాధారము లలో మేము ప్రధానముగా శాసనములు నాణెములు వాస్తు అవశేషములు సంస్కృతము పర్షియనుభాష ఆంగ్లము ఆంధ్రభాష వీనియందలి గ్రంథములను విదేశీ యాత్రికుల కథనములను కైఫయత్తులు కవిలెలు మెకంజీసంపుటములు జిల్లాగెజిటీరులు మున్నగువానిని యథాసాధ్యముగ ఉపయోగించితిమి  ఆధారగ్రంథము లన్నియు లభింపకపోవుట మాకు కొంత సంతాపము కలిగించినది  వాస్తువిషయమున దేవాలయములు మసీదులు క్రైస్తవగుళ్ళు ప్రసిద్ధమైనవాటి వర్ణనమును చరిత్రను ఇందు చూడనగును ప్రముఖములైన విద్యావైజ్ఞానికసంస్థల ప్రశంసయు కలదు  ఇది అది అననేల ఆంధ్రుల జీవితము సంస్కృతికి సంబంధించినదానినెల్ల ఈగ్రంథమునందు ప్రతిఫలింపచేయుట మాలక్ష్యము

వ్యక్తులను గూర్చి మాత్రము వ్రాసినచో సమన్వయము సమగ్రచరిత్రదృష్టియు ఎర్పడక పోవచ్చునని పెద్దలు చేసిన సూచనలను శిరసావహించి రాజుల చరిత్రలనే కాక ఆంధ్రదేశమును పాలించిన అన్ని రాజవంశముల సమన్వయచరిత్రను గూడ ప్రదర్శించుటకు యత్నించితిమి  ఇట్లు ప్రాక్చరిత్రయుగము సాతవాహనులు ఇక్ష్వాకులు పల్లవులు శాలంకాయనులు విష్ణుకుండినులు ఆనందగోత్రులు తూర్పుచాళుక్యులు వెలనాటిపృథ్వీపతులు తెలుగుచోడులు కాకతీయులు రెడ్డి వెలమ ప్రభువులు విజయనగర సామ్రాజ్యము గోల్కొండ కుతుబుషాహీ వంశము తంజావూరు మధుర నాయకులు ఆసఫ్‌జాహీ వంశీయులు బ్రిటిషు పరిపాలనా యుగము భారత స్వాతంత్ర్యము అనంతర చరిత్ర ఇదంతయు ఇంద్రధనస్సునందలి మనోహర వర్ణ సమ్మేళనము వలె పాఠకుని మనోనేత్రముల ముందట యాతాయాతములు చేయును ప్రధాన రాజ కుటుంబములతో పాటు మధ్యయుగమునాటి పెక్కు చిన్న చిన్న రాజ్యముల యొక్కయు ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించినంతవరకు బహమనీ రాజ్యపు చరిత్రయు ప్రసక్తములగును

మతముల విషయమున గూడ రాద్ధాంతముల జోలికి పోక వాటిలోని ముఖ్య శాఖలు వారి తాత్త్విక చింతనము సిద్ధాంతములు సమన్వయ దృష్టి కొరకు ప్రదర్శింపబడును  మన దేశమునందిప్పుడంతగా ప్రచారములో లేకున్నను ఒకప్పుడు ఆంధ్రదేశమును తన శాంతి సందేశముచే పావనము చేసిన బౌద్ధమతమును జైనమతమును గూడ సంస్మరించుట మా ఆశయము

ప్రత్యేకమైన ఆంధ్రదేశచరిత్ర – ఆంధ్రసంస్కృతి ఉన్నను అఖిలభారత సంస్కృతిలో అవి సూత్రాధిష్ఠితములను విషయము విస్మరింపరానిది  వేర్పాటు భావములను

ప్రోదిచేయుట తగదు  కావున సందర్భానుసారముగ భారతదేశ చారిత్రక ఎన్ని వేళ ములను ఇందు చోటు చేసికొనుచున్నవి  ఆంధ్రసంస్కృతి  ఆంధ్రభాష  ఇరుగు పొరుగు సంస్కృతులచేతను భాషలచేతను ప్రభావితములగుటయు అన్యభాషా సంస్కృతు లను ప్రభావితము చేయుటయు మేము గుర్తించినాము  వాని యాదాన ప్రదానములు సమీక్షింపబడుచుండును  ఇట్లు వైవిధ్యము — సమన్వయము అను ద్రాసుపక్ష్యముతో యుగయుగముల ఆంధ్రజీవితరాశిని  తూచుటకు మేము చేసిన ప్రయత్నము సాహసో పేతమైనను సహృదయులైన ఆంధ్రమహాజనుల సాదర  మేదుర పరిశీలనకు పాత్రమగు నని ఆశించుచున్నాము

## కార్యవిధానము

చారిత్రకాధారముల నుండియు భౌగోళిక పరిగణనము వలనను సేకరించిన అపారమైన నామజాతమును అకారాది క్రమమున కూర్చితిమి  దీని స్వరూప మంతయు మేమిదివరలో ముద్రించియున్న "ఆంధ్రదేశచరిత్ర - భూగోళ సర్వస్వము- ముఖద్వారము  అను ప్రణాళికా గ్రథమునందు విపులముగ ప్రదర్శించితిమి  ఈ ముఖద్వారము సామాన్య పాఠకులకును విద్వాంసులకును గూడ పెన్నిధిగా ఉపయో గించునని మేము భావించుచున్నాము  ఒక వ్యక్తిని గూర్చిన భోగట్టా ఎక్కడ లభిం చును అన్నచో ముఖద్వారమును పరిశీలింపదగును ఒక గ్రామము ఏప్రాంతమునందు న్నది అని విచికిత్స వచ్చినపుడు ముఖద్వారము శరణ్యము కాగలదు  అయితే శాసన ములందును వాఙ్మయమునందును వచ్చు పేర్లన్నియు గ్రంథమునందు వచ్చుట సాధ్యముకాదు  అప్పుడది నిరుపయోగమైన నామావళిగా దిగజారిపోవును  కావున ఎసజ్జనునిగూర్చి ఎంత కొంచమైనను వాస్తవ వృత్తాంతము చెప్పుటకు వీలగునో అట్టి వ్యక్తులను మాత్రమే సర్వస్వమునందు సంస్మరించుట జరిగినది  అమరావతీ స్తూప శాసనములందువలె ఒక మదురురాయి దానము చేసిన కార్మికుడును మధ్యయుగము నందలి శాసనములందువలె ఒక్కదీపమును మాత్రము దానము చేసిన గృహస్థుడును కూడ మనకు ఉపాదేయులే  దానముయొక్క విలువకాదు — దానోద్దేశము మనకు పరిగణనీయమైనది  చారిత్రకాధారములు వాఙ్మయాధారము  మున్నగునవన్నియు ముఖద్వారమునందు ప్రస్తరింపబడియున్నవి  వ్యాసకర్తలు మేమిచ్చిన పరిమితాధార ములతో తృప్తిపడక విస్తృతాధారములను అవలోడనముచేసి నూత్న విషయసంభరితము లైన సమగ్ర కథనములను సంతరించుటకై  కోరబడినారు

## ఆర్థిక సమస్య

చరిత్ర - భూగోళసర్వస్వ భావన  ఏర్పడినప్పటి నుండియు  దీనిని  సాదర పరిశీలించి ఆర్థిక సహాయమునకై  ప్రభుత్వముదృష్టికి తెచ్చినవారు రాష్ట్రపతి

స్థాయియందు విద్యాశాఖ పూర్వపు డైరెక్టర్లు శ్రీ యల్ బుల్లెయ్యగారును శ్రీ యమ్ వి రాజగోపాలుగారును కేంద్రస్థాయియందు మాన్యశ్రీ దామోదరం సంజీవయ్యగారును శ్రీ భక్తదర్శనంగారును రెండవ దశయందు ప్రస్తుతవిద్యాశాఖ డైరక్టరు శ్రీ బి ప్రతాపరెడ్డిగారును విద్యాశాఖ కార్యదర్శి శ్రీ యస్ ఆర్ రామమూర్తిగారు విద్యాశాఖామాత్యులు మాన్య శ్రీ ఎ వి నరసింహారావుగారును ఈ యుద్యమమునకు సంపూర్ణమైన చేయూత నిచ్చినారు విద్యావిషయములందు అభిమానముగలవారైన ఆర్థికశాఖ కార్యదర్శి శ్రీయన్ రమేశన్‌గారును దీని నభిమానించిరి ఈ పెద్దలందరి సానుభూతివలన కేంద్రప్రభుత్వమువారును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారును చెరిసగము ప్రాతిపదికపై ఈ సర్వస్వమునకు ధనసహాయము చేయుట కంగీకరించి మమ్ము కృతజ్ఞతాబద్ధులను చేసిరి ఏ యుద్యమమునకైనను అంచనాల దశకును నిర్వహణ దశకును కాలవ్యవధి చాల గడచుటచే అనుకొన్న వ్యయముతో ప్రణాళికలు సాగుట దుర్ఘటనమగుచున్నది వస్తువుల ధరలును మిన్నుముట్టుచున్నవి కావున చరిత్ర భూగోళసర్వస్వ నిర్మాణమునందు ఆంధ్రరచయితల సంఘము వారు పంకిలిగువుతో నడుపవలసిన వారగుచున్నారు సంపుటములు వెలువడినకొలదిని అశేషాంధ్రప్రజానీకము విద్యాసంస్థలు గ్రంథాలయములు మున్నగువారందరును వాటిని కొని తద్రూపముగా ఈ కఠినమైన సాంస్కృతిక యాత్రయందుమాకు చేదోడువాదోడు కాగలరని విజ్ఞప్తిచేయుచున్నాము సర్వస్వనిర్మాణ సంకల్పముకలిగి పెద్దల యాశీస్సులను మార్గదర్శకత్వమును పొందుటకై ఆంధ్రరచయితలసంఘమువారొక విద్వత్సభను సమావేశపరచి యుండిరి ఆసభకు విచ్చేసి వెలలేని సలహాలను అందిచ్చి తోడ్పడిన ప్రముఖచారిత్రకులు ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు ప్రొఫెసరు హెచ్ కె షేర్వానీగారు డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు డాక్టరుమారేమండ రామారావుగారు డాక్టరు ఓరుగంటి రామచంద్రయ్యగారు మున్నగుపండితప్రకాండుల ఆదరముచేనైనను ఆంధ్రదేశచరిత్ర భూగోళసర్వస్వము ఉన్నత చారిత్రక ప్రమాణములను అందుకొనునని ఆశించుచున్నాము అదియట్లే కొనసాగుగాక యువరచయితలెందరో ముందుకు వచ్చుచుండుట ఉద్యమవిజయమునకు శ్రీరామరక్ష కాగలదు

మా కార్యకర్తలు శ్రీకొమాండూరివెంకటాచారిగారు మాడభూషి శ్వేతాద్రినాథముగారు తంగిరాలఆంజనేయశాస్త్రిగారు మొదలైనవారి కార్యదీక్షను హృదయపూర్వకముగ కొనియాడుచున్నాను సర్వస్వముయొక్క ముఖద్వారమును మొదటి

సంపుటమును జయప్రదముగ ముద్రించిన ఆంధ్రరచయితలసహకారసంఘ ముద్రణాలయము వారికి అభినందనములు

దుర్బలములైన వరిగడ్డిపోచలు పెంటిగా నేర్పడి మత్తమాతంగములైనను కట్టి వేయజాలుచున్నవి. అల్పసత్వుల సంఘటిత దీక్షాబలముచే సమగ్రమైన ఆంధ్రదేశ చరిత్ర భూగోళసర్వస్వమను ఐరావతము ఆంధ్రమాత ప్రాంగణమున ఎలువరింపబడక పోవునా?

*విరోధికృతు - ఆషాఢ*
*శుద్ధఏకాదశి - ఆదివారం*
*4 7 - 1971*

*కుందవల్లి లక్ష్మీరంజనం*
అధ్యక్షుడు

# ANDHRA WRITERS ASSOCIATION

VIDYANAGAR HYDERABAD 44

## MANAGING COMMITTEE MEMBERS

| | | |
|---|---|---|
| 1 | Prof K Lakshmi Ranjanam M A<br>Retd Prof & Head of th Dept of Telugu<br>O U Hyde bad | *President* |
| 2 | Dr B Rama Raju M A Ph D<br>Head of th Dept of Telugu<br>Post Graduat Centre Warangal | *Vice President* |
| 3 | Dr C Narayana Reddy M A Ph D<br>Reader in Telugu O U Hyderabad | *Vice-President* |
| 4 | Dr P Durgaiah M A Ph D<br>Reader in Telugu O U Hyderabad | *Secretary* |
| 5 | Dr G V Subrahmanyam M A Ph D<br>Reader in Telugu<br>Nizam College O U | *Jt Secretary* |
| 6 | Shri I Krishna Murthy M A<br>Lecturer in Telugu O U Hyderabad | *Treasurer* |
| 7 | Shri C Rangacharyulu<br>Reader in Telugu O U Hyderabad | *Member* |
| 8 | Shri K Balendu Sekharam M A<br>Principal S V E S Telugu Kalasala<br>Vidyanagar Hyderabad – 44 | |
| 9 | Dr P Yasoda Reddy, M A Ph D<br>Reader in Telugu Women s College Hyderabad | |
| 10 | Dr A Rajeswara Sarma M A Ph D<br>Reader in Telugu O U Hyderabad | |
| 11 | Shri P Krishna Murthy Sastry M A<br>4997 Second Bazar Secunderabad | |
| 12 | Sri M Balaramacharyulu<br>Artist Mahankali Street Secunderabad | |
| 13 | Shri Dasaradhi Krishnamacharyulu B A<br>All India Radio Madras | |
| 14 | Shri Kaloji Narayana Rao<br>Advocate Hanumakonda Warangal | |
| 15 | Shri B N Sastry M A<br>Narayanaguda Hyderabad | |

## Advisory Board for History including Literature

| | | |
|---|---|---|
| 1 | Prof M Venkata Rangaiah | *Maredpally Secunderabad* |
| 2 | Sri N Ramesan I A S | *Secretary Finance Dept*<br>*Government of Andhra Pradesh* |
| 3 | Prof H K Sherwani | *Himayatnagar Hyderabad* |
| 4. | Sri M V Rajagopal I A S | *Joint Secretary Fducation Editor*<br>*District gaz tteers* |
| 5 | Dr P S R Apparao | *Special Officer Telugu Akademy*<br>*Hyderabad* |
| 6 | Dr N Venkata Ramanayya | *Deputy Director*<br>*Department of Archaeology A P* |
| 7 | Dr O Ramachandraiah | *Prof and Head of the History Dept,*<br>*Andhra University Waltair* |
| 8 | Dr R Subrahmanyam | *Superintendent Archaeology S E*<br>*Circle Hyderabad* |
| 9 | Sri A Veerabhadra Rao | *Malakpet Hyderabad* |
| 10 | Dr G Narayan Swamy Reddy | *Prof and Head of the Telugu Dept*<br>*Sri Venkateswara University*<br>*Tirupathi Chittoo Dist A P* |
| 11 | Dr M Rama Rao | *Retd Prof Guntur* |
| 12 | Dr V M Reddy | *Head of the History Dept*<br>*Sri Venkateswara University*<br>*Tirupathi Chittoor District A P* |
| 13 | Dr Y Vithal Rao | *Head of the History Dept*<br>*W G B College Bheemavaram,*<br>*West Godavari District A P* |

## Editorial Committee for History



## Consultant scholars

## Editorial Committee for Telugu

1 Dr P Du g a *Reid r r T lu ju* *Editor & Co ivenor*
*Osmania Univ rsity Hyde abad*

2 Dr G V ubr hmaoy a *Me b r*
*Lecturer i Telugu*
*Nizam College Hyd rabad*

3 Dr P Madhava Sar na *R ader n Tel igu*
*Osmania Univ r i y Hyderabad*

4 Dr M Kul sekhara R o *R ade in Telugu*
*Osmania Univer ity Hyderabad*

5 Smt Dr P Yasoda Re ldy *L ctur r in Telu u*
*Osmania University Women s College Hyderabad*

## Editorial Committee for Sanskrit

1 Sri ( Ra a a yulu *Reader in Telugu* *Editor & Convenor*
*Osmania University Hyderabad*

2 Sri K Lak hmana Sastry *Member*
*Deputy Director Education Dept Hyderabad*

3 Dr P G Lal *Sanskrit Lecturer*
*Osmania University Hyderabad*

4 Sri Kesav pantula Nar si nha Sast y
*All India Radio Hyderabad*

5 Dr P Rama handrudu *S in k it Dept*
*Osmania University Hyderabad*

## Editorial Committee for Urdu Etc

1 Sri I Krishna Murthy *Lecturer in Telugu* *Editor & Convenor*
*Even ng College Hyderabad*

2 Dr Srirama Sarma *Hindi Lecturer* *Member*
*Evening College Hyderabad*

3 Dr B Bhimsena Josyulu *Lecturer in Hindi*
*Arts and Science College Secunderabad*

4 Dr Akberuddin Siddiki *Reader in Urdu*
*Arts & Science College Warangal*

5 Sri Ziauddin Ahmed *Archivist*
*State Archives Hyderabad*

## Advisory Board for Geography

1 Dr V L S Pr l a R o (f rme ly)
*Pr f a id Head f the Dept of Geography*
*Osma ua Unive sity Hyderabad*

D V V Raman tha a Prof & Head of the Commerce Dept
*Osmania Univers ty Hyderabad*

3 Dr C ut m Mathu *Prof of Economics*
*Osmania University Hyde abad*

4 Dr S Bal kr h na *Deput y Director*
*Nat onal Geo phys cal Research Institute Osmania University Hyderabad*

Dr D V A v dh ni *Prof & Head of the Telugu Dept*
*Osman a University Hyderabad*

6 Sri A V Krishnamraju *Head of the Geog aphy Dept*
*W G B College Bhimavaram West Godavari District A P*

7 Sr V Mall p raju *Lecturer W G B College*
*Bhimavaram West Godavari District*

## Editorial Committee for Geography

1 Prof K Lakshmi R njanam
*Retd Prof of Telugu*

2 Sr V Vidy nath — *Editor & Convenor*
*Osmania Univ rsity Hyderabad*

3 Sri M J S bramanyam — *Member*
*L cturer Geography Dept*
*Osman a Univ rsity Hyderabad*

4 Sri S v ji Mokk pati
*Reader in Econom s*
*Osman a University Hyderabad*

5 Sri B E Vij yam
*Lectur r n G ology*
*Osmania University Hyderabad*

6 Sri V j ya S athi
*Reader in Commerce*
*Osmania University Hyderabad*

— —→←— —

# ర చ యి త లు

| క్ర సం | పేర్ల పొడి అక్షరములు | వ్యాసకర్తల పేర్లు |
|---|---|---|
| 1 | అ మ | డా అబ్దుల్ మన్నన్ ఎం ఎ పి హెచ్ డి<br>హెడ్ ఆఫ్ ది పర్షియన్ డిపార్టుమెంట్<br>ఉస్మానియా యూనివర్సిటి హైదరాబాదు |
| 2 | అ కు | జస్టిస్ అల్లాడి కుప్పుస్వామి<br>ఆంధ్రప్రదేశ్ హైకోర్టు హైదరాబాదు |
| 3 | అ గో కృ | శ్రీ అ గోపాలకృష్ణమాచార్యులు ఎం ఎ<br>తెలుగు లెక్చరర్ ఎస్ వి ఇ ఎస్ తెలుగు కళాశాల<br>విద్యానగరు హైదరాబాదు |
| 4 | ఆ వెం | శ్రీ ఆలూరి వెంచయ్య ఎం ఎ<br>హిస్టరి లెక్చరర్ ఎస్ వి ఇ ఎస్ తెలుగు కళాశాల<br>విద్యానగరు హైదరాబాదు |
| 5 | ఇ సూ | డా ఇ సూర్యనారాయణమూర్తి ఎం ఏ పి హెచ్ డి<br>డిపార్టుమెంటు ఆఫ్ హిస్టరీ<br>ఆంధ్రయూనివర్సిటీ వాల్తేరు |
| 6 | ఉ శ్రీ | శ్రీ ఉప్పలపాటి శ్రీరామమూర్తి ఎం ఎ<br>తెలుగు లెక్చరర్ గవర్నమెంటు ఆర్ట్సుకాలేజి<br>అనంతపురము |
| 7 | ఎన్ సి ఎస్ వెం | సాహిత్య విశారద ఎన్ స ఎస్ వెంకటాచార్యులు<br>తెలుగు ఎకాడమీ హైదరాబాదు |
| 8 | ఓ స | శ్రీ ఓరుగంటి సత్యనారాయణ ఎం ఎ<br>హెడ్ ఆఫ్ ది హిస్టరి డిపార్టుమెంటు<br>హిందూ కాలేజి గుంటూరు |
| 9 | కె రా | శ్రీ కె రామకృష్ణశర్మ ఎం ఏ<br>తెలుగు లెక్చరర్ ఎస్ వి ఇ ఎస్ తెలుగు కళాశాల<br>విద్యానగరు హైదరాబాదు |

| క్ర సం | పేర్ల పొడి అక్షరములు | వ్యాసకర్తల పేర్లు |
|---|---|---|
| 10 | కె వి | శ్రీ కె విఠల్ రెడ్డి ఎం ఎ<br>జాగ్రఫీ లెక్చరర్ ఉస్మానియా యూనివర్సిటి<br>హైదరాబాదు |
| 11 | కె వి రా శా | డా కె వి రామకోటేశ్వరశాస్త్రి ఎం ఎ ఎ హెచ్ డి<br>రీడర్ తెలుగుశాఖ ఎ జి సెంటర్ వరంగల్లు |
| 12 | కె సు | డా కె సుప్రసన్నాచారి ఎం ఎ ఎ హెచ్ డి<br>తెలుగు లెక్చరర్ పి జి సెంటర్ వరంగల్లు |
| 13 | కె సు | శ్రీ కె సుబ్రహ్మణ్యం<br>కరణ అన్నదేవరపేట పశ్చిమ గోదావరి జిల్లా |
| 14 | కె సు | శ్రీ కె సురేంద్రరెడ్డి ఎం ఎ<br>జాగ్రఫీ లెక్చరర్ ఉస్మానియా యూనివర్సిటి<br>హైదరాబాదు |
| 15 | కొ గో కృ | డా కొ గోపాలకృష్ణారావు ఎం ఎ ఎ హెచ్ డి<br>రీడర్ తెలుగుశాఖ<br>ఉస్మానియా యూనివర్సిటి హైదరాబాదు |
| 16 | కో వెం | శ్రీ కోమాండూరి వెంకటాచార్యులు ఎం ఎ<br>రీసెర్చి స్కాలర్ నల్లకుంట హైదరాబాదు |
| 17 | ఖం ల రం | ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం ఎం ఎ<br>యు జి సి ప్రొఫెసర్ ఉస్మానియా యూనివర్సిటి<br>హైదరాబాదు |
| 18 | ఖం బా శే | శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం ఎం ఎ<br>ప్రిన్సిపాల్ ఎస్ వి ఇ ఎస్ తెలుగు కళాశాల<br>విద్యానగరు హైదరాబాదు |
| 19 | గ రా శ | పండిత గడియారం రామకృష్ణశర్మ<br>అలంపురము మహబూబునగర జిల్లా |
| 20 | గ ల కాం | శ్రీ గరికపాటి లక్ష్మీకాంతయ్య ఎం ఎ<br>రిటైర్డు సంస్కృతాంధ్రోపన్యాసకుడు<br>నిజాం కాలేజి హైదరాబాదు |

| క్ర స | పేర్ల పొడి అక్షరములు | వ్యాసకర్త పేర్లు |
|---|---|---|
| 21 | గు ర | శ్రీ గులాం రబ్బాని<br>[illegible] |
| 22 | చ రం | శిరోమణి చలమచర్ల రంగాచార్యులు<br>తెలుగు [illegible] యూనివర్సిటీ<br>హైదరాబాదు |
| 23 | జి అ | శ్రీ జియాఉద్దీన్ అహమ్మద్ ఎం ఎ<br>[illegible] హైదరాబాదు |
| 24 | జూ హ | శ్రీ జూలూరి హనుమంతరావు బి కాం<br>ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు హైదరాబాదు |
| 25 | తం ఆం శా | భాషాప్రవీణ తంగిరాల ఆంజనేయశాస్త్రి ఎం ఎ బి ఓ యల్<br>తెలుగు లెక్చరర్ [illegible] ఓరియంటల్ కాలేజి<br>నల్లకుంట హైదరాబాదు |
| 26 | త స | శ్రీ తల్లాప్రగడ సత్యనారాయణమూర్తి ఎం ఎ<br>హిస్టరీ లెక్చరర్ ఎ ఎల్ య కాలేజి<br>అనకాపల్లి విశాఖపట్టణ జిల్లా |
| 27 | తూ వే గో శా | శ్రీ తూ వేణుగోపాలశాస్త్రి ఎం ఎ<br>టెక్నికల్ అసిస్టెంటు సెంట్రల్ ఆర్కియలాజి సౌత్<br>ఈస్టరన్ సర్కిల్ విద్యానగరు హైదరాబాదు |
| 28 | తే స | శ్రీ తేరాల సత్యనారాయణ యం ఓ యల్<br>జిల్లా పరిషత్తు హైస్కూలు నల్లగొండ |
| 29 | ధ ప్ర | శ్రీ ధర్మేంద్రప్రసాద్ ఎం ఎ<br>జాగ్రఫీ లెక్చరర్ ఉస్మానియా యూనివర్సిటీ<br>హైదరాబాదు |
| 30 | ని శ్రీ సుం | శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావు బి ఓ యల్<br>మహాభారత ప్రాజెక్టు ఉస్మానియా యూనివర్సిటీ<br>హైదరాబాదు |
| 31 | నే భా ర | శ్రీమతి నేమాని భారతీరత్నాకరాంబ ఎం ఏ<br>మల్టీపర్పస్ గరల్సు హైస్కూలు<br>నారాయణగూడ హైదరాబాదు |

| క్ర సం | పేర్ల పొడి అక్షరములు | వ్యాసకర్తల పేర్లు |
|---|---|---|
| 32 | ప దు | డా పల్లా దుర్గయ్య ఎం ఎ ఎ హెచ్ డి<br>రీడరు తెలుగుశాఖ ఉస్మానియా యూనివర్సిటీ<br>హైదరాబాదు |
| 33 | పు వి | శ్రీ పుచ్చా విశ్వనాథం బి యస్ స<br>జాగ్రఫీశాఖ ఉస్మానియా యూనివర్సిటీ హైదరాబాదు |
| 34 | పు సూ | శ్రీ పులిపాక సూర్యప్రకాశరావు<br>కరణ అమృతలూరు గు టూరు జిల్లా |
| 35 | పు శ్రీ | డా పుల్లెల శ్రీరామచంద్రుడు ఎం ఎ ఎ హెచ్ డి<br>రీడర్ స స్కృతశాఖ ఉస్మానియా యూనివర్సిటీ<br>హైదరాబాదు |
| 36 | పెం వెం రా | శ్రీ పెండ్యాల వెంకటరామారావు ఎం ఏ<br>రిసెర్చి స్కాలర్ హైద్రాబాదు |
| 37 | బి అ | శ్రీ బి అప్పలనాయుడు బి కాం ఆనర్స్<br>జాగ్రఫీలెక్చరర్ ఎ యల్ య కాలేజి<br>అనకాపల్లి విశాఖపట్టణ జిల్లా |
| 38 | బి రా | డా బి రామరాజు ఎం ఎ ఎ హెచ్ డి<br>ప్రొఫెసర్ తెలుగు డిపార్ట్మెటు పి జి సెంటర్<br>వరంగల్లు |
| 39 | బి వి | శ్రీ బి విద్యాధరరావు యం యస్ స<br>ఆర్కియాలజికల్ అసిస్టెంట్ సౌత్ ఈస్టరన్ సర్కిల్<br>విద్యానగరు హైదరాబాదు |
| 40 | మ అ | శ్రీ మహమ్మద్ అహసనుద్దీన్ ఎం ఎ<br>టీచర్ దారుల్ఉలూమ్ హైస్కూలు హైదరాబాదు |
| 41 | మ కు | డా మడుపు కులశేఖరరావు ఎం ఎ ఎ హెచ్ డి<br>రీడర్ తెలుగుశాఖ నిజాం కళాశాల<br>ఉస్మానియా యూనివరి టీ హైదరాబాదు |
| 42 | మ త క | శ్రీ మహమ్మద్ తఖారిక్ కరీమ్ ఎం ఎ<br>రిటైర్డ్ హెడ్మాస్టర్ ఆసాఫియా హయ్యర్<br>సెకండరీస్కూలు హైదరాబాదు |

| క్ర సం | పేర్ల పొడి అక్షరములు | వ్యాఖ్యాకర్తల పేర్లు |
|---|---|---|
| 43 | మా దీ | కుమారి మాన్యాప్రగడ దీనావతి ఎం ఎ<br>రిసెర్చిస్కాలర్ హైదరాబాదు |
| 44 | మా శ్వే | శ్రీ మాడభూషి శ్వేతాద్రినాథం బి యస్ సి బి ఇడి<br>రిటైర్డ్ హెడ్‌మాస్టర్ హైదరాబాదు |
| 45 | యస్ కృ | శ్రీ యస్ కృష్ణారావు బి ఇ<br>రిటైర్డ్ ఇంజనీరు హైదరాబాదు |
| 46 | యస్ యన్ సి రా | శ్రీ యస్ యన్ సి రఘునాథాచార్యులు<br>సీనియర్ లెక్చరర్ శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్<br>కళాశాల వరంగల్లు |
| 47 | యస్ ర | శ్రీమతి యస్ రత్నమాంబ ఎం ఎ<br>తెలుగు లెక్చరర్ జె యం జె కళాశాల తెనాలి 2 |
| 48 | యస్ రా | శ్రీమతి యస్ రాజవల్లి బి ఎ యల్ టి<br>హైదరాబాదు |
| 49 | వా య దే | డా వారణాసి యశోదాదేవి ఎం ఎ పి హెచ్ డి<br>శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము<br>తిరుపతి చిత్తూరు జిల్లా |
| 50 | వా సు | శ్రీ వావిలాల సుబ్బారావు ఎం ఎ<br>తెలుగు లెక్చరర్ వి ? యన్ కాలేజి<br>అమరావతి గుంటూరు జిల్లా |
| 51 | వి మ | శ్రీ వి మల్లపరాజు ఎం ఎ<br>లెక్చరర్ డి యన్ ఆర్ కాలేజి<br>భీమవరం పశ్చిమ గోదావరి జిల్లా |
| 52 | వై వి | డా వై విఠల్‌రావు ఎం ఎ పి హెచ్ డి<br>డి యన్ ఆర్ కాలేజి భీమవరం పశ్చిమగోదావరిజిల్లా |
| 53 | శ వే | శ్రీ శరమరం వేదాంతాచారి యం ఓ యల్<br>సీనియర్ తెలుగు పండితుడు గవర్నమెంటు<br>హైస్కూలు కాచిగూడ |

| క్ర సం | పేర్ల పొడి అక్షరములు | వ్యాసకర్తల పేర్లు |
|---|---|---|
| 54 | శే గో రా | శ్రీ శేషగోవర్ధన రామానుజాచార్యులు ఎం ఎ బి ఓ యల్<br>తెలుగు లెక్చరర్ ఆంధ్ర ఓరియంటల్ కాలేజి<br>నల్లకుంట హైదరాబాదు |
| 55 | శే భ వే | శ్రీ శేష భట్టర్ వేణుగోపాలాచార్యులు బి ఓ యల్<br>సీనియర్ తెలుగు పండితుడు రాజభవన్<br>గవర్నమెంటు హైస్కూలు హైదరాబాదు |
| 56 | హ అ | శ్రీ హరి ఆదిశేషువు యం యస్ సి<br>రిటైర్డ్ కెమిస్ట్రి లెక్చరర్ హైదరాబాదు |
| 57 | హ పు | అష్టావధాని హరి పురుషోత్తం<br>మలక్ పేట హైదరాబాదు |



# వ్యాసానుక్రమణిక

# ఆంధ్రత్వమాంధ్ర భాషాచ నాల్పస్యతపసః ఫలమ్

# ఆంధ్రదేశ-చరిత్ర భూగోళ-సర్వస్వము

## అంక తెలుగరి సెట్టి

తలవని తల పుగ గ్రంథార థమునందు ఒక వైశ్య సజ్జనుని పేరు వచ్చుట ం పత్పూచకమని భావి చి సంతసించు చున్నాము దీనిచే ఈ మంచి యుద్యమమునకు ఎడతెగని ధనలాభమును నిర్విఘ్న పరిసమాప్తియు ఆకాం క్షించు చున్నాము

ఖం ల రం

అ క తెలుంగరి సెట్టి నామధేయము దాక్షారామ భీమేశ్వ రాలయ శాసనములలో లభి చినది (ద హిం నె IV 1375-484) దాక్షారామము నే ద్రాక్షారామము అనుటయు లదు ఆలయప్రాకారములోని ఒక నాగవిగ్రహ సమీపమున రాల స్తంభముపై ఈ శాసనము వ్రాయబడినది శాసన సారాం శము ఈవిధముగా స్ఫురి చుచున్నది "పృథివీసెట్టి అంక తెలుంగరి సెట్టిగారున్నూ ఎండప రాయవర నడుమగల పదు నొకొండు తెగల పెక్కంద్రున్నూ (వర్తకసంఘములున్నూ) దాక్షారామము నందలి నానాదేశాగతులైన పెక్క ద్రకు యిచ్చిన ధర్మశాసనము మీరు భీమేశ్వరుని ఊడిగము (ఊలి గము - శాసనపదము) చేయుచున్నారు గాన బలంజె వారిలోని విరాళం పన్నును ఈ సంవత్సరం సంక్రమణ పుణ్యకాలము నుండి రాజమహేంద్రపురవరాధీశులైన మల్లప్ప ఒడయరు గారి పుణ్యమునకుగాను సర్వమాన్యముగా సమర్పించితిమి అల్లాడ దేవర ఊళ్ళైన (భీమేశ్వర దేవర) అవసరాల వేమవరం వీరారెడ్డినాగపర నల్లూరు పోంకలగ్రుడ్డ అల్లాడరెడ్డి వేమవరం వల్లూరి అ శ (?) అవిడి తుని పిరిమామిడాడ గ్రామములందలి బల జె విరాళ పన్ను దాక్షారామ బలంజె వారికి భీమేశ్వర సేవకై ఇచ్చితిమి

శాసనకాలము శక (వరుషంబులు) 1366 రక్తాక్షి న । మాఘ శుద్ధ పంచమీ గురువారం అనగా క్రీ శ 1444 అగు చున్నది ఈ కాలమున శ్రీ మన్మహామండలేశ్వర రాజాధి రాజ శ్రీ వీరప్రతాప ప్రౌఢ (ప్రవుఢ) దేవరాయల మహా ప్రధాని నాగభూపాల పుత్రుడైన మల్లభూపాలుడు రాజ మహేంద్రవర పాలకుడుగా నుండెను ఈతనికి కోటిశంకర మూరురాయరగ డ బిరుదులు కలవు మూరు రాయరగ డ అనునది విద్యానగర చక్రవర్తుల బిరుదము మల్లభూపాలుడు వారి ప్రతినిధి గాన ఏలికల బిరుదును వహించియుండెను కోటిశ కర బిరుదమువలన మల్లపనాయకుడు సంపన్న వైశ్య కులస భవుడని ఊహించుటకు తావొసగుచున్నది

ధర్మశాసనమిచ్చినవారిలో అగ్రేసరుడు అ క తెలుంగరి సెట్టి ఈయన నిజనామము అంకయసెట్టి అయియుండును తెలుగు దేశము వాడగుటచే అన్యప్రాంతములందీ వణిక్ప్రముఖుడు తెలుంగరి యని వ్యవహరి పబడెడివాడు కావచ్చును వీరిది పంచముల గోత్రము పెద్దినాయకుడితని తండ్రి మారమాంబ తల్లి తన ధర్మపత్ని యైన శేవాంబిక పేరును గూడ ఈతడు శాసనములో చేర్చుట విశేషము శేవాంబికా

మన కమలమిత్ర అనురీతిని కావ్యశైలిలో వ్రాయబడినది

అంకయ సెట్టికి పులియమారోళ్కులు గండ బలంజ ధర్మప్రతిపాలక పృథ్వీసెట్టి అనునవి బిరుదములు పులియ మారోళ్కులుగండ అనగా పరాక్రమశాలి అని తోచుచున్నది వ్యాఘ్రశూర అను సంస్కృత సమాసమున కిది కన్నడీకరణమేమో

ఇచ్చట నొకయంశమును స్మరింపవలసి యున్నది వైశ్య కులమువారు ధనార్జనపరులనియు పరాక్రమ విముఖులనియు ఒక పొరపాటు భావము లోకములో వ్యాపించియున్నది. వృత్తి ధర్మమునుబట్టి వారు శాంతికాముకులుగ ఉండుట సహజము వారు పరాక్రమహీనులు కారనుట శాసనముల వలన తెలియవచ్చుచున్నది ముఖ్యముగ బలంజ ధర్మప్రతి పాలక అను బిరుదము వైశ్యకులమువారి పౌరుష వ్యాపారమును సూచించుచున్నది దీనిని వీరబలంజ (బలజ్య అనుటయు కలదు) ధర్మము అనియు వ్యవహరించుచుండిరి బలంజసమయము వారందరును వైశ్యులగుదురో కాదో నిశ్చయముగా తెలియదు మొత్తముమీద వీరందరును దేశ విదేశ వ్యాపారము చేయు వర్తకప్రముఖులు శాంతిప్రియులయ్యును వర్తకమండలులవారు ధన ప్రాణరక్షణమునకై వీరవ్రతము నాశ్రయింపవలసినవారైరి వీరబలంజ ధర్మమువారి వక్కాణములలో తాము ఐదువందల వీరశాసనములను పొందినట్లు చెప్పుకొనుట గమనింపదగినది

అంక తెలుగరి సెట్టి వీరబలంజ్య ధర్మమునకు చెందిన ఆంధ్రదేశపు వర్తక ప్రముఖుడు ఈతనికి గల పృథ్వీసెట్టి బిరుదముకూడ గమనింపదగినది కోట్లకు పడగయెత్తి నానాదేశ వ్యాపారము చేయువారిని పృథ్వీసెట్టి బిరుదుచే భూషించుచుండిరి కన్నడదేశ చక్రవర్తులు విస్తృత సామ్రాజ్య పరిపాలనాసూచకముగా పృథ్వీవల్లభ జగదేకమల్ల త్రిభువనమల్ల మున్నగు బిరుదములను ధరించుట ఆచారము ఆ సంప్రదాయమును బట్టియే విస్తృతమైన దేశవిదేశ వ్యాపారసూచకముగ వైశ్యులు పృథ్వీసెట్టి బిరుదమును ధరించి యుందురు శ్రీనాథ మహాకవి మిత్రుడైన అవచి దేవయ తిప్పయసెట్టియు ఈశ్రేణికి చెందువాడే కాని యాతడు బలంజ్య ధర్మపాలకుడైనట్లు చెప్పబడలేదు

అంకయసెట్టి కథనమువలన మరికొన్ని విశేషాంశములు తోచుచున్నవి. (1) రాజమహేంద్రవర ప్రాంతము ఈశాసన సమయమునకు అనగా క్రీ శ 1444 వ సంవత్సర ప్రాంతమునకు విజయనగర చక్రవర్తియైన ప్రౌఢదేవరాయల వశమైనది ఆతని ప్రతినిధిగా మల్లప్ప ఒడయరు గారు రాజమహేంద్రియందు అధికారము వహించియుండెను ఈతని పుణ్యముగా అంకయ సెట్టి ధర్మశాసనము ప్రకటించెను దీనినిబట్టి రాజమహేంద్రవర రెడ్డి రాజ్యము (వేమ వీరభద్రారెడ్లచే అధిష్ఠితమైనది) క్రీ శ 1444 నకు పూర్వమే విజయనగర చక్రవర్తుల యధీనమైనట్లు నిశ్చయమగుచున్నది (2) తెలుగరిసెట్టి సామాన్యదానము చేసినట్లులేదు దీనిని ధర్మశాసనమని వ్యవహరించినాడు దీనిని బట్టి బలంజధర్మ ప్రవర్తకులైన వణిజులకు గల అధికార ప్రాభవము సూచితమగుచున్నది ఆనాటి రాజన్యులు వీరలను లక్ష్మీపుత్రులును అయిన బలంజ్యధర్మము వారిని కాదనలేక వారికెన్నియో అధికారములను ఎంతయో స్వేచ్ఛను ఇచ్చుచుండిరి (3) ఎండపి రాయవరము నడిమి వదు నొకడువగల పెక్కండ్రు అని చెప్పుటచే రకరకముల వర్తక శ్రేణులా కాలమున ఏర్పడి పని చేయుచుండెనని మనము గ్రహింతుము (4) వర్తక సంఘములవారు రాచకార్య బలంజె కార్య నిమిత్తము విరాళం పన్నులను వసూలు చేయుట చూడ ఈ సంఘములకు గల ప్రాధాన్యము అవగత మగుచున్నది ఇవి విరాళ రూపమయిన పన్నులని తోచును బలంజె కార్య నిమిత్తము అనగా తమ సంఘకార్యముల నిమిత్తము వర్తక శ్రేణులవారు పన్నులు సేకరించుట సహజముగానే ఉన్నను రాజకార్యముల నిమిత్తము వీరు పన్నులేల వసూలు చేయుచుండిరో తెలియదు వీరు నిర్వహించు రాజధర్మము లేవియో తెలియదు తాము నివసించుచుండిన గ్రామముల రక్షణ బాధ్యత వీరే వహించుచుండిరి కావచ్చును

(5) సాధారణముగా దేవాలయములకు బ్రాహ్మణులు వీరులు శిల్పులు మున్నగువారికి దానము లిచ్చుట ఆచారము ఈ శాసనమునందు దేశీయులైన (స్థానికులైన) వర్తకులు నానాదేశ (పరప్రాంతమువారైన) వర్తకులకు ధర్మశాసనమిచ్చుట గమనింపదగినది అన్యప్రాంతీయులైన వణిజులు వచ్చి వ్యాపారము చేయుటకై వారి ప్రోత్సాహ నిమిత్తము ఈ దానము ఈయబడినట్లు అన్వయించుకొనవలెను (6) ఈ మర్యాదనే అనగా దాక్షారామమునందు వ్యవస్థ చేసినట్లే ఇతరనగరము లందలి దేశీయవర్తకులు నానాదేశ వర్తకులకు సౌకర్యములు కలిగించవలెనని శాసనాభిప్రాయ.

ముగా తోచును శాసనము అసంపూర్తిగా నున్నది ఈ సంద ర్భమున ప్రత్యేకముగా కొన్ని గ్రామములు పేర్కొనబడినవి అవి యానాడు మంచి వర్తక స్థానములై పెక్కు ధన ఘనములు కలిగియుండెనని యూహింపవచ్చును అప్పటి వరకును దేశమును పాలించిన రెడ్డిరాజుల పేర కొన్ని గ్రామములు వెలసినవి వేమవరము వీరారెడ్డి నాగవరము అల్లాడ రెడ్డి - వేమవరము ఈ రీతిగా నెలకొనినవి

ఇందు వేమవరము అనునది రెడ్డి రాజ్యస్థాపకుడై ప్రోలయ వేమారెడ్డి పేరగాని ఆయనకుమారుడును సుప్రసిద్ధ దానశీలుడును అగు అనవేమారెడ్డి పేరగాని స్థాపబడి యుండును ప్రోలయవేముని కాలమున రెడ్డిరాజ్యము గోదావరి కుత్తరమున వ్యాపించి యుండలేదు అనవేమారెడ్డి సింహాచలపర్యంతమును దేశమును పరాక్రమముచే జయించి పరిపాలించెను కాటయ వేమారెడ్డియు అల్లాడ రెడ్డి కుమారుడును వీరభద్రారెడ్డి అన్నయు అగు మరియొక వేమారెడ్డియు కూడ వీరపరాక్రమలును విజేతలును అయి యుండిరి వేమవరములు వీరిపేరి వెలసెను వెలయుండ వచ్చును అల్లాడరెడ్డి కాటయవేముని సేనానియు వియ్యంకుడునుకూడ అయి యుండెను రాజమహేంద్రవరరెడ్డి రాజ్యము కొండవీటివారి వశమగాకుండ ఖడ్గ సహాయముతో నిలబెట్టిన దీతడే కావుననే ఒక వేమవరమునకు అల్లాడరెడ్డివేమవరమను పేరువచ్చెను

ఇప్పుడు కాకినాడ తాలూకా తిమ్మాపురం ఫిర్కాలోను అదేతాలూకా తాళ్ళరేవు ఫిర్కాలోను అమలాపురం తాలూకా పోలవరం ఫిర్కాలోను వేమవరము అను పేరుగల గ్రామములున్నవి ఇవి యెంత ప్రాచీనములో తెలియదు తుని తాలూకా తొండంగి ఫిర్కాలోను అదే తాలూకా కోటనందూరు ఫిర్కాలోను నాగారం (నాగవరము) అనుపేరుగల గ్రామములున్నవి ఇందేదైన వీరారెడ్డి - నాగవరము అగునేమో రాయవరగ్రామములు కాకినాడ తాలూకా సామర్లకోట ఫిర్కాలోను పెద్దాపురం తాలూకా జగ్గంపేట ఫిర్కాలోను అదేతాలూకా రంగంపేట ఫిర్కాలోను రంపచోడవరం తాలూకా దేవీపట్నం ఫిర్కాలోను ఉన్నవి ఎండపగ్రామమిప్పుడు కానవచ్చుట లేదు పిఠాపురం తాలూకా కొత్తపల్లి ఫిర్కాలోను ఎల్లవర తాలూకా ఎడతమామిడి ఫిర్కాలోను ఎండపల్లి అను పేరుగల గ్రామములు కలవు ఇందు ఎద్దైన ఎండప గ్రామము కావచ్చునేమో కనుకొనవలెను వల్లూరు గ్రామము రామచంద్రపురం తాలూకా మండపేట ఫిర్కాలోనున్నది అవిడిగ్రామము కొత్తపేట తాలూకా నరేంద్రపురం ఫిర్కాలో ఉన్నది తుని పట్టణము ఈనాటికిని ప్రసిద్ధమైనదే ఎరిమామిడాడ గ్రామము కాకినాడ తాలూకా కరప ఫిర్కాలో ఉన్న చిన్నమామిడాడ కావచ్చును

అంకతెలుగిరిసెట్టి పేర్కొన్న పెక్కు గ్రామములు ఇప్పటి తూర్పు గోదావరి జిల్లాలో కన్పించుచున్నవి ఇవి పదునైదవ శతాబ్దమునందు వర్తక స్థానములుగా ఎన్నిక చెందినవి

ఆం ల రం

## అంకదురు

విజయనగర పతనానంతరము అంతకు పూర్వముకూడ కొన్ని శతాబ్దముల వరకు ఆంధ్రదేశము మహమ్మదీయ ప్రభువుల పాలనలో ఉండెను గోల్కొండ కుతుబ్‌షాహీ వంశమునకు మూలపురుషుడు సుల్తాను కులి కుతుబుషా బహమనీ సుల్తానుల వశముదున్న తెలంగాణమునకు క్రీ శ 1496 వ సంవత్సరమున గవర్నరుగా నియమింపబడెను బహమనీ రాజ్య పతనానంతరము ఈయన స్వాతంత్ర్యమును ప్రకటించుకొనెను క్రీ శ 1543 వ సంవత్సరము నాటికే ఈయన తన రాజ్యమును మచిలీబందరు వరకు విస్తృతపరచుటయే కాక ఆంధ్రదేశమందు చెదరిపోయిన భూభాగముల నన్నింటిని ఒకే అధికారము క్రింద సంఘటితముచేసి తన యధీనములోనికి తెచ్చి తెలుగు ప్రజానీకముచే "బడేమాలిక్" (గొప్ప ప్రభువు) అను ప్రేమపూరితమగు బిరుదుచే పిలువబడెను

కుతుబుషాహీ వంశమునకు ఏడవతరమువాడగు అబ్దుల్లా కుతుబుషా తన పూర్వీకులు సంపాదించిన యావదాంధ్ర దేశముయొక్క పాలకుడుగా క్రీ శ 1626 వ సంవత్సరమున చిరుతప్రాయముననే సింహాసన మధిష్ఠించెను ఇతని విషయలోలత అసమర్థత రాజ్యమున కల్లోలములకు దారితీసినవి ఇతని పర్యటన కాంక్ష ఇతడు రాజ్యము నలుమూలల సంచరించుటకు దారితీసెను

అబ్దుల్లా కుతుబుషా క్రీ శ 1641 వ సంవత్సరమున తన పరివారముతో తీరాంధ్రమును దర్శింపగోరి 7 వ షహాబాన్ నెల 1049 హిజరీ సంవత్సరమున ముస్తాఫానగరు (కొండ

పేడు) నుండి బయలుదేరి బెజవాడ చేరుకొని కృష్ణా తటమున విడిదిచేసెను. ఇచట బందరు రేవు మీదుగా యూరపునుండి వచ్చిన విదేశీయులగు ఇంగ్లీషు పోర్చుగ్రీసు వర్తకులకు ఇతడు దర్శనమొసగెను. వారలు తమ మైత్రిని నవాబునకు తెలియజేసిరి. బెజవాడనుండి అబ్దుల్లా అంకదురు అను రేవు పట్టణమునకు ఏనుగు అంబారీపై ఊరేగుచు చేరెను. ఆ పట్టణమందలి ప్రజలు అచట నుండిన సైనికులు తమ ఏలికకు ఘనస్వాగతమొసగిరి. గౌరవపురస్సరముగ అచటి వర్తకులు తమ దుకాణములను చక్కగా అలంకరించిరి. అచట ఏర్పరచిన దర్బారునందు పట్టణములోని ప్రజలు తమ నవాబునకు అనేక బహుమతులను అర్పించిరి. అందు వెలలేని భూషణములు, చీని చీనాంబరములు, రంగురంగుల మేలిమి కలంకారీ వస్త్రములు, చైనా మట్టిపాత్రలు, అనేకరకముల దీపసెమ్మెలు ఉండెను.

వివిధ దేశములనుండి వచ్చిన వ్యాపారులు వైవాహిక సంబంధముల ద్వారా అంకదురునందే స్థిరనివాస మేర్పరచుకొనిరి. అట్టి విదేశవర్తకుల మీద విధింపబడిన కొన్ని పన్నులను అబ్దుల్లా నవాబు రద్దుచేసి దళారీల బారినుండి ఆ వర్తకులను సంరక్షించుటకు కట్టుదిట్టములు చేసెను. అచటనుండి ఉప్పు తయారుచేయు కొఠారులను నవాబు దర్శించెను. అచటి ఉత్పత్తిదారుల కృషిని చూచి వారలను అభినందించి ప్రోత్సాహపరచెను. ప్రస్తుతము అంకదురు ఉనికి కానరానందున ఆ పట్టణనామమందు మార్పు కలిగియుండునని భావింపనగును.

జి. అ.

## అంకభూపాలుడు - దామెర్ల

దామెర్ల వంశీయులు వెలమజాతికి చెందినవారు. వారు విజయనగర సామ్రాజ్యాధిపతుల ఆశ్రయము పొందుటయేకాక వారితో సన్నిహితసంబంధ బాంధవ్యములను నెరపుకొనిరి. వారు రాజ్యపాలనాదక్షులును, కవిజనమునకు ఆశ్రయులును, కావ్య నిర్మాతలును నైవరలిరి.

దామెర్ల అంకభూపాలుడు, అయ్యప్ప, వెంకటప్ప అనువారు ముగ్గురును సోదరులు. వారితండ్రి చెన్నప్ప నాయకుడు విజయనగర రాజ్యాంతర్గతమైన కాళహస్తి సంస్థానమును, అంకభూపాలుడును పూనమల్లిని ముఖ్యపట్టణముగా చేసికొని కొన్ని ప్రాంతములను, అయ్యప్ప నాయకుడును వందవాసియందు వసించుచు పులికాటునుండి కడలూరు వరకు గల భాగమును, వెంకటప్ప నాయకుడును పాలించిరి. వారు ముగ్గురును విజయనగర సామ్రాజ్యాధిపతియైన వెంకటపతిరాయల (క్రీ. శ. 1586 - 1614) కు బావమరుదులు. వీరు వెలుగోటివారితో వియ్యమందిరి.

అంకభూపాలుడు ఉషాపరిణయమను కావ్యమును రచించెను. అందలి ఉపోద్ఘాతమునందు వంశవర్ణనముతోపాటు కొన్ని చరిత్రాంశములు పొందుపరచబడినవి. చెన్నపట్టణము నిర్మితమైన విధము ఈ కావ్యమందలి ఈ క్రింది పద్యము నిరూపించుచున్నది.

గీ. ప్రళయకావేరి మైలాపురంబు నడిమి
తీరమున బేరనది మట్టుపెట్ట దండ్రి
పేర నస్మద్య భూమిని పృథు విభూతి
వెలయించె జెన్నపట్టణమయ్య నృపతి

ఇందు ఉదాహరింపబడిన అయ్య నృపతి అంకభూపాలుని సోదరుడగు అయ్యప నాయకుడు. ఈ అయ్యప నాయకుడు ప్రళయకావేరి (పులికాటు) యందలి డచ్చి వర్తకులకును మైలాపూరునందలి పోర్చుగీసువారలకును మధ్య వర్తక వ్యాపారముల విషయమున పరస్పర వైషమ్యములు చెలరేగగా ఉభయలమధ్య శాంతిని నెలకొల్పుటకు పులికాటు మైలాపూరుల మధ్యప్రదేశమందు ఒక పట్టణమును నిర్మించి దానికి తన తండ్రి అయిన చెన్నప్ప పేర చెన్నపట్టణమని నామమొసగెను.

అంకభూపాలుని సోదరుడగు వెంకటప్ప నాయకుడు గొప్ప యోధుడు. అతడు విజయనగర సేనలకు ఆధిపత్యము వహించి ఎదురు తిరిగిన జింజీ పాలకుడగు కృష్ణప్ప నాయకుని (1607) రణరంగమున ఓడించి అతని రాజ్యమందలి ఉత్తర ఆర్కాటు జిల్లాలో తన తండ్రి పేరిట చెన్నసాగరమను గొప్ప తటాకమును నిర్మింపజేసెను.

ఇట్టి వీరాగ్రేసరులకు తండ్రి అయిన చెన్నప్పనాయకుని (అతని తమ్ముడైన) వెంగళరాజు తన బహుళాశ్వచరిత్రమును ప్రబంధమున ఆహవమున కిరీటిగ, శోభమాన యశస్కరుడుగ, దామరాన్వవాయ కలశవారాశి పూర్ణరాకా శశాంకుడుగ, రాయసింహాసన సముద్ధరణ ధురీణుడుగ ప్రశంసించెను.

కొ. వెం.

## అంకయ

వే గీ చాళుక్యులు ఆ ్రంధ్రావనిలో నాలుగున్నర శతాబ్దములు (క్రీ శ 6 4 1075) వైదిక ధర్మము ననుసరి చి అవిచ్ఛిన్నముగ రాజ్యమేలిరి శాసనములో అచ్చటచ్చట రాజ్యవ్యవస్థకు సప్తాంగములు పదునెనిమిది తీర్థములు ఉపయోగపడినట్లు చెప్పబడి ది రాజ సభ సప్తాంగములు అది కవీశ్వరులు విద్వాంసులు పౌరాణికులు పూర్వకథలు చెప్పు వారు స్తోత్రపాఠకులు హాస్యకారులు గాయకులు రాజసభయందలి సప్తాంగములు రాజ్యాంగములు ఎడు అవి స్వామి అమాత్యులు సుహృదులు కోశము రాష్ట్రము దుర్గము బలము అనునవి రా ్యపరముగా పేర్కొనబడిన పదునెనిమిది తీర్థములలో పురోహితులు సేనాపతులు యువరాజు దౌవారికులు ప్రధానులు నియోగాధికర్తలు మున్నగు వారు చేరుదురు ఈ రాజ్యాంగములు రాజు కు రాజ్య పరిపాలనా విధానమున తోడ్పడుచు డెను వే గి రాజ్యము ఇట్టి వ్యవస్థకలదే

చాళుక్య నృపతులలో ఆ ్రధమహాభారత కృతిపతి అయిన రాజరాజు (క్రీ శ 1022 1061) ప్రముఖుడు ఈయనకున్న వైదిక మతాభిమానము జగద్విదితము ఈయనచే వేయింపబడిన మ డ (మ డపేట) శాసనమునందు అ కయ అను నాతడు దానపరిగ్రహీతగా పేర్కొనబడెను

ఒకానొక సూర్యగ్రహణ కాలమున ఆప స్త బసూత్రుడు భారద్వాజసగోత్రుడు అయిన శివకుమారభట్టు యొక్క మనుమడు రామదేవుని కుమారుడు అ కయ అను బ్రాహ్మణునకు చేయబడిన భూదాన వివరములు ఇట్లున్నవి —

గుద్ద వాటి విషయమున స ప్తగోదావరి ఉత్తరదిశను మండ అను గ్రామమందలి ముప్పది పుట్లు ప డు వరిచేను పది పుట్లు ప డు జొన్నచేను ఒకటిన్నర పుట్ల ఉద్యానవనము అంకయ పరిగ్రహి చెను ఇతనికి సమ స్త భువనాశ్రయ బ్రహ్మ మహారాజ అను బిరుదులు కూడ ఉ డెను మహిమాన్వితుడు ని త్య య జ న శా లి వాగనుశాసనుడు అయిన నన్నయభట్టారకుడు ఈ శాసనమును కూర్చెను అజ్ఞప్తుడు కట్టకరాజు శాసనమ దు చెప్పబడిన భూమి ముమ్మిడిభీమ" కోల అను కొలతబద్దతో కొలువబడినదట ఇపుడు దీని పరిమాణము తెలిసికొనుట సాధ్యముకాదు

"సమస్తభువనాశ్రయ" "బ్రహ్మమహారాజ"అను బిరుదములు విమర్శింపదగినవి పశ్చిమ చాళుక్యుల బిరుదములగు సమ స్త భువనాశ్రయ సత్యాశ్రయకులశేఖర అను బిరుదులు రా రాజు స్వీకరి చినటుల ఆంధ్ర మహాభారతమందలి ఆది పర్వములోని నాలుగవ ఆశ్వాసాంత పద్యములవలన తెలియ వచ్చుచున్నది దీనిని బట్టి రాజరాజనరే ద్రునకు తన వంశమునకు మూలపురుషులైన పశ్చిమ చాళుక్యుల దు గల అద రాభిమానములు వెల్లడి యగుచున్నవి ఈ శాసనపూర్వ భాగమున వే గి చాళుక్యులతోబాటు శ్రీ త్రిలోచన పల్లవునకు ప్రత్యర్థియగు విజయాదిత్యుడు మొదలుకొని కుబ్జ విష్ణువుదాక వంశక్రమము చెప్పబడినది

అ కయకు కూడ మ స్త భువనాశ్రయ అను బిరుదు ఉ డుటను బట్టి రాజరాజు పరివారములోని ఆనాటి సామంతులు భృత్యులు కూడ అట్టి బిరుదములను పరిగ్రహించు ఆచారము కలదని తెలియుచున్నది బ్రహ్మ మహారాజను బిరుదము దాక్షిణాత్య పరమైనది దీనికి నిదర్శనము రాజరాజు వేయించిన కలిది డి (కైకలూరు తాలూకా కృష్ణా జిల్లా) తామ్రశాసనము ఇ దలి ఇతివృత్తము ఇది - రాజరాజు రాజ్యపాలనాకాలమున కర్ణాటక సేనలు వే గి మండలమును ముట్టడి చెను అట్టి తరుణమున రాజరాజనరేంద్రుని మామయగు రాజే ద్ర చోళుని ఆజ్ఞానువర్తియై అతని విశ్వాసపాత్రుడయిన రా రాజ బ్రహ్మమహారాజు అను సేనా నాయకుడు తనఅనుచరులతో వే గి కేతె చి శత్రుసైన్యములతో పోరాడుచు వీరస్వర్గ మల కరి చెను వారల పుణ్యోదకములకు గాను రాజరాజు మూడు శివాలయములను నిర్మి పి చి కలిది డి కడప్రు అవకూరు అను మూడు గ్రామములను దానము చేసెను

దీనిని బట్టి బ్రహ్మ మహారాజను బిరుదు యుద్ధమున దు బల పరాక్రమములను ప్రదర్శి చిన యోధులకు స క్రమించుచుండెననియు అట్టి బిరుదు అ కయకు కూడ ఉండుటచేత ఈయన కావి చిన వీరోచిత కార్యముల ఫలితముగా రాజరాజు ఈతనిని ఆ బిరుదముచే గౌరవించియుండును అనియు ఊహి పవచ్చును

కా వెం

## అంకాపురము

అసఫ్ జాహి నవాబుల పాలనక్రి ద హైద్రాబాదు రాష్ట్రము మూడు సుబాలుగా విభజి పబడినది మరాతి

మాతృభాషగాగల ప్రజలకు ఔరంగాబాదుసుభా కన్నడ ప్రాంతములకు గుల్బర్గాసుభా తెలంగాణా ప్రాంతమునకు మెదకుసుభా కేంద్రములుగా ఉండగా ఆయాసుబేదార్ల యాజమాన్యమున రాష్ట్ర వ్యవహారములు జరుగుచుండెను. మరల తిరిగి పాలనా సౌకర్యమునకు పరగణాలక్రింద ఏర్పరచిరి.

ఔరంగాబాదుసుభా లోని ఆర్మూరు నిర్మలు నిజామాబాదు అను పరగణాలలోని ప్రజలు అధిక సంఖ్యాకులు తెలుగు మాతృభాషగా గలవారు. భాషాప్రయుక్తముగా రాష్ట్ర పునర్నిర్మాణము జరిగినప్పుడు 1956వ సంవత్సరమున పైన పేర్కొనబడిన మూడు పరగణాలు ఆంధ్రప్రదేశములో కలుప బడినవి.

ప్రథమనగు రెండవ అసఫ్‌జా బిరుదు ధరించిన నవాబు నిజామాలీఖాను (1761 – 1803) యొక్క రాజ్యపాలన కాలమున అంకాపురమున జరిగిన ఒక ఘట్టము స్మృతిపథమునకు తెచ్చుటకు తగియున్నది. అంకాపూర్ లేక అంకాపురము ఆదిలాబాదు రైల్వే స్టేషనుకు 7 మైళ్ళ దూరమున నున్న ఒక కుగ్రామము. ఇచట ప్రస్తుత జనాభా 848. అంకనాథ స్వామి దేవాలయమిచట ఉండుటవలన ఈ గ్రామము అంకాపురమని పిలువబడినది. హిజరీ 1202వ సంవత్సరమునకు సరియగు క్రీ. శ. 1794వ సంవత్సర కాలమున ఈ గ్రామము నిర్మలు పరగణాకు చెందినదై యుండెను. ఆ కాలమున పన్నును వసూలు చేసి దానిని సర్కారు ఖజానాకు పంపు అధికారము దేశముఖుల దేశపాండ్యాల అధీనమున నుండెడిది. నిర్మలు పరగణాకు రాజా నర్సింగరావు అను ఆయన దేశపాండ్యాగా నియుక్తుడయ్యెను.

రుక్మారెడ్డి అనునతడు అంకాపురమునందున్న ఒక గొప్ప భూస్వామి. ఇతడు సకాలమున సర్కారునకు చెల్లించవలసిన పన్ను చెల్లించక ప్రభుత్వముపై తిరుగుబాటును లేవదీసెను. నిర్మలు పరగణాకు ప్రక్కనే ఆర్మూరు పరగణా కలదు. గోవిందనాయకుని కుమారుడైన రాజా శంకరనాయకుడు ఆర్మూరునకు దేశపాండ్యాగా ఉండెను. ఇతనికి రాజా వాఘ్వంత్ బహదరను బిరుదుకూడ ఉండెను. ఈయన ప్రముఖ వర్తక వ్యాపారి ఔరంగాబాదు పూనా హైదరాబాదు పట్టణములలో వర్తకము చేయుచు గొప్ప ఆస్తిని సంపాదించెను. [illegible] పేరలేదు. [illegible]మయము దొరకెనను నెపమున నైజామునకు ఇతడు రుక్మారెడ్డియొక్క తిరుగుబాటును ఎరిగించి రాజా నరసింగరావు యొక్క ఉదాసీనతను వెల్లడిచేసెను.

నైజాము వెంటనే రాజా నరసింగరావును దేశపాండ్యా గిరినుండి తొలగించి తిరుగుబాటుదారైన రుక్మారెడ్డి [illegible] నిర్మల పరగణాను ఆర్మూరు పరగణాతో చేర్చి రాజా శంకరనాయకునకు [illegible]

జి. ఆ.

## అంకిదేవి

అంకిదేవి తూర్పు చాళుక్య [illegible] ఒకడు. చాళుక్య భీము పట్టమహిషి. [illegible] చాళుక్య భీముని రాజ్యపాలనము [illegible] 4 మొదలుకొని 945వ సంవత్సరము వరకు కొనసాగినది. దానార్ణవుడు అను [illegible] మారుడు ఈతని వలన అంకిదేవియందు ఉదయించెనని మాసగల్లు తామ్రశాసనము తెలుపుచున్నది.

కందయము [illegible] ముననుసరించి దానార్ణవుడు కళింగ రాజతనయ అయిన ఊర్జప (ఊర అనుటకు వేదమునందు అన్నము అను అర్థము కలదు) అను నామము [illegible] నిర్మించి టు చెప్పబడెను. [illegible] దానార్ణవుడు తండ్రియైన [illegible] గాధిప [illegible] పేరు పేర్కొనబడలేదు. దానార్ణవుడు తన పట్టాభిషేక సమయమున తన తల్లి అయిన అంకిదేవిని ఊర్జప అను బిరుద నామముతో వ్యవహరించినట్లు చారిత్రకులు తలచిరి.

రెండవ చాళుక్య భీముని ద్వితీయ [illegible] లో [illegible] ఈమె తలిదండ్రు లెవరను విషయము చారిత్రకుల దృష్టికి రాలేదు. ఈమెయందు రెండవ అమ్మరాజు ఉదయించెను. ఈతడు పండ్రెండేండ్ల వయస్సుననే సవతి అన్నయగు దానార్ణవుని అతిక్రమించి రాజ్యమును ఆక్రమించిన విధమును [illegible] పుటకు ఆధారములు లేవు. బహుశః ఈ బాలుడు అల్లారు ముద్దుగా పెరుగుటయే ఇతడు రాజ్యాధిపత్యమును వహించుటకు కారణమని ఊహించవలసియున్నది.

కా. వెం.

## అంకిరెడ్డిపాలెం

అంకిరెడ్డిపాలెం గుంటూరు జిల్లా గుంటూరు తాలూకాలో గుంటూరు పట్టణమునకు నాలుగు మైళ్ళ దూరములో కలదు. ఈ గ్రామ విస్తీర్ణము 4360 ఎకరములు. దీనికి తూర్పున గుంటూరు మిర్చియార్డు ఉత్తరమున గుంటూరు– పొందుగలరోడ్డు దక్షిణమున పొత్తూరు సరిహద్దులుగ ఉన్నవి.

1961 వ సంవత్సరము జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములోని పురుషులు స్త్రీలు కలసి 446 మ ది వీరిలో హరిజనులు 30 మంది షెడ్యూల్డు తరగతులవారు జాతుల వారు 708 మ ది ఈ గ్రామములో ఇండ్లు దూర దూర ముగా నిర్మి పబడినవి వీటిలో 200 పై కుటుంబ్లును రెండు ఒకే అంతస్తు గల మేడలును ఒ అనేక అంతస్తులు గల భవనమును కలవు ప్రజలలో 75 శాతమువారు జొన్న అన్న మును 25 శాతమువారు వరి అన్నమును తి దురు ఈ గ్రామము తూర్పు దక్షిణములుగా వ్యాపి చియున్నది

ఈ గ్రామ సస్యములు వానపై ఆధారపడును ఇందు నల్ల నేలలు 75 శాతముగను ఎర్ర నేలలు 25 శాతముగను ఉన్నవి జొన్న పెసర నువ్వు మిర్చి పండును ఈ ప టల క్రింద 1966 - 67 సంవత్సరములో 4 200 ఎకరముల భూమి ఉపయోగపడినది పంట దినుసులు లారీలపై బ డ్లపై గు టూరుకు రవాణా చేయబడినవి

ఇచట పశు సంపద అధికముగా ఉన్నది గేదెలు ఎద్దులు గొర్రెలు పందులు కోళ్లు మొదలగువాటి మొత్తము స ఖ్య 10 100 ఇందులో గేదెల సంఖ్య 4000 పై సంవత్స రమున ఈ గ్రామమునుండి 1200 లీటర్ల పాలు గుటూరు నకు ఎగుమతిచేసిరి వారమునకు 2 000 గ్రుడ్లను స్థానికులు వాడుకొనిరి

ఇచటి ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము వ్యవ సాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి రు 2 లు స్త్రీకి రు 1-50 లు 4 మైళ్ళ దూరములో గుంటూరు ఒంగోలు మార్గముపై గు టూరు రైల్వేస్టేషను కలదు గవర్నమెంటు బస్సులు ప్రతి అరగ టకు గుంటూరు నుండి ఈ గ్రామము మీదుగా ఒంగోలుకు పోవును ఇచ్చట కంకర రోడ్లు మట్టిరోడ్లు కలవు మట్టిరోడ్లు ఈ గ్రామమును పొరుగు గ్రామములతో కలుపు చున్నవి రెండెడ్ల బండ్లు సైకిళ్ళు మొదలగు ప్రయాణ సాధనములు ఉన్నవి

అంకిరెడ్డిపాలెమున ఒక బ్రాంచి పోస్టాఫీసు ఒక అప్పర్ ప్రైమరీస్కూలు కలవు ఇచటి పాఠశాలయ దు 40 మంది విద్యార్థులు పొత్తూరు గ్రామము నుండి వచ్చి చదువు కొందురు కళాశాల విద్యాభ్యాసమునకై 125 మంది విద్యా ర్థులు గుంటూరునకు పోవుదురు తంతి కార్యాలయమునకు ఒక మైలు దూరములో నున్న నల్లపాడునకు పోవలెను ఇచట విద్యుద్దీపములను నాలుగు ఇండ్లవారు మాత్రమే వాడు కొనుకొనుచున్నారు

ఇది పంచాయతి పరిపాలనగల గ్రామము దీనికి ఆదా యము ఇ డ్ల పన్నులు మొదలగువాటివలన లభి చుచున్నది ఇచట పంచాయతి గ్ర థాలయము రేడియో కలవు కోర్టు లకు పోలీసు స్టేషనుకు సబ్ రిజిస్ట్రారు ఆఫీసుకు తాలూకా కచ్చేరి బ్లాకు అభివృద్ధి కేంద్రముకు సినిమా థియేటరుకు గ్రామస్థులు గు టూరున కేగుదురు గ్రామములో పశురోగ ములకు నాటు వైద్యము చేయువారు కలరు ఒక ఆయుర్వేద వైద్యుడును కలడు ప్రసూతి ఆసుపత్రికి జనరల్ ఆసుపత్రులకు గుంటూరునకు పోవలయును ఇచట సంతల ఏర్పాటులేదు 12 కిరాణాదుకాణములు ఉన్నవి స్థానికముగా దొరకని వస్తువులను జనులు గు టూరు నుండి తెచ్చుకొందురు

మా శ్వే

## అంకుస - ఇమ్మడి

ఏకామ్ర నాథుడను కవి యొక్క జన్మస్థానము కొండ వీడు ఈయన సంస్కృత భాషలో జా బవతీ కల్యాణము సత్యాపరిణయము అను కావ్యములను రచించి శ్రీరంగపట్టణ సీమలోని చెన్నపట్టణ పాలకుడగు ఇమ్మడి అంకుసకు అంకి తము చేసెను కవి యొనర్చిన కృతిపతి వ శవర్ణనములో కొన్ని చారిత్రకా శములు దొరలినవి

చతుర్థ కులజులలో రణ వంశము ప్రఖ్యాతి కన్నది ఈ వంశములోని జగదేకరాయలు (క్రీ శ 1577) శూరా గ్రేసరుడు క్రీ శ 1565 లో జరిగిన తళ్ళికోట యుద్ధమందు విజయనగర సైన్యములు ఓడిపోయినవి అళియరామ రాయలు యుద్ధమునందు నిహతుడయ్యెను విజయనగర పతనానంతరము రామరాజు తమ్ముడగు తిరుమలరాయలు రాజధానిని పెనుగొ డకు మార్చెను తిరుమలరాయలకు అప్పటికి వయస్సు 90 స వత్సరములు పెనుగొ డను రాజ ధానిగా చేసికొనిన పిమ్మట కూడ రాజ్యమునకు స్థిరత్వము ఎర్పడలేదు అనేక సమయములలో పెనుగొ డ యవనుల దాడికి లోనయ్యెను

క్రీ శ 1577 లో బీజపూరు సుల్తానగు ఇబ్రాహిం అలీ పెనుగొ డను ముట్టడించెను ఆ సమయమున తిరుమల రాయల కుమారుడు రంగరాయలు సింహాసనాధిపత్యమును వహి చియు డెను అట్టిసమయమున సా మ ం తు డు ను

చేసకొనెను అని వెలుగోటి వంశావళియ దు వర్ణితమైనది

ౘి రా రా

## అంగర

అ గ అను గ్రామము తూర్పుగోదావరిజిల్లా రామ చ ద్రపుర తాలూకాలో ఉన్నది దీనికి దగ్గరగా మ డపేట పట్టణము కలదు ఈ గ్రామవిస్తీర్ణము 2293 ఎకరములు దీనికి సరిహద్దులు కపిలేశ్వరము వెదురుమూడి శేకి కాతేరు అను నవి ఇదిచాల ప్రాచీనమైన గ్రామము సుబ్రహ్మణ్యచెరువును త్రవ్వుచు డగా అయిదు శివలి గములు దొరకినవట అ దుచే దీనిని ప చ లి గమనికూడ వ్యవహరి చిరట

1961 స । నాఘా లెక్కల ప్రకారము ఈ గ్రామములోని పురుషులు ? 6 2 మ ది స్త్రీలు ? 569 మ ది వారు వెరస 5 191 మ ది వీరిలో షెడ్యూలు జాతులవారు 477 మ ది ఈ గ్రామము సమతల ప్రదేశమున ఉన్నది దీనికి మధ్యగా తారు రోడ్డు పోవుచున్నది ఇచ్చట ఇండ్లు ఒక వరుసలో ఉన్నవి వీటిలో 521 పె కుటి డ్లు 1 ? కా క్రీటుకప్పుగల ఇండ్లు 6 ఒకే అంతస్తు మేడలు కలవు

ఈ గ్రామమునకు ఎల్ల కాలువ సుబ్రహ్మణ్యచెరువు కొత్తచెరువు శివలాడిచెరువు అను నీటిఏనరులు కలవు వడ్లు మినుములు జనుము చెరకు ఇచ్చట ప డును అరటి తోటలు కలవు వ గ దుంప బీర మొదలయిన కూరగాయలు లభి చును 1966-67 సం॥లో ప టలక్రి ద ఉపయోగి పబడిన భూమి 2005 ఎకరములు ఎల్లకాలువక్రింద 274 ఎకరములు బావులక్రి ద 1221 ఎకరములు సాగుచేయబడినవి ?? ఆయిల్ ఇంజనులు 9 ఎలక్ట్రిక్ మోటరులు 1500 ఎకరములకు నీటివసతినిసమకూర్చెను 8 ట్రాక్టర్లు 1 000 ఎకరములను దున్నుటకు ఉపయోగపడెను ధాన్యము మున్నగు ప ట దినుసులు బ డ్ల పై లారీలపై మ డపేటకు తరలి పబడెను

ఈ గ్రామమున పశుసపద లెస్సగ కలదు గేదెలు ఆవులు దున్నపోతులు మేకలు గొర్రెలు పందులు గుర్రములు కోళ్ళు - వీటిమొత్తము స ఖ్య 3 323 ఇ దులో 508 గేదెలును 452 ఆవులును కలవు వీటిను డి లభించు పాలలో నెలకు దాదాపు 1000 శేర్లు స్థానికులు వాడుకొని 1000 శేర్లు మ డపేటకు రవాణా చేసెరి

ప్రజల మనుగడకు ముఖ్యాధారము వ్యవసాయము వ్యవసాయ దారులుకాక వ్యాపారస్థులు టాక్సీలు జట్కాలు ఎద్దుబండ్లు నడుపువారు క సాలివారు వడ్రగులు కుమ్మర్లు కమ్మరివారు మ గలివారు చాకలివారు గానుగ తాపీ మొదలగు వృత్తులవారును కలరు ఇచట ట్ర కుపెట్టెలు వె డిమువ్వలు చేయబడును బట్టలనేత పరిశ్రమయు 8 వడ్ల మరలు ఉన్నవి ఇచ్చట వ్యవసాయమునకును పరిశ్రమలకును సరిపడు కూలీలు దొరకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రూ 3- లు స్త్రీకి రూ 2 లు తయారయిన ట్ర కు పెట్టెలు నూలుబట్టలు వె డిమువ్వలు రామచ ద్రపురమునకు ఎగుమతి చేయబడును జనులు బావినీటిని చెరువునీటిని త్రాగుదురు నీటిఎద్దడిలేదు

అ గరయ దు సుబ్రహ్మణ్యస్వామి ఆలయము గోపాలస్వామి ఆలయము నూకాలమ్మగుడి క్రైస్తవదేవాలయము మసీదులు కలవు దేవాలయములక చె దిన భూములు 75 ఎకరములున్నవి సుబ్రహ్మణ్య షష్ఠి డిసె బరులోను గోపాలస్వామి కళ్యాణము నూకాలమ్మ తిరునాళ్లు మార్చిలోను ఆదిలక్ష్మి తీర్థము ఏప్రల్ లోను జరుగును

ఈ గ్రామమునకు 13 మైళ్ళ దూరములో ద్వారపూడి రైల్వేస్టేషను కలదు ప్రైవేటుబస్సులు రె డుగ టలకొకసారి ఈ గ్రామము గు డా కాకినాడనుండి కపిలేశ్వరపురము నకును రాజమ డ్రి ను డి కపిలేశ్వరపురమునకును అన్నవరము ను డి కపిలేశ్వరపురమునకును పోవును ఇచ్చట క కర రోడ్లు ఉన్నవి ఈ గ్రామమును క కరరోడ్లు తారురోడ్లు బేతిపూడి రాజమ డ్రులతో కలుపుచున్నవి రిక్షాలు టాక్సీలు మోటారుసైకిళ్ళు సైకిళ్ళు ఎడ్లబండ్లు మున్నగు ప్రయాణ సాధనములుకూడ ఉన్నవి

అ గరలో బ్రాంచిపోస్టాఫీసు టెలిఫోను అప్పర్ ప్రైమరీస్కూలు వెల్ ఫేరుస్కూలు ఉన్నవి ఇచ్చట విద్యుచ్ఛక్తి ఉన్నది ఇది 150 ఇ డ్లకును ఎలక్ట్రిక్ మోటారులకును ఉపయోగపడుచున్నది ఇదిపంచాయతీ పరిపాలనక్రిగ్రామము దీని ఆదాయము సాలీనా రు 50 000 లు ఇచ్చట పంచాయతీ రేడియో కలదు ఇచ్చటి సహకారసంఘము రు 10 000 లను చేనేత సహకారస ఘము రు 17 000 లను అప్పుగా ఇచ్చినవి ఈ గ్రామమున ఆయుర్వేదవైద్యులు ఒక హోమియోపతి వైద్యుడు కలరు ఇచట వారమునకు రె డు సంతలు జరుగును అలమూరు ద్వారపూడులలో వారమునకు ఒకసారి పశువులసంత జరుగును ఈ గ్రామమున కిరాణా దుకాణములు

హోటళ్ళు బట్టలకొట్లు మందులషాపులు సోడా కిళ్ళీ సిగరెట్టు దుకాణములు కలవు

4 మైళ్ళలోనున్న ఆలమూరులోని సబ్ రిజిష్ట్రారు ఆఫీసునకు మూడుమైళ్ళలోనున్న కపిలేశ్వరపురములోని బ్లాకు అభివృద్ధికేంద్రము కు 20 మైళ్ళలోనున్న రామచంద్రపురములోని మునిసిఫ్ కోర్టునకు 3 మైళ్ళలోనున్న కపిలేశ్వరపురమునందలి జనరల్ ఆసుపత్రికి పశువుల ఆసుపత్రికి పోవుచుందురు విద్యార్థులు కాలేజిచదువులకు రామచంద్రపురమునకు కాకినాడకు రాజమండ్రికి పోవుదురు

మా శ్వే

## అంగర నరసింహ కవి

ఈ కవి రామకృష్ణభట్టారకుని కొడుకు అంగరవారు ఆర్వేల నియోగులలోను మధ్వ బ్రాహ్మణులలోను వైఖానసులలోను కలరు ఈ కవి శాఖ నివాసము మున్నగు అంశములు తెలియవు

అంగర నరసింహకవి రాజరాజపట్టాభిషేకము అను ఐదాశ్వాసముల ప్రబంధమును వ్రాసి కొప్పులవల్లభూపతికి అంకితము చేసెను వల్లభూపతికి కొలాపురము రాజధాని అందు వైశ్యులు ప్రతిష్ఠించిన శివాలయము విష్ణ్వాలయము వేపియేందును ఎండిపోక జలముతో కమలములతో నిరంతరము ఒప్పు ఒక సరోవరము ఫల సమృద్ధిగల పో తోటలు ఉండెను వల్లభూపతి గొప్ప అందగాడు శౌర్యవంతుడు సామంతులాతనిని సేవించిరి అతడు పట్టుతలాట కేశాద్రిరాయ గాయగోవాళ జగనొబ్బగండ మున్నగు బిరుదములు కలవాడు అని ఆ ప్రబంధమునందలి వర్ణనలు తెల్పుచున్నవి ఆ ప్రబంధ వర్ణనమున అతిశయోక్తులను తొలగించినచో ఇతడొక చిన్న స్థానమునకు అధిపతియై యుండి యుండవచ్చును ఈ రాజునకు రాజధానియైన కొల్లాపురము విశాఖపట్టణమునందలి కోట్టాము అను గ్రామమై యుండవచ్చునని ఊహింపబడినది.

ఈ కవి కవిత్వము సరసము తన ప్రబంధమున నరసింహకవి శ్రీనాథునకు ముందటనున్న ఏకవిని పేర్కొనలేదు అందుచేత ఈ కవియు కృతిభర్తయగు వల్లభూపతియు రెడ్డిరాజుల ప్రాభవత్వపు తుదికాలమున (క్రీ శ 15 వ శతాబ్ది తుదియందు) ఉన్నవారని తెలియుచున్నది మానవల్లి రామకృష్ణకవిగారు ప్రబంధమణిభూషణము నకు తాము వ్రాసిన ఉపోద్ఘాతమందు ఈ నరసింహకవి క్రీ శ 15 వ శతాబ్ది అంతమున ఉన్నవాడనియు వల్లభూపతి దోనెపూడి శాసనమున పేర్కొనబడిన నామనాయకునికి ఐదవపురుషుడు అనియు తెలిపిరి

గ ల కాం

## అంగలకుదురు

అంగలకుదురు గుంటూరుజిల్లా తెనాలి తాలూకాలో కలదు దీనికి రెండుమైళ్ళ దూరములో తెనాలిపట్టణము కలదు ఈ గ్రామ విస్తీర్ణము 26 ఎకరములు దీని తూర్పున క్రొత్తకాలువ పడమట సంగంజాగర్లమూడి ఉత్తరమున కోపల్లి దక్షిణమున చావవారి పాలెము ఉన్నవి

1961 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములోని పురుషులు 3373 మంది స్త్రీలు 2?1 మంది వారు వెరసి 6574 మంది ఈ సంఖ్యలో షెడ్యూలు జాతులవారు తరగతులవారు 409 మంది 6-15 సం॥ల వయస్సుగల బాలురు 558 మంది బాలికలు 516 మంది 195 లో ఈగ్రామ జనాభాసంఖ్య 5442 1961 నాటికి కల్గినవృద్ధి 1132 ఇది వ్యవసాయ ప్రధానమైన స్థలము అందుచేత ఇతర గ్రామములనుండి వచ్చిన రైతులు కూలీలు ఇచ్చటనే స్థిరనివాసములు ఏర్పరచుకొనిరి వారి సంతానాభివృద్ధివలన కూడ జనాభా పెరిగినది ఈ గ్రామములో ఇండ్లు దూరదూరముగాను వాడవాడలుగాను పంక్తులు పంక్తులుగాను తీర్చి నిర్మింపబడినవి వీటిలో 284 పెంకుటిండ్లు 22 కాంక్రీటు కప్పుగల గృహములు 234 ఒక అంతస్తుగల మేడలు 15 అనేక అంతస్తులుగల భవనములు ఈ గ్రామము తూర్పు ఉత్తర దిశలుగా వ్యాపించుచున్నది తెనాలి-గుంటూరు రోడ్డు ఈ గ్రామముగుండా పోవుచున్నది

ఈ గ్రామమునకు తుంగభద్ర మురుగుకాల్వ ఊరచెర్వు ముఖ్యమైన నీటి వనరులు వరి చెరకు మొక్కజొన్న పసుపు జనుము మినుము పెసర మున్నగునవి ఇచ్చట పండును అరటితోటలు నిమ్మతోటలు కలవు అంగలకుదురు తమలపాకుల తోటలకు ప్రసిద్ధి చెందినది 1966-67 సం॥లో కాలువక్రింద 1587 ఎకరములు బావులక్రింద 359 ఎకరములు సాగుబడి చేయబడినవి ఎలక్ట్రిక్ మోటార్లు ఇచట 810 ఎకరములకు నీటిని సమకూర్చినవి ట్రాక్టర్లు 40 ఎకరములు దున్నుటకు ఉపయోగపడినవి సాలుకు సుమారు 5 వేల రూపాయల విలువగల నిమ్మకాయలు, 8 వేల రూపాయల విలువ

గల తమలపాకులు 8 వేల రూపాయల ధరగల అరటి కాయలు 5 600 రూపాయల విలువగల వ గ బె డ మొదలగు కూర గాయలు బ డ్లపై తెనాలి రవాణా చేసెరి

ఈ గ్రామమున పశుసంపద బాగుగా ఉన్నది ఇందు గేదెలు ఎద్దులు ఆవులు అబోతులు గుఱ్ఱములు మేకలు గొఱ్ఱెలు కోళ్ళుకలవు వీటి సంఖ్య 5 314 ఇందులో 865 గేదెలు 104 ఆవులు ఉన్నవి దినమునకు 1010 శేర్ల పాలు 400 కి గ్రా వెన్న 00 గ్రుడ్లు సాలీనా 30 కి గ్రా చే లు స్థానికులు ఉపయోగి చుకొని 00 శేర్ల పాలు ప్రతిదినము తెనాలికి రవాణా చే రి

ఇచటి ప్ర ల జీవితమునకు ముఖ్యాధారము వ్యవసాయము వ్యవసాయదారులు కా కమీషన్ ఏజ ట్లు దుకాణదారులు కలరు ఒట్కాలను టాక్సీలను నడుపువారు కలరు కంసాలి వడ్ర గి కుమ్మరి తాపీమేస్త్రి మ గలి చాకలి మొదలగు వేరువేరు వృత్తులవారు కలరు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 3 లు స్త్రీకి రు 2-50 లు ఇక్కడ రెండు వడ్లమరలున్నవి ఇవి స్థానిక అవసరములకు ఉపయోగ పడును జనులు బావినీటిని త్రాగుదురు నీటివెద్దడి లేదు

వేణుగోపాల భ్రమరా బా మల్లేశ్వర సంగమేశ్వర స్వాముల దేవాలయములు కలవు రామాలయము హనుమ తునిగుడి నాగరవమ్మగుడి బ్రహ్మ గారి మఠము కలవు 35 ఎకరముల 87 సె ట్ల దేవాలయభూములు కలవు ఇక్కడ మహాశివరాత్రి ఉత్సవము మాఘబహుళ త్రయోదశిను డి అమావాస్యవరకు 3 దినములు జరుగును

అంగలకుదురునకు రై ల్వేస్టేషను కలదు ఇది తెనాలి గు టూరు లైనుమీద ఉన్నది ప్రతి అరగంటకు గవర్నమెంటు బస్సులు తెనాలినుండి ఈ గ్రామముగు డా గుంటూరునకు పోవును ఇచ్చట సిమె టురోడ్లు కంకరరోడ్లు మట్టిరోడ్లు కలవు ఇచ్చటిమట్టిరోడ్లు కోపల్లి చావారిపాలెములతో ఈ గ్రామమును కలుపుచున్నవి టాక్సీలు గుర్రపుబండ్లు రిక్షాలు సైకిళ్ళు మున్నగు ప్రయాణసాధనములు కలవు

ఈ గ్రామమునందు బ్రాంచిపోష్టాఫీసు అప్పర్ ప్రైమరీ స్కూలు ఎలిమెంటరీ స్కూలు ఉన్నవి త తి టెలిఫోనుల ఉపయోగమునకై జనులు తెనాలికి పోవలెను హైస్కూలు కాలేజి చదువులకు గుంటూరునకుగాని తెనాలికిగానిపోవలెను

విద్యుచ్ఛక్తిఉన్నది దీనిని 320 ఇ డ్లు ఎలక్ట్రిక్ మోటార్లు వడ్లమరలు ఉపయోగి చుకొనుచున్నవి

ఇది పంచాయతి పరిపాలనకల గ్రామము దీనిలో ఒక ప చాయతీ గ్రంథాలయము రేడియో లౌడుస్పీకర్లు ఒక సత్రము కలవు గ్రామ పారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లు ఉన్నవి కోర్టుకు పోలీసుస్టేషనుకు బ్ రిజిష్ట్రారు ఆఫీసుకు బ్లాకులభివృద్ధికే ద్రముకు జనరల్ ఆస్పత్రికి సినిమాలకు తెనాలికి పోవలెను గ్రామమున పశువుల ఆస్పత్రియొకటికలదు ఇద్దరు హోమియోపతి వైద్యులు ఉన్నారు గ్రామ సహకార స ఘము రు 13 910 లు అప్పుగా ఇచ్చినది ఈ గ్రామమున స తలువేవు కిరాణాదుకాణములు కాఫీహోటళ్ళు సోడా కొట్లు సిగరెట్ల దుకాణములు సైకిళ్ళషాపులు షౌరశాలలు కలవు అవసరమగు అన్నిరకముల సరకులను గ్రామస్థులు తెనాలి ను డి తెచ్చుకొందురు

మా శ్వే

## అంగలూరు

అంగలూరు గ్రామము కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో ఉన్నది దీనికి నాలుగుమైళ్ళ దూరములో గుడివాడ పట్టణము 18మైళ్ళ దూరములో మచిలీపట్టణము కలవు ఈ గ్రామవి స్తీర్ణము ఎ 2857 లు దీనికి తూర్పున చ ద్రాల చెర్వుపల్లి పడమట రామచ ద్రపురం ఉత్తరమున శేరీవేల్పూరు దక్షిణమున గుడ్లవల్లేరు వేముగు ట ఉన్నవి

1961 సం॥ రం జనాభాలెక్కల ప్రకారము ఇచటిస్త్రీ పురుషులస ఖ్య 4725 ఈ స ఖ్యలో వెనుకబడిన జాతుల వారు తరగతులవారు 619 మంది 1941 లోని జనాభా 4031 ఈ జనాభాలో 1961 నాటికి కలిగిన వృద్ధి 694 ఈ గ్రామములో ఇ డ్లు వాడవాడలుగ ఉన్నవి వీటిలో 800 పె కుటి డ్లును 60 కా క్రీటు కప్పుగల ఇండ్లును 55 ఒకే అంతస్తుగల మేడలును 5 రెక్కు అంత స్తుల భవనములుమగలవు

ఈ గ్రామమునకు పాలకోడు తూర్పుచానలు చిత్రం కాలువ కుచ్చికాయలపూడి కాలువ మొండికోడు వేల్పూరు కాలువ ఊర చెరువు వెంగమ్మ చెరువు పేర్నేడు చెరువు వడ్లాబత్తులచెరువు చాకిరంచెరువు మల్లాయకోడు మొదలగునీటివనరులుకలవు వీటిక్రిందవరి పెసర మినుము పండును 1966-67 సం॥లో పంటలక్రింద ఉపయోగించినభూమి 2442 ఎకరములు కాలువక్రింద 2400 ఎకరముల భూమి సాగుబడియైనది మూడు

ఆయిల్ ఇంజనులు 2 ఎలక్ట్రిక్ మోటారులు ఇచట నీటిని సరఫరా చేసెను నాలుగు ట్రాక్టర్లు 000 ఎకరముల భూమిని దున్నుటకు వాడబడెను ఇచ్చటి నల్లరేగడి నేల ఎ 2 57 లు పండినపంటలు లారీలపై బండ్లపై గుడివాడకు రవాణాచేయబడుచున్నవి గ్రామస్థులు తమ అవసరముల మేరకు కాయగూరలను పండింతురు

ఈ గ్రామము పశుసంపద విశేషముగ ఉన్నది గేదెలు ఎద్దులు ఆవులు దున్నపోతులు గుర్రములు మేకలు గొఱ్ఱెలు పందులు కోళ్లు మొదలగు వాటి మొత్తము సంఖ్య 5 844 వీటిలో గేదెలు 1872 ఆవులు 640 దినమునకు 500 లీటర్ల పాలు 80 కి గ్రా మాంసము 440 గ్రుడ్లు 600 కి గ్రా చేపలు స్థానికముగ ఉపయోగించుకొని 1090 లీటర్ల పాలు మచిలీపట్టణము పామర్రు హనుమాన్ జంక్షను లకును 400 కి గ్రా చేపలు గడ్లవల్లేరు గుడివాడలకును రవాణాచేసెరి

ఈ గ్రామమున వ్యవసాయము జనుల ముఖ్యవృత్తి కమిషన్ ఏజెంట్లు దుకాణాదారులు క్రయవిక్రయ దారులు కలరు కంసాలివారు వడ్రంగివారు కమ్మరివారు కుమ్మరివారు మంగలివారు చాకలివారు కలరు కొందరు చేపలను పట్టి జీవింతురు ఇక్కడ వడ్లమరలు కో ఆపరేటివ్ నూనె గానుగలు ఉన్నవి వ్యవసాయమునకు పరిశ్రమలకు అవసరమగు కూలీలు దొరుకుదురు దినమునకు కూలి పురుషునకు రు 2 50 లు స్త్రీకి రు 2 లు సాలీనా 5961 క్వింటాల బియ్యము 819 క్వింటాల తవుడు 10400 కి గ్రా నువ్వులనూనె 1500 కి గ్రా కొబ్బరినూనె ఉత్పత్తి అగును స్థానికుల అవసరములకు పోను మిగిలిన సరుకు 80 మైళ్ళలోని చుట్టుపట్ల గ్రామములకు సప్లయి చేసిరి గ్రామస్థులు చెరువునీటిని బావినీటిని త్రాగుదురు నీటి ఎద్దడి లేదు

అమరేశ్వరుడు సీతారాములు అంజనేయుడు మున్నగు స్వాములు అయిదు దేవాలయములును రెండు చర్చిలును కలవు దేవాలయపు భూములు 41 ఎకరములు

ఈ గ్రామమునకు ఒక మైలు దూరములో నూజెళ్ళ రైల్వేస్టేషను కలదు ఇది గుడివాడ బందరు రైల్వే రోడ్డుపై ఉన్నది ప్రభుత్వపు బస్సులు ప్రతి గంటకు ఈ గ్రామము గుండా బందరునకు గుడివాడకు పోవుచుండును [illegible]

ఈ గ్రామమును గుడివాడ బందరులతో కలుపు తారు రోడ్డు కలువు చున్నది రిక్షాలు స్వంత మోటారుకార్లు ఒంటెద్దుబండ్లు రెండెడ్ల బండ్లు సైకిళ్ళు మొదలగు ప్రయాణ సౌకర్యములు ఉన్నవి

ఈ గ్రామమున బ్రాంచి పోస్టాఫీసు సమితి ఎలిమెంటరీ స్కూళ్ళు ఒక జిల్లా పరిషత్తు హైస్కూలు [illegible] బాలికల హైస్కూలు ఉన్నవి ఇచటి హైస్కూలు చదువుకై బొమ్మలూరు డోకిపర్రు నూజెళ్ళ చంద్రాల గుడ్లవల్లేరు అను గ్రామముల నుండి విద్యార్థులు వత్తురు కళాశాలా విద్యార్థులు గుడివాడకు గాని బందరుకుగాని పోవుదురు [illegible] కార్యాలయములకు గుడివాడ గాని గుడ్లవల్లేరునకు గాని పోవలెను విద్యుచ్ఛక్తిని 134 ఇండ్లు పరిశ్రమయంత్రములు రేడియోలు వడ్లమరలు వాడుకొనుచున్నవి

ఇది పంచాయతీ పరిపాలనగల గ్రామము ఇండ్లపన్ను బండ్లపన్ను వృత్తిపన్ను గ్రాంటు చేపలపాటల రుసుము ఈ సమితికి రాబడి ఆధారములు గ్రామ పారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లుగలవు లోకలు లైబ్రరీ అథారిటీ బ్రాంచి గ్రంథాలయము రేడియో లౌడుస్పీకర్లు పార్కులు సత్రములు కలవు సినిమాలకు నాలుగు మైళ్ళలో నున్న గుడివాడలోని సినిమాశాలలకు పోవుదురు కోర్టులకు పోలీసుస్టేషనుకు సబ్ రిజిస్ట్రారు ఆఫీసుకు తాలూకాకచేరీ గుడివాడ పోవుదురు ఈ గ్రామమున రూరల్ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి వు ఇక్కడ ఇంగ్లీషు వైద్యులు ఆయుర్వేద వైద్యులు లరు ప్రసూతి ఆసుపత్రి జనరల్ ఆసుపత్రి గుడివాడయందే [illegible] ఇక్కడ గ్రామస్థులు లేపు కిరాణాదుకాణములు కూరగాయల అంగళ్ళు [illegible] సిగరెట్టు సోడా అంగళ్ళు కాఫీ హోటళ్ళు సైకిళ్ళషాపులు క్షౌరశాలలు [illegible] గుడ్లవల్లేరులో పెద్ద పశువుల సంత జరుగును

ఇది స్వాతంత్ర్య ఉద్యమములో పాల్గొన్న గ్రామము స్వాతంత్ర్య ఉద్యమసమర సందర్భమున 31-5 1930 లో 100 పోలీసులు అనుమానాస్పదులయిన సత్యాగ్రహులను బంధించుటకు ఈ గ్రామముపై దాడిచేసి లాఠీచార్జి చేయుటవలన పెక్కురు గ్రామస్థులు గాయపడిరి ఖద్దరు పరిశ్రమ మిక్కిలి హెచ్చుగ నెలకొనిన స్థలములలో ఇదియొకటి పెద్ద వాఙ్మయ బ్రహ్మశ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు ఈ గ్రామము వారే [illegible]

## అంగిరట్టడి

అ గిరెడ్డి యను సజ్జనుని పేరు గు టూరుజిల్లా నూతక్కి గ్రామములోని శ క్త్రీశ్వర స్వామి ఆలయమున దలి ఒక శాసనములో దొరకినది (ద హి X 143 67) ట్టడి అనునది రెడ్డి శబ్దమునకు పూర్వరూపము రెడ్డికులమువారు ప్రధానముగా కర్ష కులుగాను కొన్ని యెడల గ్రామాధికారులుగాను కూడ ఉ డిరి గ్రామపు పెద్దలను పూర్వకాలమున రాష్ట్ర కూటు లనుచు డిరి రాష్ట్ర కూట శబ్ద మే వాడుకయ దు మార్పును చె ది రట్టోడి రట్టడి రడ్డి రెడ్డి రూపములను పొ దినదని విజ్ఞులు చెప్పుచున్నారు రెడ్లులనుటకు రట్టొడ్లు అనుపదము శాసనముల దు కన్పి చును అ గిరట్టడి ఎఱియమరట్టడి కుమారుడు వీరిది పులిక్రంత గ్రామము కావచ్చును శాసన కాలము శక 1080 (క్రీ శ 1158) ఇది శ్రీ రాజరాజు పరిపాలనాసమయము ఈ స వత్సరము దక్షిణాయన స క్రా తి స దర్భమున అ గిరెడ్డి నూదె కి (నూతక్కి) శ క్త్రీశ్వర మహాదేవరకు ఆ చ ద్రార్కముగా అఖ డదీపమును సమర్పి చెను దాన వివరములున్న శాసనభాగము నష్టమైనది అఖండదీప నిర్వహణమునకై అ గిరట్టడి భూదానమే చేసెనో మరియేమి ఇచ్చెనో తెలియరాదు

శాసనకాలము క్రీ శ 1158 అగుటచే ఇప్పుడు ప్రాగాంధ్ర దేశమును పా లించువారు వెలనాటి చోడులు అనుట తెల్లము ఇది వెలనాటి రె డవగొ కరాజు (క్రీ శ 1132 63) ఏలుబడి సమయము ఇతడు కడుసమర్థుడును పరాక్రమశాలియు అగు రాజన్యుడు అంగిరట్టడి ఒనశాసనములో వెలనాటి గొ కరాజును ఉదాహరి పక శ్రీ రాజరాజు పరిపాలనా కాలమును పేర్కొనుట కొంతవి ఒగనే ఉన్నది ఇదియ త ఆశ్చర్యపడవలసిన విషయమును కాదు ఏలన వెలనాటి చోడులు ఆ ధ్రదేశాధీశులైనను వీరు సర్వస్వత త్రులు కారు వీరు కాంచీపుర చాళుక్య - చోళచక్రవర్తులకు నామమాత్ర సామంతులుగా ఉ డిరి శాసనమునందు పేర్కొనబడిన రాజరాజు ఇమ్మడి రాజరాజచోళుడు (క్రీ శ 1145 73) అని చెప్పబడు చాళుక్య - చోళచక్రవ ర్తి ఇతడు ఇమ్మడి కులోత్తుంగ చోడుని కుమారుడు ఈ వంశమువారికి ఆ ధ్రదేశమున దు ప్రతినిధులుగా నుండినవారు వెలనాటి చోడులు వీరు ముఖ్య ప్రతినిధులైనను చోళచక్రవర్తులు ఇతర సామంతులను కూడ తమప్రతినిధులుగ అంగీకరించుచుండిరి వారితో కోటవంశీయులొకరు ఈ వంశమువారు ధాన్యకటకమును ముఖ్యపట్టణముగా చే కొని పరిమిత భూభాగమును పాలి చుచు డిరి కోనహైహయులును ఇట్టివారే

ఈ చిల్లర సామ త కుటు బములవారు వెలనాటి చోడుల పెద్దరికమును అ గీకరి పక చాళుక్య చోళచక్రవర్తులతో ప్రత్యక్షస బ ధములు పెట్టుకొనుటకు కోరుచు డిరి నూతక్కి గ్రామము కోటవ శమువారి అధికారపరిధిలో ఉన్నట్లు కన్పి చును కావుననే వీరిక్రింద ఉద్యోగియో మిత్రుడో అయిన అంగిరట్టడి తనదాన శాసనములో వెలనాటి చోడరాజుల ప్రశంసను విడిచిపెట్టి చాళుక్య - చోళచక్రవర్తి ఇమ్మడి రాజరాజునే పేర్కొనియు డును ఐతే క్రీ శ 1158 ప్రా తమున ధరణికోట రాజ్యమును ఏలుచున్నవాడు కోట రెండవభీమరాజు ఇతడు వెలనాటి గొ కరాజు సోదరియైన సబ్బా బికను వివాహమాడెను వెలనాటివారికి మిత్రుడుగనే ఉ డెను

నూతక్కి గ్రామము మధ్యయుగమునుండియు ప్రసిద్ధి వహి చినదిగా కనుపట్టుచున్నది ఇది ఇప్పుడు గుంటూరుజిల్లా మ గళగిరి ఫిర్కాలో ఉన్నది దీనికి నూట్టెంకి నూదె కి నూతెక్కి యను వ్యవహారము శాసనములలో కనబడుచున్నది శక 1040 నాటి యొక నూతక్కి శాసనములోఇచ్చట కేశవ దేవర ఆలయము ప్రతిష్ఠ పబడినట్లు కలదు అంగిరట్టడి దీప దానముచేసిన శ క్త్రీశ్వరస్వామి ఆలయము శివాలయము ఇట్లు క్రీ శ పన్నె డవ శతాబ్దమున వెలనాటి రాజ్యములో శివ కేశవులిరువురును పూజింపబడు చుండినట్లు తెలియుచున్నది

ఖ౦ ఎ రం

## అంజలపాడు (అమలపాడు)

అ జలపాడు గ్రామము శ్రీకాకుళంజిల్లా టెక్కలి తాలూకాలో ఉన్నది దీనికి 18 మైళ్ళ దూరములో టెక్కలి పట్టణము కలదు ఈ గ్రామ విస్తీర్ణము 1331 ఎకరములు దీనికి తూర్పున బ గాళాఖాతము పడమట గోపీనాథపురము ఉత్తరమున పల్లెపూరుకొండరీ దక్షిణమున రామకృష్ణాపురము ఉన్నవి

1961 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఇచటి పురుషులు 1430 మంది స్త్రీలు 1823 మొత్తి వెరసి 3253 మంది వీరిలో షెడ్యూల్డు జాతులవారు 48 మంది 1901 వ సం॥లో జనాభా 2646 1961 సం॥ సాటికి కల్గిన వృద్ధి 7·07 ఇచ్చట ఇసుక

దిబ్బలుమె డు సముద్రప్రాంతమున ఎరుగుతోటలు కొబ్బరి తోటలు కలవు ఈ గ్రామమున ఇండ్లు గు పు ను ఎక వం క్తిగను ఉన్నవి వీటిలో 25 పె కుటి డ్లు ౧ కా క్రీటు కప్పుగల ఇ డ్లు ఎడు ఒకల త స్తుగలమేడలు ఈ ప్రా తమున దుమ్ములగొ డ్లులను అడవిమృగములు ఉన్నవి పాముల ఎలు కల బాధగలదు జనము బావినీటిని త్రాగుదురు నీటి ఎద్దడి లేదు అందరను వరిఅన్నమునే తి దురు

ఈ గ్రామములోని ప టలకు వర్ష మేఆధారము కొబ్బరి మామిడి జీడిమామిడి తోటలను పె చుదురు ఇక్కడ కర్ర పె డటము ప డను 1966 6 సం॥లో ప టలక్రి ద 1234 ఎక రముల భూమి ఉపయోగపడెను సాలీనా 400 క్వి టాలుల జీడిమామిడిగి జలు 25 000 క్వి టాలుల కర్రపె డలము 2 00 000 కొబ్బరికాయలు 6000 క్వి టాలుల మామిడి కాయలు స్థానికులు ఉపయోగి చుకొని 400 క్వింటాలుల జీడి మామిడిగి జలు 15000 క్వి టాలుల కర్రపె డలము 1 40 000 కొబ్బరికాయలు సోంపేట పలాసాలకు ఎగుమతి చేసిరి

అంజలపాడు గ్రామమున పశువులు మేకలు గొర్రెలు పందులు కోళ్ళు కలిసి 9820 200 లీటర్ల పాలు 20 లీటర్ల పాలపదార్థములు 70 గ్రుడ్లు దినమునకును 600 క్వింటాలుల చేపలు సంవత్సరమునకును స్థానికులు ఉపయోగి చుకొని 600 క్వి టాలుల చేపలను కలకత్తాకు ఖిలాయికి ఎగుమతి చేసిరి

ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము చేపలుపట్టువారు దుకాణదారులు ఎద్దుబ డ్లుతోలువారు కలరు సాలివారు వడ్ర గులు కమ్మరవారు తెలికలవారు మంగలివారు చాకలివారు కలరు కొబ్బరిపీచు కుటీరపరిశ్రమవలన 150 కుటుంబములవారు జీవించుచున్నారు సాలీనా ఒక టన్ను కొబ్బరి నులకను ప్రక్క గ్రామములలో అమ్ముదురు వ్యవసాయ మునకు కూలీలు దొరకదురు దినమునకు కూలిరేటు పురుషు నకు రు 2 50లు స్త్రీకి రు 1-50 లు

విష్ణ్వాలయము ఈశ్వరాలయము కలవు గ్రామదేవత గుడికూడ కలదు 5 ఎకరముల దేవాలయభూమి ఉన్నది శ్రీరామనవమి మహాశివరాత్రి ఉత్సవములు జరుగును

ఈ గ్రామమునకు 2½ మైళ్ళలో పూండి రైల్వేస్టేషను ఉన్నది ఈ గ్రామమున మట్టిరోడ్లుకలవు ఈ గ్రామమును పూండితో మట్టిరోడ్డు కల్పుచున్నది సైకిళ్ళు రెండెడ్లబండ్లు ఇచట ప్రయాణమునకు సాధనములు

ఈ గ్రామమున రె డు బ్రా చి పోస్టాఫసులు సమితి ఎలిమెంటరీస్కూలు అప్పర్ ప్రైమరీస్కూలు కలవు హై స్కూలు చదువులకు 2½ మైళ్ళలో ఉన్న పూండి జిల్లాపరిషత్తు హైస్కూలునకును కళాశాల చదువులకు శ్రీకాకుళమునకు గాని విజయనగరమునకు గాని విద్యార్థులు పోవుదురు తంతి కార్యాలయమునకు 3 మైళ్ళలోనున్న కాశీ గ్గకు పోవుదురు

ఇదిపంచాయతీపరిపాలన గ్రామము ప చాయతీగ్ర థా లయము కమ్యూనిటీ రేడియో ఉన్నవి 17 మైళ్ళలో ఉన్న టెక్కలిలోని తాలూకా కచేరీ కోర్టులకును 10 మైళ్ళలో నున్న నౌపడలోని సబ్ రిజిష్ట్రారు ఆఫీసునకును పోలీసు స్టేషను కును గ్రామస్థులు పోవుదురు గ్రామ లా డ్ మార్టు గేజిబ్యాంకు రు 60 000 లు ఋగురికి అప్పులిచ్చినది గ్రామమున ఒక ఇంగ్లీషు వైద్యుడు కలడు 8 మైళ్ళలోనున్న పలాసాలో పశువుల ఆసుపత్రికలదు స్థానికముగా పశువుల డిస్పెన్సరీ కలదు పూ డిలో ప చాయతీ ఆసుపత్రి పురుళ్ళ ఆసుపత్రి ఉన్నవి గ్రామ సంతలేదు కిరాణా దుకాణములు సోడా సిగరెట్టు కిళ్ళీ అంగళ్ళు కాఫీహోటళ్ళు బట్టలషాపులు కొబ్బరికాయల అంగళ్ళు సైకిళ్ళషాపులు కలవు

మా శ్వే

## అంజుమనె ఇత్తెహాద్ ముసల్మీన్

"అ జుమనె ఇత్తెహాద్ ముసల్మీన్" అనగా మహమ్మ దీయుల సమైక్య సంఘమునిభ వము నిజాము పాలనలో నున్న పూర్వపుహైదరాబాదు రాష్ట్రమందలి కొందరు మహమ్మ దీయులు క్రీ శ 1928 లో దీనిస్థాపనకు పునాదులువేసిరి మహ మూద్ నవాజ్ ఖాన్ గృహమందు సమావేశమైన వీరు ముస్లి ముల యోగక్షేమముల జూచుటకై ఒక సంఘము నేర్పరచిరి తొలుదొ ల్త ఈ స ఘమునకెట్టి నామకరణము జరుగలేదు క్రమముగ వృద్ధిజెంది ఈ సంఘము తిరిగి 1929 సం॥లో నైజాము రాజ్య ప్రభుత్వ మత ధార్మిక శాఖాధ్యక్షులగు నవాబు బహదూర్ యార్ జంగ్ భవనములో సమావేశమై అంజుమనె ఇత్తెహాద్ ముసల్మీన్ అను నామమును సంతరించుకొన్నది దీనికిబహదూర్ యార్ జంగ్ అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను అపుడి సంఘాశయము లిట్లుపేర్కొన బడెను — మహమ్మ దీయులనందర సమైక్య పరచుట మహమ్మదీయుల సంఖ్యను వృద్ధిజేయుట వారి ఆర్థికస్థితి గతులను మెరుగు పరచుట

స ప్రదాయసిద్ధమైన వారి రాజకీయ సాంఘిక హక్కులను కాపాడుట ఇస్లాం మతమును సంరక్షించుట ఇస్లాం మత ధర్మమునాచరించు నిజాం ప్రభువుయొక్క ఆజ్ఞలను ప్రజల దరు తలదాల్చునట్లు జూచుట

బహాదూర్ యార్ జంగునకు స్వమతాభిమానము మెండు ఇతని ఆధ్వర్యవమున ఇత్తెహాద్ సంస్థ దినదిన ప్రవర్ధమానముగాజొచ్చెను తమ మతవ్యాప్తికై ఈ సంఘము వారు హిందూమతమందలి దళితజాతులవారిని ముఖ్యముగ వేదవర్గమునకు చెందిన వారిని ఇస్లాం మతము తీసికొనునట్లు ప్రోత్సహించెడివారు అందులకై వారు ధనాశనో జీవనోపాధి గల్పించు ఆశనో పెట్టెడివారు ఇందులకై అపుడపుడు అదరింపులు బెదరింపులు కూడ వారికి తోడ్పడెడివి ఈ విధముగ ఇత్తెహాద్ సంస్థవారాచరించెడి సామదానములకు లొంగియో బెదరింపులకు జడిసియో అనేకమంది హరిజనులు ఆదిహిందువులు పీడిత హైందవులు ఇస్లాం మతమును స్వీకరించుచుండిరి ఈ విధానము హిందూమతమునకు గొడ్డలిపెట్టుగ పరిణమించినది ఈ పద్ధతి నిరాటంకముగ కొనసాగినచో కొంత కాలమునకు నైజాము రాజ్యమందలి అల్పసంఖ్యాకులైన ముస్లిములు అధిక సంఖ్యాకులగుట అధిక సంఖ్యలోనున్న హిందువులు అల్పసంఖ్యాకవర్గముగ రూపొందుట తథ్యము అని తమ మతమునకు జరుగుచున్న హానిని గుర్తించిన కొందరు హిందువులు అందును ఆర్యసమాజము వారు స్వమత సంరక్షణార్థము బద్ధకంకణులైరి వీరు ఇత్తెహాద్ సంస్థ అనుసరించుచున్న మతపు మార్పిడి విధానమును తీవ్రముగ విమర్శించిరి అంతియే గాక ఇస్లాంమతమును స్వీకరించిన హిందువులను వారు శుద్ధి మార్గమున తిరిగి హిందూమతములో చేర్పదొడగిరి ఇట్లు ఆర్యసమాజము నైజామురాజ్యములో ఇత్తెహాద్ సంస్థకు ప్రత్యర్థియైనది

నైజాము ప్రభుత్వములో కొందరు హిందువులు ఉన్నత పదవులాక్రమించియుండిరి మరికొందరు గొప్ప జాగీరుదారులై యుండిరి ఇట్లున్న హిందువులజూచి ఇత్తెహాద్ సంస్థ అసూయ జెందినది ఇది ఇట్లుండగ ప్రభుత్వములోని పోలీసు భూమిశిస్తు పరిశ్రమలు మొదలగు శాఖలకు అధిపతులుగ ఆంగ్లేయులు నియమింపబడిరి దీనివలన అసంతృప్తి చెందిన కొందరు ముల్కీ ఉద్యమమును లేవదీసిరి ఉత్తర హిందూ దేశమునుండి వచ్చిన అనేకమంది ముస్లిములు ముల్కీలు కారైరి అందుచే వారు స్వలాభాపేక్షచేత హైద్రాబాదు లోని మహమ్మదీయులే సర్వ హోధికారులు అను నినాదమును లేవదీసిరి ఇట్లు వారు దువుకు ఆంగ్లేయులకు వ్యతిరేకముగను మహమ్మదీయుల కనుకూలముగను ఒక ఉద్యమము నైజాములో ప్రారంభమైనది క్రమముగా ఈ శక్తులన్నియు ఇత్తెహాద్ సంస్థ బలపడుటకు దోడ్పడినవి నైజాము ప్రభువుకూడ ఈ సంస్థ వారికి తన ఆశీస్సులతోపాటు ధనయు సహకార సంపత్తిని ధనటిని అందజేయ దొడగెను

క్రీ శ 1930 సం॥ నుండి నైజాము రాష్ట్రములో వర్గ పోరాటములు మతవైషమ్యములు నానాటికి హెచ్చినవి హైందవమత స్వాతంత్ర్యమునకై ఆర్యసమాజమువారు సత్యాగ్రహోద్యమమును ప్రారంభించిరి హైదరాబాదు పౌర స్వేచ్ఛా సంఘము (Hindu Civil Liberties Union) వారు కూడ సత్యాగ్రహము చేయుటకు ఉపక్రమించిరి మరియొకవైపున ఆంధ్ర సంఘము కొన్ని ప్రజాహిత ప్రజోద్ధరణ కార్యక్రమముల చేపట్టి నిర్వర్తించుచు క్రమముగా పరిపాలనా సంస్కరణలకై పోరాడసాగెను బాధ్యతాయుత పాలన కావలెననెడి నినాదములు నానాటికి రాజ్యమందంతట మార్మ్రోగిపోవుచుండెను అధిక సంఖ్యాకులైన హిందువుల యొక్క ఈన్యాయ సమ్మతమైన కోర్కెలను కూడ ఇత్తెహాద్ సంస్థ పాశవిక దృష్టితో తీవ్రమైన వ్యతిరేకతను ప్రదర్శించినది నాటినైజాము ప్రభుత్వముకూడ ఇత్తెహాద్‌ను సమర్థించెను రాష్ట్ర కాంగ్రెసు నిషేధింపబడినది ఇట్లు ప్రత్యక్షముగనో పరోక్షముగనో మొదటినుండియు ఇత్తెహాద్ సంస్థకు ప్రభుత్వపు అండదండలొసగ బడినవి

క్రీ శ 1938 సం॥ నకు ఇత్తెహాద్ బాగా స్థిరపడి మిక్కిలి శక్తిమంతమైన సంస్థగా రూపొందినది ఆ సంవత్సరము ఈ సంఘము తన నిబంధనావళిలో గావించిన మార్పుల వలనను చేసిన ప్రకటనలవలనను ఈ విషయము స్పష్టమగుచున్నది హైదరాబాదు యొక్క రాజ్యాధికారము దాని ప్రభువుకుగాని అతనివంశమునకు గాని చెందియుండలేదని ఈ సంస్థ నిర్ద్వంద్వముగ ప్రకటించినది అల్లే నైజాములోని మహమ్మదీయుల స్థానమును గూర్చి ప్రస్తావించుచు రాజు అతని అధికారము (సింహాసనము) కూడ మహమ్మదీయ మతస్థులయొక్క సర్వ హోధికారము నుండియు వారి సాంఘిక ఆధిక్యము నుండియు ఆవిర్భవించెననియు కావున వారి

యొక్క ఈ విశిష్టస్థానము చిరకాలము కొనసాగునట్లు చూడవలెననియు ఇత్తెహాద్ ఘంటాపథమున చెప్పినది "దక్కనులో మేమే సర్వాధికారుల మని దాని యధ్యక్షుడైన బహదూర్ యార్ జంగ్ చాటిచెప్పినాడు దీనినిబట్టి చూడ క్రీ శ 1940 స॥ నకు ఈ సంస్థ నైజాము ప్రభువును సహితము త్రోసి రాజని రాజ్యవ్యవహారముల దు తనదే పైచేయి యన గల్గినదని చెప్పదగును

ఇత్తెహాద్ నాయకత్వములో మహమ్మదీయులు ప్రభుత్వ చట్టములను కూడ సరకుజేయక విచ్చలవిడిగా స చరి ప సాగిరి ప్రభువు కూడ జూచియు చూడనట్లు వ్యవహరి చు వాడు అంతియేగాక అతడు తన సంపూర్ణ సహకారమును ఆసంస్థ క దజేయువాడు దాని కార్యకలాపములలో కూడ అతడపుడపుడు జోక్యము గల్గి చుకొనెడవాడు క్రీ శ 1944 సం॥ లో బహదూర్ యార్ జంగ్ మరణించగా ఇత్తెహాద్ సంస్థయొక్క అధ్యక్ష పదవి నిజాముయొక్క ప్రోద్బలముచే అబ్దుల్ హసన్ సయ్యద్ అలీకి ఒసగబడెను సయ్యద్ అలీ సహృదయుడు ప్రగతివాది ఇతని విశాలదృష్టి సంస్థయందలి స్వమతోద్ధరణ పరాయణులకు దుస్సహమయ్యెను అందుచే వారు క్రీ శ 1946 స॥ లో సయ్యద్ అలీని అధ్యక్షపదవి నుండి తొలగించి ఆస్థానములో కాశింరజ్వీని కూర్చుండబెట్టిరి

కాశింరజ్వీ అధ్యక్షస్థానమలంకరించినప్పటినుండి ఇత్తెహాద్ సంస్థయొక్క చరిత్రలో నూతనాధ్యాయమారంభమైనది ఇతః పూర్వము రజ్వీ లాతూరులో న్యాయవాదవృత్తి జేయువాడు స్థానిక ఇత్తెహాద్ సంస్థకధ్యక్షుడుగా నుండెడి వాడు కర్తవ్య నిర్వహణలో ఇతడు అలుపుసొలుపు లెరుగని నిత్యోత్సాహి మేధావి అందును కుటిలనీతిజ్ఞుడు స్వమతాభిమానమందతని కతడేసాటి చక్కని వక్త సామోపాయ దండోపాయచతురుడు ఇతటి సమర్థుడగుటచేతనే కాబోలు రజ్వీ నాయకత్వములో ఇత్తెహాద్ సంస్థ విజృంభించి నైజాము రాజ్యమునంతటిని షుమారు రెండేళ్ళపాటు తనకబంధహస్తములలో బంధించి నలిచి ఎండి పిప్పిచేసి వైచినది ఈ సంస్థకు అధ్యక్షుడైన నాటినుండి రజ్వీ తన మార్గములను నిష్కంటకము చేసుకొనుట కారంభించెను సంస్థలోను ప్రభుత్వరంగములోను తనకు వ్యతిరేకముగ నున్న వారందరిని క్రమముగా తొలగించి రజ్వీ వారిస్థానాలలో తనమిత్రులు నియమింపబడునట్లు చేసినాడు

కాశిం రజ్వీ నిరంతరము హిందువులపై దుష్ప్రచారము చేయసాగెను హిందువులతో పోరాడు నిమిత్తమై ఇతడు రజాకారులనెడి గొప్ప సాయుధ దళమును ఏర్పరచెను పోలీసుచర్య జరుగు సమయమునకు రజ్వీ షుమారు 4 లక్షలమంది రజాకార్లను తయారుచేసి వారికొరకై ప్రత్యేక శిబిరములను నడుపుచుండెను హైదరాబాదులోని దారుస్సలామ్ రజాకార్లయొక్క ప్రధాన కేంద్రముగ నుండెడిది రజాకార్ల ఉనికి నైజాములోని ముస్లిముల యొక్క మనోధైర్యమును అహంభావమును ద్విగుణీకృతము గావించినది సాయుధ దళ నిర్మాణమునకై దేశపు నలుమూలలనుండి మహమ్మదీయులు రాసాగిరి వీరికి తోడుగా ముస్లిములు కాని అరబ్బులు పఠానులు కూడ సర్వసన్నద్ధులై నిలిచిరి ఈ అనుకూలతను జూచుకొని రజ్వీ మరింత రెచ్చిపోయినాడు వారి సాయముతో నైజాములోని హిందువులను నిర్మూలముగా తుదముట్టింపవలెనని రజ్వీ అనెను యావద్భారత దేశమును జయించి దానిని నైజాము ప్రభువు పాదాక్రాంతము చేసెదనని రజ్వీ ప్రగల్భములు పల్కినాడు రజ్వీమాటలకుబ్బి పొంగిపోయిన నిజాము నవాబు రజాకార్లకు వలయు సాయము చేసినాడు వారి వలయు దుస్తులు ఆయుధములు ధనము మొదలగు వన్నింటిని నిజాముచేకూర్చెను రజాకార్లకు శిక్షణనిచ్చుటకు మిలిటరీ అధికారులు నియమింపబడిరి ఇట్లు నిజామునుండియు అతని ప్రభుత్వోద్యోగులయొక్కయు ముస్లిములయొక్కయు సంపూర్ణ సహకార సంపత్తులు రజ్వీకి అనిశమును పలుకు కోకొల్లలుగ లభింపదొడగెను అందుచేతనే రజ్వీ నైజాము రాజ్యములో మకుటములేని మహారాజువలె చెలామణియైనాడు

భారతదేశమునకు స్వాతంత్ర్య ప్రదానము చేయుటకై నిర్ణయించుకొని తమదేశమునకు పోవుటకై ఆంగ్లేయులు తట్టాబుట్టా సర్దుకొని సన్నద్ధులగుచున్న రోజులవి స్వదేశీయ సంస్థానముల నన్నింటిని భారత యూనియన్‌లో సంలీనము చేయుటకు వల్లభాయి పటేలు యత్నించుచుండెను ఈ సందర్భములో పటేలు యూనియన్‌లో తనరాజ్యము కూడ సంలీనము చేయవలసినదిగ నిజామునకెంతగనో చెప్పజూచినాడు పటేలు హితోక్తులు నిజామునకు కఠినోక్తులైనవి యూనియన్‌లో కలయుటకు నైజాము రాజ్యపు అధిక సంఖ్యాక ప్రజలు అభిలషించుచుండిరి కాని ప్రభువందులకు వ్యతిరేకి రాజా! క్రీ శ 1947 ఆగష్టు 15వ తేదీనుండి తాను సర్వతంత్ర

స్వతంత్రుడుగా వ్యవహరింతునని నిజాము 11 6 1947 వ తేది ఫర్మానాద్వారా ప్రకటించెను 27-7 1947 లో ఇత్తెహాద్ సంస్థయొక్క ఆధ్వర్యమున ముస్లిములు స్వాతంత్ర్య దినోత్సవమును జరుపుకొనిరి నిజాము యొక్క చర్యలకు వ్యతిరేకముగా రాష్ట్ర కాంగ్రెసు సత్యాగ్రహమును ఆరంభించినది సత్యాగ్రహము చేయువారిని అదిరించి బెదరించి దండించి అదుపులో బెట్టుటకు రజాకారులు పూనుకొనిరి క్రీ శ 1947 ఆగష్టు 15వ తేదీన నైజాములోని ప్రజలు స్వాతంత్ర్యోత్సవములను జరుపుకొనుచుండగా రజాకారులు రాష్ట్ర పోలీసులతో చేతులుకలిపి జరిపిన వాసాకాండ వర్ణనాతీతము ఈ సందర్భములో వారు భారతజాతీయ పతాకమును కూడ అవమానపరచి జాతిమొత్తమునకు తీరని అపచారమును చేసిరి

క్రీ శ 1947 ఆగష్టు 15వ తేదీనుండి క్రీ శ 1948 సెప్టెంబరు 18వ తేదీ వరకు నైజాము రాజ్యములో రజాకార్లు ఆడింది ఆటగా పాడింది పాటగా చెల్లిపోయినది తమ రాష్ట్రమును కూడ భారత యూనియన్‌లో సంలీనము చేయవలసినదని కోరి అందులకై శాంతియుతముగా పోరాడుటకు ఉద్యమించిన నైజాము ప్రజలను రజాకారులు నానాబాధలు పెట్టిరి ఈప్రజా ఉద్యమమును సమూలముగా నిర్మూలించుటకై రజాకారులు కృతనిశ్చయులై కృషి చేయసాగిరి అందులకై ప్రభుత్వపు అండదండలు వారికి పూర్తిగ ఒసగబడినవి సాయుధులైన రజాకారులు పోలీసులు తోడురాగా గ్రామములపైబడి అనేక ఘోరకృత్యముల ల్పిరి ఇట్లు ఒక సంవత్సరముపాటు దుష్కృత్యములు ప్రవర్తిల్లెను నైజామురాజ్యములోని ప్రజలందరు తమ ధన మాన ప్రాణములకు రక్షణలేక ఆ సంవత్సరమంతా తల్లడిల్లిపోయిరి కొందరు తలదాచుకొనుటకై సరిహద్దులను దాటి యూనియన్ ప్రాంతములోనికి పారిపోయిరి కొందరు రజాకారుల చేతులలో ప్రాణములను వదలిరి మరికొందరు దిక్కుతోపక నానాహింసలను అవమానములను కూడ సహించి జీవన్మృతులవలె స్వస్థానములందే యుండిరి రజాకారులు చేయుచున్న ఈ ఆగడములను అన్యాయములను దుండగములను జూచి కొందరు మహమ్మదీయులు కూడ వ్యథజెందిరి రజాకారులు చేయుచున్న ఈ దుష్కృత్యములను అంతమొందింపవలసినదిగా వారు నిజామునకు విన్నవించిరి కాని పరిస్థితి అప్పటికే అతని చేయిదాటిపోయినది పేరునకు అతడు ప్రభువువేగాని నిజముగా ప్రభుత్వమును నడుపుచున్నవారు కాశిం రజ్వీయు అతని అనుచరులే

కాని అన్యాయాలు అక్రమాలు దుండగాలు ఎంతకాలము కొనసాగగలవు? రజాకారుల పాపం పండింది భారత ప్రభుత్వమునకు కనువిప్పైనది నైజాము ప్రజల ఆర్తనాదాలు దానిని కదలించివేసినవి క్రీ శ 1948 సెప్టెంబరు నెలలో భారత సైన్యాలు నైజాము రాజ్యమును ఆక్రమించినవి రజ్వీయు అతని ప్రముఖానుచరులు మరికొందరును బంధింపబడిరి భారతప్రభుత్వము తీసికొనిన ఈ పోలీసుచర్య ఇత్తెహాద్ సంస్థకు వజ్రాఘాతమైనది నాటితో ఈ సంస్థ పూర్తిగా నిర్వీర్యమైపోయినది ఐనప్పటికి దాని యునికి వేడుకూడ లేకపోలేదు ప్రస్తుతకాలమందు ఇత్తెహాద్ ముసల్మీన్" సంస్థ ప్రజాస్వామిక వ్యవస్థకు లోనై చట్టబద్ధముగనే వ్యవహరించుచున్నది పురపాలక సంఘములకు రాష్ట్ర శాసన సభలకు తదితర ప్రజాసంస్థలకు ఈ సంస్థతరపున నిలచి ప్రాతినిధ్యము వహించి ముస్లిములు తమ వారి పురోగతికి ప్రయత్నించుచున్నారు

ఏ చెం

## అంజుమనె తరక్కి ఉర్దూ

ఈ సంస్థను ఉర్దూ వాఙ్మయ అభివృద్ధి సంఘము అని తెలుగున చెప్పవచ్చును దీనిస్థాపన ఢిల్లీలో ఏబది సంవత్సరములకు పూర్వము జరిగినది భారతదేశమందు పలుతావుల దీని శాఖలు కలవు ప్రస్తుతము ఈ సంఘ ప్రధాన కార్యాలయము ఉత్తరప్రదేశమునందలి అలిఘర్ పట్టణమున కలదు దీని అధ్యక్షులు పండిత హృదయనాథ కుంజ్రూగారు

ఆంధ్ర ప్రదేశమున ఈ సంస్థయొక్క ప్రధానశాఖ హైద్రాబాదు నగరమున క్రీ శ 1950 సం॥న నెలకొల్పబడినది ఉపశాఖలు మొత్తము అరువదివరకు దేశవ్యాప్తముగ కలవు ప్రముఖ విద్యావేత్తలతో గూడిన సంఘము యొక్క పర్యవేక్షణక్రింద ఈ సంస్థ నిర్వహింపబడుచున్నది సంఘముయొక్క ముఖ్యోద్దేశము ఆంధ్రదేశమున ఉర్దూ భాషను విస్తరింపజేయుట ఈ సంస్థ నిర్వహించిన కార్యకలాపములలో కొన్ని ముఖ్యమైనవి ఈ క్రింద పొందుపరచబడినవి

హిమాయత్ నగరున దలి ఉర్దూహాలు అనుభవనమునకు పండిత జవహరులాల్ నెహ్రూగారు 1966 సం॥న ప్రారంభోత్సవము జరిపిరి ఇదియే ఈ సంస్థకు ప్రధానకార్యాలయము ఉస్మానియా విశ్వవిద్యాలయము యొక్క ఆమో

దము బడసిన ఉర్దూ ప్రాచ్యా కళాశాల ఒకటి ఇచట 1956 న ॥లో స్థాపించబడినది ఉర్దూ ఆర్ట్సు కళాశాలను ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు అనుబంధ కళాశాలగా 1960 సం॥న ప్రారంభించిరి ఇచ్చట ఉర్దూ మాధ్యమముగా కళాశాలా విద్య నిర్వహింపబడుచున్నది ఈ కళాశాలకు ప్రత్యేక భవనము నిర్మాణమగుచు ఉన్నది గ్రంథప్రచురణముతో పాటు ఆంధ్రప్రదేశములోని ఉర్దూ మాతృభాషగాగల ప్రజల ఇబ్బందులను ప్రభుత్వదృష్టికి తెచ్చుట ఈ సంస్థ యొక్క ముఖ్యాశయములలో ఒకటియై యున్నది

వీరు ప్రచురించిన గ్రంథములలో ముఖ్యమైనది తెలుగు వాఙ్మయచరిత్ర దీని రచయిత శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారు ఉర్దూ తెలుగు భాషల నభ్యసించువారలకు ఉపయుక్తముగా తెలుగు ఉర్దూ నిఘంటువు ఉర్దూ తెలుగు నిఘంటువు అను రెండు సంపుటములు ఈ సంస్థ వెలువరించినది ఈ రెండు నిఘంటువులు భాషాభిమానులకు పెన్నిధి వంటివి గౌతమబుద్ధుని జీవితవిశేషములు ఉర్దూలో పద్యరూపమున హృదయంగమముగా ఫజుల్ రహమాన్‌గారిచే రచింపబడినవి మోమిన్ అను మహాకవి సంస్మరణార్థము గీతికారాజిత మైన ఉద్గ్రంథమొకటి మహమ్మదు మంజూల్ అహమ్మదు గారిచే రచింపబడి వెలువడినది అమరజీవుల జీవితగాథలను రెండు సంపుటములుగా హుసేని షాహిద్ మోయిద్ హుస్సన్ అను కవులు రచించిరి ఇవినేటి విద్యార్థులను ఉత్తేజితుల నొనర్ప సమర్థములు

పుస్తక విక్రయధనము అభిమానుల విరాళములు సభ్యులొసగు చందాలు ప్రభుత్వమిచ్చు ధనము మున్నగు వాటివలన ఈ సంస్థ నిర్వహింపబడుచున్నది

కా వెం

## అంటాలో (ఆంధ్ర)

ఆంధ్రదేశ ప్రశస్తి జాతిపరముగా ఐతరేయ బ్రాహ్మణ మందు చెప్పబడినది తరువాత బౌద్ధయుగమున ఈ దేశమునకు మంజీరదేశము వజ్రభూమి నాగభూమి అను పేర్లుకలిగినవి తదుపరి త్రిలింగము అను వ్యవహారము కలిగినది క్రీస్తునకు పూర్వము క్రీస్తుకు అనంతరము ఆంధ్రదేశమును పర్యటించిన విదేశపు యాత్రికులవలన కొన్నిఅంశములు చరిత్ర [illegible]నది

క్రీ॥శ 640 ప్రాంతమున యువాన్ చ్వాంగ్ అను చీనాదేశపు యాత్రికుడు దక్షిణాపథ ప్రదేశములలో పర్యటించుచు ఆంధ్రదేశమున గల వేంగిపట్టణమును ధాన్యకటకమును దర్శించెను ఈయన ఆంధ్రదేశమును చైనాభాషలో అంటాలో అనియు వేంగిపట్టణమును "ఫింగ్ కీ లో" అనియు ధాన్యకటకమును ధనకచ్క మనియు వ్యవహరించెను వేంగిపట్టణమును రాజధానిగ పాలించిన అప్పటి తూర్పు చాళుక్య ప్రభువు జయసింహ వల్లభుడు

యువాన్‌చ్వాంగ్ (హుయాన్‌త్సాంగ్) తానువ్రాసి పెట్టిన పర్యటన గ్రంథమునందు ఆంధ్రదేశమునకు సంబంధించిన విషయములను ఈక్రింది విధమున పొందుపరచెను

అనాటి ఆంధ్రదేశపు వైశాల్యము 450 చదరపు మైళ్ళు రాజధాని అయిన వేంగిపట్టణము బాయులుతీర్చిన రాచబాటలతోను చక్కని సౌధములతోను విలసిల్లుచున్నది పట్టణ వైశాల్యము ముప్పదిచ మైళ్ళు బౌద్ధ సంఘారామములు ఇరువదికిపైగా ఉన్నవి ప్రధాన సంఘారామమున దేదీప్యమానమైన బుద్ధవిగ్రహముకలదు జైనబ్రాహ్మణ మత ప్రాబల్యముచే ఆంధ్రదేశమునందలి బౌద్ధము హీనస్థితియందున్నది పొంగిపొర్లు దీర్ఘప్రవాహము చే ఈ ప్రదేశమంతయు సస్యశ్యామలమై విరాజిల్లుచున్నది

కా వెం

## అండమూరి యలమసిద్దయ

ఇతడు భీమేశ్వర మహాదేవరకు హవిర్బల్యర్చనములకు దేవభోగముగా (కాతభూమిని?) ఇచ్చి శిలాశాసనము పెట్టించెను (ద హిం IV నెం 1261 441) పెట్టించిరి అని బహువచన క్రియ వాడబడుటచే ఇది పూజ్యార్థముగా మనము గ్రహింపవచ్చును యలమసిద్దయ సంపన్నుడో అధికారప్రాభవము కలవాడో అయియుండును శాసనలేఖకుడు వీరరాజే బ్రహ్మ ఆచారి ఈతడు శిల్పికావచ్చును పూర్వకాలమున రాజుల శాసనములు చెక్కువారు కంసాలి కులమువారుగా ఉండిరి వీరినే విశ్వకర్మవంశజులు అందురు వీరివృత్తియందలి గౌరవముచే ఈ శిల్పులకు ఆచారి ఓజు(ఒజ్జ) మున్నగు మర్యాద పదములు చేర్చుచుండిరి

యలమసిద్దయ ఈ దాన మెప్పుడుచేసెనో తెలియదు శాసనకాలము తెలుపుభాగము పోయినది శ్రీ విష్ణువర్ధన మహారాజులు అను పదము ఈ శాసనము నందుండుటచే ఇది యాతని రాజ్యకాలముగా తోచును కాని ఈ విష్ణువర్ధనరాజు

ఎవరో గుర్తించుట సులభము కాదు దాక్షారామ శాసనము లందు ప్లుర్ధన మహారాజుల ప్రశస్తి తరచువచ్చుచుండును అది ఇట్లుండును స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజ రాజపరమేశ్వర పరమభట్టారక రవికులతిలక చోడకులశేఖర పాండ్యకులాంతక రాజరాజేంద్ర వీరమహేంద్ర మచోడ విజయాభరణ శ్రీ రాజకేసరి వర్మపెర్మడిగలు గంగా కావేరీ పర్యంత సస్తమో విష్ణువర్ధనులైన త్రిభువన చక్రవర్తి శ్రీ కులోత్తుంగ చోడదేవర ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సర 47 శ్రాహిగంగ గొండ చోడవలనాటి గుద్రవాడినాటి పెదదాకరేమి శ్రీ భీమేశ్వర మహాదేవర (ద హి IV నెం 1266-440) ఇత్యాదిగా ఈ ప్రశస్తి సుదీర్ఘముగా నుండును

దీనివలన కొన్నిముఖ్యాంశములు తెలియవచ్చుచున్నవి శ్రీ కులోత్తుంగ చోడదేవుడు చోడవంశీయుడు వీరిది సూర్యవంశము వీరికి గంగైకొండ అనునది బిరుదము ఆంధ్ర మహాభారత కృతిపతిఅయిన రాజరాజ నరేంద్రుడు మనకు చిరపరిచితుడు ఆతని మామగారైన చోళచక్రవర్తి పరాక్రమశాలియై గంగానది పర్యంతము విజయయాత్ర సాగించెనని చెప్పుదురు కావున చోళులకు గంగైగొండ అనునది బిరుదుగా ఏర్పడినది వీరు సహజముగా కావేరీతీరమును పరిపాలించినవారు రాజరాజ నరేంద్రుని కుమారుడు రాజేంద్ర చోడుడు మహాపరాక్రమవంతుడు తండ్రియనంతరము ఈతడు కాంచీపుర చోళసామ్రాజ్యమునకు చక్రవర్తిఅయి కులోత్తుంగ చోడనామమును ధరించెను కులోత్తుంగుడు ఆంధ్ర-తమిళ దేశములు రెండిటిని కలిపిన విశాల సామ్రాజ్యమునకు అధిపతియై కీర్తికెక్కెను కులోత్తుంగుడు తండ్రివంక చాళుక్యుడు ఈయనతల్లి అమ్మంగదేవి చోళరాజకన్యక చాళుక్యులలో వంశపురకు విష్ణువర్ధనుడు అను దివంశవరపరగా వచ్చిన నామము ఈ విధముగా కులోత్తుంగుడు చాళుక్య-చోళవంశములను రాజ్యములను కలిపినట్లే ఆ రెండువంశముల వారి బిరుదావళిని కలిపి తాను వహించినట్లు కనబడును

సమస్త భువనాశ్రయ పృథ్వీవల్లభ విష్ణువర్ధన మున్నగునవి చాళుక్యుల బిరుదులు వీరు చంద్రవంశమువారు చోళులు తాము సూర్యవంశమువారమని ప్రకటించుకొనిరి రవికుల తిలక చోడకులశేఖర మున్నగునవి చోళుల బిరుదములు ఇచ్చట విష్ణువర్ధనుడు కులోత్తుంగ చోడుడని అన్వయించుటకు వీలుగానుండుటచే అందమూరి యలమసిద్దయగారి ప్రకృతదానశాసనము కులోత్తుంగచోడుని రాజ్యకాలములో అనగా క్రీ శ 1070 1120 సంవత్సరముల నడుమ వెలసినదని ఊహింపవచ్చును దాక్షారామ క్షేత్రము గంగగొండ వలనాటిలో ఉన్నట్లు సూచితమగుచున్నది గంగగొండ చోళపురము రాజధానిగా గల విశాల సామ్రాజ్యము లోనిదని దీనిభావము కావచ్చును వల వలము శబ్దములు విస్తారము విశాలము అను అర్థములలో వాడబడుచుండును "నీ వల మూపులావు" అని భారత ప్రయోగము

సిద్దయ శాసనమునందు "సమస్తాయ అంతరాయ అభినవాయములు సర్విన వదలు గంటు లోవుగా దేవభోగము సేసె" అని వ్రాయించబడిన మాటలకు నికరమైన అర్థము తెలియుటలేదు ఆయము అనగా ఆదాయము పన్ను అను నర్థము ఉండుటచే వివిధమైన పన్నులచేవచ్చు ఆదాయముతో సహా యలముసిద్దయ ఈ దానమును ప్రకటించినట్లు వ్యక్తమగుచున్నది వీటినే పూర్వశాసనములందు సర్వకర పరిహారము సర్వబాధాపరిహారము అని వ్యవహరించుచుండిరి ఈ దానము దేవభోగము అనుటచే ఆదాయ సాధనములన్నియు భీమేశ్వర దేవునకే సమర్పితమైనవి దానములు బ్రహ్మదేయములు దేవభోగములు అని రెండు విధములు బ్రాహ్మణులకిచ్చిన వృత్తులు బ్రహ్మదేయములు దేవాలయాదులకు సమర్పింపబడినవి దేవభోగములు (గంటు) అనగా నిధియను అర్థముకానవచ్చునేమో ఇప్పటికిని భూములు దానముచేసినప్పుడును విక్రయించినప్పుడును విధివిశేషములతో అనివ్రాయించుట ఆచారము

బం ల రం

## అంతగిరి

ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన అనేకాంశములు వెలుగుబాటకురాలేదు ఉదా - తెలంగాణము తీరస్థాంధ్రమును రాయలసీమను పాలించిన మహమ్మదీయ ప్రభువుల విశేషాంశములతో గూడిన సమగ్రచరిత్రము ఉర్దూ పారసీ చారిత్రిక గ్రంథములలో ఉండుటవలన ఆయాభాషలతో పరిచయము లేని చారిత్రికుల దృష్టినుండి అవివైదొలగినవి

హాదీకుతుల్ సలాతీన్" అను పారసీ చారిత్రక గ్రంథ రచయిత నిజాముద్దీన్ అహమద్ అనునతడు ఈయన గోల్కొండ ప్రభువుల స్థానిక చరిత్ర వ్రాసినవాడు మహమ్మద్ కులీ కుతుబ్

షాకు దివానుగాకూడ ఇతడు వ్యవహరించెను. వివరణములతోకూడిన ఈయన వ్రాతలనుబట్టి గోల్కొండ నవాబుల సంచార కార్యక్రమములలో పాల్గొనిన వాడితడని తెలియనగును. ఈయన తన గ్రంథమందు కుతుబ్‌షాహీ వంశములోని ఏడవ సుల్తానగు అబ్దుల్లాకుతుబ్‌షా జరిపిన ఆంధ్రదేశకోస్తా జిల్లాల పర్యటనమును అతిరమణీయముగా వర్ణించెను. అబ్దుల్లా కుతుబ్‌షా పరిపాలనా కాలము 46 సంవత్సరములు (క్రీ శ 1626 - 1672)

క్రీ శ 1641 (హిజ్రీ 1049) సంవత్సరమున సుల్తాను అబ్దుల్లా తనపరివారముతో అనేక మజిలీలు చేయుచు మచిలీపట్టణమును చేరెను. దారిలో అమంగల్ అను గ్రామమును దాటి మంకాలు నందు మకాము చేసెను. ఈ గ్రామములు మీర్ రుస్తుమ్ ఖాన్ అను సర్దారుని పర్యవేక్షణ క్రింద ఉండినవి. అతడు అబ్దుల్లా పాదుషాను ఉచితరీతిని గౌరవ మర్యాదలతో ఎదుర్కొని స్వాగతమొసగి భోజన సదుపాయములు ఏర్పాటు చేసెను. తరువాత అబ్దుల్లా పరివారముతో రజబ్ నెల ఆఖరు రోజున తెల్లవారగనే ఆ తగిరిలో ఒకకొండ శిఖరమున నిర్మితమైన కోటయందు మకాము చేసెను. ఆకోటయందు అన్ని సౌకర్యములు ఉండెను. చుట్టునుగల ఉజ్జ్వలములగు ప్రకృతి దృశ్యములను చూచి అబ్దుల్లాకుతుబ్‌షా ముగ్ధుడయ్యెను. పైనుదాహరింపబడిన గ్రామములు ఇప్పటికిని నల్లగొండజిల్లాలో కలవు.

అబ్దుల్లా పాదుషా సంచార కార్యక్రమము నుండి మనకు కొన్ని ముఖ్యవిషయములు తెలిసికొనుటకవకాశము చేకూరినది. ఈయన తొలిదశలో మంకాలు అను గ్రామములో మకాముచేసెను. ఇది నేటి హైద్రాబాదు జిల్లాకు చెందిన ఇబ్రహీంపట్నము తాలూకాలోనిది. రెండవమజిలీ అమంగలు అనుగ్రామము. ఇది పూర్వము రాచకొండవెలమలకు రాజధానిగా ఉండెను. ఈ గ్రామము మిరియాలగూడెం తాలూకాలో ఉన్నది. తరువాత మజిలీ హుజూరునగరు తాలూకాలోని అంతగిరి. ఇచటినుండి కృష్ణానదిని వజీరాబాదు (వాడపల్లి) వద్దదాటి గుంటూరుమండలములోని కొండవీడును అతడు చేరియుండును. వాడపల్లి కాకతీయులనాటి నుండి ప్రసిద్ధికన్న రేవు. దీనినిబట్టి కుతుబ్‌షాహీ సుల్తానులు తమ రాజ్యములోని తీరప్రాంతముల చేరుటకు గోల్కొండ నుండి నల్లగొండ జిల్లా మీదుగా కృష్ణను దాటియుండుటకు ఊహ ఏర్పడుచున్నది

జ ఆ

## అంతన్న పంతులు - సబ్నవీసు

అంతన్నపంతుల విషయమును తెలుపుటకుముందు వారి ప్రభువులైన శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారి విషయమును సంగ్రహముగా తెలుపుట అవసరము. వాసిరెడ్డి వారివంశము కృష్ణా గుంటూరు మండలములలో ప్రసిద్ధికన్నది. హైదరాబాదు నిజాము నవాబు ఒకవైపునను ఆంగ్ల - ఈస్టు ఇండియా కంపెనీవారొకవైపునను పాలనాధిపత్యమునకై పెనుగులాడెడి కాలమది. క్రీ శ 1761 ప్రాంతమున ఢిల్లీ చక్రవర్తి షా ఆలం నిజాముద్వారా వాసిరెడ్డి వంశమునకు చెందిన నాగన్న నాయకునకు కృష్ణా గుంటూరు మండలము నందలి వినుకొండ బెల్లంకొండ రాయపూడి కూచిపూడి మొదలగు పరగణాలనుండి పన్నువసూలుచేయు అధికారము ఒసగెను.

నాగన్నకు ముగ్గురు కుమారులు. వారిలో ప్రథముడు రామన్న ద్వితీయుడు జగ్గయ్య తృతీయుడు వెంకటాద్రి. చరిత్ర ప్రసిద్ధికన్న రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు ద్వితీయుడైన జగ్గయ్య కుమారుడు. నాగన్న తన ప్రతిభాతిశయమున ఆస్తిపాస్తులను సంపాదించెను. అందు చింతలపాటి జమీందారీ ఒకటి.

వెంకటాద్రినాయుడు యుక్తవయస్కుడగు నప్పటికి దాయాదులైన పెదతండ్రి పినతండ్రుల కుమారులలో పాపయ్య చంద్రమౌళి అనువారలతో ఆస్తిపంపకము విషయమున వివాదము లేర్పడెను. తత్పరిణామముగా వెంకటాద్రి నాయుడు తన పితృవ్యపుత్రులను బలప్రయోగముచే చింతలపల్లి కోటయందు బందీకృతులను జేసెను.

రాజా వెంకటాద్రినాయని శౌర్యాతిశయము వితరణము ప్రఖ్యాతి నొందినవి. తనకు సంతతిలేని కారణమున చింతలపల్లియందు బందీకృతులైన తన పినతండ్రి కుమారులను విడిపించి అందు చంద్రమౌళియొక్క ద్వితీయకుమారుడగు జగన్నాథబాబును వెంకటాద్రినాయుడు దత్తపుత్రునిగా స్వీకరించెను. జగన్నాథబాబుకు పదునెనిమిదవయేట అచ్చమ్మ రంగమ్మ యను వారితో వివాహము చేసెను. మరికొంత కాలమునకు ఆయన పాపయ్యకుమారుడగు రామనాథబాబు అనువానిని రెండవ దత్తునిగా చేకొనెను.

రాజా వెంకటాద్రి నాయుడు తన జీవితకాలముననే తన ఆస్తిని ఇరువురు దత్తపుత్రులకును పంపకము చేసెను అందు జగన్నాథబాబునకు ఉమామహేశ్వర ప్రాంతమందలి 314 గ్రామములు ద్వితీయదత్తుడైన రామనాథబాబునకు చేబ్రోలు సీమలోని 287 గ్రామములు సంక్రమించినవి వెంకటాద్రి నాయుడు 1816 సం అగష్టు 17 వ తేది దివంగతుడయ్యెను చనిపోవుటయే తడవుగా ఆతనిఆస్తియంతయు కోర్టుల లావాదేవీలకు గురి అయ్యెను

రాజావారియొక్క అంతరంగిక వ్యవహారములను నిర్వహించెడి వారలలో సబ్బవీసు అన్నపంతులు పొట్టూరి కాశీదాసు అను బ్రాహ్మణులు ముఖ్యులు ఈ ఇద్దరు వ్యవహర్తలు దత్తుల ఇరుపక్షముల వహించిరి అంతులేని వ్యాజ్యములలో చిక్కుకొని కడకు ఆస్తిఅంతయు నష్టమయ్యెను అంతన్నపంతులు జగన్నాథబాబు పక్షమునను డి రెండవదత్తత సక్రమమైనదికాదు కావున ఆస్తియంతయు జగన్నాథబాబునకే చెందవలెనని వాదించెను పంపకప్రకారము రామనాథబాబునకు చేబ్రోలుసీమ గ్రామములు చెందవలెనని కాశీదాసు వాదము

ఈలోపుగా వాసరెడ్డి ఎస్టేటును డి బకాయపడిన శిస్తు వసూళ్లకు గుంటూరు బందరుజిల్లా కలెక్టరులు జమీందారీని జప్తుచేసిరి వంశము విచ్ఛిన్న కరకర్తుల తంత్రములకు గురి అయినది ఈ సందర్భమున ఈ జమీందారీ పరిస్థితుల గురించి ఎలియట్ దొరగారు వ్రాసిన అభిప్రాయము గమనించదగినది

జగన్నాథబాబుకు తండ్రి మరణానంతరము ఖజానాను డి ఎబదిలక్షల రూపాయలు సంక్రమించినవి రెండేండ్లలోపుననే 1818 నాటికి డబ్బంతయు వ్యయమై పోవుటయేకాక అమరావతిలోని భవనముకప్పుపై అమర్చబడిన ఇత్తడి రేకులను తొలగించి అవి కోర్టు ఖర్చులకుగాను బందరులోనున్న సబ్బవీసు అన్నపంతులకు పంపనైనది డబ్బంతయు ఎమూలకు పోయినదో తెలియదు

కా వేం

## అంతర్వేది

అంతర్వేది అనుగ్రామము తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకాలో వశిష్ఠ అను గోదావరి పాయ సముద్రములో కలియుచోట కలదు అందుచే ఇది పావిత్ర్యదాయకముగా భావింపబడును పడవమీద అంతర్వేదికి నరసాపురము రైల్వేస్టేషను 6 మైళ్ళలో ఉన్నది రోడ్డుద్వారా ఇది రాజోలునకు 16 మైళ్ళ దూరములో ఉన్నది ఈ గ్రామ విస్తీర్ణము 8 161 ఎకరములు దీనికితూర్పున కేశవదాసుపాలెము పడమర వశిష్ఠగోదావరి ఉత్తరమున గుడిమూలఖండ్రిక దక్షిణమున బంగాళాఖాతము కలవు

1961 స । జనాభాలెక్కలననుసరించి ఇచటి పురుషులు 3910 మంది స్త్రీలు 3674 మంది ఉండిరి జనసంఖ్యమొత్తము 7584 దీనిలో షెడ్యూలుజాతులవారు తరగతులవారు 1881 మంది ఈ గ్రామమందు గృహములు విడివిడిగాను దూరదూరముగాను కట్టబడి ఉన్నవి వీటిలో పెంకుటిండ్లు 350 కాంక్రీటుకప్పుగల ఇండ్లు 6 జనులు బావినీరు త్రాగుదురు వేసవికాలములో నీటిఎద్దడి కలదు

గన్నవరం మెయిన్ కాలువ అంతర్వేది పంటకాలువ అడ్డాలసాకుకాలువ మామిడితోటకాలువ సఖినేటిపల్లికాలువ లోకల్‌ఫండు చెరువు ఇచటి నీటివనరులు వీటిమూలమున వడ్లు చోళ్ళు జొన్నలు పండుచున్నవి 1966 67 సం॥ లో 5000 ఎకరముల భూమి పంటలక్రింద ఉపయోగపడెను కాలువలక్రింద సాగుబడిఅయిన భూమి 1500 ఎకరములు నీటిని తోడుటకు గూడలను ఉపయోగించిరి ఇచ్చట రేగడినేల 4000 ఎకరములు ఇసుకగరపనేల 4161 ఎకరములు ట్రాక్టరు సాయమున 100 ఎకరముల భూమి దున్నబడెను

ఇచటి నుల ముఖ్యవృత్తి వ్యవసాయము కమిషను ఏజంట్లు దుకాణుదారులు బండ్లతోలువారు అడవికలప కొట్టి జీవించువారు కలరు మంగలివారు చాకలివారు బెస్తవారు ఉన్నారు వ్యవసాయమునకును పరిశ్రమలకును అవసరమగు కూలివారు లభింతురు రోజుకూలి తలకు రు 2 లు స్థానికులు 7 ధాన్యపుమరలు ఉపయోగింతురు డొక్కనారత్రాడు పేను కుటీరపరిశ్రమ కలదు ఉత్పత్తియైన వస్తువులను మల్కిపురమునకు పాలకొల్లునకు ఎగుమతి చేయుదురు

అంతర్వేదిలో లక్ష్మీనరసింహ నీలకంఠేశ్వర ఆంజనేయ దేవాలయములు కలవు మొగలారమ్మ మారెమ్మ కనకదుర్గ ముత్యాలమ్మ అశ్వారూఢా బలగుడులు ఉన్నవి

నరసాపురమునుండి అంతర్వేదికి గోదావరిమీద లాంచీలు తిరుగును ఈ గ్రామములో మట్టిరోడ్లుకలవు ఇవి దీనిని ఇతరగ్రామములతో కలుపుచున్నవి ఒంటెద్దుబండ్లు రెండెడ్ల బండ్లు సైకిళ్ళు కలవు బ్రాంచి పోస్టాఫీసు ఒకటి ఉన్నది

కుమారలక్ష్మీనరసింహరాయ ఎవాదరు ఈ లక్ష్మీనరసింహ స్వామి ఆలయమునకు ధర్మకర్తగా నియుక్తుడు అయ్యెను ఆదిలో పల్లవరాజులు కట్టించిన ఆలయము ముద్రవు ఇసుకలో కూరుకొనిపోగా దానిని భక్తుని ఉద్ధరించ పునర్నిర్మించ రక ప్రస్తుతదేవాలయపు దక్షిణభిత్తిలోగల రాతిశాసనము వలన 1823 సవత్సరములో (వృషభాను వత్సర చైత్ర బ దశమి ఆదివారము) ఈ దేవాలయము నిర్మింపబడి ఆవిష్కరింపబడినదని తెలియుచున్నది

శ్రీనరసింహస్వామి హిరణ్యకశిపుని సంహరించి అతని శరీరమును అంతర్వీథి (ఆకసము)లో విసరివైచెను ఆ అంతర్వీథియే కాలక్రమమున అంతర్వేదిగా మారినదని తెలియవచ్చుచున్నది నరసింహస్వామి కల్యాణము ప్రతి వత్సరము మాఘశుద్ధ నవమి మొదలుకొని 9 దినములు జరుగును స్వామికి ధ్వజారోహణ కల్యాణ రథ ఉత్సవములు జరుపబడును దేవాదాయశాఖవారు సత్రములవారు భక్తులకు ఉచితముగా భోజనము పెట్టుదురు ఉత్సవసందర్భమున 2 3 వేల అంగడులు ఏర్పడును ఆహారవస్తువులు ఆటవస్తువులు పాత్రసామగ్రి పుస్తకములు వ్యవసాయపరికరములు విక్రయింపబడును నాటకములు నృత్యములు మొదలగు వినోదములు ఆకర్షకముగ ప్రవర్తిల్లును

గంగలకుర్రు

## అంతర్వేదిపాలెం

అంతర్వేదిపాలెం గ్రామము తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకాలో ఉన్నది దీనికి ఎనిమిది మైళ్ళ దూరములో రాజోలు పట్టణము కలదు ఈ గ్రామవిస్తీర్ణము 2410 ఎకరములు దీనికి తూర్పున కత్తిమండ పడమట గుడిమూల ఎఖినేటిపల్లి ఉత్తరమున కత్తిమండ మల్కిపురం దక్షిణమున మోరి అంతర్వేది సరిహద్దులుగ ఉన్నవి

1961 సం జనాభా లెక్కలప్రకారము అంతర్వేది యందలి పురుషులు స్త్రీలు కలిసి 7932 మంది వీరిలో షెడ్యూలు జాతులవారు తరగతులవారు 1703 మంది ఇచ్చట ఇండ్లు దూరదూరముగ ఉన్నవి వీటిలో 460 పెంకుటిండ్లు 15 కాంక్రీటు కప్పుగల ఇండ్లు సముద్రమునకు 3 మైళ్ళలోనున్న ఇసుక ప్రదేశమున ఈ గ్రామము ఏర్పడి యున్నది

అంతర్వేదిపాలెమునకు పదునొకండు పంటకాలువలు రెండు చెరువులు ఉన్నవి వరి ఉలవ జనుము పండును 1966 67 సం లో పంట క్రింద 2600 ఎకరముల భూమి ఉపయోగపడెను కాలువక్రింద 200 ఎకరములు బావులక్రింద 350 ఎకరములు సాగుచేయబడెను ఆరు ఆయిలు ఇంజనులు బోడలు సత్తగుల్లలు భూములకు నీటిని సరఫరా చేసెను రెండు ట్రాక్టర్లు 400 ఎకరములను దున్నుచున్నవి ధాన్యము మొదలయినవి బండిమీద బస్సులపై ఇంటిల్లి మార్కెట్టునకును కొబ్బరికాయలు ధాన్యము గన్నవరం మొయిన్ కాలువమీద పడవలపై రాజమహేంద్రవరమునకును ఎగుమతి చేయబడుచున్నవి అంతర్వేదిపాలెమున ఎడ్లుల క్యా 4 66 దీనిలో 1150 గేదెలు 250 ఆవులు 550 ఎద్దులు 150 మేకలు 500 కోళ్ళు కలవు దినమునకు 250 లీటర్లపాలు 140 కిలోగ్రాముల పాలపదార్థములు స్థానికులు ఉపయోగించుకొని మిగిలిన 1100 లీటర్ల పాలు పాలపదార్థములు రాజోలునకు రవాణాచేయుదురు

వ్యవసాయము ఈ గ్రామస్థులకు ముఖ్యమయిన జీవితాధారము వ్యాపారస్థులు కమిషన్ ఏజంట్లు ఒట్కాలు దొడ్డు డ్లు నడుపువారు కలరు కంసాలి వడ్రంగి కమ్మరి కుమ్మరి తాపీమేస్త్రీలు మంగలివారు చాకలివారు కూలిచేసి జీవించువారు కలరు ఇక్కడ నాలుగు ధాన్యపుమిల్లులు నాలుగు నూనెగానుగలు ఉన్నవి వ్యవసాయదారులకు కూలివారు దొరుకుదురు కూలిరేటు దినమునకు ఒక్కొక్కనికి రు 2 లు దినమునకు 30 బస్తాలబియ్యము 16 కి గ్రాం ల నూనె స్థానికులు ఉపయోగింతురు బావినీటిని త్రాగుదురు నీటియెద్దడిలేదు

అంతర్వేదిపాలెమున శ్రీమదనగోపాల రామ వాటకేశ్వర స్వాముల ఆలయములు ఎళ్ళాలమ్మ ముత్యాలమ్మల గుడులుకలవు అయిదు చర్చీలు ఒకమసీదు ఉన్నవి వాటకేశ్వర స్వామికి ఎ 10 50 సెంట్లు భూమి కలదు మదనగోపాలస్వామి ఉత్సవము మాఘశుద్ధ దశమిమొదలుకొని పూర్ణిమవరకు జరుగును స్థానికులు పొరుగూళ్ళవారు భక్తులు అభిషేకములు చేయుదురు స్వామి విగ్రహమును ఊరేగింతురు ఈ ఉత్సవము గత 300 సవత్సరములనుండి జరుగుచున్నది సాలీనా రు 000 లు ఆదాయము మదనగోపాలస్వామికి కలదు భక్తులకు ఉచితముగా అన్నదానము జరుగును ప్రసాదము పంచిపెట్టుదురు ఇచట వంశపారంపర్యముగా వచ్చు వైష్ణవులే అర్చకులు శివరాత్రి ఉత్సవమును బహుళత్రయో

దశినుండి మూడురోజులు జరుపుదురు మొదటిరోజు అభిషే౼ము అర్చనలు జరుగును శేఃచినదినములలో బాణఃచును కాల్చుదురు వినోదములు డును తత్రియులు కమ్మరులు ఈ ఉత్సవమునకు ముఖ్యపోషకులు స్థానికులును పొరుగూరి వారును గొప్ప స ఖ్యలో ఈ ఉత్సవమున పాల్గొ దురు ఈ గ్రామమున దు మారి జాడ్యములు తలయెత్తి ప్రబలినపుడు పళ్లాలమ్మ ముత్యాలమ్మలజాతరలు జరుగును

అ తర్వేదిపాలెమునకు 7½ మైళ్ళ దూరములో నరసాపుర రైల్వేస్టేషను ఉన్నది శేకసెట్టిపాలె పడవల కాలువ కూడఉన్నది క కరరోడ్లుఉన్నవి ఈ గ్రామము ను పొరుగు గ్రామములతో క కరరోడ్లు కలుపుచున్నవి 6 గుఱ్ఱపుబండ్లు 8 ఒంటెద్దుబండ్లు 100 రె డెడ్లబ డ్లు 150 సైకిళ్ళు 3 స్కూటర్లు మొదలగు ప్రయాణ సాధనములున్నవి

అంతర్వేదిపాలెములో సబ్ పోస్టాఫీసు త తికార్యాలయము టెలిఫోను కలవు హైస్కూలు చదువునకు రె డు మైళ్ళలో నున్న మల్కిపురమునకును కాలేజి చదువులకు 7½ మైళ్ళలోనున్న నరసాపురమునకును ఇచటి విద్యార్థులు పోవుదురు ఇచటి విద్యుచ్ఛక్తిని 100 ఇండ్లవారు వాడుకొనుచున్నారు ఇది పంచాయతీ పరిపాలనకల గ్రామము కోర్టుకు తాలూకా కచ్చేరికి బ్లాకు అభివృద్ధి కే ద్రమునకు 8 మైళ్ళలో నున్న రాజోలునకు పోవుదురు పోలీసుస్టేషనుకు సబు రిజిష్ట్రారు ఆఫీసుకు ఎనిమాకు మల్కిపురమునకు పోవుదురు

గ్రామ సహకారసంఘమువారు గ్రామస్థులకు రు 6000 లు అప్పుగా ఇచ్చిరి రూరలు ఆసుపత్రి కలదు ఇంగ్లీషువైద్యులు ఆయుర్వేదవైద్యులు కలరు దీనికి ఒకమైలుదూరములో నున్న మోరి గ్రామమున పశువుల ఆసుపత్రి కలదు ఇక్కడ గ్రామ సంతలులేవు కిరాణా దు కాణములు కాఫీహోటళ్ళు సోడా కిళ్ళీ ఎగసెట్టు దుకాణములు ఉన్నవి మల్కిపురం గ్రామ స తలో పశువులు కూరగాయలు మాంసము లభించును

ఈ గ్రామమున దలి శ్రీ హాటకేశ్వరస్వామి దేవాలయము చాల పురాతనమైనది దీనికి దక్షిణభాగమున ఒక రాతిపై సూర్యుని చంద్రుని ప్రతిమలు చెక్కబడుటచే ఇది కుహామ్మదీయుల పరిపాలనలో కట్టించబడినట్లు ఊహింపబడినది కీర్తిశేషులు శ్రీ కొడుకుళ్ళ సీతారామశాస్త్రిగారు వర్థమాన శ్రీ ఈతకుణ్ణి శేషశింగరాచార్యులు (వ్యాకరణపండితులు) ఈ గ్రామమునకాశే  గ ల కొం

## అందుగుల వెంకన్న

ఇతడు నియోగి బ్రాహ్మణుడు సూరఃచిపుని కొడుకు ఇతడుకవి రామరాజీయము అను నాలుగాశ్వా ఎల ప్ర ంధ మునురచి చి కోద డరామరాజునకు అ తము చేసెను అళియ రామరాయల కీర్తిప్రతాపములు ఈ ప్రబంధమున వర్ణి బడినవి కోదండరామరాజునకు ఇది అ తమైనది ఈ రె డు కారణము లచే ఈ గ్ర థమునకు రామరాజీయమను పేరు సార్థకము ఇ దు వర్ణింపబడిన అ వీటివారి ౼ల్బలము అధి ముగా ఉండుటచేత వీరు నర౼తులనబడిరి దక్షిణ హిందూ దశములోని మూడు బలవత్తర రాజ్యములకి నర తి అశ్వపతి ౼ పతి అను బిరుదములు చెల్లుచున్నవి ఇవి వారి గల ల యా బలాధిక్యమును ఒట్టియే ఎర్పడియుండును హిందూ రాజులు పదాతిబలము అధి౼ముగా కలవారగుటచే వారి న౼తులను బిరుదువచ్చెను అశ్వికబలము అధికముగాగల ముసల్మాను రాజులకు అశ్వపతులను బిరుదు కలిగెను ఎనుగుల బలము విస్తారముగా కలవారు ఓఢ్రరాజులు కావున వీరి గజ౼ుకు లను పేరు చెల్లెను

రామరాజీయము చారిత్రకముగా చాల ముఖ్యమైనది తెలుగుదేశమ దలి పెక్కువృత్తాంతములు ఆయా రాజులపేర్లు బిరుద గద్యములు ఈ గ్రంథముందు కననగును ఇందు సృష్టి కర్త మొదలుకొని చంద్రవంశమును కళ్యాణబిజ్జలుడు మొదలుగ అరవీటివంశమును గ్రి థక౼ర్త వర్ణించెను ఈ కృతిపతి యైన కోదండరామరాజు అరవీటి బుక్కరాజు వంశములోని వాడు అరవీటివారు చంద్రవంశపురాజులు అరవీడు అను పట్టణమును రాజధానిగా ఏలినరాజులలో బుక్కరాజు ప్రముఖుడు బిజ్జలుడు కల్యాణిచాళుక్యుల సేనాపతియై వారి రాజ్యమును ఆక్రమి చెను బిజ్జలుని కొడుకు తాతఎన్నరాజు తాత ఎన్నరాజు కొడుకు సోమదేవుడు ఈ సోమదేవుడే అరవీటి పాలకులలో మొదటివాడు ఇతని పరాక్రమమును విజయములను వర్ణించు పద్యములు ఈ ప్రబంధమున కలవు సోమదేవుడు నడశాలనాయకుని గుజ్జులవీరసేనిని రుద్రపాధిపుని గొరా రెడ్డిని గంగినాయకుని జయించిన మహావీరుడు కందనోలు కలువకోలు మొసలిమడుగు సాతానికోట మున్నగు కోటలను అవలీలగా సాధించిన మహాపరాక్రమశాలి ఇతడు ఈ సోమదేవుని కొడుకు రాఘవరాజు రాఘవరాజు కుమారుడు పిన్నశౌరి ఎన్నసౌరి కుమారుడే ఆర్వీటి బుక్కరాజు బుక్క

రాజునకు బళ్ళాదేవి అబ్బలదేవి అను ఇద్దరు భార్యలు ఉండిరి బళ్ళాదేవియందు బుక్కరాజునకు కలిగినవాడు రామరాజు రామరాజునకు లక్కాంబయందు తిమ్మరాజు కొండరాజు శ్రీరంగరాజు అను ముగ్గురు కొడుకులు కలిగిరి ఈ శ్రీరంగరాజు వంశములోనివాడే రామరాజీయకృతి భర్త రామరాజీయమందలి వంశవృత్తము ననుబట్టి రామరాజీయ కృతిపతియైన కోదండరామరాజు అళియరామరాజునకు మనుమని మనుమడు

ఆర్వీటి బుక్కరాజు శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేక సమయమున అనగా క్రీ శ 1510 లో ఉండినట్లు కృష్ణదేవరాయవిజయము మున్నగు గ్రంథములవలన తెలియవచ్చుచున్నది సోమదేవరాజు తండ్రియైన తాతఎన్నమరాజు శక 1 00 22 (క్రీ శ 1 78 1405) ప్రాంతమున వర్ధిల్లియుండవలెనని డా నేటూరి వేంకటరమణయ్యగారు వ్రాసిరి (పుట 311 సాహితీవాఙ్మయము) ఆర్వీటి సోమదేవరాజు క్రీ శ 1340-45 ప్రాంతముల ఉండియుండును మహమద్ బిన్ తుఘ్లకు కంపిలి రాజ్యమును జయించి అక్కడ తన ప్రతినిధిని నిలిపెను రాయలసీమ ప్రాంతమునుండి మసల్మానులను పారద్రోలుటలో సోమదేవరాజు ప్రముఖపాత్రను వహించెను సోమదేవరాజునకును బుక్కరాజునకును కాలవ్యవధి చాల ఉన్నది అందుచేత బుక్కరాజు సోమదేవరాజు మునిమనుమడనుటలో విప్రతిపత్తి యుండదు అందుగల వెంకన్న నూరంచిన్ని కొడుకు అనుటతప్ప అతనినిగురించి ఇతరవివరములు రామరాజీయమందు లేవు

గ ల కాం

## అందోలు (జోగిపేట)

అందోలు మెదకుజిల్లాలో అందోలుతాలూకాలో ఉన్నది దీనికి 18 మైళ్ళ దూరములో సంగారెడ్డి పట్టణము కలదు ఈ గ్రామవిస్తీర్ణము 2665 ఎకరములు దీనికి తూర్పున జోగినాథస్వామి గట్టు మంజీరానది పడమట డాకూరు ఉత్తరమున అన్నాసరం దక్షిణమున మసానిపల్లె ఉన్నవి

1961 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామ జనాభా 10381 ఈ సంఖ్యలో షెడ్యూలు జాతులవారు 1451 మంది 1951 సం॥ లోని జనాభా 10 000 జనాభాలో వృద్ధి 381 ఇచ్చట ఇండ్లు గుంపులుగను వాడ వాడలుగను నిర్మింపబడినవి వీటిలో 1100 పెంకుటిళ్ళు 200 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 160 ఒకఅంతస్తుగల మేడలు 40 రెండు అంతస్తుగల భవనములు తూర్పుదిశగా ప్రభుత్వ భవనములు నిర్మించుటచే ఈ గ్రామము అధికగా అభివృద్ధి చెందుచున్నది ఇచ్చటిజనులు జొన్నఅన్నము వరిఅన్నము తిందురు చెరువు నీటిని త్రాగుదురు నీటిని పరిశుద్ధముచేయు సౌకర్యము ఉన్నది నీటిఎద్దడి లేదు

మంజీరానది అందోలుచెరువు కొత్తచెరువు ఈ గ్రామము ముఖ్యమైన నీటివనరులు మంజీరానది జలమును మంచినీరుగా ఉపయోగించుటకు ప్లానును ఏర్పరచుచున్నారు వరి జొన్న వేరుసెనగ మినుములు కొర్రలు తమిదలు సెనగలు కందులు కుసుమ గోధుమ మిర్చి చెరకు ఇచ్చట పండును మామిడి జామ అంగూరు తోటలు కలవు సంవత్సరము పొడుగునను జనుల అవసరముల నిమిత్తము వివిధ రకముల కూరగాయలను పండింతురు 1966 67 సం॥ లో పంటలక్రింద 2500 ఎకరములు ఉపయోగించబడెను చెరువుక్రింద 750 ఎకరములు బావులక్రింద 80 ఎకరములు ఇతరవనరుల క్రింద 20 ఎకరములు సాగుబడి ఆయెను 4 ఆయిలు ఇంజనులు 12 ఎలెక్ట్రిక్ మోటారులు 140 ఎకరముల భూమికి నీటిని సమకూరెను బండ్లపై పంటదినుసులను జోగిపేట మార్కెటునకు చేర్చిరి వడ్లు జొన్నలు చెరకు మంజీరానదిపై మెదకు ఘనపురములకు ఎగుమతి యగును

ఈ గ్రామమున గల పశువులు 10 850 ఈ సంఖ్యలో 650 గేదెలు 500 ఆవులు 1 00 దున్నలు 300 మేకలు 8000 గొర్రెలు 5000 కోళ్ళు సాలీనా 4 23 000 లీటర్ల పాలు 1 00 కి గ్రాముల పెరుగు నెయ్యి 3600 కి గ్రాముల మాంసము 30 000 గ్రుడ్లు 5000 కి గ్రాముల చేపలు స్థానికముగను చుట్టుప్రక్కల గ్రామములకును ఉపయోగపడెను

ఇచటి ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము కలప అడవివృత్తులవారు కమిషను ఏజంట్లు దుకాణాదారులు క్రయవిక్రయదారులు కలరు ట్రక్కులు టాక్సీలు ఎద్దుబండ్లు నడుపువారును కలరు కంసాలివారు వడ్రంగులు కమ్మరివారు కుమ్మరివారు సాలెవారు తెలికలవారు మంగలి చాకలి గొల్ల వడ్డెరవారు కలరు నూలుమగ్గములు మొదలగు పనులవలనకూడ కొందరు జీవింతురు 10 వడ్లమరలు 2 నూనెగానుగలు కలవు సాలీనా 10 000 క్వింటాలుల బియ్యము 2000 కి గ్రా నూనె ఇక్కడ తయారగును.

వీటిని స్థానికులు ఉపయోగి తురు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు కూలి పురుషునకు రు 2 50 లు స్త్రీకి రూ 2 లు

ఈ గ్రామమున గోపీనాథ రాజరాజేశ్వర మాణిక్య ప్రభు శివ విశ్వేశ్వర లక్ష్మీనారాయణ గోపాల స గమే శ్వర హనుమద్దేవాలయములున్నవి ఎల్లమ్మ పోచమ్మ గుడులు ఒక చర్చి నాలుగు దర్గలు కలవు దేవాలయ భూములు 20 ఎకరములున్నవి ప్రతిసంవత్సరము చైత్రశుద్ధ దశమిను డి 11 రోజులు జోగినాథస్వామి ఉత్సవము జరుగును ద ర్గ ఉరుసుకూడ జరుగును

శ కరపల్లి రైల్వేస్టేషను అందోలు గ్రామమునకు 24 మైళ్ళ దూరములో ఉన్నది ప్రతి అర గటకు వర్న మెంటు బస్సులు ఈ గ్రామముగుండా మెదకునుండి స గా రెడ్డికిని ఎద్దిపేటను డి హైదరాబాదునకును రామాయ పేటనుండి సదాశివపేటకును శ కరంపేటను డి అల్లాదుర్గము నకును నారాయణఖేడ్ ను డి రాయిపల్లికిని నిజాంసాగర్ నుండి నిజామాబాదునకును పోవును 6 ఎమె టు రోడ్లు 6 మట్టిరోడ్లు కలవు ఈ గ్రామమును పొరుగుగ్రామములతో ఎమెంటురోడ్లు శ కరరోడ్లు కలుపుచున్నవి నదిపై జోగి పేటను డి చండూరునకు జనుల రాకపోకలు కలవు ప్రయాణ మునకు 10 టాక్సీలు 10 కార్లు 40 లారీలు 200 రెండెడ్ల బ డ్లు 480 సైకిళ్ళు కలవు

ఈ గ్రామమున సబ్ పోస్టాఫీసు టెలిఫోను బాలికా పాఠశాల బాలుర ఉన్నత పాఠశాల ప్రాథమిక పాఠశాల కలవు దీనితో కలిసి ఉన్న జోగిపేటలో బాలుర ప్రాథమిక పాఠశాల ఉన్నతపాఠశాల బాలికల మాధ్యమికపాఠశాల ఉన్నవి ఈ పాఠశాలలకు చౌటకూరు డాకూరు చండూరు పోసానిపేట చింతకుంట చిటుకుల చిల్పిశెట్టి అల్మాయిపేట మొదలగు గ్రామములను డి విద్యార్థులు వత్తురు 200 విద్యా ర్థులు కళాశాలచదువులకు హైదరాబాదునకు పోవుదురు ఇచ్చట విద్యుచ్ఛక్తిని 500 ఇండ్లు వ్యవసాయ పారిశ్రామిక యంత్రములు సినిమాథియేటరులు ఉపయోగించుకొను చున్నవి ఇది మ్యునిసిపల్ పరిపాలనలో ఉన్నది గ్రామ పారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లు కలవు ఇచ్చట జోగినాథ స్వామి గ్రంథాలయము రేడియో లౌడ్స్పీకర్లు నాటక శాలా నిర్మాణమునకు వీలుగల ప్రదేశము సినిమాథియేటర్లు సత్రములు విశ్రాంతిగృహములు ఉన్నవి ఈ గ్రామ న దు కోర్టులు పోలీసుస్టేషనులు సబ్ రిజిస్ట్రారు ఆఫీసు తాలూకా కచేరి బ్లాకు అభివృద్ధి కేంద్రము ఉన్నవి ఇవికాక వివిధ శాఖలకు స బ ధి చిన బ్రాంచి ఆఫీసులు లవు సహకార స ఘము గ్రామస్థులకు రు 10000 లు అప్పుగా ఇచ్చినది ప్రైవేటుగా అప్పులిచ్చువారుగూడ కలరు జోగిపేటలో స్టేట్ బ్యాంకు అఫ్ హైదరాబాదు యొక్క బ్రాంచి ఉన్నది ఈ గ్రామమున దు ఆసుపత్రి పశువుల ఆసుపత్రి ఉన్నవి ఇంగ్లీషు వైద్యులు ఆయుర్వేదవైద్యులు హోమియోపతి వైద్యులు యునానీ వైద్యులు కలరు వారముకొకసారి గ్రామమందు సంత జరుగును జోగిపేటసంతలో కూరగాయలు పప్పుదినుసులు వేరుసెనగ క దులు మొదలగునవి లభించును కిరాణా దుకా ణములు 150 కాఫీహోటళ్ళు కూరగాయల అంగళ్ళు 20 సోడా కిళ్ళీ సిగరెట్టుదుకాణములు 50 సైకిళ్ళషాపులు క్షౌరశాలలు లాండ్రీలు ఇతర షాపులు అందోలు గ్రామమున ఉన్నవి

క్రీ శ 1547 లో ఈ గ్రామమును అలమరెడ్డి పాలి చెను రామయోగి అనుపేరు ప్రముఖుడు ఇతడు వైరాగ్య తకొండపై శివలింగమును ప్రతిష్ఠించి పుత్రకామేష్టి యాగమును చేసెను అనేక పుత్రులనొ దునట్లు అగ్నిదేవుని ఆశీర్వాదమును పొ దెను ఇతడు ఈ గ్రామమునకు రామజోగిపేట యని పేరిడెను కాలక్రమమున ఇది జోగిపేటగా మారినది లక్ష్మణ శాస్త్రి స గమేశ్వరస గ బస్వమాణయ్య కృష్ణమా చార్యులు వడ్లభూమయ్య మొదలగు రచయితలును చింతల శ కరయ్య సానిపల్లి వీరేశలింగం మొదల ద త లును ఈ గ్రామమునకు చెందినవారే

మా శ్వే

## అందోలు (జోగిపేట తాలూకా)

ఆంధ్ర ప్రదేశమునందలి మెదకు జిల్లాలోగల 8 తాలూ కాలలో అందోలుతాలూకా ఒకటి నర్సాపూరు మెదకు తాలూకాలతోపాటు ఇది మెదకు రెవిన్యూ డివిజనులో చేరి యున్నది మెదకు జిల్లా మొత్తముగా వరంగల్లు కాకతీయ రాజ్యములో ఒక భాగమై ఉండెను క్రీ శ 1309 లో అల్లా వుద్దీను ప్రభువు సేనానియైన మాలికు కాఫరు అనునతడు గొప్పసేనతో వరంగల్లు ప్రభువుపై దండెత్తివచ్చి మెదకుసు స్వాధీనమొనర్చు కొనెను క్రీ శ 14 వ శతాబ్దిలో అధి



78° 0′
78° 15′
మెదకు జిల్లా
అందోలు తాలూకా
ఎల్లారెడ్డి తాలూకా
2 0 2 4 6 8
మైళ్లు
నారాయణఖేడ్ తాలూకా
18° 0′
శంకరంపేట
పాపన్నపేట
టేకుమాల
దేవనూరు
మెదకు తాలూకా
జోగిపేట
అందోలు
జహీరాబాదు తాలూకా
చౌటకూరు
17° 45′
నర్సాపురము తాలూకా
మంజీరానది
సంగారెడ్డి తాలూకా
వివరణ పట్టిక
తాలూకా సరిహద్దు
ఫిర్కా సరిహద్దు
తాలూకా ముఖ్యపట్టణము
ఫిర్కా ముఖ్యపట్టణము
బ్రాడ్‌గేజ్ రైలుమార్గము
మీటరుగేజ్ రైలుమార్గము
జాతీయ రోడుమార్గము
రాష్ట్ర రోడుమార్గము
జిల్లా రోడుమార్గము
ఇతర రోడుమార్గములు
అడవి
కొండలు
నది
చెరువు
దేవాలయము

బహమనీరాజ్యములో ఒక భాగముగా ఏర్పడెను. పిదప అది గోలకొండ కుతుబషాహీ రాజవంశముయొక్క స్వాధీనమందుండెను. గోల్కొండరాజ్య పతనముతో అది మొగలు సామ్రాజ్యములో చేర్చబడెను. 18వ శతాబ్ది తొలిభాగమున మెదకు మొగలు సామ్రాజ్యమునుండి విడివడి నైజాము రాష్ట్రములో కలుపబడి 1951వ సంవత్సరము వరకు అందులో ఒక భాగమై ఉండి 1956 సంవత్సరము నవంబరులో రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సందర్భమున ఇతర ఎనిమిది తెలంగాణా ప్రాంతీయ జిల్లాలతోపాటు ఆంధ్ర ప్రదేశమునకు బదిలీ చేయబడెను.

అందోలు తాలూకాకు ఉత్తరమున నిజామాబాదుజిల్లా తూర్పున మెదకు నర్సపూరు తాలూకాలు దక్షిణమున సంగారెడ్డి తాలూకా పశ్చిమమున జహీరాబాదు నారాయణఖేడ్ తాలూకాలు కలవు. దీని విస్తీర్ణము 484.01 చ. మైళ్ళు. మంజీరానది ఈ తాలూకాకు పడమరగా దక్షిణముగా తూర్పుగా ప్రవహించుచు దీనికి జహీరాబాదు సంగారెడ్డి నర్సపూరు మెదకు తాలూకాలకును సరిహద్దుగా ఏర్పడుచున్నది. నిజామసాగరు దీనికి ఉత్తరసరిహద్దుగా ఏర్పడినది. ఈ తాలూకాలో 7535 మంది నివసించు గృహములు కలవు. 1961 సంవత్సరము లెక్కలననుసరించి ఈ తాలూకాలోని జనాభా 168074. ఈ తాలూకాలో మొత్తముమీద జనావాసముగల 168 గ్రామములును 2 పాడుపడిన గ్రామములును అందోలు (జోగిపేట) అను పట్టణమును కలవు. 5000 పైగా జనాభాగల గ్రామము అల్లాదుర్గ అనునది ఒకటే కలదు.

ఈ తాలూకాలో సాధారణముగా జూనునుండి సెప్టెంబరువరకు నైరృతి ఋతుపవనముల మూలమున 30 అంగుళముల వానపడును. శీతోష్ణస్థితి మితముగానున్నది. ఇందు అడవుల ఏరియా దాదాపు మొత్తము 12000 ఎకరములు. ఈ తాలూకాలో మూడురకముల నేలలుకలవు. అవి ఎర్రనేల నల్లరేగడినేల కంకరనేల. కంకరనేలయే ఎక్కువ ప్రమాణములో ఇచట ఉన్నది. జనుల ముఖ్యవృత్తి వ్యవసాయము. కాలువలు చెరువులు బావులు ఇచటి నీటి పారుదలకు ఆధారములు. ఫతేనహర్ కాలువ పదునొకండు గ్రామములకు నీటిని సప్లయి చేయుచున్నది. ఇందలి ముఖ్యమయిన పరిశ్రమలు బీడీలు చేయుట, కోళ్ళను వృద్ధిచేయుట. అందోలులో (జోగిపేట) శంకరంపేటలో అల్లాదుర్గలో చేకుమలులో ఒక్కొక్క హైస్కూలును అందోలులో యూసుఫ్‌పేటలో పాపన్నపేటలో ఒక్కొక్క మాధ్యమిక పాఠశాలయు కలవు. అందోలులో ఒక ప్రభుత్వపు ఆసుపత్రి కలదు. పాపన్నపేట శంకరంపేటలలో రెండు మిషన్ ఆస్పత్రులు, పాపన్నపేట జోగిపేటలలో రెండు ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు, శంకరంపేటలో ఒక ఆయుర్వేద వైద్యశాల, పాపన్నపేటలో ఒక యునాని వైద్యశాల కలవు. పెద్దాపూరులో ప్రభుత్వపు సహాయమును పొందు ఒక వైద్యశాల కలదు.

ఈ తాలూకాలో రైల్వే సౌకర్యములు లేవు. కాని గూడ మన్మాడు మీదుగాపోవు రైలుమార్గములో నున్న అక్కన్నపేట రైల్వేస్టేషను దీనికి మిక్కిలి దగ్గరలో నున్నది. ఇందు రోడ్డు సౌకర్యములు బాగుగా కలవు. హైదరాబాదు నాందేడు రాష్ట్ర రహదారి ఈ తాలూకా మధ్యభాగము గుండా తాలూకా ముఖ్యకార్యాలయమైన అందోలు నుండి పోవుచున్నది. అందోలులో శంకరంపేటలో దేవునూరులో చేకుమూలులో నాగిపాని పల్లెలో అల్లాదుర్గలో ఒక్కొక్కచోట ఒక్కొక్కటి చొప్పున అను ఇన్‌స్పెక్షన్ బంగళాలు ఉన్నవి. త్రాగుడునీటి బావులే ముఖ్యాధారములు. కొన్ని గ్రామములలో జనులు చెరువునీటిని త్రాగుదురు. జోగిపేట ఖాదర్‌పేట శివంపేట శంకరంపేట చేకుమూలు పాపన్నపేట యూసుఫ్‌పేట అల్లాదుర్గ అను తావులందు వారపు సంతలు జరుగును. జోగిపేటలో జోగినాథస్వామి దేవాలయము శంకరంపేటలో రామస్వామి ఆలయము అల్లాదుర్గలో బేతాళస్వామి ఆలయము ఎల్లాపురములో దుర్గమ్మ ఆలయము కలవు. ఆయా తావులలో సాంవత్సరిక ఉత్సవములు జరుగును. అందోలు గొప్ప వర్తక కేంద్రము.

అందోలు తాలూకాలో ప్రధానమయిన తావులు -

(1) అందోలు చూ. అందోలు జాగ్రఫీ

(2) అల్లాదుర్గ చూ. అల్లాదుర్గ జాగ్రఫీ

( ) రేగోడు చూ. రేగోడు జాగ్రఫీ

(4) కిచ్చన్నపల్లె - ఇది జోగిపేటనుండి 4 మైళ్ళ దూరములోకల ఒక చిన్నగ్రామము. ఇది హైదరాబాదు నిజామసాగరు రోడ్డునుండి 1½ మైళ్ళలోఉన్నది. 1961 సంవత్సరము లెక్కలప్రకారం ఇందలి జనసంఖ్య 841. దీని వైశాల్యము 1.63 చ. మైళ్ళకు పైగా ఉన్నది. ఇందు 168 గృహములలో

జనులు నివసించుచున్నారు తిరుపతి వేంకటేశ్వరస్వామి ఆలయమును పోలిన ఒక వేంకటేశ్వరస్వామి ఆలయము యిచట కలదు ఆలయము దగ్గర గుండమను ఒకగొప్ప జలాశయము కలదు ఇందు తైర్థికులు స్నానము చేయుదురు ఈ దేవాలయము స్థానికముగా ఎక్కువ ప్రాసాముఖ్యము కలది పాల్గుణశుద్ధమందు ఇచట నాలురోజులు ప్రతిఏట ఉత్సవము జరుపబడును పూర్వము ఎచేట ఇచ్చట ఉత్సవము నెల రోజులు జరిగెడిదట ఆ ఉత్సవమును తిలకించుటకు అనేక వేల జనులు వచ్చెడివారట !

ధ వ్ర

## అంధపథము

అంధపథము అనగా ఆంధ్రదేశము ఇది ఆంధ్రపథము అనుటకు ప్రాకృత భాషారూపము పూర్వకాలమున ఉత్తర దేశమువారు వింధ్యకు దక్షిణభాగమును దక్షిణాపథము అను చుండిరి ఇదియే దక్కనుగా మారినది అంధపథ శబ్దము శివస్కందవర్మ పల్లవుని మైదవోలు శాసనములో లభించు చున్నది (ఎపి ఇం X 1 05 140) యువమహారాజగు శివస్కందవర్మ పల్లవుడు కాంచీపురమునుండి ధాన్యకటమందలి (దన్నకడ) తన వ్యాపృతునకు (ఉద్యోగికి) ఇట్లు ఆజ్ఞ పాలించెను "అంధపథమునందలి విరిపరగ్రామమును మేము అగ్నివేశ్య గోత్రికులగు పూర్వకోటార్యునకును గోనదార్యునకును దానము చేసినాము దాన పతిగ్రహీతలు బ్రాహ్మణులు శివస్కందవర్మ భారద్వాజసగోత్రుడు శాసనకాలము రాజ్యవర్షములు పది గ్రీష్మపక్షము ఆరు దివసము పంచమి పూర్వకోటార్యుడు పెద్దకోటయ్య కావచును శాసనమందలి కోటజ్జ గోనందజ్జ రూపములే తరువాత కోటయ్య గోనదయ్యగా మారియుండును వీటి సంస్కృతరూపములు కోటార్యుడు గోనందార్యుడు అనునవి

శాతావాహనుల యనంతరము ఆంధ్రదేశమును అర్థ శతాబ్దముపైబడి పరిపాలించిన ఇక్ష్వాకువంశమువారిని జయించి పల్లవులు ఆంధ్రదేశమునకధిపతులయిరి వీరి రాజ్యారంభ కాలము క్రీ శ 275 ప్రాంతమని కొందరును నాల్గవ శతాబ్ది ఆరంభమని కొందరును భావించుచున్నారు పల్లవవంశస్థాపకుడు వీరకూర్చవర్మ అను నాతడు అతని కుమారుడు యువమహారాజ శివస్కందవర్మ దన్నకడ అనగా అమరావతీ-ధాన్యవాటినగరమునందు శివస్కందవర్మ వ్యాపృతుడు (రాజప్రతినిధి) నెలకొని యుండుటను బట్టి పల్లవుల అధికారము కృష్ణానదీతీరము వరకును వ్యాపించెనని తెలియుచున్నది ఈ ప్రాంతమును అంధ్రాపథము ఆంధ్రదేశము అనుచుండిరనుట తెల్లమగుచున్నది బౌద్ధ వాఙ్మయమునందు ఆంధ్రదేశమును అంధకరట్ఠము అనికూడా వ్యవహరించిరి అంధకరట్ఠము గోదావరీతీరమున ఉండినట్లు చెప్పబడినది ఇట్లు అనాదిగా కృష్ణాగోదావరీ పరిసర దేశమునకు ఆంధ్రప్రాంతమని వ్యవహారముండినది విరిపరగ్రామము గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా పెదకూరపాడు ఫిర్కాలోని విప్పర్ల కావచ్చును ఇదిశ్రీకాకుళం కుగ్రామము

ఖం ల రం

## అంపరాయలు

చాటుపద్య మణిమంజరి (ద్వితీయభాగము - ప్రథమ సంపుటము పుట 1 6) లో గజరావు తిప్పారావు అనునాతని సాహసకృత్యములు వర్ణింపబడినవి అంపరాయలు చూచుచుండగ ఖడ్గముమెట్టుబైట యవనుల గెల్చెననియు కాటయవేముని గుండుగోలను వద్ద ఓడించెననియు తిప్పారావును గూర్చి చెప్పబడినది

పైన చెప్పబడిన అంపరాయలెవ్వరనునది విచారించవలసియున్నది తీరాంధ్రమున వసంత మహోత్సవ సౌరభములను వెదజల్లిన కుమారగిరిరెడ్డి బావమరది కాటయవేముడు. కుమారగిరిరెడ్డి తన బావమరదిమీద గౌరవముచే రాజమహేంద్రవర రాజ్యమును ఆతనికి ఏలుకొనుటకై ఇచ్చెను కాటయవేముడు క్రీ శ 1395 నుండి 1414 వరకు రాజమహేంద్రవర రాజ్యమును పాలించెను కాటయవేమునకు రాజ్యము పంచి ఇచ్చుట పెదకోమటి వేమారెడ్డికి ఇష్టము లేకుండెను రాజమహేంద్రవర రాజ్యమును ఎట్లైన తిరిగి కొండవీటి రాజ్యములో చేర్చుకొనుట కాతడు విశ్వప్రయత్నము చేయుచుండెను ఈతడు గజరావు తిప్పారావుచే గుండుగోలను కడ నోడింపబడుటచే తిప్పారావుకూడ కాటయవేమునికి సమకాలికుడై యుండును కొప్పునూళ్ళ వంశీయుడు వెలమవీరుడునైన తిప్పారావు వెలుగోటి రాయప్పరాయనికి కార్యకర్తగా వ్యవహరించినట్లు శాసనసాక్ష్యము లున్నను అందొక్కదానియందును శాసనకాలము స్పష్టముగా లేకపోవుటచే రెడ్డిరాజ్య చరిత్రకారులు పై చాటువు నాధారముగగొని గజరావు తిప్ప క్రీ శ 1395 - 1414 ప్రాంత

ములవాడని కాలనిర్ణయ మొనర్చిరి తిప్పారావు కంభము మెట్టు బైట యవనుల నోడి చిన కాలము దీనికి సమీపమునసే ఉ డవలెను ఆ యవనులెవరో తెలిసినకాని అంపరాయలను వానిని గుర్తి చుటకు వలను పడదు

రె డవ మహమ్మదు మరణానంతరము క్రీ శ 1397లో ఫెరోజుషా బహమనీ రాజ్యమునకు అధినేత యయ్యెను ఆనాటి సుల్తానులలో ఇతడతికూరుడు ధీమంతుడు రాజ్యము నకు వచ్చెననుటయే కాని ఫెరోజుషా తన చుట్టుపట్ల నున్న హిందూరాజ్యములతో ఇరువదై దే డ్ల కాలము కలహి చుట తోనే గడచిపోయినది బహమనీ వారికి రేచర్ల వెలమలు చిరకాల మిత్రులు తదుపరి కాటయవేమునిపై కత్తిగట్టి రాజమహే ద్రవర రాజ్యమును కబళి చుటకు చూచుచున్న పెదకోమటి వేముడును రాజ్యబహిష్కృతుడై కాటయ వేమునిపై పగబూనియున్న అన్నదేవచోడుడును ఫెరోజుషా పొత్తును సంపాదించుకొనిరి యవనరాజ్య విస్తరణ కా క్ష మదిలో మెసలుచున్న ఫెరోజుషాకు ఈ త్రికూటమైత్రి కొంత లాభసాటి బేరమయ్యెను పక్కలోని బల్లెమైన అన్నదేవ చోడుని జ్ఞాతియైన పెదకోమటి వేముని ఒక్కుమ్మడిగా మార్కొన లేక కాటయవేముడు విజయనగర సార్వభౌముడైన ప్రథమదేవరాయల సహాయముకోరెను విజయనగర ప్రాబ ల్యము తీరాంధ్రమున విస్తరించుట ఫెరోజుషాకు కంటగింపుగా నుండెను అన్నదేవచోడుని ఆహ్వానము పురస్కరి చుకొని ఫెరోజుషా రాజమహే ద్రము వరకు సైన్య సమేతుడై పోయెను ప్రముఖ నాయకుడైన గజరావు తిప్ప డీసమయము ననే కాటయవేము ని గ. డుగోలను వద్ద జయించియుండును కొప్పుమూరివారి బిరుద ప్రతాపమాలికలో కాటయవేము తల గు డు గండ యని సూచి పబడుటచే తిప్పారావు చేతిలో వేముడు మడసియు డు నని చరిత్రకారులు గ్రహి చిరి

రాజమహే ద్రవరము వరకుపోయిన ఫెరోజుషా గోదా వరిని దాటలేక రాజధానికి మరలి వచ్చుటకు ఉద్యుక్తుడై తెలంగాణము మీదుగా గుల్బర చేరదలచెను దీనికి కార ణము లేక పోలేదు తెలంగాణమును కైవసము చేసికొనుటకు నల్గొండ - పానుగల్లు దుర్గమును సాధింప వలెను అది విజయనగరము వారి అధీనములో నుండెను దేవరాయ లీదుర్గము యవనాక్రాంతము గాకుండ నిలబెట్టు కొనుట కెంతయో ప్రయత్నించుచుండెను గాని ఉగ్రశూరు డైన ఫెరోజుషా నెదుర్కొనుటకు వీలు చిక్కలేదు ఇ అలో దైవనియోగమన్నట్లుగా వెలమ వీరులు ఫెరోజుషా కో అస తృప్తులై రి పద్మనాయ రాజ్యమునకు ప్రత్యర్థియైన కొండ వీటి రెడ్డిరాజ్యముతో సుల్తాను చేతులు కలుపుట వారికి అనిష్టముగా నుండెను కా న వారు పానుగల్లు ముట్టడిలో సుల్తానుకు సహాయమును ఉపసంహరించిరి దేవరాయల రొట్టె విరిగి నేతిలో బడినది రాయలు వెలమవారి మైత్రిని కలుపు కొని పానుగల్లు కోటను కాపాడు కొనెను ఫెరోజుషా ఘోర పరాజయము నెదర్కొనెను ఈ తరుణముననే గజ రావు తిప్పారావు మొదట ఫెరోజుషా పక్షము వహించినను తుదకు దేవరాయలకు బాసటయై క భముమెట్టు వద్ద హాంపీ రాయలైన దేవరాయలు చూచుచు డగా యవనుల హత మార్చి యుండును హాంపీరాయలనుటకు మారుగ చాటు కవి అంపరాయలని తన పద్యపాదమున పొదిగించి యున్నాడు ఈ కాలము క్రీ శ 1417

ఈ అ పరాయలు కపిలేశ్వర గ పతి గ మాన్యుడైన హ వీరపాత్రునిగా కొందరు అన్వయించిరి మహమ్మదీయ చరిత్రకారులీ హంవీర నృపతిని అంబర్ ర య్ అనిపేర్కొ చిరి అంబరరాయ్ నామ సాదృశ్యమును బట్టి అంపరాయల గుటకే అభ్యంతరములేదు హంవీర దేవుని శాసన మొకటి వ ం గల్లు కోట యందు ఉన్నది దాని కా ము క్రీ శ 1460 ఈ కాలమునకు కాటయవేముడు లేడు మొదటి దేవరాయ లును లేడు ఫెరోజుషా లేడు వారుగతి చి సుమారు 40 సంవత్సరములు గడిచి పోయినవి కాటయవేముని కాలమువాడైన గజరావు తిప్పారావు వ ంవీరుని తెలంగాణ దండయాత్రకాలము నాటికి బ్రతికి యుండెనో లేదో చెప్ప జాలము కావున చరిత్రకారులు తల చినట్లు తిప్పారావు యవనులను జయించుచుండగా చూచినవారు హంవీర గజ పతి కాడు హ పీరాయలైన ప్రథమ దేవరాయలే అని యూహింప దగియున్నది

ఖం ల రం

ని శ మం

## అంపోలు

అంపోలుగ్రామము శ్రీకాకుళంజిల్లా శ్రీకాకుళం తాలూకాలో ఉన్నది దీనికి 8 మైళ్లలో శ్రీకాకుళం పట్ట ణము కలదు. దీని విస్తీర్ణము 5748 ఎకరములు దీనికి

తూర్పున కొత్తూరుసైరిగం పడమట పెద్దపాడు ఉత్తరమున శారవిల్లి దక్షిణమున శ్రీకూర్మ ఉన్నవి

1961 సం జనాభాలెక్కల ప్రకారము ఇచ్చట పురుషులు స్త్రీలు కలసి 5 286 మ ది ఉ డిరి ఈ స ఖ్యలో షెడ్యూల్డుజాతులవారు 509 మ ది ఇచ్చటఇండ్లు ఏకపంక్తిగా ఉన్నవి వీటిలో 72 పెంకుటి డ్లు 15 కాంక్రీటుకప్పుగల ఇ డ్లు 3 ఒకఅంతస్తుగల మేడలు ఉన్నవి జనులు చోడి గ టి వరి అన్నములను తిందురు బావినీటిని త్రాగుదురు వేంవిలో నీటిఎద్దడి కలదు

ఈ గ్రామమునకుగల నీటివనరులు షైరిదేశగడ్డకాలువ (వంశధారపాయ) నేవదినాడ చెరువు 1966 67 స ॥లో పంటలకి ద ఉపయోగించిన భూమి 4 746 ఎకరములు కాలువక్రింద 750 ఎకరములు చెరువుక్రి ద 650 ఎకరములు సాగు చేయబడివి మూడు ఆయిలు యి జనులు 50 ఎకరములకు నీటినిస ప్లయి చేసెనవి వరి వేరుసెనగ రాగి గంటి ఉలవ మినుము జొన్న ప టలుపండును ఉలవలబస్తాలను బ డ్ల మీద ఆముదాలవలసకు రవాణా చేయుదురు మామిడి కొబ్బరి తోటలు కలవు గ్రామ అవసరమునకు సరిపడు వంగ ముల్ల గి మొదలగు కూరగాయలను ప డి తురు గవర్నమెంటుకు చెందిన చిన్న అడవికలదు అందు ఈత తాటి వృక్షములు మాత్రము కలవు

అ పోలునందు పశువులు మేకలు గొర్రెలు ప దులు కోళ్ళు బాతులు కలసి 6707 వీటిలో 840 ఆవులు 95 గేదెలు దినమునకు 120 శేర్లపాలు 270 గ్రుడ్లు స్థానికులు ఉపయోగించు కొందురు

ప్రజల జీవితమునకు ముఖ్యాధారము వ్యవసాయము దుకాణాదారులు ఎద్దుబండ్లు తోలువారు కలరు క సాలి వడ్రంగి కుమ్మరి తాపమేస్త్రీ తెలికల మంగలి చాకలి గొల్ల వడ్డెర వారు కలరు నూలుమగ్గములు వడుకుట నేయుట మొదలగు వృత్తులవారును కలరు

నూనెగానుగలు గలవు చేనేత కుటీరపరిశ్రమ కలదు సాలునకు రూ 50 000/ లు విలువగల ఖాదీ చేనేతవస్త్రములు విజయవాడ శ్రీకాకుళమునకు ఎగుమతి చేయబడు చున్నవి వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి రు 2 లు స్త్రీకి రూపాయి

ఈ గ్రామమున ఒక దేవాలయము 4 అమ్మవారి గుడులుకలవు దేవాలయమునకు 20 ఎకరములభూమి కలదు చైత్రశుద్ధ పౌర్ణమినాడు అమ్మవారి జాతర జరుపుదురు

అ పోలుగ్రామమునకు 10 మైళ్ళ దూరములో ఆముదాలవలస రైల్వేస్టేషను కలదు రె డెడ్లబ డ్లు సైకిళ్ళు మొదలగు ప్రయాణ సౌకర్యములు ఉన్నవి

ఈ గ్రామమున రెండు బ్రా చి పోష్టాఫీసులు జిల్లా పరిషత్తు హైస్కూలు కలవు 20 మ ది విద్యార్థులు హైస్కూలు చదువునకు అ బటివాని పేటను డి ఇచటికి వత్తురు కళాశాల చదువులకు 8 మైళ్ళలోనున్న శ్రీకాకుళమునకు ఇచ్చటి విద్యార్థులు పోవుదురు విద్యుచ్ఛక్తిని 12 ఇండ్లు వాడుకొను చున్నవి ఇది పంచాయతి పరిపాలన గ్రామము దీనికి ఆదాయము పన్నులే ఇక్కడ వె క టేశ్వర గ్ర థాలయము ఉన్నది సినిమా థియేటర్లకు గ్రామస్థులు శ్రీకాకుళమునకు పోవుదురు ఈ గ్రామమునకు ఇంగ్లీషువైద్యులు హోమియోపతి వైద్యులు కలరు జనరల్ ఆసుపత్రికి పురుళ్ళ ఆసుపత్రికి శ్రీకాకుళమునకు పోవుదురు పశువుల ఆసుపత్రికి శ్రీకాకుళమునకుగాని గారగ్రామమునకుగాని పోవుదురు గ్రామ సంతలు లేవు కిరాణాదుకాణములు సోడా కిళ్ళీ ఎగరెట్ల దుకాణములు కాఫీహోటళ్ళు కో ఆపరేటివ్ స్టోరులు బట్టల కొట్లు కలవు 8 మైళ్ళలోనున్న గారస తలో పశువులు అన్ని సరుకులు లభించును ఈ గ్రామమున బుద్ధుని విగ్రహములు కలవు

మా శ్వే

## అంబదేవుడు

ఈతనినే శాసనముల దు అంబయదేవ మహారాజు అని కూడ వ్యవహరింతురు వీరు కాయస్థులు పరాక్రమవిరాజితులు తాము క్షత్రియకులోద్భవులని వీరు భావించినట్లు అంబదేవుని శక 1212 నాటి త్రిపురాంతకశాసనము వలన విదితమగు చున్నది దేవవ్య వద్మజనుషో ద్రుహిణస్య కాయాత్ కాయస్థ ఇత్యజని కో ప న రే ద్రవ శః బ్రహ్మదేవుని శరీరముమ డి కాయస్థులను రాజవంశము పుట్టినదని దీనిభావము పద్మభవుని బాహువులను డి కాయస్థ వ శము పుట్టినదని సూటిగా చెప్పకుండుట గమనింపదగినదియే వీరు జన్మచే క్షత్రియులైనను కాకున్నను మహాక్షాత్రగుణ విభూషితులగుటచే క్షత్రియనామమునకు అర్హులగుచునే యున్నారు

అ బదేవుని తల్లి దండ్రులు చందలదేవి-అంబజ్ఞావతులు

చందలదేవి కాకతిగణపతిదేవ చక్రవర్తిని సేవించిన గంగయ సాహిణి సోదరి కావున అంబదేవుడు గంగయసాహిణి మేనల్లుడగుచున్నాడు మేనమామయైన గంగయసాహిణి ప్రాభవము గొప్పదగుటచే అంబదేవుడు అతని బిరుదును తాను వహించి అతనినే తన శాసనములందు మన్నించుచుండెను అయినను నీలగంగవరశాసనములో అంబదేవుడు తన మాతా పితరులను పేర్కొనెను అంబదేవుని తండ్రి అంబజ్యాపతి ఎక్కువ ప్రశస్తికలవాడు కాకపోయినను పల్నాటిసీమలో నొకచిన్న ప్రాంతమును పాలించెను బావమరదియగు గంగయ సాహిణి ప్రాపకము వలననే ఈతనికి సామంత రాజపదవి లభించియుండును అంబజ్యాపతి శాసనము శక 1166 (క్రీ శ 1244) నాటిది పల్నాటితాలూకా సత్రశాల గ్రామమునందు కానవచ్చుచున్నది చందుబాయి అంబాజ్యాపతి దంపతులకు ముగురు కుమారులును పదుమాబాయి అమ్మయను కూతురును కలరు కుమారులు జనార్దనుడను జన్నిగదేవుడు మొదటి త్రిపురారి అంబదేవుడు అనువారు అంబదేవుని కుమారుడు త్రిపురారి మరియొకడుండుటచే అంబదేవుని యన్నయైన త్రిపురారిని మొదటి త్రిపురారి అందురు తండ్రియైన అంబజ్యాపతియు తనయులైన జన్నిగదేవుడు మొదటి త్రిపురారియు గంగయ సాహిణి యుద్ధములందు వానికి తోడ్పడుచుండిరి గంగయ సాహిణి కాకతీయ సామ్రాజ్యమునందు ప్రథమగణ్యులైన సేనానులలో ఒకడు ఈతని బిరుదావళి సుదీర్ఘమైనదిగా రముగా నున్నది త్రిపురాంతక శైలపాదము నందుగల మూలబ్రహ్మేశ్వరాలయములో నిలుపబడిన శక 1172 శాసనములో గంగయసాహిణి ఇట్లు పేర్కొనబడినాడు "శ్రీమన్మహా మండలేశ్వర కాహత్తరిని యోగాధిపతి చాతుర్వర్ణ్య సముద్ధరణ పశిమరాయ దామోదర సైన్యాధిశాపట్ట ఏకాంగవీర అతివిషమ హయారూఢ ప్రౌఢరేఖారేవంత గణపతిదేవ శ్రీపాదపద్మారాధక" ఇత్యాది

గంగయసాహిణి పానుగల్లు మొదలు మార్జవాడి వరకుగల భూమిని పాలించెనని అతని ప్రధానియైన నామదేవ పండితుడు గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా దుర్గి గ్రామము నందలి శక 1178 నాటి వరకేశ్వర ఆలయ శాసనములో పేర్కొనెను పానుగల్లు నల్గొండజిల్లా నల్గొండ పట్టణమునకు సమీపమున నున్నది ప్రాచీన గ్రామము మార్జవాడి యనగా ప్రాచీన కడపమండల కథనము దీనినే మహారాజ పాడి అనియు నందురు ఇది రేనాడు అని చెప్పబడు భూభాగమునకు సరిపడుచున్నది ఇక్కడ చోళమహారాజులు వైదుంబ మహారాజులు మున్నగువారు పాలించుటచే దీనికి మహారాజుల ఎలుబడిభూమి అనుకీర్తి కలిగియుండునని భావింపబడుచున్నది కాయస్థరాజుల కొన్ని శాసనములలో వీరు పానుగల్లునుండి కైవారం కోటవరకు గల విశాల భూభాగము నేలినట్లున్నది జన్నిగదేవుని సర్వాధికారియైన మెయిదేవుడు కారెపూడి సూరేశ్వర ఆలయమునందు నెలకొల్పిన శక 1186 (1264) నాటి శాసనమునందీ యంశము చెప్పనైనది అంబదేవునకు ముందు రాజ్యముచేసిన కాయస్థప్రభువులు ఇంత విశాల భూభాగము నేలిరా యనునది సందేహాస్పదము ఎట్లైనను వీరు కడపజిల్లా యంతటను గుంటూరు నెల్లూరు కర్నూలు మండలములలో కొన్ని భాగములను ఏలిరనుట వాస్తవము

గంగయసాహిణి జన్నిగదేవుడు త్రిపురారి- వీరు మువ్వురను కాకతీయ సామ్రాజ్యమునకు మిత్రులై సామంతులై రాజ్యాధికారము వహించిరి గంగయసాహిణికిని జన్నిగదేవునకును గణపతిదేవదక్షిణభుజాదండ యను నది సమభ్యర్చితమైన బిరుదపదము త్రిపురారికూడ వీనినే అలంకరించెను గంగయసాహిణి క్రీ శ 1239 51 నడుమను జన్నిగదేవుడు 1258 69 నడుమను త్రిపురారి 1272 వరకును కాయస్థరాజ్యము పాలించినట్లు శాసనములవలన తెలియవచ్చుచున్నది కాని క్రీ శ 1272-1302 మధ్య ఎరిపాలన చేసిన అంబదేవుడు ఏకారణముననో తన మేనమామయు అన్నలను అవలంబించిన కాకతీయమైత్రిని త్రోసిపుచ్చి స్వతంత్రుడగుటకు యత్నించి కృతకృత్యుడయ్యెను ఇంతేకాక అతడు కాకతీయ శత్రువులైన పాండ్యులతోను సేవుణులతోను (దేవగిరి యాదవులు) మిత్రత్వము నెరపి కాకతీయ సామ్రాజ్య ప్రాభవమును కుదించుటకు తన రాజ్యకాలమంతయు కృషిచేసెను ఈ విషమ రాజనీతియందు అతనికి మొదట చెప్పుకోదగిన విజయము ప్రాప్తించినను అతని రాజ్య చరమ భాగమునందు పరాజయము తప్పలేదు ఐనను అతడు చివరివరకును కాకతీయుల సామంతత్వమును అంగీకరింపక పరిమిత భూభాగములో స్వతంత్రుడుగా నిలిచినట్లే కనబడుచున్నది

అంబదేవుని చరిత్రము ఉల్లేఖించుటకు ఆధార భూతము

లైనవి కొన్ని శాసనములు లభించుచున్నవి వాటిలో కొన్నిటిని అతడు స్వయముగా ప్రకటించెను మరికొన్ని అతని యనుచరులును సామంతులును ప్రకటించినవి కాలానుపూర్విగ వానిట్లు క్రోడీకరించుచున్నాము ఈ శాసనము లన్నియు శాలివాహన శక సంవత్సరములు కలవైనను పాఠక సౌకర్యమునకై క్రీస్తుశకమున దిచ్చుట జరిగినది

| వత్సరము క్రీ శ | లభించినస్థలము | ప్రకటనకర్త |
|---|---|---|
| 1272 | త్రిపురాంతకము | అంబదేవుడు |
| 1279 | అత్తిరాల (కడపజిల్లా) | అంబదేవుని మహాప్రధాని |
| 1288 | త్రిపురాంతకము | ఎవదర అంబయరెడ్డిగారు |
| 1290 | పోలి (కడపజిల్లా) | అనమగ్రము |
| 1290 | త్రిపురాంతకము | అంబదేవుడు |
| 1290 | | |
| 1291 | | ఖదేవుడు అంబదేవునిపాదపద్మోపజీవి |
| 1291 | | అసమగ్రము |

ఇవికాక అంబదేవుని నీలగంగవరశాసనము (ఎ పి ఇ XX 227) తెలియవచ్చుచున్నది వీటన్నింటిలోను మిక్కిలి సాధికారికమైనవి అంబదేవుడు స్వయముగా ప్రకటించినవి వానియందును శక 1212 వికృతి సంవత్సర భాద్రపద బహుళ అమావాస్య మంగళవారమునాడు సూర్యగ్రహణ పుణ్యకాలమున అంబదేవుడు త్రిపురాంతకేశ్వరుని సన్నిధిని ప్రకటించిన ఒక సుదీర్ఘశాసనమును (ద హి X 465) మరియొక చిన్న శాసనమును (ద హి X 464) సాధికారమైనవనుట నిస్సంశయము అట్లే శక 1194 శ్రీముఖ సంవత్సర జ్యేష్ఠబహుళ అమావాస్య సోమవారమునాడు అంబదేవుడు త్రిపురాంతకేశ్వరుని సన్నిధిని ప్రకటించిన దానశాసనమును సాధికారమనుట నిర్వివాదము

అంబదేవుని త్రిపురాంతకశాసనము (ద హిం X 465) సుదీర్ఘమై సంస్కృతాంధ్రములందు వ్రాయబడినది దీనియందాతడు త్రిపురాంతక మహాదేవుని అంగరంగ భోగములకై ఈయబడిన గ్రామములను పునరుద్ధరించెను ఒక్క వాక్యము మాత్రము ఉదాహరింతుము - "శ్రీ త్రిపురాంతక దేవసాత్కృతాన్ని అలాగ గ్రామాణ పరిగ్ర్యాతసకలోపద్రవమ్ ప్రతిపాదయతిస్మ ఈ శాసనమునందు చెప్పబడిన రీతిని అంబదేవుని విజయము లిట్లున్నవి

1 శ్రీపతి గణపతి యనువానిని జయించి వానిదైన రాయ సహస్రమల్ల బిరుదమును అంబదేవుడు పరిగ్రహించెను

2 డెబ్బదియైదుమంది భూపతులను ఘోరయుద్ధమున సంహరించి తన నేత్రాంతమునందలి రుషాదేవతము పూజించెను

3 ఏటువ మల్లిదేవుడనువాని శిరస్సును ఖండించి మల్లిదేవతల గొండగండ బిరుదము వహించెను

4 పంద్రెండుమంది మాండలికులచేత సేవింపబడిన పాదకమలములు కలవాడు మహాయుద్ధమునందు శత్రురాజుల శిరోజమాల ధరించుటచే భైరవుడైనవాడు

5 అల్లుగంగ సహితులైన కేశవదేవసోమిదేవులను వారిని పలాయితులను చేసినవాడు

6 సెంతిసీమను పాలించువాడును ధర్మద్రోహియు అగు మల్లికార్జునుడను వానికి శస్త్రపూతమైన పవిత్ర మరణమును అనుగ్రహింపక వాని సప్తాంగములను హరించెను

7 కోలయన్నపతి కుమారుడైన రాజన్న యనువానికి అంబదేవుడు తన కుమార్తెను భార్యగా నిచ్చెను ఆమెకు అరణముగా నందనపుర రాజ్యమిచ్చెను సమస్తాంధ్ర మహీపతులను రణమున జయించెను

8 దాయాదులచే అపహృత రాజ్యుడైన మనుమగండగోపాలుని విక్రమసింహపుర సింహాసనముపై పునః ప్రతిష్ఠించెను

9 దేవతలు అందరును కూడి పాలసముద్రమును ద్రచ్చి ఒక ఏనుగును (ఐరావతమును) ఒక గుఱ్ఱమును (ఉచ్చైశ్శ్రవమును) ఒక లక్ష్మిని సాధింపలేయి కాలకూటమును పుట్టించిరి నిస్సహాయుడును అద్వద్వుడును అగు అంబదేవుడు మహాయుద్ధమున రిపుసాగరమును మథించి పాండ్యపంచ కల్పద్రుమములను పెక్కు ఏనుగులను గుఱ్ఱములను వశము చేసికొనెను

ఇవికాక అంబదేవుని బిరుదావళిలో కొన్ని చరిత్రాంశములను సూచించునవి కలవు సమధిగత పంచమహాశబ్ద ఖండికూటమనోరథపురవరాధీశ్వర ప్రత్యనీకప్రాసాదాయమాన కులశేఖరగండ సూర్యవంశరాయ నిర్మూలన భుజవిజయగాథాశ్రవణ చమత్కృత దేవగిరిరాయప్రస్థాపిత ప్రాభృతమణికనకభూషణ కాడవరాయ విధ్వంసన అతి

పాండవపరాక్రమపాండ్యరాజన్యప్రేయప్రేషిత చండవేదండ వైనతేయజంఘాలతురంగ గండపెండార శ్రీ అంబదేవ మహారాజు అని ఈతని ప్రశస్తి

త్రిపురాంతక శాసనము క్రీ శ 1290 నాటి దగుటచే ఇప్పటికే అంబదేవుడు పైన చెప్పిన విజయములన్నియు సాధించి శత్రుదుర్నిరీక్ష్యుడై కాకతీయాధిపత్యము ను త్రోసిపుచ్చి సర్వస్వతంత్రుడై యుండెనని తెల్లమగుచున్నది ఈకడిట్టి స్థానము సాధించిన క్రమమును కొంత అనుసంధింపవచ్చును ఇతని గల సమధిగత పంచమహాశబ్ద బిరుదము ఈతని స్వాతంత్ర్యమును చాటుచున్నది కాకతీయ రాజన్యులకిది చెల్లుచుండెను కాకతీయ సామ్రాజ్యముపై కాలుద్రవ్వుటకు పూనుకొనిన అంబదేవుని మొదటిచర్య శ్రీపతి గణపతి అను నాతని జయించి వాని రాయసహస్రమల్ల బిరుదమును తాను ధరించుట శ్రీపతి గణపతిదేవుడు పల్నాటిలో గురిందాల (గురుజాల) సీమకు అధిపతియైన కాకతీయసామంతుడు ఇతనిని పేర్కొను శాసనమొకటి శక 1190 (క్రీ శ 1268) నాటిది గురిందాలలో కనబడుచున్నది అంబదేవుని నీలగంగవర శాసనములో కూడ గురిందాల గణాధిపుని జయించిన ప్రసంగమున్నది ఈ కాకతీయ సామంతుని జయించి అంబదేవుడు పల్నాడులో తన స్థానమును బలపరచుకొనెను ఇప్పుడు రాణి రుద్రమదేవి కాకతీయ సామ్రాజ్యమును శాసించుచుండెను ఆ మహారాజ్ఞి సామంతుని నిర్జించి అంబదేవుడు సామ్రాజ్యముపై తిరుగుబాటు కావుటానెత్తెను ఇతడు జయించినట్లు చెప్పుకొన్న 75 మంది భూపతులు కాకతీయ సామ్రాజ్య రక్షకులైన నాయకులైయుండురనియు తిరుగుబాటుజెండా యెత్తిన అంబదేవుని అణచుటకై రుద్రమదేవి వీరిని పంపియుండుననియు చారిత్రకులూహించుచున్నారు విజయము అంబదేవునే వరించినట్లు తోచుచున్నది

తరువాత అంబదేవుడు తన దృష్టిని ఏరువసీమపై పరపెను ఏరువనాడు ఆంధ్రదేశపు ప్రాచీన విభాగములలో నొక్కటిగా కనబడుచున్నది నెల్లూరుజిల్లా దర్శి పొదిలి తాలూకాలలో కొంతభాగమును కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకా కడపమండలమున దలి బద్వేలు సిద్ధవటము తాలూకాలలో భాగములును ప్రాచీనమైన ఏరువనాడులో చేరియుండెనని భావింపబడినది అంబదేవుని సామంతుడైన నవదీసి అంబయరెడ్డి శక 1210 (క్రీ శ 1288) నాటి తన త్రిపురాంతక శాసనములో ఏరువనాడు పేర్కొన్నాడు "స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర గండపెండార అంబయదేవ మహారాజులు ఏర్వచెల్లించుకొనగా నాడు అని ఇందలి వాక్యము త్రిపురాంతకక్షేత్రము ఏరువనాడు నందుండెనని దీనివలన తెలియుచున్నది ఏరువనాడు గంగయసాహిణి కాలమున ఆతని పరిపాలనలో నుండినట్లు శక 1164 తురిమెళ్ళ శాసనము వలన తెలియుచున్నది ఇది ఏకారణముననో కాయస్థరాజుల అధీనమునుండి తొలగినది ఇప్పుడు ఏరువనాడు చోడవంశీయుడైన మనుమల్లిదేవరాజు పాలనలో నుండెను శక 1189 (క్రీ శ 1267) నాటివి మనుమల్లిదేవుని రెండు శాసనములు త్రిపురాంతకమునందు కనుపట్టుచున్నవి (దవా X-417 418) ఈతడు కాకతీయ సామంతుడై యుండును ఏరువ మల్లిదేవుని యుద్ధమునందు సంహరించి ఆ ప్రాంతమును స్వాధీనము చేసుకొని అంబదేవుడు ఏరువ మల్లిదేవుల గొండుగ అను బిరుదమును వహించెను అంబదేవుని శాసనము (దవా X-430) క్రీ శ 1272 నాటికే త్రిపురాంతకములో కన్పించుచుండుటచే ఇంతకు పూర్వమే ఏరువనాటి విజయము జరిగెనని యూహింపవచ్చును

కేశవదేవ సోమిదేవులను వారు వైదుంబ వంశీయులు వైదుంబులు చిత్తూరుజిల్లాయందు బాహుదానది మీగనున్న కలుకడ పురవరాధీశ్వరులు వీరు అనంతపురంజిల్లా జగశాపి గుత్తి ప్రభువును చోళకులను అగు అలుగంగనితో సఖ్యము చేసుకొని జన్నిగదేవ త్రిపురారుల కాలమున నాయకులు కాయస్థుల రాజ్యభాగములను ఆక్రమించుకొని విజృంభించిరి కాయస్థరాజుల ముఖ్యపట్టణమైన వల్లూరునుకూడ స్వాధీనము చేసుకొనిరి తనవంశమునకు జరిగిన అవమానమును తుడిచివైచి రాజ్యనష్టమును కూడతీసికొనుటకై అంబదేవుడు వీరితోపోరి ఓడించెను వైదుంబులు హద్దులో ఉంచబడిరి అంబదేవుని మహాప్రధాని కడపజిల్లా అత్తిరాల పరశురామేశ్వరాలయమునందు వేయించిన శక 1201 (క్రీ శ 1279) నాటి శాసనములో అంబదేవుడు వల్లూరు రాజధానిగా పొత్తపినాడు మున్నగు దేశములను పాలించుచున్నట్లు చెప్పయుండుటచే కేశవదేవ సోమిదేవులపై విజయము అంతకుముందే జరిగెనని భావింపవలెను ఈ విజయము క్రీ శ 1287 ప్రాంతమున జరిగెనని డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు వ్రాయుచున్నారు

శక 1200 ప్రాంతమున అంబదేవుడు పాండ్యుల దండ

యాత్రను ఎదుర్కొని వారిని పారద్రోలియు దునని పై చారి త్రకులే వ్రాసిరి పాండ్యుల సామ తుడును కా చీపురాధి నాథుడ ను అగు విజయగ డ గోపాలుని శాసనము కడపజిల్లా న దలూరు గ్రామమున దళి సౌమ్యనాథస్వామి ఆలయములో శక 1201 నాటిది కనబడుచు డుటయే ఈ యూహకు మూలమ వి యగండ గోపాలుడు నెల్లూరు తిక్కరాజు అల్లుడని తెలియుచున్నది ఈతడు శక 1172 (క్రీ శ 1 50) ను డి ము ప్పది స వత్సరములు కా చీపురము ను డి పాలన సాగించెను

అంబదేవుడు సెంతిసీమను పాలి చువాడును ధర్మ ద్రోహియు అగు మ ల్లి కార్జ నుడనురాజు యొక్క ప్రా గము లనుహరించె ని చెప్పబడినది ఈ సె తిసీమ యెచ్చటిదో గు ర్తి బడలేదు

అ బదేవుని కిరీటమునందలి మరియొక తురాయి మనుమగండ గోపాలుడనువానిని విక్రమసింహపుర సింహా సనముపై పునఃప్రతిష్ఠితుని చేయుట దీనినుద్దేశించియే కాబోలు ఆతడు "రాయ స్థాపనాచార్య" బిరుదమును దాల్చెను ఈ సందర్భమున విక్రమసి హ పురమనబడు నెలూరుచరిత్రను పాఠకులకు సంగ్రహముగా గు ర్తు చేయదగును తిక్కరాజు కుమారుడును తిక్కనామాత్యుని ఎలికయు అగుమనుమసిద్ధి రాజు క్రీ శ 1268 ప్రా తమున పాండ్యులతో జరిగిన ముత్తు కూరు యుద్ధమునందు మరణించెను నెల్లూరురాజ్యము కొంత కాలము పాండ్యుల యధీనమున దుండెను తరువాత రుద్రమ దేవి సేనానియైన దాది నాగదేవుడు మూడు నాలుగే డ్లు ఇచ్చట అధికారము నెరపెను తదనంతరము మనుమసిద్ధి కుమారు డై న రె డవ తిక్కరాజు రె డేడ్లు తన పై తృకరాజ్య మును చేజిక్కి చుకొనెను ఆపై న మనుమగ డ గోపాలుడు నెలూరురాజ్యమును ఆక్రమించుకొని పాలి చుచు డగా అతని పరివారమే వానిని రాజ్యభ్రష్టుని గావి చెను ఇచ్చట అ బ దేవుని శా సనవాక్యము ఇట్లున్నది "నిజపరివార విలోపిత రాజ్యపదం మనుమగండ గోపాలమ్" మనుమగ డ గోపాలుడు అంబదేవుని అప్రతిహత విజయములను వినినవాడగుటచే ఆతనిని ఆశ్రయించెను అంబదేవుడు వానిని ఆదుకొని స్వసై న్యము లనుపంపి మనుమగండ గోపాలుని రాజ్యప్రతిష్ఠితుని చేసెను

మనుమగండ గోపాలుని ప్రతిష్ఠితుని చేయుటలో ఆశ్రిత వత్సలత్వమే కాక రాజకీయ ప్రయోజనములును అంబదేవుని ప్రేరేప చియుండు ని ఊహించుట సులభము దక్షిణమును డి బలవ తులై న పా డ్యులు క౦చి నెల్లూరురాజ్యముల మీదుగా కాయస్థ ము దలముపై ఒ త్తిడితెచ్చుచునే యు డిరి అ బ దేవుని కాలము ను (శక 1190) మారవర్మ కులశేఖర పా డ్యుడు పా డ్య సామ్రాజ్యాధిపతి యయ్యెను ఈతడు పరాక్రమశాలియైన ప్రభువు తనకుముందు జటావర్మ సు దర పా డ్యుడు మున్నగువారు కాకతీయులను వెనుకకునెట్టి నెల్లూరురాజ్యముపై అధిపత్యము స్థాపించి యు డుటచే ఆ పూర్వప్రాభవము ను పునరుద్ధరి చుటకు కులశేఖర పాండ్యుడు కృతని ల్పుడయ్యెను ఈ యభిలాష నెరవేరుటకు అంబ దేవుని కాయస్థ రాజ్యము అడుగాను డెను ఇదివరలో చెప్పిన విజయగండ గోపాలుని ద డయాత్ర కులశేఖరపాండ్యుడు ప్రోత్సాహి చినదని చెప్పుచున్నారు పా ం డ్య బ ల ము ను నిరోధి చుటకు అ బదేవుడును సన్నద్ధుడు కావొచ్చెను ఈ ప్రయత్నమున దే ఆతడు మనుమగండ గోపాలుని నెల్లూరు సి హాసనముపై నిలబెట్టెను

అ బదేవుని ఉద్వాసన చెప్పుటకు మారవర్మ కులశేఖర పా డ్యుడు చేసిన స కల్పము నెరవేరలేదు అంబదేవుడు వా స్త వముగనే గొప్పసా యుగీనుడు కులశేఖర పా డ్యుని సై న్య ములను ఓడి చి ఈతడు "ప్రత్యనీక ప్రాసాదాయమాన కులశేఖర గండ" అని వ దిమాగధుల స్తుతుల న దుకొనెను కాయస్థ రాజ్యమున దు శక 1214 (క్రీ శ 1292) వరకును జటావర్మ సు దర పాండ్యుని శాసనములు కన్పి చుచుండుటచే అంబదేవుని విజయము స పూర్ణము కాదని చెప్పవలసి వచ్చుచున్న ది ఈ సు దర పా డ్యుడు ఆ పేరుగల పాండ్యరాజులలో రె డవ వాడు మొ త్తముమీద పాండ్యులు అ బదేవుని శ క్తిసామ ర్థ్యము లను గు ర్తి ంచి ఆతనితో సఖ్యమును కోరిరి వారాతనికి మది చిన ఎనుగు ను వై నతేయజవముగల గుఱ్ఱములను అపారధనమును కానుకగా ఇచ్చిరి ఇట్లే అంబదేవుని సఖ్య మును కోరినవారిలో సేవుణ రాజులొకరు దేవగిరి యాదవులు కాకతీయ రాజ్యమునకు బద్ధశత్రువులు రుద్రమదేవి రాజ్యావ సాన సమయమునకు కాకతీయసై న్యము గోన విఠలరెడ్డి నాయ కత్వమున కృష్ణా తుంగభద్రా అంతర్వేదిలో ప్రవేశి చి ఆద వాని తు బలము మానువ హాలువ కోటలను పట్టుకొని అక్కడ యాదవుల ప్రాభవమును తొలగ ద్రోసెను గోన విఠలరెడ్డి ఈ సందర్భముననే బలిష్ఠమైన రాయచూరు దుర్గ

మును నిర్మించి (క్రీ శ 1294) సేవుణులను డి ఆ దిక్కున రాగల ప్రమాదమును వారి చెను కాకతీయుల ప్రతిద్వంద్వి యగుటచే అంబదేవుని మైత్రిని యాదవులుకోరి కానుకలు పంపిరి

అంబదేవునికీర్తి దశదిశల వ్యాపించెను ఆతనిప్రతిష్ఠ మధ్యందినాధిష్ఠితమయ్యెను కాని పెరుగుట విరుగుట కొఱకే యనునూక్తికి ఆతడును గురికాక తప్పలేదు కాకతి రుద్రమదేవి వృద్ధురాలగుచుండెను రాజ్యభారము నామె తన మనుమడును పెంపుడు కుమారుడును అగు ప్రతాపరుద్రునిపై నిలుపజొచ్చెను యువకుడగు ప్రతాప రుద్రుడు ఉత్సాహశీలియై రుద్రమదేవి కాలములో కొంచెము సడలుచూపిన కాకతీయ ప్రతిష్ఠను సంపూర్ణముగ నిలబెట్టుటకై యత్నములు చేయజొచ్చెను కాకతీయ సైన్యము పునర్వ్యవస్థీకరింపబడెను సామ్రాజ్యాంతర్గతమైన అవ్యవస్థను ముమ్ముందు ఆతడు చక్కజేయ తలచెను అంబదేవుని ఆట కట్టించుట కాతడు నిశ్చయించి తగు సన్నాహములు కావించెను కాయస్థ రాజ్యముపై పడుటకై చక్కని వ్యూహము సిద్ధముచేయబడెను రుద్రదేవదక్షిణ భుజాదండుడు అని ప్రసిద్ధి చెందిన అడిదం మల్లుసేనాని ఒక బలీయమైన సైన్యముతో శీరాంధ్రము వెంటనడచి నెల్లూరున కధిపతియైన మనుమగండ గోపాలునిపై విజృంభించెను

మనుమగండ గోపాలుడు అంబదేవుని సాయమును పొంది ఆతనికి కృతజ్ఞుడై యుండుటచే ఆతనికి అపాయము వచ్చినప్పుడు తన సైన్యముతో వానికి బాసటయగును మనుమ గండ గోపాలునకు ఇట్టి యవకాశము దొరకకుండ చేయుటయే అడిదంమల్లు సేనాని వ్యూహము అది కాకతీయులు ఊహించి నట్లే జరిగెను మనుమగండ గోపాలుడు కాకతీయసైన్యము నెదిర్చి యుద్ధమునందు నిహతుడయ్యెను మల్లుంగారు "మనుమగండగోపాలశిరఃఖండన" అని బిరుదు దాల్చెను అడిదంమల్లుగారి ఈ విజయము శక 1216 (క్రీ శ 1294) నాటి ఆతని త్రిపురాంతక శాసనములో ప్రశంసింపబడుటచే 1294 సం॥ నకుముందే ఆతడు మనుమగండ గోపాలుని జయించియుండును ఇది క్రీ శ 1290 ప్రాంతమున జరిగియుండవచ్చును

మనుమగండ గోపాలుని తరువాత కాకతీయులు రాజగండ గోపాలుడను వానిని నెల్లూరి రాజ్యమున [illegible] యాతడు కృతఘ్నుడై పాండ్యులతో మైత్రిచేసెను రాజగండ గోపాలుని శిక్షించుటకై ప్రతాప రుద్రుడు తనకునచ్చిన సామంతుడైన మనుమగండ గోపాలుని నియోగించెను ఈ మనుమగండ గోపాలుడు మనుమసిద్ధి వంశములోనివాడు మనుమసిద్ధికి ముగ్గురు కుమారులుండిరి వారిలో మధ్యముడైన నల్లసిద్ధి ఐదుగురు తనయులు అంద గ్రజుడు ప్రకృతుడైన మనుమగండ గోపాలుడు ఈతడు ప్రబలసైన్యములతోపోయి రాజగండ గోపాలుని ఆలని విహితుడైన పాండ్యులను ఓడించినట్లు నర్సారావుపేట పట్టాభిరామ దేవాలయమందున్న శక 1219 (క్రీ శ 1297) నాటి మనుమ గండ గోపాలుని శాసనమువలన వ్యక్తమగుచున్నది ఈమనుమ గండ గోపాలుడు యాదవులనుగూడ జయించినట్లు అదే శాసన మందుగల సేవణ కటకవేణు కబళన దావపావక అను బిరుదముచే ఊహింపనగుచున్నది అంబదేవుడు తనకుమార్తెను బొల్లయకుమారుడైన రాజన్న అను నాతనికిచ్చి నంగనపుర రాజ్యము అరణముగా ఇచ్చినట్లు త్రిపురాంతక శాసనము చెప్పుచున్నది ఈ బొల్లయయు ఆతని కుమారుడు రాజన్న యు కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకాలోని మల్యాల లింగాల గ్రామములలో దొరకిన శాసనములలో కానవచ్చు చున్నారు మహాసామంత చెఱకు బొల్లయరెడ్డి మహాసామంత రాచ రుద్రదేవుడని వీరి కచ్చటి వ్యవహారము వీరు కాకతి రుద్రకుమారునికి సామంతులుగా చెప్పబడిరి ఈ శాసనములు క్రీ శ 1290 91 సంవత్సరములకు చెందినవి అనగా అప్పటికి వీరు కాకతీయులకు వశులై వారి యాధిపత్యము నంగీకరించిరన్న మాట అంతకుముందు వీరు అంబదేవునితో మైత్రి చేసి ఆతనిరాజ్య విస్తరణోద్యమమునందు తోడ్పడు చుండిరి అంబదేవుడు పెండేకల్లు ప్రాంతమును జయించుటకు యత్నించుచుండెను దానికి సమీపమునందే ఉన్న చెఱకు బొల్లయరెడ్డితో సఖ్యనడుట ఆతని యుద్యమమునకు సహకారమగును వానితో వియ్యముచేసి నందవపుర ప్రాంతము చెఱకురెడ్లకు ఇచ్చెను ఈ గ్రామము నందవరము అనుపేరుతో పూర్వపు బంగానపల్లి సంస్థానమునందు చేరియున్నది అంబదేవుడు కాకతీయ సైన్యములను నిర్జించి పెండేకల్లు రాజ్యమును వశము చేసికొనెను కాని రుద్రమదేవి ఊరకయుండలేదు ఆమె విశ్వాసమునకు పాత్రులైన నాయకులలో పశ్చిమాంధ్రమున తాతపిన్నమరాజు పేర్కొనదగినవాడు ఈతడు ఇర్వీటివంశ మూలపురుషులలో గణనీయుడు. తాతపిన్నమరాజు యుద్ధమునందు [illegible]

రుద్రుని జయించి యాతని సప్తాంగములు హరించెనని చెప్ప బడినది అనగా కాకతీయుల ప్రోత్సాహముపై వారి సహాయముతో కావచ్చును తాతపిన్నమరాజు చెఱకురెడ్లను శిక్షించి వారు తిరిగి కాకతీయ సామ్రాజ్య విధేయులగునట్లు చేసెను ఇది క్రీ శ 1 90 స వత్సరమునకు సమీపమున జరిగి యుండును

అంబదేవుని అదృష్టచక్రము తిరుగుముఖము పట్టినట్లున్నది అతని మిత్రవర్గములో ఒక్కరొక్కరే కాకతీయ బలమునకు తలయొగ్గుచుండిరి మనుమగండగోపాలుడు సంహరింపబడెను చెఱకురెడ్లు శత్రుపక్ష ధావారము చేరిరి పాండ్యులు కాకతీయ సేనానుల ధాటకు నిలువలేక వెనుకకు తగ్గిరి సేవుణులును గోనవిరలుని భుజపరాక్రమమును చవి చూచుచుండిరి ఈ సమయముననే ప్రతాపరుద్రుడో రాణి రుద్రమదేవియో నాయకత్వము వహింపగా ప్రచండ కాకతీయ వాహినులు ఎఱువసీమపై దండయాత్ర సాగించెను బలవంతుడయ్యును అంబదేవుడు పరాజితుడై పొత్తపినాటికి తన సైన్యములను ఉపసంహరించుకొనవలసి వచ్చెను శక 1213 (క్రీ శ 1 91) తరువాత అంబదేవుని శాసనములు త్రిపురాంతకమున కన్పించుటలేదు కాకతీయ సేనానుల శాసనములే ఇచ్చట లభించుచున్నవి శక 1213 ఖరస వత్సర శ్రావణశుద్ధ పూర్ణిమనాడు చంద్రగ్రహణ సమయమున శ్రీమన్మహాప్రధాని కటులూరి గన్నయ్య ప్రెగ్గడవారి కొడుకు అన్నలదేవుడు వేయించిన శాసనము త్రిపురాంతక క్షేత్రమునందున్నది అప్పటినుండి ఎఱువనాడు కాకతీయుల వశమయి యుండును

అంబదేవుడు పరాక్రమముతో నిర్మించిన మహారాజ్య సౌధమిట్లు అనతికాలములోనే క్షీణించినది కడపమండలము వెలుపల అతని యాధిపత్యము చెల్లినట్లు నిదర్శనములు లేవు క్రీ శ 1302 తరువాత అతని వార్తయు తెలియదు అతని కుమారుడు రెండవ త్రిపురారి స్వల్ప కాలము కాయస్థుల అధికారము నిర్వహించెను ఆ రాజ్యభాగములు శక 1230 కిముందే కాకతీయ సామ్రాజ్యమునందు విలీనమయ్యెను

ఇంతవరకు మనము అంబదేవుని రణపాండిత్యమును రాజనీతి చతురతను మాత్రమే సందర్శించినాము తన మేనమామయు ఇద్దరు సోదరులును పాటించిన కాకతీయ సామ్రాజ్య మైత్రిని ఈతడేల వ్యతిరేకించెనో తెలియదు ఈతడును యాదవ మహాదేవరాజువలె కాకతీయ సింహాసనముపై ఒక నారీమణి ఆసీనురాలగుట సహించియుండకపోవచ్చును అలవోకగనే స్త్రీపరిపాలనమును అంతమొందించి తానొక విజేతగా కీర్తి పొందవచ్చునని అంబదేవుడు పేరాసపడి యుండును ఇరువది స వత్సరముల వరకు విజయ మాతవిని వరించెను కాయస్థుడైన యాతడు ఆంధ్రుల మనోభావములను చక్కగా అర్థము చేసికొనియుండడు ఆంధ్రులు రుద్రమదేవిని తల్లిగా భావించి అంబయని పిలిచెడివారని సిద్ధేశ్వర చరిత్ర మున్నగు గ్రంథములు చెప్పుచున్నవి ఆంధ్ర వీరసేనాను లందరును రుద్రమదేయడు భక్తిగలవారై యుండిరి కావున అంబదేవుని విప్లవోద్యమము పరాజయమునొందక తీరలేదు

అంబదేవుని రాజకీయము లెట్లున్నను అతడు ధర్మప్రియుడు శివభక్తి తత్పరుడు వితరణశీలి అని నొక్కి చెప్పవచ్చును చాతుర్వర్ణ్య సముద్ధరణ అనునది ఈతని బిరుదులలో నొకటి వేదాది విద్యలను వర్ణాశ్రమ ధర్మములను రక్షించుట రాజుల ముఖ్యవిధిగా ఆ కాలమున పరిగణింపబడుచుండెను కాకతీయుల వలెనే ఈతడును శివభక్తి పరాయణుడు త్రిపురాంతకేశ్వరుడు ఈతని ఇష్టదైవము ఈతని శాసనము లందివిషయమిట్లు ప్రకటింపబడినది "త్రిభువన నాథీశ్వర శ్రీత్రిపురాంతకదేవదివ్య శ్రీపాద పద్మారాధక" అంబదేవుడు తరుచు త్రిపురాంతక క్షేత్రమును సందర్శించి అచ్చట దానాదులు ప్రకటించుట కాన్పించును శక 1212 వికృతి సంవత్సరమున శ్రావణ బహుళ అమావాస్య మంగళవారము సూర్యగ్రహణ పుణ్యకాలమున త్రిపురాంతకేశ్వరుని సన్నిధిని అతడు రెండు దాన శాసనములు వేయించెను అందు మొదటిది సగ్రహముగ నున్నది త్రిపురాంతకదేవునకు ప్రాతస్సంధ్యా మధ్యాహ్న సంధ్యల నడుమ తన పేరట ఒక అవసరము కల్పించుట దీని యుద్దేశము అవసరము అనగా పూజావసరమని చెప్పవలెను దాతలు తమ పేరట ప్రత్యేక అర్చనలు సేవలు దేవాలయములందు కల్పించుట ఆనాటి ఆచారము మనుమసిద్ధిరాజు పౌత్రుడైన మనుమగండగోపాల చోడదేవ మహారాజు క్రీ శ 1297 నందు నరసారావుపేట పట్టాభిరామాలయమున వేయించిన శాసనము గూర్చి చదివి యున్నాము కాట్య దాన చెన్నకేశవ స్వామికి ఈతడు ఇరువై పుట్లు వెలిచేను (మెట్టపొలము) దానముచేసెను దీనికై స్థానాపతులు చక్కెట ఆ యయ్యాళువ గండగోపాల తిరునాళ్లమ

చిత్ర మాసమునందు చేయగలవారని ఏర్పాటు

అంబదేవుని మరియొక త్రిపురాంతక శాసనము సుదీర్ఘమైనది. దీని ప్రకారము త్రిపురాంతక దేవుని "అంగరంగ భోగ ధూపదీపనైవేద్య తాంబూల శ్రీగంధ కుంకుమ కస్తూరి కర్పూర అగరు సుగంధ ద్రవ్యాద్యుపభోగార్థమ్ చీని మహాచీని హంస మాలాల కృత సితక్షౌమ రక్తక్షౌమ దివ్యాంశుచయ నిచయ సమర్పణార్థమ్ ఖండస్ఫుటిత జీర్ణోద్ధారమాట కూట (?) ప్రాసాద మండప నృత్తగీత వాద్యాది భరతవిద్యా విశారదనటజనోప సంగ్రహార్థమ్" ఇట్లే దాన ప్రయోజనము విస్తరముగా చెప్పబడినది. శైవ భక్తులలో వీరవ్రత మాహేశ్వర శైవపాశుపత మహావ్రత కాలాముఖయామిల భైరవాదుల కొఱకు సత్రపు ఏర్పాట్లు చేయనైనది. ఈ శాసనము దలి ఒక విశేష మేమనగా అంబదేవ మహారాజులకు చెప్పి ఈ ధర్మములు సంపాదించి పెట్టిన నంద శివులు అను ఆచార్యునకు దేవాలయాధికారులు వినుకొండ తూర్పున గంగాపురము అను గ్రామమును వృత్తిగా ఇచ్చిరి. అంబదేవుడు త్రిపురాంతకము నందే క్రీ శ 1272 లో వేయించిన శాసనములో మంత్రపుష్పము పెట్టెడి పూజారులు నంద శివులు మొదలగు మొత్తము పదకొండుగురు పూజారులకు మొట్టవాడలోని చిన్నపులి చెఱువులనడియూరు ఆచంద్రార్కముగా దానము చేసెను.

యథారాజా తథాప్రజా అన్నట్లు అంబదేవుని ప్రధానులు సామంతులును గూడ శివారాధకులై ధర్మ ప్రతిష్ఠలు చేయుచుండిరి. వీరిలో ముఖ్యులు (1) శక 1201 ప్రమాది సంవత్సరమున అల్లితిప్పల (అత్తిరాల) పరశురామేశ్వరాలయమునందు దాన శాసనము నెలకొల్పిన ఒక మహాప్రధాని. శాసనమునందీతని పేరుగల భాగము శిథిలమైనది. శాసన దాత పేరు ఘోడేరాయ గంగయ అని శ్రీ నేలటూరు వెంకటరమణయ్యగారు గుర్తించినారు. (2) శక 1218 లో త్రిపురాంతక క్షేత్రమునందే శాసనము వేయించిన ఖండేవుడు అను నాతడొకడు. ఈతడు కోయిని నాయని పుత్రుడు. అంబదేవునకు పుణ్యముగా ఖర ఆషాఢ శు 15 బుధవారము అనగా పూర్ణిమనాటి విత్రారోపణ పుణ్యకాలమున ఈ దానమును ఖండేవుడు ప్రకటించెను. ఇది వ్యాస పూర్ణిమా [illegible]కాలము.

[illegible] శాసనమును బట్టి పెక్కు అంశములు తెలియవచ్చుచున్నవి. ఈ మహాప్రధాని చేసిన దానముల వివరము "పోలికొండూరు సర్వమాన్యము చేసెను. పరశురామేశ్వరుని గుడి మంటపము కట్టించెను. అల్లితిప్పలు సర్వమాన్యము చేసి మాడలు విడిచెను. పొత్తపినాటి నేల కొలిపించెను. కాటమరెడ్డి అడుగున ముప్పై యడుగుల కోల గట్టించెను. ముప్పైయడుగుల కోలమానమును నిర్ణయించి దానితో భూమిని కొలిపించెనని దీని భావము కావచ్చును. ఇది యింకను విచార్యము. లేబాకను అత్రగంగన రాయ సహస్రమల్లు కాలువ త్రవ్వించెను. రాయ సహస్రమల్ల అనునది గండ పెండార అంబదేవుని బిరుదము. తాడ్లపాకను గండ పెండార కాలువ త్రవ్వించెను. ఊటుకూరను అంబ సముద్రమని చెఱువు కట్టించెను. కడువగుడి (యాడ్డను) అంబాపురమని యూరు కట్టించి యగ్రహారముగా జేసెను. అందులోని యంబాపురమును శివపురము చేసెను. శైవ భక్తులకు మాత్రము నివాసార్హత కలిగించుట శివపురము చేయుట కావచ్చును. ఈ ధర్మము లన్నియు రాజ్యముచేయుచున్న అంబదేవ మహారాజుల అనుమతితో చేయబడియే ఉండును. అంబదేవుడు వితరణ బుద్ధి కలవాడనుట దీనివలన తెల్లమగుచున్నది. స్వల్పకాలములోనే ఈతడు తన రాజ్యమునందు శాంతిని నెలకొల్పి సుపరిపాలనకై కట్టుదిట్టమైన వ్యవస్థ చేయుట ప్రశంసనీయము.

౧౦ ౭ ౮౦

## అంబర్ ఖాన్ హబ్షి

"భారతదేశమున ముస్లిముల రాజ్యస్థాపన" అను గ్రంథమును మహమ్మదు ఖాసిం అను చరిత్రకారుడు పారసీక భాషలో వ్రాసెను. ఈ గ్రంథమునకు గుల్షానే ఇబ్రాహిం తారిఖే ఫెరిస్తా అను నామాంతరములు కూడ కలవు. ఇందు క్రీ శ 17 వ శతాబ్ది పూర్వార్ధమున దక్కనులోని రాజన్యుల మధ్య జరిగిన ఘోర సంగ్రామముల వర్ణనలు పొందుపరచబడినవి. ఖాసిము తన గ్రంథమందు 13 రాజ వంశముల చరిత్రను వ్రాసినట్లు తెలియుచున్నది.

అంబర్ ఖాన్ హబ్షి ప్రశంస గోల్కొండ కుతుబ్‌షాహీల పాలన యను భాగమున కలదు.

క్రీ శ 1543 సం॥న గోల్కొండ నేలిన జంషద్ కుతుబు షాకు ఇరువురు సోదరులు గలరు.

వీరు హైదరుఖాను ఇబ్రాహిం అనువారలు. జంషద్

కుతుబుషా తన పాలనయొక్క అ త్యదశయ దు రె డు స ల పాటు బ్బస్థతిలో ఉ డెను చికాకు చా చల్యము ఎక్కువయ్యెను ఎ చిన్న పొరపాటు జరిగినను దానికి కారకులైనవారలకు మరణశిక్ష విధించెడివాడు ఇకని క్రూరత్వమునకు ప్రజల దరు భయభ్రా తులై రి ఇకని ఇరువురు సోదరులలో హైదరుఖాను వీరలో తలదాచుకొని కొద్ది రోజులకే మృతినొ దెను రెండవవాడైన ఇబ్రాహి ప్రాణరక్షణకొరకు విజయ గరమునకు పారిపోయి 7 స వత్సరముల అజ్ఞాతవాసమును అచటనే గడిపెను ఆ ధ్రదేశ చరిత్రయందును వా మ్మయమున దును మల్కిభరాము డని ప్రసిద్ధి చె దిన వ్యక్తి ఈతడే ఇతడు ఇబ్రాహి కుతుబుషా అను పేరున 1550- 580 వరకు గోల్కొ డ రాజ్యమేలెను

విజయనగరమున ఇబ్రాహీమునకు ఘనమైన స్వాగత మొసగి భ్రాతృభావముతో చూచినవాడు అళియ రామరాజు అ తేకాక ఇబ్రాహీమునకు సమయోచిత సత్కారములు జరుగుటకు ఒక చిన్న జాగిరునుకూడ అతడొసగెను ఆ జాగీరు మొదట రామరాజు భృత్యుడైన అంబర్ ఖాన్ హబ్షీ వశమం దుండెను తన జాగీరు తన చేతిను డి జారిపోయిన దులకు అంబర్ ఖాన్ క్రుద్ధుడై ఇబ్రాహీముపై పగ దీర్చుకొను సమయమునకై నిరీక్షి చుచు డెను

ఒక రోజున ఇ బ్రాహీము రామరాజు దర్బారునకు అశ్వారూఢుడై పోవుచు డెను అతనిని అ బరుఖాను వెంబడి చి దుర్భా లాడసాగెను అ తేకాక తనతో ఖడ్గయుద్ధము చేయవలెనని అతనిని బలవ తపరచెను ఎ తో ఓర్పు వహించిన ఇబ్రాహీము దక్కనులోని ఆచారము ననుసరించి అచటి పాలకులు జాగీరు లొసగుటకును వాటిని తీసికొని మరియొకరి కొసగుటకును అధికారములు కలవారలనియు జరిగినపనికి అంబర్ ఖాను కుపితుడు కానవసరములేదనియు అతనికి చ్చ చెప్పుటకు ప్రయత్ని చెను కాని ఇబ్రాహీముయొక్క శాంత స్వభావమును చులకనచేసి అంబరుఖాను అసహ్యకరముగను అవమానకరముగను మరల తిట్టుటకారంభి చెను దీనిని సహించలేక ఇబ్రాహీము వెంటనే గుర్రమును డి దిగి అ బరుఖానును క త్తివ్రేటుతో తునాతు కలు చేసివై చెను అ తేకాక ప్రక్కనే ఉన్న అ బర్ ఖానుయొక్క సహోదరుడు కూడ దుర్భాష లాడినందున అతనినికూడ సంహరించెను ఆ రోజులలో పరస్పర ఖడ్గ యుద్ధములు విరివిగా జరిగెడివనుటకు ఇది యొక దృష్టాంతమని చరిత్రకారుడు అభిభాషించెను

కొ వెం

## అంబరుఖాను

ఈతని వృత్తాంతము కొప్పునూళ్ళవారి వ శ ప్రశస్తి యందు కన్పి చుచున్నది (చా మ II-2 0) కొప్పునూళ్ళవారిలో గజరావు తిప్పరావు అను ప్రసిద్ధవీరుడు ఉగ్గడి వబడినాడు తరువాత పేట ఎల్లన్న కుమారుడును అర్జునుని వ టి పరాక్రమశాలియు అగు పేట కృష్ణభూపతి వృత్తా తము వర్ణి పబడినది గజరావు తిప్పనాయకుడు వెలమ వీరుడుగా తోచును పేట ఎల్లన్న మొదలైనవారు ప టవ శపు రెడ్లు కొప్పునూరివారిలో వెలమలును రెడ్లును ఎట్లు వచ్చిరో తెలియదు అది యెట్లయినను పేట యెల్లనకు ఆరుగురు కుమారులు అయ్యన కృష్ణ పేరన నాగన గంగన ర గన అనువారు వీరి మేనమామ దేవారెడ్డి చెన్నభూవరుడు వీరిని పెంచి పెద్దచేసెను రాయమన్నీలు ఇతర రాజులు వీరిని మన్ననతో చూచుచుండిరి వీరిలో నెరజోదైన నాగరెడ్డి చె జి యుద్ధమున దు విక్రమముచూపి వీరస్వర్గమల కరించెను పౌరుషశాలులైన గంగన్న ర గన్న మున్నగు అనుజులు కొలుచుచుండ కృష్ణారెడ్డి దేసూరుకోటను ఏలుచుండెను దేసూరుకోట చెంజి దురమునకు సమీపమున ఉన్నది

ఇట్లు డగా ఖాన్ - ఇ ఖానాన్ అనువాడు అగ్రహోవిష్టుడై గండికోట దుర్గము నాక్రమి చెను ఇతడు విజాపుర సేనాపతులలో నొకడు తాను గ డికోటను పట్టుకొనుటయే కాక తనక్రి ది యధికారియైన అ బరుఖాను అనువానిని గండికోట లా క్రమి చుటకై ఆదేశి చెను ఇది దాదాపు క్రీ శ 1650 ప్రాంతము విజయనగర సామ్రాజ్యము అస్తంగతప్రాయమయ్యెను దైవోపహతుడగు శ్రీ ర గరాయలు నిలువ నీడలేక సామంతుల వ చలను ఆశ్రయి చుచుండెను మృగే ద్రము మరణావస్థలో నుండగా దాని శరీరమును ఎవరు ఎంత భక్షించవలెనని వివాదపడు వృకములవలె కూలిపోయిన విజయనగర సామ్రాజ్యభాగములను చేతనైనంత మేరకు ఆక్రమి చుకొనుటకై గోల్కొ డ విజాపురాధీశ్వరులు స్పర్ధపడుచుండిరి విజాపుర సేనాపతులు ఖాన్ ఇ ఖానాన్ ముస్తఫాఖాను మున్నగువారు కర్ణాటకమును చొరబడిరి గోల్కొండవారి సేనాపతి మీర్ జుమ్లా అనువాడు ఇతని పూర్తిపేరు నవాబు సయ్యదు మహమ్మదు మీరుజుమ్లా గోల్కొండ

సైన్యములు గండికోట తూర్పు భూములను ఆకళి చుకొనగా విజాపురము వారు గ డికోట పశ్చిమప్రా తమును ఆకట్టుకొనిరి విజయనగర భూభా దము ఇట్లు చెరిసగము భుక్తము చేసికొను టకు గోల్కొండ విజాపురములు సామాన్యముగా అంగీక రించినను వారినడుమ పొరపొచ్చెములు లేకపోలేదు అంగీ కారమునకు విరుద్ధముగా అధిక భూభాగమును గ్రహించుటకు వారు ఉభయులును యత్ని చుచునే యు డిరి విజాపురము వారి వంతుగా ఉ డవలసిన గుత్తి దుర్గమును మీరుజుమ్లా స్వాధీనము చేసుకొనుటతో వీరి నడుమ వైరానలము ప్రజ్వరిల్లెను

దీనికి ఫలితమే ఖాన్ – ఇ – ఖానాన్ సేనాపతి గోల్కొ డ వారి గిరిలోనున్న గండికోటను పట్టుకొనుట అంతటితో ఊరు కొనక గోల్కొండ ఫౌజులను అలయి చుటకై చె జీ దుర్గాధి పతిగా నుండిన అంబరుఖాను అనువానిని ఆ ప్రాంతమందలి గోల్కొండ గండికోటలను ముట్టడించుటకై ప్రోత్సహించెను అంబరుఖానుడు సత్వరమే చర్య గైకొనెను మురారిజల్లి శూరాగ్రగణ్యుడైన శాలోజీ అహివతిరాయడు శాజిఖాను మహమ్మదుఖాను దుర్మత్తుడైన ఖైరాతుఖాను మున్నగు సర్దారులను ప్రేరేపించి గోల్కొండ వారి స్థావరములను కైవశము చేసికొనుటకై పంపెను అంబరుఖాను వ పిన సర్దారులు కొంత విజయమును సాధించిరి వీరు మొట్టమొదట మఠముకోటను ఆక్రమించిరి ఇది ఉత్తర ఆర్కాటు జిల్లా వ దవాసి తాలూకాలో ఉన్నది క్రూరుడును నిర్భయు డను అగు దుర్గోజీ పండితుని మఠము కోటలో రాణ్యి ము చిరి అలకోట తెల్లాటకోట మున్నగు దుర్గములను కూడ వశపరచుకొని దాదాపరా అనువానిని రాణ్యము ఏర్పాటు చేసిరి విజయోత్సాహముతో అంబరుఖాను అను చరులు కంచి చెంగల్పట్టు కరుగుడి మున్నగు స్థావరముల పైకి ఎగబ్రాకిరి

ఇచ్చట వీరికొక ప్రతిబ ధకము ఎదురయ్యెను కా చీ పుర పరిసరములు కాళహస్తి జామీ దారులైన దామెరవారి ఏలుబడి క్షేత్రములు వీరు మీరు జుమ్లా పక్షమున ఉండినట్లు కౌన్పించును అంబరుఖాను సైనికుల చేతిలో ఇవి పడుట దామెర వెంకటప్పనాయునకు సమ్మతము కాదు కావున ఆతడు తనకు ఇష్టుడును దేసూరుకోటకు అధిపతియు అగు పేట కృష్ణారెడ్డి [illegible] అభిమంత్రించెను తెలుగు సాయ కులు మొత్తముమీద గోల్కొండ వైపునకే మొగ్గుచుండుట కనిపించును గోల్కొండ రాజ్యము తెలుగువారికి సన్ని హితమనుభావమే దీనికి కారణమై యుండును చె జీ సమీ పమున ఉన్న దేసూరివారి భూములుకూడ విజాపురమువారి అలజడికి లోనగుచు డుట పేట కృష్ణారెడ్డికి ఆగ్రహకారణమై యుండును పేట కష్ణభూపతి యుద్ధమున దు అర్జునునివంటి వాడని బట్టులచే ప్రశంసింపబడెను

అంబరుఖాను మున్నగు విజాపుర సర్దారుల ఔద్ధత్య మును అణచుటకై కృతనిశ్చయుడైన పేట కృషారెడ్డి తన దుర్గ న రక్షణమునకై వలయు కట్టుదిట్టములను కావించెను తన పినతండ్రియైన పెదకృష్ణవిభుని తన పెద్దయల్లుడును అత్యంత శూరుడును అగు దేవారెడ్డి పెద్దన మొదలగువారిని దేసూరికోట రక్షణకు నియమి చి తాను రణక్షేత్రమున కాలిడెను ఈలోపులో అంబరుఖాను అనుచరులు మురారి జల్లి శాలోజీ అహివతి మున్నగువారు కంచివైపు విజృంభించు చుండిరి అహావతిరాయడు అయ్యవారిపేటను పట్టుకొనెను అయినను తమ వెన్నువైపున మూసుకొని వచ్చుచున్న ప్రమాదమును వీరు గుర్తించలేదు పేట కృష్ణారెడ్డి కార్యా ర గమున దూకి ముందుగా మధురాంతకమును జయించెను తరువాత మఠము కోటను ఉగ్రపరాక్రమముతో ఢీకొని అచ్చటి పఠాను యోధులను మరాటీ వీరులను అప్రతిహత ముగా సంహరించెను దళకర్త దుర్గోజియనువాని కంఠము ద్రు చి కోటను స్వాధీనము చేసుకొనెను వాని డాలు డమా ములను దస్తును స్వాధీనము కావించుకొనెను

ముఖ్యానుచరులైన మురారి జల్లి శాలోజీ మున్నగు వారు చెంజికి దూరముగ కాంజీవర ప్రాంతమున చిక్కు పడుటచే అ బరుఖానుని చేయి విరిగినట్లుండెను వాని సేనా దౌర్బల్యమును గమనించి పేట కష్ణారడ్డి ధాటితో చెంజి దుర్గమును లొంగదీయుటకు పూనుకొనెను లగ్గలక్కి చెంజిని వశపరచుకొనుటకై పొడవైన నిచ్చెనలు మొదలగు సాధనములు సేకరి చిరి కొన్ని ఫిరంగులుకూడ సేకరించి యుందురు చె జికోటలోని తురుష్క సేనలు దిగ్భ్రాంతము లయ్యెను శత్రువులందరును వికావికలై పారిపోయిరి పేట కృష్ణారెడ్డి కొంత అశ్విక సైన్యమును చెంజిపుర వీధులలో ప్రవేశపెట్టెను మురారిజల్లి అహివతిరాయడు పారిపోయిరి [illegible] వెన్నాడెను కాని ఈ సమయమునకు వారు దూర

మందుండుటచే అ బరుఖానును అపనయ దు అదుకొనగల స్థితిలో లేరు అ బరుఖానుని గతి యేమయ్యెనో తెలియదు పేట కృష్ణారెడ్డి ఘనవిజయమునకు స తసి చి దామెర వె కటప్పనాయడు మీరుజుమ్లాకు అనని పరాక్రమమును ఎరుకపరచెను నవాబు కృతజ్ఞతా సూచకముగా కృష్ణా రెడ్డికి చౌకట్లు కానుకలు అ పుచె నట అతనికి కదన హా వీర బిరుదము ఒభి చెను గోల్కొ డ విజాపూరు వారి పోటీలా మీరుజుమ్లా కొ త వి యము పొ ది ట్లు కాన్పి చి నను అది తాత్కాలికమే అని చరిత్ర వాకొనుచున్నది క్రీ శ 1655 ప్రార భమున విజాపురముతో చెలిమికై గోలకొ డవారు ఆరులక్షల సువర్ణము లు అర్పి చిరి

అ బరుఖానను గురి చి మరికొ న్ని ఎశే ములు దక్షిణ ఆర్కాటు జిల్లా గెజటీరను డి తెలియవచ్చుచున్నవి పేట కష్ణారెడ్డి సాహస ప్రదర్శనమువలన చె జిగ రమును తాత్కా లికము అక్రమి చు కొనగలిగి ను మీరుజుమ్లా ను డి సైన్య సహాయము వచ్చి ట్లు కాన్పి చదు చె జి కోట యథా పూర్వముగనే బిజాపూరు సేనాపతులకు వ శ మ య్యెను క్రీ శ 1648 1647 నడుమ ఈ దుర్గము విజాపురము వారి క్రి దనే ఉ డినట్లు చారిత్రకులు వ్రాయుచున్నారు అ బరు ఖానుడు ఈ దుర్గమునకు మధ్యమధ్య ఖిల్లేదారుగ కూడ ఉ డుచు వచ్చెను అ బరుఖాను ఖిల్లేదారుడు దుర్గరక్షణ విధానమను బలపరచి ట్లు అచ టి యొక శాసనము తెల్పు చున్నది ఇది క్రీ శ 1652 సంవత్సరమునకు తరువాత జరిగినది

చె జి దుర్గము 1677 సం లో మహారాష్ట్ర యోధుడు శివాజీ వశమైనది ఇప్పుడు అ బరుఖానుడే ఖిల్లేదారుగా ఉండెను అతడు వృద్ధుడయ్యెను శివాజీ నయవంచనముచే అవలీలగా ఈ కోటను స్వాధీనము చేసుకొ న్నట్లు కనబడు చున్నది చె జికోటను స్వాధీనము చేసుకొనవలెనని కా క్ష గలవాడై ప్రబల సైన్యముతో శివాజీ ఆ ప్రా తమునకు వచ్చెను కాని తన యుద్దేశమును నైపుణ్యముతో కప్పు పుచ్చి తాను బిజాపురమువారికి లోబడిన సైనికుడ ననియు అంబరుఖానుకూడ బిజాపురమువారి ఉద్యోగియే కనుక ఉభయులును సఖ్యముతో సంప్రదించు కొనవలెనాయు వార్త పంపెను ఖిల్లేదారు సకుటుంబముగ తన స్కంధావారమునకు వచ్చునట్లు శివాజీ రాయబారము నడపెను వృద్ధుడగు ఖిల్లేదారు ఆమాటలు నమ్మి తన పుత్రులతోను బంధువులతోను శివాజీని స దర్శి చి గౌరవి చుటకై ఆ ని స్కంధావార మునకు వెళ్ళెను అచ్చట వారందరును కపటముచే నిర్బ ధింప బడిరి చె జి దుర్గము ఒక తుపాకి పేల్చకుండగను ఒక సైనికుడు హతుడు కాకుండగను శివాజీకి హస్తగతమయ్యెను

భం ల రం

వి శ సుం

## అంబవరం

అ బవర గ్రామము కర్నూలు జిల్లా గిద్దలూరు తాలూ కాలో ఉ న్నది దీనికి మూడు మైళ్ల దూరములో గిద్దలూరు పట్టణము కలదు ఈ గ్రామ వి స్తీర్ణము 6 171 ఎకరములు దీనికి తూర్పున ఈదులకొండ పడమట కంపకొ డ ఉత్త రమున రాళ్లవాగు దక్షిణమున అక్కలరెడ్డిపల్లి కలవు

1961 న జనాభా లెక్కల ప్రకారము పురుషులు స్త్రీలు కలసి ఇచట 3 237 మ ది ఉండిరి వీరిలో షెడ్యూలు జాతులవారు తరగతులవారు 3 3 మంది ఇది కొ డ ప్రా తము ఇచ్చట గొప్ప నీటి గు డములు చెట్లు చేమలు కలవు ఇది గు డ్ల బ్రహ్మోదినది పుట్టినచోటు ఈ గ్రామ మున ఇ డ్లు శివారులుగను దూరదూరముగను కట్టబడి ఉన్నవి వీటిలో 26 కా క్రీటు కప్పుగల ఇళ్ళు గ్రామస్థు లలో 5 శాతమువారు వరి అన్నమును 35 శాతమువారు జొన్న అన్నమును 60 శాతమువారు ఇతర అన్నములను తి దురు బావి నీటిని త్రాగుదురు

ఈ గ్రామమునకు ఎఱ్ఱవాగు చెరువు నీటి వనరులు వరి జొన్న సజ్జ రాగి ఆరిక కొర్ర కంది వేరుశనగ ఆముదాలు ఉలవ మిర్చి మొదలగు ప టలు పండును 1966 67 స ॥లో ప టల క్రింద ఉపయోగించిన భూమి 2 684 ఎకరములు చెరువుక్రింద 101 ఎకరములు బావుల క్రింద 20 ఎకరములు సాగు చేయబడినవి మూడు ఆయిలు ఇ జనులు 19 ఎకరములకును మోటలు ఏతములు 8 ఎకరము లకును నీటిని సప్లయి చేసెను ఇక్కడ ఎర్రమట్టి నేల 2 03 ఎక రములు రేగడి నేల 1 502 ఎకరములు చవిటి నేల 563 ఎక రములు గరువునేల 601 ఎకరములు కనిపించును 14 ఎక రముల కంపచెట్ల చిట్టడవి ఉన్నది వ్యవసాయ ఫలసాయములు లారీలపై బండ్లపై గిద్దలూరు నంద్యాలలకు ఎగుమతి అగు చున్నవి

ఈ గ్రామమున ఆవులు గేదలు మేకలు గొఱ్ఱెలు

వ దులు కోళ్ళు కలసి 8 931 ఉన్నవి దినమునకు 5 లీటర్ల పాలు 10 కి గ్రా నెయ్యి 100 గ్రుడ్లు స్థానికులు ఉపయోగి చుకొని 50 లీటర్లపాలు 75 లీటర్ల పెరుగు 70 కి గ్రా నెయ్యి 150 గ్రుడ్లు గిద్దలూరునకు రవాణా చేయుదురు

ప్రజల జీవితమునకు ముఖ్యాధారము వ్యవసాయము కొందరు చేపలు పట్టుదురు కలప కొట్టు అడవి పనులచే కొందరు జీవింతురు దుకాణములు కలవు క సాలి వడ్రంగి కమ్మరి కుమ్మరి తాపీమేస్త్రీ మంగలి చాకలి గొల్ల వడ్డెర మున్నగువారు కలరు నూలు మగ్గములు వడకుట బుట్టలల్లుట బట్టలు నేయుట రాళ్లు కొట్టుట మొదలగు కుటీర పరిశ్రమలు కలవు వ్యవసాయము చేయువారికి కూలీలు దొరుకుదురు దినమునకు కూలిరేటు పురుషునకు రూ 1-50 లు స్త్రీకి ఒక రూపాయి

ఈ గ్రామమున మూడు దేవాలయములు 2 చర్చిలు ఒక మసీదు ఉన్నవి శ్రీర గస్వామి ఆలయమునకు 18 ఎకరముల మెట్ట భూమి కలదు మూడు సంవత్సరముల కొకసారి జాతర జరుగును

అ బవరమునకు మూడు మైళ్ళ దూరములో గిద్దలూరు రైల్వేస్టేషను ఉన్నది ఈ గ్రామమును పొరుగు గ్రామములతో ఒక కంకరరోడ్డు కలుపు చున్నది రెండెడ్ల బండ్లు సైకిళ్ళు ప్రయాణమునకు గల సాధనములు

అంబవరములో బ్రాంచి పోస్టాఫీసు ఎలిమెంటరీ స్కూళ్ళు ఉన్నవి హైస్కూలు చదువులకు గిద్దలూరునకు కాలేజి చదువులకు గుంటూరు నరసరావుపేట కర్నూలు హైదరాబాదులకును విద్యార్థులు పోవుదురు ఇది ప చాయితీ పరిపాలన కల గ్రామము దీని ఆదాయము సాలీనా రు 4 680 లు ఒక పంచాయతి గ్ర థాలయము సత్రములు ఉన్నవి మూడు మైళ్ళలో నున్న గిద్దలూరులోని తంతి కార్యాలయమునకు కోర్టులకు పోలీసు స్టేషనుకు సబ్ రిజిస్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు గ్రామస్థులు పోవుదురు పురుళ్ళ ఆసుపత్రికి జనరల్ ఆసుపత్రికి పశువుల ఆసుపత్రికి గ్రామస్థులు గిద్దలూరు పోవుదురు గ్రామ సంతలు లేవు కిరాణా దుకాణములు ఇతర షాపులు కలవు అవసరమగు సరకుల నన్నిటిని గిద్దలూరు నుండియే గ్రామస్థులు తెచ్చుకొందురు

మా శ్వే

## అంబాల (చరిత్ర)

కాకతి రుద్రమ దేవి గిరి యాదవులను ఓడి చి పారద్రోలిన ఎమ్మట అనుమకొ ౦ సిద్ధేశ్వర మహాదేవుని స దర్శించినది ఓరుగంటికి వచ్చి విజయోత్సవములు వైభవముగా చేయించినదని ప్రతాపరుద్ర చరిత్ర సిద్ధేశ్వర చరిత్ర మున్నగు గ్ర థములు వర్ణి చుచున్నవి ప్రజల దరును ఆమెయందు తమకుగల ప్రేమసూచ ముగ తమ స తానములకు ఆమె పేరు పెట్టుచుండిరి సేనలన్నియు రుద్రమదేవిని అ బ యని ఎలుచుచు డెను దీని కనుగుణముగా రుద్రమదేవి తన పేరట అంబాల అను గ్రామమును కట్టి చెనని వర్ణింపబడినది

పూర్వపు మహారాజులు తమ పేర గ్రామములు నెలకొల్పుట కలదు తూర్పు చాళుక్య వంశీయుడును ప్రసిద్ధ వీరుడును అగు రెండవ విజయాదిత్యునకు నరే ద్ర మృగరాజు అను బిరుద ముండెను దానిని పురస్కరించుకొని ఆతడు "నరే ద్రపురము" అను పేరుగల గ్రామములను స్థాపించెను ఇ దు కొన్ని ఈ నాటికిని కలవు రుద్రమ దేవియెడ ప్రజలకు గల నిరతిశయ భ క్తిగౌరవములకు అంబాల అను పేరుగల గ్రామముతే సాక్షి ఆ మహారాణి స్థాపించిన అంబాల గ్రామ మెచ్చటనున్నదో నిర్ధారణగా చెప్పలేము కరీంనగరం జిల్లా హుజూరాబాదు తాలూకాలో అ బాల గ్రామమొ టి కాన్పి చుచున్నది ఇది రుద్రమదేవి ప్రతిష్ఠయైన కావచ్చును దేవగిరి వారిని కాకతీయ సైన్యములు గోదావరి ఉత్తరము వరకును తరిమి కొట్టినవి విజయ యాత్రాన తరము దానికి సూచనగా ఈ గ్రామమును రుద్రమదేవి నెలకొల్పి యుండినను వింతలేదు అట్లే ఆమె రుద్రవరము అను పేర గ్రామములు ప్రతిష్ఠి చినట్లు చెప్పబడినది

బిం ల రం

## అంబాల

అంబాల గ్రామము కరీం గరం జిల్లా హుజూరాబాదు తాలూకాలో ఉన్నది దీనికి 15 మైళ్ళ దూరములో వరంగల్లు పట్టణము కలదు ఈ గ్రామ వి స్తీర్ణము 2842 ఎకరములు తూర్పున నూదెనపల్లి పడమట గూడూరు ఉత్తరమున నేరెళ్ళ దక్షిణమున కేశవపూరు దీని సరిహద్దులు ఇది చదునైన ప్రదేశముకలది అంబాల నల్లరాతి గుట్టపై చెట్లు చేమలున్నవి

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామము

లోని పురుషులు 1882 మంది స్త్రీలు 1857 మంది జనులు మెరసి 3739 మంది వీరిలో షెడ్యూల్లు జాతుల పురుషులు 172 మంది స్త్రీలు 169 మంది ఇచ్చట ఇండ్లు గుపుగను శివారుగను పలుప క్కులగను ఉన్నవి వీటిలో 504 పెంకు టిండ్లు గ కాంక్రీటు కప్పుగల ఇండ్లు రెండు ఫెక్కు అంతస్తులు గల మేడలు వరి అన్నము నుండి వ వ తువారుమ జొన్న అన్నము వ వ తు వారను తిందురు జానినీటిని త్రాగుదురు

గూడూరు జాల నాల కేశవాపూరు జాలునాల అంకాల వాగు పెద్దచెరువు గిద్దికుంట మెడికుంట కమ్మరికుంట కొత్తకుంట మొదలగు నీటివనరులు ఈ గ్రామమునకు కలవు వరి మిర్చి మొక్కజొన్న శనగ వేరుసెనగ పెసర కంది ఉల్లి గెల్లుల్లి ధనియాలు మొదలగు పంటను పండి తురు బత్తాయి మామిడి నిమ్మ జామతోటలు కూడ గలవు స్థానిక అవసరముల నిమిత్తము వంగ బెండ మొదలగు కాయగూరలను పండి తురు ఫలసాయములను బండ్లపై వరంగల్లు మార్కెట్టునకు రవాణాచేయుదురు 1966 67 సంలో రు 5000 ల విలువగల బత్తాయి పండ్లు రు 6000 ల విలువగల మామిడి పండ్లు రు 3000 ల విలువగల నిమ్మ కాయలు జామపండ్లు స్థానికులు ఉపయోగించుకొని రు 55 000 ల విలువగల బత్తాయిపండ్లను హైదరాబాదు నకును రు 10 000 ల విలువగల మామిడి పండ్లను రు 7000 ల విలువగల నిమ్మకాయలను హుజూరాబాదునకును ఎగుమతి చేసిరి పంటల క్రింద ఉపయోగించిన భూమి 2006 ఎకరములు కాలువ క్రింద 25 ఎకరముల భూమి చెరువుల క్రింద 471 ఎకరముల భూమి బావుల క్రింద 400 ఎకరముల భూమి సాగు చేయబడినది ఇచట 8 ఆయిల్ ఇంజ నులు 16 ఎలెక్ట్రిక్ మోటారులు 65 ఎకరముల భూమికిని మోటబావులు 315 ఎకరముల భూమికిని నీటిని సప్లయి చేసెను

ఇచ్చట పశువుల సంఖ్య 5003 ఈ సంఖ్యలో ఆవులు 429 గేదెలు 242 ఎద్దులు 782 దున్నలు 71 మేకలు 131 గొర్రెలు 2140 గాడిదలు 22 పందులు 91 కోళ్ళు 1100 పాలు పెరుగు నెయ్యి 2000 కి గ్రా మాసము 800 గ్రుడ్లు 400 కి గ్రా చేపలు స్థానికముగ ఉపయోగింప బడెను

ఇచటి ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము దుకాణా దారులు కలరు కంసాలి వడ్రంగి కమ్మరి కుమ్మరి తాపీ మేస్త్రీలు కలరు తెలికల వారు చాకలి మంగలి గొల్ల వడ్డెరవారు ఉన్నారు నూలుమగ్గములవారు చేపలు పట్టువారు కూడ కలరు 4 వడ్లమర లున్నవి ఇవి స్థానిక అవసరములకు ఉపయోగింతురు వ్యవసాయ దారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి రు 2 లు స్త్రీకి ఒక రూపాయి

ఈ గ్రామమున ఏడు దేవాలయములు రెండు మసీదులు కలవు ఖాజా మొహినోద్దీన్ ఉరుసు జరుగును

ఈ గ్రామము ఉప్పల రైల్వేస్టేషనుకు 8 మైళ్ళలోను బస్సు మార్గమునకు నాలుగు మైళ్ళలోనున్నది ప్రయాణించుటకు 232 రెడ్లబండ్లు 186 సైకిళ్లు ఒక మోటారు సైకిలు ఒక జీపు కలవు ఈ గ్రామమును పొరుగు గ్రామములతో మట్టి రోడ్డు కలుపుచున్నది

అంకాలయందు బ్రాంచి పోస్టాఫీసు జిల్లా పరిషత్తు హైస్కూలు కలవు ఇచటి హైస్కూలు చదువులకు మాదన్న పేట గూడూరు కేశవపుర నూదెనపల్లి నేరెళ్ళ అను తావులనుండి విద్యార్థులు వత్తురు కళాశాల చదువులకు విద్యార్థులు 15 మైళ్లలో ఉన్న హనుమకొండకు పోవుదురు తంతి కార్యాలయము 12 మైళ్లలో నున్న వర్ధన్నపేటలో ఉన్నది

ఈ గ్రామములో వడ్లమర 20 వ్యవసాయపు మోటారులు రెండు గృహములు విద్యుచ్ఛక్తిని వాడొడును చున్నవి ఇది పంచాయతీ పరిపాలనకల గ్రామము ఇటివన్ను వృత్తి పన్ను వ్యాపారపుపన్ను గ్రాంటు వాహనపుపన్ను బందెలదొడ్డి రుసుము వీటి వలన పంచాయతీకి ఆదాయము చేకూరును గ్రామ పారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లున్నవి కమ్యూనిటీ రేడియో కలదు

ఈ గ్రామమున ఆసుపత్రి లేదు ఇద్దరు ఆయుర్వేద వైద్యులు కలరు పశువుల రోగాలకు నాటువైద్యము చేయుదురు శనిగర గ్రామమున పశువుల ఆసుపత్రి కలదు పురుళ్ల ఆసుపత్రికి జనరల్ ఆసుపత్రికి కోర్టుకు పోలీసుస్టేషనుకు సబ్ రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు గ్రామస్థులు హుజూరాబాదునకు పోవలెను ఈ గ్రామస్థులకు బహుళార్థ సహకార సంఘమువారు రు 64 000 లను అప్పుగా ఇచ్చిరి వార సంతలు జరుగవు ఉప్పల సంతలో పశువులు వ్యవసాయ పరికరములు దొరుకును గ్రామస్థులు ధాన్యము మొదలయిన నిత్యావసర

వస్తువు ను వర గల్లు ను డి తెచ్చుకొ దురు ఈ గ్రామమున కిరాణా దుకాణములు కాఫీ హోటలు సోడా ఠిల్లీ ఎగ రెట్టు దుకాణములు సైకిళ్ల షాపులు కలవు

మా శ్వే

## అంబికాముద సీలా

కటక పురవరాధీశ్వరుడైన ప్రతాపరుద్ర గజపతి సేనా పతులలో అంబికాముదుసీలా సుబుద్ధి రామదాసారులను ఇరువురు బ్రాహ్మణులు కలరు వీరిలో అంబికాముదుసీలాది కాశ్యపస గోత్రము రెండవ వారిది భారధ్వాజస గోత్రము శ్రీ వీరప్రతాప శ్రీ వీరకృష్ణదేవరాయ మహారాజులు క్రీ శ 15 5 16 స వత్సర మధ్యమున పూర్వ దిగ్విజయ యాత్రజ ఎ అందు ప్రతాపరుద్ర గజపతి నోడించి అతనిని తన సామంతులలో ఒకనిగా చేసికొనెను ఈ విషయము చారిత్రకముగా ప్రసిద్ధము

కృష్ణరాయలవారు దిగ్విజయ యాత్రనుండి తిరిగివచ్చు మయమున ఈ ఇరువురు సేనాపతులను వెంట నిడుకొని విజయనగర మేతెంచి వారికి తమ పరివారములో ఉన్నతో ద్యోగముల నిచ్చి వారిని సత్కరి చెను దీనినిబట్టి ఈ ఇరు వురును గొప్ప యోధాగ్రేసరులై యుందురని భావి పనగును

తరువాత కృష్ణదేవరాయలు తత్వవాది జేరి సీమలో చేరిన తండలమను గ్రామమును సుబుద్ధి రామదాసారునకును తడపాలెం అను గ్రామమును అంబికా ముదుసీలాకును అనుగ్ హి చిరి

తిరుమలలో శ్రీ వరదరాజస్వామివారి ఆలయ ప్రథమ ప్రాకారమునకు ప్రాగ్దిశయందు ఒక శాసనము (క్రీ శ 1521) కలదు దాని ననుసరించి ఈ సేనాపతు లిరువురును కృష్ణ రాయలు తమకిచ్చిన గ్రామములను తిరుమలలోని శ్రీ వే క టేశుని అంగరంగ భోగములకు సమర్పించిరని తెలియుచున్నది స్వామివారి కర్పించు ప్రసాదమునకు కావలసిన సామగ్రి దీపశిఖలకు కావలసిన నెయ్యి ప్రసాదమును వినియోగించు విధము మొదలగు అనేకాంశములను గూర్చి ఈ శాసనమున తెలుపబడినది

కొ వెం

## అంబుజ వల్లెమ్మ

ఈమె క్రీ శ 1633-73 సంవత్సరముల నడుమ తంజా వూరునేలిన విజయరాఘవనాయకుని కొలువున వెలసిన విదు షీమణి ఈ పండితురాలు వస త కేళికను వినుచు చుండెడిదని మాన్నారుదాసవిలాసప్రబంధము (1 15) తెల్పు చున్నది ఇ తకన్న విశేషము తెలుగరావు

ని శ సుం

## అంబులరెడ్డి

గోదావరి ఏజెన్సీయందలి పీడిత ప్రజల ఆర్తనాదము లను విని క్రీ శ 1922 వ స ంరమున అల్లూరి సీతారామ రాజు అ ప్పటి బ్రిటిషు పాలనాధికారులపై లేవదీసిన రంప పితూరీ ఆ ధ్రదేశ చరిత్రమున ప్రముఖస్థానము వహించినది

కాని అ తకు అర్ధశతాబ్దికి ముందే (1679-1680) మధ్యమున జరిగిన రంప ఎతూరీని గురి చిన వీరోచితగాథ ఇప్పటి తరమువారికి బహుశః తెలిసియుండదు ఈ ఎతూరీ య దు అద్వితీయ పరాక్రమము చూపిన అ బులరెడ్డిని అతని అనుచరుల గురి చిన విషయములు ముందు చర్చించబడును ర ప అను గ్రామము గోదావరి జిల్లాలోని చోడవర డివిజనులో కలదు అందువలన ఈ గ్రామమును రంప చోడవరము' అనుటయే ఆంధ్రప్రాంతమున పరిపాటియైనది

రేకపల్లి అను గ్రామము భద్రాచలము తాలూకా లోనిది ఈ గ్రామముకూడ ఎతూరీదార్ల విజృ భణకు అలవాలమైనది ఈ ప్రాంతములు హైద్రాబాదు రాష్ట్రపు తూర్పు సరిహద్దుల ను డుటవలన రంప చోడవరము ఎతూరీ ప్రభావము ముఖ్యముగా ఖమ్మం జిల్లాలోని కొన్ని తాలూ కాలపై పడి ది అందువలన అప్పటి మద్రాసు ప్రభుత్వము ఎతూరీదార్లను పటి యిచ్చుటయందును ఎతూరీని అణచుట యందును తమకు సాయపడవలసినదిగా హైద్రాబాదు ప్రభు త్వమును కోరినది

ఎతూరీ జరుగుటకు గల కొన్ని కారణముల ఇట చెప్పు కొనుట అప్రస్తుతము గాదు ఏజెన్సీప్రాంతముల నివసించు కొండప్రాంతపు జనులు ముట్టాదారులని పిలువబడుదురు వారి ముఖ్యవృత్తి వ్యవసాయము వీరందరిమీద అధికారము చేయువానిని మన్సబుదారు అందరు భూమిని కౌలుకిచ్చి పన్నులు వసూలుచేయు అధికారము మన్సబుదారుకు కలదు ఈ సందర్భముల జరుగు కలహములందు మన్సబుదారు పోలీసు సిబ్బ ది సహాయముచే ముట్టేదార్ల భూముల జప్తు చేయించి వారల ముప్పుతిప్పలు పెట్టుట సహజమైనది ప్రభు త్వము ఇట్టి సమయములందు నిష్పాక్షికమయిన విచారణ జరిపి

ముట్టేదార్లకు సాయము చేయుటకు బదులు ఉపేక్షాభావము నవలంబించెడిది

ఇంతవరకు సొంతమునకు కావ సిన కల్లును ముట్టే దార్లు ఏ నిర్బ ధము లేక తాడిచెట్లనుండి తీసెడివారు కాని క్రొత్తగా వచ్చిన అబ్కారీ నిబ ధనలవలన అబ్కారీ కౌలు దార్లు ముట్టాదార్లను డి చిగురు న్ను అను ఆదా యపు పన్నును వసూలుచేయ మొదలిడిరి ఇక అబ్కారీ కౌలు దార్లకు చె దు చిగురు పన్నులో ఎగభాగముగాని లేక మూడింట రె డువంతులు పన్నుగాని అధికముగా తనకు ఇయ్యవలెనని మన్సబుదారు ముట్టాదార్లను వ త్తిడి చేయ వార భి చెను దానితో ఉడుకెత్తిపోయిన కొ డజాతి ప్ర లు తిరుగుబాటును లేవదీసిరి

ఇక రే పల్లిలో జరిగిన తిరుగుబాటునకు మూలకార ణము పోడు వ్యవసాయము వ్యవసాయము చేసికొని జీవి చు ప్రజలు నామమాత్రముగా ఒక ఎ రము వ్యవసాయానికి నాలుగు అణాలు మాత్రమే పన్నురూపమున ఈయవలసిన వారై రి అ తే నిరభ్య తరముగా ఎట్టి ఆక్షేపణ లేక తమ శక్తి సామర్థ్యములతో ఎ త భూమినైనా సాగుచేసి ఫల మనుభవి పవచ్చును ఇట్టి స్వేచ్ఛకు అవరోధము కలిగి చుచు మద్రాసు ప్రభుత్వము ఇదివరకున్న పన్నును మూడు వ తులు పె చి అమాయకులైన ప్రజలకు కష్టము కలిగించినది ఇ తే కాక కొ ఎ ప్రా తములవారిని వ్యవసాయము చే కొనకు డ నిషేధించినది రిజర్వు అడవులయ పలి కొన్ని ప్రత్యేక వృక్ష ములను వ టచెరకుగా కొట్టుకొనుటకు ప్రత్యేక పన్నులను విధించినది ఇటువంటి నిర్బ ధములు స్వతంత్ర జీవనమునకు ప్రతికూలములని ప్రజలు విశ్వసించి ఒక్కుమ్మడిగా ప్రభుత్వ ముపై ఎదురుతిరిగిరి ర ప ఏజన్సీలోని తిరుగుబాటుదార్ల సానుభూతికూడ వారలకు లభించి ది

1879 జూలై 10వ తేదీని అంబులరెడ్డి అను నతని నాయకత్వమున రంపలోని తిరుగుబాటుదార్లు రే పల్లి ప్రజలు కలిసి వడ్డిగూడెం పోలీసు స్టేషనును ముట్టడి చిరి రాజ మహే ద్రవరమునుండి స్టీమలాంచీలో వచ్చుచున్న సాయుధు లైన పోలీసులను ముట్టడించి వారలను భయభ్రాంతుల చేసిరి దాని ఫలితముగా గోదావరి తీరప్రాంతమ తయు సైనిక గస్తీదళముతో నిండినది ఆ సైన్యము ముమ్మరముగా చెల రేగిన పితూరీని అణచి ఎట్టకేలకు శాంతిని నెలకొల్పినది

అంబులరెడ్డి బోదలూరు గ్రామమునకు చె దినవాడు ఈతని నేతృత్వమున సహచరులైన చంద్రయ్య సర్దారు జ గము పులికాంత సా బయ్య తమ్మనదొర అనువారలు పోలీసు స్టేషనును ముట్టడి చుటలోను యూరోపియను ఆఫీ సర్ల పర్యవేక్షణ క్రిందనున్న పోలీసు ఎబ్బ దులను నిర్బ ధించి మట్టుపెట్టుటయందును చూపిన సాహసకార్యములు చరిత్ర య దు స్థిరత్వమును పొ దినవి

క్రీ శ 1879 స ॥ నవ బరు నెలలో అంబులరెడ్డిని ప్రభుత్వము నిర్బ ధి చెను 1880 స ॥ ఫిబ్రవరి మాసమున చ ద్రయ్య పోలీసులకు పట్టుబడి వారలచే హతుడయ్యెను 1880 స । అక్టోబరు ప్రా తమున తమ్మదొర కొ త తలయెత్తి తిరుగుబాటును లేవదీసెను కాని దానిని ప్రభుత్వము వె టనే అణచివేసెను నవ బరు 1880 సం ర ప్రా తమున ఎట్టకేలకు ఏజన్సీ ప్రాంతముల శా తి భద్రతలు ఏర్పడెను

కొ వెం

## అంబోజనరాజు

బహమనీ ఓఢ్రగజపతుల రాజకీయ సంబ ధములను విశ దీకరి చు స దర్భమున కృష్ణాజిల్లా మాన్యుయల్ రచయిత అ బోజనరాజును పేర్కొనెను క్రి దవివరి చిన చరిత్రాశ ములను డి ఈ అ బోజనరాజే అ బరరాయలు లేక హ వీరుడు అని ఊహి పనగును

అ బోజనరాజు ఓఢ్రగజపతి వ శమున స్థాపించిన కపి లేశ్వర గజపతి (క్రీ శ 1435 69) కుమారుడు బుర్హాన్ ఇ మాసిర్ అను చారిత్రక గ్ర థమునను సరి చి కపిలేశ్వరుని మరణాన తరము అతనికుమారులు అ బరరాయలు మ గళ రాయలు రాజ్యాధికారమునకై కొట్లాడిరనియు కడకు బహ మనీ సుల్తానగు ముమ్మడి మహమ్మదుషా సహాయముతో అ బరరాయలు క్రీ శ 1471లో పట్టాభిషిక్తుడయ్యెననియు తెలియవచ్చుచున్నది

శాసనాధారములనుబట్టి కపిలేశ్వరగజపతికి హంవీ రుడు పురుషోత్తముడు అను ఇరువురు కుమారులుండిరి త డ్రి మరణాంతరము ఈ ఇరువురును సింహాసనమునకై కొట్లాడుట కడకు బహమనీ సుల్తాను సహాయముతో హంవీరుడు పట్టాభి షిక్తుడగుట అనువిషయములుపైన చెప్పబడిన బుర్హాన్-ఇ- మాసిర్ లోని అ శములకు సన్నిహితములుగా ఉన్నవి

ప్రకృత చరిత్రా శములనుండి ఇరువురు సోదరులలో

అగ్రజుడైన అ బోజగరాజు హంవీరుడనియు అనుజుడైన మంగళరాయలు పురుషోత్తముడనియు తెలియనగును క్రీ శ 15 వ శతాబ్ది పూర్వార్థమున రెడ్డిరాజులచే పాలితమైన తీర స్థాంధ్రము విజయనగరరాజుల బహమనీ సుల్తానుల దండ యాత్రల ఫలితముగా కల్లోలితప్రాంతమైనది ఇట్లే తెలం గాణమునకూడ బహమనీ సుల్తానుల ఆక్రమణకు గురిఅయ్యెను ఇదే సమయమున గజపతి కపిలేశ్వరుడును అతని కుమారులును పూర్వాంధ్రదేశమును వశపరచుకొనుటకు పెక్కు ప్రయత్నములు చేసిరి

అనేకయుద్ధములందు కుమారహంవీరవిభుడు తండ్రికి చేదోడు వాదోడుగా నిలచి సహాయమొనర్చెను

తెలంగాణమందలి దేవరకొండ రాజ్యమునకు క్రీ శ 1459 వ ప్రాంతమున లింగమనాయకుడను వీరాగ్రణి రాజయ్యెను అతనికి పూర్వము నుండియు ఉన్న వైరము కారణముగా బహమనీ సుల్తానగు హుమాయూన్‌షా గొప్ప సైన్యములతో తెలంగాణముపై దండెత్తివచ్చి దేవరకొండ దుర్గమును ముట్టడించెను ఆ ధాటికాగలేక లింగమనాయడు కపిలేశ్వర గజపతి సహాయమర్థించెను గజపతి తన కుమారుడగు హంవీరుని అపారసైన్యముతో వెలమవీరులకు సహాయము చేయ పంపెను దేవరకొండ సైన్యములకును గజపతి బలములకును నడుమచిక్కి బహమనీ సుల్తాను గొప్ప పరాజయమునొందెను విజయలక్ష్మి లింగమనాయని చేపట్టెను హంవీరుడు లింగమనాయకునికి అండదండగా నిలిచి బహమనీ సర్దార్ల క్రిందనుండిన భువనగిరి రాచకొండ దుర్గములతోపాటు ఓరుగల్లుకోటనుకూడ క్రీ శ 1460 సం॥ మార్చి 2 వ తేదీన ఆక్రమించెను

దీనితరువాత ముఖ్యముగా చెప్పుకొనదగినది హంవీరుని దక్షిణదేశదండయాత్ర క్రీ శ 1464 ప్రాంతమున హంవీరుడు తండ్రిపనుపున గొప్ప సైన్యముతో దక్షిణదిశకు తరలి విజయనగరపు ఏలుబడిలోనున్న ఉదయగిరి చంద్రగిరి రాజ్యములను కైవశముచేసికొని "శత్రురక్తసిక్తమగు తనఖడ్గమును దక్షిణ సముద్రోదకముల గడిగెనని అనతవరతామ్ర శాసనమున చెప్పబడినది ఇట్టి ఘనకార్యమునకు తండ్రిచే ప్రశంసింపబడి హంవీరుడు దక్షిణదేశమునకు ప్రతినిధిఅయ్యెను

ఏ కారణముననో కపిలేశ్వరుడు తన అనంతర వారసత్వమును నిర్ణయించక ఉపేక్షించెను హంవీరుడు కొంతమంది సామంతుల కూడబెట్టుకొని తండ్రిమీద కుట్రపన్నిన కారణమున కపిలేశ్వరుడు వృద్ధుడై తన మరణానంతరము రెండవ కుమారుడైన పురుషోత్తముని రాజ్యాధిపత్యము వహించునట్లు శాసించెను తండ్రి మరణానంతరము (క్రీ శ 1468) సోదరులిరువురును ఓఢ్రసింహాసనమునకై తగవులాడిరి అప్పటి బహమనీ సుల్తానగు మూడవ మహమ్మదుషా సహాయము హంవీరుడు అభ్యర్థించెను తీరాంధ్రదేశమును ఆక్రమించుకొనుటకు మహమ్మదుషా కాంక్షించియుండుటచే ఈ సదవకాశమును ఊరక పోనీయక హంవీరునకు సహాయముచేయుటకు అతడు అంగీకరించెను మాలిక్ హస్సన్ భైరా నాయకత్వమున బహమనీ సేనలు పురుషోత్తముని ఓడించి హంవీరుని పట్టాభిషిక్తుని చేసెను ఈ సహాయమునకు కృతజ్ఞతగా తన ఏలుబడిలోని రాజమహేంద్రి కొండపల్లిదుర్గములను హంవీరుడు సుల్తానుకు బహూకరించెను ఈ దాడుల ఫలితముగా దేశము కరవు కాటకములకు గురిఅయ్యెను హంవీరుడు ప్రజాదరణము పొందలేదు ఈ పరిస్థితులలో మరల పురుషోత్తముడు సింహాసన మాక్రమించెను

క్రీ శ 1475 లో కొండవీడునందు బహమనీ సర్దారుల దుష్పరిపాలన ఫలితముగా తిరుగుబాటు జరిగెను అప్పుడొక హంవీరుడను నాయకుని ఆధ్వర్యవమున తిరుగుబాటుదారులు బహమనీ అధికారులను తుదముట్టించి బహమనీలను తీరాంధ్రమునుండి వెడలగొట్టుటకు గజపతులకు చేయూతనొసగిరని చరిత్ర చెప్పుచున్నది ఈ హంవీరుడు పురుషోత్తముని సోదరుడాలేక గజపతి వంశమునకే చెందిన వేరొక హంవీరుడా అను విషయము చర్చింపదగినది

కొ వెం

## అకాఖాను

ఈతని ప్రశంస దక్షిణహిందూ శాసనములు X నెం 772 రు శాసనములో కన్పించుచున్నది శాసనకాలము శక 1613 అనగా క్రీ శ 1696 ఈశ్వర సంవత్సర మార్గశిర శుద్ధసప్తమి శాసన సంవత్సరమును బట్టి ఔరంగజేబు ఆలంగీరుపాదుషా (1659 1707) ఢిల్లీ సింహాసనమునుండి పరిపాలించుచున్నట్లు విదితమగుచున్నది పాదుషా తరపున హజరతు అకాఖానుడు హైదరాబాదులో అధికారము చేయుచుండెను గోల్కొండరాజ్య పతనమయి అప్పటికి రమారమి పది సంవత్సరములు మాత్రమయినది దక్షిణదేశపు సుల్తానుల—బీజపూరు గోల్కొండ—మున్నగువారు అస్తమించిరి వారిరాజ్యములు మొగలు

చక్రవర్తుల ఎలుబడిలోనికి వచ్చినవి కడపటి కుతుబుషాహి సుల్తానులపై అల గీరు పాదుషాకు విశ్వాసము బొత్తిగా లేకు డెను వారు వా దూ పక్షపాతులని ఆతని నమ్మకము ముసల్మాను మతదృష్ట్యా గోల్కొ డ నవాబులు పాలి చిన ప్రా తము అపవిత్రమై మతయుద్ధమునకు ఆస్కారము కావలసిన ప్రాంతముగా ఔరంగజేబు పాదుషాచే పరిగణి ప బడెను కావుననే హైదరాబాదును సుబా దారుల్ జిహాద్ అని శాసనములో పేర్కొనిరి జిహాదు అనగా మతయుద్ధము మతయుద్ధమునకు స్థానము కావలసిన ప్రాంతమగుటచే ఇది సుబా-దారుల్-జిహాద్ అయినది

గోల్కొండ సుల్తానులను వారి ఉద్యోగులను పాదుషా విశ్వసి పక పోవుటచే ఈ ప్రా తపు పరిపాలనాధికారమును మొగలు రాజకుటు బ బ ధువులకును దూరప్రా తీయులైన ఆఫ్ఘను సరదారులు మున్నగువారికిని అప్పగి చుట జరిగినది అకాఖానుగారి వర్షి యను బిరుదావళినిబట్టి చూడగా అతడు రాజబ ధువను భావము కలిగి చు చున్నది ఈయనక్రి ద గుర్ర కొ డ ఫౌజుదారుగా ఉండిన ఇనాయతుఖాను ఘనిఅను నాతడు ఆఫ్ఘను సరదారుగా కాన్పి చు చున్నాడు ఘని అను ఉపనామము ఆఫ్ఘను జాతివారిది గుర్ర కొండ ప్రాంతమున దేశముఖుగా ను డిన హాజీఖానుకూడ ఇట్టివాడే కావచ్చును ఈ విధముగా మొగలులు ఆ ధ్రదేశమును ఆక్రమి చి స్థానికులైన మహమ్మదీయులను మ్నకి పోవుటచే ముఖ్యమైన అధికార స్థానములందు ఉత్తరదేశీయులను అన్య ప్రా తముల వారిని నిలబెట్టినట్లు ఊహి పవచ్చును

శాసనవిషయ మేమనగా గుర్రంకొ డ ఇలాకాలోని బురకాయలకోట గ్రామాధికారులైన రెడ్డి కరణాలును (మునసబు కరణాలు కావచ్చును) స్థలకరణం ర గన్న మొదలైన పెద్దవారును కలిసి తమ గ్రామపు భూములు ఎచ్చుకొలత (తక్కువకొలత) గా నిర్ణయింపబడినవని ఫౌజుదారు ఇనాయతుఖానుకు విన్నవించు కొనగా వారు చిత్తగించి ఆ భూములను తిరిగి కొలిపించి సిసలు చేయి చిరి మలికొలత (Re survey) కోసం ఫౌజుదారుగారు ఖాయంచేసిన కొలబద్ద రెండుఅడుగుల గడ అని చెప్పబడినది సదరు ఆజ్ఞలను ప్రకటించే శాసనము గుమ్మసముద్రం చెరువు పశ్చిమభాగాన ఉండే పెరుమాళ్ళబండమీద చెక్కించ బడినది తూము ముప్పది గుంటలుగా నిర్ణ యిపబడినది

శాసనమున దు పేర్కొనబడిన కొన్నిస్థలములు గుర్రంకొ డ ఒత్తూరుజిల్లా వాయలపాడు తాలూకాలో ఉన్నది 1961 స వత్సరపు పరిగణనమునుబట్టి దీనిజనాభా 35 8 బురకాయలకోట గ్రామము అదేజిల్లా మదనపల్లి తాలూకాలో ఉన్నది ఇది బురకాయలకోట ఫిర్కాకు ముఖ్య గామముగా పరిగణి పబడు చున్నది దీనిజనసంఖ్య 6391 గుమ్మసముద్రము ఇంకను కుగ్రామము ఇది మదనపల్లి తాలూకా గట్టు ఫర్కాలో చేరిఉన్నది దీని జనాభా 1905 గుమ్మసముద్రమువద్ద చెరువు ఉ డినట్లు శాసనము నుడువుచున్నది ఇప్పుడీ చెరువు ఉన్నదో లేదో తెలియదు గుర్ర కొ డ ప్రాభవము ఈనాడు తగ్గినట్లు కనబడుచున్నది ఇప్పుడిది ఫర్కాకే ద్రము కూడ కాదు ఔర గజేబు కాలములో ఇది ఫౌజుదారు కార్యస్థానమగుటచే ఎక్కువ ప్రాముఖ్యము కలిగి యు డెడిదని తోచుచున్నది

ఈ శాసనమునుబట్టి మొగలు కాలపు స్థానిక పరిపాలనాధికారులు కొ దరు తెలియవచ్చు చున్నారు సుబేదారు అనునాతడు ఒక పెద్ద ప్రా తమునకు పాలకుడు అతనిక్రింద కొందరు ఫౌజుదారులుండి యుందురు కొ దరు దేశముఖులు ఫౌజుదారునకు లోబడి యు దురు గ్రామాధికారులు రెడ్డి కరణములు రెడ్డియను నాతడు గ్రామ మునసబు కావచ్చును ఆ కాలమున రెడ్డికులమువారే విస్తారముగా ఊరిపెద్దలుగా ఉ డియు దురు తరువాత ఈ పదవి వీరిని డిలొలగి ఇతర కులముల వారికి కూడ స క్రమి చి యు డును కావున కుల వాచకముగాక అధికారవాచకమగు మునసబుగిరి దీని స్థానము నా క్రమి చినది శ్రీకృష్ణదేవరాయల కాలమున కూడ రెడ్డికులమువారు ప్రభుత్వమును అనుభవి చు చు డినట్లు తెలియుచున్నది ప్రభుత్వైకాప్త రెడ్లజడిజా అని వర్షాకాల వర్ణనలో కృష్ణదేవరాయలు పేర్కొనియున్నాడు

శాసనములు వ్రాయించుటలో ముసల్మాను అధికారులు గూడ హిందూరాజుల స ప్రదాయములను పాటించి యు డవచ్చును "మీ పుత్రపౌత్రపారంపర్యంత్యగాను ఆచ ద్రార్క స్థాయిగాను అనుభవించుకొని సుఖానవుంటిమి" సుఖానఉండేదే అనుటకు ఉ టిమి అనునది శాసనలేఖకుని పొరపాటు కావచ్చును ఇందులోకూడ ధర్మానుశాసనం చేయడం వింతకాకపోదు ఇందుకు శ్లోకము అనిచెప్పుచు పద్యము వ్రాయబడినది వర్ణక్రమవు విచిత్రములు తప్పించగా ఆ పద్య

మిట్లున్నది "కొల్చు వొరుగంటకును గోష్పాదమును తీసి॥ యెడము విడువకున్నయె (య) శముదరగు। గానకొలుచారి (దారు ?) క్రా శమిగయిటు। ధర్మమాచరించి దనరు డయ్య" కొల్చుఅనగా వ టపెరుగంటకు మొక్కలు కొ చెము ఎడముగా నాటవలయును గోష్పాదమంత స్థలము వదల వలెను అట్లుచేసి కౌలుదారు సమృద్ధిగా వ టను ధర్మమును స పాది చుకొన వలెనని ఉద్బోధ చేయుట దీనిభావముగా తోచుచున్నది వరివెన్నులు మొద లైనవి వ్రాలుటకు (వొరు గుటకు) గూడ ఎడము కావలెనయే ఉన్నది

ఖం ల రం

## అకినేపల్లి

అకినేపల్లి ఆదిలాబాదు జిల్లా అసిఫాబాదు తాలూకాకు చెందిన గ్రామము బెల్ల ల్లి అను పటణము దీనికి 5 మైళ్ళదూరములో కలదు ఈ గ్రామ వి స్తీర్ణము 90 0 ఎకరములు తూర్పున నార్వాయిపేట మెట్పల్లి పడమట కన్నాల్ పెద్దనపల్లి ఉత్తరమున గుర్జాల్ దక్షిణమున సారంగపల్లి – ఈ గ్రామము కు సరిహద్దులుగ ఉన్నవి

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఇందు స్త్రీ పురుషుల స ఖ్య 3622 ఇ దులో షెడ్యూలు జాతులవారి తరగతుల వారి స ఖ్య 1153 అకినేపల్లి యందు ఒక్కచో ఇ డ్లు గు పులుగాను ఒక్కచో విడివిడిగాను ఒక్కచో వాడ వాడలుగాను మరియొకచోట వలయాకారముగను ఉన్నవి ఇ దు పె కుటి డ్లు 200 ఈ గ్రామములో 1500 మంది వరి అన్నమును 2122 మంది జొన్న అన్నమును తి దురు

పట్టేవాగు ఊరకు ట రాయన్నకు ట ఇచటగల నీటి వనరులు వరి జొన్న పెసర నువ్వు ఉలవ క ది పండును 1966 67 స ॥ లో ఇచట 4147 ఎకరముల పోలము పంటలక్రి ద ఉపయోగ పడెను చెరువుల క్రింద 50 ఎకరములు మాత్రమే సాగాయెను ఇ దు రేగడినేల ఎర్ర్యా 4116 ఎకరములు తరినేల ఎర్ర్యా 31 ఎకరములు ఇచట అడవి వి స్తీర్ణము 2022 ఎకరములు అటవీశాఖ దీనిని పాలి చుచున్నది ఇందు మద్ది తునికి మున్నగు జాతుల చెట్లు ఉన్నవి కట్టెయు పండ్లును లభించును ఇవి మ చిరియాలకు రవాణా చేయ్యబడును పంట దినుసులు లారీలపై బ డ్లపై మంచిరియాలకు బెల్లంపల్లి కి ఎగుమతి అగును ఆవులు ఎద్దులు గేదెలు మేకలు మున్నగు పశువులు కలవు వీటి సంఖ్య 612

ఈ గ్రామస్థుల ముఖ్య వృత్తి వ్యవసాయము దు కాణములు కలవు కంసాలులు వడ్ర గులు కమ్మరులు కుమ్మరులు తెలికలవారు మంగలివార చేపలు పట్టి జీవించువారు కలరు సేద్యము చేయు వారికి కూలీలు దొరుకుదురు ది ము నకు పురుష కు కూలి రు 1 50లు స్త్రీ కూలి ఒక రూపాయి జనులు బావినీటిని త్రాగుదురు వేసవిలో నీటి ఎద్దడి కలదు

ఈ గ్రామమునకు 3 మైళ్ళదూరమున బెల్ల ల్లి రైల్వే స్టేషను కలదు రె డెడ్లబ డ్లు ఉన్నవి ఇతర గ్రామములకు దీనికి మధ్య మట్టిరోడ్డు ఉన్నది బ్రా చి పోస్టాఫీసు ఎలిమె టరీ స్కూలు ఇ దున్నవి హైస్కూలు కళాశాల చదువులకు విద్యార్థులు 1౹ మైళ్ళలో గల మ చిరియాలకు పోవుదురు సినిమాలకు బెల్ల ల్లి పోవుదురు

ఈ గ్రామము ప చాయతీ పరిపాలన యందు కలదు బెల్ల పల్లిలోని పోలీసు స్టేషనుకును మంచిరియాల య దలి పోలీసు స్టేషనుకను 0 మైళ్ళలోనున్న అసిఫాబాదు నందలి కోర్టుకు తాలూకా కచేరికి బ్లాకు అభివృద్ధి కే ద్రమునకు జనులు పోవుదురు ఆయుర్వేద వైద్యులు ఇద్దరు కలరు జనరల్ ఆస్పత్రి మ చిరియాలలోను పశువుల ఆస్పత్రి కన్నాల్ లోను కలవు ఇచట సంతలు లేవు 5 మైళ్ళలో ఉన్న బెల్లంపల్లి నుండి అన్ని సరకులను తెచ్చుకొందురు

గ ల కాం

## అక్కచూడామణి

చూ చిట్టయమంత్రి

## అక్కన - బయ్యనలు

అక్కన బయ్యనల వృత్తాంతమును తెల్పు గ్రంథములు ఆంధ్ర వాఙ్మయమున మూడు కలవు

1 సోమదేవరాజీయము ఇది కూచిమంచి జగ్గకవి ప్రణీతము దీని కాలము 18వ శతాబ్ది పూర్వార్ధము ఇది కాకతీయుల వంశ క్రమమును వర్ణించు మూడాశ్వాసముల చంపూకావ్యము

2 సిద్ధేశ్వర చరిత్రము ఇది కాసె సర్వప్ప ప్రణీతము దీని కాలము క్రీ శ 1600 ఇది ద్విపద ఇది మూడాశ్వాస ముల పరిమితి కలది అసమగ్రము

3 ప్రతాపరుద్ర చరిత్రము ఇది ఏకామ్రనాథ ప్రణీతము ఇది క్రీ శ 1500 ప్రాంతమునకు చెందినది

ఈ గ్రంథములకు కాకతీయుల చరిత్రయే కథావస్తువు మనకు సమీప కాలమున వెలసిన సోమదేవ రాజీయమున దు అక్కన బయ్యనలను గూర్చి ఇట్లు కలదు

కాకతి గణపతిని దర్శించుటకు నెల్లూరి నుండి తిక్కన సోమయాజి ఏకశిలానగరమునకు వచ్చెను వచ్చిన సోమయాజులకు గణపతి అతిథి పూజ లొనర్చి ఆతని వలన భారతార్థము ద్వైతాద్వైత తత్త్వములు చిదచిద్వివేక లక్షణములు ధర్మాధర్మ పద్ధతులు భారత వీరుల మహిమ రాజనీతి వినెను అనుమకొండ నివాసులైన బౌద్ధ పండితులను రావించి తిక్కన సోమయాజులతో వాదిపజేసెను తిక్కన వారిని అనాయాసముగా ఓడించెను గణపతి తిక్కన వాద ప్రావీణ్యమునకు మెచ్చి ఎనిమిది గ్రామములనొసగి తావచ్చిన కార్యమేమని యడిగెను అంత తిక్కన ఇట్లు జవాబు చెప్పెను సూర్యవంశోద్భవుడైన నెల్లూరి మనుమసిద్ధిని అతని దాయాదులు పదభ్రష్టుని గావించి బందీకృతుని చేసి రాజ్యమును తామే యేలుచున్నవారు కావున మీరు వేవేగ తరలి వచ్చి ఆమనుమరాజును పునరభిషిక్తుని గావింపవలయు" తిక్కన చెప్పినట్లు గణపతి దేవుడు అంగీకరించి నవలక్షధనమును యజ్ఞకుండలములను ఇచ్చి తిక్కనను సాగనంపెను తరువాత రాజగురువు శివదేవయ్య యనుమతమున గణపతి దేవుడు ప్రయాణభేరి వేయించి ముందుగా వెలనాటి ధరణి పతుల గెలిచి వారిని తన వశము చేసికొని నెల్లూరునకేగి అక్కన బయ్యనలను తరిమి మనుమసిద్ధి రాజును తానిచ్చిన మాట ప్రకారము నెల్లూరున పునరభిషిక్తుని కావించెను గణపతి దేవుడు మనుమసిద్ధికి రెండు వేల ఐదునూర్ల గ్రామములు మనోవర్తి కిచ్చి కడమవి తానుంచుకొనెను మరియు అచ్చట గొప్పతటాకమును త్రవ్వించి గంగాపురమునకు మరలి వచ్చెను (సోమదేవ రాజీయము పుటలు 78 8 )

ఈ కథనమే సిద్ధేశ్వర చరిత్రయందును ప్రతాపరుద్ర చరిత్రమునందును కొలది మార్పులతో కనిపించును

గణపతి దేవుడు అక్కన బయ్యనలను సంహరించి వారి బిరుదులు తనకు తగవని భావించి తేరాల రుద్రదేవునకు ఇచ్చినట్లును మనుమసిద్ధికి 63 పట్టణములు మాత్రమిచ్చినట్లును సిద్ధేశ్వర చరిత్ర చెప్పుచున్నది

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో (సం 7 సంచిక 2) ఈయబడిన వృత్తాంతమున మరొక అంశము కనబడు చున్నది మనుమ సిద్ధిరాజును ఆతని దాయాదులు అక్కన భీమనలు బంధించి రాజ్యమును తామే యేలుచుండిరి

పై మూడు గ్రంథములు సమకాలికములు కాకపోయినను ఒకదాని నొకటి చూచి వ్రాయబడియుండుటచే ఈ మూడింటియందును మనుమసిద్ధిని అక్కన బయ్యనలనువారు పదభ్రష్టునొనర్చిరనియు వారు మనుమసిద్ధికి దాయాదులనియు కలదు నిర్వచనోత్తర రామాయణమునందుగాని దశకుమార చరిత్రయందుగాని తిక్కన గణపతి దేవుని సందర్శించిన వృత్తాంతము లేదు

సమకాలిక గ్రంథములిట్లు మౌనము వహించియుండగా తిక్కన కేతనల కెన్నియో యేండ్ల తరువాత వెలసిన గ్రంథములందు అక్కన బయ్యనల వృత్తాంత మున్నంత మాత్రమున అది విశ్వసనీయమని నమ్ముటెట్లు ? చరిత్రకారులకు శాసనములు ప్రథమాధారములు ఎమ్మటివి సమకాలిక గ్రంథములు కనుక అక్కన్న బయ్యనలనువారు ఉన్నట్లును గణపతి దేవుడు వారిని పారద్రోలినట్లును తెలుపగల శాసన సాక్ష్యము లభించవలసి యున్నది అట్టి శాసన మొకటి లభ్యమైనది దీనిని నాయనపల్లి శాసన మనుచున్నారు దీనిని తొలుత గుర్తించిన వారు ప్రఖ్యాతాంధ్ర చారిత్రక పరిశోధకులు డాక్టరు మారేమండ రామారావుగారు (ఆంధ్ర హిస్టరీ అండ్ కల్చరు సంపుటి 1 సంచిక 1)

రామారావుగారిచే ప్రకటితమైన శాసనమును డా నేలటూరి వేంకట రమణయ్యగారు తిరిగి పరిష్కరించి భారతి 1945 ఫిబ్రవరి జూన్ జూలై సంచికలలో కాకతి గణపతి దేవుడు కులోత్తుంగ రాజేంద్ర చోళుడు అను శీర్షికతో ప్రకటించిరి ఈ శాసనమునే వి వేంకట సుబ్బయ్యగారు,ఎపిగ్రాఫియా ఇండికా 27 వ వాల్యూములో (పుటలు 196 7) మరల పరిష్కరించి ప్రచురించిరి ఈ మువ్వురి పాఠములలో వేంకటసుబ్బయ్య గారి పాఠము దొరకిన తమట్టుకు పూర్తిగా ఉన్నది అది ఇది దీని కాలము తెలియదు చేరి వ్యర్తులు శాసన కాలమును క్రీ శ 1249 అని నిర్ణయించిరి

### నాయనపల్లి శాసనము

ఇది గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని నాయనపల్లి గ్రామమున గల చెన్నకేశ్వర దేవాలయపు వెనుక ప్రక్కనున్న గోడపై చెక్కబడిన శాసనము నాయనపల్లి చారిత్రక ప్రసిద్ధిగల మోటుపల్లికి మూడు మైళ్ల దూరమున కలదు.

1
2 శ [స్తి] న [హిత]
3 హా మండలేశ్వర కాకతి
4 పతిదేవ మహారాజు [లు]
5 గ్విజయము సేస పర
6 మ [డ]లములు సాధి
7 చ్చి దక్షిణ దిగు - భాగము
8 న నెల్లూరు గాల్పి [న] త [ద్వి]రోధు
9 లైన పతిహారి బయ్యన తిక్క
10 నల వెరసిన శాత్రవ శిరం
11 బులం - గం[దుక] క్రీడావినో
12 దము సలిపి [ద్రా] విళ మం
1 డలమున గుళో[త్తు ]ంగరాజే
14 ంద్ర - చోడని [వహి ]చ్చి కొని నెల్లూ
15 రి రాజు చేత [యేను]ంగుల గాన్కి
16 గొని వచ్చి గు[ ] [తి] సిశ్రీప
17 వతాతమున [ప్ర ద్ధులకు మల్లి]
18 నాథదేవర సంతానము భృ గి మరముక
19 ట్టి చ్చి చైత్ర [వు]ర్మైన మోటుపల్లింం - ద
20 న పేర గుమారగణపేశ్వర - శ్రీ మహా [దే]వర
21 ప్రతిష్ఠ సేయుము దాన్కి ముఖ్య
22 ద[యని]

(ఎపి ఇం XXVII పుటలు 196 7)

పై శాసన విషయములను తెలుగు గ్రంథములలోని అంశములను పోల్చి చూచిన మీదట ఈక్రింది సారాంశమును గ్రహి ఎవచ్చును

1 కాకతి గణపతిదేవుడు నెల్లూరిపై దండెత్తి నెల్లూరు రాజు విరోధులైన బయ్యన తిక్కనలను వారితో చేరిన శాత్రవ శిరంబులను క దుక క్రీడా వినోద బు సేయుట - అనగా నెల్లూరి రాజునకు విరోధులైన వారిని సంహరి చుట యను నంశమును తెలుగు గ్ర థములు చెప్పినవి కాని

2 గ్ర థములలోని అక్కన బయ్యనలు శాసనములో బయ్యన తిక్కనలుగా మారిరి

3 శాసనములో నెల్లూరి రాజు పేరు లేదు నెల్లూరి రాజు అని మాత్రమే కలదు గ్రంథములు నెల్లూరి రాజు మనుమసిద్ధి యని స్పష్టముగా చెప్పు చు న్నవి

4 బయ్యన తిక్కనలే అక్కన బయ్యనలని అ గీక రించినచో వారు గ్రంథములలో దాయాదులు శాసనములో పడిహారులు

5 కవి తిక్కన గణపతిదేవుని దర్శి చినట్లు మనుమసిద్ధి అక్కన బయ్యనలచే పదచ్యుతుడైనట్లు శత్రువులను పార ద్రోలి మనుమసిద్ధిరాజ్యమును మనుమ ద్ధి కొప్పించుమని కోరినట్లు గ్రంథములు చెప్పుచున్నవి శాసనమున ఈ విషయములేదు అయినను గణపతిదేవుడు నెల్లూరి వచ్చుట కవితిక్కన అభ్యర్థన మైన అని చరిత్రవల్ల మనమూహా ప వచ్చును

6 కుళోత్తుంగ రాజేంద్ర చోడని ప్రస్తావన శాస నమున కలదు గ్ర థములందు లేదు

ఈ విధముగా శాసనము గ్రంథములు భేది చు చున్నను మొత్తము మీద అక్కన బయ్యనలు అనువారు కల్పిత పురుషులు కారనియు వారు 13వ శతాబ్దమున నెల్లూరి వ్యవహారము లందు ఐక్యము కలిగి యుకున్న పురుషు లనియు స్పష్టము

నాయనపల్లి శాసనమున ప్రస్తుతుడైన కుళోత్తుంగ రాజేంద్ర చోడుడు చోళ దేశాధిపతియైన మూడవ రాజేంద్ర చోళుడని అతని పరిపాలనా కాలము క్రీ శ 1244 - 68 అని చారిత్రక పరిశోధకులు నిర్ణయించిరి కాకతి గణపతి దేవుని దక్షిణ ద డయాత్ర క్రీ శ 1249 లో జరిగియుండు ని చెప్పు కు కాంచీపురము న దలి సామ త భోజుని శాస నము సాక్ష్య మిచు చున్నది ఈ సామంత భోజుడు గణపతి దేవుని మ తి సేనాని ఇ ని శాసనము కాళహ ి యి దు కూడకలదు

మనుమ ద్ధి ంద్రియైన చోడతి క్కరాజు వేయించిన శాసనములు క్రీ శ 1247-8 తరువాత గాంరావు తిక్కరాజు మ ణాన తరము మనుమసద్ధి రాజ్యమునకు ర వలసియుండెను కాని దాయాదులు దీనికి అవరోధములు కల్పించరి క్రీ శ 124 లో తిక్కరాజు అస్వస్థతో నున్నట్లు మనుమసిద్ధి శాసనము చెప్పుచున్నది ఆ కాలమున మనుమ ద్ధి కడప మండలము- నందు సంచరించు చున్నట్లు ఈ ప్రాంతమున నున్న శాస నముల వలన స్పష్టమగు చున్నది నెల్లూరి యందాతనికి స్థానము లేకపోయి యుండును ఈ న ఘటన 248 ప్రాంత మున జరిగెను ఈ మయమున గణపతిదేవుడు నెల్లూరిపై ఎత్తివచ్చి తిక్కన బయ్యనలను సంహరించి మనుమసిద్ధిని రాజ్య

మందు నిలిపెను. ఈ యంశమే నాయనిపల్లి శాసనమునందు కలదు. కావున క్రీ. శ. 1249 లో నాయనపల్లి శాసనము అవతరించియుండును.

పై అంశము లింవరకు చరిత్రకారులు తడవినవే. ఇక అక్కన బయ్యన లెవరు?

ఆంధ్ర గ్రంథములు దాయాదులని చెప్పుచుండగా నాయనపల్లి శాసనము పడిహారు లని శిలాక్షరము చేసినది. సమకాలిక వాఙ్మయాధారము లేనప్పుడు శిలాశాసనము చెప్పినది ఒప్పుకొనక తప్పదు. వారు పడిహారులు లేక పడవాళ్ళు అనియే నిరాఘాటముగా అంగీకరింపవలెను. అయి చో అటిపేరుగల వారెవ్వరైన నెల్లూరి మండలమున తెలుగు చోడవంశ పరిపాలనా సందర్భమున తటస్థించిరా? వారు పడిహారులై యుండిరా? అన్న ప్రశ్నలకు సమాధానము చెప్పవలసి వచ్చును.

క్రీ. శ. 1214 లో నెల్లూరు జిల్లా రావూరు తాల్లూకా ఎఱ్రగుంటపాలెము నవారు చికవోలు గ్రామమునగల కేశవ పెరుమాళ్ల దేవాలయమునకు తక్కుల అను గ్రామమును తుక్కి (తిక్క) నాయకుడు సర్వకర పరిహారముగా దానము చేసి శాసనము వ్రాయించెను. త్రిభువన చక్రవర్తి కులోత్తుంగ చోడదేవుని 36 వ రాజ్యవర్ష కాలమది. ఇతడు మూడవ కులోత్తుంగ చోడుడు. ఈతని రాజ్యారంభకాలము క్రీ. శ. 1178 అని నిశ్చయమైనది. కావున శాసనకాలము క్రీ. శ. 1214 అగుచున్నది. మూడవ కులోత్తుంగుడు క్రీ. శ. 1218 వరకు చక్రవర్తిగా నుండెను. తుక్కి నాయకుడు లేక తిక్క నాయకుడు, భైరవనాయకుడు, కోసనినాయకుడు — ఈ మువ్వురు అన్నదమ్ములు. ఇందులో తిక్కనాయకుడు తిరుక్కాళత్తి పడిహారియని చెప్పుకొన్నాడు.

ఇది (నె. శా. రావూరు 8) తమిళశాసనము. దీనిని బట్టి ఈ పడిహారుల వంశవృక్ష మిట్లున్నది.




కోసనినాయకుడు భైరవనాయకుడు తిక్కనాయకుడు

వీరు మువ్వురు ఎఱ్రసిద్ధిరాజు పడిహారులని రావూరుతాలూకా లింగసపాలెం శాసనము (నె. శా. రావూరు 38) చెప్పుచున్నది.

విషయము స్పష్టమగుటకై ఇచ్చట ప్రసక్తమగునంతవరకును నెల్లూరు చోడుల వంశావళి ఈయనగుచున్నది.



క్రీ శ 1217 లో రాపూరు తాలూకా కొరిపీడు గ్రామమున ఇష్ట కామేశ్వరిని ప్రతిష్ఠించుచు శ్రీ మన్మహా మండలేశ్వర భుజబల వీర నల్లసిద్ధన దేవచోడ మహారాజులకు ప్రీతిహార (పడిహార) సామంత పదాత్తంబు ఏడసిన భైరవ నాయకుని బావ కోనంగి సిద్ధప్పనాయకు డిచ్చిన శాసనము ఇది శక వర్షంబులు 1139 పౌష్య శుక్ల పంచమియు సోమవారము నాటిది (నె శా రాపూరు 36)

క్రీ శ 1224 లో రాపూరు తాలూకా లింగనపాలె లో మధురాంతక పొత్తపి చోళ ఎఱసిద్ధిరాజు పడిహారులైన భైరప్ప నాయకుడు తిక్కనాయకుడు కోసని నాయకుడు కలిసి వేయించిన శాసన మొకటి తమిళ భాషలో కలదు (నె శా రాపూరు 38)

ఈ మూడు శాసనములందును పడిహారులైన భైరవ తిక్కనాయకులు కన్పించుచున్నారు వీరే బయ్యన తిక్కనలు నాయనపల్లి శాసనమున చెప్పబడిన బయ్యనతిక్కనలు వీరే ఎల కాకూడదు? ఈ పేరులు కలవారు పడిహార పదవియందున్నవారు నెల్లూరి చోడరాజుల కాలమువారు ముఖ్యముగా మనుమసిద్ధి కుమారులైన తిరుకాళత్తికి పడిహారులుగా నున్నవారు వీరుకాక వేరుగా బయ్యన తిక్కన లుండుటకు వీలు కనిపించుటలేదు ఇక్కడ మనుమసిద్ధియనగా నిర్వచనోత్తర రామాయణ కృతిపతియైన మనుమసిద్ధికాడు ఆతని తాతయు ఆ చోడ తిక్కరాజు తండ్రియు అయిన మొదటి మనుమసిద్ధి నిర్వచనోత్తర రామాయణ కృతిపతి రెండవ మనుమసిద్ధి ఇతని తండ్రి మొదటి తిక్కరాజు ఇతని కుమారుడు తిరిగి తిక్కరాజు ఇతనిని రెండవ తిక్కరాజు అందురు

ఈ సోదరుల చివరి శాసనమున క్రీ శ 1224 కాకతి గణపతిదేవుడు నాయనపల్లి శాసనమున "పడిహారి బయ్యన తిక్కనల వెరసన క్షాత్రవశిరంబుల గందుకక్రీడావినోదంబు సలిపె" నని చెప్పబడినది గదా! ఆ బయ్యన తిక్కనలతోపాటు చోడ తిక్కరాజు దాయాదులైన నల్లసిద్ధిరాజును ఎఱసిద్ధి రాజును గణపతిదేవుడు సంహరించి చోడతిక్కరాజునే నెల్లూరి సింహాసనస్థితుని గావించి యుండును చోడ తిక్కరాజు శాసనములు క్రీ శ 1216-1228 నడుమ కనిపించుటలేదని డా నేలటూరి వేంకటరమణయ్యగారు వ్రాయుచున్నారు (ద హిం II-60) గణపతిదేవుడు క్రీ శ 1228 లో వేయించిన మట్టెవాడ (తెలంగాణము) శాసనమునందు తాను చోళరాజధానిని కొల్లగొట్టినట్లు చెప్పుకొని యున్నాడు క్రీ శ 1231 లో జాయప వేయించిన గణపేశ్వర శాసనమునందు చోళరాజును అనాయాసముగా జయించినట్లున్నది ఈ చోళరాజు ద్రవిడ దేశమును క్రీ శ 1216 60 నడుమ పరిపాలించిన మూడవ రాజరాజు ఇతడు కడు దుర్బలుడు మూడవ కుళోత్తుంగ చక్రవర్తి (క్రీ శ 1178-218) తరువాత రాజ్యమునకు వచ్చినవాడు కుళోత్తుంగ చక్రవర్తి కాలమున చోళరాజ్యము తన పూర్వపు ఔన్నత్యమును నిల్పుకొనుటకు తీవ్ర కృషిచేసెను కాని మూడవరాజరాజు కాలమున అది పతనమును తప్పించుకొనలేకపోయెను నాయనపల్లి శాసనమునగల నెల్లూరిరాజు చోడతిక్కరాజే అయి ఉండును తిక్కరాజు కుమారుడైన మనుమసిద్ధి క్రీ శ 1248 తరువాతగాని రాజ్యమునకు వచ్చినట్లు కానరాదు

తెలుగు గ్రంథములందు మనుమసిద్ధిని గణపతిదేవుడు నెల్లూరి రాజ్యమునకు పునఃప్రతిష్ఠితుని గావించి టులున్నదిగదా! అన్నచో నెల్లూరి చోడరాజులు తమ సింహాసనమును కట్టుదిట్టముగా నుంచుకొన్న వారుకారు మూడవ కుళోత్తుంగ చోడచక్రవర్తి కాలమున సుమారు క్రీ శ 1180 లో చోడ తిక్కరాజు తండ్రి ప్రథమ మనుమసిద్ధి రాజ్యమును పోగొట్టుకొనెను (ద వృ II 604) ఆ తరువాత తిక్కరాజు తిక్కరాజు కుమారుడైన రెండవ మనుమసిద్ధి క్రీ శ 1257 లో గణపతిదేవుని సాయమును కడపనుండి వేడుకొనెను బహుశః తన నెల్లూరి రాజ్యమును తనకిప్పించుమని కాబోలు కాని ఆ కాలమున అక్కన బయ్యనలులేరు వారు క్రీ శ 1224 తరువాత శాసనములలో కానరారు

కావున అక్కనబయ్యనలు నాయనపల్లి శాసనమునందుగల బయ్యన తిక్కనలేయనియు వారు పడిహారులుకాని దాయాదులు కారనియు తొలుత తిరుకాళత్తివద్ద పడిహారులై యుండి సనసన్నగా వాని దాయాదులైన నల్లసిద్ధి ఎఱసిద్ధిరాజుల యొద్ద చేరి వారిచే ప్రేరితులై చోడ తిక్కరాజును సింహాసనము నెక్కకుండ చేసిరనియు వీరితోపాటు నల్లసిద్ధి ఎఱసిద్ధిరాజులను గణపతిదేవుడు సంహరించెననియు ఆ కాలము క్రీ శ 1225 1231 మధ్యప్రాంతము అనియు విశ్వసించుటకు అవకాశమున్నది చోడ తిక్కరాజు "దర్పదుర్జయులగు దాయాద నృపతుల ననిలోన బఱపదే యాగ్రహమున" (నిరా 1-38) అని తిక్కన చెప్పిన దాయాద నృప

తులు నల్లసిద్ధి ఎఱ్ఱసిద్ధి రాజులేయని వ్యాఖ్యానించుటకు కూడ అవకాశమున్నది అక్కనబయ్యనలు లేక తిక్కన బయ్యనలు అనువారు అల్లు తిరుక్కాళత్తిరాజు అతని సోదరుడు విజయాదిత్యరాజు అను వాదమొకటి ఇటీవల చేయబడినది (భారతి) తిక్కన అల్లుంతిరుక్కాళత్తి నామసాదృశ్యము బట్టి కావచ్చును విజయాదిత్యుడు బిజయ బెజ్జ కావలెను కాని బయ్యన కానేరదుకదా ! శాసనముల దు పణిహారులైన భైరవ (బయ్యన) తిక్కనాయకులుండగా నామసాదృశ్యముగూడ చక్కగా కుదరని అల్లు తిరుక్కాళత్తి విజయాదిత్య రాజులను అక్కన బయ్యనలుగా గుర్తించుట కష్టము

ని శ నుం

సంపాదకుని సమన్వయము

పైన పేర్కొనబడిన నెల్లూరుజిల్లా రాపూరు తాలూకా య దలి శాసనములను బట్టి తిక్కన బయ్యనలు అనువారు నెల్లూరు రాజులవద్ద పణిహారులుగా ఉ డినట్లు తెలియవచ్చుట విశేషము వీరి శాసనములు క్రీ శ 1224 వరకు మాత్రమే కన్పి చినవి వీరు సంహరింపబడిన వృత్తా తము క్రీ శ 1248 49 నాటి నాయనిపల్లి శాసనములో కాన్పి చుచున్నది వీరు నిజముగా 1224 ప్రా తముననే అస్తమించినచో వీరి వధ వృత్తా తము ఇరువదియైదు సంవత్సరములు తరువాత వెలసిన నాయనిపల్లి శాసనములో చెప్పబడుట వింతగా ఉ డును వీరేమ త ఘనులుకారు కాగా వీరు నాయనపల్లి శాసన సమీపకాలమందే జయి పబడిరనుట యుక్తి యుక్తముగా ను డును తిక్కన (అక్కన) బయ్యనల వృత్తాంతమును తెలుగు గ్రంథములు మనుమసిద్ధితో కలిపి చెప్పుచున్నవి అతని తండ్రి చోడతిక్కరాజుతో కలిపి చెప్పబడలేదు చారిత్రకులందరును అక్కన బయ్యనల కథనమును మనుమసిద్ధి చరిత్రతోనే అన్వయించుచున్నారు దీనిని మనము త్రోసిపుచ్చనక్కరలేదు

దీనిని సమర్థించుటకు నాయనిపల్లి శాసనమునందే ఒక ఆధారము కలదు దీనిలో కులోత్తుంగ రాజేంద్రచోడుని గణపతిదేవుడు పట్టుకొనుటయో ఓడి చుటయో చేసినట్లున్నది రెండవదియే వాస్తవము కావచ్చును ఇచ్చట ప్రసక్తుడైన రాజేంద్రచోడుడు మూడవ రాజేంద్రచోడుడని చరిత్రకు పరిచితుడైన వ్యక్తిగా గ్రహింపవలెను ఇతడు చోళ చక్రవర్తులలో కడపటివాడు క్రీ శ 1246 78 వరకు చోళ సామ్రాజ్యమును పా చెను మూడవ రాజరాజును ఇతడును కలిసి కొ తకాలము చోళ రాజ్యమును ఏలిరి తిక్కన బయ్యనలు రాజే ద్రచోడునితో కలిపి నాయనపల్లి శా మున దు చెప్పబడుటచే వీరి పరాజయ వృత్తాంతము 1244 తరువాత నే కడసారి జరిగెనని మనము అన్వయింపవలెను కావున ఈ సన్నివేశము చోడ తిక్కరాజు రాజ్యారంభ కాలమున కాక మనుమసిద్ధి రాజ్యారంభ కాలముననే జరిగినదిగా భాసించుచున్నది వీటి నన్నిటిని సమన్వయము చేసి అక్కన (తిక్కన) బయ్యనల వృత్తా తము నిట్లు చెప్పవచ్చును వీరు క్రీ శ 1214 ప్రా తమును డి తెలియవచ్చుచున్నారు వీరి అగ్రజుడైన కోసిని నాయకుడు మొదటి మనుమసిద్ధి కుమారుడైన చోడ తిక్కరాజు పణిహారుడుగా ను డెను తిక్కరాజు సవతి సోదరులైన నల్లసిద్ధి తమ్ముసిద్ధి అనువారు అతనిని త డ్రి రాజ్యమును పొందకు డ నిరోధి చిరి నల్లసిద్ధి కుమారుడు ఎఱ్ఱసిద్ధికూడ తిక్కరాజును ఎతృరాజ్యమునకు రాకుండ జేసెను అయినను మహాశూరుడైన చోడ తిక్కరాజు తన భుజబలముతోను కాకతి గణపతిదేవుని సహాయముతోను దాయాదులను నిర్జి చి నెల్లూరి సింహాసనమును ఆక్రమి చుకొనెను అతడు దాయాదులతో పోరాడుచున్న కాలమున పణిహారులైన సోదరత్రయము (కోసిని భైరవ లేక బయ్యన తుక్క లేక తిక్కన నాయకులు) చోడ తిక్కరాజు ప్రత్యర్థులను చేరిరి చివరకు ఆతడు శత్రువులను జయి చి దుర్నిరీక్ష్యుడుగా ఉన్నకాలమున ఈ పణిహారులు పదవిని పోగొట్టుకొనిరో లేక అతని శరణువేడి తలలు కాచుకొనిరో తెలియదు కోసిని నాయకుని పేరు తరువాత వినరాకుండుటచే ఆతడు ఈ కల్లోల కాలమున మరణి చియుండును

చోడ తిక్కరాజు వృద్ధుడయి రాజ్యావసాన సమయము సమీపించుచు డగా అతని కుమారుడు మనుమసిద్ధికి రాజ్యము దక్కకు డ చేయుటకై మరియొక కుట్ర ప్రారంభమైనట్లు కాన్పి చును దీనికి నాయకుడు చోడ తిక్కని అల్లుడు మరియొక తిక్కరాజు వీనిని అల్లుం తిక్కయనిరి ఇతని తమ్ముడు విజయగండ గోపాలుడను వాడు ఈ యన్నదమ్ములను క్రొత్తగా (క్రీ శ 1244 ప్రాంతమున) చోళ సామ్రాజ్యమునకు భవిష్యత్ చక్రవర్తిగా నియుక్తుడైన మూడవ రాజేంద్ర చోడుడును మనుమసిద్ధి వారసత్వమును అపహరిం

చుటకు కృతనిశ్చయులైరి వీరికి స్వామిద్రోహులగు బయ్యన తిక్కనలు తోడము వైచిరి చోడ తిక్కరాజు అవసాన కాలమున వ్యాధిగ్రస్తుడై యుండుట వీరికి ఉపయోగించెను మనుమసిద్ధి ముఖ్యపట్టణమునకు దూరుడై కడప మండలమున ఉండిపోయెను

నెల్లూరులో జరుగుచున్న ఈ యక్రమమైన కుట్రను భేదించి మనుమసిద్ధి రాజ్యమాతని ఇప్పించుటకే గణపతిదేవుని సేనాపతి సామంతభోజుడు మహా సైన్యముతో వచ్చెను దుష్టులగు బయ్యన తిక్కనలు ప్రాణముల కోల్పోయిరి అల్లు తిక్కరాజుకూడ యుద్ధాగ్నులయందు హోమించియుండును విజయగండ గోపాలుడు మాత్రము బ్రతికి బయటపడి కాంచీపురమున చాలాకాలము పరిపాలన చేసెను ఈ గొప్ప ఎన్నికవేళము ఎప్పుడిం కాలమునందు జరిగిన దగుటచేతనే నాయనపల్లి శాసనమునందు కర్తింపబడెను

ఖం ల రం

## అక్కన్న - మాదన్న

అక్కన్న మాదన్నలు ప్రపంచఖ్యాతి గడించిన మహామంత్రుల పట్టికలో చేర్పదగినవారు తెలుగు సంస్కృతము ఫారసీ హిందీ మున్నగు భాషల నెరిగినట్టివారు వీరు రాజనీతియందు అర్థశాస్త్రమునందు దిట్టలు శత్రుభయంకరులు ప్రభుభక్తిపరాయణులు యవనులకడ మంత్రిత్వమును నెరపినను సనాతన బ్రాహ్మణధర్మమును శ్రద్ధతో ఆచరించినట్టివారు మాదన్న బుద్ధిలో బృహస్పతివంటివాడు ఈయన మహామంత్రిత్వము అక్కన సైన్యాధిపతిత్వము గోలుకొండ రాజ్యసంరక్షణమునకు శ్రీరామరక్ష అయినవి గోలుకొండ రాజ్యమును పాలించిన ఎడుగురు సుల్తానులలో ఆరవవాడగు అబ్దుల్లాహుసేన్ కుతుబ్షా (క్రీ శ 1626 72) యొక్క మూడవ కుమార్తె భర్తయే అబ్దుల్‌హసన్ కుతుబ్షా క్రీ శ 1673 వ సంవత్సరమున అబ్దుల్లాహుసేన్ కుతుబ్షా మరణానంతరము మంత్రుల తంత్రముచే అబుల్‌హసన్ కుతుబ్షా రాజై క్రీ శ 1687 వరకు గోలుకొండరాజ్యమును సుభిక్షముగా పరిపాలించెను ఈతడే సుల్తానులలో కడపటివాడు ఈయనకే తానాషా అను బిరుదము కలదు తానాషా అనగా మంచిరాజని అర్థము ఇతడు మహమ్మదీయులలో ఎయా శాఖకు చెందినవాడు భోగలాలసుడైనను ఇతడు హిందూ మహమ్మదీయులను సమాన ప్రతిపత్తితో చూచెను ఈ ప్రభువు చేతనే మాదన్న సూర్యప్రకాశరావు అను బిరుదముతో ప్రధానమంత్రిగను (మీరుమ్లా) అక్కన్న అమీర్ బహాదర్ అను బిరుదుతో అక్కన్న సేనానిగను చేసిరి ఈ సోదరద్వయము అండ ఉన్నంతవరకును గోలుకొండ రాజ్యము ఢిల్లీ పాదుషా అగు ఔరంగజేబునకు గూడ అజేయమై అస్వాధీనమైనది

ఇట్టి అదృష్టవంతులయిన సోదరులను కనిన ఖానుజయ్య తల్లి భాగ్యమ్మ వీరి యింటిపేరు ఎగశివారు వీరిది భారద్వాజగోత్రము వీరు నియోగి బ్రాహ్మణులు వీరిది ఋగ్వేదము భాను య్య హనుమకొండనివాస సుంకములు వసూలు చేయు అధికారి ఆయనకు భాగ్యమ్మవలన అక్కన్నమాదన్నలే కాక విస్సన్న (విశ్వనాథుడు) మల్లన్న (మృత్యుంజయుడు) అను కుమాళ్ళును మువ్వురు కుమార్తెలును జన్మించిరి వీరిలో అక్కన్నకు మల్లు అను కుమారుడును ఒక కుమార్తెయును మాదన్నకు మల్లన్న అను పుత్రుడును ఒక కూతురును ఉండిరి భానుజయ్య మువ్వురు కుమార్తెలకును వరుసగా ఒక్కొక్కరికి కంచర్లగోపన్న (రామదాసు) పొదిలిలింగన్న పులిపలి వెంకన్న అను తనయులుండినట్లు తెలియుచున్నది

అక్కన్న మాదన్నల వంశవిషయమున కొన్ని అభిప్రాయభేదములు కనవచ్చుచున్నవి కొందరు ఈ వంశమువారు సేడ గ్రామవాసులును కులకర్ణ వంశమునకు చెందిన కన్నడ బ్రాహ్మణులనియు మరికొందరు మహారాష్ట్ర పాలకుడగు శివాజీయొక్క మంత్రియగు మోరోపంతు పింగళే అనువానికి వీరు దాయాదులనియు తలచుచున్నారు చారిత్రకాధారముల ననుసరించియు వీరి యుద్యోగధర్మమును నివాసమును బట్టియు వీరు తెలుగువారనియే తెల్లమగుచున్నది వీరి వంశీయులు నేటికిని గోలుకొండవ్యాపారులను పేరుతో ఓరుగంటిలో నున్నారు

అక్కన్న మాదన్నల సోదరత్వవిషయమున గూడ అభిప్రాయభేదము లగుపడుచున్నవి వీరు సహోదరులుకారు అని నిరూపించు చిన్ని కథనుకూడ కొందరు ఇట్లు చెప్పుచున్నారు మాదన్న గోల్కొండలో మంత్రిగనున్నపుడు అక్కన్న మాదన్న గృహమునకు వచ్చెనట ఆ అతిథి అలవంక చుట్టమని భర్తయు భర్తకే పుబంధువని ఆలియు ఎంచిరి ఆయనకు దంపతులు విశేష గౌరవమును జరుపుచుండిరట కొంతకాలమునకు ఆలుమగల (మాదన్న-భార్య) సంభాషణమున అతిథివిషయము రాగా మాదన్న అతిథికి తనకుగల బాంధవ్యమేమి ? అని ఆ-

అతిథినే ప్రశ్నించెనట అంత అతిథి మాదన్నతో నేను పెద్దమ్మ (దారిద్ర్యదేవత) కొడుకును నీవు చిన్నమ్మ (లక్ష్మీదేవి) కొమరుడవు మనము అక్క చెల్లెండ్ర పుత్రులము కాన సోదరుల మని పలికెనట ధీశాలియగు మాదన్న అక్కన్న దైన్యస్థితిని గ్రహించి ఆనాటినుండియు అక్కన్నను నిసోదరునివలె చూచుకొనుచు ఆయనను అభివృద్ధిలోనికి దెచ్చెనట తానాషా

ప్రతిష్ఠితుడై రాజా బిరుద భేరీఖడ్గాశ్వాది రాజచిహ్నములను బడసెను సూర్యప్రకాశరావు అను బిరుదుగూడ ఈయనకు తానాషా వలననే లభించెను మాదన్నయందుగల ధీచాతుర్యము ప్రభుభక్తి కార్యదీక్ష లోకజ్ఞత ధార్మికత్వము మున్నగు సద్గుణములు ఆయనకు మహామంత్రిత్వమును సంపాదించి పెట్టినవి తానాషా అనుగ్రహము మాదన్న కుటుంబ

చిత్రము 2



పటము 1

అక్కన్న మంత్రి

చిత్రము 3



పటము 2

మాదన్న మంత్రి

వద్ద అక్కన్న పేష్కారును (సేనాని) రక్షణ వాణిజ్య దేశీయాంగ నౌకామంత్రిగను రాయబారిగను సైన్యాధ్యక్షుడుగను పనిచేసె నాయకుడు సత్యసంధుడు శత్రుక్షయకరుడు అని పొగడ్తకెక్కెను

అక్కన్న మాదన్నలు తమ ఇరువదిరెండవయేట హైదరాబాదునకు వచ్చి మీర్జామహమ్మదు యీాదు మీర్జుమ్లా (మంత్రి) యొద్ద క్రీ శ 1650 న కొద్ది వేతనములపై గుమాస్తాలుగా చేరి పది సంవత్సరములు పనిచేసిరి మాదన్న గొప్ప మేధావి ఇతడు క్రీ శ 1666 న గోలుకొండ సర్వసేనానియగు బడీ ఉల్ ముమాలిక్ వద్ద పేష్కారుగ నియమితుడయ్యెను ఈ సోదరద్వయము మొత్తముమీద భూమ్యాదాయ శాఖలో ఇరువదిఅయిదు సంవత్సరముల అనుభవమును సంపాదించిరి గోలుకొండ ప్రధానియగు సయ్యదుముజఫర్ కు తరువాత క్రీ శ 1674 న (జూన్ నెలలో) మాదన్న గోలుకొండ రాజ్యమున అబుల్ హసన్ కుతుబ్షా సుల్తానుచే మహామంత్రిగ

ముపై సంపూర్ణముగ ప్రసరించెను మాదన్న బంధువులకు సైతము గొప్ప పదవులు తానాషావలన లభించెను అక్కన్నకు అప్పుర్ బహాదర్ అను బిరుదము సైన్యాధిపత్యము వీరి సోదరులలో విస్సన్నకు బక్షిగిరి అను ఉద్యోగము (సైన్యమునకు జీతమొసగుకటి ధికారము) మల్లన్నకు పీష్వా ఉద్యోగము వెంకన్నకు (మూడవ మేనల్లుడు) ఫౌజుదారు ఉద్యోగము రుస్తుంరావు ఓరుయు గోపన్న (మొదటి మేనల్లుడు) భద్రాచల తహసల్దారు పదవియు లభించినవి ఇట్లు ప్రధాన పదవులన్నియు వారి బంధువులకే సంక్రమించినవి తానాషా తన పశ్యులను సర్దారులను గుల్లాములను ఉమ్రావులను నమ్మి వారికి గొప్ప పదవులీయలేదు వారు అలసత్వము మహమ్మదీయ మతాభినివేశము అవారై ఎప్పటికైనను ఔరంగజేబుకు విధేయులై గోరాజ్యమునకు ముప్పు దెత్తురని యాతని భయము

మహామంత్రి అయిన పిమ్మట గోల్కొండ రాజ్యము

నందు శాంతిభద్రతల పర్యవేక్షణకై మాదన్న సుమారు నాలుగు నెలలు దేశసంచారమొనర్చెను. ఆంగ్లేయులు చెన్నపట్టణమున ఈస్టిండియా కంపెనిని స్థాపించి వ్యాపారము నారంభించి చేయుచుండిరి. ఫ్రెంచివారు ఆంగ్లేయులతో వ్యాపారమునకు పోటీ పడుచుండిరి. ఆంగ్లేయులకు మచిలీపట్టణమున ఒక గిడ్డంగి కలదు. ఇది గోలకొండ రాజ్యములోనిది. అందుచే ఇంగ్లీషువారు గోలకొండరాజ్యములో తమ వ్యాపారము నిరాటంకముగ సాగించుకొనుటకు అక్కన్న మాదన్నల అనుగ్రహమునకై వారికి అనేక బహుమతులను సైతము ఇచ్చినట్లు **Press list of Ancient Records in Fort St George Vol VII P 126-127 Vol VIII P 1-3** లలో కనవచ్చుచున్నది. ఇందలి అంశములిట్లు తెలియవచ్చుచున్నవి. క్రీ శ 1678 లో తానాషాయును మాదన్నయును మచిలీపట్టణమునకు పోగా అచ్చట ఇంగ్లీషువారు వారిని గౌరవించి ఎన్నియో బహుమతుల నందజేసిరట. కంపెనీవారి వ్యాపారము నిరాటంకముగ జరుగునట్లు చూచుటకై గోలుకొండ రాజ్యములోని కృష్ణానది దక్షిణప్రాంతమునకు పొదిలి (పోడేల) లింగప్ప అనువానిని సుబేదారుగా మాదన్న నియమించెనట. అక్కన్న ఓడలతో సముద్ర వ్యాపారము చేయుచుండినట్లును ఆయన కొన్ని సొంత ఓడలు కలిగియుండినట్లును 1682 న పొదిలి లింగప్ప మద్రాసు గవర్నరుకు వ్రాసిన జాబును బట్టి తెలియుచున్నది. కంపెనీవారు అక్కన్న మాదన్నలకును దుబాష్ వెంకటాద్రికిని కొన్ని బహుమానములు పంపుటయే గాక క్రీ శ 1682 నవంబరున మాదన్న కుమారుడు అగు మల్లప్ప పరిణయ సందర్భమున ఒక వీసెడు బరువుగల బంగారు గొలుసును కానుకగా గూడ పంపినట్లు తెలియుచున్నది. ఈ విధముగా ఆంగ్లేయులు అక్కన్న మాదన్నల అనుగ్రహమునకై పెక్కు విధముల యత్నించి కృతార్థులైనట్లు తెలియవచ్చుచున్నది.

మహామంత్రి యగునాటికి మాదన్న వయస్సు సుమారు ఏబదిరెండు వత్సరములుండి యుండును. ఆయన గోల్కొండ రాజ్యమున పెక్కు సంస్కరణలు కావించెను. పై అధికారులు మొదలుకొని చపరాసివరకును బాహాటముగా జరుగుచున్న లంచగొండితనమును మాదన్న మాన్పించెను. అతడు వ్యవసాయమును వృద్ధిపరచెను. అపార ధాన్యమును ప్రజలకు సరసమగు ధరలకు అమ్మకూర్చెను. దేవాలయములందు ఊడిగముచేయు పూజారి తళి ముస్సంగివారిని పట్వారి పటేలు వెట్టి మాదిగ మొదలగు గ్రామోద్యోగులను చాకలివారు మంగలివారు వంటి వృత్తిమంతులను అనేక మాన్యములను ప్రసాదించెను. వస్త్రపు [illegible] ను నుతెంచి వస్త్రవ్యాపారమును భూసముద్ర వర్తకము శిల్పము చిత్రలేఖనము వంటి లలిత కళలను [illegible] అద్దముపంటి పరిశ్రమలను అతడు వృద్ధిపరచెను. నాణెములను ముద్రించు అధికారము ప్రభుత్వమునకే ఉండునట్లు కట్టడి చేసెను. [illegible] వలను కాసు తారవంటి నాణెములను చలామణిలోనికి తెచ్చెను. శుద్ధమైన మేలిమివన్నె బంగారము [illegible] సమైన ధర లభించెడిది.

మాదన్న పరిపాలనలో పెక్కు కట్టుదిట్టములొనర్చెను. రాజ్యమును కేంద్రములుగా ప్రాంతములుగా గ్రామములుగా విభజించెను. కేంద్రము రాజధాని. దేశాంగ మంత్రి దేశీయమంత్రి ముజుమ్దారు బక్షీ - ల్ ముమాలిక్ సరేఖేల్ దారోగాయే అదం సదర్ ఖాజీ దబీర్ మహాల్దారు అను ఉద్యోగులను ప్రాంతములకు సిరస్తాదారు వాను సరేఖేల్ ఖాజీ పండితుడు అను అధికారులను గ్రామమునకు పట్వారీ మాలీపటేలు కోత్వాలీ షేక్ శేఖుందు పురోహితుడు అనువారిని నియమించి పరిపాల సౌలభ్యము మాదన్న కలిగించెను. ఫౌజదారుల (సైన్యాధిపతు) ఖాతిబులకు (న్యాయాధికారుల) లోగడ నుండెడి బంగీగులను తొలగించి జీతములేర్పరచి వారిని తమ విధేయులుగా చేకొనెను. గ్రామపాలక వర్గమునకు మాత్రము అనేక మాన్యముల నేర్పరచెను. భోగలాలసులు వృద్ధులు స్వార్థపరులు సామర్థ్యహీనులు అయిన ఉద్యోగులను తొలగించి వారిస్థానమున ఉత్సాహవంతులు ప్రభుభక్తితత్పరులైన యువకులను నియమించెను. అధికారుల మార్పుదల నేర్పరచి వారిలో గల అలసత్వమును తొలగించెను. దుర్గములను బలిష్ఠములొనరించెను. అధిక వేతనముపొందు ఉద్యోగులకు వేతనము కొంత తగ్గించియు సైన్యమును అభివృద్ధిపరచియు మాన్యములనుండి ఆదాయమును కొంత వసూలుచేసియు మొత్తముమీద ఆదాయవ్యయములను సమము గావించెను. తానాషాచే అలంపనాహ అను బిరుదమును పొందె. సుల్తానుకు మాదన్న అత్యంత ప్రీతిపాత్రుడయ్యెను. తనచే పదచ్యుతులైన ఉద్యోగులు ఉమ్రావులు క్రీ శ 1676 న ప్రభుత్వముపై తిరుగుబాటు చేయగా

దానిని మాదన్న రాజవంశమునకు చెందినవాడగు అప్పలరాజు యొక్క సాయమున అణచివేసి కోస్తాతీరమున శ్రీకాకుళము వరకు నున్న గోలకొండ రాజ్యమును తిరిగి స్వాధీనము చేసికొని అప్పలరాజునకు అప్పలపాయకరావు బహద్దరు అను బిరుదమును పెక్కు జాగీరులను ఒసగి మాదన్న తన అకుంఠిత రాజనీతిజ్ఞతను లోకమునకు చాటెను

మాదన్న ప్రజాసేవకుడని మిక్కిలి ప్రసిద్ధిగాంచెను తటాకములు రహదారులు అన్నసత్రములు ఉచితవిద్యా సౌకర్యములు ఉచితవైద్యశాలలు స్త్రీలకై ప్రసూతిశాలలు నెలకొల్పి ప్రజాసౌఖ్యమునకు అతడు మిక్కిలి పాటుపడెను ఆనాడు ప్రజలు సుఖశాంతులతో సంతృప్తిగ జీవించిరి

అక్కన్న మాదన్న సుల్తానుల అనుగ్రహము పొంది గోలకొండ రాజ్యమున బాహాటముగా వర్తకము చేయుచున్న ఆంగ్లేయులు క్రమముగా గర్వితులై స్వతంత్రములను స్వంత న్యాయస్థానములను నెలకొల్పి తానాషా ఫర్మానాలను లక్ష్యపెట్టకుండిరి కాని అక్కన్న మాదన్న తిగన్నల ధాటికి తట్టుకొనలేక క్రమముగా ఆంగ్లేయులు గోలకొండ రాజ్యములోని తమ గిడ్డంగులను ఎత్తివేసి జింజీకి వెడలిపోయిరి ఇట్లు గోలకొండవారిపై కినుకవహించిన ఆంగ్లేయులు పరాసువారు సయాం చక్రవర్తిని ప్రోత్సహించి గోలకొండవారి వ్యాపార నౌకలను దోపిడిచేయింప నారంభించిరి మాదన్న క్రీ శ 1685 న తన నౌకాబల సహాయమున దోపిడీదారులను తుదముట్టించి నౌకావ్యాపారమును సురక్షిత మొనర్చెను మాదన్న భువనగిరి ఓరుగల్లు ఖమ్మంమెట్టు కొండపల్లి కొండవీడు అను తావుల దలి దుర్గములను వృద్ధిచేసి ప్రతి దుర్గమునందును సుమారు రెండువేలకు తక్కువగాని సైన్యము నుంచెను అశ్వసైన్యమును శతఘ్ని దళమును పదాతులను అతడు అధికముగా పెంచెను గోలకొండ రాజ్యమును ఖండములుగను సర్కారులుగను పరగణాలుగను విభజించి అతడు భూమిశిస్తు వసూలు సుకరమగునట్లు చేసెను గోలకొండ రాజ్యము ఆనాడు మొత్తము మూడుఖండములు పదిహేనిమిది సర్కారులు ఆరువందల ఏబదినాలుగు పరగణాలు కలిగియుండెను ఇవి తెలంగాణా ఖండములోను కర్ణాటక ఖండమందును ఆర్కాటు ఖండమందును కలవు అప్పుడు గోలకొండ రాజ్యమునకు సాలుసరి ఆదాయము మూడుకోట్ల రూపాయలు

మాదన్న విదేశాంగ నీతిలోను గొప్ప చాతుర్యము కలవాడు ఆనాడు గోలకొండ రాజ్యమునకు మహారాష్ట్ర పాలకుడగు శివాజియు ఢిల్లీ పాదుషాయగు ఔరంగజేబు అనువారు ప్రధానశత్రువులైయుండిరి క్రీ శ 1672 న బీజపూరు సుల్తానగు రెండవ అలీఆదిల్ షా మృతినొందిన ఎడల అతని కుమారుడు సికిందరు సుల్తానయ్యెను అప్పటి కాతని వయస్సు ఐదు సంవత్సరములు మాత్రమే రాజు దుర్బలుడగుట వలన శత్రువులా రాజ్యమున కలతలను లేవదీసిరి బీజాపూరువారి ప్రార్థనచే మాదన్న వాటిని అణచివేసె గోలకొండ రాజ్యము బీజాపూరునకు సహాయమొనరించుచుండునట్లును బీజాపూరు పాలకులు గోలకొండవారి ఫర్మానాలను మన్నించుచుండునట్లును బీజాపూరు కొలువున గోలకొండ ప్రతినిధి యొకడుండునట్లును కట్టుదిట్టములు చేసెను దీని ఫలితముగా అక్కన్న గోలుకొండ ప్రతినిధిగా బీజాపూరు వసించెను ఇట్లు కొంతకాలము మాత్రమే గడచినది బీజాపూరు సర్దారుల నాయకుడును వకీల్ ఉల్-సుల్తనతును అగు సిద్దీమసూదు అనునతడు గోలకొండవారి షరతులను ఉల్లంఘించెను ఇంతలో ఢిల్లీ పాదుషా పెద్ద సైన్యముతో బీజాపూరుపైదండెత్తెను బీజాపూరు పాలకుడు తనకు అవిధేయుడుగనున్నను మాదన్న సికందరు కోరికపై కొంత సైన్యమును వారికి సాయముగ పంపెను ఇది శివాజీ అసహన హేతువయ్యెను ఎలననగా మహారాష్ట్రులకు బీజాపురమువారు బద్ధ విరోధులు క్రీ శ 1674 న శివాజి మహారాష్ట్ర పాలకుడుగ పట్టాభిషిక్తుడయ్యెను మహారాష్ట్ర కోశాగారములను భర్తీచేయుటకు శివాజి ఆంధ్ర ద్రావిడ దేశములమీదికి దండెత్తనున్నట్లు మాదన్నకు తెలియవచ్చెను మాదన్న శివాజిని గోలకొండ కాహ్వానించి గొప్ప ఆతిథ్యమునిచ్చి తానాషాకును శివాజికిని మైత్రిని కల్పించెను దీనివలన మొగలాయీలబారినుండి శివాజి గోలకొండ రాజ్యమును రక్షించునట్లును (ఈ నియమమువలన అనేక మహారాష్ట్ర సైనికులు గోలకొండ రక్షణకై నియమించబడిరి) శివాజి దక్షిణదేశమును జయించిన ఎడల తండ్రియగు షాహాజీ సంపాదించిన ప్రదేశములు తక్క తక్కినవి గోలకొండవారికి అప్పగించునట్లును దక్షిణదేశ దండయాత్రకై గోలకొండవారు శివాజికి నిత్యవ్యయమునకుగాను సుమారు నాలుగున్నర లక్షల రూపాయలును మీర్జా మహమ్మదు అమీనుతో (సేనాని) సహా వేయి గుర్రపుదండును నాలుగువేల పదాతి దళమును కొన్ని

ఖరగులను తుపాకులను శివాజీకి సహాయముగ పంపునట్లును మహారాష్ట్రుల రాయబారి గోలకొండలో నుండునట్లును ఒడంబడికలు కుదిరెను శివాజీ పై నియమములు వ్రాసిన పత్రముపై సంతకము చేసెను కాని దేశమును జయించిన ఎడల శివాజీ సంధి షరతులను అతిక్రమించి కుతంత్రముతో బీజాపురమును గూడ హస్తగత మొనర్చుకొన యత్నించెను శివాజీకిని బీజాపురము వారికిని పోరు జరుగునేమో అని భయపడి మాదన్న ఎరోతుముగ బీజాపురము వారికి సాయి మొనర్చుచుండెను ఇట్టి స్థితిలోనే మొగలాయీలను శివాజీని నమ్మ శక్యము కాదని మాదన్న యెంచెను శివాజీ వలనను మొగలాయీల వలనను గోలుకొండ రాజ్యమునకు ముప్పు వాటిల్లునని భయపడుచు కడు అప్రమత్తుడై రాజ్యవ్యవహారముల నతడు నిర్వర్తించుచుండెను మాదన్న మంత్రిగ ఉన్నంతవరకు గోలకొండ తమకు స్వాధీనము కాదని ఢిల్లీ పాదుషాఅగు ఔరంగజేబు అభిప్రాయపడెను గోలకొండవారు తమకు చెల్లించవలసిన కప్పము ప్రతి సంవత్సరము చెల్లించుచుండినను తుట్టతుదక ఢిల్లీ పాదుషా తానాషాపై ఇస్లాం ద్రోహి హిందూ మతాభిమాని అను నిందలుమోపి క్రీ శ 1685 న హైదరాబాదును ముట్టడించుటకు షాఅలం (ఔరంగజేబు కుమారుడు)ను ప్రచండ సైన్యముతో పంపెను శివాజీ తమకు సహాయము చేయక పోవుటయు బీజాపూరు దుర్బల స్థితిలో నుండుటయు అను కారణములచే తానాషా ఢిల్లీపాదుషాతో సంధి చేసికొనెను ఈ సంధి నియమముల ననుసరించి అక్కన్న మాదన్నలను వారి పదవులనుండి వెంటనే తొలగించి తానాషా వారిని కారాగారమున నుంచవలెను మొగలాయీలకు అపారమైన ధనరాసుల నర్పింపవలెను తానాషా అన్ని నియమములను అంగీకరించెను అక్కన్న మాదన్నలను మాత్రము వారిపదవులనుండి తొలగించ నంగీకరింపలేదు ఇది మహమ్మదీయులకు ద్వేషహేతువయ్యెను వారు ఢిల్లీ రాయబారితో కుట్రలు చేయుచుండిరి అక్కన్న మాదన్నలు హిందూ మంత్రులని అంతఃపుర స్త్రీలకును వారిపై ద్వేషము కలదు అట్టివారిలో అబ్దుల్లా సులాను రాణులగు సరోమా జనీషాహెబాలు ప్రధానస్థానము వహించిరి వీలుచిక్కినప్పుడెల్ల వీరు తానాషాతో అక్కన్న మాదన్నలపై నేరములను పేర్చికూర్చి చెప్పుచుండిరి కాని విషయజ్ఞుడగు తానాషా వారి మాటలను పెడచెవిని బెట్టెను ఎట్లైనను అక్కన్న మాదన్నలను కడతేర్చవలయునని ముసల్మానులు పెక్కుసార్లు యత్నించుచుండిరి వీరితో గోలకొండ సేనానియగు మహమ్మదు ఇబ్రాహీం గూడ చేరెను క్రీ శ 1686 మార్చినెల చివరి భాగములో ఒకనాటి రాత్రి సుమారు తొమ్మిది గంటల సమయమున రాజకార్యములు పూర్తి చేసికొని అక్కన్న మాదన్నలు దివానమునుండి స్వగృహములకు పల్లకీలపై పోవుచుండిరి కుట్రదారులందరు ఒక్కుమ్మడి అకస్మాకముగా వారిపై బడి నిమేషములో వారి తలలను నరికివైచిరి వారి శవములను కొంతదూరము నేలపై లాగుచు వీధులవెంట తిరుగుచు ఉత్సవముచేసిరి వారి శిరస్సులను మాత్రము షోలాపురములో నున్న ఢిల్లీ పాదుషా (ఔరంగజేబు) చెంతకు పంపిరి పాదుషా ఆ శిరములను ఏనుగులచే త్రొక్కించి మిక్కిలి సంతసించెను హైదరాబాదులో అక్కన్న మాదన్నలను హత్యగావించినదుండగులగు ముసల్మానులు అంతటితో తనివినొందక రుస్తుంరావు అను బిరుదుగల పులిపల్లి వెంకన్నను సుమారు రెండువేలకుపైగా బ్రాహ్మణ కుటుంబములను (స్త్రీలను శిశువులను వృద్ధులను) హత్యగావించి వారి గృహములను అగ్గిబెట్టిరి లెక్కలేని తాటియాకు గ్రంథములు ఆ అగ్నిలో భస్మమయ్యెను ఆపిమ్మట కొద్ది కాలమునకే క్రీ శ 1687 న గోలకొండ కోటను ఢిల్లీ పాదుషాఅగు ఔరంగజేబు స్వాయత్తమొనర్చుకొనెను తానాషా దేవగిరికోటలో బందీగా ఉంచబడి అచ్చటనే తనువును చాలించెను

ఇట్లు మహామంత్రులు ప్రఖ్యాతిగాంచిన రాజ్యాధురంధరులును నిరంతర దానభోజన సత్రాది కార్యములను బహువితరణశీలశోభితులును ధర్మాత్ములునగు అక్కన్న మాదన్నలు హైందవ చరిత్రము సువర్ణాక్షరములచే లిఖింపబడి వారు మహమ్మదీయప్రాయఫలకములపై చిత్రరూపమున నొప్పుచున్నారు

తం ఆం శా

## అక్కప్పనాయుడు

విద్యారణ్య యతీంద్రుల ఆజ్ఞననుసరించి సంగమ వంశీయుడగు హరిహరరాయలు క్రీ శ 1336 నందు విద్యానగర నిర్మాణ మొనర్చెను దీనికే విజయనగర మనియు నామాంతరము రాయవాచకము నందు విద్యానగరము శా శ 1 7 న నిర్మింపబడినట్లు ఉన్నది చారిత్రకులు దీని నంగీకరించుట లేదు బహుశః ఇది ప్రమాదముచే వ్రాయబడిన

దేమో ! విజయనగర రాజ్యమును సంగమ సాళువ తుళువ ఆర్వీటి వంశీయులగు రాజులు సుమారు మూడువ దలనలుబది సంవత్సరములు పాలించినట్లు చరిత్ర చెప్పుచున్నది తుళువ వంశీయుడగు శ్రీకృష్ణదేవరాయ రాజనీతిని పాలన విధానమును దండయాత్రలను గూర్చి రాయ వాచకమునందు చక్కగా వర్ణింప బడినది

అక్కాక్కప్పనాయుడు శ్రీకృష్ణదేవరాయల దళవాయి రాయ వాచకము సందీతని ప్రశంస రెండు పర్యాయములు కనిపించుటచే ఇతడు ప్రసిద్ధుడని విశదమగుచున్నది శ్రీకృష్ణ దేవరాయల పట్టాభిషేకము నిర్వహించిన ఘనులలో ఇతని పేరు కానవచ్చుచున్నది రాయల దళవాయులగు అయ్యమరసు కొండమరసు ఖాచరసు యల్లమరసు వీరమరసు అప్పాజీ అక్కాణ దళనాయకులు అప్పరవళ్ల మన్నారువళ్ల రాయసం రామచంద్రయ్య బొక్కసం భాస్కరయ్య అవసరం వెంకటయ్య ప్రియ బకయ్య లక్ష్మీపతి ప్రధాని తిప్పరుసు దళవాయి లింగరుసు ఆర్వీటి బుక్కరాజు సాళువ మేకరాజు శ్రీగతివారు బూదహళ్లీవారు నంద్యాలవారు అవుకువారు తొరగంటివారు రాచూరి తిమ్మరాజు సంగరాజు వెలుగోటివారు పెద్దసాని అక్కాప్పనాయుడు కమ్మదొరలు తుళువ దొరలు మొదలగువారును సంగరి విద్యాంసులు చతుర్వేది రామాదీక్షితులు అష్టభాషా కవిత కృష్ణావధానులు శాబ్దిక పాండిత్య వెంకటరామ శాస్త్రుల్లు సహస్రావధాని ప్రభాకర శాస్త్రుల్లు జోస్యులు కవీశ్వరులు మున్నగువారందరు కలిసి కృష్ణదేవరాయల పట్టాభిషేక మహోత్సవ కార్యక్రమమును నిర్వహించినారట

పట్టాభిషేకానంతరము శ్రీకృష్ణదేవరాయలు తన రాజ్యమున దలి స్థితిగతులను తెలిసికొనుటకు చారులను నియమించెను అహమదా నగరము గోలకొండలలోని వార్తలను వేగుల అరవరాముడు పక్కీరి గోపోజీ అను వేగుల వాండ్రు రాయల వారికి విన్నవించి ఆయ వలన బహుమతులను గ్రహించిరి

రాయలవారు సైన్యమును పెంపొందించుటకు స్థానాపతులను అమరకందారులను ఏర్పరచినట్లు రాయవాచకము వలన తెలియుచున్నది అప్పాజీ సలహానుసరించి రాయలవారు ఒకదినమున అమరకందారులను స్థానాపతులను దళవాయులను పిలిపించి గొప్పసభచేసిరి సభకు వచ్చినవారిలో అయ్యవనమలక అంకుశ ఖానుడు రాణాజగదేవు గణుతి తిమ్మప్పనాయుడు రాచూరిరామినాయుడు పెమ్మసానిరామలింగనాయుడు హండేమల్లారావు బోయిరామప్ప వారివాణ కొమ్మాళ్లయిన పదునెనిమిది కంపణాలవారు ఒళనాయకులు అప్పరవళ్ల కుప్పరవళ్ల సాళువనాయుడు కొమారతిమ్మప్ప నంగ్గరాజు చెర్వప్రధాని తిమ్మరుసు అయ్యప్పనాయకుడు కోటికం విశ్వనాథనాయడు చెవ్వప్పనాయకుడు అక్కాప్ప నాయడు కృష్ణప్పనాయడు వెలుగోటి యాచమనాయుడు కన్నడ బసవప్పనాయడు సాళువ మేకరాజు మట్లఅనంతరాజు తిమ్మరాజు వీరమరాజు మొదలగువారును బొమ్మిరెడ్డి నాగారెడ్డి బసువారెడ్డి మొదలగు రెడ్డి కుమాళ్లును కమ్మనాయకులు విఠలప్పనాయడు అల్లుండ్లు కుమాళ్లు రాచరిక మొదలైన అమరనాయక వారలును కలరు రాయ వారు వారి యోగక్షేమములను విచారించి వారి వద్దనున్న ఏనుగులయొక్క గుఱ్ఱములయొక్క బంట్లయొక్క సంఖ్యనుగూర్చి వారిని ప్రశ్నించిరి సభలో నున్నవారిలో విఠలప్పనాయని స్థానాపతులు పరశురామనాయడి తెగవారు అమర నాయకులు స్థానాపతులలో వీరభద్రయ్య దళపతి రాయడు అనువారును రాయలవారితో ఇట్లుచెప్పిరి "స్వామివారు కైజీతము కట్టినవెను అమరపు సీమలకు నగరి లెక్కలప్రకారముతక్కువలేకుండునట్లు ఆయానియామకులు ఏనుగులను గుర్రములను రావుత్తులను మావుత్తులను బంట్లను పరిజనులను సంతరించినారు వెనుకటి మాదిరికాక స్వామివారు ఏ సమయమున మరాచకార్యమునకు ఉద్యుక్తులై వెడలుదురో అను తలపుతో కరణికులువచ్చి లెక్కించు నప్పటికి నగరి లెక్కకన్న పదేసి నుగులు నూరేసి గుర్రములు వేయి బంట్లు అధికముగా సేకరించి నియోగులు ఉంచినారు సామివారి సొమ్ము తినుచున్నందుకు తాము స్వామివారి అవసరములకు ఉపయోగించు చున్నాముగదా అని నియమితులు సంతోషించినారు

దళవాయుల అమరకందారుల స్థానాపతుల కార్యదీక్షను గూర్చి విని రాయలవారు మిక్కిలి సంతోషించిరి పెమ్మసానికుల చంద్రుడైన రామలింగనాయుడు గోలకొండ యుద్ధమున శ్రీకృష్ణదేవరాయలకు మిక్కిలి సహాయమొనరించినట్లు కృష్ణరాయవిజయము తృతీయాశ్వాసమందున్నది

అక్కప్పనాయని పేరు కృష్ణదేవరాయల పట్టాభిషేక నిర్వాహకులలోను దళవాయుల సభయందును కనిపించుటచే కృష్ణదేవరాయల ఉద్యోగులలో ఇతడును ప్రసిద్ధుడని తెలియుచున్నది

తెం ఆం శా

## అక్కమదేవి

అక్కమదేవి ఒడ్డాది విషయమునేలిన మత్స్యవంశపు రాజగు అర్జున దేవరాజుల దేవేరి ఈమె గడియపసెట్టి వీరపసేని తనూజ శక 1209 (క్రీ శ 1287) కు సరియగు చైత్ర శుద్ధ దశమి రవివారమున (ఆదివారము) ఈమె శ్రీ ద్రాక్షారామ భీమేశ్వర దేవరకు చైత్ర పూర్ణిమనాడు జరుగు డోలోత్సవము నాటి హవిర్భల్యర్చనాది విధులకు గాను ఒడ్డాదిలోని మరువాడి ను గ్రామమును ఆచంద్రార్కస్థాయిగా సమర్పించెను ఈమె భర్తయగు అర్జున మహారాజు రత్నాంచిత కిరీటముతోనొప్పు భవానీ విగ్రహమును సువర్ణముతో చేయించి భీమేశ్వరున కర్పించెను మరియు నలువైపుల చిత్ర స్తంభములతో నమర్చిన యొక పట్టు శయ్యపై భవానీ పరమేశ్వరుల సువర్ణ విగ్రహముల నుంచి వీరు డోలోత్సవ మొనరించుచుండినట్లు దక్షిణ హిందూ శాసనములో కనవచ్చుచున్నది (ద హిం IV సెం 1368 పుట 481) ఈ శాసనము ద్రాక్షారామము న దలి భీమేశ్వరాలయములోని పడమటి భాగమున నున్న ఒక స్తంభముపై కలదు

శాసనమున కనవచ్చు అర్జునదేవరాజు చరితము నుగూడ వక్కాణి ప ఆవశ్యక మిచట కలదు ఒడ్డాదిని మత్స్యవంశపు రాజులు క్రీ శ 13 ను డి 15 వ శతాబ్దివరకు పాలించిరి ఒడ్డాది విశాఖ మండలములోని అనకాపల్లికి ప ద్రెండు మైళ్ళ దూరమున ఉన్నది మత్స్యవంశమహీపతులు వేయించిన శాసనములు దిబ్బడిలో సింహాచలములో శ్రీ కూర్మములో ద్రాక్షారామములో పెక్కు కనవచ్చుచున్నవి ప్రకృత శాసనము నందలి అర్జున దేవరాజు ఒడ్డాది రాజ్యమును శక 1153-1214 (క్రీ శ 1231-1292) వరకు పాలించెను ఇతనిని మొదటి అర్జునరాజందురు ఇతడు మొదటి జయంతనరేంద్రుని తనయుడు ఇతడు నృసింహభక్తుడు ఆ కారణముననే శాసనములు ఇతనికి నృసింహ వర్ధనుడను నామాంతరము నెను ఇతనికి అక్కమదేవి కాక చేకేటి వీరపనాయకుని కూతురగు సోమదమాంబ యను అంకోక దేవియు కలదు ఈమె ద్రాక్షారామ భీమేశ్వరునకు సర్వకరపరిహారకముగా ఒడ్డాదిలోని సంకు భీమావురము అను గ్రామమును దానమొనర్చెను (ద హిం IV నె 1043-345)

అర్జున మహారాజునకు అన్నమదేవుడు మంకాదిత్యుడు అను సోదరులు కలరు వారిలో అన్నమదేవునకు గోపాల వర్ధనుడు అనియు మంకాదితునకు శ్రీరంగవర్ధనుడనియు బిరుదనామములు కలవు మత్స్యవంశ మహారాజులను మత్స్యకుల తిలకులనియు మీనాన్వయాలంకృతులనియు వ్యవహరించుచుండిరి వీరు విష్ణుభక్తులు వీరి ని శిలావంశ నృపతులకును సంబంధబాంధవ్యములు కలవు జయపురమును బొబ్బిలిని పాలించిన రాజులు శిలావంశ నృపతులు మత్స్యవంశీయుల యొక్కయు శిలావంశ ప్రభువుల యొక్కయు సంబంధమును శక 1349 నాటి శ్రీ కూర్మ శాసనము రుజువు పరుచుచున్నది ఈ శాసనమునందు శిలావంశ భవ శ్రీ విశ్వేశ్వర మహారాజుల మహాదేవియు మత్స్యకుల తిలక శ్రీ జయంతరాజుల కూతురునగు సంగమదేవియు శ్రీ కూర్మనాథున కనేక దానము లొసరించినట్లు కలదు

అర్జున దేవరాజు కాలము కాకతి గణపతిదేవుడు రుద్రమాంబలకాలమునకు సమానము అక్కాలమున గణపతి దేవుడు కళింగరాజ్యమును జయించినట్లు కలదు అయినను జయించినదానిని తిరిగి మత్స్యరాజులకే విడిచి గణపతిదేవుడు వారిని తన సామంతులను చేసెనియు చెనేమో! మత్స్యవంశ భూపాలుగ కళింగ గాంగులకు నుండి కాకతీయులకును కళింగగాంగులకును జరిగిన యుద్ధములలో గాంగులపక్షమువల నిలిచిరి మొదట్లో వీరు క్రమముగా రెడ్డి ప్రభువులకును అటుమ్మట గౌడ గజపతులకును వశులైనట్లు తెలియుచున్నది అర్జున దేవరాజు మహాధర్మాత్ముడు ఇతడు సుమారు 61 సంవత్సరములు ఒడ్డాది రాజ్యమును పాలించెను ఇతడొసర్చిన దానములను తెలుపు శాసనములు అనేకము లున్నవి

తెం ఆం శా

## అక్కయసూరి - మోతుగుండము

మోతుగుండము అక్కయసూరి సుప్రసిద్ధ పండితుడు ఇతడు వెంకటార్యుని కుమారుడు మహోపాధ్యాయ పక్షధర యెల్లయార్యునికి ఇతడు మేలుబంతి శిష్యుడుకూడ అక్కయసూరికి నవకాశీదాసు లేక అభినవకాశీదాసు అను బిరుదము

గల వెల్లాల ఉమామహేశ్వరుడు అను శిష్యుడు ఉండెను

మోతుగుండము అను గ్రామము కర్నూలు మండలము లోని గిద్దలూరు తాలూకాలో ఉన్నది వెల్లాల గ్రామము కూడ రాయలసీమలో ఉన్నది గ్రామనామములు గృహ నామములుగ ఉండు ఆచారము కనవచ్చు చుండుటచేత అక్కయసూరి నివాసగ్రామము మోతుగుండము అయియుండ వచ్చును మోతుగుండంవారు వెల్లాలవారు ములికినాటి బ్రాహ్మణులు

పూర్వ సంస్కృత కవులలో అభినవ కాళిదాసు నవ కాళిదాసు అభినవ భవభూతి మొదలగు బిరుదములను పెట్టు కొనుట ఆచారముగ ఉండెనని స్పష్టమగుచున్నది అభినవ నవ నూతన అను పదము చేర్చి కాళిదాసు అనుపేరు పెట్టుకున్న తెలుగువారు అనేకులు ఉండినట్లు తెలియుచున్నది

మైసూరు సర్వసైన్యాధ్యక్షుడగు కళువె నంజరాజు ఆస్థానమున దు - నృసింహకవి (క్రీ శ 1734 1770) అను పండితుడు ఉండెను నంజరాజ యశోభూషణము అను అలంకార గ్రంథమును ఇతడు వ్రాసెను ఈయనకు నవకాళిదాసు అను బిరుదము ఉండెను నడిమింటి సర్వమంగళశాస్త్రి అను కవికి అభినవ కాళిదాసు అను బిరుదముండెను ఈయన భగవద్గీతా భాష్యము వేదసారము పార్థవిజయము మున్నగు కృతు లను సూర్యాష్టకాదులను వ్రాసెను ఈయన కాలము క్రీ శ 1759 - 1839

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రికి అభినవ కాళిదాసు అను బిరుదము ఉండెను ఈయన కాలము క్రీ శ (1780 1870) కంకణబ ధరామాయణము యశోల్లాసము హరికారికలు నీలశైలనాథీయము అను కృతులను మదనాభ్యుదయాది భాణములను ఈయన రచించెను భినవ కాళిదాస బిరుద భాజనుడగు ములుగు పాపయారాధ్యుడు అనునొక కవి యుండెను ఇతడు అమరావతీప్రభువగు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయనివారి ఆస్థాన విద్వాంసుడు ఈయన కల్యాణచంపువు ఏకాదశీవ్రతచంపువు మొదలగు కృతులను రచించెను ఈయన కాలము క్రీ శ 1778 - 852

విక్రమరాఘవము అను మహాకావ్యమును వ్రాసి ఒక కవికి నూతన కాళిదాసు అను బిరుదము కనవచ్చుచున్నది ఈ గ్రంథము అముద్రితము - ఇది మద్రాసు ప్రాచ్య పుస్తక భాండాగారములో ఉన్నది రాఘవాభ్యుదయము అను తెలుగు ప్రబంధమును వ్రాసిన చింతలపల్లి ఛాయాపతి అను కవి అన తాతలకు ఆరుగురికి నూతన కాళిదాసు అను బిరుదములు ఉండినట్లు తన గ్రంథమునందు వక్కాణించెను ఈ నూతన కాళిదాసులు పదునేడవ శతాబ్దిలో ఉండినట్లు ఈయన తెలిపెను వీరేకాక అలూరు తిరుమలకవికి అభినవ భవభూతి అను బిరుదము ఉండెనట ఇట్లు ఆంధ్రులు పలువురు అభినవ నవ నూతన కాళిదాస బిరుదభాజనులై కనిపించుచున్నారు

మోతుగుండము అక్కయసూరి శిష్యుడగు వెల్లాల ఉమామహేశ్వరునకు (నవకాళిదాసు) కవికుంజరుడు అను శిష్యుడు ఉండెను ఈ కవికుంజరుడు తన రాజశేఖర చరిత్ర గ్రంథములో తన గురువగు ఉమామహేశ్వరుడు పినాకినీ (పెన్న)తీరమందున్న విద్యానగరమును రాజధానిగా చేసుకొని రాజ్యమును నెరపుచున్న రాజశేఖరమహారాజు ఆస్థానమున ఆస్థానకవిగా ఉండెనని చెప్పెను ఈ రాజశేఖర మహారాజు (క్రీ శ 1018 - 1064) రాజేంద్రచోళునితో సమకాలికుడు అనియు కావున ఇతని ఆస్థానమునందు ఉన్న అభినవ కాళిదాసు కూడా పదునొకండవ శతాబ్దినాటివాడే అనియు మాడభూషి కృష్ణమాచార్యులవారు తమ సంస్కృతవాఙ్మయ చరిత్రమునందు చెప్పిరి కాని రాజశేఖర చరితమును పరికించినచో కృష్ణమాచార్యులవారి అభిప్రాయము సరికాదేమో అనిపించుచున్నది ఏలనగా రాజశేఖర చరితమునందు కవి కుంజరుడు తన గురువు అగు అభినవ కాళిదాసు దుర్జయుడను మొదటి ఆస్థానకవిని (రాజశేఖరుని మొదటి ఆస్థానకవి పేరు దుర్జయుడు) వాదించి జయించి ఆస్థానకవియైన విధమును చక్కగా వర్ణించెను దుర్జయుడు రాజశేఖరుని ఆస్థానకవియై ఇతర కవులను రాజశేఖరమహారాజు నెదుట తక్కువగా చూచెడివాడట రఘువంశములో కొంతభాగమును ప్రక్రియా కౌముదిలో సంధిపరిచ్ఛేదమును మాత్రమే ఇతడు చదువుకొనెనట ఎంతటి పండితుని అయినను ఈయన పరిహాసము చేసెడి వాడట అయినను ఉపాయముతో అభినవ కాళిదాసు ఎట్లో రాజశేఖర మహారాజు నెదుట దుర్జయుని వాదమున ఓడించి తాను ఆస్థాన పండితుడు అయ్యెను అని కవికుంజరుడు తన రాజశేఖర చరితమునందు వ్రాసెను ఇచ్చట విశేషమేమనగా 1 ?6 ప్రాంతమున రామచంద్రుడు అను కవి ప్రక్రియాకౌముది అను గ్రంథమును వ్రాసెను కవికుంజరుడు ప్రక్రియాకౌముది అను గ్రంథమును తన రాజశేఖర చరితమునందు పేర్కొనుటచే

అక్కయసూరి సుశీవెను అక్కయసూరి శ్లోకము "గూఢా భట్టనిబ ధ అనునది మల్లినాథసూరిగారి వాణీంకాణభు జీమజీగణత్ ఇత్యాది శ్లోకశైలిలో నున్నది అక్కయసూరి మల్లినాథుని అనుసరి చెననుట తెల్లము ఈతడు మల్లినాథుని తరువాతివాడై యుండును అభినవ కాళిదాసుయొక్క భాగవత చ పువుకు రె డవ వ్యాఖ్యానమును అపరశ కరు డను పేరునొ దిన బెల్ల కొ డ రామరాయ కవిగారు వ్రాసిరి భాగవత చ పువులలో ఇది ప్రసిద్ధమై ముద్రణభాగ్యము నొంది పాఠకులకు గొప్ప ఆనందమును ఇచ్చుచున్నది అభినవ కాళిదాసు భాగవత చంపువు ఆర భము న దు దేవీస్తుతి ఒనర్చుటచేత అతడు దేవీభక్తుడు అని తెలియు చున్నది అక్కయసూరి టీకవలన ఈ చంపూగ్ర థమునకు బ గార మునకు తావి అబ్బినట్లు అయినది

తం ఆం శా

## అక్కరెడ్డిపల్లి

దక్కను పూర్వచరిత్ర 632 వ పుటలో అక్కా రెడ్డిపల్లి అని ఈగ్రామనామము కనిపించుచున్నది ఇది కడప మ డలము బద్వేలుతాలూకా చిరుమామిళ్ళ ఫర్కాలోనిది ప్రకృతము దీని జనాభా 1461 శా శ 1205 (క్రీ శ 1283)నకు సరియగు స్వభానువత్సరమున ఇచటనొక శాసనము లభి చెను అ దు గ డపెండేర త్రిపురారిదేవ మహారాజు కడప ప్రా తమును పాలి చు పుడు గౌరేశ్వరబాయమ్మగారు అను భక్తురాలు శివాలయమొకదానిని నె కొల్పి అ దు గోశృ గేశ్వర స్వామి ప్ర తి ప్ఠి చి ట్లు కలదు ఇ రవరకును గోకర్ణేశ్వర స్వామియే తెలియవచ్చుచున్నాడు మహే ద్ర గిరిమీద గోకర్ణేశ్వరుని లయము కలదు తూర్పుగాంగులు గోకర్ణే శ్వర భక్తులు పశ్చిమ సముద్రతీరమున గూడ గోకర్ణేశ్వరు డున్నట్లు తెలియవచ్చును కళాపూర్ణోదయములో గూడ గో ర్ణేశ్వరుడు కాన్పించును ఇక గోశృంగేశ్వరస్వామి కూడ కలడను విశేషమును ఈ శాసనము తెలుపుచున్నది

కడప మ డలమును కాయస్థవ శజులైన అ బదేవుడు కొంతకాలమును త్రిపురారిదేవమహారాజు కొంతకాలమును పాలించినట్లు తెలియుచున్నది వీరు కాకతీయులకు సామ తులుగ కొంత కాలమును ప్రత్యర్థులుగ కొంత కాలమును కడప మ డలము నేలిరి కాయస్థులైన గంగయసాహిణి జన్నిగదేవుడు త్రిపురారి అనువారు కాకతీయులకు విధేయులును మిత్రులునై పరిపాలనము చే రి త్రిపురారి క్రీ శ 1268 1272 నడుమ రుద్రమదేవికి అధీనుడై నెల్లూరు కడప మ డలములను శాస చెను ఇతనిని కాయస్థ మొదటి త్రిపురారి యనుచున్నారు ఈతని తరువాత ఈతని తమ్ముడు ఎత్రాప్రాం తమునకు అధిపతి యయ్యెను కాని ఈతడు తన యన్నలగు జన్నిగదేవ త్రిపురారి దేవులవలె కాకతీయ సామ్రాజ్యమునకు విధేయుడై యు డక స్వతంత్రప్రభువుగా వ్యవహరి చెను సామ్రాజ్యభాగముల నాక్రమించుకొనెను ఈతడు క్రీ శ 1272-1303 వరకు తిరుగుబాటు దారుగా పరిపాలన సాగిం చెను అంబదేవునకు త్రిపురారియను కుమారుడు కలడు ఇతనిని రె డవ త్రిపురారి య దురు ప్రకృతశాసనము శ క 1205 అనగా క్రీ శ 1283 నాటిది అగుటచే ఇది అ బదేవుని కుమారుడగు రె డవ త్రిపురారి ఏలుబడి కాలమని యూహించ వలెను అంబదేవుని యన్న త్రిపురారి క్రీ శ 1272 తరువాత మరణి చి యుండును ఆతని శాసనములు కానరాలేదు అంబదేవుడు తన కుమారునకు కొ త రాజ్యభాగమిచ్చి ప్రతి ని చియుండును కావుననే అంబదేవుని పరిపాలనా కాల ములో త్రిపురారి శాసనము లభించుట సుసంగతమగు చున్నది

తం ఆం శా

## అక్కలపూ

అక్కలపూడి గ్రామనామము అక్కలపూడి (రాజ మహే ద్రవరంతాలూకా) శాసనములో (ఎ ఎ ఇ XIII పు 259) కన్పి చుచు న్నది శాసనకాలము శ క 1290 (క్రీ శ 1368) ఈ శాసనము కోరుకొ డ వ శమునకు చె దిన సి గమ నాయకునిచే వేయి చబడినది ఈ వంశమునకు చె దిన వాడును స గమనాయకునకు అగ్రజుడును అగు ముమ్మడి నాయకుడు ప్రతిష్ఠి చిన మరియొ శా నము కలదు ఇది శ్రీర గ తామ్ర శా నము దీని కాలము క్రీ శ 1351) (ఎ ఎ ఇ XIV పు 83)

పూర్వకాలమున పల్లవ సార్వభౌముడగు ముక్క టి (త్రిలోచన పల్లవుడు) గ గానదీతీరమును డి మంచి కొండ అను ఇరువురు సర్దారులను ఆ ధ్రదేశమునకు తీసికొని వచ్చెను వారు ఆంధ్రదేశమున మంచికొ డ అను పట్టణమును స్థాపిం చిరి ఆంధ్రదేశ విభాగము లోని మ చికొండ అను సీమ కొ ర వి సీమ (వరంగల్లు జిల్లా మానుకోట ప్రాంతము) ప్రక్కన ఉండెను మంచికొండ అను ది గోత్రనామమో

గృహనామమో అయినను ముమ్మడి నాయకునకు తద్వంశము నకును మంచికొండసీమతో సంబంధమున్నట్లు కానరాదు

సింగమనాయకుడు అక్కలవూడి అను గ్రామమును పరహితాచార్యునకు ఋణము శ్రీనాథదేవుని సమీపమున దానమొసర్చెను దానము పొందిన పరహితాచార్యుడు అతని వంశమువారు ఆయుర్వేదమున ప్రసిద్ధినొందినవారు వీరి ప్రశంస అనితల్లి కలువచేరు శాసనములో కూడ కానగును పరహితాచార్యులు అక్కలవూడి గ్రామమునకు ముమ్మడిసింగవరము అను పేరుపెట్టి అందులో 10 భాగములు యజుర్వేద పాఠకులగు బ్రాహ్మణులకు దానము చేసెను

అక్కలవూడి దానశాసనములో దాత యగు సింగమనాయకుని వంశవివరములు ఇట్లుకలవు మచికొండ వంశమునకు చెందిన కేశవనాయకుడు భరతఖండములోని త్రిలింగదేశమునకు పాలకుడుగా నుండెను అతని కొడుకు గణపతి నాయకుడు గణపతినాయకుని కొడుకు కన్నభూపాలుడు కన్నభూపాలుని కొడుకు ముమ్మడీంద్రుడు ముమ్మడీంద్రుడు చెంగలి కురవాట కోన పాచార అను మండలములకు పాలకుడుగా ఉండెను అతడు ఆంధ్రదేశ సురత్రాణ అను ఖ్యాతినొందిన కాపయనాయకుని మేనకోడలి భర్త అతని సోదరులలో సింగమనాయకుడు కోటిపురికిని గన్నయనాయకుడు తాడిపాకకును పరిపాలకులై యుండిరి సింగమనాయకునికి పంపానదీతీరమందలి ముమ్మడివీడు ముఖ్య పట్టణముగా నుండెను అతనికి గండగోపాల అనుబిరుదు కలదు అక్కలవూడి దానశాసనమును వ్రాసిన యాతడు కామదేవుడు అతడు కౌండిన్య గోత్రుడు ఈ శాసనమునందు సింగమనాయకుడు ముమ్మడినాయకుడు సంతకములు చేసిరి

అన్నయైన ముమ్మడినాయకుడు కోరుకొండను పాలించుచుండగా తమ్ముడైన సింగమనాయకుడు ముమ్మడివీడును తన కార్యస్థానముగా చేసికొని యుండును కోరుకొండ రాజమహేంద్రవరమునకు 12 మైళ్ళదూరమున కల ఒక వనదుర్గము ఈ కోరుకొండ కు ఉత్తరమున తూర్పు గోదావరి మండలమందలి మన్యప్రాంతము దక్షిణమున గుద్ర [illegible] తూర్పున ప్రోల్నాడు పడమట గౌతమి [illegible] ముమ్మడి సింగమనాయకుని ముఖ్యపట్టణమైన ముమ్మడివీడు తూర్పుగోదావరి మండలము నందలి ముమ్మడివరము అను గ్రామమై యుండును చెంగలి నేడు గోదావరీ మండలమున చాగల్నాడని వ్యవహరింతురు కురువాట గోదావరీ దక్షిణతటమున తమ్మిలేరు ప్రాంతము కోనకు కోనసీమ యని పేరు ఇది తూర్పుగోదావరీ మండలములోని అమలాపురము రాజోలు తాలూకాలలో గౌతమి వాశిష్ఠ నదుల మధ్యభాగము [illegible] పానా[illegible] ఇప్పటి పశ్చిమ గోదావరి మండలము [illegible] క్షీమవ[illegible] రసాపుర తాలూకాల ప్రాంతమును వ్యాపించి యుం[illegible]ను

కోరుకొండ నాయకులు అ[illegible] మారెడ్డి కాలమువరకు స్వతంత్రులై ఉండిరి [illegible] కోరుకొండ మను ప్రజారంజకముగా పాలించిరి వీరు అన్యశాస్త్ర విద్యులు ధర్మశాస్త్ర వేత్తలు వైదిక మతోద్ధారకులు శుద్ధస్వాంతులు [illegible] మూలమున ఈ దేశముగ విష్ణుభక్తి హెచ్చి[illegible] వీరి శీలము పరా[illegible] కట్టువటి [illegible] ఆకర్షించి[illegible]

**అక్కలవూడి శాసనమునందలి**

తజ్జాతియాః క[illegible] శాశ్వా[illegible]
శుద్ధస్వాంతాః శ్శాంతరాగాది దోషా
రాజన్యానా మేత్య స[illegible]య్యా[illegible]ర్వ్యాం
సర్వం భార[illegible] నిర్వహా త్యేవ[illegible]

అను శ్లోకములో [illegible] వర్ణింపబడి[illegible]

అ[illegible] మారెడ్డి గోదా[illegible] దశమును [illegible] పీడురాజ్యమందు కలుపుకొనుటకు [illegible] యాత్రలు చేసెను క్రీ శ 1377 స[illegible] కొం[illegible] దాడివెడలి ముమ్మడీంద్రుని తమ్ము[illegible] సింగమనాయకుని బధించి కోరుకొండ[illegible] రామ[illegible]ద్రపుర దుర్గాధ్యక్షుని పాలనములోనికి తెచ్చెను

గండగోపాలుడు అను బిరుదము [illegible] కు లభించిన విధము తెలిసికొనుటకు ఆధారములేవు పంపానది యనునది గోదావరీ [illegible]కి చెందిన యొక ప్రాచీ శాఖయై యు[illegible] నేడు మరుగుపడిపోయియుండు నని ఊహింపవచ్చును

గ ల కొం

## అక్కారెడ్డి

ఈతని ప్రశంస చాటుపద్య మణిమంజరి (I 50)లో వచ్చినది సుప్రసిద్ధ వీరుడును మైసూరు రాజ్య నిర్మాతయు

అగు చిక్కదేవరాజ ఒడయరు (క్రీ శ 1678 704) అక్కారెడ్డిని ఈరోడ్డు యుద్ధముగ జయించి ఆ కోటను స్వాధీన పరచుకొని నట్లు తెలియు చున్నది విజయనగర యుగమున ఆ ధనాయకులను సైనికులును పెక్కురు దక్షిణాపథను పరాక్రమము నెరపి చిన్నచిన్న రాజ్యములు స్థాపించిరి త జావూరు మధుర చె జి మున్నగునవి ఇట్టివే ఆరీతిగ తమిళదేశమునకు వెడలి అక్కడ ప్ర ద్ధికెక్కిన వారిలో అక్కారెడ్డి యొకడుగా కాన్పి చును దిక్కుదిక్కుల వార్తకెక్కు నక్కారెడ్డి నట్టిట్టుచేసి చేపటు పట్టె అని చాటుకవి చిక్కరాయల విజయమును పొగడుటచే అక్కారెడ్డి రూఢి కెక్కిన వీరుడనుట తథ్యము ఈరోడ్డు కోయ బత్తూరు జిల్లాలోనున్నది

చిక్కదేవరాయలు రాజ్యారూఢుడగునప్పటికి కర్ణాటకమునందు గోల్కొ డ విజాపూరు రాజ్యముల విజృంభణము తగ్గుముఖము పట్టెను ఔర గజీబు చక్రవర్తి ఈరెండు ముస్లిము రాజ్యములను కబళి చుటకు సన్నాహములు చేయుచు డెను శివాజీ నేతృత్వమున మహారాష్ట్రులు కర్ణాటకములో తమ బలమును పె పొ ది చుకొన జూచుచుండిరి 1677 లో కైతవముచే శివాజీ చెంజీ దుర్గమును స్వాధీనము చేసుకొనెను 1674 వరకే త జావూరు నాయక రాజ్యము అస్తమి చి ఏకోజీ నాయకత్వమున మహారాష్ట్రపరిపాలన ఆరంభించెను మధుర ఏలికయైన చొక్కనాథ నాయకుడు స్థిర సంకల్పము గాని రాజనీతి గాని లేని దుర్బలప్రభువుగా నుండెను ఇట్టిస్థితిలో మైసూరు చిక్కదేవరాయలు తన సరిహద్దులను రక్షించు కొనుటకు అన్యరాజ్యములపై దురాక్రమణ సాగించుట అవసరమైన చర్యగా భావించి అట్టి యుద్యమములో ను డెను క్రీ శ 1678 సంవత్సరములో ఆతడు మధుర నాయక రాజ్యపు దౌర్బల్యమును గుర్తి చి ఆ రాజ్యపు ఉత్తర సరిహద్దు నందలి దుర్గములను ఆక్రమి చుకొనుటకు పూనుకొనెను ఘట్ట మొదలియారు అను మధుర సేనాని కాపాడుచుండిన అందూరు కుంటూరు దుర్గములను చిక్కదేవరాయలు స్వాధీనము చేసికొనెను తరువాత ఆతడు ఈరోడు దుర్గమును ముట్టడించి దానిని రక్షించుచు డిన అక్కారెడ్డిని ఓడించి ఆతనిని చెరపట్టెను అక్కారెడ్డి సులభముగా లొంగినట్లు కనబడదు ఆతడు వీరోచితముగ సుదూరము తనదుర్గపు ముట్టడిని ఎదుర్కొనెను కాని చొక్కనాథునివద్దనుండి సహాయముభాకుండుటచే కాబోలు ఆతడు పరాజయమును అ గీకరి చెను చిక్కరాయలును వీరుడగుటచే సమర్థుడగు అట్టి ప్రత్యర్థిని హర్షి చి కోటను తిరిగి ఆ నికే అప్పగి చి తనకు విధేయునిగను మిత్రుని ను చేసుకొనెను అక్కారెడ్డిని గూర్చి ఇ ం మిక్కిలి విశేషములు తెలియ రాలేదు మైసూరు చరిత్రకారులగ హయవదనరావుగారు చిక్కదేవరాయ విజయములకై కమలాచల మహాత్మ్యము హస్తిగిరి మాహాత్మ్యము వ టి క న్నడ గ్ర థములను ఆధారముగా పేర్కొనిరి వాటియ దు అక్కారెడ్డిని గూర్చి ఏమైన ఉన్న దేమో!

భం ల రం

వి శి సు

## అక్కిరాజు ఉమాకాంతపండితుడు (1889-1932)

స్వయ కృషితో విద్యను స పాది చి విద్యాశేఖరులైన మహామనీషులు అక్కిరాజు ఉమాకా త గారు వీరు క్రీ శ 1889 వ స వత్సరమున జన్మి చిరి

వీరు నియోగి బ్రాహ్మణశాఖకు చె దినవారు భాష్యాతముగ సంస్కృత వ్యాకరణమును తర్కశాస్త్రమును నవద్వీప స ప్రదాయాను సారముగ వంగదేశమున దు ఈయన అభ్యసించెను ఆ గ్ల మున దును ఈయనకు మ చి పా డిత్య ము డెను వంగదేశమునందు చదువుకొనినప్పుడు ఈయనకు వంగభాషా ప డితులతో గొప్ప సాహచర్యము లభి చెను వంగ సాహిత్యాభివృద్ధికి వారు చేయు ప్రయత్నములను ఉమాకా తప డితులు బాగుగ ఆకళి పు చేసికొనిరి స్వానుభవమును సూక్ష్మ పరిశీలనమును లోకజ్ఞానమును ఆధారముగ చేసికొని ఈయన తెలుగు సారస్వతమును పరిశీలి ప దొడగెను

చిత్రము 4



అక్కిరాజు ఉమాకా త ప డితుడు

చావిలికొలను సుబ్బారావుగారికి పిమ్మట ఈయన మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో అధ్యాపకులుగా ఉ డిరి దేహబలము తక్కువ కానీ బుద్ధిబల మీయనకు కడుగొప్పది

మద్రాసులో వావిళ్లవారు నడిపిన త్రిలిఙ్గ పత్రికకు కొంత కాల మీయన సంపాదకులుగ ఉండిరి. వాఙ్మయ పరిశీలనము నందు ఈయన గుణములను ఎంచక దోషములనుమాత్రమే చూపెడివారని కవుల అభిప్రాయము. ఇందుచేత నే కాబోలు కొందరు కవులకు ఈయన చేరిగిట్టలేదు. ఎందరు ఎట్లు అనుకొనినను సత్యమని తాను నమ్మిన విషయమును ఈయన విడువక నిర్భయముగ విమర్శనమును సాగించెను. తెలుగు నందు అనుస్వారము లేదని నిరూపించి ఈయన తన పేరును ఉమాకాన్తమ్ అని వ్రాసికొనెను.

ఈయన గ్రంథములు పరిశీలించినచో అందు ఈయన బహుముఖప్రజ్ఞ, నిశిత పరిశీలనశక్తి, పాండిత్యము వ్యక్తమగుచున్నవి. వీరి గ్రంథములు పూర్తిగా రచించినవి, కొంత వ్రాసి విడిచినవి, వ్రాయబూనినవి" అని మూడు విధములుగ కనుపట్టుచున్నవి. ఈయన రచనలలో అగ్రశ్రేణికి చెందినవి అలంకార శాస్త్రమునకు సంబంధించిన రసమీమాంస, ఆంధ్ర చంద్రాలోకవివరణము, సంస్కృత వ్యాకరణ ప్రదీపము (ఆంధ్రవివరణము) పాణినీయము, నైషధతత్త్వజిజ్ఞాస, సూత్రాత్మకమైన వాఙ్మయ దర్శనము అను గ్రంథములు. సులభమైన శైలితో నొప్పు వీరి రచనలు—చరిత్రాత్మకమైన టిప్పుసుల్తాను అను నవల, షేక్స్పియరు నాటకకథలు, త్రిలిఙ్గ చిన్నకథలు, తెలుగుదేశమునందలి చండాలురు అనునవి. ఈ విధముగ తెలుగులో సులభశైలిని ప్రవేశపెట్టిన ఘనత ఈయనకుదక్కెను.

ఈయన పల్నాటివీరచరిత్ర అను ద్విపద కావ్యమును పరిశోధించి అమూల్యమైన పీఠికతో దానిని ప్రచురించెను. సంస్కృతమందున్న పతంజలిభాష్యమును కొంత తెనిగించి అచ్చువేయించెను. ఆ పని కొంతలోనే ముగిసినది. వాఙ్మయ దర్శనము అను గ్రంథమునందు 'నేటికాలపు కవిత్వ' " అను అధ్యాయమునకు మాత్రమే ఈయన వివృతి వ్రాసెను. ఇందు ఈయన భావకవిత్వమును మిక్కిలి విమర్శించెను. వృత్తిసహితమైన తెలుగుభాషావ్యాకరణమును వ్రాయనారంభించెను. దానిని ముగించకయే తమ నలుబదిమూడు సంవత్సరముల జీవితమునందే అమూల్యమైన కాలమును సారస్వతసేవ కంకిత మొనర్చి క్రీ. శ. 1937వ సంవత్సరమున వీరు జీవితమును చాలించిరి. తెలుగు సారస్వత చరిత్రమునందు చెరగని స్థానమలంకరించిన ఉమాకాంత విద్యాశేఖరులు ధన్యజీవులు.

తం. ఆం. శా.

## అక్కూరు

జనగామ తాలూకా, వరంగల్లు జిల్లాలో అక్కూరు గ్రామము ఉన్నది. దీనికి 60 మైళ్ళలో వరంగల్లు పట్టణము కలదు. తూర్పున పోచన్నపేట, పడమట మెదకు, ఉత్తరమున చేరియాల, దక్షిణమున కొడకండ్ల ఈ గ్రామ సరిహద్దులు. దీని విస్తీర్ణము 5559 ఎకరములు. ఇది మెరక ప్రదేశమున ఉన్నది. చిన్న బోళ్ళు గుట్టలు ఉన్నవి. ఇవి నల్లరాయి నిర్మాణములు.

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఇచ్చట 1877 మంది పురుషులు, 1848 మంది స్త్రీలు, మొత్తం 3725 మంది జనులుండిరి. ఈ సంఖ్యలో హరిజనులు 799 మంది. మెడ్యూల్డు జాతుల పురుషులు 407 మంది, స్త్రీలు 392 మంది. ఇచ్చట ఇండ్లు ఒకచోట గుంపుగాను, వాడవాడలుగాను, ఒకచోట వలయాకారముగాను ఉన్నవి. వీటిలో 20 పెంకుటిండ్లు, రెండు ఒక అంతస్తుమేడలు ఉన్నత పాఠశాల, రవాణా సౌకర్యము ఉండుటవలన ఈ గ్రామము ఈశాన్యదిశగా అభివృద్ధి చెందుచున్నది. బహుకొలదిమంది జొన్న అన్నమును, మిగిలినవారు వరిఅన్నమును తిందురు.

ఈ గ్రామమునకు నీటివనరు 33 ఎకరముల ఊర చెరువు. దీని గరిష్ఠమైన లోతు 10 అడుగులు. దీనిక్రింద 1966-67 సం॥లో వరి, జొన్న, మక్క, వేరుసెనగ, కంది, పెసర, నువ్వు, మిరపపంటలు పండెను. వీటిని బండ్లపై జన గామకు రవాణాచేసిరి. 12 ఎకరముల మామిడి తోట కలదు. 18000 మామిడి కాయలను స్థానికులే ఉపయోగించుకొనిరి. బీర, టొమాటో, వంగ మొదలగు కూరగాయలను పండించిరి. రు 400 ల బీరకాయలను మాత్రము చేరియాలకు, కొడకండ్లకు రవాణాచేసి మిగిలిన కూరగాయలన్నింటిని స్థానికులే ఉపయోగించుకొనిరి. పంటలక్రింద 3600 ఎకరముల భూమి ఉపయోగించబడెను. చెరువుక్రింద 800 ఎకరములు, బావులక్రింద 2000 ఎకరములు, వర్షాధారమున 800 ఎకరములు సాగుబడి ఆయెను. 18 ఆయిలు ఇంజనులు, మోటలు 240 ఎకరములకు నీటిని సరఫరా చేసెను. ఇచట తరినేల 1200 ఎకరములు, రేగడినేల 2840 ఎకరములు, ఎర్రమట్టి నేల 500 ఎకరములు, బంజరుభూమి 600 ఎకరములు.

ఇచ్చట గేదెలు, ఎద్దులు, ఆవులు, ఆబోతులు కలిపి 2689 కలవు. మేకలు 112, గొర్రెలు 118, పందులు 84.

కోళ్ళు 3 169 ఉన్నవి దినమునకు 300 లీటర్ల పాలు 30 కి గ్రా మాంసము 600 గ్రుడ్లు వారమునకు 20 కి గ్రా నెయ్యి స్థానికులు ఉపయోగింతురు

వ్యవసాయము కూలి కుటీర పరిశ్రమ ఈ గ్రామప్రజల ముఖ్యవృత్తులు 40 మంది దుకాణాదారులు 36 మంది ఎద్దు బండ్లు తోలువారు కలరు కంసాలివారు వడ్రంగులు కమ్మరివారు కుమ్మరివారు మంగలివారు చాకలివారు గొల్లవారు వడ్డెరవారు సాలెవారు కలరు ఒక చేనేత కుటీర పరిశ్రమ కలదు రు 11 600 ల విలువగల ధోవతులు చీరెలు తువ్వాలలు మొదలగునవి స్థానికులే ఉపయోగింతురు వ్యవసాయదారులకు పరిపోవు కూలీలు దొరుకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 3 లు స్త్రీకి రు 1

ఇక్కడ శివాలయము ఆంజనేయస్వామి దేవాలయము ఉన్నవి

అక్కూనరునకు 6 మైళ్ళలో జనగామ రైల్వేస్టేషను కలదు అరు కచ్చారోడ్లు మాత్రము ఉన్నవి దీనిని చేరియాలతో ఒక మట్టిరోడ్డు కలుపుచున్నది 400 రెండెడ్లబండ్లు 26 సైకిళ్ళు సామానులను కొనిపోవుటకును ప్రయాణములకును సహాయపడును

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు జిల్లా పరిషత్తు హైస్కూలు ఉన్నవి ఇది పంచాయతి పరిపాలనలో ఉన్నది ఇంటిపన్నులు వాహనములపై పన్నులు బంజరదొడ్లపై పన్నులు ఈ పంచాయతీకి ఆదాయమును సమకూర్చును గ్రామపారిశుద్ధ్యమునకు ఏర్పాట్లు ఉన్నవి పబ్లికు గ్రంథాలయము కలదు నాటకశాలగా మార్చుకొనుటకు వీలుగా నున్న ప్రదేశమొకటి కలదు గ్రామసహకార సంఘము 62 మందికి అప్పులిచ్చినది ప్రధాన ఆరోగ్యకేంద్రము కలదు పశువుల రోగాలకు నాటువైద్యము జరుగును ఇద్దరు ఇంగ్లీషు వైద్యులు ఒక ఆయుర్వేద వైద్యుడు కలరు గ్రామసంతలు లేవు 12 కిరాణాదుకాణములు 3 కాఫీ హోటళ్ళు 12 కిళ్ళీ సోడా సిగరెట్టు దుకాణములు రెండు కూరగాయల అంగళ్ళు రెండు సైకిలుషాపులు రెండు ఇతరషాపులు కలవు

అక్కూనరునకు 10 మైళ్ళలో ఉన్న చేరియాలలో తంతి కార్యాలయము పశువైద్యశాల పోలీసుస్టేషను బ్లాకు అభివృద్ధికేంద్రము కలవు ఈ గ్రామమునకు 30 మైళ్ళలో ఉన్న జనగామలో కోర్టులు సబ్ రిజిస్ట్రారు ఆఫీసు తాలూకా కచ్చేరి పురుషుల ఆసుపత్రి జనరల్ ఆసుపత్రి ఉన్నవి కళాశాల చదువులకు గ్రామ విద్యార్థులు వరంగల్లులోని ఆర్ట్సు కళాశాల పోవుదురు

మా శ్వే

## అక్బర్ (1556 1605)

భారతదేశమును పాలించిన ప్రముఖ చక్రవర్తులలో అక్బరు చక్రవర్తి యొకడు మొగలు పాలకులలో ఇతడు అగ్రగణ్యుడు ఇతడు హుమాయూను - హమీదాబాను బేగముల పుత్రుడు హుమాయూను రాజ్యమును కోల్పోయి ప్రవాసములో ఉన్నపుడు క్రీ శ 1542 సం లో అక్బరు జన్మించెను పూవు పుట్టగనే పరిమళించునన్నట్లు అక్బరు చిరుత ప్రాయముననే విద్యల దారితేరి 14 సం ల ప్రాయమున రాజ్యాభిషిక్తుడై తన శక్తి సామర్థ్యములను ప్రకటించెను క్రీ శ 1556 సం న రెండవ పానిపట్టు యుద్ధములో అక్బరు శత్రువుల నిర్జించి తన తాతముత్తాతలార్జించిన రాజ్యమున కధిపతి యయ్యెను నాటినుండి క్రీ శ 1605 సం లో పరలోకగతుడగువరకు కూడ అక్బరు నిరంతరము తన రాజ్యాభివృద్ధికి పాటుపడుచు ప్రజానురంజకముగ పాలించుచుండెను ఇతడు గొప్పవీరుడు విశాలహృదయుడు సామర్థ్యము గల్గినపాలకుడు

రాజ్యము వీరభోగ్య మని కదా ఆర్యోక్తి కావుననే ఉత్తరాపథమునెల్ల తన పాదాక్రాంతము గావించుకొనిన ఎదప వీరాగ్రేసరుడు రాజశేఖరుడు నగు అక్బరు చక్రవర్తి తన దృష్టిని దక్కనువైపు మరల్చినాడు క్రీ శ 1591 సంవ అక్బరు చక్రవర్తి ఖాందేష్ అహమ్మదునగరు బిజాపూరు గోల్కొండల పాలకులకు తన సార్వభౌమాధికారమునకు తలయొగ్గవలసినదిదని తన రాయబారుల ద్వారా సందేశములంపెను తన రాజ్యము విస్తీర్ణమునందు చిన్నదగుటచే మొగలుసైన్యముల నెదుర్కొనుటకు వలయు సేనాదిక సామగ్రి తనవద్ద లేదని గుర్తెరిగిన ఖాందేష్ పాలకుడగు రాజా అలీఖాను ఈ మొగలు ప్రభువు యొక్క సందేశమును శిరసా వహించెను అంతియేగాక ఇతడు తన పుత్రికను అక్బరు చక్రవర్తి జ్యేష్ఠపుత్రుడైన మురాదున కిచ్చి ఉద్వాహము గావించెను

ఖాందేష్ పాలకుడు మొగలాయీల ఆధిపత్యమునకు తలయొగ్గినప్పటికిని మిగిలిన మూడురాజ్యములు అహమ్మదు

నగరు బిజాపూరు గొల్కొండలు మాత్రమట్లుచేయుట క్కొ కొనలేదు తొలుదొల్త ఈ రాజ్యముల ప్రభువులు సూటి కమ అభిప్రాయమును వ్యక్తీకరింప కాలయాపన జేసి పిదప అవసరమగుటచే ఆ పద్ధతిని విడనాడి తాము మొగలులకు సామంతులము గాలేమని కుండబద్దలు గొట్టినట్లు జెప్పిరి దక్కను సుల్తానులిచ్చిన ఈ జవాబు అక్బరు కాగ్రహమును కలిగించినది దక్కను రాజ్యముల జయించుటకే అతడు నిర్ణయించుకొనెను క్రీ శ 1595 సం లో యువరాజు మురాదు ఖాన్‌ఖానా షారుక్ మీర్జాల నాయకత్వములో మొగలు సేనలు అహమ్మదునగరుపై దండెత్తివచ్చిన నాడు బిజాపూరు రాణియైన చాంద్‌బీబి (చాంద్ సుల్తానా) యే అహమ్మదునగరు రాజ్యపాలనా వ్యవహారముల నడుపుచుండెను అందులకు కారణము అహమ్మదునగర రాజ్యమునకు ప్రభువుగా ప్రకటింపబడిన బహదూర్ షా పసిబాలుడగుటయే ఈ బాలునకు సంరక్షకురాలుగ నుండి చాంద్‌బీబి రాజ్యపాలనా భారము నంతటిని కడు సమర్థతతో నిర్వహించుచుండెను

క్రీ శ 1595 డిసెంబరు 16 వ తేదీన తమ కోటను ముట్టడించిన మొగలు సేనలతో అహమ్మదునగరు సైన్యములు తలపడినవి ఈయుద్ధములో ఇరువాగు వారు తీవ్రముగ పోరాడిరి చాంద్‌బీబి ప్రదర్శించిన శక్తియుక్తులు శౌర్య సాహసములు శత్రువర్గముల వారిని సహితము భయభ్రాంతుల గావించెను సుమారొక మాసకాలము వరకు ముట్టడి కొనసాగినది కాని ఫలితము శూన్యము వెనకు వేలు మొగలు సైనికులు మాత్రము హతులైరి ఈ స్థితిలో వేరు మార్గము తోపక మురాదు సంధి ప్రయత్నము కావించెను కొనెను ఇరుపక్షముల మధ్య సంధి కుదిరినది ఈ సంధివలన బీరారు మొగలులకు లభించినది అహమ్మదునగర రాజ్యమునకు బహదూర్ నిజాముషాను వారసుడుగా మొగలు గుర్తించిరి మొగలుసార్వభౌమాధికారము నకు అహమ్మదునగర మంగీకరించినది క్రీ శ 1597 సం లో మొగలులు సంధి షరతులను ఉల్లంఘించి అహమ్మదునగర రాజ్యపు భూభాగముల కొన్నింటిని ఆక్రమింపసాగిరి వారిని నిరోధించుటకు చాంద్‌బీబి అహమ్మదునగరు బీజాపూరు గోల్కొండ రాజ్యముల నొక మాఖ్యగ నేర్పరచి సుహైలీఖాను నాయకత్వములో దక్కను సైన్యములను పంపెను క్రీ శ 1597 జనవరి 27 వ తేదీన పోరు ఆరంభమైనది రెండు రోజులపాటు జరిగిన ఈ సంకుల సమరములో మొగలులే నెగ్గిరి కాని వారు ఈ యుద్ధములో విశేషనష్టమును పొందిరి మొగలుల పక్షము వహించి పోరాడిన ఖాందేష్ ప్రభువగు రాజాఅలీఖాన్ కూడ ఈ యుద్ధములో అసువులు బాసెను మొగలు సేనలు ఓడిపోయిన దక్కను సైన్యములను వెన్నంటి తరుముచు అహమ్మదునగరపు పొలిమేర్లవరకు వచ్చెను కాని కోటను పట్టుకొను విషయమై మురాదు ఖాన్ ఖానా్ల మధ్య అభిప్రాయభేదములు తలయెత్తినవి అందుచే వారు అహమ్మదునగరు కోటను ముట్టడింపకయే వెనుదిరిగిపోయిరి

అక్బరు చక్రవర్తి ఆశించినట్లుగ మొగలు సైన్యాధిపతులు దక్కను రాజ్యముల జయించి వాటిని అతని పాదాక్రాంతములగునట్లు చేయలేకపోయిరి ఇందులకు ప్రధాన కారణము సైన్యాధిపతుల మధ్య సమైక్యము లేకపోవుటయే మొగలు సేనాపతులు ఈర్ష్యాళువులై పరస్పర నిందలకు దిగి స్వార్థ కర్తవ్యని ర్వహణములో ప్రమత్తులై వర్తించిరి ఇందులకు తోడు వారిలో కొందరు లంచగొండులై పట్టియున్నట్లు మెలగిరి దక్కను రాజ్యములను జయించుటలో జరుగుచున్న జాప్యమును సహింపలేక అక్బరు చక్రవర్తి స్వయముగ సైన్యాధిపత్యమును వహించి క్రీ శ 1599 సం లో దక్కనుకు తరలివచ్చెను

అక్బరు దక్కనులో అడుగిడునప్పటి ఖాందేష్ ప్రభువైన బహదూరుషా ఫరూకి మొగలుల ఆధిపత్యమును ధిక్కరించి పాలించుచుండెను అందుచే అక్బరు సైన్యమును రెండు విభాగములుగా జేసి ఒకదానిని కుమారుడగు డేనియల్ నాయకత్వములో అహమ్మదునగరముపై పంపి రెండవ భాగమునకు తానే నాయకుడై ఖాందేష్‌ను జయింప సమకట్టెను అక్బరు మొదట బర్హానీపూరును జయించి ఆ పిదప అసీఘరును ముట్టడించెను అతికష్టముతో అతడు కూటనీతిని ప్రయోగించి ఆసీఘరును క్రీ శ 160 సం లో స్వాధీనపరచుకొనగలెను

డేనియల్ అహమ్మదునగరముపై దండెత్తి వచ్చునరికి అచటి పరిస్థితులన్నియు అస్తవ్యస్తముగ నుండుటచే వాతావరణము విశేషముగా అతనికి అనుకూలించినది చాంద్ సుల్తానా అప్పటికి మృత్యుసన్నిధి కేగినది అహమ్మదునగర రాజ్యమునందలి ప్రముఖులు పరస్పర ద్వేషములకు స్పర్థలకు ఈర్ష్యలకు దాసులై తరచు కలహించుచుండిరి ఇట్లు

పతనావస్థలోను న్న అహమ్మదునగరమునకు సహకరించుటకు బిజాపూరు గోల్కొండలు గతములోవలె ముందునకు రావయ్యెను ఇట్టి పరిస్థితులలో దండెత్తి వచ్చిన డేనియల్ అనాయాసముగ క్రీ శ 1600 సంలో అహమ్మదునగరమును ముట్టడించి జయించి ఆక్రమించెను అహమ్మదునగరము మొగలు సామ్రాజ్యములో ఒక భాగమై పోయినది ఇట్లు అక్బరు చక్రవర్తి తాను పరమపదించు నాటికి దక్కనులోని ఖాండేష్ బీరార్ అహమ్మదునగర ప్రాంతములను జయింపగల్గెను ఆ చెం

## అక్బర్ హైదరి సర్

సర్ అక్బర్ హైదరి పూర్తి పేరు మహమ్మద్ అక్బర్ నజరల్లీ హైదరి ఇతనిని నవాబ్ హైదరీనవాజ్ జంగ్ బహద్దూర్ యనికూడ వ్యవహరించుట కలదు ఇతడు క్రీ శ 1869 నవంబరు 8 వ తేదీన బొంబాయి నగరమందు జన్మించెను బొంబాయి యందలి ప్రముఖ వ్యాపారులలో ఒకడైన సేట్ నజర్ ఆలీ ఇతని తండ్రి న్యాయమూర్తియైన బదురుద్దీన్ తాయబి ఇతని మేనమామ ఇతని తాత ముత్తాతలు గొప్ప వ్యాపారులు ఇతని పూర్వులు అరేబియా నుండి బొంబాయి నగరమునకు వ్యాపారము నిమిత్తమై వచ్చి అచటనే స్థిరపడిపోయిరి



సర్ అక్బర్ హైదరి

సర్ అక్బర్ హైదరి బాల్యమునుండియు సునిశిత మేధాశక్తి గల్గినవాడు పదునాల్గు సంవత్సరములు నిండకపూర్వమే ఆగ్ల మెట్రిక్ పరీక్షయందు ఉత్తీర్ణుడయ్యెను 17 సం॥ ల ప్రాయమున అతడు బి ఎ పట్టభద్రుడయ్యెను తదనంతర మతడు భారత ప్రభుత్వమువారు నిర్వహించుచున్న ఆర్థిక శాఖకు సంబంధించిన ఉన్నతపరీక్షలలో ఉత్తీర్ణుడై నాగపూరునందు ప్రభుత్వోద్యోగిగ నియమింపబడెను ఉద్యోగరీత్యా అతడు కొంతకాలముపాటు లాహోరు కలకత్తా అలహాబాదు మద్రాసు నగరములందు ఉండవలసిన వాడయ్యెను ఈ మధ్యకాలములో అతడు ప్రభుత్వ ముద్రణాలయపు లెక్కలను తనిఖీ చేయు నిమిత్తము ప్రత్యేకాధికారిగ నియమింపబడెను ఈ హోదాలో అతడు ప్రభుత్వ ముద్రణాలయపు లెక్కల శాఖలో అనేక సంస్కరణములను ప్రవేశపెట్టి దానిని చక్కదిద్దెను

సర్ అక్బర్ హైదరి యొక్క కార్యదీక్షకు చాకచక్యమునకు కర్తవ్యనిర్వహణదక్షతకు ముగ్ధులైన నాటి నిజాము ప్రభువర్యులు అతనిని తమ ప్రభుత్వములో ఉద్యోగిగా నియమించుకొనుటకు వీలు కల్పింపవలయునని భారత ప్రభుత్వమును అర్థించిరి అందులకు వారు అంగీకరించిరి క్రీ శ 1905 స ॥ లో అక్బర్ హైదరి నైజాములో అకౌంటెంట్ జనరల్‌గా నియమింపబడెను ఆపదవిలో అతడు తన శక్త్యనుసారము కృషిచేసినాడు క్రీ శ 1906 స ॥ లో అతడు ఆర్థిక శాఖకు కార్యదర్శిగను క్రీ శ 1907 స లో రాజ్యాదాయ సదస్యుడుగ నియమించబడెను ఆర్థికశాఖలో అతడు అనేక సంస్కరణలు ప్రవేశపెట్టి దానిని తీర్చిదిద్దెను ఈ తరుణములోనే అతడు విద్యాశాఖకు కూడ తన సహకార సంపత్తి నందజేసి దాని అభివృద్ధికి కూడ తోడ్పడెను

క్రీ శ 1911 స । లో అక్బర్ హైదరి నైజాము ప్రభుత్వములో దేశీయ శాఖా కార్యదర్శిగా నియమించబడెను అపుడు న్యాయశాఖ పోలీసుశాఖ సామాన్యశాఖ అతని పర్యవేక్షణక్రింద ఉంచబడెను అతడు తన పదవిలో పగలనక రాత్రియనక కృషిజేసి తన కర్తవ్యములను కడు సమర్థతతో నిర్వహించెను ఈ పదవిలోనుండియే అతడు హైద్రాబాదు నగర మందలి హైకోర్టు సిటీకాలేజి మొదలగు భవన నిర్మాణమునకు వలయు చర్యలన్నిం గైకొని దానిని పూర్తిజేసెను ఇట్లు సుమారు 15 సం॥ ల పాటు అక్బర్ హైదరీ నిజాము ప్రభుత్వముతో తనయోగ్యకొలదిసేవ చేయుచుండెను

క్రీ శ 1920 సం॥ లో అక్బర్ హైదరి భారతప్రభుత్వ సేవ చేయుటకు అభిలషించెను అందుకై అతడు బొంబాయిలో అకౌంటెంట్ జనరల్‌గా నియమింపబడెను కాని మరల నైజాము ప్రభుత్వ అభ్యర్థనపై అతడు మరుసవత్సరమే హైదరాబాదునకు ఏతెంచి ఆర్థిక శాఖను చేపట్టెను ఆ పిదప అతడు ఆర్థికశాఖను అనేక భాగములుగ విభజించి దాని సక్రమ నిర్వహణమునకు దోహదము చేసెను ఈ కాలములోనే రాష్ట్రమందలి పారిశ్రామికాభివృద్ధి కతడెంతయు కృషి జేసినాడు పరిశ్రమలకు ఆర్థికసహాయము చేయుటకు గాను హైదరి ఒక కోటి రూపాయల మూలధనమును కేటాయించెను రాష్ట్రపు బహుముఖాభివృద్ధి కొరకతడు కలలు గను

చుండు వాడు

అక్బర్ హైదరి గొప్ప విద్యావేత్తయేగాక విద్యాభిమానికు డ విద్యావ్యాప్తికి అ దును మాతృభాషాభివృద్ధికి అతడు నిరంతరము శ్రమించినాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయములో బోధనభాషగా ఉర్దు ప్రవేశ పెట్టుటలో అక్బర్ హైదరి వహించినపాత్ర అత్యంత ప్రముఖమైనది ఒక దేశ భాషను ఉన్నత విద్యాబోధన భాషగ ఎన్నుకొనుటలో హైదరి చూపిన దూరదృష్టి కడుశ్లాఘ్యము నైజాము రాష్ట్రములోనే గాక రాష్ట్రము వెలుపలకూడ విద్యావ్యాప్తికై అక్బర్ హైదరి పాటుపడినాడు విద్యా స బంధమైన అనేక సదస్సులకు అధ్యక్షత వహించియు ఆలిఘర్‌లోని ఎమ్ ఏ ఓ కళాశాలకు ట్రస్టీగా ఉండియు అనేక విద్యాసంస్థలకు సహకరించియు తన విద్యాప్రియత్వమును సర్ అక్బర్ వెల్లడించినాడు స్త్రీవిద్యకై కూడ అతడు కృషి జేసెను హైదరాబాదు నగర మందలి నేటి మహబూబియా బాలికల పాఠశాల అతని కృషి ఫలితమే

హిందూ మహమ్మదీయ సఖ్యమునకై కూడ అక్బర్ హైదరి కొంతవరకు పాటుబడినాడు కాని నిజాము రాష్ట్ర కాంగ్రెసు విషయమునకు ఆర్యసమాజ విషయమునను అతడు అనుసరించిన విధానము సంతృప్తికరమైనదిగా నున్నట్లు తోచదు ఐనను ఒకరివద్ద సేవ జేయువారు అంతక టె చేయకల్గినది లేదు సర్ అక్బర్ హైదరి కార్యదక్షతగల్గిన ప్రభుత్వోద్యోగి యనుటకెట్టి సందియములేదు అతడు ఎక్జిక్యూటివ్ కౌన్సిలుకు అధ్యక్షుడై చేసిన సేవ గణనీయము బ్రిటిషు సమ్రాట్టు అతనికి వీర చక్రమును బహుమాన పురస్సరముగ ప్రసాదించినాడు అట్లే 1936 స౦॥ లో అతనిని సర్ అనరబుల్ అను విశేషణము లతో గౌరవించుట జరిగినది

ఆ చెం

## అక్షశాలిని – నాప

అన తవర్మగంగమహారాజు కళింగనగరమును రాజధానిగా చేసికొని కళింగాంధ్రమును క్రీ శ 9వ శతాబ్దము ఉత్తరార్థమున పాలించెను గంజా ము మండలములోని మహేంద్రగిరి మొదలుకొని గోదావరీనది వరకుగల మధ్య ప్రదేశమును కళింగాంధ్రమందురు క ళిగరాజ్యము తూర్పు గోదావరిజిల్లాలోని పిఠాపురము మొదలు ఉత్తరదిశనున్న మహానదిదాకా వ్యాపించినది మహానదికి ఎగువనున్న ప్రదేశము ఉత్కళములేక ఓఢ్రమని వ్యవహరి ప బడినది

అనంతవర్మ (ఇతడు పూర్వగా గుల వర పరకు చెందిన వాడు ఇతనిని మూడవ అనంతవర్మ యనుచున్నారు) తన విజయరాజ్య గం సంవత్సరము 358 (క్రీ శ 856) లో నణిచారణ అను గ్రామమును శాండిల్యగోత్రుడైన విష్ణుభట్టు అను బ్రాహ్మణు కు సూర్యగ్రహణ కాలమున దానము చేసెను విష్ణుభట్టునితండ్రి హరిశ్చంద్రుడు ఈ తామ్రశాసనము సంస్కృతమునందు వ్రాయబడినది ఇది గంజా జిల్లాలోని టెక్కలి అను గ్రామమున దొరకినది శాసనము ననుసరి చి అనంతవర్మతండ్రి మూడవ దేవేంద్రవర్మ అనియు అన్న సత్యవర్మ అనియు తెలియుచున్నది ఈ వ శములోని రాజులు శివారాధకులుగా గోకర్ణస్వామి పాదారవి దభక్తులుగా శాసనములలో పేర్కొనబడిరి కళింగపూర్వగాంగులకును వేంగి చాళుక్య వంశమునకును వైవాహిక బధ బాంధవ్యము ఏర్పడినట్లు చరిత్రాధారములు కలవు

శాసన రచయిత సామంతమాత్రశ్రీ శాసనము చెక్కినవాడు నాప ఇ దు అక్షశాలిని యను పదము విశేషణముగ వాడబడినది ప్రభుత్వ స బంధమైన ముఖ్య పత్రము లను భద్రపరచువారికి ఆకాలమున అక్షశాలిని యని అధికార పూర్వక నామధేయ ముండెడిది

నణిచారణ గ్రామపుటునికి ఇ కను పరిశోధించవలె ఉన్నది

కొ వెం

## అక్షసవాడ

ఇదియొక గ్రామనామము ఎపిగ్రాఫియా ఇ డికా X సంపుటము 14 పుటలో స గ్రహింపబడిన అమరావతీ స్తూప శాసనములందు ఇది పేర్కొనబడి యున్నది ల్యూడర్సు అను జర్మను ప డితుడు బ్రాహ్మీలిపి శాసనములను లభించిన వాటి నన్నింటిని ఒకచో చేర్చి వాటి సారాంశము వ్రా చరిత్ర కారులకు గొప్ప ఉపకారము చేసియున్నాడు ఈ శా నపు శిల ఇప్పుడు బ్రిటిషు మ్యూజియములో ఉన్నదట అమరావతీ శిల్పములమీద చెక్కబడిన ఈ శాసనము ప్రాకృతభాషలో ఉన్నది శాసన దాతకాలము మున్నగునవి ఏవియు తెలియరావు అర్జునుడనువాడు ఒక మదురురాయిని బౌద్ధ స్తూపమునకు దానముచేసె ని దీని సారాంశము అర్జునుని తాత గృహపతి మరితియనునాతడు అర్జునునితండ్రి ప్రశంస

దీనిలో లేదు ఇతడు అతుసవాడ నివాసియు ఈ గ్రామ మెచ్చటిదో గుర్తించుటకు అస్కారములేదు గుంటూరు మండలము లోనిది అగునేమో తెలియదు బౌద్ధ సఘమున దు సన్యాసుల సన్యాసినులు ఉండుట ప్రసిద్ధము అయినను సంసారిత్యాగము చేయనివారికి గూడ ఆచార్య నాగార్జునుడు బౌద్ధ సఘములో గౌరవస్థానమును కల్పించెను వీరే గృహపతులు అని తోచుచున్నది బుద్ధుని ముఖ్య ధర్మములైన అహింస ఋజుప్రవర్తనము మున్నగు వ్రతములను పాటించుచు గృహస్థ ధర్మమును నడుపుకొనువారే గృహపతులు ప్రాచీన బౌద్ధముయొక్క కఠోర సాంఘిక నియమములను ఉచితరీతిని సడలించి ఆచార్య నాగార్జునుడు దానికొక పునరుజ్జీవనమును కలిగించినాడు నాగార్జునుడు ప్రవేశపెట్టిన సంస్కారమునే మాధ్యమికవాదము దురు అర్జునుడు ను గృహపతియైన యాగని ఎతామహుడును మాధ్యమికవాదమును అవలంబించిన బౌద్ధులుగా మనము గుర్తింపవచ్చును

గృహపతి యనుపదము వేద వాఙ్మయమునుండి బౌద్ధులు గ్రహించియుందురు అగ్నిదేవుడు గృహపతియని మంత్రముల దు కలదు అయమగ్ని గ్గృహపతిః । ఋనగ్ ఉత్సృష్ట వర్ధనః

ఖం ల రం

## అఖండపాత్రుడు

ఇతడు పదునారుగురు పాత్రులలో ఒకడు బలభద్ర పాత్రుడు దుర్గాపాత్రుడు భీమాపాత్రుడు ముకుంద పాత్రుడు భీకరపాత్రుడు బేరుపాత్రుడు రణరంగపాత్రుడు ఖడ్గపాత్రుడు అఖండపాత్రుడు మురారిపాత్రుడు వజ్రముష్టి పాత్రుడు తురగరేవంతపాత్రుడు గజాంకుశ పాత్రుడు అనహాయపాత్రుడు మృగేంద్రపాత్రుడు మున్నగువారు పదునారుగురు మహావీరులు వీరు సాము గరిడీలలో ఆరితేరినవారు రాజనీతికోవిదులు వీరు ప్రతాపరుద్ర గజపతికి (క్రీ శ 1497 1540) అవసరమయిన సమయములలో తగు సలహాల నిచ్చుచుండెడివారు యుద్ధములలో పాల్గొని శత్రువులను ఓడించి రాజ్యసంరక్షణమున ఆతనికితోడ్పడుచుండిరి ప్రతాపరుద్ర గజపతి రాజ్యములో ఆంధ్ర ప్రాంతమునుండి జయింపబడిన ఉదయగిరిదుర్గము అద్దంకిదుర్గము వినుకొండదుర్గము బెల్లముకొండదుర్గము నాగార్జున కొండదుర్గము తంగేడు దుర్గము కేతవరదుర్గము కొండవీటి దుర్గము మొదలగు దుర్గములు ఉండెను

కృష్ణదేవరాయలు క్రీ శ 1513 స ॥ లో పూర్వ దిగ్విజయము కొఱకు దండయాత్ర వెడలి ఉదయగిరి మున్నగు దుర్గములను జయించి స్వాధీన పరచుకొని ఆయా దుర్గముల దు తన విశ్వాసమునకు పాత్రులయిన ప్రతినిధులను పాలకులుగా స్థాపించి ప్రతాపరుద్ర గజపతికి రాజధానియైన కటకటమును పట్టుకొన నిశ్చయించెను కాని తిమ్మరుసు మంత్రి స్థానికుడగు గజపతి బలాఢ్యుడనియు ఆతనిని జయించుట కష్టసాధ్యమనియు అందుచే ఆతనితో యుద్ధము తగదనియు సలహా చెప్పెను కాని కృష్ణదేవరాయలు తిమ్మరుసు సలహాను వినక యుద్ధసన్నద్ధుడై వెడలి కటకమునకు ఆరు క్రోసుల దూరమున సైన్యముతో మకాము చేసెను తమప్రభువుపట్టణముపై దండెత్తి వచ్చుచున్నాడను వార్తను విని అఖండ పాత్రుడు శేషించిన పాత్రులుకలసి గజపతి అనతి చొప్పున లక్షల కొలది సైన్యములను కూర్చుకొని కృష్ణరాయల సైన్యములను ఎదుర్కొని ఘోరమయిన యుద్ధము చేయుచుండిరి రాయల సేనలకు గొప్పనష్టము కల్గుచుండెను శత్రువులు స్థానబలిమిచే స్థిరచిత్తులై పోరాడుచుండుటచే కృష్ణదేవరాయలవారు తమకు అపజయము అవమానము తప్పవని భీతిల్లి తిమ్మరుసును వెంటనే దర్శించి రానున్న ఆపత్తును నివారించుటకు ఉపాయమును ఆలోచింపుమని ఆతనిని వేడిరి

తిమ్మరుసు మహారాజనీతి విశారదుడు శత్రువును దాన భేదోపాయములచే స్వాధీన పరచుకొన దలచెను పాత్రులకును గజపతికిని భేదము పుట్టింపదలచెను కృష్ణదేవరాయల అనుమతిచే పదునారుగురు పాత్రులకు అనేక లక్షల విలువగల ఆభరణములను పెట్టెలలో పెట్టించి ఆ పాత్రులకు జాబులతో పంపెను ఆ జాబులలో పాత్రులకు ఇట్లువ్రాయబడెను — "శ్రీకృష్ణదేవరాయలవారు మీపద్ధతులకు అంగీకరించెను ఆపద్ధతుల ప్రకారము గజపతిని బట్టి యిచ్చెదరేని మీరు నిర్ణయించిన ప్రకారము మరికొంత ధనమును మీయధీనము చేసెదము" సేవకులు ఆపెట్టెలను సేనల మధ్యభాగమునుండి కొనిపోవుచుండిరి గజపతి ఆపెట్టెలను తనస్వాధీనపరచుకొని అందలి ఉత్తరములను బట్టి తన పాత్రులు తనపై కుట్రపన్ని ద్రోహముచేయ నిశ్చయించినట్లు తెలిసికొని వారికి తెలియకుండ ఒక రహస్య స్థలమున దాగుకొని ఆత్మరక్షణము కావించుకొనెను అఖండ పాత్రుడు మున్నగువారు గజపతిని యుద్ధక్షేత్రమున కానక

యుద్ధమును ముగించిరి

ఇంతలో అఖండపాత్రుడు మున్నగువారికి గజపతి వలన ఒత్తిడి కలుగకుండుటకు తిమ్మరుసు రాయలవారి అనతికైకొని వెడలి గజపతిని అర్ఘ్య విధమున సత్కరించుటయేకాక రాయలతో సంధిచేసికొని కూతురు జగన్మోహిని అను కన్యను అతనికిచ్చి వివాహము చేయుటకు అతనిని ఒడబరచెను రాయలవారికి జగన్మోహినితో వివాహము జరిగెను అంతట రాయలవారు సంతోషించి రాజమహేంద్రవరము వరకు గల తన దేశమును మరల గజపతికి ఇచ్చి క్రీ శ 1519 స ॥ లో పూర్వదిగ్విజయ యాత్రను ముగించుకొని స్వస్థానము చేరుకొనిరి తిమ్మరుసు రాజనీతి కౌశల్యముచే అఖండపాత్రుడు మున్నగు వారికి హానికలుగలేదు కృష్ణరాయల విజయప్రతిష్ఠ సురక్షితమయ్యెను ప్రతాపరుద్ర గజపతి రాజ్యచ్యుతిని పొందలేదు ఉత్తర కాలమున ఉభయరాజ్యములకు పోరాటము ఏర్పడకుండ సన్నిహితమయిన బాంధవ్యము ఘటిల్లెను

పదునార్గురు పాత్రులకు తిమ్మరుసు పంపిన ఆభరణములలో పేర్కొనదగినవి శ్రీ రాయలవారు ధరించెడి వెన్నముద్ద కంఠమాల నవరత్నపు చిలుకతాళి వైడూర్యతాళి వజ్రాల సరిపెణ మరకత కంకణము హురుమంజి ముత్యాల పచ్చ సరము ఇంద్రనీలమకుటము వజ్రపుబిళ్ల మొలత్రాడు ముత్యాల కావిపెండ్యం వజ్రాల బాహుపురి దొడ్డముత్యాల అడ్డకత్తి నవరత్నపు సంహాతలాటము మున్నగునవి ఈ ఆభరణములు అనాటి చక్రవర్తుల మహావైభవమును వారికి ఆభరణములను ధరించుటయందుగల ప్రీతిని తెలుపుచున్నవి

గ ల కాం

## అగలోక

ఇదియొక స్థలము దీని ప్రశంస ఎపి ఇ XXIV-259 లో వచ్చినది ధరణికోట మహావిహారము నందలి తూర్పు ముఖద్వారమున ధర్మచక్రధ్వజ ప్రతిష్ఠ జరిగినది ఈ విషయము సూచించు ఒక శాసనమునందు అగలోక పేర్కొనబడినది శాసనము పూర్వభాగము శిథిలమై యుండుటవలన అప్పటి రాజు పేరుగాని శాసనకాలము గాని గుర్తించుటకు వీలు కలుగలేదు

అమరావతిలో దొరికిన ఇతర శాసన అక్షరలిపితో పోల్చి చూచినచో ప్రస్తుత బ్రాహ్మీశాసనము క్రీ శ రెండవ శతాబ్దికి చెందినదియై యుండునని చారిత్రకులు ఊహించిరి అప్పటి శాతవాహన సామ్రాజ్యాధినేత వాసిష్ఠీపుత్ర పులమావియని చారిత్రకాధారములను బట్టి మనము తెలిసికొనగలము

శాసనమునందు ధరణికోట మహావిహారము పూర్వశైలీయుల వశమందుండెనని చెప్పబడినది బౌద్ధ మహాసాంఘికులలో ఒక అంతశ్శాఖకు చెందిన వారు ధర్మస్తంభమెత్తించిన దాత పేరు చెప్పబడలేదు కాని అతని తండ్రి పేరు కృష్ణుడని చెప్పబడినది దాత అమాత్య పదవియందుండెను అతపుర నివాసిగా నుండి అగలక అను ప్రదేశమునకు వలస వెళ్లెను అని శాసనమందు చెప్పబడినది కాని ఈ ప్రదేశములను గుర్తించుట కష్టముగా కాన్పించును

అతపురము అనగా అర్ధపురమనియు అది నేటి బీరారు లోని అమరావతి జిల్లాకు చెందిన రిత్పూరు అను గ్రామమై యుండుననియు చరిత్ర పరిశోధకులు ఊహించిరి రిత్పూరమునందు వాకాటక మహారాణి అయిన ప్రభావతీగుప్త వేయించిన తామ్రశాసనము బట్టి రిత్పూరు అను చారిత్రక ప్రసిద్ధిగన్న గ్రామమని తెలియుచున్నది

కొ వెం

## అగస్త్యగురువు

అగస్త్య గురువు పేరు ఆంధ్రప్రదేశపు పురావస్తు శాఖ వారు ప్రచురించిన ఆంధ్రదేశమందలి కన్నడ శాసనము (సం 3 పుట 9) లో పేర్కొనబడినది ఈ శాసనము కన్నరరాజు కాలమునకు చెందినది ఈ కన్నరరాజు రాష్ట్రకూటరాజగు మూడవకృష్ణుడు (క్రీ శ 939-67) కావచ్చునని ఊహింపబడినది అగస్త్య గురువొక ఋషి అనియు అతడు కాలాముఖమను శైవశాఖకు చెందినవాడనియు అంతఃఅతికఠినముగా ఆశాఖానియమములను అనుష్ఠించుచుండు వాడనియు తెలియవచ్చుచున్నది ఆయనను గూర్చి ఇతర వివరములు తెలియవు

గ ల కాం

## అగస్త్య పర్వత ప్రశంస

దీనికి అగస్త్యమల అగస్త్యకూటము అను పేర్లు కన్పించుచున్నవి తిరువాన్కూరు సంస్థానము నెయ్యాట్టింకర తాలూకాలో పడమటి కనుమలయొక్క దక్షిణ భాగమందలి గుట్టలలో ఇదియొకటి దీనియెత్తు 6 200 అడుగులు అచ్చటివారు దీనిని పశ్యాపర్వతమందురు తిరువాన్కూరు రాజ్యమునకును తిరునెల్వేలి జిల్లాకును సరిహద్దుమీద ఈ పర్వతము కలదు-

అగస్త్యుడు ఈ పర్వతముపై తపస్సు చేసెయున్న కారణమున దీనికీ ఈ పేరు వచ్చినది ఈ పర్వతముపై అగస్త్యుడు ఇంకను తపస్సు చేసుకొనుచున్నాడని జనులు చెప్పెదరు ఈ పర్వతమును డి తామ్రపర్ణి నెయ్యార్ అను రె డునదులు పుట్టినవి

శ్రీకృష్ణదేవరాయలవారు ఉదయగిరి మొదలయిన దుర్గములను జయి చి చైత్రయాత్రను ముగి చుకొని పెక్కు క్షేత్రములను దర్శి చి అగస్త్యపర్వతమునకు వచ్చి కల్యాణ తీర్థమ గు స్నాతుడై అగస్త్యేశ్వరునకు గోపురము కట్టి చినట్లు కొమర్రాజు లక్ష్మణరావుగారి స పాదకత్వమున వెలువడిన ఆంధ్రవిజ్ఞానసర్వస్వముయొక్క ప్రథమ సంపుటమున కలదు

గ ల కాం

## అగస్త్యుడు (విద్యానాథుడు)

విద్యాకైరవకౌముదీం శ్రుతి శిరస్సమ త ముక్తామణిం
దారాస్పద్మ భువన్త్రలోకజననీ వందేగిరా దేవతామ్
యత్పాదాబ్జనమస్క్రియాః సుకృతినాం సారస్వత
ప్రక్రియా
బీజన్యాసభువోభవంతి కవితానాస్యైకజీవాతవః" —

అనుచు కవిపండితమ డలి హర్ష ధ్వానములు చెలగ ఆంధ్ర సామ్రాజ్యరమాధినాథుడగు ప్ర తా ప రు ద్ర దే వు ని పేరోలగమున మూర్తీభవించిన యాంధ్రత్వము వు భావ సరస్వతి అగస్త్యపండితాఖండలుడు వాగ్దేవతాస్తోత్రముతో తన అలంకారశాస్త్రసర్వస్వస గ్రహమునకు మంగళాచరణము కావించినాడు ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మి అమరవాఙ్మయ రత్నముకురములో ప్రతిబింబించి శాశ్వతమూర్తియై విలసిల్లినది

ఎమి యీ యలంకారప్రబంధము ? ప్రత్యుత్తరమునను రసము తొణికిస లాడుచున్నదే ! అడుగడుగునను ఆంధ్ర కీర్తి ముద్రలుగొన్నదే ! అహా ! అపూర్వ సారస్వత ప్రక్రియ! విద్యానాథుడీ మహానుభావుడు విద్యానాథుడు ! అని ప డిత లోకము ఏకకంఠమున ఎక్కినది ని జ ము గా విద్యానాథుడే అన్నాడు శివస్వరూపుడు శివదేవయ్య సచివశేఖరుడు చిరునవ్వు చెంగలింప విద్యానాథమహాకవి యని అనువది చినాడు త్రిలింగరాజపరమేశ్వరుడు అగస్త్యుని ఉత్తమాంగమున సువర్ణప్రసూనములు కురిసినవి మెడలో రత్నహారములు మెరసినవి మంగళవాద్యములు మొరసినవి ప్రతాపరుద్ర యశోభూషణము సహృదయులకు కర్ణభూషణమై వెలసినది అగస్త్యమహాకవి విద్యానాథుడుగా వాసిగా చినాడు పాత పేరు వ్యవహారమున పాతనైరై మెరుగు తరిగి మరుగుపడినది ఎవరీపుణ్యశాలి అగస్త్యుడు ?

**ఆంధ్ర చక్రవర్తి యాస్థానము విద్వత్కవులు**

అది క్రీ శ పదమూడు పదునాలుగవ శతాబ్దులమధ్య భాగము కళాలతలకు వస తము కాకతీయ న దనోద్యానము కన్నులప డువుగా కళకళలాడుచున్నది రుద్రదేవ గణపతిదేవ రుద్రమదేవులు అల్లారుముద్దుగా పెంచినారు ప్రతాపరుద్రచక్రవర్తి క్రొత్తజాతి అ టుమొక్కలుకూడ చేర్చి వన్నెలు కూర్చినాడు సహస్రస్తంభదేవాలయము రామప్ప గుడులవ టి పెక్కు నిర్మాణములు కాకతీయ శిల్పకళా సంపదకు మచ్చుముక్కలుగా నిల్చినవి పాకాల తటాకము వంటి నాటినిర్మాణములు నేటికిని చెక్కు చెదరకున్నవి రాజధానిలో వేల సంఖ్యలో ఆనాడు చిత్రకళామందిరములున్నట్లు ప్రతాప చరిత్రము సిద్ధేశ్వర చరిత్రము సాక్ష్యమిచ్చుచున్నవి

కాకతీయుల కళాపోషణములో తక్కిన కళలన్నియు నొకయెత్తు కావ్యకళ యొక యెత్తుగా వర్ధిల్లినది విశేషి చి ప్రతాపరుద్రసార్వభౌముని పాలనము విద్యావ్యాప్తికి స్వర్ణయుగమనదగినది ఆ సహృదయశేఖరుని ఔదార్యము జగత్ప్రసిద్ధము ఆతనిచేతికి ఎమ్ములేదు అ చల్లని భూవల్లభ తల్లజు నాశ్రయి చిన కవిపత నులు పండితగ్రామణులు గజా తైశ్వర్యముల ననుభవించినారట ఈ విషయమును తెలుపునట్టి ఆభాణకమొకటి కువలయానందములో కన్పట్టుచున్నది అది

కలివయదివసైః తుయం ప్రయాయాత్
కనకగిరిః కృతవాసరావసానః
ఇతి ముదముపయాతి చక్రవాకీ
వితరణశాలిని వీరరుద్రదేవే" — అనునది

బంగారుకొ డ మేరుపర్వతమే ఆతని యీవిలో చెల్లిపోవునట పేరుతెలియని కవిప్రశంస యేమంత పెద్ద ? ఆ దాన శౌ డుని దాతృతా ఫలమును నిండుగా అనుభవించిన యదృష్టవ తుడు అగస్త్యవిద్యానాథుడే స్వయముగా ఎమన్నాడో చూడుడు—

వదాన్యో భా న్యోస్మి త్రిజగతి సమో రుద్రనృపతేః
గుణశ్రేణీశ్లాఘాఽభిహిత హారిదీనానయశసః

సమ తాదుద్భూతైర్ద్విరదమదగన్ధైః సురభయ
క్రియ తే యద్విద్వజ్జనమణిగృహప్రాంగణభువః

అహో! ఆ రాజేంద్రుని ఆస్థానకవి పండితుల గృహాంగణములు మత్తగజముల మదగంధముతో గుబాళిల్లుచున్నవి మరియొకచోట ఈ విద్యానాథ కవియే—

సుధారసముచో వాచో
దత్త్వా కాకతి భూభుజే
అతో లభన్తే కవయః
సహస్ర గంధసింధురా— అన్నాడు ఇకను స్పష్టముగా ఔరా! ఎంతరమణీయపరివృత్తి! ఆరసిక శేఖరునకు విశామృత కలశాలు సమర్పించి కవీశ్వరులు గంధసింధురములను బహూకృతులుగా అందుకొనుచుండిరట! రారమ్మనుచున్న రసాలములకు పుష్కోకిలలు చేరవా? ప్రతాపరుద్రచక్రవర్తి ఆస్థానములో శాస్త్రనిష్ణాతులైన పండితులను కావ్యకళాధౌరేయులైన కవులును రెండువందల మందికి మించియుండిరని లెక్కకట్టి చెప్పిన కాని సర్వప్పమాట యొప్పేకదా! కొంత అతిశయోక్తి యున్నను మొదటికి ముప్పులేదుకదా! వీరిలో బంగారుపల్లకీ లెక్క లేని కొలువుకూటమునకు వచ్చువారు నూటయేబదిమందియట!

ఈ విధముగా ఆ ప్రభువరేణ్యుని ఆదరమునంది తదాస్థానము నలంకరించిన సంస్కృత విద్వత్కవులలో పేరెన్నికగన్నవారిలో కొందరు వీరు—

**శాకల్య మల్లకవీశ్వరుడు** — ఈతడు మహాపండితుడును కవీశ్వరుడును అయినవాడు ఉదారరాఘవమను మహాకావ్యమును రచించెను చిత్రకవితలోను మల్లకవిచంద్రుడు దిట్ట నిరోష్ఠ్యనియమముతో రామాయణమును రచించి భళీ! యనిపించుకొన్నవాడు చతుర్భాషానిఘంటువును కూర్చి మేటినైఘంటికుడుగా కూడ ఖ్యాతిగాంచినవాడు

**వీరభల్లట దేశికుడు** — సర్వశాస్త్రపారంగతుడైన ఈ యుద్దండపండితుడు శాస్త్రపరీక్షకుడుగా కాకతి విద్వత్సభకు భూషాయమాణుడై వెలయుచుండెను సభా పండితైః పండితులు సభకు అలంకారములుకదా!

**అప్పయార్యుడు** — జినేంద్రకల్యాణాభ్యుదయకర్త యగు ఇతడు జైనపండితుడు అన్ని మతములవారును కాకతీశాఖల పరిపాలనమున సుఖజీవితమును గడపిరనుటకు ఈ యప్పయార్యుని వంటివారే తార్కాణ

**త్రిపురాంతకకవి** — ఈ మహాకవి మహాప్రసిద్ధకర్తగా ప్రసిద్ధి వహించినవాడు కవిత్వాగ్రగోను భిన్నగతులు వెలయించినాడు క్రీడాభిరామమను నాటకమైన ప్రేమాభిరామమను సంస్కృత గ్రంథమును రచించినవాడీడే ఈతని త్రిపురాంతకోదాహరణము సుప్రసిద్ధము సంస్కృతాంధ్రములలో మేటి ఏచయితగా విఖ్యాతి గాంచినవాడీతడు

**కోలాచల మల్లినాథ శతావధాని** — సుప్రసిద్ధ వ్యాఖ్యాతయగు మహామహోపాధ్యాయ మల్లినాథసూరిపితామహులు పరంపరగా మహావిద్వాంసులుగా కవీశ్వరులుగా పేరుమోసినవారు వ్యాఖ్యాతృచక్రవర్తియగు మల్లినాథునితండ్రి కపర్ది పండితుడు మహాప్రకోపిదుష్ట శౌర్యమును గూర్చిన కృతి రచించినవాడు ఈతని జనకుడును మల్లినాథాభిధానుడే ఈతడు మహావిద్వాంసుడే గాక ఆంధ్రులకు సొంతసొత్తుగా వచ్చుచున్న శతావధాన విద్యయందును ఆరితేరినవాడు ఈ మల్లినాథశతావధాని ప్రతాపరుద్రు నాస్థానమున ప్రతిభా విలాసములు వెలయించి ఆ రాజన్యమౌళిచే స్వర్ణాభిషేక గౌరవము నందెను ఎతద్వంశీయుడును చంపూరామాయణ వ్యాఖ్యాతయునునగు నారాయణపండితుడు నపూర్వ జులను ప్రశంసించుచు ఈ సంగతి నిట్లు తెలిపెను

కోలాచలాన్వయాబ్ధీ దుర్మల్లినాథో మహాయశాః
శతావధానవిఖ్యాతః వీరరుద్రాభివర్ధితః
మల్లినాథాత్మజః శ్రీమాన్ కపర్దీ మంత్రకోవిదః
అఖిలశ్రౌతకల్పస్య కారికావృత్తిమాతనోత్

**గంగాధరకవి** — గీర్వాణభాషలో భారతకథను నాటకముగా నిబద్ధించి అపరవ్యాసుగని కీర్తి వహించినవాడీ మహాకవి

స్తుమస్తమపరం వ్యాస గంగాధర మహాకవిమ్
నాటకచ్ఛద్మనా దృష్టాం యశ్చక్రే భారతీం కథామ్

అని గంగాదేవిచే మధురావిజయమున ప్రస్తుతిపడసినవాడీతడే అగస్త్య మహాకవి ఈతని తానమరదియట ఈతని వంశమువారెల్ల కవిపండితులుగా వన్నెకెక్కినవారే

**విశ్వనాథకవి** ఇతడు సౌగంధికాహరణమును రచించి పేరు గాంచినవాడు గంగాధరకవికి జ్యేష్ఠపుత్రుడు మహావిద్వాంసుడు కాదంబరీనాటక కర్తయైన నరసింహకవికి అగ్రజుడు అగస్త్య మహాకవికి మేనల్లుడు మధురా

విజయమును రచియించిన గంగాదేవి యను కవయిత్రికి ఆచార్యుడు. ఈతని కవిత మనోహారిణియై విలసిల్లినట్లు ఉగ్గడింపబడినది.

చిరం స విజయీభూయాద్విశ్వనాథః కవీశ్వర

యస్య ప్రసాదాత్సార్వజ్ఞ్యం సమిధే మాదృశేష్వపి

అని గంగాదేవి ఈ కవీశ్వరుని మహిమను కొనియాడినది.

నరసింహకవి ఈతడు గంగాధరకవికి ద్వితీయ పుత్రుడు. విశ్వనాథకవికి అనుజుడు. అగస్త్య మహాకవికి రెండవ మేనల్లుడు. ఇతడు కాదంబరీకల్యాణమును నాటకమును సంస్కృతమున రచించెను.

ఇంకను ఇట్టి సంస్కృత పండిత కవులు పెక్కురు ప్రతాపరుద్రదేవుని ఆస్థానము నలంకరించిరి. తెలుగు కవులలో భాస్కరరామాయణకర్తలు భాస్కరాదులు, మార్కండేయపురాణరచయిత మారన, నయనరగడరచయిత రంగనాథుడు మొదలైనవారును పదకర్తయగు కృష్ణమాచార్యులును ఆ శ్రేణిలో పేర్కొనదగినవారు. నక్షత్రములలో పూర్ణచంద్రునివలె ఈ కవులందరిలోను మేటి కిరీటియై ప్రకాశించినవాడు అగస్త్యకవి.

అగస్త్యకవియే విద్యానాథుడు - నలకీర్తికౌముది, బాలభారతము, ప్రతాపరుద్ర యశోభూషణము మొదలైన డెబ్బదినాలుగు గ్రంథములు రచించి విశేష కీర్తి నార్జించిన కవీశ్వరుని పేరు మొదట అగస్త్యుడై యుండెననియు ఎమ్మట విద్యానాథుడను బిరుద మొసగబడినదనియు విమర్శకుల అభిప్రాయము. ఈ నామ నిర్ణయము కొంచెము జటిలముగనే యున్నది. నలకీర్తికౌముది మున్నగు గ్రంథముల ఆశ్వాసాంతగద్యములలో కవినామము అగస్త్యుడుగానే కనబడును. ఇతి శ్రీ నలకీర్తికౌముద్యాఖ్యే లక్ష్మీ పదలాంఛనే అగస్త్యకృతే మహాకావ్యే ప్రథమ సర్గః—

ఇత్యాది బాలభారతములోను

శ్రవణ్యూల స్థూల కరణ భణితిగ్రంథి నిపుణైః

కవిం మన్యైరన్యైః కిమిహ బహుభిర్మోమ భవితైః

విమర్శాదర్శాంతః ప్రతిఫలదలంకారరచనైః

అగస్త్యః పౌరస్త్యానను సరతి సూక్తైః సుమనసః -

అని అగస్త్య పదమే ఉపలబ్ధమగుచున్నది. విద్యానాథపదము వ్యవహరింపబడలేదు. ఇక ఈ మహాకవిని కీర్తించిన కవులు కూడ అగస్త్య పదాభిధేయునిగనే కీర్తించిరి.

అగస్త్యమహాకవి మేనల్లుడగు విశ్వనాథకవి సౌగంధికాపహరణములో తన కవిత యుదారమధురముగానుండుట యేమంత గొప్పవిషయము కాదనియు, అంతటివాడైన అగస్త్యపండితుడు తన మేనమామయై యుండ ఈ యితవచ్చుటేమి ఘనత యనియు చెప్పుకొనెను.

వాచస్తస్య కవేరుదార మధురా ఇత్యత్ర చిత్రం కిము ?

ప్రఖ్యాతః సకలాసు దిక్షు గుణిషు శ్రేయానగస్త్య సుధీః

వేధశ్శ్రీముఖకరా గుళి దశాస గక్వణద్వల్లకీ

వాచోయుక్తి సహోక్తిదర్శిత సుధా జన్మా స యన్మాతులః

భారతీదేవి కరాంగుళిస్పర్శచే మ్రోయు వీణా నాదమువలె అమృతాయమానమగు కవిత్వముచెప్పెడి నేర్పు గలవాడు తన మేనమామ అగస్త్యుడున్నాడు.

రాజచూడామణి దీక్షితులు (రుక్మిణీ కల్యాణములో) ఈ అగస్త్యమహాకవిని నుతించుచు

జడాశయానాం హృదయం జగత్యాం

యస్యోదయా ద్యాతితమాం ప్రసాదమ్

స ఏష సారస్వతమర్మవేదీ

విభాతి మౌళౌ విదుషామగస్త్యః -

అగస్త్యోదయమున జలాశయములు తేరుకొనును. అట్లే ఈ అగస్త్య ప్రభావమున జడుల హృదయములుకూడ ప్రసన్నములగును. సారస్వతరహస్యవేదియగు నగస్త్యకవి విద్వన్మౌళియై విలసిల్లుచున్నాడు. శ్లేషాభిరామమైన ఈ పద్యమునను అగస్త్యపదమే ప్రయుక్తమైనది.

మహారాజ్ఞి గంగాదేవి (మధురావిజయములో) తన గురువైన విశ్వనాథకవికి మాతులుడైన ఈ మహాకవికి పుష్పాంజలి ఘటించుచు—

చతుస్సప్తతి కావ్యోక్తి వ్యక్తవైదుష్య సంపదే

అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్కో న కోవిదః -

అనెను. డెబ్బదినాలుగు కావ్యములు రచించి విఖ్యాతుడైన అగస్త్యమహాకవిని ఎవరు కోరరు ? అనుచో అగస్త్యపదమునే వాడెను.

ఇట్లన్నింటను అగస్త్యశబ్దమే ఏతత్కవినామముగా గోచరించుచున్నది. వీనిలో విద్యానాథపదమీ కవీశ్వరాభిధానముగా ఎందును కానరాదు.

ఇక ప్రతాపరుద్రీయములోనో విద్యానాథపదమే ప్రకరణాంతగద్యములలో ఇతి శ్రీవిద్యానాథకృతౌ

ప్రతాపరుద్ర యశోభూషణే అలంకారశాస్త్రే నాయక ప్రకరణమ్ ఇత్యాదిగా కనబడుచు ప్రకరణాంతగద్యము లెవరో వ్రాసియుందు రనుకొనినను గ్రంథకర్తయే స్వయముగా నాయకప్రకరణమున పదియవ కారికలో విద్యానాథుని కృతి ఇదియని స్పష్టపరచుట కానవగును.

కాకతీయనరేంద్రస్య యశో భూషయితుం కృతా
విద్యానాథకృతిశ్చేయం స్వయం తేన విభూష్యతే

అంతియేకాదు సాధారణముగా కవిపేరు బైటపడు చక్రబంధములో కూడ అగస్త్యపదము లేదు.

ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతలలో ముఖ్యుడైన కోలాచల కుమారస్వామి సోమపీథి రత్నాపణావతారికలో—

పుణ్యశ్లోకగుణోక్తిశాణపటుతా దుత్తేజనాలంభితం
సంజగ్రాహ రసాది రత్ననిచయం విద్యాధినాథః పురా
సోయం తద్వ్యవహారవేతుమధునా కచిత్కరోమ్యాపణం
తత్రానుగ్రహమూల్యతోఽఖిలమిదం క్రీణంతు ధన్యా జనాః

అని కవిని విద్యాధినాథశబ్దముచే ఉపపాదించియు వెంటనే—

అథ తత్రభవాన్ విద్యానాథ మహాకవి రలంకారశాస్త్ర మారభమాణః — ఇత్యాదిగా అవతారికా వాక్యమున విద్యానాథుడనియే కవిని పేర్కొనెను. అగస్త్యమహాకవి అని మెచ్చుటను అనలేదు. ఇక రెండవవ్యాఖ్యాత శుకవటము (చిలుకమర్తి) తిరుమలాచార్యుడును తన రత్నశాణవ్యాఖ్యలో

విద్యానాథః కథమపి బహోరాకరాచ్ఛాస్త్రజాలాత్
సంజగ్రాహ ప్రకృతికఠినే రత్నజాలం కరం దే
విద్వద్గోష్ఠీహృదయరమణే రత్నశాణే ధునాస్మిన్
అంతర్గూఢద్యుతివిలసితం తత్సముత్తేజయామి

అను పద్యములో విద్యానాథ పదముననే కవి నామధేయముగా ప్రయోగించెను. ప్రతాపరుద్రీయమును పరామర్శించిన లాక్షణికులును విద్యానాథ పదమునే వాడినారు.

విషయ మిట్లుండగా ఆ అగస్త్యుడే ఈ విద్యానాథుడనుటకు అవకాశ మెందున్నది? ప్రమాణమేది? ఇదిగో! ప్రతాపరుద్రీయములోనే యున్నది. కావ్యప్రకరణమున గుణీభూతవ్యంగ్య ప్రస్తావములో అగూఢవ్యంగ్యమునకు విద్యానాథు డిచ్చిన లక్ష్య శ్లోకములో కనబడుచున్నది యా కవీశ్వరుని తొలిపేరు అగస్త్యుడనునది. ఆ శ్లోకమిది—

ఔన్నత్యం యది వర్ణ్యతే శిఖరిణః క్రుధ్యంతి నీచైః కృతాః
గాంభీర్యం యది కీర్త్యతే జలధయః క్షుభ్యంతి గాధీకృతాః
తత్త్వాం వర్ణయితుం క్షమి యదివా నాలం త్రపాస్తోకః స్థితః
త్వత్పార్శ్వే గుణసాగరోహి గిరిశే శ్రీవీరరుద్రప్రభో!

ఓ వీరరుద్రప్రభూ! నీ ఔన్నత్యము వర్ణింతునా పర్వతములు తక్కువపరచితి ననికొండలు కోపించును. నీ గాంభీర్యమును కీర్తింతునా తమ్ము తేలిక చేసితినని సముద్రములు క్షోభిల్లును. కావున నిన్ను కీర్తింప భయపడుచున్నాను. అయినను నేనగస్త్యుడనుకదా!

ఇందు పర్వతములకు సముద్రములకు నేను భయపడను నిన్ను కీర్తించియే తీరుదును అను వ్యంగ్యము గూఢముకాక బట్టబయలైనది. కావుననే యిది అగూఢవ్యంగ్యమైనది.

ఈ పద్యములో కవి ప్రయోగించిన అగస్త్యపదము ఆ కవి తొలినామమే సందేహములేదు. అది శ్లిష్టముగా ప్రయుక్తమైనది. అగస్త్యమహర్షి యనగానే వింధ్యపర్వతగర్వ నిర్వాపకుడు కనుక కొండలకు గుండెబెదురు. అట్లే సముద్ర జలములను పుడిసిలిపట్టి త్రావివైచి నాడట ఆయనపేరచేనే సముద్రములకు హడలు. ఈ పౌరాణికఖ్యాతియును తననామధేయమైన అగస్త్యపదములో శ్లేషగించే చక్కగా కుదుర్చుకొని కల్పనచేసి రచించినాడీ లక్ష్యపద్యమును మహాకవి. అట్లుకాదేని నేనగస్త్యుండనుతే అనుట పొసగదు. చమత్కరించుట కనువుగా నున్నదుననే కవీశ్వరుడిట తన మొదటిపేరు వాడుకొన్నాడని భావము. విమర్శకు లెల్లరును అగస్త్య విద్యానాథులయైక్యవాదమునకు ఈ శ్లోకమునే అంతర ప్రమాణముగా అంగీకరించినారు. ఇట ఒక విషయము స్పష్టము. శాక్యమల్లభట్టాంకుడు మొదలైన విద్వత్సంఘమువలె అగస్త్య మహాకవి తొలినుండియు ప్రతాపరుద్ర చక్రవర్తి కొలువున ఆస్థాన విద్వాంసుడుగా చేరినట్లు కనబడదు. పూర్వదశయందయి నలకీర్తికౌముది బాలభారతము శ్రీకృష్ణ చరితములవంటి బహుగ్రంథరచనమునను శిష్యులకు పాఠములు చెప్పుటలోను గడచియుండును. ఉత్తరదశలో చక్రవర్తిదృష్టికి వచ్చి తదాహూతుడై తదాస్థాన విద్వాంసుడుగా చేరి విద్యావైభవమువలన విద్యానాథబిరుదము వదియుండును. అప్పటి నుండియు పూర్వనామము వ్యవహారమునుండి తొలగ విద్యానాథ నామముతోనే ప్రసిద్ధుడై ప్రతాపరుద్రీయ కృతిలో ఆ బిరుదనామమునే వాడుకొనియుండును. అతని పూర్వగ్రంథములలో విద్యానాథపదము లేకుండుటకును ప్రతాపరుద్రీయములో

అగస్త్యపదము సర్వత్ర కనబడక పోవుటకును హేతువిదియే అనుట సమంజము

కానె సర్వప్ప వ్రాతకూడ దీనికనుకూలముగనే గన్పట్టును తురకసర్దారు ప్రతాపరుద్రుని చెరపట్టి ఢిల్లీకి కొని పోవుచు దారిలో గోదావరి ఒడ్డున విడిసియుండగా ఆ రాజచంద్రునిజూడ ప్రజలును అధికారులును శివదేవయ్య మున్నగు మంత్రివర్యులును అచ్చటికి వచ్చిరనిచెప్పి —అందునొక్క విప్రుడు ప్రతాపరుద్రీయ మను కావ్య మువెప్ప ఆ రాజునకంకితంబుగా చేయుటకు సర్వజ్ఞుండు ఆ విప్రునకు ప్రతాపరుద్రుడు అగస్త్యయనినిచ్చి యతనిని విద్యానాథుడని ఏనుగునెక్కించి చాటించుటయు—

(సిద్ధేశ్వర చరిత్రము—170 పు)

ఈవిధముగ అగస్త్యమహాకవియే విద్యానాథుడని తెలుచున్నది

**అగస్త్య విద్యానాథకృతులు —**

ఈ మహాకవి డెబ్బదినాలుగు కృతులు రచించెనని మధురావిజయ రచయిత్రి మహారాజ్ఞి గంగాదేవి వాక్యము వలన తెలియుచున్నదికదా! ఆ గ్రంథములన్నిటి పేళ్ళైనను నేడు వినవచ్చుటలేదు కాలముకడుపు కడలి అందుమునిగి ఎన్ని రూపుమాసినవో! శిథిలములై మిగిలిన యీ మహాకవి కృతులతో కొన్నియివి

**1 బాలభారతము —**

బహుభాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారతబద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహు యాగంబుల ఫలంబు పరమార్థముగున్

అన్నారు నన్నయగారు అట్టిది భారతీయుల భారతబద్ధస్పృహ అట్టి భారత పవిత్రగాథను ఏదోరూపమున రచించి కవి ధన్యతనొంద యత్నించును అగస్త్యమహాకవి ఈ గాథనే చేకొని ఇరువది సర్గముల మహాకావ్యముగా రచించెను కథ భారత గాథ శారదావతారుడును వేధశ్చంద్రముఖీకరా గుళిదళాస గర్వణద్వల్లకీవాదోయుక్తిసహోక్తి దర్శిత సుధాజన్ముడు అగు గస్త్యమహాకవిది కవితచెప్పెడిదేమి? హేమ్నః పరమామోదః బాలభారతమెంత మనోహరమో! తలమున్కలైన రాజకీయములున్న వాడయ్యును ఎట్లోతీరిక గల్గించుకొని ఈ మహాకావ్యముపై మనోహర యను వ్యాఖ్య రచించినాడు సాళ్వ తిమ్మయదండనాథుడు అనగా తిమ్మరుసు మహామంత్రి ఎట్టి మనోహర సన్నివేశము! తెలుగు మహాకవి కావ్యము—తెలుగు మహామంత్రి వ్యాఖ్యానము! మచ్చునకొక్క పద్యము

లాలాట నేత్రజ్వల నోష్మతాంతాః
కపర్దస ధో పరిపీతపాథసః
ఫణామణీనా కషణేన భోగినా
శిలీముఖాః శాతముఖాః కిరీటినః —

ఇక ఇట్టి శాతముఖములైన శిలీముఖములుగల ఆ జగజెట్టి కిరీటికి సాటి యేరీ?

**శ్రీకృష్ణచరిత్రము —** విశ్వమోహనములగు శ్రీకృష్ణలీలావిలాసము కు ముగ్ధముకాని హృదయమేదీ? అగస్త్యమహాకవి తన కవితా సుధాధారలు శ్రీకృష్ణభగవానుని పరివస్యలో సమర్పించి కృతకృత్యుడైనాడు ఇందొక విశేషము ఈ కావ్యము గద్యకావ్యమగుట గద్యం కవీనా నికషం వదంతి అని కదానుడి! సవ్యసాచియగు అగస్త్యకవీంద్రుడు తన గద్యకవితా ప్రాభవమును శ్రీకృష్ణచరిత్రములో ప్రదర్శించెను ఉత్తమశ్రేణిగద్యకావ్యములలో నిదియొకటి యని పరిశోధకులు దీనిని ప్రశంసించినారు

**నలకీర్తికౌముది —** భారతాది పురాణ ప్రసిద్ధమైనది నలచరిత్ర నలదమయంతుల గాథ పుణ్యావహము

—కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్—

అని కదాప్రసిద్ధి! శ్రీహర్షుని నైషధ కావ్యమున్నను పాపహరమగు నలదమయంతుల కథయందలి యాదరము చేతను నైషధ కావ్యము కొంత అతివర్ణనము అశ్లీల స్పర్శము కలదను విమర్శకు గురియైనదగుట చేతను సారస్వత మర్మవేది యగు ఈ అగస్త్య మహాకవి అట్టి లోపములు లేకుండునట్లును గ్రంథ గ్రంథులు లేకుండునట్లును లలితశైలిలో ఈ మహాకావ్యమును నిర్మించి లోకమున కందించినట్లు భావింపవచ్చును శ్రీహర్షుడు నైషధమును ఆనందపదాంకితము చేయగా అగస్త్యమహాకవి తన నలకీర్తికౌముదిని లక్ష్మీపద చిహ్నితము గావించెను పద్యనివహము మనోహరమై యొసలారుచుండును ఉపలబ్ధమైన సర్గాంత గద్యమును బట్టి యిది మహాకావ్యమే యనవలెను

ఇతి శ్రీనలకీర్తికౌముద్యాఖ్యే లక్ష్మీపదలాంఛనే అగస్త్యకృతే మహాకావ్యే ద్వితీయసర్గః

ఈ మహాకావ్యము మగ్రముగా లభింపకు డుట దురదృష్టము ఉదాహారణమున కి దలి రె డు పద్యములు

స్నాతా ఘటాగ్రపరి ముక్త పయోభి రావ్త
కౌశేయ కాశకుసుమా అఽదాస్య పద్మా
అముక్తమౌక్తిక విభూషణ గస్యపూర్ణా
భాతీవ భీమతనయా శరదుర్వరేయమ్ —

దమయ తీ శరల్లక్ష్ములె త హృద్యముగ చిత్రి పబడినారో!

సా మందస్మిత తర్జితాతి విశదజ్యోత్స్నా స ఫురచ్చారదా
శ్రైమీ శారద పు డరీకవదనా విప్రౌఘు వాక్సారదామ్
తామూచే శిరసాభివాఽసనరాం మంది మ్రితా శారదా
బాలే! త్వామబియాతు సర్వజగతీ సామ్రాజ్యలక్ష్మీః స్వయమ్

శారదావతారుని శారదాశీర్వాదమిది

ఈ మహాకావ్యము బహుముఖ ప్రచారము నొ ది యుండుటచే ఇందలి కొన్ని పద్యముల భావములను ఎమ్మటి కవులు తమ కావ్యములలో అనుసరి చిరి అట్టి అనుసరణము లలో వసు చరిత్రలోని యీ పద్యమొకటి

నానానూన వితాన వాసనల నాన దించు సారంగమే
లానన్నొల్ల దటంచు గ ధఫలి బల్కాకం దపంబదియోపా
షానాసాకృతిఁ దాల్చి సర్వ సుమనస్సౌరభ్య సంవాసియై
పూనె బ్రేక్షణమాలి కామధు కరీపుంజంబు తిర్యంకలన్ —

దీనికి నలకీర్తి కౌముది లోని యీ క్రి ది పద్యము మూలము

భృంగానవ్యాప్తి ప్రతిపన్న ఖేదా
కృత్వా వనే గంధఫలీ తపోఽలమ్
తన్నాసికా భూదను భూతగంధా
స్వపార్శ్వనేత్రీ కృత భృంగసేవ్యా —

**అగస్త్య నిఘంటువు** — ఈ మహాకవి ప్రామాణికమగు ఒక నిఘంటువును కూడ రచియించినట్లు విమర్శకు లభిప్రాయ పడుచున్నారు ఉత్తరరామ చరిత్ర నాటకమునకు వ్యాఖ్య రచియించిన ఘనశ్యాముడను పండితుడు తన వ్యాఖ్యలో అగస్త్యనిఘంటువును డి ప్రమాణము ల నొసగియున్నాడు ఇదియే ప్రస్తుతము మనకు లభించుచున్న దిర్దుష్ట ప్రమాణము

**మణిపరీక్ష** — రత్నముల పుట్టువును జాతి విశేషాదు లను తెలుపు గ్ర థము మణిపరీక్ష మల్లినాథసూరి తనవ్యాఖ్యలో

కరిణాం ముక్తాయోనిత్వే ప్రమాణమాహ అగస్త్యః—
జీమూత కరిమత్స్యాహివంశ శంఖవరాహజాః
శుక్త్యుద్భవ శ్చ విజ్ఞేయా అష్టౌ మౌక్తిక యోనయః —

అను శ్లోకమును అగస్త్యాదిగా పేర్కొనినాడు

**లఘుకృతులు** — లక్ష్మీ స్తోత్రము లలితాసహస్రము శివ హిత శివ స్తవము సకలాధికారము వ టివి మరికొన్ని అగస్త్యప డితుని లఘుకృతులుగా చెప్పఎడుచున్నవి

**ప్రతాపరుద్ర యశోభూషణము** — అగస్త్య మహాకవిని విద్యానాథునిచేసి అఖ డకీర్తి నార్జించి పెట్టినది అల కార శాస్త్ర సర్వస్వ స గ్రహమును నామాంతరముగల ఈ ప్రతాప రుద్ర యశోభూషణమే అల కార శాస్త్రార్ణవమునకు నిజ ముగా అగస్త్యుడేయై తత్సారమెల్ల సంగ్రహించి సర్వోప భోగ్యముగా ఒకచోనిడ మహోపకారము కావించినా డీ మహానుభావుడు కావ్యప్రమేయములో ఎ యొ గ మో అలంకారమో ధ్వనియో తీ కొని గ్రంథముల రచించి ఆల కారికులే యెక్కువ అవి ప్రౌఢుల పకరి చును ఒకచో కావ్యసామగ్రినెల్ల చూడగోరువారికి ఉపకరి చు గ్రంథములేని కొరతను విద్యానాథునికృతితీర్చుచున్నది ఇది నాయక కావ్య నాటక రస దోష గుణ శబ్దాలంకార అర్థాల కార మిశ్ర మాల కారములు అను తొమ్మిది ( కరణములుగల గ్రంథము నాతివి స్తరములయిన ప్రకరణములో బోద్ధవ్యములైన కావ్య విషయములను లక్ష్యలక్షణ సమన్వయ పూర్వకముగా పరితృ హృదయమున హత్తునట్లుగా నిరు ప చుట యిందలి విశే షము ఇట్లు విషయసౌలభ్యము దానికి వన్నెదెచ్చు పరిణత కవితావిలాసము సమకూడిన దగుటచే ఈ లక్షణ గ్రంథము పండితామోదమును బొంది అచిరకాలముననే పఠన పాఠనము లతో విశేషప్రచారము నందినది మహావ్యాఖ్యాతలు ఉట్టంకి చు కొనదగు ప్రమాణగ్ర థమైనది అలంకార శాస్త్రమున ప్రక రణ గ్ర థముగా ఆసేతుశీతాచలము ఖ్యాతివడసినది కొందరు లాక్షణికులు ఇందలి కొన్ని అంశములను విమర్శింపగా మరి కొ దరావిమర్శలను పరామర్శించి గ్రంథము ను సమర్థి చిరి వ్యాఖ్యాతృచక్రవర్తి యగు మల్లినాథసూరి కుమారుడు కుమారస్వామిసోమపీథి విద్యానాథుడు సంతరించిపెట్టిన విషయరత్నము లందరకును అందునట్లు రత్నాపణమును తెర చెను ఈ వ్యాఖ్య మూలమునకు దీటైనదని కీర్తిగడించినది ప్రతాపరుద్రీయముపై చేయబడిన మరియొక వ్యాఖ్య రత్న శాణము ఇది అర్వాచీనము

**విద్యానాథకృతి—ఆంధ్రత్వ మొక ప్రత్యేకత** —

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ అన్నారు

తనజాతి అనదేశము తన భాషయనుచు అభిమాని పని వారు డరు వట్టి యభిమానమువలన ప్రయోజనములేదు అది కావ్యరూపమును దాల్చవలెను స్వాభిమానమును కావ్య రూపమున ప్రకటి పగల్గు శక్తియు అదృష్టమును పుణ్యము చేసికొన్న కొందరకే కలుగును అట్టివారిలో అగస్త్య విద్యానాథుడొకడు ఆంధ్రతాపూర్ణహృదయుడీ వి కృతినెల్ల ఆంధ్ర కీర్తి స్మృతిగా పారి చినాడు ఆంధ్రయోధుల శౌర్యోత్సాహములు అగ్గి చినాడు ఆంధ్ర పండితకవి గోష్ఠులభివర్ణి చినాడు ఆంధ్ర రాజధానీ లక్ష్మిని ఆ దల మెచ్చి చినాడు సర్వత్ర ఆంధ్రతాముద్ర వేసి ఆమ్రామ్ళ్చనక్తాః ఎతరళ్చత్రప్తాః అని క పనిచే రెడర్థములు సాధి చినాడు విద్యానాథుడు ఇటు స్వజాతికీర్తనము అటు చక్కని లక్షణగ్రంథనిర్మాణము వర్ణ్యుడు ఆదర్శ గుణభూషితుడు ప్రతాపరుద్ర చక్రవర్తి అతడు ఆంధ్రస స్కృతికి మూర్తి తద తముగా వెలసిన ఈ కృతి ఆంధ్రజాతికే అంకితమైనదిగా పర్యవసి చినది

ఒక ఆక్షేపము — ఇ దు మానవుడు వర్ణ్యుడగుట నిజమే ప్రతాపరుద్ర చక్రవర్తి మానవుడే కాని ఎట్టిమానవుడు? వైదికధర్మ రక్షాదీక్షితుడు వాఙ్మయ కళాపోషకుడు ప్రజారంజకుడు భగవదవతారముగా సత్యవచనులచే కీర్తి పబడిన పుణ్యమూర్తి అట్టి పురుషోత్తముని కీర్తి చుట గుణమే దోషముకాదు సత్సంప్రదాయముకూడ నరాంకితము గిట్టని సోమన పోతన ధూర్జటివంటి కవులు కొం దరున్నను నన్నయ తిక్కన యెఱ్ఱన శ్రీనాథ పెద్దనాది మహాకవులు గుణగ్రాహులై ఉత్తమగుణశోభితులగు రాజవరేణ్యులకు మాన్యులగు మంత్రి దండనాథాదులకు తమ కృతులను అంకితముచేసి యున్నారు వీరెల్లరు కుక్షింభరులని కొట్టివేయదగిన వారు కారు నిజమునకు వీరిలో ఎ దరో తృణీకృతపుర దరులు ఋషిసన్నిభులు కావున విద్యానాథ మహాకవి ప్రతాపరుద్ర చక్రవర్తిని తన కృతియ దు వర్ణ్యునిగ స్వీకరించుట యాకవీశ్వరుని గుణగ్రాహిత్వమునకే తార్కాణ గాని లోపముగాదు ఆ మహాకవి తన గ్రంథారంభమున

యద్యప్యసౌ ప్రబంధేషు ప్రాచాం సాధు నిరూపితా
తథాప్యస్యాః సమ నేతుర్నో దాహరణమాదృతమ్!
పుణ్యశ్లోకస్య చరితముదాహరణమర్హతి
నకశ్చిత్తాదృశః పూర్వైః ప్రబంధాభరణీకృతః—

రసాలంకారాది కావ్యప్రమేయము పూర్వులచే ప్రతిపాదింపబడినను దానికి తగిన నాయకుని వారుదాహరింపలేదు అని నాయక మహిమచే కావ్యమహిమ ఇనుమడి చుననుచు ఇట్లు చెప్పెను

ప్రబ ధానా ప్రబ ధవాణా మం కీర్తి ప్రతిష్ఠయో
మూల విషయభూతస్యనేతుర్గుణ నిరూపణమ్

ఈ భావమునకు ఉప ష్ట భకముగా రామాయణాదుల మహత్తకు రామాదుల గుణవర్ణనమే కారణమని పలువిధముల చర్చి చి చూపెను ప్రతాపరుద్ర చక్రవర్తి లోకోత్తర గుణోత్తరు డనుటను కావ్యములు చరిత్రలు శాసనములు వేనోళ్ళ చాటుచున్నవి అట్టి పూతచరిత్రుడు ఉపశ్లోక్యుడుగా లభి చుటయే దుర్ఘటము అట్టి మహనీయుడు లభి చిననాడు సమర్థుడైన కవీశ్వరుడు ఎనుగునెక్కిన త యగును తద్గుణైః కర్ణమాగత్య చాపలాయ ప్రచోదితః అన్నాడు గుణగరిష్ఠులైన రఘువులను కీర్తి చు అవకాశము భి చినదని మురియుచు కవికుల చక్రవర్తి కాళిదాసు అల కార శాస్త్రమె త కాల మునకు ధన్యమైనది? ఆహా! అన్నాడు ఆంధ్రచక్రవర్తి వర్ణ్యుడుగా లభి చెనను ఆన దముతో విద్యానాథ మహాకవి

చిరేణ చరితార్థోఽ భూత్కావ్యాల కార స గ్రహః
ప్రతాపరుద్ర దేవస్య కీర్తి ర్యేన ప్రకాశ్యతే—

భామహ ఉద్భట రుద్రభట్ట భోజరాజాది ప్రాక్తనాల కారికుల సూక్తులను ఈస దర్భమున వృద్ధసమ్మతిగా ప్రకటి చినాడు భూష్యభూషణ భావముతో విలసిల్లుచున్నారు విద్యానాథ వీరరుద్ర భూనాథులు

కాకతీయ నరే ద్రస్య యశోభూష యితు కృతా
విద్యానాథ కృతిశ్చేయ స్వయ తేన విభూష్యతే
ఎ తటి హృదయ గమ సన్నివేశము!

విద్యానాథ మహాకవి వాఙ్మయ రంగములో ప్రవేశ పెట్టిన ఈ యశోభూషణ సవ్యప్రక్రియ ఆనంతరికులగు అలంకార శాస్త్రకారుల నె తగనో ఆకర్షి చినది పలువురు కవులీ పద్ధతిని అనుసరి చి రచనలు సాగి చినారు ఇదియొక ప్రత్యేక శాఖగా వర్ధిల్లినది

ప్రతాపరుద్రీయము చదువుచు డగా ఆంధ్రహృదయములో ఏదో నూతనోత్తేజము కలుగుచుండును

"రేరే ఘూర్జర జర్జరోఽసి సమరే ల పాక కి క వసే!
వ గ త్వ గసికి! ముధా బలరజః కాణోసికిం కో కణ
హూణప్రాణ పరాయణోభవ! మహారాష్ట్రా పరాష్ట్రోస్యమీ
యోద్ధారో వయ మిత్యరీ నభిభవంత్యంధ్ర
క్షమాభృద్భటాః—"

ఎక్కడో ఆంధ్రవీరులు పగతురను కవ్వించి కవ్వించి తరిమి తరిమి కొట్టుచున్నట్లున్నది. ఏమి యీ వీరలీల! అవిగో! కనకవేత్ర హస్తుల హెచ్చరికలు!

"కాశీ గాత్ర నిషీద! కో కణపతే దూరే భవాంగేశ్వర!
ప్రాంత సంశ్రయ మాలవేంద్ర! శనకైః
స్వోపాయనం ప్రాపయ
పాండ్యాగ్రే భవ సేవణక్షితిపతే పశ్చాద్భవాద్యైవ వః
స్వామీ కాకతి వీరరుద్రనృపతి సర్వాన్ క్రమాదీక్షతే—

ఉపాయన హస్తులైన ఆయా రాజన్యులు అహమహమికతో త్రొక్కిసలాడుచున్నారు. త్రిలింగరాజ పరమేశ్వరుని దర్శనార్థము! బంగరు బెత్తాలెత్తి క్రమపరచుచున్నారు వారిని వేత్రహస్తులు! ఔరా! ఆంధ్ర సామ్రాజ్య రమా ప్రాభవము! ఆ కొలువులో తానుకూడ ఒకడై యుప్పొంగుచున్నాడు ఆంధ్రకవిత.

అలంకారశాస్త్ర సర్వస్వమే కాదు అగస్త్య విద్యానాథ మహాకవి సృష్టించిన ప్రబంధము. ఇది ఆంధ్రవైభవ సర్వస్వము.

"ప్రతాపరుద్రదేవస్య గుణానాశ్రిత్య నిర్మితః
అలంకారప్రబంధోఽయం సంతః కర్ణోత్సవోఽస్తు వః"

యథార్థముగా ఇది సహృదయులకు కర్ణోత్సవమే! అలంకారశాస్త్రార్ణవాగస్త్యుడు విద్యానాథుడు వాఙ్మయాకాశములో పూర్ణచంద్రుడై వెలుగొందుచున్నాడు.

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్

చెరం

## అగస్త్యేశ్వరుడు

అగస్త్యేశ్వరుని ప్రశంస శ్రీనాథ కవిసార్వభౌముడు రచించిన భీమేశ్వరపురాణమునందలి తృతీయాశ్వాసమున కనవచ్చుచున్నది. భిక్షాన్నము లభింపక ఏడు దినములు ఉపవసించిన వ్యాసుడు కాశిని శపింపబూనెను. అన్నపూర్ణాదేవి సశిష్యుడైన వ్యాసునకు మృష్టాన్నమును పెట్టెను. తనకు ప్రియమైన కాశిని శపింప యత్నించినందులకు వ్యాసుని కాశీ నుండి వెడలిపొమ్మని విశ్వేశ్వరుడు ఆజ్ఞాపించెను. వ్యాసుడు శిష్యులతో కాశీనుండి వెడలివచ్చుచు మధ్యేమార్గమున జగన్నాథము, శ్రీకూర్మము, సింహాచలము, పిఠాపురము, కుమారారామము, సర్పవరము అను క్షేత్రములను కాంచెను. తుల్యభాగానదీతీరమున సమస్తము ప్రతిష్ఠించెను. ఓ ప్రియా నగరము (నేటి ఓదూరు) చెంగట లోపాముద్రతో ఉన్న అగస్త్యమహర్షి నిజూచెను. కుశలప్రశ్నము చేసిన మ్మట కాశిలో తనకు జరిగిన భంగపాటును వ్యాసుడు అగస్త్యునకు విన్నవించెను. వ్యాసుని ఊరడించి అగస్త్యుడు భీమమండలమునందలి పుణ్యక్షేత్రములను ఆ నాము నుడి వ్యాసునకు జూపెను. దక్షారామమునందలి తీర్థక్షేత్రమహిమను వ్యాసునకు దెలుపుచు అగస్త్యుడు అగస్త్యేశ్వరుని మహిమను వర్ణించి చెప్పెను. అగస్త్యేశ్వర రామేశ్వర నాగేశ్వర సోమేశ్వర పాతాళ భైరవేశ్వరులు దేవతాంచకమని భీమేశ పురాణమున శ్రీనాథుడు వర్ణించెను.

అగస్త్యేశ్వరుని దేవాలయము పలివెల అను గ్రామమునందు కౌశికీ నదీతీరమున ఉన్నది. తూర్పు గోదావరిజిల్లాలో రాజమహేంద్రవరమునకు ఆగ్నేయభాగమున సుమారు ఇరువది మైళ్ళదూరమున పలివెలగ్రామము కలదు. ఇచ్చట అగస్త్యేశ్వరుడు అగస్త్యమహర్షిచే ప్రతిష్ఠింపబడెను. అగస్త్యేశ్వరస్వామి పేరు కాలక్రమమున కొప్పులింగేశ్వరుడుగ మారినట్లు ఒక కథ ప్రసిద్ధముగ వినవచ్చుచున్నది.

చాళుక్యభీముడను రాజు (క్రీ. శ. 888-918) ఆంధ్రదేశమును పాలించుచుండెను. అప్పుడొక పూజారి పలివెలగ్రామమున నివసించుచు మిక్కిలి భక్తిశ్రద్ధలతో అగస్త్యేశ్వరుని పూజించుచుండెను. పూజారికి ఒక వేశ్యతో సంబంధమేర్పడెను. దేవుని పూజించు కాలమునందుదప్ప ఇక సమయముల దు పూజారి వేశ్యఇంటిలోనే నివసించుచుండెను. అతని ప్రవర్తనము ప్రజలకు గిట్టలేదు. కొందరు తమ ప్రభువునకు పూజారి దుర్వర్తనమునుగూర్చి తెలిపిరి. పూజారి స్థితిని గమనించుటకై రాజు కొంత పరివారమును వెంటబెట్టుకొని పలివెల గ్రామమునకు వచ్చెను. రాజు గ్రామము చేరునప్పటికి మధ్యాహ్నమయ్యెను. అప్పటికి పూజారి ఈశ్వరుని పూజించి భోజనము ముగించి వేశ్యతో సరసములాడుచు ఆమె ఇంటిలో ఉండెను. ప్రభువు ఈశ్వరుని దర్శింపగోరుచున్నాడను వార్త పూజారికి దెలిసెను. దేవుని దర్శింపవచ్చిన రాజునకు దేవుని నిర్మాల్యమగు ఒక పూలదండను ఇచ్చు ఆచారము ఆకాలమున ఉండెను. నేటికిని పెద్దలు దేవాలయమునకు వచ్చినపుడు పూలదండలను ప్రసాదమును వారికి ఇచ్చు ఆచారము మనమెరిగినదే. పూజారి వద్ద రాజునకు నిర్మాల్యముగా ఈయదగిన మాలిక ఏదియులేదు.

వేశ్యాజడలోఁ ఉ న్న పూలద డను తీసికొని పూజారి ఎవరికి కనిపిం చకు డ దేవాలయమున ప్రవేశి చెను ఈశ్వరుని స దర్శి చిన ప్రభువుయొక్క శిరమున ఆ పూజారి పరమేశ్వరుని పాదుక లు చి వేశ్యజడను డి తెచ్చిన పూలదండను అతని దోసిలి య దు శివుని నిర్మాల్యప్రసాదముగా ఉ చెను పురజనులు ఆ ద డను శ్రద్ధగా పరిశీలి చి అ దలి వె ద్రుకను రాజునకు చూపరి అది పూజారి వేశ్యకు స బ ధి చినదే అని నొక్కి చెప్పరి రాజు పూజారితో ఓయీ ! నీవు వేశ్యాలోలుడవై చెడుటయేకాక మాకిచ్చు ప్రసాదమునుగూడ ఇట్లు కేశ కళంకితము జే సివి నిన్నే మిచేసిన ఈ పాపము తొలుగును అని గద్దించి పలికెను పూజారి రాజు మాటలకు బెదరక అద డ ఈశ్వరుని శిరమును డి తెచ్చినదే అనియు అది వేశ్యజడలోనిది కాదనియు స్వామికి జటాజూటమునందు దీనిని అల కరి పగా స్వామి కొప్పున దలి వె ద్రుకయొకటి దీనికి అ టుకొనె ననియు ధైర్యముతో బదులుచెప్పెను ఈశ్వరునకు కొప్పు ఉన్నచో మాకు చూపు మని రాజు కోపముతో పూజారిని బెది రించెను పూజారి రాజుతో ప్రభూ ! ఈ దినమున దు దేవుని పూజ చి నాగాభరణముచే అల కరి చితిని దీనిని ఈరోజు తీయుటకు వీలులేదు రేపు ఉదయమున దేవుని శిరమున దలి కొప్పును తమకు తప్పక చూపెదను అని విన్నవి చుకొనెను ప్రభువు దానిక గీకరి చి ఆదినము ఆ గ్రామమునందే నిలిచెను పూజారి ఆనాటిరాత్రి దేవాలయమునకు బోయి తలుపులు మూసికొని ఈశ్వరుని చె త లిచి తనకు రానున్న ఆపదను డి తప్ప వ్వమని గాఢ భక్త్యావేశముతో ఈశ్వరుని ప్రార్థి చెను కొప్పును ధరి చి తన మానమును కాపాడనిచో శివుని చె తనే ప్రాణములను వదులుదునని పట్టుబట్టెను అతని ప్రార్థన భక్తాధీనుడగు శంకరుడు వినెనోయేమో యనునట్లు తెల్లవారు జామువరకు ఈశ్వరునిలి గమున కొప్పుమొలిచెను మరునాడు ఉదయమున పురప్రముఖులతో రాజు దేవాలయమునకు వచ్చి శివలి గము న టియు న్న జడముడిని జూచెను పూజారి ఆకేశ ములను లి గమునకు అ టి చియు డును అను అనుమాన ముతో రాజు ఆలింగపు జడముడినుండి కొన్ని వెంద్రుకలను లాగివై చెను అంత రోమకూపములను డి నెత్తురు చి దెను రాజు కన్నులు మసకబారిపోయెను తన తప్పును మన్ని పు మని రాజు ఈశ్వరుని ప్రార్థించి ఈశ్వరానుగ్రహమున మరల సరియగు దృష్టిని పొ దెను ఈ విధముగ అగస్త్యేశ్వరుడు నాడు మొదలుకొని కొప్పులి గేశ్వరుడుగా మారెను పూజారిభక్తికి మెచ్చి రాజు ఆ పలివెలగ్రామమునకు పడమట ఎనిమిదిమైళ్ళ దూరమున వసిష్ఠా (గోదావరి ఎడుపాయలలో ఒకటి) నదియొడ్డున ముప్పదిపుట్ల భూమిని అతనికి పన్నులు లేకు డునట్లు అన్ని హక్కులతో మాన్యముగా ఇచ్చెను ఈ భూమికి జుత్తిగపాడు అనుపేరు నాడును నేడునుగూడ ప్రసిద్ధమైయున్నది ఈ భూమిపై సర్వాధికారములు పూజారి వ శజులకే చె దియు డెను ఈ భూమికి సమీపమునందలి పొడగట్లపల్లి లోని వేదాధ్యయన స పన్నులైన బ్రాహ్మణులు నేటికిని వసిష్ఠానదిలో స్నానముచేసి జుత్తిగపాటిభూమిలో బ్రహ్మయజ్ఞము వేదపారాయణము చేయుటచూడగా ఈ నేల మహిమ గొప్పదని మనకు తెలియుచున్నది అగస్త్యేశ్వర క్షేత్రము(కొప్పులి గేశ్వరక్షేత్రము)దక్షారామకుమారారామ క్షేత్రములతో సమానప్రతిపత్తి కలిగియున్నది ఇచ్చటి అగస్త్యేశ్వరుడు (కొప్పులి గేశ్వరుడు) దక్షారామమున దలి భీమేశ్వరునితో సమానుడు అని విశ్వసి పబడుచున్నది

టిం అం శా

## అగళి

అగళి అను గ్రామము అన తపురం జిల్లా మడకసిర తాలూకాలో ఉన్నది దీనికి 20 మైళ్ళలో మడకసిర పట్టణము 10 మైళ్ళలో మైసూరు రాష్ట్రమునకు చె దిన సిర పట్టణము కలవు దీని తూర్పున కొడిహళ్ళి పొలిమేర పడమట హుళ్లెకెర దేవరహళ్ళిపొలిమేర ఉత్తరమున నరసాభోధి మధుడి దక్షిణమున మైసూరుస్టేటు కోడిహళ్ళి పొలిమేర కలవు ఈ గ్రామ విస్తీర్ణము 8 448 ఎకరములు

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములోని పురుషులు 2 119 మ ది స్త్రీలు 1940 మ ది - మొత్తం 4 059 మ ది వీరిలో షెడ్యూలు జాతులవారు తరగతుల వారు 814 మంది ఈ గ్రామము చెరువుకట్ట దిగువన చదును ప్రదేశమున నిర్మి పబడినది ఇచ్చటి ఇ డ్లు గు పుగాను వరుసగాను ఉన్నవి వీటిలో 4 పె కుటిండ్లు 12 కా క్రీటు కప్పుగల ఇ డ్లు 12 ఒక అ తస్తుగల మేడలు జనులు వరి జొన్న రాగి అన్నము తి దురు బావినీటిని త్రాగుదురు నీటి ఎద్దడికలదు

ఈ గ్రామమునకు సువర్ణముఖనది అగళి చెరువు ఇరిగేపల్లి చెరువు ఊటలు నీటి వనరులు వీటిక్రింద వరి రాగి

## అగ్గం

బాణవంశమునకుచెందిన అగ్గప నామధేయము ఉదవగండ్ల శాసనమునందు (జి 7 కడప 6) కలదు బాణవంశజులు మొదట మైసూరు రాజ్యమందలి కోలారు మండలమును తరువాత ఉత్తర ఆర్కాటుసందును రాజ్యము సలిపినట్లు శాసనాధారములు కలవు కానివారు స్వతంత్రులుగాక పల్లవులకును పశ్చిమ గాంగరాజులకును సామంతులై ప్రఖ్యాతికాంచిరి వారు చోళరాజగు మొదటి పరాంతకునిచే (క్రీ శ 902 48) ఓడింపబడిన బాణరాజులు పదభ్రష్టులై తమదేశమును వదలి ఆంధ్రదేశమునకు వలసవచ్చి నేటి అనంతపుర కడప చిత్తూరు జిల్లాల ఆక్రమితప్రదేశములందు అచ్చటచ్చట తమ రాజ్యమును నెలకొలిపిరి

తాము భాగవత విష్ణుపురాణములో చెప్పబడిన దానవాగ్రణియగు బలిచక్రవర్తి కొడుకైన మహాబాణుని వంశములోనివారమని బాణరాజులు తమ శాసనములందు చెప్పుకొనిరి బాణరాజుల నల్లటిధ్వజముపై రాజలాంఛనమగు వారిణియు ముద్రపై వృషభమును ముద్రితములై యున్నవి శైవమతావలంబులును నందీశ్వరుని భక్తులును నైవరలిరి కొన్ని శాసనములలో బాణరాజులు పెరుబాణాధిరాజ యను బిరుదు వహించినటుల కూడ తెలియుచున్నది తమిళభాషలో పెరు లేక పెరియ యనుపదము బృహత్ లేక గొప్ప అను అర్థము కలది

కొత్రపాడు (జమ్ములమడుగు తా॥) శాసనములో ఒకానొక బాణరాజు ఒక దేవాలయమందు ఆదిత్యుని ప్రతిష్ఠ చేయుచు తాను రెండవ చాళుక్య కీర్తివర్మకు (744-57) సామంతుడనని చెప్పుకొనెనని కలదు ఆంధ్రప్రాంతమందలి బాణరాజుల శాసనములు చాలావరకు శిథిలములగుటవలన వారి సమగ్ర చరిత్ర తెలిసికొనుట కష్టసాధ్యముగా నున్నది పులివెందల తాలూకాలోని బలపనూరు తాతకొవ్వూరు ఉదవగండ్ల అను గ్రామములందు బాణుల శాసనశిథిలావశేషములు కనిపించినవి బలపనూరు శాసనమున బాణరాజగు ధవళేయరాజు దానమిచ్చినటుల కలదు ఉదవగండ్ల శాసనమున అగ్గప యను బాణరాజుయొక్క ప్రశంస కలదు

ఆంధ్రమండలమున 12 000 గ్రామములు బాణుల రాజ్యపాలనక్రింద చేరియుండినవనియు అనంతపురముజిల్లా హిందూపురం తాలూకాలోని పరిగిపురము వారికి రాజధానియై వరలెననియు చరిత్ర ప్రతీతి కలదు ప్రస్తుతము పరిగి అను గ్రామము ఫిర్కాకు ముఖ్యకేంద్రముగా నుండి 5 643 జనాభాతో ఒప్పారుచున్నది

కొ వెం

## అగ్గినేనిమారినేడు

ఈతడు పెంజర్వు వెనుకనున్న తన తోటను గుండపరెడ్డి మారెడ్డికి విక్రయించినట్లు ఒక చిన్న శాసనములో లిఖింపబడినది గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా వేల్పూరు గ్రామమునందలి రామలింగేశ్వర ఆలయపు గాలిగోపురము సమీపములో ఈ శాసనశిల పడియున్నది శాసనకాలము శక 1182 ఆశ్వయుజశు 14 ఆ (ఆదివారము కావచ్చును) అనగా క్రీ శ 1260 ఒకఆసామి మరియొక ఆసామికి ఒక తోటను అమ్మటయనంత ప్రముఖవిషయము కాదు ఈ చిన్న విషయమునకై శాసన లేఖనమేల ఆవశ్యకమయ్యెనో తెలియదు ఇట్లైన కావచ్చును తోటనుఅమ్మిన అగ్గినేనిమారినేడు ప్రాభవముగల వ్యక్తిగా తోచుచున్నాడు ఇతడు పద్మనాయక కులస్థుడు కావచ్చునని పేరునుబట్టి తోచుచున్నది ఇతనితండ్రి అగ్గినేడు మారెడ్డి తండ్రి గుండపరెడ్డి ఆ కాలములో ఇంటిపేరునకుబదులు తండ్రిపేరును తనపేరుతో చేర్చుకొనుట ఆచారముగా కనబడుచున్నది పెంజెర్వు అనునది గ్రామనామమో లేక పెద్దచెరువు అని యర్థమో నిర్ణయింప వీలుకాదు క్రీ శ 1260 ప్రాంతమున వెలనాడంతయు కాకతీయుల ఏలుబడిలోనికి వచ్చినది అది గణపతిదేవ చక్రవర్తి రుద్రమదేవి పరిపాలించుకాలము

ఖం అ రం

## అగ్నియాకసెట్టి

అగ్నియాకసెట్టి ఒక వైశ్యోత్తముడు ఈ సెట్టిపేరు ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు ప్రచురించిన గంగాపురపు కన్నడ శాసనము (నె 8 పుట 31) లో పేర్కొనబడినది చెంకణాదిత్యసోమిసెట్టి జలదం శ్రీరామసెట్టి గోనిసెట్టి బూతిసెట్టి బాచిసెట్టి కొట్టిరుసెట్టి త్రైలోక్య మల్లసెట్టి మానిక్యమల్లిసెట్టి ఎంగణబాచిసెట్టి బోనగియ దాసెట్టి త్రిభువనమల్ల భూతినాయకుడు పాణినాయకుడు బిమ్మినాయకుడు సమస్తప్రజలు కూడి సాగరేశ్వర కేశవస్వాముల ప్రీతికొరకు అనేక దానములు చేసినట్లు పైశాసనమున చెప్పబడినది

ఈ శాసనము పశ్చిమ చాళుక్యరాజగు శ్రీమత్ప్రతాప చక్రవర్తి రెండవ జగదేకమల్లుని కాలమునకు చెందినది ఈ శాసనము తేది జగదేకమల్లుని రాజ్యపరిపాలనము నందలి 4వ సంవత్సరమునకు సరియగు దుర్మతి సంవత్సర మార్గశిర బహుళ అమావాస్య ఆదివారము (30 నవంబరు క్రీ శ 1141)

గంగాపురము చారిత్రక ప్రాముఖ్యము కలది ఇది మహబూబునగరు జిల్లా (మహబూబునగరమండలము పూర్వము చోళుల ప్రముఖస్థానము) జడ్చర్ల రైల్వేస్టేషనుకు మూడు మైళ్ళలో నున్నది చాళుక్యరాజుల కాలమున ఇది ప్రముఖ పట్టణమై వరలెను నేటికిని ఇచట దీని ప్రాచీనవైభవమును సూచించు నిర్మాణ శిథిలావశేషములు పెక్కులు కనిపించు చున్నవి

ఈ శాసనమందు కనిపించు ప్రతాపచక్రవర్తి జగదేకమల్ల అను బిరుదములను తమ విస్తృత సామ్రాజ్య సూచకములుగా కన్నడదేశ చక్రవర్తులు ధరించిరి ఈ శాసనమున పెక్కు దానములు చేసినట్లు చెప్పబడిన సెట్టులందరు వర్తకముచే విశేషముగ ధనమును ఆర్జించిన ధనికవర్తకులు దానశీలము కలవారు వీరిలో అగ్నియాకసెట్టి ప్రముఖుడు తమ ఉన్నతస్థితిని బట్టి కొందరు సెట్టులు త్రైలోక్యమల్ల వంటి బిరుదములను కొందరు నాయకులు త్రిభువనమల్ల వంటి బిరుదములను ధరించి ఉందురని ఊహింపవచ్చును

శాసనమున పేర్కొనబడిన నవకోడూరు అనుగ్రామము ఎది? ఎచ్చటిది? అను విషయము విమర్శింపదగినది కోడూరు అను గ్రామము నేడు మహబూబునగరు జిల్లాలో కలదు ఇది మహబూబునగరమునకు 7 మైళ్ళ దూరములో ఉన్నది ఒకానొకప్పుడు దొర అను అధికారి ఇచ్చట ఒక కోటను నిర్మించి కోళ్ళనుపెంచు ఒక ఫారమును ఏర్పరచెనట అందుచే ఈ గ్రామమునకు కోడూరు (కోడి + ఊరు) అనుపేరు ఏర్పడినట్లు చెప్పుచున్నారు కోడి పక్షి చోళుల ప్రాచీన గాథలతో ముడివడి ఉన్నట్లు కనబడును కలుపొన్నలు (రాతిపొన్నచెట్లు) విరిసెనని కలుకోళ్ళు (రాతికోళ్ళు) కూసెనని చెప్పబడినది ఈ శాసనస్థమైన నవకోడూరునకు ఈ కోడూరునకు ఎట్టి సంబంధముకలదో తెలియదు

శాసనమున పేర్కొనబడిన పాణినాయకుడు మున్నగు నాయకులు ముతరాచ (నేటి ముదిరాజ) కులమునకు చెందిన వారై రాష్ట్రాది సంరక్షణ కార్యములందు నియుక్తులై ఉండి యుందురు అగ్నియాసెట్టి ఒనర్చిన ఇతర ఘనకార్యములు తెలియవు

గంలకాం

## అగ్నివర్ణుడు

అగ్నివర్ణుడు అనురాజు ప్రశంస ఏకామ్రనాథుడు రచించిన ప్రతాపరుద్రచరిత్రమునందును కూచిమంచి జగ్గకవి సోమదేవరాజీయమునందును లభించుచున్నది కాకతీయ వంశపు ఆవిర్భావమును ఈ గ్రంథములు చంద్రునివద్దనుండి చెప్పుకొని వచ్చుచున్నవి కాగా కాకతీయులు చంద్రవంశము వారని ఈ పూర్వపు ఆఖ్యానముల భావముగా కనిపించు చున్నది పాండవులు ఈ వంశములోని వారే అట్లు పెక్కు తరములు గడవగా ఈ వంశములో ఉత్తుంగభుజుడను మహారాజు జన్మించెను ఈతడు దాయాదులకు ఓడియో లేక వారికి దూరముగా ఉండదలచియో గోదావరీతీరమందలి ధర్మపురికి దక్షిణభాగమున అనతి దూరములో ఒక పట్టణమును నిర్మించుకొని పెక్కు దుర్గములు సాధించి పరిపాలించెనట ఉత్తుంగభుజుని కుమారుడైన నందమహారాజు తండ్రిని మించిన వీరుడుగా వర్ణింపబడినాడు ఇతడు నందగిరి అను పట్టణమును నిర్మించి దానిని ముఖ్యపట్టణముగా చేసుకొనెను ఈ రాజు శ్రీశైలదర్శనము కావించెనట ఇతడు చోళరాజుతో మహాయుద్ధముచేసి అతనిని ఓడించి వాని కుమార్తెయైన సునందాదేవిని పెండ్లియాడెను

సునందాదంపతులకు విజయపాలుడు అను కుమారుడును సుమతి (వసుమతి) యను కుమార్తెయు కలిగిరి సుమతిని యదువంశమునందు జనించిన సత్యభానునచ్చు పెండ్లిచేసిరి విజయపాలుని కుమారుడు అగ్నివర్ణుడు సుమతికి వృషసేనుడను తనయుడు పుట్టెను ఇట్లు నందమహారాజునకు అగ్నివర్ణుడు పౌత్రుడును వృషసేనుడు దౌహిత్రుడును అగుచున్నారు అగ్నివర్ణుని తండ్రియైన విజయపాలుడు ఏ కారణమువనో శాపగ్రస్తుడగుటచే రాజ్యపాలనకు సమర్థుడు కాకుండెను నందుడు రాజ్యావసానమున శ్రీశైలమునకు వెళ్ళిపోవుచు తనరాజ్యమును అగ్నివర్ణునకును వృషసేనునకును పంచియిమ్మని తన మంత్రుల కాజ్ఞాపించెను అగ్నివర్ణుడు చాళుక్యవంశీయుడని ప్రతాపరుద్రచరిత్ర చెప్పుచున్నది

అగ్నివర్ణుడును వృషసేనుడును రాజ్యము చేయుచుండిన కాలమున మూడు సంవత్సరములు మహాక్షామము చెలరేగెనట

వృషసేనుడు ఇ ద్రుదనారాధి చగా భా ్యవృష్ట కలిగెను కావున ఈ వ శము వారికి వృష్టివ శము అను పేరు వచ్చినది వృషసేనుని వ శమునకు వృష్టివ శము అను పేరు కల్గినది ఈ వ శము పెక్కు శతాబ్దములు చెల్లియు డెనని ఊహించుటకు వీలగుచున్నది కాకతి మొదటి బేతరాజు విష్టివ శమువాడని కాజీపేట శాసనమున దు కలదు

"సామ త విష్టివంశః
శ్రీ మాన్కాకతి పురాధి నాథో బేత
చోళక్ష్మాపాల చమూ వార్ధి ప్రమథన
సమార్జితోర్జిత కీర్తిః"

ఈ శబ్దార్థము సరిగా తెలియకపోవుటచే దీనిని చారిత్రకులు అనేక విధములుగా అన్వయి చరి వృష్టి శబ్దము విష్టి యగుట సక్రమముగా ఉన్నది కృష్ణ శబ్దము క్రిష్ణ అయినట్లు మొదటి కాకతీయులు తాము విష్టివ శము వార మని చెప్పుకొనిరి ఎవప తరువాతి వారుకూడ దీనిని విస్మరి చి ట్లు కనబడును వృషసేనుని వ శములో కన్నడదేవుడను మహారాజు జన్మి చెను ఇతడు క దారమును రాజధానిగా చేసుకొని భూమిని పాలించెను ఈయన దానశీలుడు గోదావరీ తీరమునఉన్న విప్రులకు 18 500 అగ్రహారములు సమర్పి చెనట ఇది అతిశయోక్తియని వేరుగా చెప్పనక్కరలేదు కన్నడదేవుని కుమారుడే సోమదేవరాజు అగ్నివర్ణుని కుమారులు రాజ్యమునకై తమలో తాము కలహి చి కొ దరు మరణించిరి ముగిలినవారు వృష్టికులముతో కలిసియు డిరి

ఈ కథానకమున దు చారిత్రకా శమె తయో నిర్ణయించుట కష్టము చాళుక్యులు చోళులు చరిత్ర ప్రసిద్ధి నొందిన రాజవంశములవారు వృష్టివ శము వృష్ణివంశమే కావచ్చును వీరు యాదవులు కృష్ణుడు వార్ష్ణేయుడు చాళుక్యులకును చోళులకును స గ్రామములు జరుగుటకూడ విశ్వసింప వచ్చును న దమహారాజు అగ్నివర్ణుడు కన్నడదేవ సోమదేవులు - వీరి కార్యక్షేత్రమేది ? అనునది విచారణీయమైన అంశము న దునిత డ్రి గోదావరీ తీరమ దలి ధర్మపురి సమీపమున పట్టణము నిర్మి చెనని చెప్పబడినది ధర్మపురి మిక్కిలి పురాతన నగరముగా తోచుచున్నది తెల గాణము న దలి మ థెన ధర్మపురి కాళేశ్వరము ప్రాచీనస్థానములు ఇవన్నియు గోదావరీ తటమున ఉన్నవి కాని న దుడు స్వయముగా నందగిరిని నిర్మించినట్లు చెప్పబడినది ఈ నందగిరి ఎచ్చట న్నున్నదో సరిగా గుర్తి పబడుటలేదు ప్రస్తుత మహారాష్ట్ర ప్రదేశములో ఉన్న నా దేడునగరమే నందగిరియని కొందరు చెప్పుచున్నారు నా దేడునగరము గోదావరి తీరమునందే ఉన్నది దీనికి సమీ ములో దక్షిణమున ఖ దహార్ అను స్థలము కలదు ఇవన్నియు పూర్వపు నిజామురాష్ట్రములో చేరినవి పైన చెప్పబడిన కన్నదేవుడు స్థాపి చిన క దారపుర మిదియేయని వారు చెప్పుచున్నారు న దుడు నిర్మి చిన నందగిరి గోదావరీ తీరమని ఆఖ్యానములలో చెప్పబడలేదు

న దగిరిని నా దేడుపట్టణముగా గుర్తించుట ఉచితముగా కన్పి చదు తెలుగు రాజులకు స బంధించిన గాథలకు మహారాష్ట్ర ప్రాంతము ర గస్థలమగుట స దేహాస్పదము శాతవాహనులు ఆ ధ్రరాజులేకదా వీరికి మహారాష్ట్రదేశముతో గాఢ స బ ధము లేదాయని ప్రశ్నజని చును నిజమే శాతవాహనులు విశాల సామ్రాజ్యమును పరిపాలి చినవారగుటచే వారికి మహారాష్ట్రముతో స బ ధము ఉపన్నమగుచున్నది కాని న దుడు సోమదేవరాజు మున్నగు స్థానిక పరిపాలకుల కార్యక్షేత్రము మహారాష్ట్రదేశమునందు ఉ డెననుట విశ్వసనీయము గాలేదు ఇ తేకాక చోళులకును చాళుక్యులకును మహారాష్ట్ర ప్రాంతముతో స బ ధములేదు వీరు ప్రధానముగా దక్షిణ దేశపు రాజకుటు బములవారు హిరణ్యరాష్ట్రము అనబడు కడపమ డలము దాని పరిసరప్రాంతములు చోళులకును చాళుక్యులకును జన్మస్థానములని చారిత్రకులు భావి చుచున్నారు నందరాజు చోళులతో యుద్ధముచేసి చోళకన్యను పరిణయమాడెను ఈతడు శ్రీశైల మల్లికార్జున భక్తుడు

ఈ య శములను పర్యాలోచి పగా న దగిరి యనునది హిరణ్యరాష్ట్రములో నుండి యుండెనని మనము ఊహింప వచ్చును ఈ ప్రా తమును పాలి చిన చోళులను రేనాటి చోళు లనుచున్నారు వారి శాసనములిక్కడ క్రి శ 6వ శతాబ్దము ఉత్తరార్ధమును డియు లభించుచు న్నవి నందగిరి ఇప్పుడున్నదో లేదో ఎ పేరుతో ఉన్నదో పరిశోధి పవలసి యున్నది కడప జిల్లా కడప తాలూకాలో న దిమ డలము (నందిమ గలము) అను పేరుగల పురాతన గ్రామము కలదు ఇచ్చట క్రి శ 7 9 శతాబ్దముల తెలుగు శాసనములు లభి చినవి ఇదికాని ఇట్టి ప్రాచీనగ్రామములుకాని నందగిరి యగునేమో పరిశీలి పవలెను కన్నడదేవుని కందరపురము

అన దగోత్రపు రాజుల రాజధానియైన విజయక ధరపురముగా గుర్తించుటకు వీలగుచున్నది ఇది నిజమైనచో న ద మహారాజు సోమదేవరాజు మున్నగువారు గుంటూరు కడప మ డలములలో ఉన్నవారగుదురు

నందాపురము అను మరియొక ప్రాచీన నగరము గోదావరికి ఉత్తరమున పొత్త గి తాలూకాలో ఉన్నది ఇది జయపుర సంస్థానమునకు పూర్వరాజధానిగా ఉండెను దీని ప్రశంస శివలీలా విలాసము విచిత్రరామాయణము అను కావ్యములందు దొరుకుచున్నది చోళ చాళుక్య స బంధములను బట్టియు శ్రీశైల ప్రస గమును బట్టియు నందగిరి పట్టణము హిరణ్యరాష్ట్రము లోనిదని భావించుటయే ఉచితముగా నుండును

అగ్నివర్ణునకు అగ్నివర్మఅనియు పేరు వాడబడినది వర్మపదము పల్లవ మహారాజుల పేర్లలో తరచు కన్పించును రేనాటిచోళులు పల్లవ బిరుదములను ధరించుచుండిరి

బం ల రం

తం అం శా

## అగ్నిశర్మ

విష్ణుకుండి వంశజులు వేంగిదేశమును క్రీ శ అయిదవ శతాబ్దినుండి ఎడవశతాబ్దము పూర్వార్ధమువరకు పాలించినట్లు శాసనాధారములవలన తెలియుచున్నది తెనాలి తాలూకాలోని ఈపూరు అను గ్రామమున దొరికిన రెండవ తామ్రశాసనము ననుసరి చి విషుకు డి నృపతులలో మూడవ వాడగు రె డవ మాధవవర్మ అమరపురము (అమరావతి) నుండి తన విజయరాజ్యసంవత్సరము 47 లో వర్షర్తువు ఎడవ పక్షము ఓడవదివసమున అగ్నిశర్మ ఇంద్రశర్మయను ఇరువురు బ్రాహ్మణులకు ఒక గ్రామమును దానముచేసినట్లు తెలియుచున్నది శాసనభాగమిచట శిథిలమగుటవలన దానమీయబడిన గ్రామమును గుర్తించుటకు వీలుకలుగకున్నది కాని డా సర్కారుగారు ఈ గ్రామనామము మురోతుకలికి అయియుండునని భావించిరి ఈ శాసనమున మూడు తరముల రాజుల ప్రశంసగలదు అందు మొదటివాడు మహారాజు మాధవవర్మ ఇతడు ఏకాదశ అశ్వమేధములను వేయి అగ్నిష్టోమములను చేసి నట్లు వర్ణింపబడినది ఇతని కుమారుడు దేవవర్మ బాహుబల పరాక్రమశాలి శాసనదాత అయిన రెండవ మాధవవర్మ దేవవర్మకుమారుడు ఈయన త్రికూట మలయాధిపతిగా శ్రీపర్వతస్వామి పాదాశ్రితుడుగా శాసనమున తననుగూర్చి చెప్పుకొనెను దేవవర్మ డ్రిలయిస్ మొదటి మాధవవర్మకు ము దే ది గపుడగుటవల రాజ్యాధిపత్యము రెండవ మాధవవర్మకు స క్రమి చి టుల చరిత్రకారులు నిర్ణయించిరి

ప్రతిగ్రహీతయైన అగ్నిశర్మను గురి చి విశేషాంశములు పూరు మొదటి తామ్రశాసనమువలన తెలియగును ఈ శాసనము వేయి చిన్నవాడు మొదట మహారాజు మాధవవర్మ త ప్రవర్ధమాన విజయరాజ్యస వ రములు లో గ్రీష్మర్తువు ఎడవ పక్షము దు న నయున శ్రీ గోత్రుడగు అగ్నిశర్మ గుద్దవాది విషయములోని విలెంబలి అను గ్రామమును దానమిచ్చినట్లు బడెను న్నులను డి మిసహాయించవలెనని తన వ్యధికారులను మాధవవర్మ శాసించెను గుద్దవాడివిషయము గా నేటి తూర్పుగోదావరి జిల్లాలోని రామచంద్రపురము తాలూకా యని చారిత్రకుల అభిప్రాయము

సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకుడు దినేశ చంద్రసర్కారు గారి ననుసరించిమొదటి మాధవవర్మ (క్రీ శ 535-585) 50 సంవత్సరములు పరిపాలించినట్లును రెండవ మాధవవర్మ (క్రీ శ 585-615) ముప్పది సంవత్సరములు రాజ్యాధిపత్యము నహించినటును తెలియుచున్నది వారి పాలనాకాలమందు గొప్ప వ్యత్యాసము లేనందున వారి శాసనముల దు పేర్కొనబడిన అగ్నిశర్మ ఒక్కడే అయి యుండుననుటకు సందేహములేదు

కొ వెం

## అగ్గానిఏడుగు

ఈ పేరు కడపజిల్లా గెజటీరు (పు 62) నుండి గ్రహింపబడినది కడప ప్రాంతమున స్వతంత్రరాజ్యమును నెలకొలిపిన తెలుగు చోడులను రేనాటి చోడులని చారిత్రకులు వ్యవహరించుట పరిపాటైనది వీరు సూర్యవంశజులనియు వీరివంశమునకు మూలపురుషుడు కరికాల చోడుడనియు శాసనములందు చెప్పబడినది

కడప జిల్లాలో పెన్నారు చిత్రావతి చెయ్యేరు అను నదుల మధ్యనుండు ప్రదేశము మైసూరు రాష్ట్రమందలి కోలారును చిత్తూరు జిల్లాలోని కొన్ని భాగములును కలిసి రేనాడని ఆ కాలమునందు పిలువబడినది ఇందు 7000 గ్రామములు కలవని కూడ శాసనములవలన తెలియును రేనాటి చోడులు

క్రీ శ 6 వ శతాబ్దము ఉ త్తరార్ధమును డి 10 వ శతాబ్దా తము వరకు రాజ్యము చేసెరి వీరి రాజ్యమున కిరువైపుల చాళు క్యులు పల్లవులు రాజ్యము ల నేలుచు డిరి

అగ్రానిఎడుగు అనునతడు రేనాడు వ శములోని ఎడవ తరమునకు చె దిన వాడుగా కనబడును ఈయన కాలము క్రీ శ 700 అని వీరి వ శవృక్షముపలన తెలియనగును కాని ఇతడు రాజ్యమునకు వచ్చినట్లుగాని ఘనకార్యము లు చేసెనట్లు కాని తెలియుటలేదు ఈమధ్య ఆర్ష శాఖవారు బెజవాడ యందలి కొ డమీద నున్న అక్కన్న మాదన్న గుహయందలి ఒక స్త భముమీద ఉత్ప త్తిఎడుగు అను నామము 8 వ శతా బ్దపు తెలుగు అక్షరములలో వ్రాయబడి యుండుట కనిపెట్టిరి ఒక గదా యుద్ధము వలెను డు రేఖాచిత్రము ఈ పేరున కెగువ భాగమున చిత్రంపబడి యున్నది

అగ్గిఎడుగు అను శబ్దము తెలుగు భాషయ దు జాతీయ మైనది ఎదియైన భయోత్పాదకమైన కార్యమును సాహసి చి చేసెనవానిని వీడు అగ్గిఎడుగు వంటివాడు అనుట సామా న్యము అగ్రానిఎడుగు అను దానిని అగరాని ఎడుగుగా కూడ మనము అర్థము చేసికొనవచ్చును రేనాడు రాజులలో ఈ నామధేయముగల వ్యక్తి ఒక్కడే కన్పి చు చున్నాడు అందువలన ఈపదము ఒకబిరుదును సూచి చునట్టిదిగా భావి ప వచ్చును అసలు పేరు వేరుగా ఎ దైన ఉన్నదేమో !

మొదటి సారిగా తెలుగు భాషలో శాసనములు వేయిం చిన కీర్తి రేనాటి చోళులకు దక్కినది శాసనలిపి బాదామి చాళుక్యులు వేయించిన తెలుగు కన్నడ శాసనముల లిపిని పోలి యు డునని అభిజ్ఞులు నిర్ణయించిరి

కొ వెం

## అఘపురం అనంతోజీ పంతులు

ఇతడు పరదునేదార్ల (పదప్రభువుల) స్థానాపతులలో ఒకడు మాననంగువారి మాధవయ్యా చాందువారి చెన్న గిరయ్యా కటకం వారి కరుణాకరయ్యా వోరగ టి వారి వోబ శయ్యా డిల్లీ సురతాణి వారి డాకోజీపంతులు బెడదకోట వారి బేకోజీపంతులు గోలకొండ వారి గోపోజీపంతులు అహా ముదానగర వయ్యపరాజు విజయాపురం వీరమరాజు పురాణ పురం పురందరయ్యా బాగానగరం బాగోజీప తులు మొదలగు స్థానా పతులును ఇతడును గజపతులగు ముకుంద బాహు బలేంద్రులు జగన్నాథ పట్టణమున ఉండగా అచటికి వచ్చిరి అపుడా పట్టణమున జగన్నాయకుల మహోత్సవమ జరగు చు డెను ఆ మహోత్సవ సమయమున ఆ పట్టణమున అల కృతములై న భామంటపములు గోపురద్వార భూములు భట సముదాయములు శృ గార వనము లు చూచువారికి అన ద మును కల్పి చుచు డెను అన తోజీప తులు మొదలగు స్థానా పతులతో బాటు ఆ మహోత్సవమును తిల చి ఆన దించుటకు స్థానా తరముల ను డి బ్రాహ్మణ గృహస్థులు బ్రహ్మచారులు క్షత్రియు ు మున్నగువారు పెక్కురు విచ్చేసిరి ఈ స్థానా పతుల దరు స్నాన స ధ్యా వ దనములను ముగించుకొని శుద్ధ వస్త్రధారులై దేవతార్చన సమయమునకు దేవపూజాగృహము ము దరనున్న లక్ష్మీ చావడిలో కూర్చుండిరి గజపతి వారు జగన్నాథస్వామి పూ ను ముగి చుకొని నవరత్న ఖచితమైన పీటపై ఉపవిష్టులై పురాణ శ్రవణముచేసి ఆశ్రితవిద్వజ్జనులు ఆశీర్వచన పూర్వకముగా ఇచ్చిన భూతిని గ ధాక్షతాదులను భక్తితో అ దుకొని ఆ స్థానాపతులకు ఆ జగన్నాథ ప్రసాద మును వక్కలాకులను ఇప్పి చి వారిని విడుదులకు ప ఎరి దీనిచే ఆ స్థానాపతులు వివిధ రాజాస్థానములను డి ఆ ఉత్సవము నకు విచ్చేసిరనియు వారియందు గజపతి వారికి ఆదరాభి మానము లు డెననియు ఊహి నగును గజపతివారు జగ న్నాథుని భక్తులు వారు ఆ భగవ తుని శ్రద్ధాభక్తులతో సేవి చిరి వారు నవరత్న ఖచితమైన బ గరు పీటపై ఆసీనులగుట గోమేధిక స్థగితమయిన బంగరు పళ్ళెములో షడ్రసోపేత మైన భోజనమును ఆరగి చుట మున్నగు విషయములు వారు అత్య త వైభవోపేతులని చాటుచున్నవి

ఆ స్థానాపతులు వివిధ రాజాస్థానములనుండి రాయబారు లుగా వచ్చియుందురు వారిలో కొ దరు ఎ స స్థానములకు ఎ పట్టణములకు చె దినవారో బోధపడుటలేదు కటకము ఓఢ్ర దేశములోనిదే కావచ్చును బేడరకోట బీదరు అహముదా నగర అహమద్ నగరు నిజాముషాహీ క్రిందనుఉన్నది

కృష్ణరాయల సమీప కాలముననే (అప్పటి ఢిల్లీ సుల తాను అగ్బరు (1509 531)) బహమనీరాజ్యము అయిదు రాజ్యములుగా చీలిపోయెను వానిలో నిజాముషాహీ (అహ మ్మదునగరు) ఆదిలుషాహీ (బీజాపూరు విజాపురము) కుతుబు షాహీ (గోల్కొ డ) ముఖ్యములు బరీదుషాహీ ఇమాదు షాహీలు కూడా వీనిలో కలవు బాగాపురము పురాణపురము అనునవి ఎవియో తెలియుటలేదు

అఘపుర అనంతోజీవంతులు మున్నగు స్థానాపతులు స్నానసంధ్యావందనాదులు ఆచరించి తెల్లని పట్టు వస్త్రము లను ధరించి శుచీభూతులై దేవపూజాగృహమునకు వచ్చినట్లు రాయవాచకమున చెప్పబడుటచే వారు బ్రాహ్మణులును స్థానాపతులుగ వర్ణింపబడుటచే రాజనీతిచతురులును అయి యుందురనియు స్వామికార్య నిర్వహణమునకు ఆ మహో త్సవసమయమున జగన్నాథపురికి విచ్చేసిరనియు మనమూహింప వచ్చును అఘపుర అనంతోజీ పంతులను గురించి ఇతర వివ రములు తెలియవు

గ ల కాం

## అఘోరనాథ చటోపాధ్యాయ

వంగదేశమునందు అనేకులు మహావిద్వాంసులు కవులు శాస్త్రవేత్తలు విద్యానిపుణులు దేశభక్తులు మున్నగువారు జన్మించిరి అట్టివారిలో శ్రీ అఘోరనాథచటోపాధ్యాయులు ఒకరు. వీరు వంగబ్రాహ్మణులు జన్మతః వీరు ఆంధ్రులు కాక పోయినను ఇచ్చట అనగా ఆంధ్రప్రదేశ రాష్ట్రమునకు కేంద్ర

చిత్రము 6



డా అఘోరనాథ చటోపాధ్యాయ

మగు హైద్రాబాదు నగరమున ఉద్యోగిగా కొంతకాలము గడపిరి వీరి కుమార్తెయు ప్రసిద్ధకవయిత్రియు మహావక్త్రి విశ్వశోభితయు దేశభక్తురాలును అగు శ్రీమతి సరోజిని నాయుడుగారు ఆంధ్రులైన డాక్టరు ముత్యాల గోవింద రాజులు నాయుడుగారిని వివాహమాడి ఆంధ్రదేశమున స్థిర నివాసమేర్పచుకొనిరి కావున అఘోరనాథ చటోపాధ్యాయు లకు ఆంధ్రదేశములో సన్నిహిత సంబంధమేర్పడినది

అఘోరనాథుడు నేటి తూర్పు బంగాళములోని బ్రహ్మ నగరము అను గ్రామమున జన్మించిరి ఆయన పూర్వులు వేద ములను సంస్కృత వాఙ్మయమును చక్కగ అభ్యసించిన గొప్ప శ్రోత్రియులు పండితులు వారందరును స్వాధ్యాయ ప్రవచనముల దే తమ జీవితమున తను కడపుచువచ్చిరి వారె ల్లరునుకూడ ప్రకృతిసౌందర్యము నారాధించుచు దీర్ఘ కాలము అరణ్యములో కాలక్షేపమొనర్చెడివారు

అఘోరనాథుడు ప్రాథమిక విద్యాభ్యాసము ముగించు కొని ఉన్నతవిద్యను సాధించుటకై కలకత్తా విశ్వవిద్యాలయ మునందు ప్రవేశించెను పేదరికమువలన ఆయన విద్యార్థి జీవితము చాల కష్టములతో గడచెను అయినను తన మేధా సంపత్తివలన ఆయన సమకాలికులగు విద్యార్థులలో అగ్రస్థాన మును సంపాదించగలిగెను అఘోరనాథుడు సంస్కృతము నందును ఆంగ్లమునందును అపారమగు పాండిత్యమును సంపాదించెను ఆయనకు గ్రీకు హీబ్రూ ఫ్రెంచి రష్యను జర్మనుభాషలతో చక్కని పరిచయముండెను అతడనుదిన మును ఏదో ఒక నూతన విషయమును తెలిసికొనుటకై యత్నిం చుచు జీవితమంతయు విద్యార్థిగనే డపెను అఘోర నాథునికి రసాయన శాస్త్రమునందు మిక్కిలి అభిరుచియు డె డిది ఆయన తన బుద్ధికుశలతవలన విద్యార్థి వేతనమును సంపా దించి ఉన్నతశాస్త్ర విజ్ఞాన పాదసమునకై బ్రిటను దేశమున కేగి ఎడింబరో విశ్వవిద్యాలయమున 1877 వ సంవత్సరమున డాక్టరు ఆఫ్ సైన్స్ పట్టమును సంపాదించెను పిమ్మట ఆయన జర్మనీదేశమునకు పోయి అచ్చట తన శాస్త్రీయవిజ్ఞానము ని కను వృద్ధి పొందించుకొనెను ప్రకృతిశాస్త్రవిజ్ఞానమును సంపాదించి ఖ్యాతిగాంచిన భారతీయ విద్వాంసులలో ప్రఫుల్ల చంద్రరాయిగారును జగదీశచంద్రబోసుగారును ప్రథములుగ భావింపబడుచున్నారు కాని అఘోరనాథుడు వారికి పూర్వమే శాస్త్రీయ విజ్ఞానరంగమున ప్రవేశించి శాస్త్రపరి శోధనమునకు త్రోవచూపెను

విదేశములలో విద్యాభ్యాసము పూర్తికావించుకొని అఘోరనాథుడు భారతభూమికి మరలివచ్చెను అనతికాల ములో అనగా 1878 వ సంవత్సరమున ఆయనను ఆనాటి

హైద్రాబాదు ప్రభుత్వమువారు తమరాష్ట్రమునకువచ్చి విద్యాశాఖలో పనిచేయవలసినది/ ఆహ్వానించిరి ఆంగ్లభాషద్వారా విద్యా బోధచేయు ఒక ఉన్నతపాఠశాలను స్థాపించవలసినదిగ హైద్రాబాదు ప్రభుత్వము ఆయనను కోరెను ఆయన అట్టి పాఠశాలను నెలకొల్పి తనబోధన నైపుణ్యమువలనను పాండిత్యప్రకర్షవలనను గొప్పఖ్యాతి సంపాదించి హైద్రాబాదు పాలకులగు నిజాము ప్రభువుగారి మన్ననలనుకూడ పొందిరి మరికొంతకాలము గడచినవెనుక హైద్రాబాదు కళాశాల అను ఒక ఉన్నతవిద్యాస్థను జాము దొరతనమువారు స్థాపించిరి ఆ కళాశాలకు అఘోరనాథుడు ప్రధానాచార్యుడుగ నియమింపబడెను దానిని మద్రాసు విశ్వవిద్యాలయమువారు గుర్తించిరి అదియే నేటి నిజాము కళాశాల

అఘోరనాథుడు కేవలము ఉద్యోగముచేసి ఉదరపోషణము కావించుకొను స్వభావము కలవాడుకాడు ప్రజాహితముకొరకై అన్నిరంగములలోను కృషిచేయవలెనని ఆయన ఆశయము 1883వ సంవత్సరమున హైద్రాబాదు ప్రభుత్వమువారు చాందావరకును బెజవాడవరకును రైలుమార్గమును వేయించుటకు ఒక ప్రణాళికను ఒక ఆంగ్లకంపెనీ వారి పరముచేసిరి ఇట్లు చేయుట దేశమునకు హానికరమని అఘోరనాథుడు హైద్రాబాదు ప్రభుత్వమును విమర్శించెను అందులకు కోపగించి నిజాము దొరతనమువారు ఆయనను ఉద్యోగమునుండి తొలగించి తమరాజ్యమునుండి వెడలగొట్టిరి మరికొంతకాలము తరువాత ఆయనను హైద్రాబాదు ప్రభుత్వము మరల పిలిపించెను కాని ఆయన భారతజాతీయ మహాసభయెడల పక్షపాతము చూపుటవలనను వంగదేశవిభజనము తర్వాత మనదేశమున తలచూపిన స్వదేశీయ ఉద్యమమును ఉత్సాహముతో సమర్థించుటవలనను ఆనాటి బ్రిటీషు రెసిడెన్సీ అధికారులకు ఆయనపై ఆగ్రహము కల్గెను వారు నిజాము ప్రభుత్వమువారిచే అఘోరనాథుని శిక్షింపజేసిరి నిర్ణీతకాలమునకు పూర్వమే ఆయన ఉపకారవేతనము తీసికొనవలసినవాడయ్యెను 1904వ సంవత్సరమున ఆయన హైద్రాబాదునుండి కలకత్తాకు వెడలిపోయెను

అఘోరనాథుడు బహుముఖప్రజ్ఞాశాలి ఆయన ప్రకృతిశాస్త్రపరిశోధన విషయమున చాల కృషిచేసెను సంస్కృతభాషావ్యాప్తికొరకు ఆయన పథకములువేసెను అఘోరనాథుడు ఎల్లప్పుడును అభివృద్ధిపథముననే సాగిపోయెను ఆయన బ్రాహ్మమతాభిమాని ఆనాడు వంగీయశ్రోత్రియ బ్రాహ్మణకుటుంబములలో వ్యాపించియున్న దురాచారములను తొలగించుటకై ఆయన కృషిచేసెను స్త్రీవిద్యకొరకై పాటుపడెను బాల్యవివాహములను రద్దుచేయుటకై యత్నించెను స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యము కావలెననియు వారికి పురుషులతో సమానముగ సర్వతోముఖాభివృద్ధికి అవకాశములు లభింపవలెననియు ఆయన వాదించుటయేకాక తన ఆశయసిద్ధికై చాల కృషి కావించెను

అఘోరనాథునిభార్య వరదాసుందరి చిన్నబాలికగ ఉన్నప్పుడే ఆమెను ఆయన వివాహమాడెను ఆయన తన భార్యకు విద్యచెప్పించెను వరదాసుందరి మృదుమధుర గాత్రముకలది భక్తురాలు ఆమె భక్తిగీతములు విని అందరును తన్మయులగుచుండెడివారు ఈ ఉత్తమ దంపతులకు వీరేంద్రనాథుడు హరీంద్రనాథుడు అను కొడుకులు సరోజిని అను కూతురు కల్గిరి

సం బా శే

## అఘోరశివాచార్యుడు

కడప మండలమునందు పెక్కుతావులలో అనేక పీఠములు కలవు వీనిలో పుష్పగిరి పరము ప్రసిద్ధికనినది పుష్పగిరి గ్రామము మద్రాసు నుండి బొంబాయికి పోవు రైలుమార్గమున ఉన్న కమలాపుర స్టేషనుకు అయిదు మైళ్ళ దూరమున ఉన్నది అదిశంకర భగవత్పాదులు అద్వైత మతప్రచారము కొరకు భారతదేశమునందు జగన్నాథము శృంగేరి (శృంగగిరి) ద్వారక బదరీకేదారము అను స్థలములందు మఠములను నెలకొలిపిరి పుష్పగిరిలోను ఒక అద్వైత పీఠము కలదు ఇచ్చటి పీఠాధిపతులు అభినవోద్దండ విద్యాశంకర భారతీస్వాములని యొకరును వారి యనంతరము విద్యానృసింహభారతీస్వాములవారని ఒకరును పర్యాయమున పేర్లతో వ్యవహరింపబడుచుందురు పూజ్యపాదులు ఆదిశంకరాచార్యులు కైలాసమునుండి తెచ్చిన స్ఫాటికలింగములలో ఒకటియగు శ్రీ చంద్రమౌళీశ్వరలింగము ఈ పీఠమున కలదు పీఠాధిపతులు ఈ లింగమును నిత్యము పూజించుచుందురు వీరు అద్వైత మతప్రచారమును ఒనరించుచున్నారు ఈ పీఠము జగద్గురువులగు ఆదిశంకరాచార్యులు ప్రతిష్ఠించిన పీఠములకు శాఖయై ఉండునని చెప్పుదురు

పుష్పగిరి గ్రామము అద్వైతమతమునకు మాత్రమే గాక శైవమతమునకు గూడ నిలయమై యున్నది. పూర్వము నుండి నేటివరకు గూడ శైవమతానుయాయులకు నిలయమైన శైవపీఠమొకటి ఈ గ్రామమందు ఉన్నది. సుప్రసిద్ధ శైవాచార్యుడగు అఘోర శివాచార్యుడు ఈ శైవమఠమునందు నివసించి శైవమత ప్రచారము చేసెను. ఈ శైవ మఠమునకును గోళకీశైవమఠమునకును సంబంధము ఉన్నట్లు కనబడుచున్నది. గోళకీమఠమును శంభు లేక సద్భావశంభువు అను శైవాచార్యుడు స్థాపించి తానే ఆ మఠమునకు మొదటి ఆచార్యుడిగా ఉండెను. త్రిపురములోని గోళకి కొండపై ఈ శైవమఠమును నిర్మించుటచేత దీనికి గోళకీమఠము అను పేరు వచ్చినట్లు చెప్పుదురు. సద్భావ శంభువు మొదటి యువరాజ దేవుడు అను కాలచుర్యరాజుకు సమకాలికుడై ఉండెను. ఈ కాలచుర్యరాజు క్రీ. శ. పదవ శతాబ్ది చివరనో లేక పదునొకండవ శతాబ్ది మొదటనో చేదిదేశమును పాలించినట్లు తెలియుచున్నది. ఈ చేదిరాజ్యము నేటి మధ్యప్రదేశములోనిది. ఈదేశమునకు త్రిపురి అనునది (నేటి తేవా) రాజధానిగా ఉండెను. మొదటి యువరాజదేవుని భార్యనోహల కుమారుడు లక్ష్మణరాజు. వీరు కదంబ గుహాకటు మఠమునకు చెందిన శైవాచార్యులకు కొన్ని దానములు చేసిరి. చేదిరాజ్యమునకు సంబంధించిన డాహాల మండలము శైవులకు స్థానమై ఉండెను. కాళచురి రాజయిన యువరాజదేవుని రాజ్యము గంగా నర్మదా నదుల మధ్య తొమ్మిది లక్షల గ్రామములతో కూడి ఉండెనట. ఈ గోళకీ మఠమును స్థాపించిన సద్భావశంభువు అను శివాచార్యునకు కాళచురిరాజైన యువరాజదేవుడు గోళకీమఠ పోషణము కొరకు మూడులక్షల గ్రామములు కలిగిన ప్రదేశమును దానము చేసి యుండెనని మల్కాపురశాసనమువలన తెలియుచున్నది.

సద్భావశంభుని శిష్యుడు సోమశంభువు. ఇతడు సోమశంభుపద్ధతి అను గ్రంథమును రచించెను. క్రీ. శ. 1073 ప్రాంతమున సోమశంభువు ఉండెనని డా॥ ఆఫ్రెక్టు పండితుని అభిప్రాయము. విద్యారణ్యులు సర్వదర్శనసంగ్రహము అను తన గ్రంథమునందు సోమశంభు పద్ధతిని సర్వ్వచించిరి. తంజావూరు మండలములోని తిరువలూరు గ్రామనివాసుడైన నిర్మలమణిగురు అను శైవ బ్రాహ్మణుడు అఘోర శివాచార్యుడు రచించిన క్రియాక్రమోద్యోతకము అను గ్రంథమునకు లఘుప్రభ అను పేరట ఒక వ్యాఖ్యా గ్రంథమును వ్రాసెను. నిర్మల మణిగురువు ఈ వ్యాఖ్యా గ్రంథమున సోమశంభు పద్ధతిని ఎక్కువగా కొనియాడెను. మల్కాపుర శాసనములో ఉదాహరింపబడిన ...ము శివాచార్యుని ధర్మశివాచార్యుని విశ్వేశ్వరశివాచార్యుల గూడ ఇందు ప్రశంసించెను. దుర్వాసుడే శైవాగమ వాఙ్మయము ప్రపంచమునందు పుట్టుటకు కారణము అని ... చెప్పెను.

శ్రీ చోళేశ్వర మాళవ ... రాజన్య చూడామణీ యచ్ఛిష్యో కిమ పరం గణపతి క్షోణీపతిర్భృత్యత్వ సస్యాత్ స్వయ ముదేస దేశికపరశ్శైవాగమాంభోనిధిః విశ్వేశ్వర దేశికః కలచురి క్ష్మాపాల దీక్షాగురుః

అను మల్కాపురశాసనములోని శ్లోకమువలన గోళకీ మఠాధిపతులలో ఒకడవవాడైన విశ్వేశ్వరశివాచార్యులు కాకతీయ గణపతిదేవచక్రవర్తిని చోళ మాళవేశ్వరులకును కలచురిరాజులకును చిన్మయ దీక్షాగురువైనట్లు తెలియుచున్నది. విశ్వేశ్వరశంభువు గణపతిదేవ చక్రవర్తికి దీక్షాగురువే కాక రాజ్యపాలనమునందు ఆ మహారాజునకును ఆయనకుమార్తెయగు రుద్రమదేవి మహారాజ్ఞికిని సహాయ మొనర్చినట్లు విదితమగుచున్నది. వీరశైవ పాశుపత కాలాముఖ కాపాలికాది భేదములతో శైవము ఒప్పుచున్నది. ఇందులో పాశుపతశాఖ చాలా పురాతనమైనది. పాశుపత శైవమునే కాలాముఖము అనియు లకులేశ్వర మతము అనియు వర్వేరు పేర్లతో వ్యవహరించుచున్నారని అందురు. కాకతీయ రాజుల కాలమున ఆంధ్రదేశములోని గోళకీమఠ శివాచార్యులు పాశుపతశైవమును తెలుగుదేశమున వ్యాపింపచేసిరి. వీరు అనేక శివాలయములను మఠములను నెలకొల్పిరి. గుంటూరు జిల్లా మందడము (దీనినే మందాగము అనియందురు) కృష్ణాజిల్లా త్రిపురాంతకము కడప జిల్లా పుష్పగిరి మున్నగుచోట్ల వీరు మఠములు స్థాపించినట్లు తెలియుచున్నది. వీరి మఠములు ఎచ్చట ఉన్నను వాని గోళకీ మఠము అనియు ఆ మఠాధిపతులకు గోళకీ మఠశివాచార్యులనియు పేర్లుండినట్లు స్పష్టముగ కనవచ్చుచున్నది. మందడ గ్రామమున ఉన్న గోళకీమఠమును విశ్వేశ్వర శివాచార్యుడు స్థాపించినట్లు తెలియుచున్నది. ఈ మందడ గ్రామము కాకతీయ మహారాజ్ఞి రుద్రమదేవి విశ్వేశ్వరశివాచార్యునకు దానమొసగినట్లును ఈ గ్రామమునందలి గోళకీమఠ విద్యాస్థానమునందును దేవాలయమునందును గల నర్తకులకు మార్దంగికులకు గాయకు

లకు గాయనులకు వృత్తిమాన్యములి చ్చి నాట్య గీతములకు పోషణము కల్పి చినట్లును మల్కాపుర శాసనమువలన వ్యక్త మగుచున్నది

గోళకీమఠములు శైవమత ప్రచార మొనర్చుటలోను ఉచితభోజనసౌకర్యము కల్పి చి విద్యార్థులకు విద్యను గర పుటలోను ప్రసూతి శాలలు నిర్వహి చుటలోను ప్రధానపాత్ర వహి చుచున్నవి అట్టి వాటిలో శ్రీశైలముకూడా ప్రధాన శైవక్షేత్రమై వెలుగొ దినది

అఘోర శివాచార్యుని క్రియా మార్గోద్యోతక గ్ర థము నకు లఘుప్రభ అను వ్యాఖ్యానగ్ర థమును రచి చిన "నిర్మలమణి గురువు సోమశ భు పద్ధతిని పొగడ టచే ను సోమశ భువు సద్భావశ భుని శిష్యుడగుటచేతను సద్భావ శ భువు పాశుపత శైవ మతస్థుడు అగుటచేతను క్రియాక్రమో ద్యోతక ప్రణేతఅగు అఘోర శివాచార్యుడు గూడ పాశుపత శైవ మతావల బి అనియు పుష్పగిరిలో ఉన్న శైవపీఠము గూడ గోళకీ శైవమత ంతో స బ ధము కలిగియు డి రాజులు ఇచ్చిన మాన్యక్షేత్రములతో పోషి పబడుచు శైవమత ప్రచా రముతో పాటు విద్యాబోధనము కావి చు చు డినట్లును ఊహింపవచ్చును

అఘోర శివాచార్యుడు క్రీ శ 1445 ప్రా తమున జన్మి చి పుష్పగిరి శై పీఠమున నివసించి సుమారు తొ బది సంవత్సరములకుపైగా జీవించి య డెనని పుష్పగిరి గ్రామ ములో శా శ 1423 (క్రీ శ 1501) దుర్మతి స వత్సర శాసనము వలన కనవచ్చుచు న్నది అఘోర శివాచార్యుడు వేదశాస్త్రములయందు గొప్పప డితుడై శైవమతప్రచా రము చేయుచు శిష్యులకు ఉచిత భోజనము పెట్టుచు సకల విద్యారహస్యములను చెప్పెడివాడట ఈ మఠమునకు గొప్ప మాన్యములు ఉండుటచేత ఇట్లు గొప్ప సేవ చేయగలవాడై యు డెనని విశదమగుచున్నది

పుష్పగిరి గ్రామములో శా శ 1463 (క్రీ శ 1541 ఏప్రిల్ 28) ప్లవ సంవత్సర వైశాఖ శుద్ధ తదియ లక్ష్మీవారము నాటి శాసనమొకటి లభి చినది అందలి వృత్తా తమును చూచినచో విజయనగర ప్రభువగు వీరప్రతాప అచ్యుత దేవ మహారాయలుగూడ తన దళవాయి అగు తిమ్మరుసయ్యచే కొన్ని గ్రామములు పుష్పగిరిలోని వైద్యనాథస్వామికి శైవ మతమునకు చెన్నకేశ్వర స్వామికి దానముచేయించినట్లు తెలి యుచున్నది అఘోర శివాచార్యులకు స బ ధి చినవారును పుష్పగిరిలోని వైద్యనాథచెన్నకేశ్వరదేవుల స్థానికులను అగు చెన్నప్ప స్థాన పెదఓబయ్య చినఓబయ్య అనువారికి తిమ్మరు య్య ఒక సర్వమాన్య ధర్మశాసనమును వ్రాస యిచ్చెను ఆ శాసనములోని వ్రాతనుబట్టి పుష్పగిరి గ్రామ ములోని వైద్యనాథస్వామికి ఎటూరు మిడుతూరు సరును వెల్ల గ గవరము అను గ్రామములను శై మఠము కు మట గ్రామము (మట్ల) కోటవల్లూరు అను గ్రామములును చెన్న కేశ్వరస్వామి వనమా మపల్లి అనుగ్రామమును గనిపాపారెడ్డి పల్లిలో తృతీయా శమును చె ద చేయబడినట్లు తెలియు చున్నది దానములుగా ఇ గబడిన గ్రామములలోని భూము లపై హక్కు చె న్నప్ప పెంచిన ఓబయ్యలకు స క్రమి చినది ఈ చెన్న ప్ప చి పెదఓబయ్యలు గ్రామములయ దలి భూముల ను డి ఆదాయమును జాగ్రత్తగారాబట్టి వైద్యనాథ చెన్న కేశ్వర శైవమఠములకు జరుపవలసిన అ గర గభోగములు ఉత్సవములు జాతరలు జరిపి చుచు దేవాలయములను శైవ మఠములను జాగ్రత్తగా చూడవలయునని ఈ శాసనము వక్కాణించుచున్నది ఈ శాసనములో శైవమఠము అని యుండుటచే అది అద్వైతమతప్రచారమునకు వినియోగి ప బడినదో లేక అఘోరశివాచార్యులకు స బ ధి చిన శైవ మఠమో ! అను స దియము కలుగుచున్నది కాని అఘోర శివాచార్యులకు స బ ధి చినవారికి సర్వమాన్యధర్మశాస నము వ్రాయబడియు డుటచే శైవమతమునకే గ్రామములు దానముచేసినట్లు నిర్ధరి చుటకు అవకాశము కనవచ్చుచున్నది

అఘోర శివాచార్యుడు క్రియాక్రమోద్యోతకము అను గ్ర థమును రచి చుటయేకాక పెక్కుమ ది శిష్యులను తయారుచేసెను గ ది మల్లయ్య ఘంట సి గయ్య అను జ ట కవులు క్రీ శ 14 5 కు తరువాత వ్రాసిన వరాహపురాణము న దు "గురుదక్షిణామూర్త్య ఘోరశివుల శిష్యులము అని వ్రాసిరి శ్రీకృష్ణదేవరాయలకాలపువాడును అష్టదిగ్గజ కవు లలో ఒకడును అగు న దితిమ్మన తన పారిజాతాపహరణ ప్రబ ధమునందు" తిమ్మయార్యు డు శివపరాధీనమతి అఘోర శివగురుశిష్యుండు అని త న ను గూర్చి వ్రాసికొనెను క్రీ శ 1500 ప్రాంతమున రాజశేఖరచరిత్రను వ్రాసిన మాదయగారి మల్లన రాజ శేఖర చరిత్రమునందు ఇది శ్రీ మదఘోర శివాచార్య గురుకరుణావిశేషలబ్ధ సార స్వత"

అని వ్రాసెను ఈ పై వ్రాతలమూలమున నంది మల్లయ ఘంటసింగయ్య నంది తిమ్మన మాదయగారి మల్లన అను కవిశేఖరులు అఘోరశివాచార్యునికి శిష్యులైనట్లు రూఢి యగుచున్నది అంతియేకాక పై వ్రాతలవలన వీరికి అఘోర శివాచార్యునియందుగల అమితభక్తిభావము గూడ ద్యోతక మగుచున్నది

ఇంకొక్క విశేషమేమనగా మల్లనకవి తన రాజశేఖర చరిత్రయందలి తృతీయాశ్వాసములోని 9 10 11 పద్యము లలో అరుణపురము నందలి ముకుందుడు అను బ్రాహ్మణుని గుణములను ఇట్లు వర్ణించెను "ముకుందుడు ఇందుకళామృత శీతల సందీపితహృదయుడు అఖిలామ్నాయవేది బహుశాస్త్ర రహస్యపరిశోధకుడు చిత్తమదోద్రేకమును వారి చెను చిత్సుఖకేళీపరతంత్రుడు సదాచార తత్పరుడు పరమసాత్త్వి కుడు కలిమిని గర్వించడు - లేమిని కుందడు దుర్దానములు గొనడు ఆసపాతకుడు కాడు ఈసులేదు పరుష భాష ణముల పలుకడు హింససేయడు భూతదయాపరుడు సరస మైన భోజనముపెట్టి తన ఇంటివద్ద శిష్యులకు వేదశాస్త్ర రహస్యములను బోధించెడువాడు హవ్య కవ్యములచే దేవతలను పితృదేవతలను తృప్తినొందించెడివాడు మంచి తనమున అంతటివాడు లేడు సస్యములు గ్రాసమునకు సరిపడు నట్లు పండెడివి పదునైదు ఆవులు నిత్యము పాలిచ్చెడివి ఈయన గొప్ప దానశాలి "ఇట్టి పరమగుణోపేతుడు ముకుందుడు

పై వర్ణనమును బాగుగా పరిశీలించినవిమర్శకులు "తన గురువు అగు అఘోర శివాచార్యుని మనస్సులో ఉంచు కొనియే మల్లనకవి ముకుందుని ఇట్లు వర్ణించెను అని చెప్పు దురు" మల్లనకవి అఘోరశివాచార్యుల ఇంటిలో భుజించుచు శివాచార్యునివలన కావ్యశాస్త్రరహస్యములను తెలిసి కొనెను ఈ కారణముచేతనే మల్లనకు అఘోర శివాచార్యుని యెడ అమితమగు భక్తి కుదిరినదని ఎఱ్ఱుల అభిప్రాయము

తం అం శా

## అచలనాధుడు

నాథ సంప్రదాయమును అనుసరించి సిద్ధిపొందిన పరమ పురుషులలో అచలనాథుడు అచ్యుతనాథుడు ముఖ్యులు వీర శైవమునకు సంబంధించిన వీరి సంప్రదాయమున యోగ శాస్త్రరహిత పరమతత్త్వమును ఉపదేశించుట యోగాభ్యాస శక్తివలన దేహశక్తి సమకూరి సిద్ధత్వయమును పొందుటకు అవకాశము కలుగుననుట సిద్ధులై కాబోవువారికి మణి మంత్రౌషధములను హఠయోగాదిరహస్యములను బోధించుట మొదలగునవి ప్రధానకృత్యములు ఈ సిద్ధాంతమును తొలుత పరమమాహేశ్వరుడైన శివుడు మత్స్యేంద్రుడను మీన నాథునికి ఉపదేశింపగా అయన భూలోకమున ప్రచారము చేసి తొలుత తనతోపాటు తొమ్మండుగురు సిద్ధులను తయారు చేసెను వారు మీననాథుడు చౌరంగి గోరక్షుడు మేఘ నాథుడు విరూపాక్షుడు నాగార్జునుడు ఖణికుడు వ్యాళి గోరక్కుడు అనువారు వీరినే నవనాథులందురు ఈ నవ నాథుల చరిత్రమును క్రీ శ 15వ శతాబ్ది పూర్వార్ధమున గౌరన అనుకవి ద్విపదకావ్యముగా రచించియున్నాడు

మీననాథుడు నాథ సంప్రదాయమును విస్తరింప జేయుటకు ఆరురు శిష్యులను ఎంచి వారిని దేశదేశములలో ప్రచారము చేయుటకు అనుజ్ఞనిచ్చెను అందు గోరక్షుడు లాట గౌళ ఆభీర భోట దేశములకు మేఘనాథుడు అంగ వంగ కళింగ భూములకు సిద్ధబుద్ధుడు మహారాష్ట్రమునకు విరుపాక్షుడు కర్ణాట కన్నోజి మాళవ దేశములకు ఖణికుడు కాశ్మీర ఘూర్జర కొంకణ మత్స్య కోంకణములకు నాగా ర్జునుడు మళయాళ బర్బర మగధ ఆంధ్ర పాండ్య చోళ రాజ్యములకు వెడలి గురుబుద్ధి తెలిసి దీక్షనొసగి కొంతమందిని సిద్ధులుగా చేసిరి గోరక్షుడు సిద్ధత్వమును ఉపదేశించిన వారిలో అచ్యుతనాథుడొకడు ఈ అచ్యుతనాథుడు ఏ దేశము వాడో చెప్పుట కష్టము బహుశః గోరక్షుడు పర్యటించిన లాటాది దేశములలోనివాడే అయియుండును అటులనే ఖణి కునిచేత నాథ సంప్రదాయమున పరివర్తితుడైనవాడు అచల నాథుడు ఇతడు కాశ్మీర ఘూర్జర కొంకణ కోంకణ దేశ ములలో ఏదోఒక దేశవాసుడై యుండును

ని శి సుం

## అచలపురము

ప్రస్తుతకాలమున ఎల్లిచ్‌పూరు అనుపేరుతో వ్యవహ రింపబడుచున్న అచలపురము తూర్పు చాళుక్యుల కాలపు ఆంధ్ర వీరసేనానుల ప్రతాపాగ్నికి సమిధయైన పట్టణము ఎల్లిచ్ పురము విదర్భదేశమున (బీరారు) ఉన్నది భాషాప్రయుక్త ముగా రాష్ట్ర పునర్నిర్మాణము జరిగినప్పుడు విదర్భ మహా రాష్ట్రమున కలుపబడినది ఎల్లిచ్‌పురము ప్రస్తుతము మహా

రాష్ట్రములోని అమరావతి జిల్లాలో కలదు

ఆ ప్రదేశమునకు సుదూరమునఉన్న అచలపురము ఆంధ్ర విక్రమవహ్నికి ఎట్లు ఇంధనమయ్యెనో కనుగొందము తూర్పుచాళుక్యవంశమున మూడవ విజయాదిత్యుడని చెప్ప బడుచున్న గుణగ విజయాదిత్యమహారాజు మహాపరాక్రమ శాలి. ఈతడు క్రీ శ. 848-891 సంవత్సరముల నడుమ సుమారు 44 ఏండ్లకాలము మధ్యాహ్నసూర్యునివలె దుర్నిరీక్ష్యుడై వేంగిరాజ్యమును శాసించెను ఈతని కాలమున ఆంధ్రదేశపు పశ్చిమోత్తరభాగములందు దుర్దాంతమైన రాష్ట్రకూట సామ్రాజ్యము వ్యాపించియుండెను గుణగ విజయాదిత్య మహారాజు తల్లియైన శీలమహాదేవి రాష్ట్రకూట రాజకన్యక యైనను సామ్రాజ్యవిస్తరణ కాంక్షులైన రాష్ట్రకూట చక్ర వర్తులు పొరుగురాజ్యమైన వేంగిమండలమునకు ప్రక్కలో బల్లెమై వేధించుచుండిరి గుణగవిజయాదిత్యునకు సమకాలికు లైన రాష్ట్రకూట చక్రవర్తులు అమోఘవర్షుడు I కృష్ణరాజు II అనువారు అమోఘవర్షుడు గొప్ప సాహసయుగీనుడగుటచే గుణగ విజయాదిత్యుని తద్రాజ్యారంభకాలములో ఓడించి సామంతత్వమునకు ఒప్పించెనని కొందరు చెప్పుచున్నారు ఇది యెట్లైనను అమోఘవర్షుని మరణానంతరము రాష్ట్రకూటుల మదము అణచుటకు మూడవ విజయాదిత్యునకు సదవకాశము లభించెను

మర్త్యమహేశ్వరుడని శత్రుమిత్రులందరిచేతను పొగడ బడిన గుణగ విజయాదిత్యుడు ఈ మంచి తరుణమును పోగొట్టు కొనదలచలేదు అమోఘవర్షుని కుమారుడు రెండవ కృష్ణ రాజు చక్రవర్తిపదమునకు (క్రీ శ. 880 ప్రాంతము) రాగానే సామ్రాజ్యమునందు అల్లరులు చెలరేగెను కాన్యకుబ్జాధీశు డును ఘూర్జర ప్రతీహార వంశీయుడును అగు మొదటి భోజ రాజు రాష్ట్రకూట సామ్రాజ్యముపైదండెత్తివచ్చి మాళవ దేశమును ఆక్రమించుకొనెను రాష్ట్రకూట కృష్ణరాజు భోజుని ఎదుర్కొనెను గాని నర్మదాతీరమున మహాయుద్ధములో ఓడి పోయెను ఇదే సమయమున వేంగీశుడగు గుణగ విజయాదిత్యు డును ప్రచండసైన్యముతో రాష్ట్రకూట సామ్రాజ్యముపై నడచెను గుణగ విజయాదిత్యుని సేనానియగు పండరంగడు కార్తికేయునివంటి పరాక్రమశాలి ఆంధ్రసేనలు కళింగమును జయించి చక్రకొట్యదుర్గమును పట్టుకొని దాహళమండ లముపై విజృంభించెను దాహళమనగా నర్మదానదికి ఉత్తర భూభాగము ప్రస్తుతపు మధ్యప్రదేశములో ఇది అంతర్భ వించును దాహళముపై ఆంధ్రసేన లేలపడెననగా రాష్ట్ర కూటరాజు స్వరాజ్యములో నిలువలేక దాహళము నేలు చున్న తన బావమరదియగు సంకిలుని రాజ్యములో తలదాచు కొనెను వానిని శిక్షించుటకై గుణగ విజయాదిత్యుని చము వులు దాహళమును ప్రవేశించి ఆ ప్రాంతమును అల్లకల్లో లము చేసెను తుదకు సేనాని పండరంగుడు సంకిలుని ముఖ్య పట్టణమై కిరణపురమును ముట్టడించెను అతని ధాటికాగలేక కృష్ణరాజును సంకిలుడును పలాయితులైరి తూర్పుచాళుక్య సేనలు కిరణపురమును పట్టుకొని శత్రువులకు భయభ్రాంతులు కలిగించుటకై ఆ నగరమును దగ్ధముచేసెను

అంతటితో ఊరుకొనక పండరంగడు వైరివర్గమును తరుముచుపోయి పశ్చిమాభిముఖుడై దాహళము దరేనాడు మున్నగునవి నిర్జించి రాష్ట్రకూట సామ్రాజ్యములోనికి దిగి విదర్భదేశమందలి అచలపురమును జయించి దానినికూడ భస్మముచేసెను అంతటితో పండరంగడు తన విజయఖడ్గమును ఒరయందు చేర్చెను గుణగ విజయాదిత్యునకును కృష్ణరాజు నకును సంధి జరిగెను యశసే విజిగీషూణామ్ అన్న నీతిని పాటించిన ఉదారహృదయుడు మూడవ విజయాదిత్యుడు తాను జయించిన ప్రదేశములను తిరిగి రాష్ట్రకూట కృష్ణరాజు నకు ఇచ్చివేసి అతనిని ఆదరించెను

ఖం. ల. రం.

## అచలేశ్వరము

అచలేశ్వరము అను పుణ్యక్షేత్రము శ్రీశైలమునకు తూర్పుదిక్కున ఉన్నదని పాల్కురికి సోమనాథుడు రచించిన పండితారాధ్యచరిత్రమునందలి పర్వతప్రకరణము వలన తెలియుచున్నది పండితారాధ్య చరిత్రమునందు శైవమతా చార్యుడు అయిన మల్లికార్జునపండితారాధ్యుని జీవిత చరిత్రము వివరింపబడినది పండితారాధ్యుడు వెలనాటి చోడుని సభలో జైనబౌద్ధచార్వాకాది మతములను ఖండించి శివపారమ్యమును స్థాపించుట పండితారాధ్యచరిత్రమునందలి ముఖ్యవిషయము

మల్లికార్జున పండితారాధ్యుడు క్రీ శ. పండ్రెండవ శతాబ్దిలోనివాడు గొప్ప శివకవి ఆంధ్రదేశమునందు శైవ మతవ్యాప్తికి తోడ్పడిన ముగ్గురు ఆచార్యులలో (శ్రీపతి పండి తుడు శివలెంకమంచెన మల్లికార్జునపండితుడు) ఈయనఒకడు

మల్లికార్జున పండితారాధ్యుడు బసవేశ్వరుని సమకాలికుడు ఇతడు క్రీ శ 1170 వరకు జీవించియుండెను ఈతని జన్మ స్థానము గోదావరీమండలము శివతత్త్వసారము అను గ్రంథమును కొన్ని ఇతర లఘుకృతులను ఇతడు రచించెను

శ్రీశైలమహాక్షేత్రము శైవులకు దక్షిణ కైలాసము వంటిది ఆ మహాక్షేత్రమునకు నాలుగు దిక్కులయందును గొప్ప పుణ్యక్షేత్రములు వనములు నగములు కుండములు తీర్థములు కలవు

శ్రీశైలమహాక్షేత్రమునందు మల్లికార్జున లింగమూర్తి ఒప్పారుచుండును ఈయనభార్య భ్రమరాంబామహాదేవి ఈ పుణ్యక్షేత్రము ఆంధ్రదేశమునందలి కర్నూలు మండలమునందు నల్లమల అడవులలో ఉన్నది శ్రీశైలమునకు ఉత్తర దిశయందు గుప్తమాహేశ్వరము చరుకేశ్వరము గరుడేశ్వరము కాలభ్రహ్మదేశ్వరము పాపవినాశనము గణేశ్వరము దేవహ్రదేశ్వరము సిద్ధేశ్వరము నీలహ్రదము మున్నగు పదకొండు తీర్థములు ఉన్నవి శ్రీశైలమునకు తూర్పు భాగమున రామేశ్వరము ఉమామహేశ్వరము సంగమేశ్వరము చరమేశ్వరము అచలేశ్వరము తిలేశ్వరము సిద్ధముక్తీశ్వరము గిరీశేశ్వరము అను ప్రసిద్ధ పుణ్యక్షేత్రములు కలవు ఇవిగాక వేదపర్వతము శ్వేతాద్రి నీలపర్వతము అశ్వమేధ పర్వతము లింగగిరి కన్యాపర్వతము ఉమాగిరి కనకనగము గుండశిఖరి అను ప్రసిద్ధపర్వతములు ఉన్నవి రామకుండము భీమకుండము ప్రయాగకుండము వేదకుండము తిలకుండము నీలకుండము పిశాచకుండము గౌరికుండము రసకుండము అనునవియు కలవు మరియు మాతంగేశ్వరము (దానికి దక్షిణమున నున్న) త్రిపురాంతకము అను ప్రసిద్ధ పుణ్యక్షేత్రములు కలవు వీటిలో పాపవినాశనము ఉమామహేశ్వరము త్రిపురాంతకము అను క్షేత్రములు సుప్రసిద్ధములు పాపవినాశనము కర్నూలుజిల్లా ఆత్మకూరు సబ్‌తాలూకా ఆత్మకూరు ఫిర్కాలోఉన్న శ్రీశైలక్షేత్రమునకు ఉత్తరమున ఉన్నది ఉమామహేశ్వరము మహబూబునగరము జిల్లాలో ఉన్నది త్రిపురాంతకము కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకా త్రిపురాంతకపు ఫిర్కాలో కలదు

మల్లికార్జున పండితారాధ్యుని శిష్యుడు దోనమ భాజయ్య అనువాడు శ్రీశైలమునకేగి అచ్చటి ప్రసిద్ధ పుణ్య క్షేత్రములను మల్లికార్జునస్వామి అనుగ్రహమున దర్శించెనని పండితారాధ్య చరిత్రమున దలి పర్వత ప్రకరణమున ఉన్నది

తం ఆం శా

## అచింతేంద్రుడు

అచింతేంద్రయతివర్యుని ప్రశంస కాకతి రుద్రదేవుని అనుమకొండ వేయిస్తంభాలగుడి శాసనమునందు కన్పించుచున్నది ఈ శాసనకావ్యమును వ్రాసినవాడు అచింతేంద్రుడే శాసనకాలము శక 1084 చిత్రభాను సంవత్సర మాఘశుద్ధ త్రయోదశి వడ్డవారము అనగా క్రీ శ 1162 అగుచున్నది వడ్డవారమనగా శనివారము అచింతేంద్రుడు శాసనమునందొక శ్లోకములో తనుగూర్చి ఇట్లు చెప్పుకొన్నాడు భారద్వాజకులాశ్రయః పరివృఢః శ్రౌతక్రియాకర్మఠ శ్శ్రీరామేశ్వర దీక్షితో జనయితా యస్య పితావగ్రణీః। స్వో౽చింతేంద్ర వరో౽ద్వయామృతయతేశ్శిష్యో యశ్శ్రద్ధయా శ్రీమద్రుద్ర నరేశ్వరస్య సుమతేర్వంశావలీం వర్ణయే దీని తాత్పర్యము భారద్వాజకుల సత్తమ దినాథుడును శ్రౌతక్రియా కర్మఠుడను లోకము నందగ్రణియు అగు శ్రీ రామేశ్వరదీక్షితుడు ఎవని తండ్రియో ఎవడు అద్వయామృత యతీంద్రుని శిష్యుడో అట్టి అచింతేంద్రయతినైన నేను బుద్ధిశాలియైన శ్రీ రుద్రనరేశ్వరుని వంశావళిని వర్ణించుచున్నాను

దీనినిబట్టి అచింతేంద్రుడు రామేశ్వరదీక్షితుని కుమారుడనియు అద్వయామృతయతిశిష్యుడనియు స్వయముగా సన్న్యసించి యతీశ్వరుడయ్యెనయు తెలియుచున్నది కాకతీయ శాసనములలోను సమకాలిక వాఙ్మయములోను రామేశ్వర పండితుడను ఒక శైవాచార్యుడు పేర్కొనవచ్చుచున్నాడు అచింతేంద్రుని జనకుడైన రామేశ్వర దీక్షితుడును రామేశ్వర పండితుడను ఒక్కరేయని కొందరు చారిత్రకులు భావించిరి నిపుణముగ పరిశీలించినచో వీరిద్దరును ఏకవ్యక్తి కాదనియు భిన్నపురుషులనియు నిరూపించుటకు వీలగుచున్నది వీరు వేర్వేరు వ్యక్తులనుటకు కొన్ని ఉపపత్తులు చూపుచున్నాము ఆ పైన విద్వాంసులే ప్రమాణము

అచింతేంద్రుని జనకుడైన రామేశ్వరదీక్షితుడు అనుమకొండ శాసనములో మాత్రమే కనవచ్చుచున్నాడు రామేశ్వరదీక్షితుడు శ్రౌతక్రియాకర్మఠుడని చెప్పబడుటచే బ్రాహ్మణులకు విధింపబడిన నిత్యాగ్నిహోత్ర బ దర్శపూర్ణమాస ఇష్టులు మున్నగు వేదోక్త కర్మములను శ్రద్ధతో ఆచరించువాడని

విదితమగుచున్నది ఈయన యజ్ఞము చేసియుండకపోవచ్చును చేసినచో రామేశ్వర సోమయాజి అనబరగియుండును అయినను గొప్ప కర్మఠుడని అచి తేంద్రుడు ప్రశంసించినాడు వీరు అద్వైత సంప్రదాయమువారు శివకేశవులకు అభేదమును పాటింతురు కావున స్మార్తులని చెప్పవలెను గిరిది భారద్వాజగోత్రము

ఇక రామేశ్వరపండితుడు ఈయన ప్రశంస క్రింది ఆధారములలో కన్పించుచున్నది (1) శక 1012 నాటి కాజీపేట దరగాశాసనము నెం 7 పుట 25 Corpus of Inscriptions Vol I ఇదియే లక్ష్మణరాయ రిశోధక మండలివారి తెలంగాణ శాసనములు రెండవ భాగమున 91 పుటయందు ముద్రితమైనది (2) మాదిరెడ్డికుంట శాసనము నెం 39 అనుబంధము పుట 68 కాకతీయ సంచిక ఇదియే ప్రోలుని రామేశ్వరపండిత శాసనమను పేరుతో నెం 1? పుట 55 Corpus of Inscriptions Vol I లోను ముద్రితమైనది (3) దక్షిణ హిందూ శాసనములు IV సంపుటము నెం 1229 శాసనములో రామేశ్వర రాశి పండితులో రుకన్పించుచున్నారు (4) నన్నెచోడ కుమార సంభవకావ్యమునందు బృహస్పతిచేసిన దారిద్ర్యవిద్రావణ స్తవము కుమా 10 ఆశ్వాసము పద్య 90 99 వరకు

ఈ యాధారములనుబట్టి చూచినచో రామేశ్వర పండితునిగూర్చి ఈ యంశములు గుర్తునకు వచ్చుచున్నవి రామేశ్వర పండితుని కీర్తి చంద్రికలు దిక్కులకు వ్యాప్తమైనవి ఆయన గుణరత్నములకు రోహణపర్వతము వంటివాడు మహేశ్వరగ్రామణి అఘోరశ్రుతుడు పరమదయాపరుడు దీనానాథ జనులకును విప్రులకును అన్నదాతయైనవాడు ఈయన లకులేశ్వరాగమ మహాసిద్ధాంతసారమును తెలిసినవాడు ఈ మహనీయునకు త్రిభువనమల్ల బేతరాజుతండ్రి (అనగా మొదటి ప్రోలరాజు) గైజపల్లి గ్రామమును శివపురము అని పేరుపెట్టి దానముచేసెను ఇది మాదిరెడ్డికుంట శాసన కథనము ఈయన శిష్యుడైన ప్రోలరాజు స్తంభము నెత్తించెను ఇంక కాజీపేట దరగాశాసనము ప్రకారము ప్రమోద (ప్రమోదూత కావచ్చును) సంవత్సర కార్తిక బహుళ అమావాస్య ఆదిత్య వారమునాడు సూర్యగ్రహణ పుణ్యకాలమున కాలాముఖ తపోధనుడును శ్రీపర్వత మల్లికార్జున శిలామఠ ఆచార్యుడును పర్వతావళిశాఖకు చెందినవాడును అగు రామేశ్వర పండితవర్యునకు దారిద్ర్య విద్రావణ బిరుదాంచితుడగు బేతరస (అనగా బేతరాజు) గురువరేణ్యుని పాదప్రక్షాళన హస్తోదకదానపూర్వకముగా అనుమకొండ పురమునకు నైరృతి భాగమునందున్న శివపురమును సర్వనమస్యముగా సమర్పించెను ఇదే శాసనమునందు మరికొన్ని పంక్తుల తరువాత బేతరస సుపుత్రుడైన త్రిభువనమల్ల దుగ్గ (దుర్గ) నృపతి బహుధాన్య సంవత్సర ఉత్తరాయణ సంక్రాంతి సమయమున కీర్తిస్తంభమును ఎత్తించినట్లును కలదు

దక్షిణ హిందూదేశ శాసనస పుటము 4 లో 1229 సంఖ్యగల శాసనము ప్రకారము చాళుక్యాభరణుడైన త్రిభువన మల్లచక్రవర్తి పరిపాలన చేయుచుండగా చాళుక్య విక్రమ శకము 49వ సంవత్సరమున ఆషాఢ అమావాస్యనాడు (దాక్షారామ) భీమేశ్వర మహాదేవర స్థానాధిపతి రామేశ్వర రాశి పండితులు అఖండదీపమునకు ఏర్పాటుచేసెను త్రిభువన మల్లుడు అనునది చాళుక్య ఆరవ విక్రమాదిత్యుని బిరుదము చాళుక్య విక్రమ శకము క్రీ శ 1076 సంవత్సరమునుండి ప్రారంభించినదని చారిత్రకులు పరిగణించుచున్నారు 49వ చాళుక్య విక్రమశకము క్రీ శ 1125కు సరిపడుచున్నది రామేశ్వర రాశిపండితుడు దాక్షారామ భీమేశ్వరాలయమున స్థానాపతిగా ఉండిన కాలమిది ఇది కాకతి రెండవ ప్రోలరాజు రాజ్యకాలము ఇట్లు రామేశ్వర పండితుని ప్రశంస మొదటి ప్రోలరాజు కాలమునుండి రెండవప్రోలరాజు కాలమువరకును వినవచ్చుచున్నది ఇది అసంభావ్యము కాకున్నను అసాధారణముగానే ఉన్నది

నన్నెచోడకవి కుమారసంభవ కావ్యమునందు 10వ ఆశ్వాసము పద్యములు 90 99 వరకు దారిద్ర్యవిద్రావణా అను మకుటముతో పది పద్యములు కలవు బృహస్పతి పరమ శివుని సంబోధించుచు ఈ స్తుతిపద్యములు చెప్పెను దీనియందు రామేశ్వరకవి పేర్కొనబడినాడు ఇతడు రామేశ్వర పండితుడే అయియుండును దారిద్ర్యవిద్రావణుడను బిరుదు త్రిభువనమల్ల బేతరాజునకుండినట్లు కాజీపేట శాసనమున చదివియున్నాము తమగౌరవాభిమానములకు పాత్రులైన ఏలికలను కవులు పరోక్షముగా ప్రశంసించుట ఆచారము "అనుశ్లేషః ఖలువిక్రమాలంకారః అని కాళిదాసు విక్రమార్కుని భంగ్యంతరముగా పొగడెనని పండితులు చెప్పుదురు అందుచేత నన్నెచోడుడు ప్రశంసించిన రామేశ్వరకవియు దారిద్ర్యవిద్రావణుడును రామేశ్వరపండిత బేతరాజులుగా మనము గుర్తింప

వచ్చును శుద్ధశైవుడైన నన్నెచోడుడు అద్వైతశిఖామణియైన రామేశ్వరదీక్షితుని ప్రసక్తి తెచ్చియుండును

ఇది ఇట్లుండ అచింతేంద్రుని తండ్రియైన రామేశ్వర దీక్షితుడును మాహేశ్వరగ్రామణియైన రామేశ్వర పండితుడును ఎకవ్యక్తియేనా అను సందేహము కలుగుచున్నది రామేశ్వరదీక్షితుడు రెండవప్రోలరాజు కాలమునకు మించి వెనుకకు పోవజాలడు శైవాచార్యుడైన రామేశ్వరపండితుడంతకుముందు ఏబదిసంవత్సరములనాడే కాకతి మొదటి ప్రోలరాజుచే గౌరవింపబడెను వీరిద్దరినడుమను కాలవ్యత్యాసము విశేషముగా ఉండుటచే రామేశ్వరపండితుడును రామేశ్వర దీక్షితులును భిన్నవ్యక్తులని భావించుట ఉచితముగా నుండును

వీరి భిన్నత్వమును స్థాపించుటకు ఈ యుభయుల మతభావములు ప్రబలసాక్ష్యము కాగలవు రామేశ్వరపండితుడు లకులేశ్వర-ఆగమ మహాసిద్ధాంత సారమును ఎరిగినవాడు ఈయన కాలాముఖ శైవశాఖకు చెందిన తపోధనుడు ఆంధ్రదేశపు శైవాచార్యులు వీరశైవులు కారు వారు వైదిక శైవమునే ఆదరించిరి అయినను వారు శంకరాచార్య ప్రతిపాదితమగు అద్వైతమును నిరసించినవారు ఆంధ్రశైవ పండిత్రయములో ఒక్కడైన మల్లికార్జున పండితారాధ్యుడు అద్వైతులను గతశిఖాయజ్ఞోపవీతనాస్తికులు అని ఖండించెను రామేశ్వరదీక్షితుడు అద్వైతసంప్రదాయమునకు చెందినవాడు కర్మవాది శైవాచార్యులు కర్మమార్గమును మన్నిం పరు రామేశ్వరపండితుడు జీవితమంతయు మాహేశ్వరుడుగానుండి కడకు అద్వైతిగా మారెననుటకు ఆధారములు లేవు ఈ కారణములచే వీరిద్దరును భిన్నవ్యక్తులని మేము నిశ్చయముగా భావించుచున్నాము

హనుమకొండ శాసనకవియైన అచింతేంద్రుని జీవిత విశేషములేవియు మనకు తెలియవు ఆతడు సమర్థుడైన సంస్కృత కవియనుట మాత్రము నిస్సందేహము మధ్యయుగ సంస్కృతవాఙ్మయములో శాసన కవిత్వమునకు సముచిత స్థానము కలదు ఈ శాఖయందు అచింతేంద్రుడు మొదట లెక్కింపదగినవాడనుట సత్యము ఇప్పటి సంస్కృత కవిత్వము రామాయణమహాభారతముల శైలివలె సులలితముగా నుండదు కాళిదాసాదుల వైదర్భిరీతికిని ఇది కడుదూరము ఈనాటి సంస్కృతకవులు ఓజోగుణ ప్రధానమైన రచన చేయు దుర్ఘటప్రీతిరు ప్రౌఢ కవిత్వమును మన్నింతురు శబ్దాలంకార ప్రీతి శ్లేషయమకాది వైచిత్రియు వీరి రచనలో మిక్కుటము అచింతేంద్రకవి మొత్తముమీద ప్రసన్న సంస్కృతశైలిలోనే రుద్రదేవుని విజయములను వర్ణించెను ఈయకు రనగరమైన అనుమకొండ పట్టణమునందు అపారమైన అభిమానము దీనిని ప్రబంధముల పోకడలతో చక్కగా వర్ణించినాడు మచ్చునకు ఒక శ్లోకము యత్రద్విజేంద్ర భవనేషు నివాస్య మానాః కీరాః పరంతి పటువో వటుభిస్సమేతాః సర్వాగ.. గత సమస్త విచారచారు। చారిత్ర చర్చిత పదక్రమయుక్తవేదాః అనగా అనుమకొండ నగరమందలి బ్రాహ్మణోత్తముల ఇండ్లయందు చిలుకలు మిక్కిలి సామర్థ్యము లవై నివాగంపబడుచున్నను విద్యార్థులతో కలసి సర్వాగ.. న..కములును సుందరమైన చరి.. లు కలవియు ..దక్రమయుక్తము లైన వియు అగు వేదములను అధ్యయనము చేయుచుండును కాకతీయసామ్రాజ్య విస్తృతిని ఈ యతీశ్వరుడు నిర్లిప్తుడయ్యును సగర్వముగా వర్ణించినాడు రాజ్య ప్రాజ్యం లవణజలనిధేస్తీరవర్యంత మస్య। శ్రీశైలాంతం ప్రచరతి సదా దక్షిణాశా సమగ్రాం। ప్రాతీచ్యంతా కటకనికటస్థాయినీ రాజ్యలక్ష్మీః । కౌబేర్యాశాతటవిలసతే మాల్యవ త్ప్రదేశే ఈ రుద్రమదేవుని విశాల సామ్రాజ్యము తూర్పునందు లవణ సముద్రమువరకును సమగ్ర దక్షిణదిశయందు శ్రీశైల పర్వతము వరకును వ్యాపించి పశ్చిమమునందు కటకసమీపమున విశ్రమించినదై ఉత్తరదిశయందు మాల్యవంత ప్రదేశమున విలసిల్లుచున్నది స్వదేశాభిమానముగల అచింతేంద్రయతి చిరస్మరణీయుడు

ఖం ల ఏం

## అచ్చంపేట

అచ్చంపేట గ్రామము మహబూబు నగరము జిల్లా అచ్చంపేట తాలూకాలో ఉన్నది దీనికి 85 మైళ్ళలో హైదరాబాదు మహానగరము గలదు ఈ గ్రామ విస్తీర్ణము 8388 ఎకరములు దీనికి తూర్పున నడింపల్లి లక్ష్మాపురములు పడమట పోలిశెట్టిపల్లి ఉత్తరమున పులిజాల దక్షిణమున చౌటపల్లి కలవు

1961 సం జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామమందు పురుషులు స్త్రీలు కలిసి 4481 మంది వీరిలో షెడ్యూలు జాతులవారు 878 మంది 1951 సం॥ జనాభా 5898 ఇచట ఇండ్లు వలయాకారముగను దూర దూరముగను ఉన్నవి

వీటిలో ఆరు కాంక్రీటు కప్పుగల ఇండ్లు పది ఒక అంతస్తుగల మేడలు కలవు ఈ గ్రామమునకు తూర్పువైపున ఆఫీసులు బస్సుస్టాండు ఉన్నవి అందుచేత ఆవైపుగా గ్రామము వృద్ధి చెందుచున్నది గ్రామస్థులలో మూడువంతులవారు జొన్న రాగి సజ్జ అన్నమును తిందురు శేషించిన వారు వరి అన్నము తిందురు జనులు బావినీటిని త్రాగుదురు నీటిఎద్దడి కలదు

ఈ గ్రామమునకు మల్లంకుంట చనిగకుంట కొర్లకుంట బుగ్గ మొదలగు నీటివనరులు కలవు వీటిక్రింద వరి జొన్న సజ్జ వెరుసెనగ రాగి కంది ఉలవ బొబ్బర్లు మొదలగు పంటలు పండును 1966 67 సం ॥లో పంటలక్రింద 1923 ఎకరములు ఉపయోగపడెను కాలువక్రింద 78 ఎకరముల బావులక్రింద 68 ఎకరములభూమి సాగుబడి జరగెను మూడు ఆయిల్ ఇంజనులు అయిదు ఎలెక్ట్రిక్ మోటారులు మోటలు భూములకు నీటిని సప్లయి చేసెను పీడర్సు స్ప్రేయర్సు సీడ్ డ్రెన్సు గ్రడమ్సు డస్టర్సు వ్యవసాయమునకు ఉపయోగపడెను లారీలపై బియ్యమును శ్రీశైలమునకు రవాణా చేసిరి

ఈ గ్రామమున అటవీశాఖ పరిపాలన క్రింద 95 ఎకరముల అడవి కలదు ఈ అడవిలో టేకు మద్ది కొడిశ మహువా బూరుగు మామిడి మొదలగు అనేక రకముల వృక్షములు కలవు తేనె మైనము కుంకుడుకాయలు లభించును రెల్లు తోళ్ళను పదునుచేయు పట్టలు ఔషధ పదార్థములు మామిడిపండ్లు సీతాఫలములు బీడి ఆకులు ఈ అడవిలో లభించును చిరుతపులి పెద్దపులి జింక ఎలుగుగొడ్డు ముళ్ళపంది మొదలయిన మృగములు ఈ అడవిలో కలవు ఇక్కడనున్న చెంచులు లంబాడీలు వ్యవసాయము చేసికొనుట అడవిలో కర్రలుకొట్టుకొనుట మున్నగు పనులవలన జీవింతురు ఇచ్చట 2906 ఎకరముల మెరకనేల 184 ఎకరముల తరినేల కననగును

ఈ గ్రామమున 2 55 పశువులు ఉన్నవి వీటిలో 401 ఆవులు 282 గేదెలు ఉన్నవి పాలు పాలపదార్థములు గ్రామస్థులే ఉపయోగించుకొందురు

ఇక్కడ వ్యవసాయము జనుల ముఖ్యవృత్తి దుకాణదారులు కలరు కొందరు ఎద్దుబండ్లు తోలి జీవింతురు కంసాలివారు వడ్రంగులు కలరు కమ్మర కుమ్మర కాపీపనివారు ఉన్నారు మంగలి చాకలి గొల్ల వడ్డెరవారు కలరు రెండు వడ్లమరలు నాల్గుఎండిమరలు ఆరురంపపుకోతమరలు కలవు

పెద్దాపురం దగ్గర చిన్న గుట్టలలో అభ్రకమును కనుగొనినట్లు తెలియుచున్నది ఇచట వ్యవసాయమునకు పరిశ్రమలకు సరిపడు కూలీలు లభింతురు దినమునకు పురుషునకు కూలి రు 2 లు స్త్రీకి ఒకరూపాయి

ఈ గ్రామములో భ్రమరాంబా ఆంజనేయ సీతారామ వేంకటేశ్వర దేవాలయములు కలవు జుమ్మామసీదు మహబూబు సుభానీదర్గా ఉన్నవి రంగాపురం ఉమామహేశ్వరం జాతరలు జరుగును

జడ్చెర్ల రైల్వేస్టేషను ఈ గ్రామమునకు దగ్గరగా ఉన్నది రెండుగంటలకొకమారు హైదరాబాదునుండి అచ్చంపేటకు మహబూబు నగరునుండి అచ్చంపేటకు ప్రభుత్వపు బస్సులు వచ్చుచు పోవుచుండును కంకరరోడ్డు మట్టిరోడ్లు ఈ గ్రామమున కలవు దీనిని పొరుగు గ్రామములతో కంకర రోడ్లు కలుపుచున్నవి 100 రెడ్డెల్లబండ్లు 87 సైకిళ్ళు ఇచటి ప్రయాణ సాధనములు

అచ్చంపేట యందు సబ్ పోస్టాఫీసు జిల్లాపరిషత్తు హైస్కూలు జూనియర్ బేసిక్ స్కూలు బాలికల అప్పర్ ప్రైమరీ స్కూలు ఉన్నవి కళాశాల చదువులకు విద్యార్థులు హైదరాబాదునకు మహబూబునగరుకు పోవుదురు సబురిజిష్ట్రారు ఆఫీసుకు తంతి టెలిఫోనులకు ఇక్కడికి 26 మైళ్ళలోనున్న నాగరుకర్నూలుకు పోవుదురు

ఇది పంచాయతి పరిపాలన గ్రామము ఇంటిపన్ను వృత్తి వ్యాపారముల పన్నులు వాహనములపై పన్ను ఆస్తిమార్పిడిపన్ను లైసెన్సుఫీజు ఎరువులపాటలు కసాయి పాటలు వీటిమూలమున ఈపంచాయతికి ఆదాయము లభించును గ్రామ పారిశుద్ధ్యమునకు తగుఏర్పాట్లున్నవి రేడియో లౌడ్‌స్పీకరు సినిమా థియేటరు నాటకశాల కలవు విద్యుచ్ఛక్తి సౌకర్యమున్నది పోలీసుస్టేషను తాలూకా కచేరి బ్లాకు అభివృద్ధి కేంద్రము కలవు హైదరాబాదు స్టేటు బ్యాంకు బ్రాంచికలదు సివిల్ ఆసుపత్రి పశువైద్య సదుపాయములు ఉన్నవి ఇంగ్లీషు వైద్యులు ఆయుర్వేద వైద్యులు లభింతురు ప్రతి ఆదివారము గ్రామమున సంత గలదు దీనిలో బట్టలు కూరగాయలు మొదలగునవి దొరకును 31 కిరాణా దుకాణములు 15 కాఫీహోటళ్ళు సిగరెట్టు సోడా కిళ్ళీదుకాణములు సైకిళ్ళ షాపులు క్షౌరశాలలు లాండ్రీలు బ్రాందీషాపు మొదలయినవి కలవు

మా శ్వే

## అచ్చంపేట తాలూకా

అచ్చ పేట తాలూకా ఆ ధ్రప్రదేశమ దలి మహబూబు నగరుజిల్లా దూరఆగ్నేయభాగమ దు ఉన్నది దీని వి స్తీర్ణము 2917 చ కి మీ ది ఉత్తరమున 16 15 35 కును తూర్పున 78 25 79 15 కును మధ్య వి స్తరి చియున్నది ఈ తాలూకాకు తూర్పుగాను దక్షిణముగాను ఇరుకైన మార్గమున కొ డప్రదేశముగు డా కృష్ణానది ప్రవహి చుచున్నది ఉత్తరమున కృష్ణలో కలియువరకు ది డినది ఈ తాలూకాకు సరిహద్దుగాఉన్నది దీనికి పశ్చిమసరిహద్దుగా నాగరకర్నూలు కొల్లాపూరు తాలూకాలు కలవు

ఈ తాలూకాలో విశేషభాగమును అమరాబాదు పీఠభూమి ఆక్రమించియున్నది ఈ పీఠభూమి ఆగ్నేయదిశవైపు ఏటవాలుగా ఉన్నది దక్షిణ బాలఘాటు ప క్తులలో ఒక భాగమైన కొ డ వరుస ఒకటి ఈ తాలూకా మధ్యభాగము నుండి ఈశాన్యముగాను నైరృతిగాను వ్యాపి చిఉన్నది ఈ తాలూకా నైరృతిభాగము ఉత్తరమువైపు ఏటవాలుగా ఉన్నది అమరాబాదు పీఠభూమియొక్క ఎత్తు 610 మీటర్లకును 850 మీటర్లకును మధ్యన మారుచుండును ఫర్హాబాదు 875 మీటర్ల ఎత్తున ఉన్నది ఇచ్చట ఒక వేసవికే ద్రమును నిర్మి చు ఆలోచన జరుగుచున్నది అమరాబాదు పీఠభూమిలో మాననూరు వాయవ్యభాగమున 601 మీటర్ల ఎత్తున ఉన్నది

ఈ తాలూకా మొత్తము డి డి అను ఉపనదితోకూడిన కృష్ణానదికి పరివాహప్రదేశముగా ఉన్నది ఎడ్లపాయవాగు క పవాగు బుగ్గవాగు కాకయట్వాగు నల్లవాగు అమరాబాదుపీఠభూమియందలి నీటిని కృష్ణానదిలోనికి చేరవేయును వానకాలమున చెరువులనుండి ఏర్పడినవాగులు ఈ తాలూకా ఉత్తరభాగ ఈశాన్యభాగముల దలి నీటిని డిండినదిలోనికి చేర్చును చంద్రవాగునకు కొంత ప్రాధాన్యముకలదు

బావులు ఇచటి నీటిపారుదలకు ముఖ్యాధారములు 1966 67 వ సంవత్సరమున దలి నికరపు పారుదలగల 6857 ఎకరముల మింజుమలె బావినీటిపారుదల 48 55 శాతము చెరువుల నీటిపారుదల 44 52 శాతము బుగ్గల వాగుల పారుదల 4 55 శాతము కాలువలపారుదల 2 38 శాతము ఆ సంవత్సరమునందే అమూంబాపతుల పారుదలగల ఏరియా మొత్తము 7821 ఎకరములు ఈ తాలూకాకు చంద్రసాగరు ప్రాజెక్టువలన ఉపయోగము మె డు ఈ ప్రాజెక్టు దాదాపు 900 ఎకరముల ఆయకట్టుకలది ఈ ఆయకట్టు ఎర్పాటులో బొమ్మనపల్లి చ దాపూరు ఐనోలు రాయచడ్ అను గ్రామములు ఇమిడియు న్నవి

1966 67 వ స వత్సరములో 1 38 842 ఎకరములలో పైరు వేయబడెను వాటిలో 66 31 శాతము ఆహార ధాన్యములకు నియోగి పబడినది శేషి చిన వి స్తీర్ణము తదితరమయిన పైరులకు వినియోగి పబడెను వరి జొన్న జ్జ సెనగ పెసర మినుము పొగాకు మిర్చి నువ్వులు ఆముదాలు మున్నగుపైరులు ముఖ్యమైనవి మామిడిపండ్లు నారి జలు నిమ్మకాయలు మున్నగునవి కాయును

అమరాబాదు పీఠభూమిలో వెడల్పయిన స్ఫటిక శిలా ఫలకములు లభి చును అవి నిర్మాణములకును గానుగ రాళ్ళనుచేయుటకును ఉపయోగి చును రాతిపలకల గనులు కలవు ఈ పలకలు విద్యాలయములలో పలకలుగా బ్లాకు బోర్డులుగా ఉపయోగపడును ఇచట భారీఎత్తు పరిశ్రమలు లేవు వడ్రంగము కమ్మరము కుమ్మరపని చేనేతమగ్గములు ఇటుకచేతవ టి గృహపరిశ్రమలు కలవు ఇటీవల లి గాలవద్ద వెదురు పరిశ్రమకుచె దిన సహకారస ఘమొకటి స్థాపి ప బడెను ఈ స ఘముయొక్క ఉద్దేశములు స్థానికపరికరములు ఉపయోగించుట ఉద్యోగములు కల్పించుట

ప డల్లియు డి రోడ్డులు అమరాబాదునుండి అచ్చపేటగు డా నాగరకర్నూలునకును అమరాబాదును డి ఫర్హాబాద్ శ్రీశైలములగు డా కర్నూలునకును పోవుచున్నవి అచ్చ పేటనుండి కల్వకుర్తికి కూడ ఒకరోడ్డుకలదు ఒక గ్రా చిరోడ్డు లి గాలను తెలకపల్లితో కలుపుచున్నది అనేక గ్రామములకు బండ్లబాటలతో స బ ధముకలదు మరి రె డు రోడ్డుకలవు వాటిలో ఒకటి మడ్డిమడుగుగు డా వటవపల్లెగుండా కృష్ణానదికి పోవుచున్నది రె డవది అమరాబాదు నుండి రసమళ్ళబావిగు డా కృష్ణానదికి పోవుచున్నది

ఈ తాలూకాలో విశేషభాగము కొండలమయమగుటచే జనస ఖ్య పలుచగా ఉన్నది 84 172 మ ది జనులు కలరు 94 గ్రామములు కలవు వాటిలో 5 గ్రామములు పాడుపడియున్నవి

పూర్వము ఈ తాలూకాకు అమరాబాదు అను పేరు ఉండెను కాని ఈ శతాబ్దపు తొలిభాగమున దీనికి అచ్చం

పేట అను పేరు కలిగెనని తెలియుచున్నది 18వ శతాబ్ది తొలిసంవత్సరములను డి ఈ తాలూకా నైజామురాష్ట్ర ములో ఒక భాగమైయుండెను 1956 వ సంవత్సరములో ఆంధ్రప్రదేశము ఏర్పడుటతో మహబూబునగరు జిల్లాతోసహా ఈ తాలూకా ఆంధ్రప్రదేశములో ఒక భాగముగా ఏర్పడినది

కే సు

## అచ్చమాంబ భండారు

మహిళల ఉద్ధరణమునకు పాటుపడిన స్త్రీరత్నములలో భ డారు అచ్చమా బగారు ఒకతె ఈమె కృష్ణా మ డలము లోని నందిగామ అను గ్రామమున 1874 వ సంవత్సరమున జన్మించెను ఈమెతండ్రి కొమర్రాజు వె కటప్పయ్యగారు వీరు మునగాల జమిందారునొద్ద దివానుగ ఉ డిరి ఈమెతల్లి గ గమా బగారు ఈమె సోదరులు ఆ ధ్ర చరిత్రకు అపార సేవచేసిన వె కటలక్ష్మణరావు ప తులుగారు ఈమెభర్త భండారు మాధవరావు గారు ఈమె ఆర్వేల నియోగిశాఖకు చెందిన స్త్రీ

బాల్యమున డియు అచ్చమాంబగారు పట్టుదలతో చదివి గొప్ప విజ్ఞానమును సంపాదించిరి క దుకూరి వీరేశలి గము ప తులుగారి మహిళాసేవ ఈమెను ఆకర్షి చెను నాటి స్త్రీలోకము పొ దుచున్న సా ఘికమైన బాధలకు ఈమె ఎ తో తప చెను స్త్రీజాతిని ఉద్ధరి చుటయే తన కర్తవ్య మని నిశ్చయించెను తన పనులను కట్టిపెట్టి ఆంధ్ర దేశము న దంతటను తిరిగి స్త్రీవిద్యను స్త్రీస్వాత త్ర్య మును స్త్రీల హక్కులను గురించి గొప్ప ఉపన్యా సములు ఇచ్చెను స్త్రీల అభ్యున్నతికి చేయదగు కార్యక్రమములను పెక్కు పత్రికలలో ఈమె విశదీకరించెను మహిళాభ్యుదయముకు టువడక నిరంతరము కొనసాగుటకై ఈమె అచ్చటచ్చట మహిళా సమాజములను స్థాపి చెను అట్టివాటిలో బందరు పట్టణమున దలి బృందావనపుర స్త్రీసమాజము కాకినాడలోని విద్యార్థినీసమాజము ముఖ్యములు

చిత్రము 7



అచ మాంబ భ డారు

అచ్చమాంబగారు ఆ ధ్రసారస్వతమున దును గొప్ప అభినివేశముకల నారీమణి చరిత్రకాలవు ఆదర్శ వనితామణుల జీవిత చరిత్రను తెలుపునట్టి అబలా సచ్చరిత్ర రత్నమాల అను గ్ర థమును ఈమె రచి చెను పేదవారియ దు ఈమెకు సహజ ప్రేమకలదు పేదవారి బటు బపరిస్థితులను తెలుపు నట్టి "బీదకుటు బము అనువచనగ్ర థమును ఈమె వ్రాసెను శమంతకమణి రామేశ్వర యాత్రాచరిత్ర సత్కథామంజరి అను గ్ర థములను కూడ ఈమె రచి చెను

అల్లికల విషయములలో ఈమె గొప్ప నైపుణ్యము కలది "ఊలుఅల్లిక అను గ్ర థమొకటి ఈమె వ్రాసినదట 1902 వ స వత్సరమున స్థాపి పబడిన హి దూసు దరి అను పత్రికలో క్రోషా అల్లికను గూర్చి ఈమె పెక్కు వ్యాస ములు వ్రాసెను

ఈ విధముగ తన జీవితముకు మహిళాభ్యుదయమునకు అ కిత మొనర్చి శ్రీమతి అచ్చమాంబగారు 1905 వ సంవత్స రమున మధ్యప్రదేశములోని బిలాసపూరులో తనువును చాలిం చిరి తొలుదొలుత మహిళాభ్యుదయమునకు పాటుపడిన కీర్తి దక్కించుకొన్న ధన్యచరిత అచ్చమాంబ

తం ఆం శా

## అచ్చమ్మ

ఈ సాధ్వీమతల్లి ప్రసిద్ధిగన్న రాజా వాసిరెడ్డి వెంక టాద్రినాయనిజనని వెంకటాద్రినాయని త డ్రి జగ్గయ్య అతనిత డ్రి నాగన్న తండ్రి మరణానంతరము జగ్గయ్య కృష్ణా నదికి దక్షిణతటమందున్న చింతపల్లి ఎస్టేటుకు అధికారి అయ్యెను అల్లే జగ్గయ్య సహోదరుడైన రామన్న నంది గామ సీమకు ఏలిక అయ్యెను

చింతపల్లి ఎస్టేటుకు సంబంధించిన జూనియర్ చింతపల్లి ఎస్టేటు ఒకటి కలదు వాసిరెడ్డి వంశమునకు చెందిన పెద్ద రామలి గన్న వీరన్న అను సోదరులు దీనికి వారసులుగా ఉ డిరి ఈ రెండు ఎస్టేటుల జమీందార్ల మధ్య విరోధము పెరుగజొచ్చెను దీనిఫలితముగా వీరన్నను జగ్గయ్య క్రీ శ 1768 వ స వత్సరమున వధించెను మరుసటి సంవత్సరము నవాబు బసాలత్ జంగుచే నియమితుడైన ఒక ఉద్యోగి కుట్రపన్ని జగ్గయ్యకు ఒక సమావేశమునకు హాజరు కావలసినదిగా ఆహ్వానమంపెను జగ్గయ్య వచ్చుటే తడవుగా అతని శిరస్సు

ఛేది పబడెను

అచ్చమ్మ తన భర్తయగు జగ్గయ్య ఘోరమరణవార్త వినిన తనే తన చేతియ దున్న బ గారు పూఎల హారమును వి ఎరి వైచి భర్తతో సహగమనమునకుద్యుక్త అయ్యెను కష్ణా జిల్లాలో సహగమనమను ఆచారము ఈమెతో సమసినది ఈమె స్మణార్థము నేటివరకును వాఎరెడ్డి వ శములోని స్త్రీలు పూఎలతో నమర్చిన స్వర్ణహారములను ధరి చరు అచ్చమ్మ సహగమనము చేసిన ప్రదేశమున అచ్చమ్మపేట అను గ్రామమును నిర్మి చిరి ఇది గు టూరుజిల్లా ఎత్తెనపల్లి తాలూకాలో కలదు

కొ వెం

## అచ్యుత దేవరాయప్రతాపుడు

చూ చినరామనృపతి

## అచ్యుత దేవరాయలు

విజయనగర సామ్రాజ్యమును పాలించిన ప్రభువులలో శ్రీకృష్ణదేవరాయలు సర్వశ్రేష్ఠుడు తన యనంతరము రాజ్యమునకు తన ʻʻవతి తమ్ముడగు అచ్యుతదేవరాయలు ఏలిక కావలెనని మరణశాసనము వ్రాసి కృష్ణరాయలు క్రీ శ 1529 వ స వత్సరమున మరణి చెను కృష్ణరాయని కాలమ దు చ ద్రగిరి దుర్గమున బ దీగా ను డిన అచ్చుత దేవ రాయలు చెరను డి విడివడి రాజ్యాధికారమును వశపరచు కొనెను ఈతని పట్టాభిషేకము 1529 న స వత్సరము న దే తిరుపతియ దును కాళహ స్తియ దును తుదకు విజయ నగరమున దును మూడు పర్యాయములు జరిగెను అచ్యుత దేవరాయలు తుళువ నరసరాజు మూడవభార్యయైన ఓబా బిక కుమారుడు కావున శ్రీకృష్ణ దేవరాయని యిర తరమాతడు రాజ్యాధికారము వహి చుట న్యా యమని తెలుప వచ్చును

అచ్యుత దేవరాయలు సామ్రాజ్యమున కేలికయగుట కొ దరు రాజబంధువులకును ఇతర ప్రభువులకును రుచి ప లేదు వారిలో ప్రముఖుడు శ్రీకృష్ణదేవరాయని అల్లుడైన అళియ రామరాయలు రాజ బంధువులలో చెలరేగిన పోటీలు వైరములు కారణముగా సమీపమందలి ఇతర రాజులు కూడ విజయనగర రాజ్యముపై క త్తిగట్టిరి ఈ పరిస్థితిని అచ్యుత దేవరాయలు సమర్థతతో ఎదుర్కొనెను రామరాయలకు రాజ్యమునందు గల ప్రాధాన్యమును గుర్తించి అచ్యుత రాయలాతనిని తన ప్రధానమంత్రిగ నియమి చుకొనెను ఆ సమ్మట అచ్యుత దేవరాయలు ఓఢ్రదేశపు ప్రభువైన ప్రతాప రుద్ర గజపతితో యుద్ధము కావి చి ఆతనిని పరాభవించెను 1531 వ స వత్సరమున ఈ రాయలు దక్షిణదేశ దిగ్విజయము నకై బయలుదేరిపోయెను ఈ ప్రభువు ఆజ్ఞానుసారము పెద తిరుమలయ్యదేవమహారాయలు అను రాజబ ధువు చేర దేశాధిపతి నోడి చెను రాయలపై తిరుగుబాటు కావి చిన సాళువ నాయకుడను ప్రముఖ వ్యక్తిని పెదతిరుమలయ్య పరాభ వి చెను అచ్యుత దేవరాయలకు మిక్కిలి విశ్వాసపాత్రుడైన విశ్వనాథనాయకుడు రామనాథ ప్రాంతముల పాలి చు చు డిన బాణరాజుల నోడి చి సామ్రాజ్యప్రతిష్ఠను ఇనుమ డింప జేసెను 1534 వ స వత్సరమున విజయనగరప్రభువు నకును విజాపుర నవాబునకును యుద్ధము జరిగెను యవన ప్రభువునకు పరాభవము స భవి చెను రాయచూరు దుర్గము విజయనగరము వారికి వశపడెను గోలకొండ ప్రభువగు కులీ కుతుబుషాకును అచ్యుతరాయనికిని యుద్ధములు సాగి కుతుబుషా పరాభవము నొ దెను కొండపల్లి కొ డవీటి దుర్గ ములు అచ్యుతరాయనికే కైవసమయ్యెను యుద్ధవిజయము లందును రాజ్యపరిపాలనమ దును రాయనికి పెక్కండ్రు సామ తప్రభువులు తోడ్పడిరి వారిలో పెదతిరుమలయ్య దేవమహారాయలు ప్రథముడు అళియ రామరాయలు ప్రభువు అనుగ్రహమును కోల్పోయి సోదరులతో కూడి తన స్వస్థాన మగు గుత్తి దుర్గమునకు వెడలిపోయెను తర్వాత పెదతిరుమ లయ్యదేవ మహారాయలు విజయనగరరాజ్యమునకు ప్రధాన మ త్రియై సమర్థతతో రాజ కార్యముల నిర్వహించెను

అచ్యుత దేవరాయల రాజ్యము నందు సుమారు రె డు నూర్ల సామ త ప్రభువులు డెడివారు వారికిగల భూమిని బట్టియు ఆదాయమును బట్టియు రాయలు వారుచెల్లి ంచ వలసిన కప్పమును వారు పోషి చవలసిన రాణువను నిర్ణ యి చెడి వాడు ఆ నిర్ణయమునకు వ్యతిరేకముగ వర్తి చిన వారు శిక్షకుపాత్రులగుచుండిరి సామంతులలో కొందరు చ ద్ర గిరి మున్నగు ముఖ్య దుర్గముల కధిపతులుగ నియమింపబడుచు వచ్చిరి మరికొ దరు సైన్యాధ్యక్షులుగ రాజసేవ కావించు చుం డెడి వారు

అచ్యుత దేవరాయలు వైష్ణవ మతావలంబి కాని విజయ నగర ప్రభువు ల దరివలెనే ఈతడు కూడ అన్ని మతములను సమభావముతో పోషి ంచెను పట్టాభిషేక సమయమున ఈ రాయలు కా చీపురమందలి వరదరాజస్వామికిని ఏకామ్ర

నాథస్వామికిని కొన్నిగ్రామములను దానముచేసెను ఈతడు సువర్ణమేరుదానము ఆన దనిధిదానము అను గొప్ప దానముల కావించిట్లు శాసనములు తెల్పుచున్నవి ఈ రాజు షోడశమహాదానముల కావించి వన్నెగాంచెను అచ్యుత దేవరాయలు తన భార్యయగు వరదా బిక తోడను కుమారుడగు చిన వేంకటపతిరాయల తోడను పెక్కు పర్యాయములు మౌక్తికతులాభారములు తూగి ఆధనమును పేదలకు పంచి యిచ్చెను

అచ్యుతరాయలు కూడ తన వంశీయుల దరి వలెనే పెక్కు గుళ్ళు గోపురములు కట్టించెను 1539వ సంవత్సరమున ఇతడు తన పేరిట అచ్యుతరామస్వామి ఆలయమును విజయనగరమున దు కట్టించెను ఆ దేవాలయము నేటికిని దర్శనీయముగ నున్నది ఈ రాజు తన రాజధానియందు తుంగభద్రాతీరమున విరలేశ్వరాలయమును నిర్మించుట ప్రారంభించెనని చారిత్రికులు తెల్పుచున్నారు కాని ఈరాజు కాలమున ఆ దేవళము పూర్తికాలేదు అళియ రామరాయలు దీనిని పూర్తిచేయించెను

అచ్యుత దేవరాయలు కవిపండితులను పోషించెను రాజనాథ డిండిముడు ఈ ప్రభువున ఆస్థానకవి ఈ కవి అచ్యుతరాయల దిగ్విజయ యాత్రల వర్ణించుచు అచ్యుతరాయాభ్యుదయమను సంస్కృత కావ్యమును రచించెను ఈ కవి భాగవత చంపువును కూడ వ్రాసెను తిరుమలాంబ యను కవయిత్రి వరదాంబికా పరిణయమను సంస్కృతకావ్యమును ఈ కాలమ దే రచించెను రాయల ఆస్థానమున ఆంధ్రకవులు కూడ పెక్కురు ఉండెడివారు అ దు చి తలపూడి ఎల్లయ కవి ప్రత్యేకముగ పేర్కొనదగినవాడు ఈతడు రాధామాధవము తారకబ్రహ్మరాజీయము అను కావ్యములను రచించెను

అచ్యుత దేవరాయలు క్రీ శ 1542వ సంవత్సరమున కాలధర్మము చెందెను

ఖం బా శే

## అచ్యుతనాథుడు

ఇతడు నవనాథ సిద్ధులలో ఒకడైన గోరక్షకుని శిష్యుడు ఇతనిని సిద్ధునిగా జేసినది గోరక్షకుడే ప్రచ్ఛన్నవేషమున దేశదేశముల సంచరించుచు శిష్యగణము వెంటరాగా అచ్యుతనాథుడు హితులైన వారిని గురుభక్తి సహితులను పరికించి వారల భావములను తెలిసికొని వారిని సిద్ధదేహులుగా చేయుచుండెను సిద్ధులు చిరకాలజీవులు అచ్యుతనాథుని మహిమలు నవనాథ చరిత్రమున వర్ణింపబడ యు డలేదు

ని శ సుం

## అచ్యుతనాయకుడు

అచ్యుతనాయకుడు తంజావూరు లి చెవ్వప్పనాయకుని పుత్రుడు ఇతని తల్లి మూర్తమ బ ఈమె విజయనగర సామ్రాజ్యాధిపతియైన అచ్యుత దేవరాయలకు మరదలగుటచే తంజావూరి పాలకులకు విజయనగర రాజవంశీయులతో ఎంబ ధ బాంధవ్యములుకూడ ఏర్పడినవి అచ్యుతనాయకుడు త జ వూరు రాజ్యమును క్రీ శ 1561స నుండి క్రీ శ 1614సం॥ వరకు పాలించెను ఇతడు బాల్యమునుండి గొప్ప దైవభక్తి కలవాడు శాంతిమూర్తి విద్యావంతుడు చక్కని సంస్కారమును పెంపొందించుకొనిన సద్గుణసంపన్నుడు ఇతడు అనన్యసామాన్యధైర్యసాహసోపేతుడు పుణ్యాత్ముడు పేరుబొందినదాత

అచ్యుతనాయకుడు రాజ్యాధిపత్యము వహించునాటికి తంజావూరు రాజ్యము సిరిసంపదలతోను శాంతిభద్రతలతోను రాజిల్లుచు సుభిక్షముగా ఉండెను తంజావూరు విజయనగర సామ్రాజ్యమునకు సామంతరాజ్యము అట్లయ్యును పాలనా విషయముల దు తంజావూరి పాలకులు స్వతంత్రముగనే వ్యవహరించెడివారు కేంద్రముతో తంజావూరుకున్న సన్నిహిత సంబంధములే ఇ దులకు ప్రధాన కారణము అచ్యుతనాయకుడు తన ప్రధానమంత్రియైన గోవిందదీక్షితుని సహకారముతో ప్రజానురంజకముగ రాజ్యమును పాలించెను విజయనగర సామ్రాజ్యాధిపతియైన రెండవ వెంకటపతిరాయలు తన సామంతులైన మధురజింజపాలకులు తిరుగుబాటు చేయగా వారిని అణచుటకు దక్షిణాదికి ససైన్యముగా తరలి వచ్చెను ఈ సందర్భములో అచ్యుతనాయకుడు తన ఎలికకు బాసటగానిల్చి తిరుగుబాటుదారులకు తగు గుణపాఠమును నేర్పెను ఈ కారణమున ఇతడు చక్రవర్తి ప్రీతిపాత్రుడును మధుర జింజిపాలకులకు ప్రబల విరోధియు అయ్యెను

అచ్యుతనాయకుడు రాజ్యమును పాలించుకాలములో పోర్చుగీసువారు దక్షిణమున క్రైస్తవమతప్రచారము చేయుచు అనేకులను తమ మతములోనికి చేర్చుకొనుచుండిరి ఇట్లు అన్యులను తమ మతములో ప్రవేశపెట్టు విధానమువలన పోర్చుగీసు

వారి బలము హెచ్చినది. బలోద్ధతులై వారొకపర్యాయము కొందరు నిమ్నజాతులవారిని తంజావూరు రాజ్యముపై పురికొల్పిరి. అందులకు క్రుద్ధుడైన అచ్యుతనాయకుడు తనకుమారుడగు రఘునాథనాయకుని ఆధిపత్యములో కొంత సైన్యమును వారిపైకి పంపెను. తంజావూరి సైన్యములు పోర్చుగీసువారికే ద్రమగు నాగపట్టణముపై దాడిచేసి వారిని తరిమికొట్టి వారి యాగడలను కట్టించెను.

మహమ్మదీయులొకమారు విజయనగర సామ్రాజ్యముపై ఎత్తిరాగా చక్రవర్తియగు వేంకటపతిరాయలు తంజావూరి పాలకుడగు అచ్యుతనాయకునియొక్క సహాయమర్థించెను. అపుడుకూడ అచ్యుతనాయకుడు తనపుత్రుడగు రఘునాథనాయకుని నాయకత్వమున కొంత సైన్యమును చక్రవర్తికి సాయమొనర్చుటకు పంపెను. తంజావూరి సైన్యములు పెనుగొండవద్ద ముస్లింసేనలను తాకి ఓడించి తరిమివేసెను. ఇట్లు మరియొకమారు అచ్యుతనాయకుడు తనచక్రవర్తికి సహాకరించి తన ప్రభుభక్తిని వెల్లడించుకొనెను.

క్రీ.శ. 1614 సం. నాటికి తంజావూరు రాజ్యమునకు నలుగడల శత్రువులు ఏర్పడిరి. పేరుపొందిన బందిపోటుదొంగ చోళకుడు అనువాడొకడు దేవికోట యను ఒక చిన్న ద్వీపమును కేంద్రముగా జేసికొని ప్రజల ద్రవ్యమును దోచుకొనుచు పీడింపసాగెను. తంజావూరునకు శత్రువులగు పోర్చుగీసువారు, మధురజింజిరాజ్యపాలకులు చోళకుని ప్రోత్సహించియు పరోక్షముగ వానికి సహాకరించియు అచ్యుతనాయకునిపై పగదీర్చుకొనుటకు ఆరంభించిరి. ఇదేతరుణములో విజయనగరసామ్రాజ్యాధిపతియగు వెంకటపతిరాయలు మరణించుటచే కేంద్ర రాజధానియందు కలతలు కుట్రలు అంతఃకలహములు పొడచూపినవి. ఈ సందర్భములో నిజమైన వారసుని విజయనగర సింహాసనముపై కూర్చుండబెట్టు బాధ్యతకూడ తంజావూరి పాలకులపై పడినది. ఇట్టి బృహత్కార్యముల నెరవేర్చుకొనుటకు వృద్ధుడగు అచ్యుతనాయకుని శక్తి చాలదయ్యెను. అందుచే చక్కగా ఆలోచించి దుష్టశిక్షణకు శిష్టరక్షణకు తనకుమారుడగు రఘునాథనాయకుడు తగినవాడనియెంచి అతనికే క్రీ.శ. 1614సం.లో పట్టము కట్టి శ్రీరంగేశుని సేవించుటకుగాను అచ్యుతనాయకుడు అదే సంవత్సరమున శ్రీరంగమునకు వెడలిపోయెను. అచటనే అతడు తనజీవితశేషమును గడపెను.

అచ్యుతనాయకుడు గొప్ప దైవభక్తిపరుడు. ఇతడు హరిహరాదులను భేదములేక పూజించెడివాడు. కాని రంగనాథస్వామి అన్నను శ్రీరంగక్షేత్రమన్నను ఇతనికి ప్రీతిమెండు. శ్రీరంగమందు ఏడు సోపానపంక్తులను 8వ ప్రాకారమును నిర్మింపచెను. అల్లే రంగనాథస్వామికి రత్నకిరీటకవచాదులను చేయించెను. ఇవియేకాక ఇతడు రామేశ్వరమునందలి తీర్థఘట్టములన్నిటిని మరమ్మతు చేయించియు తిరుపతి కాళహస్తి మొదలగు ప్రదేశములందలి దేవాలయములకు దానములొసంగియు అనేకగుడులు గోపురములు కట్టించియు తన దైవభక్తిని వెల్లడించుకొనుటతోపాటు చిరస్మరణీయమగు కీర్తినిగూడ ఆర్జించుకొనినాడు.

ఆ. చెం.

## అచ్యుతరామభద్రనాయకుడు

ఇతడు క్రీ.శ. 1600–31 సం॥ల నడుమ తంజావూరు నేలిన రఘునాథనాయకుని రెండవ కుమారుడు. రఘునాథనాయకునకు ముప్వురు కుమారులుండినట్లు రఘునాథనాయకాభ్యుదయమందలి ఈ క్రింది పాదములు తెల్పుచున్నవి.

అచ్యుత నామాంకి తాగ్రతనూజుం
డచ్యుత రామభద్రావని విభుండు
మొదలైన తనయులు ముప్వురవ్వేళ
బొదలి మూర్తిత్రయ పోలికలనంగ (679–82)

రఘునాథనాయకాభ్యుదయమును రచియించినవాడు రఘునాథనాయకుని కుమారులలో నొకడైన విజయరాఘవనాయకుడు. ఇట్లు రఘునాథుని పుత్రులు ముప్వురు – అచ్యుతుడు అచ్యుతరామభద్రుడు విజయరాఘవనాయకుడు అనువారు. గ్రంథకర్త విజయరాఘవనాయకుడు తన నామమిందు చెప్పుకొనలేదు. మొదలైనతనయులు అనుటలో ఈ యర్థమిమిడియుండును. తానే స్వయముగా గ్రంథమును వ్రాయుటచేతనో తనకంటె అగ్రజులైనవారితో సఖ్యము లేకపోవుటచేతనో తన నామమునుదేర్చి చెప్పుకొనుటకు ఇష్టపడలేదని తోచుచున్నది. రఘునాథనాయకుడు 1631 లో మరణించినతరువాత అన్నదమ్ములు ముప్వురును సింహాసనమునకై తగవులాడిరనియు దేశమున మూడుసంవత్సరముల కాలము సంక్షోభమేర్పడినదనియు విజయరాఘవుడు తన అగ్రజుల కండ్లూడబీకించి చెరయందుంచి రాజ్యాధిపత్యమున కనర్హులుగ జేసెననియు వారిని పల్లంకోట చెరయందుంచెననియు

ములుకాక అతని ధార్మిక ప్రవర్తనాభివృద్ధికి ఉద్దేశింపబడినవి ఈకారణముచేతనే అజంతాయ దలి స్త్రీచిత్రములలో ఎచ్చటను అశ్లీలత మచ్చుకైన కానరాదు మీదుమిక్కిలి ఈస్త్రీల సహజ సౌందర్య విలాసములు మానవునిలో సద్భావముల ప్రేరేపించి అతనిని సౌందర్యారాధనోన్ముఖునిగా జేయుననుటలో సందేహము లేదు

ఆ వెం

## అజక

ఈతడొక బుద్ధభక్తుడుగా కాన్పించుచున్నాడు ఎ ఎ ఇం X నె 1256 లఘుశాసనములో ఈఅని ప్రశంస వచ్చినది అజకుడు తన తండ్రితో కలిసి అమరావతీ స్తూపమునకు ఒక మదురు రాయిని దానముగా ఇచ్చెను ఆర్యకశబ్దమునుండి అజకశబ్దము ఏర్పడియుండును ఈ శాసనము ప్రాకృతభాషలో ఉన్నది బౌద్ధయుగమున ప్రాకృతమునకు ఆదరప్రచారములు విస్తారముగా లభించెను ఒకరాతిని లేక శిలాఫలకమును సమర్పించుట ఒక గొప్పకార్యమా ! ఇదియేమంత పెద్దదానము దీని కొరకొక శాసనము వ్రాయవలెనా అని మనకొక సందేహము కలుగవచ్చును కాని ఇచట మనము పరిగణింపవలసినది అజకుని భక్తిభావము దానమిచ్చిన వస్తువు మూల్యముకాదు పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి అని గీతావాక్యముకదా ! అమరావతీస్తూపము మీది శిలాఫలకమనగా మామూలురాయికాదు దానిమీద ఎంతో శిల్పము పదకరింపబడును బుద్ధునిజీవితగాథలో పూర్వజన్మగాథలో దానిమీద శిల్పవిజ్ఞానముతో చెక్కబడును సాధారణముగా ఇవి పాలరాళ్ళు అజకుడొక శిల్పియైనకార్మికుడు కావచ్చును ఈ వేదభక్తుడు తాను కూర్చుకొన్న స్వల్పధనముతోను నేర్చిన శిల్పవిద్యతోను భగవానుడగు బుద్ధునకు ఒక శిలాఫలకమును సమర్పించి మనకు ఆదరణీయుడగుచున్నాడు

ఖం ల రం

## అజరత్ ఖాన్

కృష్ణాజిల్లా పెదకళ్లేపల్లి లోని నాగేశ్వరాలయముఖద్వారపు కుడివైపున ఉన్న స్తంభముమీద చెక్కబడిన శాసనమందు అజరతుఖాను ప్రస్తావనకలదు

ఈ శాసనము అవతరించినది వికృతి సం॥ర శ్రావణ శుద్ధ విదియ ఇతర శాసనములలోవలె ఈ శాసనమున శాలివాహన శకము పేర్కొనబడలేదు అయినను శాసనములోని ఉదితము ననుసరించి కాలనిర్ణయముచేయుట జరిగినది ఇండియన్ ఎఫిమెరిస్ అను గ్రంథమునుబట్టి ఇది వికృతి సం॥ శా శ 1452 (క్రీ శ 1530) సంవత్సరియగునని తెలిసినది ఈ శాసన పరిశీలనమునకు అప్పటి ఆంధ్రదేశ స్థితిగతులు అవలోకించుట అవసరము

కటకము నుండి కవిపరకు శాసనాటకి గజపతు లొకవైపునను బహామినీలను డి గోలకొండను ఆక్రమించుకొనిన గోల్కొండ నవాబులొకవైపును సామ్రాజ్యవిస్తరణకు పరస్పరము పగవులాడుచు ంరి విజయనగరమున కృష్ణరాయల నిర్యాణము జరుగుటయు అచ్యుతదేవరాయలు సింహాసనమును అధిష్ఠించుటయు ఇదేకాలమున జరిగినవి

పూర్వవృత్తాంతము ననుసరించి కృష్ణరాయలు కళింగ జైత్రయాత్రయందు ప్రతాపరుద్రగజపతిని 1518 సం॥న ఓడించి అతని కుమార్తెను ఉద్వాహమొనర్చుకొని కృష్ణకు ఉత్తరమున తాను జయించిన కోటలను రాష్ట్రములను తిరిగి గజపతిరుద్రునకిచ్చిన విషయము చరిత్రప్రసిద్ధము ప్రస్తుత శాసన కాలమునాటి ప్రతాపరుద్ర గజపతి జీవించియున్నట్లును కొండపల్లి అతని అధీనమునందుండినట్లును తిరిగి 1530 సం॥రననే గోల్కొండ నవాబు కులీకుతుబుషా ప్రతాపరుద్రుని యుద్ధమున ఓడించి కొండపల్లి రాజ్యమును స్వాధీనపరుచుకొనుట కూడ జరిగినది ఈ శాసనము సంధి సమయమున వేయించబడినదిగా కనిపించును ఇక గోల్కొండ మొదటి సుల్తానగు కులీకుతుబుషా బహమనీరాజ్యమునుండి స్వతంత్రత ప్రకటించి తన పోషకుడైన మహమ్మదుషా గౌరవార్థము గోల్కొండకు మహమ్మదుపురమని నామకరణము చేసెను స్వామి భక్తిచిహ్నముగా తాను పాలనచేసిన ప్రాంతములను మహమ్మదుషాపాలనక్రింద నున్నట్లుగనే శాసించెను కొంతకాలము ప్రతాపరుద్రగజపతియు కులీకుతుబుషాయు కొండపల్లిలో ఉమ్మడిప్రభుత్వము జరిపినట్లు ఈ శాసన పరిశీలనము వలన గ్రహింపగలము

ఇప్పుడు పూర్వోక్తవిషయములు దృష్టియందుంచుకొని శాసనమును పరికింతము

శాసనభాగము అచ్చటచ్చట శిథిలమైనది ఈ శాసన ప్రథమ పాదమున రుద్ర అని ఉండుటవలనను శాసన కాలము క్రీ శ 1530 అగుటవలనను రుద్రగజపతి జీవించి యుండుటయేగాక అతడు కొండపల్లి దుర్గముపై పరోక్షముగా

నైన కొంత అధికారము కలిగి యుండెననుటకు దారితీయు చున్నది

**శాసన విషయము _**

రుద్రగజపతి అనతినముంరి చి ఖామ దుల్తైన అజరతు ఖాను అజముర ఖాను అజ షరఖాను మహమ్మదు ఒడయారు గారి పక్షమున కొండపల్లి దండపాటులోని ఒక గ్రామ (శిథిలము) వానులగు క్రాజలి గారెడ్డి క్రోసూరి పూసడపు క్రాజ సెట్టి బోలిసెట్టి తమ్మిసెట్టి ప్రాగోలి కల్యాణం నాయడు శ్రీ కాకొల్ని నాగిసెట్టి (జుక్కలగడ్డ నాగినీడు) వీరు తదితర ప్రజలు కలసి ఖిల్లేదారులకు చేసికొన్న విన్నపము ఇట్లున్నది కొండపల్లి దండపాట ఖిల్లాను అంటిపెట్టుకొని ఉన్న స్థలమును సుంకము లేక వ్యవసాయము చేసుకు టాము ఇట్లు ప్రజలు కోరినమీదట వారి అభ్యర్థనను అంగీకరించి సుంకము వినాయింపబడునట్టుగా ఖిల్లేదార్లు కౌలు వ్రాసి యిచ్చిరి ఇదేసమయములో కంసాలివృత్తి పన్నుకూడా రద్దు చేయబడినట్లు శాసనమున చెప్పబడినది ఒకేసమయమున ప్రత్యర్థులైన ఇద్దరు ప్రబలరాజ్యపాలకుల ప్రశంస ఒకేశాసన మందు వచ్చుట వింతగా తోచును ఇట్టి శాసనములు బహు అరుదుగా చరిత్రలో కనబడును

ఈ శాసనమున దలి రెండు పదముల వైశిష్ట్యము తెలిసికొనుట ముఖ్యము ఒడయారు అనుపదము తెలుగున ఒడయడు అని ప్రచారములో ఉన్నది ఎలిక రాజు స్వామి మగడు అను అర్థములనిచ్చు ఈ పదములు విజయనగర సార్వభౌములు వేయించిన శాసనముల దు కాంచగలము ఇప్పటి శాసనము అనుసరించి మహమ్మదీయ ప్రభువులుకూడ తమ నామములతో మహమ్మూదు ఒడయారు అను విశేషణమును చేర్చుకొనుట విశేషాంశముగా పరిగణింపవలయును

దండపాటు అన రాజ్యభూభాగము అని చారిత్రికుల అభిప్రాయము కొండపల్లి దండపాటు అని ఈ ప్రాంతము పిలువబడుటకు ముందే కొన్ని శతాబ్దముల క్రితము కళింగ దండపాటను పదము అర్వాచీనగాంగుల గజపతుల శాసనముల దు కాంచనగును

కొ వెం

## అట్టహాసదేవుడు

గంగాన్వయావలంబన స్తంభమైన శ్రీ మదన తవర్మ దేవర రెండవభార్యయగు దెన్నమహాదేవి కుమారుడు అట్టహాసదేవుని ప్రసక్తి ద హిం IV సె 1169 శాసనములో కాన్పించుచున్నది ఈతడు దాక్షారామ భీమేశ్వర మహాదేవునకు కన్యాసంక్రాంతి సమయమున అఖండవర్తి దీపము నెల కొల్పుచు దీపారాధనకై నేయి పోయుటకొఱకు 50 ఇనుప ఎడ్లను నలుగురు బోయలు పూటగాఉంచి చి తవోల తేగడు అనువాని వశమున పెట్టెను నిత్యము మానెడు నేయిపోయుటకు ఏర్పాటు శాసనలేఖకుడు పెద్దనార్యుడు దాక్షారామ శాసనములు పెక్కింటిలో విఖత పెద్దనార్యేణ" అని వ్రాయబడి యుండును ఈ పెద్దనార్యుడు శాసనములు చెక్కించు కసాలి పెద్దయో లేక శాసనకావ్యము ను వ్రాయుటకూడ చేసెడివాడో తెలియదు మొదటి ఊహయే సత్యమనిపించును రాజులును అధికారులును పన్నులును దానశాసనములు వ్రాయించుట ఆచారమగుటచే వాటిని రేకులమీదను శిలలమీదను చెక్కుట ఒకవృత్తిగా ఏర్పడెను స్వర్ణకారులీ పనులు చేయుచుండిరి

శాసనకాలము శక 1071 అనగా క్రీ శ 1149 అని వ్రాయబడినది ఇది కులోత్తుంగ చోడదేవర 17 వ రాజ్యసంవత్సరముగా చెప్పబడినది దీనిని బట్టి కులోత్తుంగ చోడదేవుడు శక 1054 క్రీ శ 1132 నుండి పరిపాలించుచుండినట్లు కన బడు చున్నది ఈ కులోత్తుంగ చోడుడెవ్వడు ఆంధ్ర మహాభారతరచనమును ప్రోత్సహించిన రాజరాజనరేంద్రుని కుమారుడును రాజేంద్రచోడ నామాంకితుడును అగు మొదటి కులోత్తుంగచోడచక్రవర్తికాడు ఈ మొదటి కులోత్తుంగుడు క్రీ శ 1070-1120 నడుమ కాంచీపుర చక్రవర్తిగా భూపరిపాలనము చేసెను ఆతని కుమారుడు విక్రమచోళుడు క్రీ శ 1118 1135 న వత్సరములనడుమ చోళసింహాసనమును అధిష్ఠించెను వీని కుమారుడు ఇమ్మడి కులోత్తుంగుడు క్రీ శ 1133 1150 సంల నడుమ రాజ్యపాలన చేసెను అట్టహాసదేవుని దానశాసనములో చెప్పబడిన కులోత్తుంగచోడదేవర రెండవ (ఇమ్మడి) కులోత్తుంగుడనుట తథ్యము శకము 1071 ఇతని పదునేడవ రాజ్యసంవత్సరమగుటచే ఇమ్మడి కులోత్తుంగుడు శక 1054 క్రీ శ 1132 నుండియు రాజ్యాధికారము వహించినట్లు ఊహింపవలసి యున్నది ఇప్పటికి ఈతని జనకుడైన విక్రమచోళుడు కాంచీపుర సింహాసనముపై విరాజమానుడై యుండగా ఇమ్మడి కులోత్తుంగుడు రాజ్యముచేయుట ఎట్లు పొసగును అను సందియము కలుగవచ్చును దీనికి సమాధాన మంతకష్టముకాదు చాళుక్య చోడచక్రవర్తులు కాంచీపురము రాజధానిగా సామ్రాజ్య మేలుచుండగా ప్రాజ్ఞులైన వారి

కుమారులు ఆంధ్రదేశ ప్రాంతమున పరిపాలన చేయుచుండిరి వీరు తమ యువరాజపాలనా సంవత్సరములనుగూడ లెక్కించుకొను చుండినట్లు కనబడును మొదటి కులోత్తుంగుడు జీవించియుండగనే అతని కుమారుడు విక్రమచోళుడు క్రీ శ 1118 నుండియు ప్రభుత్వము నెరపినట్లు కలదు ఆ పద్ధతియే ఇచ్చట కూడ వర్తించును

అట్టహాసదేవుని తండ్రియైన అనంతవర్మ చోడగంగదేవుడు తూర్పు గాంగమహీపతులలో అగ్రగణ్యుడు ఈయన ప్రశస్తి ఇట్లున్నది "సమరముఖానేకరిపుదర్పమర్దన భుజబలపరాక్రమ పరమమాహేశ్వర పరమభట్టారక ఇత్యాది ఇతడు రాజరాజనరేంద్రుని మనుమనుమడు మొదటి కులోత్తుంగ చక్రవర్తి కుమార్తెయైన రాజసుందరీదేవి కుమారుడు అనంతవర్మ చోడగంగుడు మిక్కిలి సమర్థుడైన రాజగుటయే కాక కడు దీర్ఘకాలము రాజ్యము చేసెను ఈతని రాజ్యకాలము క్రీ శ 1078–1152 అని చెప్పబడుచున్నది ఈ దీర్ఘకాలములో ఆంధ్ర కళింగ సంబంధములు ఒకప్పుడు మైత్రితోను ఒకప్పుడు విరోధముతోను గూడినవిగా కన్పించును క్రీ శ 1149 నాటికి అనంతవర్మ చోడగంగదేవుడు మిక్కిలి వృద్ధుడయినాడు నూతన యుద్ధములలో చిక్కుకొనుట కాతనికి సమయముకాదు అందుచేత అట్టహాసదేవుడు క్రీ శ 1149లో దాక్షారామమునందు మిత్రుడుగానే వచ్చియున్నట్లు భావింపవలెను తత్కారణముననే అప్పుడు కాంచీపుర చక్రవర్తియై వేంగిదేశమునకు నామమాత్రపు ప్రభువైన ఇమ్మడి కులోత్తుంగుని ప్రవర్ధమాన సంవత్సరములను అట్టహాసదేవుడు తన దాక్షారామశాసనములో ప్రస్ఫుటముగా ప్రకటించెను తీరాంధ్రదేశమునకు ఇప్పటి వాస్తవప్రభువులు వెలనాటి చోడవంశీయులు వెలనాటి రెండవగొంకభూపతి (క్రీ శ 1132–63) ఈ సమయమున వేంగిప్రభువుగా నుండెను

అట్టహాసదేవుని తల్లి దెన్నమహాదేవి ఈమె అనంతవర్మ చోడగంగుని ద్వితీయలక్ష్మి అని ప్రత్యేకముగా చెప్పబడినది అనంతవర్మ చోడునకు పెక్కురురాణులు కలరు కస్తూరికామోదిని ఇందిర చంద్రలేఖ సోమలమహాదేవి లక్ష్మీదేవి దెన్నమహాదేవి మొదలైనవారు పలువురు రాణులుగా శాసనములలో పేర్కొనబడిరి వీరిలో కస్తూరికామోదినికి కామార్ణవుడు ఇందిరాదేవికి రాఘవుడు చంద్రలేఖకు రెండవరాజరాజు అనంగభీముడు అను తనయులు కలిగిరి ఈ కుమారులలో జ్యేష్ఠుడగుటచే కామార్ణవుడు తండ్రికి యుద్ధముల దును రాజ్యపాలనమున దును తోడ్పడుచుండెను ఇతనికి మధుకామార్ణవుడు జటేశ్వరుడు అనునవి నామాంతరములు అనంతవర్మ చోడగంగుని తరువాత గాంగసింహాసనమున కితడే అధిపతియగుట తథ్యము

అట్టహాసదేవుడు ప్రస్తుతము క్రీ శ 1149లో దాక్షారామ సందర్శనముచేయుట భగవద్దర్శనముచేసి పుణ్యమును సంపాదించుటకొరకేనా లేక మరియొక లౌకికహేతువుకలదా అని అరయవలసి యున్నది ఈ యాత్రయందు రాజకీయ ప్రయోజనము లేకపోలేదని ఊహ జనించుచున్నది తండ్రి తరువాత కామార్ణవుని తప్పించి అట్టహాసదేవుడు రాజ్యమును తానే ఆక్రమింప దలచినవాడుగా తోచును తనతల్లియైన దెన్నమహాదేవి చోడగంగదేవుని ద్వితీయలక్ష్మి అని కంఠోక్తిగా చెప్పుటలో అంతర్యము లేకపోలేదు వెలనాటి చోడుల యొక్కయు కాంచీపుర చక్రవర్తి యొక్కయు అభిమానము సంపాదించుటకే అట్టహాసదేవుడీ యాత్రసాగించి యుండును అనంతరసన్నివేశములు దీనికికొంత బలమును చేకూర్చుచున్నవి కామార్ణవుడు 1149–55 నడుమ రాజ్యముచేసెను ఈతని కడపటిరాజ్య సంవత్సరములో వెలనాటి రెండవగొంకరాజు కళింగముపై దండెత్తివెళ్ళెను దీనికి రెండుకారణములూహింపవచ్చును ముఖ్యకారణము ఉత్తరాంధ్రమునందు కళింగనృపతులాక్రమించుకొన్న భూభాగములను తిరిగి జయించుట అని చెప్పవచ్చును రెండవకారణము కళింగ సింహాసనమునకు అఱ్ఱులు సాచుచున్న అట్టహాసదేవునకు తోడ్పడుటయు కావచ్చును

తెలుగుసేనానులు దక్షిణ కళింగములో విజయములు సాధించిరి ఈ యంశము చాళుక్య చోడచక్రవర్తి రెండవ రాజరాజచోళుని శక 1078 నాటి సింహాచల శాసనమువలన తెలియనగుచున్నది కాని అట్టహాసదేవునికి దండయాత్రలు ఉపకరించినట్లు లేవు పిలప మధుకామార్ణవుని మరణానంతరము క్రీ శ 1155 56 లో అతని మరియొక తమ్ముడైన రాఘవుడు గాంగసింహాసనము నధిష్ఠించెను ఈతడు అనంతవర్మచోడగంగదేవునకు ఇందిరాదేవియందు కలిగిన కుమారుడు ఇట్లు అట్టహాసదేవుని యభీష్టము విఫలమయ్యెను ఆతని యనంతర చరిత్ర మేమాయెనో తెలియదు

బి ల రం

## అట్లూరివారు

అట్లూరివారి పేర్లు అచ్యుతువారి పేర్లు పల్నాటివీర చరిత్రమున దు కనవచ్చుచున్నవి అ దు వారివ శనామములు మాత్రమే చెప్పబడినవికాని ఆ వంశముల యందలి ప్రసిద్ధ నాయకులనామములు వ్రాయబడి యు డలేదు పల్నాటి వీరచరిత్రము ద్విపదలో శ్రీనాథకవిసార్వభౌముడు రచి చె నని తెలియవచ్చుచున్నది

ఉత్తరహిందూదేశము న దలి పాలమాచాపురిని కార్త వీర్యార్జునుని వంశపురాజగు అనుగుప్రభువు పాలి చు చు డెను అనుగురాజు తన యిలవేల్పయిన కనకాద్రి చెన్న కేశవుని ఆనతిచే తన పూర్వికుల బ్రహ్మహత్యాది మహాపాపము లను తీర్థయాత్రలచే పోగొట్టుకొనుటకు నిశ్చయి చి రాజ్య భారమును తమ్ముడగు బిరుదురాజుపై ఉ చి పట్టమహిషి యగు విద్యలదేవితో తీర్థయాత్రలకు పయనము అయ్యెను

అనుగురాజుతోపాటు తీర్థయాత్రలు ఒనరించుటకు అతని బ ధువులు డెబ్బదిరె డు గోత్రాలవారు పన్నెండు ఇండ్ల పద్మనాయకులు అవాలవారు అచ్యుతువారు పై డి చుక్కలవారు పాలెమువారు అట్లూరివారు మట్లూరివారు అఖ్యాలవారు ముతుపానివారు ముయ్యూరివారు భ డారు వారు బాదమువారు కొండవి దులవారు గోవిందువారు దొడ్డనాయుడు పెద్దన్న బ్రహ్మన్న పేరినాయుడు తెప్పలి బలునాయకుడు మొదలగు ప్రముఖులు బయలుదేరిరి

ఈ పైన పేర్కొనబడినవారు బ్రహ్మనాయడు ఏర్పాటు చేసిన సభలోను నలగామ మలిదేవులకు కారెమపూడిలో జరి గిన యుద్ధమునందును పాల్గొనినట్లు పల్నాటి వీరచరిత్రమున కనవచ్చుచున్నది

బ్రహ్మనాయడు మాచెర్లలో మలిదేవునకు పట్టముగట్టి నలగామునితో మైత్రిని నెరపుటకు గురజాలకువచ్చెను తాను తెచ్చిన కానుకలను బ్రహ్మన్న నలగామునకు సమర్పి చెను దీనినిచూచి సవతిబిడ్డలు తిరిగి స్నేహముగా ఉందురేమో అని భయపడి నాగమ్మ వారిమధ్య కయ్యమును కల్పించుటకు పూనుకొనెను తనతో కోడి పందెము ఆడవలయును ప దె మున ఓడినవారు గెల్చినవారికి తమ రాజ్యమును ఇచ్చి ఏడే డ్లు వనవాసముచేసి ఎమ్మట తమరాజ్యమును తీసుకొన వలయును అను నియమములను విధి చి బ్రహ్మనాయనితో నాగమ్మ కయ్యమునకు సంసిద్ధ అయ్యెను

బ్రహ్మనాయడు గురజాలను డి తిరిగి మాచెర్లకువచ్చి గురజాలలో జరిగిన వృత్తాంతమును మలిదేవరాజునకు తెలి పెను నాగమ్మతో ప దెము ఆడుటకు తగిన కోడిపుంజును తెప్ప పగోరి బ్రహ్మనాయడు ఒకసభను ఏర్పాటు చేయు చెను ఆ సభకు ను కరివారు రేణూరివార పోతులవారు ఆరెమువారు రేవనూళ్లవారు రేచర్లవారు పాలవర్తివారు బలమూరివారు పూర్ణిడు గండుకన్నమ రాయపడువాలు బాలగోపన్న మున్నగు ప్రముఖులేకాక అనుగురాజుతోపాటు తీర్థయాత్రలకు పయనమైపోయిన ప్రముఖులలోని కొందరు గూడ వచ్చిరి

నాయకురాలి (నాగమ్మ) కుత త్రములవల్లన నలగామ మలిదేవులకు కారెమపూడిలో ఘోరయుద్ధము జరిగెను ఆ యుద్ధమున దు బ్రహ్మనాయనికి అ డగా నిల్చిన యోధు లలో అనుగు రాజుతో తీర్థయాత్రలు సలిపినవారును బ్రహ్మనాయని సభలో (కోడిపుంజును దెచ్చుసభలో) పాల్గొన్న వారునుకాక నర్మాలవారు నాయనివారు అల్లమువారు చెవులవారు చిల్లరవారు మొదలగు ప్రముఖులు ఉన్నట్లు పల్నాటి వీరచరిత్రమునందు చెప్పబడినది పల్నాటి యుద్ధము క్రీ శ 1181-1189 స వత్సరముల మధ్యకాలమున జరిగినట్లు చారిత్రకులు అభిప్రాయ పడుచున్నారు

తం ఆం శా

## అట్లూరి వేంగళేంద్రుడు

అట్లూరి వే గళే ద్రుని ప్రశంస చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగమున కనవచ్చుచున్నది ఈయన కమ్మకులో ద్భవుడు నారాంబాంబ కుమారుడు ఇతడు ధర్మార్థకామ పద్ధ తులు తెలిసిన వాడనియు గొప్పదాతయనియు వైరుల మదమడంచెడి దిట్టయనియు కమ్మకులజుల కందరకును కీర్తిని సంపాది చిన వాడనియు గొప్పగా పొగడ్తకెక్కెను అట్లూరి వారు పలనాటి వీరచరిత్రమను గ్రంథములోను కనవచ్చు చున్నారు వీరు పలనాటి ప్రభువైన అనుగు రాజుసభలోను బ్రహ్మనాయని సభలోను పలనాటివీరుల యుద్ధములోను పాల్గొని అఖండయశస్సును సంపాది చిరి ఈ విధముగ అట్లూరి వారు అన్నిరంగములయందును బహుముఖప్రజ్ఞా వంతులని తెలియుచున్నది వేంగళేంద్రుని విషయమై తకుమించి యేమియు తెలియుటలేదు

తం ఆం శా

## అట్లూరు

నరసరావుపేట తాలూకాకు ముఖ్యపట్టణమైన నరసరావుపేట పూర్వము అట్లూరని ఎలువబడుచుండెడిది ఇది గుంటూరుకు 28 మైళ్ళ దూరమున దక్షిణ మధ్య రైల్వేలో విజయవాడ ద్రోణాచలం మార్గమున ఉన్నది దీనికి రైల్వేస్టేషను కూడ ఉన్నది

ఈ అట్లూరు గ్రామము పూర్వము వినుకొండ జమీదారీలోని ఒక గ్రామమైయుండెను వినుకొండ జమీదారీ నవాబు బసాలతుజంగుగారు మల్రాజు వెంకట నరసింహారావు గారిని అట్లూరునకు దేశముఖుగా నియమించి వారికి ఈ పట్టణము ఇచ్చినట్లు ఫర్మానా ఒకటి కలదు నరసింహారావుగారు ఇచ్చట తమ స్థిరనివాసమేర్పరచుకొని శిల్పచాతుర్యముట్టిపడు ఒకకోటను కట్టించుకొనిరి వారు అనేకమైన తోటలు వేయించిరి కోటకు పడమటగానున్న చెరువును మరమ్మతుచేయించి వెడల్పుగ చేయించిరి ఈ చెరువునీరే కోటలోని వాడుకకును మామిడితోటలకును సరఫరా అగుచుండెడిది

నరసింహారావుగారికి పెదవెంకటగుండ్లారావనియు చినవెంకటగుండ్లారావనియు ఇరువురు పుత్రులుండిరి నరసింహారావుగారి మరణానంతరము పెదవెంకటగుండ్లారావు గారు శాస్త్రమును ననుసరించి గ్రామ మధ్యమున బొడ్డురాతిని ఒకదానిని స్థాపించిరి కోటయు కోటచుట్టు గ్రామమును కట్టించబడెను నాలుగుమార్గములు కలియుచోట చౌతరా అను పెద్ద మందిరము రమ్యముగను ఆకర్షకముగను కట్టబడెను ఈ కోట ప్రక్కనున్న చెరువు ఈ వంశమునకు మూల పురుషుడైన నరసింహారావుగారు మరమ్మత్తు చేయించిరి కావున వారి తండ్రిపేరు శాశ్వతమొనర్చు తలంపుచే ఈ క్రొత్తగా కట్టబడిన గ్రామమును నరసరావుపేట అనిరి అప్పటి నుండియు అట్లూరు గ్రామము నరసరావుపేట అని ఎలువబడు చుండెను

నూతనమయిన కోటయు అందలి గృహములును మిక్కిలి రమ్యముగను ఆకర్షకములుగను నిర్మింపబడెను కోటయందొక దర్బారుహాలు కలదు అందనేకములైన గదులు కలవు రాతితో చెక్కబడిన చిత్తరువు లనేకములు గోడలయందిమిడ్చబడెను కోటయందు పూర్వమనేక తోటలుండెడివి ఆ తోటలలోని వృక్షములకు నీరు రాతిగొట్టములద్వారా కొలనునుండి సరఫరా అగు ఏర్పాటు చేయబడెను ఈ కోట ఇపుడు విశేష భాగము శిథిలమయి ఉన్నది ఇందలి భవనములన్నియు మహమ్మదీయ శిల్పసంప్రదాయమును అనుసరించుచున్నవి ఆ కాలమున జమీదారులైన గుండ్లారాయణ గారికి 99 ఏనుగులు 00 ఒంటెలు 500 గుఱ్ఱములు ఉండెడివి ఏనుగులుండు స్థలమును ఏనుగుల బజారని ఎలుచుచుండెడి వారట ఇప్పటి నిండ పేరే ఆ బజారుకు కలదు ఈ ఏనుగుల మావటీలను ఏనుగులవాడని ఎలిచెడివారు ఆ నిండ తివారిని ఇప్పటి నిండ ఏనుగుల వారినియే ఎలుచుచున్నారు

ఆ కాలమున ఈ గ్రామమున అనేకతోటలు వనములు ఏర్పరుపబడినవి కాకుమానువారి చింతవన పెల్లూరివారి వన అట్లూరివారి వన ముఖ్యములైనవి రాజాగారికి ఎనిమిది తోటలుండెడివి మామిడితోట కమలాఫలములతోట పంపర పనసతోట నిమ్మతోట కొబ్బరితోట అరటితోట కాయగూరలతోటలుండెడివి వీటిలో మామిడితోటమాత్ర మిప్పటి నిండ కలదు పూర్వము కొబ్బరిచెట్లుండెడిచోట ఇప్పుడు బావిమాత్ర మున్నది

ఇచ్చట పురాతనదేవాలయములు కలవు పట్టాభిరామస్వామి ఆలయమునందు రాతిశాసనమొకటికలదు కోటయ్యస్వామి ఆలయము భీమలింగేశ్వరస్వామి గుడి వీరాంజనేయస్వామి ఆలయము కన్యకాపరమేశ్వరీ ఆలయము పట్టాభిరామస్వామి ఆలయము పాండురంగస్వామి ఆలయము ఎన్నదగినవి గ్రామదేవతలైన అంకమ్మకు గంగాదేవికి ఆలయములు కలవు ఒక చర్చికూడా కలదు ఈ పట్టమున మొత్తము జనసంఖ్య 29 744 అనేక తెగలతోకూడిన హిందువులు నిమ్నజాతివారు దూదేకులవారు తురకలు క్రీస్తుయనులు కలరు వారి ముఖ్యవృత్తులు వ్యవసాయము వ్యాపారము రవాణా ఉద్యోగములు

ఇచ్చట శివరాత్రి మహోత్సవము ఘనముగ జరుపబడుచున్నది ఆరోజున పోటీలతో బండ్లపై ప్రభలనెక్కించి అలంకరించి ఎడ్లనుగట్టి ఆ ప్రభలను ఊరేగింతురు పెద్దజాతర జరుగును పాత్రసామాన్లు బట్టలు మందులు లాంతర్లు వ్యవసాయపు పనిముట్లు మున్నగునవి అమ్మబడును ఇచ్చట అనేకసత్రములుకూడ కలవు

ఎస్ రా

## అళ్లేరునది

ఇది నెల్లూరు జిల్లాలోని మూసనదికి ఉపనది ఇది

నెలూరుజిల్లా పొదిలితాలూకా పొదిలికొండలలోను నిషాన్ కొండలలోను అనేక ప్రదేశములలోను చిన్నచిన్న ప్రవాహముల రూపమున ఉద్భవించి తూర్పుదిక్కుగ ప్రవహించుచున్నది. ఇట్టి ప్రవాహములు కొన్నికలిసి ఆ కొండకు దిగువ ప్రాంతమున కొన్ని శాఖలుగ ఏర్పడుచున్నవి. ఈ విధముగా ఏర్పడిన శాఖలలో చెప్పుకొనదగినవి నాలుగు కలవు. వాటికి ప్రత్యేకమైన పేర్లులేవు. వాటిలో రెండు శాఖలు సన్నమూరు గ్రామమునకు సమీపమున కలిసి ఒక నదిగా ఏర్పడినవి. దీనికే అల్లేరు అనిపేరు. ఈ సన్నమూరు గ్రామము ఈ అల్లేరునది జన్మించిన ప్రాంతమునుండి షుమారు ఎనిమిదిమైళ్ళ దూరములో ఉన్నది. అల్లేరునది ఇచ్చటినుండి మూడుమైళ్ళు తూర్పుదిక్కుగ ప్రవహించి చిమట అను గ్రామము చేరును. ఈ గ్రామమునకు సమీపముననే మిగిలిన రెండు శాఖలును ఉత్తరవైపునుండి వచ్చి ఈ అల్లేరు నదిలో కలియుచున్నవి. ఈ శాఖలు కలియుటతో అల్లేరునది వృద్ధిగొంది ఎమ్మట జీవనదిగ మారి ఆగ్నేయ దిక్కుగ నాలుగుమైళ్ళు ప్రవహించి పొదిలి తాలూకా సరిహద్దుదాటి కందుకూరు తాలూకాలో ప్రవేశించుచున్నది. చిమట గ్రామముదాటిన ఎమ్మట అల్లేరునది 18 మైళ్ళు ఈశాన్యదిక్కుగ ప్రవహించి పెరిదేప అనెడి గ్రామము వద్ద మూసినదిలో కలియుచున్నది.

మూసినది అను పేరుతో ఈ ఆంధ్రప్రదేశ రాష్ట్రమున రెండు నదులు కలవు. ఒకటి కృష్ణానదికి ఉపనది. ఇది హైదరాబాదుగుండా ప్రవహించి కృష్ణానదిలో కలియుచున్నది. రెండవ మూసినది వెలికొండ పర్వతశ్రేణికి ఉత్తరముగ పొదిలి తాలూకాలో జన్మించి విశేషముగా నెల్లూరుజిల్లాగుండా ప్రవహించి కారునియచి అను గ్రామముదాటిన ఎమ్మట ఒంగోలు జిల్లాలో ప్రవేశించి చివరకు టంగుటూరు గ్రామమునకు తూర్పుగ నాలుగుమైళ్ళ దూరములో బంగాళాఖాతములో కలియుచున్నది. హైదరాబాదుగుండ ప్రవహించు మూసినదితో అల్లేరునకు ఎట్టిసంబంధములేదు. ఈ రెండవ మూసనదికి గజ్జలేరు అల్లేరు దొండపేరు జనగలపేరు మొదలైనవి ఉపనదులుగా ఉన్నవి.

అల్లేరునదియొక్క మొత్తము పొడవు 25 మైళ్ళకు మించియుండదు. ఇది మొదటి 13 మైళ్ళ దూరము వానకాలమున మాత్రము ప్రవహించుచు చిమట గ్రామసమీపము నుండి జీవనదిగ ఏర్పడి మిగిలిన 12 మైళ్ళు ప్రవహించును.

ఈ నది పొదిలి నిషాన్ కొండలలో 1000 అడుగుల సమోన్నత రేఖకు సమీపముగ అనేక చోట్ల చిన్నచిన్న పాయలుగా జన్మించుచున్నది. ఈ చిన్నపాయలలో కొన్ని 1250 1500 అడుగుల సమోన్నత రేఖలవద్ద కూడ జన్మించుచున్నవి. కొండల దిగువప్రాంతము వరకు అనగా షుమారు 250 అడుగుల సమోన్నత రేఖవరకు ఎక్కువ నిట్రవాలుగ నుండుటవలన ప్రవాహము వర్షఋతువులలో కొంచెము దూకుడుగ ఉండును. ఈ నదియొక్క ఏటవాలును ప్రత్యేకముగ పరిశీలించినచో అది ప్రారంభమైన చోటునుండి మూసనదిలో కలియువరకు ఏటవాలు ఒక్కతీరుగనుండక ప్రథమమున నిట్రఏటవాలు కలిగి పోను పోను ఎత్తుతగ్గగా చివరకు కొలది ఏటవాలుగా నుండును. 250 అడుగుల సమోన్నత రేఖవరకు అనగా ప్రారంభమైన చోటునుండి 3 మైళ్ళవరకు మైలుకు 34 అడుగుల చొప్పునను అంతకు పైగాను. ఆ తరువాత 150 అడుగుల సమోన్నత రేఖవరకు మైలుకు 17 అడుగుల చొప్పునను 100 అడుగుల సమోన్నతరేఖవరకు 8 అడుగుల చొప్పునను 50 అడుగుల సమోన్నతరేఖవరకు 5½ అడుగుల చొప్పునను ఎత్తుతగ్గుచువచ్చును. సన్నమూరు గ్రామమువద్ద బెంచిమార్కు ఎత్తు 177 అడుగులు. ఇచ్చటినుండి చిమటగ్రామమువరకు ఏటవాలు కొంచెము తగ్గుటవలన ప్రవాహము అంత దూకుడుగా నుండక మొదటికన్న కొంచెము తక్కువ వేగముతో ప్రవహించును. చిమటగ్రామమువద్ద బెంచిమార్కు ఎత్తు 130 అడుగులు కలదు. ఇచ్చటినుండి మిగిలిన 13 మైళ్ళు అనగా పెరిదేపవద్ద మూసనదిలో ఈ నది కలియువరకు వాలుతనము పూర్తిగా తగ్గిపోయి ప్రవాహము మెల్లగ నడచును. చిమట గ్రామమునుండి ఈ నది మైదాన భూమిలో ప్రవహించును.

నిట్రతనము చాలతక్కువగ ఉండుట వలననే అల్లేరు నది చిమట గ్రామమునుండి సరళరేఖగా నడవక అనేక చోట్ల మెలికలుతిరిగి వంకరవంకరగా ప్రవహించి మూసినదికి చేరును. ఇట్లు వంకరలతో కూడియుండుట వలననే చిమట నుండి నదిలోనినీరు ప్రవాహముగా 13 మైళ్ళు పయనించినగాని మూసకి చేరుకోదు. చిమట నుండి పెరిదేపకి నేరు దూరము 11 మైళ్ళు మాత్రమేకలదు. వంకరలుగా మెలికలు తిరిగియుండుటవలననే ఈ నదియొక్క పొడవు అదనముగా రెండు మైళ్ళు ఎక్కువ పెరిగినది.

50 అడుగుల సమోన్నతరేఖ పెరిదేప ఊరుగుండ పోవు

చున్నది అల్లేరు మూసినదిలో కలియుచోట ఔంచిమార్కు ఎత్తు 50 అడుగులు గలదు ఈ నదియొక్క లోతట్టు విస్తీర్ణము 136 చదరపుమైళ్ళు రెండు ప్రక్కలనున్న కట్టల శిఖరముల యొక్కయు నదియొక్క అడుగు మట్టము యొక్కయు ఎత్తులోగల భేదము 9 అడుగుల నుండి 6 అడుగుల వరకు మారును అ దువలన ఈ నదినీరు నేరుగ పారుదలకు ఉపకరి చుటలేదు ఈ నది నేరుగ నడచినచోట వెడల్పు షుమారు ఒక ఫర్లాంగు మాత్రము ఉ డి తిరుగుదలతో ఒకటి రెండు ఫర్లా గుల లోపుగా వెడల్పు మారుచుండును నదీ గర్భము ఎత్తుపల్లములతోను కొండరాళ్ళతోను కూడి యుండక క్రమమైన వాలుకలిగి ఇసుకతో కూడియుండును అందువలననే నీటి ప్రవాహము జలపాతముతో కూడియు డక క్రమమైన వేగముతో నడచును

ఈ అల్లేరు నదియొక్క ప్రవాహ మార్గమున సరస్సులులేవు కాని దీనిలో కలియు ఉపనదులమీద అనేక చోట్ల సరస్సులు కలవు ప్రతి సరస్సునకు ఒక వై పుగల నీటికాలువ ఆ సరస్సునకు నీటిని మకూర్చును మరియొక వైపునుండి బయటికి పోవు ప్రవాహము సరస్సులోని మిగిలిన నీటిని అల్లేరు నదికి అంద జేయును ఈ విధముగా ఏర్పడిన సరస్సులలో చెప్పుకొనదగిన సరస్సులు మట్టిపూతి గుండ్లసముద్రము ధర్మవరము పెట్లూరు కొండాప గ్రామములవద్ద కలవు ఇవి జీవన సరస్సులు వానకాలమున మాత్రమే ఉండు సరస్సులు కూడా కలవు ఈ సరస్సుల కన్నింటికి ఒకవై పు కట్టలు కలవు అ దువలన నీటియందలి నీరు పారుదలకు ఉపయోగ పడు చున్నది

అల్లేరునదీ తీరమున సన్నమూరు చిమట గుర్రప్పొడిగ తాటాకుపాలెము పెరిదేప అను గ్రామములు ఈ నదీతీర మ దు అభివృద్ధి చె దిన గ్రామములలో ముఖ్యమైనవి ఈ నదీ మారమున మొత్తముమీద ఎచ్చటను రైల్వేవ తెనలుగాని రోడ్డు వంతెనలుగాని అనకట్టలుకాని లేవు ప్రజలు వేసవి యం దు కాలినడకను వర్షాకాలమున పడవల సాయమునను రేవులలో ఈనదిని దాటుదురు పు వి

## అడగియచోడ ముప్పెందవేలాను

ఈతనిప్రసక్తి శక 10 9 (క్రీ శ 1107) నాటి దాక్షారామ భీమేశ్వరాలయ శాసనములో (ద హి IV నె 1295) కానిపించుచున్నది ఈ శాసనము కొ తభాగము సంస్కృత మునను మరికొంతభాగము తెలుగున మను ఉన్నది సంస్కృత భాగము న దీతడు దాక్షారామపురాధికారపదవిని ఎల్లరకును ఆనందదాయకముగా వహి చినట్లును సకల ద యయారుడయ అనిఖ్యాతి చె దెననియు చెప్పబడినది తెలుగు భాగమున దు అడగియచోడయ చోడమ డలమున వెంనాటి య దు పెరు బ ద్రూయన ఉ డినట్లు వ్రాయనైనది ఈతడు దాక్షారామ భీమేశ్వరునకు అఖ డవర్తి దీపములను నెల కొల్పుచు ఈ శాసనమును వేయి చెను

ఇది రాజరాజనరే ద్రుని కుమారుడును రాజే ద్ర నామధేయుడును అగు మొదటి కులోత్తు గ చోడచక్రవర్తి రాజ్యకాలము కులోత్తుగుని ప్రవర్ధమాన విజయరాజ్య స వత్సరములు 3ం దిన 39 లో ఈ శాసనము ప్రకటితమైనది క్రీ శ 1107 కులోత్తుంగుని 3ం వ రాజ్యస వత్సరమైనచో ఆతడు క్రీ శ 1075 లో రాజ్యమునకు వచ్చియు డును కాని చారిత్రికులు మొదటి కులోత్తు గ చక్రవర్తి క్రీ శ 1070-1120 స వత్సరములనడుమ చోళసింహాసనము అలంకరించినట్లు తెలుపుచున్నారు ఇట్లు ఐదు వత్సరముల వ్యత్యా ము గోచరించుచున్నది దీనినిట్లు పరిష్కరి పవలెను

కులోత్తు గుడు చోళదేశమున క్రీ శ 1070 నుండియు పరిపాలించుచు డినను వే గిమ డలమున ఆతని వాస్తవిక పాలనము 1075 76 లను డియే అర భించినట్లు పూర్వ చాళుక్యరాజుల చరిత్రవలన తెలియుచున్నది ఆంధ్రమహాభారత కృతిపతియైన రాజరాజనరే ద్రునకు విజయాదిత్యుడను తమ్ముడు కలడు ఆతడు రాజమహే ద్రవర సంహాసనముకై చాలాకాలము అన్నతో పెనగుచు డెను ఇతనికి పాశ్చాత్య చాళుక్యుల సహాయము లభించుచుండెను రాజరాజనరే ద్రుడు మర ణి చిన తో డ నే విజయాదిత్యుడు పశ్చిమచాళుక్యుల తోడ్పాటుతో వే గి సాక్రమించెను అప్పటికి రాజే ద్ర చోడుడు చోళసామ్రాజ్యమున తన మేనమామలవద్ద ఉ డెను ఇతని సనమేనమామయగు వీరరాజేంద్రుడు గొప్పశూరుడై చాళుక్యులను పలుమారు ఓడించియు వేంగిరాజ్యమును తన మేనల్లునకు ఇప్ప వక తన సామ్రాజ్యస రక్షణమునకై విజయాదిత్యునితో సమాధానము చేసికొనవలసినవాడయ్యెను

దీనిఫలితముగా కాబోలు విజయాదిత్యుని జీవితకాలమున ఆతడు వే గికి అధిపతిగా ఉండునట్లును తదనంతరము ఆరాజ్యము రాజేంద్రచోడునకు సంక్రమించునట్లును ఏర్పాటు

జరిగియు డును విజయాదిత్యు డప్పటికే వృద్ధుడు ఆతని కుమారుడైన రెండవశక్తివర్మ రణనిహతుడయ్యెను కావున ఎట్లును కాలముగడచినమీద వేగిరాజ్యము పక్షఫలమువలె రాజేంద్రునకు దక్కుట నిశ్చయమగుటచే అతడును దీనికి ఒడబడియు డును విజయాదిత్యుడు క్రీ శ 1076 లో మరణి చినట్లు చెప్పుచున్నారు ఆతని అ తిమగడియలకు శా చెము ము దే కులోత్తు గచోడుడు రాజమహే ద్రవరమున తన బలగమును సమీకరి చియు డును అ దుచేతనేకాబోలు ఆ ధ్ర దేశమున దీతని ప్రత్యక్షపరిపాలనము క్రీ శ 1075 నుండి పరిగణి పబడినది అడగియచోడయ ముప్వొ దవేలాను శాసన కాలమునకు ఈ విధముగా వే గిరాజ్యములో కుల త్తు గుని 32 వ రాజ్యాన వత్సరము సాగుచు డినదని భావి పవలెను

ఈ శాసనమువలన అనాటి ఆ ధ్రదేశస్థితి కొంత భాస చుచున్నది వెలనాడు ఆ ధ్రదేశములోని భాగమైనను చోళమ డలములోనిదని ప్రకటి చుట గమని పదగినది అనగా ఆ ధ్రదేశము ఒక ప్రత్యేకరాజ్యస్థాయి ను డి దిగజారి చోళ సామ్రాజ్యమున ఒకమ డలమాత్రముగ నిలిచినది దానికి తమిళులైనవారు ప్రాంతపరిపాలకులుగా నియమి పబడు చు డిరి వాస్తవమునకు క్రీ శ 1107 ప్రాంతమున తెనుగు దేశవీరులును కులోత్తు గునకు ఇష్టభృత్యులును అయిన వెలనాటిచోడులు అభ్యుదయ మార్గమున ఉ డిరి వెలనాటి మొదటిగొ కరాజు కులోత్తుంగుని ప్రతినిధిగా వెలనాటిలో ఏలుబడి ప్రారంభి చెను అడగియచోడయ గోదావరికి ఉత్తరమున దాక్షారామము కే ద్రముగా అధికారము వహించియు డవచ్చును

ఎట్లైనను అడగియచోడ ముప్వొ దవేలానుడు జనర జకుడుగా ఉ డినట్లు చెప్పుకున్నాడు ఈతడు భీమేశ్వరమహాదేవునకు భక్తుడై ఆ దేవునకు శాశ్వతదీపము నెలకొల్పెను దీనికి నిత్య మానెడు నేయి ఎరియి చుటకై (పోయుటకై) ఎబది ఇనుప యెడ్లను (గొఱ్ఱెలను) భీమేశ్వరుని కీలాగమందలి బోయల వశమున పెట్టెను ఈ శాసనమున దు చోళులయు చాళుక్యులయు బిరుదుల సమ్మేళనము కాన్పి చును

అడగియ చోడనకుగల ముప్వొందవేలాను బిరుదు కొంచెము పరిశీలి పదగి యున్నది ముప్వొ దవేలాను అనగా ముగ్గురురాజులకు ఆయుధము వ టివాడు ఇది మూరురాయరగండ త్రిభువనచక్రవర్తి వ టి బిరుదపదము ఇక్కడ ముగ్గురు రాజులనగా చోళ పా డ్య చేరరాజులని తెలియుచున్నది ఈతనికి సకల దయూరుడయ వెడనల్కొ దయూరుడయ అనియు విశేషణములు వాడబడినవి ఇతడు సకల ద వెడనల్క ద పట్టణముల కధిపతియని సూచితమగుచున్నది ఈ పట్టణము లెక్కడివో ఈతడు స్వయముగా వాటిని పరిపాలి చెనో లేదో తెలియదు చోళుల దరికిని ఒరయూరుపురవరాధిప అనుబిరుదు చెల్లుచు డును ఇవియు అట్టివే కావచ్చును ముప్వొ దవేలాను బిరుదు వీటికన్న అసాధారణమైనది అడగియచోడుడు కేవలము ఉద్యోగియైయున్నచో ఇ త పెద్దబిరుదును ధరి పజాలడు ఇదియాతనికి వంశరీత్యా వచ్చియు డవలెను ఇతడొకవేళ రాజకుటు బమునకు చెందిదూరపురాజబ ధువు కావచ్చును

కులోత్తు గ-చోడ చక్రవర్తి కుమారుల పేరులు మనకు సుపరిచితములు వీరు రాజరాజచోడగ గు రాజరాజ ముమ్మడి చోడుడు వీరచోడుడు విక్రమచోడుడు అనువారు వీరు చరిత్రకు ఎక్కినవారు అడగియచోడుడు దాక్షారామపురాధిపతియగుట ఆతనికి రాజకుటుంబమునగల సముచిత స్థానమునే సూచించుచున్నది చోళరాజకుమారులు ఆ ధ్ర దేశములో రాజ్యభారము వహించుటకు ఇష్టపడని స దర్భములలో కులోత్తుంగ చక్రవర్తి తన నమ్మినబంటులను తెలుగు దేశమున దు అధికారము నెరపుటకై ప పుచుండెను వెలనాటి చోడులు ఇట్లే అధికారమునకు వచ్చిరి ఒక్కొక్కప్పుడు రాజబ ధువులనుకూడ ఆయన నియోగి చుచుండ వచ్చును అడగియచోడముప్వొ దవేలానుడు ఇట్టి రాజబ ధువై యుండును కులోత్తు గుని కాలమును డియు రాజమహే ద్రవరము చోళప్రతినిధులకు ముఖ్యపట్టణముగా నుండినట్లు కాన్పి చదు జననాథపురము అని ప్రసిద్ధివహి చిన దాక్షారామమువారికి కార్యక్షేత్రముగా ఉ డుచువచ్చెను క్రీ శ 1107-18 స వత్సరములనడుమ పరా తకుడు వే గీరాజ ప్రతినిధిగా ఉ డెను ఈతని ని అడగియచోడునకు గల స బ ధమెట్టిదో తెలియదు

ఖం ల రం

## అడపం పెద్దన

ఈయన ప్రశస్తి తూర్పు గోదావరిజిల్లా కొత్తపేట తాలూకా పలివెల శ్రీ కొప్పేశ్వర మహాదేవర ఆలయ శాసనమునందు కనవచ్చుచున్నది (ద హి V నె 118) శాసన

కాలము శక 1338 (క్రీ శ 1416) దుర్ముఖి సంవత్సర పుష్య బహుళ అమావాస్య ఆదివారము అది అర్ధోదయ పుణ్య కాలమని చెప్పబడినది అడప పెద్దనంగారు అల్లాడరెడ్డికి మంత్రియో ముఖ్యకార్యకర్తయో అయియుండుమ. పెద్దన తండ్రిపేరు నారయ వీరిది ఏవర్ణమో చెప్పబడలేదు పురాతనమైన కీర్తికాంత ఎముకలు చర్మము మాత్రము శేషించిన దుస్థితికి వచ్చియుండగా అడప పెద్దన చేపట్టుటచే ఆ కీర్తికాంత నవయౌవనము చెందినదై ప్రకాశించెనట

అడపం పెద్దనగారి ఎలికయైన అల్లాడ రెడ్డియొక్క వంశప్రతిష్ఠ ఈ శాసనమున దుసంగ్రహముగా కీర్తింపబడినది వర్ణాశ్రమ పాలన పూర్ణశోభకల దొడ్డభూపాలుడు చతుర్థ వర్ణమునందు జనించెను ఆయనకు ముగ్గురు కుమారులు కలిగిరి వారు ప్రోల కోట అల్లాడ అనువారు అల్లాడరెడ్డి ఘనత ఇట్లు వర్ణితమైనది "కాటయ వేమ భూపాలుడు (కోటయవేమ అని చెక్కబడినది ఇది శిల్పిప్రమాదము) దివమును అలంకరించగా ఈయన (అల్లాడరెడ్డి) కాటయవేముని శత్రువర్గమును అతను నిర్మూలించి రాజ్యమును వైరులకు చెనకరానిదిగాజేసి కాటయవేముని సంతతికి భద్రపరచెను" ఇక్కడనుతింపబడిన కాటయవేముడు కొమరగిరిరెడ్డి బావయు మహావిద్వాంసుడు మహావీరుడునగు కాటయ వేమారెడ్డియే

శాసనకాలమునకు అనగా క్రీ శ 1416 నాటికే కాటయ వేముడు దివంగతుడైనట్లు ధ్రువపడుచున్నది ఇతని శత్రువు అప్పుడు కొండవీటి రాజ్యమును పాలించుచున్న పెదకోమటి వేమారెడ్డి పెదకోమటి వేముడును గొప్పవిద్వాంసుడే గొప్పవీరుడే కాని కొమరగిరిరెడ్డి రాజమహేంద్రవర రాజ్యమును తన బావయగు కాటయవేమునకిచ్చుట పెదకోమటి వేమునకు బొత్తిగా కిట్టకుండెను ఆ రాజ్యమును కొండవీటి రాజ్యములో కలుపుకొనుటకు అతడు దీక్షవహించి కాటయ వేమునితో పోరాడజొచ్చెను ఇట్టి యుద్ధము లందొకదానిలో శూరుడగు కాటయవేముడు వీరస్వర్గమలంకరించెను

ఈయదను చూచి శత్రువులు రాజమహేంద్రవర రాజ్యమును కబళించకుండ అలాడరెడ్డి తన కరవాలము నెదురొడ్డి నిల్చెను అల్లాడరెడ్డి కాటయవేమునిసేనాని వియ్యంకుడు కూడ వేముని కుమార్తెయైన అనితల్లి అల్లాడరెడ్డి రెండవ కుమారుడైన వీరభద్రారెడ్డిని పెండ్లియాడెను కాటయ వేముని ఏకైకపుత్రుడు మరణించుటచే అనితల్లియే రాజమహేంద్రవరమునకు వారసురాలయ్యెను బలవంతుడయ్యు అల్లాడరెడ్డి కాటయవేముని మరణానంతరము అతని రాజ్యము తాను అపహరింపక అతని సంతానార్థమై నిక్షేపపరచుట తప్పక ప్రశంసింపదగినదియే కావుననే ఈ నిస్స్వార్థత శాసనమున దిట్లు పొగడబడినది "అచలశ్రీకమసౌ తనోతి తత్సంతతే రాజ్య మరాత్య ధృష్యమ్"

అడపం పెద్దనంగారు కౌంతేయ నదీతీరమందున్న పలివెల గ్రామమందలి కొప్పేశ్వర మహాదేవునకు కల్యాణవేదికను అల్లాడరెడ్డి అభ్యుదయమునకై కట్టించెను యుగయుగముల వృద్ధుడైన కొప్పేశ్వరుడు ప్రతిసంవత్సరము క్రొత్త పెండ్లికొడుకై పాణిగ్రహణ మహోత్సవమును అనుభవించి అల్లాడ భూనాథునకును అతని బంధువర్గమునకును శుభములొసగుగాక అని శాసనకవి వర్ణించుట యుక్తముగానే యున్నది నారయపెద్దనగారి శాసనము వ్రాసినకవి ధూర్జటిగోపాల కవియట శాసనము చెక్కినవాడు కాసె గౌతాసరి గౌతాచారి కావచ్చును శాసనములుచెక్కు కంసాలి యున్నను శిల్పులు ఆచారి పదముచే గౌరవింపబడుచుండిరి అడపం పెద్దన కల్యాణవేదికయు శిలామండపము నుకూడ కట్టించెనట ఇది దేవాలయ నృత్యాది ప్రదర్శనములకు ఉపయోగపడియుండును కౌంతేయ నదిని ఇప్పుడు కౌశిక యందురు పలివెల శ్రీకొప్పేశ్వర లింగమును గూర్చి భక్తిశృంగారము లతో కూడిన ఒక చక్కని కథ చెప్పుదురు

ఖం ల రం

## అడప అప్పన

ఇతడు తూర్పు చాళుక్యరాజగు ఏడవ విజయాదిత్యుడు నియోగించిన వేంగి రాజ్య సంరక్షకులలో ముఖ్యుడు ఏడవ విజయాదిత్యుని ఇద్దరు రాణులలో హైహయవంశజయైన మాదాదేవి ఒకతె రెండవరాణి రేవలదేవి విజయాదిత్యునకు మాదాదేవియందు ఒక కుమారుడు కలిగెను అతనిపేరు శక్తివర్మ శక్తివర్మ అనుపేరు ధరించిన వారిలో ఇతడు రెండవవాడు అందుచే ఇతనిని రెండవ శక్తివర్మ అనుచున్నారు మొదటి శక్తివర్మ రాజరాజనరేంద్రుని పెదతండ్రి దానార్ణవుని కుమారుడు విజయాదిత్యునికి రేవలదేవియందు ఒక కూతురు జన్మించెను ఆమెపేరు సోమలదేవి క్రీ శ 1065 నాటి ద్రాక్షారామ శాసనములో సోమలదేవి భీమేశ్వరాలయమునకు కొన్ని ఆభరణములను వెండిపాత్రలను దానము

చేసి ట్లు చెప్పబడినది

ఎడవ విజయాదిత్యుడు తన సవతి అన్నయగు రాజరాజు యొక్క రాజ్యమును బలాత్కారముగా లాగుకొని క్రీ శ 1081 లో రాజ్యాభిషిక్తుడై విష్ణువర్ధన విజయాదిత్యుడను బిరుదమును వా చెను కాని అతడు రాజ్యపరిపాలనమునకు వెంటనే పూనుకొనలేదు పశ్చిమ చాళుక్యరాజగు మొదటి సోమేశ్వరునకు పెక్కు యుద్ధములలో స్థలా తరము న తోడ్పడవలసినవాడగుటచేతను క్రీ శ 106 స॥ రాజ రాజు కా గతిన దుట చేతను ఏకైక కుమారుడగు శక్తివర్మ య దలి ప్రేమాతిశయముచేతను విజయాదిత్యుడు అతనిని (కుమారుడైన శక్తివర్మను) క్రీ శ 1061 లో వే గిరాజ్యాభి షిక్తుని చేసి రాజ్య స రక్షకులను కొ దరిని నియోగి చెను అట్టివారిలో అడప అప్పన ప్రముఖుడు అప్పన శక్తివర్మ రాజ్యకాలమున అంత్యంతమయిన శ్రద్ధాభక్తులను సామర్థ్య మును కనపరచి ఆతని రాజ్యమును స రక్షించెను శక్తివర్మ ఒక సంవత్సర కాలము మాత్రమే రాజ్యమొనర్చి యుద్ధములో మరణి చెను

విజయాదిత్యుడు గొప్పయోధుడు సేనాని పరా క్రమశాలి అతడు సోమేశ్వరదేవుడు చోళరాజులతో చేసిన అన్ని యుద్ధములలో పాల్గొనెను కుమారుడు శక్తివర్మ మరణి చిన ఎదప విజయాదిత్యుడు సూర్యవ శమునకు చె దిన ముమ్మడి భీముని పెంచుకొని అతనిని కన్నకొడుకువలె ప్రేమి చి అభివృద్ధికి తెచ్చెను

అడప అప్పన రె డవశక్తివర్మ రాజ్యకాలమున స రక్షకుడుగా నియుక్తుడై మిక్కిలి స్వామి భక్తితో ధైర్య ముతో సామర్థ్యముతో రాజ్యస రక్షణరూపమున గొప్ప సేవను చేసెననుట తప్ప ఆతని వ శాదికము గూర్చియు వివరములు తెలియవు

గ ల కొం

## అడపకేతనబోయుడు

ఈతని ప్రస గము గు టూరుజిల్లా స త్తెనపల్లితాలూకా వేల్పూరు గ్రామమునందలి రామలి గేశ్వరస్వామి ఆలయ మండపము స్తంభముమీదచెక్కబడిన శాసనములో కన్పించు చున్నది కేతనబోయుడు తమతల్లి మాస్సానికి తండ్రి సాహసి మల్లినాయనికి ధర్మార్థముగా వేల్పూరి రామేశ్వర మహా దేవునికి ఆచంద్రార్కస్థాయిగా అఖండవర్తి దీపమును సమ ర్పి చెను దీపదానకాలము శక 1162 (క్రీ శ 1240) అనాడు మాఘ ఎహు 15 శొ అని వ్రాయబడినది అమావాస్య సోమ వారమేమో! అడపకేతన తాను శ్రీమన్మహా మ డలేశ్వర కోట దొడ్డకేతరాజుకొడుకు గణపయ దివ్యశ్రీపాదపంకజ భ్రమరాయమాణు డను గ గేశ్వర దేవరవృత్తిమ తుడును" అని వ్రాయి చుకొనెను కోటఅనగా ధరణికోట లేక ధాన్య కటకము దీనిని పాలి చిన వ శమువారికి కోటవ శీయులని పేరు ఈ వ శమువారు అమరావతి-ధరణికోటను ముఖ్య పట్టణముగా చేసుకొని కృష్ణానది దక్షిణమునఉన్న షట్సహస్రా వని అనగా ఆరువేలనాడును పరిపాలించినవారు కోటవ శ మున ఉపశాఖలును కలవు వీరు క్రీ శ 1080 1270 నడుమ రమారమి రె డు శతాబ్దములు సామ తరాజకుటుంబముగ వర్ధిల్లిరి

అడపకేతన ఎలి రైన కోటగణపయదేవమహారాజు క్రీ శ 1240 62 స ల నడుమ రాజ్యపాలనము చేసెను ఈయనత డ్రి కోటదొడ్డ కేతరాజు కోటవ శీయులలో కొంద రికి దొడ్డ అనువిశేషణము చేర్పబడుచుండెడిది దొడ్డభీముడు దొడ్డకేతరాజు ఈ విధముగా వారిని గౌరవి చెడివారు గణ పయదేవుని త డ్రికి మనుమకేత మన్మకేత అనికూడ శాస నములలో వ్యవహారము కలదు ఈతడు 1234 40 స ॥ల మధ్య రాజ్యముచేసెను ఒక విశేషమేమన త డ్రికుమారు లిద్దరును మొదటను డియు పరిపాలనాధికారము వహి చుచు డిరి 1 34 స వత్సరమునాటి ప్రత్తిపాడు శాసనములో తండ్రి కుమారు లిరువుర ప్రశ సయు కలదు అనగా ప్రాజ్ఞులైన కుమారులున్నప్పుడు వారిని యువరాజులుగచేసి ప్రభుత్వము దు పాలిచ్చి శిక్షణఇచ్చుచుండిరన్నమాట ఈ కేతరాజు కోటవ శములో ఆ పేరుగల మూడవవాడు కావున ఈతనిని మూడవకేతరాజు అని వ్యవహారి తురు మూడవకేతని ఎతా మహుడు రె డవకేతరాజు తాతగారిపేరు మనుమనికు చుట తెలుగువారిలో ఆచారము కావుననే ఈతనిని మనుమకేత అని పేర్కొనియు దురు కాకతీయులలోకూడ ఈ స ప్ర దాయము కాన్పించును రుద్రదేవ మహారాజు అను అభిషిక్త నామము వహి చి పరిపాలనచేసిన కాకతిరుద్రమదేవినుండి వేరుచేయుటకై ప్రతాపరుద్రచక్రవర్తిని కొన్ని శాసనము లలో మనుమరుద్ర అని వాడిరి

కోటగణపయదేవుని తల్లి బయ్యలదేవి ఈతనికి సమ

కాలికుడైన చక్రవర్తి కాకతి గణపతిదేవుడు కోటవంశీయులు కొంతకాలము వెలనాటి చోళులకు మిత్రులుగను సామంతులుగను ఉండిరి క్రీ శ 1225 తరువాత వెలనాటి చోడుల రాజ్యమంతరించినది కాకతీయ సామ్రాజ్యము తీరస్థ ఆంధ్రదేశమునకును వ్యాపించినది కావున కోటగణపతిదేవుడు కాకతీయ సామ్రాజ్యమునకు అనుకూలసామంతుడయ్యెను ఈతడు ఎనమదల కోట శాఖవారితోను నతవాటిపరిపాలకులతోను మిత్రభావమునే పాటించెను

అడపకేతనబోయుడు కోటగణపతిదేవుని సామంతుడో ఉద్యోగియో అయియుండును తాను గంగేశ్వర దేవరవృత్తిమంతుడు అని అడపకేతన వ్రాయించుకొన్నాడు ఈ బిరుదమున కర్థమేమియో తెలియుటలేదు గంగేశ్వరదేవుని భూములకు వ్యవహర్తయేమో ఈతని తల్లి పేరు మాస్సాని మాచసానియనుటకు వ్యవహారరూపము మాస్సాని కావచ్చును మాచసాని అనుటకు మాస్సాని అని తెలంగాణ శాసనములలో కన్పించును కేతన తండ్రికి సాహస అని విశేషణము చేర్పబడినది సాహస మల్లినాయడు ఇది వీరిఇంటిపేరు కాదు కావున మల్లినాయకుడు ప్రత్యేకముగ పరాక్రమశాలి అని సూచించుటకే ఈ విశేషణము వాడియుండురు మల్లినాయడు ఏ రణరంగములలో సాహసప్రదర్శనము కావించెనో ఎరుగరాదు ఈ విశేషణమును సావాసి అనియు చదువవచ్చును స్వర్గవాసి స్వర్గీయుడనుటకు సావాసి వాడుకరూపము కావచ్చును అడపకేతన రామేశ్వరదేవునకు సమర్పించిన అఖండదీపమునకై నేయిపోయుటకు గంగులపోతబోయని కొడుకు కొమ్మనబోయనికి 55 ఆవులు ఇవ్వబడెను నిత్యము మానెడు నేయిపోయుటకు ఏర్పాటు నేయి అనుటకు శాసనములోని వర్ణక్రమము నెఇ నెఇ పోయంగలవాడు ఆచంద్రార్కదీపము నెలకొల్పుటకు అడపకేతనబోయుడు భక్తిభావమును సముచిత సంపదయు కలవాడుగా తోచును

ఖం ల రం

## అడపకేశవదాసి

పల్నాటి వీరచరితమున గురజాలలో జరుగనున్న కోడిపందెములో పాల్గొనుటకు తనతో వచ్చుటకు బ్రహ్మనాయుడు పిలిపించిన ముప్పదిముగ్గురు సేవకులలో అడపకేశవదాసి ముఖ్యుడు ఆ సేవకులు వివిధములైన సేవలను చేయుటకు నియుక్తులైరి వారిలో కొందరు పావురములను పట్టి తెచ్చువారు పానీయమును భద్రపరచి తెచ్చువారు గొడుగును పట్టువారు మందులను వెంటగొనివచ్చువారు ఉండిరి ఆ ముప్పదిముగ్గురు సేవకులలో జామిదేవుడు మంగిదేవుడు నారిమంచిదేవుడు జయశీలనాథుడు జామిదేవుడు బిరుదు భీముడు మలిదేవమల్లు కుంచ శ్రీరాముడు గొడుగు మోగాయ చండివె కాయమున్నగువారు పేర్కొనదగుదురు

అడపకేశవదాస ఆ సేవకులలో అగ్రగామి అతడు బ్రహ్మనాయుని ప్రేమాదరములను విశ్వాసమును చూరగొన్నవాడు అడపమనగ వక్కలాకులనుంచు బరణి దీనిని సంస్కృతమునందు తాంబూలకరండమందురు ఆనాడు ఇదియొక గౌరవనీయమైన ఉద్యోగముగా పరిగణింపబడియుండును అడపకేశవదాసి అట్టి ఉద్యోగియై యుండును అతడు ఆ బరణిని చేతపట్టుకొని అవసరసమయమందు ఆకలనుచుట్టి బ్రహ్మనాయునకు అందిచ్చుచుండువాడు అందుచే ఆ పేరతనికి వచ్చియుండును అయితే అడపకేశవదాస కేవలము తమలపాకులనుచుట్టి ఇచ్చువాడే కాడు అతివీరుడుగా అతడు పేర్కొనబడినాడు అతడు మాటకారి నీతిజ్ఞుడు లోకజ్ఞుడు

బ్రహ్మనాయుడు గురజాలవైపు బయలుదేరి వెడలుటను తెలిసికొని చెవులగోపన్న అతనిని కలియరా యత్నించుచున్నట్లు బ్రహ్మనాయునకు తెలిసెను బ్రహ్మనాయుడు అతనిని రాకుండ వారించుటకై మొదట కన్నమను పంపెను కన్నమ వారింప యత్నించినను వినక ముందుకువచ్చునేమో అని ఊహించి బ్రహ్మనాయుడు అడపకేశవదాసుకి గోపన్నను వెనుకకు మరల్పుమని ఆనతిచ్చెను అడపకేశవదాస తమలపాకులచుట్టను బ్రహ్మనాయునిచేతి కందిచ్చెను కాని ఆ చుట్టను గోపన్నకిచ్చి మరలిపోవునట్లొనర్పుమని బ్రహ్మనాయుడు అడపకేశవదాసుని ఆజ్ఞాపించెను

కృత్యవేదియగు అడపకేశవదాస రత్నములతో పొదుగబడిన ఒకపళ్ళెములో ఆ తాంబూలపుచుట్టనుంచుకొని గోపన్నను సమీపించి అతనిని ఆ తమలపాకుల చుట్టతో సత్కరించి "బ్రహ్మనాయుడు పంపగా వచ్చితిని కన్నమ వలదని వారించినపుడు నిలువకవచ్చుట నీతికాదు ఏలినవారి చిత్తానుసారము వర్తించుట భటుని నీతి స్వామి ఆజ్ఞనుమీరిన సత్పురుషునకైనను భంగముతప్పదు నాకెదురులేరని నడవడి తప్పి మెలగిన సేవకుడు లక్ష్మీకటాక్షమును కోల్పోవును స్వామికి తనపై ప్రేమ గౌరవములు పెంపొందినకొలది సేవకుడు నమ్రతను చూపుటయే శ్రేయస్కరము కావున బ్రహ్మనాయుని ఆజ్ఞను

సారముగ మరలిపొమ్ము అని ఎంత స్పష్టముగా కర్తవ్యమును బోధించుటకు అడపకేశవదాసు యత్నించినను గోపన్న వినడయ్యె. అంత అడపకేశవదాసు నీవు సర్వజ్ఞుడవు నేర్పరివి సర్వవిద్యాసంవేదివి అనుచు స్తుతించి గోపన్నను కర్తవ్యోన్ముఖునిచేయ యత్నించెను కాని విఫలుడయ్యెను. దీనిచే అడపకేశవదాసు యొక్క స్వామిభక్తి నీతిజ్ఞత వాక్చాతుర్యము ఉచితజ్ఞత దౌత్యనిర్వహణ కౌశలము వెల్లడియగుచున్నవి.

అడపకేశవదాసుని గురించి ఇంతకంటె విశేషాంశములు తెలియవు.

గ. ల. కాం.

## అడపగుండయ

అడపగుండయ ప్రశంస ప్రతాపరుద్రచరిత్ర, సిద్ధేశ్వర చరిత్ర, సోమదేవ రాజీయము అను మూడు గ్రంథములందును కన్పించుచున్నది. వీనిలో సిద్ధేశ్వర చరిత్రమునందు మాత్రమే ఈతనినిగూర్చి కొన్ని విశేషములు అస్పష్టముగా పేర్కొనబడి యున్నవి. అడపగుండయ కాకతి గణపతిదేవ మహారాజుకాలములో అచ్చుకావలి ఉద్యోగిగా కీర్తి గడించినట్లు కన్పించుచున్నది. అచ్చుకావలి విధానమునుగూర్చి "అడపసింగమ నాయకుడు" అను వ్యాసమును చూడదగును.

గణపతిదేవ చక్రవర్తి తిక్కన సోమయాజి విజ్ఞాపనము మీద నెల్లూరుపై దండయాత్రచేసి మనుమసిద్ధి రాజ్యము అతనికి ఇప్పించి శ్రీశైలము పంచారామములు సందర్శించి వచ్చుచుండెను. ఎదియో ఒక దొంగతనము సందర్భమున గణపతిదేవుడు చోరీ ఆస్తిని పట్టుకొనుటకై అడపగుండయను నియోగించెను. వాడును కడు సమర్థతతో వ్యవహరించి ఆ యాస్తిని పట్టితెచ్చి గణపతిదేవ మహారాజునకు అప్పగించెను. ఆ రాజన్యుడు గుండయస్వామి భక్తికి మెచ్చి వాడు సాధించిన ద్రవ్యమును వానికే ఇచ్చివేసెను. అంతటితో ఆగక గణపతి దేవుడాతనికి "ఎలుగూరు" అను గ్రామమును సర్వమాన్యముగా ఇచ్చెనట. ఇచ్చట ఒక మహాతటాకము త్రవ్వబడెను.

గణపతిదేవుడు అడపగుండనికి ప్రసాదించిన యెలుగూరు గ్రామము మెచ్చటిదో తెలియవచ్చుటలేదు. అడపగుండయ ఆచోకి తీసిన దొంగతనము చిల్లర చోర వ్యాపారము కాకపోవచ్చును. సామాన్య చౌర్యమయినచో చక్రవర్తి దానినంతగా మెచ్చి గ్రామదానము చేసియుండడు. శ్రీశైల ప్రశంసచే ఈ చిన్నవేశము ఆ ప్రాంతమున జరిగినదిగా ఊహించుటలో తప్పు లేకపోవచ్చును. ఆకాలమునందు రాయలసీమ ప్రాంతము అరణ్యమయమై చోరాక్రాంతమై ఉండెను. ఇటువంటి దొంగలముఠాను దేనినో నిర్మూలించి నష్టమైన ద్రవ్యమును ఎటుకొని చక్రవర్తి సమర్పించుటచేతనే అడపగుండయకు రాజు సన్మానము లభించెను. పూర్వము పల్లవ-చాళుక్య-చోళ రాష్ట్రకూట చోళ-చాళుక్య సామ్రాజ్యములకు రంగముగా నుండిన రాయలసీమ జిల్లాలు జనసంచారము తగ్గి అరణ్యములుగా మారిపోయి దొంగలకును దారిదోపిడీగాండ్రకును ఆవాలముగా ఉండెడివి. హుయానుత్సాంగు అను చైనా బాటసారికూడ ఈ ప్రాంతమును సందర్శించినప్పుడు అవి చోరాక్రాంతములుగా ఉండినట్లు నుగొనెను. కాకతీయుల కాలమునకు గూడ ఈ దుస్థితియే చెల్లుచుండెను. గణపతిదేవుడు ఓడ దొంగలను నిర్మూలించి సముద్రపుర హాదారులను క్షేమకరములుగా చేయుటకు యత్నించెను. అట్లే నాటు దొంగలను కూడ ఉన్మూలించి రాజమార్గములను ప్రమాదరహితములుగ చేయుటకు కృషిచేసియుండును. ఆ యుద్యమములో పాల్గొన్నవాడే అడపగుండయ.

గుండయ సాహసికుడైన ఉద్యోగిమాత్రమే కాదు. అతడు సజ్జనుడుగా కన్పించుచున్నాడు. ఎలుగూరులో గొప్ప తటాకము త్రవ్వించుట అతని ప్రయత్నముచేతనే అయియుండును. అతడు ధర్మమును ఎడపక చేసెనని సిద్ధేశ్వర చరిత్ర ప్రశంసించుచున్నది. గుండయ సప్తసంతానములను నెలకొల్పెనట. కోవిదశ్రేణులకు ఈప్సితార్థము లిచ్చెనట. అతడు నాలుగు చెరువులు, నాలుగు శివాలయములు, ఒక విష్ణుగృహము ప్రాకార సహితముగ కట్టించెను. గుండయ శౌర్యపరాక్రమములచే అడపవంశమువారికి అచ్చుకావలి ఉద్యోగము పరంపరగా లభించినట్లు కనబడుచున్నది. అనవేమారెడ్డి కాలములో అడప సింగమనాయకుడను వీరుడు ఇట్టి రాజోద్యోగమునే వహించుట దీనికి కొంత తార్కాణ.

బం. ల. రం.

గ. ల. కాం.

## అడపవేమన

అడపవేమన గారి ప్రశంస కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకా త్రిపురాంతక క్షేత్రమునందలి త్రిపురాంతక

కేశ్వర దేవాలయమున దలి శాసనములో లభించు చున్నది శాసనకాలము శక 1278 (క్రీ శ 1356) దుర్ముఖి సంవత్సర నిజశ్రావణ బహుళ అష్టమీ శుక్రవారము ఈనాడు శ్రీ త్రిపురాంతక శ్రీ మన్మహాదేవరకు స్వస్తి శ్రీమతు అనపోతయ రెడ్డి గారి ఆనతిని అడపవేమన గారు "అభిషేకమును గౌరీ పరమేశ్వరికి నేతి అభిషేకమున్ను ఉపహారమున్ను 2160 పుట్లు బియ్యమును విఘ్నేశ్వరునకు ఉండ్రాలున్ను త్రిపురాంతక దేవునకు నూరుమాళ్ళెత్తు బంగారాన ఉంగరమున్ను" సమర్పించెను ఇదే సందర్భమున వేమనంగారు రెడ్డిగారి పుణ్యమునకు గాను అఖండదీపానకు 25 మోదాలు (మొదవులు) దేవాలయమునకు ఇచ్చెను ఈ గోవులను చేకొని కామన బోయడు నిత్య సోలెడు (నిత్యముసోలెడు) నేయి తన పుత్రాను పౌత్రికము నడపగలవాడు

అడపవేమనకు రెడ్డిరాజ్యములో ఎట్టి స్థానముండెదో ఈ శాసనమునందు చెప్పబడలేదు ఈతడు రాజబంధువైనట్లు కాన్పించదు అనపోతారెడ్డి గారి అంతరంగికుడైన ప్రాంత పరిపాలకుడు కావచ్చును కావుననే ప్రభువు ఆనతి మేరకు త్రిపురాంతకేశ్వరునకు ఉడుగరలు సమర్పించెను త్రిపురాంతకేశ్వరుని రాశివాసమును త్రైలోక్య సుందరీదేవి అను పేరున కాకతి ప్రతాపరుద్రుని సేనాని అంబదేవ మల్లుగారు సేవించినట్లు శక 1216 నాటి శాసనమొకటి చెప్పుచున్నది అడపవేమన ఏర్పాటుచేసిన సేవలలో నేతినూనెను అని వ్రాయించినారు గౌరీదేవికి అభ్యంజనమునకు నూనెయు దీపారాధనకు నేయియు అని యర్థము కావచ్చును త్రిపురాంతక మహాదేవునకు సమర్పింపబడిన బంగారు ఉంగరము నూరు మాళ్ళెత్తు అని వ్రాయనైనది అనగా నూరు మాడల బరువు అది అని యూహింపవలెను అడపవేమన గారు తాను స్వయముగా రెడ్డింగార్కి పుణ్యముగా దీపదానము చేయుట ఆతని స్వామి భక్తిని ప్రదర్శించు చున్నది

అనపోతారెడ్డి రెడ్డిరాజ్య స్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డిగారి అగ్రనందనుడు ఈయన పరాక్రమశాలి పెక్కు యుద్ధములు చేసెను కొన్నిట విజయమందెను కొన్నిట పరాజయమొందెను ఈయన తమ్ముడు అనవేమారెడ్డివలె విజయలక్ష్మి అనపోతారెడ్డిని నిరంతరాయముగ వరించలేదు అది యట్లుండె అనపోతయ రెడ్డి గారికి శాసనములో ఈయబడిన బిరుదులు "జగనొబ్బగండ జగరక్షపాల" అనునవి వీనిని మించి ఆయనకు కీర్తి ప్రదమైన బిరుదము మరియొకటి కలదు "హేమాద్రిదానవినిరతులైన అనునది రెడ్డిరాజులందరును ముఖ్యముగా ప్రోలయవేమారెడ్డి అనపోతారెడ్డిగార్లు హిందూ ధర్మసముద్ధరణమునందు దీక్షగలవారై హేమాద్రి ప్రోక్తములైన దానము లన్నిటిని చేసి మన్ననలు పడసిరి త్రిపురాంతకము శ్రీపర్వతమునకు ప్రాగ్ద్వారమని ప్రసిద్ధిచెందినది ఇచ్చట శ్రీపర్వత శిరోమణి శ్రీ కుమారగిరి శ్రీ త్రిపురాంతక అని వ్రాయబడినది అనపోతయరెడ్డి గారు తన కుమారునకు కుమారగిరిరెడ్డి అను పేరు పెట్టుట కుమారాచలమందలి భక్తి చేతనే కావచ్చును

శాసన సంవత్సరమైన శక 1278 ఈ రాజు కాలములో ఒక విశిష్టతగల వర్షముగా తోచుచున్నది ఎలన శక 1278 సంవత్సరముననే అనపోతారెడ్డి దాక్షారామమునందు భీమేశ్వరస్వామి సేవలు సమర్పించెను ఇటు దాక్షారామమునందును అటు త్రిపురాంతకమునందును ఒకే సంవత్సరమున దాన శాసనములు ఈ ప్రభువు వేయించుటలో ప్రత్యేకత లేకపోలేదు త్రిపురాంతక శాసనము నిజశ్రావణ బహుళ అష్టమి శుక్రవారము రోహిణీ నక్షత్రయుక్తమయమని చెప్పుటచే అది శ్రీకృష్ణాష్టమి అని భావించుచునే యున్నది ఈ రాజు శివారాధకుడయ్యు విష్ణుభక్తి వర్జితుడు కానందుట తెల్లము విచారింపగా శక 1278కి విశిష్ట ఎట్లు లిగినదియు తెలియుచున్నది ఇతడు గొంచెము ముందే అనపోతారెడ్డి కళిగముపై దండెత్తి ఘనవిజయము సాధించెను ఈ విజయ సూచకముగనే దాక్షారామమునందును త్రిపురాంతకమునందును రెడ్డిరాజుల ఇష్టదైవమైన మహాదేవుని ఆరాధన జరిగెనని నిశ్చయముగా చెప్పవచ్చును అనపోతారెడ్డి సామ్రాజ్యమునకు రాగానే కొన్ని ఇక్కట్టులకు గురియయ్యెను కళింగ గాంగభూపతి మూడవ నరసింహదేవుడు గోదావరి దాటివచ్చి కృష్ణాతీరమందలి శ్రీకాకుళమువరకు చొచ్చుకొని వచ్చెను గోదావరీ కృష్ణా నదులమధ్య దేశమును తన యాధీనమునందుంచుకొన్నగాని రెడ్డిరాజ్యమునకు క్షేమములేదని గుర్తించి అనపోతారెడ్డిగారు విజయయాత్రచేసి దక్షిణ కళింగమువరకు జయించెను ఈ విజయోత్సాహమునందే అడపవేమనంగారికి త్రిపురాంతక దేవుని ఆరాధనకై ఆనతి లభించియుండును

ఖం ల రం

## అడపా సింగమనాయకుడు

కొండవీటి రెడ్డిప్రభువుల కాలములో అనవేమారెడ్డి రాజ్యకాలమందు గ్రామాదుల దిలి పైరులను ధాన్యాదులను హరించి తెలుగు చోడవంశమునకు చెందిన బలములగు కొందరు దుండగులు త్రిపురాంతకమునకు చేరువనున్నవారు తలారుల కంటపడకుండ పారిపోవుచుండిరి వ్యవసాయదారులు ఆ రీతిగా తమకువాటిలుచున్న నష్టమును వారి ప్రభువగు అనవేమ భూపాలునికి విన్నవించిరి అంతట అనవేమ భూపాలుడు తనకు విశ్వసనీయుడును సమర్థుడును అయిన చిప్పేటి బోడి లింగమనాయకుని తనకోటను ఇతర సీమలను కాపాడుటకు అచ్చు కావలి ఉద్యోగిగా నియుక్తుని చేసెను చిప్పేటి బోడి లింగనాయకుడు (ముతరాచ) కులమునకు చెందినవాడు తెలుగు ముటరాచ కులమువారు కృష్ణ నెల్లూరు కడప ఉత్తర ఆర్కాటు జిల్లాలలో ఎక్కువ సంఖ్యలో ఉండిరి ఈనాడును కొందరున్నారు ముదిరాచ కులమువారినే ముత్రాసి ముత్తరజు ముదిరాజ మున్నగు వేరువేరు రీతులలో వ్యవహరించుచున్నారు వీరు తెలంగాణమునందును కలరు వీరు సాంఘికముగా ఇప్పుడు మిక్కిలి చితికిపోయి హీనవృత్తులను అవలంబించు స్థితికి దిగజారిపోయినను ఒకప్పుడు ఈ కులమువారు గౌరవస్థానమునే ఆక్రమించినట్లు వారి కులము పేరేచెప్పుచున్నది ముత్రాసి ముత్తరజు మున్నగు పదములు ముత్తరసు శబ్దముయొక్క వికృతిరూపములుగా తోచును అరసు అనగా రాజు అధికారి అని యర్థము ప్రసిద్ధము ముత్తరాజులు పూర్వము గ్రామోద్యోగులయి ఉందురు ఏ కారణముననో వీరాస్థానమునుండి పడిపోయి గ్రామభటులుగా మారిపోయిరి

కొంత కాలమునకు అనవేమారెడ్డి మరియొక సమర్థుడును విశ్వసనీయుడును అగు వానిని వెలికావలి అధికారిగా నియమించెను అతడే అడపా సింగమనాయకుడు

అనవేమారెడ్డి రాజ్యకాలమున ఇట్లు నగర గ్రామ సంరక్షణ పద్ధతి ఏర్పడెను అది రెండు విధములు (1) అచ్చు కావలిపద్ధతి (2) వెలికావలి పద్ధతి చిప్పేటి బోడి లింగమనాయకుడు అచ్చు కావలిపద్ధతిలో నియోగింపబడిన అధికారి అడపా సింగమనాయకుడు వెలికావలి పద్ధతి ననుసరించి నియుక్తుడయిన ఉద్యోగి అచ్చు కావలిపద్ధతి వెలికావలి పద్ధతికంటె భిన్నమైనది అచ్చుకావలి అధికారిని అమీను (Bailiff) అను ఉద్యోగితో పోల్చవచ్చును అతనికి కొన్ని సీమలను సంరక్షించు బాధ్యత అప్పగింపబడెను అతడు తనకు నచ్చిన కొందరు ఉద్యోగులను రక్షణకృత్యమున తనకు తోడ్పడుటకు నియోగించు అధికారము కలవాడుగ ఉండెను ఆ అధికారిని రాజు స్వయముగా నియుక్తుని చేసెను రాజునకే స్వయముగా అతడు సమాధానము చెప్పవలసిన వాడయ్యెను తన అధికారములో ఉన్న సీమలలో ఎక్కడ ఎప్పుడు ఎట్టి దొంగతనము జరిగినను ఎట్టి ఆస్తి నష్టమైనను అచ్చుకావలి అధికారి దొంగలను కనుగొని నష్టమైన ఆస్తిని యజమానులకు అప్పగించి చిక్కిన చోరులను శిక్షకోసరము అప్పగించుచుండువాడు దొంగలు దొరకక ఆస్తి కనబడకపోయినచో ఆ అధికారి ఆ నష్టమును ఇచ్చుకొనవలసిన వాడయ్యెను అందుచేతనే ఆతడొనర్చు కావలి అచ్చుకావలి (పోయిన ఆస్తిని అచ్చుకొను బాధ్యత గలవాడు) అనబడెను ఇట్టి పద్ధతియే అనగా నష్టమైన ఆస్తిని అచ్చుకొను పద్ధతియే నౌకాయానమునందును పూర్వకాలమున ఆచారములో ఉండినట్లు కన్పించును సముద్రములమీద ఓడలలో సరకులను తీసికొనిపోవు నావికులు తమ కష్టమునకు తగిన కేవును (ఓడఖర్చు) పుచ్చుకొనుటకు భోజుడు తన యుక్తికల్పద్రుమము అను గ్రంథమునందు అనుమతించెను ఒక్కొక్కప్పుడు నౌకా వ్యసనముచే సరకులు సముద్రము పాలగుచుండును ఓడదొంగల భయమును ఉండెను అట్టి సందర్భములలో జరిగిన ఆస్తినష్టము నావికుని తప్పిదముచే జరిగినది అయినచో అతడు ఆ నష్టమును తాను అచ్చుకొనవలసి యుండెను అది యాతని అశ్రద్ధచేకాక దైవ వశమున సంభవించినదైనచో నావికుడు నష్టమును అచ్చుకొనక్కరలేదు

వెలికావలి అధికారిని కూడా రాజే నియోగించుచుండెను వెలికావలి అధికారికూడా గ్రామాదుల సంరక్షణమునకు గ్రామముల బయటి కావలిలో తోడ్పడుటకు సహాయకోద్యోగులను తలారులను నియోగించు అధికారము కలవాడై ఉండెను వెలికావలి అనగా గ్రామమునకు వెలువల ఉన్న ప్రధాన ద్వారములను సంరక్షించుట గ్రామములలోనికి ప్రవేశించు ప్రధాన ద్వారము వద్దను గ్రామములనుండి బయటకు పోవు ప్రధాన ద్వారమువద్దను ఈ వెలికావలి ఉద్యోగిచే నియుక్తులైనవారు జాగరూకులై కనిపెట్టి ఉండి గ్రామములలోనికి వచ్చి పోవుచుండు జనుల (ఆగంతకులుయొక్కయు అనుమానాస్పదుల యొక్కయు) పేర్లను రిజిష్టరులో వ్రాసి ఉంచెడివారు ఇంతేకాక వీరు గ్రామములకు చెందిన పంట

వైరులను అగవి జంతువులు పాడుచేయకుండ సంరక్షించుచుండెడివారు ఈ వివరములన్నియు కోట కైఫియతువలన తెలియుచున్నవి

ఆనాడు కావలిచేయు భటులకు సంవత్సరమునకు ఒకసారి ఒక్కొక్క గృహస్థువలన మేర (ధాన్యము) లభించుచుండెను సంవత్సరము పొడుగునను వివిధ వర్ణములకు చెందిన ఒక్కొక్క గృహస్థు ఇంటిలో జరుగు శుభకార్య సమయములలో వర్తనముల (తలారికట్నముల) రూపమున కొంత ద్రవ్యము వెలికావలి భటులకు చెందుచుండెను

అచ్చుకావలి అమీనుకు ప్రతి సమయమందును అతనిచే నియుక్తులైన రక్షకభటులును తలారులను ఆయాచోట్ల సంరక్షణ కార్యమున తోడ్పాటు చేయుచుండిరి ప్రభుత్వము వారికి ఈ అచ్చుకావలి వెలికావలి సంస్థలతో సంబంధము తక్కువ కాని అపుడపుడు ప్రభుత్వాధికారులు ఈ కావలి సంస్థల కృత్యనిర్వహణమును పర్యవేక్షించుచుండిరి ఈ సంస్థలు సూత్రకాలమునందును స్మృతికాలమందును అమలునందున్న సంరక్షణ సంస్థలకంటె ఎంతమాత్రము భిన్నమైనవి కావు ఒక్కొక్క ముఖ్యాధికారి ఆధీనములో ఉండదగిన సీమల సంఖ్య ఆకృత్యము యొక్క స్వభావము పైనను అధికారి యొక్క శక్తి సామర్థ్యముల పైనను ఆధారపడియుండెను

అడపాసింగమనాయకుడు అనవేమారెడ్డి ప్రభువుచే కొన్ని సీమలపై వెలికావలి అధికారిగ నియుక్తుడై ఉండుటచే అతడు అత్యంతసమర్థుడై ఆ ప్రభువుయొక్క విశ్వసనీయులలో అనుగ్రహపాత్రులలో ఒకడై ఉండెనని ఊహింపవచ్చును అతనిని గూర్చిన శేషించిన వివరములు తెలియవు అతడు అనవేమారెడ్డి సమకాలికుడగుటచే క్రీ శ 14వ శతాబ్దికి చెందినవాడై ఉండును

గంజాం

## అడకాలనాయకుడు

కాకతీయ సామ్రాజ్య పతనానంతరము దేశభక్తులైన ఆంధ్రనాయకులు తురుష్కులబారినుండి తెలుగుదేశమును విడిపించుటకై నడుము కట్టిరి ఈ విమోచనోద్యమము మొదట ప్రాగాంధ్రమున ఆరంభించెను ముసునూరి ప్రోలయ నాయకుడు అతని పినతండ్రికుమారుడైన కాపయ నాయకుడును మహమ్మదీయ సేనలను దేశమునుండి తరిమివేయుటకై కృషిచేసి ప్రశంసనీయమైన విజయమును సాధించిరి ఇది యిట్లుండ పశ్చిమాంధ్రమున అనగా రాయలసీమ ప్రాంతములో ఆర్వీటి సోమదేవరాజు ఇటువంటి విమోచనోద్యమమునే ప్రారంభించెను ఈతడు మొసలిమడుగు సాతానికోట (ఇది కర్నూలుజిల్లా లోనిది) కందనవోలు (కర్నూలు) ల్వ కొలను రాచూరు ఎతగిరి గంగినేనికొండ అను ఏడు కోటలను పట్టుకొనెను ఈ ప్రదేశములన్నియు కృష్ణ-తుంగభద్రాంతర్వేదిలో నున్నవి ఢిల్లీరాజ్యము క్రీ శ 1327 28 లో మహమ్మదు బిన్ తుఘ్లుకునకు వశమైన తరువాత ఆతడు మలిక్ నాయబుమహమ్మదు అనువానిని తత్ప్రాంత పాలకునిగా నియమించెను మలిక్ నాయబు ఆర్వీటి సోమదేవరాజు విజయములను అరికట్టుటకు యత్నించి విఫలుడయ్యెను ఢిల్లీ సర్దారులకు విధేయులుగానుండి దేశీయులైనవారు కొందరు సోమదేవరాజు విక్రమమును ప్రతిఘటించిరి అట్టి వారిలో అడకాల నాయకుడొకడు కావచ్చును

గంగినేనికొండవద్ద జరిగిన మహాయుద్ధములో ఆరవీటి సోమదేవరాజు బలవంతుడగు అడకాలనాయని వీరుడైన గజ్జులవీరినేనిని రుద్రభూపతిని మహాశూరుడైన గౌరారెడ్డిని సాహసికుడైన గంగినాయకుని సహాయము మరగజములను పట్టునట్లు చట్టలెత్తించి గంగినేనికొండ తూర్పు పనివద్ద శిరములు పాతించి తోరణముగా కట్టి చెనని రామరాజీయము వర్ణించుచున్నది ఇంత పటుశౌర్యధురీణులైన ఈ నాయకులెవ్వరో వారివారి రాజ్యములేవో తెలియుటలేదు కొందరు వీరు దరుషు మహమ్మదు బిన్ తుఘుకుతో సఖ్యపడి వానికిని వాని ప్రతినిధియైన మలిక్ నాయబునకును వశవర్తులైన సామంతులనుట తెల్లము ఇందులో గౌరారెడ్డి రాయచూరు దుర్గమునకు చెందినవాడు కావచ్చునని ఊహ చేయుచున్నాము ఎట్లనగా కాకతి రుద్రమదేవికాలమున క్రీ శ 1294 ప్రాంతమున వర్ధమానపురమును ఏలి పరిపాలన చేయుచున్న గోన గన్నారెడ్డి వారి రాజ్య రక్షామణి అయిన విఠలభూనాథుడు రాయచూరు కోటను కట్టించినట్లు శాసనము తెలుపుచున్నది అప్పటినుండియు గోనవంశీయులైన రెడ్లు ఇచ్చట అధికారము నెరపుచుండిరని భావింపవచ్చును కాకతీయ సామ్రాజ్యము అస్తమించినమీదట కాలానుగుణముగ వీరు ఢిల్లీ చక్రవర్తులకును వారి ప్రతినిధులకును ఒదిగియుండి ప్రభుత్వము చేసియుందురు కావున వీరు సోమదేవరాజును ప్రతిఘటించి

పరాజితులైరి అడభాలనాయకుడు ప్రత్యేకముగ ఎ దుర్గము నేతెగో భావి పరిశోధ మువలన తేటపడవలెను

ఖం ల రం
ని శి సు

## అడయారు

పల్లవ మహారాజగు మొదటిన దివర్మ వేయి చిన ఒక దాన శాసనమున దు అడయారు ప్రశ స కలదు సుప్రసిద్ధ చ త్రకారుడగు జి జే డూబ్రే నను౦రి చి నందివర్మ రాజ్య పాలనకాలము క్రీ శ 485 510

శాతవాహనుల రా య్యపు తుదికాలమున వారి సామ తులలో ఎ ప్రా తము వారా ప్రాంతమున దు స్వత త్రతను ప్రకటి చుకొనిరి అట్టివారిలో పల్లవులొ రు నెల్లూరు బళ్లారి గు టూరు క దుకూరు సీమల దు వారి శా నములు దొరకినవి వారు దక్షిణాదిని వేగవతీ నదీతటమ దలి కా చీ పురమును రాజధానిగా చేసికొని అ ధ్రావనిలో కృష్ణానదికి దక్షిణమునఉన్న ప్రా తమును పాలి చినటుల శాసనాధార ములు కలవు వారు వైదికమతమును పునరుద్ధరించుటయే కాక అద్భుత కలా కౌశల్య శోభితములగు కుడ్యచిత్రములను కొ డలను మలచి గుహాలయములను నిర్మి చిరి

న దివర్మ వేయి చిన శాసనము ఉ త్తర ఆర్కాటుజిల్లా లోని ఉదయే దిరము అను గ్రామమున దొరకినది ఈ శాస నమునుబట్టి న దివర్మకు డి రె డవ స్కం దవర్మ అనియు ఎ హవర్మకు ఎక అనియు మొదటి స్కం దవర్మకు ప్రపౌత్ర అనియు తెలియవచ్చు చున్నది

న దివర్మ ఆయురారోగ్యాభివృద్ధి కొరకు కాంచి వాయిల్ గ్రామము న టిపెట్టుకొనియున్న అరణ్యభూమిలో నాలుగువ తులు తైత్తిరీ యాచరణ ప్రవచనసూత్ర కౌశిక గోత్రుడైన కులశర్మయను బ్రాహ్మణునకు బ్రహ్మదేయముగా దానముచేసెను ఇ దు దేవభోగహాలము (దేవాలయమున కొసగిన భూ మి) మినహాయి చ బడినది

"కలియుగ దోషావసన్న ధర్మోద్ధరణనిత్యస న్నద్ధ అను బిరుదునుబట్టి న దివర్మ ధర్మోద్ధరణయ దు దీక్షితుడని తెలియుచున్నది మరియు ఈతనికి భగవత్పాదానుధ్యాత పరమ భాగవత" అను విశేషణములు వేయబడినవి దీనిచే ఈ మహారాజు వైష్ణవ మతాభిమానియని తోచుచున్నది

ఇ దు ఉదాహరి పబడిన అడయారు రాష్ట్రము ప్రస్తుత మదరాసునగ దలి సముద్రతీరమును అ టిపెట్టుకొనిఉన్న అడ యారు ఒకప్పుడు ఈ ప్రా తము ువిశాల రాష్ట్రభాగముగా ను డి నేటి చె గల్పట్టు క జీవరముచరకు వ్యాపి చి యుండె నని మనము ఊహి చుటకు అవకాశమున్నది

కొ వెం

## అడవిచాంతిసిరి

క్రీ శ 3 వ శతాబ్దపు ప్రథమదశలలో దక్షిణాపథ చక్రవర్తులైన శాతవాహనుల పరిపాలన అ తరి చెను నాలు గున్నర శతాబ్దాలు నిరాఘాటముగా దక్షిణ పశ్చిమ భారతాల మీద ఆధిపత్యము వహి చిన ఆ ధ్ర భృత్యవ శము నిర స్తమై పోయినది ఆ ధ్రదేశము ఛిన్నా భిన్నమై మ డలాధిపతులును సేనానులును స్వత త్రులైరి

శాతవాహనుల క్షీణదశలలో విజయశాతకర్ణి పల నాడులో మాచర్లకు 14 మైళ్ళు పశ్చిమముగా కృష్ణానదీతీరపు లోయలో విజయపురి అను పేరుతో పట్టణమును ని ర్మి చ జేసెను ఇది బౌద్ధ క్షేత్రముగా ప్రసిద్ధి చెందినది

శాతవాహనులకు ఎమ్మట కృష్ణా గు టూరు మ డల ములలో ఇక్ష్వాకు రాజ వ శీయుల పాలన ఆర భమై రమా రమి ఒక శతాబ్దికాలము అధికారములో ఉండెను కాని ఈ వ్యవస్థ ఎక్కువకాలము నిలువలేదు బెజవాడ విష్ణుకు డినులు కాంచీపుర పల్లవులు తిరిగి ఆంధ్రదేశానికి సమగ్ర స్వరూప మును ఇచ్చుటకు ప్రయత్ని చిరి క్రీ శ 4 వ శతాబ్దార భ ములోనే ఇక్ష్వాకుల చరిత్ర తుదముట్టినది

ఇక్ష్వాకుల మూలపురుషుడు శ్రీ చా తమూలుడు అతడు క్రీ శ 218 230 నాటిను చి విజయపురి రాజధానిగా పరిపాలన సాగి చెను బ్రాహ్మణ మతావల బియైన ఇతడు వాజపేయ-అగ్నిష్టోమ అశ్వమేధాదిక్రతువులు చేసెను ఇతడి సోదరి చా తిసిరి మాత్రము బౌద్ధ ధర్మమును అనుసరి చి విశేష దానాలతో విజయపురిని ఇతోధిక బౌద్ధ క్షేత్రముగా రూపొ ది చినది

అడవిచా తిసిరి మహారాజగు చాంతమూలునికుమార్తె మహారాజగు వీరపురుషదత్తుని సోదరి వీరపురుషదత్తుని ఆరవ రాజ్య సంవత్సరములో రాజవ శ స్త్రీలు ఇక్కడ బుద్ధ ధాతువు నిక్షేప పబడ్డ మహా స్తూపమును పునరుద్ధరి చి ఆయక స్తంభాలను ఎత్తి చిరి శ్రీచా తమూలుని సోదరీ గణములో అతిముఖ్యపాత్ర వహి చిన చాంతిసిరి మహాస్తూప జీర్ణోద్ధర

ణమునకు పూనుకొనగా అడవిచాంతిసిరి తనకును తన వారికిని ఉభయ లోకములలోను సౌఖ్యాభివృద్ధులను కాంక్షించుచు ఆయకస్తంభాలను ఎత్తించినది. చాంతమూలుని సోదరియగు చాంతిసిరిని చిన్న వేరు పరచుటకు అతని కూతురగు ఈమెను అడవిచాంతిసిరిగా వ్యవహరించినట్లు తోచును.

ప్రాకృతభాషలోని చాంతిసిరి అను పేరు సంస్కృతీకరింపబడి శాంతిశ్రీగా మారెనని తోచును. కాని నాగార్జున కొండలో లభ్యమైన సంస్కృత శాసనములలోకూడ చాంతమూలపదమే కనిపించు చున్నది. సిరి శబ్దముమాత్రము శ్రీగా మార్పు చెందినది. రాజవంశ స్త్రీల పేర్లచివరగల సిరిని గౌరవవాచకముగా పరిగణింప వచ్చును. అటవీ శబ్దానికి తద్భవరూపము అడవి. చాంతిసిరికి అడవి అను విశేషణము ఎందుచేత ఉపయోగింపబడినదో తెలిసికొనుటకు తగిన ఆధార మేదియు లేదు.

అడవిచాంతిసిరి మహాసేనాపతి మహాదండనాయకుడు ధనకులోద్భవుడైన ఖండ విశాఖండకుని భార్య. ఈమెను మహాతలవరిగా మహాస్తూప ఆయకస్తంభ శాసనము వర్ణించినది. రక్షకభట సమూహామునకు అధ్యక్షత వహించినవారిని మహాతలవరిగా వ్యవహరించి యుందురు. అడవిచాంతిసిరి వన్యరక్షకులపై ఆధిపత్యమును వహించిన మహాతలవరియై యుండవచ్చును.

అతి ప్రాచీనకాలములో ఆర్యులు అడవిని రాజ్యభాగముగా పరిగణించినట్లు తోచదు. వారిచే జనపదము మాత్రమే రాజ్యమని భావించబడినది. రామాయణములో రాజ్యమును భరతునికి విడచిపెట్టి రాముడు అరణ్యవాసము చేసినాడు. పితృవాక్యమును యథాతథముగా పాలించుటకొరకు అతడు 14 సంవత్సరములు జనపదములో అడుగు పెట్టలేదని చెప్పబడినది. పాండవులు జూదములో రాజ్యమును పోగొట్టుకొని వనవాసము చేసిరి. వానప్రస్థాశ్రమమును కోరువారు రాజ్యమును(జనపదమును)వదలి అడవిలో నివాస మేర్పరచుకొనుట ఆర్యసంప్రదాయమే. అనార్యజాతులు రాజ్యపుపరిసరములలోని అడవులనుకూడ రాజ్య ఖండములుగా భావించియుందురు.

క్రీ. శ. 3వ శతాబ్దినాటికి భూదానము వాడుకలో లేదనుకొన వచ్చును. అనేకహిరణ్యకోటి గోసత సహస హాలసత సహస అని సువర్ణమును గోవులను నాగళ్ళను దానముచేసినట్లు శాసనాలు తెలియజేయు చున్నవి. కాని భూదాన ప్రసక్తియే లేదు. మనుస్మృతిలో అడవిలో చెట్లను నరికి పొలమును ఎవడు సిద్ధముచేయునో వానికే ఆ భూమి చెందునని చెప్పబడినది. అందువలన అడవులు కృషిభూములుగా మహాతలవరుల పర్యవేక్షణములో మార్పు చెందియుండును.

ఇక్ష్వాకులు తమ శాసనాలలో మేము సగర దిలీప అంబరీషతుల్యులమనియు పౌరాణిక ఇక్ష్వాకువంశీయులమనియు చెప్పుకొనిరి. కాని వీరిలో మేనరిక వివాహాచారము ఉండుటవలన వీరిని ఉత్తరాపథులనుటకంటె దాక్షిణాత్యులుగా భావించుట అవసరము. ఎక్కువ సాకపోయినచో ఎవరో ఉత్తర దేశమునుండి దక్షిణానికి వలసవచ్చి చిరకాలము నివసించి దక్షిణదేశ సంప్రదాయాలను జీర్ణించుకొనిన వారైనను కావచ్చును.

స్త్రీలను రక్షకభట శ్రేణులపై అధికార పదవులకు నియమించుట ఇక్ష్వాకుల ప్రత్యేకత. వీరి రాజ్యకాలములో స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యము ఉండెననుటకు ఆధారములు కనబడు చున్నవి. రాజులు వైదికమతమును ధరించి యజ్ఞములుచేసి కార్తికేయ పుష్పభద్రస్వాములకు ఆలయ నిర్మాణములను ప్రోత్సహించగా స్త్రీలు బౌద్ధ ధర్మమును అవలంబించి ఎనలేని దానధర్మాలతో నాగార్జునకొండను బౌద్ధ కేంద్రముగా మార్చివేసిరి. ఇట్టి పరమత సహనము స్త్రీ స్వాతంత్ర్యము ఇక్ష్వాకు ప్రభువుల ఔన్నత్యమునకు నికషోపలములుగా భాసిల్లుచున్నవి.

బి. వి.

## అడవి బాపిరాజు

అడవి బాపిరాజుగారు పశ్చిమ గోదావరి మండలమున ఉన్న భీమవరము చెంతనున్న సరిపల్లిలో జన్మించిరి. ఈయన జననము 1895 సంవత్సరము అక్టోబరు 8వ తేదీ. ఈయన జనకుడు కృష్ణయ్యగారు, తల్లి సుబ్బమ్మగారు. వీరు ఆర్వేల నియోగులు, సాలంకాయనసగోత్రులు. బాపిరాజుగారి బహుముఖ ప్రజ్ఞావిశేషములు నిరుపమానములు. ఈయన భక్తుడు, కవి, నవలారచయిత, శిల్పి, చిత్రకారుడు, గాయకుడు, నాట్యాచార్యుడు, అధ్యాపకుడు, పత్రికాసంపాదకుడు, సినిమా కళాదర్శకుడు. ఈయనరూపము సౌందర్యోపేతము. భావనాశక్తి అద్భుతము. మనస్సు వెన్నవంటిది. వాక్కు నవరసము లొలుకు చుండును. ఈయన విద్యాభ్యాసంగము రాజమహేంద్రవరములోని ఆర్ట్సు కళాశాలలో జరిగెను. కళాశాలా ప్రధానా

చార్యుడగు ఆస్వాల్డు జె కూల్డ్రి సాహిత్య గాన చిత్రలేఖనముల యందు కడునిపుణులు ఆయన అంతేవాసిత్వమున బాపిరాజు గారు ఆగ్ల సాహిత్యమును ... ను పెంపొందించు కొనిరి

ఈయన పట్టభద్రుడైన పిదప భారత దేశమును పర్యటించి ఆలయశిల్పములను గుహాకుడ్యములను దర్శించి వాటి విశేషములను గ్రహించెను ... ఆంధ్రజాతీయ కళాశాలలో చిత్రకళాపండితులగు ప్రమోద కుమార చట్టోపాధ్యాయుని వద్ద ఈయన కొంత కాలముండి చిత్రకళా రహస్యములను ఆకళించుకొనెను కళాపిపాసియగు బాపిరాజుగారు వీథి భాగవతములను తోలుబొమ్మలాటను చూచి అందలి కళాచితికి మురియుచుండెడివారు పల్లెలయందు సంచరించి గ్రామీ

చిత్రం 5



అడవి బాపిరాజు

ణుల జీవితవిధానమును ఈయన చిత్రించుచుండిరి ఎంకి పాటలు కిన్నెరసానిపాటలు మధుకలశము గోధూళి వంటి రచనలకీయన రూపొందించిన చిత్రములు ప్రసిద్ధములు పల్లెపదములు స్వయముగాఅల్లి పాడుకొనుట ఈయనకు అలవాటు చిలిపిన చంద్ర పాలుగారి ఉపన్యాసములు ఈయనలో దేశభక్తిని రేకెత్తించినవి

గాంధీ సిద్ధాంతము లీయనకు నచ్చెను 1921 లో సత్యాగ్రహోద్యమమునచేరి తత్ఫలితముగా ఒక సంవత్సరము ఈయన కారాగారవాసము ననుభవించెను అచ్చటనే తొలకరి అను గీతికాసంపుటిని హిమబిందు అను నవలను ఈయన రచించెను కారాగృహ విముక్తుడైన పిదప బి ఎల్ పట్టము పొంది భీమవరమునందు నాలుగు సంవత్సరములు న్యాయవాది వృత్తిని సాగించెను 1934 నుండి నాలుగు సంవత్సరములకాలము బందరు ఆంధ్ర జాతీయ కళాశాలకు ప్రధానాచార్యులుగా పనిచేసి ఈయన విద్యార్థులకు శిల్ప చిత్రకళల యందు ఆసక్తిని పెంపొందించెను 1939 వ సంవత్సరమున మద్రాసు చలనచిత్ర రంగమున ప్రవేశించి అనసూయ ధ్రువ విజయము మీరాబాయి చిత్రములకు బాపిరాజుగారు కళాదర్శకత్వమును నిర్వహించి కృతకృత్యులైరి గుంటూరులో కళాపీఠము నెలకొల్పి విద్యార్థులను తయారు చేసి కులపతి అని ఈయన వాసిగాంచిరి 1944 న హైదరాబాదులోని మీజాన్ అను దినపత్రికకు వీరు సంపాదకులై మూడు సంవత్సరములా పత్రికను సామర్థ్యముతో నడిపిరి హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమమునకు వ్యతిరేకముగా ఆ దినపత్రికయందు వ్రాయుటకిష్టపడక బాపిరాజుగారు తన సంపాదకత్వమును వదలుకొనిరి పోలీసుచర్యనాటి వరకుండి ఆ దినపత్రిక యదృశ్యమైనది బాపిరాజుగారు పది నవలలు ఎబదికి పైగా కథలు నూటయెబది కెక్కువ గేయాలు వెక్కు చిత్రములు సంతరించిరి తెలుగు నవసాహిత్యములో బాపిరాజుగారిదే అగ్రపీఠము ప్రథమాంధ్ర సామ్రాజ్యమును స్థాపించిన శాతవాహనుల కథను బోధించు హిమబిందు ఇక్ష్వాకులనాటి స్థితిని తెలుపునట్టి శాతిశ్రీ ఆంధ్ర చాళుక్య సామ్రాజ్య స్థాపనమును గూర్చి వివరించునట్టి అంశుమతి రుద్రమ అనునవి వీరి నవలలు చారిత్రకములు సాంఘికములు అని వీరినవలలు రెండు విధములుగ కన్పట్టును రుద్రమదేవినాటి పరిస్థితిని వర్ణించు గోనగన్నారెడ్డి తంజావురాంధ్ర రాజుల సంగతులను తెలుపు మధురవాణి అనునవి ఈయన వ్రాసిన చారిత్రకములైన నవలలు ఈ నవలలో మధురవాణి అసంపూర్ణమైనది వీరి సాంఘిక నవలలు జమిందారీ పద్ధతి నిర్మూలనములను తెలుపు నారాయణరావు శర్వరీ కళాభూషణుని కళాతృష్ణను వర్ణించు తుఫాను హరిజన ఆంగ్లో ఇండియను వనితల వివాహమును ముచ్చటించు నరుడు

సాంఘిక పరిస్థితులను చిత్రించు కొనగి జాజిమల్లి అనునవి సుప్రసిద్ధములు ఈయన తొలకరి అను గీతికా సంపుటిలో బరమ్మకవి భావములగపడును ఆయా నవలల స్థితిని బట్టి గ్రాంథికము వ్యావహారికములైన భాషలను ఉపయోగించియు సాంఘిక మర్యాదలను పాటించియు ఆయా పాత్రలతో తాదాత్మ్యమొందియు ఈయన తన నవ లను వెలయించిరి కథలుఅల్లుటలో బాపిరాజుగారు సిద్ధహస్తులు శైలబాల భోగీర లోయ వీణ వాన నేలతల్లి గాలివాన అనునవి వీరి ప్రధానమైన కథలు ఇం దు శైలబాల లో శిల్పము నేల తల్లి లో స ఘపు ఆవేదన భోగీరలోయలో చిత్రలేఖనము అను విషయములనుగూర్చి ఈయన పాఠకులకు బోధించిరి శైలబాలవంటి వీరి కథలుకొన్ని ఆంగ్లి క న్నడ హిందీ భాషల లోకి అనువదింప బడినవి వీరాలాపించిన గీతికలలో కొన్ని గోధూళి తొలకరి శశికళ అను సంపుటములుగా వెలువడి నవి ఈయన కళాదేవిని శశికళా మూర్తిగా ఆరాధించిరి తన ఆరాధ్యదేవత అయిన శశికళపై ఈయన భక్తిప్రేమ గీతిక లనేకములను వ్రాసిరి వీరికి గోదావరీనదియందు అభిమాన మెక్కువ "ఉప్పొంగి పోయింది గోదావరీ తాను తెప్పున్న ఎగిసిందిగోదావరీ లేపాటి బసవయ్య లేచిరావయ్య- లేచి రావయ్య కైలాస శిఖరిపై కదలిరావయ్య "మరచిపోవకే బాల మరచిపోవకే అరచి అరచి పలుపలేను తరచి తరచి కోరలేను అను వీరి గేయములు జగత్ప్రసిద్ధము లైనవి ఈయన మధురమైన స్త్రీకంఠస్వరముతో గేయములు పాడు చుండగా శ్రోతలకు మిక్కిలి ఇంపుగా ఉండెడిదట

బాపిరాజుగారు రూపొందించిన చిత్రములలో ఖడ్గ తిక్కన శబ్దబ్రహ్మ శ్వేతతార శశికళ రుద్రమదేవి నాగ నృత్యము సముద్రగుప్తుడు బుద్ధుడు సూర్యదేవ భిక్షుకి గౌరీశంకర్ భాగవత పురుషుడు మీరాబాయి అనునవి గొప్ప ప్రసిద్ధిగన్నవి వీరి శబ్దబ్రహ్మ చిత్రము డెన్మార్కు ప్రదర్శనశాలయందును భాగవత పురుషచిత్రము తిరువాన్కూరు రాజసౌధమునందును సూర్యదేవచిత్రము కూచ్ బీహారు లోను సముద్రగుప్త చిత్రము అల్లాడి కృష్ణస్వామయ్యగారి గృహమునందును అలంకారములుగ ఉంచబడినవి

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఈయన నారాయణరావు అను నవలకు ఖడ్గతిక్కన అను చిత్రమునకు బహుమానము లను ప్రసాదించెను

బాపిరాజుగారు తన కావ్యములలో చిత్రకళాదర్శము లను చిత్రములలో కావ్యకళాదర్శములను ప్రవేశపెట్టి ఒక నవ్యతను గూర్చిరి ఇట్టి కళాతపస్వి అజాతశత్రువగు బాపి రాజుగారు 1952 సెప్టెంబరు 22 తేదీన మద్రాసులో మృత్యువు జయించినట్లు తమ భౌతికకాయమును వీడిరి కళల అంతున తెలిసికొనిన అమ్మ హృదయులు బాపిరాజు గారు

తం ఆం శా

## అడవులదీవి

అడవులదీవి అను గ్రామము గుంటూరు జిల్లాలోని రేపల్లె తాలూకాలో ఉన్నది రేపల్లె పట్టణమునకు ఈ గ్రామము నకు 13 మైళ్ళు దూరములో కలదు అడవులదీవి విస్తీర్ణము 7887 ఎకరములు దీని తూర్పున అల్లపర్రు పోటుమెరక పడమట రిజర్వుఅడవి ఉత్తరమున అమ్మదాలపల్లె ప్రజ్ఞ కూచినపూడి అల్లపర్రు దక్షిణమున రిజర్వుఅడవి దిబ్బ ఉన్నవి ఇది బల్లపరపు నేలపై కలదు

1961 సం జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామము పురుషులు స్త్రీలు కలిసి 5719 మంది ఉండిరి ఈ సంఖ్యలో షెడ్యూలు జాతులవారు షెడ్యూలు తరగతులవారు కల 256 మంది ఇచట ఇండ్లు దూరదూరముగాను వాడవాడలు గాను ఉన్నవి వీటిలో 20 పెంకుటిండ్లు పది ఒకఅంతస్తుగల మేడలు కలవు జనులు బావినీటిని చెరువునీటిని త్రాగుదురు ఇక్కడ మంచి నీటివిద్దడి ఉన్నది

ఉల్లిపాలెం అల్లపర్రు కూచి పూడి గుంటకల్ కాలు వలు గుణంతిప్పచెర్వు పల్లెపాలెంచెర్వు రజకచెర్వు కాపుల చెర్వు వెంకయ్యచెర్వు కోటూరివారిచెర్వు పున్నమ్మచెర్వు తోటపాలెంచెరువు గరువుచెర్వు-ఇవి ఈ గ్రామమునకుగల నీటి వనరులు వరి వేరుసెనగ కొబ్బరి నువ్వులు రాగులు మిర్చి పొగాకు మొదలగుపంటలు ఈ వనరులక్రింద పండును మామిడి కొబ్బరి సర్వి తాటి తోటలు గలవు ఇచట పెంచ బడు దోస పొట్ల బీర బెండ మొదలగు కూరగాయలు గ్రామస్థుల అవసరములకు సరిపోవును ఇచట నల్లరేగడినేల 3500 ఎకరములు ఇసుకనేల 2500 ఎకరములు చవిటినేల 1881 ఎకరములు 1966 67 సంIIలో పంటలక్రింద 4846 ఎక రముల భూమి ఉపయోగ పడెను ఈ భూమి కాలువక్రింద సాగుబడియైనది 5 ఆయిల్ ఇంజనులు 1000 ఎకరముల

భూమికి నీటిని అ ది చెను ఒక ట్రాక్టరు 200 ఎకరముల భూమిని దున్నెను ఇచట 650 ఎకరముల గవర్నమెంటు అడవి గలదు దీనిలో ఎరుగువృక్షములు జీడిమామిడివృక్షము లున్నవి వ్యవసాయపు ప టవస్తువులను రేపల్లెకు లారీలపై బ డ్లపై ఎగుమతి చేయుదురు

ఇచట గేదెలు ఎద్దులు ఆవులు అబోతులు మేకలు గొర్రెలు ప దులు కోళ్ళు కలస 4607 ఉన్నవి సాలీనా 24 000 లీటర్ల పాలు మూడు మెట్రిక్ టన్నుల మా సము 10 000 గ్రుడ్లు స్థానికులు వినియోగి చుకొని అయిదుమెట్రిక్ టన్నుల మాంసము ను 0 000 గ్రుడ్లను కూ ినవూడి రేపల్లె లకు రవాణా చేసెరి

ఇచటి జనులు ముఖ్య జీవితాధారము వ్యవసాయము అడవికలప వృత్తులవారు దుకాణాదారులు ఎద్దుబండ్లు తోలువారు ను గలరు క సాలి వడ్రంగి కమ్మరి కుమ్మరి శాపీ చాకలి మ గలి గొల్ల వడ్డెర మొదలగువారును గలరు వడ్లమరవారు సాలీనా రెండు మెట్రిక్ టన్నుల బియ్యమును కూచినవూడి రేపల్లెలకు రవాణా చేయుదురు వ్యవసాయ దారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకుకూలి రు 3 లు స్త్రీ రు 2-50 లు

ఈ గ్రామమున సత్యనారాయణ మల్లికార్జునస్వాముల దేవాలయములు 5 చర్చిలు కలవు మాఘ శుద్ధ పౌర్ణమినాడు మల్లికార్జునస్వామి ఉత్సవము జరుగును దీనిని చూచి అన దించుటకు 2000 గ్రామస్థులు చేరుదురు

రేపల్లె రైల్వేస్టేషను ఈ గ్రామమునకు 12 మైళ్ళ దూరములో ఉన్నది ఈ గ్రామమునకు దు క కరరోడ్లు మట్టి రోడ్లు కలవు పొరుగు గ్రామములతో మట్టిరోడ్లు దీని కలుపు చున్నవి భట్టిప్రోలుప్రధానకాలువమీద ధాన్యము కలప ఉప్పు చేపలు గుడికాయలంకకు ఎగుమతియగును ఈ కాలువమీద పడవలలో జనులు గుడికాయలంక కొత్తపాలెములకు పోవుదురు ఈ గ్రామమున రె డు ఒ టెద్దుబ డ్లు 210 రె డెడ్ల బండ్లు 50 సైకిళ్ళు ప్రయాణ సాధనములు

అడవులదీవిలో ఎబ్ పోస్టాఫీసు ఆరు ఎలిమెంటరీస్కూళ్లు ఒక జిల్లాపరిషత్తు హైస్కూలు కలవు విద్యార్థులు కాలేజీ చదువులకు గుంటూరుకు పోవుదురు

ఇది ప చాయతి పరిపాలన గ్రామము దీనిలో పంచాయతీ గ్రంథాలయము సత్రము అవు ఎనిమాలకు గ్రామస్థులు రేపల్లెకు పోవుదురు కోర్టుకు సబ్ రిజిస్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి రేపల్లెకును 6 మైళ్ళలోని చోడాయపాలెములో నున్న పోలీసుస్టేషనుకును గ్రామస్థులు పోవుదురు ఈగ్రామసహకార సంఘమువారు గ్రామస్థులకు రు 89 000 లను అప్పుగా ఇచ్చిరి ఇచట లోకల్ ఫ డు ఆసుపత్రి పురుళ్ళ ఆసుపత్రి కలవు పశురోగములకు సూదిమ దు లిత్తురు రేపల్లెలో పశువుల ఆసుపత్రి కలదు ఈ గ్రామమ దు స తలు లేవు కాని పది రాణాదుకాణములు 8 సోడా కిళ్ళీ సిగరెట్టు దుకాణములు 6 కాఫీహోటళ్ళు ఇతరషాపు లున్నవి శ్రీ రావు వె కయ్యగారు ఈ గ్రామములో ప్రసిద్ధిచెందిన దాత

మా శ్వే

## అడిగొప్పల

అడిగొప్పల గు టూరు జిల్లా పల్నాడు తాలూకాలో ఉ న్నది ఈ గ్రామమునకు 8 మైళ్ళ దూరములో గురజాల అను పట్టణము కలదు ఈ గ్రామమునకు తూర్పున నరమలపాడు పడమట ధర్మవర ఓచేనుపల్లె ఉత్తరమున మిర్యాల దక్షిణమున అడవి కలవు దీని వి స్తీర్ణము 6 045 ఎకరములు

1961 జనాభాలెక్కలనుబట్టి అడిగొప్పలలో స్త్రీ పురుషుల సంఖ్య 4 241 ఈ స ఖ్యలో ఆటవికులు 50 మంది షెడ్యూలుతరగతి జాతులవారు 206 మ ది ఉన్నారు ఈ గ్రామమ దు ఇ డ్లు ఒకచో ఎకసంక్తిగాను ఒకచో విడివిడిగాను దూరదూరముగాను కట్టబడి ఉన్నవి ఈ ఇ డ్లలో 20 పె కుటి డ్లు 50 రా క్రీటుకప్పుగల ఇ డ్లు 2 ఒకఅంతస్తు మేడలు రెండు పెక్కు అ తస్తులుగల భవనములు ఇందు గాలి శిలకొండయు బ్రహ్మేశ్వరలి గమును ఒక ప్ర త కోనేరను కలవు ఈ గాలిశిలకొండ నల్లరాతితో ఏర్పడినది ఇందు చెట్లు చేమలు కనిపించును

ఈ గ్రామమునకు నీటివనరులుగా నాగార్జునసాగరపు కాలువయు చిన్నచెరువును పేర్కొనదగినవి వరి జొన్న సజ్జ వరిగ కొర్ర వేరుసెనగ మిర్చి మున్నగు పైరులు ఇచట వేయబడును 1966 67 సం।లో ప టలక్రి ద ఉపయోగి చిన భూమి 4 000 ఎకరములు కాలువక్రింద 800 ఎకరములు చెరువుక్రి ద 100 ఎకరములు సాగుచేయబడెను ఇచ్చట నల్లరేగడినేల 4 000 ఎకరములు ఎర్రనేల 1 000 ఎకరములు మొరసనేల 1000 ఎకరములు కలవు

ఈ గ్రామమున శువులస ఖ్య 1170౨ ఇందులో గేదెలు 1000 ఆవులు 400 శే౩ చినవి గుర్రములు దున్నలు గొర్రెలు మేకలు రోజుకు 1000 లీటర్లపాలు 2 మణుగుల నెయ్యి స్థానికులు ఉపయోగి చుకొ దరు వ్యవ సాయము జీవితాధారము ధాన్యము మున్న గువాటిని బండ్లమీద మాచెర్ల నర్సరావు పేటలకుఎగుమతిచేయుదురు ఇచటదుకాణా దారులుక్రయవిక్రయములు చేయువారు కలరు కంసాలివారు వడ్ర గులు కుమ్మరులు కమ్మరులు తాపీపనివారు మేద రులు కూలీలు చాకలివారు మంగలివారు ఉన్నారు పురు షునకు రోజుకూలి రు 3లు స్త్రీకి రు 2లు జనులు బావినీటిని త్రాగుదురు ఆరు దేవాలయములు రె డు మసీదులు కలవు దేవాలయములకు 150 ఎకరముల భూమి ఉన్నది

అడిగొప్పలకు 8 మైళ్ళలో గురిజాల రైల్వేస్టేషను కలదు ఇది బస్సు మార్గముపై ఉన్నది రె డుగంట కు ఒక సారి ప్రభుత్వపు బస్సులు నర్సరావుపేట ను డి మాచెర్లకు వెలుదుర్తికిపోవును ఈగ్రామమున మట్టిరోడ్లుఉ న్నవి దీనికిని పొరుగుగ్రామములకును మధ్య క కరరోడ్లు కలవు గుర్రపు బండ్లు రెండెడ్లబ డ్లు సైకిళ్ళు ప్రయాణి చువారికి లభి చును ఒక గ్రా చి పోష్టాఫీసు రె డు ఎలిమె టరీస్కూళ్ళు రేడియో లౌడ్ స్పీకర్లు ఒక ఆస్పత్రి కిరాణాదుకాణములు కాఫీహోటళ్ళు లా డ్రీలు క్షౌరశాలలు ఉన్నవి ఒక ఆయు ర్వేద వైద్యుడున్నాడు మేదర జాతివారు బుట్టలను తయారుజేసి వాటిని చుట్టు ప్రక్క ల గ ల గ్రా మ ము లో అమ్ముదురు

8 మైళ్ళలో ఉన్న కార్యమపూడిలో పోలీసుస్టేషను కలదు గురజాలలోని కోర్టుకు సబ్ రిజిష్ట్రారు ఆఫీసులకు తాలూకా కచేరికి బ్లాకుఅభివృద్ధి కే ద్రమునకు జనులు పోవుదురు

అడిగొప్పల ఓరుగాలికి ప్రసిద్ధి చె దినది మహాకవి శ్రీనాథుని చాటువుగా చెప్పబడు ఒక పద్యములో కూడ దీని ప్రశంస ఇట్లు కలదు "అడిగొప్పలయోరుగాలికినడిగితి ననుమా ఈ గ్రామమున ఓరుగాలి అత్యధికముగా ను డుటకు సమీప మునగల కార్యమపూడి కొండలు నాయకురాలికనుమ అడవి కారణములు

గ ల కాం

## అడిదంమల్లు

రాయసకల సేనాధిపతియగు అడిద మల్లుగారి ప్రశ త్రిపురాంతక శాసనములో లభి చుచున్నది (ద హి X నెం 479 259) అడిద మల్లు మహాపరాక్రమశాలియై ద డనాయ కుడు ఈయన శక 1216 (క్రీ శ 1294) జయ స వత్సర ఫాల్గుణశుద్ధ పౌర్ణమీ గురువా ర నాడు త్రిపురాంతక క్షేత్ర ములో వేయి చిన శాసనమువలన ఈయన విజయములు ధర్మకార్యములు తెలియవచ్చు చు న్నవి ఈనాడు అనగా పైనచెప్పిన పౌర్ణమినాడు అడిద మల్లు సేనాపతి త్రైలోక్య సు దరీదేవి అను పేరుతో గౌరీదేవి సువర్ణవిగ్రహం చేయి చి శ్రీ త్రిపురా తక శ్రీమన్మహాదేవరకు త్రైలోక్య సుందరీ దేవితో కళ్యాణమహోత్సవ చేయి చినట్లు ఈ శాసనము నుడువుచున్నది ఈ యుత్సవమునకు కావలసిన ఉపకరణము లన్నియు ఆయనయే సమర్పి చెను ఈ వివాహ మహోత్స వమును అస ఖ్యాక మాహేశ్వరులును గురుదేవరయు శ్రీ త్రిపురాంతకదేవుని బాహ త్తర (72) ని యోగ ము ల వారున్నూ వేడుకతో స దర్శి చి ఇది సూర్య చ ద్రాదు లున్న తకాలము ప్రతి స వత్సరము ఇట్లే జరుగవలె స కాంతీ చిరి ఆలయాధికారులు స్వామికల్యాణమును సెంపు టకు పూచీపడిరి దేవియొక్కయు దేవరయొక్కయు ఉప హారములకు దేవికి ఎదుమువడ్లను దేవునకు ఎదుమూ డ్లును సమకూరునట్లు మల్లు సేనాధీశుడు వ్యవస్థ చేయించి ట్లు కన బడును శాసనము చివర ఫలశ్రుతియు రచి పబడి ది దేవుని తిరునాళ్ళ అనుటకు తిరునాడ్లు అను రూపము శాసనమున దు వ్రాసిరి పూర్వకాలపు తెలుగులో ర డ వర్ణములు అంత మ దుగల శబ్దముల బహువచ రూపము వ్రాయునప్పుడు డ్లు వాడుచు డిరి ఊరు ఊడ్లు మడి మడ్లు ఈ రీతిగఉ డెను చక్కని పూర్వభాష ఇందు ప్రయోగి చ బడినది దేవర సన్నధిని ఇయ్యకొనిరి

అడిద మల్లును గూర్చిన కొన్ని విశేషములు శాసనార౦ భమున దు లభి చుచున్నవి ఈ మహాసైనికుని తలి దండ్రుల పేర్లుగాని అతని కులగోత్రాదులు కాని దీనిలో చెప్ప బడక పోవుట ఒక లోపమనిపించును కాని అయన ప్రశస్తి మాత్రము చాలా గాంభీరముగా ఉన్నది స్వస్తి కాకతి కులతిలక శ్రీమత్ప్రతాప రుద్రదేవ మహా సామ్రాజ్య ధురంధర అభ గరాహుత్త రాయసాహువ మనుమగండ గోపాల శిరఃఖ డన మీసరగండ శ్రీమన్మహారాయ సకల

సేనాధిపతి రుద్రదేవ దక్షిణభుజాదండ శ్రీరామదేవ దివ్య శ్రీపాదభక్తులైన శ్రీమతు అడిద మలు (మల్లు)గారు ఈ ప్రశస్తినిబట్టి మల్లుసేనాపతి కాకతీయ సామ్రాజ్యమునందు గొప్పస్థానము వహించిన వ్యక్తి అనుట తెల్లము ఇందులో చెప్పబడిన "రుద్రదేవదక్షిణభుజాదండ" అను దానినిబట్టి కాకతి రుద్రమదేవి కాలముననే అడిద మల్లుగారు ప్రాభవమునకు వచ్చెనన్నమాట రుద్రమ్మగారు పురుషవేషము పురుష నామము ధరించి పురుషులకైన తమ్మారము తీసిపోని అవక్ర పరాక్రమముతో రాజరికము నిర్వహించిన వీరవనిత అడిద మల్లుగారు రుద్రదేవ దక్షిణభుజాదండ అనుగొప్ప బిరుదమును సాధించుటకు ఆమె ఏదియో మహత్తరసేవయే చేసియుండును అది ఇదమిత్థమని నిర్ణయించుటకు తగు ఆధారములు లేవు దేవగిరి యాదవులతో అయిన యుద్ధములందో కాయస్థ అంబదేవుని విద్రోహక చర్యలను అరికట్టుటయందో మరి ఎందు గమునందో అడిదంమల్లు సేనాపతి ప్రసంశనీయమైన వీరపాత్ర నిర్వహించియుండుటచేతనే ఆతనికి ఇంత ప్రాభవోపేతమైన బిరుదు లభించినది రుద్రమదేవి సామ్రాజ్య మేలుచున్నను క్రీ శ 1294 నాటికి ఆమె కడువృద్ధురాలగుచున్నది కావున రాజ్యభారము అధికముగా ఆమె మనుమడు దత్తపుత్రుడు ప్రాజ్ఞుడు మహావీరుడు అగు ప్రతాపరుద్రునిపైనిలచెను అందుచేతనే మల్లుగారికి గల ప్రతాపరుద్రదేవ సామ్రాజ్యధురంధర అను బిరుదు సార్థకమగుచున్నది

అదృష్టవశమున మల్లు దండనాయకుని శాసనమున దలి ఒక్క బిరుదు ఆనిచరిత్ర నన్వేషించుటకు ఒకింత తోడ్పడుచున్నది ఆ బిరుదమిది మనుమగండ గోపాల శిర ఖండన అనగా మనుమగండ గోపాలుని యుద్ధమునందు సంహరించినవాడు అన్నమాట ఈ మనుమగండ గోపాలుడెవడు? అడిదం మల్లుగారు ఈతని శిర ఖండనచేయు పరిస్థితి ఎట్లేర్పడినది? అని విచారింతము మనుమగండ గోపాలుడు విక్రమసింహపురము అను నామాంతరముగల నెల్లూరు ఏలిపాలించుచున్న చోడమాండలికుడు ఇతడు కాయస్థ అంబదేవుని అనుయాయుల వర్గమునకు చెందినవాడు అంబదేవుడీతనిని నెల్లూరు సింహాసనముపై నిలబెట్టెను కాయస్థనాయకులైన గంగయ జన్నిగదేవుడు త్రిపురారులు ముగ్గురును కాకతీయ చక్రవర్తులకు విధేయులై యశస్సుగాంచిరి కాని అంబదేవుడు కాకతీయ సామ్రాజ్యమునకు ప్రత్యర్థియై స్వాతంత్ర్యము వహించెను అతడు కాకతీయుల శత్రువులగు సేవణులతోను పాండ్యులతోను చేతులుకలిపి సామ్రాజ్యభాగములను ఆక్రమించుకొనుచుండెను

ప్రతాపరుద్రుడు యౌవనవంతుడై తన మాతామహి సామ్రాజ్యనిర్వహణమునందు తోడ్పడు ప్రజ్ఞావంతుడైన తరువాత అంబదేవుని దురాక్రమణములను ఎదుర్కొని శిక్షించుటకు పూనుకొనెను అంబదేవునిమీద త్రిశూలాకారముగ వ్యూహమేర్పరచుకొని కాకతీయ సైన్యములు నడచెను రుద్రమదేవి స్వయముగ ఒక మహత్తరసైన్యముతో త్రిపురాంతకముమీద విజృంభించెను అంబదేవుని సేనలిచ్చట పరాజయమునొంది దక్షిణాభిముఖముగ ఉపసంహరించుకొనెను కాకతీయ సైన్యమందలి మరియొక శృంగమునకు మహావీరుడైన అడిద మల్లు సేనాపతి నాయకత్వము వహించెను ఈతడొక వాహినితో సముద్రతీరమువెంట విక్రమించి నెల్లూరుపైబడెను మనుమగండ గోపాలుడు అంబదేవుని అనుయాయిఅగుటచే వీడు కష్టసమయములో అంబదేవునకు సైన్యముపంపించి తోడ్పడకుండ అరికట్టవలసిన ఆవశ్యకముకలదు ఈ యుద్దేశముతోనే అడిదం మల్లుగారు విక్రమసింహపురమువంక పరాక్రమించెను మనుమగండ గోపాలుడు మల్లుసేనాపతిని ఎదుర్కొనెను కాని విజయము ఆతనికి లభింపలేదు పైగా రణరంగమందు అసువులు గోల్పోయెను ఎతద్విజయసూచకముగనే మల్లుదండాధిపతి మనుమగండ గోపాల శిరఃఖండన అను కితాబును దాల్చెను

నెల్లూరు విజయము ఎప్పుడు జరిగియుండునని ప్రశ్న జనించును క్రీ శ 1294 నాటి త్రిపురాంతక శాసనములో దీని ప్రసక్తి వచ్చియుండుటచే అంతకుముందే మనుమగండ గోపాలుని సంహరించుట జరిగియుండును ఇతర శాసనాధారములవలన ఈ యుద్ధము క్రీ శ 1290 లో జరిగియుండునని చారిత్రకు లూహించుచున్నారు

అడిదంమల్లు సేనావతి గొప్ప వీరుడగుటయేగాక మంచి దైవభక్తికలవాడు త్రిపురాంతక దేవుని కల్యాణమునకు ఈతడు చేయించిన వ్యవస్థనుబట్టి ఈయన శైవమతాభిమాని అని చెప్పవచ్చును అయినను ఈతడు శ్రీరామదేవ దివ్య శ్రీపాదభక్తుడని శాసనము తెల్పుచుండుటచే మల్లుగారు శివకేశవులను భక్తితో ఆరాధించిన సజ్జనుడని చెప్పదగి యున్నది ఈయనకుగల మహారాయ సకలసేనాధిపతి అను బిరుదము ఇతరులకు కొందరికి ఉన్నట్లు కన్పించుచుండుటచే అడిద మల్లు

గారు కాకతీయ సామ్రాజ్యములో సలసేనాధిపతి గౌరవము నందిన వీరులలో ఒక్కనిగా భావించవలసి యున్నది.

ఖం ల రం

## అడిదము రామకవి

ఈ కవియు అడిదము సూరకవి తండ్రియగు బాలభాస్కర కవియు ఒక కాలముననే స్వగ్రామమగు రేగయందు నివసించుచుండిరి (విశేషాంశములకు అడిదము సూరకవి అను వ్యాసమును చూడదగును). ఆనాడు వారి గ్రామము పేరు భూపాలరేగ. రామకవి తాను రచించిన అర్జీ పద్యములలో తననుగూర్చి ఇట్లు వ్రాసికొనెను. "అవధారుదేవ! మహాప్రభూ! విన్నప శాశ్రితోత్తముడ శుద్ధాంధ్రకవిని పేరు రామన ఇంటిపేరడిదమువారు మాజాగ భూపాల రాజురేగ". కొంతకాలమునకు ఈ గ్రామము అప్పటి గ్రామపు గుత్తేదారగు దంతులూరి అన్నమరాజుగారి పేర అన్నమరాజురేగ అని వ్యవహరింపబడెనని తెలియవచ్చుచున్నది. అడిదము సూరకవి జీవితమునుగూర్చి వ్రాసిన అడిదము రామారావుగారికి ఈ అడిదము రామకవి ప్రపితామహుడు. ఈ రామకవియే కదలుమిటుమాని దివిజగంగాభవాని అను చెరువుమీద పద్యములు చెప్పిన ఘనుడు.

ఈ వృత్తాంతమిట్లున్నది. ఈ అడిదము వంశజులలో మూలపురుషుడుగ ఎన్నబడు అడిదము నారప్పకు విజయనగర సంస్థానప్రభువులలో ఒకరగు కృష్ణమరాజు మహారాజులుగారు రేగ అను గ్రామమున కొంత మాన్యమునుకరణీకము చేయుటకు దయచేసిరి. ఈ అడిదము నారప్ప వంశస్థులలో ఒక కుటుంబమువారు రేగలోనే నివసించుచు కరణికమును నిర్వహించుచుండిరి. ఈ వంశజులలో ఒకడగు ఈ రామకవియే చెరువు పద్యములను చెప్పినవాడు.

అడిదమువారి ఇనాము భూములు అనుములచెరువు అను ఒక చెరువుక్రింద ఉండెను. ఈ ఇనాముభూముల మళ్ళలో కొన్నిటికి దగ్గరగా మరియొకచెరువు ఉండెను. దానికి నోముల చెరువని పేరు. నోముల చెరువు పూర్తిగా నిండినపుడు రామకవి మున్నగువారి భూములకు ముంపువలన నష్టము కల్గుచుండెను. రామకవి రేగగ్రామపు గుత్తేదారగు దంతులూరు అన్నమరాజుగారికి తమకు కల్గిన నష్టమునుగూర్చి చెప్పుకొని నీటిముంపును వారింపుడని ఆతనిని ప్రార్థించెను. అన్నమరాజా విషయమును చెడచెవిని పెట్టగా రామకవి తన

ఏలినయగు విజయరామ గజపతి మహారాజుగారి తెలుపనిశ్చయించుకొని ఒక అర్జీని పద్యములతో వ్రాసి ఆ మహారాజునకు దానిని పంపెను. ఆ పద్యములకు అర్జీపద్యములనిపేరు. అర్జీపద్యములచే ఎట్టి ప్రయోజనము చేకూరలేదు. కవితయే శరణ్యమని యెంచి రామకవి తన మళ్ళలో కుత్తుకబంటి నీటిలో నిలుబడి గంగాభవానిని స్తుతించుచు తాటియాకుపై ఒక పద్యమును వ్రాసి ఆ ఆకును నీటిలో విడిచెను. అప్పటికిని తన సంకల్పము సిద్ధించకపోవుటచే రామకవి కుపితుడై గంగాభవానిని దూషించుచు నాల్గు పద్యములను నాల్గు తాటియాకులపై వ్రాసి ఆ ఆకులను నీటిపై విడిచెను. అంతట చెరువులోని నీరు గండితెగిపారి సముద్రమునకు తరలెనట. రామకవి సంతుష్టుడై ఇంటికేగెనట. ఈ పద్యరచనతో సంబంధించి పారంపర్యముగ చెప్పబడుచున్న విషయమిది. రామకవి రచించిన గంగాదూషణ రూపపద్యములో పరిపుట్టి ముంపదలచి అని వ్రాయుటకు బదులుగా మాపుట్టి ముంపదలచి అని అతడు వ్రాయుటచే అతని కళత్రవియోగమయ్యెనందురు.

రామకవి గంగను భూషించుచు వ్రాసిన పద్యము దలి భావమిట్లున్నది.

బ్రహ్మాండభాండ సంపత్తిని కుక్షియందిముడ్చుకొని పద్మనాభుని పదకమలమందు పుట్టి సకల రత్నాకరుడగు సముద్రుని చరణమాశ్రయించి పరమకైవల్యకీర్తియగు శంతనుని వామాంకభాగమున ఉండి అఖిలలోకారాధ్యుడైన శివుని జటాజూటాగ్రసీమయందు విహరించుచుండెడి ఓ గంగాభవానీ! ఈ పూసపాటి మహాస్థాన భూమియందు నిలువదగదు కదలిపొమ్ము.

గంగను దూషించుచు రామకవి నుడివిన పద్యముల భావము. ఓ గంగాభవానీ! నీదుభర్త ఆదిభిక్షుకుడని రోసి ఇచట నివసింపవచ్చితివా? జగడాల చీలియై సవతితో కలహించి ఇచట దాగుకొనవచ్చితివా? స్వర్గమునువీడి ఈ బీద బ్రాహ్మణుల క్షేత్రములలో నివసించి వారికి క్లేశమును కలిగింప వచ్చితివా? ఇట నుండి కదలిపొమ్ము.

ఓ! గంగాదేవీ! క్రూరసర్పములకు తావై నిశిత కంటకావృతములైన ఈ వృక్షములుకల ఈ తావే నీకు విరితోటయైనదా! ఇచటి చవుటినేలలే నీకు పూసెజ్జలైనవా? కప్పలకు పక్షులకు ఆకరములైన ఈ కేదారక్షేత్రములే నీకు విహార

భూములైనవా? బ్రాహ్మణక్షేత్రములకు హాని యొనరింప దుర్జనులకు కూడ బుద్ధిపుట్టదు నీకేల ఈ సంకల్పము ? దివిజ గంగాధవాని! ఈ క్షేత్రములను విడిచి సముద్రుని నాశ్రయి పుము"

రామ వికవితాప్రావీణ్యము కలవాడు. అమోఘమైన వాక్కు కలవాడు ఇతడు రచించిన గ్రంథాదికములు తెలియవు

గం లం కా

## అడిదము సూరకవి

ఆంధ్రదేశమున కవితావృత్తిచే ఖ్యాతిని పొందిన నియోగి కుటుంబములలో అడిదమువారి కుటుంబము ఒకటి మొదట వీరి ఇంటిపేరు మోదుకూరువారు ఆ కుటుంబమున వలి ప్రసిద్ధకవులు కొందరు తాము రచించిన గ్రంథములను ఏనుగులపై వేసికొని రాజాస్థానములను దర్శించి సత్కారముల మూలమున జీవితమును గడుపుచు డుటచే వారికి గ్రంథ వారణమువారు అను పేరు వచ్చెనట ఎదవ ఆ వంశజులలో నీలాద్రియను కవివరుడు కళింగరాజులలో ఒకనివద్ద ఆస్థాన కవిగా ఉండి ఆతనికి శత్రువులతో పొసగిన యుద్ధములో ధైర్యసాహసములతో పోరాడెను ఆ ప్రభువు మెచ్చి ఆ నీలాద్రి కవి ద్రవ్యముతోబాటు ఒక ఖడ్గమును (అడిదము) గూడ ప్రసాదించెనట నాటినుండి ఈ వంశములోనివారికి అడిదము వారను ఇంటిపేరు కల్గెనందురు నీలాద్రికవికి మూడవ మనుమడగు బాలభాస్కరకవి శుద్ధాంధ్ర రామాయణమును రచించెను

కవి సంశయవిచ్ఛేదము నందలి ఒక పద్యమువలన అడిదము సూరకవి భాస్కరమంత్రి పుత్రుడనియు చినలచ్చమంత్రి పౌత్రుడనియు తెలియవచ్చుచున్నది ఈ కవి క్రీ శ 1720 సంవత్సరమున భూపాలరాజురేగ అను గ్రామమున జన్మించెను ఈ గ్రామము విజయనగరమునకు తూర్పున 5 క్రోసుల దూరమున ఉన్నది దీని ఇప్పటి పేరు పూసపాటి రేగ

అడిదము సూరకవి తన తండ్రియగు భాస్కరకవి వద్దనే ఇరువది సంవత్సరములు వచ్చువరకు సాహిత్యమందును కవిత్వరచనయందును సుశిక్షితుడయ్యెను తండ్రి మరణానంతరము ఈ కవి తన జన్మస్థానమును త్యజించి చీపురుపల్లెకు సమీపమున ఉన్న రామచంద్రపురమున (గురివిందాడ) నివసించుచు అచటనే తన జీవితమును ముగించెను కాని అడిదము సూరకవికిని ఇంకొక కవి నిప్పంచర్యాయమున జరిగిన సంభాషణమువలన ఇతడు చీపురుపల్లెయందున్నట్లు తెలియుచున్నది ఇతడు కోటిపల్లెయందున్న వడ్డాదివారి ఎల్లిను సమ్మ అను నామెను వివాహమాడెను చీపురుపల్లెలో ఉన్న కాలముననే సూరకవికి ఒక కుమారుడు ఒక కూతురు కలిగిరి కుమారుడు బాలభాస్కరుడు కుమార్తె నరిసమ్మ రేగయందువలె చీపురుపల్లెకు దగ్గరఉన్న కంచరాములోగూడ ఈ కవికి మాన్యము డెను

ఈ కవి దరిద్రుడగుటచే ప్రతిసంవత్సరము వర్షాశనమునకు పర్లాకిమిడి పాలకొండ బొబ్బిలి చెముడు శృంగవరపుకోట మున్నగు తావులకు పోవుచుండువాడు రైలు సదుపాయములేమిచే ఈ కవి పాదచారియై కాశీక్షేత్రమును దర్శించెనట

సూరకవి క్రీ శ 1750 ప్రాంతమున విశాఖపట్టణపు మండలమందున్న విజయనగర సంస్థానపు ప్రభువగు పూసపాటి చిన విజయరామరాజుగారియొద్ద కవీశ్వరుడుగా ఉండెను సంస్కృతాంధ్రములయందు గొప్ప పాండిత్యము కలవాడు స్వతంత్రుడు రాజులనుగూడ లెక్కచేయక కఠినముగను నిర్భయముగను తన ఆశయములను అవిష్కరించు స్వభావము కలవాడు ఇతడు ఆశుకవిత్వమందు దిట్ట గడియకు నూరు పద్యములు గంటములేక రచింతు అను వాక్యమునుబట్టి సూరకవికి ఆశుకవిత్వమందు గొప్ప సామర్థ్యము ఉండెనని మనమూహింపవచ్చును ఆంధ్రదేశమందు నిలిచియున్న ఈ కవీశుని చాటుపద్యము లిందుకు తార్కాణ ఈతని చాటుపద్యములు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్యమణిమంజరి అను గ్రంథమున పొందుపరచబడి యున్నవి ఏ కారణముననో తనను ఆస్థానమునుండి తొలగించిన పూసపాటి పెద్దవిజయ రామమహారాజుగారు బాదుల్లాఖానుతో యుద్ధము చేయబోయి పరాజితుడై తిరిగివచ్చుచుండగా ఆతనిపై కసితో ఈ కవి ఒక సీసపద్యము చెప్పెను ఇతని కొన్ని చాటువులకు కొన్ని గాథలు కలవు తన శిష్యులనుగూర్చియు భార్యకోరిన మీదట తన కుమారుడు బాచనిమిత్తమును గూర్చియు శృంగవరపుకోట జమీందారగు రాజభూపాలరాజుగారు విజయనగరపు పూసపాటివారితో పోరాడబూనినపుడును పర్లాకిమిడి రాజావారిని ధిక్కరించియు పాలకొండనుగూర్చియు ఒత్తుల

అన్నయ అను దాతను కొనియాడుచును పాలకొండ ప్రాంతమును గూర్చియు బోయదొరగలను డి ఆత్మరక్షణము చేసుకొనిన సందర్భమునను గంటముచేసి యిచ్చిన కమసాలిమీదను మన్నెపుదొరలమీదను తనను ఆదరించిన పొన్నపాటి వేంకట మంత్రి స్వర్గస్థుడైనపుడును సూరకవిచెప్పిన చాటుపద్యములు పెక్కులు కలవు

సూరకవి తాను నానార్థవిరార్థ సూక్తినిధిగా చెప్పుకొనెను ఇతడు 18 వ శతాబ్దమున ప్రౌఢప్రబంధ రచనకు ప్రసిద్ధులైన కవులలో ఒకడు లాక్షణికుడు కవిజనరంజనము లేక చంద్రమతీ పరిణయము కవి సంశయవిచ్ఛేదము చంద్రాలోకము ఆంధ్రనామశేషము రామలింగేశ శతకము అను గ్రంథములను ఈకవి వ్రాసెను

ఈ గ్రంథములలో కవి జనరంజనము మూడాశ్వాసముల శృంగారప్రబంధము ఇందు వర్ణింపబడిన విషయము చంద్రమతీహరిశ్చంద్రుల వివాహము శైలియందును కల్పనా విషయమునను ఈ గ్రంథమునందలి పెక్కు పద్యములు నైషధము వసుచరిత్రము కవికర్ణరసాయనము మొదలగు ప్రసిద్ధ ఆంధ్ర ప్రబంధములలోని పద్యములకు ఛాయలుగ ఉన్నవి కవి సంశయవిచ్ఛేదము మూడు ప్రకరణముల లక్షణ గ్రంథము చంద్రాలోకమొక అలంకారశాస్త్రము సూరకవి విత్వము సత్కవి సమాదరణీయము

సూరకవి తిట్టు కవిత్వమునగూడ గొప్ప పేరు కలవాడు సూరకవి తిట్టు కమసాలి సుత్తెపెట్టు అను లోకమందలి పలుకులే ఈ విషయమును చాటుచున్నవి ఎడ్డిప్రోలు లక్ష్మణకవి తన లంకావిజయమున తిట్టుకవితకు ప్రసిద్ధికెక్కిన భీమన శ్రీనాథుడు మున్నగు కవులతోబాటు సూరకవినిగూడ పేర్కొనెను ఆ కాలమున సూరకవియెడల సామాన్య జనులకు భక్తికంటె భయమే అధికముగ ఉండెను సూరకవి తిట్టుకవిత్వముతో సంబంధముగల కొన్ని విషయములు ఒకప్పుడు ఆళ్ళ సరమయ్య అను కోమటి ఇంటజరిగిన వివాహ సందర్భమున సూరకవి కవితా సంభావనకు పోయెనట ఆ కోమటి విసుగుకొని పీణిపాగర (పాము కరచుగాక) బావ నోడు దాచిపెట్టినట్టు పొద్దుచే పారొచ్చేడు అని సూరకవిని తిట్టెనట కోపించిన సూరకవి ఆ పామేనిన్నుంగరవ అయ్యో సరవా అని శపింపగా తిట్టుటయే తడవుగా ఒక కృష్ణసర్పము ఇంటిమునుంజూరు దూలమున చేయిపెట్టియున్న సరవయ్యను కరచి విగతప్రాణుని చేసెనట ఒకప్పుడు సూరకవి చీపురుపల్లినుండి శృంగవరపుకోటకు పోవుచు డెను మార్గమధ్యమున ద్వారపూడిలో త్రాగుటకు మజ్జిగ దొరకనందున దూరమైపోయెనా పాడి ద్వారపూడి అని ఒక శాపవాక్యమును పలికెనట నాటి సాయంకాలము ఐదారిండ్లలో ఆవులు గంటెడు పాలైన ఇయ్యలేదట గృహయజమానులు క్షమించుమని సూరకవిని వేడుకొనగా ఆతడు ప్రసన్నుడయ్యెను ఆవులు యథాప్రకారము పాలియ్యదొడగెనట ఈ వృత్తాంతము కవికిగల నిగ్రహానుగ్రహశక్తులు రెండిటికిని నిదర్శనము విరుపకనుగ్రహించి నిరుపేద ధనధిపు తుల్యుజేతునను సూరకవి వాక్యము ఈ విషయమును బలపరచుచున్నది

అడిదము సూరకవికిని తత్సమకాలికుడగు కోట్రశాల కవికిని వాగ్వాటి మెండుగ నుండెనట వీరిరువురకు గల సంబంధము కృష్ణార్జునుల సంబంధము వంటిదట వీరిరువురు వాగ్వాటి ఓడి పర్వతాలను కవి ఒకడు పారిపోయెనట సూరకవి సమస్యాపూరణమునుగూర్చి దిట్ట మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరల దఱున్ అను సమస్యను సామర్థ్యముతో పూరించి సారతర ప్రబంగము లక్ష్మణయను గా నొకరించినట్టివాడని ఇతడు ఆత్మస్తుతి ఒనర్చెనెను కవితాతత్త్వము సూరకవియే యెఱుగున్ అని ఒక బట్టుకవి సూరకవియొక్క కవితాతత్త్వజ్ఞతను పొగడెను తన శిష్యులలో అక్కినమ్మవారు పారమందిరని దూబకృష్ణుడు చదువని దుఃఖపడెడివాడని మురపాక సూరక గిరుడై నిల్చెనని సూరకవి చెప్పెను

ఈ సూరకవిని అధునాతనులును ప్రశంసించియున్నారు మంత్రిపెగడ సూర్యప్రకాశకవి తన కృష్ణార్జున సంవాదములో ఉర్వీశులచే గడుమన్ననఁగొని యొప్పెంబడు సూరక కవీంద్రుఁ దలతుఁ బటుగుణసాంద్రున్ అని సూరకవిని ప్రశంసించెను కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు బిల్వేశ్వరీయములో అధికుఁడౌనుగాదె యడిదము సూరన్న నియమకూరుడనమనిష్ఠచేత అని సూరకవిని ప్రశంసించెను

గ ల కాం

## అడివికొలను

పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెం తాలూకాలో అడివికొలను అను గ్రామమున్నది దీనికి 6 మైళ్ల దూరములో తాడేపల్లిగూడెం పట్టణముకలదు అడివికొలను గ్రామవిస్తీర్ణము 4080 ఎకరములు తూర్పున కాకరమిల్లి ఎనకేపల్లి పడమట కొల్లేరు భీమవరం తాలూకా ఉత్తరమున నిడమర్రు వెంకటాపురం తిమ్మారావుగూడెం దక్షిణమున చానమిల్లి ఈగ్రామమునకు సరిహద్దులు ఈగ్రామము చదునుగానున్న పల్లపు ప్రదేశమునగలదు

1961 న జనాభా లెక్కల ప్రకారము ఈగ్రామమందలి పురుషులు స్త్రీలుకలసి 3537 మంది వీరిలో 166 మంది షెడ్యూలు తరగతులకు జాతులకు చెందినవారు ఇచ్చట ఇండ్లు ఒకచోట గుంపుగాను ఒకచోట ఏకపంక్తిగాను శివార్లుగాను ఉన్నవి నీటిలో 325 పెంకుటిండ్లు 8 కాంక్రీటు కప్పుగల ఇళ్ళు 4 ఒక అంతస్తుగల మేడలు రెండు పెక్కు అంతస్తులుగల భవనములు ఇచట జనులందరు వరి అన్నముతిందురు గ్రామ మధ్యభాగమున గల చెరువులోని నీటిని త్రాగుదురు

మోకాటి కోడుకాలువ రావికోడుకాలువ తూర్పు చెరువు పడమటచెరువు రాజులచెరువు ఈగ్రామమునకుగల నీటివసతులు రెండురకముల వరిపంటపండును భూమియంతయు నల్లరెగడినేల 1966 67 సం లో పంటలక్రింద 3696 ఎకరముల భూమి ఉపయోగపడినది ఇది అంతయు కాలవక్రింద సాగుబడి అయెను ట్రాక్టరు 100 ఎకరముల భూమిని దున్నెను లారీలపై రెండెడ్లబండ్లపై గణపవరమునకు వడ్లురవాణా జరిగెను

ఈ గ్రామమున గేదెలు ఎద్దులు ఆవులు మేకలు గొర్రెలు పందులు కోళ్ళుకలసి 1556 వీటిలో 60 ఆవులు 234 గేదెలు సాలీనా 90 065 లీటర్లపాలు 4300 కి గ్రా వెన్న 1500 కి గ్రా చేపలు గ్రామస్థులే వినియోగించుకొనిరి మాంసము గ్రుడ్లు దొరకును

వ్యవసాయము ఇచటిజనుల ముఖ్య జీవితాధారము కమిషన్ ఏజంట్లు కంసాలివారు వడ్రంగులు కుమ్మరులు తాంపుత్తులవారు గలరు మంగలివారు చాకలివారు గొల్లవారు వడ్డెరవారుకూడ ఉన్నారు వ్యవసాయ దారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి రు 2 లు స్త్రీకి రు 1 75 లు

కేశవ సోమేశ్వర రామస్వాముల ఆలయములుకలవు గ్రామదేవతం గాలమ్మగుడి ఒకచర్చికలవు కేశవాదులఆలయములకు 23 ఎకరముల భూమి ఉన్నది ఈ 22 ఎకరముల మింజుమలె సాలీనా 196 బస్తాల వడ్లువచ్చును కేశవస్వామి సోమేశ్వరస్వామి ఉత్సవములు సంగాలమ్మజాతర మొదలగునవి జరుగును

అడివికొలను గ్రామమునకు 9 మైళ్ళదూరములో ఉండి రైల్వేస్టేషను ఉన్నది 25 కంకరరోడు 6 మట్టిరోడ్లు ఈ గ్రామమున కలవు దీనిని పొరుగు గ్రామములతో కంకరరోడ్లు కలుపుచున్నవి రెండురిక్షాలు రెండు మోటారుకార్లు రెండు ఒంటెద్దుబండ్లు 74 రెండెడ్లబండ్లు 125 సైకిళ్ళు ఇచట ప్రయాణములకు ఉపయోగపడుచున్నవి

అడివికొలనులో ఒకబ్రాంచిపోస్టాఫీసు రెండుసమితి ఎలిమెంటరీ స్కూళ్ళు పోసంసెట్టి రామమూర్తి హైస్కూలు కలవు ఇచటిహైస్కూలు చదువులకు 50 విద్యార్థులు కాకరమిల్లి చానమిల్లి బువ్వనపల్లి జాలాయపాలెం గ్రామముల నుండి వత్తురు గ్రామవిద్యుచ్ఛక్తిని 85 ఇండ్లును బియ్యపు మరయు ఎండిమరయు ఉపయోగించుకొనుచున్నవి

ఇదిపంచాయితి ఏరిపాలన కలగ్రామము గ్రామపారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లున్నవి ఒక గ్రంథాలయము రేడియో లౌడ్ స్పీకర్లు కలవు విశాలసహకార పరపతి సంఘము 1966 67 లో రు 2 61 554 లను గ్రామస్థులకు అప్పులుగా ఇచ్చినది ఇంగ్లీషు వైద్యుడు ఆయుర్వేద వైద్యులు కలరు ఈగ్రామమున సంతలులేవు 20 కిరాణాదుకాణములు 4 కిళ్ళీ సిగరెట్టు సోడాషాపులు 6 కాఫీహోటళ్ళు 3 కూరగాయల అంగళ్ళు సైకిళ్ళషాపుగలవు

విద్యార్థులు కళాశాల చదువులకు తాడేపల్లిగూడెము ఏలూరుకు భీమవరమునకు నరసాపురమునకు పోవుదురు పోలీసు స్టేషనుకు సబ్ రిజిస్ట్రారు ఆఫీసుకు బ్లాకు అభివృద్ధికే ద్రమునకు గ్రామస్థులు గణపవరమునకు పోవుదురు కోర్టులు తాలూకా కచేరి మున్నగువాటికి 18 మైళ్ళలో ఉన్న తాడేపల్లిగూడెమునకును ఆసుపత్రులకు 16 మైళ్ళలోనున్న భీమవరమునకును పశువుల ఆసపత్రికి 12 మైళ్ళలోనున్న పిప్పరకును పోవలెను గణపవర లోని వారసంతకు గ్రామస్థులుపోవుదురు శ్రీ పోసంశెట్టి రామమూర్తిగారు ఇచట ప్రముఖదాత

మా శ్వే

## అడివిరావులపాడు

అడివిరావులపాడు కృష్ణాజిల్లా నందిగామతాలూకాలో ఉన్నది ఇది హైదరాబాదు బందరు బస్సుమార్గమునకు 8 మైళ్ళలోను మధిర రైల్వేస్టేషనుకు 15 మైళ్ళలోను విజయవాడకు 33 మైళ్ళలోను కలదు ఇది నందిగామకు పడమటగా ఉన్నది ఈగ్రామములోని జనాభాసంఖ్య 894 ఈసంఖ్యలో షెడ్యూలు జాతులవారు 38 మంది జనుల జీవనాధారము వవ్యసాయము

పూర్వకాలమున ఈగ్రామము ప్రఖ్యాతిగడించినది నాడు శ్రీకృష్ణదేవరాయల వరిపాలనలో ఉన్నభాగములలో ఇది ఒకగ్రామము విజయనగరసామ్రాజము పతనమయిన తరువాత ఇది నైజాముపాలనలోనికి వచ్చెను ఈగ్రామము తుర్లపాటి వంశమువారికి బహూకరించబడినది ఈ తుర్లపాటివంశీయులు ఈభాగములకు దేశపాండ్యులు ఇప్పటికిని ఈగ్రామము 300 సంవత్సరములనుండి తుర్లపాటి వంశీయులక్రిందనే ఉన్నది దీనిని అగ్రహారమనిరి

ఈగ్రామమందు శివ ఆంజనేయ చెన్నమల్లికార్జున స్వాముల దేవాలయములును ఒకచర్చియు ఒకమసీదును లవు చెన్నమల్లికార్జునస్వామి విగ్రహము ఇక్కడ లింగరూపమున కలదు ఈస్వామికి ఆశ్వయుజ శుద్ధదశమినుండి బహుళచవితి వరకు పది దినములు ఉత్సవములు జరుగును దశమినాడు స్వామి విగ్రహమును జమ్మివృక్షముక్రింద ఉంచి పూజి తురు పుష్పములతో తయారుచేసిన బతకమ్మచుట్టు బాలికలు నృత్యము చేయుదురు ఈదేవతకు అభిషేకము చేయుదురు ఈబతకమ్మ పండుగ చాలపురాతనమైనది దీనికి స్థానికప్రాధాన్యము కలదు అన్నికులములవారు ఇందుపాల్గొందురు పూజాభిషేకానంతరము భక్తులకు ప్రసాదమిత్తురు చైత్రశుద్ధ నవమినాడు శ్రీరామకల్యాణము జరుగును మొహరంసమయమున మహమ్మదీయులు ఉపవాసముందురు

మా శ్వే

## అడివివరం

అడివివరం గ్రామము విశాఖపట్టణముజిల్లా విశాఖపట్టణము తాలూకాలో విశాఖపట్టణమునకు పదిమైళ్ళ దూరములో ఉన్నది తూర్పున భారపాలెపు పడమట కానమ్మగట్టు ఉత్తరమున జీనిగినిపాలెం రిహద్దు దక్షిణమున సింహాచలము కొండ ఈ గ్రామపు సరిహద్దులు దీని అక్షాంశము 17 47 రేఖాంశము 83 16 గ్రామ విస్తీర్ణము 8718 ఎకరములు ఈ గ్రామమునకు చుట్టును కొండలు గలవు

ఈగ్రామములో 1931 సం॥లో 2617 మంది 1941 సం॥లో 3017 మంది 1951 సం॥లో 3714 మంది 1961 సం॥లో 4716 మంది జనులు ఉండిరి వీరిలో షెడ్యూలు తరగతివారు షెడ్యూలు జాతులవారు 388 మంది 195 సం॥ నుండి 1961 సం కు 960 మంది జనం పెరిగిరి ఇది సహజవృద్ధి ఇచట ఇండ్లు శివార్లుగ ఉన్నవి వీటిలో 186 పెంకుటిండ్లు అయిదు కాంక్రీటు కప్పుగల ఇండ్లు రెండు ఒక అంతస్థుగల మేడలు ఒక ఎక్కువ అంతస్థులు గల భవనము

ఇచట 15 శాతము జనులు జొన్న గోధుమ చోడి అన్నములను తిందురు ఈ గ్రామ జనులు నూతినీటిని త్రాగుదురు త్రాగునీటిని పరిశుద్ధముచేసి కుళాయిలద్వారా అందచేయు సౌకర్యముకలదు నీటిఎద్దడిలేదు

ఈ గ్రామమునకుకల నీటివనరులు 39 ఎకరముల విస్తీర్ణముగల రామన్నచెరువు కైలాస పర్వతము పైనుండి జారు గంగధార మొదలయినవి వీటిక్రింద వరి గంటి చోడి మిరప వేరుసెనగ నువ్వు పెసర మినుము మొదలగు పంటలు పండును మామిడి జీడిమామిడి పనస అనాస తోటలుకలవు సరుగుడుచెట్లు కొబ్బరితోటలు తాటితోటలు చింతతోపులు ఉన్నవి పెంచబడిన వంగ బెండ మొదలగు కూరగాయలను స్థానికులు తమ అవసరములకే ఉపయోగించుకొందురు ఎర్ర అరటిపండ్లకు అనాసపండ్లకు సంపెంగ పుష్పములకు మిక్కిలి ప్రసిద్ధిచెందిన గ్రామమిది వ్యవసాయ ఫలసాయములు బండ్లపై లారీలపై స్థానిక మార్కెట్టునకును విశాఖపట్టణము కును రవాణా అగును మామిడి జీడిమామిడి పనస అనాస మొదలగు ఫలములలో శ్రీవంతు ఫలములు మాత్రము ఎగుమతి చేయుదురు 1966-67 సం॥ ఇక్కడ పంటలక్రింద ఉపయోగపడిన భూమి మెట్ట మాగాని కలిసి 500 ఎకరములు చెరువులక్రింద 100 ఎకరములభూమి బావులక్రింద 40 ఎకరముల భూమి ఇతర వనరులక్రింద 200 ఎకరముల భూమి సాగుబడి యైనది 40 ఎకరములు 40 ఎకరముల భూమికి నీటిని సప్లయిచేసెను ఇచ్చట 139 ఎకరముల రిజర్వు అడవికూడ ఉన్నది అడవి సమీపమున ఉండుటచే అప్పుడప్పుడు చిరుతపులులు అడవిపందులు మొదలగు మృగములు ఈ గ్రామసమీపమునకు వచ్చుచుండును

ఈ గ్రామమున గేదెలు ఎద్దులు ఆవులు మేకలు గొఱ్ఱెలు పందులు గుఱ్ఱములు కోళ్ళు కలసి 3047 వీటిలో 250 గేదెలు 100 ఆవులు దినమునకు 160 లీటర్ల పాలు 150 గ్రుడ్లు స్థానికులు వాడుదురు

ఇచటి జనుల ముఖ్య జీవితాధారము వ్యవసాయము అడవికలప వృత్తిగాకలవారు దుకాణాదారులు క్రయ విక్రయదారులు కలరు కసాలులు వడ్రంగులు మ్మరులు కుమ్మరులు తాపీపనివారు తెలికలవారు మంగలివారు చాకలి వారు గొల్లవారు నూలు మగ్గముల వృత్తులవారను కలరు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి 4 00 లు స్త్రీకి రు 2 00 నూనె మిలులు స్థానిక అవసరములను తీర్చును ఇచట కుండల పరిశ్రమ ఉన్నది రాతి క్వారియొకటి కలదు దానిలో ఇండ్ల నిర్మాణావసరములకు సరిపడు రాయి దొరుకుచున్నది

ఇచట నృసింహస్వామి వేంకటేశ్వర స్వామివార్ల దేవాలయములు కలవు పాదాలమ్మ బంగారమ్మ పైడితల్లెమ్మ గుడులు ఉన్నవి 1968 నవంబరులో ఇచట చేకూరిన దేవాదాయము రు 1 92 676 లు చైత్రశుద్ధ ఏకాదశినాడు నృసింహస్వామి కల్యాణము వైశాఖ పౌర్ణమినాడు చందన యాత్ర పుష్యబహుళ అమావాస్యనాడు తెప్ప తిరునాళ్ళ మొసలివేట జమ్మివేట మొదలగు ఉత్సవములు జరుగును

అడివివర గ్రామమునకు మూడుమైళ్ళ దూరములో అడివివరమను రైల్వేస్టేషను ఉన్నది ఈ గ్రామము బస్సు మార్గముపైననున్నది సింహాచలపు దేవస్థానము బస్సులు ప్రైవేటుబస్సులు సర్వీసు నడుపుచున్నవి విశాఖపట్టణమునకును శ్రీకూర్మం నుండి విజయనగరమునకును అన్నవరం నుండి సింహాచలమునకును విజయనగరము నుండి విశాఖపట్టణమునకునుపోవును సింహాచలము దిగువనుండి కొండపైకి దేవస్థానము బస్సులు పోవును ఈ గ్రామములో కంకరరోడ్లు మట్టిరోడ్లు కలవు ఈ అడివివరమును గోపాలపట్టణముతో ఒక కంకరరోడ్డు కలుపుచున్నది దేవస్థానమువారి ఒక జీపు ఒకకారు ఉన్నవి ఇవిగాక 5 గుఱ్ఱపుబండ్లు 16 రెండెడ్ల బండ్లు 120 సైకిళ్ళుగూడ ప్రయాణములకు ఉపయోగపడుచున్నవి

అడివివరంలో ఎబ్ పోస్టాఫీసు తంతి కార్యాలయము టెలిఫోను ఉన్నవి విజిగినపాలెంలోను పాత అడివివరంలోను సింహాచల కొండపైనను ఎలిమెంటరీస్కూళ్లు కలవు ఎస్ ఎస్ ఓరియంటల్ హైస్కూలు ఆగమ పాఠశాల కలవు ఈ ఆగమపాఠశాలలో పాంచరాత్రము శైవాగమము వైఖానసాగమము ఋగ్వేద యజుర్వేద సామవేదములు ద్రవిడవేదము నాదస్వరము డోలువాద్యము మొదలయినవి నేర్పుదురు విద్యార్థులు హైస్కూలు చదువులకు మూడు మైళ్ళలో ఉన్న గోపాలపట్నము జిల్లాపరిషత్తు హైస్కూలునకు కళాశాల చదువులకు విశాఖపట్టణమునకు పోవుదురు గ్రామములో విద్యుచ్ఛక్తి కలదు ఇది 120 వీధి దీపములకు 160 ఇండ్లకు ఉపయోగపడుచున్నది

ఇది పంచాయతి పరిపాలన లో గ్రామము గ్రామ పారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లున్నవి ఈ గ్రామమున దేవస్థానపు పుష్పవనము రేడియో లౌడ్‌స్పీకర్లు సత్రములు ఉన్నవి ఇచటి విశాల సహకారసంఘము 500 మందికి 1968 సంవత్సరములో రు 30 000 లు అప్పుగా ఇచ్చినది ఇక్కడ ఒక రూరల్ ఆసుపత్రి కలదు ఆయుర్వేద వైద్యులు కలరు వారపు సంతలు కలవు కూరగాయలు దొరకును 8 కిరాణా దుకాణములు 20 కాఫీహోటళ్ళు 9 సోడా కిళ్ళీ సిగరెట్టు దుకాణములు 3 సైకిలుషాపులు 2 క్షౌరశాలలు 30 ఆటవస్తువుల షాపులు కలవు సినిమాథియేటరునకు పోలీసుస్టేషనుకు గోపాలపుర పట్నమునకును కోర్టులకు సబ్‌రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి జనరల్ ఆస్పత్రికి పురుళ్ళఆస్పత్రికి పదిమైళ్ళలోనున్న విశాఖపట్టణమునకును బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు ఆరు మైళ్ళలోనున్న పెందుర్తికిని పోవుదురు

సింహాచలముపై వరాహ లక్ష్మీనరసింహస్వామి ఆలయము కలదు అచటి పదునొకండవ శతాబ్దినాటి శాసనము వలన అంతకు పూర్వమే ఈ దేవాలయము గొప్ప పేరొందినట్లు తెలియుచున్నది 800 అడుగుల ఎత్తుగల ఈ కొండపైకి పోవుటకు 1 000 మెట్లు ఉన్నవి స్వామివారికి చక్రవర్తులు, రాజులు దానములిచ్చినట్లు ఇచటి శాసనములవలన తెలియుచున్నది క్రీ శ 1187 56 లలో తూర్పు చాళుక్యరాణి మూడవ వెలనాటి గొంకునియొక్క కుమారుని ఓడించి స్వామివారి బంగారు విగ్రహమును అర్పించినట్లు తెలియుచున్నది ఇచట మత్స్యరాజుల చిహ్నములుకల ఆభరణములు కలవు క్రీ శ 1516 సంగలో శ్రీకృష్ణదేవరాయలు తన జైత్రయాత్రా సందర్భమున ఇచ్చట విడిదిచేసి శ్రీ నృసింహస్వామి

వారికి 991 మణులుగల క రవాశరము ను ఇచ్చెను ఈ ఆలయము నకు ధర్మక ర్తృత్వమును విజయనగర స స్థానాధిపతులు నిర్వ హి చిరి వీరు సాలునకు రు 30 000 ల ఆదాయము వచ్చు భూమిని దేవునకు మర్పి చిరని తెలియుచున్నది

శ్రీ మహావిష్ణువు ఇచట ప్రహ్లాదుని కటాక్షించెనట ప్రహ్లాదుడే ఈ దేవాలయమును నిర్మి చెనట ప్రహ్లాదుడు కొంత కాలము రాజ్యమేలి మోక్షమునొ దిన ఎదప ఈ ప్రాంతము శిథిలమయ్యెను పురూరువ చక్రవర్తి విమానమెక్కి ఈ ప్రా త మున పోవుచు డగా అది స్వయముగా ఆగిపోయెనట ఇచట పుట్టలో మరుగునపడిన మూర్తిని వెలికితీయి చి వై శాఖ శుద్ధ తదియనాడు ఆతడు పూజించెనట గ ధపుపూత పూయబడి యున్న నృసింహస్వామిని ప్రతిదినము పూజింతురు వై శాఖ శుద్ధ తదియనాడు గంధమును ఒలిచి స్వామివారి నిజస్వరూప మును దర్శి తురు అట్టి దినమును చ దనయాత్ర ప డుగగ భావి తురు 11 వ శతాబ్దా తమున శ్రీ రామానుజాచార్యుల వారు ఈ క్షేత్రమును దర్శించిరట 108 దివ్యతిరుపతులలో దీని ఒకటిగా శ్రీవారు పేర్కొనిరట కనుక ఈ క్షేత్రము అఖిలభారత ఖ్యాతిని గా చినది ఉత్తర దేశమునుండి కూడ యాత్రికులువచ్చి స్వామివారిని దర్శి తురు

మా శ్వే

## అడ్డకాలగచ్ఛ

వేంగిచాళుక్య కులోద్భవుడై న అమ్మరాజ విజయా దిత్యుడు రెండవచాళుక్యభీమునకు లోకమహాదే వలన కలిగిన పుత్రుడు ఈయన రాజ్యపాలనకాలము క్రీ శ 945 970 ఈయన వేయి చిన కలుచు బ్రరు శాసనమున అడ్డకాలగచ్ఛ ప్రశ స గలదు ఈ శాసనమున పెక్కు చరిత్రాంశములతో బాటు అప్పటి రాజాశ్రయమునుపొ దిన జైనమతప్రస క్తి కూడ కలదు చామకాంబ పట్టవర్ధకాన్వయ శ్రేష్ఠ ఈమె వలహారి గణములోని అడ్డకాలగచ్ఛకు చె దిన జైనశ్రావకి అమ్మరాజు ప్రేయసి సర్వలోకాశ్రయ జిన భవనమును జైన మందిరము నంటియున్న ఉచిత భోజనపసతిగృహము ఛిద్రమై యుండగా దాని మరమ్మత్తుల నిమిత్తము తన గురువగు అర్హ న దనునికి అత్తిలినాడు విషయములోని కలుచు బ్రరు అను గ్రామమును తన ప్రియునిచే దానమిప్పించినదీమె అత్తిలి అను గ్రామము పశ్చిమగోదావరి జిల్లాలోని తణుకుకు ఏడుమైళ్ళ దూరమున ఉన్నది పూర్వము ఈ గ్రామము అత్తిలినాడు

విషయమునకు ముఖ్యపట్టణముగా ఉ డెను కలుచు బ్రరు గ్రామము నేడు అత్తిలి ఫిర్కాకుచెంది 1422 జనాభాతోనున్న క చుమర్రు గ్రామమే అయి యు డవచ్చునని చారిత్రకుల అభిప్రాయము

ఆ ధ్రదేశమున దొరకిన ఇతరశాసనముల దు కోటిమడువ గణములోని న దిగచ్ఛము దేశిగణము మొదలగునవి ఉదాహృ తములై నవి ఇతరమతములందువలెనే జైనమును దుకూడ శాఖోప శాఖలు ప్రతానుష్ఠానముల దు ఇంచు భేదముతో ఆ ధ్రదేశమున వర్ధిల్లినవి గచ్ఛము అను ఉపశాఖ శ్వేతాంబర జైనమునకు చె దినది గచ్ఛములన పేరబరగు శ్వేతాంబర జైనశాఖలు ఎనుబదినాలుగు కలవని జైనసూత్రములు వచి చినవి కలుచు బ్రరు శాసనమున జై నమతాచార్యుల శిష్య పర పర సూచింప బడినది అ దు సకలచంద్ర సిద్ధా తదేవని ఆచార్యు డనియు ఆతని శిష్యుడు అయ్యపోటి మునీంద్రుడనియు అతని శిష్యుడు దానపరిగ్రహీతయై అర్హనంది యనియు చెప్పబడి నది ఈ అర్హన ది శిష్యురాలే చామకా బ

శాసనమందు చామకా బ గణికయని చెప్పబడినది ఆమె గుణగణములు ఇటు వర్ణింపబడినవి చామకాంబ పద్మ ములను వికసింప జేయునట్టి సూర్యకాంతివంటిది నట్టువకత్తె లలో శ్రేష్ఠురాలు జైనమతమను సముద్రమునకు చ ద్రుని వంటిది

మత సామరస్యమునకు సహనమునకు వే గిచాళుక్య నృపతులు పేరొందినవారు అవై దికమతమైన జైనము శైవముతోపాటు రాజాదరణము పొందినదని రుజువుపరచు టకు కలుచు బ్రరు శాసనమే తార్కాణ

కొ వెం

## అడ్డగూడ

అడ్డగూడ అనుగ్రామము నల్లగొ డజిల్లాలోని రామన్నపేట తాలూకాయందున్నది దీనివిస్తీర్ణము 6 656 ఎకరములు దీనికి తూర్పున చవుళ్ళరామారము పడమట ధర్మారము ఉత్తరమున కోటమర్తి దక్షిణమున కంచనపల్లి అనుగ్రామములు ఉన్నవి

1961 వ సంవత్సరపు జనాభా లెక్కలప్రకారము ఇ దలి జనసంఖ్య 4 410 ఇందులో పురుషులసంఖ్య 2 240 స్త్రీలసంఖ్య 2 170 ఈ జనసంఖ్యలో 6 మొదలుకొని 16 సంవత్సరముల వయస్సుకల బాలురు 320 మంది బాలికలు

2?0 మ ది షెడ్యూల్యుతరగతులు షెడ్యూల్యుజాతుల పురుషులు 490 మంది స్త్రీలు 478 మ ది ఈ గ్రామమ దలి ఇ డ్లు వలయాకారముగ ఉన్నవి వీటిలో నూటడె ఏదిఅయిదు పె కు టి ండ్లు పది కా క్రీటుకప్పుగల ఇ డ్లు రె డు ఒకఅంతస్తుకల భవనములు కలవు

ఇచటిప్రజలు వరి అన్నమును జొన్న అన్నమును తిందురు ఇచట నీటివనరులు సమృద్ధిగా ఉ డుటచే త్రాగెడి నీటికి ఎద్దడిలేదు మెట్టపంటలు పల్లపు ప టలుకూడ ఇచ్చట పండుచున్నవి నీటివనరులుగా ఆలేరునది చెరువులు బావులు కలవు వీటి మూలమున ఇచ్చటి పల్లపునేలలకు నీరు లభి చు చున్నది ఈ గ్రామమున 1966 67 స లో సాగుచేయబడిన భూమి మొత్తము 2 300 ఎకరములు ఇ దులో కాలువక్రింద 150 చెరువుక్రి ద 190 బావులక్రి ద 340 ఎకరములు సాగు చేయబడెను ఎనిమిది ఆయిలు ఇ జనులు బావులను డి నీరు తోడి సేద్యమునకు అంది చెను వీటి మూలమున 120 ఎకర ములభూమి సాగు అయినది ఇచ్చట నల్లనేలకలవి 1200 ఎక రములు గట్టినేలకలవి 1600 ఎకరములు రేగడినేలకలవి 800 ఎకరములు కవనగును వరి జొన్న సజ్జ వేరుసెనగ ఆముదములు ఇచ్చటి ప్రధానమైన ప టలు స్థానికులు తమ అవసరములకు సరిపోగా మిగిలిన ప టధాన్యమును చెరువులో కాలువలలో లభి చు చేపలను ఇరవై అయిదు మైళ్ళ దూరములోఉన్న రామన్నపేటకు రె డెడ్లబ డ్లపై తీసుకొని పోయి విక్రయించుచు దురు పశుస ఎదయు ఇచ్చట తృప్తి కనే ఉన్నది గేదెలు ఎద్దులు ఆవులు మేకలు గొర్రెలు పందులు కోళ్ళు మొదలగునవి 2900 ఉన్నట్లు లెక్కింపబడి నది ఇచ్చటి జనులు తమ అవసరములకు దినమునకు 500 లీటర్ల పాలను 800 కిలోగ్రాముల నేతిని 800 కి గ్రాముల మాంసమును 1200 గ్రుడ్లను 500 గ్రా ల చేపలను ఉపయోగి చుకొను చున్నారు

ఈ గ్రామమున దలి ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయము అడవినుండి కట్టెలు కొట్టితెచ్చి అమ్ముకొనెడివారు వ్యాపారము చేయువారు దుకాణములు పెట్టుకొని జీవించు వారు కమసాలులు వడ్ర గులు కమ్మరులు కుమ్మరులు మ గలివారు చాకలివారు సాలెవారు చేపలుపట్టి అమ్మువారు ఇచ్చట కలరు వ్యవసాయమునకు అవసరమగు కూలీలుఇచ్చట దొరుకుదురు పురుషునికి దినము నకు మూడురూపాయల వంతు నను స్త్రీకి రెండురూపాయల వ తునను కూలి దొరుకు చున్నది రె డు దేవాలయములు ఒక మసీదు ఇచ్చటకలవు శ్రీరామనవమి శ్రీకృష్ణాష్టమి దినములలో ఇచ్చట గొప్ప ఉత్సవములు చేయుదురు

ప్రధానముగా ప్రజలకు పలువన సౌకర్యములు ఇచ్చట ఉన్నవి ప్రాథమిక పాఠశాల అప్పర్ప్రైమరీ స్కూలు బ్రాంచిపోస్టాఫీసు రూరల్ ఆసుపత్రి ఇ గ్లీషువైద్యము ఆయుర్వేద వైద్యము పశువైద్యము కిరాణాదుకాణములు మున్నగునవి కలవు ఇది ప చాయతి పాలనలోని గ్రామము పంచాయతీ పాలకులు గ్రామపారిశుద్ధ్య విషయమున మిక్కిలి శ్రద్ధను వహించుచున్నారు 1967 68 సంవత్సరముకుగాను స్థానిక సహకార సంఘమువారు ఈ గ్రామమునకు ఎబదివేల రూపాయలు ఋణముగా ఇచ్చినట్లు తెలియుచున్నది

ఈ గ్రామమునకు 15 మైళ్ళ దూరమునగల మోతుకూరు అను గ్రామమునందలి బ్లాకు అభివృద్ధి కే ద్రమునకును పోలీసుస్టేషనుకును ఈ గ్రామప్రజలు తమ అక్కరలకై పోవు చుందురు రామన్నపేటలోగల తాలూకాఆఫీసునకు కోర్టులకు సబ్ రిజిష్ట్రారు ఆఫీసునకు త తిపాల కార్యాలయమునకు పోయి ప్రజలు తమ పనులను నెరవేర్చుకొనుచు దురు

తం ఆం శా

## అడ్డతీగల

ఇది తూర్పుగోదావరిజిల్లా అడ్డతీగల ఫర్కాలో యల్లవర స్వత త్ర సబుతాలూకా కార్యస్థానము ఇది సామర్లకోట్ (సామర్లకోట) రైల్వే స్టేషనుకు 45 మైళ్ళలో ఉన్నది ఈ గ్రామస్థులు ర పవితూరి సమయమున ఈ గ్రామమున ప్రవర్తిల్లిన స క్షోభకర స ఘటనల దు ప్రముఖ పాత్రను వహించిరి

అడ్డతీగల అను గ్రామమున 1961 స జనాభా లెక్కల ననుసరి చి 1267 మంది జనులుండిరి ఆ జనులలో 305 మంది షెడ్యూల్డు జాతులవారు 218 మ ది షెడ్యూల్డు తరగతుల వార ఇచట రామస్వామి ఆలయము సోమలమ్మగుడి చర్చిక వు సోమలమ్మ విగ్రహము శక్తిరూపమున ఉన్నది సోమలమ్మ తీర్థము రె డురోజులు సోమ మంగళ వారము లలో వైశాఖమాసమున జరుగును కొబ్బరికాయలు పండ్లు అర్పి తురు ఈ తీర్థము 75 సంవత్సరములను డి జరుపబడు చున్నది పరిసర గ్రామములవారు స్థానికులు కలిసి దాదాపు

4000 మంది భక్తజనములు వారి దువులుమాత్రమే ఈ తీర్థమునకు వచ్చుచుందురు తీర్థసమయమందు ఇచట ఏర్పరచబడిన అంగడులలో పెక్కు వస్తువులు కొనుటకు లభించును ఆ వస్తువులలో పాత్రసామాగ్రి అద్దములు లాంతరులు దువ్వెనలు దేవతల చిత్రములు వస్త్రములు వ్యవసాయపరికరములు పేర్కొనదగినవి

అడ్డతీగల చారిత్రిక ప్రాముఖ్యము కలతావు రంప ఎతూరిని (1921 24) అణచుటకు బ్రిటిషు ప్రభుత్వము వారు పోలీసుబలమును ఆఫీసరుల నేతృత్వమున స్థాపించిన నరసపటము కృష్ణదేవిపేట చింతపల్లి అను తావులతోబాటు అడ్డతీగల ఒకటి ఈ రంపఎతూరిని నిర్వహించిన వీరుడు అల్లూరి సీతారామరాజు అతడు మహాధైర్యశాలి సాహసోపేతుడు సమయస్ఫూర్తి బుద్ధివైభవము యుక్తిచాతుర్యము లవాడు ఆతడు క్షత్రియుడు సన్న్యసించెను ఆతడు బ్రిటిషువరిపాలనమును ద్వేషించెను భారతదేశమును వారి పాలనమునుండి విముక్తమొనర్పదలచెను స్వాతంత్ర్యసాధనయందీయన దండవిధానమునకు విముఖుడుకాడు పైడిపుట్టవద్ద ఒక గుహాలో ఉండెను నేపాలునకు పోయి తన ఉద్యమమున తోడ్పడుటకు తగిన అనుచరులను ఎర్పరచుకొనెను తూర్పు గోదావరి ఏజన్సీలో గల ఆటవికులను తనకు బాసటగా చేసికొనెను వారి సాయమున ప్రప్రథమమున బ్రిటిషుప్రభుత్వమును ఎదిరించి ఆ ఏజన్సీలో తన స్థావరమును ఏర్పరచుకొని ఎదప భారతదేశ విముక్తికై యత్నింపదలచెను

సీతారామరాజునకు తన ఉద్యమ నిర్వహణమునకు మందుగుండుసామాగ్రి ఆయుధములు తుపాకులవంటివి అవశ్యకములయ్యెను అపుడపుడు ఆతడు పోలీసుస్టేషనులపై దాడి జరిపి ఆయుధములను మందుగుండుసామాగ్రిని సంపాదించెను 1921 సంవత్సరము మొదలుకొని 1924వ సంవత్సరము మధ్య సీతారామరాజు దాడులను కావించెను చింతపల్లి పోలీసుస్టేషను (1922) రాజవొమ్మంగి పోలీసుస్టేషను కొండకంచేరు మల్కానిగిరి వడ్డేరు అడ్డతీగల మున్నగుతావులు ఇతని దాడులకు గురిఅయ్యెను

కినెడాసన్ సాండర్స్ స్కాట్ కవర్డ్ మున్నగు పోలీసు ఆఫీసరులను తగు పోలీసుబలముతో బ్రిటిషుప్రభుత్వము వారు సీతారామరాజు జేసిన తిరుగుబాటు చర్యలను అణచుటకు పంపిరి ఆ ఆఫీసరులు పోలీసు సంపంది సాయమున సీతారామరాజును అడవులలో నుండగా ముట్టడించి పట్టుకొనుటకు పలుమార్లు ప్రయత్నించి విఫలులైరి సీతారామరాజుగారు గ్రామముల దళి ముఖ్యులు కరణాలయొక్కయు జనులయొక్కయు అభిమానములను పొందియుండుటచే పోలీసు ఆఫీసరులకు అతని ఉనికి అగోచరమయ్యెను తుదకు రూథర్ ఫర్డ్ అను ఆఫీసరు నద్దిపాలెము ముకాములో ఉండగా - తూర్పుతీరపు స్పెషల్ పోలీసులు జమదారు కంచుమెనన్ నేతృత్వమున సీతరామరాజును గుర్తించి కాల్చి (1924 మే 7 వ తేది) చంపినట్లు చెప్పుచున్నారు

(విశేషాంశములకు అల్లూరి సీతారామరాజు అను వ్యాసము చూడదగును)

గం లం కాం

## అడ్డవట్టియ సుంక

మహబూబునగరు జిల్లాలోని వర్ధమానపురమందలి ఒక కన్నడిశాసనమునందు అడ్డవట్టి సుంకము ఉదాహరింపబడినది అడ్డవట్టి సుంకము క్రయవిక్రయములకు క్షీణమైన గ్రామసీమ

హానుమకొండ పురాధీశ్వరుడు పరమామాహేశ్వరుడు స్వయంభూదేవపాదపద్మారాధకుడు పరబల సాధకుడు మొదలైన బిరుదములతో కాకతీయ గణపతిమహారాజు ఓరుగల్లు పట్టణము రాజధానిగా రాజ్యముచేయుచున్న క్రీ శ 1229 కాలమునందు వర్ధమానపురమండలములో కందూరునాడును గోనెపుట్టిరెడ్డి కుమారుండు గణపయ్య గణపతి మహారాజునకు సామంతుడుగా పరిపాలించుచుండెను ఆ కాలములో కీర్తినారాయణపురమను బుళెపట్ట ములో దేమిసెట్టి పైదిసెట్టి మొదలైన వర్తకులు సకలేశ్వరదేవుడు మున్నగు దేవతావిగ్రహాలను ప్రతిష్ఠించి ఆ దేవతల అర్చన ధూప దీప నైవేద్యాదులకుగాను సూరసముద్రమునకు తూర్పుభాగములో ఒక చెరువును నిర్మించియిచ్చినారు ఇతర వ్యాపారస్థులు కాకతీయ గణపతిదేవునకు పుణ్యమగునట్లుగా అడ్డవట్టి సంతలో సూలు చేయు సుంకమునకుగాను ఒకనూనెగానుగ ఒక అంగిడి రెండు మగ్గములు దేవునితూర్పుభాగములోని ఒక తోట దేవునకు దక్షిణమార్గములో దేవభోగమునకు నాలుగు మహాగృహములు దానముచేసినారు అడ్డవట్టి సంత పైన పేర్కొనబడిన కీర్తినారాయణపురము లేక తుంబళపట్టణమునకు చెందియుండ

ఏలెను

అటుల ్వాతి రే న వత్సరాలకు (్రీ శ 1 5) గణపతి దేవమ ాజు ు ౕ కాధికారియైన మ ద్యర ష్ణయ్యము ల గునట్లుగా ఎకెత్స్వ దేవ్ర కు మ్సాన్యముగా విశ్వనాథ దేవుడు అడ్డవట్టి ంతకు చె సు కమును వదలు ాని నాడు అనగా ఆ ఖ కమ తయు ౯ఎకేశ్వర దేవుని ధూపదీపాదు కు వినియో పడునట్లు దా ముచేసినాడు

శాసనము న దు చె ప్పబడిన కీర్తి నారాయణపురము తు బళపటణము ఎ దవాడి ీమకు చె దినవి నేటి కర్నూలు మ డలములోని ఆలూరు ఆదవాని తాలూకాలలో తు గ భద్రానదికి దక్షి ప్రాంతమే ఎ దవాడి అయిఉ డవచ్చునని చారి త్రికులు ఊహి చిరి

వర్ధమాన పురము నేను వడ్డమాను అను పేరిట మహ బూబునగరుజిల్లాలోని నాగరకర్నూలునకు 8 మైళ్ల దూరమున ఉన్నది ప్రస్తుత జనాభా 2 782 కాకతీయగణపతి చక్రవర్తి రాజ్యపాలన కాలమున వర్ధమానపట్టణమును రాజధానిగా చేసికొని మల్యాలగు డన పాలి చుచు డెను ఈయనచే నిర్మిత మైన నాగేశ్వరాలయ శిథిలములు నేటి ని ఈ గ్రామ మున కా చనగును

జా హ

## అడ్లూరి సీమ

అడ్లూరి సమ ప్రస్తుతము నిజామాబాదుజిల్లా కామా రెడ్డి తాలూకా ప్రా తము ఈ సీమ దోమకొ డ స స్థానా ధీశ్వరుల పాలన క్రి ద ఉ డెడిది

దోమకొ డ స స్థానాధీశ్వరులై న కామినేనివారు రామాళ్ల గోత్రజులు పాకనాటి రెడ్లు వీరి ప గడమునకు కుదురై న కామినేడు గోల్కొండ కుతుబ్షా వారిచే బిక్క న వోలు ఎ స్థానము ను జాగీరుగా గ్రహి చి పట్టణమును అభి వృద్ధిపరచి తనకు రాజధానిగా చేసికొనెను ఇచ్చట సిద్ధ రామేశ్వరాలయము కలదు అప్పటి బిక్కనవోలు ేడు బి క్కనూరుగా మారినది అది కాచిగూడ మన్మాడు రై లు మార్గము న దున్నది క్రి శ 1760 లో వీరి వ శస్థుడై న రాజన్నచౌదరి ఇచ టి ను డి తన రాజధానిని కామారెడ్డి పేటకు మార్చుకొనెను ఇతని కుమారుడై న రాజేశ్వరరావు కామారెడ్డిని వదలి దానికి 12 మైళ్ల దూరమున నున్న దోమ కొ డకు తన కార్యస్థా మును మార్చుకొనెను నాటి ను డియు ఒ మినేనివారు దోమకొ డ స స్థానాధీశ్వరులమని చెప్పుకొనుచున్నారు క్రి శ 1748-57 మధ్యకాలమున రాపాకలక్ష్మపతి యను కవి భద్రాయురభ్యుదయమను కావ్యమును కామినేని రాజన్నచౌదరి ప్రేరణమున వ్రాసి సిద్ధిరామేశ్వరస్వామికి అ కితమిచ్చెను ఈ రాజన్న చౌదరి అడ్లూ రి సీమ లోని శ్రీరామరెడ్డిపేటకు పాలకుడు డ్లూరి సీమ ఇతని స్వార్జితముకాదు అది రాజన్నచౌదరి తాత ముత్తాతల కాలమునాటిది

షట్చక్రవర్తి చరిత్ర శివధర్మోత్తరము పద్మపురా ణము మున్నగు కృతులను రచి చిన కామినేని మల్లారెడ్డికి అన్న యగు ఎల్లారెడ్డి కుమారుడై న చినకామిరెడ్డి అడ్లూరి సీమ సామ్రాజ్య పూజ్య పదవి న దినాడట ఇతని కాలము క్రి శ 1650 ప్రా తము చినకామిరెడ్డికి పోతారెడ్డి ఆ పోతారెడ్డికి జోగారెడ్డి ఆ జోగారెడ్డికి పోతిరెడ్డి అనువారు కుమారులు సర్వమాంబకు పోతిరెడ్డికి కుమారుడు రాజన్న చౌదరి ఇతడే భద్రాయురభ్యుదయకృతిపతి కావున అడ్లూరి సీమ రాజన్నచౌదరి వ శమువారికి 14 తరముల నుండి స క్రమి చుచునే యున్నది తరమునకు 25 సంవత్స రములు వంతున లెక్కకట్టినచో రాజన్నచౌదరి కాలము క్రి శ 1750 అగుచున్నది కావున అడ్లూరి సమ క్రి శ 1650 ను డి 1750 వరకును కామినేని వారి యేలుబడిలో ఉన్నట్లు చెప్పవచ్చును దాని ముఖ్యనగరము రామరెడ్డి పేట

నేటి జనాభా లెక్కల ననుసరి చి అడ్లూరు యొక చిన్న గ్రామము ఇ దలి జనస ఖ్య 1290 ఇ దు 642 మ ది స్త్రీలు 648 మ ది పురుషులు కలరు ఇ దులో చదువు కొనిన పురుషులు 114 మ ది చదువుకొనిన స్త్రీలు 24 మ ది నిజామాబాదు జిల్లా కామారెడ్డి తాలూకాలో ఈ గ్రామము నమోదు చేయబడినది పూర్వమిది ఈసమకు ముఖ్యపట్టణమై సముచిత ప్రాధాన్యము వహి చియు డెను

ని శ సుం

## అణా గ్రంథమాల

ఈ గ్ర థమాలా స స్థా కులగు సర్వశ్రీ వెల్దుర్తి మాణిక్యరావు కే ఎ గుప్తగారలు వక్కాణి చినట్లు ఈ గ్ర థమాలా స్థాపన య లి ఆశయము లీ క్రి దివిధముగ మన్నవి

ఆ ధ్రుల హృదయముల దు మాతృభాషాభిమాన

మును రేకెత్తించుట ఆంధ్రులకు లోకజ్ఞాన సంపత్తిని ప్రసాదించుచు ఆంధ్రభాషా ప్రచారము కావించుట ప్రతి ఆంధ్రుడు కొని చదువుకొను అవకాశము కలుగునట్లు గ్రంథములను సాధ్యమైనంత చౌకగా అందజేయుట మహనీయుల జీవితములను ఆంధ్రుల నిత్యజీవితమునకును ధార్మిక సాంఘిక కార్మిక రాజకీయ సమస్యలకును సంబంధించిన పుస్తకములు సర్వసుబోధముగ అత్యంత సులభశైలిలో ప్రచురించుట స్థాపకుల ఆశయములకు తగినట్లు ఈ గ్రంథమాల యందు ఉత్తమ సాహిత్య గ్రంథములు వెలువడినవి ప్రకృతి మనోహర దృశ్యములకు ఆటపట్టయిన ఎల్లోరా - అజంతాలను కవియు శిల్పియు గాయకుడునైన అడవి బాపిరాజు గారు వర్ణించిన ప్రశస్తరీతి చదువరులను ఉర్రూతలూగించినది

ఆంధ్రజాతి యొక్క సంస్కృతి గౌరవప్రతిష్ఠోద్ధారకులైన వారిలో విశ్వనాథ నాయకుని గురించి శ్రీ చెలమచెర్ల రంగాచార్యులవారును అనవేమ భూపాలుని గూర్చి స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారును తంజావూరు రఘునాథ నాయకుని అధికరించి స్వర్గీయ కురుగంటి సీతారామయ్యగారును ఆంధ్ర వీరులు అను శీర్షికతో ఒక గ్రంథమును సంతరించిరి అది పాఠకులకు శౌర్య ధైర్య ఉత్సాహ భావోద్రేక సంజనకముగా అలరారుచున్నది

హాస్యరసము ఉప్పతిల్లునట్లు మొగలాయి కథలను మొగలు భాషను తెలుగున కడుపుబ్బ నవ్వు పుట్టించు సన్నివేశములను శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు తమ సహజ చమత్కార భాషణములతో పుస్తక రూపమున పొందుపరచిరి

సుప్రసిద్ధులగు స్వామిదయానంద సరస్వతి వినాయక దామోదర సావర్కరు జవహర్‌లాలునెహ్రూలజీవిత చరిత్రలను రాజకీయ విజ్ఞానాకరములగు కాంగ్రెసు చరిత్ర మొదలగు ఉత్తమ గ్రంథములను ఈగ్రంథమాల ప్రచురించునది

1941 వ సంవత్సరములో స్థాపింపబడి ఉత్తమ సాహిత్యమును వెలువరింప నుద్యమించుచున్న ఈ సంస్థ అప్పటి రాజకీయ కల్లోలములకు గురియై ధనాభావముచే నిలిపివేయబడినది

కొ వెం

## అణ్ణంగార్ పాళియము

తిరుమల దేవాలయము మొదటి ప్రాకారమున దున్న వరదరాజస్వామి సన్నిధిలోని శాసనమునందు అణ్ణగార్ పాళియము పేర్కొనబడినది క్రీ శ 1606 సం॥న ఎక్కప్ప నాయకరు కుమారుడు హనుమయ్య అణ్ణగారు అనునతడు మలయవంత పర్వతము (విజయనగరము) దు ఉండు విజయనగర సేనలకు దండనాయకుడుగా నియుక్తుడయ్యెను అప్పటి విజయనగర ప్రభువగు వెంకటపతి దేవ ఆయ్య మహారాజు యొక్కయు వారి మహారాణి గారగు కృష్ణాజీ అమ్మగారి యొక్కయు శ్రేయస్సును కోరుచు హనుమయ్య అణ్ణగారు స్వామి సేవలకు 365 రాశి పొన్నులను (బంగారు నాణెములు) సాలుసరి ఆదాయమును సమర్పించెను

హనుమయ్య అణ్ణంగారు ఈ క్రింద వివరింపబడిన విధమున స్వామివారికి చెల్లునట్లు ఆదాయమును సమకూర్చెను ఈయన తన సొంత ఖర్చుమీగ మూడు సాగుబడి కాలువలను త్రవ్వించెను మొదటిది వెంకటరాయ సముద్రమను నీటిపారుదల గల తటాకము క్రిందుగా ప్రవహించునది ఇది కల్లారు నదినుండి తీయబడిన కాలువ రెండవది ఆలిపుర గ్రామపు సరిహద్దున ప్రవహించు నదినుండి తీయబడిన కాలువ మూడవది నరయారు నది ముఖద్వారమునుండి తీయబడినది వీటి క్రింద పండించబడు పంట ఆదాయముతోపాటు హనుమయ్యచే నిర్మింపబడిన అణ్ణంగార్ పాళియము గ్రామమునుండి వచ్చు ఆదాయములో నాలుగింట మూడు వంతులు మొత్తము వెరసి 365 రాశిపొన్నుల విలువగల ఆదాయమును స్వామి సేవలకు చెందునట్లు ఏర్పాటు చేసెను

కొ వెం

## అతవుర చూ అగలోక

## అతిశయరట్ట కుట్ట

ఈతని ప్రసంగము రేనాటి శాసనములో వచ్చుచున్నది (ఎ ఎ ఇ XXVII పుట 230) ఇదియొక సాధారణ వ్యక్తి నామముగా తోచుటలేదు ఒక ఉద్యోగియైఉండును రట్టకుట్ట అనగా రాష్ట్రకూట శబ్దభవముగా గ్రహింపవచ్చును దీని

ను డియే రడ్డి రెడ్డిపదములును వచ్చినవని చెప్పుచున్నారు అతి శయ అనునది విశేషణముగా గ్రహించినచో అధిక శేక పెద్ద అనునర్థము చెప్పుచు యున్నది పుణ్యకుమారుడను మహారాజు రాజ్యములో ఒక ప్రాంతపాలకుడు (రాష్ట్రకూటుడు) అయిన పెద్దరెడ్డిగారు పాలశర్మఅను బ్రాహ్మణోత్తమునకు ఎబది (మ) మత్తులు భూదానముచేసెనని దీనిభావముగా తోచును భూమిని కొలచుటకు మత్తులు అనునది మానముగా కాకతీయ యుగమున వాడుకలోనుండెను రేనాటి చోళులకాలములో ఈ మానము ఉండెనో లేదో నిశ్చయముగా తెలియదు ఈ ధర్మమును కాచి అనగా సంరక్షించి కుడిచినవారి నగా ఆ ప్రతిగ్రహీత సుఖముగా అనుభవించుటకు తోడ్పడినవారికి భూదానము చేసిన ఫలము సిద్ధించును వారు పుణ్యవంతులు అగుదురు అనుట దీనికి వక్రపల్కినవారు అనగా ఈ ధర్మమును చెరిచినవారికి మహాపాతకము పడును సిద్ధించును అనుట తాత్పర్యము

పాలశర్మారికి అనిశాసనమున దుగల పదమునకు పాల శర్మగారికి అని అర్థముచెప్పవచ్చును లేదా తమిళభాషా సంప్రదాయము ప్రకారము పాలశర్మార్ బహువచనము (ఎక వచనము పాలశర్మన్ రామన్ కృష్ణన్ అన్నట్లు) పూజ్యార్థము నందు ఏకవచనమునకు బహువచనము వ్రాయుట పూర్వము నుండియు న్న ప్రదాయము కలదు మహారాజునకు అనవలసి నప్పుడు మహారాజులకు అని వ్రాయుట ఆచారము తెలుగు వారి ఇంటిపేర్లలో నేయి (నేతి)వంటి వస్తువులపేర్లు వినవచ్చు చునేయుండును వ్యక్తులపేర్లయందు పాలు వంటిద్రవ్య ములపేర్లు వినరావు పాలశర్మ అను పేరునుబట్టి ఈ ద్ధతికూడా పూర్వము ఉండెనేమో యనిపించును (విద్యాపౌరుషమును చూపించు వ్యాకరణము మహాభాష్యమువంటివి ఇంటి పేర్లలో కనిపించును)

రాష్ట్రకూట ప్రముఖుడైన ఈయన ఇచ్చిన దానము మాసపూర్ణిమ నాడు చేయబడినట్లు దుటచే అదియొక పర్వ దినమోలేక చంద్ర గ్రహణసమయమో అయియుండును

ఇక శాసనము దొరకిన ప్రదేశమునుగూర్చియు దాని కాలమును గూర్చియు కొంచెము ముచ్చటించవలెను ఈ శాస నము కడపజిల్లా కమలాపురం తాలూకా వెల్దుర్తి గ్రామము న దున్న చెన్నకేశవదేవాలయము ము మన్న ఒక రాతిపై చెక్కబడియున్నది క్రీ శ 6 7 శతాబ్దములలో రేనాటి చోళులను వారు అనంతపురము కడప జిల్లాలలో పరిపాలన చేసినట్లు ఆ ప్రాంతములలో కనబడు వీరి శాసనములవలన తెలియవచ్చుచున్నది వీరిని చోళమహారాజు లందురు ఏడు అనగా రాజు చోళులైన ఏడ్గురు పరిపాలించుటచే శాబోలు దీనికి రేనాడు అను పేరు ప్రసిద్ధిచెందినది రేగడినేల కల ప్రాంతమగుటచే ఇది రేనాడు అయినదని కొందరు చెప్పుదురు తరువాతకాలములో అనగా కాకతీయుల కాలములో కర్నూలు కడప మండలములలోని తూర్పుభాగములకు మార్జవాడి అను పేరు చెల్లుచుండెను మార్జవాడి అనునది మహారాజుల పాడి అనగా (చోళ) మహారాజులు పాలించిన ప్రదేశమను సార్థకనామము వహించినది

అతిశయ రట్టకుట్ట శాసనము ఎరికల్ ముత్తురాజు వంశీయుడైన పుణ్యకుమారుని రాజ్యకాలమున దు వెలసినది పుణ్యకుమారుడు చోళమహారాజులలో ప్రసిద్ధివహించినవాడు ఈతని మాలెపాడు శాసనమునుబట్టి పుణ్యకుమారుని వంశా వళి ఇటు కాన్పించుచున్నది




రేనాటి చోళులు తాము కరికాలచోడుని వంశము వారమనియు కాశ్యప గోత్రులమనియు ప్రకటించుకొనిరి వీరిలో నందివర్మ కుమారుడైన ఎరికల్ ముతురాజుధన ఞ యుడు కొంత ప్రశస్తిని చెను కలమళ్ళ శాసన మీతని కాల మున వెలసెను ధనంజయుడు క్రీ శ 6వ శతాబ్ది కడపటి పాదమువాడని ఊహించుచున్నారు అనగా క్రీ శ 575 ప్రాంతము అతిశయ రట్టకుట శాసనమున దు ప్రస్తుతుడైన పుణ్యకుమారుడు ఎరికల్ ముతురాజు మనుమడు ఈతడు క్రీ శ 630–40 ప్రాంతమున రాజ్యము చేసియుండును

పుణ్యకుమారునకు పోర్ముఖరామ పురుష శార్దూల మున్నగు బిరుదులు కలవు ఈతని రాజ్యము కడప జిల్లా కమలాపురం జమ్మలమడుగు ప్రొద్దుటూరు తాలూకాలలో వ్యాపించియుండెను

కొ వెం

బం ల రం

## అత్తలూరు

అత్తలూరు గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో ఉన్నది దీని జనాభా 1961 సం।ర లెక్కల ప్రకారము 2 175 ఈ సంఖ్యలో షెడ్యూలు జాతులవారు 216 మంది షెడ్యూలు తరగతులవారు 2 మంది ఈ గ్రామములోని శా శ 1545 (క్రీ శ 1623) నాటి శాసనమున అనుసరించి నెల్లూరి పాంనేడు అను గ్రామములోని కాపులును కలసి హజరతు పాదుషా ఒడయలు (గోల్కొండ సుల్తాను మహమ్మదు కుతుబుషా) వారి శ్రేయస్సు కోరుచు గ్రామములో త్రవ్వించిన చెరువును సరియైన స్థితిలో నుంచుటకు కొంత రాబడిని దానమొసగిరి

ఒకరాతిపైన స్తంభము క్రీ శ 1281 నాటి శాసనము కలదు దీనిలో ధాన్యకటకమును పాలించిన కోటకేత మహారాజు ఆయన భార్య ప్రోలాంబిక కలిసి పణిదెం అగ్రహారమును బ్రాహ్మణులకును అనేక భూదానములు కృష్ణూరులో నెలకొనిన గోపీనాథుని దేవాలయమునకును దానమొసగినట్లు చెప్పబడినది ఈ శాసనమందు రాణిగా వ్యవహరింపబడిన ప్రోలాంబిక రెండవ కోటకేత మహారాజునకు ఉండిన 36గురు భోగస్త్రీలలో ఒకతెగా పేర్కొనబడినది ఈ శాసనమునందు చెప్పబడిన కృష్ణూరు నేడు గుంటూరు మండలమున కానరాకున్నది

పణిదెం గ్రామమునకు పశ్చిమభాగమునను అత్తలూరునకు ఉత్తరమునను 60 అడుగుల వ్యాసము 8 అడుగుల ఎత్తునుకల దీపాలదిన్నె అను ఒక వృత్తాకారముగల మట్టిదిబ్బ కలదు దీనిపై దీపాలదిన్నెపాలెం అను గ్రామము ఉన్నది ఇది పణిదె అను గ్రామమునకు సవారు గ్రామము అర్షశాఖవారు ఇచ్చట పరిశోధనలు జరిపినచో అనేక చరిత్రాంశములు వెలువడుననుటకు సందేహములేదు

మా శ్వే

## అత్తిమలపట్టు గ్రామము

ఈగ్రామ ప్రశంస తిరుమల దేవాలయమందలి మూడవ ప్రాకారములోని నైరృతి దిశను డు కుడ్యమున అమర్చబడిన శాసనమునందు కలదు ఈ శాసనము దాశివ మహారాయల (క్రీ శ 1543) రాజ్యపాలన కాలమునకు చెందినది

ఆరణి గ్రామ వాంయగు పాలునాయ టు కుమారుడు తిరుమలనాయకరు అత్తిమలపట్టు గ్రామమును కీ వచ్చు సంవత్సరాదాయమగు 80 రేఖ పొన్నులు (బంగారు నాణెములు) శ్రీ వెంకటేశ్వరస్వామి సేవలకు సమర్పించెను విజయనగర రాజుల కాలమున చెలామణిలో నుండు బంగారు నాణెములు వరహా పగోడా పొన్ను అను నామములతో వ్యవహరింపబడినవి వీటి పరిమాణము విలువయు ఒకటిగా నుండెడిది ఆ రోజులలో ఒక్కొక్క బంగారు నాణెము రు 4/ లకు సమానముగ నుండెడిది

అత్తిమలపట్టు గ్రామము తచ్చూరు జిల్లాలో ప్రవహించు సెయ్యూరునది ఉత్తరపు టొడ్డున ఉన్నది తచ్చూరు జిల్లా జయంకొండ చోళమండలములోని పడైవీడు రాజ్యమునందు గలదు ప్రస్తుతము ఈ ప్రాంతమంతయు మదరాసు రాష్ట్రములోని దక్షిణ ఆర్కాటు జిల్లాకు చెందినది

వేంకటేశ్వరస్వామికి సమర్పించిన సంవత్సర ఆదాయముతో స్వామికి త్రికాలసంధ్యలందును తిరుప్పోనము సమర్పింపబడును స్వామికి అర్పించిన తిరుప్పోనకమునందలి నాల్గవ భాగమును దాతకును మిగిలినది భక్తులకును పంచబడును

కొ వెం

## అత్తిరాల

కడపజిల్లా రాజంపేట తాలూకా బోలి గ్రామమునకు చెందిన పాలెము ఇదియొక కుగ్రామము దీనినే అత్తిరాళ్ళ అనియు పిలుతురు ఇది జనావాసములేని ప్రదేశముగా చెప్పబడుచున్నది ఇది బాహుదానది మీద ఉన్నది బాహుదానదియు పించనదియు కలిసిన మీదట వీనికి చెయ్యేరు అను పేరు చెల్లుచున్నది చెయ్యేరు యొక్క సంస్కృతీకరణమే బాహుద కావచ్చును

అత్తిరాల గ్రామము రాజంపేట రైల్వే స్టేషనుకు 4½ మైళ్ళ దూరమున ఉన్నది ఇదియొకప్పుడు చరిత్ర ప్రసిద్ధిగన్న గ్రామము ఇచ్చట పరశురామస్వామి ఆలయముండుటచే దీనిని పరశురామక్షేత్రమందురు ఇక్కడ ఇంకను త్రేతేశ్వ

రాలయము గదా ధరస్వామి ఆలయము మున్నగు ప్రాచీనములైన దేవళములు కలవు అత్తిరాల వద్ద నేటికిని మహాశివరాత్రికి పెద్ద ఉత్సవము జరుగును ముప్పది వేల మంది వరకు యాత్రికులు సమావేశమగుదురు

త్రేతాసురుడను రాక్షసుని సంహరించుటచే త్రేతేశ్వర స్వామిఆలయము ఇచ్చటనెలకొన్నది జమదగ్నిమహర్షి కుమారుడైన పరశురాముని వృత్తాంతము సుప్రసిద్ధమే తండ్రి యాజ్ఞననుసరించి పరశురాముడు తనతల్లి రేణుకాదేవిని సంహరించెను మాతృవధచేసిన ఘోర పాపమును పరశురాముడు బాహుదానది యందు స్నానముచేసి పోగొట్టుకొనెనట మాతృహత్యాపాపము రాలిన దున ఈప్రదేశము హత్యరాలై అని పేరు చెంది క్రమముగా అత్తిరాల గా పరిణమించినదని ఈ గ్రామమును గూర్చి ఐతిహ్యము చెప్పుదురు ఇట్లే బాహుదా నదినిగూర్చియు ఇతిహాసము ఉన్నది మహాభారతము శాంతి పర్వమునందు శంఖలిఖితులను మహర్షుల వృత్తాంతము కలదు లిఖిత మహర్షికి ఒక నేరమునకై బాహుఖండనము జరిగినది ఆ నరుకబడిన చేతులు లిఖిత మహర్షి బాహుదానది యందు స్నానము చేయుటచే తిరిగి మొలిచినవట కావున ఈనది బాహుదా నదియని పేరు పొందినది

పౌరాణిక గాథలటుంచి అత్తిరాల గ్రామము మధ్యయుగమునందు కొంత వైభవమును అనుభవించిన ప్రదేశముగా కన్పించుచున్నది ఇచ్చట కొన్ని శాసనములును లభించినవి వానిలో మూడవ రాజరాజు (క్రీ శ 1232) శాసనము కాయస్థ అంబదేవుని (క్రీ శ 1287) నాటి శాసనము క్రీ శ 1477 సంవత్సరమునాటి సాళువ నరసింగయ్య దేవ మహారాజు శాసనము ముఖ్యమైనవి వోటన్నిటికంటెను కుతూహలము జనింపచేయునది క్రీ శ 1272 నాటి శాసనము దీని ప్రకారము పొత్తపినాడు వాస్తవ్యులు సమిష్టిగాచేసిన కృషి ప్రశంసనీయమైనది పరశురామేశ్వరాలయము బాహుదా నది ఒడ్డున ఉండుటచే ఆనది వెల్లువలకు గురియగుచుండగా పొత్తపినాటి మహాజనులు ఆ ఆలయమును రక్షించుటకై రాతి కట్టడము నిర్మించిరి ఇచ్చటి దేవాలయములందు చక్కని చెక్కడపు పని తనము కలదు ముఖ్యముగా పరశురామేశ్వరాలయము మీద సుందర శిల్పముకలదు లతా చిత్రములు నృత్య భంగిమలలో స్త్రీలు విష్ణు రామ పరశురామ విగ్రహములు ఆనాటి శిల్పులభావశబలతను చేతి విన్నాణమును చక్కగా ప్రదర్శించును పరశురామాలయ గోపుర మిప్పటికిని నిలిచియున్నది మట్లిరాజుల కాలములో ఉండిన ఏకతతయ్య అను భక్తుని విగ్రహము పరశురామాలయమునందు ప్రతిష్ఠింపబడియున్నది

అత్తిరాల గ్రామ చరిత్రను ఇంకను ప్రాచీన కాలములోనికి కొనిపోవుటకు కొన్ని ఆధారములు లభించుచున్నవి శాతవాహన యుగమునందు ఆంధ్రులు దూర దేశములతో వాణిజ్యము సల్పుచుండిరి రోమను సామ్రాజ్యముతో కూడ వర్తక సంబంధములు సాగుచుండెను దానికి నిదర్శనముగ రోమను చక్రవర్తుల నాణెములు ఆంధ్రదేశములో నాగార్జున కొండ నంద్యాల నెల్లూరు బిగోలు వినుకొండ మున్నగు స్థలములలో దొరికినవి అత్తిరాల గ్రామమును కూడ ఈ సందర్భమున పేర్కొనవలెను క్రీ శ 117 న వత్సర ప్రాంతమున రోమనుసామ్రాజ్యము నేలిన ట్రాజనుచక్రవర్తి బంగారు నాణెము అత్తిరాల వద్ద లభించుట గమనింపదగినది

వైదుంబ మహారాజుల కాలమునకూడ అత్తిరాల ప్రసిద్ధి వహించెను భువన త్రినేత్రుడను వైదుంబ మహారాజు శక 893 (క్రీ శ 971) దక్షిణాయన సంక్రాంతి సందర్భమున అత్తి తేవుల (అత్తిరాల) గ్రామమునందలి లోకేశ్వర భట్టర దేవాలయమునకు కటి చెరువుల అను గ్రామమును దానము చేసెను కటి తేవుల గ్రామము మంజరము గ్రామము నందుండు కూచిభట్టు అధీనములో ఉంచబడెను మంజరము ఇప్పుడు మందరము అను పేరుతో నున్నది ఇది అత్తిరాల సమీపమునందున్నది

అత్తిరాల ప్రశంస క్రీ శ 926-88 కాలమున కడప జిల్లా ఆగ్నేయ భాగమున పరిపాలనచేసిన బల్లియచోడ మహారాజు శాసనము నందు కాన్పించుచున్నది ఈ మహారాజు మందరము ఇనుంబ్రోలు కాళ్ళపాక గ్రామముల సిద్ధాయమును ఒక దేవాలయమునకు దానము చేసెను ఈ ధర్మనిర్వహణము అటితేవుల యందలి సహస్ర హస్తమున ఉంచబడినది ఇది అత్తిరాల నగరము యొక్క మహాజన సభ కావచ్చును అనగా అత్తిరాలయందు బాధ్యతాయుతమైన పౌర సభ ఉండెడిదనియు దానికిఉండిన ప్రతిష్ఠనుబట్టి బల్లియ చోడ మహారాజు తన దాన నిర్వహణ భారమును ఆ సభ వారిపై పెట్టెననియు ఊహింప దగియున్నది అత్తి తేవుల నగర మహా సభయందు వేయిమంది సభ్యులుండిరా అనునది

పేరు ప్రశ్న పౌర ఎత్తయుండెననుట మాత్రము నిర్వివాదము

పరశురామ స్వామి ఆలయమందు అ బదేవుని క్రి ది ఉద్యోగి యొకడు చేసిన దానములను గూర్చిన శాసనము లభించుచున్నది ఇక్కడ అత్తిరాలకు ఆఱుతుతేవుల అను పేరు వాడబడినది హత్యరాలె అత్తిరాల అయిన ద ను ట క ఆఱుతుతేవుల అత్తిరాల అయినదనుట భాషా పరిణామ దృష్ట్యా క్రమబద్ధముగా నున్నది పోలిగ్రామము ఈ శాసనము నందు పోలికొండూర అని వ్యవహరింపబడినది క్రీ శ పదుమూడవ శతాబ్దములో అత్తిరాల మహా వైభవమనుభవించెను పోలి నామ మాత్రమైన గ్రామముగా ఉ డెను ఈ నాడు అదృష్టచక్రముతిరిగి పోలి చెప్పుకొనదగిన గ్రామమైనది అత్తిరాల జనశూన్యమైన ప్రదేశమైనది ఓడలపై బండ్లును బండ్ల మీద ఓడలును వచ్చును గదా!

ఖం ల ర

## అత్తిలి

అత్తిలి గ్రామము పశ్చిమ గోదావరిజిల్లా తణుకు తాలూకాలో ఉన్నది దీనికి 8 మైళ్ళలో తణుకు 12 మైళ్ళలో తాడేపల్లిగూడె అను పట్టణములు ఉ న్నవి తూర్పున రేలంగి పాలి రామేశ్వర పడమట కోమర్రు మొయ్యూరు ముప్పత్తిపాడు ఉత్తరమున గుమ్మలపాడు బల్లిపాడు తిరుపతిపుర దక్షిణమున మ చిలి సాలూరు ఈ గ్రామమునకు సరిహద్దులు దీని విస్తీర్ణము 5 348 ఎకరములు

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములో పురుషులు స్త్రీలు కలిసి 15 074 మంది ఉండిరి ఈ సంఖ్యలో 25 మ ది ఎరుకలవారు 1191 మ ది షెడ్యూలు తరగతులవారు జాతులవారు కలరు ఇచట ఇ డ్లు గు పుగాను ఒకచో ఏకప క్తిగాను శివార్లుగాను ఉన్నవి వీటిలో 1207 పె కుటిండ్లు 75 కాంక్రీటు కప్పుగల ఇ డ్లు 40 ఒక అ తస్తు గల మేడలు ఈ గ్రామము గాలుగుపై పుల విస్తరి చియున్నది ఇచట జనులు కాలువ చెరువు బావుల నీటిని త్రాగుదురు

రాచకోడు మురుగుకాలువ అత్తిలి మెయినుకాలువ కే సముద్ర చెరువు కాలువ మొ డికోడు చానలు ఉరదాల పాలె చానలు అత్తిలి పేరలల్ కాలువ పాలువ కాలువ మ చిలి కాలువ కోనేటి చెరువు ముక్కంజీ చెరువు రామన్న చెరువు మొదలగు నీటివనరులు ఈ గ్రామమునకు కలవు ఇచట వివిధరకముల వరిని చెరకుపంటను పండింతురు నిమ్మ అరటి కొబ్బరితోటలు కలవు రు 4 500 ల విలువగల వంకాయలు రు 6 6 0 ల విలువగల బీరకాయలు జనుము ప డించిరి 1966 67 స ॥లో వ టలక్రి ద 4 400 ఎకరముల భూమి ఉపయోగపడినది ఇది అ తయు కాలువలక్రింద స గుబడి యైనది 8 ఆయిల్ ఇ జనులు నీటినితోడుటకు ఉపయోగి చ బడెను 3 ట్రాక్టర్లు 150 ఎకరముల భూమిని దున్నెను వడ్లు 4 500 పుట్లు బెల్లము 30 000 కొబ్బరికాయలు తాడేపల్లి గూడెమునకు రవాణా అయెను ర 8 000 ల విలువగల నిమ్మకాయలను రు 6 000 విలువగల అరటికాయలను గ్రామస్థులే ఉపయోగి చుకొనిరి వ గ బీర మొదలగు కూరగాయలు రేలంగి పెనుమ ట్ర వేల్పూరు తణుకు మున్నగు తావులకు రవాణా ఆయెను

అత్తిలి గ్రామమున 589 గేదెలు 294 వులు 50 మేకలు 42 గొర్రెలు 10 గుర్రములు 894 ప దులు 929 కోళ్ళు కలవు ఆ సం॥ న 40 000 లీటర్ల పాలు 20 000 కి గ్రా నెయ్యి 2 000లు కి గ్రా చేపలు లభించెను వీటిలో సగభాగము స్థానికముగా ఉపయోగి చుకొని మిగిలిన సగ భాగము తణుకునకు రవాణా చేసెరి

ఇచటి ప్రజల ముఖ్య వృత్తి వ్యవసాయము మి న్ ఎజ ట్లు దుకాణాదారులు క్రయ విక్రయదారులు కలరు జట్కాలను టాంగాలను ఎద్దుబ డ్లను నడుపువారు కలరు క సాలి వ డ్ర గి కమ్మరి కుమ్మరి తాపీ వెలిరల వృత్తుల వారు కలరు మ గలివారు చా లివారు గొల్లవారు నూలు మగ్గములవారు గలరు చేనేత కుటీరపరిశ్రమ వడ్లమరకలవు చేనేత బట్టలకు తణుకునకును 1 ( 00 బస్తాల బియ్యమును తణుకు తాడేపల్లిగూడెములకును రవాణా చేయుదురు కూలీలు దొరకుదురు దినమునకు పురుషునకుకూలి రు 3/ లు స్త్రీకి కూలి రు 2 50 లు

సుబ్రహ్మణ్య ఆ జనేయ వేణుగోపాల సంతాన వేణుగోపాల సిద్ధేశ్వరస్వాముల దేవాలయములు కలవు గ్రామదేవతయగు పోలేరమ్మగుడికలదు కొల్లపాటి వెంకమ్మ మహాకాళిఅమ్మ అను దేవతల గుడులు ఒకచర్చి ఉన్నవి ఈ దేవాలయములకు 85 ఎకరముల భూమికలదు మార్గశిర శుద్ధ షష్ఠి నుండి 9 దినములు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కల్యాణోత్సవము కొల్లపాటి వె కమ్మజాతర జరుగును స క్రాంతి నుండి 5 దినములు చైత్రశుద్ధ పాడ్యమి నుండి 9 దినములు

పోలేరమ్మ జాతర మొదలగునవి అత్యంత వైభవముగా జరుగను

అత్తిలి రైల్వేస్టేషను గ్రామము నుండి ఒక మైలుదూరములో ఉన్నది అత్తిలిమెయిను కాలువ రవాణాకు ఉపకరించుచున్నది రాజమండ్రి నుండి కలప కంకర ఇసుక సిమెంటు మొదలగునవి దిగుమతి అగును ప్రతి అర్ధగంటకు ప్రభుత్వపు బస్సులు ఈ గ్రామము మీదుగ తణుకు నుండి భీమవరమునకు ఆకివీడు నుండి తణుకునకు తాడేపల్లిగూడెము నుండి కోడేరునకు తాడేపల్లిగూడెము నుండి మార్టేరునకు తాడేపల్లిగూడెము నుండి దొడ్డిపట్లకు తాడేపల్లిగూడెము నుండి నర్సాపురమునకు పోవును సిమెంటురోడ్డు 19 కంకరరోడ్లు 3 కచ్చారోడ్లు కలవు సిమెంటురోడ్డు కంకరరోడ్లు ఈగ్రామమును పొరుగు గ్రామములతో కలుపుచున్నవి 6 గుర్రపుబండ్లు 9 బస్సులు 6 మోటారు కార్లు 27 ఒంటెద్దుబండ్లు 118 రెండెడ్లబండ్లు 671 సైకిళ్ళు ప్రయాణముకు ఉపయోగపడుచున్నవి ఇచట మూడు వంతెనలు నాలుగు డాములు కలవు

అత్తిలిలో సబ్ పోస్టాఫీసు తంతి కార్యాలయము టెలిఫోను మిడిల్ ఎలిమెంటరీ స్కూలు ... ఆంధ్ర ఎలిమెంటరీ స్కూలు బాలుర అప్పర్ ప్రైమరీస్కూలు బాలికల అప్పర్ ప్రైమరీస్కూలు జిల్లాపరిషత్ హైస్కూలు కలవు ఈ గ్రామములో 6 రైసుమిల్లు 2 సినిమాథియేటర్లు ఒక వడ్లమర విద్యుచ్ఛక్తిని వాడుకొనుచున్నవి ఇంకను పంచాయతీ రిపేరు గ్రామము గ్రామ పరిశుద్ధ్యమునకు అగు ఏర్పాట్లున్నవి లోకల్ లైబ్రరీ అథారిటీ బ్రాంచి గ్రంథాలయము ఒక పార్కు రెండు సినిమాథియేటర్లు కోర్టు పోలీసుస్టేషను సబ్ రిజిష్ట్రారు ఆఫీసు ఇక్కడ ఉన్నవి గ్రామ సహాకార సంఘము రు 90 754 లను గ్రామస్థులకు అప్పుగా ఇచ్చినది మరియు ఒక గవర్నమెంటు ఆసుపత్రి 4 నర్సింగ్ హోములు ఒక హోమియో ఆసుపత్రి ఒక పశువుల ఆసుపత్రి ఉన్నవి ఇచట 15 మంది ఇంగ్లీషువైద్యులు 6 మంది ఆయుర్వేద వైద్యులు ఇద్దరు హోమియోపతి వైద్యులు కలరు 20 కిరాణాదుకాణములు 20 కాఫీహోటళ్ళు 20 సైకిళ్ళ షాపులు 15 సోడా కిళ్ళీ సిగరెట్టు అంగళ్ళు 5 క్షౌరశాలలు బట్టలషాపులు మందులషాపులు ఎరువులషాపులు ఈగ్రామమునందు కలవు వారపుసంతలో కూరగాయలు దొరుకును

కళాశాల చదువులకు విద్యార్థులు 18 మైళ్ళలో ఉన్న భీమవరమునకు పోవుదురు మ్యునిసిఫ్ కోర్టుకు తాలూకా కచేరీకి గ్రామస్థులు 9 మైళ్ళలో ఉన్న తణుకునకు పోవుదురు పురుళ్ళ ఆస్పత్రి రెండుమైళ్ళలో నున్న మంచిలి జనరల్ ఆసుపత్రికి ఏలూరునకు పోవుదురు

అత్రిమహర్షి నివసించుటచే ఈ గ్రామము అత్రి అని మొదట పిలువబడి క్రమముగ అత్రి అనుపదము అత్తిలిగ మారినదట ఇచ్చట అత్రి మహర్షి సిద్ధేశ్వరుని ప్రతిష్ఠించిరట దీనికి తార్కాణముగ అత్రి మహర్షి ప్రతిమ సిద్ధేశ్వరలింగమునకు ప్రక్కన కలదు

అత్తిలి ఒకరాజ్యమునకు ముఖ్యపట్టణముగా నుండెను కుమారగిరి రెడ్డి పాలించినతరువాత రాజమహేంద్రవరపు రెడ్లకును కొండవీడు రెడ్లకును ఇచట యుద్ధముజరిగినదట ప్రస్తుతము హైస్కూలున్న ప్రాంతమున ఒకదుర్గము దానిచుట్టు కందకము (అగడ్త) ఉండెడిదట కాశీ రపురు దగ్గర గల గోదావరికి అత్రిమహర్షి నడచివెళ్ళి ఉదయమున స్నానము చేసి శివుని అభిషేకమునకు నీటిని తెచ్చెడివాడట వార్ధక్యమువలన అత్రిమహర్షి స్నానమునకు వెళ్ళలేని కారణమున అతనిశిష్యులనను యాదేవు ... గాదేవు ప్రార్థించగా ప్రస్తుతము కొలను ప్రదేశము ... బుగ్గ ... దేరినదట ప్రతి ఆదివారము సూర్యోదయమునకు పూర్వము ఆకొలను అడుగున మూడుచోట్ల జలము ఏర్పడును ఒక ఊట జలము ఉప్పగ ఉండును రెండవ ఊటయందు జలము తియ్యగ ఉండును మూడవ ఊటలోని జలము ఉప్పగ ఉండును కాశీలోని పవిత్ర జలము ఈ కొలనులోని ప్రతిఆదివారమునందును కార్తిక మాసమందును ప్రవహించునని జనులు విశ్వసించుచున్నారు అందుచే ప్రతిఆదివారమును కార్తికమాసమందును సూర్యోదయమునకు పూర్వము ఈ కొలనులో స్నానముచేయుదురు కీ శే బడేటి వెంకట్రామయ్యగారు అత్తిలిగ్రామముననే జన్మించిరి

మా శ్వే

## అత్తిలి దేవయరెడ్డి

ఈ రెడ్డిగారు చేసిన ధర్మములు ద వా X 511- 78 లోను అదే సంపుటము 518-279 శాసనములోను కన్పించుచున్నది పశ్చిమ గోదావరిజిల్లా భీమవరం తాలూకా మోంగోను(మోగల్లు) గ్రామమున దలి మూలస్థాన భీమేశ్వర

దేవుని ఆలయపు నంది మండపము శిలాస్తంభముపైగల శాసనములలో ఈతని ధర్మములు వ్రాయబడినవి ఈ రెండు శాసనములును శక 1237 (క్రీ శ 1315) రాక్షస సవత్సరమునకు చెందినవే రెండును ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తముగా వెలసినవే ఒకే దేవాలయమునందు ఒకే పుణ్యకాలమున వేర్వేరు శాసనములేల రచియించిరో తెలియదు దేవయరెడ్డి (రడి అని శాసనరూపము) తండ్రి నాగిరెడ్డి తల్లి మేడమ రెడ్డిసాని సాని అనునది పూజ్యవాచకము బమ్మెరపోతరాజు గారి తల్లి లక్కసాని దేవయరెడ్డికి మల్లయరెడ్డి మేడయరెడ్డి అను అన్నలుగలరు శాసనములు వ్రాయించు కాలమునకు వీరిరువును స్వర్గస్థులయి ఉందురు కావుననే తల్లిదండ్రులకును అన్నలకును పుణ్యముగా దేవయరెడ్డి శిలాకంబము (శిలాస్తంభము) అగ డదీపము న దాదీపము పెట్టి చెను అఖండ దీపము ఆలయములో వెలుగుచు డును నందా (సంధ్య) దీపము ఆకాశదీపము అది సాయంకాలముల దు వెల్గి పబడి ధ్వజ స్తంభముల యెత్తున వెలుగుచుండును ఈ దీపములు ఆచంద్రార్కముగా నడపుటకై దేవయరెడ్డి కొ తభూమిని బోయలకు ఇచ్చెను భూమికొలత ఖ న అను సంకేతములతో నిర్దిష్టమైనది అది ఈరీతి నున్నది

| | | |
|---|---|---|
| ఖ | — | న |
| 0 | — | 15 |
| 0 | — | 8 |
| 1 | — | 3 |

అనగా ఖం న లు ఒక ఖండిక అని తెలుచున్నది శాసనమునందు వెగలివర్తి పొలము కరాప ర్తి పొలము అను పదములు వాడబడియున్నవి కరాపర్తి వృత్తిమ తడు అని మూలఘటిక కేతనదశ కుమార చరిత్రలో చెప్పయున్నాడు వీనియర్థమేమో సరిలుగ తెలియుటలేదు నీరునేల (పల్లము) వెలిపొలము (మెట్ట) అనునట్లు భూమిరకమును తెలుపునవియో లేక కర అనగా పన్నులకు స బంధించినవో విశదముకాలేదు అట్లే పలకోటి ఉత్తరాన బయ్యకోటి ఉత్తరాన అను పద బంధముల దలి కోటి అనునది కోడు = చిన్న కాలువ పంట కాలువ అనుదాని జౌపవిభక్తిక రూపముగా తోచుచున్నది "వేమకుడిచిదీపము నడుపునారు" అనగా వేమఫల సాయము అనుభవించి అఖ డదీపము పెట్టవలెను అని భావము సాధారణముగా మధ్యయుగ శాసనములన్నిటి యందును దేవుని దీపములకు నేయిపోయుటకై మొదవులు (ఆవులు) గాని ఇనుప ఎడ్లనుగాని ఇచ్చుట కనిపించును దేవయరెడ్డి సస్యక్షేత్రము నిచ్చుట విశేషము

శాసనకాలమగు క్రీ శ 1315 నందు రాజ్యము సేయుచున్న ప్రభువులెవ్వరో శాసనమునందు చెప్పబడలేదు ఇది కాకతీప్రతాపరుద్రచక్రవర్తి కాలము కాకతీయులు కోనమండలమును ప్రత్యక్షముగా పాలించుటలేదు వారి బంధువులైన నిడదవోలు చాళుక్యులు ఈ ప్రాంతము నేలుచుండిరి దేవయరెడ్డి వారి సామ తుడు కావచ్చును ఈతని యింటిపేరైన అత్తిలి గ్రామముకూడ పశ్చిమ గోదావరిజిల్లాయ దే కలదు వీరు అచ్చటినుండి మోగల్లుకు వలసపోయి యుందురు అత్తిలిరెడ్లు సంపన్నగృహస్థులు ధర్మపరులుగా కన్పించుచున్నారు అత్తిలి పెదపోతిరెడ్డి అనువాతడు కూడ మోగల్లు మూలస్థాన శ్రీమేశ్వర దేవునిమ దు ధర్మప్రతిష్ఠాపనలుచేసెను వీరు అన్నదమ్ముల వంశమువారు కావచ్చును

ఖం ల రం

## అత్తిలి పెద్ద పోతిరెడ్డి

ఈ రెడ్డి ప్రముఖుని పేరు పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకా మోగల్లుగ్రామమున దలి శ్రీమేశ్వరాలయపు స్తంభముమీద చెక్కబడిన శాసనములో (ద వాం X సె 510) లభించుచున్నది శాసనములో మోగిల్లును మోంగొలను అని వ్యవహరించిరి శాసనకాలము శక 1237 (క్రీ శ 1315) రాక్షస సవత్సర ఉత్తరాయణ సంక్రాంతి పుణ్యకాలము ఈనాడు అత్తిలి పెదపోతిరడి (రెడ్డి) తమ తండ్రి మారెడ్డికిని తల్లి సూరమరెడ్డి సానికిని ధర్మముగా మో గొ లని మూలస్థానశ్రీమేశ్వర శ్రీమన్మహాదేవుని ము దటినందిమండపమునందు శిలాక బము (స్తంభము) పెట్టించి ప్రమథ కవి సిరిగిరిఅయ్య గారికి లంజెపాటి పొలాన 5 పుట్ల భూమి దానము చేసెను ఈ పొలమునకు నందికంబాలు పెట్టినట్లు చెప్పబడినది అనగా సరిహద్దులు నిర్దేశించుటకై నందిముద్రగల రాళ్ళను పాతిరని తోచు చున్నది ల జెపాడు ఒకప్పుడు బౌద్ధ సంఘారామముగల ప్రదేశమైయుండును బౌద్ధ మతము క్షీణించు కాలమునంథు సంఘారామములలో అవినీతి పెరుగుటచేకాబోలు అవి లంజెదిబ్బలను అపకీర్తికి పాలయ్యెను లంజెపాడు కూడ ఇట్టిదియే అయియుండును దాన ప్రతి గ్రహీతయైన సిరిగిరి

(శ్రీగిరి) అయ్యగారు ప్రమథ కవియట అనగా శివకవి కావచ్చును ప్రమథ గణములు ఈశ్వరుని భృత్యులు

శాసన కాలమునకు అనగా క్రీ శ 1 15 నాటికి కాకతిప్రతాపరుద్రచక్రవర్తి ఆంధ్ర సామ్రాజ్యము నేలుచుండెను పశ్చిమ గోదావరి మండలము నిడుదవోలు చాళుక్యుల అధీనము న దుండెను వీరు స్వతంత్రులు కాకపోయినను కాకతీయులతో బాంధవ్యము చేసిన వారగుటచే కొంత స్వేచ్ఛను అనుభవించిరని తోచుచున్నది చాళుక్య వీరభద్రుడు రుద్రమదేవిని పెండ్లి యాడిన వృత్తాంతము సువిదితము అత్తిలి పెదపోతిరెడ్డి తన శాసనములో కాకతీయులనుగాని నిడుదవోలు చాళుక్యులనుగాని పేర్కొనలేదు అయినను ఈయన స్వతంత్రుడనుటకు ఆధారములేమియులేవు అత్తిలిరెడ్లు సంపన్న గృహస్థులు ధర్మప్రియుగా కనబడుచున్నారు ఈ వంగడమునకు చెందినవారివే మరి రెండు శాసనములు (ద హిం X నెం 511 513) మోగల్లు భీమేశ్వరాలయమున నెలకొల్పబడియున్నవి పెదపోతిరెడ్డిదే మరియొక చిన్నశాసనము శక 1237 సంనకు చెందినది (ద హి X నె 5 6) ఈ యూరి భీమేశ్వరాలయమున ఉన్నది ఈ కాలమునందు ఆంధ్రదేశమున శైవమతము ఎక్కువ జనాదరము పొందుచుండెను కాకతీయ చక్రవర్తులు ప్రసిద్ధ శివారాధకులు వారిని బట్టి వారి సామంతులును శైవమతాభిమానులుగ ఉండినట్లు తోచును

పెదపోతిరెడ్డి శ్రీగిరి కవికి ఇచ్చిన 5 పుట్ల భూమి కాక మరి పదునెనిమిది పుట్ల భూమిని రాచదొడ్డి మాని నివేశన స్థలము ఇద్దుము (రెండు తూములు) ఇండ్లు కట్టిన స్థలము సర్వమాన్యముగా ఇచ్చెనట ఇది మోగల్లు దేవాలయనకే ఇచ్చెనో లేక మరెవరికైన ఇచ్చెనో తెలియుటలేదు ఈ భూమిని కేసరి అను మానముతో కొలిచియుండవచ్చును కావుననే కేసరి పదునెనిమిది పుట్లు అని చెప్పబడినది పెదపోతిరెడ్డి ఈ భూమిని పలువురు ఆసామీలదగ్గర విలిచి దానము చేసినట్లు కనిపించును ఎవరెవరివద్ద ఎంత భూమి సేకరించెనో వివరములు శాసనమందు కలవు రాచదొడ్డి మాని అనుటచే అప్పుడు రాజ్యము సేయుచున్న ప్రభువులస్థలము విడిచిపెట్టి మిగిలిన స్థలమునే పోతిరెడ్డి సేకరించి దానముచేసెను భూమిని కొలుచుటలో ఖ న అను సంకేతములు వాడుచుండిరి ఖ ఖ డ్రిక పుట్టి కావచ్చును న అనగానేమో తెలియలేదు 20 న గుర్తుగల భూఖండములు ఒక కండ్రికగా పరిగణింపబడినట్లు అత్తిలి దేవయరెడ్డి శాసనమువలన (ద హిం X నెం 511) ఊహింపనగుచున్నది

పెద పోతిరెడ్డి భూమిసేకరించిన వారిలో ముప్పరెడ్డి వారు చెరుఎళ్ళవారు అనిసెట్టివారు ఓడలవారు కామినేని వారు చెంగనేని వారు అడుకుల వారు మోటుపల్లి వారు మాలలు మున్నగువారు కలరు దోసిలావ నూంపఖండావ వంటి పేరులు శాసనములో కనబడును ఆవ అనగా చెరువు కావచ్చును విశాఖపట్నం జిల్లాలో కొండకర్ల ఆవ కొమరవోలుఆవ వంటి పెద్ద చెరువులు వినవచ్చును ఈ కాలపు భాషలో మనము వద్ద దగ్గర శబ్దములు వాడిన స్థలమునందు శాసనములో చెంత కడ అను పదములు ప్రయుక్తములయ్యెను మోటుపల్లి వారిచెంత పెన్నేరుఅమ్మగుడి కడ అను రీతిగా వాడిరి తాళ్ళదొడ్డి అని మనము వాడుకొనుచోట శాసనమునందు తాడ్ల దొడ్డి అని వ్రాసిరి అనగా డ్లు ల్లు వర్ణాంత రూపములు వాడుకలో ఉండెను అత్తిలి పెదపోతిరెడ్డి ధర్మాత్ముడనుటలో సందేహములేదు

ఖం ల రం

## అత్తివర్మ

అత్తివర్మ యను పదము హస్తివర్మయను సంస్కృత నామమునకు ప్రాకృతీకరణమని చెప్పవచ్చును ఈ హస్తివర్మ ప్రాచీనకాలమున ఆంధ్రదేశము నందలి కృష్ణా నదీతీర ప్రాంతమునందును నేటి గుంటూరు జిల్లాయందును రాజ్యపాలనము కావించిన ఆనంద గోత్ర వంశస్థుల సంతతి యందలి ఒక ప్రభువు ఈ ఆనంద గోత్ర వంశము వారిని గూర్చిన పెక్కు అంశములు చేజెర్ల యను ప్రదేశమున దొరకిన శిలాశాసనము వలన తెలియవచ్చుచున్నవి ఈ ఆనంద గోత్ర వంశమునకు ఆనంద మహర్షి మూలపురుషుడు ఈ వంశమునందలి కందర రాజు చాల ప్రసిద్ధుడు ఈతడు శత్రురాజులను జయించి తన రాజ్యమును కృష్ణానదీదక్షిణతీరము నుండి త్రికూట పర్వతము వరకు వ్యాపింపజేసెను త్రికూట పర్వతమనగా నేటి గుంటూరుజిల్లా నరసారావుపేట పట్టణమునకు సమీపమున నున్న కోటప్పకొండ అనబడుగుట్ట ఆనంద గోత్రరాజుల రాజధాని కందరపురము బహుశ దీనిని పైన తెలుపబడిన ప్రసిద్ధుడగు కందరరాజు స్థాపించియుండును ఈ వంశపు

రాజులు రెండు జనపదములను పాలించిరి సంస్కృత భాషలో వ్రాయబడిన పై శాసనము క్రీస్తు పూర్వము అయిదవశతాబ్ది నాటిదని చారిత్రికులు తలచుచున్నారు

ఆనంద గోత్ర వంశమునందలి దామోదరవర్మ ప్రసిద్ధుడైన రాజు ఈతడు కంగూర యను గ్రామమును బ్రాహ్మణులకు దానము చేసినట్లు మట్టెపాడు శాసనము వలన తెలియుచున్నది దామోదరవర్మ తరువాతివాడు అత్తివర్మ ఈ హస్తివర్మ కూడ గొప్ప దానపరుడు శివభక్తుడు ఆపస్తంబ సూత్రుడును యమునియమవంతుడును ఋగ్యజుస్సామవిదుడును కాశ్యపస గోత్రుడును అయిన కొట్టిశర్మకు ఈ అత్తివర్మ కృష్ణానదీ దక్షిణతీరమున తాడికొండ గ్రామములో 800 పుట్లభూమిని ఆతుకూరు గ్రామమును దానముచేసెను " ఆతుకూరు కృష్ణానదికి ఉత్తరమున నెలకొనియున్న ఒక పల్లెటూరు అత్తివర్మ గావించిన ఈ దానమును గూర్చిన ప్రశంస గోరంట్ల శాసనమందు కానవచ్చును శాసనము సంస్కృత భాషయందు వ్రాయబడియుండుటవలనను శాసన లిపియొక్క స్వరూపము వలనను గోరంట్ల శాసనము క్రీస్తుశకము అయిదవ శతాబ్ది తుదిభాగము నాటిదని నిర్ణయింపబడినది

ఆనందగోత్రుల వంశ చరిత్రను గూర్చిన అంశములు విశేషముగ తెలియవచ్చుటలేదు పల్లవులనురాజవంశము వారిని తరిమివేసి ఆనంద గోత్రరాజులు కృష్ణానదీ తీరమున తమ అధికారమును నెలకొల్పుకొనిరి ఆనంద గోత్ర రాజుల కాలమునాటికి బౌద్ధమతము పూర్తిగక్షీణింపలేదు ఈవంశమునందలి దామోదరవర్మ బుద్ధ పాదానుధ్యాతుడు అందును బట్టి నికి వైదికమతము నందును వేదాధ్యయన సంపన్నులగు బ్రాహ్మణులందును చాల అభిమానము ఈతడు కావించిన దానము మట్టెపాడు శాసనమునందు ఉదాహృతమైనది క్రమక్రమముగ ప్రజలయందు బౌద్ధమతాభిమానము సన్నగిల్లి వైదిక మతమునందు గౌరవము హెచ్చుకాజొచ్చెను ఈ యంశము చేజెర్లయందలి కపోతేశ్వరాలయమునందలి వ్రాతచే ప్రకటీకృతమగుచున్నది కపోతేశ్వరాలయము మొట్టమొదట బౌద్ధ చైత్య గృహముగా నుండి తరువాత హైందవ దేవస్థానముగమారినట్లు తలంపబడుచున్నది క్రీస్తుశకము అయిదవ శతాబ్ది తుదిభాగమున శాలంకాయనుల విజృంభణము వలన ఆనంద గోత్ర రాజుల యాధిక్యము క్షీణించెను

ఖం బా

## అత్యమనాయకుడు

ఈతని కుమారుడొకడు దాక్షారామ భీమేశ్వరునకు అఖండవర్తి దీపమును మర్పించెను (దహి IV 1236-427) దానముచేసిన సజ్జనుని పేరు విశదముగాలేదు వల్లెన కావచ్చును ఇతని అన్న అత్యళనాగుడను నాతడు ఈ సోదరుల తల్లిపేరు కొమ్మసాని వీరు శ్రీ మన్మహామండలేశ్వర కులోత్తుంగ చోడగొంక రాజుల బంట్లు దీపదానము ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున జరిగినది శాసన కాలము నష్టమైనది కులోత్తుంగ చోడగొంక రాజు వెలనాటి దుర్జయ వంశీయుడు ఈవంశమువారు కాంచీపుర చాళుక్య చోళ చక్రవర్తులకు నామమాత్ర సామంతులై క్రీశ పండ్రెండవ శతాబ్దియందు ఆంధ్రదేశపు తీరప్రాంతమున ఆధిపత్యము వహించిరి వీరిని వెలనాటి చోడులందురు ఈ వంశ యమునందు గొంక చోడ అనుపేరు మముగా చ్చుచుండును వెలనాటి చోడులలో ముగ్గురు గొంక నామధేయులు ఇద్దరు చోడ అను పేరుల వారును న్నారు వల్లెన ఇచ్చిన దాన శాసనమందలి గొంకరాజు రెండవ గొంకరాజుగ గుర్తింపబడుచున్నాడు దీని కారణము ఈ శాసనమున గల శ్రీరాజ - జదేవ పేర్కొనుటయే రాజు కాంచీపుర చక్రవర్తియైన రెండవ రాజరాజచోళుడు ఇతని పరిపాలనాకాలము క్రీ శ 1145 117

వెలనాటి రెండవ కులోత్తుంగ చోడగొంకరాజు క్రీ శ 1132 63 వత్సరములందుమ తెనుగుదేశమును నుఈతడు మహాపరాక్రమశాలి ఇతని మనదము దేపాశ్చాత్య చాళుక్యులు ఆంధ్రదేశములో కొంత భాగము మి చుకొని యుండిరి దేశభక్తుడై రెండవ గొంకరాజు ఇతర తెలుగు సామంత ప్రభువులను కూడ గట్టుకొని క్రీ శ 1135 లో గోదావరీ తీరమున మహాయుద్ధముచేసి పాశ్చాత్య చాళుక్యులను ఆంధ్రదేశమును ండి వెడలగొడచెను

వల్లెన నాయకుడు భీమేశ్వరదేవుని అఖండ దీపారాధనకై 50 ఇనుప యెడ్లను కాపకోయడు అియబోయడు ముస్నగువారి వశమున పెట్టెను వీరు త్రిభువనాంకుశ మానముతో నిత్యము మానెడు నేయి దేవుని దీపారాధనముకై పోయవలెనని కట్టడి చేయబడెను

ఖం ల రం

## అత్రమల్లుడు

పెదకాకాని గుంటూరుజిల్లా గుంటూరు తాలూకాలోని ఒక గ్రామము అందలి ప్రస్తుతపు జనాభా 8 838 నంబూరు రైల్వేస్టేషనుకు ఈ గ్రామము 1½ మైళ్ల దూరమున కలదు ఇచటి దేవాలయములందు ఉన్న కాకతీయ విజయనగరరాజుల కాలములనాటి శాసనములనుబట్టి ఈ గ్రామము ప్రాచీనమని తెలియనగును

కల్నల్ మెకంజీ సేకరించిన వ్రాత ప్రతులననుసరించి కాకతీయ రుద్రమ మహాదేవి రాజ్యపాలన కాలము అత్రమలుడను నతడు తన తండ్రి గడ్డ బాచినాయనికు తల్లి ఎరియమ్మకు పుణ్యము కోరుచు పెదకాకానిలోని గోపాల దేవరకు భూదానము చేసెను ఈ శాసనకాలము క్రీ శ 1270 ఇది గోపాలస్వామి ఆలయమందు కలదు ఈ శాసనమునందు అత్రమల్లుడు నగరి అంగరక్షకుడని చెప్పుకొనెను

ఆనాటి రాజ్య వ్యవస్థయందు మహారాజులు అంతఃపురమును విడి బయటికి వెడలునపుడు వారివెంట అంగరక్షకులు కూడ ఉండెడువారు అత్రమల్లుడు అట్టి ఒక అంగరక్షకుడై యుండుటయేగాక నగరి సంరక్షకుడై ఉండి కూడ తన విధులను సక్రమముగా నిర్వర్తించెడివాడని ఈ శాసనమువలన తెలియనగును

కాకతీయ రుద్రమహారాజు కాలమున ఏకశిలా నగరమునందు ఇందులూరి పెదమల్లన చినమల్లన అనువారలు నగర పాలకులుగా ఉన్నట్లు శివయోగసార మను గ్రంథమున చెప్పబడినది

మేచయ నాయకుడు ఏకశిలా నగరమునకు గణపతిదేవచక్రవర్తికాలమున నగరపాలకుడుగా నుండెనని మార్కండేయ పురాణమున చెప్పబడినది రుద్రమదేవి రాజ్యపాలనకాలమున కూడ మేచయ నాయకుడే నగరపాలకుడుగా నుండియుండును గణపతిదేవ మహారాజు రుద్రమదేవి రాజ్యపాలనకాలమున జీవించియుండుటయే దీనికికారణము ఆతనికి సహాయులుగా అత్రమల్లుడువంటిపెక్కురు అంగరక్షకులు తమ విధులతోపాటు నగర ఉప సంరక్షకులుగా ఉండెడివారని ఊహింపవచ్చును అత్రమల్లుడు అను పదము యొక్క మొదటి రూపము అస్త్రమల్లుడు అయియుండవచ్చును యుద్ధములలో అస్త్రవిన్యాసమందు గొప్ప ప్రతిభ చూపిన యోధుడు అస్త్రమల్లుడు అస్త్రమల్ల శబ్దమే క్రమముగా అత్రమల్ల శబ్దముగా మారియుండవచ్చును

మా శ్వే

## అథర్వణుడు

అథర్వణాచార్యుడు సంస్కృతమున ఆంధ్ర భాషకు వ్యాకరణమును రచించి విఖ్యాతుడైన యొక లక్షణవేత్త ఇతడు రచించిన గ్రంథములు నాలుగు అవి భారతము అథర్వణ ఛందస్సు త్రిలింగశబ్దానుశాసనము వికృతివివేకము అనునవి వికృతివివేకమునకు అథర్వణకారికావళి అను వ్యవహారముకూడ కలదు కారికలలో తెలుగు అక్షరముల స్వరూపమిట్లు వ్రాయబడియున్నది "పంచవర్గముల ప్రథమాక్షరములు (క చ ట త ప లు) శంఖశార్ఙ్గాదికముల వలె నుండును ఆ యక్షరములకు మీఁగిభాగమునందు తిర్యగ్రేఖలుండును క్రిందిభాగమందు దండరేఖలుండును" 2 ఆంధ్రాక్షరములకీ స్వరూపము పదునైదవ శతాబ్దియంతమువరకు ప్రాప్తింపనందున నీ గ్రంథకర్త యాకాలమునకుఁ బూర్వుఁడైయుండఁ డనుటలో సందేహములేదు (ఆ విజ్ఞాన స 1 సం పేజి 456) ఇతడు పదుమూడవశతాబ్ది నడుమ తిక్కనకు సమకాలికుడో ఇంచుక పూర్వుడో అయియుండవచ్చునని కవిచరిత్రకారులూహించిరి అథర్వణాచార్యుని మొట్టమొదట పేర్కొన్నవాడు క్రీస్తుశకము 1445 ప్రాంతములో ఉండిన గౌరన అనియు అతడు తన లక్షణగ్రంథమున అథర్వణచ్ఛందమును పేర్కొనెననియు అందువలన అథర్వణునికాలము గౌరనకాలమునకొక శతాబ్దము ముందు అనగా 14 శతాబ్ది పూర్వార్ధము కావచ్చునని శ్రీ ఆరుద్రగారూహించినారు కాని అథర్వణు డెప్పటివాడను విషయము సత్యాన్వేషణ దృష్టితో పరిశోధింపదగియున్నది

**నామము** అథర్వణుడను పేరు ఆంధ్రులలో వినపడదు కనుక ఇతడు జైనుడేమో అనుకొన్నారు కొందరు జైనులలోను అథర్వణనామములు అన్యులుకానరారు అథర్వణుడనునది అతని నామము గంభీరమొనర్చుకొనుటకు చేసికొనిన మార్పుకావచ్చును శ్రీ వీరేశలింగ గారు చెప్పినట్లు నాలయ్య అను నామమునకిది సంస్కృతీకరణ మనుకొనుట ఉచితముగాలేదు తెలుగువారిలో నాలయ్య అను పేరు పెట్టుకొనుట విన్నదికన్నదికాదు అథర్వణశబ్దమునకు శంకరుడని అర్థముకలదు కావున శంకరశాస్త్రియో

శంకరశర్మయో ఇతని పేరు కావచ్చును ఇదియు ఊహా మాత్రమే అథర్వణఛందములోని ఈ క్రింది పద్యము లాతడు వైదికమతానుయాయి అనుటను సూచించుచున్నవి

పర్వతములందు మేరువు భాతియగుచు
సర్వ సురలందు శంకరు చందమగుచు
నరయ మృగములందు సింహంబు కరణి
గుణములందెల్ల నగణంబు గరిమగాంచు
వసుధామరులకు గచటలు
వసుధాపతులకును దపరవలు వైశ్యులకున్
యసహలు శషలును శూద్రుల
కనమవు శకులు చెప్పనగు పద్యాదిన్ (దిన్ ?)
ఆరయస్వరగణ (త?) మయ్యుబు
కారము బుధ్రాసమగుచు గదియును రేఫన్
జేరి తనయురము దన్నిన
యా ఋషి పాదములు పిసికెనచ్యుతుడనగన్

ఈ మూడవ పద్యమందలి గాథ జైనుడైనవానికి సుకరముగా స్ఫురింపదగినదికాదు బ్రాహ్మణులను వసుధామరులని గౌరవించుట సర్వసురలలోను శంకరుడు శ్రేష్ఠదైవమని తెలుపుట అతడు జైనమతమువాడు కాడనుటకు ప్రబల నిదర్శనము అనవచ్చును

మహాభారతము ఇది వీరేశలింగము పంతులుగారునుండి అనేకులు అథర్వణాచార్యులు రచించిన భారతములో ఉపలబ్ధములైన పద్యములనుబట్టి అతడు విరాటపర్వమునుండి మూడుపర్వములుమాత్రమే రచించెనని ఊహించిరి శ్రీనిడుదవోలు వెంకటరావుగారు ఆంధ్రకౌముదినుండి సంపాదించి తమ తెలుగుకవుల చరిత్ర అనుబంధములో చేర్చిన అథర్వణ భారత పద్యములు ఆధారముగా జేసికొని శ్రీ ఆరుద్రగారు ఆదిపర్వమునుండి కనీసము కర్ణపర్వమువరకు అథర్వణాచార్యుని భారతరచన సాగియుండునని వక్కాణించిరి అథర్వణాచార్యులు భారతమును మొదటినుండియు రచించెననుట తథ్యము

రచనాప్రాగల్భ్యము అథర్వణుడు నన్నయాదులకు ఈడువచ్చుకవి అనియు అతని పద్యములు మృదుమధురము లనియు అతని భారతమునుండి లక్షణ గ్రంథకర్తల ఉపకారమున లభించిన ఈ క్రింది పద్యములు సాక్ష్యమిచ్చుచున్నవి

ప్రణతాశేషవసుంధరాధిప శిరస్స్రగ్గంధ లుబ్ధభ్రమ
త్క్వణదభ్ర భ్రమకృద్ద్విరేఫగణఝం కారప్రదాబద్ధసం
ప్రణవత్వ్యత్రప్రథిత ప్రవర్ధిత సమస్త క్షత్రసూయాధ్వర
క్షణసంహాసన భాసతున్ దృఢధనుశ్శ్లాఘాభిజనున్ ధర్మజున్
— సభాపర్వము

వరధౌమ్యాచార్యపుర
స్సరులై స్వాధ్యాయ హోమజపతత్పరులై
యఱువదివేల సవులు ధ
ర్మరాజు మఖమఱుతఁ జనిరి రాజ్యంబునకై
— అరణ్యపర్వము

ఆకర్ణ దురాలాపము
లాకర్ణింపగన సహ్యమైద్రోణునితో
నాకనదీసుతుడనియె వ
నౌకోధ్వజ మెరుగవచ్చు నరుజూపితగన్
ధర్మతనయ ! యుష్మదాజ్ఞానిగళవిని
బద్ధమగుచుజిక్కువడియెగాక
విజయ మత్తగజము విడివడ్డచోనడ్డ
పాటుగలదె విష్టపత్రయమున ?
శ్రీకంఠు డెదురునపుడు వ
నౌకోధ్వజ మింద్రమకుట మర్షనతురగా
నీకము దివ్యశతాంగము
నాకవ్వడి కబ్బియున్ననత డేమగునో !
— విరాటపర్వము

తృష్ణాతంతునిబద్ధబుద్ధులగు రాధేయాలంగూడి శ్రీ
కృష్ణుం గేవల మర్త్యుగాదలచి మర్దింపంగనుత్సాహవ
ర్ధిష్ణుండయ్యె సుయోధనుండకట ధాత్రీనాథ
యుహింపుమా
యుష్ణీషంబుగగట్టవచ్చునే మదవ్యాధోగ్రశుండాలమున్ ?
— ఉద్యోగపర్వము

గురుభీష్మ కర్ణగాంధా
రరాజ భూరిశ్రవులు దొరకుతోడ్పడిగ్ర
చ్చుర కవ్వడి మార్కొని ని
బ్బరముగ నటు గురిసరంపనా నలుకడిమిన్
అరయగ వారెల్లరు బ్రబ
లురు గావున వారితో విరోధమ్మునకే
లరపయద సంధికిం బం
పురాచ బెబ్బులి మకుటేనేపోయి మఱలెదన్

తలచైన కురుబుల
మఱపు వుచు గంమిమెఱయ మారిమసగిన
ట్లఱిముఱి బె గు గదగొని
కరువలిక్ డుక డునుఱయు గావి చెవడిన్

— యుగ్గప చకము

అథర్వణుని ఛ ందస్సు అథర్వణాచార్య ఛందస్సు వెల్ల కి తాత భట్లు మొదలైన లక్షణ గ్ర థక ర్తు ఉదాహరి చియున్నారు అ దలి పద్యములు హృద్యమధురముగా నున్నవి

కలువల గొప్పదీర్చి తెలిగ దమల ది మొఱు గుము త్తియ
బుల తొడవుల్ బెడ గడరబూని దుకూలము గట్టి చేతుల
బొలుపగు రత్నవీణియము బు స్తకమున్ విలసిల్లగు దకు
ట్మలరుచినొప్పు విప్రకుల మాతృక సత్కవితాప్రదాయి
యై

— అ ర ఛ 2 ఆ 270 ప

స్వరయతుల్ ప్లుతయతుల్ సంయుక్తయతులను వర్గ
యతులు బిందువడి యఖండ
విరతిపోల్కివడి యభేదయతి సరసయతి చక్కటెక్కటి
యతులు మఱియుఁ
బ్రభునామ యతియును బ్రాదులు వృద్ధులు మయతియు
నిత్యసమాసయతియు
నా దేశయతులు రియతి ఋయతి కల్పయతులు విభాగపు
యతులు దేశ్య
యతులు భిన్నయతులును గుణితయతులును
బ్రాది నిత్యసమాస విరహితయతులు
ఘుణ్ యతులు శకంధుయతులు నఞ్ యతులవ
లనసమాస యతు లిరువదెనిమి దొకటి

ఆ రం ఛ 3 ఆ 12 ప

ఈ యతుల సంఖ్యను వేరువేరు కవులు వేరువేరుగా చెప్పియున్నారు

భీమన ఛందమున వళ్ళు పదివిధములు విన్నకోట పెద్దన పదారు విధములనెను కవిరాక్షసుడు ఇరువదియొకటి యనెను అన తామాత్యుడు ఇరువదినాలుగు య తు లు చెప్పెను నన్నయ లక్షణసారమున ఇర్వదేడౌయతుల్ అని చెప్పెను అథర్వణాచార్యులు పై పద్యమున ఇరువదితొమ్మిది యతులను చె ప్పినాడు అప్పకవి నాలుగుపదులమీద నొకటికి పెంచినాడు ఈ యతుల స ఖ్య ను క్రమ పరిణామమనుకొని చూచినచో అథర్వణుడు అన తామాత్యుని తరువాతివాడు కావలసి వచ్చును కాని ఈ యతుల నెవరి బుద్ధి తోచినట్లు వారు చెప్పిరే కాని ఇవి కమప ణతములనుకొని కాలనిర్ణయము చేయనెంచుట ప్రమాదకరమని శ్రీ శే య్యగారు చెప్పుచున్నారు అది మ జసమే యనవచ్చును

త్రిలి గశబ్దానుశాసనము కృతివివేకము వీరేశలి గం ప తులుగారు త్రిలి గశబ్దాను శా సము అథ ర్వణ కృతియని య గీకరి చిరి వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు ఈ రె డును అథర్వణాచార్యుల కృతులు కా బోవచ్చునని అనుమాని చిరి శ్రీ చాగ టి శేషయ్యగారు ప్రభాకరశాస్త్రిలవారి అనుమానమున నే సత్యమున్నదని వా (క) చ్చినారు శ్రీ వఝుల చిన సీతారామశాస్త్రిలవారు అ థ ర్వ ణ కా రి క లు నన్నయభట్టారక రచితమైన ఆంధ్ర శబ్దచి తామణికి పూరక గ్ర థమనియు ఆకారికలు అథర్వణకృతములే యనియు విశ్వ స చుటయేగాక నన్నయాథర్వణీయమను నామాంతరము గల వైయాకరణ పారిజాతమును వెలయించినారు అం తే గాక ఆ ధ్రవ్యాకరణ స హితాసర్వస్వమున గూడ చింతామణిని అథర్వణకారికలను చేర్చికొనిరి త్రిలి గశబ్దాను శాసనమున హేమచ ద్రుడు బృహస్పతి కణ్వుడు వాల్మీకి పుష్పద తుడు పౌల స్త్యరావణుడు ధర్మరాజు పత జలి పాణిని గౌతముడు కైయటుడు అను వ్యాక ర్తలు స్మరింపబడినారు వీరిలోపాణిని పత జలి కైయటుడు సంస్కృత వ్యాక ర్తలు హేమచ ద్రుడు వాల్మీకి ప్రాకృత క ర్తలు మిగిలినవార ఆ ధ్రవ్యాక ర్తలు వికృతి వివేకమున వీరిలోపాణిని వాల్మీకిమాత్రమే కనిపి చుచున్నారు శ్రీకవి విష్ణుశర్మ హరి శృ గారభూషణుడు ధూర్వహుడు శిఖామణి శౌరి కవి భావురుడు అకల కుడు పూజ్యపాదుడు అను వ్యాక ర్తల యొక్క నామగ్రహణము చేయబడినది వికృతి వివేకమున పేర్కొన్న శేష చిర వైయాకరణుల గ్రంథాలు లభింప ని దున ఇతర విశేషము లేవియు తెలియరానందువలను ఈ నామము లేవియు వికృతి వివేకక ర్త కాలనిర్ణయ గమకములు కావు

త్రిలింగ శబ్దానుశాసనమున గద్య — ఇది చతుష్షష్టికళా దుర్వ్యాథర్వణాచార్య విరచితే త్రిలి గశబ్దానుశాసనే అని

యున్నది నిర్కృతి వివేకమున ఇతి శ్రీమదథర్వణాచార్య విరచితే వికృతి వివేకే అని యున్నది

ఇ తేగాక వికృతి వివేకములో లేని చయ్ జశ్ శ్చుత్వమ్ రప్రత్యాహారః లకారః లట్ లిట్ అర్థధాతుకము సార్వధాతుకము మొదలగు పాణినీయ సంజ్ఞలు త్రిలి గ శబ్దానుశాసనములో ఉన్నవి త్రిలి గశబ్దానుశాసనములో నున్న కణ్వాదుల సూత్రములు వికృతి వివేకమునను దనకకూడ లేవు

నిర్ధారణే కన్నక ఔ దేశ్యేపారుడిరిష్యతే అను త్రిలి గశబ్దానుశాసన సూత్రములోని పారుడి అను ప్రత్యయమును ఎడు ప్రసాదిక ర్యస్యాత్ సేపుః కాలస్య సమ్మతః అను త్రిలి గశబ్దానుశాసనములోని సేపు ప్రత్యయమును వికృతి వివేకములో లేవు

ఇవేగాక ఇంకను ఇట్టి అనేక విషయములనుబట్టి త్రిలి గ శబ్దానుశాసనమును వికృతి వివేకమును ఎకక ర్తృకములు కావనియు వీని కాలనిర్ణయమును ఆధారము లి కను పరిశోధి పవలసి యున్నదనియు చెప్పవచ్చును

అథర్వణుడు తొలుత త్రిలి గశబ్దానుశాసనమున అల్ప విషయముల జెప్పి ఎదప అనల్పవిషయములతో వికృతి వివేకమును రచించి యు డునని వఝల చినసీతారామస్వామి శాస్త్రులవా రూహించినారు వీరు త్రిలి గశబ్దానుశాసనమును చూచి దానిని వికృతి వివేకముతో పోల్చుకొని యరసి యు డిన అట్లూహించుట జరిగియు డదు

త్రిలి గ శబ్దానుశాసనము వైదికమతావల బి యగు నతని రచన ఇ దు ఆంధ్ర ష్ణువు కథ త్రిలిం శబ్ద నిర్వచనము కలవు అకల కుని పూ ్యపాదుని ప్రమాణీకరి చి నందున వికృతి వివేకము జైనకృ క మనవచ్చును వీనిలో త్రిలి గశబ్దానుశాసనము పూర్వపుది వికృతి వివేకము తరువాతిది భారతమును ఛ దోగ్రంథమును రచి చిన వైదిక మతావల బియైన అథర్వణుడు త్రిలి గశబ్దానుశాసనమునకు క ర్త కావచ్చును అగునని నిర్దిష్టముగా చెప్పుటకు ఆధారము అథర్వణ నామసామ్యము మతసామ్యము తప్ప వేరు లేదు "దేశ్యే పారుడి రిష్యతే అని త్రిలి గశబ్దాను శాసనమున పంచమీ విభక్తికి విధి పబడిన పారుడి యనుప్రత్యయ మీతని పూర్వోదాహృత సౌగ ధికాహరణ ఘటవాక్యమున కాని పి చుచున్నది దీనిని నన్నెచోడుడును ప్రయోగించియున్నాడు

ఇదిభారత కర్తయైన అథర్వణుకు త్రిలింగ శబ్దానుశాసనము నకును కర్తయై యు డుననుటకును అతని కాలనిర్ణయమునకును బలమైన కారణ మనజాలము

వికృతి వివేకమును అహోబలపతియే మొదట ఉదాహరి చి "అథర్వణగ్రంథములోని సారమంతయు నా గ్ర థమున చేర్చితిని కాన అథర్వణ గ్ర థమునుజూచు కోరి ను విద్వాసులు వదలుకొనవలసినది అని చెప్పినాడు గనుక అహోబలుడే వికృతి వివేకమును రచి చి అథర్వణుని పేరు పెట్టి యు డునని కవి చరిత్రకారులు గతానుగతికముగా వ్రాసి యున్నారు వైదికుడైన అహోబలపతి తానే వికృతి వివేక కారికలను రచించినచో జైనవ్యాకర్తలకు బదులు వైదిక వ్యాకర్తలనే ప్రమాణీకరి చి యు డును నన్నయభట్టు అవ రావతారమని చెప్పుకొనిన ఆతడు తన్నే ద్వితీయాచార్యునిగ జెప్పుకొనుటకు జ కదు అపశబ్దము విన బడినపుడు "మామేవ స్మరేత్ ప డితస త్తమః" అని అథర్వణుడు చెప్పినట్లు వ్రాయడు మామేవ అని తన కారాధ్యుడైన నన్నయ భట్టారకునికి గూడ పర్యుదాసము కలుగునట్లు అహోబల పతి వ్రాయుట సంభవమే కాదు కావున చి తామణి కర్తయైన ఒకానొక నన్నయయు వికృతివివేకకర్తయైన ఒకానొక అథర్వణుడును ఉ డి యు దురు బాలసరస్వతి తనకు లభించిన ఆ ధ్ర శబ్ద చింతామణి గ్రంథమున నన్నయ నామమును జూచి భారతకర్తయగు నన్నయ కృతమే చింతామణి యని భ్రమపడి దానికి టీక వ్రాసెనా పరిశోధక మహాశయులు చి తామణి రచనను బాలసరస్వతికే అ టగట్టినారు

ఎస్ ఎ ఎస్ వెం

## అదపాక

అదపాక గ్రామము శ్రీకాకుళంజిల్లా చీపురుపల్లి తాలూకాలో ఉన్నది దీనికి 12 మైళ్ళదూరములో శ్రీకాకుళం పట్టణము కలదు తూర్పున గడ్డ పడమట కొత్తకోట ఉత్తరమున గురాలపాలెె దక్షిణమున చెరువుగడ్డ ఈ గ్రామమునకు ఎరిహద్దులుగ ఉన్నవి దీనిని విస్తీర్ణము 3407 ఎకరములు ఇది సమతల ప్రదేశమున గలదు

1961 జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామమందలి జనులు 3 854 మ ది వీరిలో మెడ్యూలు జాతులవారు 858 మంది ఇచట ఇండ్లు ఒకచో గుంపుగాను ఒకచో మూడు పంక్తులుగాను ఉన్నవి వీటిలో 160 పెంకుటిండ్లు నాలుగు

కా క్రీటుకప్పుగల ఇండ్లు కలవు జనులు బావినీటిని త్రాగుదురు త్రాగునీటికి ఎద్దడిలేదు

ఈ గ్రామములో సెలయేరు నిడిగట్లమ్మ చెరువు పాచెరువు రావిచెరువు చిలకవాని క్రొత్తచెరువు కలవు ఈ వనరుల క్రింద వరి సజ్జ వేరుసెనగ జనుము గంటి జొన్న మినుము కంది ఉలవ పంటలు పండును ఫలసాయములను గాదెలలో పురులలో నిలవచేయుదురు ఇందు మామిడితోట ఒకటికలదు మామిడి పండ్లు మామిడికాయలు వంగ బీర బెండ మొదలగు కూరగాయలు స్థానికులకు ఉపయోగపడును పంటల క్రింద 1966 67 సంలో 1410 ఎకరముల భూమి ఉపయోగపడెను చెరువుల క్రింద 1094 ఎకరముల భూమి సాగుబడి చేయబడినది నీటిని తోడుటకు 6 ఎలక్ట్రిక్ మోటారులు లవు పంటధాన్యములను లారీలపై ఆముదాలవలస శ్రీకాకుళము నకు చీపురుపల్లికి రవాణాచేసెరి

అరపాక గ్రామమునగల పశువులు 4 415 వీటిలో ఆవులు 850 గేదెలు 200 ఎద్దులు 500 కోళ్ళు 2 465 ఇచట సాలీనా 60 000 లీటర్ల పాలు 1 200 కి గ్రా నెయ్యి 10 000 కి గ్రా మాంసము 3 00 000 గ్రుడ్లు 25 000 కి గ్రా చేపలు లభించెను 48 000 లీటర్ల పాలు 300 కి గ్రా నెయ్యి మాంసము 7 800 కి గ్రా 2 25 000 గ్రుడ్లు 12 500 కి గ్రా చేపలు స్థానికముగ సంవత్సరమునకు ఉపయోగించుకొని 12 000 లీటర్ల పాలు 900 కి గ్రా నెయ్యి 2 500 కి గ్రా మాంసము పొందూరునకును 75 000 గ్రుడ్లు శ్రీకాకుళమునకును 12 500 కి గ్రా చేపలు పొందూరు శ్రీకాకుళములకు రవాణా చేసిరి

వ్యవసాయము ఇచటి జనుల ముఖ్య జీవితాధారము దుకాణాదారులు క్రయవిక్రయదారులు ఎద్దుబండ్ల తోలు వారుకలరు వీరుగాక కంసాలులు వడ్రంగులు తాపీపనివారు మంగలివారు చాకలివారు గొల్లవారుకూడకలరు వ్యవసాయ దారులకు సరిపోవు కూలీలు దొరుకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 2 లు స్త్రీకి రు 1 50లు

శివాలయము రామాలయము బంగారమ్మగుడి ఈ గ్రామమున కలవు రామాలయమునకు భూములున్నవి

ఈ గ్రామమునకు 8 మైళ్ళలో పొందూరు రైల్వే స్టేషను ఉన్నది 3 కంకరరోడ్లు ఒక కచ్చరోడ్డు కలవు ఈ గ్రామమును పొరుగు గ్రామములతో కంకరరోడ్లు కలుపుచున్నవి ఒక గుర్రపుబండి ఒక మోటారుకారు 10 సైకిళ్లు 225 రెండెడ్ల బండ్లు ప్రయాణమునకు ఉపయోగించుచున్నవి

అరపాకలో బ్రాంచి పోష్టాఫీసు ఎలిమెంటరీ స్కూలు జిల్లాపరిషత్తు హైస్కూలు కలవు ఇచ్చటి హైస్కూలున చదువుకొనుటకు 5 విద్యార్థులు బెజ్జిపురం బుడుమూరు అను గ్రామములను డివత్తురు విద్యుచ్ఛక్తిని గ్రామములో 5 ఇండ్లు ఎలెక్ట్రిక్ మోటారులు వాడుకొనును ఇది పంచాయతి పరిపాలనకల గ్రామము 1967 68లో ఈ పంచాయతి చెందిన ఆదాయము రు 5 148 75లు పంచాయతి గ్రంథాలయము రేడియో లౌడ్ స్పీకర్లు లవు ఇంగ్లీషు వైద్యుడు ఆయుర్వేద వైద్యుడు లరు ఒక పశువుల ఆస్పత్రి లదు నాలుగు కిరాణా దుకాణములు నాలుగు కాఫీహోటళ్ళు ఒక కిళ్ళీ సోడా ఎగరెట్టు దుకాణముకలవు

ఇచట వారసంతలులేవు తంతికార్యాలయముకు సబ్ రిజిష్ట్రారు ఆఫీసుకు 8 మైళ్ళలోనున్న పొందూరునకు పోవుదురు పోలీసు స్టేషనుకు బ్లాకు అభివృద్ధికేంద్రమున 8 మైళ్ళలోనున్న రణస్థలమునకును కోర్టు తాలూకా కచేరీలకు 17 మైళ్ళ లోనున్న చీపురుపల్లికి పోవుదురు కాలేజి చదువులకు విద్యార్థులు 12 మైళ్ళలోనున్న శ్రీకాకుళమునకు పోవుదురు పురుళ్ళ ఆసుపత్రికి జనరల్ ఆసుపత్రికి సినిమాథియేటర్లకు గ్రామస్థులు శ్రీకాకుళమునకు పోవలెను

మాశ్వే

## అద్దంకి

అద్దంకి ఫిర్కాకుచెందిన అద్దంకి యను గ్రామము ప్రస్తుతము క్రొత్తగా ఏర్పడిన ఒంగోలు జిల్లాలో ఉన్నది దీనికి 24 మైళ్ళ దూరములో ఒంగోలు పట్టణము కలదు పూర్వము అద్దంకి ప్రాంతమున తయు అద్దంకిసీమ అనెడివారు అడ్డాడ అంకి అను వడ్డెరలపేరున ఈఅద్దంకి ఏర్పడినదందురు ఈ గ్రామవిస్తీర్ణము 6 909 ఎకరములు

1961 జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామమున 10 760 మంది కలరు వీరిలో పినాదులు 110 నుంది షెడ్యూల్డు జాతులవారు 1685 మంది జనులు వరిఅన్నమును జొన్న అన్నమును తిందురు బావినీటిని త్రాగుదురు

గుండ్లకమ్మనదియొక్క పాయమైన భవనాశిని ప్రాజెక్టు మూలమున ఈగ్రామమున వ్యవసాయము జరుగును జొన్న సజ్జ కొర్ర పొగాకు మిర్చి వేరుసెనగ మొదలగు

మొరకప టలు ఎ డును వీటిని గొడౌనులలో నిలువచేయు కొ దురు వ టసరకులను లారీలపై బ డ్లపై ఒంగోలునకు రవాణా చేయుదురు వ్యవసాయము వ్యవసాయకూలి ఈ గ్రామ ప్రజల ముఖ్యావృత్తులు టు బ వృత్తి చాపలు అల్లుట ఇచటి కుటీర పరిశ్రమలుఇచ్చట ఇనుపఖనిజము భి చును వ్యవసాయ దారులకు సరిపోవుకూలీలు దొరుకుదురు

ఇచ్చట పశుప పద బాగుగ ఉన్నది పాలు పాల పదార్థములు స్థానికులే ఉపయోగి చుకొందురు పూర్వము ఇచ్చట ఎతువులసంత గొప్పగా జరిగెడిదట ఇచ్చట మాధవ రామలి గ వీరభద్ర నాగేశ్వరస్వాముల దేవాలయములు పోలేరమ్మగుడి ఉన్నవి 1000 కన్నులుగల పోలేరమ్మ విగ్రహము ఉన్నది పోలేరమ్మజాతర ఆషాఢమాసములో ఒక దినము జరుగును రెండు నెలల కాలము కొలుపులు జరుప బడును ఇది చాలా పురాతన కాలము నుండి జరుగుచున్న జాతర

ఈ గ్రామమునకు 24 మైళ్ళదూరములో ఒంగోలు రైల్వేస్టేషనుకలదు అద్ద కి బస్సుమార్గముపైన ఉన్నది ప్రభుత్వపు బస్సులు ఒంగోలు నుండి ఈ గ్రామముమీదుగా నర్సారావుపేటకు పోవును దీనికిని ఒంగోలు పట్టణమునకును మధ్య సిమెం టు కా క్రీటు రోడ్లుకలవు

ఈ గ్రామమున సబ్ పోస్టాఫీసు ఎలిమెంటరీ స్కూళ్లు సబ్ రిజిస్ట్రారు ఆఫీసు తహసీల్ దారు ఆఫీసు ప డబ్లుయ డి ఆఫీసు ఒక ఇండియా స్టేటుబ్యా కు ఉన్నవి ఇది పంచాయతి పాలనకల గ్రామము ఒక రహదారి బ గళా ఒకలోకల్ ఫ డు ఆసుపత్రి ఒక ప చాయతి ఆసుపత్రి కలవు వారపు సంతలు జరుగును కి రాణదు కాణములు కాఫీహోటళ్లు సోడా కిళ్ళీ సిగిరెట్టు దుకాణములు ఇతరములు కలవు

ఒ గోలులో పురుళ్ళ ఆసుపత్రి జనరల్ ఆసుపత్రి కోర్టులు మొదలగునవి ఉన్నవి ఈ గ్రామ విద్యార్థులు కళా శాల చదువులకు ఒంగోలునకు పోవుదురు

అద్ద కిలో చాళుక్య ఎరాక్రమ సేనాధిపతి యగు ప డర గ పరమ మాహేశ్వరుని గూర్చి ఒకశిలాశాసనము తెలుగులో వ్రాయబడి ఉన్నది అన వేమారెడ్డి వేయించిన శాసనములో అద్ద కి సు దరమైన భవ తులతో ని డి సౌఖ్య ప్రదమయిన స్థలమని వ్రాయబడినది ఈ పురాతన స్థలమున 101 దేవాలయములు 101 బావులు ఉన్నవని తెలియు చున్నది ఇచ్చట ఒక పురాతనమై కోటశిధిలావస్థలో ఉన్నది వేయి స్తంభాల గుడియొకటి ఇచ్చట ఉ న్నది నాగేశ్వర స్వామి ఆలయ స్తంభములపై 8 శాసనములున్నవి శ క 1806 (క్రీ శ 1404) న వేయబడిన కోద డ రామస్వామి దేవాలయపు తూర్పు గోడపై నగల ఒ శా సనమువలన కా ర్తీక బహుళ ద్వాదశినాడు చిన్నీడొళం సెట్టి తనతండ్రి యొక్కయు తల్లి యగు బల్లిసానియొక్కయు పేర ఆగోడకు గచ్చు చేసినట్టు తెలియుచున్నది

ప్రోలయ వేమారెడ్డి అద్ద కి నుండి రాజ్యమేలినపుడు కవిత్రయములోని ఎర్రాప్రగ్గడ ఈ గ్రామమున ఉ డెనట నాటకర గమున పేరొ దిన కీ శే అద్ద కి శ్రీరామమూర్తి గారు కూడ ఈ గ్రామవాసియేయని చెప్పబడినది

మా శ్వే

## అద్దంకి

ఈ పట్టణము ఇటీవలి వరకును గుంటూరు జిల్లాలోని ఒంగోలు తాలూకాకు చె దినది ఇది ఇప్పుడు క్రొ త్త గా ఏర్పడిన ఒంగోలుజిల్లాలో చేరియున్నది ఇది ఒ గోలు రైల్వే స్టేషనుకు 24 మైళ్ళ దూరములోనున్నది అద్దంకి న గ ర ము చరిత్రలో ప్రసిద్ధిచెందియున్నది ఇది ముఖ్య పట్టణముగా గల దేశభాగము అద్దంకిసీమ అని వ్యవహరి పబడు చు డె ను తూర్పు చాళుక్య వ శములో అగ్రగణ్యుడైన గుణగవిజయా దిత్యుని కాలమున (క్రీ శ 848-891) అద్దంకి న గ ర ము మొదటిమాటు చరిత్రర గమునకు ఎక్కినది గుణగుని సేనాని యైన ప డర గుని శాసనము అద్దంకియ దు దొరకినది దీనిని బట్టి గుణగవ విజయాదిత్యుడు (గుణగుడు) రాజ్యమునకు వచ్చిన మొదటి సంవత్సరమునందే తన సైన్యాధ్యక్షుడును బ్రాహ్మణుడును మహావీరుడును అగు ప డరంగని చాళుక్య రాజ్యము యొక్క దక్షిణ సరిహద్దుపై తల యెత్తిన తిరుగు బాటును అణచివేయుటకు గొప్ప సైన్యముతో పంపెను ఈ సరిహద్దుపై తూర్పు చాళుక్యలకు అలజడి కలిగించిన వారు బోయలు వీరివి ప ద్రె డు కొట్టములు (కోటలవంటివి) ఉం డెను వాటి ఆసరాతో వీరుగుణగ విజయాదిత్యుని రాజ్యము నకు ఉపద్రవము కల్గి చుచుండిరి బోయ నాయకులకు కాంచీ పుర పల్లవుల ప్రోద్బలము కు డ ఉ డియుండెను ఇ ప్ప టి కాంచీపుర చక్రవర్తి రె ండవ నందివర్మపల్లవమల్లుడు

ఎల్లెనను బోయజాతి వారిని నిర్జించి రాజ్యపు దక్షిణ మును కాపాడు భారము ప దర గనిపై ఉ చబడెను అతడు ఈ బాధ్యతను సమర్థతతో నిర్వహించెను కట్టెము దుర్గమును నిర్మూలించి ప దర గడు బోయల రక్షణ శ్రేణిని బద్దలు చేసెను క దుకూరు దుర్గమును బ పరచి బెజవాడవ టి స్థాయిగల దానినిగా చేసెను ప దరంగడు తూర్పు చాళుక్యుల త్రిభువనా కుశధ్వజమును నిరాఘటముగా నెలకొల్పెను ఆదిత్య భట్టారకుడను బ్రాహ్మణునకు ప దర గడు 8 పుట్లు అక్కు పట్టుచేనును ధర్మవరమున దానముగా ఇచ్చెను ప ద ర గని శాసనము అద్ద కిలో నెలకొల్పబడుటనుబట్టి చూడగా క్రీ శ తొమ్మిదవ శతాబ్దిలోనే అది ప్రముఖ స్థానముగా ఉండెననుట తెల్లమగుచున్నది అద్ద కిశాసనము తెలుగు కవిత్వ వికాస చరిత్రయందు ప్రాధాన్యము వహించియున్నది మొట్ట మొదటి మాటు తెలుగులో పద్య రచన మి దు కాన్పి చును ఇచ్చట తరువోజ యను దేశీయ చ దస్సు వాడబడినది రెండవ అమ్మరాజ వి జ యా దిత్యుని బూరపాడు శాసనములో అద్ద కి పే ర్కొ న బ డి యున్నది

అద్ద కియ దు నా చారమ్మ దేవాలయమున దొరకిన ఒక ప్రాచీన శాసనములో బాణం ధూరి అనువాని ప్రశంస కలదు (నెల్లూరు శాసనములు ఒ గోలు1) బా ణ ం ధూ రి భృత్యుడైన ఎనకంప మల్లిని వీరార్యుడు వేమునూరులో ఏదియో దానముచేసెనని దీని సారాంశము శాసన కాలము తెలియదు బాణం ధూరి అనువాడు ఒక బాణరాజు కావచ్చును బాణవ శము అను నొక ప్రా చీనరాజవ శ ము కలదు వీరు రాక్షసరాజన్యుడగు మహాబలి బాణుని వ శము వారమని చెప్పుకొనుచుండిరి వీరు క్రీ శ 5 శతాబ్దము ను డియు వినవచ్చుచున్నారు కద బ వ శస్థాపకుడగు మయూర శర్మచే జయి పబడి అతనికి కప్పము కట్టిన వారిలో బృహద్బాణులునుగలరు బాణరాజులు తెలుగు దేశములో కొ త కాలము స్వత త్రులుగను ఒకప్పుడు పొరుగు వారైన పల్లవులకును పశ్చిమ చాళుక్యులకును సామ తులుగను రా జ్య ము చే రి వీరి శాసనములు అనంత పురము కడప చిత్తూరు జిల్లాలలో దొరకుచున్నవి వీరిలో కొ దరు నెల్లూరు జిల్లా ఉత్తర ప్రాంతములలో కూడ అధికారము చేసియు దురు బాణసింధూరి అట్టి ప్రభువుకావచ్చును ఇతడు స్వతంత్రుడను టకు వీలులేదు శాసన భాషనుబట్టి చూడ ఇది మహాభారత కాలము కు దగ్గరగా ఉ న్నట్లు తోచును బా ణ ం ధూ రి భృత్యుడవు (అగు అనుట) వేమనూర (వేమనూరియ దు) ధర్మము వంటివి నన్నయ భాషను తలపించును కా వు న బాణం ధూరుడు క్రీ శ 11 వ శతాబ్దము వాడని ఊహింపవచ్చును అప్పటికి అద్ద కి ప్రా తము తూర్పు చాళుక్య రాజ్యములో భాగముగా నున్నది

క్రీ శ 12 వ శతాబ్దిలో వెలనాటి చోడులు ఆ ప్రదేశమున పరిపాలనచే రి వీరి రాజ్యము ప్రధానముగ కృష్ణా నదికి దక్షిణమున ఉ డుటచే అద్ద కి దుర్గము వీరి అధీనములో ఉ డెనని తల పవచ్చును ఈ శతాబ్దాంతమున వె ల నా టి చోడుల ప్రాభవము న్నగిల జొచ్చెను కాకతీయులు వెలనాటిని జయి చుటకై ప్రయత్నములు చేయుచు డిరి ఈ యదనుననే కావచ్చును చక్రనారాయణ బిరుదా కితులైన మహారాష్ట్ర సామ త వ శమువారు అద్దంకిని స్వాధీనము చేసుకొని పరిపాలింప జొచ్చిరి వీరు యాదవ వంశీయులని కొ దరు చెప్పుచున్నారు తిక్కన సోమయాజి నిర్వచనోత్తర రామాయణమునందు రె డవ మనుమ సిద్ధిరాజు మహారాష్ట్రసార గుని అవలీలగా జయి చినట్లు వర్ణి ంచియున్నాడు చక్రనారాయణ వ శీయులు క్రీ శ 1150 ప్రా తము నుం డియు అద్ద కిలో రాజరికము చేసినట్లు గు టూరు మ డ ల సర్వస్వము నుడువుచున్నది బాణరాజులలోని రె డవ చోర బల్లిరాజు ఈ కాలమున కమ్మవాడులో సైన్యాధికారిగా నుండెను ఇతనిశాసనము క్రీ శ 1151 ప్రాంతమునాటిది కొణిదెనలో కన్పి చుచు న్నది అద్దంకి ముఖ్య పట్టణముగా చేసికొని పాలి చిన చక్రనారాయణ వ శీయులలో సార గధరుడు లేక సారంగపాణిరాజు మొదటివాడు ఈ వ శమునకు చె దిన మాధవరాజు క్రీ శ 1240 ప్రా తమున కాకతి గణపతిదేవ చక్రవ ర్తికి సామ తుడుగా కనిపి చును ఇతని కుమారులైన ఎ గళదేవుడును రె డవ సార ంగదేవుడును కూడ గణపతిదేవ చక్రవర్తికి సామ తులై యు డిరి ఈ రె డవ సార గపాణి రాజునే నెల్లూరు మనుమసిద్ధి రాజు ఓడించి వాని అశ్వములను గైకొనెను కాకతి రుద్రమదేవి కాలములోకూడ చక్రనారాయణ వ శీయులు అద్ద కిలో రా జ్యము చేయుచుండిరి ఇప్పటి వాడు రె డవ మాధవరాజు

కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఆ ప్రదేశము

చిన్నరాజ్యములుగ విడిపోయెను తూర్పు సముద్రతీర ప్రాంతమును రెడ్డిరాజులును తెలగాణ ప్రాంతమును మొదటికాపయనాయకుడును తరువాత రాచకొండ వెలమ రాజులును పరిపాలించిరి రెడ్డిరాజ్యమును స్థాపించినవాడు ప్రోలయ వేమారెడ్డి ఇతనికి అద్దంకి రాజధానిగా నుండెను వామనభట్టబాణుడను సంస్కృత కవి తన వేమభూపాల చరితమునందు అద్దంకి నగరమును సుందరముగ వర్ణించియున్నాడు తస్మిన్ భాసురసౌధగోపురవతీ నిత్యోత్సవాలంకృతా నందత్పౌరజనా విభాతి నితరామద్దంకినామాపురీ ప్రకాశమానమైన మేడల గోపురములు కలదియు నిత్యోత్సవములతో విలసిల్లునదియు సమ్మోదముతో గూడిన పౌర జనులు కలదియు అగు అద్దంకి నగరము ఒప్పుచున్నది అని దీని భావము అద్దంకిని గూర్చి వామన భట్టబాణుడు చేసిన వర్ణనమునందు చారిత్రక సత్యమొకటిమనకు తెలియవచ్చుచున్నది బలిరాజ నిలయభూతాం గంధర్వభూమిః । అద్దంకి నామధేయనగరీ బలిరాజులకు నిలయమైనదియ్యును అద్దంకి నగరము గంధర్వభూమి అని ఆలంకారికముగా వర్ణించుట గమనింపదగినది అనగా ఇదిపాతాళమయ్యును స్వర్గము వంటిది అనుట అసురవరేణ్యుడగు బలిచక్రవర్తి పాతాళము నందు నివసించుట ఇక్కడ అనుసంధించుకొనవలెను బాణ రాజులకు బలిరాజులను వ్యవహారమున్నది అద్దంకి బలిరాజ నిలయము అనుటచే ఇది బాణరాజులు పాలించిన నగరమని వామనభట్టబాణుడు సూచించినవాడయ్యెను పైన పేర్కొన్న బాణసి ధూరుని శాసనమునుబట్టి బాణరాజులు కొంతకాలము అద్దంకి సీమను ఏలిరనుట సత్యమేఅగుచున్నది

ప్రోలయ వేమారెడ్డి అద్దంకి రాజధానిగా చేసుకొని పాలించెను కాని ఆతని కుమారుడు అనపోతారెడ్డి తన ముఖ్యపట్టణమును కొండవీటికి మార్చుకొనెను రెడ్డిరాజ్యపు దక్షిణభాగమందు విజయనగరరాజుల ఒత్తిడి ఎక్కువ కాజొచ్చెను శత్రువులకు దూరముగా నుండుటకై ఆతడు రాజధానిని ఉత్తరమునకు తరలించెను రాజుల కార్యస్థానము కాకుండుటచే అద్దంకినగరము ప్రాముఖ్యమును కోల్పోయెను రెడ్డిరాజుల సామంతులు అద్దంకి యందుండి పాలించిరి దొడగిరి కుమారగిరిరెడ్డికాలమున పంటమైలారరాజు అద్దంకిలో రెడ్డి రాజ్యసామంతుడుగ ఒలుబడి సాగించెను కొండవీటి రెడ్డిరాజ్య మంతమొందిన తరువాతగూడ పంటమైలారరాజు అద్దంకిలో నే ఉండినట్లు కాన్పించును ఈతని ప్రార్థనపైన క్రీ శ 1429లో విజయనగర చక్రవర్తి రెండవ దేవరాయలు రామతీర్థమను గ్రామమును బ్రాహ్మణులకు అగ్రహారముగా దానముచేసెను మహాకవి శ్రీనాథుడు అద్దంకిని సందర్శించినట్లు చాటుపద్యముల వలన తెలియవచ్చుచున్నది పంటమైలారుడు శ్రీనాథునకు ఆశ్రయమిచ్చి ఆదరించినవారిలో నొకడు కావుననే మహాకవి ఆతని మర్యాదమునకై పొగడుచు ఇట్లు చెప్పెను "కైలాసగిరి పంటమైలారవిభుడు డెందిన వెచ్చమేరాజు తీర్చగలడు

క్రీ శ పదునేడవ శతాబ్దమునందు విజయనగర రాజులును ఒరిస్సా గజపతులును బహమనీ సుల్తానులును ఆంధ్ర దేశపు తూర్పు తీరముపై ఆధిపత్యమునకై పోటీపడుచుండిరి నెల్లూరి జిల్లాలోని ఉదయగిరి దుర్గము వారికి పోరదగిన ఆమిషముగా నుండెను అద్దంకి అంత ప్రాముఖ్యముండినట్లు కాన్పించదు అయినను అది సైన్యముల రాకపోకల బాటలో నుండిన దుర్గముగా నుండెను కృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయము చేయుచు పట్టుకొన్న దుర్గములలో అద్దంకి యొకటి తిరుమల తిరుపతి దేవస్థాన శాసనము (నె 679)లో ఇట్లున్నది శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీకృష్ణరాయ మహారాయలు పూర్వదిగ్విజయ యాత్రకు విచ్చేసి వుదయగిరి దుర్గమున్ను సాధించి తిరుమల రౌతరాయ మహాపాత్రుని పట్టుకొని అద్దంకి వినికొండ బెల్లంకొండ నాగార్జునకొండ తంగేడు కేతవరం మొదలయిన గిరిదుర్గస్థల దుర్గాలు యేకఘాటిని గైకొని"

తళ్ళికోట యుద్ధమువరకును కృష్ణదక్షిణదేశము విజయనగర చక్రవర్తుల పృథుశక్తికి లోబడియుండుటచే అద్దంకి కోటయు వారి యధీనమందే ఉండెనని ఊహింపవచ్చును ఈ యుద్ధానంతరము విజయనగర సామ్రాజ్యము క్రమముగా ఛిన్నమయ్యెను ఆంధ్రదేశమంతయు ఇంచుమించుగా గోల్కొండకుతుబుషాహీ వంశీయులకు వశమయ్యెను వీరిగవర్నర్లు కొండపల్లి కొండవీడు నగరము లందు నెలకొనియుండిరి తళ్ళికోట యుద్ధమునందు పాల్గొన్న ఇబ్రహీం కుతుబుషాహ కుమారుడు మహమ్మదుకులీకుతుబుషా క్రీ శ 1580-1611 నడుమ గోల్కొండ సుల్తాను ఆయెను ఈతని కాలములోనే కొండవీడుకు ముర్తజానగరు అనియు కొండపల్లికి ముస్తఫానగరు అనియు పేర్లు కలిగెను

మహమ్మదుకులీకుతుబుషాకు సమకాలికుడైన విజయనగర చక్రవర్తి రెండవ వెంకటపతిరాయలు ఈతడు కొండవీడు దుర్గమును తిరిగి విజయనగరము క్రిందికి తెచ్చుకొనుటకై యత్నించుచుండెను ఇట్లుండ గోల్కొండ వారిపక్షమున అలీఖాన్ లూరీ అనునాడు కొండవీడు దుర్గాధిపతిగా నియమింపబడెను వీనికిని కొండవీడులో ఆదాయమంత్రిగా ఉండిన రాజారావు అను బ్రాహ్మణునకును విభేదములు వచ్చి అలీఖానుడు గోల్కొండవారి సేవను విడిచి విజయనగర చక్రవర్తులను చేరెను గోల్కొండ సైన్యములకును విజయనగర సైన్యములకును కంభము కోటవద్ద జరిగిన యుద్ధములో విజయనగరమువారు ఓడిరి అలీఖానులూరీ పలాయితుడై అద్దంకి కోటను రక్షణకై ఆశ్రయించెను సుల్తాను సేనలు అచ్చటికిని తరుముకొనివచ్చి ముట్టడింపగా అలీఖాను పారిపోయెను గోల్కొండ సేనలు అద్దంకిలో కనబడిన శత్రుసైనికుల దరివిసంహరించెను అలీఖాను అంతటితో విరమించక గోల్కొండ సేనలకు చికాకు కలిగించుచునే యుండెను

క్రీ శ 1596 ప్రాంతమున కొండవీడు గవర్నరుగా ఉండిన ఎయితబార్ ఖాను అనువాడు విజయనగర సైన్యములను శిక్షించుటకు దక్షిణమునకు వెళ్ళగా చూచి స్థానికులగు జమీందారులు తిరుగబడి గోల్కొండకు కప్పములు చెల్లించుట మానిరి తిరుగుబాటుదారులను అణచివేయుటకై అమీను-ఉల్-ముల్కు అను సేనాపతి నియోగింపబడెను తిరుగుబాటుదారులు అద్దంకి కోటలో 7 వేల గుఱ్ఱపు దళములను 10 వేల కాల్బలమును కూర్చుకొని కయ్యమునకు సిద్ధమగుచుండిరి కాని అమీను ఉల్-ముల్కు చండశాసనుడై ఎతూరీదారులను పేరుపెట్టి కొండవీటిలో ఇన్నూటికిపైగా హిందువులను ఉరితీయించుట చూచి తిరుగుబాటుదారులు ధైర్యము సడలి అద్దంకి కోటను విడిచి పారిపోయి విజయనగరమువారి అండ చేరిరి

ఈవిధముగా అద్దంకికోట ఒక సైనిక స్థావరముగా గోల్కొండ నవాబుల కాలమున ప్రాముఖ్యము వహించెను 18 వ శతాబ్ది చివరి భాగములో గుంటూరు మండలముతో పాటు అద్దంకి నగరముకూడ బ్రిటిషువారి ఎలుబడిలోనికి వచ్చెను

బం ల రం

## అద్వయామృతయతి

ఈ యతీంద్రుని ప్రశంస కాకతిరుద్రదేవుని అనుమకొండ శాసనమునందు కాన్పించుచున్నది దీనినే వేయిస్తంభాలగుడి శాసనము అనికూడ అందురు శాసనకాలము శక 1084 (క్రీ శ 1162) అద్వయామృత యతిని గూర్చిన శ్లోకమిట్లున్నది

భారద్వాజకులాశ్రయః పరివృఢః శ్రౌతక్రియాకర్మఠః । శ్రీరామేశ్వర దీక్షితో జనయితా యస్యాక్షితావగ్రణీః సోచింతేంద్ర వరోద్వయామృతయతేశ్శిష్యో యతిశ్శ్రద్ధయా శ్రీమద్రుద్ర నరేశ్వరస్య సుమతేర్వ్యశావలీం వర్ణయేత్ ॥ దీని యభిప్రాయమిది

భారద్వాజ గోత్రజుడు యజ్ఞకర్మనిష్ఠుడు శ్రేష్ఠుడును అగు రామేశ్వర దీక్షితుడు ఎవనిజనకుడో అద్వయామృత యతీంద్రుడెవని గురువో అట్టి అచింతేంద్రయతినైన నేను బుద్ధిశాలియైన రుద్రనరేశ్వరుని వంశావళిని వర్ణించుచున్నాను పై శ్లోకమునుబట్టి అచింతేంద్రయతి తండ్రియగు రామేశ్వర దీక్షితుడును అచింతేంద్రుని గురువగు అద్వయామృతయతియు ఒకేకాలమున ఉన్నట్లు స్పష్టమగుచున్నది వీరిద్దరును రెండవ ప్రోలరాజు కాలమున (క్రీ శ 1110-1158) ఉండియుండురు శాసనములను బట్టియు నన్నెచోడకవి కుమారసంభవ కావ్యమునుబట్టియు రామేశ్వర పండితుడను శైవాచార్యుడీకాలముననే వర్ధిల్లినట్లు తెలియుచుండుటచే రామేశ్వర దీక్షితుడును రామేశ్వర పండితుడును ఒక్కరే కావచ్చునని ఇదివరలో చారిత్రకులు విశ్వసించియుండిరి ఈ యంశమును గూర్చిన విశేషములను అచింతేంద్రుడు అను వ్యాసమున చూడదగును

అచింతేంద్రయతీశ్వరుని గురువగు అద్వయామృతయతి అద్వైతమత సంప్రదాయమునకు చెందినవాడని ఆయన నామమునుబట్టియే తెలియుచున్నది ద్వయము-ద్వైతము జీవేశ్వరుల అభేదమును చెప్పునది అద్వైతము అద్వయామృత యతి ఈ మతమునకు చెందినవాడనుట స్పష్టము ఆతని శిష్యవర్యుడగు అచింతేంద్రుడును అద్వైతవాదియనుట తెల్లము కాకతీయ రాజన్యులలో మొదటివారు జైనమతాభిమానులుగా తోచినను త్రిభువనమల్ల బేతరాజు కాలమునుండియైనను వీరు శైవమతాభినివేశము కలవారుగా కన్పించుచున్నారు కాజీపేట శాసనమునందు బేతరాజు పరమమాహేశ్వరుడని

వర్ణింపబడినది. ఈయన తండ్రియగు మొదటి ప్రోలరాజు కాలముననే వీరు శైవగురువులను ఆదరించినట్లు కన్పట్టును. రామేశ్వర పండితుడను మాహేశ్వర గ్రామణిని మొట్టమొదట సంభావించినవాడు మొదటి ప్రోలుడని మాదిరెడ్డి కుట శాసనము వలన ద్యోతకమగుచున్నది. ఈ రామేశ్వర పండితుడు లకులేశ్వరాగమమహాసిద్ధాంత సారామృతమును గ్రోలినవాడట. రెండవ బేతరాజు, అతని కుమారుడు రెండవ ప్రోలరాజుగూడ రామేశ్వర పండితుని కొలిచినవారే. రుద్రదేవుడు శైవమతాభిమానము కలవాడైనను శివకేశవులను ఉభయులను మన్నించువాడనుటకు అతని సహస్రస్తంభ దేవాలయ ప్రతిష్ఠయే తార్కాణ. ఇందు రుద్రుని విష్ణువును ఆదిత్యుని ప్రతిష్ఠించుట గమనింపదగినది. ఈ మహారాజు అద్వైతమునకు విరోధికాడనుటకు అతని అనుమకొండ శాసన కావ్యకర్తయైన అచింతేంద్రయతియే నిదర్శనము. గణపతిదేవ చక్రవర్తి కాలమునుండియు కాకతీయులు శైవము వంక ఎక్కువ మొగ్గుచూపిరనుటయు తథ్యమే. ఈయన దీక్షా గురువైన విశ్వేశ్వరశంభువు గోళకీమఠమును స్థాపించి ఆంధ్రదేశమున శైవమతవ్యాప్తికి ఎక్కువ దోహదము చేసినట్లు మల్కాపుర శాసనమువలన తెలియుచున్నది.

కాకతీయ యుగమున అనేక నూతన మతోద్యమములు మత విప్లవములు తలయెత్తినవి. ఒకవైపు బౌద్ధులు జైనులు అద్వైతవాదులు పాంచరాత్రులు బహ్మవాదులు అభేదవాదులు ఏకాత్మవాదులు వేరొకవైపు శూన్యవాదులు నాస్తికులును మరియొకదిక్కు కర్మవాదులు చార్వాకులు ప్రకృతివాదులు శబ్దబ్రహ్మపరులు పురుషత్రయైకవాదులు లోకాయుతులు మున్నగు అనేక మతావలంబులు నివసించుచు తమతమ మతాధిక్యమును నిరూపించి అభివృద్ధి నొందించుకొనుటకు యత్నించుచుండిరి. పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్ర పాదప్రకరణమునందు ఆకాలపు వివిధ మతవాదములను ఉల్లేఖించి యున్నాడు. ఆయా మతానుయాయుల వాదములు సంఘర్షణములకును సమరములకును దారితీయుచుండెను.

మొదటి బేతరాజును మొదటి ప్రోలరాజును జైనుల నాదరించిరి. ప్రోలుని మంత్రియైన బేతన ప్రెగ్గడయు అతని భార్య మైలమయు జిన భక్తులు. ఇప్పుడు పద్మాక్షి గుట్టయని పిలుపబడు కొండపై మైలమ జైన దేవతయైన అంబికను ప్రతిష్ఠించెను. అంబికా విగ్రహమే తరువాత పద్మాక్షీదేవి విగ్రహముగాను అంబికాలయము పద్మాక్షి గుడిగాను మార్పబడెనని చెప్పుచున్నారు. ఆనాటి జైనమతపు నకు మెదకు జిల్లాలోని జోగిపేటకే ద్రష్టా ముగాను డెను. కన్నడ దేశమునుండి ఈ కాలముననే వీరశైవము ఆంధ్రదేశమున వ్యాపించెను. దీనిని ప్రవర్తింపజేసినవాడు శ్రీ బసవేశ్వరుడు. కాకతీయయుగముననే వైష్ణవము కూడ దక్షిణదేశమునుండి తెలుగునాట వెల్లివిరిసెను. భగవద్రామానుజులు దీని కా మూలకర్తలు. వీరశైవ శ్రీవైష్ణవ మతములు కులాచారముల పట్టును సడలించుటచే అన్ని జాతులవారును ఈ మతములను విరివిగా ఆదరించిరి. బౌద్ధము నామమాత్రావశిష్టమయ్యెను. జైనమతము వీరశైవ వైష్ణవములతో సంఘర్షణపడుచు పతనోన్ముఖమయ్యెను. ఒక్కొక్కప్పుడు అల్పసంఖ్యాకులగు జైనులు వీరశైవ వైష్ణవుల హింసాకాండకు గురియగుచుండినట్లు తోచును. పలనాటి సీమలో శీలము బహ్మనాయడు వైష్ణవమత భక్తికి ప్రత్యక్ష నిదర్శనముగా నిలిచెను.

సం ఆం శా

## అధిరాజ - ఇంద్ర

తూర్పుగోదావరి జిల్లాలో దొరకిన క్రీ శ 6 శతాబ్ది నాటి ఒక తామ్ర శాసనమును అనుసరించి పృథ్వీ మూలుడను రాజు కళింగనగరాధీశ్వరుడైన అధిరాజేంద్రుని ఆజ్ఞకులోనై అథర్వవేదమందు నిష్ణాతులైన నలువదిమూడు బ్రాహ్మణ కుటుంబములకు "కూయిపాక" అను అగ్రహారమును దానము చేసెను. ఈ బ్రాహ్మణులు అనేకగోత్రములకు చెందినవారు. శాసనమందు శాలివాహన శకము ఉదాహరింపబడలేదు. కాని పృథ్వీమూలుడు తన విజయరాజ్యపాలన 25 వ సంవత్సరము వైశాఖశుద్ధ దశమినాడు తాను విడిచిన "విజయకండేరి" అను ప్రదేశమును డి ఈ శా ను ప్రకటించెను. శాసన పరిశోధకులు శాసనకాలము 6 వ శతాబ్దియని నిర్ణయించిరి. పృథ్వీమూలుడు తన తండ్రి అయిన ప్రభాకరవర్మ దేవతలను ద్విజులను గురువులను సేవించుచు స్వర్గము నధిష్ఠించెనని చెప్పుకొనెను. పృథ్వీమూలుడు వర్ణాశ్రమ ధర్మముల రిరక్షించి అనేక కులాదానములు చేసి ఆ ధనమును యుద్ధములందు విజయముపొందిన యోధాగ్రేసరులకు పంచియిచ్చెను. అతడు గోదానములను సువర్ణదానములను భూదానములను కన్యాదానములను

చేసెను అతడు పరమమాహేశ్వర పరమబ్రహ్మణ్య ధర్మ విజయ శ్రీమాన్ పృథ్వీశ్రీ మూలమహారాజు అని ఖ్యాతి నొందెను అతడు తరుపాక విషయములోని రాష్ట్రకూట ప్రజలను సంబోధించుచు కూపాక గ్రామదాన విషయమును గూర్చి వారలకు తెలిపెను దీనిని బట్టి అప్పటి రాజ్యాంగపద్ధతిని గూర్చి కొంతవరకు తెలిసికొనుటకు వీలగును రాజు సర్వాధికారములను కలిగియుండియు దాన విషయములందు గ్రామస్థుల అంగీకారమును పొందవలసిన వాడైయుండెనను విషయము ఈ శాసనమునుండి తెలియనగును ప్రజాస్వామ్యము ఆనాడు నెలకొనియున్నదనుటకు ఇది ఒక తార్కాణ

శాసనమునందు మరొక ముఖ్యమైన చరిత్రాంశము కూడ కలదు పూర్వకళింగగా గన్నృపతులలో ఒకడైన అధిరాజ ఇంద్రవర్మ కొందరు రాజులను కూర్చుకొని వారికి తాను నాయకుడై నైరృతి దిశను పాలించుచుండిన ఇంద్రభట్టారకుని ఓడించినట్లు చెప్పబడినది దీనిని బట్టి అప్పటి దేశకాల పరిస్థితులు తెలిసికొనుటకు వీలగుచున్నది తూర్పున కటకమునుండి గోదావరివరకు ఆంధ్రదేశము కళింగంగుల ఏలుబడిలో ఉండెను అప్పటి వారి రాజధాని కళింగనగరము చాళుక్య ప్రభువైన రెండవపులకేశి తన అనుజుడు కుబ్జవిష్ణువర్ధనుని వేంగికి యువరాజుగా చేసిన తొలిరోజులవి అప్పటి కప్పుడే విజయదెందులూరు (ఇది ఏలూరువద్ద కలదు)ను రాజధానిగా చేసుకొని ప్రఖ్యాతి వహించిన విష్ణుకుండిన వంశజులు మధ్యాంధ్రమును పాలించుచుండిరి అధిరాజ ఇంద్రునిచే నిర్జింపబడిన ఇంద్రభట్టారక మహారాజు ఈ వంశములోనివాడే తూర్పు గోదావరి జిల్లాలోని రాజోలుప్రాంతము అధిరాజ ఇంద్రుని సామంతుడైన పృథ్వీమూలుని పాలనములో ఉండినటుల ఊహింప వీలగుచున్నది శాసనమునందు ఉదాహరింపబడిన తరుపాక విషయము నేటి తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకాయందలి తాటిపాక అని చరిత్రజ్ఞులు నిశ్చయించిరి

పృథ్వీమూలుని కుమారుడగు హరివర్మ వేయించిన కట్టచెరువు తామ్రశాసనమును ఆంధ్రప్రదేశ ఆర్కియాలజీ శాఖవారు హైద్రాబాదు మ్యూజియము నందలి తామ్రశాసనములు అను గ్రంథమున ప్రచురించిరి ఈ శాసనముకూడ గోదావరిజిల్లా నుండి సేకరింపబడినదని తెలియుట తప్ప దాని ఉనికిని తెలియజేయు విశేషాంశములు కొరతపడియున్నవి ఈ శాసనము పైన పేర్కొనిన పృథ్వీమూలుని శాసనమునకు అనుబంధ శాసనమనియే చెప్పనగును ఎందుచేతనన ఈ వంశమునకు చెందిన అనేకవిషయములు తండ్రి తనయులతో అంతమగును మొదటి గోదావరి తామ్రశాసనము నందువలెనే ఇందుకూడ శకసంవత్సరప్రశంసలేదు సరికదా హరివర్మ విజయరాజ్య కాలముకూడ ప్రశంసింపబడలేదు అనేక సమరాంగణములందు విజయముపొందిన తనకుమారుడగు హరివర్మ శ్రేయస్సునకును ఆయురారోగ్యాభివృద్ధికిని తండ్రి అయిన పృథ్వీమూలుడు కట్టచెరువు గ్రామమును తనకుమారునకే దానము చేసెను అనూచానముగా దేవబ్రాహ్మణులకిచ్చు దానములకు ఇది కొంత విరుద్ధముగా కనిపించుచున్నది కట్టచెరువు గ్రామము కొండ్రలగుండ్రు పర్యప్రు త్రుప్పుర్రు అను గ్రామములకు మధ్యస్థముగా ఉన్నది శాసనమునందు వీరి రాజధాని గుణపాశపురము అని చెప్పబడినది ఈగుణపాశపురమునందే హరివర్మచే నిర్మితమైన బౌద్ధ మహావిహారము కలదు దేశము నలుమూలలనుండి వచ్చి మహావిహారము నందు నివసించు బౌద్ధభిక్షువుల పోషణార్థము హరివర్మ తండ్రిను డి పడసన కట్టచెరువు గ్రామమును తండ్రి అనుమతితో నవకర్మ వ్యాపారాధికృతునకు (మహావిహారమునందు నివసించు పర్యవేక్షకునకు) దానము చేసెను తండ్రి పృథ్వీమూలుడు కరుడుగట్టిన హైందవమతాభిమాని మహావిహారమును నిర్మించి బౌద్ధధర్మమునకు దానపరంపరలు చేయుటవలన హరివర్మ బౌద్ధమతము అవలంబించినటుల తోచును

శాసనసంపాదకులకు శ్రీ రమేశంగారు గుణపాశపుర శబ్దమును ఇట్లు నిర్వచించిరి పెక్కుసద్గుణసంపత్తి అనే పాశముతో వలయీకృతుడైనవాడు హరివర్మ అందువలన పాశపురము తాడు + ఊరు = తాడూరు అయినదని అదియే రాజోలు తాలూకాయందలి నేటి అదుర్రుగా మారినదని చెప్పిరి వీరి వాదమునకు ప్రబలనిదర్శనముకూడ కలదు అదుర్రునందు బౌద్ధ మహావిహారమునకు చెందిన అనేక అవశేషములు కనబడుటవలనను భౌగోళికముగా శాసనమునందు పేర్కొనబడిన తాటిపాక విషయములు ఈ పరిసరములందే ఉండుటవలనను హరివర్మచే నిర్మితమైన మహావిహారము ఇదియే అయియుండుననుటకు తావిచ్చుచున్నది శాసనమునందు

పేర్కొనబడిన కట్టచెరువు త్రుప్పుద్రు వర్యవద్రు అను గ్రామములు నేడు కానరావు

కొ వెం

## అధి రాజేంద్రుడు

అధిరాజేంద్రుడు గంగైకొండ చోళపురము రాజధానిగ కల చోళరాజ్యమును స్వల్పకాలముగ పరిపాలించి ప్రజల ఆగ్రహమునకు గురియై మరణించిన అల్పుడైన రాజమాత్రుడు ఈతని తండ్రి వీరరాజేంద్రుడు అధి రాజేంద్రుని గూర్చి ప్రత్యేకముగ తెలుపదగిన యంశములు విశేషముగ కానరావు ఆతడు చోళరాజ్య సింహాసన మధిష్ఠించుటకు పూర్వమును తదనంతరమును కూడ ప్రబలమైన చోళ చాళుక్య రాజ్యముల నడుమ నిరంతరము యుద్ధములు సాగుచుండెను ఆ యుద్ధములందు వేంగిరాజ్యము కళింగరాజ్యము చక్రకూట రాజ్యము కూడ కొంతవరకు పాల్గొన వలసి వచ్చెను చోళచాళుక్యయుద్ధములలో చారిత్రక ప్రసిద్ధివహించిన పెక్కండ్రు గొప్ప నాయకులు ప్రముఖపాత్ర వహించిరి వీరియుద్ధముల విజయ పరాజయముల సందర్భములలో అధి రాజేంద్రుడానుషంగికముగ మాత్రము మనకుకానవచ్చును ఈ యంశముల తెలిసికొనుటకై మనము వేంగిప్రభువగు విమలాదిత్యుని కాలమునకు పోవలసి యున్నది

విమలాదిత్యుడను తూర్పు చాళుక్య (వేంగి) రాజు క్రీ శ 1011 సంవత్సరమున సింహాసన మధిష్ఠించి 1018 వరకు రాజ్యపాలన కావించెను ఈతనికి ఇద్దరు భార్యలు అందు ప్రథమురాలు చోళ చక్రవర్తి రాజరాజు కుమార్తె యగు కుందమాంబ ఈమెయందు విమలాదిత్యునికి రాజరాజ నరేంద్రుడు జన్మించెను రాజరాజ నరేంద్రుడు నన్నయభట్టుచే మహాభారతమును ఆంధ్రీకరింపజేసి జగద్విఖ్యాతి గాంచెను విమలాదిత్యుని రెండవభార్య తెలుగు చోళుల వంశమున జన్మించిన మేళమాంబ ఈమె కుమారుడు విజయాదిత్యుడు కొంతకాలము గడచిన తరువాత ఈతడు విష్ణువర్ధన విజయాదిత్యుడను బిరుదమును పూనెను వేంగిరాజ్యమును వశపరచుకొనవలెనని ఇతడు చాల కృషిచేసెను కాని ఆతని కోర్కి పూర్తిగ సఫలము కాలేదు విమలాదిత్యుని అనంతరము రాజరాజ నరేంద్రుడు రాజ్యాధికారము వహించి 1062 వరకును వైభవముతో రాజ్యము చేసెను రాజరాజనరేంద్రుడు వేంగి రాజధానిని బెజవాడనుండి రాజమహేంద్రవరమునకు మార్చి అచ్చట ఒక క్రొత్త పట్టణమును కట్టించెను రాజరాజనరేంద్ర భూపాలుడు తన మేనమామయు చోళచక్రవర్తియు అగు ప్రథమ రాజేంద్రుని కుమార్తె అమ్మంగదేవిని వివాహమాడెను వారి కుమారుడు రాజేంద్రుడు

తండ్రి రాజరాజనరేంద్రుని మరణము తరువాత అతని కుమారుడు రాజేంద్రుడు రాజమహేంద్రవరపు వేంగిరాజ్యమునకు రాజు కాకుండా ఆతని సవతి పినతండ్రియైన (విష్ణువర్ధన) విజయాదిత్యుడు అడ్డుపడి తన కుమారుడైన రెండవ శక్తివర్మను వేంగిరాజ్యమునకు ప్రభువును కావించెను వేంగి చాళుక్యులను చోళులకును సన్నిహిత బాంధవ్యము కలదు కనుక చోళులు తన కుమారునికిని తనకును వేంగిరాజ్యము దక్కకుండ చేయుదురేమో అను భయముచే విజయాదిత్యుడు చోళులకు ప్రబల శత్రువులగు పశ్చిమచాళుక్యులతో స్నేహము చేసుకొనెను ఆకాలమున చోళరాజ్యమును ఇమ్మడి రాజేంద్రుడును పశ్చిమ చాళుక్య రాజ్యమును ఆహవమల్ల సోమేశ్వరుడును పరిపాలించుచుండిరి 1068 వ సంవత్సరమున ఆహవమల్ల సోమేశ్వరుడు మరణింపగా ఆతని కుమారుడు రెండవ సోమేశ్వరుడు రాజయ్యెను ఈ సోమేశ్వరుని సోదరుడగు విక్రమాదిత్యుడు చాల సమర్థుడు అన్నయగు సోమేశ్వరుని యధికారమును మన్నించుట కీతని కిష్టము లేదు తాను స్వతంత్ర ప్రభువు కావలెనని ఈతని కోరిక

(విష్ణువర్ధన) విమలాదిత్యుడు కారణముగ రాజరాజ నరేంద్రునికుమారుడగురాజేంద్రునకు చాళుక్యరాజ్యము దక్కకుండ పోయెను ఈ రాజేంద్రుడు తన మేనమామ ఇమ్మడి రాజేంద్ర (చోళ) చక్రవర్తి కుమార్తెయగు మధురాంతకీ దేవిని వివాహమాడెను అల్లుడు పదభ్రష్టుడగుట సహింపక ఇమ్మడి రాజేంద్రుడు వేంగిచాళుక్య రాజ్యమును సంపాదించి యిచ్చుటకు కంకణము కట్టుకొనెను ఈ విధమున చోళులకును (విష్ణువర్ధన) విమలాదిత్యుని మిత్రులైన పశ్చిమ చాళుక్యులకును పెక్కుయుద్ధములు సంభవించెను చోళప్రభువు పక్షమున ఈయుద్ధమున పోరాడినవాడు ఇమ్మడి రాజేంద్రుని సోదరుడు వీర రాజేంద్రుడు పశ్చిమ చాళుక్య సేనల కాధిపత్యము వహించిన వారిలో సోమేశ్వరుని సోదరుడు విక్రమాదిత్యుడు ఒకడు ఇట్లుండగా చోళ చక్రవర్తియైన ఇమ్మడి రాజేంద్రుడు మరణించెను క్రీ శ 1062 వ సంవత్సరమున వీర రాజేంద్రుడు చోళ రాజ్యమునకు ప్రభువాయెను వీర

రాజేంద్రుడు 1070 వ సంవత్సరమున మరణించెను

వీర రాజేంద్రుని అనంతరము అతని కుమారుడు అధి రాజేంద్రుడు చోళ సింహాసనము నధిష్ఠించెను ఈతడు కేవలము అసమర్థుడు వీర రాజేంద్రుడు తన జీవితకాలమున దేశమున ప్రబలశత్రువు లిరువురతో సఖ్యము నేర్పరచుకొనెను పశ్చిమ చాళుక్య సోమేశ్వరుని సోదరుడు విక్రమాదిత్యునకు కాతడు తన కుమార్తెనిచ్చి వివాహముచేసెను వీర రాజేంద్రుడు విష్ణువర్ధన విమలాదిత్యునికి రాజమహేంద్ర వరరాజ్యమును విడచి పెట్టెను విమలాదిత్యుని యనంతరము రాజేంద్రుడు (రాజరాజ నరేంద్రుని కుమారుడు) రాజమహేంద్ర వర రాజ్యమునకు రాజుకావలెనని నిర్ణయించెను గంగవంశపు రాజులు విమలాదిత్యునికి సహాయ పడసాగిన దున రాజేంద్రుడు తన కుమార్తెయైన రాజసుందరిని కళింగప్రభువగు రాజ రాజనరేంద్రవర్మ కిచ్చి వివాహము కావించెను తన బావయగు చాళుక్య విక్రమాదిత్యుని సహాయముతో అధి రాజేంద్రుడు గంగైకొండ చోళపురమున రాజ్యాభిషిక్తుడయ్యెను కాని ప్రజలాతనిని మిక్కిలి ద్వేషభావముతో చూచి తుదకు చంపివేసిరి (1070) అంతట రాజేంద్రుడు కులోత్తుంగుడను పేరుతో చోళరాజ్యమున కేలిక అయ్యెను అచ్చట విష్ణువర్ధన విజయాదిత్యుడు క్రీ శ 1076 లో మరణింపగా వేంగీ చాళుక్య రాజ్యముకూడా కులోత్తుంగునకు వశపడెను

ఖం శా శే

## అధిష్ఠానపురము III

అధిష్ఠానము ముఖ్యపట్టణము అను నర్థములో ఈ శబ్దము అమరావతీ స్తూపశాసనము (నెం 1281 పుట 158 ఎపి ఇం X) నందు కన్పించుచున్నది ఈ శాసనము ప్రాకృతము నందు వ్రాయబడినది దీని సారాంశమిట్లున్నది గృహపతియైన సఘ అనువాని కుమారుడును వణిజుడునునైన సముద్రుని సతీమణి భగవంతుడైన బుద్ధుని మహాచైత్యమునకు ఒక ఉష్ణీష శిలను (మదురు రాయిని) సమర్పించినది ఈమె నామధేయము చెప్పబడలేదు సముద్రుడు తొంపుకి రాష్ట్రము యొక్క ముఖ్య పట్టణము (అధిష్ఠానము) నందు నివసించెనట ఈ నగరము పేరునులేదు ఇదియే రాష్ట్రమో గుర్తించుటకు వీలులేకున్నది ఇది పూగీయ రాష్ట్రమా పూగీయ పూకీయ శబ్దములు పాకనాడుగా పరిణమించినవి తొమ్‌తొల్ అనగా మొదటి లేక ప్రథమ అను నర్థమందు మనకు పరిచితము తొల్ + మిది తొమ్మిది తొంబది అను పదములలో ఈ మార్పును చూతుము అయినచో తొల్ + పుకి రాష్ట్రము తొలి పాకనాడు ఉత్తర పాకనాడు అనుభావమును అర్పింప గలుగుచున్నది సముద్రుడును ఆతని తండ్రియు ఉత్తర పాకనాటి వాస్తవ్యులేమో దానికి అధిష్ఠానమైన పట్టణమేదో తెలియదు ఈ శాసనములో కొడచ్చాది అను మరియొక గృహస్థుని నామమును చేర్పనైనది శాసనము అసంపూర్ణముగా లభించుటచే ఇతని ధర్మకార్యము లోపించినది బుద్ధధర్మపు భావముచేత సంఘమునందు స్త్రీలకు గౌరవ స్థానము లభించినది వారు స్వతంత్రముగ దానములు చేయుచుండిరనుటకు ఈ శాసనము నిదర్శనము తథాగతుని మహాచైత్యమునకు సంపన్నులు సామాన్య గృహస్థులు కూడ శిలాఫలకములు సమర్పించి ధన్యులగుచుండిరి

ఖం ల రం

## అనంగభీముడు

మూడవ అనంగభీముని ఉదంతము తెలిసికొనుటకు ముందు తూర్పు గాంగరాజ్య చరిత్రమునుగూర్చి సంగ్రహముగ తెలిసికొనుట అవసరము తూర్పుగోదావరీ మండలములోని పిఠాపురమునుండి ఉత్తరమున మహానదివరకు ఉన్న ప్రదేశమునకు కళింగదేశమని పేరు దీనికి ఉత్తరమున ఉన్న దేశమునకు ఉత్కలము ఓఢ్రము ఒరిస్సా లేక ఉత్తర కళింగము అనుపేర్లు ఉన్నవి కళింగదేశము తూర్పు సముద్ర తీరమున ఉన్నది కొండలతో అరణ్యములతో ఈ ప్రదేశము ఒప్పుచున్నది దీనికి పూర్వకాలమున దంతపురము రాజధాని బుద్ధుని నిర్వాణానంతరము ఆయన దంతమునుతెచ్చి ఒక స్తూపమున దానిని ఉంచి ఆ పురమున భద్రపరచుటచే ఆ పురమునకు దంతపురమను నామము ఏర్పడినట్లు ముఖలింగ శాసనమున కలదు శ్రీకాకుళము జిల్లాలోని శ్రీకాకుళము వద్దనున్న దంతవక్త్రుని కోటయే పూర్వపు దంతపురమని కొందరి అభిప్రాయము విశాఖపట్టణ మండలములోను దంతనదీ తీరమున ఒక దంతపురము కలదు ఈ రెంటిలో ఏది పూర్వపు దంతపురమో తెలియదు

గాంగవంశ నృపతులు కళింగదేశమును సుమారు తొమ్మిది శతాబ్దములు అవిచ్ఛిన్నముగా పాలించిరి గాంగవంశీయులు ఆత్రేయసగోత్రులు చంద్రవంశ క్షత్రియులు

చంద్రవంశ భూపతులలో తుర్వసునకు సంతానములేకుండుటచే గంగాదేవి నారాధించి అతడు గాంగేయుడను కుమారుని పడసెననియు ఆయన పేరనే ఆ వంశ భూపతులకు గాంగేయు లనియు గాంగులనియు గాంగవంశీయులనియు నామము లేర్పడినవనియు పురాణములవలన తెలియవచ్చుచున్నది. గాంగప్రభువులను తూర్పు గాంగులు పశ్చిమ గాంగులు అని రెండు విధములుగ విభజింపనగును. కళింగమును పాలించిన వారు తూర్పుగాంగులు. మైసూరును పాలించినవారు పశ్చిమ గాంగులు. తూర్పు గాంగులలో క్రీ. శ. 500ల నుండి క్రీ. శ. 1000ల వరకు పాలించిన గాంగరాజులను ప్రాచీన గాంగు లనియు క్రీ. శ. 1000 లకు తరువాత పాలించిన గాంగప్రభు వులను అర్వాచీన గాంగులనియు చరిత్రకారులు వ్యవహ రించిరి. పూర్వ గాంగుల ఇష్టదైవము గోకర్ణేశ్వరస్వామి. గోకర్ణేశ్వరాలయము గంజాంజిల్లాలోని మహేంద్రగిరిపై ఉన్నది. గాంగవంశ భూజానులు మొదట మైసూరునుండి వలస వచ్చి గోకర్ణేశ్వరుని పూజించి ఆయన అనుగ్రహముచే కళింగ దేశమున గాంగరాజ్యమును స్థాపించిరి. ఈ రాజ్యమును 500నుండి క్రీ. శ. 1487 వరకు గాంగవంశీయులు పాలించిరి. గాంగ వంశ రాజులు తమ పాలనారంభమునుండియు విజయరాజ్య సంవత్సరములు వరుసగా లెక్కించిరి. వానిని గాంగశకవత్సర ములందురు. ఈ గాంగవంశరాజులు మొదట శైవులుగను పిమ్మ ట వైష్ణవులుగను ఉండినట్లు తెలియుచున్నది. ఈ రాజులు వేద మతాభిమానులు. అనేక దేవాలయములను తటాకములను వీరు నిర్మించిరి. వీరి మంత్రులును సేనానులును తమ ప్రభువుల వలెనే తటాకాదులను త్రవ్వించిరి. గాంగవంశ ప్రభువులకు కళింగనగరము రాజధాని. శ్రీకాకుళము జిల్లాలోని వంశధారా నదీతీరమున ఉన్న ముఖలింగమే ఈ కళింగనగరమని చరిత్ర కారులు నిర్ణయించిరి. ఈ కళింగనగరము సర్వర్తుశోభా రమణీయమనియు స్వర్గమువంటిదనియు విజయవంతమైన దనియు పొగడ్తకెక్కెను.

అర్వాచీన గాంగులలో రెండవ వజ్రహస్తునకును రెండవ రాజరాజదేవుని సోదరునకును అనంగభీముడను నామ ముండినట్లు తెలియవచ్చుచున్నది. పై ఇద్దరుకాక మూడవ అనంగభీముడొకడు కలడు. అతడు మూడవ రాజరాజదేవుని కుమారుడు. మహాశూరుడు. గాంగసింహాసనము నధిష్ఠించిన వారిలో సుప్రసిద్ధుడగు అనంతవర్మ చోడగంగదేవునకు పిమ్మట మూడవ అనంగభీముడు ఒక్కడే ప్రథిత నామధేయుడయ్యెను. ఇతడు తండ్రిమరణానంతరము క్రీ. శ. 1211న గాంగసింహాసన మధిష్ఠించి క్రీ. శ. 1238 వరకు అనగా ఇరువదియేడు సంవత్స రములు గాంగరాజ్యమును పాలించెను. మూడవ అనంగభీము నకు అనియంకభీముడనియు అనియంకభీమదేవరావుతు అనియు నామాంతరములు ఉండినట్లును అతడు సమరముఖానే రిపు దర్పమర్దన భుజబల పరాక్రమ పరమవైష్ణవ పరమ మాహేశ్వర పరమభట్టారక దుర్గాపుత్ర శ్రీ పురుషోత్తమ పుత్ర రుద్రపుత్ర త్రయీవావసుధరాసముద్ధరణ ప్రచండ శ్రీ మదనంతవర్మ త్రికళింగేశ్వర అని నుతి పబడినట్లును దక్షిణ హిందూ శాసనములలో కలదు. (ద. హిం. 4 సెం. 1329 467) మరియు అతడు

వీర శ్రీ లలనా విలాసలలితానంత ప్రభావప్రభుః
స్వార్థప్రార్థ సురద్రుమో గుణిగుణాలంకార భావాశ్రయః
వీరానేకజనాభిరామ విమల ప్రఖ్యాత విఖ్యాశ్రయః
స్వామీ భాత్యనియంకభీమనృపతి ర్నేత్రత్రయాతోన్నతః

అనియు వినుతికెక్కెను. (ద. హిం. 4 సె. 1360 478) పై శాసనములు రెండును ద్రాక్షారామ భీమేశ్వరాలయము లోనివి. వీనివలన మూడవ అనియంక (అనంగ) భీముని సాహస పరాక్రమములును దాన ధర్మాది గుణములును తెల్లమగు చున్నవి. అనంగభీమునకు కస్తూరాదేవి అను భార్యవలన నర సింహదేవుడు అను కుమారుడును చంద్రికాదేవి అను నామాంతరముగల చంద్రాదేవి అనుకూతురును ఉండిరి. చంద్రికాదేవిని ఇతడు హైహయవంశజుడైన పరమాడి అను నామాంతరముకల పరమర్ది దేవున కొసగి పరిణయము కావిం చెను. అనంగభీముడు జగన్నాథ పదపద్మారాధకుడని తెలియు చున్నది.

మూడవ అనంగభీమునకును ఈతని కుమారుడైన మొదటి నరసింహ దేవునకును కాకతిగణపతి దేవుడును ఆతని కూతురైన రుద్రాంబికయును సమకాలికులు. కళింగ గంగవంశపు రాజ్యమును కబళించుటకు ఒకవంక కాకతిగణపతి దేవుడును వేరొకచక్కి ఉత్తరమునుండి బఖ్తియార్ ఖిల్జి ప్రోత్సాహముచే మహమ్మదీయులును ప్రయత్నించుచుండిరి. యవన సేనావాహిని మాటిమాటికి కళింగము నందలి ఉత్తర దిశను తన స్వాధీనమొనర్చుకొనుటకై కళింగముపై దండ యాత్ర లొనర్చుచుండెను. కాకతీయులు వేంగిరాజ్యమును వశమొనర్చుకొని కొంతవరకు కృతకృత్యులయిరి. ఇది బహుశః

మూడవ అని యంకదేవుని తండ్రియగు మూడవ రాజరాజు కాలముననే జరిగి నట్లు తెలియుచున్నది కోలనుపాలించు నట్టి వాడును మహామండలేశ్వరుడునునగు కొలని కేశవదేవుడును వెలనాటి పృథ్వీశ్వరుని సంతతివారైన కులోత్తుంగ రాజేంద్ర చోడుడు గొంకరాజు అనుమాండలికులును ఆనాటి వేంగిదేశపాలకులు వీరందరును తమ కిష్టములేకపోయినను కాకతీయులకు సామంతులై వేంగిరాజ్యమును పాలించుచుండిరి కాకతి గణపతిదేవుని వలన తన కళింగరాజ్యమునకు ముప్పుతప్పదని అనియంకభీమదేవుడు గ్రహించెను అతడు త్రికళింగమును తన ఏలుబడిక్రిందికి తీసికొనిరాదలచెను మహేంద్రపర్వతమునకు పడమటను మహానదికి ఉత్తరమునను నాగావళినదికి జన్మస్థానముగనున్న ప్రదేశమునకు త్రికళింగమని పేరు క్రీ శ 1192 నుండి 1228 వరకు నరసపురి (కొల్లేరు) రాజధానిగ కొలనుప్రాంతమును పాలించిన కేశవదేవుడు ఇంతలో మరణించెను ఈ కారణమున వేంగిలభించు అవకాశము అనంగభీమునకిపుడు లభించెను మరియు ఆదేసమయమున పాండ్యదేశాధిపతియగుమారవర్మ I సుందరపాండ్యుడు పరాక్రమించి కాకతీయసామంతులను కంచిసింహాసనము నుండి పదచ్యుతుల నొనర్చెను కాకతీయ సైన్యము దక్షిణమున హొయసలతో తెలుగుచోడులైన నెల్లూరు తిక్కనను రక్షించుటకు సమరమున నిమగ్నమైయుండెను కాకతీయుల ఒత్తిడికి తట్టుకొనలేక కులోత్తుంగ రాజేంద్రచోడుడును గొంకరాజును (వేంగిమండలాధిపతులు) కాకతీయులపై కినుకవహించియుండిరి ఇట్టి సదవకాశమున అనంగభీముడు ససైన్యుడై వేంగిదేశముపై విజృంభించి దానిని స్వాధీనమొనర్చుకొనెను ఈ యుద్ధమున ఈతనికి మిక్కిలి తోడ్పడినవాడు ఖడ్గసింహుని కుమారుడగు శ్రీసాజక అను దండనాథుడు ఇతడు అనియంకభీమునకు మిక్కిలి అండగానిల్చి సమరమున విజయము చేకూర్చెను ఈ యుద్ధము సుమారు మూడు సంవత్సరములవరకు జరిగినట్లు తెలియుచున్నది శ్రీసాజకుడు ద్రాక్షారామమున సైన్యముతోవసించి శత్రువులపై విజయమును సాధించుటకై కొంతకాలము నిరీక్షించినట్లును అతడు భీమేశ్వరాలయమును మరమ్మతుచేయు మిషతో అచట ఉండినట్లును దక్కను పూర్వచరిత్రలో కనవచ్చుచున్నది (ద పూ 2 పుట 607) ఇదే విషయము దక్షిణ హిందూశాసనములలో ఇట్లు కనవచ్చుచున్నది – శ్రీమతోనంక భీమస్య దండాగ్రే రవల్లభః శాకేనేత్రశరేరుద్ర (శా శ 1 52) గణితే కార్తికేసితే కీర్త్యామూర్త్యేవపూర్ణా విబుధగణజగ్వ ద్యభీమేశసౌఖ్య ప్రాసాదోల కృతోయ వరకృత సుధయా శ్వేతచ్చంద్రికా త్యా అచంద్రార్కం జనానామ్ముఖ కమలలసత్ఖడ్గ సహోగ్రపుత్ర శ్రీ (మత్) శ్రీసాజకేనప్రభుగుణవి లసద్భీమనాథే చ భక్త్యా (ద హిం 4 నెం 1960 పుట 478) వేంగి భూమండలమును తన ప్రభువగు అనంగభీమునకు శ్రీసాజకుడు సంపాదించిపెట్టి ద్రుతజితవిలసద్వేంగి భూమండలుడని శాసనమున పొగడ్త కెక్కెను ఈ యుదంతమే దక్షిణ హిందూశాసనములో ఇట్లు తెలియవచ్చుచున్నది ఇదియు ద్రాక్షారామ భీమేశ్వరాలయములోనిదే జనస్తుత రాజరాజః తస్మాదభూదరిగజారిరనింక భీమో। వీరోన్నృపోహరి పదప్రియరావుతాఖ్యః। శాకాబ్దే భూతబాణత్రిణయన గణితే సహసంక్రాంతికాలే భక్త్యో భీమేశ్వరాయ త్రిభువన తిలకాయాదరాదర్క కారం। పచాఖండ ప్రదీపాన్ త్రిభువన విశదా ప్రజికేన ద్రుతజితవిలసద్వేంగి భూమండలేన
(దహిం IV నెం 1252 పుట-434)

పై శాసనముల నాధారముగా అనంగభీముని దండాగ్రేసరుడైన శ్రీసాజకుని బలపరాక్రమాదులును ప్రభుభక్తియు వితరణ గుణసంపత్తియు వ్యక్తమగుచున్నవి అనియంకభీమునకు హరిపద ప్రియరావుత అను నామముకూడ ఉండినట్లు దీనివలన తెలియుచున్నది ఇట్లు సింహాచలము మొదలు గోదావరీ తీరప్రదేశములను జయించి అనంగభీముడు త్రయీావను ధరా సముద్ధరణుడు త్రికళింగేశ్వరుడు అను బిరుదములను పొందెను

మూడుసంవత్సరములు కష్టించి కాకతీయులసామంతులతో కదనమొనర్చి వేంగిదేశమును అనంగ భీముడుస్వాయత్తమొనర్చుకొనుట కాకతి గణపతి దేవునకు కడు దుస్సహమయ్యెను కాకతిగణపతిదేవుడు క్రీ శ 1258 లో మారవర్మ I సుందరపాండ్యుని పారద్రోలి కాంచీసింహాసనమందు తిక్కరాజును అధిష్టింపజేసి అనంగభీముని అధీనములోనున్న వేంగిని తిరిగి ఆక్రమింప ప్రయత్నించెను వేంగిని వశమొనర్చుకొను భారమును ఇందులూరి సోమప్రధాని భుజస్కంధములపై నుంచెను ఆతనికి సహాయకులుగా ఎరుభీముని కాలవనాయకుని మల్యాల హేమాద్రిరెడ్డిని ఏర్పరచి ప్రచండ సైన్యముతో గణపతిదేవుడు ఇందులూరి సోమప్రధానిని

వేంగిని వశమొ ద్చుకొనుటకు ప పెను కాకతీయ సేనా వాహిని మా డలికుల యొక్కయు అనియ క భీమదేవుని యొక్కయు సేనలపై విజృ భించి పోరాడినవి ఈ సమర మున కొలనురాజ్యము తిరిగి గణపతిదేవునకు దక్కినట్లు పాలేశ్వర దేవాలయమున దలి స్తంభముపైనున్న శాసనము వలన తెలియుచున్నది ఈ శాసనము క్రి శ 1231 నాటిది పాలేశ్వరాలయము పశ్చిమగోదావరి మండలములోని ఇరగ వరమను గ్రామమున ఉన్నది ఈ యుద్ధమున మల్యాల హేమాద్రిరెడ్డిచేత వెలనాటి గొంక ఓడింపబడి పారిపోయి నట్లును కులోత్తుంగ రాజే ద్రచోడుడు కాకతీయ సైన్యము నకులొ గిపోయినట్లును ఈతనికి ఎట్టి హానియు చేయక కాల పనాయకుడు రక్షించినట్లును దక్షిణ హిందూశాసనమువలన తెలియవచ్చుచున్నది ఈ శాసనము క్రి శ 1237 నాటిది ఈ శాసనమిట్లున్నది "సముద్ర ముద్రిత మహీజనవల్లభ కాకతి గణపతిదేవ దివ్య శ్రీపాదశేఖర పరబల భీకర దుర్జయకుల వార్ధి వర్ధన సంపూర్ణ సుధాకర నత్యరత్నాకర రమణీయ దక్షిణ భుజాద డ పడముట్లగండ సకలసుకవీంద్ర కులో త్తుంగరాయ రాజేంద్రచోడ గొంకదిశాపట్టవైరి గోధూమ స ఘట్ట ఖరట్ట అంబుధి ప్రకోప నామాద్రిప్రశ స్తసహితం శ్రీ మన్మహాప్రధాని మల్లల హేమాద్రిరడ్డి శకవర్షంబులు 1159 గల విషువు స క్రాంతినాడు శ్రీమద్రాక్షారామ భీమే శ్వర మహాదేవరకు తమ తల్లిదండ్రులకు ధర్మంగాను లోహ ద డు అఖండ దీపమును పెట్టించెను (ద హిం IV నె 1333—పుట—468) ఈ పై శాసనము వలన హేమాద్రి రెడ్డి పరాక్రమ సంపత్తియు దానసంపత్తియు విశదమగు చున్నవి మరియు పై సమరమున మిక్కిలి ఖ్యాతివహించిన కాలపనాయకుడు "బెజవాడ కండవాడి మన్యపురాధీశ్వరుడు ప్రతాపలంకేశ్వరుడు వీరయ దేవునికిని గణపతిదేవ మహా రాజులకును పుణ్యమునకుగాను ఇనుమట్ల చెన్నకేశవదేవరను ప్రతిష్ఠచేసి భూదాన మొనర్చి ట్లు గు టూరు మ డలము లోని వినుకొండ తాలూకాయందలి ఇనుమళ్ళ గ్రామము లోని సోమేశ్వర దేవాలయము వద్దనున్న శాసనము చెప్పు చున్నది ఇది శా శ 1176 (క్రి శ 1254) నాటిది (ద హిం VI నెం 602) మరియు ఈ కాలపనాయకుడు రుద్రయదేవ అమ్మంగారికి పుణ్యమునకై ఇనుమట్ల సోమేశ్వర దేవరకు గుడి మంటపము ఎత్తించి అంగరంగ భోగాలకై భూదాన మొనర్చెను (ద హిం VI నెం 603) కాలపనా యకుడు ఇంతటి శూరుడును ప్రభుభక్తిపరాయణుడును వితరణ శాలియగుట చేతనే గణపతి దేవుడు అతనిని వే గిమ డలము నకు గవర్నరుగా నియమించెను (ద హి VI నెం 607) ఇది శక 1176 (క్రి శ 1254)న జరిగినట్లు తెలియుచున్నది వేంగీ విషయాధినాథ అను ఈతని బిరుదముగూడ దీనికి దోహద మొసగుచున్నది

మూడవ అన గ భీమదేవుని కాలమున చోళచక్రవర్తి అగు రాజరాజ దేవుడు బలహీనుడుకాగా అతనిని పదచ్యుతుని చేయుటకు ఆతని సామంతులును దండనాథులును యత్నించు చుండిరి ఇట్లు యత్నించినవారిలో పల్లవులకును పా డ్యు లకును భాగస్వామ్యము కలదు హోయిసల బల్లాళులతో నెల్లూరు తెలుగు చోళులతోపాటు అనంగ భీమదేవుడును ఈ రాజకీయ కలహములలో ఐక్యము కలిగించుకొని సైన్యముతో కా చీపుర శ్రీరంగముల వరకు చని కాకతీయ ప్రత్యర్థులకు సాయమొనర్చినట్లు ఈతని కాంచీపుర శ్రీరంగ శాసనములవలన తెలియవచ్చుచున్నది మూడవ అనియంక భీమునిచే నిర్మితమైన దాక్షేశ్వరాలయములోని శాసనమువలన అని యంకభీముడు బంగాళ దేశపు సుల్తానులతో సమర మొనర్చినట్లును ఆ యుద్ధ మున అనంగ భీముని సేనానియగు విష్ణువు అనునతడు ప్రధాన పాత్ర వహించి అనంగ భీమునకు విజయమును సంపాదించి పెట్టినట్లును తెలియుచున్నది మరియు ఆ శాసనమున దండ నాథుడగు విష్ణువు ఇట్లు ప్రశంస బడెను "వీరవ్రతుడై నిశితసాయకములతో యవనాధీశులను విష్ణువు వధించెను" వింధ్యాద్రి సీమలో భీమనది చెంత సాగరతీరమున సమరము జరుగునపుడు "తుంఘాణ పృథ్వీపతి విశ్వము విష్ణుమయమని ఎరిగినట్లుగా పై ఖానసులుగూడ ఎరుగనేరరు" విష్ణువు ఎది ర్చిన తుంఘాణనృపతి ఇఖ్తియారుద్దీన్ (లక్ష్మణావతి) కి ప్రభువైన మలిక్—ఇజ్జుద్దీన్ తుఘ్రుల్—ఇ—తుఘా న్ ఖాన్ అని చెప్పుదురు అని యంక భీమునకు త్రికళింగ విజయమును సాధించుటలో సాయపడినవాడు మహాసాధసేనాపతి అనునతడొకడుకలడు అతడు త్రికళింగమండల మహద్దండాధిపతి అనియు శ్రీమంతు దక్షిణ దండాధికారులైన శ్రీకరణ మహాసాద సేనాపతులు అనియు శాసనములలో ప్రశంసింపబడెను

గాంగవంశ భూజానులు వేదవిద్య నాదరించిరి అనేక దేవాలయములను తటాకములను నిర్మించిరి ఈ వంశములో

ప్రసిద్ధుడగు అనంతవర్మ చోడగంగదేవుడు (పూరిలో) జగన్నాథాలయమును నెలకొల్పెను రెండవ అనంగ భీముడు మేఘేశ్వరాలయమును నిర్మించెను మూడవ అనియంక భీముడు కటక మండలములోని కృష్ణాపుర గ్రామమునందు భాస్కేశ్వరాలయమును నిర్మించెను నూటికి నెక్కువగా విలాస వసతులను నెలకొల్పెను పాంథులకై శాలలను నిర్మించెను సర్వోపయోగకరములగు శతాధిక తటాకములను త్రవ్వించెను జగన్నాథునకు ప్రీతిగా సముద్ర తటమున అనేక హేమ తులాభారములు తూగెను వేదవిదుడైన ఇతడు వేద విద్యాభివృద్ధికై పాటుపడెను ఇతడు మేషశుద్ధ పంచమి గురువారము నాండు శ్రీమద్ద్రాక్షారామమున శ్రీ భీమేశ్వర మహాదేవరకు తిజ్గ యెత్తు గద్యలు (840) యి ట్ట పుష్పమహాళి సేయించి పెట్టినట్లు దక్షిణ హిందూ శాసనములలో నున్నది (ద హి IV సెం 1399 పుట 467) పుష్పమహాళియనగా ఆభరణ విశేషమనియు అనగా సుమారు 840 బంగారు నాణెములతో ఒక ఆభరణమును చేయించి అనంగభీముడు భీమేశ్వరునకు సమర్పించెనని తెలియుచున్నది ఈకని కొమారుడగు నరసింహదేవుడు సాహస పరాక్రమములలోను దానధర్మములలోను త డికి దీటు అనిపి చుకొనెను కోణార్కమున (ఒరిస్సాలో) నరసింహదేవుడు సూర్యదేవాలయమును నిర్మించెను

ఇట్లు గాంగ భూపాలురు వేదవిదులై దైవభక్తులై అరిభయంకరులై ప్రజాహితైక తత్పరులై మహాశూరులై మిక్కిలి ప్రసిద్ధిగాంచిరి మూడవ అనంగభీముడు గాంగచరిత్రమున మకుటాయమానమై నెగడెను

తం అం శా

## అనంతగిరి

నల్లగొండజిల్లా హుజూరునగరం తాలూకాలో కోదాడ సర్కిల్‌లో అనంతగిరి అను గ్రామము ఉన్నది దీనికి 20 మైళ్ల దూరముతో ఖమ్మంపట్టణము 15 మైళ్ళలో హుజూరునగరు పట్టణము కలవు తూర్పున పాలారం పడమట తమ్మరబండ పాలెము ఉత్తరమున వస తవరం దక్షిణమున తిరువన్నారము ఈ గ్రామమునకు సరిహద్దులుగా ఉన్నవి దీని విస్తీర్ణము 7 8 0 ఎకరములు ఇది ఎత్తుపల్లప్రాంతమున ఉన్నది

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామ మందలి పురుషులు స్త్రీలు కలిసి 5889 మ ది ఉండిరి వీరిలో 6 15 సం॥ల వయస్సుగల బాలురు 280 మంది బాలికలు 880 మంది షెడ్యూలు జాతులవారు 741 మంది ఇచట ఇండ్లు ఒకచోట వాడవాడలుగను మరియొకచోట గుంపులు గు పులుగను ఉన్నవి వీటిలో 800 పెంకుటిండ్లు అయిదు కాంక్రీటు కప్పుగలవి ఒక అంతస్తుగల మేడ కలవు గ్రామస్థులలో 2000 మంది వరి అన్నము 1839 మంది జొన్న అన్నమును 2000 మంది ఇతర అన్నములను తిందురు వీరు బావినీటిని త్రాగుదురు

ఈ గ్రామమునకు పాలేరువాగు గొట్టపు బావులు నీటి వనరులుగా ఉన్నవి వీటిక్రింద వరి జొన్న వేరుసెనగ సజ్జ పండును 1966 67 సం॥లో వ టలక్రింద ఉపయోగి చిన భూమి 4800 ఎకరములు దీనిలో కాలువక్రింద 200 ఎకరములు గొట్టపు బావులక్రి ద 400 ఎకరములు ఇతర వనరుల క్రింద 100 ఎకరములు సాగుబడియైనవి ఆయిల్ ఇ జనులు 200 ఎకరములకు నీటిని సమకూర్చెను జంతు సహాయమున 100 ఎకరములకు నీటి సరఫరాచేయబడెను ఇచట 800 ఎకరముల రేగడినేల 1500 ఎకరముల చవిటినేల 8900 ఎకరముల దుబ్బనేల కన్పడును ఫలసాయములను బ డ్లపై కోదాడు హుజూరునగరములకు రవాణా చేయుదురు

ఇచ్చటి పశుస ఖ్య 8102 వీటిలో గేదెలు ఆవులు ఎద్దులుకలసి 1000 కోళ్ళు 1000 వారమునకు 1500 లీటర్ల పాలు 500 కి గ్రా నెయ్యి 500 కి గ్రా మాంసము 500 గ్రుడ్లు స్థానికులు ఉపయోగి చుకొని 500 కి గ్రా నెయ్యి 1000 గ్రుడ్లు కోదాడుకు రవాణాచేసిరి సాలీనా 1000 కి గ్రా చేపలను స్థానికులు ఉపయోగించుకొనిరి

ఈ గ్రామజనుల ముఖ్యజీవితాధారములు వ్యవసాయము కూలి చేపలుపట్టుట అడవికలప వృత్తిగా కలవారు వ్యాపారస్థులు దుకాణాదారులు కలరు కంసాలులు వడ్రగులు కమ్మరులు కుమ్మరులు చాకలివారు మంగలివారు కూడ గలరు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునికి కూలి రు 8 లు స్త్రీకి రు 150 లు

అనంతగిరికి 20 మైళ్ళలో ఖమ్మము రైల్వేస్టేషను ఉన్నది ఈ గ్రామమును పొరుగు గ్రామములతో క కరరోడ్డులు కలుపుచున్నవి 150 రె డెడ్లబ డ్లు 10 సైకిళ్ళు ఇచటకలవు

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు ప్రాథమిక పాఠశాల వ్యవసాయ పరపతిస ఘము ఉన్నవి పరపతి

సంఘము గ్రామస్థులకు 20 000 రూపాయలను అప్పుగా ఇచ్చినది ఇది పంచాయతి పరిపాలన కల గ్రామము ఇచట సత్రములున్నవి ముగ్గురు ఇంగ్లీషు వైద్యులు ఇద్దరు ఆయుర్వేద వైద్యులు ఒక హోమియోపతి వైద్యుడు కలరు పశువులకు నాటువైద్య సహాయము ఉన్నది అయిదు కిరాణా దుకాణములు కలవు

తంతికార్యాలయమునకు వారసంతకు పురుళ్ళ ఆసుపత్రికి పశువుల ఆసుపత్రికి సినిమాథియేటరుకు పోలీసు స్టేషనుకు బ్లాకు అభివృద్ధికేంద్రమునకు గ్రామస్థులు 5 మైళ్లలో ఉన్న కోదాడునకు పోవుదురు కోర్టుకు సబ్ రిజిష్ట్రారు ఆఫీసుకు 15 మైళ్ళలోనున్న హుజూరునగరుకు పోవలెను హైస్కూలు చదువులకు విద్యార్థులు హుజూరునగరునకును కళాశాల చదువులకు నల్లగొండ ఖమ్మములకును పోవుదురు

ఈ గ్రామమును కాకతీయ రాజులు పాలించిరి వీరు చారిత్రకమైన కోటను రెండు దేవాలయములను కట్టించిరి

**మా శ్వే**

## అనంతగిరి చరిత్ర

ఈ పేరు గల గ్రామములు ఆంధ్రదేశమునందు ఎడనెడ కాన్పించుచున్నవి వానిలో కొన్ని చరిత్ర ప్రసిద్ధి కెక్కినవి ఉపలభ్యములగు ఆధారములను బట్టి వీనిలో మొదటిది గుంటూరు మండలము పల్నాడులో ఉండినది

కొండవీటి పాలకుడగు కుమారగిరి రెడ్డి కాలమున (క్రీ శ 1386–1402) చొక్కన సింగన గారు అను నాయకుడు రాజప్రతినిధియై తంగెడసీమను పాలించుచుండెను తంగెడ పల్నాటిలోని గ్రామము అప్పకవి దీనిని వర్ణించెను ఇది కృష్ణానదికి దక్షిణమునకు శ్రీగిరికి ఈశాన్యదిశను ఉన్నదని అతని వర్ణనము చొక్కన సింగన గారికి ఒకనాడు స్వప్నమునందు నరసింహస్వామి దర్శనమిచ్చి తనకు ఆలయ నిర్మాణముచేయుమని ఆనతిచ్చెనట సింగనంగారు భగవంతుని యాజ్ఞ మేరకు అనంతగిరి వద్ద నరసింహస్వామి ఆలయము నిర్మించి విగ్రహ ప్రతిష్ఠ చేసిరి

అనంతగిరిని గూర్చి మరికొన్ని యంశములు దవాం X నెం 565 వలన తెలియ వచ్చుచున్నవి శాసనకాలము శ క 1313 (క్రీ శ 1391) అనంతగిరి తంగెడకు ఉత్తరమునను కృష్ణవేణీ నదికి దక్షిణమునను ఉన్నది భవనాశి అను చిన్న ఏరు వరాహగుండముతో కలియు స్థలమున అనంతగిరి యున్నది ఈ నది సంగమేశ్వరము వద్ద కృష్ణలో కలియుచున్నది

కోరుకొండమీద శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయము కూడ ఇట్లు ఒక భక్తురాలి స్వప్న ఫలితముగానే నిర్మింపబడెను ఆంధ్రవాఙ్మయమునందు స్వప్నవృత్తాంతములు తరచు లభించుచుండును శిల్ప క్షేత్రమునందు గూడ స్వప్నము మిక్కిలి ఫలవంతమైనట్లు పై ఉదాహరణలు సాక్ష్యమిచ్చుచున్నవి

క్రీ శ 1700 ప్రాంతము వాడును విజయనగరము పూసపాటి వంశీయుడును అగు తమ్మభూపాలుడు అనంతగిరి విభుడని శ్రీ కృష్ణ విజయ కావ్యములో వర్ణింపబడినది బెజవాడ యందలి కనక దుర్గాదేవి కటాక్షముచే తమ్మ భూపాలునకిది లభించెనట అప్పటికి గోల్కొండ రాజ్యమస్తమించినది మొగలాయి చక్రవర్తుల ప్రతినిధులు ఆంధ్రదేశమును అదుపులోనికి తెచ్చుకొనుటకు యత్నించుచుండిరి ఇట్టి యరాజక కాలములో తమ్మ భూపాలుడు బలపరాక్రమములచే కృష్ణకు దక్షిణ ప్రాంతమున కొంత ప్రాభవమును సంపాదించియుండును ఇట్లీతడు అనంతగిరి విభుడై యుండును

ఈ సందర్భమున మరియొక విశేషాంశము గమనింపదగియున్నది క్రీ శ 14వ శతాబ్దమునందు నరసింహస్వామి ఆరాధనము తెలుగు దేశములో వ్యాప్తిని చెందెను రెడ్డి రాజ్య స్థాపకుడగు ప్రోలయ వేమారెడ్డి అహోబల నృసింహస్వామి భక్తుడు ఎర్రాప్రెగ్గడ మహాకవి అహోబల దేవుని కంకితముగా తన లక్ష్మీ నృసింహ పురాణమును రచించెను కోరుకొండ నాయకులు గూడ కోరుకొండ దుర్గముపై లక్ష్మీ నృసింహదేవుని ప్రతిష్ఠించిరి కుమారగిరిరెడ్డి ప్రోలయవేమారెడ్డి కన్న వైష్ణవ మతమునందు ఎక్కువ ప్రత్యయము కలవాడు కావుననే అతని ప్రాంత పరిపాలకుడైన చొక్కన సింగనంగారు అనంతగిరిలో నరసింహాలయములు వెలయించెను నరసింహస్వామి శ్రీ మహా విష్ణువు యొక్క ఉగ్రావతారము శత్రు వినాశనమునకు ప్రతీకయైన దైవము శైవ మతాభినివేశము అధికముగా గల రాచకొండ పద్మనాయక ప్రభువులు శివుని ఉగ్రావతారమగు భైరవుని ప్రతిష్ఠించి ఆరాధించగా రెడ్డి రాజులు విష్ణువుయొక్క ఉగ్రరూపమైన నృసింహ దైవమును సంభావించిరని యూహింపవచ్చును శ్రీనాథుడు "వేదాద్రి నరసింహ విపుల వక్షస్థలీ కల్హార మాలికా గంధలహరి"

అని వేదాద్రి దేవుని స్మరించినాడు ఈ సంప్రదాయమే విజయ నగర సామ్రాజ్యమునకును ప్రాకినది హంపిశిథిలము లందలి ఉగ్రనృసింహమూర్తియు శత్రుసంహారమునకు చిహ్నముగానే వెలసియుండును

**అనంతగిరి (2) గ్రామచరిత్ర** ఈ గ్రామమునకు చరిత్ర ప్రాముఖ్యము కలదు ఇచ్చటి కొండపై దుర్గము నిర్మింపడెను దీనిని కాకతీయులు కట్టించి యుందురని భావింపబడుచున్నది విజయనగరచక్రవర్తియైన శ్రీకృష్ణదేవరాయల పూర్వదిగ్విజయ యాత్రయందు తెలంగాణమున ఆతడు జయించిన దుర్గములలో అనంతగిరి ఒకటి తిరుమల తిరుపతి దేవస్థాన శాసనములు మూడవ సంపుటములో (నెం 80 179 పుట) రాయల విజయములు ఇట్లు పేర్కొనబడినవి "బెజవాడకు విచ్చేసి కొండపల్లి దుర్గమున్ను సాధించి అనంతగిరి ఉద్రకొండ ఉర్లకొండ అరవపల్లి జల్లిపల్లి కందికొండ కప్పులువాయి నల్లగొండ కంభమెట్టు కనకగిరి శంకరగిరి ఇవి మొదలైన తెలంగాణ్యపు దుర్గాలు ఎకఘాటినిగై కొని" వీనిలో నల్లగొండ కంభమెట్టు ప్రసిద్ధమైనవే కందికొండ ఇప్పుడు వరంగల్ జిల్లా మహబూబా బాదు (మానుకోట) తాలుకాలోనున్నది జల్లిపల్లి అదేజిల్లా జనగామ తాలూకాలోనున్నది ఉర్లకొండ గ్రామము నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకా ఎరికొండ సర్కిలులో ఉన్నది నందితిమ్మకవి తన పారిజాతాపహరణ కావ్యమునందు కృష్ణరాయల విజయములను వర్ణించుచు (పారి 1 23) కినుకమీఱ ననంతగిరి క్రిందు సేడజేసె అని చమత్కరించినాడు రాయలు దేవరకొండ జల్లిపల్లి కంభంమెట్టు జయించినట్లు తిమ్మన వ్రాసినాడు అనగా కృష్ణదేవరాయల కాలమునకు అనంతగిరి దుర్గము యుద్ధ ప్రాముఖ్యము కలిగియుండె నన్నమాట అప్పటికి గోలకొండ రాజ్యము నూతనముగా స్థాపింపబడి కులీ కుతుబుషాహి ప్రజ్ఞాపాటవముచే తలయెత్తుటకు ప్రయత్నించుచున్నది

తర్వాతనే ఈ ప్రాంతమంతయు గోల్కొండ యాజమాన్యమున స్థిరపడినది కుతుబుషాహీ కాలమున గూడ ఇది తగుమాత్రము ప్రాధాన్యము కలిగియుండెను అబ్దుల్లా కుతుబుషా (క్రీ శ 1626 1672) తన రాజ్యకాలమున ఒక పర్యాయము రాజ్యమందలి తూర్పుతీరస్థ భాగములను సందర్శించుటకై మచిలీపట్నమునకు పోవుచుండెను దారిలో నాతడు అంతగిరివద్ద మజిలీచేసెనని ఆతని సంచారక్రమ వర్ణనలో చెప్పబడినది (చూ అంతగిరి) అనంతగిరియే ముసల్మాను రచయితచే అంతగిరిగా వ్యవహరింపబడియుండును మరింగటి సింగరాచార్యుల తండ్రి తిరువేంగళాచార్యులు అనంతగిరియందు గురురాయ పట్టభద్రుడని నిరోష్ఠ్య సీతాకల్యాణమున కలదు ఇది నల్లగొండ జిల్లాలోని అనంతగిరియని భావించుటకు వీలగుచున్నది

కవి ఇచ్చట కొన్ని విశేషములను తెల్పెను మరింగటి వారి పూర్వీకుడైన చెన్నరాయడు దేవరకొండకు చేరువనున్న పెణకరాజుపల్లెగ్రామపు కొండపై చెన్నకేశవుడుగా వెలసెనట మరింగంటి తిరువెంగళనాథుడు ఆ సమీపమందలి కొన్నిగ్రామములను గురువుగా నుండినట్లు చెప్పబడినది ఆ గ్రామములు అనంతగిరి ధర్మపురి ఊరిగొండ గంగాపురము బ్రహ్మరాయపురి కర్బుర రేబల్లె ఎడబెట్ల శాదేపల్లి అనునవి ఇ యన్నియు హరి తీర్థములని కవి వాకొనుచున్నాడు వీనిలో కొన్ని స్థలములిప్పుడు గుర్తించుటకు వీలులేకున్నవి పెణకరాజుపల్లె బ్రహ్మరాయపురి కాల్పించుటలేదు బ్రాహ్మణపల్లె అను గ్రామములు దేవరకొండ తాలూకాలో కలవు బ్రహ్మరాయపురి సంస్కృతీకరణమేమో తెలియదు ధర్మపురి గంగాపుర గ్రామములు ఈజిల్లా రామన్నపేట తాలూకాలో ఉన్నది గంగాపుర గ్రామము రేబల్లె దేవరకొండతాలూకాలో ఉన్నవి పైయంశములనుబట్టి మరింగంటి సింగరాచార్యులు పేర్కొన్న అనంతగిరి నల్లగొండ జిల్లాలోనిదేయని ప్రకృతమునకు చెప్పవచ్చును

అనంతగిరి (3) రాజనీతి రత్నాకరము అను ప్రబంధమును వ్రాసిన నేబతి కృష్ణయామాత్యుడొక అనంతగిరిని పేర్కొనియున్నాడు ఈతడు ఇబ్రహీం కుతుబుషా కుమారుడైన మహమ్మదు కులీ కాలమువాడు ఈతని కాలము క్రీ శ 1580 1612 కృష్ణయామాత్యుడు తాను గోలకొండకు పడమట సిద్దలూరు గ్రామనివాసి యైనట్లు చెప్పుకొన్నాడు సిద్దలూరుకు సమీపమునందున్న అనంతగిరి నంసింహస్వామి ఈతని ఇలువేల్పు సిద్ధలూరు గ్రామము హైదరాబాదు జిల్లా వికారాబాదు తాలూకాలో ఉన్నది ఇప్పుడు దీని జనాభా 1586 వికారాబాదు తాలూకాలో అనంతగిరికొండలున్నవి ఇచ్చట ఒక ఆరోగ్య కేంద్రము ఏర్పడియున్నది నేబతి కృష్ణయామాత్యుడు పేర్కొనిన అనంతగిరి ఇదియేయని చెప్పవీలగుచున్నది ఈ కొండమీద నరసింహస్వామి ఆలయము ఉన్నదైనను ధ్రువపడలేదు ఇకను విచారింపవలసి యున్నది ఇచ్చట నేడు అనంత పద్మనాభస్వామి ఆలయము మాత్రమే

ఉన్నట్లు తెలియుచున్నది నృసింహస్వామి ఆలయములేదు

ఖం ల రం

వి శ సం

## అనంత దైవజ్ఞుడు

ఈతడు కేశవదైవజ్ఞుని కుమారుడు నంది గ్రామనివాసి ఈతడు కాలనిర్ణయావబోధమను జ్యోతిష గ్రంథమును రచించెను బికనీర్ మహారాజా పుస్తక భాండాగార గ్రంథసూచి 899 పేజిలో క్రీ శ 1566 67 సంవత్సరము చూపబడినది కాని ఇది గ్రంథ రచనా కాలమా లేక ఎవ్వరైన లేఖకులు ఆ పుస్తకమును వ్రాసినకాలమా అనువిషయము స్పష్టము కాదు

డా ఎ రా

## అనంతపల్లి

అనంతపల్లి పశ్చిమ గోదావరిజిల్లా తాడేపల్లిగూడెం తాలూకాలో ఉన్నది దీనికి 13 మైళ్ళ దూరములో తాడేపల్లి గూడెము లదు అనంతపల్లి విస్తీర్ణము 6150 ఎకరములు దీనికి తూర్పున యర్నగూడెం పడమట చీపురుగూడెం ఉత్తరమున చిన్నాయగూడెం దక్షిణమున చోడవరం సరిహద్దులుగ ఉన్నవి ఇది వర్షాధారపు మెరక గ్రామము

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఇక్కడ పురుషులు స్త్రీలు కలిసి 5547 మంది ఉండిరి ఈ సంఖ్యలో 6 15 సం॥ ల వయస్సుగల బాలురు 663 మంది బాలికలు 487 మంది ఎరుకలు 32 మంది దొమ్మరులు 10 మంది షెడ్యూలు జాతులవారు తరగతులవారు 1018 మంది ఇచట ఒక్కచో గుంపుగను ఒకచో ఏక పంక్తిగను వేరొక్కచో శివార్లుగను ఇండ్లు ఉన్నవి వీటిలో 200 పెంకుటిండ్లు 15 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 3 ఒక అంతస్తుగల మేడలు కలవు ఈ గ్రామము తూర్పు పడమరలుగా అభివృద్ధి చెందుచున్నది గ్రామస్థులు ఎర్రకాలువ నీటిని బావి నీటిని త్రాగుదురు త్రాగెడి నీటికి ఎద్దడిలేదు

అనంతపల్లి పంటకాలువ ఉండ్రాళ్ళచెరువు కృష్ణమ్మగూడెం చెరువు ఊరచెరువు చాకలి చెరువు దుష్కుంట చెరువు ఈ గ్రామమునకుగల నీటి వనరులు వరి వేరుసెనగ ఉలవ నువ్వుపంటలు పండును కొబ్బరి మామిడి బత్తాయి నిమ్మ నారింజ జీడిమామిడి చెరుకుతోటలు గలవు వంగ బీర దోస మున్నగు కూరగాయలను పండింతురు 1966-67 సం లో పంటలక్రింద ఇక్కడ 4739 ఎకరముల భూమి ఉపయోగపడెను కాలువక్రింద 576 ఎకరముల భూమి గొట్టపు బావులక్రింద 1000 ఎకరముల భూమి సాగుబడి అయెను 51 ఆయిల్ ఇంజనులు 500 ఎకరములభూమికి నీటిని సరఫరా చేసెను 4 ట్రాక్టర్లు 200 ఎకరముల భూమిని దున్నెను ఇచట 3011 ఎకరములు గరువనేల 300 ఎకరములు రేగడినేల 1000 ఎకరములు ఎఱ్ఱ ద్రుసేల 1500 ఎకరముల ఇసుకనేల 50 ఎకరములు రాతినేల కిన్ని చును సాలీనా వైరుపంటలను 20 లక్ష మామిడి కాయలను 9 90 000 బత్తాయి పండ్లను 11 90 000 నిమ్మకాయలను 50 బస్తాల జీడిమామిడి గింజలను 1918 పుట్ల బెల్లమును కూరగాయలను తాడేపల్లిగూడెమునకు లారీలపై రెడ్లబండ్లపై రవాణాచేసిరి 25 000 కొబ్బరికాయలను 10 000 బత్తాయి పండ్లను 10 000 నిమ్మకాయలను 1000 నారింజకాయలను 2 పుట్ల బెల్లమును స్థానికులు సాలీనా ఉపయోగించుకొనిరి

ఈ గ్రామములో 182 గేదెలు 150 ఆవులు 120 ఎద్దులు 100 మేకలు 50 గొఱ్ఱెలు 50 పందులు 430 కోళ్ళు కలవు 9 600 లీటర్ల పాలు 500 కి గ్రా నెయ్యి స్థానికులు ఉపయోగించుకొని 4 000 లీటర్ల పాలను నల్లచర్ల తాడేపల్లిగూడెములకు రవాణా చేసిరి

ఇచట జనుల ముఖ్య జీవితాధారము వ్యవసాయము దుకాణాదారులు కంసాలులు వడ్రంగులు కుమ్మరులు తెలికలవారు మంగలివారు చాకలివారు గొల్లవారు కలరు బుట్టలు అల్లుట విస్తళ్ళు కుట్టుట తాటిపీచుకొట్టుట ఇచటి ఇతర వృత్తులు రాతిగనినుండి [illegible] 70 టన్నుల రాయిని పొరుగు గ్రామములకు సప్లయి చేసిరి

మదనగోపాల భోగిలింగేశ్వర సుబ్రహ్మణ్యస్వాముల దేవాలయములు కలవు గ్రామదేవతయగు దండుగంగాభవాని గుడి చర్చి ఉన్నవి దేవాలయములకు 61 ఎకరముల భూమి కలదు మార్గశిర శుద్ధషష్ఠి నాడు సుబ్రాయుడి షష్ఠి జరుపుదురు శ్రీ మదనగోపాలస్వామి కల్యాణము వైశాఖ శుద్ధ ఏకాదశి నుండి పూర్ణిమవరకు 5 దినములు జరుగును దండుగంగాభవాని సేవ సంక్రాంతినుండి రెండు దినములు జరుగును మహాశివరాత్రి మాఘ బహుళ చతుర్దశి నాడు జరుగును

ఈ గ్రామమునకు 18 మైళ్ళ దూరములో తాడేపల్లి గూడెం రైల్వే స్టేషను ఉన్నది గ్రామములో 19 కి కరరోడ్లు ఒక తారురోడ్డు ఉన్నవి పొరుగు గ్రామములతోను పురములతోను క కరరోడ్లు తారురోడ్డు ఈ గ్రామమును కలుపుచున్నవి ఇది బస్సు మార్గముపైన ఉన్నది గవర్నమెంటు బస్సులు ప్రతి అర్ధగంటకు ఈ గ్రామముగుండా పోవును ప్రయాణమునకు 00 రెడ్డెడ్ల బండ్లు 1 7 సైకిళ్ళు కలవు

అనంతపల్లిలో బ్రాంచి పోస్టాఫీసు టెలిఫోను 4 మితి ఎలిమెంటరీ స్కూళ్ళు జిల్లాపరిషత్తు హైస్కూలు ఉన్నవి 45 మంది విద్యార్థులు ఇచట హైస్కూలు చదువులకు చోడవరం తెలికచర్ల గ్రామములను డి వత్తురు మిషన్ కుట్టు లేసు అల్లిక కేంద్రములుగూడ ఉన్నవి ఇది పంచాయతి పరిపాలనకల గ్రామము గ్రామ పారిశుద్ధ్యమునకు ఏర్పాట్లు కలవు పంచాయతి ప్రభుత్వముల రేడియో లౌడ్‌స్పీకర్లు 50 మంది కి సరిపడు ఒక కమ్యూనిటీ హాలు ఉన్నవి కోర్టు పోలీసుస్టేషను సబ్ రిజిస్ట్రారు ఆఫీసులు కలవు ప్రభుత్వపు రూరల్ ఆసుపత్రి ఒకటి ఉన్నది నలుగురు ఇంగ్లీషు వైద్యులు కలరు వారపు సంతలో కూరగాయలు పప్పు ధాన్యములు దొరుకును కిరాణా దుకాణములు కాఫీ హోటళ్లు కిళ్ళీ సోడా సిగరెట్టు దుకాణములు కూరగాయల అంగళ్లు సైకిళ్ళ షాపులు క్షౌరశాలలు బట్టలషాపులు మందుల షాపులు ఉన్నవి

18 మైళ్ళ దూరములో ఉన్న తాడేపల్లిగూడెంలో తంతి కార్యాలయము మున్సిఫ్‌కోర్టు తాలూకా కచేరి ఉన్నవి కళాశాల చదువులకు విద్యార్థులు తాడేపల్లిగూడెం ఆర్ట్సు కాలేజీకి పోవుదురు సినిమా థియేటరునకు వైద్యకార సంఘమునకు 8 మైళ్ళలోనున్న నల్లజర్లకు పోవుదురు

మా శ్రీ

## అనంతపాలుడు

అనంతపాలుడు పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు ఆరవవిక్రమాదిత్యుని సుప్రసిద్ధ సేనాపతి ఇతడు పశ్చిమ చాళుక్యుల పక్షమున వేంగి దేశమును (క్రీ శ 1115) స్వాధీనము చేకొని పటుదర్పముతో కొంతకాలము పాలించెను ఈయన శిరఃచావళియు ప్రశస్తియు చాళుక్య విక్రమశకము 45 (క్రీ శ 11 0) నందు ఆయన పట్టమహిషి మహాదేవి దండనాయకురాలు ద్రాక్షారామ భీమేశ్వరాలయమున వేయించిన శాసనమువలన (ద హి IV 121 0) తెలియవచ్చుచున్నవి అనంతపాలుడు | పచండమహాదండనాయకుడు ఇతనికి సమధిగతపంచమహాశబ్ద" అను రాజులు వహించు బిరుదము కలదు ఇతడు సుజనప్రసన్నుడు పరాంగనాపుత్రుడు తురగరేవంతుడు వైరికృతాంతుడు అనివర్తి వవీడినాడు ఈయన శాసనకవనకు చెందిన బ్రాహ్మణుడు ఈయన పేరు మహాప్రధాని భీమ వెగ్గడ మనె వెగ్గడ దండనాయక అనంతపాళరసు అని శాసనము లందు చెప్పబడినది పండితులైన వాసవ కబ్రాహ్మణులు గొప్ప మేధావులను కులను అయిఉండిరి నన్నయభట్టారకుని ఆంధ్రమహాభారతం రచనయందు తోడ్పడిన నారాయణభట్టు వాణస వ కీయుడ యే తెలియవచ్చుచున్నది

అనంతపాలుడు పరాక్రమశాలి ధీరుడు ఆన విషయములు క్రీ శ 1098 న నాటికే తెలియవచ్చినది ఇతనికి కర్ణాటకములోని బనవాస పుళిగెరె బెళ్వోళ అను ప్రదేశములపై రాజ్యాధికారము ఉండెడిది ఈయనకు నబిదండాధిపుడు నారాయణావనుడు లక్ష్మణదండనాయకుడు కాళిదాసు అను అయిదుగురు తమ్ములు గలరు వీర దరును అన్నవలె గొప్పయోధులు అరవ విక్రమాదిత్య చక్రవర్తి సేవయందుండినవారు

కర్నూలుజిల్లా మార్కాపుర తాలూకాలోని త్రిపురాంతకమున దలి త్రిపురాంతకేశ్వరుని దేవళమందు వేయించబడిన ఒక శాసనమున అనంతపాలుని వంశమువారు చాళుక్య నృపతులనే లో మగ్నులైటుల తెలుపబడినది అనంతపాలుని తండ్రి మహేశ్వరదండనాథుడు "చాళుక్యకుల మూలస్తంభ అనపొగడ్తను పొందెను అనంతపాలుని పితామహుడు భీమనకూడా గొప్పయోధుడుగా ప్రశంసలందెను గోవిందదండనాథుడు వేంగివిజయమునందు అనంతపాలునకు సహాయపడిన గొప్ప శూరుడు బంధుత్వరీత్యా ఆయన అనంతపాలునకు మేనల్లుడు అల్లుడుకూడ అయినట్లు చెప్పబడినది గోవిందదండనాథుని పూర్వులుకూడ చాళుక్య ప్రభువుల సేవ లందు దండనాయకులై ప్రఖ్యాతివహించిరి

అనంతపాల దండనాథుడు వేంగిదేశమును ఆక్రమించుటకు ముందుగల ఆంధ్రదేశ పరిస్థితులను కొంతవరకు తెలిసికొనుట ముఖ్యము వేంగిరాజ్యమును పాలించిన పూర్వ చాళుక్యనృపతులలో మూడుతరములవారు చోళమహారాజుల కన్యలను

ఉద్వాహమాడిరి వీరిలో విమలాదిత్యుడు (క్రీ శ 1011 18) కుందవాంబను పెండ్లియాడెను రాజరాజు (క్రీ శ 1019 61) అమ్మంగదేవిని పరిణయమాడెను రాజేంద్రచోడుడు (క్రీ శ 1070-1120) మధురాంతకదేవిని చేపట్టెను తండ్రి రాజరాజు మరణానంతరము రాజేంద్రుని పినతండ్రి విష్ణువర్ధన విజయాదిత్యుడు వేంగిరాజ్యమును ఆక్రమించుకొనుటవలన వెనువెంటనే రాజేంద్రచోడుడు వేంగిరాజ్యమును చేబట్ట వీలుపడలేదు చోళులతో వైవాహిక సంబంధములవలన కొంతవరకు వేంగి రాజకీయ వ్యవహారములలోని అంతఃకలహములందు చోళుల ప్రాబల్యము అధికమైనది పినతండ్రి విజయాదిత్యుని మరణముతో (క్రీ శ 1076) వేంగిరాజ్యము రాజేంద్రునకు సంక్రమించినది కాని అప్పటికే చోళరాజ్యమునకు వారసులులేని కారణమున రాజేంద్రుడు మాతామహరాజ్యమైన చోళమండలమునకు అధిపతియై వేంగిరాజ్య పాలనకు తనకుమారులను రాజ ప్రతినిధులుగ నియమించెను ఇప్పటినుండియు రాజేంద్రచోళుడు మొదటి కులోత్తుంగ చోడచక్రవర్తిగా వ్యవహరింపబడెను

కొంతకాలమునకు కులోత్తుంగ చోళుడు తన ఆప్తవర్గమునకు చెంది భక్తివిశ్వాసములతో తన్ను సేవించిన వెలనాటి దుర్జయవంశములోని గొంకరాజును రాజలాంఛనములతో వేంగిరాజ్యమునకు మహామండలేశ్వరునిగా చేసెను గొంకరాజు గొప్పయోధుడు కులోత్తుంగ చోడుని ప్రేమాదరముల చూరగొనినవాడు పూర్వ చాళుక్య ప్రభువులకు వెలనాటిదుర్జయవంశజులు సమస్తసేనాధిపతులుగానుండి రాజ్య రక్షణయందు అప్రమత్తులై యుండెడివారు కులోత్తుంగుడు గొంకరాజును పుత్రవాత్సల్యముతో చూచెడివాడు

ఇంతకు ముందునుండియు పశ్చిమ చాళుక్యులకును చోళులకును పూర్వాంధ్రదేశాక్రమణమునుగూర్చి పరస్పర యుద్ధములు జరుగుచుండెడివి దీనికిలోడు తమకు జ్ఞాతులైన పూర్వచాళుక్యుల వ్యవహారములందు చోళులు జోక్యము కల్పించుకొనుట పశ్చిమ చాళుక్య నృపతులకు కంటకింపుగానుండెడిది

కులోత్తుంగచోడుడు వేంగిమండలమును వెలనాటి దుర్జయులకు దత్తపరచుటతో చాళుక్య త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యునకు మంచి అదను దొరికినది తనకును తన అన్నయగు భువనైకమల్లసోమేశ్వరునికినిగల శత్రుత్వమున కులోత్తుంగచోడుడు తన అన్నకు సాయపడినందున కులోత్తుంగునిపై పగబట్టి విక్రమాదిత్యుడాతనిని ఎట్లయినను సాధింప తలపెట్టెను వెంటనే తన దండనాయకుడైన అనంతపాలుని వేంగిరాజ్యముపై దండెత్తి వశపరచుకొనుటకు గొప్ప సైన్యముతో పంపెను మహామండలేశ్వర వెలనాటి కులోత్తుంగ గొంకభూవిభుడును అశేషసైన్యమును ఆయత్తపరచుకొని అనంతపాలుని సేనల నెదుర్కొనెను వెల్లువవలె వచ్చిపడిన చాళుక్య సైన్యమును ప్రతిఘటించుటకు సాధ్యపడక వెలనాటి సైన్యములు వెనుకపట్టినవి బెజవాడ చందవోలు చేబ్రోలు మొదలగు కోటలు అనంతపాలయ్యకు వశమైనవి ఇట్లు కృష్ణా గోదావరీ మధ్యప్రదేశమును ఆంధ్రదేశపు హృదయ భాగమునునైన వేంగిమండలము క్రీ శ 1132 నాటికి పశ్చిమ చాళుక్యుల అధికారములోనికి వచ్చెను క్రీ శ 1127 సం న జరిగిన ఒక రాజకీయ విప్లవమున కొండపల్లిని పాలించు గోవిందదండనాథుడు (అనంతపాలుని మేనల్లుడు) జననాథపురమును (బెజవాడ) ముట్టడించి గొంకరాజును చెరబట్టి రాజ్యవిహీనుని చేసి వేంగిపట్టణమును దగ్ధముచేసినటుల శాసనములవలన తెలియుచున్నది

అనంతపాలుడు వేంగిమండలమునేలుచు బెజవాడయందుండిన కాలమున శైవాచార్యుడైన శ్రీపతి పండితుడు ఇతనికి గురువై యుండెనను విషయము సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమునందు నుడివి యున్నారు శివునికన్న అన్య దైవము వేరొకడులేడను సత్యమును నిరూపించుటకు అనంతపాలునిసముఖమున శ్రీపతి పండితుడు తన మహిమను ప్రదర్శించెనని ఒక ఐతిహ్యము కలదు ఒక ఉత్తరీయమునందు కణకణలాడు నిప్పులను శ్రీపతి పండితుడు మూటకట్టెను కాని ఉత్తరీయము చెక్కుచెదరక నిలిచినది ఈ విషయమునే మల్లికార్జున పండితారాధ్యుడు శివతత్త్వసారమను గ్రంథమునందు చెప్పినాడు

"ఒక్కండె దైవము శివుఁడని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులఁ జేరన్
గ్రుక్కక శ్రీపతి పండితుఁ
డక్కజముగ విజయవాడ నలజమ్మి శివా ॥

ఇదే విషయము శాసనములందును వ్రాయబడినది బెజవాడ మల్లికేశ్వరాలయమునందు చాళుక్య వంశశాస

మహా మ డలేశ్వర ల్ల కేతుకు శ్రీపతి పండితునిమహిమనుగూర్చి శ్లోకరూపమున శాసనము వేయి చెను శాసనకాలముగాని పల్ల కేతుని పుట్టు పూర్వో త్తరముగాని తెలియవచ్చుటలేదు

శ్రీపతి ప డితుడు అనంతపాలుడు ఒకే కాలమునకు చె దిన వా రనుటలో చారిత్రకులలో భిన్నాభిప్రాయములు కలవు శ్రీపతి ప డితుడు చూపిన మహిమ కాలప్రవాహ మున ఒక ఐతిహ్యముగా నిలచినది

అన తపాల దండనాథుని కాలమున వేయబడిన ద్రాక్షారామ భీమేశ్వరాలయమున దలి శాసనములను ఈ స దర్భమున వరికి చుట సమంజసము

ద డనాథ అన త దేవయ్యే పట్టమహాదేవి ఇరువది గంధ హ స్తమాడలు భీమేశ్వర దేవరకు సమర్పించినది ఇ దు ఆమె అన తపరమ కళ్యాణాభ్యుదయ సహస్ర ఫలభోగ భాగిని ద్వితీయ లక్ష్మిగా వర్ణి ప బడినది

ద్రాక్షారామమును ఆకాలమున పెదడాకరేమి అని శాసనముల పేర్కొ నుట గమని పదగినది (ద హి IV 1211)

అన తపాలుని అల్లుడు సక్ర రాజదండనాయకుడు భీమే శ్వర మహాదేవరకు అఖండవ త్తి లోహదండ (లోహముతో చేయబడిన దండము) సమర్పి చినటుల వేరొక శాసనము నందు కలదు (ద హి IV 1311)

చాళుక్య విక్రమ సం॥ 46 కు సరియగు శా శ 1048 (క్రీ శ 1121) సమ స్త ప్రధాని అనంతపాల ద డనాయకుడు భీమేశ్వర మహాదేవరకు 10 ఖండ్రి ల భూమిని దానముచేసెను (ద హిం IV-1225)

చాళుక్య విక్రమ సంవత్సరములను ఉదాహరించిన శాసనములు గోదావరి కృష్ణ గు టూరు మ డలముల సలు తావులలో కనుగొన బడినవి

విక్రమాదిత్య మహారాజు క్రీ శ 1126 వ స । న దివంగతుడయ్యెను ఇతని కుమారుడు మూడవ సోమేశ్వ రుడు పశ్చిమ చాళుక్య సింహాసనమును అధిష్ఠించెను ఇతనికి భూలోకమల్ల అను బిరుదుకూడ కలదు విక్రమాదిత్యుని మరణాన తరము వే గిమండలమున పశ్చిమ చాళుక్యుల అధి కారమును ధిక్కరించు అనేక తిరుగుబాటులు ఉత్పన్నమైనవి ఇప్పట్టున ఆంధ్ర దేశమందలి ఇతర మ డలేశ్వరులు కలిసి కట్టుగా వెలనాటి చోళులకు అండగా నిలచి వేంగిరాజ్యమును తిరుగ ఆక్రమించుటకు గట్టి ప్రయత్నములు చేసిరి అప్పటి ఆ ధ్రాధీశుడు వెలనాటి చోడరాజు కుమారుడు రె డవ గొంక రాజు ఇతడు మహా బలపరాక్రమశాలి విక్రమచోడభూపతి చోళమండలమును డి ఇతని సహాయార్థము గొప్ప సై న్యమును ప పెను పశ్చిమ చాళుక్య సైన్యములకు ఆధ్వర్యము వహిం చిన వారు గోవింద ద డనాథుడు లక్ష్మీశ్వర దండనాథుడు ఉభయ సై న్యములకు గోదావరి తీరమున జరిగిన మహా సమ రమున చాళుక్య సేనలు తరుమబడినవి ఈ ఘోర స గ్రామ మును గురి చి

——"కుంతల వల్లభస్యనికచే గోదావరీ సంగరే
ప్రాసల్లక్ష్మణ ద డనాథ సహిత గోవి ద దాండాధిపః
జిత్వాహాటక ఘోటకోష్ట్రి నివహైర్వ్రిశ్రియ "—

అని ద్రాక్షారామ శాసనమందు విశదీకరింప బడినది (ద హి IV-1141)

దీనివలన కుంతల వల్లభుని సమక్షమున గోదావరీ తీర మందు జరిగిన స గ్రామమందు గోవి ద లక్ష్మీశ్వద దండనా థులు ఓటమిని చెందిరి శత్రు సంబ ధమైన ధనరాసులు అశ్వ ములు ఒ టెలు గొ కభూధవునకు స్వాధీనమైనవి జయలక్ష్మి గొ కని వరించినది ఈ శాసనమున శ క సం। ము గాని చాళుక్యవిక్రమ సం రము గాని ఉదాహరి ప బడలేదు ఈ యుద్ధము క్రీ శ 1135 ప్రాంతమున జరిగి యుండవలెనని చారిత్రకులు భావించిరి

ఒక విషయము చర్చనీయాంశము అన తపాల దండ నాథుని వే గి దండయాత్రను అనుసరించిన గోవిందద డనాథ లక్ష్మణ ద డనాథుల పేర్లు ఈ శాసనమున ఉదాహరింపబడి నవి అనంతపాలద డనాథుడు స్మరింపబడలేదు అ దువలన అనంతపాలుడు ఈ సంగ్రామమునకు పూర్వమే మరణించె ననుటకు తావు ఏర్పడుచున్నది

శాసనమున దు కు తలవల్లభస్యనికచే అనుటవలన పశ్చిమ చాళుక్య ప్రభువై న సోమేశ్వరుడే స్వయముగా కర్ణాట సై న్యవాహినుల నడపినటుల ఊహి చవచ్చును

విక్రమాదిత్యుని రాజ్యపాలనలో గొప్ప ప్రజ్ఞతో వే గి మ డలమును రాజప్రతినిధిగా నిర్వహి చిన కీ ర్తి అన తపాలు నికి దక్కినది

కొ వెం

## అనంతపురం జిల్లా

పరిపాలనా సౌలభ్యము కొరకు 1882లో బళ్లారి జిల్లా నుండి కొంత భాగమును విడదీసి దీనిని అనంతపురం జిల్లాగా ఏర్పరచిరి తదుపరి దీనిలో కదిరి రామదుర్గ తాలూకాలు చేర్చబడినవి ఈ జిల్లా దక్షిణ మండలములో దక్షిణమునఉన్నది దీనికి ఉత్తరమున బళ్లారి కర్నూలు జిల్లాలు తూర్పున చిత్తూరు కడప జిల్లాలు దక్షిణపశ్చిమములగా మైసూరు రాష్ట్రము సరిహద్దులుగా ఉన్నవి

ఈ జిల్లా మొత్తం వైశాల్యము 7 87 చ మైళ్లు ఈ జిల్లా తాలూకాలుగాను రెండు రెవిన్యూ డివిజను (అనంతపురము పెనుగొండ)లుగాను విభజించబడినది గుత్తి తాడిపత్రి ఉరవకొండ రాయదుర్గము కళ్యాణదుర్గము అనంతపుర ధర్మవరం పెనుగొండ కదిరి హిందూపుర మడకశిర అనునవి ఈ జిల్లాలోని తాలూకాలు నైసర్గిక పరిస్థితులను బట్టి ఈ జిల్లాను ఉత్తర మధ్య దక్షిణప్రాంతములుగా విభజింప గును ఉత్తర తాలూకాలైన గుత్తి తాడిపత్రి నల్లరేగడి భూములు కలవి కళ్యాణదుర్గ అనంతపుర ధర్మవరం పెనుగొండ కదిరి అనునవి కేంద్ర తాలూకాలు సారవంతముగాని ఎర్ర భూములు తక్కువ వర్షపాతము కలదగుటచే చెట్లు చేమలు లేక ఈ ప్రాంతమంతయు రమ్యముగా కనిపించదు హిందూపుర మడకశిర తాలూకాలు కర్ణాటక పీఠభూమి వరకు వ్యాపించి యున్న ఎత్తైన భూమిపై నున్నవి ఇచ్చటివి ఎర్ర నేలలైనను తాలూకామధ్య ప్రాంత భూములకంటె ఎక్కువ సారవంతములు ఇందు చెట్లు చేమలు పంటలు వర్ధిల్లును గుత్తి తాడిపత్రి తాలూకాలు దక్షిణ దిశకు వాలియున్నవి కనుక ఈ ప్రాంతపు వర్షపు నీరంతా పెన్నానదిలోకి ప్రవహించును జిల్లాలోని పశ్చిమ భాగములో నున్న గుత్తి కళ్యాణదుర్గం తాలూకాలలోని కొంత భాగము ఉత్తరమునకును జిల్లాలోని మిగిలిన ప్రదేశమంతయు దక్షిణమునుండి ఉత్తరమునకును వాలియున్నది

దక్కను పీఠభూమివలె ఈ జిల్లా మిట్టపల్లములతో నిండియున్న ప్రాంతము ఈ జిల్లాలో పేర్కొనదగినవి ముచ్చుకోట కొండలు" ఇవి 85 మైళ్ల పొడవున గుత్తి పట్టణపు ఉత్తరభాగమున ప్రారంభమై తాడిపత్రితాలూకా దక్షిణ కొన వరకు వ్యాపించియున్నవి ఇవి గుత్తి తాడిపత్రి అనంతపుర తాలూకాలలో కనిపించును నాగసముద్రం కొండలు గుత్తి తాలూకా పశ్చిమ భాగమునుండి ప్రారంభమై దక్షిణముగా గుత్తి అనంతపురం ధర్మవరం తాలూకాల గుండా 50 మైళ్ల పొడవున వ్యాపించి యున్నవి దక్షిణమునకు పోయిన కొలది ఇవి ఎత్తున తగ్గుచు అచ్చటచ్చట చిన్న గుట్టలవలె కనిపించుచుండును మల్లప్పకొండ అను మరియొక శ్రేణి ధర్మవరములో పుట్టి మైసూరు రాష్ట్రములోనికి వ్యాపించుచున్నది పెనుకొండ కొండలు మడకశిర తాలూకా దక్షిణ భాగములో ప్రారంభమై పెనుగొండ హిందూపుర తాలూకాల గుండా వ్యాపించి మైసూరు రాష్ట్రములో ప్రవేశించుచున్నవి మడకశిరకొండలు తాలూకాను ఉత్తర దక్షిణములుగా విభజించుచున్నవి

ఈ జిల్లాలో మలప్పకొండ 3092 అడుగుల ఎత్తునను పెనుగొండ 3061 అడుగుల ఎత్తునను కదురిదుర్గ 2996 అడుగుల ఎత్తునను మడకశిరకొండ 2936 అడుగుల ఎత్తునను ఉన్నవి కర్నూలు జిల్లాలో ప్రారంభమైన ఎర్రమల కొండలు తాడిపత్రి తాలూకా పడమటి భాగములో క్షీణదశలో కన్పించును

ఈ జిల్లాలో ప్రవహించు ముఖ్యమైన నది పెన్న ఇది మైసూరు రాష్ట్రములోని చెన్నకేశవ కొండలలో పుట్టి హిందూపురం తాలూకా దక్షిణపు కొనలో అనంతపురం జిల్లాలో ప్రవేశించుచున్నది ఇది హిందూపురం పెనుగొండ ధర్మవరం కళ్యాణదుర్గం తాలూకాల గుండాను గుత్తి అనంతపుర తాలూకాల సరిహద్దువెంబడియు ప్రవహించి తాడిపత్రి తాలూకాగుండా కడప జిల్లాలో ప్రవేశించుచున్నది హిందూపురం తాలూకా ఊటుకూరు వద్ద జయమంగళి అను ఉపనది ఈ పెన్నలో కలియుచున్నది నాగసముద్ర కొండల క్షీణ కొనలో పుట్టి తడకలేరు ఏది సంగనమల చెరువులో ప్రవేశించి తరువాత పెన్నలో కలియుచున్నది "పడెయేరు" అను ప్రవాహము అనంతపుర చెరువును నింపుచు తడకలేరులో కలియుచున్నది మడకశిర తాలూకాలో పుట్టిన స్వర్ణముఖి దిగువగా మైసూరు రాష్ట్రంలో ప్రవేశించి హగ్రీనదిలో కలియుచున్నది మద్దులేరు పాపఘ్ని కదిరి తాలూకాలో ప్రవహించు ప్రవాహములు ఇవి మద్దులేటిలో చిత్రావతిలో కలియుచున్నవి

మార్చి ఏప్రల్ మే నెలలో బాగుగా వేడిగాఉండును (98 ఫా 107° ఫా) నవంబరు డిసెంబరు జనవరి నెలలు చలి కాలము (62° ఫా) మడకశిర హిందూపురం తాలూకాలు

ఈ జిల్లాలోని ఎత్తైన ప్రాంతమున ఉండుటచే చల్లగను దును ఈ జిల్లా దక్షిణ పీఠభూమికి మధ్యగాను సముద్రమునకు దూరముగాను ఉన్నది నైరృతి ఋతుపవనములకు పడమటి కనుమలు అడ్డముగానున్నవి అందుచేత రాష్ట్రము మొత్తములో ఇచ్చట వర్షము తక్కువ ఇచటి ఎగటు వర్షపాతము 22 4 అంగుళాల ఎక్కువగా ఆగష్టునుండి అక్టోబరు వరకు కురియును వర్షాభావముచే ఈ జిల్లా తరచు క్షామములకు గురియగుచున్నది

ఇచట వర్షము తక్కువ అగుటచేతను ఇందలి భూములు సారవిహీనములగుటచేతను ఇక్కడ అడవులు దట్టముగా లేవు జిల్లా విస్తీర్ణము 10 శాతములోనే అడవులు కలవు పెనుగొండ కదిరి అడవులలో ఎంట చెరకు వెదురు మున్నగునవి దొరకును హిందూపురం అడవులు దట్టమైనవి

జిల్లాలో చెప్పుకొనదగిన సాగు వసతులులేవు ఎగువ పెన్నా ప్రాజెక్టుయొక్కయు కుముద్వతీ ప్రాజెక్టుయొక్కయు నిర్మాణములు అయినచో కొన్ని సదుపాయాలు ఏర్పడగలవు పెన్నా దిని మినహాయించినచో ఇతర నదులన్నియును బాగుగా వర్షమున కురిసినప్పుడే పొంగును వర్షాలు లేనప్పుడు వీటిలో నీరుండదు ఈ నదులపైన ఎట్టి ఆనకట్టలులేవు అక్కడక్కడ నదులపై ఇసుకతో అడ్డుకట్టలువేసి కొద్ది ప్రాంతాలను సాగుచేయుదురు

ఈ జిల్లాలో చిన్న చిన్న చెరువులు పెక్కులు కలవు కదిరి తాలూకాలో చెరవుల సంఖ్య హెచ్చుగానున్నది కాని సక్రమముగ వర్షములు లేక ఇవిచాలా వరకు నిరుపయోగకరములగుతున్నవి నదీప్రవాహాలతో నింపబడు చెరువులు స్వల్ప సంఖ్యలో కలవు వీటిలో అనంతపురం తాలూకాలోని సింగనమల చెరువు పెనుకొండ తాలూకాలోని బుక్కపట్నం చెరువు ధర్మవరం తాలూకాలోని ధర్మవరం చెరువు ముఖ్యమైనవి ఈ చెరవులు లోతు లేనివి అందుచే వానిలో చాలినంత నీరు నిల్వయుండదు

తాలూకాలలో నూతులు తగిన సంఖ్యలో కన్పించినను వర్షాలు లేనిచో అవి సాగుకు తోడ్పడజాలవు కనుక సర్వసామాన్యముగా జిల్లా మొత్తము కరువుకాటకాలకు నిలయముగా నుండును

ఆహారమునకు పనికివచ్చు పంటలలో జొన్న సజ్జ రాగి వరి కొర్ర ఉలవలు ప్రధానమైనవి ఆహారేతరములైన పంటలలో నూనెగింజలు వేరుసెనగ నువ్వులు ఆముదాలు ముఖ్యమైనవి వ్యాపారపు పంటలలో ప్రత్తి ప్రధానమైనది

పూర్వమునుంచి రామగిరివద్ద బంగారము త్రవ్వితీయబడుచున్నది ఈ బంగారము ధర్మవరం పెనుకొండ అనంతపురం తాలూకాలందు లభ్యమగును ఉత్తరమున చెన్నంపల్లి వజ్రపు గనులు మధ్యభాగమున రామగిరిగనులు దక్షిణమున జుజాటిల్ గనులు పేర్కొనదగినవి వజ్రములకు వజ్రకరూరు ప్రసిద్ధి బారైట్స్ ముట్సుకోటకు నైరృతి వైపునను తాడిపత్రి అనంతపురం రోడ్డుకు ఇరువైపులను ఎక్కువగా లభ్యమగుచున్నది ఇతర ప్రధాన ఖనిజములు స్టీటైట్ ఆస్బెస్టాసు సున్నపురాయి అనునవి

పెద్దరక మధ్యరక పరిశ్రమలలో గుంతకల్లు రాయదుర్గ తాడిపత్రి హిందూపురం అనుతావులలో గల నూలు వడకుట బట్టలునేయుట మున్నగు పరిశ్రమలు కల్లూరులో గల వనస్పతి పరిశ్రమలు చెప్పదగినవి చిన్నరక పరిశ్రమలలో దక్షిణతాలుకాలలోని చేనేతపరిశ్రమ కళ్యాణ దుర్గములోని రాయదుర్గములోని కంబళుల నేత ధర్మవరములోని పట్టునేత ప్రసిద్ధపరిశ్రమలు వేరుసెనగ నూనెతీయు చిన్నరక పరిశ్రమ జిల్లాయందు అంతటను కలదు హిందూపురంలో చింతగింజల నుండి గుజ్జును తయారుచేయు పరిశ్రమ కలదు ఖండసారిబెల్లం తయారుచేయు పరిశ్రమ హిందూపురములో కలదు ఉరవకొండలో తోళ్లను పదునుచేయు పరిశ్రమ కలదు అనంతపురములోని ఇండస్ట్రియల్ ఎస్టేటులో వివిధవస్తువులను తయారుచేయు పరిశ్రమలు కలవు

ఈ జిల్లాలో పలురకాల రోడ్ల పొడవు సుమారు 1600 మైళ్లు జిల్లా అన్నితాలుకాలలోను రోడ్లనిర్మాణము దాదాపు ఒకే మాదిరిగా ఉన్నది బెంగుళూరుకు వెళ్లు జాతీయరహదారి గుత్తి అనంతపురం పెనుకొండల మీదుగా వెళ్ళుచున్నది ఈ జిల్లాలో 252¾ మైళ్ళ పొడవుగల రైలుమార్గము కలదు ఈ జిల్లానుండి మద్రాసు-బొంబాయి పోవు బ్రాడ్ గేజ్ మార్గము తాడిపత్రి గుత్తి తాలుకాల గుండా పోవుచున్నది మీటర్ గేజ్ రైలుమార్గము గుంతకల్లు నుంచి గుత్తి అనంతపురం ధర్మవరం పెనుగొండ హిందూపురం తాలూకాల గుండా బెంగుళూరుకు పోవుచున్నది ధర్మవరం నుంచి మరియొక మీటర్ గేజి బ్రాంచిలైను కదిరి తాలూకాగుండా చిత్తూరు జిల్లాలోనికి పోవుచున్నది గుంతకల్లు ఆంధ్రదేశము

లోని ప్రధానమైన రైల్వేస్టేషనులలో ఒకటి కళ్యాణదుర్గ మడకశిరతాలూకాలలో రైలు మార్గం లేదు మిగిలిన తాలూకా కార్యస్థానాలకు జిల్లా కార్యస్థానములనుండి రైలు మార్గము కలదు

1961 జనాభా లెక్కల ప్రకారము 17 67 46 2 మంది జనులు జిల్లాలో ఉండిరి జనసాంద్రత 239 ఈ జిల్లా రాష్ట్రములో వైశాల్యమున మూడవస్థానమును జనసంఖ్య విషయమున 1 వ స్థానమును ఆక్రమించినది హిందూపురం తాలూకాలో ఎక్కువ జనసంఖ్య కలదు ఈ జిలాలో జనులు 14 పట్టణాలలోను 953 గ్రామాలలోను నివసించుచున్నారు అనంతపుర పట్టణ (జిల్లా కేంద్రస్థానము)లో 52 280 మంది జనులు నివసించుచున్నారు గుంతకల్ జనసంఖ్య 48 083 బ్రతుకు తెరువు కొరకు అనేక జనులు జిల్లాను వదిలి సమీప జిల్లాలకు పోవుదురు వర్షాలుపడిన తనే తిరిగి చేరుకొందురు ఈ జిల్లా జనాభాలో 20 6 శాతము విద్యావంతులు కలరు ఆడవారిలో విద్యావిహీనులు పెక్కురు కలరు

హిందువులు 88 3 శాతంవారు ముస్లిములు 10 39 శాతంవారు క్రిస్టియనులు 0 75 శాతవారు జైనులు 0 06 శాతంవారు కలరు

ప్రాచీనకాలమునకు సంబంధించిన చారిత్రక ఆధారాలు కొన్ని అనంతపుర తాలూకాలో లభించినవి రాతియుగపు జనులు నివసించిన గుహాలు వాడిన పనిముట్లు లభించినవి అశోకుని శిలాశాసనము గుత్తికి చేరువలో ఎర్రగుడివద్ద లభ్యమగుటచే మౌర్యులు ఈ ప్రాంతమను పాలించినట్లు తెలియుచున్నది క్రీ శ 3 వ శతాబ్దిలో ఆ ప్రదేశమును పాలించిన పల్లవుల అధికారము ఈ జిల్లాలో వ్యాపించినది రాష్ట్రకూటులకు సామంతులుగా నోలంబులు పాలించిరి రాష్ట్రకూటులను జయించిన చోళుల తదుపరి పశ్చిమ చాళుక్యుల పాలనలో ఈ ప్రాంతమున్నది కదిరి దేవాలయము పల్లవుల చాళుక్యులకాలములలోనే నిర్మింపబడినది విజయనగర రాజుల పాలనలో గుత్తి పెనుగొండకోటలు కట్టబడినవి లేపాక్షి పెనుగొండదేవాలయాల చిత్రలేఖనము శిల్పము విజయనగర రాజ్యములో విలసిల్లిన చిత్రకళా నైపుణ్యానికి తార్కాణ వారితరువాత మహాదేవ శంపురాజులు హైదరాబాదు నవాబులు మహారాష్ట్రపు మురారిరావు హైదరాలి వరుసగా పాలించిరి మైసూరు యుద్ధాలలో టిప్పుసుల్తానును జయించి ఈ ప్రాంతమును బ్రిటిషువారు స్వాధీనపర్చుకొనిరి కదిరి తాలూకా కటారుపల్లిలో యోగివేమన సమాధి కలదు

మొత్తము రాష్ట్రములో ఈ జిల్లా వ్యవసాయములో వెనుకబడిన ప్రాంతము చిన్ననదులకు ఆనకట్టలు కట్టి పరిశ్రమలు నిర్మించి ఈ జిల్లా అభివృద్ధిపరచినగాని ప్రజల దారిద్ర్యము విచ్ఛిత్తి కానేరదు

వి మ

## అనంతపురం తాలూకా

అనంతపుర తాలూకా ఉత్తర అక్షాంశము 14 28 — 14 15 నకును తూర్పు రేఖాంశము 77 15 77 55 కును మధ్య కలదు దీనికి ఉత్తరమున గుత్తి తాలూకా తూర్పున తాడిపత్రి తాలూకా పశ్చిమమున కల్యాణదుర్గం తాలూకా దక్షిణమున ధర్మవర తాలూకా కలవు ఈ తాలూకా మొత్తము విస్తీర్ణము 926 చ మైళ్ళు

1961 సంవత్సరము జనాభా లెక్కలనుబట్టి ఇందలి జనాభా 2 20 706 చ మైలునకు జనసాంద్రత 238 ఇందు 114 జనవాసముగల గ్రామములు కలవు ఈ తాలూకా ఒక విశాలమైన పీఠభూమిగా కన్పడును ఇది గుట్టలుచేతను రాతికొండలచేతను భిన్నమై యున్నది ఈ తాలూకా తూర్పు కొనలోనికి నాగసముద్రము దక్షిణకొండల వరుస చొచ్చుకొని వచ్చినది తాలూకా శేషించిన భాగములో ముచ్చుకోట కొండపంక్తి కలదు అనంతపుర తాలూకాలో అచ్చటచ్చట పూర్వశిలాయుగపు రాకాసి గుడ్లు అను మానవుల సమాధులు కనిపించును

ఈ తాలూకా భౌగోళికముగా పీఠభూమికి మధ్యస్థమగుటచేత రాష్ట్రములో నెల్ల అత్యంత శుష్కముగ కనిపించును కావున ఇందు వ్యవసాయ పరిస్థితులు అనిశ్చితములుగా ఉండును తూర్పు తీరమునుండి దూరగతమగుటచే ఈ తాలూకా ఈశాన్య ఋతుపవనముల వలన సంపూర్ణ ప్రయోజనమును పొందజాలకున్నది ఎత్తైన పశ్చిమ ఘాటులనుండి విడివడియుండుటచే ఈ ప్రాంతములోనికి నైరృతి ఋతుపవనములు చొచ్చుకొని రాజాలవు మార్చి మే నెలలలో వాతావరణము వెచ్చగనుండును దైనదిన సగటు గరిష్ఠ ఉష్ణోగ్రత 36 7 41 7 c ల మధ్యగా మారుచుండును నవంబరు డిసెంబరు జనవరి నెలలు మిక్కిలి చల్లగా నుండును అందు ఉష్ణోగ్రత 16 7 c కి దిగును ఈ తాలూకాలో సాధారణ

ముగా నైరృతి ఋతుపవనముల పరభాగము నందును ఈశాన్య ఋతుపవనముల పూర్వభాగమున దును అధిక వర్ష పాతము వాటిల్లును ఆగస్టు సెప్టెంబరు అక్టోబరు నెలలు వానకాలము ఇచటి సగటు వర్షపాతము 21.25 అంగుళములు ఈ తాలూకా కరువు మండలములో ఉన్నది కరువు కాటకములు స్వల్పవర్షము కారణములుగా చెరువులు బావులు బాగుగా నిండవు పెన్నానది అన్ని ఋతువులలో ప్రవహించునది కాదు అందలి వరదలు కొన్నిరోజులు మాత్రమే నిలువయుండును తేమలేకుండుట చెట్లు చేమలు లేకుండుట నేల బీదగిలియుండుట ఈ తాలూకాకు గల ముఖ్య లక్షణములు

సాధారణముగా ఈ తాలూకాలోని నీటి పారుదల



ఆధారములు నమ్మకము లేనివై యున్నవి వానకాలములో పడిన వాన నీటిని సంరక్షించి వ్యవసాయమునకు నీటిని సమకూర్చు చెరువులకు సక్రమముగా నీటిని సప్లయి చేయుటకు ప్రయత్నములు చేయబడుచున్నవి చెరువుల నీటిపారుదల ఈ తాలూకాలో ప్రాముఖ్యము కలదై యున్నది పదునొకండు పెద్ద చెర్వులు ఇందు కలవు వీటిక్రింద రాదాపు 3500 ఎకరముల పంట ఆయకట్టు ఉన్నట్లు నమోదు చేయబడినది మిక్కిలి ప్రముఖమైన చెరువులివి (1) సింగనమల చెరువు ఇది నాగసముద్రపు కొండలలో పుట్టిన తడకలేరు నదీ ప్రవాహముచే నిండుచున్నది దీనిక్రింది ఆయకట్టు 254 ఎకరములు (2) బ్రహ్మసముద్ర ఏలేరు చెర్వు దీనిక్రింద ఆయకట్టు 506 ఎకరములు (3) నలకచేరు చెరువు దీనిక్రింద ఆయకట్టు 292 ఎకరములు (4) అర్వకూరు చెరువు దీనికి ఆయకట్టు 269 ఎకరములు బావులు కలవు కాని అవి వేసవి కాలమున వట్టిపోవును

అనంతపురం తాలూకాలో విశేషముగా ప్రాచీన వ్యవసాయ పద్ధతి అమలులో నున్నది అయితే ఆ పద్ధతి ఋతుపవనకాలమునకు అనుకూలముగా మార్చబడుచున్నది కొయ్య నాగళ్ళు వాడబడును ఇటీవల అనేక గ్రామములలో తేలికయైన ఇనుప నాగళ్ళు మెల్లగా ప్రవేశపెట్టబడుచున్నవి స్థానికమయిన ఎరువు పశువుల పెండ ఆకు అలములవలన ఏర్పడును రసాయనపు ఎరువులు అనేక గ్రామస్థులు వాడుచున్నారు స్వంత విత్తనాలనే వ్యవసాయదారులు వాడుచున్నారు ఉత్తమ విత్తనాలను తాలూకా వ్యవసాయశాఖాధికారులు వ్యవసాయదారులకు సప్లయి చేయుచున్నారు జొన్న సజ్జ రాగి కొఱ్ఱ చామ సెనగ కంది పచ్చపెసర ఉలవ మిర్చి నువ్వులు వేరుసెనగ ప్రత్తి పొగాకు ఇవి ఈ తాలూకాలోని ముఖ్యమయిన పంటలు నీటి పారుదలగల అన్ని బావులలో వడ్లు పండించబడును పంటలలో విశేష భాగము రాష్ట్రము లోపలనే విక్రయింపబడును

పారిశ్రామికముగా ఈ తాలూకా వెనుకబడియున్నది ఇందు భారీ పరిశ్రమలు లేవు ఇటీవలనే మధ్యరకపు పరిశ్రమలు చిన్న పరిశ్రమలు స్థాపింపబడినవి అనంతపుర ఇండస్ట్రియల్ ఎస్టేటులో నాలుగు ఫాక్టరీలలో ఉక్కు సామానులు వ్యవసాయ పరికరములు సంఘటిత పాత్రలు తయారు చేయబడుచున్నవి రెండు ఫాక్టరీలలో కర్పూరపు బిళ్ళలు మూడు ఫాక్టరీలలో అల్యూమినియముతో ఇత్తడితో రాగితో చేయబడిన పాత్రలు రెండు ఫాక్టరీలలో ఉతుకు సబ్బులు తయారు చేయబడును నాలుగు ఫాక్టరీలు కాగితపు సంచులను కవరులను వ్రాయునరాను ముద్రలనరాను పాంగు సామగ్రిని తయారు చేయుచున్నవి ఈ తాలూకాయందచ్చటచ్చట బియ్యము పప్పు నూనె మిల్లులున్నవి ఈ ఉత్పత్తులు రాష్ట్రమునందును దేశమున ఇతర భాగములందును అమ్మబడుచున్నవి ముతకరకపు కంబళ్లు గ్రామములలో నేయబడుచున్నవి

ఫిబ్రవరి నెల మొదలుకొని మే నెలవరకు సనపా గ్రామములో సంతలు జరుగును అందులో రైతులకు దున్నుటకు వలసిన పశువులు విక్రయింపబడును పెద్ద గ్రామములలో వారపు సంతలు జరుగును

ఈ తాలూకాలోని ప్రముఖస్థలములలో అనంతపురము చెప్పతగినది ఇది ఒక ప్రముఖమయిన ప్రాంతీయ పరిపాలనా ప్రధాన కార్యాలయముగాను విద్యాకేంద్రముగాను వృద్ధినొందినది 1961 సం॥ లెక్కల ప్రకారము ఇందలి జనాభా 52280 పాతశాలలకు తోడుగా ఇందు కళాశాలలు ఇంజనీరింగు కాలేజి పాలిటెక్నికల్ ఇన్‌స్టిట్యూటు పోలీసు ట్రైనింగు స్కూలు కలవు ఈ పట్టణములో తాలూకా జిల్లా పరిపాలనా కార్యాలయములు కూడా కలవు

ఈ తాలూకా ప్రధాన కార్యాలయమునకు పొరుగున నున్న తాలూకాలతో రోడ్ల సంబంధము కలదు పెక్కురోడ్లు కరవు నివారణ పథకముల క్రింద నిర్మింపబడినవి బెంగుళూరు-హైదరాబాదు జాతీయ రహదారి అనంతపురం చిత్తూరు రాష్ట్ర రహదారి బెంగుళూరు-గుంతకల్లు మీటరుగేజి రైల్వే ఈ తాలూకాకు ఉపయోగపడుచున్నవి

కె. వి.

## అనంతపురము

అనంతపురము జిల్లా అనంతపురము తాలూకాలో అనంతపుర పట్టణము ఉన్నది దీనికి 193 కి మీ దూరములో బెంగుళూరు మహానగరము కలదు క్రీ శ 1843 1879 ప్రాంతములో ఈ పట్టణము అనంతసాగర మనియు క్రీ శ 1787-40 సం లలో హూడే అనంతపూరు అనియు పిలువబడుచుండెడిది దీని ఉత్తరఅక్షాంశము 14°41 తూర్పురేఖాంశము 77° 37 ఇది సముద్ర మట్టమునకు 350 మీటర్ల ఎత్తున ఉన్నది.

ఈ పట్టణమునకు తూర్పున బుక్కరాయ సముద్రము పడమట పాప పేట ఉత్తరమున సోమ దొడ్డి దక్షిణమున రాప్తాడు గ్రామము సరిహద్దులు దీని విస్తీర్ణము 4640 ఎకరములు ఇది అన తపురము తాలూకాలో నడిబొడ్డున ఉన్నది కొంత దూరములో చుట్టును కొండలు కలవు ఇది రాతినేల నలుపుతో గూడిన ఎరుపునేల కలది ఎల్లప్పుడును పైరగాలి వీచు చుండును ఇది సమశీతోష్ణ ప్రదేశము తూర్పున 3 కి మీ ల దూరములో దేవరకొండ అను పెద్ద గుట్ట గోపురాకారమున సుమారు 200 ఎత్తున ఉన్నది ఈ గుట్ట చెట్లుచేమలతో నిండియున్నది ఇది రాతి మయము ఎర్రమట్టితో గూడిన నల్ల రాళ్ళతో చిట్టి రాళ్ళతో ని డియున్నది చిక్కవడయారు సరస్సులోని ల కమండి భూసంస్కరణకు మ ట్టి ని తోలు చు దురు

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఇచ్చట 27 810 మంది పురుషులు 24 470 మంది స్త్రీలు వెరసి 52 80 మంది ఉండిరి ఈ సంఖ్యలో 6 15 సం॥ల వ యస్సు గ ల బాలురు 10 783 మ ది బాలికలు 11 725 మంది షెడ్యూలు జాతుల పురుషులు 988 మ ది స్త్రీలు 8్ర8 మంది షెడ్యూలు తరగతుల పురుషులు 142 మంది స్త్రీలు 108 మంది 1931 సం॥లో 15 0 99 మ ది 1941 సం॥లో 21 482 మ ది 1951 సం॥లో 31 952 మంది ఉండిరి 1951 1961 సం॥ల మధ్య జనాభాలో పెరుగుదల 20 328 జనాభాలో ఈ అ మి త మయిన పెరుగుదల ఏర్పడుటకు వివిధ పరిశ్రమల అభివృద్ధి ఇతర రాయలసీమ జిల్లాలలోకన్న మిన్నఅయిన ఇచటి శీతోష్ణ స్థితి మ చి నీటి వనరులు వ్యవసాయాభివృద్ధి విద్యాం స్థల స్థాపనము అన్నిర గములలో ముందంజవేయు స్వభావముగల జిల్లాగా పేరుపొ దుట మొదలయినవి కారణములు ఇచ్చట ఇ డ్లుజార్జిపేట 1 9 3 4 గాను వాడవాడలుగాను ఎకప క్తిగాను నిర్మించబడి వి రామనగరము ఆకర్ష కముగ ఉండును వీటిలో 2 695 పెంకుటిండ్లు 1 298 కాంక్రీటు క ప్పు గ ల ఇండ్లు 969 ఒక అ త స్తుగల మేడలు 19 ఎక్కువఅంతస్తులు గల భవనములు కలవు గత 5 సం॥లలో అనేక వ్యా పా ర కేంద్రములు నెలకొల్పబడినవి నాగరికత పెరుగజొచ్చినది మొదలుగా అన్ని రంగములలో అభివృద్ధి ఏర్పడుచున్నది కాలువ నీటి ఉపయోగముతో వ్యవసాయ రంగములో కృషి మరింత వేగముతో సాగుచున్నది ఇది విద్యా కే ద్రముగా ఎక్కువ ప్రాధాన్యమును పొ దుచున్నది కళాశాలలో విద్యార్థుల సంఖ్య ప్రతి సంవత్సరము పెరుగుచున్నది దీనిని పురస్కరించుకొని యూనివర్సిటీ కోర్సులు కూడ ఇ టీ వ ల నే ప్రారంభించబడినవి ఇచ్చట జనులలో 70 శాతము వారు వరి అన్నమును 10 శాతము వారు గోధుమ అన్నమును 15 శాతము వారు జొన్న అన్నమును 6 శాతము వారు ఇతర అన్నములను తి దురు బావి నీటిని త్రాగుదురు పరిశుద్ధము చేయబడిన మ చినీరు కుళాయీల ద్వార సరఫరా చేయబడుచున్నది మంచి నీళ్ళకు ఎద్దడిలేదు

ఈ పట్టణమునకు మురుగుకాలువ నడిమి వంకవాగు 00 ఎకరముల విస్తీర్ణముగల చిక్కవడయారు సరస్సు బావులు మొదలైన నీటివనరులు కలవు 1968 69 స ॥ లో వరి రాగి అరిక జొన్న సజ్జ కొర్ర పెసర కంది నువ్వులు వేరుసెనగ ఉలవ ధనియ మొదలగు పంటలను పండి చిరి వ్యవసాయ ఫలసాయములను పాతరలు గాదెలు గోడౌనులు సరకులకొట్లు వీనిలో నిలవచేసిరి వ్యవసాయ ఫలసాయములను ఎద్దుబండ్లపై అనంతపురము మార్కెట్టునకు లారీలపై గుంకళల్లు బెంగుళూరులకు ఎగుమతిచేసిరి 18 ఎకరముల ద్రాక్షతోటలు 59 ఎకరముల నారింజతోటలు కలవు ద్రాక్షపంటలో 50 శాతము స్థానికులు ఉపయోగించుకొని మిగిలిన 50 శాతము పండ్లను బెంగుళూరు హైదరాబాదు గుంటూరులకు ఎగుమతిచేసిరి నారి జపండ్లను స్థానికులు ఉపయోగి తురు వంగ టొమాటో బెండ ఆకుకూరలు స్థానిక అవసరములకు ప డింతురు ఇవిగాక అన్నిరకముల కూరగాయలను బెంగుళూరునుండి లారీలద్వార బస్సుల ద్వార దిగుమతి చేసికొనుచుందురు 1967-68 సం ॥ లో పంటలక్రింద 186 ఎకరములభూమిని ఉపయోగించిరి 1968 69 సం ॥ లో చెరువుక్రింద 900 ఎ రములభూమి బావుల క్రింద 65 ఎకరములభూమి సాగుబడి అయినది 3 ఆయిల్ ఇంజనులు 7 ఎలక్ట్రిక్ మోటారులు 200 ఎకరముల భూమికి నీటిని సరఫరాచేసెను ఇచ్చట 186 ఎకరముల రేగడి నేల 250 ఎకరముల ఎర్రమట్టినేల కలదు

ఈ పట్టణములో గేదెలు ఎద్దులు ఆవులు ఆబోతులు మొదలయినవి 2 626 గుర్రములు 23 గాడిదలు 567 మేకలు 402 గొర్రెలు 806 పందులు 367 నాటురకపు కోళ్ళు 5 5 6 మేలురకంకోళ్ళు 560 కలవు గాడిదలు

చాకిరేవునకు పోవుటకును కాండాలు కట్టెలమ్ముకొనుటకు ఉపయోగించును దినమునకు 10 000 లీటర్ల పాలు 2 000 లీటర్ల పెరుగు 700 కి గ్రా మాంసము 200 గ్రుడ్లు సాలీనా 500 కి గ్రా చేపలు స్థానికులు ఉపయోగింతురు ప్రతిదినము చేపలను తుంగభద్రా డామ్‌నుండి దిగుమతి చేసుకొందురు

అనంతపురపు ప్రజలు వ్యవసాయము వ్యవసాయకూలి చిన్నతరహా కుటీరపరిశ్రమలు వీటిపై ఆధారపడుదురు 240 దుకాణాదారులు 106 కమిషన్ ఏజెంట్లు 206 సైకిల్ రిక్షావారు 56 జట్కాలు నడుపువారు 10 టాక్సీలు నడుపువారు 146 ఒంటెద్దుబండ్లు నడుపువారు కలరు వీరుగాక 406 కంసాలివారు 398 వడ్రంగులు 649 కమ్మరులు 145 కుమ్మరులు 120 తాపీమేస్త్రీలు 65 తెలికలవారు 2 600 మంగలివారు 3 400 గొల్లవారు 260 వడుకువృత్తిగలవారు 276 నూలునేతవారు కలరు వడ్లమరలు సాలీనా 3 867 క్వింటాలుల బియ్యమును తయారుచేయును కొంతబియ్యమును స్థానికముగా ఉపయోగించుకొని మిగిలినబియ్యమును ఇతర రాష్ట్రములకు ఎగుమతిచేయుదురు నూలునేత కుటీరపరిశ్రమలో సాలీనా రు 1 20 0000 విలువగల నూలు రు 84 000 విలువగల ఎకులు రు 3 60 000ల విలువగల ఖాదీ ఉత్పత్తియగుచున్నవి వీనిలో స్థానికులు ఉపయోగించుకొనగా మిగిలివానిని ఇతర ఖాదీగ్రామోద్యోగభండారములకు ఎగుమతి చేయుదురు 16 ఆటోమోబైల్సులు 12 ఐస్‌క్రీమ్ కన్‌ఫెక్షనరీలు రీట్రేడింగ్ బుక్‌బైండింగ్ కంపెనీలు పుటువేర్పుషాపులు 9 కాఫీవర్క్సు 5 రెడీమేడ్ హోసియరీస్ బ్రిక్సుకంపెనీ వెర్మిసెల్లీ ఫ్రూట్ కేనింగ్ క్రోవ్వువత్తుల కంపెనీలు ప్రింటింగ్ ప్రెస్సులు రబ్బరుస్టాంపులు డ్రై క్లీనర్లు అగర్ బత్తి కంపెనీలు హాస్పిటల్ ఎక్విప్‌మెంట్లు ఫోటోగ్రఫీ కంపెనీలు స్టీల్‌ఫర్నిచర్ కంపెనీలు 8 వుడెన్ ఫర్నిచర్ కంపెనీలు రోడ్ మెటల్ కంపెనీ ఒక R C C పంపులకంపెనీ రేడియోఅసెంబ్లింగ్ కంపెనీ మొదలగు చిన్న కంపెనీలు ఇచట కలవు ఈ పరిశ్రమలకు రు 300/లనుండి రూ 1100ల వరకు ప్రభుత్వం వారు అప్పులిచ్చెదరు వాయిదా పద్ధతులలో అప్పులను తీర్చుకొనవచ్చును స్టైయిన్‌లెస్‌స్టీలు మొదలగు కొన్ని పరిశ్రమలకు రు 1 000 పైన కూడ అప్పులిచ్చెదరు ఇచ్చటి ఇండస్ట్రియల్ ఎస్టేటులో స్టైయిన్‌లెస్‌స్టీలు పాలిథీన్ ప్యాకెట్లు పేపర్ బ్యాగ్స్ అల్యూమినియ పాత్రలు ఆయిలు ఇంజనులు ఫుడ్ ఫ్రూట్ ప్రిజర్వేషను ఇంజనీరింగ్ వర్కుషాపు వస్తువులు ఎక్స్పాండెడ్ మెటలు మొదలయినవి తయారగును వ్యవసాయదారులకు పరిశ్రమలయజమానులకు కూలివారు హెచ్చుగా దొరుకుదురు దినమునకు కూలి పురుషునకు రు 2 50 లు స్త్రీకి రు 1-50 లు నిపుణులగు కూలీలకు రు 6 లు లభించును

ఇచ్చట విరూపాక్షేశ్వర నగరేశ్వర నందీశ్వర (పేట బసవేశ్వర) చెన్నకేశవ గణేశ దత్తాత్రేయ కేశవ కాశీ విశ్వేశ్వర సత్యనారాయణ ఆంజనేయ దేవాలయములు కలవు మధ్వాలయము రామాలయము కలవు 4 మసీదులు S I T U C చర్చి కార్మెల్ చర్చి కేథలిక్ చర్చి ఉన్నవి కేశవాలయమునకు 10 ఎకరముల మాగాణిభూమి కలదు శేషించిన దేవాలయములకు ధనముకలదు ఉత్సవములు బాగుగా జరుగును ఇక్కడ మత సామరస్యముకలదు

విజయనగర సామ్రాజ్య స్థాపకులయిన హక్కరాయ బుక్కరాయలుల గురువులగు విద్యారణ్యస్వామి వారు విరూపాక్షస్వామిని శివలింగములను ప్రతిష్ఠించిరి పట్టణ మధ్య భాగమున పెద్దమసీదు కలదు దానికొకవైపున నాగరేశ్వర దేవాలయము రెండవవైపున కన్యకాపరమేశ్వరీ దేవాలయము కలవు భాద్రపద శుద్ధ చవితినాడు గణేశ్వరుని ఉత్సవము జరుగును ఆశ్వయుజ మాసములో అన్ని దేవాలయములలో ఉత్సవములు జరుగును కార్తిక మాసములో నందీశ్వరుని పూజ వేణుగోపాలస్వామి ఆరాధన జరుపబడును నంది ధ్వజోత్సవము జరుగును మార్గశిరములో త్యాగరాజ వర్ధంతి జరుగును పుష్యమాసములో పూజలు చేయబడును

సత్యనారాయణస్వామి తెప్ప ఉత్సవము మాఘపూర్ణిమనాడు బహుళములో మహాశివరాత్రి ఉత్సవము దత్తాత్రేయ జయంతి జరుపబడును చైత్రమాసమున శుద్ధ నవమినుండి 5 రోజులు రామాలయములో శ్రీరామనవమి చైత్రబహుళ పంచమినాడు శ్రీరామసప్తాహము వైశాఖ శుద్ధ పంచమినాడు శంకర జయంతి జరుపబడును

పాతఊరునకు 3 కి మీ దూరములోను కొత్తఊరునకు 5 కి మీ దూరములోను అనంతపురము రైల్వేస్టేషను కలదు పెన్నార్ ప్రాజెక్టు కాలువ తడకలేరు ఉన్నవి అవి ఉపయోగపడుటలేదు ఇది బస్సులకూడలి దూరప్రయాణములకు గవర్న

మెంటు బస్సులు నడుపబడుచున్నవి ప్రైవేటుబస్సులు చాల కచ్చితముగా మంచిస్థితిలో నడుపబడుచున్నవి R P G T ప్రైవేటు బస్సులు అన్నిచోట్లకు బాగుగావచ్చుచు పోవుచుండును ఇక్కడనుండి 8 గంటల కొకమారు బెంగుళూరునకు బస్సులు పోవును హైదరాబాదునకు 3 ట్రిప్పులు కడపకు 8 ట్రిప్పులు చిత్తూరునకు 4 ట్రిప్పులు తుమ్కూరు (మైసూరు) నకు ఒకట్రిప్పు తుంగభద్రా డామ్ హాస్పెట్ (హంపీ విజయనగర )లకు 2 ట్రిప్పులు నెల్లూరునకు ఒకట్రిప్పు బస్సులు చేయును ప్రతి అర్ధగంటకు కర్నూలునకు ప్రతిగంటకు తాడిపత్రి కళ్యాణదుర్గమునకు రాయదుర్గమునకు ఆదోనికి గుంతకల్లునకు బస్సులుపోవును ఒక సిమెంటురోడ్డు 8 కంకర రోడ్లు 18 కచ్చారోడ్లు కలవు 28 657 కి మీ పొడవుగల కంకరరోడ్లు 11 5 కి మీ పొడవుగల కచ్చారోడ్లు 5 69 కి మీ పొడవుగల సిమెంటు కాంక్రీటు రోడ్లు 11 9 7 కి మీ పొడవుగల బిటుమెన్ రోడ్లు ఉన్నవి నేషనల్ హైవేస్ కర్నూలు బెంగుళూరు రోడ్డు అనంతపురము - తాడిపత్రిరోడ్డు బళ్లారి బెంగుళూరు రోడ్డులతో కలుపబడినవి పట్టణములో ప్రయాణ సౌకర్యములకు 55 గుర్రపు బండ్లు 206 రిజాలు 10 టాక్సి కార్లు 23 స్వంతకార్లు 146 ద్దుబండ్లు 1572 సైకిళ్ళు కలవు

అనంతపురములో హెడ్ పోస్టాఫీసు R M S office ప్రతి పేటకు ఒక తంతి కార్యాలయము టెలిఫోనులు టెలిఫోనుఎక్ఛేంజిఆఫీసు కలవు ఇచ్చట 29 మ్యునిసిపల్ ఎలిమెంటరీ స్కూళ్ళు 8 అప్పర్ ప్రైమరీ స్కూళ్లు రాజేంద్ర మ్యునిసిపల్ హయ్యర్ సెకండరీ స్కూలు పొట్టిశ్రీరాముల మ్యునిసిపల్ హైస్కూలు శారదా గరల్సు హైస్కూలు కస్తూరిబా మ్యునిసిపల్ గరల్సు హైస్కూలు గవర్నమెంటు మల్టిపర్పస్ స్కూలు గవర్నమెంటు హయ్యర్ సెకండరీ బేసిక్ ట్రేయినింగు స్కూలు (స్త్రీల కొరకు) శ్రీ సాయిబాబా నేషనల్ హయ్యర్ సెకండరీ స్కూలు కలవు పాత పటణములో గవర్నమెంటు హైస్కూలు గవర్నమెంటు బేసిక్ ట్రేయినింగు స్కూలు (పురుషులకు) ఉన్నవి మల్టిపర్పస్ స్కూళ్ళకుచెందిన జూనియర్ కళాశాల శాయిబాబా నేషనల్ ట్రష్టు ఉన్నతపాఠశాల శ్రీ సత్యసాయిబాబా స్త్రీల కళాశాల లోని జూనియర్ కళాశాలా భాగములు ఉన్నవి గవర్నమెంటు కళాశాలము 1916 లో ప్రారంభించిరి 1946 సం॥లో దీని సిల్వర్ జూబిలీ ఉత్సవము జరిగెను ఈ సంవత్సరమే దీనిని ఫస్టుగ్రేడు కాలేజిగా చేసిరి శ్రీ సత్యసాయిబాబా మహిళా కళాశాల కలదు దీనిలో 300 వరకు విద్యార్థినులు కలరు గవర్నమెంటు ఇంజనీరింగు కళాశాల పాలిటెక్నిక్ స్కూలు ఇండస్ట్రియల్ ట్రేయినింగు స్కూలు మహిళా మండలి నడుపుచున్న వొకేషనల్ ట్రేయినింగు సెంటరు ఆయిల్ టెక్నాలజికల్ ఇన్‌స్టిట్యూటు ఉన్నవి పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రముకూడ ఉన్నది పోలీసు ట్రేయినింగు స్కూలు శ్రీ విద్యారణ్య స్మృత పాఠశాల కలవు విద్యుచ్ఛక్తిని 98 శాతము ఇండ్లు ఎలెక్ట్రిక్ మోటారులు ఇండస్ట్రియల్ ఎస్టేటు నాలుగు సినిమా థియేటరులు వాడుకొనుచున్నవి

ఈ పట్టణము మ్యునిసిపాలిటీ పరిపాలనలో ఉన్నది 1869 లో ఈ మ్యునిసిపాలిటీ ఏర్పడినది 1950 సం లో దీనిని రెండవతరగతి మ్యునిసిపాలిటీగా చేసిరి ఇది 2 8 196 న మొదటి తరగతి మ్యునిసిపాలిటీగా మారినది ఆస్తిపన్ను నీటిపన్ను డ్రెయినేజిపన్ను సాయిభూమిపన్ను విద్యపన్ను లైట్లపన్ను ప్రవేశ స్థలములపన్ను భూమిపన్ను లైబ్రరీసెస్సు ఇంటిపన్ను సర్‌చార్జి వృత్తిపన్నులు బండ్లపన్ను జంతువులపన్ను గవర్నమెంటు గ్రాంటు మొదలైనవి మ్యునిసిపాలిటీకి ఆదాయాధారములు గ్రామ పారిశుద్ధ్యమునకు డ్రెయినేజి సిస్టము మొదలయినవి కలవు రెండు మ్యునిసిపల్ గ్రంథాలయములు డిస్ట్రిక్టు సెంట్రల్ లైబ్రరీ పార్కులు రేడియోలౌడ్‌స్పీకర్లు నాటకశాల లలితకళాపరిషత్తు నను నాలుగు సినిమా థియేటరులు 1 000 మంది సరిపోవు మ్యూనిటీ హాలు విశ్రాంతిభవనములు శ్రీ శేషగిరిరావు ఆశ్రమ మొదలగునవి కలవు వేసవికాలములో చలివేంద్రములద్వారా మంచినీటి ఏర్పాట్లు చేయుదురు ఇచ్చట కోర్టులు పోలీసు స్టేషను సబ్‌రిజిష్ట్రారు ఆఫీసు తాలూకా కచేరి కలవు 16 సహకార సంఘములు రు 1 00 000 లు అప్పులిచ్చినవి 5 ఫైనాన్సు కార్పొరేషనులు రు 50 000 అప్పులిచ్చినవి 4 బ్యాంకులుకూడ కలవు

ఈ పట్టణము గవర్నమెంటువారి ప్రధానకార్యస్థానము దీర్ఘరోగముల ఆసుపత్రి గవర్నమెంటు పోలీసు ఆసుపత్రి గవర్నమెంటు ఆయుర్వేదిక్ డిస్పెన్సరీలు కలవు ఇవిగాక 18 ప్రైవేటు ఆసుపత్రులు 2 హోమియోపతి ఆసుపత్రులు ఉన్నవి పురుళ్ళ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి

వెటరినరీక్లి కల్ లేబొరేటరీ పీఠ్ డిమాన్‌స్ట్రేషన్ యూనిట్ కలవు

ఇచ్చట శుక్రవారము రోజున స తజరుగును దీనిలో కూరగాయ బ తినుబ డారములు కిరాణా స్తువులు పప్పులు ధాన్యాలు మొదలయినవి విరివిగా అమ్మకమునకు వచ్చును ఇచ్చట 219 కిరాణా దుకాణములు 87 కాఫీ హోటళ్ళు 47 సోడా ఫ్యాక్టరీ సిగరెట్టు దుకాణములు 2 కూరగాయల మార్కెట్లు 10 సైకిళ్ళ షాపులు 75 ఔష శాలలు 21 లాండ్రీలు కలవు

క్రీ శ 1343-1379 లలో విజయనగరరాజగు బుక్కరాయల దివాను చిక్కప్ప ఒడయారు పెద్దచెరువును నిర్మించి నాలుగు వైపుల పల్లెను కట్టించెను తూరు వైపు నున్న పల్లెకు బుక్కదేవరాయ సముద్రమనియు పడమటివైపునఉన్న పల్లెకు బుక్కరాయల భార్య అగు అనంతమ్మ పేరట అనంత సాగరమనియు పేరిడెను తుదకు అది అనంతపురముగా మారినది రామరాజు కాలములో హండె కుటుంబములోని హనుమప్పనాయునికి ఇది ఇయ్యబడెను కనుక చాలాకాలము దీనికి హండె అనంతపురము అను పేరుండెను 1800 స లో దత్తమండలములను కంపెనీవారికి ఇచ్చినపుడు మన్రో మొదటి కలెక్టరుగ నియమించబడెను ప్రస్తుత మ్యునిసిపల్ హైస్కూలు అపుడు మన్రో ఆఫీసుగ నుండెను వాతావరణము బాగుగా ఉన్నందున ఆయన నివాసముగా అనంతపురమును ఛాయ పరచుకొనెను ఆయన నివాసగృహము ప్రస్తుతము ట్రావెలర్సు బంగళాగా ఉపయోగించుచున్నారు

ఈ జిల్లాలోని లేపాక్షి దేవాలయములు ప్రాచీన కట్టడములకు ప్రసిద్ధములు పట్టూరు (గుత్తి) శాసనము (క్రీ శ 1523) పట్టూరు శాసనము (తాడిపత్రి) (క్రీ శ 1516) సంగనపల్లి శాసనము (క్రీ శ 1339) చలివెండ్ల శాసనము (క్రీ శ 1458) ముఖ్యమైనవి రెండు వంతెనలు రెండు కాజువేలు ఉన్నవి ఒకవంతెన ప్రాత కొత్త ఊరులను కలుపుచున్నది రెండవది అందమైన స్థిరమైన వంతెన ఇది బెంగుళూరు గుంతకల్ రైల్వేలైను మీద ఉన్నది

రాయలసీమలో అనంతపురము జిల్లా ఒక ప్రత్యేక స్థానమును సంపాదించుకొన్నది అనంతపురపట్టణము జిల్లా కేంద్రమునకు కావలసిన అన్ని హంగులతో అలరారుచున్నది జిల్లా ముఖ్యపట్టణమైనను మామూలుగా జిల్లాకేంద్రములవలె గాక ఈ అనంతపురము ఒక ప్రశాంత వాతావరణకలితమై యున్నది పట్టణ ఘుమ చాలావరకు సువిశాలమయినవి ఒక ప్లాను ప్రకారము నిర్మింపబడిన కట్టడము లింటట అవు ఈ పట్టణము రమ్యముగా కనబడును ఇచ్చట జీవితము సుఖమయముగానుండును ఇచ్చట అత్యధిక ఉష్ణోగ్రత 40 C అత్యల్ప ఉష్ణోగ్రత 30 C

విద్యాకేంద్రముగా అనంతపురము ప్రసిద్ధి కాంచినది 5 కళాశాలలు ఉన్నవి ఇచట ఆంధ్ర ప్రభుత్వపు కళాశాల ఆంధ్రప్రదేశములోని పెద్ద కాలేజీలలో ఒకటి మహిళల కళాశాల పోలీసు ట్రెయినింగ్ స్కూలు మొదలయినవి కలవు ఇది బహుముఖముగా అభివృద్ధి పొందుచున్నది లలితకళలకిది పుట్టినిల్లు లలితకళాపరిషత్తు కలదు సుప్రసిద్ధములయిన 28 నాటకములను రచించిన ధర్మవరం రామకృష్ణమాచార్యులవారు ఈ ప్రాంతమువారే ప్రసిద్ధ రంగస్థల నటుడు శ్రీ తాడిపత్రి రాఘవ (బళ్ళారి రాఘవాచార్యులు) అనంతపుర నివాసియే శ్రీ ధర్మవరం గోపాలాచారి శ్రీ ఎ ఎస్ అశ్వత్థ నారాయణశాస్త్రి శ్రీ రొద్దం హనుమంతరావు శ్రీ ఎస్ ఎన్ రామస్వామి మొదలగు ప్రఖ్యాత నాటక రచయితలు నటకులు ప్రసిద్ధ సారస్వత సంగీత పండితుడు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఈ ప్రాంతము వారే ప్రఖ్యాత సంగీత కోవిదుడు శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు చిత్రకారుడు శ్రీ ఎన్ వేంకటరావు దేవాదాయ ధర్మాదాయ మాజీ కమీషనర్ శ్రీ పైడి లక్ష్మయ్య ప్రసిద్ధ కాంగ్రెసువాది శ్రీ కల్లూరి సుబ్బారావు మొదలయిన వారు ఈ పురవాసులే

ప్రముఖ రాజకీయవేత్త శ్రీ పప్పు రామాచార్యుల వారు బహుముఖ పట్టణాభివృద్ధి కార్యక్రమములలో మొదటి నుంచి ప్రముఖ పాత్రలను నిర్వహించుచున్నారు 42 సం॥ల నుండి వారు సాధన అను దినపత్రికను నడుపుచున్నారు

ఇచట ప్రతి సంవత్సరము ఆంధ్రప్రదేశ నాటకోత్సవములకు సంబంధించిన నాటక పోటీలు సారస్వత సభలు త్యాగరాయోత్సవములు జరుపుదురు UNESCO (Paris) వారి భారతీయ నాట్యసంఘము ప్రాంచి అయిన ఆంధ్రప్రదేశ నాట్యసంఘమునకు ప్రాంతీయ కేంద్రముగా అనంతపురము ఎన్నుకొనబడినది

డి శ్్రీ

మా శే

## అనంతభట్టు

అనంతభట్టు ఆత్మ విశ్వాసముగల సంస్కృత మహాకవి ఈత డాంధ్రుడని చెప్పుటకు జనశ్రుతి తప్ప నిర్దుష్టమగు ప్రమాణాంతర మేదియును కానరాదు అభినవ కాళిదాస బిరుదాంకితుడును వెల్లాల వంశోద్భవుడును అగు ఒక (ఆంధ్ర) మహాకవితో స్పర్థగొని ఆతడు వ్రాసిన భాగవత చంపూ కావ్యమున కెదురుగ ఈ అనంతభట్టు మరియొక భాగవతచంపువును (ఇది ఇంతవరకు అప్రకటితము) భారత చంపువును రచించెనని ఒక జన ప్రవాదము కలదు అభినవ కాళిదాసుడు తన భాగవత చంపువును —

"కల్యాణం నః ప్రభూత కలయతు లలితాలాపశైలేయబాలా
లీలాజాతానుకూలా శిశిరకరకలా భానుమాలాజటాలా
ఏషా శేషాహి భూషాపరికలిత సుధా పూర ధారానుకారా
శ్రద్ధాముద్రా గనిద్రా పురహరణవిధౌ కాఽకారుణ్యపూర్ణా

అను శ్లోకముతో ప్రారంభింపగా అనంతభట్టు తన కావ్యమును

"కల్యాణం వో విధత్తాం కరటమదధునీ లోలకల్లోలమాలా
ఖేలల్లోలంబకోలాహల ముఖరిత దిక్చక్రవాలాన్తరాలమ్
ప్రత్న వేదండరత్న సతత పరిచలత్కర్ణతాల ప్రరోహ
ద్వాతాంకూరాజి హర్షాదర వివృత ఫణాశృంగ
భూషాభుజంగమ్

అను శ్లోకముతో ప్రారంభించెను ఇట్టి రచనా సామ్యము పూర్వోక్త జనప్రవాదమునకు ఉపోద్బలకముగ నున్నది

పదునారవ శతాబ్దికి చెందిన కేరళదేశ కవియగు నారాయణభట్టారి తన గ్రంథములలో భారత చంపువునుండి ఎన్నియో శ్లోకములను ఉదాహరించెను అభినవ కాళిదాసు పదునొకండవ శతాబ్దికి చెందినవాడు అనునది వాస్తవమైనచో అనంతభట్టు పదునొకండు పదునారు శతాబ్దుల నడుమ బహుశః పదునొకొండవ శతాబ్ది చివరిభాగమున ఉండి యుండవలెను

భారతచంపు ప్రచుర ప్రచారములోనున్న కావ్యము రచనా సౌందర్యము అతి విస్తృతమగు మహాభారత కథను సంక్షిప్తముగ సరస రీతితో చెప్పుట మొదలగు గుణములు దీని ప్రచారమునకు కారణములని చెప్పవచ్చును ఇందు పంద్రెండు స్తబకములు కలవు చంపూ కావ్యమైనను ఇందలి గద్యముల సంఖ్య అల్పముగ నున్నది ఈ గద్య భాగములు కూడ పది పంక్తులకు మించినవి చాల అరుదుగ నున్నవి మొత్తము శ్లోకముల సంఖ్య 1031 మహాభారత కథన తను ఇంతటి చిన్న గ్రంథములో ఇముడ్చుటయందు ఈ మహాకవి చూపిన కౌశలము ఆశ్చర్యజనకము

అనంతభట్టు రచన అతి ప్రౌఢమై అలంకార బంధురమైనది ఈతని కావ్యమునందు యమకవృత్త్యనుప్రాసాది శబ్దాలంకారములు అడుగడుగునను గోచరించుచుండును ఉదాహరణమునకు రెండు శ్లోకములు

అద్యతే సవిధమాప తేదసౌ హృద్యమేతదు
చితం వచః శృణు
మారణ రిపుషు తన్వతామునా మారణం కురు
మహాన్నలీ హిసః

"జవ భజన్తౌ జయ తర్షవన్తౌ రుష వహన్తౌ
రుధిరం కిరన్తౌ
పరస్పరం తౌ పటుశబ్దవన్తౌ నియుద్ధవన్తౌ నితరామతాన్తౌ

ఈ శబ్దాలంకారములన్నియు అప్రయత్న కృతములై సహజసిద్ధములుగ కన్పట్టుట ఈతని కవితయందలి విశేషము

అర్థాలంకారములలో అతిశయోక్తి ఉపమ ఉత్ప్రేక్ష శ్లేష మొదలగునవి అత్యధికముగ ఉపయుక్తమైనవి ఈతని అతిశయోక్తికొక ఉదాహరణము —

"చిత్రం దిదర్శయిషుణా జనితస్య యస్యా
మధ్యం వినైవ విధినా మహాలా జనస్య
అంగం నితంబ జఘనాది యతో యతోధ
స్తుంగ కుచాద్యు పరియాతి తతోనుకూలమ్"

ఈ క్రింది శ్లోకము శ్లేషాలంకార ప్రయోగముతో అత్యుచితముగ నున్నది

"సర్వేషు ఎర్లేష్వపి దాతు రస్మాత్స ప్రాపవత్స్వర్థ
మజాశ తత్రోః
నవర్ణ ఏకస్తు కదాపి లేభే నార్థం క్రతూనామిహ సార్వభౌమే

ధర్మజుడు యజ్ఞము చేయునపుడు సర్వ వర్ణములకును (అన్ని వర్ణములవారికిని – అన్ని అక్షరములకును) అర్థము (ధనము అర్థము) లభించినది కాని నకారమునకు మాత్రము అర్థము లభింపలేదట అనగాలేదు అను మాటలేకుండ ఆతడు వితరణము సలిపెనని యర్థము

ఈతని ఉక్తి వైచిత్ర్యమున కొక ఉదాహరణము

రుధిరం పాతుకామేన తేనవో హన్తుమీరితా
అధర పాతుకామాహ మ స్మితే రూప న ఎదా

పా డవులను వధి చి ఆహారముగ తీసకొని రమ్మని హిడి బుడు ప పగా భీమునిచేరి అతని కామి చిన వాడి బి మాటలివి

"మీ ర క్తపానము చేయవలె ననెడు అభిలాషతో మా అన్నచే ప పబడిన నేను ఇప్పుడు నీ రూప స పదనుచూచి నీ యధరపానము చేయ నభిలషించు చున్నాను

ఈ విధముగా అన తభట్టు కవీంద్రుడు అతి సుందరము లగు వర్ణనములతో పా డుమహారాజు వృత్తా తము మొదలు యుధిష్ఠిర రాజ్యపాలనము వరకుగల మహాభారత కథన తను అత్యద్భుతముగ సంక్షేప చెను

చ పూ భారతము సరస్వతీప్రాణతుల్యా మనియు వికసత్పద్మ సుగ ధులును నటరాజ శిరస్సుపై నాట్యమాడు గ గా ప్రవాహముతో సమానములును ప్రత్యర్థి కవీ ద్రుల కీర్తిని హరి చునవియు నగు అన తనుకవి వాక్కులకు భూతలమ తయు మూల్యమనియు ఈ కావ్య వైశిష్ట్యమును ప్రశ సి చు శ్లోకద్వయము సుప్రసిద్ధముగ నున్నది ఈ శ్లోకములు అనంతభట్టు విరచితములు కూడ కావచ్చును కావుననే ఒక వ్యాఖ్యాత గ్ర థాంతమున వాటిపైకూడ వ్యాఖ్య వ్రాసియున్నాడు

దిగ న్తరలురత్కీ ర్తి రన న్తకవికు జరః
ప్రాహై స్తుల్యం సరస్వత్యా ప్రాణై శ్చిచ్చమ్పు భారతమ్
ఉన్మీల దమ్బుజ కదమ్బక సౌరభీణా
మున్న ృత్య దీశముకుటీ తటినీ సుఖినామ్
ఆ చా న్త వైరి యశసామమృతోర్మిలానా
వాచా మన న్త సుకవేర్వ సుధైవ మూల్యమ్

ఈ చ పువుపై కురవి రామకవి మల్లాది లక్ష్మణ స్వామి నారాయణస్వామి కుమారతాతాచార్యుడు నరసి హాచార్యుడు మొదలగువారు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు ఈ విధముగ ఆ ప్రదేశమున ప్రచుర ప్రచారమై పెక్కురు ఆ ధ్రులచే వ్యాఖ్యానింపబడి యు డుటచేత గూడ ఈ భారత చ పువును రచి చిన అన తభట్టు ఆ ధ్రుడని చెప్పుటకు ఎక్కువ అవకాశ మున్నట్లు తోచుచున్నది

దా ష శ్రీ

## అనంత భూపాలు మట్ల (ట్లి)

మట్ల న తభూపాలు డను ఈ రాజకవి యొక్క గృహనామము మట్ల మట్లి యని ఇరు తెరగుల కాన వచ్చుచు న్నది మట్ల యను పేరుకల గ్రామము కడప జిల్లా రాయచోటి తాలూకాలో ఉ డినట్లు తెలియుచున్నది మట్ల వారు సూర్యవ శజులు ఆ ధ్రచోడులు పదునారవశతాబ్దియంత మున వీరు వి యన రాధిపతులకు సామంతులుగా ఉ డి న చిన్న స స్థానాధిపతులు వీరి మూల పురుషుడు మట్ల తిమ్మ ప్రభుడు

ర గమా బ ఎల్లభూపాలుడు అనంత భూపాలుని జననీజనకులు అన త భూపాలుని కొడుకు అరువె గళనాథుడు శ్రీ కృష్ణదేవరాయలకు అల్లుడయిన మ ట్ల వ ర ద రా జు అ న త భూ పా లు న కు పె ద ము త్తా త మ ను మ డు నడిమి టి వె కటపతి కవిరచి చిన అభిషిక్త రాఘవము నకు కృతి భ ర్తయైన మట్లి వె కటరామ భూపాలుడు అనంత కవికి ముని మనుమడు తిరుమల తో శ ప్పా చా ర్యు లు అన త భూపాలుని గురువులు అనంత భూపాలుడు కకుత్స్థ విజయ మనెడి అయిదాశ్వాసముల కావ్యమును రచించి తన త డ్రియగు ఎల్లభూపాలునకు అంకితము కావి చెను ఇట్లు నిజకావ్యమును జనకునకు కృతి యొసగిన వారిలో ఎ గళి సూర్యనార్యుడు ప్రథముడు

కకుత్స్థ విజయ అభిషిక్త రాఘవము లను బట్టియు కొన్నిచాటు పద్యములను బట్టియు మట్ల వ శీయులు విద్యా ప్రియులుగను యుద్ధ ప్రియులుగను కనుపించుచున్నారు

కవి త డ్రియగు ఎల్లభూపాలుని శౌర్యపరాక్రమములు కకుత్స్థ విజయ కృత్యవతారికలో వర్ణి పబడియున్నవి ఈ అవతారికలోని ప్రశ సా పద్యములు ఎల్ల భూపాలుని ఆస్థాన కవియును అభినవాంధ్ర కవితా పితామహ బిరుదాంకితుడును నగు ఉప్పుగు డూరి వే కటకవి చెప్పినట్లు కవి వ్రాసికొని నాడు

రె డవ వె కటపతి దేవరాయల (క్రీ శ 1586 1614) కాలమున అతనికి దూరపు బ ధువగు న దేల కృష్ణమ రాజు (ఎంగళి సూరన కళాపూర్ణోదయ కావ్యకృతి భ ర్త) రాయలకు ఎదురు తిరిగి మట్లివారి అమరము భూముల నా క మి ం చు కొనెను ఈ సమయమున మట్లి ఎల్లమరాజాదులు రాయల పక్ష మున పోరాడిరి కృష్ణమరాజు పారిపోయి న దేలకోటలో తల దాచికొనెను కృష్ణమరాజు ప్రార్థింపగా ఎల్లభూపాలు డతనికి

వేంకటపతి రాయలతో సంధి కుదిరించెను. పొత్తపు సిద్ధవటసీమాధిపతియైన కొండ్రాజు తిరుమలరాజును రాయల పక్షమున ఎదిరించగా మట్లి ఎల్లమరాజు అతనిని మడియించెను. తిరుపతి రాజును మట్టుపెట్టుటచే అతని భూములు ఎల్లమరాజుకు అమరము భూములుగా లభించినవి.

తండ్రివలెనే అనంతభూపాలుడును రణరంగ శూరుడు. సుల్తాను కులీకుతుబుషాతో (?) పెనుగొండ సమీపమున వేంకటపతి దేవరాయలకు జరిగిన యుద్ధములో తంజావూరు రఘునాథరాయలు మున్నగు వారితో పాటు మట్ల అనంత భూపాలుడును రాయలకు బాసటగా పోరి మల్కాబలముల సాధించి యతని గర్వము నడగించెను. తరువాత ముస్లిముల పక్షమున రావెళ్ళ నాయకుడు గుత్తిముకొండ దుర్గమును పట్టుకొనగా మట్లి అనంతరాజు కస్తూరి రంగప్పతో కూడ రాయల సేనాముఖమున నడచి ఘోరయుద్ధానంతరము గుత్తిముకొండను సాధించెను.

కన్నడ మండలపు కోలారు ప్రాంతమున తనకు ఎదురు తిరిగిన తమ్మనగౌడు మున్నగు సామంతుల పీచమణచుటకు వేంకటపతిరాయలు రఘునాథరాయలతో కస్తూరిరంగప్పతో మరియు మట్ల అనంతభూపాలునితో కూడి వెడలి తనసైన్యమును కోలారు మీదికి నడపించెను. రాయల అనుజ్ఞచే అనంత భూపాలుడు కోలారుకోటపై దండెత్తి దానిని వశపరచుకొనెను. దక్షిణ దిగ్విజయ యాత్ర నెరపిన సమయమునందును వేంకటపతి రాయల సేనలకు మట్లి అనంత భూపాలుడే నాయకత్వమును పూనెను. అతని కొడుకు తిరువెంగళనాథుడును ఈ సమయమున తండ్రికి బాసటగా నుండెను. పాండ్యాధిపతితో సంఘటిల్లిన ఘోరయుద్ధమునందు అనంత భూపాలుడు పాండ్యుని పరాజితు నొనరించెను. అనంతభూపాలుని సిద్ధవట శాసనము గూడ అతని శౌర్య సాహసముల నభివర్ణించుచున్నది.

అనంత భూపాలుని కాలమునుగూర్చి తెలుపుచు వీరేశలింగము పంతులుగారు "ఈ కవి గోలకొండ నవాబయిన ఇబ్రహీముషా కాలములో రాజ్యపాలనము చేయుచుండినట్లు చరిత్రనిదర్శనములు కనబడుచున్నవి. కాబట్టి ఈ కవి క్రీ. శ. 1560-80 సంవత్సర ప్రాంతముల దుండిన వాడయి నట్లు తెలియవచ్చుచున్నది" అని వ్రాసిరి. కాని అనంత భూపాలుడు వేంకటపతి రాయల (క్రీ. శ. 1586-1614) కాలమున ఆతనికి తంజావూరు రఘునాథ యువరాజు (క్రీ. శ. 1614 కు పూర్వము) తో గూడ పలుమారులు యుద్ధమున తోడ్పడినట్లు పైన తెలుపబడెను. మరియు వేంకటపతి దేవరాయల పక్షమున అనంత భూపాలుడు సుల్తాన్ కులీకుతుబుషా (క్రీ. శ. 1512-1543) తో పోరాడినట్లు విజ్ఞాన సర్వస్వము తెలుగు సంస్కృతి సంపుటమున దు అరవీటి వంశము అను శీర్షికలో వ్రాయబడియున్నది. కాని ఈ కాలము వేంకటపతి రాయల కాలముతో ఎంత మాత్రమును సరిపోదు. రాయల కాలమున నున్నవాడు మహమ్మదు కులీకుతుబుషా (1580-1612) అయినట్లు చరిత్ర వలన తెలియుచున్నది. కావున మహమ్మదు కులీతోనే అనంత భూపాలుడు పోరియుండెనేమో (?) ఇది కాక మట్ల అనంత భూపాలుని సిద్ధవట శాసనము (క్రీ. శ. 1605) నందు అనంత భూపాలుని కకుత్స్థ విజయ ప్రబంధము కూడ పేర్కొనబడియుండుటచే ఈ కావ్యము తకు గొంత పూర్వము రచింపబడినట్లు తెలియుచున్నది. కావున వీనినన్నిటిని బట్టి అనంత భూపాలుడు పదునారవ శతాబ్ది తృతీయ పాదమునందును పదునేడవ శతాబ్ది ప్రథమ పాదమునందును ఉండియుండు ననుట సత్యమునకు సన్నిహితముగా నుండును.

మట్లి ఎల్లమ రాజు యొక్క ఆస్థాన కవియగు ఉప్పుగుండూరి వేంకటకవి అనంత భూపాలుని కవితా శక్తిని

పుత్రుఁడనంతుఁడు
బహువిధములఁ జెప్పనేర్చు భవమౌళిధునీ
లహరీ ఘుమఘుమితవచో
మహితములు కృతులు సరసమాధురి నవురా!

అని ప్రశంసించియనిచే కృతిగొందిన ఎల్లరాజును ప్రబోధించినట్లు అనంత భూపాలు కకుత్స్థ విజయ కృత్యాదిలో దెలిపినాడు.

కకుత్స్థ విజయము రసవంతమగు ప్రబంధము. ఇందలి కథ మిగుల చిన్నది. కవి దానిని చమత్కారములగు వర్ణనలతోడను కల్పనలతోడను విస్తరించి ఐదాశ్వాసముల ప్రబంధముగా రచించెను. కవి ఇందు నాటక రీతులను గూడ అటనట ప్రదర్శించెను. ఇతని కవిత్వము సలక్షణమయి హృదయ రంజకముగా నుండును. సంస్కృత పదముల నధికముగా ప్రయోగించుటయందు ఈ కవికి ప్రీతి మెండు. సంకుసాల నృసింహకవి మాంధాతృ చరిత్రమునందలి కొన్ని పద్యములకును భావములకును అనుకరణములు కకుత్స్థ విజయమునందు కనవచ్చును.

మట్లి అనంత భూపాలుడు కుముద్వతీ కల్యాణమను నొక శృంగార ప్రబంధమును గూడ రచించుటు తెలియు చున్నది కాని అది యిను ముద్రితము కాలేదు

డా  దు

## అనంతభోగేశ్వరస్వామి

అనంతభోగేశ్వరస్వామి ప్రశంస శ్రీనాథుని కాశీఖండమున త్రయోదశాశ్వాసమున నందునారవ ద్యమున కలదు అగస్త్యమహర్షి వింధ్యాద్రి గర్వభంగము చేసి భువనోపద్రవమును వారించెను కాశీకాపురిని ఎడబాయుటచేత కలిగిన మనస్తాపమును తొలగించుకొనుటకు ఆ మహర్షి భార్యతో దక్షిణకాశిని దర్శించుచు ఆ ప్రదేశమున వీరభద్రేశ్వర స్వామిని సేవించెను పిదప అతడు అనంతభోగేశ్వర స్వామిని దర్శించినట్లు చెప్పబడినది అనంతుడను సర్పరాజును కంఠమునందు ధరించుటచే ఆ స్వామి అనంతభోగేశ్వరస్వామి అను పేరు వచ్చినట్లు తెలియవచ్చుచున్నది ఆ స్వామి పురశాసనుడనియు వామకన్యకాధీశుడనియు శ్రీనాథుడు వ్రాసెను

అగస్త్యమహర్షి దర్శించిన వీరభద్రేశుడు అఖండ గోదావరీ గర్భమునగల దేకూటాద్రిపై వేంచేసెను శ్రీనాథుడీపర్వతమును వీరభద్రగిరి అనెను దీనికి పట్టిసాద్రి పట్టిసాచలము అనునవి నామాంతరములు ఇచటి వీరభద్ర స్వామిని దర్శించిన పిదప అగస్త్యమహర్షి అనంతభోగేశ్వర స్వామిని దర్శించెనని శ్రీనాథుడు చెప్పుటచే ఈ అనంతభోగేశ్వరస్వామి ఆలయము పట్టిసాచలమునకు చేరువనుండి యుండునని ఊహింపవచ్చును ఈ స్వామి ఆలయము ఎచ్చట కలదో ఈతని మహిమాదికము ఎట్టిదో తెలిసికొనుటకు తగిన ఆధారములు లభింపలేదు

గ ల కొం

**అనంతమంత్రి** చూ కేకుమళ్ళ రంగశాయి

## అనంతరాజకుమార - మట్ల

మట్లప్రభువుల జన్మస్థానము మట్ల అనుగ్రామము ఈ గ్రామము కడప జిల్లాలోని రాయచోటి తాలూకాయందలి మాండవీ నదియొడ్డున ఉన్నది ఇందలి ప్రస్తుతజనాభా 4 124 మూడుశతాబ్దములవరకు మట్లవంశీయులు విజయనగరాధీశ్వరులకు సామంతులై అనేకయుద్ధములందు పాల్గొని విజయపరంపరలను చేకూర్చిరి తళ్ళికోట యుద్ధానంతరము విజయనగర వైభవము సన్నగిల్లిన 16వ శతాబ్ది చివరి దశలో ఇతర సామంతప్రభువులతోపాటు వీరును స్వతంత్రులై చంద్రగిరి రాజ్యములోని పులుగులనాటిసీమను ఉదయగిరి రాజ్యములోని ద్గాటమును పొత్తపినాటిని పాలించిరి ఈ రాజవంశమునందలి ప్రభువులు యోధాగ్రేసరులును విద్యాప్రియులునై భాషాయోషకు పసిడి అంచులు తొడిగిరి

మట్లవంశమునకు చెందిన మట్ల అనంతకుమారుని పాలన (క్రీ శ 1623-36) ఎంతో ఖ్యాతినొందినది మట్లవంశానుక్రమమును ఘనతను తెలుపు కాకుత్స్థవిజయము (అనంత భూపాలకృతము) కుముద్వతీకల్యాణము (అనంతరాజ కుమార కృతము) అను ప్రబంధరాజములు రెండు కలవు కడపజిల్లా యందంతటను మట్లవంశీయుల శాసనములు కైఫయతులు కనుగొనబడినవి

కుముద్వతీకల్యాణము అను అముద్రితకావ్యమునందు అతని తాతయగు మట్ల అనంతభూపాలుని ప్రతాపాతిశయములు ఉగ్గడింపబడినవి ఈతని తండ్రి అయిన తిరువెంగళనాథదేవచోడ మహారాజు (క్రీ శ 1606-20) గండికోట ఉదయగిరి పాలకులతో తలపడి ఆయా దుర్గముల వశపరచుకొనుట బీజాపూరు సుల్తాను సేనలు కర్నూలు ప్రభువగు గోపాలరాజును ముట్టడింప అతనిని సంరక్షించుట మొదలగు అనేక చరిత్రాంశములు కుముద్వతీకల్యాణ ప్రబంధమున వర్ణితములైనవి అనంతరాజకుమారుడు కడప మండలములోని రాజంపేట సమీపమున ఉన్న అనంతరాజపురమును రాజధానిగా చేసికొని పాలించెను పూర్వము ఈ ప్రాంతము మట్లవారిసీమ అని పిలువబడెను ప్రస్తుతము ఈ గ్రామము జనశూన్యముగా నున్నది

భగవద్రామానుజులు ప్రవచించిన విశిష్టాద్వైతమతమును అనంతరాజకుమారుడు తండ్రితోపాటు స్వీకరించెను ఇతర మతములను కూడ ఇతడు ఆదరించెను ఇతడు కదనకౌశలమందును క్రీడలయందును విద్వత్తునందును సర్వజ్ఞుడనుపించుకొనెను ఇతడు రాజ్యాధికారము వహించిన

క్రొత్తలో అనేక ఇబ్బందులకు లోనయ్యెను తిరుపతియందలి క్రీ శ 168 నాటి ఒక శిలాశాసనము వలన ఇతని ఎరాక్రమము వితరణము మున్నగు గుణములు విశదమగుచున్నవి ఈ శాసనము తిరుమలకు పోవు మార్గమున కొండదిగువను అలిపిరి అనుచోట అనంతరాజకుమారునిచే నిర్మితమైన శ్రీపాదమంటపకుడ్యమున అమర్చబడియున్నది

శాసనము ననుసరించి అనంత రాజకుమారుని తల్లి చెన్నమ్మ అనియు తండ్రి తిరువెంగళ నాథుడనియు తెలియు



గోవిందరాజస్వామి దేవాలయము పుష్కరిణి

చున్నది తిరుపతి కొండలకును అహోబిలము కొండలకును (చిత్తూరు కర్నూలు జిల్లాలు) నడుమ నున్న ప్రదేశమంతయు ఇతని యేలుబడిలో నుండెను తనకు ఎదురు తిరిగిన పాళెగాండ్రను పలగిరి అగిమల పీలేరు చప్పల్లి వేముపల్లి అను ప్రదేశముల జరిగిన రణరంగములలో ఇతడు ఓడించెను శత్రు సైన్యముల నితడు కొట్టగల పలకడ గుండ్లూరు ముష్టూరు కుమార్లకాల్వ అను తావులనుండి చెదరగొట్టెను

ఉదయాచలాధీశ్వరుని నుండి (ఉదయగిరిలోని శ్రీరంగేశుడు) డమాయి (చర్మవాద్య విశేషము) సామజధ్వజమును పొంది స్వామికి ఆకేళి (కేళీ) మందిరమును కట్టించి ఉద్యానవనమును ఏర్పరచెను తిరువళ్లూరు (చెంగల్పట్టు) లోని వీరరాఘవస్వామికి వసంతోత్సవములు జరుపుకొనుటకు ఇందువసంతమంటపమును నిర్మించెను తిరుమల వెంకటేశునకు స్వర్ణాశ్వము ఆందూరము సమర భూపాల వాహనములు పద్మపీఠములు రత్నాఢ్య మకుటము నైవేద్య భోజనపాత్రలు సమర్పించెను ఇతడు ఉన్నత కేళీమందిరమును సోపాన మార్గమును అగ్రగోపురములను నిర్మించెను తిరుపతిలోని గోవింద రాజస్వామికి గజతురగ వాహనములను అర్పించెను కాళహస్తీశ్వరునకు కనకమయూర మోహన వాహనముల చేయించెను తిరుపతి నుండి తిరుమలకుపోవు మార్గమున వెంకటాధీశ్వర స్వామిని ప్రతిష్ఠించెను నెలదలూరు దేవాలయమునకు నలువైపుల గోపురములు సరసీ మంటపము పుష్పోద్యాన వనములు నిర్మించెను ఒంటిమిట్టలోని రఘునాథునకు ఇతడు ప్రాకార కుడ్యముల నిర్మించుటయే కాక నిత్యోపచార సేవలను ఏర్పాటుచేసెను ద్ద వటములోని చెన్నకేశవస్వామి దేవాలయమునకు గోపుర ప్రాకారముల నిర్మించుటయే కాక ఆస్వామికి ఆభరణములు సమర్పించి తత్సేవలకు రెండు అగ్రహారములను దానము చేసెను అచట ఎద్దవటేశ్వరునకు హాటక వృషభవాహనముల సమర్పించెను సోమశిలలోని కపర్దీశ్వరుని దేవాలయమునకు గోపురము కట్టించెను పుష్పగిరిలోని ప్రసన్నాచలేశ్వరునికి గోపురప్రాకారములు నిర్మించుటయేగాక సంవత్సరోత్సవముల నేర్పాటుచేసెను రాచవీడు (రాయచోటి) లోని వీరభద్రేశ్వర దేవాయలపు గోపురములు రెండింటికి రంగుపూతలు పూయించెను ఆ సేతుహిమాచలము దర్శించు యాత్రికుల సౌకర్యము

కొరకు తిరుపతిలోనిఆళ్వారుతీర్థము శేషాచలకురువ ఎద్దవటము ఒ టి మిట్ట పుష్పగిరి ఒర్ధానుపాడు దువ్వూరు గు డ్లు రు పోరుమామిళ్ల నెలవనూరు ఊర్మిళ్ల అన తరాజపురము అను తావుల దు అన్న సత్రములను నెలకొల్పెను ఈయన రజత దానము సువర్ణదానము తులాదానము కన్యాదానము భూదానము గోదానము మున్నగు మహాదానములను జరి పెను మహా మ డలేశ్వర కటకపురి చూరకార యను బిరుదులవహి చెను స వత్సరమునకొకమారు పవిత్రగంగానదీ జలములను తెప్పి చి సుస్నాతుడగు చుండెను ఈయన తల్లి చెన్నమా బ పేరట చెన్నమా బ పురము చెన్నమా బ సము ద్రము అను రె డు గ్రామములు నిర్మి చెను చెన్నూరువద్ద ఒక పెద్ద తటాకమును ఇతడు త్రవ్వి చెను

క్రీ శ 12 వశతాబ్దిలో వైష్ణవ మ త ప్రవ క్త య గు శ్రీరామానుజులచే గోవి ద రాజస్వామి దేవాలయ నిర్మాణ మునకును ట్టణ నిర్మాణమునకును వలయు హ గులన్ని టిని ఏర్పరచెను తిరుపతి పట్టణము రామానుజ పురమని ఎలువ బడుచువచ్చెను తిరుపతి సన్నిధి వీథిలోని గోవి ద రాజస్వామి దేవాలయపు దక్షిణ ద్వార గోపుర శాసనము ననుసరి చి అన త రాజకుమారుడు శ్రీ స్వామికి మహోన్నతమైన గోపు రము నిర్మి చినట్లు తెలియుచున్నది కన్నులు మిరుమిట్లు గొల్పు ఈ గోపురము 120 అడుగుల ఎత్తును ఎడ తస్థులను కలిగియున్నది గోపుర శిఖరాగ్రమును డి చూచిన యెడల తీర్చిదిద్దిన రాజ బాటలతో ప్రాసాదములతో విరాజిల్లు తిరుపతి పట్టణపు వైభవము కనులకు వి దొ సగుచు డును దేవాలయ ప్రాకారములను అందు డు చిరుగోపురములను రెండు కోలనులకును ఇరువైపుల మ టపములను మహోన్నత గోపు రమునకు అతి సు దర అనుబ ధములుగా నిర్మి చిన ఖ్యాతి అన త కుమారరాజునకే దక్కినది

మట్ల ప్రభువులకు మ త్ర దీక్షనిచ్చిన క చిలోని తోళ ప్పలా చార్యుల వ శీయులు రాజ పేట సమీపమున తిరువే గళనాథ మహారాజుచే ఒసగబడిన అగ్రహారమును నేటికిని అను భవి చుచున్నారు మట్ల ప్రభువుల స తతివారు చి త్తూ రు జిల్లాలోని కార్వేటి నగరమున దు స్థిరపడియున్నారు మెక జీ సంకలన స పుటము దు మట్లవ శజులు చే నదాన ధర్మములు విశదీకరి పబడినవి తలిద డ్రులకు ధర్మ గా రామాయణ పట్టాభిషేక పుణ్యకాలములందు మట్ల వారు సద్బ్రాహ్మణులకు చేసిన దానపర పరలు కొల్లలు

కడప జిల్లా పొ త్తపినాటిసీమలోని తాళ్లపాక పాలెం శ్రీర గరాజుపాలె పాలిక గ్రామ తుకాయపల్లె లేం బాక వె గమాంబాపురం అన తరాజపురం వోబిలిగ్రామం దామంచెర్ల వెలగచెర్ల మొదలగు అగ్రహారములు బ్రాహ్మ ణులకు దా మియ్యబడినవి

దానములుచేసిన మహా దాతలలో మహా మండలేశ్వ రులు తిరువె గళనాథ రాజదేవ చోడమహారాజు చ ద్రాజ దేవ మహారాజు వె కట్రామ రాజు కుమార వె కటరాఘవ రాజు కుమార అన తరాజులు గలరు

మట్లవ శజులు కావేరివల్లభ భల్లాణరాయలతో (కర్ణాటకమునేలిన హొయిసల బల్లాలులతో)స బంధ బా ధవ్య ములు నెరపికొనినట్లు వీరు వేయి చిన శాసనములవల్ల తెలియ నగును

కో వె

## అనంతరాజు కోనయదేవ మహారాజు

మెక జీ స పుటములందు అన తరాజు కోనయదేవ మహారాజుల పేరు కనిపి చుచున్నది కోతులమిడుతూరను గ్రామము ఇపుడు మిడుతూరు అని వ్యవహరి పబడుచున్నది ఇది కర్నూలుజిల్లా న దికొట్కూరు తాలూకాయందు కలదు ఈ గ్రామ జనాభా 3881 ఇచ్చట చెన్నకేశవస్వామి దేవా లయము వీరభద్రేశ్వరుని గుడి కలవు చెన్నకేశవ దేవాల యానికి పశ్చిమమున ఉన్న వీరభద్రేశ్వరాలయమునందు గల శాసనమున "శ్రీమన్మహామ డలేశ్వర సోమవ శోద్భవులైన ఆత్రేయగోత్రులైన అన తరాజయ్యగారి ప్రపౌత్రులయిన బుక్కరాజులగారి పౌత్రులైన వె గళరాజుగారి పుత్రులైన అనంతరాజు కోనయదేవమహారాయలు చెన్నకేశవస్వామికి వీరభద్రుని సేవలకు చేసిన గ్రామదాన వివరములు ఉదాహ రి పబడినవి ఈ శాసనము విజయనగరము నేలిన సదాశివ రాయల కాలమునాటిది (క్రీ శ 1541 1570) అనంతరాజు కోనయదేవమహారాజులవారు అరవీటి వంశమునందలి నంద్యాల శాఖకుచెందిన వారు వీరు క దనవోలు సీమను విజయనగరా ధీశులకు సామంతులుగామండి పాలి చిరి నంద్యాల వారను పేరును గా చిరి

శాసనమున దు దేవరలకు సేవచేయు శివార్చకుల ప్రశ సకలదు వీరు ఉత్సవ సమయముల దు అన్నమువండి

దేవతారాధనాన తరము దా ని గ్రామవాసు కు ప చి ఇచ్చు చుందురు వీరు దేవతావిగ్రహముల అ గర గ భోగములకై పుష్పారాధన సేవకై వనమాలలను తయారు చేయుదురు ఇట్టి సేవకు ( తిఫలముగా మడి మాన్యములను వీరు పొందగలిగిరి

ఈ వ శమువారు కర్నూలు జిల్లాలోని బేత చెర్ల ఆకుమళ్ళ అవుకుకోట న ద్యాల మొ లగు గ్రామముల దు శాసనము లు వేయి చిరి వీనిని బట్టి వీరికు డు దేవబ్రాహ్మణ భక్తి విశదము కాగలదు వీర బ్రాహ్మణులకు సర్వమ న్య ములుగా అనేక అగ్రహారము లి చ్చిరి దేవ ల సేవకై అనేక భూదానములు చే రి మంగలులు మున్నగువా రి వృత్తి పన్ను లను మన్ని చిరి ఇట్టి ఉదార కృత్యములనుబట్టి ప్రజలకు ఈ ప్రభువుల దు భక్తి ప్రేమ ఉదయి చి ట్లు తెలియుచున్నది

కొ వెం

## అనంతరాజుపేట

అనంతరాజుపేట కడపజిల్లాలోని రాజంపేట తాలూకాలో ఉన్నది దీనికి 2 1/2 మైళ్ళలో కోడూరు పట్టణము కలదు తూర్పున వాసుదేవపురం పడమట రిజర్వు అడవి ఉత్తరమున చేల పాలెం దక్షిణమున వంక ఈ గ్రామసరిహద్దులు దీని విస్తీర్ణము 6660 ఎకరములు దీని ఉత్తర అక్షాశము 14° తూర్పు రేఖాంశము 79 20 1961 జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామమున పురుషులు స్త్రీలు కలిసి 6588 మంది ఉ డిరి ఈ సంఖ్యలో షెడ్యూలు జాతులు తరగతుల వారు 189 మంది ఇచట ఇండ్లు దూర దూరముగాను వాడ వాడలుగాను ఉన్నవి వీటిలో 48 పె కుటి డ్లు 86 కా క్రీటు కప్పుగల ఇ డ్లు 6 ఒక అ తస్తుగల మేడలు బస్సు రోడ్డు ఉ డుటచే ఈ గ్రామము పడమర వై పుగా వృద్ధిచె దుచున్నది ప్రజలు బావినీటిని త్రాగుదురు త్రాగునీటి ఎద్దడికలదు ఇచ్చట 2418 మంది జొన్నఅన్నమును 618 మ ది వరి అన్నమును 3547 మంది ఇతర అన్నములను తిందురు

ఈ గ్రామమునకుగల నీటివనరులు అన తరాజుపేట చెరువు బావులు వీటిక్రింద వరి రాగి సజ్జ కొ ర వేరుసెనగ ఆవాలు ప డును ధాన్యమును గాదెలలో నిలువచేయుదురు అరటి మామిడి చీనీ (బత్తాయి) తోటలు గిలవు వ గ టోమాటో మొదలగు కూరగాయలను ప డి తురు 1966 67 స లో 1883 ఎకరముల భు మి ప టలక్రి ద ఉపయోగించ బడినది బావులక్రి ద 288 ఎకరములు చెరువుక్రింద 126 ఎకరములు సాగుబడి ఆయెను 5 ఆయిల్ ఇంజనులు 14 ఎలెక్ట్రిక్ ఇంజనులు 788 ఎకరము కు క లలు 114 ఎకరములకు నీటిని సప్లయి చేసెను గము లారీ వ కాయలు 1 లారీ టోమాటోలు బ డ్లపై కోడూరునకు ప ఎరి 47 లారీల అరటికాయలు 10 లారీల మామిడికాయలు 35 లారీల చీనీప డ్లు కడప తి తి హైదరాబాదు మద్రాసులకు ఎగుమతి చేసిరి 3 లారీల అరటికాయలు 2 లారీల మామిడి కాయలు 5 లారీల చీనీప డ్లు 1/ లారీ వంకాయలు 1 1/2 లారీ టో టోలను స్థా కలు వాడుకొనిరి

ఈ గ్రామమున 163 ఆవులు ఎద్దు 1206 గేదెలు దున్నపోతులు 1034 మే లు 1 08 గొర్రెలు 2169 కోళ్లు 31 గాడిదలుకలవు వారమునకు 4000 లీటర్లపాలు స్థానికులు ఉపయోగించుకొని 2000 లీటర్ల పాలను కోడూరునకు ప ఎరి

ఇచ్చటి జనుల జీవితాధారములు వ్యవసాయము కుటీర పరిశ్రమలు కూలిచే జీవి చువారు కలవ అడవి వృత్తులచే జీవి చువారు దుకాణాదారులుకూడ గలరు కంసాలివారు వడ్ర గులు కమ్మరులు కుమ్మరులు తాపీపని వారు మంగలివారు చాకలివారు గొల్లలు వడ్డెరలుకలరు నూలువడకు పరిశ్రమ బట్టలునేయు పరిశ్రమ కలవు సాలీనా రు 3000 లు విలువగల చీరలు పంచలు కోడూరు కడపలకు రవాణా చేసిరి వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 3/ లు స్త్రీకి రు 1 50లు

అన తరాజుపేటలో మూడు శ్రీరామ దేవాలయములు అంకాలమ్మ రామాలమ్మ గుడులు ఉన్నవి గంగమ్మ సత్తెమ్మల శిలావిగ్రహ ములు కలవు మఱ్ఱిచెట్టు క్రి ద ఒక కలశరూపమున స్థాపింపబడిన సిద్ధేశ్వర స్వామి పూజ జరుగును చైత్రశుద్ధ నవమిను డి 11 దినములు శ్రీరామ జయ తి సిద్ధేశ్వర జాగరణ ప డుగ జరుగును మాఘబహుళ త్రయోదశియ దును చతుర్దశియందును గంగమ్మ జాతర జరుగును క్రైస్తవుల చర్చి ఒకటి ఉన్నది

అన తరాజుపేటకు రైల్వేస్టేషను ఉన్నది 1 1/2 మైళ్ళ పొడవుగల తారురోడ్డు 4 మట్టిరోడ్లు ఈ గ్రామమున కలవు దీనిని పొరుగు గ్రామములతో తారురోడ్డు మట్టిరోడ్లు కలుపుచున్నవి ప్రయాణమునకు రెండెడ్ల బ డ్లు సైకిళ్లు సహాయపడుచున్నవి ఈ గ్రామము మీదుగా ప్రయివేటు బస్సులు ప్రతి అరగంటకు కడపనుండి తిరుపతికి పోవుచుండును

ఒక బ్రాంచి పోస్టాఫీసు తంతి కార్యాలయము సమితి ఎలిమెంటరీస్కూలు విద్యుచ్ఛక్తి సౌకర్యము ఈ గ్రామమునందున్నవి విద్యుచ్ఛక్తిని 6 ఇండ్లు వాడుకొనును ఇది పంచాయితీపాలన గ్రామము ఈ పంచాయితీ ఆదాయము ఇంటిపన్ను మొదలగు పన్నులచే చేకూరును ఇచట పురోద్యాన వనము రేడియో లౌడ్‌స్పీకరు రూరల్ ఆస్పత్రులు ఆయుర్వేద వైద్యుడు హోమియోపతి వైద్యుడు కలరు ఈ గ్రామములో అన్నిరకముల వస్తువులు ఎల్లప్పుడు దొరకును కిరాణా దుకాణములు బీడీ సిగరెట్టు సోడా దుకాణములు కూరగాయల అంగళ్ళు క్షౌరశాల లాండ్రీలు కలవు

హైస్కూలు చదువులకు 2 మైళ్ళలోనున్న కోడూరు జిల్లాపరిషత్తు హయ్యర్ సెకండరీ స్కూల్‌నకును కళాశాల చదువులకు కడపకును విద్యార్థులు పోవుదురు పోలీస్ స్టేషనునకు బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు ఆసుపత్రులకు సినిమాలకు కోడూరునకు పోవుదురు కోర్టు సబ్‌రిజిష్ట్రారు ఆఫీసు తాలూకా కచేరీలకు 20 మైళ్ళ దూరములోనున్న రాజంపేటకు పోవుదురు కడపలో విమానములు నిలుచు స్థానము ఉన్నది

రాజంపేట తాలూకాలోని గ్రామములలో హెచ్చు జనాభాగలది అనంతరాజుపేట భూమిశిస్తులను బట్టి ఇది ప్రాముఖ్యముకల గ్రామము 19వ శతాబ్ది అంతమున పాన్‌జమ్ కుటుంబములోని వెంకటనారాయణరెడ్డిగారు తమకు కార్వేటినగరము రాజావారిచేత బహూకరింపబడిన చీనీపండ్ల విత్తులను నాటిరి వెంకటనారాయణరెడ్డి వంశీయులు ఇప్పటికిని తంబళ్ళ వార్ధి పల్లెలో నివసించుచున్నారు ఈ అనంతరాజుపేటలో పండ్ల పరిశోధనాలయము పండ్లను నిలువచేయు ఫాక్టరీ కలవు 1955వ సంవత్సరములో స్థాపింపబడిన నిమ్మవేళ్ళ పరిశోధనాలయము ఉల్లిగడ్డ పరిశోధనాలయము ఇక్కడ ఉన్నవి శ్రీకృష్ణదేవరాయల పరిపాలన కాలములో ఈ గ్రామమును మట్లిరాజులు నిర్మించిరట

మా. శ్వే.

## అనంతరాయలు

మాధవ విద్యారణ్యుల ఆశీస్సులతో మొదటి బుక్కరాయలు క్రీ. శ. 1355 వ సం. రమున విద్యానగర సింహాసనమును అధిష్ఠించి 1377 వరకు పాలించెను అతడు రాజ్యరక్షణ విస్తృతుల కొరకై సమకాలికులైన మహమ్మదీయ రాజన్యులతో అనేక యుద్ధములుచేసి విజయ పరంపరలను పొందెను బుక్కరాయలకు కుడి భుజముగానుండి అనేక సమయములలో అతనికి రాజ్యపాలనాదితంత్రములలో తోడ్పడియున్న మహా ప్రధానియే అనంతరాయలు ఇతడు చేసినసేవ అద్వితీయము మహాదుర్గమైన పెనుగొండ (పెద్దకొండ) దుర్గమును ఈ అనంతరాయలు నిర్మించినట్లు చరిత్రాధారములు కలవు ఈయన సంస్మరణార్థము కడపజిల్లా యందలి పోరుమామిళ్ళ గ్రామమున అనంతసాగరమను పెద్ద తటాకమును భాస్కరరాయలు అను నతడు నిర్మించెను

కొ. వెం.

## అనంతవరం (అనంతారం)

అనంతవరం గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాలోఉన్నది దీనికి 5 మైళ్ళదూరంలో చిలకలూరిపేట పట్టణము కలదు ఈ గ్రామమునకు సరిహద్దులుగా తూర్పున వినజనపాడు పడమట తాతపూడి ఉత్తరమున పసుమర్తి దక్షిణమున యెనమదల ఉన్నవి ఈ గ్రామ విస్తీర్ణము 3 258 ఎకరములు

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములో పురుషులు స్త్రీలు కలసి 3 763 మంది ఉండిరి వీరిలో షెడ్యూలు జాతులు తరగతులవారు 153 మంది ఇచట ఇండ్లు దూర దూరముగ కట్టబడినవి వీటిలో 100 పెంకుటిండ్లు 10 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 10 ఒక అంతస్తుగల మేడలు కలవు జనులలో 80 శాతము వారు జొన్న అన్నము 20 శాతము వారు వరి అన్నమును తిందురు చెరువు నీటిని త్రాగుదురు మంచినీటి ఎద్దడి కలదు

వాగు బండాడుగుంట బంగారమ్మ చెరువు సూరవరిపల్లి చెరువు మర్దలారి చెరువు చలివేంద్ర చెరువు ఈ గ్రామమునకుగల నీటి వనరులు వీటిక్రింద జొన్న పొగాకు పంటలు పండును మిర్చి వంగ మొదలగు కూరగాయలను పండింతురు ఇచట పంటలక్రింద 1966 67 సం. లో 2 800 ఎకరముల భూమి ఉపయోగపడెను ఆయిల్ ఇంజను 15 ఎకరములకు నీటిని సప్లయి చేసెను రెండు ట్రాక్టర్లు 250 ఎకరములను దున్నెను పొగాకును జొన్నలను లారీలపై బండ్లపై చిలకలూరిపేటకు గుంటూరుకు రవాణా చేసిరి 600 క్వి మిర్చి 50 క్వి వంకాయలు స్థానికముగ వినియోగించిరి

అన తవరంలో 300 గేదెలు 25 ఆవులు 400దున్నలు 100 మేకలు 100 గొఱ్ఱెలు 1 000 కోళ్ళు 50 పందులు కలవు ప్రతిదినము 400 లీటర్ల పాలు 11 0 కి గ్రా నెయ్యి 400 గ్రుడ్లు స్థానికులు ఉపయోగించుకొనిరి

ఈ గ్రామములోని జనుల జీవితాధారములు వ్యవసాయము కూలిపనులు దుకాణములు ఎద్దుబండ్లు తోలువారు వడ్రంగులు కుమ్మరులు శాపీపనివారు మంగలివారు చాకలివారు గొల్లవారు వడ్డెరవారు కలరు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి రు 2 లు స్త్రీకి రు 1 50 లు

భోగమల్లేశ్వర స్వామికి వేణుగోపాలస్వామికి చెన్నకేశవస్వామికి శ్రీరామునకు విఘ్నేశ్వరునకు చెందిన దేవాలయములు కలవు పోలేరమ్మగుడి అన్నపూర్ణగుడి చర్చి ఉన్నవి ఆశ్వయుజ శుద్ధ దశమినాడు భోగమల్లేశ్వరస్వామి ఉత్సవము జరుగును కార్తిక మాఘ మాసములలో ఈ స్వామికి అభిషేకము జరుగును పుష్యమాసములో శ్రీరామాలయములో భోగములు జరుపుదురు సంక్రాంతి రోజున తెప్ప ఉత్సవము జరుగును

నర్సారావుపేట రైల్వేస్టేషను ఈ గ్రామమునకు 17 మైళ్ళ దూరములో ఉన్నది 10 మట్టిరోడ్లు ఉన్నవి పొరుగు గ్రామములతో మట్టిరోడ్లు ఈ గ్రామమును కలుపుచున్నవి 2 మోటారుకార్లు 4 ఒ ఎద్దుబండ్లు 100 రెండెడ్లబండ్లు 15 సైకిళ్ళు ప్రయాణమునకు ఉపయోగపడుచున్నవి

అనంతవరంలో ఒక బ్రాంచి పోస్టాఫీసు ఎలిమెంటరీ స్కూలు సహకార సంఘము ఉన్నవి ఇందు ఒక పంచాయతి గ్రంథాలయము రేడియో లౌడుస్పీకర్లు 4 కిరాణ దుకాణములు 2 కాఫీ హోటళ్లు 2 కిళ్ళీ సిగరెట్టు సోడా దుకాణములు కలవు ఈ గ్రామము పంచాయతీ పరిపాలనలో ఉన్నది ఈ పంచాయితికి ఇండ్ల పన్నులు వృత్తి పన్నులు మొదలగు వాటివలన ఆదాయము చేకూరుచున్నది

ఈ గ్రామమునందలి విద్యార్థులు హైస్కూలు చదువులకు రెండు మైళ్ళ దూరమునగల యద్దనపూడికి 3 మైళ్ళలోని పసుమర్రుకు పోవుదురు కళాశాల చదువులకు 17 మైళ్ళలోగల నర్సారావుపేటకు పోవుదురు చిలకలూరిపేటలోని సబ్‌రిజిష్ట్రారు ఆఫీసునకును పశువుల ఆసుపత్రికి పురుళ్ళ ఆసుపత్రికిని జనులు పోవుదురు కోర్టులకు తాలూకా కచేరికి నర్సారావుపేటకును పోలీసుస్టెషనుకు 6 మైళ్ళలోగల మార్టూరుకును బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు తమావులూరునకును పోవుదురు అవసరమగు ఎరువులు చిలకలూరిపేటను డి తెచ్చుకొం దురు

మా శ్వే

## అనంతవరప్పాడు

గుంటూరుజిల్లా గుంటూరుతాలూకాలో అనంతవరప్పాడుగ్రామము ఉన్నది దీనికి 5 మైళ్ళదూరములో గుంటూరు పట్టణము కలదు ఈ గ్రామమునకు తూర్పున గుంటూరు పొన్నూరు రోడ్డు పడమట గుంటూరు – ప్రత్తిపాడురోడ్డు ఉత్తరమున గుంటూరు దక్షిణమున ముల్లుకురు కలవు దీని విస్తీర్ణము 3540 ఎకరములు

1961 స । జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములో పురుషులు స్త్రీలు కలిసి 3 184 మంది ఉండిరి వీరిలో హరిజనులు 180 మంది ఎరుకలు 50 మంది మెడ్యూలు జాతులు తరగతులవారు 532 మంది ఇచట ఇండ్లు దూర దూరముగా కట్టబడియున్నవి వీటిలో 500 పెంకుటిండ్లు 15 కాంక్రీటుకప్పుగల ఇండ్లు 3 ఒక అంతస్తుగల మేడలు ఈ గ్రామము ఉత్తరమువైపుగా అభివృద్ధిచెందుచున్నది 70 శాతము గ్రామస్థులు వరిఅన్నమును 20 శాతమువారు జొన్నఅన్నమును 10 శాతమువారు సజ్జఅన్నమును తిందురు జనులు బావినీటిని చెరువునీటిని త్రాగుదురు ఇక్కడ మంచినీటి ఎద్దడి ఉన్నది

ఈ గ్రామమునకుగల నీటివసరు నల్లచెరువు ఒకటే ఇచ్చట వరి పెసర మిరప పొగాకు పంటలుపడును టొమాటో వంగ మొదలగు కూరగాయలను పండింతురు 1966 67 స ॥ లో పంటలక్రింద 3 000 ఎకరములభూమి ఉపయోగపడెను పంటధాన్యములు లారీలపై బండ్లపై గుంటూరునకు రవాణా చేసిరి వంకాయలు టొమాటోలు స్థానికులు ఉపయోగించుకొనిరి

ఇచట పశుసంపద చాలతక్కువ 200 గేదెలు 25 ఆవులు 300 ఎద్దులు 50 పందులు 150 కోళ్ళు ఉన్నవి వారమునకు 300 లీటర్ల పాలు 2 4 కి గ్రా వెన్న 80 గ్రుడ్లు స్థానికులు ఉపయోగించుకొని 900 లీటర్ల పాలను గుంటూరునకు సప్లయిచేసిరి ఈ గ్రామప్రజల ముఖ్యజీవితాధారము వ్యవసాయము వ్యాపారముచేయువారు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు శాపీపనివారు మంగలి

వారు చాకలివారు గొల్లలు వడ్డెరలు కలరు. వ్యవసాయ దారులకు కూలీలు దొరుకుదురు. దినమునకు కూలిరేటు పురుషునకు రు 3/ లు స్త్రీకి రు 2.75 లు.

ఈ గ్రామమున రెండు దేవాలయములు ఉన్నవి. ఈ దేవాలయములకు 20 ఎకరముల భూమి ఉన్నది.

ఈ గ్రామమునకు 5 మైళ్ళదూరమున గుంటూరు రైల్వేస్టేషను ఉన్నది. గ్రామమునకు బస్సులు కలవు. మారు గుంటూరును ఈ గ్రామము నుండి వల్లూరు పోవును. ఇందు 6 మట్టిరోడ్లు ఉన్నవి. దీనికి పొరుగు గ్రామములతో మట్టి రోడ్లు కలుపుచున్నవి. గ్రామమునకు 150 రెడ్ల బండ్లు 50 సైకిళ్ళు ఉన్నవి.

అనంతవరప్పాడులో ఒక బ్రాంచిపోస్టాఫీసు, రెండు మెటర్నిటీ స్కూళ్ళు ఉన్నవి. ఇది పంచాయితీ. పరిపాలన కల గ్రామము. ఈ పంచాయతీకి నులవలె ఆదాయము లభించును. పంచాయతీ గ్రంథాలయము రేడియోసెట్టు ఉన్నవి. 2 కిరాణాదుకాణములు 6 కిళ్ళీ సిగరెట్టు సోడా దుకాణములు 2 క్షౌరశాలలు లాండ్రీ ఉన్నవి.

హైస్కూలు చదువులకు కళాశాలచదువులకు విద్యార్థులు ఈ గ్రామమునుండి గుంటూరునకుపోవుదురు. తహశీలు కార్యాలయము కోర్టులు పోలీసుస్టేషను సబ్ రిజిస్ట్రారు ఆఫీసు తాలూకాకచేరీ బ్లాకు అభివృద్ధికేంద్రము పురుళ్ళ ఆసుపత్రి జనరల్ ఆసుపత్రి పశువుల ఆస్పత్రి మున్నగు వాటికి గుంటూరునకే పోవుదురు. జనులు జీవితావసర వస్తువులను కూడ గుంటూరునుండియే తెచ్చుకొందురు.

మా. శ్యా.

## అనంతవర్మ చోడగంగదేవుడు (క్రీ శ 1078-1152)

అనంతవర్మ చోడగంగదేవుడు 11-15 శతాబ్దులనడుమ కళింగరాజ్యమును పాలించిన కడపటి గాంగవంశ రాజులలో ప్రముఖుడు. అతడు 75 సంవత్సరములు పాలించెను. అతని పాలనాకాలము ఎంత దీర్ఘమైనదో అంతశ్లాఘ పదగినది. అపుడు గాంగరాజ్య వైభవము ఉచ్ఛదశనందుకొన్నది.

అనంతవర్మచోడగంగదేవుడు గాంగవంశమునకు చెందిన దేవేంద్రవర్మ రాజరాజదేవుని తనయుడు. దేవేంద్రవర్మకు త్రికళింగాధిపతి అను బిరుదు కలదు. అతడు శైవుడు పరమమాహేశ్వరుడు. అతడు ఎనిమిది ఏండ్లు మాత్రము రాజ్యముఏలెను. అయినను పరాక్రమవంతుడు. వేంగినుండి విజయాదిత్యుడు పారిపోయి కళింగమున గాంగ దేవేంద్రవర్మ శరణు వేడెను. దేవేంద్రవర్మ ఆశ్రయమిచ్చినాడు. రాజేంద్ర చోళుడు ? యాదిత్యుని అతనికి ఆశ్రయమిచ్చిన గాంగ రాజును శిక్షింపనెంచి కళింగముపైదండెత్తెను. రాజేంద్ర చోళునకు గాంగరాజునకు భయంకరమయిన యుద్ధము జరిగినది. ఈ యుద్ధము 1071లో జరిగినదని భావింపబడుచున్నది. పై యుద్ధములో రాజేంద్రచోళుడు ఓడుటచే గాంగరాజుతోసంధిచేసికొనుట స్నేహమును వృద్ధిచేసికొనుటకై తన కూతురైన రాజసుందరిని గాంగరాజునకిచ్చి వివాహము చేయుట జరిగెను. ఆ ఒడంబడిక ప్రకారము జీవించియున్న కాలము విజయాదిత్యుడు వేంగి రాజుగాను ఉండుట అంగీకరింపబడినది. గాంగ దేవేంద్రవర్మకు రాజసుందరి వలన కలిగిన ప్రియపుత్రుడే అనంతవర్మచోడగంగ దేవుడు.

అనంతవర్మ శక వర్షము 999 (క్రీ శ 1078) లో గంగరాజ్యమునకు పట్టాభిషిక్తుడాయెను. నాటికి అతడు పది ఏండ్లలోపు బాలుడు. బాల్యమున దేవసాహసము నెక్కుటచే అతనికి మంత్రి సామంతుల అండదండలు అవసరమైనవి. అతనికి బహువిధముల సహాయపడిన వారిలో బణపతి అను మంత్రి ముఖ్యుడు. ఇతడు అనంతవర్మ తండ్రి గాంగదేవేంద్రవర్మకు కూడ మంత్రిగానుండి రాజునుసేవించి శత్రురాజులనుఓడించి గాంగరాజ్య విస్తరణమున తోడ్పడినవాడు. బణపతి బ్రాహ్మణుడు. చలమర్తిగండడు గండగోపాలుడు అనుబిరుదులు కలవాడు.

దేవేంద్రవర్మ కాలమునుండి కళింగ వేంగిపాలకుల మధ్య స్నేహము సహకారము పెరుగుచుండెను. ఈ మైత్రి అనంతవర్మ కాలములో అతని దాయాదియైన దేవేంద్రుని వలన చెడినది. దేవేంద్రుడు అనంతవర్మను కళింగ ప్రభువుగా అంగీకరింపక కప్పము చెల్లింపక తనస్వాతంత్ర్యమును ప్రకటించుకొనెను. ఇది దక్షిణాది ఏలుచున్న కులోత్తుంగ చోడ దేవచక్రవర్తి నివేదింపబడినది. అంతట కులోత్తుంగుడు వీరులైన సేనానాయకుల నాయకత్వము క్రింద బలమైన సేనను దేవేంద్రుని శిక్షించుటకు పంపెను. ఈ సైన్యము దేవేంద్రుని అతని సహాయకులుగావచ్చిన ఇతర రాజులనుఓడించి దేవేంద్రునికి అప్పటి వరకు లోబడియున్న కళింగ ప్రాంతమును స్వాధీనపరచుకొని పెక్కు ఏనుగులను తీసికొని తిరిగి వెళ్ళెను. అంతట కళింగ దేశమునకు అనంతవర్మ ఏకైక పాలకు

డాయెను. అతని అధికారము నిరాటంకముగా సాగినది. నాటి నుండి గాంగరాజ్యము దేశములో పేరు ప్రతిష్ఠలను సంపాదించుకొనినది. అనంతవర్మ చాలా కాలము వైభవోపేతముగా రాజ్యమేలినాడు. పశ్చిమ చాళుక్య, చోళ, కళచురి రాజ్యములు గాంగరాజ్యపు సరిహద్దులందు ఉండెడివి. వాటిపాలకులతో పాటు గాంగ అనంతవర్మ కూడ రాజ్య విస్తరణమును ఆశించి దిగ్విజయమునకు సిద్ధపడెను.

దిగ్విజయ సందర్భమున అతడు పలువురు ప్రభువులతో పోరాడవలసి వచ్చింది. పశ్చిమోత్తర దిశలో కళచురి రాజులలో ఒక శాఖకు చెందినవారు ఎలుచుండిరి. వీరు దక్షిణకోసల ప్రాంతమును పాలించిరి. వీరిలో మొదటి రత్నదేవుడును అతని సంతతికి చెందిన మరికొందరు రాజులును దీర్ఘకాలముగా పాలన సాగించిన అనంతవర్మకు సమకాలికులు. వీరిలో చాలా మందితో గాంగప్రభువు యుద్ధమొనర్చెను. కాని విజయము లభింపలేదు. పైగా వారు అతనిని ఓడించినట్లు ప్రకటించుకొన్నారు. ఇంకను కళింగమునకు ఉత్తరముగానున్న బంగాళమును పాలించు సేన వంశజుడైన విజయసేనుడు గాంగరాజును జయించినట్లు చెప్పుకొనినాడు. ఈ పరాజయములు సంభవించినవో సంభవించలేదో, జరిగినచో ఎప్పుడు జరిగినవో నిస్సందేహముగా చెప్పుటకు వీలులేదు.

గాంగ అనంతవర్మకు సమకాలికుడైన సోమవంశపాలకుడగు ఉద్యోతకేసరి ఉత్కళమును పాలించుచుండెను. ఉద్యోత కేసరి పదచ్యుతుడైన పిదప అనంతవర్మ అతనిని మరల ఉత్కళ రాజ్యమున ప్రతిష్ఠించెను. వేంగిని పాలించు ప్రభువుకూడ తన సింహాసనమును పోగొట్టుకొనినపుడు గాంగరాజు అతనికి వేంగిసింహాసనమును తిరిగి సంపాదించి పెట్టెను. అంతేగాక ఉత్కళమున ఉద్యోతకేసరి తరువాత వారసులే మిచేకాని వారములలో చెలరేగిన అంతఃకలహముల మూలమునకాని అనంతవర్మ అచ్చటిసింహాసనము నాక్రమించి ఉత్కళమును తనరాజ్యములో కలుపుకొనెను. ఉత్కళ విజయము ఉత్తర దేశవిజయమును సుకరముచేసినది. ఉత్తర దిశగా ఆతడు గంగానది వరకును సాగిపోయి దారిలోనున్న రాజులను జయించి గంగా తీరమున బ్రాహ్మణులకు పెక్కు దానములు చేసినట్లు విదితమగుచున్నది.

అనంతవర్మ రాజ్యము తూర్పున బంగాళా ఖాతము నుండి పడమట కళచురిరాజుల రత్నపురి వరకు వ్యాపించినది. ఉత్తరమున విహారవాడ అనగా నేటి బీహారులోని గంగానది వరకు అతని ప్రాభవము విస్తరించినది. దక్షిణమున సింహాచలమునుండి గోదావరీ దివరకు గల ప్రాంతము కొరకై వేంగిరాజులకు కళింగ గాంగ ప్రభువులకు పోరు జరుగుచుండెను. ఆ ప్రాంతము ఒకప్పుడు ఒకరికిని మరి ఒకప్పుడు మరి ఒకరికిని హస్తగతమగుచుండెను. అనంతవర్మ తన రాజ్యము ఉత్తర దిశగా విస్తరించిన తరువాత రాజ్యము తటిని రాజధానీ నగరము మధ్యగానుండుట యుక్తమని తలచి దానిని కళింగనగగరము నుండి కటకమునకు మార్చెను. నాటినుండి గాంగవంశజులకు అది రాజధానిగా నున్నది. సాధించిన దిగ్విజయమును ప్రకటించుకొనుటకై అతడు త్రికళింగాధిపతి, ప్రతాపగంగు, సవనవతి సహస్ర కుంజరాధీశ్వర అను బిరుదులను వహించెను. అతి దీర్ఘకాలము పాలించిన ఈ పాలకుడు తన పాలన చరమ దశలో తనకుమారుడైన కామార్ణవునికి పట్టము కట్టెను. బహుశః కుమారునకు రాజ్యపాలనములో శిక్షణము నిచ్చుటకై అట్లు చేసియుండును.

అనంతవర్మ కాలమునకు సంబంధించిన శాసనములలో అనేక స్త్రీలు తాము ఈ గాంగదేవుని రాణులమని ప్రకటించుకొన్నారు. దీనిని బట్టి అతనికి పలువురు భార్యలున్నట్లు తేలుచున్నది. చోళమహాదేవి అను నామె అతని పట్టమహిషి. కస్తూరికామోదిని మరియొక భార్య. చోళమహాదేవికి సంతానము లేనందున కస్తూరికామోదిని వలన కలిగిన తనయుడు కామార్ణవ దేవుడు అనంతవర్మ అనంతరము సింహాసనము నెక్కెను. చంద్రలేఖయను ఇంకొక భార్యవలన రాజరాజు అనంగభీముడు అను పుత్రులు కలిగిరి. అనంతవర్మ చేసిన యుద్ధములలో అతని పుత్రులు కూడ పాల్గొనినట్లు తెలియుచున్నది. అనంతవర్మ తండ్రివలెనే శైవమతావలంబియై పరమ మాహేశ్వరుడనని ప్రకటించుకొనెను. తదుపరి అతడు వైష్ణవ మతస్థుడుగా మారినాడు. అయినను ఉభయ మతములను సమానముగా అదరించిన ప్రభువతడు. పరమతసహనమును చాటిన పాలకుడు. ఇతడు పూరిలోని జగన్నాథాలయమునందు విమానమును ఒక మండపమును కట్టించినాడు. పూరిలో కొంతభాగమును నిర్మింపజేసినట్లును కటకమునకు సమీపమున తన పేర ఒకతటాకమును త్రవ్వించినట్లును తెలియుచున్నది. జాజపురములోని ఇతడునిర్మించిన గంగేశ్వరాలయము ఇతని నామమును చిరస్మరణీయము చేయుచున్నది. సారంగ

గఢ న దు కనబడు శిథిలములు ఇతని కళాభిరుచిని చాటు చున్నవి అన తవర్మ కవి ప డితులను ఆదరి చి సారస్వత విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి తోడ్పడినట్లు నిదర్శ ములున్నవి ఇతని కాలమున వెలువడిన జ్ఞానశాస్త్ర గ్ర థము లో భా స్వ తి అను జ్యోతిష గ్ర థమ పేర్కొనదగి ది ఇతని పరిపాలనకాల మునగా గ సామ్రాజ్యము అ త వైభవముతో తులదూగెను

కడ టి గా గ వ శరాజులు నాలుగు శ తా బ్దు ల కాలము తూర్పుతీరము వె టనున్న కళి గోత్కళ సామ్రాజ్య మును పాలి చిరి ఉత్తరాది ను డి వచ్చు ము ము ది డ యాత్రల నెదుర్కొని వాందూ సామ్రాజ్యములను మత స్కృతులను స రక్షి చుట ఈ రాజుల విశిష్టత వారి కాలమున వైష్ణవ మతము బాగుగా వ్యాప్తిచె దినది పూరి భువనేశ్వ రము కోణార్క మొదలగు తీర్థముల దున్న వారి దేవా లయములు మతమునకు లలిత కళలకు కల విద్యలకు కే ద్ర ములుగా విలసిల్లినవి

౬. వ

## అనంతవర్మ వీరనరసింహ దేవుడు

ఇతడు కళి గ గాంగవ శమునకు చె దిన మహారాజు ఇతని ప్రశ స భీమిలిపట్నం తాలూకా పొట్నూరి సమీప మందలి రెడ్డిపాలె గ్రామమున దొరకిన శాసనమున కనవచ్చు చున్నది (ద హిం X నె 723) ఇచ్చట ఇతడు వీరవర వారసింహదేవుడని వ్యవహరి ప బడినాడు శాసన కాలము గల రాయి విరిగిపోయినది గా గ వ శములో నరస హ నామము ధరి చిన వారియందు ఈతడు ప్రథము డగుటచే మొదటి నరస హ దేవు డనబడు చున్నాడు ఇతడు అన త వర్మ నామమునుగూడ ధరి చెను వీర నరస హ దేవుని రాజ్య కాలము క్రీ శ 1237 63 వరకు ని తెలియ వచ్చుచున్నది ఆంధ్ర దేశమున ఇప్పుడు కాకతి గణపతి దేవ చక్రవర్తి పరిపాలన చేయుచుండెను వీరనరసి హుని త డ్రి మూడవ అనియంక భీముడు

ఇతడు క్రీ శ 1211 ను డి 1238 వరకు గా గ రా జ్యమును ఎలెను ఇట్లు ముమ డి అనియ క భీమదేవుడును వీర నరస హ దేవుడును – ఇద్దరును – కాకతిగణపతి దేవ చక్ర వర్తికి సమకాలికులు త డ్రి కొడుకు లిరువురును సమర్థులైన ప్రభువులు వారు తమ రాజ్యమును ఆ ధ్రదేశములోనికి వ్యాపి పజేయుటకై గాఢమైన కృషిచేసిరి గోదావరికి ఉత్త రమున ఉన్న మ డలమును జయి చుటకై వీరు కాకతీయు లతో తలపడుచుండిరి వీరనరస హుని శా నము లభి చిన స్థానమునుబట్టి చూడగా వీరు తమ యత్నములలో సముచిత విజయమును సాధి చిరని చెప్పవలసి వచ్చుచున్నది విశాఖ పట్న జిల్లాలో ఈ శాసనము లభి చుటచేతను శ్రీకూర్మము స హాచలము మున్నగు క్షేత్రము లో వీర నరస హుని శాస నములు లభించుచు డుటచేతను ఈ గా గరాజ కాలమున కళి గసైన్యము లు స హాచలము వరకు జయించినవని చెప్ప వచ్చును

గణపతిదేవుని దీర్ఘ రాజ్య కాలమున ఒకటి రె డు పర్యాయములు కాకతీయసైన్యములు కళి గముపై దండ యాత్ర సల్పెను ఇ దులూరి సోమయమ త్రి కాకతీయ సైన్యముల కధిపతియై ఒడ్డదేశము చక్రకూటము మొదలగు వానిని జయించెను ఇది వీర నరస హుని త డ్రియైన అని యంకభీముని కాలమున జరిగియుండును దీనికి ప్రతిగా వీర నరసి హ దేవుడు సి హాసనమునకు వచ్చినతరువాత తెలుగుదేశ ముపై విజయయాత్ర సాగించెను ఇతని పెంపుడు సోదరుడు అనంతపాలుడను ద డనాథుడు కృష్ణాతీరమువరకును చొచ్చు కొని వచ్చెను ఇతడు శ్రీకాకుళా ధ్రదేవుని సేవి చి ఆ దేవుని ఆలయమునకు జీర్ణోద్ధారము చేసినట్లు తెలియుచున్నది శాను కా చీపురము వరకును జైత్రయాత్ర నడపినట్లు ఇతడు ప్రకటి చుకొన్నాడు ఇప్పటికే ఆ ధ్రదేశపు తూర్పు తీర భాగములు గణపతిదేవ చక్రవర్తి వశములై యుండుటచే కాకతీయ వాహినుల నెదుర్కొనకు డ అన తపాలుడు కాంచీ పురమువరకు ఎట్లు పోగలిగెనో తెలియదు ఎట్లైనను కళి గ సేనాపతి తె లు గు దేశమున స్థావర మేర్పరచుకొనలేక పోయెను గణపతిదేవుని సేనలు కళింగవాహినుల నెదుర్కొని గోదావరీ తీరమున భీమన స గ్రామ మొనర్చి వారిని ఉత్తర మునకు తరిమివేసెను ఇది క్రీ శ 1247 48 ప్రాంతముల జరగియు డును ఈ గోదావరి స గరమునందు నెల్లూరు చోడనృపతి రె డవ మనుమ ద్ధి కూడ పాల్గొని కాకతీయుల పక్షమున పోరి కళింగ నృపతిని స్వదేశాభి ముఖముగ తరిమివేసి నట్లు మనుమసిద్ధి వేయి చిన న దలూరు శాసనము (క్రీ శ 1257 58) వలన విశదమగుచున్నది ఇప్పుడు కళి గదేశమును పాలి చుచున్నవాడు వీర నరస హ దేవుడే ఈ రె డవ ఘట్టమునందు కాకతీయ సైన్యముల కధ్యక్షుడు పట్టసాహిణి

పడికము బొప్పదేవుడు శక 1188 (క్రీ శ 1261) నాటి ఈతని త్రిపురాంతక శాసనమున దుర్గపట్టసాహిణి బొప్పదేవునికి గోదావరీ తీరసమరగాండీవ కళింగ మండలిక ఘాటీ సమ్మర్ద మున్నగు బిరుదులు కాన్పించుచున్నవి ఇది వీర నరసింహుని సైన్యముపై కాకతీయ చమువులు సాధించిన ఘనవిజయమును స్మరింపజేయుచున్నవి

ఇట్లు కళింగ కాకతి సైన్యములు గోదావరీ సింహాచల మధ్యదేశమునకై ఓహరిసాహరి పెనగుచుండినట్లు పెక్కు ఆధారములవలన తెల్లమగును జయలక్ష్మి ఒకప్పుడొకరిని మరియొకప్పుడు మరియొకరిని వరించినట్లు తోచును వీది యెట్లైనను అనంతవర్మ వీర నరసింహదేవుడు గొప్పపరాక్రమశాలియైన రాజన్యుండనుట నిర్వివాదము

ఈతడు సాహిత్యప్రియుడై ఏకావళి అను సంస్కృత అలంకారశాస్త్ర గ్రంథమును రచించిన విద్యాధరుడను పండితుని తన అస్థానమున పోషించెను శ్రీకూర్మమునందును సింహాచలమునందును అచ్చటి భగవంతులకు పెక్కు దానధర్మము లొనర్చెను ఇతని సేనాపతియయిన అళ్ళాయి యను నతడు సింహాద్రి నరసింహదేవునకు తన యేలికఆజ్ఞపై విమానము ముఖమండపము నాట్యమండపము తిరుచుట్టుమాలె కట్టించెనట శిల్పకళా ప్రపంచమునందు ప్రసిద్ధి వహించిన కోణార్కమందలి సూర్యదేవుని ఆలయమును వీరనరసింహదేవుడే కట్టించెను

ఖం ల రం

## అనంత వెంకట్రావు

ఈతనిప్రశంస తజ్కరెనిర్మల్ (తని 14 16) అను పర్షియన్ భాషాగ్రంథమునందు లభించుచున్నది క్రీ శ 1688 లో గోల్కొండ రాజ్యము ఔరంగజేబు చక్రవర్తికి వశమయ్యెను దక్కనుసుబాను పరిపాలించుటకు మొగలాయి చక్రవర్తులు సుబేదారులను ఉద్యోగులను పంపుచుండిరి దేశములో చిన్నవియు పెద్దవియు జమిందారీలు పెక్కులు ఏర్పడెను ప్రస్తుత ఆదిలాబాదు జిల్లాలోని నిర్మలప్రాంతము ఒక పరగణాగా ఉండెను దీనిని పాలించిన జమీందారులలో జగపతిరావు అప్పా ముకుందరావు అనంతవెంకటరావు మున్నగువారు తెలియవచ్చుచున్నారు విషప్రయోగమువలన అప్పాముకుందరావు అకాలమరణమునొందగా నిర్మలపరిసరములందలి ముగ్గురు జమీదారులు నిర్మల పరగణాను స్వాధీనముచేసికొని క్రమముగా పరిపాలించిరి వీరు కడంకరావు గోపాలరావు అనంతవెంకటరావు అనువారలు అనంతవెంకటరావు కొంతకాలముపాలించి భోగలాలసుడై జమీదారీ పరిపాలనమును సూర్యారావు అనువానికి అప్పగించెను అప్పాముకుందరావు హిజరీ 1159 (క్రీ శ 1749) ప్రాంతమున నిర్మల జమీందారు అయినట్లు చెప్పబడుటచే ఆతని తరువాత వచ్చిన అనంతవెంకటరావు క్రీ శ 1750 తరువాత ఉండియుండును ఈ కాలమునకు అనగా క్రీ శ 1748 ప్రాంతమున మొదటి ఆసఫుజా నిజాముల్ముల్కు మరణించెను ఆతని కుమారుడు నాసిరుజంగును మనుమడు ముజఫరుజంగును హైదరాబాదు సింహాసనమునకై కలహింపజొచ్చిరి అనంత వెంకటరావును గురించి ఇంతకన్న విశేషములు తెలియుటలేదు

డా కొం గో
అ మ

## అనంతసాగరం

అనంతసాగరం నెల్లూరుజిల్లా ఆత్మకూరుతాలూకాలో ఉన్నది దీనికి 48 కి మీ దూరములో ఆత్మకూరు పట్టణము కలదు అనంతసాగరపు వైశాల్యము 4790 ఎకరములు తూర్పున లింగగుంట పడమట మంచాలపల్లె ఉత్తరమున వెంగంపల్లె దక్షిణమున బెడుసుపల్లి దీనికి సరిహద్దులు నెల్లూరును పాలించిన మనుమసిద్ధిసైన్యాధిపతియగు ఖడ్గ తిక్కన విగ్రహము చెరువుగట్టున విరిగిపోయి ఉన్నది ఈ గ్రామము కొండలమధ్య ఉన్నది నిటారైనవీథులు కలిగియున్నది దుర్గమ్మకొండ శంఖాకారముగ ఉన్నది కొండలు చెట్లు చామలతో నిండియున్నవి ఇవి రాతితో ఏర్పడినవి

1961 సం ॥ జనాభాలెక్కలప్రకారము ఈ గ్రామములో 1729 మంది పురుషులు 1680 మంది స్త్రీలు వెరసి 3409 మంది ఉండిరి వీరిలో హరిజన పురుషులు 240 మంది స్త్రీలు 200 మంది యానాదులు 50 మంది మెడ్యాలు తరగతుల వారు జాతులవారు 592 మంది కలరు 1951 సం ॥ లో 2800 మంది జనులు ఉండిరి 609 మంది జనులు పెరిగిరి ఈ పెరుగుదల సంతానాభివృద్ధివలన కలిగినది ఇచట ఇండ్లు దూరదూరముగా కట్టబడియున్నవి వీటిలో 14 పెంకుటిండ్లు 40 కాంక్రీటుకప్పుగల ఇండ్లు 2 ఒక అంతస్తుగల మేడలు ఉన్నవి

ఈ గ్రామములో 000 మ ది వరిఅన్నమును 1409 మంది ఇఅరాన్నము ను తి దురు బావులనీటిని త్రాగుదురు మ చి నీటి ఎద్దడిలేదు

ఈ గ్రామున కు నీటివ రులుగా అన అసాగర చెరువు గొట్టపు బావులు ఉ న్నవి వీటి ద వరి ఎజ్జ రాగి లు డును వీటిని పాఅరలలో ని వచేయుదురు మ్మ తోటలు మామిడి తోటలుఉన్నవి మిరప వ గ మొదలగు కూరగాయలను ఎ డి తురు 1966 67 లో ప టల ద 2 646 ఎకరముల భూమి ఉపయోగి పబడెను చెరువుక్రింద 1580 ఎకరముల భూమి బావులక్రి ద 210 ఎకరముల భూమి సాగుబడియైనది 10 ఎలెక్ట్రిక్ మోటారులు 210 ఎకరము లకు కవలలు 80 ఎకరములకు నీటిని సరఫరాచేయనవి ఇచట 2646 ఎకరముల రేగడినేల 1188 ఎకరముల ఎర్రమట్టి నేల 956 ఎకరముల రాతినేల కలదు ఫారెస్టు డిపార్టుమె టు యాజమాన్యమున 12 6 ఎకరముల రిజర్వు అడవి ఉన్నది దీనిలో తుమ్మ ఎలమ కు కుడు వృక్షములు ఉన్నవి వ్యవ సాయ ఫలసాయములు కు కడు తుమ్మ మొదలగు అటవీ ఫలసాయములు లారీలపై నెల్లూరునకు రవాణా అగును రు 6000 ల విలువగల నిమ్మకాయలను నాగపూరునకును రు 10 000 ల విలువగల మామిడికాయలను ఆత్మకూరునకును రవాణా చేసిరి రు 10 000 ల విలువగల మామిడికాయలు 5 టన్నుల వ కాయలు 10 టన్నుల మిరపకాయలు స్థానిక ముగ వాడబడెను

ఈ గ్రామములో పశుస పద బాగుగా ఉన్నది 450 ఆవులు 00 గేదెలు 380 ఎద్దులు 2 ఆబోతులు 2000 మేకలు 500 గొఱ్ఱెలు 4000 కోళ్ళు ఉన్నవి 2500 లీటర్ల పాలు 500 కి గ్రా నెయ్యి 2000 గ్రుడ్లు 5 టన్నుల చేపలు స్థానికులు వినియోగి చుకొని 2000 గ్రుడ్లను ఆత్మకూరు నకును 5 టన్నుల చేపలను నెల్లూరునకును రవాణా చేసిరి

ఈ గ్రామస్థుల ముఖ్యజీవితాధారములు వ్యవసాయము చేపలు పట్టుట కూలిపనులు అడవి పనులు వ్యాపారస్థులు దుకాణాదారులు క్రయవిక్రయదారులు కూడ కలరు వీరు గాక ఎద్దుబండ్లు తోలువారు క సాలివారు వడ్ర గులు కమ్మరులు కుమ్మరులు తాపీపనివారు మ గలివారు చాకలి వారు గొల్లలు వడ్డెరలు కలరు వ్యవసాయదారులకు కూలీలు హెచ్చుగ దొరుకుదురు దినమునకు మనుష్యునకు కూలి రు 2 లు ఈ గ్రామమున శ్రీరామాలయము దుర్గమ్మ దేవా యము మసీదు ఉన్నవి

నెల్లూరు రైల్వేస్టేషను ఈ గ్రామమునకు 109 కి మీ దూరములో న్నది ప్రయివేటు బస్సులు పగటిపూట మూడు సార్లు ఇచ్చటినుడి ఆత్మకూరునకు పోవును 4 కంకరరోడ్లు 4 మట్టిరోడ్లు ఈ గ్రామమున ఉ న్నవి దీనిని పొరుగు గ్రామ ములతో క కరరోడ్లు కలుపుచున్నవి ప్రయాణమునకు 4 ఒ టెద్దు బండ్లు 60 రె డెడ్ల బ డ్లు 20 సైకిళ్ళు కలవు

అన తసాగరంలో సబ్ పోస్టాఫీసు 2 సమితి ఎలిమె టరీ స్కూళ్ళు జిల్లాపరిషత్తు హైస్కూలు విద్యుత్ సౌకర్యములు ఉన్న విద్యుచ్ఛక్తిని 160 ఇ డ్లు 10 ఎలెక్ట్రిక్ మోటారులు వాడుకొనును ఇది ప చాయతి పరిపాలనకల గ్రామము దీనికి సాలునకు ఇ టిపన్ను వృత్తిపన్ను బ డెలదొడ్ల రుసుము సెస్సులు మొదలగువాటి మూలమున రు 4 500 ల రాబడి కలదు పంచాయతి గ్ర థాలయము పురోద్యానము రేడియో లౌడ్ స్పీకర్లు నాటకశాల 150 మ దికి సరిపోవు కమ్యూనిటీ హాలు ప్రైమరీ హెల్తు సె టరు కలవు ఇ గ్లీషు వైద్యుడు ఆయుర్వేద వైద్యులు పశువుల రోగాలకు నాటుచికిత్సచేయు వారు కలరు వారపంతలు లేవు కాని 10 కిరాణా దుకాణ ములు 6 కిళ్ళీ సిగరెట్టు సోడా అంగళ్ళు 2 కాఫీహోటళ్ళు 4 సైకిళ్ళ షాపులు 6 ఇతర షాపులు కు రగాయల అ గడి ఉన్నవి ఇచటి సహకారస ఘము 20 మ ది అప్పిచ్చినది ప్రైవేటుగా అప్పిచ్చువారును కలరు

త తి కార్యాలయమునకు సినిమాథియేటరుకు కోర్టు లకు సబ్ రిజిస్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి బ్లాకు అభివృద్ధి కే ద్రమునకు గ్రామస్థులు 48 కి మీ దూరములో ఉన్న ఆత్మకూరునకు పోవుదురు కళాశాల చదువులకు విద్యా ర్థులు నెల్లూరునకు పోవుదురు

అనంతసాగరములోని మసీదు గొప్పతటాకము చూడ తగినవి ఈ చెరువునకు అన తసాగరమను పేరు కనుక ఈ గ్రామమునకు ఆ పేరుకలిగెను తిమ్మరుసు సాయమ్మల పుత్రుడు రాయ కొ డమరసు శ్రీకృష్ణ దేవరాయల కాల ములోనున్న శిలాశాసనము (క్రి శ 1522) వలన కొ డ మరసు తన తల్లిద డ్రుల జ్ఞాపకార్థమై ఈ చెరువును త్రవ్వి చె నని తెలియుచున్నది

మా శే

## అనంతాచార్యులు

ఇతడు సంతపూరు (స తూరు) గ్రామవాసి సంతూరు మహబూబునగరమ డలము దలిది స్తుతిరూపమైన ఎ హగిరి నరహరి వచనములను వ్రాసె కాకతి ప్రతాపరుద్రుని విద్యా స్థానమునవానకెక్కినకృష్ణమాచార్యులకు ఈఅనంతాచార్యులు సోదరుడు కృష్ణమాచార్యుల వార నేక మహిమలను అనాడు ప్రదర్శి చియు డిరట అన తమ్ముడైన అనంతాచార్యులు ఊరనున్న ఒక రజకస్త్రీతో స బ ధము కలిగియు డగా అది తెలిసిన రజకుడు మండిపడి ఆచార్యులను తన భార్యను పొడిచి చ పెనట అన తాచార్యుల శవమును ఎత్తుటకెవ్వరును సమ్మతి పరైరి అన్నగారైన కృష్ణమాచార్యులు చేయునది లేక భగవ తుడయిన వాసుదేవమూర్తిని వేడుకొనగా శవము స్వయముగా కాష్ఠమున కరిగెనట ప్రతాపచరిత్ర యను చారిత్రక గ్రంథమున ఈ ఉద తము కలదు

ని శ సుం

## అనంతాచార్యులు ఆసూరి

ఆసూరి అనంతాచార్యులు చంపూరాఘవమను చంపూ కావ్యమును 1868వ సంవత్సరమునందు రచించెను ఇది ఆసూరి వెంకటనరసింహాచార్యులచే రచితమయిన వ్యాఖ్యాన ముతో బెజవాడలో ముద్రి పబడెను

డా పు శ్రీ

## అనంతాచార్యులు సంద్యాల

వీరు గద్వాల సంస్థానమునందు ఆస్థాన పండితులుగా వెలుగొ దిన వారు వీరు బాల్యమ దు వారణాసికేగి అచ్చట శ్రమించి మహావిద్వాంసులవద్ద గొప్ప పా డిత్యమును సంపాది చుకొనిరి తర్కశాస్త్రమున దు అత్యంత నిష్ణాతులుగా వీరు ఖ్యాతినొ దిరి వీరినిగూర్చి ఇతర వివరములు తెలియవు

గ ల కొం

## అనంతామాత్యుడు

క్రీ శ 15వ శతాబ్దమున విలసిల్లిన కవులలో అనంతా మాత్యుడు దొడ్డకవి భోజరాజీయము ఛ దోదర్పణము రసాభరణము అను మూడు గ్ర థములు అనంతామాత్య రచితములు ఇ దు మొదటిది కావ్యము రె డవది ఛందస్సు మూడవది సాహిత్య శాస్త్రము నన్నెచోడుడు పాల్కురికి సోమనాథులవలెనాక అన తుడు స్పష్టముగా తన కాలమును ఇట్లుచెప్పియున్నాడు

జానొ దన్ శకవర్ష ముల్ బుతుశరజ్వాలే దులై యొప్పన
య్యానం దాబ్దమున దు మాఘమునం గృష్ణైకాదశీభౌమయు
క్తానామామృతవేళ నీకృతి యన తార్యు డు సమ్యగ్గుణ
శ్రీ ని దన్ ధ్రువపట్టణాధిపునకిచ్చెన్ భక్తిపూర్వ బునన్
(రసాభరణము)

శాలివాహనశకము 1356 ఆనందనామ సంవత్సర మాఘ బ॥ ఎకాదశీ మ గళవారమునాడు రసాభరణకృతిని ధ్రువపురి గోపాలునకు భ_పూర్వకముగా అతడు సమర్పిం చెను దీనికి సరియగు క్రీస్తు శకాబ్దపు తేది 5 1-1435 ఈ విధముగా పద్యరూపమున గ్ర థములోపల తన కాలమును చెప్పిన కవులలో ఇతడు ద్వితీయుడు ప్రథముడు యథా వాక్కుల అన్నమయ్య

అనంతామాత్యుని ఇ టిపేరు తెలియదు ఇతనిది కౌండిన్య గోత్రము ఇతడు ఆర్వేలనియోగి బ్రాహ్మణుడు పరమభాగవత కీర్తనమును వైష్ణవ గురుచరణస్మరణంబును తన ప్రథమ గ్రంథమైన భోజరాజీయమున చెప్పుటచేతను భోజరాజీయ ఛ దోదర్పణ రసాభరణములు మూడును వరుసగా అహోబల నృసింహ కృష్ణ గోపాలాంకితములుగా కనబడు చుండుటచేతను అనంతుడు వైష్ణవభక్తి తత్పరుడని చెప్పవచును

అనంతామాత్యుని వంశజులలో కొందరు ప్రసిద్ధ పురుషులు స్త్రీలు కలరు నందనార్యుడు వీరి మూల పురుషుడు ఇతని మనుమడైన భైరవుడు లేకబయ్య నభాసుర కవితాచతురుడు పంచమవేదమైన భారత మును తెనిగి చిన తిక్కన సోమయాజి బయ్యన కవితాచతుర తకుమెచ్చి ఆతనికి భవ్య భారతి అను బిరుదమొసగెను

త్రిపురాంతకుడు నందనార్యుని రెండవ కుమారుడు నిశ్చల ధ్యానైకనిష్ఠాగరిష్ఠుడై షణ్మాసములు పునశ్చరణచేసి తనవంశమువారియి టి ఎల్లి కినైనను నరకములేకుండ వరమును పొంది తాను బ్రహ్మపదమును జె దెనట ఇతనిని త్రిపురాంతక బ్రహ్మయని అన తుడు పొగడెను

తిక్కవిభుడు భవ్యభారతి బయ్యన మనుమడు అనంతా మాత్యుని త డ్రి శ్రీకాకుళాంధ్రవల్లభుని భక్తుడు ఆంధ్ర వల్లభుడు ప్రత్యక్ష పరమపదమట! నివాసము పెరమగూరు

కృష్ణా మలాపహారిణీ భీమరథీ నదీత్రయాంతర్వేదిపావన క్షేత్రమున పెరమగూరు కలదట ఈ పెరమగూరు తూర్పు చాళుక్యుల కాలమునందియు ప్రసిద్ధమైనది ప్రథమ చాళుక్య భీముని జ్యేష్ఠపుత్రుడైన ఇరిమర్తిగండడి పెరమగూర రణక్షేత్రమందు రాష్ట్రకూటులతో పోరాడుచు వీరస్వర్గము లకరి చెను క్రీ శ 1160 ప్రాంతమున బాపట్ల భావనారాయణస్వామి గుడిగోడమీద చెక్కబడిన వెలనాటి కులోత్తుంగ చోడపృథ్వీశ్వరుని విగ్రహికొమ్మన శాసనమున తనతాత కొమ్మన పెరమగూరి వాస్తవ్యుడని చెప్పుకొనెను (శాసన పద్యమంజరి నె 45) ఈ కొమ్మన మనుమడగు నడూరి గుండన (కేయూర బాహు చరిత్ర కృతికర్త) శ్రీకాకుళవల్లభునికై కర్యము లొసగిన వాడే ఈ పెరమగూరు కృష్ణాయందలి బెజవాడ తాలూకా లోని నేటి పెనుమకూరని రెడ్డిరాజ్య చరిత్రకారులైన మల్లంపల్లి సోమశేఖరశర్మగారు గుర్తించియున్నారు (రె రా పుట 505) అనంతామాత్యుడును కృష్ణామండలమువాడే

అనంతామాత్యుని తల్లి మల్లమాంబ ఈమె మేనమామ కోటకరుణాకరార్యుడగు మదుసూరి పెద్దవిభుడు కోటకరుణాకరార్యుండనగా అర్థము తెలియుటలేదు కోటభూమి కృష్ణానదీ దక్షిణతటమునగలదని సింగన జ్ఞానవాసిష్ఠమున కలదు (1-93) దీనికి షట్సహస్రావని యనిపేరు రెండవ కోటకేతరాజు అమరావతీ శాసనములో కృష్ణవేణ్ణానదీ దక్షిణ షట్సహస్రావనీ అనియున్నది (ఎంఇ VI నె 1౦) ఇట్టి విశిష్టాన్వయమున బుట్టిన అనంతామాత్యుడు వాణీవరప్రసాదాను లబ్ధవాగ్విభవుడు కవినికర విధేయుడు ఇతనిగురువు తిరుమల్ల నల్లానుతనూజుడైన గోవిందచక్రవర్తి ఇతనికి తిరువేంగళ అళఘరి ఔబళ శ్రీదేవచక్రవర్తులు అగ్రజులు ఈ వైష్ణవ స్వాములు ఆ ప్రదేశమున మత ప్రచారకులుగా నుండిరి గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా కారెమపూడి గ్రామమందలి వీరుల గుడి అవరణలో ఒకరాతిమీద చెక్కియున్న క్రీ శ 1396 నాటి శాసనమున గోవిందచక్రవర్తి ప్రశంస గలదు ఇందు గోవిందచక్రవర్తితోపాటు తన చిన్న అన్న యగు దేవచక్రవర్తికూడ గలదు (చూ కారెమపూడి శిలా శాసనము మల్లంపల్లి సోమశేఖరశర్మ డిసెంబరు 1954 భారతి పుటలు 520-525) తనకు సరస్వతీదేవి కటాక్షముచే కవిత్వమబ్బెనని చెప్పుకొనియున్నాడు కావున గోవిందచక్రవర్తి అనంతామాత్యునికి వైష్ణవమత మొసగియుండుననుట కవకాశము కల్గుచున్నది క్రీ శ 1435 నాటికి తన చివరికృతి రసాభరణమును ముగించుటచే ఇతడు కవిసార్వభౌముడైన శ్రీనాథుని సమకాలికుడుగా కనబడుచున్నాడు

***భోజ రాజీయము***

అనంతుని తొలిరచన భోజరాజీయము ఇది 7 ఆశ్వాసముల ప్రబంధము ఇది 2199 గద్యపద్యములు కలది సూత్రకథ భోజరాజచరిత్రము ఇది ధర్మరీతులతో నీతులతో చిత్ర చిత్ర కథలతో ప్రసన్నగంభీరమై వెలువడిన కావ్యము అహోబలమునందలి యోగానంద నృసింహునకిది అంకితము చేయబడినది కవి కలలో గురువైన గోవిందచక్రవర్తి అహోబల నృసింహునితో సాక్షాత్కరించి తన కృతిని ఆ నృసింహస్వామికంకితము గావింపుమని అనంతునితోచెప్ప అతడ్లే చేసితుడయ్యెను ఇట్టి స్వప్నకథావృత్తాంతములను దైవసాక్షాత్కారములను కావ్యావతారికలయందు ప్రవేశపెట్టినవారు కవిబ్రహ్మతిక్కన సోమయాజియు ప్రబంధపరమేశ్వరుడు ఎఱ్ఱనయు కవి దీనిని అహోబలునకు విన్నపంబు సేయురీతిని కథాప్రసంగ మొనర్చినాడట గ్రంథాంతమునందు గూడ ఇది తన విన్నపమనియే చెప్పినాడు అత్రికుమారుడగు దత్తాత్రేయమునీంద్రుడు వక్తయు మాహుడను కాంభోజమహీశుడు శ్రోతయునై కథను నడపించిరి ఇందలి కథావస్తువిది అధిగత విద్యాచయుడగు భోజుడు పూర్వజన్మమున బ్రాహ్మణుడై యుండి దారిద్ర్యభారమెక్కువై ఎంభవించిన విరక్తి కారణముగా తీర్థయాత్ర చేయుచు ప్రయాగయందు ఇష్టకామ్యసిద్ధిపొందిశరీర విసర్జనంబుచేసి ద్విజన్మయుడై పుట్టి లాటదేశంబునందు ధారానగరమునకు అధీశ్వరుడయ్యెను అతడు రాజ్యము జేయుచు ఒక్కనాడు మృగయావినోదార్థమై వనమునకు జని అందు సర్పటి యను సిద్ధపుంగవు గని అతనిని తన పట్టణమునకు తోడ్కొనిపోయెను అతడట్లు చనుదెంచి ఒక్కరాత్రి రహస్యవృత్తిచే తన ప్రభావమును చూపదలచి తనచేతి ధూమవేదియను ఔషధముచే ఆరాజు యొక్క పంచమయ లోహనిర్మితమైన చవికెను శుద్ధ సువర్ణమును కావించి పోయెను ఆ మరుసటి దినమున ఇది సర్పటి కృత్యంబని గ్రహించి కృతకమతమున అతనినిరావించి ధూమవేదిని భోజుండపహరించెను సర్పటి కోపించి భోజునకు శాపము నొసంగెను రాజు ప్రార్థింపగా సర్పటి దానిని క్రమ్మరించెను పిమ్మట భోజన నిమిత్తమున భోజసర్పటుల మధ్య జరిగిన

సంభాషణ వివిధ పుణ్యకథా ప్రసంగములు కలదై కథ ముగియును ఇందులోని అవాంతర కథలు (1) అగస్త్య వసిష్ఠులకథ (2) పంచభిక్ష మాహాత్మ్యము (3) దుష్టపతి సత్పతుల చరిత్ర (4) మంటిముద్ద యోగికిబెట్టిన స్త్రీకథ (5) చండాల దంపతుల చరిత్ర (6) అతిథిపూజా ప్రభావము ( ) పుష్పగంధి చరిత్రము (8) గోవ్యాఘ్రసంవాదము (9) చాకలివాని భార్యచే చెరుపబడిన ముని కథ (10) మదనరేఖ కథ (11) పాచకలోముని కథ (12) సుశీల చరిత్ర (13) అన్నదాన పరుడగు విప్రుడు—అతని పదినెల కథ (14) వ్యాఘ్రుకథ (15) మాదిగ వాని కథ ఇందలి కథలన్నియు చెవిగోరొని వినవలెననియే యుండును దేనికదేసాటి అన్నిటికంటె మిన్నయైనది గోవ్యాఘ్రసంవాదము గోవు సకల సాత్త్వికస్వభావమునకు నిదర్శనము పులి అత్యంత క్రూరస్వభావము ప్రదర్శించు జంతువు ఈ రెండిటిని ఒకచో నిలిపి కథాపాటవమేమాత్రము చెడనీయక సంయమనముతో సవిధాన చాతురితో కథ నడపి పగల సామర్థ్యము అనంతునికే దక్కినది ప్రాచీన భారత సంస్కృతియందు అభిమానమున్నవాడు ఎవ్వడైనను ఒకసారి భోజరాజీయమును పఠించవలెను

### ఛందోదర్పణము

భోజరాజీయము తరువాత అనంతడు రచించిన రెండవ గ్రంథము ఛందోదర్పణము విషయము శాస్త్రప్రధానమైన ఛందస్సు కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణుల తరువాత ప్రసిద్ధమైన లక్షణ గ్రంథమిది 4 ఆశ్వాసముల పరిమితి కలిగి 674 గద్య పద్యములుగల దర్పణమునందు 8 వచనములే కలవు అవియును అతుకు ముక్కలవలె మధ్య మధ్య బిగింపబడినవి ప్రథమాశ్వాసమున గద్య పద్యాది కావ్యలక్షణములు గురులఘు నిర్ణయము గణ నిరూపణము ప్రాసయతి విశేషములు పరిగణన సంఖ్య మొదలగునవి కలవు ద్వితీయాశ్వాసమున సంస్కృతాంధ్రభాషలయందలి గద్య పద్యముల విధము షడ్వింశతి ఛందోనామములు సమవృత్తములు వృత్తమిశ్రములగు అర్థసమ విషమవృత్తములు ఛందోతిరిక్తములగు మాలావృత్తములు తద్భేదంబగు దండక లక్షణములు చెప్పబడినవి తృతీయాశ్వాసమున జాతి మాత్రా లక్షణ లక్షితంబులగు రచనలు చాటు కావ్య ప్రమాణములు ఉదాహరణ లక్షణము షట్ప్రత్యయాదులు చేర్చబడినవి చతుర్థాశ్వాసమునందు దశదోషములు సంధి మాసములు మున్నగునవి నిరూపింపబడినవి గ్రంథము దివ్యాలంకృత కృష్ణాహారీ ముకుందానుసంబోధనలతో పెక్కు పద్యము లిందు కనిపించును కస్తూరి రంగకవి నరకు గల లాక్షణికులీతని ఛందోదర్పణమును వాడిరి రాఘు పాండవీయ హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్యలు ఛందోదర్పణమును ప్రామాణికముగా కైకొనినవి లింగమగుంట తిమ్మన తన సులక్షణసార గ్రంథమున సుమారు 40 పద్యములను ఛందోదర్పణమునుండి గ్రహించెను ప్రచుర ప్రచారమును పొందిన అప్పకవీయమునందు దర్పణము నుండి పరిగ్రహములు చూపబడినవి కాని అప్పకవి భోజరాజీయరసాభాసముల పేరైన యెత్తలేదు

లక్షణ గ్రంథములలో సుముద్రణ భాగ్యమును పొందిన వానిలో కావ్యాలంకార చూడామణి అనంతచ్ఛందము అప్పకవీయము ముఖ్యములైనవి కవిజనాశ్రయము కవి జనసంజీవని పెద్దన లక్షణసారసంగ్రహము ముద్రితములయ్యెను ప్రత్యంతరములు లేక శిష్టజనాదరమును పొందజాలక యున్నవి కొలసమగ్రముగా లభించి కామణ్యాదులి కను వెలుగును చూచినవి కావు సార్వభౌముడైన కూచిమంచి తిమ్మకవి యొక్క సర్వలక్షణసారసంగ్రహము తొలి ముద్రణమునసే నిలిచినది మొత్తము మీద ఈ లక్షణ గ్రంథములలోని పద్యములొకే మూసలో పోసినట్లుండును పేరు చెప్పకొందరును చెప్పకయే కొందరును తమ తమ గ్రంథములందు స్వకీయములని చెప్పుచునట్లు ఇతరుల పద్యములను వ్రాసికొందురు తెలుగున తొలి లక్షణ గ్రంథమైన కవిజనాశ్రయము (వావిళ్ల ప్రతి) నందలి

కం భాసురములగుచు సుకరం (సంజ్ఞాధికారము)
ప్రాసాను ప్రాస

అను పద్యము కావ్యాలంకార చూడామణి 7, 8 లో కలదు కావ్యాలంకారచూడామణిలోని స్రగ్విణి భుజంగప్రయాత సుందర మదాక్రాంతా లక్ష్యములకు ఛందోదర్పణములోని లక్ష్యవృత్తములు అప్పచెల్లెండ్ల పోలికగలవి ఇక అప్పకవి మాట చెప్ప నక్కరలేదు తనకు ముందుగల లక్షణ గ్రంథములలోని పద్యములకు ప్రతిబింబములనే ప్రకాశింపజేసినాడు అనంతామాత్యుడు యతులు 24 మాత్రమే చేసెనని అప్పకవి చెప్పయున్నాడు స్వరయతులలో ఋకారము కు యతిమైత్రిని అనంతుడొక్కడే చెప్పినాడు ప్రాచీనలేఖన పద్ధతినిగూర్చియు

వ్యాకరణ విషయమున సంస్కృత ధులను గూర్చియు చెప్పిన వాడన తుడే రగడలను గూర్చి కొంత క్రమించి లక్ష్యముల నొసగిన వాడను అన తుడే

*రసాభరణము*

ఆంధ్ర సాహిత్య పరిషత్తు (కాకినాడ) వారు రసాభరణమును 1931 లో ప్రచురించిరి ఇందు 4 ఆశ్వాసములు కలవు కృత్యాది లభింపలేదు ప్రథమాశ్వాసమున నవరసముల గూర్చియు ద్వితీయాశ్వాసమున విభావాదులను గూర్చియు తృతీయాశ్వాసమున ద్వాదశావస్థలను గూర్చియు చతుర్థాశ్వాసమున నాయికా నాయకులను గూర్చియు లక్షణ లక్ష్యములొసంగబడి యున్నవి చాలావరకు ప్రతాపరుద్రీయము ననుసరించి అనంతుడు దీనిని వ్రాసెను అందుగల నాయక రస ప్రకరణములను ఆధారముగా గొని కవి దీనిని నాల్గాశ్వాసముల గ్రంథముగా సంతరించియున్నాడు

నిశిసు

## అనంతామాత్యుని గంగయ

ఈయన క్రీ శ 1470 ప్రాంతమున నెల్లూరిజిల్లా ఉదయగిరి దుర్గాధ్యక్షుడైన బసవ భూపాలుని మంత్రిగా నుండెను బసవభూపాలుడు పూసపాటి వంశీయుడు ఇతని తండ్రి తమ్మ భూపాలుడు గంగయమంత్రి తల్లి తిప్పాంబిక తండ్రి అనంతామాత్యుడు గంగయమంత్రి అమాత్యశేఖరుడు అగుటయేకాక సాహిత్యమునందును వేదాంతమునందును ప్రీతిగలవాడుగా ఉండెను ఈయన దగ్గుబల్లి దుగ్గన కవిచేత నాసికేతోపాఖ్యానమును జంట కవులగు నంది మల్లయ ఘంట సింగయ గార్లచేత ప్రబోధ చంద్రోదయమును కృతినిగైకొనెను ఈ గ్రంథపీఠిల వలన గంగయ మంత్రి వంశమును గూర్చియు ఆతని ఏలిక యగు బసవ భూపాలుని గూర్చియు కొన్ని అంశములు తెలియవచ్చుచున్నవి

చెందలూరు అను గ్రామము ఒంగోలు తాలూకాలో ఉన్నది ఇది కడవకుదురు రైల్వేస్టేషనుకు 13 మైళ్ళ దూరమున ఉన్నది గంగన ఇంటిపేరు చెందులూరువారు ఈ వంశము మూలపురుషుడు అయితనామాత్యుడు ఇతడు తన మంత్రశక్తిచేత ఉద్ధతులైన వైరిమంత్రీంద్రులకు అంకుశము వంటి వాడట అయితమంత్రికి కొమ్మనయు ఆతనికి అనంతయ్యయు పుట్టిరి అనంతయ్యకు తిప్పాంబికి (ఈమె కాచన మంత్రి శేఖరుని కూతురు) వలన కలిగిన నలుగురు కుమారులలో గంగయమంత్రి కడపటివాడు ఈయన సతీమణి నారమ ఈమె కాచమ రాజశేఖరుని సుత రాజశేఖరమంత్రి మౌద్గల్య గోత్రుడు ప్రబోధ చంద్రోదయమువలన వీరిది పెసరువాయ వంశమనియు తెలియుచున్నది "పెసరువాయ వంశవార్ధి బిరుహారి మండలా" అని గంగయామాత్యుడు సంబోధింపబడినాడు పెరువాయ అను గ్రామము కాంతి ప్రతాపరుద్రుని కాలమున క్రీ శ 1 99 లో అల పురము బ్రహ్మేశ్వరాలయమందలి ఒక శాసనములో పేర్కొనబడినది (తెలంగాణా శాసనములు రెండవ సంపుటము కాకతీయ శాసనం 14) అల పురి మహబూబునగర మండలమున ఉన్నది పెసరువాయకూడ ఈ జిల్లాలోనే ఉండియుండవచ్చును గంగనామాత్యుని పూర్వులు ఈ గ్రామమునుండి చెందులూరు గ్రామమునకు తరలిపోయి అచ్చట స్థిరపడినవారేమో అని తోచును

గంగయ మంత్రి శివభక్తి పరతంత్రుడు ఈతడు మాధవశర్మ వంశీయుడైన బసవభూపాలునిచే మన్ననలు వడసినవాడు గొప్ప నీతి విదుడు ఇతడు తన నయనైపుణ్యముచే స్వయం హమనుజాధీశుని జీవగ్రాహముగా పట్టుకొనుటలో తోడ్పడెను దీనిని ముందు చర్చింతము ఈ మహామంత్రి సకల సంసార భోగములను అనుభవించువాడైనను తామరాకు మీది నీటి బిందువువలె సంసారమునందు నిర్లిప్తుడైన యోగియని నంది మల్లయ ఘంట సింగయ కవులు ఈతనిని సముచితముగ ప్రశంసించిరి కావుననే ఇతడు ప్రబోధ చంద్రోదయమువంటి వేదాంత కావ్యమును కృతిగా స్వీకరించెను ఈతడు కృతిపొందిన నాసికేతోపాఖ్యాన వృత్తాంతము కఠోపనిషత్తునందును మహాభారతమునందును కలదు దీనివలన గంగయమంత్రి శ్రుతి పురాణాదులతో గాఢ పరిచయముకల మనీషియని స్ఫురించుచున్నది

గంగనామాత్యుని ప్రభువైన పూసపాటి బసవ భూపాలుడు బెజవాడ దుర్గా బ వరమువలన చతురంగబలములు వడసి ఆమె కటాక్షముచే అచ్చట సువర్ణవృష్టి కురిపించిన మాధవవర్మ వంశజుడు తమ్మరాజు తనయుడు ఉదయగిరి దుర్గాధ్యక్షుడు దుగ్గన చెప్పిన విషయమిటేయుండగా జంట కవులు తమ ప్రబోధచంద్రోదయమున ఈ బసవరాజును గూర్చి ఇట్లు పొగడిరి

సీ. మాధవవర్మ భూమండలేశ్వర వంశ
 జలధికి నేరాజు చ దమాము
యేరాజు దయ శైల మెలమి విభేదించెఁ
 గ టాపాత మదా ధ కారమడఁగ
గజపతి సురథాణి గడి దుర్గములకెల్ల
 నేరాజు వజ్రంపుబోరు తలుపు
మహిమచే నేరాజు మరపి చె నల భగీ
 రథ పృధు మాంధాతృరఘు రమణుల
నట్టి గుణశాలి తమ్మరాయని కుమార
వీర బసవతు మాచక్ర విభునిచేత
మన్ననలఁగాం చి మించిన తుహితుఁడితఁడు
మనుజమాత్రుండె గంగయా మాత్యవరుఁడు

ఈ పద్యమును బట్టి చూడగా బసవరాజు ఉదయగిరి దుర్గమును విబేధించి గజపతి గడిదుర్గములకు బోరుతలుపై అనగా రక్షకుడుగాను డెనని తెలియుచున్నది ఈ బసవరాజు గజపతికి సామంతుడుకాడని పై సీసపద్యములోని విశేషణము లన్నియు బసవరాజు తండ్రియైన తమ్మ భూపాలునికే చెంద వలెననియు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆగష్టు 1959 భారతిలో వ్రాసియున్నారు ఉదయగిరి దుర్గము నెల్లూరికి 60 మైళ్ల దూరము నున్న బలిష్ఠమైన కోట ఈ కోట 3000 అడుగుల ఎత్తున ఒక కొండపై కట్టబడినది స్థానికచరిత్రలందు దీనిని లాంగూల గజపతి కట్టినట్లు వ్రాయనైనది

బసవ భూపాలుని వంశము

మాధవవర్మ (బెజవాడ కనకదుర్గ ప్రసాదము నందిన మహారాజు)



గజపతుల రాజ్యమునకు కడదుర్గమును విజయనగర సార్వ భౌములకు మొదటి దుర్గమునైన ఉదయగిరి చరిత్రలో కడ ప్రసిద్ధమైనది

క్రీ శ 1460 లో కపిలేంద్రగజపతి దీనిని స్వాధీన పరచుకొని బసవరాజు తండ్రియైన తమ్మరాజును దుర్గాధ్య క్షునిగా నియమించెను తమ్మభూపతి ఈ సంవత్సరమే గోపాల కృష్ణునికి ఉదయగిరి దుర్గముపై నగరు కట్టించెను తమ్మ భూపతి శాసనములకై నెల్లూరు శాసన సంపుటములు పుటలు 1573 76 చూడదగును క్రీ శ 1470 నాటికి కపిలేంద్రుడు స్వర్గస్థుడు కాగనే ఉత్కళ రాజ్యమున అంతఃకలహములు సంప్రాప్తమయ్యెను ఇది మంచి తరుణమని సాళ్వనరసింహ రాయలు ఉదయగిరిని ఆ సంవత్సరమే స్వాధీన రచుకొనెను అంతవరకు గజపతులకు సామంతుడైన తమ్మరాజు రాయ సామంతుడయ్యెను ఇతని కాంచీపురమందలి శాసనమందల్లే చెప్పబడినది దీనికాలము క్రీ శ 1471 తమ్మరాయల శాస నములలో ఇదియే చివరిది తమ్మరాయల కుమారుడైన బసవరాజు క్రీ శ 1471 తరువాత ఉదయగిరి రాజ్యమునకు వచ్చియుండును బసవభూపుని సంతతివాడు పాపరాజు కుమారుడు సంగయ్యదేవుడు శక 1440 లో వేయించిన శాస నముగూడ దీనిని సమర్థించును (దక్షిణ హిం IV సం 789) కపిలేంద్ర గజపతి మరణానంతరము కుమారుడైన పురుషో త్తమ గజపతి క్రీ శ 1468లో ఓఢ్ర సింహాసన మెక్కి సుమారు ముప్పది సంవత్సరముల కాలము పరిపాలించెను అప్పటి ఉదయగిరిదుర్గము సాళువ నరసింహుని చేతి యందుండెను తండ్రి కాలమున నష్టపోయిన దుర్గములను స్వాధీనపరచుకొనుటకై పురుషోత్తమ గజపతి ఉదయగిరి పైకి నడువగా సాళ్వనరసింహుడు ప్రతిఘటించియుండును పురు షోత్తముని ధాటి కాగలేక నరసింహరాయలు జీవగ్రాహముగా పట్టుబడెనోయి ఉదయగిరిని ఆతడు పురుషోత్తమునకు "అభయయాచనాంజలి"తో అర్పించుకొనెననియు సరస్వతీ విలాసము అనంతవరం శాసనములు చెప్పుచున్నవి సరస్వతీ విలాసము ప్రతాపరుద్రగజపతి రచించిన ధర్మశాస్త్ర గ్రంథము సాళువ నరసింగరాజును పట్టుకొనుటలో గంగయామాత్యుని రాజనీతికౌశలము బసవరాజుచే వినియోగింపబడినదని చెప్పు చుందురు ప్రబోధచంద్రోదయమునందలి

శ్రీకర వీక్షణ దాసవ
శీకరనరసింహ నృప వశీకరనయవి
ద్యాకరణచతురగళవి
ద్యాకర ధీర గమతి యనంతయ గంగా (2-1)

నరసింహ నృపుని వశీకరించుకొను గలిగిన నయవిద్యా విశారదుడా ! అని దీని యర్థము ఈ నరసింహ నృపు డెవ్వ రను విషయమున దేశ చరిత్రకారులలోను వాఙ్మయ చరిత్ర కారులలోను సందేహములు పొడసూపినవి గంగయామాత్యుని సమకాలికులు మీపకాలికులునైన నరసింహ నామధేయులు నలువురు గలరు క్రీ శ 1486 నుండి 1490 వరకు విజయ నగర సింహాసన మధిష్ఠించిన సాళ్వ నరసింహరాయ లొకడు అతని తనయుడు ఇమ్మడి నరసింహరాయలు రెండవవాడు సాళ్వ నరసింహరాయల దండనాథుడైన తుళువనరస నాయ కుడు మూడవవాడు ఇక నాలుగవవాడు ఈ నరసనాయ కుని పెద్దకుమారుడు వీరనరసింహరాయలు ఈ నల్వురును క్రీ శ 1486 1509 మధ్యకాలమున నుండువారు వీరిలో ఒక నరసింహ నామధేయుడు గంగనామాత్యుని నయవిద్యా నైపు ణ్యమునకు వశుడయ్యెను

వీరేశలింగ పంతులుగారు "గంగయామాత్యుడు ముందు జైమినీ భారత కృతిపతియైన సాళువ నృసింహ నృపా లుని సచివుడై యుండినట్లు ప్రబోధచంద్రోదయ ద్వితీయా శ్వాసాది పద్యములవలన తెలియవచ్చునని తమ ఆంధ్రకవుల చరిత్ర (ద్వితీయ ముద్రణము) 640 పుటలో వ్రాయుచున్నారు ఈ యభిప్రాయము సమంజసముగా లేదని శేషమళ్ళ అచ్యుత రావుగారు తమ విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్ర వాఙ్మయచరిత్రము" (ప్రథమ భాగము 1935) 215 216 వ పుటలలో ఇట్లు విమర్శించిరి

"గజపతులయొద్ద మంత్రిగానున్న కాలములో కృతి నొందిన గ్రంథములో శత్రురాజునొద్ద దానుమంత్రిగానుండినట్లు వ్రాయించుకొనునని యూహించుట అసంగతమని తోచు చున్నది కనుక (సాళ్వ) నృసింహరాయలను జీవగ్రాహ ముగా బట్టించుటయే గంగమంత్రియొక్క నయవిద్యాకరణ మహత్త్వమని నిర్ణయింపవచ్చును" ఆంధ్ర కవితరంగిణీ కర్తలైన చాగంటి శేషయ్యగారు 6 వ సంపుటము 184 పుట యందునందమల్లయ ఘంటసింగనలమగూర్చి వ్రాయుచు అచ్యుత రావుగారి పై యభిప్రాయమును బలపరచిరి డా॥ రాయ

ప్రోలు సుబ్రహ్మణ్యా గారు "The Suryavamsi Gajapatis of Orissa (1952) అను తమ సిద్ధా త గ్ర థము (పుట 8) న దును రాళ్ల బ డి సుబ్బారావుగారు , ఓఢ్ర గజపతులు అను తమ వ్యా మున దును (తెలుగు స స్కృతి విజ్ఞాన సర్వ స్వము - 3 పుట 76) సాళ్వ నరసింహారాయలే గ గమంత్రి రాజనీతి చాకచక్యమునకు లోబడిపోయిన నరసింహ నృ తి యని నిశ్చయి చిరి వీరి అభిప్రాయముల నన్ని టిని సిూచిన ముగా సమీక్షి చి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆగస్టు 1959 భారతి పత్రికయ దు మాధవవర్మ అతని సంతతి అను వ్యాసావళిని ముగించుచు ఇట్లు వ్రాసియున్నారు (పుట 63 64) "శ్రీకరవీక్షణ యను పద్యములోని వర స హన్నృపతి సాళువ నరసింహన్నృపతియే యని శాయిగ్రుద్ది నట్లు చెప్పవీలులేదు వశీకర యన్న వశపరచుకొన్నవాడని యర్థమైనను తన నయ విద్యావై పుణ్యమున పై నలుగురిలో నెవరో యొకరి మనసు మెప్పి చి యతనిని దనవానిగ జేసి కొనె ననియు నర్థము చెప్పవచ్చును జీవగ్రాహముగ సాళువ నరసింహుని బట్టుకొనినట్లే చెప్పనక్కరలేదు ఇంతకు బసవ రాజు రాయసామంతుడు కాని గజపతి సామంతుడుకాడు నరసానాయకుడు శాలివాహనశకము 1425 (క్రీ శ 1503) లో మృతినొ దెను ఇతని మరణానంతరముకూడ ఇమ్మడి నర సింహరాయలు జీవించియుండెను అ దువలన శాలివాహన శకము 1420 (క్రీ శ 1498) నాటి బసవరాజు శాసనము నందు చెప్పబడిన రాయలు నరస హుని పుత్రుడై న ఇమ్మడి నరసింహరాయలు కావలెను పేరుకు ఇమ్మడి నరసింహ రాయలు రాజయినను అధికారమంతయు తుళువ నరసనాయ కునిదే అట్లగుట శ్రీకరవీక్షణ పద్యములోని నరసింహనర పతి తుళువ నరసనాయకుడై న కావచ్చును శర్మగారు సుదీర్ఘముగా శాసన ప్రమాణములతో బసవరాజు గజపతి సామ తుడుగాడని రాయ సామంతుడే యని నొక్కివక్కా ణించినను శ్రీకరవీక్షణ యను ప్రబోధ చంద్రోదయ పద్యములోని నరసింహన్నృపతి ఎ నరసింహుడో స్పష్టముగా చెప్పక యే తమ వ్యాసావళిని ముగించిరి

మొత్తముమీద యెవరెట్లు వ్యాఖ్యానించినను కర్ణా టక నృపుడెవ్వడై ననేమి గ గనామాత్యుని నీతివిద్యా విశార దత్వము మాత్రము ఆనాడుప్రఖ్యాతమైనది కమక నే గ గనా మాత్యుని దుగ్గనయు జంటకవులును నీతికళా యుగంధ రు నిగా పొగడియున్నారు గ గనామాత్యుని ప్రోద్బలము చేతనే కాబోలు బ వఘూపాలుడు దూబగు ట నారాయణ కవిచే నీతిగ్ర థమగు ప చత త్రము నా ధ్రీకరి ప జేయి చు కొనెను

చెందలూరి గ గనామాత్యుడు పెనరువాయాన్వయ సంజాతుడు గ గన అ త్తవారును పెనరువాయాన్వయులే యని తెల్పుటకు దుర్గాభైరవరాజు వ శములోని లక్కసానమ్మ భ ర్త ఆదిరాజు క్రీ శ 1469 లో తిరుపతిలో ఒక శాసనమును వేయి చెను (నె 52 తి లి దే సాళ వ నరస హుని కాలపు శాసనములు) అ దు లక్కసానమ్మ పెనరువాయాన్వయము నకు స బంధించినదని తెలుపబడినది ఈ పెనరువాయి యెచ్చటిదో ? యని చాగంటి శేషయ్యగారు వ్రాసిరి

కాకతి ప్రతాపరుద్రుని కాలమున క్రీ శ 1299 లో అల పురి బ్రహ్మేశ్వర దేవాలయమునగల ఒక శాసనమున (తెలం శా 2వ కాకతీయ శా 14, పెనరువాయ పేర్కొన బడినది అల పురము మహబూబు మండలమునందలిది కావున పెంరువాయగూడ అ దేయుండును గ గనామాత్యుడు మహ బూబుమ డలము వాడనుటలో దేహములేదు గ గన ఎ త రాజనీతి విశారదుడో అ త సరసుడును స గీత సాహి త్యముల దీతనికి సమానమైన అభినివేశముకలదు సంగీతమున గ గనకుగల ప్రజ్ఞ యెట్టిదో తెలియరాలేదు కాని సాహిత్యాభి మానమునకు రె డాంధ్ర గ్రంథములు నాంకేతోపాఖ్యానము ప్రబోధచంద్రోదయము సాక్ష్యములు దగ్గుపల్లి దుగ్గయ దీనికి క ర్త దుగ్గయ కవిసార్వభౌముడై కర్ణాటవిభుచేత కనకాభిషేకము సత్కారములు కనిన శ్రీనాథుని కూరిమి నేయు మరది ఆ మహా వీంద్ర ప్రసాదలబ్ధకవితావిశేషమే దుగ్గనను కవిగా తీర్చినది సకల విద్యాచతురుడై న దుగ్గన అనేక చాటుపద్యములు రచియి చి గ గనామాత్యుని కీర్తి సౌరభములను గుబాళి ప జేయుటయేగాక గంగనామాత్యుని ఎనతండ్రి కుమారుడై న దేవమ త్రికి కా చీపుర మాహాత్మ్య మను కృతి న కితముజేసె చెందలూరివారికి ఆస్థాన విద్వాంసు డై నాడు గంగయామాత్యు డంకితముగొన్న రెండవకృతి ప్రబోధచంద్రోదయము దీనిని నంది మల్లయ ఘంట సింగయ కవులా ధ్రీకరించిరి ఈ జంటకవులే వరాహ పురాణమును గూడ ఆ ధ్రీకరించి సాళ్వ నరసింహభూమండలేశ్వరుని సేనా పతియైన తుళువ నరసానాయకున కంకిత మొనర్చిరి

సంస్కృత ప్రబోధచంద్రోదయము అను నాటకము ఆంధ్ర వేదాంత నాటకము. క్రీ శ 11 వ శతాబ్దమువాడైన కృష్ణమిశ్రపరమహంస దీనిని రచించెను. ఇందు మతి వివేకులు నాయికా నాయకులు. అద్వైత వేదాంతమును ముముక్షువులు సులభముగా తెలిసికొనునట్లు చేయుటకై కృష్ణమిశ్రుడు ఈ కృతి రచించెను. చార్వాక బౌద్ధ పాశుపత నైయాయిక వైశేషిక పూర్వమీమాంసాదిమతములిందు చర్చింపబడినవి. ఈ సంస్కృత రూపకము తెలుగున అయిదారుగురు కవుల చంపూ రూపమున అవతరించినది. ప్రబోధ (జ్ఞాన) మనెడి చంద్రునియొక్క ఉదయమే ప్రబోధచంద్రోదయము.

ని శ సుం

## అనంతుడు

వెలనాటి చోడరాజన్యులలో మూడవగొంక నరేంద్రుని కుమారుడును వెలనాటి వారిలో చివరివాడునగు పృథివీశ్వర నృపాలుని చెంత అనంతుడను పేరుగల ఒక కోశాధ్యక్షుడుండెను. అతడు శ్రీకూర్మమునందలి కూర్మేశ్వర స్వామివారికి నిరంతరము దీపద్వయము వెలిగించుటకై కొన్ని దానములొనర్చెను. శ్రీకూర్మము గంజాం మండలమునందలి శ్రీకాకుళ తాలూకాలో నున్నది. అందు కూర్మేశ్వరస్వామి దేవాలయములోని వస్తుస్థాపనగృహమున కెదురుగా నొక శాసనము కలదు. అందు అనంతుడొనర్చిన దాన విషయము లిఖియింపబడియున్నది (ద హిం V సె 1254 పుట 431).

ఈ శాసనమున కనవచ్చు విషయములు. వెలనాటి విషయమునకు అధిపతియైన పృథ్వీమూలునిచెంత కోశాధ్యక్షుడగు అనంతుడు శా శ 1128 (క్రీ శ 1203)న సూర్యుడు మేషరాశిలో నుండగా శ్రీకూర్మేశ్వరస్వామివారికి శాశ్వతముగ దీపద్వయము వెలిగించుటకై ఆచరించిన దానధర్మాధికములు. అతడొనర్చిన దాన వివరములు మాత్రము శాసనమందు కనవచ్చుటలేదు. ఈ శాసనమున కనిపించు వెలనాడు అను దేశవిషయమును దానిప్రభువగు పృథ్వీమూలుని విషయమును కొంత వివరించుట యావశ్యకము.

గుంటూరు మండలమునందలి తెనాలి రేపల్లెతాలూకాలకు గుంటూరు తాలూకాలోని కొంతభాగమునకు పూర్వము వెలనాడు అను నామము డెడిది. దీనికే విశనాండని నామాంతరము కనిపించుచున్నది. ఈ సీమలోని శాకరంబు అను గ్రామమును కారచేడు వాస్తవ్యుడైన దేవశర్మ అను బ్రాహ్మణునకు దానమొసగినట్లు క్రీ శ 76 నాటిదైన చాళుక్య ప్రథమ విజయాదిత్యుని శాసనమువలన తెలియవచ్చుచున్నది. ద్రాక్షారామమునందలి యొక శాసనమువలన వెలనాటి రెండవ గొంకరాజు మూలపురుషుడైన మొదటి మల్లివర్మ త్రిలోచన పల్లవు సమరమున నాయమొనర్చి ఈ వెలనాటి విషయమును (దేశమును) అతనివలన స్వీకరించి సామంతుడై దీనిని పాలించినట్లు తెలియుచున్నది. వెలనాడు ఆరువేల గ్రామములతో కూడిన ప్రదేశమని యొక శాసనములోను ఆరువేల మూడువందల గ్రామములతో నొప్పునదని వేరొక శాసనములోను కనవచ్చుచున్నది. వెలనాటి దేశమునకు చందవోలు రాజధాని. చందవోలుకు ధనదుపురము సనదవ్రోలు అను పేర్లున్నవి. వెలనాటి చోడనృపాలురకు కూడ ఇదియే రాజధానియై యొప్పునది. చందవోలు నేడు గుంటూరు మండలములోని రేపల్లె తాలూకాలో నున్నది. ధనదుపురము (చందవోలు) పుష్పకవిమానములవంటి సుందరములగు దేవాలయములతో వెండికొండలవలె స్వచ్ఛమైన సౌధములతో కుబేరుని నిధులను బోలిన అగళ్ళతో ఉదకపూర్ణములైన తటాకములతో ఉపవనములతో సరస్సులతో చెరకు తోటలతో ఒప్పుచు అపరస్వర్గమువలె నుండెడిదనియు ఆ పట్టణమునందలి ప్రజలు మెట్టికుండ నుంకము చమురింపు పూరిల్లు నూలుచీరె రత్నములు పొడగని సువర్ణాభరణములు అననెట్టివో ఎరుగరనియు మంచన తన కేయూరబాహు చరిత్రలో వర్ణించెను.

వెలనాటి విషయాధీశుడైన పృథ్వీశ్వర భూపతి మూడవ గొంకనరేంద్రునకు కొండపడమటి రాజవంశమువారి ఆడపడుచైన జయాంబిక అను భార్యవలన జన్మించెను. వెలనాటి చోడరాజులలో పృథ్వీశ్వరుడు చివరివాడు. అని తండ్రి పాలనకాలము శా శ 1108 (క్రీ శ 1186) అని తెలియుచున్నది. తండ్రియనంతరము పృథ్వీశ్వరుడు వెలనాటి రాజ్యశాసనము వహించెను. ఈతనికిని చందవోలే రాజధాని. ఇతడు మిక్కిలి బలవంతుడు. పీఠాపుర చాళుక్యులను జయించి కళింగదేశమును కైవసమొనర్చుకొని పల్లవరాజగు బయ్యయను పలాయితునిజేసెను. గాంగవంశజుడైన రెండవ రాజరాజదేవుని (శా శ 1091-1112 ప్రాంతము) పదచ్యుతునిజేసిన దిట్టయే ఈ పృథ్వీశ్వరుడు. ఈతనికి కళింగ యుద్ధమున సాయపడిన వారిలో ఇతని ప్రధాన దండనాయకుడైన కొరవి

వెన్నయామాత్యుడు ముఖ్యుడు దానిచే ఈ అమాత్యునకు వెలనాటి పృథ్వీశ్వర రాజ్యసముద్ధరణ వీర ఘోట్టవిశాళ రాయగజగ ధవారణ మున్నగు బిరుదములుకూడ లభించెను ఈ వెలనాటి పృథ్వీశ్వరుని శాసనము శ్రీకూర్మమున (శక 1110 నాటిది) ఉండుటచేత అతడు శక 1108-1110 ప్రాంతమున కళింగ దేశముపై దాడివెడలి దానిని జయించినట్లు తెలియుచున్నది శక 1128 (క్రీ శ 1206) నాటి శాసనములో వెలనాటి పృథ్వీశ్వరరాజు పేర్కొనబడుటచే ఈతడు క్రీ శ 1206 వరకు జీవించియుండెననుట తథ్యము కాకతి గణపతిదేవుడు ఈతనిని జయించియే వెలనాటి రాజ్యమును హస్తగతమొనర్చుకొనెను గణపతిదేవుని ఈ విజయము క్రీ శ 1206 తరువాత జరిగియుండవలెను వెలనాటి విజయములో గణపతిదేవునకు సాయమొనర్చినవాడు నెల్లూరు చోళ తిక్కరాజు ఈతడు శైశవమునందే పృథ్వీశ్వరరాజు శిరస్సుతో కందుక క్రీడసల్పెనని నిర్వచనోత్తరరామాయణమున వర్ణింపబడినది

వెలనాటి పృథ్వీశ్వర రాజునకు పృథ్వీమూలుడని పేరుండుట విశేషము ఇది శాసనలేఖకుని ప్రమాదమైన కావచ్చును ఏలన ప్రాచీన కళింగ నృపతులలో పృథ్వీమూలుడను ప్రసిద్ధ వీరుడుండెను ఈతడు విష్ణుకుండిన ఇంద్రభట్టారకవర్మను జయించినట్లు తెలియుచున్నది పృథ్వీమూలుని పేరు వీరవ్రతమునకు కళింగదేశమున ప్రసిద్ధికెక్కియుండును అతని నామసామ్యముచే వెలనాటి పృథ్వీశ్వరుని పృథ్వీమూలుడు అని పొరపాటుగా వ్రాసిరి కావచ్చును

తం ఆం శా

## అనంతరాజు - వెంకటరాజు

అనంతరాజు వెంకటరాజు గొప్ప శూరుడు చాటుపద్యమణి మంజరి ద్వితీయభాగమున ఇతని ప్రశంస కనవచ్చుచున్నది (చా మం II 231) మట్ల తిమ్మరాజునకును వెలుగోటి కస్తూరి రంగప్పనాయకునకును కోడూరునొద్ద గొప్ప సమరము జరిగెను శా శ 1501 (క్రీ శ 1579)కు సరియగు ప్రమాదిత్సర ఆశ్వయుజ శుద్ధ అష్టమి ఆదివారమునాడు ఈ సమరము జరిగినట్లు గ్రంథమున కనిపించుచున్నది ఈ యుద్ధము జరుగుటకు ప్రధానకారణమిది సారె యోబళరాజు యొక్క రాజ్యమును మట్ల తిమ్మరాజు ఆక్రమించుకొనెను బలహీనుడును అగతికుడునైన యోబళరాజు ఖ్యాతవృద్ధుడును యాచమనాయకుని తండ్రియును మహాపరాక్రమోపేతుడును నగు వెలుగోటి కస్తూరి రంగప్పనాయని శరణుజొచ్చెను రంగప్పనాయడాతని కభయమిడి శత్రునిర్మూలనమునకై సైన్యముతో సమరమునకు బయలుదేరెను చామెర వెంకటప్పనాయడు గొప్పసైన్యమును వెంటనిడుకొని కస్తూరి రంగప్పనాయనికి సాయముగ వచ్చెను దండు కోడూరుచెంత విడిసెను మట్ల తిమ్మరాజు గూడ తక్కువవాడు కాడు దాసరిరాజు గోపరాజు వెంకటరాజు మొదలగు సోదరులతో అనంతరాజు వెంకటరాజు మున్నగు నేబదిమంది మహాయోధులతో నొప్పుచున్న సైన్యము వెంటరాగా మట్ల తిమ్మరాజు రంగప్పనాయని మార్గమున ఎదుర్కొనెను ఇరువాగుల వారికిని రణము ఘోరముగ జరిగెను ఇరువైపులగూడ సైన్యమపారముగ నష్టమయ్యెను రంగప్పనాయడు మట్ల తిమ్మరాజును తన కరవాలమున కెరచేసెను విజయలక్ష్మి తుదకు కస్తూరి రంగప్పనే వరించెను అనంతరాజు వెంకటరాజు మున్నగు వీరు లేబదిమందియు రంగప్పనాయనికి బందీలుగ పట్టుపడిరి దయార్ద్ర హృదయుడగు రంగప్పనాయడు వారిని వధింపక వారి నివాసములకు వారిని సురక్షితముగ పంపివైచెను జయించిన రాజ్యమును సారె యోబళరాజున కప్పగించెను

తం ఆం శా

## అనకంపేట

ఈ గ్రామ ప్రశంస (త ని-27) అను గ్రంథములో కలదు ఇది తెలంగాణమునందలి ఎల్గడపు పరగణాలో నున్నది ఇది నిర్మల పట్టణమునకు సమీపమున ఉన్న కోహె వాస్సారు (ఒక కొండను ఆనుకొని యున్నది ఎల్గదల (కరీంనగరంజిల్లా) జిల్లాదారుడగు తఖీఖాను అనునాతడు విప్లవము చేయదలచెను వాడు పదాతులు సవారులతోగూడిన ఐదువేల సైన్యమును సమకూరెను అనకంపేట ఈతని కార్యస్థానము ఇది మొదటి నిజాము ఆసఫ్‌జా దక్కనుసుబేదారుగా వచ్చిన కాలమని తోచుచున్నది తఖీఖాను తలపెట్టిన తిరుగుబాటు క్రొత్త సుబేదారుమీద కావచును ఈతనినిగూర్చి ఇంతకన్న వివరములు తెలియవచ్చుట లేదు

కా గో
ఆ మ

## అనకాపల్లి

విశాఖపట్నంజిల్లా అనకాపల్లి తాలూకాలో అనకాపల్లి ఉన్నది దీనికి 20 మైళ్ళ దూరములో విశాఖపట్నం కలదు దీని ఉత్తర అక్షాంశము 17 - 4½ తూర్పు రేఖాంశము 83 - 01 దీనిచుట్టు తుమ్మపాల నాతవలసరోడ్డు ఉమ్మలాడ ఎరసపల్లి ఉన్నవి ఈగ్రామ విస్తీర్ణము 5754 ఎకరములు ఇది నాతవలస జంక్షన్ వరకును తుమ్మపాలవైపును వృద్ధి యగుచున్నది

1961 సం జనాభా లెక్కల ప్రకారము అనకాపల్లిలో పురుషులు స్త్రీలు కలిసి 45 210 మంది ఉండిరి వీరిలో షెడ్యూలు తరగతులవారు షెడ్యూలు జాతులవారు 2 305 మంది 1951 సం లో జనులు 40 102 మంది ఉండిరి జనాభాలో వృద్ధి 5 108 మంది దీనికి స్థానిక సంతానాభివృద్ధియే కారణము ఇచట ఇండ్లు ఒకచో దగ్గర దగ్గరగాను ఒకచో పేటలుగాను మరియొకచో శివారులుగాను ఉన్నవి వీటిలో 2 045 పెంకుటిండ్లు 185 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 209 ఒక అంతస్తుగల మేడలు 75 పెక్కు అంతస్తుగల భవనములు జనులలో రెండువంతులవారు వరిఅన్నమును ఒకవంతువారు జొన్న చోడిఅన్నములను తిందురు వీరు బావుల నీటిని త్రాగుదురు పరిశుద్ధము చేయబడిన నీటిని కుళాయిలద్వారా కూడా త్రాగుటకు ఏర్పాటు అగును

5 శారదానది కాలువలు అనకాపల్లి ఆవ పెదకమ్మ చెరువు మొదలగునవి ఇచట పంటలకు ఉపకరించుచున్న నీటి వనరులు వరి గంటి చోడి మొక్కజొన్న చెరకు ఉల్లి మొదలగు పంటలను పండింతురు అరటి తోటలు మామిడి తోటలు కొబ్బరి తోటలు కలవు స్థానికుల ఉపయోగములకు కూరగాయలను పండింతురు పొరుగు గ్రామములనుండి కూడ కూరగాయలు తేబడును 1966 67 సం లో పంటల క్రింద 4 864 ఎకరముల భూమి ఉపయోగపడెను కాలువల క్రింద 3 555 ఎకరముల భూమి చెరువుక్రింద 131 ఎకరముల భూమి సాగుబడి ఆయెను 40 ఆయిల్ ఇంజనులు 23 ఎలక్ట్రిక్ మోటారులు 500 ఎకరములకును 100 మోటారులు ఏతములు 200 ఎకరములకును నీటిని సరఫరా చేసెను ఒక ట్రాక్టరు 250 ఎకరముల భూమిని దున్నెను తుమ్మపాలకు బండ్లపైనను మధ్యప్రదేశ్ మహారాష్ట్ర గుజరాత్ ఒరిస్సా పశ్చిమ బెంగాలు బీహారులకు లారీలపైనను రైళ్ళమీదను చెరకును బెల్లమును రవాణాచేసిరి ఇచట ఉత్పత్తియగు మామిడి కాయలలో సగమువంతు గ్రామస్థులు వాడుకొని మిగిలిన సగభాగమును విశాఖపట్నమునకు రవాణాచేసిరి

అనకాపల్లిలో 575 గేదెలు 303 ఆవులు 541 ఎద్దులు 199 దున్నలు ఉండెను ఇవిగాక 247 మేకలు 248 గొఱ్ఱెలు 4 9 6 కోళ్ళు 4 గుర్రములు 185 పందులు 4 గాడిదలు కలవు రోజునకు 400 లీటర్ల పాలు పాలసంబంధమగు పదార్థములు 730 గ్రుడ్లు మాంసము స్థానికులు ఉపయోగించుకొనిరి

ఇచట జనుల ముఖ్యజీవితాధారములు వ్యవసాయము పరిశ్రమలు కూలి కమీషన్ ఏజంట్లు దుకాణాదారులు క్రయవిక్రయదారులు జట్కాలు టాంగాలు రిక్షాలు టాక్సీలు ఎద్దుబండ్లు నడుపువారు కూడ కలరు కమసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీపనివారు తెలికలవారు మంగలివారు నూలు మగ్గములవారు ఉన్నారు వడ్లమరలు వర్కుషాపులు ఉన్నవి రీరైండింగులు చేనేత వస్త్రములు ఇక్కడి అల్యూమినియ ఇనుప వస్తువులు తాటిపీచు వీటికిచెందిన పరిశ్రమలు కలవు వీటివలన 2 000 మంది జీవించుచున్నారు వ్యవసాయమునకు పరిశ్రమలకు సరిపోవు కూలీలు ఇచట దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి రు 2-50 లు స్త్రీకి రు 1-75 లు

ఈ పట్టణమునందు కన్యకాపరమేశ్వరీ ఆలయము కాశీవిశ్వనాథుని ఆలయము గౌరీపరమేశ్వరుల ఆలయము భోగలింగేశ్వరస్వామి ఆలయము సత్యనారాయణమూర్తి ఆలయము కలవు నూకాలమ్మగుడి ఒకచర్చి ఒకమసీదు ఉన్నవి శ్రీ భోగలింగేశ్వరస్వామి దేవాలయమునకు సాలీనా రు 2000 ల ఆదాయము వచ్చును నూకాలమ్మ పండుగలు జరుగును

అనకాపల్లికి రైల్వేస్టేషను కలదు అనకాపల్లి గవర్నమెంటు బస్సులకు కో-ఆపరేటివ్ బస్సులకు ప్రయివేటు బస్సులకు కూడలి ఈ బస్సులు పూడిమడకనుండి అనకాపల్లి విశాఖపట్టణములకును రాంబిల్లి నుండి పాయకారావుపేటకును రాయవరం నుండి విశాఖపట్టణమునకును దిమిలినుండి విశాఖపట్టణమునకును పెంటకోటనుండి అనకాపల్లికిని పాపేటనుండి అనకాపల్లికి మాడుగులకు పాడేరుకు విశాఖపట్టణమునకు సింహాచలమునకును కాకినాడనుండి విశాఖ

పట్టణము విజయనగరము పార్వతీపురములకును రాజమండ్రినుండి విశాఖపట్టణమునకు విజయనగరమునకు శ్రీకాకుళమునకును అన్నవరం నుండి సింహాచల శ్రీకూర్మములకును కెండి పేటనుండి అనకాపల్లి విశాఖపట్టణములకును పోవును మరియు ఈ బస్సు తాండవానుండి అనకాపల్లి విశాఖపట్టణములకును నర్సిపట్టణమునుండి చోడవర అనకాపల్లి విశాఖపట్టణములకును సీలేరునుండి విశాఖపట్టణమునకును కొయ్యూరు నుండి విశాఖపట్టణమునకును పాడేరునుండి అనకాపల్లి విశాఖపట్టణములకును చోడవరం నుండి అనకాపల్లికిని అనకాపల్లి నుండి విశాఖపట్టణం విజయనగరం శృంగవరపు కోటలకును పోవును ఈ అనకాపల్లిలో 28 89 కిమీటర్ల కంకర రోడ్లు 12 53 కి మీ సిమెంటు రోడ్లు 2 70 కి మీ B T S రోడ్లు 0 18 కి మీ మట్టిరోడ్లు కలవు ఈ అనకాపల్లిని పొరుగు గ్రామములతో సిమెంటు రోడ్డు కంకరరోడ్లు కలుపుచున్నవి ఇచటి ప్రయాణములకు 4 గుర్రపుబండ్లు 247 రిక్షాలు 3 టాక్సీలు 10 మోటారు కార్లు 4 ఒంటెద్దుబండ్లు 106 రెండెడ్లబండ్లు 608 సైకిళ్ళుకలవు

ఇచట సబ్ పోస్టాఫీసు తంతి కార్యాలయము టెలిఫోను ఉన్నవి 16 ఎలిమెంటరీ స్కూళ్ళు 4 అప్పర్ ప్రైమరీ స్కూళ్ళు ఒక హయ్యర్ సెకండరీ స్కూలు ఒక బాలుర హైస్కూలు ఒక బాలికల హైస్కూలు లింగమూర్తి హైస్కూలు లింగమూర్తి కళాశాల ఉన్నవి పొరుగు గ్రామములనుండి 1 4 మంది విద్యార్థులు హైస్కూలు చదువులకు వత్తురు అనకాపల్లి A క్లాసు మ్యునిసిపాలిటీ పట్టణము ఇండ్లపన్ను వాహనముల పన్ను వృత్తిపన్ను లైసెన్సుఫీజు బస్సుస్టాండు రుసుములు వినోదపు పన్ను సర్ చార్జి స్టాంపుడ్యూటీలు ఎలిమెంటరీ ఎడ్యుకేషను గ్రాంటు సెకండరీ ఎడ్యుకేషన్ గ్రాంటు మార్కెటుపాటలు మున్నగు వాటివలన ఈ మ్యునిసిపాలిటీకి ఆదాయము ఏర్పడును ఈ ఆదాయ మొత్తము రు 20 00 000 లు ఇచట 2 మ్యునిసిపల్ గ్రంథాలయములు శారదా గ్రంథాలయము (ఇందులో మిక్కిలి పురాతన గ్రంథములు కలవు) లక్ష్మి గ్రంథాలయము గౌరీ గ్రంథాలయము స్థానిక గ్రంథాలయము 2 మ్యునిసిపల్ పార్కులు 2 ప్రైవేటు పార్కులు రేడియో లౌడ్ స్పీకర్లు సినిమా థియేటర్లు కన్యకాపరమేశ్వరీ సత్రము ఉన్నవి ఇచటి విద్యుచ్ఛక్తిని 3275 ఇండ్లు దుకాణములు 827 వీధి దీపములు 20 మెర్క్యురీ దీపములు 28 ఎలెక్ట్రిక్ మోటారులు 69 పారిశ్రామిక యంత్రములు సినిమా థియేటర్లు వాడుకొను చున్నవి గ్రామ పారిశుద్ధ్యమునకు సరియగు ఏర్పాట్లు కలవు

ఈ పట్టణములో కోర్టులు పోలీసుస్టేషను సబ్ రిజిష్ట్రారు ఆఫీసు తాలూకా కచేరి ఉన్నవి L S సహకార సంఘము భూమి తనఖా బ్యాంకు ఇండియన్ బ్యాంకు ఆంధ్రా బ్యాంకు స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా కోఆపరేటివ్ బ్యాంకు (విజయనగర బ్రాంచి) కలవు గవర్నమెంటు ఆసుపత్రి మ్యునిసిపల్ జనరల్ ఆసుపత్రి రెండు ఆయుర్వేద ఆసుపత్రులు వెంకటస్వామి నాయుడు పురుళ్ళ ఆసుపత్రి కుటుంబనియంత్రణ కేంద్రము పశువైద్యశాల కలవు ప్రయివేటు ఆసుపత్రులు నర్సిగుహోములు కూడ కలవు ఇంగ్లీషు వైద్యులు ఆయుర్వేద వైద్యులు హోమియోపతి వైద్యులు పెక్కురు కలరు అన్ని కాలములలోను అవసరమగు వస్తువులన్నియు స్థానికముగా దొరుకును తుమ్మపాల గ్రామములో వారమున కొకమారు పశువుల సంత జరుగును అనకాపల్లిలో 90 కిరాణా దుకాణములు 151 భోజన కాఫీ హోటళ్లు 59 కిళ్ళి సిగరెట్టు సోడా దుకాణములు 22 కూరగాయల అంగళ్లు 49 క్షౌరశాలలు 13 లాండ్రీలు 15 నూనెదుకాణములు 14 రొట్టెలను తయారుచేయు షాపులు అల్యూమినియం షాపులు బెల్లం దుకాణములు మొదలగునవి కూడ ఉన్నవి

అనకాపల్లి చాల పురాతనమయిన పట్టణము ఇది 1877 లో మ్యునిసిపాలిటీ అయినది ప్రస్తుతము ఇది A క్లాసు మ్యునిసిపాలిటీగా మారినది ఈ ప్రాంతమును మత్స్యవంశపు రాజులు గవరలు గోడెవంశపు వారు పాలించిరి గోల్కొండ నవాబుల కాలమున శ్రీకాకుళం ఫౌజుదారు యొక్క ప్రధాన సైనిక కార్యాలయము ఇచట ఉండెనని తెలియు చున్నది

ఇక్కడి బెల్లంమార్కెట్టు దేశ ప్రఖ్యాతి పొందినది పూర్వము ఇక్కడ పాయకారావుచే నిర్మించబడిన కోట ఉండినట్లు తెలియుచున్నది శ్రీ లింగమూర్తి శ్రీ వెంకటస్వామి నాయుడు మొదలగు దాతలు ఇక్కడివారే శారదానదిపై 2 రైలు వంతెనలు ఒక రోడ్డువంతెన కలవు అనకాపల్లికి 20 మైళ్ళ దూరములోనున్న విశాఖపట్టణములో విమానాశ్రయమున్నది

మా శ్వే

## అనకాపల్లి తాలూకా

అనకాపల్లి విశాఖపట్టణమునకు దక్షిణముగా సముద్ర తీరమున ఉన్నది ఉత్తరమున చోడవరం తాలూకా దక్షిణ పశ్చిమములలో యలమంచిలి తాలూకా ఉన్నది ఈ తాలూకా విస్తీర్ణము 304 చదరపు మైళ్ళు జనసంఖ్య 1 26 000 ఇందు 154 గ్రామములు కలవు

ఈ తాలూకాను నైసర్గికముగా 3 భాగములుగా చేయవచ్చును 1 ఉత్తర దక్షిణముగా నున్న కొండవరుసలు 2 సముద్ర సామీప్యమున లోతుగనున్న బురదనేలలు 3 మధ్యభాగ మైదానము

ఈ తాలూకాలో ఉన్న కొండలు తూర్పు కనుమలకు చెందినవి ఉత్తరభాగమున ఉన్న కొండలు తూర్పు పడమరలుగా వ్యాపించి ఒక శ్రేణిగా ఉన్నవి ఇందలి శిలలు ఎర్రగా నుండుటచే వీనిని ఎర్రకొండలందురు ఇవి విశాఖపట్టణపు జిల్లాలోని ప్రఖ్యాత దక్షిణభాగమున గల కొండలకు చెందు ఈ కొండల శిలలలో కఠినత్వము ఎక్కువ ఈ శ్రేణిలో బాగుగా తూర్పున ఉన్నటువంటి "కొప్పాక కొండ"కు చెందిన శిలలు ఎక్కువగా గృహనిర్మాణమునకు ఉపయోగించుచున్నారు అట్లే తుమ్మపాలవద్దనున్న "బగలువాడమెట్ట" అనబడు కొండశిలలు పలకలుగా తయారుచేసి ఇతర జిల్లాలకు కాంక్రీటు కట్టడములకు ఉపయోగించుటకు పంపుచున్నారు ఈ శ్రేణిలో శంకరము వద్దనున్న బొజ్జన్నకొండ చారిత్రకముగా చాల ప్రసిద్ధి చెందినది అందు బౌద్ధ చిహ్నములు పెక్కులు కలవు మరియు శారదానది దక్షిణముగా ఈ శ్రేణిలోగల యేడువాకుల కొండ చాల ఎత్తయినది ఇది వర్షపుగాలులను ఆపుటకు కొంత తోడ్పడుచున్నది దీనికి ప్రక్కగా అరమైలు దూరములో శ్రీ సత్యనారాయణస్వామివారి ఆలయముగల కొండయొకటి కలదు

దక్షిణమునున్న ఎర్రకొండలు గుట్టలుగా నుండి తక్కువ ఎత్తు కలిగియున్నవి ఇవి ఒక శ్రేణిగాకాక విడివిడిగా చెదరియున్నవి ఇవి సముద్రతీరమున గల బురదనేలలను మధ్యభాగమునగల మైదానమునుండి వేరుచేయుచున్నవి

2 సముద్రతీరమున గల లోతట్టు ప్రాంతములలో ఉప్పును పండించుచున్నారు పూడిమడక యలమంచిలి తాలూకాలలో పూడిమడక ముఖ్యమయిన గ్రామములు దక్షిణమున ఈ కొండలకు మధ్యగా మైదానమున్నది ఇందు మూడురకముల నేలలు కలవు కొండప్రాంతములకు దగ్గర లేటరైటు నేలగలదు ఇది ఎర్రగా నుండును ఇది సారవంతము కాదు ఈ ప్రాంతములలో ఎక్కువగా జీడిమామిడి తోటలు పెంచుచున్నారు సముద్రతీర ప్రాంతమునందు ఇసుకనేలలు కలవు ఇచ్చట సరుగుడు తోటల పెంపకము జరుగుచున్నది మొత్తము 76 000 ఎకరములలో మెట్టపంటలు పండించుచున్నారు ఆ మెట్టపంటలలో జొన్న రాగి సజ్జ ముఖ్యమైనవి మిగిలిన మైదాన భాగములలో నల్లమట్టినేలలు ఒండ్రమట్టినేలలు మిక్కిలి సారవంతమైన ప్రదేశము ఇందలి సుమారు 6 000 ఎకరములలో వరి చెరకు ఎక్కువగా పండించుచున్నారు ఈ తాలూకా ఉత్తర భాగములో శారద ప్రక్కగా మామిడితోటలు కూడా పెంచుచున్నారు

అనకాపల్లి తాలూకా సగటు వర్షపాతము 38 (95 సెం మీ) వర్షపాతములో సుమారు 85 శాతము నైరృతి ఋతుపవనముల వలనను 15 శాతము ఈశాన్య ఋతుపవనముల వలనను కలుగుచున్నది దక్షిణమునకు పోయినకొలది వర్షపాతము తగ్గుచున్నది సముద్ర సామీప్యము వలన గాలిలో తేమ ఎక్కువగనుండును రాత్రి పగళ్ళ ఉష్ణోగ్రతలలో ఎక్కువ వ్యత్యాసము గోచరించదు అధికోష్ణోగ్రత సగటున 90 F అల్పోష్ణోగ్రత సగటున 75 F ఉండును సంవత్సరమునకు సరాసరి ఉష్ణోగ్రత సుమారు 85 F ఉండును

ఈ తాలూకాలో సాగు ఎక్కువగా శారదా నదీ జలాధారమువలన జరుగుచున్నది శారదానది మాడుగుల కొండలలో ఉద్భవించి దక్షిణముగా ప్రవహించి అనకాపల్లి చేరి అచ్చట మద్రాసుపోవు రైలువంతెనను ట్రంకురోడ్డును దాటి నైరృతి దిక్కుగా తిరిగి కశింకోట ప్రక్కగా ప్రవహించి వాడ సమీపమున వరహానదితో కలిసి సముద్రమును చేరుచున్నది శృంగవరపుకోట తాలూకానుండి ఒక ఉపనది వచ్చి మద్దూర్తి దగ్గర శారదలో కలియుచున్నది శారదానదికి ముఖ్యముగా మూడు కాలువలు కలవు ఇందొకటి అనకాపల్లికి 6 మైళ్ల దూరమునగల కొండకర్ల ఆవ అనెడు సుప్రసిద్ధమై ప్రకృతి సహజమైయుండ మైన తామర కొలనును నింపుచున్నది ఈ రస్సు అనకాపల్లి యలమంచిలి తాలూకాలలోగల 12 గ్రామములలో సుమారు 3 500 ఎకరముల భూములకు నీటి వసతిని కల్పించుటయేకాక చేపలపెంపకమునకు కూడ ఉపయోగపడుచున్నది

ఇచటికి పై ప్రాంతమునుండి రకరకముల పక్షులు వచ్చును నీటిబాతులు ఇచటి ప్రత్యేక లక్షణము అనేకలు వచ్చి చేలు ట్టుదురు బాతును వేటాడదురు నీటిపై వినోదము కై బోటు ఏకారు చేయుచుందురు ఈ నదిపై అనేకచోట్ల ఆనకట్టలు నిర్మించి పంట భూములకు నీటి తిని కలిగించుచున్నారు గొడేవారి కట్టనుండి శిరుకొండకర్ల అవకు చేరచున్నది మామిడివాడ కిమిలి కట్టబోలు కమ్మరాపల్లి మరిపాలెము బొడ్డేటిట్టు తుమపాకట్లు మొదలైన విశేష నఆకట్టలు ఇకా నూతుల టిపల చెరువుల టివ నకూడ కొంత భూమి సాగు రగుచున్నది

**అనకాపల్లి** ఈ తాలూకాలో చాలా ముఖ్యమైన పట్టణము ఇచ్చటి మునిసిపాలిటీ ప్రథమ తరగతికి చెందినది జనసాంద్రత చాల ఎక్కువ జనసంఖ్య సుమారు 57 660 విస్తీర్ణము 8 44 చ మైళ్లు మద్రాసు పోవు గ్రాండు ట్రంకు రోడ్డునకు ఇరుపైపుల విశాఖపట్టణమునకు 21 మైళ్ళ దూరములో ఇది ఉన్నది పట్టణముకు తూర్పున ఉత్తర దక్షిణలుమగా ఎవవాచుంటకాలు యు పశ్చిమము శారదా నదియు దీనికి సరిహద్దులుగ ఉన్నవి ఈ ట ముగు డా ఉత్తర దక్షిణములుగా మాడుగుల పూడి మడక రోడ్డుపోవుచు మద్రాసు ట్రంకు రోడ్డును మునిసిపల్ ఆఫీసువద్ద దాటుచున్నది ఈ కూడలి ప్రదేశముకు ఈ మధ్యనే నెహ్రూ చౌక్ అని నామకరణము చేసిరి జనసాంద్రత చాలా ఎక్కువ అగుట వలన వాయవ్య దిశగా శారదా నది ఒడ్డున ఈ పట్టణము అభివృద్ధిచెందినది ట్రంకు రోడ్డుకు ఉత్తరముగా ఎడీ ఎమ్ పమున ఉడ్డుపేట నరశింగరావుపేట మద్రాసు రైలు మార్గమునకు ఉత్తరముగా విజయరామరాజుపేట శ్రీకొవిపేట గాంధీనగరము క్రొత్తగా వెలసినవి గాంధీనగర ప్రాంతములోనే పట కాలువ ప్రక్క ప్రభుత్వపు రహదారి బంగళా దానికి తూర్పుగ దగ్గర అచ్చమ్మ పేరటాలుగుడి దానిప్రక్క ప్రభుత్వపు పరిశోధన కేంద్రము కలవు ఈ కేంద్రము స్థాపించ డి 60 సం॥ పైగానైనది పరిశోధనము కూడ జరిగిది ఇది రాష్ట్రములో చాల ప్రముఖ స్థానము నుపొందియున్నది విత్తములపై చెఱకు పరిశోధన ఇచట జరుగుచున్నవి అందు ప్రగతిని చాల రకు సాధించిరి పట్టణముగ్ గాంధీ మార్కెట్టు అనెడి బెల్లము మార్కెటు దేశ మొత్తములో ద్వితీయ స్థానమును ఆక్రమించినది ఇతర గ్రామము నుండి తాలూకాలనుండి ఈ మార్కెట్టుకు బెల్లము తీసుకొనిరాబడును ఇచ్చటినుండి బెల్లము ఇతర రాష్ట్రములకు ఎగుమతి చేయబడును ప్రత్యేకముగా బెల్లము ఎగుమతికి గూడ్సు సెడును ఒకటి రైలు స్టేషనుకు సమీపమునే నిర్మించబడినది రైతుల సౌకర్యముకొరకు ప్రభుత్వపు మార్కెటింగ్ కమిటీ ఒకటి కలదు ఇచట వర్తకులచే నెలకొల్పబడిన వర్తక సంఘము దేశఖ్యాతి పొందినది ఈ సంఘము వారిచే ఒక కళాశాల ప్రసూతి ఆసుపత్రి హైస్కూలు నడుపబడుచున్నవి పట్టణమునకు తూర్పుగా పులికాలువ దగ్గర ఒక ఐస్ ఫ్యాక్టరీ కలదు సుమారు 10 నూనె ఫాక్టరీ 5 ధాన్యపు మిలులు కలవు పులికాలువ ప్రక్కగా విశాఖపట్టణము కుపోవు రోడ్డుకు దక్షిణముగా శ్రీ సత్యనారాయణస్వామివారి దేవాలయము కలదు పట్టణ దక్షిణభాగమున గవరలు ఎక్కువగా నుండుటచే అది గవరపాలెము అనబడును ఇచటి జనుల ముఖ్యవృత్తి వ్యవసాయము బెల్లం తయారుచేయు లో వీరు ప్రావీణ్యము సంపాదించిరి ఈ ప్రాంతములో పూర్వము పాయకరావుచే నిర్మించబడి కోట శిథిలమై దిబ్బగా నుండుటచే దీనిని దిబ్బవీథి అందురు ఈ శిథిలమైన కోటకు దక్షిణముగా నూకాలమ్మ గుడియు దక్షిణముగా శ్రీ భోగలింగేశ్వరాలయమును కలవు పట్టణముమధ్య వేంకటేశ్వరఆలయము దీనికి ఉత్తరముగా ఒక మసీదు ట్రంకురోడ్డుకు దక్షిణముగా శారదానది ఒడ్డున ఒక చర్చియు కలవు

అనకాపల్లికి ఉత్తరముగా 1 1/ మైళ్ళ దూరములో పూడిమడక మాడుగులరోడ్డుకు తూర్పున చోడవరం తాలూకా సరిహద్దులో తుమ్మపాల ఉన్నది ఇచ్చట సహకార పద్ధతిపై నడుపబడు పంచదార ఫాక్టరీ కలదు బగులువాడ మెట్టలు దీనికి ఉత్తర సరిహద్దులు గ్రామ జనసంఖ్య 10 299 పల్లపు నేలలో వరి చెరుకు ముఖ్యమైన పంటలు పండును మామిడి తోటలు కూడ కలవు

అనకాపల్లికి 3 1/2 మై॥ దూరములో నైరృతి దిక్కుగా ట్రంకురోడ్డు ప్రక్కన కశింకోట ఉన్నది జనసంఖ్య 11 713 ఇచ్చట అగ్గిపెట్టెలను బంగారా పెంకులును పప్పులను తయారుచేయు ఫాక్టరీలు కలవు ఇది పంచాయతీ కేంద్రము పూర్వపు జమీందారుకోట వేణుగోపాలస్వామి ఆలయము పేర్కొనదగినవి గ్రామమునకు దక్షిణగా నున్న ఎఱ్ఱకొండల ననుసరించి దట్టమైన పొదలు చిన్న చిన్న చెట్లు

కల ప్రభుత్వపు రిజర్వు అడవి యలమంచిలి వరకు కలదు

అనకాపల్లికి 1 1/ మైళ్ళ దూరములో ఈశాన్యదిక్కుగా ట్రంకరోడ్డు ప్రక్కన శంకరము ఉన్నది ఇది చాల చిన్న గ్రామము ఇచ్చటి జనసంఖ్య 8314 ఇచ్చటినేల లేటిరైటు నేల కావున జొన్న రాగి మొదలైన మెట్టపంటలను పండించుచున్నారు కొన్ని పరిసరభూములలో జీడితోటల పెంపకము కూడ జరుగుచున్నది ఇచ్చటనున్న ఎర్రకొండలో పశ్చిమముగా నున్నది బొజ్జన్నకొండ ఇది చారిత్రకముగా ప్రసిద్ధి చెందినది ఇందు బౌద్ధ చిహ్నములనేకములు కలవు

మరియు నాగులాపల్లి మునగపాక అరవపాలెము అను గ్రామములు చాల సారవంతమైనవి మార్కెట్టుకు 50 శాతం బెల్లము ఈ గ్రామమునుండియే వచ్చును చెరకు వరి ఎక్కువగా సాగుచేయుచున్నారు అనకాపల్లికి తూర్పుగా 12 మైళ్ళ దూరములో అగనంపూడివద్ద నిర్మించబడిన రేడియో కేంద్రము బొజ్జన్నగెడ్డ వరకు ఈ తాలూకాలోనిదే ఇచ్చటిది లేటిరైటునేల దక్షిణముగా పోయినకొలది సరుగుడు తోటలు అచ్చటచ్చట మామిడితోటలు కలవు అనకాపల్లి ఒకప్పుడు జామపండ్లకు కూడ ప్రసిద్ధిగాంచినది మామిడిపండ్లు నేటికిని విరివిగా ఎగుమతి చేయుచున్నారు ఇచట తాటిచెట్టు చాలముఖ్యమైనది ఎచ్చటచూచినా వరసలుగా ఇది కనిపించును తాలూకాకు దగ్గరలో కోరమాండలు ఎరువుల కర్మాగారము భారత హెవీప్లేట్సు అండ్ వెసల్స్ కర్మాగారము కాల్టెక్స ఆయిలు రిఫైనరీ మొదలైనవి విశాఖ అనకాపల్లి రోడ్డుకు ఉత్తరముగా నెలకొల్పబడుటచే ఇవి తాలూకాకు చాల దగ్గరగానుండి పారిశ్రామికంగా ఈ తాలూకా భవిష్యత్తులో అభివృద్ధి కలుగునట్టి అవకాశ మిచ్చినవి

వి. అ.

## అనకాపల్లి తాలూకా చరిత్ర

అనకాపల్లి తాలుకా చారిత్రకముగా ఎక్కువ ప్రాముఖ్యముకల ప్రాంతము ఈ తాలూకాలో గల గ్రామాలన్నిటిలోను అతి ప్రాచీనమైనది శంకరం అను గ్రామము ఈ గ్రామము అనకాపల్లికి మైలున్నర దూరములో ఉన్నది ఈ గ్రామమువద్ద ఒక దాని నొకటి ఆనుకొనిన రెండు చిన్న కొండలు కలవు ఇవి బొజ్జన్నకొండ లింగాలకొండ అనునవి క్రీ శ 1906 లో అచార్య రియే అనునతడు ఈ రెండు కొండలపై త్రవ్వకాలు చేయించి అతి ప్రాచీన బౌద్ధశిథిలావశేషములను బయలు పరచెను బొజ్జన్నకొండ ఎత్తు సుమారు 200 అడుగులకు పైగా ఉండును దీని శిఖరము స్తూపపు పునాది తిన్నెగా మలచబడినది దీని చుట్టు చనాటికి ఇటికనిర్మాణము ఉన్నది దీనికి తూర్పుగా ఒక మహా విహారము దాని చుట్టు మాళిగలు త్రవ్వకాలలో బయటపడినవి స్తూపపు తిన్నెకు పశ్చిమముగ రాతి దగోబాలు విరిగి పోయిన శిలా స్తంభములు కలవు ఈ స్తంభముపై ఉన్న శాసనము రూపు మాసి పోయినది అక్కడక్కడ దాని ఛాయలున్నవి స్తూపపు శిథిలాలకు దిగువగా రెండ తస్తులలో గుహాలయాలు కలవు వీటిలో బుద్ధుని విగ్రహాలు తదితర విగ్రహాలు దగోబాలు ఉన్నవి వీటికి దిగువగా పశ్చిమ దిశలో మరియొక గుహాలయము కలదు ఇందులో మత్స్యసేనుడైన ఒక వ్యక్తి యొక్కయు అతని ప్రక్క నాగశిఖరముకల మరియొక వ్యక్తి యొక్కయు చిత్రాలు చెక్కబడినవి

బొజ్జన్నకొండపై సముద్రగుప్తుని బంగారు నాణెము కుబ్జ విష్ణువర్ధనుని విషమసిద్ధి బిరుదుగల రాగి నాణెములు ఆంధ్ర శాతవాహనుల సీసపు నాణెములు దుర్జయ నామముకల ముద్రలు మృణ్మయ పాత్రలు దీపపు ప్రమ్మెలు కత్తులు గంటలు కంచు ఉంగరాలు పూసలు మొదలైనవి దొరికినవి

లింగాలకొండ దూరమునుంచి మత్స్యాకారముగా కనబడును దీని పడమటిశిఖరము ఒక పెద్ద రాతిస్తూపముగా మలచబడినది దాని ప్రక్కనే మరియొక గుహాలయము ఉన్నది లింగాలకొండమీద ప్రతిరాయి దిగోబాగా మలచబడినది ఈ శిథిలాలను వెలుగులోనికి తెచ్చిన ఆచార్య రియే వీటికాలము బహు ప్రాచీనమైనదని వెలిబుచ్చుచు ఇచ్చటి రాతి దగోబాలు అశోకునిచే నిర్మించబడిన కట్టడముల నాటివని ఖండితముగా చెప్పగలను అని వ్రాసిరి శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు దక్షిణ హిందూదేశమందెచ్చటనూ ఇట్టి పురాతన కట్టడము కానరాదు అని వ్రాసిరి

ప్రాచీనకాలములో ఈ శిథిలాలుగల నగరానికి గల పేరేమిటో ఏ రాజులు ఈ స్తూపమును విహారాలను గుహాలయాలను నిర్మించిరో తెలియుటలేదు కాని ప్రాచీనకళింగ దేశానికి రాజధానియై ప్రఖ్యాత బౌద్ధ కేంద్రముగా వర్ధిల్లిన దంతపుర మిక్కడనే ఉండెడిదని ఒక వాదము గలదు

ప్రాచీన మధ్యయుగాలలో మహానదీ గోదావరీల మధ్యప్రదేశమును కళింగదేశమని వ్యవహరించెడివారు కళింగదేశము క్రీ శ 5వ శతాబ్దమునుండి క్రీ శ 15వ శతాబ్ది వరకు తూర్పు గంగవంశరాజులచే పరిపాలింపబడినది ఈ వంశపురాజులలో అనియంక అని బిరుదుల రాజులు కొందరు కలరు వీరిలో ఒకరి పేరును బట్టి నిర్మించబడినదే అనకాపల్లి దీనికి అసలు పేరు అనియంకపల్లి ఆనామము ప్రజా వ్యవహార వశమున అనకాపల్లిగా మారినది క్రీ శ 1400లో తూర్పుగంగవంశరాణి అయిన పార్వతీమహాదేవి సింహాచలదేవాలయములో వేయించిన శాసనములో ప్రప్రథమముగా అనకాపల్లి ఉదాహరించబడినది

తూర్పుగంగరాజుల తర్వాత గజపతులు వారి తర్వాత బోయరాజులు శాహుబలేంద్ర బిరుదు వహించిన తెలుగువంశపురాజులు కళింగదేశమును పరిపాలించిరి తెలుగువంశపురాజులనుండి కళింగాంధ్రప్రాంతమును గోల్కొండ నవాబులు జయించిరి

కళింగదేశముపై గోల్కొండ దండయాత్రలను నిర్వహించిన ప్రధాన సైనికాధికారులలో కాకర్లపూడి అప్పలపాయకరావుగారొకరు ఈయన సేవలకు మెచ్చి మహమ్మద్ కులీ కుతుబ్ షా క్రీ శ 1611లో ఈయనకు పాయకరావు అను బిరుదునిచ్చి అనకాపల్లిప్రాంతానికి ఇతనిని రాజుగా నియమించెను ఈ విధముగా అనకాపల్లి రాజ్యస్థాపన జరిగినది కాకర్లపూడి అప్పలపాయకరావుగారు అనకాపల్లి కోటను భోగలింగేశ్వరస్వామి ఆలయమును నూకాంబికాలయమును నిర్మింపచేసిరి వీరు దక్షిణ విశాఖ మండలములో పెక్కుతావులను పాలించిరి

అప్పలపాయకరావుగారు క్రీ శ 1627 లో మరణించిరి ఆయన తర్వాత ఆయనసోదరుడు వెంకటరాజుగారు వెంకటరాజుగారి అనంతరము ఆయన కుమారుడు మొదటిరామభద్రపాయకరావు రాజ్యాభిషిక్తులైరి ఈ రామభద్రపాయకరావు ప్రసిద్ధి చెందిన కవి కవిపోషకుడు శతాధికగ్రంథకర్త ఈయన వ్రాసిన ముఖ్యగ్రంథములు సర్వకామాదాంబాపరిణయము చంపూ రామాయణము పద్మినీపరిణయము నీలగిరినాథశతకము ఈయన అనకాపల్లిలో సర్వకామదాంబాలయమును నిర్మింపచేసెను

క్రీ శ 1652 లో కళింగ విజయనగర రాజ్యము వెలసినది క్రీ శ 1688 గోల్కొండ రాజ్యము ఔరంగజేబ్ చే నాశనము చేయబడినది ఈ అదనులో కళింగ విజయనగరాధీశుడైన మొదటివిజయరామగజపతి స్వతంత్రుడై శ్రీకాకుళములోని విశాఖపట్టణములోని తూర్పు గోదావరిజిల్లాలోని రాజ్యాలను తనస్వాధీనము క్రింది తెచ్చుకొనెను అనకాపల్లి పాయకరావులుకూడ ఆయనకు చేవోడుగా లబడిరి ఆకాలమునాటి అనకాపల్లి రాజు గోపాలపాయకరావు

క్రీ శ 1724 లో జామ్‌ఉల్‌ముల్క్ హైదరాబాదు రాజ్యముస్థాపించి ఉత్తర సర్కారులపై తనఆధిపత్యమును వ్యాపింపజేయుటకు తీవ్రయత్నాలుచేసెను ఈయనచేపంపబడిన నూరుద్దీన్ అనుసేనాని పెద్దాపుర రాజ్యాన్ని ఆక్రమించగలిగెను కాని క్రీ శ 1734 లో చేబ్రోలు వద్దజరిగిన యుద్ధములో ప్రథమవిజయరామరాజు గోపాలపాయకరావులచే ఓడింపబడెను ఈయుద్ధములో అనకాపల్లి బోయసైన్యము అత్యున్నతమైన సాహసకృత్యమొనర్చినది ఈ సైన్యానికి చెందినవీరులు శత్రుసైన్యములోకి చొచ్చుకొనిపోయి నూరుద్దీన్ అధిష్ఠించిన ఏనుగును సమీపించి దానిఅంబారి త్రాళ్ళను కోసి అతనిని క్రిందికిలాగి చంపిరి

క్రీ శ 1753 లో హైదరాబాదు నవాబైన సలాబత్ జంగ్ ఉత్తరసర్కారులను ఫ్రెంచివారికి ధారాదత్తముచేసెను విజయనగరాధీశుడైన ప్రథమవిజయ రామరాజు శ్రీకాకుళమునకు విశాఖపట్టణమునకు తూర్పుగోదావరి జిల్లాకు స్వల్పశిస్తును చెల్లించుషరతుపై అధికారిగా ఫ్రెంచివారిచే గుర్తింపబడెను నిజాముచే శ్రీకాకుళ ఫౌజ్‌దారుగా గతములో నియమింపబడిన జాఫరల్లీ దీనికి అంగీకరించలేదు అతడు ఉత్తర సర్కారులను తనస్వతంత్ర ఆధిపత్యములో పెట్టుకొనుకాంక్షతో ఫ్రెంచివారికిని విజయరామరాజునకును వ్యతిరేకముగా మహారాష్ట్రుల సహాయమును అర్థించెను నాగపూరు అధిపతియైన రఘూజీభాంస్లేచే పంపబడిన మహారాష్ట్ర సైన్యములను క్రీ శ 1754లో తుమ్మపాలవద్ద ఫ్రెంచివారు పెదవిజయరామరాజు గోపాలపాయకరావు కలసి ఓడించిరి ఈ యుద్ధములోకూడ అనకాపల్లి సైన్యము అనేక సాహసకృత్యాలొనర్చెను

గోపాలపాయకరావు ఆరితేరిన సైన్యాధినేతయేకాక గొప్ప కళాపోషకుడు ప్రద్యుమ్నాభ్యుదయము రుక్మవతీ

పరిణయము వ్రాసిన రేకపల్లి సోమనాథకవి ఈతని ఆస్థాన కవీశ్వరుడు

గోపాలపాయకరావు అనంతరము రెండవరామభద్రపాయకరావు అధికారమునకు వచ్చెను ఈయన 1757లో జరిగిన బొబ్బిలి యుద్ధములో విజయరామరాజు తరఫున పోరాడెను ఆతర్వాత విజయనగరాధీశుడైన ఆనందరాజు ఇంగ్లీషు వారితో కలసి కోస్తాజిల్లాను ఆక్రమించుటకై నిర్వహింపబడిన దండయాత్రలో ప్రధాన పాత్రను వహించెను ఆనందరాజు 1760 లో మరణించెను కుమారులు లేనిచే పెద విజయరామరాజుగారి భార్య చంద్రయ్యమ్మ వెంకటపతిరాజు అను బాలుని దత్తు గాచేకొని అతనిని చి విజయరామరాజు అను పేరతో విజయనగరాధీశుగా ప్రకటించెను ఇందులో రెండవ చినవిజయరామగతి రామభద్రపాయకరావు తోడ్పడెను ఒన జయరామరాజు సహజ సోదరుడైన సీతారామరాజునకు తన సోదరుడు విజయనగరాధిశుడు అగుట ఇష్టములేదు అందుచే దీనికి కారణభూతురాలైన చంద్రయ్యమ్మపై రామభద్రపాయకరావుపై అతడు కక్ష వహించెను ఇంతలో రామభద్రపాయకరావు మరణించెను సీతారామరాజు కోపమునకు రామభద్రపాయకరావు కుమారుడైన అప్పలపాయకరావు ఆయన కుమారుడైన మూడవ రామభద్రపాయకరావు గురియైరి అతడు క్రీ శ 1779 లో ఇంగ్లీషువారి మద్దతుతో విజయనగరరాజ ముఖ్యకు దివానై అనకాపల్లిపై దండెత్తివచ్చెను అప్పలపాయకరావు మూడవ రామభద్రపాయకరావు శౌర్య ధైర్యములతో పోరాడి వీర స్వర్గమలంకరించిరి అనకాపల్లిరాజ్యము విజయనగర రాజ్యములో కలిపి వేయబడెను దీనికి బదులుగా విజయనగరము వారు ఇంగ్లీషు కంపెనీకి చెల్లించవలసిన పేష్కష్ పెంచబడినది

అప్పలపాయకరావు భార్యకు మూడవరామభద్రపాయకరావు యొక్క భార్యకు సాలీనా రూ 10 000 భరణము ఇచ్చుటకు కంపెనీవారు వాగ్దానమొనరిచిరి కాని ఇది ఎన్నడు ఇయ్యబడలేదు క్రీ శ 1804లో అప్పలపాయకరావు సతీమణి గుండెజబ్బు కారణముగా మరణించెను మూడవరామభద్రపాయకరావుగారి తీమణి దగ్గర కుటుంబములోని ఒక బాలుని దత్తునిగా చేకొనెను చివరి రోజులలో ఆమె మతిస్థిమితముతప్పి హృదయవిదారక పరిస్థితులలో క్రీ శ 1814లో మరణించెను

ఆమె మరణానంతరము దత్తునికి కంపెనీవారు సహాయము చేయక కోట విడిచి పొమ్మని అతనిని ఆజ్ఞాపించిరి ఈ ఎల్లవానికి జరిగిన అన్యాయమును సహించలేక ఆయన దగ్గర బంధువైన జగన్నాథపాయ రావు కంపెనీ ప్రభుత్వముపై క్రీ శ 1833 లో తిరుగుబాటుచేసెను ఇది ఆంధ్రదేశములో ఇంగ్లీషు వారి వ్యతిరేకముగా జరిగిన మొట్టమొదటి ప్రజల సాయుధమయిన తిరుగుబాటు ఈ తిరుగుబాటు నణచుటకు కంపెనీ ప్రభుత్వము జార్జిరస్సెల్ అను వానినాయకత్వాన సైన్యములను పంపెను ఈ రస్సెల్ అనకాపల్లి ప్రజలను రాజకుటుంబమువారిని వర్ణింపరాని బాధలకు గురిచేసెను కోటనేలమట్టము చేయబడినది గ్రామములలో అనేక భాగాలు తగులబెట్టబడెను ఇక గత్యంతరములేక జగన్నాథపాయకరావు ఊరు విడిచి రంప అడవులలోకి పారిపోయెను కాని అచిరకాలములోనే పట్టుబడి 1834లో తాండవనదీతీరములో ఉరి తీయబడెను

పాయకరావులు అనకాపల్లి ప్రాంతానికి అనేక విధాల సేవచేసిరి గవర కులానికి చెందిన రైతులను తీసుకొనివచ్చి వారి సాయమున అనేక వేల ఎకరాల భూమిని సాగులోకి తెచ్చిరి అనేక దేవాలయాలు నిర్మించిరి అనకాపల్లిలోని నూకాంబికాలయము భోగలింగేశ్వరస్వామి ఆలయము వెంకటేశ్వరస్వామి ఆలయము జగన్నాథస్వామి ఆలయము సర్వకామదా బాలయములు ఉప్మాక లోని వెంకటేశ్వరస్వామి ఆలయము రామభద్రపురములోని కోదండరామస్వామి ఆలయము సత్యవరంలోని వేణుగోపాలస్వామి ఆలయము చెప్పదగినవి వీరు కవులను పోషించి తాము స్వయముగా గ్రంథాలను వ్రాసి సాహిత్య సేవచేసిరి ఈ పాయకరావుల పతనముతో అనకాపల్లి వైభవము అడుగంటెను

180 లో ఉత్తర సర్కారులలో జమీందారీ విధానము ప్రవేశపెట్టబడినది దీని ననుసరించి అనకాపల్లి జమీందారీని విజయనగరము జమీందారు అయిన నారాయణగజపతి కొనెను 1809 లో విజయనగరము వారినుండి దీనిని గోడే సూర్యప్రకాశరావుగారు కొనిరి 1863లో ఈయనవంశస్థుడైన నారాయణగజపతిరావు అనకాపల్లి జమీందారయ్యెను ఈయన కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజీలో చదివి పట్టభద్రుడయెను 1868 నుండి 16 సంవత్సరాలు మద్రాసు శాసనసమితిలో అతడు సభ్యుడుగా నుండెను 1898 లో బ్రిటిష్

ప్రభుత్వముచే ఈయనకు మహారాజు బిరుదు ఇయ్యబడెను ఈయన కాలములోనే అనకాపల్లి ఉన్నత పాఠశాల స్థాపించ బడినది అనకాపల్లి పురపాలక సంఘము ఏర్పాటుచేయ బడినది అనకాపల్లిలో అత్యంత రమణీయమైన పూలతోట పెంచబడినది శారదానదికి ఆనకట్ట కట్టబడినది వేల ఎకరాలు సాగులోకి తేబడినది ఈయన సహాయమువల్లనే విశాఖపట్టణములో ఎ వి యన్ కళాశాల ఉన్నతపాఠశాల ప్రభుత్వ వైద్యశాల నిర్మించబడినవి 1(9? లో నారాయణ గజపతి మరణించెను ఆయన భార్య శ్రీమతి గజ తిరావు అనకాపల్లి మార్కెటు నిర్మించెను ఆమె మరణానంతరము ఆమె కుమార్తెద్వారా వధ్యాన్ రాజవంశము కును వారి నుండి చెముడు జమీందార్లకును అనకాపల్లి దఖలు పడినది జమీందారీ విధానము రద్దుకావడంతో అది ప్రభుత్వాధీనమైనది అనకాపల్లి పట్టణానికి 4 మైళ్ళ దూరంలో కశి కోట కలదు అనకాపల్లి ఎలమంచిలి ప్రాంతమునకు ప్రాచీన యుగములో దేవరాష్ట్రమను వ్యవహారము డెనని నిర్ణయించుటకు ఉపయోగబడిన మొదటి చాళుక్యభీముని శాసనము ఇక్కడనే దొరికినది ఈ దేవరాష్ట్రాన్ని సముద్రగుప్తుడు జయించినట్లు అలహాబాదు శాసనములో పేర్కొనబడినది ఆ తర్వాత ఇది తూర్పు గంగరాజులపాలనలోను కటకం గజపతులపాలనలోను ఉండెంది ఆ తర్వాత బాహుబలేంద్ర బిరుదుగల తెలుగువంశపు రాజుల పాలనలోకి ఇది వచ్చినది వారే ఇక్కడ కోటను నిర్మించిరి ఆకోట శిథిలాలు ఇప్పటికిని కలవు కుతుబ్షాహీలు బాహుబలేంద్రులను తరిమివేసి కశి కోటను "ఇనుగంటి" ఇంటిపేరుకల పద్మనాయక వెలమల కిచ్చినట్లు తెలియుచున్నది బొబ్బిలిరంగారావు భార్య అయిన మల్లమ్మ వీరి ఆడపడుచే క్రీ శ 1766 లో జరిగిన బొబ్బిలియుద్ధములో ఆత్మార్పణమొనర్చుటకుముందు మల్లమ్మదేవి తను ఆరాధించుచున్న వేణుగోపాలస్వామి విగ్రహమును రహస్యముగా కశి కోటకు పంపినది ఆవిగ్రహము కశి కోటలో ప్రతిష్ఠించబడినది ఆ దేవుని ఈనాటికి ప్రజలు బొబ్బిలి వేణుగోపాలస్వామి అనుచున్నారు

సర్కారుజిల్లాలలో జమీందారీవిధానము ప్రవేశపెట్టబడినప్పుడు కశి కోట జమిందారీని విజయనగరమహారాజు కొనెను రెండు సంవత్సరాల తర్వాత వారివద్దనుండి కారుమంచి వెంకటచలం పంతులుగారు కొనిరి ఆయనకు మగసంతతి లేనందుచే కుమార్తెద్వారా ఈ జమిందారీ మంత్రిప్రగడ వారికి సంక్రమించినది ఈ వంశములోని తుది జమీందారునకు కూడా మగసంతతి లేనందువలన కుమార్తె ద్వారా ఈ జమీందారీ మారెళ్ళవారికి సంక్రమించినది జమీందారీ విధానము రద్దయిన తర్వాత ఈ జమీందారీ ప్రభుత్వ స్వాధీనము అయినది కాని ఈ జమీందారీ కుటుంబము మాత్రము ఇప్పటికిని ఉన్నది

త స

## అనపర్తి

తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకాలో అనపర్తి గ్రామము ఉన్నది దీనికి 14 మైళ్ళ దూరములో రామచంద్రపురం అను పట్టణము కలదు ఈ గ్రామమునకు తూర్పున బలభద్రపురము పడమట కేసవరం ఉత్తరమున పాలమూరు దక్షిణమున దొప్పలపూడి ఉన్నవి దీని విస్తీర్ణము 8 840 ఎకరములు

1961 సం జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామమున 12 802 మంది జనులుండిరి ఈ సంఖ్యలో షెడ్యూల్డు జాతులవారు షెడ్యూల్డు తరగతులవారు 784 మంది ఇచ్చట ఇండ్లు రోడ్డునకు ఇరువైపుల ఏకపంక్తిగా ఉన్నవి వీటిలో 2300 పెంకుటిండ్లు 80 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 20 ఒక అంతస్తుగల మేడలు 4 ఎక్కువ అంతస్తుగల భవనములు కలవు అందరు వరి అన్నమును తిందురు కాలువనీటిని బావి నీటిని త్రాగుదురు మంచినీళ్ళ ఎద్దడి లేదు

నల్లకాలువ ఎర్రకాలువ లక్ష్మీదేవి చెరువు తుంగ చెరువు కొప్పసాని చెరువు తిమ్మరాజు చెరువు పెద్ద చెరువు ఈ గ్రామ నీటివనరులు గ్రామస్థులు వరి చెరకు ంఎలను పండితురు అరటి కొబ్బరితోటలు కలవు స్థానిక అవసరములకు సరిపోవు వంకాయలను పండితురు 1966 67సం॥లో ఇక్కడ పంటల క్రింద 1715 ఎకరముల భూమి ఉపయోగపడెను చెరువుల క్రింద 157 ఎకరముల భూమియు బావుల క్రింద 560 ఎకరముల భూమియు సాగుబడియైనది 80 ఆయిల్ ఇంజనులు 10 ఎలక్ట్రిక్ మోటారులు పైర్లకు నీటిని సప్లయి చేసెను 5 ట్రాక్టర్లు భూమిని దున్నుటకు ఉపయోగపడెను చెరకును లారీలపై చెయ్యేరునందలి పంచదార ఫ్యాక్టరీకి రవాణా చేసిరి

అనపర్తిలో 1200 గేదెలు 520 ఆవులు 800 ఎద్దులు

529 దున్నపోతులు 12 గుర్రములు 4059కోళ్ళు 19 మేకలు గొర్రెలు పదులు కలవు పాలు నెయ్యి గ్రుడ్లు స్థానికులు ఉపయోగించుకొనిరి

గ్రామస్థుల ముఖ్య జీవితాధారము వ్యవసాయము బట్టలు నడుపువారు కసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీ పనివారు తెలికలవారు మంగలివారు చాకలివారు గొల్లవారు గడ్డెరవారు కలరు 2 వడ్లమరలు గలవు ఇవి తయారు చేయు బియ్యములో కొంతభాగము రామచంద్రపురమునకు రవాణా చేయబడెను వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు కూలీ రేటు పురుషునకు రు 3 లు స్త్రీకి రు 2 లు

ఈ గ్రామమున ఒక జగన్నాథస్వామి దేవాలయము ఒక చర్చి ఒక మసీదు ఉన్నవి ఏటేటా పేరాలమ్మ తీర్థము ఏప్రియల్ నెలలో బాపనమ్మ తీర్థము జరుగును

అనపర్తికి రైల్వేస్టేషను ఉన్నది గ్రామమునగల ఎర్రకాలువ పంటలకును నల్లకాలువ రవాణాకును ఉపయోగపడును తరచుగా ప్రయివేటు బస్సులు ఈ గ్రామముగుండా కాకినాడ నుండి రాజమహేంద్రవరమునకు యానాం నుండి రాజమహేంద్రవరమునకును పోవును అనపర్తి నుండి ద్రాక్షారామమునకు అనపర్తి నుండి రాజానగరమునకు బస్సులు పోవును గ్రామమున తారు రోడ్లు కంకరరోడ్లు గ్రావెల్ రోడు మట్టిరోడ్లు కలసి 178 ఉన్నవి ఈ గ్రామమును రాజమండ్రి కాకినాడలతో ఒక తారు రోడ్డు కలుపుచున్నది ప్రయాణ సౌకర్యములకు 12 గుర్రపు బండ్లు 25 రిక్షాలు మోటారుకారు 40 రెండెడ్ల బండ్లు 5 సైకిళ్ళు 50 లారీలు ఉన్నవి

ఈ గ్రామములో సబ్ పోష్టాఫీసు తంతి కార్యాలయము టెలిఫోను జిలాపరిషత్తు హైస్కూలు జిల్లాపరిషత్తు బాలికల స్కూలు ఇండస్ట్రియల్ ట్రెయినింగు సెంటరు ఉన్నవి విద్యుచ్ఛక్తిని 400 ఇండ్లు సినిమా థియేటరులు ఎలెక్ట్రిక్ మోటారు వాడుకొనును పోలీసుస్టేషను కోఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటి కన్జ్యూమర్సు మార్కెటింగ్ షాపు I L T D వర్కర్సు షాపు ఇక్కడ ఉన్నవి ఇది పంచాయతీ పాలనకల గ్రామము 1966 67లో దీని ఆదాయము రు 27 571 3 లు గ్రామ పారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లున్నవి లోకల్ లైబ్రరీ పార్కు కమ్యూనిటీ రేడియోసెట్టు ప్రైమరీ హెల్తుసెంటరు నల్గురు ఆయుర్వేద వైద్యులు ఇద్దరు హోమియోపతి వైద్యులు పశుచికిత్సకులు కలరు గ్రామమున అర్ధవారపు సంతలున్నవి కిళ్ళీ సిగరెట్టు సోడా అంగళ్ళు 30 కిరాణా దుకాణములు 12 కాఫీ హోటళ్ళు 4 కూరగాయల అంగళ్ళు 10 సైకిళ్ళషాపులు క్షౌరశాలలు లాండ్రీలు 3 మెడికల్ షాపులు ఇచ్చట కలవు

ఈ గ్రామ విద్యార్థులు కళాశాల చదువులకు రామచంద్రపురమునకు రాజమండ్రికి పోవుదురు గ్రామస్థులు మున్సిఫ్ కోర్టుకు తాలూకా చేరీలకు రామచంద్రపురమునకు పోవుదురు సబ్ రిజిష్ట్రారు ఆఫీసునకు 4 మైళ్ళదూరములో నున్న బిక్కవోలు కును బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు రాయవరమునకు జనులు పోవుదురు

మా శ్వే

## అనపోతమహీపతి

పద్మనాయక కులస్థుడును రావు వంశీయుడును అగు అనపోతమహీపతి పెదసింగమనాయని కుమారుడు ఈ పెద సింగభూపతి కాకతీగ్రణ జయసన్థానైక ధౌరేయుడైన భేతాళుని పుత్రుడు సింగభూపతి పూసపాటి మాధవవర్మచే చంపబడెను సింగభూపుని భార్య అంతకుమున్నె చూలాలై యుండుటచే భర్త లేమికి చింతించుచు ఘోరమృగ దుర్గమ కానన మండలములు తిరిగి తిరిగి భువనగిరి చేరుకొనెను ఆ పట్టణమున వేదవేదాంగవేదియగు విజయమూర్తి నరసన్న అను విప్రోత్తముని ఇంట సింగభూపతి ఇల్లాలు తలదాచుకొనెను మాధవవర్మ ఈ వార్తవిని ఆమెను సమయింప భువనగిరివచ్చి నరసన్న మందిరమున ప్రవేశించెను దయామయుడగు ఆ నరసన్న ఆమె తన తనయ యని శపథోక్తులు పల్కి ఆమెను కాపాడెను అటుపిమ్మట కొంతకాలమునకు సింగభూపతి భార్య ప్రసవించి అనపోతుని కనెను

నరసన్న అనపోతునకు శస్త్రప్రయోగ కౌశలము వారణాద్యారోహణైకనిరూఢి నేర్పెను వైరులపై పగ సాధింపగ బూనినట్లు అనపోతుడు నేర్చుకొనిన శస్త్రవిద్యా ప్రౌఢిమ అతడు తన తండ్రి శత్రువును ససైన్యముగా తునుముటకు తోడ్పడెను ఈ విజయమునకు మహోత్సాహము నచ్చిగ్రణకర్ణుల హేయము లభించినట్లు వీరు హైందవేతరులని ఊహింపవచ్చును ఈ అనపోత మహీపతి వృత్తాంతము వాసవదత్తాపరిణయ అవతారికలో వక్కలంక వీరభద్రకవి వ్రాసియున్నాడు

ఏ శేషం

## అనపోతవిభుడు

అ పోతవిభుడు వెంకటగిరి స స్థాన ప్రభువులలో ఒకడు ఇతడు వెలుగోటివారి వ శమున ఆరవ తరమునకు చెందినవాడు ఈయన త డ్రి మొదటి ఎ గమనాయడు తల్లి సి గమా బ వీరిది వెలమకులము రేచర్ల గోత్రము ఈ వ శీయులు కాకతీయ ప్రభువులకు సేనాపతులై అనేక సమరములలో శత్రువులను తునుమాడి విజయములను చేకూర్చి వారి ప్రశ ల న దుకొనిరట్లు వెలుగోటి వారి వ శావళి చెప్పుచున్నది వెలుగోటి వారి వ శమునకు మూల పురుషుడని చెప్పబడుచున్న చెవిరెడ్డి యొ క్క ధైర్య శౌర్యములకు మెచ్చుకొని కాకతి గణపతిదేవచక్రవర్తి (క్రీ శ 1198 1 6?) అతనికి లతసీమను లికి తురాయిని బ గారు పూతగల చౌ శక త్తిని బహూకరి చి భేతాళనాయడను పౌరుషనామము నొ గెను ఈ వ శము నందలి రె డవ తరము కు చె దిన ప్రసాదాదిత్యనాయకుడు కాకతి రుద్రమ దేవిని (క్రీ శ 1 6?-1 96) సింహాసన మెక్కనీయక బాధి చు శత్రు సమూహమును ఓడి చి ఆమెను సి హాసనమున ను చి ఆ మహారాజ్ఞి వలన కాకతి రాయ రాజ్యస్థాప నాచార్య రాయ పితామహాంక అను బిరుదములను పొ దెను మూడవ తరమునకు చె దిన వెన్నమనాయడును కాకతీయులపై కరుదెంచిన తురుష్క ముష్కరులను ఓడించి గొప్ప కీర్తిని గాంచెను ఈయన కుమారుడు ఎరదాచ నామా తరముగల దాచానేడు కా చీపురముపై దాడి వెడలి సమరమున వీరపాండ్య విక్రమపాండ్య పరాక్రమ పాండ్య సు దరపా డ్య కులశేఖరపా డ్యులు అను పంచ పా డ్యులను నిహతులను జేసి బంగారు సి హాసనమును వచ్చను జయ సూచకముగా కొనివచ్చి రె డవ ప్రతాప రుద్రునకు (క్రీ శ 1296 1323) అర్పి చి పంచపాండ్య దళ విభాళ అను బిరుదమును అయన వలన పొందెను ఈ కాంచీపుర యుద్ధమున దాచానేని కుమారుడగు మొదటి సింగమనాయడును తండ్రికి మిక్కిలి సాయమొనర్చి ప్రతాప రుద్ర ప్రభువు వలన అశీతి (ఎనుబది) వరములను పొంది అశీతి వరాల సి గమనాయడు అని లోకమున వ్యవహరి ప బడెను ఈ సి గమ నాయకునకు ఇరువురు కుమారులు గలరు వారిలో మొదటివాడు అనపోతానాయడు రెండవవాడు మాదానాయడు వీరిద్దరు రాజనీతి చతురులై మహాయోధులని ప్రసిద్ధిగాంచిరి రేచర్ల పద్మనాయకులు కాపయనాయకుని సామంతులు తెలంగాణములోని కైలాసకోట ఇందూరు మెదకు ప్రా తములకు వీరు ప్రభువులుగ ను డిరి

కాకతీయ రాజ్యము యవనులకు చేజిక్కిన పిదప (క్రీ శ 1325) కాకతి ప్రతాపరుద్రుని సేనానులు డెబ్బది అయిదుగురు ఒక్కుమ్మడి శత్రువులను చీల్చి చె డాడి తమ సామ్రాజ్యమును మరల తురుష్కుల ను డి స్వాధీన మొనర్చు కొనిరి ఇట్టి నాయకులలో మొదటివాడు ముసునూరి ప్రోలయనాయకుడు రె డవవాడు ముసునూరి కాపయ నాయకుడు (ఇతడు ప్రోలయనాయకుని పినతండ్రియగు దేవ నాయని కుమారుడు) మూడవవాడు ప్రోలయ వేమారెడ్డి అనునతడు వీరుముఖ్యులు మహమ్మదీయులపై తిరుగుబాటు చేసి దేశ స్వాత త్ర్యమును తిరిగి కాపాడు ప్రయత్నములో పాల్గొనిన వారిలో సి గమనాయడును ఆతని త డ్రియగు దాచానాయడును కలరు సింగమనాయడు కాపయనాయ కునికి సహచరుడై తురుష్కులను తెలంగాణము ను డి తరిమి వేసెను తెలుగుదేశము ను డి యవనులు వెడలిపోయిన పిమ్మట నాయకులు స్వతంత్రులై ప్రత్యేక రాజ్యములను నిర్మించుకొని తమ అధికారములను నెరపు కొను చుండిరి అట్లు తెలంగాణమున రూపొ దిన రాజ్యములలో రాచకొ డ రాజ్య మొకటి దీనికి రాజాచలము రాజగిరి అనియు నామా తరములు కలవు ఇది హైదరాబాదునకు తూర్పున ముప్పదిరె డుమైళ్ళ దూరమున నల్లగొండ జిల్లాలో ఉన్నది ఇది పదునైదుమైళ్ళ చుట్టుకొలత గలిగి యుండెడిదట సింగమనాయడు దీనికి ఏలికయై ముసునూరి కాపయ నాయకునికి (ఆనాటి ఓరుగంటి ప్రభువు ఇతడే) సామంతుడుగ ఉండెను ఈయన రాజధాని అనుమనగల్లు కాపయనాయకునకు లోబడి రాజ్యమును పాలి చుట సింగమనేనికి ఇష్టములేదు ఇతడు తన రాజ్యమును విస్తరింప దలచెను అదనుకై వేచి యుండెను ఇంతలో ఓరుగంటి ప్రభువగు కాపయనాయకునికి బహమనీరాజాధిపతియగు అల్లాఉద్దీన్ హసన్ షాకును (బహమనీరాజ్యము క్రీ శ 1347 లో నెలకొల్పబడెను) సమరము సంభవించెను ఇది మంచి అవకాశమని యె చి సింగమనాయడు తమ్ముడగు మాదానాయని సాయముతో బలమును కూర్చుకొని దక్షిణమున ఉన్న దుర్గములపై దాడి వెడలి ఆ తర్వేది ఎలేశ్వరము (నల్లగొ డ జిల్లాలోనిది) లను స్వాధీనమొనర్చు కొనెను ఇతడు తన రాజ్యమును కృష్ణా నది

తీరము వరకు విస్తరింపజేసెను తన అధికారమును ఉత్తరమున కూడ ప్రవర్తింపచేయు నెంచి సింగమ నాయడు ముసునూరి కాపయనాయకునితో గూడ యుద్ధ మొనర్చి జయము పొందినట్లు వెలుగోటివారి వంశావళిలో కలదు ఇదే ప్రయత్నములో సింగమనేడు జల్లిపల్లి కోటను ముట్టడించెను దీని పాలకులు సోమవంశ క్షత్రియులు శత్రువులను సమరమున ఎదుర్కొను సామర్థ్యము వారికి లేదు చుట్టు ప్రక్కలనున్న రెడ్డి మన్నీలతో వారు మంత్రాంగమును నెరపి కుట్రతో సింగమనాయని జయింప తలపెట్టిరి సింగమనాయని బావమఱది యగు చింతపల్లి సింగమనాయని వీరు బంధించి చెరలో ఉంచిరి తంబళ్ళ బ్రహ్మాజీ అను వానిని సింగమనేని కడకు వారు రాయబారిగపంపిరి రాయబారమునకై వచ్చిన తంబళ్ళ బ్రహ్మాజీ సింగమనేనితో ముట్టడి మానుకొనినచో మీ బావమరదిని మీకు అప్పగింతుము అని ముచ్చటించుచునే ఏమరుపాటున ఉన్న సింగమనాయని ఆయువు పట్టున కత్తితో పొడిచి పారిపోయెను సింగమనాయడు కుమారులగు అనపోత విభుని మాదానాయకుని ఎలిపించి సోమవంశక్షత్రియులను వారి సహాయకులను వధించి వారి రక్తముతో తనకు తర్పణములు చేయుడనిచెప్పి ప్రాణములను విడిచెను శత్రువులు అనపోతనాయకునికి భయపడి కొందరు ములంగూరు దుర్గమున దాగికొనిరి మరికొందరు దుర్గాధిపులను సాయముగా గొని చెంచర్లవద్ద అనపోతానేనితో సమర మొనర్చుటకు సిద్ధపడిరి అనపోతనాయడును మాదా నాయడును సైన్యమును వెంట గొనివచ్చి శత్రువులను కదనమున తమ భీకర ఖడ్గములచే నరికివైచి వారి రక్తముతో తమ తండ్రికి తర్పణములు విడిచిరి. ఈ యుద్ధమున సోమవంశ క్షత్రియులు సర్వులు మడిసిరి వారికి సాయ మొనర్ప నరుదెంచిన వారిలో కొందరు పారిపోయిరి ఈ యుద్ధము క్రీ శ 1361 శార్వరి సంవత్సర కార్తిక శుద్ధమున జరిగినదట పరశురాముడు క్షత్రియకులక్షయము పాత మొనరించినట్లు అనపోతా మాదానాయకులు సోమవంశ క్షత్రియులను ఇతర రాకుమారులను వధించుటచే వారికి సోమకుల పరశురామ జల్లిపల్లి రణకోణి భారతీశ మల్ల అను బిరుద నామములు కలిగినవి సోమవంశ క్షత్రియులకు సాయముగ వచ్చిన రెడ్డి రాజులు కొందరు అనపోత మాదానాయకులకు భయపడి పారిపోయిరి వారిని వెన్నంటి పోవుచు మాదానేడు అతని పినతండ్రి పుత్రుడు అగు నాగానేడు అనువారు కృష్ణానదిని దాటి దక్షిణముగ పోయి రెడ్డి రాజులతో చేబ్రోలు మొగుల్లూరు మొదలగు చోట్ల యుద్ధము లొనర్చి కర్నూలు జిల్లాలోని శ్రీశైల ప్రాంతమును జయించి తమరాజ్యమున కలుపుకొనిరి ఈ ప్రాంతము కొండవీటి రెడ్ల అధీనములోనిది దీనికి ఆనాటి ప్రభువు అనపోతారెడ్డి అనువాడు (క్రీ శ 1350 1362) ఇతడు ప్రోలయ వేమారెడ్డి కుమారుడు శ్రీశైల ప్రాంతమును జయించిన ఎమ్మట దన్నాల కోట వద్ద (అమరావతి ఒద్దనున్న ధరణికోట) అనపోతా రెడ్డిని ఉత్తరగోగ్రహణ సమయమున దుర్యోధనుని అర్జునుడువలె మాదానాయకుడు పారద్రోలెనట అనపోతారెడ్డి ఆయుధములు విరిగి పారిపోవుచు డగా కతారి నాగానాయకుడు వెనుపరిమి పట్టుకొని ఖడ్గముతో డాగువెట్టి అతనిని విడిచెనట ఈ విజయము లభించిన ఎడప రేచర్ల వెలమవీరులు జగనొబ్బగండ రాయ వేశ్యాభుజంగ మొదలగు రెడ్డిరాజుల బిరుదములు వహించినట్లు తెలియుచున్నది దన్నాలకోట మాత్రము వెలమవారికి వశము కాలేదు ఈ దన్నాలకోట యుద్ధము క్రీ శ 1361 ప్రాంతమున జరిగినట్లు ఊహించుచున్నారు రాచకొండవారికిని రెడ్డిరాజులకును జరిగిన తొలి సమర మిదియె ఆనాటి నుండియు రెడ్డిరాజ్యము అంతరించు వరకును ఈ రెండు రాజ్యముల వారికిని వైరాగ్ని దినదినము వృద్ధినొందినదే కాని చల్లారలేదు వీరు కృష్ణా గోదావరి మధ్య ప్రదేశములకై నిరంతరము సమరమొనర్చుచునే యుండిరి జల్లిపల్లి యుద్ధానంతరము అనపోతా మాదానాయకులు బ్రాహ్మణులకు అగ్రహారములు ఒసగి చక్రవరము అను గ్రామము ఒక భట్టునకు దానముగా ఇచ్చి అనుమనగల్లు రాజధానిగా రాచకొండ రాజ్యమును కొంతకాలము పాలించిరి అనుమనగంటి పురవరాధీశ్వరులని వీరికి బిరుదము గూడ ఉండినట్లు వెలుగోటి వారి వంశావళి గద్య చెప్పుచున్నది

అనపోతవిభుడు (క్రీ శ 1361-1384) అనుమనగంటి నుండి రాచకొండకు మార్చి అచ్చట దుర్గమును బలిష్ఠముగ జేసెను తండ్రివలె అనపోతామాదానాయకు లిరువురును తమ రాజ్యమును విస్తరింపజేయు కాంక్షతో సమర సన్నాహ మొనర్చుకొని ఓరుగంటి నాథుడగు ముసునూరి కాపయనాయకునిపై దండెత్తిరి ఈ యుద్ధమున రాచకొండవారికి బహమనీ సుల్తానులు రహస్యముగ సాయమొనర్చినట్లు తెలియుచున్నది

కాపనాయకుడు బహమనీ సుల్తానులగు అల్లాఉద్దీన్ హసన్ షా తోను ఆతని కుమారుడగు మహమ్మదుషాతోను అంతకు ముందు అనేక పర్యాయములు యుద్ధమొనర్చి క్షీణబలుడై యుండెను తన బలమును చక్కదిద్దుకొను సమయముననే అనపోతవిభుడు అతనిపై యుద్ధమునకు వచ్చెను ఇరుపక్షముల వారికిని అనుమకొండ సమీపమునందలి భీమవరమునొద్ద పోరు ఘోరముగ జరిగెను అందు అనపోతవిభునిచే కాపయనాయకుడు హతుడయ్యెను ఓరుగంటిరాజ్యము రేచర్ల వెలమ దొరలకు వశమైంది ఈ యుద్ధము క్రీ శ 1368 లేక 1369 లో జరిగినట్లు అయ్యనవ్రోలు శాసనమువలన తెలియవచ్చుచున్నది ఈ యుద్ధానంతరము రేచర్ల వెలమనాయకులు వసుమారి కాపయనాయకుని పైన "ఆంధ్రదేశాధీశ్వర ఖడ్గనారాయణ గాయగోవాళ వా దూరాయసరత్రాణాది" బిరుదములు ధరించి తెలగాణమును పాలింపదొడగిరి అనపోతానేడు శత్రుదుర్భేద్యమైన త్రిభువనగిరిని (ఇదియే భువనగిరి) జయించి త్రిభువనీరాయరావు అను బిరుదము నొందినట్లు తెలియుచున్నది క్రీ శ 1369 వ నాటి అయ్యనవ్రోలు శాసనము వలన అనపోతానేడు ఓరుగల్లు శ్రీ భువనగిరి రాచకొండ నిగవురము మున్నగు దుర్గములకు ప్రభువైనట్లు తెలియుచున్నది (చూ వెలువ చరిత్ర పుట - అనుబంధము 24) ఈ శాసనమును అనపోతాభుడు వేయించెను ఈ విధముగ అనపోతానాయని రాజ్యము ఉత్తరమున గోదావరి వరకును దక్షిణమున శ్రీశైలము వరకును పశ్చిమమున బహమనీ రాజ్యమువరకును తూర్పున కొండవీటి రాజ్యమువరకును వ్యాపించియుండెను అట్లు రాజ్యము మిక్కిలి విస్తరించుట చేత అనపోతవిభుడు తన రాజ్యమునందలి ఆగ్నేయపు సరిహద్దును శత్రువుల బారినుండి రక్షించుటకును రాచకొండ రాజ్యమునందలి దక్షిణ భాగమును పరిపాలించుటకును తనకు ప్రతినిధిగ తన సోదరుడగు మాదానాయకుని నియమించెను ఈ ప్రాంతమే దేవరకొండ రాజ్యమని వ్యవహరింపబడెను మాదానేడు దేవరకొండకు దక్షిణముగ తన పేర మాధవపురమను నగరమును నిర్మించి అందు తాను నివసించుచు దేవరకొండ రాజ్యమును పాలింపదొడగెను క్రమముగ అనపోతవిభుని సంతతివారు రాచకొండరాజ్యమునకును మాదానాయని సంతతివారు దేవరకొండరాజ్యమునకును ప్రభువులై పాలింపదొడగిరి

అనపోతానాయకుడు సమరశూరుడు రాజనీతిజ్ఞుడే కాక ప్రజాహిత తత్పరుడనియు శివభక్తుడనియు ఆశ్రితులకు కల్పవృక్షము వంటి వాడనియు దానములచేత విప్రులను సంతోషపెట్టువాడనియు రాచకొండ శాసనమువలన తెలియుచున్నది (చూ వెలువంచ అను పుట 26 29) ఇతడు బహమనీసుల్తానులతో స్నేహము నెరపి రాజ్యము ఎట్టియుపద్రవములకు లోనుగాకుండునట్లు పాలించెను రాచకొండలో ఇతడు రాయసముద్రము అనపోతసముద్రము అను తటాకములను నిర్మించెను (చూ వెలువంచ అనుబంధం పుట 26 28) రామస్వామి వీరభద్రస్వాముల దేవళములను నెలకొల్పెను జీర్ణస్థితిలోనున్న దుర్గాలయమును పునరుద్ధరించెను కొలనుపుకూటపు బావిని సంకీర్ణ బావిని త్రవ్వించెను అనేక రాజమందిరముల నేర్పరచెను నాగానాయనికొండను రాచకొండతో కలిపి చుట్టు ప్రాకారమును నిర్మించి నాగనాయని కొండపైనున్న దుర్గమును శత్రు దుర్భేద్యముగ ఒనర్చెను శివాలయములను నిర్మించెను పెక్కు భైరవ ప్రతిష్ఠలుకూడ చేసినట్లు అనపోతానాయని రాచకొండ శాసనములవలన తెలియుచున్నది (చూ వెలువంచరి అనుబంధ పుటలు 26 28) హేమాద్రి పేర్కొనిన దానములు సమగ్రముగ ఇతడొనర్చెనట ఇతడు శ్రీపర్వతమునకు సోపానములు కట్టించినట్లును వింధ్య శ్రీశైల మధ్యప్రదేశమును పాలించినట్లును రసార్ణవసుధాకరమను గ్రంథమువలన తెలియవచ్చుచున్నది ఈ గ్రంథమును అనపోతవిభుని కుమారుడగు కుమార సింగమనాయుడు రచియించెను ఇందు అనపోతనాయకీయ మను గ్రంథ ప్రశంసయు కనవచ్చుచున్నది కుమార సింగభూపాలుని ఆస్థానకవి యగు విశ్వేశ్వరకవి అనునతడు అనపోతానాయని ప్రశంసతో నొప్పు చమత్కారచంద్రిక అను గ్రంథమును సంస్కృతమున వ్రాసెను ఈ విశ్వేశ్వరకవి శిష్యుడే అయినవ్రోలు శాసనకర్త అగు నాగనాథుడు ఇతడు (నాగనాథుడు) సంస్కృతమున మదన విలాసభాణము అను గ్రంథమును ఆంధ్రమున విష్ణుపురాణమును రచించెను అనపోతవిభుడు అయినవ్రోలు గ్రామములోని మైలారుదేవుని దర్శించి ఆయనకు అయినవ్రోలును సమర్పించి అనేక శిలాశాసనములు వేయించెను అనపోతానేని తమ్ముడు అగు మాదానాయకుడు గూడ శివభక్తుడు ఇతడు శ్రీశైలమునకు ఉత్తర ద్వారమని పేరొందిన ఉమామహేశ్వర మను గ్రామమునందు ఒక మహా

శ్వర దేవర మంటపమును శివాలయమును నిర్మించి శాసనము వేయించెను (చూ వెలు వంశ చ అనుబం పుటి 81 85 శ్లోకం 27)

అనపోతానాయని ఉచ్ఛ్రతిని జూచి సహి పలేక అతని విజృంభణమును అణచివేయు ఉద్దేశముతో బహమనీ పాలకుడగు మహమ్మదుషా ఓరుగల్లు గోలుకొండల దుర్గములపైకి దండెత్తివచ్చెను ఈ యుద్ధమున మహమ్మదుషాకు ఓరుగల్లు వశముకాలేదు కాని అనపోతానాయడు గోలకొండదుర్గము మహమ్మదుషాకిచ్చి అతనితో తనరాజ్యముపైకి తిరిగి దండెత్తకుండు ట్లు స ధిచేసికొనెను ఇట్లు మూడువూలు అరు కాయలతో వృద్ధినొందిన రాచకొండరాజ్యము క్రమముగా క్షీణించి క్రీ శ 1484 తో నామమాత్రావశిష్టమై నేడు చూపరులకు ఆ ప్రాంతము నిబిడారణ్య నిమగ్నమయి కనిపించుచున్నది

శం అం శా

**అనపోతానాయకుడు** – చూ అనపోతవిభుడు

## అనపోతా రెడ్డి I

కాకతీయ సామ్రాజ్యము క్షీణించుకాలమున వెల్లూరు మండలము నందలి పంట వంశీయులైన దేసటి రెడ్లు స్వసంత్ర ప్రతిపత్తిగల కొండవీటి రాజ్యమును స్థాపించిరి దీనిని వేమారెడ్డి పౌత్రుడును ప్రోలయరెడ్డి పుత్రుడును అగు ప్రోలయ వేమా రెడ్డి క్రీ శ 1324 న స్థాపించి 1352 వరకు ధర్మయుతముగ పాలించెను ఈయన మరణానంతరము ఈతని కుమారుడగు అనపోతారెడ్డి క్రీ శ 1353 న కొండవీటి రాజ్య సింహాసనమును అధిష్ఠించెను ఈ రాజ్యమునకు గుండ్లకమ్మనది యొడ్డున ఉన్న అద్దంకి ముఖ్యపట్టణము శ్రీశైలము నుండి తూర్పు సముద్రము వరకును ఉత్తరమున కృష్ణాతటము వరకును వ్యాపించి ధరణికోట చందవోలు వినుకొండ కొండవీడు కొండపల్లి బెల్లంకొండ వంటి బలిష్ఠములగు దుర్గములతోను సుప్రసిద్ధమైన మోటుపల్లి అను రేవు పట్టణముతోను ఈ కొండవీటిరాజ్యము ఒప్పుచుండెను

యువరాజుగ నున్నపుడే అనపోతారెడ్డి తండ్రికడను పినతండ్రియగు మల్లారెడ్డి చెంతను మేనమామయగు నాగారెడ్డి సాంగత్యమునను తక్కిన మంత్రుల వద్దను రాజనీతి యుద్ధతంత్రములు సమరకౌశలము దండనీతి మున్నగు విషయముల నలవరచుకొనెను స్వయముగా సైన్యము నడుపు సమరమున తండ్రికి సహాయుడయ్యెను సింహాసనము నధిష్ఠించు నాటికే ఇట్టి సామర్థ్యముతో ఒప్పుచు ఇతడు వీరాన్నపోతనృపతి అని వ్యవహరింపబడుచుండెను పిత్రార్జితమైనరాజ్యము అల్పమని యెంచి ఇతడు దానిని విస్తృతమొనర్ప దలచెను పశ్చిమమున వెలమసంతపు రాజులును ఉత్తరమున తెలంగాణమునకు ఎలి యగు కాపయనాయకుడును బలవతులగుటచే ఇతడావంకలకు దండెత్తలేదు కృష్ణాగోదావరీల మధ్య ప్రదేశమే ఈతనిదండయాత్రకు అనువుగనుండెను అచ్చటి మాండలికులు పరస్పర ద్వేషములతో కలహములతో కొట్లాడుచుండిరి మంత్రులగు మల్లన సోమయ వేమనలతో ఆలోచించి ఇతడు సింహాసనస్థుడైన పిదప రెండు మూడు సంవత్సరములలోనే గొప్పసైన్యమును కూర్చుకొని కృష్ణనుదాటి మధ్యేమార్గమ దలి కాపయసామంతులతో పోరుచు గోదావరీ తీరమువరకు జైత్రయాత్ర సాగించెను అపారమైన రెడ్డివాహినిని అరికట్టుటకు మాండలిక నృపతులు సన్నద్ధులయిరి వారిలో ఉండీకులు ముఖ్యులు వీరు సూర్యవంశ క్షత్రియులు పడమటి గోదావరిమండలములోని మాణిపీడు ఎలూరు భీమవరము జల్లిపల్లి మున్నగు సీమలను వీరు పాలించుచుండిరి వీరు నిడుదవోలు చక్రవర్తి తోను చోడులతోను బాంధవ్యము కలిగి స్వతంత్రులై యుండిరి వీరుగాక మాండలికులలో ఎన్నదగినవారును చోళులలో ప్రముఖుడగు కామరాజను నామాంతరముగల భక్తిరాజు ఈయన కుమారుడు అన్నదేవుడు అనువారును నల్లభీముడను నామాంతరముగల ఎరవభీముడును హైహయవంశీయులును కోనవంశపురాజులలో ప్రధానులునగు ఇందుశేఖరుడు గణపతిదేవుడును మున్నగువారును రెడ్డిసైన్యమును జయించుటకై తమ శక్తిని ధారవోసిరి భక్తిరాజు ఉండిరాజుల సాయముతో సూరవరప్రాంతమున అనపోతారెడ్డిని సమరమున ఓడించినట్లు తెలియుచున్నది మహాబలవతుడైన భక్తిరాజు క్రీ శ 1367 నాటివరకు జీవించియుండెను అతడున్నంతవరకును గోదావరీ పరిసరప్రదేశము రెడ్డిరాజ్యములో కలియలేదు తుదకు అనవేమారెడ్డి కాలములో (క్రీ శ 1370 1385) కాటయవేముడు అల్లయ వీరభద్రులు క్రమించి ఆ ప్రాంతమును రెడ్డిరాజ్యములో కలిపిరి మొదటినుండియు రెడ్డినృపతులకును రేచర్ల పద్మనాయకులకును

మధ్య కలహాగ్ని ప్రజ్వరిల్లుచునే యుండెను ప్రతాపరుద్రుని తరువాత తెలంగాణమును పాలించుచున్న కాపయనాయకు నికి ఈ వెలమదొరలు సామంతులు వీరు రాచకొండ రాజ్యమును పాలించుచుండిరి వీరు క్రమముగా బలవంతులై తోడి క్షత్రియ సామంతులను జయించి వారి నాయంకరములను వశమొనర్చుకొనుచు తుదకు కాపయనాయకుని గూడ లెక్క పరైరి వీరిలో క్రీ శ 1361 న సింగమనాయని పుత్రులైన అనపోతామాదానాయకులు తమ తండ్రిని వధించిన ల్లి ల్లి క్షత్రియులను వధించి వారికి సాయపడిన రాజులను వెంటాడుచు కృష్ణానదినిదాటి రెడ్డిరాజుల ఆధీనములోనున్న శ్రీశైలమును వశమొనర్చుకొని దన్నాలకోట (ధరణికోట అమరావతి సమీపమున ఉన్నది) ను ముట్టడించిరి రెడ్డి ఏలిక యగు అనపోతారెడ్డికిని వెలమరాజులకును పోరు ఘోరముగ జరిగెను ఈ దుర్గాపతియగు కేతయ మల్లినాథ వేమన సమరమున కడు చతురుడు ఈతడు అనపోతారెడ్డికడ మంత్రిగను సేనాధిపతిగను ఉండి ఆతనికి కుడిభుజముగ నుండెను ఇతడు రెడ్డిరాజులకు కాలక్రమముగా వచ్చుచున్న మంత్రిపుంగవుడు. మల్లినాథ లక్కాంబికల తనూభవుడు అనపోతారెడ్డి యొనర్చు సమరములలో ఇతడు ప్రధానపాత్ర వహించెను ఈతని తండ్రియగు మల్లినాథుడు ప్రోలయవేమారెడ్డి బిరుదములను గూడ ధరించినట్లు శాసనములలో కనవచ్చుచున్నది ఇట్టి ప్రజ్ఞావంతుడగు వేమన గూడ ఈ యుద్ధమున రేచర్ల వీరులధాటికి తట్టుకొనలేక పోయెను అపజయము అపార నష్టము రెడ్డిరాజులకు సమరమున కలిగినను ధరణికోట దుర్గము మాత్రము రేచర్ల వెలమవారికి స్వాధీనము కాలేదు ఈ విధముగ అనపోతారెడ్డి కాలము విజయములంతొ పరాజయములతోడనే గడచిపోయెను

అనపోతారెడ్డి ద్వీపజేత అని క్రీ శ 1356 నాటి ద్రాక్షారామ శాసనము పేర్కొనుచున్నది బహుశ ఇతడు కోనసీమను (తూర్పు గోదావరి మండలములోనిది) జయించియుండెనేమో ఈతడిట్లు ప్రతి సంవత్సము సమరముల నెదుర్కొనుచున్నను తండ్రివలెనే ధార్మికబుద్ధితో ప్రజారంజకముగ రాజ్యము పాలించి పటుఃపాలన కర్మఠి అని శాసనములలో పొగడ్తకెక్కెను ఇతడు వినుకొండ బెల్లముకొండ కొండవీడు దుర్గములను శత్రువులకు అభేద్యములుగ నొనర్చెను పరిపాలన సౌలభ్యమునకై అద్దంకిని మార్చి కొండవీటిని తన రాజధానినిగ చేసికొనెను క్రీ శ 1353 ప్రాంతమున యవనులు హైందవ గ్రామములపైబడి గ్రామములను తగులబెట్టియు హైందవ స్త్రీలను అవమానమొనర్చియు హిందువుల గృహక్షేత్రాదులను వర్తకుల సువర్ణ రత్నరాసులను అపహరించియు మిక్కిలి హింసించుచుండిరి అనపోతారెడ్డి యవనుల విజృంభణమును అరికట్టి కర్షకులకును వర్తకులకును వారి వారి సొత్తులను తిరిగి అప్పగించి వారికి ధైర్యమును కలిగించి వ్యవసాయ వాణిజ్యములను తిరిగి అభివృద్ధి పరచెను

ఇతడొనర్చిన ముఖ్యకార్యములలో మోటుపల్లి రేవును అభివృద్ధిచేయుట యొకటి (మోటుపల్లి గుంటూరు మండలమున బాపట్లకు 17 మైళ్ల దూరమున సముద్రతీరమున ఉన్నది) సముద్రవ్యాపారమున నష్టము కలుగుచున్నదను విషయమును తన మంత్రులలో ద్వితీయస్థానము వహించిన సోమనవలన ఇతడు తెలిసికొనెను తోడనే క్రీ శ 1353 వ మోటుపల్లికి ఇతడు వేంచేసి అచ్చటి విషయములను సాకల్యముగ పరిశీలించి వర్తకులకు సంబంధించిన నియమములను తెలుపునట్టి యొక ధర్మశాసనమును స్తంభముపై వ్రాయించెను ఇదియంతయు సోమనమంత్రి ఆధ్వర్యవమున జరిగెను ఆ నియమముల ననుసరించి సముద్రవ్యాపారము చేయువర్తకులకు పెక్కుకష్టములు తప్పిపోయెను అందలి ప్రధాన నియమము లిట్లున్నవి — వ్యాపారమునకై మోటుపల్లికి వచ్చు వర్తకుల నెవరినైనను గౌరవింపవలెను ఒక చోటినుండి వేరొకతావునకు వర్తకులు స్వేచ్ఛగా పయనముచేయవచ్చును వర్తకులు వారికి వచ్చిన ప్రదేశములలో వస్తువులు కొనుగోలు చేసి వారికి ఇష్టమునచ్చిన తావులలో అమ్ముకొనవచ్చును సుంకములు వసూలుచేయు సందర్భమున బేహారులను రాజోద్యోగులు బాధింపరాదు బంగారమునకు సుంకము వసూలు చేయరాదు అపుత్రికము సుంకాదాయము అను పన్నులను వసూలుచేయకూడదు " ఈ విధముగ నియమములను విధించిన సమ్మట మోటుపల్లి రేవున వ్యాపారము మిక్కిలి అభివృద్ధి నొందెను ఈ రేవువలనవచ్చు ఆదాయమే రెడ్డిరాజులను ధన సమృద్ధియుతులను చేసెనది ఈ వ్యాపారమువలననే అవచి తిప్పయశ్రేష్ఠివంటి వారు కోటీశ్వరులయిరి

దాన ధర్మము లొనర్చుటలో అనపోతారెడ్డి తండ్రికెంతమాత్రము తీసిపోడు ఇతడు తెనాలివద్దనున్న కొల్లూరు

గ్రామమునకు "అన్నపోత పుర మని పేరిడి కతిపయబ్రాహ్మణులకు సర్వాగ్రహారముగా దాన మొనర్చినట్లు శా శ 1280 (క్రీ శ 1358) నాటి శాసనమువలన తెలియుచున్నది ఈ శాసనము శా శ 1286 (క్రీ శ 1364) నాటిది అని మరికొందరు భావించుచున్నారు మరియు ఈ శాసనమునందు తాడినగరపు పొలమున ఇరువుట్టి 57 వేమూరిపొలాన 57 శెరసి కేసరపాటి 53 ఖండ్రిక అను పొలము యర్రాప్రెగడగారికీయ బడినట్లున్నది ఈ యర్రాప్రెగడ తండ్రి ఆస్థాన విద్వాంసుడైన శ భుదాసుడేమో నికొందరి ఊహ ఈతని ఆస్థానమున మహోపాధ్యాయి బిరుదాంచితుడైన ఎలకూచి బాలసరస్వతి అను పండితుడుండెను అ పోతారెడ్డి వేయించిన శా సములను ఇతడే వ్రాసెను శాసనముల తుదిని

అన్నపోత నరేంద్రస్య విద్వాన్ బాలసరస్వతిః
అకరోదాకరోవాచా నిర్మలం ధర్మశాసన "

అని ఇతడు వ్రాసెను అనపోతారెడ్డి బ్రాహ్మణులకు అనేక అగ్రహారములను దానము చేసినట్లు శాసనములవలన తెలియుచున్నది శా శ 1278 (క్రీ శ 1356) వినుకొండసీమలోని నాగళ్ళ అను గ్రామమును క థంపాటి కొండు శాస్త్రిలింగారికి అతడు అలవణం అకరగా సర్వాగ్రహారంగా ధారాగృహీతము కావించెను మరియు శా శ 1286 (క్రీ శ 1364) న జమ్మలమడక పురుషోత్తమ సోమయాజికి కోడితాడిపర్రు అను గ్రామమును దానము చేసెను యవనాపహృతమైన ఉప్పుగల్లు అను అగ్రహారమును (గుడివాడ తాలూకా తిరిగి అగ్రహారికులకు అప్పగి చెను క్రీ శ 1357 ప్రాంతమున ఢిల్లీశ్వరుడగు తఘ్లకు దండయాత్ర వలననో లేక అల్లాయుద్దీను దండయాత్రాఫలితముగనో భగ్నముచెందిన అమరావతిలోని అమరేశ్వరాలయమును బాగు చేయించి అమరేశ్వరస్వామిని అందు పునః ప్రతిష్ఠితుని చేయించెను ఈ కార్యక్రమములో ఇతనికి మిక్కిలి తోడ్పడినవాడు ధాన్యకటక (ధరణికోట) దుర్గాధిపతియు ఇతని మంత్రియు సేనానియు నైన కేతయమల్లసోమశౌరి ఈ అమాత్యశేఖరుని గొప్పద మును అమరా తి శాస మిట్లు వర్ణించుచున్నది

"అనపోత మహీశ బాహుదండః
ప్రథితారాతి నికాయ కాలదండః
భువి కేతయ మల్లవేమశౌరి
స్సదయం రక్షతి రమ్యధాన్య వాటీం॥

హేమాద్రి పేర్కొనిన దానములను అనపోతారెడ్డి సమగ్రముగ నెరవేర్చెనట ఈతని ఆస్థానమును వేదపండితులు శాస్త్రవేత్తలు ధర్మాదులు కవులు జ్యోతిషికులు నిరంతరము అలంకరించుచు డిరి వైదిక స్మార్త జ్యోతిష ఆయుర్వేదాది విద్యలను ఇతడు మిక్కిలి ప్రోత్సహించెను ఇట్లు క్రీ శ 1370 వరకు రెడ్డిరాజ్య రమను ప్రజార జకముగ పాలించి రెడ్డిరాజ్య చరిత్రలో ప్రధాన స్థానమాక్రమించిన మహనీయుడు అనపోతారెడ్డి

తం అం శా

## అనపోతారెడ్డి II

కొ డవీటి రెడ్డిరాజ్యమును స్థాపించిన మహనీయుడు ప్రోలయవేమారెడ్డి (క్రీ శ 1324 1353) ఈయనకు ఎమ్మట ఈయన కుమారుడు అనపోతారెడ్డి కొండవీటి స హా వమును అధిష్ఠి చి క్రీ శ 1353 నుండి 1364 వరకు రాజ్యమును పాలించెను ఈయననే మొదటి అనపోతారెడ్డి అని వ్యవహరింతురు ఈయన కుమారుడు కుమారగిరిరెడ్డి ఇతడు త డ్రియగు అనపోతారెడ్డి మరణి చు నాటికి బాలుడగుటచే కొ డవీటి రాజ్యభారమును ఈతని పినత డ్రియు అనపోతారెడ్డికి తమ్ముడును అగు అనవేమారెడ్డి వహి చి క్రీ శ 1364 ను డి 1386 వరకు రాజ్యమును పరిపాలించెను ఈ అనవేమారెడ్డి సంతానము లేక మరణించెను అందుచే ఈతని అన్నయగు అనపోతారెడ్డి కుమారుడు కుమారగిరిరెడ్డి కొండవీటి రాజ్యసింహాసనమును అధిష్ఠించి క్రీ శ 1386 నుండి క్రీ శ 1402 వరకు రాజ్యము నేలెను ఈతని కుమారుడు అనపోతారెడ్డి ఇతనిని రెండవ అనపోతారెడ్డి అని వ్యవహరింతురు

రెండవ అనపోతారెడ్డికి కుమార అన్నపోతు వీరాన్నపోతు అనునామములను శాసనములందు కనవచ్చుచున్నవి ఇతడు కొమరగిరిరెడ్డికి ఏకైక పుత్రుడు అందుచే కొమరగిరిరెడ్డి ఈ బాలుని ప్రాణప్రదముగ చూచుకొనుచు డెను కొమరగిరిరెడ్డి కొండవీటి రాజ్యసింహాసనమున అధిష్ఠించిన వె టనే కుమారాన్నపోతును వె టగొని ద్రాక్షారామమున కేగెను అచట భీమేశ్వరుని సందర్శి చెను తొడపై అన్నపోతును కూర్చుడబెట్టుకొని అతడు హేమాద్రి పండితుడు చెప్పిన దానకల్పములోని మిక్కిలి ప్రశస్తి వహించిన తులాపురుష దానమొనర్చెను అనపోతున్ఫురద్రూపి

పితామహుడువలె అతడు సాహసపరాక్రమోపేతుడు మామయగు కాటయవేమారెడ్డి సాంగత్యముచే అతడు సమర తంత్రములను రాజ్యపాలనపటుత్వమును చక్కగా గ్రహించెను కొమరగిరిరెడ్డి క్రీ శ 1390 న కుమారుడగు అనపోతునకు యౌవరాజ్య పట్టాభిషేకమొనరించి సింహాచలము మొదలుకొని రాజమహేంద్రవరమువరకు గల రాజ్యమును అతనికొసగెను ఈ ప్రాంతమంతయు క్రీ శ 1385 ప్రాంతమున అనపోతు మామయగు కాటయవేమారెడ్డి జయించినట్లు కాటయవేముని గోపవర శాసనము చెప్పుచున్నది ఈ శాసనము క్రీ శ 1395 నాటిది ఈశాసనమునందు కాటయవేమునకు కటకచూఱకార అను విశేషణము వాడబడినది కుమారాన్నపోతునకు రాజమహేంద్రవరరాజ్యమున మంత్రిత్వమును నెరపినవాడు అల్లాడరెడ్డి

కుమారగిరిరెడ్డికి సమకాలికుడును గాంగవంశీయుడును కళింగదేశమును పాలించువాడును అగు నాలుగవ వీరనరసింహదేవుడు గాంగరాజ్యమును పాలించు నాటికి గాంగరాజ్యము మిక్కిలి క్షీణదశలోనుండెను ఈ వీరనరసింహుడు గాంగరాజ్యమును క్రీ శ 1378 నుండి 1409 వరకు పాలించెను ఈ సమయమున రెడ్డి ప్రభువులు గాంగ రాజ్యదక్షిణ భాగము నాక్రమింప దొడగిరి కాటయవేముని ధాటికి వీరనరసింహుడు తట్టుకొనలేకపోయెను తన రాజ్యమును కబళించుచున్న రెడ్డి రాజులపైకి నాలుగవ వీరనరసింహదేవుడు క్రీ శ 1399 న దండెత్తివచ్చెను రాజమహేంద్రవరరాజ్యమును అతడు కబళింపనిశ్చయించెను కాని అతని ఆశయము తారుమారయ్యెను. ఆ యుద్ధమున కాటయవేముడును కుమారగిరిరెడ్డియు కుమార వీరాన్నపోతును పాల్గొనిరి వారు విహారణగిరి ముందు నరసింహదేవుని ఎదుర్కొని సమరమున అతనిని ఓడించిరి ఈ యుద్ధమున గొగ్గయ నాయకుని కుమారుడు అగు దేవనాయకుడను నతడు కుమారాన్నపోతునకు మిక్కిలి సాయపడెను ఆటకొండ తిరుగుడు మెట్టు అను తెనుగు పదములకు సంస్కృతీకరణమే విహారణగిరి అయినట్లు తోచుచున్నది ఈ విహారణగిరి నేటి తూర్పు గోదావరీ మండలమునందలి పెద్దాపురము తుని ప్రాంతము అందుండినట్లు ఊహింపబడుచున్నది రెడ్డి నృపతులు ఈ యుద్ధమున నరసింహదేవునోడించుటయేకాక ఒరిస్సాలో నున్న చిలుక సముద్రమువరకు చొచ్చుకొనిపోయి దానిని ఆక్రమించినట్లును తెలియుచున్నది ఈ విధముగ రాజమహేంద్రవర రాజ్యము కటకమువరకు విస్తరించెను కపిలేశ్వరగజపతి కళింగ రాజ్యాధిపతియగు నంతవరకును రెడ్డి రాజుల విజృంభణమును అరికట్ట గలిగిన గాంగప్రభువు ఒక్కడును లేకుండెను క్రీ శ 1434 లో ఎమ్మటి కళింగపాలకుడగు నాలుగవ భానుదేవుని అస్తమయానంతరము అతని మంత్రి "కపిలేశ్వర గజపతి" అను నామమును ధరించి కళింగ రాజ్యమును పాలించెను రాజమహేంద్రవరరాజ్యవిస్తరణానంతరము వీరాన్నపోతారెడ్డి తనకు సమరమున సాయపడిన దేవనాయకునితో సర్పవరము (తూర్పు గోదావరి మండలములోనిది) లోని భావనారాయణస్వామిని దర్శించి ఆదేవునకు అనేక దానములొసగి శాసనములు వేయించెను (L R II Page-258) మరియు కుమార అన్నపోతు రాజమహేంద్రవర దుర్గమునందలి గోపీనాథదేవరకు అను పఱితి (అను వర్తి) అను గ్రామమును అంగరంగ భోగములకై దానమొసగెను

ఇట్లు రెడ్డి రాజ్యచరిత్రమున రెండవ అనపోతారెడ్డి శాశ్వతకీర్తిని సంపాదించి క్రీ శ 1390–1395 మధ్యన అకాల మరణమునకు గురి అయ్యెను ఈ విషయము అనువర్తి గోపవర శాసనముల వలన తెలియుచున్నది ప్రియపుత్రుని మరణము కుమారగిరిరెడ్డికి హృదయశల్యమయ్యెను అతడు రాజమహేంద్రవర రాజ్యసింహాసనమును అధిష్ఠింపతగిన వ్యక్తికై సమాలోచన సేయుచుండెను ఉత్తరమున కళింగ గజపతుల ధాటిని తట్టుకొనగల బలవంతుడును రాజ్యమును సురక్షితముగ కాపాడగల వాడును మిక్కిలి ఆవశ్యకుడయ్యెను అట్టివాడు కొమరగిరిరెడ్డి బావఅగు కాటయవేమారెడ్డి తక్క అన్యుడులేడు అందుచే కొమరగిరిరెడ్డి రాజమహేంద్రవర రాజ్యమును కాటయవేమునకు సమర్పించి దాని అతనిని ఏలికగ ఒనర్చెను ఈ కార్యము కుమారగిరి రెడ్డి అనంతర వారసుడైన పెదకోమటి వేమారెడ్డికి అంగీకారము కాలేదు ఈ కోమటి వేముడు మాచారెడ్డికి మనుమడు (పౌత్రుడు) మాచారెడ్డి కొండవీటిరెడ్డి రాజ్యస్థాపకుడగు ప్రోలయవేముని సోదరుడు కొండవీటిరెడ్డి రాజ్యమును హస్తగతమొనర్చుకొనుటకు కోమటివేముడు అవసనరకై వేచియుండెను అతడు కొంత సైన్యమును కూర్చుకొని క్రీ శ 1402 న కొండవీటిరాజ్యముపై దండెత్తి సమరమున కుమారగిరిరెడ్డిని ఓడించి కొండవీటి రాజ్యమును వశమొనర్చుకొనెను కొమరగిరిరెడ్డి

నిలువ నీడలేక రాజమహేంద్రవరరాజ్యమున కాటయ వేముని చెంత కొంతకాలముండి ఆధివ్యాధిగ్రస్తుడై తుదకు క్రీ శ 1402 తరువాత తనువును చాలించెను

తం ఆం శా

## అనపోతు

సంధి జరగకుండ పలనాటియుద్ధము తుదివరకు కొనసాగుటకు కారణభూతుడు అనపోతు అను బ్రాహ్మణ యువకుడు ఇతడు ఆరువేల నియోగిశాఖకు చెందినవాడు ఈయన ఇంటిపేరు ఒడ్డి ఇతడు పెద్దనపౌత్రుడు మల్లపరాజుపుత్రుడు ఈయన తల్లి పేరమ్మ ఇతడు నాలుగు వేదములను చదివెను శాకుయుద్ధమునందు ఇతడు గొప్ప నైపుణ్యము కలిగియుండెను ఈతని తండ్రి అగు మల్లపరాజు మాచెర్ల రాజ్యమును పాలించుచున్న మల్లిదేవరాజు నొద్ద వ్రాయసకాడుగ ఉండెను అనపోతుబాలచంద్రునికి నెచ్చెలికాడు మహాయోధుడు

నాయకురాలి (నాగమ్మ) కుతంత్రములవలన గురజాలను పాలించుచున్న నలగామునకును మాచెర్లరాజగు మలిదేవునకును కార్యమపూడి యొద్ద యుద్ధము ఆరంభమయ్యెను ఈ యుద్ధము క్రీ శ 1181 1182 ల మధ్యకాలమున జరిగియుండునని ఊహింపబడుచున్నది ఈ యుద్ధమునకు పల్నాటిసీమ ఏలిక అగు అనుగురాజుపుత్రులలోని దాయభాగమునకై కలిగిన అంతః కలహములే దారితీసినవి నలగామునిమంత్రిణి అయిన నాగమ్మ ఈ యుద్ధప్రజ్వలనమునకు ముఖ్యకారకురాలు ఆమె సవతి సోదరుల మధ్య కలతలు లేవదీసి కోడిపందెము అను మిషతో మలిదేవుని మాచెర్లరాజ్యమును కబళించెను ఏడుసంవత్సరములు అరణ్యవాసము చేసి తిరిగివచ్చిన మలిదేవునకు తిరిగి మాచెర్లరాజ్యమీయక నాయకురాలు మరమునకు మొగ్గెను నలగాముడు నాయకురాలి చేతిలో కీలుబొమ్మయై ఆమె చెప్పినట్లు నడుచుచుండెను మలిదేవుని మంత్రియగు శీలం బ్రహ్మనాయడు ధర్మమార్గతత్పరుడై సవతిసోదరులమధ్య స్నేహమును వృద్ధిచేయుటకు యత్నించియు విఫలుడయ్యెను తత్ఫలితగా సోదరులకు కార్యమపూడి (ఇది గుంటూరు జిల్లా పలనాడు తాలూకాలో ఉన్నది) వద్ద యుద్ధము ఆరంభమయ్యెను

బ్రాహ్మనాయని పుత్రుడగు బాలచంద్రుడు భార్యయగు మాంచాలవద్దకుపోయి "దీవించియుద్ధమునకు పంపుమని తన ఖడ్గమును ఆమెకిచ్చెను మాంచాల భర్త చేతిలో ఉన్న ఖడ్గమును గ్రహించి "కలియుగమున మీకు ఘన పూజలమరును" అని దీవించి తిరిగి ఆ కత్తిని బాలచంద్రునికిచ్చి అనపోతు బ్రాహ్మణుడు అతడు యుద్ధమున మరణించుచో బ్రహ్మహత్య ఘటిల్లును ఎట్లయినను అనపోతును ఇంటికి మరల్చుడు అని బోధించెను బాలచంద్రుడు దానికంగీకరించెను అతడు తల్లియగు ఐతాంబ కడకేగి ఆమె ఆశీస్సును పొంది కార్యమపూడి యుద్ధమునకు పయనమయ్యెను

అనపోతు తనతో యుద్ధమునకు రానీయక అతనిని ఇంటికి పంపు ఉపాయమును బాలచంద్రుడు ఆలోచించెను మార్గమధ్యమున ఆగి బాలచంద్రుడు అనపోతుతో తాను తన ముత్యాలహారమును ఉంగరమును మాంచాల నగరిలో మరచి వచ్చితినని అబద్ధమాడి వాటిని తెమ్మని ఆజ్ఞాపించెను స్నేహితుని ఆజ్ఞ శిరసావహించి అనపోతు మాంచాలనగరికి మరలిపోయెను బాలచంద్రుడు అచటినుండి త్రిపురాంతకమునకు (ఇది కర్నూలుజిల్లాలో మార్కాపురమునకు ఈశాన్యముగ రెండుమైళ్ళ దూరమున ఉన్నది) వచ్చెను అనపోతును కార్యమపూడికి రావలదని ఆజ్ఞాపించుచు ఒకలేఖవ్రాసి దానిని ఒకరాగిచెట్టు కొమ్మకుకట్టి మిగిలిన స్నేహితులతో బాలచంద్రుడు నల్లగొండకుపోయి అచట విశ్రమించెను నల్లగొండ శిఖరము నెక్కి బాలచంద్రుడు కార్యమపూడి యుద్ధరంగమును కలయజూచెను యుద్ధముచేయు నుత్సాహముతో బాలచంద్రుడు స్నేహితులతో కలిసి కార్యమపూడికిపోయి మలిదేవుని కొలువున ప్రవేశించెను మలిదేవుడు నాయకురాలితో సంధికి అంగీకరించినట్లు తెలిసికొని అతనిని నిందించి యుద్ధరంగమునకు కదలుడని బాలచంద్రుడు వీరులను పురికొల్పసాగెను తుదకు కొమ్మరాజు వాక్యములను విని బాలచంద్రుడు శాంతచిత్తుడయ్యెను సంధికుదిరెననెడు సంతోషముతో మలిదేవుని వీరులు నలగాముని రాయబారులను విందు కుడువనారంభించిరి

బాలచంద్రుని సుపున అనపోతు మాంచాల నగరికేగెను అచ్చట బాలచంద్రుని ఆభరణములు లేనందున అతడు తిరిగివచ్చుచు త్రిపురాంతకము చేరెను మార్గమున ఉన్న చెట్టుకొమ్మకు కట్టియుంచిన లేఖనుగాంచెను హతాశుడయ్యెను బాలచంద్రుడు మిషపెట్టి తనను వెనుకకు పంపివేసి యుద్ధమునకు రావలదని తనకు ఆంక్ష విధించినందులకు

అనపోతు మిక్కిలి దుఃఖించెను. ఇంతలో గరికమాడచి యను ఒకదాసి మేడపను డి (మేడప కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకా త్రిపురాంతకము ఛర్కాలో ఉన్నది) కార్యమపూడికి పోవుచుండెను. అనపోతు దానితో తన వృత్తాంతమును చెప్పెను. తన జడెమును బిరుదును బాలచంద్రునకు ఇమ్మని ఆమెచేతిలో ఉంచెను. బాలచంద్రుని వీరస్వర్గమున కలిసికొందునని బాకుతో పొడుచుకొని అనపోతు మరణించెను.

కార్యమపూడిలో వీరులు రాయబారులు సంధి విందుకుడుచు సమయమునకే మాడచి రక్తసిక్తమయిన అనపోతు జడెమును బిరుదును బాలచంద్రునికి ఒప్పగించెను. వాటిని చూచి బాలచంద్రుడు దుఃఖించి మిక్కిలి రోషముతో తానొక్కడే శత్రువులను వధించి నరసింగుని తలతరిగి కొమ్మరాజునకిచ్చి కులంగ తీరెదనని ప్రతినబట్టి యుద్ధమునకు సన్నద్ధుడయ్యెను. విందుగుడుచుచున్న వీరులు తాము భుజించుచున్న అన్నమును నాగులేటిలో కలిపి సంధికార్యమును విడిచి బాలచంద్రుని అనుసరించిరి. నలగాముని రాయబారులు హతాశులై తిరిగిపోయిరి. ఇరుప్రక్కలవారు కదనమునకు సన్నద్ధపడిరి.

ఈ విధముగా పలనాటియుద్ధము సంధిపొసగక సాంతముగా జరుగుటకు అనపోతు కారణభూతుడని చెప్పనగును.

అనపోతు అగ్రవర్ణమున జన్మించి చతుర్వేదములను పఠించి కదనమున అహోయశూరుడై ప్రభుభక్తిపరాయణుడై బాలచంద్రునకు మిక్కిలి విశ్వాసపాత్రుడై కల్లకపటములు లేని మహాయువకుడుగా పల్నాటి వీరచరిత్రమున మనకు గోచరించుచున్నాడు. ఇతియేకాక వేశ్యాలోలుడై యుద్ధమును విస్మరించిన బాలచంద్రుని యుద్ధోన్ముఖునిగ జేయుటయందును బాలచంద్రుడు వేశ్యకు ఇచ్చుటకు యత్నించిన ఆభరణములను ధనమును భట్టులకు పేదవారికి ఇప్పించుటయందును ఇతడు కృతకృత్యుడయ్యెను. మరియు ఇతడు మలిదేవుని కొడుకగు బిరుదురాజుకడను డి కరణకార్యమును నెరపెను. ఇట్లు అనపోతు ఒనర్చిన కార్యములు పెక్కులు మనకు పల్నాటి వీరచరిత్రమున కననగుచున్నవి. పల్నాటి వీరచరిత్రమును శ్రీనాథ విసార్వభౌముడు ద్విపదగా వ్రాసెను. పల్నాటియుద్ధమును మహాభారతయుద్ధముతోను బ్రహ్మనాయని శ్రీకృష్ణునితోను బాలచంద్రుని అభిమన్యునితోను అనపోతుని అశ్వత్థామతోనుకవులు ఉపమించిరి.

త. అ. శా.

## అనలేశ్వరము

అనలేశ్వరమొక పుణ్యక్షేత్రము. ఇది శ్రీశైలము పశ్చిమద్వారము చెందియున్నది. శ్రీశైలము ఆంధ్రదేశమునందలి కర్నూలు మండలములోని నల్లమల యడవులలో ఉన్నది. ఇది శైవులకు దక్షిణ కైలాసమని ప్రసిద్ధి కన్నది. ఇందు భ్రమరాంబా సహాతుడయిన మల్లికార్జునస్వామి లింగమూర్తియై ఒప్పారుచున్నాడు. పాల్కురికి సోమనాథ విరచితమైన పండితారాధ్య చరిత్రమునగల పర్వతప్రకరణమున శ్రీశైలక్షేత్ర మహాము రమణీయముగ వర్ణింపబడినది. ఈ పుణ్యక్షేత్రము చుట్టును అనేక కుండములు తీర్థములు నగములు వనములు పుణ్యక్షేత్రములు విలసిల్లుచున్నవి. ఇది ఆంధ్రదేశమునందలి సుప్రసిద్ధ శైవక్షేత్రము.

ఆంధ్రదేశమునందలి సుప్రసిద్ధ శైవాచార్యులలో మల్లికార్జున పండితారాధ్యుడొకడు. ఈయన క్రీ శ 1170 వరకు జీవించియుండెను. ఈయన శిష్యుడగు దోనము రాజయ్య తనకు తోడుగ కొందరు జంగములను (శివభక్తులను) వెంటనిడుకొని శ్రీశైలమహాక్షేత్రమును దర్శించెను. మహాశివరాత్రి పర్వదినమున రాజయ్య ఉపవాసముండి మల్లికార్జున లింగమూర్తికి అభిషేకమొనర్చి పత్రపుష్పములతో పూజించి నైవేద్యాదుల నొసగి భక్తిభరితుడై భజనసేయుచుండెను. భక్తిపూర్ణమైన మనస్సుతో కనులు మూసికొనిన దోనమ రాజయ్య చెంతకు మల్లికార్జున లింగమూర్తి వృద్ధతాపస రూముపన అరుదెంచెను. శ్రీశైలమునందలి వనముల గిరుల కాంతారముల బిలముల గుహాలలోని విశేషములను అతనికి చెప్పదలచెను. దోనమయ్యను వృద్ధతాపసి బిల్వవనమధ్యమ్మునకు కొనిపోయెను. అందలి దీపవృక్షముపై అతని నెక్కించెను. వాని శిరముపై చేయిడి శ్రీగిరి యందలి దృశ్యములను చూడుమనెను. దోనమ రాజయ్య అచ్చెరువుతో శ్రీగిరియందలి సర్వదృశ్యములనుకనువిందుగ చూచుచుండెను. అట్టి సందర్భమున కవి శ్రీపర్వత ప్రాంతమునందలి పుణ్యక్షేత్రముల నన్నిటిని కన్నులకు గట్టునట్లు వర్ణించి మనకు జూపెను. శ్రీపర్వతమునకు నలుదిక్కులనున్న పుణ్యతీర్థములను పుణ్యనగరములను తెలుపుచు కవి పశ్చిమద్వారపు ప్రభావమును వర్ణించెను.

ఈ ద్వారము చెంతనున్న ప్రసిద్ధపుణ్యస్థలములు దేవద్రోణి వరాహ బ్రహ్మేశ్వరములు ఛాయా మల్లికార్జునము గణికా సిద్ధనాథ మోక్షేశ్వరము భుజగేశ్వరము నారదేశ్వరము బ్రహ్మేశ్వర రాజరాజేశ్వరము అగ్నీశ్వరము రమ్య భోగేశ్వరము సోమేశ్వరము కలకలేశ్వరము అను పదునొకడు తీర్థములు ఇవికాక రుద్ర పాదాది తీర్థములపేరిట కొన్నికలవు అవి బ్రహ్మేశ్వరము ఇంద్రేశ్వరము కమలేశ్వరము పాపవినాశము యాగేశ్వరము అగస్త్యేశ్వరము నాగేశర్వము సప్తకోటీశ్వరము కుక్కుటేశ్వరము అశ్వమేధేశ్వరము లకులేశ్వరము శ్రీరామేశ్వరము లక్ష్మణేశ్వరము ధవళేశ్వరము ధర్మేశ్వరము విమలేశ్వరము ఇంద్రేశ్వరము కర్ణేశ్వరము వ్యాసేశ్వరము వరుణేశ్వరము మలపహరేశ్వరము ఉత్తరేశ్వరము అనలేశ్వరము ఏలేశ్వరము ఈశ్వరపంచలింగములు సప్తలింగములు ఉభయసంగమేశ్వరములు సకలేశ్వరము కనకేశ్వరము బ్రహ్మేశ సీతాత్రిపురాంతకాదులును భస్మేశ పరశురామేశ్వరములు హోమకుండము సిద్ధేశ్వరము మలపహరన కుండయుగము మున్నగునవి

పై పుణ్యక్షేత్రములను వృద్ధతాపస రూపమున ఉన్న మల్లికార్జున లింగమూర్తి చూపుచుండగా దోనమ రాజయ్య చూచియు వాటి మహిమను వినియు మిక్కిలి ఆనందించెను అని సోమనాథుడు తెలిపెను

తం అం శా

## అనవర్తిఖానుడు

అనవర్తి ఖానుని ప్రశంస చాటుపద్యమణిమంజరి ద్వితీయ భాగమున కనవచ్చుచున్నది కందుకూరి రుద్రకవికి ఇబ్రహీంకుతుబ్షా దానముగా ఒసగిన రెంటచింతల (చింతలపాలెము) గ్రామమును రుద్రకవి ఆతని వంశ్యులును యథేష్టముగ అనుభవించుటకు సాయపడిన వారిలో అనవర్తిఖాను డొకడు

గోలుకొండ రాజ్యమును పాలించిన ఆరుగురు రాజులలో ఇబ్రహీంకుతుబ్షా (ఇభరాముడు) మూడవవాడు (క్రీ శ 1550-1580) ఇతడు తన అన్నయగు జంషీద్కుతుబ్షాకు భయపడి విజయనగరమునకు పోయి అళియరామరాయల శరణుజొచ్చి కొంతకాలము అచటనే నివసించెను ఆంధ్ర కవులతో పరిచయముచేసికొని ఈయన ఆంధ్రమున పాండిత్యమును సంపాదించుకొనెను గోలుకొండ రాజ్యమునకు నవాబయిన ఎమ్మట ఇతడు ఆంధ్రకవులను పోషించెను ఈయన ఆస్థానమున అద్దంకి గంగాధరకవి కందుకూరి రుద్రకవి అను వారు ఉండిరి గంగాధరకవి తపతీసంవరణోపాఖ్యానము అను గ్రంథమును రచించి ఇబ్రాహీం కుతుబ్షాకు అంకితమిచ్చెను కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానము రసవత్ప్రబంధమును సుగ్రీవవిజయము యక్షగానమును ఇతర శతకములను స్తోత్రములను రచించెను రుద్రకవి విశ్వబ్రాహ్మణ కులజుడు ఈయన ఆశుకవిత్వమున దిట్ట ఈయన చాటుపద్యములతో ప్రభువులను మెప్పించెను శ్రీకృష్ణదేవరాయల ఆస్థానములోను రుద్రకవి 12 సంవత్సరములు నివసించి ట్లు చాటుపద్య మణిమంజరి చెప్పుచున్నది

ఇబ్రాహీం కుతుబ్షా శా శ 1480 (క్రీ శ 1558) జయ సంవత్సర మాఘశుద్ధపంచమీ జయవాసరమున రెంటచింతల (దీనికే చింతలపాడు అను నామాంతరమున్నది కృష్ణామండలము నందలి విజయవాడ తాలూకాలో చందర్లపాడు ఫర్కాలో చింతలపాడు) అను గ్రామమొకటి ఉన్నది బహుశః ఇదియే అది అయియుండవచ్చునేమో!

ఆ గ్రామము కందుకూరి రుద్రకవికి దానమొసగబడినది

కందుకూరి రుద్రకవికి ఇబ్రాహీం కుతుబ్షా దానముగా ఒసగిన రెంటచింతల గ్రామమును కుతుబ్షాకు ఎమ్మట పాచ్ఛాపుతానీషా తావుత్ఖానుడు పాల్వఖానుడు సాతులాఖానుడు ముస్తాఖానుడు అనవర్తిఖానుడు సురాజద్దవులా ట్రావర్సన్ ప్రభువు అను వారును క్రమముగా మన్నించి రుద్రకవి వంశ్యుల అనుభవములో ఆ గ్రామముంచి వారు దానిని యథేష్టముగ అనుభవింప వీలుకలిగించినట్లు రుద్రకవి వంశమువారు చెంచలరాయనితో విన్నవించుకొన్నట్లు చాటుపద్య మణిమంజరి ద్వితీయభాగములోని శ్రీలలరగ రెంటచింతల ఖండ్రిక (చూ చా ఫ మ 2 12?) అను సీసపద్యమువలన తెలియుచున్నది రెంటచింతల గ్రామము అశీతిద్వయ పరిమితమైన గొర్లభూమితో ఒప్పుచు డినట్లును పాలేరుచెంత (తీరనదీతట క్షేత్రము) అది ఉండినట్లును తెలియుచున్నది

పాఛ్ఛాపుతానీషా ప్రసిద్ధుడే అబుల్హసన్కుతుబుషా అనబడు ఇతడు గోల్కొండ సుల్తానులలో కడపటివాడు క్రీ శ 1687 లో మొగలులు గోల్కొండను జయించిరి

తానీషా తరువాత పేర్కొనబడిన తావృతుఖాను (దావుద్ ఖాను) మొదలగువారు మొగలుసామ్రాజ్యప్రతినిధులై తెలుగుదేశములో కొంతభాగము నేలినవారై యుండిరి. ట్రావెర ను అనునాతడు బ్రిటిషువారి ప్రాంతపరిపాలకుడై యుండెను.

తం. ఆం. శా.

## అనవర్దిఖాను — చూ. అన్వరుద్దీను

## అనవేమపురము

అనవేమపురము చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగమున ప్రకటింపబడినది. పెదకోమటి వేమారెడ్డిని గూర్చి పూర్వులు చెప్పిన చాటుపద్యములలో అనవేమపురము అను గ్రామనామము కనవచ్చుచున్నది. పెదకోమటి వేమారెడ్డి క్రీ. శ. 1402 మొదలు 1420 వరకు కొండవీటి రాజ్యమును పాలించెను. ఈయన సంస్కృతభాషలో అమరుశతక వ్యాఖ్య, సాహిత్యచింతామణి మున్నగు గ్రంథములను రచించెను. సర్వజ్ఞచక్రవర్తి అని ఈయనకు బిరుదము గలదు. శ్రీనాథకవి సార్వభౌముడు ఈయన ఆస్థానమున విద్యాధికారిగ ఉండెను. పెదకోమటి వేమునకు శత్రువులు మిక్కుటముగ నుండి ఈయన రాజ్యపాలనమునకు ఆటంకములను కలిగించుచుండిరి. ఈయనకున్న శత్రువులలో కాటయవేమారెడ్డి, విజయనగరాధీశ్వరుడగు దేవరాయలు, రాజమహేంద్రవరము పాలకుడగు అల్లాడరెడ్డి అనువారు ముఖ్యులు. శత్రువులను ధైర్యముతో ఎదుర్కొని పోరుచునే పెదకోమటి వేమారెడ్డి రాజ్యమును ధర్మయుతముగ పాలించెను. ఈయన గొప్పపండితుడేగాక రాజనీతి చతురుడను అంశము గూడ ఈయనను గూర్చి చెప్పిన చాటుపద్యములలో కనిపించుచున్నది. ఈయన యెంత సహనశీలియో "అచెంచనుద్దండ అనవేమపురమను గ్రామంబు తోరణకట్టిరేని" అను సీసపద్యము వలన తెలియుచున్నది. పెదకోమటి వేమారెడ్డి శత్రువులు (బహుశః వెలమనాయకులు) సుప్రసిద్ధమైన అనవేమపురమను గ్రామమునకు తోరణము కట్టినను (అనగా అనవేమపురమును నాక్రమించి దానిని సైన్యస్థావరముగ చేసికొన్నను) ధరణికోటలోని ధనధాన్య వస్తువులను కప్పముగా గొనిపోయినను ఈతని అభిమానమును నాశనము చేసినను, అశ్వ్యజనము నేయు నూనెలో చెప్పులు వైచినను, ఇన్ని అసభ్యకృత్యములను చేయుచున్నను వాటి నన్నిటిని సహించి పెదకోమటి వేమభూపాలుడు తగిన అవకాశము లభించిన ఎడల శత్రుమదమును అణచివేసెనట్లు పై పద్యమున గనవచ్చుచున్నది.

అనవేమపురము పూర్వము మిక్కిలి ప్రసిద్ధిగన్న గ్రామమైనట్లు తెలియుచున్నది. ఇది కొండవీటి రాజ్యస్థాపకుడైన ప్రోలయవేమారెడ్డి పౌత్రుడైన అనవేమారెడ్డి పేర నిర్మితమైనట్లు ఊహింపబడుచున్నది. ఈ గ్రామనిర్మాణమును గూర్చిన వివరములను కనవచ్చుటలేదు. అందుచే దీని ఉనికిని నిర్ణయింపశక్యముకాదు.

తం. ఆం. శా.

## అనవేమారెడ్డి (క్రీ. శ. 1370-1386)

సస్యశ్యామలమైన ఆంధ్రదేశమును పదునాల్గవశతాబ్దము రెండవపాదము నుండి పదునేనవ శతాబ్దపు మధ్యభాగము వరకును రెడ్డిసామ్రాట్టులు పాలించిరి. వీరిలో తృతీయుడు అనవేమారెడ్డి. ఇతనితండ్రి ప్రోలయ వేమారెడ్డి (క్రీ. శ. 1325-58) అద్దంకి రాజధానిగ గుండ్లకమ్మకు ఉభయతటముల విస్తృతమైన రెడ్డిరాజ్య నిర్మాత. ఇతడు ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్రసురత్రాణ బిరుదాంకితుడు. తల్లి ప్రోలమాంబాదేవి. ప్రోలయ వేముని అనంతరము మహానదీ పర్యంతము వ్యాప్తమైన రాజ్యమును సుభిక్షముగ నేలి రాజధానిని కొండవీటికి తరలించిన అనపోతారెడ్డి (క్రీ. శ. 1356-70) అనవేముని జ్యేష్ఠభ్రాత. ధర్మవేమ యని కొనియాడబడిన అనవేమారెడ్డి రెడ్డిరాజులందే కాక తదితర సమకాలిక ప్రభువు లందరిలోను మహనీయుడు. ఇతని పరిపాలనాకాలము రెడ్డిరాజ్య చరిత్రమున స్వర్ణయుగము.

రాజ్యతంత్రమందును రణతంత్రమందును సుశిక్షితుడైన అనవేమారెడ్డి అనపోతారెడ్డి రాజ్యకాలమున యావరాజ్య పట్టాభిషిక్తుడై దేశరక్షణమందును, రాజ్యవిస్తృతియందును రాజ్యకార్యములందును అప్రమత్తుడై యుండెను. క్రీ. శ. 1364 న నుండి ఇతని శాసనములు కానవచ్చుచున్నవి. తన కుమారుడు కుమారగిరిరెడ్డి చిన్నవాడైనందున అనపోతారెడ్డియే తన అనంతరము తన సోదరుడు రాజగునట్లు నిర్ణయము చేయుచుండెను. ఇది రాజ్యరక్షణ కర్తవ్యపరము. ఏలనగా అప్పటి రాజకీయ వాతావరణమును ఎదుర్కొనుటకు దక్షతగల రాజుయొక్క అవశ్యకత ఎంతేని యుండెను. విజయనగరచక్రవర్తులు, రేచర్ల వెలమప్రభువులు, కళింగ

గాంగరాజులు రాజ్యమును కబళింప బొంచియుండిరి అనవేముని శాసనములలో ఈ క్రింది శ్లోకము

"సోయం భ్రాతురనంతర విజమహీభారం వహన్ వైతృకం।
రాజ్యశ్రీ రమణీ స్వయంవరపతిశ్శ్రీ" యన్న వేమప్రభుః
పూర్వం మ్లేచ్ఛనృపాల కైరపహృతాన్ శిష్టాగ్రహారాన్ బహూన్
దాతు కౌతుకవామదారచరితో జాగర్తి లోకోత్తరః॥

తరచుగ కన్పట్టుచున్నది ఇది అనవేమారెడ్డి వైతృకమగు రాజ్యమును అన్నగారి అనంతరము క్రమ ప్రకారము ఏ విధమైన కలవరములు లేకుండా ప్రజామోదముతో వహించెనని స్ఫురింపజేయుచున్నది

విజయనగరమున బుక్కరాయలు I (క్రీ శ 1355-77) కుమారుడు హరిహరరాయలు II (క్రీ శ 1377 1404) వెలమ రాజ్యములో రాచకొండ దేవరకొండల నేలుచున్న అనపోతనాయడు మాచానాయడు (క్రీ శ 1361 84) కుమారసి గమనాయడు పెదవేదగిరి నాయడు (క్రీ శ 1384-99) కళింగమున తూర్పు గాంగచక్రవర్తి నరసింహదేవుడు III (క్రీ శ 1379-1404) ను అనవేముని సమకాలిక ప్రభువులు

తద్రిచే మహానదీ పర్యంతము వ్యాప్త మొనర్పబడిన రెడ్డి సామ్రాజ్యము అనవేముని పట్టమునాటికి కొంత లుప్తమై యుండెను దానిని విస్తృత పరచుటకై బద్ధకంకణుడై అనవేముడు తూర్పున స్వతంత్రులైయున్న సామంత ప్రభువుల దర్పమడచి వారి దేశములను కైవసము జేసికొనుటకై దండయాత్ర వెడలెను ఈ ఉద్యమమున మండలేశ్వరులు బంధువులునైన కాటయరెడ్డి (రెండవ) మారయరెడ్డి (రెండవ) దొడ్డారెడ్డి వాని సహోదరులు అనవేమునికి అండగా నిల్చిరి

క్రీ శ 1372 సం॥ లో అనవేముడు దివిసీమను గెల్చెను దివిదుర్గ విభాళ అను బిరుదుమ ధరించెను అచటి నుండి ఉండి రాజ్యముపై బడెను సూర్యవంశజులైన ఉండి ప్రభువులు కూరవర పట్టణము (నూజివీడు తాలూకా కృష్ణాజిల్లా) రాజధానిగ నూజివీడు యేలూరు భీమవరముప్రాంతములను పాలించుచుండిరి అనగా ఇది వేంగినాటిలో తూర్పుప్రాంతము వీరు ఏరువ చోళరాజులకు బంధువులు అనవేముడు వీరిలో తమ్మరాజును వాని కుమారుడు ఉండిరాజు (లేక ఉండికుడు)ను ఓడించెను అంతట వేగినాటి ఉత్తర పార్శ్వమునకుబోయెను ఇది ఎరువచోళరాజ్యములో చేరియుండెను ఎరువచోళుడైన కామరాజు అను నామాంతరముగల భక్తిరాజు కామవరము (ఎల్లవర డివిజను పశ్చిమగోదావరిజిల్లా) ముఖ్యపట్టణముగ మన్నెము వేసరినాడు మలయము వేగినాడు భీమప్రోలి సీమ-వీటిని పాలించుచుండెను ఇతని మరణానంతరము కుమారులిర్వురు చోడభీముడు అన్నదేవుడు రాజ్యముకై వివాదపడుచుండిరి ప్రాయశః చోడభీమునికి ఆశ్రయమిచ్చి అనవేముడు బయలుదేరి చాళుక్యుల దిక్కుకు మరలెను చాళుక్యులు కోనమండలము దలి కోనహైహయులతో సంబంధ బాంధవ్యముల జరుపుచు నిరవద్యపోలు (నిడదవోలు పశ్చిమ గోదావరిజిల్లా) రాజధానిగ అన్నదేవుని పక్షమై పాలించుచుండిరి అనవేముడు నిరవద్యపురమును సాధించి సమరాంగణమున అన్నదేవుని ఓడించి పదచ్యుతుని గావించి అన్నగారైన చోడభీమదేవుని తనకు సామంతరాజుగ సింహాసనమునిల్పెను బంధురీత్యా అనవేమునియొక్క సోదరి చోడభీమునకుభార్య అంతట అన్నదేవుడు తన రాజధానిని రామవరపు దుర్గమునకు మార్చుకొనెను

అనవేముడు వాసిష్ఠ గౌతమీనదుల నడుమనున్న సారవంతమైన పానారవిషయమును కోనమండలమును జయించెను ఇందు గౌతమీసాగర సంగమస్థానములందుగల బలిష్ఠమైన జలదుర్గములను అనవేముడు తన వశముజేసికొనెను ఈ ప్రాంతమును పాలించుచున్న మంచికొండ ముమ్మడినాయకుడు ఇతనికి సామంతుడయ్యెను గోదావరినిదాటి అనవేముడు బలిష్ఠమైన రాజమహేంద్రవరదుర్గమును ముట్టడించెను ఇది కోరుకొండ రాజధానిగ పాలించుచున్న మంచికొండ ముమ్మడి నాయకుని రాజ్యములోనిదై యుండెను దుర్గము వశమయ్యెను ముమ్మడి నాయకుడు దాసోహమ్మనెను రెడ్డి సైన్యములు విజయోత్సాహముతో దక్షిణ కళింగమువైపు దారితీసెను అనవేముడు సింహాచలము పర్యంతము వ్యాప్తమైన దుర్గమారణ్యములందున్న వీర సామంతులను మన్నెప్రభువులను శిక్షించెను ఈ కొండజాతులవారు తరచుగ తమ స్వస్థానముల నుండి దిగి వచ్చి అనవేముని రాజ్యపు సరిహద్దులపై దాడులు సల్పుచు అలజడులు కల్గించుచుండిరి వీరిని అనవేమారెడ్డి అదుపులోనికి దెచ్చెను

త్రిలింగరాజ్యము హిమాచలపర్యంతమను ప్రతీతికి తగినట్లు రెడ్డిరాజ్యమునకును కళింగరాజ్యమునకును మధ్యప్రదేశమందున్న దక్షిణకళింగమండలి సామంతప్రభువులు ఇటు తెలుగురాజులవల్లను అటు కళింగ రాజులవల్లను ఒత్తిడిచేయబడుచుండిరి వీరిలో కొప్పుల రాజులు పిఠాపురము రాజధానిగా గౌతమీతటమునుండి కళింగమువరకును విస్తృతమైన ఆంధ్రఖండమండలమును ఏలుచుండిరి అనవేముడు కొప్పుల నామయనాయకుని ఓడించి అతనిని తన సామంతునిగ నిల్పెను రువీ తదుపరి కోరుకొండ రెడ్ల హస్తములలో పరాజితులై తుని ప్రాంతమున స్థిరపడిరి కొప్పుల రాజ్యము నంటికొనియే ప్రక్కన తూర్పు చాళుక్య రాజ్యము ఉండెను తూర్పుచాళుక్యులు యలమంచిలి (విశాఖపట్టణము జిల్లా) రాజధానిగ నేలుచుండిరి వీరిలో ఉపేంద్రుడు (నాలుగవ) వాని [illegible] ఉపేంద్రుడు (అయిదవ) అనవేముని సమకాలికులు అనవేముడు వీరిని జయించి శారదా నదీతీరమందున్న వడ్డాది (వీరవల్లి తాలూకా విశాఖపట్నంజిల్లా) ముఖ్యపట్టణముగనున్న మత్స్యరాజ్యమును వశము చేసుకొనెను మత్స్య ప్రభువులలో జయంతుని కుమారుడైన వీరార్జునదేవుడు (రెండవ) అనవేముని కాలమునందుండెను ఇతడు అనవేముని సామంతుడయ్యెను "హిమాచలాదివింధ్యపాదప్రతిష్ఠాపిత కీర్తిస్తంభ" అన్న శ్రీశైల శాసనము (క్రీ శ 1377) లోని అనవేముని బిరుదము అతని విజయములను స్థిరపరచుచున్నది ఈ కళింగ విజయములలో ప్రధాన పాత్రధారి అనవేముని మంత్రియు సేనానియునైన చెన్నమనాయకుడు ఇతడు క్రీ శ 1375 స ॥లో గొట్టివాడ గ్రామమును వీరార్జున దేవునివలన పరిగ్రహించి సింహాద్రినాథునకు దానమిచ్చెను అనవేముడు గండమాడలను నాణెములను దేవుని కైంకర్యమునకై సమర్పించెను విజయవంతమైన కళింగదండయాత్రా విషయమున కృతజ్ఞతా పూర్వకముగ రాజును మంత్రియు దేవునకు ఈ దానములు చేసియుందురు

రెడ్డిరాజ్యమునకు పశ్చిమమున విజయనగరప్రభువులు అనవేముని రాజ్యములోనికి దాడులు సల్పుచు క్రమక్రమముగ ఆక్రమణము చేయుచుండిరి బుక్కరాయల (మొదటి) సామంతుడైన వెలుగోటి వెంగళరాజు - చెన్నరాజు క్రొత్తచెర్లకోట (దర్శితాలూకా) సమీపమున జరిగిన యుద్ధములో రెడ్ల సైన్యములను ఓడించెను మరొక విజయనగరసేనాని వినుకొండసీమలోని విజనపాడు గ్రామమును పాపవినాశన దేవునకర్పించెను పూర్వదండయాత్రనుండి రాజధాని మరలి వచ్చిన అనవేమారెడ్డి శ్రీశైలమువరకు వ్యాప్తమైన రెడ్డి రాజ్యమును తిరిగి రాయలను జయించెను

అనవేముని కాలము నాటి రాచకొండ దేవరకొండల వెలమరాజులు ఓరుగల్లు రాజధానిగాగల తెలగాణమును వశము చేసికొనిరి అనవేముడు కృష్ణానది ఉత్తర పార్శ్వమున వ్యాపించియున్న వెలమరాజ్యములోని కొంతభాగమును జయించి తన రాజ్యములో కలుపుకొనెను క్రీ శ 1377 స ॥ నాటి వాడపల్లి వజీరాబాదు (నల్లగొండజిల్లా) శాసనములో అనవేమారెడ్డి జ్యేష్ఠసోదరుడైన అన్నమాచారెడ్డి పుణ్యమునకై కడియము పోతినేడు అగస్త్యేశ్వరస్వామికి కానుక లర్పించినట్లు కలదు అదే వత్సరపు బూరుగుగడ్డ (నల్లగొండజిల్లా) శాసనములో పేర్కొనబడిన అన్నమనాయకుడు అనవేముని సామంతుడు కావచ్చును ఈ శాసనములు రెండును వెలమరాజ్యముపై అనవేముని విజయములను రెడ్డిరాజ్యపు పశ్చిమసరిహద్దును తెలుపుచున్నవి తన విజయపరంపరలవలన అనవేముడు అంతకు పూర్వమున నష్టపోయిన రాజ్యపు ఖండములను జయించుటయేకాక రాజ్యమును దక్షిణకళింగపు కడవరకు విస్తరింపజేసెను ఇతడు పూర్వసముద్రాధీశ్వర బిరుదు ధరించెను ఇతని మన్యమాపురశాసనము (క్రీ శ 1382) అనవేమారెడ్డి శ్రీశైలమునుండి సింహాచలమువరకును వ్యాప్తమైన దేశమును న్యాయబద్ధుడై పరిపాలించెనని చెప్పుచున్నది

శ్రీశైలమునుండి సముద్రమువరకును కందుకూరునుండి సింహాచలమువరకును వ్యాపించిన రాజ్యమును అనవేముడు కొండవీడులో రత్నసింహాసనాసీనుడై ప్రజానురంజకముగ పాలించెను రాజ్యరక్షణమునకు దుర్గప్రాధాన్యమును అనవేమారెడ్డి ఎంత తగా గ్రహించెనో వాని బిరుదములే చెప్పుచున్నవి కాకతీయులనాటి డెబ్బదియేడు దుర్గములు ప్రోలయ వేమారెడ్డి కాలమునాటికి ఎనుబదినాలుగు దుర్గములై వృద్ధి పొందినవి అనవేమన కొండవీటి దుర్గమును బలపరచెను రాజమహేంద్ర నిరవద్య గిరాది బహువిధస్థలదుర్గవర్గవిదళన బలరామ సాగరగౌతమీసలిలలంఘన సకలజల దుర్గసాధన రఘురామ గిరిజల దుర్గవిభాళ అను బిరుదులు సకలవిధదుర్గ ప్రాధాన్యమును చూపుచున్నవి ప్రజాపరిచిత చతుర్విధోపాయ బిరుదము అనవేముని రాజనీతిచతురతను సూచించుచున్నది

తరచుగ మంత్రి పదవియును దండనాయకత్వమును ఒక్క వ్యక్తియే నిర్వహించుచుండెను అనవేముని అమాత్య సేనానులలో ముఖ్యుడు 1 మామిడి పెద్దనామాత్యుడు వీని వంశీయులు పారంపర్యముగ రెడ్డిరాజుల కొలువులోనుండుచుండిరి పెద్దనామాత్యుని పూర్వులలో ఒకటి పెద్దన విక్రమసింహపురి సింహాసనాధ్యాసి అనగా తెలుగుచోళుల కొలువులోనుండెను పెద్దన కుమారుడు సింగనామాత్యుడు శ్రీనాథుని శృంగార నైషధ కృతికర్త శ్రీనాథుడు పెద్దనామాత్యుని "అనవేమాధిపరాజ్యభారభరణవ్యాపారదక్షుడు" అని ప్రశంసించియున్నాడు 2 ఇమ్మడి రుద్రుడు ఇతడు మల్లయమంత్రి కుమారుడు లోహిత గోత్రుడు సకలార్థవేది గొప్ప పరాక్రమశాలి అనవేముని వానపల్లి శాసనము ఇతనిని మంత్రిసత్తమునిగను పండితునిగను చెప్పుచున్నది 3 అల్లాడరెడ్డి ఇతడు దండనాయకులలో ఉద్దండుడై అమాత్యులలో మేటియైయుండెను తూర్పుదేశము రెడ్డిరాజ్యమున కలియుటకు ఇతని పరాక్రమమే ముఖ్యమైన కారణము అటుపిమ్మట అల్లాడరెడ్డి రాజమహేంద్రవర రెడ్డిరాజ్యముతో సన్నిహితమైన సంబంధము గలిగియుండెను

అనవేముని రాజనీతియేకాదు రణనీతియు శ్లాఘనీయము ఇతని పరిచితానేకగతి విశేషవారణ మారణోపాయ సంగ్రామగాండీవి తురికాకరివేతాళ తురికాహాయకరవాలవైనతేయ కలియుగబేతాళ విక్రమ పంజరనిగృహీత రిపురాజసింహ విజయకుంజరాలాన నిజభుజాస్తంభ సంభృత యశోమండన జగనొబ్బగండ ఇత్యాది బిరుదములు అనవేముని ధైర్యమును స్థైర్యమును సాహసమును పరాక్రమమును శత్రుసైన్యహాననసామర్థ్యమును చాటుచున్నవి

ఇతడు ధర్మవేమన వీరాన్నవేమన అను ఖ్యాతిగడించెను ఇంతవరకును పంటదేసటి మహాన్వయులమని చెప్పుకొన్న రెడ్డిరాజులు అనవేమునినుండి తమయందు క్షత్రియత్వమును ఆపాదించుకొనసాగిరి అనవేముని మనుమకులవార్ధిచంద్ర బిరుదమే ఇందుకు ప్రథమప్రబలనిదర్శనము అనవేమునిరాజముద్ర తురికాసహాయ కలియుగబేతాళ పల్లవత్రినేత్ర త్రిపురాంతక అను నాలుగు రీతులుగనుండెను అంతలు రెడ్డి రాజ్యము "త్రిపురాంతకదేవేనదత్తమ్మను ఖ్యాతిగలదు విజయనగరమునకు శృంగేరిపీఠమువలె రెడ్డిరాజ్యమునకు ఘోడెరాయపీఠము రక్షప్రాపు అనవేముడు ఘోడేరాయ కరుణాపాత్రుడైయుండెను

పరిపాలనా సౌకర్యార్థము రెడ్డిరాజ్యము భూమి సీమ నాడు స్థలము గ్రామము అను దేశవిభాగములతోను ఉద్యోగుల సిబ్బందితోను అనవేమునికాలమున దివ్యముగ సాగుచుండెను వర్తకవ్యాపారములు విరివిగానుండెను కాకతీయుల నాటినుండి ప్రసిద్ధిగాంచిన మోటుపల్లి రేవుపట్టణము రెడ్డిరాజ్యమున చేరినదే గణపతిదేవుని యొక్కయు అనవేముని అన్న అనపోతారెడ్డి యొక్కయు అభయశాసనముల ఫలితముగ ముకుళపుర మనబడిన మోటుపల్లి దేశవిదేశీయ ద్వీపద్వీపాంతరములనుండి రాకపోకలు సలుపు బేహారులకు కేంద్రమయ్యెను వివిధ సంస్కృతుల కలయికకు కూడలి అయ్యెను రాజ్యమున ఎట్టికలతలులేక శాంతి భద్రతలు నెలకొనియుండెను ప్రజలు సస్యసమృద్ధికలిగి "ధనకనకవస్తువాహన మాణిక్య గాణిక్యముల తో సుఖజీవనము సలుపుచుండిరి "యథారాజా తథాప్రజా" అన్నట్లు శాశ్వతధర్మలోలుడైన ధర్మవేమన రాజుగానున్నపుడు ప్రజలు నిత్యకల్యాణములతో పచ్చతోరణములతో విలసిల్లుచుండిరి ధర్మము అనవేముని పరిపాలనలో నాల్గు పాదములపై నడచినదనుట అతిశయోక్తి కానేరదు

రెడ్డిరాజులు శైవులు శివభక్తులు ఐనను పరమత సహిష్ణుతాయుతులు అనవేమారెడ్డి ఆగమశైవాచార తత్పరుడై నిత్యము షట్కాలములందును శివపూజ చేయుచుండెను అమీనాబాదులో (సత్తెనపల్లి తాలుకా) వెలసిన కులదేవత మూల గూరమ్మకు కోటభూమిలో వడిదరము ములగూరు అమ్మన పలకలూరు అను మూడు గ్రామములను అంగరంగ భోగములకై దానమిచ్చెను శ్రీశైలములో మల్లికార్జున దేవాలయములో క్రీ శ 1377 సం॥న అనవేముడు తన పినతండ్రి అన్నయరెడ్డికి పుణ్యముగ వీరశిరోమంటపమును కట్టించెను ఇందువీరులు భక్త్యావేశముతో శిరములను నాలుకలను గండకత్తెరతో ఉత్తరించుకొని వెంటనే కైలాసమును పొందుచుండిరట ప్రోలయవేమననాడు పాతాళగంగకు సోపానములు నిర్మించినశిల్పి పంచభితము రామలింగమే ఈ వీరశిరోమంటపమును నిర్మించెను

హేమాద్రిదానచింతామణి యను బిరుదు రెడ్డిరాజులు ధరించి కార్యరూపమున బెట్టిరి అనవేముడు హేమాద్రి చతుర్వర్గ చింతామణిలోని వ్రతఖండమున పేర్కొనిన విధులనన్నిటిని నెరవేర్చె నన్నఅతిశయోక్తికాదు పంచారామములైన

అమరారామము దాక్షారామము క్షీరారామము కుమారారామము (సామర్లకోట సమీపమందలి భీమవరము), భీమారామము (పశ్చిమగోదావరి జిల్లా భీమవరము దగ్గర గునుపూడి) లలో తన శత్రు విజయచిహ్నములుగా గజఘంటలను దేవుళ్లకు అర్పించెను శ్రీశైలము త్రిపురాంతకము అహోబలము కాశి ప్రయాగ గయ సింహాచలము శ్రీకూర్మము పురుషోత్తమము (జగన్నాథము) లందలి దేవాలయములపై బంగారు వెండికలశముల స్థాపించెను షోడశదానములు జరిపించెను తన పేరిటనిత్య నైవేద్యములకు ఏర్పాట్లుచేసెను కాశీవిశ్వేశ్వరునకనేకభోగములను కల్పించెను బ్రహ్మాండదానము కల్పతరుదానము కనకధారాదానము గోసహస్రదానములుచేసెను పుణ్యక్షేత్రములకు బోవుబాటలలో యాత్రికులకు సౌకర్యములు కల్గించెను సత్రముల కట్టించెను వసతిగృహముల నిర్మింపించెను చతుర్విధాన్నదానముల జేయించి చతుర్విధాహారబిరుదు వహించెను ఉద్యానవనముల నిర్మించి ప్రోలయవేముడు అనేక నగరోపకంఠప్రతిష్ఠాపిత బహువిధారామ అను సార్థక బిరుదమును వహించెను

అనవేముడు వసంతరాయ కర్పూర వసంతరాయ అను బిరుదములు తాల్చెను వసంతోత్సవము బహుప్రాచీనమైనది ఇదివాత్స్యాయనునిచే బిల్హణునిచే కాళిదాసుచే హర్షునిచే వర్ణింపబడినది కాని ఆంధ్రదేశమున దేవాలయములలో దేవుని వసంతోత్సవములుకాక భారీఎత్తున మహావైభవముతో వసంతోత్సవముల జరుపుట ప్రారంభించిన వాడు అనవేమారెడ్డియే తర్వాత రెడ్డిరాజ్యాంతనము వరకును ప్రతిసంవత్సరము ఇవి జరుపబడినవి

రెడ్డిరాజులకు వసంతోత్సవములలో వలసిన సుగంధద్రవ్యములను పారంపర్యముగ నెల్లూరి పాపాణిసెట్టి వంశ్యులు సరఫరాచేయుచుండిరి అనవేమునివసంతోత్సవమునకు వలయు సరకులను పాపాణి వంశీయుడైన అవచి దేవయసెట్టియును వాని కుమారుడు తిప్పయసెట్టియును దేశదేశములనుండి నౌకలపై తెప్పించుచుండిరి

కొండవీటిలో ప్రతియేట జరుగు వసంతోత్సవములకు పండితులు పామరులు సకలకళాభిజ్ఞులు తరలి వచ్చుచుండిరి నిరతమును విజ్ఞుల సహవాసమున మెలగు అనవేముడు ఈ ఉత్సవములందు విద్యావినోద ప్రదర్శనములకు పండితసదస్సులకు ఏర్పాట్లుచేసి పాల్గొనువారిని ఉచితరీతిని గౌరవించుచుండెను వేలాది సువర్ణనాణెములతో విద్వాంసుల సంభావించి బహుసహస్ర సువర్ణదాన సంతోషిత మహాపీశ్వర బిరుదాంకితుడయ్యెను అనవేముని వసంతోత్సవములలో చల్లబడిన కర్పూరఖండములు వడగళ్ల వర్షమువలె నున్నట్లు దృష్టివరపు శాసనములో గలదు

> స ప్రోలమాంబాతనయః కృతార్థో వసంతకేళీ
> ప్రతివర్షముర్వ్యాం
> స్తూరికా కుంకుమ గంధసారహిమాంబు కర్పూర
> ముఖైశ్చకార॥
> వసంతరాయస్య వసంతకేళౌ కస్తూరికా రేణు
> చయాంబుహాపై
> క్షిప్తా హిమా భోఘనవర్షధారాః కర్పూరఖండా
> కరకావికీర్ణాః

నడుపూరుశాసనములో భూమియే కాదు ఆకాశమంతయు కస్తూరిచే కర్పూరముచే గంధముచే సువాసితమైనదనియు ముల్లోకములు ధవళితములగుట వసంతోత్సవమందు వ్యాపించిన కర్పూరపుజల్లులవల్లనా లేక అనవేముని కీర్తివల్లనా అని లోకులు తర్కింపజొచ్చిరని చమత్కరించినారు అనవేముని వసంతోత్సవ వైభవమును "ఘనసార కస్తూరికాదివస్తు విస్తార విరచితాపూర్వవైభవ అన్నబిరుదమే (శ్రీశైల శాసనములోనిది) చాటుచున్నది

అనవేముని ఆస్థానకవులలో బాలసరస్వతి అనపోతారెడ్డికాలము నుండియు విద్యాధికారి పదవియందుండెను ఇతడు అనేక శాసనముల రచియించెను త్రిలోచనాచార్యుడు విద్వద్వంశమున జన్మించెను బాలసరస్వతి అనంతరము విద్యాధికారి అయ్యెను ఇతడు శైవాగమవిశారదుడు శారదావల్లభ బిరుదాంకితుడు విశిష్టమైనశైలిలో ఇమ్మడిల కశాసనమును రచియించెను మరొక కవియైన ప్రకాశభారతీయోగి దాక్షారామ ఆలయములో అనవేముని కట్టడములజెప్పు శాసనమును రచించెను అనవేముని ఆదరమునుపొందిన కవులు పండితులు అనేకులుండిరి అనవేముని రసికతను వదాన్యతను దెల్పుకథలు చాటువులు సంస్కృతమందును తెలుగునందు చాటు పద్యములును ఎన్నియో కలవు విష్ణుపురాణ కర్త వెన్నెలకంటిసూరన అనవేమారెడ్డి తన సహాయమును బ్రాహ్మణులకును బిరుదులను పంటప్రభువులకును రాజకీయ విజ్ఞాన లోకజ్ఞానములను ప్రజలకును ఇచ్చెనని వాని దాతృ

త్వమును ఎంతయు పొగడెను అనవేముడు మృతుడైనపుడు కవులు మిక్కిలి పరితపించిరట

అనవేముని కాలమున సకల కళలు అభివృద్ధిచెందెను సంగీతమ దును సాహిత్యమ దును నిపుణులైన ముగ్గురు స్త్రీలకు అనవేముడు అగ్రహారములను దానమిచ్చెను నృత్త నాట్యములకు రాజాదరణముండెను వసంతోత్సవములు కళా కారుల కళారాధనతత్పరతకు అవకాశముకల్పించెను దాక్షారామములో శ్రీశైల వీరశిరోమ డప నిర్మాణమును తదుపరి భీమేశ్వరాలయములో అనవేముడు నదిదేపావళి నాట్య కళ్యాణ హోమ శనివార గయార్క్ మంటపములను తిరు చుట్టుమాలియను దివ్యలిగ బుల గుళ్లను వజ్రపురాకోటను గోపురములను పాకశాల గేహములను సోపానములను భాండాగారములను వివిధ విద్యాలయములను వ టఇండ్లను చతుర్ద్వారకవాటములను పరివార దేవతాభవనములను కట్టించెను సింహాచల సింహాద్రినాథాలయములో అనవేముడు తన పేరిట అనవేమనగరును కట్టి చెను

అనవేముని తండ్రికాలమున క్రీ శ 1346 సం॥ నాటి మహితాంధ్రదేశమని మన్నింపబడిన రెడ్డిసామ్రాజ్యమునకు రాణ్మాత్రె అనవేమారెడ్డి ప్రశాంతముగా ప్రజామోద ముతో రాజ్యపాలన జేయుచు క్రీ శ 1377 స ॥ నాటికి శ్రీశైలశాసనములో "మహనీయాంధ్రదేశ పట్టాభిషేక సం వృతమహాభాగ్య" యను బిరుదమును సగర్వముగ చెప్పు కొనెను రెడ్డిరాజ్యపాలకులలో ప్రజానీకములో అనవేమా రెడ్డికి న ప్రాప్తమైన ప్రఖ్యాతి మరెవ్వరికిని కలుగలేదు

డా వా య దే

## అనాతవరం

తూర్పు గోదావరిజిల్లా అమలాపురం తాలూకాలో అనాతవరం గ్రామము కలదు దీనికి 4 మైళ్ళ దూరములో అమలాపురము ఉన్నది ఈ అనాతవర గ్రామమునకు తూర్పున ముమ్మిడివరం పడమట భట్నవిల్లి ఉత్తరమున మాగాం పోతుకుర్రు దక్షిణమున చెయ్యేరు గున్నేపల్లి అను గ్రామములు కలవు ఇది సమతల ప్రదేశమున ఉన్నది దీని విస్తీర్ణము 056 ఎకరములు

1961 సం॥ జనాభా లెక్కలప్రకారము ఈ గ్రామములో పురుషులు స్త్రీలు కలసి 4252 మంది ఉండిరి ఈ సంఖ్యలో షెడ్యూలు జాతులవారు షెడ్యూలు తరగతుల వారు 1451 మంది ఇచట ఇండ్లు విడివిడిగాను పంక్తులుగాను ఉన్నవి వీటిలో 150 పెంకుటిండ్లు 4 కాంక్రీటు కప్పుగల ఇండ్లు రెండు అంతస్తులగల మేడలు ఒక పెక్కు అంతస్తులుగల భవనము కలవు ఇచటి జనుల ముఖ్యాహారము వరి అన్నము వీరు కాపులనీటిని త్రాగుదురు

ఈ గ్రామము దలి నీటి వనరులు వట కాలువ శివాలయం చెరువు వీటిక్రింద వరి పండును గాదెలలో పురులలో వడ్లను నిలవ చేయుదురు ఇచట కొబ్బరి తోటలున్నవి 1966 67సం॥లో ఇచట పంటల క్రింద ఉపయోగి పబడిన భూమి 1750 ఎకరములు కాలువ క్రింద 1380 ఎకరముల పొలము కావు క్రింద 20 ఎకరముల పొలము సాగుబడి చేయబడెను ఒక ఆయిల్ ఇంజను 0 ఎకరములకు నీటిని సప్లయి చేసెను కొందరు నీటిని తోడుటకు నత్తగుల్లను గూడలను ఉపయోగించిరి 3 ట్రాక్టర్లు 400 ఎకరముల పొలమును దున్నెను ఇచట అంతయు నల్లరేగడినేల వడ్లు 3 00 000 కొబ్బరికాయలు రెడ్లబండ్లపై అమలాపురమునకు రవాణా చేయబడెను

అనాతవరలో 300 గేదెలు 250 ఆవులు 400 ఎడ్లు 150 మేకలు 200 గొర్రెలు 100 పందులు 6 గుర్రములు 400 కోళ్ళు ఉన్నవి పాలు పాలపదార్థములు మాంసము గ్రుడ్లు రు 1000ల విలువగల చేపలు స్థానికులు ఉపయోగించుకొనిరి

ఇచటి ప్రజల ముఖ్య జీవితాధారము వ్యవసాయము కమిషన్ ఏజంట్లు దుకాణాదారులు క్రయవిక్రయదారులు జట్కాలను టాంగాలను నడుపువారు 100గురు ఎద్దుబండ్లు తోలువారు కలరు వడ్రంగులు కమ్మరులు కాపీఎనివారు తెలికలవారు మంగలివారు చాకలివారు గలరు నాగ్లు ధాన్యపుమరలు రెండు గానుగలు స్థానిక అవసరములకు ఉపయోగపడెను వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు కూలీరేటు పురుషునకు రు 2లు స్త్రీకి రు 1 50 లు

ఈ గ్రామములో కేశవాలయము జాహ్నలేశ్వరాలయము రాజ్యలక్ష్మి ఆలయము కాట్లమ్మగుడి ఉన్నవి వైశాఖ బహుళ ఏకాదశి నుండి 5 దినములు శ్రీ కేశవస్వామి కల్యాణము చైత్రమాసములో శ్రీ రాజ్యలక్ష్మి సేవలు జ్యేష్ఠమాసములో శ్రీ జాహ్నలేశ్వరస్వామి అభిషేకములు జరుగును

అనాతవరమునకు 42 మైళ్ళలో రాజమహేంద్రవరంలో రైల్వేస్టేషను ఉన్నది ప్రయివేటుబస్సులు గంటకొకమారు పల్లంకుర్రునుండి రాజోలునకును పల్లంకుర్రునుండి బొబ్బర్లంకకును పోవును ఈ గ్రామమున 10 కంకరరోడ్లు ఉన్నవి దీనిని పొరుగు గ్రామములతో ఈ కంకరరోడ్లు కలుపుచున్నవి సమీపములో ఒక నీటికాలువ ఉన్నది కాని అది రవాణాకు ఉపకరించదు ప్రయాణములకు 6 గుర్రపుబండ్లు 6 రిక్షాలు 3 ఒంటెద్దుబండ్లు 100 రెండెడ్లబండ్లు 340 సైకిళ్ళు ఇచట ఉన్నవి

ఈ గ్రామములో సబ్‌పోస్టాఫీసు టెలిఫోను జిల్లా పరిషత్తు హైస్కూలు ఉన్నవి 150 మంది విద్యార్థులు ఇచటి హైస్కూలునకు అయినాపురం చెయ్యేరులనుండి వత్తురు విద్యుచ్ఛక్తిని 100 ఇండ్లు గ్రామంలు వాడుకొనెను ఇది పంచాయతీపాలన గ్రామము ఇక్కడ పంచాయతి గ్రంథాలయము జే కే క్లబ్బు ఆయుర్వేద ఆసుపత్రి కలవు వారమునకు ఒక సంత జరుగును 6 కిరాణా దుకాణములు 5 కాఫీ హోటళ్ళు సోడా కిళ్ళీ సిగరెట్టు దుకాణములు 2 కూరగాయల అంగళ్ళు 4 సైకిళ్ళషాపులు 3 క్షౌరశాలలు కూడ ఉన్నవి

తంతి కార్యాలయమునకు కోర్టులకు సబ్‌రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి బ్లాకుఅభివృద్ధి కేంద్రమునకు సినిమాథియేటరుకు అమలాపురం పోవుదురు ఇచటికి 4 మైళ్ళలోనున్న కాట్రేకోనలో పోలీసు స్టేషను ఉన్నది

మా శ్వే

## అనిగండ్లపాడు

కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలో అనిగండ్లపాడు గ్రామముఉన్నది దీనికి8మైళ్ళలో నందిగామయు 40మైళ్ళలో విజయవాడయు ఉన్నవి ఈ గ్రామమునకు తూర్పున జొన్నలగడ్డ పడమట పెనుగంచిప్రోలు ముచ్చింతాల ఉత్తరమున తాళ్ళూరు దక్షిణమున గుమ్మడుదుర్రు సుబ్బాయగూడెం కలవు ఈ గ్రామ విస్తీర్ణము 5064 ఎకరములు

1961 సం॥ జనాభా లెక్కలప్రకారము ఈ గ్రామములో పురుషులు 2 600 మంది స్త్రీలు 2 491 మంది మొత్తం 5 091 మంది ఉండిరి ఈ సంఖ్యలో షెడ్యూలు జాతుల వారు తరగతులవారు 1000 మంది కలరు ఇచట ఇండ్లు నివాసాలుగా ఉన్నవి వీటిలో 240 పెంకుటిండ్లు 18 కాంక్రీటు కప్పు గల ఇండ్లు ఉన్నవి ఈ గ్రామస్థులు వరి అన్నమును జొన్న అన్నమును తిందురు బావి నీటిని త్రాగుదురు మంచి నీటి ఎద్దడి లేదు

ఇచట మునేరు మెయిను చానలు భూములకు నీటిని సప్లయి చేయును ఇచట వరి జొన్న సెనగ ఉలవ కంది పెసర వేరుసెనగ మిర్చి పొగాకు ధనియాలు గోగులు మొదలగు పంటలను పండించెదరు బీర దోస రామములగ పొట్ల కాకర మొదలగుకూరగాయలను పండింతురు 1966 67 సం॥లో పంటలక్రింద 4290 ఎకరముల భూమి ఉపయోగపడెను కాలువక్రింద 1 600 ఎకరముల భూమి సాగుబడి చేయబడినది ఇచట రెండు ఆయిలు ఇంజనులు 8 ఎలక్ట్రిక్ మోటారులు పైరులకు నీటిని సప్లయి చేసెను వ్యవసాయ యంత్ర పరికరములు పదిగలవు పంటధాన్యములు మున్నగువాటిని నందిగామ విజయవాడలకు రవాణా చేసిరి కూరగాయలు పరిసర గ్రామములకు సప్లయి చేయబడు చున్నవి

ఈ గ్రామమున పశువులు అధికముగ ఉన్నవి వీటిలో 1936 గేదెలు 602 ఆవులు 460 ఎద్దులు 602 దున్నలు 1077 గొర్రెలు 278 మేకలు 2464 కోళ్ళు కలవు దినమునకు 460 లీటర్ల పాలు 25 కి గ్రా మాంసము 600 గ్రుడ్లు స్థానికులు వినియోగించు కొనిరి

ఇచటి ప్రజలయొక్క ముఖ్యమయిన వృత్తులు వ్యవసాయము కుటీరపరిశ్రమలు కూలి నులు కమిషన్ ఏజంట్లు దుకాణాదారులు క్రయ విక్రయదారులు గలరు కంసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీపనివారు మంగలివారు చాకలివారు కలరు నూలు నేతపని వారు రు 16 00 ల విలువగల చీరెలు ధోవతులు తుండులు లుంగీలు తయారు చేసిరి ఇచటకల మూడు వడ్లమరలు స్థానికుల అవసరములకు ఉపయోగపడు చున్నవి వ్యవసాయపు పనులకు కూలీలు దొరకుదురు దినమునకు పురుషునకు కూలి రు 2-50 లు స్త్రీకి కూలి రు 2/ లు

ఈ గ్రామములో 5 దేవాలయములు 2 చర్చిలు ఒక పీర్ల సావడికలవు కాశీవిశ్వేశ్వర ఆంజనేయ స్వాముల దేవాలయములకు 23 ఎకరముల భూమి ఉన్నది

అనిగండ్లపాడునకు 6 మైళ్ళ దూరములో మధిర రైల్వే స్టేషను ఉన్నది 4 మట్టిరోడ్లు ఈ గ్రామమున కలవు ఇవి దీనిని పొరుగు గ్రామముతో కలుపుచున్నవి ప్రయాణ

ములకు 818 రెండెడ్ల బండ్లు 49 సైకిళ్ళు ఉన్నవి ఈ గ్రామమునకు 8 మైళ్ళలో పెనుగంచిప్రోలు జగ్గయ్యపేట బెజవాడ బస్సు మార్గములు కలవు

ఈ గ్రామమున బ్రాంచి పోష్టాఫీసు టెలిఫోను సమితి ఎలిమెంటరీ స్కూలు అప్పర్ ప్రైమరీ స్కూలు ఉన్నవి విద్యుచ్ఛక్తిని 57 ఇండ్లు ఎలెక్ట్రిక్ మోటారులు వడ్ల మరలు వాడుకొనుచున్నవి ఇది పంచాయతి పాలన గ్రామము ఇందు లోకల్ లైబ్రరీ అథారిటి బ్రాంచి గ్రంథాలయము ఎమిట్టి రేడియో కేంద్రము ఒక సత్రము లోకల్ ఫండ్ ఆస్పత్రి కో ఆపరేటివ్ బిల్డింగ్-సొసైటి కలవు ఈ గ్రామమున 28 కిరాణా దుకాణములు 5 కాఫీ హోటళ్ళు 7 కిళ్ళి సిగరెట్టు సోడా దుకాణములు క్షౌరశాల 2 లాండ్రీలు సైకిళ్ళషాపులు ఉన్నవి

హైస్కూలు చదువులకు ఈ గ్రామములోని విద్యార్థులు పెనుగంచిప్రోలునకు వత్సవాయికి కళాశాల చదువులకు వ దిగామ విజయవాడలకునుపోవుదురు మెజిస్ట్రేటు కోర్టుకు తాలూకా కచేరికి బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు 8 మైళ్ళలో ఉన్న నందిగామకు పోవుదురు. పోలీసు స్టేషనుకు 8 మైళ్ళలో మన్న పెనుగంచిప్రోలునకును సబ్ రిజిష్ట్రారు ఆఫీసునకు 12 మైళ్ళలో నున్న జగ్గయ్యపేటకును జనులు పోదురు జనరల్ ఆసుపత్రికి నందిగామకును పశువుల ఆసుపత్రికి పెనుగంచిప్రోలునకును సినిమాథియేటరులకు మధిర నందిగామలకును పోవుచుందురు

ఈ గ్రామములో తిరుపతమ్మ జన్మించినదని వాడుక ఇచటి శివాలయములో ఒక శిలాశాసనము కలదు ఇచటికి 8 మైళ్ళలో నున్న రామిరెడ్డిపల్లిలో బౌద్ధ స్తూపము శిల్పములు ఉన్నవి

మా శ్వే

## అనితల్లి

అనితల్లి కాటయవేమారెడ్డికుమార్తె రాజమహేంద్రవర రాజ్యాధిపతియగు అల్లాడవీరభద్రారెడ్డి కీమె ధర్మపత్ని ఈమెయొక ఆయుర్వేద వైద్యునకు కలువచెరువు అనుగ్రామమును దానమొసగెను ఈ దానశాసనమునకు అనితల్లి కలువచేరు శాసనమనిపేరు ఈ శాసనము తూర్పుగోదావరి మండలము కాకినాడ తాలూకాలోని ఆర్యావటము (ఆర్యవటము) అను గ్రామమునలభించెను ఈ శాసనమునందు గల సారాంశము ఇట్లున్నది.

శక 1845 (క్రీ శ 1428) శ్రావణబహుళ అష్టమీదివసమున రెడ్డిరాణియగు అనితల్లి అత్రేయసగోత్రుడును వరహిత వశీయుడును ఆయుర్వేదవైద్యుడునగు వరదార్యునకు కలువచెరువు అను గ్రామమును దానమొసగెను శ్రీశైల ద్రాక్షారామ కాళేశ్వరముల మధ్యప్రదేశమునకు త్రిలింగదేశమనిపేరు ఈ త్రిలింగదేశమును కాకతీయవంశీయుడగు గణపతిదేవుడు పాలించెను "కాకతి" యను శక్తి అనుగ్రహమున గుమ్మకిలీగెను బాలుడు జన్మించెను నాటి నుండియు ఆతని సంతతివారిని కాకతీయులని వ్యవహరించుచుండిరి గణపతిదేవుని తరువాత ఆతని కుమార్తెయగు వీరరుద్రమదేవియు ఆమెకు ఎమ్మట ఆమె దౌహిత్రుడగు ప్రతాపరుద్రదేవుడును త్రిలింగదేశమును పాలించిరి ఉత్కలాధిపుడు గజపతికంటెను పాశ్చాత్యప్రభువు అశ్వపతికంటెను అధికుడని నరపతియైన ప్రతాపరుద్రదేవుడు ఖ్యాతికాంచెను ఇతడు యవనులచే బందీకృతుడై ఢిల్లికి కొంపోబడునపుడు సోమోద్భవయగు నర్మదానదిం జొచ్చి పరమపదించెను తురుష్కముష్కరాక్రాంతమగు త్రిలింగదేశమును ప్రోలయనాయకుడు సముద్రమునందు మునిగిన భూమిని ఆదివరాహమూర్తివలె సముద్ధరించి తిరిగి స్వాయత్త మొనర్చుకొనెను ఈతనికి ఎమ్మట ఆతని పినతండ్రి కుమారుడగు కాపయనాయకుడు త్రిలింగదేశమును పాలించెను ఈతని ఆధిపత్యముక్రింద డెబ్బదిఅయిదుమందినాయకులు సేవలుచేయుచుండిరి ఇతడు విశ్వేశ్వరానుగ్రహమునకు పాత్రుడు ధర్మాత్ముడు మ్లేచ్ఛాపహృతములైన బ్రాహ్మణాగ్రహారములను ఇతడు తిరిగి స్వాధీనమొనర్చుకొని ఆయా బ్రాహ్మణులకు వానినర్పించెను

కాపయనాయకుని అనంతరము ఆతనికి సేవలొనర్చు డెబ్బదిఅయిదుగురు నాయకులు తామాక్రమించిన ప్రదేశములను స్వతంత్రప్రతిపత్తితో పాలింపదొడగిరి ఇట్టివారిలో పంటవంశీయుడగు వేమారెడ్డియొకడు ఇతడు కొండవీటిరాజ్యమును స్థాపించి పాలింపదొడగెను పాతాళగంగకు మెట్లు కట్టించి ఇతడు యాత్రికులకు మహోపకారమొనర్చెను ఈయనకు అనపోత అన్నమాచ అన్నవేమ అను ముప్వురు తనయులుండిరి వీరిలో అనపోతారెడ్డి కుమారుడు కుమారగిరి ఆతని కుమార్తె దొడ్డాంబిక కాటయవేముడు అనపోతారెడ్డికి అల్లుడును కుమారగిరికి బావయును మంత్రియునై

యుడెను కాటయవేమునకు దొడ్డాంబికవలన కుమారగిరి అను కుమారుడును అనితల్లియను కుమార్తెయును జన్మించిరి కాటయవేముడు రాజమహేంద్రవరరాజ్యమును పాలించెను ఈతని మరణానంతరము ఈతని కుమారుడు కుమారగిరి కొద్దికాలము ఈ రాజ్యమును పాలించి దివంగతుడయ్యెను ఎమ్మట రాజమహేంద్రవరరాజ్యము కున్పతి జలరాశిమగ్నము కాగా కాటయవేముని బంధువగు దువ్వూరి అల్లారెడ్డి రాజ్యము నుద్ధరించి కాటయవేముని కూతురగు అనితల్లికి పట్టముకట్టెను అల్లాడరెడ్డి రాణిఅనితల్లికి మిక్కిలి అండగనుండి రాజ్యతంత్రమును నడుపుచుండెను అల్లారెడ్డికి వేమారెడ్డి వీరభద్రారెడ్డి అను తనయులు వేమాంబికవలన జన్మించిరి వీరిలో రెండవవాడగు వీరభద్రారెడ్డికి అనితల్లితో వివాహము జరిగెను అనితల్లివలననే రాజమహేంద్రవర రాజ్యము వీరభద్రారెడ్డికి సంక్రమించెను వీరభద్రారెడ్డి యన్న వేమారెడ్డి రాజ్యపాలనమున తమ్మునకు మిక్కిలి సహాయభూతుడయ్యెను

అనితల్లి మహాసాధ్వి గొప్పవిదుషీమణి ఈమె కడు ధర్మాత్మురాలు దేవబ్రాహ్మణభూములపై పన్నులను ఈమె రద్దుచేసెను ఈ కలువచేరు శాసనమున దానప్రతిగ్రహీతల యొక్క వంశము ఈ క్రింది విధముగ కనవచ్చుచున్నది ఈ వంశము వారిది ఆత్రేయసగోత్రము వీరికి పరహిత అను వంశనామ మేర్పడుటకు కారణమిట్లు చెప్పబడినది ఈ వంశమునందలి యొకవైద్యుడు నోటిలో గ్రుచ్చుకొనిన ఎముకతో ఒకసర్పము మిక్కిలి బాధనొందుచుండగా అది విషనాగమని విచారింపక దాని నోటనున్న యెమ్మునులాగి వేసెనట నాటినుండియు అతనికి పరహిత అను బిరుదమేర్పడినదట ఈ విధముగ వీరిది పరహిత వంశమయ్యెను ఇట్లు పరహిత బిరుదాంచితుడైన యావైద్యునకు రామనాథుడను కుమారుడును పరహిత దేవన కలానాథ అనుపేర్లుగల ముగ్గురు మనుమలును ఉండిరి వీరిలో కలానాథుడు అనువానికి రామయ పరహిత దేవన వరదుఅను నలుగురు తనయులుండిరి వీరందరును ఆయుర్వేదవైద్యమున కడుదిట్టలు వీరిలో చివరివాడగు వరదార్యునకు అనితల్లి కలువ చెరువు గ్రామమును దానమొసగెను వీరభద్రారెడ్డి ప్రభువు ఈ వరదార్యునకు రాయవైద్యభుజంగ కలిభేతాల [illegible] వశంకర అను బిరుదముల నొసగి సత్కరించెను శాసనము చివర వీరభద్రారెడ్డి యొక్కయు అతని అన్న వేమారెడ్డి యొక్కయు నామములున్నవి శాసనలేఖకుడు మార్కండేశ్వరుడు (చూ భారతి-21-6 పుట 663 ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక - 4 వ సంపుటము పుటలు 93-112) శాసనమున పేర్కొనబడిన వరదార్యుడు బహుశః రెడ్డిరాజులకు ఆస్థానవైద్యుడై యుండెనేమో! అనితల్లి వీరభద్రారెడ్డి గార్లు ఒనర్చిన దానవిశేషములు దక్షిణహిందూశాసనములలో కనవచ్చుచున్నవి

అనితల్లమ్మ గారు వీరభద్రారెడ్డిగారును గురువగు శ్రీపురారిజియ్య గారికి ఘోడవల్లి ఎనమయ్య గారి ఆత్రిక్రమాన శక 1345 (క్రీ శ 1423) శోభకృతు సంవత్సర చైత్ర బహుళదశమినాడు మహాబృహస్పతి పుణ్యకాలమున గౌతమీ మహానదీ తటమునందలి మార్కండేశ్వర రుద్రపాదాలసన్నిధిన పెటలొడ్డ రాయవరము నడిమిబాడి గ్రామములలోని బ్రాహ్మణసీమలను గొని ఆయము (పరిమాణము)ను పునాయమును ధారవోసి సర్వమాన్యముగా దానమొసగిరి (ద హిం శా సెం 114 పుట 42) మరియు ఈ అనితల్లి-వీరభద్రారెడ్డిగారలు శ క 1345 (క్రీ శ 1423) శోభకృతు సంవత్సర జ్యేష్ఠబహుళ తదియ శుక్రవారమున మిథున సంక్రాంతిపుణ్యకాలమున స్వస్తిశ్రీ భవరోగవైరి శ్రీమత్పల వెలకొప్పేశ్వర శ్రీమన్మహాదేవరకు కాటయవేమారెడ్డి యొక్కయు అతనిభార్య దొడ్డాంబికయొక్కయు పుణ్యమునకై అనేకదానము లొసగిరి (ద హిం శా సెం 109 పుట 40) ఈ శాసనము సమగ్రముగ కనిపించుటలేదు

ఇట్లు అనితల్లి మహారాణియై మహాధర్మాత్మురాలై గొప్పఖ్యాతి వహించెను వీరి ఆస్థానకవియగు శ్రీనాథకవి సార్వభౌముడు తనకాశీఖండమున అనితల్లి నిట్లు శ్లాఘించెను

"అనితల్లి న్వనితామతల్లి మదయస్త్రాద్రీంద్ర వేమావనీ
ఘనసామ్రాజ్య మర్థనాప్రతిమ సాక్షాదిందిరాదేవతన్"
కార్యేషు మంత్రీ కరణేషు దాసీ-
రూపేచ లక్ష్మీః క్షమయా ధరిత్రీ"

అను శ్లోకమున చెప్పబడిన గుణములకు అనితల్లి కార్యాణయై రెడ్డిరాజ్యచరిత్రమునకు నొసటన తిలకప్రాయమై ఎసగినది -

తం ఆ శా

## అనిమల

అనిమల గ్రామము కడపజిల్లా కమలాపుర తాలూకాలో ఉన్నది దీనికి 21 మైళ్ళలో ప్రొద్దుటూరు 25 మైళ్ళలో కమలాపురము ఉన్నవి తూర్పున ఎల్లివారిపలె పడమట వీరపునాయునిపల్లి ఉత్తరమున లింగాల దక్షిణమున గోను మాకులపల్లె ఈ గ్రామమునకు సరిహద్దులుగా ఉన్నవి దీని విస్తీర్ణము 9 402 ఎకరములు దీని ఉత్తరఅక్షాంశము 14 28 తూర్పురేఖాంశము 78 28 ఇది అనిమలకొండల దిగువ భాగమున ఉన్నది

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములో పురుషులు స్త్రీలుకలసి 3 246 మంది ఉండిరి వీరిలో షెడ్యూలు జాతులవారు షెడ్యూలు తరగతులవారు 337 మంది ఇచట ఇండ్లు దూరదూరముగాను వాడ వాడలుగాను ఉన్నవి వీటిలో 6 పెంకుటిండ్లు 9 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 2 ఒక అంతస్తుగల మేడలు గలవు గ్రామస్థులలో 478 మంది వరిఅన్నమును 2 316 మంది జొన్నఅన్నమును 452 మంది ఇతర అన్నములను తిందురు వీరు బావినీటిని త్రాగుదురు ఇచట వేసవిలో మంచినీటి ఎద్దడి కలదు

ఊటలు బుగ్గలు బావులు ఇచటి భూములకు నీటి వనరులు ఈ నీటి వనరులక్రింద వరి జొన్న కొర్ర వేరుసెనగ ప్రత్తి మున్నగు పంటలు పండును ఇచట 6 ఎకరముల చీనీ తోట ఒకటి ఉన్నది వంగ టోమాటో మొదలగు కూరగాయలను పండింతురు 1966 67 సం॥ లో పంటలక్రింద 2 488 ఎకరములభూమి ఉపయోగి పబడినది ఊట కాలువలక్రింద 142 ఎకరముల భూమి బావులక్రింద 63 ఎకరముల భూమి సాగుబడి చేయబడినది 4 ఆయిల్ ఇంజనులు 35 ఎకరములకును కొన్ని కపిలలు 28 ఎకరములకును నీటిని సరఫరా చేసెను రు 6 000 లు విలువగల చీనీపండ్లను యర్రగుంట్లకును 8 000 కి గ్రా వంకాయలను టొమాటోలను వేంపల్లెకుమ బండ్లపై లారీలపై రవాణాచేసిరి

ఈ గ్రామములో ఆవులు ఎద్దులుకలసి 874 గేదెలు దున్నపోతులుకలసి 359 మేకలు 66 గొర్రెలు 346 కోళ్లు 1274 ఉన్నవి సాలీనా 4 000 లీటర్లపాలు స్థానికముగ వినియోగపడెను

ఇచట ప్రజలు ముఖ్యముగా వ్యవసాయము కూలి ఆధారములుగా జీవింతురు దుకాణాదారులు ఎద్దుబండ్లు తోలువారు క్రయవిక్రయదారులు కలరు సాలు వడ్రగులు కమ్మరులు తాపీమేస్త్రీలు మంగలివారు చాకలివారు గొల్లలు వడ్డెరవారు కలరు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు రు 3 లు స్త్రీకి రు 1 కూలి

ఈ గ్రామమున చాల పురాతనమైన నగమేశ్వర దేవాలయము కలదు దీని ప్రాకారము గోపురములు మండపము పెద్ద శివవిగ్రహము చాల ప్రసిద్ధిచెందినవి మాఘ బహుళ చతుర్దశినాడు మహాశివరాత్రి పండుగ జరుగును ఆంజనేయస్వామి గుడి వీరభద్రస్వామి గుడి గ్రామదేవత బొగడెమ్మగుడి కలవు బొగడెమ్మజాతర వైశాఖపూర్ణిమకు మూడు దినముల ముందునుండి 8 దినములు జరుగును

అనిమల గ్రామమునకు 13 మైళ్ళలో ఎర్రగుంట్ల రైల్వే స్టేషను ఉన్నది ఇది బస్సుమార్గముపైనలేదు ఒక కంకర రోడ్డు రెండు మట్టిరోడ్లు ఉన్నవి మట్టిరోడ్లు ఈ గ్రామమును పొరుగు గ్రామములతో కలుపుచున్నవి ప్రయాణములకు 8 ఒంటెద్దు బండ్లు 52 రెట్టెడ్లబండ్లు 20 సైకిళ్లు ఉపయోగపడుచున్నవి

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు ఎలిమెంటరీ స్కూలుకలవు దీని నివారుగ్రామమైన వీరపునాయునిపల్లెలో జిల్లాపరిషత్తు హైస్కూలు సినియర్ బేసిక్ స్కూలు ఉన్నవి ఇది పంచాయతిపాలనకల గ్రామము పంచాయతి ఆదాయము ఇండ్లపన్ను వృత్తిపన్ను మొదలయిన వాటివలన చేకూరును రేడియో లౌడ్ స్పీకర్లు కలవు 5 కిరాణా దుకాణములు కాఫీహోటళ్లు 3 కిళ్ళీ సిగరెట్టు సోడా అంగళ్లు 3 కూరగాయ అంగళ్లు కలవు తంతికార్యాలయమునకు సినీమా థియేటరుకు గ్రామస్థులు ఎర్రగుంట్లకు పోవుదురు కోర్టులకు సబ్ రెజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు 25 మైళ్ళలోనున్న కమలాపురమునకు పోవుదురు 3 మైళ్ళలోనున్న గంగిరెడ్డిపల్లిలో పోలీసుస్టేషను ఉన్నది పురుళ్ళ ఆసుపత్రికి జనరల్ ఆసుపత్రికి పశువుల ఆసుపత్రికి కమలాపురముకు పోవలెను

మొగమేరు పాపఘ్ని నది కలియు స్థానమునకు పడమట 1 1/2 మైళ్ళలో ఈ అనిమల గ్రామము ఉన్నది ఇచట విజయనగరరాజుల పరిపాలన కాలమునకుచెందిన శాసనములు కలవు 10 వ శతాబ్ది అంతమున రాష్ట్రకూటుల సామంతులగు

వైదు బుల సంస్థానములో అనిమల ఉ డెను క్రీ శ 1644 ౹౹ లో మట్ల కుమారఅనంతరాజు చెన్నకేశవస్వామి దేవాలయమునకు దానమిచ్చి ట్లు ఇచటి ఒక శాసనము తెలుపుచున్నది

మా శ్వే

**అనియంక భీమదేవరావతు** చూ అన గభీముడు

**అనియంక భీమారావు** చూ అనంగభీముడు

**అనియంక భీముడు III** చూ అన గభీముడు

## అనుగురాజు

అనుగురాజు హైహయ వ శీయుడు హైహయ వంశమునకు మూలపురుషుడు కార్తవీర్యార్జునుడు హైహయులు చేది దేశమును క్రీ శ 12వ శతాబ్ది చివరవరకు పాలించినట్లు శిలా శాసనములవలన తెలియుచున్నది హైహయులకు సంబ ధించిన శిలాశాసనములు సంస్కృతమున వ్రాయబడినవి వీటిలో ఒక శాసనము నర్మదానదీ సమీపమున గల జబ్బల్పూరునకు యేబదిమైళ్ళదూరమున ఉన్న బిల్హారి అనుగ్రామము నందు మీర్జాపురమునకు పోవు రోడ్డువద్ద దొరికినది రెండవ శాసనము జబ్బల్పూరుకు సమీపమున కరంబేలు అను గ్రామములో కనుగొనబడినది పై శాసనములు నర్మదానదీ ప్రాంతమున లభించుట హైహయులు నర్మదానదీ ప్రాంతమును పాలి చిరనుటకు నిదర్శనముగ నున్నది చేది దేశము నేటి మధ్యప్రదేశ రాష్ట్రములోని జబ్బల్పూరును చుట్టుముట్టి మహారాష్ట్రములోని నాగపూరువరకు వ్యాపించి యున్నది

అనుగురాజు క్రీస్తుశకము 1110 నుండి 1170 వ స వత్సరమువరకు ఉ డినట్లు ఊహింపబడుచున్నది ఇతడు ఆంధ్ర దేశమునకు వలస వచ్చుటను గూర్చి పెక్కు అభిప్రాయములు కనవచ్చుచున్నవి పదునొంకడవ శతాబ్ది ఆర భము నుండి చేది దేశము విభజింపబడి ఎక్కువమంది రాజుల పాలన క్రింద ఉండినట్లును ఈ రాజులను రేవాఖ గేలులో మహమ్మదీయులో లేక ఇతరశత్రువులో ఓడించి వీరిరాజ్యములను గైకొని వీరిని పారద్రోలినట్లును అట్లుపారివచ్చిన రాజులలో అనుగురాజు కూడ ఒకడైనట్లును ఈ అనుగురాజు ససైన్యముగ పలనాటికి వచ్చి అచ్చట స్థిరపడినట్లును తక్కిన హైహయులు క్రీ శ 1181 వ సంవత్సరమువరకు ఉండి క్రమ ము గా రాజ్యభ్రష్టులైనట్లును స్మి త్తు గా రి వ్రాతలమూలమున తెలియవచ్చుచున్నది పల్నాటి వీర చరిత్రమున (దీని గ్ర థక ర్తలు శ్రీనాథుడు మల్లయ్య కొ డయ్య అనువారు) అనుగురాజు పల్నాటి వచ్చిన విధము అచట రాజ్యమును స పాది చి పాలి చిన విధానములును మనోహరముగా వర్ణి పబడినవి పల్నాటి వీర చరిత్రలో అనుగురాజు చరిత్రము ఈ క్రి దివిధముగ కనవచ్చుచున్నది

అనుగురాజు చేదిదేశమున దలి పాలమాచాపురి అను పట్టణమునకు ఎలిక పాల మాచాపురికి జ భనాపురి అని నామాంతరము ఇది నేటి జబ్బల్పూరే కావచ్చునని చారిత్రకులు ఊహి చుచున్నారు అనుగురాజు మిక్కిలి ధార్మికుడు ప్రజానుర జకముగ అతడు రాజ్యమును పాలి చుచుండెను సామ తరాజులును అనుగురాజుకు విధేయులై కప్పములు చెల్లి చుచు అతని ఆజ్ఞను నిర్వర్తి చుచు డిరి అనుగురాజు తన రాజ్యమున దు అడుగడుగున స భవి చుచున్న అరిష్టము లను తన పురాకృత పాపములను తొలగింప నిశ్చయించి బ్రాహ్మణులతో ఆలోచి చి తన కోశాగారమునగల ధన రాసులను తన కొలువులోని బ్రాహ్మణులకు అతడు దానము చేయ నారంభించెను ఇ తలో ఒక వృద్ధ విప్రుడు సభలోనికి వచ్చి "పూర్వము కార్తవీర్యార్జునుడు జమదగ్ని ఆశ్రమమునకు బోయి ఆ మహర్షి వలన ఆతిథ్యమును పొంది కృతఘ్నుడై ఆ మునిని సంహరి చెను అట్లు బ్రహ్మహత్యా దోషమునకు గురిఅయి పతితుడైన కార్త వీర్యార్జునివంశమున జన్మించిన అనుగురాజు ఇచ్చునట్టి దానములను స్వీ రించుట మహాపాతక హేతువని అచటి బ్రాహ్మణులతో చెప్పెను అనుగురాజు వృద్ధ బ్రాహ్మణుని మాటలకు నివ్వెరపడి బ్రహ్మ హత్యాదోషము తొలగు ఉపాయమును తెలుపుమని అతడు ఆ బ్రాహ్మణుని ప్రార్థి చెను బ్రాహ్మణుడు రాజును అనుగ్రహించెను అతడు రాజుతో ఇట్లు చెప్పెను "రాజా! బ్రహ్మహత్యా దోషనివృత్తికై నీవు మలిన వస్త్రములను ధరించి పుణ్యతీర్థములయ దు స్నానదానములను ఒనర్చుచు దివ్యక్షేత్రములను సందర్శి పుము నీవుకట్టుకొనిన మలినవస్త్రములు ఎ నది య దు స్నానయచేసినప్పుడు తెల్లబడునో అంతటితో నీపూర్వపాపములు తొలగిపోయినట్లుభావింపుము నాటినుండియు నీవు పవిత్రుడవగుదువు మీ పూర్వుల బ్రహ్మహత్యాది దోషములును తొలగిపోయినట్లు అనుకొనుము అని చెప్పుచునే వృద్ధబ్రాహ్మణుడు సభను డి వెడలిపోయెను ఈ వృద్ధబ్రాహ్మణుడు అనుగురాజు ఇలువేలుపుఅగు కనకాద్రి

చెన్నకేశవుడే రాజును పాపవిముక్తుని చేయునదేశముతో ఆయన అట్లు మారురూపమున వచ్చి రాజునకు కర్తవ్యమును ఉపదేశించెనట

చెన్నకేశవుని ఆజ్ఞానుసారము అనుగురాజు తీర్థయాత్రలు చేయ సంకల్పించెను తన రాజ్యభారమును తన తమ్ముడగు బిరుదురాజుపై ఉంచెను పట్టమహిషియగు విద్యలదేవిని మంత్రియగు దొడ్డనాయని దొడ్డనాయని పుత్రులగు పెద్దన బ్రహ్మన మున్నగువారిని సేనాధిపతియైన తెప్పలినేనిని సైన్యమును పరివారమును చెన్నకేశవుని పూజాపీఠమును తనతో తీసికొని అనుగురాజుతీర్థయాత్రలుచేయ బయలెడలెను పుణ్యనదులలో స్నానముచేయుచు దివ్యక్షేత్రములను దర్శించుచు అతడు గయాక్షేత్రమును చేరెను గయా పట్టణము (నేటి బీహారు రాష్ట్రమున ఉన్నది) నకు రాజగు భీముడను తడు తన పుత్రికయగు భూరమాదేవిని అనుగురాజునకిచ్చి పెండ్లి చేసెను

ఇట్లు అనేక నదులలో స్నానమాడుచు అనేక దివ్యక్షేత్రములను దర్శించుచు అనుగురాజు ఆంధ్రదేశమునందలి కృష్ణానదిని దాటి మోటుపల్లెకు (గుంటూరు మండలములోని బాపట్ల తాలూకాయందలి సముద్ర తీరమున మోటుపల్లె ఉన్నది) వచ్చి సముద్ర స్నానము చేయుచుండగా అనుగురాజు ధరించిన మలిన వస్త్రములు తెల్లబడెను అమరావతివద్ద కృష్ణానదిలో స్నానమాడునపుడు అనుగురాజు ధరించిన మలిన వస్త్రములు తెల్లబడెనని కొందరి అభిప్రాయము మురికిబట్టలు తెల్లబడుటచే అనుగురాజు పాపములన్నియు నశించినవని బ్రాహ్మణులు రాజుతో చెప్పిరి అనుగురాజు మిక్కిలి సంతసించెను తన పాపములను పోగొట్టిన మోటుపల్లి ప్రాంతము ముక్తిక్షేత్రమని రాజు ఎంచెను అచటనే డేరాల నెత్తించి అతడు కొన్నిదినములు గడిపెను పశుగ్రాసమునకై తన సేనానియగు తెప్పలినేనిని అరణ్యములకు పంపి అనుగురాజు అచ్చటి కాపులకు వలసిన ధనమిచ్చి పశువులకు సమృద్ధిగా మేతను సంపాదించెను కొన్నదినముల తరువాత మేకపోతు విషయములో సంభవించిన రెడ్డివివాదమే తుదకు అనుగురాజునకును ఊరకోట ప్రభువగు పేరమరాజునకును మధ్య గొప్పపోరాటము ఘటిల్లుటకుకారణమయ్యెను ఆ పోరాటములో తెప్పలినేడు పేరమరాజును వధించి "భూమిలోని రాజులందరు స్త్రీలవంటివారు అనుగురాజు ఒక్కడే రాజనామార్హుడు" అను ఒక బిరుదుశాసనము వ్రాయించి ఊరకోటలో నెలకొల్పెను

ఈ వృత్తాంతమును విని చందవోలురాజు (చందవోలు గుంటూరుజిల్లాలోని బాపట్లతాలూకాలో యాజలి ఫర్కాలో ఉన్నది చందవోలును పాలించిన అప్పటిరాజు వెలనాటి చోళుడగు రెండవ గొంకయ అయి అతని పాలనకాలము క్రీ శ 1126-1161 అనియు చారిత్రికులు ఊహించుచున్నారు అనుగురాజుతో మరమునకు తలపడెను దొడ్డనాయని పుత్రుడగు పెద్దన్న చందవోలురాజును పోరున ఓడించి బందీగా దెచ్చి అనుగు నృపాలునియొద్ద అతనిని నిలబెట్టెను చందవోలురాజు అనుగురాజుతో సంధిచేసికొని తనకుమార్తె అగు మైలమాదేవిని అనుగురాజునకిచ్చి వివాహముచేసి పల్నాటి సీమను అనుగురాజునకు అరణముగా ఇచ్చెను (ఈ వివాహము క్రీ శ 1146-47 మధ్యకాలమున జరిగినట్లు ఊహింపబడుచున్నది)

పలనాటిసీమ కృష్ణానదికి దక్షిణతీరమున సముద్రమునకు సుమారు 100 మైళ్ళ దూరమున ఉన్నది పలనాటిసీమకు ఉత్తరమున 75 మైళ్ళపొడవు కృష్ణానది ప్రవహించుచున్నది ఈ రాజ్యము కుడిదక్షిణమున కొండలు అడవులును తూర్పున పడమట ఏట్టడవులు కొండలునున్నవి ఈసీమ వైశాల్యము సుమారు 1050 చదరపు మైళ్లు ఇది దండకారణ్యములో కొంతభాగమై ఉండెట్లును ఇది పూర్వము ఖర దూషణాది రాక్షసులు నివసించిన స్థలమయినట్లును తెలియుచున్నది నాగులేరు (దీనికి నాగానది అనియు పేరు ఒకగొప్ప నాగుపాము ప్రాణములు తీసి ఈనది ప్రవహించుటవలన దీనికి ఈ పేరు వచ్చినది అని అందురు) చంద్రవంక (దీనికి చంద్రభాగ యని పేరున్నది) అను నదులు దక్షిణమునుండి ఉత్తరమునకు ప్రవహించి కృష్ణానదిలో కలియుచున్నవి గురజాల మాచెర్ల కార్యమపూడి మొదలగు పట్టణములు ఈ సీమలో కలవు వజ్రములు రాగి సీసము ఇనుము పాలరాయి నాపరాయి దొరుకునట్టి గనులు ఈ సీమలో ఉన్నవి సుప్రసిద్ధమయిన కోహినూరువజ్రము ఈ సీమలో లభించినట్టిదే నాగార్జునకొండ ఎత్తిపోతల మున్నగు పుణ్యక్షేత్రములతో మంచి పొలములతో పల్నాటిసీమ ఒప్పుచున్నది

అనుగురాజు పల్నాటిరాజ్యము నందలి గురజాల ప్రవేశించి కొన్నిదినములు అచట నివసించి పాలమాచాపురికి తిరిగి పయనమయ్యెను కనకాద్రి చెన్నకేశవుడు ఆరాజు స్వప్నమున

కనిఎ చి పాలమాచాపురము కా ర్తవీర్యార్జునిపాపముచే అప విత్రమైనది కావున అదిరాజులకు వాఽ యోగ్యము కాదనియు గురజాలయ దే ఉ డుమనియు తానుగూడ అచ్చటనే ఉ దు ననియు చె ప్పి అంతర్ధానమయ్యెను స్వామి ఆజ్ఞ ప్రకారము అనుగు రాజు గురజ లను రాజధానిగా జేసికొని పల్నాటి రాజ్యము పాలి చుచు డెను గురజాలలో చెన్న కేశవునికి దేవాలయమును కట్టించెను ఈ దేవుని అనుగ్రహమున అనుగు రాజునకు మైలమవలన నలగాముడును ...రమాదేవివలన కామరాజు నరసింగరాజు ఝుట్టిరాజు పెదమాళ్ళరాజు విద్యలదేవివలన పెదమల్ల చినమల్ల బాలమలిదేవులు అను పుత్రులు ఉదయించిరి వీరిలో నలగాముడు క్రీ శ 1148 49 మధ్యకాలమున జన్మించెనని ఊహి పబడుచున్నది ఇతడు అందరిక లెను పెద్దవాడు ఇట్లు అనుగురాజు పుత్రులతో సుఖియై ప్రజానుర జకముగ పల్నాటి రాజ్యమును పాలించు చుండెను ఇట్లు కొంతకాలము గడిచిపోగా ఊరకోట యుద్ధ మున తెప్పలినాయునిచేతిలో మరణించిన పేరమరాజుయొక్క కుమారుడు ఉ త్తరుడను వాడు ప్రతీకారవా ఛతో ససై న్యుడై అనుగురాజుపై యుద్ధమునకు ఉద్యమించెను ఆ యుద్ధము అరణగండ్లవద్ద జరిగెను ఇందు అనుగురాజు సేనాని యగు తెప్పలినాయుడు మరణి చెను బ్రహ్మనాయుడు గండుకన్నమ కన్నమనేని మున్నగువారు ఆ యుద్ధమున పాల్గొని ఉ త్తరుడు మొదలగు రాజులను ఓడించి బ దీలుగా పట్టుకొని అనుగురాజునొద్దకు తెచ్చిరి బ్రహ్మనాయని కోరి కనుబట్టి వారివద్ద కప్పములు మాత్రము గ్రహించి వారిని అనుగురాజు విడిచిపుచ్చెను

కుమారులు యుక్తవయస్కులు అగుటచే అనుగురాజు నలగామ నరసింగ ఝుట్టి పెదమాళ్ళరాజులకు వివాహ ములు చేసెను అనుగురాజు ఒకప్పుడు పరివారముతో వేటకు పోయి మరలివచ్చుచుండెను మార్గమున పంటరెడ్డివారిఆడపడు చును ఆర్వెల్లివారి కోడలును వీరజగ్గారెడ్డి దత్తపుత్రికయు అయిననాగమ్మఅను ఒకయువతిఅనుగురాజుకువిందుచేసి ఆతనిని సంతోషపరచి ఆ రాజువలనపల్నాటిరాజులవద్ద ఎడుగడియల కాలము మ త్రిత్వము చేయుటకు వలసిన అధికార పత్రమును సంపాది చెను నాగమ్మ గురుజాలకువచ్చుచు అచ్చటి విష యములను గ్రహించుచు తనకు విధేయతజూపని కారణమున బ్రహ్మనాయనిపై పగబట్టియుండెను బ్రహ్మనాయనికి నాగమ్మకును క్రమముగా పగవృద్ధి యగుచు డెను

ఇ తలో అనుగురాజునకు వీపున రాచపు డుపుట్టి అతడు మరణావస్థలో ఉ డెను అప్పుడు అతడు తన కుమాళ్ళను అ దరిని బ్రహ్మనాయనికి అప్పగి చెను నలగాముని పల్నాటి రాజ్యమునకు ప్రభువునుచేసి బ్రహ్మనాయని మంత్రిగాఉ డు మని అరాజు బ్రహ్మనాయుని కోరెను పుత్రులను జాగ్రత్తగా చూడుమనియు వారు ఐక్యమత్యముతోను దునట్లు చూచు కొమ్మనియు రాజు బ్రహ్మనాయని చెప్పి మరణి చెను అనుగురాజు మ త్రియు బ్రహ్మనాయుని త డ్రియునగు దొడ్డ నాయుడు అనుగురాజు మరణమునకు శోకించి మ చముపట్టి మనోవ్యథతో కృషి చి తుదకుకొన్ని దినములకుకనుమూసెను

ఇట్లు అనుగురాజు ధర్మసంరక్షకుడై భగీరథునివలె తమ పూర్వీకుల పాపములను పటాపంచలుచే ధర్మయుత ముగ రాజ్యమొనర్చి ప్రజల ఆదరమునుపొ ది సాటి ప్రభువు లలో మేటి అనిపించుకొని పలనాటి వీర యశస్సాధమునకు మూలస్తంభమై అలరారెను ఇట్టి రాజుల పరిపాలనచే పలనాటి సీమయు వీరపల్నాడు అను కీర్తికిస్థానమై ఎసగినది

కం ఆం శా

## అనుపల్లి

అనుపల్లి అనుగ్రామము అన తపురముజిల్లా గుత్తి తాలూకా నాగసముద్రము ఫర్కాకు చె దినది దీనికి అనం పల్లి అనియు నామా తరమున్నది ఇందలి నేటి జనాభా 1493 ఈ గ్రామమున దు గోపాలస్వామిదేవాలయము ఆ జనేయస్వామిదేవళమును కలవు వీనిలో ఆ జనేయ స్వామివారి దేవాలయములోని ఒక స్తంభముపై ఒకశాసనము కనిపి చుచున్నది ఇది శక 1572 (క్రీ శ 1650) నాటిది (ద హిం X నెం 757)

ఈ శాసనమున దు శ్రీమద్రాజాధిరాజ రాజ పరమేశ్వర అను బిరుదములు మాత్రము కనవచ్చుచున్నవి కాని రాజుపేరు మాత్రము వ్రాయబడలేదు మరియు శా ను గొలలోను సింహాసనారూఢుడై యున్న అజరతిహా (ఇది నవాబు బిరుదము) నవాబు ఘ డికోట సీమలోనుండి జగదాజగుత్తి సీమనుపాలించుచు డిన సమయ మున అనుపల్లి గ్రామవాస్తవ్యులైన వైశ్యులు నగర వారు వ ర్తకులు గమికాడ్లు (అధికారులు) ప్రజలు అందరును ఆ గ్రామమునందలి (అనుపల్లి) గోపాలస్వామి

ఆంజనేయస్వామి దేవాలయములకు నిత్యనైవేద్యమునకును అంగరంగవైభవాదులకును ప్రతిమాసమునకు ఒక్కొక్క అంగడి నుండి కొంతసొమ్మును ఒక్కొక్క అధికారినుండి కొంత ద్రవ్యమును వసూలుచేసి దానితో ఆయాదేవాలయములలో కైంకర్యములను అర్చనావిధులను జరిపించుచుండిరి మరియు దేవాలయములలోని అర్చనాది విధులలో సాయపడుచుండిన గోపాలభట్టు అను పురోహితునకు గూడ వారు కొంత బంగారమును దానముచేసినట్లు శాసనమున కలదు ఈ విధముగ అనుపల్లి ప్రజలు తమ భగవద్భక్తిని బ్రాహ్మణభక్తిని దానరూపమున ప్రదర్శించుటయే ఈ శాసనమందలి ప్రధానవిషయము శాసనవిషయములతోపాటు ఆనాటిగుత్తి సీమపాలకుల ఉదంతమును గ్రహించుటయు అవసరమే క్రీ శ 1649 నాటికి విజయనగరసామ్రాజ్యము లుప్తప్రాయమయ్యెను ఈ సామ్రాజ్యమును పాలించిన వారిలో చివరివాడు మూడవ శ్రీరంగదేవరాయలు ఇతడు పేరుకు మాత్రమే విజయనగరాధిపతిగ నుండెను గోల్కొండ బీజాపూరు నవాబులు విజయనగరసామ్రాజ్య భాగములను ఎవరికి చేతనైనంత వారు కబళించుచుండిరి ఈ శాసనకాలమునందు గోల్కొండ సుల్తాను అబుల్లా కుతుబుషాయొక్క ప్రధానియైన మీరుజుమ్లా అనునతడు గండికోట దుర్గమును (క్రీ శ 1650) స్వాధీనపరచుకొనెను ఇది దుస్సాధ్యమైన దుర్గమగుటచే మీరుజుమ్లా విజయము గోల్కొండ వారికి మిక్కిలి హర్షదాయకమయ్యెను సుల్తాను అబ్దుల్లా తన సేనాపతియైన మీరుజుమ్లాను గొప్పగా భూషించెనట

విజయనగరసామ్రాజ్య దురాక్రమణమునందు గోలుకొండ వారును బీజపూరువారును ఒక యొప్పందమునకు వచ్చిరి గండికోట దుర్గమునకు తూర్పుభాగము గోల్కొండ వారికి వతగను దీనికి పశ్చిమభాగము బీజాపూరువారి వంతుగను అంగీకరింపబడెను కాని మీరుజుమ్లా విజయగర్వితుడై ఒప్పందమును అతిక్రమించి బీజాపురము వారి వంతు అయిన గుత్తి దుర్గమునుగూడ ఆక్రమించెను అయినను త్వరలోనే బీజాపూరు సేనానులు మీరుజుమ్లాకు బుద్ధి చెప్పిచిరి విజయనగరసామ్రాజ్య భాగములను తన ప్రధానియైన మీరుజుమ్లా ఆక్రమించుకొనుచుండెనని అబ్దుల్లాకుతుబ్షా హర్షించెనే కాని అతడు (మీరుజుమ్లా) బలవంతుడై తనను ధిక్కరించుస్థితికి వచ్చుచుండుటను సుల్తాను గమనించలేదు ప్రకృతశాసనములోని విషయములను పరిశీలింతము ఇందలి అజరతు అను శబ్దము సుల్తానుల గౌరవవాచకము ఇది హజరతు అను శబ్దభవమై యుండును హజరతు అనునది ఫార్సీశబ్దము ఇక్కడ అజరతు అనగా గోల్కొండ సుల్తాను అబ్దుల్లాకుతుబ్షా అని అర్థమును గ్రహింపవలయును అతడు గోలకొండ సింహాసనారూఢుడై యుండగా అతని ముద్రకర్త (మీరుజుమ్లా) గండికోటలో నుండెను మీరుజుమ్లాకు కూడ నవాబు బిరుదమగు అజరతు ఉండినట్లు ఈ శాసనము వలన తెలియుచున్నది

శాసనములో శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర అను బిరుదములు కనవచ్చుట విశేషము ఇవి విజయనగర సమ్రాట్టుల బిరుదములు విజయనగరసామ్రాజ్యము నశించినను ప్రజల మనస్సులలో వారి బిరుదములింకను మెదలుచునే యుండెను కావుననే శాసనమునందు విజయనగర బిరుదావళి ప్రస్తావన చేయబడినదని భావింపనగును

తం ఆం శా

## అనుమంచిపల్లి

అనుమంచిపల్లి గ్రామము కృష్ణామండలములోని నందిగామ తాలూకాలో ఉండినట్లు దక్షిణ హిందూ శాసన గ్రంథమున ఉన్నది కాని ఇది నేడు జగ్గయ్యపేట తాలూకాలో కనవచ్చుచున్నది 1961 నలెక్కననుసరించి దీని జనాభా 1366 ఈ గ్రామమందలి చంద్ర కాశీశ్వరస్వామి దేవాలయములోని ఒక స్తంభముపై శక 1134 (క్రీ శ 1212) శ్రీముఖ సంవత్సరపునాటి శాసనమొకటి కనిపించుచున్నది అందులో చేవలి అన్నిమంచి అను విప్రుడు నతవాటి సీమాధిపతియగు త్యాగాంక పోతాధిపతి అనుమతితో అనుమంచిపల్లి గ్రామములోని చంద్రమౌళీశ్వరస్వామికి హవిర్బల్యర్చనాది విధులకుగాను కొన్నినివర్తనముల భూమిని దానమొసగినట్లున్నది (ద హిం శా X నెం 259-134)

ఈ శాసనమున కనవచ్చుచున్న అన్నిమంచి అను వ్యక్తిని గూర్చియు నతవాటి సీమాధిపతియగు పోతభూపతిని గూర్చియు నతవాటిసీమను గూర్చియు కొన్ని అంశములు వివరించి చెప్పుట అప్రస్తుతము కాదు

అన్నిమంచి అనునతడు బ్రాహ్మణకులజుడు ఇతని ఇంటిపేరు చేవలివారు ఈయన తండ్రి పేరు బ్రహ్మయ

తల్లి పేరు అక్కమాంబ వీరిది శ్రీవత్సగోత్రము ఈయన తాత ప్రోలనార్యుడు అన్ని మంచి బుద్ధిలో బృహస్పతితుల్యుడు సత్కళాశోభితుడు అపరవిరించి ఇక్కాలమున నతవాటిసీమను చాగి (సాగి) వంశము వారు పాలించుచుండిరి వీరు కాకతీయులకు రాజబంధువులు వీరు గుడిమెట్ల రాజధానిగ నందిగామసీమను పాలించిన సామంతమండలేశ్వరులు ఈ వంశమువారు దుర్జయవంశ భూతులు వీరిలో ఇంకొక శాఖ వారు హైహయవంశీయులు వీరు పలనాటిని పాలించిరి వీరును దుర్జయాన్వయ జాతులును చతుర్థకులజులు వీరు మనుకులసంభవులమని చెప్పుకొనిరి వారి శాసనములు కృష్ణామండలము నందలి గుడిమెట్ట ముక్త్యాల పెనుగంచిప్రోలు అనుమంచిపల్లె బెజవాడ నవాబుపేటము నగు స్థలములో లభించినవి వీరివంశములోని దోరభూపతి (చాగిరాజు) కుమారుడే రెండవ పోతరాజు ఇతడు బెజవాడను రాజధానిగ చేసికొని నతవాటిసీమను పాలించెను ఈ శాసనమున కనిపించుచున్న వాడితడే ఇతడు శాత్రవభయంకరుడు ఈయన గజారంభముగ రాజ్యమును పాలించెను ఈతని కాలమున నతవాటిసీమ ధనధాన్య సంపూర్ణమైయొప్పెను ఇతడు క్షీరనది (పాలేరు) యొడ్డున తనపేర పోతపురమను అగ్రహారము నిర్మించెను ఈ అగ్రహారము హింతాలతాలనారికేళ వృక్షములతో విరాజిల్లునట్లు ఇతడొనరెను ఇతడు ప్రజాహితకార్యము లెన్నియోచేసెను పాలేటినుండి కావేరిని బోలు ఒక పెద్ద కాలువ నుత్రవ్వించి వ్యవసాయమునకు వలసిన జలమును సమకూర్చెను ఈతడొనరించిన దాన ధర్మములను చెప్పు శాసనములు శక 1119 1152 వరకు లభించుచున్నవి ఇతడు అనుమంచిపల్లి గ్రామమున చంద్రమౌళీశ్వరాలయమును నిర్మించెను దీనికి అంగరంగ భోగములనిమిత్తము అనేక భూములను దానము చేసెను ఈతడెన్నియో దేవాలయములకు అనేక దానములు చేసినట్లు శాసనములు కనబడుచున్నవి శ్రీశైలమున నుండు మల్లికార్జునస్వామిచేత నదీశ్వరుని ప్రతిష్ఠించి ఇతడు ఆదేవుని కైంకర్యమునకై కంభపాడు ముచ్చితలబూదపాడు మున్నగు గ్రామములను దానము చేసెను ముక్తేశ్వరాలయమును నిర్మించి ఆ దేవునకు ముక్తి అను గ్రామమును దానమొసంగి ఆ దేవరకు రత్నకిరీటమును ఇరువదియైదు ఆవులను దానమొసంగెను బెజవాడలోని శ్రీ మల్లేశ్వరస్వామి హవిర్బల్యర్చనములకుగాను నొడ్డ గ్రామమును ఒక్కిమపూడిలోని రెండు భాగములను దానమిచ్చెను సింహాచలమున చాగిపోత సముద్రమను చెరువును త్రవ్వించెను ఇట్లీయన యొనర్చిన దాన ధర్మములకంతే లేదు

కోటబయ్యలదేవి అమరావతి శాసనమును బట్టియు కాకతీయులనాటి అనుమంచిపల్లి గ్రామ శాసనము వలనను మొదటి అమ్మరాజు మచిలీపట్టణపు శాసనము ననుసరించియు బాపట్ల భావనారాయణస్వామి ఆలయ శాసనము వలనను నతవాటి సీమ అనగా కృష్ణానదికి ఉత్తరముననున్న నందిగామ తాలూకాయును దానికి ఎగువభాగమును అయియుండినట్లు తెలియుచున్నది నతవాటి సీమకు పెన్నాతవాడి శ్రీనాథవాటిసీమ అను పేర్లుండినట్లు శాసనాధారములుగలవు అమ్మరాజు శాసనములలో కనవచ్చు గొట్టిప్రోలు (గొట్టుముక్కల) మల్కాపురము (మలకాపురము) తాడిగుమ్మి (తాడిగుమ్మి) ద్రుజ్జారు (జుజ్జూరు) మున్నగు గ్రామములు నందిగామ బెజవాడ జగ్గయ్యపేట తాలూకాలలో కనిపించుటచేత నతవాడి పెన్నతవాడిసీమలు కృష్ణామండలములోని కృష్ణానదికి ఉత్తరదిశన ఉన్న నందిగామ తాలూకా ప్రాంతమని చెప్పవచ్చును నతవాటిసీమపాలకులు కాకతీయులకు సామంతులమని చెప్పుకొనక పోయినను వెలనాటి కులోత్తుంగ పృథ్వీశ్వరుని జయించుటలో తెలుగు చోళులు కోట వంశీయులతోపాటు వీరును కాకతీయగణపతిదేవునకు సాయమొనర్చిరి ఈ యుద్ధము క్రీ శ 1207 1208 ప్రాంతమున జరిగినట్లు తెలియుచున్నది

అనుమంచిపల్లిలోని చంద్రమౌళీశ్వరాలయమునకు కైంకర్యము నిమిత్తము హవిర్బల్యర్చనాదులకును పోతభూపతి ఆజ్ఞానుసారముగ అన్నిమంచి అను బ్రాహ్మణుడు పరోపకార సంతతి కొరకును పుణ్యాభివృద్ధి కొరకును శక 1134 (క్రీ శ 1212 న అనుమంచిపల్లి గ్రామములోని కొన్ని నివర్తనములభూమిని దానమొనర్చెను ఈ గ్రామనామము ఈ అన్నమంచి అను విప్రునినామమునకును కొంత పోలిక కనిపించుచున్నది బహుశ ఈ గ్రామమును త్యాగిపోత భూపతి అన్నమంచికి దానమొనర్చియుండునా? అను సందియము కలుగుచున్నది పోతపురమునకే అనుమంచిపల్లి అను నామముగూడ కలదేమో అని ఊహింపవీలగుచున్నది

తం అం శా

నిల్పినట్లును అన్మకొ౦డ పురమందలి సెట్టిప్రముఖ౦న్నరము వారు ఉమాబేతేశ్వరదేవర నిత్యదీపమునకై ప్రతినిత్యము మానెడునూనె ఇచ్చినట్లును ఇదివరకే పేర్కొన్న యేదపశాస

చిత్రము 13



పటము 4
వేయి స్త౦భాల గుడి అనుమకొ౦డ

నము తెలుపుచున్నది కాకతీయుల శిల్పమునకు విజయ పతాక వేయిస్తంభాలగుడి యని పిలువబడు రుద్రేశ్వరము కాకతిరుద్రదేవుడు (1150–1195) శిల్పసుందరమైన రుద్రేశ్వర మును ఈ బృహన్నిర్మాణమును త్రికూటాలయముగా 1163 లో నిర్మి౦ప౦చినట్లును అందలి దేవతల పూజాదులకై మద్దిచెరువుల గ్రామమును దానము చేసినట్లును వేయి స్తంభాల గుడి శాసనము చాటుచున్నది ఈ రుద్రేశ్వరమందే కాకతీయుల నమ్మినబ౦టు గొ౦గి ఈశ్వరుడు చతుర్ముఖ దేవరను ఉమామహేశ్వర దేవరను వేయి లింగాలను ప్రతిష్ఠించినట్లు చాటెడు మరియొక శాసనము రుద్రేశ్వరాలయ కుడ్యస్తంభమునై కలదు రుద్రదేవుని మంత్రి చెల్లకి గంగాధరుడు

అనుమకొండ రుద్రేశ్వరదేవు సమీపమున పురమధ్యమున ప్రసన్నకేశవదేవుని పున్నేశ్వర దేవాలయసాన్నిధ్యమున పన్నగభూషణుగుడిని నిర్మించుటేకాక గంగాచెయ చెరువును త్రవ్వి౦చి దానిప్రక్కన కేశవాలయమునునిల్పి ఆప్రాంతమును సద్ధ్యోపాసన కనువగునట్లు తీర్చి విప్రుల కిచ్చిన ట్లొక శాసనమున్నది

ఆనాటి ఈ దేవాలయములు చెరువులు అన్నియు ఈనాడులేవు ఇప్పటికిని నిలిచియున్న సిద్ధేశ్వరాలయము దానిప్రక్కనగల సిద్ధేశ్వరగుండము ఎప్పటివో తెలియదు కానె సగ్వప్ప వ్రాసిన సిద్ధేశ్వరచరిత్రమున కైలాసమును౦డి శివుడే తెంచి అనుమకొండలో సిద్ధేశ్వరుడుగా నిలిచినట్లును పార్వతియే పద్మాక్షియై వెలసినట్లును సిద్ధేశ్వరునికి తూర్పున భద్రేశ్వరి (ఈనాటి భద్రకాళి) క్షేత్రపాలుడైన గోపాలుడు పడమట భైరవుడు ఉత్తరమున నిషాదరుద్రేశ్వరి అనుమకొండ దుర్గముచుట్టును గర్గళదేవుడును ఇతర దుర్గాశక్తులగుడులును ఉండినట్లు వర్ణింపబడినది వీనిలో ఈనాటికి మిగిలినవి భద్రకాళిగుడి దానిచె౦తగల భద్రకాళి చెరువులు మాత్రమే భద్రకాళిగుడి చాలా ప్రాచీనమైనదని చెప్పుదురు ఎడవశతాబ్దము చాళుక్యపులకేశివల్లభుడీ భద్రకాళిని గొలిచి విజయుడైనట్లు జనశ్రుతి యున్నది వేయిస్తంభాలగుడి శాసనములో రుద్రదేవుని

చిత్రము 14



పటము 5
సిద్ధేశ్వర దేవాలయము – పరస్సు – అనుమకొండ

రాజధానీనగరమైన ఆనాటి అనుమకొ డ వైభవము చక్కగ వర్ణి ఎబడినది
యత్రద్విజే ద్రభవనేషు నివార్యమాణాః
కీరాః పఠన్తి పటవో వటుభి స్సమేతాః
సర్వా గ న గత సమ స్తవిచారచారు
చారిత్రచర్చితపదక్రమయుక్త వేదాన్
నాతిక్రామతి వైష్ణవ పదమితి ధ్యా గౌరితిజ్ఞామిమా
పాదైః స్స్పృశ్యతి నో తుర గమచయః శ్రీరుద్రదేవస్య యః
సర్వాశాః పరిపూరయన్ విజయ తే నృత్యేన స భీషయన్
శత్రూన్ యుద్ధమహీతలే ప్రతిదిన విద్రావయన్ మారయన్
అతిరమణశరీరా యే చనీచస్వరాఢ్యా
స్సకలతురగశాస్త్రోద్భాసస ల్లక్షణాఢ్యాః ।
జవభరభరివితాంగాస్సత్వస వన్నగాత్రా
అతిచురతరజీవాః వ చభారస్తురగా

ఇట్టి వైభవములతో తులతూగిన అనుమకొ డ పట్టణము కాకతీయరాజ్యము పతనమైన తరువాత మహోన్నాదుల దుండగములవలనను కాలపురుషుని ప్రభావమువలనను కళ మా సి పో యి దినదినము సన్నగిల్లి ది ఆసఫ్జాహీల కాలమున ఓరుగల్లు సుబాకు అనుమకొండ కేంద్రస్థానమై పూర్వపుఔన్నత్యమును కాకపోయి ను కొంత ప్రాముఖ్యమును గ డి చు కొ న్న ది పూర్వరాజధాని ఉత్తరముఖమున జనావాసము వెలసినది దినదినము తూర్పు పడమరలకు పెరిగినది ఓరుగల్లుమండలమునకు చె దిన సమస్త ప్రభుత్వకార్యాలయములకు కూడలియైనది అన్నివృత్తులకును అన్ని కళలకును చెందిన ఉన్నతవిద్యాకేంద్రములతో దిన దిన ప్రవర్తమానమగుచున్నది ఇటు ఖాజీపేట అటు ఓరుగల్లువరకు బారలుసాచి ప్రగతిపథమున సాగుచున్నది

డా బి. రా

## అనుమగంటి గోత్రము చూ అనుమగల్లు

## అనుమగంటివారు

అనుమగ టి వారి ప్రశంస పల్నాటి వీరచరిత్రమునందు కనిపి చుచున్నది పల్నాటి వీరచరిత్రను శ్రీ నా థు డు మల్లయ్య కొ డయ్య అను వారలు రచించిరి అనుగు రాజు కుమారులగు నలగామునకు మలిదేవునకును దాయభాగమునకై పొడమిన కుటు బకలహము తుదకు యుద్ధమునకు దారి తీసినది పల్నాటి రాజ్యమును రె డుగ విభజించి గురజాల రాజధానిగ నలగాముడును మాచెర్ల రాజధానిగ మలిదేవుడును పాలి చుచు డిరి నలగామునకు మ త్రిణి నాగమ్మ (ఈమెకు నాయకురాలని బిరుదు) మలిదేవునకు మంత్రి శీల బ్రహ్మనాయడు నాయకురాలి కుత త్రములచే జరిగిన కోడిపందెములో ఓడిపోయి బ్రహ్మనాయడును మలిదేవాదులును ఎడు స వత్సరములు రాజ్యము విడిచి మేడపికి (ఇది కర్నూలు జిల్లా మార్కాపురముతాలూకా త్రిపురా తకము ఫిర్కాలో ఉన్నది) వలపోయి గడువుతీరిన ఎమ్మట తమ మాచర్ల రాజ్యమును తిరిగి తమకు అప్పగి పుమని నలగాముని కోరిరి నలగాముడు నాగమ్మ దుర్బోధచే మలిదేవునకు రాజ్యము తిరిగి అప్పగించుటకు అ గీకరి పలేదు నలగాముడు రాయబారిగా వచ్చిన అల్లుని (అలరాజును) చ పెను మేడపిలోనున్న వీరనాయకులు ఈ వార్తవిని మిక్కిలి కుపితులై రి యుద్ధమునగాని తమ రాజ్యము తమకు లభి పదని నిశ్చయి చుకొనిరి ఒక శుభ ముహూర్తమున మలిదేవునికొడుకగు బిరుదు రాజునకు పట్టము గట్టి బాలచంద్రునకు మ త్రిత్వమిచ్చి అనపోతునకు కరణ కార్యము అప్పగి చి వీరనాయకులు యుద్ధమునకు స న్న ద్ధులై రి మలిదేవుడు పురోహితులను పిలిపి చి జయముహూర్తమును పెట్టి చెను తొలిఏకాదశినాడు (ఆషాఢశుక్ల ఏకాదశి) రణభేరివేయించి వీరనాయకులు ఉత్సాహాభరితులై తమతమ పౌరుషములు ప్రకటి చుకొనుచు మేడపిను డి కా ర్య మ పూడియుద్ధర గమునకు బయలుదేరిరి ముందు వెనుకల సైనికులు బారులుతీర్చి నడుచుచు డగా మలిదేవాదులు బ్రహ్మనాయడును పాలకీలనె క్కి కదనమునకు బయల్వెడలిరి

ఈ యుద్ధమునందు మలిదేవాదుల పక్షమున పో రు కు నడచినవారు వీరు అవలవారు అరెమువారు కొ డవీడు వారు గో దువారు మతసానివారు ముయ్యూరువారు నర్మాలవారు నాయనివారు పైడిచు ట్లవారు పాలప ర్తి వారు బలమూరివారు పాలెమువారు రేవనూళ్లవారు రేచర్లవారు అనుమగంటివారు అల్లమువారు అట్లూరివారు మట్లూరివారు అఖ్యలవారు చెవులవారు చిల్లరవారు గ డు వారు వీర దరు యోధవరు ఎ వీరు మిక్కిలి ఉత్సాహముతో సమరమునకు బయల్వెడలిరి

ఈ విధముగ అనుమగంటివారు మహావీరులై కార్యమపూడి సమరా గణమున తమ భుజబలమును బాహుశత్రు వీరులను

తుమమాడినట్లు తెలియుచున్నది. పల్నాటి యుద్ధము క్రీ. శ. 1181-1182 ల మధ్యకాలమున జరిగినట్లు ఊహించుచున్నారు.

తం. అం. శా.

## అనుమడు

అనుమని ప్రశస్తి సిద్ధేశ్వర చరిత్రమునందును సోమదేవ రాజీయమునందును కనవచ్చుచున్నది. కాకతీయరాజులకు ముందు రాజ్యపాలనమునందు ఇతడు ప్రసిద్ధుడై యుండెనని విశదమగుచున్నది. ఆంధ్రదేశమున శ్రీశైలము సుప్రసిద్ధ పుణ్యక్షేత్రము. దీనికి ఉత్తరమున దండకారణ్యము కలదు. ఇది కృష్ణా గౌతమీ మధ్యప్రదేశమున ఉన్నది. ఈ అడవిలో హిడింబాశ్రమము కలదు. ఈ ఆశ్రమమునకు ఈశాన్యమున హనుమద్గిరి అను పర్వతము అలరారుచుండును. ఈ కొండయందు దేవయక్ష గంధర్వసిద్ధ విద్యాధరులు ఎల్లప్పుడు విహరించుచుందురు. దీనిపై మునులు తపము చేయుచుందురు. ఈ పర్వతమునందు సిద్ధయోగి జనసేవితుడై సిద్ధేశుడు నెలకొనియుండును. హనుమద్గిరికి పూర్వభాగమున భద్రేశ్వరియు దక్షిణమున పద్మహస్తుడగు గోపాలమూర్తియు పడమట పద్మాక్షియు ఉత్తరమున గర్గరదేవుడు నిషాదరుద్రేశ్వరియును కలరు. ఇట్లు ఈ పర్వతము పెక్కు దేవతలకు నిలయమై ఉన్నది.

ఎరుకదేవరాజు అను కిరాతకుడు మిక్కిలి శూరుడు. రూపమున మన్మథుని బోలినవాడు. అతడు ఒకసారి తనచారులతో అడవిలో సంచరించుచు హనుమద్గిరికి చేరెను. అది తన నివాసమునకు యోగ్యమగు స్థలమని యెంచి ఆ కిరాతుడు అచటి సిద్ధేశ్వరుని సేవించుచు అచటనే కాపురముండెను. తన భుజబలముచే ఆ ప్రాంతమునకు ఏలికయై ఎరుకదేవరాజు ఉండెను. ఆ ఎరుకదేవరాజు వంశమున కొండడు, అనుమడు, గర్గరేయుడు, కొమ్మకాప్రేడు మొదలగు కొందరు ఎరుకరాజులు జన్మించి హనుమకొండను (నేటి వరంగలు జిల్లా) నూటపది సంవత్సరములకు పైగా పరిపాలించిరి.

అటు తరువాత పద్మాక్షీదేవి వరప్రసాదమున కాకతి రాజులు మిక్కిలి వైభవముతో వేయి సంవత్సరములు ఆ రాజ్యమును పాలించిరి. కాకతి రాజులు ఏకశిలానగరమును నిర్మించియు, కోటలు కట్టించియు, ప్రజలకు ఎన్నియో వసతులు చేకూర్చియు హనుమకొండ రాజ్యమును పాలించిరి.

తం. అం. శా.

## అనుమనగల్లు

అనుమనగల్లు అను గ్రామము నల్లగొండజిల్లా మిరియాలగూడెం తాలూకాలో ఉన్నది. దీనినే అమనగల్లు అనికూడ వ్యవహరించుచుండిరి. ఇది మిరియాలగూడెమునకు పశ్చిమముగ పదునాలుగు మైళ్ళ దూరమున కలదు. ఈ గ్రామమునకు సూర్యాపేట ఏడుమైళ్ళ దూరమున ఉన్నది.

1961 సంవత్సరపు జనాభా లెక్కలను బట్టి ఈ గ్రామము నందలి జనసంఖ్య 2411. బ్రాహ్మణులు, శివార్చకులు, వైశ్యులు, రెడ్లు, ముతరాసులు, తెలగలు, సాలీలు, గొల్లలు, గౌండ్లు, మహమ్మదీయులు కాక సుమారు ఆరువందలమంది మెడ్యూలు జాతివారు ఈ గ్రామమునందు కలరు. స్థానిక ప్రజల ప్రధానవృత్తి వ్యవసాయము. వ్యవసాయముతోపాటు ఇతర వృత్తులనుకూడ ఇచ్చటి ప్రజలు అవలంబించుచున్నారు.

ఈ గ్రామమునగల రామలింగేశ్వరస్వామి ఆలయము సుప్రసిద్ధమైనది. ప్రతి సంవత్సరము ఫాల్గుణ శుద్ధపూర్ణిమకు (ఫిబ్రవరి మార్చి నెలలు) రామలింగేశ్వరస్వామి మూడు దినములు కల్యాణోత్సవములు జరుగును. స్వామిని ఊరేగించి భక్తులు నారికేళ ఫలపుష్పాదులను స్వామివారికి సమర్పించి తమ భక్తిభావమును వెల్లడించుకొందురు. ఈ స్వామికి శివార్చకులు అర్చనమొనర్చి ప్రసాదమును భక్తులకు పంచిపెట్టుచుందురు. మహాశివరాత్రి దినమున స్వామి అభిషేకాదులు జరుగును. ప్రజలు ఇచటి సీతారామస్వామిని హనుమంతుని ముత్యాలమ్మ అను గ్రామదేవతను కూడ పూజించుచుందురు.

అనుమనగల్లు (అమనగల్లు) చరిత్రప్రసిద్ధికెక్కిన గ్రామము. వెలుగోటి వారికిని జటప్రోలు, బొబ్బిలి, ఎరాపురము, మైలవరము మున్నగు సంస్థానములకు మూడు పురుషులని ఖ్యాతిగాంచిన బేతాళనాయకునకిది ముఖ్యపట్టణమని చెప్పుచుందురు. అనుమగంటికి ఉత్తరమున నాలుగుమైళ్ళ దూరమున ఎల్లిమర్తి అను గ్రామముకలదు. ఇదియు కొంతకాలము బేతాళనాయకునకు (చెవ్విరెడ్డికి) రాజధానిగ ఉండెను.

బేతాళనాయకుని మొదటిపేరు చెవ్విరెడ్డి అని తెలియుచున్నది. బేతాళనాయకుడు అనునది పరాక్రమాతిశయముచే ఇతనికేర్పడిన పౌరుషనామము. ఈతడు కాకతి గణపతిదేవ చక్రవర్తి కాలమున ఉండెననియు, ఆ చక్రవర్తిని మెప్పించి ఆయన నుండి కొంతరాజ్యమును పెక్కు బిరుదులను సంపాదించెననియు వెలుగోటివారి వంశచరిత్ర చెప్పుచున్నది.

అమనగ టికి ఎల్లలమర్రికి తూర్పునకాలుగు మైళ్ళ దూరమునఉన్న రెండు పర్వతములపై దుర్గమమైన దుర్గము టి దు బేతాళనాయకుడే ఆ దుర్గమును నిర్మించెననియు అ మ అండు ఖద్రపరచిన ధనము ఇప్పటి నిక్షేపముగా నిలువ లియు అచటి ప్రజల విశ్వాసము

అనుమనగిటి గ్రామమున నివసించుటచేతనే చెవిరెడ్డి (బేతాళనాయకుని) ఎకముపాకు అనుమనగటి గోత్రులుగా పిలువబడినట్లు తెల్లమగుచున్నది పద్మనాయకులు మన్నగువారి బిరుదులో "అమనగటి పురవరాధీశ్వర" అనునది తరచు కానిపించును

తం ఆం శా

## అనుమాంబ

షితాబుఖానుఅను నతడు తన ఇరువదియవ ఎట (క్రీ శ 1470) బహమనీసుల్తానుల సైన్యమునందు ఒక సిపాయిగా చేరెను ఇతని మొదటిపేరు సీతాపతి కాకతీయసామ్రాజ్య పతనముతోపాటు ఓరుగంటి ప్రతిభతగ్గెను కాని షితాబుఖాను బహమనీసుల్తానుల ప్రాపునుపొంది గవర్నరుహోదాతో వరగల్లు పట్టణమును ఆక్రమించెను అప్పటినుండి ఆ పట్టణ శోభ ఇనుమడించెను

ఓరుగల్లుకోటలోని షితాబుఖాను దర్బారుమహాలు అను మందిరమునకు దక్షిణమున శంభునిగుడి ఉన్నది దానిముందు షితాబుఖాను క్రీ శ 1504లో ఒకశిలాశాసనమును వేయించెను ఇందు తన శౌర్యపరాక్రమములను అతిశయోక్తులతో వర్ణించుకొనెను

ఈయన ద్వితీయ మహిషి అనుమాంబయని శాసనము దు తెలుపబడినది ఈమె చిత్తాపుఖానునకు సదా అనుకూలవర్తిని అగుచు అతనిని ఛాయవలె అనుసరించెడిది ఈమెయందు అమరుడు భోగి రాముడు అను ముగ్గురు సుతులు వరుసగా ఉద్భవించిరి

క్రీ శ 1493 ప్రాంతమున గోల్కొండసుల్తానగు కుతుబల్ ముల్కునకును షితాబుఖానునకు జరిగిన సంగ్రామమందు షితాబుఖానుని జ్యేష్ఠపుత్రుడగు అమరుడు మరణించియుండవచ్చునని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు అభిప్రాయమును వెలిబుచ్చిరి

శాసనమునందు ఓరుగల్లును ఏకోపల అని ప్రత్యేకనామముతో ఉదాహరించుట గమనింపదగిన విషయము

కో వెం

అనుమాయికోట చూ ఉత్తరమల్లూరు

## అనూపదేశము

అనూపదేశము సింధునదానదికి ఎగువభాగమున ఉన్నది దీని మాహిష్మతీనగరము రాజధాని "జలప్రాయ మనూపం స్యాత్" అని అమరకోశము చెప్పును అనుగతాః అపః యేషుతే అనుపానామదేశా అని రఘువంశ మహాకావ్యమున చెప్పబడుటచేత ఈ అనూపదేశము అన్నికాలములయందును నీరు సమృద్ధిగా లభించు ప్రదేశమనిగాని లేక నిరంతరము వర్షములు కురియుచుండుటచేత చెమ్మగిలియుండునట్టి ప్రదేశమనిగాని చెప్పనొప్పును రావణాసురుని తన కారాగారమున బంధించినవాడును అవినీతిపరులను శిక్షించువాడును అష్టాదశ ద్వీపములయందు యూపస్తంభములను పాతినవాడును దత్తాత్రేయ వరప్రసాదలబ్ధుడును మహాపరాక్రమోపేతుడును అగు కార్తవీర్యార్జునుడు పూర్వము అనూపదేశమును పాలించెను కార్తవీర్యార్జున వంశీయుడగు ప్రతీపుడను రాజు విదర్భదేశాధిపతి అనుగు చెల్లెలగు ఇందుమతీదేవియొక్క స్వయంవరమునకు వచ్చెనని రఘువంశ కావ్యమున చెప్పబడినది ఈ మహారాజులు వేదపండితులను సేవించెడివాడనియు లక్ష్మీదేవి ఇతనివద్ద స్థిరముగా నివసించి చంచల అను అపవాదమును పోగొట్టుకొనెననియు రఘువంశమున వర్ణింపబడినది పంచపాండవులలో కనిష్ఠుడగు సహదేవుడు దక్షిణ దిగ్విజయ మొనర్చుచు మాహిష్మతీనగరమునకు వచ్చెను అగ్నిదేవుడు తానుపూర్వమానగర ప్రభువుల కొసగిన వరమును బట్టి సహదేవుని సైన్యములను దహించుచుండెను అప్పుడు సహదేవుడు అగ్నిసూక్తములతో అగ్నిదేవుని ప్రసన్నునిచేకొని మాహిష్మతీపురమును జయించి నిషధప్రభువువలన ధనరాసులను కానుకగా గ్రహించినట్లు మహాభారతమున సభాపర్వమున ఉన్నది అనూపదేశమునకు చేదిదేశమని వేరొక పేరు ఉన్నట్లు తెలియుచున్నది ఈ దేశమును శ్రీకృష్ణ విరోధిఅగు శిశుపాలుడు కొంతకాలము పాలించెను పల్నాటి వీరసౌధమునకు ప్రధానస్తంభభూతుడైన అనుగున్నపాలుడు మొదట అనూపదేశమునకు పతియై తన పూర్వుల పాపము లను కడిగివేయుటకు తీర్థయాత్ర లొనర్చుచు పలనాటికి వచ్చి అచ్చట తన రాజ్యమును సుస్థిరమొనర్చుకున్నట్లును

ఆ రాజకుమారులగు నలగామ మలిదేవాదులకు రాజ్య భాగము మిత్తముగా యుద్ధము జరిగినట్లును పల్నాటి వీర చరిత్ర చెప్పుచున్నది

సుమారు నాలుగున్నర శతాబ్దముల కాలము దక్షిణా పథమును పాలించినవారను ఆంధ్రరాజులునగు శాతవాహనుల లో తలమానికమువంటివాడనదగిన గౌతమీపుత్రశాతకర్ణి అను రాజన్యుడు అనూపదేశమును జయించినట్లు " the Early History of Deccan అను గ్రంథమునందలి మొదటిభాగమున కలదు గౌతమీపుత్రశాతకర్ణి క్రీ శ 78 నుండి 102 వరకు రాజ్య మేలెను

ఈయన రాజధాని అమరావతి వద్దనున్న ధాన్యకట కము (నేటిధరణికోట) ఈ మహారాజు తల్లియగు గౌతమీ బాలశ్రీ వేయించిన నాసిక శాసనమువలన గౌతమీపుత్ర శాతకర్ణియొక్క గుణగణములను ఆయన జయించిన దేశము లును మనకు విశదమగుచున్నవి గౌతమీపుత్రశాతకర్ణి మాతృ సేవాపరాయణుడు మూడు సముద్రముల నీరు త్రాగిన సమ రాశ్వములు కలవాడు శక యవన పహ్లవులను జయించి వంశమును నశింపజేసినవాడు వర్ణవ్యవస్థను సక్రమముగ నడి పించినవాడు ఏకధనుర్ధర ఏకబ్రాహ్మణాది బిరుదములు కలవాడని వర్ణింపబడెను ఇతడుజయించినదేశములలో అనూపదేశము/గాడ ఉన్నది ఆదేశముల వివరములు ఇట్లు తెలుపబడినవి (1)అసిక (దీనికి రిషీకమని వేరొక పేరు ఇది అశ్మకదేశమునకు దక్షిణమున కృష్ణాగోదావరీ మధ్యప్రదేశమై ఉన్నది) (2) అసక (ఇదిహైద రాబాదు రాష్ట్రము కు తూర్పు దక్షిణములందున్న ప్రదేశము గోదావరిజిల్లా ఇందు కలదు (3) ములక (పైఠానుకు అంటి యున్న మండలము) (4) సురాష్ట్ర (దీనిని సురఠఅనియు అందురు ఇది నేటి దక్షిణ కథియావాడ అయియున్నది) (5) కుకుర (ఇది తూర్పు రాజపుత్రస్థానము నందలి యొక భాగము) (6) అపరాంత (ఉత్తర కొంకణము ఉత్తర మహా రాష్ట్రము నాసిక కార్లే జిల్లాలు గలిగిన ప్రదేశము) (7) అనూప (నర్మదానదికి ఎగువ ప్రాంతము మాహిష్మతీ నగ రము దానికి రాజధాని) (8) విదర్భ (బీదరు) (9) ఆకర ఇది విదిశానగరముతో గూడిన తూర్పు మాళవదేశము) (10) అవంతి (పశ్చిమ మాళవదేశము దీనికి ఉజ్జయిని రాజధాని ఉజ్జయినికి అవంతి విశాల పుష్పకండిని అని నామాంతరము లుండినట్లు హేమచంద్రకోశము చెప్పుచున్నది ఉజ్జయిని నేటి మాళవ సింథియారాజ్యము నందున్నది ఇది అవంతి నదీతీర మున ఉన్నది అవంతి నదికే శిప్రా అని వేరొక నామము కలదు మోక్షదాయకములగు "అయోధ్య మధుర మాయ కాశి కాంచి అవంతి ద్వారవతి"అనుపట్టణములలో ఉజ్జయిని ఒకటి "నిరక్షదేశాత్ క్షితిషోడశాంశే భవేదవంతీ గణితేన యస్మాత్। తదంతరం షోడశసంగుణ స్యాత్ భూమాన మస్మాత్ బహుతద్యుక్త్యా" అనుభాస్కరాచార్యుల వాక్యమువలన నిరక్షదేశమునుండి (భూమధ్యరేఖ) అవంతివరకు కొలచిన యెడల అది భూపరిమాణమునకు పదునారవవంతు ఉండు ననియు దానికి పదునారురెట్లు చేసినయెడల భూమి ప్రమా ణము వచ్చునని జ్యోతిషికుల అభిప్రాయము దీనినిబట్టి అవంతియొక్క ఉత్తర అక్షాంశము 22½ అంశములు నేటి లెక్కప్రకారము ఉజ్జయిని 23 ఉత్తర అక్షాంశముల మీద ఉన్నది అంశమనగా 70 మైళ్ళదూరము ఉజ్జయిని పూర్వము సంస్కృతప్రాకృతాదిభాషలకు నిలయమై ఉండెను ఈ విధముగా గౌతమీపుత్ర శాతకర్ణి జయించిన దేశముల వివరమేకాక ఆయాదేశముల యందున్న పర్వత ములును ఇట్లు చెప్పబడినవి (1) వింధ్య (తూర్పు వింధ్య ప్రాంతము) (2) అసివత (మాళవదేశమునకు దక్షిణమున ఉన్న వింధ్యపర్వతప్రాంతము) (3) పారియాత్ర (ఆరావళి పశ్చిమ వింధ్యపర్వతముల ప్రాంతము) (4) సహ్యా (పడమటి కనుమలు) (5) కన్హగిరి (దీనికి కన్హేరి అనియు పేరు ఇది మహారాష్ట్రములోని బౌద్ధగుహాలు గలిగిన ప్రదేశము) (6) సిరితానా (దీనిని శ్రీస్థానమనియు అందురు ఇది శ్రీశైలము (7) మలయ (నీలగిరికి దక్షిణమున ఉన్న పడమటికనుమలు) (8) మహేంద్ర మహానదీ గోదావరుల మధ్యమున్న ప్రదేశము ఇది తూర్పుకనుమలలోనిది (9) చకోర (శ్రీశైలప్రాంతము)

దీనినిబట్టి గౌతమీపుత్ర శాతకర్ణి దక్కను నంతటిని మాళవ రాష్ట్రములను రాజస్థానమున కొంత భాగమును పాలించినట్లు తెలియుచున్నది

ఇటు అనూపదేశము వింధ్యపర్వత పఙ్క్తితో సాంద్రా రణ్యములతో రేవా దీనుతల్లితో కనులపండువొనర్చుచు చరిత్రప్రసిద్ధమై బహు పట్టణాద్యలంకృతమై అలరారు చున్నది

శం అం శా

## అన్నంభట్టు – గరికపాటి

అన్నంభట్టు వంశీయులు మొదట తెలంగాణములోని మహబూబునగరు మండలమునందలి అచ్చంపేట తాలూకాలో ఉన్న మామిళ్ళపల్లి అను గ్రామమునందు నివసించిరి. పిమ్మట ఉత్తరమండలము ప్రాంతమునకు వలసపోయిరి. అన్నంభట్టు [illegible] గరికపాటివారు గుంటూరుమండలములోని గరికపాడులో నివసించుటచేత ఆ గ్రామనామమే ఈయనకు గృహనామముగ ఏర్పడినట్లు విశదమగుచున్నది. ఈయన క్రీస్తుశకము పదునారవ శతాబ్దిమధ్యకాలమున ఉండినట్లు స్పష్టపడినది. ఈయన తెలగాణ్యశాఖకు చెందిన ఆంధ్రబ్రాహ్మణుడు. కా[illegible]గోత్రుడు. వీరిది విద్వత్కుటుంబము. వేద శాస్త్ర శ్రౌత సంగీతములకు వీరి వంశము నిలయము.

అన్నంభట్టు తండ్రి తిరుమలభట్టు. తిరుమలాచార్యుడు అనియు ఈయనను వ్యవహరించిరి. ఈయనకు సర్వతోముఖయాజి అను బిరుదము ఉండెను. సంధ్యావందనభాష్యము అను గ్రంథమును ఈయన రచించెను. అన్నంభట్టు తాత మల్లుభట్టు. ఈయనకు అగ్నిహోత్రభట్టు అను బిరుదము ఉండెను. ఆలోకస్ఫూర్తి అను న్యాయగ్రంథమును తత్త్వవివేచనము అను వేదాంత గ్రంథమును మహాభాష్యటీక అను వ్యాకరణ గ్రంథమును ఈయన రచించెను. అన్నంభట్టు ముత్తాత లోకనాథభట్టు. ద్వాదశాహయజ్వ అను బిరుదము ఈయనకు ఉండెను. అన్నంభట్టు అన్న సర్వదేవుడు. అన్నంభట్టు ఆలోకసిద్ధాంజనము గ్రంథమందు "అస్మదగ్రజచరణా" అను వాక్యమున తన అన్నను గౌరవపురస్సరముగ పేర్కొనుటచే సర్వదేవుడను గొప్ప పండితుడని తెలియుచున్నది. అన్నంభట్టు వంశీయులకు మూలపురుషుడు రాఘవ సోమయాజి. ఈయనకు అద్వైతాచార్యుడు అను బిరుదము ఉండెను. ఈ విధముగ గరికపాటి అన్నంభట్టు వంశము మహావిద్వాంసులకు నిలయమై ఎసగినది.

అన్నంభట్టునకు బాల్యమున విద్య అబ్బలేదని చెప్పుదురు. తండ్రి అన్నంభట్టును కోపించి ఇల్లు వీడిపొమ్మనెను. అభిమానవంతుడయిన అన్నంభట్టు వెంటనే గృహమును విడిచి కొండవీటికి పోయెను. అచటి పాఠశాలలో ప్రవేశించి 12 సంవత్సరములు దీక్షతో చదివి ఎనుబదిరెండు ప్రశ్నలు కృష్ణయజుర్వేదమును తర్కమీమాంసావేదాంతశాస్త్రములను [illegible]చెను. పిమ్మట కాశీకిపోయి అచట శేషవీరేశ్వర పండితుని యొద్ద వ్యాకరణశాస్త్రమును చదివెను. ఈ విధముగా అహర్నిశములు శ్రమించి అన్నంభట్టు న్యాయమీమాంసావేదాంతవ్యాకరణశాస్త్రములను కృష్ణయజుర్వేదమును పూర్తిగావించుకొని మహావిద్వాంసుడుగా ప్రసిద్ధికెక్కెను. ఈయన ఏకసంథాగ్రాహి. ఈయన పాండిత్యము అనితరసాధ్యము.

అన్నంభట్టు కాశినుండి తిరిగి తన స్వగ్రామమునకు (ఉత్తూరు వద్దనున్నది) పోయి కొంతకాలమచటనేయుండి తిరిగి కొండవీటికి చేరెను. అచట నొకపాఠశాలను నెలకొల్పెను. అందు విద్యార్థులకు తర్కశాస్త్రమును బోధించుచు గ్రంథరచనము చేయుచుండెను. తర్కశాస్త్రము చదువు విద్యార్థులు క్రమముగా తర్కసంగ్రహము దీపిక ముక్తావళి గదాధరి అను గ్రంథములు చదువవలయునను క్రమమును ఈయనయే నిర్దేశించెను. ఈ క్రమము సమంజసముగా ఉండుటచే ఆసేతుశీతశైలము విద్వాంసులందరును దీనిని నామోదించిరి. తర్కశాస్త్రమును చదువు విద్యార్థులు నాటినుండియు తర్కసంగ్రహముతో శాస్త్రపఠనము ఆరంభించుట పరిపాటి అయ్యెను. అన్నంభట్టు వైదుష్యము క్రమముగా నలుదిక్కులకు తెలిసెను. తుళువవంశదీపకుడైన శ్రీకృష్ణదేవరాయల అల్లుడగు అళియరామరాజు అన్నంభట్టు పాండిత్యమునకు మెచ్చి గుంటూరుమండలమునందలి సత్తెనపల్లి తాలూకాలోని గరికపాడు అను గ్రామమును అన్నంభట్టునకు దానమొసగెను. ఈ దానతామ్రశాసనములు నేటికిని మద్రాసు మ్యూజియమునందున్నవి. అళియరామరాజు సదాశివరాయలు విజయనగరసామ్రాజ్యమును పాలించుచున్నకాలమునందుండెను. సదాశివరాయలకు రామరాజు బాసటయైయుండి తానే రాజ్యమును పాలించుటలో ప్రధానస్థానము ఆక్రమించెను. రాయల పాలన కాలము క్రీస్తుశకము 1542 నుండి 1570 వరకు అగుటచేతను ఆ కాలముననే అళియరామరాజు అన్నంభట్టునకు గరికపాడు దానమొసగుటచేతను అన్నంభట్టు ఉనికి క్రీస్తుశక పదునారవశతాబ్ది మధ్యకాలమని తెల్లమగుచున్నది. అన్నంభట్టు గరికపాడు అగ్రహారమున సుఖజీవనము చేయుచు విద్యార్థులకు తర్కాదిశాస్త్రములను బోధించుచు అనేక గ్రంథములను రచించియుండెను.

ఈయన రచించిన గ్రంథములు ఈయన వేదశాస్త్ర

పాండిత్యమునకు నికషములవంటివి ఈయన గ్రంథములు మొత్తము పదునొకండుకు పైగా కన్పట్టుచున్నవి

న్యాయ గ్రంథములు- (1) తర్కసంగ్రహము (2) తర్కసంగ్రహదీపిక (3) తర్కభాషాతత్త్వబోధిని (4) ఆలోక సిద్ధాంజనము (ఈ గ్రంథము జయదేవుని చే రచితమైన ఆలోక మను తత్త్వచింతామణి టీకకు టీక) (5) సుబుద్ధిమనోహరము (ఇది రఘునాథశిరోమణి యొక్క దీధితి మీది టీక)

మీమాంసా గ్రంథములు- (6) రాణకోజ్జీవని (ఇది భట్టసోమనాథుని రాణకమను టీక దీనికి సుధాసారము- సుబోధిని అని నామాంతరములు) (7) తంత్రవార్తిక టీక

వేదాంత గ్రంథములు- (8) మితాక్షర (ఇది బ్రహ్మసూత్రములపై వృత్తి) (9) తత్త్వవివేచనము

వ్యాకరణ గ్రంథములు- (10) వ్యాకరణ మితాక్షర (ఇది పాణిని అష్టాధ్యాయిపై మిక్కిలి సులభమైన వ్యాఖ్య) (11) భాష్యప్రదీపోద్ద్యోతనము (ఇది కైయటుని ప్రదీపము మీది వ్యాఖ్య)

వేదముపై ఈయన సర్వలక్షణము అను గ్రంథమును రచించెను

తర్కశాస్త్రము ప్రాచీనము నవీనము అని ద్వివిధముగా పేర్కొనబడుచున్నది క్రీస్తుశకము 12 వ శతాబ్దికి పూర్వమున ఉన్నదానికి ప్రాచీనతర్కము అనియు 12 వ శతాబ్దికి తరువాత గంగేశోపాధ్యాయరచిత తత్త్వచింతామణి అను గ్రంథారంభమునుండి ఉన్నదానికి నవీన తర్కమనియు పేర్లు ప్రాచీనతర్కములో ప్రమాణ నిరూపణముచేయక ముందు పదార్థనిరూపణమును చేసిరి ఆరంభమున ఉన్న ప్రమాణ నిరూపణము సుబోధముకాక విద్యార్థులకు ఆ పద్ధతి విసుగు జనింపజేసి తర్కశాస్త్ర పఠనమునందు వారికి విముఖత కలిగించెడిది అన్నంభట్టు తర్కశాస్త్రాభ్యాసకుల క్లేశమును అర్థము చేసికొనెను విద్యార్థులకు సులభముగ బోధపడునట్లు తర్కసంగ్రహమునందు ప్రమేయములను ముందుగనిరూపించి ఆ ప్రమేయ నిరూపణమునకు ప్రమాణములను సాధనముగా గ్రహించెను ప్రాచీన నవీనమతములలో భేదము కలిగినపుడు యుక్తియుక్తముగ ఉన్నదని ప్రాచీనమతమునే గ్రహించెను బుద్ధిచర్చలో గౌతమభావమును ఇతరములను చర్చించుటలో కణాద మహర్షి భావములను ఈయన అనుసరించెను తర్కసంగ్రహమునకు ఈయన వ్రాసిన వ్యాఖ్యయే తర్కదీపిక "టీకాం శిశుహితాం కుర్వే తర్కసంగ్రహ దీపికామ్ (శిశువులకు గూడ సులభమగు విధముగ తర్కసంగ్రహ దీపికను వ్రాయుచున్నాను) అని అన్నంభట్టు గ్రంథారంభమున వ్రాసెను తర్క్యంతే ప్రతిపాద్యంతే ఇతి తర్కాః ద్రవ్యాది పదార్థాస్తేషాం సంగ్రహః సంక్షేపేణ స్వరూపకథనం క్రియత ఇత్యర్థః ఇట్టి రమ్యశైలితో తర్కసంగ్రహదీపిక అలరారుచున్నది

అన్నంభట్టు రచించిన తర్కసంగ్రహ తర్కసంగ్రహదీపికలకు లభించిన ఖ్యాతి వ్యాప్తి ఆయన రచించిన ఇతర గ్రంథములకు చేకూరలేదు తర్కసంగ్రహముపై ఇరవై అయిదు వ్యాఖ్యలును దీపపై పదివ్యాఖ్యలును వెలువడినవి

అన్నంభట్టు తనకు ఏబదిఅయిదు సంవత్సరముల వయస్సు దాటిన పిమ్మట శ్రీశైలమునకు పోయినట్లు తెలియుచున్నది ఈయన నిత్యసంతోషి ఇతరులను ఆశ్రయించుట అన్న ఈయనకు ఏవగింపు గరికపాడు గ్రామదానమును గూడ ఈయన అతికష్టముతో అనిష్టముతో గ్రహించినాడట కాశికి పోయి అచటి మహాపండితులను శాస్త్రవాదముల జయించి అచ్చటి పండితమండలిచే ఈయన బ్రహ్మరథ గౌరవమును పొందెను "కాశీగమన మాత్రేణ నాన్నంభట్టాయతే ద్విజః" (కాశికి పోయినంత మాత్రమున నే బ్రాహ్మణుడు అన్నంభట్టు వంటి ప్రసిద్ధి గలవాడు కాజాలడు గదా) అను ఆభాణమునకు స్థానమైన అన్నంభట్టు కడు ధన్యజీవి

తం. ఆం. శా.

## అన్నచోడవరము

శ్రీనాథమహాకవి భీమేశ్వరపురాణరచనారంభమునకు మంగళాచరణముగా అల్లాడ రెడ్డి కొడుకులగు వేమారెడ్డి యొక్కయు వీరభద్రారెడ్డి యొక్కయు ప్రభావమును ఎడపతన కృతిభర్తయగు బెండపూడి అన్నమంత్రి యొక్కయు వంశావతారమును వర్ణించెను సందర్భవశమున శ్రీనాథుడు ఆ వంశస్థుల కార్యఖడ్గ నిపుణతలను సాహసౌదార్యములను ధర్మనిరతిని పేర్కొనెను బెండపూడి అన్నమంత్రి అన్నయగు లింగన మంత్రిని కవీశ్వరుడు ప్రశంసించెను

లింగన మంత్రి ఇంటిపేరు అరియేటి ఈ మంత్రి పూర్వులకు అరియేటివారు అను పేరు ఏర్పడెను అట్టి పేరు వచ్చుటకు కారణము తత్పూర్వుడగు పోలయ అన్నమంత్రి

అరియేడు లేక అరేడు అను గ్రామమును అగ్రహారముగా పడసి యుండటయే అని తెలియుచున్నది

లింగమంత్రి దువ్వూరి వంశస్థుడు అలాడరెడ్డికి చేదోడు వాదోడుగా ఉండి అతని యుద్ధకార్యములను నిర్వహించు చుండెను లింగనమంత్రి ధీరోదాత్తుడు మంగళాచారుమూర్తి నిర్మల ధర్మమూర్తి నీతి విద్యాబృహస్పతి సంగరసవ్యసాచి అని శ్రీనాథుడు కొనియాడెను అల్లాడరెడ్డి జయించిన ప్రాంతమును శ్రీనాథుడు ఒక సీసపద్యములో వర్ణించెను ఆ జయపరంపరలో అల్లాడరెడ్డికి పిరాగ్రేసరుడయిన లింగనమంత్రి కావించిన తోడ్పాటు కూడ ప్రశంసనీయమైనది అల్లాడరాజుచే లింగనమంత్రి తెలుగుభూమిని ఏలించెను అతనిచే బ్రాహ్మణులకు సర్వస్వామ్యములతో భూములను ధారపోయించెను

లింగమంత్రిని శ్రీనాథుడు నరసింహ కర్ణాటకునితో పోల్చెను లింగమంత్రి ద్వాదశి నాడు బ్రాహ్మణులకు షడ్రసోపేతమయిన భోజనమును సర్వోపచారములతో పెట్టుచుండెడివాడు ఇట్టి గుణగణ విశిష్టుడగు లింగనమంత్రికి ప్రతాపవేమరాజు కోడకుర్తి మహాస్థలమున అన్నచోడవరమను అగ్రహారమును అర్పించెను లింగనమంత్రి ఆ అగ్రహారమును కవి ద్విజ బంధువుల పోషణము కొరకు గ్రహించెనని చెప్పబడినది

ప్రతాపవేమరాజు ఎవ్వరు కోడకుర్తి మహాస్థలము అన్నచోడవరము ఎక్కడివి అను విషయములు విమర్శింప దగినవి

ప్రతాప అనునది బిరుదము ప్రతాపవేమరాజు (క్రీ శ 1400) అలాడరెడ్డి మొదటి కుమారుడు అతడు తన తండ్రియైన అల్లాడరెడ్డికి లింగనమంత్రి యొనర్చిన అమూల్యసాహాయ్యమును పురస్కరించుకొని అన్నచోడవరమను అగ్రహారమును దానమొనరించి యుండెనని ఊహించుట ఉచితము

కోడకుర్తి అనునది తూర్పుగోదావరి జిల్లా అమలాపురం తాలూకాలోని కోడసకుర్రు కావచ్చును అన్నచోడవరము దానికి సమీపమున గల గ్రామము కావచ్చును అన్నచోడవరపు సన్నివేశమును నిర్ణయించుటకు తగిన ఆధారములు లభింపలేదు

గంటి లంకాం

## అన్నదేవచోడుడు

క్రీ శ 1317 మొదలుకొని క్రీ శ 1416 వరకును జయాపజయములకులోనైనను విక్రమపరాక్రమములతో కృష్ణా గోదావరీ మధ్య ప్రదేశమును పాలించిన మహాయోధుడు అన్నదేవచోడుడు

దువచోళులు తెలుగుచోళులలో ఒక శాఖకు చెందిన వారు పూర్వము కడప జిల్లాలోని బద్వేలు సిద్ధవటము కర్నూలు మండలములోని మార్కాపురము మొదలగు ప్రాంతము పొత్తపినాడని పిలువబడినది పొత్తపిచోళుల వంశకర్త దువ భీముడు అన్నదేవచోడుడు ఈ వంశమునకు చెందినవాడు అన్నదేవుని తండ్రి కామరాజు ఇతనికి వేరొక నామధేయము భక్తిరాజు నుండి ఇతని భార్య అన్నెమాంబ

వెలనాడునుండి భక్తిరాజు పూర్వులు తూర్పుతీర ప్రాంతమునకు ఎప్పుడు తరలిరో చెప్పవలను పడదు కాని వీరు కొండవీటిరెడ్డిరాజుల కాలమున పాలించిన దేశములు భీమవోలు మ (పశ్చిమ గోదావరి జిల్లాలోని భీమవర ప్రాంతము) వేగినాడునందున్నవి ఇవి చోడమండలమని ఆనాడు ప్రసిద్ధికెక్కినది భక్తిరాజు మహావీరుడను విషయము ఇతని కుమారుడగు అన్నదేవుడు వేయించిన రాజమహేంద్రవర శాసనము వలన తెలియవచ్చుచున్నది చోడమండలమును ఎట్లయినను తమ రాజ్యమున కలిపివేయుటకు కొండవీటి ప్రభువులు గట్టి ప్రయత్నము చేసిరి రెడ్డిరాజ్య విజృంభణమును వారి అత్యాశలను అరికట్టుటయందు హైహయులు ఉండికులు నిడదవోలు చక్రవర్తులు కొంతవరకు ప్రయత్నించి సఫలులైరి భక్తిరాజు కూడ ఆయా సమయములందు రెడ్డిరాజుల ప్రతిఘటించి వారి ప్రయత్నములను వమ్ము చేసెను భక్తిరాజు మరణానంతరము కొండవీటి ప్రభువుల కోర్కె ఈడేరినది అది ఎట్లన భక్తిరాజుకు వేరొక భార్య వలన భీమలింగరాజను కుమారుడు గలడు ఇతనిని చోడభీముడనియు భీమచోడుడనియు కూడ పిలుతురు రెడ్డిరాజ్యస్థాపకుడైన ప్రోలయవేమారెడ్డి తన రెండవ కుమార్తెను (పేరు తెలియదు) భీమలింగమునకిచ్చి వివాహమొనరించెను తండ్రి మరణానంతరము అన్నదేవుడు పైతృకరాజ్యమునధిష్ఠించి క్రీ శ 1367 లో పట్టాభిషేకము చేసికొనెను భీమలింగన తన బావమరదులగు అనపోతారెడ్డి అనవేమారెడ్డిగారల సహాయముతో తమ్ముడగు అన్నదేవుని ప్రతిఘటించి రాజ్యమును వశపరచుకొనెను అప్పటి

నుండియు అన్నదేవచోడునకు రెడ్డిరాజులు బలవద్విరోధులై రి సమయము దొరికి పుడెల్ల ప్రత్యర్థి తో కూడి అతడు రెడ్డి రాజులను హతమార్చుటకు వేచియుండెను అన్నదేవుడు వివిధ ప్రాంతముల సాహాయ్యముకొరకై తిరుగుచు దేవరకొండ నేలుచున్న పెద్దవేదగిరిని (1384-99) తన రాజ్యము తిరిగి సంపాదించుకొనుట విషయమున సహాయమునకై అర్థించెను

ఇదే సమయమున రెడ్డి పక్షమునమధ్య రాజమహేంద్రవర రాజ్యము విషయమున తగవులేర్పడినవి (రాజమహేంద్రవర రాజ్యము గోదావరీ పూర్వతటమును డి ... పాచల పర్యంతము వ్యాపించియున్నది) కొమరగిరిరెడ్డి ఈ ప్రాంతమునకు తన కుమారుడగు అనపోతారెడ్డిని యౌవరాజ్య పట్టాభిషిక్తునిగ చేసెను కాని అతని అకాలమరణము వలన కొమరగిరి రాజ్యపాలనాధురంధరుడగు తన బావమరది కాటయవేముని రాజమహేంద్రవర పాలకునిగా చేసెను (క్రీ శ 1395) కుమారగిరి రాజ్యము చేయుచుండగా పెద కోమటివేముడు కొండవీటిని క్రీ శ 1402 సంవత్సర ప్రాంతమున ఆక్రమించెను పెద కోమటి వేమారెడ్డి కొమరగిరిరెడ్డికి సన్నిహితజ్ఞాతి అందువలన ఈతనికి రాజమహేంద్రవర రాజ్యము కాటయవేమునికి సంక్రమించుట కన్నెర్రయైనది ఈ తరుణమున అన్నదేవునకు పైతృకరాజ్య సంపాదనయందు పెదకోమటివేమారెడ్డి వలన సాయము కూడ కలుగ వచ్చినది

రాజమహేంద్రవర రాజ్యమును పెద కోమటిరెడ్డికి సంక్రమింపజేయుటకు అతని సహాయార్థమై గొప్ప సేనతో అన్నదేవ చోడుడు ఆధిపత్యము వహించి కళింగము మీదుగ రాజమహేంద్రవరమును ముట్టడించుటకు బయలుదేరెను ఇదివరలో సహాయమర్థించిన దేవరకొండ వెలమ నాయకులు పెదవేదగిరి అతని కుమారుడు మాదానాయకుడు తమ సైన్యములతో అన్నదేవచోడునకు బాసటయై నిలిచిరి తూర్పు చాళుక్యవంశములోని వాడును ఎలమంచిలి పాలకుడును రాజమహేంద్రవర రెడ్డిరాజులకు సామంతుడును అగు విశ్వేశ్వరుడు క్రి శ 1402లో సర్వసిద్ధి (విశాఖపట్నము జిల్లా) వద్ద శత్రుసైన్యమును అడ్డుకొని అన్నదేవచోడుని పరాజితుని చేసినట్లు పంచధారల వద్దగల శాసనము (పంచధారల విశాఖ జిల్లాలోని అనకాపల్లికి 15 మైళ్ల దూరమున ఉన్నది) (దక్షిణ. VI నె 713)పేర్కొనుచున్నది కాని మరల ద్విగుణీకృతమగు సేనలను కూర్చుకొని అన్నదేవుడు కాటయవేముని

నోడించి రాజమహేంద్రవరరాజ్యములోని పెక్కుభూభాగములనుకూడఆక్రమించుకొనినటుల ఈతనిచే వేయబడిన ద్రాక్షారామశాసనము (క్రీ శ 1404) (ద ఖా IV నె 1347 1348) వలన తెలియవచ్చును ఇందు రాజాధిరాజపరమేశ్వర పూర్వపశ్చిమ సముద్రాధీశ్వర ప మహామాహేశ్వర అను బిరుదులు రాజలాంఛనములుగా ధావి వబడి ఇతని ప్రాభవము అధికారమును తెలియపరచును కాని ఇతడు సంపాదించిన రాజమహేంద్రవర రాజ్యభూభాగములను తనస్వాధీనములో పెక్కుకాలము ఉంచుకొనలేకపోయెను తొర్రెపూడి సర్వవరము మధిపూడి అచ్యుతాపురము అను తావులందు కనుగొనబడిన కాటయవేముని శాసనములను బట్టి రాజమహేంద్రవరము మాత్రము అతని అధీనమునందే కలదని తోచును ఇతని రాజ్యము భద్రాచలమునకు ఎగువను గోదావరియందున్న "మోతే" (గోముఖగిరి) అను ద్వీపము నుండి పోలవరమునకు దిగువనున్న పట్టిసగిరి వరకును (గోదావరి పశ్చిమతటము) వ్యాపించియున్నది

ప్రబలశత్రువగు కాటయవేముడు రాజమహేంద్రవర రాజ్యమున ప్రత్యర్థిగ తన ప్రక్కనే మసలుట అన్నదేవునకు రుచించలేదు అందువలన అతనినెట్లయిన తొలగించుటలో కాటయవేమునకు ప్రత్యర్థియగు పెద కోమటి వేముని సహాయమునకై అభ్యర్థించెను ఈ కూటము తనకు గొప్ప ముప్పు తేగలదను విషయము కాటయవేమునకు తెలియును కాగా రేచెర్ల నాయకులు బహమనీసుల్తానును తనకు ప్రబలశత్రువులు అందువలన వీరందరుకలసి ఒకేపెట్టున తన మీదకు రాకుండ అతడు విజయనగరాధీశ్వరుడైన మొదటి దేవరాయలను తనకు సహాయార్థమై వేడుకొనెను దేవరాయలు అందులకు ఒప్పుకొని గొప్ప సైన్యముతో కొండవీటి రాజ్యములోని బాపట్ల ప్రాంతమును ఆక్రమించెను దీనివలన పెదకోమటి వేముడు కాటయవేముని ఎదుర్కొనుటలో కొంత జాప్యము వహించవలసి వచ్చెను

అన్నదేవచోడుడు తన బావయగు వనుండిరాజు పెదకోముడు మున్నగు వారి సహాయముతో గోదావరికి పశ్చిమమున తన రాజ్యమును స్థిరపరచుకొనెను గోదావరిని దాటి తన భూభాగమైన కోనమండలమును అన్నదేవుడు ఆక్రమించుకొనునను భయము కాటయవేమునకు కలిగినది అందువలన గొప్ప సేనలను కూర్చుకొని అన్నదేవునితో

అత్తిలి (పశ్చిమ గోదావరి జిల్లా) వద్ద క్రీ శ 1412 లో యుద్ధము కు తలపడెను అన్నదేవుని సహాయార్థము రాచకొండ దేవరకొండల వెలమనాయకులు బహమనీసుల్తానగు ఫిరోజుషా సైన్యముల ను వేరొ క్క ను డి పెదకోమటిరెడ్డి సైన్యములను కలి కాటయవేముని ఎ రి చినవి రాజమహేంద్రవరపు మ్యూజియమున దలి అన్నదేవచోడుని శాసనమును బట్టి అన్నదేవుడు తన మి తుని (పెదకోమటి వేమారెడ్డి) కాపాడుటకుగాను తన బావయగు ఎనమండిరాజు అధ్యక్షుడుగను కన్నడులు మొదలగు శత్రువులను యజ్ఞపశువులగను చేసి తాళిక వీరయజ్ఞము చేసినట్లు తెలుపుకొనెను ఈ యుద్ధమున దు అన్నదేవుడు విజయమునొందుటయేగాక అత్తిలికోటయ దు ఒక్కుపడిన 10 000 మ ది శత్రుయుద్ధభటులకు ప్రాణ దాన మొస గినట్లు చెప్పబడినది

కాటయవేమునితో జరిపిన స గ్రామములలో కెల్ల కాకరపర్తి (తణుకు తా॥) వద్ద జరిగిన యుద్ధము భీకరమైనది ఈ యుద్ధమున కాటయవేమునకు సహాయార్థమువచ్చిన విజయనగరసేనలు పలాయనమైనవి కాకరపర్తి విజయముతో గోదావరీ దక్షిణప్రాంతమంతయు అన్నదేవుని అధీనమునకు వచ్చెను కాటయవేమారెడ్డి కుటు బము బ ధువులు మిత్రుల పరివారము అన్నదేవునకు ప్రణమిల్లి శరణువేడగా వారలను అన్నదేవుడు బ్రోచెను ఆ రాజన్యునికి "శరణాగత భూప రక్షాదీక్షా గురు" అనెడి బిరుదముకలిగి ట్లు వివరింపబడినది ఈ భూపతి రాజ్యపాలనము లో ప్రజలు సుఖముగా ను డిరనియు భూసుర ప్రీతో ముచే ఇతడు తీర్థయాత్రలు చేయుచు పాలకొల్లునందలి క్షీరారామేశ్వర (శ్రీ)మన్మహాదేవరకు తలిద డ్రుల పేర క్రీ శ 1416 లో భూదా ము చేసెనని తెలియుచున్నది

కాటయవేముడు క్రీ శ 1414 ప్రాంతమున పెదకోమటి అనుయాయులగు కొప్పుల నాయకులతో జరిగిన యుద్ధములందు మరణి చియుండవచ్చునని చారిత్రకులు ఊహి చిరి కొప్పుల నాయకులు పెదకోమటి వేమునకు విశ్వసనీయులగు సామంతులు కొప్పుల నాయకులలో అగ్రగణ్యుడైన గజ్జారావుతిప్ప (గజరావుతిప్ప నాయనంగారు) ని వలన కాటయవేముడు హతుడై నటుల మెక జీ వ్రాత ప్రతుల సంకలనమువలన తెలియవచ్చుచున్నది కొప్పులవ శమువారు కాటయవేముని "తలగొండు గండ" యను బిరుదమును తదాదిగా వహించియుండిరి

కాటయవేముని మరణముతో అన్నదేవచోడునకు మనః స్థిమితములేనట్లు తోచును కాటయవేముని బ ధువగు అల్లాడరెడ్డి కాటయవేముని పుత్రుడగు కొమరగిరి పక్షమున రాజ్యాధికారమునూని అన్నదేవచోడుని ఎదుర్కొనెను ఆ రణము న కొమరగిరి మరణి చెను అల్లాడరెడ్డి అప్పటి పోరుమానక అన్నదేవుని క్రీ శ 1416 వ స వత్సరమున సమరమున చ పి ట్లు తెలియుచున్నది

అన్నదేవుని రాజమహేంద్రవర శాసనమును పరిశీలించిన యొకల ఒక విధముగా దీనిని ఆయన ఆత్మకథగా పరిగణి పనగును శాసనమువేయు సందర్భము తన తల్లిదండ్రులకు పుణ్యముగా వీరనాడు రాజ్యము లోనిదియు (గోదావరి ప్రాంతము) గోదావరి-విన్నసాని స గమమునకు చేరువగాను పల్లూరిసీలవరమునకు దక్షిణముగాను ఉన్న అన్నదేవవరఅగ్రహారమును అన్నదేవుడు బ్రాహ్మణులకు దానము చేసెను ఇందు శాసనకాలము చెప్పబడలేదు కాని కాకరపర్తి యుద్ధమునందు జయపరంపరలనందుకొని ఇతడు విజయసూచకముగా బ్రాహ్మణులకు గ్రామ దానము చేయు సందర్భమును బట్టి కా రప ర్తి యుద్ధాన తరమే ఈ శాసనము వేయబడియు డునని భావి పనగును శాసనము సరస్వతి వరాహ గణేశ చ ద్ర సూర్యక్షేత్రపాలుర ధ్యానశ్లోకములతో ప్రారంభమగును తరువాత తన వ శోత్పత్తి త డ్రి భక్తిరాజు జీవితమునకు సంబ ధించిన అనేక విశేషములు ఉదాహృతములై నవి గౌతమీతటము దలి కాకరపర్తి వద్ద తనకును కాటయవేమునకును జరిగిన యుద్ధమున దు తురుష్కసేనలు తనకు సహాయముగా నిలిచినట్లు ఇతడు చెప్పుకొనెను యుద్ధానంతరము కాటయవేముని కుటు బము ఇతని పాదాక్రాంతము కాగా వారిని రక్షించుట మొదలగు విషయములు ఇతని శాసనమునందు వర్ణితము లై నవి ఇతడు శివపూజాదురంధరుడు ఇతడు శివుని ప్రతినిత్యమును ఆరు పర్యాయములు కొలిచి బ్రాహ్మణ సమారాధన చేసెడివాడు పట్టిసమునందలి వీరభద్రేశ్వరాలయమునకును గోముఖగిరి ద్రాక్షారామ భీమేశ్వరాలయములకును ఇతడు బంగారుకలశముల నెత్తి చెను వీరభద్రేశ్వరుని సమక్షమందు గోసహస్ర స ప్తసాగర వారణ్యమేరు దానముల చేసెను

పిన ఉండిరాజు సోదరి అగు ఇరుగాంబను అన్నదేవచోడుడు పెండ్లియాడి ఆమె వలన వీరభద్రుడను కుమారుని కనెను యుక్తవయస్కుడగుటతోడనే వీరభద్రుడు తండ్రితో

వెంటన టి అనే యుద్ధముల దు వీరోచితముగ పాల్గొనెను శ్రీ నా థు డు భీమేశ్వరపురాణమ దలి అవతారికయ దు అన్నదేవచోడని అతని కుమారుడగు వీరభద్రుని రణరంగమున అల్లాడ భూ భుడు చ పెనని వ్రాసియున్నాడు

అన్నదేవునకు తూర గోదావరి జిలా రాజమహేంద్రవర తాలూకాయందు మురమ డ పోలవరము చోడవరము తాలూకాలోని రామగిరి (రామవరము) దుర్గము ప్రధాన రాజధానీ నగరములుగ ను డెడివని చారిత్రకుల అభిప్రాయము ప్రస్తుతము ఈ గ్రామములు గవర్నమెంటువారు ప్రచురించిన గ్రామముల పట్టి లో కన్పి చవు

మురమండ పోలవరము సకలైశ్వర్యములతో ఒప్పు చుండెను ఇచట అన్నదేవుడు ఎడు అ తస్తులుగల గొప్ప దేవాలయమును నిర్మి చెను

వనదుర్గము మ గిరిదుర్గమ ను అయిన రామగిరి దుర్గము రాజమహే ద్రవరమ కు 0 మైళ్ళ దూరమున కలదని రెడ్డి సంచిక య దు చె ప్పబడినది ఇచట ప్రాచీన ఘనతను చాటు అనేక చిహ్నములు కలవు అన్నదేవుడు దీనినే ముఖ్యపట్టణ ముగా చేసికొని రెడ్ల ప్రక్కలో బల్లెమై అనేక సార్లు వీరల నోడించినట్లు లోకలు రికార్డులలో కలదు

మెక జీదొర సంపాది చిన శాసన సంపుటములందు అన్నదేవునికి చెందిన విశేషాంశములు కొన్ని పొందు పరుప బడి వి ఒక శాసనము రాజమహేంద్రవరములోని కోటదొడ్డి గుమ్మం వెలుపల గోదావరికి సమీ మున భూమిలో పూడి యు న్నది ఈ శాసనమునందు అన్నదేవచోడుడు అన్నదేవ పాలుడుగా వ్యవహరింపబడినాడు ఇదివరకు భక్తిరాజు భార్య ఒక్క అన్నెమా బ అనియే చెప్పబడినది వేరొక భార్యవలన భీమచోడుడు జనించెనని విశ్వసి పబడెను ప్రస్తుత శాసనపార మును అనుసరించి చో అన్నదేవుని మాతృదేవిని గూర్చియు ఆమె మాతామహులను గురి చియు తెలియగలదు నిరవద్య పుర (నిడదవోలు) చక్రవైరా కురమైన చాళు క్య నారా యణ బిరుదుగల ఎన్నుండి చోడరాజుగారి కుమారుడైన నాగరాజునకును అతని భార్య లక్ష్మీదే మ్మగారికిని ఉదయి చిన కళానిధి అయిన కుమారిక వీరమదేవమ్మగారు ఆమెకు అన్న దేవపాలు డు జన్మించెను దీనిని బట్టి అన్నదేవుని సవతి అన్న యగు భీమచోడుని తల్లి అన్నెమా బ అనిరూఢిగా చెప్పగలము

గండభేరుండ రాయవేశ్యాభుజంగరవికులతిలక రాజ పరమేశ్వర రూపనారాయణ అప్రతిసింహాసనాధీశ్వర ప్రబల ప్రతిష్ఠాపనాచార్య శరణాగతవజ్ర పంజర దేవ బ్రాహ్మణ పరిపాలన విస్తారిత సామ్రాజ్య అను బిరుదులు కలవాడుగా శాసనమున దు అన్నదేవుడు ప్రశంసి పబడినాడు

అన్నదేవుని కులదైవతము ఎట్టి వీభద్రుడు అతని సమక్షమున మర్పించిన దాన వివరములు ఇదివరలో చెప్ప బడినవి ప్రస్తుత శాసనము కూడ తాను రామవరము పట్టణ మున దు పట్టాభిషిక్తుడగు సమయమున గృహాగతులైన మహా జనుల ఎదుట తన వి స్తృత రాజ్య భూభాగము దలి అనేక అ గ్ర హా ర ము ల ను పట్టిసవీరభద్రునికి ప్రీతిగా ఇచ్చి వేయించిన శాసనకాలము ఇతరాధారముల వలన మనకు తెలిసిన అన్నదేవచోడుని కాలముతో సరిపడుట లేదు

ఇది శా క 1259 అగు నేటి పరాభవ స వత్సర ఆశ్వ యుజ శుక్ల దశమినాడు వేయి చిన శా నము దీనికి క్రీ శ 1 37 సంవత్సరము సరిఅగును వేరొకచో త ద్విమరణాన తరము క్రీ శ 1 67 లో అన్నదేవుడు పట్టాభిషిక్తుడయ్యెనను విషయ ము తెలుపబడి ది దీనిని బట్టి ఏర్పడుచు న్న ముప్పది సంవ త్స రముల వ్యవధి శాసన లేఖకుని ప్రమాదమై యుండవలయును లేక శా నము సకల వ్రాయుట యందైనను ఈ లోపము జరగియుండవలయును

ఎస్ వే

కా వెం

## అన్నదేవపాలుడు అన్నదేవచోడుడు

## అన్నదేవరపేట

అ న్నదే రపేట పశి మగోదావరిజిల్లా కొవ్వూరు తాలూకాలో ఉన్నది దీనికి 20 మైళ్ళ దూరములో రాజ మహేంద్రవరపట్టణము ఉన్నది దీని అక్ష శము 16 17 రేఖాంశము 8 8 ఈ గ్రామమునకు తూర్పున గజ్జరం పడమట చిట్యాల శివోలు ఉత్తరమున తుపాకులగూడెం దక్షిణమున తిరుగుడుమెట్ట వెంకటాయపాలెం పట్యాల సరిహద్దులు దీని వి స్తీర్ణము 5 000 ఎకరములు ఇది సార వంతమైన మెరకప్రదేశము ఇచట 60 అ ఎత్తుగల షెత్రం పిల్లెమ్మమెట్ట 200 అ ఎత్తుగల గాజులమెట్ట ఉన్నవి వీటపై జీడిమామిడి తోటలుకలవు అచ టచ్చట సద్దరాయికూడ కలదు రెండులంకలు నీటిరావిడికి కోతపడి నిరుపయోగముగా ఉన్నవి

ఈ గ్రామములో 1931 స లో 3100 మ ది 1941 సం॥ లో 3500 మ ది 1951 స లో 4200 మ ది 1961 సం॥ లో 5 038 మ ది జనులు ఉ డిరి వీరిలో షెడ్యూలు జాతులవారు 1627 మ ది షెడ్యూలు తెగలవారు 40 మ ది 1951 స ను డి 1961 స వరకు జనాభాలో పెరుగుదల 858 ఈ పెరుగుదలకు స తానాభివృద్ధియే కారణము

ఇచ్చట ఇ డ్లు ఒకచో గు పుగను సూరయ్యపేట శివారుగను ఒకచో వలయాకారముగను ఉన్నవి వీటిలో 120 పె కుటి డ్లు 20 కా క్రీటు కప్పుగల ఇ డ్లు నాలుగు ఒక అ తస్తుగల మేడలు ఒక ఎక్కువ అంతస్తులుగల భవనము జనులు వరి అన్నము నుతి దురు నూతినీటిని త్రాగుదురు మంచినీటి ఎద్దడికలదు

ఇచ్చట కొవ్వూరుకాలువ రాజుచెరువు పెదబ గారమ్మ చెరువు బావులు కలవు 1966 67 సం లో వ టల క్రి ద 2800 ఎకరముల భూమి ఉపయోగపడినది చెరువు క్రింద 120 ఎకరముల భూమి బావుల క్రి ద 80 ఎకరముల భూమి సాగుబడి అయెను 8 ఆయిల్ ఇ జనులు 6 ఎలెక్ట్రిక్ మోటారులు 80 ఎకరములకు నీటిసరఫరాయిచేసెను బుడమ మిర్చి వర్జీనియాపొగాకు కొత్తరకం అముద వరి వంటలువ డెను వర్జీనియా క పెనీలు పొగాకును కొనెను మిర్చి లారీలమీద రాజమ డ్రి ఏలూరులకు రవాణాచే రి 850 ఎకరముల మామిడితోటలు 900 ఎకరముల జీడిమామిడి తోటలు ఉన్నవి మామిడికాయలలో జీడిమామిడికాయలలో 25 శాతము గ్రామస్థులు ఉపయోగించుకొని 75 శాతము ఏలూరు తాడేపల్లిగూడెములకు రవాణాచే రి ఇక్కడ 1100 ఎకరముల నల్లరేగడినేల 2000 ఎకరముల ఇసుకనేల 830 ఎ రముల ఎర్రచెక్కనేల 1000 ఎకరముల రాతిప్రదేశము 70 ఎ రముల పుల్లకనేల కలవు

ఈ గ్రామమున 900 ఆవులు 1200 గేదెలు 1100 ఎద్దులు 20 ఆబోతులు 12 గుర్రములు 4000 మే లు 2000 గొర్రెలు 1200 ప దులు 1600 కోళ్లు ఉండెను పాలు వెన్న మా సము గ్రుడ్లు స్థానికులే వాడుకొనిరి

వ్యవసాయము కూలి ఈ గ్రామస్థుల ముఖ్యవృత్తులు నల్గురు కమీషన్ ఏజె ట్లు 18 మ ది దుకాణాదారులు ఇద్దరు క్రయవిక్రయదారులు నల్గురు జట్కాలు తోలువారు 30 మంది ఎద్దుబ డ్లు తోలువారు ఎడుగురు క సాలులు 8మ ది వడ్ర గులు ఇద్దరు కమ్మరులు ఎదుగురు కుమ్మరులు 10మంది తాపీమేస్త్రులు ఇద్దరు తెలికలవారు 30మ ది మ గలివారు 40మ ది చా లివారు గొల్లలు వడ్డెరలు ఉ డిరి ఒకవడ్లమర 5 000 టన్నుల బియ్యమును గ్రామస్థుల అవ రములకు తయారుచేసెను వ్యవసాయదారులకు కూలీలు దొరకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 2 50/- స్త్రీకి రు 2 లు

ఇచ్చట సీతారామ గమేశ్వరస్వాముల దేవాలయములు బంగారుపా మ్మగుడి చర్చి ఉన్నవి దేవాలయములకు 30 ఎకరముల భూమికలదు బ గారమ్మ తీర్థము జరుగును

ఈ గ్రామమునకు 17 మైళ్ళ దూరములో కొవ్వూరు రైల్వేస్టేషను కలదు కొవ్వాడకాలువ ఉన్నది కాని అది రవాణాలకు ఉపయోగపడదు కొన్ని ప్రభుత్వపు బస్సులు కొవ్వూరునుండి జంగారెడిగూడెమునకు పోవును ఇచ్చట ఒక కంకరరోడ్డు 4 కచ్చారోడ్లు ఉన్నవి ప్రయాణములకు 4 గుర్రపుబ డ్లు 12 రిక్షాలు 2 కార్లు 80 రె డెడ్లబండ్లు 180 సైకిళ్లు ఉపయోగపడెను

ఈ గ్రామమున బ్రాంచిపోస్టాఫీసు టెలిఫోను ఎలిమె టరీస్కూలు హైస్కూలు ఉన్నవి హైస్కూలు చదువులకు 100 మంది విద్యార్థులు రాగోలపల్లి పోచవరం గజ్జరం భీమోలు చిట్యాల వె టాయపాలె గ్రామముల ను డి ఇచ్చటకు వచ్చిరి విద్యుచ్ఛక్తిని 100 ఇండ్లు ఎలెక్ట్రిక్ మోటారులు వాడుకొనెను

ఇది ప చాయతీపాలన కల గ్రామము పంచాయతీ గ్ర థాలయము రేడియో లౌడ్‌స్పీకరు త్ర ఉ న్నవి కో ఆపరేటివ్ బ్యాంకు 1350 మ ది రు 766 376 లు అప్పుగా ఇచ్చినది ప్రైవేటుగా అప్పు లిచ్చువారుకూడ కలరు రూరల్ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి - బ్రా చి ప్రథమ చికిత్సాకే ద్రము ఇచట కలవు ముగ్గురు ఇంగ్లీషువైద్యులు ముగ్గురు ఆయుర్వేదవైద్యులు ఇద్దరు నాటువైద్యులుకలరు. ఇచ్చటి ఆదివారపుస తలో కూరలు దొరుకను 11 కిరాణా దుకాణములు 5 కాఫీహోటళ్లు 8 కిళ్ళీ సోడా సిగరెట్టు దుకాణములు 6 సైకిళ్లషాపులుకూడ ఉన్నవి కొవ్వాడ కాలువపై వ తెనకలదు

ఇక్కడకు 4 మైళ్ళ దూరములోనున్న వేగేశ్వరపురములో తపాలకార్యాలయము రిజిష్ట్రారు ఆఫీసు 7 మైళ్ళలోనున్న గోపాలపురములో బాకు అభివృద్ధికేంద్రము 17 మైళ్ళలో ఉన్న కొవ్వూరులో కోర్టులు పోలీసుస్టేషను తాలూకాకచేరీలు ఉన్నవి కళాశాల చదువులకు గ్రామ విద్యార్థులు ఏలూరు విజయవాడలకు పోవలెను

మా శ్రీ
కె సు

**అన్నదేవేంద్రుడు** చూ అన్నదేవచోడుడు

## అన్నపూర్ణాదేవి

శ్రీ కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదాకృత్యాది యందగల "అవితథ తర బంధురావలయము బూని తీవ్ర రహిమై తిరుమల్దేవియును నన్నపూర్ణాదేవియు కమలాబ్జముఖయు దేవరులు గాన్" అనుపద్యముకలదు ఈ పద్యములోని కమలాబ్జముఖయు అనుదానికి మలాబ్జముఖులు అను పాఠాంతరము కలదు ఈ పాఠమును బట్టి కొందరు ఆముక్తమాల్యదా రచన నాటికి శ్రీకృష్ణదేవరాయలకు తిరుమలదేవి అన్నపూర్ణాదేవి కమలాదేవి అబ్జముఖిదేవి అను నలుగురు భార్యలు ఉన్నట్లు అర్థము చెప్పిరి కొందరు కమలాబ్జముఖులు అనునది తిరుమలదేవికిని అన్నపూర్ణాదేవికిని విశేషణములనియు తిరుమలదేవి కమలముఖి అనియు అన్నపూర్ణాదేవి అబ్జముఖి (చంద్రవదన) అనియు అభిప్రాయపడిరి అబ్జముఖి అనగా చంద్రవదన అనక పద్మముఖియే అను అర్థము చెప్పవలెనయు చంద్రవదన అని చెప్పుటయే కవి భావమైనచో కమలేందుముఖులు అనిచెప్పి ఉండును అయు కొందరనిరి చేకుమళ్ళ అచ్యుతరావుగారు కమలాబ్జముఖులు అను పాఠమే సరియైనదనియు అన్నపూర్ణాదేవి అను చంద్రవదన వలన తిరుమలదేవి కమలముఖ అయ్యెనని కవి సూచె చెసియు యానవతి అగు అన్నపూర్ణరాకచే సవతియగు తిరుమలదేవి ముఖము ముకుళించుట సహజము కావున కవి నిగూఢముగా అట్లు చెప్పెనయు అభిప్రాయపడిరి వేదము వెంకటరాయశాస్త్రి వారు కమలాబ్జముఖయు అను పాఠమును గ్రహించి దానికి కమల అనియొడి కమలనఖ లేక చంద్రవదన అని అర్థము చెప్పిరి ఈ శాస్త్రిల వారి వ్యాఖ్యానుసారముగా రాయలకు అప్పటికి తిరుమలదేవి అన్నపూర్ణాదేవి కమలాదేవి అను ముగ్గురు భార్యలు ఉండిరని తెలుచున్నది ఈ పక్షములో చిన్నాదేవితో కలిసి రాయలకు నల్గురు భార్యలను న్యూనిజు వ్రాతతో సరిపోవుచున్నది

ఆముక్తమాల్యద యందలి ఈ అన్నపూర్ణాదేవి ఎవ్వరను విషయము మర్మయము అన్నపూర్ణాదేవి అను ది చిన్నాదేవియొక్క నామాంతరము అనుటకును జనము కాదు అనేక శాసనములలో కావ్యములలో ఖ్యాతితో చిన్నాదేవినామము ఉదాహృతమైనది ఆమెనామము మూర్చి ఆముక్తమాల్యదలో అన్నపూర్ణాదేవి అను క్రొత్తనామము చేర్పబడుటకు కారణము కనిపించదు ఆముక్తమాల్యదా రచన నాటికి చిన్నాదేవి కాలధర్మము నొందినది కావున అన్నపూర్ణాదేవియే చిన్నాదేవి యనుట తగదు గజపతి పుత్రియే అన్నపూర్ణాదేవి అని కొందరి తలపు ఓఢ్రభాషలోగల అనేక చారిత్రిక గ్రంథములందు ఈమెపేరు అన్నపూర్ణాదేవి అనియే ఉన్నట్లు తెలియవచ్చు చున్నది ఈమెపేరు లక్ష్మీదేవి అని ఒకరు వాదించిరి రాయవాచకాది గ్రంథములలో చెప్పబడని అన్నపూర్ణాదేవి అను పేరు ఆముక్తమాల్యదలో కవిచే ఉపయోగించబడెను అనుటకు అవకాశము లేదు కొందరు తక్కిన ముగ్గురి నామములు బాగుగాలేవని కృష్ణదేవరాయలు అన్నపూర్ణాదేవి అను నామము పెట్టెను అనుటయు కలదు కమలాబ్జముఖులు అను పాఠానుసారము అన్నపూర్ణాదేవిని గజపతి పుత్రికగా భావింపవలయును అని కొందరు అందురు అది సత్యమైనచో న్యూనిజు వ్రాత అసత్యమైపోవును తగిన ప్రబల సాక్ష్యము చేకూరు వరకు గజపతికుమార్తెనామము లక్ష్మీదేవి అనియే ఒప్పుకొని అన్నపూర్ణాదేవి కృష్ణరాయల నాలుగవ భార్య అని తలచుట యుక్తము అని చాగంటి శేషయ్యగారి ఆశయము

అన్నపూర్ణాదేవి ఏరాజు కూతురో ఆమె వివాహము ఎప్పుడు జరిగెనో తెలియదు కొండమరుసయ్య శాసనమునకు (1517 డిసెంబరు ఒకటవతేది) ఎమ్మటను ఆముక్తమాల్యదా రచనముకు పూర్వమునను ఈమె వివాహము జరిగియుండును అని ఊహింపబడినది ఇంతకు మించి అన్నపూర్ణాదేవిని గూర్చిన వివరములు తెలియవు పోర్చుగీసు దేశీయుడైన పేయస్ అను నాతడు చరిత్ర వ్రాయునప్పటికి అన్నపూర్ణాదేవి వివాహము జరిగి ఉండదు అందుచేతనే అతడు రాయలకు ముప్పురు భార్యలు అని వ్రాసియుండను చిన్నాదేవి తప్ప తక్కిన భార్యలు ముప్పురను కృష్ణరాయల అనంతరము వరకు జీవించి ఉన్నట్లు తెలియవచ్చుచున్నది వారి తరువాతి వృత్తాంతముగాని వారు గతించినకాలముగాని తెలియదు వారు దానముచేసి వ్రాయించిన శాసనములును కనిపించవు

గ ల శ్రీం

## అన్నభూనాథుడు

ప్రాగాంధ్రతీరమున చరిత్రకెక్కి క్షత్రియవంశములలో పూసపాటివారు ప్రముఖులు. వీరి మూలపురుషుడు మాధవవర్మ. ఇతడు బెజవాడ కనకదుర్గకరుణచే వైభవోపేతుడయ్యెను.

మాధవవర్మ పేరు నుండియే విష్ణుకుండిన ప్రభువైన మాధవవర్మ స్మరణమునకు వచ్చును. తూర్పు చాళుక్యులే విష్ణుకుండినులను రాజీతులనుజేసి తమరాజ్యమును క్రీ శ 624 లో తీరాంధ్రమున స్థాపించుకొనిరి. క్రీ శ 1600 ప్రాంతమున పూసపాటి తమ్మభూపాలుడనురాజకవి తన శ్రీకృష్ణవిజయమున వంశానుకీర్తనము చేయుచు మూలపురుషుడైన మాధవవర్మ నిట్లు నుతిచెను

గీ. శాలివాహన సుశకవర్షముల సంఖ్య
యరయ నేనూట పదునాలుగైనవాడు
ధర్మనిరతికి మాధవవర్మ మెచ్చి
కనకవర్షంబు గురిసె బెజవాడ కదుర్గ (1 98)

శా శ 514 (క్రీ శ 592) లో మాధవవర్మ ధర్మపరతకు మెచ్చి కనకదుర్గ కనకవర్షము గురిపించెనట. బెజవాడ మల్లేశ్వరస్వామి దేవాలయమున గల పల్లికేతని శాసనమున

శ్రీమచ్చాళుకాబ్ధేర్షి శశిసాయక మ్మితే
రాజా మాధవర్మా భూద్విఖ్యాతో ధరణీతలే॥

అను శ్లోకమునందు చెప్పబడినకాలముతో ఈ కాలము సరిపోవుచున్నది. ఈ పల్లికేతనిశాసనమునకు కాలములేదుగాని క్రీ శ 11 వ శతాబ్దిది కాదగునుట కవకాశము కలదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు భారతి పత్రిక (మాధవవర్మ అతని సంతతి జూన్ 1939 పుట 12) లో వ్రాసియున్నారు.

విష్ణుకుండిన మాధవవర్మ కాలమునకీ కాలము సరిపోవుటచే పూసపాటి మాధవవర్మయే విష్ణుకుండిన మాధవవర్మ యగునని శ్రీ శర్మగారూహించియున్నారు. విష్ణుకుండినులు వేదధర్మావలంబకులు కర్మానుష్ఠానపరులు. ఈ పావనవంశమున జన్మించినవాడే అన్నభూనాథుడు. తండ్రి కృష్ణరాయడు. తల్లి ఎల్లమాంబ. కటకకర్ణాట భూకాంతుల సభలో పూజ్యత నొందినవాడని తెలియుటచే ఇటు గజపతులకును అటు విజయనగర సార్వభౌములకును ప్రీతిపాత్రుడని చెప్పవచ్చును. ఈ కాలమునకు విజయనగర ప్రాభవము మిక్కిలి సన్నగిల్లినది. ఓఢ్రదేశము లిశారుహామన్నె భూపతుల నీతడు సామంతునుగా చేకొనెనట. ఇతనిగూర్చి చారిత్రక విషయము లింకనిచరిత్రమున కానరావు. శ్రీకృష్ణవిజయ కావ్యకర్తయైన పూసపాటి మహీపాలుడు ఈ అన్నభూనాథుని స్వకుమనుమడగుటచే ఇతనకును మనుమడగుచున్నాడు. తమ్మభూపాలుడు క్రీ శ 1605 ప్రాంతమున మొగలితుర్రు దురాధ్యక్షుడగా నుండినట్లు చెప్పబడినది. కావున అన్నభూపాలుడు క్రీ శ 1575 ప్రాంతమువాడగును.

ఈ వంశమున అన్నభూపాలురు పలువురుగలరు. వారు కేవలము నామమాత్రులుగ కన్పట్టుచున్నారు.

నిశ్రీ మం

## అన్నమంత్రి - బెండపూడి - I

బెండపూడి అన్నామాత్యులు చారిత్రకముగ ప్రసిద్ధికెక్కినవారు మనకు ఇరువురు కనవచ్చుచున్నారు. మొదటి అన్నామాత్యుడు కాకతీయరాజన్యులలో కడపటివాడగు ప్రతాపరుద్రదేవుని యొద్ద (క్రీ శ 1296 1323) మంత్రిగను గజసైన్యాధ్యక్షుడుగను ఉండెను. రెండవ అన్నామాత్యుడు రాజమహేంద్రవరరాజ్యాధిపతియగు వీరభద్రారెడ్డి కడ అమాత్యుడై నెగడినవాడు. వీరిరువురిలో మొదటి అన్నామాత్యుకు పౌత్రుడే రెండవ అన్నామాత్యుడగుట మిక్కిలి విశేషము.

### అన్నామాత్యుడు బెండపూడి I II

భీమేశ్వరపురాణము ప్రథమాశ్వాసములోని 45 59 పద్యముల ఆధారముతో బెండపూడి వారి వంశవృతము ఈ దిగువన రూపొందింపబడినది



బెండపూడి అనుగ్రామము తూర్పుగోదావరీమండలములోని తునితాలూకాలో ఉన్నది గ్రామనామమే సాధారణముగ గృహనామమగుట మనకు సంప్రదాయసిద్ధమైన విషయము బహుశః అన్నామాత్యునకు పూర్వులు వారి నివాసస్థలము బెండపూడి అయియుండెనేమో! బెండపూడి వారిది కాశ్యప గోత్రము వీరు నియోగిశాఖకు చెందిన బ్రాహ్మణులు

మొదటి బెండపూడి అన్నామాత్యుని తండ్రి పోలమంత్రి అన్నామాత్యునకు అల్లాడామాత్యుడను అగ్రజుండు కలడు అతడు కాకతీయ శ్రీవీరప్రతాపరుద్రచక్రవర్తి యొక్క రాజ్యభారధురంధరులలో ఒకడు శ్రీనాథమహాకవి భీమఖండమను నొకకృతిని రచించి ఈ మొదటి అన్నామాత్యుని మనుమడును రాజమహేంద్రవర రాజ్యపాలకుడగు అల్లయ వీరభద్రారెడ్డికి సచివోత్తముడునగు రెండవ అన్నయమంత్రికి అంకితమొనరెను శ్రీనాథుడు భీమఖండపీఠిలో ఒక పద్యమున మొదటి అన్నామాత్యుని ఇట్లు స్తుతించెను

సీ॥ కాకతిక్ష్మాపాలగంధదంతావళ
　　ధ్వజినీమహాధురంధరుండనంగ
వలతుకోదండనాథ రాజ్యాబ్ధి
　　సంపూర్ణపూర్ణిమాచంద్రుండనంగ
సంధిభూమండలాధ్యక్షసంహాసన
　　సంస్థాపనాచార్యుండనంగ
వీరరుద్రాశేష విశ్వంభరాధీశ
　　పృథులదక్షిణభుజాపీఠమనంగ
తే॥ యవనసంహారవిలయకాలాగ్ని యనంగ
　　ధాటిఘటితకుమ్మరోద్యానుండనంగ
విశ్వలోకప్రశస్తుడై వినుతికెక్కె
　　ఘుంటజంసిరి పోలయయన్న శౌరి
　　　　　　(భీమేంద్ర అ - 49 ప)

ఆపద్యభావమిట్లున్నది బెండపూడి అన్నామాత్యుడు కాకతిప్రతాపరుద్రుని గజసైన్యమున కధ్యక్షుడు నవలక్ష ధనుర్ధరులుగల రాజ్యమను మహాసముద్రమునకు అన్నామాత్యుడు చంద్రునివంటివాడు అతడు ఆంధ్రభూమండలాధ్యక్ష సింహాసన ప్రతిష్ఠాపకుడు వీరరుద్ర మహారాజు యొక్క సర్వరాజ్యభారధురంధరుడు యవనులను నాశమొనర్చుటలో అతడు ప్రళయాగ్నివంటివాడు కుమ్మటమును జయించినట్టివాడు ఈ అన్నామాత్యునకు (మోటటి) కొలని ప్రతాపరుద్రుడు సూర్యగ్రహణ కాలమున సవిలవిగర్ధమానబహుసమాకులమైన అరేకుగ్రామమును దానముగా నొసగెను అన్నయమంత్రి ఆ గ్రామమును స్వీకరించి బంధువులను విప్రకోటిని నిరతాన్నదానముతో సంతృప్తుల నొనరెను (భీమఖండము - ప్రథమ 49 50 పద్యములు) ఈ పొగడ్తలలో అతిశయోక్తి ఆవంతయు కనిపించదు ఇవి యన్నియు అన్నయమంత్రియందలి సహజసిద్ధములైన గుణములే కంపిలి రాజపుత్రుడగు కుమారరాముడు కాకతీయసామ్రాజ్య దక్షిణభాగమును అలజడిపరుప నారంభించెను కాకతి ప్రతాపరుద్రదేవుని ఆజ్ఞచే రేచెర్ల గమనాయకుడును బెండపూడి అన్నయసేనాయుడు అరెవీటిప్రభమునకు మూలపురుషుడైన తాత పిన్నమకోవిభుని కుమారులలో పెద్దవాడగు కొటికంటి రాఘవుడును కుమారరాముని కుమ్మటమువద్ద (కుమ్మటము అనునది కంపిలికి రాజధాని) ఓడించి ఆతని సప్తాంగములను హరించిరి ఈ యుద్ధము క్రీ శ 1309 ప్రాంతమున జరిగినట్లు తెలియుచున్నది

అన్నయామాత్యుడు పరమమాహేశ్వరాచారతత్పరుడు ఈతడనేకదానములొసగినట్లు కృష్ణామండలములోని శ్రీకాకులేశ్వరాలయము నందలి శాసనములు చెప్పుచున్నవి

అన్నామాత్యునకు లక్ష్మీదేవి అను భార్యవలన దేవమంత్రి తల్లప్ప ప్రోధాని అను ఇరువురుతనయులు జన్మించిరి ఈ అన్నామాత్యవర్యుడు తురుష్కుల దండయాత్రలలో మృతుడైనట్లు భావింపబడుచున్నది

త　ఆ　శా

## అన్నమంత్రి బెండపూడి II

మొదటి బెండపూడి అన్నామాత్యుని తనయులలో మొదటివాడగు దేవమంత్రి విశ్వనాయకుని పుత్రికయగు రామమాంబను పరిణయమాడి ఆమెవలన లింగనమంత్రి తల్లన్న అన్నామాత్యుడు అను సుతులను బడసెను వారిలో లింగన మంత్రి సంగరసవ్యసాచి వితరణమున దధీచి నవీన రుక్మాంగదుడు అని ఖ్యాతివహించెను ఇతడు ప్రతిద్వాదశినాడు విప్రులకు షడ్రసోపేతమైన భోజనమును పెట్టెడివాడట ఇతడు గొప్పవీరుడు ఝాడేశ బాహుహాదొంతివ తునాడుల శత్రుశేనను గెలిచెనట ఒడ్డాది మత్స్యవంశోద్భవుడైన అర్జునుని చేతను పల్లవరాజుచేతను కప్పమును గొనెనట సూర్య

కు జూడైన వీరభద్రారెడ్డి దేవేంద్రుని గర్వమణచి యవన కర్ణాట కటక రాజులతో చెలిమిని పాటించి అల్లాడధరణినాథు చేత తెలుగు భూమిని ఏలించెను ఇతడు విప్రులకు సర్వమాన్యములుగా భూములను ధారవోయించెను ప్రతాపవేమవసుధాధిపునిచేత ఇతడు భువ మనోహరమైన బోడసకుర్రు మహాస్థలమున చోడవరమును అగ్రహారముగ ద్విజుల ధురక్షణకై పరిగ్రహించెనట ఈయన భార్య గంగాంబికాదేవి ఈయనకు మంత్రి దేమంత్రి అను సతులుండిరి మొదటి అన్నమంత్రి పుత్రులలో రెండవ వాడగు తల్లన్న చదువుల రస్వతి అని ప్రోగడ్త కెక్కెను

అన్నామాత్యుడు (రెండవ) రాజమహేంద్రవర రాజ్యపాలకుడగు వీరభద్రారెడ్డికి ప్రధానామాత్యుడై నెగడెను ఆయన ఆంధ్ర ఘూర్జర అరబ్బీ తురుష్క కర్ణాట మలయాళ శక సింధు సౌవీర బర్బర కరహాట భాషలను ఆయాగోష్ఠీకాలములలో చక్కగా మాట్లాడెడివాడట ఇతడొప్పుడు అహమ్మదుషా సన్నిధి పారసీభాషలో నొక కమ్మను వ్రాసి పంపెనట ఆ కమ్మయందలి అచ్చువంటి పారసీ అక్షరములను చూడి అహమ్మదుషా మహానందభరితుడయ్యెనట శ్రీనాథకవి భీమేశ్వర పురాణమున అన్నామాత్యుని గుణముల నిట్లు ప్రశంసించెను అన్నామాత్యుడు శత్రువులను పరిభవించుటలో గాండీవ మటివాడు వితరణశీలి గా ధర్మవిద్యలో (సంగీతమున) గట్టివాడు !

పులిచర్మముపై నాసీనుడయి శరీరమునందు తెలని భస్మమును పూసికొని కంఠమున రుద్రాక్షమాలలు ధరించి అన్నమంత్రి సంధ్యాత్రయమునందును పరమశివుని పూజించెట ఇతడు రాజమహేంద్రవర దుర్గమునందలి వీరభద్రస్వామికి ప్రాకారమును నిర్మించెను మార్కండేయ నీలకంఠ దేవర చెంత ఇతడు తన తల్లిపేరు మీద రామేశ్వరుని ప్రతిష్ఠించెను సంగమేశ్వరదివ్య శంభులింగమునకు కల్యాణ గర్భగృహమును నిర్మించెను సప్తగోదావరీతటమున ఇతడు ద్రాక్షారామ భీమేశ్వరునకు గోపురమంటపాదులను నిర్మించినట్లు దక్షారామా శాసనములో కనవచ్చుచున్నది ఆశాసనమిట్లున్నది

"అస్తి ప్రశస్తమతి రల్లయసేను భూపో !
రాజ్యోన్నతో జగతి రాజమహేంద్రపుర్యాం ॥
మంత్రీ హితోస్య మతి నిర్జిత దేవమంత్రి
ర్దివ్యశ్రియా జయతి దేవయ అన్నమంత్రీ ॥

శాకే పుష్కర బాణ విశ్వగణితే సంవత్సరే కీలకే
కార్తిక్యాం శనివాసరే సుకృతధీ శ్రీయన్న
మంత్రీశ్వరః
దాక్షారామజభీమలింగపురతః శ్రీసప్తగోదాతటే
ప్రాచీగోపుమండప సమకరోద్రమ్య శిలానిర్మిత
ద్వాదశసంఖ్యాస్తంభే సదా బహిర్ద్వార
మండపే విహరన్ ।
రక్షతు భీమేశోయ శ్రీదేవయ యన్నసచివమాకల్పాం
-(ద హి VI నె 1381)

మరియు అన్నమంత్రీశ్వరుడు ద్రాక్షారామములోని భీమేశ్వరునకు మొగలివాట ధామమును (గృహమును) రచించెను ఇతడు వీరభద్రారెడ్డి భ్రాతయగు వేమారెడ్డికి గారాము మంత్రి రాజుయొక్క దిగ్జయ శాసనములు వ్రాయుటలోను నిరంతరము భూపాలుని పార్శ్వమున కూర్చుండి ఎసిడిగంటముతో నయకార్యములను తీర్చివ్రాయుటలోను ఇతడు సిద్ధహస్తుడు ఇట్టి ప్రశంసలు మంకు భీమఖండమున కనిపించును శ్రీయన్నియు అన్నామాత్యునియందలి నైసర్గికగుణ ప్రశంసలనియే భావింపనగును

రాజమహేంద్రవర రాజ్యము కుమారగిరిరెడ్డి వలన అతని భార్యయు మంత్రియునగు కాటయవేమారెడ్డిని ఆ ఎమ్మట కాటయవేమునికూతురగు అనితల్లి కని అనితల్లిద్వారా ఆమె భర్తయగు వీరభద్రారెడ్డిని సంక్రమించెను వీరభద్రారెడ్డి దువ్వూరి అల్లాడరెడ్డి తనయులలో రెండవవాడు వీర భద్రారెడ్డి అన్నయగు వేమారెడ్డి సోదరునకు అండగానిలిచి కార్యధుర్యధురీణుడై రాజ్యభారమంతయు నిర్వహించుచుండెను అల్లాడ వీరభద్రారెడ్డి వేమారెడ్డి రాజమహేంద్రవర రాజ్యమును క్రీ శ 1423 మొదలు 1434 వరకు పాలించినట్లు తెలియుచున్నది శ్రీనాథకవి బెండపూడి అన్నామాత్యునకు బంధువు రెడ్డిరాజుల ఆస్థాన ప్రవేశమునుకోరి శ్రీనాథుడు మొదట అన్నామాత్యుని ఆశ్రయించెను క్రీ శ 1415 ప్రాంతమున ద్రాక్షారామ భీమేశ్వరుని మహిమను దెలుపునట్టి భీమఖండమను కృతిని రచించి దానిని బెండపూడి అన్నయమంత్రికి అంకిత మొసగెను ఆవిధముగ అతని అండదండలతో శ్రీనాథుడు రెడ్డిరాజుల ఆస్థానమున ప్రవేశమును సంపాదించుకొని ఆస్థాన కవియయ్యెను అతడు సుమారు పది సంవత్సరముల తరువాత కాశీక్షేత్రమహిమనుగ్గడించు కాశీఖండమను కృతిని

రచించి దానిని ప్రభువగు వీరభద్రారెడ్డికి అంకితమిచ్చెను

పంచారామముల యొక్కయు లింగమూర్తియొక్కయు ప్రశంస భీమేశ్వర పురాణమున (భీము-ప్ర - ఆ - 78వ) వచ్చుటచే ఇది రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమున ఉండినట్లు ఊహింపవలెను. పంచారామము లెవ్వియనగా అమరారామము క్షీరారామము కొమరారామము దాక్షారామము భీమారామము సోమారామము అనునవి

పల్వపురి ఇప్పటి తూర్పుగోదావరిజిల్లా కొత్తపేట సమీపమందలి పలివెలక్షేత్రము కావచ్చును. భీమేశ్వర పురాణ రచనాకాలమునకు అనగా క్రీ శ 1430 ప్రాంతమునకు కొండవీటి రెడ్డిరాజ్యమంతరించినది. అమరారామము (అనగా ఇప్పుడు గుంటూరునకు సమీపమందలి అమరావతి నగరము) ఇదిరాజమహేంద్రవర రెడ్డిరాజుల క్రింద ఉండుట సందేహాస్పదము. కావున పంచారామముల దలి ప్రౌఢిం దు బింబా నలు అన్నమంత్రిని కాంచిరని చేసిన ప్రసంగము ఔపచారికము గనే మనము గ్రహింపవలెను. మిగిలిన యారామములు వీర భద్రారెడ్డి రాజ్యాంతర్గములని యొప్పుకొనవచ్చును

ఇట్లు బెండపూడి అన్నామాత్యుడు (రెండవ) ప్రజాహిత తత్పరుడై ప్రభుభక్తి పరాయణుడై మహామంత్రులలో నొక్కడుగ పరిగణింపబడెను

తం ఆం శా

## అన్నమదేవి

అన్నమదేవి అను పేరు శ్రీనాథకవిసార్వభౌముని హరవిలాసపీఠికలో కానవచ్చుచున్నది. హరవిలాసకావ్యమును కృతినందిన అవచి తిప్పయశెట్టిని గురించి ప్రస్తావించుచు శ్రీ చెలువ బుగ్గెకొనిన చేడియ అన్నమదేవి భార్యగా గలవాడు తిప్పయశెట్టి అని చెప్పబడినది

అవచి తిప్పయశెట్టి రెడ్డి యుగమునకు చెందినవాడు. శ్రీనాథుని కాల్య సఖుడు. క్రీ శ 1390-1404 వరకు రాజ్యమేలిన కొమరగిరి భూపాలుని మన్ననలకు పాత్రమైనవాడు. ఈ రాజునే కొమరగిరి వసంతరాయలని కూడా పేర్కొనుటకలదు. ఈ మహారాజు ప్రతి సంవత్సరము చేయు వసంతోత్సవములకు కావలసిన కస్తూరీ కుంకుమ కర్పూరాది సుగంధ ద్రవ్యముల నన్నిటిని నానా దేశములనుండి నానా ద్వీపముల నుండి తెప్పించి ఇచ్చి వసంతోత్సవములను అతివైభవోపేతముగా జరిపించుచుండు వాడట ఈ వణిగ్వరుడు

అన్నమదేవి అవచి తిప్పయసెట్టి ధర్మపత్ని. హరవిలాస కావ్యము క్రీ శ 1430 తరువాత రచింపబడినట్లుగా నిర్ణయింపబడినది. కనుక అన్నమదేవి క్రీ శ 14వ శతాబ్దాంతము నుండి 15వ శతాబ్ది మధ్యకాలము వరకు జీవించియున్నట్లు చెప్పవచ్చును. ఈమె భర్త కాంచీపుర వాస్తవ్యుడు. కావున ఈమె కూడా ఆ ప్రాంతములకు చెందిన దేయని గ్రహింపనగును

అన్నమదేవినిగురించి ఒక్క పాదములో తప్ప మరెక్కడ చెప్పబడియుండలేదు. శ్రీ చెలువ బుగ్గెకొనిన చేడియ అనుటలో ఈమె సర్వలక్షణసంపన్నురాలైన లక్ష్మీస్వరూపిణి యని తెలియుచున్నది. అందుకు తార్కాణగా కుబేర సమానుడైన అవచి తిప్పయ కర్థాగలక్ష్మియై అశేషమైన ఐశ్వర్య వైభవములను అనుభవించినది. మంచన విశ్వనాథుకు చినమల్లన నను అకుమారులను కనితన జన్మమును సార్థకము చేసికొన్నది. స్త్రీల సౌభాగ్య విశేషములకు నిధానములైన సంతు సౌభాగ్యము - రెండును ఈ ఇలాలిని వరించినవి. పైగా కవిసార్వభౌముని కావ్యములో ప్రస్తుతింపబడుట్టి అదృష్టము ఈమెకు కలుగుట కూడా ఒక సుకృతఫలమే. ఆనాటి స్త్రీలు ఇంతకంటె ఎక్కువగా ఇలుగురి నోళ్ళలో పడుట కిష్టపడుచుండెడివారు కారేమో

నే శా ర

## అన్నమదేవుడు

అన్నదేవుడు కాకతీయ రాజులలో కడపటివాడైనను ప్రతాపరుద్రదేవుని అనుజుడు. మహాదేవాజ్ఞాతః "ముమ్మడా బా తృతీయా అను ప్రతాపరుద్రీయమునందలి విద్యానాథకవి వాక్యములవలన ప్రతాపరుద్రుడు ముమ్మడాంబా మహాదేవులకు కుమారుడని స్పష్టమగుచున్నది. ఈతని అనుజుడైన అన్నమదేవునకును ముమ్మడాంబామహాదేవులే తల్లిదండ్రులని దీనివలన మనకు విశదమగుచున్నది

ఇంతవరకును ప్రతాపరుద్రుని తండ్రియైన మహాదేవు డెవరో పరిశోధకులకు తెలియలేదు. ఈతడు చాళుక్య వీరభద్రుని తమ్ముడు కావచ్చునని చిలుకూరు వీరభద్రరావుమున్నగు వారు ఊహించిరి. కాని ఇటీవల ఒక కన్నడ శాసనమువలన మహాదేవరాజు కాకతీయుడేయని తెలుచున్నది. రెండవ ప్రోలరాజునకు రుద్రదేవుడు మహాదేవుడుగాక మరియిద్దరు ముగ్గురు కుమారులున్నట్లు తెలుచున్నది. వీరిలో ఒకని

వంశమున దు ప్రతాపరుద్రునితండ్రియైన మహాదేవుడు జన్మించినట్లు ఈ కన్నడశాసనమువలన తెల్లమగుచున్నది. మహాదేవుడు నిరవద్య (నిడుదవోలు ఇది పశ్చిమగోదావరిజిల్లాలో ఉన్నది) పురాధీశుడు క్రీ శ 1000వ సంవత్సరమున మొదటి బేతరాజుపాలనముతో ఆరంభమైన కాకతీయసామ్రాజ్యము మూడువందల ఇరువదిరెండు సంవత్సరములు అవిచ్ఛిన్నముగా మూడుపూలు ఆరుకాయలతో విలసిల్లి తుదకు ప్రతాపరుద్రుని కాలమున (క్రీ శ 1323) అంతరించిపోవుట విధివైపరీత్యమని భావింపనగును. ప్రతాపరుద్రదేవుడు (క్రీ శ 1296 323) కాకతీయరాజులలో కట్టకడపటివాడు. ఇతడు సర్వసద్గుణోపేతుడు శాత్రవభయంకరుడు. సింహాసనము నధిష్ఠించినప్పటినుండి ఇతడు అనేక సమరములను ఎదుర్కొనవలసివచ్చెను. ఇతడు దిగ్విజయయాత్రలకై వెడలిన సమయమున రాజ్యభారమును తమ్ముడగు అన్నమదేవునిపై ఉంచెను. అన్నమదేవుడు అన్నకు తగిన సోదరుడని పేరుపొంది రాజ్యభారమును వహించుటలో మిక్కిలి అప్రమత్తుడై మెలగెను. తనపై దండెత్తివచ్చిన యవనులను కదనరంగమున చీల్చిచెండాడిన యోధుడితడు. క్రీ శ 1322వ సంవత్సరమున ఢిల్లీశ్వరుడగు తుగ్లకు ప్రతాపరుద్రుని చెరబట్టుకొనిపోయినసమయమునందు అన్నమదేవుడు రాజ్యభారమును వహించి ప్రతాపరుద్రుడు తిరిగి వచ్చిన పిమ్మట రాజ్యము నతని కప్పగించినట్లును ప్రతాపరుద్రుని మరణానంతరము అన్నదేవుడు ఓరుగంటిలో నుండ వొల్లక విధ్యప్రాంతమునకును వెడలిపోయినట్లును కళిలానగర వృత్తాంతము అను వ్రాతప్రతిలో కనవచ్చుచున్నది (ఇది చెన్నపురి ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్ట్సు లైబ్రరిలోనిది మెకంజీ గుమాస్తా దానిని వ్రాసినట్లు తెలియుచున్నది) దీనివలన ప్రతాపరుద్రునకు సంతానములేదనియు తెలియుచున్నది. కాని దైవేశ్వరచరిత్రవలన ప్రతాపరుద్రునకు సంతానమున్నట్లే కనిపించును.

రఘునాథభాస్కర్ గోడ్‌బోలె అను కవి మహారాష్ట్రభాషలో వ్రాసిన కవి చరిత్ర అను గ్రంథమువలన అన్నమదేవునకు సంబంధించిన మరికొన్ని వివరములు మనకు విశదమగుచున్నవి. అందులో ఒక ముఖ్యమైన విషయమిట్లున్నది. యవనులచే ప్రతాపరుద్రుడు చెరసాలలో బంధింపబడియున్నపుడు ప్రతాపరుద్రీయమను సంస్కృత అలంకారశాస్త్రగ్రంథమును వ్రాసిన విద్యానాథకవి (ఈతనికే అగస్త్యకవి అనియు పేరు) ప్రతాపరుద్రుని స్వీకరింపుమని కోరెనట. ప్రతాపరుద్రుడు తన అసహాయస్థితి వగచి తన ప్రతినిధిగా రాజ్యమును దీక్షతో నిర్వహించుచు ప్రస్తుతము ఓరుగంటిని పాలించుచున్న తన తమ్ముడగు అన్నమదేవుని దర్శింపుమని అతడు విద్యానాథునితో చెప్పెనట. విద్యానాథుడు అన్నమదేవుని దర్శించి యతనివలన పెక్కు బహుమతులను పొందినట్లును ఓరుగంటిలో అన్నమదేవుడు స్థాపించిన పాఠశాలలో ఆచార్యపీఠము నలంకరించి కొంతకాలము అతడు ఉండినట్లును మనకు విశదమగుచున్నది.

ఓరుగంటినుండి వెడలినపిమ్మట అన్నదేవుడు బస్తరురాజ్యమును స్థాపించెను. బస్తరురాజ్యము ఓరుగంటికి ఈశాన్యమున రెండువందల మైళ్ళదూరమున ఉన్నది. ఈ రాజ్యమునకు తూర్పున జయపురము జమీందారియు దక్షిణమున భద్రాచలము ఉన్నవి.

సెంట్రల్ ప్రావిన్సెస్ గెజిటీర్సు అను గ్రంథమునందలి Chhathi garh Feud tory states Pages 36 46 51 లలో అన్నమదేవునకు సంబంధించిన మరికొన్ని విషయములు మనకు కనవచ్చుచున్నవి. అవి ఇవి (1) అన్నమదేవుడు ఓరుగంటి రాజ్యమును విడిచి బస్తరుకు వచ్చునపుడు వారి కులదేవతయైన మాణిక్యదేవి అను మదేవునకు ఒక ఖడ్గమును ప్రసాదించెనట. అది ఇప్పటికిని బస్తరుపాలకులచెంత కలదట (2) అన్నమదేవుడు ఓరుగంటినుండి బస్తరుకు పోవునపుడు అతనివెంట నీటిని దించుటకొరకు సేవకుడుకూడ పోయెనట. ఆ సేవకుని వంశమువారే నేటికిని బస్తరు సంస్థానములోని ఘట్ కేల్ మీ దారికి ప్రభువులుగా నుండిరట (3) బస్తరు సంస్థానమందలి కోసాయాలు అనుజాతి వారిపూర్వులు ఓరుగంటినుండి అన్నమదేవునితో పాటు బస్తరుకు చేరినవారే అట "

అన్నమదేవుడు పదియవతరమువాడుగా ఎంచబడుచున్నవాడును బస్తరు పాలకుడునగు దిక్పాలదేవుచే వ్రాయించబడిన శాసనమునందు బస్తరురాజులు ప్రతాపరుద్రుని తమ్ముడైన అన్నమదేవుని సంతతివారని తెలుపబడినది. ఈ శాసనము బస్తరు స్థానమునందలి దంతేశ్వరీదేవాలయములో ఉన్నది. అన్నమదేవునకు హమీరదేవుడను కుమారుడు ఉండినట్లును ఈ శాసనము చెప్పుచున్నది.

ఇట్లు ప్రతాపరుద్రునకు అనుంగు సోదరుడై రాజ్యపాలనమున దక్షుడై బస్తరు రాజులకు మూలపురుషుడై అఖండఖ్యాతినార్జించిన అన్నమదేవుడు క్రీ శ 1360వ సంవత్సరమున పరమపదించినట్లు తెలియుచున్నది.

తం ఆం శా

## అన్నమనేడు

వెలుగోటివారి వంశములో ఎనిమిదవ తరమునకుచెందిన వాడు అన్నమనేడు ఇతడు పెదసింగమనేని రెండవ కుమారుడు మొదటివాడు ఎనసింగమనేడు ఈ అన్నమనేడు యేరు చేను బయట గండికోటపై ముట్టడికిదిగగా పోలెపల్లి బుక్కరాజు రాత్రియుద్ధమున అతనిని చంపెనని చెప్పబడెను రసార్ణవసుధాకరకర్తయగు పెదసింగభూపతి తనకాఱ్గురు పుత్రులనియు వారు వరుసగా అనపోత దాచయ వల్లభ వేదగిరి మాచయ దామయ అనువారనియు తన గ్రంథమున తెల్పియున్నాడు ఇందు అన్నమనేడుగాని ఎనసింగమగాని లేడు మరియు 14 వ శతాబ్ది తుదివాడైన అన్నమనేడు 15 వ శతాబ్ది తుదివాడైన పోలెపల్లిబుక్కరాజుచే మడియుట అసంభవము కావున అన్నమనేడు కల్పిత పురుషుడని చరిత్రపరిశోధకుల తలంపు లేదా బుక్కరాజుచే రాత్రియుద్ధమున నోడిపోయి మరణము పొందిన అన్నమనేడు వేరు వ్యక్తియై యుండవచ్చును

వి శి సం

## అన్నమయ్య–తాళ్ళపాక

దివ్య తిరుపతి స్థలమున నెంకొన్న వేంకటపతిపై వేలాది పదములు చెప్పి యశఃకాయుడైన తాళ్ళపాక అన్నమాచార్యులు క్రీ శ 1408 సం॥ వైశాఖమాసమున విశాఖా నక్షత్రమున జన్మించినాడు పొత్తపినాటిలోని రాజంపేట తాలూకా తాళ్ళపాకలోని నారాయణసూరి లక్కమాంబ అను దంపతులు సంతానము లేక తిరుమలకేగి గరుడస్తంభమునకు దండదండములిడి వేంకటేశ్వరానుగ్రహమున అన్నమయ్యను సూనునిగా పొందిరి ఆ పుణ్యదంపతులకు స్వామి కలలో కనపడి బిరుదు గజ్జియలు ముప్పడి కరార బిచ్చెనట అన్నమయ్య విష్ణుమూర్తి నందకాంశజుడని ప్రతీతి అన్నమయ్యను అయిదవయేట గురువు ఉపనీతుగావించెను వెన్నునివరముచే విద్యలన్నియు అన్నమయ్య జిహ్వాగ్రరంగమున నాట్యమాడెను అన్నమయ్య ఆడిన మాట అమృతకావ్యమైనది పాడిన పాట పరమ గానమైనది తాళ్ళపాకవారు నందవరీకులు భారద్వాజస గోత్రులు ఆశ్వలాయన సూత్రులు

అన్నమయ్య చిన్ననాటి నుండియు హరిభక్తి పరాయణుడు తలిదండ్రులు అన్న వదిన తనను పసవులకు కావు తెమ్మని పంప పచ్చని గరికను కొడవలితో కోయునపుడు అతని చేయి తెగినది అంతటితో ఆ పనిని కట్టిపెట్టి శేషాద్రి నాథుని కొలువ దలచుకొని తిరుమలకేగ పయనమయ్యెను తిరుమలకు వచ్చి చేరునపుడు అన్నమయ్యకు పదునారవయేడట నల్లని చిన్నవాడని ముద్దుగారెడి వాడని నునుపట్టుకుచ్చుల దండెను భుజంబున ధరించినవాడని అన్నమయ్య వర్ణనము ఇది ముద్రాధారణ కాలము దీనిని కావించినవాడు ఘనవిష్ణువను మౌని వేదమార్గానుసారముగ శంఖచక్రాంకితుడైన అన్నమయ్య కానాటినుండియు వైష్ణవ పంక్తిలో సాపాటు లభించినది అన్నమయ్య అచ్చట కొంతకాలము గడపినట్లును స్వామి కలలో అతనికి ప్రత్యక్షమై తన యూరునకు పొమ్మని సెలవిచ్చినట్లును అన్నమాచార్య చరిత్రమున కలదు బహుశః ఆ కాలము శా శ 1346 క్రోధిసంవత్సరమై (క్రీ శ 1424) యుండును ఆధ్యాత్మికకీర్తనలు మొదటి రాగిరేకుపై వ్రాయబడిన తేది ఇట్లున్నది

"స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౬ అగు నేటి క్రోధి సంవత్సరమందు తాళ్ళపాక అన్నమాచార్యులవతరించిన పదారేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతే అదిమొదలుగాను

దీనిని బట్టి అన్నమాచార్యులకు పెండ్లి యీడు వచ్చినదని తెలియనగును తల్లి లక్కమాంబ ఎలజవ్వనము మేననిగురొత్తు తన కొడుకును చూచి కులమువారలయిండ్లకు పెండ్లి సంబంధమునకై తిరుగనారంభించినది అన్నమయ్యకు పిల్లనిచ్చుటకు ఎవ్వరును ముందుకు వచ్చినవారు కారు శ్రీరామ గోవింద హరియను నాచారముగల దాసరయ్యకెవ్వరు బిడ్డనివ్వ నిచ్చగింతురు? అయినను హరి అనుగ్రహముచే తిరుమలమ్మ అక్కలమ్మలను ఇద్దరు కన్యల నొక్కమారే అన్నమయ్య వివాహమాడెను వేదాంత దేశిక వేంకటాచార్య దివ్య సంప్రదాయమున వర్తించు శఠగోపముని వద్ద సకల వేదాంత పఠనము పూర్తి చేసెను అన్నమయ్య గాంధర్వ విద్య బాగుగా నభ్యసించి వాల్మీకిరామాయణమంతయు రాగయుక్తముగాపాడెనట అతని గానము విని అతడు తుంబురుడో నారదుడో గంధర్వుడోయని ప్రజలచ్చెరువునందిరట

అన్నమాచార్యుల కాలమున సాళ్వ నరసింహరాయలు టంగుటూరుపురమేలుచున్నట్లు అన్నమాచార్య చరిత్ర చెప్పుచున్నది సాళ్వ నరసింహరాయలు తొలుత సంగమ వంశీయులకడ దండనాయకుడుగా నుండి ఆ ప్రభువులు విషయలోలురై రాజ్యపాలన విషయముల విముఖులై యుండుట

గా చి విజయనగర హో నమును హ స్త ము చేసికొనెను ట గుటూరు తాళ్ళపాక రె డను కడప మ డ ములోని రాజ పేట తాలుకాలోనివే మఱియు క్రీ శ 1456 లో ఇతని మొదటి శా నము తిరుమలయ దు కాన్పి చుచు డుట చేత క్రీ శ 4 6 నాటికి సాళ్వ నరస హరాయలు చ ద్రగిరి ప్రా తమున ను డెనని ద్రుఢముగా చె ప్పవచ్చును ఇతడు రాచమూకలలోని పరాక్రమశాలియనియు నాశీ బాంధ వాన్వయు నియు మాత్రమే అన్నమాచార్య చరిత్రలో చెప్ప బడియు డుటచే ఇతడిప్పటి మహామ డలేశ్వరుడు కాలేదని చె ప్పనొప్పును సాళ్వ నరస హరాయలు అన్నమయ్యను దర్శి చి తనకు గురువుగా ను డి బుద్ధులు చె ప్పుమనికోరెను అన్నమయ్యకు ట గుటూరున పెద్దనగరిని ఏర్పాటుగావి చెను ఇ తిలో నరసింహరాయలు పెక్కు వి యములుగా చి తన రాజధానిని పెనుగొ డకు మార్చుకొని అన్నమయ్య నచ్చటి రావి చుకొని తనపై కీర్తనలు చె ప్పుమని కోరెను అ దుల కన్నమయ్య మిగుల బాధనొ ది "అయచ్యుతుని దక్క నన్యుల వినుతిసేయుట నాకన్న చెలియలి వావి అని నిరాకరించెను రాయ న్నమయ్యను బ ధి చి శృ ఖలాబద్ధుగావి చెను అన్నమయ్య హరికీర్తనము జేసి సంకెలను డి వి ము క్తు డయ్యెను అని చెప్పుదురు రా య ల ం త టను డి అన్నమా చార్యులకు శిష్యుడయ్యెను అన్నమాచార్యులనేక మహిమలను జూపి వేలకొలది స కీర్తనలను జేసి క్రీ శ 1503 దు దుభి స ॥ ఫాల్గుణ బహుళ ద్వాదశి నాడు దివ్యధామ ముం దెను

అ న్నమాచార్యులు 1) ఆధ్యాత్మ సంకీర్తనలు 2) శృ గార స కీర్తనలు 3) వైరాగ్య స కీర్తనలు 4) శృ గారమంజరి 5) ద్వి ద రామాయణము 6) స స్కృత వే టాచల మాహా త్మ్యము 7) వే కటేశ్వర శతకము 8) స కీర్తన లక్షణము (స స్కృతము) రచియించె ని తెలియవచ్చినది ఇ కను 12 శతకములు కల భాషలయందును తిలేని నానా ప్రబ ధ ములు అనేకరచి చెనట పైన పేర్కొనబడిన వానిలో ద్విపద రామాయణము సంస్కృత వే కటాచలమాహాత్మ్యము స కీర్తన లక్షణము (స స్కృతము) నేడు లభి పవు స కీర్తన లక్షణమున కాంధ్రాను వాదమును ఆతని మనుమడు చిన్నన్న చేసి యున్నాడు

అ న్నమయ్యకు అల్లుడు వేంకటేశ్వరస్వామి ఆయన వే కటేశ్వరస్వామిపాదములు కడిగి అలమేలుమ గమ్మను ఆతనికి అర్పి చి పరిణయము గావి చెనని రేవణూరి కొ డమా చార్యులు శ్రీపాదరేణుమాహాత్మ్యమున వ్రాసియున్నాడు తిరుమ పై అ న్నమయ్య కాలమునాటి వరకు అలమేలు మంగమ్మ యు ట్లు శాసనాధారములుగాని ఇతరాధారము లుగాని కా రావు ఇది చూచియే కా లు అన్నమయ్య కల్యాణ మహోత్సవము ను జరిపియు డను

అన్నమ య్య కుమారుడు పెద తిరుమ య్య మనుమడు తిరువె గళనాథుడు వే కటే శ్వరస్వామి అనేక కై కర్యము లొనర్చుటయేగాక తమ సర్వస్వమును ఆ స్వామికే అర్పి చు కొని ధన్యులైరి

వి శ సుం

## అన్నమయ్య - యథావాక్కుల

1919 వ స వత్సరమున కాకినాడ ఆ ధ్ర సాహిత్య పరి షత్తు వారు సర్వేశ్వర శతకమును సుపరిష్కృత మొనరి చి అ దుగల పీఠికలో అన్నమయ్యనుగూర్చి కొంత తెలుపబడినది అన్నమయ్య వంశవృత్తా తమును సోమరాజు వేం టశివుడుగారు పెద్దల వలన విని వ్రాసిరట అది పద్యమయము ఈ వ్యాస మున కాధారభూతము

యథావాక్కుల వారి వ శమున వేదా త దులనే కులుద్భవి చిరి అందు అన్నమయ్య సర్వేశ్వరశతకమను కృతిని తెలుగున రచియించెను ఇది వీరశైవ మత స ప్ర దాయానుసారముగా భ క్తిరసప్రధానముగా వేదా తవిషయ బోధకముగా అన్నమయ్యచే నిర్మి పబడినది

స ర్వేశ్వరశతకము త ప్ప అన్నమయ్య కృతి వేరొండు కానరాదు ఇ దు అన్నమయ్య నామధేయము గురుస్తుతి శతకరచనాకాలము మాత్రమే తెలుపబడినవి

అన్నమారాధ్యుడు ఆత్రేయసగోత్రుడు యజుశ్శాఖా ధ్యాయి గోదావరీ తీరవాసి రాజమహే ద్రవరమునకు సమీ పమున ఉన్న పట్టిసగ్రామమ దు వె సిన వీరభద్రేశ్వరస్వామి ఈయనకు ఇలవేల పు స్వాయ భు మానసగ్వశాస్త్రాశ్రిత విదుడు వేదవేదా తపారగుతుడు మదనాంత కాంఘ్రియుగ శామృతపానరతా తర గుడు అన్నమయ్య ఇతని కొడుకు వీరంరాజు మనుమడు నాగరాజు మునిమనుమడు చి ట్టి మ రాజు ఇతడు క్రీ శ 14?? లో పల్నాటి సీమకువచ్చి అచ్చట చెన్నగుడిపాడు మిరియాల ఎల్లిగు త పశ్వేముల వద్దిరేల సీతానగరములను అరుగ్రామములకు కరిణీకమునంపాదించెను

ఈ చిట్టిమరాజు కొడుకు గోపరాజు మనుమడు సోమరాజు ఈ సోమరాజు కాలము నుండి యథావాక్కుల వారి యింటిపేరు సోమరాజు వారైనది

శతక రచనా కాలమును కవి 127 వ పద్యమున వార్ధిపట్కపురజిత్సఖ్య చెప్పుటచే శా శ 1164 (క్రీ శ 1242) ఈ శతకము తిక్కన భారత రచనకు ముదుగను మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వ సారమునకు వెనుకను రచియింపబడినది వంశవృత్తాంతము ననుసరించి చూచిన అన్నమయ్యకును మునిమనుమడైన చిట్టిమరాజునకును మధ్య 180 సంవత్సరముల కాల వ్యవధి కనబడుచున్నది వంశావళి నిన్నమొన్నటిది యగుటచేత అంతగా విశ్వాసపాత్రము కాలేదు అన్నమయ్య క్రీ శ 1242 ప్రాంతమువాడు

"దూదికొండ మహనీయారాధ్యసోమేశ్వర ప్రభు కారుణ్యవశ తసంజనిత ధ్యానప్రసూనావళి" తన సర్వేశ్వర శతకమని అన్నమయ్య వచించెను దూదికొండ సోమేశ్వరారాధ్యుడే అన్నమయ్య గురువని స్పష్టముగా తెలియుటలేదు పాల్కురికి సోమేశ్వరుని భావములే ఇందు పద్యరూపమున దాల్చినవని చెప్పవచ్చును దూదికొండ కర్నూలు జిల్లా ప్రత్తికొండ తాలూకాలో ప్రత్తికొండకు సమీపమున నున్నది అన్నమయ్య గోదావరి నివాసియని వంశావళి చెప్పుచున్నది సర్వేశ్వరశతక మందిట్టిదేమియు లేదు కాని వంశావళి వృత్తాంతముల ననుసరించి చూడగా అన్నమయ్య శ్రీశైలమునకేగి తిరిగివచ్చుచు కృష్ణాతీరమున పల్నాడు తాలూకా కెట్టపాలెము చాపున విశ్వామిత్రాశ్రమ మనబడు సత్రశాలయను పుణ్యస్థలమున కొంతకాలముండి అచ్చటనే శతకమును రచియించియుండవచ్చునని తెలియుచున్నది శ్రీశైలమునకు కర్నూలు మండల మార్గమున పోవలెను కాన దూదికొండయందలి ఆరాధ్యసోమేశ్వరుని అన్నమయ్య దర్శించియుండును మహాకవి పాల్కురికి సోమనాథుడే ఈ సోమేశ్వరారాధ్యులని ప్రఖ్యాత పరిశోధకులు భావించుచున్నారు అన్నమయ్యకు సద్భావ ప్రసూనములు సోమనాథుని గ్రంథములనుండియు మల్లికార్జున శివతత్త్వ సారమునుండియు లభించినవని వీరి సిద్ధాంతము

ప్రాచీనాంధ్ర కవీశ్వరులలో కొందరు శాపానుగ్రహ సమర్థులు భగవద్భక్తి తత్పరులు అందులో అన్నమయ్య ఒకడు ఒక్కొక్క పద్య మొక్కొక్క తాటియాకుపై వ్రాసి ఆయాకును కృష్ణలోవైచి "అద్రిప్రవాహమున నెదురీదివచ్చెనా దాని దీని సూత్రమున కెక్కచెద అట్లురాపోయెనా అప్పుడే నాశిరము ఖండించుకొనియెద" అని శపథము చేసి మొదటకు గండకత్తెర తగిలించుకొని ఆకులమీద పద్యములు వ్రాసి నీళ్ళలో విడిచిపెట్టగా అవితిరిగి వచ్చుచుండినవి కొంతసేపటికి తరులుంబువులు లు ఎ దెత్తై యొదవి అను పద్యము వ్రాసి ప్రవాహములో పడవేయగా అది కొట్టుకొనిపోయెను అది చూచి గండకత్తెరతో శిరమును కత్తిరించుకొనుటకు అన్నమయ్య సిద్ధపడగా దానిని అచటి పసులకాపరిగొని తెచ్చి అన్నమయ్యకిచ్చి అంతర్ధానము చెందెను అందు పై పద్యమునకు బదులు ఒక పుష్పము భవత్పద ద్వయముపై నన్న పద్యమొకటి క్రొత్తగా దోచినది ఇది భగవద్విలాసమని శతకమును పూర్తి చేసెను కవి వీరశైవుడనుటకిదియొక ప్రబలనిదర్శనము

కవి దీనిని స్తోత్రమనియు స్తవకదంబమనియు ప్రాశామ్య స్తవమనియు చెప్పెను శతకమనియున్న పద్యము ప్రక్షిప్తమని పూర్వపరిశోధకులు త్రోసిపుచ్చిరి అచ్చయిన 138 పద్యములలో ఈపద్యమే చివరిది సర్వేశ్వరాయను మకుటముకలిగి మత్తేభశార్దూలములతో భక్తిరసభావబంధురముగ అన్నమయ్య దీనిని రచియించెను ఇందు మల్లికార్జున పండిత పాల్కురికి సోమనలకృతులలోని భావములేగాక శివపంచస్తవములలో ప్రఖ్యాతములైనమహిమ్నము అనామయము మొదలగువాని యానుధీకరణములిందుకలవు శివకవులరచనయందు కాన్పించు సమూహా ఎగుర్వించు నురంగము బహురూపమాడు సుమహాత్పద్మభవాండ పంక్తులు ఉత్సాహించి మొదలగు విలక్షణ ప్రయోగములిందును కాన్పించును పచాతురీ మంత్ర ప్రభావము లింగజంగ మార్చన కర్మవాదనిరసనము శివభక్తి మాహాత్మ్య మిందు ప్రదర్శితములైనవి ఇక్కవి శివకవుల పంక్తి నుండదగిన వాడని సర్వేశ్వర శతకమును గూర్చి చర్చించిన పండితుల యభిప్రాయము

వి శి నుం

## అన్నమరస

అన్నమరస పశ్చిమచాళుక్య రాజైన మూడవ త్రైలోక్య మల్లుని రాజ్యకాలములోని వాడు ఇతడు డాకూరు పట్టణమునకు అధిపతి మూడవ త్రైలోక్య మల్లుడు రాజ్యాధికారానికి వచ్చునప్పటికి రెండు సంవత్సరములు గడచి వి ఇతడు మూడవ తైలప చక్రవర్తియని తెలియుచున్నది

(ద పూ I పు 374) ఇతనికి త్రిభువనమల్లుగనియు బిరుదు కాన్పి చుచున్నది ఇతడు క్రీ శ 1149 1163 నడుమ చాళుక్య సామ్రాజ్యమ కు అధి తిగా ను డెను ఇతడు మర్థుడగు చక్రవర్తి కాకపోవుటచే చాళుక్య సామ్రాజ్యము విచ్ఛి ము కా జొచె ను సామ త ప్రభువులు ఒకీయ లై చక్రవర్తి యధి కారమును ధిక్కరి చుచుండిరి ట్టివారిలో కలచురి బిజ్జలుడు కాకతి రెండవ ప్రోలరాజు ముఖ్యులు ప్రోలరాజు తైలపుని యుద్ధమున దు పట్టుకొని పూర్వపు స్వామి భక్తిచే అతనిని ప్రాణములతో విడిచినట్లు రుద్రదేవుని అనుమకొండ శాసనమున లిఖింపబడినది ఈ కాలమునకు అనగా క్రీ శ 1152 నాటికి పశ్చిమ తెల గాణము చాళుక్య చక్రవర్తుల నామ మాత్ర పాలనలో ఉండినట్లు కన్పించును

అతని (త్రైలోక్యమల్లుని) రాజ్యకాలములో మహామండ లేశ్వరుడైన సోమపెర్మాడి డాకూరులోని బిజ్జేశ్వరదేవునికి దానాదిక మొనర్చినాడు తరువాత డాకూరున కధి తియైన అన్నమరస మార్తా డరస మొదలైన ప్రభువులందరు కూడి ఉత్తరాయణ స క్రా తి వ్యతీపాతకాలములో మయిలేశ్వరదేవు నకు నిత్యపూజకు గంధధూపదీపనైవేద్యాదులకు ఆటపాట లకు ఆలయ కట్టడములకు చైత్రారోహణాది ఉత్సవాలకు ఉపయోగి పబడునట్లు దానములుచేసి దానశాసనము వ్రాయి చినారు ఈ దా న శా స న ము (క్రీ శ 1152) డాకూరులో ఉన్నది డాకూరు ప్రస్తుతము మెదకు జిల్లాలో అ దోలు తాలుకాలో ఉన్నది ఈ గ్రామ జనాభా 8 031

అన్నమరస చేసిన దాన వివరాలు ఇట్లున్నవి —

1 అప్పకబ్బె చెఱువు క్రి దనున్న పొలం 2 మర్తురులు

2 ఉత్తర పొల లోని నల్లనేల 20 మర్తురులు

3 తూర్పు పొల లో కట్టకాలువకు ఉత్తరంగా మధ్య భూమిలోని అరటి తోటల భూమి 12 మర్తురులు

4 దేవుని ముందున్న పూదోట — 1 మర్తురు

5 ఊరికి దక్షిణ భాగంలో మన్న 18 అ కణాల నివేశన స్థలము

6 ఊరిలో నున్న మూనె గానుగలలోని గానుగఎండి

7 ఊరిలోని వ్యాపారస్థులు కొన్న వరి (కలమ) ధాన్యమునకు ఒక కొట్టు–ఒక వాోరి (8 మణుగులు) ధాన్యములో నాల్గవ వంతు

8 దేవమానవ ధర్మ విచారణమునకు ఒక ముద్రణాగారము (టంకసాల)

జూ హా

## అన్నమరాజుపేట

అ న్నమరాజుపేట విశాఖపట్టణముజిల్లా శృంగవరపు కోటలో ఉ న్నది దీనికి 12 మైళ్ళ దూరములో విజయనగరము ఉన్నది ఈగ్రామమునకు సరిహద్దులుగా తూర్పున పోట్నూరు గోస్తానది పడమట రోడ్లఎల్లి అలమండ ఉత్తరమున కొత్త వలస మొఖాసా దక్షిణమున తిరుసుఖండుపాలెము శా దేవు పురం ఉ న్నవి దీని ఉ అక్షా శము 18 14 తూ రేఖాం శము 83 18 గ్రామ విస్తీర్ణము 3000 ఎకరములు ఇచట 4 ఎకరముల ఎర్రరాతి దిబ్బిడిమెట్ట కలదు

1961 సం జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామములో పురుషులు 16 9మ ది స్త్రీలు 1614 మ ది వెరసి 4243 మంది ఉండిరి ఈ స ఖ్యలో షెడ్యూలు తరగతులవారు షెడ్యూలు జాతులవారు కల 219 మ ది 1951 సం॥ జనాభా ఖ్య 3102 ఈ పది సంవత్సరములలో 1141 మ ది పెరిగిరి ఇచ్చట ఇ డ్లు శివార్లుగా నిర్మి పబడినవి వీటిలో 286 పె కు టిండ్లు 3 ఎక్కువ అంతస్తులుగల భవనములు ఉన్నవి గ్రామ స్థులలో 2/3 వ తువారు వరిఅన్నమును 1/3 వ తువారు జొన్న గంటె చోడి అన్నములను తి దురు జనులు పరిశు ద్ధము చేయబడిన బావినీటిని త్రాగుదురు

ఈ గ్రామములో పద్మనాభచెరువు రామన్నపాలెం చెరువు బండిరేవు బంద సేరిచెరువు కోమటిచెరువు కలవు ఈ నీటివనరులక్రింద వరి వేరుసెనగ చోడి గ టి నువ్వు చెరకు ప టలు ప డను ప ట ధాన్యమును గాదెలలో నిలవచేయు దురు పంటవస్తువులను బ డ్లపై రైళ్ళమీద కొత్తవలసకు విజయనగరమునకు రవాణా చేయుదురు ఇచట 220 ఎకర ముల మామి తోటలు లవు మామిడికాయలలో ప డ్లలో 2/3 వ తు ఢిల్లీకి రవాణాచేసి మిగిలిన 1/3 భాగము కాయ లను పండ్లను స్థానికులు ఉపయోగింతురు 1966 67 స ॥లో ప టలక్రి ద 2228 ఎకరముల భూమి ఉపయోగించబడి ది చెరువులక్రి ద 1 00 ఎకరములభూమి ఇతరవనరులక్రింద 800 ఎ రములభూమి సాగుబడి యైనది 10 ఆయిల్ ఇంజ నులు 10 మోటలు 60 ఏతములు 65 ఎకరములభూమికి నీటిని సరఫరాచేసెను

అన్నమరాజుపేటలో 365 గేదెలు 450 ఆవులు 864 ఎద్దులు 670 దున్నలు 584 మేకలు 2564 గొర్రెలు 100 పందులు 154 కోళ్లుకలవు దినమునకు 236 శేర్ల పాలు 200 గ్రుడ్లు స్థానికులు ఉపయోగి తురు

ఇచ్చటి ప్రజల ముఖ్యవృత్తులు వ్యవసాయము కూలి కుటీర పరిశ్రమలు దుకాణదారులు ఎద్దుబడ్లుతోలువారు కసాలలు వడ్రంగులు తాపీమేస్త్రీలు తెలికలవారు మంగలివారు చాకలివారు గొల్లలు కలరు 2 పడమరలు స్థానిక అవసరములు తీరును వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి 2 50 లు స్త్రీకి రు 1-25 లు

ఈ గ్రామమున ఒక శివాలయము ఉన్నది ఇచటి శ్రీ వేణుగోపాలస్వామి ఆలయమును జంపన జగన్నాథరాజుగారి భార్య జపనబ గారయ్యగారు కట్టించి విజయనగర మహారాజా వారి అప్పగించిరి ఆలయమునకు ఒక ఇనాముకలదు దీనికి సింహాచల దేవస్థానమువారి ఆర్థిక సహాయముకూడ లభించు చున్నది ఇక్కడ ఉత్సవములు మార్చినెలలో జరుగును

ఈ గ్రామమునకు రెండు మైళ్ళలో అలమండ రైల్వే స్టేషను కోరుకొండ రైల్వేస్టేషన్ ఉన్నవి ఈ గ్రామమును మట్టిరోడ్డు భీమసింగు అను గ్రామముతో కలుపుచున్నది ఇచట ప్రయాణమునకు 13 రెడ్డెద్దబడ్లు 50 సైకిళ్ళు కలవు

అన్నమరాజుపేటలో ఒక బ్రాంచ్ పోస్టాఫీసు మూడుఎలిమెంటరీస్కూళ్ళు ఒక హరిజన ఎలిమెంటరీస్కూలు ఉన్నవి ఇది పంచాయతిపాలన కల గ్రామము ఇచ్చటనున్న వాహనముల న్ను వృత్తి న్ను ల్యాడుసెన్సులు సరార్జ్ గ్రాంటు మొదలగునవి కలసి రు 5472 లు ఈపంచాయతికి ఆదాయము గ్రామపారిశుద్ధ్యమునకు ఏర్పాట్లు కలవు బహుళార్థ సహకారసంఘము రు 5000 లు గ్రామస్థులకు అప్పుగా ఇచ్చినది 10 కిరాణా దుకాణములు 1 కాఫీ హోటళ్లు 4 సోడా కొట్లు సిగరెట్టు దుకాణములు 2 సైకిళ్ళ షాపులు కలవు

ఈ గ్రామ విద్యార్థులు హైస్కూలు చదువులకు 2 1/3 మైళ్ళలో ఉన్న రెడ్డిపల్లికి 5 మైళ్ళలో ఉన్న జామికి కళాశాల చదువులకు సినిమా థియేటరులకు విజయనగరమునకు విశాఖపట్టణమునకు పోవుదురు పోలీసు స్టేషనుకు జామికిని కోర్టులకు సబ్ రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి తాకు అభివృద్ధి కేంద్రమునకు 14 మైళ్ళలో ఉన్న శృంగవరపుకోటకు గ్రామస్థులు పోవుదురు జనరల్ ఆసుపత్రికి 6 మైళ్ళలోఉన్న అలమండకు పురుళ్ళ ఆసుపత్రికి పశువుల ఆసుపత్రికి జామికి జనులు పోవలెను పశువుల సంత అలమండలో జరుగును

విజయనగర పెనుసారాయణమూర్తి మహారాజావారు ఈ అన్నమరాజుపేటలోనే జన్మించిరి ఇచ్చట శ్రీ జపనవారి భవనము శిథిలమై మొండిగోడలతో కనిపించుచున్నది శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయము విశాలముగా 16 స్తంభముల వరండాతో విరాజిల్లుచున్నది ఇచటి దేవాలయ స్తంభములు బలిఘట్టములో గ దేవాలయ స్తంభములవలె ప్రత్యేకశిల్పసృష్టితో మలచబడినది ఆలయపుగోడ నల్లరాతితో నిర్మింపబడినది

మా శ్వే

## అన్నమరెడ్డి

అది క్రీస్తుశకము 1323 వ సంవత్సరము కాకతీయ రాజులలో కట్టకడపటివాడైన ప్రతాపరుద్రుడు అస్తమించెను తెలుగుదేశమును యవనులాక్రమించిరి అప్పటి యవనుల ప్రతినిధి ఉలుఘ్‌ఖాను ఇతడు ఢిల్లీసుల్తాను ఘియాజుదీన్ తుఘ్లక్ కుమారుడు దేశము అరాజకమైనది తురుష్కుల చేతులలో దేవాలయములు దేవాలయములందలి దేవతాప్రతిమలు ఛిన్నాభిన్నములైనవి గృహ క్షేత్ర పదలు మావి అనుకొనే భావము ప్రజలలో శించినది వైదికధర్మము నశించినది అది ప్రజకు మహాకష్టకాలము

ఇట్టి మహోపద్రవమును నివారించుటకును మేచ్ఛాక్రాంతమైన తెలుగుదేమును తిరిగి స్వాధీనమొనర్చుకొనుటకును కొందరు నాయకులు కంకణము కట్టుకొనిరి వీరందరు ప్రతాపరుద్రుని సేనానులే వీరు మొత్తము డెబ్బది అయిదుగురు కలరు వీరికి నాయకుడు ముసునూరి ప్రోలయ సులాను షీన్ తుఘకు దుర్భాగ్యమును తుదముట్టించుటలోను హైందవధర్మమును పునరుద్ధరించుటలోను ప్రోలయనాయకుకు కుడిభుజముగ పని చేసినవాడు ప్రోలయవేమారెడ్డి ఇతడే రెడ్డిరాజ్యస్థాపకుడు ఇతడు తురుష్కులాక్రమించిన గృహ క్షేత్ర బ్రాహ్మణాగ్రహారములను తిరిగి వారికి ఇప్పించెను వైదిక మతమును తిరిగి ప్రతిష్ఠించెను అద్దంకి రాజధానిగ చేకొని పూగినాటిని పాలించెను శ్రీశైలము తూర్పుపాదమునుండి తూర్పు సముద్రమువరకు గుండ్లకమ్మ నదికి రెండువైపుల ఉన్న దేశమునకు పూర్వము పూగినాడని పేరు శ్రీశైలమునకు పాతాళగంగకు అహోబలమునకు యాత్రికుల సౌకర్యమునకై మెట్లు కట్టించెను ఎర్రాప్రెగ్గడ కృతకమైన

హరివంశమునకు ఇతడే కృతిభర్త ఇట్టి మహామహుని తమ్ముడే అన్నమరెడ్డి ఇతనిని అన్నారెడ్డి యనియు అన్నయరెడ్డి అనియు వ్యవహరింతురు

అన్నమరెడ్డి తాత పంటవంశమున జన్మించిన వేమారెడ్డి యనునతడు ఇతడు కాకతిరుద్రమదేవి కొలువున దండనాథపదవి నధిష్ఠించెను అన్నారెడ్డి తండ్రి ప్రోలయరెడ్డి తల్లి అన్నమాంబ ప్రోలయరెడ్డి రేకపల్లికి నాయకుడు అన్నారెడ్డి పెద్ద అన్నగారు మాచారెడ్డి ఇతడు ఆదిరాజన్య తుల్యాచారనిధియని ఎఱ్ఱన హరివంశమున పొగడ్తకెక్కెను మహాభిమానియని శిలాశాసనకాయ బంధుడని వేమభూపాల చరిత్రమున ఇతడు వర్ణింపబడెను ఇందు ధనచప్రోలు (నేటి రేపల్లె తాలూకాలోని చందవోలు) ప్రాంతము నేలెను సుప్రసిద్ధుడైన ప్రోలయ వేమభూపతి అన్నమరెడ్డికి రెండవ అన్నగారు అన్నమరెడ్డికి దొడ్డారెడ్డి అను పేరుగల మూడవ అన్నగారు కూడ కలరని వేమభూపాల చరిత్రమునందును కొన్ని శాసనములందును కలదని రెడ్డిసంచికలో కలదు ఎఱ్ఱాప్రెగ్గడ తన హరివంశమున దొడ్డారెడ్డిని పేర్కొనలేదు అన్నారెడ్డి సోదరుడు మహాపరాక్రమోపేతుడగు మలారెడ్డి ఇతడు మోటుపల్లిని (బాపట్ల తాలూకాలో సముద్రతీరమున ఉన్నది) జయించి అన్నయగు వేమారెడ్డి కర్పించియు బహమనీ సుల్తాను అగు అలావుద్దీన్‌హసన్ అనువానిని ఓడించియు చెదలువాడలో (ఇది నేటి ఒంగోలు తాలూకాలో ఉన్నది) గుండ్లకమ్మ నదియొడ్డున రామాలయమును నిర్మించియు గొప్పఖ్యాతిని సంపాదించెను ఇతడు కడపజిల్లాలోని కురుమూరి నాయకుడు నామమునకు ముందు కోమటి అని పెట్టుకొనుట రెడ్డిరాజులకు ఆచారముగ గనవచ్చుచున్నది

అన్నమరెడ్డి గుణగణములను ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములో ఇట్లు ప్రశంసించెను

"అన్నచమూవరుండు సకలార్థసమన్వితుడన్న దానసం
పన్నుడ భిన్నబాహుబలభాసి శివాంఘ్రి సరోజపూజనా
సన్నుతి తత్పరాత్ముడవన్న విరోధిప్రసన్నభావుడ
భ్యున్నత శాలి శీలిత శుభోదయుడూర్జితుడయ్యె
నెయ్యెడన్

"దైశేయారికి మాఱట
చేతులక్రియ నొప్పరెండు జేవోడైవి
ఖ్యాతులు తమ్ములు వేమ
జ్మాతలపతికన్న విభుడు మల్లవిభుడున్

పై వర్ణనల వలన అన్నమరెడ్డి యందలి శౌర్యము భక్తిభావము ధర్మతత్పరత విశదమగుచున్నవి ఇతడు శత్రుదుర్గములను స్వాధీనము చేసుకొనుటలో వేమభూపతికి మిక్కిలి సహాయపడెను క్రీ శ 1346 1347 సంవత్సరముల నాటి శాసనముల వలన అన్నారెడ్డి అనపోతారెడ్డి సాయముతో కర్నూలు జిల్లా త్రిపురాంతకమునందలి చోళులను పారద్రోలి శ్రీశైల త్రిపురాంతక ప్రాంతములను రెడ్డిరాజ్యమునకు విధేయములగునట్లు చేసెననియు త్రిపురాంతకేశ్వరునకు కొన్ని దానముల నొసగెననియు తెలియుచున్నది ఈ పై శాసనములు శకసంవత్సరములు 1268 1 69 నాటివి త్రిపురాంతకసమీపమున ఇవి లభించినవి ఇట్లు వేమభూపాలునికడ ఇతడు గొప్పసేనానియై వెలుగొందెను

అన్నారెడ్డికి వేమాంబయను కుమార్తె యుండినట్లును ఆమెను చిట్టయవనుమడును నూకారెడ్డి కుమారుడును నగు నల్లనూకయరెడ్డికి ఇచ్చి వివాహ మొనర్చినట్లును కనవచ్చుచున్నది

అన్నమరెడ్డి ఏదో ఒకయుద్ధమున వీరమరణము నొందినట్లు తెలియుచున్నది

శ్రీశైలమందలి మల్లికార్జునస్వామి దేవాలయములోని నందిమండపమునకు సమీపమున వీరశిరోమండపము (వీరమండపము) లదు దానిని క్రీ శ 1377 వ సంవత్సరమున ప్రోలయవేముని తమ్ముడగు అన్నవేముడు అన్నారెడ్డి పుణ్యమునకై నిర్మించినట్లు ఆనాటి (క్రీ శ 1377) శాసనమునగలదు అనపోతారెడ్డి తమ్ముడను అన్నమరెడ్డి కుమారుడను ఇరువురను అనవేమారెడ్డి యనుపేరు కలవారగుటచేత వీద్దరిలో ఎవరు ఈ మంటపమును నిర్మించినవారు ? అనువివాదము బయలుదేరినది అన్నారెడ్డి కుమారుడగు అనవేమారెడ్డియే దీనిని నిర్మించెనని పరిశోధకులు అభిప్రాయపడుచున్నారు దీనికి కారణమేమనగా శాసనములో మంటపదాత అన్నయరెడ్డి కుమారుడగు అన్నవేమయ యని చెప్పబడియుండుటయే ఆనాటిరెడ్ల యాస్థానకవియైన బాలసరస్వతియే ఈ శాసనమును వ్రాసెను ఈ వీరమంటపమును నిర్మించిన శిల్పి పంచభిక్షు మల్లయ ఇతడు రామన కుమారుడు ఇతడు శైవాగమవిహితమంత్ర దీక్షాపరుడని వీరమంటప శాసనము

తుదిన వ్రాయబడిన సీస ద్వయమున గలదు. ఈ వీరము టపము నందు వీరలు పెక్కురు తలలు నాలుకలు గండకత్తెచే ఛేదించుకొనుచు భక్తి సాహసములను చూపుచుండెడివారనియు ఈ శాసనమున కలదు.

ఇట్లు శత్రునిర్మూలనమునందును ధర్మరక్షణమునందును సకల సద్గుణములయందును అన్నయగు ప్రోలయ వేమభూపాలునకు దీటైనవాడు అన్నమరెడ్డి.

తం అం శా

## అన్నమాంబ

ఈ సాధ్వీమణి మల్రాజు వేంకటాచలరాయనిగారి భార్య. ఈమె ఆశ్రిత జనులకు కాశీ అన్నపూర్ణ.

మల్రాజువారు నరసారావుపేట (గుంటూరుజిల్లా) జమీందారులు. విరియాల గోత్రజులు. పద్మనాయకులనెడి వెలమవారు. వీరికి బెల్లంకొండ వినుకొండ నరసారావుపేట రాజధానులుగా నుండెడివి. వీరిలో రాజా తిరుమల రాయణింగారు మొదటివారు.

దిట్టకవి నారాయణకవి రచియించిన రంగరాయ చరిత్రము మల్రాజు కొండలరాయని కుమారుడగు రామచంద్రనృపతికి అంకితమైనది. దీనిని రంగరాయ కదనరంగ చరిత్ర యని కవి / గ్రంథాంత గద్యమందు చెప్పినాడు. వీర పురుషపౌరుషరసానుబంధబంధురంబగు రంగరాయ కదన రంగచరిత్రకు బొబ్బిలియుద్ధము కథావస్తువు. క్రీ శ 1757 జనవరి 24 తేది తెల్లవారుజామున విశాఖపట్టణమండలాంతర్గతమయిన విజయనగర సంస్థానమునకు అధీశ్వరుడైన విజయరామ గజపతికి బొబ్బిలి సంస్థానాధిపతియైన గోపాలకృష్ణ రంగారావునకును మధ్యజరిగిన యుద్ధమే బొబ్బిలి యుద్ధము.

అన్నమాంబా వేంకటాచలరాయనింగార్లను రంగరాయ చరిత్ర (46 47 48) పేర్కొనుచున్నది. కృతిపతియగు రామచంద్రరాయని గారి వేంకటాచలనాయని గారు పినతండ్రి. వేంకటాచలనాయనింగారు వాచామాధుర్యైక నిధా గుణాధారుడు. ఔదార్యరూపప్రభుత్వ శౌర్యధర్మముల యందు వీరికి మారెవరులేరట. వేంకటాచలముగారి భార్య అన్నమాంబ ఆశ్రితజనావనాంచద్దయావలంబ అనియు అన్నపూర్ణా ప్రతిబింబ అనియు దిట్టకవి నారాయణకవి వర్ణించియున్నాడు.

ని శ సుం

## అన్నమాంబ

క్రీ శ 1388 - 1416 సంవత్సరముల నడుమ తీరాంధ్ర రాజ్యచరిత్రలో ప్రముఖపాత్ర వహించిన అన్నదేవ చోడుని తల్లి అన్నమాంబ. అన్నదేవుడు తెలుగుశాఖకు చెందిన చోళవంశీయుడు. వీరిని ఎరువరాజ్య చోళులని చరిత్రకారులు చెప్పుచున్నారు.

నెల్లూరుజిల్లాలోని దర్శి పొదిలి తాలూకాలలోని కొంత భాగము కడపమండలములోని బద్వేలు సిద్ధవటము తాలూకాలోని కొంతభాగము కర్నూలు మండలములోని మార్కాపురము తాలూకా ప్రాంతము పూర్వము ఎరువనాడని వ్యవహరింపబడినట్లు శాసనములమూలమున తెలియుచున్నది. దీనికి తురుమెళ్ళ రాజధాని.

కాలక్రమాంతరముచే ఈ వంశములోని చోడభక్తీశ్వరుడను రాజు తీరాంధ్రమునకు రావలసివచ్చెను. కామరాజుననది ఈతని పుట్టుపేరు. పరమమాహేశ్వరుడైన కతన ఈతనికి భక్తీశ్వరుడను పేరువచ్చెను. ఇతని భార్యయే అన్నమాంబ. కుమారుడు అన్నదేవుడు.

అన్నదేవుని రాజమహేంద్రవరమునగల వస్తుప్రదర్శనశాలయందలి తామ్రశాసనమునందు అతని తల్లి అన్నమాంబయే కాక వేరొక అన్నమాంబ పేర్కొనబడినది. కాని ఈమె భర్త పేరుగల రాతిరేకుపోయినది. యుద్ధాంగణమునందు చనిన ఆ వీరవరుని భార్య అన్నమాంబ. ఆమెకు ఏటువ భీముడుపుట్టెను అని ఆ శాసనభాగము మొదలిడినది. ఈ ఏటువ భీముని మనుమని మనుమడు భీమరాజు. ఇతని భార్య పేరుకూడ అన్నమాంబ యని ముందే చెప్పబడినది.

ని శ సుం

## అన్నమాంబ

క్రీ శ 1390లో కుమారగిరిరెడ్డి కొండవీటి సింహాసనాధీశ్వరుడుగా నుండి తీరాంధ్రదేశమునందు రాజ్యనిర్వహణ సౌకర్యమునకై రాజమహేంద్రవరమును రాజధానిగా జేసికొని పాలించెను. ఆనాటి నుండియు కొండవీటి రెడ్డిరాజులది పూర్వసింహాసనము ఈ రాజమహేంద్రపురికి. కుమారగిరిరెడ్డి కుమారుడైన రెండవ అనపోతారెడ్డి మొదటిరాజు. ఇతనికి తోడనీడగ ఉండినవాడు రాజనీతిజ్ఞుడు పండితుడునైన కాటయవేముడు. కొండవీటి పతనానంతరము రెడ్డిరాజ్యమును రాజమహేంద్రవరమున మరికొంతకాలము సాగించినవాడు

ఈయనే రెండవ అనపోతు మరణించిన తరువాత కుమార గిరి రాజమహేంద్రవర రాజ్యమును కాటయవేమునకు సంతోష పూర్వకముగా నొసగెను. కాటయవేముడు రాజబంధువేకాని అన్యుడుకాడు. కుమారగిరిరెడ్డి చెల్లెలయిన దొడ్డాంబికకు భర్త అనగా బావమరది. దొడ్డాంబికా కాటయవేములకు కుమార గిరిరెడ్డి అనితల్లి అనువారు కలిగిరి. హరిహరాంబయను వేరొక కూతురును కలదు. కాటయవేముని యనంతరము రెండవ కుమారగిరిరెడ్డి పక్షముననే అల్లాడరెడ్డి రాజమహేంద్రవర మును పాలించెను. అల్లాడరెడ్డి బహుపరాక్రమవంతుడైన సేనానాయకుడు. ఇతడును కాటయవేమునివలె రాజబంధువే. ఇతడు కొండవీటి రెడ్డిరాజగు అనవేమారెడ్డి పౌత్రియైన వేమాంబను వివాహమాడినట్లు కాశీఖండములో (1-31) చెప్పబడినది. కాటయవేమారెడ్డి కుమారుడైన కుమారగిరి చిన్న వయస్సుననే మరణించెను. అప్పటికి దేశమంతయు స్వామి ద్రోహపరాయణ కన్నృశిజలరాశి నిమగ్నమై యుండెను. ఒకవంక ప్రక్కలోని బల్లెమైన అన్నదేవచోడుడు వేరొకవంక జ్ఞాతి పెదకోమటి వేమన రాజమహేంద్రరాజ్యమును కబళింప యత్నించుచుండిరి. ఇట్టి తరుణమున అల్లాడరెడ్డి ధరణి వరాహమై శత్రురాజుల నిశ్శేషముగా సంహరించి కాటయ వేముని కూతురైన అనితల్లికి రాజ్యమును అప్పగించెను. ఈమెయే రాజమహేంద్రవర రాజ్యమునకు వారసురాలు. ఎమ్మట ఈమె అల్లాడరెడ్డికి కోడలుగూడ అయ్యెను.

అల్లాడరెడ్డి పంటరెడ్డి వంశమునకు చెందినవాడు. నెల్లూరుజిల్లాలోని పినాకినీనదీతీరస్థమైన దువ్వూరిగ్రామమందు నివసించువారైన పెరుమాండిరెడ్డి వీరి మూలపురుషుడు. వీరు దేటులు అనగా రాజోద్యోగులు. వీరిగోత్రము పోలోల్వలి గోత్రమని కొమ్ముచిక్కాలవలశాసనము చెప్పుచున్నది. నెల్లూరుతాలూకాలోని దువ్వూరిగ్రామము దుర్వాసుని ఆశ్రమమట. ఇందు కోటీశ్వరాలయము కలదు. పెరుమాండి శివభక్తుడు. బహుశః ఈ కోటీశ్వరుని పేరే కాబోలు తన బిడ్డలైన పెదకోట ఎనకోటరెడ్లకు పెట్టియుండును. పెరుమాండి పేరు క్రీ శ 13 వ శతాబ్ది వెలూరి శాసనములలో కనిపించుచున్నది. కాని ఆ పెరుమాండిరెడ్డి ఈతడేనని స్పష్టముగా చెప్పలేము. ఈ పెరుమాండిరెడ్డి భార్యపేరే అన్నమాంబ. ఈమెకు పెరుమాండిరెడ్డివలన అల్లాడరెడ్డి పెదకోటరెడ్డి ప్రోలరెడ్డి దొడ్డారెడ్డి ఎనకోటరెడ్డి అను అయిదుగురు పుత్రులు కలిగిరి. ఇందు దొడ్డభూపాలుని అన్నమాంబవలన ప్రోలరెడ్డి కోటరెడ్డి అల్లాడరెడ్డి అనువారు ఉద్భవించిరి. పెరుమాండిరెడ్డిమనుమడును దొడ్డారెడ్డికుమారుడును అయిన అల్లాడరెడ్డియే రాజమహేంద్రవరరాజ్యచరిత్రలో చిరస్మరణీయుడు. చిత్రమేమనగా అల్లాడరెడ్డి తల్లియు నాయనమ్మయు అన్నమాంబా నామధేయలే.

ఖం ల రం

వి శ మం

## అన్నమ్మ

ఈమె పేరు పల్నాటి వీరచరిత్రయందు కానవచ్చును. ఈమెయొక వైశ్యభామ. బాలచంద్రుడు ఉబుసుపోక బొంగరములాడగోరి తల్లియైన ఐతమ్మ ఆజ్ఞను అర్థించెను. ఊరక బొంగరములాడినచో స్త్రీలకు తగులును. వారు శపింతురు వలదని ఐతమ్మ కొడుకు బాలచంద్రుని ఆయుష్యమునుండి వారింప యత్నించెను. కాని అతడు వినడయ్యెను. అతడు బంగారు బొంగరములు కావలెనని పట్టుపట్టెను. ఐతమ్మ బంగారు బొంగరములు చేయించిచ్చెను. మేడలలో మేలైన రచ్చలలో వీధిమార్గములలో విబుధుల గేహములమధ్య బొంగరము లాడకూడదనియు గ్రామమువెలుపల ఆడుట శ్రేయస్కర మనియు కుమారునకు ఆమె బుద్ధిచెప్పి పంపెను.

బాలచంద్రుడు చెలికాండ్రతో బొంగరములాడుటకు టకు ఊరిబయటకు చేరెను. అమ్మలక్కలు అచ్చట గుమిగూడి ఆటను చూచి ఆనందించుచుండిరి. బాలచంద్రుని బొంగరము అచట స్త్రీలలో వొకతెయగు అన్నమ్మయను వైశ్యాంగనమీగాలికి తగిలి ఆమె మూర్ఛిల్లెను. చెంతనున్న స్త్రీలు ఆమెకు శైత్యోపచారములు చేసిరి. అన్నమ్మ కొంతసేపటికి తెలివినొంది "పోతుసింగమువలె మన్నుమిన్ను కానక పోతరించితివి. మీ అయ్యలకు యుద్ధమున సాయపడ కార్యమపూడికిపొమ్ము. అచ్చట శత్రువులు నీ పొంకమడచెదరు" అని బాలచంద్రుని తూలనాడెను. ఆమె పలుకులు తన చెవులలో ములుకులై నాటిన బాలచంద్రుడు వినయముతో ఆ వైశ్యస్త్రీని మన్నింపవేడుకొని తల్లికడకు వేగముగాపోయి యుద్ధరంగమునకుపోవ ఆజ్ఞనొసగుమని ప్రార్థించెను. తల్లి ఐతమ్మయు భార్య మాంచాలయు ఎంత వారించినను వినక బాలచంద్రుడు పల్నాటియుద్ధములో పాల్గొని శౌర్యాతిశయమును ప్రకటించి పలువురు వీరులను పరిమార్చి భారతయుద్ధమున అభిమన్యునివలె శత్రువులచే

నిహతుడయ్యెను

లోకములో దియేని అనర్థము రామున్నపుడు దాని సూచనగా ముందుగనే కొన్నిన ఘటలు ప్రసంగములు జరుగుచుండును తొలుత బొగరములుచేయునపుడు బగారము చిమిడిముక్కలగుట ఒక దుస్స ఘటన కొడుకునకు బుద్ధి చెప్పు సందర్భమున బమ్మ గ్రామమధ్యమున బొగరములాడుట హాకరము ఎప్రికేని తగిలించొశం చును తన్మూలమున అనర్థము తప్పదని లికెను అమాటని క్రమయ్యెను అన్నమ్మయను వైశ్యా గనమీగాలికి కాంచ ద్రునిబొగరము తగులుట అమెక్రోధావేశమున యుద్ధములో శత్రువులు నీ మదమణచెదరని శపించుట అట్టి రుషోక్తియే ఆతనిని యుద్ధోన్ముఖుంచేయుట అతడు శత్రునిహతుడగుట జరిగెను

గ ల కాం

## అన్నయ చూ అన్నయ్య మంత్రి

## అన్నయ ఇదులూరి చూ అన్నయ్య ప్రధాని

## అన్నయ - తెనాలి

గుంటూరు మండలము న దలి తెనాలి పట్టణము పూర్వమునుడి నేటి వరకును పండితులకు నిలయమై ఎసగుచున్నది సుప్రసిద్ధ కవిశేఖరుడును హాస్యనిధియును పాండురంగమాహాత్మ్యాదిగ్రంథకర్తయునగు తెనాలిరామకృష్ణుడను శ్రీశైలమాహాత్మ్యగ్రంథ రచయితగు శ్రీగిరికయును సుదక్షిణాపరిణయ వ్యాకర్తయైన అన్నయ కవియును తెనాలి వాస్తవ్యులే ఈ సోదరత్రయము తెనాలి రామపండితుని కుమాళ్లు వీరిలో పెద్దవాడు తెనాలి రామకృష్ణుడు రెండవవాడు శ్రీగిరి మూడవవాడు అన్నయ వీరి జనని లక్ష్మమ్మ వీరు యాజ్ఞవల్క్యనియోగిశాఖకుచెందిన బ్రాహ్మణులు ఈ శాఖనే ప్రథమశాఖ అనియు శుక్లయజుర్వేదీయశాఖఅనియు నుశ వుదురు వీరిది కౌండిన్య గోత్రము

అన్నయ కాలమునుగూర్చి వ్రాయుచు క దుకూరి వీరేశలిగము పంతులుగారు తమ ఆంధ్రకవుల చరిత్రలో "ఇతడు క్రీ శ 1580 ప్రాంతమువాడని వ్రాసిరి మాన వల్లి రామకృష్ణ కవిగారు క్రీ శ 1565 ప్రాంతమున ఇతడు డెనంచెప్పిరి చాగంటి శేషయ్యగారు తమ ఆంధ్రకవి తరంగిణి తొమ్మిదవ సంపుటములో ఇతడు తన సుదక్షిణా పరిణయ గ్రంథమును క్రీ శ 1560 ప్రాంతమున పులిజాల సోమయామాత్యునకు కృతియిచ్చెనని వ్రాసిరి కావున ఈ కవి క్రీస్తుశకము పదునారవ శతాబ్ది మధ్యమున జీవించియుండెనని స్పష్టమగుచున్నది సుదక్షిణాపరిణయకావ్యకృతిపతి సోమయామాత్యుడు ఈతని తండ్రిరామయామాత్యుడు వీరిది కాశ్యప గోత్రము సోమయామాత్యుడు కోనేటిరామరాజ నృపాలునొద్ద మంత్రిగను డెను ఈ రామరాజు అర్వీటివంశీయుడగు అళియరామరాజుకు మునిమనుమడు అళియరామరాజు ఈకోనేటి రామరాజునకు కొంత రాజ్యమును కూడ ఇచ్చినట్లు సుదక్షిణా పరిణయకావ్యము వలన తెలియుచున్నది ముత్తాతయగు అళియరామరాజు ము మనుమడగు కోనేటి రామరాజునకు రాజ్యము కొంతఇచ్చుట అనునది సత్యవిషయమగునా? అను శంక నిపవచ్చును

మునిమనుమడను ముత్తాతయును ఎకకాలములో నుడిన సందర్భములు కొన్ని కుటుంబములలో కనవచ్చుచునేయున్నవి అళియరామరాజు జననకాలము క్రీ శ 1486 ప్రాంతము తళ్లికోటయుద్ధమున (క్రీ శ 1565) మరణించునాటికి అతని వయస్సు ఎనుబది సంవత్సరములు కోనేటి రామరాజు జననము క్రీ శ 1525 ప్రాంతమని నిర్ణయించుటచే అళియరామరాయలు మరణించునాటికి ఈ కోనేటి రామరాజు వయస్సు నలుబది సంవత్సరములు అందుచే అళియ రామరాజు కోనేటి రామరాజునకు కొంత రాజ్యమొసగెనను విషయము సమంజసముగ నున్నదని యెంచవలెను

తెనాలి రామకృష్ణకవి తన పాండురంగ మాహాత్మ్యములో వ్యంగ్య రీతిని రామరాజభూషణుని వసుచరిత్ర పేరు ఎత్తుటచే అతడు వసుచరిత్రకారునకు కొంచెము ఈవల ఉన్నవాడగును అగుచో అతని తమ్ముడైన సుదక్షిణా పరిణయ కర్త వీరేశలింగము పంతులుగారు నిర్ణయించినట్లు క్రీ శ 1580 ప్రాంతమువాడనుటయే యుక్తము ఈ కాలము అళియ రామరాజు ము మనుమనికి కూడ చక్కగా కుదురును

"ఇది శ్రీమత్తెనాలి రామేశ్వర శాశ్వతకృపాకటాక్ష లక్షిత కవితాభిరామరామయ పండిత కుమారసహజశైవాచార సంపన్న ధీమదన్నయ నామధేయ ప్రణీతంబైన సుదక్షిణాపరిణయంబను శృంగార కావ్యంబు" అను సుదక్షిణా పరిణయ మందలి గద్యవలన అన్నయకవి నివాసము తెనాలియే యని తెలియుచున్నది కృతిపతియగు సోమామాత్యుడు "మణికుట్టిమ ప్రాసాదసౌధ మహాహట్ట శాదాలి పట్టణ శ్రీకిరీటంబగు

కొలువు కూట బున నుండి తనను పిలిపించుకొని నట్లు అన్నయ సుదక్షిణాపరిణయ గద్యము దు వ్రాసెను ఈ బాదాలి పట్టణ మెచ్చట ను న్నదో తెలియరాకున్నది బళ్లారి మ డలములోని హర్పణహల్లి తాలూకాలో బాగాలి అను గ్రామమును అన తపురము జిల్లాలోని హిందూపుర ము తాలూకాలో బూదలి అను గ్రామమును ఉన్నవి బాదాలి ఈ రె డి టిలో నొకటియై యు డునేమో అని ఊహి చు చున్నారు అన్నయ కృతి తిని పులిజాలధామ అని న బో ధి చుటచే కృతిపతి నివా ము పులిజాల అయినట్లు తెలియు చున్నది ఈ బాదాలి పులిజాల అనునవి మాత్రము ఒక్కటి యని చెప్పవీలులేదు ఇ దు మొదటిది కృతి భ ర్తయొక్క ఉద్యోగముచేసిన ప్రదేశమని రె డవది జన్మస్థాన మని ఎ చ వీలగుచున్నది హరపదా భోజసౌముఖ్య అను విశేషణము వలన అన్నయకవి మొదట శైవుడై యుండెననియు సుదక్షిణా పరిణయమ దలి

క దాళ భావనార్యుల
న దను శ్రీరంగ గురుని తబుధరజా
మ దార బు నుతి తును

మ దార మర దలి దు మధురారభటిన్" అను పద్య మువలన వైష్ణవమతమును స్వీ రి చెనియు తెలియవచ్చు చున్నది అన్నయకు విద్యాగురువు భీమేశ్వరుడు వైష్ణవమత మునిచ్చినవాడు క దాళ శ్రీరంగాచార్యులు అ న్నయ వైష్ణవాచార్యుని శిష్యుడయ్యు శైవాచార స న్నడ ని గ్ర థా తమున వ్రాసికొనుటచే ఇతడు శివకేశవుల య దు అభేదబుద్ధి కలవాడని యె చనగును కృతి భ ర్తయగు సోమ యామాత్యుడు అన్నయతో

పలుకులకల్కి క ప్పరపు బల్కులచల్లి రీతి బండువె
న్నెల తళుకుల్ విధు డు హవణించన మి చన
శ బరారిచెం
గలువల తూపు గోపుల ముఖాముఖి జూపిన
యేపున గృతుల్
పలుకగ నేర్తు పూర్వకవి పద్ధతిరామయయన్నసత్కవీ"

"సరససాహిత్య సౌహిత్య పరత నీవు పరిఢవించు దక్షిణాపరిణయ బును కీర్తి విలసిల్ల మాకు నంకితముసేయు తేటయగు వాగ్విలాసంబు కోటిసేయు అనిన మాటలమబట్టి -అన్నయ కవిత్వము పాండిత్యము ప్రతిభ ఎంతగొప్పవో తెలియ నగును

అన్నయ కవికృతమైన సుదక్షిణాపరిణయకావ్యము అయిదాశ్వా ముల గ్ర థము ఇ దు సుదక్షిణా వృత్తా తము తుది నాలుగయిదాశ్వాసముల య దుకలదు మొదటి మూడాశ్వాసములలోను సూర్యవంశపు రాజైన దిలీపుని కథ క దు దిలీపుని జ నముతో ఆర భమయిన ఇ దలి థ సుద క్షిణాదిలీపుల పరిణయముతో పరిసమాప్తమగును అయోధ్యా నగరాధిపతియు సూర్యవ శజుడునగు అ శుమ తుడను రాజు స తతికొరకు భార్యయగు భానుమతితో మేరుపర్వత మున కేగి అచటశివునిగూర్చి తపమొనర్చెను పరమేశ్వరాను గ్రహమున భానుమతి గర్భవతియై దిలీపుని కను దిలీపుడు యౌవనవ తుడైనపుడు అ శుమ తు డాతనికి రాజ్యమునప్ప గి చి తపము ర్చ వనమునకుబోయెను దిలీపుడు రాజ్యము నేలుచు ఒకప్పుడు వనమునకు వేటాడబోయి సింహమునొక దానిని బాణముతోకొట్టెను అది స్త్రీరూపమునుబొ ది "భానుహరిణి అనుపేరుగల అచ్చరననియు వీతహవ్యముని శాపముచే సింహమయితిననియు బాణము తగులుటచే తనకు శాపవిముక్తి కలిగినదనియు రత్నచూడు ను రక్కసుని వధి చినీవొ కన్యను పరిణయ మాడుదువనియు దిలీపుతో నుడివి మాయమైపోయెను ఎవప దిలీపుడు మంత్రియగు సుద ర్శనునకీవృత్తా తము దెలిపి రత్నచూడుడను రక్కసుని వధి చి సురథుని కుమార్తెయగు సుదక్షిణను వివాహమా డెను కాళిదాస కృత రఘువ శ మహాకావ్యము దు "తస్య దాక్షిణ్యరూఢేన నామ్నా మగధవ శజా। పత్నీసుదక్షిణే త్యాసీదధ్వర స్యేవ దక్షిణా (రఘు ప్ర స 31) అనియు న్నది దీనిచే ఈ సుదక్షిణాదేవి మగధవంశ రాజకుమార్తె యయినట్లు తెలియుచు న్నది

ఈ కావ్యమున దు దిలీపుడు నాయకుడు నాయిక సుదక్షిణ ప్రతినాయకుడు రత్నచూడుడను రాక్షసుడు అ శుమ తుడు భానుమతి సురథుడు మున్నగు ఇతరులును కన వచ్చుచున్నారు ఇది రసగర్భకావ్య మనిచెప్పవొప్పను ఇందు రత్నచూడుని కృత్యములు యుద్ధవర్ణనలు అంశుమ తుడు దిలీపునకు బోధి చిన ధర్మబోధ మున్నగునవి హృదయంగమ ములుగా నున్నవి అవర జిబలుగట్టు యతి మన బులగుట్టు విల్లుగా నిల్లుగా వె యు తని వ టి పద్యముల సోయగ ముతో "కుందేటి కొదమకు గొమ్ము చూపునట్లు"వ టి జాతీ

యములతో అతిశయోక్తి ప్రభృత్యల కారములతో మిక్కిలి రమణీయమై ఈతకవిత వెలయుచున్నది ప్రౌఢమై సలక్షణమై ఈతని కవిత్వము అన్నగారగు రామకృష్ణుని కవితతో తులతూగుచున్నదనుటలో అతిశయోక్తి లేదేమో!

తం అం శా

## అన్నయ ప్రధాని

ఇందులూరి వంశీయుడగు అన్నయప్రధాని గౌరమాంబా గన్న భూవిభులకు తనయుడు ఈతడు కౌండిన్యగోత్రసంభవుడు నియోగి బ్రాహ్మణుడు ఈయన సముత్తాత అనుమకొండ నివాసియగు నానగౌర్యుడు ఈశ్వరపద పద్మారాధకుడని అతడు ఖ్యాతిగాంచెను అన్నయ ముత్తాత పెదమల్లవిభుడు కాకతి మొదటి రుద్రదేవమహారాజు చెంత సచివుడై అతడు కీర్తిగాంచెను అన్నయతండ్రియగు గన్నభూవిభుడు వైరిరాజ దుర్మదపావకభంజనభుజప్రభవాస్పదుడని వాసి గాంచెను అన్నయ అగ్రజుడగు సోమవిభుడు కాకతిగణపతి దేవునికడ మంత్రియు దండనాథుడునై యుండెను అతడు మహాసమర్థుడు కాకతీయ ప్రత్యర్థులగు మాండలికులను పారద్రోలి కొలనివీడు స్వవశ మొనర్చుకొనినకారణమున గణపతిదేవచక్రవర్తి తనిని కొలని సోముడని వ్యవహరించెను ఇట్లు ఇందులూరి వారు కాకతీయ భూజానులకు సచివులై సేనానులై కాకతీయ సామ్రాజ్యరక్షణమునకు నిరంతము పాటుబడినవారు

ఇందులూరి అన్నయామాత్యుని చరిత్రము తెలిసికొనుటకు శివయోగసారమను గ్రంథము మిక్కిలి ఉపకరించుచున్నది ఈ గ్రంథమును కొలనిగణపతి దేవుడను కవిరచించెను ఇతడు కొన్ని అన్నయామాత్యుని పెక్కుపద్యములతో కొనియాడెను అందు అతిశయోక్తులున్నను అవి అన్నయప్రధానిమహామహత్త్వమును బలపరాక్రమాదులను చక్కగా తెలుపుచున్నవి ఆపద్యములలో ఒక సీసపద్యము అన్నయనిట్లు వర్ణించినది "అత్యుత్తమంబైన యత్యాశ్రమస్థుండు కారణజన్మసంగతి వహించె" ఈ పాదమునందలి అన్నయ కారణజన్మత్వమునకు శివయోగసారమున ఒకకథ ఇట్లున్నది అన్నయతల్లిదండ్రులగు గౌరమాంబా గన్నవిభులు పుత్రసంతతికై తపించుచు అనేక పుణ్యవ్రతములాచరించినారట అంతలో ఒక దినమున ఒకయతి గౌరమాంబ వద్దకువచ్చి తల్లీ! నాకింకొక జన్మముకలదు నీకడుపునకొమరుడనై పుట్టి ఇరువదియేండ్లు రాజ్యభోగము ననుభవించి ఆ పిమ్మట ముక్తిగాంతును ఇది దైవనిర్ణయము నీకువిశ్వాసము జనించుటకై నీకు పుట్టబోవు శిశువుయొక్క రూపచిహ్నములను ఇప్పుడే నీకు వ్రాసి ఇచ్చుచున్నాను "అని ఆయతి కొన్ని గుర్తులు వ్రాసి గౌరమాంబకొసంగి కాశీశ్వరమునకుపోయి అచ్చట సిద్ధిపొంది మరుజన్మములో గౌరమాంబకు అతడు అన్నయ అనుపేరుతో తనయుడుగా జన్మించెను అందుచే తనే పద్యపాదమున ఉత్తమమైన యత్యాశ్రమమున దుండియు కారణ జన్ముడై అన్నయామాత్యుడుదయించెనని కవి తెలిపెను

అన్నయప్రధానియొక్క శ్యామాయతదేహము గౌరనేత్రములు ఉన్నతఘనతంత్రాలిము శ్రీచిదిద్దినట్లున్న నాసిక చూపరులకు కనులపండువు కలిగించెడివట అతడు చండభుజబలుడు కలియుగభీముడు అతడు స్థలగిరివనజల దుర్గములను అవలీలగ ఆక్రమించుటలో దిట్ట రాయచౌహత్తమల్ల మూరురాయర జగదాదిగండ జగమొత్తగండర బిరుదములందినవాడు ఇన్నిటి మించిన శివభక్తికలవాడు ప్రభుభక్తి పరాయణుడు ఇట్టి సుగుణసంపత్తి కలవాడగుటచేతనే అన్నయప్రధానికి కాకతిరుద్రమదేవి తనగాదిలిసుతయైన రుయ్యాంబనిచ్చి వివాహ మొనరెను అన్నయప్రధాని పెంపుడు కొమరుడు కొలనిరుద్రదేవుడు అన్నయామాత్యుడును కొలని రుద్రదేవుడును కాకతి రుద్రమదేవికడను ఆమె దత్తపుత్రుడును కాకతిరాజ్యపాలకుడును అగు రెండవ ప్రతాపరుద్రదేవ చక్రవర్తివద్దను అమాత్యులును దండనాథులును భూనాథులునునై వసించినట్లు అన్నయ మంత్రియొక్క శక 1213 (క్రీ శ 1291) నాటి త్రిపురాంతకశాసనము శక 125 (క్రీ శ 1293) నాటి ద్రాక్షారామ శాసనము నుడువుచున్నవి కాకతి రుద్రమదేవునినాటి (క్రీ శ 116?) అనుమకొండ వేయిస్తంభముల గుడిలోని శాసనము ఆధారముగ ఆనాటి కాకతీయ రాజ్యపు సరిహద్దులిట్లు తెలియుచున్నవి

"రాజ్యం ప్రాజ్యం (ప్రాచ్యం) లవణజలధేస్తీరపర్యస్తమస్య
శ్రీశైలాన్తాం ప్రతివరతి సదా దక్షిణాశాం సమగ్రాం
ప్రాతీచ్యాన్తా కటక నికట స్థాయినీ రాజ్యలక్ష్మీః
కౌబేర్యాశాతట విలసితే మాల్యవస్తం ప్రదేశే॥"

కాకతీయ సామ్రాజ్యము తూర్పున బంగాళాఖాతమువరకు దక్షిణమున శ్రీశైలమువరకు పడమట (కల్యాణి) కటకము వరకు ఉత్తరమున మాల్యవంతమువరకును వ్యాపించియున్నది

అనగా తూర్పున గోదావరి ముఖద్వారమువరకు గల భూమియు శ్రీశైల ప్రాంతమ తయును గుంటూరు కర్నూలు మండలములను వేంగిదేశము కాకతీయుల ఏలుబడిలో ఉన్నవి కాకతీయుల రాజ్యపు ఉత్తర సరిహద్దుకు మాండలికులవలనగాని గజపతులవలనగాని ప్రమాదములు మెండయ్యెను ఈ ప్రమాదము గణపతిదేవుని పాలనకాలము నుండియు జరుగుచునే యుండెను గణపతి దేవుని కాలమున కళింగపాలకుడగు మూడవ అనియంక భీమదేవుడు కాకతీయుల ఉత్తర సరిహద్దుకు అలజడి కలిగించెను అప్పుడు గణపతిదేవుడు తన ప్రధాని యగు మల్యాల హేమాద్రిరెడ్డిని గజసైన్యాధ్యక్షుడగు జాయపనాయకుని కాలప నాయకుని పంపి ఆయుపద్రవమును వారించెను ఈవిషయమును ద్రాక్షారామమునందలి హేమాద్రిరెడ్డి శాసనములు నుడువుచున్నవి కాలపనాయకునకు వేగివిషయాధినాథ అను బిరుదము శాసనములో కనపడుటచే అతడు వేగిపాలకుడై యుండెను తెలియుచున్నది ఈ విషయము శక 1176 నాటి కాలపనాయకుని ద్రాక్షారామ శాసనము చెప్పుచున్నది కాకతీరుద్రమదేవి (క్రీ శ 1 59) మహారాజ్ఞి అయినప్పటి ఆమె పాలనము ఇష్టములేక ఎదురుతిరిగి స్వతంత్రులైనాలమనెడి కొల్పి వారుగలరు కాయస్థ వంశజులగు జన్నిగదేవ త్రిపురారిదేవులు రుద్రమదేవికి విధేయులుగనే ఉండిరి అంబదేవుడు మాత్రమే ఆమె అధికారమును ధిక్కరించెను ఈతడు క్రీ శ 1272 వరకును అధికారమునకు రాలేదు మరియు పాండ్య దేశాధీశులును గుంటూరి మాండలికులును చోళరాజై దక్షిణుడను పల్లవరాజగు కొప్పెరుంజి గడును వీరువ మల్లిదేవుడను కళింగ గజపతులును ముఖ్యులు వీరి యుపద్రవమును అరికట్టుటకు రుద్రమదేవి తన సకలసేనాధిపతియగు బొప్పదేవుని అన్నమ త్రి మున్నగువారిని పంపెను బొప్పదేవుడు గుంటూరు మాండలికుడగు నాగదేవరాజు తల గొట్టి నాగదేవతల గొండుగండ అనియు కళింగ మాండలికుల ధాటిని పాండ్యుల అలజడిని అరికట్టి కళింగ మాండలిక ధాటి మర్థరాయ కురువతోండ బొంయరాయకు వరపడి పాణవల్ల అను బిరుదముల వహించినట్లు శక 1188 (క్రీ శ 1261) నాటి త్రిపురాంతక శాసనమువలన తెలియుచున్నది ఈయుపద్రవములనరికట్టినవారిలో పోతనాయకుడు ఆతని కొమరులగు మారవ పోతయ మారయ అనువారును ముఖ్యులు వీరిలో మారయ పోతయ అనువారు కళింగ గజపతులగు మొదటి భానుదేవుయొక్కయు (శక 1168 1210) ఆతని కుమారుడగు రెండవ నరసింహదేవు యొక్కయు (శక 1201-1238) దండయాత్రను అరికట్టి కళింగ రాజధానియగు కటకమును నాశన మొనర్చినట్లు కాకతీయసంచికలోని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్యాసమునకలదు (కా స పుట 186)

క్రీ శ 1261లో అంబదేవునిపై జరిగినవిజయములో అన్నయ మంత్రియుండెను తనసామ్రాజ్యమునందలి ఇట్టి మహోపద్రవమును అరికట్టుటకు తన సేనాపతులతోపాటు ఇందులూరి అన్నయామాత్యునిగూడ రుద్రమదేవి పంపినట్లును అతడు కళింగులతో పాండ్యులతో ఇతర మాండలీకులతో జరిగిన సమరములలో పాల్గొనినట్లును శివయోగసారమునందలి పద్యములమూలమున తెలియవచ్చుచున్నది అన్నయయొనర్చిన ఘనకార్యములు ఇట్లు కనవచ్చుచున్నవి

అన్నయ మోపూరి రాజులయేపు అణగించెను అతడు స్థల గిరి వన జల దుర్గములను పట్టుకొనెను డెబ్బదిరెండు దుర్గములలో తన బందుగులనిలిపెను మోపూరి రాజును జయించి ఇరువత్తుగండ బిరుదమును గైకొనెను కాకతీయ సామ్రాజ్య రక్షణమునకు ఇట్లెంత యోసాయ మొనరించిన రాజబంధువగు అన్నయామాత్యుని కొలనిరుద్రదేవుని కాకతి రుద్రమదేవి ఓరుగల్లు మొదలుసింహాచలమువరకుగల ప్రాంతమునకు పాలకులుగ నియమించెను ఆ విషయమే శివయోగసారమున ఇట్లు వర్ణింపబడినది

మొగినోరుగంటి తూర్పుగవని మొదలుగా
సింహాద్రి సీమగా శితిశరి చె
హారుడు (లు పన్నెండువేల శియ రౌతు(ల)
పంచమలక్ష కాల్బలమునే లె
వార్వేలు శూల (ఖడములు) గొని కాళింగ
పతియైన గజపతి బాబదోలి
చా (సులతానోరుగల్లైన) చుట్టుముట్టనె
క్కువ లింబాసె (కోలోక్క) టగాచె
నేఘమైపంచ పాండ్యుల రూపుమాపె
యోల చెల్లాదిగా భూమి లింగొనియె
గొలనిరుద్రుడు దాను నిశ్చలత నిందు
లూరి యన్నయదేవు డమానబలుడు

(శివయోగ-44 పద్య)

పైవద్యమువలన అన్నయ యందలి శౌర్యసాహసాది గుణములును ఆయన గజపతులను పాండ్యులను సులతానులను పారద్రోలిన విధమును మనకు తెలియవచ్చుచున్నవి అన్నయ వేగిరాజ్యమును సామర్థ్యముతో పరిపాలించి రీతి వేగిధరిత్రిలో విలసిల్లునెడ అను పద్యమున కవి వర్ణించెను వేగిరాజ్యమునకు సూరవరము రాజధానిగచేసికొని అన్నయ పాలించెను అన్నయ కొలనివీడు ఆదిగాగల ప్రాంతములకు భద్రుని గన్నయభద్రుని రక్షకులుగా నియమించెను రాజమహేంద్రవర దుర్గమునకు తన మేనమరదియగు వర్వశమల్లును రక్షకుని గను చేసెను మనుమగన్నయ్య జామాతను ఓలచర్లను రక్షకుని చేసెను నూజెర్ల కచెర్ల రక్షకులుగ మగిరాజు ముగిరాజు నరసరాజు గన్నదేవరాజు అనువారిని చేసెను ఇట్లు వేగిరాజ్యములో శత్రువిజృంభణమును అరికట్టి శాంతిని స్థాపించుటలో అన్నయ మిక్కిలి పాటుపడెను అయిదువన్నెల గొడుగు అర్ధచంద్రాంకిత విజామరములు మున్నగు రాజలాంఛనములతో పులితలాటముల ధరించిన మదపుటేనుగునెక్కి అన్నయమంత్రి సామంతవీథులలో సంచరించెడివాడట (శివయో 48వ) అన్నయ ప్రధాని రెండవ ప్రతాపరుద్రదేవుని కాలమున (క్రీ శ 1296 1323) ఓరుగల్లును ముట్టడించిన ఉలుఘ్‌ఖాను (ఇతడు ఢిల్లి పాదుషా ఘియాజుద్దీనుకొమరుడు) సమరమున ఓడించి కోట శత్రువశము కాకుండ రక్షించెను ఈ యుద్ధము క్రీ శ 1321 లో జరిగినది సమరమున ఓడిన ఉలుఘ్‌ఖాను దేవగిరికి పారిపోయెను ఈ విషయమునే శివయోగసారమున

> ఓం తురకల గెల్చి ప్రతాపరుద్ర
> మనుజనాయకు కోట నేమరక గాచె
> నుచు బొగడొందె నియ్యవని నిందు
> లూరియన్నయదేవుడనూనబలుడు

అని కవి వర్ణించెను

త్రిభువన చక్రవర్తి బిరుదాంచితుడైన శ్రీరాజాధిరాజదేవర విజయరాజ్యసంవత్సరంబులు 6 నాటి శాశ 1215 (క్రీ శ 1 93) వృషభబహుళ సప్తమీసోమవారమున అన్నయ ప్రధాని ద్రాక్షారామమునందలి భీమేశ్వరస్వామివారికి పంచశత నిష్కముల దానమొసగి చిట్లు దక్షిణ హిందూ శాసనములలో కనగచ్చుచున్నది ఈ శాసనము ద్రాక్షారామ భీమేశ్వరాలయములోనిది శాసనకాలమునాటికి మధ్యాంధ్రప్రదేశమును త్రిభువన చక్రవర్తి బిరుదాంచితుడును చోళవంశీయుడునునైన మూడవ రాజాధిరాజు పాలించుచుండెను ఆనాటి కాంధ్రదేశము కాకతీయసామ్రాజ్యమునకు సంక్రమించినట్లులేదు ఈ మూడవ రాజాధిరాజు చాళుక్య చక్రవర్తులలో కడపటివాడని యూహింపవచ్చును ఇతని నామము ద్రాక్షారామ శాసనములందు మాత్రమే కనబడుచున్నది రాజాధిరాజు ప్రశంసగల మొదటిశాసనము శక 1174 (క్రీ శ 1 52) నాటిది ఇది యాతని మూడవ యేడవ రాజ్యసంవత్సరముగా చెప్పబడినది ప్రస్తుతశాసనము అతని డెబ్బదియారవ సంవత్సరమును పేర్కొనుచున్నది

దీనినిబట్టి యాతని రాజ్యారంభము (శక 1215 76 1 39, క్రీ శ 1217 గా ఎర్పడుచున్నది క్రీ శ 12 లో ఉండినవాడు చోళచక్రవర్తి మూడవ రాజరాజు ఇతడు క్రీ శ 1216 60 వరకు చోళసింహాసనముపైనుండెను క్రీ శ 1278 తో చోళసామ్రాజ్యము అంతమొందెనని చెప్పుచున్నారు కావున త్రిభువన చక్రవర్తి అను పెద్దపేరు ధరించిన ఈ వ్యక్తి నామమాత్రుడైన చాళుక్యచోళ చక్రవర్తి కావచ్చును మూడవ రాజరాజు కాలమునుండి అన్నయమంత్రి శాసనకాలమునకు అనగా క్రీ శ 1293 నాటికి రమారమి 76 సంవత్సరములు గడచినమాట నిజము అతియేకాని 76 వ రాజ్యసంవత్సరమెట్లయ్యెనో చెప్ప వీలులేకున్నది

అన్నయప్రధాని ఇట్లు తన జీవితమంతయు కాకతీయరాజ్యసంరక్షణమునకై వినియోగించిన ధన్యజీవి ఇతడు మంచివాడై సేనానియై పాలకుడై రాజజామాతయై కాకతీయ భూపాలురకు అకుంఠిత సేవ యొనర్చెను

శం అం శా

## అన్నయ మంత్రి

అన్నయమంత్రి భీమనకుమారుడు ఈయన ఇంటి పేరు బమ్మెర వారు ఈతడు నియోగి బ్రాహ్మణుడు కౌండిన్యగోత్రుడు ఆపస్తంబసూత్రుడు ఈయన భార్య పేరు గౌరమాంబ ఈయనకు సోమనమంత్రి అను సుతుడు కలడు సోమనకు ఎల్లన అను కుమారుడును ఎల్లనకు కేసన అను తనయుడును కేసనకు ఆంధ్రభాగవతగ్రంథకర్తయగు పోతన అను కుమారుడును తిప్పన అను పెద్ద కుమారుడును కలరు ఈ వంశము వారి నివాసస్థానము తెలంగాణమునందలి బమ్మెర అను గ్రామమైనట్లు తెలియుచున్నది వీరిది పండిత

వంశము అన్నయమంత్రి తాతగారి పేరు మల్లయ అని వీరభద్రవిజయము (ఇది పోతన చేరదు గాబడినది) చెప్పుచున్నది. అన్నయమంత్రికి అయిదవతరము వాడు పోతన. శ్రీ చాగంటి శేషయ్యగారు ఊహించిన ప్రకారము పోతన సుమారు క్రీ.శ. 1450 ప్రాంతము అని అనుకొనినచో తరమునకు ఇరువది అయిదు సంవత్సరములు వంతున తీసికొనినచో అన్నయమంత్రి ఉనికి క్రీస్తుశకము పదునాలవ శతాబ్ది పూర్వార్ధమని కాని లేక మధ్యకాలమని కాని ఊహింపవీలగుచున్నది. అన్నయ వ్రాసిన కావ్యములను గూర్చిగాని యతని జీవిత విశేషములను గూర్చిగాని పోతన తన భాగవతమునందుగాని వీరభద్ర విజయమునందుగాని మరెచ్చటనుగాని ముచ్చటించలేదు. భాగవతమునందలి తమ వంశవర్ణనమునందు పోతన "భీమమంత్రి ప్రియపుత్రుడన్నయ కలకీర్తి తద్భార్య గౌరమాంబ" అని మాత్రము అన్నయ్యను గూర్చి వ్రాసెను. అన్నయ కుమారుడగు సోమన అను వానికి రేచన, నన్నయ, ఎల్లన, అయ్యలు, ప్రెగ్గడ మాచయ అను సుతులును, వారిలో ఎల్లన అను వానికి కేసన, మాధవుడు, ఇమ్మడి అను కుమాళ్లును, వారిలో కేసనకు తిప్పన, పోతన (ఆంధ్రభాగవత గ్రంథకర్త) అనువారును, మాధవునకు కేసన అను సుతుడును జన్మించిరని పోతన వీరభద్రవిజయమునందు కృతికర్త వంశాభివర్ణన సందర్భమున వక్కాణించెను.

తన తండ్రియగు కేసన మంత్రిని మాత్రము వీరభద్ర విజయమునందు పోతన ఇట్లు ప్రశంసించెను. కేసనమంత్రి భూసురవంద్యుడు, సుగుణభూషణుడు, ఆశ్రితకల్పవృక్షము, దానజనప్రసన్నుడు, శివతత్త్వజిజ్ఞాసువు, సత్యనిధి, కీర్తి విశాలుడు.

తం. అం. శా.

## అన్నయ లెంక

కాకతీయ రాజన్యులు రాజ్యమొనర్చు కాలమున ప్రభువులతో పాటు మహాప్రధానులు, ప్రధానులు, రాజప్రతినిధులు, మండలాధికారులు, సేనానులు, సాహిణులు, లెంకలు మున్నగు రాజోద్యోగులు తమ తమ పదవులను సక్రమముగ నిర్వహించుటయేకాక అనేక దానధర్మములొనరించినట్లును దేవాలయ నిర్మాణములు చేసినట్లును శాసనముల వలన తెలియుచున్నది. అట్టివారిలో అన్నయలెంక అనునతడు ఒకడు. ఇతడు రాయగజసాహిణి మాదయరెడ్డి యొక్క చిన్ని తమ్ముడు. మాదయరెడ్డి రెండవ ప్రతాపరుద్రునికడ సైన్యాధిపతిగనుండినట్లు తెలియుచున్నది. లెంక అను పదమునకు సేవకుడు అను సాధారణమైన అర్థమున్నను సమయమువచ్చినపుడు ప్రాణములనర్పించి రాజ్యమును రాజును రక్షించునట్టి శక్తిమంతుడను విశేషార్థము గూడ ఉండినట్లు చరిత్రను బట్టి ఊహింపవీలగుచున్నది. కాకతీయ ప్రభువులు తమ కొలువులో పని చేయుచున్న ఉద్యోగుల పోషణమునకు గాను నాయంకరమును ఒసగిరి. అట్లే వారు లెంకలకు గూడ నాయంకరముల నొసగి పోషించిరి. నాయంకరములనగా పోషణమునకై ఒసగబడిన కొన్ని మాన్యములు. ఇట్టి మాన్యములను గ్రహించిన వారికి నాయంకరులని పేరు. నాయంకరులైన లెంకలు సైన్యమును, అశ్వములను, గజములను ప్రోగుచేసి తగిన తర్ఫీదునిచ్చి వలసినపుడు ప్రభువునకు యుద్ధమున తోడ్పడుచుండిరి. ప్రభువు వీరికొసగిన నాయంకరముల (మాన్యముల) ఆదాయముతో సైనికులకు, అశ్వములకు, ఏనుగులకు వలసిన వ్యయమును (అనగా పోషణమునకును, కొనుగోలునకును, జీతబత్తెములకును) చేయుచుందురు. సైన్యాభివృద్ధి చేయుటయు, యుద్ధములలో ప్రభువునకు సాయమొనర్చుటయును లెంకలయొక్క విధులుగా కనిపించుచున్నవి. లెంకలను పేరుతో సేనానులు మొదలుకొని అడపము (తాంబూలము) నిచ్చువారి వరకును కనవచ్చుచున్నారు.

రెండవ ప్రతాపరుద్రుని కాలముననున్న లెంకలు అనేకులు మనకు శాసనములలో కనిపింతురు. వారిలో జుట్టయ లెంక గొంకారెడ్డి అనునతడు ముఖ్యుడు. ఇతడు రెండవ ప్రతాపరుద్రదేవుని కుమారుడనియు "మూర్లోకగండ మూర్తి బ్రహ్మరాక్షస గండికోట దుర్గవిభాళ మల్లదేవర గొండుగండ స్వయంభూనాథదేవర దివ్య శ్రీపాద పద్మారాధక మహారాయ కంఠకాల నాయకుడైన జుట్టయలెంక గారు" అనియు క్రీ.శ. 1318 ప్రాంతమున ఇతడు ములికినాడు, గండికోట సీమలను పరిపాలనము చేసెనని చెన్నూరి శాసనము (క్రీ.శ. 1318) చెప్పుచున్నది. ఈయనకు రుద్రయ అను తమ్ముడు కలడు. లెంకలలో పెద్ద ఉద్యోగము చేసినవాడు మహారాయ సకలసేనాధిపతి సోమయలెంక (క్రీ.శ. 1240) అనునతడు. ఈతని కుమారుడు పోచులెంక (పొచ్చు లెంక) అనువాడు. ప్రతాపరుద్రదేవుడు తన కొలువున పని చేయు లెంకలకు పెక్కు నాయంకరముల (మాన్యముల)

నొసగెను ఇతడు మయిదేవలెంక అనువానికి పదునెనిమిది గ్రామములు కలసిన కొండూరుస్థలమును నాయంకరముగ నొసగినట్లును మయిదేవలెంక తనకు నాయంకరముపై లభించు ఆదాయములో కొంత (అనగా గడ్డుగ కానిక అమ్మకపు సుంకము తలారిపన్ను మున్నగునవి) తంగండి మూండి చెన్నమల్లి కార్జున లింగమునకు అంగరంగ భోగముకై ఒసగినట్లును ద హిం X-నెం 521 281 శాసనమున కలదు ఈ శాసనము శా శ 1239 (క్రీ శ 1317) నాటిది మరియు ప్రతాపరుద్రదేవుడు తిక్కయ రుద్రయలెంక మారయలెంక పిచ్చయలెంక అను వారికి కొప్పర స్థలమును నాయంకర ముగ ఒసగెను

లెంకలలో కొందరు ప్రభువునకు సంబంధించిన ప్రత్యేక మైన సిబ్బందిలోని వారు కలరు పోచులెంక (పొమ్మలెంక) అనునతడు ప్రభువునకు అడపము (తాంబూలము) నిచ్చునట్టి వాడు ఈ పొమ్మలెంక (సోమయలెంక కుమారుడు) కొలంకులూరు అగస్త్యేశ్వరస్వామి ని వీరభద్రదేవునకును ఎనిమిదేసి పందుముల భూమిని కేశవ పెరుమాళ్ళస్వామికి అయిదు తూముల భూమిని దానము చేసినట్లును (ద హిం X నెం 522 523 పుట 282) కారెంపూడిలోని సూరేశ్వర కేశవ పెరుమాళ్ళ దేవాలయమునకు మరమ్మతులు చేయించి నట్లును ద హిం X నెం 491 265) శాసనములో గన వచ్చుచున్నది పెద్దయలెంక అనువాడు ప్రతాపరుద్రునకు ఆలవట్టము (వింజామరము) పట్టునట్టివాడు ఇతడు కారెంపూడి సూరేశ్వర దేవాలయమునకు పాంగపన్ను లేకుండునట్లు 5లపుట భూమిని దానము చేసినట్లు (ద హిం X నెం 501 పుట.281) శా శ 1233 (క్రీ శ 1316) నాటి శాసనములో కలదు ఎఱ్ఱయ లెంక అంతఃపురమును సంరక్షించునట్టివాడు ఈయనకు ప్రతాపరుద్రదేవుడు ఇరువది రెండు గ్రామములతో కూడిన నాయంకరమును ఇచ్చినట్లును ఎఱ్ఱయ తనకు నాయంకరముపై వచ్చు ఆదాయములో కొంత దేవాలయములకు వెచ్చించినట్లును (ద హిం X నెం 509 276) శా శ 1236 (క్రీ శ 1314) నాటి గుంటూరు జిల్లాలోని పెనుమూరి శాసనమువలన తెలియుచున్నది ఎఱ్ఱయ ప్రతాప రుద్రుని ద్వారపాలకుడనియు శాసనమున కలదు వీరు కాక అనుమకొండ యొక్క అనుములెంక రాయగజసాహిణి మాదయరెడ్డి తమ్ముడగు అన్నయలెంక మున్నగువారు శాసనములలో కనవచ్చుచున్నారు

శా శ 1215 (క్రీ శ 1293) న ప్రతాపరుద్రమహా రాజు వేయించిన మక్తల (మహబూబునగరు జిల్లా) శాసనములో రాయగజసాహిణి మాదయరెడ్డిగారు మరణింపగా ఆయన తమ్ముడైన అన్నయ్యలెంక తన అన్నకు పుణ్యలోక ప్రాప్తి కలుగుటకై మగతలలోని శ్రీస్వయంభు మల్లికార్జున దేవరకు అంగరంగ భోగముకై మగతల పడమటి నేరడికొమ్ము చెరువు దక్షిణం బద్ది రాజు చెరువు ధారాపూర్వకముగా ఇచ్చినట్లు తెలంగాణా శాసనములు రెండవ సంపుటము పుట-124 లో కలదు

ఈ విధముగ ప్రతాపరుద్ర దేవుని కొలువున స్వామి భక్తిపరాయణులై లెంకలు తమ విధులను క్రమముగ నిర్వర్తించుటయే కాక ఎన్నియో దానధర్మములు చేసినట్లు తెలియుచున్నది

తం అం శా

## అన్నయమంత్రి - విరూరి

విరూరి అన్నయమంత్రి శఠమర్షణ గోత్రుడు ఇతడు అవ్యాహతైశ్వర్య లక్ష్మీవంతుడు విరూరికర్త సచివ శ్రేష్ఠుడు విద్యాహయగ్రీవుడు భూనభోంతరముల యందు ఈతని కీర్తి వ్యాపించియుండెను ఈయన భార్యయగు లక్ష్మాంబగారు అరుంధతి రేవతి ఆదిలక్ష్మి శచీదేవి అనువారికంటెను మిన్న అని తెనాలి రామకృష్ణునిచే రచింపబడిన పాండురంగ మాహాత్మ్యమను గ్రంథమునందు కృతిపతి వంశవర్ణనసందర్భమున తెలుపబడినది తెనాలి రామకృష్ణుని కృతులలో ఉద్భటారాధ్య చరిత్రము పాండురంగ మాహాత్మ్యము ఘటికాచల మాహాత్మ్యము అనునవి సుప్రసిద్ధములు రామకృష్ణ కవి పాండురంగ మాహాత్మ్యమును విరూరి వేదాద్రి అనువానికి అంకిత మిచ్చెను విరూరి వేదాద్రి అన్నయమంత్రికి పెద్దకుమారుడు వాడు పొత్తపినాటిలో (కడప మండలమున ఉన్నది) శ్రీకృష్ణ దేవరాయలకు ఎమ్మటి సదాశివరాయలకు (క్రీ శ 1542-1564) లోబడి రాజ్యమును పాలించుచుండినవాడును మహామండలేశ్వర బిరుదాంచితుడును మంగయ గురవరాజు కుమారుడు నగు పెద్దనగరాజుకొద్ద విరూరి వేదాద్రి ప్రాయసకాడుగ ఉండెను కందాళ అప్పలాచార్యులవారు వేదాద్రికి గురువులుగ డికోట ప్రభువు దాల అప్పలాచార్యులవారి క్రీ శ 1542 లో భూదానమొసర్చినట్లు శాసనము కలదు

తెనాలి రామకృష్ణుని గురువగు భట్టరు చిక్కాచార్యులవారి కాలము క్రీ శ 1520- 590 ప్రాంతమని ఆంధ్రకవి తరంగిణీ కారులు తెలిపిరి పై ఆ శకములను బట్టి పెద్దసంగరాజు - అతని ప్రాయపు కాడగు విరూరి వేదాద్రియు క్రీ శ 1540-1565 ప్రాంతము వారని తెలుచున్నది కాగా పాండురంగమాహాత్మ్యము క్రీ శ 1542 కు పిమ్మట రచితమయినట్లును తెనాలి రామకృష్ణుని జీవిత కాలము క్రీ శ 1500- 5 0 ప్రాంతము అయియుండి నట్లును విశదమగుచున్నది, పై పరిశీలనమును బట్టి విరూరి అన్నయమంత్రి ఉనికి పదునాల్గవ శతాబ్ది చివరగాని 15 వ శతాబ్ది ఆరంభమునగాని అయియుండెనని భావింప వీలగుచున్నది

ఈ విధముగా అన్నయ మంత్రి నుండి వేదాద్రి వరకును గల విరూరి వంశపువారు సచివులు ఉన్నతోద్యోగులు ప్రాయపుకాంక్షు నయి ప్రభువుల ఆదరాభిమానములను సంపాదించుటయే కాక కృతి కర్తలై ఖ్యాతినొందినట్లును దీని వలన తెల్లమగుచున్నది

తం అం శా

## అన్నయ - వెన్నెలకంటి

పిల్లలకు పెద్దలకు కథలంటే అందరికిని ఇష్టమే అందు చేతనే కాబోలు ఆంధ్రవాఙ్మయమునందు కథాసాహిత్యమునకు ప్రాచీనకాలము నుండి అర్వాచీన కాలము వరకును ప్రజాదరణ ఎక్కువగ లభించుచున్నది పూర్వము నుండి నేటివరకు బహుళప్రచార మొందిన గ్రంథములలో కేతన దశకుమారచరిత్ర అనంతుని భోజరాజీయము జక్కన విక్రమార్కచరిత్ర కొరవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక కదిరిపతిశుకసప్తతి నారాయణకవి హంసవింశతి తురగా వెంకంరాజు మర్యాదరామచరిత్ర చిన్నయసూరి వీరేశలింగముల నీతిచంద్రిక సుబ్బన్న దీక్షితుల కాశీమజిలీ కథలు షేక్స్పియరు కథలు అరేబియను నైట్సుకథలు - ముఖ్యములు నేటి తెలుగు సారస్వతరంగమున ఇట్టి కథా కావ్యములు ఇంకను ఎన్నియో అవతరించుచునే ఉన్నవి వీనిలో కొన్ని నీతి బోధకములుగ మరికొన్ని శృంగారహాస్య-అద్భుత వీరరసోపేతములునై పాఠకులకు ఆనందానందమును కలిగించుచున్నవి

తెలుగు కథాకావ్యములలో పేరెన్నికగన్నది షోడశకుమారచరిత్ర ఒకటి ఇది ఎనిమిది ఆశ్వాసముల గ్రంథము ఇందు మూడవ నాల్గవ ఆశ్వాసములు లభించలేదు మిగిలిన ఆశ్వాసములలో అక్కడక్కడ శిథిలభాగములు ఉన్నవి నామసామ్యమును బట్టియే దీనిని దశకుమార చరిత్రకు తమ్ముడనవచ్చును దశకుమారచరిత్రలో పదిమంది యువక వీరుల సాహసగాథలు వర్ణింపబడినవి షోడశకుమార చరిత్రలో పదునారుగురు యువకవీరుల సాహసకృత్యములు విపులీకరింపబడినవి

షోడశకుమారచరిత్రను వెన్నెలకంటి అన్నయ రచించెను ఇతడు సుప్రసిద్ధ పండితవంశములోనివాడు సూరామాత్యుని కుమారుడు ఇతనిది హారితసగోత్రము - ఈయన నియోగిబ్రాహ్మణుడు - శివభక్తుడు మనోహరమైన గాథలతో హృద్యమైన శైలితో ఈయన షోడశకుమార చరిత్ర ఒప్పుచున్నది ఈ కవి కాలము నిర్ధరించుటకు తగిన ఆధారములు లభించుటలేదు షోడశకుమారచరిత్రలో ఏడవ ఆశ్వాసములోని చివరి పద్యములో అన్నయ కృతికర్త అగు సూరామాత్యుని ప్రశంసించుచు నానారస భావములను మథించుటలో భోజునికి (11వ శతాబ్ది) తుల్యుడు అనియు శాస్త్రవిజ్ఞానకవిత్వముల యందు సర్వజ్ఞ సోమేశ్వరునికి (12 వ శతాబ్ది) దీటుఅనియు విద్యాగోష్ఠులయందు జగదేకమల్లునితో (12 వ శతాబ్ది) సమానుడనియు సత్కళాగమ పద్ధతులలో కృష్ణకంధారుని (13 వ శతాబ్ది) వంటి వాడనియు వర్ణించెను పైన పేర్కొనబడిన నారంపలును చరిత్ర ప్రసిద్ధికెక్కిన పురుషులే వీర నరుని అన్నయకు పూర్వులే అగుట చేతనే వారి దీటుగాని సూరామాత్యుని వర్ణించెను. పై నాల్గు చారిత్రక వ్యక్తులలో అందరికంటెను కడపటివాడు యాదవరాజగు కృష్ణకంధారుడు ఇతడు క్రీ శ 1250 ప్రాంతమున ఉండెను కావున వెన్నెలకంటి అన్నయ కూడ అనాటివాడే అని నిడుదవోలు వెంకటరావుగారు తెనుగుకవులచరిత్ర 380 వ పుటలో వ్రాసినారు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ History of Reddy Kingdoms లో- 504 వ పుటలో కృష్ణకంధారుడు రాష్ట్రకూటరాజులలోని మూడవ కృష్ణుడనియు అతని కాలము క్రీ శ 939 ప్రాంతమనియు వ్రాసినారు కాని అన్నయ కాలము అతని గ్రంథరచనమునుబట్టి క్రీ శ 15 వ శతాబ్ది అని చెప్పవొప్పును

షోడశకుమారచరిత్ర కృతికర్త సూరామాత్యుడు హారితగోత్రుడు కృతికర్త యొక్క గోత్రనామములు

అన్నయ తండ్రియొక్క గోత్రనామములు రెండును ఒకేవిధముగ నుండుటచే అన్నయ వి తన తండ్రికే షోడశకుమార చరిత్రను అంకితము ఇచ్చి నాడని విమర్శకుల భావన కృతిభర్త సర్వతోముఖ ప్రజ్ఞాపాండిత్యములు కలవాడు ఈ విషయమును అన్నయ తన కావ్యమునందలి ఆశ్వాసాది - అంత్య పద్యములలో వ్యక్తముచేసినాడు కృతిభర్తయగు సూరామాత్యుడు భారతరామాయణములను కుమారసంభవాది పురాణములను చక్కగా చదివి సారమును గ్రహించినవాడు ఆఖ్యాన ఉపాఖ్యాన ఆఖ్యాయికలలోని మర్మములను తెలుపుటలో దిట్ట వైయాకరణ సిద్ధాంతమును బాగుగా ఆకళింపు చేసికొన్నవాడు నాటక కోలాహల నాట్యముల యందలి రహస్యములను గ్రహించినవాడు భరతాచార్యుడు అశ్వశిక్షకుడు - ఇంతటి ప్రజ్ఞావంతునకు - అన్నయ తన కావ్యమును కృతి నొసగుట ఆయన అదృష్టమే

అన్నయ తన కావ్యమునకు పేరు పెట్టుటలోను కథారంభములోను కొన్ని కథాఘట్టముల యందును దశకుమార చరిత్రను పూర్తిగా అనుకరించెను దశకుమారచరిత్రమున రాజహంసుని కుమారుడగు రాజవాహనుడు తొమ్మండ్రు మంత్రి పుత్రులతో కలిసి తీర్థయాత్రకు బయలుదేరును అడవిలో నిద్రించుచున్న స్నేహితులకు తెలుపకయే రాజవాహనుడు మాతంగునికి సాయమొనర్చుటకు పాతాళమునకు పోవును నిద్రలేచిన మంత్రితనయులు రాజవాహనుని గానక అడవి యంతయు అతనికై తిరిగి ఒక్కొక్కరు ఒక్కొక్క దేశమునకుపోయి అచట విచిత్రాద్భుత సాహస కృత్యములుచేసి తిరిగి రాజవాహనుని కలిసికొని తాముచేసిన వీర కృత్యములను అతనికి తెలుపుదురు ఇది దశకుమార చరిత్రలోని కథ

షోడశకుమారచరిత్రలోని కథయు ఇట్లే ఆరంభమగుచున్నది విజయ మహారాజు కొడుకు కమలాకరుడు ఇతడు కరుణాకరుడు చిత్రకరుడు కాంతిమంతుడు బుద్ధి సహాయుడు వివేకనిధి ప్రభాకరుడు యశఃకేతుడు నీతిమంతుడు (వీరు ఎనమండుగురు మంత్రుల కుమాళ్లు) భీమభటుడు విక్రమకేసరి దీర్ఘబాహుడు దృఢముష్టి (వీరు నలుగురు సేనాధిపతుల తనయులు) వసంతకుడు మతిమంతుడు కళానిధి (వీరు ముగ్గురు పురోహితునిసుతులు) అను వారితో (మొత్తము వీరందరు పదునారుగురు) కలిసి దండకారణ్యములో నున్న ఒక సాధకునకు సాయమొనర్పబోయి ఒక భయంకర సర్పమునకు భీతిల్లి తలకొకదిక్కుగా పారిపోయిరి ఒక్కొక్కరు ఒక్కొక్క ప్రాంతమునకుచేరి - అచ్చట అనేక సాహసాద్భుతకార్యములు ఒనరించి తిరిగి కమలాకరుని (రాజకుమారుని) కలిసికొని వారివారి సాహసోదంతములను అతనికి నివేదింతురు ఇది షోడశకుమారచరిత్రలోని కథ అన్నయకవి భేతాళ పంచవింశతి కథలను విక్రమార్కచరిత్రలోని ఘట్టములను కొన్నింటిని అనుసరించియు కేయూర బాహుచరిత్రలోని కొన్ని కథాంశములను కథాసరిత్సాగరము నందలి కొన్ని భాగములను వినియోగించియు షోడశ కుమారచరిత్ర కావ్యమును సర్వాంగసుందరముగా రూపొందించెను ఈతని కవితలో శ్రీనాథుని కవితకు దీటువచ్చు పద్యములు కొన్ని కనవచ్చుచున్నవి ఇందుచేతనే అన్నయ కవి శ్రీనాథునికి పిమ్మటివాడని యెంచవీలగుచున్నది షోడశకుమారచరిత్రమునందలి కథలు శృంగార హాస్య వీర అద్భుత కృత్యములతో పాఠకులకు సంతసమును గూర్చుచుండును మొత్తముమీద అన్నయ పాండిత్యమునకు నికషోపలమే ఈ షోడశకుమారచరిత్ర

తం అం శా

## అన్నరెడ్డి శ్రీగిరిరెడ్డి

అన్నరెడ్డి - శ్రీగిరిరెడ్డి ప్రశంస దక్షిణ హిందూశాసనములలో కనవచ్చుచున్నది (ద హిం 6 నెం 615) ఈ శాసనము కొణిదెన గ్రామమునందలి శంకరస్వామి దేవాలయ పశ్చిమోత్తర ప్రాకారములోని తూర్పుముఖముగ ఉన్న యొక స్తంభముపై లిఖితమై యున్నది కొణిదెన గుంటూరుమండలము నందలి నరసరావుపేట తాలూకాలో ఉన్నది 1961 వ జనాభా లెక్కనుబట్టి ఇందలి జనసంఖ్య 5445 శాసనము నందు కాలము వ్రాయబడలేదు శాసనము నందలి సారాంశమిది హేమాద్రి దానచక్రవర్తి యని పేరొందిన అన్నరెడ్డి శ్రీగిరిరెడ్డింగారు కొణిదెనలోని శంకరదేవరకు సేవలకుగాను కొంత మాన్యమును పూలతోట నిమిత్తము భద్రిక పొలమును గూడ దానము చేసెను

పై శాసనమునుబట్టి కొన్ని చారిత్రికాంశములను గమనించుట యుక్తము శాసనమున కనవచ్చు శ్రీగిరిరెడ్డి మల్లారెడ్డి పుత్రుడు ఎనకోమటిరెడ్డి పుత్రుడు ఎనకోమటిరెడ్డికి అన్నమరెడ్డి యని నామాంతర ముండెనేమో! కొండ

వీటిరెడ్డి రాజ్యస్థాపకుడైన ప్రోలయవేమారెడ్డికి మల్లారెడ్డి కనిష్ఠసోదరుడు. ఇతడు గొప్ప మహాశూరుడగు సేనాని. ఈతని సామర్థ్యమును గుర్తించి వేమారెడ్డి ఇతనికి కందుకూరు రాష్ట్రమునకు (ఇది నేడు ఒంగోలు జిల్లాలో ఒక తాలూకా) అధిపతిగ నొసర్చెను. మల్లారెడ్డి సంతతివారు కందుకూరు రాజధానిగ జేసుకొని తత్పరిసర ప్రాంతమును పాలించుచుండిరి. ఈ రాజ్యము కొండవీటికి సామంతరాజ్యమయ్యెను. కుమారగిరిరెడ్డికిని పెదకోమటి వేమారెడ్డికిని వైరానలము ప్రజ్వలించు సందర్భమున మల్లారెడ్డి మనుమడైన ఈ శ్రీగిరిరెడ్డి (ఆనాటి కందుకూరు రాజ్యమునకు ఇతడు ఏలిక) కొండవీటి రాజ్యమునుండి విడివడి స్వతంత్రుడయ్యెను. అయినను పెదకోమటి వేమారెడ్డి ఇతని విజృంభణమును అరికట్ట యత్నించుచునే యుండెను. బహమనీ సుల్తానగు ఫీరూజ్‌షా (క్రీ. శ. 1397-1422) కందుకూరు రాజ్యముపై దండెత్తగా అసహాయశూరుడగు శ్రీగిరిరెడ్డి అతనిని పారద్రోలెను. అంతటితో ఊరుకొనక ఇతడు విజయనగర రాజ్యముపై దండెత్తి ఉదయగిరి (ఇది నెల్లూరు మండలములోనిది) సిద్ధవటము పొత్తపినాడు పులుగునాడు (ఇవి కడప మండలములోనివి) చంద్రగిరి (చిత్తూరు జిల్లా) రాచవీడుకోట (రాయచోటి ఇది కడప మండలములో నున్నది) - వీటిని వశమొనర్చుకొనెను. కడప మండలమునందలి లేపాక్షి తగటూరులలో ఈ కందుకూరి పాలకుల శక 1333 (క్రీ. శ. 1408) శక 1335 (క్రీ. శ. 1413) నాటి శాసనములు కలవు. విజయనగర సామ్రాజ్యాధిపతియైన రెండవ దేవరాయలు (ప్రౌఢదేవరాయలు క్రీ. శ. 1423-1446) కందుకూరు రెడ్డిరాజులనోడించి (క్రీ. శ. 1427 న) వారి రాజ్యమాక్రమించుకొనెను. నాటినుండియు కందుకూరి రాజ్యము విజయనగర రాజ్యమున అంతర్భాగమయ్యెను. ఈ రాజులు విజయనగర సామంతులైరి.

రెడ్డిమన్నీలలో పెక్కురు హేమాద్రికల్పమున చెప్పబడిన దానము లొనర్చిరి. శ్రీగిరిరెడ్డికి హేమాద్రిదానచక్రవర్తి యను బిరుదము శాసనమున కనిపించుచున్నది. ఈయన హేమాద్రి చెప్పిన దానములలో ప్రశస్తములగు గోసహస్ర కల్పతరు బ్రహ్మాండ తులాపురుషాది దానము లొనరించినట్లును పెక్కు దేవాలయములకు భూదానము లొసర్చినట్లును తెలియుచున్నది. ఈయన సస్యాకరప్రశస్యములైన అనేక సహస్రాబ్ధి సమానగాఢీర్యమహాతటాకములను గూడ నిర్మించినట్లు శాసనములు నుడువుచున్నవి. ఇతడు గొప్ప కళావిమర్శకుడు. సంగీతసాహిత్యములందు ప్రవీణుడు. ఈతనికి మాచారెడ్డి రాచవేమారెడ్డి అను సోదరులుండినట్లును వారితనికి సమరాంగణములలో సాయపడినట్లు తెలియుచున్నది. ప్రజాపాలనతత్పరుడును యోధాగ్రణియు పరమధార్మికుడునైన శ్రీగిరిరెడ్డి క్రీ. శ. 1408 ప్రాంతమున పరమపదించినట్లు తెలియుచున్నది.

తం. అం. శా.

## అన్నవరం

అన్నవరమును ఆరెంపూడి అన్నవరం అనికూడ అందురు. విజయవాడ వాల్తేరు రైలు మార్గంలో ఇది అన్నవరం రైల్వే స్టేషను నుండి 2 మైళ్ళ దూరంలో ఉన్నది. ఈ గ్రామము కాకినాడ నుండి 30 మైళ్ళలోను ప్రత్తిపాడు నుండి 2 మైళ్ళలోను రాజమహేంద్రవరం నుండి 50 మైళ్ళ దూరంలోను ఉన్నది. తుని కాకినాడ రాజమహేంద్రవరం ఏలేశ్వరం అను తావులనుండి బయలుదేరు బస్సులు శ్రీవీరవెంకట సత్యనారాయణస్వామి దేవాలయమున్న రత్నగిరి కొండను తాకుచు అన్నవరం గుండాపోవును. దేవాలయమును చేరవలయునన్న కొండ దిగువనుండి 460 రాతిమెట్లు ఎక్కవలెను. ఆ దేవాలయము నడచిపోయినచో 4 ఫర్లాంగుల దూరమును ఘాట్ రోడ్డునుండి 2 మైళ్ళ దూరమునను కలదు. ఇచటి జమీందారులు వదాన్యులై ఎల్లప్పుడు యాత్రికులకు ఉచితాన్నదాన సౌకర్యములు కలుగజేయుటచే ఈ గ్రామమునకు అన్నవరం అనిపేరు వచ్చినదని అందురు.

రత్నగిరి కొండ చాలా పవిత్రమైనది. కొండల కధిపతియైన మేరువు మేనకతోగూడి ఇచట గొప్ప తపస్సు చేసెను. మహావిష్ణుమూర్తి అనుగ్రహమువలన ఆమేరువునకు భద్రుడు రత్నాకరుడు అను ఇరువురు పుత్రులు కలిగిరి. తపమొనర్చి మహావిష్ణువు అనుగ్రహమును పొందుటచే భద్రుడు భద్రాచలముగ మారెను. అచ్చటనే శ్రీరాముని దేవాలయము కలదు. రత్నాకరుడుకూడ అన్నగారివలె తపస్సుచేసి విష్ణుమూర్తి కృపచే రత్నగిరిమారెను. దానిమీద మహావిష్ణువు వీరవెంకట సత్యనారాయణ రూపమున వెలసెను.

ఈ రత్నగిరి యను కొండవరుసలలో భూగర్భమార్గములు ఉన్నవి. శ్రీకృష్ణదేవరాయలు రెండువైపుల నుండి కూడ శత్రుసైన్యముల నెదుర్కొనెనట. రంపవతూరి నాయ

కుడైన అల్లూరి సీతారామరాజు బ్రిటిషువారిపై తిరుగుబాటు జరిపినపుడు తనకు తనసహచరులకు రహస్యమైన నివాసస్థలములను ఈ కొండ శ్రేణులలోనే ఏర్పరచుకొనెనట

చిత్రము – 15



సత్యనారాయణస్వామి దేవాలయము అన్నవరం

1961 లో ఇచ్చటి జనాభా 2 550 ఈ సంఖ్యలో షెడ్యూలు జాతులవారు 651 మంది ఇచ్చట ప్రజలు వ్యవసాయముచే వ్యవసాయకూలిచే వ్యాపారముచే యాత్రిసేవచే దేవాలయ ఉద్యోగములచే జీవింతురు

గోరస – కిర్లంపూడి ఎస్టేటుజమీందారైన రాజా ఐ వి రామాయణంగారు తనకు కలలో కనిపించి ఆజ్ఞాపించిన దేవుని ఆజ్ఞపై కొండలోనున్న ఒక విగ్రహమును కనుగొని ఖర (1891) సంవత్సరమున శ్రావణశుద్ధ విదియనాడు ప్రస్తుతమున్న స్థలమున దేవుని ప్రతిష్ఠించి దేవాలయమును నిర్మింపించిరి దీనికి ఒకవైపున 11 మైళ్ళ దూరములో బంగాళాఖాతము మరియొకవైపున తూర్పుకనుమలు కలవు రత్నగిరి చుట్టును పంపానదికలదు ఈ కొండ సముద్రమట్టమునకు 300 అడుగుల ఎత్తున ఉన్నది ప్రధానదేవాలయము నాలుగుచక్రములు గల రథమువలె నిర్మించబడినది దాని ఎదుట శ్రీ ఏకశిలాశోభితమైన కల్యాణమంటపము కలదు క్రిందికి దిగుమార్గములో రామాలయము వనదుర్గా కనకదుర్గా దేవాలయములు ఉన్నవి వనదుర్గాదేవిని అమితభక్తితో జనులు పూజింతురు ఆ దేవి నేటికిని ఆ స్థలమును కాపాడుటకై రాత్రిపూట తిరుగుచుండునని ప్రతీతి

దేవాలయపు ఆవరణములో ఉత్తరము వైపున హిందూదేశ కాలమానమును అందరకు తెల్పుటకై సూర్యగమనచక్రము (Sundial) నిర్మించబడినది ఒకేసమయమున వేయిమంది సత్యనారాయణవ్రతములు జరుపుకొనుటకు వలసినంత పెద్దమంటపమును నిర్మించిరి ఇది కల్యాణమంటపమునకు దిగువగా కలదు కల్యాణమంటపమునకు ఎదురుగ తూర్పువైపున గాలిగోపురము ఒకటి ఉన్నది ప్రధానదేవాలయపు దక్షిణభిత్తికి ఎడమవైపున నవగ్రహ విగ్రహములు ప్రతిష్ఠింపబడినవి మెట్లుదిగి వచ్చునపుడు కార్యాలయములు అతిథిగృహము ఒక చిన్న సత్రము హరికథలు చెప్పుటకు అనాచ్ఛాదితమయిన ఒకరంగశాల కలవు దేవాలయమునందు తూర్పుభాగమున గాలిగోపురమునకు దిగువన కేశఖండనశాలయు ప్రధాన దేవాలయము వెనుకవైపు వంటశాలలును కలవు

ఈ దేవాలయమునకు దగ్గరగా కృష్ణతులసీవనమొకటి కలదు దీనిమధ్యభాగమున తరతరములనుండి కన్పించుచున్న చీమలపుట్టలు కొన్ని ఉన్నవి ఇచ్చట విగ్రహము ఒకటి స్తూపాకారముగా 13 అడుగుల ఎత్తున ఉన్నది ఇందు అడుగుభాగమున బ్రహ్మయొక్కయు ఊర్ధ్వభాగమున మహావిష్ణువుయొక్కయు మధ్యభాగమున శివునియొక్కయు మూర్తులు చిత్రింపబడినవి

ఈ దేవాలయమున రెండు అంతస్తులు కలవు మొదటి అంతస్తులో దైవయంత్రము పీఠము ఉన్నవి యంత్రము నలువైపుల గణపతి సూర్యనారాయణ బాలాత్రిపురసుందరీ మహేశ్వరస్వాముల ప్రతిమలు కలవు సమీపమున ఒక శ్రీరామాలయమున్నది ఈ పవిత్రస్థానముననే శ్రీ సత్యనారాయణస్వామి విగ్రహమొకటి భక్తులకు దొరకినదట శ్రీరాముడు ఈ శ్రీసత్యనారాయణస్వామి పవిత్రక్షేత్రపాలకుడని జనుల విశ్వాసము

ధనము విద్య విజ్ఞానము శ్రేయస్సు సంతానము జయము మున్నగునవి చేకూరుటకును బాధలు వ్యాధులు మున్నగునవి నివృత్తియగుట కొరకును శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతమును జనులు సల్పుదురు వ్రతము చేయలేని వారు వ్రతము చేయుపుడు దానిని చూచినను వ్రతకథ వినినను వారి కష్టములు పాపములు తొలిగిపోవునందురు

ఈ స్వామి వచ్చు ఆదాయములో రు 60 000 లు కాకినాడలోని అన్నవర సత్యవతీదేవి కళాశాలకును ఆదాయములో కొంత రాజమహేంద్రవరములోని కుష్ఠ వ్యాధి చికిత్సాలయమునకును అనాథశరణాలయమునకును జీవకారుణ్యసంఘమునకును ఒసగబడుచున్నవి చెదుర్తిలో గల కుష్ఠవ్యాధి చికిత్సాగృహమునకును ఇతర విద్యాసంస్థలకును కూడ ఈ ఆలయ ఆదాయమునుండి ధనసహాయము చేయబడుచున్నది

మా శ్వే

## అన్నవిభుడు

అన్నవిభుని గృహనామము ఊరె (ఊర) వారు ఈయన నియోగి బ్రాహ్మణుడు ఇతనిది కౌండిన్యగోత్రము తెనాలిరామలింగకవి రచించిన ఉద్భటారాధ్యచరిత్ర కృతికర్తయగు దేచమంత్రి ఈ అన్నవిభుని మూడవ కుమారుడు దేచమంత్రి కొండవీటి దుర్గాధ్యక్షుడగు నాదిండ్ల (నాదెండ్ల) గోపమంత్రికడ ప్రధానోద్యోగి విజయనగర సామ్రాజ్యాధిపతి యగు శ్రీకృష్ణదేవరాయలు క్రీ శ 1615 ప్రాంతమున కొండవీటిని జయించెను నాటనుండియు కొండవీటిదుర్గము రాయల పాలనములోనికి వచ్చెను రాయల ప్రధానమంత్రి సాళువ తిమ్మరుసయ్య కొండవీటి దుర్గమును పాలించుటకు తన మేనల్లుడగు నాదెండ్ల గోపమంత్రిని నియమించెను తదాది ఊరె దేచమంత్రి గోపమంత్రికడ ముఖ్యోద్యోగియై అతనికి మిక్కిలి అండగనిలచెను దేచమంత్రి ప్రభుభక్తిపరాయణత్వమునకు మెచ్చి గోపమంత్రి క్రీ శ 1517న దేచమంత్రికొక అగ్రహారము నొసగెను ఉద్భటారాధ్య చరిత్రము ప్రథమాశ్వాసము లోని 32-37 పద్యముల ఆధారమున ఊరెవారి వంశవృక్షము ప్రక్కన రూపొందింపబడుచున్నది




ఊరెవారు శివారాధనతత్పరులు అర్థిజనకల్ప భూరుహులు ఊరాగ్రహారమునను నివసించుటచేత వీరి ఊరె (ఊర) యను గృహనామము ఏర్పడినట్లు తోచుచున్నది వీరివంశమునకు మూలపురుషుడు పెద్దన్నమంత్రి ఊరాగ్రహార వాసి యనియు ఈశపదపద్మధ్యానవిధానవిద్యావిశ్రాంతుడనియు ఉద్భటారాధ్య చరిత్రమున వర్ణింపబడెను ఈయన భార్య కొమ్మాంబ ఈ దంపతులకు ఐలమంత్రి తిప్పవిభుడు దేచప్రభుడు అనుమువ్వురు సుతులు జన్మించిరి వీరు పురహర పూజాప్రభావిష్ణులట తిప్పవిభుని భార్య పేరాంబిక ఈదంపతులకు అన్నవిభుడు జన్మించెను అన్నవిభుడు వితరణశాలియని ప్రశంసింపబడెను ఈయనభార్య కృష్ణమాంబ ఈమె రమామల్లనార్యులకూతురు అన్నవిభునకు కృష్ణమాంబకు పర్వతయ్య ఐలమంత్రి దేచమంత్రి కొండశౌరి అనుసుతచతుష్టయము జన్మించెను వీరిలో దేచమంత్రి చంద్రశేఖర వాచయమీంద్రసేవాచాతురబుద్ధి అని కొనియాడబడెను ప్రతి నిత్యము దేచమంత్రి శివపంచాక్షరిని జపించుచు పరమేశ్వరుని సువర్ణాక్షతలతో పత్రితో పుష్పములతో పూజిచెడివాడట పూజాకాలమున ఆయన హస్తాగ్రకంకణఝంకారములు శబ్దించుచుండెడివట అన్నవిభుని ఉనికి క్రీ శ 15 వ శతాబ్దియని యూహింపవచ్చును

తం ఆం శా

## అన్నశౌరి

అన్నశౌరి అయితన్నకు దేవమాంబకు రెండవకుమారుడు ఇంటిపేరు చెందలూరివారు చెందలూరుగ్రామము నేటి ఒంగోలుజిల్లా ఒంగోలుతాలూకాలో ఉన్నది చెందలూరు గ్రామ నివాసముమబట్టి వీరికిచెందలూరివారను గృహనామము

ఏర్పడియుండును వీరిది కాశ్యపసగోత్రము ఆపస్తంబ సూత్రము వీరు నియోగిబ్రాహ్మణులు అన్నశౌరివృత్తాంతము నాసికేతోపాఖ్యానమను గ్రంథమున కనవచ్చుచున్నది ఈ గ్రంథమును దగ్గుపల్లి దుగ్గనకవి రచించెను దుగ్గన శ్రీనాథ కవి సార్వభౌముని బావమరది నాసికేతోపాఖ్యానము కాంచీపుర మాహాత్మ్యము అను రెండుగ్రంథములను దుగ్గన రచించెను వీనిలో కాంచీపురమాహాత్మ్యమును చెందలూరి గంగయమంత్రి సుతుడగు దేవయమంత్రికి అంకితమిచ్చెను నాసికేతోపాఖ్యానమును దుగ్గన చెందలూరి అనంతామాత్యుని కుమారుడగు గంగయామాత్యునకు అంకితమొసగెను ఈ దేవయ గంగయ మంత్రులిరువురును అన్నదమ్ముల తనయులగుట విశేషము నాసికేతోపాఖ్యానమునందలి ప్రథమాశ్వాసములోని 28 69 పద్యము లాధారముగా చెందలూరివారి వంశవృక్షము దిగువ వ్రాయనైనది




నాసికేతోపాఖ్యాన కృతిపతి చెందలూరి గంగయామాత్యుడు ఇతడు బసవ భూపాలునొద్ద మంత్రిగనుండెను బసవ భూపాలుడు పురుషోత్తమ గజపతికి సామంతుడు ఉదయగిరి దుర్గమును భేదించినవీరుడు దూబగుంట నారాయణకవి వలన పంచతంత్ర కావ్యమును కృతినొందినట్టివాడు బసవభూపతి తండ్రి తమ్మభూపతి వీరు మాధవవర్మవంశీయులు బసవనృపాలుడు క్రీ శ 1460 1500 లకు నడుమ నుండినట్లు తెలియుచున్నది గంగయమంత్రి నంది మల్లయ ఘంట సింగయ అను జంటకవులవలన ప్రబోధచంద్రోదయకావ్యమును కూడ కృతినొందెను ఇందు గంగయామాత్యుని గృహనామము పెసరవాయ అని యుడుటచే వీరు చెందలూరు పెసరవాయ గ్రామములలో నివసించుటనుబట్టి ఇట్టి గృహనామము లేర్పడినట్లు ఊహింపవీలగుచున్నది ఒక్క గృహనామములలో మాత్రమే తప్ప నాసికేతోపాఖ్యాన ప్రబోధ చంద్రోదయ కృతిప్రతులగు గంగయామాత్యుల వంశవృత్తమున ఎట్టి భేదము కనవచ్చుటలేదు గంగయమంత్రి "నరసింహ నృపవశీకర నయ విద్యాకరణ చతుర్ధర విద్యా రుడు" అని నుతింపబడెను దీనినిబట్టి ఇతడొకప్పుడు సాళువనరసింహ భూపుని తన నయ విద్యాకౌశలముచే వశీకర మొనర్చుకొనినట్లు తెలియుచున్నది గంగయ గొప్ప రాజకీయవేత్త దుగ్గన నాసికేతోపాఖ్యానమును క్రీ శ 1460 ప్రాంతమునరచించి గంగయామాత్యునకు అంకిత మొసగినట్లు తెలియుచున్నది దీనిని బట్టి గంగయామాత్యుని ఏనతాతయగు అన్నశౌరి క్రీ శ 15వ శతాబ్ది ఆరంభమున ఉండియుండును

"విన్ననువు నయము క్రియమును
గన్నోటము దగవు వగవు గా ధీర్యంబుల్
జెన్నును నైతయయన్నని
కెన్నిక కెక్కిన గుణంబు లిమ్మహిలోనన్"

అని అన్నశౌరి నాసికేతోపాఖ్యానమున ప్రశంసింపబడెను

తం అం శా

## అన్నాయ మహాసేనాపతి

అన్నాయ మహాసేనాపతి కదనరంగమునను దాన ధర్మము లొనర్చుటలోను దిటయని ప్రసిద్ధివడసెను ఇతడు కళింగరాజ్యాధినేతయును గాంగావంశీయుడు నైన మూడవ వీరనృసింహదేవరాయలకడ సైనికాధికారిగనుండెను ఇతడు పాత్రతల్లుభట్టుకుమారుడు నృసింహభక్తుడు ఇతడు శక 1272 (క్రీ శ 1350)కు సరియగు చైత్రశుక్ల పూర్ణిమా బుధవాసరమున తమ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధికై సింహాచల క్షేత్రమునందలి నరసింహస్వామికి పుష్పమాలలు రెండును స్వామికి ఉభయకాలముయందును ధూపము

పెట్టు నిమిత్తము పరమార శ్రీరామరెడ్డి నరసింహాము పొన్నమ మాదిసాని అనువారలకు రెండు నిబంధములను స్వామికి అభిషేకావసరమందు పురుషసూక్తమును పఠించునట్టి కేశవ భాగవతునికి ఒక నిబంధమును ప్రతిదినము స్వామికి తిరుమాల చాటి చుటకై అమరదాసు అన్నిసాని అనువానికి ఒక నిబంధమును ఈ ధర్మానుసంధాతయైన సోమాదుల చింగు నాయకునికి ఒక నిబంధమును ఒసగినట్లు శాసనము (దహి VI నెం 969) నకలదు ఈ శాసనము విశాఖపట్టణ మండలములోని సింహాచలమున దలి లక్ష్మీనృసింహ స్వామి దేవాలయమున కల్యాణమంటపమునకు పోవు మార్గమందలి యొక స్తంభముపై కలదు అనాటి కళింగప్రభువైన మూడవ వీరనరసింహదేవరాయలు రాజన్యమాలామణి మకుట రోచిస్సులచేత ప్రకాశింపచేయబడిన పాదములు కలవాడనియు అహితులను ప్రౌఢముగ మర్దించువాడనియు ధీమతుడు వీరశ్రీమంతుడు అనియు శాసనమున వర్ణింపబడెను

ఈ నరసింహప్రభువు రెండవ భానుదేవునకు లక్ష్మీదేవి వలన జన్మించెను ఇతడు గాంగవంశములో మూడవ వీరనరసింహదేవుడు శ్రీకూర్మమునందలి శాసనమువలన ఇతని రాజ్యపాలనము శక 1248 49 (క్రీ శ 1326-27) ఆరంభమై శక 1274 75 (క్రీ శ 1352-53) తో అంతమయినట్లు తెలియుచున్నది శ్రీకూర్మము సింహాచలము మొదలగు పుణ్యక్షేత్రములలోని శాసనములవలన ఈయన రాణులు సేనానులు మాండలికులు చేసిన దానధర్మములు తెలియవచ్చుచున్నవి నరసింహదేవునికి గంగాదేవి కొమ్మిదేవి అను ఇరువురు భార్యలు కలరు గంగాదేవికే కమలాదేవి యని నామాంతరముండినట్లు తెలియుచున్నది గంగాదేవి శ్రీకూర్మము సింహాచలము శ్రీకాకుళము దేవాలయములకు పెక్కు దానము లొనర్చినట్లు శాసనములవలన తెలియుచున్నది గంగాదేవి భక్తిభావము అనితరసాధ్యము ఈమె శ్రీకూర్మనాథునికి దీపహస్తప్రతిమను నవరత్నాలమకుటమును ముత్యాలహారమును సింహాచలలక్ష్మీనృసింహదేవునికి అనేక ఆభరణములను ధూపమునకై కొంత ద్రవ్యమును ఒసగెను కొమ్మిదేవియు తన కూతురైన సీతాదేవికి పుణ్యమునకుగాను నృసింహస్వామికి దీపదాన మొనర్చెను

మూడవ నరసింహదేవరాయల పాలనకాలమున ఆంధ్రదేశము ఒన్నముక్కలై స్వతంత్రరాజ్యములుగా ఏర్పడెను రాజ్యాధికార విస్తరణమునకై ఆయా రాజ్యాధిపతులు పరస్పరముగ దండయాత్ర లొనర్చుచుండిరి ఉలుఘ్‌ఖాను దండయాత్రతో కాకతీయ సామ్రాజ్యము తురుష్కుల వశమైనది యవనహస్తగతమైన తెలుగుదేశమును తిరిగి ఆంధ్రనాయకులు స్వాధీన మొనర్చుకొని కొన్ని స్వతంత్రరాజ్యములుగ నేర్పరచుకొని పాలించిరి ముసునూరి కాపయనాయకుడు ఓరుగంటిని విద్యారణ్యులసాయమున హరిహరరాయలు విజయనగరమును రేచర్ల పద్మవెలమనాయకులైన సింగమనేడు రాచకొండను ప్రోలయ వేమారెడ్డి అద్దంకి రాజధానిగ కొండవీటిని పాలించుచుండిరి వీరు తమ రాజ్యములను పెంపొందించుకొనుటకై ఒకరిపై నొకరు దండయాత్రలు సేయుచుండిరి ఇట్టి కాలమునందే గుల్బర్గ రాజధానిగ (క్రీ శ 1347) బహమనీరాజ్యము వెలసెను కళింగాధిపతియగు మూడవ వీరనరసింహరాయలు రాజ్య విస్తరణ మొనర్పు మధ్యాంధ్రదేశముపై దండెత్తి శ్రీకాకుళమువరకు దండునడిపి ప్రోలయ వేమారెడ్డి కుమారుడైన అనపోతారెడ్డిచే కళింగ సీమావధులవరకు తరుమగొట్టబడినట్లు తెలియుచున్నది ఇట్లు పరస్పరము అంతఃకలహములతో నున్నను ఆనాటి రాజులు రాణులు సేనానులు సచివోత్తములు మండలాధిపతులు భగవద్భక్తిపూరితులై అనేక దేవళములను నిర్మించియు దేవాలయములకు అనేకదానము లొనర్చియు తమ భక్తిభావమును చాటుకొనిరి

సం ఆ శా

## అన్నారగూడెం

అన్నారంగూడెం ఖమ్మం జిల్లా మధిరతాలూకాలో ఉన్నది దీనికి 25 మైళ్ళలో ఖమ్మం పట్టణము కలదు ఈ గ్రామమునకు నీలగూడెం నిమ్మగూడె అనుపేర్లు కూడ కలవు దీనికి తూర్పున కల్లూరుగట్టుపేరు పడమట బాపటవాగు ఉత్తరమున జగనాయకులగుట్ట దక్షిణమున తల్లాడ గ్రామము ఉన్నవి దీనివి స్త్రీర్ణము 4002 ఎకరములు

1961 స ॥ జనాభాలెక్కల ప్రకారము ఇచట పురుషులు 1656 మంది స్త్రీలు 1600 మంది వెరసి 3 256 మంది ఉండిరి ఈ సంఖ్యలో షెడ్యూల్డుజాతుల పురుషులు 160 మంది స్త్రీలు 179 మంది 1951 లోని జనాభా సంఖ్య 2 598 ఈ 10 వ వత్సరములలో వ్యవసాయము కూలిపనులు పెరుగుటవలన జనాభాలో 658 మంది పెరిగిరి

ఇచట ఇండ్లు దూరదూరముగాను విడివిడిగాను ఒకచో పంక్తులుగాను కట్టబడినవి వీటిలో 16 పెంకుటి ళ్లు 15 కాంక్రీటు కప్పుగల ఇళ్లు 15 ఒక అంతస్తుగల మేడలు ఉన్నవి ఖాళీస్థలము ఉండుటచే ఈ గ్రామము తూర్పుగా అభివృద్ధి అగుచున్నది ఈ గ్రామస్థులలో 156 మంది వరి అన్నమును 2000 మంది జొన్నఅన్నమును తిందురు వీరు బావినీటిని త్రాగుదురు ఇచట మంచినీటి ఎద్దడిలేదు

నిమ్మగూడెం చెరువు కోనప్పకుంట ఎర్రచెరువు ఈ గ్రామమునకు గల నీటివనరులు వీనిక్రింద వరి జొన్న పచ్చ పెసర మొక్కజొన్న మిర్చి అలచంద పంటలు పండును ఫలసాయములను బండ్లపై ఖమ్మమునకు రవాణాచేయుదురు 1966 67 సం॥ పంటలక్రింద 8160ఎకరముల భూమి ఉపయోగపడెను మామిడి తోటలోని 600 మామిడికాయ ను స్థానికులే వాడుకొనిరి రెండు ఆయిలు ఇంజనులు 100 మోటలు 151 ఎకరములభూమికి నీటిని సరఫరా చేయును ఇచట భూమిలో ఎర్రనేల నల్లనేల పుల్లుపునేల మాగాణి నేల కనిపించును

ఈ గ్రామమున 700 గేదెలు 100 దున్నలు 800 ఆవులు 600 ఎద్దులు ఒక ఆబోతు 000 మేకలు 1000 గొర్రెలు 50 పందులు 860 కోళ్ళు కలవు దినమునకు 8?0 లీటర్లపాలు 800 శేర్ల పెరుగు 15 శేర్ల నెయ్యి 50 కి గ్రా మాంసము 250 గ్రుడ్లు స్థానికులు వాడుకొనిరి

ఇచట ఎక్కువలు వ్యవసాయము కూలి అడవి కలప కొట్టి అమ్ముకొనుట మున్నగు వృత్తులమీద జీవింతురు దుకాణదారులు ఎద్దుబండ్లతోలువారు కసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు గలరు మంగలివారు చాకలివారు గొల్లలు వడ్డెరవారు కలరు మేదరవృత్తిశ్రమ కలదు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు కూలీ పురుషునకు రు 2లు స్త్రీ రు 1 50 లు

ఈ గ్రామమున ఆంజనేయదేవాలయము అంకమ్మ గుడి ముత్యాలమ్మగుడి చర్చి పీరులచావడికలవు ఇచట అంకమ్మ తిరునాళ్ళ శ్రీరామనవమి పండుగ జరుగును

ఖమ్మం రైల్వేస్టేషను ఈ గ్రామమునకు 5 మైళ్ళ దూరములో ఉన్నది ఈగ్రామము బస్సు మార్గముపై కలదు ప్రభుత్వపు బస్సులు ఈ గ్రామముగుండా కొత్తగూడెమునకును భద్రాచలమునకును ఖమ్మమునకును పోవును ఇచట 6 ఫర్లాంగుల పొడవుగల మట్టిరోడ్డు ఉన్నది 200 రెండెడ్ల బండ్లు 15 సైకిళ్ళు ప్రయాణమునకుఉపయోగపడు చున్నవి

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు జిల్లాపరిషత్తు హైస్కూలు ఉన్నవి విద్యార్థులు ఇచటి హైస్కూలునకు కాలువేపల్లి సోములగడ్డ గంగదేవిపాడు గ్రామములనుండి వత్తురు ఇది పంచాయతి పరిపాలన గల గ్రామము ఈ పంచాయతికి ఆదాయము రు 1860 లు ఇచట గ్రామపారిశుధ్యము నకు తగు ఏర్పాటులున్నవి ఒక పంచాయతిరేడియో ఒక ఎత్రము ?న్నవి ఇచటి సహకారసంఘము గ్రామస్థులకు రు 10 00) లు అప్పుగా ఇచ్చినది ఈ గ్రామమునందు సంతలు జరుగవు 8 కిరాణాదుకాణములు 3 కాఫీహోటళ్ళు బీడీ సిగరెట్టు సోడా అంగడి ఉన్నవి ఇచట పశురోగములకు నాటువైద్యముకలదు ఇంగ్లీషువైద్యులు కలరు

ఇచటికి 2 మైళ్ళలోనున్న ఖమ్మములోని తహశీల్దారు కార్యాలయమునకు 23 మైళ్ళలోనున్న మధిరలోని మేజిస్ట్రేటు కోర్టునకు సబ్ రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి ఈ గ్రామస్థులు పోవుదురు బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు 12 మైళ్ళలో ఉన్న కలూరునకు పోవుదురు కళాశాల చదువులకు 5 మైళ్ళలోకల కొత్తగూడెమునకు ఖమ్మమునకు విద్యార్థులు పోవుదురు పురుళ్ళ ఆసుపత్రికి పశువుల ఆసుపత్రికి 9 మైళ్ళలో నున్న వైరాకు జనులు పోవుదురు

మా శ్వే

## అన్నారము

అన్నారము నల్లగొండజిల్లా సూర్యాపేటతాలూకాలో ఉన్నది దీనికి 60 మైళ్ళ దూరములో వరంగల్లు పట్టణము కలదు తూర్పున గానుగబండ పడమట కోదాడ ఉత్తరమున వెంకేపల్లి దక్షిణమున గోరెంట - ఈ గ్రామమునకు సరిహద్దులు దీని విస్తీర్ణము 4627 ఎకరములు ఇది ఎత్తు పల్లములుగా ఉన్నది

1961 స॥ జనాభాలెక్కల ప్రకారము ఇచట పురుషులు 1775 మంది స్త్రీలు 1726 మంది వెరసి 3501 మంది ఈ సంఖ్యలో 6 కే సం॥ల బాలురు 150 మంది బాలికలు 250 మంది షెడ్యూలుజాతుల పురుషులు 280 మంది స్త్రీలు 284 మంది ఇచ్చట ఒక్కచో ఇండ్లు గుంపుగాను ఒకచో ఏకపంక్తిగాను ఒకచో వలయాకారముగాను ఉన్నవి వీటిలో

120 పెంకుటిండ్లు 8 కాంక్రీటుకప్పుగల యిండ్లు కలవు పడమటదిశగా ఎక్కువ భాశీర్ధలముండుటచే ఈ గ్రామము పడమరగా వృద్ధిచెందుచున్నది ఇచటి జనులలో 1500 మంది వరి అన్నమును 500 మంది జొన్నఅన్నమును 1500 మంది యితర అన్నములను తిందురు బావినీటిని త్రాగుదురు

చెరువులు బావులు ఈ గ్రామమునకుగల నీటివనరులు వీటిక్రింద వరి జొన్న సజ్జ వేరుసెనగ పంటలు పండును వీటిని బండ్లపై సూర్యాపేటకు ఖమ్మముకు రవాణా చేయుదురు 1966 67 సం|లో పంటలక్రింద ఉపయోగపడిన భూమి 3 600 ఎకరములు చెరువుక్రింద 200 ఎకరముల భూమి బావుక్రింద 150 ఎకరముల భూమి సాగుబడియైనది 5 ఆయిలు యింజనులు 120 ఎకరముల భూమికిని తదితరములు 150 ఎకరముల భూమినిని నీటిని సల్లయిచేసెను ఇచట భూమి దుబ్బనేల ఎర్రనేల తరినేల అని పెక్కురకములుగా ఉన్నది

ఆవులు ఎద్దులు గేదెలు దున్నలు వగయిరా 1000 మేకలు 500 గొర్రెలు 300 పందులు 200 కోళ్ళు 800 రెండు గుర్రములు ఉన్నవి దినమునకు 600 లీటర్ల పాలు మాసమునకు 500 కి గ్రా నెయ్యి 300 కి గ్రా మాంసము 1000 గ్రుడ్లు సాలీనా 1000 కి గ్రా చేపలు స్థానికులు వాడుదురు

ఇచటి ప్రజల ముఖ్యవృత్తులు వ్యవసాయము కూలి కుటీర పరిశ్రమలు అడవి నులు వ్యాపారము ఇవిగాక దుకాణాదారులు కంసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు కలరు మంగలివారు చాకలివారు కలసి 150 మందియు గొల్లలు వడ్డెరవారు కలసి 300 మందియు కలరు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి రు 2లు స్త్రీకి ఒకరూపాయి

ఈ గ్రామమున ఆంజనేయస్వామి గుడి గ్రామదేవత యగు ముత్యాలమ్మగుడి మహమ్మదీయుల ఈద్గా ఉన్నవి శ్రావణమాసములో అంజనేయస్వామికి దీపారాధన జరుగును ముత్యాలమ్మ జాతర శ్రీరామనవమి పండుగలు ఘనముగ జరుపుదురు

వరంగల్లు రైల్వేస్టేషను ఈ గ్రామమునకు 60 మైళ్ళ దూరములో ఉన్నది దీని పొరుగు గ్రామములతో మట్టిరోడ్డు కలుపుచున్నది ప్రయాణమునకు 150 రెండెడ్లబండ్లు 15 సైకిళ్లు కలవు

అన్నారములో ప్రాంచిపోస్టాఫీసు ప్రాథమిక పాఠశాల కలవు ఇది పంచాయతి పరిపాలనకల గ్రామము వ్యవసాయ పరపతి సంఘము ఉన్నది ఇద్దరు యింగ్లీషువైద్యులు కలరు అయిదు కిరాణా దుకాణములు కలవు

తంతి కార్యాలయమునకు జనరల్ ఆసుపత్రికి పురుళ్ళ ఆసుపత్రి కోర్టులకు రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరీకి ఈ గ్రామస్థులు 28 మైళ్ళలో ఉన్న సూర్యాపేటకు పోవుదురు హైస్కూలు చదువులకు విద్యార్థులు సూర్యాపేటకును కళాశాల చదువులకు 60 మైళ్ళలోనున్న నల్లగొండ వరంగల్లుకును పోవుదురు పోలీసు స్టేషనునకు 4 మైళ్ళలోఉన్న తుంగతుర్తికి పశువుల ఆసుపత్రికి బ్లాకు అభివృద్ధి కేంద్రములకు 15 మైళ్ళలోనున్న నాగారమునకు గ్రామస్థులుపోవుదురు

మా శ్రీ

## అన్నిగ

ఇతడు నోళంబవాడి రాజ్యాధిపతి తండ్రి అయ్యప్ప కుమారుడు ఇతడు తొలుత నోళంబరాష్ట్రము ముప్పదిరెండు వేల గ్రామ పరిమితమైయుండి కాలక్రమమున మైసూరురాజ్యములోని తుముకూరుచిట్టలదుర్గమండలి ప్రాంతమువరకును అనంతపురమండలములోని దక్షిణ ప్రాంతము వరకును వ్యాపించెను దీనికి మడకశిర తాలుకాలోని హెంజెరువాడి లేక హేమావతి రాజధాని

ఈ నోళంబవాడి తూర్పుచాళుక్యుల చరిత్రముతోపాటు ఆ ప్రదేశ చరిత్ర కెక్కినది

నోళంబులు ఈశ్వరవంశజులమనియు చండికారాధకులమనియు కాంచీపురత్రిలోచనపల్లవుల అనుచరులమనియు తమ శాసనముల దు చెప్పుకొనియున్నారు

తూర్పుచాళుక్య ప్రభువైన నాల్గవ విజయాదిత్యుడు (కొల్లభిగండ) మరణించిన తరువాత అతని కుమారుడైన మొదటి అమ్మరాజు విష్ణువర్ధన జమహేరాంద్ర అనుబిరుదములతో క్రి శ 921 లో రాజ్యాభిషిక్తుడయ్యెను ఇతడు 934 న వరకు పాలించెను ఇతని పినతండ్రియు ప్రథమచాళుక్యభీముని కుమారుడునునైన రెండవ విక్రమాదిత్యుడు కొంతమంది బంధుసామంతులతో కలిసి అమ్మరాజును పదభ్రష్టుని చేయ సంకల్పించుకొనెను కాని అమ్మరాజు వీరినందరిని జయించి తన సింహాసనమును కాపాడుకొనగల్గెను

అమ్మరాజు రాజ్యకాలమున జరిగినవిశేషములలో ముఖ్యమైనది నోళ బవాడి యుద్ధము అమ్మరాజునకు అన్నిగ సమకాలికుడు

అన్నిగ క్రీ శ 922 లో రాజ్యమునకు వచ్చినట్లు కడబగెరె శాసనము చెప్పుచున్నది తండ్రి అయ్యప పశ్చిమగాంగులపై పోరు సలిపి రణభూమియందు మరణించుటచే అన్నిగ రాజయ్యెను అన్నిగ రాష్ట్రకూట చక్రవర్తియగు మూడవ అమోఘవర్షుని ధిక్కరించి స్వాతంత్ర్యమును ప్రకటించుకొనెను క్రీ శ 929 లో అన్నిగ తనయుడైన ఇఱుళచోడుని శాసనములు నోళ బవాడియందు కాన్పించుటచే అన్నిగ 7 సంవత్సరముల కాలమే రాజ్యమేలెనని చెప్పవచును

మొదటి అమ్మరాజునకు నోళంబ అధిపతులైన అయ్యప అన్నిగలతో యుద్ధము పొసగెననుటకు స్థిరమైన ఆధారములు లేవని కొందరు చారిత్రకులు భావించుచున్నారు

నిశమం

## అన్నెమాంబ

ఈమె పేరు మల్లపల్లి సోమశేఖరశర్మగారు రచించిన రెడ్డిరాజ్యచరిత్రము" అను గ్రంథమున 5 అధ్యాయములో 85 పుటలో కానవగును

కొండవీటిరెడ్డిరాజ్యస్థాపకుడైన ప్రోలయవేమారెడ్డి తల్లియే అన్నెమాంబ ఈమె నెల్లూరు దొడ్డయసేనాని కుమార్తె ఈమెకు అనతాంబ అనునది నామాంతరము ఈమెను దొడ్డారెడ్డి స్కందదేవుని ప్రసాదమున పడసెననియు అతడు విక్రమసింహపుర (నెల్లూరు) నివాసిఅనియు ఆతనికి ఉద్యట్టికరిపుబల తుఖురఘట్ట అను బిరుదముండెననియు వామనభట్టరచితమైన వేమభూపాలచరిత్రము (III-97) వలన తెలియుచున్నది ఈమెభర్త ప్రోలయరెడ్డి సోదరుడునాగసేనాపతి ఈమెతండ్రియగు దొడ్డారెడ్డియు సోదరుడగు నాగసేనాపతియు క్రీ శ 1323 లో కాకతీయ ప్రభువగు ప్రతాపరుద్రునికిని ఢిల్లీ సుల్తానగు మహమ్మద్ బిన్ తుఘ్లక్ చక్రవర్తికిని జరిగిన యుద్ధములలో కాకతీయుల పక్షమవలంబించి వీరోచితముగ పోరాడి శత్రువులను చీల్చిచెండాడిన మహావీరులు ప్రోలయరెడ్డి వలన అన్నెమాంబకు అయిదుగురు కుమారులు జన్మించిరి వారు క్రమముగా మాచారెడ్డి ప్రోలయవేమారెడ్డి (అన్నమ వేమారెడ్డి) అన్నారెడ్డి దొడ్డారెడ్డి మల్లారెడ్డి అనువారు ఈమె కడుపు చల్లనితల్లి ఈమె తనయులైదుగురును పంచపాండవులకు దీటు వారిలోఅగ్రగణ్యుడు వేమారెడ్డి ఇతడు హిందూమతాభిమాని ఇతడు కొండవీటిరాజ్యమును స్థాపించి ధర్మయుతముగ దానిని పాలించెను ఇతడు శ్రీశైలమునకును అహోబలక్షేత్రమునకును మెట్లుకట్టించి యాత్రికులకు గొప్ప సౌకర్యమును కూర్చెను హరివంశమును రచించిన ఎఱ్ఱాప్రెగడ అను కవిని పోషించెను బ్రాహ్మణులకు అనేకాగ్రహారములు దానమొనర్చెను ఈ మహనీయుడు శక 1266 (క్రీ శ 1344) కు సరియగు పార్థివ సంవత్సర కార్తిక కృష్ణ అమావాస్యా భానువాసరమున సూర్యగ్రహణకాలమున దుతమ తల్లి అన్నమాంబ పుణ్యమునకుగాను పెర్వలి (తెనాలి తాలూకాలో ఉన్నది) అను గ్రామమును నూటయెనిమిది వృత్తులుగాచేసి బ్రాహ్మణులకు సర్వాగ్రహారముగాను అష్టభోగసహితముగాను సహిరణ్యోదకముగాను దానముచేసెను (చూ ఎపి ఇ స పు V పుట 13) ఆశాసనమున ఈ క్రింద వ్రాయబడిన శ్లోకములున్నవి

"శాకాబ్దే రసతర్క-భానుగణితే సంవత్సరే పార్థివే
కార్తిక్యా ముపరాగ పుణ్యసమయే భానోశ్చభేవాసరే।
శ్రీమద్వేమనృపోష్టభోగసహిత సర్వాగ్రహార దదౌ
గ్రామ పెర్వలినామకం ద్విజగణస్యాచంద్రమాతారకమ్
సోయమస్మిన్ పుణ్యదినే స్నాత్వా కృష్ణానదీ జలే।
సామాతు రన్నమా బాయాః పృథు పుణ్యానువర్తయే
గ్రామం పెర్వలినామాన అష్టాధిక శతాని చ
కృత్వా (శ్రేష్ఠా) గ్రజన్మేభ్యః సహిరణ్యోదక దదౌ॥

అన్నెమాంబ ప్రత్యేకించేసిన దానములు శాసనములలో కనవచ్చుటలేదు ఈమె వీరప్రసవినియై వీరభర్తృకయై మహాపతివ్రతయై అఖండ ఖ్యాతినార్జించిన పుణ్యమూర్తి

తంఆంశా

## అన్యమదేవి

అన్యమదేవి విష్ణువర్ధనమహారాజబిరుదాంచితుడైన నాగేంద్ర చక్రవర్తి యొక్క భార్య ఈమె పచ్చార్ల గ్రామములోనున్న ధర్మలి గేశ్వరస్వామివారికి అఖండదీపమునకై కొంత భూమిని దానమొనరెను ఈ విషయము దక్షిణ హిందూశాసనము వలన (ద హి VI నెం 656) తెలియ వచ్చుచున్నది ఈ శాసనము శక 1339 (క్రీ శ 1417) నాటిది ఇది పంచధార్లయందలి ధర్మలి గేశ్వరస్వామి దేవాలయపు తూర్పు ద్వారముచెంత ఒక స్తంభముపై ఉన్నది

విశాఖపట్టణము జిల్లాలోని సర్వసిద్ధి తాలూకాలో ప చధార్ల గ్రామమున్నది శాసనములోని సారాంశమిట్లున్నది స్వస్తిశ్రీ శక 1339 నాటి హేవిలబి స వత్సర చైత్ర శుద్ధ అష్టమీ శుక్రవారము మేష స క్రాంతి పుణ్యకాలమున శ్రీ విష్ణువర్ధన మహారాజులైన నాగే ద్ర చక్రవర్తులదేవియైన అన్యమదేవి తన చి తిత మనోరథ సిద్ధికిని స తానాభివృద్ధికిని ప చధార్ల గ్రామమునందలి ధర్మేశ్వరలింగమునకు ప్రతి దినమును మాన దీపానకై (అఖ డ దీపమునకు) 50 గొర్రెలను ఇచ్చినది

ధర్మ లి గస్యమేషే
అన్యా శా ప చధారాపుర కృతవ స తే
ర్దీపమా చ ద్రతార
దేవీ ప్రాదాదఖ డ ఖలదమనుదిన
నాగభూమీశ్వరస్య

మరియు ధర్మేశ్వరలి గమునకు వెలపుళ్లలోని పొలమును (ఖ డికను) కొ త దానమొనర్చెను ఈ యఖండదీపమును నిత్యము నెరవేర్చుటకై సోములగ గ బోయిని కొడుకులు మారెబోండిన్ని కూనబో డిన్ని మా కన బో డిన్ని అనువారికి పెదవరు (పెదపర్రు) భూమిలోని ఉత్త రాన పందుము క్షేత్రమును ఆ చ ద్రార్కముగ ఇచ్చెను బోయడు బోయ డు బోండు అనురీతిని ఈ పదము ఏర్పడి యు డును

శాసనమునందలి విషయమును గ్రహి చునపుడు ఆనాటి చరిత్రాంశములను గూడ గ్రహించుట మిక్కిలి అవశ్యకమని తోచును కళి గదేశచరిత్ర వలన (చూ పు 64 ) కొన్ని ప్రధానా శములు తెలియవచ్చుచున్నవి

క్రీ శ 10వ శతాబ్దార భమున వే గి తూర్పుచాళుక్యులు అ త కలహములతో చీలిపోయిరి వీరి వంశము (వే గి తూర్పు చాళుక్యవ శము) అనేక శాఖలుగ ర్పడెను మల్లపదేవుని ఎతాపుర శాసనమును బట్టియు ప చధార్ల సి హాచల శాసనములను బట్టియు క్రీ శ 925 న రాజ్యమేలిన మొదటి అమ్మరాజు సుతుడగు బేత విజయాదిత్యుని స తానము ఎల మ చిలి కళింగ విషయమును పాలి చుచుండెను ఈ ద శాసనపట్టిక వలన తూర్పుచాళుక్యవ శపురాజుల నామ ములను కనవచ్చుచున్నవి




పై పట్టికలోని శక 1294 (క్రీ శ 1372)న ఎలమ చిలి కళింగ విషయమును పాలించిన ఉపేంద్ర V చక్రవర్తి యొక్క రె డవ కుమారుడు నాగే ద్ర చక్రవర్తి ఈతని భార్యయే అన్యమదేవి ఎలమ చిలి కళి గ పాలకులు క్రీ శ 11 వ శతాబ్ది నుండి 15 శతాబ్దము వరకు రాజ్యము నేలిరి వీరు కళి గ గాంగ గజపతి రాజులకు నామ మాత్రముగ సామంతులై స్వతంత్ర ప్రతిపత్తి కలిగియుండిరి వీరు తూర్పు చాళుక్య ళువుల బిరుదములను వహి చిరి వీరి రాజ్యము శ్రీ కూర్మము మొదలుకొని విశాపురము వరకుండెను వీరు ప చధార్లలోని ధర్మలి గేశ్వరునకు భూదానములు గ్రామ

దానములు గూడ ఒసగిరి అనేక తటాకములను దేవళములను వీరు నిర్మించిరి సింహాచలములోని నృసింహస్వామికి వీరు బహుదానములు చేసిరి దేవభోగములకు వీరనేక మాన్యముల నిచ్చిరి బ్రాహ్మణులకు అనేక అగ్రహారములనొసగిరి కళలను పోషించిరి ఈ రాజులొనర్చిన దానములను తెలుపు శాసనములు పంచధార్లలోని ధర్మలింగేశ్వరాలయమున విశేషముగ లభించినవి ఈ శాసనముల వలన (క్రీ శ 1022 68) దుమ రాజమహేంద్రవరమును రాజరాజనరేంద్రుడు నిర్మించెనను నూతన విషయము ప్రకాశితమగుచున్నది దానంబట్టియే ఈ శాసనమున కనవచ్చు నాగేంద్ర చక్రవర్తికి తూర్పుచాళుక్యుల బిరుదముగు శ్రీ విష్ణువర్ధన మహారాజులు అను బిరుదము ఏర్పడెను ఈ విధముగ ఆనాటి ప్రభువులును వారి రాణులును భగవత్కైంకర్యమునకై అనేక దానధర్మములొనర్చి ప్రజారంజకముగ పాలనమొనర్చి తమ జీవితములను ధన్యమొనరు కొనిరి

తం ఆం శా

## అన్వరుద్దీను

గోల్కొండరాజ్యము ఆసఫ్ జాహి నవాబుల పాలన క్రింద అయిదు సుబాలుగా ఏర్పడినది ఇవి ఆర్కాటు కడప కర్నూలు రాజమహేంద్రవరము శ్రీకాకుళము అనునవి ఈ సుబాలపై అధికారము గోల్కొండకు సామంతులగు నవాబుల అధీనము చేయబడినది మొదటి నైజాముగు నైజామ్ ఉల్-ముల్కు ఒకవైపున మహారాష్ట్రులతో యుద్ధము చేయుచు వేరొకవైపున ఢిల్లీలోని కుట్రలను కుతంత్రములను ఎదుర్కొనుచు విరామములేక రాజ్యమును పాలించుచుండెను తనక్రిందనున్న సుబాలయొక్క సక్రమపాలనమునకు దక్షులగు నవాబులను నియోగించుటలో అతడు శ్రద్ధ వహించియుండెను

ఈ సమయమందే రాజమహేంద్రవరము ఏలూరు ప్రాంతములందలి జమీందారులు తమ అధికారమును నిలుపుకొనుటకు నిజాము ప్రభుత్వముపై ఎదురుతిరిగి విప్లవములను కలిగించుచుండిరి ఈ విపత్పరిస్థితులను ఎదుర్కొనుటకు నైజాము 1726వ సంవత్సరములో ఆర్కాటునవాబువంశస్థుడును తన కొలువునందున్నవాడును అగు అన్వరుద్దీను అను యోధుని రాజమహేంద్రవరము సుబాకు పాలకునిగా నియమించెను

అప్పటి జమీందారులు తమ విధ్యుక్తధర్మములను విస్మరించి రైతులను ఒత్తిడిచేసివారలనుండిబలాత్కారముగా మిక్కుటముగపన్నులను వసూలుచేసి ప్రభుత్వపు ఖజానాలను దుర్వినియోగముచేయుచు దుష్టులై ప్రవర్తించుచుండిరి అచటిపరిస్థితులను చక్కబరచుటకు రుస్తుంఖాను అను ఫౌజుదారు నైజామునే పంపబడెను అతని అసలుపేరు హాజీహుస్సేను అతడు జమీందారులదౌర్జన్యమును అణచుటయందు అనేక కఠినచర్యలను జరపెను అతనిపేరు ఆ నీతిపరులకు సింహస్వప్నమైనది అతనిచే అనేకులు తిరుగుబాటుదారులు హతమొనర్పబడిరి రాజమహేంద్రవరమందును ఏలూరు పట్టణమందును తిరుగుబాటుదారుల ఉరితీత రుస్తుంఖాను విధించెను

అన్వరుద్దీనుకాలమునందే నూజివీటి జమీందారగు నరసింహ అప్పారావు (ఈతనిని రామచంద్ర అనియు పిలిచెడివారు) తన స్వతంత్రతను ప్రకటించుకొని నైజామునకు ఎదురుతిరిగెను అందుచే నూజివీటికోటను రుస్తుంఖాను ముట్టడించి మూడునెలలకు ఎట్టకేలకు తనస్వాధీనము చేసికొనగల్గెను బందిగా కొనబడిన ఆ జమీందారుని శిరఃఖండనము కావింపబడెను

రుస్తుంఖాను క్రూరచర్యల మూలమున అన్వరుద్దీను పాలనము ఆ ప్రాంతములో క్రూరత్వమునకు పేరొందెను ఇట్లు 16 సంవత్సరములు శిరాంద్రమును పాలించి అన్వరుద్దీను హైదరాబాదు చేరుకొనెను హైదరాబాదు నవాబు దక్కను సుబేదారుగా తనకున్న అధికారమును ఉపయోగించి మరల తన ఆస్థానములో చేయుచున్న ఈ అన్వరుద్దీనును 1743 సంవత్సరములో ఆర్కాటునకు నవాబుగా నియమించెను ఆర్కాటు కర్ణాటకమునకు ముఖ్యపట్టణము అన్వరుద్దీను ఆర్కాటు నవాబుగా నియుక్తుడైనప్పటి పరిస్థితులిట్లున్నవి

మొగలాయి ప్రాభవము దక్కనుప్రాంతమునకు ప్రాకినపుడు సాదతుల్లాఖాను అనునతడు కర్ణాటకప్రాంతమునకు నవాబయ్యెను కృష్ణానదికి ఉత్తర సరిహద్దుగా పర్వతములను - బంగాళాఖాతము తీరమునకును నడుమనున్న ప్రాంతము దక్షిణమున తంజావూరు వరకు గలప్రాంతము ప్రస్తుతము నెల్లూరు మద్రాసు చెంగల్పట్టు ఆర్కాటు జిల్లాల ప్రదేశము రాయలసీమ ప్రాంతము — ఈ ప్రాంతములకు కర్ణాటకమని పేరు కర్ణాటకమునకు ఆర్కాటు ముఖ్యపట్టణమని తెలిసికొని ఉన్నాము — సాదతుల్లాఖాను 1710 నుండి 1740 వరకు ఇచట నవాబుగా ఉండెను

నము పేరువచ్చియుండవచ్చునని వారు ఊహించిరి

కాని ఆంధ్ర దేశమునందు క్రీస్తునకు పూర్వము రెండవ శతాబ్దమునాటినుండి చైత్యకనికాయము పూర్వశైలనికాయము అపరశైలనికాయము అనునవి ఉన్నట్లు ఆధారములు కలవు మరియు మహాదేవభిక్షువు ఆంధ్ర ప్రాంతమునకు ఏతెంచకమునుపే చైత్యశైల బౌద్ధసంస్థలు పాటలీపుత్రమున ఉండెనని ఖుల్లవగ్గ అను గ్రంథమందు ఉదాహరింపబడియున్నది

మహాదేవభిక్షువు కుక్కుటారామమున ఉన్నపుడే సంఘమునందు శ్రమణులు అర్హతులు బుద్ధునిసూక్తుల ఆదేశానుసారము నికాయములందు అష్టాంగిక మార్గముతోపాటు పంచశీలవ్రతము నుపాటించవలెనని ప్రబోధించెను శీలవ్రతనిబంధనలైదు అవి (1) జీవహింసచేయకుండుట (2) దత్తము కాని దానిని గ్రహించకుండుట (3) అసత్యమాడకుండుట (4) వ్యభిచారము చేయకుండుట (5) మద్యపానము చేయకుండుట అనునవి వీటిని పాటించుటవలన మానవుని శీలమునందు మార్పువచ్చునని స్పష్టము చేయబడెను శీలసూత్రము నుపాటించువారు శీలసంఘములుగా పరిగణింపబడ్డట్లు మహావస్తువను మహాశ బౌద్ధ గ్రంథమునందుకలదు

చైత్యకులయందు శీలసూత్రములు ఉద్రేకపరుచబడుటవలన కొంతమందివారిను విడిపోయిరి అనస్థశీలసంఘాలుగా మారెను కుక్కుటారామమునుండి వీరిలో కొంతమంది ధాన్యకటకమునకు మహాదేవభిక్షువుతో వలసవచ్చిరి ఈ వలసవచ్చినవారే అపరశైలనికాయులు గండవ్యూహమునందు చెప్పబడినట్లు విచిత్రమాలధ్వజమను మహారణ్య ప్రాంతమున ఉండుటవలన అపరమహావనశైలనికాయులుగా పరిగణింపబడుచుండెడివారని ఊహింపవచ్చును దీనికి తార్కాణముగ ఆంధ్ర ప్రాంతమున పురాతత్త్వ పరిశోధనలో ఎక్కువగ అపరమహావనశైలీయ ఆరామముల అవశేషములు బయటపడెను కాని పూర్వశైలనికాయమునకు చెందిన ఆరామములు బయటపడలేదు శాసనములయందుండు శేలియ అను పదము శైలియ అయి ఉండవచ్చునని తోచుచున్నది

తూ వెం గో శా

## అపరమహా వినశైలియ :

ఇది బౌద్ధమతమునందలి ఒకఉపశాఖ బుద్ధుని ధర్మమునకు అనేక విధములైన వ్యాఖ్యానములు వివరణములు చేయబడి అందు అనేక శాఖలు క్రమముగా ఏర్పడినవి కొన్ని శాఖలు పశ్చిమమునకు దక్షిణమునకు ప్రాకినవి అవి వినయమునకు ప్రాధాన్యము నిచ్చినవి సూత్రము అభిధమ్మము వినయము అనునవి త్రిపిటకములు వినయపిటకము త్రిపిటకములలో ఒకటి కొన్నిశాఖల ఆచార్యులయొక్క చైత్యములు పర్వతముల మధ్యభాగమున పర్వతశిఖరములమీద ఉండెడివి ఈ అపరమహావినసేలియ అనునది అట్టి లక్షణములు కలది ఆంధ్రదేశమున కృష్ణానదీతీరమున అమరావతి ధాన్యకటకము కేంద్రములుగా ఇది ఇక్ష్వాకురాజవంశ స్త్రీల ఆదరసత్కారములతో బాగుగా ప్రాభవము నందినది

దీనిని గురించి ఇంకను వివరములు తెలిసికొనుటకు ముందు బౌద్ధమతము కొన్ని ముఖ్యశాఖలుగా ఎందుచీలినదో ఎట్లు చీలినదో ఏ శాఖనుండి ఈ అపరమహావినసేలియ మున్నగు ఉపశాఖలు పుట్టినవో వాని లక్షణములెట్టివో తెలిసికొనవలసి యున్నది ఆ ప్రధానశాఖయొక్క ముఖ్యయాత్రముచే ఈ ఉపశాఖలన్నియు అంగీకరించి అవలంబించి ఆచరించియున్నవి

బుద్ధుని జీవితకాలమునందే బుద్ధుని జ్ఞాతియైన దేవదత్తుని వంటివారు అతని ప్రాముఖ్యమును అంగీకరించకుండిరి వారు మరియు బుద్ధుడు తన నిర్వాణ సమయమున తన వారసునిగా ఎవరిని పేర్కొనలేదు బుద్ధుడు తన అంతరంగిక పరిచారకుడగు ఆనందునితో ధర్మ వినయములే అందరు ప్రమాణములుగా ఎంచవలెనని చెప్పెను అందుచేతనే బౌద్ధ శ్రమణులయొక్కయు సంఘములయొక్కయు ప్రవర్తనములు సూత్రములలోను వినయములోను పొందుపరుపబడియున్న బుద్ధునియొక్క సూక్తులకు ఎంతవరకు అనుగుణముగా ఉన్నవో పరీక్షింపవలసి యున్నది

ఈ స్థితి తరువాత అనేక అభిప్రాయభేదములకు దారితీసినది అవి వ్యక్తులపైనను వారి అవసరములపైనను పరిసరములపైనను ఆధారపడియుండెను బుద్ధుని బోధలు వ్యాఖ్యానములు గురువునుండి శిష్యునికి వాగ్రూపమున సంక్రమించుచుండెను అందుచేత వాని అసలు స్వరూపము క్రమముగా తెలియకుండాపోయి కాలక్రమమున అభిప్రాయభేదములు ఏర్పడెను

ఈఅభిప్రాయభేదము బుద్ధనిర్వాణానంతరము ఒకశతాబ్దికి అంకురించెను అవి పాటలీపుత్రనగరమున సమావేశమైన

రెండవ బౌద్ధపరిషత్తునందు పరిపుష్టమైనవి. ఈ భేదములకు ముఖ్యకారణము కొందరు శ్రమణులు బౌద్ధమున దలిదీరిన నియమములను సడలించవలెననియే. అది అవసరమనినవారు మహాసాంఘికులనబడిరి. అది అనవసరమన్న స్థేరవాదులు (స్థవిరవాదులు) అనబడిరి. ఈ రెండు ముఖ్యశాఖలకు అనేక ఉపశాఖలు బయల్వెడలినవి.

బుద్ధుని నిర్వాణానంతరము ఒకశతాబ్దికి బయలుదేరిన మహాసాంఘికశాఖ మరియొక శతాబ్దికాలములో ఏకవ్యావహారిక లోకోత్తరవాద కుక్కుటిక (గోకులిక) బహుశ్రుతీయ ప్రజ్ఞప్తివాదములు అను ఉపశాఖలుగా చీలి శైల (సేలియ) వాదములుగా కూడ బయలుదేరెను. మునుముందు చైత్యకవాదముగా నుండి ఆ చైత్యములు పర్వతముల మధ్య పర్వతముల మీద నుండుటచే శైలవాదములుగా పేర్కొనబడెను. ఇవి మహాయానమునకు తరువాత దారితీసినవి. సింహళ బౌద్ధగ్రంథములు ఈ శైలీయులను అంధకులనికూడ పేర్కొన్నవి. వీటి ఆంధ్రమునందు ప్రాముఖ్యము హెచ్చగుటచే ఆ పేరు వచ్చెను. ఈ మహాసాంఘికశాఖలు చైత్యక శైలవాదములు దక్షిణభారతమున గొప్పప్రభావము కలిగియుండెను.

ఈ మహాసాంఘికులు స్థేరవాదుల విరోధమును నిలద్రొక్కుకొని అన్నిదిక్కులకు ముఖ్యముగా దక్షిణమునకు వ్యాపించిరి. చైనాయాత్రికులైన యువాన్‌చ్వాంగ్ (హ్యూయాన్‌చ్వాంగ్) ఇత్సింగ్ వీరిని పేర్కొనిరి. భారతదేశమునందలి వివిధప్రాంతములందలి శాసనములుకూడ వీరిని పేర్కొనెను. వీరు పాటలీపుత్రము వైశాలినగరము కేంద్రములుగా అన్ని దిక్కులకు వ్యాపించిరి. నాగార్జునకొండ అమరావతీ శాసనములు హాంగి (ఆయిర - హాగన) చైత్యక జేతియవాదక మహావినసేలియన అపరమహావినసేలియన పుబ్బశైల రాజగిరినివాసక సిద్ధార్థిక బహుశ్రుతీయ మహీశాసక శాఖలను పేర్కొనెను. వీనిలో చివరదితప్ప తక్కినవి ప్రాంతీయములు మహాసాంఘికశాఖలును.

అమరావతి నాగార్జునకట్టడములను బట్టి మహాసాంఘికులకు కృష్ణా గుంటూరు మండలములందు మంచి ప్రాముఖ్యము కలదని తెలియుచున్నది. ఈ కట్టడములు శాఖల అవినాభావ సంబంధముతో వృద్ధినొందినవి. అంధకపదము గూడ ఆంధ్రమునందు శైలీయులు ఆదరమునొందిరని సూచించుచున్నది.

చైత్యవాదమునకు మూలపురుషుడు మహాదేవుడు. ఈతడు బుద్ధనిర్వాణము తరువాత రెండవ శతాబ్దమున జీవించి మహాసాంఘికుల పంచసూత్రములను పాటించెను. ఈతడు పర్వత చైత్యమునందు నివసించుచుండుటచే ఈతని అనుయాయులను చైత్యకులనిరి. అమరావతి నాగార్జునకొండ శాసనములు వీరిని పేర్కొన్నవి. చైత్యవాదము శైలీయవాదములకు మూలము. చైత్యవాదులకు మహాసాంఘికులకు కొన్ని స్వల్పవిషయములందే కాని మూలసూత్రములందు ఎట్టి భేదములేదు. వారి ముఖ్యసూత్రములు (1) చైత్యనిర్మాణము అలంకరణమువలన పుణ్యము కలుగును. అటులే చైత్యప్రదక్షిణమువలనగూడ. (2) పుష్పములు సుగంధద్రవ్యములు అర్పించుట గూడ అట్టిదే. (3) దానముచే పుణ్యమునొందినతను తనవారికికూడ అర్పణచేయవచ్చును. ఈ బోధము హీనయానమందులేదు. మహాయానమందు బాగుగా కలదు. అందుచే ఇవి సామాన్యులకు ప్రీతిపాత్రమయ్యెను. (4) బుద్ధుని బంధుముక్తులు వారిమనమువే అర్హతున్నతులు. (5) సమ్యక్ దృష్టిలేనివాడు ద్వేషాతీతుడుకాడు కనుక క్రూరకర్ముడగును. (6) నిర్వాణము అత్యంతనిర్దుష్టమైనది. ఈ విధముగా ఈ సూత్రములు తరువాతి మహాయానమునకు ప్రాతిపదికలై ఉన్నవి. ఇవి మొదటిసారిగా బుద్ధుని బోధిసత్త్వులకును దివ్యత్వమునాపాదించి తరువాత మహాయానమందలి వారి పరిపూర్ణ దివ్యత్వమునకు దారితీసినవి. ఈ విధముగా ఇవి సామాన్యులకు ప్రీతిపాత్రములైనవి. వాటి సంభోగకాయ ప్రతిపాదనము మహాయానమునందలి త్రికాయ సిద్ధాంతమునకు మూలమైనది. చైత్యపూజ నైవేద్యములు ప్రజారంజకమైన బౌద్ధమునకు దారితీసినవి. ఈ విధముగ మహాసాంఘికులును వారి శాఖీయులును మహాయానమునకు ప్రజారంజకమైన బౌద్ధమునకు ప్రగతికారులైరి. కథావత్తు వ్యాఖ్యానము మరినాలుగుశాఖలను పేర్కొన్నది. అవి రాజగిరి సిద్ధార్థిక పుబ్బసేలియ అపరసేలియ వాజిరీయ ఉత్తరపథ వేతుల్య వాదములు. అందు మొదటి నాలుగు అంధకములనబడినవి. రెండవశతాబ్ది మూడవశతాబ్దుల శాసనములు పెక్కుశాఖలను వానిలో చైత్యక పూర్వశైలీయ అపరశైలీయులను పేర్కొనినవి.

ఇన్నిశాఖలున్నను వానిలో వైరభావములేదు. వివిధ శాఖీయశ్రమణులు పరస్పరము రాకపోకలు చేయుచుండిరి

న్నది అందుచే కళ్యాణపూర్వభాగములు అపరాంతనగరము లని చెప్పవచ్చును కాని అది దక్కనుపీఠభూమి ఆవల సహ్యాద్రికి తూర్పున ఉన్నది కాళిదాసు అపరాంతము సహ్యాద్రి పశ్చిమకనుమలకు సముద్రమునకు మధ్యనున్నదనెను అతడు అచటి త్రికూటపర్వతమును కూడ పేర్కొనెను అది అపరాంతదేశాధిపతులుగా ప్రసిద్ధులైన త్రైకూటకులను జ్ఞప్తికితెచ్చును వారిరాజధానియు అమరము అని రుద్ర పురమువారు 5 శతాబ్దివారు అప్పటిదే అజంతా మహా శాసనము త్రికూటమును లాటదేశమునకు వేరుగా చెప్పినది పదమూడవశతాబ్దియందలి వాత్స్యాయనుని కామసూత్ర వ్యాఖ్యానము అపరాంతమును పశ్చిమతీరప్రాంతముగాను లాటమును వేరుగాను చెప్పుచున్నది

ఆరవ శతాబ్దినుండి ఈ భూభాగమునకు కొంకణ విషయమని పేరువచ్చెను అప్పటి మగధేశుని శాసనము కొంకణ విషయమందలి ఒక గ్రామమును పేర్కొన్నది బృహత్సంహిత చెప్పినట్లు కొంకణము మొదట అపరాంతమునకు వేరుగా కన్పడును కాని 8వ శతాబ్ది చివరిభాగమందు అదిలాట భాగమగువాసియానిప్రాంతములో చేరియుండినది 8వశతాబ్ది మొదటిభాగమందు ఒక కొంకణరాష్ట్రపాలకునకు గోప్త పతియని బిరుదు అదు అది గోకర్ణము కొంకణదక్షిణభాగమని సూచించుచున్నవి దాని మాహాత్మ్యము మహాభారతకాలము నుండి యున్నది అపరమధ్యయుగము నందలి శక్తిసంగమ తంత్రమను గ్రంథము కొంకణము పశ్చిమకనుమలకు సముద్ర మునకు మధ్యభాగమని చెప్పినది అది కోటీశమండలమధ్యము వరకు వ్యాపించినది కోటీశమనగా గోకర్ణమందలి కోటి తీర్థమట శాతవాహన సామ్రాజ్యభాగములలో అంత ర్మండలవిషయమున్నది అదిఅపరాంత లేకకొంకణదేశభాగము

నాసికగుహాశాసనము నాసిక కార్లెమండలములు గౌతమీపుత్రుని సామ్రాజ్యభాగమైన అపరాంతభాగములని సూచించుచున్నది సహ్యాద్రిఖండగ్రంథము దానియందలి కొంకణమునే కాక ఇతరభాగములను కూడ చెప్పుచున్నది కన్‌హేరి (అపరాంతమండలి) శాసనమొకటి దాతను నాసికమందని చెప్పుచున్నది

శాతవాహన సామ్రాజ్యభాగములలో సోపరక (సుప్పరక)ఆహారముఅనుపదమున్నది శాతవాహనుల తరువాతినుండి పదము వచినది 8వ శతాబ్దినుండి దక్షిణ కవికజన వచ్చెను అపరకారము కొంకణము 900 1400 (గ్రామము ఖ్య) అనునది వ్యవహారములోని వచ్చెను

మహాభారతమున సుప్పారకనగరము తీర్థయాత్రా స్థలమైన రామతీర్థము కలవు ఇది ఉపవదత్తుని ఋషభదత్తుని శాసనములలో పేర్కొనబడి గ్రీకులు మటి ముప్పర లేక సొప్పరగా గుర్తించిరి అది కల్లియన్ లేక కళ్యాణి తోపాటు పేర్కొనబడినది ప్రాచీ పాళీగ్రంథములు సుప్పరక సువర్ణభూమి (దక్షిణబర్మా మలయాద్వీపములు) లకు మధ్య విస్తృతవ్యాపారములున్నటు పేర్కొనుచున్నవి అల్బెరూనీ దానిని సోపర అని పేర్కొని అది 11వ శతాబ్ది వరకు వృద్ధిలో నున్నట్లు సూచించుచున్నాడు క్రీ శ 1090 నాటి శిలాశాసనము సుర్పారకమున్నగు నగరములకు వచ్చు బడ్లపై సుంకములను పేర్కొనుచున్నది సుర్పారకముకు ఇప్పటి బొంబాయికి కొంచెము ఉత్తరముగా బస్సీనుదగ్గరి సోపారాగా భావించుచున్నారు ఆహారావార్ లేక అభీరవంశము (తూర్పు మాళవములోనిది) ఉన్నప్పటి వాఙ్మయము అభీరులు అపరాంతవాసులని సూచించుచున్నది పురాణములు వారిని శాతవాహనుల తరువాత అచ్చటి ప్రబలులుగా చెప్పుచున్నవి వారి రాజ్యములో ఉత్తరకొంకణము లేక అపరాంతము కూడ నుండవచ్చును అభీర ఈశ్వరసేనుడు క్రీ శ 278 279 లో తనశకమును సాధించియుండి చో అభీర రాజ్యములో అపరాంత లాటములు కూడ ఉండియుండవచ్చును చంద్రగిరి శాసనము త్రైకూటకులు అపరాంతమును తీసుకొనిరని సూచించుచున్నది వారు భీరుల శాఖ కావచ్చును చుటుశాతవాహనులు కూడ శాతవాహన సామ్రాజ్యానంతరము అపరాంతమును బనవాసిని కొంతకాలము పాలించిరి

రాజకీయముగా అపరాంతము దక్షిణభారతములో ప్రబలులైన వారందరికి లోబడి ది అట్లు దాని మౌర్యులు శాతవాహనులు వాకాటకులు చాళుక్యులు రాష్ట్ర కూటులు కళ్యాణిచాళుక్యులు కొంతకాలము లోబరుచు కొనియుండిరి మధ్యమధ్య కొన్ని ప్రాంతీయవంశములు కూడ దానిని పాలించినవి ఆర్థికముగా అది ఏరాజ్యమున కైనను తలమానికమువంటిది వ్యవసాయము పరిశ్రమలు (ముఖ్యముగా వస్త్రపరిశ్రమలు) వ్యాపారము దేశాంతర

ప్రశంసయే కెస్సరాజు ఉద్దేశమైయుండును. ఏలన పాపాత్ములను తెగడిన తరువాత పుణ్యాత్ములకు శుభము పలుకుట అవసరము. ఈ రెండవ వాక్యము అందులకే వ్రాయబడి ఉండును అయి చో దీనిట్లు ఊహించుచున్నాము. ధర్మవెట్టి లేకధర్మచందా పెట్టినవారు (జనులు) పుట్టేలి మారమ్మ పరిచర్య (చరి) చేయువారు అనగా తత్పాత్రులు ఒకానొక దేవత యొక్క పరిచర్య చేయు పుణ్యాత్ములగుదురు. పుట్టేలి మారమ్మ వనవోలు గ్రామ ప్రాంతమందలి ప్రసిద్ధమైన గ్రామదేవత అని భావించవలెను. వనవోలు గ్రామము పైన నుడివినట్లు హిందుపుర తాలూకాలో ఉన్నది. ఇప్పటి దీని జనాభా 4 69 బుట్టేలి పుత్తేలి ఎచ్చటిదో నిర్ణయింపలేము. అయినను శాశ్వతమైన ఒక ఊహ చేయవచ్చును. హిందుపురం తాలూకా గోరంట్ల ఫిర్కాలో బూదిలి గ్రామము కలదు. దీని జనాభా 5672. శాసన సంగ్రాహకులు దీనిని బూదిలియని వ్యవహరించిరి. బూదిలి గ్రామమే బుడేలియని ప్రకృతమునకు భావించుచున్నాము. బుదిలి వనవోలు గ్రామములు రెండును ఒకే ఫిర్కాలో ఉన్నవి.

కెస్సరాజు శాసనము చాలా ప్రాచీనమైనదనుటనిస్సందేహము. ఇందలి వర్ణక్రమము ఈనాడు మనకు విచిత్రముగా ఉండును. కెస్సరజు కెస్సరాజు పణ్ణోల-వనవోలు చెఱువు చెఱువుల యొక్క బరవారాణసి (కాశీ) పెంచినవారు-పెట్టినవారు. ఈ రీతిగ నాలైదు పంక్తులలో ఇప్పటి భాషాదృష్ట్యా ఎన్నియో అంతరములు కన్పించును. వాక్యరచనయు క్రొత్తగా అగుపించును. కెస్సరాజు నిచ్చిన దత్తి-అనగా కెస్సరాజు ఇచ్చిన ధర్మము నన్నయభట్టుగారు కూడ ఇట్లే ప్రయోగించును. నా నేర్చిన ధంబున అనగా నేను చేయగలిగినయట్లు అని భావము. ఇందు గండవాదేశము అతిసామాన్యము. బుడెలి మరమ్మ చరిసేసె వణ+ప్రోలు -వణ్ప్రోలు-వనవోలు.

అవమనగంగు కెస్సరాజుగారి శాసనము ప్రాచీనమైనచో ఎంత ప్రాచీనము అను ప్రశ్న యుదయింపకమానదు. నిశ్చితముగా చెప్పుటకు ఆధారములులేవు కాని శాసన సంపాదకులు దీని వైదుంబుల శాసనావళిలో కూర్చినారు. వైదుంబులను రాజవంశము చిత్తూరుజిల్లాలో పరిపాలన చేసినట్లు వారి శాసనముల వలన తెలియుచున్నది. వీరిని గూర్చి ప్రత్యేకశీర్షిక క్రింద వ్రాయబడును. వైదుంబవంశములో ఒకడగు "భువనత్రినేత్ర వైదుంబమహారాజు శక 894లో పట్టాభిషిక్తుడైనట్లు కడప జిల్లా ఉప్పల్లి దగ్గర దొరికిన శాసనములో ఏ వా X నెం 6 8- 4 ) చెప్పబడియున్నది. ఇది క్రీ శ 9 ) ప్రాంతము నన్నయభట్టారకునకు అర్ధశతాబ్దము ముందు. అవమనగంగు కెస్సరాజు దీనికి పూర్వుడైయుండును.

ఖం ల ర

## అపీలకుడు

ఏకచ్ఛత్రాధిపత్యముగా రమారమి 450 సంవత్సరములు వింధ్యప్రాంతమునుండి దక్షిణాపథమును ఏలిన శాతవాహనరాజులలో అపీలకుడు ఒకడు. ఇతనికి ఇవిలక హివిలక అను నామాంతరములు కలవు. ఇతని పూర్వులు క్రీస్తుకు పూర్వము ఒకటవశతాబ్దమున శకులకు భృత్యులుగా ఉండి సిముఖుని నాయకత్వమున స్వతంత్రరాజ్యమును సంపాదించిరి. మత్స్యవాయుపురాణములనుండి ఎక్కువ విషయము వీరి చరిత్రను గురించి సేకరింపవచ్చును.

మత్స్యపురాణమునందు వరిపబడిన 30 మంది రాజులలో అపీలకుడు నిమిదవవాడు. వాయుపురాణమునందున్న 17 శాతవాహనరాజులలో ఇతడు నాలుగవవాడు. ఈ రెండు పురాణములయందును ఇతడు 12 సంవత్సరములు రాజ్యము చేసినట్లు సమకూరిపడియున్నది. ఇతని తండ్రి లంబోదరుడు. ఇతని తరువాత మేఘస్వాతి అను రాజు రాజ్యమేలినట్లు కొన్ని పురాణములు చెప్పుచున్నవి.

చారిత్రకముగా అపీలకుని గురించి వివరములు లేకపోవుటవలన కొందరు ఇతడు ధాన్యకటకము నేలిన శాతవాహన రాజులలో ఒకడనియు మరికొందరు ఇతడు ప్రతిష్ఠానపురమును ఏలిన రాజులలో ఒకడనియు భిన్నాభిప్రాయములను అంగీకరించిరి. కాని పురాణములయందు లంబోదరుని పుత్రుడుగా ఉదాహరింపబడియుండుటచేత ఇతడు ప్రతిష్ఠానపురమునుండి రాజ్యమును ఏలియుండవచ్చునని ఊహింపవచ్చును. మరియు ఈతని గురించి నాణెముల పరిశోధనలలో కొన్నిరహస్యములు బహిర్గతమైనవి.

మహాకోసల సంస్థచే సేకరింపబడిన నాణెములలో ఒక రాగినాణెము అపీలకునిది. దీనియొక వైపు ఏనుగుపైన అంకుశము క్రింద నందిపాదము ముద్రింపబడియున్నవి. ఈ బొమ్మను అంటుపెట్టుకొని పైభాగమున "రాణోశివశిరిసఅపీలకస" అను అక్షరములు బ్రాహ్మీలిపిలో వ్రాయబడియున్నవి

చిత్రము - 16



రాణోశివ శిరి అపీలకస

ఈ నాణెము ప్రస్తుతము మధ్యప్రదేశములోని ఛత్తీస్‌ఘడ్ ప్రాంతమునందుదొరికినట్లు రూఢియగుచున్నది (చూ విస్తృత నాణెచిత్రము)

లండనులోని బ్రిటిషు మ్యూజియమునందు ఇటువంటి నాణెమే మరియొకటి కలదు మా రేమండరామారావుగారు వ్రాసిన శాతవాహనుల నాణెములు అను వ్యాసములో అపీలకుని పొటిన్ (వెండితగరము కలసినది) నాణెమొకటి ఉదాహరింపబడినది దానియందు రాణోశిరిసాపీలకస అను అక్షరములు బ్రాహ్మీలిపిలో వ్రాయబడి యున్నవి

పై అంశములను బట్టి అపీలకుని చరిత్రను ఇంకను ఇట్లు అన్వయించవచ్చును పురాణములందు ఇతని తండ్రిపేరు లంబోదరుడు అని కన్పించుచున్నను అది వాస్తవనామముగా గ్రహింపనక్కరలేదు అట్టి వికృతనామము ఎవరును పెట్టుకొనరు అపీలకుని తండ్రి స్థూలకాయుడగుట చేతనో మరియే అవయవవికారము కలవాడగుటచేతనో లోకమునందు లంబోదరుడని వెక్కిరింపు పేరుతో పిలువబడగా అదియే గ్రంథములకెక్కియుండును ఇది ధృతరాష్ట్రునకుగల చీకురాజు వంటి గుణనామధేయమని మనము ఊహింపవచ్చును ఈతని నిజనామము శివశ్రీ కావచ్చును రాణోశివశిరిస అపీలకస అనుదాని మహారాజైన శివశ్రీ కుమారుడు అపీలకుని యొక్క అని అర్థము చెప్పుటయుక్తము తండ్రిపేరు చెప్పి కుమారులను వ్యవహరించు లోకము కలదు ఉండనే యున్నది తరువాత ఈ పద్ధతిని మార్చి శాతవాహన రాజులలో కొందరు తల్లిపేరుతో కలిపి తమపేరు చెప్పుకొను ఆచారమును ప్రవేశపెట్టిరి గౌతమీపుత్రశాతకర్ణి వాసిష్ఠీపుత్ర శ్రీ పులుమావి మొదలగువారు ఇందులకు ఉదాహరణములు కావున మహారాజైన అపీలకుని తండ్రి శివశ్రీ యని చెప్పుట అసమంజసము కాకపోవచ్చును

మత్స్యపురాణములోని పట్టినిబట్టి అపీలకుని తండ్రియైన శివశ్రీ మహారాజు శాతకర్ణి కుమారుడు శాతవాహన వంశమున పూర్వతరము వారిలో ఇద్దరు శాతకర్ణులు కానిపించుచున్నారు మత్స్యపురాణమునుబట్టి కృష్ణశాతవాహనుని కుమారుడు ఒకడు పురాణము ఇతనిని శ్రీమల్లకర్ణియని పలుకుచున్నది అపీలకుని పితామహుడును శివశ్రీ తండ్రియు గు మరియొక శాతకర్ణి కలడు ఇతడు రెండవ శాతకర్ణి కృష్ణశాతవాహనుని కుమారుడైన మొదటి శాతకర్ణిని గూర్చి మనకంతగా తెలియదు కాని రెండవ శాతకర్ణి ఈ వంశములో చాలా ప్రసిద్ధుడు ఇతడు 56 సంవత్సరముల దీర్ఘకాలము సామ్రాజ్యము చేసినట్లు తెలియుచున్నది దీర్ఘకాలము పరిపాలనచేయుటయే కాక ఇతడు మహాసమర్థుడు అగు రాజగుట మరియొక విశేషము రెండవ శాతకర్ణి కాలము క్రీ పూ 184-123 అని లెక్క చేయబడినది ఇతడు కళింగమును పాలించినవాడును గొప్పవిజేతయు అగు ఖారవేలునకు సమకాలికుడు ఖారవేలుడు తన రెండవరాజ్య సంవత్సరమున శాతకర్ణిని ధిక్కరించి తన సైన్యమును పశ్చిమమునకు దండయాత్రపై పంపినట్లు తన హాథిగుంఫశాసనమున ప్రకటించుకొన్నాడు రెండవశాతకర్ణి ఇట్లు తనరాజ్యారంభకాలమున బలవంతుడైన ఖారవేలునకు కొంచెము ఒదిగి ఉండవలసినవాడైనను తరువాత మహాపరాక్రమముతో విజృంభించి శాతవాహన సామ్రాజ్యమును మధ్యప్రదేశములోనికి వ్యాపింపజేసెను సాంచీవద్దగల మహాస్తూపముపై శాతకర్ణి పేర్కొనబడియున్నాడు ఈ మహావీరుడు శుంగవంశీయులైన పుష్యమిత్ర అగ్నిమిత్రులను నిరోధించి పశ్చిమ మాళవమునందు తన రాజ్యమును స్థిరపరచెను

రెండవ శాతకర్ణికుమారుడు లంబోదర ఉపనామకుడైన శివశ్రీ. శివశ్రీ కుమారుడు అపీలకుడు. శివశ్రీ ఎంత కాలము పరిపాలించెనో అతని రాజ్యవిశేషము లేవియో తెలియదు. అతని పుత్రుని నాణెము లభించుట విశేషము. ఇతడు పన్నెండు సంవత్సరములు పాలించినట్లు మత్స్యవాయు పురాణములు రెండును వ్రాసిపెట్టుటచూడగా అపీలకుడు కొంత ప్రసిద్ధిని పొందిన రాజనియే మనము ఊహింపవలెను. తండ్రిపేరైనను నికరముగా తెలుపని పురాణములు ఇతని రాజ్యకాలపరిమితి కూడ చెప్పుటచే ఇతడు ప్రజ్ఞావంతుడు అనియే భావింపదగి యున్నది. ఇతని నాణెము మధ్యప్రదేశమున దొరకుటచే అపీలకునికాలమువరకును ఆప్రాంతము శాతవాహనుల అధీనమునం దుండుటను రుజువుచేయుచున్నది. అపీలకుని యొక్కయు అతని తండ్రి యొక్కయు రాజ్యకాలము 8 సంవత్సరములని ఊహించిచో శివమాళవము క్రీ పూ 10 సంవత్సరముల వరకును శాతవాహన సామ్రాజ్యాంతర్గతమై యుండెనని చెప్పవచ్చును

తూ వెం గో శా
ఖం ల రం

## అప్పకవి

అప్పకవి నామము విన్నంతనే ఆంధ్రఛందోగ్రంథములలో ప్రసిద్ధమైన అప్పకవీయమను లక్షణగ్రంథము మన స్మృతిపథమున గోచరించును. బాలసరస్వతీయమువలె అహోబలపండితీయమువలె అప్పకవీయము తద్గ్రంథకర్తయగు అప్పకవినామమున వ్యవహరింపబడుచున్నది. కవి ఈగ్రంథమునకు ఆంధ్రశబ్దచింతామణియని నామకరణ మొనరెను. అప్పకవి గృహనామము కాకునూరివారు. వారిది భారద్వాజస గోత్రము ఆపస్తంబసూత్రము కృష్ణయజుశ్శాఖ. అతడు వైదిక బ్రాహ్మణుడు. క్రీ శ 17వ శతాబ్దివాడు. అప్పకవీయమునందలి పీఠికలోని 71 83 పద్యములు ఆధారముగ కాకునూరివారి వంశవృత్తము తెలియవచ్చుచున్నది

అప్పకవికి తాతకు తాతయైన సోమయఅనుపండితుడు మధురాపురమునకు జని

"వేదశాస్త్రపురాణాది వాదములను కాకనూరి టిజేన
కారణమున కాకనూరి టివాండన ఘనతఁ గాంచె"

అనియు

"చరికొండసీమలో సంతరించెను గాకునూరన
సర్వాగ్రహారమొకటి"

అనియు అప్పకవి పీఠికలో చెప్పుటచే కాకునూరు అనునది వీరి గ్రామనామముగా ఊహింపవచ్చును. "కాకనూరితిమ్మన సుతుడు సోముఁడభినవ చూతగ్రామమునను" అని అప్పకవి పీఠికలో (అప్ప పీ 73) చెప్పుటచే సోమయతండ్రియగు తిమ్మననాటికే "కాకనూరి" యనుగృహనామము అప్పకవి పూర్వులకు ఉండినట్లు తెల్లమగుచున్నది. కాకునూరివంశమునకు మూలపురుషుడు తిమ్మన. ఈతని కుమారుడగు సోమయ అభినవచూతగ్రామమున నివసించెను. ఈ గ్రామముపేరు నేటితెలుగులో క్రొత్త మామిడిపల్లె అయియుండును. మామిళ్లపల్లి గ్రామమొకటి బాపట్లతాలూకాలోను మామిళ్లపల్లి అగ్రహారమొకటి నూజివీడుతాలూకాలోను కలవని లక్ష్మణరావు పంతులుగారు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమున వ్రాసిరి. కాని అభినవచూతగ్రామములు పైవి రెండును కావనియు జామురాష్ట్రమందలి తేమావిళ్ళ అను గ్రామమనియు కీ శే బూర్గుల రామకృష్ణారావుగారు వ్రాసిరి. చరికొండ జామురాష్ట్రమున నుండుటచే కాకనూరి వారినివాసము మొదట తెలంగాణమునందే అని విశ్వసింపబడుచున్నది

కాకునూరి వంశీయుల పాండిత్యము వారి ప్రజాహిత తత్పరత్వము వైదిక కర్మానుష్ఠానమునందు వారికిగల అనురక్తియు మనకు విస్మయమును కలిగించుచున్నవి. అప్పకవితాతకు తాతయైన సోమయ బాల్యముననే కాశికిబోయి బ్రహ్మేంద్రులయొద్ద వేదశాస్త్రములను చదివెను. పిమ్మట మధురానగరమునకేగి పండితులను శాస్త్రవాదమున ఓడించి ఆతడు కాకనూరు అగ్రహారమును విడిచివెళ్లి బొద్దినేపల్లి నవదళపురి (వరదళపురి) అనుగ్రామములలో కొన్నిమాన్యక్షేత్రములను పొందెను. అప్పకవితాతయగు పెదసోమయ్య అనేక క్రతువులొనర్చెను. నరసరావుపేట తాలూకాలోని రొంపిచెర్లయను గ్రామమున ఒకపెద్దనూతిని త్రవ్వించెను. అచ్చటి శంకరలింగమునకు ఘన శిలాసాలమును (ప్రాకారమును) నిర్మించెను. సత్తెనపల్లి తాలూకాలోని గుడిపాటి గ్రామమున వినుకొండకుబోవు మార్గమందొక పెద్దతోటను నాటించెను. గుడిపాటికి దక్షిణదిశన పశువులు నీరుత్రాగుటకొక చెఱువును త్రవ్వించెను. ఈ పెదసోమయ్య కామేపల్లి అగ్రహారికుడగు వల్లెము పోతనార్యుని యొక్క కూతురగు కృష్ణమ్మను

...రియయమాడెను కృష్ణమ్మ పెద్దిభట్టునకు సోదరి పెద్ది భట్ట గొప్పపండితుడు ఇతడు సాయప వేంకటపతిభూపాలుని వలన కామెపల్లిని అగ్రహారముగా పడసెను ఈ విషయము పీఠికలోని పద్యములవలన తెలియుచున్నది పెసోమయ్య అగ్రజుడైన తిరుమలభట్టు కాలామృతమను జ్యోతిగ్రంథమును రచించెను (అ ప 4 37) అప్పకవి తండ్రియగు వెంగన వేదవేదాంగములలో నిష్ణాతుడు పల్లెనాటిలోని యాటవెం తో బదినాలుగు గ్రామములందును వెంగన వేదపఠనమునందు అద్వితీయుడనియు మాఘబ్రహ్మయనియు ప్రస్తుతికెక్కెను (అప్ప 1 30) ఇతడు పెద్దిభట్టు కూతురగు సేమమ (శేషమ్మ)ను పెండ్లియాడెను ఈ విధముగ వల్లెనువారు అప్పకవి తండ్రిని అప్పవీని మాతామహస్థానీయులైరి వల్లెనువారు గొప్పకావ్య నిర్మాతలయినట్లు మాతృబంధుబ కృతప్రబంధులు కులబంధుసౌగంధి బంధులు నీతియుగంధరులు అని అప్పకవి చెప్పిన వాక్యముల వలన తెలియుచున్నది అప్పకవితాత పెసోమయ కామెపల్లిలోని వల్లెనువారితో సంబంధము చేకొని దిమెలు ఎల్లెనాటనే కాపురముపెట్టినట్లు తెలియుచున్నది అప్పకవి తనమాతామహుని గృహముననే పెరిగి విద్యావంతుడయినట్లు జనశ్రుతి యొకటి కలదు తన మాతామహుల నివాసస్థానమగు కామెపల్లిని గూర్చి అప్పకవీయపు పీఠికలో అప్పకవి చక్కగ తెలిపెను ఆంధ్రదేశమునందు దండకారణ్యమున శ్రీశైలమునకు ఈశాన్యదిక్కున కొండవీటి పడమటను నిత గె సీమలో కామేపల్లి కలదు నిర్జరగంగా మ నాగనిమ్నగా పూర్వము నంబి గళపుర దక్షిణమున కామెపల్లియున్నది " ఇందు నాగనిమ్నగా అనగా వాగులేరనియు ఎంగళపురము అనగా ఎన్నెల్లి అనియు అర్థము నాగులేరు కారెమపూడి కొండలలోపుట్టి పల్లెనాట ప్రవహించి కృష్ణానదిలో కలియుచున్నది మరియు ఈ కామెపల్లి ఎలేశ్వరమునకు తూర్పున పదుయోజనముల (60 మైళు) దూరమునను కేశవరమునకు నైఋతిదిక్కున మూడు యోజనముల (24 మైళ్లు) దూరమునను కృష్ణానదికి దక్షిణమున యోజనము (8 మైళ్ళు) దూరమునకలదు కామెపల్లిలో గోపాలస్వామి దేవాలయమున్నది ఈ ఆలయమునందు ఉపవిష్టుడై అప్పకవి అప్పకవీయమును రచించినట్లు ప్రసిద్ధి కలదు ఈనాటికిని పల్లెనాటిలోని కామేపల్లిలో వల్లెవారు కలరు ఎన్నెల్లి గ్రామమునందును వర్తించుచున్నారు అందుచే అప్పకవి పల్లెనాటనున్న కామెపల్లిలోనే నివసించి అప్పకవీయమును రచించినట్లు నిర్వివాదముగ విశ్వసింపబడుచున్నది నెల్లూరు మండలమున దలి కందుకూరు తాలూకాలోను గుంటూరు మండలమున దలి నరసరావుపేట తాలూకాలోను కామెల్లి అనునామములుగల గ్రామములు ఉన్నట్లు తెలియుచున్నది

అప్పకవి మూర్తి సర్వజ్ఞ అనుపండితుచేత కృష్ణయజుర్వేదమును కాడూరిగిరి దేశికునొద్ద శబ్దశాస్త్రమును సూరభట్టునొద్ద సిద్ధాంతములను మంచి ఒంటియోగ నరసింద్రునొద్ద లక్షణగ్రంథములను కొలిచలి మల్లన గనార్యునొద్ద స్మార్తకర్మమును రాజయోగి వద్యానిచెంత ఆగమములను పఠించెను (అప్ప పీ 31) విద్యాభ్యాసానంతరము అప్పకవి శ్రీశైలమునకేగి అచట భోగి విభూషణుని పట్టపుకవీంద్రుడై కొంతకాలము డి గ్రంథరచనము సాగించెను అప్పకవిరచించిన గ్రంథములు ఇట్లు క వచ్చుచున్నవి (1) అప్పస్తంబ షట్కర్మ పద్ధతి ఖండ నిబంధనము (2) కాలబాహ్యార్ణవము అను పేరుగల జౌతిషగ్రంథ గ్రహము ఈ రెండు గ్రంథములు సంస్కృతభాషలో వ్రాయబడినవి (3) అనంతవ్రతకథ (4) శ్రీశైలమల్లికార్జునునిపై శ్లేషని దాస్తుతి గర్భికనప పద్యశతము (5) కవిల్పము (లక్షణగ్రంథము) (6) శ్రీ సుద శ్వి ద (7) అ ఖిలావాగము (యక్షగానము) (8) అప్పకవీయము అను వివిధని తెనుగుగ్రంథములు

మన్మథ శ్రావణ బ అష్టమి మంగళవారము (క్రీ శ 1 3 1656) నాటి రాత్రి శ్రీమహావిష్ణువు అప్పకవి కామెపల్లిలో స్వప్నమునందు సాక్షాత్కరించి నన్నయభట్ట విరచిత ఆంధ్రశబ్ద చింతామణి సూత్రములను తెనిగించి వాని అర్థమొనర్పుము అని ఆదేశించెను మరునాడు అనగా శ్రావణ బహుళ నవమీ బుధవారమున మక గపర్వత ప్రాంతీయుడగు ఒకవిప్రుడు ఆంధ్రశబ్ద చింతామణిని బాల సరస్వతి టీకను అప్పకవికొసగెను అప్పకవి మన్మథ వత్సర శ్రావణ బహుళ దశమి గురువారమున (క్రీ శ 1656 అగస్టు 5వ తేదీ) అప్పకవీయమను నామాంతరముగల ఆంధ్రశబ్ద చింతామణిని వ్రాయుటకు ఉపక్రమించెను

అప్పకవీయమును గురించి వ్రాయుటకుముందు ఆంధ్రశబ్ద చింతామణిని గూర్చియు దాని శేషగ్రంథము అథర్వణకారికావళిని గూర్చియు టీకాగ్రంథమగు బాలసరస్వతీయ

మును గూర్చియు ముచ్చటించుట అప్రస్తుతము కాదు. క్రీ. శ. 11వ శతాబ్దిలో రాజరాజనరేంద్రుని ఆనతిచే నన్నయభట్టు భారతాంధ్రీకరణమునకు కడంగెను. ఆంధ్రశబ్ద చింతామణి యను ఒక వ్యాకరణ గ్రంథమును సంస్కృతభాషలో ఆర్యావృత్తములలో వ్రాసెను. ఆంధ్రమహాభారతము రచించిన నన్నయభట్టారకుడే తెలుగు భాషకు వ్యాకరణము లేనిలోపమును పూరించుటకై ఆంధ్రశబ్ద చింతామణి అను వ్యాకరణమును వ్రాసెనని పండితులు విశ్వసించుచున్నారు.

ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కృతము కాదనియు దానిని అర్వాచీనకాలికుడైన ఎలకూచి బాలసరస్వతి మహోపాధ్యాయుడు రచించి గ్రంథప్రశస్తికై నన్నయభట్టు పేరు పెట్టియుండెననియు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్రకవుల చరిత్రలో దీర్ఘమైన చర్చను చేసిరి. వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి గారు ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కృతమే అని పెక్కు ఉపపత్తులతో తమ ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము మున్నగు గ్రంథములందు నిరూపించుటకు యత్నించిరి.

అథర్వణకారికావళి లేక వికృతివివేకము అను వ్యాకరణ గ్రంథమును 13వ శతాబ్దివాడైన అథర్వణాచార్యుడు వ్రాసెనని పండితులు విశ్వసించుచున్నారు. ఇదియు సంస్కృతమునందు వ్రాయబడినదే. ఇది యాంధ్రశబ్ద చింతామణికి శేషగ్రంథము. దీని కర్తృత్వ విషయమును గూడ వీరేశలింగము పంతులుగారు శంకించిరి. అథర్వణుడు దీనిని వ్రాయలేదనియు 18వ శతాబ్దివాడైన అహోబల పండితుడు వికృతివివేకమును వ్రాసి అథర్వణుని పేరుపెట్టెననియు పంతులుగారి వాదము. వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి గారు ఈ వాదమును నిరాకరించిరి. సదరు వాదోపవాదములు ఆయా గ్రంథములందు చూడదగును.

అప్పకవీయము: అప్పకవి కృతముగాన దీనికి అప్పకవీయమని వ్యవహార నామమేర్పడినది. అప్పకవి దీనికి ఆంధ్రశబ్ద చింతామణియనియే పేరిడెను. ఇది నన్నయ ఆంధ్రశబ్దచింతామణికి పద్యగద్యాత్మకమైన తెనుగు అనువాదగ్రంథము. దీనిని ఎనిమిది ఆశ్వాసములతో వ్రాయవలెనని అప్పకవి సంకల్పించెను. కాని అయిదాశ్వాసములు మాత్రమే పూర్తిచేసెను. తక్కిన మూడు వ్రాసినాడో లేదో లేక వ్రాసినను అవి మనకు లభ్యమగుటలేదో తెలియదు. ప్రకృతము మనకు లభించు అప్పకవీయమున (1) భాషాపరిచ్ఛేదము (2) వర్ణపరిచ్ఛేదము (3) వళిప్రాస పరిచ్ఛేదము (4) పద్యపరిచ్ఛేదము (5) సంధిపరిచ్ఛేదము అనునవి మాత్రమే కలవు. తక్కిన గ్రంథములో అప్పకవి తత్సమ దేశ్య క్రియాపరిచ్ఛేదములను రూపొందింప దలంచెను. కాని అట్లు జరుగలేదు. షష్ఠ సప్తమ అష్టమాశ్వాసములు గూడ పూర్తిచేసినచో ఇది సమగ్రాంధ్ర వ్యాకరణమయ్యెడిది. అట్లుగాక కేవలము ఛందోవిషయమునకే మిగుల ప్రాధాన్యమిచ్చుటచే అప్పకవీయము ఛందోగ్రంథముగనే ప్రసిద్ధమైనది. అప్పకవి తనకు ముందున్న లక్షణగ్రంథములను ఆమూలాగ్రముగ పరిశీలించెను.

"ఇది చదివినయప్పుడు మఱి
యేదియేనియు జదువబుద్ధి యేలా పొడమున్
పదపడి గ్రంథములన్నియు
వెదకి వెదకి సారమెల్ల వివరింపఁగన్
పర్వతములెల్ల నొక్క దర్పణమునందు
జూడ దెలుగున గవితోపయోగ
లక్షణములన్నియును సరళంబుగాఁగఁ
దెలుపఁగబడునందుఁ దెలియ నూహించిరేని"

(అప్ప 1 ఆ 78 ప)

అనుచు తన గొప్పను అప్పకవీయమును కవి రూపొందించెను. ఆంధ్రశబ్ద చింతామణి ఇది నామమాత్రానువాద గ్రంథము. కాని ఇది స్వతంత్రగ్రంథముగనే భావింపదగును.

తిం. ఆం. శా.

## అప్పకొండాచార్యుడు—కందాడై

కందాడై అప్పకొండాచార్యుడు సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసుడు. ఈయన తర్కవేదాంతాది శాస్త్రములయందు గొప్ప పాండిత్యమును గడించెను. ఈయన తండ్రి అప్పలాచార్యులు, తల్లి లక్ష్మమ్మ. వీరి నివాసభూమి కృష్ణాతీరము. ఈయన అరువది గ్రంథములకు పైగా రచియించినట్లు తెలియుచున్నది. ఆ గ్రంథములలో నేడు మనకు శిష్టాద్వైత నిర్ణయము, మానసోల్లాసము అను పేరుతో మనుస్మృతికి వ్రాసిన వ్యాఖ్యయు, శాస్త్రామృతము, తత్త్వనిష్కర్ష, తత్త్వనిర్ణయము, కుదృష్టిభంగము, సజ్జనామృతము, సిద్ధాంతసారము, మాయిభంగము, రహస్యత్రయసారార్థము అనునవి మాత్రమే కనవచ్చుచున్నవి. తక్కిన గ్రంథముల యునికి తెలియదు. ఈయన ఉదంతము కూడ ఇంతకు మించి తెలియవచ్చుటలేదు.

తిం. ఆం. శా.

## అప్పచ్చియారు అణ్ణ — కందాడై

క్రీ శ 1468 న రమున తిరుమల తిరుపతి దేవాలయ మందు చేయించిన ఒక శిలాశాసనము నుండి అప్పచ్చియారుఅణ్ణ కందాడై అనువారు వెంకటేశ్వరస్వామి వారి సేవలకు 1500 పణములు సమర్పించినట్లు తెలియుచున్నది సందర్భము ననుసరించి ఈ శాసనమునందు స్వామి వారి వైభవము శ్రీభండారమునందు ధన సమర్పణ ప్రసాదము యొక్క వినియోగము మొదలగు పెక్కు అంశములు పొందు పరుపబడినవి

దాన మిచ్చిన సందర్భము – ఉత్సవ సమయమున శ్రీస్వామి వారికి అలిమేలుమంగకు రుగు పులుకాపు పండుగ అనగా స్వామి వారికి తిరుమంజన మొనరించి అలంకరించుట ఈ పండుగ మాసములో వచ్చు ప్రతి శుక్రవారమున జరుపబడును అలంకృతుడైన స్వామి మఠమున కందాడై రామానుజయ్య గారి తరపున ఉలా (విద్యారూపమున స్వామి పై వ్రాయబడిన స్తుతి) గాన మొనరించుదురు ఇది అయిన వెంటనే తిరువెంకటముడియాను [వెంకటేశ్వరస్వామి]కు రెండు అతిరసపడులు (అప్పములు) నైవేద్యము చేయబడును

శాసనమునందు ఉదాహరింపబడిన కందాడై రామానుజయ్యంగారు శ్రీభగవద్రామానుజుల శిష్య పరంపరలోనివారు వారి కాలము క్రీ శ (1480 1490) ఈయన విజయనగరాధీశ్వరుడగు సాళువ నరసింహునకు గురువను ప్రతీతి కూడ కలదు తిరుమలలోని స్వామికి జరుపు ఉత్సవముల యేర్పాటునందును ఆరాధన క్రమమునందును సంప్రదాయ సిద్ధమగు ఇతర కార్యక్రమములందును భగవద్రామానుజాచార్యుల వారు ఒరవడి పెట్టిన మహాపురుషుడు వారి తరువాత వెంకటేశ్వరుని భక్తిశ్రద్ధలతో అశేషభోగ భాగ్యముల సమకూర్చి ఖ్యాతిగాంచినది కందాడై రామానుజయ్యంగారికి కలిగినది అందువలన ఈ దివ్యక్షేత్రమునందు స్వామికి పూజాక్రమముల నిర్వర్తించు పుడు నేటి ని వారి పేరును స్మరించుచు స్వామికి ఉపచారక్రమము జరుపుట జరుగుచున్నది

అప్పచ్చియారు అణ్ణగారు స్వామికి సమర్పించిన 1500 పణముల వివరములు ఈ క్రింది విధముగ సేకరింపబడినవి

కాడిపేరి గ్రామము కు చెందిన పరందూరు తిరువెంకట ముడియాన్ అనువారినుండి ఒక సర్వమాన్య భూమి వాటాను కైటడిపూరు వలితున్నైనారు అను వారినుండి అర్ధవాటా మాన్యమును అదే గ్రామమునకు చెందిన ఎకాబరుప డితారు ను డి అర్ధవాటా మాన్యమును వెరసి రెండు భాగముల మొత్తము భూమిని 1500 పణములకు కొని దాని తాలూకు దస్తావేజును శ్రీభండారమునకు అప్పచ్చియారు సమర్పించెను

కాడిపేరి గ్రామము పడైవీడు రాజ్యములోనిది ఇది ప్రస్తుతము మదరాసు రాష్ట్రములోని దక్షిణ ఆర్కాటు జిల్లాలో కలదు

పూజయైన వెంటనే స్వామి వారి కర్పించు ప్రసాదము నుండి 18 వ తులు దానకర్తకును మిగిలిన ప్రసాదము ప్రాతస్సమయమున భక్తులకను పంచబడును

కొ వెం

## అప్పన

అప్పన కు డిన సీమ (గుంటూరు సీమ) యందలి బ్రాహ్మణ వశీయుడు ఈయన తండ్రిపేరు నన్నపార్యుడు తల్లిపేరు జన్నాంబిక వీరి నివాసము క్రొవ్వెలిపురము అప్పన జ్యోతిశ్శాస్త్రమునందు గొప్ప పాండిత్యము కలవాడు అర్థులకు చింతామణి ఈయనకు ఎల్లమ్మ అను భార్య గలదు ఆమె పాతివ్రత్యమున అరుంధతి వంటిది ఈ దంపతులకు గండిరాజు కుమారుడు కలడు అతడు ఆనాటి పాలకుడైన గొంక రాజు కును రాజేంద్రచోడునకును ధర్మమునకై గుంటూరు మండలములోని నరసరావుపేట తాలూకాలోని ఎమిడిపాడు అగ్రహారమునందు ఒక ఆలయమును నిర్మించి అందు శకవర్షములు 1077 (క్రీ శ 1155) అగు నాటి జ్యేష్ఠ శుద్ధ పంచమినాడు చెన్నకేశవస్వామిని ప్రతిష్ఠించెను విమానమును నెలకొల్పెను స్వామి త్రికాలములయందు పూజాదికమునకును దీపమునకును నైవేద్యాదులకును ఇతర పరికరములకును ఉత్సవములకునుగాను పమిడిపాటికి ఉత్తరముననున్న దమ్మాలపాటి దక్షిణముననున్న దమ్మాలపాటిపొలములో రెడ్డిపట్టు ఆడ్లపట్టు అను ధార్మికముగా అతడు దానము చేసెను ఇదిగాక పమిడిపాటిగ్రామముపై వచ్చు సుంకము వివాహసందర్భములయందు వచ్చు పన్ను (సుంకము) మున్నగునవియు చెన్నకేశవస్వామి దేవాలయమునకు చెందవలయునని అతడు ఉద్దేశించినట్లు శాసనము (సంపుటము 10 శా నె 135 పుట 83) చెప్పుచున్నది ఈ శాసనము పమిడిపాటిలోని చెన్నకేశవస్వామి దేవాలయమునకు ముందు భాగమున ఉన్న గరుడస్తంభముపై గలదు

శం ఆం శా

అప్పన చూ అన్నకారి

అప్పన చూ బిజ్జల తిమ్మభూపతి

## అప్పనపల్లి

అప్పనపల్లి తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకా లో ఉన్నది దీనికి 8 మైళ్ల లో అమలాపురము 7 మైళ్ళలో రాజోలు ఉన్నవి దీనికి సరిహద్దులుగా తూర్పున బి దొడ్డవరం పడమట పెదపట్నం వైనతేయ గోదావరి పాయ ఉత్తరమున పెదపట్నంలంక దక్షిణమున పాశర్లపూడి మామిడికుదురు ఉన్నవి ఈ గ్రామవిస్తీర్ణము 1712 ఎకరములు

పూర్వము ఇచట ఉప్పరులు నివసించుటచే దీనికి ఉప్పరపల్లి అని పేరు వచ్చెనట తరువాత క్షత్రియులిచటికి వచ్చి ఉప్పరులను తొలగించి దీనికి అప్పనపల్లి యని పేరు పెట్టిరట

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఇచట పురుషులు 1585 మంది స్త్రీలు 1674 మంది మొత్తము 3 259 మంది ఉండిరి వీరిలో షెడ్యూలు జాతుల వారు 981 మంది షెడ్యూలు తరగతులవారు 18 మంది ఇచట ఇండ్లు వాడవాడలుగా ఉన్నవి వీటిలో 50 పెంకుటిండ్లు ఒక కాంక్రీటు కప్పుగల ఇల్లు గలవు ఇచట జనులు వరి అన్నముని తిందురు కావిసీటిని త్రాగుదురు

ఇది నీటి వసతులు లేని మెట్ట గ్రామము 1966 67 సం లో పంటల క్రింద 1140 ఎకరముల భూమి ఉపయోగపడెను బావుల క్రింద 400 ఎకరముల భూమి సాగుచేయబడెను నీటిని తోడుటకు ఒక ఆయిల్ ఇంజను కలదు ఇచట కొబ్బరి తోటలు ఉన్నవి సాలీనా 24 000 కొబ్బరికాయలు లభించును 6 000 కాయలు స్థానికులు ఉపయోగించుకొని మిగిలిన 18000 కాయలను పాలకొల్లునకు రవాణా చేసెరి

ఈ గ్రామమునందు 231 గేదెలు 128 ఆవులు 160 ఎద్దులు 53 మేకలు 98 గొర్రెలు 100 పందులు 600 కోళ్ళు కలవు దినమునకు 100 లీటర్ల పాలు 25 వీశెల నెయ్యి స్థానికులు వాడుకొని 300 లీటర్ల పాలు 75 వీశెల నెయ్యి పెదపట్నం పాశర్లపూడులకు రవాణా చేయుదురు

ఇచట జనుల ముఖ్య జీవితాధారములు వ్యవసాయము వ్యవసాయకూలి చేనేత కుటీర పరిశ్రమదారులు దుకాణదారులు ఎద్దు బండ్లు తోలువారు కలరు కంసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీ పనివారు మంగలివారు చాకలివారు కలరు రు 1 5000 లు విలువగల చేనేత బట్టలు పాలకొల్లునకు రవాణా అగును వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు మనిషికి కూలి రు 2 లు

ఇచ్చట శ్రీ విశ్వేశ్వరస్వామి దేవాలయము కలదు గ్రామదేవతయగు మహాలక్ష్మమ్మ గుడి ఉన్నది మహాలక్ష్మమ్మ తీర్థము వైశాఖ శుద్ధ పూర్ణిమకు పూర్వము సోమ మంగళ బుధవారములలో జరుగును ఈ తీర్థము 180 సంవత్సరములనుండి జరుగుచున్నది

ఈ గ్రామమునకు 25 మైళ్ళలో నరసాపురం రైల్వే స్టేషను ఉన్నది 3 కంకరరోడ్లు 3 మట్టిరోడ్లు ఉన్నవి ఈ గ్రామమును పొరుగు గ్రామములతో ఈ కంకర రోడు కలుపుచున్నవి ప్రయాణమునకు 60 ఎద్దు బండ్లు 45 రెడ్డె బండ్లు 120 సైకిళ్ళు కలవు

అప్పనపల్లిలో బ్రాంచి పోస్టాఫీసు రూరల్ ఆసుపత్రి కలవు ఒక ఇంగ్లీషు వైద్యుడు ఒక ఆయుర్వేద వైద్యుడు ఒక హోమియోపతి వైద్యుడు ఉన్నారు విద్యుచ్ఛక్తిని 60 ఇండ్ల వారు వాడుకొనుచున్నారు ఇది పంచాయతి పరిపాలన గ్రామము ఇందు ఒక పంచాయతి గ్రంథాలయము గలదు ఈ గ్రామమందలి కోఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ రు 40 000 లు గ్రామస్థులకు అప్పుగా ఇచ్చినది ఇచటి వారపు సంతలో కూరగాయలు లభించును గ్రామములో 4 కిరాణా దుకాణములు 4 కాఫీ హోటళ్ళు 2 సిగరెట్టు సోడా (కిళ్ళీ) దుకాణములు 2 సైకిళ్ళ షాపులు గలవు

తహశీల్దారు కార్యాలయమునకు పోలీసు స్టేషను కు పశువుల ఆసుపత్రికి 5 మైళ్ళలో ఉన్న నగర గ్రామమునకు గ్రామస్థులు పోవలెను ఇచటి విద్యార్థులు హైస్కూలు చదువులకు 1½ మైళ్ళలోనున్న పెదపట్నంకకు కళాశాల చదువులకు అమలాపురమునకు పోవుదురు ఈ గ్రామస్థులు బి రిజిస్ట్రారు ఆఫీసునకు 3 మైళ్ళలో ఉన్న మామిడికుదురునకును కోర్టులకు తాలూకా కచేరిలకు 10 మైళ్ళలోనున్న రాజోలునకు పోవలెను

మా శ్వే

## అప్పనపెద్ది

అమరేశ్వరా యను సత్తెనపల్లి తాలూకాలోని అమరావతీ గ్రామమునందలి దేవాలయమునకు తూర్పు ప్రాకారపు బైటగోడ (శ.శ. 1120 క్రీ.శ. 1200) నాటి శాసనము కలదు. శాసనములోని విషయము ఎట్లన్నన్ ధర్మముల ఆచరించు అప్పనార్యునిని అతని భార్య అగు విద్దాసానిని బుధులు అత్యంతముగా వర్ణించుచుండగా పెద్దన జన్మించెను. ఇతడు యుక్తవయస్కుడగునప్పటి యోగ్యయగు నాకమాంబను పరిణయమాడెను. వీరికి జన్మించిన పుత్రరత్నమే అప్పనపెద్ది. ఇతడు పెరిగి పెద్దవాడై కేతభూభుని సేవలయందు మగ్నుడై సమున్నతికెక్కెతో రాయూరిపుర శాసనమునడుగ వ్యవహరించెను. అప్పనపెద్ది ద్విజుడు. శివచరణద్వయ పూజకుడు. భారద్వాజ గోత్రుడు. మిత్రశ్రేణిని రక్షించు ధార్మిక ప్రవృత్తి కలవాడు. ఉత్తరాయణ సంక్రమణమున తల్లిదండ్రులకును తనకును ధర్మార్థముగా ఈయన అఖండ దీపమును అమరేశ్వరుని మ్రోల నర్పించెను.

దేవునకు నిత్యము మానెడు నేయి పోయుటకు 55 ఇనుప ఎడ్లను మల్లెబోయనిని వాని అల్లుడు రామబోయనిని పుత్రానుపౌత్రికముగ అనుభవించుటకై ఇచ్చెను.

శాసనమునందు పేర్కొనబడిన కేతభూవిభుడు క్రీ.శ. 1189 సం॥న ధాన్యకటకమునకు ప్రభువయ్యెను. ఈయనయే కోటవంశమునకు చెందిన మొదటి కేతకోటరాజు. ఈయన వేయించిన శాసనములందలి ప్రశస్తి చూడగా ఇతడు బాహుబల సంపన్నుడని తోచును. ఈయన "చతుస్సముద్రముద్రిత అఖిలవసుంధరా పరిపాలకుడు, శయలోకదుర్లభుడు, చోళచాళుక్య సామంత మదాపహ మృగేంద్రుడు." ఇంతశక్తిమంతుడైన ప్రభువువద్ద మంత్రి ఖ్యాతిగొనిన అప్పనపెద్ది గొప్ప రాజ్యధురంధరుడని గ్రహింపవలయుండును. దీనిబట్టి బ్రాహ్మణులు ఆకాలమున దండనాధీశులుగను సామంత నృపతులుగను నియమింపబడి తమ యేలిక ప్రాపును పొందిరనుటకు సందియము లేదు. రాయూరుపురము గుంటూరు మండల గ్రామ పట్టికలో కానరాకున్నది.

శాసనము తెనుగు భాషలో శార్దూలవిక్రీడితమునందు వ్రాయబడినది. 12వ శతాబ్దాంతమున పరిపుష్టినొందిన ఆంధ్రభాషకు ఈ శాసనమొక మచ్చుతునక అనవచ్చును.

సుప్రసిద్ధ చారిత్రకులగు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ "రెడ్డి రాజ్యములు" అను ఆంగ్లగ్రంథమునందు (పుట 196) కాటయవేముని ప్రధాన కార్యనిర్వహణాధికారి అప్పనపెద్ది అనునతడు తన యజమానుని పుణ్యము కోరుచు అమరేశ్వర దేవరకు దానము చేసినట్లు వ్రాయుచున్నారు. ఈ శాసనము ద. హి. VI సె 223వ సంఖ్యగా ప్రచురింపబడినది. కాని అందు దానమిచ్చిన వ్యక్తి జతనముపెద్దిసెట్టి. శాసనకాలము శక 1308 (క్రీ.శ. 1386). పొరపాటున అప్పనపెద్ది పేరు గ్రంథస్థమైనట్లు భావింపనైనది.

కో. వెం.

## అప్పనప్రెగ్గడ

అప్పన ప్రెగ్గడ భీమనామాత్యుని కుమారుడు. ఈయన తల్లి పేరు రామాంబ. వీరిది కాశ్యప గోత్రము. శ్రీమన్మహామండలేశ్వర-కులోత్తుంగ చోడదేవర రాజ్యపాలన కాలమున శ్రీమద్దొంక మహాపాలుని కొలువున ఖడ్గధురంధరుడును పెనుముది గ్రామవాస్తవ్యుడును అగు ఈ అప్పన ప్రెగ్గడ కన్యామాసమున సూర్యగ్రహణ కాలమునందు దాక్షారామ భీమేశ్వరస్వామి వారికి ఆచంద్రార్కముగ అఖండదీపమునకై నేయిపోయుటకు యేబది ఇనుప ఎడను నాతబోలని - బీరడు మున్నగువారి వశమున ఉంచెను. ఇనుపఎడ్లు అనుశబ్దమునకు గొఱ్ఱెలను అర్థమున్నట్లు తెలియుచున్నది. ఇనుపఎడ్లను గ్రహించిన బీరడు మొదలగువారు నిత్యదీపమునకై భీమేశ్వరస్వామివారికి వలసిన నేతిని సమకూర్చి ఇచ్చుచుండవలెను. ఈ దానము శా.శ. 1033 (క్రీ.శ. 1141)న ఇవ్వబడినది. ఇది వెలనాటి చోడులు ఆంధ్రదేశమును పాలించుచుండిన కాలము.

అప్పన ప్రెగ్గడమాలకాఱ-ఎటిఎ వెందె పోలిశె ఎటిఎ అను వారికి కొంత భూమి యిచ్చి వారిచే దానికి ప్రత్యామ్నాయముగా శ్రీ భీమేశ్వర అనంత నారాయణ మలయాండపతి నారాయణ ధర్మ నారాయణ దేవరలకు కొన్ని ఊడిగములు (పనులు) గూడ చేయించినట్లు ఈ శాసనము చెప్పుచున్నది (చూ. ద. హిం. IV పుటలు 461 463). ఈ శాసనము తూర్పు గోదావరి మండలమునందలి రామచంద్రపురము తాలూకాలోని ద్రాక్షారామ భీమేశ్వరస్వామివారి దేవాలయమునందలి ఎనిమిదియవ స్తంభముపై గలదు. "ఖడ్గధురంధరుడు" అను విశేషణమువలన అప్పన ప్రెగ్గడ సేనానిగ ఉండినట్లు తోచుచున్నది. శాసనము

అక్కడక్కడ శిథిలమగుటచే విషయము సమగ్రముగ తెలియ వచ్చుటలేదు

అప్ప ప్రెగ్గడ పెనుమది గ్రామమునకు ఏకభోగి అని చెప్పబడినది అనగా ఈ గ్రామాదాయము సర్వస్వము ఈ మంత్రి శిఖామణికే చెల్లుచు డెంని ఊవా చవలెను శేశి కొలతకు త్రిభువనా కుశ శేశి మాన ప్రమాణముగా చెప్పనైనది ేయి పోయుట అనుటకు ేయి సరియించుట బోయలు అనుటకు బోలు (నలువురుబోలు) న్నునుగునవి అప్పటి భాషా విశేషములు ఈ శాసనము సంస్కృతా ప్రథములందున్నది

శాసన సంవత్సరము కులోత్తుంగ చోడ దేవర 9వ పరిపాలనా సంవత్సరమని చెప్పుటచే సదరుకులోత్తుంగ చోడుడు శక 1054 అనగా క్రీ శ 113 లో రాజ్యారూఢుడయ్యెనని తెలియుచున్నది శాసన లేఖకుడు పెద్దనార్యుథు

త ఆం శా

## అప్పన్న పేంద్రుడు చూ బిజ్జుల తిమ్మభూపతి

## అప్పన్న పేట

అప్పన్నపేట పెద్దపల్లి తాలూకా కరీంనగరు జిల్లాలో ఉన్నది పెద్దపల్లి దీనికి రెండు మైళ్ళు ఈ గ్రామమునకు తూర్పున రాఘవపురము పడమట పెద్దగుట్ట ఉత్తరమున బ్రాహ్మణపల్లి దక్షిణమున బంధపల్లి ఉన్నవి దీని విస్తీర్ణము 4564 ఎకరములు ఇక్కడ పెద్దగుట్ట పోచమ్మగుట్ట మల్లన్నగుట్ట జంగం బోరుగుట్ట ఉన్నవి ఇవి నల్లరాతితో ఏర్పడి ఉన్నవి పెద్దగుట్టపై టేకు చెట్లు కలవు

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఇక్కడజనసంఖ్య 3480 ఇందులో ఎరుకలవారు 26 మంది షెడ్యూలుజాతులవారు 557 మంది ఇచ్చట ఇండ్లు ఒకచోట గుంపుగాను ఒకచో ఏకపంక్తిగాను ఒకచోట వలయాకారముగాను వాడవాడలుగాను నిర్మించబడినవి వీటిలో 306 పెంకటిండ్లు ఒక కాంక్రీటు కప్పుగల ఇల్లు 3 మేడలు కలవు గ్రామస్థులలో 20 శాతము వారు వరిఅన్నమును 80 శాతము వారు జొన్న అన్నమును తిందురు

ఈ గ్రామములో పెద్ద చెరువు ఊరకుంట కోమటి కుంట తాళ్ళకుంట మూతికుంట బట్టోనికుంట తురుకకుంట చేతికుంట వచ్చర్లకుంట ఉన్నవి వీటిక్రింద వరి జొన్న మిర్చి పెసర మక్క కంది సెనగ మొదలగు పంటలు పండును ఫలసాయమును గుమ్ములలోను గాగులలోను ధాన్యమును గరిసెలలోను నిలువచేయుదురు వీటిని పెద్దపల్లికి రవాణా చేయుదురు 1½ ఎకరముల బత్తాయి తోట ఉన్నది టొమాటో వంగ బీర బెండ మొదలగు కూరగాయలను పండించుచు వీటిని స్థానికులు ఉపయోగించుకొని వారమునకు 50 క్వింటాలుల కూరగాయలను 1966 67 సం॥లో పెద్దపల్లికి పంపిరి 3778 ఎకరముల భూమి పంటల క్రింద ఉపయోగపడెను చెరువులక్రింద 368 ఎకరములు ఇతర వనరుల వలనను 95 ఎకరములు సాగుబడి అయెను 60 ఎలెక్ట్రిక్ మోటారులు 420 ఎకరములకును 185 మోటలు 345 ఎకరములకును నీటిని సప్లయి చేసెను ఇచట 1200 ఎకరముల రేగడినేల 2060 ఎకరముల ఎర్రచౌకనేల ఉన్నది 233 ఎకరముల అడవి గవర్నమెంటు యాజమాన్యమున ఉన్నది టేకు కలప లభించును

ఇచట 340 గేదెలు 680 ఎద్దులు 560 ఆవులు 840 మేకలు 1680 గొర్రెలు 56 పందులు 1240 కోళ్ళు ఉన్నవి ప్రతిదినము 1 0 లీటర్ల పాలను సేయి పెరుగును 120 గ్రుడ్లును వారమునకు 50 కిలోగ్రాముల మాంసమును ఉపయోగించుకొని 120 లీటర్ల పాలను పెద్దపల్లికి సప్లయి చేసిరి

ఈ గ్రామస్థుల ముఖ్యవృత్తులు వ్యవసాయము వ్యవసాయకూలి 8 దుకాణాదారులు 10 మంది కంసాలులు 10 మంది వడ్రంగులు ఇద్దరు కమ్మరులు నల్గురు కుమ్మరులు ఒక తెలికలవాడు 10 మంది చాకలివారు 10 మంది మంగలివారు 150 మంది గొల్లలు అయిదుగురు నూలు మగ్గముల వారు కలరు 8 వడ్లమరలున్నవి ఇవి స్థానిక అవసరములకు ఎక్కువగ ఉపయోగపడును పెద్దపల్లికి కూడ సప్లయి చేయును స్థానికావసరములకు సరిపడు చీరెలు ధోవతులు ఇచట తయారగును వ్యవసాయదారులకు కూలీలు దొరకుదురు కూలి రేటు దినమునకు పురుషునకు రు 2-50 స్త్రీకి రు 1 50 లు

ఇచ్చట రంగనాయక ఆంజనేయ దేవాలయములు పోచమ్మగుడి ఎల్లమ్మగుడి ఉన్నవి దేవాలయములో రంగనాయకస్వామి పాలకడలిలో శేషతల్పముపై శయనించుచున్నట్లు కనిపించును లక్ష్మీదేవి అలమేలు మంగమ్మ స్వామి

పాదములకు ఇరుప్రక్కల ఆసీనులై ఉండురు అందమైన 10 మంది ఆళ్వారుల విగ్రహములు ఆళ్వారు ఎ బడిమన్నారు విగ్రహ ము లక్ష్మి అలమేలు మంగమ్మ తో రంగనాయక స్వామి ఉత్సవవిగ్రహము ఉ న్నవి ట్రాఫిం క్కుసగు శ్రీరామ విగ్రహము శ్రీ వే కటేశ్వర శ్రీ బాలకృష్ణ విగ్రహములు ఉన్నవి వైశాఖ శుద్ధ నవమినుండి ఎడు దినములు శ్రీర గ నాయ స్వామి ఉత్సవము జరుగును ఇది 1౦0 ఎ వత్సరముల నుండి జరుగుచున్నది ఈ సందర్భములో 8 దినములు స త జరుగును దానిలో ఆహారపదార్థములు వస్త్రములు చిత్ర విచిత్రమైన వస్తువులు లభి చును

ఈ గ్రామమునకు కి మైళ్ళ దూరములో పెద్దపల్లి రైల్వే స్టేషను ఉన్నది ఈ గ్రామము బస్సు మార్గముపైన ఉన్నది 10 గవర్న మె టు బస్సులు కరీ నగరమును డి దీని గు డా గోదావరి ఖని పోవును ఇచ్చట ఒక క కరరోడ్డు 2 కచ్చారోడ్లు ఉన్నవి దీనిని ఇతర గ్రామములతో తారు రోడ్డు కలుపుచున్నది 8 5 రె డెడ్ల బ డ్లు 65 సై క్లు ప్రయాణములకు సరకులను గొని పోవుటకు ఉపయోగ పడును

ఇచ్చట బ్రాంచి పోస్టాఫీసు పైమరీ స్కూలు ఉన్నత ప్రైమరీ స్కూలు ఉన్నవి రాఘవపురము బాహ్మణ ల్లి గ్రామముల నుండి విద్యార్థులు ఈ గ్రామములోని ఉన్నత ప్రైమరీస్కూలునకు వత్తురు విద్యుచ్ఛక్తిని 5 ఇ డ్లు 60 ఎలెక్ట్రిక్ మోటారులు 3 వడ్ల మరలు ఉపయోగి చ కొను చున్నవి ఇది ప చాయతీ పాలన కల గ్రామము ఈ ప చా యతీకి ఇ టి పన్ను వాహనములపన్ను వృత్తి పన్ను మొదలయినవి ఆదాయమునిచ్చును గ్రామ ప చాయతీ గ్రంథాలయమున్నది ఇచ్చటి 2 బహుళార్థ సహకారసంఘ ములు రు 1 60 000 ను అప్పుగా ఇచ్చినవి ఇచ ట ముగ్గురు ఇ గ్లీషు వైద్యులు ముగ్గురు ఆయుర్వేద వైద్యులు ఇద్దరు హోమియోపతి వైద్యులు ఒక యునాని వైద్యుడు కలరు పశువులకు నాటు వైద్యము చేయుదురు వారమునకు ఒక మారు సంత జరుగును 6 కిరాణా దుకాణములు ఒక కాఫీ హోటలు ఒక కిళ్ళీ సోడా సిగరెట్టు దుకాణము ఒక సైకిల్ షాపు 10 క్షౌరశాలలు 6 లాండ్రీలు ఉన్నవి

పెద్దపల్లిలో తంతికార్యాలయము టెలిఫోను లు పురుళ్ళ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి పోలీసుస్టేషను ఎబ్ రిజిస్ట్రారు ఆఫీసు తాలూకాకచేరీ బ్లాకు అభివృద్ధి కేంద్రము ఉన్నవి విద్యార్థులు హైస్కూలు చదువులకు పెద్దపల్లికి కళాశాల చదువులకు కరీ నగరమునకు పోవుదురు గ్రామవార సంతలో పశువులు ధాన్యము మొదలయినవి లభి చును

200 సం ల క్రితము మ డల వె కన్న అనునాయన తన కుమారులగు భాజన్న అప్పన్న న బయ్యల సాయ ముతో అడవిని కొట్టించి తన రె డవ కుమారుని పేర అప్పన్న పేటను నిర్మించెనని గ్రామస్థులు చెప్పుదురు ఇది గోదావరికి దక్షిణమున గల సిర్సిలాడు మ డలములోని రామగిరి పరగ ణాకు చెందిన గ్రామమట ఇది 8 చ। మైళ్ళలోనున్న బొంపల్లి నగరము యొక్క సివారు గ్రామమట

మా శ్వే

## అప్పబయ్యమదేవి

అప్ప బయ్యమదేవియనగా అక్క జ్యేష్ఠ భగినియైన బయ్యమదేవి అనియర్థము అళియరామరాజు దమున దు ళియ అల్లుడు అనునది బాంధవ్యవాచకము అట్లే ఇక్క డను గ్రహి పవచ్చును బయ్యమదేవి ప్రశంస ద వా VI నెం 6 8లో కానిపించుచున్నది ఈమె పాత్ర శ్రీ పోతరాజు ప్రభు వునకు జ్యేష్ఠసోదరి శాసనకాలము శక 1291 (క్రీ శ 1376) భాద్రపద పూర్ణిమ సోమవారము ఈ దినమున పాత్ర పోతరాజ ప్రభువు అక్కయైన బయ్యమదేవియు ఆయన కుల పాలి యు ప్రేయసియునగు రాజలదేవియు కలసి అహోబల నరసి హదేవునకు సేవలు సమర్పి చిరి పదినెయు మరదలును లి సిదానము చేసిరన్నమాట వీరి అన్యోన్యము ప్రశ సనీయ ముగ ఉ న్నది వీరు చేసినదానములు నరసి హస్వామికి నిత్య మున్ను ధూపసేవా స దర్భమున బయ్యమదేవి ఒ పుష్ప మాలికను చామరమును రాజలదేవి ఒక పుష్పమాలికను సమ ర్పి చుటకు కట్టడి చేయబడినది ఈ మాలికా సమర్పణములు ఆ చ ద్రార్కముగా సాగుటకై నరసాసాని మనుమరాలు తల్లాసానికి స ప్రదాయాన తిరువాసాని (స ప్రదాయజ్ఞురాలు అని భావము కావచ్చును) అరిజాసాని అను ముగ్గురు వేశ్యలు నియమి పబడిరి వారికి పదిమాడలు రె డుకుంచాలు ప్రసాదము ఇచ్చుటకు ఏర్పాటయ్యెను అట్లే నిత్యము ఒక తిరుమాల సమర్పి చు కై వరదయ్యంగారను బ్రాహ్మణుకు నియుక్తుడైనట్లు కర్పి చును ఈతడు పుష్పవాటికకు అధిపతి కావచ్చును ఈయనకు కుంచెడు ప్రసాదము ఇ చ్చు ట కు

ఏర్పాటు దేవాలయములకు అంగముగ పుష్పవాటికలు ఉండుట సంప్రదాయము ఆముక్తమాల్యద యందలి విష్ణుచిత్తులవారు స్వామియొక్క పుష్పోద్యానమును సంరక్షించుచు మాలాకైంకర్యము చేయుచుండెనని చదువుదుము సదరు వరదయ్యంగారు సింహాచల దేవస్థానమున తోటమాలిగను మాలాకారుడుగను ఉండి యుండవచ్చును

శాసనకాలమునకు కళింగదేశము పాత్రసామంతుల పరిపాలనలో ఉండినట్లు కన్పించును వీరు కటకాధిపతులైన గాంగరాజులకు సామంతులుగా ఉండిరి క్రీ శ 1375 నాటికి మూడవ భానుదేవుడు (క్రీ శ 1353 77) ఉత్కళాధిపతిగ నుండెను ఈతని శాసనములు సింహాచలములో కనిపించుచుండుటచే ఈ ప్రాంతమాతని ఆధిపత్యమున ఉండెనని చెప్పవచ్చును ఈతని కాలములో ఫిరోజుషాతుఘ్లకు సేనలు ఉత్కళదేశముపై దండెత్తి చాల విధ్వంసము కావించినవి కటకాధిపతుల బలము సన్నగిల్లెను పాత్రసామంతులు బలాధిక్యము కలవారు కాజొచ్చిరి పాత్ర శ్రీ పోతరాజు ఇటువంటి పాత్రసామంతుడుగా ఉన్నాడు ఈ కాలమునకు ఆంధ్రదేశములో రెడ్డిరాజ్యము వర్ధిల్లుచుండెను అనవేమారెడ్డి మహాబలవంతుడై సింహాచలము వరకుగల దేశమును జయించెను కాని కళింగదేశమంతయు అతని యేలుబడిలోనికి రాలేదనిపించుచున్నది సింహాచలమునందు మూడవభాను దేవుని కుమారుడు నాల్గవ వీరనరసింహదేవుని శాసనములు కన్పించుటయే ఈ యూహకు ఆధారము ఎట్లైనను బయ్యమదేవియు ఆమె మరదలు రాజలదేవియు క్షత్రియులైన ఉత్తమ నారీమణులు నృత్యాంగనితలకు ఈ కాలమున దేవాలయములందు మంచిస్థానము ఉండినట్లు కన్పించును

కొం వెం
ఖం ల రం

## అప్పమారె పోతయ

శ్రీకాకుళమునందలి శ్రీ కాకుళేశ్వర స్వామివారి దేవాలయమునందలి శిలాశాసనమువలన అప్పమారె పోతయ అనువాడు శ్రీకాకుళేశ్వర స్వామివారికి దీపమును ఏర్పరచినట్లును దానికై ప్రతిసంవత్సరము రాగబోయుడు అనునతడు ఒక మాడను ఈయవలయునట్లును ఈ విధానము ఆచంద్రార్కముగ ఉండవలయునట్లును తెలియవచ్చుచున్నది ఇంతకుమించిన విశేషము లెవ్వియు ఈ శాసనమునందు కనవచ్చుటలేదు (చూ ద వాం IV పుట 314)

ఈ శ్రీకాకుళము కృష్ణాజిల్లా పూర్వపు చల్లపల్లి సంస్థానములోనున్న ప్రాచీన గ్రామము ఇచ్చట ఆంధ్రనాయక స్వామి దేవాలయము పురాతనమైనది కలదు శ్రీ కృష్ణదేవరాయలు దీనిని సందర్శించెను ఈశాసన గ్రంథమును కలిచిన్నదియగుటచే అప్పటిభాషను వర్ణక్రమమును చూపుటకై ఉదాహరించుచున్నాము అప్పమారె-పోతయ పె( )ట్టిన దీవనకు రా(ం) గ (మ) బోయు(ం)డ్డు ఎ (ం) ట్టి మాడపెటువాండు ఆ చ దా్రి(ం)క్కన్ ముగను"

తం ఆం శా

## అప్పయ గోపయ

కొండవీటిరెడ్డి రాజుల బిరుదావళిలో అప్పయగోపయ దిశాపట్ట అను బిరుదు కనిపించుచున్నది దీనియర్థమేమి ఇది వారికెప్పుడు ఎట్లు సంక్రమించినది అను విషయము విచారణీయము దీనివలన కొన్ని చారిత్రకాంశములు మన దృష్టికి వచ్చుచున్నవి పూర్వపురాజులు వీరులు మొదలగు వారు వహించుచుండిన బిరుదములు రెండువిధములు కొన్ని వారు తమ పరాక్రమాదులచే ఆర్జించుకొన్నవి కొన్ని వారికి పరంపరాగతములు అనగా వారి పూర్వులెవరో వీరకార్యములను చేసి సంపాదించుకొన్నవి వాటిని కులక్రమాగతముగ ఆ వంశీయులు దాల్చుచుండిరి రెడ్డిరాజన్యులకు గల అప్పయ గోపయ దిశాపట్ట అనుబిరుదము రెడ్డిరాజ్యస్థాపన జరిగిన తరువాత ఏర్పడిన విజయములవలన పొందబడినది కాదు అది వారికి కులక్రమాగతముగ సంక్రమించినదే ఇది యెట్లో చూతము

ఈ బిరుదుపదమందు అప్పయ గోపయ అను ఇద్దరు దండనాథులు తెలియవచ్చుచున్నారు వీరిని రెడ్డిరాజుల పూర్వులెవరో యుద్ధమునందు ఓడించి దిక్కులకు పారిపోవునట్లు చేసిరి కావున ఆ రెడ్డినాయకులకు అప్పయ గోపయ దిశాపట్ట బిరుదము లోకములో ఏర్పడినది ఈ అప్పయ గోపయ దండనాథులు ఒకరికొకరు బంధువులగుదురో కాదో తెలియదు వీరిపేరులు కలిపి ఎందుకు ఈ బిరుదు ఏర్పడినదో నికరముగ చెప్పజాలము గోపయ దండనాథునిపేరు గోప్పయ అనియు శాసనములందు కనిపించుచున్నది ఇతనికి సముద్ర అనునది ఉపపదము సముద్ర గోపయ అనివ్యవహరింపబడినాడు

ఇది ఇంటిపేరు కావచ్చును తెలుగువారిలో ఇప్పటికిని ముద్రాల అను గృహనామము కలవారున్నారు లేదా గొప్ప రాజాధికారము వహించి రాజముద్రను రక్షించుటచే ఈయనకు సముద్ర అను ఉపపదము కలిగినదేమో తెలియదు ఎట్లైనను అప్పనయ సముద్రగోపయయు ప్రసిద్ధదండనాథులు వీరిని జయించి రెడ్డిరాజుల పూర్వులు ఈ బిరుదముచే భూషితులైరి

వాస్తవమునకు అప్పయ గోపయ దండనాథులు తెలుగుదేశమునకు చెందినవారుకారు వారు కర్ణాటకవీరులు హోయసల భూపతి వీరనరసింహరాయల (క్రీ శ 1220 1238) సేవలో వీరు డి పరాక్రమచర్యలుచేసి ప్రసిద్ధికెక్కిరి ఇది ఏ సందర్భమో తెలుసుకొనుటకు తత్కాల దక్షిణ హిందూదేశ చరిత్రను సంగ్రహముగా సూచింపవలెను ఆంధ్రదేశమున కాకతీయుల విజృంభణము ఫలవంతమగుచుండెను గణపతిదేవ చక్రవర్తి అఖిలాంధ్రవిజయము సాధించుచుండెను కాకతీయులకు దక్షిణమున తమిళదేశమున చోళసామ్రాజ్యము అంతమయోన్ముఖముగానుండెను మూడవ రాజరాజు మూడవరాజేంద్రుడు చోళసింహాసనమున క్రమముగ ఆసీనులైరి క్రీ శ 1216 78 నడుమ చోళసామ్రాజ్యము క్రమముగ విచ్ఛిన్నమై కాలగర్భమున కలిసిపోయెను చోళులకు దక్షిణమున పాండ్యులు పర్యాయముగా అభ్యుదయ పతనములనుచెందుచుండిరి కన్నడదేశమందు హోయసల వంశము వారు బలవంతులై సామ్రాజ్య స్థాపనమునకు అర్రులు సాచుచుండిరి ఈ పెద్దరాజ్యముల నడుమ కొందరు వీరసామంతప్రభువులు ఇరికియుండి సమయానుకూలముగ తలయెత్తుచుండుచుండిరి ఇట్టివారిలో మనము ముఖ్యముగ గమనింపవలసినవారు నెల్లూరు తెలుగుచోడులు తరువాత ఉత్తరదక్షిణ ఆర్కాడు మండలమున దు కొప్పెరుంజింగ నాయకులైనపల్లవ సామంతులు తండ్రికుమారులు ఇద్దరు కనిపించుచున్నారు వీరిని కాడవపతులనియు అందురు ఈ రాజకీయ నాటకము యొక్క ప్రథమాంకము చోళుడైన మూడవ రాజేంద్రుని రాజ్యారంభకాలమున క్రీ శ 1216-18 సంవత్సరముల నడుమ నడచినది మొదటి మారవర్మసుందరపాండ్యరాజు మహాబలశాలియై చోళసామ్రాజ్యమును ఓడించి చికాకుపరచెను మూడవరాజరాజు అంతకుముందు జరిగిన సంధికి విరుద్ధముగ పాండ్యుల మీద దండెత్తిపోయి యుద్ధమునందు పరాజితుడై తనముఖ్యపట్టణమునుగూడ వీడి పలాయితుడగుచుండెను సేదమంగళాధిపతియైన కొప్పెరుంజింగడు రాజరాజునకు సామంతుడయ్యు ఆతనికి ద్రోహము తలపెట్టి తన యజమానునకు తోడ్పడుటకు బదులుగా ఆతనిని చెరపెట్టి పాండ్యులకు వంతపాట పాడెను చోళుని యవస్థ కడుదీనముగా ఉండెను ఈ యదనున హోయసల వీరనరసింహదేవుడు సాటి రాజ్యునిపై అమాత్యనము చేతనో లేక చోళరాజ్యమును పాండ్యులు కబళించుట తనకు ముప్పుతెచ్చునని భావించియో చోళచక్రవర్తి మూడవ రాజరాజును ఆపత్కాలమందు ఆదుకొనుటకు నిశ్చయించి పరాక్రమసంపన్నుడైన తనసేనాపతి అప్పన దండనాయకునకు ప్రబలసైన్యమిచ్చి స్వామిద్రోహియైన కొప్పెరుంజింగని శిక్షించుటకును పాండ్యసేనలను వెనుకకునెట్టివేయుటకును ఆదేశించిపంపెను సముద్ర గోపయ్య దండనాథుడును ఈ యుద్ధమునందు పాల్గొనెను

మహాసమర్థులైన అప్పన గోపయ దండనాథులు కొప్పెరుంజింగని రాజ్యముపైబడి దానిని విధ్వంసము చేయుచుండగా ఆతడు విధిలేక చోళచక్రవర్తి మూడవరాజరాజును బంధవిముక్తుని చేయుటకు అంగీకరించెను చోళుడు తిరిగి తన రాజ్యమునందు ప్రతిష్ఠింపబడెను వీరనరసింహునకు చోళస్థాపనాచార్య గౌరవము దక్కెను ఈ యంశములు తిరువేంద్రిపురశాసనము వలన తెలియవచ్చుచున్నవి ఈ కథాభాగము క్రీ శ 1230 సంవత్సరప్రాంతమున జరిగెను హోయసల సేనానులు ఈ సమయమున చోళరాజ్యమునందు సైనికచర్యలలో నిమగ్నులైనట్లు కాంచీపురమందలి కొన్ని శాసనములు నిరూపించుచున్నవి ద్వారసముద్ర సేనాని భూతదేయ నాయకుని కూతురు బాచల్దేవి కాంచీపురమున దీపదానము చేయుటయు గోపయదండనాయకుడు క్రీ శ 1231 లో ఇచ్చట ఒక గ్రామదానము చేయుటయు గమనింపదగినవి

ఇంతలో పాండ్య హోయసల రాజ్యములందు ముఖ్యమైన మార్పులు జరిగెను హోయసల వీరనరసింహదేవుడు మరణింపగా ఆతని కుమారుడు వీరసోమేశ్వరుడు (క్రీ శ 1233-1254) రాజయ్యెను పాండ్యదేశమున మొదటి మారవర్మసుందరపాండ్యుడు గతించి రెండవ మారవర్మ రాజ్యాధిపతియయ్యెను ఇతడు సమర్థుడైన పరిపాలకుడుకాడు కావున చోళులు తమకిదివరలో జరిగిన పరాభవమును తుడిచివేయుటకు

నడుముకట్టిరి ఈ యుద్ధముమునకు నాయకుడు చోళుడైన మూడవ రాజేంద్రుడు ఇతడు క్రీ శ 1243 46 ప్రాంతము నుండియు మూడవరాజరాజునకు సహపరిపాలకుడుగా చోళసామ్రాజ్యమునందు వ్యవహరించెను మూడవ రాజేంద్రుడు యువకుడు సమర్థుడు మిక్కిలి క్షీణించియున్న చోళసామ్రాజ్య వైభవమును పునరుద్ధరించుటకై ఇతడు గాఢమైన కృషిచేసెను చోళులకు సహజ శత్రువులగు పాండ్యులపై ఇతడు దండెత్తివెళ్ళి దుర్బలుడగు రెండవ మారవర్మపై కొన్ని విజయములు సాధించెను చోళసామ్రాజ్యము తిరిగి పుంజుకొని దక్షిణదేశ రాజకీయములలో గణనీయమైన శక్తిగా నిల్చుపరిస్థితి కనిపించెను ఇది హొయసలులకు సహింపరానిదయ్యెను చోడ పాండ్యులలో ఎవరును బలాధికులుగా కాకుండ ఉండుటయు హొయసలులమీద వారు ఆధారపడునట్లు చేయుటయు ద్వారసముద్రపు రాజనీతి దక్షిణ హిందూదేశ రాజ్యములందుమ బలతూకము సమముగా ఉండునట్లు చూచుట హొయసలుల విధానముగా నుండెను కర్ణాటవీరనరసింహుడును అతని యనంతరమీతని కుమారుడు వీరసోమేశ్వరుడును ఈ నీతినే పాటించిరి

మూడవ రాజేంద్రుని చొరవచే చోళులు బలపడుచుండుట చూచి హొయసలులు ఈమారు పాండ్యుల పక్షము వహించి చోళులను హద్దులో పెట్టుటకు పూనుకొనిరి ఇప్పుడు వీరసోమేశ్వరుడు కర్ణాటాధిపతిగా ఉండెను ఈతడు కొన్ని మైసూరు శాసనములలో పాండ్యకుల సంరక్షణ దక్ష దక్షిణభుజుడు అని స్తుతింపబడుట గమనింపదగినది క్రీ శ 1241 45 సంవత్సరముల నడుమ కర్ణాటక సేనానులు సింగన దండనాయకుడు రవిదేవ దండనాయకుడు మున్నగువారు చోళరాజ్యమును ప్రవేశించి చోళులను అదుపులో పెట్టయత్నము చేయుచుండిరి చోళులపరిస్థితి ప్రమాదకరమయ్యెను ఈ విషమసమయమున వారు మిత్రసహాయమును కాంక్షించి నెల్లూరు చోడులను అభ్యర్థించిరి మనుమసిద్ధి తండ్రియైన మొదటిచోడ తిక్కరాజు ఇప్పుడు నెల్లూరులో మహాపరాక్రమవంతుడై రాజ్యము చేయుచుండెను అతడు చోళచక్రవర్తికి నామమాత్ర సామంతుడు ఐనను స్వామిభక్తిపరాయణుడై తిక్కనృపాలుడు చోళులను అణగద్రొక్కుచున్న కర్ణాట సోమేశ్వరుని ఎదుర్కొని అతని సేనానులను ఓడించి చోళులపై బిగియుచున్న హొయసలుల ఇనుపగుప్పిటిని సడలింపజేసెను చోళచక్రవర్తికి చేసిన సహాయమునకై తిక్కరాజునకు చోళస్థాపనాచార్య బిరుదము లభించెను ఈ యంశములు తిక్కన్నయొక్క నిర్వచనోత్తర రామాయణమునందు సూచితములైనవి చోడ తిక్కరాజు కర్ణాట సోమేశ్వరునిపై సాధించిన విజయము క్రీ శ 1240 ప్రాంతము అని తెలియుచున్నది తిక్కభూపాలుని శాసనములు కాంచీపురమున 1240 సమీపమున కనిపించుటకు ఇదియే హేతువు

చోడతిక్కని దండయాత్రలలో పాలుగొని రెడ్డిరాజుల పూర్వులు కర్ణాటులైన అప్పయ్య - గోపయ దండనాథులను కాంచీపురమండలము నుండి ఓడించి పారద్రోలియుందురు ఈ విధముగా వారి అప్పయ్య గోపయ గిత్తాపట్ట బిరుదము లభించియుండును క్రీ శ 1240 ప్రాంతమున ఇంకను రెడ్డిరాజ్యమేర్పడనేలేదు తరువాత 85 సంవత్సరములకుగాని రెడ్డిరాజ్యము స్థాపింపబడలేదు కావున వారు స్వయముగ అప్పయ గోపయ దండనాథులను నిర్జించు శక్తిమంతులుగ లేకుండిరి చోడతిక్క ధాత్రీపతి బలముతో కలిసి వీరును కర్ణాటకులపై విజృంభించి జయముచేకొనియుందురని ఊహింపవలెను

బం ల రం

## అప్పయాచార్యుడు - బొమ్మకంటి

బొమ్మకంటి అప్పయాచార్యుడు అనపోతానేనికి పిదప రాచకొండ రాజ్యాసనము నధిష్ఠించిన రేచర్ల కుమార సింగభూపాలుని ఆస్థానకవులలో ఒక్కడని తెలియుచున్నది ఈ భూపాలుడు అనపోతవిభుని కుమారుడు వెలుగోటి వారి వంశమున ఇతడు ఏడవతరమునకు చెందినవాడు ఈయన రాజ్యపాలనాకాలము క్రీ శ 1383 84 1399 అగుటచే ఈయన ఆస్థానకవులలో ఒక్కడగు అప్పయాచార్యుడును ఈనాటివాడని తెలియుచున్నది అప్పయాచార్యునకు మారపోత అను పేరొకనామముగూడ కలదట కొందరు ఈయనను పోతప్పయ్య అనియు పిలిచెడివారట ఈయన సంస్కృతమున గొప్ప పండితుడు అమరసింహునిచే రచింపబడిన అమరకోశమునకు (నామలింగానుశాసనము) ఇతడు అమరకోశవ్యాఖ్య అను పేరుతో ఒక గొప్పవ్యాఖ్య రచించెను ప్రభువగు సింగభూపతియు రసార్ణవసుధాకరమను నామాంతరముగల సింగభూపాలీయమను అలంకారశాస్త్రము సంగీత

రత్నాకరమునకు వ్యాఖ్య రచించి సర్వజ్ఞ అను బిరుదమును వహించెను చమత్కారచంద్రికాకర్తయగు విశ్వేశ్వరకవియు ఈ ప్రభువు ఆస్థానమందుండెనే అప్పయాచార్యుడు వ్రాసిన గ్రంథములితరములు కనపడుటలేదు

కం ఆ శా

## అప్పయామాత్యుడు

అప్పయామాత్యుని ప్రశంస వాణీవిలాస వనమాలిక (వాణీ I 4) లో కన్పించుచున్నది ఈతడు చేకుమళ్ళరంగశాయి కవి ముత్తాత - చూడుడు చేకుమళ్ళరంగశాయి అను వ్యాసము

ఆం ల రం

## అప్పయ్య

నడిమల్లయ్య ఘంటసింగయ్యగార్లు రచించిన ప్రబోధచంద్రోదయకావ్యమునందు (ప్ర బో 1–8) అప్పయ్య పేరు కన్పించుచున్నది ప్రబోధచంద్రోదయ కృతికర్తయైన అనంతామాత్యుని గంగయమంత్రి ఈ అప్పయ్య వంశములో జన్మించెను చూడు - అనంతామాత్యుని గంగయ అను వ్యాసము

ఆం ల రం

## అప్పయ్య భాగవతార్

ఈయనపేరు ఆంధ్రదేశ స్వాతంత్ర్య సమరము (The freedom struggle in Andhra Pradesh) అను గ్రంథము రెండవ సంపుటము 7వ పేజీలో కననగుచున్నది 1921–31 సం ల మధ్యకాలము భారతదేశ స్వాతంత్ర్య సమర చరిత్రమందు అత్యంత దివ్యమును వీర్యవంతమునునయిన అధ్యాయము కొండా వెంకటప్పయ్య దుగ్గిరాల గోపాలకృష్ణయ్య బులుసు సాంబమూర్తి టంగుటూరి ప్రకాశం పంతులు డా భోగరాజు పట్టాభిసీతారామయ్య కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు వంటి మహానేతల నేతృత్వమున గాంధి మహాత్ముని ఆదేశమును శిరసావహించి ఆంధ్రదేశ ప్రజలు అహింసాతత్త్వము అసహాయోద్యమము ప్రభుత్వాజ్ఞోల్లంఘనము మున్నగు పద్ధతులద్వారా దేశస్వాతంత్ర్యోద్యమములో అత్యుత్సాహముతో అకుంఠిత దీక్షతో పాల్గొనిన దినములవి

నాగపూరు కాంగ్రెసు తీర్మానమునను సరించి ఆంధ్ర ప్రాంతీయ కాంగ్రెసు కమిటి 1921 సం జనవరి నెలలో విజయవాడలో సమావేశమై జిల్లా తాలూకా గ్రామ కాంగ్రెసు కమిటీల నేర్పరచి త్రివిధ బహిష్కరణములకు నిర్మాణాత్మక కార్యక్రమమునకు అనుకూలముగా ప్రచారమును కొనసాగింప నిశ్చయించెను దీనిఫలితముగా స్వరాజ్య మొక సంవత్సర కాలములో లభింపగలదను ఆశ ప్రజాహృదయములలో రేకెత్తెను ఈ దీక్షానినాదము ప్రజలమనస్తత్త్వమును స్వాతంత్ర్య సంపాదనమునందు కేంద్రీకరింప జేసెను

అసహాయోద్యమమును సార్వజనిక మొనర్చుటకు అన్ని విధములయిన ఉపాయములను అవలంబింపబడెను కొండా వెంకటప్పయ్య మున్నగు పైన పేర్కొనబడిన అగ్రనాయకులు తమ బహిరంగోపన్యాసములలో స్వాతంత్ర్యార్జన ప్రాముఖ్యమును సామాన్య ప్రజలకు ప్రబోధ మొనర్ప తొడగిరి ఆగ్లమున కావింపబడిన ఉపన్యాసములు సామాన్య ప్రజలకు బోధపడనందున మరం బాలసుబ్రహ్మణ్యాగస్త్య వంటి మహావక్తలు సామాన్యజనుల నుద్దేశించి ప్రజల మాతృభాషలో కావించిన ఉపన్యాసములు అమోఘముగా పనిచేసెను దేశభక్తిని పురికొల్పు జాతీయ గేయములు రచింపబడెను అట్టివానిలో సమస్త ప్రజలను ఆకర్షించినపాట మాకొద్దు ఈ తెల్లదొరతనము అనునది ఇదిగరిమెళ్ల సత్యనారాయణగారు రచించిరి విదేశీయ ప్రభుత్వముపై విముఖత్వమును ప్రజల హృదయములలో రేకెత్తించుటలో ఈ పాట ప్రభావము అనంతమయ్యెను వీథులలో ఊరేగింపులు జరుపబడెను వానిలో స్వచ్ఛందసేవకులు (స్త్రీలు పురుషులు) గొంతులు కలిపి అట్టి కీర్తనలుపాడదొడగిరి హరికథలలో భజనలలో సంకీర్తనలలో స్వాతంత్ర్యార్జనకృషియొక్క ఉత్కృష్టత వెల్లడించబడెను 1921 సం ఆగస్టు నెలలో వచ్చిన కృష్ణాపుష్కరసందర్భమును లోకమాన్య తిలకు గాంధిమహాత్ముడు మున్నగువారి జన్మదినోత్సవములలోను స్వాతంత్ర్యసందేశము ప్రజలకందరికి బంగబడెను అంతర్వేద్యాది ఉత్సవములలో మహాత్ముగాంధి వంటి ఉత్తమనాయకుల చిత్రపటముల నూరేగించిరి కవులచే రచింపబడిన స్వరాజ్య సోపానము తిలకవిజయము వంటి నాటకములు ప్రదర్శింపబడెను దువ్వూరి సుబ్బమ్మ పొణక కనకమ్మ ఉన్నవ లక్ష్మీబాయమ్మ మొదలగు స్త్రీల ప్రచారోద్యమము పురుషుల ప్రచారోద్యమమును మించినదై ప్రవర్తిల్లెను శిశువులుకూడ బిచ్చమెత్తుకొను అదనున దేశభక్తియొక్కయు స్వాతంత్ర్యోద్యమము యొక్కయు

ఉత్తమత్వమును ప్రకటించు జాతీయ గేయములను ప్రజలకు వినిపింప మొదటివారి అట్టివారిలో అప్పయ్య భాగవతార్ ముఖ్యుడు ఇతడు కాకినాడ వాస్తవ్యుడు అచంచల దేశభక్తి విరాజితుడు దేశభక్తి ప్రబోధము నందు బద్ధక కణుడు కావుననే ఇతడు ప్రభుత్వమువారొసగిన నిషేధాజ్ఞలను నిర్ల క్ష్యముతో ఉల్లంఘించి జాతీయగేయములను పాడుచు డెడివాడు ఆ నేరమునుబట్టి ఇతడు ప్రభుత్వముచే కారాగారమున నుంచబడెను ఇతని గురించిన ఇతర విషయములు తెలియవు

గ ల కాం

అప్పరఎళ్ళ చూ అక్కన్నపాయడు

## అప్పల నరసింహ

అప్పల నరసింహ అను నతడు వారణాసి కటకమున ఉన్న ముకుందరర మహా సేనాపతి కుమారుడు ఈతని ప్రశస దక్షిణ హిందూశాసనములలో కనవచ్చుచున్నది (ద హిం VI నెం 1083) శాసన సారాంశము క్రింది విధముగ ఉన్నది

స్వస్తిశ్రీ శక వర్షములు 1348 (క్రీ శ 1426) నేటి వైశాఖ శుద్ధ తృతీయ గురువాసరమున వారణాసి కట మున ఉన్న ముకుందర మహా సేనాపతి కొడుకు అప్పల నరసింహ చరణుని యొక్కయు కళింగ వీరగణము యొక్కయు ఆజ్ఞ చేత ఆస్థానబోయ వర మహాపశాయితి అను నతడు తన అభీష్ట సిద్ధికై సింహాచలమున దలి శ్రీనరసింహనాథునికి నిత్యము ఉభయ ధూపములకై (ఉదయము సాయంత్రము) శ్రీభండారమున ఆరు వెడిట కాలను నిధిగా సమర్పించెను శ్రీ నరసింహస్వామి వారికి ప్రతి నిత్యము ఉభయ ధూపములు సక్రమముగ జరిపించుటకై అలమభట్టు శ్రీరంగభట్టు అను వారలకు నిత్యము రెండు కుంచముల ప్రసాదములు ఈయ వలసియుండినట్లును శాసనమున కలదు

శాసన విషయములు ఆధారముగ నాటి చారిత్ర కాంశములు ఇట్లున్నవి గాంగవంశ భూజానులలో క్రీ శ 1409 నుండి 1433 వరకు కళింగ గోత్కల రాజ్యమును పాలించిన వాడు నాల్గవ వీరభానుదేవుడు ఇతడు నాలుగవ వీరనర సింహదేవుని కుమారుడు ఈతనితో గాంగ నృపాలుర పాలనము ముగిసినది ఈయన కాలమున కొండవీటి రాజ్యమును పెదకోమటి వేమభూపుడు పాలించుచు డెను అల్లాడ రెడ్డి కాటయవేముని కొమరుడగు కొమరగిరిరెడ్డిని రాజ మహేంద్రవర సింహాసనము నెక్కించి అతనికి బాసటగ తాను రాజమహేంద్రవరరాజ్యమును రక్షించుచు డెను విజయనగర సామ్రాజ్యమును మొదటి దేవరాయలు ఏలుచుడెను రాజమహేంద్రవర రాజ్యమును కబళింప పెదకోమటి వేమారెడ్డియు కళింగాధిపతియగు నాలుగవ వీరభానుడును విజయనగర ప్రభువు మున్నగువారును యత్నించుచు డిరి కొమరగిరికి అల్లాడరెడ్డియు అతని సుతులు వేమారెడ్డి వీరభద్రారెడ్లును సహాయులుగ నుండి శత్రువులలో తమ రాజనీతిచే కొందరికని మిత్రులుగా చేసుకొనియు కొందరిని జయించియు రాజమహేంద్రవర రాజ్యమును కాపాడు చుడినట్లు వేమవరశాసనమున కలదు ఈ శాసనము అల్లాడరెడ్డి కుమారుడు వేమారెడ్డి వేయించినది కొమరగిరి రెడ్డి మరణానంతరము కాటయవేముని కూతురగు అనితల్లికి రాజమహేంద్రవర రాజ్యమును అల్లాడరెడ్డి అప్పగించెను ఇట్లు కొంతకాలము గడిచిన పిమ్మట అల్లాడరెడ్డి మరణించెను ఈతని మరణానంతరము ఈతని (అల్లాడరెడ్డి) అన్న అనప్రోలా రెడ్డి కుమాళ్లగు కొమరగిరి అనవోతారెడ్లు వీరభాను గజపతిదేవుని సాయముతో రాజమహేంద్రవర రాజ్యముపై దండెత్తి దానిని ఆక్రమించుకొని పాలనము సాగించిరి అటు పిమ్మట కొంత కాలమునకు (అనగా శక 1342 (క్రీ శ 1420) ప్రాంతమున కళింగోత్కలాధిపతియగు నాలవ వీర భానుదేవుడు రాజమహేంద్రవర రాజ్యముపై దండెత్తిపోయి దానిని జయించినట్లు తెలియుచున్నది గంగవంశానుచరిత ము కూడ ఈ విషయమును ధ్రువపరచుచున్నది ఇట్లు మధ్యాంధ్ర దేశము కళింగులకు వశమయినను ఎవరు గాంగభూపాలురు వారి రాజులు మంత్రులు సేనాపతులు సింహాచలక్షేత్రము నందలి నరసింహస్వామికి అనేక దానధర్మములొనర్చి శాసన ములు వేయించిరి అట్టి శాసనము లనేకములు కలవు నాలుగవ వీరభానుదేవుని పాలనకాలమున కళింగోత్కలమున వారణాసి కటకము పొట్నూరికోట ము నగరికటకము అను మూడు ముఖ్య పట్టణములు డెనివి ఆ పట్టణములందు మహాపశాయితి మహా సేనాపతి మహామాండలికుడు అను ముఖ్యులగు రాజకీయోద్యోగులు నివసించుచుండిరి వారు తమకు

తమ లికాకు ఆయురభివృద్ధికై దా ములో ర్చుచుండిరి వారు వైష్ణవమతాభిమానులు నాలుగవ ఖానదేవునకు అనేక రాణులుండికట్లును వారు దానములొసర్చి కాం ములు చెక్కించుచు డికట్లును తెలియుచున్నది గా గవ శ రాజులు వైదిక సంస్కృతిని కాపాడియు పూరి భువనేశ్వరము కోణార్కము మున్నగు తావులందు మనోహర శిల్పములతో ఒప్పు దేవళములను నిర్మించియు చరిత్రము విశిష్టస్థానమును అలంకరించిరి వారి ఉద్యోగులను వారిని అనుసరించిరి అట్టి వారిలో అప్పల నరసింహుడను ఒక్కడని తెలియ వగును నరసింహుడను అతని నామమే సింహాచలనరసింహ దేవునియందు అతనికి గల భక్తి తాత్పర్యములను వెల్లడించుచున్నది

తం అం గా

## అప్పల పాయకరాయడు చూ అప్పలపాయకరాయరాజు

## అప్పల పాయకరాయరాజు - కాకర్లపూడి

ఇతని చరిత్రము కొంత రుక్మవతీపరిణయము అను గ్రంథమున కలదు ఈ గ్రంథమును రేకపల్లి సోమనాథకవి క్రీ శ 1750 ప్రాంతమున రచియించి కాకర్లపూడి గోపాల పాయకరాజున కంకితముగావించెను సంప్రదాయాను సారముగ సోమనాథకవి కృతిభర్త యొక్క వ శావళిని వైపుణ్యముతో ఎదీర్ఘముగా వర్ణించెను గోపాలపాయక రాజు సత్యవరమున కధిపతియనియు రుస్తుంఖాను కుమారుడైన నూరుద్దీను హుశ్శేను హరించెననియు చేప్పుటచే కృతిభర్త గోపాలపాయకరాజు కాలమును దెలిసికొనుట కవకాశమేర్పడుచున్నది

క్రీ శ 1725 నుండి 1741 వరకు అన్వరుద్దీను రాజమండ్రి సుబాకు ఫౌజుదారుగా నైజాము నవాబు అయిన నిజాముల్ ముల్క్‌చేనియుక్తుడయ్యెను ఇతని క్రింద రుస్తుఖాను అనునాతడు జిల్లాదారుగా నియక్తుడై క్రీ శ 1732 మొదలు 1739 వరకు ఏడును వత్సరముల కాలము తన అధికారమును నిరంకుశముగా కడుసమర్థతతో నిర్వహించెను సర్కారు జిల్లాలలోని జమీందారులు కొందరు నిజామునకు శిస్తులను చెల్లించుటమానిరి మరియు తమచుట్టుపట్లనున్న ప్రదేశములపై దురాక్రమణముగావించి దేశమున అల్లరులను లేవనెత్తిరి ఈ ఆక్రమణచర్యలను అరికట్టి రుస్తుఖాను మీ దారులను ఒక కట్టడిక్రి దకు తెచ్చెను ఈ తెచ్చుటలో రుస్తుంఖాను అసాధారణ క్రౌర్యమును ప్రదర్శించియుడుటచే ఆనాటి ప్రజలు అతని చర్యలను సహించలేకపోయిరి అతనికి హాజీ హుస్సేనులను నామాంతరము కలదు అతని కుమారుడే నూరుద్దీన్ హుశ్శేను అతడు తన తండ్రియైన రుస్తుఖానును మెడమీద కాళ్ళువేసి తొక్కించి చ పినాడని సామర్లకోట కైఫియతు చెప్పుచున్నది క్రీ శ 1740 లో ఎరాపురము వద్దనున్న చేబ్రోలులో జరిగిన "లడాయిలో నూరుద్దీను హుస్సేనుఖానుడు అంబారిలో ఉండగా విజయరామరాజువారి తరపు అనకాపల్లి బోయీలు అనేఫౌంజు రెండు వేలమంది నూరుద్దీను హుశ్శేనుఖానుని అంబారీ చుట్టుకొని అంబారీతాళ్లు తెగబొడిచి నవాబును పట్టుకొని తలతెగ గోసినారు (చామర్లకోట కైఫియతు) ఈ అనకాపల్లి బోయీల కథికతి గోపాలరావగుటచే గోపాలపాయకరావు మరుద్దీనును చంపెనని రుక్మవతీ పరిణయమున వ్రాయబడినది ఈ చేబ్రోలు యుద్ధము నూరుద్దీనునకును పూసపాటి విజయరామరాజుగారికిని నడుమ జరిగినది నూరుద్దీను కళింగముపై దాడి వెడలి పూసపాటివారిని అదుపులోనికి తెచ్చుటకై బయలు వెడలగా చేబ్రోలువద్ద ఈ స ఘటన జరిగినది

దీనినిబట్టి రుక్మవతీ పరిణయకృతి భర్తయైన గోపాలపాయకరావు క్రీ శ 1740లో జీవించియున్నట్లు నిశ్చయింపవచ్చును వీరిరాజధాని యగు సత్యవరము తూర్పుగోదావరీ మండలమున దల తునికి రెండుమైళ్లదూరమున తాండవ నదీతీరముననున్నది

కాకర్లపూడి వారు ఆంధ్ర క్షత్రియులు వసిష్ఠ గోత్రజులు సమరశూరులు సాహిత్యపోషకులు తుని తాలూకాలోనిదేయగు కాకర్లపల్లి వీరి మొదటి నివాసము నివాసగ్రామనామమే గృహనామమైనది వీరి వంశమునకు మూలపురుషుడు దేవనకసవరాజు కసవరాజు కాకర్లపూడిని రాజధానిగా చేసికొని తన చిన్నస స్థానమును పాలి పదొడగెను అప్పటినుండియు వీరి వంశనామము కాకర్లపూడిగా మారినది

ఈ క్షత్రియ పుంగవుల కుటుంబములు అనకాపల్లి మెళుపాక మర్లపాడు దొడ్డిగల్లు అలమండ కోటరామచంద్రఅను నగరములందు నేటికిని కలవు వీరు అనకాపల్లి జమీందారులని సత్యవరము జమీందారులని చరిత్రలో

వేంకటరాయలును కొద్దికాలము విజయనగరరాజ్యమును పాలించిరి. మోసముతో మేనల్లుడగు వేంకటరాయలను వధించి సలకము తిమ్మయ యనువాడు రాజుకాగా అళియ రామరాజు సమరమున తిమ్మయ్యను తునుమాడి అచ్యుత రాయల కుమారుడగు సదాశివరాయను (క్రీ. శ. 1542-1570) నామమాత్రముగ రాజునుచేసి తానే విజయనగర సామ్రాజ్యమును పాలింపదొడగెను.

ఆర్వీటిని ముఖ్యపట్టణముగ చేకొని పాలించుటచేత ఈ వంశము వారికి ఆర్వీటి అనియు వీరిలో కొందరు నంద్యాలను ప్రధానపట్టణముగ చేకొనుటచే నంద్యాల అనియు వారికి గృహనామములు ఏర్పడెను. ఆర్వీటివంశమునకు మూలపురుషుడు బుక్కరాయలు. ఇతడు విజయనగరాధీశుడైన సాళువ నరసింహరాజు (క్రీ. శ. 1485-1491) కడ ప్రవృద్ధ సేనాని. బుక్కరాయలకు సింగరాజు రామరాజు నను పుత్రులును వారిలో రామరాజుకు తిమ్మరాజు కొండరాజు శ్రీరంగరాజు అను కుమారులును వారిలో శ్రీరంగరాజుకు కోనరాజు తిమ్మరాజు రామరాజు (అళియరామరాజు) తిరుమలరాజు వెంకటరాజు అను కుమారులును జన్మించిరి. వీరిలో అళియరామరాజు విజయనగరసామ్రాజ్యభారమును సుమారు ఇరువదిమూడు సంవత్సరములు మిక్కిలి చాకచక్యముతో వహించెను. ఆయన శ్రీకృష్ణదేవరాయల కుమార్తెయగు తిరుమలాంబవలన కృష్ణరాజు పెద్దతిమ్మరాజు అను కుమారులను పడసెను. మరియు అళియరామరాజు జిల్లేళ్ళ వంశీయుడగు పెద్ద[illegible]రాజు యొక్క కూతురగు అప్పలాంబ అను నామెను వివాహమాడెను. పోచిరాజు తిమ్మరాజు యొక్క కుమార్తెలగు కొండమ్మ లక్ష్మమ్మ అను వారిని గూడ అళియరామరాజు పరిణయమాడి అందు కొండమాంబ వలన కొండరాజు చిన్నతిమ్మరాజు అను కుమారులను లక్ష్మాంబ వలన శ్రీరంగరాజు అను పుత్రుని గనెను. ఈ విధముగ రామరాజుకు మొత్తము ఐదుగురు భార్యలును ఐదుగురు తనయులును ఉండినట్లు రామరాజీయము అను గ్రంథము వలన తెలియుచున్నది.

తిం. ఆం. శా.

## అప్పలాంబ

ఈమె [illegible] వెంకయ్య కవి రచించిన నరపతివిజయమునందు వచించినది.

విజయనగర సామ్రాజ్యాధీశుడైన శ్రీకృష్ణదేవరాయలకు అల్లుడును ఆర్వీటి వంశీయుడును అగు అళియరామరాజుకు (క్రీ. శ. 1542-70) ఐదుగురు కుమాళ్ళు కలరు. వారిలో శ్రీరంగరాజుకు చిన్నవెంకటరాజు అను కుమారుడుండెను. చిన్నవెంకటరాజు కుమారుడు వెంకటరాజు. ఈతనికే వేంకటపతిరాయలు అనియు వ్యవహారనామమున్నది.

వేంకటపతిరాయలు ఆర్వీటి పురమునకు ప్రభువు. ఈయన క్రీ. శ. 164[illegible] ప్రాంతమున ఉన్నట్లు తెలియుచున్నది. రాజాధిరాజ వీరప్రతాప మున్నగు బిరుదములు గలవాడు. ఇతడు గొప్ప దాతయనియు ధర్మపరుడనియు ఖ్యాతి నార్జించెను. ఇతడు కృష్ణపరాజు పుత్రికయైన అప్పలాంబ అనునామెను పోచిరాజాన్వయుడగు రఘునాథ రాజేంద్రుని కుమార్తెలైన వెంగమ్మ కోనేటమ్మ అను వారిని వివాహమాడెను. ఈ ముగ్గురు భార్యలలోను అప్పలాంబ అను నామె భర్తయందు మిక్కిలి అనురక్తయై గొప్ప [illegible]గా పేరుగాంచినట్లు రామరాజీయమను గ్రంథము వలన తెలియుచున్నది.

అశ్విన్యాది నక్షత్రములలో భర్త అనురక్తిని పొందిన రోహిణి వంటిది అప్పలాంబ. ఆమె గొప్ప సుగుణ సంపత్తి కలదియు గొప్ప అందకత్తె అయి వర్ణింపబడినది. పేదవారియందు ఈమె గొప్ప ఆదరము కలిగియుండెడిది. ఇట్టి సుగుణములు కలది కనుకనే ఈమె తన భర్త అనురాగమునకు పాత్రమయ్యెను. ఈ దంపతులకు ముగ్గురు కుమాళ్ళు జన్మించిరి.

తిం. ఆం. శా.

## అప్పలాచార్యుడు

అప్పలాచార్యుడు పండితకవి. ఈయన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమున ఉండెనట. అనాటికవులు గొప్ప పండితులు. రెండేసి మూడేసి శాస్త్రములయందును వేదవేదాంగములయందును కళలయందును కావ్యప్రబంధ నిర్మాణమునందును దక్షత గలవారు. వీరు ఏదేని ఒక కావ్యమును వ్రాసి దానిని విద్వత్సభలలో పఠించి అచటి విద్వాంసులచే శభాసు

అని ఎ చుకొనినగాని వారి కావ్యమునకును వారి ని ప్రఖ్యాతి లభి చెడిదికాదు అ తంతమా తముగ పా డిత్యము 2 కవులు రచి చిన గ్ర థములు అచటి అసార ఎ డిత కవులచే అనాదృత ములయ్యెడివి ఎంత శ్రమి చి కావ్యములు వ్రాసి ను కొందరు ర ధ్రాన్వేషణ తత్పరులు అ కావ్యములం లి గుణములను గ్రహి పక దో గులను మాత్రమే చూపుచు కావ్య నిర్మాతలకు నిరుత్సాహమును జని ఎ చే వారు అయితే కొ దరు సహృదయులు రసగ్రహణ పారీ ములు కావ్యమును సా తముగ ఎరి చి ఆనందించు వారును ఉ డిరి కవికుల తిలక డై న కాళిదాసు వ టి మహాకవి అభిజ్ఞాన శాకు తల నాటకమున "ఆపరితోషా ద్విదుషాం న సాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్" అని వ్రాసుకొనినాడ లే ఆనాటి ండిత పరిసత్తులను కవిత్వము వ్రాసి మెప్పించుట ఎంత కష్టమయ్యెడి దో అనూహ్యము

అప్పలాచార్యుని కవిత్వమున అపశబ్దములు ఎక్కువగా ఉండుననియు ఆయన ఎన్నిధిలో అపశబ్దభయము లేదనియు అర్థమునిచ్చు అపశబ్దభయ నా స్తి అప్పలాచార్య సన్నిధౌ అను శ్లోకార్థ పాదముతో ఒక కవి అప్పలాచార్యుని ఆక్షే చె నట ఈ ఆక్షే ణ యును మనము వేరువిధముగా గ్రహి ప వచ్చును ఎన్నగా అప్పలాచార్యుడు వైయా రణి కావున ఆయన చె త అపశబ్దభయములేదు అనగా ఎల్లప్పుడు సాధు బ్ది ప్రయోగమునే అప్పలాచార్యుడొనరు ను అను నర్థము చెప్ప దీ ని మర్థింపవచు ను కాని అంతటి సహృదయత ఆనాడు ఉ డెనా? కేవలము ఇది అ ప్పలాచార్యుని ఆక్షే చుటకే ఉత్పన్నమైనట్లు టి ని ప డితులు ఈ శ్లోక పాదమును వాడుచుందురు దీనివలన అప్పలాచార్యుడు ఆనాటి ప డితు లలో పరిహాస భాజనుడై నట్లు విశదమగుచున్నది

అప్పలాచార్యుని విషయము ఇట్టి ఆధిక్షేపములోనే ముగిసినదికాని ఆయన వ్రాసిన గ్రంథములుగాని ఆయనకు సంబంధి చిన ఇతర చరిత్రముగాని చాటు పద్య మణిమంజరి ప్రథమ భాగమున కనవచ్చుటలేదు

కం ఆం శా

## అప్పలేంద్రుడు

అప్పలే ద్రుడు సా బోపాఖ్యాన కృతిక ర్తయైన రామ రాజు న అప్పరాజు మూడవ అన్నగారు చూడు వ్యా ము రామరాజురంగప్పరాజు

ఖం ల రం

## అప్పవిభుడు

అప్ప భుడు చ ద్రభాను చరిత్ర కావ్యమును రచి చిన తరిగొప్పుల మల్లన మ త్రికి జ్యోతి నోసరుడు కాలము క్రీ శ 1600 ప్రా తము అప్పవిభుడు జ్యోతిర్గణితశాస్త్ర ములో పార గతుడనియు మాధ్వరుడు చరణభ్యా సైక తత్పరుడనియు మల్లన వ్రాసెను ఈ మాధ్వ గురు వె రో తెలియదు చూడు వ్యా ము తరిగొప్పుల మల్లన

ఖం ల రం

## అప్పాజీ

అష్టదిగ్గాజ భయంకరుడై హిందూరాయ సురత్రాణుడై మూరురాయరగ డడైన శ్రీ కృష్ణదేవరాయలు భార తీయ చక్రవర్తు లో ప్రాతః స్మ ణీ యుడు వి యనగర సామ్రాజ్యము నేన స గమ పాలన తులున ఆరవీటి వ శము లలో కృష్ణరాయ తో ఎనయరు సార్వభౌములు లేరని చెప్ప వచ్చును ఆ మహారాజు తన మ త్రి స త్తముడైన సాళ్వ తిమ్మరుసును అప్పాజీ యని పిలిచెడివాడు

అయ్యవ ంచుకొ టి వి
నెయ్య బున కృష రాయనృప పుంగవు చే
నయ్యా వి రియేరీ
తియ్యని పిలుకాడవయ్య తిమ్మరుసయ్యా

అని తిమ్మరుసు భట్టుమూర్తి కవిచే పొగడ్త లొ నట్లు ఆంధ్ర కవుల చరిత్ర (ద్వి భా పు 85) య ను క మహా వీరేశ లి గ పంతులుగారు వ్రాసియున్నారు అప్పాజీని భటి యు గ ధరాదులతో చేర్చి చెప్పుట తెనుగుకవులకు ఆచారమైనది కస్తూరిరంగకవి అప్పాజీ భటి యుగ ధరావిమ త్రిమూర్ధన్య (1 5) అని తన కృతిపతియైన ఆనందరంగరాజును కీ ర్తి చి యున్నాడు క్రీ శ 1 5) లో వ్రాయబడిన నల్ల గల్ వారి వ శావళి యను వివరద ప్రకాశ సీసమాలి లో అప్పాజి కై పడినల యుగ ధరుమాడ్కి అని యుగ ధరాది మహా మంత్రుల శ్రేణిలో అప్పాజీ పేరు ఉదాహృతమైనది.

తిమ్మరుసు అను నామముకన్న "అప్పాజీ"యను నామమే తెలుగుదేశమున మిక్కిలి ప్రచారము గాంచినది

సాళ్వతిమ్మరుసు నామమును బట్టి చూడగా ఇతడు కన్నడదేశమ దలి రణశ్రేష్ఠుడో సచివోత్తముడో అనిపె టనే స్ఫురించును కాని ఇతడు ధుకు చంద్రగిరి దుర్గము నేలిన సాళ్వవంశీయుల యొద్ద తొలుత ఉద్యోగిగా ఉన్నకారణము చేత ఈతని సాళ్వతిమ్మరుని వ్యవహరించెడివారు "అరసు" అను పదము రాజు అను సంస్కృతపదమునకు ద్రవిడభాష లో ఏర్పడిన తద్భవము కర్ణాటభాషలో ఈ పదమునకు ఎక్కువ వ్యాప్తి అదు విజయనగరరాజులు ద్రవిడ కేరళ కర్ణాటాంధ్ర దేశములకన్నిటికిని ఏకచ్ఛత్రాధిపతులై ఉండుటచేతను తిమ్మరుసు కర్ణాటాంధ్ర సరిహద్దు గడి దుర్గములందును కర్ణాటదేశమునందును రాజకీయోద్యోగము నెరపుటచేతను ఈతనిని తిమ్మరుసు అని పిలుచుచు డెడివారు

తిమ్మరుసు వృత్తాంతమును గ్రహించుటకు ఆధారములుగా రెండు శాసనములు కలవు ఇందు మొదటిది శా శ 14౨9 (క్రీ శ 1507) ప్రభవ సంవత్సర మార్గశిర బహుళ 14 సోమవారమునాటిది ఇది విజయనగర చక్రవర్తి యగు వీరనరసింహరాయల పరిపాలనా కాలము ఎదరు తేదీనాడు శ్రీ మన్మహాప్రధాన సాళువతిమ్మయ్య గారు అనంతపురంజిల్లా తాడిపరతి (తాడిపర్తి తాడిపత్రి) తాలూకా తాడపర్తి గ్రామమున ఉండు వేంచేయున్న శ్రీరామేశ్వర దేవరసన్నిధిని శివరాత్రి పుణ్యకాలమున పెండ్లిళ్ళ కాలు విడచుచు శాసనము వేయించిరి వీరనరసింహరాయల వారు తమ నాయంకరమునకు ఇచ్చినగుత్తిరాజ్యములోను పెన్నబడిసీమ (పెన్నానదీ టము కావచ్చును) లోను పెండ్లిండ్లకు పెండ్లిసుంకాలు గొనుటను వీరనరసింహరాయలకు పుణ్యముగా విడిచిరి దీనిని బట్టి తిమ్మరుసు మంత్రి యొక్క ప్రజాహితతత్పరత తేటపడుచున్నది వివాహము సార్వత్రికముగావున సర్వవర్ణముల వారును ఈ పన్ను రద్దుచేయుటను అపారముగా హర్షించియుందురు తాడిపత్రి దగ్గర పెన్నానది ఉత్తర వాహిని యైనట్లు ఈ శాసనమున గలదు "యత్రనీలగిరి స్తత్ర పెన్నాచోత్తరవాహినీ యత్ర రామేశ్వరో దేవ స్తత్ర ముక్తిర్న సంశయః"

తిమ్మరుసయ్య వారి రెండవ శాసనము కూడ ఈదేవాలయమందే ప్రతిష్ఠింపబడినది కాలము శక 1491 (క్రీ శ 1509) శుక్ల సంవత్సర చైత్రశుద్ధ 10 శుక్రవారము ఇదియు వీరనరసింహరాయల పరిపాలనాకాలమే తిమ్మరుసు గారి నాయంకరమున నున్న గుత్తిరాజ్యములో పెన్నబడి స్థలములోని నెడదపాడు (ఎరదపాడు?) అను గ్రామము నకు వీరనరసింహపురము అను పేరుపెట్టి ఆ మహారాజుకు పుణ్యముగా తాడిపర్తి రామేశ్వరదేవునకు సాళువ తిమ్మయ్యంగారు ధారాపూర్వము చేసిరి ఈ దేవునకాయ గోపురము మండపమును గోపురప్రాకారాదులను నిర్మించెను ఈ శాసనమునందు అష్టభోగములు చేర్చబడినవి అవి గృహ ఆరామ క్షేత్ర నిధి నిక్షేప జల పాషాణ అక్షిణి అను ఏ అక్షిణి యన నేమో విశదముగ టలేదు మోనియరు విలియమ్సు ఆప్టే మున్నగు ప్రసిద్ధ నిఘంటుకారులు కూడ నిశ్చితమైన అర్థము చెప్పలేదు O e of the 8 Conditions or privileges attaced to landed property - అని మాత్రమే వ్రాయుచున్నారు ఇది అక్షయ్యమై యుండునేమో అనగా అది నిరంతరము సంచని భోగమని చెప్పవచ్చును

వాఙ్మయాధారములో మాదయగారి మల్లన కృత రాజశేఖర చరిత్రము నాదెండ్ల గోపమంత్రి కృష్ణార్జునసంవాద ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యలు సాళ్వ తిమ్మరుసు రచించిన బాల భారతవ్యాఖ్యయు తిమ్మరుసు చరిత్ర రచనమునకు ఎక్కువ ఉపకరించును ఇవిగాక విదేశీయయాత్రికులైన పైయస్ న్యూనిజ్ మొదలగు వారి వ్రాతలును స్వీకార్యములే చిలుకూరి వీరభద్రరావుగారు తిమ్మరుసుమంత్రి అను గ్రంథమును క్రీ శ 193 లో రచియించిరి తిమ్మరుసు పూర్వులు ఏ ప్రాంతమువారో స్పష్టముగా తెలియదు ఈ వంశమువారికి తొలుత కొండవీడు సమయమే స్వస్థానముగ ఉండెనని ఇతని తాతయు తండ్రియు గూడ కర్ణాటసామ్రాజ్య సార్వభౌములగు ప్రౌఢదేవరాయని మల్లికార్జునరాయని సామంత నృపతులుగ ఉన్న సాళ్వవంశీయులైన మహారాజు కడ మంత్రులుగ నుండి ప్రఖ్యాతి కెక్కినవారైనను మల్లికార్జునరాయల కాలమున కొండవీటి రాజ్యమును ఉదయగిరి రాజ్యమును గజపతులాక్రమించుకొన్న దున తిమ్మరుసు తండ్రియైన రాచిరాజు తన ఐశ్వర్యము నంతయు కోల్పోయి చంద్రగిరి రాజ్యమునకు వలసపోయెననియు తిమ్మరుసు చంద్రగిరిలోనే క్రీ శ 1480 వ సంవత్సరమున పుట్టెననియు వీరభద్రరావుగారు

గ్రాంధీ అగస్త్యభారతము పై తాను రచించిన హరవ్యాఖ్య యందు తిమ్మరుసు తన తండ్రి గురుల ట్లు పేర్కొని యున్నాడు

పౌలోమీవ దివా సామధి తి సీవ రామ ప్రియం రాచయ్య వరదా బికాభజత తచి త్తానుకూలాంతీ "

## తిమ్మరుసు వంశము

గ్రంథాధారములవలన తిమ్మరుసు వంశక్రమ మీ దిగువ జూపబడినది




మహామంత్రి సాళ్వతిమ్మరసు నాదెండ్ల తిమ్మమంత్రి సోదరియగు లక్ష్మాంబను వివాహమాడెను. ఈమెను లక్ష్మి అమ్మగారు అనెడివారు. ఈ సాధ్వి శ. సం. తి. దే. శా. III 198 లో ముద్రింపబడిన శాసనమున కలదు. లక్ష్మీ అమ్మంగారు తిరుపతి వేంకటేశ్వరస్వామి సేవకై 1200 వరహాలు సమర్పించినట్లు కలదు. మాదయగారిమల్లన రచించిన రాజశేఖర చరిత్రకృతిపతి అప్పయమంత్రియు కృష్ణార్జున సంవాద కృతికర్త గోపయయు నాదెండ మంత్రికి తనయులు. వీరిరువురికి బాంధవ్యముచే తిమ్మరుసు మేనత్తభర్త యగును.

గోవిందరాజు మహామంత్రి తిమ్మరుసు తమ్ముడు. రాజధానియగు విజయనగరమునకు అనాడితడు పురపాలకాధ్యక్షుడని పైయస్ తెల్పియున్నాడు. రాయలవారి అనుమతితో గోవిందరాజు పోర్చుగీసు రాయబారులకు విజయనగర పట్టణమును నందలి గృహరాజ సౌధములను స్వయముగా చూపెను. ఆ పోర్చుగీసు బృందములో విజయనగర వృత్తాంతకథకుడు పైయస్ గలడు. సాళువ గోవిందరాజు వీరనరసింహరాయల కాలమునను కృష్ణదేవరాయల వారికాలమునను గుత్తిసీమను నాయంకరముగా పాలించినట్లు తెల్పుశాసనములున్నవి (ద. హి. IV 800). మైసూరు రాష్ట్రములోని జిల్లా గూడులో చామరాజనగరములో గుండ్లుపేట తాలూకాలో ఇతని శాసనములు కలవు. ఆదితడు రాయలకిరః ప్రధానుడని కలదు. అన్న తిమ్మరుసు తోపాటు ఇతడును రాయలవారి ఆగ్రహమునకు గురియై చివరికాలమున బందీకృతుడయ్యెను. అచ్యుతదేవరాయల కాలమున ఇతడు సజీవుడై మహాప్రధానియై యున్నట్లు తిరుమలయందున్న శాసనములు సాక్ష్యమిచ్చుచున్నవి. సాళువ గోవిందరాజు తన అన్నగారింపలెనే తిరుమల శ్రీవేంకటేశ్వరుని కొలిచెనవాడు. తిరుపతిలో (నె. 97 తి. టి.) 27-8-1522 నాడు వేయించిన శాసనములో కృష్ణరాయల రాజ్యాభివృద్ధికిగాను ఇతడు గండికోటసీమలోని మోల్పాడి గ్రామమును దానముచేసెను. అదే నె. 12 (తి. టి.) శాసనమున ఉదయ కొండసీమలోని హనుమనిగుండమను గ్రామమును దానము చేయుచు ఈ గ్రామాదాయమును శ్రీవేంకటేశ్వరులకు గోవిందరాజస్వామి నైవేద్యము నేర్పాటుగావించెను. ఈ శాసనము తేదీ 20-11-1524. ఇందు సాళువగోవిందరాజు కుమార్తె తిరుమలమ్మయని పేర్కొనబడెను. అచ్యుతదేవరాయల చివరి రాజ్యకాలమున 6-11-1541 (నె. 85 తి. టి.) ఇతడు మంటపమునొకదానిని కట్టించినట్లు తెలియుచున్నది (చూ. తిరుమల తిరుపతి శాసనసంగ్రహనివేదిక పుటలు 193-194). కృష్ణమాంబ తిమ్మరుసు చెల్లెలు. నాదెండ్ల తిమ్మమంత్రి భార్య. నాదెండ్ల అప్పయ గోపయమంత్రుల తల్లి. ఈన బంధముచే తిమ్మరుసు వీరికి మేనమామ యగుచున్నాడు. "శ్రీసాళ్వతిమ్మసచివేశ్వరభాగినేయః । నాదిండ్లగోపసచివో యతతత్త్వవేదీ" అని నాదెండ్ల గోపమంత్రి తన ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యయందు తానును

"తద్భాగినేయా తరణి ప్రతాపౌ
నాదిండ్ల అప్ప ప్రభు గోపవర్యౌ

క్కరణి ఘటింపుచుం గృతయుగంబున త్రేతను ద్వాపరంబునం దరయగ సాళ్వతిమ్మ సచివాగ్రణి న మమ త్రికల్గునే

(ౢ వి 2 104)

ఈ మహనీయుని భౌతిక దేహమెప్పుడు పతనమొందెనో తెలియదు

"1453 శకమందున అచ్యుతదేవరాయలు ప్రభుత్వాంచేసిన మీను సదాశివరాయల ప్రభుత్వములో 1465 శ మందు అగునేటి శుభకృత్ సంవత్సర కార్తీక శు ౧౧ గురువార ప్రధాని తిమ్మరుసయ్యగారి కార్యకర్తలైన పోతుమామిళ్ళ సజ్జియంగారు కొల్లూరుగ్రామములో శ్రీగోపీనాథస్వామివారి ఆలయ ప్రాకార మంటపములు కట్టించి దర్శోద్యానానకు పశిపాటి శిం భొట్లు కరచేను కొల్లూరిపాడున్ను ౨౫౦ అర్ధాన యేకాదశీ పుణ్యకాలమందు తిమ్మరుసయ్యగారికి పుణ్యముగాను ధారపోసియిచ్చి యీ దేవాలయ శాసనస్తంభ మీద శాసనము లిఖించేసి వున్నాడు అని మె జీ ౭౫ వ సంపుటమునందు కలదు ఈ శాసనసారాంశము రంగాచారిగారి శాసన సముచ్చయము (వి రం సం వి II పుట 642) న గలదు తెనాలి తాలూకా కొల్లూరి గోపాలస్వామి దేవాలయములో ఈ శాసనము కలదని రంగాచార్యుల వారు సూచించియున్నారు

ఈ శాసనము ననుసరించి చూడగా క్రీ శ 1548 సంవత్సరమునకు ముందే తిమ్మరుసు మరణించి యున్నట్లు విదితమగుచున్నను క్రీ శ 1534 స । ప్రాంతమున అచ్యుతరాయల వారి కాలమున వెలసిన తిరుపతి శాసనములలో తిమ్మరుసు ప్రసక్తి కనబడుచుండుటచేత తిమ్మరుసు క్రీ శ 1540లో మరణించి యున్నట్లు తలంచుట యుక్తము

ఇట్లు అప్పాజీ విజ్ఞాననిధిగా రాజనీతి చతురుడుగా స్వామిభక్తి పరాయణుడుగా కృష్ణరాయల దక్షిణభుజముగా శాస్త్రజ్ఞుడుగా సంగీతకళానిధిగా వ్యాఖ్యాతగా సమయస్ఫూర్తి విరాజితుడుగా కృష్ణరాయల సకలసైన్యాధ్యక్షుడుగా యోధాగ్రేసరుడుగా ఔదార్యనిధిగా విఖ్యాతుడైనాడు కృష్ణరాయలను రక్షించినవాడు అతనికి రాజ్యమిప్పించినవాడు అతనిని దిగంత విశ్రాంతయశస్కునిగా విచినవాడు తిమ్మరుసుమంత్రియే అనుట అతిశయోక్తి కానేరదు

వి శి సుం

## అప్పాపండితులు

శ్రీ వీరప్రతాప సదాశివదేవమహారాయలు విజయనగరమునందు సామ్రాజ్యపాలన చేయుచున్న కాలమందు అప్పట్లో కొండవీడురాజ్యము విజయనగర సామ్రాజ్య అంతర్భాగముగా ఉండెను శ్రీ మహా మండలేశ్వర రామరాజు తిరుమల రాజయ్యదేవ మహారాజు కొండవీడునకు పాలకుడుగా ఉండెను ఆయన శాలి 1486 (క్రీ శ 1564) కు సరి అగు రక్తాక్షి సంవత్సర శుద్ధ ఏకాదశీదిన మున కొండవీటి సీమలోని నదివెలుగు అగ్రహారమునందలి 14 వృత్తుల మాన్యమును భార్గవ గోత్ర ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయులైన పండితమహాపాత్రు పౌత్రుడును జగన్నాథ పండితుల పుత్రుడైన కృష్ణ పండితునకు దానము చేసెను

ఈ శాసనమునుబట్టి ఆ కాలపు లావాదేవీలు కొంతవరకు తెలియవచ్చుచున్నవి

తిరుమలరాజయ్యపేర ఈ గ్రామమునకు తిరుమలరాజపురమను పేరుపెట్టబడెను ఈ దానము తిరుమలరాజయ్యగారి దివాణము పుస్తకములలో నమోదు చేయబడినట్లు వహివ్యంతరువుచేసి అనుమాటల వలన తెలియుచున్నది అనగా 16 వ శతాబ్దమున దే ఈనాటవలెనే భూములరిజిస్ట్రేషను అమలులో నుండెనట విదితమగుచున్నది వహి అనగా పుస్తకము రిజిస్టరు ఇది పర్షియను పదముగా తోచును ఖాతా వహి అనుటకలదు ఆస్థానపు కవిలెలో నమోదుచేసిన తరువాత దానప్రతిగ్రహీత ఉపయోగము కొరకై తామ్రశాసనము అతనికి ఇయ్యబడుచుండెను సదరుదానము విషయమై ఏదైనవివాదము ఏర్పడినచో ఆస్థానమునందలి వహిపారము నిర్ణాయకముగా ఉండియుండును

దానముపుచ్చుకొన్న కృష్ణపండితుడు దానిని ఏ కారణముననో అప్పాపండితునకు పరివర్తనము చేసెను ఇంతకుముందా మీయబడిన భూమి కొండవీటిలోని గోపీనాథ దేవునకు ఇదివరలో చెల్లుచుండినట్లు వాకబు వచ్చియుండును దేవస్వమును అనుభవించుటకు వెనుదీసిన అప్పాపండితుడు దానికి ప్రతివిధాన మాలోచించి సిద్ధిరాజు తిమ్మరాజుగారి అనుజ్ఞమీద నదివెలుగు గ్రామములో తనకు సంక్రమించిన భూమికి బదులాగ అంతవిస్తీర్ణము గల అనగా 74 వృత్తుల భూమిని అద్దంకి సీమలో విడిచి గోపీనాథదేవునకు చెల్లునట్లు వ్రాయించి ఇచ్చెను దీని వలన దేవభోగమును స్వంతమునకు అనుభవించు

మహాప్రాముఖ్యుడై అప్పాపండితుడు విముక్తుడయ్యెను. అప్పాపండితుడు మొదట అర్ధమాన్యమైన శేళ్ళ గ్రామవాసి యయియుండవచ్చును. కావుననే అక్కడ భూమినిగూర్చి ఈయగలిగెను. నందివెలుగు గ్రామమునందలి భూమి దేవస్వమని తెలిసిన తరువాతకూడ అప్పాపండితుడు దానిని విడచి యేల పోలేదను ప్రశ్న రానచుండు. దాని సమాధానము అంత కష్టమునుకాదు. ఈనూతనగ్రామమునందు దాతడు నివాసమేర్పరచుకొనుటచే అర్ధమాన్యమును కురలిపోవుటకు ఇష్టములేక ఇక్కడనే స్థిరనివాస మేర్పరచుకొనెను.

దేవస్వమును అనుభవించు దోషపరిహారార్థమైకాబోలు అప్పాపండితుడు నందివెలుగు భూమిమీద మూడవవంతు రాబడిని గోపీనాథ దేవునకే సమర్పించెను. ఇదివరలో ఈ భూమిని చేయువారు ఆరవవంతు మాత్రమే దేవుని దివాణమునకు చెల్లించుచుండిరి. ఈ విధముగా ందరు పరిష్కారమునందు కొండవీటి గోపీనాథ దేవుడు మంచిలాభమునే పొందెను. గోపీనాథ దేవునకు అర్ధమాన్యములో 74 వృత్తులు + నంది వెలుగుభూమిలో మూడవవంతు ఆదాయము. వెరసి 1⅜ భాగము ముట్టగా అప్పాపండితునకు ⅜ మాత్రమే ముట్టుచున్నది. దైవభీతిగల అప్పాపండితుడు పరద్రవ్యాపహారణ వాంఛలేని సజ్జనుడని ఈ భూమి పరిష్కార వ్యవహారముచే నిర్ధారితమగుచున్నది. ఇది సిద్దిరాజు తిమ్మరాజు గారు ప్రభుత్వాధికార బలముచే సాధించిన పరిష్కారము కాదని చూపుటకై కాబోలు శేళ్ళపల్లి గ్రామవృత్తులను అప్పాపండితుల వారు గోపీనాథదేవునకు దానశాసన పూర్వకముగ సమర్పించిరి.

శాసనమునందు చెప్పబడిన వృత్తులు అనగా దేవునిసేవలకు ఇచ్చుభూములని తెలియనగును. నందివెలుగు గ్రామము గుంటూరుజిల్లా తెనాలి తాలూకాయందు కలదు. అందలి నేటి జనాభా 5 394. ఈ గ్రామము పౌరాణికముగను చారిత్రకముగను ప్రసిద్ధి చెందినది.

ఖం ల రం
కొ వెం

## అప్పాపిళ్ళై

ఈయన ప్రశంస (ఆ దే-శా III 52 84 పుటలలో) వచ్చినది. ఉత్తరమేరూరు అను గ్రామము ప్రస్తుతము మద్రాసు రాష్ట్రములోని చెంగల్పట్టు జిల్లాలో కలదు. దీనినే పూర్వము రాజేంద్ర చోళచతుర్వేది మంగళము అనెడివారు.

క్రీ శ 15 వ శతాబ్దిమండియు ఈ ప్రాంతము తయు విజయనగర సామ్రాజ్యముక్రింద ఉండెడిది. అందువలన ఉత్తరమేరూరునందు విజయనగరసేనలు విడిసియుండెడివి. అప్పాపిళ్ళైయు అతని పెద్దన్నగారగు మన్నారుపిళ్ళైయు ఇరువురును సైన్యాధిపతులుగ నియుక్తులైరి. ఈ సోదరుల ఎత్తుపాదులు కరవట్టి పుళిశ్వారు అనువారు. తల్లి కామాక్షమ్మగారు. వీరి జన్మస్థలము ఉత్తరమేరూరును అంటియున్న మహాపాలకుల కాలచ్చేరి అను ఒక కుగ్రామము.

అప్పాపిళ్ళై అతనిసోదరుడు తిరుమల తిరుపతులయందు తమపేరిటకల పుణ్యము కోరుచు వేయించిన శాసనములనుబట్టి ఈ సోదరులు విజయనగర ప్రభువులగు సాళువ నరసింహరాయలు (1485 1491) తుళువ వీరనరసింహరాయలు (1503 1509) శ్రీకృష్ణదేవరాయలు (1509 1530) వీరి రాజ్యపాలన కాలము వరకు విజయనగర సేవలయందు నిమగ్నులై ఉన్నట్టుల తెలియవచ్చుచున్నది.

శాసనస్థవిషయములను పరిశీలించినచో అప్పాపిళ్ళై కౌండిన్యగోత్రుడనియు ఆపస్తంబ సూత్రుడనియు తెలియును. ఆ కాలపు దానోద్దేశములు సమయములు వాటిని ఖాతాలో చేర్చుపద్ధతి దానమును అమలులో పెట్టు విధానము మున్నగు పెక్కువివరములు శాసనములవలన సుబోధములగును. ధర్మము నెరవేర్పదలచినవ్యక్తి స్వామివారి శ్రీభండారమునకు రొక్కమునుగాని దానమీయదలచిన గ్రామమునుగాని ఇచ్చును. దానిని శ్రీవైష్ణవుల సమ్మతితో దేవస్థానపు కరణము లేక లెక్కలువ్రాయు అధికారి దేవాలయపు ఖాతాయందు ఎక్కించును. రొక్కమైనచో దానిమీద వచ్చు వడ్డీతో దాతయైన యజమానుడు కోరుసేవలను నడిపింతురు. సదరుసేవలకు అవసరమగు సమస్తవస్తువులను శ్రీభండారమునుండి కొలతలెక్కప్రకారము ప్రసాదము చేయువారికి ఇత్తురు. ధాన్యము బియ్యము నేయి బెల్లము పప్పు మొదలగు ద్రవ్యములు ఆకులు పోకలు నూతన వస్త్రములు కాగడాలకు నూనె మొదలగు సంభారములన్నియు శ్రీభండారమునుండి ఇచ్చుచుందురు. యజమానుడు గ్రామము సమర్పించినచో దానిమీద పన్నులను రాబడిని శ్రీభండారమునకు జమకట్టి అట్టి ఆదాయముతో యజమానుడు కోరినసేవలు నడుపుదురు.

అప్పాపిళ్ళై రెండు విధములైన వ్యవస్థలను చేసెను.

వీరనరసింహరాయని ధర్మముగా గోవిందరాజస్వామికి క్రీ శ 1506 స । న డోలోత్సవమునకై చేసిన ధర్మమునందాతడు శ్రీ భ డారము కు 7800 నర్పణములు నగదు రూ మున సమర్పి చెను దీనిమీద వచ్చువడ్డీతో అయన కోరిన సేవలను ఏర్పాటు చేయు ద రు శ్రీకృష్ణదేవరాయల ధర్మముగా చే న శా వ్యవస్థయ దు ఉప్పావల్లె ఒక గ్రామమును దా ము చేసెను దానిమీదవచ్చు ఆదాయమును వసూలుచేసి దేవ స్థా మువారు యజమానుడు కోరినసేవలను ఏర్పాటుచేయు చు ఒరి గోవి దరాజస్వామి చేయుటకు అప్పావళ్లె ఏర్పాటు చేసినసేవలు డోలోత్సవ స దర్భమున ఆరంభి చును ఎళ్ళె యొక్క జన్మ—లనక్షత్రమైన చిత్రానక్షత్రమునాడు అ కు రార్పణచేయబడను కృష్ణదేవరాయల పుణ్యము కై క్రీ శ 1511 స వదై వీడు రాజ్యమునకు చె దిన అరణిసీమ లోని వీరక పనల్లూరు అను గ్రామమును వే క టేశ్వరస్వామి సేవకై దా^ముచేసెను అధర్మము అప్పావళ్ళె ఆల్లియైన అక్కాలమ్మ శ్రాద్ధదివసమునాడు దేవుని సేవలకై ప్రవర్తి ంచి నది

ప్రసాదములో కొంతభాగము యజమానునకుగాని అతని వారసులకుగాని అతని యాదేశము పొ దిన ఇతరులకుగాని ఇత్తురు కొంతభాగము ఆలయపు పూజారులు స్వీకరింతురు దేవాలయ పరివారములో నృత్య స్త్రీలు జీర్ణోద్ధారము చేయు మేస్త్రులు వంటలవారు పురోహితులు ము న్నగు వారు డిరి పుణ్యదివసములు — ఉత్సవదివసములు కొన్ని పేర్కొనబడినవి బ్రహ్మోత్సవము ముక్కోటిద్వాదశి డోలో త్సవము వస తోత్సవము సహస్రకలశాభిషేకము శ్రీజయ తి దీపావళి చాతుర్మాస్యలు ఉత్థానద్వాదశి శ్రీ రామానుజులవారి ప్రతిష్ఠగాచేయబడు అధ్యయనోత్సవము మొదలై నవి కలవు అప్పావళ్ళె తనపేర స్వామివారికి ఉత్సవ మంటపములను గూడ కట్టి చెను

కొ వెం
ఖం ల ర ం

## అప్పాపురం

అప్పాపుర గ్రామము గు టూరు జిల్లా బాపట్ల తాలూకా కాకమాను ఫర్కాలో ఉన్నది ఈ గ్రామపు ప్రస్తుతపు జనాభా 2 218 మల్లం ల్లి సోమశేఖరశర్మగారు తాము రచి చిన "రెడ్డి రాజ్యములు అను ఆంగ్ల గ్ర థము నందు 271 వ పుటలో ఈ గ్రామమ దలి ఒక శాసనమును ఉదా హరి చియున్నారు ఈ శా సకాలము క్రీ శ 405 ఇది ధరణికోటను రాజధానిగా చేసుకొని పాలి చిన కోటవంశజులు హరిసమ కృష్ణుని సంతతి వా మని చె ప్పుకొనిరి స దర్భో చితముగ శ్రీశర్మగారు ఆ ప్రదేశమ లి క్షత్రియ వ శ ము ఉ న్నమును పేర్కొనిరి శ్రీ సవిజయము రామ విలా ము ధ జయవిజయము త్రియ గోత్ర మాలిక మొదలగు ఉప త్ర గ్ర థములును దేశము నాలుగు చెరగుల పడియున్న శా నము లను ఆ ప్రదేశ క్షత్రియుల వంశాను క్రమ కి ను తెలియచేయుచు న్నవి

ధనంజయవి యము అను కావ్యమును మహాకవి శ్రీనాథుడు రచించి గన్న భూపాలున ు అ తము చేసెను అందు కృతిభ ర్త ధరణికోటను పాలి చిన కోట వ శీయులకు మూల పురుషుడైన హరి^మ కృష్ణుని స తతివాడని కవి తెలిపెను ఆ ప్రదేశమందలి క్షత్రియులను రాచవారని ఎలు చుటయు కలదు ఈ వ శములలోని వారలకు "పేషణి హనుమ త" అను బిరుదు కలదు

పెద్దాపుర తాలూకా తూర్పుగోదావరి జిల్లా తిరుపతి గ్రామమున వె న శ్రీర గరాయదేవాలయమున వలి ముఖ మ డప శిలా స్త భమున శక 1364 (క్రీ శ 14 ?) నాటి శాసనమొకటి కలదు ఇ దు వత్సవాయ అయ్యపదేవ మహా రాజుల ప్రజ ము స్వామి వారి సేవలు చేయి చిన వివరము లు కలవు "పేషణ హనుమ త" బిరుదు ప్రతాపవత్సవాయి అయ్యపదేవ మహారాయలు అని శా నమునందు చె ప్పబడినది దీనినిబట్టి వత్సవాయి వ శము వారు పేషణి హనుమ త అని బిరుదు పొ దిరని తెలియను ట్టి బిరుదు శేష చి రాచ వారికి కూడా ఉండి యు డవచు ను పేషణి అను పదము నకు శబ్దరత్నాకరకారులు స్త్రీ నూరెడురాయి సన్ని ల్లు అను అర్థములు చెప్పిరి ఈ అర్థములలో ఏదియు ఈ బిరుద విషయమున అన్వయి చుటలేదు వత్సవాయి వ శమువారు శత్రువులను నుగ్గు చేయుటలో హనుమంతునితో తుల్యులు అను అర్థము చెప్పినచో ఈ బిరుదు సార్థక్యమున చెందునేమో! వత్సవాయి వ శమువారు సూర్యవ శమునకు చె దిన ప్ర ద్ధ కుటుంబీయులలో నొకరు పెద్దాపుర సంస్థానమునకు చెందిన వత్సవాయి తిమ్మ గపతి వారి ఆశ్రయములో ఎనుగు లక్ష్మణ కవి రామవిలా మను గ్ర థము ను రచించెను అ దు చాగి

అను రాజవంశము వత్సవాయి వంశముగా పరివర్తనము పొందిన విషయము సూచించబడినది. చాగి ఎఱ్ఱ పోతరాజు కుమారుడు రామరాజను నాతడు వత్సవాయి అను పట్టణమున శాశ్వతముగా నివసించుట వలన అతని సంతతివారు చాగి వంశజులని వ్యవహరింపబడుటకు బదులుగా వత్సవాయి వంశజులుగా వ్యవహరింపబడజొచ్చిరని తెలియుచున్నది. తెలుగుచోడులు ఉండిరాజులు తమ శాసనములందు తాము సూర్యవంశజులమనియు ఎలమంచిలి వేంగి చాళుక్యులు తాము చంద్రవంశజులమని చెప్పుకొనిరి.

విశాఖపట్టణము జిల్లా మ్యాన్యుయల్ అను గ్రంథమునందు ఆంధ్రదేశమునందలి రాచవారి ప్రశంస కలదు. క్రీ.శ. 1540 ప్రాంతమున పూసపాటి తమ్మభూపాలుడు శ్రీకృష్ణవిజయమను కావ్యమును రచించెను. అందు మాధవవర్మ (క్రీ.శ. 591) అను రాజు వశిష్ఠ ధనంజయ కౌండిన్య కాశ్యప గోత్రులైన క్షత్రియజాతులతో ఉత్తరదేశమునుండి తెలంగాణమునకు వలసవచ్చినట్లు చెప్పబడినది. ఈ మాధవవర్మ వేయించిన పోలమూరు శాసనమును (క్రీ.శ. 594) ప్రామాణ్యముగా గైకొని చారిత్రికులు ఇతడు విష్ణుకుండిన వంశమునకు చెందిన మాధవవర్మయే యైయుండవచ్చునని నిశ్చయించిరి.

రెండవ కాకతి ప్రోలుని హనుమకొండ శాసనమున (క్రీ.శ. 1117) ఉగ్రవాది మేళరస యొక్క పూర్వుడు మాధవవర్మ అనియు అతడు గొప్ప గజతురగ పదాతి సైన్యము కలవాడనియు పరాక్రమవంతుడనియు తెలుపబడినది. ఉగ్రవాది మేళరస (మేడరాజు) వరంగల్లు జిల్లా పాకాల తాలూకా (ప్రస్తుత నరసంపేట తాలూకా) లోని కురువెట్టకును గోదావరీ నదికిని మధ్యనున్న దేశమును పాలించినటుల ఇతని మంత్రి నాగదేవరాజు గోవిందపురమున వేయించిన శాసనము వలన తెలియవచ్చుచున్నది. మేడరాజు జైనమతాభిమాని. ఇతడు ప్రోలరాజు కాలమున యువకుడుగా నుండి కాకతీయ సామ్రాజ్యమును లెక్కచేయక చాలకాలము స్వతంత్రుడుగా వ్యవహరించి వార్ధకమున రుద్రదేవ మహారాజుచే ఓడింపబడినటుల హనుమకొండ వేయిస్తంభాల గుడి శాసనమున తెలుపబడినది. మాధవవర్మ పరమధార్మికుడుగా న్యాయబుద్ధి కలవాడుగా కీర్తిని పొందెను. ఇతని ధర్మప్రియత్వమునకు సంతోషించి బెజవాడ మల్లేశ్వరస్వామి కనక వర్షమును కురిపించెనను ఐతిహ్యము కలదు. పూసపాటి విజయనగర సంస్థానాధీశులు మాధవవర్మ సంతతి వారమని చెప్పుకొనుట వలన ఆంధ్రప్రాంతపు క్షత్రియ కుటుంబములవారు విజయనగర మహారాజులను గౌరవపురస్సరముగా నేతలని పరిగణించుచున్నారు.

ఆంధ్రదేశమందలి రాచవారు తాము కాశ్యప గోత్రులైన కాకతీయుల (ఓరుగల్లు) ధనంజయ గోత్రులైన కోట వంశజుల (అమరావతి) వశిష్ఠ గోత్రులైన పరిచ్ఛేదుల (చేబ్రోలు కొల్లిపాక) కౌండిన్య గోత్రులైన వరాహకనకుల సంతతి వారమని చెప్పుకొనుచున్నారు. ఇందు ఏరాటకులు ఏ ప్రాంతమువారైయుండిరో తెలియవచ్చుట లేదు. రెడ్డిరాజుల పరిపాలన కాలమునకు రాచవారిలో గృహనామములలో శాఖలలో భేదములు ఏర్పడినవి. నేడు వీరు దంతులూరి మందపాటి వత్సవాయి పూసపాటి అను గృహనామములను కలిగియున్నారు. 13 శతాబ్దికి చెందిన మంగళగిరి అనంతకవి తాను రచించిన విజయానందవిలాసమును దాట్ల పెద్దిసుపుత్రకు కృతి ఇచ్చెను. వీరు హరిసీమ కృష్ణుని సంతతివారలని అతడు తెలిపెను. మందపాటి క్షత్రియులు తాము కాకతీయుల వారసులమనియు పూసపాటి వారి పూర్వులు తాము పరిచ్ఛేద వంశము వారమనియు చెప్పుకొనుట కలదు.

కొ. వెం.

## అప్పాపురం కాలువ

అప్పాపురం కాలువ గుంటూరు తాలూకాలో ప్రవహించుచున్నది. గుంటూరుజిల్లాకు ముఖ్యమైన నీటివసతి కృష్ణానది. విజయవాడ ఆనకట్టకు దక్షిణదిక్కుగానున్న సీతానగరమునుండి ఒక పెద్ద కాలువ దుగ్గిరాల వద్దకు వచ్చునికి మూడుపంటకాలువలుగ విభక్తమైనది. అవి బ్యాంకుకాలువ, నిజాంపట్టణము కాలువ, కొమ్మమూరుకాలువ అనునవి. జాగర్లమూడి లాకునకు ఎగువ కొమ్మమూరు కాలువనుండి విడిపోయిన అప్పాపురం కాలువ వలన గుంటూరు తాలూకాలోని కొన్ని భూములు సాగగుచున్నవి. 65/D/3 అను సంఖ్య ఇండియా సర్వే వారు ప్రచురించిన టోపోగ్రాఫికల్ చార్టు ననుసరించిన సంజ్ఞ యని తెలియనగును.

కొ. వెం.

## అప్పా ముకుందరావు

ఈయన ప్రశ ం (త ని 21 పుట) గ్రంథములో చేయ నైనది ఈతడు నిర్మల జమీ దారుల పర పరకు చె దిన వాడు ఈయన త డ్రియైన జగ తిరావునకు మొదటి జాము ఆ పుజావాజరీ 1137 (క్రీ శ 1ı 7) లో జాగీరును ం దను ఇచ్చి ట్లు తెలియుచున్నది జగపతిరావు వాజరీ 1159 (క్రీ శ 1749) లో మరణి చగా అప్పా ముకు దరావు నిర్మల పరగ ణాకు జాగీర్దారు అయ్యెను క్రీ శ 1743 లో ఆ పుజా నిజాముల్ముల్కు గతి చెను ఆయన కుమారుడు నాసరుజం గును మనుమడు ముజఫరుజ గును హైదరాబాదు ం హాసన ముకై కలహాంపజొచ్చిరి

అప్పా ముకుందరావు సమర్థుడైన పాలకుడు ఇతడు ప్రజాహితమును దృష్టియందుంచుకొని పాలి చెను ఈతని కాలమున నిర్మల పరగణా చక్కగా అభివృద్ధిచెందెను అప్పా ముకుందరావు పరాక్రమశాలి యనుటకుగూడ అనువగుచున్నది శాలకొండవద్ద జరిగిన యుద్ధములో ఈతడు ముఘ్రహ ఖాను అనువానిని ఓడించెను అప్పటికి దక్కను సుబేదారు (నాసరుజ గు కావచ్చును) ముకుందరావు సాహ పరాక్రమ ములను అభినంది చి ఈయనను సముచితముగా గౌరవించెనట నీతిజాయతీలు కలిగి ప్రజాక్షేమ దృష్టితో జమీందారీని పరిపా లించుచున్న అప్పా ముకుందరావుగారు ఇతర ఉద్యోగులకు కంటకప్రాయు డయ్యెను ప్రభుత్వధనమును అపహరించు స్వార్థపరులకు వీలుచిక్క దయ్యెను

ఇట్టి దుర్నీతులగు అధికారులందరును ఏకమయి కుట్ర చేసి అప్పా ముకుందరావుగారిని విషప్రయోగముచే సంహారిం చిరి వీరి తరువాత నిర్మలపరగణాను పరిసరములందలి ముగ్గురు జమీందారులు ఆక్రమించుకొని పరిపాలించిరట్లు చెప్ప బడినది వీరు కడంకరావు గోపాలరావు అనంత వె కట రావు అనువారలు ముకుందరావు దుర్మణమునకు కారకు లైన కుట్రదారులలో వీరు ఉ డిరో లేదో తెలియదు

కా గో
● మ

## అప్పాయిపల్లి

అప్పాయి ల్లి మహబూబునగరం జిల్లా మహబూబునగ రము తాలూకాలో ఉన్నది ఈ గ్రామమునకు 6 మైళ్లలో మహబూబున ర స్టేషనున్నది ప్రస్తుతము ఈ గ్రామ మును కోడూరుతో కలిపిరి దీని తూర్పున తెలుగు వెను పడమర అప్పాయిపల్లి ఉత్తరమున బొ కలోని ల్లి ఉన్నా మున ముక్కిడిగట్టు సరిహద్దులు ఇచ్చట ము డి ట్టు అడ్డగట్టు దొంగగట్టు బ వల్‌తిప్ప లో నే గుట్టు మాలగుట్ట మునెమ్మగల్లు కుక్కలపారె ట్టు గు డ్ల ట్టు రెడ్డి ట్టు అను నవి ఉన్నవి ఈ గట్లు గుట్టలపై ప వ్వరి ఓవి చీకి నేరేడు సీతాఫలము ఇప్ప పాలి చెట్లు లవు ఈ గుట్టలు ట్టు రాయి నిర్మాణములు అప్పాయిపల్లి విస్తీర్ణము ౨౦6 ఎ రములు

1931 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఇచ్చట 3 90 మంది జనులు కలరు ఈ స ఖ్యలో 50 మ ది హరి నులు 28 మెహ్యాలు జాతులవారు ఇచ్చట ఇ డ్లు ఒకచోట గు పు గను ఒకచో దూరముగను ఒకచో ఏ ప క్తిగను నిర్మి చ బడియున్నవి ఇచట 445 పెంకుటి ఇ డ్లు ఒక కా క్రీటు కప్పుగల ఇల్లు ఒక ఎక్కువ అంతస్తులుగల భవనము ఉన్నవి గ్రామస్థులలో 80 శాతమువారు వరి అన్నమును 20 శాతము వారు జొన్న అన్నమును తి దురు వీరు బావినీటిని త్రాగు దురు ఇచట వేసవికాలములో నీటి ఎద్దడికలదు

2 మైళ్ల పొడవుగల మాలకు టవాగు 2 మైళ్ళ పొడవు గల మైసమ్మ చెరువువాగు కలవు మైసమ్మ చెరువు మాల కుంట నల్లకు ట కొత్తకు ట తిమ్మాయికు ట ర్నాల కుంట ఊరకు ట అమెకు ట కానుగులకుంట ఆకులవాని కుంట చాకరికు ట-ఇవి ఈ గ్రామ నీటివనరులు 1966 67 స లో పంటలక్రింద 2025 ఎకరలముల భూమి ఉపయోగించ బడెను చెరువుల క్రింద 306 ఎకరములు ఇతర వనరుల క్రింద 15 ఎకరములు సాగుబడి అయెను 15 ఎలెక్ట్రిక్ మోటారులు 2? ఆయిల్ ఇంజనులు 40 ఎ రములకును 40 మోటబావులు 150 ఎకరములకును నీటిని సప్లయిచేసెను వరి జొన్న వేరుసెనగ రాగులు సజ్జలు పండును గ ట రకు లను గుమ్ములలో గాదెలలో నిలువచేయుదురు వీటిని బండ్లపై మహబూబునగరమునకు ఎగుమతిచేయుదురు చిన్నమామిడి

తోట ఒకటి లదు గ్రామస్థులు తమ అవసరముల నిమిత్తము మాత్రమే టొమాటో వ కాయ మొదలగు కూరలను ఎండి తురు ఈ గ్రామమునకు 861 ఎకరముల అడవి ఉన్నది ఇది గవర్నమెంటు పాలనలో ఉన్నది దీనిలో సీతాఫలములు తునికి ఆకు దొరకును నక్కలు తోడేళ్లు కుందేళ్లు ఎలుగు గొడ్లు అడవి ందులు ఎదులు మొదలగునవి కూడ ఉన్నవి

ఈ గ్రామమున 543 గేదెలు 878 ఎద్దులు 417 ఆవులు 860 మేకలు 1105 గొర్రెలు 55 ప దులు 1681 కోళ్లుకలవు బట్టలు మొదలగు బరువులను మోయుటకు ౨0 గాడిదలు ఉన్నవి ది మునకు 250 లీటర్లపాలు నేయి పెరుగు 12 కి గ్రా మా సము 150 గ్రుడ్లు సాలీనా 366 కి గ్రా చేపలు గ్రామస్థులే ఉపయోగి తురు ఎగుమతిలేదు

ఈ గ్రామస్థులకు వ్యవసాయము వ్యవసాయపుకూలి చే బ్రతుకుట ముఖ్యమైన వృత్తులు దుకాణదారులు కుల వృత్తులవారు స్వల్పసంఖ్యలో కలరు ఒకవడ్లమర 2 పిండి మరలు మాత్రమే కలవు వీటి ఉత్పత్తులలో కొంతభాగము వాడుకొని కొంతభాగము మహబూబునగరమునకు సప్లయి చేయుదురు వ్యవసాయదారులకు కూ లీ లు దొరుకుదురు కూలి రేటు పురుషునకు దినమునకు రు 1 50 స్త్రీకి రు 0-75 లు

ఇచ్చట వరదరాజస్వామి దేవాలయమును హనుమంతుని గుడియు కలవు హనుమంతుని గుడికి 15 ఎకరముల దేవా లయ భూమి ఉన్నది

ఈ గ్రామమునకు 1½ మైళ్ళ దూరములో కోడూరు స్టేషను ఉన్నది ప్రభుత్వపు బస్సులు కోడూరుమీదుగా మహ బూబునగరము ను డి నారాయణపేటకు రాయచూరునకు కృష్ణకుపోవును ఇచ్చట ఒకమైలు పొడవుగల రె డు మట్టి రోడ్లు కలవు దీ ని ఎ్రిక్కగ్రామములతో ఒకమట్టిరోడ్డు ఒకమైలువరకును తరువాత ఒక తారురోడ్డు కలుపుచున్నవి ప్రయాణములకును సరకులను చేరవేయుటకును ఇచ్చట 200 రెండెడ్ల బండ్లు ఉన్నవి 10 సైకిళ్లు కూడ ప్రయాణమునకు ఉపయోగపడుచున్నవి

ఇచ్చట బ్రాంచి పోస్టాఫీసు సి పి యస్ స్కూలు ఉన్నవి ఇది పంచాయతి పరిపాల లోని గ్రామము ఇచ్చట ఇద్దరు ఇ గ్లీషు వైద్యులు ముగ్గురు ఆయుర్వేద వైద్యులు ఇద్దరు హోమియోపతి వైద్యులు ఒక యునానివైద్యుడు కలరు పశురోగాలకు ఇచట నాటువైద్యము చేయుదురు నాలుగు కిరాణాదుకాణములు రెండు కాఫీ హోటళ్లు కలవు

అప్పాయిపల్లికి 6 మైళ్ళదూరములో ఉన్న మహబూబు నగరములో తంతికార్యాలయము టెలిఫోనులు పురుళ్ల ఆసు పత్రి జనరల్ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి ఎనిమాధియేటరు కోర్టులు పోలిసుస్టేషను బ్ రెజిస్ట్రారు ఆఫీసు తాలూకాకచేరి కలవు బ్లాకు అభివృద్ధి కేంద్రము కు జడ్చెరకు పోవలెను ఈ గ్రామవిద్యార్థులు హైస్కూలు కళాశాల చదువులకు మహ బూబునగరమునకు పోవలెను గ్రామస్థులు మహబూబునగర వారసంతనుండి ప శు వు లు కూరగాయలు ఫలములు ధాన్యము బట్టలు మొదలయినవి కొనితెచ్చుకొందురు

మా శ్వే

## అప్పారాయలు

విజయనగర పతనాన తరము ఆ రాజ్యావశిష్టములగు చిన్న చిన్న సామంతరాజ్యములు సంస్థానకులు సాహిత్య పోషణభారమును నిర్వహించి యు దుట ప్రశ సంప దగినవిష యము రాజకీయపు జగడములలో నలిగిపోవుచున్నను ఈ సంస్థానపాలకులు ఆంధ్రదేశమున సాహితీగోష్ఠులు నిర్వహి చి పండితులను కవులను పోషించిరి జటప్రోలు సురభిమాధవ రాయలు బిక్కనవోలు కామినేనిమల్లారెడ్డి విజయనగర పూసపాటి తమ్మభూపాలుడు వనపర్తి అష్టభాషాకవి గోపాల రాయలు పెద్దాపురము వత్సవాయ బలభద్రగజపతి నూజ వీటి వెంకటాద్రి అప్పారాయలు మొదలగు సంస్థానాధీశ్వరులు కృతికర్తలుగా కృతిభర్తలుగా చరితార్థులైరి

పద్మనాయక కులోద్భవులగు వెలమవారి గోత్రములలో విప్పర్లగోత్ర మొకటి ఆ విప్పర్లగోత్రములో మేకావారిది మేటికుటు బము ఈ కుటుంబమునకు చెందినవారే అప్పా రాయలు

ఈ కుటు బమునందు మేకాబసవన్న ఆద్యుడని ప్రతీతి నూజివీటిలో స్థిరపడకముందున్న వీరి పూర్వుల చరిత్ర ఎట్టిదో తెలియదు కాకతీయుల కొలువులో వీరు ఉన్నట్లు ఊహిం చుటలో దోషములేదు బసవన్నయు అతని సంతతివారును కులక్రమముగ చోళరాజ్య ప్రతిష్ఠాపనాచార్య అను బిరుద మును ధరించుచువచ్చిరి దీనిని బట్టి రాజ్యభ్రష్టుడైన నెల్లూరి మనుమసిద్ధి తన రాజ్యమును తిరిగి పొ దుట కాకతి చక్రవ ర్తుల సాయమున బసవన్నగారి ద్వారా జరిగియుండెనవి

ఊహి వచ్చును ఓరుగల్లుపతనముతో దక్షిణముగా వీరు తరలివచ్చిరి వీరిలో బసవన్న కుమారుడు తిమ్మన్న తిమ్మన్న కుమారుడు బాపన్న బాపన్న కుమారుడు కోనప్ప ఈ కోనప్పయే అనే గ్రామములతో కూడిన పరగణాకు ప్రభువై నూజివీటికోటను కట్టించెను ఈ కోనప్పపుత్రుడు వెంకటాద్రి వెంకటాద్రి కుమారుడు అప్పాజీ ఇతడు నూజివీటి పాలకులలో నాటి నేటి మేటిపాలకుడుగా ప్రసిద్ధికెక్కెను (కాలము దాదాపు క్రీ శ 1667 ప్రాంతము) ఈ అప్పన తన ధైర్యసాహసములను ప్రదర్శించి ఒక పరగణాగా ఉన్న తన ముందు తరములనాటి సంస్థానమును పదునెనిమిది పరగణాలుగ వృద్ధిజేసెను ఇతని కాలమునుండియే రావు పదము బిరుదుగా నిలిచినది అందుచే ఈ అప్పన అప్పారావుగా ప్రసిద్ధుడైనాడు తరువాతి నూజివీడు పాలకులు అప్పారావు అను నామమును బిరుదనామముగా ధరించిరి ఈ అప్పారావుగారికి వెంకటాద్రి అప్పారావుగారు కుమారుడు ఈయనకు విజయఅప్పారావు అను బిరుదుకలదు వెంకటాద్రి అప్పారావుగారికి నరసింహాఅప్పారావు సుబ్బన్న అని ఇరువురు కుమారులు ఉండిరి ఈ ఇరువురు సోదరులు పరాక్రమమునందు భీమార్జునులుగా పేర్వడసిరి

ఈ నరసింహ అప్పారావు బహద్దర్ వారికి తీన్‌హజార్ మన్సబ్‌దార్ అను బిరుదము లభించెను ఇతడు కవిపండితపోషకుడు ఇతనికి సారస్వతాభిరుచిమెండు కుమారధూర్జటి ఇతని ఆస్థానకవి పరశ్శతములుగ వెలసిన ప్రబంధములలో కుమారధూర్జటి కృతమైన "ఇందుమతీ పరిణయము శ్రేష్ఠమైనది ప్రసిద్ధములైన ఎల్లి వసుచరిత్రములలో ఇది ఒకటిగ పరిగణింపబడుచున్నది ధూర్జటి వంశస్థుడగుటచే వెంకటయ్య అను పండితకవికి కుమారధూర్జటి అను బిరుదము లభించినది అట్టి దక్షిణాది కుమారధూర్జటి ఏకారణముచేతనో నూజివీడు సంస్థానమునకు వచ్చెను అతనిని తన సభకు పిలిపించి అందు చతుర్విధ కవితారచన మృదువచన భారతీశ్వరులగు కవీశ్వరులు పరివేష్టించియుండగా అప్పారాయలు దాక్షిణాత్యకవులను ఇట్లు కీర్తించెను

దాక్షిణాత్యకవులు ద్రాక్షేక్షుమధురస
మాధురీ ధురీణ మహితదివ్య
భవ్యకావ్యనవ్యపటు వాక్చమత్కార
పటిమననరినట్టి ప్రౌఢులెంద్రు

ఇట్లు కీర్తించి

త్రిపద్య చమత్కృతితో
సతిహృద్య్య బిరియట చు నఖిల కవీంద్రుల్
మది చోద్యలీల వినగా
కృతిని విరచింపుమని కోరి తనప్రార్థన నంగీకరించి

కుమారధూర్జటి రచించిన ఇందుమతీపరిణయమును అతడు అంకితము గావించుకొనెను ఈ ఇందుమతీ పరిణయము ఆరాశ్వాసములు కలది కాళిదాస మహాకవిచే రచింపబడిన రఘువంశమునందలి 5 6 సర్గములలోని కథను అనుసరించి కొంచెము విస్తరించి ఈ కావ్యమును ఈ కవి రచించెను ఇతని కవిత్వము ధారాశుద్ధిశోభితము లక్షణము మృదుమధురము ఇందు కవియొక్క స్వాతంత్ర్యద్యోతక ప్రయోగములు కొన్ని కనబట్టుచున్నవి కావ్యమునందు అక్కడక్కడ విజయవిలాస పద్యములను పోలిన పద్యములు కలవు

ఉదా

సీ అడుగుమాత్రమె కాయ యంత యెక్కుడుగనీ
జాలెనేయల బలిచక్రవర్తి (విజయవి ఆ 1)
సీ అడుగుమాత్రవు దాతయలబలి దనుజుడు
బదులీయనిదు దాత భానుజాతి (ఇందుమతి ఆ 2)

ఈ కృతికర్తయొక్క కావ్యకర్తృత్వము పారశీకరాధీశచరిత్ర"లో ఇట్లు వర్ణించబడినది

ఇందుమతీపరిణయము ఖ
ణుదర కావ్యములు పెక్కుసుకవులు కొనిరా
నందెకృతి నాయకత్వము
మందాన ఏమున వారి మన్నించితగన్

ఈ అప్పారాయలు ఆణివెళ్ళ వెంకటశాస్త్రి రచించిన అప్పారాయ యశశ్చంద్రోదయము అను కృతినికూడ స్వీకరించెను ఆణివెళ్ల వెంకటశాస్త్రిగారు కూచిమంచిజగ్గకవి సమకాలికులు అనగా ఈ కృతికర్త క్రీ శ 1750–60 ప్రాంతమువాడు నరసింహ అప్పారాయలు సుబ్బన్న అను ఈ ఇరువురు సోదరులు సంతాన రహితులై మరణించుటచే వారి దూరబంధువు అప్పన్న అను నతనికి ఈ సంస్థానము సంక్రమించెను

ఎస్ ర

## అప్పారావు జగన్నాథ

జమీ దారీలలో నూజివీడు జమీ దారీ ముఖ్యమైనది ఈ జమీ దారీ వంశము కు మూలపురుషుడు మేకా బంవన్న గారు వీరి మనిమనమడు కోనప్ప కోనప్ప మూడవ కుమారుడు రామన్న ఈ రామన్న సం తి వాడైన వె కటాద్రి రాజ్యము (న్ను) చెల్లి చు పరతు మీద 1738 లో చాటాద్రిని వి యరాయు 1740 సం లో పె ట పాడును 1744 లో ఉయ్యూరును మేడూరను 1743 లో చాతు మ బు ఎస్టేటును గొని 1745 స లో అ బూరుపేట మురాను 1746 సం లో నిడదవోలును బహర్ జిల్లిని అనఫ్ జాఫాజుదారులు స్వాధీనపరచిరి ఈ జమీ దారీలో పాత నూజవీడు సంస్థా ములోని విశేష భాగము ఉన్నది

ఈ నూజివీడు జమీ దారులపై ఆధారపడిన కామదాన వ శీయులలో ఇరువురు సోదరులు కామదాన అప్పన్న కామ దా రాయన్న అనువారు అనాడు జమీ దారీ రెవేన్యూ వసూళ్లను తఖీ చేయుచుండిరి వారు తమకు హైదరాబాదులో అధికారవర్గము తోనున్న ప లుకు బ డి ని ఉపయోగించి వె కటాద్రి పేరట జమీందారీ సనదును సంపాదించి తెచ్చిరి వె కటాద్రి మరణాన తరము వారు అతని తమ్ముడగు జగన్నాథుడు (జగ్గయ్య) అను అతనిని జమీందారుగా చేసిరి జగ్గయ్య కొంత కాలము జమీ దారీని వృద్ధికి తెచ్చెను అతడు తనకు సహాయము చేసిన కామదాన సోదరులను దురుద్దేశముతో రాజ్యమునుండి తరిమి వేయ ప్రయత్నించెను ఆ సందర్భమున కొట్లాటజరిగెను అందు ఆ జగన్నాథుడు గాయపడి కామదాన సోదరుల చేతులలో బందీ అయ్యెను జగన్నాథుడు భయపడి నిడదవోలు పె టపాడు పరగణాల యాజమా న్యమును అప్ప గింతునని ఆ సోదరులకు వాగ్దానము చేసి వారి చేతుల నుండి విముక్తుడయ్యెను కాని విముక్తుడైన పిదప అతడు తన వాగ్దానమును భ గపరచి వారిని తన జమీందారీ ను డి పార ద్రోలెను అ తట కామదాన సోదరులు హైదరాబాదునకు పోయి మొత్తము నూజివీడు జమీందారీ సనదును తమపేర నమోదు చేయించుకొని వచ్చిరి న్యాయస్థానమున వారికి గల పలుకుబడికి భీతిల్లి జగన్నాథుడు ఆ సనదును రద్దు చేయించిన యెడల చార్ మహాలు ఎస్టేటును వారికి ఇచ్చెదనని మరల వాగ్దానము చేసెను అతని మాటలను మ్మి వారు తమ సనదును రద్దుచేయించిరి కాని రెండవ మారుకూడవాగ్దా నమును కాపాడుకొనక జగన్నాథుడువారికి ద్రోహము చేసెను

ఈ సమయమున ఫ్రెంచివారు మచిలీ పట్టణములో స్థిర పడియుండి దివిసీమలో కోటను నిర్మించుకొని దాని క్విట్ రెంట్ క్రింద దివి జమీ దారునకు మూడు గోడాలు [ గోడా = ౹ రూపాయలు] చెల్లించిరి ఫ్రెంచివారు క్రమముగా దక్కను రాజ్య రాజకీయములో పలుకుబడిని కూడా సంపాదించుకొనిరి కామదాన సోదరులు నూజివీడు జమీ దారీ పైగల హక్కు భుక్తములను తమకు ఇప్పించ వలసినదిగా ఫ్రెంచి వారిని కోరిరి ఆ సో దరులతో రాజీచేసి కొనుమని ఫ్రెంచి వారు జగన్నాథ అప్పారావుకు హితోపదేశ ము చేసి రి అతడు అందుకు ఒప్పుకొనక పోవుటచే ఫ్రెంచి వారు ఆ సందర్భమున జరిగిన యుద్ధములో అతనిని బందీగా చేసి దక్కనునకు కొనిపోయిరి 1756 సం॥లో అతడు గుల్బర్గా వద్దనున్న బుస్సీ మకాములో స్వర్గస్థుడాయెను

మా శ్వే

## అప్పారావుపేట (ఆదిలాబాద్ జిల్లా)

ఈ గ్రామప్రశంస తక్కు రె నిర్మల్ (త ని-21) అను పార్శ్వ చరిత్ర గ్రంథములో వచ్చుచున్నది జగపతిరావు అను నాతడు నిర్మల జమీందారు ఈయన హిజరీ 1121 (క్రీ శ 1711) లో నిర్మల పరగణాకు ఏలిక అయెను హిజరీ 1137 (క్రీ శ 1727లో అసఫుజాని జాముల్ ముల్కు జగపతిరావుకు జాగీరు సనదు ఇచ్చి ట్లు చెప్పబడినది జగపతిరావు క్రీ శ 1749 వరకు నిర్మల పరగణాను పాలించి ట్లున్నది ఇది యెట్లైనను జగపతిరావు సమర్థుడును నేర్పరియునైన జమీం దారుగా కన్పించును తన పరగణాలో ప్రవహించు చిన్న చిన్న ఏరుల నీళ్లు వ్యర్థముగాపారి గోదావరిలో పడుచుండుట చూచి ఆ నీటిని వ్య వ సా య ము న కు ఉపయో గించుటకై ఈయన యోజ చేసెను ఈ వాగులకు అప్పా రావుపేట గ్రామమువద్ద జలాశయము ని ర్మి చి నీటిని నిలువ చేసి దా నుండి తీసిన కాలువలగు డ ప్రవహించుటకు ఏర్పాటుచేసెను సదరుకాలువ నిర్మలపట్టణములో నుండి పారునట్లు త్రవ్వబడెను వ్యవసాయమునకు ఉపయోగించు టయేకాక నిర్మలవాసులకు మంచినీటి సదుపాయము కల్గిం చుట కూడ జగపతిరావు ఉద్దేశమై యుండును

ఈ కాలువకు జగపతిరావు తన తమ్ముడు వెంకటరావు పేరుపెట్టెనట ఆతని స్మృతి చిహ్నముగా ఇట్లు పేరు పెట్టెనేమో ఈ కాలువలో ఆరునెలలు నీరు ప్రవహించి మిగత ఆరునెలలు అది ఎండిపోయెడిది జలాశయము విస్తారము నీటిని నిలువచేయుటకు ఉద్దేశింపబడకుండ వచ్చును కాలువనీటిచే నిర్మలపరగడాయదు సేద్యమునకు అనుకూల్యము కలిగి వత్సరమునకు రెండుపంటలు పండించుటకు వీలు కలిగెను ప్రభుత్వాదాయము హెచ్చెను జగపతిరావు గారు చిన్న జమీ దారు అయినను ఆయన ప్రజాక్షేమము నకై చేసిన వ్యవస్థ ప్రశంసనీయమైనది

కాగో
అమ

## అప్పారావుపేట (పశ్చిమగోదావరిజిల్లా)

అప్పారావుపేట పశ్చిమగోదావరి జిల్లా తాడేపల్లి గూడెం తాలూకాలో ఉన్నది దీనికి 12 మైళ్ళ దూరములో తాడేపల్లిగూడెం పట్టణమున్నది తూర్పున మాధవరం పడమట కొమ్ముగూడెం కడియద్ద ఉత్తరమున కోరిమామిడి దక్షిణమున కు చెనపల్లి ఈ గ్రామమునకు సరిహద్దులు దీని విస్తీర్ణము 3547 ఎకరములు ఇది చదునైన మెరకభూమిపై ఉన్నది

1961 స॥ జనాభా లెక్కలప్రకారము ఈగ్రామములో పురుషులు స్త్రీలు కలసి 4256 మంది ఉండిరి ఈ సంఖ్యలో షెడ్యూలు జాతులవారు షెడ్యూలుతరగతులవారు 790 మంది ఇచట ఇండ్లు ఒకేచోట గుంపుగా ఉన్నవి దీనికి మోదుగగుంట గొల్లగూడెం పుల్లాయగూడెం సివార్లుగ ఉన్నవి వీటిలో 152 పెంకుటిండ్లు 4 తాటాకుకప్పుగల ఇండ్లు ఒకమేడ ఉన్నవి ఇచ్చట జనులు వరిఅన్నమును తిందురు చెరువు నీటినిత్రాగుదురు ఇచట మంచినీటి ఎద్దడి ఉన్నది

ఎర్రకాలువ P W D చెరువు 4 మైనర్ ఇరిగేషన్ చెరువులు బావులు ఈ గ్రామమునకుగల నీటివనరులు నీటి క్రింద వివిధరకముల వరి ఉలవ కంది నువ్వు పండును పంటధాన్యాదికమును గాదెలలో నిలువచేయుదురు పంట సరకులను రెండెడ్ల బండ్లపై తాడేపల్లిగూడెమునకు రవాణా చేయుదురు చెరకు తోటలు గలవు తయారగు 72 పుట్ల బెల్లమును తాడేపల్లిగూడెమునకు పంపిరి 1966-67 సం॥లో పంటల క్రింద 3024 ఎకరముల భూమి ఉపయోగపడెను కాలువక్రింద 472 ఎకరముల భూమి చెరువుల క్రింద 31 ఎకరముల భూమి బావుల క్రింద 150 ఎకరముల భూమి సాగుబడి అయినది 32 ఆయిల్ ఇంజనులు 87 ఎకరముల భూమికి నీటిని సరఫరాచేసెను ఒక ట్రాక్టరు 60 ఎకరముల భూమిని దున్నెను ఇచటి భూమిలో 620 ఎకరముల నల్లరేగడి 1343 ఎకరముల ఎర్రమట్టి నేల 1000 ఎకరముల ఇసుక నేల కలవు చుము

ఇచట 300 గేదెలు 300 ఆవులు 624 ఎద్దులు 4 గుర్రములు 400 మేకలు 10 గొర్రెలు 20 పందులు 450 కోళ్ళు ఉన్నవి నెలకు 6552 లీటర్ల పాలు 000 కి గ్రా నెయ్యి గ్రుడ్లు స్థానికులు ఉపయోగింతురు

ఈ గ్రామస్థుల ముఖ్యజీవితాధారములు వ్యవసాయము కూలి కుటీరపరిశ్రమ దుకాణములు కంసాలులు వడ్రంగులు కుమ్మరులు తాపనివారు తెలికలవారు మంగలివారు చాకలివారు గొల్లలు కలరు కుటీర పరిశ్రమకుచెందినవారు బుత్తాయివండ్ల బుట్టలు తాటియాకుతో అల్లువారు కలరు ఈ బుట్టలను పాలకొల్లుకు జంగారెడ్డిగూడెముకు రవాణా చేయుదురు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి రు 2 లు స్త్రీకి రు 1 50 లు

ఈ గ్రామములో శివాలయము విష్ణ్వాలయము 4 రామమందిరములు ఒక సుబ్రహ్మణేశ్వరాలయము కలవు దండుమారెమ్మ గుడి గంగాదేవి గుడి ఒక చర్చియుకలవు దేవాలయములకు 13 ఎకరముల భూమికలదు శ్రీసుబ్రహ్మణ్యేశ్వరషష్ఠి పండుగయు దేవతలగుళ్ళయందు జాతరలు జరుగును

నవాబ్ పాలెం రైల్వేస్టేషను ఈ గ్రామమునకు 7 మైళ్ళ దూరములో ఉన్నది ఈ గ్రామము బస్సుమార్గముపైనలేదు మూడు కంకరరోడ్లు ఇందు కలవు అవి ఈ గ్రామమును పొరుగు గ్రామములతో కలుపుచున్నవి ప్రయాణమునకు మూడు గుర్రపుబండ్లు రిక్షాలు 200 రెండెడ్లబండ్లు 26 సైకిళ్ళు ఉపయోగపడుచున్నవి

అప్పారావుపేటలో బ్రాంచి పోస్టాఫీసు సమితిఎలిమెంటరీ స్కూలు సమితి భగీరథ అప్పర్ప్రైమరీ స్కూలు ఆర్ సి ఎమ్ ఎలిమెంటరీ స్కూలు సమితికిచెందిన పుల్లాయగూడెం మోదుగుంట గొల్లగూడెం ఎలిమెంటరీ స్కూళ్ళు కలవు ఇది పంచాయతీ పరిపాలనకల గ్రామము

పంచాయతీ సమితి గ్రంథాలయము రేడియో లౌడ్‌స్పీకర్లు మూడు చిన్న మ్యూనిసిపాలిటీ వాటలు ఉన్నవి పశువుల రోగాలకు ప్రభుత్వ పశువైద్య డాక్టరు చికిత్సచేయును ఈ గ్రామమున పంచాయతీ కోర్టు ఉన్నది 12 కిరాణాదుకాణములు ఒక క్షౌరశాల కలవు

తహశీల్దారు కార్యాలయమునకు సంతలకు ఎనిమాథియేటరులకు కోర్టులకు బ్రిజిస్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి ఈ గ్రామస్థులు 12 మైళ్ళ దూరములో ఉన్న తాడేపల్లిగూడెమునకు పోవుదురు 10 మైళ్ళలో ఉన్న అనతపల్లిలో పోలీసు స్టేషను ఉన్నది హైస్కూలు చదువులకు ఇచటి విద్యార్థులు 2 మైళ్ళలోను న్న మాధవరమునకు పోవుదురు కళాశాల చదువులకు భీమవరమునకు ఏలూరునకు పోవుదురు పురుళ్ళ ఆసుపత్రిక 15 మైళ్ళలోఉన్న వెంకట్రామన్నగూడెమునకు జనరల్ ఆసుపత్రికి ఏలూరునకు పశువుల ఆసుపత్రికి మాధవరమునకు గ్రామస్థులు పోవుదురు

మా శ్వే

## అప్పారావు—రాజానారయ

కృష్ణా జిల్లాలో నెల్ల ప్రసిద్ధిచెదిన జమీందారీలలో నూజవీటి జమీ దారీ ఒకటి అరాజక పరిస్థితులలో నూజివీడు జమీ దారులు చూపిన శౌర్యాతిశయము వర్ణనాతీతము క్రీ శ 1667 వ సంవత్సరమున గోల్కొండనవాబు అబ్దుల్లా కుతుబ్‌షా ఈ జమీ దారీవంశములో పూర్వుడగు అప్పన్నఅను వనికి దర్బారు మర్యాదలతో పాటు అప్పారావు అను బిరుదులను బహూకరించెను తదాదిగా వ్యక్తినామములతో పాటు రాజా అప్పారావు బహదరు అను బిరుదములుంచు కొనుట ఈ వంశీయులకు ఆచారముగానున్నది

తండ్రి రాజా శోభనాద్రి అప్పారావుగారి మరణానంతరము క్రీ శ 1868 లో నూజివీడు ఎస్టేటుకు ఉత్తరాధికారిగా రాజానారయ అప్పారావు నియుక్తుడగుటను ప్రభుత్వము ఆమోదించినది ఎస్టేటుతోపాటు ఆరు లక్షల అప్పు తీర్పు బాధ్యతకూడ వీరిమీద బడినది అప్పు తీర్పు ఉద్దేశముతో వీరు రైతులమీద పన్నులు అధికతరముగ విధించిరి తత్ఫలితముగా మేడూరు ఉయ్యూరు ఎస్టేటులకున బంధించిన 80 గ్రామములలోని రైతులు ఎదురు తిరిగి పంట పైరులను దగ్ధము చేసి భూములను బీడుపెట్టిరి ఈ ఉపద్రవమును ఎదుర్కొనజాలక జమీ దారు అంతకుపూర్వము రైతులు చెల్లించుచు వచ్చిన పన్నులనే విధించెను అంతటితో ప్రశాంత పరిస్థితులు మరల నెలకొనెను

రాజావారి పరిపాలనా దక్షత శ్లాఘనీయమైనది వారి ఆనతిచొప్పున నూజివీడు పట్టణము దలి మురికివాడలు శుభ్రపరచబడెను రాచబాటలు నిర్మింపబడెను వీధుల దు దీపస్తంభముల ఏర్పాటుజరిగెను వీరు ఆరిపల్లి దేవాలయమునకు సోపానములను నిర్మించుటయేకాక అనేక వసతులు ఏర్పరచిరి వీరు 1877 సం॥ జులై నెలలో దివంగతులైరి

కో వె

## అప్పారావు—రాజా విజయబహద్దరు

నూజవీడు జమీందారగు కోనప్పకు నలుగురు కుమాళ్ళు గలరు పెద్దకుమారుడు తండ్రికంటె ముందే మరణించెను రెండవ కుమారుడు వెంకటాద్రి అతడు గొల్లపల్లి పరిగణాలోని అయిదారు ఊళ్ళను 1652లో కౌలుకు ఇచ్చెను వెంకటాద్రి కుమారుడు విజయఅప్పన్న అతడు జమీందారీని వృద్ధిచేసెను 1677 సం॥లో గోల్కొండ నవాబు అబ్దుల్లాకుతుబుషా (1626 72) అప్పన్నను తహవీర్ (శౌర్యము) వజాహత్ (గౌరవము) దస్తగహ (సామర్థ్యము) కలవాడని ప్రశంసించెను నగారా ప్రయోగించుటకును జల్తారుతో అలంకరింపబడిన సవారీని ఉపయోగించుటకును నవాబు హుకుమును జారీ చేసెను ఇదిగాక గోల్కొండ నవాబు అప్పన్నకు రాజా బహద్దరు అప్పారావు అను బిరుదులనుగూడ అనుగ్రహించెను ఆ బిరుదములలో అప్పారావు అను బిరుదమును మాత్రము నూజివీడు జమీ దారులు వదలకుండ వంశపారపర్యముగా వాడుకొనుచుండిరి అందుచేతనే జమీ దారుల తొలి రికార్డులలో ఈ అప్పారావు అను బిరుదమే విశేషముగా నమోదు చేయబడినది

శ్రీ రాజా విజయ బహద్దరు అప్పారావుగారు ఒకనాడు తన అనుచరులతో గుర్రముపై స్వారిచేయుచు ఒక నువ్వుచేను దగ్గరకువచ్చిరి అచ్చట ఒక మేక తోడేలును ధైర్యసాహసములతో ఎదుర్కొనుచుండెను ఆ దృశ్యము శుభసూచకము జయావహము అని రాజా విజయబహద్దరు అప్పారావు ఆ స్థల

మున ఒక కోటను నిర్మించిరి నువ్వుచేనునుబట్టియే ఆ కోట కట్టిన తావునకు నూజవీడు అని పేరు వచ్చెనని ఒక ఐతిహ్యము కలదు ఇట్టి కథలు ఇతర నగరములను గూర్చియు కలవు ఓరుగల్లును గూర్చి సువర్ణశిల వృత్తాంతము విద్యానగరమునుగూర్చి కుందేళ్ళు వేటకుక్కలను తరుముట వంటి వృత్తాంతములు నూజవీడు కథకు మూలము కావచ్చును

మా శ్వే

## అప్పారావు—వెంకటాద్రి

వీరు నూజివీడు సంస్థానమునకు చెందిన ఉయ్యూరు జమీందారులు వీరు వేంకటరంగయప్పారాయ నారయమ్మల పుత్రులు వీరు శ్రీ రాజా రంగయ్యప్పారావుగారిచే పెంచబడిరి ఉయ్యూరు సంస్థానాధిపతులైన రంగయ్యప్పారావు గారు సంస్కృతాంధ్ర భాషలపై అధరాభిమానములు కలవారు పర్షియను భాషా కోవిదులైన వీరు షాహనామా అను చరిత్ర గ్రంథములో కొంతభాగమును తెనిగించి ప్రకటించిరి

వెంకటాద్రి అప్పారావుగారు శ్రీ రంగయ్యప్పారావు గారి తరువాత సంస్థానాధిపతులైరి వీరిజననకాలము 1893 పెక్కురు గురువర్యుల కడ చదివి సంస్కృతాంధ్రభాషలలో వీరు పాండితినార్జించుకొనిరి అంతకుముందే వీరు మెట్రిక్యులేషను పరీక్షయందు ఉత్తీర్ణులైయుండిరి నాట్యము జ్యోతిషము చిత్రకళ సంగీతము వీరికి ఉగ్గుపాలతో అబ్బిన విద్యలు వీరు వైష్ణవమతపరులు వేణుగోపాలమూర్తి వీరి అభీష్టదేవుడు వీరు నూజివీడులో వసించిరి

వెంకటాద్రి అప్పారావుగారు పూర్వోక్త భాషలలో పండితులగుటయేకాక పెక్కు గ్రంథములను సంతరించి విఖ్యాతులైరి వీరు రచించిన గ్రంథములలో—గోవర్ధనోద్ధారణము శోభనాచలమాహాత్మ్యము జ్యోతిర్లీల ఆంధ్రాష్టపదులు (జయదేవుని గేయములకు తెలుగు పాటలుగా శ్లోకములకు పద్యములుగా రచితములు) వీరగాథలు పేర్కొనతగినవి ఆంధ్రాష్టపదులను రచించి వీరు ఆంధ్రజయదేవుడను ఖ్యాతిని ఆర్జించుకొనిరి

వీరు రచించిన జ్యోతిర్లీల యొకనాటకము అందారంభమున స్వీయ వృత్తాంతమును చెప్పుకొనిరి చిత్రకళానికేతము వీరి రాధాకృష్ణ ప్రేమతత్త్వ ప్రీతికిని ఆంధ్రాష్టపదులు వీరి సంగీత సాహిత్యాభిరుచికిని నిదర్శనములుగా ఎన్నబడుచున్నవి 1937 ములో కాకినాడలో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షిక మహాసభకు వీరు అగ్రాసనాధిపతులుగా నుండి గండపెండేరము గ్రహించిరి ఆ సంవత్సరము స్వర్గస్థులైరి సాహిత్య ప్రీతి మరియొక తార్కాణ

గ ఽ కా

## అప్పేచెర్ల

అనంతపురము జిల్లా గుత్తి తాలూకాలో అప్పేచెర్ల అను గ్రామము ఉన్నది దీనికి 30 మైళ్ళ దూరములో అనంతపుర పట్టణము కలదు దీని తూర్పుగ కదిరిగుట్టపల్లె పడమట రిజర్వు ఫారెస్టు ఉత్తరమున ఇసురాళ్ళపల్లె దక్షిణమున మువ్వాళ్ళ గుత్తి ఉన్నవి దీని విస్తీర్ణము 6566 ఎకరములు 200 అడుగులు ఎత్తుగల గుట్టలు పెక్కులు ఉన్నవి ఇవి నల్లరాతిచే ఏర్పడినవి ఇచట రిజర్వు ఫారెస్టులోని గుట్టలపై చిన్నచిన్న చెట్లు కనిపించును

1961 జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములో పురుషులు 1526 మంది స్త్రీలు 1515 మంది మొత్తం 3041 మంది ఉండిరి వీరిలో 6 15 సం ల వయస్సుగల బాలురు 150 మంది బాలికలు 101 మంది షెడ్యూలు జాతులవారు 184 మంది 1951లో 2600 మంది జనులుండిరి ఈ పది సంవత్సరములలో జనాభాలో 441 మంది వృద్ధి చెందిరి ఇది సహజ అభివృద్ధి ఇచ్చట ఇండ్లు గుంపుగానున్నవి వీటిలో రెండు పెంకుటిండ్లు 31 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 29 ఒక అంతస్తు గల మేడలు రెండు ఎక్కువ అంతస్తులుగల భవనములు కలవు ఇచ్చట జనులు అన్నిరకముల ఆహారమును తీసికొందురు బావి నీటిని త్రాగుదురు

ఈ గ్రామమున అప్పేచెర్ల చెరువు బావులు ఉన్నవి వరి జొన్న కొర్ర మొదలగు పంటలు వీటిక్రింద పండును వీటిని గాదెలలో గరిసెలలో నిలువ చేయుదురు పంటధాన్యమును గుత్తి లారీలపై రవాణాచేయుదురు ఇచటతమలపాకుల తోటలు కలవు తమలపాకుకట్టలను బరోడా బొంబాయిలకు రైలుపై ఎగుమతి చేయుదురు 1966–67సం॥లో ఇక్కడపంట క్రింద 50 5 ఎకరముల భూమి ఉపయోగపడెను దీనిలో 4100 ఎకరముల ఎర్రరేగడి నేల 325 ఎకరముల నల్ల మాగాణినేల కలదు చెరువులక్రింద 220 ఎకరముల భూమి

కాపుల్రకింద 105 ఎకరముల భూమి సాగుబడియైనది. పది ఎలెక్ట్రిక్ మోటారులు 105 ఎకరములకు నీటిని సప్లయిచేసెను. ఈ గ్రామమునకు భుత్యపరిపాలనక్రింద అడవికలదు. దీనిలో చంద్ర గొటి మొదలైన కపజాతులు కలవు. అడవినుండి గ్రామస్థులు వంటచెరుకును గ్రహింతురు.

అప్పేచెర్లలో 280 పశువులు 6 గుర్రములు 382 మేకలు 100 గొర్రెలు 17 పందులు 360 కోళ్ళు గలవు. ఛాకలివారిబట్టలబరువులను మోయుటకు 22 గాడిదలు ఉన్నవి. ఇచటి పాల ఎదార్థములు మాంసము గ్రుడ్లు స్థానికుల ఉపయోగమునకు సరిపోవును.

ఈ గ్రామస్థుల ముఖ్యజీవనాధారము వ్యవసాయము. దుకాణాదారులు ఒట్కాలు టాంగాలు ఎద్దుబండ్లతోలువారుకలరు. వడ్రంగులు కుమ్మరులు మంగలివారు చాకలివారు గొల్లలుకూడకలరు. వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు. ఇచట శ్రీరామాలయము ఆంజనేయాలయముకలవు. మసీదుకలదు. ఇచటి ఆలయములకు మాన్యము కలదు.

ఈ గ్రామమునకు 5 మైళ్ళలో జక్కలచెరువు రైల్వే స్టేషనుకలదు. ఇచటి శిఫర్లాంగుల మట్టిరోడు చిన్నచిన్నబండ్లు పరచిన త్రోవలుకలవు. 4 గుర్రపుబండ్లు 165 రెడ్లబండ్లు 8 సైకిళ్ళు ప్రయాణమునకు ఉపయోగపడుచున్నవి.

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు సమితి అప్పర్ ప్రైమరీస్కూలుఉన్నవి. ముప్పాళ్ళగుత్తి బండార్లపల్లె తిమ్మసముద్రము మొదలగు గ్రామములనుండి 6 7 తరగతుల విద్యార్థులు ఇచటిస్కూలుకు వత్తురు. విద్యుచ్ఛక్తిని 80 ఇండ్లు ఎలెక్ట్రిక్ మోటారులు వాడుకొనుచున్నవి. ఇది పంచాయతి పరిపాలనకల గ్రామము. వృత్తిపన్ను ఇండ్లపన్ను మొదలయినవి కలిసి 1967లో పంచాయతీ ఆదాయము ఇచట రు 695 లు. పంచాయతీ రేడియో ఉన్నది. కిరాణాదుకాణములు 4 కిళ్ళీ సిగరెట్టు సోడాదుకాణములురెండు సారా దుకాణము ఒకటి కలవు.

ఈ గ్రామమునకు 14 మైళ్ళ దూరములో ఉన్న గుత్తిలో కలతంతికార్యాలయమునకు నిత్యావసర వస్తువులకు పురుళ్ళ ఆసుపత్రికి జనరల్ ఆసుపత్రికి సినిమాథియేటరుకు గ్రామస్థులు పోవుదురు. కోర్టుకు పోలీసుస్టేషనుకు సబ్‌రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు కూడ గుత్తికి పోవుదురు. రూరల్ ఆసుపత్రికి 8 మైళ్ళలోనున్న క్రిష్టిపాడునకు పశువుల ఆసుపత్రి 6 మైళ్ళలోనున్న జక్కలచెరువునకు పోవుదురు. విద్యార్థులు హైస్కూలు చదువులకు క్రిష్టిపాడునకును కళాశాల చదువులకు 35 మైళ్ళలోనున్న అనంతపురమునకు పోదురు.

ఈ గ్రామపు మసీదు ముందర దీర్ఘ ఘనచతురస్రాకృతి కల రాతిమీద శాసనమొకటి కనిపించుచున్నది.

మా. శ్వే.

## అప్రతిమల్లచోడుడు

ఈతని నామము మహానందిక్షేత్రమున దు వెలుగోటి గంగరాజుగారు శక 1322 (క్రీ శ 1400) సంవత్సరప్రాంతమున వేయించిన దీపదానశాసనములో కన్పించుచున్నది. గంగరాజు నంద్యాలపురవరాధీశ్వరుడని చెప్పబడినది. ఈయన బిరుదులలో క్రొత్తచర్లకోట వీరక్షత్ర భారతీమల్ల అను ది పరిగణింపదగినది. శాసనకాలము నాటికి విజయనగర సామ్రాజ్యమేర్పడి అరువది సంవత్సరములు పైబడినది. ఇది రెండవ హరిహర రాయల పాలనాకాలముగా కన్పించును. శ్రీనాథుని హరవిలాస పద్యమునుబట్టి ఈ కాలమునకుచెందిన ఇద్దరుముగ్గురు ప్రసిద్ధులైన రాజులు తెలియవచ్చుచున్నారు. వారెవరనగా (1) విజయనగరాధీశ్వరుడు హరిహరరాయలు (2) బహమనీ సుల్తాను ఫిరోజుషాహా (3) కొండవీడు పాలించుచున్న కుమారగిరిరెడ్డి. ఈ ప్రభువులందరకును అవచిదేవయతిప్పయ సెట్టి కస్తూరికాదిసుగంధద్రవ్యములను విదేశములనుండి దిగుమతి చేయించి సరఫరా చేయుచుండెను. ఈ కాలమునకు రాచకొండ రాజ్యమును సర్వజ్ఞబిరుదాంచితుడైన సింగభూపాలుడు ఏలుచుండెను. మహానంది శాసనదాతయైన వెలుగోటి గంగరాజును మనము ఈ చారిత్రక సన్నివేశములో అన్వయించుకొనవలెను. విజయనగర సామ్రాజ్యమప్పటికే బలవంతమైయుండుటచే నంద్యాలప్రాంతమును దానిలోని అంతర్భాగముగనే గ్రహించవలెను. కావున వెలుగోటి గంగరాజు విజయనగర సామంతుడని చెప్పదగును.

వెలుగోటి అను వంశనామము అనంతరకాలమున దు పద్మనాయకులకు ప్రసిద్ధముగా చెల్లుచుండెడిది. వెంకటగిరి సంస్థానపాలకులు వెలుగోటివారని చరిత్రకెక్కియున్నారు. నంద్యాల శాసనదాత కూడ పద్మనాయక వంశీయుడేమోయని సందియముకలుగుట సహజము. కాని దీనికి రెండు

విప్రతిపత్తులు కాన్పించుచున్నవి 1) పద్మనాయకవ శీయులు ఈకాలమునకే కను వెలుగోడుతో సంబంధమున్న వారుగా కనుపట్టరు క్రీ శ 1 00 ప్రాంతమునను తరువాత ముప్పదియైదు సంవత్సరముల వరకైనను వారు స్వతంత్రప్రభువులై తెలంగాణమును పటువర్చముతో పాలించుచు ఓరి రాచకొండయందు కొంతకాలమును దేవరకొండయందు క్రీ శ 1460 ప్రాంతమువరకైనను వీరు గొప్ప ప్రాభవమును అనుభవించిరి ఆ రాజ్యములు రెండును అస్తమించిన తరువాతనే పద్మనాయకులు వేరు ఆశ్రయములను వెదకుకొనవలసినవారైరి పదునేనవ శతాబ్దియ తమునసో తరువాతనో వెలమవీరులు వెలుగోడునందు ప్రతిష్ఠితులై వెలుగోటివారు అయిరని ఊహించుట యుక్తము అందుచేత ప్రస్తుతము మనకు చెప్పుకొను గంగరాజు వెలుగోటి వంశీయుడైన వెలమవీరుడు కాడనియే తోచుచున్నది

దీనిని బలపరచు మరియొ అంశము గంగరాజు శాసనమున దే కలదు తాను అప్రతిమల్ల చోడవంశోద్భవుడ నని అతడు చెప్పుకొనుట గమనింపదగినది ఈ యప్రతిమల్ల చోడు డెవరో నిర్ణయించుట సులభసాధ్యముకాదు కాని గంగరాజు బిరుదావళియందలి క్రొత్తచర్లకోటవీరక్షత్రభారతీమల్ల అను వర్ణనము గంగరాజును గూర్చి సత్యమును తెలుపుటకు దారి తీయుచున్నది ఈ క్రొత్తచర్లకోట విజయమెప్పటిది? దీనిని సాధించిన దెవరు మున్నగు అంశములను పరిశీలించినచో గంగరాజు పూర్వుల చరిత్ర కొంతవరకు విశదమగును క్రొత్తచర్లకోట ఇప్పుడు నెల్లూరు జిల్లా దర్శి తాలూకాలోని కొచ్చెర్లకోటగా భాసించుచున్నది కొచ్చర్లకోటవద్ద జరిగిన మహాయుద్ధము వెలనాటి రెండవకులోత్తుంగచోడుని కాలములో జరిగినది కల్యాణకటకమును పాలించు వీరసోమదేవుడు వెలనాటిపై దండయాత్రను సాగించెను సోమిదేవుడు కల్యాణబిజ్జలుని కుమారుడు బిజ్జలుడు క్రీ శ 1168 వరకు రాజ్యపాలనము చేసెను అతని అనంతరము కళ్యాణకటకమునకు ఏలికయైన సోమిదేవుడు వెలనాటి రెండవకులోత్తుంగచోడుని కాలమున (క్రీ శ 1168-80) వెలనాటి రాజ్యముపై దండు నడపెను వెలనాటి చోళులలో రెండవ కులోత్తుంగచోడుడు గొప్ప పరాక్రమశాలి కళ్యాణ సోమిదేవుని దండయాత్రను సహించక అతడు తన మంత్రియు సంధివిగ్రహియు అగు నందూరి కొమ్మనమంత్రిని పశ్చిమ చాళుక్య దుర్గ మును ఎదుర్కొనుటకై పంపెను ఈ కొమ్మన మంత్రి తెలుగు విమంచనచే కేయూరబాహుచరిత్రమును కృతిపొందిన నందూరి గుండిన మంత్రి పూర్వుడు

వెలనాటి కులోత్తుంగచోడని సైన్యము కొమ్మన మంత్రియు ఇతర సేనానులును కర్ణాటక సైన్యము లను ఎదిర్చి క్రొత్తచర్లకోట వద్ద మహాయుద్ధమొనర్చి వారిని ఓడించి పారద్రోలిరి నంద్యాల గాంగ సదాశివుయై వెలుగోటి గంగరాజు పూర్వులెవ్వరో మహాశూరులై ఈ క్రొత్తచర్లకోట యుద్ధమునందు పరాక్రమము నెరపియుండుటచే గంగరాజు వంశమువారి క్రొత్తచర్లకోటవీరక్షత్రభారతీమల్ల బిరుదము వచ్చియుండును దీనినే గంగరాజు వంశపారంపర్యముగా ధరించెను కర్ణాటులపై సాధించిన ఈ మహావిజయముచే వెలనాటి కులోత్తుంగచోడుడు అప్రతిమల్లచోడ అను బిరుదము కలిగెనేమో శాసనశోధనమువలన తెలియవలెను ఎట్లైనను వెలుగోటి గంగరాజు వెలనాటి చోడుల వంశము వాడేమోయని సందియము దృఢపడుచున్నది

వెలనాటి రెండవ కులోత్తుంగచోడుని కాలము కళ్యాణి సోమిదేవుని కాలమునుబట్టి చూడ క్రొత్తచర్లకోటయుద్ధము క్రీ శ 1170 75 సంవత్సరముల నడుమ జరిగినదిగా భావింపవచ్చును గంగరాజు తన ముత్తాత అమ్మగారు మహానందీశ్వరునకు దీవదాన ప్రతిష్ఠచేసినట్లు చెప్పుటచే ఈ వంశమువారు నంద్యాలప్రాంతమునందు అప్పటినుండియు పరిపాలకులుగా ఉండిరట్లు ఊహింపవలెను

వెలుగోటి గంగరాజు శ్రీమహానందీశ్వరపాదపద్మారాధకుడయి మనకు సాక్షాత్కరించుచున్నాడు దీనివలన మహానందీశ్వర క్షేత్రము పదునేనవ శతాబ్ది అరంభమునకే ప్రశస్తి వహించెనని తెలియుచున్నది

కుం ల రం

## అబుల్ ఖాసిం–మీర్ ఆలం

అసఫ్‌జాహి సామ్రాజ్య ప్రప్రధాన మంత్రులలో సయ్యదు అబుల్ ఖాసిం మీర్ ఆలం విశిష్ట స్థానమును వహించినవాడు ఇతని పూర్వులు పారశీక దేశవాసులు ఇతడు "షేఖుల్ ఇస్లామ్" పదవిని వంశపరంపరగా పొందినవాడు ఈ వంశమునకు చెందిన సయ్యద్ రజీ సకల విద్యా పారంగతుడు ఇతడు అరేబియా మున్నగు దేశములందు సంచరించి

భారతదేశమునకు వచ్చి స్వదేశవాసుల ప్రోత్సాహమున వివిధ ప్రాంతములందు కొన్నినాళ్ళు ఉద్యోగమొనర్చి చివరకు నిజాముల్ ముల్క్ అసఫ్‌జా (మొదటి నిజాం)గారి కాలములో హైదరాబాదుకువచ్చి ఉద్యోగమును సంపాదించి ఇచట స్థిరపడెను. సయ్యద్ రజీ రెండవ జాయిగారికి పటాన్ చెరువు ప్రాంతమున జాగీరును కూడ పొందెను. ఈతనికి బాదుషాబేగ అను భార్యవలన అబుల్ ఖాసిం, జైనులాబుద్దీను అను పుత్రులను మరియమ్‌బేగమ్ అను పుత్రికయు కలిగిరి.

సయ్యద్ అబుల్ ఖాసిం హైదరాబాదులో 1817-1752న జన్మించెను. ఇతడు బాల్యమున అరబీ పారశీక భాషలను అభ్యసించెను. ఇతడు యుక్తవయస్కుడై తండ్రిగారి ఆదేశానుసారము జాగీరు వ్యవహారములు, ఇంటి వ్యవహారములు చూచుకొనుచు ప్రాపంచిక పరిజ్ఞానమును తీరిక సమయములలో వివిధశాస్త్రపాండిత్యమును సంపాదించుకొనెను. ఆనాటి ప్రముఖ పండితులు మీర్ అబ్దుల్ అలీగారు నిర్వహించుచుండిన విద్వద్గోష్ఠిలో అబుల్ ఖాసిం కూడ పాల్గొని గణిత శాస్త్రమునకు చెందిన క్లిష్టసమస్యలను అవలీలగా పరిష్కరించి విద్వాంసుల ఆదరమునకు పాత్రుడగుచుండెను. అప్పటికి ఇతడు ఇరువదిరెండు ఏండ్లవాడు. ఇతడు అప్పుడప్పుడు పారశీకమునందు కవిత్వమునుగూడ చెప్పుచుండెను. ఈతని కవిత్వమే ఇతడు నిజాముగారి ఉద్యోగములో చేరుటకు ఉపయోగపడినది.

ఒకానొక సందర్భమునందు అప్పటి ప్రధానామాత్యులైన అరస్తూజాపై అబుల్ ఖాసిం పద్యములు వ్రాసి వినిపించియుండెను. అరస్తూజాగారు అబుల్ ఖాసిం పాండిత్యమును మెచ్చుకొని తన దర్బారునకు ప్రతిదినము వచ్చుటకై అతనికి అనుజ్ఞనొసగెను. కొన్నినాళ్ళకు ప్రధానమంత్రియగువారు అబుల్ ఖాసిమును తనకు మున్షీగా నియమించుకొనెను. ఈ ఉద్యోగమే అతడు భావి ప్రధానామాత్య పదవి నొందుటకు తొలిమెట్టుగా ఉపకరించినది.

అరస్తూజాగారికి మున్షీగానుండి అబుల్ ఖాసిం రాజ్యవ్యవహార పత్రములను వ్రాయుచు పరిశీలించుచు పరిపాలనకు సంబంధించిన విశేష పరిజ్ఞానమును సంపాదించెను. ఈతని నిశితమైన పరిశీలన జ్ఞానము ప్రధానమంత్రిని ఆకర్షించినది. ప్రజల విన్నపములను స్వీకరించి వారి కష్టనిష్ఠురములను పరిశీలించుటకై సమర్థుడైన ఒకవ్యక్తిని తాలుకాదారుగా నియమించుటకై అరస్తూజా ఆలోచించుచుండిన సమయమది. వారి దృష్టి అబుల్ ఖాసింపై బడినది. అపుడే ఆ ఉద్యోగము అతనికి లభించినది.

అబుల్ ఖాసిం ప్రభుత్వమువారి కార్యభారమును నిర్వహించుచు ప్రధానామాత్యులయు ప్రభువులవారియు మన్ననలను పొందెను. కొన్నినాళ్ళకే మరియొక పదవి లభించినది.

నిజాం ప్రభుత్వముతో సంప్రదింపులు జరిపి వ్యవహారములు పరిష్కరించుటకై ఆనాడు శ్రీహాలెండుగారు హైదరాబాదునకు రెసిడెంటుగా వచ్చియుండిరి. రెసిడెంటుగారికిని నిజాం ప్రభుత్వమువారికిని మధ్యస్థుడుగా వకీలుగా అబుల్ ఖాసిం నియమింపబడెను. అతడు రెసిడెంటుగారికి వసతి సౌకర్యములు కల్పించి కంపెనీవారు నిజాం ప్రభుత్వమునకు బాకీపడిన ధనమునుగూర్చియు తదితర రాజకీయ సమస్యలను గూర్చియు రెసిడెంటుగారితో చర్చించి నిజాముగారికి వివరములు తెలియచేసెను. ఈ పదవిలో ఉన్నపుడే అబుల్ ఖాసిం ఈ అంశములను కలకత్తాలోని గవర్నరు జనరల్‌గారితో సంప్రదించి పరిష్కరించుటకై రాయబారిగ వెడలెను.

క్రీ. శ. 1787లో నిజాంగారి ఆదేశానుసారము అబుల్ ఖాసిం కలకత్తా చేరి గవర్నరు జనరల్ కారన్‌వాలీస్‌తో దాదాపు నాలుగు మాసములవరకు చర్చలు జరిపి నిజాముగారికి రావలసిన తొమ్మిది లక్షల రూప్యములను అమూల్యమైన బహుమానములతో స్వీకరించి హైదరాబాదు తిరిగివచ్చి ప్రభువుగారికి వానిని సమర్పించెను. నిజాం ఆలీఖానుగారు ఈ సందర్భమునందే అబుల్ ఖాసింను "మీర్ ఆలం" అను బిరుదముతో సత్కరించిరి. నాటినుండియే అబుల్ ఖాసిం మీర్ ఆలంగా ప్రసిద్ధులైరి. రాజుగారు మీర్ ఆలం పుత్రునకు కూడ మీర్ దౌరాన్ అను బిరుదము నొసగిరి.

పదునెనిమిదవ శతాబ్ది మధ్యకాలమున నిజాం రాజ్యము జటిలమైన సమస్యలను ఎదుర్కొనవలసివచ్చెను. మహారాష్ట్రుల వలనను టిప్పుసుల్తానువలనను నిజాం రాష్ట్రమునకు ప్రమాద పరిస్థితులు ఏర్పడియుండెను. టిప్పుసుల్తాను రాష్ట్రమున దక్షిణప్రాంతములను కొన్నింటిని వశపరచుకొనెను. ఇట్టి పరిస్థితులలో నిజాం ఆలీఖానుగారు ఆంగ్లేయులతో ఒకవిధమైన ఒప్పందమును కుదుర్చుకొనుటకు ఉద్యమించిరి. టిప్పు పరాజయమును కోరుచున్న బ్రిటిషువారును అందులకు సంసిద్ధులైరి. ఈ ఒప్పందము కుదుర్చుటకు మీర్ ఆలం నియోగింపబడెను. అతడు క్రీ. శ. 1790లో పానగల్లులో సంధి కుదిర్చెను.

టిప్పును ఓడించుటకు ఆంగ్లేయులు నిజాముతో చేయుటకు అంగీకరించిరి. ఆంగ్లేయుల సైన్యములు 1791 లో పురోగమించినది. నిజాం పక్షమున యువరాజగు సికిందరుజాయు తదితర ఉన్నతాధికారులును మీర్ ఆలం మొదలగువారును వెడలిరి. టిప్పు సంధికి దిగివచ్చెను. ఆంగ్లేయులకును నిజామునకును మూడేసి కోట్ల రూపాయలును జయించిన రాజ్యభాగములలో సరిసమానమైన భాగమును పంచి ఇచ్చుటకు సంధి జరిగినది. ఈ సంధి వ్యవహారమునందు మీర్ ఆలం ప్రధానమైన పాత్రను నిర్వహించెను.

పై సంధి ప్రకారము తమకు దత్తమైన మండలములను బందోబస్తుచేయు కార్యములను మీర్ ఆలమునకే నిజాం అలీఖానుగారు అప్పగించిరి. తదనంతరము సర్ దేశముఖ్ చౌతు మున్నగు మమ్యలనుగూర్చి మహారాష్ట్రులతో చర్చించుటకు మీర్ ఆలం పూనాకు వెళ్ళెను. ఈలోపల మహారాష్ట్రులు క్రీ. శ. 1795లో బీదరు సమీపమున ఖడలామైదానంలో నిజాం గారి సైనికులతో యుద్ధమొనర్చిరి. ఈ యుద్ధమున ఆంగ్లేయులు నిజాం గారికి ఎట్టి సహాయమును చేయలేదు. నిజాం గారు ఆంగ్లేయులను తొలగించి ఫ్రెంచివారిని సైన్యములో చేర్చుకొనుటకు సంకల్పించిరి. కాని మీర్ ఆలం ఇట్టి ఏర్పాటుకు అంగీకరించలేదు. ఆంగ్లేయుల పక్షమున ఉన్నందున మీర్ ఆలమును గూర్చి కొందరికి అపోహాలు ఆరంభమైనవి.

నాలుగవ మైసూరు యుద్ధము సందర్భమున 1799 లో నిజాంగారి సైన్యములకు మీర్ ఆలం ఆధిపత్యమును వహించెను. శ్రీరంగపట్టణ విజయఫలితముగా నిజాం గారికి లభించిన రాజ్యభాగముల బందోబస్తు నిమిత్తమై మీర్ ఆలంగారు నియోగింపబడిరి. కృష్ణాతీరమునందు మీర్ ఆలం దాదాపు ఎండాది వరకుండి అన్ని ఏర్పాట్లు సక్రమముగా ఒనర్చెను. ఈ సందర్భమున దేజయించిన రాజ్యభాగముల పంపిణీ విషయములలో మీర్ ఆలం గారికిని వెల్లస్లీగారికిని అభిప్రాయభేదములేర్పడినవి.

వెల్లస్లీగారు మీర్ ఆలం పై చర్యతీసుకొనవలెనని నిజామునకు సూచించిరి. నిజాం గారిఉన్నతాధికారులలో కొందరు మీర్ ఆలం దినక్రమముగా పొందుచున్న ప్రాభవమును జూచి అసూయనొందియుండిరి. మైసూరు యుద్ధానంతరము నిజాము భాగమునకు వచ్చినరత్నరాసులను అమూల్యములైన వస్తువులను మీర్ ఆలం నిజామునకు అందసేయక దాచియుంచెనను పదంతి పూర్తిగా ప్రబలియుండెను. అరస్తుజాహును మీర్ ఆలమునకును లోలోన అభిప్రాయభేదములు కలిగెను. మీర్ ఆలం ఆంగ్లేయులపై అభిమానముతోనుండుట నిజాముగారికి బాధను కలిగించెను. ఈ కారణములన్నియు ఒకటికొకటితోడై చివరకు నిజాం మీర్ ఆలమును ఉద్యోగమునుండి తొలగించుట జరిగినది. కొందరు పారశీ చరిత్రకారులు మీర్ ఆలం పదవినుండి తొలగుటకు వేరొక కారణమును వివరించియున్నారు. హైదరాబాదు రెసిడెంటు జేమ్స్ ప్యాట్రిక్ ఖైరున్నిసా అను కన్యతో ప్రణయవ్యవహారములు సాగించి ఆమెను బలవంతముగా వివాహమాడినట్లు మీర్ ఆలం బ్రిటిషున్నతాధికారులకు అతని చర్యను ఖండించుచు విన్నపము పంపుకొనియుండెను. ఖైరున్నిసా అతని దగ్గరిబంధువు అగుటవలన అతడు ఈవ్యవహారములో జోక్యము కలిగించుకొనెను. రెసిడెంటుగారు మీర్ ఆలమును తొలగించుటకు ఒత్తిడిచేసియుండునని ఈ చరిత్రకారుల అభిప్రాయము.

మీర్ ఆలం గోల్కొండకు సమీపమునగల నాగులపల్లిలో గృహనిర్బంధములో ఉంచబడెను. ఈ సంఘటనవలన మీర్ ఆలం మానసికముగ కృంగిపోయినందున అతని ఆరోగ్యము కూడ చెడినది. తనచిత్తశుద్ధిని నిరూపించుకొనుచు ఆరోగ్య పరిస్థితిని వివరించుచు మీర్ ఆలం ప్రభువుగారికి విన్నపములు సమర్పించెను. చివరకు హైదరాబాదులోని స్వగృహములో ఉండుటకు మీర్ ఆలమునకు ప్రభువువలన అనుమతి లభించినది. ఇచ్చట అతడు ఎవరిని కలిసికొనరాదను నిర్బంధము ఉండెను.

నిజాం ప్రభుత్వములో ఈ కాలమునందే పెక్కుమార్పులు కలిగెను. రెండవ నిజామగు నిజామలీఖాను 1803 లో మరణించెను. క్రీ. శ. 1804 లో ప్రధాని అరస్తూజా కాలధర్మమునొందెను. మూడవ నిజాం సికందర్ జాగారు క్రొత్తప్రధానిని నియమించవలసిన వాడయ్యెను. సికందర్ జాగారికి మీర్ ఆలంఎడ్ల అంతగా అభిమానము లేకుండెను. స్థానిక జాగీరుదారులు కొందరు మొదటినుండియు మీర్ ఆలమును ఈర్ష్యతో చూచుచుండిరి. రాష్ట్రపాలనమైన దిన వ్యవహారములందు ఆంగ్లేయుల జోక్యమధికమగుచుండెను. మీర్ ఆలమును నియోగించుట తగునని వారు నిజామునకు సూచించిరి. బ్రిటిష్ వారితో వివిధ సమస్యలు పరిష్కరించుటకు ప్రభుత్వ పక్షమున నిజాం గారికి మీర్ ఆలం మాత్రమే సమర్థుడను అభిప్రాయమేర్పడియుండెను. సికిందర్ జాగారు నాలుగైదు మాసములవరకు

ఆలోచించి మీర్ ఆలమును 1804 లో దివానుగా నియమించిరి ఈ పదవికి మహీపత్‌రామ్ ఆశించియుండెను సికిందర్ జాగారికి అతనియందు అభిమానముకూడ ఉండెను సికిందర్ జాగారు అతనిని సహాయమంత్రిత్వపదవి నొసగిరి

ప్రధానమంత్రి పదవిని స్వీకరించిన తరువాత మీర్ ఆలం నిజాం అలీఖాన్ మరణసమయమున చేవిడీలముందు నియమించియుంచిన ఆంగ్లేయ సైనికుల కావలా తొలగించెను మహీపత్‌రాంగారితో ఏర్పడిన భేదాభిప్రాయముల మూలమునను అధికార వర్గములో కొందరితో మీర్ ఆలమునకు కలిగిన స్పర్ధలవలనను తదితర కారణములవలనను సికిందర్ జాగారు మీర్ ఆలమును దూరముగానే యుంచిరి కాని కొన్నాళ్ళకు అతనియెడ ప్రసన్నులైరి మీర్ ఆలము ఆశుభసమయమున సికిందర్ జాగారి జన్మదినోత్సవమును మూసీతీరమునందలి తమ ఉద్యానవనములో మహావైభవముగా జరిపెరి

రాజ్యపాలనమును పటిష్ఠమొనర్చుటకై మీర్ ఆలంగారు చందూలాల్‌ను పేష్కారుగా నియమించిరి అంతియే కాక వివిధ పదవులలో సమర్థులైన వారిని నియమించి దాదాపు నాలుగేండ్లవరకు సమర్థవంతముగా వ్యవహారములను నిర్వహించిరి ఆంగ్లేయుల జోక్యమును తగ్గించుటకై కృషిసలిపి రాష్ట్రప్రతిపత్తిని కాపాడుటకు శక్తివంచనలేక పాటుపడిరి కాని పరిస్థితుల ప్రభావమువలనను ఆంగ్లేయుల రాజకీయ ప్రాబల్యమువలనను నిజాం రాజ్యము రక్షితరాజ్యముగ కొనసాగెను దాదాపు నాలుగేండ్లవరకు ప్రధానామాత్య పదవిని నిర్వహించి మీర్ ఆలం 1808 లో పరలోకగతుడయ్యెను

మీర్ ఆలం తనహయాములో కొన్ని నూతన శాఖలను ప్రజోపయోగార్థమై స్థాపించెను వైద్యశాఖను ప్రత్యేకముగ ఒకానొక ఆంగ్లేయ వైద్యునకప్పగించెను రాష్ట్రములో ప్రభుత్వపక్షమున నియమింపబడిన ప్రథమ వైద్యుడాంగ్లేయుడు అతనికి నెలకు రెండు మూడువేల రూపాయల జీతమునొసగి ఒక వైద్యశాల నిర్వహింపజేసెను మీర్ ఆలం కాలమునందే తపాలశాఖ ఏర్పాటైనది మూడు నాలుగుమైళ్ల కొక సేవకుని చొప్పున కొందరిని నియోగించి ఉత్తరములు దూర ప్రాంతములకు పంపుసౌకర్యము ఇతడు కలిగించెను

నిజాం ప్రభుత్వము నిరంతరము యుద్ధప్రయత్నములందు నిమగ్నమైయుండుటచేత రాష్ట్ర ఆర్థికపరిస్థితులు దుర్భరముగా నుండెను కరువువలన నిత్యావసర వస్తువుల ధరలు విపరీతముగ పెరిగిపోయెను ప్రజలు బాధపడుచుండ వర్తకులు ధరలుపెంచి అధికలాభము లార్జించుట న్యాయ్యముకాదని మీర్ ఆలం హెచ్చరికచేసియుండెను కాని ఫలితము కనిపించనపుడు ఇతర ప్రాంతములనుండి ధాన్యముతెప్పించి తక్కువ ధరలకు ప్రజలకు దానిని విక్రయించు సౌకర్యము మీర్ ఆలం కలిగించెను తన దేవిడీవద్ద ప్రతివ్యక్తికి సేరుబియ్యము కొన్ని పైసలు దానముచేయు ఏర్పాటుకూడ కావించెను ప్రజలకు పనికల్పించునిమిత్తమై మీర్ ఆలం ఈ కాలమునందే ఎన్నియో భవననిర్మాణ కార్యక్రమము లారంభించెను ఇట్లెన్నియోవిధముల ప్రజలకష్టములను తొలగించుటకై మీర్ ఆలం ప్రయత్నించెను

మీర్ ఆలం మూసీతీరమునందు అతివిశాలమైన ఉద్యానవనమును సౌధమును నిర్మించుకొనెను ప్రస్తుతము ఈ ప్రాంతమునందే సాలార్‌జంగ్ మ్యూజియమ్ అను నూతనభవనము నెలకొనియున్నది నేటికిని బాలాదరీ శిథిలములు నాటిస్మృతి చిహ్నములుగ నిలచియున్నవి ఈ ఉద్యానవనమునందు మీర్ ఆలం అందరికిని స్వేచ్ఛగావిహరించు సౌకర్యములను కలిగించియుండెను కాని ఒకానొక సందర్భమున కొందరు వ్యక్తులు సంఘర్షణకు దిగి ప్రశాంతవాతావరణమును భగ్నమొనరించినందున నాటినుండి అట్టిసౌకర్యములు తొలగింపబడెను మీర్ ఆలం నివాససౌధము నాటిసుందరభవనములలో ఒకటిగా పరిగణింపబడుచుండెను భోజనసమయమున తన ఉద్యానవనములోనున్న వారికి కూడ భోజనము వడ్డించు ఏర్పాట్లు గావించి మీర్ ఆలం అన్నదాతగా కీర్తివహించెను

ఈ సౌధమునకు సమీపమందే ఒక విశాలమైన ఆవరణమున మీర్ ఆలం ఒక వ్యాపార కేంద్రమును నెలకొలిపి దానికి ప్రభువు అగు సికిందర్‌జా పేర సికిందర్‌గంజు అని నామకరణమొనర్చియుండెను కాని ఇది నాటినుండి నేటివరకును మీర్ ఆలం మండిగానే ప్రసిద్ధమైయున్నది

మీర్ ఆలం పేరును చిరస్మరణీయ మొనర్చునదిఅతడు క్రీ శ 1802 లో హైదరాబాదునగరమునకు 5 మైళ్ల దూరమున నిర్మింపించిన ఒక చెరువు ఇది నేడును మీరుఆలం చెరువు అని ప్రసిద్ధము మీరుఆలం పాశ్చాత్య ఇంజనీర్ల పర్యవేక్షణలో ఈ చెరువును త్రవ్వించి కట్టముకూడ కట్టించెను ఈ చెరువునుండియే నగరవాసులు త్రాగుటకు మంచినీటి సౌకర్యము కలిగినది చిన్నచిన్న కాలువలద్వారా తోటలకు

నీటిపారుదల సౌ ర్యము కూడ కల్గించబడి ది నగరవాసులు నిత్యము స్మరించుట్టి పుణ్యకార్యమ లను మీర్ ఆలం ఒన ర్చెను అతని మరణానంతరము ప్రజలు మీర్ గుర గయే ఘరు ఘరు పానీదియే" (మీర్ ఆల మరణి చెను ఇంటింటికి నీళ్ళిచ్చెను) అని అతనిని కీర్తి రి

మీర్ ల దైవ చి తనపర డు అతడు పుణ్యకర్మమ లు చేయుట యందెలయో ఆసక్తి చూపెను త్రమలు బావులు మసీదులు తోటలు మున్నగు ఎన్నో శాశ్వత ములప్రతి ష్ఠగావించి కర్తినొ దెను ఈత కి బంధుప్రీతిమెండు సమర్థులైనవారికి ఉన్నతోద్యోగములను జాగీర్లను ప్రభువుగారివలన ఇప్పించెను

మీర్ ఆలం ఉదాత్తగుణసంపన్నుడు సామాన్య మున్షీ పదవినుండి ప్రధానామాత్యపదవి నొందియు లక్షలకొలది ఆస్తిని సంపాదించియు గర్వరహితుడుగా ఇతడు జీవించెను నిశితమైన పరిశీలనాశక్తి పరిపాలనా నిర్వహణ దక్షత దూర దృష్టి కల రాజకీయవేత్తగా ఇతడు ప్రశంసలనొందెను

మీర్ ఆల గారికి షహజాదిబేగం జేబున్నిసాబేగ ఖైరున్నిసాబేగ అను భార్యలుండిరి మొదటి భార్యవలన సయ్యద్ రజీ ను కుమారుడును నఫనాబేగ సాహిబబేగ అనుఫీ పుత్రి లును కలిగిరి మీర్ ఆల తనపుత్రునకు అరబీ పారశీకములతోపాటు ఆంగ్లవిద్యను గూడ బోధించు ఏర్పాట్లు చేసెను దౌత్యకార్యములకు వెడలునపుడు తనపుత్రుని కూడ వెంబడి నిడుకొనిపోయెడివాడు

మీర్ ఆల కు నిజాం గారివలన లభించిన జాగీర్లు ఎన్నియో కలవు అతడు తన కూతుళ్ళకు భార్యలకు కోడలికి అల్లు డ్రక ఈజాగీర్లలోని వివిధగ్రామములను దత్తముచేసెను స్థిర చరాస్థి పంపకమును గూర్చి మీరుఆల ఒక మరణశాసన ము ను వ్రాసియుంచెను

మీర్ ఆలం ప్రజాహిత కార్యముల దే కాక సాహిత్యము న దును అభిరుచిని ప్రకటించెను ఇతడు బాల్యమునుండియే పారశీకమునందు కవిత్వమును చెప్పుచుండెను ఇతడు రచించిన ఒకటి రెండు గ్రంథములు నమాజునకు సంబంధించినవి కలవు దాదాపు రెండువందల పద్యములుగల మస్నవ మీర్ ఆలం అను పద్యకావ్యము మీర్ ఆల రచనలలో ప్రశస్త మైనది దౌత్యకాలమునందును తదితర సందర్భములందును మీరుఆల అప్పటి ప్రధానికిని నిజాం ప్రభువునకును వ్రాసిన లేఖల సంపుటి రుఖాత్ మీర్ ఆలం అను పేరున కలితమొనర్ప బడినది ఇది నాటి రాజకీయ స్థితిని మీర్ ఆల వ్యక్తిత్వమును శక్తిసామర్థ్యము ను ప్రకటించు ప్రధా ఆధార గ్రంథము పారశీకమున మీ ఆల అ బీ ఉర్దూభాషల దును కొన్ని రచ లొ రెను కొ కృ రచయితల తమగ్రంథముల మీర్ ఆల పే ప్రకటించి ఆ మీర్ ఆల వ్యయముగా వ్రా వికావు

రి పద కలిగియు మీర్ ఆల సరాడ బరముగ తన జీవితమును గడిపెను తనగోరీపై యెట్టి గ బదు కాని శిలా ఫలకముగాని కట్టవలదని మీర్ ఆ తన జీవితకాలములో దే కోరియుండెను మీర్ మొహిన్ దాయిరాలో ఈతని సమాధి ఇతనిదని ప్రసిద్ధప్రధానమంత్రి ని గుర్తించజాలనంత నిరా డంబరముగా నిర్మితమై యున్నది

పదునెనిమిదవ శతాబ్ది ఉత్తరార్ధమున దును పదునెని మిదవశతాబ్ది ఆరంభమున దును నాటి రాజకీయముల దు కీలకపాత్రను వహించి విశిష్ట గుణ పదచేత మీర్ ఆలం ప్రసిద్ధు డయ్యెను అతడొనరించిన ప్రజాహితకార్యములు నేటి ని నగరమున ఆతని స్మృతిచిహ్నములై అతని కీర్తిని చాటు చున్నవి

కా గో

## అబుల్ హసన్-తానాషా

గోల్కొండను పాలించిన కుతుబ్‌షాహి వంశములోని తుదిరాజు అబుల్ హసన్ తానాషా తానాషా అను ది ఇతని బిరుదనామము తానాషా అనగా మంచిరాజు తెలుగు వారు ఈయనను తానీషా అందురు ఇతడు క్రీ శ 1672 ము డి 1687 స ॥ వరకు రాజ్యపాలన చేసెను దురదృష్ట వశమున ఈరాజు పాలనాకాలములోనే గోల్కొండ మొగలు లచే జయింపబడి ఆక్రమింపబడినది అబుల్ హసన్ కత్ బుషా ప్రభువుయొక్క ఆభిజాత్యమును గూర్చి అనేక కథలు ప్రచారములో ఉన్నవి ఇతడు విదేశీయుడనియు అరేబియా నుండియో పర్షియానుండియో గోల్కొండ రాజ్యమునకు వచ్చి ఉండుననియు కొందరు భావించుచున్నారు ఇతడు అనంతగిరి గ్రామమందొక దేవాంగుల గృహమందు జన్మించినా డనియు అక్కన్న మాదన్నల ప్రాపుతో పెరిగి పెద్దవాడై వృద్ధిలోనికి వచ్చినాడనియు ఆ కృతజ్ఞతతోడనే తాను గోల్కొండ ప్రభువైన వెంటనే తన శ్రేయస్సుకై పాటుబడిన

ఆ సోదరు శిశువునకు ఉన్న తోద్యోగములిచ్చి గౌరవించె ననియు ఒక భద్దిపేట లోను ఆ పరిసర ప్రాంతము లందును ప్రచారములో ఉన్నది అట్లే ఇతడు రాజ వంశీయుడగియు కుతుబుషా అబుల్లా (1626-1672) ప్రభువునకు దగ్గరి బంధువనియు అందుచే గోల్కొండ సింహాసనము కు వారసత్వహక్కు సైతము కల్గియుండెననియు కొందరు చరిత్రకారులు చెప్పుచున్నారు కుతుబుషాహి వంశమునకు మూలపురుషు

చిత్రము 17



అబుల్ హాసన్ తానాషా

డైన "సుల్తాన్ కులీకుతుబుషాకు" (1512-1543) దాయాది యగు ఫతీఖాన్ యొక్క పుత్రుడైన సయిఫఖాన్ అయినుల్ ముల్క్ నకు అబుల్ హసన్ తానాషా దౌహిత్రుడట! అబుల్ హసనుకు సుల్తాన్ అబ్దుల్లాకుతుబుషా (1626-72) యొక్క తృతీయ పుత్రికతో ఉద్వాహమైనది ఆమె యందతనికి మువ్వురు పుత్రికలు ఒక పుత్రుడు జన్మించిరి

అబుల్ హాసన్ తానాషా యొక్క బాల్యకౌమార దశా విశేషములను గూర్చి కూడ పరస్పర విరుద్ధాభిప్రాయములు వెలిబుచ్చబడినవి ఇతడు గొప్ప విషయలోలుడు మహాభోగిఅట కౌమారదశలో ఇతడు సదా మధువును సేవించి మత్తకాశినులతోడి విలాసములలో తేలియాడుచు కాలము గడుపుచుండెడివాడని కొందరు చరిత్రకారులు చెప్పిరి ఇందులకు విరుద్ధాభిప్రాయములు కూడ లేకపోలేదు ఇతడు బాల్యమునుండియు చక్కగా విద్యాబుద్ధులు నేర్చుచు సచ్ఛీలముతో మెలగెను ఇతడెన్నడు మత్తుపదర్థముల ముట్టి ఎరుగడు కామకాకనకములను ఇతడెన్నడు కన్నెత్తి కూడ చూచి ఎరుగడు గొప్ప మేధావి సత్ప్రవర్తనవంతుడు నీతిమంతుడు ఇతడు తన సర్వకాలమును భగవత్ప్రార్థనలతోను మతవిషయక చర్చలతోను గడుపుచుండెడివాడు ఖురాను పఠనములో ఇతనికి దీక్షయైన వారాకాలమున అరుదుగ నుండిరని ఇతడు సత్పురుషుడు అనియు మరికొందరు చరిత్రవేత్తలు నుడివి యున్నారు

అబుల్ హాసన్ తన బాల్యదశలో ఏకారణముచేతనో సన్యాసజీవితమువైపు మొగ్గినాడు పట్టుమని పాతిక సంవత్సరములు కూడ నిండక పూర్వమే ఇతడు వైరాగ్యమును వహించి హైదరాబాదులోని ఫతేదర్వాజా (విజయద్వారము) సమీపమందు నివసించియున్న ప్రఖ్యాత యోగియగు షారాజూ ఖత్తాలీ నాశ్రయించి అతనిని శ్రద్ధాభక్తులతోను నిత్యము సేవించి అతని కృపను సంపాదించుకొనెను రాకుమార్తెతో తన వివాహమగువరకు అతడా ఆశ్రమములోనే గురుశుశ్రూష చేయుచు కాలముగడిపెను

అబుల్ హాసన్‌కు గోల్కొండ రాకుమారితో వివాహము జరుగునని ఎవ్వరు కలలో కూడ ఊహింపరైరి పరిస్థితుల ప్రాబల్యమువలననే ఈయనూహ్యమైన పెండ్లి జరిగిపోయినది ప్రప్రథమమున సుల్తాన్ అబ్దుల్లాకుతుబ్‌షా తన పుత్రికను సయ్యద్ సుల్తాన్ అను నొక అరేబియా యువకునకిచ్చి ఉద్వాహము కావింప తలపెట్టెను ఈ సంబంధమును రాజుయొక్క పెద్ద అల్లుడైన సయ్యద్ నిజాముద్దీన్ అహమ్మద్ సూచించెను ఇందులకు కారణము వారిరువురు ఒకే దేశీయులును ఒక తెగవారును సహచరులును అయిఉండుటయే వివాహము నిశ్చయమైనది ముహూర్తము నిర్ణయింపబడినది వివాహ సన్నాహములన్నియు కడువేగముగ జరిగిపోవుచుండెను ఇంతలో సయ్యద్ నిజాముద్దీన్ సయ్యద్‌సుల్తానుల మధ్య విరోధమేర్పడినది క్రమముగా అది ప్రబలమై ఒకరి ఉనికి ఒకరు సహింపలేని స్థితి ఘటిల్లెను ఈ స్థితిలో సయ్యద్ నిజాముద్దీన్ తన మామను సమీపించి సయ్యద్ సుల్తానుకు రాకుమారినిచ్చి వివాహముచేయవలదని చెప్పెను అట్లుగాక తన మాటను త్రోసిపుచ్చి వివాహమునే జరిపినచో తాను సపరివారముగా మొగలు చక్రవర్తివద్దకేగి అతనినే సేవింతునని అతడు నిష్కర్షగా చెప్పెను ఇది ఇట్లుండగా అంతఃపురములో పెద్ద కుమార్తె ఆమె తల్లికూడ సయ్యద్ నిజాముద్దీన్ పక్షమువహించి ఆ పెండ్లి జరుగుటకు వీలులేదని పట్టుబట్టిరి అభీష్టమునకు వ్యతిరేకముగా పెండ్లి కావింప అతడు యత్నించినచో తామిరువురు బలవన్మరణము నొందుట తథ్యమని ఆ తల్లిబిడ్డలు ప్రభువునకు విన్నవించిరట!

ఈ స్థితిలో సుల్తాన్ అబ్దుల్లాకుతుబ్‌షా కేమియు తోచకుండెను నిశ్చితమైన పెండ్లి నాపుట మంగళకరముగాదు

అట్లని ఆ శుభకార్యమును అనుకొనినట్లుగా నెరవేరి గృహచ్ఛిద్రములను కొని తెచ్చుకొనుట వివేకముకాదు శ్రేయస్కరము కాదు అని అతడు వితర్కించుకొనుచు విచిత్రమైన విషమ పరిస్థితిలో చిక్కుకొని యున్నతరి అతని అంతరంగికులు బాగుగా ఆలోచించి ఆదే శుభముహూర్తమున లో రాకుమారిని మరియొకనికిచ్చి వివాహము చేయదగునని సూచించిరి రాజు అంతట తన కుమార్తెను అబుల్ హసన్ కు ఇచ్చి పెండ్లి చేయుట యుక్తమని తలచెను బంధుమిత్రులందరు తమ యామోదమును దెల్పిరి పిదప షారాజూఖత్తాలీ యొక్క ఆశ్రమమునండి అబుల్ హసన్‌ను సగౌరవముగా తోడ్కొనివచ్చి ఆ సుముహూర్తముననే అతనికి రాకుమారినిచ్చి రాజు వివాహము చేసెను

క్రీ శ 1672 సం లో అబుల్ హసన్ రాజ్యపాలనా భారమును వహించెను ఇతని పెండ్లి యెట్లు జరిగినదో పట్టాభిషేకముకూడ అట్లే చిత్రమైన వాతావరణములో జరిగినది క్రీ శ 1656 సం లో మొగలు చక్రవర్తితో జరిగిన సంధిననుసరించి గోల్కొండ రాజ్యమును సుల్తాన్ అబ్దుల్లాకుతుబ్‌షా మరణానంతరము అతని రెండవ అల్లుడును ఔరంగజేబు జ్యేష్ఠ పుత్రుడును అగు మహమ్మద్‌సుల్తాన్ పాలింపగలిగిన వాడు కాని అబ్దుల్లాకుతుబ్‌షా మరణశయ్యపైనున్న తరుణములో మహమ్మద్ సుల్తాను తన తండ్రి ఔరంగజేబు ఆగ్రహమునకు గురియై చెరసాలలో బంధింపబడియుండెను అబ్దుల్లాకుతుబ్‌షాకు తన పెద్ద అల్లునిపై సదభిప్రాయమున్నట్లు కానరాదు పెద్దఅల్లుని త్రోసిపుచ్చి అబుల్ హసన్‌ను తన వారసుడని ప్రకటింపలేకుండెను మీదు మిక్కిలి పెద్ద అల్లుడైన సయ్యద్ నిజాముద్దీన్ రాజకార్యములలో చొరవజేసికొని ప్రవేశించి అనేకమంది ప్రభుత్వోద్యోగులను తన పక్షమునకు త్రిప్పుకొనసాగెను ముఖ్యముగా క్రీ శ 1670 సం లో రాజమాతయైన హాయత్‌బక్షీ బేగమ్ మరణించినప్పటినుండి అతడనేక ప్రభుత్వాంగములను తన యదుపులోనికి తెచ్చుకొని పాలనా వ్యవహారములందు విశేషముగా పాల్గొనుచుండెను ఈ వాతావరణములో అబుల్ హసను రాజ్యాధికారమును సంపాదించుట మిక్కిలి దుష్కరమయ్యెను

సుల్తాన్ అబ్దుల్లాకుతుబ్‌షా మరణశయ్యపై ఉన్నపుడు అబుల్ హసన్ అతనిని జూచుటకు అంతఃపురమునకేగెను కాని అతనిని సయ్యద్ నిజాముద్దీన్ వర్గమువారు లోనికి రానీయ లేదు ఆ మార్గ చితమివేసిరి ఈ ఘటనను సాకగా తీసికొని సయ్యద్ నిజాముద్దీన్ యొక్క ద్వేషియు అబుల్ హసన్ యొక్క పక్షపాతియునగు సయ్యద్ ముజఫర్ అను అతని రక్షకాధ్యక్షుడు మూసాఖాను హవల్దారు అనువాని యొక్కయు అక్కన్న మాదన్నల యొక్కయు తోడ్పాటుతో గోల్కొండలోని కీలక ప్రాంతములందంతట తన వర్గమువారిని నిలిపి రాజప్రాసాదమును ముట్టడించి సయ్యద్ జాముద్దీనును అతని సహచరులను బంధించివేసెను తదనంతరము అతడును అతని భార్యయు నిర్బంధములో మరణించిరి క్రీ శ 1672 సం ఏప్రిల్ 2 వ తేదీన అబ్దుల్లా కుతుబ్‌షా మరణించెను ఏప్రిల్ 21 వ తేదీన అబుల్ హసన్ రాజుగా ప్రకటింపబడినాడు ఏప్రిల్ 30వ తేదీన అతడు పట్టాభిషిక్తుడై క్రీ శ 1687 సం॥ వరకు రాజ్యపాలన చేసెను

అబుల్ హసను పట్టాభిషిక్తుడై వెంటనే రాజ్యప్రాప్తియందు తనకు తోడ్పడిన మిత్రవర్గమును సముచిత రీతిని ఆదరించి వారికి ఉన్నత పదవులను ప్రసాదించెను వీరిలో ప్రధానుడగు సయ్యదుముజఫరు అనునాతడు అంతఃపుర రక్షక స్థానము నుండి ఎత్తబడి మీరుజుమ్లా అను మహోన్నత స్థానమున నియుక్తుడయ్యెను ఇతనికి అమీర్ ఉల్ ఉమ్రా (ప్రభువుకు ప్రభువు) అను అత్యర్హితమైన బిరుదు ప్రసాదింపబడెను అబుల్ హసను తమువహించిన మూసాఖాను అనువాడు ఇదివరలో చిన్నహవల్దారుగా నుండెను వాడిప్పుడు సేనాధ్యక్షుడయ్యెను తానాషా యొక్క హితులు మిత్రులైన మాదన్న అక్కన్నగార్లకును ఉద్యోగములందు తగిన లభించెను మాదన్నగారు సయ్యదుముజఫరుకు పేష్కారుగా నియుక్తుడయ్యెను అక్కన్నగారు తమ్మునికి కార్యదర్శియైనట్లు కాన్పించును రజాకులీబేగ్‌ఖాను అను సమర్థుడైన ఉద్యోగి కర్ణాటకమునకు ప్రాంతపరిపాలకుడుగా ఇదివరలో వలెనే వ్యవహరించెను మొగలు చక్రవర్తియైన ఔరంగజేబును కూడ తనకు సుముఖునిగ చేసుకొనుటకై క్రొత్త గోల్కొండ నవాబు యత్నించెను చక్రవర్తికి కానుకలు మున్నగునవి పంపించెను చక్రవర్తి అంతగా సంతృప్తి పొందకున్నను అబుల్ హసనును ప్రభువుగా గుర్తించుచు ఫర్మానా జారీచేసెను దానితోపాటే మహారాష్ట్రనాయకుడగు శివాజీతో ఎట్టి ప్రమేయమును పెట్టుకొనవలదని హితోపదేశము చేయుచు వ్రాసెను

మీరుజుమ్లాగా అధిష్ఠించిన సయ్యిదుముజఫరు అధికార దుర్వ్యామోహముచే మొండివాడయి తానే రాజైనట్లు నిరంకుశముగా వ్యవహరించుచు తన మార్గమునకు అడ్డు రాదలచిన అధికారులను వేధింపజొచ్చెను సైన్యాధ్యక్షుడైన మూసాఖాను పై అతడు అసూయవహించెను కర్ణాటక గవర్నరు నేక్‌ఖాను మరణించగా మూసాఖానును ముఖ్యపట్టణమునుండి దూరముగా తొలగించుటకై కర్ణాటక గవర్నరుగా వేయించివేసెను అంతటితో ఊరకొనక అతమీద రాజద్రోహ్యావారిగా నేరము మోపి కృత్రిమవిచారణ చేయించి ఆతనిని కారాగారమునందుంచెను సుల్తాను అబుల్‌హసను విలాసపురుషుడనియు రాజ్యపాలనశ్రమను వహించడనియు ఒక చెడుప్రతీతి వ్యాపించి యుండుటచే ప్రధానమంత్రియైన సయ్యిదుముజఫరు నిర్భయముగా వ్యవహరింజొచ్చెను ఇవన్నియు గమనించక్లే అబుల్‌హసను భోగలాలపురుషుని వలె కన్పించుచు ఒకంట తన ప్రధాని దుశ్చర్యలను వీక్షించుచుండెను 1674 సంవత్సరమున హఠాత్తుగా దర్బారు ఏర్పాటుచేసి అబుల్‌హసను తన ప్రధానమంత్రిని పదవీచ్యుతునిగా ప్రకటించెను ఇదివరలో సయ్యిదుముజఫరు పేష్కారుగా ఉండిన మాదన్నపంతులు ఇప్పుడు మీరుజుమ్లాస్థానమందు నియోగింపబడెను ఆయనకు సూర్యప్రకాశరావు అను గౌరవబిరుదము ఈయబడెనట అక్కన్న తిరిగి తనయనుజునకు పేష్కారుగా నియుక్తుడయ్యెను సేనాధ్యక్షపదవి మూసాబేగుఖాను అనునాతనికి లభించెను సైన్యమునకు జీతనాతము లిచ్చుటలో అవకతవకలు జరుగకుండుటకై అబుల్‌హసను ఈ బాధ్యతను తనపై పెట్టుకొనెను పదభ్రష్టుడైన సయ్యిదుముజఫరు ఆతనికుమారుడును గోల్కొండనుండి పారిపోయి మొగలుసామ్రాజ్యములో తలదాచుకొని సుల్తానుకు శాశ్వతశత్రువులుగమారిరి ఉల్లికట్టుమాటలతో వారు అబుల్‌హసను మీద మొగలాయీ చక్రవర్తి ఆగ్రహమునకు దోహదము చేయుచుండిరి

నూతన ప్రధానమంత్రియైన మాదన్న పంతులు హనుమకొండనివాసియైన భానోజీ పంతులు రెండవ కుమారుడు అక్కన్న పెద్దవాడు అబ్దుల్లా కుతుబుషా కాలమునందే ఈ సోదరులు గోల్కొండ నవాబుల పాలనమున ఉద్యోగులుగా చేరి క్రమముగా తమబుద్ధి విశేషముచేతను చాకచక్యముచేతను గొప్పస్థానములకు రాగలిగిరి మాదన్నగారికి రాజభాషయైన పర్షియను భాషలో చక్కని జ్ఞానముండుటచే చక్రవర్తినుండి వచ్చు ఫర్మానాలను చదువుట సమాధానములు వ్రాయుట అతడు నేర్పుతో చేయుచుండెను చిరకాలము పేష్కారుగా ఉండుటచే ఆదాయ వ్యయ పద్ధతులు ఆతనికి కరతలామలకములుగా నుండెను కాని గోల్కొండ రాజ్యములో ఇదివరకు సర్వాధికారము ననుభవించిన స్థానికులును విదేశీయులును అగు మహమ్మదీయులు ఎవరును మాదన్న ప్రధానియగుటకు ఇష్టపడక ఉండెను దీనికితోడు మాదన్న స్వాభిమానము కలవాడై విదేశీయులైన తురకలను కీలస్థానముల నుండి తొలగించి దేశీయులను నియమించ జొచ్చెను ఇదియు వారికి కడుపుమంట కలిగించెను నూతనోద్యోగములందు మాదన్న తన బంధువులను నియోగించెనని ఒక ప్రతీతియు కలదు ఇస్లాము మతమును సంరక్షించుటకు కంకణముకట్టుకొన్న ఔరంగజేబు చక్రవర్తికి హిందువులగు మాదన్న అక్కన్నగార్లు గోల్కొండ భాగ్యవిధాతలగుట బొత్తిగా సహింపరానిదయ్యెను గోల్కొండ రాజ్యమును కబళించుటకు సాకులువెదకుచున్న చక్రవర్తికి కాఫరులను పెద్ద ఉద్యోగములలో పెట్టి ముస్లిములను వారికి అనుచరులనుచేయుట క్షంతవ్యముకాని అపరాధముగా ఉపకరించెను

సమర్థుడును విశ్వాసపాత్రుడును అగు ప్రధానమంత్రిని ఏర్పరచుకొని అబుల్‌హసను తన రాజ్యవ్యవస్థను చక్కజేయుటకు నడుముకట్టి చాలవరకు కృతకృత్యుడయ్యెను గత సుల్తాను అబ్దుల్లాకుతుబుషా కాలమున ఆతని మెత్తదనముచేతను మొగలాయీలు మహారాష్ట్రులు చేయు అలజడులచేతను పరిపాలనాయంత్రము చాలా దెబ్బతినెను తానాషాయు మాదన్నయు ప్రభుత్వశాఖలను చక్కబరచి సువ్యవస్థను కావించిరి గోల్కొండ రాజ్యము ఇప్పుడు సువిశాలమై ఒకచిన్నసామ్రాజ్యము తటిదిగానుండెను రాజ్యమునందలి వివిధ ప్రాంతములు కేంద్రములతో చక్కగా సంబంధము కలుగుటకును ప్రజల కష్టనిష్ఠురములు యోగక్షేమములు తెలిసికొనుటకును అబులుహసను రెండుసంవత్సరముల కొకపర్యాయము రాజ్యము నాలుగు మూలలను సంచరించి వచ్చుచుండెను ఇట్లు కార్యదీక్షగల ప్రధానమంత్రియు రాజధర్మములు విధులు తెలిసిన ప్రభువును ఒకరికొకరు తోడ్పడుచు రాజ్యమును మహోన్నతస్థితికి తెచ్చిరి క్రీ శ 1674 76 78 సంవత్సరములలో

తానాషాయు మాదన్నయు రాజ్యమంతయు సందర్శించి వచ్చిరి విదేశీయవర్తకులైన ఫ్రెంచివారు ఆంగ్లేయులు మున్నగువారు ఆరబ్రాంతములందు వ్యాపారముచేయుచు ధనార్జన చేయుచుండిరి ఈ విదేశీయులు హద్దులు మీరకుండుటకై మాదన్న గట్టిచర్యలు తీసుకొనెను అబుల్ హసను స్వయముగ మచిలీపట్టణము సుదరాసు పులికాటు రేవులందలి విదేశ వర్తక స్థానములను పరీక్షించి వచ్చెను కొండవీడు కొండపలిదుర్గములను రాజును మంత్రియు దుర్భేద్య బలములవానిగా చేసిరి అందును కొండపల్లిపై ప్రత్యేక శ్రద్ధచూపబడెను అవసరమైనచో ప్రభుత్వ ధనాగారమును కొండపల్లిలో భద్రపరచుటకను వలసినచో ప్రభువచ్చి నివాసము చేయుటకును దీనిని అనుకూలముగా పెంపొందించిరి వ్యవసాయాభివృద్ధికై తటాకములు నూతులు క్రొత్తవి నిర్మింపబడెను ప్రజలనుండి పన్నులు వసూలుచేయుటకు గుత్తేదారీ పద్ధతి ఇదివరలో అమలునందుండెను గుత్తేదారులు ప్రజలను బాధించి ధనము సంపాదించుచుండిరి పెక్కు గ్రామములు దీనిచే నిర్జనములైపోయెను అబుల్ హసన్ నవాబు ఈ పద్ధతికి స్వస్తిచెప్పి గుత్తేదారులను తొలగించి ప్రభుత్వోద్యోగులను పన్నులసేకరణకై నియమించెను అగ్రహారములు పునరుద్ధరింపబడెను ఇటి గ్రామములు బొత్తిగా పన్నులు చెల్లింపక పోవుట రాచబొక్కసమునకు కష్టముగానుండుటచే స్వల్పకరములు వీటిపై విధింపబడెను గోల్కొండ వైభవమునకును మహాసంపదకును చిహ్నములైన వజ్రపుగనులను అభివృద్ధిపరుచుచు అబుల్ హసను మంచి కృషిచేసెను గనులు త్రవ్వువారికి హెచ్చువేతనము లేర్పాటుచేసిరి దానిచే వజ్ర వ్యాపారము బాగుగాసాగెను ప్రశంసనీయమైన ఇట్టి పెక్కు సంస్కరణలచే గోల్కొండ రాజ్యము లక్ష్మీనిలయమై సుఖశాంతులకు ఆలవాలమయ్యెను ఇదియంతయు ధనాశాపీడితుడగు ఔరంగజేబు చక్రవర్తి తృష్ణాకూపమును గభీరతరముచేయుటకే వినియోగించెను పాడిగోవువలె ఉన్న గోల్కొండ రాజ్యము ఆతనిని మరియు ఆకర్షించెను

గోల్కొండరాజ్య విదేశాంగనీతియు అన్నిరాజ్యములకును అహ్హిమైన స్వార్థపద్ధతులమీదనే నడచినను ఔరంగజేబు చక్రవర్తికి క్రోధ కారణమయ్యెను గోల్కొండవారి లక్ష్యములు రెండు (1) తమ రాజ్యముయొక్క స్వాతంత్ర్యము (2) ఇతర దక్షిణాపథ రాజ్యములతో మైత్రితోగూడిన సహకారము ఇప్పుడు క్రమముగా [illegible] రాజ్యము బిజాపురరాజ్యము మహారాష్ట్రరాజ్యము మొగలాయి చక్రవర్తులు దక్షిణాపథ రాజ్యములను ఎట్లయినను లోబరచుకొన [illegible] అహమ్మదునగరు రాజ్యము పడిపోయినది బిజాపుర రాజ్యముకూడ పడిపోయినచో గోల్కొండవంతు వెంటనే వచ్చునని తానాషాయు అతని మంత్రి మాదన్నయు చక్కగా గ్రహించిరి కావున మొగలాయీల దుస్తంత్రములను [illegible] పురమునకు సైన్యసహాయము ధనసహాయము చేయుటకు వారు ప్రయత్నించిరి బలవత్తరమైన ఢిల్లీ సైన్యములను ఎదుర్కొనుటకు తమ శక్తి చాలదని గుర్తించి వారు మహారాష్ట్రులతోకూడ సఖ్యము పాటించిరి ఈ విదేశాంగ నీతి గోల్కొండ ఆత్మరక్షణమునకే ఉద్దేశింపబడినదైనను మొగలాయి చక్రవర్తికి సహజముగనే అనిష్టమయ్యెను బలప్రయోగమునకు గురికావలసిన అభాగ్యుడు స్వయరక్షణకై ఉద్యుక్తుడగుట క్రోధకారణముకాక యెట్లుండును ?

ఇపుడు విజాపుర రాజ్య పరిస్థితులు అస్తవ్యస్తమై మొగలాయి దురాక్రమణను ఆహ్వానించునవిగా ఉండెను బిజాపుర సుల్తాను రెండవ అలీ ఆదిల్షా 167?లో మరణించెను ఆతని వారసుడైన కుమారుడు సికందరు ఆదిల్‌షా 5 ఏండ్ల బాలుడు దక్కను రాజ్యములన్నిటియందును వాటి నిర్మూలన బీజములు పూర్వమునుండియు మొలగుచునే యుండెను రాజ్యమునందు అన్యోన్య వైరముతో వ్యవహరించు రెండు బలీయములైన పక్షములు ఏర్పడియుండెను ఒకపక్షమువారు పర్షియా అరేబియా మున్నగు ప్రాంతములనుండి పొట్టచేతపట్టుకొని వచ్చిన విదేశీయులు వీరు విద్యాధికులును రాజనీతి చతురులును అగుటచే ఉన్నత స్థానములను ఆక్రమించియుండిరి రెండవపక్షము వారు అంత సమర్థులు కాకున్నను దేశీయులైన దక్కనీ ముస్లిములైయుండిరి ఈ ఉభయపక్షములును ఒకరియెడ మరొకరు శత్రుభావము వహించియుండిరి రాజు సమర్థుడైనచో కలహాశీలురైన ఈ రెండు పక్షములవారిని అదుపులో పెట్టగలుగుచుండెడివాడు వారు తెగబడి ప్రజలను పీడించుచు రాజ్యవిచ్ఛేదమునకు దారితీయుచుండిరి ఈ పరిస్థితి దక్కను ముస్లిము రాజ్యములకన్నిటికిని సాధారణము

విజాపురము ఇప్పుడీ దుస్థితిలో పడెను ఇప్పటి సుల్తాను అయిన సికందరు ఆదిల్షా బాలుడు విదేశీయుల వర్గము

నకు బహలూల్‌ఖాను అనువాడు నాయకుడుగా నుండెను దక్కనీ పక్షమునకు మియాఅబుల్‌మహ్మద్ ఖావాస్‌ఖాను అనువారు నాయకులు ఎరాను జాతీయుడైన బహలూల్ ఖాను దేశీయులను దోచుకొనుచు ట్టగలు అరాజకమును సాగించెను దక్కనున దళి మొగలాయి ప్రతినిధులు సామ్రాజ్య లాభమును దృష్టియందుపెట్టుకొని బిజాపురము నందు అంతఃకలహములకు దోహదమిచ్చుచుండిరి విధిలేక బిజాపురమువారు 1676 సంవత్సరమున శివాజీతో రక్షణ సహాయమును కుదుర్చుకొనిరి మొగలుల దాడులనుండి విజాపురమును కాపాడుటకై శివాజీకి మూడులక్షల హొన్నులను తక్షణము ఇచ్చునట్లును తరువాత ప్రతి వత్సరమునకు లక్ష హొన్నులు ఇచ్చుచుండునట్లును ఏర్పాటయ్యెను

గోల్కొండ వారును మహారాష్ట్రులతో ఇట్టి యొడంబడికనే చేసుకొనిరి శివాజీ తండ్రి షాజీ బిజాపురపు వారిసేన యందుండెను ఆతడు బిజాపుర సైన్యసహాయముతో కూలిపోవుచున్న విజయనగర సామ్రాజ్యభాగములను పెక్కింటిని ఆక్రమించుకొనెను జింజీకోటవరకును తన యధికారమును వ్యాపింపజేసెను అతని కుమారుడు ఏకోజీ మహారాష్ట్రసైన్యములను తంజావూరులో ప్రవేశపెట్టెను శివాజీ తన యన్న విజృంభణమును సహింపక తానును కర్ణాటకముపై సైన్యములను నడిపి సోదరుని వెడలగొట్టి కర్ణాటకమును ఆక్రమించుకొనెను శివాజీ ఇప్పుడు మొగలులతో సంధిచేసికొనియుండుటచే అవంకనుండి అతనికి ప్రమాదము లేకుండెను బీజాపురము వారు మొగలాయీలతో కలహమునకలుగా యుద్ధమునందు మగ్నులైయుండిరి కావున శివాజీ కర్ణాటక విజయము (క్రీ శ 1676) నిర్నిరోధముగ సాగెను అతడు గోల్కొండతో సఖ్యముకుదుర్చుకొనెను క్రీ శ 1677 సవత్సరమున శివాజీ హైదరాబాదు నగరమునకువచ్చెను అబుల్‌హసను మాదన్నగార్లతో సంప్రతింపులు జరిపెను తత్ఫలితముగ గోల్కొండ మహారాష్ట్ర సంబంధములు సన్నిహితములయ్యెను శివాజీ తానుదక్షిణమున దు జయించిన దుర్గములను భూభాగములను కుతుబుషాహీ రాజ్యమునకు అప్పగించుటకును గోల్కొండ రాజ్యము శివాజీ దండయాత్రల వ్యయము క్రింద ఒకలక్ష హొన్నులు వెంటనే ఇచ్చుటకును అతని సైనికచర్యలు దక్షిణమునందు సాగుచున్న కాలమున దినవ నకు మూడువేల హొన్నుల చొప్పున చెల్లించుటకును ఒడంబడికకుదుర్చుకొనిరి మొగలాయీల ప్రమాదమునుండి రక్షణలభించునని గోల్కొండ వారీ సంధికి అంగీకరించిరి శివాజీ ఈ సంధి షరతుల ప్రకారము దక్షిణమున తాను జయించిన భూభాగమును గోల్కొండ రాజ్యమునకు అప్పగించినట్లు కానరాదు

విజాపురము వారి ఆత్మ రక్షణ యత్నము లందు గోల్కొండ వారు తోడ్పడుటకు నిశ్చయించి ఔరంగజేబు దురాగ్రహమునకు గురి అయిరి దిలేరుఖాను అను వాడు మొగలాయిసేనాధిపతిగా నుండెను స్వార్థపరుడైన బిజాపూరు నాయకుడు బహలూల్‌ఖాను మొగలులతో చేయి కలిపి గోల్కొండరాజ్యసరిహద్దులపై ఎత్తివచ్చెను గోల్కొండ దళవాయులు షేక్‌మిన్‌హాజుఖాను రుస్తుంరావు సంజార్ ఖాను అను వారు మాల్ఖేడ్ వద్ద మొగలులను ఎదిరించి పారద్రోలిరి షేక్‌మిన్‌హాజు అనువాడు మొదట బీజపూరువారి కడనుండి మొగలాయి పక్షమునుచేరి వారిని కూడ విడిచి గోల్కొండలో కుదురుకొనెను అబులుహాసను మీద ఔరంగజేబు ఆరోపించిన శత్రుచర్యలలో తమవద్దనుండి పలాయితుడై వచ్చిన షేక్‌మిన్‌హాజుకు ఆశ్రయమిచ్చుట ఒకటి విజాపుర రాజ్యములో అంతఃకలహములు సాగుచునేయుండెను వాటిని సర్దుబాటుచేయుటకై అబులుహాసను పూనుకొని బహలూల్ ఖానును గోల్కొండకు పిలిపించి మందలించి ఐకమత్యముతో వ్యవహరింపుమని ఉద్బోధించెను బహలూల్‌ఖాన్ పీష్వాస్థానము నుండి తప్పుకొనుటకును సిద్దీమసూదు అనునాతడు విజాపుర ప్రధాన మంత్రియగుటకును ఏర్పాటయ్యెను గోల్కొండ రాజ్యము పక్షమున అక్కన్నగారు విజాపురములో రెసిడెంటుగా ఉండుటకును అంగీకరింపబడెను

మసూదుఖాను కొద్ది కాలములోనే పరిపాలకుడుగా వ్యర్థుడని రుజువయ్యెను పైగా ఇతడు గోల్కొండకు విరుద్ధముగా మొగలాయీ సేనాపతులతో చేతులుకలప జొచ్చెను ఇట్లుండ 1684 లో ఢిల్లీ చక్రవర్తి బిజాపురము మీదను గోల్కొండమీదను పెద్దసైన్యములను పంపెను ఇది చూచి అబుల్‌హసను తనరాజ్యమందలి దుర్గములన్నిటిని బలపరచి సంగ్రామమునకు సన్నద్ధుడు కాజొచ్చెను ఇంగ్లీషు వర్తక సంఘమును డి విస్తారముగా మందుగుండు సామాను సేకరింపబడెను మహమ్మదు ఇబ్రహీమ్ అను నాతడు ఇదివరలో సైన్యాధిపతిగా ఉండెను అతనిని తప్పించి అక్కన్నపంతులు సర్వసైన్యాధ్యక్షుడుగా నియమింపబడెను మహమ్మదు ఇబ్ర

హీమ్‌కు ఇది మిక్కిలి అసంతృప్తిని కల్గించెను అతడు కొంత కాలమునకు గోల్కొండను వీడి మొగలాయీ స్కంధావారమును చేరెను గోల్కొండ సైన్యములు తమ ఉత్సాహ ద్వైత మాల్ ఖేడ్ సంరక్షణకై నడచెను ప్రప్రథమమున గోల్కొండ దళములు ఓటమిచెందినను వారు తరువాత నిలువద్రొక్కుకొని మొగలాయి సైన్యములను చీల్చిచెండాడిరి విజయము గోల్కొండకు దక్కినట్లే అనిపించెను ఇంతలో దైవదుర్విపాకము వలన ఒకదుష్టమదగజము గోల్కొండ సైన్యముల భీభత్సము కలిగించెను గోల్కొండ శ్రేణులు ఛిన్నమయ్యెను ఈ యదను గైకొని మొగలాయి సైన్యములు విజృంభించి గోల్కొండ వాహినులను తరుము కొనివచ్చెను కుతుబుషాహి సైన్యములు హైదరాబాదుకు ముఖముగా పలాయనముచేసెను వారిసేనాపతులు కొందరు ఖలీలుల్లాఖాను మున్నగువారు దేశద్రోహులై స్వపక్షమును వీడి మొగలాయీలను చేరిరి

చక్రవర్తి కుమారుడు షాఆలమ్ మొగలు విజయసైన్యములతో హైదరాబాదుపై పడెను వారు ధూల్‌పేట గోషామహాలు గగన్‌పహాడ్ మున్నగు ప్రాంతములను ఆక్రమించిరి అబుల్‌హసను దిగ్భ్రాంతిచెంది అర్ధరాత్రమునందు హైదరాబాదు నగరమునువీడి గోల్కొండ దుర్గ సంరక్షణమును కోరి కోటలో ప్రవేశించెను వరంగలుకోట ఇంతకన్న క్షేమకరమని మాదన్నమంత్రి చెప్పెనట మాదన్న శత్రువులైన షేక్ మిన్ హాజువంటి గోల్కొండ సేనాధిపతులు కుతుబుషాహి సైన్యముల పరాజయముకు మాదన్న ద్రోహమే కారణమని ప్రచారముచేసిరి రాజరక్షణములేని హైదరాబాదు నగరము మహావిపత్తుకు గురియయ్యెను మొగలుసైనికులును సమాజవ్యతిరేకశక్తులును చెలరేగి అమరావతివలె భోగభాగ్యములతో కలకలలాడుచున్న ఆమహాపట్టణమును నిర్దయగా దోచుకొనిరి ఈ యాపత్తుకు సంసిద్ధులుకాక దుడుకుచే అమాయకులైన ప్రజలు పెక్కుకడగండ్లకు పాల్పడిరి పరదారస్త్రీలు అవమానములకు పాలయిరి సుందరహర్మ్యములు రాజప్రాసాదములు ఊచముట్టుగ కొల్లగొట్టబడెను కొన్నిదినముల దురాగతముల తరువాత మొగలాయిరాకుమారుడు షాఆలమ్ నగరవిధ్వంసమును ఆపుటకు దుర్బల ప్రయత్నముచేసెను

అబుల్‌హసను చాలా ఖిన్నుడైపోయెను అతడు తన ప్రజల సర్వవినాశమునుచూచి సహించలేక ఎట్టి సంధిషరతుల కైనను అంగీకరింతునని మొగలులకు కబురుచేసెను చివరకు క్రింది షరతులపై యుద్ధనిరామము ఏర్పాటయ్యెను

1 ప్రతిసంవత్సరము పాతబకాయీలు క్రింద అబుల్ హసను 1 కోటి 20 లక్షల హొన్నులు చెల్లింపవలెను

2 సాలీనా రెండు లక్షల హొన్నుల కప్పము చెల్లించవలెను

3 సేరము మాల్ఖేడు జిల్లాలను మొగలులకు దత్తతు చేయవలెను

4 మొగలుల పరమద్వేషమునకు గురిఅయిన అక్కన్న మాదన్నలను బర్తరఫుచేయవలెను

రాకుమారుడిచ్చిన ఒప్పుకొన్నను చక్రవర్తికి సంతృప్తి కలుగలేదు అతడు కోరినది గోల్కొండ వినాశముకాని శాంతి స్థాపనకాదు అయినను తాత్కాలికముగా ఔరంగజేబు ఈ సంధి బద్ధుడాయెను

రాజ్యమునకు వచ్చిన గొప్పవిపత్తువలన అబుల్‌హసను మొగలులకు చెల్లించవలసిన ధనమును బహుకష్టముతో సేకరించగల్గెను మొగలుసైన్యములు హైదరాబాదును వీడి ఉత్తరమున డెబ్బదిమైళ్ళపైనున్న కోహీర్ దుర్గమునకు ఉపసంహరింపబడెను అన్నిషరతులను పూర్తిచేసి మాదన్న అక్కన్నగార్లను తొలగించుటకుఇష్టపడక సుల్తాను విలంబనము చేయుచు ఇదిగ్ధావస్థలో పడెను ఈయన్న దమ్ములకు పెక్కు శత్రువు లేర్పడిరి షేక్ మిన్ హాజువంటివారు వీరిని గూర్చి విషప్రచారము చేయుచుండిరి అంతఃపురస్త్రీలు సయితము బ్రాహ్మణమంత్రుల యెడ ద్వేషభావము వహించిరి మాజీ సుల్తాను భార్యలు సరుమా జానీ బేగము అనువారు అక్కన్న మాదన్నల సంహారమునకై కుట్రను లేవదీసిరి ఒకనాడు ఈ సోదరు లిరువురును రాజ కార్యములను నిర్వర్తించుకొని రాత్రి సమయమున ప్రాసాదమునుండి మరలివచ్చుచుండిరి హంతకులు వారిని నడివీధిలో చుట్టుముట్టి నిర్దయగా వధగావించిరి గోల్కొండభవిష్యత్తుకు గొడ్డలిపెట్టువంటిదైన ఈ దురంత చర్య మార్చి 6 1686 సంవత్సరమున జరిగెను మాదన్న బంధువైన రుస్తుంరావు పుల్లిల్లి వెంకన్న అను సేనానియు అనిశ్చితమున దేకుట్రదారులచే ఇంటిలో వధ చేయబడిరి ఆసోదరులశిరస్సులు ఖండింపబడి ఔరంగజేబుకు కానుకగా పంపబడెను అయినను చక్రవర్తి ద్వేషానలము చల్లారలేదు అబుల్‌హసను తన విశ్వాసపాత్రులైన మం

త్ర వ హో మకరశు గించెను అతడు రెక్కలులేని పక్షివలె ఆయెను

గోల్కొండను కొంతకాలము జోకొట్టి ఔరంగజేబు తన యాకచ్ఛక్తులను విజాపురముపై కేంద్రీకరించి ఆ శాఖ్య రాజ్యమును కూలద్రోసెను వెంటనే యాతని సైన్యములు గోల్కొండపై మరలింపబడెను చక్రవర్తి తన రాజ్యముపై దండెత్తనున్నాడని గమనించి రక్తపాతమును కావలదని అబులుహసను ఎంతయో దీనముగా విన్నవించెను దీనికి సమాధానముగా ఔరంగజేబు మిక్కిలి పరుషమైన ఫర్మానా జారీచేసెను అబుల్ హసను పయలంపటుడనియు ఇస్లాము మతమునకు ద్రోహము కావించెననియు అతడు తప్పుడు కాడగియు దానిసారాంశము సామదాన మార్గములు నిష్ఫలమగుటచే సుల్తాను అబుల్ హసను ధీరత్వము నవలంబించి రాజ్యరక్షణముకై తీవ్ర సన్నాహములు చేసెను అతడిప్పుడు భోగపురుషుడుకాడు వీరపురుషుడు జనవరి 28 1687 వ వత్సరమున మొగలులు గోల్కొండను ముట్టడించిరి షర్జాఖాను షేక్ మిన్ హాజు ముస్తఫాఖాను అనుపేరుగల అబ్దుల్ రజాక్ లారిమున్నగు సేనానులు గోల్కొండ రక్షణకై సుల్తానుచే ఆదేశింపబడిరి గోల్కొండ ముట్టడి యొకమంచి వీరగాథ అది ఎనిమిది నెలలు ఏకాగ్రముగా జరిగెను పండినపండువలె ఒడిలో పడునుకొన్న కోట మొగలాయి చక్రవర్తికి అపారప్రాణనష్టము ధననష్టము కీర్తిహాని కలిగించెను గోల్కొండ సంరక్షణమునందు ఒక జంతువు ఒక వీరుడు అజరామరత్వమునొందిరి అజంతువు ఒక కుక్క ఒకనాటి నిశీథమున మొగలాయి సైన్యములు కోట లెక్కుటకు ప్రయత్నించుచుండగా ఆ శ్వానము నిరంతరముగా మొరగెను రక్షక సైన్యములు మేల్కొని శత్రువులను గోడలమీదనుండి క్రిందకు త్రోసివేసిరి గోల్కొండ వీరులు కృతజ్ఞతాసూచకముగా ఆకునక కుమారునకు బంగారు గొలుసువేసి ఫెరోజుజంగు అను బిరుదు ఇచ్చిరి ఫెరోజు జంగు అనునాతడు గోల్కొండ ముట్టడి సాగించు మొగలాయి సైన్యమునకు సర్వసేనాపతి

గోల్కొండ చరిత్రలో స్వర్ణాక్షరములతో లిఖింపదగిన వాడు అబ్దుల్ రజాక్ లారి గోల్కొండ కోటను పట్టుకొనుటలో విసిగి వేసారి మొగలాయీలు భేద తంత్రమును అవలంబించిరి అబ్దుల్లాఖాన్ పన్నీ అను పఠాను సేనాని మొగలాయీల వద్ద లంచముగొని 21 సెప్టెంబర్ 1687 నాటి అర్ధరాత్రమున రహస్య ద్వారము గుండ వారిని గోల్కొండ కోటలో ప్రవేశపెట్టెను దుర్గమునందు హాహాకారములు బయలుదేరెను నిద్రించుచున్న అబ్దుల్ రజాక్ లారీ కవచము ధరించి కతిపయ పరివారముతో మొగలులను చివరవరకు ఎదిరించెను కాని అప్పటికే అంతయు అయిపోయెను ప్రాణాపాయకరములైన గాయములు తగిలి అతడు మూర్ఛిల్లు వరకు తన విధిని నిర్వహించి చక్రవర్తిచేగూడ స్వామిభక్తికై ప్రశంసింపబడెను గోల్కొండకు ఔరంగజేబు దారుల్ జిహాదు అని పేరు పెట్టెను అనగా మతయుద్ధమునకు గురికావలసిన దుష్ట నగరము కోటపడిపోయినను అబుల్ హసను నిర్విణ్ణుడు కాలేదు అతడు స్థితప్రజ్ఞునివలె ధైర్యముతోను ఉల్లాసముతోను వ్యవహరించెను శత్రు వీరులు తనను నిర్బంధించుటకు వచ్చినప్పుడు ఆతడు వారిని రాజ ఠీవితో పలుకరించెను అబుల్ హసను చిన్నప్పుడు సూఫీ వేదాంత వేత్తకు శిష్యుడుగానుండుటచే ఆపత్తునందు ధీరునివలె వ్యవహరించి సభావ్యుడయ్యెను సర్వమును ఆ సర్వేశ్వరుని విధానమే అనినేను భావించుచున్నాను అతడేనాకు రాజ్యమును ప్రసాదించెను దానిని నేను కోల్పోవుటయు ఈశ్వర సంకల్పమే అని యాతడు తన్ను గొనిపోవవచ్చిన శత్రుసేనానులతో పలికెను ఆతడు బందీయై గుర్రమెక్కి పోవుచుండగా ప్రజలందరును వెక్కివెక్కి యేడ్చిరి వీర పరాజయము నొందిన అతడు ఔరంగజేబుతో ఉత్తరాభిముఖముగ వెళ్ళవలసివచ్చెను కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తియు సుల్తాను అబుల్ హసను తానాషాయు ఆంధ్రదేశ చరిత్రకు వన్నెతెచ్చినవారు వారు దైన్యమునెరుగరు అబుల్ హసను దౌలతాబాదు దుర్గములో చెరబెట్టబడెను మూర్ధాభిషిక్తుడైన అతడు రాచరికమునకు గాకపోయినను రాజమర్యాదలకైనను అర్హుడు కాని మొగలాయీలు ఆతనియెడల నీచముగ ప్రవర్తించిరి నిర్బంధమునందాతనికి అర్హమైన భోజన వసతులు గూడ మంజూరు చేయకుండిరి కడు దుఃఖితుడై ఆత్మాభిమానియైన అబుల్ హసను క్రీ శ 1700 ప్రాంతమున నిర్బంధమునందే దివంగతుడయ్యెను ఈ కాలమునందాతని కొక కుమారుడు కలిగెనని చెప్పుదురు అబుల్ హసనుకు ఒక దత్తపుత్రుడును ముగ్గురు కుమార్తెలును ఉండినట్లు తెలియుచున్నది గోల్కొండ పతనానంతరము చక్రవర్తి అనుమతితో వారికి తగురీతి వివాహములు అమర్పబడెను

ఎ చెం
తం ల రం

## అబులామా

ఈ స్థలనామము ఎపి ఇ X సం 1106 పుట 120లో కన్పించుచున్నది పశ్చిమభారతములోని గుహాలయములందలి శాసనములు అను గ్రంథమును పండిత భగవాన్‌లాల్ ఇంద్రజీ బర్జెస్ దొరలు కలిసి ప్రకటించిరి శాతవాహన చక్రవర్తులలో వాశిష్ఠీపుత్ర శ్రీ పులుమావి (క్రీ శ 86 114) దక్కను రాజ్యములో ప్రముఖస్థానము వహించెను ఇతడు గౌతమీపుత్ర శాతకర్ణి కుమారుడు

వాశిష్ఠీపుత్ర శ్రీ పులుమావి 24 వ రాజ్య వత్సరము హేమంతఋతు తృతీయపక్షము రెండవ దివసమున ఒక ప్రాకృత శాసనము బ్రాహ్మీలిపిలో వ్రాయబడి ఉన్నది ఈ శాసనము కార్లీ గుహాలయమున చెక్కబడినది బొంబాయి పూనా పట్టణములకు మధ్యగల బోరఘాటు కనుమలలో కార్లీ గుహాలయములు కలవు వాటిని దర్శించు వారికి పూనానుండి 35 మైళ్ల రహదారి కలదు

బౌద్ధమతమందలి విభిన్నశాఖలు ప్రత్యేకముగా కొన్ని తావుల కేంద్రీకృతములై యుండెడివి ఆంధ్రదేశమునందు అంధకులును నాసికాకన్హేరిలయందు భాధయానీయులు (భద్రాయణీయులును) కార్లేప్రాంతమున మహాసాంఘికులను అమరావతివద్ద చేతకీయులు (చైత్యకవాదులు)ను పోహారా జున్నారులయందు ధమ్మొత్తరీయులు (ధర్మోత్తరీయులు)ను నాగార్జునకొండయందు పూర్వశైలీయులు అపరశైలీయులు అను తెగవారును ఉండెడివారు

పైన చెప్పబడిన కార్లీగుహాలయశాసనమందు సేతఫర్ణుని కొడుకు హారఫర్ణుడు అనువాడు దేశము ఆరుచేరగులమండి వచ్చు భిక్షుకుల నివాసార్థము తొమ్మిది గదులుగల మండపమును నిర్మించి మహాసాంఘికులకు ప్రత్యేకస్థిరాస్తిని కలుగచేసెనని వర్ణింపబడినది సేతఫర్ణుడు హారఫర్ణుడు అబులామా అను గ్రామమున నివసించెడివారు ప్రస్తుతము అబులామా గ్రామపు ఉనికి తెలిసికొన సాధ్యముకాదు శాసనము తుది భాగమున బుద్ధరక్షితుని పేరు అతని తల్లి (ఉపాసిక) పేరు ఉదాహరింపబడినవి

కొ వెం

## అబుసింధు ఖాను

అబుసింధుఖానుని ప్రశంస కస్తూరిరంగ కవి విరచితమైన ఆనందరంగరాట్ఛందము అను గ్రంథమున (పీఠి 107) కనవచ్చుచున్నది ఇతడు నాసిర్‌జంగుకు సహాయార్థము వచ్చి ఢిల్లీ పాదుషా సేనానియగు హిరాయిత మొహదీనుఖాను చేత ఓడింపబడెను క్రీ శ 1687 న ఢిల్లీ పాదుషాయగు ఔరంగజేబు గోల్కొండ రాజ్యమును జయించెను కాని ఆనాడు గోల్కొండరాజ్యములో శాంతిభద్రతలు మిక్కిలి లోపించెను ఆరాజ్యమునందలి జమీందారులు సామంతులు ప్రభుత్వముపై తిరుగుబాటు చేసిరి ఔరంగజేబు దానిని అణచి ఎట్లో శాంతిని నెలకొల్పెను

క్రీ శ 1707 లో ఔరంగజేబు మరణించెను అతనికి ఎమ్మట అతని కుమారుడు మొఅజ్జం అనునతడు బహదూరుషా అను పేరుతో చక్రవర్తియయ్యెను ఈతని యధికారము నామమాత్రముగనుండెను ఢిల్లీ పాదుషాచే దక్షిణదేశమునకు సుబేదారుగా నియుక్తుడైన నిజామ్ ఉల్ ముల్క్ ఆసఫ్‌జా అనునతడు క్రీ శ 1724 న స్వతంత్రుడై హైదరాబాదు రాజ్యమును స్థాపించెను ఈ రాజ్యము పూర్వపు గోల్కొండ రాజ్యమును ప్రతిబింబమన వచ్చును నిజాము ఉల్ ముల్క్ ఆసఫ్‌జాకు ఆరుగురు కుమారులు వారిలో ఘాజీఉద్దీన్ అనువాడు పెద్దవాడు ఇతడు నిజాము మనుమడని విన్‌సెంట్ స్మిత్తు వ్రాసెను ఇతడు మొగలాయి ఆస్థానమున తండ్రికి ప్రతినిధియై ఢిల్లీలో నివసించుచుండెను క్రీ శ 1748 లో ఆసఫ్‌జా కడు వృద్ధుడై మరణించెను ఆసఫ్‌జా రెండవ కుమారుడు నాసిర్‌జంగు ఇతడు మొగలాయి చక్రవర్తి ఆమోదమును పొంది దక్కను సుబాను పాలించుచుండెను మొగలాయి చక్రవర్తి ఈతనికి నిజామ్‌ఉద్‌దౌలా అను బిరుదమునిచ్చెను ఢిల్లీయందు మహమ్మదుషా 1719-48 నడుమను అహమ్మదుషా 1748-54 నడుమను నామమాత్రపు చక్రవర్తులుగా ఉండిరి ఆసఫ్‌జాకు ముజఫర్‌జంగ్ అను దౌహిత్రుడు కలడు ముజఫర్‌జంగు బీజపూరు ముఖ్యపట్టణముగా కర్ణాటకమునందొక భాగమునకు గవర్నరుగా ఉండెను అతడు దక్కను రాజప్రతినిధి పదవికై ప్రాకులాడుచు డూప్లే అధిపత్యములోనున్న ఫరాసువారి సాయమర్థించెను నాసిర్‌జంగుకు ఆంగ్లేయులు సహాయకులైరి ఇరుపక్షముల వారికి

పోరాటము జరిగెను. తుదకు నాసర్‌జంగుకు విజయము లభించెను.

భారతదేశము వ్యాపారముకై వచ్చిన పాశ్చాత్యులు పదునెనిమిదవ శతాబ్దిలో ప్రబలులై భారతదేశమున రాజ్యసంపాదనముకై ప్రయత్నించుచుండిరి. వారిలో ఆంగ్లేయులు మద్రాసులో కోట కట్టుకొని స్థిరపడిరి. ఫ్రాన్సువారు వ్యాపారమొనర్చు మచిలీపట్టణమున కోటను కట్టుకొనిరి. ఆత్మరక్షణముకై వీరు సైన్యమును గూడ సిద్ధమొనర్చుకొనిరి. ఈ కాలమున దక్షిణమున ఆంగ్లేయులకు మద్రాసు, ఫ్రెంచివారికి పుదుచ్చేరి కేంద్రములుగా నుండెను. బంగాళరాష్ట్రమున ఆంగ్లేయులకు కలకత్తాయును, ఫ్రెంచివారికి చంద్రనగరమును కేంద్రములు. ఫ్రెంచివారును ఆంగ్లేయులును అంతఃకలహములతో కొట్టుమిట్టాడు భారతీయ ప్రభువులలో చేరి యొక పక్షమునచేరి వారికి సాయమొనర్చి దానికి ప్రత్యామ్నాయముగ కొంత రాజ్యమును సంపాదించుకొనుచుండిరి. ఈ ఇరుతెగలవారు హిందూదేశపు సిపాయిలకు క్రమశిక్షణము నిచ్చి సైన్యమును అభివృద్ధిచేయుచుండిరి. దేశీయరాజుల అన్యోన్యకలహములలో జోక్యము కలిగించుకొని వీరు తమ పలుకుబడిని అధికారమును ధనసంపాదనమును అధికమొనరుచుకొనుచుండిరి. క్రీ.శ. 1748లో నిజామ్ ఉలుముల్క్ అసఫ్‌జా మరణించినపుడు హైదరాబాదు రాజ్యమున కలిగిన అంతఃకలహములలో ఫ్రెంచి గవర్నరు డూప్లే జోక్యము కలిగించుకొని అతని సేనానాయకుడగు బుస్సీ ద్వారా అసఫ్‌జా దౌహిత్రుడగు ముజఫరుజంగును, అతనికి ఎమ్మట అసఫ్‌జా కుమారుడు సలాబత్‌జంగును నిజాముగ ఒనర్చెను. ఆ సాయమునకు ప్రత్యామ్నాయముగ ముస్తాఫానగర్ (కొండపల్లి) ఏలూరు రాజమహేంద్రవరము శ్రీకాకుళము సైన్యవ్యయమునకు భరణముగ ఫ్రెంచివారు సర్కారులను నిజామువలన పొందిరి. ఆనాటి పరిస్థితి ఇట్లుండెను.

ఇట్టి స్థితిలో ఢిల్లీ పాదుషాయగు అహమ్మదుషా ఆజ్ఞలను లక్ష్యపెట్టక నిజాము రాజ్యపాలకుడగు నాసర్‌జంగు ప్రవర్తించుచుండెను. ఈతని మదమునణచుటకై ఢిల్లీ పాదుషా హిరాయిత మొహదీనుఖాను అను తన సేనానిని సైన్యముతో పంపెను. మొహదీనుఖానుడు మధ్యమార్గమున దలి శత్రువులను ఎదుర్కొనుచు వారిపీచమడచుచు క్రమముగా పుదుచ్చేరి చేరెను. గవర్నరగు డూప్లే సాయమతడు అర్థించెను. ఆనాడు పరాసువారికి మిత్రుడైన విజయానందరంగనృపాలుడు ఈ విషయమును డూప్లేకు విన్నవించి ఢిల్లీసేనానికి సాయమొనర్చ ఆయన అనుమతి వడసెను. రంగనృపాలుడు ఆంగ్లేయులచే చెరబట్టబడిన చందాసాహేబును విడిపించెను. పుదుచ్చేరినున్న రజాసాహేబుకు నవాబుపదవి ఇప్పించెను. సహాయకులగు బారుసిపాయిలు ఫ్రాన్సుసోల్జారులు చందాసాహెబు హిరాయిత మొహదీనుఖానుడు యవనసైన్యము వెంటరాగా నాసర్‌జంగును జయించుటకు విజయానందరంగరాజు బయలుదేరెను. శత్రుపక్షీయుడగు అన్వర్దిఖానుని అతని ఫౌజును నిముసములో వీరు జయించిరి. మధుర తంజావూరు మైసూరు యిక్కేరి మున్నగు సంస్థానములను వీరు వశమొనర్చుకొనిరి. బుదునాపురి నావరించుకొనియున్న నాసర్‌జంగుపై వీరుపడిరి. నాసర్‌జంగు లక్షగుర్రములతో పెద్దదండుతో కదనమునకు సిద్ధముగ నుండెను. నాసర్‌జంగుకు సహాయకులుగ గులాం హుఘమహమ్మదుఖానుడు తురకతమాఘఖానుడు అబుసిధుఖానుడు అనువారు గొప్పసైన్యముతో వచ్చిరి. ఢిల్లీ సేనాని మొహదీనుఖాను వీరినందరిని ఓడించి మహమ్మదు అబరాల్ యొక్క పాళయమును నెత్తగొట్టెను. ఇట్లు వీరు శత్రువును చీల్చిచెండాడి నాసర్‌జంగు సైన్యమున ప్రవేశించి దానిని పీనుగుపెంటగావించిరి. తుదకు ఢిల్లీసేనాని నాసర్‌జంగుకు చిక్కెను. అతని విడిపించుటకై విజయానందరంగనృపాలుడు అనేక తంత్రములు పన్ని తుదకు నాసిరుజంగు దండును నాశనమొనర్చి అతని గర్వమడచి హిరాయిత మొహదీనుఖానుని చెరవిడిపించి అతని నిజాముపట్టణ పాలకుడుగ ప్రతిష్ఠించెను. రంగరాయని శౌర్యధైర్యములకు అబ్బురపడి మొహదీనుఖాను రంగరాయనికి వజారత రాయడు అను బిరుదము చెంగిలిపట్టుసెల్లా జాగీరు నవపత్తుమాయిమరాతము మున్నగు రాజశాసనములను బహుమతిగా ఇచ్చెను. డూప్లే రంగరాయని అనేకవిధముల స్తుతించెను. ఈవిధముగ అబుసిధుఖానుడు సమరమున అపజయము నొందినను అతని స్వామిభక్తి చిరస్థాయిగ నిలిచెను.

కస్తూరి రంగకవి కథనమునందు ప్రధాన చారిత్రకాంశములు యథాతథముగనే ఉన్నను అతడు పేర్కొనిన వివరములు గుర్తింపరాకున్నవి. ఇప్పుడు ఢిల్లీ సామ్రాజ్యము దుష్టులను క్రూరులును అసమర్థులును అగు చక్రవర్తుల పాల

బడెను. క్రీ.శ. 1707 లో ఔరంగజేబు మరణించినది మొదలు 1719 వరకు ఛాయామాత్రులైన ఐదుగురు చక్రవర్తులు పేరునకు సింహాసనమధిష్ఠించుచు దుర్మార్గగణము పాలించుచువచ్చిరి. మహమ్మదుషా క్రీ.శ. 1719 లో చక్రవర్తియై 1748 వరకు ఎట్లో ప్రాణములు దక్కించుకొనెను. ఈతని దీర్ఘపరిపాలనమున మొగలు సామ్రాజ్యము ఢిల్లీనగరము పెక్కుకడగద్లుకు పోయెను. 1748 లో మహమ్మదుషా మరణించగా అతని కుమారుడు అహమ్మదుషా ఢిల్లీ చక్రవర్తి అయ్యెను. ఆ ఫ్ మనమడగు ఘాజీఉద్దీను సామ్రాజ్యమునకు వజీరుగా నియమింపబడెను. ఇతడు 1754 లో అహమ్మదుషాను సింహాసన భ్రష్టుని కావించి కన్నులు ఊడ పెరికించెను.

జామునకు మారుడగు నాసిర్ జంగు గొప్పసైన్యముతో ముజఫరుజంగుపై దండెత్తి వాని నోడించెను. ఈతని పక్షము వహించిన వారిలో కర్నూలు నవాబు హిమ్మత్ బహదూరు ఖాను, కడపనవాబు మోచామియా, సవనూరునవాబు అబ్దుల్ కరీ ఖాను మున్నగు వారుండిరి. కస్తూరి రంగవి పేర్కొన్న గులాం హుసుఖాను, అబుసి ధుఖాను మున్నగు వారిని గుర్తించుట సాధ్యపడలేదు. కడప కర్నూలు నవాబులు మొదట నాసిర్ జంగు పక్షము వహించియు తరువాత ద్రోహులై 1750 సంవత్సరమున నాసిర్ జంగును హత్యచేసి ముజఫరు జంగును రాజుగా ప్రకటించిరి. వారి దౌష్ట్యము ఇంతటితో ఆగలేదు. 1751 సంవత్సరమున వారు ముజఫరు జంగును లక్కారెడ్డిపల్లివద్ద వధించిరి. ఈ కుటిలరాజనీతి పథము దుష్ప్రవర్తించువారికిని వారివద్ద ఉద్యోగియైన ఆనంద రంగపిళ్ళైకును తాత్కాలిక విజయములు లభింపకపోలేదు.

తం. అం. శా.

ఖం. ల. రం.

## అబ్దుర్ రజాక్

క్రీ.శ. 15 శతాబ్ది మధ్యకాలమున దక్షిణ భారతమునకు విచ్చేసిన రాయబారులలో అబ్దుర్ రజాకు ఒకడు. ఈయన పూర్తి పేరు "కమాలుద్దీన్ అబ్దుర్ రజాక్ బిన్ జలాలుద్దీన్ ఇసాక్ సే సమరఖండీ" అనునది. పర్షియాదేశమందలి హీరట్ నగరము ఇతని జన్మస్థానము. తన తండ్రి జలాలుద్దీను వలెనే ఇతడు కూడ అరబ్బీ భాషయందు పండితుడు. తండ్రి కుమారులు ఇరువురును పారశీక చక్రవర్తియగు షారూఖ్ కొలువునందుండిరి. క్రీ.శ. 1442 సంవత్సరములో తన ప్రభువగు షారూఖ్ ఆదేశమును అనుసరించి మలబారు తీరమున ఉన్న కాలికట్టులోని జామొరిన్ యొక్క ఆస్థానమునకు అబ్దుర్ రజాకు రాయబారిగా వచ్చెను. ఇతని పర్యటనానుభవములను వర్ణించు గ్రంథము పేరు మత్లా ఉస్ సాదైన్. ఇందు విజయనగర సామ్రాజ్యమునకు చెందిన పెక్కు అంశములు ఆకర్షకముగా వర్ణింపబడినవి. దక్షిణదేశమందలి భిన్నమతసంప్రదాయముల, జనుల కట్టుబొట్టులు, నీతినియమములు ఈయన చక్కగను విపులముగను వర్ణించెను. ముఖ్యముగా ఆనాటి దక్షిణపథము నందలి రాజ్యములలోని పట్టణములలో నెల్ల [illegible]కటమైన విజయనగరము యొక్క ప్రాభవ వైభవములను గూర్చి సమగ్రముగా తెలిసికొనుటకు ఇతడు వ్రాసిపెట్టిన కవిలెకట్ట మనకు ఎంతయు ఉపయోగపడుచున్నది.

కాలికట్టులోని ప్రజలు చాలా విశ్వసనీయులు. కాని వారి ఆకృతులు అబ్దుర్ రజాకునకు రోత కలిగించినవి. అచటి ప్రజలు నడుమునకు ఒక గోచిని మాత్రమే కట్టుకొని వస్త్రవిహీనులుగ నుండిరి. రాజు కొలువులో కూడ అదిగంబరమూర్తులే అయినను ప్రత్యేకమైరి. జామొరిన్ ప్రభువు చక్కగా అలంకరింపబడిన దర్బారు మహలునందు రెండు మూడు వేలమంది [illegible]తో సుఖాసీనుడై యుండెను. తాను తీసికొనివచ్చిన కానుకలనుండి ప్రత్యేకించి చక్కగా అలంకరింపబడిన ఒక గుర్రమును బుటేదారు జరితో అల్లబడిన ఒక టోపీని ఒక రత్నకంబళమును రజాకు రాజునకు బహూకరించెను.

కాలికట్టులో అదివరకే పెక్కుమంది మహమ్మదీయులు అబిసీనియా మొదలగు దేశములతో వ్యాపారము చేయుచు నివసించుచుండిరి. రెండు మసీదులు కట్టుకొని అందు ప్రతి శుక్రవారమునను వారు ప్రార్థనలు సలుపుచుండిరి. దోపిడి భయములేక వారు శాంతియుత జీవితమును గడిపెడివారు. కాలికట్ వాస్తవ్యులు సముద్రవ్యాపారమున ఆరితేరినవారు. వీరు మిరియములు విశేషముగా ప్రాగ్దేశములకు ఎగుమతి చేసెడివారు. ఈ ప్రాంతమున గోవధ నిషేధింపబడినది. ఈ నిషేధాజ్ఞను ఉల్లంఘించిన వారలకు మరణశిక్ష విధించెడివారు. కొంత కాలమైన తరువాత విజయనగర ప్రభువు అబ్దుర్ రజాకునకు తన పట్టణము దర్శించవలసినదని ఆహ్వానము పంపెను. కాలికట్టునందలి జామొరిన్ రాజు స్వతంత్ర ప్రతిపత్తి

కలవాడైనప్పటిని విజయనగరాధిపతి ఆహ్వానమును పంపించి అబ్దుర్ రజాకును వెంటనే బయలుదేరి వెళ్లవలసినదని కోరెను

ఒక సుముహూర్తమున అబ్దుర్ రజాకు కాలికట్టునుండి ఓడమీద ప్రయాణము జేసి మంగళూరునకు చేరెను అచటినుండి బయలుదేరి అతడు మైసూరు రాష్ట్రములోని బేలూరునందును తదితర పట్టణములందును మజిలీలు చేసికొనుచు విజయనగరము చేరెను మార్గమధ్యమునగల పట్టణములందలి దేవాలయములను అందలి శిల్పచాతుర్యముతో చేయబడిన విగ్రహములను చూచి అతడు నివ్వెరపడెను బేలూరు పట్టణములోని సామాన్య గృహస్థుల కట్టడములు కూడ ఆతనికి పెద్ద రాజభవనములవలె కనపట్టినవి అచ్చటి స్త్రీలు ఆయన కంటికి అప్సరసలవలె కనబడిరి ఆయన చేసిన ఒక దేవాలయపు వర్ణనలనుబట్టి అది శిథిలమై నిలిచియున్న బేలూరునందలి సోమనాథేశ్వరుని దేవాలయమైయుండునని చారిత్రికులు అభిప్రాయపడిరి ఈ దేవాలయమును క్రీ॥ శ॥ 1117 స॥లో హోయసలరాజగు బిట్టిగ నిర్మించెను ఈ దేవాలయమునందు సాయంసంధ్యాకాలమున భగవదారాధనము ముగియుటయే తడవుగా నృత్యగీతములు వలిపి విందు చేసెడివారట ఈ దేవుని ధూపదీప నైవేద్యములకై కొందరు పట్టణధనికులు దానధర్మములు చేసిరి

అబ్దుర్ రజాకు విజయనగరమునందు ప్రవేశింపనున్నాడు అను విషయము తెలిసికొని విజయనగర ప్రభువు సగౌరవముగా ఆతనిని ఎదుర్కొని ఆతనిని అతిథిగృహమున ప్రవేశపెట్టెను అబ్దుర్ రజాకు దృష్టి విజయనగరమునందలి ప్రతి చిన్న విషయముపైనను ప్రసరించినది కావున ఆతని గ్రంథము ఆ నగరపు ప్రఖ్యాత వర్ణనలతో నిలిచియున్నది అబ్దుర్ రజాకును ఆహ్వానించిన విజయనగర సామ్రాజ్యాధినేత ప్రౌఢదేవరాయలు ఈయనకు ఇమ్మడి దేవరాయలు గజబేంట దేవరాయలు అను నామాంతరములు కలవు గొప్ప శౌర్యవంతుడగుటవలన పూర్వపశ్చిమ సముద్రములు ని హాళము గుల్బర్గా ఈయన రాజ్యపుటెల్లలై ఉండెను దేశాంతరములతో సముద్ర వ్యాపారము చేయుటవలన విజయనగరసామ్రాజ్యము అత్యంత భాగ్యవంతమయ్యెను ఈ రాజ్యము క్రింద ఉన్న 300 రేవుపట్టణములలో వర్తకవ్యాపారమునకు ప్రసిద్ధిచెందిన గోవా రేవు దేవరాయల అధీనముననే ఉండెను ఈ రేవుద్వారా గొప్ప ఎగుమతులు దిగుమతులు జరుగుచుండెడివి రాజ్యమునుండి ఎగుమతి చేయబడు సరకులలో బట్టలు బియ్యము ఇనుము చక్కెర సుగంధద్రవ్యములు ముఖ్యమైనవి దిగుమతులలో గుర్రములు ఏనుగులు ముత్యాల కుంకుమ చీనాపట్టు మఖ్మల్ మొదలగు సరకులు చెప్పుకొనదగినవి

అబ్దుర్ రజాకు వర్ణనలనుబట్టి విజయనగరము సప్త ప్రాకారములతో కట్టబడిన గొప్ప పట్టణము వలయాకారముగా 18 మైళ్ళ విస్తీర్ణముతో ఇది కొండనానుకొని నిర్మితమైనది తుంగభద్రానది నగరి పొంతనుండి ప్రవహించుచున్నది చూచువారికి పర్వతములవలె ఉన్నతములై భయంకరముగానుండు ఏనుగులు 1000 కి మించి ఈ నగరమునందుండెడివి రాజు కాల్బలము 11 లక్షలకు మించియుండెను రాత్రి దివములు రక్షకభటులు నగరమును కాపాడుచుండిరి ఏడవ ప్రాకారమందు రాజభవనములుండెను మొదటి ఒకటి రెండు ప్రాకారముల మధ్య ఉండు స్థలమున పొలములు పుష్పఫల శోభితమైన తోటలు పెద్దదిగుడు బావులు ఉండెను ఏడవ ప్రాకారమున రాయల సౌధమును అనుకొని నాలుగు రాచబాటలు ఉండెను వీటికి ఇరుప్రక్కల క్రిక్కిరిసి విస్తరించిన ఇండ్లు అంగళ్లు అంతర్వీథులు ఉద్యానవనములు ఉండెను ప్రతి రాజవీధికి ముందు ఎత్తైన తోరణద్వారములుండెను రాజవీధికి ఇరువైపుల పరిమళమును వెదజల్లు నానావిధ పుష్పములు అమ్మబడుచుండెను వీథులలో ఇసుక వేసిన రాలకుండునట్టి జనసమ్మర్దము ఉండెను అందు బండ్లను పల్లకీలను అశ్వములను ఏనుగులను అధిష్ఠించినవారు రాజకార్య నిమగ్నులై తిరుగుచుండిరి గులాబీ పుష్పములు ఈ దేశీయులకు ప్రాణసమానములు పుష్పాలంకరణము స్త్రీ పురుషులకు అత్యంతావశ్యకముగను ప్రీతిపాత్రముగను ఉండెను అంగడి బజారులో వజ్రవైడూర్యాది రత్నములను రాసులుగా పోసి వర్తకులు అమ్ముచుండిరి భాగ్యవంతుల యొక్కయు కూలినాలిచే బ్రతుకు పేద జనులయొక్కయు చేతులు మెడలు చెవులు అమూల్యరత్నాభరణములచే అలంకృతములై యుండెడివి

రాయల సౌధమునకు కుడివైపున ప్రధానసభామంటపముండెను ప్రధానద్వారమునకుముందు ఒక ఖోజ్జా కాపలాదారుగా ఉండెను లోపలికి పోవువారు ఈతని అనుజ్ఞను పొందవలెనను నియమముండెను మండపమునందు అడుగడుగునను ఒక చోపుదారు ఉండెను ఇతడు నడుమునకు రంగు

మూలల దు తెల్లవారు టకుమున్న జయమ గళధ్వనులు విని చెదివి చక్కగా అలంకరించబడిన 1000 ఏనుగులను రాజాంతఃపురము కు ముందున్న పెద్ద మైదానములో వరుసగా లబెట్టె వారు మైదానము కు అతిదూరమున ప్రేక్షకుల కొరకు డేరాలు నిర్మించెడివారు వీటి వెనుకభాగములో తొమ్మిది అంతస్తుల రమణీయమ డపము నిర్మించబడుచు డెడిది ఆ తొమ్మిదవ అంతస్తుమీద బంగరు సింహాసనముపై రాయలు కూర్చుండి దర్బారు వేడుకలను తిలకించెడివారు

ఆధ్యాత్మిక చింతన విద్వత్తు వైదిక ధర్మాచరణముగల బ్రాహ్మణులు రాయలవలన ఎక్కువ పూజలను పొందుచుండిరి పండుగ మొదటిరోజు పరమేశ్వరికి వేదమంత్ర పఠనముతో పూజలు జరిపెడివారు వేడుకమంటపానికి రాజాంతఃపురానికి మధ్యమందు ప్రదేశముగ పగటివేషగాండ్రు గారడీవారు కథలుచెప్పువారు గాయకులు తమనైపుణ్యమును ప్రదర్శించుచుండిరి భోగపుసానులు పరరత్నాభరణములతో మంచి ముత్యాలహారములతో అలంకరించుకొని అపూర్వసౌందర్యముతో రాయలవారి ముందటనే ఒక ఉల్లిపొరవంటి తెర చాటున కూరు డెడివారు అబ్దుర్ రజాకునకను ఆయన దేశమునుండి వచ్చిన వ్యాపారస్థులకను ఈ దృశ్యమును చూచుటకై ప్రత్యేకమందిరములు ఏర్పాటుచేయబడెను

అన్ని క్రీడలలోను ఏనుగునృత్యము అత్యంత ఆకర్షకముగాను డెడిది లావైన పెద్దదూలములు నిలువులుగాను లావైన పెద్దదూలపుముక్కలు మెట్లుగాను అమర్చబడిన బ్రహ్మాండమైన చ్చెనపైకి నుగులు వెనుక మ్రోగుచున్న వాద్యధ్వనులతో ప్రోత్సాహిం పబడి విలాసముగా ఒక్కొక్క మెట్టునెక్కుచు ప్రదర్శించిన సొగసు (నృత్యము) ప్రేక్షకులను ఆశ్చర్యానందభరితుల నొనర్చెడిది

రాత్రివేళ చాల ప్రొద్దుపోవువరకు కాల్చబడిన బాణసంచా చిత్రవిచిత్రమైన వర్ణములను విరజిమ్ముచు అపూర్వ నేత్రానందకరమగుచు డెను పండుగ తుదిరోజున రాజదర్బారులో ఒక పెద్దసభ జరిగెడిది ఆ సమయమున దర్బారులోని కల్యాణమంటప మంతయు బంగరురేకులతో అలంకరింపబడెడిది మణినిర్మిత సింహాసనముమీద రాయలు ఆసీనులై యుండెను సామంత ప్రభువులు సర్దార్లు హోదెదార్లు వారివారి అర్హతలను అనుసరించి రాయలచే సత్కరింపబడె వారు ఏనుగులను కొజ్జాలను బహుమతిగా పెర్షియా చక్రవర్తికొరకై తీసికొని

పొమ్మని రాయలు అబ్దుల్ రజాకును కోరెను

అబ్దుర్ రజాకునకు కాలక్రమమున రాయలతో ఏర్పడిన పలుకుబడినిగూర్చి తెలిసికొనియు ఆయనకు జరుగుచున్న సన్మానములను చూచియు అతని దేశస్థులు ఓర్వలేకపోయిరి ఆయన పాచే నియుక్తుడైన రాయబారికాడనియు తమవలెనే ఒక వ్యాపారస్థుడనియు వారు అతనిపై ప్రతికూల ప్రచారముచేసి మహామాత్యుని ని ఆయనద్వారా రాయలవారి ని తెలియపరచిరి దీని పరిణామముగా రాయలకు తనయందలి స్నేహము కొంత సన్నగిల్లినమాట నిజమే అని అబ్దుర్ రజాకు ఒప్పుకొనెను

విజయనగర సామ్రాజ్యము సర్వసౌఖ్యములకు ఆకరమై ప్రపంచమందలి పట్టణములలో నెల్ల విశేషఖ్యాతిని గడించినదనియు రాయలు ఉత్తమ ఆదర్శములుగల ప్రభువనియు రజాకు వర్ణించెను విజయనగర వైభవము నమసిపోయినను అబ్దుర్ రజాకు వ్రాసిపెట్టిన అనాటి విజయనగర చారిత్రకాంశములు శాశ్వతముగా నిల్చియున్నవి

కొ వెం

## అబ్దుర్ రజాక్ లారీ

గోల్కొండ దుర్గమును మొగలాయి సేనలనుండి పరిరక్షించుటలో అద్వితీయ పరాక్రమమును చూపిన శౌర్యశాలి అబ్దుర్ రజాక్ లారీ ఈయన కార్యరంగమున ప్రవేశించుటకు ముందు గోల్కొండ ఉదంతమును పరిశీలింతము

గోల్కొండ రాజ్యమును పాలించిన సుల్తానులలో కడపటివాడు అబుల్ హసన్ తానాషా అహమ్మదునగరు రాజ్యము క్రీ శ 1685 వరకే మొగలుల వశమయ్యెను ఈయన గోల్కొండ సింహాసనమును క్రీ శ 1672లో అధిష్ఠించి 15 సంవత్సరములు పాలనచేసెను సమకాలిక చరిత్రకారులీయన రాజకార్య ధురంధరుడనియు న్యాయబుద్ధిగలవాడనియు అనుపమ సద్గుణసంపన్నుడనియు పరమత సహిష్ణుతాయుతుడనియు వర్ణించిరి గోల్కొండలోని భోగభాగ్యములు ఢిల్లీ పాదుషాలకు కనుకుట్టినది గోల్కొండను వశపరచుకొని మొగలాయి సామ్రాజ్యమున కలుపుకొనుటకు వారు అనేక ప్రయత్నములుచేసిరి దీనికితోడు రాజధానియగు గోల్కొండలో అంతఃకలహములు కుట్రలు రాజ్యవినాశమునకు దారితీసినవి అబ్దుల్లాకుతుబుషా రాజ్యముచేయు కాలముననే మొగలాయిపాదుషా ఔరంగజేబు రాజ్యవిస్తరణము ధ్యేయముగా

పెట్టుకొని గోల్కొండ రాజ్యమునేగాక బీజాపూరు రాజ్యమును కూడ కబళింప నూహించెను. దక్కను రాజ్యముల గుట్టుమట్టులు తెలిసిన గోల్కొండ సుల్తానుల కొలువుందున్న మహమ్మదు సయ్యదు మీర్ జుమ్లా అనునతడు ఔరంగజేబు పక్షమును చేరెను. క్రీ.శ. 1656వ సంవత్సరమున ఔరంగజేబు కుమారుడు షా ఆలం నాయకత్వమున మొగలు సైన్యములు హైదరాబాదును ముట్టడించి దోపిడి దహనములు చేసినవి. ఇట్టి ఘోరకృత్యములను చూచి సహింపజాలక అబుల్ హసన్ శాంతిని కోరుచు హీనమైన సంధికి ఒడంబడెను.

అవమానకరమైన ఈ సంధి షరతులకు శాంతిభద్రతల దృష్ట్యా అబుల్ హసన్ తలయొగ్గి తూచతప్పకుండా పాటించినప్పటికిని ఔరంగజేబునకు మాత్రము ఈ సంధి తృప్తిని కలిగించలేదు. ఔరంగజేబు బీజాపూరును వశపరచుకొని తన యావద్దృష్టిని గోల్కొండమీద కేంద్రీకరించెను. ఈలోపుగా అక్కన్న మాదన్నలు మొగలు చక్రవర్తి తృప్తికొరకై వధింపబడిరి. నిష్కారణముగా గోల్కొండనాక్రమించుట మానవత్వముకాదని ఔరంగజేబునకు తెలియును. మొగలు చక్రవర్తులు మహమ్మదీయులైయుండియు మహమ్మదీయ సుల్తానులుండు బీజాపూరు గోల్కొండలమీద పగబూనుట ఇస్లాము మతమునకు విరుద్ధమని మౌల్వీలు ఔరంగజేబునకు హితమును బోధించిరి కాని ప్రయోజనము లేకపోయినది. పైగా తన క్రౌర్యమును మరుగుపరచుటకై తన చేతలు సక్రమమైనవే అనియు మతవిశ్వాసములేనివాడనియు హిందువుల పక్షపాతి అనియు మహారాష్ట్రులతో చేతులు కలుపుచుండెననియు ఎప్పుడు విషయలంపటుడై భోగములందు మునిగితేలుచుండుననియు చక్రవర్తి అబులుహసనుపై నేరారోపణలు చేసెను.

గత్యంతరములేక అబుల్ హసన్ తన రాజ్యమును రక్షించుట కొరకు యుద్ధ ప్రయత్నములు చేయవలసివచ్చినది. శత్రు సైన్యముల నెదుర్కొనుటకును గోల్కొండ రక్షణకును సర్వాధికారిగా షేక్ మినాజు అనబడు అబ్దుర్ రజాక్ లారీ అను గొప్ప యోధుని నియమించెను. మొగలు సైన్యములు ఉప్పెనవలె వచ్చి 1687 సం. 28వ తేదీని గోల్కొండకోటను ముట్టడించినవి. బైటనుండి కోటను రక్షించుచున్న 40 వేలమంది గోల్కొండ వీరులతో మొగలుసేనలు తలపడవలసివచ్చెను. ఈ పోరాటములో పెక్కురు మొగలు సైనికులు మరణించిరి. సైన్యముల వెంటనున్న రాకుమారుడైన షాఆలము యుద్ధములో జరిగిన నష్టమును చూచి అబుల్ హసనుతో సంధికి ప్రయత్నించెను. ఈ నిశ్చయము ఔరంగజేబు చక్రవర్తికి తెలిసి షాఆలమును అతని భార్యను చెరయందుంచెను. ఇక మొగలు సైన్యములను నడుపు భారము ఫిరోజ్ జంగ్ భుజస్కంధములపై బడెను. 1687 సం. 6 మే తేదీన మధ్యరాత్రమున గోల్కొండ పహారీలు గాఢనిద్రయందుండెను. అట్టి సమయమున నిచ్చెనలు మోకుత్రాళ్లు మున్నగువాని సహాయముతో గోడలను దాటి కోటలో ప్రవేశించుటకు మొగలు సైనికులు ప్రయత్నించిరి. వారలు చేయుచున్న ప్రయత్నముల ధ్వనులను విని కోటయందలి కుక్క అరచి మొరగుటను విని వెంటనే గోల్కొండ సైనికులు మేల్కొని శత్రువులను తరిమి తరిమి వారిలో అనేకమందిని చంపివైచిరి. ఆ కుక్క చేసిన సహాయమునకు దాని మెడకు బంగారుగొలుసు గట్టి దానికి ఫిరోజ్ జంగ్ అని పేరు పెట్టిరి.

మొగలులు కోటను ముట్టడించి ఇప్పటికి ఆరుమాసములైనది. గత రెండేండ్లుగా దేశమునందు వర్షములు లేకపోవుట వలన పంటలు లేకపోవుటవలన మరాటీ దండుల ముట్టడుల వలన ఆహారము కొరత ఏర్పడినది. ఈలోపుగా కుంభవృష్టిగా వానలు కురియుటవలన మార్గములు సరిలేక ఆ స్వల్పముగా వచ్చెడి ఆహార దినుసులకు కూడ అవరోధమేర్పడినది. వానల వలన మొగలు సైనికుల స్థావరములు వారి యుద్ధ సన్నాహములు చిందరవందర అయినవి. ఈ అదను చూచి గోల్కొండ సైనికులు పెద్దపెట్టున పోరు సాగించి అనేకమంది శత్రు సైనికులను మట్టుపెట్టిరి.

ఇంత నష్టము కలుగుచున్నను ఔరంగజేబు పాదుషా కొంచెమైనను చలించలేదు. అబుల్ హసన్ తానాషా రెండవమారు శాంతినికోరుచు చక్రవర్తికి ఈ క్రిందివిధముగా లేఖను వ్రాసెను.

కోట మీ స్వాధీనమైనను పాలనాతంత్రాంగము నాకు వదలివేయుడు. ఇదివరకే దేశము దుర్భిక్షము పాలైయున్నది. నాదేశమును ప్రజలను నేను ప్రేమించునట్లు ఇతరులు ప్రేమించలేరు. మీరు వచ్చినపుడెల్ల కోటిరూపాయలు నజరానా చెల్లింతును. ఇదివరలో మీకు జరిగిన నష్టములకు పరిహారమిచ్చెదను. ఈ ప్రార్థనకు కారణములు అనేకమంది మీవలె ముసల్మానులు నిహతులగుట. వారి సంసారములు అకారణముగా నాశమగుట న్యాయముకాదు.

ఇట్లు అబుల్‌హసన్ పక్ష ప్రార్థన ఔరంగజేబునకు ప్రకోపమునకు కారణమయ్యెను "నిజముగా అబుల్‌హసన్ శాంతిని కోరువాడైనచో నాసమక్షమునకు చేతులు జోడించి ఎదుటకురాడు అట్లు రాకున్నచో అతని చేతులకు బేడీలు వేయించి తీసుకునిరండి" అని చక్రవర్తి వ్రాసిచ్చెను

కోట చుట్టును కందకములు త్రవ్వి మొగలు తుపాకులకు కోటవైపునకు సంధి చేసిరి 1687 సం॥ జూను 20వ తేదీన భారీ ఎత్తున కోటముట్టడి జరిగినది ముఖ్యసేనాని అబ్దుల్ రజాక్‌లారీ అప్రమత్తతవలన మొగలాయి సైన్యములు వీగిపోయెను దానికితోడు కుంభవృష్టివలన నదీప్రవాహములు వెల్లివిరిసి మొగలాయీల ముట్టడికై చేసిన విశ్వప్రయత్నములను తుదముట్టించెను మొగలాయీల బందూకులు ప్రవాహములో కొట్టుకొనిపోయెను సమయము దొరకినదికదాయని గోల్కొండ సేనలు శత్రుసైన్యములను చీకాకుపరచెను

చేయునదిలేక మొగలులు ద్రోహచింతతో రహస్యముగా కోటను ఆక్రమించుటకు తలపెట్టిరి ఇంతకు మునుపే ముఖ్య సేనానాయకులైన ఇబ్రహీం ఖలీలుల్లాఖాను షేక్ మిన్హాజ్ అనువారలు మొగలాయీల లంచమునకు ఆశపడి వారి తరపున చేరిరి ఇక కోటను వేయికన్నులతో కాపాడుచున్నవారు అబ్దుల్ రజాక్ లారీ అబ్దుల్లాఖానుపున్నిఅనువారే వీరలనుకూడా మొగలులు తమతో కలుపుకొనుటకు విశ్వప్రయత్నములు జరిపిరి తమలో చేరినచో 6000 దళమునకును వేయి గుర్రములకును అధ్యక్షునిగ చేతుమని అబ్దుల్ రజాక్ లారీకి ఆశ చూపుచు లేఖను వ్రాసిరి జీవితమంతయు ఇంతవరకును స్వామిభక్తితో గడపిన రజాక్ ఉత్తరమును చూచి దానిని తుత్తునియలుగా చేసి రౌద్రముతో ఈప్రకారము పలికెను ఇప్పుడు జరుగుచున్న సంగ్రామము కరబాలా మైదానమునందలి యుద్ధమువంటిది నా ప్రాణమున్నంతవరకును అవినీతి మార్గము అనుసరించను రెండువేలమంది వలె ప్రవర్తింపను వారలు ఇమామునకు సహాయమొనర్తుమని భగవంతుని సాక్షిగా ప్రమాణముచేసి తుదకు ఇమాంమీదికి కత్తులుత్రిప్పి ఆతనిని స్వర్గస్థుని చేసిరి నిశ్చలమైన భక్తివిశ్వాసాలతో ఆయనను అనుగమించిన డెబ్బదిరెండు భక్తుల మార్గాన్ని నేను అనుసరించి ఇహపరములందు శాశ్వతకీర్తిని పొందుదును"

సన్నిహితుడును సహచరుడును అయిన అబ్దుల్లాఖాను మొగలులు పన్నిన వలలో చిక్కుకొనెను వారిచ్చు సిగ్గుమాలిన లంచమునకు వశుడై అర్ధరాత్రమున ముట్టడిదారులు లోన ప్రవేశించుటకై కోట వాకిలి తీసెదనని వాగ్దానము చేసెను ఇతని విశ్వాసఘాతుక కృత్యమువలన గోల్కొండ నామరూపములు లేకుండా మరుగున పడిపోయెను ఇతర రాజభక్తులతోపాటు పున్నికూడా ఈద్రోహమును తలపెట్టక శత్రుపక్షమున చేరకున్నచో కుతుబుషాహీల ఐక్యమునకు భంగము కలుగకుండెడిది ఇతడు కోటలోనే ఉండి విశ్వాసపాత్రుడుగా నటించి శత్రువులకు రాత్రి మూడు గంటలకు కోటద్వారము తెరచినందున ఒక్క త్రుటిలో గోల్కొండలో రక్షణకై చేసుకొనిన ఏర్పాటులు అన్నియు ఖిర్కీ అను నొక చిన్న ద్వారముగుండా ప్రవేశించిరి మొగలులలో ప్రముఖ సైన్యాధ్యక్షులు రుహల్లాఖాను ముక్తారుఖాను రుస్తుంఖాను సావ్‌షికేనోఖాను జానుస్సారుఖాను అనువారలు కోటలో ప్రవేశించి రాజభవనమువైపు తరలిరి వీరిరాకతో కోటలో పెద్ద కలవరము కలిగినది కోట పడిపోవుటను సూచించుచు మొగలులు జయదుందుభులను మ్రోగించిరి ఒక అనుచరుడు గాఢనిద్రాగతుడైన రజాక్ లారీని లేపి విషయమును తెలిపెను లారీ తన తుదికర్తవ్యము నిర్వహించుటకై కొద్దివ్యవధిలోనే చేతికందిన ఆయుధములను సమకూర్చుకొని 12 మంది సైనికులు వెంటరాగా అశ్వారూఢుడై కదనరంగమున కురికెను కాఫీఖానుడను చరిత్రకారుడు రజాక్ లారీ సముద్రములోని కాకిరెట్టలారునను చంద్రభాస్కరుని కిరణములలోని ఒక పుట్టుమచ్చలాగునను ఉండెనని వర్ణించెను లారీ ధైర్యమును కోలుపోక "నా ప్రభువు అబుల్ హసనునకు నా జీవితమును అర్పించెదను" అని పిచ్చివానిలాగ అరుచుచు కత్తిని విసరుచు శత్రుమూకలమధ్యకు దూసుకొనిపోయెను ఒక్కత్రుటిలో అసంఖ్యాకములైన కత్తిపోట్లకు అతడు గురి అయిపోయెను స్పృహతప్పి పడిపోయిన ఆయన అశ్వముకూడా అనేక కత్తిపోట్లకు గురియై రక్తసిక్తమయిన శరీరముతో ఎంతో కష్టముమీద తన యజమానిని నగీనాబాగు అను ప్రదేశమునకు కొనిపోయి ఒక ఈతచెట్టుక్రింద నిలబడినది అబ్దుల్ రజాక్ చెట్టునకు ఆనుకొని భూమిమీదకై పడిపోయి మూడురోజులదాకా స్పృహ లేక అటులే ఉండిపోయెను శత్రువులు మిత్రులుకూడా అతని జాడను తెలిసికొనుటకు ప్రయత్నించిరి ఒక ప్రాతఃసమయమున

అతని మిత్రులు స్వహితప్పుడియున్న రజాకును అమూలాగ్రముగా గుర్తించి అతనిని ఇటచేర్చి గాయాలకు కట్లుకట్టి ఉపచారములు చేసిరి.

ఈలోపుగా అబుల్‌హసన్ తానీషాను బందీగా గొనిపోయిన మొగలులు గోల్కొండ ఖిల్లాను స్వాధీనము చేసికొనుటకు తిరిగెను. ఔరంగజేబు చక్రవర్తి అబ్దుర్ రజాక్ లారీ యొక్క స్వామి భక్తిపరాయణతను శ్లాఘించెను. అతని గాయములు మాన్పుటకు భారతీయ వైద్యులను యూరోపియను వైద్యులను నియమించెను. లారీవంటి మరికొందరు స్వామిభక్తిపరులైన వ్యక్తులు దుర్గమున ఉండియున్నచో ఆ కోట స్వాధీనమగుటకు చాలకాలము పట్టి ఉండెడిదని చక్రవర్తి నుడివెను. లారీ శరీరమునిండా కత్తిపోట్ల గాయములచే అతని దృష్టికూడా లోపించుటచే అవాంతర స్థితి కలిగినది. పదమూడుదినముల తరువాత లారీ కొద్దిగా కళ్ళుతెరచి అస్పష్టముగా మాట్లాడకలిగెను. ఈ విషయము చక్రవర్తి తెలిసికొని ఆనందించెను. తప్పేను మన్నింతునయు అతనిని అతని కుమారులకును రాజలాంఛన గౌరవములు జరుగునియు లారీకి వర్తమానము పంపెను. రజాకు మొగలులతో పొత్తును చక్రవర్తి తలపెట్టిన మర్యాదలను త్రిప్పుపుచెను. "నేను ట్టిదలగల మానవుడను ఇకా నేను వ్యాధినుండి కోలుకొనలేదు. కోలుకొను అవకాశము కూడా కనబడదు. ఒకవేళ నాకు స్వస్థతచేకూరినను అంగవైకల్యముతో నౌకరీచేయుటకు నాకు సామర్థ్యము ఉండదు. అయినను ఒకప్పుడు నా సర్వస్వమును అబుల్‌హసన్‌కు సమర్పించిన నేను అలంగీరుపాదుషాకు ఎట్లు సేవ చేయకలుగుదును" అని తన తిరస్కారభావమును వ్యక్తముచేసెను. చక్రవర్తికి లారీప్రవర్తన ఎక్కువ పరితాపము కలిగించినది. అతడు రెండవమాటు లారీ పూర్తిఆరోగ్యమును పొందెనను విషయము తెలిసికొని తిరిగి తనఆహ్వానమును అతనికి అందజేసెను. ఈమాటుకూడ లారీ ససేమిరా అని ఒప్పుకొనలేదు. పైగా తాను మక్కాకు యాత్రార్థము పోదలచుకున్నట్లు తెలియపరచెను. చక్రవర్తి ఈ తిరస్కారమునకు క్రుద్ధుడై వెంటనే లారీని ఖైదుచేసి తనముందుకు తెమ్మని హుకుం జారీచేసెను. మొగలుసైన్యములకు సర్వసేనాధిపతి అయిన ఫిరోజ్‌జంగుకు ఈ విషయము తెలిసి లారీని రక్షించుటకు సమయము తప్పి ప్రమాదము సంభవించునని భయపడి మధ్యవర్తిత్వమునకు పూనుకొనెను. "కాలము పరిస్థితులు మారిపోయినవి. నీ ఉద్దేశాలు ఎంత ఉదాత్తమైనా కాలానికి అనుగుణముగా వ్యవహరించవలెను. అయినను ఇప్పుడు గోల్కొండ రాజ్యము అనునది ట్లును లేదు" అని ఫిరోజ్‌జంగు లారీకి చెప్పుటకు ప్రయత్నించెను. లారీ పయముల ఔదార్యము కనబరచవలెనని చక్రవర్తికి సూచించెను. అయినప్పటికి లారీ చక్రవర్తి తనకు చేయనున్న సత్కారాలకు ఆశించలేదు. ఒక సంవత్సరమైన తరువాత ఇక పరిస్థితులు మెరుగుపడవని అతడు ఎట్టకేలకు తనకు జరుగనున్న రాజలాంఛనాను గ్రహించక తప్పినదికాదు. లారీ నాలుగువేల ఎబ్బది మూడువేల గుర్రాలు కల సైన్యమునకు అధిపతి ఆయెను. ఖాను అను ఖితాబుతో అనేక గుర్రములతో ఏనుగులతో లారీ సత్కరించబడెను. లారీ రెండు సంవత్సరములపాటు విముఖతతో మొగలులకు సేవ చేసి పవిత్ర స్థలాలను దర్శించుటకు సెలవుపొంది తిరిగి భారతదేశమునకు రానేలేదు. అబ్దుర్ రజాక్ లారీకి ఐగురు కుమాళ్లు కలరు. వీరు క్రమముగా అబ్దుల్ ఖాదర్, అబ్దుల్ కరీము, రజాక్ ఆలీ, ఖలీల్, మహమ్మదు అనువారు. ఔరంగాబాదు పరగణాలో వీరలకు జాగీరులు హోదాగల ఉద్యోగములు లభించెను.

కా వెం

## అబ్దుల్ నబీఖాన్

తళ్ళికోట యుద్ధానంతరము కుతుబుషాహీ సామ్రాజ్యాధిపతి అధీనులైన కొందరు మహమ్మదీయ సర్దారులు కడప ప్రాంతమును వశపరచుకొని యుండిరి. తదనంతరము ఈప్రాంతము మొగలుసామ్రాజ్యములోని ఒక భాగముగా నుండినది. మొగలు ప్రభుత్వము కడప ప్రాంతమునకు పఠాను జాతివారిని ఫౌజుదారులుగా నియమించిరి. నాటినుండి పఠాను నవాబులు దక్కను సుబేదారుల సామంతులుగ ఈప్రాంతమును పాలించిరి.

కడపను పాలించిన పఠాను నవాబులలో అబ్దుల్ నబీఖాను వంశీయులు ప్రముఖులుగా కన్పట్టుచున్నారు. నబీఖాను పదునెనిమిదవ శతాబ్ది ప్రథమార్థమునందు కడపనవాబుగ పరిపాలించెను.

కడప కర్నూలు సవనూరు నవాబులు పదునెనిమిదవ శతాబ్దికి చెందిన దక్షిణాపథ రాజకీయములందు ప్రధాన పాత్రను నిర్వహించిరి. డూప్లే నాయకత్వమునగల ఫ్రెంచి

అధికారులు కర్ణాటకప్రాంతము నందు అధిపత్యమునకై జరిపిన ప్రయత్నములందును నిజాముల్ ముల్క్ ఆసఫ్ జా మరణానంతరము వారసత్వమునకై ముజఫర్ జంగు నాసర్ జంగు మొగలు వారి ఘర్షణల సందర్భములందును ఉప్పుడప్పుడు మహారాష్ట్రులొనర్చిన దాడుల సందర్భమునను ఈ ప్రాంతపు పఠాను నవాబులు తమ ప్రాబల్యమును నిలుపుకొనుటకై కావించిన కృషి ప్రధానముగ గమనింపదగి యున్నది. ఈ సందర్భములందు అబ్దుల్ నబీఖాను విశిష్టమైన పాత్రను నిర్వహించెను.

దక్కను అధికారమునకు ప్రాకులాడుచున్న నాసిర్ జంగును హతమార్చినవారిలో కర్నూలు నవాబుతోపాటు అబ్దుల్ నబీఖానుకూడ ఒకడని కొందరు చరిత్రకారులు భావించుచున్నారు. మహారాష్ట్రులీప్రాంతమునందు సలిపిన దాడులు కడప ప్రాంతపు ప్రజలకే కాక నవాబునకును కష్టనష్టములు కలిగించివి. బలవంతరావు నాయకత్వమున గల మహారాష్ట్ర సైన్యములు కడప మీదుగా గల సిద్ధవటప్రాంతమున రణమొనర్చియుండెను. 1758 లో వారు అబ్దుల్ నబీఖానుతో ఒక ఒప్పందమును కుదుర్చుకొనిరి. దాని ప్రకారము గండికోట మున్నగు ప్రాంతములు మహారాష్ట్రుల అధీనమునకు వచ్చినది.

అబ్దుల్ నబీఖాను గొప్ప పరాక్రమవంతుడు. దక్షిణమునందలి అనేక ప్రాంతములను జయించి శత్రురాజుల వలన కప్పములనొందెను. కడప సిద్ధవటము అతనికి ప్రధాన కేంద్రములుగ నుండెను. ఈతనికి గల అయిదుగురు పుత్రులలో అబ్దుల్ హమీద్ ఖాను అబ్దుల్ మహమ్మద్ ఖాను అబ్దుల్ మొహసన్ ఖాను అనువారలు సుప్రసిద్ధులు. నబీఖాను తాను జయించిన ప్రాంతములలో కొన్నిటిని తన పుత్రులకు జాగీరులుగ ఒసగియుండెను. వారు కడప ప్రాంతమును వివిధ కాలములందు పరిపాలించిరి.

అధికార విస్తరణమందే కాక ప్రజాహితకార్యములందును నబీఖాను ఆసక్తిని జూపెను. పాతకడప చెరువును ఇతడే నిర్మింపజేసినాడు. ఈ చెరువునకు నీరు తెచ్చుటకై బుగ్గవంకకు ఆనకట్ట కట్టించి ఇతడు ఆ ప్రాంతమునందలి వ్యవసాయాభివృద్ధికి తోడ్పడెను.

ఈతని అనంతరము నబీఖాను వంశీయులు కొంతకాలమువరకు కడప ప్రాంతమును పాలించిరి. అఫ్జాహీల కాలమున ఈ ప్రాంత మాంగ్లేయులకు దత్తమొనర్పబడెను.

దా కో గో

## అబ్దుల్ హక్

ఉర్దూభాషా సాహిత్యములకు మహత్తరమైన సేవగావించిన ఆధునిక విద్వాంసులలో మౌల్వీ అబ్దుల్ హక్ గారు ప్రథమగణ్యులు. ఉర్దూభాషా ప్రచారకులుగను పండిత పరిశోధకులుగను ఆచార్యులుగను ఉత్తమ రచయితలుగను అబ్దుల్ హక్ గారు కీర్తిగాంచినారు.

మౌల్వీగారు ఉత్తరప్రదేశములోని హాపొడ్ అను నగరమున క్రీ శ 1870 లో జన్మించిరి. బాల్యదశలో వీరు మతసంబంధమైన విద్యల నభ్యసించిరి. ఉన్నత విద్యకై ఆలీగఢ్ వెళ్ళి అచ్చట 1888 నుండి 1898 వరకు ఉండిరి. ఆ కాలమునందే మహమ్మదీయ-ఆంగ్ల-ఓరియంటల్ కళాశాలా (ఎం ఏ ఓ కళాశాల) స్థాపకులైన సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్ గారితోడను వారి సమకాలికులైన ఇతర విద్వాంసులతోడను హక్ గారికి ప్రగాఢపరిచయము కలిగినది. సమకాలిక భాషా వాఙ్మయ-రాజకీయ-పరిస్థితులను మౌల్వీగారు చక్కగా గ్రహించిరి. అతి విస్తృతమైన వారి భావిజీవిత కార్యక్రమములకు ఆలీగఢ్ నివాసకాలము చక్కని పునాదిగ నేర్పడినది.

ఆలీగఢ్ నందలి ఎం ఏ ఓ కళాశాలను డిగ్రీ పట్టము నొందిన అబ్దుల్ హక్ గారు నవాబు మొహసిన్ ఉల్ ముల్కు గారికి కార్యదర్శులుగా నియుక్తులై బొంబాయికి వచ్చిరి. అటు తరువాత క్రీ శ 1896 లో నవాబు అఫ్సర్ ఉల్-ముల్కు గారి ఆహ్వానమును పురస్కరించుకొని హైదరాబాదు నిజాంగారి ఉద్యోగములో చేరుటకు హైదరాబాదు నగరమునకు విచ్చేసిరి. ఆ కాలముననే మొదటి సాలారుజంగుగారు ప్రవేశపెట్టిన పరిపాలనా సంస్కరణములవలన హైదరాబాదు నిజాంగారి పరిపాలనారంగమున కృషి సలుపుటకు అప్పటప్పుడే విశ్వవిద్యాలయములందు ఉన్నత విద్యనభ్యసించిన విద్యావంతులకు ఉన్నతపదవులు లభించుటకు అవకాశములు ఏర్పడియుండెను. అట్టి సదవకాశమును జూచి ఉత్తరప్రదేశము మున్నగు రాష్ట్రములనుండి విద్యావంతులనేకులు నిజాం రాష్ట్రమునకు వచ్చుచుండిరి. వీరిరాక వలన హైదరాబాదులో భాషాసాహిత్య వ్యాసంగమునకు నూతనజీవనము వచ్చినది. రాజధానీ నగరము విద్వాంసులకు విద్యాకేంద్రమువిలసిల్లినది. అప్పుడే నిజాంగారి ఉద్యోగములో చేరిన అబ్దుల్ హక్ గారికి ప్రముఖవిద్వాంసులతో పరిచయము కలిగినది. తమ శయభివృద్ధికి అనుకూలమైన రంగము ఏర్పాటైనది. ఈ కాలముననే హైదరాబాదు ఎడ్యుకేషనల్ కాన్ఫరెన్స్ అనువాద కార్యాలయ

స్థాపనము (దారల్ తర్జుమా) ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనము అను కార్యక్రమములు విద్యాధిర గమున దు ఆ కులైనవారు రూపొ ది చుచు డిరి ర్ ఆ ్బర్ హైదరీగారు ఈ ఉద్య మము లకు మూల స్త భముగా లి యు డిరి బ్దుల్ హక్ గారు టి విద్యాసాహిత్య రంగము లతో ప్రత్యక్షముగా సంబ ధము ను ఏర్ప చుకొని యుండిరి

హక్ గారు మదరసె-ఆలియా అను పాఠశా లకు ప్రిన్సిపాలుగా నియమితులై తదనంతరము ( భుత్వ గృహము త్రిత్వశాఖా కార్యదర్శి కార్యా లయములో కొంత కాలము అనువాదకులుగ పని చేసి క్రీ శ 1917 లో "దారుల్ తర్జుమా నిర్వ హణ బాధ్యతలను స్వీకరి ఒరి కొన్ని స ంవత్సర ముల తరువాత విద్యాశాఖలో డిప్యూటి ఇన్స్పె క్టర్ గా నియమితులై ఔరంగాబాదునకు బదలీ చేయబడిరి అచ్చట ఉస్మానియా విశ్వవిద్యాలయ మునకు సంబ ధి ంచిన కళాశాల ఒకటి స్థాపిత మైనపుడు దానికి హక్ గారే ప్రిన్సి ల్ గా నియ మింపబడిరి ఒకవ క వీరు ఉస్మానియా విశ్వవిద్యా లయాభివృద్ధికి కృషిచేయుచునే "రొకవ క ఉర్దూ భాషా సాహిత్యముల గూర్చియు ప్రత్యేకమైన శ్రద్ధను వహి చి కృషి సలుపుచుండిరి అ జమన్ తరక్కీఉర్దూ అను స స్థయొక్క కార్యకలాపములను కూడవీరునిర్వహి చుచు డిరి క్రీ శ 1913నుండియే హక్ గారు ఆసంస్థయొక్క కార్యదర్శులుగా పని చేయుచు డిరి హైదరాబాదున దలి విద్యాంసుల సహాయ హకారములు పొ ది నిజాం నవాబుగారి



చిత్రవ 7

అబ్దుల్ హక్ బి ఎ డి లిట్

పోషకత్వమును సంపాదించుకొని అబ్దుల్ హక్ గారు అంజుమన్ ప స్థను అలీగఢ్ నుండి ఔరంగాబాదునకు మార్చిరి నాటికి ఆసంస్థ వార్షిక ఆదాయము అయిదువందల రూపాయలు మాత్రమే ఉండెను సంస్థ కార్యాలయమును ఔరంగాబాదు నకు మార్చి హక్ గారు వేలకొలది సభ్యులను చేర్పించియు నవాబులవలనను సాహిత్యాభిమానులవలనను వేలకొలది విరాళము లను సేకరించియు నిర్విరామకృషి యొనర్చి అ జు మన్ సంస్థకు దృఢమైన పునాది వేసిరి క గ్రంథి ను స్థాపించి వీరు దేశపునలుమూలలయందును తమ ఆశయములను ప్రచార మొనర్చిరి వివిధరాష్ట్రములు రాజధానీనగరము ల పల్లెటూళ్ళు-ఇవిఅవి అననేల ప్రతిప్రాంతమునందును హక్ గారు సంచరించి అంజుమన్ ంధ న గూర్చియు ఉర్దూభాషా వాఙ్మయ ముల ప్ర ధాన్యముమగూర్చియు బహుళప్రచార మొనర్చిరి దక్కనీభ ష (ఉర్దూభాషామాండలిక భేదము)ను గూర్చియు

వీరు ప్రత్యేక శ్రద్ధవహించిరి. ఔరంగాబాదులోని వారి నివాసగృహము సాహిత్యోపాసకులకు కేంద్రమును, విద్యార్థులకు, పండిత పరిశోధకులకు, కార్యకర్తలకు అతిథిగృహముగను విలసిల్లినది.

ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు ఉర్దూశాఖాధిపతిగా పనిచేయుచుండిన వహీదుద్దీన్ సలీముగారు అకాలమరణము నొందగా మౌల్వీ అబ్దుల్ హక్ గారు ఉర్దూ ఆచార్యులుగ నియుక్తులై హైదరాబాదునకు తిరిగివచ్చిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయమున వీరు 1929 నుండి 1936 వరకు ఉర్దూ ఆచార్యపీఠమును అలంకరించిరి. బంజారాహిల్సులో వీరు నిర్మించుకొనిన సుందరసౌధము విద్యా సాహిత్య కేంద్రముగ మారినది. ఉద్యోగములలో ఎన్ని మార్పులు వచ్చినను మౌల్వీగారు అంజుమన్ కార్యక్రమాలను సక్రమముగానే నిర్వహించుచుండిరి.

భారతదేశములో ఉర్దూ హిందీ భాషల పరస్పర సంబంధమును గూర్చి చెలరేగిన వివాదములలో హక్ గారి పాత్ర ప్రశంసార్హము. హిందుస్తానీ భాషను గూర్చి వీరు రాజేంద్రప్రసాద్ గారి అభిప్రాయముతో ఏకీభవించి అంతరంగముగ కొంతకాలము మాత్రమే కృషి సలిపిరి. మరల తమ ఉర్దూప్రచార కార్యక్రమమును మాత్రమే చేపట్టిరి. ఉర్దూ హిందీ భాషలను గూర్చి వీరు మహాత్మాగాంధీగారితోడ అభిప్రాయభేదమును వహించియుండిరి. భారతదేశములో ఉర్దూబోధనభాషగాగల విశ్వవిద్యాలయమును స్థాపించుటకై వీరు ప్రయత్నించిరి. కాని ఆ ప్రయత్నము నిష్ఫలమైనది.

క్రీ.శ. 1948లో ఉత్తరభారతదేశమున ఢిల్లీ ప్రాంతమున జరిగిన అల్లకల్లోలములో అంజుమన్‌కు చెందిన అమూల్యమైన గ్రంథాలయము లూటీచేయబడినది. ఈ సంఘటనవలన హక్ గారు ఎంతయు బాధనొందిరి. సంస్థకేగాక తమకును ఆ ప్రాంతములో సముచిత స్థానములేదని గ్రహించి కార్యాలయమును ఢిల్లీనుండి లీఢ్‌కు మార్చిరి.

మరికొన్ని సంవత్సరముల తరువాత మౌల్వీగారు పాకిస్తాన్‌కు తరలి కరాచీలో నివాసమేర్పరచుకొని అంజుమన్ కార్యకలాపములను అక్కడినుండియే నిర్వహించిరి. పాకిస్తాన్‌లో తమ సంస్థద్వారా ఉర్దూభాషాసాహిత్యము అభివృద్ధికి బృహత్ప్రణాళికను సిద్ధముచేసిరి. తొలిదశలో పాకిస్తాన్ ప్రభుత్వమువారియు జిన్నాసాహెబుగారియు అండదండలు వారికి ఆశాజనకముగా ఉండెను. ఉర్దూబోధనాభాషగా ఒక కళాశాలకూడ స్థాపితమయ్యెను. కాని జిన్నాగారి మరణమువలన పాకిస్తాన్‌లోని రాజకీయ పరిస్థితులలో వచ్చిన మార్పుల కారణముగా మౌల్వీగారి అంజుమన్ సంస్థకు సరియైన ఆదరణ లభించలేదు. సంస్థ ఆర్థిక పరిస్థితులుకూడ దిగజారిపోయినవి. ఈ చిక్కులవలన సంస్థయొక్క కార్యకలాపములు సన్నగిల్లినవి. 1961లో పశ్చిమపాకిస్తాన్ ప్రభుత్వము ఉన్నత పాఠశాలల తరగతులమేరకు మాత్రమే ఉర్దూ బోధనాభాషగ స్వీకరించుటకు నిశ్చయించినది. మౌల్వీగారు ఉర్దూ విశ్వవిద్యాలయస్థాపన నిర్ణయమును పదునేను సంవత్సరముల వరకు వాయిదా వేయుటకు ప్రభుత్వము నిశ్చయించినది. ఈ నిర్ణయము హక్ గారు రూపొందించిన కార్యక్రమమునకు గొడ్డలిపెట్టుగా పరిణమించి ఆయనకు తీరని ఆశాభంగమును కలిగించినది. అప్పటికే వారు వయోవృద్ధులైరి. దాదాపు తొంబదియేడు సంవత్సరముల వయస్సులో క్రీ.శ. 1963లో హక్ గారు కాలధర్మము నొందిరి.

మౌల్వీగారి జీవితమును పరిశీలించిచో వారు అంజుమన్ సంస్థకై ఉర్దూ ప్రచారమునకై తమ జీవితమును ధారపోసినట్లు స్పష్టమగును. వీరు తమ జీవితమును బ్రహ్మచారులుగనే కొనసాగించిన అంశము గమనింపదగినది.

ఉర్దూ భాషా సారస్వతములకు తమ సర్వస్వమును ధారపోసిన మౌల్వీ అబ్దుల్ హక్ గారిని బాబాయె ఉర్దూగ ఉర్దూ ప్రపంచము గౌరవించినది. వీరి అమూల్యమైన కృషిని గుర్తించియే అలహాబాదు విశ్వవిద్యాలయమువారు వీరిని డి.లిట్ పట్టముచే బహూకరించిరి. నేడు మౌల్వీ అబ్దుల్ హక్ గారు నిర్వహించిన అంజుమన్ సంస్థయు వారు ప్రకటించిన గ్రంథములును వారి నిర్విరామకృషికి చిరస్మరణీయములైన స్మృతి చిహ్నములుగ నిలిచియున్నవి.

అబ్దుల్ హక్ గారి వాఙ్మయసేవ బహుముఖమైనది. అంజుమన్ సంస్థతోపాటు వారు కొన్ని పత్రికలను కూడ నడిపిరి. "హమారీ జబాన్" అను పత్రిక వారికి ముఖ్యప్రచారసాధనముగ ఉండెను. ఉర్దూ భాషలో ప్రచురింపబడిన అనేక గ్రంథములకు హక్ గారు చక్కని పీఠికలను కూర్చిరి. ఈ పీఠికలన్నియు రెండు సంపుటములలో పిదప ప్రకటింపబడినవి. గ్రంథసమీక్షలు "చంద్ శస్త్రీ హాక్ అబ్దుల్ హక్" "ఖుత్బాత్ అబ్దుల్ హక్" అను గ్రంథముల రూపమున వెలువడినవి.

హక్ గారు కూర్చిన ఆంగ్ల–ఉర్దూ నిఘంటువు వారి

మైనింగ్ కంపెనీలోగల షేర్లను అధికవ్యయముతో కొనుగోలు చేయుటయందు తన ప్రభుత్వమును ప్రోత్సహించి కృతకృత్యుడయ్యెను. అతనికి ఒక పైసలో పెక్కువస్వంత వాటాలు ఉండి ఉన్నందున కంపెనీకి ముట్టిన పెద్దమొత్తమునుండి అధిక లాభము అతనికే చేకూరెను. ఈ విషయము ప్రభుత్వమునకు తెలిసెను. ప్రభుత్వము తాత్కాలికముగ అతనిని పదవినుండి తొలగించి అతనిపై విచారణ జరుపుటకు ఉపక్రమించెను.

అవమానకరమును కలుషితమును అగు ఇట్టి వ్యాపారమునకు దిగజారిన "దక్కన్ మైనింగ్ కంపెనీ" ఇంగ్లండులోని ప్రజానీక హృదయములందు గొప్ప అలజడిని కలుగజేసెను. కేసును దర్యాప్తు చేయుటకు పార్లమెంటు 25 మంది సభ్యులసంఘమును ఏర్పాటుచేసెను. విచారణయందు పాల్గొనుటకును దక్కన్ మైనింగ్ కంపెనీ వ్యవహారములను చక్కదిద్దుటకును ఆర్థికశాఖా కార్యదర్శియైన మొహిసేన్ ఉల్ ముల్కుగారును హైకోర్టు ప్రధానన్యాయమూర్తియగు మెహిదీహసన్ ఫతే నాబుజంగుగారును హైదరాబాదు ప్రభుత్వము తరపున ఇంగ్లండునకు పంపబడిరి. ఈ అవకాశము చూచుకొని ఇంగ్లాండునందు ఆర్థికశాఖ కార్యదర్శియైన మెహిదీఅలీమొహసన్ ఉల్ ముల్కు భారతజాతీయ కాంగ్రెసును విమర్శించుటయే కాక ముస్లిములకు కాంగ్రెస్ ఎడ విముఖులుగా నుండవలెనని బోధచేసెను.

కొ. వెం.

## అబ్దుల్లా కాంతేయ

ఈతని ప్రశంస పార్శీభాషలో వ్రాయబడిన హదీకతేసలాతీన్ అను చారిత్రకగ్రంథమునందు కలదు. ఈ గ్రంథరచయిత జాముద్దీన్ అహమ్మదు అనునతడు గోల్కొండను క్రీ. శ. 1626-72 వరకు పాలించిన సుల్తాను అబ్దుల్లాకుతుబుషా పరిపాలనకు సంబంధించిన అనేక విషయములు ఇందు పొందుపరుపబడినవి.

క్రీ. శ. 1579 నుండు 1684 వరకును ముర్తుజానగరు (కొండవీడు) గోల్కొండ సుల్తానుల అధీనమున ఉండెను. ముర్తుజానగరు అనగా ప్రియమైన పట్టణము. తరువాత అది మొగలు సామ్రాజ్య అంతర్గతమయ్యెను. కుతుబుషాహీల పరిపాలనలో గోల్కొండ తరువాత కొండవీడు రెండవ రాజధానిగా పరిగణింపబడినది.

అబ్దుల్లాకుతుబుషా యొక్క సుఖలాలసత్వము, రాజకీయములందాతని విముఖత రాజ్యమునందు అనేకతావుల విప్లవములకు దారితీసినది. కొండవీడునందలి ఫౌజుదారులు ప్రభుత్వముపై కుట్రలెన్ని తిరుగుబాటును లేవదీసిరి. అబ్దుల్లా కుతుబుషా స్వయముగా సేనలను నడపి తిరుగుబాటుదారులను శిక్షించి తిరుగుమార్గమున కృష్ణానదిని ఎలేశ్వరమునద్ద దాటి దేవరకొండమీదుగా నల్లగొండ దుర్గమును చేరెను. అతడు అచట కొంతకాలము విశ్రాంతినిపొంది గోల్కొండ చేరెను. ఇది జరిగిన కొంతకాలమునకే కాంతయ్య అను సరదారుడు నా(నౌ)రోజీయను పేరొందిన సేనానితో కలిసి కొండవీడునందు ప్రభుత్వముపై తిరుగుబాటును లేవదీసెను. ఇదివరకే కాంతయ్య ఇస్లాము మతమును స్వీకరించి అబ్దుల్లాకాంతేయ అను పేరుతో కొంతకాలమునకు సేనాధిపతిగా ముర్తుజానగరునందు నియుక్తుడై ఉండెను.

ఈ తిరుగుబాటు వైనమును విని అబ్దుల్లాపాదుషా ఎల్చిబేగు నాయకత్వమున గొప్పసైన్యమును దండగుల శిక్షించుటకు కొండవీడునకు పంపెను. తిరుగుబాటుదారులలో ఘర్షణలో కొంతమంది మరణించిరి. కొందరు పరారి అయిరి. మరికొందరు చిక్కుబడిరి. కాంతయ తన అనుచరులతో అడవుల పాలయ్యెను. తరువాత కొంతకాలమునకు అతని జాడ తెలియుటతో వాడు తన అనుచరులతో పట్టుపడుట జరిగెను. అబ్దుల్లాపాదుషా అతనిని చెరసాలయందు కొంతకాలము ఉంచి తదుపరి అతని తప్పిదములను మన్నించెను.

ఇదే సమయమున సాంపానీడు అను మురేదారుడు ఒకడు కొండవీడు పరిసరములందు విజృంభించి ప్రబలుడై ప్రభుత్వమును సమయము దొరికినపుడెల్ల ఎదిరించుచుండెను. ఎల్చిబేగు నాయకత్వమున గోల్కొండసేనలు సాంపానీడును ముట్టడించి వశపరచుకొనెను. సాంపానీడు 40 000 హొన్నులను మూడు హొన్నులబరువు కల ఒక వజ్రమును అబ్దుల్లా పాదుషాకు కానుకగా ఇచ్చి మన్నింపవేడెను. ఇంత ఘన విజయమును సాధించిన ఎల్చిబేగును విజయోత్సాహములతో పాదుషా దర్బారును ఏర్పరచి అందు అతనిని అనేక బహుమతులతో సన్మానించెను.

అబ్దుల్లాకాంతేయ అనుచరులకు తిరిగి గోల్కొండయందు కొలువులు లభించెను. కాని వారు పాదుషాయందు పూర్తి

జన్మ నక్షత్రము దోషయుక్తమనియు అతడు పన్నెండు ఏండ్ల వరకు తండ్రికి కంట బడరాదనియు తెలిపిరి సుల్తాన్ మహమ్మదు వారి సలహాను పురస్కరించుకొని అబ్దుల్లాను అంతఃపురమునకు దూరముగ నగరములో ఒక గృహమునందుంచి అందుండియే సమస్త విద్యలను అభ్యసించు ఏర్పాట్లు గావించెను మీరు కుతుబుద్దీన్ నిమతుల్లా మీరాషరీఫ్ ఖాజా ముజఫర్ అలీ మౌలానా హుస్సేన్ షీరాజీ అనువారు రాజకుమారునకు విద్యాగురువులుగ నుండిరి ద్వాదశవర్షపరిమితి పూర్తియైన తరువాత రాజ ప్రాసాదమునకు వచ్చెను సుల్తాన్ మహమ్మదు కొంతకాలము తరువాత మరణించెను

అబ్దుల్లా కుతుబుషా తన తండ్రి మరణానంతరము క్రీ శ 1626 లో సింహాసనము అధిష్ఠించెను అబ్దుల్లా అప్పటికి పదమూడు సంవత్సరముల వాడైనందున ఆ నిపతమున రాజ్యపాలన బాధ్యతను హయాత్ బక్షీ బేగము నిర్వహించెను ప్రభువు బాలుడైనందున రాజ్యమునందెట్టి అల్లకల్లోలములు జరుగకుండ హయాత్ బక్షీ బేగము రక్షణచర్యలకు ఉపక్రమించెను నగరమునందలి పారసీకులకు తుర్కీదేశవాసులకు తగిన భద్రత కల్పించబడినది రాజధానీ నగరమున శాంతిభద్రతలను కాపాడుటకై మన్సూర్ ఖాన్ హబ్షీ మలిక్ యూసుఫ్ అనువారలు వినియోగింపబడిరి పోలీసు కమీషనరుగా నుండిన కాశి బేగు గోలకొండ చావడి ప్రాంతమును అతని సహాయ అధికారి చార్మినారు ప్రాంతమును సురక్షితముగ జూచు బాధ్యతను వహించిరి

ఇట్టి ఏర్పాట్లతో పట్టాభిషేక మహోత్సవము శాంతియుతముగను వైభవముతోను జరిగినది దర్బారులో అధికారులకు పండితులకు ముచిత సత్కారములు జరిగినవి నగరమునందు మధురపదార్థములు పంచిపెట్టబడినవి ఈ శుభసమయమును పురస్కరించుకొని అబ్దుల్లా పేర క్రొత్తనాణెములు చలామణికి వచ్చినవి

హయాత్ బక్షీ బేగము దక్షులైనవారిని వివిధపదవులందు నియోగించినది రాజబంధువగు షామహమ్మదు పీష్వాగ నియమింపబడెను కాని బాధ్యతగల పదవిని అతడు దక్షతతో నిర్వహింపజాలకుండెను అపుడే రాజదౌత్యము నిర్వహించి పారశీక దేశమునుండి గోలకొండకు తిరిగివచ్చిన షేక్ మహమ్మద్ ఇబ్నె ఖాతూన్ అనునతడు డిప్యూటీ పీష్వాగా నియుక్తుడయ్యెను మన్సూర్ ఖాన్ హబ్షీ మీరుజుమ్లా పదవినొందెను కాశి బేగు పోలీసుకమీషనరుగను హసన్ బేగ్ అతనికి సహాయాధికారిగను పూర్వపదవులందే కొనసాగిరి మీర్ కాశిము నాజరుగను నారాయణరావు మజుందారుగను వెంకమాదరావు రాజఫర్మానాలు తెలుగులో వ్రాయుటకు దబీరుగను ఉండిరి భర్త గోలకొండ సుల్తానుగనున్న కాలమున హయాత్ బక్షీ బేగము అతనికి రాజకార్యములందు తోడ్పడుచు పరిపాలనానుభవమును సంపాదించియుండెను అబ్దుల్లా తరపున రాజ్యభారమును వహించి సామ్రాజ్యరక్షణకై శక్తివంచనలేక ఆమె పాటుపడినది కాని విధి వక్రించి ఆమె ప్రయత్నములు ఫలించలేదు

ముఖ్య-అధికారులలో కొందరిలో ఏర్పడిన స్వార్థదృష్టి అబ్దుల్లా విలాసజీవితము ఉత్తరదిశనుండి వెల్లువల వలె వచ్చిన మొగలు దండయాత్రలు అబ్దుల్లా పాలనమును సమూలముగ భగ్నమొనర్చినవి చివరిదశలో కొందరు సమర్థులైన అధికారులు రాజ్యవిస్తృతికై ప్రయత్నించి సామ్రాజ్య ప్రతిష్ఠను నిలుపగలిగిరి కాని ఆ స్థితియు కొన్నినాళ్ళవరకే ఉండెను గోలకొండను సామంత రాజ్యముగ ఒనరుటలో మొగలు చక్రవర్తి కృషి ఫలించినది ఇట్టి రాజకీయ సంఘటనలు అబ్దుల్లా పాలనములో విశేషముగ గమనింపదగినవి

మీరుజుమ్లాగనుండిన మన్సూర్ ఖాన్ హబ్షీ తన పదవిని సమర్థతతో నిర్వహింపజాలకుండెను ఈతనికి దూరదృష్టికాని రాజనీతి చతురతకాని పరిపాలనా దక్షతకాని లేనందున రాజ్యపాలనలో గణనీయమైన అభివృద్ధి కనిపించలేదు అదృష్టవశమున తనకు లభించిన ఉన్నత పదవిచే గర్వితుడై అతడు ఇతర అధికారులయెడ దురుసుగా ప్రవర్తించెడివాడు అధికారులకు వివిధ పదవులలో కలిగిన మార్పులవలనను వారిలో ఈర్ష్యాసూయలు పెచ్చుపెరిగినవి యుక్తవయస్కుడైన అనంతరముకూడ పరిస్థితులను సమీక్షించి ధైర్యముగ అధికారులను అదుపులో ఉంచుటలో అబ్దుల్లా అసమర్థుడై యుండెను ముల్లాతకీ షేక్ ఇబ్నెఖాతూన్ వంటి అధికారులు కొందరు మాత్రమే విశ్వాసపాత్రులై రాజ్యక్షేమమునకై యత్నించుచుండిరి వీరి సేవానిరతికి అబ్దుల్లా బలహీనత దోహదకారిగ లేకుండెను

అబ్దుల్లా కుతుబుషా విలాసప్రియుడు సుఖలాలసుడు అతడు రాజ్య వ్యవహారములందే మాత్రము శ్రద్ధ వహింపకుండెను ఏదేని సందర్భమును పురస్కరించుకొని అతడు

నగరము నుండి వెడలి నెలలు తరబడిగ విందులతో విలాసములతో కాలక్షేపము చేసెడివాడు ప్రతి సంవత్సరము వర్షఋతు శోభను తిలకించుటకై ఉద్యానవనము లందు అతడు బస చేసెడివాడు పట్టాభిషిక్తుడైన సంవత్సరములోనే 1626 లో అబ్దుల్లా లింగంపల్లి ఉద్యానవనమునకు వెడలి రెండు మాసములు అచటనే ఉండెను 1627 లో జన్మదినోత్సవమును వేలకొలదిధనమును వెచ్చించి మహా వైభవముగ జరుపుకొనెను 1628 లో కోహేతూర్ అను ప్రాంతమునకు విలాస క్రీడలకై వెళ్ళి అచట ఒక నెలవరకు ఉండెను 1630 లోను ఆప్రాంతము లోనే కొన్ని మాసములు వినోద క్రీడలలో నిమగ్నుడై యుండెను 1632 వ సంవత్సరమున కేశఖండనోత్సవము నిమిత్తమై హయాతాబాదు వెళ్ళి విందులొనర్చెను

ఇట్టి విలాస జీవితము వలన అబ్దుల్లా పాలనము లో ఒక విధమైన స్తబ్ధత కలిగినది ఆకాలము నందే మొగలాయి చక్రవర్తి దక్షిణాపథములోని రాజ్యములపై ఆధిపత్యము వహించుటకై ప్రయత్న మొనర్చుచుండెను గోలకొండ అహమ్మదు నగర బీజాపుర సామ్రాజ్యములలోని పరిస్థితులు ఢిల్లీ చక్రవర్తి విజయము నొందుటకు తోడ్పడినవి జహంగీరు మరణానంతరము 1628 లో షాజహాన్ ఢిల్లీ సింహాసనము నధిష్టించి యుండెను అతడు యువరాజుగా దక్షిణాపథములో తలదాచు కొనుటకు వచ్చినపుడు ఇచ్చటి పరిస్థితులను స్వయముగ పరిశీలించి యుండెను

చక్రవర్తి యైన తరువాత బురహాన్ పురములో విడిది చేసి ఈ సామ్రాజ్యములపై దండెత్తుటకు అతడు సన్నాహ మొనర్చెను 1635 లో అహమ్మదు నగరము స్వాధీన మైనది దానితో దక్కను సామ్రాజ్యముల ఐకమత్యము భగ్నమైనది గోలకొండ బిజాపురములకు ప్రమాద మేర్పడినది

యువరాజుగా ఉన్నప్పుడు షాజహాను గోలకొండ సామ్రాజ్యముపై కొంత అభిమానమును వహించి యుండెను అబ్దుల్లా పట్టాభిషేకోత్సవసందర్భమున తన శుభాకాంక్షలుకూడ పంపియుండెను కాని క్రమముగ షాజహాను చక్రవర్తి గోలకొండ బీజాపురమువారు సమైక్యముగా మొగలు సైన్యము నెదురుకొనుటకై ఒనర్చు సన్నాహనములను జూచి పూర్వాభిప్రాయమును మార్చుకొని ఈ సామ్రాజ్యమును కబళింపవలయుననియే నిశ్చయించుకొనెను బీజాపురముతో మైత్రి వాంఛనీయముకాదని అబ్దుల్లాను హెచ్చరిక చేసెను అది ఫలించలేదు అతడు గోలకొండను డక్కన్ ప్రభువును కానుకలను బలవంతముగా అర్పించసాగెను అబ్దుల్లా ఢిల్లీ పాలకుని కోరిక లను తుచ తప్పక తీర్చుచుండెను మొగలు రాజప్రతినిధులకు స్థాపనావతులకును గోలకొండ సుల్తాను అపూర్వ రాజగౌరవములను చూపుచుండెను మొగలు చక్రవర్తి ప్రతినిధి గోలకొండకు వచ్చినపుడు సరిహద్దుల కాలినడిచియే స్వాగత సత్కారములను ఏర్పాటుచేసి అతనిని గోలకొండ కాహ్వానించుటకు అబ్దుల్లాఖాన్ను మీర్ కాశి అనువారికి ఆదేశము నిచ్చుచుండెను ఈ ప్రయాణయందలి వివిధ ఘట్టములలో రాజప్రతినిధికి అపూర్వమైన విందుభోజనము లేర్పాటగుచుండెను అబ్దుల్లా ప్రభువుకూడ స్వయముగ అతనికెదురేగి విలువైన కానుకలు సమర్పించి రాజధానికి అతనిని వెంబడించుకొని వచ్చెడివాడు రాజదర్బారులో అశ్వములను గజములను బహూకరించెడివాడు ఒకానొక రాజప్రతినిధి దాదాపు ఏబదివేల రొక్కమును అమూల్యమైన కానుకలను రాజగౌరవములను పొందియుండెను అబుల్లా బలహీనతను గమనించి మొగలు ప్రతినిధులు అతని నుండి అధిక ధనమును కానుకలను నిర్బంధముగ రాబట్టుకొనుచుండిరి ఇట్టి పరిస్థితులలో షాహమహమ్మదును పీష్వాగా నియమించుట తగునని అతని హితవరులు కోరిరి షాహమహమ్మదు పీష్వాపదవిని స్వీకరించి మొగల్ చక్రవర్తి ప్రతినిధును గోలకొండ సామ్రాజ్య గౌరవమునకు అనుగుణముగ ప్రవర్తించవలయునని సూచించి వారి దురుసువర్తనమును గూర్చి దక్షిణాపథమున నున్న మొగలుక మాండరు అఫ్ఖాన్‌నకు నివేదించెను షాజహాన్ చక్రవర్తి ఆ వృత్తాంతమును విని తన ప్రతినిధులను తత్క్షణమే రప్పించుకొనెను

మొగలు సైన్యముల స్వేచ్ఛా విహారము గోలకొండ రాజ్యమునకు ప్రక్కలోని బల్లెముగ పరిణమించుచుండెను ఢిల్లీ సైన్యము గోలకొండను ఆనుకొనియున్న ఖాంధార్ వరకు వచ్చుటచే అబ్దుల్లా ప్రభుత్వము రక్షణచర్యలకు పూనుకొనక తప్పలేదు మొగలు సైన్యములను ఎదుర్కొనుటకు సిద్ధముగా నుండవలసినదని సైన్యములకు ఆదేశము పంపబడినది అదమ్ ఖాన్ హాష్మీ అల్లామలీబేగ్ మొదలగు గోలకొండ సైనికాధికారులు రాజ్యపుసరిహద్దులను రక్షించుటకు సన్నాహము నొనర్చిరి ఢిల్లీ చక్రవర్తి ఒకవంక సైనిక దాడులు జరుపు

చునే మరియొకవైపు అబ్దుల్లా నుండి అమూల్యములైన వజ్రములను కానుకలను రాబట్టుకొనుచుండెను.

అబ్దుల్లాకుతుబుషా ప్రతిదర్భమునందును చక్రవర్తికి లొంగి హీనుడై వర్తించుచున్నందున మొగలు సైన్యముల ధైర్యము హెచ్చెను. ఢిల్లీ పాదుషా అబ్దుల్లాకుతుబుషాకు ఫర్మానా మూలమున తాకీదు చేసెను. సామంతస్థితిని అంగీకరించునట్లును గోల్కొండ రాజ్యమునందు కుత్బాలో ఢిల్లీచక్రవర్తి పేరు చేరునట్లును మొగలు చక్రవర్తి పేరును నాణెములపై ముద్రించునట్లును షాహజహాను ఆదేశించెను. అమూల్యములైన కానుకలనొసగి ఒడంబడిక కుదుర్చుకొననిచో రాజ్యముపైదండెత్తుట కూడ జరుగునని హెచ్చరించెను. అబులా అశక్తుడై గోల్కొండ ప్రతిపక్షమును గకంమగు రీతిలో వర్తించి చక్రవర్తి అజ్ఞాపించిన మేరకు సామంతునిగ ఉండుటకు అంగీకరించి తన ప్రతినిధి ముల్లా తీవ్వారా దాదాపు లక్షన్నర విలువచేయు అమూల్యములైన కానుకలు చక్రవర్తికి సమర్పించి వినయవిధేయతలు ప్రకటించుచు సమాధానమును నివేదించుకొనెను. క్రీ. శ. ౧౬౩౬ లో ఢిల్లీ ప్రతినిధి గోలకొండకు వచ్చినపుడు అతనికి దీనాగులో చక్కని విడిదు ఏర్పాటు చేయబడెను. పిందు అనంతరము చక్రవర్తి ఆదేశానుసారము అంగీకారపత్రము సిద్ధము చేయబడెను. రాజప్రతినిధి కొన్ని మాసములు గోలకొండలో మకాముచేసి ఒడంబడికను సక్రమముగా పాటించుటకు కట్టుదిట్టములు చేసి ఢిల్లికి వెడలిపోయెను. ౧౬౩౬ నాటి ఈ ఒడంబడిక గోలకొండ స్వాతంత్ర్యమునకు వెన్నుపోటుగ పరిణమించినది. ఢిల్లీ చక్రవర్తి బిజాపురమును కూడ ఇట్లే స్వాధీనమొనర్చుకొనెను. కాని ఆ రాజ్యముపై అబ్దుల్లాకు విధించినట్లు కఠినమైన నియమములు ఆదేశింపబడలేదు. దీనిని పరిశీలించి చూడ అబులా ఎంతటి నిస్సహాయస్థితిని అశక్తతను వ్యక్తీకరించెనో స్పష్టమగును.

ఈ ఒడంబడిక జరిగిన అనంతరము గోలకొండ సైనికాధికారులు రాజ్యవిస్తరణకై చేసిన కృషి కుతుబుషాహీలకు కొంత గౌరవస్థానమును సంపాదింపగలిగినది. అబ్దుల్లా కుతుబుషా తండ్రియగు సుల్తాను మహమ్మదు కాలములో సైనికశక్తిని పెంపొందించుటకు కాని రాజ్యవిస్తృతికిగాని ఎట్టి ప్రయత్నములు జరుగలేదు. సుల్తానుమహమ్మదుకుతుబుషా శాంతిప్రియుడు. అతడు యుద్ధములందు అభిరుచి చూపలేదు. అంతియే కాక రాజ్యవిస్తరణకై ఎట్టి కాంక్షయు అతనికి లేకుండెను. అబ్దులానాటి పరిస్థితులు తారుమారైనవి. మొగలు దండయాత్రలను ఎదుర్కొనుటకు సైనికబలమును పెంచక తప్పలేదు. ౧౬౩౬ నాటి సంధి అనంతరము మొగలు అలజడి తగ్గుటతో రాజ్యములో కొంత శాంతి ఏర్పడినది. ఈ సమయమునందే అబ్దులా ప్రభుత్వదృష్టి దక్షిణాపథమునందు రాజ్యవిస్తరణకై కేంద్రీకృతమైనది. కర్ణాటక ప్రాంతమునకు సుబేదారుగనుండిన మహమ్మద్ సయ్యద్ ఇట్టి రాజ్యవిస్తరణోద్యమములో ప్రధానపాత్రవహించెను. ఇతనికి మీరు జుమ్లాపదవి ఈయబడెను. ఇతడు సాధించిన విజయపరంపరలు ఇతనికే కాక గోల్కొండ రాజ్యమునకును గౌరవమును కలిగించినవి. మహమ్మద్ సయ్యద్ ఈ దండయాత్రకై ప్రత్యేకమైన సైనికదళమును సిద్ధము చేసెను. ఐదువేల అశ్వములతో మూడువందల ఏనుగులతో అయిదువందల ఒంటెలతో ఇరువదివేల పదాతులతో కూడిన ఈ దళమునందు ఇంగ్లీషు వారిని ఫ్రెంచివారిని కూడ సయ్యదు చేర్చుకొనెను. బలిష్ఠమైన గండికోట దుర్గమును సాధించుటకీ ప్రత్యేకదళమే మహమ్మదుసయీద్‌కు తోడ్పడినది. కడప సిద్ధవటము మున్నగు ప్రాంతములు జయించి అతడు కోరమాండల్ తీరమునకు వెడలి పాశ్చాత్యవర్తకులను లొంగదీసికొని వారు పూర్వము పొందిన కౌలును రద్దుచేసి ౧౬౪౬ లో క్రొత్త కౌలును ఏర్పాటుచేసెను.

ఇట్టి దండయాత్రల సందర్భమునందు మహమ్మద్ సయ్యదు విజయములనే కాక అనంత ధనమును జాగీర్లను కూడ సంపాదించెను. గండికోట ప్రాంతము వజ్రములకు ప్రసిద్ధి. మొత్తముమీద ఇతడు లక్షలు విలువచేయు ధనమును సంపాదించినట్లు ప్రతీతి. ఇది యంతయు స్వయంశక్తి సంపాద్యమను గర్వమతనికి క్రమక్రమముగా కలుగసాగినది. ౧౬౫౬ నాటికి అతని చిత్తవృత్తిలో మార్పువచ్చినది. మొగలు చక్రవర్తి ప్రాపకమును అభిమానమును పొందవలయునను సంకల్పమాతనికి కలిగినది. మహమ్మదుసయ్యాదు వర్తనము అబ్దులా ప్రభుత్వమునకు బాధాకరమైనది. మీరు జుమ్లాను నిర్బంధించుటకు సుల్తానుఅబ్దులా యత్నించెను. దీనిని గ్రహించి మహమ్మదుసయీదు తప్పించుకొనిపోయి మొగలాయీల అండచేరెను. అబ్దుల్లా కర్ణాటక ప్రాంతమునకు నేక్‌నామ్‌ఖానుని నియమించెను. మహమ్మద్ సయీద్ మొగలులతో చేయికలిపిన సందర్భములో కోల్పోయిన ప్రాంతములను

షేర్ నవాజ్ ఖాను తిరిగి స్వాధీన మొనర్చుకొని కొన్ని ఇతర ప్రాంతములను కూడ జయించెను. పాశ్చాత్య వర్తకుల కౌలు ధనమును రెట్టింపుచేసె. అదివరకు చెల్లించని కౌలుధనమును రాబట్టుకొనెను. షేర్‌నవాజ్‌ఖాను రాజ్యమునకొనర్చిన సేవ అతి ప్రశంసనీయమైనది. ఈతని మరణానంతరము రాజకుటుంబమునకు చెందిన సమాధి స్థలములో ఈతని సమాధి నిర్మింపబడినది.

మహమ్మద్ సయీదు ప్లవచర్య అబ్దుల్లా ప్రభుత్వమునకు తీరని ఆపదను తెచిపెట్టినది. సయీదు గోలకొండతో సంబంధము తెంచుకొనెను. అతనికుటుంబము మాత్రమే గోలకొండలో ఉండెను. అతని పుత్రుడు మహమ్మద్ అమీన్ తండ్రికి కలిగిన మితిమీరిన గౌరవముకు గర్వితుడై కుతుబుషాహీ ప్రభుత్వమును లక్ష్యముసేయక వర్తించుచుండెను. ఒకనాడతడు త్రాగి దర్బారులో ప్రవేశించి అసభ్యముగ ప్రవర్తించినందున అబ్దుల్లాకుతుబుషా అమీనును నిర్బంధించి అతని ఆస్తిని జప్తుచేయుటకాజ్ఞాపించెను. ఇప్పుడు ఢిల్లీ సింహాసనమును షాహజహాన్ పుత్రుడు ఔరంగజేబు అధిష్ఠించియుండెను. అబ్దుల్లా చర్యమొగలు చక్రవర్తికి ఆగ్రహమును కలిగించెను. మహమ్మదు సయీదు పుత్రుని తక్షణమే బంధవిముక్తుని గావించుమనియు ఆతని కుటుంబమును క్షేమముగ ఆగ్రాకు పంపుమనియు చక్రవర్తి తాకీదు పంపెను. 1656 లో ఔరంగజేబు పుత్రుడు మహమ్మదుసుల్తాన్ కొంత సైన్యమును తీసికొని గోలకొండను ముట్టడించుటకు హైదరాబాదునకు పయనమయ్యెను. ఇట్టి విపత్కర పరిస్థితి యందును అబ్దుల్లా తన శక్తిహీనతను ఆత్మాభిమానరాహిత్యమును చాటెను. ఏమియు తోచని స్థితిలో చక్రవర్తి ఆజ్ఞను పాటించుటయేకాక మొగలు రాజకుమారుడగు మహమ్మదు సుల్తానునకు తన కుమార్తెనిచ్చుటకును తనఅనంతరము అతడే గోలకొండ ప్రభువు అగుటకును అంగీకరించెను. ఈ ఒడంబడిక వలన లేశమాత్రముగ మిగిలిన కుతుబుషాహీ గౌరవము అడుగంటినది. ఒకవారము అనంతరమే అబ్దుల్లా తన కూతురిని రాజకుమారునికిచ్చి వివాహముకావించి రాయగిరి జిల్లాను కట్నముగ సమర్పించెను.

మొగలు చక్రవర్తికి అబ్దుల్లా పూర్తిగ లొంగిపోవుటతో అబ్దుల్లా ప్రభుత్వములో ఆతని జోక్యముకూడ అధికము కాజొచ్చినది. అబ్దుల్లా రాజధానికి దూరముగ గోలకొండయందు అనామకుడుగ నివసించి రాజ్యవ్యవహారముల దేమాత్రము శ్రద్ధవహింపక జీవితము గడిపి 1672 లో మరణించెను.

అబ్దుల్లా కుతుబుషా కాలము జరిగిపోవుటకుముందు పెద్దగా ప్రా... దీపమువలె గోల్కొండ రాజ్యము కృత్రిమశోభను సంతరించుకొనెను. అబ్దుల్లా పాదుషా సరిహద్దు ... రానీతిచే గోల్కొండ దౌర్బల్యమునకు దారితీసినది. అబ్దుల్లా ఆలంను యావనముకు రాకుండగనే అహమ్మదునగరము అస్తమించెను. ఉత్తరాదినుండివచ్చు మొగలులకును దక్షిణమున దలిముల్మాను రాజ్యములగు బీజాపూరు గోల్కొండలకును మధ్య అహమ్మదునగరు ఒక ఐభయ రాజ్యముగా ఉండెను. బీజాపూరు గోల్కొండ నవాబులు విశేషశక్తివంతులైనచో ఆ ఫకీరు రాజ్యము అట్లే చాలకాలము కొనసాగుటకు దోహదము చేసియుండెడివారు. అహమ్మదు నగరము స్వతంత్ర కాలము తాము మొగలాయి సైన్యములతో ప్రత్యక్షముగ సంఘర్షింపవలసిన ఆవశ్యకత లేకుండెడిది. బీజాపురము వారీ రహస్యమును గుర్తించి అహమ్మదునగరము పతనముకాకుండ సైన్యసహాయమును ధనసహాయమును చేయుచు వచ్చిరి. మహారాష్ట్రనాయకుడగు షాజీ (శివాజీ తండ్రి) బీజపూరువారి కొలువులో చేరి మొగలాయిలను వేధించెను. బీజాపుర సేనానులలో మిక్కిలి మరుడైన రణదుల్లాఖానుడు మహారాష్ట్రీను అహమ్మదునగరు ఫతేఖానుని లొంగదీసికొని మొగలులను ఎదిరించుటకై త్రైత్రిక సైన్యబలమును కూడ గట్టుకొనివచ్చెను. కాని మొగలుసేనాధిపతి మహబతుఖానుడు వీరిని మించిన యుద్ధతంత్రజ్ఞుడగుటచే త్రైత్రిక కూటము ఏమి చేయలేదు. క్రీ శ 1633 లో దౌలతాబాదు మొగలుల వశమగుటతో అహమ్మదు నగరరాజ్యము తుదిగడియలు సమీపించెను. 1635 లో ఆరాజ్యమంతరించెను. ఇదియంతయు అబ్దుల్లా కుతుబుషా యుక్తవయస్కుడు కాకముందే జరిగిపోటచే అహమ్మదు నగరపతనమునకై ఆతనిని మనమంతగా విమర్శింపలేము. రాజ్యసంరక్షకురాలుగానున్న హయాత్ బక్షిబేగమును ఆమె సలహాదారులును ఈ విపర్యాసమునకు బాధ్యులని యెంచవలెను.

మొగలాయి చక్రవర్తియెడ అబ్దుల్లా ప్రదర్శించిన భయవినయములును సంగ్రామమునకు వెనుదీసి ఎడతెగని కానుకలతో సమాధానమును సాధింప జూచుటయు గర్హించియున్నాము. దీనిచే ఆతని ప్రతిష్ఠశూన్యమై మొగలాయి సర్దారులను దురా

క్రమణకు ప్రోత్సహించెను. దీనికి నిదర్శనము ఒరిస్సా ప్రాంతమున సామ్రాజ్యపు గవర్నరుగా ఉండిన శా ల్ ఖాను జీమ్ పాని అను సరదారుడు గోల్కొండ రాజ్యము ఈశాన్య భాగముపై దండెత్తివచ్చి కళికోట వరకును చొచ్చుకొని వచ్చెను. రామహేంద్రవరముపై దుటకై ఆ డు పెద్ద యెత్తున సన్నాహములు చేయుచుండెను. కళికోట దుర్గాధిపతి సయ్యదు ముస్తఫాఖాను కే ద్రసహాయమును అర్థించెను. సయ్యదు అబుల్లాఖాను పాఠశీయాకూబుఖాను అను సేనాపతులు ప్రబల సైన్యముతో గోల్కొండను డి పంపబడిరి. ఈలోపుగా ముస్తఫాఖాను మరణించగా సయ్యదు అబ్దుల్లా కళికోటకు గవర్నరుగా నియమింపబడెను. కాని ఒరిస్సానుండి వచ్చు ప్రమాదమును వీరు నిరోధింపలేకపోయిరి. గోల్కొండ సైన్యములు ఓడిపోయి పారిపోవొచ్చెను. ఈ విపత్సమయమున గుటూరు సైన్యాధిపతి ఖాజాఅఫ్ జలుటర్కు ఉత్తర సరిహద్దునకు పంపబడెను. పరిస్థితులు ఇంతకన్న విషమింపకుండగనే షహజహాను చక్రవర్తి మధ్యవర్తిత్వముచే ఒరిస్సా ఫౌజుదారు దురాక్రమణయత్నము విరిచిపోయెను.

దౌలతాబాదుదుర్గము మొగలుల వశమయి అహమ్మదు నగరు రాజ్యము అస్తమించిన తరువాత గూడ కొంతకాలము వరకును విజాపురరాజ్యము నిలకమును వీడక షాజహాను చక్రవర్తి ప్రయత్నములను ఎదురు చునే యుండెను. గోల్కొండకు ధైర్యముచెప్పుచు అన్యోన్య సహాయముతో తమ ఉభయుల స్వాతంత్ర్యమును సంరక్షించుకొనుటకై ఆదిల్‌షాహి ప్రభుత్వము తుది ప్రయత్నము చేసెను. అబ్దుల్లా కుతుబుషా దీనిని మొదట గ్రహించియు చక్రవర్తివద్దనుండి వచ్చు రాకీదులకు భయపడి జాపురము సలహాను త్రోసిపుచ్చి మొగలులతో అవమానకరమైన సంధికి ఒడంబడెను. దీనితో విజాపురము దుర్బలమైపోయి ఆరాజ్యముకూడ మొగలులకు దాసోహమ్ అనవలసివచ్చెను.

మొగలాయి సేనలకు జడిసి వెనుకంజవేసిన అబ్దుల్లాకు దక్షిణాదిని కొంతకలసివచ్చెను. తాళికోట యుద్ధానంతరము విజయనగరసామ్రాజ్యము దక్షిణాది సుల్తానుల దురాక్రమణవాంఛకు అనుకూలమైన రంగముగా పరిణమించెను. అహమ్మదునగరుదూరమునందుండుటచే నిజాముషాహివారికి విజయనగరసామ్రాజ్య భాగములను ఆక్రమించుకొనుటకు అంతగా అనువుగాకుండెను. బీజపూరు గోల్కొండ రాజ్యములు యథేచ్ఛముగా విజయనగర భాగములను కబళించినవి. ఆ దును ఆదిల్లాహోలది పైచేయి ఆయెను. బీజపూరు ఆక్రమించుకొన్నంత భూభాగము గోల్కొండకు దక్కలేదు. గోల్కొండపక్షమున మీరుజుమా కర్ణాటకమున కొంత దురాక్రమణచేసెను. కాని అతడు స్వార్థపరుడై కుతుబుషాహిలకు ద్రోహముచేసి మొగలాయిలతో చేరిపోయెను. తుదకు బిజాపూరు గోల్కొండలు సంపాదించిన విజయనగర సామ్రాజ్య భూములు పాశ్చాత్య వర్తకులకు దక్కెను.

అబ్దుల్లాకుతుబుషాకు ముగురు కుమార్తెలు జన్మించిరి. పెద్ద కూతురును అతడు సయ్యద్ జాముద్దీన్ అనువానికిచ్చి పెండ్లి చేసెను. రెండవ కుమార్తెను ఔరంగజేబు పుత్రుడు మహమ్మద్ సుల్తానునకిచ్చియుండెను. అబ్దులా మరణానంతరము ఈతడే గోల్కొండ సింహాసనమున కధికారి. కాని ఈ రాజకుమారుడు తండ్రి ఆగ్రహమునకు గురిఅయి నిర్బంధములోనుండి అప్పటికే మరణించియుండెను. అతని భార్యయు అట్టిస్థితిలోనే మరణించియుండెను. గోల్కొండను డి వెడలిన తర్వాత ఆమె వృత్తాంతమేమియు తెలియరాదు. ఆకమూడవ కుమార్తెను రాజవంశమునకు దూరపు బంధువైన అబ్దుల్ హసన్ మనకు ఇచ్చి అతడు పరిణయ మొనర్చెను. తానాషాగా ప్రసిద్ధుడైన అతడే అబ్దుల్లాకు వారసుడై గోలకొండ సింహాసనమును అధిష్ఠించెను.

గోలకొండకు సామంతస్థితి కల్గుటకు కారణము అబ్దులా అశక్తతయే అని భావించుటకెట్టి సందేహములేదు. అట్టి అపఖ్యాతికి గురియైనను అబ్దులా కొన్ని విషయములందు విశిష్ట గుణసంపన్నుడే. ఈతడు న్యాయశీలియై స్వపరభేదములేక చట్టమునందరికి సమముగ వర్తింపచేసెను. పాశ్చాత్య యాత్రికులు అబ్దుల్లా న్యాయబుద్ధిని బహువిధములుగ ప్రశంసించియున్నారు. ఉన్నతాధికారులు నేరమొనర్చినపుడు వారిని శిక్షించుటకు అతడు వెనుకాడలేదు. ఒక అమీరు ఒక వర్తకుని వద్ద కొన్ని వేల రూప్యములు బలవంతముగ గ్రహించెను. అబ్దుల్లా ఆతనినుండి ఆ ధనమును వసూలుచేసి వర్తకుని కిప్పించెను. ఏలీ బేగులను శక్తి వర్తకులనుండి బలాత్కారముగా ధనమును స్వీకరింపగా రాజు ఆతని ఆస్తిని స్వాధీన మొనర్చుకొని వర్తకునకు చెందవలసిన ధనమును చెల్లించెను.

ఈ సుల్తాను ఉదార హృదయుడు — భగవద్భక్తి కలవాడు. మత సంప్రదాయములను పాటించుటలో అతడు

ప్రత్యేకమైన శ్రద్ధవహించెను. మొహరమ్ సందర్భమునందు సంప్రదాయానుసారముగ ఇతడు సంతాపదినములను పాటించెడివాడు. తన తండ్రి కాలములో ఆగిపోయిన కొన్ని మతసంబంధమైన ఉత్సవములను అబ్దుల్లా తన పరిపాలనా కాలములో పునరుద్ధరించెను. రబీఉదుగ సందర్భమున ఈతని అనతిచే బీదలకు అన్నదానము జరగెడిది.

అబ్దుల్లా సాహిత్యాభిమాని. అబ్దుల్లా కాలములో పారసీక పండితులు అత్యుత్తమ కావ్యములను శాస్త్రగ్రంథములను నిఘంటువులను రచించిరి. అవి పారసీక వాఙ్మయమునకు అమూల్యాలంకారములుగ నున్నవి. గొప్ప పారసీక పండితుడగు ఇబ్నెనిషాతీ ఫూల్ బన్ అను ఒక మహాకావ్యమును రచించెను. ఈ రచనలు ప్రశస్తములై వన్నెకెక్కినవి. అబ్దుల్లాగారి పోషకత్వమున మహమ్మదు హుసేను అను పండితుడు పారసీకమునందు బురహానేఖాతే అను నిఘంటువును కూర్చియుండెను. అహ్మదును నవాబుద్దీన్ అనునొక పండితుడు కొన్ని అరబ్బీ గ్రంథములను పారసీకమునందనువదించెను. ఈ కాలమునాటి పారసీక ఉర్దూకవులు గజలు, రుబాయీ, మర్సియా, కసీదా, మస్నవీ మున్నగు కావ్యప్రక్రియల నాదరించియుండిరి. అబ్దుల్లా కుతుబుషా జీవితమునకు సంబంధించిన అనేక విషయములు "హదీకుతుస్ సలాతీన్" అను పారసీ గ్రంథమునందు కలవు. దీని రచయిత జాముద్దీన్ అను చారిత్రకుడు. ఇతడు అబ్దుల్లా కొలువునందుండి అతని సంచార కార్యక్రమములందు పాల్గొనినట్లు తెలియనగును. ఉర్దూ వాఙ్మయ చరిత్రలో ఇతని పరిపాలనాకాలము సాహిత్య విషయమున స్వర్ణయుగముగ కీర్తింపబడుచున్నది. ఈ ప్రభువు పండితుడు, కవి. ఈతని కావ్యసంపుటము ప్రశస్తివహించిన గ్రంథము. ఇతని ప్రభుత్వకాలములో జీవించిన కవులలో గవ్వాస్, ఇబ్నెనిషాతీ, మౌలానా నారోఖీ, ఫకీరు షరాజు అను కవులు సుప్రసిద్ధులు. గవ్వాస్ రచనలలో "తుతీనామా", "సైఫుల్ ముల్క్" అను వాదము తూత్ నామా ప్రత్యేకముగ పేర్కొనదగిన కావ్యములు. రాజకీయరంగమునందు లేకున్నను అబ్దుల్లా సాహిత్య క్షేత్రమునందు మాత్రము కీర్తిని సంపాదించెను.

అబ్దుల్లాకుతుబుషా విశాల హృదయుడు. హిందూ ప్రజల యెడ అభిమానమును చూపిన గోలకొండ సుల్తానులలో అబ్దుల్లా శిష్టుడు. కృష్ణాతీరమందలి గ్రామములందు గల శాసనముల వలన అబ్దుల్లా ఒకానొక వైదిక బ్రాహ్మణ పండితునకు యజ్ఞములొనర్చుటకై, శిష్యులకు వేదశాస్త్రముల నేర్పుటకై ఒక గ్రామమును దానమొసర్చినట్లు తెలియుచున్నది. వేదవిద్యలందును, యజ్ఞయాగాదులందును అబ్దుల్లాకు గల ఆసక్తిని ఆదరమును ఈ అంశము నిరూపించుచున్నది. ఈ సుల్తానుకు సాహిత్యమందే కాక నృత్యసంగీతములందును గల అభిని వేశము గొప్పది. తన రాజ్యమునందలి వారినే కాక అహమ్మదాబాదు, బర్హాన్ పూరు, లాహోరు మున్నగు ప్రాంతములనుండియు గీతశాస్త్రజ్ఞులను నర్తకులను ఆహ్వానించి ఐశ్వర్య గీతగోష్ఠులను ఏర్పాటుచేసి ఆనందించెడివాడు. కళాకారులకు ఘనసన్మానములను జరిపి అమూల్యములైన కానుకలనర్పించువాడు. సుప్రసిద్ధ వాగ్గేయకారుడగు క్షేత్రయ్య అబ్దుల్లా దర్బారునకు వచ్చి ఇచ్చట సంగీత విద్వాంసులను తన పదకవితచే ఓడించి అబ్దుల్లాపై కొన్ని పద్యములను స్తుతి పూర్వకములను రచించి అతని మెప్పునొంది బహుమానములను గ్రహించెను.

అబ్దుల్లా చక్రవర్తి వలన ఘనసన్మానములను పొందిన హైందవ సంస్థానాధీశ్వరులు పెక్కురుండిరి. పెదపెండ్యాల నివాసియగు మాణిక్యరావు పుత్రుడు కొండలరాయడు అబ్దుల్ కుతుబుషావలన ఘనసన్మానము నొందినట్లు ధనుర్విద్యావిలాసములోని ఒక పద్యమువలన తెలియుచున్నది.

అబ్దుల్లా పరిపాలనాకాలమున వర్తక వ్యాపారములు విశేషముగా అభివృద్ధినొందెను. ఈ కాలమున మచిలీబందరు సుప్రసిద్ధమయిన రేవుపట్టణముగను వర్తక కేంద్రముగను అభివృద్ధినొందెను.

గోలకొండయు తత్పరిసర ప్రాంతములును రత్నములకు వజ్రములకు ప్రసిద్ధివహించి యుండెను. అబ్దుల్లాకుతుబుషా అట్టి ప్రాంతములందలి గనులను సురక్షితముగనుంచుటకు ప్రత్యేకమయిన శ్రద్ధను వహించెను. రాజ్యమునందలి వజ్రముల గనులను పరిశోధించుటకై అతడు ప్రత్యేకాధికారులను నియుక్తులనొనర్చెను. వారి కృషివలన కర్ణాటక ప్రాంతములో గనులు కనుగొనబడెను. అబ్దుల్లా అమూల్యములైన రత్నములను వజ్రములను సేకరించి తన అధీనమునందుంచుకొనెను. అతని కిరీటము అమూల్య రత్నములచే శోభితమయ్యెను. ఈ సుల్తాను మొగలాయిరాజ ప్రతినిధులకు చక్రవర్తులకు అమూల్య రత్న హారముల నర్పించెను. అబ్దుల్లా అధికారులు కూడ అమూల్య రత్నములను పొందిరి. మహమ్మదు సయీద సంపా

ది ఒన రత్నములు వజ్రములు అత్యంత అమూల్యములు ఇతడు గండికోట ప్రాంతమును వశపరచుకొని అచ్చటి గనులను త్రవ్వుటకై 12 వ దల కార్మికులను నియోగించెను

సుందరభవన నిర్మాణమునందును ఉద్యానవన నిర్మితియందును తన పూర్వులవలె అబ్దుల్లాకూడ శ్రద్ధాసక్తులను ప్రదర్శించెను ఇతని కాలమున మహోన్నతసౌధములు నాలుగు అంతస్తులతో పెక్కులు నిర్మింపబడెను ఈ సౌధ నిర్మాణమున ప్రత్యేకతను హిందువులైన సుందరచందన ఫలకములచే నునుగుడ తమలచే నిర్మితములైన ప్రధాన ద్వారములు భిన్న వర్ణయుత చిత్రశిల్పశోభాయమానములైన అంతర్భాగములై యున్నవి ఈ చక్రవర్తి బీబాగు లింగంపల్లి బాగు అనురెండు ప్రసిద్ధ ఉద్యానవనములను నిర్మింపించెను లింగంపల్లిబాగులో మూడంతస్తుల సుందరభవనము నొకటి ఇతడు నిర్మింపించి అచ్చట సంవత్సరమునకొకకాలము నివసించుచుండెవాడు దానిశిధిలములు నేటికిని కలవు

అబ్దుల్లాకుతుబుషా రాజకీయములందు చాకచక్యమును చూపినవాడు కాడనుట విదితమే దక్కను సుల్తానులు సమైక్యగా ఏర్పడి అన్యోన్య సహాయముచేసుకొనుచు మొగలులను దక్షిణాపథమునకు రాకుండా రోధింపతలపెట్టిన ఉద్యమములలో మొదట అహమ్మదు నగరు వారును తరువాత బీజాపురము ఆదిలషాహీలును కొంత దక్షతను చూపిరి సుల్తాను మహమ్మదు శాతి ప్రియుడగుట చేతను అబ్దుల్లా యుద్ధవిముఖుడగుటచేతను దక్కను సుల్తానుల సంరక్షక వ్యూహమునందు గోల్కొండ తన పాత్రను సక్రమముగా నిర్వహింపజాలదయ్యెను శరాగముతో సతరమొదుచున్న విజయనగర సామ్రాజ్య భాగములను బీ పూరువారు ఆక్రమించుకొన్నంత విస్తృతముగా గోల్కొండవారు ఆక్రమణము చేయలేక పోయిరి మీరుజుమ్లా మాత్రము కర్ణాటకమున కొంత విజయమును సాధించియు స్వార్థపరుడై కుతుబుషాహి రాజ్యమునకు వినాశకర పరిస్థితులనే కల్పించెను దక్కను సుల్తానులు ఉత్తరమున మొగలులతో పోరాడుచు దక్షిణమున మహారాష్ట్రులతో తలపడవలసినవారయిరి షాహాజీ శివాజీల సామ్రాజ్య మొగలాయీల ఒత్తిడి అధికమైన కొలదియు సుల్తానులు మహారాష్ట్రుల నెదుర్కొనలేక వారితో సఖ్యపడవలసిన వారయిరి

అయితే అబ్దుల్లాకుతుబుషా సహృదయుడుగా సాహిత్యాభిమానిగా సాహిత్యపోషకుడుగా కళాప్రోత్సాహకుడుగా అత్యున్నతామూల్య సౌధ నిర్మాతగా పరమత సహిష్ణుతాలక్షితుడుగా అమూల్య రత్నఖని సంరక్షకుడుగా తన్య గ్రాహకుడుగా విశాలహృదయుడుగా అనంత విఖ్యాతి సంశోభితుడయ్యెను

దా కో గో

ఆం ల రం

## అబ్దుల్లాఖాన్ పున్ని

గోల్కొండ కుతుబుషాహి వంశము కుచెదిన అబ్దుల్లా కుతుబుషా క్రీ శ 1672 లో లోకాంతరగతుడయ్యెను తదనంతరము అతని మూడవఅల్లుడు అబుల్ హసన్ కుతుబుషా రాజ్యము కువచెను అబుల్ హసన్ దక్కనులోని జనసామాన్యమున తానాషా అను పేరప్రసిద్ధుడయెను అతడు వివేకసంపత్తి మహోదారాశయముల కాలదృష్ట రాజ్యపరిపాలనాదక్షత విదేశ వ్యవహారములలో మెలకువ కలిగి రాజ్యమేలుచుండెను

అట్టి ఉత్తముడయిన నవాబుకూడ మొగలాయి చక్రవర్తుల దుస్తంత్రములకు దుష్ప్రచారములకుగురి అయ్యెను దక్కనులోని మహమ్మదీయరాజ్యములను కూలద్రోసి తన సామ్రాజ్యములో కలుపుకొనుటకు ఉద్దేశించిన మొగలాయి చక్రవర్తి అగు ఔరంగజేబు క్రీ శ 1682 లో దక్కనునకు వచ్చి దక్కను సుల్తానులమీదను మహారాష్ట్రులమీదను కూడ దండయాత్రలుసాగించెను ఔరంగజేబు 1685 లో తన కొడుకులైన ఆజము మువజములనుబీజాపురము మీది గోల్కొండమీదికి సైన్యములతో పంపెను రెండునెలలు ముట్టడిసాగెను అంతట బీజాపురము మొగలాయీలకు లోబడిపోయెను కాని గోల్కొండ ముట్టడి ఎనిమిదినెలలు దీర్ఘకాలము కొనసాగినది చక్రవర్తి ఔరంగజేబు విసుగెత్తి ఒకప్పుడు ముట్టడిని మానివేయప్రయత్నించెను కాని అట్టిసమయమున అఫ్ గను సేనానియైన అబ్దుల్లాఖాన్ పున్నిఅను పరమ ద్రోహి అర్ధరాత్రమున గోల్కొండకోట తలుపులు తెరచిలోనికి శత్రువులను రానిచ్చెను అందుచేత కోట శత్రువులకు వశమైనది కొందరు లోకములో ఘనకార్యములచేసి ఆచంద్రార్కముగా కీర్తిని సంపాదించుకొనువారుండగా అబ్దుల్లాఖాన్ పున్ని అనునతడు విశ్వాసఘాతకుడై గోల్కొండ రాజ్యపతనమునకుకారకుడై శాశ్వతమయిన అపకీర్తికి గురి అయ్యెను

గ ల కాం

**అబ్బన** చూ. అన్నకారి

**అబ్బ నృపతి**

అబ్బనృపతి దామెరల వంశీయుడు. అతడు శ్రీపాదనాయనివారి కుమారుడు. దామెరలవారు పద్మనాయక కులజులు. వీరిది నగాల గోత్రము. వీరి వంశము పులకు కాణాచి. ఈ వంశీయుడైన వెంగళభూపాలుడు బహుళాశ్వచరితము అను ద్వ్యర్థికావ్యమును వ్రాసెను. దామెర్లవారు విజయనగర సామ్రాజ్యాధిపతుల అండదండలు వడయుచు ప్రసిద్ధులగు వెలుగోటి వారితో సంబంధబాంధవ్యముల నెరపియు తుదకు తమ సామ్రాట్టులైన విజయనగర రాజులతో బంధుత్వమును పెంచుకొనియు మనుగడసాగించిరి. వీరు కావ్యకర్తలే కాక కావ్యభర్తలు కూడ. విజయనగర రాజ్యాంతర్గతమైన కాళహస్తి సంస్థానమును వీరు పాలించిరి. అంతియే కాదు. వీరి వంశమునందలి మహీపతిరాయని వారి పుత్రుడగు తిమ్మానాయని వారికి మహాప్రబలులైన గజపతిరాయని వారి తావున నిండా మొహబతు చేసినందున వారు నిండా దయచేసి దేవరకొండ రాజ్యం జహగీరుగా దయచేసిరట" (చా. మ. 2–317) ఈ వంశమునకు మూలపురుషుడైన మాదానాయని వారు "ప్రతాపరుద్రుని తావున విస్తారంగా ప్రభుత్వము చేస్తూవుండి తదనంతరం గజపతిరాయుల వారి తావున ప్రవేశించి వారు విస్తారంగ రాజ్యం సంపాదించుకుని ప్రభుత్వం చేస్తూవుండిరట" (చా. మ. 2–316)

దామెరల వంశమునకు మూలపురుషుడైన మాదయనాయనికిని శ్రీపాదనాయనికిని నడుమ ఇంకను పెక్కురు ప్రభువులు ఉండినట్లు చాటుపద్యమణిమంజరి వలన తెలియుచున్నది (చా. మ. 2 3 6)

చంద్రగిరి రాజైన వేంకటపతిరాయలకు యుద్ధమునందు దక్షిణభుజమై వెలుగొందిన వెలుగోటి – కస్తూరిరంగనాయని కుమారుడగు బంగారు యాచమనాయుడు బహుళాశ్వచరిత్ర కృతికర్తయగు వెంగళభూపాలునకు మేనత్తకుమారుడే. దామెరల చెన్నప్పనాయకుని సుతులగు అంకభూపాలుడు అయ్యప్ప వేంకటప్ప అనువారు విజయనగర సామ్రాజ్యాధిపతియైన వేంకటపతిరాయలకు బావమరదులు. వేంకటపతిరాయలు విజయనగర సామ్రాజ్యమును క్రీ. శ. 1586 నుండి 1614 వరకు పాలించెను. పై ముగ్గురిలో అంకభూపాలుడు ఉషాపరిణయ కావ్యమును ఆంధ్రమున రచించెను. పై సోదరత్రయము కాళహస్తి వందవాసి పులికాటు-డలూరు ప్రాంతములను పాలించిరి. వీరిలో అయ్యపనాయకుడు ఫ్రెంచువారిని డచ్చివారిని వివాదరహితముగా సుఖముగ వ్యాపారము సాగుటకు తన తండ్రిపేర పులికాటు మైలాపూరుల మధ్య చెన్నపట్టణమును నిర్మించెను. అదియే నేడు ప్రసిద్ధమైన మదరాసు నగరము. అంకభూపాలుడు జింజిపాలకుడగు కృష్ణప్పనాయకుని క్రీ. శ. 1607 లో ఓడించియు తన తండ్రిపేర ఉత్తర ఆర్కాటు జిల్లాలో చెన్నసాగరమను పెద్ద తటాకమును త్రవ్వించియు గొప్ప ఖ్యాతిగాంచెను. డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక లో ఇట్లు వ్రాసిరి. గోలుకొండ రాజ్యమప్పుడు చెంజి ప్రాంతము వరకు వ్యాపించియుండెను. ఇచ్చట అనేకులు హిందూనాయకులును పాళెగాండ్రును సుల్తానుకు లొంగి కప్పముకట్టుచు పెక్కుసీమలను దుర్గములను ఏలుచుండిరి. వెంకటగిరి ముఖాసాదారులగు వెలుగోటివారును కాళహస్తి జాగీరుదారులగు దామెరలవారును చెంజిపరిసర ప్రదేశములపై ప్రభుత్వము నల్పుచుండిరి. మధురాంతకము కరుగుడి పాళెము వెలుగోటి యాచమనాయకునికిని కంచి పూనమల్లి దేనూరు మొదలయిన కోటలు దామెరల వెంకటప్ప నాయనికిని చెందియుండెను. అతని యనుచరుడగు పేట కృష్ణారెడ్డి దేనూరు కోటనేలుచుండెను (దేనూరి రెడ్లు ఆంధ్ర సా. ప. ప. పుట 119) పై ఆధారముల వలన దామెరల వారు మహాయోధులై భండన భయంకరులై శాత్రవుల పీచమడచుచు ధర్మయుతముగ రాజ్యమును పాలించుచు విజయనగరము వెలుగోటి రాజులతో బాంధవ్యములను నెరపినట్లు విశదమగుచున్నది.

దామెరల వెంగళభూపాలుడు తన బహుళాశ్వచరిత్రములో దామెరలవారి వంశవృక్షమును శ్రీపాదనాయనింవారితో నారంభించిచెప్పెను. ఈ ప్రక్కన ఇవ్వబడిన పట్టికవలన కాళహస్తి పాలకులగు దామెర్ల వారియొక్కయు వెలుగోటి వారియొక్కయు సంబంధబాంధవ్యములు గ్రహింపవచ్చును.




**(Sources of Vijayanagara History Page 304)**
**by S Krishna Swamy Ayyangar**

దామెరల వంశభూషణుడైన శ్రీపాదనాయనిం వారి కుమారుడు అబ్బానాయనింవారు

"దేవరకొండ రాజ్యం ప్రభుత్వం చేస్తూ వున్నంతలో లోగడబైచడు అనేవాని జ్ఞాతి వాలూరి (నేటి రాయవేలూరు) రాజ్యం చేస్తూవుండే వీరిమీద విరోధాలకు యత్నం చేస్తూ వుండే కమ్మవాడిమీద లడాయిచేసి వాణ్ణి కొట్టి వాలూరి పట్నం కట్టుకొని యీ రాజ్యమున్ను దేవరకొండ రాజ్యమున్ను ప్రభుత్వం చేస్తూ వచ్చినారు (చా మం 2 - పుట 321)

చాటుపద్య మణిమంజరిలో కనవచ్చు ప్రాతలవలన దామెర్ల ప్రభువుల రాజ్యసంపాదన విధానమును దామెర్ల నృపాలుర పాలన కాలమును నిర్ణయించుట పెక్కు చిక్కులతో కూడియున్నట్లు కన్పించును. అయినను వాని నిట్లు సమన్వయింపవచును. దామెర్ల వంశమూలపురుషుడగు మాదానాయనివారు "ప్రతాప రుద్రుని తావున విస్తారముగ ప్రభుత్వ చేస్తూ ఉండి గజపతిరాయలవారి తావున ప్రవేశించి" అను చాటుపద్య మణిమంజరిలోని వాక్యములు సుసంగతములుగ కన్పించుటలేదు. ఇందు కనవచ్చు ప్రతాపరుద్రుడు కాకతీయ ప్రతాపరుద్రుడా? లేక గజపతి ప్రతాపరుద్రుడా? అను అంశము విచారింపవలసియున్నది. మాదానాయని వారు కాకతీయ ప్రతాప రుద్రుని సేవించి గజపతుల సేవలోనికి వెళ్లెననుట ఉపపన్నముగా లేదు. కాకతీయుల అస్తమయమునకును గజపతుల పాలనారంభమునకును ఒక శతాబ్దమేని యంతరము కలదు. కావున మాదానాయని వారు కాకతీయ ప్రతాపరుద్రుని గజపతులను వరుసగా సేవించెననుట పొసగదు.

మాదానాయడు సేవించిన ప్రతాపరుద్రుడు ఆ పేరి గజపతి అనుకొన్నను సరిపడుటలేదు. ఈ ప్రతాపరుద్ర గజపతి శ్రీకృష్ణదేవరాయలవారికి సమకాలికుడును ప్రతిస్పర్ధియునై యుండెను. ఈతని రాజ్యకాలము క్రీ శ 1497 1538 అని తెలియుచున్నది. దామెర్లవారి వంశములో ప్రసిద్ధుడైన శ్రీపాదనాయనిగారికిని మాదానాయనికిని నడుమ తొమ్మిది తరములు చెల్లినట్లు చాటుపద్య మణిమంజరిలోని దామెర్లవారి వంశక్రమమున కనవచ్చుచున్నది. తరమునకు 25 వత్సరములు చూచుకొన్నను మాదానాయనికిని శ్రీపాదనాయనికిని మధ్య సుమారు 225 సంవత్సరముల వ్యవధి కన్పించుచున్నది. ప్రతాపరుద్ర గజపతి కాలమునుండి లెక్కించినచో అనగా క్రీ శ 1500 నుండి 225 సంవత్సరముల తరువాత క్రీ శ 1725 ప్రాంతమున శ్రీపాదనాయని వారుండురు. 1725 నాటికి గజపతులు అస్తమించి చాలకాలమైనది. శ్రీపాదనాయనివారి కుమారుడు అబ్బనృపతి దేవరకొండ రాజ్యమును ఏలినట్లు చాటుపద్య మణిమంజరిలో కలదు. క్రీ శ 1725 నాటికి గోలకొండ రాజ్యముకూడ అస్తమించి హైదరాబాదు నిజాముల పరిపాలన కాలము వచ్చినది. ఇటు చూచినను దామెర్లవారి మూలపురుషుడైన మాదానాయనివారి కాల నిర్ణయము వివాదాస్పదముగా నున్నది.

ఇట్లు మూలపురుషుడు మొదలుగా దామెర్లవంశకాలాము పూర్తిని నిరిగణించుట కుదురుట లేదు. దీని భిన్నముగ వంశమునందలి అనంతర పురుషులతో వారంభించి మీది కెక్కవేసుట ఉపకరించునేమో చూతము. దామెర్ల వంశమునందు మనము సులభముగా గుర్తించుటకు వీలైన వ్యక్తులు ఇరువురు కలరు. వీరు చెన్నప్ప నాయనింగారి కుమారులు అప్ప అయ్యప్పనాయని గార్లు. వీరు విజయనగరచక్రవర్తి రెండవ వెంకటపతిరాయల బావమరదులని చెప్పబడినదిగదా. వెంకటపతిరాయలు క్రీ శ 1586 1614 నడుమ పాలన చేసెను.

కావున ఈతని బావమరదులు 1600 సంవత్సరము ప్రాంతమున నుండిరని నిశ్చయింపవచ్చును. ఆ కథాపాలాదులకును శ్రీపాదనాయని వారికిని నడుమ ఏడు తరములు చెల్లినవి. అనగా 175 సంవత్సరముల అంతరమున్నది. ఇది క్రీ శ 1425 ప్రాంతము. ఇది దామెర్ల శ్రీపాదనాయని కాలమగుటకు యుక్తముగనే ఉన్నది. అప్పుడు విజయనగరమున ప్రౌఢదేవరాయలు సామ్రాజ్యము శాసించుచుండెను. కళింగదేశమునందు రాజ్యవిక్రాంతి యేర్పడి ప్రాచీన గాంగవంశమును తుదముట్టించి కపిలేశ్వర గజపతి 1434 సంవత్సరమున సింహాసనమెక్కెను. శ్రీపాదనాయనింగారును ఆతని కుమారుడు అబ్బానాయడును కపిలేశ్వర గజపతికి తోడ్పడియుందురు. కావుననే అబ్బానాయని వారికి దేవరకొండ రాజ్యము జాగీరుగా లభించెను. "మహీపతి నాయనింగారి పుత్రుడు తిమ్మానాయని వారికి గజపతులు దేవరకొండ రాజ్యం ఇచ్చిరి" అన్న విషయమును ఈ విధముగా సమన్వయించుకొనుట యుక్తము.

దామెర్లవారికి దేవరకొండ రాజ్యమును జాగీరుగా నీయగల సామర్థ్యము గజపతుల కెట్లుకలిగెనో విచారింపవలయును. దేవరకొండకోట తెలంగాణములోనున్నది. పద్మనాయకులు రాచకొండ దేవరకొండ ముఖ్యపట్టణములుగా కాకతీయుల పతనానంతరము తెలంగాణమును పాలించుచుండిరి. వీరికి బహమనీ సుల్తానులు ప్రక్కలో బల్లెముగనుండి రాజ్యాక్రమణమునకు నిత్యసన్నద్ధులగుచుండిరి. తుదకు 1485 ప్రాంతమున రాచకొండ రాజ్యమును బహమనీ సుల్తాను అహమ్మదుషా ఆక్రమించుకొనగలిగెను. ఇక మిగిలిన దేవరకొండను కూడ కబళించుటకు అహమ్మదుషా కుమారుడును ఆతని తరువాత

రాజ్యాధినేతయు అయిన హుమాయూన్‌షా (1457 61) నిశ్చయించి దేవరకొండను ముట్టడించెను ఈ సుల్తాను మిక్కిలి క్రూరుడగుటచే ఈతని సరదారులే కొందరు రాజ్యమున తిరుగుబాటులు లేవదీయుచుండిరి ఇటువంటి దేవరకొండ ప్రభువు బాలకుడై లింగమనేడు ఈయన మహమ్మదీయుల ముట్టడిని డిగ పతి కపిలేశ్వరు సాయము పేక్షించెను కపిలేశ్వరుని కుమారుడు హంవీరుడు బలీయమైన సైన్యముతో వచ్చి దేవరకొండను ముట్టడించుచున్న బహమనీ సైన్యము లపై డెను దుర్గములోనుండి లింగమనేడును బోను వెలువడిన చాన్యముపలె విక్రమించెను ఈ యుభయుల ధాటికి నిలువలేక మహమ్మదీయ సైన్యములు చెల్లాచెదరయెను ఇట్లు గజ తుల హాయముతో దేవరకొండకోట రక్షింపబడెను

కపిలేశ్వరుని విజయయాత్రలలో విశ్వాసముతో సేవించుటచే నే దామెర్ల అబ్బానాయని గారికి దేవరకొండ జాగీరు లభించియుండును దేవరకొండ జాగీరు శ్రీపాదనాయనివారి కుమారుడైన అబ్బానాయనికి లభించినను లేక మహీపతి రాయల కుమారుడైన తిమ్మానాయనివారికి లభించినను దానిని ఇచ్చుటకు గజపతులకు సామర్థ్యము క్రీ శ 1460 ప్రాంతమునే ఏర్పడెను కాని అంతకుముందు కాదు లింగమనేడు మరణించిన తరువాత దామెర్లవారికి ఈ జాగీరు లభించియుండును కావున అబ్బానాయనివారి (అబ్బనృపతి) కాలము క్రీ శ 1460 సంవత్సర ప్రాంతమనియు ఆయనతండ్రి శ్రీపాద నాయనివారి కాలము క్రీ శ 1425 30 ప్రాంతమనియు ఊకృతము లభించు ఆధారములతో నిర్ణయింపవీలుపడుచున్నది శ్రీపాదనాయనికి తొమ్మిదితరములు ముందు అని చెప్పబడుచున్న మాదానాయుడు దామెర్లవారి మూలపురుషుడు క్రీ శ 1200 ప్రాంతమువాడయి కాకతీయ సామ్రాజ్యకాలములో అదృశ్యుడగుచున్నాడు

అబ్బనృపతి ప్రతాపాది గుణములు చాటుపద్యమణిమంజరిలోను బహుళాశ్వ చరిత్రములోను ఇట్లు ప్రశంసింపబడి

దుర్గమున బోయ దళ బులం
బరుడితో అడ్డివారి ట్టణ మపుడున్
గిరకరి అబ్బనృపాలుడు
స్థిరముగం దానేలె నపుడు దివ్యులు మెచ్చన్ ॥
(చా మం II-పుట 321)

శ్రీపతి పద పద్మమున భృ
గాపటిమ జనించి పద్మనాయక మణియై
ధీపాటిత నేపారన
శ్రీపాద ప్రభున కబ్బనృపతి జనించెన్ ॥
(బహు చ 1 19)

ఉబ్బడు లిబ్బులు గలవని
రెబ్బడు రిపురాజుం గాంచి రేఖల వలరా
యబ్బడు పరభామినికై
యబ్బడు శ్రీపాదజేని యబ్బడు ధాత్రిన్ ॥
(బహు చ 1 20)

ఇట్లు ధర్మపాలనము భుజబలము వినయము పరస్త్రీ పరాఙ్ముఖత్వము మున్నగు సద్గుణములు కలవాడై అబ్బనృపతి దామెరలవారి వంశమునకు అలంకార ప్రాయుడయ్యెను

తం ఆం శా

## అబ్బనృపాలుడు

అబ్బనృపాలుడు పోతుగంటి మైలానేడు కుమారుడు కాకతి ప్రతాపరుద్ర దేవుని సేవించిన డెబ్బది యేడుగురు నాయకులలో మైలానేడు ఒకడు ఇతడు మహాబలశాలి ఇతడు అనేకసమరములలో పాల్గొని శత్రువులపీచమడచి ప్రతాపరుద్ర దేవునకు విజయమును సాధింపజెప్పిన వీరుడు ఈయన కుమారుడు అబ్బనృపాలుడు ఇతడు గొప్పశూరుడు ఈ అబ్బనృపాలుని ప్రశంసించు చాటుపద్యమణిమంజరిలో ఇట్లు లదు

వల్లభ! భోగ భాగ్యసుర వల్లభ! చారు వివేక శారదా
వల్లభ! నిత్య సత్యగరిమవల్లభ! ధర్మ విచార ద్రౌపదీ
వల్లభ! వాగ్విలాసఫణి వల్లభ! కాంతి విహార శారదా
వల్లభ! చిత ల్లూపుర వల్లభ! అబ్బనృపాలు వల్లభా
(చా మ II-85)

వివరములకు చూ పోతుగంటి మైలి

తం ఆం శా

## అబ్బయగోపుడు

అబ్బయమంత్రి కుమారుడైన గోపుడు మైరావణచరిత్రమను పద్య కావ్యమునకు కృతికర్త దీనికి మాదయకవి కృతికర్త కృతికర్తయు కర్తయు శ్రీవత్సగోత్రజులు గోపయ మంత్రి తల్లి అబ్బమాంబ భార్య రామమాంబ ఇంటిపేరు లేజర్ల వారు పాండవ వంశవర్ధనాయని గోపరాజును మాదయ సంబోధించియుండుటచే లేజెర్లవారు కణ్వ వంశీయులని చెప్ప

వచును వీరిది ప్రథమ శాఖ కావచ్చును వీరి ఇంటి పేరు వేజర్లవారని లేజర్ల నామాంతరమని తెలియుచున్నది లేజర్ల గుంటూరు తాలూకాలోనిది

గోడు రామానుజమతస్ప్రవర్తకుడు నారాయణ పుణ్యకథాశ్రవణాసక్తుడు నీతి శాస్త్ర పారీణుడు

గోపయకు కాంతట్మా ఘునితో వియ్యముకలదు మాడయకవి కాచమంత్రి తనయుడైన ఎఱ్ఱమంత్రికి దేవేంద్ర విజయమను ద్విపద కావ్యమును అంకితముగానొసగెను

మాడయకవి కర్ణాట వీరనరసింహరాయలచే సత్కృతుడనైతినని చెప్పుకొనుటచే అబ్బయ గోడు క్రీ శ 16వ శతాబ్దపు తొలి వర్షములలో ప్రఖ్యాతివహించి యుండవచ్చును

మైరావణ చరిత్రము (8 అ) క్రీ శ 1941లో ఎతాపురము విదేఃజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు కళావతీ పత్రికాధిపతులచే ప్రకటింపబడినది దీనికి విద్వత్కవివర్యులు శతావధానులునైన రామకృష్ణకవులు ఉపోద్ఘాతమును రచించిరి ముద్రిత ప్రతియందు అబ్బయగోపని వంశావతార వర్ణనములు నష్టమగుటచే ఇంతకంటె విశేషము తెలియరాకున్నవి

వి శ మం

## అబ్బలూరు

అబ్బలూరు ప్రశంస పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమునందలి మహిమ ప్రకరణములోను బసవపురాణమునందలి పప్తాశ్వాసములోని ఏకాంత రామయ్యగారి కథలోను ఎపిగ్రాఫియా ఇండికా 5వ సంపుటములోని అబ్లూరు శాసనములందును కనవచ్చుచున్నది

పాల్కురికి సోమనాథుడు కాకతీయ రెండవ ప్రతాపరుద్రుని కాలము (క్రీ శ 1295 1328)నాటివాడని తెలియుచున్నది ఇతడు చతుర్వేదపారగుడు ఇతడు బ్రాహ్మణుడు శైవపరదీక్షనొంది తన అనల్ప కవితా శక్తిని వీరశైవమత ప్రచారమునకై వినియోగించినమహనీయుడీతడు శాస్త్రములు స్మృతులు ఈయనకు కరతలామలకములు సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో ఇతడు కావ్యములను వెలయించెను ద్రావిడ మహారాష్ట్రి భాషలీ తనికి సుపరిచితములు ఈతడు వరంగలు జిల్లా పాలకుర్తి నివాసియనికొందరును మైసూరు రాష్ట్రములోని పాలకురికి గ్రామవాసియని మరికొందరును భావించుచున్నారు ఈతని రచనలు పెక్కులు కలవు వానిలో బసవపురాణము పండితారాధ్య చరిత్ర వృషాధిప శతకము చెన్నమల్లు సీసములు చతుర్వేద సారము అనుభవ సారము సోమనాథ భాష్యము రుద్రభాష్యము అను వి బహుళ చారిత్రను ... వీరశైవ సిద్ధాంత ప్రతిపాదక గ్రంథములు శివుడే పరదైవమనియు ... దేతలు శివుని పరివారమనియు శైవప్రభావితురు వీరశైవ మతమును స్థాపించినవాడు బసవేశ్వరుడు బసవపురాణము పండితారాధ్య చరిత్రము దేశీయంలో వ్రాయబడిన గ్రంథములు నందికేశ్వరుని అవతారముగ భావింపబడు బసవేశ్వరుడు కన్నడ దేశమున మండెగ మాదరాజు మాదాంబయను దంపతులకు జన్మించెను ఉపనయనాది కర్మలను అంగీకరింపక బసవడు గృహమును విడిచి వెడలి కూడలి సంగమ క్షేత్రమున పరమశివుని గూర్చి తపమొనర్చెను శివుడు ప్రత్యక్షమై బసవనికి మహత్తర సందేశమొసగెను బసవడు శైవమును ప్రచారముచేయనెంచి కల్యాణపురమేలు బిజ్జలుని యొద్ద మంత్రిగ నుండి కోశాగారమునందలి ధనమును శైవమత వ్యాప్తికై వినియోగించుచుండెను వర్ణాశ్రమ ధర్మములను పాటింపక సర్వులను కొలువులోనికి రానిచ్చుచుండెను ఇది బిజ్జలునికి గిట్టక బసవేశ్వరుని తన ఆస్థానమునుండి వెడలి పొమ్మనెను బసవేశ్వరుడు కల్యాణ పురమును శపించి వెడలిపోయెను అంతట శైవులకును జైనులకును పరస్పర మతకలహము లేర్పడి పరస్పరము పోరాడుకొని కల్యాణపురమును నాశనమొనర్చిరి ఇదియే బసవపురాణమునందలిగాథ

క్రీ శ 12వ శతాబ్దిలోని వాడగు మల్లికార్జున పండితారాధ్యుని కథాకథనగ్రంథమే పండితారాధ్యచరిత ఆంధ్రదేశమునందు శైవమతవ్యాప్తికై తోడ్పడిన శ్రీపతిపండిత శివలెంకమంచన పండితులతోపాటు మల్లికార్జున పండితారాధ్యుడును ఒకడు ఇతడు బసవేశ్వరునకు సమకాలికుడు క్రీ శ 1170 వరకు ఇతడు జీవించియుండినట్లు తెలియుచున్నది శివతత్త్వ సారము అను గ్రంథమునుఇతడు రచించెను ఈతని నివాసస్థలము తూర్పు గోదావరి మండలము

అబ్బలూరు అనుగ్రామము మైసూరు రాష్ట్రములోని ధార్వారు మండలమునందలి కోడ్ తాలూకాలోనున్నది ఇది కోడ్ పట్టణమునకు పశ్చిమమున రెండు మైళ్ల దూరమున

కలదు చారిత్రకముగ ఈ గ్రామము మిక్కిలి ప్రసిద్ధి వడసినది పశ్చిమ చాళుక్య రాజుల శాసనములనేకములు ఇచ్చట లభించినవి ఇచట బ్రహ్మేశ్వరాలయము కలదు దీనిని ప్రస్తుతము బసవేశ్వరాలయమని చెప్పుచున్నారు ఏకాంత రామయ్య అను వీర శైవుడు అబ్బలూరు గ్రామమునందు తన మహిమను జైనులకు చూపి వారిని శైవులుగ నొనరించినట్లు బసవపురాణమున గలదు పద్యములోకూడ కలదు ఏకాంత రామయ్య ధార్వార్ మండలమునందలి లక్ష్మేశ్వర్ అను హాలగ్గేరి గ్రామములోని సోమనాథ స్వామి భక్తుడు అతడు ఏకాంత భక్తి సుశ్లోకుడు నిష్ఠాహేంద్రియ గుణాన్విత చేతనుడు అతడు నిత్యము శివార్చనానంతర కాలమున ప్రమథలోకమున కరిగి వీరభద్రాది గణములకు ప్రణమిల్లి తిరిగి భూమికిదిగి వచ్చెడివాడట ఆయనకు సోమనాథస్వామి యిట్లు ఆదేశించెను

"అబ్బలూరు వరగ్రామ । గత్వా రామ మమాజ్ఞయా
ప్రతవాసం కురు స్వామ్ యజ మాం భక్తి యోగతః
జైనైస్సహ వివాద చ । శంకా హిత్వా కు స్వథ
స్వశిరోపి పణ కృత్వా । పుత్ర త్వం విజయీభవ

(Inscriptions at Abbur Eipsgraphia Indica Vol V 247 Page)

(ఏకాంతరామా ! నీవు అబ్బలూరు గ్రామమునకుపోయి జైనులతో వివాదమొనర్చి నీ శిరమునుకూడ పణముగ నొనర్చి విజయము నొందుము)

సోమనాథేశ్వరస్వామి ఆజ్ఞానువర్తియై ఏకాంత రామయ్య అబ్బలూరు కుచని అచ్చటి బ్రహ్మేశ్వరాలయమున వసించుచుండెను శంకగౌడ అను జైనుడు ఒకనాడు పాదరక్షలతో ఆ శివాలయమున ప్రవేశించెను దానిని సహింపక ఏకాంతరామయ్య పాదరక్షలను పారవైచి మృదునకు సాహసముగ మన్నించు క్షమని జైనునికోరెను జైనుడు దానికంగీకరింపక నిజమైన దేవుడు జినుడే అని వాదించుచు శివుడు మహిమోపేతుడే అయినచో తలను తరుగుకొని తిరిగి తను బడసి నీ శివభక్తిని ప్రదర్శింపుమని రామయ్యనుకోరెను రామయ్య పరమశివునిముందట తన శిరమును ఖండించుకొని ఏడు దినములు శిరోవిహీనుడైయుండి ఆటపాటలతో నృత్యమొనర్చి అందరిని ఆశ్చర్యచకితులనొనర్చి తుదకు గళమున శిరము నంటించుకొనెను జైనులు ఏకాంతరామయ్య శివభక్తికి ఆశ్చర్యమొంది అనేకులు రామయ్యవలన శైవదీక్ష పొందిరి ఈ విషయమును తిలకించుటకు కల్యాణపురాధిపతి యగు బిజ్జలుడును ఆయన మంత్రియగు బసవేశ్వరుడును ఏతెంచినట్లు బసవపురాణమున కలదు శైవులు విపరీత మతావేశమునకులోనై అబ్బలూరులోని జైన ప్రతిమల విటతాట మాడి జైనవసతులను ధ్వంసమొనర్చినట్లు తెలియుచున్నది ఇందుచేతనే కాబోలు ఏకాంతరామయ్యకు జైన మయ కోలాహలుడు అను బిరుదముకూడ లభించినట్లు బసవపురాణమున కలదు ఏకాంతరామయ్యగారి కోరికపైని హాలగేరి యందలి సోమనాథేశ్వరునకు కదంబవంశీయుడగు కామదేవ మహామండలేశ్వరుడు మల్లిహాల్లి (మల పల్లి) అను గ్రామమును దానమిచ్చి శాసనము (ఎపి ఇ V పుట 244) వ్రాయించెను ఏకాంతరామయ్య యొక్క శివభక్తికిమెచ్చి పశ్చిమ చాళుక్య ప్రభువగు నాలుగవ సోమేశ్వరుడు వీరసోమనాథేశ్వరస్వామి వారికి అబ్బలూరు గ్రామమును దానముచేసినట్లు (ఎపి ఇ V పుట 244) కలదు కామదేవుడు క్రీ శ 1182 నుండి 1 08 వరకు రాజ్యపాలన మొనర్చెను అబ్బలూరులో లభించిన శాసనములు పశ్చిమ చాళుక్యరాజులు దేవాలయములకు ఒసగిన దానధర్మాదులను ఆనాటి వీరశైవమత ప్రాచుర్యమును శివభక్తుల గాథలను నుడువుచున్నవి

క్రీ శ 4 5 శతాబ్దములలో మూషువూరు అరుకాయలతో వర్ధిల్లిన బౌద్ధము క్రమముగా క్షీణించినది తమిళదేశమున శైవము కర్ణాటక ఆంధ్రదేశములలో జైనము వ్యాప్తి గాంచసాగినవి క్రీ శ 12 వ శతాబ్దమువరకు వీరశైవము బయలుదేరి బౌద్ధ జైనమతములను అణగద్రొక్కి మిక్కిలి ప్రాధాన్యము పొందెను వీరశైవులు నాలుకలు తలలు కోసుకొని తిరిగి వానిని పొందియు కండ్లను పొడుచుకొని తిరిగి ఆ కండ్లనుపొందియు ఘటములోని సర్పములను చేత బట్టుకొనియు నిప్పుమ మూటగట్టియు శత్రువులను శపించియు తమ మహిమలను తమ శివభక్తి తత్పరత్వమును వెల్లడించుకొనుచుండెడివారు ఆ యద్భుతదృశ్యములను చూచి ప్రజలు శైవదీక్ష వహించెడివారు శివునకు ధూపము లభ్యము కానపుడు తమ చర్మమును కాల్చుకొని ఏర్పడిన పొగయే ధూపముగను దీపము లభించనపుడు తమ జుట్టును కాల్చుకొని ఆ జ్వాలయేదీపముగను శైవులు అర్పించెడివారు శ్రీశైలక్షేత్రమునందలి వీరమండపము శైవులొనర్చు వీర కృత్యములకు ఆనాడు స్థానముగనుండెడిది వర్ణనియమము

లేకుండుటచే అన్ని జాతులవారును శైవదీక్షను బొంది వీర శైవులైరి కొందరు స్త్రీలుకూడ వీరశైవము నవలంబించిరి ఆనాడు మొత్తము వీరశైవులు (లింగాయతులు) నుమారు రెండు జాతి లక్షలవరకు ఉండి ట్లు తెలియుచున్నది జైనులతో వాదము సంభవించుటయు ఆ వాదమున జయించి చో శైవులు జయపత్రములను దుకొని జైనులను శైవులనుగా ఒనర్చుటయు ఆనాడు జరుగుచుండెడిది సంగమవంశీయుడగు బుక్కరాయల కాలమున శైవులకును జైనులకును వివాదములు ఏర్పడగా ఆయన వారి వివాదములను పరిశీలించి ఉభయులకు న్యాయము కలిగించి ట్లు తెలియుచున్నది కాకతీయులు శైవమతావలంబులైనను అన్యమతముల వారినికూడ కూడ మానప్రేమతో ఆదరించిరి

శం ఆం శా

## అబ్బళదేవి

సీ॥ ఆ బుక్కరాజేంద్రుడు డబ్బళిదేవి బ
ళ్ళాదేవియను సతులను వరించి
యబ్బళదేవి య దాత్మజుని సింగ
విభుడాదిగాఁ గను వేడ్క గాంచి
నందేల యొసఁగ వానందనులాపురిఁ
దమకను నిజ రాజధానిగాఁగ
నేలుచు గులమునందేల పేరధరిత్రిఁ
దనరఁగఁ బుత్రపౌత్రాభివృద్ధి
గీ॥ నతిశయిల్లిరి మరియును నా నృపాలుఁ
డన ఘనుఁడు బళ్ళాదేవియందు రామ
భద్రవరలబ్ధ జనితుండుద శౌర్య
భాను నిభతేజు రామ భూపాలుఁగనియె
(రామరా 207)

ఈ పద్యము రామరాజీయమను నామాంతరముగల నరపతి విజయములోనిది ఇది ఆ దుగుల వెంకయ్య కవిప్రణీతము ఇందు చరిత్ర పరిశోధకులకు ఉపకరించు అంశములు పెక్కులు కలవు

కల్యాణ బిజ్జలుని వంశమున సోమదేవరాజ తనూజవుడు రాఘవుడు ప్రముఖుడైను అతని కుమారుడు పిన్నశౌరి అతని కుమారుడు బుక్కరాజు బుక్కరాజు సకల కళాకోవిదుడనియు అనహాయ శూరుడనియు సాళువ నరసింహరాయ రాజ్య ప్రతిష్ఠాపనాచార్యుడనియు ప్రసిద్ధి వహించెను

పై నుదాహరించిన పద్యమున పేర్కొనబడిన అబ్బళదేవి యనునామె ఈ బుక్కరాజు పట్టమహిషి ఈ అబ్బళదేవి కుమారుల రాఘవుడు మున్నగువారు వీరు నందేల రాజధానిగా జేకొని రాజ్యము నేలుచు నందేలవారు అని ప్రశస్తిని బడసిరి శాసనాలోకించు ప్రతిశర్తయైన కృష్ణమరాజు ఈ వంశ ధ్యానమ వంశమునకు చెందిన వాడే

బుక్కరాజునకు రెండవ భార్యయగు బళ్ళాదేవికి శ్రీరామునివరమువలన రామభూపాలుడు పుట్టెను అతడు కందవోలు రాజధానిగా జేకొని రాజ్యమునేలెను




ఆ గో కృ

**అబ్బానాయడు—దామెర్ల —** చూ అబ్బన్ననృపతి

## అభినవ కాళిదాసు—వెల్లాల

గీర్వాణ వాఙ్మయమునకు స్త్రీలెన్నియో విశిష్ట కృతి లాభములు నవదరించిన ప్రాచీనాధునికులందు అభినవ కాళిదాస బిరుదాంకితుడైన వెల్లాల ఉమామహేశ్వర పండితుడొకడు ఆతడనేక శాస్త్రములు తెలిసిన పండితుడే కాక గొప్పకవికూడ ఆతని కాలమును గూర్చియు పేరునుగూర్చియు ఇటీవలివరకు ఇదమిత్థమని నిర్ణయము జరగలేదు సంస్కృత వాఙ్మయ చరిత్రకారులాతని బిరుదనామము తోడనే పేర్కొనుచేకాక యీ పండితకవి పదునొకండవ శతాబ్దమందుండిన ట్లూహించిరి

మాడభూషి కృష్ణమాచార్యుల వారు తమ సంస్కృత

వాఙ్మయచరిత్రమున 1 భాగవతచంపువు 2 అభినవభారతచంపువు 3 శృంగారకావ్యదర్పణము 4 కలివిడంబనము అభినవకాళిదాసు రచనలుగా పేర్కొన్నారు. వీనిలో ఒక్క భాగవతచంపువు మాత్రమే ఈనాడు పరిపూర్ణముగ దొరకుచున్నది. తక్కినవి మృగ్యములు. అభినవకాళిదాసు శిష్యుడైన కవికుంజరుడు తన గురువు పినాకినీతీరమందున్న విద్యానగర రాజధానీ పాలకుడైన రాజశేఖర మహారాజు ఆస్థానకవియని తన రాజశేఖరచరిత్రమున చెప్పినందున ఆ రాజశేఖరమహారాజు రాజేంద్రచోళుని (1016–1064) సమకాలికుడనియు కనుక అభినవకాళిదాసు కూడ పదునొకండవ శతాబ్దము వాడనియు కృష్ణమాచార్యుల వారభిప్రాయపడిరి. చంపూభారతము వ్రాసిన అనంతభట్టుకు అభినవకాళిదాసు ప్రతిస్పర్ధి యనియు అతని చంపూభారతము మూలముగా అభినవకాళిదాసు రచించిన అభినవభారతచంపువు మరుగున పడిపోయినదనియు పండితలోకమున ప్రచారమందున్న ఐతిహ్యమును గూడ కృష్ణమాచార్యులవారుల్లేఖించినారు. రాజశేఖర చరిత్రయందు కవికుంజరుడు తనగురువైన యభినవకాళిదాసు ప్రతిభాపాండిత్యములకు సంబంధించి వ్రాసిన కథను కృష్ణమాచార్యులవారిట్లు వ్రాసినారు. రాజశేఖరుని యాస్థానమున దుర్జయుడను ప్రధానకవి యొకడుండెను. అతడు ప్రతిభావంతుడైన క్రొత్త కవులెవరైనను రాజదర్శనమునకు వచ్చినచో వారికి రాజదర్శనము కాకుండ అడ్డుపడుచుండెడివాడు. దుర్జయు నాశ్రయించనిదే ఎట్టివారికైనను రాజసత్కారము లభించెడిది కాదు. దుర్జయునికాదని ఎవరైన రాజదర్శనము చేసికొన్నచో అట్టివారి కేమియు రాదని దుర్జయు డెగతాళి చేసెడివాడు. ఎంతటి కవిపండితుడు వచ్చినను అతడు రఘువంశమందు మూడుసర్గలు ప్రక్రియాకౌముదిలో సంధిపరిచ్ఛేదము మాత్రము చదివినవాడని పరిహసించి పరాభవించుచుండెను. అభినవకాళిదాసు ఏవిధముగానో రాజదర్శనము సంపాదించి దుర్జయుని పరాభవించి అతని స్థాన మాక్రమించుకొనెను. ఇది రాజశేఖర చరిత్రమందలి కథ.

కాని ఈ కథయందలి యాంతరంగిక సాక్ష్యమే అభినవకాళిదాసు పదునొకండవ శతాబ్దికి చాలకాలము తరువాతివాడని తేల్చుచున్నది. రాజశేఖర చరిత్రమున ప్రక్రియాకౌముది ప్రసక్తి వచ్చినందున ప్రక్రియాకౌముదికన్న రాజశేఖర చరితమును దాని రచయిత కవికుంజరుడును అతని గురువైన యభినవకాళిదాసును తరువాతివారే కావలయును. ప్రక్రియాకౌముదికారుడు రామచంద్రుడు క్రీ శ 1235 ప్రాంతమున నున్నవాడు. కనుక అభినవకాళిదాసు అటుతరువాతివాడే కావలెను. మరియు పినాకినీతీరమున ఉన్నదని చెప్పిన విజయనగర రాజధానియు దానికి పాలకుడైన రాజశేఖర మహారాజును చరిత్రలో కానరారు. చరిత్రలో ప్రసిద్ధికెక్కిన విజయనగరము తుంగభద్రాతీరమందున్నది. ఆ విజయనగర రాజులందు ఒక్కడే రాజశేఖర నాముడున్నాడు. అతడు సంగమవంశమునకు చెందిన మల్లికార్జునరాయల (1446–1465) కుమారుడు.

భాగవతచంపువు వ్రాసినవాడు అభినవకాళిదాసు లేదా నవకాళిదాసు. దీనిపై పక్షధర యెల్లయ్యార్యుని శిష్యుడైన మోతుకు అక్కయసూరి రత్నావళియను వ్యాఖ్యానమును వ్రాసినాడు. ఈ యక్కయసూరి అభినవకాళిదాసుకు గురువు. ఉద్దండపండితుడైన గురువుచే తన కావ్యమునకు వ్యాఖ్యానము వ్రాయించుకొన్న శిష్యుడెంత ధన్యుడో మన మూహింపవలయును. అక్కయసూరి తనశిష్యుడైన అభినవకాళిదాసును "వెల్లాల కులశిరోమణిః" అనియు "వెల్లాలకుల వారాశిజాతశీతాంశుః" అనియు పేర్కొన్నాడు. దీనివలన అభినవకాళిదాసు ఇంటిపేరు వెల్లాలవారని తెలిసినది. అతియ కాని అతని నిజమైన పేరేమిటో చంపూభాగవతమునగాని తద్వ్యాఖ్యానమునగాని లేదు. మోతుకు, డం, వెల్లాల గ్రామములు రాయలసీమలో నున్నవి. ఆ యింటిపేర్లు గలవారు ములికినాటివారు. వారిప్పటికిని కర్నూలు మండలమందును మైసూరు రాష్ట్రమందును ఉన్నారు.

అడయారు లిఖిత పుస్తకభాండాగారమున తత్త్వచంద్రిక అను వేదాంతగ్రంథమున్నది. దానిలో తత్కర్త వెల్లాల ఉమామహేశ్వరుడనియు అక్కయసూరి శిష్యుడనియు కలదు. దీనిచే తత్త్వచంద్రికా గ్రంథకర్త వెల్లాల ఉమామహేశ్వరుడును భాగవతచంపూరచయితయైన అభినవకాళిదాసును అభిన్నులని నిర్ణయించవచ్చును. ఇది సిద్ధాంతమైన తరువాత అభినవకాళిదాస వెల్లాల ఉమామహేశ్వరుల పేర్లతో పెక్కు గ్రంథములు లభించుచున్నవి. అడయారు గ్రంథాలయమందే విరోధవరూధిని యనెడు ద్వైత విశిష్టాద్వైతఖండన గ్రంథమొకటి అభినవకాళిదాసు రచనముగా నున్నది. దీనివలన

ఇది తాటిచెట్లతో నిండి విశాలమైన ఎల్లెటూరు దీని విస్తీర్ణము 5922 ఎకరములు

1961 స। జనాభా లెక్కల ప్రకారము ఈగ్రామములో 2036 మ ది పురుషులు 1860 మ ది స్త్రీలు చెరసి 3896 మ ది ఉ డిరి వీరిలో 6–15 ।ల వయస్సుగల బాలబాలికలు 6 3 మ ది! షెడ్యూల్డు జాతులు షెడ్యూల్డు తరగతులవారు కలసి 653 మంది 1931 లో 2589 మంది 1941 లో 3006 మ ది 1951 లో 3509 మంది నలు ఉ డిరి 1951 నుండి 1961 వరకు కలిగిన జనవృద్ధి 385 ఇది సహజవృద్ధి ఇచ్చట ఇ డ్లు విడివిడిగను శివార్లుగను నిర్మించబడి వి వీటిలో 23 పె కు టిండ్లు 19 కాంక్రీటు కప్పుగల ఇ డ్లు 6 పెక్కు అంతస్తులు గల భవనములు కలవు ఇక్కడ జనము వరి రాగి జొన్న అన్నములను తి దురు వీరు బా నీటిని త్రాగుదురు

ఇచ్చట వర్షాధారమువలన బావుల నీటివలన పంటలు పండును వరి జొన్న రాగి వేరుసెనగ కంది మొదలగునవి ముఖ్యమైన పంటలు ఫలసాయములను కొన్ని టిని గాదెలలో నిల్వ చేయుదురు పంటదినుసులు లారీలపై కదిరి అనంత పురములకు రవాణా అగును 15 ఎకరముల్ల విస్తీర్ణముగల 3 నారి జతోటలుకలవు వీటిపైవచ్చు సాలుసరి ఆదాయము రు 85 000 లు స్థానికులు స్థానిక ంతకు ఉపయోగపడు కూరగాయలను ప డింతురు 1966–67 సం॥లో 4140 ఎకర ముల భూమి సాగుబడి క్రిందఉండెను 320 ఎకరములభూమి గొట్టపు బావులక్రి ద సాగుబడి ఆయెను 8 ఆయిల్ ఇంజనులు 162 ఎకరముల భూమికిని క లులు ఏతములు 158 ఎకరముల భూమికిని నీటిని సమకూర్చెను భూమిలో 2518 ఎకరముల ఎర్ర నేల 2125 ఎకరముల నల్ల నేల కలదు

ఈగ్రామమున గేదెలు ఎద్దులు ఆవులు ఆబోతులు మొదలయినవి 3219 మేకలు 298 గొర్రెలు 526 కోళ్లు 623 ఉన్నవి పాలు పాలపదార్థములు మా సము గ్రుడ్లు స్థానికులు ఉపయోగింతురు బరువులు మోయుటకు 25 గాడి దలు కలవు

ఇచ్చటి ప్రజల ముఖ్యవృత్తులు వ్యవసాయము కూలి ఆరుగురు దుకాణాదారులు ఇద్దరు క్రయ విక్రయదారులు 63 మంది రె డ్లబండ్లతోలువారు లరు ఇద్దరుకంసాలివారు ఒకకమ్మరి అయిదుగురు తాపీమేస్త్రీలు ముగ్గురు తెలికల వారు మంగలి చాకలివారుకూడ కలరు వ్యవసాయదారు లకు కూలీలు ప్రక్క గ్రామము నుండికూడ లభి తురు

ఈగ్రామమున 5 దేవాలయములు ఒక చర్చి 2 మసీ దులు ఉన్నవి దేవాలయములకు ఈనా భూములు ఉన్నవి శ్రీరామనవమి ఉత్సవమును జరుపుదురు

ఇచ్చటికి 22 మైళ్ళ దూరములో కదిరి రైల్వేస్టేషను ఉన్నది గంటకు ఒకమారు బస్సులు కదిరిను డి ధర్మవరము నకు పోవును ఈగ్రామమున 3 మట్టిరోడ్లు కలవు దీనిని పొరుగు గ్రామములతో ఒక కంకరరోడ్డు కలుపుచున్నది ప్రయాణములకు రె డు ఒంటెద్దుబ డ్లు 43 రె డ్లబండ్లు 6 సైకిళ్లు ఉన్నవి

ఈగ్రామమున బ్రాంచి పోస్టాఫీసు సమితి ఎలిమెంటరీ స్కూలు జిల్లాపరిషత్తు హైస్కూలు ఉన్నవి ఈహైస్కూలు చదువునకు గురిగింజల పల్లెనుండి అలంపల్లెనుండి 59 మంది విద్యార్థులు వచ్చిరి ఇది పంచాయతీపరిపాలనలోనిగ్రామము 1967–68 సం॥లో ప చాయతీ ఆదాయము రు 8596–51 లు లోకల్ లైబ్రరీ సత్రము పోలీసుస్టేషను ఉన్నవి ఇచట సహకారసంఘము 600 మందికి అప్పులిచ్చినది ప్రైవేటుగా అప్పులిచ్చువారుకూడ గలరు ప్రైమరీహెల్తుసెంటరు పురుళ్ళ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి ఉన్నవి 8కిరాణాదుకాణములు 2 కాఫీహోటళ్లు 3 సోడా కిళ్ళి సిగరెట్టు దుకాణములు 6 కూరగాయల అంగళ్లు తౌరశాల ఒకలాండ్రీ కలవు

ఇచ్చటికి 22 మైళ్ళ దూరములోనున్న కదిరిలో తంతి కార్యాలయము జనరల్ ఆసుపత్రి సినిమాథియేటరు కోర్టులు సబ్ రిజిష్ట్రారు ఆఫీసు తాలూకాకచేరీ బ్లాకు అభి వృద్ధి కేంద్రము ఉన్నవి కళాశాల చదువులకు విద్యార్థులు అనంతపురమునకు పోవుదురు

మా శ్వే

## అమనగల్లు (అమంగల్)

అమంగల్ కల్వకుర్తి తాలూకా మహబూబునగరము జిల్లాలో ఉ న్నది దీనికి 14 మైళ్ళ దూరములో కల్వకుర్తి 32 మైళ్ళ దూరములో హైదరాబాదు నగరము ఉన్నవి ఈ గ్రామమును మొదలు పుష్పగుచ్ఛము అని పిలిచెడివారట తరువాత ఇది ఖుష్‌ఖుషాబాదుగాను చివరకు అమంగల్‌గను మారెనట ఈ గ్రామమునకు తూర్పున ఆపూరువల్లి పడ మట చుక్కాపురం ఉత్తరమున విఠాయిపల్లి పల్లి దక్షిణ మున చేరకూరుఉన్నవి దీని విస్తీర్ణము 1685 ఎకరములు

మల్లప్పగుట్ట పెద్దిగుట్ట కోడన్‌గుట్ట ఆరెలగుట్ట సంకెరకొండ పీతకొండ కప్పలకొండ చద్రాయణగుట్ట మొదలగునవి కలవు వీటిపై సీతాఫలపు చెట్లుకలవు

1961 వ స॥ జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామము లోని పురుషులు స్త్రీలు కలసి 7 407 మ ది ఉ డిరి వీరిలో షెడ్యూలు జాతులవారు 1142 మ ది షెడ్యూలు తరగతుల వారు 22 మంది ఇచట ఇండ్లు ఒకచోట గుంపుగను ఒకచో దూరదూరముగను ఒకచో ఏకపంక్తిగను వాడవాడలుగను నిర్మించబడినవి వీటిలో 1384 పెంకుటిండ్లు 18 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 8 ఒక అంతస్తుమేడలు ఈ గ్రామము పడమరదిశగా పెరుగుచున్నది గ్రామస్థులలో 60 శాతము వారు వరి అన్నమును 40 శాతమువారు జొన్న అన్నమును తిందురు త్రాగుటకు వీరు బావినీటిని ఉపయోగింతురు మంచినీటి ఎద్దడి వేసవిలో ఉండును

పెద్దవాగు కల్లెడపువాగు మారసముద్ర చెరువు పల్లె చెరువు రావులచెరువు– ఈ గ్రామమునందుగల నీటి వనరులు 1966 67 స ।లో 12075 ఎకరముల భూమి పంటలక్రింద ఉపయోగించబడెను చెరువు క్రింద 801 ఎకరములు సాగుబడి ఆయెను 40 ఎలెక్ట్రిక్ ఇంజనులు 12 ఆయిల్ ఇంజనులు 75 ఎకరములకును 15 మోటలు 81 ఎకరములకును నీటిని సప్లయి చేసెను ఒక ట్రాక్టరు 150 ఎకరముల భూమినిదున్నెను వరి జొన్న ఆముదాలు కుసుమ పెసర కంది మవ్వుమొదలయినపంటలుపండును పంటధాన్యమును గుమ్మిలలో నిలువ చేయుదురు పంట సరుకులను లారీలపై హైదరాబాదునకు రవాణాచేయుదురు గ్రామస్థులు తమకు సరిపడు టొమాటా వంగ బెండ మొదలగు కూరగాయలను పండింతురు ఇచ్చటి భూమిలో 15578 ఎకరముల ఇసుకనేలయు 487 ఎకరముల చౌడునేలయు కనిపించును గవర్నమెంటు పాలనక్రింద ఇక్కడ 856 ఎకరముల అడవి ఉన్నది చంద్ర బిల్లుడు మోత్కు మొదలగు వృక్షజాతులుకలవు అడవిపందులు తోడేళ్లు మొదలగు వన్యమృగములుఉన్నవి

ఈ గ్రామములో 428 గేదెలు 779 ఎద్దులు 545 ఆవులు రెండు గుర్రములు 783 మేకలు 1290 గొర్రెలు 50 పందులు 1808 కోళ్ళు ఉన్నవి దినమునకు 250 లీటర్ల పాలు పెరుగు నేయి 28 కి గ్రా మాంసము 350 గ్రుడ్లు సాలీనా 650 కి గ్రా చేపలు స్థానికులే ఉపయోగించుకొందురు ఇచ్చట 75 గాడిదలుకూడ ఉన్నవి వీటిని చాకలి బట్టలు మోయుటకును బరువులను మోయుటకును ఉపయోగింతురు

వ్యవసాయము వ్యవసాయకూలి ఈ గ్రామ ప్రజల ముఖ్య వృత్తులు అడవి సంపదలపై జీవించువారు మిషన్ ఎజెంట్లు 28 మంది దుకాణదారులు ! ఎద్దుబండ్లు తోలువారుకలరు కమసాలివారు వడ్రంగులు కమ్మరులు కమ్మరులు తాపీపనివారు తెలికవారు కలరు 50 మంది చాకలివారు 25 మంది మంగలి వారు 30 మంది గొల్లవారు 0 మంది వడ్డెరవారు 150 మంది నూలుమగ్గములవారు 8 మంది పట్టు మగ్గముల వారు కలరు 4 వడ్లమరలు 4 ఎండిమరలు ఉన్నవి తయారుచేసినబియ్యములో కొంతభాగమును వాడుకొని కొంతభాగము హైదరాబాదునకు రవాణాచేయుదురు చేనేత వస్త్రపరిశ్రమ ఉన్నది పట్టుబట్టలు చీరెలు మొదలగు చేనేతవస్త్రములను గంగాపురం పాలమూరు అచ్చంపేట అమరాబాదు దేవరకొండ షాద్ నగరములకు ఎగుమతిచేయుదురు ఈ పరిశ్రమవలన 450 మంది జీవించుచున్నారు వ్యవసాయదారులకు సరిపోవు కూలీలు దొరుకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 2 50 పై స్త్రీకి రు 1-50 పైసలు

అచ్చట వేంకటేశ్వర ఆంజనేయ శివదేవాలయములు ఒక మసీదుఉన్నవి శ్రీ వేంకటేశ్వర దేవాలయమునకు 8 ఎకరముల తరిభూమి 20 ఎకరముల మెట్టభూమి కలదు ఇచ్చట శ్రీ వేంకటేశ్వరస్వామి ఒక గుండ్రని రాతి ఆకారమున వెలసెనట దాని ప్రక్కన మనుజరూపమున ఒకశిలావిగ్రహమును ప్రతిష్ఠించిరి ఊరేగింపు సమయములో లోహనిర్మితమయిన ఉత్సవ విగ్రహములను ఉపయోగింతురు ఫాల్గున శుద్ధషష్ఠి నుండి ఏకాదశివరకు అనగా ఆరుదినములు శ్రీ వేంకటగిరి జాతర (బాలాజీ ఉత్సవము) జరుపుదురు మొదటి దినమున అంకురార్పణ రెండవదినమున ధ్వజారోహణము భేరీపూజ అగ్నిప్రతిష్ఠ మూడవదినమున ఆరాధాన ఎదురుకోలు గరుడసేవ హోమము నాల్గవదినమున కల్యాణోత్సవము ఆరాత్రి రథోత్సవము ఆయిదవదినమున శకటోత్సవము అశ్వవాహనోత్సవము ఆరవది మున పూర్ణాహుతి చక్రతీర్థము ఆరాత్రి నాకబలి జరుగును వెండి మీసములు ఊగుడు బిల్లలు కొబ్బరికాయలు దేవునికి మ్రొక్కులవారు సమర్పింతురు ఈ ఉత్సవము 40 సంవత్సరములనుండి జరుపబడుచున్నది.

ఈ దేవాలయమున కెదురుగా 8 దినములు సంత జరుగును ఈ సంతలో తినుబండారములు పాత్రలు అద్దములు దువ్వెలు ఫొటోలు పుస్తకములు బట్టలు గాజులు ఆట వస్తువులు మొదలగునవి అమ్మెదరు వర్తకులు గ్రామస్థులు ఈ ఉత్సవము జరుపుటకు యథాశక్తి ధనమిచ్చెదరు భజనలు నాటకములు జరుగును ఈ గ్రామమునకు తూర్పున నాలుగు ఫర్లాంగుల దూరమున బుర్జుగవ్వగవి అను ఒక కొండగుహ ఉన్నది ఈ గుహకు దారినుండి ప్రాకుచుపోయిన ఒక చెరువును చేరుదురు కాని ఎవ్వరును దానిగుండా సాహసించిపోలేదు

ఈ గ్రామమునకు 32 మైళ్ళదూరములో నాపల్లి రైల్వేస్టేషను ఉన్నది అనుంగల్ బస్సుమార్గముపై ఉన్నది ప్రభుత్వపు బస్సులు ఈ గ్రామము మీదుగా హైదరాబాదునుండి నాగార్జునసాగరుకును హైదరాబాదునుండి మహబూబునగరమునకును పోవును ఇచ్చట మొత్తము 1½ మైళ్ళుపొడవుగల 7 మట్టి రోడులవు ఈ గ్రామమునుండి పొరుగు గ్రామములతో మట్టి రోడ్లు కలుపుచున్నవి ఒక రిక్షాబండి ఒక ఒంటెద్దుబండి 165 రెండెడ్లబండ్లు 77 సైకిళ్ళు ప్రయాణములకును సరుకులను గొనిపోవుటకును ఉపయోగపడును

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు జిల్లా పరిషత్తు హైస్కూలు ఉన్నవి ఒక పరిషత్తు పాఠశాల బాలికలకు కూడ కలదు హైస్కూలు చదువునకు ముస్తాద్‌పల్లి మంగల్‌పల్లి విఠ్ఠాయిపల్లి జంగిరెడ్డిపల్లి మేడిగడ్డతాండ ముచ్చుగుంట చింతలపల్లి నకటోన్‌పల్లి అను గ్రామములనుండి 150 మంది విద్యార్థులు వత్తురు దీనిలో 180 మంది బాలికలు చదువుచున్నారు ఇచ్చట సాంకేతిక వృత్తి నేర్పుటకు రెండు కర్రకోతయంత్రములున్నవి విద్యుచ్ఛక్తిని 158 ఇండ్లు 40 ఎలెక్ట్రిక్ మోటారులు 4 వడ్లమరలు 4 పిండిమరలు వాడుకొనును

అమంగల్ పంచాయతీ పాలకల గ్రామము ఇంటిపన్ను వృత్తిపన్ను వాహనముల పన్ను మొదలయినవి ఈ పంచాయతీకి ఆదాయమును సమకూర్చును గ్రామపారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లుకలవు గ్రంథాలయము 100 మంది కూర్చొనుటకు వీలగు కమ్యూనిటీహాలు పోలీసుస్టేషను బహుళార్థ సహకార సంఘము ఉన్నవి ప్రభుత్వపు ఆసుపత్రి పశువుల ఆసుపత్రి కలవు వారపు సంతలో బట్టలు ధాన్యము పండ్లు కూరగాయలు లభించును ఇచ్చట 18 కిరాణాదుకాణములు 8 కాఫీహోటళ్ళు 3 కిళ్ళీ సోడా గిరెటు దుకాణములు కూరగాయల అంగడి 3 సైకిళ్ళషాపులు 6 క్షౌరశాలలు 5 లాండ్రీలు 5 బట్టల షాపులుఉన్నవి

ఈ గ్రామవిద్యార్థులు కళాశాల చదువులకు హైదరాబాదునకును 14 మైళ్ళలోగల కల్వకుర్తిలోని జూనియర్ కళాశాలకును పోవుదురు కోర్టుకును సబ్ రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకాకచేరికి సినిమాథియేటరునకు కూడ కల్వకుర్తికి గ్రామస్థులు పోవుదురు

మా శ్వే

## అమరచింత

మహబూబునగరుజిల్లా ఆత్మకూరు తాలూకాలో అమరచింత అను గ్రామము ఉన్నది దీనికి మూడుమైళ్ళలో ఆత్మకూరు పట్టణము కలదు దీనికి తూర్పున చిన్న చెర్ల పడమట మస్తీపురం పామిరెడ్డిపల్లె ఉత్తరమున నద్దూరు దక్షిణమున సింగంపేట కానాపురం పెద్దచెరువు హద్దులుగా ఉన్నవి ఈ గ్రామవిస్తీర్ణము 507? ఎకరములు ఇచట మస్తీపురం గుట్టకలదు ఇది రాతిమయముగా ఉన్నది

ఈ గ్రామములో పురుషులు స్త్రీలుకలసి 1961 లో 4636 మంది ఉండిరి వీరిలో మెడ్యూలు జాతు వారు మెడ్యూలు తరగతులవారు 285 మంది 1951 నాటి జనుల సంఖ్య 4040 పదిసంవత్సరములలో 596 మంది వృద్ధి యి ఇచ్చట ఇండ్లు దూరదూరముగాను విడివిడిగాను కట్టబడి యున్నవి వీటిలో 5 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 10 ఒక అంతస్తుగలమేడలు కలవు ఈ గ్రామము తూర్పుదిశగా అభివృద్ధి చెందుచున్నది మిగిలిన మూడు దిశలలో తరిభూమి కలదు ఇచటి జనులలో 25 శాతమువారు వరి అన్నమును 75 శాతము వారు జొన్న రాగి అన్నమును తిందురు ఆ దరు చేదబావుల నీటిని త్రాగుదురు పరిశుద్ధము చేయబడిన జల సౌకర్యము కూడకలదు మంచినీటి ఎద్దడ ఉన్నది

పెద్దచెరువు బావులు ఈ గ్రామమునగల నీటివసరులు వీటిక్రింద వరి జొన్న సజ్జ కొర్ర ఆరికెలు కందులు వేరుసెనగ ఆలచంద మొదలగునవి పండును వీటిని గుమ్ములలో నిలువచేయుదురు బండ్లపై వీటిని వనపర్తిరోడ్డు మార్కెట్టునకు చేర్తురు టొమాటో వంగ బీర పొట్ల మొదలగు కూరగాయలను పండింతురు అవి గ్రామస్థులకే ఉపయోగపడును 1966-67 సం॥ లో పంటలక్రింద 4336 ఎకరములభూమి

ఉపయోగపడెను ఇదలో చెరువు క్రింద 400 ఎ ర వ భూమి బావుల క్రింద 15 ఎకరముల భూమి సాగు బడియైనది ల యిలు ఇజలు 21 ఎలక్ట్రిక్ మోటా రులు 1ట0 ఎకరములకు నీటిని సరఫరాచేసెను నీటి సరఫ రాకు మోటలనుగూడ ఉపయోగించిరి వ్యవసాయదారులు 10 వీడర్లు 8 ఇనుపనాగళ్లు 5 స్ప్రేయర్సు 3 డస్టర్లు సీడ్ డ్రిల్సు గు డ్రమ్ములు ఉపయోగించిరి

ఈ గ్రామములో ఆవులు 228 ఎద్దులు 607 గేదెలు 177 దున్నలు 50 గుర్రములు 4 మేకలు 170 గొర్రెలు 560 పందులు 53 కోళ్లు 1637 ఉన్నవి పాలు పాల పదార్థములు మాసము గ్రుడ్లు రు 2000 విలువగల చేపలు స్థానికులు ఉపయోగించుకొనిరి

ఇచటి ప్రజలముఖ్య జీవితాధారములు వ్యవసాయము వ్యవసాయకూలి బట్టలనేత బీడీలు తయారుచేయుట దుకాణాదారులు క సాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీవారు మంగలివారు చాకలివారు గొల్లలుకలరు వ్యవసాయమునకును పరిశ్రమలకును రిపోవు కూలీలు దొరుకుదురు దినమునకు కూలిరేటు పురుషునకు రు 2 లు స్త్రీకి ఒకరూపాయి 4 ఎ డిమరలు 4 హల్లర్లు 4 బీడిఫ్యాక్టరీలు ఉన్నవి సాలీనా రు 78056 లు విలువగల బీరెలను హైదరాబాదునకు రవాణాచేసిరి

ఈ గ్రామములో శ్రీరామ రామలింగేశ్వర ఆంజనేయ ఈశ్వర దేవాలయములు ఉన్నవి కాళికాదేవిగుడి చౌడమ్మగుడి 2 దర్గాలు మసీదులుకలవు సీతా-రామ-ఆంజనేయుల పాలరాతి విగ్రహములను 1958 లో కాశీనుండితెచ్చి ప్రతిష్ఠించిరి ఇచట చైత్రశుద్ధ సప్తమినుండి దశమివరకు శ్రీరామనవమి మహోత్సవము జరుగును ఈ గ్రామమునకు 5 మైళ్ళలో ప్రవహించుచున్న కృష్ణానదీ జలమునుతెచ్చి శ్రీరామునకు అభిషేకము చేయుదురు మహారాష్ట్రదేశములోని కల్యాణిలో జన్మించిన రాజవాలి అను సిద్ధపురుషుడు 800 సంవత్సరముల్ల తము ఈ గ్రామమునకువచ్చి ఇచ్చటనే మరణించెను వారికి పెక్కుమంది శిష్యులు కలరు వీరి ఉరుసు మూడుదినములు ఖాజీ అహమ్మద్ బేగ్ ఆధ్వర్యమున ఘనముగా జరుగును

ఈ గ్రామమునకు 12 మైళ్ళ దూరములో శ్రీరామనగరు రైల్వేస్టేషనుఉన్నది ఇది బస్సుమార్గముపైన లేదు గ్రామమున ఒక మైలుపొడవున రెండు మట్టిరోడ్లు ఉన్నవి ఈ గ్రామము క ఇ ర గ్రామములతో మట్టిరోడ్ల లు చున్నవి యాణములకు 10 రెడ్లబండ్లు 0 సైకిళ్లు ఒక మోటారసైకిలు

అమరచింతలో బ్రాంచిపోస్టాఫీసు జిల్లా ఉన్నతహైస్కూలు ఉన్నవి హైస్కూలు చదువులకు 4 5 మైళ్ళదూరమునుండి కూడవిద్యార్థులు ఇచట వత్తురు దుర్భిక్షనివారణకు 00ఇడ్లవాగు వాడుకొనుచున్నారు ఇది చాయతీపాలకల గ్రామము ఇటను ఆస్పత్రిన్ని లైబ్రరీన్ని ప్రసూతిన్ని సైకిళ్ళ పన్ను ఎరువుల పేలము రుసుము ఈ పంచాయతీ గల ఆదాయము గ్రామపారిశుద్ధ్యమునకు తగుఏర్పాట్లు ఉన్నవి సహకారసంఘము చేనేత సహకారసంఘము ఇక్కడ ఉన్నవి తాళ్ళ సహకారసంఘము రు 18 000 లు గ్రామస్థులకు అప్పులిచ్చినది పంచాయతీ గ్రంథాలయము రేడియో లౌడ్ స్పీకరు నాటకశాలగామార్చుకొనుటకుతగిన ప్రదేశము టూరింగ్ సినీమాథియేటరు కలవు ఈ గ్రామమున ముగ్గురు ఇంగ్లీషు వైద్యులు ఒక ఆయుర్వేద వైద్యుడుకలరు పశురోగములకు నాటువైద్యము చేయుదురు వారసంతలో గింజలు కూరగాయలు బట్టలు లభించును 0 కిరాణదుకాణములు 10 కాఫీహోటళ్లు 7 సోడా కిళ్ళి సిగరెట్టు దుకాణములు 2 సైకిళ్ళషాపులు ఒక క్షౌరశాల ఒకలాండ్రి మూడు జనరల్ షాపులు ఇచటకలవు

మూడుమైళ్ళ దూరములోని ఆత్మకూరులో టెలిఫోను పురుళ్ళ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి ఉన్నవి అచ్చటి వారసంతలో ధాన్యము పశువులు ధాన్యము బట్టలు దొరుకును విద్యార్థులు కాలేజీ చదువులకు మహబూబునగరము హైదరాబాదులకు పోవుదురు ఆత్మకూరునందలి పోలీసుస్టేషనుకు తాలూకాకచేరి బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు జనులు పోవుదురు కోర్టు నులకు వనపర్తి ని బ్ రిష్ట్రారు ఆఫీసుకు గద్వాలకును గ్రామస్థులు పోవుదురు

మా శ్వే

## అమరపురము

అమరపురవృత్తాంతము ఎప్పుకు డిమల వాణెములు అను గ్రంథమున కన్పించుచున్నది అమరపురముము అమరావతి యని చరిత్రకారులు భావించుచున్నారు విష్ణుకుండిన వంశీయులలో దేవవర్మ కుమారుడగు మాధవవర్మ అమరపురము రాజధానిగ పూర్వాంధ్రదేశమును పాలించెను ఈయనకే

రెండవ మాధవవర్మయని పేరు ఈని పాలనకాలము క్రీ శ 458 483

శాలంకాయనుల పాలనానంతరము విష్ణుకుండిన ప్రభువులు క్రీ శ అయిదవ శతాబ్ది చివరినుండి ఏడవశతాబ్ది మొదటిభాగమువరకు అనగా ఇమారు నూటయేబది సంవత్సములు పూర్వాంధ్రదేశమును పాలించిరి కళింగములోగూడ కొంతభాగము వీరిక్రింద గలదు ఈ రాజులకు అమరపురము పురనిర్గమము దెందులూరు బెజవాడ రాజధానులుగ నుండినట్లు తెలియుచున్నది విష్ణుకుండినుల చరిత్ర తెలిసికొనుటకు ఆధారములైనవి అయిదు తామ్ర శాసనములు ఇవి ఈవూరు చిక్కుళ్ళ రామతీర్థము పొలమూరు అను గ్రామములలో లభించినవి వీనినిబట్టి ఈ రాజులచరిత్ర మనకు గ్రహింపవీలైనది విష్ణుకుండినుల జన్మస్థానము వినుకొండ ప్రాంతము ఈ ప్రాంతమున వసుపులేరు అను నదికలదు దీనికి విష్ణుకుండి యను నామాంతరము డినట్లును ఈప్రాంతమున నివసించుచే ఈ రాజులకు విష్ణుకుండినులు అను పేరు కలిగినట్లును చారిత్రికులు ఊహించుచున్నారు విష్ణుకుండిన భూపతులకు త్రికూటమలయాధిప అనియు భగవత్ శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతస్య అనియు విశేషణములు శాసనములలో కనవచ్చుచున్నవి నేటి గుంటూరుమండలము నందలి నరసారావుపేట తాలూకాలోని కోటప్పకొండకు త్రికూటమను పేరుండి ట్లును తూర్పుకనుమల ప్రాంతమునకు మలయ అను నామము కలిగి ట్లును చారిత్రికులు చెప్పుచున్నారు ఈ పై రెండు ప్రాంతములకు అధిపతులు కాన ఈ రాజులకు పై విశేషణములు అన్వర్థములుగ నున్నవి శ్రీపర్వత మనగా శ్రీశైలము శ్రీపర్వతస్వామియనగా మల్లికార్జునస్వామి పాదానుధ్యాతు అనగా పాదములను ధ్యానించువారు అనియర్థము దానినిబట్టి విష్ణుకుండినులు గొప్ప శివభక్తులని విదితమగుచున్నది కొందరు వీరిని విష్ణుకుండులనియు వ్యవహరించిరి వీరు పరమమాహేశ్వరులని శాసనములలో ప్రశంసింపబడిరి శ్రీశైలము కర్నూలుమండలము నందలి నల్లమల అడవులలో నున్నది సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రమగు నాగార్జునకొండకుగూడ శ్రీపర్వతమను పేరుగలదు

విష్ణుకుండిన వంశీయులలో మాధవవర్మ నామధారులు ఇద్దరు ముగ్గురు నలుగురు ఉండిరని చరిత్ర పరిశోధకులు భిన్నాభిప్రాయములను వెలిబుచ్చుచున్నారు ఈ నామధారులలో మొదటి మాధవవర్మ విష్ణుకుండిన వంశస్థాపకుడు ఇతడు క్రీ శ 420 55 వరకు రాజ్యపాలన మొనర్చెను ఇతడు గొప్పశూరుడు పదునొకండు అశ్వమేధములు వాజపేయము సర్వమేధము రాజసూయము పురుషమేధము వంటి క్రతువులను అనేకము లొనర్చెను రెండవ మాధవవర్మ దేవవర్మ కుమారుడు ఇతడు క్రీ శ 458 నుండి 4 8 వరకు అమరపురము రాజధానిగ పూర్వాంధ్రదేశమును పాలించెను ఈతని కాలముననే ప్రసిద్ధ బౌద్ధక్షేత్రమగు అమరావతి అమరేశ్వర క్షేత్రముగ రూపొందినట్లు చరిత్రకారులు భావించుచున్నారు ఈ వంశమున దలి చివరిరాజు మూడవ మాధవవర్మ నామధేయుడు ఇతడు గోవిందవర్మ కుమారుడు ఈతనికి విక్రమాశ్రయ జనాశ్రయ అను బిరుదము లుండినట్లు తెలియుచున్నది ఇతడు క్రీ శ 546 నుండి 611 వరకు రాజ్యమునేలెను ఇతడు తన సైన్యమున ఎనిమిదివేల గజములు పదికోట్లు అశ్వములు అంతులేని కాల్బలము కలిగియుండినట్లు తెలియుచున్నది ఇందుకొంత అతిశయోక్తి యున్నట్లు తెల్లమగుచున్నది ఇతడు పదునొకండు అశ్వమేధములు వేయి అగ్నిష్టోమములు ఒనర్చి హిరణ్యగర్భాది దానములు ఆచరించెను త్రివరనగరయువతీ మనోహరుడని ఈతనికి బిరుదము కలదు దగ్గుపల్లి దుగ్గయ్యకవి తన నాచికేతోపాఖ్యానము అను ప్రబంధమున ఈ రాజునిట్లు ప్రశంసించెను

"చతురంగబలములు జయవాడ దుర్గాబ
వరమున బడసి దుర్వారలీల
జగతీస్థలంబెల్ల సాధించి జయశాస
నములు దిగ్గంతి దంతముల నలిపి
వేదపాలునకుగాఁ బ్రియసుతు మోహాబు
పట్టక బెజవాడఁ బాడి నిలిపి
కలయంగఁ బురమునఁ గాంచనవర్షంబుఁ
గురియించి దేవతాకోటి పొగడ
వసుధ నెగడిన మాధవవర్మ"

ఇట్లు విష్ణుకుండిన రాజులు మహాశూరులై వైదికమత తత్పరులై ప్రజాహితమతులై వెలుగొందిరి ఈ రాజులలో విక్రమేంద్రవర్మ కుమారుడు ఇంద్రభట్టారకుడు చతుర్దంత గజ (నాలుగు దంతములు గల ఏనుగులు) సంగ్రామములలో నిపుణుడు ఇతడు పెక్కు ఘటికాస్థానములు (విద్యా

మందిరములు) నెలకొల్పెను  ఈతని కుమారుడు రెండవ విక్రమేంద్రవర్మ అట్టి విహితశాసనుడని చిక్కుళ్ళ శాసనమున వర్ణింపబడెను  ఇతడు కళి ? రాజగు ఇంద్రవర్మను రణమున పరాజితునిజేసి తన సామంతులపై విష్ణుకుండినుల స్వామిత్వమును స్థాపించిన పరాక్రమశాలి

విష్ణుకుండినుల పాలనకాలమున బౌద్ధము అడుగంటినది వైదికమతము అభివృద్ధిగాంచినది  యజ్ఞములొనర్చుటయు యాగాంతమున అవభృథ స్నానమాచరించుటయు ఆ పవిత్రోదకమును శిరముల దు చల్లుకొని పవిత్రులమైతిమని భావించుటయు  అనాటి రాజు యొక్కయు ప్రజల యొక్కయు ఆచారములు  బౌద్ధక్షేత్రములు శివక్షేత్రములుగా మారినది ఆకాలముననే అనాటి రాజులు పెక్కుక్రతువులొనర్చుట ఘనతగా భావించిరి ప్రాచీనకాలమునుండి బౌద్ధక్షేత్రముగ విలసిల్లుచున్న అమరావతి ఆ కాలమున శివక్షేత్రమైనది  అమరావతి గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో కృష్ణానదికి దక్షిణదిశన కలదు  ఈ గ్రామమునకు పూర్వము అమరపురమను నామము కలదు  దీనికి ఉత్తరమున కొద్ది దూరమున ధరణికోట అను గ్రామముకలదు అదియే ధాన్యకోట యని శాసనప్రశస్తి వహించినది  క్రతువులుచేయుంచు బ్రాహ్మణులకు అనాడు ఆదరము హెచ్చుగనుండెను  అట్టి విప్రులకును  వేద వేదాంగములు చదివిన భూసురులకును విష్ణుకుండిన ప్రభువులు రాగిరేకులపై శాసనములుచెక్కించి అనేక భూప్రభృతి దానాదులొసగిరి  రెండవ మాధవవర్మ అమరపురమునుండి తన విజయరాజ్యసంవత్సరము 47 లో వర్షర్తువు ఏడవపక్షమున ఒక విప్రునకు గ్రామదానము చేసెనట గోవిందవర్మ పుత్రుడగు మూడవ మాధవవర్మ ఫాల్గున శుద్ధపూర్ణిమాయుక్తచంద్రగ్రహణమునాడు యజుర్వేద తైత్తిరీయశాఖకు చెందినవాడు  గౌతమసగోత్రుడు రుద్రశర్మ పౌత్రుడు దామశర్మ పుత్రుడు అగు శివశర్మకు గుడ్డవాది విషయములోని (మచిలీపట్టణమునకు నాలుగుమైళ్ళదూరముననున్న గూడూరు గ్రామము) పలోంబూరు (పొలమూరు) అను గ్రామమును దానముచేసెను  గుడ్డవాది గుద్రవారము  గుద్రహారము కూడూరహార ) అనునవి బృహత్పలాయనుల విష్ణుకుండినుల చాళుక్యుల [illegible] నాటి చాళుక్యుల శాసనములలో కనవచ్చుచున్నవి  ఇవి కృష్ణామండలమునందలి గుడివాడ బందరు తాలూకాలకు  తూర్పుగోదావరి మండలమునందలి రామచంద్రపురము తాలూకాలకుచెందిన భూభాగముకలై యుండునని చారిత్రికులు భావించుచున్నారు  విష్ణుకుండిన ప్రభువులు ప్రజలు శ్రీపర్వతేశ్వరస్వామి ( శ్రీశైలమల్లికార్జునస్వామి ) అర్చించెడివారు  బౌద్ధము క్షీణించు వలన ప్రాకృతమునకును ప్రాకృతకవులకును ఆదరము సన్నగిల్లి దిం సంస్కృతమునకు సంస్కృత కవులకు  వేదవిద్యకు గౌరవాదరములు హెచ్చినవి  తెలుగుభాష కుదురుదియగాటి జాబిల్లివలె రేఖామాత్రముగ శాసనములలో పొడసూపినది  విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ శాసనమునందు సంస్కృత  క్తులనడుమ "విజయరాజ్య సంవత్సర బుల్ " అను పదము ప్రయుక్తమై కనబడుచున్నది ఇది విజయరాజ్యసంవత్సరములు అను దాని  రూపాంతరము అనగా తెలుగు బహువచన ప్రత్యయము  ళ్  ళు లు - అనురీతిని విష్ణుకుండినుల నాటికే  వాడుకలో  నుండెనట విదితమగుచున్నది అట్లే  రాజ్య బు  అను రూపము రాజ్యము అనుదానికి రూపాంతరమునట తెల్లము  తెనుగు అమహద్వాచక ప్రత్యయమును ఇక్కడ మనము చూతుము  ఈ రాజుల పాలనకాలమున దక్షిణదేశ పరిస్థితులు ఇట్లు కనవచ్చుచున్నవి  పల్లవులు కదంబులతో పోరాడుచు క్షీణత్వ మొందుచుండిరి  విష్ణుకుండినులు ప్రబలులై పల్లవుల రాష్ట్రభాగముల నాక్రమించుకొనుచుండిరి  మహాశక్తిసంపన్నులైన వాకాటకులతో విష్ణుకుండినులు సంబంధ బాంధవ్యములు  పెంపొందించుకొని తమ ప్రాబల్యమును వృద్ధిచేకొనిరి

తం ఆం శా

## అమరవాది నారాయణాచార్యులు

తెలంగాణా ప్రాంతమున పేరెన్నిక గన్న శ్రీవైష్ణవ పండితులలో ఈయనఒకరు ఉభయ వేదాంతములను ఆచార్యముఖమున అధ్యయనముచేసి తిరిగి తాము ప్రవచనముగూడ నొనర్చినవారు జన్మతః వీరు కరీంనగరము జిల్లాలోని తొటపల్లి గ్రామానికి చెందినవారు వీరిజీవితకాలము క్రీ శ 1874 నుండి 1939 వరకు సాగినది వీరు బహుజనుల నాశ్రయించిన మహోపన్యాసకర్తగా ప్రసిద్ధిగాంచినవారు తర్కశాస్త్రమును ప్రకరణాంతముగా విజయనగరములో శ్రీ గుమ్మలూరి సంగమేశ్వరశాస్త్రిగారివద్దను  శ్రీభాష్యాది విశిష్టాద్వైత సిద్ధాంత గ్రంథములను శ్రీపెరుంబూదూరు కళాశాలలో శ్రీమాన్ కుండలం నరసింహాచార్యులవారి వద్దను ద్రవిడ వేదాంతమును మామకోట ప్రాంతమునకుచెందిన శ్రీమరింగంటి

చెన్నమాచార్యులవారివద్దను వీరు అభ్యసించినారు. వరంగల్ నగరములో వైశ్యప్రముఖుల సాహాయ్యముతో శ్రీప్రతాపురం రామస్వామిగారిచే స్థాపింపబడిన సంస్కృత పాఠశాలలో కొంత కాలము అధ్యాపకులుగా నుండి వీరు ఆ నగరములోనే స్థిరవాసులైనారు.

కోరుకొండ పెంటపాడు మొదలగు ఆంధ్రప్రాంతాలలో ఆనాడు జరుగుచుండిన శ్రీవైష్ణవపండిత సభలలో ప్రతిసంవత్సరము ఆహూతులై వీరు మహోపన్యాసములు కావించుచు పండితోత్తముల ప్రశంసలకు పాత్రులైనారు. నారాయణాచార్యులవారు ద్వాదశోర్ధ్వ పుండ్రములతోను కర్ణకుండలములతోను సువర్ణహస్తలాటాది (చేతిమురుగులు) విద్వద్భూషణములతోను పచ్చని మేనిచాయతోను సభలకు అలంకారప్రాయులై శోభించినవారు. వీరు సంస్కృతమున గ్రంథరచయితలు సరసకవులు. రామానుజ యశోభూషణము అను పేరుతో చంద్రాలోక ప్రక్రియలో అలంకారశాస్త్రగ్రంథము రచించినారు. వివిధ వృత్తాలతో సాగిన ఈగ్రంథము శ్లోకపూర్వార్ధాలలో లక్షణ ర్వచము ఉత్తరార్ధాలలో భగవద్రామానుజుల వైభవోదాహరణము కూర్పబడినవి. ధారాళమైనది వీరిరచనాశక్తి. లుప్తోపమకు ఉదాహరణము

యో మే శ్రీభూత పుర్యాం యతికులమణినా
సత్సమావేశ ఆసీత్
తత్సేవాయాశ్చలాభః కుమతి జనగణైర్దుర్లభో యో
మయాప్తః
ఇత్థం సర్వం తదేతద్భువి విధివశతః కాకతాళీయమాసీత్
నోచేన్నీచః క్వచాహం క్వచ స యతివర స్సర్వలో
కోచ్ఛ్రితావాన్ ॥

పరికరాలంకారానికి ఉదాహరణము

సాభిప్రాయ విశేషణైః పరికరాలంకారమేకేబుధాః
మన్యంతే కవి సమ్మతో భవతిచేత్ సారస్యమాపాదితః
శ్రీహస్తాంజలి ముద్రిత స్వచరణాంభోజాశ్రితాం
స్త్రాన్ప్రీతి
శ్రీనాథం సుముఖీకరోతి యతిరాట్ కాలత్రయా
భూన్వితాన్ ॥

ఇక వీరి ఇతర రచనలలో గోదాదేవి ప్రసాదించిన తిరుప్పావై ప్రబంధానికి సంస్కృతానువాదము ప్రౌఢమైన సుదర్శన శతకానికి సంస్కృత వ్యాఖ్య మొదలైనవి పరిగణనీయమైనవి. ముప్పది పాశురాలతో కూడిన తిరుప్పావునకు ఒక్కొక్కదానికి రెండు శ్లోకాల పద్ధతిలో మొత్తము 60 శ్లోకాలు వీరు రచించినారు. దిఙ్మాత్రముగా ఉదాహరణము "మార్గళి త్తింగళ్" అను మొదటి పాశురమున గోపికానుకారము చేస్తున్న శ్రీగోదాదేవి సంపత్సమృద్ధమైన గోకులంలో నివసించే భూషణభూషితలైన శ్రీమతులగుగోపకన్యకలారా! ఈమార్గళి మాసములో శుక్లపక్షములో ఈసుదినమున వ్రతమునకై ప్రాతస్స్నానమొనర్చి అన్వయింపదలచిన మీర దరుర౦డి! తీక్ష్ణవేలాయుధ ధారియు అతికరినాత్ముడనైన నందగోప కుమారుడును సౌందర్య భరితమైన నేత్రాలుకల యశోద యొక్క బాలసింహమును నీలమేఘశ్యాముడును పద్మారుణ నేత్రుడును సూర్యచంద్రులవంటి ముఖముతో నొప్పువాడు నగు నారాయణుడే మనకు ఈ వ్రతమునకు ఉపయోగించు పర్రై అను వాద్యమును ఇచ్చును. మన ప్రతికూలురు గూడ శ్లాఘించు విధమున వ్రతానుష్ఠానము చేద్దాము రండి" అని ఆహ్వానించును.

దానికింది శ్లోక యుగ్మము అనువాదము

మాసో మార్గశిరాస్సితశ్శశభృతాపక్షో మహార్తశ్శుభః
సుస్నాతుం స్పృహయాశవోఽన్విత మహాలంకార
యుక్తాస్స్త్రియః
సంపత్సంభృతగోకులస్థిత మహాభాగ్యాంచితా బాలికాః!
నైశిత్యాన్విత కుంతభీషణ మహావ్యాపార నందాత్మజః॥
సౌందర్యోల్లసితాక్షి సంభృతయశోదాసింహడింభాంకురః
శ్యామాంగారుణనేత్రయుగ్మమిహిర గ్లౌతుల్యతా
భాఙ్ముఖః
శ్రీనారాయణ ఎవ వాద్యపటహం యచ్ఛేత్స్వయం
చైవనః
లోక శ్లాఘ్యమిహావగాహనమిదం హ్యస్మాక మేకం
వ్రతమ్ ॥

శ్రీ ఆచార్యులవారు అఇఉణ్ ఋళృక్ ఇత్యాది చతుర్దశవర్ణ సమామ్నాయ సూత్రాలపైన కొన్ని శ్లోకాలు రచించినారు. ఒక్కొక్క సూత్రములోని అక్షరాలు ఆయా ప్రత్యాహారములలో చేరుట అందువలన ఆయాసూత్రాలనుబట్టి వచ్చు కార్యాలు వాటి ఉదాహరణాలు ఆశ్లోకాలలో కూర్చబడినవి. వీరే వాటికి సంస్కృత వ్యాఖ్యగూడా వ్రాసినారు. అఇఉణ్ అను సూత్రానికి ఈక్రింది శ్లోకము రచింపబడినది

మునిశ్చాద్యే మా|తే౽ఇఉణితిణకారేణదయయా
తథా ప్రతా హార్శిత్ ఉరణితిచసూ|తే౽ణితిచవై
ఋకారస్థానే (ణ్ భవతిరఎరశ్చేతి ఇగో
ఉదాహార్షీద్భర్తా కిరతి హరిపాణ్మాతుర ఇతి

పాణిని మహర్షి అఇఉణ్ సూత్రముతో అణ్ ప్రత్యాహారము న్ధముచేసి అణ్ ఇజ్ఞను ఉరణ్ రపరః అను సూత్రములో ప్రయోగి చి ఋకారస్థా ములో ఆదేశమగు ట్టి ణ్ ఇజ్ఞలోని అక్షరమేదైనా రేఫను పరమందు చుకొని వచ్చునని తెలిపినాడని భర్తా కిరతి హరి-పాణ్మాతుర-శబ్దాలలో అర్-ఇర్-ఉర్ అని ఆదేశాలు వచ్చుట ఇ దుకు ఉదాహరణమని పై శ్లోకానికి భావము ఇలాగే తక్కిన సూత్రాలపై గూడ శ్లోకాలు సాగినవి వీరు నీలా ల్యాణము అను ఒక నాటకమును రచి పద చినట్లు తెలియుచున్నది స్వహ_స్త లిఖితమైన వ్రాత ప్రతిలో ప్రస్తావన మాత్రము సూత్రధార-నట-స భాషణరూపముగా వ్రాయబడి ఆగిపోయినది శ్రీ చార్యులవారిపైని పేర్కొనబడిన గ్రంథములేవియు ముద్రితములు కాలేదు వరం ల్ నగరములోనే నివసి చియు డి "ఉపన్యాసకే రి" "సుబోధక సుధామణి ఇత్యాది బిరుదాంచితులైన శ్రీమాన్ కోవెల ర గాచార్యులుగారు కూడా బాల్యములో ఈ ఆచార్యులవారివద్దనే స స్కృతమభ్యసించినవారు ఇట్లు శ్రీ ఆచార్యులవారు శాస్త్ర పాండిత్యమున దను ద్రవిడ ప్రబంధములయ దును రచనావ్యాస గమున దుమ మహోపన్యాసకరణమున దును ఎద్దహస్తులు

ఎస్ ఎస్ పి ర

## అమరాపురం

అమరాపుర మడకసిర తాలూకా అనంతపురం జిల్లాలో ఉన్నది దీనికి 28 మైళ్ళదూరములో మడకసిర ప ట్టణము ఉన్నది

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఇచ్చట పురుషులు స్త్రీలు కలసి 6 424 మ ది ఉండిరి ఈ స ం ఖ్యలో షెడ్యూలు జాతులవారు 763 మ ది షెడ్యూలు తరగతుల వారు 14 మ ది ఇచ్చట ఒకచోటగు పు మ కోట లి గాయత గారి మ్మవీథి కురువవీథి మెయిన్‌బజారు మొదలయిన వాటి ను ఒకచో వ క్తులుగాను ఇ డ్లు నిర్మించబడినవి వీటిలో మూడు పె కుటిండ్లు 100 కా క్రీటు కప్పుగల ఇండ్లు 20 ఒక అంతస్తుగల మేడలు ఇచ్చటి జనులు బావి నీటిని త్రాగుదురు మ చి నీటి ఎద్దడికలదు తాలూకా కే ద్రమయిన మడకసి కు ఈ గ్రామము ఎక్కువ అభివృద్ధి అగుచు న్నది అమరాపుర లో కొబ్బరితోటలు అ టితోటలు తమలపాకుల తోటలు పో తోటయు న్నవి వ్యవసాయ ఫలసాయములను ప్రక్కను న్న ల్లెను డి ఇచ టకువచ్చు ఫలము లను కూరగాయలను మడ శిరను ఎ దూపు మను మైసూరుస్టేటులోని సరకును చెళ్ళకెరకును ర వాణా చేయుదురు

ఇచ్చటి జనులు వ్యవసాయము వ్యాపార య్యకూలి వ్యాపారము నూలునేత అను వృత్తులమూలమున జీవి తురు కంసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు శాలీనని వారు తెలికవారు మంగలివారు చాకలివారు గొల్లలు వడ్డెరలు సాలీలుఉన్నారు వ్యవసాయదారులకు కూలీలు దొరకదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 1 50 లు స్త్రీకి రు 1 25 లు

ఈ గ్రామమున వెంకటరమణ ఈశ్వర అంజనేయ వీరభద్ర బసవన్నల దేవాలయములుకలవు గ్రామదేవతయగు చోళమ్మగుడి ఆదినాథస్వామి జైనదేవాలయము ఒ మసీదు ఉన్నవి మాఘశుద్ధదశమిను డి 8 దినములు వె కటరమణ స్వామి రథోత్స ము జరుగును మొదటిదినము క కణధారము రె డవదినము అ జనేయస్వామి ఊరేగి పు మూడవదినమున నరసింహస్వామి ఊరేగింపు నాల్గవదినమున రుడవాహనోత్సవము అయిదవ దినమున గజవాహనోత్సవము ఆరవదినమున రథోత్సవము ఏడవది మున ల క్రీడోత్సవము ఎనిమిదవ దినమున ఉట్లప డుగ జరుగును

ఈ గ్రామము కు 47 మైళ్ళ దూరములో హి దుపురము రైల్వేస్టేషనుకలదు ఇది బస్సు మార్గముపైన ఉ న్నది అమరాపుర ను డి హిందుపురమునకు పెనుకొ డకు కల్యాణదుర్గమునకును శిరానుండి అమరాపుర మీదుగా పై యస్ హోసకోటకును హి దుపురమునుండి అమరాపురం మీదుగా హిరియూరు కును మూడు గ టలకొకసారి ప్రయివేటు బస్సులుపోవును ఇచ్చట క కరరోడ్లు మట్టి రోడ్లు ఉన్నవి దీనిని పొరుగు గ్రామములగు తమాడి ల్లి యద్దనకు ట ఎల్లే కుంటలతో బండ్లబాటలు కలుపుచున్నవి ప్రయాణములకు 30 సైకిళ్ళు ఉపయోగపడుచున్నవి

ఇచ్చట సబ్‌పోస్టాఫీసు 7 సమితి ఎలిమె టరీ స్కూళ్ళు

ఒ సమితి ముస్లిం బాలికల ఎలిమెంటరీ స్కూలు ఒక జిల్లా పరిషత్తు హైస్కూలు ఉన్నవి హైస్కూలు చదువులకు వలస తమాదిహాళ్ళి అలుకూరు గ్రామములనుండి ఇచ్చటి హైస్కూలునకు వత్తురు ఇ ప చాయతి పాలనకల గ్రామము ఈ పంచాయతీకి ఇ టిపన్ను వృత్తి న్న వాహ పుపన్ను మొదలయిన వాటివలన రు 0 000 లు మకూరెను పౌర గ్రంథాలయము రేడియో లౌడ్ స్పీకరు రె డు సత్రములు ఒక రహదారి బ గళాఉన్నవి గ్రామ పారిశుద్ధ్యమునకు ఏర్పాట్లు ఉన్నవి ఇచ్చట పోలీసుస్టేషను బహుళార్థ సహకారసంఘము ఉన్నవి ఈ సహకార సంఘము 120 మందికి అప్పులిచ్చినది బ్ రిజిస్ట్రారు ఆఫీసు లోకల్ ఫ డు ఆసుపత్రి ఉన్నవి ఒక పశువైద్య కాంపౌండరు ఒక ఇ గ్లీషు వైద్యుడు ఒక హోమియోపతి వైద్యుడుకలరు వారమున కొక మారుసంత జరుగును దీనిలో ధాన్యము మిర్చి కూరగాయలు దొరుకును 95 కిరాణా దుకాణములు 9 కాఫీహోటళ్ళు 7 కిళ్ళీ సిగరెట్టు సోడా అంగళ్ళు 5 సైకిళ్ళషాపులు 6 క్షౌరశాలలు రెండు చెప్పుల దుకాణములు మూడుషరాబుషాపులు 8 బట్టల షాపులు ఉన్నవి

కళాశాల చదువులకు ఈగ్రామ విద్యార్థులు హిందుపురమునకు అనంతపురమునకు పోవుదురు మడకసిరలో కోర్టులు తాలూకాకచేరి బ్లాకు అభివృద్ధి కేంద్రములు ఉన్నవి

ప్రఖ్యాత జైన ప డితుడగు అమరసింహుడు ఈ గ్రామమును నిర్మి చుటచే దీనికి అమరాపురం అని పేరు వచ్చెను విజయనగరరాజుల క్రిందికి ఈ గ్రామమువచ్చుటకు పూర్వము గాంగవ శపు రాజైన శైలారునిచే జయింపబడుటచే దీనికి శైలంగిరి అని పేరువచ్చెను ఇదిజైన సంఘ కే ద్రము ఇందు ఇప్పటికిని కొన్ని జైనకుటుంబములు అభివృద్ధిలో ఉన్నవి

విజయనగర రాజులు శైల గిరిని ఖాళీచేసి ప్రస్తుత అమరాపురమునకు దక్షిణమున కల్లుదుర్గమును నిర్మించిరి ఈ స్థలపు వాడుక నామము నడ్ లల్లీ అనునది దీనిని బస్సులు మడకసిరద్వార పెక్కు స్థలములతో కలుపుచున్నవి అమరాపురం మేజరు పంచాయతీయై పేరు గాంచినది ఇది మైసూరు స్టేటులోనికి చొచ్చుకొనియున్నది ఇచ్చట పెక్కుమంది జనులు కన్నడము మాట్లాడుదురు

మా శ్వే

## అమరాబాదు

అమరాబాదు మహబూబు నగరం జిల్లా అచ్చంపేట తాలుకాలో ఉన్నది దీనిని ఒక శతాబ్దము క్రి ది వరకు అమరావతి అని పిలిచెడివారట ఈ గ్రామ విస్తీర్ణము 13072 ఎకరములు ఇచటి శివాలయము దగ్గర ఒక శాసనము గుడిగడ్డ దగ్గర చరిత్రాత్మకమైన లింగములు ఉన్నవి

1961 సం॥ ఓనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములో పురుషులు స్త్రీలు కలిసి 6 51 మ ది ఉండిరి ఈ సంఖ్యలో షెడ్యూలు జాతులవారు షెడ్యూలు తరగతుల వారు కలిసి 2667 మ ది ఇచట ఇండ్లు ఒకేచోట గు పుగా ఉన్నవి వీటిలో ఒక కాంక్రీటు కప్పుగల ఇల్లు రె డు ఒక అంతస్తుగల మేడలు ఉన్నవి జనులలో 25 శాతమువారు వరి అన్నమును 75 శాతమువారు జొన్న రాగి సజ్జ అన్నములను తిందురు జనులు చేదబావుల నీటిని త్రాగుదురు ఇచట పరిశుద్ధము చేయబడిన జలముకూడ లభించును మంచి నీళ్ళ ఎద్దడి లేదు

ఎల్కవానికుంట వనంబావికుంట గునుగుంట బావికుంట పెద్ద చెరువు రెడ్లచెరువు లోకేశ్వరంచెరువు కొత్తచెరువు సీతారామ చెరువు సుంకరిచెరువు గురిజాల చెరువు మొదలయినవి ఈ గ్రామమునందుకల నీటివసరులు వీటిక్రింద వరి జొన్న సజ్జ వేరుసెనగ రాగి కొర్ర సెనగ కంది ఉలవ మొదలయిన పంటలు పండును లారీలపై ఫలసాయములను జడ్చర్లకు రవాణా చేయుదురు అటవీ శాఖ వారి పాలనక్రి ద అడవి కలదు దీనిలో టేకు నల్లమద్ది నల్లకొడిశ పాలకొడిశ మొదలయిన అనేకరకముల వృక్షజాతులు కలవు తేనె మైనము కుంకుడు సికస్వామికాగింజలు రేసులు తోళ్ళను పదునుచేయు బెరడులు మామిడికాయలు సీతాఫలములు లభించును బీడీ ఆకులను జిల్లాలోని ఇతర ప్రదేశములకును తోళ్ళను పదునుచేయు బెరడులు మద్రాసునకును రవాణాచేయుదురు ఇచటి అడవిలో నీతి ఎద్దు మచ్చలలేడి నల్లసమగలేడి అడవి పంది అడవి మేకలు చిరుతపులులు పెద్ద పులులు ఎలుగుబంట్లు వేట కుక్కలు మొదలయిన జంతువులు ఉన్నవి చెంచువారు లంబాడీలు అడవి పనుల వల్లను వ్యవసాయపు పనుల వల్లను జీవింతురు ఇచట 1966 67 సం॥లో పంటలక్రింద 7592 ఎకరములభూమి ఉపయోగపడెను కాలువక్రింద 14 ఎకరముల

చెరువులక్రింద 505 ఎకరముల భూమి బావులక్రింద 127 ఎకరముల భూమి సాగుచేయబడినది 4 యిలు ఇజనులు మోటలు పీటిని భూములకు సరఫరా చేసెను వ్యవసాయమునకు 5 స్ప్రేయర్సు 5 పీడర్సు ఒకడస్టర్ ఒకసీడ్ డ్రెసింగ్ డ్రమ్ము ఉపయోగింపబడెను ఇచటి ఖుష్కినేల 9 17 ఎకరములు తరినేల 6 2 ఎకరములు

ఈ గ్రామములో 674 ఆవులు 1714 ఎద్దులు 599 గేదెలు 44 దున్నలు 2 గుర్రములు 404 మేకలు 1699 గొర్రెలు 39 పందులు 2478 కోళ్లుకలవు నాలుగు గాడిదలు చాకలి బరువులు మోయుచున్నవి పాలు పాల పదార్థములు మాంసము గ్రుడ్లు స్థానికులు ఉపయోగించుకొందురు

ఇచటిప్రజల ప్రధాన జీవనాధారములు వ్యవసాయము అడవి పనులు దుకాణాదారులు కులవృత్తులు చేసెడివారు గలరు ఎండిమర గ్రామస్థుల అవసరములకు పనికి వచ్చును వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు కూలీ రేటు పురుషునకు రు 2 లు స్త్రీకి ఒక రూపాయి

ఈ గ్రామమున కోదండ రామస్వామి దేవాలయము శివాలయము కలవు జుమ్మామసీదు పీర్ల చావళ్ళు మహబూబు ఉస్మానీదర్గా ఉన్నవి కోదండ రామస్వామిదేవాలయమునకు 77 ఎకరముల భూమి కలదు మసీదు పీర్లదర్గాలకు 112 ఎకరములు భూమి కలదు శ్రీ చెన్నకేశవస్వామి పండుగ వైశాఖ శుద్ధ పాడ్యమి నుండి 5 దినములు జరుగును షెడ్యూలు జాతులవారికిది ముఖ్యమయిన పండుగ

ఈ గ్రామమునకు 61 మైళ్ళ దూరములో జడ్చెర్ల రైల్వే స్టేషను ఉన్నది ఈ గ్రామము బస్సు మార్గమున ఉన్నది 6 గంటల కొకమారు మహబూబునగరమునుండి అమరాబాదునకు అమరాబాదునుండి డిండికి బస్సులుపోవును ఈగ్రామములో 3 మట్టిరోడ్లు కలవు ఈగ్రామమును పొరుగు గ్రామములతో కాలిత్రోవలు బండ్లబాటలు కలుపుచున్నవి ఈగ్రామములో ప్రయాణములకు ఒకలారీ 275రెండెడ్లబండ్లు 12 సైకిళ్లుకూడ కలవు

అమరాబాదులో సబ్‌పోస్టాఫీసు బాలికల ప్రాథమిక పాఠశాల జిల్లా పరిషత్తు హైస్కూలు ఉన్నవి 5 మైళ్ళ చుట్టు ప్రక్కలనుండి కూడ హైస్కూలు చదువులకు విద్యార్థులు ఇచటికి వత్తురు ఇది పంచాయతిపరిపాలన కల గ్రామము ఇండ్లపన్ను వృత్తిపన్ను వాహనములపన్ను గృహనిర్మాణపు ఫీజు క్రయవిక్రయపు పన్ను బంజరుశిస్తు జరిమానాడబ్బు ఎటువంటి పన్ను లైసెన్సు ఫీజు మొదలగు విధముల పంచాయతి ఆదాయము గ్రామపారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లు లవు పంచాయతీ [illegible] రేడియో లౌడ్‌స్పీకర్లు నాటకశాలగా మండుటకు అనువగు ప్రదేశము కలవు ఇచట పోలీసుస్టేషను ప్రాథమిక రోగ్య కేంద్రము వైద్యశాలలు ఉన్నవి ఇంగ్లీషు వైద్యుడు గూడ కలడు ఒవాలశాఖ వారి కారణము సు. రూ. 8000లు అప్పలిచ్చినది వాగవు సంతలో బట్టలు కూరగాయలు ధాన్యము దొరకును 5 కిరాణాదుకాణములు 4 కాఫీహోటళ్ళు 2 గిరెట్టు శ్రీసోడా దుకాణములు సైకిళ్ళ షాపు రెండు క్షౌరశాలలు రెండు మందుల షాపులు కూడ ఈ గ్రామమున ఉన్నవి

కళాశాల చదువులకు ఈ గ్రామములోని విద్యార్థులు పాలెము కు హైదరాబాదుకు పోవుదురు సినిమాథియేటరునకు తాలూకాకచేరికి బ్లాకుభివృద్ధికేంద్రమునకు గ్రామస్థులు 16 మైళ్ళలో ఉన్న అచ్చంపేటకు పోవుదురు కోర్టులకు బిరిజిష్ట్రారు ఆఫీసుకు గ్రామస్థులు 42 మైళ్ల దూరములో మన్న నాగరకర్నూలునకు పోవుదురు

మా శ్యే

## అమరావతి

అమరావతి గుంటూరుజిల్లా మంగళగిరి సబ్‌తాలూకాలో ఉన్నది దీనికి 0 మైళ్ళ దూరములో గుంటూరు పట్టణము కలదు దీనికి తూర్పున పడమట ఉత్తరమున కృష్ణానది దక్షిణమున రుకుళ్ళపాడు ఉన్నవి దీని విస్తీర్ణము 4,80 ఎకరములు ఇది చాలాపురాతనమైన పట్టణము చారిత్రక ప్రాముఖ్యము కల ఇది కృష్ణానది ఒడ్డున ఉన్నది ఇచట బౌద్ధస్తూపము ఉండెడిది

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామమున పురుషులు స్త్రీలు కలిసి 5 000 మంది వీరిలో 150 మంది ఎరుకలవారు షెడ్యూలు జాతులు షెడ్యూలు తరగతుల వారు కలసి 284 మంది ఇచ్చట ఇండ్లు విడివిడిగాను దూరదూరముగాను నిర్మించబడినవి వీటిలో 400 పెంకుటిండ్లు 100 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 7 ఒక అంతస్థుగల మేడలు 5 ఎక్కువ అంతస్తులుగల భవనములు కలవు గ్రామస్థులలో 70 శాతమువారు వరి అన్నమును 15 శాతమువారు జొన్న

అన్నమును 15 శాతమువారు వరిగఅన్నమును తి దురు వీరు శా నీటిని క ష్ణానది నీటిని త్రాగుదురు ఇచట మంచి నీళ్ళక ఎద్దడిలేదు

966 67 స లో అమరావతిలో వరి క ది పొగాకు ఎ డలు వ డెను ఈ ఫలసాయములను ఎడవలలో లారీలలో విజయవాడకు గుంటూరుకు రవాణాచేసిరి పంటల క్రి ద 900 ఎకరముల భూమి ఉపయోగపడెను ఇది అంతయు కృష్ణ కాలువక్రింద సాగుబడియైనది రెండు ట్రాక్టర్లు 1000 ఎకరముల భూమిని దున్నెను

ఇచ్చట 500 గేదెలు 00 ఆవులు 600 ఎద్దులు 200 దున్నలు 200 మే లు 300 గొర్రెలు 80 ప దులు 300 కోళ్లు ఉన్నవి ప్రతిదినము 1000 లీటర్లపాలు 12 వీసెల వెన్నె 150 గ్రుడ్లు స్థాని ముగ ఉపయోగపడెను

ఇచ్చటి ప్ర లకు వ్యవసాయము కూలి వ్యాపారము జీవనాధారములు 50 దుకాణాదారులు 10 విక్రయదారులు 50 కు ది మ గలివారు 100 మ ది చాకలివారు 150 మ ది

చ్రమము 0



పటము - 1
అమరేశ్వర దేవాలయ గోపురము

గొల్లలు 75 మ ది వడ్డెరలుకలరుక సాలివారు వడ్ర గులు కమ్మరులుకూడ గలరు రె డు వడ్ల మర లున్నవి ఇవి గ్రామ అవసరములకు పని చేయును వ్యవసాయదారులకు కూలీలు దొరుకు దురు

సుందరమును ఉన్నతమునైన అమరేశ్వర దేవాలయము కృష్ణానది ఒడ్డున ఉన్నది శ్రీ మ రేశ్వరుని పాదము ను స్పృశి చుచు కృష్ణానది గ భీరముగా ప్రవహించుచున్నది ఈ నదిపడమట ను డి తూర్పునకు ప్రవహి చుచు ఇచటమలుపుతిరిగి ఉత్తరమును డి దక్షిణమునకు ప్రవహి చుచున్నది కృష్ణానది మలుపు తిరిగినస్థలము అతిపవిత్రమయిన స్థలముగా భావి చబడుచు న్నది ద్వాపరయుగాంత మున శౌనకాది మునులు ముక్తిపొందుటకు శ్రేష మగు మార్గమును తెల్పుమని నారదమహర్షిని ప్రార్థి చిరి అ తట నారదుడు అమరేశ్వర క్షేత్రపు పవిత్రతనుగూర్చి వారికి తెల్పెను మహా శివుడు భక్తుల కోరికలను నెరవేర్చుటకు అమ రేశ్వర రూ మున ఇచట ఆవిర్భవి చెను ఈఅమ రేశ్వరుని పూజి చిన భక్తులకు పునర్జన్మ ఉ డదు శ్రీ అమరేశ్వరుడే శ్రీ కాశీవిశ్వనాథుడు ఈ స్థల మున గల కృష్ణానదియే గ గానది అని మల భావనయే ఈయన క్రౌంచనాథుడు క్రౌ చ పురియే అమరావతి అని భావింపబడుచున్నది మరియొక పురాణ వృత్తా తము ప్ర కా ర ము అమృతలి గము 5 భాగములకా ఇంద్రుని వన ములో పడినది అచ్చోట ఒక మర్రివృక్షము

పెరుగుటకల అవి మరుగుపడి వి ఇంద్రుడు ఐరావతము నెక్కి ఒక దినమ న పోవుచు డ ఆ ఐరావతము మర్రివృక్షక చుట్టు ప్రదక్షిణము చేసి సాష్టాంగనమస్కార మొ రెను ఇంద్రుడు కారణ మే నని అడిగెను ఆ తట ఆ ఐరావతము పూర్వగాథను తెల్పి అమృతలింగమ మొక్క ఐదుముక్కలు ఆ మహావృక్షమ క్రింద మరుగుపడియున్నవని తెలెను ఇంద్రుని ఎనుపుక ఐరావతము వృక్షమును ప్రేళ్ళతో ఊడ బెరికెను నాలుగు ముక్కలు మాత్రమే కనబడెను అయి వ ముక్క గ ఒ క వో స్రుటకు అయ అహల్యాదేవికి మ్రొక్కక ఆమెను అవమాని చుటయే కారణమనెను అ తట ఇంద్రుడు తన పాపమును నివృత్తి చే కొనుటకు మొదటి ముక్కను క్రౌంచనగరికి కొనిపోయి అచ్చటనే ప్రతిష్ఠి చెను అమరప తిచే ప్రతిష్ఠ పబడుటచే ఆ లి గమునకు అమరేశ్వర లి గమ నియు ఆ స్థలమునకు అమరావతి అనియు పేర్లు కలిగెనట పవిత్రమైన ఆ మర్రివృక్షమును మరల నాటుమని మహావిష్ణువు ఇంద్రున కా తిచ్చెరు అటులనే ఇంద్రుడుచేసెను ఆ వృక్షము అక్షయవటముగ పరిగణి పబడజొచ్చెను ఆ వృక్షము క్రింద గౌతముడు బుద్ధుడాయెను అప్పటిను డి ఆ వృక్షము మహా బోధి వృక్షమనబడెను మాఘబహుళ దశమినుండి 10 దినములు అమరేశ్వరస్వామి రథోత్సవము ఘనముగా జరుగును స్వామికి 816 ఎకరముల భూమి కలదు దీని నుండి సాలీనా వచ్చిన ఆదాయము రు 19 748 లు

అమరావతికి 21 మైళ్ళ దూరములో గు టూరు రైల్వే స్టేషను ఉన్నది గ్రతిగంటకు ప్రభుత్వపు బస్సులు గు టూరు ను డి అమరావతికి పోవును ఇ దు 7 కంకరరోడ్లు 8 మట్టి రోడ్లు ఉన్నవి దీనిని పొరుగు గ్రామములతో క కరరోడ్లు కలుపుచున్నవి కృష్ణానదిపై విజయవాడకు పెనర క ది మొద లగు పప్పుధాన్యములు ఎగుమతియగును ప్రయాణమునకు గ్రామములో 7 రిక్షాలు 4 టాక్సీ కారులు 200 రెండెడ్ల బండ్లు 185 సైకిళ్లు ఉన్నవి

అమరావతి యందు సబ్ పోస్టాఫీసు త తికార్యాలయము టెలిఫోను ఎలిమెంటరీస్కూలు హైస్కూలు ఉన్నవి ఇది ప చాయతీ పాలనకల గ్రామము దీనిలో పంచాయతీ గ్రంథాలయము రేడియో లౌడ్ స్పీకర్లు సినిమాథియేటరు సత్రము విశ్రాంతి గృహము ఉన్నవి

విద్యుచ్ఛక్తిని 200 ఇండ్లు సినిమాథియేటరు వాడుకొను చున్నవి చట సాలీ స్రైన క్లా థి ది కేం వాయితీ ... కు ... కి వు ... ఫములు ... 300 ... స్పుగా ... 0 కాఫ ... ళ్లు 00 ... దుకా ... వ లు 8 ... ళ్లు సై ... 4 ... కాల 6 లా డ్రి ... మ షాపులు 5 ఫా ... షాపులు 4 బియ ... టు ఉన్న చట శ్రీ రాజావాసరెడ్డి వె కటాద్రినాయని కా ల ఉన్నది

మా శే

## అమరావతి—చరిత్ర

అమరావతి ఆంధ్రదేశ చరిత్రారంభమును డి రాజకీయ సాంస్కృతిక ర గాలలో కీలకస్థానము మి ఖ్యాతినొ దిన ఒకనాటి నగరమైన ధాన్యకటకమే నేటి గ్రామమైన అమరావతి ఇది గు టూరు ఉత్తర దిశగా కి మీ దూరమున కృష్ణా దీతటమున ఉన్నది ఈ గ్రామమునకు పశ్చిమముగా ఒక అరమైలు దూరమున ధరణికోట యను గ్రామము లదు ఇప్పటి ఈ రెండు గ్రామముల ప్రాంతము చరిత్ర కాలమున ఒకటిగనేయు డి ధనకట ము ధాన్యకట ము-ధాన్యవాటిక-దన్నాడ దన్నకడ మొదలగు పేర్లతో పేర్కొనబడినది

అమరావతి గ్రామము జనస ఖ్య 6225 ఆదాయము 25 వేల రూపాయలు ధరణికోట గ్రామమ లి జనసంఖ్య 3821 ఆదాయము ప ద్రెండువేలరూపాయలు అమరావతి చుట్టు ప్రక్కల గ్రామాలకు వ్యాపార కేంద్రము ధరణికోట పూర్తిగా వ్యవసాయము ఆధారము గలగ్రామము స్థానిక స్వపరిపాలనా విషయమున ఇవి రె డును వేరు వేరు ప చాయితీలై మ ప్రజాజీవితమున ఇవి రెండును అభిన్నములుగా నున్నవి ఈ రె డు గ్రామములు అభివృద్ధియగుచు కలసిపోవున తగా పరస్పరము సన్నిహితములగుచు న్నవి అమరావతిలో బౌద్ధస్తూప శిథిలావశేషములు అమరేశ్వర దేవళము కృష్ణానదీ సౌందర్యము ధరణికోటలోగల కోటదిబ్బలు ఇవి యాత్రికులకు దర్శనీయప్రదేశములు ఈ యాత్రా కేంద్రము నందు యాత్రికుల సౌకర్యార్థమై రెండు సత్రములు ను వినోద పర్యటకులకై ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు నిర్మించిన అతిథిభవనములును కలవు మూడు నాలుగు బస్సుమార్గముల కిది కూడలి

పై మున్న మయిన అర్ధగోళాకృతి దా శీర్షముపై ఒకటి గాని మూడుగాని లేక మరికొన్నిగాని బే సంఖ్యలో ఛత్రములనుగల గొప్ప నిర్మాణమునకు స్తూపమని పేరు ఈస్తూపము కు చుట్టును పాకారమును నిర్మి తురు స్తూపమునకు కును ప్రాకారమునకుగల మధ్యభాగమును ప్రదక్షిణ పథమందురు

అమరావతియందు గల స్తూపవేదిక ఎత్తు ఆరడుగులు వ్యాసము 188 అడుగులు స్తూప పదపీఠమునుండి శీర్ష ఛత్రమువరకు గల ఎత్తు దాదాపు 100 అడుగులు ఈ స్తూపమునకు నాలుగుదిక్కుల వేదిక నాను 32 ఎత్తైన అరుగులు నిర్మింపబడినవి వీనినే అయక (ఆర్యక) స్తంభములందురు స్తూపమునందు అయకస్తంభములను నిల్పుట ఆంధ్రదేశ బౌద్ధ శిల్పుల ప్రత్యేకత ఈ అయిదు స్తంభములు బుద్ధుని జీవితములో అయిదు ముఖ్యఘట్టములకు ప్రతీకలు నాలుగుదిశలయందు ఆయకస్తంభవేదికల కెదురుగా ద్వారములు కలవు ఇంతటి మహానిర్మాణమున అంగుళము చోటైనను వదలక శిల్పాలంకృతులు కావింపబడెను

ఈ మహాస్తూపమంతయు ఏ ఒక్కతరములోనో నిర్మింపబడినది కాదు ఇది నాలుగుశతాబ్దుల విశిష్టపరిణామఫలితము స్తూప శిథిలములలో కనుపించు శాసన పరిణామములను శిల్పరీతులను ఆధారముగ గొని ఈ స్తూపనిర్మాణము నాలుగు దశలుగా సాగియుండునని పండితులు నిర్ణయించిరి ప్రథమ దశ క్రీ పూ రెండవ శతాబ్దముననే ప్రారంభమైనది ఈ దశయందలి శాసనశిల్ప ఫలకములపైని లిపి మౌర్యలిపికి మిక్కిలి సన్నిహితముగా నున్నది శిల్ప చిత్రణము రెండవ శతాబ్దికి చెందిన భార్హూతు శిల్పరీతికి దగ్గరగా నున్నది

రెండవ దశలోని నిర్మాణమున ఉపయోగించబడిన శిలాఫలకములు అంత మృదువైనవి కాకపోయినను వెడల్పైనవి ఈ శిలాఫలకములపై బుద్ధుని జీవితకథలు మలచబడినవి ఈ దశలోని శిల్పమునందు బుద్ధుడు మనుష్యాకృతిలో గాక బోధివృక్షము పాదుకలు పొత్తిళ్ళు మొదలగు ప్రతీకలుగా రూపొందింపబడెను ఈ శిల్పఫలకములపై కనిపించు శాసనలిపి ననుసరించి ఇది కొంచెమటునిటుగా క్రీస్తుశకారంభమునకు చెందినదని పండితుల నిర్ణయము

మూడవ దశయందు స్తూప ప్రాకారము సుందరశిల్పాలంకారములను సంతరించుకొన్నది ఈ శిల్పరచనాకార్యక్రమమంతయు ప్రసిద్ధ బౌద్ధాచార్యుడైన నాగార్జునుని యాధ్వర్యవమున నడచెనని టిబెట్ గాథలుచెప్పుచున్నవి ఈ ప్రాకార నిర్మాణము వాసిష్ఠీపుత్ర పులోమావికాలము జరిగినట్లు శాసనములే సాక్ష్యమిచ్చినవి

నాల్గవ దశయందు ఆంధ్రశిల్పి భావ ప్రకాశన దీనదియిందు మిక్కిలి సున్నితమైన రాయి వాడబడి ది శిల్పి చేయి కూడ సున్నితముగ రగి ది బుద్ధుని జాతకకథలు అతని దివ్యశక్తులు తెలుపు కథలు ఈకాలపు శిల్పులకు భిమ న ఎయములు ఈ శిల్పములు ముఖ్యముగ స్తూపవేదికను కప్పుటకై ఉపయోగింపబడినది ఈ దశ క్రీ శ 2వ శతాబ్దమున నడచియుండవచ్చును ఈ దశాంతమున స్తూపాలంకరణము పూర్తియైనది శాతవాహనుల పాలనమును పూర్తియయినది

అశోకునిచే దక్షిణదేశమునకు పంపబడిన మహాదేవస్థవిర నామధేయుడొకడు ఆంధ్రదేశమునకు వచ్చి కృష్ణా దీరప్రాంతమున చైత్యకవాదమను నొక బౌద్ధశాఖను ప్రారంభించెను చైత్యము నారాధించుట ఈ శాఖయందలి ముఖ్యాంశము ఈ వాదము ఆంధ్రమునందు మంచి ఆదరమును పొందినది ఈ మహాదేవస్థవిరుడే అమరావతిలో స్తూప నిర్మాణమునకు ప్రేరకుడైయుండవచ్చును అమరావతియందలి స్తూప పరిసరములందు నిర్మింపబడిన బౌద్ధ విహారములు వేలకొలది భిక్షువుల కాశ్రయమిచ్చినవి ఈస్తూపమునందు బుద్ధుని ధాతువులు నిక్షిప్తము చేయబడుటచే కాబోలు ఈప్రాంతమత్యంత పవిత్రమై బౌద్ధములో గల అన్నిశాఖలవారిని ఆకర్షించినది ఈ స్తూపమందలి గౌరవాధిక్యముచే చైనా బౌద్ధగ్రంథములు దీనిని శ్రీ ధాన్యకటక చైత్యమని పేర్కొనుచున్నవి

ఆచార్య నాగార్జునుడు మహాయానబౌద్ధమున కొక స్థిరరూప మొసంగిన తరువాత ఆంధ్రదేశమునందలి చైత్యకవాద బౌద్ధులుకూడ మహాయానమునందే కలసిపోయిరి నాటినుండి ధాన్యకటకచైత్యము మహాయానమార్గస్థులకు కేంద్రమైనది మహాయానమార్గావతరణమునకు ముందే బౌద్ధమున చిన్నచిన్న శాఖాభేదములు కలవు అవియన్నియు ముఖ్యసిద్ధాంతముదృష్ట్యా హీనయానమందో మహాయానమందో చేరిపోయినను వాని అస్తిత్వమును పూర్తిగా కోల్పోలేదు పూర్వశైలీయ అపరశైలీయాది భేదములు కొనసాగుచునే యున్నవి కాని ఈ భిన్నశాఖీయులందరు ధాన్యకటక స్తూపసమక్షమున బుద్ధారాధనమందు మాత్రము సమీకృతులగుచుండెడివారు మహాయానానంతరము వజ్రయానము

తాంత్రికవాద మారకమైనది దీనికిగూడ ధాన్యకటకమందు తావునొసంగినది ఈవాదమునకు చెందిన తారాదిదేవతల విగ్రహములు బయల్పడుటచే ఇది స్పష్టమైనది అన్నిచోట్ల జరిగినట్లే అమరావతియందుకూడ వజ్రయానమే బౌద్ధమత పతనమునకు నాంది పలికినది అది ప్రజాదరణము కోల్పోయినది

క్రీ శ 630–640 మధ్యకాలమున ఈప్రాంతమును సందర్శించిన చైనాయాత్రికుడు యువాన్‌చాంగ్ నాటిధాన్యకటకమునిట్లు వర్ణించెను " ఆరువేల లీల చుట్టుకొలతగల ధాన్యకటక రాజ్యప్రముఖ్యపట్టణముయొక్క చుట్టుకొలత నాలుగువందల లీలు (ర మైళ్ళు) ఇచట అనేక బౌద్ధసంఘారామములు కలవు కాని వానిలో పెక్కు జీర్ణములు మహాసాంఘికవాదులైన వేయిమంది శ్రమణులు మాత్రము ఇరువది

చిత్రము 22




పటము - 3
అమరావతి స్తూపము—ఆకృతి చిత్రము

స్తూపమునకు దగ్గర దేవాలయములు కలవు. వివిధ శాఖలకు చెందినవారనేకులు రాజధానికి తూర్పుగనున్న విహారమునందు పూర్వశైలీయులు పశ్చిమముగనున్న విహారమునందు అపరశైలీయులుండిరి. బుద్ధుని మరణానంతరము ఒక వెయ్యి సంవత్సరముల వరకు వర్షాకాలమును గడుపుటకై ఒకవేయి మంది శ్రమణులువచ్చి అర్హత్వమును పొందినవారు. వారి అతీతశక్తులతో ఆకాశమార్గమున తిరిగిపోయెడివారు. తరువాత సాధారణ శ్రమణకులు అర్హత్వమును పొందనేరక జీవించుచుండిరి. కాని వందసంవత్సరములనుండి శ్రమణులెవ్వరును ఇచట నివసించుటలేదు"

కాలము గడచినకొలది ఇచట బౌద్ధమతము అడుగంటెను. కాని స్తూపమందలి బుద్ధదేవునకు పూజలు కొనసాగుచునే యున్నాయి. 12వ శతాబ్దమున పాలించిన కోటకేతరాజు "శ్రీ అమరేశ్వరదేవరకు తోడుగ "శ్రీమద్బుద్ధదేవరకు కూడ కొన్ని గ్రామములను దానముచేసెను. ఈశ్వరాలయమునందుకల కొన్ని శాసనముల శీర్షములందు శివనంది రూపములతోపాటు బుద్ధరూపములుకూడ చెక్కబడినవి. ఇట్లు కొంతకాలము అమరేశ్వరునకు తోడు దేవరగా గడపి రాను రాను అమరావతిలో బుద్ధుడు పూర్తిగా తెరమరుగై కల్నల్ మెకంజీ కృషివలన 1797 లో వెలికి వచ్చినాడు.

శైవారామము: మధ్యయుగాలలో శైవమునకు కూడ అమరావతి కేంద్రస్థానమైనది. ఆంధ్రదేశమున పంచారామములుగా ప్రసిద్ధిచెందిన అయిదు శైవక్షేత్రములలో అమరావతి మొదటిది. యుద్ధరంగమున తారకాసురుని మెడయందలి శివలింగమును కుమారస్వామి ఛేదింపగా అది అయిదుఖండములై పడెను. ఆఖండములే శివలింగములుగా అయిదుప్రదేశములలో ప్రతిష్ఠింపబడెను. అవియే పంచారామములు. అందలి ప్రథమఖండము అమరావతియందు అమరేశునిచే ప్రతిష్ఠింపబడినదని పురాణగాథ. అందుచే ఇచట నెలకొన్న శివునిపేరు అమరేశ్వరుడు. అమరేశ్వరాలయమునకు ప్రక్కనే కృష్ణానది ప్రవహించుచుండును. దేవళము వెనుక నదిలో నొకపెద్దరాతిచట్టు కలదు. దానిని క్రౌంచగిరి అందురు.

ఈదేవాలయ ప్రారంభమునుగూర్చి నిర్దిష్టముగా తెలుపుటకు తగిన చారిత్రక ఆధారములులేవు. క్రీ.శ. 1089వ సంవత్సరమున కొమ్మనాయకుడు అమరేశ్వర మహాదేవరకు అఖండవర్తిదీపమునకు ఇచ్చిన దానశాసనముకలదు. అంతకు పూర్వపు శాసనాధారములు కనిపించలేదు.

బౌద్ధము క్షీణదశనందగా వైదికమతము పునర్వైభవమును పొందుచున్న దశయందే అమరావతి నిండా శైవమవ్వి యుండును. చైనాయాత్రికుడు యువాన్ చాంగ్ (క్రీ.శ. 640) వచ్చునప్పటికే బౌద్ధము క్షీణదశనందియుండెను. "పెక్కు ఇతర దేవాలయములును గలవు" అని అతడు పేర్కొనుటచే అమరేశ్వరుడును ఆ ఇతర దేవతలలో నొకడై శైవశైవదశకాధారభూతుడైయుండెనేమో అని ఒకఊహ. నాటినుండి పైన పేర్కొన్న శాసనకాలము వరకు కల దేవాలయ చరిత్ర చీకటికోణమే. 12వ శతాబ్దమందలి కోటరాజుల కాలమున ఈ ఆలయము రాజాదరణమును వైభవమును అనుభవించినది. వారి పెద్దపెద్ద శాసనములే ఇందుకు తార్కాణ. 1270 ప్రాంతమున ప్రసిద్ధ శైవాచార్యుడైన మల్లికార్జున పండితారాధ్యులవారు అమరావతి పురమును దర్శించి శైవాపరాధియైన చోడునిచూచి మాటలాడుటవలన సంక్రమించిన పాపపరిహారార్థము అమరేశ్వరునికి పూజలుచేసి మహేశ్వరాష్టకము చెప్పినట్లు పాల్కురికి సోమనాథుని కథనము. పండితారాధ్యులవారి ఆగమనముతో వారొనర్చిన పూజలతో అమరావతికిగల శైవప్రాధాన్యము అధికమైయుండెను.

అల్లావుద్దీన్ హసన్‌గంగు జరిపిన దాడుల తాకిడి అమరేశ్వరాలయమునకుకూడ తగిలినది. ఇందులకు కోవెల మైలపడినదని తలచి క్రీ.శ. 1361 లో అనవోతారెడ్డి ఆలయమును బాగుచేయించి ఆచంద్రార్కముగ పునఃప్రతిష్ఠచేయించి అనేక దానములిచ్చి స్థితి నెలకొల్పెను. మరలఇట్లే తురుష్కుల దాడికి పాల్పడిన దేవళమునకు "హరిదికం పెద్దప్ప" క్రీ.శ. 1623వ సంవత్సరమున శ్రీఅమరేశ్వరలింగము మూడో ప్రతిష్ఠ చేయించి పూజార్లకు ఇతర సేవకులకు తగు భాగము లేర్పరచి వానిని సువ్యవస్థిత మొనర్చెను.

శ్రీకృష్ణదేవరాయలు కటక విజయమును సాధించి వచ్చునప్పుడు క్రీ.శ. 1515 లో ఈదేవాలయమున తులాభారమును తూగి ఆధనమును దానమొనర్చి తులాపురుషాది మహాదానములుచేసి శాసనము వేయించెను.

ఇట్లనేకులు అమరేశ్వరుని పూజించిరి. కాని అమరావతి గ్రామ నిర్మాణమొనర్చి దేవాలయమునకొక స్థిరత్వమును చేకూర్చిన ప్రభువు మాత్రము రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడుగారే. ఈసుప్రసిద్ధ జమీందారుగారు 1795 మండ

1797 వరకు అమరావతీ గ్రామనిర్మాణ మొనర్చెను విశాలములై తీరైన వీధులతో ప్లానుగ్రామముగ నిర్మించబడిన పేటలతో గృహములను కట్టించి మడిమాన్యములిచ్చి పెక్కు గ్రామములనుండి బ్రాహ్మణులను వైశ్యులను ఆకర్షించి వారికి తగు వసతులుచూపి ఒక నూతన నగరమును నిర్మించి తన రాజధానిని చింతపల్లినుండి అమరావతికి తరలించెను దేవాలయమునకు గోపుర ప్రాకారాదులు నిర్మించి ఆలయమును విస్తృతపరచి మిక్కిలి శోభనకూర్చెను ఈజమీందారు దేవాలయమున మూడు పర్యాయములు తులాభారముతూగి స్వర్ణగోగర్భమును దూరివచ్చి దానధర్మము లొనర్చెను దేవాలయమునందలి అరక కుటుంబములకు సర్వ దాసదాసీజనులకు ఈనాములిచ్చెను తన సర్వస్వము స్వామిదేనన్న భావముతో దేవాలయమునకు మాత్రము ప్రత్యేకమైన ఆస్తి ఏమాత్రము ఏర్పరుపలేదు

ఈతని మరణానంతరము దేవాలయ సుస్థితికి కొంత లోటువచ్చుటచే దివాన్ చందూలాల్ ప్రేరితుడై నైజాం నవాబు 1862వ సంవత్సరమున అమరేశ్వరునకు 500 ఎకరముల పొలమును ప్రతిసంవత్సరము వేయిరూపాయలనగదును ఇచ్చున ట్లేర్పాటు చేసెను నర్సారావుపేట జమీందారు మల్రాజు గుండారాయని గారు 215 ఎకరముల పొలమును ఈశ్వరున కొసగెను ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు దేవాదాయ ధర్మాదాయశాఖను నెలకొల్పిన తరువాత ఈ దేవాలయము వారి ఆధ్వర్యవమున చేరినది ఇపుడీ దేవాలయము సాలునకు 85 000 రూపాయల ఆదాయముతో భక్తులకు కేంద్రస్థానమై ప్రముఖ యాత్రాస్థలముగా ఉన్నది

శిల్పకళ కళాప్రపంచ చరిత్రలో ఒక విశిష్టశిల్పరీతిగా పేరొందిన అమరావతీ శిల్పకళకు 400 సంవత్సరముల సుదీర్ఘ చరిత్ర కలదు క్రీస్తుకుపూర్వము వర్ధిల్లిన భార్హుతు మగధలందలి శిల్పరీతులలో పుట్టిన అమరావతీ శిల్పకళా ప్రథమదశ స్తూపముతోపాటు శిల్పనైపుణ్యముగూడ క్రమపరిణామము నంది సౌందర్యపుష్టిని కూర్చుకొన్నది అనంతరకాలమున ప్రవర్తిల్లిన అజంతా చిత్రకళపైనను పల్లవ శిల్పములపైనను గుప్తుల కళపైనను ఈ శిల్పకళ తన ప్రభావమును విస్తరింప జేసినది అంతటితో ఆగక సముద్రములు దాటి జావా మొదలగు ఆగ్నేయాసియా దీవులలోగూడ తన శిల్ప సంప్రదాయమును కొనసాగించినది అమరావతీ శిల్పరీతి ప్రాచీన భారతీయ కళాసంప్రదాయములకు ప్రియపుత్రిక అనంతరకాలీనులకు కన్నతల్లి

కొలది బుద్ధవిగ్రహములు తప్ప అమరావతీ శిల్పములన్నియు పరిమాణమందు చిన్నవై దాదాపు 3 × 5 విస్తృతిగల పాలరాతి శిలాఫలకములపై ఉబ్బెత్తు (Relief) పద్ధతిలో చెక్కబడి బుద్ధుని జాతకకథలను జీవితగాథను తెలుపుచుండును పద్మాలంకృత ఫలకములు పూర్ణకుంభ ఫలకములు విస్తృతమైన వైవిధ్యముతో చూపరుల నాకర్షించుచుండును ఈ శిలాఫలకములన్నియు స్తూపప్రాకారమునందును స్తూప పరితలమునందును అలంకరింపబడినవి అజంతాగుహాలయందలి అనేక చిత్రములకు అమరావతిలో మాతృకలు కనిపించును చిత్రలేఖనమునందు గల వర్ణాలంకరణ కౌశల్యమును అమరావతీ శిల్పములకు చేర్చినచో అజంతా చిత్రము లేర్పడును అమరావతిలోని ప్రథమ దశాశిల్పములు భార్హుతు శిల్పములతో పోలికను కలిగియున్నను రేఖావిన్యాసమందలి నాజూకుతనమందును స్త్రీమూర్తుల భంగిమలలోని లావణ్యమందును సౌందర్యదృష్టియందును అంతకన్న ఉత్తమముగా నున్నవి. స్త్రీభంగిమలలోని వైవిధ్యము ఒయారము అవయవములందలి నిండుతనము అంగవిన్యాసములలోని సమతూకము స్థైర్యముతోగూడిన అలసత్వము అమరావతీ శిల్పములందు కనిపించు ముఖ్యలక్షణములు ఈ శిల్పములను పరిశీలించినచో ఆనాటి శిల్పులకు గల అవయవ నిర్మాణశాస్త్ర ప్రజ్ఞ స్పష్టమగును ఇట్టి శాస్త్రపరిజ్ఞాన మున్నను శారీరక బలమును సూచించునట్టి కొనలుతేరిన రేఖలతోడి కండరనిర్మాణమును గాక పూర్ణత్వమును పుష్టిని ప్రదర్శించు శరీరవిన్యాసముతో శిల్పులు ప్రదర్శించిరి

అమరావతీ శిల్పములలో ప్రకృతికి స్వతంత్రస్థానము లేకపోయినను మానవ జీవితమునకు రమ్యతచేకూర్చు నేపథ్యముగా ప్రకృతికి ఎంతటి స్థానము కలదో అంతటి స్థానము ఈ శిల్పములలో ఒసగబడినది రాజునుండి పేదవరకు గల జీవితములలోని తారతమ్యములు సుఖదుఃఖములే గాక జీవితమునందలి ప్రత్యంశము సౌందర్యదృష్టితో మేళవింపబడి లయాత్మకముగ శిల్పింపబడినవి వారి దృష్టిలో జీవితము కర్కశ కఠోరమును స్వాప్నిక పుష్పశయ్యయునుకాదు అది కాఠిన్య మాధుర్యాల కలగలుపు

అమరావతీ శిల్పకళ బౌద్ధమే యైనను మతైకదృష్టి

గలిగినది కాదు బుద్ధబోధలలోని కఠోరనిర్మమతాజీవనమును రహీన నిస్స గర్వష్టియు ఇందు కన్పి పవు శారీరక సౌంద ర్యమును విషయానుభ్యనమును వారు నీచముగా నెంచలేదు తరుణీకనూలావణ్యము అత్యంతశ్రద్ధతో శిల్పీకరింపబడి ప్రాచీన కావ్యవర్ణన ను స్ఫురి పజేయును

రాజు మొదలు పరిచారక నివరకు ఎర్వుల విగ్రహములు విన్యాసాలతో గా భీర్యమును తరగని సుఖలీలను ఔచిత్యము చెడని లా హ ను ప్రదర్శి చుచుండును అమరావతీ శిల్పుల లోకాను కల పటుత్వముగాని ఇంద్రియలౌల్యముగాని కనిపి ఎదు ఇందు త్యాగిగ ధీరత ప్రశాంత రమణీయతాది అతిమానుష గుణములు క్రూరత భీభత్సతాది అమానుష గుణములు గూడ శిల్పుల చేతులలో రూపులు దిద్దుకొన్నవి

అమరావతీశిల్పకళ ప్రా తీయత సధిగమించి భారతీయ శిల్పకళాన ప్రదాయమున నొక విశిష్టా గమై ప్రప చము దలి కళాప్రియుల నేత్రములను అన్నింటిని ఆకర్షించుచున్నది

వా సు

## అమరినాయకుడు

ఈయన పేరు ద హిం IV – 1062 ద్రాక్షారామ శాసనములో కన్పించుచున్నది శక 10 నేష్టి వైశాఖ కృష్ణ (బహుళ) దశమీ ఆదివారంనాడు అమరినాయకువారి రాజసాని ఘా తురు కూతురు) నత్యాసాని భీమేశ్వరమహాదేవునకు అఖండలోహసంబు పెట్టి చుటకై నలభై వీసలు (వీశెలు కావచ్చును) ఎత్తు మొక్క కామనబోయని లక్ష్మణబోయని వశమున పెట్టిన మొదవులు 50 దేవునకు నిత్యము త్రిభువనాంకుశమానతో మానెడు నేయి దీపారాధనకై సదరు బోయలు పోయుచు డవలెను మొదవులు ఆవులు అనుటకు మోదాలుఅనుట విశేషరూపము ఈ ఇద్దరుబోయలును కట్టడి చేసి ధర్మము పకారము నేయిపోయుచు డుటకు మరినలువురు బోయలు పూ గా బాధ్యులుగా చేయబడిరి

అమరినాయకుని వృత్తా తము తెలియదు ఈతడు ద్రాక్షారామ ప్రా తము దలి సంపన్న గృహస్థుడో భూ స్వామియో అయి యుండును అమరినాయకువారి అని గౌరవార్థవాచకముచే ఈయన కొంత ప్రముఖుడే యని ఊహింపవలసియు డును దానమొసంగిన నత్యాసాని ల్లియైన రాజసాని అమరినాయకుని ధర్మపత్నియో లేక భోగస్త్రీయో తెలియరాదు ఈశాసనమందలి సంస్కృతభాగము చాలావరకు విరిగిపోయినది అయినను దానిలో

నాయకస్వదుహిత

ప్రాదాద్దీపముఖ ద మే మతుల శ్రీమేశ్వరాయానరాశ్

అనుమాటలచే నత్యాసాని అమరినాయకువారి ధర్మసంతానమే యని భావించుటకు వీలగుచున్నది అమరనాయకుని తెలుగు శాసనభాగము నష్టమైనది ద హిం X 292 తెనాలి తాలుకా కొలకలూరు శాసనములో మరియొక అమరినాయకుడు కన్పి చుచున్నాడు ఈశాసనకాలము శక 1168 నత్యాసాని జనకుడైన అమరినాయకుడు శక 10 లోని వాడు కావున ఈయన కొలకలూరి అమరినాయకునకు 100 స వత్సరములు వెనుకవాడగుటచే వీరిద్దరును భిన్నవ్యక్తు లనుట తథ్యము

బం ల రం

## అమరినేడు

దక్షిణ హి దూ శాసనములలో అమరినేని ప్రశంసకలదు ఈతడు రాయపూడి గ్రామములోని వీరభద్రేశ్వరస్వామికి అంగర గభోగములకు గాను కొ తభూమిని దానముచేసినట్లు శాసనమున కలదు (ద హి X నె 463) రా య పూ డి గ్రామము గు టూరుజిల్లా గుంటూరుతాలుకా తాటికొ డ ఫర్కాలోనున్నది ప్రకృతము ఈ గ్రామమున దలి జనస ఖ్య 3308 కి మించియున్నదని తెలియుచున్నది ఇ దలి వీరభద్రాలయమునకు ఎదురుగనున్న ఒక రాతిపై శాసనమొకటి లిఖతమైయున్నది శాసనమునందలి మొత్తము పంక్తులు 12 మాత్రమే ధర్మార్థమువంటి లేఖక ప్రమాదజనితములైన పద ములుగూడ కొన్ని ఇందు గోచరి చును శాసన ప క్తుల చివరి భాగము పూర్తిగ నష్టమైనది అ దుచేతనే శాసనకాలము ౧౨౦ (120) అని మాత్రమేయు డి తక్కినది భ్రష్టమగుటచే అందలి చారిత్ర కా శములు తెలిసికొనుట కష్టమైనది శాసన మంతయు తెలుగులో వచన రూపముననున్నది

### శాసన సారాంశము

స్వస్తి శ్రీ శుభశకవర్షంబులు ౧౨౦- (120) నేటి మాఘశుద్ధ పూర్ణిమా గురువారమున దు మందడికలింగి నాయని మన్మడును (తెప్ప) లినాయుని కొమరుడును అగు అమరినేడు అనువాడు తమ తల్లి (దండ్రు)లకు ధర్మార్థము రాలివూండి (రాయపూడి)లోని (వీరభ) దునకు అంగరంగ భోగములకై దేహపుర మార్గమునందున్న పేద్యభూమిని కొంత

క్రయ చేసి సమర్పించెను

పై వ్రాతలో—లి అనుచోట కెప్పలి అనియు తల్లి— అనుచోట తల్లి ద డ్రులు అనియు— ధనకు అనుచోట వీరభద్రు నకు అనియు ఊహించి వ్రాయబడినది శకవర్ష ౧౨౦౦ అని యున్న దున ఆ వత్సరము చివరి సంఖ్య (9) కి మించియుండదుగాన శాసనకాలము 1200 కు పై నో 1209 కి లోపు నో ఐయుండు నియు అనగా ఇది క్రీస్తుశకము 1278 1287 మధ్యకాలమునాటి శాసనమనియు భావింపవీలగుచున్నది ఈశాసన కాలము నాటికి గుంటూరు ప్రాంతము కాకతి రుద్రమవశములోనున్నది ఈమె కాకతీయ సామ్రాజ్యమును క్రీ శ 1262 ను డి 1 96 వరకు పాలించెను గుంటూరు ప్రాంతము పూర్వపు వెలనాటి యంతర్భాగము ఈ ప్రాంతమును వెలనాటి చోడులు సుమారు ఒక శతాబ్దికాలము అవక్ర పరాక్రమముతో పాలించిరి వెలనాటి రాజులలో కడపటివాడు మూడవగొంకరాజుకుమారుడగు పృథ్వీశ్వరుడు ఇతడు క్రీ శ 1206 వరకు వెలనాటిని పాలించి దురమునందు నెల్లూరు చోడతిక్క రాజుచే నిహతుడయ్యెను ఇంతటితో వెలనాటి చోడరాజుల స్వతంత్ర పరిపాలన మంతమొందెను క్రీ శ 1225 నాటికి ప్రాగాంధ్రము కాకతీయ రాజులవశమయ్యెను వెలనాటి ప్రభువులు కొందరు కాకతి గణపతిదేవునకు సామంతులై వెలనాటిని కొంతకాలమువరకు పాలించినట్లు తెలియుచున్నది గణపతిదేవుడు క్రీ శ 1193 నుండి 1262 వరకు కాకతీయ సామ్రాజ్యమును పాలించెను అమరినేడు కాకతీయ ప్రభువు ఉద్యోగులలో ఒకడై యుండవచ్చును ఆనాడు అంగరంగ వైభవాదులకు నిత్యనైవేద్య ధూపదీపారతులకును దేవాలయములకు భూదానమొనర్చి శాసనములు వేయుచుట యొక ఆచారముగ పరిగణింపబడెను అట్లొనర్చుట పుణ్యప్రదమనియు అట్టి దానములు పర్వదినములయందొనర్చుట విశేషఫలప్రదములనియు ఆనాటి రాజులయొక్కయు ఉద్యోగులయొక్కయు ఇతర భక్తులయొక్కయు భావన అట్టి వారిలో చేరిన అమరినేడు కొంతభూమిని కొని వీరభద్రేశ్వరునకు అంగరంగభోగాదులకర్పించి తన తల్లి దండ్రులకు అఖండ పుణ్యము నుసమకూర్చెను దీనివలన అమరినేనికిగల పితృభక్తియు దైవభక్తియు ద్యోతకములగుచున్నవి వీరియింటి పేరైన మందడి అనువది కొన్ని యంశములను స్ఫురింపజేయుచున్నది ఈ వంశమువారు మందడ గ్రామమునకు చెందినవారు కావచ్చును దడము కృష్ణాతీరమునందలి గ్రామము ఇచ్చుటనే గణపతిదేవుని దీక్షాగురువగు విశ్వేశ్వర శివాచార్యుడు శైవమత వ్యాప్తికై గోళకి మఠమును స్థాపించెనని మల్కాపుర శాసనము వలన తెలియవచ్చుచున్నది రుద్రమదేవి ఈ మఠమునకు భూదానము చేసెను

శం ఆం శా

## అమరిసెట్టి

ఈ వణిక్ప్రముఖుని పేరు గుంటూరుజిల్లా గుంటూరు తాలూకా మందడ గ్రామమునందుండు వెంచేసియున్న శ్రీరామలింగస్వామివారి ఆలయమందు నెలకొల్పబడిన ఒక నల్లశిలపై చెక్కబడిన శాసనమునందు లభించుచున్నది (ద హి X నెం 446) శాసనకాలము శక 1201 (క్రీ శ 1279) ప్రమాది సంవత్సర చైత్రశుద్ధ 13 ఆదిత్య వారము విషువు సంక్రాంతి ఈ పుణ్య దివసమునందు అమరిసెట్టి కృష్ణవేణీ నదీతీరమున దొడ్డి కంద్ర వాటిని మందర గ్రామమందు చతుర్దశ భువనాధీశ్వరులైన శ్రీరామేశ్వరస్వామి మహాదేవరకు తమకు ధర్మార్థముగా అఖండదీపమునకై 25 గోవులు దానముచేసెను వీటిని రక్షించి ప్రతిష్ఠోరి గొల్ల ప్రోలెబోయని కొడుకు పోతెబోయడు దేవుని దీపారాధనకై నిత్యము మానెడు సమరు (చమురు) నడిపెడివాడు అని శాసనములోని ఆదేశము అమరిసెట్టి తండ్రి పేరు రేవిసెట్టి అమరిసెట్టి తాత పేరు అమరిసెట్టియే మనుమనికి తాత పేరుపెట్టుట ప్రసిద్ధము వీరు పెనుగొండ శాసనములని చెప్పబడినది పశ్చిమ గోదావరిజిల్లాయందలి పెనుకొండ పట్టణము చిరకాలమునుండియు వైశ్యులకు పవిత్రనగరముగా ఉండినది వైశ్యకులమువారికి ఇష్టదేవతయగు కన్యకాపరమేశ్వరీయొక్క ఆలయము ఇచ్చటకలదని తెలియుచున్నది కర్ణాటక దేశమందలి వీరబల ఐదర్నమార్గానుయాయులు ఐహోలు పురవరమునుండి వచ్చినవారుగాచెప్పుకొందురు ఆంధ్రవైశ్యులు పెనుగొండనగరమును చెప్పుకొందురు అమరసెట్టి పెనుగొండ శాసనమడనగా ఈ యర్థమునే గ్రహించవలెను వాస్తవమునకు అమరిసెట్టి పూర్వులు కృష్ణాతటాకము తురుకేశ్వరమునుండి వచ్చినవారుగా కన్పింతురు ఈతని పూర్వులు తురుకేశ్వర మహాదేవ శ్రీపాద పద్మారాధకులని చెప్పబడినది వీరిది సూర్యకోటి గోత్రము

మందర గ్రామము కృష్ణవేణీనదీ తీరస్థమనియు దొడ్డి కంద్రవాటివాడులోనిదనియు శాసనము నుడువుచున్నది

కృష్ణకు దక్షిణమగుటచే దీనినిదొడ్డికంద్రవాడు అని యందురు ప్రకృత శాసనకాలమునందు కాకతిరుద్రమదేవి ఆంధ్రదేశా ధీశ్వరురాలు ఈ మందర గ్రామము ఆంధ్రదేశ చరిత్రయందు అసాధారణ ప్రాధాన్యముగల ప్రాచీనగ్రామము ఎందుచేత నవగా రుద్రమదేవియు ఆమె త ండ్రి గణపతిదేవుడును ఇచ్చట ఒక గొప్ప గోళకీమఠమును స్థాపి చిరి దీని ప్రశంస మల్కాపుర శాసనమునందు (క్రీ శ 1261) సవిస్తరముగా కాన్పించును (చూడు కాకతీయసంచిక అనుబంధము పుటలు 71 81) గణపదేవచక్రవర్తి రాజగురువగు విశ్వేశ్వరశంభువు ఇచ్చట గోళకీమఠమును నెలకొల్పగా చక్రవర్తి దీనపోషణకై మందర గ్రామమును సమర్పించెను చక్రవర్తి యను మతితో ఆతనికుమార్తెయగు రుద్రమదేవి వెలగపూడి గ్రామమును కృష్ణలోవిలంకను దానముచేసెను మల్కాపుర శాసనము నందును మందరగ్రామము వెలనాడులోని కంద్రవాటిలో ఉన్నదని చెప్పనైనది ఇదియు కృష్ణాతీరము మందడము కృష్ణకు దక్షిణమున ఉన్నది దీనిసమీపమందు వెలగపూడి తాడేపూడి పెనుమాక మొదలైన గ్రామములు కలవు

వైశ్యపుంగవుడైన అమరిసెట్టి అదృష్టశాలిగా కన్పించుచున్నాడు మహా ప్రభచక్రవర్తులైన కాకతీయుల దానములతో ప్రసిద్ధి కెక్కిన మందరగ్రామమునందు తాను ధర్మశాసనము వేయించి కీర్తిగడించినాడు

ఆం ఆ రం

**అమరుడు :** చూ అనుమాలు

**అమరేంద్రుడు** చూ అమరేశ్వరుడు-చిన్నపూడి

## అమరేశమంత్రి

ఇతడు పి గళివంశీయుడు గౌతమగోత్రుడు ఆపస్తంబ సూత్రుడు యాజుషశాఖాధీతి అనులాంబా సూర్యనార్యుల తనయుడు ప్రఖ్యాతాంధ్ర కవీశ్వరుడైన పింగళి సూరన్నను క న్న అదృష్టవంతుడు ఇతనిభార్య అంబమ్మ అమరేశమంత్రికి సూరన అమరయ్య ఎర్రన అనువారలు పుత్రులు వారిలో వీరన కాశి గయ ప్రయాగ శ్రీగిరి గంగాద్వారం నీలచాలం (జగన్నాథం) ఉజ్జయిని ద్వారక అయోధ్య మధుర మొదలైన పుణ్యస్థలములందు తండ్రికి తర్పణక్రియలొనరించి పుణ్యలోకప్రాప్తి కావించి కృత కృత్యుడైనాడు సూరనయు పితృభక్తియందు శ్రీరాము గాంగేయులతో పోల్చదగినవాడు అతడు తండ్రిని పరమ పూజ్యునిగా గురువుగా దలచినాడు తమ్ముడు ఎర్రన తండ్రికి పరలోకమందతయ్యె పుణ్యఫలము చేకూర్చగా సూరన ఇహమునందే తండ్రికి అక్షయకీర్తి వైభవాదివృద్ధియగునట్లుగా (ప్ర ప్ర 1-51) తన ప్రభావతీ ప్రద్యుమ్నము నంకితమొనర్చి శాశ్వతకీర్తిని ప్రతిష్ఠి చినాడు హరివంశ కథాశ్రయమును శ్రీకృష్ణ పుత్రగుణస్తవాంకితమును నైనది ప్రభావతీ ప్రద్యుమ్నము సూరన కన్నకావ్య సంతానములో కడగొట్టుబిడ్డ ప్రభావతీ ప్రద్యుమ్నము మనమీనాడు వేనోళ్ళ శ్లాఘి చుచున్న కళాపూర్ణోదయముపై సూరన కసలు ప్రీతియే లేదట దానికారణ మాతనితండ్రి గుణకీర్తనము అందు లేకపోవుటయే ఈవిషయమును కవియే స్వయముగా తెల్పియున్నాడు(1 6)

పింగళివారిలో గౌతమ గోత్రజులే కాక భారద్వాజ గోత్రమువారు కూడకలరు సర్వేశ్వర మహాత్మ్యంబను లోకచరిత్ర)కై శ్రీనవమత ప్రబంధమును రచియి చిన పి గళిఎల్లకవి భారద్వాజ గోత్రుడు

ఎంగళి యనుగ్రామము పల్నాడుతాలూకాలో ఉన్నది ఇది నేడు పిన్నలిగా వ్యవహరింపబడుచున్నది గు టూరు-మాచెర్ల రైలుమార్గమున నున్న తుమ్మలచెరువు రైలు స్టేషనుకు మూడుమైళ్ళదూరమున ఇది కలదు ఎంగళివారి మూలపురుషుడైన గోకనామాత్యుడిచ్చట భోగక్షేత్రస్వామ్య సమాగతి పింగళిపురాంకుడై యొప్పె నట ఇది సూరన చెప్పినట్లు కృష్ణ తెలంకుల"మున్నది అప్పకవి ఈయూర దక్షిణదిశ నున్న గోపదేవుని స్తుతించియున్నాడు (అప్ప 1-101) ఇచ్చట శివాలయము నేటికిని కలదు

ఎంగళివారి వంశమునకు మూలపురుషుడు గోకనామాత్యుడు ఇతడు పేకి యను గంధర్వస్త్రీని దాసిగా విలు కొనెనట(1-14) ఈపింగళివారి పేకినిగూర్చిన అద్భుతకథలను గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారికవిజీవితములందును కందుకూరి వీరేశలింగం పంతులుగారి "ఆ ధ్ర కవుల చరిత్ర" (ద్వితీయభాగము) యందును చూడనగును

మూలపురుషుడైన గోకనభార్య సంతానము కొరకు సూర్యుని ప్రార్థించెను సూర్యుడామెకు ప్రత్యక్షమై యొక దొండచెట్టిచ్చి దానిని ప్రోదిచేసికొన్నచో దొ డపాదులలోతె శాఖోపశాఖలుగా పుత్రపౌత్రాది బహుపరంపరలు కలుగునని

చెప్పెను అది మొదలు పింగళివారి వంశము నేటికిని అభివృద్ధి చెందుచునే యున్నది సూర్యపరివార దేవతలలో పింగళ లోకడు కలడు ఎంగళివారింటిపేరు ఈ పరివార దేవుని పేరు వలన నేర్పడినదేమో? తెనుగున పింగళి యను పదమునకు "వెనుక యని అర్థము

అమరేశమంత్రి శైవుడు శ్రీమద్రామేంద్ర గురువంశ శశియైన సోమనారాధ్యుని కృపవలన శివభక్తి శోభితుడయ్యెను శంభుపదాచలిత విచారుడు శివతత్త్వకథా మీమాంసుడు ప్రమథపతిసుభక్తుడు అను విశేషణములను సూరన తన కావ్యమున వాడియుండుటచే అమరనామాత్యుడు శైవుడని నిశ్చయింపవచ్చును అమరేశమంత్రి బ్రహ్మవిద్యామరక్తుడు తత్త్వకోవిదుడు అపరహంసుడు శమదమగుణనిష్ఠుడు సద్వైశ్వానర్యోదయబోధ ముఖ్యుడు వైదిక సమాచారుడనియు శ్రౌతస్మార్తప్రథామవర్తను డనియు సూరన తనతండ్రిని స్తుతించుటచే అమరేశమంత్రి వైదిక నిష్ఠాగరిష్ఠుడని చెప్ప వచ్చును

బహునృపకృతోపచారుడు (1-14) భూనాథ స్థాన విధేయవర్తను (4-168) డయిన అమరనామాత్యుడు రాజ గౌరవము పొంది విడుమానూరు కృష్ణరాయ సముద్రము, అను గ్రామములను అగ్రహారములుగా గ్రహించెను (1 45) విడుమామూరు కృష్ణామండలమున బెజవాడకు సమీపమున ఉన్నది కృష్ణరాయ సముద్రమెచ్చట మారురూపముతో నున్నదో తెలియుటలేదు కృష్ణరాయ సముద్రము అని స్పష్టముగా తెలియుటచే కృష్ణదేవరాయలవారిచే ఈతడగ్రహారమును దానముగ పరిగ్రహించియుండును

వి శ నం

## అమరేశుడు చూ అమరేశ్వరుడు-చిమ్మపూడి

## అమరేశ్వరుడు

అమరేశ్వరుడు ఒక కరణము మల్లపరాజు కుమారుడు ఇతడు చాగిదోరయరాజుల చెంత ప్రధానిగ ఉండెను త్రిపురాంతకేశ్వరునకు నిత్యము అఖండదీపమునకై ఇతడు ఆజ్యమునకై ఇరువది అయిదు ఆవులను దానమొసగెను దక్షిణ హిందూశాసనములందు ఈతని గూర్చి కనవచ్చుచున్నది (ద హిం X నెం 307, ఈశాసనము త్రిపురాంతకేశ్వరుని ఆలయమున దళి ఉత్తరపుగోడపై ఉన్నది త్రిపురాంతకమున ఈ ఆలయము కలదు త్రిపురాంతకము నేటి ఒంగోలుజిల్లా మార్కాపురము తాలూకాలో ఉన్నది ఈశాసనముశక 1168 (క్రీ శ 1246) నాటిది

*శాసన సారాంశము*

స్వస్తిశ్రీ శుభ శక వరుషంబులు ౧౧౬౮ (1168) గు నేంటి పరాభవ సంవత్సర చైత్రశు ౬ (షష్ఠి) ఆదివారము విష్ణువు సంక్రాంతినాడు శ్రీ త్రిపురాంతక శ్రీమహాదేవరకు శ్రీమన్మహామండలేశ్వర చాగిదోరయ రాజుల ప్రధాని కరణము మల్లపరాజుకొడుకు అమరేశ్వరుండు తమ తల్లి దండ్రులకు ధర్మువుగా అఖండదీపమునకిచ్చిన మొదవులు ౨౫ (౨౫)

ఈశాసనాధారముగా ఆనాటి చారిత్రకాంశములు కొన్ని పొందుపరుపబడుచున్నవి శాసనమున కనవచ్చు చాగి వారు ఆంధ్రదేశమునుపాలించిన మాండలిక ప్రభువులలో ఒకరు వేంగిదేశమును పాలించిన రాజరాజనరేంద్రుని కుమారుడు కులోత్తుంగ చోడుడు ఈయన మాతామహుడు రాజేంద్ర చోళుడు బాల్యమునుండియు కులోత్తుంగుడు మాతామహ స్థానమున అనగా చోళరాజ్యమున నివసించుటచే ఈతనికి చోళరాజ్యమునందే ప్రేమ మిక్కుటమయ్యెను రాజరాజ నరేంద్రుని మరణానంతరము క్రీ శ 1070 లో కులోత్తుంగ చోడునకు వేంగిరాజ్యముతోపాటు మాతామహునిది యగు చోళరాజ్యముకూడ సంక్రమించెను ఈ వేంగి చోళరాజ్యములు రెండింటికి కులోత్తుంగచోడుడే ప్రభువు అయ్యెను ఇతడు చోళరాజ్యమున ఏలికగా నుండి తనకు ప్రతినిధులనుగా తనకుమారులను వేంగిదేశమునకు పంపుచుండెను తనసుతులకు సాయ మొనర్చుటకై తనకు విశ్వాసపాత్రులైన భృత్య వంశీయులకు రాజచిహ్నముల నొసగి వేంగిదేశమును కొన్ని మండలములుగా విభజించి ఆయామండలములకు వారిని పాలకులుగ నొనర్చెను ఈ భృత్య వంశీయులైన పాలకులకే మాండలికులు అని పేరు ఈ మాండలికులు చాళుక్య చోళ మహారాజులైన కులోత్తుంగ చోడునకు సామంతులై విధేయతతో మండల పాలనమును నెరపుచుండిరి మాండలికులలో పూర్వాంధ్రదేశమును మొత్తమును పాలించిన ఖ్యాతి వెలనాటి ప్రభువులకేదక్కినది ఇట్లు శ 1173 నాటికి చాళుక్య చోళ చక్రవర్తి రెండవరాజరాజు మరణించెను అంతటితో మాండలిక ప్రభువులైన వెలనాటివారు స్వతంత్రప్రతిపత్తితో రాజ్యము పాలింపదొడగిరి వారినిచూచి తక్కిన మాండలిక మహారాజులుకూడ స్వతంత్రపు బావుటాను ఎగురవేసిరి ఇట్టి

మాండలికులలో చాగివారు కోటవారు హైహయులు తెలుగు చోళులు తెలుగు నాయకులు కమ్మ నాయకులు మున్నగువా రెందరో కలరు వీర దరు ఈనాడు స్వతంత్రులై తమ తమ మండలములను పాలించుకొనుచుండిరి ఇట్టివారిలో ఒకరగు చాగివారు విజయవాడ గుడిమెట్టలు రాజధానులుగా చేసికొని ఆంధ్రదేశములో కొంతభాగము పాలించిరి గుడిమెట్ట అను గ్రామము నేటి ఒంగోలుజిల్లా గిద్దలూరు తాలూకాలో ఉన్నది 1961 నాటిలెక్కననుసరించి ఈగ్రామము మూడువేలపైన జనాభా కలిగియున్నది ఇట్టి మాండలిక ప్రభువైన చాగిదొరయరాజు నొద్ద అమరేశ్వరుడు ప్రధానిగ నుండెను అమరేశ్వరుడు తన తల్లిదండ్రుల పుణ్యమునకై అఖండదీపారాధనమొనర్చెను దీపమునకు వలసిన నేతికై 25 ఆవులను దానమొసగెను ఇది త్రిపురాంతకేశ్వరునకు జరుపవలసిన నిత్యము విధానమై యున్నది

మాండలికులు ఆంధ్ర దేశమును చిన్ని చిన్ని మండలములుగ చేసికొని పాలించుచు ప్రజలలో దైవభక్తిని పావిత్రిని ధర్మానురక్తిని పెంపొందించిరి రాజరాజనరేంద్రుడు తెలుగును గౌరవించి నన్నయచే మహాభారతమును కొంత వరకు ఆంధ్రీకరింపజేసెను కాని ఆయనకుమారుడైన కులోత్తుంగ చోడుడు తెలుగును గౌరవింపలేదు అతడు తమిళ దేశమున వసించుటచే తమిళమునే గౌరవించి అందు కావ్యములను వెలయింపచేసెను వేంగి దేశమున ఆనాడు తెలుగు కవిత నిరాశ్రయయైనది మాండలికులు తెలుగు కవితకు ఆశ్రయ మిచ్చినారని చెప్పవచ్చును మాండలికుల శాసనములలో తెలుగుపద్యములు హృద్యములుగ కనవచ్చుచున్నవి నన్నెచోడ మహాకవి ఆనాటి పాకనాటి తెలుగు చోళుడే అతడు కుమారసంభవమను మహాకావ్యమును తెనుగు పద్యములలో వ్రాసెను మాండలిక ప్రభువులు దేవాలయాదులకు దాన ధర్మములొసగి వాని వివరములను తెలుగు పద్యములతో శాసనములపై వ్రాయించిరి ఆనాటి ప్రజలు శివకేశవులయందు అభేద బుద్ధితో ఉండిరి అయినను ఆనాటి పాలకులు శైవము నందే కొంత మొగ్గుచూపినట్లు కనవచ్చుచున్నది ప్రజలు మరణించిన స్వీయుల జ్ఞాపకార్థము దేవాలయములను నెలకొలిపిరి దాన ధర్మములను ఒనర్చిరి శాసనములు వేయించుచుండిరి నాయకులు ప్రజలు మున్నగు వారిలో ఇట్టి ధర్మాచరణాసక్తియు పురాణశ్రవణాసక్తియు మిన్నగ ఉండెను ఆనాటి రాజులు ప్రధానులు ప్రజలు దేవాలయాదులను నిర్మించి అందు స్వామిని ప్రతిష్ఠించి ఆ స్వామికి నిత్య నైవేద్య అంగరంగ ధూప దీపాది అర్చనములకై భూమిని ఆరామములను మొదవులను గొఱియలను దానముచేయుచుండిరి దేవాలయములలో కైంకర్యము చేయుటకై సాని మాని నిబంధన కారులను దారినాయకములను ఏర్పాటు చేసియు అట్టి వారివృత్తులకై మాన్యక్షేత్రముల నొసగియు నాయకులు ప్రజలు తమలోని భక్తి భావమును ప్రకటించుకొనుచుండిరి పర్వదివసములందు స్వామి సన్నిధిలో అఖండ దీపదానము చేయుట మిక్కిలిపుణ్యప్రదమని ప్రజలు విశ్వసించుచుండిరి ఈ పుణ్యకార్యములను రాజోద్యోగులు సపన్నులు గుత్తకాండ్రు మిక్కుటముగా ఆచరించుచుండినట్లు తెలియుచున్నది నేడు మనకు కనవచ్చు తెనుగు లిపికి ఆనాడు శాసనములో ప్రారంభస్థితిలో నున్న శాస లిపి మూలము

భగవంతునిపై ఇట్లు భక్తి ప్రపత్తులను చూపిన మహానీయుడె అమరేశ్వరుడు త్రిపురాంతకేశ్వరస్వామి మహామహిమోపేతుడు త్రిపురాంతకము శ్రీశైలమునకు తూర్పు ద్వారము ఈ దేవాలయమున అనేక శాసనములున్నవి

తం ఆం శా

## అమరేశ్వరుడు – చిమ్మపూడి

పూర్వాంధ్రకవులచే స్తుతింపబడిన కవీశ్వరులలో చిమ్మపూడి అమరేశ్వరుడొకడు ఇతడు రచించిన గ్రంథము విక్రమసేనమని సంధాన గ్రంథములవలనను లక్షణ గ్రంథముల వలనను తెలియుచున్నది కాని ఈతనిగ్రంథము పూర్తిగ లభ్యపడదయ్యెను

క్రీడాభిరామమున ఇతనిపేరు నన్నయభట్టన్నను తిక్క కవినాయకుడన్నను చిమ్మపూడి యమరాధిపుడన్నను సత్కవీశ్వరులు తమ వెన్నుదుట కరాంజలులు నింతురన్నరీతి తొలుత వినబడుచున్నది క్రీడాభిరామము రావిపాటి త్రిపురాంతకుని సంస్కృత ప్రేమాభిరామమున కాంధ్రీకరణమని యందే చెప్పబడుటచే ఈ కవి రావిపాటి తిప్పన కించుక పూర్వుడో సమకాలికుడో అగును తిప్పన కాకతి ప్రతాపరుద్రునికాలము వాడని కొందరును అనవేమారెడ్డి కాలమువాడని మరికొందరును తెల్పియున్నారు ఏదియెట్లున్నను తిప్పన క్రీ శ 14 వ

శతాబ్దిలో ఉత్తరార్థమున ఉండియుండును అమరేశ్వరుడు పూర్వార్థమున వెలసి విక్రమసేనమును రచియించియుండును క్రీ శ 16వ శతాబ్దమువాడని పరిశోధకులచే ఊహింపబడు పెదపాటి జగ్గన విక్రమసేనమునుండి పద్యములను గైకొని తన ప్రబంధ రత్నాకరమున కూర్చి యున్నాడు ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున గల ఉదాహరణ పద్యములు అను సంకలన గ్రంథమున అమరేశ్వరుని పద్యములు కలవు ఈ రెంటిని సంధానించి వేటూరి ప్రభాకరశాస్త్రి గారు ప్రబంధరత్నావళిని కూర్చి వెలయించిరి ఇందు 58 పద్యములు కలవు ఇవి అకారాదిగా కూర్చబడి యున్నవి కాని ఇవియన్నియు అమరేశ్వరునివి అని నొక్కివక్కాణించుట కష్టము నన్నెచోడుని కుమారసంభవము మండియు పోతన భాగవతమునుండియు చేరిన పద్యములివి మన్నవి

ఉన్న పద్యసంగ్రహమును అనుక్రమముగా శీలారూపాన్ని (శ్రీ) ఆరుద్ర ( సమగ్రాంధ్ర సాహిత్యం III - పుటలు 100 183) ప్రకటించినారు ఇందు శివస్తుతి షణ్ముఖస్తుతి మన్మథస్తుతి సంస్కృత విస్తృతి కనబడుచున్నవి కథారంభము ఉజ్జయినీ పురవర్ణనముతో ప్రారంభమగుచున్నది కథానాయకుడు విక్రమసేనుడని మరియొక పద్యముచెప్పుచున్నది చెదురు మదురుగానున్న పద్యాలను బట్టి కవితాప్రతిభ నిర్ణయించుట కష్టము భట్టుమూర్తి అమరేశ్వరుని ప్రతిభను "సహస్ర ముఖదృష్టి" యని శ్లాఘతో చెప్పినాడు అనగర నృసింహకవి (క్రీ శ 1860) వచ ప్రసాద ప్రసిద్ధునిం జిమ్మపూడి కులశేఖరునయ్యమరేశసత్కవిన్ "కవిస్తుతి చేసియున్నాడు బహుశః వీరిద్దరును విక్రమసేనము చదివి ఆనందించియుందురు

వి శ నం

అమలప్రభుడు చూ అమలరాజు

## అమలరాజు

ఈతని ప్రసక్తి పూసపాటి తమ్మభూపాలుని శ్రీ కృష్ణ విజయ కావ్యమునందు కలదు (శ్రీ కృ 1-100) పదమూడు పదునాలు శతాబ్దములలో ఆంధ్రదేశపు రాజకీయ ములందు ప్రముఖపాత్ర వహించిన వంశములలో పూసపాటివారి వంశమొకటి వీరిది వశిష్ఠగోత్రము వీరు క్షత్రియ వంశ్యులు వాఙ్మయాధారములను బట్టి వీరిలో అమలరాజు మొదలుకొని పదితరముల పురుషుల చరిత్రయు ఆధునిక కాలములో మరి కొందరిచరిత్రయు తెలిసికొనుటకు అవకాశము కలుగుచున్నది రాజకీయచరిత్ర కెంత ప్రాధాన్యము కలదో అంతటి ప్రాముఖ్యము వీరి సాహితీపోషణమునకుగూడా కలదు అమలరాజు మొదలుకొని వీరిలో పెక్కురు కృతిపతులుగనో లేక కృతికర్తలుగనో వరలియుండిరి

పూసపాటివారి కాలములో వెలువడిన తెలుగుకావ్యములలో (1) శ్రీకృష్ణ విజయము (2) ఉషాభ్యుదయము (3) విష్ణుభక్తి సుధాకరము (4) వేంకటాచల మాహాత్మ్యము (5) రసభూపాలరాజీయము (6, వశిష్ఠగోత్ర క్షత్రియులను గూర్చి తెలుపు 58 చరణముల సీసమాలిక ప్రధానమైనవి ఈకావ్యములన్నింటియందును అమలరాజు మొదలుకొనియే వీరి వంశక్రమ వర్ణనము కనిపించుచున్నది అమలరాజు మొదలుకొని ఈ వంశములోనివారికందరికి పూసపాటి వారను గృహనామము ఏర్పడిన వివరము ఈ క్రింది సీసపాదముల వలన తెలియుచున్నది

వసుదిగింద్రియ వత్సర బుల జయ
 వాటికాదుర్గ వైభవముం గాంచె
గగనవాణీవాక్య గౌరవంబునం బూస
 పాటి భూమిని పురీవనము గట్టి
వాసిగా నుటం బూసపాటి వారను నిటి
 పేరు గాంచిరి రాచపెద్దలైన
యమలరాజాదిగా ప్రముఖులు మావారు
 తత్గృహనామముల్ దాల్చుచుండి
 (రాచిరాజు సీసమాలిక)

ఇచట వసుదిగింద్రియ = 8810 1035 శక = క్రీ శ 1166 గా కనిపించును అప్పుడు కాకతీ రుద్రదేవరాజు పాలించుచుండెను తీరాంధ్రదేశమున వెలనాటి చోళుల పరిపాలన సాగుచుండెను

పైన పేర్కొనబడిన గ్రంథము లేవియును నేటివరకు ముద్రణము నొందలేదు అందుచేత ఆదలి చారిత్రకాంశములు ఎవ్వియు వెల్లడికాక ఉన్నవి అమలరాజునకు పూర్వులును అటుతరువాతివారును అగు ఈఅంశమువారు తెలుగు దేశమును పరిపాలించిన మహారాజులకడ సేనాధిపతులుగా ఉండి తమ ప్రతాప విక్రమములను ప్రదర్శించుచు క్రమముగా చిన్నచిన్న ప్రాంతములకు పరిపాలకులైరని తెలియుచున్నది అమలరాజునకు తరువాత రెండవతరములో ఉన్న మొదటి తమ్మిరాజును ఈతని కుమారుడు మొదటి రాచిరాజును విజయనగరమును పాలించిన ప్రౌఢదేవరాయలకడ (క్రీ శ 1418-1448) దండనాయకులుగా ఉండి కొన్ని విజయములను సాధించినట్లు

కొన్ని శాసనములను బట్టియు వాఙ్మయాధారములనుబట్టియు తెలియుచున్నది

ఉదా దిననాథద్యుతి రాచిరాజు రణధాత్రిం దామెరాధీశు తి
మ్మననోడించెఁ జళుక్య వీరఘనరాజ్యస్థాపనాచార్యతన్
గనియెన్ మ్లేచ్ఛుల గెల్చి తద్వివిధదుర్గగ్రాహియై ప్రౌఢదే
వ నృపాదిప్రభుశాసన ప్రథిత దీవ్యద్విక్రమప్రౌఢిచేన్
(విష్ణుభక్తి సుధాకరము)

మొదటి రాచిరాజు తనయుడైన రెండవ తమ్మిరాజు కపిలేశ్వర గజపతినాశ్రయించి కొండవీడు మొదలగు దుర్గములను పాలించినట్లు తెలియుచున్నది ఈతడే రెండవ తమ్మిరాజు తెలంగాణమునేలు రాచకొండ మూడవ సర్వజ్ఞసింగభూపాలుని పరాజితునిగావించెననియు సింగభూపతి రాజ్యము ఆ సమయమునందే కూలినదనియు తెలియుచున్నది

త్రిభువనీరాయ బిరుద ప్రదీప్తరావు
సింగన జయిచె బెన వీటిచెంత బోదలి
కలన శరణన్న కావోదిభామగాఁచె
రాచభూపాలు తమ్మిధరావరుండు
(శ్రీకృష్ణవిజయము 1 117)

నవభారతాఖ్యాత మను కావ్యమునకు నాయకుడైన రాచిరాజు రెండవతమ్మభూపతికుమారుడు ఈతడే వశిష్ఠగోత్ర క్షత్రియుల వంశచరిత్రను తెలుపు 56 చరణముల సీసమాలికను రచించినవాడు ఈరాచిరాజు కొండవీటి దుర్గమును పాలిచుచుండగా క్రీ శ 1515 లో శ్రీకృష్ణదేవరాయలు ఆదుర్గము నాక్రమించి అందున్న వీరభద్ర జగపతితోపాటు రాచిరాజును జీవగ్రాహముగా పట్టుకొనెను తరువాత పరిణామములలో రాయలు వీరభద్రగజపతి కుమార్తెను వివాహమాడగా అంతకు పూర్వమే గజపతి ప్రథమపుత్రికను రాచిరాజు తనయుడైన మూడవతమ్మభూపాలుడు వివాహమాడియున్నందున వీరిరువురును తోడియల్లుండ్రైరి

రాచిరాజు జీవగ్రహముగా కొనిపోబడినప్పుడు ఈతని యధికారమునమున్న కేతవరదుర్గప్రాంతము వీరివంశములోనివాడైన రామయదేవరాజునకు ఒసంగబడినట్లు తెలియుచున్నది మొత్తముమీద అప్పటిరాజకీయ పరిస్థితులనుబట్టి వీరిలో కొందరు విజయనగరసామ్రాజ్యమునను మరికొందరు జగపతులకడను ఉండి ప్రసిద్ధులైరి




శేష

## అమలాపురము

తూర్పుగోదావరి జిల్లా అమలాపురం తాలూకాలో అమలాపురము ఉన్నది దీని పూర్వపు పేరు అమ్లికాపురము ఇది కోనసీమకు మకుటాయమైనది తూర్పున కామనగరువు పడమట ఈదరపల్లి ఉత్తరమున వేమవరము దక్షిణమున పేరూరు ఈగ్రామమునకు సరిహద్దులు

1991 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఈగ్రామములో పురుషులు 11 798 మంది స్త్రీలు 12 265 మంది – వెరసి 24063 మందికలరు వీరిలో షెడ్యూలు జాతులవారు షెడ్యూలు తరగతులవారు 2585 మంది ఇచ్చట ఇండ్లు గుంపుగాను, వాడలుగాను ఉన్నవి వీటిలో 2 500 పెంకుటిండ్లు జనులందరు వరిఅన్నమును తిందురు బావినీటిని త్రాగుదురు మంచినీటి ఎద్దడి లేదు

రెండు కాలువలు చెందుకాలువ రెండు చెరువులు ఈ గ్రామమునకు గల నీటివసరులు ఇచ్చట నల్లటిరేగడి భూమి కలదు జనులు వరిపంట పండింతురు మామిడితోటలు కొబ్బరి

తోటలు కలవు 1966 67 సం॥లో పంటలక్రింద 1181 ఎకరముల భూమి ఉపయోగపడెను ఇదియంతయు కాలువక్రింద సాగుబడి అయెను ట్రాక్టరు మొదలైనవి 5 ఉన్నవి 45 ఆయిలు ఇంజనులు గూడను 50 ఎకరములకు నీటిని సరఫరా చేసెను పడ్లను పడవలమీద రాజమండ్రికిని మామిడి కాయలను బండారులంకకు రవాణాచేసెదరు

ఈ గ్రామమున 750 గేదెలు 500 ఆవులు 800 ఎడ్లు 9 గుర్రములు 70 మేకలు 50 గొర్రెలు 65 పందులు 1268 కోళ్ళు ఉన్నవి దినమునకు 1000 లీటర్ల పాలు 550 కి గ్రా నెయ్యి సాలీనా 8 టన్నుల చేపలు గ్రామస్థులు ఉపయోగించుకొని 400 లీటర్ల పాలు 140 కి గ్రా నెయ్యి పేరూరునకును 2 టన్నుల చేపలు పల్లంకుర్రునకును ఎగుమతి చేసిరి

ఇచటి ప్రజల ముఖ్య జీవనాధారములు వ్యవసాయము కూలి వ్యాపారము దుకాణదారులు కమీషన్ ఏజంట్లు ఉన్నారు ట్యాంకులు టాంగాలు టాక్సీలు ఎద్దుబండ్లు నడుపువారు కలరు కంసాలులు వడ్రంగులు కమ్మరులు తాపీ పనివారు మంగలివారు చాకలివారు కలరు 4 ధాన్యపు మరలు దినమునకు 400 బస్తాల బియ్యమును తయారుచేయును వ్యవసాయదారులకు కూలీలు దొరకుదురు దినమునకు రు 3/-లు కూలి రేటు ఉన్నది

వెంకటేశ్వరస్వామికి మల్లేశ్వరస్వామికి చెన్నకేశవస్వామికి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి చంద్రమౌళీశ్వరస్వామికి విఘ్నేశ్వరస్వామికి రామస్వామికి చెందిన ఆలయములుకలవు. ముత్యాలమ్మ బంగారుపాప గణికమ్మల గుడులు ఉన్నవి రెండు చర్చిలు రెండు మసీదులు ఈ గ్రామమున ఉన్నవి వెంకటేశ్వరస్వామివారికిసాలీనారాబడి రు2000నుండి రు3000 వరకు కలదు మల్లేశ్వరస్వామికి 50 ఎకరముల ఈనాం భూమియు చెన్నకేశ్వరస్వామికి 30 ఎకరముల భూమియు గలదు చెన్నకేశ్వరస్వామి కల్యాణము ఫాల్గున ఏకాదశినుండి ఐదుదినములు జరుగును వేంకటేశ్వరస్వామివారి కల్యాణము చైత్ర శుద్ధ దశమినుండి 5 దినములు జరుగును ఆ సమయమున బుర్రకథలు హరికథలు జరుగును. వైశాఖ శుద్ధ ఏకాదశి నుండి 5 దినములు మల్లేశ్వరస్వామి కల్యాణముజరుగును సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కల్యాణము జరుగును సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కల్యాణము మార్గశిర శుద్ధ షష్ఠినుండి 5 దినములు జరుగును చైత్ర శుద్ధ నవమినుండి శ్రీరామనవమి ఉత్సవములు 5 దినములు జరుగును చైత్ర శుద్ధ పాడ్యమినాడు ముత్యాలమ్మ జాతర జరుగును చంద్రమౌళీశ్వరస్వామి పండుగ మాఘ బహుళ అమావాస్యనాడును భాద్రపద శుద్ధ చవితి నాడు గణపతి పండుగయు జరుగును

అమలాపురము కు 33 మైళ్ళ దూరములో రాజమండ్రి రైల్వేస్టేషను ఉన్నది కాలువద్వారా ధాన్యమును రాజమండ్రికిని కొబ్బరికాయలను విజయవాడకును ఎగుమతి చేయుదురు నూనెలు యంత్రభాగములు విజయవాడ నుండి ఇచటికి దిగుమతి అగును జనుల రాకపోకలు లాంచిపై రాజమండ్రి నుండి అమలాపురము కు జరుగును ప్రయివేటు బసులు ముక్తేశ్వరం నుండి బొబ్బర్లంక కొనసీమ రాజోలు కును మురమళ్ళను డి చెయ్యేరు పనమూరు లంకకును కొమరగిరి పట్నము వకును ముక్తేశ్వరమునుండి కాకినాడకును రాజమండ్రి ని పశ్చిమపేట వల్లిను డి కాకినాడకును రాజమండ్రికిని పోవును ప్రభుత్వపు బసులు అమలాపురమును డి తిరుపతికిని హైదరాబాదు కును పోవును ఇచట సిమెంటురోడ్లు కంకరరోడ్లు కచ్చారోడ్లు మట్టిరోడు కలవు అమలాపురమును సిమెంటు రోడ్లు కంకరరోడ్లు పొరుగు గ్రామములతో కలుపుచున్నవి 9 గుర్రపుబండ్లు 177 రిక్షాలు 12 టాక్సీలు 15 మోటారు కార్లు 84 ఒంటెద్దుబండ్లు 56 రెండెడ్లబండ్లు 1560 సైకిళ్లు ప్రయాణము కు ఉపయోగపడుచున్నవి

అమలాపురంలో హెడ్ పోస్టాఫీసు తంతికార్యాలయము జిల్లాపరిషత్తు హయ్యర్ సెకండరీస్కూలు ఎస్ కె బి ఆర్ కాలేజీ ఉన్నవి ఈదరపల్లినుండి నడవపల్లి నుండి ఇచ్చటి హయ్యర్ సెకండరీస్కూల్ లో చదువుకొనుటకు విద్యార్థులు వత్తురు ఇచ్చటి కళాశాల చదువులకు విద్యార్థులు కోనసీమ యొక్క వివిధప్రాంతములనుండి వత్తురు ఇచటి విద్యుచ్ఛక్తిని 2000 ఇండ్లు వీధి దీపములు రంపపుకోత మిల్లులు సినిమా థియేటరులు వడ్లమరలు వాడుకొనును ఇది మునిసిపాలిటీ పరిపాలనలో ఉన్నది

మున్సిపాలిటీకి ఆదాయము లాండుసెస్సులు గవర్నమెంటు బస్సుల లైసెన్సులు మొదలయిన వాటివలన చేకూరును గ్రామ పారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లు ఉన్నవి. పార్కులు రేడియో లౌడ్ స్పీకర్లు ఒక నాటకశాల సినిమా థియేటర్లు 4 సత్రములు కలవు ఇచట కోర్టులు ఒక పోలీసు

స్టేషను ఒక తాలూకా కచేరి 8 కోఆపరేటివ్ బ్యాంకులు ఒక ఆంధ్రాబ్యాంకు ఒక స్టేటుబ్యాంకు ఒక అర్బన్ బ్యాంకు ఉన్నవి జనరల్ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి కలవు 25మంది ఇంగ్లీషువైద్యులు 15మంది ఆయుర్వేదవైద్యులు 10మంది హోమియోపతి వైద్యులు ఇక్కడ కలరు నిత్యావసరవస్తువులన్నియు ఈ గ్రామమున ఎల్లప్పుడు దొరుకును వారమున కొకమారు సంత కలదు కూరగాయలు మాంసము చేపలు దొరుకును 88 సోడా కిళ్ళీ సిగరెట్టు దుకాణములు 45 కిరాణాదుకాణములు 36 కాఫీహోటళ్లు 24 సైకిళ్ళషాపులు 60 తోపుశాలలు 20 లాండ్రీలు 05 బట్టలషాపులు మందుల షాపులు ఫాన్సీషాపులు మొదలయినవి కలవు

అమలాపుర ద్రుపదరాజు పాలించిన పాంచాలదేశమని అందురు 15వ శతాబ్దమున కోనవ క్షత్రియులు ఈప్రాంతమును పాలించుటచే దీనికి కోనసీమయని పేరువచ్చినది 16వ 17వ శతాబ్దములలో మహమ్మదీయు లీప్రాంతమును పాలించిరి అంతవరకు ఇది ప్రసిద్ధిచెందుటచే దీనిని అమీపురమనిరి కాలక్రమముగా ఈ పేరు అమలాపురముగా మారినది

గొప్ప దాతయగు కీ॥ శే॥ నడింపల్లి సుబ్బరాజుగారు ఈ గ్రామస్థులే

మూర్తి

అమలాపురముతాలూకా

అమలాపురము తాలూకా తూర్పుగోదావరి జిల్లాలో కలదు ఇది సముద్రతీరమునఉన్న తాలూకాలలో ఒకటి ఇది త్రిభుజాకారముగ ఉన్నది ఉత్తరమున గౌతమీ గోదావరి దక్షిణమున సముద్రము త్రిభుజములలో రెండు భుజములుగ ఉన్నవి పశ్చిమమున చివరిదశలో దక్షిణాభిముఖముగా తిరిగిన వైనతేయము (గోదావరిశాఖ) రాజోలు తాలూకా ఉత్తరభాగములో నగభాగము మూడవభుజముగా ఉన్నవి భారత ప్రామాణికకాలపు 82 తూర్పు రేఖాంశము ఇంచుమించుగా ఈతాలూకాగుండా పోవుచున్నది

అమలాపురము తాలూకా గోదావరి మధ్య డెల్టా ప్రాంతములోని భాగము కోనసీమగా ప్రసిద్ధిచెందిన సారవంతమైన ప్రాంతములో ఇది యొకభాగము ఈ తాలూకా మొత్తము విస్తీర్ణము 808 చ మైళ్లు 1961 జనాభాలెక్కల ప్రకారము ఈతాలూకాలోని మొత్తముజనసంఖ్య 56 676 ఈతాలూకాలోని గ్రామములు 108 ఇందు ఒకగ్రామము జననివాస రహితముగాఉన్నట్లు చెప్పబడినది ఈతాలూకాలో ఇండ్లు 65 116 జనసాంద్రత చదరపు మైలుకు 1010 జిల్లాలో జనసాంద్రత ఎక్కువగా ఉన్న తాలూకాలలో ఇదియొకటి ఈ తాలూకాలో రెండు పట్టణములుఉన్నవి జిల్లాస్థానము కాకినాడ

నైసర్గికముగా ఈతాలూకా మొత్తము ఒకసువిశాలమైన పల్లపుమైదానము ఈతాలూకాలో కొంతభాగము డెల్టాప్రాంతము ఇచ్చటినేలను రెండురకములుగా విభజింపవచ్చును ఒకటి ఒండ్రుమట్టినేల ఇదితాలూకాలో సుమారుగా 85 శాతముగా ఉన్నది మిగిలినది ఇసుకనేల ఈతాలూకాలోని మొత్తమునేల ఫలవంతమైన ఒండ్రుమట్టి గోదావరి నీటి వసతులు లభించుటవలన ఇది ముఖ్యమైన పంటభూమిగా ఎన్నబడుచున్నది ఇచట వరి ప్రధానమైన ఆహారపుపంట

ఇచ్చట సంవత్సరములో మొదటి నాలుగుమాసములు వర్షములు లేకపోవుటకలదు మేనెలలో నైరృతిఋతుపవనములవలన తొలకరి వర్షము ప్రారంభమగును ఋతుపవన వర్షము జూన్ నెలలో ప్రారంభమై వర్షపాతములో సగము కంటె హెచ్చుభాగము ఆనెలలో నేకురియును తూర్పునగల ఇతర ప్రాంతములయందు కంటె ఈశాన్యఋతుపవనములు ఈజిల్లాలో చాలబలహీనములు ఈఋతుపవనములు ప్రారంభదశలో అత్యతిశయముగానుండి ఎక్కువ వర్షపాతమును కలుగజేసి నవంబరు 15వ నాటికి తగ్గిపోవును ఈశాన్యఋతుపవనములవలన అక్టోబరునెలలో హెచ్చువర్షపాతముకలుగును తూర్పుడెల్టా ప్రాంతములు ఈఋతుపవనములవలన హెచ్చు వర్షమును పొందుచున్నవి ఇచ్చట సగటువర్షపాతము 46 44 అంగుళములు (1965) సంవత్సరము మొత్తముమీద సుమారు 72 దినములు ఇచట వర్షపుదినములు తూర్పుతీరమునగల ముమ్మిడివరము మొదలగు ప్రాంతములలో వర్షపాతము కొంచెము అధికము

ఉష్ణోగ్రత ఏప్రిల్ - మే మాసములలో అత్యధికము (98 6 F)గా ఉండును డిసెంబరు జనవరి మాసములలో అత్యల్పము (66 F)గా ఉండును అధిక అల్ప ఉష్ణోగ్రతల వ్యత్యాసము తూర్పుతీరములు చేరినకొలది తగ్గుచుండును మొత్తముమీద సంవత్సరములో సగటు ఉష్ణోగ్రత 82 4 F


తూర్పుగోదావరి జిల్లా
అమలాపురము తాలూకా
2 0 2 4 6
మైళ్ళు
రామచంద్రాపురము తాలూకా
కాకినాడ తాలూకా
కొత్తపేట తాలూకా
రాజోలు తాలూకా
బంగాళాఖాతము
అమలాపురము
వెయ్యేరు
ఉప్పలగుప్తము
దేవగుప్తము
రాజోలు
82° 00
82° 15
16° 45'
16° 30'
వివరణ పట్టిక
తాలూకా సరిహద్దు
ఇతర రోడ్డుమార్గములు
ఫిర్కా సరిహద్దు
కాలువ
తాలూకా ముఖ్యపట్టణము
అడవి
ఫిర్కా ముఖ్యపట్టణము
నది
జిల్లా రోడ్డుమార్గములు
చెరువు

అమలాపురము తాలూకా భూమిలో చాలభాగము గోదావరి దీని మూలననే సాగు అగుచున్నది గోదావరినది ధవళేశ్వరమువద్ద గౌతమి వశిష్ఠ అను రెండుశాఖలుగా చీలుచున్నవి రామచంద్రపురము కాకినాడ తాలూకాలకు దక్షిణ సరిహద్దుగా గౌతమి ప్రవహించుచు యానామువద్ద ఒక రెండు ముఖాలుగా చీలి సముద్రములో కలియుచున్నది రాజోలు తాలూకాకు పశ్చిమ సరిహద్దుగా వశిష్ఠ ప్రవహించి నరసాపురము సమీపమున అంతర్వేదివద్ద సముద్రములో కలియుచున్నది రాజోలు తాలూకా ఉత్తరభాగములో సగము వైనతేయ గోదావరి ఈతాలూకాకు పశ్చిమపు హద్దుగాఉన్నవి అమలాపురము తాలూకాలో ముఖ్యముగా పోలవరము హైలాండు మధ్యడెల్టా కాలువవలన సాగుకు తేబడినది గోదావరియొక్క మెరిమెల్లపాయ పై అన్నపల్లికగర కట్టుకిరం ఆనకట్టవలన పోలవరము హైలాండుకు నీటిందుపాయములు కలిగినవి గోదావరికి వరదలు ఏర్పడినప్పుడు అమలాపురము రాజోలు తాలూకాలు ఎక్కువనష్టమును పొందుచున్నవి కాని నిక్షేపణ క్రియవలన ఎక్కువ ఒండ్రుమట్టిచేరి నేల మిక్కిలి సారవంతమగుటకును ఎక్కువపంట పండుటకును అవకాశము కల్గుచున్నది కాలువనీటి ఆధారమువలననే పంటలలో సగముకంటె హెచ్చు పంటలు పండుచున్నవి ఇదిగాక నూతులవలన అర్టీషియను నూతులవలన చెరువుల నీటివలనకూడ జనులు పంటలు పండించుకొనుచున్నారు

ఇచ్చట హెచ్చుభాగము ముంతలమైన పల్లపునేల అందుచే పంటలు చాలహెచ్చుగా పండును వరి ఇచ్చటి ప్రధానమైన ఆహారపుపంట ఈ తాలూకా మొత్తము సాగులో ఉన్నది 1 90 000 ఎకరముల మి జుమలె సుమారు 50 000 ఎకరములలో దాలవాపంటను అనగా రెండవ పంటను పండించుచున్నారు నికరముగా 1 40 000 ఎకరముల భూమి సుమారుగా సాగులో ఉన్నది ఇందు ఇంచుమించు 85 000 ఎకరముల భూమిలో వరి సాగుచేయబడుచున్నది కాలువనీరు అందని ప్రాంతములలోను కాలువకట్టపైని రోడ్ల కిరువైపులను ఉన్న ప్రాంతములలోను కొబ్బరితోటలను అధికముగా పెంచుచున్నారు వీటికి నూతినీటిని ఉపయోగింతురు ఆంధ్రప్రదేశములో కోనసీమ కొబ్బరి తోటలకు ప్రధాన కేంద్రము రాష్ట్రపు మొత్తపు కొబ్బరిపంటలో 75 శాతముపైగా ఈ ప్రాంతముననే ఉత్పత్తి జరుగుచున్నది కొబ్బరి వగైరాలక్రింద రమారమి 28 000 ఎకరములు సాగులో ఉన్నది

ఇచ్చటినుండి కొబ్బరికాయలు కుడిడీలు కొబ్బరినూనె వివిధప్రాంతములకు ఎగుమతి చేయుచున్నారు డెల్టా తాలూకాలైన రాజోలు అమలాపురం తాలూకాలలో కొబ్బరితోటల పెంపకము చాల హెచ్చుగా ఉన్నది అమలాపురము తాలూకాలోని కొమరగిరిపట్నం ఎడూరిలంక ఇమకలపూడి అంబాజీపేట పుల్లపూడి ఇందుపల్లి పీచు పరిశ్రమకు ప్రధాన కేంద్రముగా ఉన్నవి స్థానికులు కొంత పీచును ఉపయోగించుకొని కొంత పీచును ఎగుమతి చేయుచున్నారు కొమరగిరిపట్నములో బ్రష్షులకు పరుపులకు ఉపయోగించు పీచును ఉత్పత్తి చేయుదురు అందు పీచును పదునుచేయు విషయమున తర్ఫీదునిచ్చు కేంద్రముకూడ నెలకొల్పబడినది పరిశ్రమశాఖవారు పూర్వము అంబాజీపేట వద్ద కొంతకాలము పీచును తయారుచేయుటలో పరిశోధనలు గావించిరి లాభదాయకముగా లేకపోవుటచేత వారు ఆ ప్రయత్నమునుండి విరమించుకొనిరి తరువాత కొన్ని సంవత్సరములక్రిందట కేంద్ర ప్రభుత్వమువారు ప్రాంతీయ కొబ్బరి పరిశోధనశాలనొకదానిని నెలకొల్పిరి బోడ కుర్రు అంబాజీపేటలలో కొబ్బరినూనెతీయు యంత్రములు కలవు వీటివలన ఉత్పత్తియగు నూనె స్థానికోపయోగమునకేకాక ఎగుమతి చేయుటకుకూడ ఉపయోగపడుచున్నది గానుగపిండి ఒకప్పుడు విదేశములకుకూడ ఎగుమతి చేయబడుచుండెడిది కాని దీనిని ప్రస్తుతము పశుగ్రాసముక్రింద ఎరువులక్రింద వాడుచున్నారు బజారులలోకూడ దీనిని అమ్ముట జరుగుచున్నది

ఇచ్చట పెసలు కందులు మినుములు ఉలవలు నువ్వులు ఆముదములు వేరుసెనగపంట పండుచున్నవి మెట్ట ప్రాంతములలో జొన్న చోడి గంటి పంటలను పండించుచున్నారు జీడిమామిడితోటల పెంపకము కలదు పండ్లతోటలలో అరటితోటలు ప్రధానమైనవి చక్కెరకేళి అరటిపండ్ల పంట ప్రత్యేకముగా పేర్కొనదగినది మామిడితోటలు పనసతోటలు అచ్చటచ్చట కనిపించును ప్రత్తిని పొగాకును పసుపును గసగసాలను పండించుచున్నారు ప్రస్తుతము పరిస్థితులు అనుకూలముగా ఉండుటచేతను లాభదాయకముగా ఉండుటచేతను వరిసాగుచేయుభూములలో చెరకును పండించుచున్నారు ఈ పంట హెచ్చుగా పండుచున్నది చెరకునుండి

రసము తీసి బెల్లమును తయారుచేయుచున్నారు. ఆలమూరు వంతెన నిర్మాణానంతరము ఈ బెల్లమును తాడేపల్లిగూడెము, అనకాపల్లి మార్కెట్టులకు పంపుట జరుగుచున్నది. వరిపంట అనంతరము జనుమును పండించుట కూడ కలదు. కాని ఈ జనుము పశువుల మేతగాను, పచ్చిఎరువుగాను ఉపయోగపడుచున్నది. ఒకప్పుడు విరివిగా పెంచబడు నీలిమందు పైరు కాలక్రమమున క్షీణించినది. అయన్‌విల్లి, వెలవలపల్లి, తొత్తరమూడి, మాకువల్లి మున్నగు తావులలోగల నీలిమందు ఫ్యాక్టరీలు ఎత్తివేయబడినవి. ఇప్పుడు నీలిమందు పైరు ఎరువు కొరకు కుగ్రాముకొరకు పెంచబడుచున్నది. బండమూరులంక పూర్వము ఓడరేవుగా ఉపయోగపడినది. దీని సమీపమున పూర్వము ఆంగ్లేయులచే ఒక ఫ్యాక్టరీ నెలకొల్పబడినది. ఫ్రెంచివారి మట్టడి జరిగిన తరువాత దానిని అలక్ష్యముచేసి విడిచిపెట్టిరి. బండమూరులంకలో సహకారపద్ధతిపై చేనేత పరిశ్రమను నెలకొల్పిరి. బండారులంక యందు నూలుతోను కృత్రిమ పట్టుతోను నేయబడు చీరలు ప్రసిద్ధములు. ఇచ్చట నేతపనివారు నేర్పరులు.

ఈ తాలూకాలో సుమారు 3 చదరపు మైళ్ళ భాగము రిజర్వు అడవిగా ఉన్నది. ప్రభుత్వమువారిచే కొంతభాగములో వేగిస, చేవ, కల్లమద్ది వగైరా చెట్లు పెంచబడుచున్నవి. అడవిలో చెట్లు విశేషముగా వంటచెరకుగా ఉపయోగింపబడుచున్నవి.

తాలూకాయందలి మొత్తము గ్రామములు పట్టణములు 106. వీటిలో 1961 జనాభాలెక్కల ప్రకారము ఇందు నివాసయోగ్యముకానిది ఒక గ్రామము కలదు. తాలూకాలో రెండు గ్రామములు పట్టణములుగా గుర్తింపబడినవి. 1951 జనాభాలెక్కల పిదప ఈ తాలూకా జనసంఖ్య 18 65 శాతము పెరిగినట్లు తెలియుచున్నది.

అమలాపురము: ఇది తాలూకాకు ముఖ్యపట్టణము. మధ్యడెల్టా యొక్క మెయిన్ కెనాల్ పై రాజమండ్రికి వాయువ్యదిశగా ఇది ఉన్నది. పట్టణ జనసంఖ్య 24 068 (1961). ఇందు 12 079 మంది పురుషులు, 11 984 మంది స్త్రీలు. ఇది మూడవ తరగతి మ్యునిసిపాలిటీ. 1924 సం॥లో జిల్లా మునసబుకోర్టు ఇచట స్థాపింపబడినది. మొట్టమొదట స్థాపింపబడిన న్యాయస్థానములలో ఇది ఒకటి. ప్రస్తుతము సబ్ ఆర్డినేటు జడ్జి కోర్టు కూడ కలదు. తాలూకా కేంద్రమగుటచేత తాలూకాలో ఉండవలసిన తాసీల్దారు, స్టేషన్ రీబ్ మెజిస్ట్రేటు, సబ్-రిజిష్ట్రారు ఆఫీసులు, ప్రభుత్వమువారి ఆసుపత్రి ఇచ్చట ఉన్నవి. తాలూకా ఆఫీసులు కాలువగట్టున నిర్మింపబడినవి. ఇచ్చట రెవెన్యూ డివిజనల్ ఆఫీసు కూడ కలదు. నగరములో ప్రధానమైన రహదారి ఉత్తర దక్షిణములుగా రెండుమైళ్ళ పొడవున కలదు. ఇది ఉత్తరమున కాలువ ఒడ్డునుండి దక్షిణమున పేరూరు శివారువరకు పోవుచున్నది. ఈ స్వాము ఎలి వలె పొడవుగా ఉన్నది. వెడల్పు మూడు నాలుగు ఫర్లాంగులకు మించి లేదు. మెయిన్‌రోడ్డునకు తూర్పుగా నగరము వృద్ధి చెందుచున్నది. పూర్వము దీని కానుకులైన సబ్-కలెక్టరు జ్ఞాపకార్థము ఆ పేటకు మోర్లీపేట అను పేరుపెట్టిరి. ఇచ్చట సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకు, ల్యాండు మార్టుగేజి బ్యాంకు, సెంట్రల్ డెల్టా ఫిషర్‌మెన్స్ కో-ఆపరేటివ్ సొసైటీ కలవు. సముద్రపు చేపలవేటకు కాకినాడ, అమలాపురము జిల్లాలో ప్రధానకేంద్రములుగా ఉన్నవి. హిందువులు ఎక్కువమంది కలరు. ముస్లిములు, క్రైస్తవులుకూడ తక్కువ సంఖ్యలో ఉన్నారు.

వ్యవసాయము ఇచ్చట ప్రధాన వృత్తి. ఇచ్చట ఎస్. కే. బి. ఆర్. కళాశాల ఒకటి కలదు. ఆలమూరువద్ద గౌతమీ గోదావరిపైన వంతెన నిర్మాణము జరిగిన తరువాత పట్టణ ప్రాముఖ్యము పెరిగి ఇది దినదినాభివృద్ధి చెందుచున్నది. ఇచ్చటనుండి ఒక రహదారి 8½ మైళ్ళు దూరములోనున్న గన్నవరమువరకు అనగా వైనతేయ గోదావరిపై గన్నవరము దగ్గర కట్టిన అక్విడక్టుకు 1 ఫర్లాంగు దూరమువరకు పోవును. అమలాపురం నుండి కొత్తపేటమీదుగా బొబ్బర్లంకకు ఒక మార్గము కలదు. ముమ్మిడివరము, బండమూరు లంకల మీదుగా ఏదూరు లంక వరకు ఒక రహదారి కలదు. జనుమువల్లి, నేదునూరులమీదుగా ముక్కామలకు ఒక మార్గము కలదు. అమలాపురము ముక్తేశ్వరము మార్గమొకటి కలదు. రైలుమార్గములు ఈ తాలూకాలో లేకపోవుటచే బస్సు, కారు ప్రయాణములు హెచ్చుగామున్నవి. కొబ్బరి, చెరకు ఇచట ప్రధానమైన పంటలు.

అల్లవరము: ఇది బండమూరు లంకకుపోవు రహదారిపై అమలాపురమునకు ఆరుమైళ్ళ దూరములో వాయవ్యదిశగా ఉన్నది. గోదావరి నీరు చేరకపోయినను నూతిపీటి సదుపాయమువలన కొబ్బరి తోటల పెంపకము అధికముగా జరుగు

చున్నది ఇందు రాదాపు 6 900 మంది ప్రజలుకలరు ఇచ్చట ప్రసిద్ధిచెందిన ఒక శివాలయముకలదు ప్రతిసంవత్సరము చైత్ర మాసములో ఉత్సవముజరుగును ప్రతి అదివారము ఒక సంత జరుగును దీని శివారు గ్రామము రాజుపాలెము క్షత్రియ కుటుంబములు ఎక్కువగాను డుటచే దీనికా పేరువచ్చెను ఇది పంచాయతీకల గ్రామము

అంబాజీ పేట ఇది పెద్ద వ్యాపారస్థలము ఇచ్చట నూనె మిల్లులు ధాన్యపు మిల్లులుకలవు అముదము నూనె గానుగలండి ఇచ్చటనుండి పెక్కుచోట్లకు ఎగుమతి అగును గానుగపిండిని ఉగ్రాసముగాకూడ ఉపయోగించుచున్నారు పీచు పరిశ్రమకూడ ఇచ్చట కలదు

బెండమూరులంక అమలాపురమునకు దక్షిణముగా నైరృతిమూలలో సుమారు 12మైళ్ళదూరములో ఇది ఉన్నది ఇది కొమరగిరిపట్టణ శివారు గ్రామము కొమరగిరిపట్టణములో పీచు ఉత్పత్తి తర్ఫీదు కేంద్రము లవు అందుచే ఇచ్చట కూడ పీచు పరిశ్రమ అభివృద్ధి చెందుచున్నది వైనతేయము గోదావరికి రెండు మైళ్ళ దూరములో ఉన్నది ఇది ఒకప్పుడు ఓడరేవుగా ఉండెడిది దీనికి సమీపమున ఆంగ్లేయులచే ఒక ఫ్యాక్టరీ నెలకొల్పబడినదట అది మరల క్రొత్తచోటికి మార్చబడి దట అందుచే చివరకు ఆ రెండు ప్రాంతములు పాతకోట క్రొత్తకోట దిబ్బలుగా మారినవి అవి పల్లెవారిచే ఆక్రమించబడి పల్లె లేక కోల్లవారి దిబ్బగానేడు పిలువబడుచున్నది

ముమ్మిడివరము ఇది తాలూకాలో ప్రధానపట్టణములలో ఒకటి అమలాపురముకు ఈశాన్య దిక్కుగా 8 మైళ్ళ దూరములో ఇది కలదు అమలాపురమునుండి నీలపల్లి కోరంగుల మీదుగా కాకినాడకుపోవు మార్గములో ఇది ఉన్నది ఇచ్చట చాల పురాతనమైన విష్ణ్వాలయమొకటి కలదు దీని స్తంభములపై తెలియని వ్రాతలు అనేకములుగలవు అన్నపల్లి అక్విడక్టుకు 4 మైళ్ళ దూరములో ఉన్నది ఇచ్చట ప్రసిద్ధిచెందిన బాల యోగీశ్వరుడు కలడు ఈయన సుమారు 25 సంవత్సరములనుండి ఆహారపానాదులు విసర్జించిధ్యాననిమగ్నుడై ఇక్కడేఉన్నాడు ప్రతి సంవత్సరము శివరాత్రి సమయమున ఈ బాలయోగి ప్రజలకు దర్శనమిచ్చుటచే అనాడు చాల పెద్ద ఉత్సవము జరుగును బాలయోగి మాహాత్మ్యమును తెలిసిన నాటినుండి ప్రజలనేకులు వచ్చిపోవుటచే ఈ పట్టణము క్రమముగా వృద్ధి చెందెను రాకపోక సౌకర్యములుకూడ పెరిగినవి

నేదునూరు ఇది అమలాపురముకు ఉత్తరముగా 4 మైళ్ళ దూరములో ఉన్నది అమలాపురము మెయిన్ కాలువ వలన నీటి సరఫరా ఈ గ్రామమునకు జరుగుచున్నది ఇచ్చట పురాతనమైన "జైన విగ్రహములుకలవు" వాటిని కదిల్చినచో ప్రమాదమువచ్చునను భీతితో ఆవిగ్రహములను ఎవ్వరును కదల్చినవారులేరు

ఇవిగాక ఐనపల్లిలో రెండు ముక్తేశ్వరాలయములుకలవు క్రొత్త ఆలయము తొత్తరమూడికి 6 ఫర్లాగుల దూరములో నున్నది అచ్చట దేవిరాజరాజేశ్వరికలదు పేరూరు గ్రామము చాల సారవతమైనది తమిళనాడునుండి వచ్చి ఈ గ్రామములో స్థిరపడిన బ్రాహ్మణులు పేరూరు ద్రావిడులందురు వీరు సంస్కృతమును వేదములను బాగుగ అభ్యసించిన వారు

ఒకప్పుడు కోనసీమ రహదారి సౌకర్యములు లేమిచే ఇతర ప్రాంతములకు చాల దూరముగా ఉండెడిది పూర్వము కోటిపల్లినుండి ఫెరీలో అమలాపురంచేరెడివారు 1929 నవంబరు 1 తేదీన కాకినాడనుండి కోటిపల్లివరకు రైలు మార్గము వేయుటవలన సరుకు ఎగుమతులకు చాలసౌకర్యము ఏర్పడినది కాని రెండవ ప్రపంచ సంగ్రామసమయములో ఈరైలు మార్గము రద్దుచేయబడినది కాకినాడ రాజమండ్రుల ద్దనే రైలు స్టేషనులు లభించును బస్సు మార్గములు కూడతక్కువ కాని ఆలమూరు సిద్ధాంతము వంతెన నిర్మాణము కోనసీమకు క్రొత్తశోభను తెచ్చినది మద్రాసు కలకత్తాలను కలుపు జి యన్ టి నేషనల్ హైవే నెం 5 రామచంద్రపురము తాలూకాల గుండా ఆలమూరు వంతెనపైనుండి మరలింపబడుటచే గోదావరికి ఇరువైపులనున్న ప్రాంతములకు రాకపోకలు చాల సులువైపోయినవి అమలాపురం తాలూకాకు పూర్వము పాంచాల దేశమనెడి పేరుండెడిదట

బి అ

## అమాత్య విద్దడు

అమాత్య విద్దని ప్రశంస దక్షిణహిందూ శాసనము (దహిం VI నెం 182) లో కనవచ్చుచున్నది ఈ శాసనము గుంటూరు మండలము బాపట్లతాలూకా అప్పికట్ల గ్రామములోని విశ్వేశ్వరాలయమున కలదు దీని కాలము శక 1073 (క్రీ శ 1151) శాసనము తెలుగు లిపిలోనున్నది ఇందులో కొంత పద్యమయముగను కొంతగద్యమయముగను కనవచ్చు

చున్నది శాసన లిపిలో కొంత భ్రష్టముగనున్నది కొన్ని లేఖక ప్రమాదములును కలవు అమాత్య విద్దని రెండవకొమరుడగు యల్లయప్రెగ్గడ ప్రేపల్లిలోని శ్రీభావనారాయణ దేవరకు అఖండవర్తిదీపమునకై 12 విరుదు మాడలు సమర్పించినట్లు ఈ శాసనము చెప్పుచున్నది

శాసన సారాంశము

శివదేవుడను బ్రాహ్మణుడు పోరదూరికి ప్రభువు అతడు కశ్యపగోత్రోద్భవుడు ఆతత గుణనిధి పుణ్యమూర్తి ఆయన భార్యపేరు గుండమాంబ ఈ దంపతులకు మంత్రి కేతడు జన్మించెను కేతనప్రెగ్గడ సత్యనిత్య నికేతనుడు ధర్మోపేతుడు ఈతని భార్య ముద్దమాంబ ఈ దంపతులకు అమాత్యవిద్దడు జన్మించెను విద్దనప్రెగ్గడ ఊరితనయశాలి ఈయన భార్య దోసమాంబ విద్దనకు దోసమాంబకు కేతుడు విద్దనమల్లడు అను ఇరువురు తనయులు ఉదయించిరి కేతన హితమితభాషి విద్దనమల్లడు సమస్తజనానురంజకుడు ఇంద్రభోగశాలి ఈతడు శ్రీమన్మహామండలేశ్వర త్రిభువనమల్లదేవ పొత్తపి చోడమహారాజులనొద్ద అధ్యక్షుడు ఇతడు శక 1073 (క్రీ శ 1151) న ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున కమ్మనాటిలోని ప్రేపల్లి యందలి శ్రీభావనారాయణదేవరకు ఆచంద్రార్కము అఖండవర్తిదీపమునకు బెట్టిన విరుదు మాడలు 12 వీనింజేకొని మారెని కామరాజు కొడుకు దేవన అనునతడు తన పుత్రపౌత్రికముగ నిత్యము మానెండు నేయి పోయగలవాడు

పై శాసనాధారముతో ఆనాటి చారిత్రకాంశములు కొన్ని తెలియుచున్నవి తూర్పు చాళుక్యప్రభువగు రాజరాజనరేంద్రుని కుమారుడు రాజేంద్రచోడుడు కులోత్తుంగ విరుద నామమువహించి మాతామహుల దియగు చోళరాజ్యమునకును పితృపితామహరాజ్యమగు వేంగి రాజ్యమునకు అధిపతి యయ్యెను గంగైకొండ-చోళపురము రాజధానిగ చేసుకొని చోళరాజ్యమున దేయుండి కులోత్తుంగ రాజేంద్రచోడుడు వేంగిరాజకార్యముల నెరవుచుండెను తనతనయులను తన కు ప్రతినిధులుగ వేంగి రాజ్యపాలమునకు పంపెను ఇతడు తన క్రింద పనిచేయుచున్న సేనానులకు ఇతర ఉద్యోగులకు రాజలాంఛనములిచ్చి వేంగిదేశమును కొన్ని మండలములుగా నొనర్చి వానిలో ఒక్కొక్క మండలమునకు ఒక్కొక్కని అధిపతిగా నొనర్చెను ఇట్టివారే మాండలికులు మండలాధిపతులు మండలేశ్వరులు అను పేళ్ళతో ఒప్పిరి వీరు చాళుక్య చోళరాజగు కులోత్తుంగునకు సామంతులై వేంగిని పాలించుచుండిరి ఇట్టిమాండలికులలో వెలనాటివారు చాగివారు హైహయులు చోళరాజులు ముఖ్యులగు వారెందరో కలరు వారిలో పొత్తపిని రాజధానిగచేసికొని తెలుగుప్రాంతమును పాలించిన చోడమహారాజునొద్ద విద్దనప్రెగ్గడ రెండవకుమారుడగు విద్దనమల్లడు అధ్యక్షోద్యోగము నడపెను

గుంటూరు మండి మన్నేరు వరకుగల ప్రాంతమును పూర్వము కమ్మనాడని వ్యవహరించిరి అనగా పూర్వపు కమ్మనాటిలో నేటి నరసరావుపేట తాలూకా బాపట్ల తాలూకా ఒంగోలు తాలూకా మార్కాపురము తాలూకాలు ఉండినట్లు శాసనముల వలన తెలియ వచ్చుచున్నది పొత్తపియను గ్రామము నేడు కడప మండలములోని రాజంపేట తాలూకాలో చెయ్యేరునది తటమున కలదు పొత్తపిని బట్టియే ఆ ప్రాంతమునకు పొత్తపినాడు అనుపేరు కలిగినట్లు కనిపించుచున్నది శ్రీ కాళహస్తిమాహాత్మ్యము నందలి కన్నప్పయను నామాంతరము గల తిన్ననియొక్క జన్మస్థానము పొత్తపి నాటిలోని ఉడుమూరు అని ధూర్జటి కవి వ్రాసెను పొత్తపినాడు అను పేరు కలిగినవి రెండు ప్రాంతము లుండినట్లు ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము వలన తెలియ వచ్చుచున్నది అందు మొదటిది కడప మండలములోని రాజంపేట తాలూకా ప్రాంతము రెండవది తూర్పుగోదావరి మండలము నందలి పిఠాపుర ప్రాంతము శాసనమున కనవచ్చు పొత్తపి చోడమహారాజు చాళుక్య చోళ చక్రవర్తి యగు రెండవ రాజరాజచోళుని సామంతుడైనట్లు తెలియుచున్నది రెండవ రాజరాజచోళుడు ఇమ్మడి కులోత్తుంగచోళుని కుమారుడు ఈతడు చాళుక్య చోళరాజ్యములను క్రీ శ 1145 మొదలు 1173 వరకు పాలించినట్లు కనవచ్చుచున్నది ఈ పొత్తపి తెలుగుచోళులకు సంబంధించిన వేరువేరు శాఖలవారు నెల్లూరు మండలమున రాజ్యములు నిర్మించుకొని కొంత స్వాతంత్ర్యము కూడ అవలంబించుచు పాలన సాగించినట్లు తెలియుచున్నది పొత్తపిని పాలించిన తెలుగుచోళులకు మధురాంతకపొత్తపి చోళులనియు విరుదునామము కలదు దాక్షిణాత్య చోళప్రభువైన పరాంతకుని సామంతులలో మధురాంతకుడను నతడొకడు కెననియు అతడు కడప మండలములోని పొత్తపిని రాజధానిగ చేసికొని పాలించెననియు అతని పేరుమీదనే మధురాం

తక పొత్తపి చోళులను పేరు తెలుగుచోళుల కేర్పడినదనియు విశదమగుచున్నది ఈ చీపుర చోళులకు మధురనేలు పాండ్యులకును వైరములు డెను పాండ్యుల నొకప్పుడు జయించి చోళులు మధురా తక బిరుదు దాల్చుచు డిరి దానినే పరంపరగా తెలుగుచోళులును వహి చుచుండిరి క్రి శ 11వ శతాబ్దమునాటి ను డియు పొత్తపి చోళుల శాసనములు కడప మండలమున కనవచ్చు చున్నవి

శాసనమున క వచ్చు వ్రేంగల్లి నేటి గుంటూరు మండలము నందలి రేపల్లె ఆయియుండునేమో అ దలి భావనారాయణ స్వామివారికి ఏద్దనమల్లుడు ఆచంద్రార్కముగ అఖండ వ త్తిదీపము నిర్వహి చుటకుగాను 12 బిరుదుమాడలు సమర్పి చెను దేవన అనునతడు మారెని కామరాజు కొడుకు ఈతడు ఈ 12 మాడల నుంచుకొని నిత్యము మానెడు నేయి స్వామివద్ద దీ మునకై పోయవలయునని ఈ శాసనము చెప్పు చు న్నది బిరుదమాడలు అనగా ప్రత్యేక రాజచిహ్నములుగల బ గారుమాడలని తెలియుచున్నది మాడ అ గా సుమారు పది రూకల విలువ గలిగిన నాణెము శాసనములలో మాడలు అను శబ్దము క వచ్చుచున్నది ఆనాటిప్రభువుల పేర్లతోగాని బిరుదులతోగాని ఇది వెలయుచున్నది కులోత్తుంగమాడ గంగ మాడ మధురాంతకమాడ అనునవి ఇట్టివే

తం అం శా

## అమాత్య విష్ణువు

ఈతని నామధేయము గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకా నాదెండ్ల గ్రామమునందు వెలసియున్న మూలస్థానేశ్వరుని ఆలయమునందు వేయించబడిన ఒక శాసనము నందు కానవచ్చుచున్నది దహిం(IVనె 682) అమాత్యవిష్ణువు తండ్రి నరసింహాభట్టు జిల్లాంబిక ఈయన ధర్మపత్ని విష్ణు మంత్రి తల్లి నరసింహాభట్టు పెనుమదము అను గ్రామమునకు అధినాథుడు కరణము కావచ్చును పెన్మద గ్రామము త్రయీ విద్యకు నిలయులైన బ్రాహ్మణుల కాలవాలమట అమాత్య విష్ణువు బహుసద్గుణ శోభితుడు ఇతడు శాలివాహన శకము 1068 (క్రి శ 1146) సంవత్సర విషువసంక్రాంతి నిమిత్తమున నాదెండ్ల మూలస్థాన మహేశ్వర దేవరకు శాశ్వతదీపకమును సమర్పించెను అమాత్య విష్ణువు భారద్వాజ గోత్రుడు

ఈ యమాత్యు డెవరిసేవలో నుండెనో తెలియరాదు క్రి శ 1146 ప్రాంతమున వెలనాటి చోడులు ఆంధ్రదేశము నేలిరి ఇప్పటి వెలనాటిరాజు రె డవ గొంకరాజు కావచ్చును ఈ విష్ణుమంత్రి వెలనాటి రాజ్యములోని వాడు కావున వారి వద్దనే అమాత్యుడుగ ఉ డెనని ఊహింపదగి యున్నది ఈ శాసనము సంస్కృత శ్లోకములలో నున్నది

బిం ల రం

## అమాన్ మహాలు

అమాన్ మహాలు అనగా శాంతిసౌధము గోల్కొండ కుతుబుషాహీల కాలమున సుల్తానులు ధర్మాసనముండు గొప్ప కట్టడము అమాన్ మహాలు అనబరగెను (గోల్కొ డచరిత్ర- అబ్దుల్ మజీదుసిద్దీకి పుట 395) కుతుబుషాహి వంశమువారు న్యాయనిర్ణయము చేయుపట్ల మిక్కిలిశ్రద్ధ వహించుచు డిరని చారిత్రకులు వర్ణించుచున్నారు విదేశయాత్రికులగు టవెర్నియరు థేవినో మున్నగువారి కథనములు దీనిని సమర్థించు చున్నవి ముఖ్యముగా మహమ్మదుకులీకుతుబుషా(1580 1612) సుల్తానుమహమ్మదు (1612 27) అను పరిపాలకులు ప్రజలకు న్యాయముచేకూర్చుటకు ప్రశంసనీయమైన కృషి చేయుచుండిరి మహమ్మదుకులీ గొప్ప భవననిర్మాత అయన ఎన్నియో సుందరములును సుప్రసిద్ధములును అగు ప్రాసాదములతో హైదరాబాదు నగరమును అలంకరించెను ధర్మాసనమునకై అతడు దాదుమహాలు అను మహాభవనమును కట్టి చెను కాని ఇది వర్షపాతములకును విద్యుద్ఘాతమునకును గురియై కొ తశిథిలమయ్యెను మహమ్మదుకులీ తమ్ముని కుమారుడును కులీయనంతరము గోల్కొండ సింహాసనమును అధిరోహించిన వాడును అగు సుల్తానుమహమ్మదు పిడుగుపాటుచే దెబ్బతిన్న దాదుమహాలును మరమ్మతు చేయించెను అంతటితో తృప్తి పడక ఈప్రభువు తాను స్వయముగ మరొక బ్రహ్మాండమైన ప్రాసాదమును ధర్మాసనమునకై అమానుమహాలు అను పేరిట కట్టించి కీర్తివడసెను

ఈభవనము న్యాయార్థులగు జనులక దరకు అందు బాటులో ఉ డుటకును సుప్రథితముగా ఉండుటకును వీలుగా నగరములోనికి ప్రవేశించుటకు వాడబడు రాజమార్గము మీద ఉండెడిదట కుతుబుషాహి సుల్తానుల న్యాయవిచారణాపద్ధతి ఇట్లుండెను ప్రభువు అమానుమహాలు యొక్క బాల్కనీమీద ఆసీనుడై యుండును అతనిప్రక్క భాటానరా అను ఒకఉద్యోగి

నిలబడియుండును వలభిక్రింద ఒక అమాత్యుడు నిలబడి న్యాయమును అర్థించు ప్రజలనుండి విజ్ఞప్తి పత్రములను సేకరించుచుండును ఐదారు విజ్ఞప్తిపత్రములు ప్రోగైనవిమ్మట వాటిని ఒకసంచిలోనుంచి పైకి పంపుచుండిరి వలభిమీదనున్న అధికారి ఒక సంచిని క్రిందకు జారవిడిచెడివాడు విజ్ఞప్తిపత్రములతో ఆసంచిని తాళ్ళతో పైకిచేదుకొనుచుండిరి ప్రభువునకు న్యాయనిర్ణయమందు తోడ్పడుటకై ఖాజీలనబడు ముసల్మాను న్యాయవేత్తలును హిందూ ధర్మపర్యవేక్షణకై పండితులును సమావిష్టులగుచుండిరి

న్యాయార్థులగు ప్రజాసమూహములు అమానుమహాలు ఆవరణమునందు గుమిగూడుచుండిరి వారు తొందర తొక్కిడి చేయుటకుగాని క్రమశిక్షణ రహితముగ ప్రవర్తించుటకు గాని వీలు లేకుండ ఏర్పాట్లు చేయబడుచుండెను శాంతిసౌధ ప్రాంగణమునందు పగ్గములతో మూడుకక్ష్యలు ఏర్పాటు చేయుచుండిరి ఈపగ్గములు దృఢమైన స్తంభములకు కట్టబడుచుండెను ఎవ్వరును తమకు నిర్ణీతమగు కక్ష్యనుదాటిగాని పగ్గములను అతిక్రమించిగాని వచ్చుటకు వీలులేదు న్యాయార్థులైనవారిని ఒక ప్రత్యేకమార్గముగుండ తెచ్చి ప్రభువు సమ్ముఖమున వలభిక్రింద నిలబెట్టెదురు అట్లుచేయుటకు వీరుపగ్గములతో నిర్మించిన మరియొక కక్ష్యను దాటవలసియుండెను అన్యాయమునకును పీడనమునకును గురియైన అభాగ్యుల పాలిటి కల్పవృక్షముగా అమానుమహాలు ప్రాంగణము భాసిల్లెను

సుఖలాలసుడు భోగప్రియుడుగా పరిగణింపబడిన అబ్దుల్లాకుతుబుషాకూడ క్రీ శ (16 7–72) న్యాయవిచారణయందు మిక్కిలి శ్రద్ధచూపెడివాడని థెవెనో ప్రశంసించెను ఎంత పలుకుబడిగల సామంత ప్రభువులైనను అన్యాయాచరణము చేసినచో శిక్షాక్రమమును తప్పించుకొనలేకుండిరి బలవంతులును న్యాయనిర్ణయమునకు తలయొగ్గవలసినదే అబ్దుల్లా న్యాయబుద్ధిని ప్రదర్శించు ఒకటి రెండు సన్నివేశములను థెవెనో గ్రంథస్థము చేసియున్నాడు ఒకఅమీరుప్రభువు ఒక హుండీకారునివద్ద 5000 రూపాయిలు బదులుతీసికొని ఆసొమ్మును న్యాయముగా ఇచ్చివేయక హుండీకారునిపై బలప్రయోగముచేయుటకు తలపడెను ఈ దావాను విని అబ్దుల్లాకుతుబుషా న్యాయవిచారణచేసి అమీరును హుండీకారునిధనము చెల్లించుటకై శాసించెను సైదీ అను చరిత్రకారుడు మరియొక అభియోగమును గూర్చి వ్రాయుచున్నాడు ఎలిచబేగు అను అమీరొకడు వర్తకులవద్ద బదులుచేసిన సొమ్ము ఎగవేయుటకు చూచెను సుల్తాను అదావాను విచారణచేసి ఎలిచబేగునకు వచ్చు ఆదాయమునుండి 0 లేక 40 వేలహొన్నులను పట్టియుంచి ఆసొమ్మును వర్తకులకు ఇప్పించెను దానిచే పూర్తిసొమ్ము చెల్లింపుకాకపోగా కొరతలకు ప్రభుత్వము బొక్కసమునుండి వర్తకులకు పరిహారమిప్పించెను

ఖం ల రం

## ఆమానిగుడిపాడు

అమానిగుడిపాడు కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకాలో ఉన్నది దీని పెద్దగుడిపాడు రామలింగాపురము అను పేర్లుకూడకలవు దీనికి 7 మైళ్ళలో మార్కాపుర పట్టణము కలదు ఈ గ్రామమునకు తూర్పున గురజేపల్లి పడమట గ్రావుపాల ఉత్తరమున అడవి దక్షిణము చట్టిమిల్లు పరిహద్దులుగా ఉన్నవి దీని విస్తీర్ణము 7014 ఎకరములు దీని చుట్టును తోటలు మైదానములు ఉన్నవి ఇచ్చట తొర్రగల కొండ ఒకటి ఉన్నది ఇది చక్కరాయిచే గులకరాయిచే ఏర్పడినది

1961 సం జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామమున పురుషులు స్త్రీలు కలసి 3 428 మంది ఉండిరి ఈ సంఖ్యలో షెడ్యూలు తరగతులవారు షెడ్యూలు జాతులవారు కలిసి 156 మంది ఇచట ఇండ్లు వాడవాడలుగా నిర్మింపబడినవి వీటిలో 48 కాంక్రీటు కప్పుగల ఇండ్లుకూడకలవు గ్రామస్థులలో 30 శాతమువారు జొన్నఅన్నమును 63 శాతమువారు ఇతర అన్నములను తిందురు 2 శాతమువారు మాత్రమే వరి అన్నమును తిందురు వీరందరు బావి నీటిని త్రాగుదురు ఇక్కడ మంచినీటి ఎద్దడిలేదు

వొద్దులవాగు ఎగువచెరువు దిగువచెరువు బావులు మొదలగునవి ఈగ్రామమునకు కల నీటివనరులు వీటిక్రింద రాగి సజ్జ జొన్న వరి కొర్ర కంది అరిక ప్రత్తి జనుము మొదలగు పైరులు పండును ధాన్యమును గాదెలలో భద్రపరచుదురు ఇక్కడ తమలపాకుతోట ఒకటికలదు తమలపాకులను మార్కాపురమునకు రవాణాచేయుదురు స్థానికులు వాడుకొనుటకు కూరగాయలను పండింతురు 1966–67 సం॥లో పంటల క్రింద 3600 ఎకరముల భూమి ఉపయోగపడెను చెరువు క్రింద 400 ఎకరముల భూమియు బావుల క్రింద 670 ఎకరముల భూమియు సాగుబడి అయెను మోటల సహాయమున 450 ఎకరముల

భూమి నీరు పల్లయి అగుచున్నది. ఇచ్చట చిట్టడవి ఒకటి ఉన్నది. ఇది ఎర్రగొండపాలెం రేంజి పాలనక్రింద ఉన్నది. పశువుల మేతవలన అటవీశాఖకు 5000/- రూపాయలు ఆదాయము వచ్చెను. ఇచటి అడవిలో జింకలు, చిరుతపులులు కలవు.

ఈ గ్రామములో 1 849 ఎనుములు 333 మేకలు 4 245 గొర్రెలు 140 పందులు 1 331 కోళ్లున్నవి. దినమునకు 400 లీటర్ల పాలు, వారమునకు 5 కి. గ్రా. నెయ్యి స్థానికులు వాడుకొని వారమునకు 85 కి. గ్రా. నెయ్యి గుంటూరు వినుకొండలకు ఎగుమతి చేయుదురు.

ఈ గ్రామ ప్రజలముఖ్యజీవితాధారములు వ్యవసాయము, కూలి, కుటీర పరిశ్రమ. కొందరికి ఎద్దుబండ్లతోలుట జీవనాధారము. కంసాలివారు, వడ్రంగులు, కమ్మరులు, కుమ్మరులు, మంగలివారు, చాకలివారు కలరు. చేనేత వస్త్ర కుటీర పరిశ్రమవలన స్థానికులకు చాలినంత వస్త్రములభించుచున్నది. వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు. దినమునకు కూలిరేటు పురుషునకు రు. 1-50 లు, స్త్రీకి రు. 1/- లు.

అమానిగుడిపాడులో నరసింహస్వామి ఆలయము, త్రిపురసుందరీదేవ్యాలయము, రామాలయము, శివాలయము ఉన్నవి. వీటికిమూడు ఎకరముల మాగాణిమాన్యము, 4 ఎకరముల మెట్టమాన్యముకలవు. ఇచట జాతరలు జరుపుదురు.

ఈ గ్రామమునకు 20 మైళ్ళ దూరములో మార్కాపుర రైల్వేస్టేషనున్నది. 4 మట్టిరోడ్లుకలవు. దీనిని పొరుగు గ్రామములతో ఈ రోడ్లు కలుపుచున్నవి. ప్రయాణమునకు 100 రెడ్డెల బండ్లు 4 సైకిళ్ళు ఈ గ్రామమున కలవు.

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు, ఎలిమెంటరీ స్కూలు ఉన్నవి. ఇది పంచాయతీ పాలనకల గ్రామము. ఇచటి పంచాయతీకి సాలీనా ఆదాయము రు. 4000/-లు. పంచాయతీ రేడియో, సర్కారు విశ్రాంతి చావడికలవు. ఇచటి కోఆపరేటివ్ సొసైటి 80 మంది గ్రామస్థులకు అప్పిచ్చినది. వైద్యవృత్తిగా అప్పులిచ్చువారు కూడ కలరు. పశువులకు రైతులు నాటువైద్యము చేయుదురు. ఇచ్చట 10 కిరాణ దుకాణములు మాత్రము ఉన్నవి.

ఈ గ్రామమునకు 10 మైళ్ళలోనున్న ఎర్రగొండపాలెం లోని తంతి కార్యాలయమునకు, జనరల్ ఆసుపత్రికి, పశువుల ఆసుపత్రికి గ్రామస్థులు పోవుదురు. హైస్కూలు చదువులకు ఎర్రగొండపాలెమునకును, కళాశాల చదువులకు కర్నూలునకును విద్యార్థులు పోవుదురు. కోర్టులకు, సబ్ రిజిస్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి 17 మైళ్ళలోనున్న మార్కాపురమునకు పోవుదురు. పోలీసుస్టేషను, బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు ఎర్రగొండపాలెమునకు పోవుదురు. ఈ గ్రామమునకు 4 మైళ్ళదూరములో బస్సు మార్గమున్నది. స్వల్ప ఖర్చుతో ప్రైవేటు బస్సులు ఎర్రగొండపాలెమునుండి మార్కాపురమునకు పోవును.

మా. శ్రే.

## అమీనాబాదు

అమీనాబాదు గుంటూరు జిల్లా నర్సరావుపేట తాలుకాలో ఉన్నది. దీని 11 మైళ్ళ దూరములో గుంటూరు పట్టణము కలదు. ఈ గ్రామ విస్తీర్ణము 3318 ఎకరములు. ఇచ్చట తెల్లరాయికొండ ఒకటి ఉన్నది. దీనిపై చెట్లుకలవు.

1961 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఈగ్రామములో పురుషులు స్త్రీలు కలసి 4 027 మంది ఉండిరి. ఈ సంఖ్యలో షెడ్యూలుజాతులవారు, షెడ్యూలు తరగతులవారు 402 మంది. ఇచ్చట ఒకచో ఇండ్లు గుంపుగాను, ఒకచో వలయాకారముగాను ఉన్నవి. వీటిలో 40 పెంకుటిండ్లు 10 కాంక్రీటు కప్పుగల ఇండ్లు. ఈ గ్రామస్థులలో 75 శాతము వారు వరి అన్నమును 10 శాతము వారు జొన్న అన్నమును 15 శాతము వారు వరిగ మొదలగు అన్నములను తిందురు. వీరు బావినీటిని త్రాగుదురు.

నాగార్జున కాలువ, మల్కాచెరువు, లింగాల చెరువు, అక్కులచెరువు, రమణప్పచెరువు, చిక్కాగుంటచెరువు ఈ గ్రామమునకు గల నీటివసతులు. వీటిక్రింద వరి, జొన్న, వేరుసెనగ, కంది, వరిగ, ఉల్లి పండును. ధాన్యమును గాదెలలో నిలవ చేయుదురు. ఫలసాయములను గుంటూరునకు, నర్సారావుపేటకు లారీలపై బండ్లపై రవాణా చేయుదురు. ఇచట 80 ఎకరముల నిమ్మతోట ఒకటి కలదు. 1966-67 సం॥లో రు. 10 000 ల విలువకల నిమ్మకాయలు గుంటూరునకు ఎగుమతి అయ్యెను. ఇచట పంటలకు 1 800 ఎకరముల భూమి ఉపయోగపడెను. కాలువక్రింద 800 ఎకరములభూమి, చెరువు క్రింద 70 ఎకరములభూమి సాగుబడి ఆయెను. రెండు ఆయిల్ ఇంజనులు, రెండు ఎలెక్ట్రిక్ మోటారులు 150 ఎకరముల భూమికి నీటిని సరఫరా చేసెను. ఒక ట్రాక్టరు 100 ఎకరముల భూమిని దున్నెను. ఇచ్చట 1000 ఎకరముల గరువు

నేల 813 ఎకరములు ఎర్రనేల 1500 ఎకరములు నల్లరేగడి నేల నిపించును ఇంటు ప్రభుత్వపు పరిపాలనక్రింద 50 ఎకరముల చిట్టడవి కలదు అమీనాబాదులో 4 000 గేదెలు 150 ఆవులు 600 దున్నలు 700 దున్నెలు ఉన్నవి 600 మేకలు 5000 గొర్రెలు 300 పందులు 2 000 కోళ్లు కూడ కలవు వారమునకు 4 000 లీటర్ల పాలు 224 కి గ్రా వెన్న 500 గ్రుడ్లు స్థానికులు వాడుకొందురు

ఈ గ్రామస్థులకు వ్యవసాయము కూలి వ్యాపారము ముఖ్యమయిన జీవనాధారములు కసాలులు వడ్రంగులు కమ్మరులు 20 మంది గొల్లలు 9 మంది వడ్డెరవారు కలరు కటిక పరిశ్రమ వలన మేదర వాండ్లు జీవించుచున్నారు రు 3000 ల విలువగల బట్టలు నెట్టలు మొదలగునవి చుట్టుప్రక్కల పల్లెలలో అమ్ముదురు ఇంటి క్వారినుండి రు 10 000 ల విలువగల రాయి త్రవ్వబడెను అందులో 5 శాతము స్థానికముగా ఉపయోగించుకొని మిగిలిన రాతిని గుంటూరు కు నర్సారావుపేటకు ఎగుమతిచేసెదరు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు నిపుణుడగు మగవానికి దినమునకు కూలి రు 3 లు స్త్రీకి రు 2 50 లు సాధారణముగా మగవానికి కూలి దినమునకు రు 2/ లు స్త్రీకి రు 1 50 లు

ఈ గ్రామమునకు 6 ఫర్లాంగుల దూరములో వేమనూరుపాడు రైల్వే స్టేషను ఉన్నది గవర్నమెంటు బస్సులు గుంటూరు నుండి ఈ గ్రామము మీదుగా నర్సారావుపేటకు గంటగంటకు పోవును ఇచట 10 మట్టిరోడ్లు ఉన్నవి దీనిని పొరుగుగ్రామములతో ఒక తారురోడ్డు కలుపుచున్నది 00 రెండెడ్ల బండ్లు 25 సైకిళ్ళు ప్రయాణమునకు ఉపయోగపడెను

అమీనాబాదులో బ్రాంచి పోస్టాఫీసు ఎలిమెంటరీస్కూలు హైస్కూల్ ఉన్నవి విద్యుచ్ఛక్తిని గ్రామములలోని 80 ఇండ్లవారు వాడుకొనుచున్నారు ఇది పంచాయతీ పాలన కల గ్రామము ఇచ్చట పంచాయతి రేడియోసెట్టు కలదు ఇచ్చటి సహకారసంఘము రు 1 25 000 లు గ్రామస్థులకు అప్పుగా ఇచ్చినది ఈ గ్రామములో 10 కిరాణాదుకాణములు 2 కాఫీ హోటళ్లు ఒక సోడాకొట్టు సిగరెట్టు దుకాణము ఉన్నవి ఈ గ్రామమునకు మూడు మైళ్ళ దూరములో ఫిరంగిపురము కలదు అందలి తంతి కార్యాలయమునకు పురుష్ళ ఆసుపత్రికి పశువుల ఆసుపత్రికి సినిమాథియేటరుకు పోలీసుస్టేషనుకు రిజిష్ట్రారు ఆఫీసుకు బ్లాకు అభివృద్ధికే ముఖ్య గ్రామస్థులు పోవుదురు కోర్టుకు తాలూకా చేరి 12 మైళ్ళలో ఉన్న సత్తెనపల్లి పోవుదురు కళాశాలచదువులకు విద్యార్థులు గుంటూరునకు పోవుదురు జనరల్ ఆసుపత్రి గుంటూరునకే పోవలెను

కొండవీటి రాజులు పరిపాలించిన గ్రామములలో ఇది ఒకటి ఇచట అవ్వడెక్కు ఒకటి ఉన్నది

మా శ్వే

## అమీనాబాదు (చరిత్ర)

అమీనాబాదు ప్రస్తుత మొక గ్రామము (సత్తెనపల్లి తాలూకా గుంటూరు జిల్లా) ఇచ్చట కనుగొనబడిన శాసనములనుబట్టి పూర్వమీ గ్రామము ఒక మహాపట్టణముగా విలసిల్లియుండెనని తెలియుచున్నది ఈ గ్రామనామము (శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి రెడ్డి రాజ్యములు (పుట 45) అను ఆంగ్ల గ్రంథమున పేర్కొనబడినది ఈ గ్రామమునందలి నాలుగు శాసన విషయములు కాలక్రమము ననుసరించి సమన్వయపరచబడినవి

1 అనవేమభూపాలుని శాసనము (క్రీ శ 1376)
2 రాచవేముని శాసనము (క్రీ శ 1415)
3 మల్కాఅమీన్ శాసనము (క్రీ శ 1592)
4 నాగమనాయని గారి శాసనము

మొదటి అనవేమ భూపాలుని శాసన విషయమిట్లున్నది. అనవేమభూపాలుడు మూలగూరమ్మకు శా శ 1293 (క్రీ శ 1376) సంవత్సరమున నలసంవత్సర మాఘపూర్ణిమనాడు కోటభూమికి (అమరావతి) చెందిన పడిదము మూలగూరు చినపలుకలూరు అను గ్రామములను ధారపోసెను ఇది జరిగిన ముప్పదియేండ్లకు రాజ్యమునకువచ్చిన పెదకోమటి వేమారెడ్డి సర్వకర పరిహారముగా సామైశ్వర్యముగా సాష్టభోగముగా పైన పేర్కొనబడిన గ్రామములను ఒసగుటయేగాక మూలగూరమ్మగుడియు ప్రాకారము నిర్మించిన విషయము ఈ శాసనమునందే సీసపద్యరూపమున చెప్పబడినది శాసనము కొండమీద మూలగూరమ్మ గుడి కడజారుబండపై చెక్కబడియున్నది పెదకోమటి వేమారెడ్డి క్రీ శ 1402 1420 నడుమ కొండవీటి రాజ్యమును పాలించెను వేమభూపాల చరిత్రమను గద్యకావ్యము అయన జీవిత విశేష

ములను తెలుపుచున్నది. అందు పూర్వ దిగ్విజయయాత్ర ముగించుకొని గృహోన్ముఖుడై తరలు సమయమున విద్యారణ్యమునందొక చండికాయతనమందున్న ఆదిభైరవిని వీరయలాచార పద్ధతిని అనుసరించి పెదకోమటి వేముడు పూజలు సలిపినట్లు తెలియవచును. ఈ తాంత్రిక పూజా విధానమునందు సురామైరేయములతో దేవిని సంతృప్తి పరచుటయు కలదు.

రెడ్డిరాజులకు కులదేవత మూలగూరమ్మ అను విఖ్యాతి గలదు. రెడ్డి సంచిక యను గ్రంథమున పెదకోమటి వేముడు ముల్లగూరమ్మ మహాదేవికే గాక నాగవరపుఅమ్మ వేములమ్మ పుట్టమ్మ ముత్యాలమ్మ మున్నగు శక్తి దేవతాలయములను కట్టించి క్రమోత్సవములను ఏర్పాటు చేసెనని తెలుపబడినది. ఈ విషయమును బట్టి ఆనాడు ఆంధ్రదేశమున వామాచార పద్ధతి ననుసరించి శక్తిపూజలు చేసెడివారని తెలియవచ్చుచున్నది.

అమీనాబాదులోని రెండవ శాసనము పెదకోమటి వేముని పుత్రుడు రాచవేమ రెడ్డి వేయించినది. ఈ శాసనము అమీనాబాదునందలి పులాంబిలోడు అను బండమీద చెక్కబడినది. "సహస్రబులు శాకాబ్దములు మున్నూట ముప్పదియేడు శా॥ శ॥ 1337 (క్రీ॥ శ॥ 1415) మన్మథ సంవత్సర మాఘ మాసములో పూర్ణిమా దివసమున హేమాద్రిదాన చింతామణి అరిరాయ బసవశంకరుడు అభినవఫల్గుణుడు సమదారి రాయ వేశ్యాభుజంగుడు అను బిరుదములను వహించిన వేమయ రాచవేమ క్ష్మావరుడు తల్లి సూరాంబచే నిర్మితమైన సత్రానవారథికి మాతృదేవి అనుజ్ఞనుపొంది జగనొబ్బగండ అను కాల్వలను త్రవ్వించెను" శాసనము శ్రీనాథకృతి అని అంత్యమున చెప్పబడినది.

అమీనాబాదులోని కొండమీదనున్న దుర్గాభవాని (ముల్లగూరమ్మ) దేవాలయపు తూర్పుద్వారము నున్న శాసనవివరములిట్లున్నవి. శాసనకాలము క్రీ॥ శ॥ 1592. వేయించబడిన శాసనములలో కాలక్రమమును బట్టి ఇది మూడవది అయియున్నది. గోల్కొండసుల్తాను ఇభరాముడు (ఇబ్రహీమ్ కుతుబుషా) (క్రీ॥ శ॥ 1550-1580) తళ్ళికోటయుద్ధానంతరము విజయనగరపాలన క్రిందనుండి తనకు సంక్రమించిన ఉదయగిరి కొండవీడు వినుకొండ బెల్లముకొండ తంగెడ దుర్గములను సాధించి గోల్కొండ సామ్రాజ్యమును విస్తృతపరచెను.

ఈ శాసనమునందు కొండవీడు కర్ణాటక రాజధానిగా చెప్పబడినది. దీనినిబట్టి రాయలకాలమునందలి విజయనగరము తరువాత ఆ సామ్రాజ్యమున విఖ్యాతిపొందినపట్టణము కొండవీడని గ్రహించనగును. ఇబ్రాహీము అనంతరము అతని కుమారుడు మహమ్మదుకులీపాదుపా క్రీ॥ శ॥ 1580 సం॥ న రాజ్యాధిపత్యమును వహించెను. అతని కాలమున కొండవీడునందు ప్రాంతీయ సంరక్షణకై గోలుకొండ సైన్యము విడిసియుండెను. సైన్యాధిపతులును దుర్గరక్షకులును అయిన శాఖాజీ (శఖాజీ) ఖాతేరావు అలఖాన్ ఖాన్‌ఖాన్ అనువారలు పాదుపాపై తిరుగుబాటును క్రీ॥ శ॥ 1591 సం॥ న లేవదీసిరి. ఈ విషయము సుల్తాన్ మహమ్మదు కులీపాదుపాకు తెలిసెను. అతడు పితూరీదార్లను దండించుటకు తన ప్రధాని అయిన అమీను-ఉల్ ముల్కును (శాసనమునందలి మల్కా అమీన్) గొప్ప సైన్యముతో కొండవీడునకు పంపెను. ఈతని రాకనుగురించి విని తిరుగుబాటుదారులు పారిపోయిరి. ఈ విషయము శాసనమునందు ఉపమానాల కారయుక్తముగా ఉదహరింపబడినది. "మల్కా ఒకయ్య గారు గోలుకొండ వెళ్ళి వచ్చెనన్న ఖబరువిని యీ హరాంఖోర్లు అయినవారు అందరును సూర్యోదయం అయితేను చీట్లు విచ్చిపోయి చెట్టెయక్కడివాళ్లు అక్కడనే యదాయలై పారిపోయిరి." శాసనకారకుడు ప్రధాని అమీన్ ఉల్-ముల్కు.

శాసనమున చెప్పబడిన తిరుగుబాటుదారులలో శాఖాజీ ఖాతేరావుగారలు గోలుకొండ చారిత్రక ఘట్టములందుచేసిన సేవలను పురస్కరించుకొని ఎక్కువగా శ్లాఘింపబడిరి. వీరు గోల్కొండలో ఉన్న పదవులయందుండిరి. ముస్లిము అధికారులతోపాటు వీరుకూడ తమ ఏలికయెడ విశ్వాసముతో ప్రవర్తించిరి. ఇట్టి సమయములో కొండవీడునందు వీరు తమ ఏలికపై తిరుగుబాటు చేయుటకుగల కారణము లెట్టివో తెలియవు.

నాగమనాయని గారి శాసన విషయము మెకంజీస పుటములో వ్రాయబడిన అమీనాబాదు శాసనములు అను శీర్షికనుండి గ్రహింపబడినది. నాగమనాయని గారు మహాపరమేశ్వరి ముల్లగూరు ఆదిశక్తికి ముల్లగూరు అగ్రహారమును దానము చేసెనని చెప్పబడినది. నాగమనాయనింగారి పూర్వోత్తరములు కాలము తెలియవు. వీరు కంపెనీ ప్రభుత్వకాలమున గుంటూరు మండలమున ఏర్పడిన జమీందారీ వంశములలో ఒకరై ఉందురు.

కొం. వె.

## అమీనాబాదు (వరంగలు జిల్లా)

వరంగల్లుజిల్లా నర్సంపేట తాలూకాలో అమీనాబాదు గ్రామము ఉన్నది దీనికి 28 మైళ్ళలో వరంగల్లు పట్టణము ఉన్నది తూర్పున వరంగల్లు పడమట ద్వారకపేట ఉత్తరమున చంద్రుగొండ దక్షిణమున నెక్కొండ ఈగ్రామమునకు పరిహద్దులు ఈగ్రామ విస్తీర్ణము 86 8 ఎకరములు

1961 స॥ జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామములో 2368 మంది పురుషులు 2236 మంది స్త్రీలు వెరసి 4604 మంది ఉండిరి వీరిలో షెడ్యూలుజాతులవారు 314 మంది ఇచట ఒకచోట ఇండ్లు గుంపుగాను ఒకచోట వలయాకారముగాను మరియొకచోట వాడవాడలుగాను ఉన్నవి వీటిలో 150 పెంకుటిండ్లు రెండు ఒకటి అంతస్తుగల మేడలు ఉన్నవి గ్రామస్థులలో 604మంది వరిఅన్నమును 1850 మంది జొన్న అన్నమును 150 మంది ఇతరఅన్నములనుతిందురు వీరుబావి నీటిని త్రాగుదురు ఇచట మంచినీటి ఎద్దడికలదు

రెండుమైళ్ళ పొడవుగల కాలువ చెరువులు బావులు ఈగ్రామ నీటివనరులు వీటిక్రింద వరి జొన్న మొక్కజొన్న పెసర వేరుసెనగ కందులు పండును పంటధాన్యములు బండ్లపై లారీలపై వరంగల్లునకు రవాణాచేయుదురు 1966 67 సం॥లో ఇచట పంటలక్రింద 4 20 ఎకరములభూమి ఉపయోగించబడెను కాలువక్రింద 600 ఎకరములు బావులక్రింద 500 ఎకరములు చెరువులక్రింద 200 ఎకరములు ఇతరవనరుల క్రింద 601 ఎకరములు సాగుబడి ఆయెను నాలుగు ఆయిలు ఇంజనులు 6 ఎలెక్ట్రిక్ మోటారులు 60 ఎకరములకు నీటిని సమకూర్చెను ఇచటిభూమిలో 1 192 ఎకరములు తరినేల 6000 ఎకరముల రేగడినేల 1000 ఎకరముల బాగాయతు భూములు కలవు

ఇచట 1 612 ఆవులు 164 మేకలు 320 గొర్రెలు 154 పందులు 2 162 కోళ్ళుకలవు దినమునకు 200 లీటర్ల పాలు 10 కి గ్రా నెయ్యి 20 కి గ్రా మాంసము 400 గ్రుడ్లు స్థానికులు వాడుకొనిరి

ఈగ్రామస్థుల ముఖ్యజీవితాధారములు వ్యవసాయము కూలి ఇచట కుటీరపరిశ్రమలుకలవు ఎద్దుబండ్లు తోలుబావు దుకాణదారులు కంసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు మంగలివారు చాకలివారు గొల్లలు మాలలు మగ్గములవారుకలరు ఇచట రెండువడ్లమరలుకలవు అవి సాలీనా 500 పుట్లబియ్యమును గ్రామస్థుల వాడుకకు తయారు చేయును సాలీనా రు 1500 ల విలువగల చేనేతవస్త్రములు ఇచట తయారగును వ్యవసాయము చేయువారికి కూలీలు దొరుకుదురు దినమునకు కూలీరేటు నిపుణుడగు పురుషునకు రు 2-50 లు సాధారణమయిన వానికి 1 రూపాయి

ఈగ్రామమున ఒకశివాలయము మసీదు కలవు ఇచటికి నాలుగుమైళ్ళదూరములో నెక్కొండ రైల్వేస్టేషను ఉన్నది హనుమకొండనుండి నెక్కొండకుపోవు ప్రభుత్వపు బస్సులు మిక్కిలి వ్యల్పన ఖర్మ లవి ఈగ్రామమున ఒకమైలు పొడవుగల రెండు మట్టిరోడ్లుఉన్నవి ప్రయాణమునకు 150 రెడ్ల బండ్లు 16 సైకిళ్లు కలవు

ఈగ్రామమున బ్రాంచిపోస్టాఫీసు ప్రాథమికపాఠశాల విద్యుచ్ఛక్తి ఉన్నవి విద్యుచ్ఛక్తిని 20 ఇండ్లు వడ్లమరలు ఎలెక్ట్రిక్ మోటారులు వాడుకొనును ఇది పంచాయతీ పాలనగల గ్రామము ఇండ్లపన్నులు ఆదాయపుపన్నులు వాహనములపై పన్నులు బందిలదొడ్లపన్నులు మొదలయినవి ఈ పంచాయతీయొక్క ఆదాయమునకు ఆధారములు ఈగ్రామ సహకారసంఘము 45 మందికి అప్పిచ్చినది ఇచట 15 కిరాణాదుకాణములు 2 కిళ్ళీ సిగరెట్లు సోడాదుకాణములు 2 కాఫీదుకాణములు సైకిళ్ళషాపులు కూడ ఇచ్చట ఉన్నవి రూరల్ మెడికల్ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి ఉన్నవి ఇంగ్లీషు వైద్యుడు ఆయుర్వేదవైద్యుడు హోమియోపతివైద్యుడు యునానివైద్యుడుకలరు

సంతలకు పశువుల ఆసుపత్రికి 4 మైళ్ళలోనున్న నెక్కొండకుపోవుదురు ఆసంతలో పశువులు గొర్రెలు బట్టలు కూరగాయలు మొదలగునవి దొరుకును పురుళ్ళ ఆసుపత్రికి జనరల్ ఆసుపత్రికి 12 మైళ్ళలోనున్న నర్సంపేటకుపోవుదురు హైస్కూలు చదువులకు నర్సంపేటకు కళాశాల చదువులకు వరంగల్లుకు విద్యార్థులు పోవుదురు కోర్టుకు పోలీసుస్టేషనుకు సబ్ రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరికి బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు గ్రామస్థులు నర్సంపేట పోవలెను

మా శ్రీ

## అమీనుఖాను

మల్కిభరాముగా తెలుగువారికి సుపరిచితుడైన ఇబ్రహీం కులీకుతుబుషా గోలకొండ సామ్రాజ్యమున క్రీ శ 1550 మండి 1580 వరకు పరిపాలించెను ఆంధ్రకవులను పోషించియు కృతులను అంకితమునొందియు ఇబ్రహీం కుతుబుషా తనకుగల తెనుగు సాహిత్యమునందలి అభిమానమును చాటెను సామ్రాజ్యములోని ఇతర అధికారులును ఈ గోలకొండ ప్రభువు అడుగు జాడలను అనుసరించి తెలుగు కవులను పండితులను ఆదరించి వారి కృతుల నందుకొని కీర్తి గడించిరి అట్టి అధికారులలో ప్రథమగణ్యుడు అమీనుఖాను ఈతని వంశీయులు మూడు తరములు వరకును గోలకొండ ప్రభువులను సేవించిరి

ఆంధ్ర భాషలో మొట్టమొదటి అచ్చ తెనుగు కబ్బమును రచించిన కీర్తి గౌరవములు పొన్నిగంటి తెలగనార్యునకు లభించినవి ఈ కావ్యము (యయాతి చరిత్ర) అమీనుఖానునకు అంకిత మొనరబడినది తెలగనార్యుడు ఈ కావ్య అవతారికయందు అమీనుఖాను వంశమును ఆతని వంశీయుల గుణగణమును విపులముగా వర్ణించెను

అమీనుఖాను గోలకొండ ప్రభువునకు హితవరిగను శాసనల నాటిలోని పొట్లచెరువు ప్రాంతమునకు ప్రధానాధికారిగను ఉండెను ఈతని వంశ వివరములివి –

కర్తారుడు వంశకర్తగా గల ఒకానొక సద్వంశమున దుహుమామియా అనునతడు జన్మించెను చాదుబీబి అతని సతీమణి ఈ దంపతులకు బడేమియా అను పుత్రుడు ఉదయించెను శక్తి గుణ సంపదలకు అతని కీడైనవారెవరును లేకుండిరి బడేమియాకు ఎలారుబీబీ రబబీబీ అను ఇరువురు భార్యలుండిరి సిరారు బీబీవలన అమీనుఖాను సరబబీబీవలన బాబనుమియా అను పుత్రులు కలిగిరి

అమీనుఖానుడు తనగుణగణము చేతను శక్తి సామర్థ్యములచేతను గోలకొండ సుల్తాను మన్ననకు అర్హుడై పొట్లచెరువు ప్రాంతమునకు ప్రధానాధికారిగా నియుక్తుడయ్యెను

అమీనుఖానునకు బడేబీబీ సెక్కరుబీబీ సెమ్మబీబీ అను ముగ్గురు భార్యలుండిరి బడేబీబీ వలన గశాతుఖాను ఫాజిలుఖాను అను పుత్రులును సెక్కరబీబీ వలన అబ్దులీ షేక్‌భరాం అను పుత్రులును సెమ్మెబీబీ వలన అబ్దుల్ కరీం అనుపుత్రుడును కలిగిరి

అమీనుఖాను తనపేర పొట్లచెరువు ప్రాంతమున అమీనుపురమును నిర్మించెను ఈ పురమున దొక తటాకమును కూడ అతడు త్రవ్వించెను అమీనుఖాను డొనరించిన ప్రజాహితకార్యములు పెక్కులు కలవు మారేడు మామిడి దాడిమ పొన్న నిమ్మ ఇప్ప కరూరము మున్నగు వృక్షములతో నొప్పారు తోటలను అతడు నిలిపెను ఇందు నానావిధములైన పండ్లు సమృద్ధిగా పండుచుండెను పురోద్యానవనములతోపాటు ఈతడు చలివ దిబ్బ సత్రములు బావులు పూదోటలు నల్లిండ్లు చెరువులు లిఎయు పొట్లచెరువున దొక మసీదును కట్టించియు కీర్తి వహించెను

ఇట్టి ప్రతిష్ఠలన్నియు ఒకయెత్తు యయాతి చరిత్రమను కావ్యస్వీకృతివలని ప్రతిష్ఠ యొకయెత్తు ఈకృతిని స్వీకరించి అమీనుఖాను తెలుగు వాఙ్మయ చరిత్రలో స్థిరస్థానము చేరాజితుడయ్యెను ఈతడు సరసుడు సాహిత్యప్రియుడు కవులను పండితులను పోషించి వారి కావ్యములను నిండు భలో విని సంతసమంది వారిని సన్మానించెడివాడు ఈతని దర్బారు నలంకరించినవారిలో మరిగంటి అప్పన పొన్నికంటి తెలగనార్యుడు ప్రముఖులుగా కన్పట్టుచున్నారు మరిగంటి అప్పనగారి సూచనను అనుసరించియే తాను రచించిన యయాతి చరిత్రను తెలగనార్యుడు అమీనుఖానునకు అంకితమొసగెను

అమీనుఖాను చదువులకు సరస్వతి సరసుడు ప్రభువుల మన్ననల నొందినవాడు దానశీలుడు దైవమునెడ భక్తికలవాడు భక్తులకెన్నియో విధముల సహాయము చేసినవాడు బ్రాహ్మణులయెడ ఈతనికిగల భక్త్యాదరములు అపారమై వి అన్నింటికంటె విశిష్టగుణమొకటి ఇతనికి గొప్ప ఖ్యాతిని చేకూర్చినది ఇతడు విప్రకన్యలకు ద్రవ్యసాహాయమొసర్చి వివాహము చేయించి గొప్ప పుణ్యమును సంపాదించెను అమీనుఖాను తలపెట్టిన ఇట్టి సత్కార్యములకు దిగులొంది బ్రహ్మచారియగు వాయుకుమారుడు అడవులదూరి తపసియై సంచరించుచుండెడివాడట

అమీనుఖానునకు ఈడగునట్లు అతని సతీసుతులును అనేకములైన సత్కార్యములొనర్చిరి ఈతనిభార్య బడేబీబి లక్ష్మీదేవివలె ఒప్పుచుండెడిది పేదల నాదరించియు బంధువులకు కన్నతల్లిగా వర్తించియు ఈమె వాసిగాంచెను అత్తవారింటికి వెడలు వధువులకు కట్నములిచ్చియు ప్రతి ఉదయము వాడలోని పసిబిడ్డలకు పాలుపోయించియు ఆకొన్నవారికి

అన్నదాన మొనర్చియు భర్త ఆశుగులకు మడుగులొత్తియు పుట్టినింటి మెట్టినింటి వన్నె దెచ్చిన వనితామణి ఈమె అమీనుఖాను రెండవ దేవేరి చుట్టముల పాలిట తగెటిజున్ను మూడవభార్య సెమ్మెబీబి బంధుప్రీతిగల ఇల్లాలు ఆమె మగని చొప్పు రసి వర్తించు ఎగువ

అమీనుఖాను యొక్క పుత్రులును తండ్రివలె వివిధ భాషల దు పాండిత్యము అవారు వారు సాహసకార్యము లొనర్చి ప్రఖ్యాతి అకు పాత్రులైనవారు గతాతుఖానుడు మహావీరుడు పరాక్రమవంతుడు అతడు తేకీనెక్కనట్టి తరి సెవెంగుడకు ఎడమన్న అవరెకీకట ఈతడు అక్బరు చక్రవర్తిచేత మెప్పు అందుకొనినవాడయు విశ్వనాథదేవుని చేత వేనవేలు నుగులు తెచ్చినవాడనియు ఎదులవీటి కేగి కప్పములు గ్రహించినవాడనియు మారనముల్కుబరీదు నిజాం శాహుకు మల్కిభరామునకు న్నులు వ పు ట్లుగా ఒన ర్చిన వాడనియు కన్నడరాజులచేత పొగడ్తకెక్కినవాడనియు ప్రశంస బడెను తండ్రిమాటకు జవదాటని సుపుత్రుడు భగవంతుని యెడ భక్తిభావము కలవారు అరబి పారసి గుజరాతి యారె అచ్చతెలుగు కన్నడి మొదలగు భాషలు తెలిసి చక్కగా వ్రాయగలవారు మహాశూరుడైన గతాతుఖానుని బోలినవారు అరుదు ఈతని తమ్ముడు ఫాజిలుఖానుడును సాటిలేని పరాక్రమవంతుడు ఈతడొక సందర్భమున మహాసైన్యముతోనేగి శ్రీరంగరాయని మెప్పించి మల్కిభరామునకు నెయ్యమును కూర్చినవాడు పరరాజులనుండి అమూల్యములైన కానుకలనెన్నిటినో తెచ్చినవాడు

అబ్దులిలీ అనునతడు మల్కిభరాముపాదుషాయునందు రాయమువాడుగ గౌరవస్థానము నొందినవాడు అరబీ పారసి కన్నడము కన్నడి మొదలగు భాషలు తెలిసిన వాడు అబ్దుల్ రీ సుల్తాను అభిమానమును చూరగొన్న వాడు ఇతడును అరబీ పారశీములందు పండితుడు

ఇట్లు అమీనుఖానుడును అతని పుత్రులును విశిష్ట గుణముచే స్థిరకీర్తి నొందిరి

డా కొ గో

## అమీనుపురము

ఇబ్రహీం కుతుబ్‌షా క్రీ శ 1550 1580 వరకు గోల కొండను పాలించెను ఈతనికి హితవరి ను పొట్లచెరువు ప్రాంతమునకు ప్రధానాధికారిగను అమీనుఖాను అనునతడుండెను పొన్నికంటి తెలగనార్యుని యయాతి చరిత్రము కావ్య మును ఇతడంకితము నొందెను

అమీనుఖాను తన పేర పొట్లచెరువు మీదను అమీను పురమును నిర్మించెను యయాతి చరిత్ర కావ్యావతారిక వలన ఈ పురమును గూర్చిన వివరములు తెలియుచున్నవి

యయాతిచరిత్ర క్రీ శ 1574 90 మధ్యకాలమున రచింపబడినది అమీనుఖాను మల్కిభరాము కాలమున పొట్ల చెరువు ప్రాంతమునకు క్రీ శ 1550 అనంతరము అధికారిగా నియమింపబడియుండును కావున ఈ పురము 1550 70 మధ్యకాలమున నిర్మితమైయుండునని భావించుటకెట్టి సందే హము లేదు

తెలగనార్యుడొనర్చిన వర్ణనను బట్టి ఈ పురము శాహుబలంబున్నదైన రౌతులకు వీరులకు బట్లకు ఆటపాట కత్తియలకు నెలవు అని తెలియుచున్నది ఈ పురమునందు అమీనుఖానుడు ఒక చెరువుకూడ త్రవ్వించి నానాఫలములు సమృద్ధిగానుండు వృక్షములతో అలరారు మేలైన తోటలను కూడ వెలిపెను

డా॥ కొ గో

## అమీర్ ఉల్ ముల్క్

తెలుగు రచయితలు ఈతని పేరు అమీరు ఉల్ ముల్కుగా గ్రహించిరి ముస్లిమ్ చరిత్రకారులు ఇతనిని అమీనుల్ ముల్క్ అనియే వ్యవహరించిరి ఇదియే సరియైన నామమని చెప్ప వలెను వాస్తవమునకు ఇతని పేరు మహమ్మదు అమీను గోల్కొండ రాజ్యమును ప్రవేశించి ఉన్నతస్థానములను అలంక రించిన తరువాత ఈతనికి అమీర్ ఉల్ ముల్క్ అను బిరుదము ఈయబడెను మహమ్మదు అమీను ఇరానుదేశము నుండి వచ్చెను మిక్కిలి చేవరికముతో హిందూదేశమునకు వచ్చి గోల్కొండలో ఆశ్రయమును సంపాదించెను ఈతడు మంచి విద్వాంసుడై సుల్తానుల దృష్టిని ఆకర్షింపగలిగెను మహమ్మదు కులీ కుతుబ్‌షా (1580 1611) కాలమున ఈతడు మీరుజుమ్లా పదవిని అధిష్ఠించెను అమీనుల్ ముల్క్ ఆర్థిక వ్యవహారము లను సైనిక వ్యవహారములనుగూడ చూచుచుండెను అప్పుడు గోల్కొండలో పీష్వా (ప్రధానమంత్రి) పదవిని అధిష్ఠించిన మీరు మొమీను అస్తరుబాది అనువాడడుకూడ విదేశీయుడే ఈతడును ఆకాలమున ప్రముఖ విద్వాంసుడుగను రాజనీతి శాస్త్రజ్ఞుడుగను కీర్తిగాంచెను మీరు మొమీను పర్షియా

దేశమును డి వలసవచ్చెను మధ్యయుగమునందు పర్షియాదేశమును పాలించిన సఫవిడే వంశీయులకును దక్కను సుల్తానులకును నడుమ మైత్రిసంబంధములు చెల్లుచు డెను ఉభయులును ముసల్మానులలోని షియావర్గమునకు చెందుట ఒక ముఖ్యకారణము సఫవిడే వంశమువారిని ఉత్తరహిందూస్థానము లిన మొగలాయీలకును వైరముండెను దక్కను ముస్లిము రాజ్యములను నిర్మూలించుటకు మొగలులు కంకణము కట్టుటకు ఒక ముఖ్యకారణము వారు (దక్కను ముస్లిము రాజ్యములవారు) మొగలులకు ప్రతిస్పర్థులైన పర్షియా సఫవిడే సామ్రాజ్యముతో సఖ్యసంబంధములను నెరపుచుండుటయే యని చారిత్రకులు భావించుచున్నారు మొత్తముమీద విదేశీయులైన ఆగంతకులకు గోల్కొండరాజ్యము మంచి క్షేత్రముగ ఉ డెను ఉన్నతాధికారము అన్నియు సాధారణముగా వారికే దక్కుచుండెను సహజముగనే ఇది స్థానికులైన మహమ్మదీయులకు అసూయాకారణమై దేశీయ-విదేశీయ ముసల్మానుల వైరములు గోల్కొండరాజ్యమున ఆరని నిప్పువలె రాజుచు డెను

ప్రకృతము మనము అమీన్ ఉల్ ముల్కు చరిత్రమును అనుసరింతము మహమ్మదు కులీకుతుబ్ షా సింహాసనమునకు వచ్చుసరికి 15 ఏండ్ల బాలుడు ఈ యదను కనిపెట్టి దూరప్రాంతములందున్న సర్దారులును సామంతులును తిరుగుబాటు చేయుచుండుట ఆచారము గుంటూరులో సేనాధిపతిగా ఉండిన అలీఖాన్ లూరు అనువాడు మహమ్మదు కులీపై తిరుగుబాటు బావుటా యెత్తెను ఇతనికి విజయనగర సామంతుల ప్రోత్సాహము డిన యుండవచ్చును ఉత్తరమునందు గోల్కొండ సామంతుడైన కసింకోట రాజుకూడ తిరుగుబాటు చేసి కప్పము కట్టుట మానివేసెను అమీనుల్ ముల్కు కసింకోట రాజును లొంగదీసి అదుపులో పెట్టెను రాజమంద్రియందును నెల్లూరునందును గూడ ఇట్టి చిన్నచిన్న పితూరీలు తలయెత్తెను అవియన్నియు అణచివేయబడెను

గుంటూరు దుర్గాధిపుని పితూరీ అంత త్వరగా చల్లారినట్లు కనబడదు కృష్ణకు దక్షిణమున విజయ నగరాధికారము పూర్తిగా నశించిపోయెను అదను దొరికినప్పుడు వారిసేనలు గోల్కొండరాజ్య దక్షిణ సరిహద్దున అలజడులు కలిగించుచునే యుండెను అదృష్టవశమున విజయనగరము యొక్క అవశిష్ట సామ్రాజ్యము ఇప్పుడు సమర్థవంతమైన హస్తములకు వచ్చెను రెండవ వెంకటపతి రాయలు క్రీ శ 1586లో రాయసింహాసనాధిష్ఠితుడయ్యెను ఇతడు తన అన్నయగు వెంకటి రాజును అయిన మొదటి శ్రీరంగరాయల కన్న మిన్నగా కార్య ఖడ్గ నైపుణ్యము గలవాడు కూలిపోవుచున్న రాయసామ్రాజ్యమును అంతలో నిలబెట్టుటయు సాధ్యమైనంత వరకును సామ్రాజ్యము యొక్క నష్టభాగములను తిరిగి సంపాదించుటయు ఈతడు తన లక్ష్యములుగ పెట్టుకొనెను కృష్ణకు దక్షిణమునందు ముసల్మానులు విజృంభింపకుండ అరికట్టుట ఈతని ధ్యేయము కావున గుంటూరు నందలి మహమ్మదీయ సేనాపతి గోల్కొండపై తిరుగుబాటు చేసినచో అది విజయనగరము వారికి రాజనీతిదృష్ట్యా విహితముగనే ఉండెను అమీన్ ఉల్ ముల్కు ఈ తిరుగుబాటును అణచివేయుటకును హిందువులను దక్షిణమునకు మళ్ళించుటకును నియుక్తుడయ్యెను రాయసైన్యములు ముందుకు చొచ్చుకవచ్చి ఉదయగిరి దుర్గమును స్వాధీనము చేసుకొనెను దీనికి కాలానందుడను సేనాని దుర్గాధీశుడుగా నియమింపబడెను వెంకటపతిరాయలు అంతలో ఊరుకొనకతన ముఖ్యపట్టణమును చంద్రగిరినుండి పెనుగొండకు మార్చి దానిని బలపరచుచుండెను

శత్రువులిట్లు విజృంభణ నీతిని అవలంబించుచుండగా గోల్కొండవారు ఊరకొందురా? కులీకుతుబుషా సైన్యములు అమీన్ ఉల్ ముల్కు నేతృత్వమున కర్నూలుజిల్లా ప్రాంతమునుండి రాయసామ్రాజ్యముపై బడెను మొదలిమడుగు నంద్యాల కలగూరు మున్నగు దుర్గములను ఆతడాక్రమించెను కులీ కుతుబుషా స్వయముగ ఈ దండయాత్ర యందు పాల్గొనెను

అంతట అమీనుల్ ముల్కు గండికోట దుర్గమును ముట్టడించెను ఇక్కడి దుర్గాధిపతి వెంకటపతి రాయల బంధువగు నరసింగరాజు అనువాడు తురకల ధాటికి ఆగలేక ఈతడును లొంగిపోయెను ఈలోపుగా పెనుగొండచేరిన వెంకటపతి రాయలకు ఊపిరిసలుపకుండుటకై కులీకుతుబుషా పెనుగొండ కోటను ముట్టడించెను రాయలు ఆకోటను దృఢతరముచేయు ప్రయత్నములు ఇంకను పూర్తికాలేదు అతనికి వ్యవధికావలసియుండెను వేంకటపతి మాయోపాయమును అవలంబించెను గోపరాపు తిమ్మమంత్రిని సేనాపతి పాపయ్యశ్రేష్ఠిని కుతుబుషాతో సంధిమాటలు సాగించుచు కాలయాపనముచేయుటకై

వ్యక్తిత్వముకలవారు రాజకీయ చదరంగములో ఎత్తుగడలు వేసి నిలువనోపలేక వీరు మంత్రి పదవిని త్యజించిరి. ఈ త్యాగము ఉర్దూ పారశీక వాఙ్మయ ప్రపంచమునకు మహోపకారమొనర్చినది.

అమీర్ ఫక్రుద్దీన్ గారు అరబీ పారసీ ఉర్దూ ఫ్రెంచి ఆంగ్లభాషలందు పండితులు. ఆనాటి విద్వాంసుల దృష్టిని ప్రణయకవిత్వము కథానికలు మున్నగు సారస్వత ప్రక్రియలనుండి మరల్చి వివిధశాస్త్ర వాఙ్మయ సృష్టికి ప్రోత్సహించిన విద్వాంసులు వీరు. ఫక్రుద్దీన్ గారు ఫ్రెంచి భాషలందుగల అమూల్యములైన గ్రంథములను ఉర్దూ పారసీ భాషలలోనికి అనువదించి శాస్త్రగ్రంథరచనకు రాజమార్గమును జూపిరి. పాశ్చాత్యదేశములలో వెలువడుచున్న శాస్త్రగ్రంథములను ఉర్దూ పారసీ భాషలను అనువదింపజేసి ప్రకటించుటకు వీరు దీక్షవహించిరి. మహోత్కృష్టములైన వివిధశాస్త్రములకు చెందిన బృహద్గ్రంథములను అనువదించుటయు ప్రకటించుటయు సామాన్యులకసాధ్యమైన కార్యము. ఫక్రుద్దీన్ గారు ఆనాడొక మహాసంస్థగా రూపొందిన మహనీయులు. ఫ్రెంచి ఆంగ్లము పారసీ ఉర్దూ భాషాభిజ్ఞులగు పండితులను వేతనములొసగి పోషించి పాశ్చాత్యశాస్త్రగ్రంథముల ననువదించుటకు ప్రోత్సహించిరి. వారి దేవిడీ వివిధభాషలందు కూలంకషమైన పాండిత్యముగల విద్వాంసులకు కేంద్రముగను అనువాద సంస్థగను విలసిల్లినది. అమీర్ గారు దేవిడీలో ఒక ముద్రణాలయమును స్థాపించి అట్టి గ్రంథములను ప్రకటించుటకేర్పాట్లు కూడ కావించిరి. భగవంతుడొసగిన పాండిత్య సంపదను వంశపరంపరగా దత్తమైన సిరిసంపదలను స్వార్జితమైన విత్తమును శాస్త్రవాఙ్మయోన్నతి వికాసములకే అంకితమొనర్చిన త్యాగమూర్తి ఫక్రుద్దీన్ ఖానుగారు.

వీరు గణితశాస్త్రము సంఖ్యాశాస్త్రము జంతుశాస్త్రము భౌతికరసాయనశాస్త్రములు చరిత్ర మున్నగు అంశములపై ఎన్నియో గ్రంథములు ప్రకటింపజేసిరి. ఇందు ఫక్రుద్దీన్ గారు స్వయముగా రచించినవి కొన్ని. ప్రముఖపండితుల సహాయమున సంకలితము చేసినవి మరికొన్ని.

వీరి గ్రంథములలో షమ్సుల్లిందసా రిసాలాఇల్మెజాల్ అనునవి ప్రత్యేకముగ పేర్కొనదగియున్నవి. ఇవి గణితశాస్త్రములోని వివిధఅంశములకు సంబంధించిన గ్రంథములు. ఫ్రెంచి భాషలో మోసియోఖ్లార్క్ గారు రచించిన గ్రంథము ఆధారముగ గొని ఫక్రుద్దీన్ గారు "షమ్సుల్లిందసా" అను గ్రంథమును పారశీకభాషలో రచించిరి. ఈ గ్రంథము చివర తమపుత్రులు రఫీఉద్దీన్ ఖానుగారి చిత్రములు ఉదాహరణార్థము చూపబడినవి. "రిసాలాఇల్మెజాల్" కూడ పారశీకభాషయందు రచితము. క్లిష్టమైన గణితశాస్త్ర సమస్యలను సుబోధకమగు పారసీభాషలో ఫక్రుద్దీన్ గారు వివరించిరి.

క్రీ॥శ॥ 1818 లో లండన్‌లో ప్రకటితమైన రెవరెండ్ చార్లెస్ గారి ఆంగ్లగ్రంథమును ఫక్రుద్దీన్ గారు మీర్ అమాన్ అలీ గులామ్ మొహియుద్దీన్ మున్నగువారిచేత ఉర్దూలో అనువదింపజేసి ప్రకటించిరి. దీని వారు విపులమైన పీఠికకూడ వ్రాసిరి. నీరు గాలి మున్నగు అంశములను వివరించు గ్రంథమిది. ఇది ఆరు భాగములలో ప్రకటితము.

ఆకాలమున దే ఆంగ్లమునందు రచింపబడిన జంతుశాస్త్రమును అమీర్ గారు ఉర్దూలో అనువదింపజేసిరి. ఈ గ్రంథమునందు 120 జంతువులనుగూర్చి వివరింపబడినది. గ్రంథాంతమునందు ఆంగ్ల అరబీ పారసీక నామముల పట్టికకూడ చేర్చబడినది.

రసాయనశాస్త్రమునుగూర్చి రెవరెండ్ జాన్‌టాయిమ్ గారు క్రీ॥శ॥ 18[illegible] లో ప్రకటించిన ఆంగ్లగ్రంథమును ఫక్రుద్దీన్ గారుచూచి సామాన్యులకు ఉపయుక్తమగునట్లు ఉర్దూభాషలో అనువదింపజేసిరి. ఈ గ్రంథమునందలి అంశములను కొన్నిగ్లాసులతో ఒకమూసతో కపాత్రతో మాత్రమే ప్రయోగాత్మకముగ నిరూపించుటకు వీలగును. సామాన్యులకు మిక్కిలి విలువగల ప్రయోగోపకరణములు అందుబాటులో నుండవు కనుక ఇట్టి సామాన్యఉపకరణములచేత ప్రయోగముల ద్వారా రసాయనశాస్త్రాంశములను వివరించు అమూల్యమైన గ్రంథమును అనువదింపజేసి శాస్త్రవాఙ్మయమునకు ఫక్రుద్దీన్ గారు అమూల్యమైన సేవనొనర్చిరి.

అమీర్ గారు సంతరింపజేసిన చారిత్రకాంశములకు సంబంధించిన గ్రంథములలో జమాల్ వఖాయే తారీఖ్ అనునది అత్యంత విశిష్టమైనది. ఇందు క్రీ॥శ॥ ఆరంభము నుండి క్రీ॥శ॥ 1846 వరకుగల ముఖ్యమైన చారిత్రక సంఘటనలు కాలక్రమానుసారము వివరింపబడినవి. ఇందు ప్రపంచచరిత్రయే గాక భారతదేశచరిత్రకును దక్షిణాపథ చరిత్రకును సంబంధించిన అనేకవివరములు చేర్చబడినవి. ఈ చారిత్రకాంశములను తమపోషణలోనున్న అనేకపండితుల సహాయమున అమీర్

గారు సంతరించి ప్రకటించిరి

ఫక్రుద్దీన్‌గారి సుపుత్రులు తండ్రివలెనే విద్వాంసులు శాస్త్ర వాఙ్మయకారులుగ ప్రశస్తి వహించిరి. పెద్దపుత్రుడు రఫీఉద్దీన్‌ఖాను "రిసాలాఇల్మెహిందసా" రఫీఉల్లిసాబ్, రఫీఉప్రర్, రఫీఉలత్, రఫీఉల్అర్కబ్ అను గ్రంథములను ప్రచురించెను. గణితశాస్త్రము లోని భిన్న భిన్నములైన అంశములను సుబోధముగ రఫీఉద్దీన్‌ఖాను కూర్చెను. రెండవ పుత్రులు బదర్ఉద్దీన్‌ఖాన్‌గారు కవులు. పండితులు చిత్రకారులు. గోడతో వీరు చిత్రించిన రేఖలు చిత్రములు ప్రశస్తములైనవి. మూడవ కుమారుడు ఎల్తానుద్దీను. ఈతని పుత్రుడు వజీరుద్దీను తాతగారివంటి పండితుడు.

ఫకరుద్దీన్‌గారి గ్రంథరచనకు నాటి ప్రముఖ కవీశ్వరుడు ఫైజ్‌గారి ఆశీస్సులు లభించినవి. ఫైజ్‌గారు అమీర్‌గారి ప్రతి గ్రంథమునందును ఒకటిరెండు పద్యములు చేర్చియుండెను.

ఫక్రుద్దీన్‌గారు జహానుమాలో భూగోళదర్శినిశాలను నిర్మించిరి. ఆప్రాంతమున దుకాణ వివిధమార్గములు మార్కెటులు మున్నగువానిని గణితశాస్త్రమును అనుసరించి శాస్త్రీయముగా కొలతలు నిర్ణయించి నిర్మింపజేసిరి. ఈ నిర్మాణమునందు వారికిగల శాస్త్రవైదుష్యము స్పష్టమగుచున్నది. వీరు సమకాలిక రచయితలను కవులను పండితులను ఎందరినో ప్రోత్సహించి తన్మూలమున కీర్తిగడించిరి.

డా కొ గో

## అమీర్ సయ్యద్ అహమదు మాసూమ్

అతిపవిత్రమైన మక్కాలో సంపన్న విద్వత్కుటుంబమొకటియుండెను. ఆ వంశీయులందరును బహువిధ శాస్త్ర విజ్ఞాన పారీణులు. అరబీసాహిత్యమున అపారమైన సేవచేసినవారు. వారిలో మహమ్మద్ మాసూమ్ అను పండితుడు సుప్రసిద్ధుడు. ఈతడు కొన్నిరాళ్లు పిరాజునకు వెళ్లి మరల స్వరాష్ట్రమగు మక్కాకువచ్చి స్థిరపడెను. మహమ్మద్ మాసూమ్ అమీర్ నాసరుద్దీన్ కూతురగు ఫాతిమాను వివాహమాడినట్లు కొందరును, రెండవ షాహాఅబ్బాస్ సఫవీ సోదరిని పరిణయమాడినట్లు మరికొందరును చెప్పుచున్నారు. మహమ్మద్ మాసూమునకు ఈ రాజకుమారివలన సయ్యద్‌అహమద్ క్రీ శ 1617లో జన్మించెను. ఈతని పూర్తిపేరు అమీర్ నిజాముద్దీన్ సయ్యద్ అహమద్ బిన్ మాసూమ్. సయ్యద్ అహ్మద్ మాసూమ్ అని ఈతనిని బహుళముగ వ్యవహరించిరి.

సయ్యద్ అహమద్ మాసూమ్ బాలమంతయు మక్కాలో గడచినది. వంశసంప్రదాయానుసారముగా ఇస్లామత సంబంధమైన మతవిద్యలను ఇతర శాస్త్రవిద్యలను అభ్యసించి తండ్రివలె గొప్పపండితుడును కవియును ప్రశస్తి వహించెను.

ఆ కాలమున అరేబియా పారశీక దేశవాసులైన పండితులు భారతదేశమందలి వివిధ ప్రాంతములకువచ్చి రాజుల నాశ్రయించి గౌరవసన్మానములొందుచుండిరి. ఇట్లు దక్షిణాపథమున దక్షిణ బహమనీ రాజులను గోల్కొండ కుతుబుషాహీ ప్రభువులనుదర్శించి గౌరవసన్మానములొందిన అరబీ పారశీక పండితులెందరో ఉండిరి. వీరిలో కొందరు కొంతకాలము వరకు మాత్రమే నివసించి స్వదేశమేగుచుండిరి. మరికొందరు ప్రభుసన్మానములొంది ఆయాప్రాంతములందు స్థిరపడుచుండిరి. అపూర్వమైన మేధావంతులను విద్వాంసులను ప్రభువులే స్వయముగా తమ రాజ్యములకు ఆహ్వానించుచుండిరి. క్రీ శ 1626-1672 వరకు గోల్కొండనేలిన అబ్దుల్లా కుతుబుషా సయ్యద్ అహమ్మద్ మాసూమ్ అను విద్వాంసుని తన రాజ్యమునకు పెక్కుమార్లాహ్వానించెను. తొలిదశలో సయ్యద్‌అహమద్ అబ్దుల్లా అహ్వానమును లెక్కపెట్టలేదు. కాని చివరకు గోల్కొండ ప్రభువు బలవంతమువలన అతడు మక్కానువదలి క్రీ శ 1645లో గోల్కొండకువచ్చెను. అబ్దుల్లాకుతుబుషా ఈతని కవితాశక్తిని పాండిత్యవైభవమును ప్రశంసించి తన దర్బారులో ఇతనికి ప్రత్యేక గౌరవస్థానమునొసగి తన రాజ్యములో ఒక అమీర్‌గా గౌరవించెను. అతియేకాకవిశిష్ట సంస్కృతీ సంపన్నమైన అతనివ్యక్తిత్వమునకు ముగ్ధుడై అతనికి అబ్దుల్లా కుతుబుషా తన పెద్దకూతురి నొసగి వివాహముచేసెను. మక్కాలోనున్నపుడే సయ్యద్‌అహమదు వివాహితుడు. అతనికి ఇద్దరు పుత్రులును ఒక పుత్రికయునుండిరి. గోల్కొండ రాజకుమార్తెను వివాహమాడినతరువాత సయ్యద్‌అహమద్ ఇచ్చటనే స్థిరపడుటకు నిశ్చయించుకొనెను. మొదటి భార్యకు సయ్యద్ అలీసద్రుద్దీన్ అను పుత్రుడు క్రీ శ 1642 సం॥ లో కలిగెను. అతడు యుక్తవయస్కుడైన తరువాత గోల్కొండకువచ్చి తండ్రియొద్దనే నివసించెను.

సయ్యద్ అహమదు గోల్కొండలోని రాజభవనములో కొంతకాలము మాత్రమే వసించి తదుపరి హైదరాబాదులో నిర్మించుకొనిన సుందర సౌధమునకు తన నివాసమును మార్చెను

అతని విమూత్న సౌధము అరబీ కవితా సౌరభముతో గుభాళించి గోలకొండలోని కవులకును ఆశ్రయ ప్రాంతమునుండి వచ్చిన పండితులకును ఈతని భవనము గోష్ఠికేంద్రముగా విలసిల్లినది కావ్యగానములు శాస్త్రచర్చావేశములు పెక్కులు జరుగుచుండెను సయ్యద్ అహమదు వేలకొలది ధనము వెచ్చించి కవి పండితులను సన్మానించుచుండెను అరేబియాదేశమునుండి వచ్చిన కవుల కెందరికో తోడు పోషించెను ఆతని పుత్రుడు సయ్యద్ అలీ బద్రుద్దీనుకూడ ఉత్తమశ్రేణికి చెందిన కవిపండితుడుగా రాణించి తండ్రి ప్రశస్తిని ఇనుమడింపజేసెను

సయ్యద్ అహమ్మదునకుగల అరబీ సాహిత్యపోషణాసక్తియు ఆతని ఉదారగుణ సన్నతయు మక్కా హిజాజు యమన్ సిరియామున్నగు దేశములనుండి విద్వాంసుల నాకర్షించినవి ఆతని దర్బారు అలంకరించిన విద్వచ్ఛ్రేణ్యులలో అల్ షేక్ అహమ్మదు సయ్యద్ హసన్ జమాలుద్దీన్ మున్నగువారు ప్రముఖముగా పేర్కొనబడుచున్నారు

సయ్యద్ అహమదు స్వయముగా కవి గొప్ప పండితుడు ఈతడు అరబీభాషయందు సంప్రదాయబద్ధమైన రచన లొనరించెను వీనిలో కొన్ని గీతికలు లేఖలుమాత్రమే నేడు లభించుచున్నవి అరేబియాదేశసౌందర్యమును అచ్చటి ప్రకృతిరామణీయకమును స్త్రీసౌందర్య విలాసములను అబ్దుల్లా కుతుబుషామున్నగు రాజన్యులను ఈకవి సందర్భానుసారముగ ప్రశంసించెను పండితమిత్రులకు వ్రాసినలేఖలలో సయ్యద్ అహమదు మక్కాసీమలో నివసించిననాటి మధురస్మృతులను రమణీయముగ చిత్రించెను లలితమైన కూర్పుకాని శబ్దాడంబరముకాని ఇతని కవిత్వమునందు కన్పించదు సహజసుందరమైన శైలిలో భావములను సున్నితముగను సుకుమారముగను వ్యక్తీకరించుటయందీతని లేఖనీశక్తి పటిష్ఠమైనది సమకాలిక కవులు సయ్యద్ అహమదు కవితాసౌందర్యమును బహుముఖశాస్త్రపాండిత్యమును వేనోళ్ల ప్రశంసించియున్నారు

కవి పండితుల పోషించుటయందే కాక సయ్యద్ అహమ్మదు అబ్దుల్లా కుతుబుషా పెద్దల్లుడగుటచే రిపాలనా వ్యవహారములందును శ్రద్ధచూపెను రాజ్యమునందీతడు వజీరుగనుండి ప్రధానాధికారబాధ్యతలనువహించెనని కొందరు చరిత్రకారుల వ్రాతవలన తెలియుచున్నది కాని సయ్యద్ అహమ్మదు ఎట్టి పదవియందును నియుక్తుడుకాలేదు అచిరకాలముననే ఆతడొందిన ప్రాభవోన్నతులజూచి స్థానికాధికారులు ఈర్ష్యాళువులైయుండిరి రాజ్యవ్యవహార నిర్వహణమునందాతనకిగల ప్రాధాన్యమును కొందరికి సహింపరానిదయ్యెను గోలకొండ సింహాసనమునకుగల వారసత్వరీత్యా అతనికిగల ప్రాధాన్యమువలన రాజ్యములో సయ్యద్ అహమదునుగూర్చి ద్వేషభావములు ప్రబలినవి అబ్దుల్లా కుతుబుషాకు పురుషసంతానములేదు అతనికి ముగ్గురు కూతుళ్లు మాత్రమే వారి పెద్దకూతురును సయ్యద్ అహమ్మద్ పరిణయమాడెను రెండవకూతురును సంధిపణముగ మొగలు రాజకుమారునకిచ్చి పెండ్లిచేసిరి అబ్దుల్లా తన కనిష్ఠపుత్రికను అరేబియానుండి గోలకొండకువచ్చి స్థిరపడిన సయ్యద్ సుల్తాన్‌నకిచ్చుటకు నిశ్చయించుకొనియుండెను కాని చివరిక్షణములో కుతుబుషాహివంశీయుడైన అబుల్ హసనునకొసగి వివాహము గావించెను మొగలు చక్రవర్తితో జరిగిన సంధిప్రకారము రెండవ అల్లుడు గోలకొండ సామ్రాజ్యమునకు వారసుడు కాని ఆ రాజకుమారుడు తండ్రి ఆగ్రహమునకు గురియైనిర్బంధములోనుండి ట్టస్థలోనే కాలధర్మమునొందెను పెద్ద అల్లుడైన సయ్యద్ అహమ్మదు చిన్నఅల్లుడైన అబుల్ హసన్ మాత్రమే వారసులుగ నిలచిరి

ఆకాలమున గోలకొండకు పారశీ దేశమునుండి వచ్చినవారికిని అరేబియాదేశమునుండి వచ్చినవారికిని లోలోన వర్గకలహము లేర్పడియుండెను పారశీ దేశవాసులు సంఖ్యలో అధికులగుటచే రాజ్యమునందు ప్రబలులైయుండిరి సయ్యద్ అహమ్మదు శత్రువర్గము వారాతనిని గర్వితుడనియు దురహంకారియనియు దురుసుతనము గలవాడనియు చిత్రించి అబ్దుల్లా కుతుబుషాకు దురభిప్రాయము కల్పించుటలో సఫలులైరి రాజ్యములో కుతుబుషాహీ వంశీయుడగు అబుల్ హసను అభిమానులు బలపడిరి క్రమముగా అబ్దుల్లా కుతుబుషాకు పెద్దల్లునియందుకంటె చిన్నల్లునిపై ఎక్కువ అభిమానము కలిగినది కాని అతడు సయ్యద్ అహమ్మదునకు జంకి ఎన్నడును తన హృదయగత అభిప్రాయమును బహిరంగముగ చాటలేదు

అబ్దుల్లా వర్తనములో కలుగుచున్న మార్పును సయ్యద్ అహమ్మదు త్వరలోనే గుర్తించగలిగెను రాజ్యములోని ప్రత్యర్థివర్గమువలన తనకుగల ప్రాభవోన్నతులుకూడ సన్నగిలుచుండినట్లు గ్రహించి అతడు బాధపడెను ఒకటి రెండు సందర్భములందు తన మనోవ్యథను అబ్దుల్లా కుతుబుషాకు నివేదించినట్లు అతని అరబీగీతికలు ప్రబల సాక్ష్యములుగానున్నవి అబ్దుల్లా క్రీ శ 1672 లో మరణించుటతో వారసత్వ వివా

యగు రాజేంద్రచోడదేవునకు వర్తించునవియేమో ఇట్లైన గొంకయబోయడు సామాన్యవ్యక్తి కాడు ఖండ భీమ ఆహవరక్కస దాయగజ సహ ఇత్యాది బిరుదులను ఇతనికికలవు ఈతని ఏలికయగు రాజేంద్రచోడదేవుడు వెలనాటి చోడవంశమునకు చెందినవాడని సులభముగనే గుర్తింపవచ్చును వెలనాటి చోడులు కాంచీపుర చక్రవర్తులైన చాళుక్యచోడులకు సామంతులై ఆంధ్రదేశ తీరప్రాంతమును క్రీ శ 12 శతాబ్దమున పాలించిరి రాజేంద్రచోడునకు చాళుక్యమూలస్తంభ అను ప్రశస్తి ఉచితముగనేయున్నది

ఇది మొదటి కులోత్తుంగచోడుని కుమారుడైన విక్రమచోడుని (క్రీ శ 1118 ?) రాజ్యకాలము కులోత్తుంగుని రాజ్యావసానకాలమున పశ్చిమచాళుక్యులు వేంగిదేశముపై దండెత్తివచ్చి దాని నాక్రమించుకొని 1185 సంవత్సరమువరకును పాలించిరి వెలనాటిచోడులకు వేంగిపై అధికారము సన్నగిల్లిన సమయమది వెలనాటి రాజేంద్రచోడుడు ఆపేరు గలవారిలో మొదటివాడు ఇతనితండ్రి మొదటి గొంకరాజు వెలనాటి రాజ్యస్థాపకుడితడే వెలనాటి మొదటి రాజేంద్రచోడుడు పశ్చిమచాళుక్యుల దుర్దమబలమును గుర్తించినవారికి సామంతుడై వారితో సఖ్యతను పాటించియుండవచ్చును చాళుక్యరాజ్యమూలస్తంభ అను బిరుదమితనికి ఈరీతిగవచ్చియుండును కాని వెలనాటివారు పశ్చిమచాళుక్యులకు దాసోహమని చిరకాలముండలేదు వారికి కాంచీపుర చోళులతోనే ఎక్కువ సన్నిహితత్వము కావున ఆంధ్రమండలాధీశులందరును చేతులుకలిపి పశ్చిమ చాళుక్యులను వెడలనడచుటకు ప్రయత్నములు చేయుచునుండిరి పశ్చిమచాళుక్య చక్రవర్తి ఆరవ విక్రమాదిత్యుని మరణానంతరము వీరికి కాలమనుకూలించెను చాళుక్యుల ప్రచండసేనానియైన అనంతపాల దండనాధుడుకూడ ఆంధ్రదేశమున ఇప్పుడులేడు అతడు మరణించెనో లేక అన్య ప్రాంతములకు పాలకుడుగా పోయెనో తెలియదు ఈ యదనుచూచుకొని ఆంధ్రవీరసేనానులు పశ్చిమ చాళుక్యులను క్రమముగా కృష్ణకు దక్షిణమునుండియు తుదకు గోదావరికి ఉత్తరమునకు తరిమివేయగలిగిరి క్రీ శ 1185 ప్రాంతమున జరిగిన గోదావరీతీర మహాయుద్ధమే దీనికి పరిఘట్టమని చెప్పుదురు వెలనాటివారును చోళులును ఈ సంగ్రామమునందు సంపూర్ణవిజయమును సాధించి పశ్చిమచాళుక్యుల ప్రాబల్యమును తొలగించిరి అనుటకు నూరు శాసనదాతయైన గొంకయబోయడు ఏవో పెక్కు రణాంగములందు పరాక్రమము నెరపుటచేతనే ఈతనికి ఖండనభీమ ఆహవరక్కస బిరుదములు లభించినవి ఈతని పేరునుబట్టిచూడ వీనివంశమువారు వెలనాటిచోడులకు ఇష్టభృత్యులని తోచుచున్నది కావుననే మొదటిగొంకరాజు పేరు ఇతనికి పెట్టబడియుండును ఇతడు స్వతంత్రరాజు కాకపోయినను ప్రసిద్ధవీరుడగుటచే మహామండలేశ్వర గౌరవమునకు అర్హుడయ్యెను

ఖం ల రం

## అమృతపురము

ఈ గ్రామనామము గుంటూరు జిల్లా గుంటూరు తాలూకా కొన్నలగడ్డ గ్రామమందలి అమరేశ్వరాలయమునందు వేయించబడిన ఒక శాసనములో కన్పించుచున్నది (ద హిం X నెం 215) ఇట్టి పేరుగలదియే అమృతలూరు (చూ అముతునూరు) తెనాలి తాలూకాలో ఉన్నది కృష్ణాతీరమందలి అమరేశ్వరదేవుని పేరనే ఆయా గ్రామనామములు ఏర్పడియుండవచ్చును

ఈ శాసనమును సంస్కృత శ్లోకములలో వ్రాసిరి వెలనాటి విషయమునందు విద్వాంసులైన విప్రులతో నొప్పు అమృతపురము కలదు ఈగ్రామమునందు హారితాన్వయుడగు భీమపండితుడు కలడు అయన కుమారుడు తిక్కన తిక్కన పండితుని తనయుడు అమ్మన ఇతడు గొప్ప శూరుడు చోడక్షితిపాలునికడ భటుడై పరాక్రమముచే ఇతడు ఆయనను మెప్పించి ఆయన ప్రసాదసూచకముగ భూషణములచే అలంకృతుడయ్యెను అమ్మనవల్లభేశ్వరదేవునకు జయఘంటను ధూపదీపహారతులను భక్తితో సమర్పించెను

శాసనమునందు కాలము చెప్పబడలేదు ఈ చోడరాజెవ్వడో గుర్తించుటకును సూచనలు లేవు వెలనాడును చోడ క్షితిపాలుడును చెప్పబడుటచే అమ్మన వెలనాటిచోడుల వద్ద సైనికుడని తోచుచున్నది

ఖం ల రం

## అమృతలూరి మంచిరాజు

మంచిరాజు ప్రశంస దక్షిణహిందూ శాసనములలో కనవచ్చుచున్నది (ద హిం IV నెం 1086 పు 362) ఈ శాసనము శక 1085 (క్రీ శ 1163) నాటిది ఇది ద్రాక్షారామ భీమేశ్వరాలయములో ఉన్నది ఈ శాసన మిట్లున్నది "శక

1085 గునేంటి శ్రీరాజరాజ సంవత్సర 18 గ్రాహ విషువ సంక్రాంతి నిమిత్తమున శ్రీమన్మహామండలేశ్వర కులోత్తుంగ వెలనాణ్టి రాజేంద్రచోడయ (రాజు) ల ప్రధాని అమృతలూరి మంచిరాజు కొడుకు దేవనప్రెగ్గడ శ్రీ భీమేశ్వర మహాదేవరకుం బెట్టిన అఖండ కర్పూరవర్తి లోహదండు దివియ 1 ణ్టి బోలు (న) లువురుం బూణ్టగా రెణ్డవు నడపున పణ్డనూ కనివ మునం బెట్టిన ఇనుప ఎడ్లు 50 ణ్టికి ఆచంద్రార్కము నిత్యపడిగొలవం గల త్రిభువనా (క్క) (శ) నేమాన 1 లికిత పెద్దనాచార్య్యే (౯) ౯

ఈ శాసనము మొదట సంస్కృతమున శార్దూల వృత్తములతో ఆరంభింపబడినది అట్లు ఎనిమిదవ పంక్తివరకు సంస్కృతములో నేడున్నది రెండవపంక్తి మొదలుకొని ఎడవ పంక్తివరకు అచ్చుటచ్యుత స్ఖాలిత్యములున్నవి అందుచేత సంభావము సమగ్రముగ తెలియవచ్చుటలేదు తొమ్మిదవ పంక్తి నుండి పన్నెండవపంక్తి వరకు తెలుగులో ఉన్నది తదాధారముగ శాసనభావము సంగ్రహముగ ఇట్లున్నది అది క్రీ శ 1163 వ సంవత్సరము చాళుక్యచోళరాజ్యమును రెండవ రాజరాజచోళుడు పాలించుచుండెను ఈతని సామంతుడును మండలాధిపుడునైన కులోత్తుంగ వెలనాటి రాజేంద్రచోడయకు ప్రధానియు అమృతలూరి మంచిరాజు కొమరుడు నగు దేవనప్రెగ్గడ శ్రీ భీమేశ్వర స్వామికి కర్పూరహారతియు దీపమును వెలిగించు నిమిత్తము ఒక లోహస్తంభమును చేయించి ఇచ్చెను పరమేశ్వరునకు ప్రతినిత్యము దీపకర్పూరహారతులు జరిపించుటకై ఎండనూనిని వశమున 50 ఇనుపఎడ్లను (గొర్ఱెను) ఉంచెను ఈ దానము విషువత్సంక్రాంతి పుణ్యకాలము నిమిత్తముగ చైత్ర బహుళ విదియనాడు జరిపినట్లు తెలియుచున్నది దానకర్తయైన దేవనప్రెగ్గడ ద్విజన్మాగ్రణి యాచకులకు అమరభూరుహము వంటివాడు శౌర్యముచే మృగపతిని గాంభీర్యముచే సముద్రుని జయించినవాడు ధర్మరాజుతో సమానుడు అని శాసనమున అతడు నుతింపబడెను ఈ విషయములు శాసన ప్రారంభమున వ్రాయబడిన సంస్కృతశ్లోకములవలన తెలియుచున్నవి మంచిరాజును గూర్చిన వివరములు శాసనమున కనిపించుటలేదు శాసనమున కనవచ్చు రెండవ రాజరాజ చోళునియొక్కయు వెలనాటి మాండలిక మహారాజుల యొక్కయు చరిత్ర సంగ్రహముగ ఇట్లున్నది

రాజరాజనరేంద్రుడు తూర్పు చాళుక్య వంశీయుడు అతడు వేంగిరాజ్యమును పాలించెను అతని ఎమ్మట అతని రాజరాజనరేంద్రుని కుమారుడు రాజేంద్రచోళుడు వేంగిరాజ్యమునకును మేనమామల రాజ్యమగు చోళరాజ్యమునకును క్రీ శ 1070 స రాజయ్యెను ఇతడు సుమారు 50 సంవత్సరములు వేంగి చోళరాజ్యములను పాలించెను ఈతని కొమరులు వేంగి దేశ పాలనమునకు ప్రతినిధులుగ పంపబడిరి ఈ రాజేంద్రచోళునకే కులోత్తుంగచోడుడను పేరుకూడ కలదు వీరికిని పశ్చిమ చాళుక్యులకును శత్రుత్వము గలదు పశ్చిమ చాళుక్యులు కన్నడదేశమును పాలించిరి త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు అను పశ్చిమ చాళుక్యరాజు వేంగిదేశమును కబళింపచూచుచుండెను ఇందుచే తన కొమరులకు సహాయులుగ నుండుటకు కులోత్తుంగచోడుడు తనకు విశ్వాసపాత్రులైనవారికి రాజచిహ్నములనొసంగి వారిని మండలాధిపతులనొనర్చెను ఈ మండలేశ్వరులు చాళుక్య చోళమహారాజులకు సామంతులు వీరు ఆ ప్రదేశములోని వేరువేరు మండలములను పాలించిరి వీరిలో మొదటివారు వెలనాటి దుర్జయవంశీయులు వీరుగాక చాగివారు (విజయవాడ గుడిమెట్ట పాలకులు) కోటవారు (ధరణికోట పాలకులు) హైహయులు (పలనాడు కోన ప్రాంత పాలకులు) తెలుగుచోళులు (కొణిదెన నెల్లూరు పొత్తపి పాలకులు) తెలుగునాయకులు (కొలనివీడు ప్రభువులు) కమ్మనాయకులు (కొండపడమటి ప్రభువులు) కలరు వీరందరును ఆ ప్రదేశములోని ఒక్కొక్క ప్రాంతమును పాలించుచు కులోత్తుంగ మహారాజుకు సామంతులుగ ఉండిరి గుంటూరు జిల్లాలో కృష్ణానది దక్షిణమున సముద్రమువరకును కల ప్రదేశమునకు పూర్వము వెలనాడు అని పేరుండెడిది దానిని వెలనాటి రాజులు పాలించుచుండిరి వీరికి రాజధాని ధనదప్రోలు (గుంటూరు జిల్లాలోని చందవోలు) క్రీ శ 1120 ప్రాంతమున కులోత్తుంగచోడుడు మరణించెను అదే సమయమున పశ్చిమచాళుక్యరాజు విక్రమాదిత్యుడు వేంగీదేశముపై దండెత్తి దానిని వశమొనర్చుకొనెను ఆంధ్ర మాండలికులు కన్నడ ప్రభువునకు సామంతులైరి ఇట్లు క్రీ శ 1126 వరకు గడచెను విక్రమాదిత్యునకు ఎమ్మట అతని కొడుకు భూలోకమల్ల సోమేశ్వరుడు రాజయ్యెను వెలనాటిమాండలిక ప్రభువులలో చోడరాజు కుమారుడగు రెండవ గొంకరాజు పశ్చిమ చాళుక్యులను ఓడించి వేంగిరాజ్యమును తిరిగి చాళుక్యచోళమహారాజునకు అర్పించెను ఆనాడు వెలనాటిమాండలికులు ఉత్తరమున మహేంద్రగిరినుండి పాకనాటివరకు (నెల్లూరుప్రాంతము) ఉన్న దేశమును

పాలించిరి ఈ రెండవ గొంకరాజు కుమారుడే మనకు శాసనమున కన్పు రెండవ చోడరాజు ఇతడు క్రీ శ 1163 నుండి 1181 వరకు రాజ్యమును పాలించెను ఈ మండలేశ్వరులును కులోత్తుంగ అను బిరుదమును వహించుచుండిరి వీరు పశ్చిమ చాళుక్య బిరుదములనుగూడ ధరించుచుండిరట్లు తెలియుచున్నది శాసనమునందలి త్రిభువనాంకుశ అను పదము దీనిని స్థిరపరచుచున్నది ఈ రెండవ చోడరాజు (శాసనములోనివాడు) చాళుక్య చోళచక్రవర్తియగు రెండవ రాజరాజునకు సామంతుడు రెండవరాజరాజు పాలనము క్రీ శ 1145 నుండి 1173 వరకు అయినట్లు తెలియుచున్నది శాసనమునందలి "శ్రీ రాజరాజ సంవత్స 18 ప్రవర్తమానే" అనునది దీనిని బలపరుచుచున్నది అనగా చాళుక్య చోళరాజగు రెండవ రాజరాజు ఈ దానకాలమునాటికి చాళుక్య చోళరాజ్యము కు పాలకుడై 18 వ సంవత్సరము జరుగుచున్నట్లు మనకు విశదమగుచున్నది ఈ మహారాజు సామంతుడే వెలనాటి రాజేంద్ర చోడుడు ఈ రాజేంద్రచోడుని అమాత్య శేఖరుడే అమృతలూరి మంచిరాజు కుమారుడగు దేవన ప్రెగ్గడ

వెలనాటి మాండలిక ప్రభువులు శైవులని తోచుచున్నది వీరు దేవాలయములను నిర్మించియు వేదశాస్త్ర అధ్యయనములను వృద్ధినొందించియు గొప్పపేరుపొందిరి తెలుగు భాషను తెలుగు కవులను వీరు మిక్కిలి ఆదరించిరి సంగీతసాహిత్య నృత్య శిల్పాది లలితకళలను వీరు మిక్కిలి ప్రోత్సహించిరి దేవాలయాదులకు పెక్కు దానముల నొనర్చిరి వీరు ప్రజాహిత తత్పరులని తెలియుచున్నది వీరి స్వభావమును బట్టియే వీరి మంత్రివర్యులును సేనానులును గొప్పదాతలైరి అమృతలూరు గ్రామనివాసముచే మంచిరాజు పూర్వులకు అమృతలూరు అను గృహనామమేర్పడెనేమో! గ్రామనామములు గృహనామములగుట తెల్లమేకదా! "అమృతలూరు" అను గ్రామము నేడు గుంటూరు మండలములోని తెనాలి తాలూకాలో కలదు ఈ గ్రామములోని పట్టాలమ్మ ఆలయము చెంతనున్న పోతరాజు విగ్రహముపైనున్న శాసనములో అముతునూరు అని ఈ గ్రామము పేరుగలదు ఈ శాసనము శక 1054 (క్రీ శ 1132) నాటిది అమృతలూరు అనుదాని యొక్క ప్రాకృత రూపమే అముతునూరు కావచ్చును ఈ గ్రామమునందలి అమృతేశ్వర దేవరకు శ్రీమన్మహామండలేశ్వర గొంకయబోయడు అఖండ వర్తి దీపమునకై పదిది గొఱియలను సోమన చెంతనుంచెను సోమన నిత్యము దీపారాధనకై మానెడు నేతిని పోయవలెను గొంకయబోయడు చలమర్తిగండ రాజేంద్రచోడ దేవ దివ్య శ్రీపాద పద్మారాధకుడు చతుర్థ కులజుడు (ద హి X సెం 90) అని ఈ శాసనమునకలదు

తం అం శా

## అమృతలూరు

అమృతలూరు తెనాలి తాలూకా గుంటూరు జిల్లాలో ఉన్నది దీనికి 9 మైళ్ల దూరములో తెనాలి పట్టణము కలదు తూర్పున పాంచాళవరం పడమట తురుమెళ్ళ ఉత్తరమున పెదపూడి దక్షిణమున గోవాడ ఈ గ్రామమునకు సరిహద్దులు దీని విస్తీర్ణము 3704 ఎకరములు

1961 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామములో 3033 మంది పురుషులు 2 86 మంది స్త్రీలు మొత్తము 59 9 మంది ఉండిరి ఈ సంఖ్యలో 6 5 సం॥ల బాలబాలికలు 9 4 మంది ఎరుకలు కోయలు మొదలగు పురుషులు 42 మంది స్త్రీలు 36 మంది షెడ్యూలుజాతులవారు 277 మంది షెడ్యూలుతరగతులవారు 184 మంది 1931 సం॥ లో 4334 మంది 1941 సం॥ లో 4836 మంది 1951 సం లో 6125 మంది జనులు ఉండిరి 1951 సం॥ నుండి 1961 సం॥ వరకు జనాభాలో తగ్గుదల 1.6 మంది ఇచ్చట ఇండ్లు మారదూరము గను ఏకపంక్తిగను కట్టబడి వి హరిజనులఇండ్లు వాడవాడలుగ ఉన్నవి ఇండ్లలో 433 పెంకుటిండ్లు 72 కాంక్రీటు కప్పుగలఇండ్లు 6 ఒకఅంతస్తుగల మేడలు ఉన్నవి వీధులు దీర్ఘ చతురస్రాకారముగ ఉన్నవి జనులందరు వరి అన్నమును తిందురు బావినీటిని త్రాగుదురు పరిశుద్ధము చేయబడిన జల సౌకర్యము కలదు నీటిఎద్దడిలేదు

ఈ గ్రామమునకు కృష్ణానది కాలువలు నీటివనరులు 1968 69 సం॥ లో పంటల క్రింద 3387 ఎకరముల భూమి ఉపయోగించబడినది కాలువక్రింద 3 111 ఎకరముల భూమి సాగైనది వరి పెసర మినుము మేతపైర్లు పండెను ఫలసాయములను పురులలో గోడౌనులలో నిలువచేసిరి బండ్లపై లారీలపై వరి పెసర మినుములను తెనాలికి రవాణాచేసిరి 9 ఎకరముల విస్తీర్ణముగల నారింజ నిమ్మతోటలున్నవి 90 000 కాయలను స్థానికులు ఉపయోగించుకొని 135 000 కాయలను తెనాలికి రవాణాచేసిరి స్థానికఉపయోగమునకు పొట్ల బీర మొదలగు కూరగాయలనుపండించిరి ఆరు ఆయిలు

ఇ జనులు 11 ఎకరములకు నీటిని సరఫరాచేసెను మూడు ట్రాక్టర్లు 460 ఎకరములభూమిని దున్నెను ఇచట ఎలుకల బాధ హెచ్చుగాఉన్నది

గేదెలు ఎద్దులు ఆవులు ఆబోతలు మొగలయినవి 4411 మేకలు 75 గొర్రెలు 16 పందులు 66 కోళ్లు1564 ఇచటఉన్నవి దినమునకు 2 200 లీటర్లపాలు వారముకు 400 కి గ్రా వెన్న పాలీన 20000 గ్రుడ్లు 200 గ్రా చేపలు స్థానికులు ఉపయోగించుకొని 200 కి గ్రా వెన్న 600 గ్రా చేప తెనాలికి రవాణాచేసెదరు

ఈగ్రామస్థుల ముఖ్యవృత్తులు వ్యవసాయము కూలి చేపలుపట్టుట కుటీరపరిశ్రమలు 61 మంది దుకాణాదారులు 24 మంది క్రయవిక్రయదారులు టాక్సీలు నడుపువారు ఎద్దుబండ్లు తోలువారుకలరు వీరుగాక 9 మంది కంసాలివారు 8 మంది వడ్రంగులు ఆరుగురు కమ్మరులు 41 మంది కుమ్మరులు 16 మంది కాపిమేస్త్రీలు 120 మంది గొల్లలు వడ్డెరలు ఇద్దరు నూలుమగ్గములవారుకలరు చరఖా కుటీర పరిశ్రమవారు 72 000 చిలపలనూలును తయారుచేసి చరఖా సంఘమునకుపంపిరి వ్యవసాయదారులకు కూలీలుదొరకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 3 లు స్త్రీకి రు 2లు

ఇచ్చట అమృతేశ్వర భావనారాయణ మదనగోపాల ఆంజనేయస్వాముల దేవాలయములుకలవు క్రొత్తపల్లివారి రామమందిరము శరణువారి రామమందిరము వెలగపోలు వారి రామమందిరము రెండుచర్చిలు ఒకమసీదుకలవు శ్రీఅమృతేశ్వరస్వామికి 9 ఎ 40 సెంట్లు శ్రీ భావనారాయణస్వామికి 24 ఎ సెంట్లు శ్రీమదనగోపాలస్వామి 18ఎ 28 సెంట్లు మాగాణి భూములున్నవి శ్రీఅమృతేశ్వరస్వామి దేవాలయములో ఫాల్గుణపూర్ణిమనాడు ఈశ్వరకల్యాణము ఆరుద్ర ఉత్సవము శ్రీమదనగోపాలస్వామి ఆలయములో శ్రీకృష్ణజయంతి శ్రీఆంజనేయస్వామి ఆలయములో వైశాఖ మాసములో హనుమజ్జయంతి ఇట్టిఉత్సవములు జరుగును

ఇచ్చటికి 9 మైళ్ళదూరములో తెనాలి రైల్వేస్టేషను ఉన్నది కృష్ణాకాలువమీద విజయవాడనుండి కంకర ఇసుక దిగుమతియగును ఈగ్రామమున 8 కంకరరోడ్లు 8 మట్టి రోడ్లుకలవు దీనిని పొరుగుగ్రామములతోను పురములతోను కంకరరోడ్లు కలుపుచున్నవి ఇది బస్సుమార్గముపైన ఉన్నది. ప్రతిగంటకు గవర్నమెంటు బస్సులు తెనాలినుండిచెరుకుపల్లికి తెనాలినుండి భట్టిప్రోలుకు పోవును ప్రయాణములకు రెండు టాక్సీకారులు నాలుగురిక్షాలు 15 రెండెడ్లబండ్లు 461 సైకిళ్లు తోడ్పడుచున్నవి

అమృతలూరులో బ్రాంచిపోస్టాఫీసు పోస్టుగ్రాము టెలిఫోను జరుగుచుండెను ఎలిమెంటరీస్కూళ్ళు ఒక జిల్లాపరిషత్తు హైస్కూలు ఉన్నవి 198 ఇండ్లు విద్యుచ్ఛక్తిని వాడుకొనెను ఇది పంచాయతిపాలనగల గ్రామము గ్రామపారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లుఉన్నవి గవర్నమెంటు లోకల్ లైబ్రరీ శాఖా గ్రంథాలయము సామాథియేటరు క్లాసు అభివృద్ధికేంద్రము సహకారరూరల్ బ్యాంకు ఇచటఉన్నవి ఈబ్యాంకు 690 మందికి అప్పులిచ్చినది ప్రధానఆరోగ్యకేంద్రము పశువుల ఆసుపత్రిఉన్నవి 8 మంది ఇంగ్లీషువైద్యులు ఇద్దరు ఆయుర్వేదవైద్యులు ఇద్దరుహోమియోపతి వైద్యులుకూడ కలరు 8 కాఫీహోటళ్లు 12 కిరాణాదుకాణములు 16 కిళ్ళీసిగరెట్టు బడ్డీలు గళ్లు 4 సైకిళ్ళషాపులు 6 కౌరశాలలు 2 లాండరీలు 14 బట్టలషాపులు ఉన్నవి

తెనాలిలో తంతికార్యాలయము మేజిస్ట్రేటుకోర్టు పోలీసుస్టేషను తాలూకాకచ్చేరిఉన్నవి ఈ గ్రామమునకు 5 మైళ్ళలోఉన్న మోపర్రులో బ్రిజిస్ట్రారు ఆఫీసుకలదు 5 మైళ్ళదూరములోఉన్న చెరుకుపల్లి వారసంతలో కూరగాయలు కిరాణసరకులు దొరకును ఈ గ్రామము నుండి 180 మంది విద్యార్థులు కళాశాల చదువులకు తెనాలిలోని వి యస్ ఆర్ కళాశాలకుపోవుదురు

శ్రీఅమృతేశ్వరస్వామి పేరునుబట్టి ఈగ్రామమునకు అమృతలూరు అని నామకరణము చేయబడినది శ్రీస్వామివారి కొరకు పూర్వము ఒకఆవు ప్రతిదినము పాలను శివలింగము మీద కార్చిపోయెడిదట ఆ ఆవుయజమానుడు ఒకమారు ఆ ఘటనముచూచి గొడ్డలితో ఆ ఆవును నరకయత్నించెను ఆఆవునకు దెబ్బతగలలేదు కాని ఆశివలింగముతలంగిలి నెత్తురు కారజొచ్చినదట అదిచూచి యజమానుడు భీతినొంది క్రింద పడి చనిపోయెనట ఇప్పటికీకూడ ఆలింగము తలపగిలినట్లు కన్పడును నాగలింగరెవెంకటేశ్వరశాస్త్రి కొత్తసత్యనారాయణ చౌదరి మొదలగురచయితలు క్రొత్తపల్లి వెంకటసుబ్బయ్య శరణు వెంకటసుబ్బమ్మ మొదలగువారలు ఈగ్రామస్థులే

పు మా

మా శ్వే

## అమృతానందయోగి

అమృతానందయోగి ఆలంకారికుడు. ఈతడు అలంకార సంగ్రహము అను గ్రంథమును రచించెను. భక్తిభూమిపతి రాజ్యము చేయుచుండగా ఆతని కుమారుడగు మన్నభూపతి అలంకారశాస్త్రమునకు సంబంధించిన విషయములనన్నిటిని ఒక్కచోట చేర్చి ఒక గ్రంథము వ్రాయుమని కోరుటచే తానీ గ్రంథమును వ్రాయుట జరిగెనని ఉపోద్ఘాతశ్లోకములో అమృతానందయోగి పేర్కొనియున్నాడు. ఈ మన్నభూపతి పేరు కొన్ని లిఖిత ప్రతులలో మన్మభూపతియని ఉన్నదట. ఈతడు వేంగీదేశమును పరిపాలించిన తెలుగుచోడవంశమునకు సంబంధించిన ఎఱ్ఱన కుటుంబమునందు జన్మించినవాడనియు పదునాల్గవ శతాబ్దిమధ్యభాగమునందుండెననియు కొందరి అభిప్రాయము. ఈ మన్నభూపాలుడు క్రీ.శ. 1297 కంటె పూర్వమందున్న మన్మగండగోపాలదేవుడే అనియు ఈతని ఆస్థానమునందుండుటచే అమృతానందయోగి పదమూడవ శతాబ్ది పూర్వభాగమునకు చెందినవాడనియు మఱికొందరి అభిప్రాయము.

అలంకారసంగ్రహము పదునొకండు పరిచ్ఛేదముల గ్రంథము. ప్రాచీనాలంకారగ్రంథములను పరిశీలించి కొన్నిస్థలములందు ఆ గ్రంథములోని వాక్యములనే ఉపయోగించుచు —

"తత్ర తత్ర రోచితాకారాన్ వాక్యాన్యేవ క్వచిత్ క్వచిత్
సంచిత్య క్రియతే సమ్యక్ సర్వాలంకారసంగ్రహః"

తానీ గ్రంథమును రచించినట్లు రచయిత చెప్పియున్నాడు. సర్వాలంకారసంగ్రహమునందు అలంకారశాస్త్రమునకు సంబంధించిన అన్ని విషయములును ప్రతిపాదింపబడినవి. భరతుని నాట్యశాస్త్రము ప్రధానముగా రూపకములను గూర్చి వ్రాయబడిన గ్రంథము. రూపకములకు సంబంధించిన వివరములు కొన్ని అలంకారాంశములు కూడ అచ్చటచ్చట అందు పేర్కొనబడినవి. భామహదండ్యాదుల గ్రంథములు కేవలము శ్రవ్యకావ్యములకు సంబంధించినవి. దశరూపకాదులు పూర్తిగ రూపకములకు సంబంధించినవి. ఈ అలంకారసంగ్రహమునందు అట్లుకాక దృశ్యశ్రవ్యకావ్యములకు రెండింటికిని సంబంధించిన విషయములు ప్రతిపాదింపబడినవి.

ఈ గ్రంథము చాలవరకు మమ్మటుని కావ్యప్రకాశముపైనను దండివిరచితమగు కావ్యాదర్శముపైనను అవలోక వ్యాఖ్యాన సహితమగు దశరూపకముపైనను ఆధారపడియున్నది. భామహదండ్యాదుల కావ్యాలంకార కావ్యాదర్శములవలె ఈ గ్రంథముకూడ కారికారూపమునున్నది. ఇందు మొత్తము కారికల సంఖ్య 725. దాదాపు 400 శ్లోకములు ఉదాహరణరూపమున చూపబడినవి. వీటిలో కొన్ని శ్లోకములు కవి స్వయముగా రచించినవి. పదునొకండు పరిచ్ఛేదములలో విషయవిభాగము ఈ క్రింది విధముగ నున్నది.

ప్రథమపరిచ్ఛేదము — కావ్యప్రారంభమున ఏయే వర్ణములను ఏయే గణములను ఉపయోగింపవలెనో ఈ పరిచ్ఛేదమున ప్రతిపాదింపబడినది. శుభకరములగు వర్ణములను గణములను కావ్యారంభమునందు ప్రయోగించుటచే రచయితలకును పఠితలకును కావ్యనాయకులకును కూడ శుభము కల్గును. ఈ నియమము కేవలము సంస్కృత పద్యకావ్యములకే గాక గద్యకావ్యములకును ప్రాకృతాది భాషాకావ్యములకును గూడ వర్తించును.

ద్వితీయపరిచ్ఛేదము — సప్తవిధకవులను వారి లక్షణములను తెలుపబడినవి.

రోచికుడు వాచికుడు అర్థుడు శిల్పికుడు మార్దవానుగుడు వివేకి భూషణార్థి అను సప్తవిధకవులలో వివేకి అత్యుత్తముడు. ఆతడు శబ్దార్థముల గుణదోషములను బాగుగ నెఱిగి మహాకవుల మతమును అనుసరించుచు శాస్త్రాలంకారసంస్కారవంతుడై వరలును. ఎమ్మ శక్తినిపుణతాభ్యాసములలో మూడును కావ్యహేతువులే యైనను సహజమైనది కాని లేక దేవతాప్రసాదలబ్ధమైనది కాని అయిన శక్తియే కావ్యప్రధానకారణమని సూచింపబడినది. తరువాత శబ్దార్థనిర్ణయోపయుక్తములగు సంయోగవిప్రయోగాదికములు ప్రతిపాదింపబడినవి.

తృతీయపరిచ్ఛేదమునందు అమృతానందయోగి రసములను నిరూపించెను. రసముల విషయమున ఆనందవర్ధనాభినవగుప్తాదులు అనుసరించిన అభివ్యక్తిపక్షమునే ఈతడుకూడ అంగీకరించెను. ఆయా రసముల స్థాయివిభావానుభావాదులను మాత్రమే కాక వాటి వర్ణవిశేషములను దేవతావిశేషములనుగూడ ఈతడు నిర్దేశించెను.

చతుర్థపరిచ్ఛేదమునందు నాయికానాయకభేదములను శోభ విలాసము మొదలగు నాయకాలంకారములను భావహావాదులగు ఇరువది నాయికాలంకారములను భావహావాదు

రము పటహా కర్ణేశ్వరము కుళకర్ణేశ్వరము కనకగిరి జానుపతర్వ భూతిపర్వత లింగపర్వత రుద్రాక్షపర్వతావళులు ఘటికాసిద్ధనాథలింగము కమలేశ్వరము స్కాంద సోమేశ్వరము సాలంకేశ్వరము మత్స్యకుండ విభీషణకుండ కుమారకుండ గుప్తకుండములు భీమేశ్వరము విభీషణేశ్వరము రామేశ్వరము రావణేశ్వరము సాలంకమత్స్యకేశ్వరము మున్నగు పుణ్యక్షేత్రములు కలవని సోమనాథుడు పండితారాధ్య చరిత్రమున వ్రాసెను పైన పేర్కొనబడిన అమృతేశ్వరాది పుణ్యక్షేత్రములను ప్రకృతము గుర్తింపవీలు పడుట లేదు అవి బహుళః నల్లమల అడవులలో ఉండియుండును బసవ పురాణ పండితారాధ్య చరిత్రములలో అనేక దేశములు గ్రామములు నదులు కొండలు కుండములు పుణ్యక్షేత్రములు వనములు కనవచ్చుచున్నవి వీనిలో పెక్కులు ప్రకృతము గుర్తింపవీలు లేకున్నవి వీటివలన ఆ కాలమున వీరశైవమతము ఎంత విస్తృతముగ వ్యాపించెనో తెలియుచున్నది

తం అం శా

## అమెరికన్ బాప్టిస్టు మిషన్

ఇది ఒక క్రైస్తవ మతసంస్థ 1866 వ సంవత్సరమున ఇది ఒంగోలు పట్టణమును కేంద్రముగను చేకొని క్రైస్తవ మత వ్యాప్తి దోహదము చేసెను ఈ సంస్థ అవతరణమునకు ముందు భారతదేశమునందలి క్రైస్తవ మత వ్యాప్తిని ప్రజాభిప్రాయమును తెలిసికొనుట ముఖ్యము

క్రీ శ 1857 58 వత్సరముల మధ్య భారత స్వాతంత్ర్య సమరము జరిగినది దీనినే సిపాయీల పితూరి" అని కూడ వ్యవహరించుచున్నారు ఈ పోరాటమునకు దారితీసిన కారణములలో దేశమునందు క్రైస్తవ మతవ్యాప్తి ఒకటిగా భావింపబడినది ప్రభుత్వము క్రైస్తవ మత ప్రచారకులతో కలసి హిందూమతమును మట్టుపెట్టి దేశీయులను క్రైస్తవులుగా మార్చుటకు ప్రయత్నములు జరిపెను అను అపోహ ప్రజలలో అలజడిని కలిగించినది అంతట దేశములో శాంతిని నెలకొల్పుటకై విక్టోరియా మహారాణి మతమువట్ల ప్రభుత్వ విధానమును ప్రకటింపవలసి వచ్చెను అందు "ఎవరికి తోచిన విధమున వారు తమ మతమును అనుసరించి ఆరాధనలను జరుపుకొనుటయందు స్వేచ్ఛావర్తనులై మెలగవచ్చును ప్రభుత్వము మతవిషయములందు జోక్యము కలిగించుకొనదు ఏ మతము వారి యందును పక్షపాతము లేకుండ ప్రభుత్వము వ్యవహరించును" అని ప్రకటింపబడెను

కాని ప్రభుత్వము ప్రత్యక్షముగానో పరోక్షముగానో క్రైస్తవమత సంస్థచే నడుపబడు విద్యాలయములకు ధనసహాయము చేయుచుండెను నిర్బంధముగా అట్టి క్రైస్తవ విద్యాలయములందు క్రైస్తవేతరులకు క్రైస్తవ సూక్తులను బైబిలును పాఠ్యభాగములుగ నిర్దేశించుట జరిగెను అది అన్యమతస్థులకు కంటకముగా నుండెను

మద్రాసు జనసంఘము వారు విద్యావిధానము పట్ల జరుగుచున్న అన్యాయములను ప్రభుత్వ దృష్టికి తెచ్చిరి దానికి ప్రభుత్వము దేశవ్యాప్తముగా విద్యాప్రచారము చేయు బాధ్యతను ఒక ప్రభుత్వమే వహించుట కష్టసాధ్యమనియు తత్ప్రచారార్థమై ప్రయివేటు సంస్థలకు ఉచితముగ ధనసహాయము చేయుటయందు తప్పేమియు లేదనియు వాదించెను

ఆంధ్రదేశమునందు క్రైస్తవమత ప్రచారకుల విజృంభణము ప్రజలలో కలవరమును కలిగించెను కొన్ని క్రైస్తవ మత సంస్థలు 1858కి పూర్వమే సంఘశుద్ధి కార్యకలాపములను ఆంధ్రదేశమున నిర్వర్తించుచుండెను లండను మిషను అను క్రైస్తవ సంస్థవారు విశాఖపట్టణమందును కడపయందును తమ ప్రచారకేంద్రముల నెలకొల్పి మతబోధల చేయుచుండిరి చర్చిమిషనరీ సొసైటీ అను సంఘము బందరులో రెవరెండు నోబులు అనువాని ఆధ్వర్యమున అగ్రకులజులకు విద్యనేర్పు మిషతో మొదట బ్రాహ్మణ యువకులను తరువాత అన్యజాతీయులను క్రైస్తవులుగ మార్చెను క్రీ శ 18 వ శతాబ్దియందే గుంటూరునందు కేథలిక్ మిషను మతప్రచారమునందు నిమగ్నమైయుండెను అదే తావున అమెరికన్ మిషనువారు విద్యావ్యాప్తికి తోడుగ క్రైస్తవ మతవ్యాప్తిని కూడ చేయుచుండిరి

అమెరికన్ బాప్టిస్టు మిషన్ వారు 1866 వ సంవత్సరమున ఒంగోలు పట్టణమును కేంద్రముగ చేసికొని మతప్రచారమును కొనసాగించిరని తెలిసికొనియుంటిమి 1876లో బలక్షామము గుంటూరు మండలమంతయు వ్యాపించి ప్రజలను నిర్జీవులను చేసినది ఆ అవకాశమును పురస్కరించుకొని అమెరికన్ బాప్టిస్టు మిషన్ సంఘము వారు భోజనము పెట్టి కాపాడు వ్యాజమున దినమునకు 100 మంది వ్యక్తులను క్రైస్తవ మతమున చేర్చిరి ఇదే సంస్థ 1890 సం|| లో బాపట్లలో లోయర్ ఎలిమెంటరీ ఉపాధ్యాయుల బోధశాలను స్త్రీవిద్యకై పాఠశాలలను విద్యార్థి వసతిగృహములను నిర్మించి ప్రజాసేవయందు నిమగ్నమైయుండెను

కా వెం

## అమ్జద్ హైదరాబాదీ (1879–1961)

సయ్యద్ అహమ్మద్ హుసేన్ అమను మహాశయులు హైదరాబాదు నగరములో జన్మించిరి ఆయన జన్మించిన తేదీ ఇదమిత్థముగా తెలియ వచుటలేదు అయినప్పటికిని లభ్యమైన కొన్ని ఆధారములను బట్టి ఆయన క్రీ శ 1879 లో జన్మించెనని చెప్పవచ్చును అమద్ పుట్టిన నలుబది దినములకు ఆయన తండ్రిగారు దివగతులైరి తండ్రిలేని తనయుడగుటచే బాల్యమందు ఆయన మిక్కిలి దీన స్థితిలో నుండెను చదువు సంధ్యలు లోపించుటచే ఆయన బాల్యము ఆటపాటలయందును అటునిటు తిరుగుటయందును గడచిపోవుచుండెను అతని తల్లి మిక్కిలి సహనశీల ఆమె అతనిని మదరసానిజామియా లో చేర్పించి విద్యార్థి వసతిగృహములో అతడు ఉండునట్లు ఏర్పాట్లు చేయించెను

నిజామియా లో విద్యాభ్యాసము గావించిన పిమ్మట నగరములో మిక్కిలి ప్రసిద్ధివహించిన దారల్ ఉలూమ్ పాఠశాలలోచేరి మున్షీ ఫాజల్ పరీక్షయందు ఉత్తీర్ణుడై అమ్జను అచ్చటనే ఉపాధ్యాయుడుగా నియమితుడయ్యెను తొలిరోజులలో అయన ఆర్థికముగా పెక్కుఇబ్బందులను ఎదుర్కొనవలసిన వాడయ్యెను నెలకు 2 రూపాయల ఫీజు గ్రహించి ప్రతిదినము నాలుగు మైళ్ళ దూరము నడచివెళ్లి ఒక బాలికకు అతడు చదువు చెప్పుచుండెను కొన్ని రోజులు గడచిన తరువాత ఆయన అక్కౌంటెంట్ జనరలు కార్యాలయములో గుమాస్తా ఉద్యోగమునందుచేరి పనిచేయుచు క్రమముగా అసిస్టెంట్ అక్కౌంట్స్ ఆఫీసరు పదవి అలంకరించెను ఆపదవిలో అతనికి నెలకు 400 రూపాయలకు పైబడి జీవితము గడుపుచుండెను ఉద్యోగకాలము పూర్తిఅగుటతో అతడు పదవీ విరమణము గావించెను 1961 లో 82 సంవత్సరముల ప్రాయమందు ఆయన స్వర్గస్థుడయ్యెను

1908 లో మూసీనదికి సంభవించిన కనీ విని ఎరుగని వరదలు అమ్జదు జీవితములో అత్యంత ప్రధానమైన సంఘటనగా

చిత్రము 28



అమ్జద్ హైదరాబాదీ

పేర్కొనవచ్చును మహోద్ధృతమైన మూసినది వరదల భీభత్సమునకు హైదరాబాదు నగరము గురియయ్యెను కొలది గంటల లోపల వేనవేలజనులు ప్రవాహములో కొట్టుకొనిపోయిరి అమ్జదు ఇల్లు మూసీనదిగట్టున చేరువనే యుండెను అదికూడ ఆజలప్రళయమునకు గురియయ్యెను అతిని స్సహాయస్థితిలో ఆయన కన్నులఎదుటనే అయనతల్లి భార్య కూతురు వరద వల్ల కొట్టుకొనుచున్న ఆ ప్రవాహములో మునిగి అదృశ్యులై పోయిరి దైవికముగా ఆయన మాత్రము బ్రతికి బయటపడిరి హృదయవిదారకమయిన ఈ సంఘటనను ఆయన తన జీవితాంతమువరకు మరువజాలకపోయెను బహుశః ఇందువలననే

జనన మరణములు  గత్తుయొక్క నశ్వరత అనిత్యత  మానవుని నిస్సహాయస్థితి మొదలగు విషయములు ఆయన కవిత్వమునందు తరచుగా ప్రతిఫలించుచుండును

అక్బర్ అలహాబాదీ కవితన రచనలద్వారా హితప్రబోధము గావించెను ఆయన కవిత శైలి శరమువలె వాడియైనది అమ్జదు వినీ కవిత్వమునందలి మెలకువలను స్వాయత్తము చేసికొనెను. ఆయన మధుర ప్రేమపూరితమై మృదుమధురమై హృదయంగమమై యుండును ఉద్భుద్ధ పారసీక కవియైన సాదీ యొక్క మనోహరమైన గులిస్తాన్ శైలిని పోలి లలితమై ఉన్నత భావ స్ఫోరకమై అనుభూతి హితమై చైతన్యవంతముగా నుండును అతినిగూఢమైన తత్త్వవిషయములను క్లిష్టసమస్యలను సులభముగా అర్థమగునట్లు వివరించి చెప్పుటలో ఆయన సిద్ధహస్తుడు అందుచేతనే నిత్యానిత్యతలు ఈశ్వరతత్త్వము పాపపుణ్యములు దైవము-ఆరాధకుడు ఏకేశ్వరవాదము మున్నగు పెక్కు జటిలమైన సమస్యలను సులభగ్రాహ్యముగను రమణీయముగను ఆయన వర్ణించి చెప్పగలిగెను

అమ్జదు కవితా ప్రవృత్తిగళ్లు (aDes) భావాలు పద్యములు రుబాయీలు మున్నగు వివిధ సాహిత్యప్రక్రియలలో జాలువారినది ప్రత్యేకముగా రుబాయీ ప్రక్రియయందు ఆయనకు ఆయనేసాటి ఖురాను సూక్తులు ప్రవక్త ప్రవచనములు ఆయనలో కవితాభినివేశమును ఉద్దీపనచేసినవి అందులో అనేక నిత్యసత్యములు ధర్మసూక్ష్మములు ప్రపంచింపబడినవి అవి దేశకాలములకు అతీతములు పరిణామమునకు గురికానివి ఆయన రచించిన రుబాయీలు కొన్ని తెలుగులోనికి అనువదింపబడినవి

అమ్జదు కవిత్వములో పదాడంబరత ఎచ్చటను గోచరించదు ఆలంకారిక వస్తువులు అతనిచే మనదైనదిన జీవితములోను మన పరిసరములందును కనిపించు విషయములనుండి గ్రహింపబడినవి అవి సహజసుందరములై చిత్తాహ్లాదమును కలిగించుచుండును వాటిలో ఉపమలు రూపకాలంకారములు ముఖ్యముగా పేర్కొనదగినవి అతని కవితపాఠకులను ఆనంద పరవశులనొనర్చును రసానుభూతి కవిత్వమునకు పరమావధి

ఒక వ్యక్తి ఎంత పండితుడైనను గుణవంతుడు కానిచో ఆయన వైదుష్యమంతయు నిరర్థకమగును అమ్జదు కవి ఉన్నత గుణశీలి ఆయనలో సౌజన్యము సాధుస్వభావము మానవతా ప్రేమ మూర్తీభవించినవి ఆయనతో సంభాషించువారికి ప్రశాంతత చేకూరు మహత్తరమైన శక్తి ఆయనయందుండెను

అమ్జదు కవి గద్య పద్యములందు పెక్కు రచనలు వెలయించెను ఈ క్రింది ముద్రితగ్రంథములు ఆయన ఉభయకవితా ప్రౌఢికి నిదర్శనములు ఆయన రచించిన ప్రప్రథమ కవితా సంకలనము 1905 లో ప్రచురింపబడినది అటు పిమ్మట రియాజ్ అమ్జదు (1 2 భాగములు) రుబాయియాత్ అమద్ (మొదటి భాగము) జర్ బాల అమ్జదు ... మ్జదు అను పద్యకావ్యములు ప్రచురింపబడినవి ఇవికాక రుబాయీలు రెండు గ్రంథములలో సంకలితమై వెలువరించబడినవి హాల్ అమ్జదు హికాయాత్ మరియు గులిస్తాన్ మొదలైన వచనకావ్యములు ధారావాహికముగ వెలువడినవి

అమ్జదు కవి రచనలు ఉర్దూసాహిత్యమును సుసంపన్నమొనర్చినవి ఆయన ఉర్దూసాహితీరంగమందు అత్యంత ప్రముఖస్థానము వహించెను

షు ర

## అమ్మన

అమ్మన వెలనాటి దేశమునందలి అమృతపురమునకు నేలిక ఇతడు చోడమహారాజుయొక్క సేనాని ఈయన తండ్రిపేరు తిక్కన తల్లిపేరు యెరయాంబిక ఈతడు గుంటూరు మండలము గుంటూరు తాలూకాలోని కొన్నలగడ్డ గ్రామమునందలి వల్లభేశ్వరదేవరకు జయఘంటను ధూపదీపారతులను బిందమును తను మర్పించినట్లు దక్షిణహిందూ శాసనము (ద హిం X సెం 215) లో కలదు ఈ శాసనము కొన్నలగడ్డ గ్రామములోని అమరేశ్వరస్వామి ఆలయ కుడ్యమునందు అమర్చబడియున్నది శాసనమునందు శాసన కాలము లిఖింపబడలేదు శాసనము సంస్కృత శ్లోకములలో వ్రాయబడినది దీనిచివర అయిదు పంక్తులుమాత్రము తెనుగులో నున్నవి శాసనములలో దోసగులనేకములు కనవచ్చుచున్నవి శాసనమునందలి సారాంశ మీక్రింది విధముగనున్నది

వెలనాటిదేశమున అమృతపురము అను గ్రామము కలదు ఆ గ్రామము విద్వజ్జనులకు నిలయము అందు భీముడను విప్రుడు కలడు అతడు హరితాన్వయవార్ధివర్ధనవిధుడు ఆయనకు తిక్కన అను తనయుడు కలడు తిక్కన అగణ్య గుణవంతుడు తిక్కనభార్య యెరయాంబిక ఈ తిక్కనకు

ఏచోడరాజునొద్ద సేనానిగను డెనో విచారింతము రెండవ శాసనమునుబట్టి ఈ విషయము మనము సులభముగ గ్రహింపగలము శక 1095 (క్రీ శ 1178) న దక్షిణాయన సంక్రాంతి నిమిత్తముగ అమ్మనచోడుడు శ్రీ కులోత్తుంగ రాజేంద్రచోడెయ రాజులకు ధర్మార్థముగా వల్లభేశ్వర దేవరకు రెండఖండదీపములకై నిత్యనైవేద్యాదులకై కొంత భూమిని దానముచేసినట్లు రెండవ శాసనము (నెం 198) చెప్పుచున్నది ఈ శాసనమునుబట్టి అమ్మన క్రీ శ 1178 నాటివాడని స్పష్టమగుచున్నది అమ్మనకాలము తెలిసినమీదట అమ్మన వెలనాటిని పాలించిన మాండలిక ప్రభువులలో నెవరియొద్ద సేనానిగనుండెనో తెలిసికొనుట యుక్తము

పూర్వము వెలనాడు అను పేరుకలిగిన భూభాగము నేడు కృష్ణానదికి దక్షిణమునగల గుంటూరు మండలములోని గుంటూరు రేపల్లె తెనాలి బాపట్ల తాలూకాలలో కొంత ప్రదేశము కృష్ణామండలములోనికొంతభాగమునయియుండినట్లు శాసనాధారములు కలవు ఈ వెలనాటి ప్రాంతమును మాండలిక ప్రభువులగు వెలనాటి చోడులు క్రీ శ 1108 నుండి 1206 వరకు పాలించినట్లు చరిత్రచెప్పుచున్నది తూర్పు చాళుక్యాధిపతియు ఆంధ్రమహాభారత కర్తయునగు రాజరాజనరేంద్రుని యొక్క కొమరుడగు కులోత్తుంగ చోడమహారాజువలన మాండలిక ప్రభువులు నియుక్తులైరి అట్టివారు వేంగి రాజ్యములోని ఒక్కొక్క మండలమునకు అధిపతులై క్రమముగా మాండలికులు అనుపేర వ్యవహృతులై కులోత్తుంగ చోడునకు సామంతులుగనుండి వేంగిరాజ్యపాలన మొనర్చుచుండిరి ఇట్టి మాండలిక భూజానులలో వెలనాటి వారు ప్రముఖస్థానమువహించిరి వీరు ప్రతాపోన్నతులై పూర్వాంధ్ర దేశమును పాలించిరి వీరుదుర్జయవంశీయులు వీరికి ధనదప్రోలు (నేటి గుంటూరు మండలమునందలి చందవోలు) రాజధాని వెలనాటి మాండలికులలో మొదటివాడు గొంకరాజు ఇతడు కులోత్తుంగ చోడునికడ మొదటసేనానిగనుండి క్రమముగ రాజానుగ్రహముపడసి యతనికి సామంత నృపతియయ్యెను ఈతని కుమారుడు వెలనాటి చోడరాజు ఈతని తనయుడు రెండవ గొంకరాజు ఇతడు మహావీరుడు ఇతడు వేంగినాక్రమించిన పశ్చిమచాళుక్యసైన్యమును గోదావరీ తీరయుద్ధమున పారద్రోలి వేంగిని స్వాధీనమొనర్చుకొని దానిని తిరిగి తన ప్రభువగు చాళుక్యచోళ మహారాజునకు సమర్పించిన వీరుడు ఇట్టి రెండవ గొంకరాజు కుమారుడు రెండవ చోడరాజు క్రీ శ 1168 నుండి 1182 వరకు వెలనాటి రాజ్యమును రెండవ చోడరాజు పాలించెను ఇతడు చాళుక్య చోళచక్రవర్తియగు రెండవ రాజరాజునకు సామంతుడు అమ్మన వెలనాటి ప్రభువగు రెండవ చోడరాజుకడనే సేనానియై మనుగడ సాగించినట్లును ప్రఖ్యాతమైన అమృతపురమునకు పాలకుడైనట్లును మనము నిర్ణయింపవచ్చును నేటి గుంటూరు మండలము తెనాలి తాలూకాలోని అమృతలూరు పూర్వము అమృతపురమను నామముతో వ్యవహరింపబడినదేమో!

వెలనాటి ప్రభువులు మిక్కిలి ధర్మాభిరతులు వీరు అనేక దేవళములు నిర్మించిరి అనేక దేవాలయములను అభివృద్ధి పరచిరి దేవరలకు అంగరంగభోగములకును నిత్యనైవేద్యాదులకును దేవాలయ నిర్వహణమునకును వీరు పెక్కు భూదానముల నొసగిరి వీరు వేదశాస్త్రముల అభివృద్ధికై పాటుపడిరి తెలుగు భాషను తెలుగు కవులను ఆదరించిరి ప్రభువులవలెనే ఆనాటి ఉద్యోగులును సంపన్నగృహస్థులును దేవాలయములకు అనేకదానము లొసగెడివారు దానములుకొన్ని తమపుణ్యమునకును కొన్ని తమ ఏలికల పుణ్యమునకును చేసెడివారు అమ్మన తన పుణ్యమునకై వల్లభేశ్వర దేవరకు జయఘంటను ధూపదీపారతులను తన ప్రభువగు కులోత్తుంగ రాజేంద్ర చోడెయరాజుల ధర్మార్థము అఖండదీప నిత్యనైవేద్యాదులకు కొంతభూమిని దానమిచ్చి తనయందలి దైవభక్తిని ప్రభుభక్తిని వెలిబుచ్చుకొనెను

జొన్నలగడ్డ అమరేశ్వరస్వామి ఆలయమునందలి రెండవ శాసనములో ఒకవిశిష్ట సన్నివేశము కాన్పించుచున్నది దేవన కూతురు వల్యపఅను విప్రభామినియు అముతూరిరెడ్డి తిక్కరాజు కొడుకు చోడెరాజును చరియఅమ్మన ప్రెగ్గడపెండ్లము వల్యసానియు అనగా ఇద్దరు విప్రకాంతలును ఒక రెడ్డియు కలిసి వల్లభేశ్వర ఆలయము నిర్మించిరి ఇట్లా కాలమందు వివిధ వర్ణములవారు స్త్రీపురుష విభేదములేకుండ ధర్మకార్యము లందుచేయి కలుపుట మనోజ్ఞమైన సన్నివేశము

శం అం శా

## అమ్మనబోలు

నల్లగొండ జిల్లా రామన్నపేట తాలూకాలో అమ్మనబోలు అను గ్రామము ఉన్నది దీనికి దగ్గరగా నల్లగొండ పట్టణము కలదు ఈ గ్రామమునకు తూర్పున ఉప్పలవంచ పడమట బచ్చుప్పల తురకలపల్లి ఉత్తరమున మూసీనది దక్షిణమున కుంకుడపాముల ఉన్నవి దీని విస్తీర్ణము 6349 ఎకరములు ఇది ఎత్తు పల్లములతో కూడి వున్నది

1961 సం జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామమున పురుషులు 1761 మంది స్త్రీలు 1752 మంది మొత్తం 3513 గురు ఉండిరి ఈ సంఖ్యలో 615 బాలురు 80 మంది బాలికలు 190 మంది షెడ్యూలు జాతుల పురుషులు 376మంది స్త్రీలు 243 మంది ఇచట ఇండ్లు ఒకచో వలయాకారముగాను ఒకచో వాడవాడలగాను ఉన్నవి గ్రామస్థులలో 1000మంది వరి అన్నము 518మంది జొన్నఅన్నమును 2000మంది ఇతర అన్నములను తిందురు వీరు బావి నీటిని త్రాగుదురు మంచినీళ్ళ ఎద్దడిలేదు ఖాళీస్థలము హెచ్చుగా నుండుటచే గ్రామము దక్షిణ దిశగా అభివృద్ధి చెందుచున్నది

మూసీనది పెద్దచెరువు ఈ గ్రామ నీటి వనరులు వీటి క్రింద వరి జొన్న సజ్జ పెసర వేరుసెనగ మొదలగు పంటలు పండును వీటిని బండ్లపై రామన్నపేటకు భువనగిరికి రవాణా చేయుదురు ఇచట 5 ఎకరముల మామిడితోట రెండుఎకరముల నిమ్మతోట ఉన్నవి 1966 67లో 3000 మామిడికాయలను 1000 నిమ్మకాయలనుస్థానికులు ఉపయోగించుకొని 7000 మామిడికాయలను 4000 నిమ్మకాయలను భువనగిరికి రామన్నపేటకు రవాణాచేసిరి 200 కి గ్రా బెండకాయలు 500 కి గ్రా వంకాయలను పండించి 400 కి గ్రా వంకాయలను మాత్రము భువనగిరి రామన్నపేటలకు రవాణాచేసి మిగిలిన వాటిని స్థానికులు వాడుకొనిరి పంటల క్రింద 3500ఎకరముల భూమి చెరువుల క్రింద 90 ఎకరముల భూమి బావులక్రింద 220 ఎకరముల భూమి ఇతర వనరుల క్రింద 50 ఎకరములభూమి సాగుబడి యైనది 6 ఆయిల్ ఇంజనులు 240 ఎకరముల భూమికిని యాంత్రికము కాని విధానములు 220 ఎకరముల భూమికిని నీటిని సరఫరాచేసెను ఈ గ్రామమున 2200 ఎకరముల దుబ్బనేల 600 ఎకరముల తరినేల 1800 ఎకరముల చవిటినేల కనిపించును

ఈ గ్రామములో 500 ఆవులు గేదెలు ఎద్దులు మున్నగునవి 400 మేకలు లేక గొర్రెలు 150 పందులు 5 గుర్రములు 1000 కోళ్ళు ఉన్నవి దినమునకు 1500 లీటర్ల పాలు నెలకు 200 కి గ్రా నెయ్యి 800 గ్రా మాంసము 500 గ్రుడ్లు పాలీనా 1000 కి గ్రా చేపలు ఉపయోగించుకొని నెలకు 400 కి గ్రా నెయ్యి 4000 కి గ్రా చేపలను రామన్నపేటకు భువనగిరికి రవాణాచేసిరి

ఇచట ప్రజలకు వ్యవసాయము కూలి చేనేత ట్టుట కుటీర పరిశ్రమలు వ్యాపారము ముఖ్యజీవనాధారములు దుకాణదారులు ఎద్దుబండ్లు తోలువారు కంసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీమేస్త్రీలు మంగలివారు చాకలివారు గొల్లలు వడ్డెరలు మాలమగ్గములవారు కలరు వ్యవసాయ దారులకు కూలీలు దొరుకుదురు కూలీరేటు దినమునకు పురుషునికి రు 3లు స్త్రీ కిరు 1-25లు

ఈ గ్రామమునకు 5½ మైళ్ళలో భువనగిరి రైల్వేస్టేషను కలదు ఇది బస్సు మార్గముపైన ఉన్నది ప్రయివేటు బస్సులు రామన్నపేటనుండి అమ్మనబోలునకు ప్రయాణించును ఈ గ్రామమునగల మూడు మట్టిరోడ్లు దీనిని పొరుగు గ్రామములతో కలుపుచున్నవి ఇచ్చట 150 రెడ్లబండ్లు 5 సైకిళ్ళు ప్రయాణములకు పనికి వచ్చుచున్నవి

ఈగ్రామమున రెండు దేవాలయములు ఉన్నవి కృష్ణాష్టమి శ్రీరామనవమి ఉత్సవములు వైభవముతో జరుగును

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు ప్రాథమిక పాఠశాల ఉన్నవి ఇది పంచాయతీ పరిపాలన కల గ్రామము ఇచటి వ్యవసాయ పరపతి సంఘము రు 2000లు అప్పులిచ్చినది ముగ్గురు ఇంగ్లీషువైద్యులు ఇద్దరు ఆయుర్వేద వైద్యులు కలరు పశు రోగములకు నాటువైద్యము చేయువారు కలరు

30 మైళ్ళ దూరములో ఉన్న రామన్నపేటలో తంతి కార్యాలయము కోర్టులు పోలీసుస్టేషను సబ్ రిజిష్ట్రారుఆఫీసు తాలూకాకచేరి బ్లాకు అభివృద్ధికేంద్రము పురుళ్ళ ఆసుపత్రి జనరల్ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి కలవు విద్యార్థులు హైస్కూలు చదువులకు రామన్నపేటకును కళాశాల చదువులకు నల్లగొండకును పోవుదురు

మా శ్వే

## అమ్మనబ్రోలు

అమ్మనబ్రోలు ఒంగోలుతాలూకా ప్రస్తుతపు ఒంగోలు జిల్లాలో ఉన్నది ఇది మద్రాసు వాల్తేరు రైలుమార్గమున ఉన్నది పూర్వము దీనికి అమ్మనబోలు అను పేరుకూడ ఉండెను

1961 స॥ జనాభా లెక్కలప్రకారము ఇచ్చట పురుషులు స్త్రీలుకలిసి 5538 మంది ఉండిరి ఈ సంఖ్యలో షెడ్యూల్డు జాతులవారు 469 మంది షెడ్యూల్డు తరగతుల వారు 47 మంది ఇచ్చట పెంకుటిండ్లు 620 కాంక్రీటుకప్పు గల ఇండ్లు 250 కలవు జనులు వరిఅన్నమును జొన్న అన్నమును తిందురు చెరువులనీటిని బావు నీటిని మీరుత్రాగుదురు

ఇచట వ్యవసాయమునకు ఆధారముగా రెండు చెరువులు 8 బావులుకలవు 1963 964 స లో 2856 హెక్టారల భూమి పంటలక్రింద ఉపయోగించబడెను చెరువులక్రింద 141 5 హెక్టారులభూమి బావులక్రింద 0 05హెక్టారులభూమి సాగుబడి అయెను ఇచ్చట వరి జొన్న సజ్జ మొక్కజొన్న వేరుసెనగ పప్పుధాన్యములు పండును ఈ పంటలను ఒంగోలునకు రవాణాచేయుదురు ఇచట పొలములను దున్నుటకు 582 కొయ్యనాగళ్లు 8 ఇనుపనాగళ్లు కలవు 5 హెక్టార్ల భూమిలో ఫలవృక్షములున్నవి 1? హెక్టారుల భూమిలో కూరగాయలను పండించుదురు

ఇచట 238 మేకలు 107గొర్రెలు 23 గుర్రములు 278పందులు 3710 ఎడ్లు ఉన్నవి పాలను పాలపదార్థములను గ్రామస్థులే ఉపయోగించుకొందురు

ఈజనులముఖ్యవృత్తులు వ్యవసాయము వ్యవసాయకూలి కులవృత్తులు బీడీలు తయారుచేయు పరిశ్రమ

ఇచ్చటపోలేరమ్మగుడి అంకాలమ్మగుడి ఒకచర్చి ఒక మసీదుఉన్నవి పోలేరమ్మ అంకాలమ్మ శక్తి స్వరూపిణులు వీరివిగ్రహములు శూలమును ధరించినట్లు కనిపించును ఈగుడి గ్రామమునకు పడమటివైపునఉన్న స్మశానవాటికకు సమీపమున ఉన్నది గ్రామస్థుల అనుకూల్యమునుబట్టిగాని 5 6 సం॥ కు ఒకమారుగాని అంటురోగములు సంభవించినపుడుగాని ఈ దేవతల కొలుపులు అతివైభవముగా జరుపుదురు

అమ్మనబ్రోలునకొక రైల్వేస్టేషనుకలదు ఇందు బస్సు వసుపాయములు కలవు ఈ గ్రామములో 3కి మీ కంకర రోడ్లు 8కి మీ కచ్చారోడ్లు ఉన్నవి ప్రయాణికులకు సరకు రవాణాలకు ఇచ్చట 358 బండ్లు కలవు

ఇచ్చట పోస్టాఫీసు 5ప్రాథమిక పాఠశాలలు ఒక హయ్యర్ సెకండరీస్కూలు ఉన్నవి ఇది పంచాయతీపాలనగల గ్రామము ఇచ్చటరెండు ఆటస్థలములు ఒకగ్రంథాలయము 288మంది సభ్యులుగల బహుళార్థసాధక సహకారసంఘము ప్రధాన ఆరోగ్యకేంద్రము కుటుంబనియంత్రణకేంద్రము పశువుల ఆసుపత్రి కలవు ఇచ్చట ఇంగ్లీషువైద్యులు నలుగురు హోమియోపతి వైద్యుడు ఒకడు కలరు

ఈగ్రామమునకు 5కి మీ దూరములోఉన్న ఉప్పుగుండూరులో తంతితపాలాకార్యాలయముకలదు ఇచ్చటి విద్యార్థులు కళాశాలచదువులకు ఒంగోలుకు తెనాలికి పోవుదురు

మా శ్వే

## అమ్మనబ్రోలు సీమ

పరిపాలనా సౌకర్యమునకై యొక పెద్దదేశము రాష్ట్రములుగను జిల్లాలుగను తాలూకాలుగను ఫిర్కాలుగను గ్రామములుగను విభజింపబడియుండుట నేడుమనము కాంచుచునే ఉన్నాము ప్రాచీనాంధ్రదేశములో ఇట్టి విభాగములు అనేకములుండినట్లు శాసనములవలన మనకు తెలియవచ్చుచున్నది ప్రాచీనదేశవిభాగములలో రట్టము హారము (ఆహారము) రాష్ట్రము మండలము విషయము పథము నాడు రాజ్యము దుర్గము సీమ వాడి వళితము వెంట మాగాణి స్థలము భోగము దండపాట కంపనము కొట్టము భూమి పాంచాలి సమితు అనునవి ఉండినట్లు తెలియుచున్నది

రటము లేక (రాష్ట్రము) రటము అను దేశభాగము పల్లవరాజైన శివస్కందవర్మహీరహడగల్లి ప్రాకృతశాసనమునందును ఇక్ష్వాకువంశీయుడైన శ్రీవీరపురుషదత్తుని జగ్గయ్యపేట ప్రాకృతశాసనమునందును కనిపించుచున్నది రాష్ట్రమను సంస్కృతపదమునకు రట్టమనునది ప్రాకృతరూపము బౌద్ధ సారస్వతమున రట్టములు పేర్కొనబడినవి అంధకరట్టము ఇట్టిదే శాతవాహనరాజులలో ఒకడగు వాసిష్ఠీపుత్రపులుమావియొక్క నాసిక కార్లీ శాసనములలో హారము(ఆహారము) అను దేశవిభాగము కలదు గోవర్ధనాహారము సాతవాహనీహారము అనునవి ఇట్టివే గోవర్ధనాహారముమహారాష్ట్రదేశము

దుర్గ రాజ్యములోనిది) పులియేరుమాగాణి (గుత్తిసీమలోనిది) కందుకూరి స్థలము (ఒంగోలు జిల్లాలోనిది) అనునవి ఇట్టివే ఇట్లే భోగము దండపాట కంపనము కొట్టము భూమి పాంచాలి అను దేశవిభాగములు శాసనములలో కనవచ్చుచున్నవి కవచశారభోగము (కమ్మరాష్ట్రములోనిది) కళింగ దండపాట కొండపల్లి దండపాట లిట్టివే దండపాట అనునది రెడ్డి విజయనగర గజపతులకాలమున వాడబడినది రాయలసీమ నెల్లూరు శాసనములలో కంపన శబ్దము దేశపరముగా కలదు అదినెల్లూరు మండలములోని దర్శి శాసనములో "శ్రీ త్రిపురాంతక దేవర దివ్య శ్రీపాదపద్మారాధకులైన శ్రీమత్ శాంత శివగురుదేవరకు అమవకలమూరి కంపనము లోన ప్రతిష్ఠించిన చలమర్తి గంగాపురము నెడియూరు ఇందలి కంపనశబ్దము దేశపరము ఈశాసనము శా శ 1177 నాటిది ఇట్లే త్రిపురాంతకములోని శాసనములలో కంప్పణము అనునవియు నెల్లూరుమండలములోని తమిళ శాసనములలో కొట్టము అనునదియు ఆంధ్రశాసనములలో భూమి అనునదియు దేశవిభాగములుగ కనవచ్చుచున్నవి

బోయకొట్టము (పండరంగని అద్దంకిశాసనము)పవ్వత్తిరి కొట్టము కోటభూమి అనునట్టివి చిన్నప్రదేశములై యుండును పూర్వగాంగుల శాసనములలో పాంచాలి అనుశబ్దముకలదు ఇది పంచగ్రామములను తెలుపు ట్టి ప్రదేశమైయుండవచ్చును పుష్యగిరి పాంచాలి దేవన్నపాంచాలి అనునవి నేటి గంజాము జిల్లాలోని పర్లాకిమిడి ప్రాంతములోనివని చారిత్రికులు భావించుచున్నారు సముతు అను రాజ్యవిభాగమొకటి కలదు రాయలవారు మన్నించిన మాజాగీరు సీతారామపురం సముతులో సీగారెడ్డిపల్లె మాచిరెడ్డిపల్లెకు ప్రతినామము అయ్యవారిపల్లె అని నిర్ణయించిరి అను దానియందలి సముతుశబ్దము మరాఠము(N I C P 8 శక 1578) ఈవిభాగమునే సముతుబంది యనికూడ అందురు ఇది మహమ్మదీయుల రాజ్యపాలకాలము ఏర్పడినట్లు తెలియుచున్నది ప్రాచీనాంధ్రదేశమునందలి విభాగములను వివరముగ తెలిసికొనుటకు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారి ఆంధ్రులచరిత్ర-సంస్కృతి అనుగ్రంథములోని 48-51 పుటలను శ్రీకుందూరి ఈశ్వరదత్తుగారి ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము అను గ్రంథమునందలి ప్రాచీనాంధ్ర దేశవిభాగములు అను శీర్షికను చూడనగును)

నము అనునది దేశములోని ఒకఅంతర్భాగమని తెలిసికొంటిమి ఇట్టివానిలో చేరినదే అమ్మనబ్రోలుసీమ శాసనముల వలన అమ్మనబ్రోలు సీమలో ఈక్రింది గ్రామములుండినట్లు తెలియుచున్నది అమ్మనబ్రోలు గోనుగుంట చదలువాడ వల్లూరు దొడ్డవరము (నేటిఒంగోలు తాలూకాలోనివి) కొత్తపల్లి కొచ్చెర్లకోట (దర్శితాలూకాలోనివి) తోంగుంట తనుగుంట (కందుకూరు తాలూకాలోనిది) దీనినిబట్టి అమ్మనబ్రోలు సీమ నేటిఒంగోలుజిల్లాలోనిదని స్పష్టమగుచున్నది దీనిప్రశంస శాసనములలో ఇట్లుకనిపించుచున్నది "తిమ్మరుసయ్యవారు తమకు చెల్లివచ్చె కొండవీడు రాజ్యంలోని అప్పానాయని వారికి దయచేసియిచ్చిన అమ్మనబ్రోలి సీమలోని కొచ్చెర్లకోట కటకసాలుంగోట్టున గోనగుంటన" ఈశాసనము (N I ongole 146) శక 1488 నాటిది అనగా క్రీ శ 1511 నాటి పై గోనెగుంట శాసనమువలన అప్పానాయనివారు అమ్మనబ్రోలు సీమలోని గోనెగుంటగ్రామమును శ్రీకృష్ణదేవరాయల మంత్రియగు సాళువ తిమ్మరుసయ్యగారి పుణ్యముగా దానముచేసెనని తెలియుచున్నది కొండవీటిరెడ్డిరాజ్యము కోమటివేమారెడ్డి కొమరుడగు రాచవేమారెడ్డి పాలనముతో అనగా క్రీ శ 1424 నాటికి పతనమైనది ఆ రాజ్యమును సంగమవంశీయుడును విజయనగర పాలకుడునైన రెండవదేవరాయలు (ప్రౌఢదేవరాయలు) జయించి స్వాధీనమొనర్చుకొనెను నాటినుండియు కొండవీటిరాజ్యము విజయనగర రాజుల వశముననే యుండెను సంగమ వంశములో చివరిరాజులు దుర్బలులైన కారణమున గజపతులు దీనిప్రాంతము నాక్రమించుకొనిరి తుళువవంశీయుడైన శ్రీకృష్ణదేవరాయల మంత్రి తిమ్మరుసయ్య కొండవీటిని మరల క్రీ శ 1516 న జయించి తనమేనల్లుడగు నాదెండ్లగోప మంత్రిని దానికి పాలకునిగ నియమించినట్లు చరిత్ర చెప్పుచున్నది గోపమంత్రి కొండవీటిని క్రీ శ 1515 నుండి 1533 వరకు పాలించెను శాసనమున కనవచ్చు అప్పానాయనివారు గూడ గోపమంత్రికడ ఒకపెద్ద ఉద్యోగియై యుండును

దక్షిణహిందూ శాసనములలోను అమ్మనబ్రోలుసీమ ప్రశస్తి కలదు శ్రీకృష్ణదేవరాయలు అమ్మనబ్రోలు సీమలోని వల్లూరి గ్రామాన్ని తమపురోహితులు రంగనాథదీక్షితులకున్ను శివాదీక్షితులకున్ను అమ్మనబ్రోలి సీమలోని కొత్తపలి గ్రామంన్ని తోంగుంట గ్రామంన్ని దానము

చేసెనని కలదు (ద హి VI నెం 248) శాసనము శక 1 437 (క్రీ శ 1515) నాటిది "స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలి వాహన శకవర్ష బ్బులు 1468 (క్రీ శ 1546) అగు నేంటి పరాభవ స వత్సర జ్యేష్ఠ శు 15 (పూర్ణిమా) బు శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివ దేవమహారాయలకు ప్రధానాగ్రగణ్యులున్ను కర్ణాటక మహా రాజ్య విద్యా గర రజిత ు హాసన సామ్రాజ్య ధుర ధురులైన రామరాజయ్య అల్లుడున్ను స గీతసాహిత్య ంగ్రామ పార్థ చౌహత్తిమల్ల రాజుతమ అయ కొ డవీడు అ ద్ద కి అమ్మనంబ్రోలలిని గోపినాథు గాను యిప్పించిన స్వామ్యాలు (ద హిం VI నెం 699 పుట 219)

వై శాసనమువలన అళియ రామరాయల అల్లుడు కొండవీటిలోని గోపీనాథదేవరకు అద్దంకి అమ్మనబ్రోలు గ్రామములలో నొసగిన భూదానములు వానియాజమాన్యములును తెలియవచ్చుచున్నవి అనవేమారెడ్డి చీమకుర్తి శాసనశాసనమున అనవేమారెడ్డి అమ్మనబ్రోలు సీమలోని రామతీర్థమును సర్వాగ్రహారముగా కౌండిన్యగోత్రుడును ఆపస్తంబ సూత్రుడును యజుశ్శాఖీయుడునగు చిట్టిమూరి తిమ్మనభట్టశాస్త్రిలకు దానముచేసినట్లుగలదు తిమ్మనభట్టశాస్త్రిలు శామేశ్వర భట్టు పౌత్రుడు కొండుభట్టారకుని పుత్రుడు (ఎపి ఇం XXI P P 276) మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమరెడ్డిరాజ్యము అను గ్ర థమున ఈశాసనము భోరరిఅయియుండునని కొన్ని కారణములనుచూపిరి (రె రా—91 పుట) ఇట్లే "అమ్మనంబ్రోలసీమలోని చదలవాడస్థలమందు" "అమ్మనంబ్రోలు సీమలోని ఊరుదొడ్డారమున మల్లికార్జు దేవునికి" అను అమ్మనబ్రోలుసీమనుగూర్చిన శాసనములు శక 1481 1438 నాటివి పడువుచున్నవి

నేడు అమ్మనబ్రోలు మద్రాసు వాల్తేరురైలుమార్గమున దలి యొకస్టేషను 1961 నాటి జనాభాలెక్కనుసరించి అమ్మనబ్రోలు గ్రామమున 5 588 జనులుకలరు అమ్మనబ్రోలు అనుపేరు ఈగ్రామమునకు వచ్చుటకు గలకారణమును స్థానికులు ఇట్లుచెప్పుదురు ఒకప్పుడు ఒకరాజు వేటకై వచ్చి దాహపీడితుడై ఇచ్చటికుంటయందలి నీటినిత్రాగి ఈ నీరు అమ్మపాలవలెయుండెనని పొగడెనట నాటినుండియు ఈ గ్రామమునకు అమ్మనబ్రోలు అనునామము ఏర్పడెనట నేటికి ఈగ్రామమునందలి పెద్దబావియు కోటయు శాసనములును ఈగ్రామ ప్రాచీనప్రాధాన్యమును ఉగ్గడించుచున్నవి ఇచ్చటిప్రజలవృత్తి వ్యవసాయము ప్రతిసంవత్సరములకొకమారు ఈగ్రామమునందలి పోలేరమ్మ అంకాలమ్మ అనుగ్రామదేవతలకు ఉత్సవములు జరుగుచుండును వేలకొలది ద్రవ్యమును వ్యయించి పదిరోజులు రథోత్సవాదులతో ఈయుత్సవమును అద్భుతముగ నిర్వహించుచుందురు దీనిని తిలకించుటకై చుట్టుపట్ల గ్రామములనుండి ప్రజలు తండోపతండములుగ వచ్చుచుందురు మసీదు చర్చి ఇతర దేవళములును ఈగ్రామ ప్రజల వివిధ మతాభిరుచులను చాటుచున్నవి ఒంగోలు జిల్లాకు అమ్మనబ్రోలు తలమానికము వంటిదని చెప్పనగును

తం అం శా

## అమ్మరాజు I

మొదటి అమ్మరాజు విష్ణువర్ధనుడు (క్రీ శ 921—928) పూర్వ చాళుక్య చక్రవర్తులలో పదునారవరాజు చాళుక్య వంశ్యులు అనేకులు స్వతంత్రులుగను సామంతులుగను ఉత్తరదేశమునందును దక్షిణాపథమందును రాజ్యములనేలిరి. వీరందరికిని బాదామి(వాతాపి) చాళుక్యులు మూలపురుషులు తూర్పు చాళుక్యులు కల్యాణి చాళుక్యులుకూడ బాదామి చాళుక్యుల సంతతివారే ముదిగొండయందును వేములవాడయందును నిడదవోలునందును ఎలమంచిలియందును చాళుక్యులు పరిపాలన సాగించిరి గుజరాతు రాజస్థానములందును చాళుక్యరాజ్యరమువెలిగెను వీరలను చరిత్ర యందు సోలికులు అనిరి

వేంగిచాళుక్య రాజ్యము మహేంద్రాచలము నుండి మన్నేరు వరకును పూర్వసముద్ర పర్యంతమును వ్యాపించియుండెను ఈరాజ్యము నాల్గుదశల నెమథవించినది 1 క్రీ శ 625—753 ఈదశలో రాజ్యాభివృద్ధి ప్రశాంతతచేకూరెను 2 క్రీ శ 753—973 ఈదశలో చాళుక్యులకు రాష్ట్రకూటులకు బద్ధ రమేర్పడుట వలన దేశము నిరంతరము మరములచే కృశి చి క్రు ంగెను 3 క్రీ శ 973—1075 ఈదశలో చాళుక్యులకు ఒకవైపు కళ్యాణి చాళుక్యులతో వైరమును మరియొకవైపు చోళులతో మైత్రియు సాగుచుండెను 4 క్రీ శ 1025 ఈదశలో చోళుల ప్రాబల్యము హెచ్చినది

మొదటిఅమ్మరాజు ప్రథమచాళుక్యభీమునిపౌత్రుడు కొల్లభిగండ భాస్కర బిరుదాంకితుడైన నాల్గవ విజయాదిత్యుని పుత్రుడు అమ్మరాజు తల్లి పల్లవమహాదేవి ఇతని కనిష్ఠ

సోదుడు రెండవ చాళుక్యభీముడు మేలా తాతయుడు తండ్రి విజయాదిత్యునకు తాను పాలించిన ఆరు మాసములలో కళింగరాజ్యముపైదండెత్తి వెళ్లి ఆయుద్ధమునందు మరణించెను విజయాదిత్యుని మరణముతో వేంగి రాజ్యమున వారసత్వపు యుద్ధములు ప్రారంభమయ్యెను పన్నెండు సంవత్సరములలో క్రమముగ ఆర్గురు రాజులు స్వల్పకాలము రాజ్యమొనరిరి వీరిలో ఒక్కరుగా బలాఢ్యులు కాకపోవుటచే రాజ్యమును అదుపులో నుంచలేకపోయిరి ఇతర రాజుల దండయాత్రల వలన అంతకంతకు క్లిష్ట పరిస్థితులేర్పడెను

ఇట్టి సమయమున మొదటి అమ్మరాజు రాజయ్యెను అమ్మరాజు రాజరికమును మన్నింపక అతని పినతండ్రియైన రెండవ విక్రమాదిత్యుడు తిరుగుబాటులేదీసి సింహాసనమునకై యుద్ధముచేసెను ఈఅదను చూచుకొని అమ్మరాజుయొక్క సామంతులు స్వాధీనము తప్పి రాష్ట్రకూట రాజైన మూడవ ఇంద్రుని సాయముతో తిరుగబడిరి వంశక్రమముగ రాజునకు విశ్వాసపాత్రమైన రాజసైన్యములు సైతము అమ్మరాజునెడ ద్రోహముతలపెట్టి శత్రువులతో కలియుటచే పరిస్థితులు మరింత క్లిష్టమయ్యెను అంతట స్థితప్రజ్ఞుడై అమ్మరాజు మహాపరాక్రమవంతుడై ధైర్యసాహసములతో తనకు నమ్మిన బంటులైన అల్పసంఖ్యాకులైన సైన్యాధికారుల సహాయముతో శత్రువులను చెండాడి ఇడుములగడచి రాజ్యమున స్థిరపడెను మహాకాలుడను సేనానియు కుంతాదిత్యుడను నామాంతరముగల ఖండనాదిత్యుడను మహామంత్రియు మహారాష్ట్ర ఇందపరాజును అమ్మరాజునకు అండదండగా నిల్చి విజయముల చేకూర్చిరి

మహాకాలుడు మొదటి భీమరాజు కాలమునుండియు సైన్యాధ్యక్షుడుగా ఉండెను కుంతాదిత్యుడు అమ్మరాజు తండ్రికాలమున మహామంత్రి అమ్మరాజు రాజ్యారంభ కాలమున వీరును అంకి వ్యతిరేకులైయుండిరట్లు ఈరాజు ఈదేరు శాసనమువలన ద్యోతకమగుచున్నది వంశక్రమాగతులైన ఈ యధికారులను అమ్మరాజు విశేషముగా సన్మానించి తన పక్షమునకు త్రిప్పుకొనెను వీరిసహాయముతో శత్రువులను నిర్జించెను అమ్మరాజునకు తోడ్పడిన మరియొక వ్యక్తి ఇందపరాజు ఈతడు మహారథుల వంశమునకు చెందినవాడట ఈతని తాత మరియొక ఇందపరాజు వీరు మాన్యఖేటము నుండి వచ్చిరి మాన్ఖేడు రాష్ట్రకూట రాజవంశము కును ఇందపరాజు వంశమునకును ఏదైన బాంధవ్యమున్నదేమో తెలియదు ఏరేయులు రాష్ట్రకూటులు దండయాత్రలలో వేంగిప్రాంతమునకు వచ్చి అక్కడ స్థిరనివాసమేర్పరచుకొని యుండిరి అనంతరకాలమున కాకతీయ యుగమునందు సాగి పోతిదేవుడను మహారాష్ట్ర కుటుంబముల వారు తెలుగుదేశములో నిలిచిపోయిరి ఇందప అను ది ఇంద్రప శబ్దభవము కావచ్చును

అమ్మరాజు ఏడు సంవత్సరములు ప్రశాంతముగ రాజ్యపాలనము సాగించెను తనకు సాహాయ్యమొనర్చిన సేనానులకు అనేకదానములను చేసెను రాష్ట్రకూట రాజులు ద్వితీయ అమోఘవర్షుడును (క్రీ శ 9 2 927) వానికి తమ్ముడు నాల్గవ గోవిందరాజు (క్రీ శ 927 36) ఇతని సమకాలికులై యుండిరి అమోఘవర్షుడు గోవిందుని పన్నాగమువలన మృత్యువువాతపడిన తోడనే పట్టమహిషి వేంగిరాజ్యమునకు పలాయనమొనర్చి అమ్మరాజు సంరక్షకత్వమున ఉండెను ఇది గోవిందరాజునకు కోపకారణమయ్యెను అతడు కక్షకట్టి అమ్మరాజు మరణానంతరము చాళుక్య రాజ్యములో చెలరేగిన వారసత్వపు యుద్ధములో కలుగజేసికొని తన పక్షపాతియైన మొదటి తాడపరాజును గద్దెనెక్కించెను

పులివర్రు శాసనము అమ్మరాజు మహారట్ట వంశజుడును మాన్యఖేటాధిపతియునైన ఇందపరాజునకు పౌత్రుడైన ఇందపరాజునకు గ్రామము దానమిచ్చినట్లు చెప్పుచున్నది దానగ్రహీత ఇంద్రుడు (ఇందపరాజు) రాష్ట్రకూటరాజు మూడవ ఇంద్రుని మనుమడు ఇతడు అమోఘవర్షుని కుమారుడనియు తండ్రి తనతమ్ముడైన గోవిందునిచే రాజ్యచ్యుతుడు కాగా ఇతడు అమ్మరాజును ఆశ్రయించి ఉండునని ఊహింపబడినది కాని అమోఘవర్ష నామధేయము శాసనములో పేర్కొనబడకదున దానప్రతిగ్రహీత తండ్రి పట్టాభిషిక్తుడైనరాజు కాడేమో అనితోచుచున్నది అతడు ప్రయశః మరొక రాజకుమారుడై యుండియుండును

మొదటి అమ్మరాజునకు రాజమహేంద్ర అను బిరుదు కలదు పూర్వచాళుక్య రాజ్యమునకు దాదాపు మున్నూరు వర్షములు రాజధానిగనున్న వేంగీపురమును వీడి అమ్మరాజు గోదావరీతీరమున రాజమహేంద్రవర పట్టణమును నిర్మించి తనరాజధానిని అచటికి తరలించెను కృష్ణాగోదావరీ నదులకును పూర్వసముద్ర మహేంద్రపర్వతములకును మధ్యమున్న ప్రదేశమే

వేంగిపై దండెత్తిరి వీరికి కటకరాజగు రెడ్డపండరంగడును కొలను పాలకుడైన నృపకాముడును సాయమొనర్చిరి వీరు చాళుక్యుల భృత్యవర్గములోని వారైనను రాజద్రోహులై శత్రుపక్షమును చేరిరి వీరితోపాటు మరికొందరు సామంత ప్రభువులును బాడప తాళపులకు అండగా నిలిచిరి ఈ యుద్ధము నాటికి అమ్మరాజు వయస్సు ఇరువదిమూడు సంవత్సరములు మాత్రమే అయినను అమ్మరాజు ధైర్యమును గోల్పోలేదు సైన్యమును కూడగట్టుకొని కదనమునకు సిద్ధపడెను కాని శత్రుసైన్యము మితిమీరి యుండుటచే దానిని నిలువరింపజాలక అమ్మరాజు యుద్ధరంగమునుండి పారిపోయెను శత్రువులకు వేంగి వశమయ్యెను బాడపుడు వేంగికి రాజయ్యెను తాళపరాజు అతనికి సహాయకుడయ్యెను మాలెనశర్మ అను బ్రాహ్మణుడు వారికి మంత్రిత్వము నెరపుచుండెను మాలెనశర్మది కౌండిన్య గోత్రము అతని తండ్రి యతుడు తల్లి కాంతమ్మ వేంగి సింహాసనము నెక్కిన అల్పకాలముననే బాడపరాజు అకాలమరణము నొందెను అతనికి పిమ్మట తమ్ముడు తాళపరాజు వేంగికి రాజయ్యెను ఇతడు బాడపునివలె ధైర్యసాహసోపేతుడుకాడు శత్రుగతమైన వేంగిని ఎట్లైనను తిరిగి ఆక్రమింపవలెనని అమ్మరాజు పొంచియుండెను కొలని ప్రభువైన నృపకామగండ నారాయణుని కూతురగు నాయమాంబను అమ్మరాజు పరిణయమాడి నృపకాముని అండను సంపాదించుకొనెను శత్రుసామంతులను కొందరిని కూడగట్టుకొనెను వెనుక తనకు ద్రోహమొనర్చిన వారిని తిరిగి తనవైపు త్రిప్పుకొనెను ఈతనికి సాయమొనర్చిన వారిలో కటకరాజగు దుర్గరాజు మిత్రాయు వంశజుడైన కుప్పన అనువాడు సువర్ణ భాండాగార శ్రీకరణ ముఖ్యుడగు కోరివియయు యువరాజ బల్లాల దేవుడు అనువారుకలరు ఈ విధముగ అమ్మరాజు సైన్యమును ఆయత్తమొనర్చుకొని వేంగిపై దాడివెడలెను

సమరమున తాళపుని పరిమార్చి అమ్మరాజు వేంగికి తిరిగి రాజయ్యెను ఇట్లు పదునొకండు సంవత్సరములు గడచెను అమ్మరాజు సవతిసోదరుడగు దానార్ణవుడు తనకు దక్కవలసిన రాజ్యము తమ్మునకు దక్కనేయని చింతించుచుండెను ఇట్టి సమయమున అనగా క్రీ శ 956సం॥న రాష్ట్రకూటుడైన ముమ్మడికృష్ణరాజు దానార్ణవుని లోబరచుకొని వేంగిపైదాడి సలిపెను అసహాయశూరుడగు కృష్ణభూపతి ధాటికి ఆగలేక అమ్మరాజు కళింగమునకు పారిపోయెను వేంగి కృష్ణరాజునకు వశమయ్యెను కమ్మనాటికి (కృష్ణానదికి దక్షిణప్రదేశము) నాగమయ్య సుతులగు మల్లపయ్య పొన్నమయ్య అను జైన బ్రాహ్మణులను పాలకులుగ నియమించి శేషించిన వేంగి రాజ్యమును దానార్ణవున కప్పగించి కృష్ణరాజు స్వదేశమునకు మరలిపోయెను దానార్ణవుడు రాజ్యపాలనమున దక్షుడు కాడు ఈతని యసమర్థతనుగురై రిగినవాడు కావున ఇదియే తగిన సమయమనియెంచి అమ్మరాజు కళింగమునుండి తిరిగి వచ్చి కొంతసైన్యమును సిద్ధము చేకొని తిరిగి వేంగిపై బడెను దానార్ణవుని పారద్రోలి మరల అమ్మరాజు వేంగికి పాలకుడయ్యెను అయినను అమ్మరాజునకు ఆత్మశాంతి లేదు దాయాదుల శత్రుత్వమింకను అతనికి వదల లేదు సింహాసనస్థుడైన నాటినుండియు అతడు శత్రువులతో పెక్కు సమరములు సలుపవలసిన వాడయ్యెను పదవీ చ్యుతుడైన దానార్ణవుడు కృష్ణభూధవాదుల సాయముతో తిరిగి వేంగిపైబడి సమరమున సవతిసోదరుడగు అమ్మరాజును వధించి తాను తిరిగి వేంగి రాజ్యసింహాసనము నధిష్ఠించెను

ఈయుద్ధము క్రీ శ 970 సం॥న జరిగెను సమరమున నిహతుడైన నాటికి అమ్మరాజు వయస్సు ముప్పదియేడు సంవత్సరములు ఈతనికి పిమ్మట ఈతని సవతి యన్న దానార్ణవుడు మూడుసంవత్సరములు మాత్రమే వేంగిని పాలిచెను రెండవఅమ్మరాజు చెల్లెలిభర్తయైన జటాచోడభీముడనువాడు అవక్రపరాక్రమముతో వేంగిని ముట్టడించి రణమున దానార్ణవుని పరిమార్చి అతని తనయులను దేశమునుండి పారద్రోలి వేంగి కళింగములను సుమారు ఇరువదియేడు సంవత్సరములు అనగా క్రీ శ 973 నుండి 1000 వరకు పాలించెను

ఈ రెండవ అమ్మరాజు వేంగిని పాలిచిన కాలము మొత్తము ఇరువదియైదు సంవత్సరములు (క్రీ శ 945 70) రెండుపర్యాయములు రాజ్యభ్రష్టుడై ఇతడు తన సామర్థ్యము వలన తిరిగి రాజు కాగలిగెను తుదకు సవతి సోదరుడగు దానార్ణవుని చేతిలో సమరమున పంచత్వము నొందెను అమ్మరాజు గొప్పధైర్యశాలి అతడు కదనరంగమున కాకలు తీరినబంటు ఏనుగులను యుద్ధమునకు తర్ఫీదునిచ్చుటలోను వానిని యుద్ధరంగమునకు నడపి గజయుద్ధమొనర్చుటలోను అతడుకడు నేర్పరి అమ్మరాజు పేరట పెక్కుశాసనములు

ఈ గ్రామమున 1000 ఆవులు ఎద్దులు గేదెలు మున్నగు నవి 500 మేకలు 200 గొర్రెలు 50 పందులు 4 గుర్రములు 1000 కోళ్ళు ఉన్నవి దినమునకు 500 లీటర్ల పాలు నెలకు 300 కిగ్రా వెన్న 600 కిగ్రా మాంసము 1500 గ్రుడ్లు స్థానికులు వినియోగింతురు

ఇచటి ప్రజలకు వ్యవసాయము కూలి ముఖ్యమయిన జీవనాధారములు దుకాణాదారులు కంసాలులు వడ్రగులు కమ్మరులు కుమ్మరులు తాపీమేస్త్రీలు 150 మంది లివారు చాకలివారు (0) గొల్లలు వడ్డరలు కలరు వ్యవసాయ దారులకు కూలీలు దొరుకుదురు దినమునకు కూలిరేటు పురుషునకు రు 2 లు స్త్రీకి ఒకరూపాయి

ఇచ్చట మూడు దేవాలయములు ఒక మసీదు కలవు శ్రీరామనవమి ఉత్సవము జరుగును

ఈ గ్రామమున 40 మైళ్ళలో భువనగిరి రైల్వేస్టేషను ఉన్నది ఈగ్రామము బస్సు మార్గము పైన ఉన్నది గవర్నమెంటు బస్సులు ప్రతి రెండు గంటలకు ఈ గ్రామము నుండి విజయవాడకు నల్లగొండకు సూర్యాపేటకు హైదరాబాదుకు పోవును దీనిని పొరుగు గ్రామములతో కంకర రోడ్లు మట్టిరోడ్డు కలుపుచున్నవి ప్రయాణములకు 10 రిక్షాలు 400 రెండెడ్ల బండ్లు 56 సైకిళ్ళు కూడ ఈ గ్రామములో ఉన్నవి

అయిటిపాములలో బ్రాంచి పోస్టాఫీసు అప్పర్ ప్రైమరీ స్కూలు కలవు ఈ స్కూలునకు విద్యార్థులు రామచంద్రపూరు సంధము ?ల్లి మొదలగు గ్రామముల నుండి కూడ వత్తురు ఇది పంచాయతీ పాలనకల గ్రామము ఇంటి పన్నులు మొదలగు వాటి ద్వారా ఈ పంచాయతీకి ఆదాయము వచును ఎడబ్లుయుడి ట్రావెర్సుబంగళాకలదు గ్రామవ్యవసాయ పరతిన ఘము గ్రామస్థులకు రు 25000 లు అప్పుగా ఇచ్చినది ఇద్దరు ఇంగ్లీషు వైద్యులు ముగురు అయుర్వేద వైద్యులు కలరు పశురోగాలకు నాటువైద్యము కలదు వారమున కొకమారు పశువుల సంత జరుగును 10 కిరాణా దుకాణములు ఒక కాఫీ హోటలు ఒక జీని సోడా సిగరెట్టు దుకాణము ఒక సైకిల్ షాపు కలవు

తతి కార్యాలయమునకు జనరల్ ఆసుపత్రికి పురుష్ణ ఆసుపత్రికి పశువుల ఆసుపత్రికి పోలీసు స్టేషనుకు అభివృద్ధి కేంద్రమునకు గ్రామస్థులు 4 మైళ్ళలో ఉన్న నకిరెకల్లునకు పోవుదురు విద్యార్థులు హైస్కూలు చదువులకు నకిరెకల్లునకును కళాశాల చదువులకు 0 మైళ్ళలో నున్న నల్లగొండలోని నాగార్జున కళాశాలకు పోవుదురు కోర్టులకు జిల్లా ప్లాప్రీసు ఆఫీసుకు తాలూకా కచేరికి నల్గొండకు పోవుదురు

మా శ్వే

## అయితమాంబ

ఈయము ప్రశంస మెకంజీ సేకరణము సంపుటి 2413 71 వ దును దక్షిణహిందూదేశ శాసనములు పదియవ సంపుటము నందును శాసనగును (ద హి X సె౦ 112) ఈమె ఈవని కంద్రవాటి సీమలోని కురుంగల్లునకును వెల్నాడులోని దావులూరునకును రక్షరికము నిర్వహించిన అయతమ నాయకుని భార్య

శాక 1065 (క్రీశ 1143 వ సం॥ రము విషువు సంక్రాంతి పుణ్యదినమున అయితమాంబ దావులూరున దలి గోకేశ్వర దేవరకు అఖండవర్తి దీపమునకు గాను 55 గొర్రెలను దానము చేసెను వాటిని తెనాలి నక్కనాబోయని కొడుకులు చెన్నబోయను కామబోయను అను వారలకు నిచ్చి వారు నిత్యము మానెడునేయి గోకేశ్వర దేవర దీపమునకు పోయునట్లు ఏర్పాటు చేయుచు శాసనము వేయించెను

ఈశాసనము శ్రీమన్మహామండలేశ్వర వెలనాటి రెండవ గొంకరాజు పరిపాలన కాలమునకు చెందినది ఇందు అయితమ నాయకుడు రాజేంద్రచోడ రాజునకు ఇష్టభృత్యుడని తెలుప బడినది రాజేంద్రచోడుడు అనగా రెండవ గొంకరాజు తండ్రియైన మొదటి వెలనాటి చోడరాజు

గోకేశ్వరాలయమున దలి ?రొక శాసనము నుండి (ద హిం X సె 109) అయితమాంబకు కొమ్మయనాయకుడను కుమారుడు కలడని తెలియవచ్చినది తండ్రి వలెనే ఇతడుకూడ వెలనాటి రాజేంద్రచోడుని ప్రేమాదరములనొంది కురంగల్లుగామ విభుడయ్యెను దావులూరునందు శ్రీగోకేశ్వరదేవరకు ప్రతిష్ఠించి గుడియు మంటపమును కట్టించెను ఈతడు తనతల్లి అయితమాంబ గుణగణములను కీర్తించి తల్లి ఋణము దీర్చుకొని ధన్యుడయ్యెను ఈ వర్ణన సంస్కృత శ్లోకమునందున్నది అందలి కొన్ని విషయములు ఈ క్రింద పొందుపరుపబడినవి

అయితమాంబ విశేషకీర్తి పొందిన తీవ్రవత శచీదేవి ఇంద్రుని సేవించినట్లు అయితమాంబ భర్తను సేవించినది

480 మేకలు 70 గొర్రెలు 0 పందులు 670 కోళ్ళు కలవు. దీనివలన 200 లీటర్ల పాలు 5 కి గ్రా నెయ్యి స్థానికులు వినియోగించుకొని 300 లీటర్ల పాలను 140 కి గ్రా నెయ్యిని అమలాపురమునకు రవాణా చేసి సాలీనా రు1000లు వివర గల చేలను స్థానికులు ఉపయోగించుదురు

ఇచట ప్రజల ముఖ్య జీవనాధారములు వ్యవసాయము కూలి కటీరపరిశ్రమలు వ్యాపారము దుకాణదారులు క్రయవిక్రయదారులు బట్టలు నేయువారు ఎద్దుబండ్లతోలు వారు కలరు వీరుగాక కంసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీమేస్త్రీలు తెలికలవారు మంగలివారు చాకలివారు కలరు సిద్ధివినాయక కోకోనట్ కంపెనీ వారు సాలీనా 1000 బస్తాల కుడి ను తయారుచేసి విజయవాడకు కాకినాడకు ఎగుమతి చేయుదురు వడ్లమర 10 000 బస్తాల బియ్యమును తయారుచేసి విజయవాడకు కాకినాడకు ఎగుమతి చేయును కొబ్బరిపీచుతో తాళ్ళను తయారుచేసి కాకినాడకు రవాణాచేయుదురు వ్యవసాయదారులకు కూలీలు దొరుకు దురు దినమునకు కూలిరేటు పురుషునకు రు 3 50 లు స్త్రీకి రు 3 లు

ఇచ్చట చెన్నకేశవ సిద్ధివినాయక కాలభైరవ క్షణముక్తేశ్వరస్వాముల దేవాలయములు కలవు సత్తెమ్మ పోలేరమ్మల గుడులు ఒక చర్చి ఉన్నవి సిద్ధివినాయ దేవాలయమునకు 30 ఎకరముల భూమియు క్షణముక్తేశ్వరస్వామి దేవాలయమునకు 40 ఎకరముల భూమియు కలవు జనవరి మాసములో ప్రభల తీర్థము జరుగును

ఈగ్రామమునకు 16 మైళ్ళ దూరములో ద్రాక్షారామ రైల్వే స్టేషనున్నది ముక్తేశ్వరం బ్యాంక్ కెనాల్ ద్వారా అరటికాయలను కొబ్బరిని మొక్కజొన్నలను కాకినాడకు రాజమండ్రికి ఎగుమతి చేయుదురు రాజమండ్రినుండి సూనెలు దిగుమతి యగును ఈముక్తేశ్వరం బ్యాంకు కాలువద్వారా కాకినాడకు జనుపరాకపోకలు జరుగును ఈ గ్రామ సివారైన ముక్తేశ్వరమునకు బస్సుకలవు అరగంటకొకసారి ప్రయాణపు బస్సులు ముక్తేశ్వరనుండి బొబ్బర్లంక రాజోలుకు కాకినాడ ఇచ్చటికి పోవును ఈగ్రామములో 15కంకర రోడ్డున్నవి దీనిని పొరుగు గ్రామములతో కంకర రోడ్లు కలుపుచున్నవి ప్రయాణములకు గ్రామమున 6 గుర్రపుబండ్లు 2 ఒంటెద్దు బండ్లు 280 రెండెడ్ల బండ్లు 270 సైకిళ్ళు 4 మ్యాటర్లు కలవు

ఈగ్రామములో బ్రాంచి పోష్టాఫీసు తంతికార్యాలయము టెలిఫోను ఉన్నవి జయతి బుచ్చిరామయ్య వంతులు జిల్లా బోర్డ్ హైస్కూలున్నది ఈహైస్కూలునకు ఎర్రపల్లి వెలువలపల్లి తాళ్ళపల్లి కొత్తగరమూడి గ్రామముల నుండి కూడ విద్యార్థులు వత్తురు విద్యుచ్ఛక్తిని 33 ఇండ్లు మిల్లు వాడుకొనుచున్నవి ఇచట పంచాయతి పరిపాలన లగ్రామము పంచాయతి గ్రంథాలయము సత్రముకలవు ఇచటి సహకార సంఘము రు 40 000 లు గ్రామస్థులకు అప్పుగా ఇచ్చినది ఇచ్చట లోకల్ ఫండ్ ఆసుపత్రి ప్రధాన ఆరోగ్యకేంద్రము ఉన్నవి ఇద్దరు ఇంగ్లీషు వైద్యులు ఇద్దరు ఆయుర్వేద వైద్యులు ఒక హోమియోపతి వైద్యుడు ఇచట లరు గ్రామ సివారైన ముక్తేశ్వరంలో పశువుల ఆసుపత్రి ఉన్నది గ్రామ వారసంతలోను లకసంతలోను కూరగాయలు దొరుకును 6 కిరాణా దుకాణములు 5 కాఫీ హోటళ్ళు 4 సోడా ఫ్యాక్టరీ దుకాణములు 15 సైకిళ్ళ షాపులు కూడ ఉన్నవి

ఈగ్రామ విద్యార్థులు కళాశాలచదువులకు అమలాపురంలోని యస్ కె బి ఆర్ కళాశాలకు పోవుదురు ట్రెజరీకు ఆఫీసుకు తాలూకా కచేరీ అమలాపురమునకును పోలీసు స్టేషనుకు అల్లవరము కోర్టులకు 13 మైళ్ళలోనున్న కొత్తపేటకును బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు 15 మైళ్ళలో మన్న ముమ్మిడివరమునకు గ్రామస్థులు పోవుదురు

శ్రీరామచంద్రుడు ఈస్థలమునందే శివుని ప్రార్థించి ఒక ఋషికన్యకు ముక్తిని ఇచ్చెను క్షణకాలములో ముక్తినిచ్చిన కారణమున ఈ స్థలము క్షణముక్తేశ్వరమైనది అదే సమయమున క్షణముక్తేశ్వరస్వామిని ఇచట శ్రీరామచంద్రుడు ప్రతిష్ఠించెను ఇక్కడ సిద్ధివినాయకుని దేవాలయము మిక్కిలి ప్రసిద్ధి చెందినది ఈ దేవాలయ ప్రాంగణములో 5 అలయములున్నవి కాశీకు పోవు యాత్రికులు ఇచ్చటికి వత్తురు

వర్ధమాన నగర పూర్వ జమీందారు శ్రీ ... ప్రేమానికామేశ్వరరావుగారు ఇచటి ప్రజారోగ్యకేంద్రమునకు భూమిదానమిచ్చిరి శ్రీ గంటి ... గారు ఇచట ధ్వజస్తంభప్రతిష్ఠ కావించిరి గౌతమీనదిపైన తెనగలదు

మా శ్వే

## అయినాపురం

అయినాపురం తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకాలో ఉన్నది ఇచ్చటకు పూర్వకాలమున ఒక కమ్మలు

లేని దేవదాసి వచ్చెనోయి ఆమెకు దృష్టి చెడినియు అందరు ఆకారణముచే గ్రామమునకు అయినాపురము అను పేరు వచ్చిందందురు. దీనికి నాలుగు మైళ్ళ దూరములో ముమ్మిడివరం ఉన్నది. తూర్పున కుండలేశ్వరము పడమట ఉప్పుడు ఉత్తరమున కొత్తలంక దక్షిణమున చెయ్యేరు ఈ గ్రామమునకు సరిహద్దులుగా ఉన్నవి. ఈ గ్రామవిస్తీర్ణము 2541 ఎకరములు. ఇది సమతలప్రదేశమున కలదు.

ఈ గ్రామములో 1961సం॥ జనాభాలెక్కల ప్రకారము పురుషులు స్త్రీలుకలిసి 4793 మంది ఉండిరి. వీరిలో షెడ్యూల్డు జాతులవారు షెడ్యూల్డు తరగతులవారు 1769 మంది. ఇచట ఇండ్లు పంక్తులుగా ఉన్నవి. వీటిలో 15 పెంకుటిండ్లు రెండు కాంక్రీటుకప్పుగల ఇండ్లు రెండు ఒకఅంతస్తుగల మేడలుకలవు. ఇచ్చట ప్రజలందరు వరిఅన్నమును తిందురు. కాలువనీటిని చెరువునీటిని త్రాగుదురు. ఇచట మంచినీటి ఎద్దడిలేదు.

అయినాపురం మెయిన్ కాలువ మాగాంకాలువ వాడవర్రు కాలువ చెంకుకాలువ కుండలేశ్వరంకాలువ పెద్దచెరువు సత్యనారాయణచెరువు బొట్టుగట్టుచెరువు ఒట్టిచెరువు బొందగట్టిచెరువు మొదలయినవి ఈ గ్రామమునకు గల నీటి వనరులు. వీటిక్రింద వరి మిరప పసుపు జనుము మొదలగువంటలు పండును. ధాన్యమును గాదెలలో పురులలో నిలువ చేయుదురు. వీటిని బండ్లపై ముమ్మిడివరమునకు రవాణాచేయుదురు. 687 ఎకరముల మేరకు కొబ్బరితోటలు ఉన్నవి. రు 60 000 లు విలువగల కొబ్బరికాయలను 1976-77 సం॥ లో అమలాపురమునకు కాకినాడకు ఎగుమతి చేసిరి. పంటలక్రింద 2100 ఎకరములభూమి సాగుబడియైనది. 400 ఎకరములభూమి కాలువక్రిందను 20 ఎకరముల భూమి చెరువులక్రిందను 100 ఎకరములభూమి బావులక్రిందను సాగుబడి చేయబడినది. ఆరు ఆయిల్ ఇంజనులు 200 నత్తగుల్లలు ఇచటి నీటిని భూములకు సరఫరాచేసెను. ఇచ్చట 2100 ఎకరములు నల్లరేగడి పొలము ఉన్నది.

ఈ గ్రామములో 268 ఆవులు 174 గేదెలు 472 ఎద్దులు 53 దున్నపోతులు 97 మేకలు 163 పందులు 1781 కోళ్ళు ఉన్నవి. సాలీనా 1 50 000 లీటర్ల పాలు స్థానికులు వినియోగించుకొని 1 00 000 లీటర్ల పాలను అమలాపురమునకు రవాణాచేసిరి.

ఇచటి ప్రజల ముఖ్యవృత్తులు వ్యవసాయము కూలి వ్యాపారము. ఎద్దుబండ్లు తోలువారు కంసాలులు వడ్రంగులు తాపీమేస్త్రీలు కెలిలవారు మంగలివారు చాకలివారు గొల్లలుకూడ కలరు. ఇచట నాలుగు వడ్లమరలు సాలీనా 50 000 బస్తాల బియ్యమును తయారుచేయును. బియ్యము అమలాపురమునకు రవాణా అగును. వ్యవసాయదారులకు కూలీలు దొరకుదురు. కూలిరేటు దినమునకు పురుషునకు రు 2లు స్త్రీకి రు 1 50 లు.

ఈ గ్రామమునకు 35 మైళ్ళ దూరములో కాకినాడ రైల్వేస్టేషను ఉన్నది. కాలువలద్వారా జనుల రాకపోకలు జరుగును. గ్రామములో 2 తారురోడ్లు 12 మట్టిరోడ్లు ఉన్నవి. దీని ముమ్మిడివరం గ్రామముతో మట్టిరోడ్డు కలుపుచున్నది. ఇచట ప్రయాణమునకు 150 రెండెడ్లబండ్లు 450 సైకిళ్ళు గలవు.

ఈ గ్రామమున వరాహలక్ష్మీనరసింహ సోమేశ్వర స్వాముల దేవాలయములుకలవు. మూడు రామాలయములు నీలాలమ్మగుడి ఆదిలక్ష్మిగుడి ఉన్నవి. వరాహలక్ష్మీనరసింహస్వామి కల్యాణము నీలాలమ్మతీర్థము జరుగును.

ఈ గ్రామములో బ్రాంచిపోస్టాఫీసు ఎలిమెంటరీస్కూలు ఉన్నవి. ఇది పంచాయతి పరిపాలనకల గ్రామము. ఇచటి పంచాయతి ఆదాయము రు 18000 లు. పంచాయతి గ్రంథాలయము రేడియో లౌడ్ స్పీకర్లు ఉన్నవి. ఒక కోఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ రెండు సహకారసంఘములు ఉన్నవి. ఇద్దరు ఆయుర్వేద వైద్యులు ఇద్దరు హోమియోపతి వైద్యులుకూడ గలరు. ఈ గ్రామములో వారసంత జరుగును. ఇచట 10 కిరాణాదుకాణములు 5 కాఫీహోటలు 3 సోడాబళ్ళు సిగరెట్టు దుకాణములు రెండు సైకిళ్ళషాపులు ఒక క్షౌరశాల ఉన్నవి.

ఈ గ్రామవిద్యార్థులు హైస్కూలు చదువులకు ముమ్మిడివరమునకు కళాశాల చదువులకు అమలాపురమునకు పోవుదురు. పోలీసుస్టేషనునకు సబ్ రిజిష్ట్రారుఆఫీసునకు తాలూకా కచేరీకి బ్లాకు అభివృద్ధికేంద్రమునకు ముమ్మిడివరమునకును కోర్టులకు అమలాపురమునకును గ్రామస్థులుపోవుదురు. జనరల్ ఆసుపత్రికి ముమ్మిడివరమునకు పోవలయును.

మా శ్వే

## అయిలాపురము

అయిలాపురము కరీనగరు జిల్లా మెటుపల్లి తాలూకాలో ఉన్నది. దీనికి 47 మైళ్ళదూరములో కరీనగరు పట్టణము కలదు. ఈ గ్రామమునకు తూర్పున కొల్లూరు, పడమట యూసుఫ్ నగరు, ఉత్తరమున టాపూరు, దక్షిణమున కోరుట్ల గ్రామములు సరిహద్దులుగా ఉన్నవి. దీని ఉత్తర అక్షాంశము 18-30 తూర్పు రేఖాంశము 78-50. దీని విస్తీర్ణము 5035 ఎకరములు. ఇది కొండల ప్రాంతమందున్నది. ఇచట 158 ఎకరముల ఎర్ర్యాకల మల్లన్నగుట్ట, 158 ఎకరముల మామిడిగుట్ట, 30 ఎకరముల విస్తీర్ణము కల పొట్టిగట్టు, 42 ఎకరముల విస్తృతికల పులిగుట్ట కలవు. వీటిపై టేకుచెట్లు సీతాఫలము చెట్లు కలవు. ఇవి కల్లరాతి నిర్మాణము కల గుట్టలు.

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములో 1981 మంది పురుషులు 2198 మంది స్త్రీలు వెరసి 4179 మంది ఉండిరి. ఈ సంఖ్యలో షెడ్యూలు జాతుల పురుషులు 303 మంది స్త్రీలు 331 మంది వెరసి 636 మంది. ఇచట ఇండ్లు ఒకచో దూరదూరముగాను ఒకచో వాడవాడలుగాను ఒకచో వరుసలుగాను నిర్మింపబడినవి. వీటిలో 1280 పెంకుటిండ్లు, 25 కాంక్రీటు కప్పుగల ఇండ్లు, 10 ఒక అంతస్తుగల మేడలు, 5 ఎక్కువ అంతస్తులుగల భవనములు ఉన్నవి. ఈ గ్రామస్థులలో 3000 మంది వరిఅన్నమును 1179 మంది జొన్న అన్నమును తిందురు. వీరు బావినీటిని త్రాగుదురు. మంచినీళ్ళ ఎద్దడి లేదు.

టాపూరువాగు, పెద్దచెరువు, పేటచెరువు, నరసింహులకుంట, మారెపలికుంట, బూస్గుల్లికుంట, నాయనదికుంట, కుమ్మరికుంట, గౌవుడవాలకుంట, చెవదుకుంట, బల్లెముట్టికుంట, పోల్కమ్మకుంట మొదలగునవి ఈ గ్రామమునగల నీటివనరులు. వీటిక్రింద వరి మిర్చి పసుపు చెరకు కంది ఉవ నువ్వు మొక్కజొన్న పండును. ఈ పంటదినుసులను బండ్లపై కోరుట్లకు మెట్టుపల్లికిని లారీలపై గిత్యాల నిజామాబాదులకును రవాణా చేయుదురు. ఇక్కడ 30 ఎకరముల మేరకు మామిడితోటలు కూడ ఉన్నవి. 1966-67 సంవత్సరములో రు 5,000 ల విలువగల మామిడికాయలను స్థానికులు ఉపయోగించుకొని రు 5,000 ల విలువగల మామిడికాయలను కోరుట్ల జగిత్యాలలకు రవాణా చేసిరి. గ్రామ అవసరములకు సరిపడు కూరగాయలను పండించుదురు. పంటల క్రింద 3018 ఎకరముల భూమి సాగుబడియైనది. కాలువక్రింద 20 ఎకరముల భూమి, చెరువుక్రింద 801 ఎకరముల భూమి, బావులక్రింద 250 ఎకరముల భూమి, ఇతర వనరులక్రింద 160 ఎకరముల భూమి సాగుబడియైనది. 4 ఆయిల్ ఇంజనులు 115 పర్షియను చక్రములు ఏతములు 860 ఎకరములకు నీటిని సరఫరా చేసెను. ఇచట భూమిలో 600 ఎకరముల నల్లరేగడి నేల, 1900 ఎకరముల ఎర్రమట్టి నేల, 600 ఎకరముల సారవంతమైన ఇసుకనేల కలవు.

అయిలాపురమునందు 275 ఆవులు 1066 ఎద్దులు 229 గేదెలు 227 దున్నలు 12 గాడిదలు 20 మేకలు 612 గొర్రెలు 50 పందులు 1594 కోళ్ళు కలవు. పాలు పెరుగు నెయ్యి మాంసము గ్రుడ్లు 400 కి. గ్రా. చేపలు స్థానికులు వాడిరి.

ఈ గ్రామ ప్రజలముఖ్యవృత్తులు వ్యవసాయము కూలి వ్యాపారము. కంసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీమేస్త్రీలు చాకలివారు మంగలివారు గొల్లలు వడ్డెరలు నూలునేయువారు కలరు. ఇచట 5 వడ్ల మరలు 18 బీడీల ఫ్యాక్టరీలు కలవు. రు 80,000 ల విలువగల బీడీలను నిజామాబాదునకు రవాణా చేసిరి. వ్యవసాయదారులకు కూలీలు దొరకుదురు. దినమునకు కూలిరేటు పురుషునకు రు 4 లు స్త్రీకి రు 2-50 లు.

ఇచట ఆంజనేయ రాజేశ్వర అనంతస్వాముల ఆలయములు, పోచమ్మ తాతమ్మ మహాలక్ష్మమ్మ పెద్దమ్మ గుడులు, ఒక మసీదు ఉన్నవి.

ఈ గ్రామమునకు 47 మైళ్ళదూరములో నిజామాబాదు రైల్వేస్టేషను ఉన్నది. ఈ గ్రామమును ఇతర గ్రామములతో మట్టిరోడ్డు కలుపుచున్నది. ప్రయాణమునకు మోటారుకారు 514 ఎడ్లబండ్లు 65 సైకిళ్ళు ఉపయోగపడెను.

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు టెలిఫోను జిల్లా పరిషత్తు హైస్కూలు ఉన్నవి. హైస్కూలు చదువులకు యూసుఫ్ నగరు టాపూరు గ్రామముల విద్యార్థులు ఇచటకు వత్తురు. ఇది పంచాయతి పరిపాలనకల గ్రామము. ఈ పంచాయతి ఆదాయము ఇంటిపన్ను ఆదాయపుపన్ను బందెదొడ్డిపన్ను ప్రభుత్వపు గ్రాంటు మొదలయిన వాటివలన లభించును. ఇచట గ్రామపారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లు కలవు. గ్రామ[illegible] సహకార సంఘము రు 18,000 లు

గ్రామస్థులకు అప్పుగా ఇచ్చునది. కురోగములకు నాటువైద్యము చేయువారు కలరు. ఇక్కడ 3 కిరాణాదుకాణములు 3 కాఫీ హోటళ్ళు రెండు సోడా గోట్లు (ఫ్యాక్టరీలు) నూనెకానములు 3 సైకిళ్ళ షాపులు రెండు షావుకారులు 3 బట్టలషాపులు ఉన్నవి.

తపాలాకార్యాలయమునకు వారమంతకు కవుల ఆను పత్రికలు ఎస్ మాధవపేటరకు ఈ గ్రామమునకు 3 మైళ్ళలో నున్న కోరుట్లకు గ్రామస్థులు పోయెదరు. ఉన్నత పాఠశాల చదువులకు విద్యార్థులు 17 మైళ్ళలోనున్న జగిత్యాలకు పోవుదురు. పోలీసు స్టేషనుకు కోర్టులకు తాలూకాకచేరీ జాకు అధికారికే బ్రహ్మముకు మెట్‌పల్లిలోని కోర్టులకు సబ్‌రిజిష్ట్రారు ఆఫీసుకు జగిత్యాలకును గ్రామస్థులు పోవుదురు. పురుళ్ళ ఆసుపత్రికి జనరల్ ఆసుపత్రికి కూడ జగిత్యాలకే పోవుదురు.

మా శ్వే

## అయ్యంకి బాలసరస్వతికవి

అయ్యంకి బాలసరస్వతి తురగా రాజకవియను వారిరువురును జంటకవులు. వీరు స్కాందపురాణము నందలి "నాగరఖండము"ను ఆంధ్రీకరించి "ధవళేశ్వరపు మార్కండేయుడు" అను నియోగిబ్రాహ్మణునకు కృతి నిచ్చిరి. నాగరఖండము నందలి

క. అభినవ విశ్రుతకవితా
విభవుల మఖిలాగమాంతవిదశాకగో
త్రభవులము బుధవిధేయుల
మభవ పదాభోజ బంభరాత్ముల మహిమన్

క. ఆ రంగుడు తురగా రాజన
యసమప్రతిభావిరాజియయ్యంకితబా
లసరస్వతియను వారల
మసిష్ణుప్రజవిదారణార్థుల మతిన్

గద్య — ఇది శ్రీమద్దుర్గాపతిదాశామూర్తి వరప్రసాద ఫలిత తురగా రాజకవి వయ్యంకి బాల సరస్వతీ నామధేయ ప్రణీతంబైన శ్రీ స్కాందంబను మహాపురాణంబునందు సనత్కుమార సంహిత యను నాగరఖండంబున అను పద్య గద్యముల వలన మాత్రమే ఈకవులను గూర్చి కొంతవరకు తెలిసి కొనుటకు అవకాశ మేర్పడినది. కవుల నివాసము గాని, తల్లి దండ్రుల పేర్లు గాని తెలియుట లేదు. ముద్రిత ప్రతి పీఠికాకారులు గాని వ్యాఖ్యాతలు గాని ఈ కవులను గుర్తించిన విశేషములు తెలుపలేదు. పై ఆధారము వలన వీరు పండిత కవులనియు ఆగమవిదులనియు బ్రాహ్మణులనియు శాకగోత్రులనియు స్పష్టమగుచున్నది. వీరు కృష్ణామండలము వారని పరిశోధకులు తలంచిరి. వీరు నియోగి బ్రాహ్మణులు. అయ్యంకివారును తురగావారును అయిన నియోగి బ్రాహ్మణులు నేటికిని కృష్ణామండలములో కలరు.

నాగరఖండము నందలి ఈ క్రింది పద్యము వలన ఈ గ్రంథరచనాకాలము శా॥శ॥ 1503 అనగా క్రీ॥శ॥ 1586 అని తెలియుచున్నది.

సీ. శాలివాహనశక సంఖ్యాకములునగు
పదియేను వందల పై నెనిమిది
వత్సర ములలోన వసుధాస్థలమున
కుతుబుషాహీ రాజా కులతిలక నాథు
ప్రాభవవేళ మార్కండేయ భూపతి
ధవళేశ్వరాన్వయ భవుడు నగుచు
సకల దిశావ్యాప్త సాంద్ర సుధాస్వచ్ఛ
కీర్తి పరంపరా స్ఫూర్తి నలరి
మరుచిరంబైన పెద్దోట పురిని నిలిచి
విశ్వకర్మాన్వయాంబుధి వెలయ జేసి
ఎప్త సంతానముల గాంచి సాధువృత్తి
సుకవి వర్యులు భళి యని స్తుతులు సేయ
ధరణి పాలించు చుండెను ధర్మనిరతి

పై పద్యమును బట్టి కృతిపతి యగు మార్కండేయుడు గోల్కొండ నవాబయిన మహమ్మదుకులీకుతుబ్‌షా కాలమున పెద్దోట పురమున నివసించుచు సప్తసంతానముల గాంచుచు అమల యశోవిరాజితుడై మనినట్లు తెలియుచున్నది. ఇంతియ గాక

క. అతడు ప్రసిద్ధి వహించెన్
క్షితినర గజపతుల గెలిచి చెలగి జయశ్రీ
పతి యైన మాహమ్మదు
కుతుబుశహా చంద్రునకును గుడిభుజ మనగన్

అను పద్యము వలన ఈ మార్కండేయుడు మహమ్మద్ కులీ కుతుబ్‌షాకు కుడిభుజమై నిలిచి నరపతులను గజపతులను గెలిచి విజయము నొందినట్లు కూడ తెలియుచున్నది.

ఈ మహమ్మదు కులీకుతుబ్‌షా క్రీ॥శ॥ 1580-1611 నడుమ రాజ్యమేలినట్లు చరిత్రకారుల వ్రాతల వలన తెలియుచున్నది. కాన పై చెప్పబడిన ఈ గ్రంథరచనా కాలము

సరియైనదిగనే కనుపట్టుచున్నది

మొత్తము మీద ఈ నాగరఖండమును సోమకుమార సహితము కృతి గొన్న మార్కండేయుడు ప్రజాదరణము గొన్న వాడనియు ధర్మ నిరతి గలవాడనియు తటాకాది కములను త్రవ్వించిన వాడ యు శ్రీశైలముగ వదునొక డు మార్కండేయ లింగములను స్థాపించిన వాడనియు కవులచే కీర్తింప బడిన వాడనియు వీరాధివీరుడై వర్ధిల్లిన వాడనియు తెలియుచున్నది

కృతిపతియును పెదోట పుర వాస్తవ్యుడును నగు మార్కండేయుడే తమను గౌరవించి కృష్ణామండలము నుండి రావించి ఈ గ్రంథము ను రచియింప గోరి ట్లు కవులే స్వయముగ చెప్పుకొనిరి ఈ పెదోట యెచ్చటిదో దీనికి ప్రకృతము గల పేరేదియో తెలియరాదు

ఈ నాగరఖండము ఐదాశ్వాసములుగలది ఇందు విశ్వకర్మ ప్రభావము వర్ణింపబడినది ఇందలి కవిత్వము ధారాశుద్ధి గలిగి ద్రాక్షాపాకమున నొప్పుచున్నది

అ గో కృ

## అయ్యంగారిపాలెము

అయ్యంగారిపాలెము ప్రశంస శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు ఆంగ్లమున రచించిన రెడ్డిరాజ్యచరిత్రము అను గ్రంథములోని 381 వ పుటలో కనవచ్చుచున్నది

గుంటూరుజిల్లా పలనాడు తాలూకా పులిపాడు గ్రామమునకు మీమున అయ్యంగారి పాలెము అను గ్రామము కలదు ఇచ్చట క్రీ శ 7 వ శతాబ్దినాటి శాసనము చాళుక్య లిపిలో ఉన్నది ఆ శాసనమున నిట్లుకలదు

మైందరాముడు అను నతడు కమ్మ కులమునకు చెందిన కల్గరాభరణాచార్యుడను శిల్పిచే జల్వేశ్వరాలయమును నిర్మించెను శాసనమున కనవచ్చు మైందరామ అను పదము మహేంద్రరామ అయియుండునని తోచుచున్నది కల్గరాభరణాచార్యుడు కమ్మకులమునకు సంబంధించినవాడని శాసనమున ఉన్నది కాని ఇచ్చట కమ్మకుల మనగా కమ్మవారి తెగ అని కాదు విశ్వకర్మల తెగవారిలో కమ్మనాటిశాఖకు చెందిన తెగ అని యర్థమైనట్లు తెలుపబడినది అనగా విశ్వకర్మకులజులు కాలక్రమేణ ఆయా ప్రాంతములకు వలసపోయి ఆ ప్రాంత నాయకులతో పేర్కొనబడిరి అట్టి విశ్వకర్మ కులజులలో నిది కమ్మనాటికి చెందిన తెగయని తెలియుచున్నది

గుంటూరుజిల్లాలోని మాచర్ల వద్ద క్రీ శ 12 వ శతాబ్దికి చెందిన యొక శాసనములో కమ్మకులజులైన ఆచార్యులు శివలింగములను చెక్కుటలోను ప్రతిమలనుతయారుచేయుటలోను నానావిధ రకముల రాజభవనములను ప్రాసాదములను నిర్మించుటలోను వాస్తుశాస్త్రక్షేత్ర గణిత జ్ఞానములోను మస్థులనియు వారి కులవృత్తి నాచరించుటలో దిట్టలనియు పొగడబడిరి

పల్నాడు తాలూకాలోని పొందుగుల గ్రామములో లభించిన రెండు శాసనములలోను జల్వేశ్వరాలయ నిర్మాతమైందరాముడనియు శిల్పి కల్గరాభరణాచార్యుడనియు వ్రాయబడియున్నది ఎ పి రెం 85 (1929-30) ఎ పి రెం 86 (1936 37)

మా శ్వే

## అయ్యదేవర కాళేశ్వరరావు

ప్రపంచమున దన్ని దేశములందును అన్నికాలములందునుకూడ గొప్ప విద్వాంసులు రచయితలు కార్యశూరులును జన్మించి ప్రజాసేవ కావించిన యశము మనకందరకును తెలియును కాని సర్వసాధారణముగ విద్వాంసులును రచయితలును అగువారు కార్యశూరులగుట కానరాదు కార్యశూరులు జిజ్ఞాసువులును గ్రంథరచయితలును అగుట మిక్కిలి అరుదు ఈ లక్షణములు రెండును ఒకే వ్యక్తియందు సంపుటియగుట అసామాన్యమగు అంశము కాని అసామాన్య గుణగణములు కల పురుష పుంగవులు అప్పుడప్పుడు సమాజమునందవతరించుచుందురు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు అట్టి అసామాన్య పురుషుల కోవకు చెందినవారు అట్టి మహనీయుడు మన ఆంధ్రదేశమునందు జన్మించి ఇచ్చటి ప్రజానీకమునకు సేవ కావించియుండుట ఆంధ్రుల యదృష్టమని భావింపవలెను జాతుల చరిత్రను సూక్ష్మముగ పరిశీలించు వారికొక విశేషము గోచరింపక మానదు ప్రతిజాతి చరిత్రయందును కొన్ని సందర్భములలో మహత్తరమగు కార్యములు సాధింప బడును అట్టి మహత్తర ఘట్టములలో అనన్య సామాన్య శేముషీధురంధరులును సత్యవ్రతులును ధర్మనిష్ఠాపరాయణులును అగు సత్పురుషులను ప్రకృతి మాతె ప్రపంచరంగమునకు గొనివచ్చును శ్రీ కాళేశ్వరరావుగారు గతశతాబ్దపు తుదిభాగమున జన్మించి 1962 వ సంవత్సరమున దేహయాత్ర చాలించిరి ఎనుబది సంవత్సరముల వీరి జీవిత

కాలమున ఎ ఘన సత్కారము భారతజాతీయోద్యమము ఆ ంధ్రభాషా వ్యాప్తి ఆంధ్రరాష్ట్రావతరణము మున్నగు మహోద్యమములు మన రాష్ట్రమున దు నడచెను అట్టి మహోద్యమములు విజయవంతముగ సాధించు మిత్తమే శ్రీ కాళేశ్వరరావు పంతులుగారివంటి దేశభక్తుని ధర్మనిష్ఠా పరాయణుని ప్రకృతిమాత ఆంధ్రులకు నాయకత్వము వహించుటకు పంపియుండు నట తథ్యము

చిత్రము–24



అయ్యదేవర కాళేశ్వరరావు

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు స్మార్త పక్షకుచెందిన ఆంధ్ర నియోగి బ్రాహ్మణులు వీరి స్వస్థలము కృష్ణా జిల్లా యందలి నందిగామ యను చిన్న పట్టణము కాళేశ్వరరావుగారి పూర్వీకులు చిరకాలముగ నందిగామయందు నివసించి యున్నట్లు కానవచ్చుచున్నది వీరి తాత అయ్యదేవర పురుషోత్తంగారు వాసిరెడ్డి వంశమునకు చెందిన ముక్త్యాల మీంధారుగారి తరఫున నందిగామలో కరణముగా ఉండిరి కాళేశ్వరరావుగారి తండ్రి లక్ష్మయ్యగారు మునగాల జమీందారుగారి వద్ద మేనేజరుగా పనిచేసిరి మునగాల జమీందారీ ప్రభువులవారి యేలుబడిలో నందిగామ తాలూకాలో చేరియున్నను అది నైజాం ప్రభువుల అధికారము కులోబడియున్న తెలంగాణా ప్రాంతమునకు మిక్కిలి చేరువలో నున్నది మునగాల జమీందారులకు వరంగల్లు జిల్లాలోని రెడ్డి దేశముఖులు చాలమంది మిక్కిలి సమీపబంధువులు ఆకారణముచే అయ్యదేవరవారు తమయందు మానుల పక్షమున తరచు తెలంగాణమునకు వచ్చుచు పోవుచుండెడివారు అయ్యదేవర వారికి తెలంగాణమందలి నియోగి కుటుంబములతో సన్నిహిత సంబంధ బాంధవ్యములు దుండ గమనింపదగిన యంశము శ్రీ కాళేశ్వరరావు పంతులుగారి తల్లి వరలక్ష్మమ్మగారు మాదిరాజువారి ఆడపడుచు వీరు తెలంగాణమున లి పరిపాలకు దేశముఖు దేశపాండ్యాలు ఈ మాదిరాజువారు పటాలి కారు మెళ్ళదూ మునను్న జజూరులో కాపురము డెడివారు శ్రీ కాళేశ్వరరావుగారి తల్లి ఎరతాతయైన రాజా మాదిరాజు కృష్ణమంతు బహద్దరుగారు హైదరాబాదు నిజాముగారి వద్ద గొప్ప ఉద్యోగము చేసిరి పంతులుగారి తల్లివైపు బంధువులందరు వరంగల్లు ఖమ్మం జిల్లాలలో వసించుచున్నారు వీరి పెద్దమేనమామకుమారులైన శ్రీమాదిరాజు రామకోటేశ్వరరావుగారు వరంగల్లు పట్టణములో గొప్ప న్యాయవాదిగ ప్రసిద్ధిగాంచి ప్రజోద్యమము లన్నిటిలో పాలొని మహానుభావులై యిప్పటి దేహమును చాలించిరి తెలంగాణ ప్రజా నాయకులలో సర్వశ్రేష్ఠులైన శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు శ్రీ కాళేశ్వరరావుగారి బంధువర్గములోనివారు కాళేశ్వరరావుగారు బాల్యమున మూడు తరగతుల వరకు తెలంగాణా ప్రజలలో యెక్కువ ద్రవలెనే ఉర్దూభాష నభ్యసించిరి కాళేశ్వరము తెలంగాణా ప్రాంతమునందలి ఎవిమతము ప్రాంతమున నెలకొనియున్న గొప్ప శైవక్షేత్రము అచ్చటి అధిష్ఠాన దైవము శ్రీకాళేశ్వరుడు ఆ ప్రభువు పేరిటనే మన పంతులుగారికి కాళేశ్వరరావు అను నామకరణము చేయబడినది ఈ విధముగ కాళేశ్వరరావు పంతులుగారు విశాలాంధ్రమునకు చెందినవారు ఇట్టి ఆంధ్రవముఖుడు విశాలాంధ్రరాష్ట్ర స్థాపనకై మహత్తరమగు కృషి సాగించి అట్టి ఆంధ్రరాష్ట్ర సాధనమును స్వయముగ చూచి అమరలోకస్థులైరి విరాల్లుండు చాల అముఖమైన యంశము "ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబం" అను ఆర్యోక్తి మేరకు శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు విశాలాంధ్రరాష్ట్రమునకే కాదు యావద్భారత దేశమునకు యావత్తు మానవజాతికి చెందిన పురుషపుంగవులు

శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు సంపన్నకుటుంబమునకు చెందినవారు వీరి జననము 22-1-1881 సంవత్సరమున జరిగెను ఈయన బాల్యమున నందిగామయందే విద్యాభ్యాసము చేసిరి

అచటనే ఆయన తెలుగు ఉర్దూ ఇంగ్లీషు భాషలతో పరిచయము కల్గించుకొనిరి. ఆ కాలములో వీరి తాతగారు కచేరీలలో లెక్కలు వ్రాయుచుండెడివారు. 1887వ సంవత్సరమున కాళేశ్వరరావుగారి ఉపనయనము 1894వ సంవత్సరమున వివాహము జరిగెను. వారి భార్య దురాంబగారు ఎంగకవీరభద్రయ్యగారి కుమార్తె. మన పంతులుగారి తాతగారు పురుషోత్తముగారు మరణించిన వెనువెంట వారి కుమారులు లక్ష్మయ్యగారు కాని శ్రీకాళేశ్వరరావుగారు కాని కరణీకము చేయలేదు. వారు ఆపదవికి రాజీనామానిచ్చిరి. 1894వ సంవత్సరమునందే కాళేశ్వరరావుగారు బందరు పట్టణమున ఉన్నతవిద్యాభ్యాసమునకై వెడలిపోయిరి. వారు 1897వ సంవత్సరమున మెట్రిక్యులేషన్ పరీక్షయందును 1899వ సంవత్సరమున ఎఫ్. ఏ. పరీక్షయందును ఉత్తీర్ణులైరి. ఎఫ్. ఏ. తరగతిలో వారు శ్రీ ముట్నూరి కృష్ణారావు పంతులుగారికి సహాధ్యాయులుగ నుండిరి. కృష్ణారావు పంతులుగారు అనంతరకాలమున గొప్ప జాతీయవాదులుగను కృష్ణాపత్రికా సంపాదకులుగను ఆంధ్రదేశమున ఖ్యాతిని గడించిరి. శ్రీకాళేశ్వరరావుగారు విద్యార్థిదశయందు గణితశాస్త్రమున చక్కని సామర్థ్యమును ప్రదర్శించుచు వచ్చిరి. కాని కొన్ని కారణముల వలన ఆయన మద్రాసుపోయి గణితశాస్త్రమునందు B.A. తరగతిని చదువలేకపోయిరి. అందుచే మరల బందరు పట్టణమునందలి నోబులు కళాశాలలోనే విద్యాభ్యాసము సాగించి దేశచరిత్ర రాజకీయ అర్థశాస్త్రములను అభిమాన విషయములుగ గ్రహించి పట్టపరీక్షయందు ఉత్తీర్ణులైరి. విద్యార్థిదశయందు మన పంతులుగారు దేశాభిమాన పూరితములైన పెక్కు గ్రంథములను, ఐరోపా అమెరికా ఖండములయందలి స్వాతంత్ర్యోద్యమ చరిత్రను మిక్కిలి ఆసక్తితో చదివెడివారు. ప్రసిద్ధ వంగీయప్రముఖులును గొప్పవిద్వాంసులును అగు శ్రీ రమేశచంద్రదత్తుగారు రచించిన భారతదేశ ప్రాచీననాగరికత అను ఉద్గ్రంథమును మన కాళేశ్వరరావుగారా కాలముననే చదివిరి. ప్రాచీన కాలమున భారతదేశము సాధించిన మహోన్నత వైభవమును తమ కాలము నాటి భారతదేశ పరిస్థితిని పోల్చి చూచుకొని వీరు మిక్కిలి వ్యసనపడిరి. భారతదేశమును పునః మహోన్నతదశకు కొనిరావలెనను గొప్ప ఆదర్శమునకు వారి హృదయక్షేత్రమున బీజములు నాటుకొనెను. 190? సంవత్సరమున వీరు బి. ఏ. పరీక్షయందు ఉత్తీర్ణులైరి. నోబులు కళాశాల ప్రధానాధ్యాపకులైన రెవరెండు క్లార్కు గారి కోరికపై కాళేశ్వరరావుగారు నోబులు కళాశాలయందే రెండు సంవత్సరములు ఉపాధ్యాయునిగ పనిచేసిరి. 1903వ సంవత్సరమున వారి తండ్రి బందరు పట్టణముననే మరణించిరి. 1904వ సంవత్సరమున కాళేశ్వరరావుగారు కుటుంబముగ మద్రాసు పట్టణమునకు పోయిరి. 1904, 1905 సంవత్సరములలో వారు న్యాయశాస్త్రకళాశాలలో చదివి పరీక్షయందుత్తీర్ణులై న్యాయవాద పట్టమును తీసికొనిరి. న్యాయశాస్త్ర కళాశాలలో వీరికి శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు, శ్రీ పాకాల వెంకటరమణరావునాయుడుగారు, శ్రీ లక్కరాజు సుబ్బారావుగారు మున్నగు న్యాయవాద ప్రముఖులు సహాధ్యాయులుగ నుండిరి. స్వతంత్రజీవనము గడపవలయునను ఉద్దేశ్యముతోడనే ఆయన న్యాయవాదవృత్తిని స్వీకరించిరి. 1906వ సంవత్సరమున వారు బెజవాడలో తమ వృత్తిని ప్రారంభించి అతికాలములోనే గొప్ప పేరు ప్రఖ్యాతులు గడించిరి. ధనార్జనము గావించిరి. ఈ కాలమున వీరికి ప్రభుత్వోద్యోగము ఇప్పించెదమని పలువురు అధికారులు వీరి నాహ్వానించిరి. కాని విదేశీయులైన ఆంగ్లేయుల కడ దాస్యవృత్తి చేయుట కిష్టములేక కాళేశ్వరరావుగారు ఆఉద్యోగముల నిరాకరించిరి.

మహాత్మాగాంధీగారు మన భారతదేశమున వ్యాపించిన జాతీయోద్యమమునకు 1920వ సంవత్సరమునుండి నాయకత్వము వహించి 1947వ సంవత్సరము నాటికి భారతదేశమునకు రాజకీయ స్వాతంత్ర్యమును సంపాదించిన యంశమెల్లవారికిని తెలిసినదియే. కాని భారతభూమి పారతంత్ర్య బంధములనుండి విడివడి స్వాతంత్ర్యమును సాధించుటకు హేతువు కేవలము రాజకీయాందోళనము మాత్రమే కాదనియు మహాత్మా గాంధీగారికి పూర్వము అనేకులు భారతీయ ప్రముఖులు ధార్మిక నైతిక సాంఘిక వైజ్ఞానిక రంగములలో కావించిన గొప్ప ప్రబోధమువలననే 1947వ సంవత్సరమున భారతభూమి రాజకీయ స్వాతంత్ర్యము లభించినదనియు మనము గ్రహింపవలెను. జాతీయజీవనము బహుముఖమైనదియొక సమగ్రస్థితి. అందు ధార్మిక జ్ఞానము, నైతికోన్నతి, సాంఘిక పవిత్రత, స్వభాషాభిమానము, విద్యాభివృద్ధి, ఆర్థిక పరిపుష్టి, స్వాతంత్ర్యాభిలాష మున్నగు అనేకాంశములు చేరియున్నవి. ఒక జాతి తన జీవితమునందు కొన్ని యంశములలో

అత్యున్నతిని సాధించి ఇతరవిషయములలో వెనుకపడియుండుట యనునది ఎంతమాత్రమును సాధ్యము కాదు కావున జాతుల అభివృద్ధి ఎల్లప్పుడును సర్వతోముఖముగ నుండవలెను ఇంట గెలిచి రచ్చ గెలువవలెను సామెత మనకందరకును బాగుగ తెలియును ఒక జాతివారు రాజకీయాభివృద్ధిని సాధించుటకు పూర్వము ధార్మిక నైతిక సాంఘిక విజ్ఞానికాభివృద్ధులను సాధింపవలెను ధార్మిక నైతిక రంగములలోని మూఢవిశ్వాసములను తొలగించి సత్య స్వరూపమును ప్రకటింపవలెను సమాజమందలి దుష్టమగు ఆచారములను తొలగింపవలెను స్త్రీల ఉన్నతిని సాధింపవలెను స్వభాషల నుద్ధరించి వాని ఆధునికతను చేకూర్చవలెను విద్యావ్యాప్తి కావింపవలెను దేశపు ఆర్థిక సంపదను పెంపు కావింపవలెను ఈ పరతులన్నియు పూర్తియైన పిమ్మట జాతీయ జీవనమునకు పతాకాయమానముగ రాజకీయ స్వాతంత్ర్యము లభించును పైన యంశముల నన్నిటిని మనము అంగీకరించిన పక్షమున భారత జాతీయ జీవనవికాసమునకు నాందీవాక్యము పల్కిన మహనీయుడు శ్రీ రాజారామమోహన రాయలవారని గుర్తింపగలము రామమోహనరాయలవారు ఆ కాలమునందు భారత ప్రజానీకమునందు మత ధార్మిక విషయములలో వ్యాపించియున్న తప్పుడు భావములను తొలగించి సత్యమైన ఉపనిషత్తమును పునరుద్ధరించు నిమిత్తము బ్రహ్మసమాజ మతమును స్థాపించిరి సహగమనము అతిబాల్య వివాహము నిర్బంధ వైధవ్యము మున్నగు సాంఘిక దురాచారములను తీవ్రముగ వారు నిరసించిరి స్త్రీవిద్యకొరకును సమాజమున స్త్రీలకు సముచిత స్థానము చేకూరుటకును బహువిధముల కృషి సల్పిరి భారతదేశీయులకు వారి ప్రాథమిక స్వత్వముల లభింపజేయుటకై కూడ ఆయన పాటుపడెను రాజారామమోహన రాయలవారి ఆదర్శముల సాధించుటకై బ్రహ్మసమాజనాయకులు పలువురును పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరుల వారును చాల ప్రయత్నము సల్పిరి రాయలవారి ఆదర్శముల సాధించుటకై మహారాష్ట్రదేశమున శ్రీ మహదేవగోవింద రానడేగారు చాల పాటు పడిరి మన జాతీయ జీవన వికాసమునకై అమోఘమగు సేవ కావించిన వారిలో బ్రహ్మజ్ఞానియైన శ్రీ రామకృష్ణపరమహంసగారును వారి శిష్య పుంగవులగు శ్రీ స్వామి వివేకానందగారును వారి శిష్యకోటియు చేసియున్నారని మనము తెలిసికొనవలెను ప్రాచీన భారతీయ విజ్ఞానమునందు తిరుగని విశ్వాసమును గొప్ప కార్యశూరతయు నిర్మాణదక్షతయు గల మహర్షి దయానంద సరస్వతుల వారును వారు స్థాపించిన ఆర్యసమాజ మతానుయాయులు పలువురును భారతజాతి పునరుద్ధరణకొరకై అపారమగు సేవ కావించిరి వంగదేశమునందును మహారాష్ట్ర దేశమునందును దేశీయభాషల పునరుద్ధరణ కొరకై ఎంతయో కృషిసాగెను దివ్యజ్ఞాన సమాజమువారు (Theosophical Society) మన భారత జాతియందు నవచైతన్యమును కల్గించు నిమిత్తము చాల పాటుపడిరి ఈ సమాజము పక్షమున మన ప్రజలకు అనిబిసెంటుదొరసాని కావించిన సేవ అమోఘము పైన తెలుపబడిన మహోద్యమముల ప్రభావము ఆంధ్రదేశముపై కూడ ముద్రితమగుట అనివార్యము ఆంధ్రదేశమునందు ఆధునిక యుగమునకు వేగుచుక్క యని తెలుపదగిన మహనీయుడు రావుబహద్దూరు కందుకూరి వీరేశలింగం పంతులుగారు వారి శిష్యులలో ప్రముఖులైనవారు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారును సర్ రఘుపతి వేంకటరత్నంనాయుడుగారును మున్నగువారు వీరందరును శ్రీ వీరేశలింగం పంతులుగారు ప్రారంభించిన సంఘసంస్కరణోద్యమమును ఆంధ్రభాషా వికాసవిషయిక కృషిని సమర్థతతో బలపరచిరి వీరేశలింగం గారు సంఘమునందలి యవివేకిని అతితీవ్రముగ ఖండించి ప్రజ లెల్లరును నీతి నియమములతో జీవింపవలెనని వాదించిరి వారు అతిబాల్యవివాహములను నిర్బంధవైధవ్యమును నిరసించిరి బాలవితంతువులకు పునర్వివాహము కావించుటకై వారు సల్పిన కృషి జగత్ప్రసిద్ధము వీరేశలింగముగారు అనాథ శరణాలయముల స్థాపించిరి స్త్రీవిద్యను ప్రోత్సహించిరి ఆకాలమున వివాహాది శుభకార్యములయందును దేవస్థానములందును భోగము మేళములు పెట్టించుట పరిపాటిగ నుండెను వీరేశలింగం పంతులుగారు ఈదురాచారమును అతి తీవ్రముగ నిరసించిరి వీరేశలింగం పంతులుగారి భావోద్యమము చిగిన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారును రఘుపతి వేంకటరత్నంనాయుడుగారును తమగురువుగారి గొప్ప ఆదర్శముల సాధించుటకై అవిరతకృషిని సాగించిరి వారి సోద్ధరణము కొరకై లక్ష్మీనరసింహంగారును వేంకటరత్నంనాయుడుగారును కూడ యెంతయో కృషిని సాగించిరి మన ఆంధ్రదేశమున బ్రహ్మసమాజమతము విశేషముగా వ్యాపించెను తత్ఫలితముగ ఆంధ్రులు అభివృద్ధి కాముకులై సర్వవిధముల

ముందంజ వేయ తొడగిరి అంతేకాదు పందొమ్మిదవ శతాబ్ది ద్వితీయార్థమున క్రైస్తవ మిషనరీలు తమకు రాజకీయముగ గల పలుకుబడినంతను వినియోగించి పేదప్రజలను అగ్రవర్ణముల వారిని కూడ క్రైస్తవమత సంఘమునందు చేర్చుకొనుటకై చాల ప్రయత్నములు చేసిరి కాని బ్రహ్మసమాజ ఆర్య సమాజ మతప్రభావము వలన ఈ క్రైస్తవమత వ్యాప్తి చాల వరకు అరికట్టబడెను ఆంధ్రదేశమునందు ఆర్యసమాజ మతమునకు శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు ప్రతినిధిగ నుండిరి పందొమ్మిదవ శతాబ్ది ద్వితీయార్థమునందు మన ఆంధ్రదేశమునందు సంభవించిన భావచైతన్యమున గల ముఖ్యమగు అంశము భాషావికాసము దీనికి బీజముల నాటిన మహనీయుడు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారే ఈయన తెలుగు భాషలో శతాధిక గ్రంథముల రచించి పెక్కు క్రొత్త త్రోవలను త్రొక్కెను ఈసందర్భమున పంతులుగారి తరువాత స్మరింపదగినవారు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు వారి రచనలు మిక్కిలి హృదయంగమములై ఆబాల గోపాలమును ఆనందింపజేయును భాషాభిమానమును స్వజాతి నాగరికత సంస్కృతులయందభిమానమును ఉజ్జీవింపజేయుటయందు నాటకసాహిత్య మద్వితీయమైనది ఇట్టి నాటకసాహిత్యము నాంధ్రభాషయందు సృష్టించి ప్రచారము గావించినవారిలో శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులవారి కూడ వీరేశలింగ లక్ష్మీనరసింహప్రభృతులతో సంస్మరింపవలెను

పైన వర్ణింపబడిన భారతజాతీయ జీవనవికాసము మన దేశమున వ్యాపించుచున్న యుసంధియందు శ్రీ కాళేశ్వర రావుగారు వయస్కులైయుండిరి కావున ఈ మహత్తర భావముల ప్రభావము వారిపై ప్రసరించుట యనివార్యము శ్రీ కాళేశ్వరరావుగారు క్రైస్తవ మిషనరీలచే నడుపబడిన స్కూలులు కళాశాలలో విద్యాభ్యాసము గావించినను వారెన్నడును ఈనూతనమతమువైపు మొగ్గలేదు వారు ప్రాచీనమగు హైందవమతమునందే యెల్లప్పుడును భక్తిశ్రద్ధలను చూపుచువచ్చిరి ప్రఖ్యాతులైన శ్రీ రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు మన కాళేశ్వరరావుగారికి గురువులు అంతే కాదు ఆయన మన పంతులుగారికి ఆదర్శము శ్రీ వేంకటరత్నము నాయుడుగారి వలెనే కాళేశ్వరరావుగారు కూడ సంఘసంస్కరణకార్యకలాపములందు ఉత్సాహముతో పాల్గొనసాగిరి 1902వ సంవత్సరమునందే వీరు ఒక మహిళా సంఘమును నెలకొల్పి స్త్రీల అభివృద్ధికై కృషి ప్రారంభించిరి అస్పృశ్యతానివారణోద్యమమునందు వీరికి చాలఅభిమానము ఆ అభిమానమును వారు కేవలము మాటలలో కాక చేతలలో ప్రదర్శించిరి ఆంధ్రదేశమున గల హరిజన ప్రముఖులలో శ్రీ వేముల కూర్మయ్యగారొకరు ఆయనను బాల్యము నందియు తమ వద్ద ఉంచుకొని కాళేశ్వరరావుపంతులుగారు విద్యాబుద్ధులు చెప్పించిరి ఆ పిమ్మట కూర్మయ్యగారిని శ్రీ కాళేశ్వరరావుగారు బనారస్ విశ్వవిద్యాలయమునందు పట్టభద్రుని గావించిరి ఆ కాలమున వివాహాదులయందు భోగము మేళముల పెట్టించుట ఆచారముగ నుండెను భోగ స్త్రీలు వ్యభిచారమునే తమ ముఖ్యవృత్తిగ ఎన్నుకొనుట వలన పెక్కుండ్రు పడుచువారు ఈ పణ్యస్త్రీల వలలో పడి పోయెడివారు పెక్కు సంసారములు దుఃఖము పాలగుచుండెను వారస్త్రీల జీవనమెంత హేయముగ నుండెడిదో వేరుగ తెలుపనక్కరలేదు ఈ దుస్థితిని తొలగించు నిమిత్తము కాళేశ్వరరావు ప్రభృతులైన ఆంధ్రనాయకులు భోగము మేళముల పద్ధతిని నిరుత్సాహ పరచుటకును ఆ కులమునందలి బాలికలకు ఇతరకులముల వారికి వలెనే వివాహములు చేయించుటకును ఒక ఉద్యమమును లేవదీసిరి ఆ యుద్యమము అనతికాలములోనే ఫలప్రదమయ్యెను భోగపు కులమున పుట్టిన యువతులకు వివాహములు కాజొచ్చెను ఆ కులమునందు విద్యావంతులును విజ్ఞానవంతులును అగు ప్రముఖులు బయలుదేరిరి అట్టివారిలో Dr ముత్తులక్ష్మిరెడ్డి B A M B C M దివాన్ బహద్దరు బండి శ్రీహరిరావు నాయుడు మున్నగువారు ప్రత్యేకముగ పేర్కొనదగినవారు వ్యభిచార వృత్తిని నిర్మూలనము గావించుటకై మద్రాసు శాసన సభయందు చట్టము గావింపబడెను ఆ చట్టమును గావించుట యందు కాళేశ్వరరావుపంతులుగారు చాల తోడ్పడిరి ఇరువదవ శతాబ్ది ప్రారంభమున మన ఆంధ్ర దేశమునుండి పెక్కుండ్రు ప్రముఖులు ఉన్నత విద్యాభ్యాసమునకై ఇంగ్లండు మొదలైన దేశములకు పోయెడివారు ఆ కాలమున సముద్రయానము నిషిద్ధమని పూర్వాచార పరాయణులు భావించుచుండిరి అందువలన విదేశములనుండి తిరిగి వచ్చినవారిని సామాన్యజనులు వెలివేయుచు పంక్తి బాహ్యులుగ భావించుచుండిరి ఇది సమాజమునకు చాల నష్ట హేతువు కావున విదేశములనుండి తిరిగి వచ్చినవారిని ఎట్టి

ప్రాయశ్చిత్తమును లేకుండ సమాజములోనికి చేర్చుకొని వారిని గౌరవించి వారితో భోజనములు జరుపుచుండెను. కొందరు అభివృద్ధి కాముకులు వాదింపసాగిరి. కాశేశ్వరరావు పంతులుగారు అభివృద్ధి మతమును స్వీకరించి సీమనుండి తిరిగి వచ్చిన వారితో పంక్తి భోజనములు చేసిరి. ఇట్టి సంఘసంస్కార ప్రయత్నములకై కొందరు బెజవాడ పౌరులు వీరిని సంఘము నుండి వెలివేయుటకై యత్నించిరి. కాని మన పంతులుగారు ఏ మాత్రమును వెనుదీయక తమ సమాజ సంస్కార కృషిని సాగించుచునే వచ్చిరి. హిందూ సంఘమున బహుభార్యా నిషేధము కొరకును విడాకుల చట్టమును అంగీకరింపజేయుట కొరకును వీరు చాల కృషి కావించిరి. ఇందుకు సంబంధించిన చట్టమును మద్రాసు శాసనసభవారిచే ఆమోదింపజేసిరి. మన పంతులుగారి ప్రోత్సాహమువలన 1957వ సంవత్సరమున ఆంధ్ర ప్రదేశ శాసనసభవారు వరకట్న నిషేధ శాసనము కావించిరి. ఈ విధమున కాశేశ్వరరావు పంతులుగారు సంఘమునందలి దురాచారములను తొలగించుటకై అపారమగు కృషి సల్పిరి.

విద్యారంగమునందు కాశేశ్వరరావుగారు చెప్పదగిన కృషిని సాగించిరి. వీరు నందిగామలో బాలికలకొరకు పాఠశాలను ఉన్నత పాఠశాలను కూడ స్థాపించిరి. బెజవాడయందు నేషనల్ హైస్కూలు అను సంస్థను స్థాపించి దానికి ముఖ్య కార్యకర్తగ వ్యవహరించిరి. ఇందు చదువుకొను బాలురలో జాతీయభావములను దేశభక్తియు వికాసము చెందించుటకు కృషిచేయబడెను. కాశేశ్వరరావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయపు సెనేటుయందును సిండికేటునందును కొంతకాలము సభ్యులుగనుండిరి. వీరు ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారకమండలికి ఉపాధ్యక్షులుగ కూడ పనిచేసి విద్యావ్యాప్తికై చాల పాటుపడిరి.

భాష ఒక జాతికి ఆయువుపట్టువంటిది. భాషయే జాతికి తరణోపాయము. దాని వలననే జాతుల ఔన్నత్యమును పతనమును సంభవించును. ఆంధ్రభాషయందు నవచైతన్యము కలిగించకుండా ఆంధ్రులు సర్వతోముఖాభివృద్ధిని సాధించుట సాధ్యముకాదని కాశేశ్వరరావుగారు యువకులుగనున్నప్పుడే గ్రహించిరి. 1906 వ సంవత్సరమునందు వీరు శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు మున్నగు పండితులతో సహకరించి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని స్థాపించిరి. ఈ సంస్థవారు దేశ చరిత్ర శాస్త్రీయ జ్ఞానము జీవితచరిత్ర చరిత్రాత్మక నవలలు మున్నగు భాషావిభాగములకు సంబంధించిన 42 గ్రంథముల ప్రకటించి భాషాసేవకావించిరి. కాశేశ్వరరావుగారు స్వయముగ అమెరికా సంయుక్తరాష్ట్రములు ఫ్రెంచివిప్లవము అను గ్రంథములు వ్రాసిరి. 1953 వ సంవత్సరమున కాశేశ్వరరావుగారు ఆంధ్రప్రదేశ శాసనసభకు అధ్యక్షులుగ నున్నకాలమున శాస్త్రీయ జ్ఞానము చరిత్రలకు సంబంధించిన తెలుగు అకాడమీని నెలకొల్పిరి. అతికాలములో దానినే వారు తెలుగు ఉర్దూ అకాడమీగ మార్చి తెలుగు ఉర్దు భాషలు రెండిటిలోను ఉత్తమ ఆధునిక గ్రంథములను ప్రకటించుటకై పథకము సిద్ధముచేసిరి. ఈ సంస్థకొరకై పంతులుగారు సుమారు ఏబదివేల రూపాయలు విరాళముగ సంపాదించి యిచ్చిరి. ఈ సంస్థ ముప్పదికి మించిన గ్రంథములను ఆధునిక విజ్ఞానపూరితములగు వానిని ప్రకటించి గొప్ప భాషాసేవ చేయుటయే కాక ఆంధ్రప్రదేశమందలి హిందూ ముస్లిముల కలయిక కొక రంగముగ ఏర్పడినది. ఈ అకాడమీ నేటికిని పని చేయుచున్నది. ప్రస్తుతము దీని అధ్యక్షులు ఆంధ్రప్రదేశ రాష్ట్ర విద్యాశాఖామాత్యులు శ్రీ P V నరసింహారావుగారు. శ్రీ కాశేశ్వరరావుగారు గొప్ప విద్వాంసులు చారిత్రక విజ్ఞానమునకు నిధి. వీరు తురుష్క సామ్రాజ్యము మధ్యప్రాచ్యము ఈజిప్టు చరిత్ర చైనావిప్లవము మున్నగు ఉత్తమగ్రంథముల వ్రాసి వన్నెకెక్కిరి. ఉపనిషత్సారములు అను పేరున వీరు వ్రాసిన చిన్నగ్రంథము వీరికి మన ప్రాచీన విజ్ఞానమునందు గల అభిరుచికిని సన్నిహిత పరిచయమునకును గొప్ప నిదర్శనము.

శ్రీ అయ్యదేవర కాశేశ్వరరావు పంతులుగారి రాజకీయ జీవితమును గూర్చి వ్రాయుటకొక గ్రంథము కావలెను. వారు కొంతకాలము విజయవాడ పురపాలక సంఘమున కధ్యక్షులుగ పనిచేసి అపారమైన సేవ కావించిరి. బెజవాడ పట్టణమునకు వీరు మకుటములేని రాజు. ఇచటి పెద్ద మార్కెట్టుకు కాశేశ్వరరావు మార్కెట్టు అను పేరు ఉండుటయే ప్రజలకు వీరియెడగల ప్రేమాభిమానములకు తార్కాణము. 1921 వ సంవత్సరమున వీరు తమ న్యాయవాద వృత్తిని విడనాడి చాల ధనసంపాదనమునకు మూలమగు సాధనమును బుద్ధిపూర్వకముగ విడిచిపెట్టిరి. వీరు మహాత్మా గాంధీగారిని తమ గురువుగా భావించి రాజకీయ రంగమునందు వారి అడుగు జాడలలో నడచిరి. అనేక పర్యాయములు

## అయ్యన వంశము

అయ్యన వంశప్రసంగము ఆంధ్రదేశ పురావస్తుశాఖా ప్రచురణములు (8 7)లో కన్పి చుచున్నది ఈ వంశమునకు మూలపురుషుడు అయ్యన మహామండలేశ్వరుడును మధ్య దేశాధిపతియు అయిన శ్రీ నీలకంఠదేవరస ఈ అయ్యన వంశములో జన్మించినాడు నీలకంఠదేవరసయొక్క పట్టపు రాణి మహాదేవి వీరిరువురకు పద్మలదేవి జన్మించినది అయ్యన నిగళిరుదాం తుడును కాంచీపురాది త్రిపురములకు అధిపతియునైన చోళమహారాజు వంకరస అనువతడు ఇతడు కరికాలచోడుని కులమునకు రత్నదీపము వంటివాడు ఈ వంకరస భార్య పద్మలదేవి వంకరసకు పద్మలదేవివలన మల్లాణిదేవి జన్మించినది ఈ మల్లాణిదేవి అనేక గుణముల కాటపట్టు పవిత్రశీల సౌభాగ్యనిధి ఈమె ఖ్యాతి దిగంతములవరకు వ్యాపించినది రూపలావణ్యవిలాసములకు గని గానకళలో విఖ్యాతయైనది విద్యాధరి బిరుదాంకిత ఈమె ఎల్లప్పుడు శివమేశ్వరునియందే తన మనస్సును లగ్నముచేసెడి భక్తురాలు భక్తికి చిహ్నముగా ఈమె దేవాలయ నిర్మాణము కావించినది

పై విషయములు మహబూబునగరు జిల్లా యందలి గంగాపురం గ్రామములో ఉన్న శిలాశాసనములో ఉటంకించబడినవి ఈ శాసనభాగము క్రీ శ 1042 68 స ॥లో పశ్చిమ చాళుక్యరాజైన మొదటి త్రైలోక్యమల్లసోమేశ్వరుని రాజ్యకాలములో వేయించబడిన శిలాశాసనమునకు క్రింది భాగములో చెక్కబడినది

పశ్చిమచాళుక్యచక్రవర్తులకు సామంతమాండలికులుగా ఉండిన తెలుగు చోళులలో ఒక శాఖ వర్ధమానపురము కందూరు పానుగల్లు మొదలగు ప్రదేశములలో 11వశతాబ్దిని పాలన చేసెను ప్రస్తుతము ఈ ప్రదేశములు నల్గొండజిల్లా మహబూబునగరు జిల్లాలలో కలవు తెలుగుచోళులు దక్షిణ హిందూదేశమున ఖ్యాతికన్న కరికాలచోడుని సంతతివారమని తమశాసనములందు చెప్పుకొనుట కలదు వీరు ఆరవశతాబ్దమున కన్పి చుచున్నారు ఈ శాసనమందు చోళమహారాజు వంకరస కాంచీపురాది త్రిపురములకు అధిపతియని చెప్పుకొనుట అతిశయోక్తి కాని మరియొకటి కాదు

జా హ

## అయ్యన్న చూ అయ్యవారిపాలెము

## అయ్యన్న దేశాయి గార్లపాటి

మహమ్మదీయ దండయాత్రకు పూర్వము కృష్ణా జిల్లాలోని జమీందారులలో కెల్ల మునగాల జమీందారీ కుటుంబము వారు విశేషభూములను కలిగియుండిరి వారు రెడ్డికులము వారు వారుమునగాలలో కొన్ని శతాబ్దములనుండి నివసించుచుండిరి ఈ ఎస్టేటు కృష్ణాజిల్లాలోని నందిగామ తాలూకాలో ఉన్నది దీని విస్తీర్ణము 100 చ॥ మై

ఈ రెడ్డి నాయకులలో ఆఖరివాడు గార్లపాటి అయ్యన్న దేశాయి ఇతని కుమారుడు తండ్రికి ముందుగనే చనిపోయెను క్రీ శ 1698 లో తండ్రి కూడ చనిపోయెను అప్పుడు కుమారుని భార్య అయిన సుభద్రమ్మకు జమీందారీ సంక్రమించినది ఆమె తన సోదరులకు జమీందారీని ఇచ్చివేసెను వారిలో కిన్నర ముకుందప్పకు మాత్రము బిడ్డలు కలరు జమీందారీ ముకుందప్పకు సంక్రమించెను

తరువాత ముకుందప్ప కుమారులయిన సూరన్న నరసన్నలు వారసులైరి తరువాత నరసన్న పెద్దకుమారుడు అయిన వెంకటరామన్న జమీందారాయెను ఈ వెంకటరామన్న పెద్దకుమారుడైన వెంకటనరసింహారావు తండ్రి యనంతరము జమీందారయి దేశముఖ్ బిరుదము వహించెను భూమి శిస్తును చిన్నకుటుంబములవారు పంచుకొనిరి శాశ్వత సనదు వెంకట నరసింహారావు పేరన ఈయబడెను దానిని అందుకొనకుండ అతడు క్రీ శ 1808లో దివంగతుడయ్యెను గనుక సనదును అతని కుమారుడగు కోదండ రామయ్యకు ఒసగిరి క్రీ శ 1814లో కోదండరామయ్య చనిపోయెను అతని కుమారుడగు వెంకటనరసింహారావు మైనరు అయినందున జమీందారీ కోర్టుఆఫ్ వార్డ్సువారి స్వాధీనములో క్రీ శ 1814 నుండి 18 8 వరకు ఉండెను

వెంకటనరసింహారావు 1818 లో జమీందారై పాలనమును 18 సంవత్సరములు నిర్వహించి క్రీ శ 1836లో చనిపోయెను ఈయనకు సంతతి లేనందున కోదండరామయ్య అను 6 ఏండ్ల బాలుని దత్తత చేసికొనెను కోదండరామయ్య మైనరు అయినందున జమీందారీ మరల 14 సంవత్సరములు కోర్టుఆఫ్ వార్డ్సు క్రింద నుండెను కోదండరామయ్య 1850లో జమీందారీని తీసికొని 4 సంవత్సరములు పాలించెను ఈయన

క్రీ శ 1854లో చనిపోవునప్పటికి ఏ వి డ్ల లచ్చాయమ్మ అను కుమార్తె ఈయ కుకఁదు ఆతని వితంతుభార్యయైన రుక్మమ్మ క్రీ శ 1868లో చనిపోవు వరకు జమీందారీని తన నిర్వహణములో ఉ చుకొనెను 1879లో జమీ దా రీ లచ్చాయమ్మ పేరున రిజిష్టరుచేయబడినది

ఈమెకు బిడ్డలు లేనందున శ్రీనాయని వెంకటరంగారావు బహద్దరు వారిని దత్తత చేసికొనెను ఈయ బహుముఖ సారస్వత సేవ చేసి విఖ్యాతి గాంచెను ఈ రాజావారు 1958 లో స్వర్గస్థులయిరి

మా శ్రీ

## ఒయ్యప

అయ్యపదేవుడు నొల బవాడి ప్రభువనియు క్రీ శ 920 ప్రాంతమున ఉండి యుండునయు తెలియుచున్నది నొలంబవాడి అనగా బళ్ళారి అనంతపుర జిల్లాలలో కొంత భాగము పూర్వపు మైసూరురాజ్యము న దలి కోలారు తుంకూరులలోని కొంత భాగము అనియు గుర్తింప బడినది ఇది 32 వేల గ్రామములు గల సీమ నొళంబులు పశ్చిమ గంగ వంశమువారికి సామంతులై తూర్పు చాళుక్య రాజ్యమునకు ప్రతిస్పర్థులుగా ఉండిరి గుణగవిజయాదిత్యుని సేనానియైన పండర గు వీరిని జయించినట్లు ఆ కాలపు శాసనముల వలన తెలియవచ్చుచున్నది పండరగడు జయించిన నొళంబాధిపతి మంగి యనువాడ నొళంబులరాజైన అయ్యపదేవుడు ఒకానొక అమ్మనరాయని జయించినట్లు నొళంబ శాసనముల దు కలదు ఈ అమ్మనరాయడు తూర్పు చాళుక్య ప్రభువైన మొదటి అమ్మరాజు (క్రీ శ 922 9 9) అని కొందరు చారిత్రకులు ౹వా రి డాక్టరు య న్ వె కటరమణయ్యగారు దీనిని వ్యతిరేకించిరి క్రీ శ 922 నాటికే అయ్యపదేవుని కుమారుడు అన్నిగదేవుడు నొలంబ రాజ్యమును ఏలుచుండె నియు కావున అయ్యపదేవుడు మొదటి అమ్మరాజుతో యుద్ధముచేయు ప్రసక్తియే లేదనియు వీరు భావించినది యుక్తియుక్తముగనే ఉన్నది

కాని తూర్పు చాళుక్యులతో అయ్యపదేవుని సంబంధము బొత్తుగా నిరాకరించుటకు వీలులేదు ఎలన రెండవ అమ్మరాజు కలుచు బట్టు శాసనములో తన తండ్రియైన రెండవ చాళుక్య భీమరాజు (934 945) జయించిన పెక్కు శత్రువులను పేర్కొని యున్నాడు ఆతడు జయించిన శత్రువర్గములో అయ్యపుడను నాతడొకడు ఈతనిని గూర్చిన పంక్తి యిట్లున్నది బలిన మతితరం అయ్యపమ్ భీమ ముగ్రమ్ అనగా అత్యంత బలియుడును ఉగ్ర పరాక్రమ సమన్వితుడును అగు అయ్యపదేవుని రెండవ చాళుక్య భీముడు జయించెను ఈ అయ్యపదేవుని దృష్టియందుంచుకొనియే కాబోలు కొందరు చరిత్రకారులు అయ్యపదేవుడు మొదటి అమ్మరాజునకు (క్రీ శ 92? 934) సమకాలికుడై ఆతనిని యుద్ధమున ఓడించి యుండునని భావించిరి నొళంబ అయ్యపదేవుడు క్రీ శ 922కు పూర్వమే గతించియుండుటచే ఆతడు అమ్మరాజుతో తలపడుట పొసగదని వారు వివరించిరి అయినచో రెండవ చాళుక్య భీమరాజు జయించిన ఉగ్రపరాక్రముడగు అయ్యప ఎవ్వడను సమస్య బయలుదేరుచున్నది ఈ అయ్యపుడు రాష్ట్రకూట నాల్గవ గోవిందరాజు సామంతుడైన అయ్యపయ్య అనువాడు కావచ్చునని శ్రీ వె కటరమణయ్యగారు తలచిరి

రాష్ట్రకూట చక్రవర్తి నాలుగవ గోవిందరాజు తూర్పు చాళుక్యులకు శత్రువు ఇతడు రెండవ యుద్ధమల్లుని పక్షము వహించి సైన్యములను పంపి వేగిరాజ్యములో విశేష భాగమును ఆక్రమించెను రెండవ చాళుక్య భీమరాజు బహుపరాక్రమశాలియై వేగిని వానమును ఆక్రమించుకొన్న యుద్ధమల్లుని ఆతనికి బాసటయైవచ్చిన నాల్గవ గోవిందరాజును తరిమివేసి ప్రాక్చాళుక్య రాజ్యమును వశపరచుకొనెను ఈ సందర్భమున ఈతడు రామయ్య ధళగ తాతబిక్కి బిజ అయ్యప మున్నగువారిని నిర్జించెనని చెప్పబడినది ప్రస్తుతము ప్రసక్తుడైన అయ్యపదేవుడు ఈతడు కావచునని డాక్టరు రమణయ్యగారి భావన అయ్యపదేవుడు మానెయవాడి కొగలినాడు ప్రాంతములను పాలించుచుండెను రెండవ చాళుక్యభీమునకు సమకాలికుడగు నొళంబాధిపతి అయ్యపదేవుని మనుమడగు ఇఱులచోర అబడువాడు క్రీ శ 929 ప్రాంతమున ఈతని శాసనము కాన్పించుచున్నది తాత పేరు మనుమలికి పెట్టు సంప్రదాయమున్నది ఇఱులచోరని కూడ అయ్యప అను పేరున్నదని భావించినచో ఈతడు నొళంబరాజులలో రెండవ అయ్యపుడగును ఈ రెండవ అయ్యపుడు మొదటి అమ్మరాజు రాజ్యాంతమునవర్ధిల్లి రెండవ చాళుక్య భీముని కాలమువరకును ఉండును అమ్మరాజు ప్రత్యర్థి ఈ రెండవ అయ్యప అని సంభావించినచో సమన్వయము కుదురును ఇది ఇంకను విచార్యము

తిం ల రం

## అయ్యపదేవ మహారాజు

ఈయన ప్రశ ం దక్షిణహిందూదేశశాసనముల దు కని పించుచున్నది (ద హి VI సె 96) ఈయన క్రీ శ 12వ శతాబ్దము వేగి ప తమను పాలించిన సామంతరాజవంశము కు చెందినవాడు కమిళదేశమును పరిపాలించుటకువెళ్ళిన తరువాత కులోత్తుంగచోళుకు ఆంధ్రదేశప్రభుత్వమును వెలనాటిచోడులవరము చేసెను ఈకాలమున దు ఆంధ్రదేశమున పెక్కుసామంత రాజకటుంబములవారు తలయెత్తిరి ఇట్టి వారిలో వేంగి నిడదవోలు ఎరాపురము ఎలమంచిలి పంచ ధార్ల (శ్రీ)కూర్మములలో పరిపాల చేసిన చిన్నచిన్న చాళుక్య కటుంబములవారును కోనహైహయులును ధరణికోట యందలికోటవంశీయులును పల్నాడులో గురజాల ముఖ్య పట్టణముగా లినసలగామరాజు మున్నగు హైహయులును గడిమెట్టచాగివారును పేర్కొ దగినవారు వీరిలో కొందరు వెలనాటిచోడుల ఆధిపత్యమును అంగీకరింపక స్వతంత్రులగు టకు యత్నించుచుండిరి

అయ్యపదేవుని వంశమువారు ఏలూరు మీసమ దలి తడికలపూడి ముఖ్యపట్టణముగా చేసుకొని వేగినాటిని పరి పాలించిరి ఈవంశమున దు అయ్యపదేవ నామము వహించిన వారు తాత మనుమలు ఇద్దరు కలరు మనుమడైన అయ్యప దేవుని తాతగారినుండి వేరు చేయుటకై కాకోలు మనుమ (మన్మ) అయ్యపదేవు ను వ్యవహార మేర్పడెను కాకతి ప్రతాపరుద్రునకు కొన్ని శాసనములలో మనుమరుద్రదేవుడను పేరు కన్పించును మాతామహియైన రుద్రమదేవి రుద్ర దేవరాజు అను ప్రశస్తియుండుటచే ఆమెను వేరు చేయు టకై ప్రతాపరుద్రుని మనుమరుద్రదేవుడని వాడి యుండురు అయ్యపదేవుల విషయమున గూడ మనము ఇట్లే అన్వయిం ప వలసియుండును మనుమఅయ్యపదేవుని శాసనము విజయ వాడయందు లభించినది మల్లేశ్వరమహాదేవునకు అయ్యప దేవుడు అఖండవర్తిదీపము నెలకొల్పుచు శాసనమువేయించెను ఈశాసనముచెక్కబడినరాతిలో కొంతభాగముపోవుటచే కాకోలు శాసనము సందేహమునకు తావిచ్చుచున్నది శాసనభాగమిట్లు న్నది దశరరుద్రమితేశకాబ్దే "వరదీపక కాంతారమల్లేశ్వర" శర = 5 రుద్ర = 11 ద అనుచోట ఒక అక్షరముపోయినది దీనిని మనము వేద అనిపరించినచో "వేదశరరుద్రమితే శకాబ్దే అని యేర్పడును అది శకము 1154 (క్రీ శ 1232) అగును అనగా మన్మఅయ్యపదేవుడు క్రీ శ 1232 ప్రాంతమున నెగ్గ్రిప్రాంతమున ఎలుబడి నెరపుచుండెనని తెలుచున్నది ఇతడు దానముచేసిన భూమి లూంకనకు తూర్పున బోయినట్లు కి శెట్టినభూ 1 అనుటచే ఈ ండు లూరు దాని మీసము న దలి వేగి మున్నగు నగరములకు అధిపతి యని ఊహింప వచ్చును

బెజవాడ శాసనమునందు అయ్యపదేవుడిచ్చిన వంశక్రమ మిట్లున్నది

గొంకభూపతి (ఇతడు వేగింహాప్రసిద్ధమాధీశుడు)
|
అయ్యపదేవుడు-భార్య-ముప్పలమహాదేవి
|
గణపతినృపుడు (రాజ్యలక్ష్మి ఈయన వక్షఃస్థలమున చిరకాలము నెనట)
|
మన్మఅయ్యపదేవుడు (మన్మయ కూడ కావచ్చును) విజయవాడ శాసనదాత (క్రీ శ 1232)

మన్మఅయ్యపదేవుని విజయవాడశాసనముకాక ఇతరశాసన ములనుండి మ కొందరు ఈవంశీయులు తెలియవచ్చుచున్నారు

1) ఇప్పటి పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరుతాలూకా తడికలపూడి గ్రామమున శక 1063 (క్రీ శ 1141) ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున ఆ డు బల్లి హారిదేశ్వరమహాదేవరకు హారిక్షుల్యర్చనదీపములకు వేగి య్యపదేవ డు తమ తల్లి దండ్రుల ధర్మముగాచేసిన దానము

(ద హి V సె 207)

(2) శక 1115 (క్రీ శ 1193) వెలనాటి అయ్యపదేవ మహారాజు బుడిసెలపూడి గ్రామమును తెలికిచర్లలోని మూల స్థాన మహేశ్వర దేవునకు దానముచేసెను

3) శక 1130 (క్రీ శ 1208) ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున తడికలపూడిలోని ఆ డు బల్లి హారిదేశ్వర మహా దేవరకు (శ్రీ)మన్నవ మండలేశ్వర వేగిమహాదేవరాజుల బంటు కొట్యకొమారినాయకుడు అఖండదీపము సమర్పించుచు చేసిన దానము

దీనివలన ఒక అయ్యపదేవ మహారాజు ఒకవేగి మహా దేవరాజు తెలియవచ్చుచున్నారు వీరును మనుమఅయ్యపదేవ మహారాజువంశీయులని యేమేమో భావించుచున్నాము తడి కలపూడి గ్రామమునందే శక 1063 శక 1130 శాసనములు లభించుచున్నవి రెండవది ఈశాసనములు మిక్కిలి సమీప కాలమునందే వెలువడినవి కావున ఈశాసనముల వలన తెలియ

వచ్చిరాజులను పూర్వోక్తవంశమునకే చెందియుండరనుట యుక్తియుక్తము గాదు. అయినచో వేంగిచాళుక్యవంశమునందు వీరిస్థానమును నిర్ణయించవలెను. ఖ్యాతనామ్యమైన అయ్యపదేవు శాసనములు రెండు కాన్పించుచున్నవి. ఒకటి శక 1068 నాటిది, రెండవది శక 1115 నాటిది. రెండవ శాసనములో ఈతడు వెలనాటి అయ్యపదేవుడని చెప్పబడుట విశేషము. క్రీ శ 12వ శతాబ్దియందలి ఆంధ్రదేశచరిత్రయొక్క ముఖ్యాంశములను స్మరించినచో వేంగిచాళుక్యమాండలిక రాజ్యమును సందర్శించగలము. అప్పుడు కాంచీపుర చాళుక్యచోడులకు నామమాత్రసామంతులై వెలనాటిచోడులు తీరస్థ ఆంధ్రదేశమునందు ప్రధానపాలక కుటుంబముగానుండిరి. పశ్చిమాంధ్రమునందు కాకతీయులు రెండవప్రోలరాజు రుద్రదేవుల క్రింద విజృంభించుచుండిరి. వెలనాటిచోడులు ప్రధానముగ కృష్ణకు దక్షిణమున ప్రాభవోపేతులైయుండిరి. వీరు చతుర్థకులజులు అనియో లేక సాటి మాండలిక కుటుంబము మాత్రము అని ఎంచియో వేంగిలోని చాళుక్య కుటుంబముల వారు వీరియెడ ఉదాసీనభావము వహించినట్లు కాన్పించును. ఈచాళుక్యకుటుంబములవారు తాము చంద్రవంశక్షత్రియులమని ప్రకటించుకొనుచుండిరి. గొంకమహీపతి లోకస్తుత్య సోమాన్వయమున జన్మించినట్లు మనుమ అయ్యపదేవుడు శక 1 6[illegible] నాటి విజయవాడ శాసనములో వర్ణించెను.

వేంగిలోని క్షత్రియ చాళుక్య కుటుంబములవారు వెలనాటిచోడ ప్రభుత్వమును తెగడి స్వతంత్రులవుటకై యత్నములు చేయుచుండిరి. తామెవ్వరికిని సామంతులము కామను ధోరణిలోనే వీరి శాసనములున్నవి. ఎలన వీరు తమ శాసనములలో తమ అధిపతులైన వారి నెవరిని పేర్కొనలేదు. వెలనాటిచోడుల నధిక్రమించగల శక్తిసామర్థ్యములు వీరికెట్లు వచ్చెనను నది ఒక ముఖ్యసమస్య. దీనికెట్లు సమాధానము చెప్పవలెను? వెలనాటిచోడులను కాంచీపురచోడులును తమకు బలవత్తరప్రత్యర్థులైన పశ్చిమ చాళుక్యులతో మహాయుద్ధములు చేయుచుండిరి. క్రీ శ 1120 ప్రాంతమున మొదటి కులోత్తుంగచక్రవర్తి మరణించెను. అతని అనంతరీయులు అంత సామర్థ్యము కలవారుకారు. వెలనాటి చోడులకు మరియొక ప్రత్యర్థిరాజ్యమువారు ఎదురైరి. వీరు కాకతీయులే. ప్రోలరాజును రుద్రదేవుడును కూడ వెలనాటివిజయమునకై ఉవ్విళ్లూరుచుండిరి. ఆయత్నమునందు రెండవప్రోలుడు రణనిహతుడయ్యెను. విజయలక్ష్మి రుద్రదేవుని కొంత వరించెను. పల్నాటి యుద్ధమును సాకుగా చేసుకొని రుద్రదేవరాజు తన సేనలను నడిపించి ధరణికోటను ఏలుకోటవంశీయులను ముట్టడించెను. కోట దొడ్డభీమభూపాలుడు యుద్ధమునందు ఓడెను. రుద్రదేవరాజు కోటరాజ్యమును తాను ఉంచుకొనక దొడ్డభీముని కుమారుడైన రెండవ కేతరాజుకు ఇచ్చివేసి కోటవారిని తనకు మిత్రులుగ చేసుకొనెను. కోటవంశీయులిదివరలో వెలనాటిచోడులతో శాత్రవములు నెరపుచు వారి రాజ్యమునకు ప్రబల సహాయులుగనుండిరి. కాకతిరుద్రదేవుని శాసనము శక 1107 (క్రీ శ 1185) నాటిది త్రిపురాంతకేశ్వర ఆలయమునందు కన్పించుచుండుటచే ఆతని ధరణికోటవిజయము తత్సమీపకాలమున జరిగెనని యూహించదగును.

ఇట్లు వెలనాటిచోడులు మొదట పశ్చిమ చాళుక్యులతోను తరువాత కాకతీయులతోను యుద్ధనిమగ్నులగుట చూచి వేంగిచాళుక్యక్షత్రియకుటుంబమువారు స్వతంత్రులగుటకు యత్నించిరనుట సంభావ్యముగ నున్నది. ఈ చాళుక్యులు కాకతీయులకు మిత్రులుగా ఉండియుండవచ్చును. వీరి రాజ్య ప్రాభవమును గాకున్నను చంద్రవంశ క్షత్రియులను ఆభిజాత్యమును పరిగణించియే కాకతిగణపతిదేవుడు తన పెద్దకుమార్తె రుద్రమ్మను నిడుదవోలు చాళుక్యవంశీయుడైన వీరభద్రునకు ఇచ్చుట కంగీకరించియుండును.

వేంగి చాళుక్యవంశమువారి చరిత్రను అనుసంధింతము. మనుమఅయ్యపదేవుని శాసనమునుబట్టి ఈవంశములో మొదట ప్రసిద్ధికెక్కినవాడు గొంకభూపతి. గొంకభూమీశునకును మనుమఅయ్యపదేవునకును నడుమ మూడుతరములుగడచుటచే వారిమధ్య ఒక శతాబ్దము అంతరము కలదని భావింపవచ్చును. అందును తన తండ్రియైన గణపతిదేవుని వక్షఃస్థలమున దరాజ్యలక్ష్మి చిరకాలము వసించెనని మనుమఅయ్యపదేవుడు చెప్పియున్నాడు కదా. కావున గొంకభూపతి క్రీ శ 118[illegible] ప్రాంతమున వర్ధిల్లియుండును. ఇది మొదటి వెలనాటిచోడుని రాజ్యకాలము. గొంకభూపతి వేంగి సహస్రగ్రామాధీశుడని మనుమ అయ్యపమహారాజు శాసనము నుడువుచున్నది. అనగా వేయిగ్రామముల పరిమితిగల వేంగిమండలమును ఆతడు స్వతంత్రుడుగా పరిపాలించెను.

ఇతని కుమారుడు అయ్యపదేవుడు. ఈతని తడికలపూడి శాసనము శక 1068 (క్రీ శ 1141) నాటిది లభించినది

దీనిలో ఇతడు శ్రీ మన్మహామండలేశ్వర వేంగి అయ్యపదేవుడని ప్రకటించుకొనెను అగా స్వతంత్రప్రతిపత్తికి కావుటా యె తె నట అయ్యపదేవుని రెండవశాసనము శక 1115 (క్రీ శ 1193) నాటిది తెలికిచర్లలో కనిపించుచున్నది ఇచ్చట ఈతనికి వెలనాటి అయ్యపదేవుగని వ్యవహారము కానిపించుచున్నది ఈయిద్దరును ఏ వ్యక్తియేనని భావించుచున్నాము అయినచో వేంగి అయ్యపదేవుడు వెలనాటి అయ్యపదేవుడు ఎట్లయ్యెనని విచారింపవలెను తిరిగి మనము క్రీ శ 1193 సంవత్సర ప్రాంతమందలి ఆంధ్రదేశచరిత్రను నెమరువేసుకొనవలెను రెండవ వెలనాటి చోడరాజు రాజ్యావసానకాలమున క్రీ శ 1182 ప్రాంతమున పల్నాటియుద్ధము తటస్థించెను దీనిలో పెక్కు శూరకుటుంబములు నశించెను వెలనాటి రెండవచోడుని తరువాత సింహాసనమునకు వచ్చిన మూడవ గొంకరాజు సమర్థుడైన పరిపాలకుడు కాడు ఈతనికాలమున నే వెలనాటిచోడులకుబంధువులును పరాక్రమోపేతులునైన మిత్రులును అయిన కొండపడమటి మాండలికులు రుద్రదేవరాజు సేనానులకు వశులైరి ఇట్లు క్రమముగా వెలనాటివారికి వెలనాడులో బలము బొత్తుగా క్షీణించెను కాకతి రుద్రదేవుని వెలనాటి దండయాత్రలయందు వేంగి అయ్యపదేవుడు తోడ్పడి వెలనాటిలో కొంతభాగమును తానును ఆక్రమించియుండును వెలనాడులో తాను సాధించిన విజయములకు సూచకముగనే ఇతడు శక 1115 (క్రీ శ 1193) నాటి శాసనములో వెలనాటి అయ్యపదేవుడను ప్రశస్తి వ్రాయించుకొనెనని మనము భావింపవచ్చును వెలనాటివంశీయులలో గొంక వెలనాటిచోడ అను నామములే కాని అయ్యపదేవ నామము కన్పింపదు వేంగి అయ్యపదేవుడే వెలనాటి అయ్యపదేవుడు అయ్యెనని ప్రకృతమునకు ఊహింపవలెను వేగిక్షత్రియ వంశమునందలి మొదటి అయ్యపదేవుడైన ఇతడు సమర్థుడైన రాజన్యుడై దీర్ఘకాలమే క్రీ శ 1141 93 సంవత్సరముల నడుమ రాజ్యపాలనముచేసినట్లు కన్పించును

మొదటి అయ్యపదేవుని కుమారుడును తదనంతర పాలకుడును అయిన గణపతి నృపునిశాసనములు ఇంతవరకును తెలియరాలేదు ఈతని కుమారుడు మన్మఅయ్యపదేవుని శాసనమును బట్టియే ఈతడు తెలియవచ్చుచున్నాడు ఈతడును దీర్ఘకాలము పాలించినట్లు విజయవాడ శాసనమున గలదు తండ్రియైన మొదటి అయ్యపదేవునితో కలిసి కొంత కాలమును స్వతంత్రుడుగా కొంతకాలమును గణపతినృపుడు పాలించెనని యూహింపవలెను ఈతడు క్రీ శ 1183 1200 ల నడుమ వేంగిపాలకుడుగా ఉండియుండవచ్చును ఈతనికాలమునందు జరిగిన ఒక ముఖ్యమయిన రాజకీయ సంఘటన వెలనాటి పృథ్వీశ్వరరాజు సంగ్రామమునిహతుడగుట వెలనాటిరాజ్యము సంపూర్ణముగా చరిత్రరంగమునుండి అస్తమించుట వెలనాటి పృథ్వీశ్వరుని రణమునందు హరించుటలో నెల్లూరు చోడతిక్కరాజునకును కాకతి గణపతిదేవచక్రవర్తికిని ప్రధానపాత్రకలదు కాకతి గణపతిదేవుని వెలనాటివిజయము క్రీ శ 1207 10 ప్రాంతమున జరిగినట్లు చారిత్రకులు భావించుచున్నారు ఈసంగ్రామమునందు వేంగి గణపతిదేవుడు కూడ సముచిత పాత్ర వహించి యుండును సామ్రాజ్యనిర్మాణ ప్రయత్నము నందు కాకతీయులు పెక్కు సామంతులను జయించియు వేంగి చాళుక్య వంశీయులను విడిచిపెట్టుటకు హేతువు వారు కాకతీయులకు మిత్రులును సామంతులును అయియుండుట తప్ప వేరుకారణము కాన్పించదు ఈమైత్రియే కొంతకాలము నకు బాంధవ్యముగా పరిణమించుట ఒక విశేషము

వేంగి చాళుక్య వంశములో మనము గుర్తింపవలసిన ఒకవ్యక్తి మిగిలియున్నాడు ఈతడు వేంగి మహాదేవరాజు ఈతని అనుచరుడైన కొట్యకొమరినాయకుని శక 1130 (క్రీ శ 1208) తడికలపూడి శాసనమువలన మహాదేవరాజు తెలియవచ్చుచున్నాడు తడికలపూడి వేంగి వేయుంటికి (అనగా వేయిగ్రామములు) రాజధానియని ఈ గ్రామమునందలి అయ్యనీశ్వర ఆలయము నందు తడికలపూడి బొక్క గోవిందభట్లు అను బ్రాహ్మణుడు శక 1176 (క్రీ శ 1254) నందు వేయించిన శాసనము (దహిం ఇ నెం 195)లో వర్ణింపబడినది క్రీ శ 1208 లో వేంగి మహాదేవరాజుల ప్రశంసగల శాసనము వెలువడినది ఇదివరలో మనముచెప్పుకొన్న కాల పరిగణమును బట్టి తడికలపూడి యందిప్పుడు గణపతిరాజు పాలించుచున్నాడు ఆతని రాజధానియందే మరియొక దేవాలయమున అనగా ఆండుంబల్లి హారికేశ్వర (హారుకేశ్వరయని శాసనము) మహాదేవర ఆలయమునందు వేయబడిన శాసనములో ప్రస్తుతుడైన మహాదేవరాజు గణపతినృపునికి అత్యంత సన్నిహితుడై యుండకతప్పదు మన్మఅయ్యపదేవుడు తన వంశప్రశస్తిలో మహాదేవరాజు మాటయెత్తలేదు ప్రధాన రాజ కుటుంబముతో మహాదేవరాజుల సంబంధమెట్టిదో మనకు

విశదముగ తెలియదు కాని సందర్భమునుబట్టి కాలస్థల సామ్యముచే మహాదేవరాజు చాళుక్యవంశీయుడే అనియు గణపతిరాజునకు ఏకోదరుడైన సహోదరుడో సవతితమ్ముడో అయియుండవలెననియు ప్రకృతమునకు ఊహించుచున్నాము

ఈయూహకు మరొకప్రయోజనము కలదు ఇప్పుడు మనము కాకతిరుద్రదేవి అత్తవారివంశము వరకు మరలుదము రుద్రమదేవి భర్త చాళుక్యవీరభద్రుడనియు ఈవంశమువారు నిరవద్యపురమను నిడుదవోలు పాలకులనియు చారిత్రకులంగీకరించిన విషయము చాళుక్యవీరభద్రుని తండ్రి ఇందుశేఖరరాజు ఈయంశము వీరభద్రుని తల్లియైన ఉదయాంబిక పాలకొల్లు క్షీరారామేశ్వర ఆలయమునందు వేయించిన శక 1188 (క్రీ శ 1 66) నాటి శాసనమువలన తెలియవచ్చుచున్నది ఈశాసనమునందు చేయబడిన దానము వీరభద్రేశ్వరుని పుణ్యసంప్రాప్తికై చేయబడినందున దురదృష్టవశమున చాళుక్యవీరభద్రుడు అప్పటికే అకాలమృతినొందెనని భావింపవలసి యున్నది వీరభద్రుని తండ్రి ఇందుశేఖరుడనియు తాత విష్ణువర్ధనుడనియు ఇందు కలదు విష్ణువర్ధనుడనునది చాళుక్యరాజుల వంశపరంపరాగతమైన ప్రశస్తినామము బహుశః ఈతని పేరు మహాదేవరాజై యుండును క్రీ శ 1278 నాటి కోటనుపాక శాసనమిట్టి యూహకు తావిచ్చుచున్నది ఇదియే సత్యమైనచో ఇందుశేఖరరాజు తండ్రి విష్ణువర్ధన మహాదేవరాజు కావలెను మనుమడైన చాళుక్యవీరభద్రునకును అతని తాతయైన మహాదేవరాజునకును 60 సంవత్సరముల అంతరమును చూచుకొన్నచో మహాదేవరాజు క్రీ శ 1203 ప్రాంతమువాడగుటలో విప్రతిపత్తి ఏమియు లేదు

అయినచో మహాదేవరాజువంశమువారు నిరవద్యపుర చాళుక్యులెట్లైరి అనునది విచారణీయము ఇది యంత దుష్కరము కాదు వేంగి (తడికలపూడి) గణపతిదేవుని కాలమున అతనికిని అతని సోదరుడగు మహాదేవరాజునకును నడుమ రాజ్యవిభాగము జరిగి యుండును ఆయన్నదమ్ముల అన్యోన్య సఖ్యతచే నైనను ఇది జరిగియుండును లేదా కుటుంబమునందు అంతఃకలహములు వారించుటకై సామోపాయముగా నైన జరిగియుండును ఇట్టివిభాగవిషయమున చారిత్రకసామ్యములు లేకపోలేదు రాచకొండ వెలమరాజ్యమును అనపోతానాయుడు అతనితమ్ముడు మాదానాయుడును రాచకొండ దేవరకొండ నగరములు రాజధానులుగా సౌభ్రాత్రముతో పంచుకొని పరిపాలించుకొనిరి కొండవీటి రెడ్డిరాజైన కుమారగిరిరెడ్డి తన బావమరదియైన కాటయవేమారెడ్డికి రాజమహేంద్రవరరాజ్యమును ప్రీతిపూర్వకముగా ఇచ్చెను చాళుక్యవంశమునందును ఇట్టి ఏర్పాటే జరిగినను ఆశ్చర్యపడనక్కరలేదు తడికలపూడి గణపతిదేవుడు రాజ్యమునందలి దక్షిణభాగమును తానుంచుకొని ఉత్తరభాగమును అనగా నిడదవోలు ప్రాంతమును తన సోదరునకు ఇచ్చియుండును వీరే నిరవద్యపురచాళుక్యులైరని భావింపవలెను

ఇది సిద్ధాంతముగా నిశ్చయించుటకు సాక్ష్యమింకను వలయును కాని ఇప్పుడు లభించుసాధనములతో ఈసమన్వయము చేయగును ఐనచో ఈవంశావళిని స్వల్పముగా మార్పవలసి యుండును




ఈ చాళుక్యవంశమువారి కాలమందు వేంగిదేశమున శైవము ప్రభువులయాదరమును పొందుచుండెను తడికలపూడియందు అయ్యనేశ్వరాలయము హరిణేశ్వరాలయము తెలికిచర్లయందు మూలస్థానమల్లేశ్వరాలయము విజయవాడయందు మల్లేశ్వరాలయము తెలియవచ్చుచున్నవి

దా వా య దే

శం ల రం

## అయ్యప నాయకుడు

అయ్యపనాయకుని ప్రశంస చాటుపద్యమణిమంజరి రెండవ భాగములోని 309 వ పుటలో కనవచ్చుచున్నది వెలుగోటి యాచమనేనికిని గొబ్బూరి జగ్గరాజునకును జరిగిన సంగ్రా

మమునందు అయ్యపనాయకుడు యాచమనేనికి అండగా నిలిచెను ఆ వృత్తాంతము చాటుపద్యమణిమంజరిలోని క్రింది పద్యమున గనవచ్చుచున్నది

సీ॥ రామరాయనరేంద్ర రఘునాథనాయక
ప్రాముఖ్య కార్యకర్తల బలంబు
నిజసహోదర సింగ నృపతి రాయపభూప
రాయ్యపనాయకోద్యత బలంబు
దామెరకాల చెన్నధాత్రీశ చెరుకు వె
గళభూప బంధువరముల బలము
పరమాప్తు కేతిరెడ్డి రఘునాథేంద్ర పా
వడ కృష్ణ నృప సుహృద్వరబలంబు
మెఱసి తనుఁ గొల్వఁ గొక్కర్ల మెట్ట యొద్ద
సమర మొనరించి గొబ్బూరి జగ్గరాజుఁ
దునిమి మధురేంద్రుఁజెజీకు దొరలఁ దఱిమె
నెంత ప్రబలుండు రంగయ యేచఘనుఁడు॥

పై పద్యమును బట్టి కొన్ని చారిత్రకాంశములను గ్రహింపగలము. వెలుగోటి కస్తూరి రంగప్పనాయని రెండవ కుమారుడు యాచమనాయడు కస్తూరి రంగప్పనాయని భార్య దామెరవారి ఆడ బిడ్డయైన వేంకటాంబిక అను నామె బహులాశ్వచరిత్ర కృతికర్తయగు దామెర వెంగళభూపాలుడు రంగప్పనాయని మేనల్లుడు యాచమనాయడు మహాపరాక్రమవంతుడు ఇతడు విజయనగర ప్రభువైన రెండవ వేంకటపతిరాయల (క్రీ శ 1586-1614) నుగ్రహమునకు పాత్రుడై ఆయనొసగిన పెమిడి సీమను పాలించుచు మధురా తకమున వసించెను రెండవ వేంకటపతిరాయలకు గొబ్బూరి జగ్గరాజు బావమరది క్రీ శ 1614 లో రెండవ వేంకటపతిరాయలు మరణించుచు తనకు సంతతి లేకుండుటచే తన అన్న కుమారుడైన శ్రీరంగరాయని తన యనంతరము రాజుగ నిర్ణయించెను కాని గొబ్బూరి జగ్గరాజు ఆ నిర్ణయమును అంగీకరించక వెంకటపతిరాయల రాణియు తనకు సోదరియునగు నామెకు కుమారుడు జన్మించినట్లు ప్రకటించి తన మేనల్లుని రాజుగా చేయనెంచి శ్రీరంగరాయలపై తిరుగుబాటు చేసెను రంగరాయలను ఆతనికుటుంబమును జగ్గరాజు సంహరించెను వెలుగోటి యాచమనేని సాయముతో శ్రీరంగరాయలకుమారుడగు రామదేవరాయలు మాత్రము మృత్యుముఖమునుండి తప్పించుకొని గలిగెను సామ్రాజ్యమునందలి సామంతులు రెండుపక్షములుగ చీలిరి కొందరు జగ్గరాజు పక్షము వహించిరి మరికొందరు రామదేవరాయల పక్షమున చేరిరి వెలుగోటియాచమనాయడు దుర్మార్గుడగు జగ్గరాజును శిక్షింపఁ గోరెను తంజావుర రఘునాథనాయకుని సాయమర్థించెను తంజావురము మొదటినుండియు రాయ సామ్రాజ్యమునకు విధేయమై యుండుటచేత రామరాయ నరేంద్రుడు రఘునాథనాయకుడు నిజసహోదరుడైన సింగ నృపతి రాయపభూపరుడు అయ్యపనాయకుడను దామెర కాలచెన్నధాత్రీశుడు చెరుకు వెంగళభూపతి పరమాప్తుడగు కేతిరెడ్డి పావడకృష్ణుడు మున్నగు వారును వారి బంధుమిత్రులను తనవెంట నుండగా గొప్పసైన్యముతో యాచమనాయడు జగ్గరాజుపై దాడి వెడలెను జగ్గరాజునకు అండగా మాకరాజు మధురేంద్రుడు చెంజినాయకులును అరుదెంచిరి ఉభయపక్షములవారికిని కొక్కర్ల మెట్ట వద్ద పోరు ఘోరముగ జరిగెను యాచమనేడు కదనమార్తాండుడై శత్రువును అఖ్యాకముగ దునుమాడుచుండెను ఆయన ఖడ్గ ధాటికి ఆగలేక మధురచెంజి దొరలు రణరంగమును విడిపారిపోయిరి సమరాంగణము పీనుగుపెంటలతోనిండెను జగ్గరాజు పారిపోవుచున్న తనసైన్యమును హెచ్చరించుచు శాత్రవులతో భయంకరముగ పోరాడి తుదకు యాచమనేని ఖడ్గహతిచే అసువులబాసెను ఈ యుద్ధము క్రీ శ 1616 న జరిగినట్లు తెలియుచున్నది

అయ్యపనాయకుడు కదనరంగమున సోదరుడగు యాచమనేనికి సాయపడి తన భ్రాతృభక్తిని ప్రదర్శించెను వెలుగోటివారి వంశావళియందు కస్తూరి రంగప్పనాయనికి ముగ్గురే కుమారులు చెప్పబడిరి కుమారరంగప్ప యాచమ సింగమ అనువారు వారిలో నుండిరి అయ్యపనాయకుడు అందు కనవచ్చుటలేదు కాని చాటుపద్యమణిమంజరి యందలి

"నిజసహోదర సింగనృపతి రాయపభూప
రాయ్యపనాయకోద్యత బలంబు"

అను పద్యపాదమున సింగనృపతి రాయపభూపరుడు అయ్యపనాయకుడు అనువారు యాచమనాయనికి సోదరులుగా చెప్పబడిరి నర తిరువిజయ మనునామాంతరము గల రామరాజీయము అను గ్రంథమునందు అయ్యపనాయకుని పేరు అయ్యన అనికలదు - ఈ గ్రంథ రచయిత అందుగులవెంకయ్య ఈయన యాచమనేనికిని గొబ్బూరు జగ్గరాజునకు జరిగిన యుద్ధ

మును మహాభారత యుద్ధముతో పోల్చెను (రా-రా-956 పద్య) రామదేవరాయలు ధర్మరాజు సింగన్నృపుడు భీమసేనుడు రాయన్న తిమ్మనుడు అయ్యన్న చెన్నన్న్పతులు మాద్రేయులు ఇతరరాజులు విరాటపాంచాలాదులు రఘునాథనాయకుడు శ్రీకృష్ణుడు చెన్నవీరప్ప యాచన మొదలగు రాజాదులు దుశ్శాసన శకుని శల్య కర్ణాదులు జగ్గరాజు దుర్యోధనుడు- అను రీతిగ ఆయన చమత్కరించెను కాని ఈ యుద్ధమున ప్రధానపాత్ర వహించిన వెలుగోటి యాచమనాయని ఆయన ప్రశంసించని కారణమేమో తెలియదు నిజముగా ఈసమరమున మిక్కిలి ప్రతాపమునుచూపి జగ్గరాజును వధించి రామదేవరాయలకు రాజ్యమును దక్కించిన ఘనత వెలుగోటి యాచమనేనికే దక్కుచున్నది మాద్రేయులలో చివరివాడుగపోల్చబడిన చెన్నన్పపుడు దామెరవశీయుడు

కొక్కర్సు మెట్ట వద్ద జగ్గరాజునకును యాచమనేనికిని పోరు జరిగినట్లు చాటుపద్యమణిమంజరిలో గలదు కాని ఈ యుద్ధము తోపూరులో జరిగినట్లు చరిత్రాధారములు కలవు కొక్కర్స మెట్ట వద్ద జరిగిన యుద్ధము తోపూరు యుద్ధములోని చరమఘట్టమని భావింప వీలగుచున్నది కొక్కర్సు మెట్ట తోపూరు ప్రాంతమున నుండెనేమో !

తం ఆం శా

అ గో కృ

## అయ్యపరుసయ్య

అయ్యపరుసయ్య వృత్తాంతము దక్షిణహిందూశాసనములలో కవచ్చుచున్నది (దహి IV నె 936) ఈ శాసనము గుంటూరు జిల్లా గుంటూరు తాలూకా యెనమదల గ్రామములోని వీరభద్రస్వామి దేవాలయములో దక్షిణ దిశనున్న రాతిస్తంభముపై చెక్కబడి యున్నది శాసనకాలము శక 1453 (క్రీ శ 1531) శాసనము మొత్తము ఇరువదియేడు పంక్తులలో నున్నది మొదటి మూడున్నర పంక్తులలో శార్దూలవిక్రీడితవృత్తము సంస్కృతభాషలో నున్నది పిదప 12వ పంక్తుల వరకు నాలుగుపాదములు తేటగీతితో నొక సీసపద్యమున్నది 12వ పంక్తిలో సగము తమిళ లిపిలో నున్నది 13వ పంక్తినుండి 27వ పంక్తి వరకు తెలుగు వచనములో నున్నది

శాసన సారాంశము - "స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షములు 1453 (క్రీ శ 1531) అగు నేంటి నందన సంవత్సర భాద్రపదశుద్ధ 10 (దశమి) సోమవారము నాండు రాయసం అయ్యపరుసయ్యవారు కొండవీటి సంస్థానము పాలించగాను ఆయన సేవకుండు గు బొమ్మనాయడు వీరేశ్వరునికి ప్రాకారముఖమంటపములు సమర్పించెను ఆయన మరంది బాణా వీరయ పదకము సమర్పణ శ్రీచినబొమ్మనాయడు వీరేశ్వరునికి సాగించిన భోగరాగాలు అమృతపళ్లు మొదలైన ధర్మములున్న స్థానమాన్యాలున్ను యెవ్వరు సాగింతురు వారి పాదాలు మాతలమీందనుండును అని చినబొమ్మయకుటుంబసమేతుడై సేవచేస్తున్నాడు"

పై శాసనమున గనవచ్చు కొండవీటిపాలకుడగు రాయసం అయ్యపరుసయ్య రాయసము కొండమరుసు (కొండమరాజు) కు జ్ఞాతియో లేక సోదరుడో లేక సుతుడో అయియుండునని తెలియుచున్నది రాయసము కొండమరుసు మహావీరుడు విజయనగర సామ్రాజ్యాధిపతియైన శ్రీకృష్ణదేవరాయల కడ అతడు మహాసేనాధిపతిగ నుండెను శ్రీకృష్ణదేవరాయల పూర్వదిగ్విజయ యాత్రలో కొండమరుసు మిక్కిలి ప్రధానపాత్ర వహించెను లక్ష సైన్యమునకు అతడు అధికారియై బీజాపురసుల్తాను అదిల్‌షాహాపై దండెత్తి తురుష్కవీరుల మట్టుపెట్టి విజయమును సాధించెను శ్రీకృష్ణదేవరాయల ప్రధానామాత్యుడైన సాళువతిమ్మరుసయ్యగారికి రాయసము కొండమరుసయ్యయు తిమ్మరుసయ్య తమ్ముడగు గోవిందరాజు అను వారిరువురును రెండు చేతులవంటివారు రాయల ఆజ్ఞచే తిమ్మరుసు క్రీ శ 1515లో కొండవీటిని ముట్టడించి సమరమున ప్రతాపరుద్ర గజపతి నోడించి ఆ దుర్గమును స్వాధీనము చేసికొనెను కొండవీటి రాజ్యమునకు తిమ్మరుసు మంత్రితమేల్లుడగు నాదిండ్ల అప్పామాత్యుని పాలకునిగ జేసి తాను యుద్ధమున రాయలకు సాయమొనరింప నేగెను ఆ పిదప క్రమముగా కొండవీటి పాలనము క్రీ శ 1531 నాటికి రాయసము అయ్యపరుసయ్యవారి వశమైనది రాయలవారు తనకు సమరరంగమున కుడిభుజముగ తోడ్పడిన రాయసము కొండమరుసయ్యగారి సంతుష్టికై ఆయనబంధువగు అయ్యపరుసయ్యగారిని కొండవీటి పాలకునిగ నియమించినట్లు ఊహించుట కవకాశమున్నది లేక అయ్యపరుసయ్య కూడ రాయలవారి సైన్యమునకు దండనాధుడై ఆయన కెంతయో సేవచేసియుండెను గాన తత్ఫలితముగా ఆయనకు ఇట్టి పాలకపదవి లభించెననియు భావింప వీలగుచున్నది రాయసమువారు బ్రాహ్మణకులజులు మంత్రిత్వము నెరపుటలోను ఖడ్గము-

ధరించి కదనర గమున దూకుటలోను రాజ్యమును పాలించుట లోను కడు సమర్థులు అయినట్లు మనకు చరిత్రవలన తెలియు చున్నది

శ్రీకృష్ణదేవరాయల రాజ్యకాలమున క బదూరు గ్రామములోని మల్లికార్జున దేవరకు (మల్లేశ్వరస్వామికి) రాయసము అయ్యపరుసయ్య రాయ ము కొండమరుసయ్య వారి పుణ్యముకై జలువెటి అను గ్రామమును దాన మొస గి చినట్లు దక్షిణహిందూశాసనములలో గలదు (ద హిం IX నెం 518) ఈ శాసనకాలము శక 1447 (క్రీ శ 15 5, పార్థివ సవత్సరము ఈ శాసనమును బట్టి కొ డమరుసయ్య శ్రీకృష్ణదేవరాయలు విజయనగరసామ్రాజ్యము పాలించు నపుడే అనగా క్రీ శ 1525 కు పూర్వమే మరణించినట్లును ఆయ పుణ్యమునకుగాను ఆయనపుత్రుడో లేక జ్ఞాతియో లేక సోదరుడో అయిన అయ్యపరు య్య "జలువెటి అను గ్రామ మును కంబదూరులోని మల్లికార్జునస్వామికి మల్లేశ్వరస్వామికి) దానము చే నట్లును మనకు విశదమగుచున్నది కాని కొండ మరు య్య రాయల మరణానంతరము కూడ విజయనగర ర ఘువగు అచ్యుతదేవరాయల చెంత ప్రధానమంత్రిత్వము నెరపినట్లు అనగా శక 1463 (క్రీ శ 1541) ప్లవసంవత్సరము వరకు సజీవుడై యుండినట్లు తిరుపతిదేవస్థాన శాసనముల రిపోర్టు 198వ పుటలో కనవచ్చుచున్నది కంబదూరుగ్రామము నేటి అనంతపురము జిల్లా కల్యాణదుర్గము తాలూకాలో నున్నది కల్యాణదుర్గమునకు ఇది 18 మైళ్ళ దూ ర ము న నున్నది ఈ గ్రామమున దు మల్లేశ్వర దేవాలయము కలదు దేవాలయ ము ఖమ టపము లోని లోపలి కప్పుపై రాతిమీద మిక్కిలి సు దరమైన కమలము చెక్కబడి యున్నది అ దు చేత నే ఈ గ్రామమును పూర్వము కమలాదూరు అని పిలిచెడి వారట అదియే క్రమముగా కంబదూరుగా రూపొ దినదని అనంతపూరు ఫెయిర్సు అండ్ ఫెస్టివల్స్ అను గ్ర థమున 82వ పుటలో గలదు

అయ్యపరుసయ్యవారి సేవకుడు చి బొమ్మానాయడు ఇతడు వీరేశ్వరునికి ప్రాకారము ముఖమంటపములను నిర్మించెను ఈయన మరది యగు బాణాలవీరయ వీరభద్రేశ్వరునకు పదకమును మర్పించెను – పదకం –క రభూషణం –అని అనగా హారము మధ్య నుండెడు రత్నములు పొదిగిన బిళ్ళకు పదకమని పేరు వీరేశ్వరు డనగా వీరభద్రస్వామియనిభావము

ఎనమదల గ్రామములోని వీరభద్రునకు చినబొమ్మన ప్రాకార ముఖమంటపములను ఆయన బావమరది వీరయ పదకమును సమర్పి చెను శాసనమున కనవచ్చు అమృతపళ్ళు అనుశబ్దము నకు నైవేద్యము అని అర్థము ఎనమదల గ్రామము గుంటూరు మండలములోనిది పూర్వపుకొండవీటి రాజ్యమున గుంటూరు నెల్లూరుమండలములు కలవు శాసనమునందలి సంస్కృతశ్లోకము వలనను సీసపద్యము వలనను కొన్ని విశేష ములు తెలియవచ్చుచున్నవి చినబొమ్మన శ్రీమన్మల్లయ చిన్నబొమ్మనృపతిః శ్రీవీరభద్రేశితుః అని శ్లోకమున వర్ణి బడెను దీ వలన చినబొమ్మానాయడు ఎనమదలగ్రామము నకు రక్షణాధికారి అగయు మల్లయ కుమారుడనియు వీర భద్రునకు భక్తుడగయు తెలియుచున్నది ఈతడు శక 1458 న దన సంవత్సర భాద్రపద శుద్ధ దశమి సోమవారమునాడు మిక్కిలి ప్రేమతో "తన నాథుడయ్యప దండనాయక నకు పుణ్య బుగా ని బుధులు పొగడు" ట్లుగా మల్లనరనాథు చి బొమ్మ మనుజవిభుడు!" ఎనమదలవీరన్న కిరవుగాప్రాకార ము ను భోగ రాగంబులనువుగ"ఇచ్చి" నాడు దీనిని బట్టి అయ్య పరుసయ్య దండనాయకుడై నట్లు స్పష్టమగుచున్నది ద డ నాథుడై అయ్యపరుసయ్య శ్రీకృష్ణ దేవరాయని సే వి ం చి ఆయన అనుగ్రహముచే కొండవీటి రాజ్యమునకు పాలకుడై వెలుగొందెను

తం ఆం శా

## అయ్యపిన చోడి

ఈతడు కాకతి గణపతిదేవుని గజాధ్యక్షుడైన జాయప సేనాని త డ్రి గణపతిదేవు డాపినచోడినాయకుని కుమార్తె లైన నాగమ్మ పేరమ్మలను వివాహమాడి అయ్య వంశము తో సఖ్యసంబంధము ను దృఢతరము చేసుకొనెను గణపతిదేవచక్ర వర్తికి అయ్యవంశముతో మొదట కయ్యము ను తరువాత వియ్యమును ఎట్లున భవించెనో పరిశీలింతము అయ్యవంశము వారు వెలనాటి చోళులకు మిత్రులును సామంతులును అయి కృష్ణాముఖద్వారమందలి దివిని అనగా దివి తాలూకా ప్రాంత మును పాలి చుచు డిరి క్రొయ్యూరు వీరిముఖ్య పట్టణము అయ్య వంశమున భీమ నా య కు డు పుట్టెను జల్లయ్య నారయ సూరయ అను నితని పుత్రులు వెలనాటి రాజుల కాశ్రితులై విశేషఖ్యాతిని పొందిరి వీరిలో నారయ కుమా రుడు పినచోడినాయకుడు పినచోడినాయకుని వ తీ మ ణి

దామమ్మ వీరికి జాయప పృథ్వి నారప అను కుమారులును నారమ్మ పేరమ్మలను కుమార్తెలును కలిగిరి ఈ సోదరీద్వయము నే కాకతి గణపతిదేవుడు పరిణయమాడెను

గణపతిదేవుడు తన రాజ్యారంభమునందే వెలనాటి విజయము చేయ నిశ్చయించెను ఇప్పటి వెలనాటి చోడుల ప్రాభవము చాలతీణించెను తూర్పుతీరమున పెక్కుమాండలిక రాజ్యములేర్పడి దేశమున దు కే ప్రాధికారము లోపించెను ధరణికోటయందు కోటవారును గుడిమెట్టలో చాగివారును పారసపురము అనబడు కోలనువీడులో కోలనినాయకులును దివియ దు అయ్యవంశీయులును ప్రబలురుగ ఉండిరి రెండవ ప్రోలరాజు రుద్రదేవుల కాలముననే వెలనాటి విజయమునకు ప్రయత్నములు కొంతసాగి యుండెను గణపతిదేవుని కాలమున ఆ యుద్యమము ఫలసిద్ధిని కాంచెను మూడవ గొంక రాజు తరువాత వెలనాటి రాజ్యము కృష్ణకు దక్షిణమున అదృశ్యమయ్యెను వెలనాటి పృథ్వీశ్వరరాజు గోదావరి కుత్తరమున నెలకొనెను కొందరు సామంతులింకను వెలనాటివారియ దు భక్తివిశ్వాసములతోనే ఉండిరి అట్టివారిలో క్రొయ్యూరు పాలకులైన అయ్యవంశీయులు పేర్కొన దగినవారు

క్రీ శ 1201 ప్రాంతముననే గణపతిదేవుడు బహుళ సైన్యపరివృతుడై వెలనాటివిజయమునకు వెడలెను అతని వెంట పలువురు కాకతీయ వీర సామంతులు నడిచిరి నతవాటి వారు మల్యాలవారు కోటవారు వీరిలోముఖ్యులు ఈసైన్యములు మొదట విజయవాడను జయించెను బెజవాడ మల్లేశ్వరాలయమందు నతవాటి వక్కడిమల్లరుద్రుని శాసన మొకటి కాన్పించుచున్నది తరువాత గణపతిదేవుని వాహినులు దివి పరిపాలకులైన అయ్యవంశీయులపై పడెను పినచోడి నాయకుడిప్పటి క్రొయ్యూరు పాలకుడు అతడును వీరులైన అతని కుమారులును కాకతీయులతో తీవ్రముగ యుద్ధము చేసిరి కాని కాకతీయుల బలమధికమగుటచే పినచోడినాయకుని విక్రమము లాభించలేదు కాకతీయ సైన్యములు క్రొయ్యూరును పట్టుకొని దివి ప్రాంతమును కొల్లగొట్టెను దివిసీమను జయించుటలో మల్యాల చౌండసేనాని గొప్ప శౌర్యమును ప్రదర్శించెను గణపతిదేవుడాతని పరాక్రమమునకు మెచ్చి ద్వీపిలుంటాక అను బిరుదొసగెనని తెలియుచున్నది

కాకతి గణపతిదేవుడు అయ్యవంశీయులను జయించినను రాజ్యతంత్రజ్ఞుడగుటచే వారిని తనకు అనురక్తులుగ చేసుకొనుట మంచిదని గ్రహించి వారి రాజ్యమును వారికే ఇచ్చివేసెను ఇంతేకాక దివిపాలకులతో బాంధవ్యమును కల్పుకొనుటకై పినచోడినాయకుని కూతుళ్ళను పెండ్లియాడెను వారి సోదరుడైన జాయపనాయకుని తన గజసైన్యమునకు అధ్యక్షుడుగ చేసుకొని గౌరవించెను ఈజాయపసేనానియే నృత్తరత్నావళి యను ప్రసిద్ధ నాట్యశాస్త్రగ్రంథమును రచించెను జాయపుడు తనతండ్రి గౌరవార్థమై చేబ్రోలు పట్టణమునందు శా శ 1152 అనగా క్రీ శ 1230 సంవత్సరమున చోడేశ్వరలింగమును ప్రతిష్ఠించి ఆలయమును కట్టించెను దాని పోషణమునకై మోదుకూరు గ్రామమును దానము చేసెను దివి విజయము క్రీ శ 1211 సంవత్సరమునకు ముందే జరిగి యుండవచ్చును

బి ఎరం

## అయ్యప్ప కవి

నల్లిగాల్వ వరకవి అయ్యప్పకవి ప్రసంగము మెకంజీ వ్రాత సంపుటములలో లభించుచున్నది మెకంజీ సంగ్రాహకులు వెంకటగిరి సీమలో చేరిన భీమవరం అగ్రహారీకులైన నల్లిగాల్వవరకవి వెంకటరామన్న గారిని సందర్శించి వారి కుటుంబ చరిత్రను అడుగగా ఈక్రింది వృత్తాంతము వారికి తెలుపబడెను

"మా గ్రామమునకు వుండు దాన పత్రం బహాదరు అవాంతరంలో పోయింది పూర్వం మా కూటస్థుడైన నల్లిగాల్వలవరకవి అప్పయ్యకవి ఒంటిమిట్ట రఘునాథస్వామి వారి దగ్గర వరం న పాదించుకొని గొబ్బూరి జగ్గరాజు ఓబరాజు గారి మీద కృతులుచెప్పి పాలకి మొదలైన బహుమతులు తీసుకొని వెంకట్రాయలవారి కచేరిలో విద్యప్రకటించేసి దుష్ట కవుల గర్వభంగ మొనరించి సంగీత సాహిత్యముల చేత మెప్పించి యీ అగ్రహారం దానపత్రం కూడా వారిచేత సంపాదించి అనుభవిస్తువచెను వారి కుమారుడు శత్రుసంహార శతకం చెప్పి శేషాచలస్వామి చేత వరం తీసుకొన్న పీతాంబి అయన కుమారుడు గోలకొండరాజును మెప్పించి గోలకొండలో జయస్తంభం వేసిన కొండప్ప ఆయన కుమారుడు చందశ్శాస్త్రం చేసిన వెంకటరామప్ప ఆయన కుమారుడు కువలయానందమును తెనిగించిన లింగప్ప ఆయన కుమా

రుడు పార్వతీపరిణయ చెప్పిన సీతారామప్ప ఆయన కుమారుడు వెంకట్రామన్న దరు వ్రాసిన పురుషుల పారంపర్యంగాను అగ్రహారాన్ని అనుభవిస్తున్నాము

పై కథనమును బట్టి నల్లగాల్వ వరకవి అను పండిత కవిని వంశము తెలియవచ్చుచున్నది వీరు సంపాదించిన భీమవరము అగ్రహారము నెల్లూరు జిల్లా వెంకటగిరి తాలూకా సోమశిల్పపూడి ఫర్కాలో కలదు ఈగ్రామము ప్రస్తుత జనాభా 674 కవుల వంశవృక్షమును క్రింది విధముగా నిర్మించవచ్చును

నలగాల్వల వరకవి

అప్పయ్యకవి — కూటస్థుడు రెండవ వెంకటపతి రాయలు కాలము 1585 1614
|
సీతాపతి — శత్రుసంహార శతక నిర్మాత
|
కొండప్ప — గోలకొండలో జయస్తంభము వేయించెను
|
వెంకటరామప్ప — ఛందశ్శాస్త్ర రచయిత
|
లింగప్ప — కువలయానందము తెనిగించెను
|
సీతారామప్ప — పార్వతీపరిణయ రచయిత
|
వెంకటరామన్న — మెకంజీ సంగ్రాహకులకు వంశకథనము చెప్పిన పురుషుడు
|

విజయనగర సామ్రాజ్య ప్రసిద్ధిని పొందిన ఈవిద్వత్కవి వంశము సాహిత్యచరిత్రల కెక్కినట్లు కాన్పించదు వారి రచనలు నష్టప్రాయము లగుట విచారకరము ఏమైనను కృష్ణదేవరాయల యుగము నందే కాక అనంతర విజయనగర చక్రవర్తుల కాలమున కూడ విద్వాంసులు కవులు పోషింపబడిరనుటకు నల్లగాల్వ కవుల వృత్తాంతమే తార్కాణము

ఈ వంశనామ మందలి వరకవి అనునది బిరుదు కావచ్చును నల్లగాల్వల అనునది ఇంటి పేరుగా తోచును ఈ కుటుంబమువారు నల్లకాలువ తీరమునుండి వలస వచ్చినవారగుటచే నల్లగాలువ వీరికి ఉపపదమైనది నదులపేర్లు ఇంటి పేర్లుగా ఉండుట తెలుగువారిలో కలదు గోదావరి పెన్నా చెయ్యేరు వంటి ఇంటిపేర్లు మనలో వినవచ్చుచుండును పండిత జవహరులాల్ నెహ్రూగారి కుటుంబమునకు నెహ్రూ అను ఉపపదము ఒక కాలువ ఒడ్డున వీరు నివసించుటచే కలిగినదని చెప్పుదురు నెహరు అనగా చిన్న యేరు లేక కాలువ అట్లే నల్లగాల్వల వంశము వారికిని ఆ ఇంటి పేరు నల్లకాలువ ఒడ్డున నివసించి వచ్చుటచే ఏర్పడియుండును ఈ నల్లకాలువ ఏదియో నిర్ణయించుటకు మనకు ఆధారములు లేవు

సదరు వంశమువారి చరిత్రను అన్వేషించుటకు ముందు వీరి సన్మానము చేసిన ప్రముఖుల వృత్తాంతము పరిశీలింపదగును నల్లగాల్వల వారి కూటస్థుడైన అప్పయకవిగారు వెంకట్రాయుల వారి కచేరిలో విద్యా ప్రకటన చేసి అగ్రహారము దానపత్రము వారిచేత సంపాదించెనట ఈ వెంకట్రాయలు పెనుగొండ చంద్రగిరి ముఖ్య పట్టణములుగా విజయనగర సామ్రాజ్యమును శాసించిన రెండవ వెంకటపతిరాయ మహారాజు అని గుర్తించుట సులభము క్రీ శ 1585 1614 సంవత్సరముల నడుమ విజయనగర చక్రవర్తియైన ఈయన రాజ్యకాలమున రాయసామ్రాజ్యము మరియొకమారు మహావైభవముతో వెలిగి శ్రీకృష్ణదేవరాయలనాటి స్వర్ణయుగమును జ్ఞప్తి తెచ్చును తాళికోట యుద్ధము యొక్క దురాఘాతము నుండి కోల్కొని రాయసామ్రాజ్యము శత్రుభీకరమై గోల్కొండవారిని కృష్ణకు ఉత్తరమున తరిమివేసినది సామ్రాజ్యమునకు నవజీవనము వచ్చినట్లే భాసించెను వెంకటపతిరాయలు కవులకు విద్వాంసులకు కళాకారులకు అసంఖ్యాకముగా అగ్రహారములు మాన్యములు బహూకరించెను దురదృష్టవశమున ఈమహారాజునకు ఔరస సంతానము లేకపోయెను గొబ్బూరి జగ్గరాజు (ఓబరాజు కుమారుడు కావచ్చును) సోదరి బాయమ్మ రెండవ వెంకటపతిరాయల పట్టపురాణి ఈమెకు సంతానము కల్గినచో సామ్రాజ్యము మేనల్లుని ద్వారా గొబ్బూరి జగ్గరాజు అధీనములోనికి వచ్చి అతనిని విజయనగర స్థాపనాచార్యునిగా చేయుచుండును జగ్గరాజు అతని సోదరిమున్నగువారు కుట్రచేసి పెద్దరాణికి కుమారుడు పుట్టిన తతంగమును నడిపించిరి వెంకటపతిరాయలకు నిజము తెలిసియు తనరాణిని చిన్నబుచ్చుట కిష్టములేక మూకత్వము వహించెను కాని మరణశయ్యపైనున్న వెంకటపతిరాయలు గొబ్బూరి జగ్గరాజు మేనల్లుని అనంతర వారసుడుగా పేర్కొనక తన యన్న కుమారుడు శ్రీరంగచిక్కరాయలను తన వారసుడుగా నియమించెను

గొబ్బూరి జగ్గరాజు మున్నగువారు తమ ప్రయత్న

ములు ఫలమగుటకు వగచి శ్రీరంగ చిక్కరాయల కుటుంబమును ఒక్కనిసగు వేగా పాతమార్చిరి వెలుగోటి యాచమనాయడు స్వామిభక్తిపరాయణుడై రాయవంశాంకురమగు ఆ యొక్క పిల్లవానిని కాపాడి వానిని సిహాసమునెక్కి పట్టాభిషిక్తుని చేసెను ఈ పిల్లవానిపేరు రామదేవరాయలు తంజావూరు రఘునాధరాయలు యాచమనాయనికి దన్నుగా నుండెను ఆయెన మధురనాయకులు స్వామిద్రోహులై జగ్గరాజు పక్షము వహించిరి క్రీ శ 1619 ప్రాంతమున తోపూరు సమీపమున ఇరు పక్షములవారికిని ఘోర యుద్ధము జరిగి జగ్గరాజు పక్షము పరాజయము నొందెను రామదేవరాయలు 16 9 లో పట్టాభిషిక్తుడయ్యెను

వెంకటపతిరాయలచే తన గొబ్బూరు జగ్గరాజుచేతను సన్మానములు పొందిన నల్లిగాల్వ అయ్యప కవి 1565 - 1620 నడుమ వర్ధిల్లెనని చెప్పవచ్చును ఈకవీశ్వరుడు వెంకటపతిరాయలను మెప్పించి శ్రీమవర అగ్రహారమును సంపాదించెను ఈతడు రచించిన కృతులేవియో చెప్పబడలేదు ఈవంశము వారు మొదట కడప మండలమున నుండిరి కావచ్చును అయ్యప్పకవి ఒంటిమిట్ట రఘువీరుని వద్ద వరమును పొందెనట ఈతని కుమారుడు సీతాపతి తిరుపతి వెంకటేశ్వరునిచే వరము పొందెనని చెప్పబడుటచే తిరుపతి ప్రాంతమునకు వచ్చియుండును సీతాపతి విశ్వామిత్రసంహారశతకము చెప్పెను ఇదియు తెలియవచ్చుటలేదు తురుష్కులు హిందూదేవాలయములపై దాడి వెడలి ఖండితులై వారు దేవుని బోధించుచు శతకములు చెప్పుట ఈ యుగమున ఆచారము "వైరి వరర హ సహాద్రి నార హ అనుమకుటముతో వెడలిన సహాద్రినారసింహశతక మీకోవకు చెందును నల్లిగాల్వ సీతాపతికవి శత్రుసంహారశతకము ఇట్టిదగునేమో తెలియదు

సీతాపతి కుమారుడు కొండప్ప గోల్కొండ రాజును మెప్పించి గోల్కొండలో జయస్తంభము వేయించెను సీతాపతి తాతయైన అయ్యప్పకవి క్రీ శ 1600 ప్రాంతము వాడగుటచే ఆయన మనుమడగు కొండయార్యుడు క్రీ శ 1650 - 1660 ప్రాంతమువాడు అగును ఇది గోల్కొండ సుల్తాను అబ్దులా కుతుబుషా (క్రీ శ 1628 - 70) కాలమని చెప్పవచ్చును అబ్దుల్లా కుతుబుషా విద్యాప్రియుడై యుండెనని వినవచ్చుచున్నది తెలుగులో పదకవితాపితామహుడని చెప్పదగిన క్షేత్రయ్యగారు ఈ పాదుషా ఆస్థానమున పందర్శించి అతనిపై కొన్ని పదములుచెప్పి సన్మానము పొందెనని చెప్పుచున్నారు నల్లిగాల్వ కొండయ్యకవి సాహిత్యవిజయములు సాధించి జయస్తంభమెత్తించుట విశేషము ఇట్టి ఈ వంశములోని తరువాతివారు చంద్రికాశాస్త్రమును కువలయానందమును (అలంకార శాస్త్రగ్రంధము) పార్వతీ పరిణయ కావ్యమును వ్రాసి గణనకెక్కిరి ఇంతటి విద్వత్కుటుంబము యొక్క రచనలేవియు ఇంతవరకును వెలికి రాకుండుట సాహిత్యమునకు లోపము అయ్యప కవినుండి వెంకట్రామన్న వరకును 6 తరములు గడచినవి ఈ వ్యవధిని మనము 200 సంవత్సరములని భావించినచో మెకంజీ సంగ్రాహకులకు స్వకుటుంబ వృత్తాంతమును వినిపించిన నల్లిగాల్వ వెంకట్రామన్నగారు క్రీ శ 1800 సంవత్సరప్రాంతమున జీవించియుండుట ఉపపన్నమగుచున్నది

ఇచ్చట ఒక చిన్న విషయము పరిశీలింపవలసి యున్నది నల్లిగాల్వవారి దానపత్రము బహదరు అవాంతరములో పోయినట్లు వెంకట్రామన్న చెప్పెను బహదరు అవాంతరమనగా ఏమి? అని ఆలోచింపవలసి యున్నది బహద్దరు అనునది ముసల్మాను నవాబులు ధరించు గౌరవపదము 18 వ శతాబ్దమునందు తెలుగుదేశములో ఎన్నియో అవాంతరములు (రాజ్యకల్లోలములు) జరిగినవి మొట్టమొదటిది గోల్కొండ కుతుబుషాహీ వంశమును అంతమొందించి మొగలు సరదారులు ఆంధ్రప్రాంతమును నిరంకుశముగ పాలించుట ఆ కాలములో గ్రామములు పెక్కు కడగండ్లకు పాలయిరి ధర్మసా అను యవన సరదారుడు హిందూప్రజలను నిర్దాక్షిణ్యముగ శిక్షించి దుష్కీర్తిని గడించెను బహదరు అవాంతరము ఇదియైన కావచ్చును లేదా హైదరాబాదు నిజాముల వంశస్థాపకుడైన మొదటి అసఫుజా 1748 సంవత్సరమున మరణము నొందెను అతని కుమారుడు నాజరు జంగును మనుమడగు ముజఫర్ జంగును హైదరాబాదు సింహాసనము కొరకై కలహించిరి దేశమునందు అలజడి కలిగెను కడప కర్నూలు నవాబులు కుట్రపన్ని వీరిని ఒకరి తరువాత ఒకరిని హతమార్చిరి ఫ్రెంచి తూర్పు ఇండియా కంపెనీవారు డూప్లే నాయకత్వమున హైదరాబాదు రాజ్యక్రాంతిలో చేయిచేసుకొని అలజడికి కారకులైరి విదేశీకంపెనీ వారిని ప్రజలు బహద్దరు అని వ్యవహరించుచుండిరి కావున నల్లిగాల్వవారి అగ్రహార దానపత్రము ఈ కల్లోలములలో ఎప్పుడో నష్టమై యుండును

కొ వెం
ఖం ల రం

అయ్యారాజులు చూ బయ్యారాజులు

## అయ్యలమంత్రి

రావెల అగ్రహారాధిపతియగు అల్లాడమంత్రి కుమారుడు అయ్యలమంత్రి ఈయన తల్లిపేరు చిట్టాంబిక ఈమె గుంటూరుకొమ్మవిభుని పుత్రిక కొమ్మవిభుడు ఆంధ్రమహాభారతకర్తయైన తిక్కనసోమయాజి పుత్రుడైనట్లు తెలియుచున్నది ఈయన నియోగిశాఖకు చెందిన బ్రాహ్మణుడు వీరిది భారద్వాజస గోత్రము మడికి గ్రామ నివాసులగుటచే వీరికి గృహనామము మడికివారని ఏర్పడినట్లు తోచుచున్నది ఈయన భార్య సింగాంబిక ఈమె ఆత్రేయగోత్రపవిత్రుడైన పేరయమంత్రి కుమార్తె అయ్యల సింగాంబికలకు సింగన అనంతుడు వారయ అను తనయులును ఓబయాంబిక అను పుత్రికయును జన్మించిరి అయ్యలమంత్రి సుతులలో పెద్దవాడగు సింగన గొప్పకవిగా ఖ్యాతి వహించెను సింగనకవి పద్మపురాణోత్తరఖండము భాగవత దశమస్కంధము జ్ఞానవాసిష్ట రామాయణము సకలనీతిసమ్మతము అనుగ్రంథములను ఆంధ్రమున పద్యరూపమున రచించెను జ్ఞానవాసిష్టమున తన తండ్రినిగూర్చి తెలుపుచు మడికి సింగనకవి పీఠికలో ఒక్క పద్యమును వ్రాసెను

ఆత్రేయగోత్రపవిత్ర పేరయమంత్రి
　　పుత్రి సింగాంబికఁ బుణ్యసాధ్వి
వెలయ వివాహమై వేఁగిదేశంబులో
　　నేపారు రాజమహేంద్రపురికి
నధిపతి తొయ్యేటి యనపోతభూపాలు
　　మంత్రియై ప్రాజ్యసంపదలఁ బొదలి
యొప్పార గౌతమ యుత్తరతటమున
　　మహనీయమగు పెద్దమడికి యందు
స్థిరతరారామతతులు సుక్షేత్రములును
బెక్కు లార్జించి సితకీర్తిఁ బెంపు మిగిలి
యఖిలజగ దన్నదాతనా నవనిఁ బరఁగె
మధురగుణధుర్యుఁ డయ్యలమంత్రి వరుడు॥

ఈ పైపద్యమువలన అయ్యలమంత్రి వేంగిదేశము నందలి రాజమహేంద్రపురాధీశుడైన తొయ్యేటి అనపోతభూపాలుని చెంత మంత్రియై వెలుగొందినట్లును గొప్పసంపదలు కలిగి యుండినట్లును గోదావరికి ఉత్తరమునయున్న పెద్దమడికి అను గ్రామమునందు గొప్ప తోటలు మంచి పొలములు సంపాదించినట్లును నిరంతరము సర్వులకు అన్నదానము చేయుచు అన్నదాత యని పేరు పొందినట్లును మనకు తెల్లమగుచున్నది అయ్యలమంత్రి మంత్రిత్వము నెరపిన అనపోతభూపాలు డెవడో తెలిసికొనవలసిన యావశ్యకమున్నది దీనికి ముందు అప్పటి చారిత్రక పరిస్థితులు కూడ గ్రహించుట అవసరము

కాకతీయ సామ్రాజ్యము క్రీ శ 1323 తో అంతరించి యవనహస్తగతమైనది కాకతీయ రాజ్యమును కూలద్రోసిన పిమ్మట మహమ్మదీయులు విపరీతమైన పరమతద్వేషముతో హైందవమతమును హైందవప్రజలను నిర్దాక్షిణ్యముగా అణచివేయ నారంభించిరి స్త్రీల సౌశీల్యమునకును ప్రజల గృహధన క్షేత్రాదులకును రక్షణములేదు అది హిందువులకు మహావిపత్కర పరిస్థితి ఆనాటి ప్రజలస్థితి గంగాదేవి రచించిన మధురావిజయమను సంస్కృత కావ్యమువలనను ఇబిన్ బతూతాఅను మహమ్మదీయ యాత్రికుని వ్రాతమూలమును అనితల్లి కలువచేరు శాసనము వలనను ఇతర సమకాలికుల రచనల వలనను తెలియనగును ఇట్టి ప్రజల కష్టములను సముద్ధరింప నేగుదెంచిన అవతారమూర్తియో అనునట్లు ముసునూరి వంశమునకు చెందిన ప్రోలయనాయకుడు అరుదెంచెను ప్రోలయనాయకుడు ప్రతాపరుద్రుని సేనలలో నొకడు ఇతడు మహాపరాక్రమవంతుడు ఇతడు వేంగివిషయ నివాసియైన పోచినాయకుని కుమారుడు ఇతడు తనకు తోడుగ కొందరు రెడ్డివీరులను పినతండ్రులగు దేవ కామ రాజనాయకులను పినతండ్రికొడుకులను కాపయ మున్నగు వారిని తమ్ముడగు ఎరపోతానాయకుని సాయముగగొని తురుష్కులను పారద్రోలి కృష్ణా గోదావరీ మండలములకు తాను అధిపతియయ్యెను

ఇతడు యవనాపహృతములైన అగ్రహారములను తిరిగి బ్రాహ్మణులకు అర్పించెను ఆపత్కాలమున నష్టమైన హిందూధర్మమును తిరిగి ఇతడు ఉద్ధరించెను ప్రజలను కంటికిరెప్పవలె కాపాడెను ఈవిషయము విలసతామ్రశాసనమున సమగ్రముగ వర్ణింపబడినది ఈతడు క్రీ శ 1320 నుండి 1333 వరకు రాజ్యము నేలెను ఈతనికి పిమ్మట ఈతని పినతండ్రి యగు దేవనాయకుని కుమారుడగు కాపయనాయకుడు రాజయ్యెను ఇతడు అన్నయగు ప్రోలయనాయకునియొద్ద రాజ్య సమర

తంత్రముల పాండిత్యమును సంపాదించెను ఇతడు అపారబలమును సంపాదించుకొని రెడ్డివీరులు పద్మనాయకులు తనకు అండగా నిలువ యవనులను పారద్రోలి పూర్వపు కాకతీయ సామ్రాజ్యము నంతయు తన అధీనములోనికి దెచ్చుకొని పాలింపదొడగెను ఈతడు క్రీ శ 1333 నుండి 1363 వరకు ఓరుగల్లురాజ్యము నేలినట్లు తెలియుచున్నది ఇతడు గోదావరికి ఉత్తరముననున్న గోదావరి మండల ప్రదేశమును పాలించుటకు తనకు ప్రతినిధిగ తన పినతండ్రి రాజనాయకుని కుమారుడైన అనపోతానాయకుని నియమించెను అనాటికి ఈప్రదేశమునకు తొయ్యేరు రాజధానిగ నుండెను తొయ్యేరు నేటి చోడవరము డివిజనులో నున్నది కొంతకాలము తరవాత తొయ్యేరునుండి రాజధాని రాజమహేంద్రవరమునకు మార్చబడెను అనపోతభూపాలుడు తొయ్యేరురాజధానిగ మొదట పాలించుటచే తొయ్యేటి అనపోతభూపాలుడు అను నామముచే వ్యవహరింపబడుచుండెను అయనయే రాజమహేంద్రవర పురాధిపతియైనను ఆయనకు తొలుత ప్రక్రమించిన తొయ్యేటి అనపోతభూపాలుడు అనుపేరు మాత్రము స్థిరముగ నిలిచిపోయెను ఈ అనపోతభూపాలుడు నొద్దనే అయ్యలమంత్రి సచివోత్తముడై యుండి రాజకార్యములను మిక్కిలి ప్రజ్ఞతో నెరవేరెను ముసునూరి కాపయనాయకుడు క్రీ శ 1333 నుండి 1363 వరకు ఓరుగంటి రాజ్యమును పాలించెను ఆయనచే ప్రతినిధిగ నియమితుడైన అనపోత భూపాలుడును అనపోతభూపాలుని మంత్రియైన అయ్యల మంత్రియును ఆకాలము నాటి వారని మనకు స్పష్టమగుచున్నది

పద్యమున గనవచ్చు పెద్దమడికి యను గ్రామము రాజమహేంద్రవరమునకు ఆగ్నేయదిశన గోదావరికి ఉత్తరమున నదిమైళ్ళ దూరమున నున్నది ఆగ్రామమును నేడు మడికి యని మాత్రమే పిలుచుచున్నారు కాకతీయరాజ్యమును పాలించిన కాపయనాయకుడు గుంటూరుమండలవాసి యని తెలియుచున్నది అయ్యలమంత్రి తండ్రియగు అల్లాడమంత్రి రావెలగ్రామ నివాసి యని జ్ఞానవాసిష్ఠము నందలి "భూసారమగు కోటభూమిం గృష్ణానది దక్షిణ తటమున ధన్యలీల నలరారు రావెల యను నగ్రహారము తనకేకభోగ్యంబుగా నేలుచుండి" అను సీసపద్య పాదములవలన తెలియుచున్నది రావెల గ్రామము గుంటూరు జిల్లా గుంటూరుతాలూకాలో నున్నది అల్లాడమంత్రి కుమారుడగు అయ్యలమంత్రియు కాపయనాయకులును అనపోత భూపాలుడును గుంటూరు మండల వాస్తవ్యులగుటచేతను అయ్యలమంత్రిసామర్థ్యము బాగుగా నెరింగినవాడగుటచేతను అనపోతభూవిభుడు తనకు మంత్రిగా అయ్యలమంత్రిని ఏర్పరచుకొనెను అనపోతభూపతి చెంత అయ్యలమంత్రి సుమారు ఇరువది సంవత్సరములు మంత్రియై మనినట్లు తెలియుచున్నది ఈతడు మొదట రావెల గ్రామములో జన్మించినను తుదకితని నివాసము గోదావరి మండలమునందలి పెద్దమడికి గ్రామము అగుటచే వీరి గృహనామము క్రమముగా మడికి అని స్థిరపడినట్లు ఊహింప వీలగుచున్నది ఈతని పుత్రరత్నము మడికిసింగనకవియని ప్రసిద్ధివహించుటయే దానికి కారణము

అయ్యలమంత్రి తండ్రియగు అల్లాడమంత్రి రావెల గ్రామమున ఒక కోవెల కట్టించి అందు గోపికానాధుని ప్రతిష్ఠించినట్లు "అందుం గోవెలం గట్టి గోవిందు నెన్నం గోపికానాధుని బ్రతిష్ఠం గోరి చేసె" అను జ్ఞానవాసిష్ఠము నందలి పీఠికలోని సింగన వ్రాత వలన తెలియవచ్చుచున్నది ఇట్లు మడికి వారు దాతలై ధర్మపరులై పండితకవులై సచివోత్తములై వెలుగొందిరి

అయ్యలమంత్రి రాజ్యకార్యములయందు మిక్కిలి నైపుణ్యము చూపి అనేక ఆరామక్షేత్రములను సంపాదించి నిరతాన్నదాతయై మధురగుణములతో నొప్పారిన మహానీయుడు

తం ఆం శా

## అయ్యలరాజు రామభద్రుడు

అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయమను మహాప్రబంధమును రచించెను ఈ మహాకావ్యపు ఆశ్వాసాంత గద్యము ఈవిధముగా నున్నది

"ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీరశతక నిర్మాణ కర్మఠ జగదేకఖ్యాతిధుర్య అయ్యలరాజు తిప్పయమనీషి పర్యాప్తాభిధాన పౌత్ర అక్కయామాత్యపుత్ర పరిశీలితసమిద్ధ రామానుజమత సిద్ధాంత ముమ్మడి వరదాచార్య కటాక్షవీక్షా పాత్రీభూతహృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్రకవి ప్రణీతంబైన రామాభ్యుదయంబను మహాప్రబంధంబు"

ఈగద్యమువలన రామభద్రకవి ముత్తాత తిప్పయమనీషి తాతపర్వతన్న తండ్రి అక్కయామాత్యుడు గురువు ముమ్మడి

వరదాచార్యుడు అని తెలియవచ్చుచున్నది మరియు నితడు ఆఱువేల యోగిబ్రాహ్మణుడు ఆపస్తంభసూత్రుడు

రామభద్రకవి తన గోత్రమును ఎచ్చటను చెప్పుకొనలేదు కాని ఈయన వంశీయుడగు అయ్యలరాజు నారాయణామాత్యుడు తన హంసవింశతి కావ్యమునందును అయ్యలభాస్కరకవులు తమ రెట్టమతశాస్త్రమునందును తిప్పయమనీషియు రామభద్రకవియును మా పూర్వీకులని చెప్పియున్నారు ఈకవులది కౌండిన్యస గోత్రమైనప్పుడు రామభద్రకవి గోత్రముకూడ అదే యనుట నిస్సందేహము

ఇక రామభద్రకవి ఇంటిపేరు విషయమున విమర్శకులు వివాదపడుచున్నారు కొందరు వీరి యింటిపేరు అయ్యలరాజు వారనగా మరికొందరు రాయకవి వారనిరి అదీకాదీకాదు పుత్తేటివారని అన్యులు నిరూపించియున్నారు

రాయకవియగు అయ్యలరాజువంశ్యులు "... ఘు ఎన్నక్క విధు ఫత్పుత్రి అయ్యలాఖ్యు" అని రెట్టమత శాస్త్రవచనము కలదు అయ్యలరాజు కృష్ణ" అనుటవలన అయ్యలరాజు వారను దివ్యనామమేయని అయ్యలరాజు మొదలకొని తత్సంతతి వారందరును అయ్యలరాజువారే యాయెనని ఊహింపవచ్చును

రాయకవివారననది ఈ విధముగా ప్రచారమునకు వచ్చియుండును అయ్యలరాజు మొదట రాయల ఆస్థానకవి పదవినందుకొని యుండును రాయకవిలగా రాయల ఆస్థానకవి అని చెప్పుకొనుట సహజమే అయ్యలరాజు రాయకవియై తన కుమారున (తిప్పయ్యకు ఆస్థానమందు ప్రవేశించుటకై వీలు కల్పించియుండును వాటినుండి ఈవంశమువారికి రాయకవి వారను పేరు పరంపరగా వచ్చియుండును అయ్యలరాజే మూలపురుషుడగుట వలన అయ్యలరాజువారని కూడ వంశనామముగా వ్యవహారమున నిలచియుండవచ్చును

ఇక పుత్తేటివారను దిఎట్లు ప్రచారమునకు వచ్చినదో విచారింపవలసి యున్నది రామభద్రకవి వంశీయులైనవారెవ్వరును తమ వంశనామము పుత్తేటివారని పేర్కొని యుండలేదు కాని రింగమగుట తిమ్మకవి యుగణ వరపు వెంకటకవియు ఇతనిని పుత్తేటిరామభద్రయ్య అని వ్యవహరించుటవలన ఇంచుక విచారింపవలెను బహుశః రామభద్రకవి పుత్తేరు అను గ్రామమునందు నివసించియుండవచ్చును దానిని బట్టియే పుత్తేటి వారని గ్రంథస్థమొనర్చియుండురు కాని నిజమునకు అది అతని వంశనామము అగునో కాదో తెలియదు

మరియును సకలకథాసారసంగ్రహమును రచించిన రామభద్రుడును రామాభ్యుదయ ప్రబంధమును రచించిన అయ్యలరాజు రామభద్రుడును ఒక్కరేయని కొందరు కాదు భిన్నులని మరికొందరును పలువిధముల అభిప్రాయములను వెలిబుచ్చియున్నారు

శ్రీ శే లక్ష్మణరావుపంతులుగారు బ్ర శ్రీ వీరేశలింగముపంతులుగారును ఇద్దరు రామభద్రులొక్కరే యని "సకల కథాసారసంగ్రహమును" రచించినది అయ్యలరాజు రామభద్రుడే యనియును అభిప్రాయపడిరి

కాని ఆంధ్రకవితరంగిణి కారులు మాత్రము ఐక్యము నంగీకరింపక వారిద్దరూ భిన్నులనియే అభిప్రాయపడిరి అందుకు వారు చూపిన కారణములు ఇట్లున్నవి

1 రామాభ్యుదయము నందలి ఆశ్వాసాంతగద్యమునకును సకలకథాసారసంగ్రహము నందలి ఆశ్వాసాంత గద్యమునకును మిక్కిలి భేదము కన్పించును సకలకథాసారసంగ్రహమందలి గద్యము ఇట్లున్నది- "ఇది శ్రీరామభద్రప్రసాదలబ్ధ కవిత్వమహత్వవిశారద శారదసత్కవిమిత్ర యాపస్తంభసూత్రపాత్ర కాశ్యపసగోత్ర పవిత్ర రామభద్రధీముద్రాభద్ర రామభద్ర ప్రణీతమైన సకలకథాసారసంగ్రహము" ఈగద్యరచనకు అయ్యలరాజు రామభద్రుని ఆశ్వాసాంత గద్యరచనకు చాల భేదమున్నదనుట స్పష్టము

2 అయ్యలరాజు రామభద్రుడు కౌండిన్యస గోత్రుడు సకలకథారామభద్రుడు కాశ్యపస గోత్రుడు

3 శ్రీకృష్ణదేవరాయలు కవిని సకలకథాసారసంగ్రహము రచింపుమని నేడిట్లు ఈ క్రింది వాక్యములలో కలదు

"ఇట్లు కీర్తివిస్తారధురంధరుడగు కృష్ణరాయ నరపాలాఖండలుడు మన్నించి పురాతన మహాకవి విరచిత ప్రబంధంబుల వీక్షించి భగవద్భక్తి సాగరములగు రాజశ్రేష్ఠుల వృత్తాంతంబులు ప్రసిద్ధంబులగునట్లుగా ప్రశస్తకథలు విస్తృతంబుగా ఎలకూచి సాహిత్యలక్షణ చిత్రకవిత్వ ప్రభావంబు లోకోత్తర చోటంగనుండ రచియింపవలయునని ప్రార్థించి మరియు నిట్లనియె"

ఈగద్యమునందు "ఎలకూచి సాహిత్యలక్షణ చిత్రకవిత్వ ప్రభావంబు లోకోత్తర చోటంగనువడ రచియింపవలయునని" శ్రీకృష్ణదేవరాయలు ప్రార్థించినట్లు కలదు ఎలకూచి

యనగా ఎలకూచి బాలసరస్వతియై యుండును అయ్యలరాజు రామభద్రుడు ఎలకూచిబాలసరస్వతి కన్న పూర్వీకుడు పూర్వీకుడైన రామభద్రుడు తన తరువాతి కాలమువాడైన ఎలకూచిని స్మరించుట అసంభవముగదా! అందుచేతనే రామాభ్యుదయ కర్త సకలకథాసారసంగ్రహకర్త ఇరువురునూ భిన్నులే ఇక కృష్ణరాయడు తన గ్రంథము రచించుటకు పూర్వము సకలకథాసారసంగ్రహమును వ్రాయుట గ్రంథమునకు గౌరవమును కూర్చుటకొరకు కవిచేసిన ప్రయత్నమనక తప్పదు

4 అదియునుగాక రామాభ్యుదయము స్వతంత్రగ్రంథము అందు ఇతరుల అనువాదములు కాని అనుకరణలుకాని కానరావు సకలకథాసారసంగ్రహము స్వతంత్రగ్రంథము కాదు ఇందు ఎక్కువభాగము ఇతరకవుల ననుకరించినట్లే తోచును ఈ స్వభావము అయ్యలరాజు రామభద్రునకు లేదు

బ్రౌను పండితుడు కూడ సకలకథాసారసంగ్రహమును గూర్చి ఇట్లు అభిప్రాయమును తెలిపెను

This is an illiterate poem of no merit What ever parts are superior are stolen from other authors

రామభద్రకవి నివాసభూమి కడపమండలములోని ఒంటిమిట్టయను గ్రామము ఈతడు తాను రచించిన రామాభ్యుదయ మహాకావ్యమును గొబ్బూరి నరసరాజునకంకితమిచ్చెను నరసరాజు అళియ రామరాజునకు మేనల్లుడు రామరాజు తన సోదరి లక్ష్మమను గొబ్బూరి కొండరాజు కుమారుడు తిమ్మరాజునకిచ్చి వివాహము చేసెను ఆ దంపతుల తనయుడే నరసరాజు రామాభ్యుదయ కృతికర్త శా శ 1478వ సంవత్సరమున ఆంజనేయస్వామి కొంత భూమిని నరసరాజే దానము చేసినట్లు కడప జిల్లాలోని తొండూరు గ్రామమున కలదు కావున రామభద్రకవి కాలము కూడ అదే అని నిర్ణయింపవచ్చును అట్లయినచో అతని కాలము క్రీ శ 1550 ప్రాంతము అనవచ్చును

అదియును గాక కవి అళియరామరాయలను వర్ణించు సందర్భమున కూడ సదాశివరాయలను స్మరించియుండెను అళియ రామరాయలు సదాశివరాయని కర్ణాట రాజ్య సింహాసనమున నిల్పినది క్రీ శ 1543వ సంవత్సరము కావున సదాశివరాయని స్మరించిన రామభద్రుని కాలము క్రీ శ 1550 అనుట యుక్తియుక్తమే కాగలదు

మరియును అళియరామరాయల మూడవ కుమారుడు తిమ్మరాజు క్రీ శ 155 లో రాయచూరు వద్ద మహమ్మదీయుల నోడించి రాచూరి దుర్గపాలనము స్వీకరించినట్లు చారిత్రకాంశము రామభద్రకవి కూడ ఒకకదపద్యములో రాచూరి తిమ్మవిభునిక రాచూరుదెస నిరంతరము" అనుచు రాచూరి తిమ్మరాజుని స్మరించుటచేత రాచూరు దురవిజయానంతరము ఇంచుమించు క్రీ శ 1555 ప్రాంతమున రామాభ్యుదయమును రచించెనని ఊహా పవచ్చును కనుక ఇది కూడ రామభద్రుడు క్రీ శ 1550 నాటి వాడను ఊహకు ఊపిరి పోయుచున్నది

హ వ

## అయ్యల సోమయాజుల గణపతి శాస్త్రి

గణపతిశాస్త్రిగారి యింటిపేరు అయ్యల సోమయాజుల వారు ఈయన క్రీ శ 1878 వ సంవత్సరమున విశాఖపట్నం జిల్లా కలువరాయి అను గ్రామమున జన్మించెను ఈయన తండ్రి పేరు నరసింహశాస్త్రి తల్లి పేరు నరసమాంబ నరసింహశాస్త్రిగారు గొప్ప పండితులు మహావిద్యోపాసకులు నరసమాంబ మహాపతివ్రత ఇట్టి యుత్తమ దంపతులకు శుచీనాం శ్రీమతాం గేహే యోగ భ్రష్టోభిజాయతే అనునట్లు గణపతి యను కుమారుడు జన్మించెను శుక్లపక్ష శశాంకునివలె గణపతి దినదినాభివృద్ధి నొందుచుండెను గణపతికి పది సంవత్సరముల వయస్సు వచ్చెను అప్పటికే అతడు కాళిదాసు కావ్యత్రయమును పూర్తి చేసెను కవన మల్లి కొచ్చెను జ్యోతిశ్శాస్త్రమున ప్రవేశము సంపాదించెను పంచాంగమును వ్రాయుటలో క్రొత్త విధానమును కనుగొనెను అతడు ఏకసంథాగ్రాహి అతనిమేధాశక్తి గురువులకే ఆశ్చర్యము కలిగించుచుండెను హఠాత్తుగా గణపతికొక దుఃఖము సంప్రాప్తించెను అతని తల్లి పరమపదించెను ఈ శోకము అతనిని కొంత తల్లడిల్లచేసెను అయినను మనస్సును దిటవుపరచుకొని అతడు విద్యలనభ్యసించెను అతని పండ్రెండవ యేట ఆయనకు వివాహము జరిగెను సరసకవి శారివాసుడగు గణపతిశాస్త్రి నుద్దేశించి శృంగసందేశము అను కావ్యమును వ్రాసెను ఈ కావ్యము సంస్కృతభాషలో మందాక్రాంత వృత్తముతో నొప్పిట్టిన షోడశవర్షీయుడగు గణపతి కావ్య శాస్త్రేతిహాసములను సంపూర్ణముగ చదివెను. హిమవన్నగాగ్రమునుండి క్రిందికి దుముకుగంగా నిర్ఝరిణీ సదృశమైన అతుకవిత్వమును

సంస్కృతమున అతడు చెప్పదొడగెను తండ్రివలన మహామంత్రోపదేశమును బొంది యతడు జపము చేయదొడగెను అయినను ఆజపముతో ఆయనకు తృప్తి కలుగలేదు లోకము నశ్వర

చిత్రము 24



అయ్యల సోమయాజుల గణపతి శాస్త్రి

మను విషయము అతని మనమున కలత పెట్టుచుండెను ఏదియో అపూర్వ విషయమును తపముచే సాధించవలయునని అతని యంతర్వాణి యాతనికి బోధించుచుండెను ఈ సంఘర్షణమున అతడు సాంసారిక భోగములనుపరిత్యజించెను నాసిక భువనేశ్వర క్షేత్రములలో నాలుగు సంవత్సరములకు పైగా అతడు తపమొనర్చి కొన్ని అపూర్వశక్తులను సాధించెను

బంగాళా దేశమునందలి నవద్వీపమున పండితులకు నిలయమును ప్రతిసంవత్సరమచట విద్వత్పరీక్షలు జరుగుచుండును అనేక శాస్త్రపండితులు అచటికి వచ్చి విద్వద్గోష్ఠిలో పాల్గొని తమ వాద ప్రతివాదములను ప్రదర్శించి పారితోషికములను బడయుచుందురు అది క్రీ శ 1900 వ సంవత్సరము నవద్వీపమున పండిత పరీక్షలు జరుగు నను వర్తమానము గణపతి చెవిసోకెను వెంటనే ఆ పండిత రీక్షలలో పాల్గొనుటకాతడు నవద్వీపమునకు బోయెను విద్వత్సభలో ఆశువుగా నతడు చెప్పిన సంస్కృత శ్లోకములు సభ్యులను ముగ్ధుల నొనర్చెను పరీక్షకులు అతని యాశుధారాకవితా పాటవమునకు మెచ్చి కావ్యకంఠ అను బిరుదము నాతని కొసంగి సత్కరించిరి కావ్యకంఠుడనగా ఆశువుగా కావ్యములల్లువాడు అను నర్థము గోచరించుచున్నది చెన్నపురిలో (మద్రాసు) నారాయణ సుదర్శనుడను గొప్ప పండితుడుండెను గణపతి అట్టి మహాపండితునితో వివాదమునకు సిద్ధపడెను నిముసమునకునాలుగు శ్లోకముల చొప్పున ఇరువదియైదు శ్లోకములు సంస్కృతమున ఆశువుగా చెప్పి పోటీలో నారాయణసుదర్శను నోడించి స్వర్ణసింహతలాటములను (బంగారు కడియములను) అతడు బహుమానముగా పొందెను ఆయన క్రీ శ 1902 న అరుణాచల క్షేత్రమున కరిగెను అరుణాచలము నేటి తమిళనాడు రాష్ట్రమునమున్నది అచ్చటపరమేశ్వరునిఆశుధారగా సహస్ర శ్లోకములతో స్తుతించి యచటి పండితులను మెప్పించెను వారి ప్రేమకు పాత్రుడై అతడు ఒక సంవత్సర కాలము ఆక్షేత్రమున అధ్యాపక వృత్తిలో నుండెను అటుపిమ్మట వేలూరులో నాలుగు సంవత్సరముల కాలముతెలుగుపండిత పదవిని అతడు నిర్వహించెను వేలూరు నేటితమిళనాడురాష్ట్రములోని ఉత్తర ఆర్కాడు జిల్లాలో మున్నది

అరుణాచలము గొప్ప పుణ్యక్షేత్రము అందు బ్రాహ్మణస్వామి యను పేరుగల రమణమహర్షి మౌనియై చాలకాలము నుండి తప మొనర్చుచుండెను అతడు మహాతేజస్సంపన్నుడు గణపతి ఈ మహాపురుషుని సందర్శించి యాతనివలన కొన్ని తపస్సంబంధమైన అనుభూతులను గ్రహింప సంకల్పించెను క్రీ శ 1907 న అతడు అరుణాచలమున కేగెను గుహాంత ర్భాగమున నిమీలిత నేత్రుడై తప మొనర్చు బ్రాహ్మణ స్వామిని గణపతి దర్శించెను ఆయనకు సాష్టాంగముగ ప్రణమిల్లెను వసిష్ఠగోత్ర సంభవుడననియు గణపతి నామధేయుడననియు తెలుపుచు అతడు తన సందేహ విషయములను బ్రాహ్మణస్వామిని పృచ్ఛించెను స్వామి కనులు తెరచెను అతనికి బదులు పలుక లేకపోయెను స్వామి కంఠనాళములు

ఎండిపోయి వి గణపతిని స్వామి పరిశీలించి చూచెను శుష్కించిన స్వామి శరీర భాగములు ఆర్ద్రములయ్యెను అందుండి క్రమముగా వాగ్రథము పయనమయ్యెను అదియే ఉపదేశ వాక్కు ఆ వాక్కు అనిర్వచనీయమైనది దాని యర్థము వేదాంతులకే యెరుక గణపతి అవార్థమును గ్రహించెను తపఃపదమునకు సంతృప్తికరమగు నిర్వచనము ఆ వాక్కునందు గణపతికి లభించెను బ్రాహ్మణస్వామి గణపతిని నాయన అని సంబోధించెను క్రమముగా గణపతికి నాయన అను నామము సర్వవ్యాప్తమయ్యెను సిద్ధగురువైన బ్రాహ్మణ స్వామి అనుగ్రహము గణపతిపై సంపూర్ణముగ ప్రసరించెను అట్టి సిద్ధగురువును దర్శింప జేసినది తన నిత్యోపాసనీయైన ఈశ్వరియే ఈశ్వరి అవ్యాజమైన కరుణకు అతడు అబ్బురపడెను వెంటనే ఆశువుగ అనేక కృతజ్ఞతా శ్లోకములతో నతడు ఈశ్వరిని స్తుతించెను ఆ వెనుక అతడు సిద్ధుని వలన పొందిన నవ్యోపదేశముచే మంత్ర జప తంత్ర యోగ స్థానములు తనకు స్ఫురింపబడిన విధమును దెలుపుచు నొక గ్రంథమును వ్రాసెను అదియే ఉమాసహస్రము అను పేరుతో నొప్పెను ఉమాసహస్ర గ్రంథమొక వేదాంత మహాకావ్యము రసవంతములును మధురములగు సంస్కృత శ్లోకములతో చక్కని యలంకారములతో నిది యొప్పెను స్తుతి ఉపనిషత్ కావ్యశైలులను అతడు అగ్రంథమున పొందుపరచెను భోగిని విరాగిని జేయునట్టి దా గ్రంథము ఆ పిమ్మట గణపతి తపస్తత్త్వమును దెలుపు మంత్రమునకు కవచముగూడ ఋషులు కల్పించి యుందురని గ్రహించెను ఆ కవచము ఆతనికి బోధపడ లేదు అతడు తపమొనర్చి ఆ కవచమును బడయనెంచెను రేణుక అను దేవతను అతడుపాసించెను రేణుక ప్రత్యక్షమై మంత్రకవచము నాతనికి అనుగ్రహించెను ఆనాటినుండి అతని జీవితములో గొప్ప మార్పు వచ్చెను తన జీవితశేషము అంతయు వేదార్థమును దెలిసికొనుటకు వినియోగింప నతడు సమకట్టెను అతడు సమాధి నిమగ్నుడై అనేక దివ్యానుభవములను పొందెను ఆయన తపస్సుచే నిగూఢమైన వేదార్థమును గ్రహించెను కపాలభేదన సిద్ధి గూడ ఆయన సాధించెను కపాలభేదన సిద్ధి యనగా బ్రహ్మరంధ్రమును పగులగొట్టుకొని ప్రాణవాయువులు పైకి వెడలునట్లు చేయు యోగము అఖండ బ్రహ్మతేజస్సుతో ఆయన వేదర్షివలె ప్రకాశించెను తనదర్శనానుభవములను లోకమునకు అందించుటకు ఆయన అనేక గ్రంథములను రచించెను అట్టి గ్రంథములు డెబ్బది అయిదుకు పైగా కలవు అందులో ముద్రణభాగ్యము నందగలిగినవి నాలుగు గ్రంథములుమాత్రమే ఆయన గ్రంథములలో మనకు తరచుగా స్తోత్రములు సూత్రములు కూర్పులు విమర్శలు కనవచ్చుచుండును ఇట్టి గ్రంథములలో మిక్కిలి ప్రబోధాత్మకమైన గ్రంథము భారతవిమర్శ అనునది ఇందు ఋగ్వేదమున గనవచ్చు భారత చరిత్రాంశములు రూపొందింపబడినవి ఉపనిషత్తుల కంటెను బ్రహ్మసూత్రములకంటెను మించిన వేదాంతార్థమును బోధించు గ్రంథమొకటి ఆయన రచించెను అదియే రమణగీత అను గ్రంథము రమణమహర్షి యొసగిన బోధసారము ఇందు నిండియున్నది

కావ్యకంఠుడు (గణపతి) ఇట్లు అనితర సాధ్యమైన తపముచే ప్రభావితుడయ్యెను రాజకీయములయందు గూడ తన మనమును ప్రసరింపజేసెను గాంధీమహాత్ముని బోధనలతనిని రాజకీయములలోనికి ఆకర్షించినది తత్ఫలితముగా ఆయన క్రీ శ 1924 న కాంగ్రెసు సంస్థలో చేరెను తమిళరాష్ట్ర కాంగ్రెసు కమిటీకి అతడు అధ్యక్షుడయ్యెను ఈ క్రొత్తపదవివలన ఆయన తపశ్చర్యకు గ్రంథరచనమునకు గొప్పఅంతరాయమేర్పడెను అందుచే అతడు తన క్రొత్త పదవిని (అధ్యక్ష పదవిని) ఆ సంవత్సరమే వదలిపెట్టి కాంగ్రెసు సంస్థనుండి బయటకు వచ్చెను ప్రజలలో కరుడు గట్టుకొని పోయిన అంటరానితనమను ఎంచమును అతడు పారద్రోలదలచెను శాస్త్రీయదృష్టితో అతడు అస్పృశ్యతా నివారణమును సమర్థించుచు పంచజనచర్చ అనునొక సుదీర్ఘ వ్యాసమును వ్రాసెను క్రీ శ 1928 లో హైదరాబాదు నగరమునందలి శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము రజితోత్సవమును జరుపుకొనెను అట్టి సందర్భమున ఆ ఆంధ్రభాషానిలయ కార్యనిర్వాహకులు మహాముని యు కావ్యకంఠుడైన అయ్యల సోమయాజుల గణపతిశాస్త్రిగారిని అధ్యక్షోపన్యాసము నొసగుటకై ఆహ్వానించిరి ఆరజితోత్సవములు మూడు దినములు కన్నుల పండువుగా జరిగెను అధ్యక్షోపన్యాసమున భాషానిలయ ప్రయోజనమును గూర్చి ముచ్చటించుచు ఆయన ఇట్లనెను

"కొలది గ్రంథముల పఠనము చేసినే భాషయందు వ్యుత్పత్తి సిద్ధించినను అంత మాత్రమున విజ్ఞానము విస్తరిల్లజాలదు విజ్ఞానాభివృద్ధికి రెండు మార్గములు గలవు మొదటిది బహు గ్రంథావలోకనము రెండవది వృద్ధసేవ వృద్ధులనగా

నిచ్చుటవిద్యావృద్ధులుగాని కేవలపరీక్షలకు సహాయకులుగాను పుస్తకాలయములు స్థావర గ్రంథాలయములనియు విద్యావృద్ధులు జంగమగ్రంథాలయములనియు చెప్పవచ్చును స్థావరగ్రంథాలయముల యందు భగవతి యగు సరస్వతి యొక్క ఆధిభౌతిక స్వరూపము జంగమ గ్రంథాలయముల యందు ఆమె ఆధ్యాత్మిక స్వరూపము వ్యక్తమగుచుండును కనుక గ్రంథాలయములు సరస్వతీదేవ్యాలయములని యే నాయభిప్రాయము సరస్వతియొక్క ఆధిభౌతిక స్వరూపమును గాని ఆధ్యాత్మిక స్వరూపమును గాని శ్రద్ధతో భజించిన నామె తప్పక యనుగ్రహించును" (రజతోత్సవసంచిక 4వ పుట 1938 ముద్రణము)

పాఠకుడు పుస్తకమును చదివి సువిమర్శనముగా జదువుటయందే యీ సరస్వత్యుపాసనము సిద్ధించుచున్నది విమర్శశక్తి లేనివాని కాగ్రమనస్సు లేదు రాజయోగమునందు గూడ విమర్శనమే యేకాగ్రమనస్సుకు బీజమై యున్నది హఠయోగ రాజయోగ భక్తియోగ కర్మయోగాదుల వలె చదువు కూడ నొక యోగమే దానిని పెద్దలు స్వాధ్యాయ యోగమని చెప్పుదురు యోగయుక్తము గాని కర్మ యెట్లు చిత్తశుద్ధికి హేతువు కాజాలదో అట్లే యోగయుక్తము గాని స్వాధ్యాయము జ్ఞానాభివృద్ధికి తోడ్పడజాలదు కర్మకు యోగయుక్తత్వము ఫలాపేక్షారాహిత్యము స్వాధ్యాయమునకు యోగయుక్తత్వము సువిమర్శత్వము అనునవి ప్రధానములు గ్రంథము నవలోకించు ప్రతివాడు ఈసూత్రమును గమనింపవలయును దేశభాషలలో పాండిత్యము గలుగవలయునన్న సంస్కృతభాష తప్పక అభ్యసింపవలయునని వారు బోధించుచు ఒక దేశభాషయందలి పాండిత్యము సంస్కృతభాషయందు పాండిత్యముండినగాని పూర్ణముగాదని చెప్పిన నయ్యది అతిశయోక్తి కానేరదు ప్రాయికముగా భరతఖండములోని దేశభాషలు సంస్కృతోపజీవ్యములై యున్నవనుటలో నెవ్వరికిని ఆక్షేపణముండదని నేను నమ్ముచున్నాను అని తెలిపెను

ద్రావిడభాషలలో తెలుగు అన్నచో ఆయనకు గల ప్రీతిని ఇట్లు వెల్లడించెను ద్రావిడభాషలలో ఆంధ్రభాష సంస్కృతభాషతో తన సోదరభాషలకంటె అధికముగు సంబంధమును సంపాదించుకొని యున్నది సంస్కృత దీర్ఘసమాసములు ఆంధ్రభాషలో ఇమిడి యున్నట్లు ఇతర ద్రావిడభాషలలోనే కాక యుదీచ్యభాషలలో గూడ ఇమిడి యుండలేదు

అందువలన ఆంధ్రభాష మాధుర్యమునే కాక తేజోగుణము గూడ చక్కగా ప్రదర్శింపగలుగుచున్నది అవ్యయములు సర్వనామములు అప్పు తక్కిన సంస్కృతపదము లన్నియు ఆంధ్ర తత్సమరూపములలో గన్పట్టుచున్నవి ఇంత తత్సమ బాహుళ్యము ఏ ఇతర భారతీయ భాషలలో గూడ లేదు సంస్కృత భాషా సంబంధము వలన ముందేసు వరముగాను చిన ఆంధ్ర భాషా స్వరూపము మరింత సుందరమయ్యెను పాశ్చాత్య దేశ భాషలలో ఇటలీదేశపు భాషవలె భరతఖండభాషలలో ఆంధ్ర భాష మిక్కిలి సుందరమైనదని భాషాతత్వవేత్తలు అంగీకరించి యున్నారు" ఆంధ్రభారతిని సేవించు కవులకు ఆయన ఇట్లు ఒక సూచనచేసెను "పద్యగ్రంథములకంటె వచనగ్రంథము లను నిర్మించుటయందు కవులెక్కుడు పరిశ్రమను దీసికొనవలెను సంస్కృత వాఙ్మయమునందలి వేదశాస్త్రగ్రంథము వచనములోనికి పరివర్తనము గావలెను"

మంచి కావ్యమును రచింపవలయునని ఆయన బోధించుచు భోజమహారాజుతో ఒక కవి చెప్పిన మాట ఇట్లు జ్ఞాపకపరచెను

"కావ్యం కరోమి నహి చారుతరం కరోమి
యత్నాత్కరోమి యది చారుతరం కరోమి

(నేను కావ్యమును చేయుదును అయితే చక్కని కావ్యమును చేయజాలను ప్రయత్నమువలన చేయునెడల చక్కని కావ్యమును చేయగలుగుదును) కావున శ్రమించియైనను కవులు రసవత్కావ్యముల నిర్మింపవలయునని ఆయన అభిప్రాయమును వెలిబుచ్చిరి ఛందోనియమములను గూర్చి ఆయన కవులకిట్లు బోధించెను "గ్రంథములను వ్రాయువారు ఛందోవ్యాకరణాదినియమముల నుల్లంఘించి వ్రాయుట మంచి పద్ధతిగాదు నియమము అభ్యుదయావహమని పతంజలి చెప్పియున్నాడు"

హైదరాబాదు నగర నివాసులైన ప్రజల నుద్దేశించి ఆయన ఇట్లు ఉపదేశించెను

వట్టర్గాడులో నుండిన జర్మను ఫ్రెంచి ఇటలీ వారి వలె నిజాము రాష్ట్రములోనున్న ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటకులు ఐకమత్యముండిననే మనగలుగుదురు లేనియెడల నుదోపనుంద న్యాయమే"

గణపతిశాస్త్రిగారు మహోత్తత్వవేత్త యని ఆయన మూడవనాటి ఉపసంహారోపన్యాసమునందు ప్రస్ఫుటమైనది

కావ్యకంఠ గణపతిశాస్త్రిగారి పై యుపన్యాసమును బట్టి ఆమహామునియ దలి యోగవిద్యా పరిపూర్ణత్వము శాస్త్రవైదుష్యము ఆధ్యాత్మికశక్తి లో జ్ఞానము యోగానుభవములు పరిపూర్ణవ్యక్తిత్వము మనకు సువిదితము అగుచున్నవి

ఈ మహాయుడు వాసిష్ఠుడు మహాముని కావ్యకంఠుడు నాయన గణపతి గణపతిశాస్త్రి యను నామములతో జగద్విఖ్యాతినొందెను

క్రీ శ 1936 లో గణపతిశాస్త్రి ఖడ్గపురశిష్యుల మధ్య శివమంత్రమును జపించుచు తనభౌతికకాయమును వీడి శివలోక గతుడయ్యెను

శం ఆం శా

## అయ్యలామాత్యుడు

ఇతడు ద్విపదహరిశ్చంద్రోపాఖ్యానము నవనాథచరిత్ర లక్షణదీపిక అను గ్రంథములు వ్రాసిన గౌరన తండ్రి ఈతనికి కొన్ని గ్రంథములలో ఎల్లయ అను పేరు కాన్పించును హరిశ్చంద్రోపాఖ్యానపీఠిక యందు ఎల్లనార్యుడని ఈతడు వ్యవహరింప బడినాడు

"పొగడొందు పెద్దన పోతరాజునకు
దగిన తమ్ముఁడుయశోధనుఁ డెల్లమంత్రి"

కాని సంస్కృతము నందు వ్రాయబడిన లక్షణదీపికలోను హరిశ్చంద్రోపాఖ్యానము చివరి భాగము నందును నవనాథ చరిత్ర యందును "అయ్యలమంత్రి" అనియే ఇతడు వ్యవహృతుడైనాడు

"సింగియ మాధవక్షితిపాలమంత్రి
పుంగవుఁడై యొప్పు పోతరాజునకు
ననుజాతుఁడగు నయ్యలామాత్యు
కూర్మితనయు డుత్తముఁడు" నవనాథ చరిత్ర

గౌరనచే మూడు స్థలములందు అయ్యలమంత్రి అనియు ఒక్క సందర్భమున మాత్రము ఎల్లమంత్రి అనియు పేర్కొనబడి యుండుటచే ఆతని తండ్రి పేరు అయ్యలమంత్రి అనియే నిర్ణయింపవచ్చును

ఈ అయ్యలమంత్రి సింగయమాధవక్షితిపాలుని మంత్రియైన పోతరాజు మంత్రి తమ్ముడు వీరి తండ్రి పెద్దనామాత్యుడు వీరిది గౌతమ గోత్రము వీరు వీరశైవులు కాకున్నను శివారాధకులు గౌరనకవి శ్రీశైలభ్రమరాంబికా భక్తుడు అయ్యలమంత్రి భార్య గౌరనకవి తల్లి పోచమాంబ ఆమె తల్లిదండ్రులు గంగాంబా వల్లభమంత్రులు అయ్యలమంత్రి సతీమణి చుట్టాలసురభి యని పొగడబడినది ఈ దంపతులకు ఇద్దరు కుమారులు వారుధరణిమంత్రి గౌరన అనువారు

వీరి కాలమేది యనుటలో విమర్శకుల యందు కొంచెము అభిప్రాయ భేదము కలదు అయ్యలమంత్రి అగ్రజుడైన పోతరాజు సింగయమాధవనరేంద్రుకు మంత్రియని చెప్పబడినది సింగయమాధవుడనగా రాచకొండ పద్మనాయక వంశస్థుడు సింగమనాయుని కుమారుడైన మాదానాయకుడు అని యర్థము వీరిది రేచెర్ల వంశము ఈ వంశమున దు సింగయ జనకుడుగాగల మాధవనాయకులు ఇద్దరు డుటచే వీరిలో ఎవరు పోతురాజుమంత్రి ఏలికయైన మాదానాయకుడు అని విచికిత్స కలుగుచున్నది ఇందులకై రేచెర్లపద్మనాయకుల వంశవృక్షము పరిశీలింపదగును




పై వంశావళిని బట్టి మొదటి మాదానాయని తండ్రి సింగమనాయడు తాత దాచానాయడు రెండవ మాదానాయని తండ్రి సింగమ తాత అనపోతానేడు మొదటి అనపోత మాధవ నాయకులే రాచకొండ వెలమ రాజ్యమునకు రూపు దిద్దినవారు మొదటి మాదానాయని శాసనము శక 1298 (క్రీశ 1376) నాటిది మహబూబునగరం జిల్లా అమరవాది

తాలూకా ఉమామహేశ్వర క్షేత్రమున దు లభించినది ఈ శాసనము చివర పెద్దన పోతరాజు పేరు కలదు రెండవ మాధవనాయకుడు రసార్ణవసుధాకరాది గ్రంథకర్తయు సర్వజ్ఞ బిరుదాంచితుడును అగు రెండవ సింగమనాయని అనవపోతకుమారుడు రాచకొండకు సమీపమున గల నాగారమను గ్రామమునందు నాగాంబిక శాసనము వేయించినది దీని కాలము శక 1349 ప్లవంగ సంవత్సరము అనగా క్రీ శ 1427 నాగాంబిక సింగయమాధవేంద్రుని దేవేరి యని కలదు ఈ మాధవనృపాలుడు విద్వాంసుడై రామాయణమునకు వ్యాఖ్య వ్రాసినట్లు నాగారము శాసనము చెప్పుచున్నది

పెద్దన పోతరాజు ఈ యిద్దరు మాదానాయనింగార్లలో ఎవరి వద్దమంత్రిగా ఉండెను అనునదియే చర్చావిషయము ఉమామహేశ్వర శాసనము చివర పెద్దన పోతరాజు ప్రశంస యున్నది కాని ఇది ప్రక్షిప్తమని కొందరు తోచిపుచ్చు చున్నారు నాగారం శాసనమునందు పెద్దన పోతరాజు ప్రస్తావము లేశమాత్రముగా లేదు మొదటి మాదానాయడు గొప్ప వీరుడై అన్నయైన అనవోతానాయనితో కలిసి రాచకొండ రాజ్యమును స్థాపించుటకు కారకుడయ్యెను తరువాత ఈ యన్నదమ్ములు రాజ్యమును విభజించుకొని అనవోతానేడు రాచకొండయందును మాధవనాయకుడు దేవరకొండ యందును పరిపాలన చేసిరి ఇద్దరు మాధవనాయకులలో స్వతంత్రరాజ్యమును స్వతంత్రప్రతిపత్తియు గలవాడగు మొదటి మాదానాయుడే అనుట నిశ్చయము కావున పెద్దన పోతరాజు మొదటి మాదానాయని వద్దనే క్రీ శ 1376 ప్రాంతమున మంత్రిసత్తముడుగా వ్యవహరించి యుండుననుట యుక్తయుక్తముగా ఉన్నది ఇది అంగీకరింపబడినచో పోత రాజు తమ్ముడైన అయ్యలమంత్రియు ఆ కాలమువాడే అయి యుండును అయ్యలమంత్రిని గూర్చి ఇంతకన్న విశేషములు తెలియవచ్చుట లేదు

మా దీ

## అయ్యలార్యుడు

ఆంధ్రవాఙ్మయమున కాలక్రమము ననుసరించి కవి త్రయమువారి భారతము తరువాత ప్రాముఖ్యము నొందిన గ్రంథము భాస్కరరామాయణము ఈ గ్రంథము కూడ భారతమువలెనే ఏకకర్తృకము కాక బహుకర్తృకముగా నున్నది

ఈరామాయణమును భాస్కరుడు మల్లికార్జునభట్టు కుమారరుద్రదేవుడు అయ్యలార్యుడు అను కవులు రచించి యున్నారు ఇందు వయస్సుచేతను కవితాప్రాభవముచేతను భాస్కరుడు ప్రధానుడగుటచేత ఈగ్రంథము భాస్కర రామాయణమను ప్రఖ్యాతిని పొందినది ఈకవియే భారత కవియగు తిక్కనగారి ఎతామహుడగు భాస్కరుడని చెప్పు దురు కాని యీ యంశము నిర్ధారణ కనుపడలేదు

భాస్కరరామాయణమును రచించిన నలుగురు కవులలో అయ్యలార్యుడు చివరివాడు ఇతనికే అయ్యలభట్టు అను నామాంతరము కలదు ఈ కవి రామాయణమున దలి యుద్ధ కాండమున 1140వ పద్యము మొదలుకొని చివరివరకు అనగా యుద్ధకాండాంతము వరకు రచన చేసియున్నాడు ఈతడు ఈగ్రంథమున మొత్తము 1683 గద్యపద్యములను రచించెను రచనాపరిమాణమునుబట్టి చూడగా నీ వి భాస్కరరామాయణ కవులలో మూడవవాడుగ నెన్నదగియున్నాడు భాస్కర రామాయణము సాహిణిమారడు అను వానికి అంకిత మైనట్లుగా చెప్పబడి యున్నది

ఈ మారడు కాకతీయ వంశములోని రెండవ ప్రతాప రుద్రుని కొలువులో అశ్వసైన్యాధ్యక్షుడుగా నున్నట్లు తెలియు చున్నది అనగా నీగ్రంథము క్రీ శ 14వ శతాబ్దమున రచితమై యుండవలెను గ్రంథరచనాకాలమునుబట్టి చూడగా ఆరచయితలలో ఒకడైన అయ్యలార్యుడు క్రీ శ 14వ శతా బ్దము వాడని చెప్పవలసియుండును

అయ్యలార్యుని గురించి చెప్పుచు తమ ఆంధ్రకవులచరిత్ర ప్రథమభాగమున శ్రీ కందుకూరి వీరేశలింగముగారు అయ్య లార్యుడు ముఖ్యకవియైన భాస్కరుని స్నేహితుడని భావించిరి ఈఊహ సరియైనచో భాస్కరుడును అయ్యలార్యుడు క్రీ శ 14వ శతాబ్దివారే యగుదురు అనగా సాహిణిమారనికి సమకాలికుడుగా అయ్యలార్యుని భావింపవచ్చును

దీనికి భిన్నముగా శ్రీ చాగంటి శేషయ్యగారు ఆంధ్ర కవి తరంగిణిలో ఇట్లు చెప్పిరి 1141 వ పద్యము (యుద్ధ కాండమున)నుండి అయ్యలార్యుడు రచించెను ఈపద్యమునకు ముందు ఇదిమొదలు వేదగిరి నాయనింగారి ప్రేరణమున నయ్యలార్యుడు రచించినది అని యున్నది దీనినిబట్టి అయ్య లార్యుడు 1384-94 ప్రాంతమున దేవరకొండను పాలించిన వేదగిరి నాయనింగారికి సమకాలికుడుగా కాన్పించును

శ్రీ శేషయ్యగారి వాదమునుబట్టి అయ్యలార్యుడు క్రీశ 14వ శతాబ్ది కడభాగమున జీవించినట్లుగా కాన్పించును

అయ్యలార్యుడు రచించిన రామాయణభాగమునందలి గద్యములనుబట్టి యీతడు ఉభయభాషా కవితా విశారదుడని తెలియుచున్నది అట్టి పాండిత్యము కలవాడు కాబట్టియే రామాయణమువంటి గ్రంథరచనమునకు ఇతడు పూనుకొనుట సముచితముగా కాన్పించును ఈతడు తన తాతగారు శాకల్య మల్లుభట్టు అని చెప్పియున్నాడు శాకల్యమల్లుభట్టు కాకతి ద్వితీయ ప్రతాపరుద్రుని ఆస్థానమును అలంకరించిన మహా విద్వాంసుడు శాకల్యమల్లుభట్టు కూడ రామాయణగ్రంథమును రచించెనని యు దానిని నిరోష్ఠ్యముగా నిర్మించెననియు మరి గంటి లంగాచార్యులు తన నిరోష్ఠ్యరామాయణ పీఠికలో ఇట్లు వ్రాసియున్నాడు

మును రామాయణమున్ నిరోష్ఠ్యముగ నింపున్ మీర శాకల్య మల్లన తా సంస్కృతభాష జేసెనను నాలాగున్ తెన్గుల్ నిండగా వినుతింగాని ధరిత్రిపై నిమముగా శోభింపలేదట్టి దే దెనుగు జేసెద నెల్లడ గన్నెకుం బ్రఖ్యాతమై యేర్పడన్

దీనివలన అయ్యలార్యుని వంశమువారు పండితులనియు అందును రామాయణ రచనాసక్తి కలిగినవారనియు తెలియుచున్నది తన తాతగారగు శాకల్యమల్లుని అడుగు జాడలలో నడిచియే అయ్యలార్యుడును రామాయణరచనమునకు పూనుకొనెనట్లు భావించవలసియున్నది

అయ్యలార్యుని తండ్రి పేరు నరసింహుడనియు గద్యలోనే కలదు కాని యాతనికి కూడ సాహిత్యకముగా నేమైన ప్రాముఖ్యము కలదా యను ప్రశ్నకు సరియైన సమాధానము లభించదు అయ్యలార్యుడు తన తల్లి పేరును ఎచటను పేర్కొనియుండలేదు

భాగతమున అరణ్యపర్వశేషమును పూరించిన ఎఱ్ఱాప్రెగ్గడ కవి చాలవరకు నన్నయభట్టును కొంతవరకు తిక్కన సోమయాజిని అనుసరించియున్నాడనుట సాహిత్యకులందరెరిగినదే అట్లే అయ్యలార్యుడు యుద్ధకాండపూరణము చేయుసందర్భమున భాస్కరుని రచనను చాలవరకు అనుసరించియున్నాడు అయినవలెనే యితడును ఉదిలాగ్నికి శలభవృత్తి (1 49) మహోజ్జ్వల విస్ఫులింగములు (1154) మొదలైన పదప్రయోగము చేసియున్నాడు

అయ్యలార్యునకు ఉత్తమ పరిశీలనాశక్తి కలదు వానరులు లంకను దహించివేయునప్పుడు అందు నివసించు రాక్షసుల అవస్థను ఎట్లు చక్కగా వర్ణించినాడో చూడగును

పొరిది మద్యము గ్రోలి చొక్కెడువారును
బలునిద్రచేం దొట్టుపడెడువారు
లలనాగ్రభుజలతా లలిత వక్షులు
గార్ముక ముద్గర ఖడ్గ ధరులు
భామలగూడి తల్పముల నిద్రితులును
బుత్ర దారల దేర బోవువారు
బొగ పుట్టుముట్టిన బోలేనివారును
గరమును ఒమ్మిట గదియువారు
తేంగారాని పెగదాకి చిక్కువారు
బొదలు మిడుగర్ల తాకున బొగులువారు
నైనం దైత్యులు పదివేవురగ్నియందు
బడుటాకులకై వడి భస్మమైరి

ఇందు లంకానగరవాసులైన రాక్షసుల స్వభావము చక్కగా ఊహించి స్వాభావికముగా వ్రాసెనమటలో అతిశయోక్తి లేదు

ఈకవికి యుద్ధవర్ణనము చేయుటయందు మంచి అభినివేశము కలదు దానికి గిట్టగానే అతడు వీరరస ప్రధానమైన యుద్ధకాండమునే చేపట్టియున్నాడు ఉత్తమశైలిలో తెలుగును డికారపుమాధుర్యము ఉట్టిపడునట్లుగా పద్యముమవ్రాయుటలో ఈకవికి నేర్పు కలదు

ఈ పద్యము పరిశీలించదగినది

సురలకు గుండె తల్లడము శూరుల డెందములోని కొట్టు ఖేచరపతి కంటిలో నలుసు సాధ్యుల కొంగున నున్న నిచ్చుభూసురులకు నెల్లవాడు మెడజుటిన పాము మునీంద్రకోటిపై బొరిబడమున్న యాపడుగు బొల్పరం జేసితి నీవు రాఘవా
(యుద్ధ 2430)

ఆంధ్రభాగవతకర్తయైన పోతనగారు వ్రాసిన మందార మకరంద అను పద్యమును ఎననివారుండరు ఆపద్యమునకు మారదర్శమేమో అనునట్టి ఒక పద్యమును అయ్యలార్యుడు తన యుద్ధకాండమున రచించియున్నాడు

"మందారభూజమునమరగిన భృంగి
నిచుమంద శాఖపై బ్రౌమగలదె
బలిమానన మున మేంగెడు హంసికి
వెలయం బల్వలముపై వేడ్కగలదె"
(భా రా యుద్ధ కాం 2416 పద్యం)

ఇంత మంచిపద్యములు వ్రాయ సమర్థుడైనవాడు కాబట్టియే అయ్యలార్యుడు ఆంధ్రవాఙ్మయమునందలి ప్రముఖ కవుల కోవలో స్థానమును పొందియున్నాడు

దా ము కు

అయ్యలప్రెగ్గడ  చూ అయ్యనమంత్రి

## అయ్యలూరు

అయ్యలూరు కర్నూలు జిల్లా నంద్యాల తాలుకాలో ఉన్నది దీనికి 4 మైళ్ళ దూరములో నంద్యాల పట్టణముగలదు దీనికి సరిహద్దులుగా తూర్పున నందిపల్లి పడమట నూనపల్లి చాబోలు ఉత్తరమున తబళ్ళల్లి కొట్టాల దక్షిణమున మసీదుపురం చాబోలున్నవి ఈగ్రామవిస్తీర్ణము 4072 ఎకరములు ఈ గ్రామమును అనుకొని ఒక ట్రంకురోడ్డు పోవుచున్నది దీనికి సుమారు ఒ మైలు దూరములో కర్నూలు కడప కాలువ పోవుచున్నది ఈ గ్రామములోని బజారులు ఎగుడు దిగుడుగా ఉన్నవి

1961సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈగ్రామములో 1586 మంది పురుషులు 1557 మంది స్త్రీలు మొత్తం 3143 మంది ఉండిరి వీరిలో 6-15 సం॥ల వయస్సు గల 220 మంది బాలురు 200 మంది బాలికలు షెడ్యూలు జాతులవారు షెడ్యూలు తరగతులవారుకలసి 606మంది ఇచట ఇండ్లన్నియు ఒకే చోట గుంపుగా ఉన్నవి వీటిలో 359 మట్టి మిద్దెలు 5 పెక్కు అంతస్థులు గల భవనములు కలవు గ్రామస్థులలో 15 శాతమువారు వరి అన్నమును 45 శాతము వారు జొన్న అన్నమును 40 శాతము వారు ఇతరాన్నములను తిందురు వీరు బావి నీటిని త్రాగుదురు మంచినీళ్ళ ఎద్దడిలేదు

పాలేరు పెద్దచెరువు చిన్నచెరువు ఈ గ్రామమునకు గల నీటివసతులు వీటి క్రింద వరి ఆరిక వేరుసెనగ మినుములు మొదలగు పంటలు పండును ధాన్యమును గరిసెలలో గోడౌనులలో నిలువ చేయుదురు ఫలసాయములను లారీలపై నంద్యాలకు ఎగుమతి చేయుదురు ఇచట 68 ఎకరముల చీనీ తోటలు 8 ఎకరముల ద్రాక్షతోట 30 ఎకరముల మామిడితోటలు 5 ఎకరముల పూల తోటలు కవు చీనీ పండ్లను ద్రాక్షపండ్లను మామిడిపండ్లను పూలను నంద్యాల కడపలకు రవాణా చేయుదురు స్థానిక అవసరములకు సరిపడు ఉల్లిని మిరపకాయలను పండింతురు 1966-67 సం॥లో పంటల క్రింద 3418 ఎకరముల భూమి ఇచట ఉపయోగపడినది కాలువ క్రింద 9 ఎకరముల భూమి, చెరువుల క్రింద 78 ఎకరముల భూమి సాగు చేయబడు చున్నది 34 ఆయిల్ ఇంజనులు 4 ఎలెక్ట్రిక్ ఇంజనులు 115 ఎకరములకు నీటిని సరఫరా చేసెను ఇచటి భూమిలో 1294 ఎకరముల నల్లరేగడి నేల 1772 ఎకరముల మిశ్రమ రేగడి నేల 27 ఎకరముల ఇసుక నేల 45 ఎకరముల మొరుసునేల కనిపించును

ఈ గ్రామములో 907 గేదెలు 226 ఆవులు 30 ఎద్దులు 63 దున్నలు 63 మేకలు 1409 గొర్రెలు 29 గాడిదలు 2 గుర్రములు 1175 కోళ్లు ఉన్నవి ప్రతిరోజు పాలు 20 లీటర్లు 9 కి గ్రా నెయ్యి 0 కి గ్రా మాంసము 20 గ్రుడ్లు స్థానికులు ఉపయోగించుకొని 40 లీటర్ల పాలు 40 కి గ్రా నెయ్యి 100 గ్రుడ్లు నంద్యాలకును 160 కి గ్రా మాంసము నూనెపల్లికిని ఎగుమతి చేసిరి

ఈ గ్రామ ప్రజలు ముఖ్యముగా వ్యవసాయము మీద కూలిమీద ఆధారపడి జీవింతురు దుకాణాదారులు బట్టాలు టాంగాలు ఎద్దుబండ్లు తోలువారు కంసాలివారు వడ్రంగివారు కమ్మరులు కుమ్మరులు శాపీపనివారు మంగలివారు చాకలివారు గొల్లలు వడ్డెరవారు కలరు ఒకవడ్ల మగ్గము కలదు ఇవి స్థానిక అవసరములకు పనికి వచ్చును రాతి క్వారీ నుండి సానికులకు గృహములు కట్టుకొనుటకు ఎర్రరాయి లభించును వ్యవసాయదారులకు సరిపడు కూలీలు దొరుకుదురు

అయ్యలూరునకు 3 మైళ్ళలో నంద్యాల రైల్వే స్టేషను ఉన్నది గ్రామములో కంకరరోడ్లు మట్టిరోడ్డు ఉన్నవి దీనిని పొరుగు గ్రామములతో బాటరోడ్లు కలుపుచున్నవి ప్రయాణములకు రెండుగుర్రపు బండ్లు 180 ఒంటెద్దు బండ్లు 10 రెండెడ్ల బండ్లు 53 సైకిళ్ళు ఉపయోగపడుచున్నవి

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు ఎలిమెంటరీస్కూలు ఉర్దూ ఎలిమెంటరీ స్కూలు ఉన్నవి ఇది పంచాయతీపాలన కల గ్రామము ఇచటిపంచాయతీకి ఆదాయము రు3482 30లు ఇచటి పంచాయతీ గ్రంథాలయము సహకారసంఘము కలవు ఇచట సహకారసంఘము 3 మంది గ్రామస్థులకు అప్పులిచ్చినది ప్రైవేటుగా అప్పులిచ్చువారు కూడ కలరు 12 కిరాణాదుకాణములు రెండు కాఫీహోటళ్ళు ఒకటి సిగరెట్టు సోడా దుకాణము 2 సైకిళ్ళషాపులు 2 ఇతర షాపులు గ్రామములో ఉన్నవి పశురోగాలకు నాటువైద్యము చేయువారుకలరు

తంతికార్యాలయమునకు టెలిఫోనునకు కళాశాల చదువులకు 4 మైళ్ళలోనున్న నంద్యాలకు గ్రామస్థులు పోవుదురు పురుళ్ళ ఆసుపత్రికి జనరల్ ఆసుపత్రికి పశువుల

అను తిరిగి కోర్టులకు సబ్ రిజిష్ట్రారు ఆఫీసుకు నంద్యాలకే గ్రామస్థులు పోవుదురు

ఈ గ్రామములో కోదండరామస్వామి నీలకంఠేశ్వర స్వామి ఆంజనేయస్వాముల దేవాలయములు శంకరస్వామి మఠము ఒకమసీదు కలవు ఈ దేవాలయములకు 94 ఎకరముల మెట్ట ఒక ఎకరము మాగాణికలదు మసీదునకు 101 ఎకరముల మెట్ట ఉన్నది

ఇచ్చట శిథిలమైన కోట ఒకటికలదు నవాబులను నందన చక్రవర్తి పాలించినారట పూర్వము ఇచ్చట అహోబిల మఠాధిపతులు ఉండెడివారట

మా శ్వే

## అయ్యవంశము చూ అయ్యనచోడి

## అయ్యవారిపురము

అయ్యవారిపుర ప్రశంస చాటుపద్యమణిమంజరి రెండవ భాగమున 251 వ పుటలోని యొక సీసమాలికలో గనవచ్చు చున్నది ఈ సీసమాలిక సుమారు 78 పాదములతో నొప్పు చున్నది ఇందు దేసూరిరెడ్ల పరాక్రమము వర్ణితము పంట వంశీయుడైన వేటకృష్ణారెడ్డిని సంబోధించుచు నప్పటికాలపు కవి యొకడు చెప్పిన సీసమాలిక యిది విష్ణుదేవునిపాదమున బుట్టిన గంగకు సైదోడని పేరుగా చినదిప టవ శము ఇట్టివ శమున యెల్లన్నజనియించెను ఈతనికి అయ్యన్న కృష్ణప్ప పేరప్ప నాగన్న గంగన్న రంగప్పఅనునార్వురుతనయులు కలరు బహుశః బాల్యముననే తల్లిదండ్రులు గతించుటచేతనో యేమో వీరిని మేనమామయగు దేవారెడ్డి చెన్నారెడ్డి పెంచి పెద్దజేసెను ఈసోదరషట్కమున చేరొదినవారు నలుగురు మాత్రమే కృష్ణప్ప దేసూరికోటకు ప్రభువు గంగన్న రంగప్పలు కదనవాం వీరులు నాగన్న కడు శూరుడు వీరికిపినతండ్రి పెదకృష్ణారెడ్డి ఇతడు మహాశూరుడు బీజాపుర పాదుషావుల ప్రతినిధి గోల్కొండ నవాబు అధీనములోనున్న కోటలు ముట్టడించుచు మార్గమున నున్న అయ్యవారిపురమును తగులబెట్టెను ఈవృత్తాంతమును చెప్పుటకు ముందు ఆనాటి రాజకీయములనుగూర్చి ముచ్చటిం చుట మిక్కిలి అవసరము

క్రీ శ 1650 తో విజయనగరసామ్రాజ్యము అంత రించెను యవనులు ఆసామ్రాజ్యమును ఎవరికి దక్కినది వారు కబళించిరి అట్టివారిలో పెద్ద భాగస్థులు గోల్కొండనవాబు బీజాపూరు సుల్తానులు విజయనగరసామ్రాజ్యములోని తూర్పు భాగము అనగా నేటి గుంటూరు నెల్లూరు కడప చిత్తూరు కర్నూలు అనంతపురము జిల్లాలు మిళనాడు రాష్ట్రము నందలి చెంగల్పట్టు ఉత్తర ఆర్కాడు జిల్లాలు గోల్కొండ సుల్తానుకు దక్కినవి వీనికి పడమట దక్షిణము నున్న రాజ్యము బీజాపూరుసుల్తానుకుదక్కినది ఇట్లు యవనప్రభువులు రాయ రాజ్యమును పంచుకొన్నను ఒండొరులకు పొత్తుకుదరక నిరంత రము కలహములకు కాలుద్రవ్వుచుండిరి ఆనాటి గోల్కొండ సుల్తాను ప్రతినిధి నవాబు య్యదు హ న్మహమ్మదు మీర్ జుమ్లా అనువాడు జాపురమువారి ప్రతినిధి ఖాన్ మహమ్మదు అనువాడు ఇతనికి ఖాన్ ఖాన్ అను బిరుదము కలదు ఈబిరుదనామముతో నీతడు పిలువబడుచుండెను గోలకొండ రాజ్యమునకు విధేయులై వెలుగోటివారు వెంకటగిరిని దామెరలవారు కాళహస్తిని చెంజి పరిసరప్రదేశములను పాలించుచుండిరి వీరి అధీనములోనున్న మధురాంతకము కరుగుడిపాళెములు వేలుగోటియాచమ నాయునికిని దేసూరు మటమును కంచి పూనమల్లి మున్నగు కోటలు దామెరల వెంకటప్పనాయనికిని చెందియుండెను సీస మాలిక సంబోధనమునకనవచ్చు వేటకృష్ణారెడ్డి దేసూరికోటను పాలించుచుండెను వీరు గోల్కొండసుల్తాను అనుయాయులు ఆనాటి చెంజిదుర్గాధిపతి అంబరుఖానుడు ఈయనక్రింద మురార్జుపల్లి జాలోజీఅహిపతిరావు బాజఖాను కైరాతఖాను మహమ్మదుఖాను అను సర్దారులు కలరు వీరు బీజాపూరు ప్రతినిధియగు ఖాన్ ఖాన్ అనుయాయులు

బీజాపూరువారు గోల్కొండవారు ఒకరిరాజ్యమొకరు కబళింప యత్నించుచు సమయమునకై వేచియుండిరి కర్ణా టకము మొత్తమును తమతమ అధీనములలోనుంచుకొనవలయు నని వీరిరువురును పేరాశతోనుండిరి ఇంతలో నొక్క ఘటన జరి గెను గోల్కొండ ప్రతినిధిమీర్ జుమ్లా బీజాపురమువారికి చెంద వలసిన గుత్తిదుర్గమును ఆక్రమించెను గుత్తిదుర్గము గండికోట దురమునకు పడమట గలదు గోల్కొండ బీజాపురసుల్తానుల ఒడంబడికప్రకారము గుత్తిదుర్గము బీజాపురమువారికి చెందవలసియుండెను అది అక్రమమైన ఈదురాక్రమణము క్రమముగా ఇరు పురినడుమ పోరుకు దారితీసినది బీజాపురప్రతినిధి ఖాన్ ఖానుడు గోల్కొండవారొనర్చిన దానికి ప్రతిచర్యగా గోల్కొండవారి గండికోటదుర్గమునాక్రమించుటకై దండును పంపెను అంత టితో అతడు తృప్తిచెందక గోల్కొండవారి అధీనములోనున్న

ఇతర దుర్గములను ఆక్రమించుటకై చెంజీదుర్గాధిపతియగు ఆ ఖారుఖానునకు ఆజ్ఞయొసగెను. ఆ ఖారుఖానుడు తన అధీనములోనున్న సర్దారులను వెంటకొని సైన్యముతో గోల్కొండవారి అధీనములోనున్న మటముకోటను ముట్టడించి దానిని వశము చేసుకొనెను. దానిరక్షణకై దుర్గాధిపతిని నియమించెను. మటముకోట నేటి తమిళనాడురాష్ట్రము ఉత్తర ఆర్కాటుజిల్లా వందవాసితాలూకాలో నున్నది. దీనికి సమీపమున చెంజీదురము కలదు. అంబారుఖాను సైన్యము పరిసరమందున్న ఆకోట తెల్నాటికోటలను వశము చేసుకొనెను. నేటి తమిళనాడురాష్ట్రము చెంగల్పట్టుజిల్లాలోనిదగు కరుగడి పాళెము కంచి మున్నగు ప్రదేశముల నాక్రమించుటకై అంబారుఖాను బయలుదేరెను. వారికి మధ్యమార్గమున అయ్యవారిపురము అనుగ్రామము కనిపించెను. మురార్జల్లి ఖాలోజీ అహోపతిరాయడు అను సర్దారులు కొంతసైన్యముతో ఆగ్రామమున ప్రవేశించి ఇండ్లు దోచుకొని గ్రామప్రజల కొందరిని వధించి ఆ తటతో తనివితీరక ఆగ్రామమును దగ్ధమొనర్చిరి. ఈవిషయమే సీసమాలికలో ఇట్లున్నది.

"అహోపతిరాయడు నయ్యవారిపురంబు
పేటలు గాల్చియు బెళుకుగాంగంచిపై జగడ
మిచ్చిరి ప్రబల్ గిలిపాలు (చా మ II 251 పుట)

పాపము హతశేషులైన ప్రజలు అరచేతిలో ప్రాణములు పెట్టుకొని గ్రామమును వీడి పారిపోయిరి. అయ్యవారిపురము నేటి కాంచీపురముతాలూకాలోని అయ్యంపేట అగునేమో అని కొందరు భావించుచున్నారు. ఇట్లు అయ్యవారిపురమును భస్మమొనర్చి అంబారుఖానుడు దండుతో కంచిని జేరెను. అంతటితో ఆతనికి చుక్కెదురైనది. ఆతని విజయపరంపర అంతటితో ఆగిపోయినది. ఆతడు పట్టుకొనిన మటముకోట దామెరల వెంకటప్పనాయని వశములోనిది. ఈనికి దేసూరికోటప్రభువగు కృష్ణారెడ్డి నమ్మినబంటు. మటముకోట దేసూరుకోటలు రెండును సమీపప్రదేశముననే గలవు. కృష్ణారెడ్డి దామెరలవెంకటప్పానాయని సోదరుడగు అకప్పనాయని అనుమతి పొంది ఆ ఖారుఖానునని పీచమణచుటకును ఆతడు ఆక్రమించిన తమ కోటలను తిరిగి స్వాధీన మొనర్చుకొనుటకును సైన్యముతో సిద్ధపడెను. దేసూరికోట రక్షణబాధ్యత ఆతని ఎనతండ్రియైన పెదకృష్ణారెడ్డిని అల్లుడైన దేవారెడ్డిని వీరుడైన పెద్దన అనువానికిని అప్పగించెను. తాను గొప్పసైన్యమును వెంటగొని శత్రువశమైన మధురాంతకమును ముట్టడించి దానిని తిరిగి స్వాధీనమొనర్చుకొనెను. ఎమ్మట మటముకోటపైబడి దానికి కాపున్న దుర్గాధిపతి వధించి దానిని తిరిగి తనవశము లోనికి దెచ్చెను. అవెమ్మట చెంజీదుర్గముపైకి దండును నడపెను. సైన్యము ఉత్సాహముతో కోటనెక్కి చెంజీవీధులలో ప్రవేశించి శత్రువులచే నిర్బంధింపబడిన గజ్జములను విడిపించెను. లక్ష్మీపురము మొదలగు పేటలను సైన్యము కాల్చివేసెను. ఈయుద్ధముననే కృష్ణారెడ్డి సోదరుడు నాగన్న తన బాహుబలమును చూపి శత్రువులను సంహరించి తుదకు తాను వైరులచే నిహతుడయ్యెను.

కంచిని నిరాఘాటముగా ప్రవేశించిన ఆ ఖారుఖానునకు శత్రువుల విజయవార్తలు వినిపించెను. ఆతడు శత్రువులకు ప్రతిక్రియ చేయలేక మిన్నకుండెను. కృష్ణారెడ్డి ఇట్లు అసహాయశూరుడై విజయములను బడసి దామెరల వెంకటప్పానాయని ప్రశంసల నందుకొనెను. కృష్ణారెడ్డి ధైర్యసాహసములకు మెచ్చి గోల్కొండసుల్తాను ఆయనకు అనేక బహుమతుల నొసగెను. అప్పట్టుననే కృష్ణారెడ్డిని సంబోధించుచు ఆనాటికవి దేసూరి రెడ్ల పరాక్రమమును చాటు సీసమాలికను చెప్పెను. సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులకు డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ఈవంశచరిత్రను వివరించిరి.

తం అం శా

## అయ్యవర్మ

అయ్యవర్మ ప్రశంస ఆతని కుమారుడు మాధవవర్మ ఇచ్చిన పెనుకొండ శాసనమునందు కాన్పించుచున్నది (ఆం సూ శాస్త్ర I 222). అయ్యవర్మ మాధవవర్మలు పశ్చిమ గాంగవంశపు రాజులు. మాధవుడు తాను పల్లవమహారాజు స్కందవర్మచే సింహాసనాసీనుడు చేయబడినట్లు పెనుకొండశాసనములో ప్రకటించుకొనెను (ఎపి ఇ XIV 331). అట్లే తన తండ్రి అయ్యవర్మ పల్లవమహారాజు సింహవర్మచే సింహాసనాధిష్ఠితుడు చేయబడినట్లు వ్రాయించెను. పెనుకొండశాసనకాలము లిపి శాస్త్ర ప్రమాణములనుబట్టి క్రీ శ 475 సంవత్సర ప్రాంతమని నిర్ణయింపబడినది. దీనిని బట్టి పశ్చిమ గంగవంశమువారు పల్లవమహారాజులకు అధీనులై పరిపాలన మొనర్చిరని తెలియుచున్నది. పల్లవుల వంశావళీ నిర్ణయము పెక్కు సమస్యలతో కూడియున్నది. మాధవుని

శాసనము ననుబట్టి క్రీ శ ఐదవశతాబ్ది అంతమున సింహవర్మ స్కందవర్మ అను పల్లవచక్రవర్తులు దగ్గరదగ్గర కాలములో పరిపాలించినట్లు ఏర్పడుచున్నది పల్లవచరిత్ర నిర్మాణములో ముఖ్యాధారముగ పరిగణింపబడుచున్న ఉదయేందిర శాసనము నందునుని సింహవర్మ స్కందవర్మలు ఆక్రమములోనే చెప్పబడుటచే ఉదయేందిర పెనుగొండశాసనములందలి పల్లవరాజులు ఒక్కరే అనియు వారు క్రీ శ ఐదవ శతాబ్ది అంతమున కాంచీపుర చక్రవర్తులుగా ఉండిరనియు తెల్లమగుచున్నది

ఇక్కడ మరికొన్ని విశేషములను గుర్తింపవలసి యున్నది పల్లవచక్రవర్తిని సింహవర్మ కాలనిర్ణయము చేయుటకు మరియొక ఆధారము తోడ్పడుచున్నది ఇది సింహనంది యను జైనాచార్యుడు వ్రాసిన లోకవిభాగము అను భూగోళ విషయికగ్రంథము సింహనంది తన గ్రంథమును కాంచీపురాధీశ్వరుడైన సింహవర్మ 22 వ రాజ్యవర్షము కు సరియగు శక 380 న వత్సరమున వ్రాసి ముగించినట్లు చెప్పుకొన్నాడు అనగా పల్లవసింహవర్మయొక్క 22 వ రాజ్యవర్షము క్రీ శ 458 అగుచున్నది ఈ కాంచీపురాధీశ్వరుడు క్రీ శ 436 నందు పల్లవసింహాసనము నధిష్ఠించెనని ఏర్పడుచున్నది ఇతడు క్రీ శ 460 వరకును పరిపాలించెను ఈతని కుమారుడు స్కందవర్మ 460 నుండి 485 వరకును పరిపాలన చేసియుండును

పల్లవులకు కదంబవంశమువారు ప్రబల శత్రువులుగ ఉండిరి కదంబవంశమును మయూరశర్మ యను బ్రాహ్మణ వీరుడు స్థాపించెను వీరు పల్లవాధికారమును ధిక్కరించి పశ్చిమ సముద్రతీరము శ్రీపర్వతముల నడిమిదేశమును స్వతంత్రముగ పాలించుచుండిరి పల్లవులకును వీరికిని నడుమ వైరానలము ప్రజ్వరిల్లుచుండెను కదంబులఔద్ధత్యమును అణచుటకై సింహవర్మ ఒక ఉపాయమును అవలంబించెను కదంబులకు ప్రతిస్పర్ధులై వారి ధాటిని నిలువరింపగల మరియొక రాజకుటుంబమును ఈతడు ఆంధ్రకర్ణాటదేశముల సరిహద్దు ప్రాంతములందు నెలకొల్పెను వీరే పశ్చిమగాంగులు అనబడువారు వీరు పల్లవులకు మిత్రులును సామంతులును అయి కదంబుల దురాక్రమణను ఎదురొడ్డినిలుచుటకు ప్రయోగింపబడిరి ఇట్లు స్థాపింపబడిన పశ్చిమగంగవంశ ప్రభువే సైన పేర్కొనబడిన అయ్యవర్మ లేక ఆర్యవర్మ వీరికి కావేరీతీరమందలి తలకాడు ముఖ్యపట్టణము వీరిరాజ్యమునుగాంగవాడి యందురు

పశ్చిమగంగవంశమువారు మూడు నాలుగు తరముల వరకును కాంచీపుర పల్లవులకు మిత్రసామంతులై యుండిరి అయ్యవర్మకుమారుడు మాధవవర్మ సింహవర్మ కుమారుడైన స్కందవర్మకు (క్రీ శ 460 85) సమకాలికుడై అతనిచే గాంగసింహాసనముపై ప్రతిష్ఠింపబడెను పశ్చిమగాంగులు పల్లవుల అనుమతియు మైత్రియు కాపట అగుచుండగా పశ్చిమాంధ్రమునందు కొంత భాగమును ఆక్రమించి పాలించిరి మాధవుని పెనుగొండశాసనమున కిదియే అర్థము అయ్యవర్మ కాలమునకే వీరు పశ్చిమాంధ్రమున నెలకొనిరో లేదో తెలియదు

మం ల రం

## అరగొండ

అరగొండ చిత్తూరుజిల్లా బంగారుపాలెం సబ్‌తాలూకాలో ఉన్నది దీనికి చరిత్రప్రసిద్ధి గల అర్ధగిరి పట్టణమను పేరుకలదు అర్ధగిరిపట్టణము శిథిలమయిన తరువాత ప్రస్తుతపు అరగొండగ్రామము ఏర్పడినది దీనికి 12 మైళ్ళలో చిత్తూరు పట్టణము ఉన్నది తూర్పున దిగువమాగం పడమట గాజుల పల్లి ఉత్తరమున ఈచేనేరి దక్షిణమున మత్యం కలవు ఈగ్రామ విస్తీర్ణము 29 7 ఎకరములు గుండ్లకొండ దొర్లుగుడు రాకాసిగుబ్బలు ఉన్నవి గుండ్లకొండ తెల్లరాతిమయము

1961 సం॥ జనాభా లెక్కలప్రకారము ఈగ్రామమున పురుషులు స్త్రీలు కలిసి 3492 మంది ఉండిరి వీరిలో మెద్యాలు జాతులవారు 801 మంది మెద్యాలు తరగతులవారు 1 7 మంది ఇచట ఇండ్లు ఒక వరుసలో కట్టబడినవి వీటిలో 600 పెంకుటిండ్లు 50 కాంక్రీటు ప్పుగల ఇండ్లు 50 ఒక అంతస్తుగలమేడలు 12 ఎక్కువ అంతస్తులుగల భవనములు ఉన్నవి వీధులు దీర్ఘచతురస్రాకారముగ ఉన్నవి జనులలో 75 శాతమువారు వరిఅన్నమును 25 శాతము వారు రాగి అన్నమును తిందురు బావినీటిని త్రాగుదురు మంచినీటి ఎద్దడి లేదు

బహుదానది గుడికాలువ కొత్తకాలువ కమటం కాలువ కొండరాజుకాలువ ఓటిచెరువు కోమటివానికుంట వడ్డెవానిచెరువు మడవనేలిపెద్దచెరువు ఎదర్లచెరువు శేషం నాయనిహొద్దు గొల్లపల్లిచెరువు మొదలయినవి ఈగ్రామపునీటి వనరులు వీటిక్రింద వరి చెరకు రాగి జొన్న పేరుశనగ

మొదలగు పంటలు పండును నీటిని బండ్లపై ఉత్తూరునకు రవాణాచేయుదురు 1966 67 సం॥లో 240 ఎకరములమామిడి తోటలు 14 ఎకరముల కొబ్బరితోటలు ఇచ్చట ఉండెను కొబ్బరికాయలను స్థానికులు ఉపయోగింతురు రు 50 000 ల విలువగల మామిడికాయలను మద్రాసుకు బొంబాయికి ఎగుమతి చేసిరి గ్రామస్థులు తమ అవసరములకు సరిపడు వంకాయలు టొమేటోలు ఎర్రగడ్డ మొదలగు కూరగాయలను పండించిరి పంటలక్రింద 1700 ఎకరముల భూమి ఉపయోగపడెను కాలువక్రింద 257 ఎకరముల భూమి బావులక్రింద 150 ఎకరముల భూమి సాగుబడి అయెను రెండు ఆయిల్ ఇంజనులు 320 ఎలెక్ట్రిక్ మోటారులు నీటిని తోడుటకు ఉపయోగపడెను మూడు ట్రాక్టర్లు 600 ఎకరములను దున్నెను ఇచట 600 ఎకరముల ల్లరేగడినేల 1800 ఎకరముల ఎర్రరేగడినేల కలదు

ఈ గ్రామములో 500 ఆవులు 200 గేదెలు 400 ఎద్దులు 8 ఆబోతులు 100 మేకలు, 500 గొర్రెలు 60పందులు ఉన్నవి పాలు పాలపదార్థములు మాంసము స్థానికులు ఉపయోగింతురు

ఈగ్రామ ప్రజలు వ్యవసాయముపై కూలిపై కుటీర పరిశ్రమలపై జీవింతురు దుకాణాదారులు ఎద్దుబండ్లతోలువారు కసాలివారు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తెలికలవారు కలరు మంగలివారు చాకలివారు గొల్లవారు వడ్డెరలుకూడ కలరు ఇచటి 4 వడ్లమరలు గ్రామ అవసరములకు ఉపయోగపడును మేదర కుమ్మర కుటీర పరిశ్రమలవలన 31 కుటుంబములు జీవించుచున్నవి దినమునకు కూలీరేటు పురుషునకు రు 3/- లు స్త్రీకి రు 2 50 లు

స్వయంభూదేవాలయము రాములవారిగుడి నాలుగు శక్తిదేవతలగుడులు ఒకమసీదు ఇక్కడకలవు గవర్నమెంటువారు దేవాలయపు ఖర్చుల క్రింద రు 666లు ఇచ్చుచున్నారు మహాశివరాత్రి శ్రీరామనవమి ఉత్సవములు జరుగును

అరగొండకు 12 మైళ్ళదూరములో ఉత్తూరు రైల్వే స్టేషను ఉన్నది ఈ గ్రామము బసు మార్గముపైన ఉన్నది ప్రైవేటుబస్సులు ప్రతిఅరగంటకు ఉత్తూరునుండి అరగొండకు ఉత్తూరునుండి అరగొండమీదుగా బంగారుపాలెమునకు పాకాలనుండి అరగొండమీదుగా బంగారుపాలెమునకు పోవును గ్రామములో 6 మైళ్ళ కంకరరోడ్లు ఉన్నవి దీనిని పొరుగు గ్రామములతో మట్టిరోడ్లు కలుపుచున్నవి ప్రయాణమునకు రెండు మోటారుకార్లు 10 ఒంటెద్దుబండ్లు 50 రెండెద్లబండ్లు 180 సైకిళ్లుకూడ ఉపయోగించుచున్నవి

ఈగ్రామమున బ్రాంచిపోస్టాఫీసు మిడిల్ ఎలిమెంటరీస్కూలు జిల్లాపరిషత్తు హైస్కూలు ఉన్నవి 9 మీటర్ల చుట్టుపట్టు గ్రామములనుండి కూడ విద్యార్థులు ఇచటి హైస్కూలు చదువులకు వత్తురు విద్యుచ్ఛక్తిని 500 ఇండ్లు ఎలెక్ట్రిక్ మోటారులు ఉపయోగించుకొనును ఇచటి గ్రామసహకారసంఘము 200 మందికి అప్పులిచ్చినది పురుళ్ళ ఆసుపత్రి ప్రభుత్వపశుగణాభివృద్ధికేంద్రము ఇక్కడ ఉన్నవి వారమునకొకమారు గ్రామసంత జరుగును ఈ సంతలో పప్పుధాన్యములు కూరగాయలు వస్త్రములు మొదలయినవి లభించును

తంతికార్యాలయమునకు జనరల్ ఆసుపత్రి సినిమా థియేటర్లకు కోర్టుకు రిజిస్ట్రారు ఆఫీసుకు ఉత్తూరునకును పోలీసుస్టేషనునకు వెంకటగిరికిని తాలూకాకచేరి బాకు అభివృద్ధికేంద్రమునకు 8 మైళ్ళలోనున్న బంగారుపాలెమునకు పోవుదురు కళాశాల చదువులకు విద్యార్థులు ఉత్తూరునకు పోవుదురు

స్వయంభూదేవుని గుడిలోని లింగము స్వయముగా పుట్టినదని చెప్పెదురు రాములవారి గుడివద్ద 10 × 10 × 1 కొలతలుగల ఒకబండ కలదు దీనిని భూతములు బండ అందురు గ్రామమునకు నలువైపుల నాలుగు శక్తిదేవతల గుడులు ఉన్నవి అర్ధగిరిపట్టణము గుండ్లకొండవద్ద ఉన్నట్లు పురాణములలో కలదు అచటి పొలములలో శిథిలవస్తువులు రాతివస్తువులు ఇండ్లపెంకులు దొరికినవి దొరికిన రాళ్ళపై ప్రాచీన లిపికి సంబంధించిన శాసనములుకలవు స్వయంభూదేవుని ఆలయమున ఇట్టిశిలాశాసనములు అనేకములు ఉన్నవి ఈ ఆలయములు విజయనగరరాజుల కాలమున నిర్మింపబడినట్లు తెలియుచున్నది స్వయంభూదేవాలయము నుండి గుండ్లకొండకు ఒక భూగర్భమార్గము ఉన్నదని చెప్పుదురు ఆ మార్గమున ఇపుడు ఎవ్వరును వెళ్లుటకు వీలుకాదట

మా శ్వే

అరటిరేవుల చూ అత్తిరాల

## అరట్లకట్ట

అరట్లకట్ట తూర్పుగోదావరిజిల్లా కాకినాడతాలూకాలో ఉన్నది దీనికి 12 మైళ్ళలో కాకినాడపట్టణము కలదు

ఈ గ్రామమునకు తూర్పున జమీ దారీపావర పడమట కడకుదురు ఉత్తరమున కొవ్వూరు దక్షిణమున శిగాపురం సరిహద్దులుగా ఉన్నవి ఈ గ్రామవిస్తీర్ణము 503 ఎకరములు

1961 సం జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామములో 1904 మంది పురుషులు 1953 మంది స్త్రీలు వెరసి 3857 మంది ఉండిరి వీరిలో 5 8 మంది షెడ్యూలుజాతులవారు 29మంది షెడ్యూలు తరగతులవారు ఇచట ఇండ్లన్నియు ఒకేచోట గుంపుగా ఉన్నవి వీటిలో 130 పెంకుటిండ్లు 3 కాంక్రీటు కప్పుల ఇండ్లు కలవు వరిఅన్నమే ఇచ్చటి జనుల ముఖ్యాహారము ఈ గ్రామమునకు చెరువు మధ్యభాగమున కలదు కాలువ సమీపమున కలదు చెరువునీటిని కాలువనీటిని బావులనీటిని గ్రామస్థులు త్రాగుదురు ఇచట మంచినీళ్ళ ఎద్దడి లేదు

2 మైళ్ళపొడవుగల కాకినాడకాలువ 2 1/2 మైళ్ళ పొడవుగల రెండుపంటకాలువలు మంచినీటిచెరువు ఈ గ్రామమునకుగల నీటివనరులు వీనిక్రింద వరి చేరుశనగ మిర్చలు మొదలగు పంటలు పండును పంటలను గాదెలలో పురులలో నిలువచేయుదురు పంటరకులను లారీలపై పడవలపై కాకినాడకు రవాణా చేయుదురు 1966 67వ సంవత్సరంలో పంటల క్రింద 1790 ఎకరముల భూమి ఉపయోగింపబడినది 19ఆయిల్ ఇంజనులు 3 ఎలెక్ట్రిక్ మోటారులు 90 ఎకరముల భూమికి నీటిని సరఫరాచేసెను నీటిని తోడుటకు గూడలు నత్తగుల్లలు గూడ ఉపయోగపడినవి

ఇచ్చట 530 గేదెలు 480 ఆవులు 5(2 ఎద్దులు 84 మేకలు 112 గొర్రెలు 35 పందులు 25) కోళ్లుఉన్నవి దినమునకు 400 లీటర్ల పాలు నెలకు 200 వీశెల నెయ్యి స్థానికులు ఉపయోగించుకొని 500 లీటర్ల పాలు 50 వీశెల నెయ్యి కాకినాడకు రవాణాచేసిరి

ఈ గ్రామప్రజలు ముఖ్యముగ వ్యవసాయముమీద కూలిమీద జీవింతురు కమీషన్ ఏజెంట్లు దుకాణాదారులు ఎద్దుబండ్లు తోలువారు గలరు కంసాలివారు వడ్రంగులు కమ్మరివారు శాపివారు మంగలివారు చాకలివారు కూడ కలరు ఒకవడ్లమర ప్రతిదినము 400 బస్తాల బియ్యమును తయారుచేసి కాకినాడకు రవాణాచేసెను వ్యవసాయదారులకు కూలీలు దొరకుదురు దినమునకు కూలి రు 3/-లు

ఈ గ్రామములో రామలింగేశ్వరస్వామి ఆలయము వేణుగోపాలస్వామి ఆలయము కలవు కట్లమ్మ అమ్మవారిగుడి రెండుచర్చిలు ఉన్నవి శ్రీ రామలింగేశ్వరస్వామికి 15 ఎకరములభూమి కలదు

ఈ గ్రామమునకు 12 మైళ్ళలో కాకినాడరైల్వేస్టేషను కలదు సమీపములో కాకినాడకాలువ ఉన్నది దీనిద్వారా కాకినాడకు ధాన్యము పడవలపై రవాణా అగును ఈ గ్రామమున 3 కంకరరోడ్లు గలవు ఇవి దీనిని పొరుగు గ్రామములతో కలుపుచున్నవి 60 రెండెడ్లబండ్లు 70 సైకిళ్లు ప్రయాణములకు గ్రామమున సహాయపడుచున్నవి

అరట్లకట్టలో బ్రాంచిపోస్టాఫీసు ఎలిమెంటరీస్కూలు ఉన్నవి విద్యుచ్ఛక్తిని 100 ఇండ్లు వాడుకొనును ఇది పంచాయతిపారిపాలనకల గ్రామము ఒక పంచాయతి గ్రంథాలయము ఉన్నది ఈ గ్రామముతో మూడు బహుళార్థసహకారసంఘములు రు 3 55 000లు గ్రామస్థులకు అప్పుగా ఇచ్చినవి ఇద్దరు ఇంగ్లీషువైద్యులు ఒక ఆయుర్వేదవైద్యుడు కలరు ఇచట వారపుసంతలో కాయగూరలు మాంసము లభించును 6 కిరాణాదుకాణములు 3 కాఫీహోటళ్లు 2 సైకిళ్ళ షాపులు 3సోడా సిగరెట్లు కిళ్ళీఅంగళ్ళు ఉన్నవి

గ్రామస్థులు తహశీలుకార్యాలయమునకు సినిమాథియేటర్లకు కోర్టులకు సబ్‌రిజిష్ట్రారుఆఫీసునకు తాలూకాకచేరికి 12 మైళ్ళలోనున్న కాకినాడకుపోవుదురు పోలీసుస్టేషనునకు 11 మైళ్ళలోనున్న గొల్లపాలెమునకును బ్లాకుఅభివృద్ధి కేంద్రమునకు 27 మైళ్ళదూరములోనున్న తాళ్ళరేవునకును పోవుదురు హైస్కూలుచదువులకు 5 మైళ్ళలోనున్న కరపకు కళాశాల చదువులకు కాకినాడకు విద్యార్థులు పోవుదురు ప్రజారోగ్యకేంద్రము పశువులఆసుపత్రి కరపలో ఉన్నవి

మా శ్వే

## అరట్లవారు

అరట్ల వారికి సంబంధించిన విషయములు కొన్ని చాటుపద్య మణిమంజరి రెండవ భాగమున (పుట 232) కనవచ్చుచున్నవి అరట్లవారు కాకతీయులను సేవించిన డెబ్బదిఇద్దరు నాయకవర్గములోని వారైన కావచ్చును వీరి విరుదావళిలో గండలపోరుగల్లు అనియున్నది ఓరుగల్లుగండలలో అనగా వీరపరేణ్యులలో వీరు పరిగణనమునకు వచ్చిరని తెలియుచున్నది.

కాకతీయ సామ్రాజ్య పతనానంతరము అరట్లవారు కల్యాణరాజులు అనబడు ద్వారసముద్రపు కర్ణాట ప్రభువులను

సేవించి యుండవచ్చును "భల్లాణ కొలువున మదహస్తిని పట్టు" అను వాక్యముచే భల్లాణరాజుల కొలువులో మదపుటేనుగును పట్టుకట్టి స్వాధీనము చేసుకొనిన శూరుడు వీరని స్ఫురించుచున్నది. కాకతీయ సామ్రాజ్యము విధ్వంసమైన పిమ్మట ఆసామ్రాట్టుచే మన్ననలందిన వీరులు, ధీశాలులు, నీతివేత్తలు మున్నగువారందరును ఆశ్రయము లేక చెట్టునకు ఒకరుగా వలసపోయిరి. విజయనగర సామ్రాజ్య స్థాపకులగు హరిహర బుక్కరాయలు ఇరువురును ఇట్లే ఓరుగల్లునుండి వెడలిపోయి క్రమముగ మహాసామ్రాజ్యమును నెలకొల్పిరి.

అరట్లవారికి ఈయింటిపేరు వారి గ్రామనామమును బట్టియే వచ్చియుండవచ్చును. వీరిది తెలంగాణములోని ఆరుట్లగ్రామమై యుండవచ్చును. అరట్ల ఆరుట్ల యగుటలో వింతలేదు. ఆరుట్ల ఇంటిపేరుగా కలవారు తెలంగాణములో ఇప్పటికిని నల్లగొండజిల్లాలో ఉన్నారు.

అరట్లవారిలో మొదట ఎన్నికకు వచ్చిన వీరుడు భల్లాణరాజుల కొలువులో మదపుటేనుగును వశీకరింపజేసికొని ప్రసిద్ధికి వచ్చినట్లు కాన్పించును. దీనికై అతనికి తొలివిడెమున్ను తొలికట్నమున్ను గౌరవార్థముగ లభించినవి. తరువాత వీరు మొల్లమూరువారని వ్యవహరింపబడినట్లు తోచును. వీరు మొల్లమూరులో నివాసముచేసి యుండవచ్చును. ఈ మొల్లమూరు ఎచటిదో తెలియదు. అరట్లవారి బిరుదావళి విషయమైన ప్రభువు పేరును తెలియవచ్చుటలేదు. ఈయన తండ్రి పేరు రాఘవుడని చెప్పవచ్చును. "మొల్లమూరి బిరుద రాఘవకుమార" అను సంబోధనము గమనింపదగినది. ఈ రాఘవకుమారుని ఒక ముఖ్యవిజయము కరెమల్లిదేవునితో యుద్ధముచేసి వానిని సంహరించుట. "ద్వాదశి సోమవారమునాడు యలమింట పడమటిబైట కరెమల్లిదేవునితో తలపడి" ఇత్యాది వాక్యముచే ద్యోతకమగుచున్నది. ఈ కరిమల్లిదేవుడెవ్వరో అతనితో యుద్ధము జరిగిన యలమిల్లు ఎక్కడిదో గుర్తింపవీలులేకున్నది.

మన్యమృగవేటకాడ అనుటచే ఆరుట్లవారు మన్నెపు రాజులను జయించినవారను విషయము ఊహింపవీలగుచున్నది. "బిరుదురాజుల తెంకోలుగండ" అనుటచే ఈవంశమువారికి బిరుదురాజుల అను ఇంటిపేరు కడపటికి స్థిరమైనట్లు కన్పించును. బిరుదరాజులవారు క్షత్రియులలో కనిపించుచున్నారు. ఇతర వర్ణములలో ఉన్నారేమో తెలియదు.

తెంకోలుగండ అనగా తెంకోలును జయించినవాడు అని తోచును. తెంకోలు అనగా బిక్కనవోలు కావచ్చును. ఇది తెలంగాణమునందున్నది. దోమకొండ సంస్థానాధీశుల పూర్వులైన కామినేనివంశమువారి ఇది ముఖ్యపట్టణముగా నుండెను. షట్చక్రవర్తిచరిత్రను వ్రాసిన మల్లారెడ్డి యీవంశమునకు చెందినవాడే. నిజామాబాదుజిల్లాయందలి కామారెడ్డి ఎల్లారెడ్డి మున్నగు గ్రామములు కామినేనివంశమువారు స్థాపించినవే. వీరు గోల్కొండ సుల్తానులకు సామంతులుగా ఉండిరి. బిరుదరాజులవారు అని చివరకు పేరుపొందిన అరట్ల లేక ఆరుట్లవారు కామినేనివంశీయులతో తలపడి వారి ముఖ్యపట్టణమైన బిక్కనవోలును జయించియుండవచ్చును. ఈ విజయము వీరు స్వతంత్రముగా తమ బలముతో సాధించినది కాకపోవచ్చును. గోల్కొండవారికి ప్రత్యర్థులైన విజయనగరాధీశుల దండయాత్రలలో భాగముగనే అరట్లవారు బిక్కనవోలును జయించియుందురు. జటప్రోలు సంస్థానాధీశులలో బింకోట గండమల్లభూపాలుని పేరు వినవచ్చును.

అరట్ల రాఘవవరకుమారుడు కోదండనారాయణదేవదివ్యశ్రీపాదపద్మారాధకుడు అనుటచే ఆపేరి దైవమును ఆరాధించినవాడని తోచుచున్నది. కోదండనారాయణుడను రాజు ఎవరును తెలియవచ్చుటలేదు. కావున కోదండనారాయణుడు అరట్లవారి కులదైవమని ఎంచవలెను. ఈవంశమువారు అశ్వారోహణమునందు ప్రవీణులని "తురగారోహణరేఖారేవంత" బిరుదము చాటుచున్నది.

వీరు బ్రాహ్మణభక్తి కలిగియుండిరి. సంగీత సాహిత్య భరత విద్యలందు వీరు ఆసక్తి కలిగి యుండిరి. వీరు భట్టులను కవులను విస్తారముగ ఆదరించిరి. వీరు భండనభీములు. "మొనకెక్కేనుతు రాహుత్తులగండ" అనుటచే వీరు ఖానుబలములను అనగా ముస్లాము బలములను ఎప్పుడైన మర్దించి యుండవచ్చును. ఖేనుడు ఖానుడు కావచ్చును. రాహుత్తులనగా రౌతులు లేక వీరులు అని భావింపనగును.

ఇట్లు అరట్లవారు శత్రుభయంకరులై ఆశ్రితపారిజాతులై అరట్లపురవరాధిపతులై విలసిల్లిరి.

తెం. అం. రా.

## అరతిరేవుల (అఱతురేవుల)

అత్తిరాల గ్రామమునకే పూర్వపు పేరు అఱతురేవుల కొందరు దీనిని అరతిరేవులని యని చదివినారు రేవు పదము చివరగల గ్రామనామములు తెలుగులో ఇంకను ఉన్నవి వాడరేవు వాడ్రేవు తాళ్ళరేవు ఇట్టివేకావచ్చును అత్తిరాలను గూర్చి ఆ పేరుగల వ్యాసము చూడదగును ప్రకృతము ఈ గ్రామనామము కాయస్థ అంబదేవుని మహాప్రధాని శాసనమునందు వచ్చినది (ద హిం X-448) ఈ మహాప్రధాని పేరు శాసనశిలలో నష్టమైనది శాసనకాలము శక 1201 ప్రమాది సంవత్సరము అనగా క్రీ శ 1279 అది కాకతిరుద్రమదేవి పరిపాలనాకాలము అంబదేవునిగూర్చి ఇంతకుముందు వ్రాయనైనది ఈ శాసనమునందు అతని మహాప్రధాని తన ఏలిక రాజ్యాభివృద్ధికై చేసిన దానవిశేషములు ధర్మకార్యములు వివరింపబడినవి అంబదేవమహారాజు వల్లూరుపట్టణము రాజధానిగా పొత్తపినాడు మొదలగు దేశములు పాలించుచుండగా తత్పాదపద్మోపజీవియైన మహాప్రధాని ప్రమాది సం॥ర పుష్య బహుళపంచమీ శుక్రవారమువాడు మకరసంక్రమణకాలమున పొత్తపివాటిలోని అఱతురేవుల మహాస్థానమునందలి వరకు రామేశ్వరదేవునకు పోలికొండూరు సర్వమాన్యముగా సమర్పించెను వరకురామేశ్వరునిగుడిమంటపము కట్టించెను అచ్చటి రామనాథదేవునకు కాడోలు అరతురేవుల సర్వమాన్యము చేసి మాడలు సమర్పించెను

ఈ మహాప్రధాని ధర్మప్రతిష్ఠాపనములు ప్రజోపయోగకార్యములు ఎదిగ్గ్సములై ప్రశంసనీయములుగ ఉన్నవి పొత్తపినాటిలో కాటమిరెడ్డి అడుగన ముప్పదియడుగులు కొలగట్టి కొలిపించెట ఈ కాటమిరెడ్డి ఎవరో తెలియదు ఏమైనను అతడు నిలచేసిన భూమికొలతమానముతో పొత్తపినాటిలో భూమిని కొలిపించుచుదురు భూమిని స్థిరము నట్టి న్నులు విధించుటకై ఇట్లు పొత్తపినాటిలో భూమిని సర్వే చేయించి ఉందురని భావించవలెను లేకాకయందు అత్రగంగ అను రాయసహస్రమల్ల కాలువ త్రవ్వించెను రాయసహస్రమల్ల అనునది అంబదేవ మహారాజుబిరుదుకావచ్చును అంత్రగంగ అనగా తెలిసినదముకాలేదు అంతర్గంగ అగునేమో అయినచో కొండలలోనుండి ప్రవహించివచ్చు బుగ్గటిని కాలువతీసి పారించిరి అని కావచ్చును ఇట్టిది ఒకటి చిన్నదైనను మహానంది క్షేత్రమునందుగలదు. ప్రాడ్లపాకమ (తాళ్ళపాక) గండపెండార కాలువ త్రవ్వించెను ఈ ప్రదేశములన్నియు కడపజిల్లా రాజంపేట తాలూకాలో ఉన్నవి బలిఅనుచోటను ఊటుకూరునందును అంబసముద్రమను చెరువులు త్రవ్వించెను

కడువగుడివద్ద అంబాపురమను అగ్రహారమును కాం చెను ఓలలోని అంబాపురమును శివపురము చేసెను అనగా శివభక్తులకు ప్రత్యేకించిన అగ్రహారముకావచ్చును ఈశాసన లేఖకుడు ఓలోలి కరణము చెవ్వరాజు కొడుకు సిద్దయ ఈతనికి సిద్దయఅనునామము జ్యోతియందలి సిద్ధవటనాథేశ్వరుని పేర పెట్టబడినదట ఇన్నియుత్తమధర్మములు నెలకొల్పిన పుణ్యాత్ముడైన మహాప్రధానిపేరు లభింపకపోవుట విచారకరము కాకతీయులనాడు ప్రజాక్షేమమునకును వ్యవసాయాభివృద్ధికిని ఎట్టి ఏర్పాట్లు కావించుచుండిరో ఈ శాసనము చక్కగా ప్రకటించుచున్నది

ఆం ల రం

## అరవపల్లి :

అరవపల్లి గ్రామము రేపల్లె రైల్వేస్టేషనునకు రెండు మైళ్ళదూరములో ఉన్నది ఇచ్చట 1961 జనాభా లెక్కలను బట్టి 1480 మంది ఉండిరి వీరిలో షెడ్యూల్డు జాతులవారు షెడ్యూల్డు కులములవారు 75 మంది వీరి ముఖ్యజీవనాధారములు వ్యవసాయము వ్యవసాయకూలి కులవృత్తులు

ఇచ్చట కాలకోటేశ్వరస్వామి దేవాలయము ఉన్నది రేపల్లె తాలూకాలోని ఉల్లిపాలెం జమీందార్లు ఈదేవాలయమును నిర్మింపించి వివాహసమయమున వారికుమార్తెకు దీనిని పసుపు కుంకుమ క్రిందఇచ్చిరి ఆమె నరసారావుపేట జమీందారుల కోడలు నరసారావుపేట జమీందారుల యాజమాన్యము క్రింద 30 సంవత్సరములు ఉత్సవములు జరిగెను తరువాత ఈ దేవాలయము ఎండోమెంటుబోర్డు వారి యాజమాన్యము క్రిందికి వచ్చినది ఈదేవాలయమునకు ప్రక్కనే గొల్లభామ దేవాలయము ఉన్నది

ఒక మేక రహస్యముగ తనపాలను కాలకోటేశ్వరస్వామికిచ్చెడిదట మేకలకాపరి అదృశ్యమును చూచి పాలను కొండమీదికి తెచ్చి సమర్పించెదము అనియు కొండమీదినుండి దిగి రావద్దని స్వామిని ప్రార్థించెను అప్పటినుండి యాదవులు వంతుల ప్రకారము పాలను స్వామివారికి కొండమీకి పోయి అర్పించుచుండిరి ఒకదినమున గర్భవతియగు ఒక

చిత్రము – ౭౯



కాకోలేశ్వరస్వామి దేవాలయము – అరవపల్లి

యాదవ యువతి వంతు వచ్చెను ఆమె కొండఎక్కలేక "కొండ దిగవచ్చి పాలను తీసుకొని పాలఖరీదునుగూడ ఇవ్వవలెనని" స్వామిని కోరెను ఆమెను వెనుదిరిగి చూడకున్న కొండదిగి వచ్చెదనని స్వామిచెప్పెను ఆమె అందులకు ఒప్పుకొనెను స్వామి దిగుచు వచినపుడు పెద్దధ్వని వినబడగా ఆమె వెనుక వైపునకు తిరిగెను స్వామి అతట ఆమె శిలయగునట్లు శపించెను ఆ శిలచుట్టు ఒక దేవాలయమును నిర్మించి స్వామితోపాటు ఆమెనుగూడ పూజింప దొడగిరి మాఘ బహుళ త్రయోదశి నుండి అమావాస్యవరకు మూడు దినములు స్వామి ఉత్సవములు జరుగును ప్రభల ఊరేగింపుకూడ జరుగును ఈ ఉత్సవములు 100 స॥ లపైనుండి జరుగుచున్నవి సంతతి దినములు జరుగును తినుబండారములు గాజుసామానులు పాత్రలు దీపములు అద్దములు దువ్వెనలు బొమ్మలు ఆట వస్తువులు దొరకును హరికథలు వీధినాటకములు జరుగును

మా శ్వే

## అరవరాముడు

అరవరాముని ప్రశంస రాయ వాచకమున గనవచ్చుచున్నది దీనిని విశ్వనాథనాయని స్థానాపతి రచించెను అరవరాముడు శ్రీకృష్ణదేవరాయల చేత వేగులవాడుగపనిచేసెను అయారాజ్యములయందు ప్రచ్ఛన్న వేషములతో సంచరించుచు అచ్చటి సమాచారములను ఎప్పటికప్పుడు తమ ప్రభువులకెరింగించుచుండెడి వేగులవారి పని

వేగులవారిలో అరవరాముడు కుశాగ్రబుద్ధి సాహసి. సమయోచితవర్తనుడు ఈతనిని అహమ్మదునగరు గోల్కొండల వార్తలు సేకరించుటకై కృష్ణదేవరాయలు నియోగించెను శ్రీకృష్ణదేవరాయలు క్రీ॥శ 1509 నుండి 1530వరకు విజయనగర సామ్రాజ్యమును అప్రతిహత శక్తితో పాలించెను రాయలు సింహాసనమున నధిష్ఠించినది మొదలు విజయనగర రాజ్యమును శత్రువుల బారి నుండి రక్షించి సుస్థిర మొనర్ప సంకల్పించెను

రాయల కాలమునాటికి బహమని రాజ్యము మూడు స్వతంత్ర మహమ్మదీయ రాజ్యములుగ విడిపోయెను. అందు బిజాపురమును యదులశాహు (ఆదిల్షా) అహమ్మదు నగరమును నిజాంషాహు (బర్హను నిజాం షా క్రీ శ 1508 1553) గోల్కొండను కుతుబ్‌ఉలముల్క (కులికుతుబ్షా క్రీ శ 151 -1548) అను వారు పాలించుచుండిరి. వీరితో పాటు మూడు హిందూ రాజ్యములు స్వతంత్రములుగ నాడు వెలసినవి. ఒంధు దేశము నుండి గోదావరివరకు గల ప్రదేశమును అఘుర్పురమువారు కేరళ మొదలు కృష్ణవేణి వరకు గల భూమిని కర్ణాటకము వారు జగన్నాథమునుండి బెడదకోట వరకు గల ప్రదేశమును గజపతులు పాలించుచుండిరి. వీనినుండి యెప్పుడైన ప్రమాదము సంభవింపవచ్చునని రాయలు యోచించెను. సైన్యమును పెంపొందించుట గూఢచారుల వలన ఇతర రాజ్యములయందలి సమాచారములు గ్రహించుట అనునవి రాయల ఆలోచనలో ముఖ్యవిషయములు. శ్రీకృష్ణదేవరాయలకడ అంతరంగిక గూఢచారులు నల్వురు కనవచ్చుచున్నారు. వారు వాయువేగిహనుమయ్య, మనోవేగి పురుషామృగమయ్య, ఫక్కీరు గోవిందజి, అరవరాముడు అనువారు. వీరు వివిధ వేషములతో శత్రురాజ్యములలో సంచరించి అచ్చటి వర్తమానములను సేకరించి రాయలకు నివేదించెడివారు. విజయనగరమున నూట ఇరవై మంది వేగులవారు ఉండినట్లు తెలియుచున్నది.

రాయలు కళింగమును జయించెను. సింహాచలమున జయస్తంభమును నాటెను. కల్యాణ వేంకటేశ్వరుల దర్శించెను. నూట యెనిమిది దివ్య తిరుపతులను డెబ్బదిరెండు దేవస్థానములను పదునెనిమిది శక్తులను సేవించెను. సేతువునకు పోయి రామనాథుని దర్శించి ధనుష్కోటిలో ఖడ్గమును కడిగెను. ఈతని పరాక్రమమునకు శత్రువులు వెరుగుపడుచుండిరి.

అరవరాముడు అహమ్మద్ నగరం గోలకొండ రాజ్యములలో కనిన వార్తలను రాయలవారితోను అప్పాజీ అయ్యమరుసు కొండమరుసు అనువారితో విన్నవించెడివాడు. ఆదినములలో తురకరాజ్యమున సంచరించుట అనిన సామాన్యమైన పనికాదు. మహమ్మదీయోద్యోగులు పరదేశస్థులను బాగుగ శోధించెడివారు. కోటలోనికి పోవునపుడు ఇతరులకు పట్టణములోని విశ్వాసపాత్రులు కొందరు పూచీఖత్తు ఈయవలెను. పూచీఖత్తు ఇచ్చినవారు అన్యదేశస్థులు పరారైనచో వారి నేరమునకు శిక్ష పూచీదార్లే అనుభవింపవలెను. కోటలోనికి పోవువారికి శిఖా ఇచ్చి పంపెడివారు. కొత్వాలు శిఖను చూచిగాని కోటలోనికి వారిని వదలడు. కోటనుండి తిరిగివచ్చునపుడు వారుపారుపత్యగానికి శిఖా ఇచ్చి అతడిచ్చిన శిఖాను కొత్వాలుకు చూపి కోట గుమ్మము వద్దకు రావలెను. ద్వారరక్షకులకు కూడ శిఖను చూపి కోటనుండి బయట పడవలయును. కోటలోపలికి పోయి బయటకు వచ్చుటకు ఆనాడు ఇంత తతంగము ఉండెడిది.

నేరము చేసినవారిని యవనరాజ్యములో ఆనాడు విధించు శిక్షలు కూడ మిక్కిలి కఠినముగా నుండెడివి. నడిమికి తెగవేయుట, రంపాన మనుష్యుల గోయుట, గోనెలో మనుష్యులను వేసి గట్టి ఇనుపగుదియలతో కొట్టుట, చెవులకు శింగాణికొనల వారుల తగిలించుట, మూటకట్టుగాకటి యెండలో దొరలించుట, కాలు చేయి చెవి ముక్కు కోసివేయుట, ఏనుగుకాలికి గట్టి లాగించుట వంటి శిక్షలు విధించెడివారు. లంచము ఇచ్చినచో ప్రాణములతో విడిచెడివారు. లంచము ఈయజాలని వారిని హింసించి వీధిలో చంపెడివారు.

రాయలు నియమించిన వేగులవారిపని కడు సాహసోపేతమైనది. యవన రాజ్యములలో విధించు దుర్భర శిక్షలను కన్నులార జూచియు వారు తఖీదార్లు చేయు శల్య పరీక్షలకు సముచిత రీతి సమాధానము లిచ్చుచు ఎవరికిని అనుమానము కలుగకుండునట్లు కోటలో ప్రవేశించి సమాచారముల సంగ్రహించి ఎట్లో ప్రాణములతో బయటకు రాగలిగెడివారు. వీరు అనేకభాషలను మాట్లాడెడివారు. వీరొక్కచోట నియమితముగ ఉండెడివారుకారు. పకీరులతో బైరాగులతో కలిసి వీరు సంచరించెడివారు. గంగానదినుండి ధనుష్కోటికిపోవు యాత్రికులతో కలసి వీరు తిరిగెడివారు. జనము గుంపుగా గూడి మాట్లాడుకొను చోట వీరుండి వారి సంభాషణము ను గ్రహించెడివారు. బహువేషములతో ప్రజలలో కలిసి వారి వారి భావములను వీరు గ్రహించెడివారు.

రాయచూరు ముద్గల్లు ముస్నగు దుర్గములను రాయలు అశ్రమముగా జయించుటకు వేగులవారి సమాచారమే కారణము.

ఇట్టి వేగులవారి కృత్యమును మిక్కిలి చాతుర్యముతో నెరవేర్చి విజయనగర సామ్రాజ్య సుస్థిరతకు మిగుల సేవచేసిన మహనీయుడు అరవరాముడు. చరిత్రలో ఈతని పేరు మాయమైనను రాయవాచకమున నిది స్వర్ణాక్షరములతో శోభించుచునే యున్నది.

హ వు

## అరవళ

అరవళ అను నతడు చోళమహారాజుయొక్క కుమారుడు ఈతని ౧ శ స దక్షిణ హిందూశాస మ దు కనిపచు చున్నది (ద హిం X నె 602) ఈ శాసనము అనంతపురము జిల్లా హిందూపురము తాలూకా బూందగడ్డ ల్లి అను గ్రామములో ఈశా న్యభాగమున ఉ న్న ఒక వీరగల్లుపై చెక్కబడి ఉన్నది శాసనము అం పూర్ణముగ నున్నది శాస ము మొత్తము నాలుగు పంక్తులు మాత్రమే—అ దులో మూడుప క్తులే కన వచ్చుచున్నవి—ఈమూడు పంక్తులలోను లిపి దోషములు వర్ణ భ్రంశములు కలవు శాసనకాలము తెలియుటలేదు

శాసనము

1 స్వస్తిశ్రీ చోళమహారాజు—
2 మగన్డు అర ళమహా
3 — — ద్విప - - భము — —
4 — — — —

శాసనము నందలి పదప్రయోగమునుబట్టి కొన్ని విశేషాం శము ను ఊహి ఎవచ్చును ఇ దుకు ఆధారము మగన్డు అను పదము న్డు అను ప్రత్యయము ఇప్పుడుమ ము వాడుచున్న డు ప్రత్యయము కు పూర్వరూపము (అనగా మహద్వా చక ప్రథమ ఏకవచన ప్రత్యయము (రాముడు) ఈ న్డు ప్రత్యయము మిక్కిలి ప్రాచీన రూపమని భాషాశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు ఇట్టిరూ ము న్ డయికట్టుకాలము కు ముందే డు అను రూపముగామారి భాషయ దు స్థిరపడిపోయినది అయి చో న్డు అ తమ దుగల రూపములు తెలుగు భాష యందు ఎప్పుడు ప్రచారములో ఉ డెనో తెలియుటలో ఎచో ఈ శా నము ఆకాలమునాటిదని స్థూలముగా నిర్ణయి ప వచ్చును

ఆ ప్రదేశము క్రీస్తు పూర్వ మైన రాయలసీమ క్రీ శ 6 9 శతాబ్దముల దుమ చోళమహారాజులనువారు పాలి ిరని తెలియవచ్చుచు న్నది వీరినే రేనాటి చోళులు అని ఎలుతురు వీరికాలపు శాసనములలో సత్యాదిత్యుని గోత్రన్డు (సత్యాదిత్యుడు గోత్రుడు) వ టి రూపములు తరుచు కనబచ్చుచు డను ప్రకృతశాస మునందలి మగను కూడ రేనాటి చోళులకాలపు భాషకు చెందినదేయని నిర్ణయిం చుట యుక్తివిరుద్ధముకాదు రేనాటిచోళుల పరిపాల ము ప్రధానముగ కడప జిల్లా య మను అన తపురము జిల్లా దక్షిణ భాగమ దు కొ తవరకును వ్యాపించి ట్లు కాన్పి చును రేనాటి చోళులలో ధనంజయుడు పుణ్యకుమారుడు విక్రమా దిత్యుడు సత్యాదిత్యుడు మొదలగు వారు కనవచు చున్నారు వీర దరును ఒకరి తరువాత ఒకరు రాజ్యముచేసినట్లు చెప్ప వీలులేదు చోళమహారాజుల పరిపాలనకాలముగా చెప్పబడిన మూడు నాలుగు శతాబ్దులకాలము లో అప్పటప్పట వీరు ఉ డి ర మాత్రమే చెప్పవీలగుచున్నది వీర దరును చోళమహా రాజులే అరవళ రాకుమారుడు వీరిలో ఎవరి తనయుడో నిర్ణయి చుటకు ఆధారములులేవు

అయి ను ఈ వ శమువారిలో ఒక మహారాజు కు ప్రత్యే కముగ చోళమహారాజు అను వ్యవహారము న్నట్లు మాలెపాడు శా నముల వలన తెలియవచ్చుచున్నది ఎ కలముత్తురాజు ధ ంజయుని కుమారుడు మహేంద్రవిక్రముడు అగునాతనికి చోళమహారాజు అను ప్రశస్తి యు డెనట ఈ ప్రభువు వ్యాక రణశాస్త్రమున దు పారీణు ని కీ ర్తిగడి చెను ఈతనికి గుదిత శిలాక్షరుడు అనియు బిరుదు లదు మహే ద్రవిక్రము ని శాస ములు కడపజిల్లా కామలాపురం తాలూకాయందు లభి చి నవి మనకు ప్ర క్తుడైన అరవళ రాకుమారుడు చోళమహా రాజని ప్రశ స్తిగా ంన మహే ద్రవిక్రముని కుమారుడగునేమో తెలియదు

అర ళుని నామధేయము హి దూపురం తాలూకాలో ఒక వీరగలుపై చెక్కబడిఉ డుట గమనార్హము ఈయుగము న దు రణనిహతులైన శూరుల స్మరణకై వారి పవిత్ర నామములను వీ రగల్లులు అని దు శిలాఫ కములపై చెక్కుట ఆచారముగా నుండెను దీనినిబట్టి అర ళ రాకుమారుడు యుద్ధములందు వీ మ ణము చె దియుండుననియు అతని స్మారకముగా వీ గల్లు వేయబడె యు ఊహింపవలసి యు న్నది అరవళుని త డిగా మనము భావి చినచో చోళ మహారాజు కడ జిల్లా కామలాపురము ప్రా తమున పాలించి యు డగా అరవళుడు తమ రాజ్యమునకు దూరమందున్న హిందుపురము ప్రా తమున నెలకొల్పబడిన వీరగల్లుపై ఎల ప్రత్యక్షమగుచున్నాడో తెలియదు చోళమహారాజు రాజ్య వి స్త ణమునందు శూరుడైన అరవళుడు శత్రుప్రా తమున యుద్ధముచేయుచు వీరశయను మలంకరించె ని స భావింప వచ్చును లేదా తండ్రి తమున హిందుపురం సీమలో యువ

రాజుగాను డి శత్రువులను ఎదిర్చియైన వీరశయ్యను చేరి యుండను

ఎట్లైనను ఈ చిన్న శాసనమువలన రెడు ముఖ్యాంశములు విదితములగుచున్నవి ఒకటి రేనాటి చోళుల పరిపాలనము కడప మండలమునకు మాత్రమే పరిమితము కాలేదు అనంతపుర జిల్లాయందును వారు పరాక్రమము నెరపి కన్నడ దేశ రిహద్దులవరకును ము రాజ్యమును విస్తరింపయత్నించిరి రెడవది అరవళుడు శూరవరేణ్యుడు అభిమన్యునివ టి పరాక్రమశాలి

తం ఆ శా

ఖం ల రం

## అరవసంగాళుడు

అరవసంగాళుని ప్రశంస కవిసారభౌమ బిరుదా చితుడు శ్రీనాథకవి విరచితమైన పలనాటివీరచరిత్ర అను ద్విపద కావ్యమునందు కనవచ్చుచున్నది (పు॰ 27) ఈ గ థమును పండిత ఉమాకాన్తవిద్యాశేఖరులు విపులమగు పీఠికతో స స్కరించి ప్రచురించిరి

క్రీ శ 11 వ శతాబ్ది చివరిభాగమును డి పంద్రెండవ శతాబ్ది చివరివరకును అనగా సుమారు ఒకశతాబ్ది కాలము రాజకీయముగా ఆంధ్రదేశమునకు మి క్కలి చెడ్డకాలమని చెప్పనొప్పును రాజరాజనరేంద్రుని పరిపాలనాన తరము తూర్పు చాళుక్యులకుపశ్చిమచాళుక్యులకును యుద్ధములు తరచుగ జరుగుచు డెడివి దీ కి కారణము పశ్చిమచాళుక్యులు తూర్పు చాళుక్యులదైన వేంగిరాజ్యమును కబళి పజూచుచుండుటయే ఆనాడు వేంగిదేశము వెలనాడు పలనాడు పాకనాడు కమ్మనాడు మున్నగు మండలములుగ విభక్త మయ్యెను ఒక్కొక్క మండలమును ఒక్కొక్క ప్రభువు పాలి చుచు డెను ఇట్టి ప్రభువులను మాండలికు ల దురు వీరు రాజరాజనరేంద్రుని త యుడను చాళుక్య చోళ రాజ్యాధిపతియునగు కులోత్తుంగచోళచక్రవర్తిచే నియమితులైనవారు అక్కాలమున వేంగిదేశము తూర్పుపశ్చిమచాళుక్యుల సమరమునకు క్రీడారంగ మయ్యెను వేగిదేశ మనగా ప్రధానముగా కృష్ణాగోదావరీనదుల మధ్యభాగము వారివారి సామంతులు ఆయాచక్రవర్తులకు పోరున సాయపడుచుండిరి ఒక్కొక్కప్పుడు బలవంతులైన మాండలికప్రభువులు తమస్వతంత్రతను ప్రకటించుకొనుటయేకాక చుట్టుపట్లనున్న మండలములను ఆక్రమించుటకు నిరంతరము తములోతాము పోరాడుచు డిరి ఒకవంక చక్రవర్తులకు జరిగెడి మహాయుద్ధములు వేరొ వంక మండలికులకు జరిగెడి చిన్నసంగ్రామములును వేంగిదేశమున శాంతిభద్రతలు లేకుండునట్లు చేసినవి

ఇట్టి విపత్కరపరిస్థితిలో ఆంధ్రదేశమున బొబ్బిలియుద్ధము లలో పలనాటియుద్ధ మొ టి ఇది ఆనాడు పలనాటిని పాలి చుచు డిన హైహయవంశజులైన రాజులకు దాయభాగమునకై సంభవించిన కుటుంబకలహము కారణముగ గలిగినట్టిది స్నేహబాంధవ్యములను పురస్కరించుకొని వెలనాటి దుర్జయులు కళ్యాణకళచురిరాజులు హొయిసలబల్లాళులు కోటరాజులు గుడిమెట్టచాగివారు కాకతీయులు మొదలగు మ డలాధిపతులు తదితరులును ఈయుద్ధమున పాల్గొనిరి

ఉత్తరదేశమున జంభనాపురి యను నామాంతరముగల పాలమాచాపురి అను పట్టణము కలదు దానిని అనుగురాజు పాలించుచుండెను అతడు హైహయవ శజుడు తన పూర్వులు చేసిన పాపములు తనను బాధింపగా అనుగురాజు పాపపరిహారార్థము అనేకతీర్థములలో స్నానమాడుచు కృష్ణానదికి వచ్చెను అందు స్నానమాడిన వెంటనే అతని మలి వస్త్రములు తెల్లబడెను తనపాపములు విముక్తము లయ్యె ని బ్రాహ్మణులవలన అతడు గ్రహించెను చ దవోలులో రాజ్యము చేయుచున్న రాజుకూతురగు మైలాంబను వి వా హ మా డి అరణముగా అతడు పల్నాటి రాజ్యమును సంపాదించెను

అనుగురాజుకు వీరవిద్యాదేవి భూరమాదేవి మైలమాదేవి అను ముప్వురు భార్యలు కలరు వీరవిద్యాదేవియందు పెదమల్లదేవుడు ఎనమల్లదేవుడు బాలమల్లదేవుడు అను వారును భూరమాదేవియందు కామరాజు నరసింగరాజు ఝుటిరాజు పెరుమళ్లురాజు అనువారును మైలమాదేవికి నలగాముడు అను సుతులు జన్మించిరి గురిజాల రా జ ధా ని గా అనుగురాజు పలనాటిని పాలించుచుండెను వెలమ బేతినాయని కుమారుడగు దొడ్డనాయడు అనుగురాజునకు మంత్రి అయ్యెను అనుగురాజు కొంతకాలము పలనాటి రాజ్యమును పాలించి మృతి నొందెను దొడ్డనాయకుకూడ అతని అనుసరించెను అపిమ్మట నలగామరాజు పట్టాభిషిక్తు డయ్యెను ఈ య న మంత్రిణి నాగమ్మ అను ఒకయువతి ఈమెకు నాయకురాలని

నాయమా గరప. ఈమె జన్మస్థానము కల్వకుర్తి తాలూకాలోని ఒట్టిగామాలపాడు. ఈమె తండ్రి చౌదరి రామిరెడ్డి. ఈమె పట్టెడ కలంకు చెందినది. ఈమె మేనమామ మేడికొండ సింగారెడ్డి. ఈమె గొప్ప పరాక్రమశాలిని. పలనాటి యుద్ధమునకు ఈమెయే ముఖ్యకారకురాలు. గురిజాల పురాధీశుడు నలగామరాజు ఈమె చేతిలో కీలుబొమ్మ.

దొడ్డనాయని సుతుడు బ్రహ్మనాయుడు. అనుగురాజు మరణించుచు తన సుతులను బ్రహ్మనాయని చేతియందుంచెను. వీరవిద్యాదేవి తనయులైన మలిదేవాదులు చిన్నవారగుటచే వారిని దగరకు చేర్చి బ్రహ్మనాయుడు సాకెను. పలనాటి రాజ్యములో కొంత వారికి ఇప్పించెను. అదియే మాచర్ల రాజ్యము. దానికి పెదమల్లిదేవుని ప్రభువుగ జేసి బ్రహ్మనాయుడు మంత్రియై పాలింప దొడగెను. కల్యాణపురాధీశుడగు వీరసోముని కుమార్తెలతో మలిదేవాదులకు వివాహము జరిగెను.

నాయకురాలు మాచర్ల రాజ్యమును కాజేయుటకు ఎత్తులు వేయుచుండెను. కోడిపందెము నేర్పాటు చేసి కపటముతో బ్రహ్మనాయని పందెములో ఓడించెను. నియమ ప్రకారము బ్రహ్మనాయుడు ఏడు సంవత్సరములు మాచర్ల విడిచి మలిదేవాదులతో మండాదికి వలసపోయెను. ప్రవాసానంతరము తమ మాచర్ల రాజ్యమును తమకీయవలసినదిగా నలగామునకు బ్రహ్మనాయుడు రాయబారము పంపెను. నాయకురాలు దానిని తిరస్కరించెను. ఈ కారణముగ మాచర్లవారికి గురిజాలవారికి పోరు ఆరంభమయ్యెను.

నలగాముడు తనకు సాయము చేయవలసినదిగా గుండముకోట మనుజేశుడు, ధరణికోట రాజగు భీమదేవుడు, గోలంకిక్షత్ర ఘూర్జరపతి ఉరగసేనుడు, ఏడు మాడెములేలు ఎరుకుకాముడు, పొన్నాళ్ళభూపతి, పొదిలె రాజులు, కటకాధిపతి కల్వరాయుడు, దేవాద్రిని పాలించు తెలుగు బిడ్డలు, పెదబాహుభూపతి భీమసేనుడు, సూర్యకుమారుడను చోళరాజు, సంగ్రామ విజయుడైన జయదేవుడు, జయసింగునృపతి, చంద్రాద్రిపతి, ధీరవిక్రముడైన తిరునాళ్ళపతి, ప్రాభవాఢ్యుడైన వీరభల్లాణుడు, అరవసింగాళుడు, అర్ణమాపతి, బంగాళపతి, పాండ్యేశుడు, మళయాళ కర్ణాటక మానవేంద్రులు మున్నగువారికి లేఖలనంపెను. బ్రహ్మనాయని పక్షమున అనేకరాజులరుదెంచిరి. కారెమపూడిలో నాగులేటి యొడ్డున ఉభయపక్షముల వారికిని సంగ్రామము భయంకరముగ జరిగెను. నెత్తురేరులు ప్రవహించెను. తుదకు మలిదేవాదులకే విజయము లభించెను. ఈ యుద్ధము క్రీ శ 1 8 - 1 6[illegible] ల మధ్య జరిగినట్లు తెలియుచున్నది.

అరవసింగాళుడు నలగామునకు యుద్ధమున తోడ్పడిన వారిలో నొకడని మాత్రమే మనకు తెలియుచున్నది. అరవ శబ్దముచేత సింగాళుడు అప్పుడు తమిళదేశమున దుష్టపాలనము చేయుచుండిన చోళవంశీయుడో లేక అతని సామంతుడో కావలెను. అప్పుడు చోళసామ్రాజ్యము మూడవ కులోత్తుంగుడు ఏలుచుండెను.

కం ఆం శా

## అరసవిల్లి

శ్రీకాకుళము జిల్లా శ్రీకాకుళము తాలూకాలో అరసవిల్లియను చిన్నగ్రామము కలదు. ఇది శ్రీకాకుళమునకు ఉత్తరము వైపున సుమారు రెండుమైళ్ళదూరములో ఉన్నది. భారతదేశములో సూర్యదేవాలయములు బహుస్వల్పముగ ఉన్నవి. వానిలో అరసవిల్లిలోని దేవాలయము చాలప్రసిద్ధికెక్కినది. ఇది ఆంధ్రదేశములో ఉండుట ఆంధ్రుల అదృష్టమే అని చెప్పవగును.

పూర్వగాంగ రాజైన రెండవ దేవేంద్రవర్మ వేయించిన రాగిశాసనములో తన పేరుగల అతని తాతయే అరసవిల్లిలోని సూర్యదేవాలయమును నిర్మించినట్లు కలదు. ఈయన తాతయే మొదటి దేవేంద్రవర్మ. ఈయన క్రీ శ 676 నుండి 702 వరకు గాంగరాజ్యమును పాలించెను. దానివలన ఈ దేవాలయనిర్మాణము క్రీ శ 7 శతాబ్దిలో జరిగినట్లు గ్రహింపగలము.

శ్రీకాకుళములోని జుమ్మామసీదులో నొకశాసనము కలదు. క్రీ శ 1680 సంలో షేక్ మహమ్మదుఖాను అనునతడు హిందూదేవాలయములను నాశనమొనర్చి ఆ దేవాలయపరికరములతో జుమ్మామసీదును నిర్మించినట్లును ఆ శాసనము చెప్పుచున్నది. అట్లు నష్టమైన దేవాలయములలో అరసవిల్లి దేవాలయము గూడ ఒకటి అయి యుండునట్లు తెలియుచున్నది. ఇట్లు నష్టమైన ఈ సూర్యదేవాలయమును క్రీ శ 1778లో శ్రీ ఎలమంచి పుల్లాజీ పంతులుగారు పునరుద్ధరించినట్లు సూర్యదేవాలయము నందలి యొక శిలాశాసనమున గలదు.

ఈ దేవాలయము తూర్పు ముఖముగానున్నది. దానికి ముందుగా నొక గోపురము ధ్వజస్తంభము కలవు. దీనిపై

గరుడ చిహ్నముగల సత్యాగోపాలస్వామి యంత్రముగల కంబము ఉన్నది. ఒక విశాలమయిన కల్యాణమండపమున్నది. గర్భగుడిలో సూర్యదేవుని విగ్రహమున్నది. ఆకర్షకమయిన శిల్పసౌందర్యముతో మూడడుగుల యెత్తున సూర్యవిగ్రహము కలదు. విగ్రహము అడుగున రథమునకు పూన్చబడిన ఏడు అశ్వములు చెక్కబడిన రథము కూడ ఉన్నది. సూర్యదేవుడు రథముపై నిలబడి యున్నాడు. ఈ విగ్రహమునకు ప్రక్కగా సూర్యదేవుని భార్యలయిన ఛాయ పద్మిని ఉష అను విగ్రహములు చెక్కబడియున్నవి.

సర్వచర్మరోగములు నేత్రరోగములు తగ్గుటకు ఎందరో భక్తులు ప్రతిదినము దేవాలయమునకు వచ్చి స్వామి దర్శనము చేసికొని తీర్థప్రసాదములను గ్రహించిపోవుదురు. ఈ దేవాలయమునకు తూర్పున సూర్యపుష్కరిణికలదు. యాత్రికులు పుష్కరిణిలో స్నానమాచరించి దేవదర్శనము చేయుదురు. యాత్రికుల నిమిత్తము సత్రములు నిర్మింపబడినవి. ప్రతి ఆదివారమునను విశేషదినములందును ఉత్సవములు వైభవోపేతముగ జరుగును. స్వామిపేరు చాలమంది తమబిడ్డలకు పెట్టుకొందురు.

తూర్పుగాంగ ప్రభువులు కోణార్కములో ఒక సూర్యదేవాలయమును నిర్మించి ఉత్తరభారతమునందు కూడ ఒక సూర్యదేవాలయముండినట్లు తెలియుచున్నది.

మా. శ్యా.

## అరస్తుయార్ జంగ్ బహద్దూర్

(నవాబు) అరస్తు యార్జంగ్ బహద్దూర్ - డాక్టరు అబ్దుల్ హుసేన్. వీరికి తల్లి తండ్రులు పెట్టిన పేరు అబ్దుల్ హుసేన్. వీరు హైదరాబాదు సంస్థానములోని ప్రజాప్రియులైన "హకీము"గా సుప్రసిద్ధులైనారు. సంస్థాన ప్రజానీకానికి వైద్యము ద్వారా చేసిన సేవలకు సంతసించి మహోన్నత వహించిన మీర్ ఉస్మానాలీఖాన్ బహదర్ నిజాం ప్రభువరేణ్యులు నవాబ్ అరస్తూయార్జంగ్ అను బిరుదను ప్రసాదించిరి. హైదరాబాదు సంస్థానములోని వైద్యులు హకీములు "మొయినల్ హిక్మా" అని పెద్దలు మతప్రముఖులు "ఒలీయుద్దీన్" అని బిరుదులు అరస్తూయార్జంగ్‌కు యిచ్చి గౌరవించిరి.

డాక్టర్ అబ్దుల్ హుసేన్‌గారు 24 షవ్వాల్ 1276 హిజిరీ (క్రీ. శ. 1868) నాడు ఒక బోహరా ముస్లిమ్ కుటుంబములో జన్మించిరి. వీరి తండ్రిపేరు ఇస్మాయిల్ సాహేబుగారు. ఆయనకు ఝాన్సీ ఒజారులో చిన్న అత్తరు షాపు ఉండెను. అసలు వారి జన్మస్థానము రాజస్థానములోని ఉదయపూరు. ఇస్మాయిల్ సాహెబ్‌గారి తండ్రి అబ్దుల్ ఖాదర్ పెద్ద తండ్రి గులామ్ హుసేన్. జామ్ నాసిరొద్దౌలా" (క్రీ. శ. 1749 - 1760) పరిపాలించుచున్నప్పుడు హైదరాబాదుకు వచ్చి స్థిరపడిరి.

డాక్టరు అబ్దుల్ హుసేన్‌గారికి చదువులో మిక్కిలి ఆసక్తి ఉండేది. ఉర్దూ పార్సీ భాషలు నేర్చుకొని అరబ్బీ భాష అభ్యసించి ఇంగ్లీషులో అవసరమున్న జ్ఞానము లవర్చుకొని హైదరాబాదు మెడికల్ స్కూల్ లో చేరిరి. అప్పటి హైదరాబాదు సంస్థానానికంతటికి ఆ మెడికల్ స్కూలే ప్రధాన వైద్య విద్యాకేంద్రము. అక్కడ ఆరేండ్లపాటు విద్యాభ్యాసము తరువాత సర్జన్‌గా యోగ్యతా ప్రత్రమును తీసుకొనిరి.

డాక్టరు అబ్దుల్ హుసేన్‌గారికి హైదరాబాదు సంస్థాన చరిత్రలో ఒక విశిష్టమైన యుగములో జన్మించిన అదృష్టము కలిగింది. అది (1857-1869) జామ్ అఫ్ జలుద్దౌలా రాజ్యమేలుతున్న కాలము. ప్రధానిగా ముఖ్తారుల్ ముల్క్ సర్ సాలార్ జంగ్ ఉండెను. ఆయన సంస్థాన పరిపాలనా వ్యవస్థలో సంస్కరణలను ప్రప్రథమముగా ప్రవేశపెట్టిన తరుణమది. భారత దేశములోని నలుమూలల నుండి గొప్ప గొప్ప విద్వాంసులను వైజ్ఞానికులను హైదరాబాదులోని - ప్రధాన విద్యాసంస్థ "దారుల్ ఉలూమ్" ఆకర్షించుచున్న రోజులవి. అప్పుడే సయ్యద్ హుసేన్ బిల్‌గ్రామి (ఇమాదుల్ ముల్క్) మౌల్వీ ముష్తాఖ్ హుసేన్ (విఖారుల్ ముల్క్) అల్లామా మెహ్దీ హసన్ (మొహసనల్ ముల్క్) వంటి మహామహులు వచ్చి యిక్కడి విద్యాసంస్థలలో పనిచేసి సంస్థాన విద్యా చరిత్రలో అతి ఉజ్వలమైన స్థానాన్ని ఆక్రమించుకొన్నారు. ఆ గురువుల వలన ప్రభావితులయిన శిష్యులలో నేనొకడని డాక్టరు అబ్దుల్ హుసేన్‌గారు వ్రాసుకొనినారు. అందుకు తోడు "మితవ్యయములో క్రమబద్ధ జీవితము విజయవంతముగా కడపచూపిన "షమ్సుల్ ఉల్మా డాక్టర్ జీర్ అహ్మద్ సాహెబు గారి సాహచర్యము మత సాంప్రదాయాలతో సమగ్ర జీవనము సాధించుచు సర్వమత ప్రేమియైన నవాబ్ అజమ్ యార్జంగ్ (మౌల్వీ చిరాగ్ అలీ) గారి అనుచరత్వము నాకు చక్కటి దారి చూపించుటలో తోడ్పడ్డవి అని అరస్తూయార్

జంగ్ గానున్నారు అంతేకాదు ఫాజిల్ ఉలామా" మౌల్వి అన్వరుల్లాఖాన్ ఫజీల్ంల్ జంగ్ గారి విద్యాబంధుత్వము ఇఫ్తెకారుల్ముల్క్ మహబ్ జంగ్ గారి రాచకార్యనిర్వాహాధికారి మహారాజా కిషన్ ప్రసాద్ బహదూరు గారి సన్మైత్రము సర్ ఖుర్షీద్ జాహ్ బహదూర్ గారి సత్క్రమ అంతరంగ విధానము మౌల్వి ఎమా ఫోర్దిన్ సాహెబ్ సూబేదారు గారి స్వామి సేవా ధురంధత రీమాజంగ్ సర్ ఫఖ్రుల్ ముల్క్ బహాదూర్ గారి రాజనీతిజ్ఞతా జీతము నకు ఒరవడి పెట్టి ఈస్మసార్ధం చేసి విశేషముగా అంతకు ఆపెద్దలకు అందఱకు బుణపడి యున్నానని డాక్టరు హుసేన్ గారు ఒకచోట వ్రాసినారు

డాక్టరు అబ్దుల్ హుసేన్ గారు హైదరాబాదు మెడికలు స్కూలు నుండి యోగ్యతా పత్రము పుచ్చుకొనిన వెంటనే మెదకు జిల్లాలో ముఖ్యస్థానమగు సంగారెడ్డి ఆస్పత్రిలో విలువర్జనుగా నియమింపబడిరి రాత్రి బంళ్లు విధి విరామము లేకుండా రోగుల చికిత్స చేసి చక్కని పేరు తెచ్చుకొనిరి తండోపతండాలుగా దూరదూర గ్రామాలనుండి రోగుల రాక ప్రారంభమయ్యెను దవాఖానాలోని మందులు వడుపోయెను పైకి మందుల కొరకు డాక్టరుగారు వ్రాసిరి అందుకు జవాబు యీక్రింది విధముగా వచ్చెను " సంవత్సరానికి అయ్యే మందులు మూడు నెలలలోనే అయిపోవుట ఆశ్చర్యకరముగా ఉన్నది ఈ విషయములో జాగ్రత్త వహించలేదని తోచుచున్నది ఇప్పుడు మందులు తిరిగి పంపించబడుచున్నవి ఇక ముందు సంవత్సరము అయిపోయేవరకూ మీరు ఔషధముల కొరకై వ్రాయకుందురుగాక " సంగారెడ్డి నుండి డాక్టరుగారికి బదిలీ వీసనగరకు ఆయెను అక్కడి "అవ్వల్ తాలూక్దార్ (జిల్లాకలెక్టరు) తన దగ్గరకు వచ్చి రోజూ సలామ్ కొట్టలేదని కినుకచే స్థానిక పత్రికలో డాక్టర్ అబ్దుల్ హుసేన్ గారిపైన లేనిపోని అవాకులు చవాకులు వ్రాయించెను అందుచేత సూబెదారు గారు దరియాప్తుకై వచ్చి డాక్టరు సాహెబును విచారించగా ఎవరో నాస్తికయోఖిలాఫియే వ్రాసియుండవచ్చునని చెప్పెను ఆమాటకు సూబేదారు సాహెబు చకితుడై "మీమీద షికాయతు వ్రాసినవారు మీ క్షేమోఖిలాషి ఎట్లు కాగలరు" అనెను అందుకు డాక్టర్ సాహెబు -ఆ షికాయతు వ్రాసిన మహాశయుడు ఒక విధమున కాదు రెండు విధముల నాక్షేమోఖిలాషియే ఎట్లనగా ఒకవేళ నేను నేరస్థుడనేఅయినచో నానేరాన్ని ఎత్తి చూపి మేలు చేసినాడు" లేక నేను నిర్దోషిని అయినచో ఇప్పుడు మనుష్యుల మేము చేయుచుండా నా కీర్తికి వన్నె చేకూర్చు వ్యక్తిగా చేసినాడు అనెను సూబేదారుసాహెబు చాల అనుకూలజ్ఞుడు కాబట్టి నిజము తెలిసికొని డాక్టరుసాహెబు వినయ సౌశీల్యానికి కొనియాడెను

తీరువును డు డాక్టర్ సాహెబ్ గారి బదిలీ జిల్లాంపు తులలో పెద్దదైన "వరంగల్ దవాఖానాకు ఆయెను ఒకసారి రెసిడెంటు ప్రిన్స్ ను వృంటకు పాఖాలకు వచ్చుచు సర్ సాలార్ జంగ్ బహదూర్ గారిని తోడుకొని వచ్చెను సాలార్ జంగ్ గారి అనుచరులలో ఒకరు తీవ్రమైన జబ్బున పడిరి వరంగల్ సూబేదారు గారి సలహాపై వరంగల్లు దవాఖానాలో జబ్బున పడిన వాని చేర్చిరి జబ్బు నయమాయెను సాలార్ జంగ్ బహదూర్ గారు డాక్టరు అబ్దుల్ హుసేన్ గారి చికిత్సా నైపుణ్యమును మెచ్చుకొని హైదరాబాదులోని అఫజల్ గంజ్ దవాఖానాలో సూపరింటెండెంటుగా వేయించిరి

నిజాం మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ బహాదూర్ గారు తాము సింహాసన మధిష్టించిన సందర్భమున సంస్థానములోని ప్రముఖులను ఒకనాటి సాయంకాలము 8 30 సమయానికి విందునకు ఆహ్వానించిరి అంతకు పూర్వము మహబూబ్ అలీపాషా సాహెబు దర్శ్యము వలన ప్రముఖులకు ఎవ్వరికి సమయపాలనపై ఏమాత్రము శ్రద్ధలేకుండెను అయినను ఆనాడు అయిదు నిమిషాలు ఆలస్యముగా మాత్రమే షహాబ్ జంగ్ బహదూర్ అను ఒక విఖ్యాతులైన నవాబుగారు వచ్చిరి నిజాం ప్రభువులు కోపోద్రిక్తులై సమయము సతిక్రమించి వావని యూహించి షహాబ్ జంగ్ను తిరిగి పంపివేసిరి తరువాత అయిదునిమిషాలకు డాక్టరు అబ్దుల్ హుసేన్ వచ్చిరి నిజాం ప్రభువు వీరి నుద్దేశించి అబ్దుల్ హుసేన్ సాహెబ్ మీకు ఇచ్చిన వేళ ఇదేనా అనిరి అప్పుడు నవాబ్ ఫఖరుల్ ముల్క్ బహాదూర్ గారు లేచి మహాప్రభో ఇతని భోజనము ఎక్కడ సమయముకు దొరకును తినే అన్నము మధ్యలో వదలి రోగుల చికిత్సకై పరుగెత్తవలసి ఉండును అని మనవిచేసెను ఆమాటలు విని నిజాంప్రభువు మిన్నకుండెను

ఒకసారి డాక్టరు అబ్దుల్ హుసేన్ సాహెబుగారు ఆస్పత్రిలోని ఆపరేషను థియేటరులో ఒక రోగికి ఆపరేషన్ చేయుచుండిరి ఇంతలో నిజాం సంస్థానపు వైద్యశాఖా డైరెక్టరు కర్నల్ షోర్ అను యూరోపియన్ డాక్టర్ థియేటరులోనికి

ప్రవేశించి ఆపరేషను చేయచున్న డాక్టరుగారి వెనుక నడచి చప్పుడు లేకుండా నిలుచుండి ఆ రేసు విధానమును గమనించ సాగెను. కుట్లు వేయుచున్న డాక్టరుగారి చేతిలోని సూది కర్నల్ షోరగారి కంటిలో గ్రుచ్చుకొనెను. ఆ విగత ఘటనకు డాక్టరుగారు చాల నొచ్చుకొని వెంటనే కర్నల్ షోరుగారితో నేను మిమ్ములను చూడలేదు నన్ను క్షమించండి అనెను. అప్పుడు కర్నల్ షోర్ అందులో డాక్టరుగారి తప్పులేదని తనదే తప్పు అని ఒప్పుకొని డాక్టరుగారి ఆపరేషనులోని నైపుణ్యమును కొనియాడెను. కుట్లు వేయుచున్న సూది గ్రుచ్చుకొనుట వలన కర్నలు షోర్ కన్ను విషపూరితమయ్యెను. చివరకు డాక్టర్ అబ్దుల్ హుసేన్ గారే ఆకన్ను తీసి వైచి గాజుకన్ను అమిర్చిరి.

అది 1908లో సెప్టెంబరు నెల మూసీనది ఉధృతముగా పొంగి పొరలి హైదరాబాదును ముంచివేయుచున్న రోజు మృత్యుదేవత పట్టణము అంతా వికటాట్టహాసము చేయుచున్న తరుణము. డాక్టరుగారు ఆరాత్రి అప్పటి డ్యూటిలో ఉండిరి. మొట్ట మొదట హాస్పిటలులోని రోగులను మందులను ముఖ్యమైన వస్తువులను సురక్షిత స్థానముకు చేర్చిన పిదపనే అబ్దుల్ హుసేన్‌గారు తన భార్యను బిడ్డలను గురించి ఆలోచించినారు.

డాక్టరు అబ్దుల్ హుసేన్‌గారు హైదరాబాదు మెడికల్ స్కూలు నుండి సామాన్యమైన సర్టిఫికెట్‌ను మాత్రమే సంపాదించినవారైనను యూరపులో పెద్ద పెద్ద డిగ్రీలు సాధించిన డాక్టర్లు సహితము అబ్బుర పడేటట్లు రోగ నివారణము చేయువాడు. ఆపరేషనులు విజయవంతముగా నిర్వహించే వాడు. మత విశ్వాసాలలో మతి చెదరక సదా పాలించుచున్న వాడైనను ఆయన గొప్పమానవతావాది. మానవజాతిపై అచంచలమైన మమత అతని నైజగుణము. సర్వమానవ సమానత్వము అతని విశ్వాసము.

ఆయన హస్తవాసి అద్భుతమైనదని అపరధన్వంతరి యని దక్కను అరస్తూ యని రాష్ట్రమంతట ప్రఖ్యాతుడైనాడు. అతని చికిత లో రోగులు అందరూ సమానులే. రాజు పేద అనే తారతమ్యము లేదు. తన జీవితములో అరువది యేండ్ల పాటు నిరంతరము రోగుల చికిత్సా వ్యాసంగములో గడపి డాక్టరు అబ్దుల్ హుసేన్ 16 సఫర్ 1850 నాడు కన్ను మూసెను. అప్పుడు సంతాప సందేశమును ఆయన కుమారు

డైన డాక్టర్ ఖుర్షీద్ హుసేన్ [illegible] కిషన్ ప్రసాద్ బహదూర్‌గారు యొద్ది [illegible] ప్రధాని [illegible]

నా స్నేహితుడు [illegible] అరస్తు యొక్క [illegible] నాకూ దక్కన [illegible] గ్రించిన [illegible] యను. ఇక అట్టివాని [illegible] దుర్లభము. అయినా యూవిగా [illegible] మయ [illegible] ఉగ్ర [illegible] గ్గిగుచు [illegible] న్నది.

పె వె రా

## అరికేసరి-I

వేములవాడ చాళుక్య కుటుంబము లో మొగటి అరికేసరి ప్రసిద్ధుడు. అరికేసరి అను పేరుగల రాజులు ఈ వంశమునందు ముగ్గురుండుటచే ఈతనిని మొదటి అరికేసరి అనుచున్నారు. వేములవాడ కరీంనగరంజిల్లా సిరిసిళ్ళ తాలూకాలో ఉన్నది. ఇక్కడవున్న రాజరాజేశ్వరాలయము ఈ నాటికిని మహిమాన్వితమై అపారముగ భక్తులను ఆకర్షించుచున్నది. వేములవాడకు ప్రాచీన నామము లేములవాడ. లేములవాడ అరికేసరి వంశము వారి శాసనములందు ఇది లేములవాటిక అని వ్యవహరింప బడినది. వేములవాడ చాళుక్యులు నిజామాబాదు కరీంనగరు మండలమును నల్లగొండ వరంగల్లు జిల్లాలలో కొన్ని భాగములను రాష్ట్రకూటులకు సామంతులై పరిపాలించిరి. తెలుగుదేశములో పరిపాలన చేసిన ఈ రాజకుటుంబము వారు కన్నడభాషకు సాటిలేని సేవచేసి గణనీయులైరి. తెలుగునకు నన్నయభట్టారకుని వలె కన్నడభాషకు అదికవియైన పంప మహాకవి వేములవాడ చాళుక్య వంశమువారి యాస్థానమును అలంకరించెను. ఈ వంశమువారి చరిత్రను డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు విస్తృతముగా పరిశోధించి ప్రకటించిరి.

ఈ వంశమువారి చరిత్ర నిర్మాణమునకు ఆధారములు: (1) కురవుగట్టి శాసనము (2) కొల్లిపర తామ్రశాసనము (3) వేములవాడ శిలాశాసనము (4) పంపకవి విక్రమార్జున విజయము (5) పర్భని తామ్రపట్టికలు (6) జైన విద్వాంసుడు సోమదేవసూరి గ్రంథములు. మొదటి అరికేసరి ఇచ్చిన కొల్లిపర తామ్రపట్టికవలన ఈతనినిగూర్చి కొన్ని యశములు తెలియుచున్నవి. ఈ దాన శాసనమునందు కాలము చెప్పబడలేదు. దీనినిబట్టి తెలియవచ్చు విశేషములు: చాళుక్య వంశమునందు సత్యాశ్రయ మహారాజు జన్మించెను. ఈయన గొప్ప పరాక్రమశాలి. ఈతని కుమారుడు పృథ్వీపతి పృథు చక్రవర్తి వంటివాడు. ఈతని తనయుడు మహారాజు అను పేరివాడు

వానికొడుకు రాజాదిత్యుడు ఈయన కుమారుడు వినయాదిత్య యుద్ధమల్లుడు యుద్ధమల్ల నామధారులు ఈ వంశము నందు ముగ్గురు ఉండుటచే రాజాదిత్యుని కుమారుని మొదటి యుద్ధమల్లుడు అందురు వినయాదిత్యుని కుమారుడు మొదటి అరికేసరి మహారాజు

ఈ వంశమున దలి కడపటిరాజైన మూడవ అరికేసరి ప్రకటించిన పర్భని తామ్ర శాసనము శక 888 అనగా క్రీ శ 966 వ వత్సరమునకు చెందినది ఈ శాసనము వేములవాడ వంశస్థాపకుడు అని చెప్పదగిన వినయాదిత్య మొదటి యుద్ధమల్లునకును నడుమ తొమ్మిది తరముల అంతరము ఉండుటచే వినయాదిత్యుడు క్రీ శ 750 75 నడుమ పరిపాలన చేసియుండునని చారిత్రకులు పరిగణించుచున్నారు వినయాదిత్యుని కుమారుడగు మొదటి అరికేసరి క్రీ శ 775 800 ప్రాంతమున రాజ్యపాలనము చేసియుండును కొల్లిపర తామ్రశాసనమును బట్టి అరికేసరి మహారాజు ముగ్ధశివాచార్యుడను తపస్వికి రామడుగు విషయమున దలి బెల్మొగము అను గ్రామమును విద్యాదానముగా సమర్పించెను ఈ శివాచార్యుడు సిద్ధాంతబద్ధబుద్ధి ధ్యానాదులచే ధ్వంసము చేయబడిన దురితములు కలవాడు ముగ్ధ శివాచార్యుడు సద్యః శివాచార్యుని శిష్యుడు సద్యశ్శివుడు అమటగురుకులము కుచెందిన కాలాముఖ శైవాచార్యుడు ఇతడు సదాశాకాహారుడు శ్రీకతాపాపమగు శ్రీశైలపర్వతమునకు ఉత్తర ద్వారమైన ఏలేశ్వర క్షేత్రనివాసి బెల్మొగము గ్రామము ఊరిగె అను విఖ్యాత మహాగ్రామమునకు దక్షిణమున ఉన్నది తువతోరు పరివాతుర్ల పుల్చెరువుల పోతువోడువు అను గ్రామములకు మధ్యన ఉన్నది ఇది విద్యాదానమని చెప్పబడుటచే విద్యార్థుల పోషణమునకై ముగ్ధశివాచార్యునకు ఈయబడినదని భావింపవలెను దానమిచ్చిన గ్రామము గాని దాని సరిహద్దు గ్రామములు కాని ఇప్పుడు గుర్తించుటకు వీలు లేదు రామడుగు విషయముకూడ అజ్ఞాతముగానే యున్నది కరీంనగరం జిల్లాయందలి రామగిరి రామగుండము ప్రాంతములు కావచ్చునేమో రిశీలించవలసి యున్నది సద్యశ్శివాచార్యుని నివాసమైన ఏలేశ్వరము నల్లగొండ జిల్లాలో నున్నది

అరికేసరి తండ్రియైన వినయాదిత్య యుద్ధమల్లుడు గొప్ప పరాక్రమశాలి యనియు తురుష్క యవన బర్బర కాశ్మీర కాంభోజ మగధ మాలవ కళింగ గంగ పల్లవ పాండ్య కేరళ ప్రభృతి నరపతులను జయించినవాడనియు వర్ణింపబడినాడు ఇందు విశేషభాగము అతిశయోక్తిగా భావించిను వినయాదిత్యుడు ప్రశంసనీయమైన కొన్ని విజయములను సాధించెననుట వాస్తవము ఈతని విజయములు స్వతంత్రచర్యలు కావు రాష్ట్రకూట సామ్రాజ్య స్థాపకుడైన దంతిదుర్గునకు విశ్వసనీయుడైన సహచరుడుగా ఈతడు ప్రఖ్యాతి వచ్చెను దంతిదుర్గుడు క్రీ శ 754 ప్రాంతమున బాదామి చాళుక్యుల సామ్రాజ్యమును తుద ముట్టించి రాష్ట్రకూట సామ్రాజ్యమునకు బీజములు వైచెను వినయాదిత్య యుద్ధమల్లుడు ఈతని అనుచరుడై దండయాత్రలలో పాల్గొని పేరుప్రతిష్ఠలు సంపాదించెను వినయాదిత్యుడు సపాదలక్ష దేశమును ఏలెననియు చిత్రకూటమను దుర్గమును జయించెననియు ఈతని మదగజములు పోతన నగరమునందు త్రైలదీర్ఘికల యందు స్నానము చేసెననియు వేములవాడ శాసనము వర్ణించినది సపాదలక్ష దేశము అనగా రాజపుత్ర స్థానము తూర్పు భాగముగా గుర్తింపబడినది దంతిదుర్గుడు ఈ భాగమును జయించినప్పుడు వినయాదిత్యుడు దీనికి శాసకుడుగా స్థాపింపబడెను ఇది ఇతరులెవ్వరును పరిపాలింపలేని దేశమట చిత్రకూట దుర్గమును తూర్పు రాజస్థానమునందే కలదు పోతన నగరము వినయాదిత్యుని రాజధాని ఇది నిజామాబాదు జిల్లాయందలి బోధన పట్టణముగా గుర్తింపబడినది పై యంశముల బట్టి వేములవాడ చాళుక్యవంశ స్థాపకుడైన వినయాదిత్యుడు తన రాజ్యారంభ కాలమునకు విజృంభించుచున్న రాష్ట్రకూటుల పక్షమును అవలంబించి వారి యభ్యుదయములో భాగస్వామి అయ్యెననుట విశ్వసనీయముగు చున్నది

వినయాదిత్యుని కుమారుడైన మొదటి అరికేసరి కూడ సమర్థుడైన సేనానియే అయి ఉండును తండ్రి సంపాదించి ఇచ్చిన సామంతరాజ్యము నీతడు నిలుపుకొనగలిగెను మొదటి అరికేసరి విద్యాపక్షపాతి అతడు స్వయముగ విద్వాంసుడైనట్లు కొల్లిపర శాసనము నుడువుచున్నది ఈతడు వ్యాకరణ ధర్మవేత్త గజశాస్త్రనిపుణుడు న్యాయనిపుణుడు ధనుర్వేద విశ్రుతుడు వైద్యశాస్త్ర ప్రవీణుడు అని స్తుతింపబడినాడు ఈతనికి పరాక్రమ సూచకముగ పెక్కు బిరుదులు కలవు సమస్తలోకాశ్రయ త్రిభువనమల్ల రణార్జున మున్నగునవి ఈతని బిరుదులు కొల్లిపర శాసనమునందు ఈతని విజయము

లేవియు చెప్పబడలేదు కాని ఈవ శీయులు అన తరశాసనము ల దు అరికేసరి వే గిదేశమును త్రి లి గమును జయిం చి ట్లు చె ప్పబడి ది ఇ దు కొ త సత్య ముండవచ్చును ఇప్పటి దక్షిణదేశ రాజకీయ పరి స్థితిని కొ తపరిశీలించినచో అరికేసరి వేంగివిజయము నిరాధారమైన ప్రస గము కాదని తోచును రాష్ట్రకూటులు చాళుక్యుల సామ్రాజ్యమునకు వారసులగుటచే అ తకుమున్న బాదామి చాళుక్యుల అధి త్యమున గీకరించిన వారు తమకను సామంతులు కావలెనని కోరిరి వే గి చాళుక్యులు బాదామి చాళుక్య వ శమునకు చె ది వ రే అగుటచే వారు బాదామి చాళుక్యులకు మిత్రులై యుండిరి రాష్ట్రకూట సామ్రాజ్యస్థాపనతో ఈమైత్రి విచ్ఛిన్నమయ్యెను రు మదేవుడను నామాంతరము గల ధా రా వ ర్ష ధ్రువ చక్రవ ర్తి కాలములో మొదటి అరికే రి వేంగీ కళింగములను జయి చి ట్లు చెప్పబడినది రాష్ట్రకూట మొదటి కృష్ణరాజు తరువాత అతని కుమారులు రె డవ గోవి దరాజు ధ్రువుడు రాజ్యమునకై కలహించిరి రెండవ గోవిందరాజు మొదట రాష్ట్రకూట సింహాసనము నెక్కెను కాని తమ్ముని పరాక్రమ మును హించలేక ఈతడు వే గిచాళుక్యుల సహాయమును అర్థి చెను మొదటి విజయాదిత్యుడు (క్రీ శ 753 ( 0) గోవిందరాజు కు సహాయము చేసెను అయి ను ధ్రువరాజు గోవిందుని ఓడించి చక్రవర్తిత్వమును సాధ్వీనము చేసు కొనెను త యన్నకు సహాయముచేసిన తూర్పు చాళుక్య రాజును శిక్షించుటకై ధారావర్ష ధ్రువదేవుడు (క్రీ శ 780–93) వేములవాడ అరికే రిని ప్రోత హించి వే గిపై దండు వ పి చెను ఈ సందర్భమునే అరికేసరి వే గి కళింగములలో కొన్ని విజయములు సాధించి యుండను అయినను ఇవి స్థిరవిజయములు కావు వేంగిదెశము అరికేసరి గాని ధారా వర్షునకుగాని అరిగాపయి ఉ డలేదు

వినయాదిత్య యుద్ధమల్లునకు ఇద్దరుకుమారులు ఉండిరి జ్యేష్ఠుడగు మొదటి అరికేసరి వేములవాడ సి హాసన మధి ష్ఠి చెను రెండవవాడగు వీరగ్రహుడు కురువగట్టి శాసనము నందు కీర్తి వహిడివాడు కురువగట్టి గ్రామము మహబూబు నగర జిల్లా నాగరకర్నూలు తాలూకాలో ఉన్నది ఈ శాసనము దు వీరగ్రహుడు చాళుక్య వినయాదిత్యుని కుమారుడనియు రాష్ట్రకూట చక్రవర్తి కవివల్లభుని కుమారు డగు గోవిందునకు పరమమిత్రుడనియు చెప్పబడినది కవివల్లభు డను ది ధారావర్ష ధ్రువదేవుని బిరుదము ఈతని కుమారుడు మూడవ గో దరాజు (క్రీ శ 793 814) వీరగ్రహుడు మూడవ గోవిందుని మిత్రుడని భావిం బడినది

మొదటి అ కె రి యనంతరము అతనికుమారుడు మొ టి నరసి హుడు రాజ్యమునకు వచ్చె ను ఎలేశ్వర ము న దలి శివాచార్యుని శిష్యు కు దాన మిచ్చి యు డుటచే నల్లగొ డజిల్లా ప్రా ము అరికేసరి రాజ్యములో చేరి యు డునని భావింప వీలగుచున్నది అనగా ఈతడు త డ్రి యిచ్చిన రాజ్యమును నల్లగొండజిల్లా వరకు వ్యాపింప జేసెనని చెప్పదగును

బి. ఎ. రం.

## అరికేసరిII

వేములవాడ చాళుక్య వ శ ప్రభువైన రెండవ అరికే రి క్రీ శ 930 955ల నడుమ పరిపాలనచే యుండునని భావి ప బడుచున్నది ఈకాలమున వే గిదేశమునందు రె డవ యుద్ధ మల్లుడు రె డవ చాళుక్యభీముడు రెండవ అమ్మరాజు రాజ్యాధికారము వహించి యు డిరి రె డవ అరికేసరిని గూర్చి తెలిసికొనుటకు అతని లే (వే) ములవాడ శాసనము ఈవంశీయుడే అగు మూడవ అరికేసరి పర్భణి తామ్ర పట్టి కలను కన్నడమహా కవి ఆ ది ప ం ప ని విక్రమార్జు విజయ కావ్యమును కొ త తోడ్పడుచున్నవి పంపకవి రె డవ అరికే రి యాస్థానము అలంకరించి తన కావ్యమున ను అతని ప్రశస్తిని శ్లేష చమత్కృతితో చిత్రించెను వ పభారతము నందు పా డవ సోదరుడగు అర్జునునకు అరికేసరికిని అభేదము పాటి పబడెను ఈయుభయ నాయకులకును సమానములగు కొన్ని పన్నివేశములు కటస్థిపనవి అర్జునుడు ఇంద్ర ప్రసాదమున జన్మి చెను రె డవ అరికే రి రాష్ట్రకూట చక్రవ ర్తియగు మూడవ ఇ ద్రరాజు మే ల్లుడు అరికేసరి తన బాల్యమున దు ఇంద్రరాజుచే సంవర్ధింపబడెను ఇద్దరును ఇంద్రసంవర్ధితులే దానిని ఆధారముగ చే కొని ప ంకవి ఎంతయో చమత్కరి చె ని చెప్పుదురు కొ ని చారిత్ర కాంశములను ఈమహాకవి శ్లేషరీతిని ప్రకటి చినవాడయ్యెను

అరికే రి తండ్రి రెండవ నరసి హరాజు తల్లి రాష్ట్ర కూటవంశీయురాలును మూడవ ఇ ద్రరాజు సోదరియు అగు జా వ్వ అరికేసరి తాను ఇద్దరు రాష్ట్రకూట రాజకన్యకలను పెండ్లి యాడెను అందొక రాకుమారి అతని మేనమామ

(ఇంద్రరాజు) కుమార్తెయగు రేవక నిర్మడిదేవి మరియొక భార్య లోకమహాదేవి పై సంబంధములచే రెండవ అరికేసరి తన తండ్రి వలెనే రాష్ట్రకూటరాజవంశమునకు ఎక్కువ సన్నిహితుడగుచున్నాడు. అరికేసరి జనకుడగు రెండవ నరసింహరాజు (క్రీ శ 915-0) మహాయోధుడై తన ఏలికలగు రాష్ట్రకూటచక్రవర్తులకు వారి యుద్ధములందు నిర్భర సహాయముచేసెను. రాష్ట్రకూటులకు గూర్జరప్రతీహారులతో జరిగిన సంగ్రామములందు రెండవ నరసింహుడు రాష్ట్రకూటుల సేనాపతియై వారికి విజయపరంపర సాధించెను. ఈతడు గూర్జరరాజగు మహీపాలుని గంగా యమునా నదుల మధ్యదేశము వరకును తరుముకొని పోయి కాన్యకుబ్జ నగరమును పట్టుకొని దానిని విధ్వంస మొనర్చి యమునా తీరమున కాలప్రియనాథుని దేవాలయమున జయస్తంభమును ప్రతిష్ఠించెను.

అట్టి వీరుని కుమారుడగు రెండవ అరికేసరి గూడ పరాక్రమశాలియె. ఈతడు సాధించిన విజయములు కొన్ని మాత్రమే తెలియవచ్చుచున్నవి. (1) అరికేసరి బిజ్జడు అనబడు చాళుక్య విజయాదిత్యునకు తన రాజ్యమున ఆశ్రయమిచ్చి కాపాడెను. ఈ బిజ్జడు గోవిందరాజు ఆగ్రహమునకు గురిఅయి అరికేసరి ప్రాపును కోరియుండును. "క్రుద్ధే గోవిందరాజే శరణ ముపగతో రక్షితో యేన బిజ్జ" వేములవాడ శాసనము. (2) చక్రవర్తి యగు గొజ్జిగ రాజు తన మీదకు పంపిన ఒక మహాసామంతుని ఘోర రణమునందు నిర్జించి పారద్రోలెను. (3) బద్దెగదేవునకు అరికేసరి ఆశ్రయమిచ్చెను. క్రోధావిష్టుడైన చక్రవర్తి తన మీద ఒహుళసైన్యముతో ఎత్తిరాగా చక్రవర్తిని ఓడించి రాజ్యమును బద్దెగదేవునకు సమర్పించెను. (4) చక్కలుని అనుజుడగు బప్పువదేవుని అనుకారుడు తన రాజ్యముపై బడగా అరికేసరి నిస్సహాయుడై వానిని పలాయితుని చేసెను.

అరికేసరి సాధించిన విజయములను అన్వయించుకొనుటకై ఆకాలపు రాష్ట్రకూట సామ్రాజ్యచరిత్రయు వేములవాడ చాళుక్యులకు పొరుగువారగు ముదిగొండ చాళుక్యుల చరిత్రయు సంగ్రహముగా తెలుసుకొనవలెను. అరికేసరి మేనమామయు మామయు అగు రాష్ట్రకూట మూడవ ఇంద్రరాజునకు ఇద్దరు కుమారులు ఉండిరి. పెద్దవాడు అమోఘవర్షుడు. ఇతడు తండ్రి మరణానంతరము రెండవ అమోఘవర్షుడను పేర సింహాసన మధిష్ఠించెను. ఇది వీని తమ్ముడును తరువాత నాల్గవగోవిందరాజను పేర రాష్ట్రకూట సింహాసన మెక్కినవాడును అగు గోవిందునకు సమ్మతము కాకుండెను. గోవిందుడు తన యన్నపై కుట్రలు పన్ని అతనిని సంహరించి సింహాసనమును ఆక్రమించుకొనెను. భ్రాతృహంతకుడగు నీతని పరిపాలనము (క్రీ శ 929 34) పెక్కు రాష్ట్రకూట సామంతులకు హేయమయ్యెను. ఈతని బావమరదియగు రెండవ అరికేసరికూడ గోవిందరాజునకు శత్రువుగా పరిణమించెను. గోవిందునకు సకుటుంబమునందే ప్రబల ప్రత్యర్థులేర్పడిరి. మూడవ ఇంద్రరాజునకు బద్దెగదేవుడను తమ్ముడుండెను. ఈతని కుమారుడు మూడవ కృష్ణరాజు. బద్దెగదేవుడు తన యన్న కుమారుని దుష్టపరిపాలనమును కూలద్రోసి తానే చక్రవర్తి కాగోరెను. గోవిందరాజు తన పినతండ్రిని అతని కుమారుని దేశనిర్వాసితులను చేసెను. వారు బద్దెగుని యత్తవారైన చేది హైహయులకడ త్రిపుర నగరమునందు నివాస మొనర్చుచు నాల్గవ గోవిందుని పతనమునకై యత్నములు చేయుచుండిరి.

వేములవాడ చాళుక్యరాజ్యమునకు తూర్పున వేంగిదేశమునంటి ముదిగొండ చాళుక్యుల సామంత రాజ్యముండెను. కృష్ణా జిల్లాలోని కొండపల్లినుండి వరంగల్లు జిల్లాలోని కొరవి రకము గల దేశము మంచికొండవిషయమందురు. దీనిని పాలించినవారు ముదుగొండ చాళుక్యులు. ఈవంశములో కుసుమాయుధ నామము గల నలుగురు పాలకులు గలరు. ముదుగొండ చాళుక్యులు తూర్పు చాళుక్య వంశమువారికి సామంతులును మిత్రులును అయియుండిరి. ఈ వంశమునందలి మొదటి కుసుమాయుధుకు వేంగీశ్వరుడైన మొదటి చాళుక్య భీమరాజుకు (క్రీ శ 892-922) విశ్వాసపాత్రుడైన సామంతుడై రాష్ట్రకూటులు వేంగి రాజ్యమును ఆక్రమింప జూచినప్పుడు భీమరాజునకు గొప్ప సహాయము చేసెను. దీనికి సంతసించి మొదటి చాళుక్య భీమరాజు మొదటి కుసుమాయుధునకు అర్ధ రాజ్యమిచ్చెనని చెప్పుదురు. కుసుమాయుధుని ప్రశంస కొరవి శాసనమునందును కూకిపల్లి శాసనమునందును కలదు. మొదటి కుసుమాయుధుని కుమారుడు విజయిత (క్రీ శ 915 40) విజయాదిత్య శబ్దమునకిది తద్భవము కావచ్చును. అరికేసరి ఆశ్రయమిచ్చి రక్షించిన బిజ్జి అనువాతడు ముదిగొండ చాళుక్యప్రభువైన విజయితయే కావలెను.

ముదిగొండ చాళుక్యవిజయితకు ఆపద యెచ్చటనుండి వచ్చెను రెండవ అరికేసరి ఆతనిని ఎట్లు ఆదుకొనెనో విచారింపవలెను మొదటిచాళుక్యభీముని తరువాత వేగిరాజ్యమును కొల్లభిగండ విజయాదిత్యుడు కొన్ని మాసములు పాలించి కళింగ దండయాత్రయందు వీరస్వర్గము నొందెను అతని తరువాత రాజ్యమాతని కుమారుడు మొదటి అమ్మరాజునకు (922-27) సంక్రమించెను అమ్మరాజు అనంతరము వాని సంతతిని త్రోసిపుచ్చి వెంగీ సింహాసనమును రెండవ యుద్ధమల్లుడు (927 34) ఆక్రమించుకొనెను ఈ యుద్ధమల్లుడు రాష్ట్రకూటుల సాయముతో వేగి రాజ్యమును పొందుటచే వారికి వశవదుడై పరిమిత భూభాగమును మాత్రము ఏల కలిగెను రాష్ట్రకూట సేనానాయకులు ఆంధ్రదేశములో ఎక్కువ భాగము నాక్రమించి దండువిడిసి యుండిరి ఇంతలో మొదటి అమ్మరాజు సవతి సోదరుడగు రెండవ చాళుక్య భీముడు తన వంశీయుల సింహాసనమునకై రెండవ యుద్ధమల్లునితోను రాష్ట్రకూట సైన్యములతోడను ఘోరముగా యుద్ధములు చేసి రాష్ట్రకూటసైన్యములను వెడలనడచి తూర్పు చాళుక్యరాజ్యమును సంపాదించెను రెండవ చాళుక్యభీమరాజు (క్రీ శ 934-45) విజయములు ఆతని కుమారుడు రెండవ అమ్మరాజు మాగల్లు కలుచుంబఱ్ఱు శాసనములలో కీర్తింపబడినవి ముదిగొండచాళుక్యులు తూర్పు చాళుక్య వంశీయులకు మిత్రులగుటచే వారు భీమరాజునకు తోడ్పడి యుందురు తనయన్న యగు రెండవ అమోఘవర్షునికి తోడ్పడినందుకును రెండవ చాళుక్య భీమరాజుకు సాయము చేసినందుకును ప్రతీకారముగ నాల్గవ గోవిందరాజు ముదిగొండ చాళుక్యులను శిక్షింపదలచెను భీమరాజు విజృంభణమును అరికట్టి రాష్ట్రకూటులకు అరిగాపగు యుద్ధమల్లునకు సంరక్షణకల్పింపవలసిన అవశ్యకతయుండెను గోవిందరాజు రాచమయ్య యను ప్రసిద్ధసేనాపతిని ప్రచండసైన్యముతో వేంగిమీదికి పంపెను దారిలో వారు చాళుక్యవిజయిత చిన్న రాజ్యమును కబళించి వానిని పారద్రోలిరి బిజ్జడు రెండవ అరికేసరి ఆశ్రయమును కోరగా ఆతడు వానిని చేబట్టెను బిజ్జని రక్షణకార్యమునందే పండ్యార్యుడను సేనానిని అరికేసరి యుద్ధరంగమందు జయించెనని వేములవాడ శాసనము చెప్పుచున్నది. భీమరాజు గొప్ప యోధుడగుటచే రాష్ట్రకూటులకు వేగియందు చుక్కెదురయ్యెను వారు పరాజయము పొంది వెడలి పోవలసినవారైరి

అరికేసరి రెండవ వీరకృత్యము చక్రవర్తియగు గొజ్జిగ (గోవింద IV) తనపై పంపిన మహాసాముతుని నిరించుట అరికేసరి గోవిందుని శాసనమరదియైనను అతడు సోదరహంతకుడని శాభోలు వాని శత్రుపక్షము నవలంబించెను చాళుక్య బిజ్జకు రక్షణ కల్పించినదుకై గోవిందుడు అరికేసరిపై సైన్యమును పంపెను కాని ఈ ప్రయత్నము విఫలమైనది అరికేసరి గోవిందునకు వ్యతిరేకముగా చేసిన మరియొక ప్రబల సంఘటన కలదు గోవిందుని పినతండ్రియగు బద్దెగదేవుడును వాని కుమారుడు కృష్ణుడును గోవిందుని పదచ్యుతుని చేసి సామ్రాజ్యాధికారమును కైవసముచేసికొన యత్నములు సాగించుచుండిరి వీరికి హైహయుల తోడ్పాటు ఉండనే యున్నది పశ్చిమ గాంగరాజకుమారుడగు బూతుగ అను వాతడుకూడ ఈవర్గములో చేరెను బూతుగ బద్దెగని అల్లుడు తనయన్నను పదభ్రష్టుని చేసి గాంగరాజ్యమును తానే ఏలవలెనని బూతుగయొక్క సంకల్పము బద్దెగదేవుడు రాష్ట్రకూట చక్రవర్తియైనచో తన యభీష్టము సాధించుకొన వచ్చునని బూతుగ ఆశించెను ఆంధ్రదేశపు చాళుక్యులు రాష్ట్రకూట పరాభవమును కోరుచునే యుండిరి వీరందరుకును రెండవ అరికేసరి సంధానకర్తయైనట్లు కాన్పించును మొత్తముమీద ఇంతమంది శత్రువుల నెదుర్కొనలేక నాల్గవ గోవిందరాజు పరాజయము పొంది చక్రవర్తిత్వము కోల్పోయెను బద్దెగ దేవుడు రాష్ట్రకూటసింహాసనమును సంపాదించెను ఈతడు మూడవ అమోఘవర్షుడుగా చెప్పబడుచున్నాడు అరికేసరి నాలుగవ వీరకృత్యము కక్కలుని తమ్ముడగు బప్పువ అను వాని అంకకారుని జయించుట కక్కలుడు కాని బప్పువ కాని ఎవరో నిశ్చయించి చెప్పుటకు వీలు కాలేదు వీరు మూడవ అమోఘవర్షుని ప్రతిపక్షీయులనియు క్రొత్తగా చక్రవర్తియైన ఆతని యాధిపత్యమును అంగీకరింపకుండుటచే చక్రవర్తిచే నియమితుడై అరికేసరి ఈ తిరుగుబాటుదార్లను అణచివైచియుండుననియు ఊహింపబడినది ఇట్లు రెండవ అరికేసరి తండ్రి యంతటి విజయశాలి కాకపోయినను సమర్థుడైన వీరుడనుట సంభావ్యము

ఈతని పరిపాలనా విశేషములు తెలియరాకున్నను అరికేసరి గొప్ప భాషాపోషకుడగుట నిజము పంపమహాకవికి ఆశ్రయమిచ్చిన ఈతడు నన్నయభట్టును పోషించిన రాజరాజనరేంద్రుని

స్థాయికి చెందినవాడు. అరికేసరి వేములవాడశాసనముమువలన అకాలపు సాంఘిక విషయములు కొన్ని విదిత మగుచున్నవి. తన తంత్రపాలుడగు పెద్దన అభ్యర్థనపై బద్దెగేశ్వర ఆలయము సత్రము కొరకై నూరు నివర్తనముల భూమిని పానీయ శాలకై ఎనిమిది వర్తనముల భూమిని బెంబులవాటక నగరమునకు ఈశాన్య ప్రదేశమున అరికేసరి దానము చేయుట ఈశాసనోద్దేశము. శాసనమునందు మొదట వినయాదిత్యయుద్ధమల్లుడు మొదలు రెండవ అరికేసరివరకు వంశావళి వర్ణింపబడినది. అరికేసరి ఇంద్రరాజు కుమార్తె రేవకనిర్మడిదేవిని పరిణయమాడుటయు అతడు గజశిక్షాకోవిదుడనియు సకలకళాకుశలుడనియు బంధుప్రీతి కలవాడనియు కావ్యరీతిలో వర్ణింపబడినది. సమధిగతపంచమహాశబ్ద నొడట్టిగెలువ త్రిభువనమల్ల సామంతచూడామణియగు అరికేసరి తత్పాదపద్మోపజీవియు తంత్రపాలుడును సమస్తశాస్త్రపారంగతుడును అగు పెద్దనార్యుని చేత అభ్యర్థితుడై అతడే (పెద్దనే) నిర్మింపబడిన ఆదిత్యదేవాలయమునందు ధర్మము కువచు అభ్యాగతుల మిత్తమైన సత్రమునకు శతనివర్తనముల భూమిని పానీయశాలకు అష్టనివర్తనముల భూమిని ఉత్తరాయణ పుణ్యకాలమున సమర్పించెను. పెద్దనార్యుడు బద్దెగభూమిపాలుని తంత్రాధిపాలుడైన నాగమార్యుని కుమారుడు. తంత్రపాలుడు అనగా సైన్యాధిపతి. బద్దెగుడు రెండవ అరికేసరి ప్రపితామహుడు. గొప్పవీరుడు.

ఈదానమునకు సాక్షులు రాజేశ్వర ఆదిత్యగృహ బద్దెగేశ్వర వాగేశ్వర ఆలయముల స్థానాధిపాసులైన మల్లికార్జున వ్యక్తశిరోగి విద్యారాశి వ్యాఖ్యాభట్టారకులు మరియు చంద్రశేఖ మొదలగు తొమ్మండుగురు బ్రాహ్మణులు. ఈదానమునకు సాక్షులు సర్వశైకాగ్రణియు సూరిసాన అధ్యక్షుడును శాండిల్యాన్వయ జాతుడును అగు మునీశ్వరుడును సాక్షి. ఈ ధర్మమును రక్షించువారికి పుణ్యము కలుగునని చెప్పుటకై ఈక్రింది శ్లోకము ఉటంకింపబడినది.

అనిత్యాని శరీరాణి విభవో నైవశాశ్వతః
నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మ సంగ్రహః

దామీయబడిన క్షేత్రముమీద సిద్దాయము వంద్రెండు ద్రమ్మలు అని శాసనము చివర వ్రాసియున్నది.

శాసనమునందు అరికేసరి సంధివిగ్రహియైన గుణాంకుశుని ప్రసంగముకూడ కలదు. ఇతని సందర్భమెందుకువచ్చినదో నిశదము కాలేదు. రెండవ అరికేసరి కాలమునకే అనగా పదియవ శతాబ్దారంభమునకే వేములవాడ గ్రామమునందు రాజరాజేశ్వరాలయము ముందుటగమనార్హము. బద్దెగేశ్వరాలయము తరువాతి కాలమున భీమేశ్వరాలయముగా మారినది. ఈ దేవాలయ ప్రాంగణమునందే అరికేసరి శాసనము ప్రతిష్ఠింపబడినది. శాసనోక్త దానము ఆదిత్యాలయమునకు చేయబడినది. శాసనకావ్యము తరమగుణముగ సూర్యభగవానుని స్తుతితో మొదలిడుచున్నది. శాసనము సంస్కృతగద్య ద్యములందు అలంకారసుందరమైన శైలిలో వ్రాయబడినది.

భం రా శర్మ.

## అరికేసరి III

లే (వే) ములవాడ చాళుక్యవంశమునందు మూడవ అరికేసరి కడపటిరాజు. ఈతని దానశాసన మొకటి క్రీ శ 966 నాటిది లభించుచున్నది. చారిత్రకులు దీనిని పర్భనీ తామ్రశాసనమని వ్యవహరించుచున్నారు. ఈ సంవత్సరమును అరికేసరి రాజ్యారంభకాలముగా తీసుకొనవచ్చును. ఈతని రాజ్యమెప్పుడు అంతమొందెనో నిర్ణయించుటకు ఆధారములు లేవు. మూడవ అరికేసరి కాలమునందు రాష్ట్రకూట సామ్రాజ్యము అంతమొందెను. చాళుక్యులు తిరిగి విజృంభించి రాష్ట్రకూటులను క్రీ శ 973 ప్రాంతమున ఓడించి కళ్యాణిచాళుక్య సామ్రాజ్యమును స్థాపించిరి. ఆహవమల్ల బిరుదాంకితుడైన రెండవ తైలపరాజు అధికారుడైన సోమదేవమాడి అను వీరుని శాసన మొకటి శక 95 నాటిది నల్లగొండ జిల్లా కొరప్రోలు గ్రామములో లభించుచున్నది. దీని బట్టి క్రీ శ 973 నాటి తెలంగాణము తిరిగి చాళుక్యుల యధీనములోనికి వచ్చినదని చెప్పవచ్చును. వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూటులకు సామంతులును హితులును అగుటచే తమ ఏలికల పక్షము వహించి విజయశీలురైన చాళుక్యులతో పోరాడుచు 973 సంవత్సర ప్రాంతమున చరిత్రపుటనుండి తొలగియుందురని ఊహింపవలయును.

రెండవ అరికేసరిని గూర్చి ఇదివరలో చదివియున్నాము. ఈయకు రాష్ట్రకూట ఇంద్రరాజు కుమార్తెయైన రేవకనిర్మడిదేవి వలన వాగరాజు అను కుమారుడును రాష్ట్రకూటాంగనయే అగు లోకాంబిక వలన భద్రదేవుడను తనయుడును కలిగిరి. భద్రదేవునే బద్దెగదేవుడనియు అందురు తండ్రియనం

తరము నాగరాజు పదిన వత్సరములు 955 మొ సంవత్సరముల నడుమ పరిపాలన చేసెను. ఈతని తరువాత మూడవ అరికేసరి రాజ్యమునకు వచ్చెను. అరికేసరి జనకుడగు భద్రదేవుడు మరణించుటచే కాబోలు వేములవాడ రాజ్యము మూడవ అరికేసరికి దక్కెను. నాగరాజునకు సంతతి యుండెనో లేదో ఉన్నచో వారేమయిరో తెలియరాదు. మూడవ అరికేసరి రాజ్యవిశేషము లేవియు వినరావు. ఈతనికి పెక్కు బిరుదులుండినట్లు పర్భనీ తామ్ర పట్టికలయందు వ్రాయబడినది "స్వస్తి సమధిగత పంచమహాశబ్ద చాళుక్యవంశోద్భవ పాంబిరాంకుశ అమ్మనగంధవారణ త్రిభువనమల్ల సామంతచూడామణి" మున్నగునవి ఈతని బిరుదులు. ఇన్నియు వంశపరంపరాగతములు ఈరాజునకు ప్రత్యేకములు కాకపోవుటచే వాటివలన ద్యోతకమగు చారిత్రికాంశము లేవియు లేవు.

పితామహుడైన రెండవ అరికేసరివలె ఈరాజు కూడ విద్యాప్రియుడుగా కన్పించుట ప్రశంసనీయము. ఆకాలపు సుప్రసిద్ధ జైనాచార్యుడును విద్వాంసుడును అగు సోమదేవసూరికి మూడవ అరికేసరి శక 888 (క్రీ శ 966)లో వ్యయ సంవత్సర వైశాఖ పూర్ణిమా బుధవారమునాడు కుట్టుంవృత్తి వనికటుపలు అను అగ్రహారమును దానముచేసి శాసనబద్ధము చేసెను. ఈ గ్రామము సబ్బినేడు నాట ఉండెను. దీనినే సబ్బి సాయిర మండల మనియు వ్యవహరింతురు. ఇది కరీంనగరం జిల్లాకు సరిపడును. కుట్టుంవృత్తి గ్రామము రేపాక ద్వాదశ గ్రామ మధ్యమున కలదని చెప్పబడినది. దానికి తూర్పున దరిపూరు దక్షిణమున ఇలిందకుంట పశ్చిమమున వెల్లాలపట్టు ఉత్తరమున కట్టకూరు గ్రామములు సరిహద్దులు. దానము త్రిభోగాభ్యంతర సిద్ధి సర్వనమస్యముగను ఈయబడినది. త్రిభోగములనగా తానమనుభవించుట దానము విక్రయము కావచ్చును. ఇప్పటికిని దాన విక్రయాది సర్వాధికారములతో దానమిచ్చుట వాడుకలో ఉన్నది. సర్వనమస్యము అనగా సర్వబాధా పరిహారము కావచ్చును. త్రిభోగాభ్యంతరసిద్ధి యనగా జినాలయము యొక్క ఉదయ మధ్యాహ్న సాయం సమారాధనలైన కావచ్చును.

దాన ప్రతిగ్రహీతయైన సోమదేవసూరిని గూర్చి కొన్ని మంచి యంశములు చెప్పబడినవి. (శ్రీ) గౌడ సంఘమునందు మునిమాన్యుడైన యశోదేవుడు సంభవించెను. ఆయన ఉగ్రతపస్సుచేత శాసనదేవతలతో సమాగమము చెందెను. యశోదేవుని శిష్యవరేణ్యుడు స్యాద్వాద రత్నాకరుడైన నేమిదేవుడు. నేమిదేవునకు సముద్రులైన పెక్కురు శిష్యులు కలరు. వారిలో వయస్సున చిన్నవాడైనను ధీవిశేషము చేత అగ్రజు వంటి వాడైన సోమదేవసూరి విరాజిల్లును. అతడు సమస్త విద్యలకును ఆదర్శము. యశోధరచరితమను గ్రంథమును (యశస్తిలక చంపువును) రచించెను. స్యాద్వాదోపనిషత్తును గ్రథించెను. పెక్కు ఇతర సుభాషితములను వ్రాసెను. కవివత సుడు మహారాజు లాతనికి నమస్కరింతురు. వేములవాడయందు అరికేసరిమహారాజు తండ్రియైన బద్దెగదేవుని పేరిట నిర్మింపబడిన శుభధామ జినాలయము కలదు. సోమదేవసూరి ఈ జినాలయమునకు స్థానాపతి కావచ్చును. ఈ దేవాలయము యొక్క ఖండస్ఫుటిత నవసుధాకర్మ బలినివేద్యార్థముగా కట్టువృత్తి వనికటుపలు గ్రామము సోమదేవసూరికి అరికేసరిచే సమర్పింపబడినది.

అరికేసరి శాసనమునందు వేములవాడ చాళుక్యవంశావళి ఇంచుమించు సమగ్రముగా ఈయబడినది. దీనిని అనుసంధించుట అప్రస్తుతము కాకపోవచ్చును. "ధర్మచక్రమనే బలముచే చీల్చివేయబడిన పాపములుగల జైనశాసనము వర్ధిల్లుగాక! ఆదిత్యభవమైన చాళుక్య వంశము కలదు. దానియందు యుద్ధమల్లుడు ప్రభవించెను. అతడు సపాదలక్ష దేశమునేలెను. బోదన నగరమున ఆయన తన ఏనుగులు తైలకూపమునందు అవగాహనము చేసెను. ఈయన కుమారుడు అరికేసరి. ఈ మహారాజు కళింగత్రయమును వేంగీసహితముగ సంరక్షించెను. ఆయన కుమారులు నరసింహభద్రదేవులు. నరసింహుని కుమారుడు యుద్ధమల్లుడు. వాని తనయుడు బద్దెగడు. బద్దెగడు నానా దుర్ధర యుద్ధలబ్ధ విజయుడు. పాండవ మధ్యముని వంటివాడు. అతడు అంబు సమరమునందు ఉగ్రమైన మొసలిని వలె భీమపరాక్రముడైన భీమరాజును అవలీలగా పట్టుకొనెను. బద్దెగని నందనుడు కార్తికేయ విక్రముడైన యుద్ధమల్లుడు. ఈయనకు నృసింహదేవునివంటి నరసింహుడు జన్మించెను. ఈయన తనూజుడు అరికేసరి. ఇతడు శత్రుకటకములను క్రీడగా గ్రహించెను. ఈయన రాష్ట్రకూట కులమునందు వెలసిన లోకాంబికను సతీమణిగా వడసి ఆమె యందు భద్రదేవుని కాంచెను. భద్రదేవుని పుత్రరత్నము అరికేసరి మహారాజు. ఈరాజేంద్రుడు అమోఘవర్ష చక్రవర్తి కుమారుడైన అకాలవర్ష కృష్ణరాజు పాదపద్మోపజీవి."

అమోఘవర్షుడు ఆ పేరుదాల్చిన చక్రవర్తులలో మూడవ వాడు కృష్ణరాజునకు అకాలవర్ష బిరుదము కలదు ఈయన కృష్ణ నాయకులలో మూడవ వాడు ఈశాసనమునందు చాళుక్యులు సూర్యవంశ ప్రభువులని చెప్పబడినది తూర్పు చాళుక్యులు తాము చంద్రవంశీయులమని ప్రకటించుకొనిరి చాళుక్యులు అయోధ్యా పురమునుండి వచ్చినట్లు వారి వంశక్రమములు చెప్పుచున్నను వాస్తవమునకు వారు దాక్షిణాత్యులనియే నిర్ణయింపబడినది ఆంధ్రదేశమునేలిన ఇక్ష్వాకు వంశీయుల కాలమున హిరణ్యరాష్ట్రమునందు స్కంధచలికి రెమ్మకుడు అను పురుషుడు తెలియవచ్చుచున్నాడు చలికి శబ్దమే చాళుక్య శబ్దమునకు పూర్వరూపము

మూడవ అరికేసరి శాసనము సంస్కృత గద్యపద్యములందు వ్రాయబడినది శాసన కావ్యము రచించినవాడు కవి పెద్దనభట్టు శాసనము చెక్కిన శిల్పి రేవయను నాతడు

అం ల రం

## అరియనాథుడు

ఈయన పూర్తిపేరు అరియనాథ మొదలియారు విజయనగర సామ్రాజ్యమునకు మహామంత్రి సాళువతిమ్మరుసు ఎట్టివాడో నూతనముగా స్థాపింపబడిన మధురనాయక రాజ్యమునకు అరియనాథ మొదలియారు అట్టివాడు ఈయన క్రమముగా నలుగురు నాయకరాజుల వద్ద ప్రధాన సైన్యాధిపతి ఉద్యోగమునందుండి మధురరాజ్య నౌకకు సాటిలేని కర్ణధారుడని చెప్పుచున్నారు విశ్వనాథ ముదటికృష్ణప్ప వీరప్ప రెండవకృష్ణప్ప నాయకులవద్ద అరియనాథుడు దళవాయి-ప్రధాని పదవిని అలకరించెను కాకతీయులవద్ద మంత్రి శివదేవయ్యయు విజయనగరమున తిమ్మరసు మంత్రియు తంజావూరులో గోవింద దీక్షితుడును మధురలో అరియనాథుడును నీతి బృహస్పతులని పరంపరగా చెప్పుకొనబడుచున్నది వీరందరును శతాధిక వృద్ధులై చిరకాలము తమతమ రాజ్యములందు అద్భుతావహములగు పరాక్రమ నయవ్యాపారములు జరిపినట్లు పూర్వకథానకములు వర్ణించును ఈ కథనములలో కొంత అతిశయోక్తి ఉన్నను విస్తారము సత్యమును లేకపోలేదు

అరియనాథ మొదలియారు కాంచీపుర ప్రాంతమున జన్మించెనట ఈయన తల్లిదండ్రులెవరో పేరవారు వారి నామధేయములు తెలియరాలేదు. ఈతని జనన మరణ కాలములను ఊహాధీనములే కాని వాస్తవము తెలియదు అరియనాథుడు కడు వృద్ధుడై క్రీ శ 1601 ప్రాంతమున మరణించెనని చెప్పుచున్నారు కావున ఈతని జననము క్రీ శ 1515 20 ప్రాంతమగుటన భావ్యమగుచున్నది ఈతడు తన బుద్ధి విశేషముచేతను చాకచక్యముచేతను ధైర్య సాహసములచేతను గణ్యుడై శ్రీకృష్ణదేవరాయల కాలమునకే విజయనగరసామ్రాజ్యమునందు ఉద్యోగిగా కుదురుకొనెను కృష్ణదేవరాయలు తన రాజ్యావసానకాలమున మధురనాయక రాజ్యమును నెలకొల్పి విశ్వనాథనాయకుడను వీరుని దానికి రాజప్రతినిధిగా చేసి పంపించెను అరియనాథుడు విశ్వనాథునకు సహాయకుడుగను సలహాదారుగను పంపబడెను బాధ్యతతోకూడిన ఇట్టి పనికి నియోగింపబడు వ్యక్తి పసివాడై యుండుట కుదరదు అందుచే అరియనాథుడు విశ్వనాథనాయకునితో సమవయస్కుడో లేక కొంచెము వయోధికుడో అయియుండునని కొందరు భావించుచున్నారు అరియనాథుడు క్రీ శ 1598 ప్రాంతము వరకు జీవించియుండునని వీరి భావన ఎట్లైనను ఈ మంత్రిసత్తముడు అసాధారణ మేధావి సహస్ర మానజీవి అనుట తథ్యము మధురనాయక రాజ్యము ఏర్పడిన విధము సంగ్రహముగా తెలుసుకొనదగును ప్రాచీనమైన చోళ పాండ్య సామ్రాజ్యములు గొప్ప చరిత్ర కలవియై దేవేంద్రవైభవము అనుభవించి క్రమముగా విచ్ఛిన్నములై పోయెను 14 వ శతాబ్ది చివరి భాగముననే అవి విజయనగర సామ్రాజ్యాంతర్గతములయ్యెను చోళ పాండ్య వంశీయులైన చిన్నచిన్న రాజులు నామ మాత్రముగా ఉండిరి శ్రీకృష్ణదేవరాయలవారి రాజ్యాంతమందు చోళరాజొకడు తన భూమిపై దురాక్రమణము చేసెనని పాండ్యరాజు విజయనగరమునకు నివేదించెను చోళుని ఔద్ధత్యమును మాన్పి పాండ్యునకు న్యాయము చేయుటకై రాయలవారు నాగమనాయడను తన సైన్యాధిపతిని ఒకనిని దక్షిణమునకు పంపెను నాగమనాయడు చోళుని శిక్షించి పాండ్య భూమికి విడుదల కావించెను కాని ఆరాజ్యమును పాండ్యునకు ఇవ్వక తానే ఉంచుకొనెననియు అవిధేయుడైన నాగమనాయకుని సక్రమ మార్గమునకు గొనివచ్చుటకై కృష్ణరాయలు నాగమనాయకుని సుతుడైన విశ్వనాథనాయకుని బహుళ సైన్యముతో పంపెననియు వాడుకలో ఉన్నది ఈ కథ చదువుటకు బాగున్నను విశ్వసనీయముగ లేదని చారిత్ర

కులు భావించుచున్నారు నాగమనాయకుడు సామ్రాజ్యమునకు విశ్వాసపాత్రుడైన సేనాధిపుడు కృష్ణదేవరాయలవారి నిరక్షర భాటిని ఎరుగనివాడు కాడు విశ్వాసపాత్రుడైన అట్టి వీరుడు సామ్రాజ్య ద్రోహిగా పరిణమించుట సంభావ్యము కాదని వీరు తలచుచున్నారు పాండ్యవంశమును పునరుద్ధరించుట సాధ్యము కాదనియు దేశక్షేమమునకై సామ్రాజ్యాధికారులే పాండ్యదేశమును పరిపాలించుట యుక్తమని నాగమనాయకుడు పట్టుదలగా వాదించి యుండుననియు చారిత్రకులు భావింతురు

ఏది యెట్లైనను విశ్వనాథనాయకుడు భూరి సైన్యబలముతో దక్షిణమునకు నడచి నాగమనాయకుని నుండి మధుర పరిపాలనమును స్వీకరించెను అప్పుడు పాండ్య మండలపరిస్థితి చాల హీనముగా ఉండెను ఎల్లయెడలను అరాచకమే గోచరించుచుండెను పాండ్య వంశీయులమని చెప్పుకొనువారిలో కూడ ఐకమత్యము లేక ఒక వర్గమువారు మరొక వర్గమువారిని అక్రమసంతతియని నిందించుకొనుచుండిరి దుర్గములు శిథిలములై యుండెను కావేరీ తీరమువెంట అరణ్యము పెరిగి దారిదోపిడి దొంగలకు నిలయములై యుండెను బలవంతులగు స్థానిక నాయకులు దొంగల ముఠాలను చేరదీసి అమాయక ప్రజలను కొల్లగొట్టుచుండిరి వ్యవసాయము క్షీణించెను ప్రభుత్వాదాయము సన్నగిల్లెను ఇట్టి చిక్కు సమస్యలను పరిష్కరించుటకు వృద్ధుడగు నాగమనాయకుడు చాలడు కావుననే యువకుడును వీరుడును దక్షుడును అగు విశ్వనాథనాయకుని మధురయందు రాజప్రతినిధిగా నియమించుట జరిగెను

విశ్వనాథుడు పాండ్యమండలమున శాంతి స్థాపనచేయు గురుతర బాధ్యతయందు కార్య ఖడ్గములకు సహాయుడుగా ఉండుటకై అరియనాథ మొదలియారు ఎన్నిక చేయబడుట అతని సామర్థ్యమునకు ప్రబల సాక్ష్యము మధురనాయక రాజ్యస్థాపనమునందు వీరు ఇద్దరును సమముగా పనిచేసినవారే కొందరు చారిత్రకులు అరియనాథుడు విశ్వనాథనాయనికి ద్వితీయుడని ప్రశంసించిరి అరియనాథుడు దళవాయిగను ప్రధానిగను చిరకాలము మధురలో ముఖ్యపాత్రవహించెను వయస్సు మీరిన కొలదియు అతడీ బాధ్యతలను నామమాత్రముగా నిర్వహించెనని చెప్పినను తప్పులేదు మధురను చేరగానే రాజప్రతినిధియగు అతని సచివుడును పాండ్య మండల పునర్నిర్మాణమును చేబట్టిరి మధుర దుర్గము శిథిలమై పడియుండగా విశ్వనాథుడు దానిని అరియనాథ కేశవప్ప నాయకుల సహాయముతో బలిష్ఠము కావించెను కోటకు పెక్కు బురుజులు ఏర్పరచిరి దేశోద్ధరణకు కావలసిన ధనము బొక్కసములో లేకుండెను అయినను ప్రజాహిత చింతకుడైన విశ్వనాథనాయకుడు తన తండ్రి సేకరించి ఉంచిన ధనరాసులను ప్రజోపయోగ కార్యములకై వెచ్చించెను మీనాక్షీ సోమసుందరేశ్వరుల ఆలయములను బాగుచేయించిరి పాండ్యులలో ఒకవర్గమువాడైన చంద్రశేఖరపాండ్యుడు నిస్సంతుడుగా మరణించుటచే విశ్వనాథనాయకుడే మధురాధిపతి అయ్యెను ఆరంభములో చోళ మండలము కూడ విశ్వనాథుని క్రిందనే యుండెను అచ్యుతదేవరాయల కాలమున చోళరాజ్యము విడదీయబడి చెవ్వప్ప నాయకుని అధీనమున ఉంచబడెను తిరుచునాపల్లి దుర్గమును బలవత్తరము కావించిరి కావేరీ తీరమందలి దొంగల గూడెములు నిర్మూలింపబడెను తిరుచునాపల్లి శ్రీరంగక్షేత్రములందలి దేవాలయములను బాగుచేసి మంచి స్థితిలోనికి తెచ్చిరి

విశ్వనాథనాయకునకు సహాయుడుగా అరియనాథ మొదలియారు కొన్ని ముఖ్య సమస్యల పరిష్కారమునందు వినియోగింపబడెను రాజ్యముయొక్క దక్షిణ ప్రాంతమగు తిరునల్వేలి జిల్లాయందు ప్రమాద పరిస్థితి ఏర్పడెను అచ్చటి చిన్న చిన్న నాయకులు సైన్యములను కూర్చుకొని మధుర నాయకుని అధికారమును అంగీకరింపక యుద్ధసన్నద్ధులైరి పాండ్యమండలమునందు సువ్యవస్థ ఏర్పడుట వీరికిష్టము లేదు వారి ఆగడములకు అటకటు అగుని వీరి కాపత్రయము అరియనాథుడు సామమార్గముచే వీరిని దారికి తీసుకొని వచ్చుటకు యత్నించి విఫలుడయ్యెను అతడు తన సైన్య సహాయమునకై విశ్వనాథుని అర్థించెను మొత్తముమీద విశ్వనాథుడు ఉపాయముచే పల్లవనాయకులను లోబరచుకొని వారికి తన పాళెయగారు వ్యవస్థయందు అవకాశము కల్పించెను తిరునల్వేలి నగరమును స్వాధీనము చేసుకొని ప్రభువును మరియు దానిని బాగుచేయించి రాజమార్గములు చక్కబరచిరి ప్రజలకు పెక్కు సౌకర్యములు కల్పించిరి ముఖ్యముగా వ్యవసాయాభివృద్ధికై కార్యక్రమములను అమలుచేసిరి పడావుభూములు వ్యవసాయము క్రిందికి తెచ్చుటకు ప్రోత్సాహము ఇచ్చిరి దేశమంతయు తిరిగి శాంతితోను సంపత్తితోను

కలకలలాడజొచ్చెను.

ఇప్పుడు మధుర నాయక రాజ్యము విస్తృత భూభాగము నాక్రమించి క్రమబద్ధమైన పరిపాలనా విధానమును, సైన్య రక్షణ పద్ధతిని కోరుచుండెను. దీనియందు మధుర, రామనాడు, తిరునల్వేలి, తిరుచునాపల్లి, కోయంబత్తూరు, సేలము జిల్లాలును తిరువాన్కూరులో కొంత భాగమును చేరియుండెను. విస్తృతమైన ఈ రాజ్యమును చిన్న చిన్న విభాగములుగా చేసి మంచి వ్యవస్థ ఏర్పరచవలసిన భారము అరియనాథునిపై ఉంచబడెను. అతడు దీని పరిష్కారమునకై కల్పించిన పద్ధతియే పాళెగారు విధానము. ఉత్తరాదినుండి తనతో వచ్చిన పెక్కు వీరులకు విశ్వనాథనాయకుడు గౌరవస్థానము ఈయవలసియుండెను. అట్లే శాసించిన పూర్వ పాండ్య కుటుంబముల కును బలవంతులైన స్థానిక నాయకులకును రాజ్యములో అర్హస్థానములు కల్పించవలసియుండెను. దేశము నంతను అరియనాథుడును విశ్వనాథనాయకుడును 72 పాళెములుగా విభజించిరి. దీనిలో చిన్నవియు పెద్దవియు కలవు. ఒక్కొక్క పాళెము ఒక్కొక్క పాళెగారు అధీనమున ఉంచబడెను. మరియు ఇది వంశ పారంపర్యముగా వచ్చు పదవి యగుటచే పాళెగారులు చాలమంది దీనితో తృప్తిపడి కేంద్రమునకు విధేయులును విశ్వసనీయులును అయిరి. పాళెగారుడు ఒక చిన్న రాజ్యాధిపతి. పాళెము రక్షణమునకు కావలసిన పోలీసు సిబ్బందిని అతడు భరించును. న్యాయవిధానము కూడ అతనియందే నిలచెను. ఇదికాక కేంద్రమునకు యుద్ధ సమయము నందు తోడ్పడుటకై పాళెగాడొక చిన్న సైన్యమును సమకూర్చుకొని పోషించవలసియుండెను. పాళెము ఆదాయములో మూడవవంతు కేంద్రమునకు కప్పముగా పంపవలెను. రాజ్యమునకు ప్రశంసనీయమైన సేవచేసిన సందర్భములలో పాళెగారుడు కట్టవలసిన పాలీనా కప్పము మాపుచేయబడుచుండెను.

పాళెగారు పద్ధతియందు దోషములు లేకపోలేదు. దేశమునందు మాండలిక ప్రభువులు కాముకులు తంపరులు అయిరి. కేంద్ర వ్యవస్థ బలహీనమగుటకు బీజములు దీనిలో ఇమిడియున్నవి. అయినను అప్పటి పరిస్థితులలో పాళెగారువిధానము ప్రయోజనవంతముగనే పరిణమించెను. మరియొక మార్గము ప్రత్యామ్నాయముగ కానరాదయ్యెను. ఈ వ్యవస్థ చాలవరకు అరియనాథుని బుద్ధికల్పితమగుటచే పాళెగారు లాతనికి కృతజ్ఞులైయుండిరి. అరియనాథుని సేవలకు మెచ్చి విశ్వనాథనాయకుడాతనికి తిరునల్వేలి జిల్లాలో 12 గ్రామములు దానము చేసినట్లు క్రీ శ 1560 వ వత్సరము నాటి ఒక తామ్రశాసనము నుడువుచున్నది. ఈ మంత్రిసత్తముని భుగి పరాక్రమమును గూర్చియు జటిలమైన సమస్యలను గూడ క్షణములో పరిష్కరించగల బుద్ధికుశలతను గూర్చియు అద్భుతావహమైన కథలు జనులలో వ్యాపించియున్నవి. పుదు మండపమునందును సహస్రస్తంభ మండపమునందును ప్రతిష్ఠింపబడిన ఆయన విగ్రహములు అరియనాథుని గొప్పతనమునకు సాక్ష్యములు.

విశ్వనాథనాయకుడు క్రీ శ 1564 ప్రాంతమున దివంగతుడయ్యెను. ఆయన కుమారుడు మొదటి కృష్ణప్పనాయకుడు మధుర సింహాసనమును అధిష్ఠించెను. ఈతని కాలమున కూడ అరియనాథ మొదలియారు దళవాయి ప్రధాని పదవియందుండెను. ఇంతలో విజయనగర సామ్రాజ్యము అత్యంత విపత్కరమైన ఝంఝా మారుతములో చిక్కుకొని విధ్వంసమయ్యెను. అది తాళికోట యుద్ధము. సామ్రాజ్యమునకు ఈమహాపదయందు తోడ్పడవలసిన బాధ్యత మధురరాజ్యముపై ఉండెను. కృష్ణప్పనాయకుని రాజ్యారంభకాలముననే అతడు స్వరాజ్యములో తిరుగుబాటులను ఎదుర్కొనవలసినవాడయ్యెను. కావున ఉత్తరాదికి పంపుటకు అతనివద్ద సైన్యబలము తగ్గెను. అట్లయ్యును అరియనాథుడు కొంత సైన్యముతో సామ్రాజ్యసహాయమునకై వెడలెను. కాని విధిప్రేరితమైన విజయనగర పతనమును అతడు నిలువరింపగలుగునా? అరియనాథుడు 1566-67 నడుమ తిరిగి మధుర రాజ్యమునకు మరలెను. తాళికోట యుద్ధానంతరము అతడు ప్రజాక్షేమ కార్యములలో నిమగ్నుడయ్యెనని చెప్పుదురు. కంజీవర ప్రాంతములందున్న తన బంధువులను దక్షిణమునకు రప్పించి అరియనాథుడు వారికి వసతులు కల్పించెను. మధుర రాజ్యమందటను గల ప్రసిద్ధ దేవాలయములను పునరుద్ధరించుట, క్రొత్త దేవళములు నిర్మించుట అతడు శ్రద్ధతో చేపట్టెను.

అరియనాథుని జీవిత విశేషములు మృత్యుంజయ కవిలెలయందు వర్ణితమైనవి. అందు అతిశయోక్తులు చాల కలవు. ఈ సచివోత్తముడు క్రీ శ 1600 లో మరణించువరకును మధురరాజ్యచక్రమును తానొక్కడే త్రిప్పెననియు అప్పటి నాయక ప్రభువులు అతని చేతిలో కీలుబొమ్మలవలె ఉండిరనియు కొందరు చెప్పుదురు. ఇది యంతగా విశ్వసింపదగినది కాదు.

వృద్ధుడను మహా వర్ధుడను అగుటచే అతని సలహా పాటింపబడుచుండెను. మదగిరియే 1570 సంవత్సరము నాటి యొక శాసనములో అరియనాథుడు విశ్వనాథ కృష్ణప్ప వీరప్పనాయకుల కార్యకర్తయని ప్రశంసింపబడెను. కటిక దరిద్రమునుండి కలిమిలుకను అనామకత్వమునుండి మహాకీర్తి పథమునకును తన బాహుబలముచేను ధీపటిమచేను నిరంతర కార్యశీలతచేతను అరియనాథుడు మొదలియారు మార్గము నిర్మించుకొనుచు పోయెను.

ఆం. ల. రం.

## అరియప్రెగ్గడ

అరియప్రెగ్గడ ప్రశంస దక్షిణహిందూ శాసనములలో గానవచ్చుచున్నది (ద. హిం. IV నెం. 1057). ఈ శాసనము దాక్షారామ భీమేశ్వరాలయములోని యొక శిలాస్తంభముపై నున్నది. ఇది శక 1071 నాటిది. శాసనము మొత్తము పది పంక్తులలో నున్నది. మొదటి ఆరుపంక్తులు సంస్కృత శ్లోకము లోను, చివరి నాలుగు పంక్తులును తెలుగువచనములో నున్నవి. 9, 10 పంక్తులలో కొంత భ్రష్టమైనది.

**శాసన సారాంశము**

శకవర్ష 1071 ణ్టి సంవత్స 17 శ్రాహిను త్తరాయణ సంక్రాన్తి నిమిత్తమున శ్రీభీమేశ్వర మహాదేవరకుం గమ్మనాణ్టి త్రిభువనమల్ల దేవరాజు ప్రెగ్గడ (అరి) య ప్రె(గ్గడ) అఖండ వర్తి లోనారదణ్టు గణ్టికి నాచ ద్రార్కము నేయి తిరియించ్చువారుగా బోలు లవురుం బూణ్టగా మూణ్డవు నడపునము – – వనమున ఇ(ముప్ప)డ్లు 50 (త్రి)భు(వ)నా కుశ నిత్యనేమాన గ ఇమన్మల త్రిపురాన్తకమున రామేశ్వరం—కు శాశ్వతి

ఈ శాసనాభిప్రాయము ఇట్లు తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 1149 వ కమ్మనాటి పాలకుడైన త్రిభువన మల్లదేవరాజు మంత్రియైన అరియప్రెగ్గడ ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తముగా దాక్షారామ భీమేశ్వర దేవరకు అఖండ దీపముంచుటకు గాను ఒక లోహస్తంభమును సమర్పించెను. నిత్యముస్వామివారి కడ అఖండదీపము వెలిగించుటకై నేతికొరకు యేబది గొఱ్ఱెలను ఇవురు బోయల వశమున నుంచెను. వారు నిత్యము అఖండదీపమునకు ఒక మానెడు నేతిని స్వామివారికి సమర్పించు చుండవలెను. ఈ విధముగ ఆచంద్రార్కము జరుగవలెను.

శాసనమున కనబడు త్రిభువన మల్లదేవరాజు పాలన కాలమునాటి కొన్ని యంశములను ముచ్చటించుట అవసరము. క్రీ. శ. 1070 నాటి తూర్పుచాళుక్య ప్రభువగు రాజరాజ నరేంద్రుని కుమారుడు కులోత్తుంగచోడుడు (రాజేంద్ర చోడుడు) వేంగిచోళ రాజ్యములకు చక్రవర్తి అయ్యెను. వేంగిని పాలించుటకు తనకు ప్రతినిధులనుగా తన సుతులను పంపి తాను చోళరాజ్యమున ఉండి రాజ్య వ్యవహారములను చక్కబెట్టుచుండెను. వేంగిని కబళించుటకై పశ్చిమచాళుక్యులు యత్నించుచుండిరి. అందుచే అతడు తన శత్రువులకు అందగకుండుటకు తన సేనానులలో భృత్యవర్గములలో కొందరికి రాజలాంఛనము లొసగి వేంగిని కొన్ని మండలములుగ విభజించి ఒక్కొక్క మండలమునకు ఒక్కొక్కరిని పాలకులుగ నియమించెను. మండలములను పాలించువారు గావున వీరికి మాండలికులు అను పేరు కలిగెను. ఇట్టి మాండలిక ప్రభువులలో వెలనాటివారు ప్రముఖస్థానము వహించిరి. వీరు కళింగముతో గూడిన తూర్పుసముద్ర తీరస్థమైన ఆంధ్రదేశమునకు పాలకులైరి. ఇట్టి మాండలిక ప్రభువులలో తెలుగు చోడుల శాఖకు చెందిన త్రిభువన మల్లదేవ చోడమహారాజొకడు. ఇతడు దినకులతిలకుడు అనగా సూర్యవంశము వాడని చెప్పబడినది. ఇతడు కులోత్తుంగచోడ గొంకరాజునకు సమకాలికుడు. ఈయనకు నన్నిచోడ కన్నరదేవులు అను కుమాళ్లు కలరు. ఇతడు కమ్మనాడు గుండికర్తి మొట్టవాడి ప్రాంతములను పాలించెను. నేటి నరసారావుపేట తాలూకాలు ఒంగోలు తాలూకాలో కొంత భాగము మార్కాపురము తాలూకా ప్రాంతము గుండ్లకమ్మ నదికి రెండు తీరములలోనున్న ప్రాంతములును పైన పేర్కొనిన పూర్వపు కమ్మనాడు గుండికర్తి మొట్టవాడి ప్రాంతములకు వర్తించును. ఈ మూడిటిని కలిపి కమనాడని యే పూర్వము వ్యవహరించిరి. గుండికర్తి అనగా గుండ్లకమ్మకు రెండువైపుల కావచ్చును. కర్తి కరుతి అనగా సమీపము ఒడ్డు అని అర్థము. శాసనములలో తరచు ఈ శబ్దము కనిపించును. గంగకటుత గోవుల చంపిన పాపము అని ఒక శాసనములో కలదు.

మల్లదేవచోడమహారాజు శక 1059 నుండి 1075 (క్రీ. శ. 1137 నుండి 1153) వరకు కమ్మనాటిని పాలించెను. తెలుగుచోళులు నరసరావుపేట తాలూకా కొణిదెన రాజధానిగా చేసికొని పాలించిరి. కొణిదెనకే పూర్వము కోట్యదోన అని పేరు గలదు. వీరు మొదట పశ్చిమచాళుక్యులకు సామంతులుగ ఉండిరి. వేంగి నాక్రమించిన పశ్చిమచాళుక్య చక్రవర్తిని

హానెయదొర నివాసముగా జేసకొని యందే ఎలిచిపోయెను ఈతనికి చిరకాలము దనుక సంతానము లేకు డెను నిషతో కంఎల సోమేశ్వరదేవుని ఆరాధించి తత్ప్రసాదనమున నొక పుత్రుని గా చెను సోమేశ్వరదేవుని అనుగ్రహమున ంించిన వాడగుటచే గనాయకుడు తన పుత్రునకు సోమేశ్వరుడని నామకరణ మొనరి చెను ఆబాలుడు పెరిగి పెద్దవాడై బాహో విక్రమఖని యని పేరొ దెను త డ్రి మరణాన అరము బైచప్ప మ త్రిసహాయమున గద్దెనెక్కెను ంపెల ఆనెగొంది హ వి హోసమలె దుర్గములు తన ఏలుబడిలోనికి తెచ్చెను ప్రజానురంజకముగా పాలి చుటచే ప్రజలీతనిని ఆరాధ్యదైవ ముగా నెంచి కంఎలరాయ (దేవుడు) అని పేర్కొని భక్తి ప్రపత్తుల సేవి చుచుండిరి వీరత్వమునకు సూచకంబులగు వీరకంపిల వీరకుంభిణి అను బిరుదు నామముల నీతడు ధరించెను అట్టివీరుని అర్ధాంగియై అరియాలదేవి వీరపత్ని విఖ్యాతి న దు కొనెను

కంఎలరాయలు బహుకల్లభుడైననూ పతి మతమే తన మతముగా భావించి సపత్నులయ దు ఇసుమంతయు నీర్ష్య లేకుండా పతి హృదయమును జూరగొనిన పతివ్రతా శిఖామణి అరియాలదేవి పరస్పరానురాగ బద్ధులైన అరియాల ంఎలి రాయలకు చిరకాలము దనుక స తానము కలుగకుండెను ఆమె సంతతికై నోయరాని నోములు పట్టరానివ్రతాలు అకల్లావత్రిగా నోచెను రావిచిలుకనోయు నోచెను కాశీతీర్థ గంగకు గ గ తీర్థం గాశికి చేర్పెను ప ర్వత బో యేటి మార్గంలో పదివేలకు జ గమార్చన చేయి చెను పె డ్లిండ్లు లేని పేద బ్రాహ్మణులకు పెండ్లి డ్లు చేయి చెను వడుగులు లేని పేదబ్రాహ్మణులకు వడుగులు చేయించెను మిట్టను బావులు పల్లమున చెఱువులు గో ఒక పనా తరమున వేయించెను కాని సంతానఫలము లేకుండెను తుదకు ఘోరతప మొనరించి జత గరాముని ప్రసన్నుని గావించు కొని సంతానము బొందవలెనను దృఢ స కల్ప భరిత చిత్త యయ్యెను భర్త యాజ్ఞలు పొందెను జత గరాముని గూర్చి తప మొనరింప నేగెను ఆమె తపో నిష్ఠ కుమారరాముని కథ యందిట్లు వరితమయ్యెను

"ఆదేవళము ముందరను మాదిగుండు ఉన్నది
నరు లెక్క లేరు దిగలేరు ఆ నూవిగుండు మీదికి
తాను తాను ప్రాకెను దర్భాసనము పరచినది
దర్భాసనము మీదను పులిచర్మము పరచినది
పైన జింకచర్మము పరచినది జి క చర్మము మీదను
గుమ్మడి పండును నిలిపెను గుమ్మడిప డు మీదను
సూది మీద సూదేమి యేడుసూదులు నిలిపెను
చివరసూదిని అరియాలి అవగి జను నిలిపెను
ఆవగింజమీదను శిరస్సు క్రింద మోపినది
శ్రీపాదము మీదేమి తామ తపస్సు పట్టి ది
అప్పుడు స్వామివారేమి గడగడ వణకుచును
అబ్బ! ఎ తతపస్సు పట్టినది! నేను చూడలేనేమి
అంటూ ప్రత్యక్షమైనాడు
నీకు ఇంత కష్ట మె దుకు నీకు కోరినఫలములు
యిచ్చెదను"

అన్నాడు భర్త ప్రసన్నుడయి భగవానుకు అటుల జతంగరాముని ప్రసన్నుని గావించుకొని తద్వర ప్రసాదమున నొక పుత్రుని గాంచెను అతనికి ఆదేవుని పేర కుమార రాముడ ని నామ రణ మొనరించెను ఆపై కవి కల్పన లెట్లు న్ననూ అరియాల దేవి అనన్యభక్తి చిత్తయగియు అట్టి సాధ్విని సతిగా బడయుటచేతను క ఎలరాయ బ ను ఆ పవిత్రచరిత్రను జనయిత్రిగ బడయుటవలనే కుమార రాముడు ను శత్రుభీ ంలై శాశ్వత విఖ్యాతి న దు కొన గలిగిరని నిర్వివాదముగ పలుకవచ్చును

## హ పు

ఇందలి చరిత్రాంశములను కొన్నింటిని గుర్తింపదగును దేవగిరి యాదవ రాజులలో రామదేవరాయలు అను ప్రభువు లేడు రామచంద్రదేవుడు కలడు ఈతడే కుమారరాముని కథ యందలి రామదేవరాయలని ఊహింపవచ్చును ఈతడు క్రీశ 1271-1311 నడుమ 40 స వత్సరముల దీర్ఘ కాలము దేవగిరి రాజ్యమును ఏలెను ఈతడు కాకతి రుద్రమదేవి ప్రతాపరుద్రచక్రవర్తికిని సమకాలికుడు డగుచున్నాడు రామ చంద్రదేవుడు ద్వారసముద్రపు హొయసలులపై ద డెత్తి వారి ముఖ్యపట్టణమును ముట్టడించి చాలా చికాకుకలిగించెను

ఈతడు ఉత్తర హిందుస్థానమును గూడ ప్రవేశించి వారణాసిని మునల్మానులనుండి గ్రహించుటకు కృషి చేసెను ఇంతలో అదృష్ట చక్రము యాదములకు వక్రించెను అల్లా ఉద్దీనుఖల్జీ దేవగిరిపై చేసిన హఠాత్తు దండ యాత్రకు లొంగి పోయి రామచంద్రదేవుడు ఢిల్లీకి కప్పము కట్టుట కంగీక

రించెను కాని పరాక్రమశాలియు యువకుడును అగు రామచంద్రదేవుని కుమారుడు శంకరదేవుడు ముసల్మానులకు లోంగి యుండుటకు అంగీకరించక తిరుగుబాటు చేయుటకు అదనుచూచు చుండెను

క్రీ శ 1304 సంవత్సరమున అల్లాఉద్దీను కాకతీయ సామ్రాజ్యమును కబళించుటకై ప్రయత్నము మారక చెను ప్రతాపరుద్రుడు తురుష్క సైన్యములను ఓడించి పారద్రోలెను హిందువుల విజయముతో రామచంద్రదేవుడు కొంత యుత్సాహమును తెచ్చుకొనెను కుమారుడు శంకరదేవుని ప్రోద్బలముపై అతడు ఢిల్లీకి కప్పము పంపుట మానెను అల్లావుద్దీను అగ్రహోదగ్రుడై మాలికాఫర్ ను ప్రబల సైన్యముతో దేవగిరిపై పంపెను రామచంద్రదేవుడు బందీ అయి ఢిల్లీకి కొనిపోబడెను రాజనీతి చతురుడయిన సుల్తాను రామచంద్రదేవుని సామంతునిగా అంగీకరించి దేవగిరి పాలించుకొనుటకు పంపివేసెను

రామచంద్రదేవుని పరాజయమును చూచి ప్రతాపరుద్రుడు అనంతపురం రాయచూరు జిలాలను ఆక్రమించుకొనెను హొయసలులును కొంత రాజ్యమును ఆక్రమించుకొనిరి రామచంద్రదేవుడు 1311 ప్రాంతమున మరణించి యుండును

కంపిలిరాజకుమారుడైన కుమార రాముడు ప్రతాపరుద్ర చక్రవర్తి చివరి కాలమున కాకతీయ సామ్రాజ్య దక్షిణభాగమున అలజడి కలిగింప జొచ్చెను ప్రతాపరుద్రుని సేనాములగు రేచర్ల సంగమనాయుడును బెండపూడి అన్నమంత్రియు కుమ్మటము వద్ద కుమారరాముని ఓడించిరి శ్రీనాథుని భీమేశ్వర పురాణమున బెండపూడి అన్న సేనాని కుమ్మటమును విఘటించు ప్రశంసకలదు

ఇం లి రం

## అరియేటిఅన్నయమంత్రి చూ అన్నమంత్రి బెండపూడి

## అరియేటి లింగమంత్రి చూ అన్నమంత్రి బెండపూడి

## అరివర్ణమ్మ

ఈ పేరు రేనాటి చోళుల శాసనములందు కాన్పించుచున్నది (ఎపి ఇం XXVII నెం 42 పుట 245) ఇదే పేరు మరియొక శాసనమునందును కనవచ్చుచున్నది (ద హిం X నెం 632) అందిది ఒక వ్యక్తి నామమో లేక బిరుదమో నిశ్చయించుట కష్టముగా ఉన్నది రెండు గ్రంథములందును ఇది అరివరజమున్టు అను రూపముతో నున్నది న్టు ప్రత్యయము అంతమందు గల శబ్దములు తరువాతి కాలమున డు ప్రత్యయాంతములుగా మారినవి ప్రాచీనాంధ్రభాషలోని న్టు డు డు అను క్రమమున పరిణామము చెందినదని భాషాశాస్త్రజ్ఞులు చెప్పుదురు అరివరజమున్టు అనునది ఇప్పటి అరివరజముడుతో సమానము అగుచున్నది శత్రువీరులకు యముని వంటివాడు అని దీని యర్థము యముడు-జముడు యవనిక జవనిక అను రీతిని యకారము జకారముగా మారుటయు దీనిలో గుర్తింపవచ్చును అరివరజమున్టు అను పదము వైరి సమాసమని చెప్పవలెను శాసనభాషయందు ఇట్టివి సామాన్యము బిరుదు పదములయందు వైరి సమాసములు కూర్చుట ప్రసిద్ధము ఒక విధముగా ఈ శబ్దము మార్తురగండుగు వంటి భావమునే చెప్పును

ప్రసక్తమైన శాసనపాఠములను రెండు ఆధారగ్రంథముల నుండియు ఇచ్చుట యుక్తమని అట్లు చేయుచున్నాము

ఎపి ఇం పాఠము శ్రీమహేంద్ర మానరవి మారురవ (డుగు) మగన్టు పుదలి ఎలువాన్టు కాంబోల ముత్తరజు అచ్చెరువుగను అరివరజమన్టు అన్వన్టు దంతియమ్మ మగు తోళన్ పొడుచి పడియెన్" ద హిం X పాఠము శ్రీమహేంద్ర ఎమాన (ర) వికూలు (--)వి మగన్టు పుదలి పలువాన్టు కాపిఅన్వన్టులను అరివరజమన్టు అన్వన్టు దన్తియమ్మ వొగుణ పొడుచి పడియె"

ఈశాసనము అనంతపురం జిల్లా హిందుపూరు తాలూకా బూడిదగడ్డపల్లి గ్రామము శివారైన బూదిలి వద్ద ఒక వీరగల్లు మీద లభించినది రెండు గ్రంథములను ఈవిషయమున అంగీకరించుచునే ఉన్నవి ఉభయపాఠములందును సామాన్యమైన పేర్లు-శ్రీమహేంద్ర పుదలి అరివరజమున్టు దంతియమ్మ -అనునవి పొడిచిపడుట అనగా యుద్ధము చేసి వీరమరణము నొందుట అను కార్యముకూడ రెండింటి యందును సమానముగనే ఉన్నది ఎపిగ్రాఫియా పాఠమునందు కాపిచోళముత్తరజు అచ్చెరువుగను అనునదియు మగు (దతియమ్మ మంగు) అనునదియు అధికముగా ఉన్నవి ఎపిగ్రాఫియా పాఠమే సరిఅయినదియు సమగ్రమైనదియు కావచ్చును

ఐనచో శాసనము అర్థము ఇట్లుండవచ్చును

దుర్గుడు శ్రీశైలము నేలు రాజును జయించియు డును

ఈదండయాత్రయందే హిందుపూరు తాలూకాలోని బూదిలి గ్రామము రణ క్షేత్రముగా మారియుండుట సంభావ్య ము ఈయుద్ధము చాళుక్యులకును ద తిదుర్గుని మిత్రవర్గ మునకును నడుమ జరిగెనని ఊహింప వచ్చును అయినచో బూదిలి ప్రాంతము నేలుచున్న రేనాటి చోళుల పాత్ర యెట్టిది వీరు ద తిదుర్గునకు మిత్రులా ? శత్రులా ? అనునది నిర యించుటకు నిశ్చయమైన సాక్ష్యము లభించుటలేదు అరివరజముని గూర్చిన వీరగల్లు శాసన పాఠము విభిన్నముగా ఉన్నది "ద తియమ్మమంగు తోడ పొడిచి పడియె" అను పాఠమును బట్టి శాక్యపి చోళముత్తరాజు దంతిదుర్గుని సైన్యము నెదిరి చి వీరమరణము పొ దెనని సూచితమగు చున్నది దంతియమ్మ వొగుణ పొడిచి పడియె అను పాఠ మును గ్రహింపదగియే ఉన్నది అయినచో వొగుణ అనగా నేమి?దీనిని మేము పొగుడ ప్రశంసి ప అని యర్థము చేయు చున్నాము ణ కారము డ కారము ప్రాచీనభాషతో తారుమారు అగుచు డును ఇప్పటికిని ఉన్నది కణుదురు-కడుదురు పణతి పడతి ఇట్టివి ఉదాహరణములు దంతియమ్మ ప్రశంసించు రీతిని చోళముత్తరాజు విక్రమించి మరణించెను అని చెప్పినట్లయినది అనగా శ్రీమహేంద్రుడును అతని పుత్రుడును బాదామి చాళుక్యులకు ప్రత్యర్థులై నందివర్మ-దంతిదుర్గ సమాఖ్యకు మిత్రవర్గము వారని తెలుచున్నది ఇది యింకను విచారణీయము మొత్తముమీద రేనాటి చోళులు పల్లవసామ్రాజ్యముయొక్క పరిధియందే సామ త మిత్రులుగా ఉ డరని తోచుచున్నది

దంతియమ్మ మ గు అనగా దంతిదుర్గుని అనుచరుడు కావచ్చునని కొందరు చెప్పిరి కాని శత్రువుగనో మిత్రునిగనో మహావిజేతయైన దంతిదుర్గుని పేర్కొనుట సహజముగా నుండును వాని భృత్యుని పేర్కొనుట యుక్తియుక్తముగా తోపదు

శ్రీకంఠచోళుని శాసనమునందు రెండవ మహేంద్రుని కుమారుని పేరు ఎలంజూళ ముత్తమరాజు ప్రశంస లేదు మహేంద్రుని తరువాత రాజరికము చేసినవాడు ఎల జోళ కావచ్చును కావున అతడు పేర్కొనబడినాడు ముత్తరాజు బూదిలి ప్రాంతమున తండ్రికి ప్రతినిధిగా ఉండుచు రణ విహతుడయ్యెనని సమన్వయము చేయనైనది

కిం లి రం

## అరివీడు

అరివీడు కడపజిల్లా రాయచోటితాలూకాలో ఉన్నది దీనికి 23 మైళ్ళదూరములో రాయచోటిపట్టణము కలదు ఈ గ్రామమునకు తూర్పున రిజర్వుఫారెస్టు పడమట రిజర్వు ఫారెస్టు ఉత్తరమున గాలివేడు దక్షిణమున ఒకగుట్ట ఉన్నవి ఇది ఎర్రనేలలతో గుట్టలతో చదునుగాను మిట్టపలములు గాను ఉన్నది దీనివిస్తీర్ణము 6 925 ఎకరములు

1961 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామము లోని పురుషులు స్త్రీలు కలిసి 3399 మంది ఉండిరి వీరిలో షెడ్యూలు జాతులవారు 227 మంది షెడ్యూలు తరగతుల వారు 7 మంది ఇచ్చట ఇ డ్లుదూరదూరముగాను విడివిడిగాను వాడవాడలుగాను నిర్మి చబడినవి వీటిలో 4 పెంకుటిండ్లు 16 కాంక్రీటు కప్పుగలఇ డ్లు 3 ఒక అంతస్థుమేడలుకలవు ఖాళీ స్థలముఉ డుటచేతూర్పువైపునగ్రామముఅభివృద్ధిచె దుచున్నది ఇచ్చటి జనులలో 1 876 మంది వరిఅన్నమును 1142 మంది జొన్నఅన్నమును 381 మంది ఇతరాన్నములను తిందురు బావినీటిని త్రాగుదురు మంచినీటి ఎద్దడి కలదు

ఈ గ్రామమున 948 ఎకరములఅరివీడుచెరువు బావులు కలవు వీటిక్రింద వరి జొన్న వేరుసెనగ రాగులు మొద లైన పంటలు పండును ఈ పంటధాన్యమును పాతరలు మొద లగు వాటిలో నిలువచేయుదురు వీటిని బండ్లపై లారీలపై రాయచోటికి రవాణాచేయుదురు ఒకమామిడితోట కలదు మామిడికాయలను స్థానికులు ఉపయోగింతురు వ గ బె డ టొమాటో మొదలగు కూరగాయలలో సగమువాడుకొని మిగిలినసగమును గాలివేడు రాయచోటి అను గ్రామములకు రవాణాచేయుదురు 1966 67 సం॥లో ప టలక్రి ద ఉప యోగి చిన భూమి 868 ఎకరములు చెరువుక్రింద 374 ఎక రములు బావులక్రి ద 62 ఎకరములు సాగుబడి జరిగెను 5 ఆయిల్ ఇంజనులు 32 ఎకరములకు కపిలలు 30 ఎకరము లకు నీటిని సప్లైచేసెను ఇచట 5664 ఎకరముల చిట్టడవి ఉన్నది ఇది ప్రభుత్వపు అధికారములో ఉన్నది దీనిలో చీకు యలమ మొదలగు వృక్షములున్నవి కట్టెలను రాయచోటికి రవాణాచేయుదురు

ఇచ్చట ఆవులు ఎద్దులు కలిసి 430 గేదెలు దున్న పోతులుకలిసి 318 కలవు మేకలు 62 గొర్రెలు 616 కోళ్ళ

1472 కలవు 6 గాడిదలు ఉన్నవి పాలునకు 4000 లీటర్ల పాలను స్థానికులు ఉపయోగించుకొని 4000 లీటర్ల పాలను గాలివేడునకు రవాణాచేయుదురు

ఈ గ్రామప్రజలకు వ్యవసాయము కూలిజీవనాధారములు 13 దుకాణాదారులు 2 క్రయవిక్రయదారులు 59 మంది ఎద్దుబండ్లుతోలువారు ౼లరు కసాలులు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీమేస్త్రీలు మంగలివారు చాకలివారు గొల్లలు వడ్డెరలు కలరు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు కూలిరేటు పురుషునకు రు 2/ లు స్త్రీకి రు. 1-00

ఈ గ్రామములో ఒకరామాలయము ఒకమసీదు౼లవు దేవాలయమునకు 3 ఎకరములభూమి కలదు గంగజాతర జరుగును

కదిరిరైల్వేస్టేషను ఈ గ్రామమునకు 29 మైళ్ళదూరములో ఉన్నది ఈ గ్రామములో ఒకకంకరరోడ్డు 3 మట్టిరోడ్లు ఉన్నవి దీనిని పొరుగుగ్రామములతో మట్టిరోడ్లు కంకరరోడ్లు ౼లుపుచున్నవి ప్రతిరెండుగంటలకు౼మారు ప్రైవేటు బస్సులు రాయచోటినుండి అరివీడునకు వచ్చును ప్రయాణములకు 4 ఒంటెద్దుబండ్లు 55 రెండెడ్లబండ్లు 14 సైకిళ్ళు ఉపయోగ౼డుచున్నవి

అరివీడులో బ్రాంచిపోస్టాఫీసు అప్పర్ ప్రైమరీస్కూలు ఉన్నవి ఇది పంచాయతీపరిపాలనకల గ్రామము ఇండ్లపన్ను వృత్తిపన్ను మొదలగునవి పంచాయతీకి ఆదాయము నిచ్చును రేడియో లౌడ్‌స్పీకర్లు కలవు నాటకశాలానిర్మాణమునకు తగిన ప్రదేశము ఒక సత్రము ఉన్నవి ఒక హోమియోపతి వైద్యుడు కలడు 6 కిరాణాదుకాణములు 4 కిళ్ళీ సిగరెట్టు సోడా దుకాణములు ఒక కూరగాయల అంగడిఉన్నవి

హైస్కూలుచదువులకు 5 మైళ్ళలోఉన్న గాలివేడునకును కళాశాలచదువులకు కడపకును విద్యార్థులు పోవుదురు జనరల్ ఆసుపత్రికి పురుళ్ళ ఆసుపత్రికి పశువుల ఆసుపత్రికి సినిమా థియేటరునకు కోర్టులకు సబ్‌రిజిష్ట్రారు ఆఫీసునకు తాలూకాకచేరికి తంతికార్యాలయమునకు గ్రామస్థులు రాయచోటికి పోవలెను పోలీసుస్టేషనుకు 5 మైళ్ళలోనున్న గాలివేడునకు శాకు అభివృద్ధి కేంద్రము౼కు 16 మైళ్ళలోనున్న లక్కిరెడ్డిపల్లికి పోవలెను గాలివేడులో జరుగు వారసంతలో అన్ని౼రకులు దొరుకును

మా శ్రే

## అరుణగిరినాథుడు

తొలుత చోళ హో౼ల ప్రభువుల వలనను పిమ్మట విజయనగర సామ్రాజ్యాధిపతుల వలనను విశేషముగా మన్నింపబడి ప్రసిద్ధములైన కొన్ని బ్రాహ్మణ విద్వత్కుటుంబములలో అరుణగిరినాథుల కుటుంబమొకటి చరిత్రలో ఖ్యాతి గాంచిన అరుణగిరి నామధేయు౼ నలుగురు గోచరింతురు వీరు వంశ పారంపర్యముగా మహావిద్యాంసులై కవిసార్వభౌములై రాజాదరణమును పొందినవారు వీరిలో కొందరికి డిండిమభట్ట కవిసార్వభౌమ మున్నగు బిరుదులుండెను

మొదట ఈపండిత కుటుంబమువారు గౌడ దేశమున గంగా నదీ తీరమందలి పర్యేంద్రపుర వాస్తవ్యులై యుండిరి ఒకానొ౼ చోళరాజు తీర్థయాత్రలకై ఉత్తరదేశమున కేగి తిరిగి వచ్చుచు ఆ గౌడ దేశమునుండి ఎనిమిది విద్వత్కుటుంబములవారిని బహుమానముగా తన దేశమునకు తోడ్కొని వచ్చెను ఆకుటుంబములవారెల్లరును వేద వేదాంగ పారగతులు భిన్న గోత్రములకు చెందినవారు వారిలో ఒకరు గౌతమ గోత్రజులైన ఈయరుణగిరినాథుల కుటుంబమువారు చోళరాజు మెట్టెపాడి అను అగ్రహార మొసగి యావిద్వత్కుటుంబములవారిని తన దేశమున వేద శాస్త్ర ప్రచారము కావింప నియోగించెను

పైన పేర్కొన్న యంశములు నేడు తమిళనాడులో నున్న ఉత్తర ఆర్కాటుజిల్లా ముల్లండ్ర మనెడి గ్రామమున లభించిన రెండు శాసనముల మూలమున తెలియవచ్చుచున్నవి వానిలో ఒకటి డిండిమకవిసార్వభౌమ బిరుదాంచితుడైన ఒక అరుణగిరినాథుడు దేవరాయల వలన తన కొసగబడిన నందన వన మనెడి భూభాగమును అగ్రహారముగా కొందరు స్వీయులైన విద్వాంసుల కిచ్చిన సందర్భములో వేసిన శాసనము ప్రభువర్యుని పేర ఆ యగ్రహారము ప్రౌఢదేవపుర మని వ్యవహరింపబడెను దీనికే సార్వభౌమపురము డిండిమాలయము మూలాండము అనునవియు నామాంతరములై యుండెను మూలాండ పదమే ముల్లండ్రముగా మారెను విభాగరత్న

మాలిః అను పుస్తకములో ఈపేర్లు వచ్చుటకు హేతు విట్లు చెప్పఁబడినది

"ప్రౌఢదేవో దదౌ యస్మాత్ ప్రౌఢదేవపురం తథా
సార్వభౌమః స్వయం కర్తా సార్వభౌమపురం తతః
యత్ర స్థితానాం విదుషాం సామాన్యం డిండిమం యతః
డిండిమాలయ మిత్యేవ నామ ప్రోక్తం తృతీయ మ్
మూలా ఇతిహి విద్వాంసః తేషామ దం సమాశ్రయః
మూలాండ మితి తన్నామ తస్మాద్వక్ష్యంతి వై బుధాః

ప్రౌఢదేవరాయ లిచ్చినది కావున ప్రౌఢదేవపురము సార్వభౌముఁడు డిండిమ విసార్వభౌముఁడు తాను కర్తయై యొసగుటచే సార్వభౌమపురము ఇచటి విద్వాంసుల కెల్ల విజయ డిండిమము బిరుదు చిహ్నముగా వెలయుటచే డిండిమాలయము మూలభూతులైనవారు విద్వాంసులు అట్టివారికి అండము అనగా ఆవాసభూమి కాబట్టి మూలాండము విద్వాంసులకు నెలవని ఫలితార్థము అని పైశ్లోకముల భావము

రెండవ శాసనము అరుణగిరినాథుల వంశములోని ఒక దీక్షితమణి తనకును తన భర్తకును పుణ్యప్రాప్తి కొరకై మల్లంద్రగ్రామము నందలి స్వయంభూనాథేశ్వరుని ఆలయావరణములో అణామలైనాథార్ అను భక్తుని విగ్రహమును ప్రతిష్ఠ చేయించిన సందర్భమున శాసించిన భూదానమునకు సంబంధించినది ఈవిషయములను అరుణగిరినాథుల వంశీయులు రచించిన సోమవల్లీ యోగానందప్రహసనము సాళువాభ్యుదయము భాగవతచంపువు అచ్యుతరామాభ్యుదయము సుభద్రాధనంజయ నాటకము మొదలగు గ్రంథములు కూడ బలపరచుచున్నవి మెలెప్పాడి మల్లంద్ర మొదలైన అగ్రహారములు నెలవులుగా దక్షిణ దేశమున స్థిరపడిన ఈయొమిది గౌడ విద్వత్కుటుంబముల వారును క్రమముగా విస్తరిల్లి చోళరాజు లిచ్చిన విధముగా వేదవిద్యావ్యాప్తికి పాటుపడినారు

## మొదటి అరుణగిరినాథుడు [పుట్టుక 1290 క్రీ శ]

ఈతడు గౌడదేశమునుండి వచ్చి దక్షిణమున స్థిరపడిన విద్వత్కుటుంబములలో ఒకదానికి చెందినవాడు సామవేదీయుఁడు గౌతమ గోత్రజుఁడు తండ్రి రాజనాథకవి తల్లి కాశ్యప గోత్రజయైన అభిరామాంబిక మేనమామ సోమనాథుడు భార్య యజ్ఞాంబిక ఈ అరుణగిరినాథునకు శోణాద్రిధరుడను నామాంతరము కలదు ఈతని పాండిత్యము "విశావైభవము అసాధారణములై విశేషమైన శివానుగ్రహమునకు పాత్రుడగుటచేతనే యీతనికంతటి వైదుష్యము కవితాశక్తియు అలవడిన వని దురు ఈసందర్భమున దక్షిణదేశ మందొక ఐతిహ్యము వ్యాప్తిలో కలదట అది యిది చిన్ననాడే అరుణగిరి తలిదండ్రులు గతించిరి మేనమామ సోమనాథుని యింటనే ఈతడు పెరుగుచుండెను మేనమామ భార్య సూటిపోటి మాటలచే నొప్పించుచు నుండెను అనాదరించుచుండెను బాలుని అభిమానము దెబ్బతినెను ఆతడు అయిట నిలువలేకపోయెను ఇల్లు విడిచి పోయెను రాత్రికి పూడూరు (నవగ్రామము) అను గ్రామము చేరెను అచటి శివాలయమున శివుని స్మరించుచు నిద్రలో సోలిపోయి ఒడలు తెలియక నిదురించెను అప్పుడు శివుడు జాలిపడి ఆతని కలలో సన్నిధి చేసి తన నోటి తమ్మును ఆతని కిడెను బాలుడు తెల్లవారి లేచెను నోరు తమ్మును అదిచూచినవారు శోణాధరుడన్నారు ఇంతలో మేనమామ వెదకుచు వచ్చి జరిగిన వృత్తాంతము తెలిసి లుని కౌగిలించుకొని బుజ్జగించి యింటికి వెంట నిడుకొని పోయెను అనాటినుండి ఆబాలుడు సర్వ విద్యా పారంగతుడుగా మహాకవిగా విరాజిల్లసాగెను

ఈవిద్వత్కవి ప్రసిద్ధి అచిరకాలముననే నలుగడను వ్యాపించెను ఆ కాలమున ఆప్రాంతమును ఏలిపాలించుచున్నది (మూడవ) హొయసల బల్లాలరాయలు (క్రీ శ 1292-1342) ఈతడు తన కొడుకు వీరవిజయ రూపాక్ష దేవుని పేర వీరవిజయవిరూపాక్షపురము" (అనెగొంది హోస్పేట) అను నగరమును కట్టించి అందుండి పరిపాలించుచుండెను దక్షిణ రాజధానిగాయైన అణామలై నగరమున ఈతని కుమారుడు వీరవిజయవిరూపాక్ష దేవుడు రాజప్రతినిధియై ప్రభుత వహించుచుండెను ఈవిరూపాక్ష దేవునకే దేవరాయలు ప్రౌఢదేవరాయలు నను వ్యవహారము లుండెను విద్యావిశారదులు గల యీతడు విద్వత్కవియైన అరుణగిరినాథుని కీర్తి ప్రతిష్ఠలను వినియాతని నాహ్వానించి తన కడనుంచుకొని యాదరించుచుండెను ఒక సమయమున అరుణగిరినాథుడు తన కాయువరాజుతో కల సాన్నిహిత్యమును బట్టి ఆప్రాంతమందున్న నందనవన మనెడి సువిశాలమైన ఒక రాజోద్యానమును తన కిమ్మని కోరెను అందులకు రాజపుత్రుడంగీకరింపక

పోగా అమహావి హస్తపురమున కేగి (హస్తపురము హోసపేట ఆనెగొందె వీరవిజయవిరూపాక్షపురము) సుర త్రాణుని సభలో మొనగాడై యున్న అనపాయుడను కవి మల్లుని జయించెను రాజుచే సార్వభౌమకవి యను బిరుదము నొందెను అంతేగాక తన కవితా చమత్కృతులచే నాతని మెప్పించి యాతని వలన తాను కోరియున్న ఉద్యాన వనసీమను తనకీయవలసినదిగా యువరాజునకొక ఆజ్ఞాపత్రము కూడ సంపాదించెను

"విభాగపత్రమాల"లో ఈప్రకరణమున పేర్కొనబడిన "హస్తినపురమును" ఢిల్లీనగరముగాను సురత్రాణుని "సుల్తాను"గాను చరిత్రకారులు Sewell గోపీనాథరావు మున్నగువారు కొందరు తలంచిరి కాని అది సరిగాదు బల్లాలరాయనికే (మూడవ) సురత్రాణ అనునది పర్యాయముగా వాడబడెననుటకు అందే ఈరాజులకు విశేషణములుగా ప్రయుక్తములై యున్న "జగత్త్రాణ" "ద్విజత్రాణ" "నిజత్రాణ" పదములును సందర్భమును తార్కాణముగా నున్నవి ఇట సురత్రాణ పదము దేవాలయాదులను సక్రమముగ నడపించుట ద్వారా దేవతలను కాపాడువాడు అను అర్థమున ప్రయుక్తమైనది

దాని ప్రభావముచే యువరాజు వలన తాను దానముగా పొందిన ఆ నందనవనమును ఉదార హృదయుడైన ఈ అరుణగిరినాథుడు స్వీయులును విద్వద్వర్యులును నగు కొందరు బ్రాహ్మణులకు అగ్రహారముగా ఇచ్చెను

ఈఅరుణగిరినాథున " అష్టభాషాకవితాసామ్రాజ్యాభిషిక్తుడు నాగకవి గజకేసరి మొదలైన బిరుదము లున్నట్లు ఈతని మనుమడైన రెండవ అరుణగిరినాథుడు రచించిన యోగానంద ప్రహసనము వలనను దృఢ డుచున్నది అందు ఈతనిని "శ్రీకవిప్రభువు" అని పేర్కొనుటచే ఈతడు కవులకు ప్రభువైనవాడను తాత్పర్య మేర్పడుచున్నది ఇది పేరు కాదని తోచును ఈ విద్వత్కవి రచించిన గ్రంథము లెవ్వియో తెలియరాలేదు

**రెండవ అరుణగిరినాథుడు [పుట్టుక క్రీ శ 1350 ప్రాం]**

ఈతడు మొదటి అరుణగిరినాథుని ప్రౌత్రుడు డిండిమ భట్టు కవిసార్వభౌమ మున్నైన బిరుదులు కలవాడు ఈతడు సరస్వతీ ప్రసాద లబ్ధ కవితాసనాథుడు ఈతడు రచియించిన గ్రంథములలో సోమవల్లీ యోగానంద ప్రహసనము అను నొక రూపకము లభించినది అందు ప్రస్తావన విభాగమున చెప్ప వాక్యములను బట్టి యీతని పూర్వులను గూర్చియు ఈతనిగూర్చియు చారిత్రకములైన అంశములు కొన్ని తెలియవచ్చుచున్నవి అభాగమిది-

అస్తి ఖలు గౌడేషు పర్యేంద్రపురాగ్రహార నాయకమణేః సామవేదసాగర సాంయాత్రికస్య అష్టభాషా కవితా సామ్రాజ్యాభిషిక్తస్య బల్లాలరాయ కటకకవికుల గర్వ పర్వత పవేః నాగ కవి గజకేసరిణః శ్రీకవి ప్రభోః పౌత్రః పుత్రః శ్రీరాజనాథ దేశికస్య బ్రహ్మాండ భాండ చండమండలిత విజయ డిండిమ చండిమ్నః శ్రీకంఠాగమ శిఖండ మండన మణేః శ్రీడిండిమ ప్రభోః దౌహిత్రః శ్రీమదభిరామ నాయికా స్తనంధయః సభాపతి భట్టారకాచార్య భాగినేయః శ్రీడిండిమ కవిసార్వభౌమ ఇతి ప్రథిత బిరుదాంక నామధేయః సరస్వతీ ప్రసాదలబ్ధ కవితాసనాథః శ్రీమాన్ అరుణగిరినాథః తేన కృతేన యోగానంద నామ్నా ప్రహసనేన సభా నియోగ మనుతిష్ఠామి

గౌడ దేశములో పర్యేంద్రపురమను ఒక అగ్రహారము కలదు అందు నాయకమణిగా భాసించువాడు శ్రీకవిప్రభువు (మొదటి అరుణగిరినాథుడు) ఇతడు అష్టభాషా కవితా విశారదుడు సామవేద పారంగతుడు బల్లాలరాయని ఆస్థానకవులనెడి గర్వపర్వతములకు వజ్రాయుధము వంటివాడు నాగనయను కవి గజమునకు సింహము వంటివాడు ఇట్టికవి మనమడే (రెండవ) అరుణగిరినాథుడు ఈఅరుణగిరినాథుని తల్లిదండ్రులు అభిరామనాయికా రాజనాథ దేశికులు అరుణగిరినాథుని మాతామహుడు డిండిమ కవీంద్రుడు ఇతడు బ్రహ్మాండ భాండమును దద్దరిల్ల జేయు విజయ డిండిమము గలవాడు శ్రీకంఠాగమ శిఖామణి అరుణగిరినాథుని మేనమామ సభాపతి భట్టారకుడు ఇట్టి మహనీయవంశమున పుట్టిన అరుణగిరినాథుడు డిండిమ కవి సార్వభౌమ బిరుదమును దాల్చి సరస్వతీ ప్రసాద లబ్ధ కవితాసనాథుడై వాసిగాంచినవాడు ఇట్టి మహామహుడు రచించిన యోగానందప్రహసనమును ప్రదర్శించి సభను ఆరాధింతము-అనిభావము

ఈరూపకారంభ గద్యము వలన ఈఅరుణగిరినాథుని పితామహ మాతామహు లిరువురును ఉద్దండ పండితు లనియు వాదమున ప్రతివాద భయంకరులనియు మహాప్రభువుల

ఆస్థానములలో విజయ డిండిమములు మ్రోయించిన విద్వద్వీర శిఖామణులనియు తెల్లమగుచున్నది

ఈ (రెండవ) అరుణగిరి నాథుడు దీర్ఘ కాలము జీవించెను విజయనగర సామ్రాజ్యాధీశ్వరులైన బుక్కరాయ హరిహరరాయ దేవరాయల (మొదటి ప్రౌఢదేవరాయలు క్రీ శ 1406 1422) పరిపాలనములను చూచినవాడు ఈ ఆస్థానమున విద్వత్కవి పదవి నలంకరించి యున్నవాడు ఈ (మొదటి) ప్రౌఢదేవరాయలు వేమభూపాలీయ కర్తయగు వామన భట్టబాణకవి సుప్రసిద్ధ వ్యాఖ్యాతయైన కోలచెలమ మల్లినాథసూరి ఉత్తరనారిషధ రచయిత వాచనసోమనాథుడు ఇట్టి మఱికొందరు సంస్కృతాంధ్ర కవిపండితులను సత్కరించిన విద్యాదరుకుడు ఈ (మొదటి) ప్రౌఢదేవరాయల విద్వత్సభలోనే అరుణగిరినాథ డిండిమకవిసార్వభౌమునకును శ్రీనాథమహాకవికిని ఉత్కట వివాదము సంఘటిల్లెను ఈవివాదమున మాధ్యస్థ్యము వహించిన చంద్రభూషణక్రియాశక్తి రాజగురువైన శైవపీఠాధిపతి ఈతడు క్రీ శ 1349 నుండి క్రియాశక్తి పీఠాధిపత్యము వహించెను క్రీ శ 1371 లో బుక్కరాయలచే కొండూరు అను గ్రామమును అగ్రహారముగా పడసినట్లు కొండూరు శాసనము తెల్పుచున్నది అరుణగిరినాథ శ్రీనాథుల యీవిద్యా వివాదము నాటి చంద్రభూషణ క్రియాశక్తి వార్ధకము మిక్కిలి పైకొన్నవాడై యుండెను జ్ఞాన వయోవృద్ధుడును రాజగురువునగుటచే అందరకును ఆతని మాధ్యస్థ్య మంగీకార మాయెను క్రియాశక్తిగురువుల పరంపరలో ఈచంద్రభూషణక్రియాశక్తి తప్ప ఈ పేరుగల శైవాచార్యుడు మరియొకడు కానరాకుండుటచే ఈతడే పై వివాదమున మాధ్యస్థ్యము వహించినవాడనియు ఈ హేతువుచేతనే శ్రీనాథునికి కనకాభిషేకమును కావించిన మొదటి ప్రభువు ప్రౌఢదేవరాయలు (1406 1422) అగునే కాని (రెండవ) ఇమ్మడిదేవరాయలు (క్రీ శ 1422-1446) కాజాలడనియు విమర్శకులు నిర్ణయించినారు శ్రీనాథుడీవివాదము నాటికి నాలుగు పదులు నిండని నవయౌవనమున వెలయుచున్నవాడు ఇట్లు మొదటి ప్రౌఢదేవరాయలచే కవిసార్వభౌమ బిరుదమును పొంది కనకాభిషేకమును గాంచి వెళ్ళి శ్రీనాథమహాకవి రెండవ ప్రౌఢదేవరాయల (క్రీ శ 1422-1446) ఆస్థానమునకు కూడ వచ్చియుండెను ఆకవీశ్వరుని అప్పటి స్థితి మొదటిదాని వంటిది కాదు

ఈ రెండవ అరుణగిరినాథునకు రాజనాథుడను ఒక కుమారుడు అభిరామనాయిక అను ఒక కూతురు కలుగు అభిరామనాయిక భర్త కాశ్యపగోత్రుడైన స్వయంభూకవి సుభద్రాపరిణయమును రచించిన రాజకవి యీ అరుణగిరినాథుని దౌహిత్రుడు

*మూడవ అరుణగిరినాథుడు*

పుట్టుక 1400 ప్రాంతము రెండవ అరుణగిరినాథుని కుమారుడైన మూడవ రాజనాథ కవి (క్రీ శ 1375 80) పుత్రుడు ఈతడు విజయనగరాధిపతి యగు దేవరాయల ఆస్థాన విద్వాంసుడై యుండెను ఈతనికి డిండిమభట్ట కవిసార్వభౌమ బిరుదములు డెను ఈతని కుమారుడును మూడవ డిండిమభట్టుగా ప్రసిద్ధి గాంచినవాడును అగు నాల్గవ రాజనాథకవి రచియించిన సాళ్వాభ్యుదయ మహాప్రబంధమున త్రయోదశ సర్గాంతమున లన తండ్రియైన ఈమూడవ అరుణగిరినాథుని గూర్చిచెప్పిన ప్రశంసావాక్యము లివి

"నరసింహ మహారాజస్య చరితే ద్వాదశ దేశ్య వృత్తి పారదృశ్వనః అష్టభాషా పరమేశ్వరస్య అభినవ నాటక భవభూతేః మాపాద్యతివర్తి చిత్రప్రబంధ పరమేశ్వరస్య అష్ట దిగ్విజయ పటహీకృత బిరుద డిండిమాడంబరస్య షడ్దర్శనీ షణ్ముఖస్య శైవశాస్త్ర జీవాతోః అఖిల వేదసాగర పాంయాత్రకస్య డిండిమకవిసార్వభౌమ ఇతి కృత్వా వర బిరుద నామ్నః శ్రీమదరుణగిరీశస్య తనః పాకస్య డిండిమకవి రాజనాథస్య కృతౌ నవరసభరితే శ్రీ సాళ్వాభ్యుదయే మహాకావ్యే త్రయోదశ స్సర్గః సమాప్తః "

దీని వలస ఈ మూడవ అరుణగిరినాథునకు ద్వాదశ దేశ్యవృత్తిపారదృశ్య అష్టభాషాపరమేశ్వర అభినవనాటక భవభూతి చిత్రప్రబంధపరమేశ్వర మున్నగు బిరుదములుండినట్లును షడ్దర్శనములలో మహాపండితుడై యుండుటచే షడ్దర్శనీ షణ్ముఖుడనియు శైవాగమ పారగతుడగుటచే శైవశాస్త్ర జీవాతువనియు అతడు ప్రసిద్ధి గాంచినట్లు తెలియుచున్నది

శివభక్తి సంపన్నుడగు ఈ అరుణగిరినాథుడు తమిళ భాషలో అనర్ఘములగు పెక్కు శివస్తోత్రములను రచియించెను వీనికి ద్రావిడదేశములో మిక్కిలి వ్యాప్తి గలిగెను ఈస్తోత్ర సంకలనమునకు "తిరుప్పుహళ్" అని పేరు

ఈ అరుణగిరినాథుడు మహావిద్వాంసుడు కవిగానే గాక మహాభక్తుడును అగుటచే వైష్ణవాలయములలో ఆళ్వార్ల విగ్రహములను ప్రతిష్ఠించి పూజించినట్లు శివాలయములలో ఈ అరుణగిరినాథుని విగ్రహమును శివభక్తుల విగ్రహములతో పాటు నేటికొల్పి పూజించుచున్నట్లు తెలియుచున్నది. ఈ భక్త కవి దేహాంతకాలమున (అణ్ణామలైనాథ) శివునిలో సాయుజ్యము నొందిన కారణమున ఎమ్మట ఈతనిని అణ్ణామలైనాథార్ అని ఎలుచుచు భక్తులు ఈతని విగ్రహమును శివాలయములలో ప్రతిష్ఠించి పూజించుచున్నట్లు విమర్శకులు తలంచుచున్నారు. ముల్లంద్రగ్రామమున కుమారడిండిమ కవి భార్య గంగయ్యాడినాచ్చియార్ అను నామె ఈ ణ్ణామలైనాథర్ విగ్రహమునే ఆయూరి స్వయంభూ దేవాలయావరణమున ప్రతిష్ఠింపజేసి వేయించిన దానశాసనము కూడ ఈ విషయమును బలపరచుచున్నది. తాను చిత్రకవితా విశారదుడైనట్లును రాజాస్థానముల విశేష గౌరవములకు పాత్రుడై యున్నట్లును తిరుప్పుహళ్ గ్రంథమున అచటచట కవి చెప్పుకొన్నాడు. అయా విశేషణములును ఈ అరుణగిరినాథుడే తిరుప్పుహళ రచించిన భక్తకవి యని ఎట్టి యిచ్చుచున్నట్లు తద్విదులు భావించుచున్నారు.

*నాల్గవ అరుణగిరినాథుడు*

ఇతడు 1550 ప్రాంతమువాడు. ఇతనికి కుమారడిండిముడను బిరుదు కలదు. ఈతడు దుర్గాదేవి రాజనాథుల పుత్రుడు. రాజనాథ కవియే సాళ్వాభ్యుదయ మనెడి మహాప్రబంధమును రచియించినవాడు.

ఈ అరుణగిరినాథుడును తన పూర్వులవలె డిండిమ కవి సార్వభౌమ బిరుదమును ధరియించియుండెను. ఇతడు "వీరభద్రవిజయ మనె ప్రబంధమును రచియించెను. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవులలో నొకడై వానిగాంచెను.

వీరభద్రవిజయము నందలి సూత్రధార వాక్యములు ఈకవీశ్వరుని గురించి ఇట్లు ఉగడించుచున్నవి.

శ్రుణు తావత్ సకలశివలింగారాధన ప్రవణో గంగాతటాల కార గౌడదేశ చూడాపీడ వరేంద్రాగ్రహార నాయకమణయః శైవాగమ జీవాతవః చోళ పాండ్య శిష్య కుల సంస్కృత మహిమానః సామవేద సీమానః శ్రౌతాచార పూతాత్మానః పవిత్రతర గౌతమ గోత్ర జన్మానః ద్విజన్మానః తదన్వవాయార్ణవ పూర్ణచంద్రస్య నాగణకవి గజకేసరిణ సరసకవితా సామ్రాజ్యాను భోగ సార్వభౌమస్య కవి ప్రభో నృత్తరాజస్య పౌత్రః పరమమాహేశ్వరస్య పవిత్రతర చరిత్రస్య శివతత్త్వజ్ఞాన శీలస్య శ్రీమతః రాజనాథస్య పురాతన పుణ్య పరిణామః ఎముఖాత్ అభూతపూర్వ చతుర్విధ కవితా స్వర్లోక ఎరత్ కల్లోల మాలా ప్రచండ తరకాహళ ఘటా డిండిమ విరచిత బిరుద ఘోషణో డిండిమ కవి సార్వభౌమా పరనామా శ్రీమాన్ అరుణగిరి నాథోనామ

*నటీ*

"యో బిరుద కవిప్రపితామహ ఇతి భణితః"

*సూత్రధారః*

"తతోజ బుధోత్తమాత్ తదుపమాన వాగ్వై
యశోభి రుపశోభితో యమక చిత్రవృత్తాద్యఖిలకవి
ప్రచండ జయడిండిమః వర్తిత ప్రబంధ క్రియా
చమత్కృత సమగ్ర ధీః సకల రాజనాథః కృతీ

*నటీ*

"యం దశరూప నారాయణా పరనామానం భణంతి"

సూత్రధారః "తస్యాఖిల దుర్గాదేవ సహచరస్య చతుర్విధ కవితా చాతుర్యస్య సూనునా కుమారడిండిమ విన అరుణగిరినాథేన ప్రణీతో వీరభద్ర విజయాభిధానోడిమ ప్రబంధః అస్మాకం హస్తే నిక్షిప్తః అభినీతపూర్వశ్చ"

ఈ ప్రస్తావనలో కుమారడిండిమ వి తన వంశప్రతిష్టను తెలుపుచు పూర్వులు శైవాగమాచార్యులై చేర చోళ పాండ్య దేశములయందున్న శిష్యకోటిచే పూజ్యులై యుండిరనియు వీరిలో మొదటి రాజనాథదేశికాదులను నృత్తరాజా పరనామధేయులైన అరుణగిరినాథదులగు గన కవితా మహా ప్రపితామహాదులు డిండిమ విసార్వభౌమాది బిరుదాంచితులనియు తండ్రి రాజనాథకవి యనేక చిత్రకవితా ధురంధరుడనియు ప్రచండ విజయడిండిముడనియు దినమునకొక ప్రబంధముగా రచన సాగించగల ప్రతిభా సంపన్నుడనియు ఉల్లేఖించెను. ఈ కుమారడిండిమ వియు షడ్భాషా సార్వభౌముడై యున్నట్లును "వీరభద్ర విజయము" నందలి గ్రంథాంత గద్య వలన స్పష్టపడుచున్నది.

ఈకుమారడిండిమ కవి భార్య "గంగియ్యాడి నాచ్చియ్యార్" ఆమె "ముల్లంద్రం" అను తమప్రాచీనుల అగ్రహార గ్రామమున స్వయంభూ దేవాలయమునందు తన భర్త వంశ

మ న పూర్వుడై "అణ్ణామలై నాథర్ అని భక్తులచే సబహుమానముగా కీర్తి ప పడుచుండిన తిరుప్పహళ్" కర్త మూడవ అరుణగిరినాథుని శిలావిగ్రహమును ప్రతిష్ఠించెను ఆసందర్భమున వేయిం స దాన శాసనము వలనను ఈవంశీయులను గూర్చి ఇంతవరకు తెల్లమైన విషయ లు దృఢపడుచున్నవి

ఈ కుమారడిండిమ కవిసా ర్వభౌముడుతు రాల్గవ అరుణగిరినాథుడు అద్వైతాచార్యుడుగా సుప్రసిద్ధుడై యుండిన అప్పయదీక్షితుల వారి గ్రామమునకు వెళ్ళి దీక్షితులవారితో వేదాంత విషయములు చర్చించి ఆశీర్వదించి వచ్చెనను విషయము సాంప్రదాయికులు చెప్పుచున్నారు అప్పటి ఈకుమార డి డిమ కవి వార్ధకమునను అప్పయదీక్షితులవారు యౌవనమునను ఉండి యుందురు

అరుణగిరినాథుని కుమారుడైన రాజనాథ డిండిమకవియు పేరెన్నిక గన్న విద్వాంసుడు రచయిత ఈతడు తన తండ్రి తాతల వలెనే విజయనగర సామ్రాజ్యాధిపతుల మన్ననలకు పాత్రుడై ఆస్థాన కవి పండితుడై వెలసియుండెను శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముని తమ్ముడైన అచ్యుతదేవరాయల వారి విశేషాదరమునకు పాత్రమై యుండిన ఈ కవి ఆ మహారాజు చరిత్రమును కావ్యబద్ధము చేసెను ఈ పద్య ప్రబంధమునకు అచ్యుతరాయాభ్యుదయమని పేరు ఇంతే గాక ఇతడు భాగవత చంపూ కావ్యమును కూడ వ్రాసెను ఈరాజనాథ కవి అచ్యుత దేవరాయల ఆస్థానమున కవీశ్వర పదవి నంది యుండెనను విషయము గురురామ వి యను నాతని దౌహిత్రుడు రచియించిన "రత్నేశ్వర ప్రసాదనమ్" అను నాటకమున సాహిత్య సామ్రాజ్య పట్టాభిషిక్తస్య రాజనాథ కవేః దౌహిత్ర ఆనుకూల వాగ్విలాసః గురురామ నామక కవిః"- ఇత్యాది వాక్యముల వల స్పష్టపడుచున్నది

సాళ్వాభ్యుదయము వలెనే ఈ అచ్యుతరాయాభ్యుదయమును విజయనగర రాజుల చరిత్రమును సరివిజయయాత్రలను వాఙ్మయపోషణ ది విషయములను తెలుపుట మహోపకారకమైయున్నది

ఈ పద్వకుటుంబములోని వారు దిరుసు విజయనగర రాజులకు ఆస్థానకవులుగాను ఆస్థానపండితులుగాను బహు గ్రంథరచయితలగాను వాసి గాంచియుండిరి వీరిలో ఒక అరుణగిరినాథ పం తుడు మల్లినాథునకు పూర్వమే కాళిదాసాది మహాకవుల కావ్యములకు వ్యాఖ్యలు వ తరించి యున్నటు తెలియుచున్నది మల్లినాథుడు—

అథాప దక్షిణావర్తనాథాద్యైః క్షుణ్ణవర్త్మసు
వయం చ కాళిదాసోక్తి ష్వవకాశం లభేమహి"

అని కాళిదాస కావ్యములలో తనకు దక్షిణావర్తనాథాదుల వ్యాఖ్యా మార్గము ఆదర్శమై యున్నట్లు పేర్కొనెను ఇందు నాథ పదము అరుణగిరినాథుని తలంచుచున్నది మల్లినాథుడే ఈ నాథుని వ్యాఖ్యానము తనకు నచ్చని చోట "నాథ వ్యాఖ్యాన మనాథ వ్యాఖ్యానమేవ" అని తిరస్కరించుటకును వెనుదీయలేదు ఈఅరుణగిరినాథుడు మల్లినాథునకు పూర్వుడై సుప్రతిష్ఠితుడై యుండినవాడగుట రెండవ అరుణగిరినాథుడై యుండునని తోచుచున్నది

## డిండిమ - అరుణగిరినాథకవుల వంశవృక్షము




రాజనాథుడు II (పుట్టుక 1825-30)
భార్య అభిరామ నాయిక
అరుణగిరి II
(పుట్టుక 1350 ప్రాంతము)
డిండిమకవి I
సోమవల్లీ యోగానంద కర్త
రాజనాథకవి III (పుట్టుక 1375 80
అరుణగిరి III (సార్వభౌమ డిండిమకవి II)
పుట్టు 1400 ప్రాంతము
తిరుప్పుహాళ్" కర్త
రెండవ దేవరాయల ఆస్థానవిద్వాంసుడు
(రాజ్యకాలము 1422-46)
రాజనాథకవి IV (డిండిమకవి III)
పుట్టుక 1450 ప్రాంతము భార్యదుర్గాదేవి
సాళ్వాభ్యుదయకర్త
అరుణగిరి IV (కుమార డిండిమకవి IV)
(క్రీ శ 1550 ప్రాంతము భార్యగంగయ్యాడినాచ్చియార్)
వీరభద్రవిజయ కర్త (అప్పయదీక్షితులవారితో వేదాంతచర్చ చేసి ఆశీర్వదించి వచ్చినవాడు)
రాజనాథకవి V (డిండిమకవి V)
(క్రీ శ 1570 ప్రాంతము) అచ్యుతదేవరాయల ఆదరమునకు పాత్రుడైనవాడు)
1 అచ్యుతరాయాభ్యుదయము
2 భాగవత చంపువుల రచయిత
దౌహిత్రుడు
గురురామకవి
"రత్నేశ్వరప్రసాదన కర్త
అభిరామనాయిక
(భర్త స్వయంభూకవి)
కాశ్యపగోత్రుడు
రామకవి
"సుభద్రాపరిణయ కర్త

## అరుణాచలము

అరుణాచలము మద్రాసు రాష్ట్రమున దక్షిణ ఆర్కాటు జిల్లాలో ఒక ప్రసిద్ధ శైవ క్షేత్రము. అరుణాచలమునే తిరువణ్ణామలై అని పిలుచుటకూడా కలదు. ఇచట అరుణాచలేశ్వరుని దేవాలయముండుట వలన ఈ పట్టణము అరుణాచలమని అందురు. పట్టణము ఎత్తైన కొండను అనుకొని నిర్మించబడినది. ఈకొండ సముద్ర మట్టమునుండి 2669 అడుగుల ఎత్తునుండి చాలా మైళ్ళ వరకును చూపరుల దృష్టి నాకర్షించును. పౌరాణికముగను చారిత్రకముగను అరుణాచలము ఖ్యాతి గాంచినది. కావ్యములందు ఈ పట్టణము శోణగిరి శోణశైలము అరుణశైలము అని కూడ పిలువబడినది.

ప్రచారములో నున్న ఒక ఇతిహాసము ననుసరించి తిరువణ్ణామలై యొక్క విశిష్టత ఈక్రింది విధముగ చెప్పబడినది. పూర్వము కైలాసమున పార్వతి పరమేశ్వరునితో ఉద్యానవనమున విహరించుచు వినోదార్థము తన చేతులతో శివుని

చిత్రము 28



అరుణాచలక్షేత్రము

నేత్రములను మూసెను. వెంటనే బ్రహ్మాండమంతయు చీకటి ఆవరించెను. దీనికి కారణ మేమనగా పరమేశ్వరుని యొక్క నేత్ర ద్వయము సూర్యచంద్రులుగదా! అట్టినేత్రములను పార్వతి మూసివేయుటచే సూర్యచంద్రులు ఉదయించుట మానిరి. పార్వతీ పరమేశ్వరులకు దీని వలన క్షణికమైన ఆనందము కలిగినను సృష్టియందున్న జీవరాసులు ఈక్షణిక కాలముననే అనేక సంవత్సరముల అంధకారమున బాధనొంది మిక్కిలి తల్లడిల్లినవి. అపుడు మహామునులు శివునితో తమను లోకములను రక్షించునట్లుగా ప్రార్థించిరి. పార్వతిచేసిన తప్పిదమునకు వగచి ఆమెను శిక్షించుటకై పరమేశ్వరుడు ఆమెను అనేక పుణ్యస్థలములలో తపమాచరింప పంపెను. పార్వతి తపస్సు చేసిన తీర్థములలో అణ్ణామలై ఒకటిగా నుండెను. ఈపవిత్ర స్థలమున పార్వతి ఒనర్చిన తపమునకు శివుడు సంతసించి ఒక జ్వాలామణి రూపమున అణ్ణామలై కొండ చివర ప్రజ్వరిల్లెను. అంతటితో చీకటు లంతరించి సృష్టికి తిరిగి చైతన్యము కలిగెను. కొండదాపున సుందర విగ్రహములతో నొప్పారు దేవాలయ నిర్మాణము జరిగినది. అనుస్యూతముగా వచ్చు పైన చెప్పబడిన గాధననుసరించి నేటికిని కార్తీక మాసము (నవంబరు - డిసెంబరు) నందు దేదీప్యమానమైన కాంతినిచ్చు దీపమును కొండ శిఖరమున భక్తులు పెట్టుదురు.

క్రీ. శ. 13 వ శతాబ్ది అంతిమ దశలో దక్షిణ భారతము మహమ్మదీయుల దండయాత్రలకు లోనయ్యెను. ఢిల్లీ సామ్రాజ్యాధిపతి అల్లాఉద్దీను ఖిల్జీ సేనానియగు మాలిక్ కపూరు (క్రీ. శ. 1309) దేవగిరి ఓరుగల్లులను ముట్టడించి విశేష ధనమును కొల్లగొట్టెను. ఇచ్చటనుండి మలిక్ కపూరు దక్షిణభారతమునందలి ద్వారసముద్రము నేలుచున్న వీర బల్లాలుని ఓడించి మధుర నాక్రమించి యచట ఢిల్లీ సామ్రాజ్యము ప్రతినిధుల నిలిపెను. మహమ్మదీయుల దుండగముల నరికట్టుటకు వీరబల్లాలుడు ఎంతయో ప్రయత్నించెను. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము దక్షిణమునందలి మధురయు శ్రీరంగము నకు చేరువనున్నట్టిదియు పూర్వపు

ఆతని 20 వ రాజ్య సంవత్సరము తరువాత జరిగెను అనగా క్రీ శ 1005 తరువాత కావున ఆ హాళ విజయమును కీర్తించుచున్న అరుళాక్కి దానశాసనము క్రీ శ 1005 14 నడుమ వెలువడి యుండును

అరుళాక్కి చేసిన మరియొక దానము తిరువైయారు నందలి వచ్చేదీశ్వరాలయమున కలదు ఇది మొదటి రాజేంద్రచోళుని 21 వ రాజ్య సంవత్సరమున కావి పబడిన దానము అనగా క్రీ శ 1035 కావచ్చును అరుళాక్కి ఈ దానమును లోకమహాదేవి ఈశ్వరునకు సమర్పించెను దానిని ఇప్పుడు ఉత్తర కైలాసమని చెప్పుచున్నారు లోకమహాదేవి రాజరాజచోళుని పట్టపురాణి ఈమె అసలు పేరు దంతిశక్తి విటంకి ఈమె పల్లవరాజ కన్య యని కొందరు భావించు చున్నారు లోకమహాదేవియే ఈశ్వరుని ప్రతిష్ఠించి యుండవచ్చును దంతిశక్తివిటంకి రాణీ తన భర్త మరణా నంతరము చాలకాలము జీవించి యున్నట్లే కనబడుచున్నది ఈమె పక్షమున అరుళాక్కి మువ్వేందవేలాణుడు ఈశ్వరునకు అనర్ఘ్యమణులు పొదిగిన కొన్ని బంగారు కంఠహారములను సమర్పించి శాసనము ప్రకటించెను

ఇచ్చట మరియొక విశేషాంశము పేర్కొనదగియున్నది రాజరాజచోళుని తండ్రి రెండవ పరాంతకుడు ఈతని పట్టపు రాణి పరాంతకదేవి అమ్మగారు తిరుపతి వెంకటేశ్వరస్వామికి వజ్రములు తాపిన కిరీటమును సమర్పించినట్లు చెప్పబడినది పరాంతకదేవి చేరమాణుడు అనగా చేరరాజు కుమార్తె రాజరాజచోళుని తల్లి ఈమె కాదు పరాంతకుని మరియొక రాణి వానవనమహాదేవి ఈమెకు మొదటి రాజరాజ చోళుడును అతని యక్కకుందవదేవియు పుట్టిరి రాజరాజ చోళుడు చేరరాజు దౌహిత్రుడైనను పిదప చేర దేశముమీద యుద్ధము చేసి వారి నైభవమును డిందుపరచినట్లు ప్రకటించు కొన్నాడు రాజరాజు కొమార్తె కుందవాంబ తూర్పు చాళు క్యుడు విమలాదిత్యుని రాణి అయ్యెను

అరుళాక్కి చేసిన మరియొక చిన్న దానము తిరుచా మారు దేవాలయమునకు చేసినట్లున్నది ఇతడు 40 కళంజుల బంగారమును దేవాలయమునకు మర్పించెను ఇది ధర్మ కాటాలో తూచి ఆలయము కవిలెలందు నమోదు చేయ బడెను బంగారము మున్నగు వానిని తూచుటకు ఆకాలమున రెండు పద్ధతులుండెను ఒకటి ధర్మకాటా పద్ధతి దేవాలయ ములకు భక్తులు సమర్పించు సువర్ణము మున్నగు వానిని దీనితో తూచుచుండిరి రెండవది కుడినైక్కల్ పద్ధతి ఇది లౌకిక వ్యవహారముల దు తూకములకు ఉపయోగించెడివారు కాని రెండు పద్ధతులందును తూకమున చెప్పుకోదగిన భేద మేమియు లేకుండెను

హ ఆ శే
ఖ ల రం

## అరువపల్లి నెల్రెడ్డి

ఈతని పేరు నెల్లి రెడ్డి అనియు వ్యవహరింపబడుచున్నది వెలుగోటివారి వంశావళిలో (పుట 17) ఈయన ప్రశంస ఇట్లున్నది "అరువపల్లి నెల్రెడ్డి బలాటవీ దావాగ్నికీల" పద్మ నాయక వీరులైన అనపోత మాదానాయుని గార్ల బిరుదావళి లో అరువపల్లి నెల్రెడ్డి ప్రసంగము వచ్చుటచే వారిచే జయింప బడిన ప్రత్యర్థులలో నెల్రెడ్డియు ఒకడని ఊహి పవలెను అన పోత మాదగార్లచే సంగ్రామ విజితులైన రెడ్డి క్షత్రియ కమ్మనాయకుల పట్టిక దీర్ఘముగా ఉన్నది వీరిలో కొందరు- మంగిపూడి ఇమ్మడిరెడ్డి రావువరపు మల్లారెడ్డి పోలూరు పోలారెడ్డి బండి కాటారెడ్డి వినికొండ మారారెడ్డి కుంట్లూరి మారారెడ్డి క్రొత్తకొండ కొండ్రెడ్డి నేరగిరి వారారెడ్డి మలచము కొండమాచారెడ్డి పంటముమ్మడి పంటమైలారు వీరును కమ్మనాయకులును అనపోత మాదానాయకులను చెంజెర్ల (చేజెర్ల గుంటూరు జిల్లా) భూమి ప్రాంతమున మొలుగూరు దుర్గ సమీపమున ప్రచండ సైన్యములతో ఎదిరించి యుద్ధమున సంహరింపబడిరి ఓడిపోయిన వీరుల తలలు కొట్టి వారి రక్తముతో అనపోత మాదానాయకులు తమ తండ్రి సింగమనాయనికి పితృ తర్పణములు చేసిరట

ఏ సందర్భమున ఈ భయంకర సన్నివేశము జరిగెనో సూచన మాత్రముగా చెప్పవచ్చును కాకతీయ సామ్రాజ్య పతనానంతరము దేశము తురుష్కాక్రాంత మయ్యెను హిందూప్రజలు దారుణ హింసలకు గురియైరి దేశభక్తులైన రెడ్డి వెలమ వీరులను ముసునూరి ప్రోలయ కాపయనాయకు లును ప్రతాపరుద్ర చక్రవర్తి సేనానులు ఇందులూరివారు కొండపూడివారు మున్నగువారును అందరును ఐకమత్యముతో పనిచేసి నిర్వక్ర పరాక్రమము చూపి మునల్మానుల పీచ మడంచి దేశవిముక్తిని కొంతవరకు సాధింపగలిగిరి కాపయ నాయకుడు ఓరుగల్లులో పట్టము కట్టుకొని ఆంధ్రమరక్షాణ

విరుదము వహించి పాలింప మొదలిడెను

దేశ విమోచనమునందు పాల్గొని పరాక్రమము చూపిన రెడ్డి వెలమ నాయకులు సామంత పదవికి అంగీకరింపక తాము స్వతంత్రరాజ్య స్థాపన చేయుటకు నడుము కట్టిరి. తెలంగాణమునందు పద్మనాయకులు బలీయులుగ నుండిరి. వారు ఆమనగల్లు పిల్లలమర్రి మున్నగు నగరములు కేంద్రములుగా చేసుకొని చుట్టుపట్లనున్న చిన్న చిన్న నాయకులను జయించి వశపరచుకొనుచు తమ రాజ్య విస్తృతి చేయజొచ్చిరి. ఈ యుద్యమము అనవోత మాదానాయకుల తండ్రి పెదసింగమనాయనితో ఆరంభించెను. ప్రతాపరుద్ర చక్రవర్తి కాలములో ప్రసిద్ధుడైన ఎఱదాచానాయనికి సింగ, వెన్న, ఏచ (యాచ) అను ముగ్గురు కుమారులు. వీరు ముగ్గురును పరాక్రమశాలులే. స్వతంత్రరాజ్య స్థాపనమునందు సింగమ మున్నగువారికి ముగ్గురు ప్రత్యర్థులు ఎదురైరి. కాపయనాయకుడు, అప్పటి కొందరి క్షత్రియ కుటుంబములవారు, రెడ్డినాయకులు. పెదసింగమనాయడు జీలుగుపల్లి వద్ద మచ్చకొమ్మ భూపాలుని యుద్ధములో సంహరించెను. మచ్చరుద్రుని మగతల రణరంగమునకు బలిచేసెను. మచ్చగన్నవిభుడు సింగమనాయనికి ఓడి పారెను. ఈ గన్నభూపతినే కాబోలు సింగమనాయని తమ్ముడు ఏచడు యుద్ధములో చంపెను. ఇట్లు విజృంభించుచున్న పద్మనాయకులు కాపానాయకునకును రెడ్డివారికిని భయకారణులైరి. సింగమనాయకుని బావమరది చింతపట్ల సింగమనేని రాచవారు జల్లిపల్లి కోటలో చెరబట్టి ఉంచగా అతనిని విడిపించుటకై పెదసింగమనాయడు జల్లిపల్లి కోటను ముట్టడించెను. కాని రాచవారు మాయోపాయముచే తన తమ్ముడు బొమ్మయ్యచే పొడిపించిరి. అట్లు మరణించిన సింగమనాయడు (క్రీ.శ. 1360 ప్రాంతము) తన కుమారులను పిలిచి రాజుల రక్తముతో తనకు తిలోదకములిమ్మని ఆదేశించెనట. మహాభారత యుద్ధమునందు ద్రోణుడు తనచే సంహరింపబడని పాంచాలురు ఉన్నచో వారిని వధింపుమని అశ్వత్థామకు ఆదేశమిచ్చుట మనము స్మరింపవచ్చును.

ప్రచండవీరులైన అనవోత మాదానాయకులు పితృవాక్య పరిపాలన చేయుచు జల్లిపల్లి కోటను ముట్టడించిరి. క్షత్రియులను కాపాడుటకొరకో లేక దుర్దయులగుచున్న వెలమనాయకులను అదుపులో ఉంచుటకో రెడ్డి కులమువారు అనవోత మాదగార్లపై కత్తి దూసిరి. ఈ కాలమునకే కృష్ణకు దక్షిణమున ప్రోలయవేమారెడ్డి నాయకత్వమున రెడ్డిరాజ్యమేర్పడి యుండెను. అది మొదట అద్దంకి ముఖ్యపట్టణముగా ఏర్పడి క్రమముగా విస్తరించి కొండవీడు వరకు వ్యాపించెను. పెదసింగమనాయని మరణకాలమునకు అనవోతారెడ్డి (క్రీ.శ. 1353-64) రాజ్యము చేయుచుండెను. అనవోతారెడ్డి అనుమతితోనే కావచ్చును పైన చెప్పిన మంగిపూడి ఇమ్మడిరెడ్డి, అరువపల్లి వెన్నెరెడ్డి మున్నగు పలువురు రెడ్డి వీరులు అనవోత మాదానాయకులను జల్లిపల్లి కోట ముట్టడినుండి మరల్చుటకై సైన్యములు తరలించిరి. భీషణప్రతిజ్ఞులైన సోదరులు వెనుదీయక కృష్ణ దాటి వచ్చి చేజెర్ల ప్రాంతమునందలి మొగుళ్ళూరు కోటవద్ద రెడ్డిసైన్యములను ఎదుర్కొని భయంకర సంగ్రామము చేసిరి. దీనిలో పెక్కు రెడ్డినాయకులు వధింపబడిరి. పెదసింగమనాయని తమ్ముడు ఏచవిభుని కుమారుడు నాగానాయడు మహాపరాక్రమవంతుడనియు కఠారినాగవిభుడని పేరు గాంచెననియు వెలుగోటివారి వంశావళి చెప్పుచున్నది. ఈ నాగానాయకుడు దన్నాలకోట అనగా ధరణికోటవద్ద అనవోతారెడ్డి వెన్నుదాగు పరిచెనట. మొగుళ్ళూరు కోటవద్ద రెడ్డిసైన్యములను జయించి పద్మనాయకులు అనవోతారెడ్డి రాజ్యముపై పడియుందురు. ఈ యత్నమునందే ఏచవిభుని కుమారుడు నాగానాయడు అనవోతారెడ్డిని లాయితుని చేసెను. కాని ధరణికోట పద్మనాయకులకు వశమైనట్లు కానిపించదు.

అనవోత మాదానాయకులు రెడ్ల వలన వెనుకనుండి రాదగిన ప్రమాదమును గొప్ప రక్తపాతముతో చల్లార్చి జల్లిపల్లి కోటకు తిరిగివచ్చి కోటను పట్టుకొని రణనిహతులు కాని క్షత్రియులను భయంకరముగ సంహరించి రక్తముతో తమ తండ్రికి తిలోదకములిచ్చి చెల్లించబడిన ప్రతిజ్ఞ కలవారయిరి. తదనంతరము వారు కాపయనాయకునిపై పగతీర్చుకొని క్రీ.శ. 1369 సంవత్సరమున ఓరుగల్లు సమీపమున భీమవరము వద్ద మహాసంగ్రామములో కాపయ నాయకుని వధించిరి. మాదానాయకుడు రెడ్డివారిని శిక్షించుటకై మరియొకమారు ధరణికోటను ముట్టడించుటకై యత్నించెను. ప్రాణనష్టమెట్లున్నను ధరణికోట పద్మనాయకుల వశము కాలేదు. అది రెడ్డిరాజ్యమందే ఉండి పోయెను. అరువపల్లి

నెల్లెడ్డి సైన్య దావానలముతో పద్మనాయకులను ఆవరింపలేక మరణించు. రెడ్డి రాజ్యముపై అనపోత మాదానాయకులచే నమొదటి దాడి యందే అయి యుండును అనగా క్రీ శ 1361-62 ప్రాంతము కావచ్చును

హ ఆ శే

శం ల రం

## అరుసవెల్లి-మడపనాయకుడు

మడపనాయకుడొనర్చిన దానధర్మములు దక్షిణహిందూ శాసనముల వలన తెలియవచ్చుచున్నది (ద హి IV నెం 1168) ఈశాసనము దాక్షారామమునందలి భీమేశ్వరాలయమున నొకస్తంభముపై నున్నది ఇది ఏమిది పంక్తుల శాసనము ఇందు మొదటి పంక్తి పూర్తిగను 2 5 7 పంక్తులలో కొంతయును భ్రష్టమైనవి ఇందు శాసనకాలము లేదు తెలుగు వచనములో నుండి అచ్చటచ్చట లేఖకుని లిపి దోషములతో గూడియున్నది

శాసన సారాంశమిట్లున్నది అరుసవెల్లి-మడపనాయకుడు దాక్షారామమునందలి భీమేశ్వర దేవరకు లోహదండదివియ సమర్పించెను లోహదండదివియ అనగా ఇనుముతో చేయించిన దీపస్తంభమని యర్థము ఇందు ఆచంద్రార్కము అఖండ దీపము స్వామి చెంగట వెలిగించుటకై నిత్యము మానెడు నేయి పోయుటకొరకై 50 ఇనుపఎడ్లను ప్రోలబోలమున్నగువారి వశమున అతడుంచెను ఇనుపఎడ్లు అను శబ్దమునకు మేకలు లేక గొఱ్ఱెలు అను నర్థము శాసన శబ్దకోశమున కనవచ్చుచున్నది

శాసనమునందు శాసనకాలము లేకుండుటచే మడపనాయకుడు ఏ ప్రభువునొద్ద ఎప్పుడు ఎట్టి ఉద్యోగము నిర్వహించెనో గ్రహింప వీలులేకున్నది అరుసవెల్లి కళింగములోనిదని శాసనము చెప్పుచున్నది గోదావరికి ఉత్తరమున ఉన్న ఆంధ్రదేశ ప్రాంతమును కళింగమని వ్యవహరించుచుండిరి పీఠికాపురము (పిఠాపురము) కళింగ దేశాభరణమని తెనాలి రామకృష్ణకవి వ్రాసెను ద్రాక్షారామమునకు శాసనములలో దాక్షారేమి పెద్దదాకరేమి అను పేర్లు కానవచ్చును ఇది దాక్షారామ శబ్దము యొక్క తద్భవ రూపము కావచ్చును

ప్రకృత శాసనకాలమును పరోక్షపద్ధతిని ఇట్లు నిర్ణయింపవచ్చును ఈశాసనము వ్రాసినవాడు పెద్దనాచార్యుడు లిఖితం పెద్దనాచార్యేః అని ఉన్నది ఈపెద్దనాచార్యుడు పెక్కు దాక్షారామ శాసనములందు కానవచ్చును ఈయన శాసనములు చెక్కు విశ్వకర్మ కుల ప్రముఖునిగా తోచును రాజశాసనములు దానధర్మ శాసనములు శిలల మీదను రాగిరేకులమీదను చెక్కుట మధ్యయుగములో ఒక ముఖ్యవృత్తిగానుండెను సాధారణముగ దీనిని కంసాలి కులమువారు చేయుచుండిరి వారు విద్యావంతులుకూడ అగుటచే వీరికి ఆచార్యపదము చేర్చబడుచుండెను

అరుసవెల్లి మడపనాయకుని దానశాసనము చెక్కిన పెద్దనార్యుడు ఒక ప్రముఖ లేఖకునిగా కన్పించును దాక్షారామశాసనములను మూలముగా పరికించి చూడగా ఈ పెద్దనార్యుడు శక 105 (క్రీ శ 11 9) నుండి శక 1076 (క్రీ శ 1154) వరకు శాసనములు వ్రాయు వృత్తిలో ఉండెనని తెలియవచ్చుచున్నది ఇది యింకను పరిశీలింపవలెను (చూడు ద హిం IV నె 1165 1167 1173 1175 1176) పెద్దనార్యుడు ఒక వ్యక్తి నామమో లేక దాక్షారామ విశ్వకర్మకులజుల బిరుదు నామమో ఇంను చూడవలెను ఎట్లైనను శిల్పివర్యుడైన పెద్దనార్యుని కాలము క్రీ శ 1129 54 అని నిర్ణయించుకొనవచ్చును ఇది సత్యమైనచో అరుసవెల్లి మడపనాయకుడును ఈకాలము నందే దానము వెలయించి ఉండును

తం అం శా

## అరేటియన్నమంత్రి — చూ అన్నమంత్రి బెండపూడి

## అరేడుగ్రామము

ఇది యొకప్పుడు చరిత్ర ప్రసిద్ధిని పొందియు ఇప్పుడు నామరూపములు లేక పడియున్న కుగ్రామము ఇది పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకాలో కన్పించుచున్నది దీని ఇప్పటి జనాభా 717

అరేడునే అరియేరు అని కూడ పిలుచుచుండిరి కావుననే అరియేటి లింగమంత్రి అను వ్యవహారము కలిగినది అరేటి అన్నమంత్రి అనియు కలదు ఈగ్రామ ప్రశంస శ్రీనాథమహాకవిచే రచింపబడిన భీమేశ్వరపురాణము (1 50)లో వచ్చుచున్నది కాకతిప్రతాపరుద్రచక్రవర్తి మహాప్రధానియు గజసైన్యాధ్యక్షుడును గొప్పయోధుడును అగు బెండపూడి అన్నమంత్రికి కొలని ప్రతాపరుద్రునిచే అరేడు గ్రామము

దానముగా ఈయబడినట్లు భీమేశ్వరపురాణము చెప్పుచున్నది. అపద్యమిది:

కోలను ప్రతాపరుద్ర నృప కుంజరుచే నరేడు సారణీ
లిల వివర్ధమాన బహుసస్యసమాకుల మగ్రహారమై
వెలయ విభాకర గ్రహణవేళ దగం బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభుతో సరియెట్లు ప్రధాను
లెవ్వరున్॥

కాలువల నీటిచే వర్ధిల్లుచున్న పెక్కు పంట పర్యాయములు గల అరేడు గ్రామమును అన్నమంత్రి కోలను ప్రతాపరుద్రుని చేత సూర్యగ్రహణ కాలమందు పొంది అగ్రహారము చేసి బంధువులను భరించెను. అట్టి జనాగ్రణియైన అన్నమంత్రితో సాటియైన ఇతర మంత్రులు లేరని కవి భావము. దీనినిబట్టి అరేడు ఒక అగ్రహారముగా ఉండెననియు దానికి మంచి నీటి పారుదల సౌకర్యము ఉండుటచే పెక్కు పంటలు అక్కడ పండింపబడుచుండెననియు తెలియుచున్నది. అన్నమంత్రి బంధువులకు పలువురకు ఈ గ్రామములో వృత్తులు ఏర్పరచియుండురు.

దాన మొసగిన కోలను ప్రతాపరుద్రనృపకుంజరుడెవరు? దానప్రతిగ్రహీతయగు అన్నమంత్రి యెవరు? ఈ ప్రశ్నలకు సంగ్రహముగా సమాధానమీయవలయును. నృపకుంజరుడు అనుటచే కోలను ప్రతాపరుద్రుడు రాజరికము చేయు క్షత్రియుడేమో యను భ్రాంతి కలుగును. అతడు ప్రభుత్వము చేసినది వాస్తవమే అయినను క్షత్రియుడు మాత్రము కాదు. కోలనువారు బ్రాహ్మణులు. వీరి మొదటి ఇంటిపేరు ఇందులూరివారు. ఈ వంశీయుడైన ఇందులూరి సోమయమంత్రి కాకతిగణపతిదేవ చక్రవర్తి వద్ద మహామాత్యుడును దండనాథుడును అయి యుండెను. ఆకాలమున పశ్చిమ గోదావరిజిల్లా కొల్లేరు సరస్సు ప్రాంతమున శత్రుదుస్సాధమైన జలదుర్గము ఒకటి యుండెను. దీనినే కొలను, కోలనువీడు, సారసపురి మున్నగు పేర్లతో వ్యవహరించుచుండిరి. ఇందులూరి సోమయమంత్రి ఈ దుర్భేద్యమైన కోటను కాకతీయుల కొరకు జయించెను. ఇందుకు సంతోషించి గణపతిదేవుడు దీనిని కొలను సోమయమంత్రి అని ప్రశంసించెను. అప్పటినుండియు ఈ వంశీయులను కోలనువారు అని పిలుచుటకు ఆరంభించిరి. అన్నమంత్రికి అరేడు గ్రామము దానమిచ్చిన కోలను ప్రతాపరుద్రుడు సోమయమంత్రికి తక్కిన కుమారుడు. సోమయమంత్రికి పెదగన్నమంత్రి అను తమ్ముడుండెను. అయనకు పెద్దభార్యయగు మల్లమాంబయందు రుద్రి అను పేర్లు గల ముగ్గురు సుతులు ఉదయించిరి. పెదగన్నమంత్రికే గౌరాంబయందు ఇందులూరి అన్నయమంత్రి జన్మించెను. ఈయన సాక్షాత్తు కారణజన్ముడైన యోగి యని ఆకాలపువారు భావించిరి. ఇందులూరి అన్నమంత్రి కాకతి రుద్రమదేవి గారి పుత్రికయగు రుయ్యమ్మను వివాహమాడెను. అటీయన రాజబంధువుకూడ అయి మహాప్రతాపశాలియు సేమంధురీణుడును అయి వాసికెక్కెను.

ఇందులూరు కోలనువారి వృత్తాంతము విస్తారముగా ఈవంశమువాడైన కోలని గణపతిదేవుడు రచించిన శివయోగసారమందు ఉపలభ్యమగుచున్నది. రాజవంశములు ప్రజారంజకములుగా ఉన్నప్పుడు ప్రభువుల పేర్లను ప్రజలు తమ సంతానమునకు పెట్టుకొను ఆచారము కలదు. కాకతి రుద్రమదేవి పేరును అట్లు పలువురు తమ పిల్లలకు పెట్టుకొనుచుండిరట. కోలని రుద్రదేవుని నామము అట్లే ఏర్పడియుండును. ఈతనికి ప్రతాపరుద్రుడను వ్యవహారము గ్రంథములలో లేదు. శ్రీనాథుడు ఔపచారికముగా వాడియుండును. కోలనురుద్రదేవుడు సకలాగమ ప్రాజ్ఞుడని విప్రులు పొగడుదురు. ఈతడు మహాప్రతాపశాలియై కాకతీశ్వరులచే ఏకశిలానగరము—సహ్యకంధరము (సహ్యాచలము) మధ్య గల దేశమునకు పాలకుడుగా నియమింపబడెను. కోలనువీడు ఈయనకు రాజధాని. చేబ్రోలు, దేవపురపు కోట, జయవాడి (విజయవాడ కావచ్చును), ఎమదల, కంచెర్ల, పొదిలె, పొడకనూరు, ఓలచెర్ల, ఆదూరు, నూజెళ్ళ, సూరవరము, రామహేంద్రవరము, గోడికురము, తురుకోట, చామెర్లకోట, బోడకట్టు, బెండపూడి మున్నగు మహాస్థలములు సేనాధీశుని యధీనములందుండెను. కోలను ప్రాంతమునకు పరిపాలకుడగుటచేనే రుద్రదేవుడు సీమయందలి అరేడు గ్రామమును బెండపూడి అన్నమంత్రికి అగ్రహారముగా ఇవ్వగలిగెను. కోలనురుద్రదేవుడు ఓరుగల్లు పతనానంతరము కూడ కొంతకాలము జీవించినట్లు కానిపించును. నర్సారావుపేట తాలూకా సంతమాగులూరులో ఈయన శాసనములు రెండు కాన్పించుచున్నవి (దక్షిణ హిం. శా. X 535 537). ఈశాసనముల కాలము క్రీ. శ. 13 6 అని చెప్పుచున్నారు. దీనిని బట్టి కోలనురుద్రసేనాని మహమ్మదీయులను ప్రతిఘటించుచు ప్రతాపరుద్ర

చక్రవర్తి నిర్యాణము తర్వాత కూడ కొంతకాలము జీవించెనని తోచుచున్నది

దాన పత్రిగహీతయైన బెడపూడి అన్నమంత్రియు అసాధారణ వ్యక్తియే ఈయన కాకతీశ్వరుని గజ దంతా వళములకు అధిపతి మహా మాత్య అన్నమంత్రి బెడపూడి(1) ఈయన రేచర్ల సింగమనాయనితో కలిసి కాకతీయ సామ్రాజ్యపు పశ్చిమ సరిహద్దుపై దురాక్రమణ చేయబూనిన కంపిలి రాజకుమారుడు కుమారరాముని జయించి కుమ్మత నగరమును సాధించెను బెడపూడి మొదటి అన్నమంత్రికి కొలని రుద్రదేవుడు అరేడు గ్రామమును ఎప్పుడు బహూకరించెనో తెలిసికొనుట కాధారములేదు సూర్యగ్రహణ కాలమున దానము ఈయబడినట్లు ఉన్నను అది యేసంవత్సరమో చెప్పలేదు సంతమాగులూరు శాసనమును దుందుభి సంవత్సర సూర్యగ్రహణ కాలమున కొలనిరుద్రదేవని గారు గోపీనాథ దేవునకు కొన్ని వృత్తులు పెట్టినట్లున్నది అరేడు గ్రామదానమును ఇదే సమయమున చేయబడియుండరాదా? అని సందేహము జనిపవచ్చును కాని అప్పటికి దేశము తురుష్కాక్రాంతమైనది కొలని రుద్రసేనాని వేగిదేశమునందు ఇప్పుడు లేడు కృష్ణకు దక్షిణముకు ఉపసంహరించుకొని అచటినుండి మహమ్మదీయులను నిరోధించుచుండెను కావచ్చును కాగా సంతమాగులూరు శాసన కాలమున అరేడు గ్రామదానము చేయుట సంభవించియుండదు అన్నమంత్రి ఏ శాసన కావ్యములలో కుమ్మటోద్యానమును జయించుటయను సాహసము చేయుటకు శ్రీనాథుడు వర్ణించెను కుమ్మరమును ఎఫటి చు క్రీ శ 1819 ప్రాంతమున జరిగినదని చారిత్రకులు భావించుచున్నారు దీనికి సమీపకాలముందే అన్నమంత్రి సేవలను గుర్తించుటకై అరేడు అగ్రహార దానము జరిగియుండవచ్చును

హ ఆ శే
కం ల రం

## అర్కి

సుల్తాన్ మహమ్మదుషా క్రీ శ 1482 నుండి క్రీ శ 1518 వరకు బహమనీ సామ్రాజ్యమును పాలించెను ఈతడు తైత్రయాత్రకు వెడలుచు బీదరు ప్రాంతమున కతి దూరమునగల అర్కి అను ప్రదేశమున విడిది చేసెను

గోలకొండ అధిపతియగు కుతుబుల్ ముల్కు 500 అశ్వబలము 80 గజబలము 5000 పదాతి బలముతో కూడిన సైన్యముతో బహమనీ ప్రభువునకు సహాయముగా వచ్చి ఇచట కలసికొనెను

ఈ అంశములు అహమదునగరము అధిపతి బురహాన్ నిజాం షా దర్బారు నలంకరించిన సుప్రసిద్ధ చారిత్రకుడు సయ్యద్ అలీతబాతబాయి రచించిన పారసీక గ్రంథము "బురహాన్ మా ర్" లో వివరింపబడినవి

దా కొ గో కృ

## అరోకోటము

రాజమహేంద్రవరము సూబాలో అరోకోటము అను దుర్గముకలదు వేంకటరాజు ఈదుర్గమున కధిపతిగా నుండెను క్రీ శ 1550 నుండి 1580 వరకు గోలకొండ సామ్రాజ్యము నేలిన ఇబ్రహీం కుతుబషా ఆజ్ఞానుసారముగ క్రీ శ 1560 ప్రాంతమున మలిక్ నాయబు అను అధికారి రాజమహేంద్రవరము గోపాలదుర్గములను జయించి అరోకోటదుర్గమును కూడ వశపఱచుకొనెను

ఈఅంశములు రెండవ అసఫ్ జా నిజాం అలీఖాను కాలమున ప్రధానామాత్య పదవి నలంకరించిన అబుల్ కాసిం మీర్ ఆలం (క్రీ శ 1752 1808) రచించిన హదీకతుల్ ఆలమ్ అను పారశీక గ్రంథము వలన తెలియుచున్నవి

దా కొ గో కృ

## అర్చకం శ్రీనివాసాచార్యులు

అర్చకం శ్రీనివాసాచార్యులుగారు అఖిల భారత ఖ్యాతి గాంచిన పుణ్యశ్లోకులు తమకు తిరుపతి నివాసులు ఈయన క్రీ శ 1850 ప్రాంతమువాడు తండ్రి తిమ్మయాచార్యుడను తిరుమలాచార్యుడు వీరు కాశ్యప గోత్రులు అర్చకం అను నది ఇంటిపేరు వంశ పారంపర్యముగా తిరుమల క్షేత్రమున శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధిలో అర్చన చేయుచున్నందున ఈవంశమువారికి వృత్తిని సూచింపజేయు అర్చకం" అను పదము ఇంటి పేరై స్థిరపడినది నేటికిని అర్చకం వారే శ్రీ వేంకటేశ్వరస్వామివారి ప్రధానార్చకులుగాను మిరాశీ దారులుగాను ఉన్నారు వీరు వైఖానస శాఖకు చెందిన శ్రీ వైష్ణవులు శ్రీవైష్ణవాగమములలో పాంచరాత్ర వైఖానసములు ప్రముఖములైనవి అందు వైఖానసము విఖనస ఋషి ప్రవర్తితమైనది అనాదిగా ఈవైఖాన సాగమానుసారమే

తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి అర్చనా విధానమెల్ల నిర్వర్తింపబడుచున్నదను విషయమును శ్రీ వేంకటేశ్వరాష్టోత్తర నామ స్తోత్రమునందలి వైఖానస మునిశ్రేష్ఠ పూజితా ఘయుగాయచ అను వాక్యముకూడ బలపరచుచున్నది ఈ శ్రీనివాసాచార్యుడు స్వీయ శాకుంతల వ్యాఖ్యారంభ భాగమున తన వంశాములను గూర్చి చెప్పుచు

వైఖాన సాన్వయ పయోధి మృగాంకమూర్తిః
శ్రీకశిలో విజయతే సహి తిమ్మయాఖ్య
శ్రీ వేంకటేశ చరణాంబుజ నిత్య పూజా
పూతాకృతి ర్గుణనిధి ర్మహితో మనీషి

తన తండ్రి తిమ్మయ (తిరుమలాచార్యుడు) వైఖానస వంశమనెడి పాల్కడలికి చంద్రునివంటివాడు కౌశిక గోత్రుడు ఎడకొండలవాని అడుగుదమ్ములు-చ్చెలు-కొలిచేపున్నెము చేసికొనినవాడు అయన గుణవంతుడు పూజ్యుడు పండితుడు అట్టివాని పుత్రుడైన శాపో

"తస్య పుత్రోస్తి విద్యావాం స్వయంవరపతిః కవిః
వ్యాఖ్యాతా నాటకాదీనాం శ్రీనివాస ఇతి శ్రుతః

విద్యలెల్లి తాముగా వచ్చి వరించిన స్పృహణీయ మూర్తి కొంగా పేరొందినవాడు నాటకాదుల మీద వ్యాఖ్యానాలు సంతరించిన ధీమంతుడు తనను శ్రీనివాసుడందురు

విద్యాగురువుగాని మంత్రోపదేష్టయైన ఆచార్యుని గాని గురించి చెప్పుకొన లేదు విద్యానాం స్వయంవరపతి అనుటచే గురు శుశ్రూషాక్లేశము లేకయే యీ మనీషికి శ్రీనివాసుని యనుగ్రహమున విద్యలు సంక్రమించినవేమో! కావు తలకు టీక వ్రాయుచు

"టీకాం కరోమి విదుషాం పరితోషణాయ
శ్రీ తలస్య వృషశైల పతేః ప్రసాదాత్

శ్రీనివాసస్వామి అనుగ్రహమే అందులకు హేతువని చెప్పుకొనుటయు ఈ భావమునకు తార్కాణగా కనబడుచున్నది

మహాపండితుడైన యీ శ్రీనివాసాచార్యుడు వైఖానస సూత్రములకు వ్యాఖ్య రచించెను అట్లే శ్రీమద్రామాయణమునకును ఒక వ్యాఖ్యానమును కూర్చెను ఈతని రామాయణ వ్యాఖ్య వ్రాతప్రతి దక్షిణ ఆర్కాటు (తమిళనాడు) జిల్లాలోని ఒరట్టి అను గ్రామమున గలదట

శ్రీనివాసాచార్యుని కీర్తి కౌముదికి విజయ పతాకయనదగినది ఆతని శాకుంతల వ్యాఖ్య కాళిదాస మహాకవి సూక్తి మర్మము అంత తవారికి అందేదికాదు అది నీటిగొంది తామర అతి సామాన్యుడును ఆ కవీశ్వరుని కృతి చదివి యర్థమైనదని అనంది మను కొమ్ములు తిరిగిన విద్వాంసుడును దీనిలోతు ఇంకను పూర్తిగా అందుట లేదేయని కించపడును కావుననే జీవిత మంతయు వ్యాఖ్యా వ్యవసాయములో వెచ్చించిన మల్లినాథ సూరి యంతటివాడు

"కాళిదాస గిరాం సారం కాళిదాసః సరస్వతీ
చతుర్ముఖోఽథవా సాక్షా ద్విదు ర్నాన్యే తు
మాదృశాః

ఆ సూక్తిసారము అవగాహనము చేసికొనుటకు సరస్వతియో బ్రహ్మయో కావలెను మాబోట్లకు తెలియదు అని ఆయూక్తి మహత్తును ఉగ్గడించినాడు అట్టి కాళిదాసుని నాటకములలో సర్వశ్రేష్ఠమైనది శాకుంతలము కదా! దాని మీద వ్యాఖ్య వ్రాయబూనుకొనుటయే పెద్ద సాహసము సముద్రమునకు వీవ మెత్తుట! ఎందరో విద్వాంసు లీపనికి పూనుకొన్నారు రాఘవభట్ట కాటయవేమ ఘనశ్యాముదులు రచించిన శాకుంతల వ్యాఖ్యానాలు మొత్తము మీద ఇరువదియైదునకు మించి యున్నవందురు వీనిలో కొన్ని ప్రాచీనములు కొన్ని అర్వాచీనములునై యున్నవి ఆ ప్రథమలలో మొదటివాడు కాటయవేమారెడ్డి ఈతడు క్రీశ 1886 4(2 వరకు కొండవీటి రాజ్యము నేలిన కొమరగిరి రెడ్డి కుడి భుజమైయున్నవాడు ఆ రాజవర్యుని పేర కాళిదాసుని మూడు నాటకముల మీదను కుమారగిరిరాజీయ మను వ్యాఖ్యానములు వ్రాసిన విద్వాంసుడు కాటయవేముని వ్యాఖ్య సంగ్రహమైనది

మహాకవుల కావ్యములకు గాని నాటకములకుగాని వ్యాఖ్యానాలు వ్రాయుటకు పూనుకొను వ్యాఖ్యాత అనేక శాస్త్రము లలో లోతైన పాండిత్యము కలిగియుండవలసియున్నది అట్టివాని వ్యాఖ్యానమే రాణించును ముఖ్యముగా సర్వశాస్త్రోపకారకములుగా ప్రసిద్ధి చెందిన కాణాద పాణినీయములలో వైదుష్య మవసరము మల్లినాథుడు చెప్పిన

వాణీ కాణభుజీ మజీగణ దవా
సాసిచ్చవైయాసకీమ్-అను

పద్యధోరణిలోనే ఈ అర్చకం శ్రీనివాసాచార్యుడు వ్యాఖ్యాతకు కావలసిన ఆపాడిత్యబలము తను పుష్కలముగానేయున్నది సుమా! ప్రాచీన వ్యాఖ్యాతల యందు గల ప్రామాణిత్వము తనే నాయందును వనివచ్చునన్నట్లు ఇట్లు నుడివి నాడు

> యా శ్రీనివాస మఖిలాగమ సారసి ధు
> కుంభోద్భవ బుధజనాః పరికీర్తయంతి
> సోఽహం విచార్య భరతాది మునిప్రణీతం
> శాస్త్రం కవీంద్ర రచితాని చ నాటకాని
> న్యాయం ఫణీంద్ర ఫణితి కపిలస్యం తంత్ర
> కాణాదత త్ర మథ జైమినినా కృతంచ
> టీకాం కరోమి విదుషాం పరితోషణాయ
> శాకుంతలస్య వృషశైలపతేః ప్రసాదాత్"

అన్ని శాస్త్రాలు ఆపోశనం పట్టిన అగస్త్యుడ దురు లోకులన్ను నాట్యశాస్త్రము మొదలుపురు కవులనాటకాలు పరిశీలించితిని న్యాయ వ్యాకరణ మీమాంసాది శాస్త్రాలు గట్టిగా ఆలోచించితిని సహృదయులు ఆనందించు రీతిగా శాకుంతలమునకు టీక వ్రాయుచున్నాను అన్నాడు ఇంత అహంకారమా! అనరాదు చెప్పనేచెప్పెను వృషశైలపతేః ప్రసాదాత్ అని ఆస్వామిఅనుగ్రహమున్నవాడు కొలంత ఏమి కలుగును? శ్రీనివాసుని దివ్య పాదములు నిత్యము అర్చించు భాగ్యశాలి కదా తాను! ఆత్మ విశ్వాసము -ఆధ్యాత్మిక తత్త్వము- రెండును ఇందు ద్యోతకమగుచున్నవి అంతియేగాక అపరితోషా ద్విదుషామ్ అన్న మూలకారుని ఛాయయు గోచరించినది

అనేక శాస్త్రములలోనే కాక పెక్కు భాషలలో ఈయనకు మంచి ప్రవేశమున్నందున అ భాషా చక్రవర్తిగా ! సిద్ధికెక్కెను శ్రీవేంకటభట్ట అను బిరుద పదము ఈవంశీయుల కెల్ల కుల క్రమానుగతమై వెలయుచు డెను ఈమనీషి అలంకార శాస్త్రమందు ధ్వని మార్గమున విశేషించి కృషి చేసిన వాడౌట ధ్వని ప్రస్థాన పరమాచార్య అను మరియొక ప్రశస్తి వాచకముచే భూషితుడై యుండెను ఈయ శముతే యీశాకుంతల వ్యాఖ్యలో అంకాంతముల దు గద్యముల వెల్లడి పబడి వి సప్తభూక వ్యాఖ్యాత గద్య యిట్లున్నది

> "ఇతి శ్రీరమణ వేంకటాచలేశ్వర పాదారవింద
> సమారాధక
> వైఖానస కుల తిలక కౌశికగోత్ర శ్రీవేంకటభట్టఇతి
> గోత్ర క్రమాగత భట్టబిరుద తిరుమలాచార్యపుత్రేణ
> ధ్వనిప్రస్థాన పరమాచార్యే ణాష్టభాషాచక్రవర్తి
> శ్రీనివాసాచార్యేణ
> విరచితాయా మభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యాయాం
> సప్తమో కః!!

ఈయన చెప్పినట్లు చేయగలిగిన ధీరుడు టీకాం కరోమి విదుషాం పరితోషణాయ అన్నాడు కదా! ధ్వని ప్రస్థాన పరమాచార్యేణ అన్నాడు కదా ఈయన వ్యాఖ్య కాళిదాసమహాకావ్యంగ్యవైభవమును ప్రదర్శించినంత పుష్కలముగా మరియొకరి వ్యాఖ్య ప్రదర్శింప లేకపోయినది నిజముగా బుధులు సంతసించినారు! సార్థక మన్నారు అయన ధ్వని ప్రస్థాన పరమాచార్యత్వము శాకుంతలములో ప్రతి శ్లో వ్యాఖ్యను పరిశీలించి న ఈసత్యముపొడగట్టును పఠనపాఠనములలో శాకుంతలము కు శ్రీనివాసాచార్యుల వ్యాఖ్యయే శారదజ్యోత్స్నయైనది ఆంధ్రుడని యభిమానము కాదు భారతీయ విద్వాంసులు అన్ని ప్రాంతములవారును ఈవ్యాఖ్యకు ప్రథమ తాంబూలమిచ్చినారు బొంబాయిను డి శా శ 1838 (క్రీ శ 1916) నాగరలిపిలో లక్ష్మీవెంకటేశ్వర ముద్రణాలయమున ముద్రింపబడిన అభిజ్ఞానశాకుంతల (వ్యాఖ్యాద్వయోపేతము) పుస్తక విజ్ఞప్తిలో (పీఠికా భాగములో) ప్రకాశకుల ఈ వాక్యములు గమనింపదగియున్నవి

నైక విధ వ్యవహార మూలకతయా చ రూపకాణాం స్వత ఏవదుర్గమత్వేన అవశ్యం వ్యాఖ్యాసాపేక్షత్వమ్ అభిజ్ఞానశాకుంతలే చ సమీచీనాయాః వ్యాఖ్యాయాః అభావాత్ దురోభతయా రస పరిప్లుతతయా చ తదాస్వాద మభి ష్య తో రసికా అమూల కంటక చ్ఛన్నం కేతకీ ప్రసూనమనురావతో మధుకరాఇవ నితాంతందుఃఖాయ తఇతి తస్య సరల వ్యాఖ్యాసాపేక్షత్వ మనుబుధ్యా స్మాభి శ్లాఘా మహతా ప్రయత్నేన అష్టభాషా చక్రవర్తి శ్రీనివాసాచార్య విరచితా శాకుంతల వ్యాఖ్యా

ఇయం వ్యాఖ్యా స్ఫుటత్వాత్ విస్తృతతాత్ శాస్త్రప్రమాణిత యుక్తిమత్వాత్ శ్రీకాళిదాసీక వీశ హృదయస్య సర్వతః ప్రకాశనే అలమితి విచార్యే మా వ్యాఖ్యా మాంధ్రలిపితో స్మాభి ర్దేవ నాగ రాక్షరై ర్విపరివర్త్య ముద్రితా-

మొదలే రూపకాలు దురవగాహాలు వ్యాఖ్యానాలు

లేనిదే అర్థము కావు ఇక కాళిదాస కృతుల మాట చెప్పవలెనా ? అ దలి సార స్యమును ఆస్వాదించ బోయి ముళ్లు గప్పిన మొగలి పువ్వుల మీదికిపోయిన తుమ్మెదలవలె రసికులు కలగుండుపడుదురు మేము ఎంతో శ్రమించి ఈ ఉభయభాషా చక్రవర్తి శ్రీనివాసాచార్యుని వ్యాఖ్య సంపాదించితిమి ఇది మిక్కిలి వైశద్యముకలది విస్తృతమైనది ప్రామాణికమైనది కావున కాళిదాసుని హృదయమును అంది చుటలో అతి సమర్థమైనది—అని భావము

శ్రీనివాసాచార్యుడు తస్య పుత్రో నిగిద్యానా స్వయం వరపతిః కవిః అన్న వాక్యములో తానుకవిని అని చెప్పుకొన్నాడు ఈయన కవితలో వెలయించిన గ్రంథములెవ్వియో కానరాలేదు ధ్వనిమర్మ వేత్తయై యీ విద్వాంసుని లేఖిని సృజించి యుండిన కవిత యెంత వ్యంగ్య మధురైక భోగ్యమైయుండెదో! అట్టిదొక కృతియు లభించకుండుట కావ్య రసికులకు విచార హేతువేయగును ఆయనవ్యంగ్య మాధురీ ధురీణమైన కవితకూర్పునేర్చినవాడనుటకు మచ్చుతునకగాపద్మావతీ శ్రీనివాసుల ప్రణయ లీలను వర్ణించు అవిస్పష్టమైన చెప్పిన యీపద్యరత్నమొకటి శాకుంతల వ్యాఖ్యారంభములో కనబడుచున్నది

"లక్ష్మీం వః సుతరాం తనోతు మధుకృల్లక్ష్మీ
ముఖాంభోరు హో
భక్తాభీష్ట వరప్రదాన నిపుణః శ్రీవేంకటేశో విభుః
లీలా పంకజ మగ్ర మధుకరం సంబద్ధుమంకే స్థితా
నేత్రం శ్రీ భ ధాతియస్యకుతుకాత్ సవ్యేతర పాణినా
చేరం

అర్ధమాపతి చూ అరపసింగాలుదు

## అర్ధవరం

అర్ధవరం పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెం తాలూకాలో ఉన్నది ఈ గ్రామమునకు 10 మైళ్ళదూరములో తాడేపల్లిగూడెం పట్టణముఉన్నది దీనికి తూర్పున కాకినాడ పడమట కొత్తపల్లి ఉత్తరమున పరిమెళ్ళ దక్షిణమున పాండువ్వ సరిహద్దులుగ ఉన్నవి ఇది సారవంతమైన చదునైన ప్రదేశమున కలదు దీని విస్తీర్ణము 2 568 ఎకరములు

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామ మందలి జనులు 6089 మంది వీరిలో ఎరుకలు ముగ్గురు మెడ్యూల్డు జాతులవారు 374 మంది షెడ్యూల్డు తరగతుల వారు 14 మంది ఇక్కడ కొన్ని ఇండ్లు గుపుగను కొన్ని ఇండ్లు గలవ క్రిందను ఉన్నవి వీనిలో 185 పెంకుటిండ్లు 8 కాంక్రీటు ప్రగలఇండ్లు ఒక అంతస్థుగలమేడ ఒకటి అందరు వరిజన్నముననే తిందురు చెరువు నీటిని త్రాగుదురు మంచినీటి ఎద్దడి లేదు

కాకినాడ మరుగుకాలువ పాండువకాలువ అరేడు కాలువ గోపవరం కాలువ గోపవరం బ్రాంచికాలువ ముగ్గుళ్ళ కాలువ కొత్తపల్లి బ్రాంచికాలువ కట్టమ్మచెరువు చిన వెంకట్రాజుచెరువు రావుచెరువు అది అగ్రహచెరువు- ఇవి ఈ గ్రామపు నీటివనరులు పీటిద్వార పరిపంట పండును పడ్లను గాదెలలో నిలువచేయుదురు లారీలపై రెండెడ్లబండ్లపై పడ్లను గణపవరం తాడేపల్లిగూడెములకు రవాణా చేయుదురు 1960-61 సం॥లో పంటల క్రింద 18 0 ఎకరముల భూమి సాగైనది సాగుబడి అంతయు కాలువ నీటిక్రిందనే జరిగెను 8 ట్రాక్టర్లు 150 ఎకరములభూమిని దున్నెను

ఈ గ్రామమున 150 గేదెలు 35 ఆవులు 200 ఎద్దులు 8 గుర్రములు 10 మేకలు 12 గొర్రెలు 75 పందులు 100 కోళ్ళు గలవు సాలీనా 12500 లీటర్ల పాలను 5000 కిలోగ్రా నెయ్యి మాసమును గ్రుడ్లును స్థానికులు ఉపయోగించుకొని 18301 లీటర్ల పాలను గణపవరం ఏప్పర తాడేపల్లి గూడెములకు రవాణా చేసెద

ఈగ్రామజనుల ముఖ్యవృత్తులు వ్యవసాయము కూలి దుకాణాదారులు టాంగాలను ఎద్దుబండ్లను తోలువారు వడ్రంగులు కంసాలులు తాపీమేస్త్రీలు తెలికలవారు మంగలివారు చాకలివారు కలరు వ్యవసాయదారులకు కూలీలు దొరకుదురు దినమునకు పురుషునకు రు 1 50 లు స్త్రీకి రు -75 లు

ఈ గ్రామములో రెండు విద్యాలయములు ఒక శివాలయము ఒక రామాలయము ఒకటకట్టమ్మవారిగుడి ఒక చర్చి ఉన్నవి విద్యాలయమునకు రు 8000 లు శివాలయమునకు రు 4000 లు రామాలయమునకు రు 500 లు సాలీనా దేవాలయభూములవలన ఆదాయము వచ్చును మఖ్యా రాయుడిపన్న తిరునాళ్ళ కట్టమ్మజాతర జరుగును

ఈ గ్రామమునకు 12 మైళ్ళ దూరములో అత్తిలి స్టేషను తాడేపల్లిగూడెం స్టేషను ఉన్నవి ఈగ్రామమునకు

1½ మైళ్ళదూరములో బస్సుమార్గము కలదు అర్ధగంటకొక మారు ప్రభుత్వపుబస్సులు తాడేపల్లిగూడెం నుండి భీమవరము నకు పోవును ఎమ్మెంటురోడ్లు రబ్బిష్‌రోడ్లు ఉన్నవి ప్రయాణములకు గ్రామములో 6 గుర్రపుబండ్లు 8 ఒంటెద్దు బండ్లు 70 రెండెడ్లబండ్లు 75 సైకిళ్ళు కలవు

అర్ధవరంలో బ్రాంచిపోస్టాఫీసు టెలిఫోను పరిషత్తు హైస్కూలు ఉన్నవి కొత్తపల్లి వరదరాజపురం ముగ్గళ్ళ వట్లూరు అను గ్రామములనుండి విద్యార్థులు ఇచటి హైస్కూలునకు వత్తురు విద్యుచ్ఛక్తిని 55 ఇండ్లు ఒక ఎలెక్ట్రిక్ మోటారు వాడుకొనుచున్నవి ఇది పంచాయతీ పరిపాలనగల గ్రామము గ్రామపారిశుద్ధ్య కార్యక్రమము జరుగును పశువుల ఆసుపత్రి ఉన్నది ఒక ఆయుర్వేద వైద్యుడు కూడ కలడు గ్రామకోర్టు కలదు ఇచ్చట 5 కిరాణాదుకాణములు ఒకసోడా ఫ్యా సిగరెట్టుబంగడి మూడు సైకిళ్ళషాపులు గలవు

ఈ గ్రామమునకు రెండుమైళ్ళదూరములోనున్న ఎప్పర లో తంతికార్యాలయము వారసంతలు కలవు ఈ సంతలో పశువులు ఆహారపదార్థములు దొరుకును పశువులు ఆహార పదార్థములకొరకు వారసంతకు పురుళ్ళఆసుపత్రికి సినిమా థియేటరుకు పోలీసుస్టేషనుకు సబ్‌రిజిష్ట్రారు ఆఫీసుకు బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు గ్రామస్థులు నాలుగుమైళ్ళదూరములో ఉన్న గణపవరమునకు పోవుదురు మున్సిఫ్‌కోర్టునకు తాలూకాకచేరీకి 12 మైళ్ళలో ఉన్న తాడేపల్లిగూడెమునకు పోవుదురు కళాశాలచదువులకు విద్యార్థులు భీమవరములోని D N R కళాశాలకు పోవుదురు జనరల్ ఆసుపత్రికి ఏలూరునకు పోవలెను

మా శ్రే

## అర్ధవీడు

అర్థవీడు కర్నూలుజిల్లా గిద్దలూరుతాలూకాలో ఉన్నది దీనికి 18మైళ్ళలో కంభం పట్టణమున్నది తూర్పున దొనకొండ పడమట పాపినేనిపల్లి ఉత్తరమున రంగాపురం అడవికొండ దక్షిణమున ఎర్రగుట్ల ఈగ్రామపరిహద్దులు ఇది చదరమైన నేలపై కట్టబడినది దీనివిస్తీర్ణము 6013 ఎకరములు గ్రామమునానుకొని ఉత్తరమున జంపలేరు దక్షిణమున చీమలేరు ప్రవహించుచున్నవి ఎర్రకొండ అపిటికొండ కలిసి ఉన్నవి 3 ఎకరములవైశాల్యము 89 అడుగులఎత్తుగల బాబాశాలతిప్ప 9 ఎకరములవైశాల్యము 109 అడుగుల ఎత్తుగల నారాయణపల్లితిప్ప ఇచ్చట ఉన్నవి ఇవి కఠినకరాయి గుండ్రాళ్ళతో ఏర్పడి ఉన్నవి

961 సం॥ జనాభాలెక్కలప్రకారము ఈ గ్రామమున గల జనులు 3838 మంది వీరిలో షెడ్యూలుజాతులవారు షెడ్యూలుతరగతులవారు కలసి 25మంది ఇచ్చట కొన్నిచోట్ల ఇండ్లు దూరదూరముగాను వాడవాడలుగాను నిర్మింపబడినవి వీటిలో 48 శాక్రిటుకప్పుల ఇండ్లు ఒక మేడ కలవు దక్షిణ దిశగా ఆసుపత్రి హైస్కూలు మున్నగు సౌకర్యములు ఉండుటచే ఈగ్రామము దక్షిణదిశగా అభివృద్ధి అగుచున్నది జనులలో 42 శాతమువారు వరిఅన్నమును 28 శాతమువారు జొన్నఅన్నమును 30 శాతమువారు కొర్ర సజ్జమొదలయిన అన్నములను తిందురు బావినీటిని త్రాగుదురు

ఈగ్రామమున నీటివనరులు-జంపలేరు చీమలేరు చెన్నరాయనిచెరువు నల్లమూలబుగ్గ మొదలయినవి వీటిక్రిందవరి జొన్న సజ్జ కొర్ర రాగి అరిక వేరుసెనగ ఆముదాలు ప్రత్తి కంది ఉలవ వరిగ మొదలగు పంటలను పండింతురు ఈపంటసరకులను గాదెలు పాతరలు మొదలగువాటిలో నిలువచేయుదురు వీటిని బండ్లపై కంభం గిద్దలూరు నంద్యాలలకు రవాణాచేయుదురు ఒక్కఎకరముచీ తోట 2½ ఎకరములమామిడితోట ఇచట కలవు మామిడికాయలను స్థానికులు ఉపయోగింతురు 8000 చీనీపండ్లను కంభమునకు సప్లైచేయుదురు మిర్చి ఉల్లి టొమాటో వంగ గోంగూర తోటకూర మొదలగువాటిని పెంచుదురు 15 పుట్లమిరపని కూరగాయలను స్థానికులు ఉపయోగించుకొని 1500 పుట్లమిర్చిని కంభమునకు రవాణా చేయుదురు 196 69 లో పంటలక్రింద ఉపయోగించబడిన భూమి 8580 ఎకరములు చెరువులక్రింద 120 ఎకరముల భూమి బావులక్రింద 50 ఎకరములభూమి సాగుబడి అయినది రెండు ఆయిల్ ఇంజనులు 20 ఎకరములకును మోటలు 20 ఎకరములకును నీటిని సరఫరాచేసెను 61 ఎకరముల బీడవి ఈ గ్రామము బు అధికారమున కలదు ఇచ్చట 5090 ఎకరముల విస్తీర్ణముగల ఎర్రనేల 784 ఎకరములవిస్తీర్ణముగల పాటినేల 565 ఎకరముల విస్తీర్ణముగల తువ్వనేల 162½ ఎకరముల విస్తీర్ణముగల చవిటినేల కలదు

ఈగ్రామమున గేదెల ఎద్దుల ఆవులసంఖ్య 2210 మేకలు 24 గొర్రెలు 605 పందులు 45 కోళ్ళు 774 కలవు

దినమునకు 159 లీటర్ల పాలు 50 కి గ్రా నెయ్యి 25 గుడ్లు స్థానికులు వాడుకొని 459లీటర్ల పాలను 140 కి గ్రా నెయ్యిని క థమ నకు ర వాణాచేయుదురు బరువులను మోయుటకు 19 గాడిదలు గలవు

ఇచ్చటి ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము వ్యవసాయ కూలి కుటీర పరిశ్రమలు కలపకొట్టుట మున్నగు అడవి పనులు దుః ఆధారుల క సాలివారు వ్రడ గులు కమ్మరులు కుమ్మరులు తాపీమేస్త్రులు నెలికలవారు కలరు మరియు 22 మ ది మ గలివారు 150మంది చాకలివారు 81మ దిగొల్ల వారు 64మంది వడ్డెరవారు 10మందిసాలెవారు కలరు ఏడ్లమర స్థానికుల అవసరములకు ఉ యోగపడుచున్నది చేనేత మేదర కుమ్మర కుటీరపరిశ్రమలవలన కొ దరు జీవి చుచున్నారు వీరు తయారుచేసిన దుప్పట్లు చీరెలు పంచెలు చా ట లు జల్లలు గా దెలు కు డలు మొదలయినవి స్థానికులే ఉపయో గి తురు రాతిగనులనుండి త్రవ్వబడిన రాతిని ఇ డ్లుకట్టుటకు ఉపయోగి చుచున్నారు వ్యవసాయమునకు సరిపోవు కూలీలు దొరకుదురు దినమునకు కూలిరేటు పురుషునకు రు 2/ లు స్త్రీకి రు 1 50లు

అర్ధవీడులో వీరభద్ర రామ శివస్వాములఆలయములు ఒక మసీదు కలవు దేవాలయములకు 15ఎకరముల మెట్టభూమి 2¾ఎకరముల తరిభూమికలదు శివరాత్రిఉత్సవము ప్రభలతో ఆకర్ష ణీయముగ జరుపుదురు

ఈ గ్రామమునకు 18 మైళ్ళలో కంభం రైల్వేస్టేషను ఉన్నది ఈగ్రామమునకు ప్రైవేటుబస్సుకలదు ఇచట 8క కరోడ్లు కలవు దీనిని ఇతర గ్రామములతో క కరరోడ్లు కలుపు చున్నవి ప్రయాణఅవసరములకు ఈగ్రామమున 284 రెండెడ్ల బ డ్లు 4 సైకిళ్లు కలవు

ఈ గ్రామములో ఒకసబ్ పోస్టాఫీసు ఒక బ్రా చి పోస్టాఫీసు 5 ఎలిమె టరి స్కూళ్ళు ఒక జిల్లాపరిషత్తు హైస్కూలు ఉన్నవి ఇచ్చటిహైస్కూలుచదువులకు పాపినేని పల్లి బొల్లుపల్లి దొనకొండ మోదిన్ పురం అచ్చంపేట నారాయణపల్లి అంకభూపాలం మొదలయిన గ్రామముల నుండి విద్యార్థులు వత్తురు ఇచట ఒక ప్రైమరీహెల్తుసెంటరు కలదు ఇద్దరు ఇంగ్లీషువైద్యులు ఇద్దరుఆయుర్వేదవైద్యులు కలరు పశురోగాలకు పాటువైద్యము చేయుదురు

ఇది పంచాయతీ రిపాలనలో ఉన్న గ్రామము ప చా యతీ ఆదాయము రు 5 056లు ఒ ప చాయతీగ్రంథా లయము తాలూకా చేరి ఉ న్నవి ఇచటి మల్టీసర్వీస్ సహా కార ఘము 14 మ ది గ్రామస్థులకు అప్పులిచ్చినది ప్రైవేటు అప్పులిచ్చువారు కలరు వీవర్స సహకారస ఘము ఉన్నది 8 కిరాణాదుకాణములు రె డుకాఫీహోటళ్లు ఒకకిళ్ళీ సోడ సిగరెట్టు అం డి ఒకహోటళ్ల 10 అలరసావులు ఈ గ్రామమున గలవు

పురుళ్ళఆసుపత్రి జనరల్ ఆసుప త్రి తంతితపాలా లయ ముకు సబ్ రిజిస్ట్రారుఆఫీసుకు ఈగ్రామస్థులు 18 మైళ్ళ దూరములోఉన్న క థమునకు పోవుదురు తూర్లుకు తాలూ కాకేంద్రముకి 55 మైళ్ళలోవున్న గిద్దలూరునకును బ్లాక అభివృద్ధి కేంద్రమునకు 21 మైళ్ళలో వున్న వె వారిపేటకును పశువుల ఆసుపత్రికి 1¾ మైళ్ళలోవున్న పాపినేనిపల్లి కిని ఈ గ్రామము ను డి పోవుదురు

అర్ధవీడులో కోటఉన్నది చెన్న కేశవస్వామిఆలయములో శాసనములు విగ్రహములు ప్రాచీనచిత్రరువులు కలవు ప్రస్తుతము ఈకోట శిథిలావస్థలో ఉన్నది

మా శ్వే

## అర్జాపురము (టి)

టి అర్జాపురము విశాఖపట్టణ జిల్లా చోడవర తాలూ కాలో ఉన్నది దీనికి 17 మైళ్ళలో చోడవరంపట్టణము కలదు ఈ గ్రామమునకు తామరచెర్ల అర్జాపురము అను మరియొక పేరు కలదు దీనికి తూర్పున మేడివాడ దిడ్డి పడమట చెన్న వరంశివారు కిత్తంపేట ఉత్తరమున కొట్నాపల్లి దక్షిణ మున జాడిపల్లి పొన్నంపోలు ఉన్నవి దీని అక్షా శము 17 47 రేఖా శము 82 45 ఈ గ్రామ విస్తీర్ణము 1 668 ఎకరములు ఇది తాటితోపులమధ్యగా ఉన్నది ఇచట జమ్మి దేవమ్మపర్వతము తామరచెర్ల మెట్టకలవు ఇవినల్ల రాతివిర్మాణ ములు

196 ౧ జనాభాలెక్కలప్రకారము ఇ క్కడ 1 561 మంది పురుషులు 1535 మందిస్త్రీలు వెరసి 3096 మందిఉండిరి వీరిలో షెడ్యూల్డుజాతులవారు 168 మ ది షెడ్యూల్డు తర గతులవారు 98 మంది 1951 సం॥ జనాభా 2 940 1951 1961 సం॥లో జనాభాలో వృద్ధి 156 ఇచ్చట ఇండ్లు పంక్తులుగాను కొట్నాపల్లి సవారుగమ నిర్మించబడినవి వీటిలో 12 పెంకు టిండ్లు 4 కాంక్రీటు కప్పుగలఇండ్లు ఉన్నవి గ్రామస్థులలో

850 మందివరిఅన్నమును 2 143 మంది జొన్న గంటి చోడి అన్నము తిందురు వీరుబావి నీటిని త్రాగుదురు మంచినీటి ఎద్దడి కలదు

ఇక్కడి తిర్వలగడ్డ ఎర్రిచెరువు తెలికలచెరువు కొత్త చెరువు రామరాజుచెరువు వడ్డివానిబంద కట్టచెరువు గదబ బంద అను వీనిగ్రామపు నీటివనరులు వీటిక్రింద వరి చెరకు కంది గంటి కొర్ర చోడి వేరుసెనగ నువ్వులు చామ బొబ్బర అనుము పెసర మినుము జొన్న ఉలవ పంటలు పండును పడ్లను గాదెలలో నిల్వయుంతురు పంటలను బండ్లలో లారీలపై అనకాపల్లి గోదాములకు రవాణాచేయుదురు ఇక్కడ 4 71 ఎకరములమామిడితోట కలదు మామిడి కాయలను స్థానికులు ఉపయోగింతురు పండిన కాయలను పండింతురు పంటక్రింద 1966 67 సం॥లో 1283 ఎకరములభూమి ఉపయోగింబడెను కాలువక్రింద 80 ఎకరములు చెరువుల క్రింద 442 ఎకరములు వర్షాధారమున 200 ఎకరములు సాగైనవి మోటలు 400 ఎకరములకలసి 850 ఎకరముభూమికి నీటిని సరఫరాచేసెను ఆంధ్రప్రదేశపు అటవీశాఖవారి పాలనలో అడవి ఉన్నది

ఈ గ్రామములో 670 గేదెలు 550 ఎద్దులు 130 ఆవులు 790 దున్నలు 258 మేకలు 860 గొర్రెలు 200 పందులు 1458 కోళ్ళు కలవు దినమునకు 14½ లీటర్ల పాలు 250 గుడ్లు స్థానికులు ఉపయోగింతురు

ఇచ్చటి జనుల ముఖ్యవృత్తులు వ్యవసాయము వ్యవసాయకూలి కంటికపరిశ్రమ ఎద్దుబండ్లను తోటవారుకలరు కంసాలి వడ్రంగి కమ్మరి తెలికల మంగలి చాకలి గొల్ల సాలిమొదలయినవారు కలరు చేనేతవారు కలరు సాలీనారు 25 000 ల విలువగలచీరెలు పంచెలు తయారగును కొత్తకోటకు వీనిని రవాణాచేయుదురు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు కూలిరేటు పురుషునకు దినమునకు రు 2 లు స్త్రీకి రు 1

రామమందిరములుమాత్రము ఇచ్చట ఉన్నవి రామాలయమునకు 5 ఎకరములభూమి ఉన్నది గ్రామ దేవతల ఉత్సవములు జరుగును

అర్జాపురమునకు 28 మైళ్ళలో అనకాపల్లి రైల్వేస్టేషను కలదు ఈ గ్రామము బస్సుమార్గమునకు 4 ఫర్లాంగులదూరములో ఉన్నది కొత్తకోటనుండి విశాఖపట్టణమునకు ఒకబస్సు నర్సీపట్నమునుండి అనకాపల్లికి 3 బస్సులు మాడుగునుండి తునికి 2 బస్సులుపోవును 2 మట్టిరోడ్లు ఉన్నవి 60 రెడ్లబండ్లు 13 సైకిళ్ళు ప్రయాణికులు ఉపయోగించుచున్నారు

ఇచ్చట బ్రాంచిపోస్టాఫీసు 2 మిడిల్ ఎలిమెంటరీ స్కూళ్ళు ఉన్నవి ఇది పంచాయతి సమితిలో ఉన్నది ఈ పంచాయతి ఆదాయము ఇండ్లపన్ను వృత్తిపన్ను వాహనములపన్ను సరాయి లైసెన్సు గ్రాంటు మొదలగువానివలన లభించుచున్నది రేడియో లౌడ్ స్పీకరు ఉన్నవి ఆయుర్వేదవైద్యుడు కలడు ఇచ్చట 4 కిరాణాదుకాణములు 2 కాఫీహోటళ్ళు 2 సోడా ఫ్యా సిగరెట్టుదుకాణములు 2 సైకిళ్ళషాపులు కలవు

విద్యార్థులు హైస్కూలు చదువులకు 8 మైళ్ళలోనున్న కొత్తకోటకును కళాశాలచదువులకు అనకాపల్లికిని పోవుదురు కొత్తకోటలోపోలీసుస్టేషను సివిల్ మాజిస్ట్రేటు కోర్టులు సబ్ రిజిస్ట్రారు ఆఫీసు తాలూకా కచేరి ఆఫీసు జనరల్ ఆస్పత్రికి చోడవరమునకును బ్లాకు అభివృద్ధికై దగ్గరకునకు పశువుల ఆసుపత్రికి రావికమతమునకు పోవుదురు కొత్తకోటవారపు సంతలో పశువులు దొరుకును

మా శ్రే

**అర్జున** చూ అతుకాలిని

**అర్జునదేవరాజు** చూ సూరమదేవి

**అర్జునదేవుడు**

ఈయన ప్రశస్తి దక్కను పూర్వచరిత్ర రెండవ సంపుటము పుట 828 యందు గలదు అర్జునదేవరాజు దక్షిణకళింగము నందలి ఒడ్డాది సీమను క్రీ శ 1263 1292 ప్రాంతమున ఒడ్డాది రాజధానిగా చేసుకొని పాలించెను ఇతడు ఈవంశపు రాజులలో ప్రముఖుడు ఇతడు మత్స్య వంశమునకు చెందినవాడు దక్షిణకళింగ ప్రాంతము (దీనినే కళింగాంధ్రము దురు) ప్రస్తుత గంజాము శ్రీకాకుళము విశాఖపట్టణ జిల్లాలు కలసిన ప్రదేశమై యుండెను ఒడ్డాది గ్రామము విశాఖపట్టణ జిల్లాలోని అనకాపల్లికి 18 మైళ్ళదూరమున కలదు ఈ గ్రామమునందలి ఇప్పటి జనాభా 6 023 నేటి నిపూర్వపు ఔన్నత్యమును దెలుపు కోట శిథిలములు ఈ గ్రామమున కననగును ఒడ్డాదిమత్స్య జాతరునాడు సరదునాడు శిలాశాసనపు రాజులు కళింగాంధ్రమున చిన్న రాజ్యముల నేర్పరచుకొని

పాలించిన కళింగము నేలిన గాంగులకు వీరు సామంతులుగ నుండిరి వీరి రాజ్యపాలనా కాలము క్రీ శ 13 14 15 వ శతాబ్దముల వరకు నుకొనసాగి టుల సింహాచలము శ్రీకూర్మము ద్రాక్షారామదేవాలయములందు వీరు వేయించిన దాన శాసనము నుండి తెలియగును

వడ్డాది నేలిన మత్స్యవంశజులు సింహాద్రినాథునకు భక్తులు వీరి శాసనములందు సింహాచలనాథ పాద కమల ద్వంద్వానుషక్తాశయ అని యుండుట వలన వీరలకు నరసింహనాథుని యందుండు ప్రగాఢ భక్తి విశ్వాసములు వెల్లడి యగును మత్స్య వంశజులు వేయించిన కొన్ని శాసనములందు మత్స్య లాంఛనము చెక్కబడియున్నది మత్స్యవంశపు రాజులు శిలావంశపు బొబ్బిలి (ప్రాంతము) రాజులతో సంబంధ బాంధవ్యముల నెరపి ఆ రాజ్యమును పటిష్టము గావించుకొనిరి

వడ్డాది నేలిన మొదటి అర్జునదేవరాజు శక 1191 (క్రీ శ 1269) న వేయించిన దిబ్బిడ తామ్రశాసనము నుండి మత్స్యవంశ క్రమము తెలియనగును (ఎపి ఇ v పు 106) దిబ్బిడి అగ్రహారము విశాఖపట్టణము జిల్లా చోడవరము తాలూకాలో గలదు ఈ గ్రామ ప్రస్తుత జనాభా 1549

శక స 1191 వైశాఖమాసము అక్షయ తృతీయ పుణ్య దివసమున అర్జునదేవరాజు తన తండ్రి జయంతుని పుణ్యమును కోరుచు దిబ్బిడి అగ్రహారమునకు తన తండ్రి పేరట జయంతి నారాయణపురము అని నామకరణము చేసి కొందరు విప్రులకు దానము చేయుట ఈ శాసనము తెలుపుచున్నది

పౌరాణిక సంప్రదాయము ననుసరించి శాసనమునందు మత్స్య వంశావతరణము పౌరాణిక చారిత్రిక యుగములకు ముడి పెట్టి ఈ క్రింది విధముగ చెప్పబడినది

విష్ణు నాభి కమలము నుండి బ్రహ్మ అవతరించెను అతని నుండి అత్రి వారినుండి శశ్యపుడు జనించెను వీరివంశమునకే చెందిన నారంగు అను తపస్వి ఆకాశమున సంచరించుచు మత్స్య వాహినిని చూచి భూమి నెంచి నదియొడ్డున నిశిత వ్రతమాచరింప మొదలిడెను అందులకు ఇంద్రుడు వెరచి అతని తపోభంగము నొనర్చుటకు మంజుఘోషను అప్సరను పంపెను నారంగు ఇందులకు కుతూహలుడై మంజుఘోషను మత్స్యాకృతి ధరించుటకు శపించెను మంజుఘోషకు సత్య మార్తాండుడను బాలుడు కలిగెను కొంత కాలమునకు ఉత్కళ దేశమును ఏలుచున్న జయంతిసేన అను రాజు ఈ విషయమును విని తన కుమార్తెయగు ప్రభావతిని సత్యమార్తాండున కిచ్చి వివాహము చేసి వడ్డవాది రాజ్యమునకు పాలకునిగా చేసెను సత్యమార్తాండుని అనంతరము చాలామంది రాజులు వడ్డాది నేలిరి చారిత్రిక యుగమునకు చెందిన వీరి వంశావళి ఈ క్రింది పట్టిక వలన తెలియనగును

భీముని తమ్ముడు గంగ






అర్జునదేవరాజు ఒడ్డాది విషయమును పాలించు సమయమున కాకతిరుద్రమదేవి (క్రీ శ 1262 1296) విశాలాంధ్రమును పాలన చేయుచుండెను కాకతీయ సామ్రాజ్యము ఉత్తరాంధ్రమున విశాఖ పట్టణము జిల్లాలోని వీరవల్లి తాలూకా వరకును విస్తరించినటుల అర్జునదేవరాజు దిబ్బిడ తామ్రశాసనము వలన తెలియవచ్చును దిబ్బిడ అగ్రహారపు సరిహద్దుల నిర్ణయము చేయు సందర్భమున కాకతిఖండి అనునది యొక సరిహద్దుగ తెలుప బడినది కాకతఖండి ఒక గ్రామ నామమై యుండవచ్చును

కాకతీయుల కళింగ దండయాత్రలు గణపతిదేవ చక్రవర్తి (క్రీ శ 1198-1262) కాలము నుండియే ప్రారంభమైనటుల కొలని గణపతిదేవునిచే రచితమైన శివయోగసారమున వివరింపబడినది అందు ఇందులూరి పెదమల్ల విభుని కుమారుడైన సోమమంత్రి గణపతిదేవునకు ప్రధానమంత్రిగాను దండనాధునిగాను ప్రవర్తించి ఓరుగంటికి తూర్పుభాగమున నుండెడి దేశములనే కాక కళింగ ప్రాంతములను కూడ వశపరచుకొనెనని వర్ణించెను అప్పటి కళింగాధిపతి మొదటి నరసింహదేవుడు (క్రీ శ 1237 1263)

గణపతిదేవచక్రవర్తి అనంతరము ఓరుగంటి రాజ్యమును రుద్రమదేవి పాలించెను అంతవరకును గణపతి చక్రవర్తి కాలమున అడగి మడగి యుండిన కాకతీయ సామంతులు మాండలికులు మొదలగువారు కాకతీయ సామ్రాజ్యముపై తిరుగుబాటును లేవదీసిరి ఇట్టి ఉపద్రవ పరిస్థితుల చూచి కళింగ మండలీకులు ఆ ధర ప్రాంతముల కలవర పరచుచుండినటుల తెలియుచున్నది విశ్వాసపాత్రులు స్వామిభక్తిపరాయణులగు కాకతీయ దండనాధులు అప్రమత్తతతో వ్యవహరించి శత్రువులను దొలగించిరి

రుద్రమదేవి రాజ్యమునకు వచ్చిన మొదటి 16 సం॥ముల గోదావరి లోయ ప్రాంతముకాని వేంగి పరిసరములు కాని కాకతీయుల వశమందు ఉన్నటుల ఆధారములులేవు ఈ ప్రాంతముల పాలించుచున్న తూర్పు చాళుక్య నృపతులు హైహయులు స్వతంత్రులగుటకు కారణము మహారాణి రుద్రమదేవి భర్త వీరభద్రుడు చాళుక్య వంశము వాడగుట వలన కావచ్చును రుద్రమదేవి వారలమీద ఒత్తిడి చేయక ఉపేక్ష వహించియుండినదను ఊహకు తావిచ్చును కాని రుద్రమ రాజ్యపాలన తుది సంవత్సరములకు తీరాంధ్రము పూర్తిగా ఆమె స్వాధీనమందు ఉన్నటుల తరువాత జరిగిన విషయములనుండి తెలిసికొనగలము

కటకము నేలుచున్న మొదటి గజపతివీరభానుదేవుని (క్రీ శ 1264 1278) తండ్రి మొదటి కళింగగజపతి నరసింహదేవుడు ఈతడు క్రీ శ 1257-81 ప్రాంతమున గణపతి చక్రవర్తితో గోదావరి తీరమున జరిగిన యుద్ధమునందు పరాజితుడయ్యెను తన తండ్రికి జరిగిన పరాభవమునకు ప్రతీకారము తీర్చు కొనుటకై వీరభానుదేవుడు సమయమునకు వేచి యుండెను రుద్రమదేవికి కలిగిన విపత్సమయముల అదను చూచి గొప్ప సైన్యమును సమీకరించుకొని శక 1196 (క్రీ శ 1274) ఆతడు వేంగిని ముట్టడించెను గజపతి సైన్యవాహినులు ద్రాక్షారామ పరిసరముల వరకును చొచ్చుకొని పోయినవి ఇదే సందర్భమున తన యేలికయగు భానుదేవుని సహాయార్థము వడ్డాది అర్జునదేవుడు కూడ ఆయనను దండయాత్రయందు అనుగమించెను

రాణి రుద్రమదేవి ఈఉపద్రవమును అరికట్టుటకును వేంగి పరిసరముల నేలుచున్న రాజన్యులను పరిరక్షించుటకు నల్లప్పనాయని కుమారులును సమరయోధులునగు పోతినాయక ప్రోలినాయకుల నాయకత్వమున గొప్ప సేనల నిచ్చి భానుదేవుని ఎదుర్కొనపంపెను

కాకతీయ వీరులకును గజపతులకును గోదావరీ తీరమున జరిగిన సంగ్రామమున భానుదేవుడు పూర్తిగా అపజయము నొందెను. విజయము పొందిన పోతనాయక ప్రోలినాయకులు "గజపతి మత్తమాతంగసింహ", "ఒడ్డియ రాయమానమర్దన" అను బిరుదులతో మహారాణి రుద్రమదేవిచే ప్రశంసింపబడిరి. తరువాత అర్జునదేవరాజుని గురించిన విశేషములేమియు కానరాకున్నవి. దీనికి కారణము సింహాచల పర్యంతము కాకతీయుల రాజ్య విస్తరణవలన ఒడ్డాది మొదలగు చిన్న రాజ్యములు పతనమైయుండును.

దక్షిణహిందూ శాసనములు సంపుటి IV నెం 1043 నందు అర్జునదేవరాజుల దేవి సూరమాంబ శక 1174 (క్రీ శ 1252) [illegible] ఈశాసనము రాజరాజు 36వ రాజ్య సంవత్సరమని చెప్పబడినది. ఇతడు చోళచక్రవర్తి మూడవ రాజరాజు అని భావింపవలెను. క్రీ శ 1252 ఇతని 36వ రాజ్య సంవత్సరమైనచో ఇతడు 1216 నుండియు అధికారము వహించెనని తోచును. తన తల్లిదండ్రులకు ధర్మార్థముగా జ్యేష్ఠమాసము పున్నమినాడు గౌరీవ్రతసందర్భమున ఒడ్డాదిసీమ అవికట్టునాడులోని సంకభీమాపుర మను అగ్రహారముగ భర్త అనుమతిని బడసి భీమేశ్వరదేవరకు ఆచంద్రస్థాయిగను సర్వకర పరిహారముగను సమర్పించినది. శాసనమున తన తండ్రి పెద్దమున్నేటి వ్రేకేటి వీరపనాయకుడనియు ద్రాక్షారామ గ్రామవాసియనియు చెప్పుకొనెను. వీరపనాయకుడు రెడ్డి యని ఈశాసనము సంస్కృత భాగమునందు కలదు. "ఆసీద్వీరపరెడ్డి రతిఖ్యాతః" ఇతని తండ్రి నూకిసారుడు. వీరపరెడ్డి భార్య లక్ష్మాంబ. ఈసందర్భమును బట్టి కళింగులకును తెలుగువారికిని రాష్ట్రాంతర వర్ణాంతర వివాహములుండెడివని ఊహింపనగును. ఈవివాహము అర్జునదేవరాజు తరుణవయసునందు రాజ్యాధిపత్యము వహించకపూర్వమే జరిగియుండునని శాసనకాలమును బట్టి తెలిసికొననగును.

ఈగ్రామము నామె అర్జునదేవునిచేత బడసి (అనగా బహుమానముగా పొందినదై) తిరిగి భీమేశ్వరునకు దానము చేసినది. అర్జునదేవుడు మత్స్యవంశమణి యనియు ఆతని తండ్రి జయంతుడనియు పితామహుడు మంకాదిత్యుడనియు ఈశాసనమునందు కలదు.

అర్జునదేవునకు మరియొకరాణి కలదు. ఆమె పేరు అక్కాంబిక (దహిం IV నెం 1873) ఈమె తండ్రి పేరు కొండికామున్నూటిఅడపగడియపసెట్టి వీరపసెట్టి. ఈతడు సూరమదేవి తండ్రియైన వీరపసెట్టి కంటె భిన్నుడనియే భావింపవలెను. ఏలన ఈతని తండ్రి గడియపసెట్టి. ఇదే కాక వీరు కొండికమున్నూటివారు. సూరమదేవి తండ్రి పెదమున్నేటి వంశమువాడు. అర్జునదేవుని రెండవరాణియైన అక్కాసాని శక 1197 నగా (క్రీ శ 1272) సంవత్సరము జ్యేష్ఠమాసమున అమావాస్య మంగళవారమునాటి సూర్యగ్రహణపుణ్యకాలమున దాక్షారామ భీమేశ్వరదేవునకు మడువాడ గ్రామమును దానము చేసెను. ఇది భీమేశ్వరుని దవనపున్నమనాటి డోలోత్సవము సందర్భమున హవిర్బల్యర్చనములకై సమర్పింపబడెను. ఈగ్రామమును అర్జునదేవుడు తన రాణి నోము చేయునప్పుడు ధారాపూర్వకముగ ఇచ్చినట్లు చెప్పబడినది. శాసనకాలము రాజాధిరాజదేవర 59వ రాజ్యసంవత్సరమని శాసనము నుడువుచున్నది. దీనిని బట్టి కూడ రాజరాజు క్రీ శ 1216 లో రాజ్యాధికారమునకు వచ్చినట్లే కన్పించును. సూరమదేవి శాసనమును బట్టియు అక్కాసాని శాసనమును బట్టియు చూడ అర్జునదేవుని యధికారము దాక్షారామ ప్రాంతమునందు క్రీ శ 1252-75 సంవత్సరముల నడుమ సాగినట్లు సూచితమగుచున్నది. అనగా ఈమధ్య కాలమున కాకతీయుల అధికారము ఇక్కడ లోపించెననియు దానికి కళింగుల అండదండలు గల ఒడ్డాది అర్జునదేవుని దురాక్రమణయే కారణమనియు చెప్పవలెను.

కో. వెం.
ఖ. ల. రం.

## ఆలంపురము

అలంపురము పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెం తాలూకాలో ఉన్నది. దీనికి 4 మైళ్ళదూరములో తాడేపల్లిగూడెంపట్టణము కలదు. ఈ గ్రామమునకు తూర్పున ముద్దాపురము, పడమట ప్రత్తిపాడు, ఉత్తరమున కృష్ణాయపాలెం, దక్షిణమున రాచెర్ల ఉన్నవి. దీని విస్తీర్ణము 4749 ఎకరములు. ఇది చదునైన ప్రదేశమున ఉన్నది.

1961 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఈ గ్రామములో 3134 మంది జనులుండిరి. వీరిలో 25 మంది ఎరుకలు, 20 మంది ఏనాదులు, 513 మంది షెడ్యూలుజాతులవారు, 71 మంది షెడ్యూలుతరగతులవారు. ఇచట ఇండ్లు ఒకచోట గుంపుగాను ఒకచో పంక్తులుపంక్తులుగాను ఉన్నవి. వీటిలో

868 పెంకటిండ్లు 6 కాంక్రీటుకప్పుగలఇండ్లు 5 ఒకఅంతస్తు మేడలు ఉన్నవి తూర్పువైపున ఖాళీప్రదేశము ఉండుటచే గ్రామము ఆవైపుగా అభివృద్ధి చెందుచున్నది జనులు అందరు వరిఅన్నము తిందురు

ఈ గ్రామములో మిడ్‌లెవెల్‌చానల్ లోలెవెల్ చానల్ ఊరచెరువు గొల్లగుంటచెరువు చందాలచెరువు బంగారురాజుచెరువు కాపన్నచెరువు మరి 5 చిన్నచెరువులు కలవు వీటిక్రింద రకరకముల పంటలు నువ్వులు వేరుసెనగ మొదలగుపంటలను పండించుదురు ఈపంటసరకులను గాదెలలో కొట్లలో నిలవచేయుదురు లారీలపై రెడ్లబండ్లపై పడవలపై ఈపంటదినుసులను తాడేపల్లిగూడెము కురవాణా చేయుదురు 1966-67సం॥లో 1 6 ఎకరముల భూమిలో చెరకు తోటలను వేసిరి 1200 పుట్ల బెల్లమును తాడేపల్లిగూడెము నకును 1200 టన్నులచెరకును తణుకువంచదారఫ్యాక్టరీకి ఎగుమతిచేసిరి పంటలక్రింద 1982 ఎకరములభూమి ఉపయోగ పడెను ఇది అంతయు కాలువక్రింద జరిగిన సాగుబడియే ఇచట మూడుట్రాక్టర్లు 200 ఎకరములభూమిని దున్నెను 1491 ఎకరముల ల్లరేగడినేల కలదు

ఈ గ్రామములో 81 గేదెలు 696 ఎద్దులు 856 ఆవులు 2 అబోతులు 22 మేకలు 25 గొర్రెలు 65 పందులు 411 కోళ్ళు ఉన్నవి సాలీనా 10 300 లీటర్లపాలు 6001 కి గ్రా నెయ్యి 150 కి గ్రా చేపలు స్థానికులు ఉపయోగించుకొని 15000 లీటర్ల పాలను 1835 కి గ్రా చేపలను తాడేపల్లిగూడెమునకు పరిసరగ్రామములకు పంపిరి

అలంపురముప్రజలకు వ్యవసాయము ముఖ్యవృత్తి బట్టలను ఉతుకువారు ల్లురుక సాలివారు పదిమంది వడ్రంగులు ఇద్దరు కుమ్మరివారు కలరు వ్యవసాయ దారులకు కూలీలు దొరుకుదురు దినమునకు కూలిరేటు పురుషునకు రు 2- లు స్త్రీకి రు 1 50 లు

ఈ గ్రామములో శివాలయము వీరభద్రాలయము రామాలయము ఉన్నవి ఈ దేవాలయములకు 7 ఎకరముల భూమి మిజుమలె 78 బస్తాలవడ్లు వచ్చును మహాశివరాత్రి వీరభద్రఉత్సవము శ్రీరామనవమి మొదలగు ఉత్సవములు జరుగును

ఈగ్రామమునకు 6 ఫర్లాంగులదూరములో ప్రత్తిపాడు రైల్వేస్టేషను ఉన్నది మిడ్‌లెవెల్‌కాలువద్వారా ధాన్యము ఏలూరునకు తాడేపల్లిగూడెమునకు ఎగుమతిఅగును ఏలూరు నుండి సరకులుదిగుమతిఅగును ఇది బస్సుమార్గముపైన ఉన్నది ప్రతిఅర్ధగంటకు గవర్నమెంటుబస్సులు ఈ గ్రామము మీదుగా పోవును ఇచట 6 కంకరరోడ్లు ఒకమట్టిరోడ్డు ఉన్నవి దీనిని పొరుగుగ్రామములతో తారురోడ్డు కంకర రోడ్డు కలుపుచున్నవి ప్రయాణములకు 3 గుర్రపుబండ్లు 2 రిక్షాలు 4 ఒంటెద్దుబండ్లు 151 రెడ్లబండ్లు 158 సైకిళ్ళు ఈగ్రామమున కలవు

ఈగ్రామములో బ్రాంచిపోస్టాఫీసు సమితి ఎలిమెంటరీ స్కూలు సమితిసోషల్‌వెల్‌ఫేరు ఎలిమెంటరీస్కూలు ఆది ఆంధ్ర ఎలిమెంటరీస్కూలు పరిషత్తుహైస్కూలు ఉన్నవి ఇచటి హైస్కూలుచదువులకు కోడూరు నవాబుపాలెం కృష్ణాయపాలెం ఆరుగొలను కొమ్మూరు ప్రత్తిపాడు మొదలగు గ్రామములనుండి విద్యార్థులు వత్తురు విద్యు చ్ఛక్తిని 69 ఇండ్లు వాడుకొనును ఇది పంచాయతీపాలనకల గ్రామము ఒక పంచాయతీగ్రంథాలయము రేడియో లౌడ్ స్పీకర్లు ఉన్నవి ఒక గ్రామకోర్టు కలదు E 958 నెం గ్రామ సహకారసంఘము రు 53 000 లు గ్రామస్థులకు అప్పుగా ఇచ్చినది ఒక పశువుల ఆసుపత్రి కలదు ఇద్దరు ఇంగ్లీషు వైద్యులు ఒకఆయుర్వేదవైద్యుడు కలరు ఇచట గ్రామసంత వారము కొకమారు జరుగును 8 కిరాణా దుకాణములు 8 కాఫీహోటళ్ళు 6 బీడీ ఎగరెట్టు సోడా దుకాణములు 4 సైకిళ్ళషాపులు ఒకక్షౌరశాల 4 బట్టల షాపులు కలవు

తంతికార్యాలయమునకు పురుళ్ళ సుపత్రికి గ్రామస్థులు తాడేపల్లిగూడెమునకు పోవుదురు కళాశాల చదువులకు ఇచటివిద్యార్థులు తాడేపల్లిగూడెములోని గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీకు పోవుదురు మున్సిఫ్‌కోర్టు పోలీసుస్టేషను సబ్‌రిజిష్ట్రారు ఆఫీసు తాలూకాకచేరీలకు తాడేపల్లిగూడెము నకును బ్లాకు అభివృద్ధికేంద్రమునకు గణపవారమునకును పోవుదురు జనరల్‌ఆసుపత్రి ఏలూరునకు పోవలెను తాడే పల్లిగూడెముసంతలో పశువులు అవరాలు మొదలగునవి దొరకును

మా శ్వే

## అలంపురము

అలంపురము మహబూబునగరు జిల్లా అలంపురము తాలూకాలో ఉన్నది దీనికి 18 మైళ్ళ దూరములో కర్నూలు పట్టణము కలదు ఈ గ్రామ సరిహద్దులు తూర్పున తుంగభద్ర పడమట ఇమామ్‌పూరు ఉత్తరమున బుక్కాపురము దక్షిణమున కాశీపురము దీని విస్తీర్ణము 12 869 ఎకరములు

మూడవ శతాబ్దములో దీనికి హలంపురము అను పేరు ఉండెను తరువాతి శాసనములో ఇది అలంపురము హత్తంపురము అని పేర్కొనబడినది ఒకానొకకాలములో దీనికి హేమలాపురము అను పేరు వాడుకలో ఉండెను ఇచ్చట ఎల్లమ్మ అను గ్రామదేవతను పూజించెడివారు ఎల్లమ్మ అను దిన సంస్కృతములో హేమల అను పేరునకు సమానమనియు అందుచే దీనికి అలంపురము హేమలాపురము అను పేరులు వచ్చెననియు తెలియుచున్నది హత్తపురము అను పేరు ఎట్లువచ్చినదో తెలియదు షాఅలి అను ఒక మహమ్మదీయ యోగి స్మారకార్థము దీనికి షాఅలీపూరు అను పేరు కలిగెనందురు కాలక్రమమున దీనికి అల్పూరు అనియు అలపూరు అనియు వ్యవహారము కలిగెనట ఇచ్చట బ్రహ్మేశ్వరుడు ఉండుటచే బ్రహ్మేశ్వరము అనియు విద్యాపీఠము ఉండుటచే విద్యాపురి అనియు దీనికి నామములు ఏర్పడెనందురు అలంపురము చాల పవిత్రస్థలముగ పరిగణింపబడుటచే దీనిని దక్షిణకాశి అని కూడ అందురు

ఈ గ్రామములో 1931 సం॥లో 2 995 మంది 1941 సం॥లో 4 052 మంది 1951 సం॥లో 5 276 మంది 1961 సం॥లో 7 3 8 మంది జనులు ఉండిరి ఈ సంఖ్యలో షెడ్యూల్డు జాతులవారు షెడ్యూల్డు తరగతులవారు 1118 మంది 1951 61 సం॥లో జనాభాలో పెరుగుదల 2 10౭ ప్రభుత్వ కార్యాలయములు ఇతర సంస్థలు ఏర్పడినందున ఇచట జనాభా పెరిగినది ఇచట ఇండ్లు ఒకచోట గుంపుగాను వాడవాడలుగాను ఏకపంక్తిగాను నిర్మించబడినవి వీటిలో 1863 పలకరాయి ఇండ్లు 12 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 1872 ఒక అంతస్థుగల మేడలు 2 రెండు అంతస్థులుగల భవనములు ఉన్నవి

ఈ గ్రామములో 10 శాతమువారు వరిఅన్నమును 80 శాతమువారు జొన్నఅన్నమును 10 శాతమువారు ఇతర అన్నములను తిందురు వీరు బావినీటిని నదినీటిని త్రాగుదురు మంచినీటి ఎద్దడి కలదు

ఈ గ్రామమునకు తుంగభద్రానది నీటివసతి ఉన్నది దీని ద్వారా పండించెడి మిరప జొన్న కొర్ర కంది పొగాకు మొక్కజొన్నలు దుంపలు పండించుటయేగాక లారీలోను రైళ్ళలోను కర్నూలుకు గద్వాలకు రవాణా చేయుదురు 2 ఎకరముల విస్తీర్ణముగల అరటితోటలు 60 ఎకరముల విస్తీర్ణముగల ద్రాక్షతోటలు కలవు వంగ టొమాటో ఉల్లిగడ్డ ఆకుకూరలు జనులు తమ పెరడులలో పండించుకొందురు 1963 67 లో 1204 ఎకరముల భూమి సాగుబడి అయినది కాలువక్రింద 2071 ఎకరములు సాగుబడి ఆయెను 4 ఆయిల్ ఇంజనులు ఒక ఎలెక్ట్రిక్ మోటారు 80 ఎకరములకు నీటిని సరఫరాయి చేసెను ఎత్తిపోతయమున 17 ఎకరములకు నీరు సమకూరెను రెండు ట్రాక్టరులు 300 ఎకరముల భూమిని దున్నెను ఇచట నల్లరేగడినేల 12903 ఎకరములు ఎర్రమట్టినేల 60 ఎకరములు

ఇచ్చట గేదెలు ఎద్దులు ఆవులు ఆబోతులు మొదలయినవి 1837 మేకలు 178 గొర్రెలు 2500 పందులు 58 గుర్రములు 27 కోళ్ళు 538 ఉన్నవి సాలీనా 2 25000 లీటర్ల పాలు రు 48 000 విలువగల మాంసము 14 000 కి గ్రా చేపలు స్థానికులు ఉపయోగించుకొందురు

ఈ గ్రామస్థులకు వ్యవసాయము కుటీరపరిశ్రమలు ముఖ్యవృత్తులు 48 మంది దుకాణాదారులు 5 గురు క్రయవిక్రయదారులు ఆరుగురు జట్కాలను నడుపువారు కలరు వీరు గాక కలుకు సాలలు అర్గురు వడ్రంగులు ఆరుగురు కమ్మరులు 12 మంది కుమ్మరులు 31 మంది తాపీమేస్త్రీలు ముగ్గురు తెలికలవారు 30 మంది చాకలి మంగలివారలు 450 మంది గొల్లలు వడ్డెరవారు 4 6 మంది నూలునేతవారు 10 మంది నూలుమగ్గములవారు కలరు చేనేతకుటీరపరిశ్రమవారు సాలీనా రు 1 50 000 ల విలువగల వస్త్రములను విజయవాడ గుంటూరు మహబూబునగరము హైదరాబాదు అను తావులకు ఎగుమతిచేసిరి పాషాపలో బండలక్వారి ఉన్నది కాని ఉత్పత్తిలేదు వ్యవసాయదారులకు కూలివారు కొలదిసంఖ్యలో దొరకుదురు దినమునకు కూలిరేటు పురుషునకు రు 3/ స్త్రీకి రు 2 లు

అలంపురములో 12 దేవాలయములు 2 చర్చిలు 2 మసీదులు కలవు 600 ఎకరముల దేవాలయభూములు ఉన్నవి 9 బ్రహ్మేశ్వర దేవాలయములు కోటలోపల ఒకే ఆకారములు

కలవిగా ఉన్నవి బాలబ్రహ్మలింగము తలమీద చిన్నగుంటలు కలవు విష్ణువునకు ఈశ్వరునకును భేదము లేదన్నట్లుగా బాల బ్రహ్మలింగము చుట్టును నారాయణసాలగ్రామములు ఉన్నవి తుంగభద్రాజలముతో బాలబ్రహ్మేశ్వరలింగమునకు యాత్రికులు అభిషేకము చేసినపుడు ఆ లక్షలో ఒకబిందువయినను బయటికి పోర్లక లింగనుచుట్టును ఇంకిపోవునట ప్రధాన దేవాలయ ప్రాంగణములో కామాక్షీదేవ్యాలయము వెంకటేశ్వర దేవాలయము షాఆలిపాదుషాసమాధి కలవు ఈ సమాధికే దర్గాషరీఫ్ ముబారక్ అను పేరు ఉన్నది దుంరిగణపతి దత్తాత్రేయస్వాముల దేవాలయములు ఉన్నవి శ్రీషాఆలి బాదుషా ఉరుసు వైశాఖబహుళ అష్టమినుండి 4 దినములు జరుగును దీనిలో పెక్కుమంది హిందువులుకూడ పాల్గొందురు మాఘ బహుళచతుర్దశిను డి 5 దినములు శ్రీబాలబ్రహ్మేశ్వర ఉత్సవము జరగును వైశాఖశుద్ధ పౌర్ణిమనాడు శ్రీనరసింహస్వామి జయంతికి మాఘశుద్ధసప్తమినాడు శ్రీసూర్య నారాయణస్వామి ఆరాధనకుచెందిన ఉత్సవములు జరుగును అశ్వయుజ శుద్ధపాడ్యమినుండి నవమివరకు 9 దినములు జోగులాంబాదేవి నవరాత్రములు జరుగును

ఈ గ్రామమునకు 6 మైళ్ళలో అలంపూరురోడ్డు రైల్వే స్టేషను ఉన్నది తుంగభద్రానదిపై చిన్నచిన్న పడవలలో ప్రజలు పోవుదురు ఇది బస్సుమార్గముపై ఉన్నది గవర్నమెంటుబస్సులు ప్రతిగంటకు పోవుచుండును ఈగ్రామములో ఆరుకంకరరోడ్లు 12 కచ్చారోడ్లు ఉన్నవి దీనిని పొరుగుగ్రామములతో కంకరరోడ్లు కచ్చారోడ్లు కలుపుచున్నవి ప్రయాణములకు 6 గుఱ్ఱపుబండ్లు 3 మోటారుకార్లు 19 రెండెడ్లబండ్లు 39 సైకిళ్ళు ఉన్నవి

ఇచ్చట బి పోస్టాఫీసు తంతికార్యాలయము టెలిఫోనులు ఎలిమెంటరీస్కూలు జిల్లాపరిషత్తుహైస్కూలు ఉన్నవి కూడవెల్లి యాపల్ దేవిపాడు గుందిమళ్ళ బస్వాపురము బహారాపురము మొదలగు గ్రామములనుండి 220 మంది విద్యార్థులు హైస్కూలుచదువులకు ఈ గ్రామమునకు వత్తురు విద్యుచ్ఛక్తిని 335 ఇండ్లవారును ఎలెక్ట్రిక్ మోటారు యజమానులును సినిమాథియేటరువారును వాడుకొనుచున్నారు ఇది పంచాయతీ పరిపాలనలో ఉన్నది గ్రామ పారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లు ఉన్నవి పంచాయతీ రేడియో సినిమాథియేటరు నాటకశాలనిర్మాణమునకు అనువగు ప్రదేశము సత్రములు విశ్రాంతిగృహములు కలవు ఇచ్చట కోర్టులు పోలీసుస్టేషను సబ్ రిజిష్ట్రారు ఆఫీసు తాలూకా కచేరీ మూడుసహకార సంఘములు ఒకబ్యాంకు కలవు ప్రైవేటుగా అప్పులు ఇచ్చువారును కలగు ప్రభుత్వఆసుపత్రి పశువైద్యశాల ఉన్నవి ఇంగ్లీషువైద్యుడు ఇద్దరు ఆయుర్వేద వైద్యులు ఒకహోమియోపతివైద్యుడు కలరు ఇచ్చటి వారి సంతలో కిరాణాసరకులు బట్టలు కుండలు మొదలయినవి దొరకును 26 కిరాణాదుకాణములు 75 కాఫీహోటళ్ళు 46 కిళ్ళీ సోడా రెట్టుదుకాణములు 7 కూరగాయల అంగళ్ళు 3 సైకిళ్ళషాపులు 7 క్షౌరశాలలు ఒక లాండ్రీ 17 ఇతర షాపులు కూడ ఉన్నవి

ఇచ్చటి విద్యార్థులు కళాశాలచదువులకు కర్నూలుకు హైదరాబాదునకు పోవుదురు నులు వ్యాపారాభివృద్ధికే గ్రామమునకు 6 మైళ్ళలో ఉన్న కర్నూలునకు పోవుదురు

7 వ శతాబ్దములలో చాళుక్యప్రభువులు అల పురము లోని దేవాలయములను నిర్మింపించిరి 9 వ శతాబ్దములోని రాష్ట్రకూటులు 10 2శతాబ్దములలోని కల్యాణిచాళుక్యులు వారిరాణులు ఇతర భాగ్యవంతులు ఈ దేవాలయములకు గొప్పగా దానములు చేసిరి ఆ కాలమున తుంగభద్రానదీ తీరమున సంగమేశ్వరమువరకు 64 స్నానఘట్టములను నిర్మించిరి ఇచ్చట భావనాశినది కృష్ణానదిలో కలియును కాకతీయులు వీరపూజను ప్రారంభించిరి కాకతీయరాజ్య పతనానంతరము ఈ ప్రాంతమున అరాజకము ప్రబలినది ఫకీరులు పహిల్వానులు అధికముగాచేరి ముస్లిం మతమును వ్యాపింపజేసిరి బాలబ్రహ్మేశ్వరస్వామి దేవాలయ ముఖద్వారమున ఒకముస్లిము సాధువు జ్ఞాపకార్థము ఒకసమాధిని నిర్మించి స్థానికముగ ఉరుసులను జరుపుచున్నారు బహమనీసుల్తానులు అల పురములోని ప్రథమ తారకబ్రహ్మదేవాలయమును భూమట్టము చేసిరి తరువాత శ్రీకృష్ణదేవారాయలు ముస్లిముపరిపాలకులు ఆంగ్లేయులు శిథిలదేవాలయములను కాపాడిరి రాయచూరులో జయముపొంది 1521లో ఇచ్చటకు వచ్చి శ్రీకృష్ణదేరాయలు పెక్కు గ్రామములను ఈ దేవాలయముల పోషణనిమిత్తమై దానమొసగి బసవరాజుగారిని గవర్నరుగ నియమించి గ్రామరక్షణకు దేవాలయరక్షణకు బలమైనకోటను నిర్మింపించి వాటిగోడలపై మహాభారత గాథలను చెక్కించెను

మా శ్వే

## అలంపురము (చరిత్ర)

ప్రాచీనకాలమునుండి అలంపురము దక్షిణ హిందూస్థానమునందు సుప్రసిద్ధ పుణ్యక్షేత్రములలో నొకటిగా పరిగణింపబడుచున్నది. ఆంధ్రదేశములో మహబూబునగరముజిల్లాకు ఉత్తరవాహినియగు తుంగభద్రానది ఈక్షేత్రమునకు తూర్పువైపున ప్రవహించి ఉత్తరమున కూడలిసంగమేశ్వరమువద్ద కృష్ణానదిలో కలియుచున్నది. దక్షిణ మధ్యరైల్వే హైదరాబాదు ద్రోణాచల విభాగమునందు అలంపురం రోడ్డు కు ఈక్షేత్రము 10 కిలోమీటర్ల దూరములో ఉన్నది. కర్నూలు వద్ద తుంగభద్ర దాటి యీవలకి వచ్చినచో అనతి దూరములో ఈయూరును చేరుటకు ఒక కాలి బాట గలదు.

మహబూబునగరము జిల్లాలోని కృష్ణా తుంగభద్రానదీ ప్రాంతము ఇప్పుడు అలంపురము తాలూకాకు చెందినది. దీని వైశాల్యము 4 5 చ॥ మైళ్లు. నదినానుకొని ఎడమవైపున అలంపురము నిర్మితమై యున్నది. రమారమి దీని పొడవు ½ మైలు వెడల్పు ¼ మైలు. దీనిని రెండు భాగములుగ విభజింపవచ్చును. నది యొడ్డున ఉన్న భాగము పల్లముగ ఉండును. ఇది పురాతన ఆలయములతోను వసతి గృహములతోను నిండియున్నది. దీనికి చుట్టును వెలుపల నొక కందకముచే ఆవరింపబడిన ఒక శిథిలమై పోయిన కోటగోడ కలదు. దీనికి పశ్చిమముగ ఎత్తుగా నుండు ప్రదేశమునందు ప్రభుత్వపు ఆఫీసులు అంగళ్లు గలవు.

అలంపురము శివారునకుచెందిన ప్రాంతము తయారు కృష్ణా తుంగభద్రానదుల మధ్యనుండుట వలన కృష్ణాతుంగభద్రా డోఆబ్ (అంతర్వేది) అని పిలువబడెడిది. ఇది ఎక్కువగా రాతి ప్రదేశము. పట్టణ పరిసరము లన్నియూ రాతిదైన నల్లమట్టిచే కప్పబడి యుండును. ఇచట రాయిపొరలుపొరలుగ పలకలవలె యుండుట వలన పలకరాయి ఇంటి కప్పులకు గోడలకు ఇప్పటికిని ఉపయోగించుచున్నారు. అటువంటి రాతి ప్రదేశమునందు పెద్ద అడవి పెరుగుటకు వీలు లేదు. ఇందువలన అడవి జంతువులకు ఇది స్థానము కాదని చెప్పవచ్చును. నదికి ఎగువ ప్రాంతము తయ పొదలతో గూడిన బయలు అగుటచే వేగముగ పరుగెత్తు జింకలు కుందేళ్ళు మొదలగు వాటికి ఆశ్రయమగుచున్నది. అలంపురము ఉనికిని బట్టి తుంగభద్రానదిలో వరద వచ్చినను నీటి పొరుదలచే ఒక తడాగము (basin) వలె యుండుట వలన ఒండు మట్టి నిలవక ఉత్తర వైపునకు పోయి కొన్ని మైళ్ల దూరము వరదిబ్బ చేయును. ఈవిధముగా నీటియందుట వలన నీటిపారుదల సౌకర్యము లేక అనాదినుండి ఈప్రదేశము మానవులకు ఉపయోగపడుచున్నట్లు చెప్పవచ్చును. కనుక ఇది మానవ భౌతిక మత విద్యాస్థలము శివాలయములకు స్థానమై నిలయమై పుణ్యక్షేత్రముగ మారెను.

దీనియందు ప్రాచీన అవశేషములలో కొన్ని బౌద్ధ జైన మతములకు చెందినప్పటికీ ఇచట ముఖ్యముగా వైదికమతము పోషింపబడెనని చెప్పవచ్చును. దీనిలో శైవ వైష్ణవ కార్తికేయ సౌర గాణపత్య కౌమార మొదలగు ఉపశాఖలకు సంబంధించిన దేవతా మూర్తులెన్నో ఇచ్చట చూడవచ్చును. ఈ శాఖలలో ముఖ్యముగ పోషింపబడినది శైవము.

ఇది శ్రీశైలమునకు పశ్చిమముగ ఉండుట వలన ఈపుణ్యక్షేత్రము శ్రీశైల పశ్చిమ ద్వారమని పిలువబడుచున్నది. విశ్వేశ్వరుని నిలయమైన కాశీగంగానదీ తీరమున యున్నట్లు గంగోటిలింగములు పెక్కు దేవళములు అనేక స్నాన ఘట్టములలో అతిముఖ్యమైన ఈశ్వరుని స్థానమై యుండుట వలన ఇది దక్షిణకాశీ యని గూడ వ్యవహరింపబడుచున్నది. ఇవిగాక దీనికి పెక్కుపేర్లు గలవు.

రసరత్నాకరము పండితారాధ్యచరిత్ర స్కాందపురాణములలో ఇది బ్రహ్మేశ్వరక్షేత్రము భాస్కరక్షేత్రము పరశురామక్షేత్రము హేమలాపుర మనునామములలో ఉదహరింపబడియున్నది. ఇచటనున్న వస్తు ప్రదర్శనాలయము (museum లో భద్రపరచిన కొన్ని కాకతీయ శాసనములలో దీనికి హతంపురమని వ్రాసి యున్నది. ఈగ్రామమునకు సమీపమునమున్న ఉండవల్లిలో అనాదిగా పూజింపబడుచున్న ఎల్లమ్మ పేరుమీదుగ వచ్చిన ఎల్లమ్మపురమే అలంపురముగా మారియుండవచ్చును. ఈప్రాంతము కుతుబ్‌షాహి అఫ్జాహి కాలములలో అల్మాపురనునామములో వ్యవహరింపబడెను. ఈగ్రామనామములో ఎన్ని మార్పులున్నప్పటికీ ప్రస్తుతము అలంపురమనియే పిలువబడుచున్నది.

ఈక్షేత్రమును గురించి తెలుసుకొనుటకు ఒకస్థలపురాణమున్నది. ఇది పన్నెండు అధ్యాయములు గల గ్రంథము. ప్రతి అధ్యాయమునకు చివర ఇతి శ్రీ స్కాందపురాణే శ్రీశైలఖండే పశ్చిమద్వార మహాత్మ్యే అను వాక్యమును బట్టి

దీని యందు దహరించిన బ్రహ్మేశ్వర మహిమ పాప వినాశ తీర్థ మహిమ మొదలగు వాటిని బట్టి ఇది ఒక మహోత్తర శైవ క్షేత్రమని తెలుచున్నది అలంపురము అష్టాదశ శక్తి పీఠములలో నొకటి దీనియందున్న అధిదేవత జోగులాంబ

చిత్రము - 27



అలంపుర దేవాలయము

ఇచట నున్న తొమ్మిది ముఖ్యమైన ఆలయములకు బాల బ్రహ్మ కుమారబ్రహ్మ వీరబ్రహ్మ అర్కబ్రహ్మ విశ్వ బ్రహ్మ తారకబ్రహ్మ గరుడబ్రహ్మ స్వర్గబ్రహ్మ పద్మబ్రహ్మ అను పేర్లు ఎట్లు వచ్చెనో బ్రహ్మేశ్వర మహిమ అను భాగము నందు ఉదహరింప బడియున్నది దీనిని బట్టి పూర్వ మిచట బ్రహ్మ తపస్సుచేసి ఈ దేవాలయములలో 9 లి గములు ప్రతిష్టి చుటచే వీటికి బ్రహ్మేశ్వరాలయములని పేరువచ్చెను

ఈఆలయములను కట్టినవాడొక రస సిద్ధుడు ఇతడు కాశీ విశ్వేశ్వరుని ఆజ్ఞాను సారము ఇచట తపస్సు చేసి ఒక రసమును సంపాదించి దీని సహాయముతో ఈఆలయములు కట్టినట్లు తెలియుచున్నది ఈరసము అనేకమంది అధిదేవతలచే ప్రసాదింప బడెను ఇది బ్రహ్మ శిరస్సు నుండి జోగులాంబ నోటినుండి గణేశ్వరుని నాభినుండి పార్వతి వామపాదమునుండి భైరవుని కుడి భాగమునుండియూ ఉద్భవించెను ఈరసముయొక్క మహిమను తెలిసికొని అపహరించ వలెనని ఆశతో ఆకాలమున రాజ్య మేలుచున్న "విలసద్రాజు" రససిద్ధుని మీదికి దండెత్తి వచ్చెను అప్పు డతడు బాలబ్రహ్మేశ్వరాలయమున ప్రవేశించి లి గమున దైక్యమైనటు తెలియుచున్నది

ఇవి యునూ గాక ఈస్థలమున దు తండ్రి ఆజ్ఞానుసారము జమదగ్ని కొడుకు పరశురాముడు తన తల్లి శిరమును ఖండి చినట్లు తెలియుచున్నది

సింగిశారాధ్యచరిత్రలో ఈక్షేత్రమును గురించి మరి కొన్ని వివరములు గలవు ఈక్షేత్రమునకు పరిసరములలో అనేక ఓషధులు యున్నట్లుగను ఇవి పరసవేది యను రసాయనమును యారు చేయుటలో ఉపయోగ పడునని వ్రాయయున్నది

అలపుర క్షేత్రచరిత్రను గురించి తెలుసుకొనుటకు పైను దహరించిన పురాణ గ్రంథములేగాక పురాతత్వ పరిశోధన లలో కొంత బయటపడుచున్నది ఈప్రదేశమున దున్న శిలా శాసనములు శిల్పములు దేవాలయములు వాటియందు బిడీకృతమైనకళ వాస్తు విశేషములలో చారిత్రక విషయము లెన్నియో గ్రహింప వచ్చును ఇవి అన్నియు క్రీస్తుకు తరు వాత వచ్చిన చరిత్రకు ఆధారములు

ఇచట తుంగభద్రా నదీ ప్రాంతము నిశితముగా పరీక్షించినచో కొత్త రాతి యుగమునకు చెందిన చిన్నచిన్న రాతి పనిముట్లు (microlithes) ను సేకరింపవచ్చును దీనిని బట్టి క్రీస్తుకు పూర్వము 20 000 సంల నుండియు అలంపురము మానవుని ఆక్రమణలో యుండెనని తేలుచున్నది

క్రీస్తుకు పూర్వము ఈప్రదేశమునకు కొంత ప్రాముఖ్యతలో యుండెనని చెప్పుటకు కొన్ని ఆధారములు కలవు పరిసరములనున్న కర్నూలు జిల్లాలో జొన్నగిరి (ఎఱ్ఱగుడి) లోను రాయచూరు జిల్లాలోని రాజులమండగిరి యందును గొప్ప చదరపు రాతిమీద అశోకుని ధర్మశాసనములు కలవు ఇవి గాక ఈప్రదేశమున ఆంధ్రదేశ పురాతత్వ శాఖ త్రవ్వకములలో శాతవాహన కాలపు నాణెములు పూసలు ఎరుపు నగిషీగల మృణ్మయ పాత్రల పెంకులు దొరకెను ఈఊరునకు 5 6 మైళ్లలో శాతనకోట అను ఊరు కలదు ఈ పేరు శాతవాహన కాలమును డి వచ్చుచున్నట్లు ఊహింపవచ్చును తరువాత విజయపురిని ముఖ్య పట్టణముగ చేసుకొని నేలిన ఇక్ష్వాకు రాజులకు ఒక హలంపురస్వామి సామంతుడుగ ఉన్నట్లు శాసనముగలదు దీనిని బట్టి అల పురము ఇక్ష్వాకు రాజుల కైవసములో నుండెడిదని చెప్పవచ్చును

చిత్రము 8



గణపతి అలంపురము

ఇక్ష్వాకుల ప్రభావము తగ్గిన తరువాత ఈ ప్రదేశము నందు అరాజకము ప్రబలినట్లు తెలియుచున్నది. అభీరులు, చుటు, వాకాటకులు మొదలగువారి ఏలుబడిలో దగరనున్న కొన్ని ప్రాంతము లున్నట్లు చెప్పవచ్చును గాని అలంపురము పరిసరములయందుండు రాజకీయ పరిస్థితి సంగతి చెప్పుట కష్టము. క్రీ శ 6వ శతాబ్దాంతమున దక్షిణాపథమున దాధిక్యతకు చాళుక్యులకు పల్లవులకు ఘోర సంగ్రామములు జరిగెను. వీటిలో చాళుక్యులు విజయమును సాధించిరి. తరువాత వీరు మైసూరు రాష్ట్రమునకు చెందిన బాదామిని ముఖ్యపట్టణము చేసి దక్షిణాపథము నేలిరి. దీనినిబట్టి కృష్ణా తుంగభద్రా ప్రాంతము తయును బాదామి చాళుక్యుల ఏలుబడిలో యుండినట్లు చెప్పవచ్చును. ఇదియునుగాక ఈ చాళుక్యులు కళాపోషకులు. వీరు అహిహొళె (ఐహోలు) పట్టడకల్ బాదామి మొదలగుచోట్ల వాస్తుపద్ధతిని ప్రప్రథమముగా ఎన్నో శివాలయములను నిర్మించిరి. ఈ ఆలయములను బోలునవి పైనుదహరించిన నవబ్రహ్మ దేవాలయములు. ఈ ఆలయముల నిర్మాణమును బట్టి అలంపురము బాదామి లేక పశ్చిమచాళుక్యుల ఏలుబడిలో నున్నట్లు చెప్పవచ్చును. మరియు క్రీ శ 566లో రాజ్యమునకు వచ్చిన బాదామి చాళుక్యరాజగు మొదటి కీర్తివర్మ వేంగి కాలియ అంగ వత్తూర మగధ మాద్రక కేరల గాంగ మూసిక అలుప పాండ్య ద్రమిళ చోళియ వైజయంతి నలకదంబ మొదలగు దేశము లన్నిటిని జయించెను. ఆనాటి నల రాజ్యము ఎక్కువగా ఈనాటి తెలంగాణా ప్రాంతమై యుండుటవలన అలంపురము వారికైవసమైనదని చెప్పుటకు సందేహము లేదు. క్రీ శ 7వ శతాబ్దమున పశ్చిమ చాళుక్యులు అలంపురము ప్రాంతము నేలినట్లు పురాతత్వ పరిశోధనల వలన కొన్ని ముఖ్యమైన ఆధారములు బయటపడెను. మొదటిది విక్రమాదిత్యుని (క్రీ శ 655) అమిదాలపాటి తామ్ర శాసనము. ఈ గ్రామము అలంపురము తాలూకాకు చెందినది. దీనిలో విక్రమాదిత్యుని మహాదండనాయకుడైన సుదర్శనాచార్యుడు శివమండలదీక్ష

యను వ్రతము చేయుచుటచే అందుచూ ఋత్విజులైన పాశుపత శైవబ్రాహ్మణులను ప్రస్తావింపబడిరి

విక్రమాదిత్యుని కొడుకు వినయాదిత్యుడు (క్రీ శ 681) ఇతడు ఈ మ చాళుక్యులలో 5వ రాజు ఇతని పేరు శాసన పూర్వకముగ గర్భబ్రహ్మ దేవాలయపు గోడయందు లిఖింపబడియున్నది బాల బ్రహ్మేశ్వర దేవాలయమునందు మరొక శాసనముకలదు దీనిని బట్టి వినయాదిత్యుని కుమారుడైన విజయాదిత్యునిచే దేవాలయ ముఖమండపము నిర్మింపబడినట్లు తెలుచున్నది (క్రీ శ 702) మరొక శాసనమును బట్టి ఇతనిచే దేవాలయములకు ప్రాకారముగూడ నిర్మింపబడినట్లు తెలుచున్నది

పై నుదహరించిన వాటిని బట్టి నవబ్రహ్మ దేవాలయములు పశ్చిమ చాళుక్యులచే నిర్మింపబడినట్లు తెలుచున్నది ఆ పురము వీరికి ముఖ్య స్థానమై యుండవలెను ముఖ్యముగా ఆలయ నిర్మాణము విక్రమాదిత్య వినయాదిత్య విజయాదిత్యుల కాలములో అనగా క్రీ శ 655 700 మధ్యలో జరిగినట్లు తెలుచున్నది శాసనములు ఆలయ నిర్మాణ విశేషములు ఈ కాలము నాటి ఉత్తర దేవాలయ వాస్తుపరిశీలనకు ఎంతయో ఉపయోగపడుచున్నవి

చిత్రము – 29



నటరాజు అలంపురము

విజయాదిత్యుని తరువాత ఎనిది సంవత్సరముల వరకూ అలంపుర చరిత్ర ఎమియు తెలియుటలేదు తరువాత క్రీ శ 757లో ఈప్రాంతము రాష్ట్రకూటులచే పాలింపబడినట్లు ధారావర్ష ప్రభూతవర్షుల శాసనముల వలన తెలియుచున్నది రాష్ట్రకూటులలో ధృవుడు క్రీ శ 780 791 వరకు రాజ్యము చేసెను ఇతనికి ధారావర్ష అను బిరుదము గలదు ఇతని కుమారుడు ముమ్మడి గోవిందరాజు ఇతడు క్రీ శ 793 815 వరకు రాజ్యము చేసెను ఇతనికి ప్రభూతవర్ష అను బిరుదము గలదు ధారావర్షుని శాసన మొకటి దేవాలయ ప్రాంగణ ప్రదేశమునకు ముందు మహా ద్వారమునందు లిఖింపబడియున్నది ప్రభూతవర్షుని శాసనమొకటి ఇచ్చటి మ్యూజియములో భద్రపరుపబడియున్నది వీరిద్దరును జైన మత పోషణకు తోడ్పడిరిగాని దేవాలయ నిర్మాణములకు దోహదమీయలేదు రాష్ట్రకూటరాజులలో చివరివాడగు కక్కలుని కాలమున క్రీ శ 973 కల్యాణీ చాళుక్యుల వంశీయుడగు రెండవ తైలపుడు ఈరాజ్యముపై దండెత్తి వశపరచుకొనెను దీనితో అలంపురమునందు రాష్ట్రకూటుల ప్రభావము తగ్గిపోయెను

కల్యాణి చాళుక్యులకు బాదామి చాళుక్యులకు కొంత సంబంధ బాంధవ్యములుకలవు వీరిని బంధీకులు కొంతమంది రెండవ తైలపుని ఆధ్వర్యమున అనేక రాజ్యములను సంపా

దించి కల్యాణిని ముఖ్య పట్టణముగ జేసుకొని క్రీ శ 973 1161 వరకు పరిపాలించిరి అల పురము రెండవ జయ సంహుని కాలమునుండి ఆరవ విక్రమాదిత్యుని వరకూ కల్యాణి చాళుక్యుల ఏలుబడిలో యున్నట్లు తెలియుచున్నది

రెండవ జయ సింహునకు జగదేకమల్ల త్రైలోక్యమల్ల మల్లికామోద విక్రమసంహ అను బిరుదులు గలవు ఇతడు క్రీ శ 1015 1043 వరకు రాజ్యము జేసెను అలంపురము నందలి పురావస్తు ప్రదర్శనశాల లో ఒక శిల్పమునందు ఏనుగుతో ఒక యోధుడు పోరాడుచున్నట్లు చిత్రింప బడి యున్నది దీనిమీద వ్రాసిన శాసనములో జయసంహుని పేరు రాజ్యము నేలుచున్న సంవత్సరముతో పాటు ఉదహరింపబడి యున్నది

రెండవ తైలపుని తరువాత దక్షిణ హిందూదేశమునం దాధిపత్యమునకై దక్షిణముననున్న చోళులకు చాళుక్యు లకు యుద్ధములు ప్రారంభ మాయెను ఇవి ముఖ్యముగా రాయచూరు మహబూబునగరము నల్లగొండ మండలము లలో జరుగుట వలన అలంపురం పరిసరములన్నియూ రంగ స్థలముగ మారెను కాని అలంపురమునందు చోళుల ప్రభావమే లేదు కల్యాణి చాళుక్యరాజులు త్రైలోక్యమల్ల త్రిభువన మల్ల భువనైకమల్ల మొదలగువారు సామంతులతో సహా శాలబ్రహ్మేశ్వరుని దర్శించి ఇచట వేయించిన దాన శాసన ములు గలవు అలంపురమునకు సమీపముననున్న పూడూరు అను ప్రసిద్ధ జైన క్షేత్రమునందు హల్లకరసు అను త్రిభువన మల్లని సామంతుడు ఒక పల్లవ జినాలయమును కట్టించెను ఈత్రిభువనమల్లుడే ఆరవ విక్రమాదిత్యుడు ఇతడు చాళుక్య శకమును ప్రారంభించెను ఈ శకము క్రీ శ 1076 నుండి అనగా ఇతడు రాజ్యమునకు వచ్చిన కాలమునుండి ప్రారంభ మాయెను అలంపురమందున్న శాసనములు చాళుక్య విక్రమ సంవత్సరములలో గలవు

కల్యాణి చాళుక్యులు కాలాముఖశైవమును ఎక్కువగ వ్యాపింప జేసిరి ఈమతమునకు చెందిన అనేక మంది పండితులు వీరిచే గౌరవింపబడిరి ఆ కాలమున కాలాముఖులకు అలం పురము (బ్రహ్మేశ్వరక్షేత్రము) ముఖ్య స్థానముగ ఉండెడిది ఈశైవ పండితులకు రాజులు సామంతులు అనేక గ్రామదాన ములు భూదానములును చేసిరి అలంపుర శాసనములలో ధరణేంద్రరాసి వితశెంద్రరాసి బ్రహ్మరాసి సోమేశ్వరరాసి కేశవరాస సావరాసి ఈశానరాస విద్యారాశి మొదలగు శైవాచార్యుల పేర్లు కానవచ్చుచున్నవి

అలపురమునకు నైరుతి దిక్కుగా ఒక జీర్ణించి పోయిన శైవ మఠము గలదు ఇది త్రైలోక్యమల్లుని కాలమున క్రీ శ 1030లో కుక్కుటేశ్వరలోకాభరణ పండితునిచే స్థాపింప బడెను

త్రైలోక్యమల్లుని కాలమున వేయించిన మరొక శాస నము పాపనాశనీ తీర్థమునందు గలదు ఈతీర్థము తుంగభద్రా నది యొడ్డుననే అలంపురమునకు దక్షిణ దిక్కుగా యున్నది దీనియందు 28 దేవాలయములు దగ్గరదగ్గరగా నిర్మింపబడినవి వీటియందు నిర్మాణవిశేషము లెక్కువగా యుండుట వలన దక్షిణదేశ దేవాలయ వాస్తువునకు ఎంతో ముఖ్యము వీటిలోని ప్రధాన దేవాలయమునందొక స్తంభమునందు త్రైలోక్య మల్లుడు త్రిభువనశక్తి పండితునకు దాన మిచ్చినట్లుగ వ్రాసి యున్నది

అలంపురమునందు నరసింహస్వామి దేవాలయము గలదు దీని నిర్మాణమునందనేక మార్పులు గలవు కాని మొదట ఇది పాపనాశినీ తీర్థ ప్రధాన దేవాలయమువలె యుండి యుండవలెను ఒక స్తంభమునందున్న శాసనమును బట్టి ఇది త్రిభువనమల్లుని కాలమున సామంత హల్లకురుసు సమక్షములో మాధవ దేవరకు చంకన్న యనువానిచే భూదానము చేయ బడినట్లుగ వ్రాయబడియున్నది దీనివలన అలంపురమునందు ఇదే మొట్టమొదటి వైష్ణవదేవాలయమని తెలుచున్నది తరువాత కృష్ణదేవరాయల కాలమున క్రీ శ 1521లో అనేక మండపము లతో పునర్నిర్మాణము గావింపబడి దేవాలయమునందు ఇప్పు డున్న యోగనరసింహ విగ్రహము స్థాపింపబడినట్లూహింప వచ్చును ఇరు ప్రక్కలనుండు గదులలో లక్ష్మి అష్టభుజ మాధవీ శక్తి స్థాపింపబడెను మొదట స్థాపింపబడిన మాధవ దేవర విగ్రహమే యోగనరసింహ దేవాలయములో అధిదేవతగా మార్పు చెందియుండవచ్చునని యూహింపవచ్చును

త్రిభువనమల్లునకు (ఆరవవిక్రమాదిత్యుడు) దేవగిరి యాదవులు ఓరుగంటి కాకతీయులు హోయసల భల్లాళులు సామంతులుగఉండెడివారు తరువాత భూలోకమల్లుని కాలమున క్రీ శ 1188లో వీరు స్వతంత్రులైరి క్రీ శ 1156లో కల్యాణి చాళుక్య రాజు మూడవ తైలపుడు అసమర్థుడగుటచే మరి యొక్క స్వతంత్రరాజు కాలచుర్య బిజ్జలుడు వానిని బంధించి

కల్యాణిని ఆక్రమించెను ఈసందర్భమున యాదవులు కాకతీయులు బళ్ళాలులు గూడ స్వతంత్రులైరి కాని అలపుర ప్రాంతము కాలచుర్యుల వశమున నున్నట్లును సూర్యనారాయణ దేవాలయములో నున్న ఒకశాసనమువలన తెలియుచున్నది కాలచుర్యబిజ్జలుడు క్రీ శ 1156 1183 వరకు రాజ్యము చేసెను బిజ్జలుని కొడుకు భుజబలమల్ల ఆహవమల్లుడు తన నాల్గవ రాజ్య వర్షమున క్రీ శ 1187 సూర్యనారాయణ ఆలయస్తంభములమీద శాసనము వేయించెను

భుజబలుని తరువాత అలంపురము ప్రాంతము తయు కాకతీయులు ఆక్రమించుకొనిరి ఇది రుద్రమదేవుని కాలమున క్రీ శ 1199 కి పూర్వము జరిగి యుండవలెను ప్రతాపరుద్రుని కాలమువరకు (క్రీ శ 1323) అల పురము వీరి ఏలుబడిలో నుండెను ప్రతాపరుద్రుని కాలమున కొందరు వర్తకులు వేయించిన దాన శాసనము మ్యూజియమునందు భద్రపరుప బడియున్నది వీని కాలమున దేశ క్షేమముకొరకు గ్రామారిష్టమును పోగొట్టుటకు వీరపుంజ యను పేరుతో శైవ వీరుల ఆత్మార్పణకు జ్ఞాపకముగ అనేక వీరగల్లులు గలవు అల పురమునకు వాయువ్యముగా 5 6 మైళ్ళలో గొంది మళ్ళ యను గ్రామముగలదు దీని యందొక దేవాలయము తుంగభద్ర యొడ్డున నిర్మింపబడియున్నది ఇది వరంగల్ జిల్లాలోని రామప్ప చెరువుయొద్ద ఒక కాకతీయ గుడిని బోలి యుండును

క్రీ శ 1323 తరువాత కాకతీయ రాజ్యమంతయూ ముస్లిముల కైవసమైనది దీనితో అల పుర ప్రాంతమునందు కొంత అరాజక స్థితి ఏర్పడెను ముస్లిం సాధువు షాఅలీపహిల్వాన్ కొందరు అనుయాయులతో కర్నూలునుండి హిందువులకు స్థానమైన అలంపురమునకు మత ప్రబోధమునకువచ్చెను ఆసందర్భములో షా అనుచరులకు హిందువులకుజరిగిన కలహములో అతడు చనిపోయెను వీని మాధి ఇప్పటికిని మహాద్వారము వద్ద చూడవచ్చును దీనికి ప్రతి సవత్సరము ఉరుసు జరుగును కాని మత ప్రాబల్యము ఎక్కువగా యుండుటచే హైందవ ధర్మమునకు ప్రాచీన దేవాలయములకు ముప్పు ఎక్కువగా నుండెను ఈసమయమున ముసునూరి ప్రోలయ నాయకత్వమున ఒక జాతీయ ఉద్యమము సాగెను అల పుర ప్రాంతము ఆరవీటి సోమదేవరాజుచే స్వాధీనము చేసుకొనబడి శాంతి ఏర్పడెను

క్రీ శ 1521 లో విజయనగర రాజులకు బహమనీ ముస్లిం రాజులకు కృష్ణా తుంగభద్రా మధ్య ప్రాంతమునందు ప్రబలమైన పోరాటములు సాగినవి వీటియందు విజయనగరాధీశ్వరుడు కృష్ణదేవరాయలు విజయము నొందెను తరువాత కృష్ణదేవరాయలు అల పురమునకు వచ్చి బ్రహ్మేశ్వర నారసింహాలయములను దర్శించి పునరుద్ధరించి దానములు జేసినట్లు శాసనములను వేయించెను కొన్ని సంవత్సరములు మహామండలేశ్వర బసవరాజు విజయనగర ప్రతినిధిగా అలంపురమును పరిపాలించెను

క్రీ శ 1565 లో తిరిగి ముస్లిములకు విజయనగర రాజులకు కృష్ణా తుంగభద్రా ప్రాంతమున రక్కసతంగడి యను చోట ఘోర యుద్ధము జరిగెను దీనిలో అలంపురము ప్రాంతమంతయు ముస్లిముల వశమైనది క్రీ శ 1672 1687 వరకు బిజ్జల తిమ్మభూపాలుడు ఆనవాబుల ప్రతినిధిగ అల పురము పరిపాలించెను ఇతడు గొప్ప విద్వాంసుడు సంస్కృతమున మురారి వ్రాసిన అనర్ఘరాఘవమును ఆంధ్రప్రబంధముగ అనువదించెను

క్రీ శ 1687 లో ఔరంగజేబు గోల్కొండను వశపరచుకొనెను బిజ్జల వంశీయుల అధికారము సన్నగిల్లెను తరువాత అల పుర ప్రాంతము అసఫ్ జాహీల పరిపాలన క్రిందకి వచ్చెను వీరు 19 వ శతాబ్దారంభమున అలంపురం ఒకనవాబునకు జాగీరుగ నిచ్చిరి ఇతడు ప్రస్తుతము తుంగభద్రానది యొడ్డునయున్న P W D బంగళాగా వాడుచున్న భవనమును ఒక మసీదును కట్టించెను ఇతనితో ఈజాగీరు అంతరించి నిజాం ప్రభుత్వ వశమై చివరకు ఆంధ్రప్రదేశ్ లోని మహబూబ్ నగరం జిల్లాలో తాలూకా ముఖ్యపట్టణముగ అవతరించెను

అలంపురము చరిత్రలో మూడు ముఖ్య ఘట్టములు గలవు 1 క్రీ శ 6వ శతాబ్దాంతమునందు ఇచ్చట నున్న బాదామి చాళుక్య దేవాలయములు ప్రప్రథమముగా నిర్మింపబడెను ఆనాటి వాస్తువునకు ఆదర్శముగనున్న శివాలయములు

2 తరువాత పదవ శతాబ్దాంతమున కల్యాణి చాళుక్యులు పాపనాశిని తీర్థమున యున్నగుంపులు గుడులుగ నుండు ఆలయములను మఠములను పీఠములను స్థాపించిరి వీరి కాలమునందే జగద్గురు శంకరులు జోగులాంబాలయ స్థాపించియుండవచ్చును

3 కొన్ని ఆలయములు కృష్ణరాయలకాలమున పునరుద్ధరింపబడెను గ్రామమునకు చుట్టును కోటగోడను నిర్మించెను

తు వెం గో శా

## అలంపురము తాలూకా

అల పురము తాలూకా 11 7 2 చ ౘ మీటర్ల విస్తీర్ణముకలది ఇది ఆంధ్రప్రదేశమున దలి మహబూబునగరు జిల్లాలో నైరృతిభాగమున ఉత్తరఅక్షాంశము 15 47 16 1° మ డి తూర్పురేఖాంశము 77 38 - 8 17 వరకు వ్యాపించి ఉన్నది ఈ తాలూకాకు కృష్ణానదియు తుంగభద్రానదియు ఉత్తరమునను తూర్పునను దక్షిణమునను సరిహద్దులుగా ఉన్నవి ఈ తాలూకాకు పశ్చిమమున గద్వాల తాలూకా కలదు

ఈ అల పురము తాలూకాలో నిమ్నోన్నతములైన మైదానములు అడ్డముగా వ్యాపించిఉన్నవి సాధారణముగా నేల పశ్చిమమునుండి తూర్పునకు ఏటవాలుగా ఉండును ఇచటి గరిష్ఠమైన ఎత్తు 300 మీటర్లనుండి 380 మీటర్లవరకు మారుచుండును ఈ తాలూకాలో ప్రముఖములైన కొండల పంక్తులు లేవు

ఈ తాలూకాఏరియాలో విశేషభాగము దక్షిణమున తుంగభద్రానదికిని ఉత్తరమున కృష్ణానదికిని పరివాహప్రదేశముగా ఏర్పడుచున్నది వానకాలమున చెరువులనుండి ఏర్పడిన ప్రవాహములు ఇచటి మొత్తముఏర్యాలో పారుచుండును

సగటువేసవి ఉష్ణోగ్రత 37 8 సెం కును 42 8 సెం కును (100 -109 ఫా) మధ్యగా ఉండును గరిష్ఠఉష్ణోగ్రత మేనెలలో కనిపించును డిసెంబరు జనవరినెలలు చలిగలనెలలు ఆ నెలలలో సగటు ఉష్ణోగ్రత 10 సె కును 15 సె (50 60 ఫా)కును మధ్యగాఉండును అలంపురముపట్టణము నందు సాలీనా సగటువర్షపాతము 66 సెంటిమీటర్లు (24 అం) ఈ తాలూకా మొత్తముమీద సాలీనా సగటువర్షపాతము 61-63 5 సెం మీటర్ల (24 25 అం) మధ్యగా ఉండును

వ్యవసాయమునిమిత్తము సహజవృక్షసంపద ఎక్కువభాగము నిర్మూలి చబడినది అయితే అచ్చటచ్చట ఎత్తుగా పెరుగని ముళ్లపొదలు కంటికి గోచరించుచు డును

1966 67 సం॥ లో జరగిన 25041 ఎకరముల నికరము నీటిపారుదల మింజుమలె ఇచటకాలువలమూలమున చేకూరిన నీటిపారుదలనూటికి 62 5 శాతముగఉన్నది ఇదికాకబావులనీటిపారుదల 25 1 శాతము చెరువులక్రింద నీటిపారుదల 7 5 శాతము బుగ్గలయొక్కయు వాగులయొక్కయు నీటిపారుదల 3 6 శాతము కలదు అనవవత్సరమందే అమాంబాపతుల నీటిపారుదల ఏరియా 31393 ఎకరములు ఈ తాలూకా దక్షిణ ఏరియాయదు కాలు నీటిపారుదలలో ఘటిల్లిన శీఘ్రప్రగతికి ...ణము తుంగభద్రానది అడ్డముగాకట్టబడిన రాజోలుబండ డైవర్షన్‌స్కీముకుచెదిన ఆనకట్ట పొడిగింపబడుటయే సేద్యముచేయబడిన 219 ?77 ఎకరముల మిజుమలె 63 23 శాతము ఎర్యాఆహార ధాన్యములను ఎ డించుటకును శే... చి...ర్యా తదితరవస్తువులను ప డించుటకును ఉపయోగి పబడెను పైరులలో ముఖ్యమైనవి జొన్న సజ్జ వరి వ్ప్రుధాన్యములు వేరుశనగ ఆముదాలు పొగాకు ఇచట సాగన ఎమై నల్లరేగడిభూములు కలవు వీటిలో జొన్న మిర్చి పొగాకు మున్నగుఆదాయములభి చుపైరులు వేయబడును

ఈ తాలూకాయందు నిర్మాణమునకు పనికివచ్చు సాధనవస్తువులు అనేకచావుల దు లభి చును భారీఎత్తు పరిశ్రమలు లేవు చిన్నయెత్తు పరిశ్రమలలో వడ్రంగము కమ్మరము కుమ్మరిపని నేతమగ్గములు పేర్కొనదగినవి రైల్వేలు రహదారులు ఈతాలూకాలో మిక్కిలి ఉపయోగపడుచున్నవి సికింద్రాబాదు బెంగుళూరురైల్వేలైను ఈ తాలూకాగుండా పోవుచున్నది హైదరాబాదు-బెంగుళూరుజాతీయరహదారి రాయచూరు-అలంపూరురోడు ఈ తాలూకాగుండా పోవుచున్నవి

ఈ తాలూకాలో 96 999 మ దిజనములుకలరు వీరు 94 గ్రామములలోను ఒకపట్టణములోను విభక్తులై ఉన్నారు ఆరుగ్రామములు జనశూన్యములై ఉన్నవి

జోగులాంబగుడినిబట్టి అలంపురముపట్టణమునకు పేరు ఏర్పడినదందురు పూర్వము జోగులాంబకు ఎల్లమ్మ అను పెరు కెనట ఎల్లమ్మ ఉన్నపురము ఎల్లమ్మపురమై అది క్రమముగా అలంపురముగా మారినట్లు తెలియవచ్చుచున్నది ఈస్థలమునకు దక్షిణకాశిఅను ప్రసిద్ధి కలదు ఇచట ప్రాచీనకాలమునకు చెందిన శిథిలశిల్పావశేషములు విరివిగా కనిపించుచున్నవి ఇక్కడ కనిపించు ఆలయములలో బ్రహ్మేశ్వరాలయము నవబ్రహ్మాలయము ముఖ్యమైనవి

పూర్వము నైజాముప్రభువురాజ్యకాలమున రాయచూరుజిల్లాలో ఈ తాలూకా ఒకభాగమై ఉండెను 1956 వ స లో ఆంధ్రప్రదేశనిర్మాణము జరిగినపిదప ఇది మహబూబునగరు జిల్లాలో చేర్చబడెను

కే ప రె



మహబూబునగరు జిల్లా
అలంపురము తాలూకా
మైళ్లు
గద్వాల తాలూకా
వనపర్తి తాలూకా
కొల్లాపురు తాలూకా
కర్నూలు జిల్లా
ఇటిక్యాల్
రాజోలు
అలంపురము
రాయచూరు
సూచిక
తాలూకా సరిహద్దు
ఫిర్కా సరిహద్దు
తాలూకా ముఖ్యపట్టణము
ఫిర్కా ముఖ్యపట్టణము
మీటరుగేజ్ రైలుమార్గము
జాతీయ రోడుమార్గము
రాష్ట్ర రోడుమార్గము
జిల్లా రోడ్డుమార్గము
అడవి
కొండలు
నది
చెరువు
దేవాలయము

## అలంపూరు సీమ

అలంపూరు మిక్కిలి పురాతనమైనది

పురాణ ప్రసిద్ధమై దక్షిణాపథమునకు తలమానికమై ఉన్న శ్రీశైల క్షేత్రము యొక్క చతుర్ద్వారములలో అలంపుర క్షేత్రము పశ్చిమ మహాద్వారముగా ఉన్నది ఇచట చతుర్ముఖుడు తపమాచరించి శివలింగమును ప్రతిష్ఠించెను అందువలన ఈ లింగము బ్రహ్మేశ్వరలింగమయ్యెనని స్కాంద పురాణము చెప్పుచున్నది మరెచటను కానరాని బ్రహ్మ విగ్రహములు అలంపురసీమలో విశేషముగ కానవచ్చుచున్నవి ఈ సీమకు ఉత్తర దక్షిణ పూర్వదిశలలో కృష్ణా తుంగభద్రా నదులు ప్రవహించుచున్నవి

ఇతిహాస యుగమునకు పూర్వము ఈసీమలోని అనేక గ్రామములలో ప్రాచీనావశేషములు పూర్వశిలా యుగపు రాతిగొడ్డళ్లు సూక్ష్మ శిలాయుగ పరికరములు నవీన శిలా యుగ సమాధులు కానవచ్చుచున్నవి అలంపూరిలో త్రవ్వకాలు జరిగినపుడు అందుండి దక్షిణావర్త శంఖముతో చేయబడిన అందమైన గాజులు నలుపు ఎరుపు రంగు పూతలు చేయబడిన మట్టిపాత్రలు శాతవాహనుల నాటి నాణెములు సుమారు 21 అంగుళములు గల పెద్ద ఇటుకలు బయల్పడినవి కొన్ని గ్రామములదగ్గర ప్రాగైతిహాసిక యుగసమాధులు విశేషముగ ఉన్నవి వీనిని జనులు రాకాసిగుళ్ళు అని అరెలమోరీలు అని వ్యవహరించుచున్నారు ఈసీమలోని జిల్లెళ్ళపాడు గొంది మళ్ళ ఉప్పలపాడు బాగటూరు దన్నె బాగాపురం గ్రామాల దగ్గర ఈ సమాధులు వివిధాకృతులతో కానవచ్చు చున్నవి వీనిని శాస్త్రీయముగ త్రవ్వించి పరిశోధనలు జరిపించినచో వేలయేండ్ల నాటి భారతీయ సంస్కృతి విశేషములు బయలు పడగలవు

చారిత్రక యుగము - అలంపూరునకు 70 మైళ్ళ దూరములో కర్నూలు జిల్లాకు చెందిన పత్తికొండ సమీప మండలి ఎర్రగుడి రాజులమదగిరి జొన్నగిరి గ్రామాల దగ్గరను 60 మైళ్ళ దూరములో రాయచూరు జిల్లాకు చెందిన మస్కి దగ్గరను అశోక లిపులు బయల్పడిన దున క్రీ శ 3వ శతాబ్దము నాటికే ఈప్రాంతము మౌర్య సామ్రాజ్యమున చేరి ఉండెనని చెప్పవచ్చును

శాతవాహన యుగము - అలంపురునకు 6 మైళ్ళ దూరమున తుంగభద్రా తీరమందున్న శాతన కోటలో ప్రాచీనావశేషములు చాల కానవచ్చుచున్నవి ఆగ్రామము శాతవాహనుల మూలస్థానమై యుండెను అది శాస్త్రీయముగా త్రవ్వించినచో అపూర్వ విశేషములు బయటపడగలవు ఈ సీమలో నలుచోట్ల శాతవాహనుల నాణెములు లభించుచున్నవి మౌర్య శాతవాహనుల కాలమున నీ ప్రాంతమందు జైన బౌద్ధములు వ్యాపించియుండును ఈతాలూకాలోని తక్కశిల ఉండవెల్లి గ్రామములు ఉత్తర భారతములోని సుప్రసిద్ధ ప్రాచీన విద్యాపీఠమగు తక్షశిల కృష్ణా జిల్లాలోని బౌద్ధక్షేత్రమగు ఉండవల్లి పేర్ల వికృత రూపములే ఈగ్రామములలో ప్రాచీనావశేషము లున్నవి ఏ కారణము వలననో ఈ సీమలో జైన బౌద్ధములు నిలువలేదు ఆ మతావశేషము లొక్కటియు లేకుండ పోయినవి ఈసీమ నానుకొని ఉన్న పూడూరు నేటి గద్వాల తాలూకా గ్రామము జైనుల ముఖ్య స్థానమై మూల ద్రవిడ సంఘారామముగా అచట శాసనములలో పేర్కొన బడినది (తెలంగాణా శాసనములు భాగము (1) పూడూరు శాసనము) అచట జైన తీర్థంకర శిలావిగ్రహములు నేటికిని కానవచ్చును

శాతవాహనుల తరువాత ఈప్రాంతమున ఇక్ష్వాకుల ఏలుబడి సాగినది ఆవంశ మూలపురుషుడగు ఐహుబల శాంత మూలుని కాలమున మహాతలవర- విశాఖ స్కందనాగుడు ఈప్రాంతముల నేలియుండెను అలంపూరునకు 7 మైళ్ళ దూరమున నేడు కర్నూలుగా వ్యవహరింపబడుచున్న కందనోలు మహబూబ్‌నగర మండలములోని నాగరకర్నూలు అనునవి అతని పేర కట్టబడియుండవచ్చును పలనాటిలోని గురిజాల దగ్గర దొరకిన ఒక ప్రాకృత శాసనమందు రుద్రపురుషదత్తుని కాలమున నడుకరి అనువాడు హాలంపుర స్వామి భూదానము చేసిన విషయము చెప్పబడినది (ఎ ఎ ఇ 26 పుటలు 123 5)

చాళుక్య రాష్ట్రకూట యుగము ఇక్ష్వాకుల తరువాత ఈప్రాంతమును కదంబులు పాలించిరి వారి మూలస్థానము శ్రీశైల ప్రాంతములో ఉండినది తరువాత వారిని పారద్రోలి బాదామి చాళుక్యులు విజృంభించిరి వారిలో రెండవ పులకేశి ఒక మహాసామ్రాజ్యమును స్థాపించెను ఈసీమపై వారి ఏలుబడి సాగినది ఆవంశీయుల శాసనములు ఇచట గ్రామములలో ఉన్నవి "చిన్న అమిదేలపాడు"లో మొదటి విక్రమా

దేవరాజీయ) అప్పుడు ఆ జిల్లాలో నున్నప్పుడు గ్రంథర్చనా దిమా ము అలంపుర క్షేత్రములోని ఆలయములు పూర్తిగా ధ్వంసము గాకుండ రక్షించినది.

విజయనగర యుగము 14వ శతాబ్దమున స్థాపించబడిన బహమనీ రాజ్యము విజయనగర సామ్రాజ్యములు పరస్పర ప్రాబల్యము కై పోరాడ దొడగినవి. కృష్ణాతుంగభద్రా నదుల మధ్య భూమి నిరంతర సంగ్రామముచే నిండిపోయినది. 15వ శతాబ్దమున ప్రౌఢదేవరాయల సైన్యములు పానుగంటి గిరి దుర్గము నాక్రమించినప్పుడు ఈ సీమలో కొంతవరకు బహమనీల దండయాత్రలు అరికట్టబడెను. 1521 సంవత్సరమున శ్రీకృష్ణదేవరాయలు రాయచూరును సాధించి అలంపూరు నకు వచ్చెను. అప్పుడీ సీమకు గౌరదండనాయకుని బసవయ్యను అమరనాయకునిగ నియమించెను. అతడు 1522లో అలంపూరు బ్రహ్మేశ్వరస్వామికి అన్నసత్రమునకు చెన్నిపాడు ర్యాలంపాడు గ్రామములను శ్రీనరసింహస్వామికి భైరాపురమును సమర్పించి శాసనములు చేయించెను. అతని కాలముననే అలంపూరు కోట కట్టబడియుండును. 1527లో ఈ సీమకు అమరనాయకుడుగ నుండిన భండారము పెద్దినాయడు అలంపూరు బ్రహ్మేశ్వరునకు చెన్నపాడు గ్రామమును చెన్నపాడులోని కేశవస్వామికి గోకులపాడును సమర్పించి శాసనములు చేయించెను. ఇతని అనంతరము ఈ సీమ నేలిన అచ్యుతరాయల కాలమున చంద్రశేఖరయ్య కుమారుడు చెన్నపాడు కేశవస్వామికి పూసలపాడును సమర్పించెను. మహామండలేశ్వర బసవరాజు శాసనము లింగనవాయిలో ఉన్నది.

అర్వాచీన యుగము 1565లో రక్కసతంగడి యుద్ధము జరుగువరకు ఈసీమ విజయనగరరాజుల యేలుబడిలో నుండెను. ఆతరువాత కుతుబ్‌షాహీల అధీనమయ్యెను. వారి సామంతులైన కిజ్జుల వంశీయులు ఈ సీమ నేలిరి. చిట్టచివరి కుతుబ్‌షా అబుల్ హసన్ తానాషా కాలమున (1672-86) కిజ్జుల తిమ్మభూపాలుడు అలంపుర సీమకు పాలకుడుగా నుండెను. (అనర్ఘరాఘవకావ్యము పీఠిక 78 పద్యము) ఆయనకు నాడగౌడు దేశాయి నాడకరణము మున్నగు బిరుదములుండినవి. ఇతడు కర్నూలు అలంపూరు సమితులను పాలించెను. ఈ కిజ్జుల వంశములోని చినతిమ్మనృపాలుడు సంస్కృతాంధ్ర భాషలలో విద్వాంసుడు. కవి. సంస్కృతమున మురారి కవి వ్రాసిన అనర్ఘ రాఘవ నాటకమును ఇతడు ఆంధ్ర ప్రబంధముగ అనువ దించెను. ఆయన కవిత్వము చాల ప్రౌఢమైనది. కిజ్జులవారు మోటాడి రెడ్డి శాఖకు చెందినవారు. వీరు మొదలు శైవులు. తరువాత వైష్ణవమును స్వీకరించిరి. ఔరంగజేబు దండ యాత్రలతో కిజ్జులవారి అధికారము అంతరించెను.

ఔరంగజేబు కాలమున 1686లో దక్కను ముస్లిం రాజ్యములు అనియు మొగల్ ప్రవాహమున కలిసిపోయెను. అతని దుష్పరిపాలనలో దక్షిణాపథము అతలాకుతలమై పోయెను. అలంగీరు మరణానంతరము దక్కన్ సుబేదారుడైన నిజాముల్ ముల్క్ ఆసఫ్ 1724లో స్వతంత్రుడయ్యెను. ఈతని వంశీయుల కాలములో కిజ్జులవారు వల్లెపాడు గ్రామమునకు జాగీరుదారులై ప్రస్తుతము భూస్వాములుగ ఉన్నారు. 1823లో అలంపూరు సాలార్‌జంగ్ మీర్ ఆలం ముల్క్ ను నవాబుకు జాగీరుగా ఇచ్చెను. 1851లో ఈ జాగీరు నిజాం సర్కారులో కలిసిపోయెను.

1854లో నైజాం నవాబు రాయచూరుజిల్లాను బ్రిటిష్ వారి సైనిక వ్యయముల కై ఇచ్చియుండెను. 1857లో జరిగిన మహా విప్లవమునందు నవాబు ఇంగ్లీషువారికి సాయము చేసినందున మరల రాయచూరు జిల్లాను ఆంగ్లేయులు నవాబుకు ఇచ్చిరి. ఆ మధ్యమున 10 సంవత్సరముల కాలము అలంపూరుసీమ ఇంగ్లీషువారి పాలనలో ఉండినది.

భారతదేశము స్వతంత్రమైన తరువాత 1949లో హైదరాబాదు రాజ్యము స్వాతంత్ర్యము నొందెను. జాగీరులు రద్దయిన తరువాత గద్వాల తాలూకాలోని 52 గ్రామములు ఈ తాలూకాలో చేర్చబడినవి. ఇప్పుడు 100 గ్రామములు ఈ తాలూకాలో కలవు. 1956లో రాష్ట్ర విభజన జరిగి కన్నడ ప్రాంత మగు రాయచూరు జిల్లా మైసూరు రాష్ట్రమున కలిసినపుడు ఆ జిల్లాలో నుండిన అలంపూరు గద్వాల తాలూకాలు మహబూబునగర జిల్లాలో చేర్చబడినవి. పూర్వము గద్వాల సంస్థానములో నుండిన రాజోలు బోరవెల్లి సంస్థానాలు ప్రస్తుతము అలంపూరు సీమలో చేర్చబడినవి.

గ. రా. శ.

అలకోట చూ. అయ్యవారిపురము

## అల్ ఖతీబు

గోలకొండ సామ్రాజ్యము నేలిన కుతుబుషాహిసుల్తానులు అరబీ పారశీక భాషాసాహిత్య పోషణమునందు విశేషమైన

అనక్తిని చూపెను. అబ్దుల్లా పరిపాలన కాలమున (క్రీ శ 1626-72) అరేబియా ప్రాంతముల నుండి అరబీ భాషా విపండితులు విద్వాంసులెందరో గోలకొండకు వచ్చి రాజు వలన సన్మానములొందుచుండిరి. అబ్దుల్లా కుతుబుషా యొక్క పెద్ద అల్లుడు అమీర్ సయ్యద్ అహమద్ ఇబ్నెమాసూమ్ (క్రీ శ 1617-74) అరేబియా దేశము నుండి వచ్చినవాడు. మక్కా, షిరాజు, యమన్ మున్నగు దేశములలోని అరబీ విద్వాంసులతో అతనికి పరిచయమేర్పడి యుండెను. అతడు స్వయముగా అరబీభాషలో కవి. వివిధశాస్త్రములందారితేరిన విద్వాంసుడు. సయ్యద్ అహమ్మద్ నివాసభవనమాహాడు అరబీ విపండితులకు కూడలిగ నుండెడిది. అతడు కవులనెందరినో పోషించియుండెను. అతని పోషణమునొందిన అరబీ కవులలో అల్ ఖతీబు ఒకడు.

ఈతని పూర్తి పేరు అల్ ఖతీబు అబ్దుల్లా అల్-జబర్ అల్ హానూఫీ. ఈకవి భారతదేశమున కెపుడు వచ్చెనో తెలియదు. కాని ఇతడు సయ్యద్ అహమ్మదు ఆహ్వానమును పురస్కరించుకొని గోలకొండకు వచ్చి కొన్ని నాళ్లుండి అమీర్ సయ్యద్ అహమదు వలన గౌరవ సన్మానములొంది స్వదేశమునకు వెళ్లిపోయినట్లు తెలియుచున్నది. అల్ ఖతీబు కవికి సయ్యద్ అహమ్మదుపై అపారమైన భక్తిగౌరవములుండెను. వీరిరువురును చిరకాలము వరకు ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా తమ స్నేహమును ప్రగాఢమొనర్చుకొని యుండిరి. ఈ ఉత్తర ప్రత్యుత్తరము లన్నియు అరబీ కవితారూపమున నున్నవి.

అల్ ఖతీబు గోలకొండకు వచ్చి సయ్యద్ అహమదును సందర్శించి మదీనాకు వెడలి అచ్చటినుండి పద్యరూపమున రెండు మూడు లేఖలు వ్రాసెను. మదీనాయందున్న అల్ ఖతీబు కవి సయ్యద్ అహమ్మదు పై తనకు గల భక్తిగౌరవములనిందు వ్యక్తీకరించెను. ఒక లేఖ ఆరంభమునందు అల్ ఖతీబు ఇట్లు వ్రాసెను.

“సుదూర ప్రాంతమున నున్న మదీనా భూతలమును స్పృశించి చుంబించి ఈకవి సయ్యద్ అహ్మద్‌ను గౌరవించుచున్నాడు. సమయము లభించినచో సమీపమునకు వచ్చి అతనికి పాదాభివందన మొనర్చువాడు. మరియొక లేఖయందు అల్ ఖతీబు కవి తన పోషకులకు వాసస్థలమైన హిందూ దేశమును సముచితముగ ప్రశంసించెను. హిందూదేశము నుండి మందమందముగా సుగంధమారుతములు వీచినపుడు అవి లవంగ వృక్షముల సౌరభముల గుభాళించుచున్నట్లు భావించుచున్నాను.” సయ్యద్ అహమద్ వ్రాసిన లేఖకు అల్ ఖతీబు కవి సమాధానపూర్వకముగ నిట్లు రచించెను.

“మీ లేఖ సుదూరము నుండి వీచు వాయువు సౌరభము వలె హృదయాహ్లాదకారిగ నున్నది.” ఇట్టి లేఖలన్నియు అల్ ఖతీబు కవి సుకుమార భావనాశక్తి పూరితమైన కవితాశక్తిని చాటుచున్నవి. ఎదలో దాగిన స్నేహభావమును అల్ ఖతీబు మృదుమధుర రమణీయ కవితారూపమున వ్యక్తీకరించెను. ఆతడరబీలో గొప్పకవి అగియు స్నేహశీలియునయి లేఖలందలి పద్యములు రూపొందుచున్నవి. హిందూదేశమునందు అందును గోలకొండ సీమలో అతడు కొన్నినాళ్లు మాత్రమే నివసించినను మధుర స్మృతులను అరబీ పద్యముల ద్వారా చిరకాలముండునట్లుగ మనకందించినాడు.

డా కొ గో కృ

## అలగ్ ఖాన్

క్రీ శ 1500 ప్రాంతమున తెలంగాణము నందలి వివిధ మండలములలో జహాగీరు ఖాను ఖవాముల్ ముల్కు ముఖ్య ప్రబీఖాన్ అలగ్ ఖాను అనువారు జాగీరుదారులుగ నుండిరి. సుల్తాన్ మహమూద్ షా బహమనీ ఆ సంవత్సరమున ఈ జాగీరుదారులకంటె అధికమైన ప్రతిపత్తిని సుల్తాన్ కులీకుతుబుల్ ముల్కునకు ఒసగియుండెను.

అహమ్మద్ నగరు అధిపతి బురహాన్ నిజాంషా దర్బారులోని సుప్రసిద్ధ చారిత్రకుడు సయ్యద్ అలీ తబాతబాయి పారసీక గ్రంథము బుర్హాన్ మాసిర్ నందు వివరించిన అంశమును సరించి అలగ్ ఖాను పై జాగీరుదారులకు సమకాలికుడని తెలియుచున్నది.

డా కొ గో కృ

## అలగయ్య పెరుమాల్

ఈ వ్యక్తి నామము తిరుమలతిరుపతి శాసనసంపుటము I వ సంఖ్య 236 న ను శాసనమును అలగయ్యపెరుమాల్ తండ్రి పేరు రామానుజదాసారు. వీరి స్వగ్రామము తిరుచకనూరు. ఆగ్రామీణుల మహాసభలో అలగయ్యపెరుమాల్ ఒక సభ్యుడుగాకూడ నుండెను.

శా శ 1368 (క్రీ శ 1446) విజయనగరాధీశ్వరులైన రెండవ దేవరాయల పుత్రుడు మల్లికార్జునరాయల పరిపాలన కాలములో అలగయ్యపెరుమాల్ మార్గశి (మార్గశిర)

మ ంమునందు వచ్చు ధనుర్మాసోత్సవములకు గాను 200 వరహములను శ్రీ వేంకటేశ్వర గోవిందరాజ పెరుమాళ్ళకు చెందు ట్లు శ్రీ భండారమునకు సమర్పించెను

ఈ ద్రవ్యము మీద వచ్చు వడ్డీని ఈ మార్గళి మహోత్సవ సమయమున స్వామి అర్పించు ప్రసాదానికి కావలయు సామాగ్రిని ప్రతినిత్యము 30 దినముల వరకు శ్రీభండారము నుండి సరఫరా చేయుటకు నిర్ణయమైనది

నైవేద్యానంతరము తయారైన ప్రసాదమునుండి మూడవ వంతు దానకర్తకును మిగతా ప్రసాదము తిరు తిరుమల స్వామి సన్నిధుల సంధ్యాసమయమునందు భక్తులకు వినియోగింపబడును

శ్రీవైష్ణవుల అనుమతిని పొంది ఈ దానము తిరుమల సంస్థానమునందలి లెక్కలలో నమోదు చేయబడినది శ్రీ వైష్ణవులు ఈ దానమును సంరక్షించెదరు

కొం వెం

## అలఘుచర్లవారు

అలఘుచర్లవారు పద్మనాయక కులజులు వీరి ప్రశంస చాటుపద్యమణిమంజరి రెండవ భాగములోను రెడ్డిసంచికలోను కనవచ్చుచున్నది కాకతిప్రతాపరుద్రదేవుని సేవించిన డెబ్బదియేడుగురు నాయకులలో వీరును ఒక్కరని తెలియుచున్నది మాండలిక మహారాజులైన ఏరువచోడులను వీరు సేవించి ట్లును కనవచ్చుచున్నది క్రీ శ 1323 లో కాకతీయ సామ్రాజ్యము అంతరించినది ఆనాటి వరకును కాకతీయులను సేవించిన నాయకులు జీవనోపాధికై తలకొకరిని ఆశ్రయించి మనుగడ సాగించిరి అట్టివారిలో అరవెల్లివారు పెంపాలివారు కొమరవెల్లివారు అలఘుచర్లవారును ఏరువచోడ రాజుల నాశ్రయించినట్లు విశదమగుచున్నది

ఏరువరాజులు గొప్ప పరాక్రమవంతులు రెడ్డిరాజన్యులతో సమరము సాగించి వారి రాజ్యమును తూర్పు దిశను విస్తరింపనీయక సుమారు యేబది సంవత్సరముల కాలము అడ్డగించినవారు ఏరువచోడ ప్రభువులే ఏరువచోడవంశకర్త నల్లభీముడను నామాంతరము గల ఏరువభీముడను నతడు ఏరువ మాండలికులు కరికాలచోడుని వంశజులు వీరు సూర్యవంశ క్షత్రియులు పూర్వము ఏరువనాడు అని పిలువబడినట్టిది నేటి ఒంగోలు మండలమునందలి మార్కాపురము పొదిలి దర్శి తాలూకాలలో కొంత భాగము కడపజిల్లాలోని బద్వేలు సిద్ధవటము తాలూకాలలో కొంతభాగము అయియుండినట్లు చారిత్రకులు చెప్పుచున్నారు ఏరువ అను గ్రామము కడప మండలమున నేడు కనవచ్చుటలేదు కడప జిల్లాలోని ప్రొద్దుటూరు తాలూకాలోనున్న ఎఱ్ఱవపాలెము చెంత పూర్వపు ఏరువ గ్రామముండినట్లు ఊహించుచున్నారు ఏరువ మాండలికులలో అవతంసకర్తగా పేర్కొనబడిన భల్లభీముడు మహాసాహసోపేతుడై చక్రకొట్టము మన్యము వడ్డకేళియ వేంగి కళింగాది మండలములను జయించినట్లు తెలియుచున్నది ఈవిజయములు భల్లభీముడు స్వతంత్రముగా సాగించినవికావు మాండలికుడగు అతని అంతశ్శక్తిలేదు కాకతిగణపతిదేవునికళి దండయాత్రయందు తోడ్పడుచు భల్లభీముడు ఈవిజయములందు పాల్గొనెను ఏరువచోడులను ఆశ్రయించిన అరవెల్లినాయకులకు సకలవర్ణ దని దక్షిణభుజాదండమనియు పెంపాలివారికి రువరాజ్యమూలస్తంభమనియు కొమరవెల్లి వారికి ఏరువరాజు మూలస్తంభమనియు బిరుదములు ఉండినట్లు తెలియుచున్నది ఈబిరుదముల వలన ఏరువరాజుల నాశ్రయించిన ఈ నాయకులు ఏరువరాజులకు వారి రాజ్యమునకు ఒనర్చిన సేవ తెల్లమగుచున్నది

ఏరువచోడరాజులను ఆశ్రయించి వారికి సంగ్రామరంగమున అండగ నిలచి శత్రువుల బారినుండి ఏరువరాజ్యమును రక్షించి ఏరువరాజ్యసాధనాచార్య అను బిరుదమును వహించిన మహనీయులు అలఘుచర్లవారే అని వారి బిరుదముల వలన తెలియుచున్నది ఈవృత్తాంతము చాటుపద్యమణిమంజరిలో ఇట్లు కనవచ్చుచున్నది "పల్లవుండను రాజు యేర్వ ప్రధానంబునకెత్తి యడచిన యేర్వరాజు తమ అలఘుచర్ల నాయక వర్గంబుల బిలిపించి కదనంబునకే ప్రోచి తురంగంబుల వల్లనకటిధాత్రి కాయుధ ప్రవీణులై ంచ మహాలాయుధంబులతో పురంబు వెలి యుద్ధసన్నద్ధులై తలపడి ఒండొరుల మీద తమ ఖండంబు (దండంబు) వెత్తి మొత్తిన తుత్తినియలై వీరభటుల శిరోంబులు తురంగంబులను ఖండతుండంబులై రుడిన గజంబులను చతురాయుధంబులు వైచి శరణంబు వేడిన గాచి పల్లవుల బిరుదంబుగైకొని తమ్మేలిన యేరువరాజు సముఖంబున పెట్టి విన్నవించిన అన్నృపాలుండు మెచ్చి యిచ్చిన బిరుదంబు లెట్టివనిన (చామం 11 214 పుట)

ఈపల్లవుడు కొప్పెరుంజింగడు అని యూహించుటకవ

కాలమున్నది కాకతి గణపతిదేవుని రాజ్యావసాన కాలమున సామ్రాజ్య దక్షిణ భాగము దుర్భరమైన అలజడియే జరిగినది. ఇట్లన మహాపరాక్రమవంతుడగు జయశాలియగు జటావర్మ సుందరపాండ్యుడు కాంచీపురమును జయించి నెల్లూరు తెలుగుచోడ రాజ్యముపై పడుటకు ఆయత్తుడగుచుండెను. నెల్లూరుచోడులు కాకతి గణపతిదేవుని సామంత మిత్రులగుటచే మనుమసిద్ధితో తలపడుట అనగా కాకతీయులతో సంగ్రామము చేయుట అన్నమాట. జటావర్మను దర పాండ్యుడు పరాక్రమశాలియయ్యు యుద్ధతంత్రజ్ఞుడగుటచే నెల్లూరు కాకతీయ సేనాబలమును విభజించుటకై ఒక వ్యూహమును పన్నెను. ముందుగా తనచే విజితుడయి తనకు అధీనుడైన కొప్పెరుంజింగడు కాంచీపురచోళుడు మున్నగువారిని ఎరువనాడు మీదుగా కాకతీయ సామ్రాజ్యముపై పడుటకు నియోగించెను. ప్రధాన సైన్యములతో తాను నెల్లూరు మీద విక్రమించెను.

అట్లు ప్రేరేపితుడైన కొప్పెరుంజింగడు తనవంతు కార్యమును మొదట జయప్రదముగనే సాగించెను. యుద్ధలంపటుడగు కొప్పెరుంజింగడు (పల్లవుడు) తుపానువలె ఎరువనాడుపైపడి ముందువీకు సాగిపోయి దాక్షారామము వరకును దాడి సాగించెను. కొప్పెరుంజింగని శాసన మొకటి ఈ కాలమున ద్రాక్షారామమున దొరకుచుండుటకిదియే కారణము. కాకతీయ సేనానులు పరాకుగా ఉండగా పల్లవుడు అట్లు ఆంధ్రదేశ తీరము వెంట సుదూరము వెళ్ళినవాడైనను త్వరలోనే తిరోగతిచెందవలసినవాడయ్యెను. వచ్చినదారినే అతడు మరలవలసివచ్చెను. ఈసందర్భముననే కాబోలు ఎరువచోడుల దండనాయకులైన అలఘుచర్లవారు పల్లవుని ఓడించి తరిమికొట్టి వాని బిరుదములను అపహరించిరి.

కాకతీయులు త్రిపురాంతకము ఎరువనాడు మున్నగునవి కాపాడుచుండగా జటావర్మసుందరపాండ్యుని శృంగాటక వ్యూహమునందలి ప్రధానమైన కొమ్ము నెల్లూరు మీద పడనే పడెను. మనుమసిద్ధిరాజు పరాక్రమోపేతుడై పోరాడుచు క్రీ.శ. 1261 63 ప్రాంతమున ముత్తుకూరు యుద్ధములో వీరశయన మలంకరించెను.

ఎరువరాజులు నెల్లూరివారికి సామంతులో మిత్రులో అయినట్లు కాన్పించును. చోడతిక్కరాజు (మనుమసిద్ధితండ్రి) ఎరువమున్నీల వేలె అని చెప్పబడినది.

పై వచనములోని చతుశ్శాయుధములు అను శబ్దము గమనింపదగినది. బహుశా ఇది ఛత్తీసాయుధములై యుండును. అనగా 36 విధముల ఆయుధములు. ఆ కాలమున అన్నిరకముల యుద్ధసాధనములు దెలిసియు అలఘుచర్లవారు వాటి అన్నిటియందును నేర్పరులనియు భావముగా వచ్చును. ఎరువవారు కల్యాణరాజులను ఓడించుచున్నకాలము 12వ శతాబ్దము అని దేసాధ్యమగుచున్నది. కల్యాణరాజులు అనగా ద్వారసముద్ర హొయసలులు. ఈశతాబ్ది మధ్యమున ప్రాముఖ్యమునందరి అప్పటికి కూలిపోవుచున్న చోళసామ్రాజ్యమును ఆదుకొనుటకు నెల్లూరు చోడతిక్కరాజు కొంత ప్రయత్నించి చోళస్థాపనాచార్య బిరుదమును పొందెను. ఈప్రయత్నము నందాతడు కర్ణాట సోమేశ్వరుని దర్పఘాతము నరపెనని నిర్వచనోత్తరరామాయణము ప్రశంసించుచున్నది. అలఘుచర్లవారిపాలకులైన ఎరువచోళులు తిక్కరాజునకు కల్యాణరాజులతో అయిన యుద్ధములందు పాల్గొనియుండుట సంభవమగుచున్నది.

అలఘుచర్లవారికి గల అరమని గొండెయరగండ అను బిరుదును ఇట్లు అన్వయించుటకు వీలు కానిపించుచున్నది. అరమని అనగా అరెమని కావచ్చును. అరె అనగా మహారాష్ట్రులు. అరెమని అనగా మహారాష్ట్ర వీరులు. నెల్లూరు చోడతిక్కరాజుకును ఎరువనాయకులకును మహారాష్ట్ర సైన్యములతో పోరాడవలసిన అవశ్యకత 13వ శతాబ్దమున ఏర్పడెను. ఏలనదేగిరియాదవులు సింఘణ నేతృత్వమున కావచ్చును కాకతీయ సామ్రాజ్య ఉత్తరప్రాంతముపై విజయయాత్రలు సాగించిరి. వారు కడపజిల్లాయందలి కరుమలూరు వరకును చొచ్చుకొని వచ్చిరి. లకుమయదండనాథుడు కరుమలూరుపై ఎత్తిరాగా చోడతిక్కరాజు వాని నోడించి వాని ఘోటకములను పట్టుకొనెనని వర్ణింపబడినది. కర్నూలు జిల్లా తూర్పుతాలూకాలలోనికి కూడ యాదవ సైన్యములు చొచ్చుకొని వచ్చుటయు ఎరువచోళులు తమ రాజ్యమును కాపాడుకొనుటకై మహారాష్ట్ర సైన్యములతో పోరాడి జయించుటయు విశ్వసనీయమైన వృత్తాంతముగనే ఉన్నది.

అలఘుచర్లవారు (చరుకుకేశారెడ్డితలగుండుగండ) అను బిరుదు దాల్చుటకు మూలమైన సన్నివేశమును ఇట్లు అన్వయింపవచ్చును. పై చెప్పిన బిరుదుల మూలములు సాధారణ

## (అల) చోళరాజు

(అల) చోళరాజు ప్రశస్తి పలనాటి వీరచరిత్రమున కలి కొమ్మరాజు యుద్ధ ఘట్టమున కవచ్చుచున్నది పల్నాటివీర చరిత్రను కవిసార్వభౌమ బిరుదాంచితుడైన శ్రీనాథ మహాకవి ద్విపద ఛ్ఛందమున వ్రాసెను

శైవ మతావలంబియు కల్యాణ పురాధీశుడును అయిన వీరసోమునకు కొమ్మరాజు (అల) చోళరాజు అల్లాడిరాజు (అలరు) ముప్పిడిరాజు (అల) నూకరాజు అను సుతులును సీరాదేవి అను కూతురును కలరు పలనాటి ప్రభువైన అనుగు రాజు యొక్క తనయుడైన మలిదేవునకు సీరాదేవి నిచ్చి వీరసోముడు పరిణయము కావించెను వీరసోముడు కొమ్మరాజు చోళరాజు అల్లాడిరాజు ముప్పిడిరాజు నూకరాజు మున్నగు వారందరును పల్నాటి యుద్ధమున మలిదేవుని పక్షము వహించి గురజాల ప్రభువైన నలగామునితో పోరిరి

పల్నాటి యుద్ధము క్రీ శ 1181-118౨ల మధ్యన జరిగినట్లు తెలియుచున్నది ఇది పలనాటిని పాలించిన హైహయ వంశజులైన సోదరుల మధ్య జరిగిన సంగ్రామము పలనాటి రాజ్యపాలకుడగు అనుగురాజు యొక్క పుత్రులగు నలగామాదులకును మలిదేవాదులకును రాజ్యభాగము నిమిత్తము కలహము ఆరంభమయ్యెను నలగాముడు గురజాలకు రాజు అయన మంత్రిణి నాయకురాలు మలిదేవుడు మాచర్లకు ప్రభువు ఆయన మంత్రి బ్రహ్మనాయుడు నాయకురాలు కపటమున కోడిపందెములలో బ్రహ్మనాయని ఓడించెను నియమ ప్రకారము బ్రహ్మనాయుడు మలిదేవాదులతో మాచర్ల రాజ్యము విడిచి మండాదికి వలస పోయెను ఏడు సంవత్సరములు అచట గడిపెను పిమ్మట తమ మాచర్ల రాజ్యమును తిరిగి తమకు అప్పగింపుమని అలరాజు ద్వారా నలగామునకు బ్రహ్మనాయుడు రాయబారము పంపెను నాయకురాలి దురోచే నలగాముడు మాచర్ల రాజ్యమును వారికీయ తిరస్కరించెను ఈ కారణముగా నలగామునకును మలిదేవునకును కారెంపూడి నాగులేటి యొడ్డున గొప్ప యుద్ధము జరిగెను అదియే పల్నాటి యుద్ధము

ఈయుద్ధమున ఉభయ సైన్యములయందును అనేక రాజులు వీరులు పాల్గొని హతులైరి బాలవీరుడును బ్రహ్మనాయని కుమారుడును అగు బాలచంద్రుడు శత్రువులను అనేకులను అవలీలగ చంపి రణరంగమున వీరమరణము నొందెను పిమ్మట మలిదేవుని బావమరదియగు కొమ్మరాజు బ్రహ్మనాయని ఆజ్ఞవడసి సమరమునకు వేగెను నాయకురాలు కొమ్మరాజు నెదిరింప సోమల సోమశేఖరుని పంపెను సోమశేఖరుడు గొప్ప ధనుర్విద్యాచార్యుడు కొమ్మరాజు అపాయకారుడు సోమశేఖరుని సైన్యమును అతడు తుత్తునియ లొనరెను మరికొంత సైన్యమును గ్రహించి సోమశేఖరుడు కొమ్మరాజుతో ఘోరముగ పోరాడుచుండెను

కొమ్మరాజు సోదరులగు (అల) చోళరాజు అల్లాడిరాజు (అలరు) ముప్పిడిరాజు (అల) నూకరాజు అనువారు అన్న ఆజ్ఞచే జోదు సోమునిపై బడిరి సోముడు తన సోదరులను పిలిచి కొమ్మరాజు సోదరులతో తలపడుడని చెప్పెను (అల) చోళరాజాదులు అఖండ పరాక్రమముతో విజృంభించి సోముని సోదరులను తెగటార్చిరి ఎదిరి పక్షమున మార్కొనదగిన శత్రువీరులు వారికి లేకుండిరి వారు అన్నయగు కొమ్మ రాజుతో అవిషయమును తెలిపిరి కొమ్మరాజు వారితో నిట్లు చెప్పెను

మనము ధరించిన శస్త్రజాలము శంభుని వలన మన తండ్రియగు వీరసోమునకు లభించినవి అతని వలన అవి మనకు లభించెను ఇవిగాక నాకుమారుడైన అలరాజుకు సూర్యుడు సూర్యఖేటకము అను శస్త్రము నొసగెను అదియు ఇప్పుడు మన వద్దనే యున్నది ఇవి దేవతలు ఇచ్చిన ఆయుధములు ఈఆయుధములు మన చెంత ఉన్నంతవరకు ఎట్టి మగటిమి గల రాజులైనను మనల గెలువజాలరు మన బంధువులెందరో ఈ సమరమున మరణించిరి ఇక మనము కూడ వారినే అనుసరింప వలయును ఈదివ్యాయుధములు మన చెంత నున్నంతవరకు మనకు మరణము కలుగదు అందుచే మీరు ఈదివ్యాయుధములు విడిచి కురుచ కైదువులు ధరించి సమరము సేయుడు ఈ దివ్యాయుధములను కట్టగట్టి నాకడ నుంచుడు

అన్న మాటలు విని (అల) చోళరాజు దివ్యాయుధము లను కట్టగట్టి ఆయుధముపై తమ తమముద్రలు వేసి అన్న యగు కొమ్మరాజుకు అప్పగించెను పిమ్మట (అల) చోళరాజు అల్లాడిరాజు (అలరు) ముప్పిడిరాజు (అల) నూకరాజును కురుచ బల్లెములు కుంతఖడ్గములు ధరించిరి సింహనాదము

లొ న్చిరి శత్రుసైన్యముపై దుమికిరి గుఱ్ఱములను కుంజరములను గూల్చిరి రౌతుల శిరములను ఖండించిరి పోటు బంట్లను చీల్చిరి శత్రువుల సైన్యములు యుద్ధమున నాశనమొనరించిరి లగామని సేన వారి ధాటికి ఆగలేక పారిపోయెను

జోదుల సోముడు పారిపోవుచున్న సైన్యమును నిలువరింప ప్రోత్సహించుచుండెను సైన్యము ఒకచో నిలిచెను సోముడును అతని సైన్యము ఉమ్మడిగా (అల) చోళరాజాది సోదరులపై బడిరి చురియలు బల్లెములు అస్త్ర నారాచములు మున్నగు ఆయుధములతో ఆ సోదరుల శరీరములను గాయపరచిరి వారి శరీరములనుండి రక్తము ప్రవహించుచుండెను మాచెర్ల చెన్నుని బ్రహ్మనాయని అన్న యగు కొమ్మరాజును మనసులో స్మరించుచు (అల) చోళరాజాది సోదర చతుష్టయము నేలపై అమ్ముల పాన్పుపై పడి ప్రాణములు విడిచెను

ఇట్లు మహావీరుల పట్టికలో నొకడుగ నిలిచి పలనాటి యుద్ధమున పవిత్రత్వము నొందిన పరాక్రమశాలి (అల) చోళరాజు

ఈ వ్యాసమున గనవచ్చు అలచోళరాజు అలరురాజు అలనూకరాజు అను నామములందు గనవచ్చుచున్న అల అలరు అను శబ్దములు ద్విపచ్ఛందమునకు అనుగుణముగా కవి వాడినట్లు కనిపించుచున్నవి అల అనునది సుప్రసిద్ధము అను నర్థము నందును అలరు అనునది శోభించు వికసించు అను నర్థములయందును తరచు వాడబడుచున్నవి కవి పైన పేర్కొనబడిన పేర్లముందు అల అలరు అను శబ్దములను ప్రసిద్ధాది అర్థముల కొరకే వాడబడినట్లు కనిపించుచున్నది అవి పేర్లకు ముందు సహజముగ ఉండునట్లు కనవచ్చుటలేదు అల అను శబ్దము విశేషణముగ ఉండినట్లు మనకు కవి ప్రయోగముల వలన దెలియవచ్చుచున్నది అలచందమామ ఘుటిక (భీమఖండము) అను శ్రీనాథకవి ప్రయోగమిట్టిదే ఇట్లే అలరు శబ్దము కూడ విశేషణముగ వాడిన స్థలములు అనేకములున్నవి "అలరు జొంపములు" (భారతము) అను తిక్కన ప్రయోగము మనకు విదితమే ఈ కారణముచేతనే ఈ వ్యాసములో పేర్లకు ముందున్న అల అలరు అను శబ్దములను విశేషణములుగ భావించి కుండలీకరణములలో వానిని చూపించడమైనది

తం. ఆం. శా.

## అలజంగి

అలజంగి శ్రీకాకుళ జిల్లా బొబ్బిలి తాలూకాలో ఉన్నది ఇది 5 మైళ్ళ దూరములో బొబ్బిలి స్టేషను కలదు దీని తూర్పున కారాడ ఆనవరము [illegible] రాయి [illegible] ఉత్తరమున [illegible] రోడ్డు [illegible] పాలేరు ఉన్నవి ఈ గ్రామ విస్తీర్ణము 217 ఎకరములు

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామ జనాభా 4[illegible]2 దీనిలో 908 షెడ్యూల్డు జాతులవారు 14 షెడ్యూల్డు తరగతుల వారు ఇచట ఇండ్లు గుంపుగాను ఒకచో వాడవాడలగను కట్టబడినవి వీటిలో 178 పెంకుటిండ్లు గ్రామస్థులలో 450 మంది వరి అన్నము మిగిలినవారు జొన్న ఇతరములను తిందురు కోనేటి నీటిని త్రాగుదురు మంచినీళ్ళ [illegible] హెచ్చుగా ఉన్నది

ఈ గ్రామమునకు నీటివసతులుగా దాల్ది దెవు చెరువు గ్రామకోనేరు ఉన్నవి వీటి క్రింద వరి చెరకు నువ్వు చోడి మొదలగు పంటలు పండును వీటిని స్థానిక అంగడిలోనే అమ్మెదరు 1966-67 సం॥లో 15 ఎకరముల మామిడి తోటలు 2 ఎకరముల అరటి తోటలు ఉండెను మామిడి కాయలను అరటి కాయలను స్థానికులే ఉపయోగించిరి పంటల క్రింద 1867 ఎకరముల భూమి ఉపయోగించబడినది [illegible]ల్లి రేగడినేల 1000 ఎకరములు చవుక రేగడినేల 400 ఎకరములు

ఈ గ్రామమున గేదెలు ఎద్దులు ఆవులు ఆబోతులు మొదలయినవి 1678 మేకలు 4 2 గొర్రెలు 560 పందులు 90 కోళ్లు 732 దినమునకు 60 లీటర్ల పాలు 150 గ్రుడ్లు స్థానికులు ఉపయోగించిరి

ఇచట ప్రజలు వ్యవసాయము వ్యవసాయ కూలి స్వంత దుకాణములు వీటిమూలమున జీవింతురు రిక్షాలు జట్కాలు టాంగాలు ఎద్దుబండ్లు నడపువారు కలరు వీరుగాక 9 మంది కంసాలివారు నల్గురు వడ్రంగులు ఒక కమ్మరి 7 గురు కాపీపనివారు ముగ్గురు తెలికలవారు 8 మంది మంగలివారు 19 మంది చాకలివారు 30 మంది గొల్లవారు కలరు వ్యవసాయదారులకు కూలీలు దొరకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 2/-లు స్త్రీకి ఒక రూపాయి రెండు పిండిమరలు స్థానిక అవసరములను తీర్చును

ఈ గ్రామమునకు 8 మైళ్ళలో బొబ్బిలి రైల్వే స్టేషను ఉన్నది దీనిని పొరుగు గ్రామములతో కంకర రోడ్డు కలుపుచున్నది ప్రయాణమునకు గ్రామమున 15 గుర్రపు బండ్లు 2 మోటారు సైకిళ్లు 168 రెండెడ్లబండ్లు 45 స్వంత సైకిళ్లు గలవు

అలజండిలో బ్రాంచి పోస్టాఫీసు అప్పర్ ప్రైమరీ స్కూలు ఉన్నవి విద్యుచ్ఛక్తిని 97 ఇండ్లు రెండు పిండిమరలు వాడుకొనుచున్నవి ఇది పంచాయతీ పరిపాలనకల గ్రామము వివిధ రకముల పన్నులు పంచాయతీకి ఆదాయమును సమకూర్చును ఇచ్చట ఇంగ్లీషు వైద్యుడు ఆయుర్వేద వైద్యుడు కలరు 6 కిరాణాదుకాణములు 5 కిళ్లీ సిగరెట్టు సోడా అంగళ్లు కాఫీ హోటళ్లు 2 ఇతర షాపులు గలవు

బొబ్బిలిలో తంతి కార్యాలయము పురుళ్ల ఆసుపత్రి జనరల్ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి సినిమా థియేటరులు ఉన్నవి కోర్టులకు పోలీసు స్టేషనుకు సబ్‌రిజిస్ట్రారు ఆఫీసుకు తాలూకాకచేరికి బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు గ్రామస్థులు బొబ్బిలికి పోవుదురు గ్రామములోని విద్యార్థులు హైస్కూలు చదువులకు ఒక మైలులో ఉన్న పాల్తేరుకు 8 మైళ్ళలో ఉన్న పెరిడిలోని జిల్లా పరిషత్ హైస్కూళ్లకు కళాశాల చదువులకు బొబ్బిలికి పోవుదురు

మా శ్వే

అలనూకరాజు చూ అలచోళరాజు

## అలనేనవారు

అలనేనవారి వృత్తాంతము చాటుపద్యమణిమంజరి రెండవ భాగమున (270 పుట) కనవచ్చుచున్నది వెలుగోటి కస్తూరి రంగప్పనాయనికి మట్ల తిమ్మరాజునకు జరిగిన యుద్ధమున తిమ్మరాజునకు సహాయకులుగ వచ్చినవారిలో అలనేనవారును కలరు

పరాక్రమశాలి అయిన కస్తూరిరంగప్పనాయడు సుప్రసిద్ధుడయిన వెలుగోటి వంశీయుడు ఈయన భార్య వేంకటాంబిక ఈమె దామెరవారి ఆడుపడుచు బహుళాశ్వచరిత్ర కర్త అయిన దామెర వెంగళభూపాలుడు కస్తూరిరంగప్ప మేనల్లుడు మహావీరుడైన యాచమనాయడు కస్తూరిరంగప్ప కుమారుడు

రంగప్పనాయడు క్రీ శ 1570 ప్రాంతమువాడు ఆనాటి విజయనగర సామ్రాజ్యాధిపతియైన సదాశివరాయల వారికి అతడు నమ్మినబంటు అతడు ప్రభువాజ్ఞచే గోల్కొండ లోని యవనులను జయించెను కొండవీటి సము వినుకొండ సీమలలోని మన్నియలను కొచ్చెర్లకోట వరకు తరిమివైచెను సదాశివరాయలకు కప్పము చెల్లింప నిరాకరించి తిమ్మనగౌడు అనువానితో క్రొత్తకనుమ అనుచోట సమరము చేసి అతని దర్పమణగించి ఆయనచే రాయలకు కప్పమును కట్టించెను అతడు ఓర్వసమును పాలించెను ఇదియే ఉరవకొండసీమ యేమో! అయినచో ఇది నేటి కడప జిల్లా గుత్తి తాలూకా రాయదుర్గము అనంతపురము జిల్లా అనంతపురము తాలూకా ప్రాంతమై యుండును

ఆకాలమున మట్లసీమను తిమ్మరాజు పాలించుచుండెను మట్లసీమ కడపమండలములో రాయచోటి తాలూకా ప్రాంతమై యుండునని ఊహించబడుచున్నది తిమ్మరాజునకు కొండ్రాజు వేంకటరాజు దాసరిరాజు అను సోదరులు కలరు వీరందరు గొప్ప పరాక్రమవంతులు తిమ్మరాజు శూరులైన సోదరుల సాయముతో గొప్పదండునుగూర్చుకొని తనమట్లసీమకు చుట్టుపట్లనున్నచిన్ని చిన్నిరాజ్యములపై దండెత్తి వానిని ఆక్రమించుకొనుచుండెను సారెయోబళుని రాజ్యము గూడా ఈ విధముగనే తిమ్మరాజు ఆక్రమణములోనికి వచ్చెను సారెయోబళరాజు భయభ్రాంతుడై కస్తూరి రంగప్పనాయని ఆశ్రయించెను తిమ్మరాజును పారద్రోలి తన రాజ్యమును తిరిగి తనకు ఇప్పించుమని అతడు రంగప్పను ప్రార్థించెను రంగప్ప మిక్కిలి కరుణాళువు అతని ప్రార్థన మన్నించెను శత్రుహస్తగతమైన రాజ్యమును తిరిగి ఓబళరాజునకు ఇప్పింతునని అతడు ప్రతిజ్ఞ చేసెను

దామెర వెంకటప్పనాయడు తోడురాగా ఇరువదివేల సైన్యమును వెంటగొని తిమ్మరాజుతో సమర మొనర్ప కస్తూరిరంగప్ప బయలుదేరెను కోడూరు గ్రామమునకు వచ్చెను ఇది నేటి కడప మండలములోనిది ఇందు మనుమసిద్ధి II (తిక్కన సోమయాజి ఎలిక) వేయించిన శాసన మొకటి కలదు కోడూరు అను పేరుగల గ్రామములు అనంతపురము జిల్లా హిందుపూరు తాలూకాలోను కృష్ణా జిల్లా దివి తాలూకాలోను కడప జిల్లా రాజంపేట తాలూకాలోను నెల్లూరు జిల్లా నెల్లూరు తాలూకాలోను విశాఖ జిల్లా నర్సీపట్నము తాలూకా చోడవరము తాలూకాలలోను శ్రీకాకుళము

జిల్లా బొబ్బిలి తాలూకాలోను కనవచ్చుచున్నవి

కస్తూరిరంగప్ప బహు సైన్యముతో తనపై నెత్తివచ్చుట తిమ్మరాజు వేగులవారి వలన వినెను. కాల్వేనివారు, కరవారు, కూనపులివారు, పెదవోతువారు, అలనెవారు, నేమలవారు, కాలువపల్లికారు, మాచుల్లివారు, పొత్తరవారు, రేగటిగికటివారు, గండికోటవారు, చల్లవారు, వరము వారు మున్నగు పన్నిమ్మనులను ఉదయగిరి దుర్గాధిపతులను తనకు సాయకులు కాగా, తిమ్మరాజు తొంబది నగలు ... యిచ్చిన ... ఎఱ్ఱగుంట అను గ్రామము చేరెను. ఎఱ్ఱగుంట అను గ్రామము అనంతపురము జిల్లా రాయదుర్గము తాలూకాలోను, ఎఱ్ఱగుంట్ల అను గ్రామము కడప జిల్లా కమలాపురము తాలూకాలోను, ఎఱ్ఱగుంట్లకోట అను ది కడప జిల్లా రాజంపేట తాలూకాలోను నేడు కనవచ్చుచున్నవి. కస్తూరిరంగప్ప వద్దకు గుత్తి వేంకటరాజు ద్వారా "మాపై నిర్హేతుకముగ యుద్ధము చేయబూనుట తగదు" అని అతడు రాయబారము పంపెను. దానికి సమాధానముగా కస్తూరిరంగప్ప సారెయోబళుని రాజ్యమును నీవు వదలుకొని పోయి గాని నేను నీపైన సమర ప్రయత్నమును ఆపువేయజాలను అని తిమ్మరాజునకు కబురు పంపెను. సంధిపొసగకుండుటచే ఉభయపక్షములవారికిని పోరు ఆరంభమయ్యెను.

కస్తూరి రంగప్ప సేనలు తిమ్మరాజు సైన్యము భయంకరముగ యుద్ధమొనర్చుచుండెను. తిమ్మరాజు సైన్యమును రంగప్పసేన చీకాకు పెట్టుచుండెను. విరిగెడు శిరములతో కూలెడు శరీరములతో మరభూమి నిండిపోయెను. రంగప్ప నాయడు మహావిక్రమముతో కదనమొనరిం, సోదర త్రయముతో గూడిన తిమ్మరాజును అతని సేనానులైన లింగరాజు తిమ్మన్న మల్లువారు వీరయ్య, నకెల్లి రాఘవయ్య మున్నగు ఏబది మువ్వురను హతమొనర్చెను. రంగప్ప ధాటి కోర్వలేక తక్కిన సేనాధిపతులు మన్నెదొరలును రంగప్పను శరణు వేడిరి. రంగప్పనాయడు వారిని రక్షించి సారెయోబళరాజుకు అతని రాజ్యమును తిరిగి అప్పగించెను. ఈ యుద్ధము శక 1501 (క్రీ శ 1579 సెప్టెంబరు 27 వ తేది) ప్రమాది సంవత్సర ఆశ్వయుజ శుద్ధఅష్టమి ఆదివారమునాటితో ముగిసినట్లు వెలుగోటివారి వంశ చరిత్రలో (95 పుట) కలదు.

ట్లు అలనెవారు మరమునతిమ్మభూపాల సాయము ... నమస్నేహ ప్రవృత్తిని గ్రహించి చుకొనిరి అలనెవారి చరిత్రము ఇంతకు మించి తెలియవచ్చుటలేదు.

కం ఆ శా

## అలమండ

అలమండ విశాఖపట్టణ జిల్లా శృంగారపుకోట తాలూకాలో ఉన్నది. దీనికి 16 మైళ్ళలో విజయనగరము పట్టణము కలదు. దీనికి అలమండ R S అను రైలుస్టేషను అలమండ అను పేర్లు ఉన్నవి. దీని అక్షాంశము 8 14 రేఖాంశము 17 59 దీని తూర్పున గవరము, గంధవరము, డమట, ఎలిగిపాలెము, కలగాడ, ఉత్తరమున కెరళ, గొడుకొమ్మ, దక్షిణమున పెదరావుల్లి, చిరావుపల్లి రిహద్దులు. ఈగ్రామ విస్తీర్ణము 3 57 ఎకరములు. ఇచట కద్దుపాలెకొండ, రాళ్ళగుట్ట కలవు. ఇవి కంకరరాతి నిర్మాణములు. ఈగుట్టలపై తుప్పలు మాత్రము ఉన్నవి.

ఈగ్రామమున 1931సంలో 4 014 మంది 1941సంలో 4 369 మంది 1951 సం లో 4512 మంది 1961 సం లో 4468 మంది జనులు ఉండిరి. 1961 సం నందలి 4488 మందిలో 2 08 మంది పురుషులు 2400 మంది స్త్రీలు. ఈ సంఖ్యలో పెద్యూలు జాతులవారు 415 మంది పెద్యూలు తరగతుల వారుముగ్గురు. 1951ను డి 1961వరకు జనులలో తగ్గుదల 24. ఇచ్చట ఇండ్లు విడిగాడిగాము, కద్దుపాలెము, నారాయణపురము శివార్లుగాను ఉన్నవి. ఓటిలో 50 పెంకుటిండ్లు రెండు కాంక్రీటు కప్పుగలఇండ్లు 15 ఒక అంతస్తు గలమేడలు గలవు. ఒకవతు జనాభావారు వరిఅన్నమును రెండువతుల సాఖా వారు జొన్న, గంటి, చోడి అన్నములను తిందురు. బావినీటిని చెరువునీటిని త్రాగుదురు. వేసవిలో మంచినీటి ఎద్దడి ఉన్నది.

ఈగ్రామమునకు గల నీటివరులు ముఖ్యముగ రామడికుంట విజయ గోపాలరాజు చెరువు, కొత్త చెరువు, పాటువాని చెరువు, మొగలిచెరువు, సీతారామరాజుచెరువు, అయ్యచెరువు, వనగంటివానిచెరువు, పట్టాభిరామరాజుచెరువు మరి 17 చిన్న చెరువులు, బందలు మొదలగునవి. వీటిక్రింద వరి, గంటి, చోడి, కొర్ర, ఉలవ, కంది, నువ్వు, వేరుసెనగ, చెరకు, గోగు మొదలగు పంటలు పండును. ధాన్యమును గాదెలలో నిలవ చేయుదురు. బండ్లపై పంటదినుసులను కొత్తవలస, విజయనగరములకు రవాణాచేయుదురు. 1966–67సంలో చిన్నకొబ్బరి బత్తాయి,

రిజిష్ట్రారు ఆఫీసుకు తాలూకా కచేరీకి జనరల్ ఆసుపత్రికి జనులు చోడవరమునకు పోవుదురు బ్లాక అభివృద్ధి కేంద్రమునకు శివుల ఆసుపత్రికి 5 మైళ్ళలోనున్న K కోటపాడునకును పురుళ్ళఆసుపత్రికి 7 మైళ్ళలోనున్న లక్కవాని పాలెమునకు పోవుదురు

సూ శ్వే

## అలముఖాను

అలముఖాను పేరు చాటుపద్యమణిమంజరిలో కనవచ్చుచున్నది (చా మం II 332) ఇతడు గోలకొండ నవాబు పక్షమున దామెర వేంకటప్పనాయనితో యుద్ధ మొనర్చిన వీరుడైనట్లు తోచుచున్నది

క్రీ శ 1646 లో విజయనగర సామ్రాజ్యము చివరి స్థితిలోనికి వచ్చెను ఆనాటి విజయనగర రాజ్య పాలకుడు మూడవ శ్రీరంగరాయలు ఈతని పాలన కాలమున విజయనగర రాజ్యము చిన్నాభిన్నమయ్యెను తంజావూరు మధుర జింజీలను పాలించు సామంత ప్రభువులు శ్రీరంగరాయల మాట వినుటలేదు వారిని అదుపులో పెట్టు సామర్థ్యము శ్రీరంగరాయలకు లేదు ఒక వైపు గోలకొండ నవాబు మరియొక వైపు బిజాపూరు నవాబు రాయల సామ్రాజ్యమును ఆక్రమించు యత్నములోనుండి కొంతవరకు కృతకృత్యులగుచుండిరి ఇట్టి విపత్కర పరిస్థితి నెదుర్కొనుటకు శ్రీరంగరాయలు ఢిల్లీ పాదషా సహాయమును నపేక్షించెను ఆనాటి ఢిల్లీ పాదుషా మొగలాయి చక్రవర్తి అగు షాహజహాను రాయల అభ్యర్థనమును ఢిల్లీ పాదుషా పెడ చెవిని బెట్టెను ఎటు చూచినను రాయలకు సాయము వచ్చు జాడకనిపించలేదు

గోలకొండ నవాబు విజయనగర రాజ్యమును కబళించుటకై తగిన సరదార్లను ఫౌజును పంపెను అందులో అలముఖాను గూడ ఉండినట్లు తెలియుచున్నది వీరు కందుకూరు బయళ్ళలో విడిసిరి కందుకూరు నేటి ఒంగోలు జిల్లాలో నున్నది గోలకొండ నవాబు తన రాజ్యముపై దండెత్తి వచ్చుచుండినట్లు శ్రీరంగరాయలకు తెలిసెను అతడు దామెర వేంకటప్పనాయని సాయము అర్థించెను వేంకటప్పనాయడు అయ్యప్పనాయని కుమారుడు అతడు మిక్కిలి పరాక్రమవంతుడు రాయలకు నమ్మిన బంటు

వేంకటప్పనాయడు తన దేవరకొండ రాజ్యమునకు తన తమ్ముడైన చెన్నప్పనాయని కాపుంచి కొంత దండును వెంటబెట్టుకొని రాయల సైన్యముతో కలిసెను గోల్కొండ నవాబు సైన్యము రాయల సైన్యము కందుకూరు వద్ద యుద్ధమునకు తలపడినవి పోరు ఘోరముగ జరిగినది వేంకటప్పనాయడు యవన వీరులను తుదముట్టించెను తుదకు విజయము రాయలకే లభించినది ఇట్లు తనకు విజయము గూర్చిన వేంకటప్పనాయనికి శ్రీరంగరాయలు బిరుదములు సింహతలాటములు బహుమానములుగ ఒసగెను కాళహస్తి వందవాసి చెంజీలను జాగీర్లుగా అతనికి ఇచ్చెను ఇట్టియుద్ధమున గోలకొండ నవాబు పక్షమునుండి వేంకటప్పనాయనితో సమరము చేసినవాడు అలముఖాను ఇతనికి వేంకటప్పనాయడు అనినచో మత్సరము ఎక్కువ ఈవిషయమే వేంకటప్పనాయని పొగడుచు చాటుపద్యమణిమంజరిలో ఒక కవి చెప్పిన పద్యములలో ఇట్లున్నది

"మన్నె మార్తాండుతో మత్సరంబేటికి
మానుమీ అలంఖాన్ ఖానరాయ"
(చా మం II 332)

అలముఖాను కందుకూరు పాలకుడో లేక గోలకొండ సేనానియో అయి యుండినట్లు తోచుచున్నది మన్నె మార్తాండుడు అనగా మన్యపు పాలకులకు సూర్యుని వంటివాడు మన్య ప్రభువుల పీచమణచుటలో వేంకటప్పనాయడు దిట్ట అని అర్థము అట్టి పరాక్రమశాలి యగు వేంకటప్పనాయనితో నీకు అసూయ ఏల ? అని ఒక కవి అలముఖానుకు హితమును ఉపదేశించినట్లు ఈపద్యమున కనవచ్చుచున్నది

తం ఆం శా

## అలమేలమ్మ

విజయనగరమున శ్రీకృష్ణదేవరాయలవలెతంజావూరులో రఘునాథభూపాలుడు (క్రీ శ 1614 1633) సరసకవితా సనాథుడనియు కవి పండిత పోషకుడనియు కీర్తి గాంచెను రఘునాథ భూపాలుని కుమారుడు విజయరాఘవనాయకుడు (క్రీ శ 1633-1673) తండ్రి యనంతరము నాయకరాజ్యమును పాలించెను తండ్రివలె విజయరాఘవనాయకుడు గూడ అనేక కృతులు రచించి కృతికర్తగా కృతిభర్తగా కవి పండిత పోషకుడుగా లలిత కళోద్ధారకుడుగా పేరొందెను తండ్రి యాస్థానమున రామభద్రాంబ మధురవాణి మొద

లైన విదుషీమణులున్నట్లే విజయరాఘవనాయకుని యాస్థాన మున రగాజమ్మ మొదలైన కవయిత్రులు విదుషీమణులును ఉండిరి గా ధర్మమునను భరత శాస్త్రమునను ఆరితేరిన విదుషీమణు లెందరో విజయరాఘవనాయకుని యాస్థా మున కలంకారమలైరి అట్టివారిలో అలమేలమ్మయొ రు విజయ రాఘవనాయకుడు పేరోలగ ము డునపు డెల్ల నిస్తులగుణ ప్రశ స్త యగు కస్తూరెమ్మయు నళినిశాల నయనా బుజ యగు నంబుజ వల్లెమ్మయు ప్రఖ్యాత కీర్తిగల మోహన మూర్తమ్మయు సరస గుణ నిష్ణాతయగు కృష్ణాజమ్మయు ఇలమేల న దగు నలమేలమ్మయు నాట్య చాతుర్య విఖ్యాత యగు సీతమ్మయు మహనీయతర రూప రేఖయగు మదనరేఖ మ్మయు మొదలుగా గల కాంతామణులు పరివేష్టి చి యు డెడువారని రంగాజమ్మ తన మన్నారుదాసవిలాస ప్రబంధమున (I 15) పేర్కొన్నది

డా వి రా

## అలమేలు మంగాపురము

పవిత్ర పుణ్యక్షేత్రములలో ముఖ్యమైనది మంగాపురము దానికి ప్రతినామము అలమేలుమంగాపురము మంగాపురము చిత్తూరు జిల్లాలో చంద్రగిరి పట్టణమునకు సమీపమున కలదు ఇది శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్యక్షేత్రమగు తిరుపతికి పశ్చిమమున సుమారు 8 మైళ్ళ దూరమున దు ఉన్నది ఇచ్చట అనేక దేవాలయములు గలవు

స్కాందపురాణము దలిశ్రీవేంకటాచలమాహాత్మ్యమునందు మరియు శ్రీర గమాహాత్మ్యము దశమాధ్యాయమున దు అలమేలుమంగాపుర మాహాత్మ్యము వర్ణింపబడినది ఈపట్టణ ము ను విజయనగర ప్రభువులు తాళ్ళపాకవారికి సర్వమాన్య అగ్రహారముగా నొసంగినారు

అలమేలుమంగాపురమునందలి శ్రీ కళ్యాణ వే క టేశ్వరస్వామివారి ఆలయపు సింహద్వారము కుడివైపున దు ఒకశాసనముకలదు (తి దే శా నెం 144) దీనిని శ్రీతాళ్ళ పాక పెదతిరుమలయ్యగారి కుమారుడు చిన్నతిరుమలయ్యం గారు వ్రాయించినారు

శాసన విషయము: స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలి వాహన శకవర్షములు 1463 (క్రీ శ 1541) అగు శార్వరి సంవత్సర చైత్ర శుద్ధపౌర్ణమి చిత్తా నక్షత్రమునందు శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాచార్య శ్రీరామానుజసిద్ధాంత స్థాపనాచార్య వేదాంతాచార్య కవితార్కిక కేసరి శరణాగత వజ్రపంజరు లైన తాళ్ళపాక పెదతిరుమలయ్యంగారి కుమారుడు శ్రీచిన్న తిరుమలయ్యగారు స్కందపురాణోక్తమైన శ్రీవేంకటేశ్వర మాహాత్మ్యమునందు శ్రీర గమాహాత్మ్యము దశమాధ్యాయము న దు వర్ణింపబడిన వికల్యనది దేవళ తీర్థము దు తమకైం కర్యముగాను తమ అగ్రహారమగు అలమేలుమంగాపురము నందు జీర్ణదేవాలయోద్ధరణమునకుగాను శ్రీ వేంకటేశ్వరు లను నాచ్చియారును అనంత గరుడ విష్వక్సేనాది పెరు మాళ్ళను ఆళ్వారులను ఉడైవరులను పూర్వాచార్యులను (క్రోత్తాళ్వాన్ శ్రీవేందాతదేశికన్ మొదలగు వారు) ఆచార్యులైన అన్నమాచార్యులను ప్రతిష్ఠచేసి ఆళ్వారులదగ్గర సాయంకాల సమయమున నిత్యాను ధానములను నిర్వ ర్తించి ఆచార్యపురుషులు జియ్యరు వైష్ణవుల సన్నిధి యందు ప్రొద్దు గ్రుం కిన పిదప పెరుమాళ్ళకు అరగి పు ఫల చందనగోష్ఠి మొదలగునవి గావించుచు ఈప్రకారముగానే పుత్ర పౌత్రాభివృద్ధిగా ఆచంద్ర తారార్కముగా జరుగునట్లు ఏర్పాటు చేయబడినది ఈశాసనము పెరియకోయిల్ కేళ్వి యతి రాజయ్యంగారిచేత వ్రాయించబడినది ఇతడు మనవాళ జియ్యరుగారి శిష్యుడు

అలమేలుమంగాపురమునందలి శ్రీకల్యాణవేంకటేశ్వర స్వామి ఆలయపు సింహద్వారము ఎడమవైపున ఒకశాసనము గలదు (తి దే శా I నెం 145) శ్రీవైష్ణవ మతోద్ధారకుల సంస్మరణార్థము తిరునక్షత్రముల జరుపుట ఆకాలపు విశే షాంశములలో నొకటియై యున్నది ఈ శాసనము దు ఆళ్వారుల మరియు ఆచార్యుల సెలసరి తిరునక్షత్రముల పట్టిక (ఆచార్యులు లేక ఆళ్వారులు జన్మి చిన నక్షత్రములు) గలదు

అశ్వనీ నక్షత్రమునందు కందాళ ముదలియా డన్‌గారి తిరునక్షత్రము భరణినక్షత్రమందు పెరునంబియారుతిరు క్షేత్రము కృత్తిక నక్షత్రమునందు తిరుమంగయాళ్వారుల తిరునక్షత్రము రోహిణి నక్షత్రమునందు తిరుప్పాణాళ్వారుల తిరునక్షత్రము మృగశిర నక్షత్రమున దు తిరుకచ్చియాళ్వారుల తిరునక్షత్రము ఆరుద్ర నక్షత్రమున దు ఉదయవరు తిరునక్షత్రము పునర్వసు నక్షత్రమునందు కులశేఖరాళ్వారుల తిరునక్షత్రము పుష్యమి నక్షత్రమున దు పెరియతిరుమలనంబి తిరునక్షత్రము జరుగు నట్లుగా శాసనమునందు వ్రాయించబడినది

యీశాసనముయొక్క రెండవభాగమునందు ఈ అలమేలు మంగాపురము అగ్రహారమునుండి వచ్చు ఆదాయమును శ్రీ వేంకటేశ్వరస్వామివారికి సమర్పించునట్లుగా నున్నది

ప్రతిమాసమునవచ్చు బహుళ శుద్ధ దశమి తిథులయందు మరియు రెండు ఏకాదశి తిథులయందు పూర్ణిమ అమావాస్య లయందు పండుగ చేయునట్లు ఏర్పాటు చేయబడినది

చిన్నతిరుమలాచార్యులు తన తండ్రి స్మారకార్థము నూతనముగా గోవిందరాజస్వామివారికి కళ్యాణోత్సవమును ఏర్పాటు చేనట్లు తెలియుచున్నది ఇదే ప్రకారము ఇతర నిర్మింపజేసెను

మంగాపుర పురోభివృద్ధికిని శ్రీవేంకటేశ్వరస్వామివారి సేవలకును తాళ్ళపాకవారు తమ సర్వస్వమునర్పితము చేసిరి ఈసందర్భమున వారి వంశవృక్షమును తెలిసికొనుట ముఖ్యము

పెదతిరుమలాచార్యుల కుమారుడు చిన్నతిరుమలాచార్యులు వేంకటేశ్వరస్వామికి దిగువ తిరుపతిలోని దేవుళ్ళకు చాల కైంకర్యములు చేయించినాడు

గోవిందరాజస్వామికి కళ్యాణము ఉత్సవము జరుపుటకు "నేడియం" అను గ్రామపు రాబడిలో సగము ఇచ్చుట్లును




దేవతలకుకూడా నిత్య ధూప దీపాదులకు ఏర్పాటు చేసినట్లు తెలియుచున్నది

పెదతిరుమలాచార్యులుగారు అచ్యుతరాయలవారి ఆజ్ఞానుసారముగా వెంకటేశ్వర కీర్తనలు ఎన్నింటినో గావించి వారు అయనయే స్వామిపుష్కరిణి దానికిమెట్లు మంటపము గోవిందరాజు విఠలేశ్వర అచ్యుతపెరుమాళ్ రఘునాథ వరదరాజ లక్ష్మీనారాయణులకు హనుమదాలయమునందు తను ప్రతిష్ఠించిన నరసింహస్వామి మొదలగువారి సేవలకై చిత్తా నక్షత్రములోను తన జన్మ దినోత్సవ కాలమునను వైశాఖ మృగశిరనక్షత్రములలో తన తండ్రిగారికి తిరువాళ్ళ

కాలమునందు గోవిందరాజస్వామి ఆలయముదగ్గరి సుదర్శన చక్రానికి కైంకర్యముల కొరకు "...దుమపాక్కమను" గ్రామమును అర్పించుచు శాసనములు చెక్కించినారు

అలమేలుమంగాపురమునందు కల్యాణవెంకటేశ్వర దేవాలయమును పునరుద్ధరణము గావించి స్వామి దివ్య విగ్రహమును నెలయించి భార్యలతో భావ్యకార్లతో దేశికులతో పాటు తన తాతగారగు అన్నమాచార్యులగారి విగ్రహమును గూడ ప్రతిష్ఠ చేయించినారు వీరు ప్రతిష్ఠించిన అన్నమాచార్యుల విగ్రహమును ఎవరో తొలగించిరి ప్రస్తుతమచట లేదు కల్యాణవేంకటేశ్వరదేవాలయమందు చిన్నతిరుమలాచార్యులు చెక్కించిన శాసనములు తెలుగునందు గలవు చాగంటి శేషయ్యగారి ఆంధ్రకవితరంగిణిసంపుటి 8లో భాగమును బట్టి అన్నమయ్య దేవాంశ సంభూతుడుగ చెప్పుచున్న

"శ్రీమహావిష్ణువు వక్షస్థలమందలి కౌస్తుభమే శఠకోప యతీగా అవతరించెను శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయపు గంట అంశమున వేదాంతదేశికులుగా జన్మించినారు వేంకటేశ్వరస్వామివారి నందకాంశమునకే (ఖడ్గము) శ్రీ అన్నమయ్యగారు జన్మించినట్లుగా ప్రఖ్యాతి గలదు

అన్నమాచార్యుల తండ్రి తాతలు తాళ్ళపాకయందు (రాజంపేటతాలూకా కడప జిల్లా) కాపురముండుటచే వారి ఇంటిపేరు తాళ్ళపాకవారు అని ఏర్పడినది వీరు నందవరీక బ్రాహ్మణులు ఋగ్వేదీయులు ఆశ్వలాయన సూత్రులు భారద్వాజ గోత్రులు ఇట్టి వంశమున పరీక్షాగ్రేసరుడగు నారాయణసూరి (అన్నమయ్య) అను విష్ణుభక్తునకు అక్కమాంబ గర్భమందు శ్రీవేంకటేశ్వర వరప్రభావముచే కారణజన్ముడై పెదతిరుమలాచార్యులు జన్మించినాడు

ఈతాళ్ళపాకవారు అలమేలుమంగాపురమునందు ఎన్నియో జీర్ణదేవాలయముల నుద్ధరించి వైష్ణవమత ప్రాబల్యమునకు తోడ్పడినారు శాసనాధారము ననుసరించి చిన్నతిరుమలాచార్యులు శాలివాహన శకము 1468 సంవత్సరమునకు చెందినవాడు అగుటవలన ఆకాలమునకే చెందిన విజయనగర సార్వభౌముడైన అచ్యుతరాయలు ఈయనకు సమకాలికుడు ఈమంగాపురము పూర్వము విజయనగర ప్రభువులచేత సర్వమాన్యాగ్రహారముగా తాళ్ళపాకవారికి ఒసంగబడుటయే వీరిద్దరకుగల చిరపరిచయమును తెలియజేయును తాళ్ళపాక చినతిరుమలాచార్యులగారిచే పునరుద్ధరింపబడిన మంగాపురమునందలి శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామివారి దేవళము ప్రస్తుతము జీర్ణమై యున్నది శ్రీవేంకటేశ్వర స్వామివారి విగ్రహము పీఠమును 8 అడుగుల ఎత్తుగలదు కాని తిరుమలలోని స్వామివారివిగ్రహము కుండు కళాకాంతులు ఈవిగ్రహములో లోపించియున్నట్లు కనిపించును ప్రస్తుతము ఇచట ఆరాధన నైవేద్యములు లేవు

టి కె వి

## అలరాజు

అలరాజు చల్లమాదేవి కొమ్మరాజుల పుత్రుడు ఇతడు రాచమల్లు అల్లుమల్లు బిరుదాంకితుడు సకలవిద్యాపారంగతుడు ఇతని పితామహుడు క్రీ శ 12వ శతాబ్దిలో కల్యాణి నేలిన కలచూరి వీరసోమేశ్వరుడు ఇతని మేనత్తయైన సిరాదేవి మాచర్ల ప్రభువైన మలిదేవరాజునకు పట్టమహిషి అంతియేగాక అలరాజు గురజాల నేలు నలగామరాజుయొక్క ముద్దుల పట్టియగు పేరిదేవిని వివాహమాడి యారాజునకు యల్లుడైనాడు అందులకే ఇతడటు మాచర్ల నేలు మలిదేవాదులకు ఇటు గురజాల నేలు నలగామాదులకు సన్నిహిత బంధువైనాడు వీరసోముని మరణానంతరము కాలము కలిసి రాకపోవుటచే కొమ్మరాజు కల్యాణమును వదలి బ్రహ్మనాయుని ప్రోద్బలముచే సకుటుంబముగ మాచెర్ల చేరి మలిదేవాదుల ప్రాపున కాలము గడుపసాగెను వీరసోమునకు ఐదుగురు పుత్రులు వీరైదుగురిలో నొక్క కొమ్మరాజునకు దప్ప మిగిలిన వారెవ్వరికి మగసంతు లేదు అందుచేతనే అలరాజు వారందరి మధ్య అల్లారుముద్దుగ పెరిగి పెద్దవాడైనాడు అలరాజు వంశీయులందరు పేరు పొందిన శివభక్తులు శైవమత పోషకులు వీరు చంద్రవంశపు రాజులు

పల్నాటి చరిత్రలో అలరాజునకు గణనీయమైన పాత్ర యున్నది కురుపాండవులకు బావయైనవాడైన శ్రీకృష్ణుడు భారతరణమునకు పూర్వము పాండవుల తరపున కౌరవులవద్దకు రాయబారమేగిన చందమున ఇరుపక్షములకు బంధువగు అలరాజు పల్నాటి యుద్ధమునకు పూర్వము మలిదేవాదుల పక్షమున గురజాలకు రాయబారమేగెను అలరాజును రాయబారిగ పంపవలెనని మొదట ప్రతిపాదించినది మలిదేవరాజే అలరాజు సామవాక్యములతో శత్రువుల నైన మెప్పింపగల మేటి శాంతుడని మలిదేవరాజుచే కొనియాడబడినాడు అలరాజును రాయబారమంపుట యతని తల్లి

దండుల కిష్టము లేదు బ్రాహ్మణుడుగాని భట్టుగాని రాయబారములు పోవలెగాని రాజులెవ్వరైన రాయబారమునకు బోయిరాదియని కొమ్మరాజు తన అయిష్టతను తెల్పినాడు కాని బ్రహ్మన్న కూడ అలరాజునే రాయబార మంపుట మంచిదని సూచించి తన కుమారుడైన బాలచంద్రుని అలరాజునకు మారుగా కొమ్మరాజుగద్దె ఇల్లడ బెట్టుటచే వేరు గత్యంతరము లేక కొమ్మరాజు చల్లమాబలు కుమారుని రాయబార మంపుటకు ఒల్లెయనిరి

గురజాలకు రాయబార మేగునపుడు అలరాజు తన తోడి మరియొక రాజును దర్శించు రీతిన సకల హంగులతో బయలుదేరి వెళ్ళుట గమనార్హము ఇతడాసమయమున ననేక బిరుదులు ధరించి వీరసోముడు తనకు బహూకరించినట్టి మణుల కిరీటమును గూడ ధరించి కన్నుల పండువుగా నలంకరించిన నవరాలగోడిగ యను నుత్తమాశ్వము నధిరోహించి కన్నమనేడు కాల్బలముతో వెంట నడువ అలరాజు వీర మేడపి వదలి గురజాలకు కదలివెళ్ళినాడు అతడు త్రిపుర వరము వల్లివేముల కంభముపాడు గడచి కోలేరు దాటి రెంటాల మీదుగా గురజాల సమీపించి తన రాకను భట్టుచే తెలియబరచినాడు నలగాముని కొలువుకూటపు మొగసాల వద్ద పల్లకీదిగి పావాలు దొడగి అలరాజు సభలో ప్రవేశించగనే అచట కొలువున్న రాచదొరలెల్ల దిగ్గునలేచి భక్తితోడ కరములు మొగిచిరట! దీనిని బట్టి చూడ అలరాజు ఎంతటి పేరు ప్రతిష్ఠలు గల్గిన వ్యక్తియో స్పష్టమగుచున్నది ఇతడు రాయబారము నిమిత్తము గురిజాల కేతెంచినప్పటికిని నలగాముని యెడల కొంతవరకు బంధుమర్యాదలు జరుపుట గమనార్హము తదనంతరము అతడుచిత రీతిన తాను వచ్చిన కార్యమును నలగామ రాజునకు దెలిపినాడు ఆసందర్భములో నేను నీకు అల్లుడను అవుదను కాబట్టి నామాట మన్నించి న్యాయముగా దాయాదులయొక్క రాజ్యమును వారి కొసంగుట ధర్మమని అలరాజు నయబోధ జేసినాడు అందుపై నలగాముడు అగిమీద గుగ్గిలమువలె నెగిరిపడగా అలరాజు అతనిని సరకు గొనక మాటకు మాట సమాధాన మిచ్చినాడు కోడి పందెములో మలిదేవాదులు ఓడిపోయిన రాజ్యమును తిరిగి ఇచ్చు ప్రసక్తి లేదనియు ఒకవేళ వారు యుద్ధమునకు దలపడినచో వారి నెదుర్కొనుటకు తనవద్ద విశేష బలములు న్నవని నలగామరాజు పలుకగా అలరాజు అతని బెదిరింపులను లక్ష్యపెట్టక ఆబలము లన్నిటిని ఎదుర్కొనుటకు తమ వద్దనున్న మువ్వురు సుర్లు ఎదుగువంగొన కుళే చాలునని నలగాముని బిరుదువీరుల నగరిని యెదుర్కొనుటకు తానొక్కడు చాలునని జవాబిచ్చినాడు అంతలో చింతపల్లి రెడ్డి నలగామునకు వావు బోధిచు చుండ నాయకురాలుతో వ్యాముగలించుకొని మలిదేవాదులను దూషించినది అందుపై అలరాజు కోపించి నాయకురాలును మట్టు బెటుటకు కత్తి యెత్తెను అపుడామె భయపడి నలగాముని వెనుకకు బోగా అలరాజు ఎత్తినకత్తిని దించరావని తలంచి యెదుటనున్న ఉక్కుకంబమును నడిమికి రెండుగా నరికి శాంతించినాడట తదనంతరము నలగాముడు అలరాజును తన విడిదికి వేంచేయవలెనని కోరినప్పటికిని అతడు మామ కోర్కెను నిరాకరించి మేడపికి తిరుగు ప్రయాణము గట్టినాడు

గురజాలనుండి తిరిగి వచ్చునాటిరాత్రి అలరాజు చెర్లగుడిపాడులో విశ్రమించెను అట అలరాజు నెట్లైన కడతేర్పవలెనని నాయకురాలు పరిపరి విధంబుల దలంచి మరునాడు వేకువ జామునవే తంబళ్ళకొమ్మజియ్యరును బిలిపించి పూల చెండ్లు దెప్పించినది ఆఘ్రాణించిన తక్షణమే ప్రాణములు తీయగల ఔషధక్రియల నాపూలచెండ్ల యందు జొనిపి యంత్ర తంత్రములను గూడ నందుంచి కొమ్మజియ్యరునకిచ్చి యెట్లైన నతడాచెండ్లను అలరాజునకు సమర్పించి యతనిచే నాఘ్రాణింప జేయవలెనని శాసించినది జియ్యరు రాచెండ్లను గొని చెర్లగుడిపాడున కేతెంచి ప్రయాణమై పోవుచున్న అలరాజున కెదురేగెను జియ్యరును జూచి అలరాజు సంతసించి గత పరిచయమును పురస్కరించుకొని వానిని చేర బిలిచి ప్రేమతో కుశల మడిగెను అపుడు జియ్యరు మొసలికన్నీరొలకించుచు వారు గురజాల వదలిపెట్టి పోయినప్పటినుండి తన స్థితి యేమియు బాగులేదనియు తన కిష్టము లేకున్నను నాయకురాలి యాజ్ఞతి చొప్పున ఆమె పూజకై ప్రతిదినము పూలు దెచ్చి యిచ్చుచుంటినియు నాడు కూడనట్లే గొంపోవుచుంటిననియు చెప్పెను అందుపై అలరాజు రాజ్యమును మేము బొందినవెంటనే నిన్ను తిరిగి చేరదీతుమని జియ్యరు నోదార్చెను తదనంతరము అతడు జియ్యరుతో నాయకురాలేమి? దైవపూజలు ధర్మకార్యములు జేయుటఏమి? యని హేళనగాబల్కి యతని వద్దనున్న పూలబుట్టను గైకొనెను అంతట జియ్యరు మెల్లగా జారుకొనెను

జియ్యాల పద్ద గ్రామంన పూలచె దను ఆ భూమి చి అందలి విషమ అలకెక్కగా అలరాజు ప్రభు కొల్పె సాగెను అతడు తన శక్తిని కన్నమనేడన కెరిగి పగా అతడు అలరాజును ఆశ్రయముపైన డి ది ఒక ట్టు నీడను ఒరు డ బెట్టెను అలరాజు వెంట నాగమ్మ చేసిన మో ము నెరింగిన వాడై ఆవార్తను గురజాల రాచనగరులో దెల్పి తన ధర్మ పత్నియగు రత్నాల పేరమ్మను దోడ్కొని రావలసనదిగ కన్నమను గోరినాడు

కన్నమనేడు ఆదే ధముగా గురజాలకేతె చి ఆవార్త నచట దెలుపగా పేరమ్మ వేదన డుచు తన తండ్రిని నాగమ్మను దూషించుచు రయమున భర్తవద్ద కరుదెంచి ది ఆమె భర్తపై బడి విలపించుచునే ఆమె త లో భర్త నీక్రింది విధముగా కీర్తించినది

"అలరాజు సకల విద్యాప్రసంగముల
తులతూగ నీపాటి దొరలెందు లేరు
విలువిల్లు నాటెరవెట కయ్యమున
ఇలలోన డెబ్బది యేడందలముల
మనుజనాథుల నిమున మాత్రాన చంపి
ఘన శౌర్య సంపదగ టి వడిగాక
తక్కక నీవు పోదాటి కయ్యమున
ఒక్కడె గెలిచిన యురు బలాఢ్యుడవు
తగిన కులమున పుట్టి తగని యాచావు
సీకెట్లు వద్ది చె యేటని మీద
అట్టి సాహస మెందు అంగెనో రాజ
ఎట్టి యాచార్యము లి కెనో రాజ
అ దుకే వగచెదనయ్య గావి క

అంతలో అలరాజు కు కొ చెము స్పృహ వచ్చినది అతడు తక్షణమే కన్నమను జే బిలిచి తన బిరుదులన్నిటిని దీసి యతనికిచ్చి అందు ముఖ్యమై వాటని వరాలగోడిగతో బాటు బాలచంద్రుని కివ్వవలసి దిన జె ప్పి అసువుల బా నాడు తదనంతరము పేరమ్మ భర్త శవము ను మేడలకి గొనిపోయి జంగముల పూజించి శివుని ధ్యాని చి భర్తతో సహగమనము జేసినది అలరాజు మరణముతో మాచెర్లకు గురజాలకు మధ్య సంధి కుదురునన్న యాశ పూర్తిగా సన్నగిల్లుటయే గాక పల్నాటి యుద్ధ మనివార్య మైపోయినదని చెప్పదగును

ఆ చెం

అలయమప్పడిరాజు చూ ఆంబోళరాజు

ఒలహాబాదు

అలహాబాదు శాసనప నకు బ ధి చిన విరవములు రెడ్డిరాజ్యము (137 పుట) న దను క ళ గ దేశ చరిత్ర (463 పుట)లోను కనవచ్చుచున్నవి ఇ దు చ ద్రగుప్తుని కుమారుడైన సముద్రగుప్తుడు దక్షిణ దేశ ప్రభువులను జయి చిన వృత్తా తము కలదు ఈశాసనము సంస్కృత వచనములో నున్నది

గుప్త వ శ ప్రభువైన చంద్రగుప్తుడు పాటలీపుత్రము రాజధానిగా మగధదేశమును క్రీ శ 310 మొదలుకొని 340 వరకు పాలించెను అతనికి ఎమ్మట అతని కుమారుడు సముద్రగుప్తుడు రాజయ్యెను సముద్రగుప్తుడు అన్ని విద్యల యందు ఆరితేరినవాడు ప్రజారంజకముగ రాజ్యమును పాలించునట్టివాడు చిరకాలము భూమిని పాలింపుమని తన తండ్రిచే వరమును బడసినవాడు సమరవిద్యలో మిక్కిలి నైపుణ్యముకలవాడు ఈయన క్రీ శ 348వ దక్షిణదేశముపై దండయాత్ర సలిపి అనేకరాజులను జయించి తన దిగ్విజయ వృత్తాంతమును శిలాస్త భముపై వ్రాయించెను ఈశాసనము అలహాబాదునందలి అశోకుని శాసనము ప్రక్కన అదే శిలపై చెక్కబడినది ఈ శాసనలేఖకుడు సముద్రగుప్తుని మ త్రియు మహాద డనాథుడును అగు హరిసేనుడనువాడు శాసనము నందు సముద్రగుప్తునకు అనేకవిశేషణములు వాడబడినవి అందులో నొక విశేషణము సముద్రగుప్తుడు దక్షిణాపథము న దలి రాజులను జయి చి ట్లు తెలుపుచున్నది అది ఈక్రింది విధముగ ను న్నది

కౌ ల మహే ద్ర మహాకా తారకవ్యాఘ్రరాజ కైరలక మ టరా పైష్టపురక మహే ద్ర గిరికౌట్టూరక స్వామి దత్త ఐరండపల్లకదమన కా చేయక విష్ణుగోప అవముక్తకనీలరాజ వై ఙ్గేయకహస్తివర్మ పా లక్క క ఉగ్రసేన దైవరాష్ట్రికకుబేర కౌస్థలపురకధనంజయ ప్రభృతి సర్వదక్షిణాపథ రాజగ్రహణ మో క్షా ను గ్ర హ జనిత ప్రతాపోన్మిశ్ర మహాభాగ్యస్య

శాసనము నందలి గద్యవలన సముద్రగుప్తునిచే ఓడింప బడిన రాజులలో కోసలాధిపతి యగు మహేంద్రుడు మహా కాంతారమునకు పాలకుడగు వ్యాఘ్రరాజు కురాళ

(కరలక?) దేశ ప్రభువగు మంటరాజు పిఠాపురమును పాలించు మహేంద్రుడు గిరికొత్తూరు ఏలిక అగుస్వామిదత్తుడు ఏరండపల్లిని పాలించు దమనకుడు కంచి రాజధానిగా పాలించు విష్ణుగోపుడను పేరుకల పల్లవరాజు అవముక్త దేశాధీశ్వరుడగు నీలరాజు శాలంకాయన వంశీయుడును వేంగి రాజధానిగా పాలించు హస్తివర్మయు పాకనాడు లేక పాలకవాటని పాలించు ఉగ్రసేనుడు అనువారు కలరు వీరిని సముద్రగుప్తుడు మరమున ఓడించి వీరివలన అమూల్యములైన కానుకలు గ్రహించి వీరి రాజ్యములను తిరిగి వీరికి ఇచ్చివైచెను సముద్రగుప్తుడు ఉత్తరదేశమునందే కాక దక్షిణదేశమందుకూడ తన సార్వభౌమత్వమును ప్రకటింప నెంచి దక్షిణదేశ విజయమునకై బయలుదేరినట్లు తోచుచున్నది పరరాజ్యములను ఆక్రమింపగోరినవాడే యైనచో సముద్రగుప్తుడు తాను జయించిన రాజ్యములను తిరిగి ఆయారాజులకు అప్పగించుట జరిగియుండదు ఇంచుమించుగ ఇతడు దక్షిణాపథమందలి తూర్పుతీరమున ఉన్న రాజ్యముల నన్నిటిని జయించెను ఇట్లు దక్షిణదేశమున కంచి వరకు జయించి ఇతడు అశ్వమేధ యజ్ఞ మొనరించినట్లు తెలియుచున్నది

శాసనమున కనవచ్చు దక్షిణదేశరాజ్యముల ఉనికి నేడు ఇట్లు గుర్తింప వీలగుచున్నది కోసలమునకే మహాకోసలము దక్షిణకోసలము అను నామాంతరములు కలవు ఇది నేటి మధ్యపరగణాలకు తూర్పుభాగమని గుర్తింపబడినది కోసలమునకు దక్షిణ తూర్పుభాగములందు మహాకాంతారము కలదు ఈ మహాకాంతారమునకే ఝూడేశవనము ఝూర్ఖండము ఝూడే అను నామాంతరములు కనవచ్చుచున్నవి ఇవి నేటి గంజాము విశాఖపట్టణము జిల్లాల ఏజన్సీ భాగమని తెలియుచున్నది దీనిని అల్లాడరెడ్డి పెద్దకుమారుడును రాజమహేంద్రవర పురాధీశుడగు వీరభద్రారెడ్డి అన్నయును అగు వేమారెడ్డి అరిహేటి లింగనమంత్రి సాయముతో ఆక్రమించినట్లు కాశీఖండ భీమేశ్వరపురాణముల పీఠికలలో నున్నది మహాకాంతారమునకు తూర్పున కురాళ (కరలక?) దేశము కలదు ఇది నేటి ఉత్తరగంజామని గుర్తింపబడినది నేటి పిఠాపురమునకే పూర్వము పిష్టపుర మను పేరు కలదు కొత్తూరు నేటి శ్రీకాకుళము మండలమున కలదు ఏరండపల్లి అనగా ఆముదాలవలస కావచ్చును పాకనాడు లేక పాలక్కాడు అనునది నేటి నెల్లూరు ప్రాంతము దేవరాష్ట్రమను నది నేటి విశాఖపట్టణము జిల్లాలోని ఎలమంచిలి ప్రాంతమై యున్నది కుస్థలపురము నేటి పార్వతీపురమై యుండునని తోచుచున్నది దీని నందపురమనియు నామాంతర ముండినట్లు తెలియుచున్నది

సముద్రగుప్తుడు దక్షిణదేశమునందలి తూర్పు దిక్కునే జయించెనుగాని మధ్య పశ్చిమ ప్రదేశములను జయించలేదు దీనికి కారణము ఆనాడు ఈమధ్య పశ్చిమ ప్రదేశములకు లిచ్ఛవులు తనకు సామంతులును బంధువులును అగు వాకాటకు గుప్తుల ఆధీనమున నుండుటయే అని ఊహింప వీలగుచున్నది సముద్రగుప్తుని శిలాశాసనము మహాకోసలమునందు కనిపించినది అతని బంగారునాణెము విశాఖమండలమునందలి శకవరములోని బౌద్ధమఠమునందు లభించినది ఎల్లైనను సముద్రగుప్తుని సార్వభౌమత్వమును అంగీకరించి ఆనాటి దక్షిణదేశమునందలి రాజులు కొంతవరకు స్వతంత్రప్రతిపత్తి కలిగి యుండిరను విషయము స్పష్టమగుచున్నది సమకాలిక చరిత్రను అన్వయించుటకు సముద్రగుప్తుని అలహాబాదు శాసనము ప్రమాణముగా భావింపబడుచున్నది

ఖం అం శా

అలావదీన్ చూ అల్లాఉద్దీన్ హసన్ షా

## అలి-ఆదిల్ షాహ :

అలిఆదిల్ షా క్రి శ 1551 బిజాపురము నేలిన సుల్తానులలో నొక్కడు ఇతడు సుల్తాన్ ఇబ్రహీం ఆదిల్ షా ద్వితీయ పుత్రుడు అలిఆదిల్ షా దూరదృష్టి గల్గిన రాజనీతిజ్ఞుడు విజయనగర సామ్రాజ్య వినాశనమునకితని కుటిల రాజనీతి ప్రధాన హేతువైనది ఇతడు పట్టుదల గల వ్యక్తి తనకు నచ్చిన కార్యమెంతటి జటిలమైన దైనప్పటికిని ఇతడేదో విధముగా వాకార్యమును సాధించువాడేగాని నిరుత్సాహ నిస్పృహలతో మిన్నకుండువాడు కాదు ఇతడు సమయాసమయము లెఱిగి ప్రవర్తించు నేర్పు కలవాడు అవసరమగుచో నితడు ధనమును మంచినీటి ప్రాయముగ వెచ్చించి కార్యము చక్కబెట్టుకొనువాడు ఇతడు వితరణశీలి కళాప్రియుడు రాజ్యపాలనా విషయములందును యుద్ధనీతిలోను ఇతడు నాటి దక్కను సుల్తానులకు మేటిగాకున్నను సాటి యని మాత్రము చెప్పవచ్చును చుకుకు దన మొక్క పాలు ఇతనిలో అతని యన్నదమ్ములలోకంటె హెచ్చు

అలీ ఆదిల్ షా క్రీ॥శ 1558 సం॥లో బిజాపూరు సింహాసన మధిష్ఠించి క్రీ॥శ 1580 సం॥వరకు రాజ్యమును పాలించెను. ఇతనికి షియా మత మన్న యభిమానము కానియితని తండ్రి సున్నీ మత పోషకుడు. మత విషయమై తండ్రి కొడుకులు తరచు ఘర్షణ పడువారు. ఈ భిన్న మతాభిమానములు తండ్రి కొడుకుల మధ్య నుండవలసిన సహజ ప్రేమాదరణలను రూపుమాపినది. ఇది ఇట్లుండ ఇబ్రహిం ఆదిల్ షా జ్యేష్ఠ పుత్రుడగు ఇస్మాయిల్ ఇంచుక మంద బుద్ధి యగుటచేత బిజాపూరు ఉమ్రావులు అధికారులు కూడ అలీ ఆదిల్ షానే యెక్కువగా ప్రేమించువారు. ఇది కూడ ఇబ్రహిం ఆదిల్ షాకు కంటకముగ నుండినది. తన యనంతరము రాజ్యపాలన చేయవలసిన ఇస్మాయిల్‌ను నిర్లక్ష్య పరచి ప్రజలును అధికారులు అలీని యభిమానించుట ముమ్ముందెట్టి యనర్థములకు దారి తీయనో యని శంకించియు అలీయొక్క షియా మతాభిమానము రాను రాను రాజ్యము నందెట్టి కల్లోలములైన గల్గింపగలదని భయమును జెందియు ఇబ్రహిం ఆదిల్ షా పుత్ర ప్రేమ నించుక ప్రక్కకు ద్రోసి అలీని మిరాజ్ దుర్గములో బంధించెను. అతడట్లే తొమ్మిదియేండ్లు కారాగార వాసము జేసి తండ్రి మరణానంతరము విముక్తుడై క్రీ॥శ 1558 సం॥లో బిజాపూరు తఖ్తు నెక్కెను. అలీ సింహాసన మధిష్టించిన శుభ సమయమున అహమ్మదు నగరము నేలుచున్న హుసేన్ నిజామ్‌షా తప్ప దక్కనులోని రాజులందరతని నభినందించుచు తమ కతనియెడల గల సుహృద్భావమును ప్రేమాభిమానములకు చిహ్నములుగ వెలలేని కట్నములను కానుకలను బంపిరి. హుసేన్ నిజామ్‌షా అందువలె ఆదిల్ షా నభినందించక పోవుటకు రెండు రాజ్యముల మధ్య గల బద్ధవైరము వైషమ్యమే ప్రధాన కారణము.

అలీ రాజ్యాధికారము వహించిన వెంటనే తన స్థానమును పదిల పరచుకొనుట కుపక్రమించెను. అతడు తన రాజ్యములోనున్న అనేకమంది సున్నీ మతస్థులను నిర్దయతో దేశ బహిష్కృతుల గావించెను. వీరిలో చాలామంది విజయనగరమున కేగి అళియరామరాయల కొలువులో కుదురుకొనిరి. పిదప ఆదిల్ షా బిజాపూరునందు విరివిగా దాన ధర్మములు చేసి ప్రజల యాదరాభిమానముల జూరగొనెను. అంతియే గాక ఇరాన్ ఇరాక్ మొదలుగాగల మహమ్మదీయ దేశముల నుండి వేలకొలది షియా మతాభిమానుల రావించి వారికే కొదువ లేకుండా జూడసాగెను. అందుచేత బిజాపూరులో అలీ పక్షము బలపడుటకు వీలు గల్గినది.

అలీ ఆదిల్ షా పట్టాభిషేక సమయమున హుసేన్ నిజామ్‌షా యతని నభినందించ లేదు సరిగదా అలీ బాలుడని యెంచి బిజాపూరుపై దాడి చేయుటకు వలయు సమర సన్నాహములు గావింపసాగెను. ఈ వార్త విన్న ఆదిల్ షా కుపితుడయ్యెను. అతడు నిజామ్‌షాకు తగు పాఠము చెప్పు మార్గము నాలోచింపసాగెను. తన సేనతో పోయి నిజామ్‌షాను యుద్ధములో గెల్చుట సంశయాస్పదమైన విషయము. అతని నెదుర్కొనుటకుగాను తనకు మరియొక రాజుయొక్క సహాయము నావశ్యకమని ఆదిల్ షా గ్రహించెను. అందుచేత నతడెట్లైన విజయనగరాధిపతియగు అళియరామరాయల సహాయ మర్థించుటకు నిశ్చయించుకొనెను. ఇదే తరుణములో నట విజయనగరములో రామరాయలు తన చెట్టంత పుత్రుని గోల్పోయి శోకసముద్రములో మునిగి యుండెను. ఇది తెలిసి దూరదృష్టిగల్గిన ఆదిల్ షా తన రొట్టె విరిగి నేతిలో బడినదని సంతోషించెను. వెంటనే యతడు రామరాయల నోదార్చుటకై స్వయముగా విజయనగరమున కేగెను. రామరాయల కతడు తన సానుభూతితో పాటు అనేక కట్నములను కానుకలను అందజేసి యతని ప్రేమాదరములకు పాత్రుడయ్యెను. పుత్రశోకముతో కృశించి పోవలదనియు పుత్రుడు లేని లోటును దాను దీర్పగలననియు తనను తమ పుత్రునివలె భావించి వలసిన సేవలన్నిటిని తనచే జేయించుకొనవలసినదనియు ఆదిల్ షా యా వృద్ధ దంపతులకు పరిపరి విధముల జెప్పి వారి నోదార్చెను. వారతని నడతకు సంతసించిరి. రామరాయల సతియు నతనియెడ పుత్ర వాత్సల్యమును జూపిరి. కార్యార్థ మేతెంచిన వాడు వేగిరపడుట పాడిగాదని భావించి ఆదిల్ షా యచటే కొంతకాలము పాటు విజయనగరములో నుండి రామరాయల దంపతుల యెడల వినయ విధేయతలతో మెలగుచు వారి యాదరాభిమానముల జూరగొనుచు ఒక దినమున తనపై హుస్సేన్ నిజామ్‌షా కత్తిగట్టినాడనియు అనతి కాలములోనే తన రాజ్యముపై దండెత్తి రాగలడనియు తెల్పి యతని నెదుర్కొనుటకు రామరాయలు తనకు సహాయము చేయవలసినదని యర్థించినాడు. రామరాయలందులకు నొప్పె ననెను. ఇట్లు విజయనగరాధిపునిచే వాగ్దానమును గొని ఆదిల్ షా తృప్తిగా రాజధానికి మగిడివచ్చెను.

అనుకొనినట్లుగనే క్రీ శ 1558 సం లో అహమ్మద్ నగరము బిజాపురముల మధ్య యుద్ధ మారంభమైనది ఈ యుద్ధారంభమునకు కారణము భిన్న గ్రంథముల దు భిన్న విధములుగ పేర్కొనబడినది ఆదిల్ షా బాలుడగుటచే నతనిపై నహమ్మద్ నగర ప్రభువు దండెత్తి వచ్చెనని కొన్ని గ్రంథము లందున్నది రామరాయలు తనకు సహాయము జేతునని మాట నిచ్చిన యనంతరము విజయనగరమునుండి బిజాపూరునకు విచ్చేసిన వెంటనే అలీఆదిల్ షా అహమ్మద్ నగర ప్రభువు గతములో తమనుండి స్వాధీనము జేసుకొన్న కల్యాణి షోలాపూర్ దుర్గములను వెంటనే తనకు తిరిగి స్వాధీనము జేయవలెనని హుసేన్ నిజామ్ షాకు వర్తమాన మంపెననియు అందులకతడు దిరస్కరింపగా ఆదిల్ షా రామరాయలతోగూడి అహమ్మద్ నగర రాజ్యముపై దండెత్తెననియు మరికొన్ని గ్రంథము లందున్నది కయ్యమునకు కాలుదువ్వినవారెవ్వరైనప్పటికిని ఆదిల్ షా రామరాయలతో గలసి అహమ్మద్ నగర రాజ్యముపై బడినది మాత్రము సత్యము

విజయనగర బిజాపూరు సైన్యములు అహమ్మద్ నగర రాజ్యముపై పడి దోచుకొనసాగినవి ఈదాడిలో ఖబరునది వరెడావరకు అహమ్మద్ నగరమునుండి దౌలతాబాదువరకు గల ప్రాంతములన్నీ శత్రు సైన్యముల స్వేచ్ఛా విహారములకాలవాలమైనవి ఈస్థితిలో చేయునది లేక జామ్ షా ల్యాణి దుర్గమును ఆదిల్ షా కిచ్చుటకొడంబడి శత్రువులతో సంధి చేసుకొనెను తదనంతరము విజయనగర సేనలు వెనుదిరిగి పోయెను రాయలసైన్యము విజయనగరము చేరి దో లేదో ఇంతలోననే నిజామ్ షా ఇబ్రహి కుతుబ్ షాతో గూడి కళ్యాణిపై బడినాడనియు వెంటనే వచ్చి తనయాపద గడవబెట్టవలసినదనియు ఆదిల్ షా బిజాపూరునుండి బంపిన విన్నపము రామరాయలకందినది తక్షణమే రామరాయలు ససైన్యముగా వచ్చి ఆదిల్ షాతో గలసి కల్యాణిని జయించి అహమ్మదు నగరమును ముట్టడించెను ఈతరుణములో కుతుబ్ షా తన మిత్రుడైన నిజామ్ షాను వదలి ఆదిల్ షా పక్షమున జేరెను ముగ్గురు గలసి అహమ్మద్ నగరముపై ముట్టడి కొనసాగించుచుండిరి కాని నిజామ్ షా పక్షపాతియైన కుతుబ్ షా రహస్యముగ్గ నోషిసవిధముగ నిజామ్ షాకు సహాకరించుచుండెను ఈ విషయమ్ము రామరాయలకు తెలియవచ్చినది అందుచే రాయలు తన్ను శిక్షింపగలడని భయపడి అకస్మాత్తుగ ఇబ్రహి కుతుబ్ షా తన సేనలను దీకొని గోల్కొండ పోయెను ఈమధ్య కాలములో రాయ సైన్యములు జమీఖేడ్ వద్ద జామ్ షా సైన్యముల నోడించి యావదప దౌలతాబాదుకోటను కూడ బట్టుకొనినవి ఇంతలో వర్షాకాల మాసన్నమగుటచే రామరాయలు అహమ్మద్ నగర్ ముట్టడిని విరమించి వెళ్ళెను

పై దండయాత్రలలో విజయనగర సైనికులు అహమ్మద్ నగర రాజ్యమును నాశనముచేసి మహమ్మదీయులను హింసల బెట్టిరని పెరిష్టా వ్రాసియున్నాడు హిందూ సైనికుల యొక్క ఈ ప్రవర్తనకు కినిసి తదనంతరము దక్కను సుల్తానులందరేకమై తమమత సంరక్షణార్థము క్రీ శ 1565 సం॥లో విజయనగర రాజ్యముతో యుద్ధమునకు దలపడిరని కొందరు వ్రాసియున్నారు దక్కను సుల్తానుల కూటమి నేర్పాటు చేయుటకు అలీఆదిల్ షా నాదీ వాచకము బల్కగా ఇబ్రహీం కుతుబ్ షాహీ చొరవదీసికొని కృషిజేసి దానిని పరాకాష్ఠ నందించెను అహమ్మద్ నగర బిజాపూరు రాజ్యముల మధ్య మస్థిర సంబంధ మేర్పడుటకుగాను హుసేన్ నిజామ్ షా తన పుత్రికయైన చాంద్ బీబిని అలీఆదిల్ షా కిచ్చి వివాహము జేసి షోలాపూర్ దుర్గము నతనికి అరణముగా నిచ్చెను మరియు ఆదిల్ షా తన సోదరియగు హాలాబీబి (హదియా) జామ్ షా కుమారుడగు ముర్తజాకు ఇచ్చి పరిణయము జేసెను ఇట్లు తన బద్ధ శత్రువగు నిజామ్ షాతో సంబంధ బాంధవ్యముల నందిన అలీ ఆదిల్ షా క్రీ శ 1564 సం లో మిగిలిన ముగ్గురు సుల్తానుల గూడ గట్టుకొని విజయనగరముపై దండెత్తుటకు సిద్ధమయ్యెను పిదప నతడు గతములో బిజాపూరు రాజ్యభాగముల గొన్నిటిని రామరాయలాక్రమించియుండినాడనియు ఆప్రాంతములను దిరిగి తనకిచ్చి వేయుట శ్రేయస్కరమని విజయనగరమునకు రాయబారుల నంపెను రామరాయలందులకు దిరస్కరించి రాయబారుల నవమానించి పంపెను అది సాకుగా దీసికొని ఆదిల్ షా తక్కిన సుల్తానులతో గూడి విజయనగరముపై దండెత్తెను తత్ఫలితమే తల్లికోట సంగ్రామము అని చెప్పబడినది

పైకథనము నాధారముగా గొని రెండు మూడు విషయముల నిచట స్పష్టముగా చర్చించుట అవసరము —
1) అహమ్మదునగర రాజ్యముపై జరిపిన దాడుల సందర్భములో విజయనగర సైన్యము అమానుషముగా ప్రవర్తించి

నవా? రాయుగారు యలందులకు మిన్నకుండెనా? (II) బిజాపూరు రాజ్య భాగముల నెపుడైనా రామరాయలు ఆక్రమణ జేసెనా? (III) ఆదిల్ షా దక్కను సుల్తానులందరను యేకము జేసి వారితో ఏకీభవించి తనకు మేలొనరించిన రామరాయలపై నేల కత్తి గట్టవలసి వచ్చినది?

విజయనగర సైన్యము అమానుషముగా ప్రవర్తించినవా? ఈసేనలు ఆదిల్ షాకు సహాయముగా నహమ్మదు నగరముపై దాడి జేయుటకు వెళ్ళినవి ఇట్టి సందర్భములో సహాయ మర్థించినవారి కోర్కెననుసరించి సహాయముజేయ వచ్చిన సేనలు చాల వరకు నడచుకొనుట యుక్తము ధర్మముగూడ కాబట్టి విజయనగరసేనలను పైదాడి సందర్భములో నాదిల్ షా అభిరుచుల కనుగుణముగానే నడచియుండును నిజామ్‌షాపై ఆదిల్ షా కున్నంత క్రోధము రామరాయలకు నుండదుగదా కావుననిజామ్‌షా రాజ్యములో నానా భీభత్సము జేయుటకు ఆదిల్ షా సైన్యముల ప్రోత్సహించుట కవకాశముగలదు అది యటులుండ నీ దండయాత్రా సమయములో నొక్క విజయనగర సైనికులే పైశాచికముగ ప్రవర్తించిరా? బిజాపూరు సైనికులట్లు ప్రవర్తించి యుండరా? విజయనగర సైనికులందరూ హిందువులనియు బిజాపూరు సైనికులందరూ మహమ్మదీయులనియు చెప్పదగునా? అంతియే గాక స్త్రీల నవమాన పరచినపుడు విజయనగర సైనికులు వీరు మహమ్మదీయ స్త్రీలు వీరు హిందూస్త్రీలునని వివక్షతతో ప్రవర్తించి యుందురా? వారు మహమ్మదీయులను మాత్రమే హింసించి హిందువులను వదలివేసిరని చెప్పుట భావ్యమా? ఇది యెట్లు పొసగును? దండయాత్రలలో సామాన్య సైనికులు అందును కామాంధులు అత్యాచారపరులు దుర్బుద్ధులునైన యేకొందరో ఎన్ని కట్టుదిట్టములు చేసినను అనౌచిత్యగముగ విచక్షణారహితముగ ప్రవర్తించుట పరిపాటే అది వారి నైజము అంతియే కాబట్టి ఈదండయాత్రా సందర్భములో జరిగిన ఘోరములకు విజయనగర బిజాపూరు సైన్యములోని హిందు మహమ్మదీయు లిరువురకు సమాన బాధ్యత యున్నదని చెప్పకతప్పదు కానిచో దాడి మహమ్మదీయ ప్రభువుపై జరిగినది గాన యా ఘోర కృత్యములన్నింటిని హిందువులే జేసిరని భావించుట లోను యట్లే వ్రాయుటలోను పెద్దగా ఆశ్చర్య పడవలసినది లేదు నిజ మరసినచో నీ ఘోర కృత్యములకు రామరాయల కెట్టి బాధ్యత యున్నదో చెప్పజాలము సుస్సు నెరియగలదు పరమత సహనము గల్గిన రామరాయలు మహమ్మదీయుల కెదరను తన కొలువులో నాశ్రయ మిచ్చిన రాయలు మహమ్మదీయుల ప్రార్థనలు జరుపుకొనుటకు గాను విజయనగరములో మసీదులు కట్టించిన రాయలు తన సభ కేతెంచు మహమ్మదీయ సర్దారులు హిందూరాజులకు సలాములు జేయుటకు మనస్సులందు కుందుదురని యెఱిగి వారి నిబ్బంది పెట్టుట ఇష్టములేక తన పక్కనే సింహాసనముపై ఖురాను ప్రతి నొకదాని నుంచుకొనిన యౌదార్యమూర్తి రామరాయలు తన సైనికులు మహమ్మదీయ స్త్రీల చెరచి మహమ్మదీయ మతమును అగౌరవ పరచుచునను జూచుచూ యూరకుండినాడనినచో నమ్ము టెట్లు? అట్టి యకృత్యముల జేసినవారిని రాయలు శిక్షింప కుందునా? బాగుగా నాలోచించినచో నీయకృత్యముల జేయుటకు నాదిల్ షా యనుమతితో బిజాపూరు సైనికులే శత్రురాజ్యములోనట్టియకృత్యముల జేసి హిందువులపై నెట్టియుండవచ్చుననియు దోచును

బాగుగా తరచి చూచినచో నాదిల్ షాయొక్క చర్యలన్నిటికి పరమార్థము వేరుగా గోచరింప గలదు సరిగా రామరాయలు పుత్రునిగోల్పోయిన తరుణములోనే నిజామ్‌షా బిజాపూర్‌పై దండెత్త యత్నించుచుండెను శత్రువునెదిర్చి నిలుచుటకు ఆదిల్ షాకు శక్తిలేదు అందుచే నతనికి రామరాయల సహాయ మనివార్యమైనది బాగుగా దూరమాలోచించియే ఆదిల్ షా స్వప్రయోజనార్థము రామరాయలతో చెలిమిజేయుచున్నట్లు వర్తించినాడు ఇది నిజమైన మైత్రియైనచో నతడదాని తుది వరకు కొనసాగించియే యుండెడివాడు కాని యట్లు జరగలేదు అందుల కనేక కారణములుగలవు నిజామ్‌షాను నిరి పవలెనని యతడాశించెను. అది జరుగలేదు రామరాయలతో గూడి ఆదిల్ షా తనను మార్కొనినపుడతడు లొంగిపోవుచుండెను కాని రామరాయలు తిరిగి తన రాజ్యమునకు బోయిన వెంటనే మరల నిజామ్‌షా విజృంభించి ఆదిల్ షాపై బడుచుండెను రామరాయలయండ దన కున్నప్పటికి నిజామ్‌షావలన వచ్చు ప్రమాదము ఆదిల్ షాకు శాశ్వతముగా తొలగిపోలేదు ఇది యిట్లుండ తాను సాటి మతస్థులగు సుల్తానులను వదలి యొక హిందువుతో చేతులు గలపినాడని దక్కను సుల్తానులతనిని చిన్న చూపుచూచినను నాశ్చర్య పడవలసిన పనిలేదు కాని యీయవమానమును

ఆదిల్ షా యెంతకాలము భరింపగలడు? అంతియేగాక తాను రాయలతో గూడి చిటికి మాటికి అహమ్మదునగర రాజ్యముపై బడి విచ్చలవిడిగ దోచుకొని దానిని సర్వనాశనము చేయుటకు దక్కనులోని మహమ్మదీయులంతా సహింపక అకష్టనష్టములన్నిటికి బాధ్యుడవని ద్వేషిత్తి జూపు య పిర్యంచుకొను యుందురనుటలో నతిశయోక్తి లేదు ఆదిల్ షా ఈనిందనెంతకాలము భరింపగలడు? ఈస్థితిలో నతడు పునరాలోచించి క్రొత్తయెత్తు వేసినాడు తత్ఫలితమే దక్కను సుల్తానులందర నేకము చేసి రామరాయలతో తడు తల్లికోటవద్ద దలబడుట

ఈమిత్రద్రోహమువలన ఆదిల్ షాకు గల్గు లాభమేమి? విజయనగర రాజ్యమా కాలములో సిరిసంపదలతో దులదూగుచున్నది ప్రభుత్వపు ఖజానాలో వెండిబంగారములకు నవరత్నములకు కొదువ లేకుండెను రామరాయల నిర్జించినచో విజయనగర సంపద నంతటిని దోచుకొనవచ్చును ధనాశాపరుడైన నిజామ్ షాకు రామరాజ్యములో చాలినంత సంపద లభించినచో నతడామీదట తనపై దాడులు చేయకుండుటకవకాశమున్నది అంతియేగాక సాటి సుల్తానుల గూడదీసి మతసంరక్షణార్థము హిందువులతో పోరాడినాడన్న కీర్తి తనకు దక్కగలదు ఈచర్యవల్ల మహమ్మదీయు లంతా హర్షింపగలరు ఇట్లెన్ని విధముల నాలోచించియే ఆదిల్ షా మహమ్మదీయ ప్రభువులతో నొక కూటమి నేర్పాటు చేయుటకు బూనుకొని కృతకృత్యుడయ్యెను

పై విధముగా దక్కను సుల్తానులందరూ దనకు వ్యతిరేకముగా నొక కూటముగా నేర్పడుటలో రామరాయల బాధ్యతగాని లేక అతడు చేసిన యపరాధముగాని లేదా? లేకేమి ఆదిల్ షాను పుత్ర వాత్సల్యముతో జూసి యతని కవసరమైనపుడెల్ల ఓపిన సహాయము చేయుటయే రామరాయలు చేసిన మహాపరాధము అహమ్మదునగర ముట్టడి సందర్భములో కుతుబ్ షా యొనర్చిన మిత్రద్రోహమున కతనిని తీవ్రముగా శిక్షింపక పోవుట రాయలు చేసిన మరొక యపరాధము! మహమ్మదీయ ప్రభువులలో చీలికలు దెచ్చి వారిరాజ్యముల నాక్రమించుచు వారిరాయబారుల నవమానించినాడను దానికేమి సమాధానము? రామరాయ లెన్నడు దక్కను సుల్తానుల మధ్య చీలికలు దెచ్చుటకు ప్రయత్నించలేదని ఘంటాపథముగ చెప్పవచ్చును మీదు మిక్కిలి వారందరు సఖ్యముగ నుండి స్వాతంత్ర్యముతో సుఖముగ నుండవలెననియే అతడు మనోవాంఛాయ కర్మల కృషి చేసినాడు క్రీ శ 1557 సం॥ లో దక్కను సుల్తానుల మధ్య రాయలు గుదిర్చిన సంధియే ఇందులకు ప్రబల తార్కాణము ఇక వారిరాజ్యము లాక్రమించినాడందుమా? ఇదియు సత్యముగాదు అహమ్మదునగర ముట్టడి సందర్భములో కుతుబ్ షా తలపెట్టిన మిత్రద్రోహము కు బదులు రాయ అతని రాజ్యముపైబడి యనేక దుర్గముల జయింపగా వేరు గత్యంతరములేక కుతుబ్ షాహి గణపురము పానగల్లు దుర్గములు రాయలకిచ్చి సంధిగావించుకొనినాడు ఇది యాక్రమణయెట్లగును? అహమ్మదునగర రాజ్యభాగముల నతడాక్రమించుకొన్నట్లు యెచటను చెప్పబడలేదు కాగా ఆదిల్ షాహి మాత్రము దక్కను సుల్తానులతో యుద్ధకూటము నేర్పరచిన యనంతరము రాయలవద్దకు రాయబారులచేత గతములో బీజాపూరు రాజ్యమునుండి రాయలాక్రమించిన దుర్గములను తిరిగి తనకప్పగించవలెననియు లేనిచో తగు ఫలిత మనుభవించగలడనియు వార్త బంపినాడు ఇది కయ్యమునకు కాలుదువ్వుచు జూపిన కుంటి సాకు గాని తదితరముగాదు కాబట్టి ఆదిల్ షా రాజ్యములో కొంత భాగము రాయ లాక్రమించినా డన్నది యసత్యమే గాగలదు బహుశః రామరాయలు తనకు చేసిన సహాయమునకు సంతసించి యొకప్పుడాదిల్ షాయే మనస్ఫూర్తిగనో లేక స్వలాభాపేక్షతోనో తన రాజ్యములోని కొన్నిదుర్గములను బహుమాన పూర్వకముగ రాయలకు ఇచ్చి యుండవచ్చును తదనంతర మతడా దుర్గములను రాయ లన్యాయముగా ఆక్రమించినాడని కల్పించి వానిని తిరిగి తనకు స్వాధీనము చేయుమని రాయబారము పంపియుడనోపును ఈధోరణి జూచి రామరాయలు క్రుద్ధుడై ఆదిల్ షాయొక్క రాయబారుల నవమానించిన యవమానించి యుండవచ్చును ఇట్టి సందర్భములను బురస్కరించుకొని రామరాయలు మహమ్మదీయ సుల్తానులను వారి రాయబారుల నవమానించినాడని వ్రాయుటయేమి ధర్మము? దీనికంతకు కారణము ఆదిల్ షాయొక్క కూటనీతిగదా? ఆదిల్ షాయొక్క కుటిల నీతి ఫలితమే కదా మహోన్నత దశలోనున్న విజయనగర రాజ్యమనతి కాలములోనే దుస్థితిని బొందుట !

తల్లికోట యుద్ధములో గూడ ఆదిల్ షా తనమిత్రులతో గలసి రాయలతో నొక వంక రాయబారముల నడపుచు ఏమరుపాటుతోనున్న రాయ సైన్యములపై నకస్మాత్తుగ బడి వారి బరిమార్చి రాయల జంపించి జయముగాంచినాడు

తదన తరము వారు తా విజయగర్వముతో నటనుండి కదలి విజయనగర పట్టణమును జేరి యానగరమును రాత్రి నక పగలు అరుమాసముల పాటు దోచుకొని సర్వనాశనము చేసి ప్రజల నానా హి ల బెట్టిరి విజయనగరములో దోచుకున్న ధనముతో ఆదిల్ షా బిజాపూరు చుట్టు ప్రాకారమును నిర్మించి చక్కగా కట్టుదిట్టము చేసినాడు తల్లికోట వి యము వలన అతనికి ముద్గల్లు రాయచూరు దురము లభించినవి

తల్లికోట యుద్ధానంతరము ఆదిల్ షా దక్షిణదేశమును జయి చ టక కూడ మక ట్టైను ఆదిల్ షా బలవ తుడైనచో తమకు ము ప్పువచ్చునని భావి చిన కుతబ్ షా నిజామ్ షా లొక టియై బిజాపూరుపై నెత్తివచ్చుటచేత వీదక్షిణదేశ ద డ యాత్రి పొసగలేదు కొ తకాలము క ఆదిల్ షా పెనుగొండ గోవాలపై దాడ లుచేసి విఫలుడయ్యెను కాని తోరణగల్లు ఒ కపూరు ధార్వాడుల నితడు జయి చెను ఇ దర లన్ని విధముల వ చి చి తన కార్యముల జక్కబెట్టుకొన్న ఆదిల్ షా తుదకు క్రీశ 1579 స లో తనకిష్టుడైన యొకా నొక నపుంసకుని చేత హత్య చేయబడెను విధి బలీయము గదా!

ఆదిల్ షా కళాప్రియుడు ఇతని కాలములో ననేకమ ది షియా మతమునకు చెందిన మేధావంతులు కళాకారులు పర్షియా ఇరాక్ మొదలగు దేశములను డి బిజాపూరునకు విచ్చేసిరి ఉర్దూలో గద్య పద్య రచన వృద్ధి యగుట కితడు గూడ తగిన ప్రోత్సాహము నిచ్చినాడు ఇతడు బిజాపూరులో జామమసీదు గగన మహల్ చాంద్ బౌలి ఆనందమ హల్ మొదలగు నిర్మాణములు జేసి తన కళాప్రియత్వము నకు వెల్లడి చినాడు ఆ చెం

అలిఎరి చూ అనంతరాజు కుమారమట్ల

## అలిఇమామ్

సర్ అలిఇమామ్ ప్రశంస "హైద్రాబాదుస్వాతంత్రోద్యమము" అను గ్ర థము మూడవ స పుటియందు కానవగును క్రీశ 1915 1919 మధ్య ప్రాంతమున నిజాము రాష్ట్రము నవచైతన్యముతో తొణికిసలాడినది మేధావులగు విద్యాధికులు సంఘసంస్కర్తలు ఒకరిని మించి ఒకరు రాష్ట్రమందలి విద్యాభివృద్ధికిని నిమ్నజాత్యుద్ధరణకు సాంఘిక సంక్షేమము కొరకు నిరక్షరాస్యత తొలగించుటయందును గ్రంథాలయ సం ఘల నెలకొల్పుటయ దును విధి నిరామమ తో పాటు ఎడిరి ఇదేసమ మ బ్రిటిషు పాలి ప్రా ము భ వ్యాను జలియన్ వాలాబాగ్ ద జ ని మాన ప్రెస్ ల రౌలటు చట్టము ప్రవేశ పెట్టట ల ల ఉవ ఎ బ్రిటిష పాలన ట్ల హేయభావ ను కి ది ఖిలాఫతు కా గ్రెసు ఉ ్యమముల న హాజ్య ఉద్య ఎద్దె దాక్షిణ్యవి వీటి ప్రభావము జాము రాష్ట్రప్రజలందు దును ప్ర రి చి స్వాతంత్ర్య వాతావరణమునకు దోహదము కలిగి ది

కుశాగ్రబుద్ధి ల నిజాము ప్రభువు సిర్ ఉస్మాన్ అలీఖాను బ దల ప్రజాభిప్రాయమును గ్రహించి అ వ కను అనులున దు పాలనా ధా మ దు ఈ క్రింది మార్పులు చేయస మకట్టైను

17వ నవంబరు 1919 న జరిగిన అమలులో నున్న మంత్రి సభను (cabinet) రద్దు పరచ ఆదేరోజున నిజాము ప్రభువు చట్ట నిర్మాణమును బాధ్యతాయుతమును అగు కార్యనిర్వాహక సంఘము (Executive council) ను నెలకొల్పి దాని తొలి అధ్యక్షునిగా సర్ అలిఇమామ్‌గారిని నియమించిరి ఈసందర్భమును పురస్కరి చుకొని నిజాము ప్రభువ రేణ్యులు చేసిన ప్ర ంగమును డి కొంత భాగమును నీక్రి ద పొ దు పరచుట సమ జసమని తోచినది

"నేను రాజ్యాధిపత్యము వహించినప్పటిను డి పరిపాలనా వ్యవస్థయ దు అనేక లోట్లు వాదృక్ప్రథము కు చ్చినవి నాకు కలిగిన అనుభవమును బట్టి పాలనా వి ధా న ము న మార్పులు అవసరమని గ్రహి చి ప్రధానమంత్రి సహాయము లేకు డగనే పాలనా బాధ్యత స్వయముగా శిరసావహి చితిని అయిదు స ల్లలు అవిరళ కృషిచే నా ప్రజల మనోవాంఛితము లను వారి సంక్షేమమునకు తగి ట్లు అనేక మార్గముల అన్వేషించితిని స స్థానమున దును బయటను ప్రస్తుతము చెలరేగు చున్న ఆందోళనలను రాజకీయ వాతావరణ పరిస్థితులను గమని చి మర్మతతోను పురోభివృద్ధికి అవసరమగు రాజ్యాంగ సంస్కరణల ప్రవేశపెట్టుట వాంఛనీయమని గ్రహించితిని ఒకే వ్యక్తి ఎంతసామర్థ్యమును కలిగియున్నను బాధ్యతాయుత ప్రభుత్వమును నలబెట్టుట కష్టసాధ్యము అందువలన నా ప్రజల సుఖమును కాంక్షించుచు సలహాసంఘముతో కూడిన రాజ్యాంగము ఉత్తమమని తలచి దానిని ఏర్పాటు చేయుటకు నిశ్చయించితిని "

రోజు నే ౧౯ నవ బరు 9 9 నా ఫర్మాను (ప్రభు ( ట మ క అధ్యక్షునితో సహా ఎనమ డ గురు ఖ జ్ఞ ను భాగ ములు అయిన సభ్యు తో ఒ్కని వ్యక ఘ నె ఏర్పబడినది దీని అధ్యక్షు లగు ర్ లీ మా పరిచయము చేయుట హైన్య స్పది కి వీ యొ ఖ క సామర్థ్యము లు బ్రిటిషు ఇ డియాలో ఖ్యా ప్రశ ం స ను కొన్నరి

అమ ది ఎ శా ఖా (Legislative council) లా ఏఉ డ కూ షు ప్రచ్చ కడిసి కొందు స్వ నిరాకా ఖ మ డలితో బాటు శాసన భమ కూడ విస్తృత పరిచి ( జా మా ము ను నుటుల రాజ్యాగ స ఎ ణ య చేయు ం నిజాము భుప ఉద్యుక్తులైరి

5 ఫిబ్రవరి 920 న నిజాము ప్రభువు రా ప్రభుత్వ ( టన చేసి అ ను విద్యా సా ఖ పురోగ మనమును దృష్టియ ను చు ని శా న భ పునరుజ్జీవి ప చేయు తలపుతో ఈ ది సూచనలననుసరి చి విషయ సేకర ణకు విచారణ ఘమును నెలకొల్పి దాని అధ్యక్షులుగా సర్ అలీఇమామ్‌గారిని ఎయమించిరి

1 శాసనమ డలియ దు ఎన్నుకోబడు సభ్యుల నిర్ణయము

2 ( త్యక్ష ఎన్ని ల విధానము

3 ప్రత్యేక ఎంస్థల ప్రాతినిధ్యము

4 అల్ప ఎంఖ్యాక వర్గము ల రక్షణ

5 నియోజనాధికా నిబ ధనలు

6 ( ఖు వ నియమిత సభ్యుల స ఖ్య

7 శాసనసభ అ ఎలి సభ్యులకు ను విధుల ఎబ ధనలు

నిజాము ప్రభువు అజ్ఞ ఎనుసరి చి విచారణ సంఘము తమ రిపోర్టును కార్యనిర్వాహణ ఘమ డలికి నివేదించవలెను సర్ అలీఇమా గారు మాజీహైకోర్టు జడ్జి ఆగు రామ్‌లాల ముకుంద ను ప్రభువు పేర్కొ న సూచనలపై విచారణ జరిప తీర్మానమును త మ కు తెలియచేయవలెరిరి రామ్‌లాల ముకుందు విచారణ జ పి తమ రిపోర్టును 1½ ఏండ్ల వ్యవధిలో కార్యనిర్వాహక సంఘు నకు అ ద జేయ గ లి గి రి కాని వీశారణము చేతనో నిజా ము ప్రభువు ప్రకటించిన ఉత్సాహము సన్నగిల్లినది కష్టపడి సంపాది చిన నివేదిక వెలుగులోనికి రాలేదు

అలీఇమాము బీహారు రాష్ట్రమునకుచెందినవాడు గొప్ప ( జ్ఞా ంతుడు రాజ్యా గచట్టమునకు స బంధి చి వ్యవహార ములలో పేరుపొందిన బారిష్టరు పాట్నాలోని వీరి కుటుంబ సభ్యులు అభ్యుదయభావములుకలగి అప్పటి భారత దేశపు రాజకీయములతో సన్నిహిత స బ ధము కలిగియుండిరి స్వయ ముగా అలీఇమాము గోఖలే ఎనల బించిన లిబరల్ (ఉదార వాదము) పార్టీని సమర్ధించెడివాడు భారతజాతీయ కా గ్రెసు సభకు అధ్యక్షత వహి చి సన్ ఇ మాము అలీఇమా గారి సోదరుడు

అలీఇమాము ఎన్నో గురు బాధ్య ల స్వహా చి పే ప్రతిష్ఠల తెచ్చుకుని రాజప్రతినిధి కార్యనిర్వాహక మ డలిలో సభ్యుడుగనుండెను అలీఇమాము సత్ప్రవర్తన నిజాయితీ సమకాలీ రాజకీయనాయకులను ఎం యో ఆకర్షి ంచెను తను గోఖలే పక్షమువాడైనప్పటి తిలకు గా ధి మొదలగు నాయకులతో ఎ ఎ బంధము కలిగియు డెడి వాడు వ్యభావసిద్ధ ముగా కపటమెరుగనిమానవ మైన లిగిన మహాపురుషుడు మతదురభిమానముగాని భాషాభేదములు కాని లేక ప్రజలలో కలసిమెలసియుండెడివాడు అ దుకనే గా ధీజీ వీరినిగురించి 1 4 1941 హరిజన్ పత్రిక లో "హిందువులు ముస్లిములు రెండుజాతులుకావు" అను శీర్షికతో ఈక్రి ది వాక్యముల వ్రాసెను

"అలీఇమామును నేను మొదటిసారి చూచినపుడు అతనిని హిందువు అనియే అనుకొంటిని అతని భా అతని దుస్తులు ఆహారము ఆచారసంప్రదాయములు మొ లగునవి అన్నియు అయన చుట్టునున్న హి దూప్రజలవలెనే ఉండెను "

అలీఇమాము హైదరాబాదు స స్థా నమునకు దివాను అయిన వె టనే మార్లే మింటో పద్ధతిని ఎయమబద్ధమైన రాజ్యాంగస స్కరణలు సంస్థానమున ప్రవేశపెట్టుఉద్దేశముతో రాయ్ లాలముకుందును ప్రత్యే ద్యోగిగా నియమించెను అలీఇమాము హైదరాబాదు సంస్థానమున ప్రవేశపెట్టదలచిన ప్రణాళికలలో "నవా అబాదీ" అనునది ఒకటి కలదు దాని ఉద్దేశము భారతదేశమునందలి ముస్లిములు స స్థానములో అదిలాబాదువంటి తక్కువ జనాభా కలగిన ప్రాంతముల వలస ఏర్పాటుచేయించి ఆప్రాంతమును అభివృద్ధి చేయసమకట్టెను కాని కష్టపడి భూమినిదున్ని బ్రతుకుటకు ముస్లిములురానందున అలీఇమాము తలపెట్టిన స్కీము అమలులోనికి రాలేదు

బెరారు సమస్యపై అలీఇమాము చాలాకృషిచేసి రాజ

ప్రతినిధికిని బ్రిటిష్ ప్రభు ్వమునకు నచ్చచెప్పుటకు ఆం ళాయ శక్తుల ప్రయత్నిం చెను 19 4 సం॥గముస ఆన వలుకబడిని వినియోగి చి గా ధీజితోడు డ బెరారు నిజాము ్రభు న చె దు ంషయమై ్రస్తావి చెను ఇదే ం దర్భము నిజా నవాబు ఉస్మాన్ అలీఖాను ద్వారా బెరారు మన్యపై సహాయ మర్ది చుచు బిరారు ్ర జలకు స్వయంనిర్ణయాధికారము ఒస గెంన హామీ ఇవ్వంచెను

ఇ జలో నే హై ద్రాబాదులోని పలుకుబడిగల నవాబు లకును అలీఇమా ము నకును మధ్య మన ృర్థలేర్పడెను సర్ అక్బరు హై దరీగారికిని వీరికిం అనులేపడిరాలేదు అలీఇమాము హిందూఅభి ా ) అని ము స్లిములు అతిగతిలేకు డా పోవు చున్నారని ఒ ప్రచారము సాగుచుండెను తరువా నిజాము నవా బుకును అలీ ఇమామ ము కు డ భేదాభిప్రా ) ములు జని చెను దు లన అలీఇమా ము 1924 లో తన ప గవికి రాజీన మా ఇచ్చి పాటూ కు వెగలిపోయెను

హా పె
పెం వెం హా

## అలియాబాదు

రెం వ ఆ ఫ్జానిజా అలీఖాన్ ప్రభువు నాడు గోషామహల్ ఫసీల్ ను డి ఎలగందల దుర్గమునకై వెడలెను మార్గమధ్యమున అలియాబాదు అను గ్రామమున విడిది చేసెను

ఈ అ శము హదీకతుల్ ఆలం అను గ్ర థమున గలదు.

డా కొ గో కృ

## అలీనవాజ్ జంగు

నవాబు అలీనవాజ్ జంగుబహదూర్ గొప్ప పేరెన్నిక గన్న హైదరాబాదు ఇంజనీరు అతనియొక్క అద్భుత శక్తి సామర్థ్యముల వలన హైదరాబాదునందేకాక భారతదేశమంతట ఖ్యాతి గాంచెను అనేక సందర్భములలో ఇతర రాష్ట్రముల వారు ఈయన సలహాలు కోరెడివారు ఈయన దేశమునకు సేవచేసిన అర్థశతాబ్దములో సుమారు 30 ఏండ్లు పి డబ్ల్యు డి శాఖకు ఛీఫ్ ఇంజనీర్ గాను సలహా ఇంజనీరుగాను ప చేసి గట్టి పునాది వేసిరి

ఎడవ నై జాముగారైన మీర్ ఉస్మాన్ అలీఖాను బహ దూర్ గారు మీరుఅహమ్మదలీగారికి వీరి అవిరళమైన సేవలను గుర్తించి అలీనవాజ్ జంగుబహదూర్ అను బిరుదును బహూక

8 ంఠి మీర్ అహమ్మ ద్ అలీ 11 వ జులై 1 17 న హైదరాబాదు జన్మిం చెను రి మీర్ వ జిద్ అలీ ీ నిజాము ర్కారులో ద ఫ్తరే ముల్కీ (ఇ ప్రైవేట్ సెక్రెటరీ) వృ పత్రికాశాఖ అను ఆఫీసులో నిజాము కును ఇ డియా ప్రభుత్వమునకును మధ జరుగుచు త్తర ప్రత్యుత్త శాఖ హ కారి ద్యగా చే





మీర్ అ మ్మద్ హైదరాబా హై దరాబా సెం ట్ నా ని ద్విలియ నాం గి పి యి గ మ గా సీ – లేజీ కు ర్హి అని దశలోనే వా గి ఎ విశే ము అనేక విద్యార్థి వేత ములను పొ ది

మీర్ అహమ్మద్ ఇంగ్లాండులో ది ముగించుకొని 1898 సం వత్సరమున తిరిగి హై రాబాదు క వచ్చి ప్రభుత్వ నిర్మాణశాఖలో అ స్టెంటు ఇంజనీయరుగా నియమితులైరి క్రమముగా వీరు ఛీఫ్ ఇ నీయరు సెక్రటరీ దవుల నంది ప్రభుత్వ ఉపకార వేత ముని పొ దిరి తరువాత వీరు ప్రభుత్వము కు సలహా ఇ నీయరుగా నియమితులైరి ర్కారు కొలువున ్ర ెచినపుడు వీరి నెల జీతము రు॥ 400 ఉ డెడిది వీర ఛీఫ్ ఇనీయరు ఎదవినుండి విర మించునాటికి వీరు నెలకు పొ ేన వే నము రు॥ 3 50/– నవాబు అలీనవాజ్ జ గుబహ దూర్ గారు ఛీఫ్ ఇంజనీయరు పదవి పొందినవారిలో ప్ర థమ భారతీయుడు ప్రభుత్వ నిర్మాణశాఖ క్రింద అగు ఖర్చు ఒక పెద్ద తలబరువుగా అప్పటి నిజాము ప్రభుత్వము కు తోచెడిది నవాబుగారు ఛీఫ్ ఇంజ నీయరు పద ికి వచ్చుచే తడవుగా ప్రభుత్వమునకున్న ఈవింత ధోరణిని తొలగించిరి దేశ భాగ్యోదయమునకు అవసరమగు

కార్యక్రమములను ప్రణాళిక ల ద్వారా యోపా ది చి వాటిని నిర్మాణాత్మకముగా సాగించిరి ఇ జనీయ గుకళాశాల య దు ఉత్తీర్ణులైన విద్యార్థులనే పదవుల దు నిలిపి ఇంజనీయ రి గు సర్వీసులకు స్థిరత్వము ఏ ర్పిరి

ఇదివరలో పబ్లిక్ వర్క్సుశాఖ ఖర్చులకు ఏటేటా 82 87 లక్షల రూపాయలు మా త్రమే కేటాయి ప బడెడిది నవాబుగారు చీఫ్ ఇ జనీయరు పదవి అధిష్ఠి చి ప్రణాళి కకు మునకు కావలసిన మార్గములన్నిటిని అన్వేషి చి నిర్మాణ కార్య క్రమ పద్దుంకు రు 258 77 లక్షలు బడ్జెటున దు కేటా యించునట్లుగా చేసి ప్రజలమన్ననల బడసిరి నవాజ్ సాహేబు గారి పర్యవేక్షణలో ఈ క్రి ద పేర్కొనబడిన నిర్మాణాత్మకమైన పథకములు రాష్ట్రమునందు ప్రవేశ పెట్టబడుటయే కాక వారి ఆధ్వర్యమున సమర్థతతో నిర్వహించు యు జరిగినది

1 తు గభద్రా ప్రాజెక్టు
2 నిజా సాగరు ప్రాజెక్టు
3 జలవిద్యుత్ ప్రాజెక్టులు
4 వరద నిరోధక చర్యలు
5 చిన్నతరహా మధ్యతరహా సేద్యపుప్రాజెక్టులు
6 ప్రభుత్వ భవననిర్మాణములు
7 జాతీయ ప్రణాళికాసంఘములు
8 పెద్దతరహా సేద్యపు ప్రాజెక్టులు

అలీనవాజ్ జంగుగారు మన భా ర త దే శ ము లో నీటి ఉత్పత్తిస్థానములు కనిపెట్టుటలోను ఆహార పదార్థముల ఉత్పత్తిని పె పొ ది చుటలోను చవుక విద్యుత్ శక్తి ఉత్పత్తి చేయుటలోను మిక్కిలి పుణుడని పేరు గా చిరి పెద్ద డాముల నమోనాలు తయారుచేయు యు దు వీరుప్రవీణులు ఈయన పర్యవేక్షణక్రి దనే నిజా సాగర్ ప్రాజెక్టు తుంగ భద్రాడాము పోచారము మహబూబ్ నగర్ మున్నేరు వైరా పాలేరు డిండి ప్రాజెక్టులు పూర్తి చేసిరి నాగార్జున సాగర్ గోదావరి ఎగువ కృష్ణ ప్రాజెక్టులకు సర్వే ఎస్టి మేటులు ఈయన పర్యవేక్షణ క్రి దనే జరిగినవి

హైదరాబాదున దలి కట్ట కడపటి ఆ గ్లేయయింజనీ యరు శ్రీ ఎ టి మెకంజీగారు అలీనవాజ్ జంగుగారికి తమ పదవిని అప్పగించుచు నాకన్న గొప్ప యింజనీయరునకు నా పదవిని వదులుచున్నానని సగర్వముగా పలికి

1938లో పండిట్ జవహర్ లాల్ నెహ్రూ అధ్యక్షత క్రింద నేషనల్ ప్లాని గ్ కమిటీ ఒకటి ఏర్పరచిరి 29 చిన్నకమిటీలు దీని క్రి ద ఏర్పరచి ఒక్కొక్కటి ఒక్కొక్క జీవితాంశము చూచుకొనునట్లు ఏర్పరిచిరి అ దులో ఒక కమిటీ దులు నీటిసరఫరా విషయములు చూచుట ఈకమిటీకి నవాబుఅలీ నవాజ్ జంగుగారిని అధ్యక్షుని చేసిరి నవాబుగారు చేయవలసిన పద్ధతిన తయి మూడు అంశములక్రి ద విశదీ రి 1రి మొద టిది పొలములకు నీరు కట్టుట రెండవది దు ను వరదల నుండి కాపాడుట మూడవది నీటి శక్తులను ఉప యోగించుట ఈయన సలహా మీద ప్లాని గ్ కమిటీవారు నేష ల్ వాటర్ రిసోర్సెస్ బోర్డు (జాతీయజల వద) కటి ఏర్పరచవలెనని తీర్మాని చిరి ఈబోర్డు నీటిపాయుదల నీటి ప్రయాణ సౌకర్య ములు వరదలనుండి కాపాడుట విద్యుచ్ఛక్తి తీయుట ఆహార విషయములకు ఉపయోగపడు నీరు మున్నగు అ శ ము లను పరీక్షించును

ప్లాని గ్ కమిటీ ఈయన సలహాపై కొన్ని తీర్మానములు చేసినది (1) నీటి హక్కులపై రాష్ట్రముల మధ్య వివాద ములు రాకుండ ఇంటర్ స్టేటు కమీషన్ ఒకటి ఏర్పరచవలెను

2 నీరు వృథాగా పోకుండా ఉపయోగ పరుచుటకు గాను నీటిని కూడ పెట్టుటకు రిజర్ వాయరులు కట్టవలెను

3 భు మిని బాగా పరిశీలి చి ఏ ఏ భూమి నీటి పారు దల ఎంతెంత అవసరమో పరీక్షించుట

4 వరదలు కరువునుండి కాపాడుట

5 భూమిసారము కొట్టుకొని పోకుండ అడ్డుకట్టలు కటుట

నవాబుఅలీనవాజ్ జంగుగారు నీటిను డి తీయు విద్యు చ్ఛక్తి మిక్కిలి చవుకగా వచ్చునని దానినే పరిశ్రమలకు ఉపయోగించడ మంచిదని చెప్పిరి వాటర్ పవర్ అదే ఒక పరిశ్రమ మరియు పరిశ్రమలకు ఆధారమని చెప్పిరి ప్రజలు ముఖ్యముగా చవుకగాను బాగా ఉపయోగ పడు నమ్మ కమైన శక్తి మీద ఆధారపడుదురు విద్యుచ్ఛక్తి అటువంటిది విద్యుచ్ఛక్తి ముఖ్యముగా పల్లెటూళ్ళయందు అవసరమని చెప్పిరి విద్యుచ్ఛక్తివలన వ్యవసాయమువిగుల తొందరగను సులభముగను చేయవచ్చును మరియు కుటీర పరిశ్రమలకు ఇది ఎంతయో ఉపయోగము విద్యుచ్ఛక్తి ఉపయోగించుట వలన గ్రామ సౌభాగ్యము బాగా వృద్ధి చె దును అప్పటి అవసరములకే గాక ముందు అవసరముల కొరకు విద్యుచ్ఛక్తి

నిలువచేసుకొనవలెనని చెప్పిరి

నవాబుసాహెబుగారు 20 వత్సరములలో విద్యుచ్ఛక్తిని 4 000 000 కిలోవాట్లు వృద్ధి చేయవలెననియు, ఒక యూనిటు 0 7 అణా చొప్పున సరఫరా చేయవలెననియు సేషనల్ పవర్ బోర్డు నొకదానిని స్థాపించి పరిశ్రమలకు ప్రజల ఉపయోగములకు సరిగ్గా ఉపయోగించునట్లు చూడవలెనని చెప్పిరి విద్యుచ్ఛక్తిని ప్రజల ఉపయోగముల కొరకు లాభనష్టములు చూడకుండా సరఫరా చేయవలెనని వ్యాఖ్యానించిరి

అలీనవాజ్ జంగువారు హీరారు వరదల గురించి దేశమును నిగి పోకుండ ఎట్లు కాపాడుకోవలెనో తెలిపిరి వరదల ఉద్రేకమును ఆపుటకు నదుల పారుదల వేగమును తగ్గించవలెననిరి కాలువలు త్రవ్వి అందులోనికి నది నీరు పోవునట్లు చేయవలెను లోయలో నీరు నిలువకుండ చూడవలెను నీటి కొరకు జలాశయములు (రిజర్వాయరులు) అడ్డు కట్టలు (ఎంబేంకుమెంట్సు) అవసరమని చెప్పిరి ఇవి ఉండిన వరదల కాలమున ఎక్కువ నీటిని వీటిలో అపుచేసి కావలసినపుడు వదలుటకు వీలగును

అలీనవాజ్ జంగుగారు కర్షకులకు చేసిన అనేక సదుపాయములలో ముఖ్యమైనది 500 చదరపు మైళ్ళ కన్న ఎక్కువగా నున్న నది ప్రక్కల నున్న స్థలములో నుండి (catchment area) ఎంత వర్షపు నీరు నదిలోనికి పారునో దానికి ఒక సూత్రము తయారుచేసిరి

ఈయన ఈసూత్రము కనిపెట్టుటకు ముందు మన దేశములో డికెన్సు మరియు రైవ్సు సూత్రములు అమలులో ఉండెడివి కానీ వీటిని ఉపయోగించు వారికి విలువలలో భేదములు కనబడెడివి కాని అలీనవాజ్ జంగుగారు తయారు చేసిన సూత్రప్రకారము విలువలలో ఎక్కువ భేదములు కనబడెడివి కావు ఈయన సూత్రములో మిత్ క్రియ (Logarithmic Function) మీద ఆధారపడియుండును ఒక్కొక్క ఇంజనీయరు తీర్మానముల మీద ఆధారపడియుండదు అందుచే భేదములు వచ్చుటకు అవకాశము లేదు అతని సూత్రము

$$Q = C\ M^{\ b \lg M}$$

Q = Maximum discharge (గరిష్ఠవిసర్జన)

C = Constant (స్థిర సంఖ్య)

M = Catchment area in Sq miles (నది చుట్టు ప్రక్కలనుండు స్థల వైశాల్యము)

$$C = 1700 \quad a = 0\ 94 \quad b = 1/14$$

ఈ సూత్ర ప్రకారము 1 513 చదరపుమైళ్ళ కాచ్మెంటు స్థలమునుండి (పరీవాహ ప్రదేశము) గరిష్ఠ విసర్జన 2 71 500 క్యూసెక్సు నీరు

వాటికగు కాలము ఒక నాలుగు నిమిషముల 30 సెకన్లు

రైవ్సు సూత్రము $Q = C\ M^{\frac{2}{3}}$

C = 2000 ఉన్నపుడు Q = 2 73 600 క్యూసెక్సు ఉండును

డికెన్సు సూత్రము $Q = C\ M^{\frac{3}{4}}$

C = 1 100 ఉన్నపుడు Q = 50 860 క్యూసెక్సు ఉండును

గ్రిగ్సు సూత్రము $Q = \sqrt{M}$

Q = 2 33 00 క్యూసెక్సు

ఇంగ్లిస్ సూత్రము $Q = \dfrac{7000 \times M}{\sqrt{M+4}}$

ఇంగ్లిస్ సూత్రము ననుసరించి Q = 2 71 800 క్యూసెక్సు

దిండినది (మహబూబ్‌నగర్ జిల్లా) హెచ్చు వరదలలో R L = 1 265 ఉన్నపుడు విసర్జన 2 73 000 క్యూసెక్సు వచ్చినది ఈకొలత అలీనవాజ్ జంగుగారి సూత్రమునకు సరిపోవుచున్నది

నవాజ్ జంగుగారు తమ జీవితమంతయు తుది వరకు హైదరాబాదు రాష్ట్రమునందు నీటి ఉత్పత్తి స్థానములను అభివృద్ధి చెందించుటకే వెచ్చించిరి తాము పరిశీలించని నది ఒక్కటియైనలేదు అన్ని నదులను జాగ్రత్తగా పరిశీలించి వాటి యొక్క ఉపయోగములను వ్రాసి యుండిరి అందుచే ఏప్రాజక్టుకైన ఎస్టిమేట్లు వ్రాయవలసి వచ్చినపుడు అయనకు చాలా తేలికగా ఉండెడి 1951 లో ప్లానింగుకమిషనువారు కృష్ణానది నీరు ఉపయోగించుటకు గాను ప్రాజెక్టు విషయమై అడుగగా ఆయన ఒక నెలలోపలనే నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు కావలసిన విషయములు తెలియపర్చిరి మరాట్వాడాలోనున్న పూర్ణా ప్రాజెక్టు పోచంపాడు ప్రాజెక్టు మైసూరు రాష్ట్రము తీసుకొన్న ఎగువ కృష్ణ ప్రాజెక్టు ఈయన పరిశీలనా ఫలితములే

ఈయన మొట్టమొదట చేసిన పనులు ఉస్మాన్‌సాగర్

మరియు హిమాయత్ సాగరుల నిర్మాణము ఇవి కట్టిన దున సికింద్రాబాదు హైదరాబాదు నగరములను డి పాడుటయే కాక నీటి వసతి ఏర్పాటు నది ఉస్మాన్‌సాగర్ ప్రాజెక్టుపని 1913 సం॥ మున ప్రారంభమై 1918 సం॥ న ముగిసి ది హిమాయత్‌సాగర్ నిర్మాణము 1918 వ సం॥ న ప్రారంభమై 1926వ సం॥న ముగిసి ది 1908లో మూసీనది పొంగి హైదరాబాదు నగరము ముంచి వేసినది పై డాములు కట్టిన తరువాత వరద బాధ లేదు ఇవేకాక నిజాం సాగర్ పోచారం వైరా పాలేరు డిండి మానేరు కోయిల్ సాగరు బెనుసురా కడమ ప సీ చంద్రసాగర్ పెండ్లి పాకల సరళసాగర్ తుంగభద్ర రాజోలిబండ ఆయన జీవిత కాలములోనే కట్ట బడినవి తరువాత తయారైన నాగార్జునసాగర్ పోచంపాడు అప్పరు కృష్ణ ప్రాజెక్టులు ఈయన కృషి ఫలితములే

నిజాం సాగర్ డాము కట్టుటలో ఈయన ధైర్యము ఎంతయు కొనియాడ దగి వి అప్పుడు భారత దేశములో నీటిని నిల్వచేయు డాములలో అన్ని టికంటె పెద్దది మొట్టమొదటిది మైసూరు రాష్ట్రములో నున్న కృష్ణరాజ సాగరము దీని తరు వాత ఈయన మదరాసు రాష్ట్రముతో కలసి తుంగభద్ర ప్రాజెక్టు నిర్మించిరి కాని చాలా కాలము ఈ రెండు రాష్ట్రములమధ్య నీటిని వాడుకొనే విషయములో అభిప్రాయ భేదములు కొనసాగుచుండెను చివరకు 1942 లో అప్పటి మదరాసుముఖ్యమంత్రియగు శ్రీరాజగోపాలాచారి గారితో మాట్లాడి ఒప్పందమునకు వచ్చిరి ప్రస్తుతము ఈనదీ జలములను ఆంధ్రరాష్ట్రము మైసూరు రాష్ట్రములు ఉపయోగించుకొను చున్నవి ఎంతటి క్లిష్ట పరిస్థితినైన ఎదుర్కొనే శక్తి ఈయనకు కలదు ఎన్ని సంవత్సరములనుండియో జరుగుచున్న అభిప్రాయభేదములకు ఈయన తన తెలివితేటలతో ఒక దారికి తెచ్చిరి

నవాజ్ జంగుగారు డాములు కట్టునపుడు ఎస్టిమేట్లు చాలా తగ్గించి వేయుచుండిరి అట్లు చేసినచో క్రిందివారు డబ్బు జాగ్రత్తగా వాడుదురని ఆయన నమ్మిక డబ్బు విరివిగా వాడుటకు ఆయన ఎప్పుడు ఒప్పుకొనెడివారు కాదు ఆయన స్వంతముగా డాములు కట్టు సంస్థలకు వెళ్ళి పరిశీలించువారు కాదు వెళ్ళినను కొన్ని ప్రశ్నలడిగి తెలిసి కొనేవారే కాని స్వతంత్రముగా చూసెడివారుకాదు ప్రశ్నలమూలకముగానే ఆయన పని ఎట్లు జరుగునది తెలిసికొనెడివారు ఆయనకు బ్రిడ్జి ఆట అన్న చాలా ఇష్టము ఆ బ్రిడ్జి ఒల్లపెద్దనే ఆయిన సందిగ్ధమైన విషయములు విడదీయువారు

ఈయన ఇరిగేషన్ ప్రాజెక్టులే కాక రోడ్లు వంతెనలు వేయుటయందు కూడ దిట్ట గోదావరీ కృష్ణల మీద కట్టిన వంతెనకు ఈయనే బాధ్యుడు

ఇరిగేషనుకు హైడ్రాలిక్సుకు సంబంధించిన లెక్కలు ఈయన నిమిషములో సూక్ష్మపద్ధతి చేసెడివారు గంటల తరబడి కాగితము మీద లెక్కలు చేసి చూచి దానికి దీనికి ఎక్కువ తేడ లేకుండెడిది

ఈయన తీవారు వరదలు తగ్గించుటకు కొన్ని వ్యాసము వ్రాసి పంపిరి ఈయన రాష్ట్రముల మధ్య నీటి తగువులు లేకుండ చూచుటకు వాటర్ కమిషన్ నొకదాని ఏర్పాటు చేయవలెనని చెప్పిరి

ఈయన కృషి వలనే ఆయకట్టు పొలములకు నీరు ఇచ్చు రాయంతో పాటు చెరకు పండించుటకు మరియు ఫ్యాక్టరీకి చవకగా విద్యుచ్ఛక్తి సరఫరా చేయుట

బోధన్ వద్దనున్న నైజాం షక్కర్ ఫ్యాక్టరీ ఈయన కృషి ఫలితమే నిజాంసాగరు ప్రాజెక్టు కట్టిన తరువాత ఎరి చెఱకు పండించుటకు వీలైనది అందుచే చెఱకు ఎక్కువగా పండించుటకు ప్రోత్సహించుటకుగాను చక్కెర ఫ్యాక్టరీని నిర్మించవలెనని నవాబుగారు తెలిపిరి నవాబుగారు హైదరాబాదు రాష్ట్రమున అనేక ప్రఖ్యాత సుందర భవనములను నిర్మించిరి హైదరాబాదునగరమున అడ్డిగమెట్టు సమీపమున 1636 ఎకరముల భూమిని సంపాదించి అందు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సంబంధించిన భవనములలో ఆర్ట్సు కాలేజీ విద్యార్థి వసతి గృహములు ఈయన కాలముననే పూర్తి అయినవి ఢిల్లీలోని నిజాము ప్రభుత్వ భవనము రు 28 75 518/- ఖర్చుతో నిర్మించ బడినది బొంబాయిలోని నిజాము ప్రభుత్వపు "నేపియన్ హౌస్" అను సుందర భవనమును కొన్ని మార్పులతో అభివృద్ధి పరచిరి నిజాము రాకుమారుడు మోజం జాబహదురు నివసించెడి హిల్ ఫోర్టు అను గొప్ప భవనమునకు కావలయు హంగుల నేర్పాటు చేసిరి మూసీనది ఒడ్డున నిర్మితమైన ప్రభుత్వ గ్రంథాలయము ఉస్మానియా ఆసుపత్రి వీటియందు ఏర్పరచిన సుందర ఉద్యానవనములు నిర్మించిన కీర్తి నవాబుగారిదై యున్నది

నవాబు అలీనవాజ్ జంగుగారు గొప్ప ఇంజనీరే కాక ఇతర విషయములలో కూడ ప్రజ్ఞ కలిగియుండిరి. మత విషయములు, వేదాంతము, వైద్యము, న్యాయశాస్త్రము, రాజకీయ విషయములమీద గంటల తరబడి చర్చించువారు. ఈయన చాలా కష్టపడి పని చేసెడివారు. సిగరెట్టు మాత్రము ఎక్కువగా త్రాగెడివారు. కాని వైద్యుని సలహా ననుసరించి వెంటనే ఆ అలవాటుకు స్వస్తి చెప్పిరి.

ఇట్టి గొప్ప వ్యక్తి సంస్మరణార్థము అలీనవాజ్ జంగు బహదూరు మెమోరియల్ కమిటీ ఒకటి ఏర్పాటయినది. మెమోరియల్ కమిటీవారు వీరి ఛాయా చిత్రమును ఇన్‌స్టిట్యూట్ అఫ్ ఇంజనీయర్సు భవనమున 16 సెప్టెంబరు 1968 నాడు ఆవిష్కరించిరి. అదే సమయమున ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారైన శ్రీ బ్రహ్మానందరెడ్డిగారికి ఒక లక్ష రూపాయలకు చెక్కును నవాబుగారి జ్ఞాపకార్థము బహూకరించిరి. బ్రహ్మానందరెడ్డిగారు కమిటీవారికి వందనములు తెలిపి తాము ఉస్మానియా విశ్వవిద్యాలయము సహాయముతో ఇంకొక రెండు లక్షలు కూడబెట్టి ఇంజనీరింగు కాలేజీలో నవాబు అలీనవాజ్ జంగువారి పేరుమీద ఒక ఆచార్య పదవిని ఏర్పాటు చేయుదుమని తెలిపిరి.

నవాబుగారు 6 వ డిసెంబరు 1949 నాడు తమ 72 వ ఏట హైదరాబాదునందు దివంగతులైరి. వీరి అంత్యక్రియలకు మహాఘనత వహించిన నిజాము ప్రభువు, ఉన్నతాధికారులు హాజరై శ్రద్ధాంజలులు ఘటించిరి. వీరి మరణమునకు అప్పటి గవర్నరు జనరల్ హోదాలో నున్న శ్రీమాన్ రాజగోపాలాచారిగారు, సుప్రసిద్ధ ఇంజనీయరు యమ్. విశ్వేశ్వరయ్య, అప్పటి హైదరాబాదు ప్రధానామాత్యుడు యమ్. కె. వెల్లోడి సంతాప సందేశములు పంపిరి.

ఎన్. కృ. రా.

ఎన్. రా.

## అలీఫ్‌ఖాను

అలీఫ్‌ఖాను ప్రశంస తెలుగు విజ్ఞానసర్వస్వము నాలుగవ సంపుటమున కనవచ్చుచున్నది (విజ్ఞా. తె. IV–746). ఇతడు పఠాను జాతీయుడు. ఇబ్రాహింఖాను కుమారుడు. ఇతడు కర్నూలుకు నవాబై క్రీ. శ. 1724 నుండి 1733 వరకు పాలించెను. ఇతడు దక్కను సుబేదారైన నిజామ్‌ఉల్ ముల్కు–అసఫ్‌జాకు విధేయ సామంతుడు.

క్రీ. శ. 1707 న మొగలాయి చక్రవర్తి ఔరంగజేబు మరణించెను. అతని తరువాత అతని కుమారుడు మొఅజ్జమను వాడు బహదూర్ షా అను పేరుతో చక్రవర్తి అయెను. ఔరంగజేబుతో మొగలాయి పాలన ఆధిక్యము అడుగంటెను. మొఅజ్జ తన తండ్రివంటి సమర్థుడు కాడు. అతని కాలమున వివిధ ప్రాంతములలోనున్న మొగలాయీల సామంతులు అనేకులు స్వతంత్రులైరి. అట్టి వారిలో ఒకరు దక్షిణ దేశమునకు సుబేదారుగ నియమితుడైన నిజామ్‌ఉల్ ముల్కు అసఫ్‌జా. అతడు కూడ క్రీ. శ. 1724 స్వతంత్రుడై ము ఏర్పరచి హైదరాబాదు రాష్ట్రమును స్థాపించెను. ఆంధ్రదేశమున చాల భాగము ఈ హైదరాబాదు రాష్ట్రములోనే ఉండెను. ఆవిధముగనే రాయలసీమలోని కర్నూలు మండలము కూడ అసఫ్‌జా అధీనములో నుండెను.

అలీఫ్‌ఖానుకు పూర్వము కర్నూలు ప్రాంతము దావూద్‌ఖానుకు జాగీరుగా ఇయ్యబడెను. దావూద్‌ఖాను అలీఫ్‌ఖానుకు పెదతండ్రి. అటుపిమ్మట క్రీ. శ. 1724 న కర్నూలు ప్రాంతము అలీఫ్‌ఖాను వశమయ్యెను. తాను కర్నూలు ప్రాంతమునకు పాలకుగా గుర్తించవలసినదని అలీఫ్‌ఖాను దక్కను సుబేదారైన అసఫ్‌జాను విజ్ఞప్తి చేసికొనెను. అసఫ్‌జా అతని విజ్ఞప్తిని మన్నించెను. ఆదవాని కిల్లాకు అతనిని అధిపతిగా ఒనరెను. ఆదవాని నేడు ఆదోని అని పిలువబడుచున్నది. ఇది నేడు కర్నూలు మండలమున ఒక తాలూకా. అసఫ్‌జా అనుమతిని పొంది అలీఫ్‌ఖాను కర్నూలులోనే ఉండి ఆదవానిని తొమ్మిది సంవత్సరములు పాలించెను (క్రీ. శ. 1724–1733).

అలీఫ్‌ఖానుకు హిమాయత్‌ఖాను, రహమత్‌ఖాను అను ఇరువురు తనయులు కలరు. వీరిలో పెద్దవాడగు హిమాయత్‌ఖాను తండ్రి పిమ్మట అతని జాగీరుకు పాలకుడయ్యెను. ఇతడు క్రీ. శ. 1733 నుండి 1751 వరకు పాలించినట్లు తెలియుచున్నది.

తం. ఆ. శా.

## అలుంగచింగపురము

అలుంగచింగపురము ఎచ్చటిదో గుర్తించుటకు వీలు పడలేదు. ఈ పట్టణ ప్రశంస రాజమార్తాండరాజు కుమారుడు రాయపరాజు శాసనమునందు కన్పించుచున్నది (ద. హి. IV నెం. 1090). రాజమార్తాండరాజు అలుంగచింగపురమునకు

చెందినట్లు వ్రాయబడినది. శక 1064 (క్రీ. శ. 1142) సంవత్సరము ఉత్తరాయణ పుణ్యకాలమున రాయపరాజు తమ తండ్రి ధర్మార్థముగా దాక్షారామ భీమేశ్వరదేవునకు అఖండ వర్తి లోపాదండు వియకు గామ ఎలుగుగు బోయలు పూటగా దాయబోల నరసింహోరికి ఏబది ఆనుప ఎడ్లను ఇచ్చెను. సదరు బోయ ప్రతినిత్యము మానెడు నేయి దేవుని దీపారాధనకై సమర్పించగలవాడు. ఈ శాసనమును పెద్దనార్యుడు చెక్కెను. లికి (ఖి)౦ పెద్ద నాచార్యేణ అని యున్నది. శాసనకాలమునందు అనగా 1142 సంవత్సర ప్రాంతమున వెలనాటి చోడులు ఆంధ్రమండలాధీశ్వరులుగా ఉండిరి. దీనికి సమీపకాలముననే అనగా క్రీ. శ. 1185 ప్రాంతమున వెలనాటి చోడులు పాశ్చాత్య చాళుక్య సైన్యములను గోదావరీ తీరమున ఓడించి ఆంధ్రదేశమునుండి వెడలగొట్టిరి. అలుంగచిగపురము అనగా ఉగ్రనరసింహస్వామి ప్రతిష్ఠ గల గ్రామము అను అర్థమును ఇచ్చుచున్నది.

ఖం. ల. రం.

## అలుకూరు—మల్లికార్జున శాస్త్రి

అలుకూరు మల్లికార్జునశాస్త్రిగారు గొల్లావిన్ని వంశమునకు చెందినవారు. వీరు యజుశ్శాఖీయులు. వీరిది శ్రీవత్సస గోత్రము. ఆపస్తంబ సూత్రము. వీరి నివాస గ్రామము రాయచూరు మండలమునందలి అలుకూరు అను గ్రామము. వీరి పూర్వీకులు మొదట కర్నూలు మండలమునందలి కోడుమూరు గ్రామమున నివసించినట్లు తెలియుచున్నది. వీరి తల్లిదండ్రులు సుబ్బమాంబా వేంకటరామశాస్త్రిగార్లు. వీరికి రామశాస్త్రి అను సోదరుడును సోమాంబ గిరిజ అను సోదరీమణులును కలరు.

మల్లికార్జునశాస్త్రిగారిని గూర్చి వ్రాయుటకు ముందు వారి పూర్వీకుల వృత్తాంతము గూడ సంగ్రహముగ వ్రాయుట ఉచితమని తోచును. మల్లికార్జునశాస్త్రిగారి తాతకు తాతగారైన అప్పయ్యశాస్త్రిగారు మయూరవాహినీ దేవ్యుపాసకులు. ఆయన తన పన్నెండవయేటనే దేవిని దర్శించి ఆమె వలన తనమండి ఏడుతరములవరకు తన వంశమున జన్మించినవారు గొప్ప శాస్త్రపండితులగునట్లు వరమును బడసినట్లు ఈ క్రింది శ్లోకము చెప్పుచున్నది.

ఆసప్త మాధ్వర మగాన్నిజ వంశజానామ్
విచ్ఛిత్తి శూన్య విమలాఖిల శాస్త్ర బోధమ్॥

అప్పయ్యశాస్త్రిగారు శాస్త్రపండితులు, అనర్గళ కవితాధారా పటిమగలవారు. వీరి కవితకు మెచ్చి రాయచూరు పాలకులు వీరికి రాయచూరు మాన్వి అరిగెర తాలూకాల లోని అలుకూరు గ్రామమను సోమ కొంతభూమిని ఉచ ద్రార్క్యముగ దానమొసగిరి. ఈపై ప్రదేశముల పూర్వపు హైదరాబాదు రాష్ట్రమున ఉండెడివి. ఇవి నేడు మైసూరు రాష్ట్రమునకు చెందియున్నవి. వీరికి కవీశ్వర అను బిరుదము గూడ కలదు. వీరు అలుకూరు గ్రామమున నివసించిరి. అందుచేతనో యేమో వీరి గ్రామ నామము గృహనామముగ ఏర్పడినట్లు తోచును.

మల్లికార్జునశాస్త్రిగారి తాత సుబ్బాశాస్త్రిగారు. వీరికి చిదంబరస్వామి అను యతి అనుగ్రహమున వేంకటరామశాస్త్రి శేషశాస్త్రి అను ఇరువురు తనయులు జన్మించిరి. సుబ్బాశాస్త్రిగారు గొప్ప శాస్త్రపండితులు. ఈయన సుతులగు వేంకటరామశాస్త్రి శేషశాస్త్రి అనువారు కూడ న్యాయ వేదాంత వ్యాకరణ శాస్త్రములందు గొప్ప పండితులే కాక కర్ణాట సంస్కృత సాహిత్యములందును గొప్ప అభినివేశము కలవారు. భాషాత్రయమునందును కవిత్వము చెప్పెడివారు.

క్రీ. శ. 1871వ సంవత్సరమున అనగా ప్రజోత్పత్తి నామ సంవత్సర భాద్రపద బహుళ దశమినాడు వేంకటరామశాస్త్రి సుబ్బామాంబగారలకు మల్లికార్జునశాస్త్రిగారు జన్మించిరి. మల్లికార్జునశాస్త్రిగారికి ఆయన ఎనిమిదవ యేట ఉపనయనము జరిగెను. తండ్రి చెంతనే వారు నాటకాంత సంస్కృతసాహిత్యమును సవ్యాఖ్యానముగా కౌముదిని పఠించిరి. వీరికి గొప్ప కవితాశక్తియు అలవడినది. అప్పటికి వీరివయస్సు పండ్రెండు సంవత్సరములు మాత్రమే.


అలుకూరి
మల్లికార్జునశాస్త్రి

తండ్రి వీరిని వెంటపెట్టుకొని గద్వాల వనపర్తి ఆత్మకూరు మున్నగు సంస్థానములను దర్శించెడివారు. అచ్చటి విద్వాంసులు మల్లికార్జునశాస్త్రిగారిని పరీక్షించి ఆయన పాండిత్యమునకు కవితాపటిమకు మెచ్చి భారతీ బాలలీలారూపుడు అను బిరుదము నొసంగిరి. శాస్త్రిగారు తండ్రి కడనే న్యాయ

వేదాంత శాస్త్రముల నభ్యసించిరి. వేదాంతము కడవరకు ముగియకమును వేంకటశాస్త్రిగారి తండ్రి వేంకటరామశాస్త్రిగారు దివంగతులైరి.

శాస్త్రిగారికి జ్యోతిష విద్యయందు ఆసక్తి పొడమెను. తోడనే అనంతపురము జిల్లా గడేహోతూరు గ్రామ వాస్తవ్యులగు వేంకట్రామశాస్త్రిగారి వద్ద వీరు పదునారు అధ్యాయములుగల గ్రహలాఘవము అను గ్రంథమును ప్రశ్న శకున శాస్త్రములను అధ్యయన మొనర్చిరి. అంతటితో వారికి తృప్తి కలుగలేదు. అందుచే పితామహుని ఆజ్ఞ ననుసరించి మదరాసు వాస్తవ్యులైన బెంగుళూరు శివశంకరశాస్త్రిగారి సిఫారసు పత్రమును సంపాదించి రాఘవాచార్యులవారి యొద్ద జ్యోతిశ్శాస్త్రమును వ్యాకరణశాస్త్రమును అభ్యసించుటకై కాళహస్తికి చనిరి. రాఘవచార్యులవారు స్కంధత్రయ జ్యోతిష విద్యా పండితులు. అఖిల శాస్త్ర పాఠ ప్రవచన నిష్ఠా గరిష్ఠులు. ఇట్టి మహాపండితుల యొద్ద శాస్త్రిగారు మహాభాష్యాంత వ్యాకరణమును ముహూర్త జాతక సిద్ధాంత రూప స్కంధత్రయ జ్యోతిష శాస్త్రమును మహా మేధాశక్తితో అచిరకాలముననే అభ్యసించిరి. గురువుగారి అనుజ్ఞగొని శాస్త్రిగారు కలియుగాది దశ సహస్ర వర్షముల యొక్కయు తిథి వార నక్షత్ర యోగ కరణ ఘటికా విఘటికల యొక్కయు ప్రమాణములను అతి సులభముగ బోధించునట్టి ఖచరమణి పేటిక అను జ్యోతిష గ్రంథమును యేబది సంస్కృత శ్లోకములలో రచించి గురువుగారికి సమర్పించిరి. శిష్యుని బుద్ధి వైభవములకు గురువుగారు మిక్కిలి అచ్చెరువొంది ఆయనను మిక్కిలిగ ఆశీర్వదించిరి.

శాస్త్రిగారు తాను రచించిన ఖచరమణి పేటికను మద్రాసులోని శివశంకరశాస్త్రిగారికి చూపిరి. వారు ఆగ్రంథమును మిక్కిలి కొనియాడిరి. శివశంకరశాస్త్రిగారు తాము వ్రాసిన జ్యోతిస్సిద్ధాంతసంగ్రహము అను గ్రంథమును శాస్త్రిగారికి కానుకగా నొసగిరి.

శాస్త్రిగారు తిరిగి స్వగ్రామమునకు వచ్చి తండ్రివద్ద కొరతవడిన వేదాంతశాస్త్రమును తాత సుబ్బాశాస్త్రిగారి వద్ద పరిసమాప్తి చేసిరి. ఇట్లు ఇరువది సంవత్సరముల ప్రాయముననే శాస్త్రిగారు శాస్త్ర జ్యోతిశ్శాస్త్ర కవిత్వములందు నిరుపమానమైన పాండితిని సంపాదించిరి. వీరి ఇరువదవయేట వీరికి సుబ్బమాంబతో వివాహము జరిగెను. సుబ్బమాంబగారు అనంతపురము జిల్లా గుత్తి తాలూకా డోనే ల్లు గ్రామ వాసులగు అలూరు వేంకటరామశాస్త్రిగారి కుమార్తె.

గృహస్థ ధర్మములను నెరవేర్చుకొనుచు శిష్యులకు శాస్త్ర పాఠములను బోధించుచు శాస్త్రిగారు కడప బళ్ళారి మున్నగు ప్రదేశములలో శతావధానముల నొనర్చి అనేక సత్కారముల నందిరి. గద్వాల సంస్థానమున పండిత సభలో తర్క వ్యాకరణ వేదాంత శాస్త్రములలో ఆయా శాస్త్రపండితులతో వాదించి తమ అసదృశ పాండిత్యమును వీరు నిరూపించుకొనిరి. ఇట్లే వనపర్తి ఆత్మకూరు సంస్థానములలో తమ పాండిత్యమును ప్రదర్శించి వీరు ప్రభువులవలన అనేక సన్మానములను బడసిరి.

గద్వాల సంస్థానమున వీరొనర్చిన శతావధానము మిక్కిలి ప్రశంసనీయమైనది. మాఘ శుక్ల పూర్ణిమ నాటి విద్వత్సభలో వారు శతావధానమును చేసిరి. సుప్రసిద్ధ అష్ట శతావధానులగు తిరుపతి వేంకటకవుల అధ్యక్షమున ఈశతావధానము జరుగుట గొప్ప విశేషము. ఈయన కవితా ధారకు తిరుపతివేంకటకవులు సభ్యులు ఆశ్చర్యము నొందిరి. గద్వాల రాజావారు ముగ్ధులైరి. శాస్త్రిగారికి ఆసభలో కవితాసార్వభౌమ బిరుదముతో పాటు ఘన సన్మానము లభించెను.

మిత్రులగు బెంగుళూరు శివశంకరశాస్త్రిగారి ఆహ్వానము నందుకొని శాస్త్రిగారు మదరాసునకు పోయిరి. అచ్చటి విద్వత్సభలో వీరు శాస్త్రార్థములు శతావధానములచే సభ్యుల నానందింపజేసిరి.

బాలసరస్వతి షడ్దర్శనీపండిత శతావధాన బిరుదాంచితులగు బుక్కపట్నం శ్రీనివాసాచార్యులవారు శాస్త్రిగారికి సకలశాస్త్రాభిజ్ఞ అను బిరుదమునొసగిరి. శ్రీనివాసాచార్యులవారు ఆత్మకూరు సంస్థానపండితులు.

శాస్త్రిగారు కేశవాంకితముగ వాసుదేవానందము అను అలంకార గ్రంథమును రచించిరి. ఇది అముద్రితము. జ్యోతిశ్శాస్త్ర సుధర్మసారము అను గ్రంథమును రచించి వీరు కాలడి అగ్రహారమునందు శృంగగిరి నరసింహభారతీ స్వాములవారు శంకర ప్రతిష్ఠ యొనర్చినపుడు జరిగిన పండిత సభలో స్వాములవారికి ఆగ్రంథమును సమర్పించిరి. స్వామివారు శాస్త్రిగారికి అగ్రతాంబూల మొసగి పండితసార్వభౌమ అను బిరుదము ప్రసాదించిరి. శాస్త్రిగారు హంపి విరూపాక్షేశ్వరుని చెంత బ్రహ్మసత్రము చేసి వారణాసిలో అవభృథ మొనర్చిరి.

ప పా భువనేశ్వరీ ఎహితుడగు విరూపాక్ష దేవేశుల చెంత వీరు మూడు దినములు అన్న పానీయములు విడిచి బాహ్య స్థితిని మరచి సమాధిలో ను డి విరూపాక్షుని దర్శి చిరి ఇట్లు మూడేసి నాలుగేసి దినములు ఆహార పానీయములను విడిచి మైమరచి సమాధిలో ను డుట వీరికి పరిపాటి అయ్యెను ఈయన సమాధిలో నున్నపుడు ఈయన సంసార భారమును ఈయన తల్లియు తమ్ముడగు రామశాస్త్రియు వహించెడివారు

శాస్త్రిగారికి కృష్ణవేణి లక్ష్మి సర స్వతి అను ముప్వురు కుమార్తెలును రామశాస్త్రి అను కుమారుడును ఉండినట్లు తెలియుచున్నది

శాస్త్రిగారు క్రీ శ 1917 వ సంవత్సరమున శివధ్యాన తత్పరులై భౌతిక కాయమును వీడిరి

తం ఆం శా

**అలుగురాజు** చూ అనుగురాజు

## అల్మయ్య

అబ్దుల్లా కుతుబుషా (క్రీ శ 1626 1672) పాలన కాలములో జరిగిన కొన్ని సన్నివేశములను హాకీమ్ నిజాముద్దీన్ అహమ్మదు అను చరిత్రకారుడు హాదికతేసలాతీన్ అను గ్రంథమున వివరించెను

చరిత్రకారుని కథనము ననుసరించి చౌదరీ బిరుదమును వహి చిన వీరందరు రెడ్డి ప్రముఖులు గుల్బర్గా ప్రాంతమున ను డెడివారు వారిలో పెద్దిరెడ్డి కుమారుడు అల్మయ అను నాతడు సిరి సంపదలను గౌరవ మర్యాదలను కలిగి ప్రజారంజకుడుగా మెలగుచుండెను

అల్మయ్య జీత బత్తెముల నిచ్చి 840 మంది భటులు గల అశ్వదళమును పెక్కు సుశిక్షితులై న పదా తు ల ను పోషి చెడివాడు కుతుబుషాహీ ప్రభువులకు చెందిన గుల్బర్గా పరిసరములను బీజపూరులోని ఆదిల్ షాహి ప్రభుత్వము ఆక్రమి చుకొనకుండా చేయుటకే తాను సైన్యమును సేకరి చి పోషించుచున్నట్లు అల్మయ్య చెప్పెడివాడు

రా మర్యాదలకు భంగము కాకుండ నటుల అల్మయ్య అనేక బహుమతులను పంపుటా సుల్తాన్ అబ్దుల్లా కుతుబుషా వారికి బహుకరించెడివాడు కాని ఇతర సర్దారవలె స్వయముగా దర్బారునకు హాజరయి సుల్తానువారు జరపు గౌరవ పురస్కారముల స్వీకరించెడు వాడుకాదు దర్బారునకు రాకపోవుటకు కారణముగా ఏవో కుంటిసాకులు చెప్పి తప్పించుకొనుటయే కాక కేంద్రప్రభుత్వము పంపు కాఖీదులక కూడ మన్నించక నిర్లక్ష్యముగా ప్రవర్తి చెడివాడు

అల్మయ్య ప్రవర్తన ననుసరించి సుల్తాను మీద ప్రత్యక్షముగ తిరుగుబాటు జరుపకు డినను పరోక్షముగానైనను అతని అవిధేయతను కేంద్ర ప్రభుత్వము తిరుగుబాటుగా పరిగణించినది కాల్బలమును అశ్వదళమును అల్మయ్య కలిగి యుండుటకు గల కారణము అతడు స్వత త్రుడగుటకు చేయు యత్న మనియు సమయము చిక్కినచో ప్రభుత్వము నెదుర్కొనుటకే అతడు యత్నించుచున్నాడని ప్రభుత్వము భావించెను

అబ్దుల్లా కుతుబుషా వర్ష ఋతువునందు విలాసార్థము పరివారముతో ఫల పుష్ప శోభితములైన ఉద్యాన వనములను సందర్శించి అందు కొ త కాలము విహరించుట పరిపాటైనది ఇట్టి ఉల్లాసమును కలిగి చు దినములను "బుర్షాబహారు" అని పార్శీ భాషలో అ దురు

జమాదులవ్వల్ నెల 1039 హిజిరీ (క్రీ శ -1631) సం॥ వర్ష ఋతువున హైదరాబాదునుండి మ హ మ్మ దు నగరు (గోల్కొండ)కు పరివారముతో అబ్దుల్లాపాదుషా తరలి వెళ్లెను అచటి పరిసరములను ను ఉద్యానవనముల విహరించుటకును తండ్రి మహమ్మదుకుతుబుషా సమాధిని దర్శించి ఆయన స్మారకార్థము వినయ విధేయతల ప్రదర్శించుటకును సుల్తాను ఉద్దేశించెను

సుల్తాను వచ్చు స దర్భమును పురస్కరించుకొని ప్రజలు సంతోషమును ప్రకటించుపట్టునను వారి రివికి తగు రీతిని ఆ ప్రదేశ మ తయు చక్కగా అలంకరించిరి సుల్తాను తన పరివారముతో ఉద్యాన వనమున సంచరి చు సమయమున ప్రధానమంత్రి షరీపుల్ ముల్కు అను నాతడు అల్మయ్యచౌదరీ అవిధేయతను చెప్పి అతనిని శిక్షించుటకు బందీగా గొని వచ్చునట్లు అమజ్ఞ పొందెను వెంటనే సర్వసైన్యాధిపతి అయినఎల్చిబేగు కాల్బలమును అశ్వదళమును వెంట నిడికొని ఒక రోజు ఒక రాత్రి హుటాహుటి ప్రయాణము చేసి తెల్లవారుజామున గుల్బర్గా పట్టణమును ప్రవేశించెను అప్పటికి అల్మయ్య గాఢ నిద్రలో ను డెను ఎల్చిబేగు సేనలు అల్మయ్య నివాసగృహమును చుట్టు ముట్టినవి కాని అతను మేల్కొని పరిస్థితులు గ్రహించులోపున ఇరు పక్షములకు పెద్ద పోరు

జరిగి అందు అల్మయ్యా సైనికులు అనేకమంది హతులైరి అల్మయ్యా ఉగ్రప్రచండుడై తన డాలును కత్తిని ధరించి పగతుర సైన్యముమీద ఉరికెను. కాని శత్రువులు ఆతనిని ముట్టడించి అతని శిరమును ఖండించి వైచిరి. ఎల్చిబేగు అల్మయ్యా శిరమును వెంట నిడికొని సైన్యముతో ఆదేరోజునగోల్కొండకు తరలెను. అల్మయ్యాను జీవగ్రాహముగా పట్టుకొని రమ్మనిన సుల్తాను ఆజ్ఞ తారుమారైనది. గుల్బర్గాలోని జనులు ఈ దృశ్యమునకు విభ్రాంతులైరి.

అబ్దుల్లా వేడుకను ముగించి గోల్కొండ దుర్గ బహిద్వారమును దాటి హైదరాబాదునకు వెడలు సమయమున ఎల్చిబేగు గోల్కొండను చేరుకొనుటయు ఒకే సమయమున జరిగినవి. వెంటనే ఎల్చిబేగు అల్మయ్యా శిరమును అబ్దుల్లా పాదుషాకు సమర్పించెను. ఎల్చిబేగు సాహస కృత్యమునకు అబ్దుల్లా ఎంతో సంతోషించి అనేక కానుకల నిచ్చి బహూకరించెను. ఈ బహుమతులలో "అస్ఫాతాజ్" అను పేరు కలిగిన ఒక ఉత్తమాశ్వము కూడ కలదు.

అల్మయ్యా స్థిరాస్తుల కన్నిటికిని ఎల్చిబేగు వారసుడయ్యెను. ధన కనక వస్తు వాహనము లన్నియు కుతుబు షాహీ ఖజానాకు దఖలు పడినవి.

అల్మయ్యా వధానంతరము గుల్బర్గా పరగణాలో ప్రభుత్వ పాలన క్రింద స్థిరత్వము నెలకొల్పబడినది. అన్ని విధముల ప్రజలు సౌఖ్యముల ననుభవించిరి. ఇది ముసల్మాను చరిత్ర కారుల కథనము. దీని నిజా నిజములు నిర్ణయించుటకు ఇతరాధారములు లేవు.

మ. త. క.

## అల్లంరాజు - రంగశాయికవి

అల్లంరాజు రంగశాయికవి ఆరామద్రావిడ శాఖీయ బ్రాహ్మణ కులమునకు చెందినవాడు. వీరిది హరితస గోత్రము అపస్తంబ సూత్రము. ఈయన నివాస స్థానము పీఠికాపురమునకు సమీపమందున్న చేబ్రోలు అను గ్రామము. ఈయన తండ్రి పేరు సుబ్రహ్మణ్యము తల్లి పేరు చిన్నమాంబ.

రంగశాయి తండ్రియైన సుబ్రహ్మణ్యకవి భద్రాపరిణయము మున్నగు గ్రంథములను రచించెను. క్రీ. శ. 1860 న అనగా రౌద్రి నామ సంవత్సర నిజాశ్వయుజ శుద్ధ దశమి బుధవారమున రంగశాయి జన్మించెను. ఈయన గొప్ప సుగుణ సంపత్తి కలవాడు. సంస్కృతాంధ్రములయందు గొప్ప పాండిత్యముకలవాడు. పాండిత్యము ఈయనయందు ఎంత అధికమో దానికి రెట్టింపుగా వినయ సంపత్తి కలదు. వైదిక కర్మానుష్ఠానమునందు ఈయనకు ఆదరము ఎక్కువ. ఆచార వ్యవహారమునందు ఈయనకు ప్రీతి అధికము. పిఠాపురములోని సూర్యరాయా ధ్రనిఘంటు కార్యస్థానమునకు ఈయన కొంతకాలము పండిత పదవి నలంకరించెను. ఈయన ఉద్యోగమునకు బోవునపుడు మార్గమున అంటరాని వస్తువును తాకినట్లు అనుమానము కల్గినచో వెంటనే ఇంటికి తిరిగిపోయి స్నానముచేసి వచ్చెడివాడట. అసత్యము పలుకుటయందు ఈయనకు మిక్కిలి ఏవగింపు. అందుచేతనే అసత్య విషయములు అసూత కల్పనలతో గూడిన స్వతంత్ర కావ్యములను వ్రాయుటకు ఈయన పూనుకొనలేదు. భగవంతుని స్తుతించు శతకములు సంస్కృతాంధ్రీకరణములు మాత్రమే ఈయన రచనలు కనవచ్చుచున్నవి. ధన సంపాదనమునందు ఈయనకు అపేక్ష లేదు. అసంతుష్టో ద్విజో నష్టః అను సూక్తిని అనుసరించి ఈయన ఉన్నదానితో సంతృప్తిగ కాలము గడిపెడువాడు. ఈయనకు భగవంతుని యందు అమితమైన విశ్వాసము. అందుచేతనే ఈయన తన కృతులను వేనిని నరాంకిత మీయక భగవంతునికే సమర్పించుకొనెను. లౌకిక రాజకీయ తంత్రములకు ఈయన మిక్కిలి దూరముగ నుండును. ఒకరిని యాచించుట అన్నను ఒకరి చెంత ఉద్యోగము చేయుట అన్నను ఈయనకు అభిమతముకాదు.

రంగశాయకవి అష్టావధాన శతావధానముల నొనర్చుటలో దిట్ట. చిత్ర బంధకవిత్వములయందును అశువుగా సంస్కృతాంధ్రములలో సమస్యలను పూరించుటలోను ఈయన మిక్కిలి ప్రజ్ఞావంతుడు. నూజివీడు జయపురము మున్నగు సంస్థానములలో ఈయన శతావధానముల నిర్వర్తించి ఆయా ప్రభువులవలన అనేక సత్కారములను పొందెను. గోడే గజపతిరావు ప్రభువు నొద్ద ఈయన సుమారు ముప్పది సంవత్సరముల కాలమునుండి ఆప్రభువుచే అనేక సన్మానములు పొందినట్లు తెలియుచున్నది.

రంగశాయికవి రచించిన గ్రంథములు పదునైదుకు పైగా కనవచ్చుచున్నవి. అవి చంపువులు శతకములు సంస్కృత గ్రంథములు అను విధములుగా నున్నవి. ఈయన రచించిన శ్రీమదాంధ్రచంపూ భారతము రామాయణచంపువు అను వానిలో మొదటిది క్రీ. శ. 1918 వ ముద్రితము. రెండవది

కాలకా డము వరకే వ్రాయబడినట్లు తెలియుచున్నది రఘు రామశతకము పరమాత్మశతకము సర్వేశ్వరశతకము గోపి దశతకము లక్ష్మీశతకము మాధవశతకము గోపాల స్వామిశతకము కుక్కుటలిగశతకము మల్లికార్జునస్వామి శతకము అనునవి ఈయన రచించిన శతకములు వీనిలో కొన్ని సంస్కృతమునను కొన్ని తెనుగునను వ్రాయబడినట్లు తెలియుచున్నది శివకేశవులను సమాన ప్రతిపత్తితో శతక రూపమున ధ్యానించి రంగశాయికవి తన అద్వైత భావమును నిరూపించుకొనెను ఈయన సంస్కృతమున శైవ స్తోత్రరత్నావళి నారాయణానందాలహరీ కవిమానసరంజనీ అను గ్రంథములను రచించెను ఈయన గ్రంథముల కన్నిటికిని భగవంతుడే కృతిభర్త ఈయన తన తండ్రి యాజ్ఞపై సంస్కృతభారత చంపువును తెనుగున అనువదించినట్లు చెప్పుకొనెను సంస్కృత భారతచంపువును అనంతభట్టుకవి వ్రాసెను ఈకవి రచనము సంస్కృతమున మనోహరముగ సాగినది, దీనికి దీటుగ రంగశాయికవి తన తెలుగు అనువాద కవితను వెలయించెను చిత్రకవిత్వ రచనమునం దీకవి సిద్ధహస్తుడు

రంగశాయికవి క్రీ శ 1936 న అనగా యువ సంవత్సర చైత్ర బహుళ దశమినాడు దివ మలంకరించెను

తం అ శా

## అల్లపర్రు

అల్లపర్రు గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాలో ఉన్నది దీనికి 7 మైళ్ళలో రేపల్లె పట్టణముకలదు తూర్పున బేతపూడి ఇసుకపల్లి శింగుపాలెం బోయిమెరక పడమట కూచినపూడి పల్లిపట్ల ఉత్తరమున పేటేటిపాలెం (?)మిడిమర్రు దక్షిణమున అడవుల దీవి ఈగ్రామమునకు సరిహద్దులుగా ఉన్నవి ఇది బల్లపరుపు నేలకలదై ఉన్నది దీని విస్తీర్ణము 9 550 ఎకరములు

1941 సం॥లో ఈగ్రామములో 6 187 మంది 1951 సం॥లో 6 257 మంది 1961 స ॥లో 8 663 మంది ఉండిరి 1951-1961 సంవత్సరముల మధ్య 2 406 మంది పెరిగిరి ఇచట వ్యవసాయము అభివృద్ధి అగుటచేతను ఉన్నతపాఠశాల ఉండుటచేతను జనాభా పెరిగినది ఈజనాభాలో 1017 మంది షెడ్యూలుజాతుల వారు 220 మంది షెడ్యూలు తెగలవారు గలరు. ఇచ్చట ఇండ్లు కొన్నిచోట్ల ఏకపంక్తిగాను ఒకచో వాడవాడలుగాను నిర్మించబడినవి వీటిలో 800 పెంకుటిండ్లు 100 ఒక అంతస్తుగల మేడలు 2 ఎక్కువ అంతస్తులుగల భవనములు ఉన్నవి ఈగ్రామస్థులలో 8000 మంది వరిఅన్నమును 663 మంది ఇతర అన్నములను తిందురు బావుల నీటిని కాలువనీటిని త్రాగుదురు

ఇసుకపల్లి కాలువ ఉల్లిపాలె కాలువ అల్లపర్రు కాలువ దేవుడి చెరువు మెడువారి చెరువు నాగులచెరువు మాలపల్లి చెరువు కింతేటివారి చెరువు రావివారి చెరువు గొల్లపాలెంచెరువు అల్లపర్రుమాలపల్లిచెరువు మొదలయినవి ఈగ్రామపు నీటివనరులు వీటిక్రింద వరి జొన్న ఉలవ వేరుసెనగ మొదలగు పంటలు పండును పంట వస్తువులను గాదెలలో పురులలో నిలువ చేయుదురు బండ్లపై లారీలపై పంటదినుసులను రేపల్లెకు రవాణా చేయుదురు కాటితోపులు మామిడి తోటలు సీమరేగు తోటలు ఈగ్రామమున కలవు ఫలములను రేపల్లెకు రవాణా చేయుదురు దోస పొట్ల కాకర మున్నగు కూరగాయలను పండింతురు కూరగాయలలో ఒక వంతు గ్రామస్థులు ఉపయోగించుకొని మిగిలిన రెండువంతులు రేపల్లెకు రవాణా చేయుదురు 1966 67 స ॥లో ఇక్కడ పంటల క్రింద 1 097 ఎకరముల భూమి ఉపయోగపడెను 6 ట్రాక్టర్లు 750 ఎకరముల భూమిని దున్నెను ఇచ్చట 6000 ఎకరముల నల్లనేల 3 550 ఎకరముల చవిటినేల ఉన్నది

ఈగ్రామమున గేదెలు ఎద్దులు ఆవులు ఆబోతులు మున్నగునవి 973 ఉన్నవి 120 మేకలు 40 గొర్రెలు 21 పందులు 1 142 కోళ్ళు కలవు సంవత్సరమునకు 12000 లీటర్ల పాలు 7 మెట్రిక్ టన్నుల మాంసము 2 మెట్రిక్ టన్నుల చేపలు 5000 గ్రుడ్లు స్థానికులు ఉపయోగించుకొని 10 000 లీటర్ల పాలు 3 మెట్రిక్ టన్నుల మాంసము 3 మెట్రిక్ టన్నుల చేపలు 15 000 గ్రుడ్లు రేపల్లెకు రవాణా చేసిరి

ఈగ్రామ ప్రజల ముఖ్య వృత్తులు వ్యవసాయము వ్యవసాయకూలి కమిషన్ ఏజ౦ట్లు స్వతదు కాణాదారులు ఎద్దుబండ్లు తోలువారు కలరు కంసాలివారు వడ్రంగులు కమ్మరులు, కుమ్మరులు తాపీమేస్త్రీలు మంగలివారు చాకలివారు కలరు 4 వడ్లమరలు 20 మెట్రిక్ టన్నుల బియ్యమును సాలీనా రేపల్లెకు ఎగుమతి చేయుచున్నవి వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు దినమునకు పురుషునకు కూలి రు 3-లు; స్త్రీకి రు 2-50 లు

ఇచ్చట చెన్నమల్లేశ్వర సుబ్రహ్మణ్యేశ్వర చెన్నకేశవ ఆంజనేయ కోదండరామస్వాముల దేవాలయములు కలవు గ్రామదేవత గుడి 2 చర్చిలు కలవు శ్రీచెన్నకేశవస్వామి శ్రీచెన్నమల్లేశ్వరస్వామి వార్ల కల్యాణ మహోత్సవములు వైశాఖశుద్ధ ఏకాదశి నుండి పూర్ణిమ వరకు వైభవముతో జరుగును శ్రీమల్లేశ్వరస్వామికి సహస్రనామార్చన అభిషేకములు జరుగును

ఈగ్రామమునకు 7 మైళ్ళలో రేపల్లె రైల్వేస్టేషను ఉన్నది గవర్నమెంటు బస్సులు రెండుగంటలకు ఒకసారి రేపల్లె నుండి కూచె పూడికిని రేపల్లె నుండి నగేటి రేవుకును పోవును ఈగ్రామములో 8 క కరరోడ్లు 17 మట్టి రోడ్లు కలవు దీనిని పొరుగు గ్రామములతో కంకరరోడ్డు మట్టిరోడ్డు కలుపుచున్నవి ప్రయాణమునకు ఈగ్రామమున 15 రిక్షాలు రెండు ఒంటెద్దుబండ్లు 949 రెండెడ్ల బండ్లు 125 సైకిళ్ళు ఉన్నవి

అల్లపర్రులో మూడు బ్రాంచి పోస్టాఫీసులు కలవు దీని కుగ్రామమైన ఉల్లిపాలెంలో ఒక జిల్లాపరిషత్ హైస్కూలు ఉన్నది హైస్కూలు చదువులకు విద్యార్థులు మంత్రిపాలెం సజ్జవారిపాలెం నాగళ్ళవారిపాలెం గుడికాయలక బొడ్డువారిపాలెం శింకపాలెం ఏలేటిపాలెం మొదలగు గ్రామములనుండి వత్తురు ఇచటి విద్యుచ్ఛక్తిని 100 ఇండ్లు వాడుకొనును ఇది పంచాయితీ పరిపాలనకల గ్రామము ఇందు పంచాయతీ గంథాలయము సహాకార సంఘము కలవు ఒక ప్రసూతికేంద్రము కలదు ముగ్గురు ఇంగ్లీషు వైద్యులు ముగ్గురు ఆయుర్వేద వైద్యులు ఇద్దరు హోమియోపతి వైద్యులు కలరు పశురోగాలకు మూడమందు లిచ్చు వైద్యులు కలరు ఇచ్చట 15 కిరాణా దుకాణములు 4 కాఫీ హోటళ్ళు 20 సోడా కిళ్ళీ సిగరెట్టు దుకాణములు ఒక క్షౌరశాల ఒక లాండ్రి 15 ఇతర షాపులు ఉన్నవి

తహశీల్కార్యాలయము పురుషుల ఆసుపత్రి జనరల్ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి కోర్టులు పోలీసుస్టేషను సబ్ రిజిష్ట్రారు ఆఫీసు తాలూకా కచేరి రేపల్లెలో ఉన్నవి బ్లాకు అభివృద్ధి కేంద్రము 1 మైలు దూరములో ఉన్న పల్లపట్లలో ఉన్నది కళాశాల చదువులకు ఇచటి విద్యార్థులు తెనాలికి పోవుదురు

మా శ్వే

## అల్లభూవరుడు చూ అల్లాడరెడ్డి

## అల్లమప్రభువు

బసవేశ్వరుని తరువాత వీరశైవ మతమును సముద్ధరించిన మహనీయ పురుషులలో అల్లమప్రభువు మిక్కిలి ప్రసిద్ధుడు ఇతడు పన్నెండవ శతాబ్దము ఉత్తరార్ధమున వెలసినట్లుగా చారిత్రకులు భావి చుచున్నారు పరమేశ్వరుని సాత్త్వికకళ నిరహంకారుడను పురుషునకు సుజ్ఞాని యను ఆమెయందు అల్లమప్రభువుగా అవతరించినట్లు చెప్పబడుచున్నది

అల్లమప్రభువు పరమ మాహేశ్వరుడు ఆయన భూలోకమున వీరశైవ రహస్యములను ప్రబోధించెను మరియు కన్నడ భాషయందాయన రచించినవిగా 1 శూన్య సంపాదనము 2 మంత్రమహాత్మ్యము 3 షట్స్థల వచనములు 4 మంత్రగోప్య పదములు 5 సృష్టి వచనములు 6 బెడగిన వచనములు 7 కాలజ్ఞాన వచనములు 8 ప్రభుదేవర కందములు-అను ఎనిమిది కృతులు కానవచ్చుచున్నవి ఈ అల్లమప్రభువు చరిత్రమును కన్నడ భాషయందు పదునైదవ శతాబ్దమున చామరసు అను కవి ప్రభులింగ లీలలను పేర రచించెను దానిని బట్టియే పదునారవ శతాబ్దమున తెనుగు భాషయందు ద్విపదగా ఎడుపల్తి సోమనాథుడు ప్రభులింగలీల రచించెను ఇది అయిదాశ్వాసముల గ్రంధము ఆశ్వాసములు మరియు గతులుగా విభజింపబడినవి మొత్తము ఇరువదియైదు గతులు పదునారు గతులుమాత్రమే ముద్రితములు

పరమశివుని అవతారమైన అల్లమప్రభువు లీలలు చిత్రమహనీయములు అల్లమప్రభు వింత గొప్పవాడని ఒకసారి శివుడు పార్వతితో అనెను ఆమెకు అల్లమప్రభువును పరీక్షింపవలయునని అనిపించెను వెంటనే ఆమె శివునితో ప్రతిజ్ఞ చేసి అల్లముని వంచించుటకు తన తామస కళను మమకారుడను రాజునకు మోహిని అను అతని భార్యయందు మాయగా జనింపజేసెను మాయ అల్లముని వంచించి లోంగదీయుటకెన్నియో ప్రయత్నములు చేసెను అల్లమప్రభు లీలా విశేషములముందు మాయా విలాసములు పనికి రాకపోయెను అల్లమప్రభు విటకాడుగా మద్దెలకాడుగ కనిపించి మాయను భ్రాంతి మతిని గావించెను ఉన్నట్లుండి మాయ బలవంతము చేయరాగా ఆమెముందు అల్లమప్రభువు అదృశ్యుడయ్యెను ఆయన నింక తానేమియు సాధింపలేనని మాయ చెప్పి

పోయినది అది పార్వతీదేవికి మిక్కిలి దుఃఖ కారణమైనది కాగా శివుడామె కొక సలహా చెప్పెను అప్పుడు పార్వతి తన సాత్విక నిర్మల కళను భూలోకమునకు అక్కమహాదేవిని చేసి పంపించెను అక్క మహాదేవి మిక్కిలి శ్రద్ధా భక్తి వైరాగ్యములతో అల్లమప్రభువును సేవించి ఆయనను వశము చేసుకొనెను అక్కమమహాదేవి అల్లమ ప్రభువును వశముచేసికొనుచో తదనుకూల వాతావరణమునకై శివగణములు భూలోకము నందంతటను అక్కడక్కడ అవతరించినవి

అల్లమప్రభువునకు మాయాకోలాహలుడను బిరుదమున్నది ఈయన నివాస స్థలము కల్యాణ కటకముగా చెప్పుదురు పరమశివుని లీలామహాత్మ్యములను ప్రత్యక్షపరచి భూలోకమున శైవమును వ్యాపింప జేయుటకుగా నవతరించిన అవతారపురుషుడు అల్లమప్రభువు

సంస్కృతమునందు కృష్ణమిశ్రుడను కవి ప్రబోధచంద్రోదయ నాటకమును వ్రాసెను దీనియందలి పాత్రలన్నియు వేదాంత భావసహితములు ప్రబోధచంద్రుడు అహంకారుడు మోహుడు తృష్ణ మొదలగువారు స్త్రీ పురుషులుగా కల్పింప బడిరి అల్లమప్రభుని జీవితకథనమునందును వేదాంత భావములు ఆకృతిని పొందినట్లు చిత్రింపబడినది నిరహంకారుడు సుజ్ఞాని మాయ మున్నగునవి ఇట్టివి

కె వి రా ళా

## అల్లమరాజు - సుబ్రహ్మణ్యకవి

ఈకవి 1831వ సంవత్సరమున జన్మించెను 1892 లో నిర్యాణము చెదెను

ఈయన ఆరామద్రావిడ బ్రాహ్మణుడు హరితసగోత్రుడు గంగమాంబ ఈతనిజనని రంగశాయి ఈతనిజనకుడు పిఠాపుర సమీపమున ఉన్న చేబ్రోలు ఈతని జన్మస్థానము

ఈకవి రచించిన గ్రంథములు 1 శ్రీకృష్ణభూపతి లలామశతకము 2 శివధర్మములు 3 పావయమంత్రిశతకము 4 ఆత్మబోధము 5 మణిధ్వజ చరిత్రము 6 సింహాద్రి రామాధిపశతకము 7 భద్రాపరిణయము 8 శ్రీకృష్ణలీలా కల్యాణము 9 చాటుధారా చమత్కారసారము అనునవి

పిఠాపుర సంస్థానాధిపతియగు రావు వేంకట మహీపతి గంగాధర రామరాయ ప్రభువు ఈకవికి 1869లో మాసవేతన మేర్పాటు చేసెను మాడగల్లు సంస్థానాధిపతి ఈకవిని ఆస్థాన కవిగా నుండుమని కోరెను ఈతని జన్మస్థానమునకా గ్రామము దూరమగుటచే ఇతడంగీకరింపలేదు అచ్చట వార్షికసన్మానము నియతమయ్యెను 1869 వరకు ఆవిత్తమతనికి చేరుచుండెను

ఈకవి ఉభయ భాషాధ్యయనము చేసెను స్వయంకృషిచే సాహిత్యాంభోనిధిని హస్తగతము చేసికొనెను వసుచరిత్ర ఆముక్తమాల్యద ఈతని అభిమాన గ్రంథములు ఇతడు జ్యోతిశ్శాస్త్రమును బాగుగా అభ్యసించెను ప్రప్రథమమున ఇతనికది జీవనాధారముగ నుండెను ఎమ్మట కవితావ్యాసంగమే ప్రధానవృత్తి అయ్యెను ఇతడు ఆయా నృపతులను సందర్శించి కవితా ప్రదర్శనము చేసి బహుమానముల నందుచుండెను

మాడుగల్లు సంస్థానవిద్వాంసులు ఇతనికి పెక్కు ఇబ్బందులు కలిగించిరి మంత్రిప్రెగడ సూర్యప్రకాశ రాయకవి ప్రభృతులు ఆచ్చటి పండితకవులు వారిచ్చిన "కుట్రయొనర్చి లేమ తన గుబ్బల యుబ్బు సహింపలేమిచేన్" అను సమస్యను సరసముగ పూరించి ఆ సంస్థాన ప్రభువుచే ఇతడు సమ్మానితుడయ్యెను ఈకవి మాడుగల్లు నృపతి శ్రీకృష్ణ భూపతిపై ఒక సీసపద్యశతకము రచించెను దానికి శ్రీకృష్ణభూపతి లలామశతకము అని పేరు

భద్రాపరిణయ మను నాలుగాశ్వాసముల ప్రౌఢాంధ్ర ప్రబంధమును రచించి ఇతడు పీఠికాపుర సంస్థానాధిపతియగు శ్రీగంగాధర రామరాయేంద్రునకు అంకితము చేసెను కాణాదము పెద్దన సోమయాజి భద్రాపరిణయ మను నామాంతరముగల ముకుందవిలాస ప్రబంధమును రచించెను ఈ ప్రబంధము నందలి కవితారీతులను పద్యములను కథను చాలవరకు మార్పులేకుండగనే అల్లమరాజు రచించెనని వాఙ్మయ విమర్శకులు చెప్పిరి ఆకవిపై ఇతనికి గల అభిమానము దీనివలన వ్యక్తమగునని చెప్పవచ్చును పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు ఈ ప్రబంధమునకు వ్యాఖ్య వ్రాసిరి

అల్లమరాజు చాటుధారా చమత్కారసార మను గ్రంథమును సంధానించెను పండితులచే పరంపరా యాతములై గంభీరార్థ శోభితములైన సంస్కృత శ్లోకములకు ఇందు సులభమయిన యర్థము గలదు

ఈతడు గ్రంథవిమర్శనములను గూడ రచించెను శ్రీమన్మాడభూషి వేంకటాచార్యకవి రచించిన భరతాభ్యుదయమున దోషములున్నవని రాజయోగి పత్రికలో సప్రమాణముగ ఇతడు నిరూపించెను ఈకవి తుల్యప్రతిభావ్యుత్పత్తులు కలవాడు

శ్రీమన్మాడభూషి వేంకటాచార్యులవారు పీఠికాపుర సంస్థానమునకు వచ్చినపుడు అక్కడగల సుబ్రహ్మణ్యకవి "ఇంక" అను పదముతో నారంభించి ప్రభువర్ణన చేయుడనెను ఆయన తక్కినమూడుపాదములలో నిర్బిందుక కకార ప్రాసము నుంచి ఆశుకవిత్వముతో ఆసంస్థానమును వర్ణించెను అప్పుడు అల్లమరాజు ఆ తప్పిదమును ఎత్తిచూపెను ఇట్లు చూపినను ఈకవి తన కావ్యములలో ఈసబిందుక నిర్బిందుక ప్రాససాంకర్యమును చేసి యుండుటచే ఇది ఈతనికి సమ్మతమైనదని ఎంచనగును

అల్లమరాజు రచించిన చాటుపద్యములు బహుళ వ్యాప్తములు కాట్రావుపల్లి నూతులను ఇతడు ఇట్లువర్ణించెను

కం॥ "దేవాసురులబ్ధిదరువ
నావిర్భూతమయిహాలహాల మపుడు మహా
దేవునకున్ ఖీలికా
ట్రావుల పలినూతులందు డాగెంబుండీ"

ఈకవి వర్యునిది పండితవంశము ఇతని తండ్రిరంగభా మార్యుడు ఆయన నారాయణాచల మాహాత్మ్య ప్రణేత

కె రా

## అల్లమాంబిక

అల్లమాంబిక ప్రశంస వెలుగోటివారి వంశావళిలో కనవచ్చుచున్నది ఈమె వెలుగోటివంశీయులలో పదునేనిమిదవ తరమునకు చెందిన పెదకొండపనేని భార్య ఈమె మిక్కిలి సద్గుణవతి ఈమెకు తిమ్మానాయడు చెన్నప్పనాయడు వేంకటాద్రినాయడు అను తనయులు కలరు

తిం ఆం శ

## అల్లమవారు చూ అనుమగంటివారు

## అల్లయ చూ అల్లాడరెడ్డి

## అల్లయ దొడ్డారెడ్డి

అల్లారెడ్డి కుమారుడైన దొడ్డారెడ్డి ప్రశంస శ్రీనాథుని కాశీఖండమునందును నిశ్శంక కొమ్మన శివలీలా విలాసము నందును ప్రధానముగ లభించుచున్నది శివలీలావిలాసము దొడ్డారెడ్డికిని కాశీఖండము అతని అన్నయు రాజమహేంద్ర వర రాజ్యాధినాథుడను అగు వీరభద్రారెడ్డికిని కృతి యీయబడినవి శివలీలావిలాసము అసమగ్రముగా మాత్రమే దొరకినది ఈకావ్యపీఠిక యందు దొడ్డారెడ్డి వంశావళి కొంచెము చెప్పబడినది విష్ణుమూర్తి పాదకమలమునుండి ఒక నిర్మలవంశము జనించెను వారిలో దేంటులు ధర్మరక్షణ తత్పరులు ఉదారులు ఆవంశమునందు దొడ్డారెడ్డి ప్రభవించెను అతనికి అన్నమాంబ వలన అల్లాడక్షితిపతి యుదయించెను ఈ దంపతులకు అన్నప్రోల అను పేరుగల మరియొక కుమారుడును ఉండినట్లు ఇతరాధారముల వలన తెలియవచ్చుచున్నది కాని అన్నప్రోలుని సంతానము అల్లాడరెడ్డి కుమారులకు ప్రత్యర్థులై కొంతకాలము వారిదైన రాజమహేంద్రవర రాజ్యమును ఆక్రమించుకొనిరి ఈ వైషమ్యముచే కాబోలు శివలీలావిలాసమునందు అన్నప్రోలుని ప్రస్తావము పరిహరింపబడినది

చోడభక్తి రాజు కుమారుడైన భీమలింగము తనూజయగు వేమాంబను అల్లాడరెడ్డి పెండ్లియాడెను వీరి సంతానము నలువురు కుమారులు వేమ వీరభద్ర దొడ్డ అన్నయ అను వారలు అల్లాడరెడ్డియు అతని నలుగురు కుమారులును గొప్పవీరులై కొంతకాలము కాటయవేమా రెడ్డికి సహాయకులుగాను తరువాత స్వతంత్రముగను పరాక్రమము నెరపిరి ఇప్పటి ప్రస్తావమునకు విషయమగు దొడ్డారెడ్డి కూడ ప్రశంసనీయమైన విక్రమము కలవాడు ఇతడు గొప్ప అశ్వికుడుగా కీర్తిగొన్నాడు యౌవనమునందే మూలగూరు వద్ద 24 మూళ్ళదూరము గుఱ్ఱమును దూకించి ప్రశంసలందుకొనెను తండ్రి అల్లాడరెడ్డికిని పెద్దన్నయగు వేమారెడ్డికిని విధేయుడై దొడ్డారెడ్డి వారి జైత్రయాత్రలందు పాల్గొనుచు మహాసమర్థుడని పేరు పొందెను ఇతడు ఒడ్డాదియు శృంగార కోటయు (శృంగవరపు కోట) సాధించెనని శ్రీనాథుడు ప్రశంసించెను శివలీలావిలాసము నందు దొడ్డారెడ్డి విజయములు వేరుగా ప్రస్తావింపబడలేదు వేమారెడ్డి విక్రమములలో అంతర్భాగములుగనే సూచింపబడినట్లు తోచును ఉదాహరణకు శివలీలావిలాసము ఇట్లు చెప్పుచున్నది రఘురామ సదృశ పరాక్రముడగు వేమారెడ్డి రాఘవుడు లంకను జయించి విభీషణునకు ఇచ్చివేసినట్లే వేమారెడ్డి శృంగారపుకోటను గెలిచి సంగవభూపుని పుంగ శౌరిని అచ్చట నెలకొల్పినాడు" అనగా వేమారెడ్డి శృంగారపుకోటను జయించి తన్ను ఆశ్రయించిన పుంగశౌరికి దానిని తిరిగి ఇచ్చివేసినాడనుట విభీషణ ఉపమాన బలముచే ఈ పుంగశౌరి

అతకు ముందు శృంగారపుకోటకు ప్రభువైన వాని తమ్ముడైన కావచ్చును (వేమారెడ్డి సంగవభూపుని పుంగశౌరిని కాక సంగవభూపతినే శృంగారపు కోటయందు నిలిపెనని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు అన్వయించిరి ఇది విచార్యము ఎట్లైనను వేమారెడ్డియు అతని రెండవ తమ్ముడైన దొడ్డారెడ్డియు శృంగవరపుకోటను సాధించి తమకు వశవర్తియైన వానికి ఏలుకొనుటకై ఇచ్చివేసిరి అట్లే వేమారెడ్డి ఒడ్డాది మత్స్యవంశపు రాజులను గెలుచుటయు కాశీఖండమున చెప్పనైనది ఈ విజయమునందును దొడ్డారెడ్డికి సముచిత పాత్ర కలదనుట విశ్వసనీయము దొడ్డారెడ్డి చిలుక సరస్సు తీరమున జయస్తంభము నాటెనని కాశీఖండము నుడువుచున్నది

ఇంతేకాక ఈ సోదరులకు అన్నచోడదేవునితో జరిగిన సంగ్రామములందును దొడ్డారెడ్డి ముఖ్యపాత్ర వహించినట్లు శివలీలావిలాసము సూచించుచున్నది "ప్రతిఘాతచోడ పక్ష్మాంతస్తాప రత్నాకరుఙ్" (శివలీ 1 72) ఇక్కడి పదప్రయోగము విస్పష్టముగా లేకున్నను "ఎదురు దెబ్బలచేత చోడరాజునకు అంతస్తాపము కలిగించినవాడు" అను భావము స్ఫురించుచున్నది అన్నదేవచోడుడు చోడశక్తిరాజు రెండవ కుమారుడు మొదటివాడు శక్తిలింగము శక్తిలింగము కుమార్తెయే వేమ దొడారెడ్డిగార్ల జనని ఇట్లు అన్నదేవ చోడుడు వేమారెడ్డి మున్నగు వారికి వరుసకు పినతాత అగుచున్నాడు అయినను అతడు అల్లాడరెడ్డికి ప్రబలశత్రువైన కొండవీటి పెదకోమటి వేమారెడ్డి పక్షము వహించి అల్లాడ రెడ్డితోను అతని నందనులతోను ఎడతెగని యుద్ధములుచేసి చివరకు వాటియందొక దానిలో క్రీ శ 1414 15 ప్రాంతమున వీరమరణము పొందెను దొడ్డారెడ్డి అంతస్తాపము కలిగించినది ఈ యన్నదేవచోడునకే అని చెప్పదగి యున్నది

ఇంత పరాక్రమశాలి యయ్యు దొడ్డారెడ్డి వేరే రాజ్య స్థాపనను కాంక్షింపగ తన యన్నలకు విధేయుడై యుండుట ఎంతయు ప్రశంసింపదగి యున్నది ఆమాటకు వచ్చినచో రఘురాముని వంటి పరాక్రమశాలి అని పొగడబడిన వేమారెడ్డి గొప్ప ఆత్మసంయమనము కలవాడై తన తమ్ముడును అతని తల్లి భర్తయు అయిన వీరభద్రారెడ్డిని రాజమహేంద్రవర రాజ్యమునకు అధిపతిగాచేసి తాను వానికి మంత్రిమాత్రుడై యుండుటకు అంగీకరించుట చరిత్ర పుటలలోనే అపూర్వము ఈ యన్నదమ్ముల సౌభ్రాత్రము ఆదర్శప్రాయమైనది అందుచేత దొడ్డారెడ్డికి ప్రత్యేకముగా రాజ్యముకాని ముఖ్యపట్టణముకాని ఉన్నట్లు కాన్పించదు రాజమహేంద్రవరమే ఇతనికిని నిలయమని భావింపవలసియున్నది అన్నగార్ల యనుమతితో కాబోలు ఇతడు శక 1352 అనగా క్రీ శ 1431 సాధారణ సంవత్సర పుష్యమాసమందలి అర్థోదయ పుణ్యకాలమున గుంపిణి యను గ్రామమును తనపేర అల్లాడరెడ్డి దొడ్డవరము అని పేరుపెట్టి వేదవేదాంగ విదులైన విప్రులకు దానము చేసెను ఈ గ్రామము కొంతేయనదికి దక్షిణమున ఉండవచ్చునని భావింపబడినది గౌతమికే కొంతే యనను పేరుకూడ ఉన్నట్లు చెప్పబడినది గుంపిని గ్రామము ఇప్పుడు గుర్తింపరాకున్నది కాని దీని ఎల్లలుగా చెప్పబడిన కొన్ని గ్రామములు అమలాపురం తాలూకా యందు గుర్తింపబడినవి దేవరపల్లి పలివెల ముమ్మడివరము ఈత కోట కేతరాజుపల్లి వెదిరేశ్వరము అను గ్రామములు దొడ్డవరము సరిహద్దులుగా చెప్పబడినవి

దొడ్డారెడ్డి ఈగ్రామమును 59 మంది బ్రాహ్మణులకు దానము చేసెను వారిలో 88 మంది కృష్ణ యజుర్వేదమును 4 శుక్ల యజుస్సును 6 ఋగ్వేదమును ఒక్కరు మాత్రము సామవేదమును అధ్యయనము చేసిరి దీనినిబట్టి ఆంధ్రదేశమునందు ఆయా వేదములకున్న ప్రాచుర్యము తెలియవచ్చుచున్నది ఈశాసనపు రేకులు తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురమునకు 5 మైళ్ళదూరమున ఉన్న కొంకుదురులో దొరకినవి కావున దీనిని దొడ్డారెడ్డి కొంకుదురు శాసనము అనుచున్నారు (ఎపి ఇంV)

దొడ్డారెడ్డి యందలి మరియొక విశేషము అతని శివభక్తి తత్పరత్వము దానియందొక పరాకాష్ఠయున్నది నిశ్శంక కొమ్మన కవిని ఆహ్వానించి అతనితో దొడ్డారెడ్డి ఇట్లనెను " నేను పెక్కు పురాణములు విని కృతార్థత బొందితిని కాని వేని యందును ముక్కంటి మహత్వము వికతముగా చెప్పబడలేదు కావున

కేవల శివచరితమునే
భావనవినంగోరుదుం బ్రబంధనిధాన
శ్రవణులంగ వినిపింపుము
భావరసాలంకృతాంధ్రభాషావరతన్

అట్టిది దద్దారెడ్డి గారి గాథ శివభక్త ఈరెడ్డికటు బయు వారి గురువు ఘోడియ రాయ శ్రీగుదేశికుడు ఈగురువర్యుని విద్యానిరూఢలను అన్నదాన వితరణ సమిత్వమును నిశ్శంక కొమ్మన ప్రత్యేకముగాప తింపినాడు ఘోడియరాయ అను నది శైవాచార్యపదమనియు శ్రీమేశ్వరుడాగురువరేణ్యునినామ మరియు శివలీలా లా మృందలి వర్ణనను బట్టి తోచుచున్నది

మా దీ
శం ల ర

## అల్లయరెడ్డి వేముడు

ఇ డు వేమా బిక అల్లాడరెడ్ల జ్యేష్ఠ కుమారుడు రాజ మహేంద్రవర రెడ్డి రాజ్యమును సంహోద్రి పర్యంతము విస్త రింప జేయుటకు ఈతడు త ద్రి క నేక యుద్ధములలో సహాయ మొనర్చెను అల్లాడరెడ్డి మరణా తరము అతని అన్న అన ప్రోలారెడ్డి కుమారలయిన మ డవ కుమారగిరి మూడవ అనపోతుడు రాజమహేంద్రవర సాహసన మాక్రమి చి నాల్గు స వత్సరముల కాలము పరిపాలించిరి శక సం 1341 ను డి 1345 అనగా (క్రీ శ 1419 23) మధ్య వేమ వీరభద్రారెడ్ల శా నములు లభించుట లేదు వేమ వరాగ్రహార శా నము నందు దాన మీయబడిన గ్రామపు సరిహద్దులలో "అన ప్రోలా రెడ్డి కొమరగిరిపురము అనునది పేర్కొనబడి ది చూడగా ఈగ్రామము అనప్రోలారెడ్డి కుమారుడయిన కొమరగిరి పేర అతని సోదరుడైన అనపోతారెడ్డి దానము చేసినట్లు కన్పి చు చున్నది ఈ అనప్రోలారెడ్డి కుమారగిరి పురము తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురము తాలూకా యందలి గ్రామమగుటచే అనప్రోలారెడ్డి కుమారులు పశ్చిమ గోదావరి జిల్లాయందే గాక తూర్పుగోదావరియందు కూడా పరిపాలన చేసినట్లు తెలియుచున్నది మరియు మూడవ అనపోతుని కొమ్మచిక్కాల శాసనమందు "ఆసీద్ రాజమహేంద్ర నామ నగరమ్ యస్య ప్రభో ర్వాసభూః (ఆం-చ బIII 228) అని చెప్పబడియుండుటచే యితని నివాసభూమి రాజమహేంద్రవర మని స్పష్టముగా తెలియుచున్నది వీటన్నిటినిబట్టి అల్లాడరెడ్డి మరణానంతరము అనప్రోలారెడ్డి కుమారు లన్యాయముగా రాజమహేంద్రవర సింహాసన మాక్రమించి అల్లాడరెడ్డి కుమారులకు శత్రువులయిరి కావుననే కాబోలు పెదమాండి రెడ్డి వీరివంశ మనువర్ణి చిన శ్రీనాథుడు వీరి పేరైన తలప లేదు అట్లే అనపోతుని కొమ్మచిక్కాల శాసనమందు అల్లాడ రెడ్డి కుమారల పేర్కొనబడలేదు

వీరి శౌర్యములకు సరుగాంచక అల్లాడరెడ్డి కుమారు లుండ అనప్రోలారెడ్డి కుమారలెట్లు రాజమహేంద్రవర సింహాసన మాక్రమి రో తెలియవల యు్ననిచో క్రీ పు గ్రమును అందు లభి చు కైఫీయతు లన్నిటి య దును శక సం 1341 42 అనగా క్రీ శ 14 2 0 లో కొ వీటి రాజ్య పతనానంతరము కళి గరాజు లాంగూల గజపతి రెడ్డి రాజుల నోడి చి వి య గర ం జుల తిరిగి గెలుచునంతకు తీరా ధ్రమును పాలి చెనని యున్నది కైఫీయతుల టి య దును శక స 1342 లో రా మహే ద్ర మును లాంగూలగజపతి జయించి ట్లు కలదు కాని జయ రాజులు దీ ని జయి చిన కాలమును గూర్చి భిన్నాభి ప్రాయ ములు వ్యక్త మగుచున్నవి కొన్ని కైఫియతుల నను రి చి ఈ గజపతి నరస హదేవుడు కాని అల్లాడరెడ్డి కాలమునకే నరసింహదేవుని కుమారుడు నాలుగవ భానుదేవుడు క్రీ శ 1409 39) సింహాసనమునకు వచ్చి యుండెను గంగవంశాను చరిత్రమున దు జ్జటభానుడు గ గరాజు శ మమునైపు దండయాత్ర సాగి చెనని యు్నది ఈ ద డయాత్ర శక స 1341 42 ప్రాంతముల అల్లాడరెడ్డి మరణానంతరము జరిగియు డును బహుశా ఈ నాలుగవ భానుదేవుని సహాయ మునసే అ పోతారెడ్డి కుమారలు రా మహేంద్రవర సింహాసనమును కొ త కాల మాక్రమించి యుండురు

వేమారెడ్డి గజపతులతో స్నేహము గావించుకొని దక్షిణ కళింగభాగముల వారికి కానుకగానిచ్చి శక సం 1345 లో రాజమహేంద్రవర రాజ్యమును తిరిగి సంపాదించెను ఆనాటి ను డియు వీరు నామమాత్రము గజపతులకు సామంతులుగ ను డిరి రాజ్యము హస్తగతమైన పిదప వేమారెడ్డి తమ్ము డైన వీరభద్రునకు పట్టము గట్టి తాను సచివుడై రాజ్య మేలి చెను

శ్రీనాథుడు భీమఖ డమున ధ్యాత్రీతాలింతు రాచంద్రతా రకముగ వేమభూవల్లభుండును వీర భ్ద్రుడు" (భీ 1 33) అని వేమవీరభద్రు లిరువురు భూమి పాలింతురని చెప్పి ఆతరువాత పద్యమున తమ్ముని వీరభద్ర వసుధాధిపు విక్రమ వీరభద్రుని న్సమ్మద లీల రాజ్య భరణ స్థితి బట్టము గట్టి (భీ 1 34) అనియు కాశీఖండమున వేమభూపాలు డనుజన్ము వీరభద్రు ధాత్రి నేలి ప (కాశీ 1 37) అని చెప్పినాడు నిశ్శంక

కొమ్మన తన శివలీలావిలాసమందు "తమ్ముని వీరభద్రునిన్ రాజమహేంద్ర నామ నగర పురపట్టము గట్టి" (శివ 1 58) అని చెప్పినాడు వీనిని బట్టి వేమారెడ్డి వీరభద్రునకు పట్టము గట్టి అతనిచే రాజ్యపాలన మొనరింప జేయుచుండెనని తెలియుచున్నది

అనితల్లి కలువచేఱు శాసనమున "తస్యాగ్రజో జయతి వేమయ భూతలేంద్రః శ్రీకామినీ వివిధ చారు విలాస సాంద్రః అని తల్లి పతిదైవా ఘన సచివీభూత భావుకా భువ మవతి (50) అని యున్నది ఆంసాపప్రమాది చైత్ర పుట 109) దీనిని బట్టి రాజ్యాధికారము అనితల్లి హస్తమున నుండెననియు ఆమెకు వారు సచివుడై యుండెననియు తెలియుచున్నది కావున వేమవీరభద్రులు ఇరువురును పాలించి రనుటపొసగదు

వేమారెడ్డి నేమవర శాసనమునందలి "రాజ్ఞో స్త యో రాజమహేంద్ర నమా రామాభిరామాజని రాజధానీ" (18) అను దానిని బట్టి రాజమహేంద్రవరము వేమవీరభద్రారెడ్లిరువురకును రాజధాని అని తెలియుచున్నది అనితల్లి మూలమున వీరభద్రారెడ్డికి రాజమహేంద్రవర రాజ్యము లభించినప్పటికిని శౌర్యౌదార్యాది విశిష్ట గుణముల వలన వేమారెడ్డికే విశేషఖ్యాతియున్నట్లీశాసనము వలన స్పష్టమగు చున్నది దీనినే కాశీఖండమునందలి శ్రీనాథుని "నిజభుజా విక్రమంబున నిఖిల దళలుగెలిచి తను రాజ్య పీఠ మెక్కించి నట్టి యున్న వేమేశ్వరుని యక మాశ్రయించి (కాశీ 1 10) అను పద్యము సమర్థించుచున్నది

ఇతడు బీడికోట నూకవరము మొదలగు దుర్గముల జయించెననియు యవనకర్ణాట కటకాధిపతులతో స్నేహము పాటించెననియు సప్తమాడియముల కధిపతులను ఝూడె జంతుర్నాటి రాజులను శారహదొంతి భూపాలురను కలువపల్లి ఒడ్డాది రాజుల నోడించెననియు భీమఖండ కాశీఖండ శివలీలావిలాసములందు చెప్పబడినది ఈస్థలములు నేడెచ్చట నున్నవో పరిశీలి తము

ఝూడె—ఇది నేటి పార్వతీపురము బొబ్బిలి తాలూకాలును జైపూర్ ఎస్టేటులోని అధికభాగము లేదా పూర్తిభాగము నకు సరిపడును పొట్టంగి తాలూకాలోని నందాపుర మీతైపూరునకు పూర్వరాజధాని దీనిని పాలించిన రాజులు శిలావంశముతారు

సప్తమాడియములు :

మాడియ పదము మాళియ పదమునకు రూపాంతరము ఇది మంప మును డిపుట్టినది మల అనగా పర్వతము గంజాం జిల్లా యందలి తూర్పుకనుమల వరుసను మాళియల దురు ఈకనుమలు ఏడు భాగములుగా విభజి పబడినట్లు కన్పించు చున్నవి అదే సప్తమాడియములు

శారహదొంతి

శారహా అనగా పదిరెండు దొంతి అనగా ఒ దాని ప్రక్క ఒకటి అనగా ఈ పంద్రెండు దేశములు ఒక దాని ప్రక్క ఒకటిఉన్నవి ఇవి ఒరిస్సా మధ్యప్రదేశ నందలి సామంత రాజ్యములు విశాఖపట్టణము గంజాం జిల్లాల సరిహద్దు ప్రాంతములు

జంతుర్నాడు

ఇది నేటి విశాఖపట్టణము జిల్లా యందలి శృంగవరపు కోట తాలూకా దీనిని పాలించిన రాజులు సురభి వంశీయులు గార్త్స్యమద గోత్రులు

ఒడ్డాది

ఇది నేటి విశాఖ పట్టణముజిల్లా యందలి వీరవల్లి తాలూకా ఇది మత్స్యరాజుల రాజధాని

పల్లవ వంశీయుడైన పురుషోత్తముని మాకవరమునందు శుభ రాజ్య ప్రాజ్యు గావించి వేమారెడ్డి "రాయస్థాపనాచార్య" బిరుదు పొందినట్లు శివలీలావిలాసము చెప్పుచున్నది (శి వ 1 56)

వేమారెడ్డి పోగొట్టుకున్న దక్షిణ కళింగభాగముల జయించు నవకాశమునకై వేచియున్న సమయమున విజయనగరరాజు గజపతి నోడించినట్లు కొండవీడు కైఫీయతునందు కలదు ఇది శక సం 1358 అని చెప్పబడినను విజయనగర సామంతుడు తెలుంగురాయని సింహాచల శాసనమువలన ఈ విజయము శక సం 1350 లో జరిగెనని తెలియుచున్నది ఇందు తెలుంగురాయడు తూర్పు దిగ్విజయానంతరము సింహాచలమునందున్నట్లు కలదు (ద హిం VI నెం 905) గజపతుల అధీనమున నున్న రెడ్ల తూర్పు రాజ్యభాగముల నాక్రమించుటకు విజయనగర రాజులకు దేవరకొండ వెలమనాయకులు సహాయ మొనర్చిరి కుమారమాదానేని కుమారుడు లింగమనేడు వేమ వీరభద్రారెడ్ల జయించినట్లు వెలుగోటివారి

వంశావళియందు కలదు. గ గ సాక్షిగ మీతి కదిని రాజ మహేంద్రవరము చూఱలు గొని వచ్చినాడు వీరభద్రుని దొడ్డ విభు వేమ నృపతుల రట్టడై కాలుందె బెట్టినాడు (పద్యములు 112 118 126)

శక స॥ 1346 అనగా క్రీ శ 1424 లో సహాసమస్థుడైన రెండవ దేవరాయలు తూర్పురెడ్డి రాజ్య భాగములను కొండవీటి రాజ్యమును జయించి విజయనగర రాజ్యమందు కలిపికొనెను ఆనాటి నుండియు సింహాచలము విజయనగర రాజుల తూర్పు సరిహద్దు అయినది వేమ వీరభద్రారెడ్లు వారి సామంతులయిరి

వేమారెడ్డి సింహాచల శాసనమువలన శక స॥ 1356 అనగా క్రీ శ 1434 నాటికి వీరు పోగొట్టుకున్న దక్షిణ కళింగభాగముల తిరిగి పొందిరని తెలియుచున్నది ఇందు ఆతడు కలువపల్లి ఒడ్డాది పొట్నూరు స్థలములకు చెందిన దేవబ్రాహ్మణ సీమలకు అగ్రహార ఖండికలపై పన్ను రద్దు చేయించి పూర్వధర్మముల పాటించుటకొడ బడినట్లు కలదు (ద హిం VI నెం 1168) ఈద డయాత్రా సమయముననే నాలుగవ భానుదేవుడు వేమవీరభద్రారెడ్ల నెదుర్కొన రాగా కపిలేశ్వర గజపతి ఒరిస్సా సింహాసన మాక్రమించియుండును

శక సం 1356 57 లలో కపిలేశ్వరగజపతి ఒరిస్సా సింహాసనాక్రమణతో ఆంధ్రదేశమందలి రాజకీయ పరిస్థితులు తారుమారయినవి ఆతడు దక్షిణకళింగము రెడ్డిరాజుల యధీనమునందుండుటను సహింపజాలక పోయెను దీనితో పాటు రాజమహేంద్రవరమును కూడ కబళింప యత్నించెను ఈప్రయత్నమున రెండవ దేవరాయలు తన మంత్రి మల్లప్ప ఒడయరును రెడ్డి రాజులకు సహాయముగా రాజమహేంద్రవరమున కంపెను ఈయుద్ధమున మల్లప్ప ఒడయరు విజయమును సాధించెను (ద హిం IV నెం 1375)

కాని తరువాత తరువాత అధికార దాహమున ఒరిస్సా గజపతులకు విజయనగర నరపతులకు జరిగిన యుద్ధములందు రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము పూర్తిగా నలిగిపోయినది ఈరాజ్యమును నిలబెట్టుటకు శక సం॥ 1366 వరకును విఫల ప్రయత్నములు జరుగుచున్నట్లు రెండవ దేవరాయల ద్రాక్షారామ శాసనము వలన తెలియుచున్నది (ద హిం IV నెం 1375) ముద్రిత శాసన ప్రతి అసంపూర్ణముగా నున్నది కాని దీని చివరి భాగము మెకంజీ సంపుటములలో కన్పించుచున్నది సర్వమాన్యంగాను అల్లారెడ్డి వేమారెడ్డి గారి ఆజ్ఞను సమర్పణ చేస్తిమి" (లోకల్ రికార్డు II పుట 157) అను వాక్యము వలన పైశాసనకాలము నాటికి వేమారెడ్డి అధికారము వహించినట్లు భాసించుచున్నది కావున క్రీ శ 1444 నాటికి వేమవీరభద్రారెడ్లు జీవులై రాజమహేంద్రవరమున రాజ్యము చేయుచుండిరనుట స్పష్టము ఈరాజ్యము శక సం॥ 1370 అనగా క్రీ శ 1448 నాటికి గజపతుల హస్తగతమైనట్లు గజపతి క్షోణీశుని పేర్కొనుచు వెలువడిన పెనుగొండ (తణుకుతాలూకా) శాసనమువలన విదితమగుచున్నది దీనితో రెడ్డిరాజ్యము సంపూర్ణముగ పతనమైనది వేమ వీరభద్రారెడ్ల రాజ్యాంతము ఎట్లు జరిగెనో తెలియదు

వేమారెడ్డి గొప్ప రాజకీయవేత్త వ్యవహారవేత్త రాజమహేంద్రవర రాజ్యమంతయు భుజబల సాధితము ఇతనికి యిరువురు భార్యలు మొదటిభార్య జియ్యమల్లసామ్మ (ద హిం V నెం 84) రెండవ భార్య హరిహరాంబ ఈమెను గూర్చి వేమవర శాసనమందిట్లున్నది

పుత్రీ కాటయవేమయ క్షితిపతేః పౌత్రీం చ
కాటప్రభో
రౌహిత్రీం చతురర్ణవీం పరిహర క్షోణీపతేశ్శాసితుః20
తన్నామ్నా విదితాహ్వయాం హరిహరాంబాం చారు
మగ్రహీయ
శ్శ్రావాగో వేమ మహీశ మల్లనృపతి స్సామ్రాజ్య లక్ష్మ్యా
సమం

(శ్రీనాథకవితా సమీక్ష సం 2 పుట 259)

ఈమె కాటప్రభుని పౌత్రి కాటయ వేముని కుమార్తె హరిహరరాయల దౌహిత్రి హరిహరరాయల కుమార్తె పేరు ఇందులేదు కాని కాటయ వేముని అహోబిలశాసనము చివర చెప్పబడిన అతని భార్య తల్లాంబికయే హరిహరరాయల కుమార్తె కావచ్చును ఈశాసనము "పౌత్రీం కాటయవేమ పుత్రీంచ కాటప్రభో" అని చెక్కబడియుండగా శ్రీ సెట్టూరి ప్రభాకరశాస్త్రిగారు దీనిని పై విధముగా సరిదిద్దిరి వేమారెడ్డి కూడ వీరభద్రారెడ్డివలె కాటయవేముని అల్లుడే అయినను అతల్లియే రాజమహేంద్రవర సింహాసనమునకు రెండవకుమారగిరి తరువాత న్యాయసమ్మతమైన వారసురాలగుటచే ఆమె భర్త అయిన వీరభద్రారెడ్డికే పట్టము గట్టెను కాటయవేమునకు బావమఱదియైన కుమారగిరిరెడ్డి మండి

రాజమహేంద్రవర రాజ్యము అరణముగాలభించినది కుమార గిరి చెల్లెలు దొడ్డా బిక దొడ్డాంబి – కాటయవేముల కుమార్తె అనితల్లి అదువల్ల అల్లి మూలముగా అనితల్లికే రాజమహేంద్రవర రాజ్యము పై అధికారము హెచ్చు

హరిహరాంబ కాటయవేముని పుత్రి అన్నట్లు వేమవర శాసన పాఠము నవరిప బడినను మరికొన్ని సమకాలిక శాసనములలో కూడ ఈమె కాటయవేముని పౌత్రియనియే చెప్పబడినది వేమారెడ్డి ఎనపళ్ళ గ్రామమును అల్లాడవేమభూపవరము అను పేరు పెట్టి తనమ త్రియైన శ్రీగిరికి శక 1346 (క్రీశ 1424)లో దానము చేసెను దీనియందును హరిహరాంబ కాటయవేముని పౌత్రి అనియే యున్నది (భారతి ఫిబ్రవరి 1967) ఇందలి శ్లోకము విస్పష్టముగా నున్నది

పుత్రీ కాటయవేమ భూప తనయ శ్రీకాటయ క్ష్మాపతేః పౌత్రీ త్ర్యర్ణవశాసితు ర్హరిహరస్యోర్వీశ చూడామణేః। తన్నామ్నా ప్రథితా చ సా హరిహరాంబాఖ్యా మహాభాగినీ ముఖ్యా దేవ్యభవత్ పవిత్ర చరితా శ్రీవేమపృథ్వీపతేః॥

దీనిభావము – కాటయవేమ భూపుని కుమారుడైన కాటయరాజుయొక్క పుత్రియు మూడు సముద్రముల నేలు హరిహర క్షోణీశుని పౌత్రియు ఆయన పేరు చేత ప్రసిద్ధి నందినదియు పవిత్రచరిత్రయు అగు హరిహరాంబ వేమపృథ్వీపతిముఖ్యదేవి ఆయెను కోరుమిల్లి శాసనము కూడ ఇట్టి పాఠమునే కలిగియున్నది మూడు సమకాలిక శాసనములందు ఎకరీతిగా ఉన్న పాఠమును త్రోసిపుచ్చుటకు హేతువు కానరాదు

హరిహరాంబ అనితల్లి వీరిద్దరును కాటయవేముని సంబంధము కలవారే మొదటియామె మనుమరాలు రెండవయామె కుమార్తె మనుమరాలి కన్న కుమార్తె సన్నిహిత బంధువగుటచే కుమార్తెయైన అనితల్లికే సన్నిహిత రాజ్యార్హత కలదని ధర్మశీలుడైన వేమారెడ్డియు సమకాలికులైన పెద్దలును నిర్ణయించి అనితల్లి వీరభద్రులను పట్టాభిషిక్తులను చేసియుందురు

ఈఅన్నదమ్ము లిరువురకు మంత్రి బెడవూడిఅన్నయ ఈఅన్నమంత్రి అహమ్మదుషాహి సన్నిధికి వేమమహేశ్వరుని పక్షమున పారసీ భాషయందు లేఖలు వ్రాయువాడట (శి 174) శ్రీనాథుని భీమఖండ మీమంత్రికే అంకితము

వేమారెడ్డి గొప్ప శివభక్తుడు రాజమహేంద్రవర మార్కండేయస్వామి యన్న వీరికి మిక్కిలి భక్తి ప్రపత్తులు ఇతడు 12వేల వరహాల పరిమాణము గల కంచుగంటను ఈ స్వామికి బహూకరించెను ఇతని వేమవర శాసనాంకవర గల శ్రీమార్కండేశ్వర వేమాయరెడ్డి వ్రాలు" అనునది దీనికి నిదర్శనము ఈతడు పట్టాభిషేకమునందు శివుని పూజించుచు డెడివాడని అనే మహాగ్రహారాది దానములాచరించెనని యు అనాటి వాఙ్మయము శాసనములు చెప్పుచున్నవి వేమారెడ్డి గోదావరియందు అఘమర్షణ స్నానమాచరించి నీర్కావి ధోవతి కనకమేఖలతోడ కటిప్రదేశంబున గట్టి మూలమంత్రాక్షరములచే విభూతి మంత్రించి పుండ్రకములు ఫాలమున ధరించి ముత్తెములతో గూర్పబడిన రుద్రాక్షమాలికలు అష్టోత్తర శతంబులు అరుతదాల్చి పుండరీకాజినమున గూర్చుండి పూజ యొనర్చునప్పుడు రెండవ శంభుని వలె ప్రకాశించుచుండెడివాడట (కాశీ 1 39 40) వేమభూపాలుడను జమ్మనిచే గౌతమీ తటమునందు ధాత్రి యేలింపుచు ద్విజ బ్రాహ్మణులగ్రహారములయందు సర్వ సౌఖ్యముల ననుభవించుచుండెడివారు (కాశీ 1 37 భీ 1 41) ఇవి యితనికి బ్రాహ్మణుల యెడగల భక్తి ప్రపత్తుల చాటి చెప్పుచున్నది

వేమారెడ్డి తుల్యభాగా నదీతీరము నంటియున్న ఎనమహేంద్రవాడ వెదురుపాక గ్రామముల నేకము చేసి తన పేర "అల్లాడరెడ్డివేమవరము"గా నామకరణ మొనరించి ఆ గ్రామమునకు చెందిన భూమిని 85 వృత్తులుగా విభాగించి వేద వేదాంగవేత్తలయిన విప్రులకు శక స ॥ 1356 (క్రీశ 1434) ఆనంద స ॥ జ్యేష్ఠ బహుళ అమావాస్య సోమవారము సూర్య గ్రహణ కాలమున దాన మిచ్చెను వెదురుపాకకు కొంచెము ఈశాన్యమున గల కొంకుదురు గ్రామమును తమ తల్లియైన వేమాంబిక పేర "వేమసానక్కదొడ్డవరము"గా మార్చి దాన మిచ్చెను ఇతడు సప్తమాడెముల యధిపతులను జయించి కళింగ భూమి నాక్రమించి పూరీ జగన్నాథ సింహాచలము లందు జయ స్తంభముల నాటెనని ఈశాసనము చెప్పుచున్నది

వేమారెడ్డి త్రిపురారిందుగిరి కుమారుడైన భోగరాయభీమేశ్వరుని శిష్యుడు శైవాచార సంపన్నుడు అన్నదమ్ము లిరువురు రామలక్ష్మణులవలె హరిహరులవలె భాసిల్లిరి వీరి అనురాగము ఆదర్శప్రాయమైనది శ్రీనాథుని రావించి

ఆదరించి అతని పేరిరేపి చి కాశీఖండమును తమ్ముడయిన వీరభద్రునికు అంకిత మిప్పించెను ఇతనికి రాయవేశ్యాభుజంగుడు సంగ్రామపార్థుడు గాయగోవాళుడు సప్తమాడియరాయడను బిరుదులు కలవు ఈతని రాజ్యకాలమందు రాజమహేంద్రవరము మిగుల రాణకెక్కెను ప్రజలు సుఖులైరి

సూ దీ

## అల్లయి వీరభద్రుడు

ఇతడు వేమాంబిక అల్లాడరెడ్ల రెండవ కుమారుడు వేమారెడ్డికి ఈతడు తమ్ముడు కాటయవేముని కుమార్తెయైన అనితల్లిని వివాహమాడుట వలన రాజమహేంద్రవర రెడ్డి రాజ్య సింహాసనాధికారి యయ్యెను

కాటయవేముని కుమారుడు రెండవ కుమారగిరి అతకు ముందే మరణించుటచే అనితల్లి మూలమున రాజ్యము ఆమె భర్తకు సంక్రమించెను అల్లాడరెడ్డి మరణానంతరము రాజమహేంద్రవర సింహాసనమును అనప్రోలారెడ్డి కుమారులైన మూడవ కుమారగిరి మూడవ అనపోతు లాక్రమించగా వారి నోడించి వేమారెడ్డి తన భుజబల సాధితమైన రాజ్యమునకు తమ్ముడు వీరభద్రుని పట్టము గట్టి తాను సచివుడై రాజ్యమేలి చెను అనప్రోలారెడ్డి అల్లాడరెడ్డి యగ్రజుడు

వీరభద్రారెడ్డి వేమారెడ్డివలె తండ్రి కనేక యుద్ధములలో సాయ మొసర్చెను ఈతడు కాటయవేముని కుమార్తె అనితల్లిని వివాహమాడెను కాటయవేమునకు కుమారగిరిరెడ్డి చెల్లెలయిన దొడ్డాంబిక వలన ఈమె జన్మించెను ఈమెను గూర్చి శ్రీనాథుడు ఉదయాస్త్రాద్రి ద్ర సమావనీ ఘన సామ్రాజ్య సమర్థ సుప్రథిమ సాజా ది దిరా దేవతన్" (కాశీ పీఠి 4గ) అని చెప్పినాడు ఈమె శ్రీశైలాది పరమేశ్వరుని సన్నిధిని శక సం 1345లో శోభకృతు సంవత్సర శ్రావణ బహుళ అష్టమినాడు కలువచేఱు గ్రామమును అన్నవరమను పేరుతో కాశీనాథభట్టుకుమారుడు అగు వరహిశాచార్యుడను వైద్యునకు దత్తము చేసెను ఇందామె పతిదైవయనియు బావ ఈమెకు సచివుడనియు చెప్పబడినది ఈ శాసన విషయమును బట్టి అనితల్లి పేర వేమ వీరభద్రారెడ్లు రాజ్యపాలన మొనరించుచుండెడివారని తెలియుచున్నది

వీరభద్రారెడ్డి ప్రత్యేకముగా సాధించిన విజయములేవియు పేర్కొన బడలేదు రాజమహేంద్రవర రాజ్యము వేమారెడ్డి భుజబల సాధితముగా చెప్పబడినది కావున వీరభద్రుడు యుద్ధములందు అన్నగారి సహాయ మొదవుచు రాజ్యపాలన సాగించి యుండవచ్చును

శ్రీనాథుని కాశీఖండ రచనను బాల్య ద్రష్టాంతగా జని అతని రావి వి త్రైలోక్యవి ను సౌ బు కొలువుండి వేమారెడ్డి కాశీఖండమును తమ్ముడు వీరభద్ర మిప్పించెను ఇతడు సంగీత సాహిత్యములయందభిలాష గలవాడని నిశ్శంకకొమ్మన తన శివలీలా విలాసమందు చెప్పినాడు (శివ 1-61) ఇతడు కర్పూర వసంతరాయడను పేరుగా దినట్లు కాశీఖండము చెప్పుచున్నది (కాశీ 1 15

వేమశౌరి యనుజుడైన వీరభద్రుడు సమున్నత వైభవముతో రాజమహేంద్రవరము రాజధానిగా చీటికళింగము చిల్కసముద్రము సహ్యశైలములను పాలించెనని కాశీఖండము చెప్పుచున్నది (కాశీ 1 60 ఇతడు శ్రీముకుందోద్భవ స్వామి శివుని ప్రమోల అగ్రహారాది అఖలమాన్యము లొసగి ధర్మశాసన శిలాస్తంభముల నెత్తించెను ఇతడు ఉత్కల కర్ణాట తురుష్క రాజులకు పరమమిత్రుడనియు (2-165) మత్స్య వంశ నృపుని రక్షించెననియు (4-307) కమిగోట వెంటాయి కప్పకొండ కిల్లెడ భూపతుల ఆతరంగములకు విషానలము వంటివాడనియు (4-309) ధారాపట్టణ సార్వభౌముని దర్పమడచెననియును (5-30) కాశీఖండమునందు కీర్తింపబడినాడు ఇతని మంత్రి బెండపూడి అన్నయ

వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము న కితముగొన్న వీరభద్రారెడ్డికి ఆరోపింపబడిన విజయములు చాటుపద్యములలో వేమారెడ్డిని ఆరోపింపబడి యున్నవి వేమారెడ్డి కప్పకొండను తమ్మటి వ్వమలచే గంతులు వేయించెనని వర్ణింపబడినది దీనిని బట్టి ఈ యన్నదమ్ములు చేయి చేయి కలిపియే వివిధ విజయములను సాధించి రనుట విశ్వసనీయముగుచున్నది ధారాపట్టణ సార్వభౌము డనగా మాళవరాజ్యాధిపతి యగు హోషంగుషా అల్లాడరెడ్డియే ఈతనిని జయించినట్లు మరొకచో చెప్పబడినది

ఇతనికి రాయవేశ్యాభుజంగుడు అభినవభోజుడు జగనొబ్బగండడు త్రిలింగరాజపరమేశ్వరుడు చెంచుమలచూఱకారుడు రణరంగభీముడను బిరుదులున్నట్లు కాశీఖండ భీమఖండ శివలీలావిలాసములు చెప్పుచున్నవి

వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము సంకితముగొన్న రాఘవరెడ్డి కొల్లి టి రెడ్డి వంశీయులైన అనవేమారెడ్డి వీరభద్రారెడ్లకు కృతి తివ్వ భాగ్య మబ్బినట్లే తనకును ఆ భాగ్యమును కలిగించమని సూరనను ప్రార్థించెను(విష్ణు 1 20)

అని ల్లి వీరభద్రారెడ్లు ఇరువురును ఒనగిన అనేక దాన శాసనములు కలవు ఇతడు త్రిపురారీంద్రుని కుమారుడైన ఘోడెరాయభీమేశ్వరుని శిష్యుడు

రాజమహేంద్రవర రెడ్లు స్వయముగా సంగీత సాహిత్యముల దు ష్ణాతులై కవిపండితుల నాదరి చి తెలుగు సాహిత్యాభివృద్ధికి విశేష దోహదము చేసిరి

మా దీ

## అల్లవరం

అల్లవరం తూర్పుగోదావరి జిల్లా అమలాపురం తాలూకాలో ఉన్నది దీనికి 6 మైళ్ళ దూరములో అమలాపురం పట్టణము కలదు ఈగ్రామమునకు తూర్పున గూడాల తాటికోన ముమ్మిడివరప్పాడు బోడకుర్రు ఇంటికోన ఉత్తరమున పేరూరు దక్షిణమున గోడిలంక సరిహద్దులుగా ఉన్నవి దీని విస్తీర్ణము 2 685 ఎకరములు ఇది సమతల ప్రదేశమున కలదు

1961 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఈగ్రామములోని జనులు 7 412 మంది వీరిలో 2 125 మంది షెడ్యూలు జాతులవారు 189 మంది షెడ్యూలు తరగతులవారు ఇచ్చట ఇండ్లు విడివిడిగాను పంక్తులుగాను ఉన్నవి వీటిలో 980 పెంకుటిండ్లు 4 కాంక్రీటు కప్పుగల ఇండ్లు 3 ఒక అ తస్తుగల మేడలు ఉన్నవి అందరు జనులు వరిఅన్నమును తి దురు బావినీటిని త్రాగుదురు

ఈ గ్రామమున 5 కాలువలు చింతాలమ్మచెరువు రాఘవచెరువు శిష్టావారి చెరువు ఉన్నవి వీటిక్రింద రెండు వరిపంటలను పండింతురు పంట ధాన్యమును గాదెలలో పురులలో నిలువచేయుదురు వడ్లను బండ్లపై అమలాపురమునకు రవాణా చేయుదురు ఇక్కడ 400 ఎకరముల కొబ్బరి తోటలు గలవు 1966–67వ ॥లో 50 000 కొబ్బరికాయలను స్థానికులు ఉపయోగించుకొని 3 50 000 కాయలను అమలాపురమునకు రవాణాచేసిరి ఇచ్చట పంటల క్రింద 2 085 ఎకరముల భూమి ఉపయోగపడెను కాలువ క్రింద 1 121 ఎకరములభూమి బావుల క్రింద 400 ఎకరములభూమి సాగుబడియైనది 6 ఆయిల్ ఇంజనులు 400 ఎకరములకును గూడల న త్తగుల్లలు 1 121ఎ రములకు నీటిని సమకూర్చెను ఇక్కడ అ తయు నల్ల రేగడి నేలయే కలదు

ఈ అల్లవరములో 1 ,00 గేదెలు 400 ఆవులు 1 200 ఎద్దులు 2 000 మేకలు 200 గొర్రెలు 50 పందులు 50 గుర్రములు 3000 కోళ్లు ఉన్నవి పాలలో పాలపదార్థములలో సగమువ తు స్థా కులు వాడుకొని మిగిలిన వ తును అమలాపురమ నకు రవాణా చేసిరి

ఈ గ్రామస్థులు వ్యవసాయముచే కూలిచే కొబ్బరి తోటల ఆదాయముచే జీవింతురు జట్కాలు తోలువారు ఎద్దు బండ్లు తోలువారు కంసాలులు వడ్రంగులు కమ్మరులు మంగలివారు చాకలివారు గొల్లవార కలరు 6 ధాన్యపుమరలు ఒకనూనెగానుగ కలవు ఇవి స్థానిక అవసరములను తీర్చును బట్టల నేతపరిశ్రమఉన్నది గ తిన వత్సరమున రు 1 20 000లు విలువగల బట్టలను అమలాపురమునకు రవాణాచేసిరి

ఈ గ్రామములో మల్లేశ్వరస్వామి ఆలయము రామాలయము చింతాలమ్మ మొదలగు ముగ్గురు అమ్మవార్లగుళ్లు 2 మసీదులు కలవు 11 ఎకరముల భూమి శివాలయమునకు కలదు చైత్రశుద్ధ ఏకాదశి నుండి బహుళ పాడ్యమి వరకు మల్లేశ్వరస్వామి కల్యాణము వైశాఖమాసములో 15 దినములు చింతాలమ్మ జాతర జరుగును

అల్లవరమునకు 44 మైళ్ళలో రాజమహేంద్రవరం రైల్వేస్టేషను ఉన్నది ప్రైవేటు బస్సులు గంటకొకమారు బెండమూరు లంకనుండి మురమళ్ళకును కొమరగిరి పట్నము నుండి మురమళ్ళకును పోవును ఈగ్రామమున 10 క కర రోడ్లు ఉన్నవి దీనిని పొరుగు గ్రామములతో కంకరరోడ్లు సిమెంటురోడ్లు కలుపుచున్నవి ప్రయాణములకు 50 గుర్రపు బండ్లు ఒకమోటారుకారు 6 ఒంటెద్దుబండ్లు 200 రెండెడ్ల బండ్లు 350 సైకిళ్ళు ఈగ్రామమున ఉన్నవి

ఈ గ్రామములో ఒక సబ్ పోస్టాఫీసు రెండు బ్రాంచి పోస్టాఫీసులు టెలిఫోను అప్పర్ ప్రైమరీస్కూలు జిల్లా పరిషత్తు హైస్కూలు ఉన్నవి ఇచటి హైస్కూలు చదువులకు విద్యార్థులు గూడాల తాటికోన ఇంటికోన గ్రామముల నుండి కూడవత్తురు ఇక్కడి విద్యుచ్ఛక్తిని 900 ఇండ్లు వాడుకొనుచున్నవి ఇది పంచాయతి పరిపాలనకల గ్రామము పంచాయతీ గ్రంథాలయము మూడు సహకార సంఘములు

ఉన్నవి రూరల్ ఆసుపత్రి పశువుల ఆసుపత్రి ఉన్నవి ఆరుగురు ఆయుర్వేద వైద్యులు ఒక హోమియోపతి వైద్యుడు కలరు సన్నరకపు పొడుగు నూ ఇచట ధాన్యము కూర గాయలు దొరుకును ఈ గ్రామమున సోమవారమునాడు సంత జరుగును 8 రాజా దుకాణములు 9 కాఫీహోటళ్లు 12 సోడా ఫ్యా క్టరి రెట్టు దుకాణములు 6 సైకిళ్ళషాపులు 3 క్షౌరశాలలు ఉన్నవి ఇచటి విద్యార్థులు కళాశాల చదువులకై అమలాపురమునకు పోవుదురు కోర్టులు పోలీసుస్టేషను సబ్‌రిజిష్ట్రారు ఆఫీసు తాలూకాకచేరి బ్లాకు అభివృద్ధి కేంద్రముల పనులమీద గ్రామస్థులు అమలాపురమునకే పోవుదురు

అల్లవరము శివారయిన కోడూర్పాడు ఒకప్పుడు కోడూరు మహాపట్టణమని పిలువబడెడిది అది కాకతీయపాలనలోనిదనియు అది మేచ్ఛుల తాకిడికి పాడుపడినదనియు చెప్పుదురు ఇచటి కీ॥ శే॥ నడింపల్లి సుబ్బరాజుగారు దాతగా ప్రసిద్ధి చెందినవారు వర్తమాన శ్రీ నడింపల్లి రామభద్రరాజుగారు అప్పర్ ప్రైమరీస్కూలునకు 8 ఎకరముల భూమిని విరాళముగా ఇచ్చిరి వర్తమాన శ్రీ నడంపల్లి సూర్యనారాయణ రాజుగారు దేవాలయ నిర్మాణమును గావించిరి

మా శ్వే

## అల్లసాని పెద్దన

అల్లసాని పెద్దన నందవరీక నియోగి బ్రాహ్మణుడు తండ్రి చొక్కనామాత్యుడు జన్మస్థానము బళ్ళారి ప్రాంతమున దూపాడు పరగణాయందలి దోరాల అను గ్రామము అన్నారు శాసనమును బట్టి ఈయన ఋక్శాఖాధ్యాయి ఆశ్వలాయన సూత్రుడు వశిష్ఠగోత్రుడు అని తెలియుచున్నది ఇతడు పుట్టుకచే అద్వైతి విశిష్టాద్వైతమతాభిమాని ఇతడు క్రీ శ 1470 ప్రాంతమున జన్మించెను 1485 ప్రాంతమున శఠగోపయతికి శిష్యుడయ్యెను శఠగోపయతి అహోబల మఠ సంస్థాపకుడు అతడు క్రీ శ 1487 ప్రాంతమున పుట్టెను 1515 వ సంవత్సరము వరకు జీవించియుండెను అని తిరుపతి దేవస్థానము వారు ప్రకటించిన శిలాశాసన కర్తల వంశావళులను బట్టి తెలియవచ్చుచున్నది పెద్దనకు సంక్రమించిన విశిష్టాద్వైత మతాభిమానమునకు కారణము ఇతడు శఠగోపయతికి చేసిన శుశ్రూషయే

పెద్దన తన 40 సంవత్సరముల ప్రాయమున కృష్ణదేవరాయల ఆస్థానమున ప్రవేశించెను రాయలవారి కోరికను అనుసరించి ఈకవి స్వారోచిషమను - సంభవము అను ఆశ్వాసముల ఉత్తమ ప్రబంధమును రచించి ఆప్రభువుకే అంకితము చేసెను దీని మూలము గూర్చిన మార్కండేయ పురాణము మాత్రన దాదాపు 150 పద్యములలో చెప్పిన కథను పెద్దన 900 పద్యములలో పెద్దన మహాకావ్యముగా రచించెను సందర్భమును బట్టి సంభాషణములను పెంచెను ప్రబంధమునకు కావలసిన పదునెనిమిది వర్ణనములను చేర్చెను అలంకార యుతముగా ఈ ప్రబంధమును రసవంతముగ జేసెను ఈ ప్రబంధమునందు ఆనాటి సాంఘిక పరిస్థితులు ప్రతిబింబించుచున్నవి ధర్మాధర్మములమధ్య ఘటిల్లిన సంఘర్షణములో అధర్మముపై ధర్మమునకే విజయము చేకూర్చినాడు అల్లసాని పెద్దన కవి ఈ ప్రబంధమునందలి వర్ణనలు సహజములు కవిత్వము అనర్గళ ధారకలది పాత్రపోషణమున ఈ విధిగా పెద్దన రచించినట్లు చెప్పబడిన ఇతర సంస్కృతాంధ్ర గ్రంథములు లభించుటలేదు శ్రీకృష్ణరాయలు సంతసించి అగ్రహారములను గండపెండారమును ఆంధ్రకవితాపితామహ అను బిరుదమును పెద్దనకు ప్రసాదించెను

పెద్దన ఉదారశీలుడు రాయలవలన తనకు లభించిన కోకటాగ్రహారమును ఇతడు వైష్ణవులకు దానమిచ్చి దానికి తన గురువుపేర శఠగోపపురమని పేరుపెట్టెను ఈవిధముగ పెద్దన తన విశిష్టాద్వైత మతాభిమానమును గురుభక్తిని వెల్లడించెను పెద్దనార్యుడు చేసిన దానములకుచెందిన మూడు శాసనములు లభించినవి వాటిలో కోకటమునకు చెందిన శాసనములు రెండు మొదటి ధర్మశాసనములో పెద్దయ్యగారు శా శ 1440 లేది కోకటమును సకలనాథలింగమునకు ఇచ్చిన భూదానమని చెప్పబడినది రెండవ శాసనమున శా శ 1440 సంవత్సరమందే పెద్దయ్యగారు కోకటమును దీపారాధనకు నైవేద్యమునకు పెరుమాళ్ళకు ఇచ్చినట్లు వ్రాయబడినది అన్నూరుశాసనమందు శా శ 1442 సంవత్సరమున సోమోపరాగ పుణ్యకాలమున పెద్దిరాజుగారు కఠివాచిసీమయందు అన్నూరు గ్రామమునగల వరదరాజ పెరుమాళ్ళకు నిత్యనైవేద్యమునకు దీపారాధనకు ఉత్సవాదులకు సమర్పించిన భూదానమని కలదు

పెద్దనార్యుడు పినాకిని నుండి కోకటమునకు ఒక కాల్వను త్రవ్వించెనని కోకటం కైఫీయతులో చెప్పబడినది ఈ కోకటము కడపమండలమున ప్రొద్దుటూరు తాలూకాలో కాశీ

రామేశ్వరమునకు పోవు బాటకు ప్రక్కన ఉన్నది పెద్దనార్యుడు విశిష్టాద్వైతమతాభిమానియైనను శివక్షేత్రములందు సమానభక్తిగల అద్వైతి స్వారోచిషమను సంభవము నందలి కొన్ని పద్యములను తో లకటమును పెద్దనార్యుడు నకలేశ్వరునకు అర్పించుటయు అతనికి శివక్షేత్రములందుగల తుల్యభావమునకు నిదర్శనములు

అల్లసానిపెద్దన గొప్పకవిగా పండితుడుగా ప్రసిద్ధిని పొందుటయేకాదు ఆతడు రాజ్యకార్యములలో రాయలకు మంత్రిగను ఆయంకరముచేయు ఉద్యోగిగను కూడ వ్యవహరించెనని చెప్పబడినది ఈ కవికి వ్యవహారదక్షత తద్రీవలననే సంక్రమించియుండును

పెద్దన శ్రీకృష్ణదేవరాయల అనంతరమున 1558 ప్రాంతమున కీర్తిశేషుడయ్యెను

గ ల కాం

## అల్లాఉద్దీన్‌ఖిల్జీ

అల్లాఉద్దీన్ ఖిల్జీ క్రీ శ 1296 సం నుండి క్రీ శ 1316 వరకు ఢిల్లీ నేలిన చక్రవర్తి ఇతడు ఢిల్లీ సుల్తానగు జలాలుద్దీన్ ఫిరోజు నకు సోదరుడైన షహాబుద్దీన్ యొక్క కుమారుడు అల్లాఉద్దీనునకు అమన్‌బేగ్ (ఉలుగేఖాన్) కుత్లుగ్ తిఘన్ మహమ్మద్ ఆకత్‌ఖాన్ అను ముప్వురు సోదరులుండిరి ఇతడు తన పినతండ్రియు ఢిల్లీచక్రవర్తియునగు జలాలుద్దీన్ ఫిరోజ్ యొక్క పుత్రికను వివాహమాడెను మొదటనుండి బంధుత్వము ఉండుటచేతను తన కల్లుడగుటచేతను ఫిరోజ్‌షా ఇతనిని కడు ప్రేమతో జూచువాడు అల్లాఉద్దీనునకు ఎనమండుగురు కుమాళ్ళు ఉండిరి అల్లాఉద్దీను స్వభావరీత్యా శక్తిశాలి రాజ్య కాంక్షాపరుడు గొప్ప శూరుడు సైన్యములను చక్కగా నడుపగల నేర్పరి కార్యసాధకుడు తన కోర్కెను నెరవేర్చుకొనుటలో వెనుకముందులను గాని బంధుప్రేమను గాని జూచువాడు కాడు కొంత వరకు కృతఘ్నతా బుద్ధి గలవాడు కఠినస్వభావుడు కాని పరిపాలనాదక్షుడు

అల్లాఉద్దీన్ మొదట కారాకు గవర్నరుగా నియమింపబడెను క్రీ శ 1292 సం లో నితడు భిల్సాపై దాడి జేసి అశేష ధన కనక వస్తువాహనములను కొల్లగొట్టుకొని వచ్చి ఢిల్లీ సుల్తానునకు సమర్పించెను ఇందుకు ప్రతిఫలముగ సుల్తాను అతనిని ఔధ్ (అయోధ్య) ప్రాంతమునకు గూడ పాలకునిగ జేసెను ఇదువలన అల్లాఉద్దీను యొక్క అధికార ప్రాభవములు హెచ్చివి అతనిని అభిమానించువారి సంఖ్యయు విస్తారముగ పెంగినది ఈ అవకాశమును జారవిడువక అతడు కారా ఔధ్ ప్రాంతములపై వచ్చు ఆదాయమును ప్రభుత్వ ఖజానాలో కట్టకుండగ తానే ఉపయోగించుకొనుటకు గాను సుల్తాన్ యొక్క అనుమతిని బొందెను ఈయాదాయము నూతనముగా గొని అతడు సైన్యసమీకరణము గావించెను ఆపదప చందేరిపై దాడిచేయుటకు అనుమతి నివ్వవలసినదిగ సుల్తానును అర్థించెను సుల్తాను అందులకు అంగీకరించెను

చందేరిపై దాడిచేయుట కను నెపముతో అల్లాఉద్దీన్ 8000 పదాతులతోను 4000 అశ్వికులతోను దేవగిరికి పయనమయ్యెను మాలిక్ అలా-ఉల్ ముల్క్‌ను తన ప్రతినిధిగ కారాలో ఉంచి తన చర్యల (దండయాత్రాగమన ధములు) గూర్చి సుల్తాన్ తృప్తి చెందునట్లు తప్పుడు సమాచారము అప్పుడప్పుడు అందించుచుండవలెనని అతనితో జెప్పి క్రీ శ 1296 సం ఫిబ్రవరి 26వ తేదీన అల్లాఉద్దీన్ దేవగిరికి ప్రయాణమయ్యెను కారా నుండి చందేరి భిల్సాల ద్వారా అతడు సైన్యముతో త్వరిత గతిని ఎల్లిచ్‌పూర్ జేరెను అటనుండి కదిలి దేవగిరిని ముట్టడించెను ఈసమయమందు దేవగిరి సైన్యములో నధిక భాగము దేవగిరి రాకుమారుడైన శంకరదేవుని యాధిపత్యములో కారణాంతరముచేత తమ రాజ్యసరిహద్దులకు బోయి యుండెను ఈస్థితిలో దేవగిరి పాలకుడైన రామచంద్రుడు వేరుగతి లేక కోటలో చేరి కవాటములు బంధించుకొనెను అందుచే అల్లాఉద్దీన్ నిరాఘాటముగ దేవగిరి పట్టణమును కొల్లగొట్టెను ఇదే సమయములో తానుకొలది సైన్యముతో ముందుగ వచ్చితిననియు వెనుక 20 000 అశ్వికులు వచ్చుచున్నారనియు అతడు తప్పుడు ప్రచారము చేయించెను ఈప్రచారమును మ్మి కొంత భయపడుట చేతను తాము యుద్ధ సన్నాహము లెవ్వియు ముందుగ జేసికొనకుండుటచేతను కోటలో చాలినంత ఆహార పదార్థములు లేకుండుట చేతను తమ సైన్యములో నధికభాగము రాజధానికి దూరముగ నుండుటచేతను అల్లాఉద్దీనుతో యుద్ధముచేయుట శ్రేయస్కరము గాదని ఎంచి రామచంద్రుడు సంధి రాయబారములకు దిగెను అల్లాయుద్దీను కూడ త్వరితముగ వెనుదిరిగి పోవలెననెడి

ఆతురతతో నడచినవేళ సంధి విముఖుడుగనే యుండెను ఈతరుణములో తమ రాజధానిని శత్రువులుముట్టడించినారని తెలిసి శంకరదేవుడు తన సైన్యముతో తిరిగివచ్చి శత్రువుల దాకెను ఇరుపక్షములకు పోరు ఘోరముగ జరుగుచున్న సమయములో దేవగిరిని ముట్టడించుటకై నస్రత్ ఖాన్ అధీనములోనుంచిన సైన్యము యుద్ధభూమికి వచ్చినది ఈసైన్యమును జూచి అల్లాయుద్దీన్ గతములో ప్రచారము చేసిన అశ్వికులు వీరేయని దలచి దేవగిరి సైన్యములు వెనుకజ వేసినవి దానితో గెలుపు అల్లాఉద్దీనుకు లభించెను రామచంద్రుడు సంధిని అర్థించెను అల్లాయుద్దీన్ అందులకు ఒప్పుకొని నష్టపరిహారముగ ఎక్కువధనమును ఏనుగులను అశ్వములను స్వీకరించి దేవగిరి రాకుమారిని ఎల్లిచ్ పూర్ తో సహా తనకిచ్చునట్లు రామచంద్రునిచేత వాగ్దానమును పొంది తిరిగి కారాకు వెళ్లెను

కారా చేరిన వెంటనే అల్లాఉద్దీన్ ఢిల్లీసుల్తాన్ కొక క్షమాపణ పత్రమును బంపుకొనెను సుల్తాన్ అనుమతి లేక దేవగిరిపై దాడి చేసినందులకు తనను క్షమింపవలసినదనియు తాను దేవగిరినుండి కొల్లగొట్టుకొని తెచ్చిన సంపత్తి నంతటిని సుల్తాన్ పరము జేయుటకు సిద్ధముగా నుంటిననియు అల్లాఉద్దీన్ ఆపత్రములో వివరించెను అల్లే తన సోదరుడైన అమస్ బేగ్ నకు వ్రాసిన యొక జాబులో తాను దేవగిరిపై చేసిన దండయాత్రకు ఎంతగనో పశ్చాత్తాప బడుచుంటిననియు సుల్తాన్ కు తనపై నాగ్రహము వచ్చియుండుననియు అతడు తనకు క్షమించునట్లు చేయవలసినదనియు సుల్తాన్ స్వయముగ కారాకు వచ్చి తాను దేవగిరినుండి తెచ్చిన సంపదనంతటిని స్వీకరించి తనను ఢిల్లీకి వెంటదోడ్కొని పోయినచో అతడు తనను క్షమించినట్లుగ భావింతుననియు వ్రాసెను ఈసమాచారమునంతటిని దెలిసికొని సుల్తాన్ తన యల్లుడైన అల్లాఉద్దీనును అభినందించుటకై కారాకు పయనము గట్టెను అల్లాఉద్దీన్ యొక్క కుత్సితబుద్ధిని పసిగట్టిన కొందరు రాజభక్తిపరాయణులగు ఉన్నతోద్యోగులు సుల్తానును కారా వెళ్ళవద్దని వారించిరి కాని అతడు వారిమాటల పెడచెవిని బెట్టి కారాకు బయలుదేరెను అచట అల్లాఉద్దీను కుట్రచేసి జలాలుద్దీన్ ఫిరోజ్ ను ఎదురేగి మాణిక్ పూర్ వద్ద హత్యచేయించి తానే ఢిల్లీసుల్తాన్ నని ప్రకటించుకొనెను తర్వాత నతడు విరివిగ నందరకు దానధర్మములు చేసి లోకమును మభ్యపెట్టి దాని నోరు మూసెను అంతియేగాక తనను అభిమానించువారికి దరకుగొప్పగొప్ప పదవులనిచ్చి మరింతగ వారి ప్రేమాభిమానముల చూరగొనెను తన ఈచర్యలను గర్హించినవారిని గతించిన సుల్తానునకు వారసులైనవారిని అతని బంధువులను తదితర రక్తసంబంధీకుల నందరిని కడతేర్చి అల్లాఉద్దీన్ తన స్థానమును సుస్థిర పరచుకొనెను

సింహాసన మధిష్ఠించిన వెంటనే అల్లాఉద్దీన్ క్రీ శ 1298 సం లో తన సైన్యములను జైత్రయాత్రకు బంపెను ఢిల్లీ సేనలు మొదట చిత్తూరుమీదుగ గుజరాతుపై నడచి దాని రాజధానియగు అన్హిల్ వార్ ను దోచుకొనినవి పిదప ఆసేనలు సోమనాథ్ కు వెళ్ళి దానిని కొల్లగొట్టినవి గుజరాతు దాడి సందర్భములో అల్లాయుద్దీను సైన్యాధిపతులు గుజరాతు పట్టమహిషియగు కమలాదేవిని బంధించి సుల్తాన్ అంతిపురి కంపిరి క్రీ శ 1301 సం లో అల్లాయుద్దీన్ రణథంభోరుపై దండెత్తి దానిని జయించెను గుజరాతు రణథంభోరులపై చేసిన దాడుల సందర్భములో అల్లాయుద్దీన్ ప్రవర్తించిన రీతి వలన అతని కుత్సితగుణము కృతఘ్నత దుర్మార్గత్వము క్రూర స్వభావము చక్కగా వెల్లడియైనవి తదనంతర మతడు క్రీ శ 1303 సం లో చిత్తూరును క్రీ శ 1305 సం లో మాండు (మాళ్వ)ను క్రీ శ 1308 సం లో సివాన (రాజస్థాన్)ను జయించెను క్రీ శ 1310 సం లో అతని సేనలు దక్షిణ హిందూదేశము నందంతట వీరవిహారము చేసి అనేక ప్రాంతములను జయించినవి అల్లే దక్కనుపై ముఖ్యముగ ఓరుగల్లుపైనను దేవగిరిపైనను అతని సైన్యములు పలుమారులు దాడి జరిపినవి

క్రీ శ 1303 సం లో అల్లాఉద్దీన్ ఓరుగల్లుపైకి దండెత్తి వచ్చెను అపుడు ఓరుగల్లు సామ్రాజ్యమును ప్రతాపరుద్ర చక్రవర్తి పాలించుచుండెను ఇరుపక్షములవారికి పోరు ఘోరముగ జరిగినది ఈసమరములో ఢిల్లీ సేనలు వికావికలై వచ్చిన దారిని బట్టినవి ఈఓటమి ఢిల్లీ సుల్తాన్ కు తీరని యశాంతిని గల్గించినది తన సేనలు తెలంగాణములో ఓడిపోయి వచ్చుట నతడు సహింపలేకపోయెను ఎట్లైనను ఓరుగల్లును జయించి తీరవలెనని అతడు సంకల్పించుకొనెను కాని కారణాంతరముల వలన షుమారు 6 సం ల కాలము అతడు ఓరుగల్లుపై దాడిని గూర్చి తలపెట్టలేకపోయెను క్రీ శ 1309 సం లో నతడు తన సేనానియగు మాలికాఫర్ ను విశేషసైన్యముతో ఓరు

గల్లు దుర్గముపైకి బంపెను మాలికాఫర్ తెలగాణములో ప్రవేశించి సర్వారును జయించి యటనుండి కదలివచ్చి ఓరుగల్లును ముట్టడించెను కాకతీయ సైన్యములు కోట సంరక్షణకై వీరోచితముగ పోరాడినవి 25 దినముల పాటు సంకుల సమరము జరిగిన పిదప అతికష్టముమీద మహమ్మదీయులు ఓరుగల్లుదుర్గముయొక్క బాహ్య ప్రాకారమునకు గండికొట్టి లోన ప్రవేశించిరి అందుచేత కాకతీయసైన్యములు దుర్గముయొక్క రెండవప్రాకారములోపలజేరి శత్రువు నెదుర్కొనవలసి వచ్చినది లోపల జనసమ్మర్ద మధికమగుటచే కాకతీయసైన్యము అనేక కష్టనష్టముల నెదుర్కొనవలసివచ్చినది ఈ స్థితిలో చేయునదిలేక ప్రతాపరుద్రుడు సంధిరాయబారములు జరిపెను మాలికాఫర్ గూడ సంధికి సుముఖుడుగనేయుండెను ప్రతాపరుద్రుడు తన వద్దనున్న సమస్త ధనములతోబాటు 100 ఏనుగులను 700 అశ్వములను మాలికాఫర్‌నకు యిచ్చి ప్రతి సంవత్సరము ఢిల్లీసుల్తానునకు కప్పము గట్టుట కొడంబడి యామహమ్మదీయ సేనానిని సాగనంపెను ఈదాడి వలన తెలంగాణమునకు నాడు తీరని నష్టము గల్గినది ధన కనక వస్తు వాహనముల కోల్పోవుటయే గాక విశేష ప్రాణనష్టము గూడ జరిగినది దీనికి తోడు కాకతీయసామ్రాజ్యములోని కొందరు సామంతులు చక్రవర్తిని నిర్లక్ష్యపరచి ప్రవర్తించుటకును తిరుగుబాటు చేయుటకు గూడ ఈదాడి యవకాశము నిచ్చినది అట్టివానిలో నెలూరు నేలుచున్న తెలుగు చోళ ప్రభువగు రంగనాథుడు చేసిన తిరుగుబాటు పేర్కొనదగినది ఈతిరుగుబాటు నణచుటకు ప్రతాపరుద్రుడు తగు అవకాశముకై షుమారు రెండేళ్ళువేచి యుండవలసి వచ్చినది క్రీ శ 1311 సం లో మాలికాఫర్ దక్షిణహిందూదేశముపై నెత్తివచ్చినపుడు కాకతీయసైన్యము అతనికి అండగా నిలచి యొంతగనో సహాకరించినవి ఈతరుణములోనే ప్రతాపరుద్రుడు తిరిగి నెల్లూరుని తన యధీనములోనికి దెచ్చుకొనుట జరిగినది క్రీ శ 1309 సం లో ప్రతాపరుద్రుడు ఢిల్లీసుల్తానుతో సంధి చేసుకొని నప్పటినుండి క్రీ శ 1316 సం లో అల్లాఉద్దీన్ ఖిల్జీ మరణించువరకు ఓరుగల్లు ఢిల్లీ దర్బారుల మధ్య సంబంధములు సామరస్యముగనేయుండినవి దక్కనులో అల్లాఉద్దీన్ జయించిన మరియొక ప్రముఖ రాజ్యము దేవగిరి

అల్లాఉద్దీన్ ఢిల్లీ గద్దె నెక్కిన పిదప క్రీ శ 1307సం॥లో దేవగిరిని జయించుటకు తన సైన్యముల బంపెను ఇందులకు ప్రధాన కారణము దేవగిరి ప్రభువు ఢిల్లీకి గట్టవలసిన కప్పము బకాయి బడి యుండుటయే దానికి తోడు అతడు గుజరాతు పాలకుడైన కర్ణదేవునకు ఆశ్రయమిచ్చియుండెను అందుచే అల్లాఉద్దీన్ తనసేనానియగు మాలికాఫర్‌ను దేవగిరిపైకి బంపెను అతడు దేవగిరిపై దండెత్తివచ్చి దానిని జయించి కప్పము వసూలు చేసికొని వెళ్లెను నాటినుండి దేవగిరిరాజు కూడ ఢిల్లీకి విధేయుడై యుండెను మహమ్మదీయ సేనలు దక్షిణాదికి వచ్చినప్పుడెల్లా అతడు కూడ వాని యవసరము లన్నిటిని దీర్చుచు వానికండగ తన సేనను గూడ బంపువాడు ఈ సంబంధము లిట్లే క్రీ శ 1311లో నతడు గతించువరకు కొనసాగినవి కాని తండ్రి మరణానంతరము దేవగిరి సింహాసన మెక్కిన శంకరదేవుడు ఢిల్లీసుల్తానును ధిక్కరించి స్వాతంత్ర్యమును ప్రకటించెను అందుచే క్రీ శ 1313లో అల్లాఉద్దీను దేవగిరిపై దాడి జేయుటకు మాలికాఫర్‌ను మరల బంపెను ఈదాడిలో శంకరదేవుడు చంపబడెను దేవగిరి రాజ్యము ఖిల్జీసామ్రాజ్యములో గలిపి వేయబడినది

అల్లాఉద్దీన్ తన పాలనలో హిందువులయెడ నిర్దయతో ప్రవర్తించెను హిందువుల యున్నతిని జూచి అతడు సహింపలేక పోయెను పూర్వమునుండి యనుభవించుచున్న కొన్ని హక్కులను విశేషాధికారములను హిందూ అధికారులిక మీదట అనుభవించుటకు వీలులేదని అతడు శాసించెను ముఖ్యముగా హిందూ జమీందారులను పర్గణాలకు గ్రామాలకు అధిపతులగు హిందువులను అతడు చిన్నచూపు జూచి చాలా పీడించెను వీరి వద్దనున్న ధనమునంతటిని యేదో ఒక నెపముచే అతడు స్వాధీనము చేసుకొని వారిని దరిద్రులజేసి వదలిపెట్టెను అల్లాఉద్దీన్ గద్దె నెక్కక పూర్వము శ్రీమంతులైయుండి సకల భోగముల ననుభవించిన హిందూ స్త్రీలు అతడధికారమును జేపట్టిన కొలది కాలమునకే జీవనోపాధికై మహమ్మదీయుల గృహములలో ఊడిగము చేయవలసి వచ్చిన దన్నచో అతడు హిందువులను పెట్టిన కష్టముల గూర్చి వేరుగ వర్ణింపబనిలేదు ఇతడు పరమతద్వేషి యనుటలో సందేహములేదు

అల్లాఉద్దీన్ పరిపాలనము చాల కట్టుదిట్టముగ సాగించెను ఇతడు దేశమందంతట గూఢచారుల నియమించి యెప్పటి వార్తల నప్పుడు సేకరించి తిరుగుబాటుదార్లను జూదరులను లంచగొండులను శిక్షించువాడు ప్రముఖ రాజోద్యోగులు

క్రీసు తులు రాజబంధువులు తరచు సమావేశముగా రాదనియు వివాహ వినోద విహారములు చేయరాదనియు అతడు శాసించెను. నిత్యావసర వస్తువుల ధరలు నిర్ణయించి అందరు అప్రకారమే వస్తువులను అమ్మవలెనని శాసించెను. అధికధరలకు అమ్మువారికి తూకములో దగా చేయువారిని అతడు కఠినముగ శిక్షించువాడు. ఇతడు ఇక్ఫాదారుల భూముల న్నిటిని స్వాధీనపరచుకొని అనేకులను దరిద్రులుగ చేసివైచెను. ఇతడు ప్రజలపై అనేక రకముల క్రొత్త పన్నుల విధించి వానిని పాదావలో నధిక భాగము ప్రభుత్వ ఖజానాకు చేరునట్లును వారు జీవించుటకు చాలిచాలినంత ఆదాయము మాత్రము మిగులునట్లు చేసెను. ఇందుచేత ప్రజలు నిత్యము తమ భుక్తి కొరకు దేవులాడుటయందే తమ కాలమును గడుపవలసి వచ్చుటయు రాజకీయముల జోలికి పోకుండుటయు జరిగినది. అందుచేత అల్లాఉద్దీన్ తన ఇష్టము వచ్చిన రీతిని పాలించుటకు వీలైనది. ఇతడు క్రీ శ 1316 సం॥లో జనవరి 5వ తేదీన అకస్మాకముగా మరణించెను.

ఆ. చెం.

## అల్లా ఉద్దీన్ హాసన్‌షా

అల్లాఉద్దీన్ హాసన్‌షా దక్కనులో బహమనీ రాజ్యమును స్థాపించెను. ఇతని పుట్టుపూర్వోత్తరముల గురించి ఇదమిత్థమని తెలియరాలేదు. ఇతడు పర్షియా రాజును ఇస్ఫెండియారు పుత్రుడును అగు బహ్మన్ యొక్క వంశీయుడని కొందరి మతము కాగా ఇతని పూర్వచరిత్రను గూర్చి వేరొక ప్రసిద్ధ గాథ యున్నది. ఈ కథ ప్రకారము ఇతడు ఢిల్లీలో గంగూ యను నొక బ్రాహ్మణ జ్యోతిష్కుని వద్ద సేవ చేయుచుండెను. ఒక దినమున అతడు ఆ బ్రాహ్మణుని పొలమును దున్నుచుండగ ఒక పాత్ర బయటపడినది. ఆపాత్ర నిండుగ ధనము ఉండుటచేత అతడు దానిని గొనిపోయి తన యజమానికొసంగెను. ఆ బ్రాహ్మణుడు ఇతని నీతి నిజాయితీలకు ఋజువర్తనకు సంతసించి నాడు ఢిల్లీ నేలుచున్న మహమ్మద్ బిన్ తుఘ్లక్ వద్దకు అతనిని గొనిపోయి జరిగినదంతయు చెప్పెను. అందులకు సుల్తాను సంతసించి హాసన్‌ను శతాశ్వాధికారిగ నియమించెను. తదనంతరము అతడు తన శక్తిసామర్థ్యములచేత దక్కనులో రాజ్యమును స్థాపించి తన యజమాని యగు గంగు పేరును తన పేరుతో జతచేసి హాసన్‌గంగు యని వ్యవహరింపబడెననియు ఆ యజమాని కులమునకు పర్షియను భాషలో పర్యాయ పదమగు బహ్మన్ యను దానిని తన వంశ నామముగ స్వీకరించెననియు చెప్పబడినది. అతను స్థాపించిన రాజ్యము కూడ బహమని (బహ్మని) రాజ్యమని వ్యవహరింపబడుట ఇచట గమనింపదగిన విషయము. ఈ కథయందలి నిజానిజము లెట్లున్నను హాసన్ కనసామాన్య కుటుంబము నందు జన్మించినాడన్న విషయము స్పష్టము. ఇతడు మహమ్మద్ బిన్ తుఘ్లక్‌ను సేవించినాడన్నది వాస్తవము. బహమనీ రాజ్యస్థాపనకు నాంది యైన దక్కను అమీరుల తిరుగుబాటు సందర్భములో ఇతడు గుల్బర్గా ప్రాంతమునకు జాగీర్దారుగ నుండెను.

క్రీ శ 1347 స॥లో హాసన్ బహమని రాజ్యమును స్థాపించెను. బహమని రాజ్య స్థాపనకాలములో దక్కనులో రాజకీయ పరిస్థితులను రాజ్యస్థాపనకు దోహదము చేసిన సంఘటనలను ఇచట పరిశీలించుట ఉచితము. బహమనీ రాజ్య స్థాపన కాలమునాటికి యావద్భారతములోని రాజకీయ పరిస్థితి అంతయు అస్తవ్యస్తముగా నుండినది. ఉత్తర భారత దేశములోని లాహోరు గంగా యమునా అంతర్వేది మొదలగు ప్రాంతములలోను దక్షిణ భారతదేశమందలి మలబారు ప్రాంతములోను తుఘ్లక్ పాలనకు వ్యతిరేకముగ చెలరేగిన తిరుగుబాట్లు ఢిల్లీ సుల్తానుకు కలవరమును కల్గించినవి. ఇదే కాలములో ఓరుగల్లునందు కాపయనాయకుడు స్వతంత్ర రాజ్యము స్థాపించెను. వేరొకవైపున తుంగభద్రానదీ తీరమున విజయనగర సామ్రాజ్యమునకు హరిహరబుక్కరాయ సోదరులు పునాదిరాళ్ళను వేసిరి. ఇట్లనేక ప్రాంతముల నేక కాలములో చెలరేగిన విప్లవ ఝుఝూ మారుతము తుగ్లక్ సామ్రాజ్య వృక్షమును కూకటివేళ్ళతో పెళ్లగించినట్లుండెను.

పై రాజకీయ సంక్షోభ కాలములో కొన్ని ప్రత్యేక పరిస్థితులు దక్కనులో బహమనీ రాజ్య స్థాపనకు దోహదము చేసినవి. నాడు దక్కనులో సుల్తాన్ ప్రతినిధిగ కుత్లుగ్ ఖాను రాజ్య పాలనా వ్యవహారముల జూచుచుండెను. ఇతని ఉన్నతిని జూచి సహింపలేని కొందరు స్వార్థపరులు కుత్లుగ్ ఖాను ప్రభుత్వ ధనమును దుర్వినియోగపరచుచున్నాడనియు అతని క్రింద ఉద్యోగులనేకమంది తప్పుడు లెక్కలు జూపి ధనము నపహరించుచున్నారనియు సుల్తానుతో పితూరులను చెప్పిరి. అందుపై సుల్తాను క్రీ శ 1345 సం॥లో కుత్లుగ్ ఖానును ఢిల్లీకి పిలిపించి అతని స్థానములో ఆలీముల్ ముల్క్‌ను

నియమించెను ఎదవ సుల్తాను గుజరాతు మాల్వాలకు గవర్నరుగా అజీజ్ ఉద్దీన్ కమర్ ను నియమించి అమీరుల వద్దనుండి వీలైనంత పెద్ద మొత్తములలో కప్పములను నిర్దాక్షిణ్యముగా వసూలు చేయమని చెప్పెను అందుల కామోదించి అజీజ్ ఉద్దీన్ తన కేంద్రస్థానమగు థార్ పట్టణమును చేరినవెంటనే 89 మంది స్థానిక అమీరులను సమావేశపరచి దక్షిణాదిని చెలరేగు విప్లవముల కన్నిటికి కారణము దేవగిరి ప్రాంతమందలి అమీరులే అని చెప్పి తదితరులను భయభ్రాంతుల జేయు దృష్టితో వారినందరను క్రూరముగ జంపించెను ఈ చర్య వలన అతడాశించిన ఫలితము కలుగలేదు మీదుమిక్కిలి దౌలతాబాదు గుజరాతు వాని పరిసర ప్రాంతములందలి అమీరులందరికి అతనిపై ఆగ్రహము కలిగినది సుల్తాను పాలనలో తమకు రక్షణ లేదనియు చేయని తప్పులకు శిక్షల ననుభవించవలసి వచ్చుచున్నదని వారెంతయో మనస్సుల గుండెకి అందుచే వారందరు తమతమ ప్రాంతములలో సుల్తాన్ పాలన నంతమొందించు అదనుకై వేచియుండిరి

అజీజ్ ఉద్దీన్ కమర్ అనేకమంది అమీరులను పైవిధముగ హత్య జేసిన అనతి కాలమునకు క్రీ శ 1346 స ॥ లో గుజరాతు ప్రాంతములో గొప్ప విప్లవము చెలరేగినది విప్లవకారులు కాంబే రేవు పట్టణమును స్వాధీన పరచుకొని బరోడావద్ద అజీజ్ ఉద్దీన్ నెదుర్కొని పోరాడి ఓడించి అతనిని చంపిరి ఈ వర్తమాన మందిన వెంటనే సుల్తాను స్వయముగ అబూనుచేరి అటునుండి కొంత సైన్యమును గుజరాతులోని తిరుగుబాటుదార్ల నణచుటకు బంపెను ప్లవకారులు ధైర్యముతో సామ్రాజ్య సేనల నెదుర్కొనిరి కాని సుల్తాన్ సైన్యముల ధాటి కాగలేక వారు దేవగిరికి లాయనమై పోయిరి మాలిక్ మక్బూల్ సైన్యముతో విప్లవకారుల వెన్నంటి తరుముచు మార్గ మధ్యములో కొందరిని బట్టుకొని శిరచ్ఛేదనము జేసెను ఎదవ సుల్తాన్ విప్లవకారుల ఉనికి దెలిసికొనుటకై ఇరువురు విచారణ కర్తలను దేవగిరికిబంపెను 1500 మంది సుశిక్షితులగు అశ్వికుల తోడునిచ్చి దేవగిరిలోని అమీరుల నందరను తన వద్దకు బ్రోచ్ పట్టణమునకు బంపవలసినదని కూడ సుల్తాను వారిద్వారా నాటి దేవగిరి గవర్నరగు ఆల్ ముల్ ముల్కునకు ఆజ్ఞను బంపెను ఈయాజ్ఞ నందుకొని ఆలిమిల్ ముల్క్ రాయచూరు ముద్గల్ బీజాపూర్ బీరారు గుల్బర్గా మొదలగు ప్రాంతములకు చెందిన ప్రముఖులగు అమీర్లను సుల్తాన్ వద్దకు పంపుటకు విశ్వ ప్రయత్నము చేసెను వారు సుల్తాన్ యొక్క ఆ తంత్రమును గ్రహించనిచ్చి వారగుటచే బ్రోచ్ కు బోవు విషయములో వెనుకవేసిరి ఎట్టకేలకు అతి కష్టముపై నతడు ఇస్మాయిల్ ముల్క్ హసన్ గంగు నాసిరుద్దీన్ మొదలుగాగలకొందరు ప్రముఖులు నెల్లొ యొప్పించి అశ్వికుల నిచ్చి బ్రోచ్ పట్టణమునకు బయనము జేసెను ఇట్లు ప్రయాణమై పోవుచున్న అమీరులందరు మార్గమధ్యమున సమావేశమై సుల్తాన్ తమను రప్పించుటలోగల విశేషమును గూర్చి చర్చించి అతడు తలపెట్టిన దుర్మార్గమునకు మొదట వగచి తదనంతర మాగ్రహించి తమతో వచ్చుచున్న విచారణకర్తల నిరువురను జంపి దేవగిరికి తిరిగివచ్చి బాహాటముగ విప్లవపు బావుటా నెగురవేసిరి తదనంతరము వారు ప్రభుత్వ ఖజానాను దోచుకొని సుల్తాన్ పాలనను ధిక్కరించి దక్కనులో స్వాతంత్ర్యమును ప్రకటించిరి వారు ఇస్మాయిల్ ముల్క్ ను తమ ప్రభువుగ నెన్నుకొనిరి ఇతడు నసీరుద్దీన్ అను బిరుదమును ధరించి అధికారమును జేపట్టెను ఇట్లు దక్కనులో విప్లవమును లేవదీసిన ప్రముఖులలో హసన్ గంగు కూడ యుండెను హసన్ గంగుకు జఫర్ ఖాన్ యను బిరుదముసు ఈసందర్భములోనే దక్కనుకు సుల్తానుగ నెన్నుకొనబడిన ఇస్మాయిల్ ముల్క్ ఇచ్చెను

దౌలతాబాదు తిరుగుబాటును గూర్చి తెలిసిన వెంటనే మహమ్మద్ బిన్ తుఘ్లక్ స్వయముగా బయలుదేరి దౌలతాబాదుకు వచ్చెను మార్గమధ్యమున తిరుగుబాటుల్లు ఒకటి రెండు చోట్ల సుల్తాన్ సైన్యముల నెదుర్కొనిరి కాని ఫలితము లేకపోయెను పరాభూతులైన విప్లవకారు లనేకులు దేవగిరిని జేరి కోటలో తల దాచుకొనిరి విప్లవమునకు ప్రముఖనాయకులైన ఇస్మాయిల్ ముల్క్ సోదరులు హసన్ గంగు మొదలగు అమీరులు తమ తమ జాగీర్లకు వెళ్ళిరి సుల్తాన్ మహమ్మద్ దేవగిరిని ముట్టడించి కొంతకాలము ముట్టడిని కొనసాగించెను ఇంతలో గుజరాతునందు మాలికితఘీ విప్లవము లేవదీయుటచే దాని నణచుటకు సుల్తాన్ గుజరాతుకు వెళ్ళుచు కొంత సైన్యమును దేవగిరి ముట్టడి కొనసాగించుటకు ఇమాదుల్ ముల్క్ నాయకత్వములోనుంచి తమ తమ జాగీర్లకు వెళ్ళిన తిరుగుబాటుదారులను కూడ పట్టుకొని శిక్షింప వలసినదని యతని నాదేశించెను ఈ వ్యవధిలో ఓరుగల్లు కంపిలి మొదలగు రాజ్య

ములు స్వాతంత్ర్యమును ప్రకటించుకొనినవి ఇది ఇట్లుండ ఇమాదుల్ ముల్కు వీరందరుకు తీవ్రముగ చేసికొని విప్లవకారుల నణచి వేయుటకు ప్రయత్నించుచుండెను ఇంతలో హసన్‌గంగు సామ్రాజ్య సేనల నెదుర్కొనుటకు గాను గుల్బర్గాలో సైనిక సన్నాహముల పూర్తి గావించెను వరంగల్లునుండి కాపయ నాయకుడు దౌలతాబాదునుండి ఇస్మాయిల్ ముల్కు సుల్తాను నెదుర్కొనుచున్న హసన్‌గంగు సహాయముగ నుండుటకై కొంత సైన్యమును బంపిరి ఇట్లు బంపబడిన సైన్యమును తన సైన్యమును దీసికొని హసన్‌గంగు సామ్రాజ్య సైన్యముల నెదుర్కొనుటకు బోయెను ఇరు పక్షములకు జరిగిన యుద్ధములో ఢిల్లీ సైన్యము ఓడిపోయినది ఇమాదుల్ ముల్కు చంపబడెను శత్రువులకు చెందిన సంపద పెద్దమొత్తములో హసన్‌కు లభించినది ఈ సందర్భములో నతనికి (ఖాక్ట్రియా ప్రాంతపు ఒంటెలు తార్తార్ దేశపు అశ్వములు అబీసీనియా దేశమునకు చెందిన వేలాది బానిస స్త్రీపురుషులు మణుగుల కొలది వెండి బంగారములు వందలకొలది గుడారములు లభించెను అటనుండి హసన్ దౌలతాబాద్ వైపు నడచెను అతని రాకను ముందుగనే పసిగట్టిన ఢిల్లీ సైన్యములు దౌలతాబాదు ముట్టడిని విరమించి పలాయనమై పోయినవి అందుచే నతడు నిరాఘాటముగ దౌలతాబాదు పట్టణములో ప్రవేశించెను ఇట్లు విజయధ్వజముతో వచ్చిన హసన్‌గంగుకు ఇస్మాయిల్ ముల్కు ఎదురేగి తోడితెచ్చెను పిదప ఇస్మాయిల్ ముల్కు అమీరుల నందరిని సమావేశపరచి తాను వృద్ధుడనైతి ననియు రాజ్యము నేలు శక్తి తనకు లేదనియు అందులకు తగినవాడు హసన్ మాత్రమే అనియు తాను మనస్ఫూర్తిగా రాజ్య పరిత్యాగము చేయుచుంటిననియు గాన వారందరు హసన్‌ను తమ రాజుగ నెన్నుకొనవలెననియు చెప్పెను అందు మీదట అచటసమావేశమైన అమీరులందరు హసన్‌ను తమప్రభువుగ నెన్నుకొనిరి ఇట్లు క్రీ శ 1347సం లో జఫర్ ఖాన్ (హసన్) బహమని రాజ్యమునకు సికందర్ ఐ సానీ అలాఉద్దీన్ హసన్ బహమనీ షా అల్వాలీ అను బిరుదుతో రాజయ్యెను ఇట్లు పరిస్థితుల ప్రాబల్యమువలనను ఓరుగల్లు కంపిలి రాజ్యముల యొక్క హిందూపాలకుల సహాయము చేతను హసన్‌గంగు క్రీ శ 1347 సం లో బహమనీ రాజ్యమును స్థాపింపగల్గెను నాటినుండి సుమారొక దశాబ్దము (1347-1358) వాటు అతడు బహమనీ రాజ్యమును పాలించెను

హసన్ సింహాసన మధిష్ఠించిన తోడనే దక్కనులోని పరిస్థితులన్నియు అతని కనుకూలముగా మారిపోయినవని చెప్పుట కవకాశము లేదు మహమ్మద్ బిన్ తుఘ్లక్ యొక్క అభిమాను లనేకులు నాడు దక్కనులో నుండిరి వీరంతా హసన్‌షాకు వ్యతిరేకులైరి అట్లే దక్కనులోని అమీరులలో కొందరికి ప్రబల స్వాతంత్ర్య కాంక్ష యుండినది వీరు బహమన్‌షా పాలన కంతరాయము గల్గించుటకు సిద్ధపడిరి అట్లే అప్పటివరకు దక్కనుకు రాజుగనుండి రాజభోగముల ననుభవించి రాజ్యపరిత్యాగము జేసిన ఇస్మాయిల్ ముల్కు హసన్‌షాను కూలద్రోయుటకు పరోక్షముగ కుట్ర పన్నుట కవకాశముండినది ఇట్లు బహమన్‌షాకు నాడు పెక్కు చిక్కులుండినవి ఈ క్లిష్ట పరిస్థితి నధిగమించి తన స్థానమును స్థిర పరచుకొనుటకై హసన్‌షా సింహాసన మధిష్ఠించిన మరుక్షణము నుండియే ప్రయత్నింపసాగెను దక్కనులోని ప్రముఖుల కనేకులకు అతడు బిరుదముల నిచ్చియు తనయాస్థానములో గొప్ప గొప్ప పదవుల నిచ్చియు వారి ప్రేమాభిమానములను సంపాదించెను అతడు సైఫుద్దీన్ ఘోరిని ప్రధానమంత్రిగ నియమించెను ఇస్మాయిల్ ముల్కును అమీరుల్ ఉమ్రాగ జేసెను గతములో తనను పోషించిన గంగూను గణకాధిపతిగ నియమించెను

హసన్‌షా తన రాజ్యమును విస్తరింపదలచెను దక్కనులో తనకు వ్యతిరేకముగ నున్నవారి నందరిని అణచి వేయుటకు అతడు నిశ్చయించెను అందుచే నతడు తన సైన్యాధిపతులను నలువైపులకు దాడులు చేయబంపెను గుర్షాప్ నాయకత్వములో కొంతసైన్యము కోటగిరిపై దాడి వెడలినది కోటగిరితో బాటు త్రోవలోనున్న కాండహార్‌ను గూడ జయించి ఈసైన్యము తిరిగి వచ్చినది అట్లే క్వీర్ ఖాన్ కొంత సేనతోబోయి కల్యాణిని జయించి హసన్‌షా పాలనలోనికి దెచ్చెను సికందర్ ఖాన్ కూడ మాల్ఖేడును జయించి బహమనీ రాజ్యములో గలిపివేసెను క్రీ శ 1350 సం లో బహమనీ సైన్యములు ఓరుగల్లు రాజ్యముపై దండెత్తెను అపుడు కాపయనాయకుడు బహమన్‌షాకు కౌలాస్ దుర్గము నిచ్చి ఏటేట అతనికి కప్పముగట్టుటకు ఒప్పుకొనిన సంధి చేసుకొనెను అట్లే బహమనీ సేనలు మాహూరు మహేంద్రి అక్కల్‌కోట మొదలగు దుర్గములపై దండెత్తి పోయి వానిని జయించెను హసన్‌షా పాలనలో బహమనీ సేనలు కర్ణాటకముపై గూడ దండెత్తి పోయినట్లు ఫెరిష్టా వ్రాసినాడు కాని విజయనగర

ప్రభువునకు హసన్‌షాకు మధ్య యుద్ధములు జరిగినవనుట సంశయాస్పదమే

హసన్‌షా పాలనలో కొన్ని తిరుగుబాట్లు కూడ జరిగినవి తుఘ్లక్ అభిమానియగు పోచారెడ్డి గుల్బర్గాలోనే బహమన్‌షా పాలనకు వ్యతిరేకముగ తిరుగుబాటు లేవదీసెను బహమన్‌షా దీనిని నిర్దయతో నణచివేసెను అట్లే క్రీ శ 1352 న లో మహమ్మద్ అలం తిరుగుబాటు జేయగా హసన్‌షా స్వయముగ నచటికేటి దానిని అణచివేసెను కాని మహమ్మద్ అల శరణని వేడుటచే బహమన్‌షా యతనిని క్షమించి వదలిపెట్టెను ఇంతలో తుఘ్లక్ మరణించినాడన్న వార్త అందుటచే హసన్‌షా కొంత తృప్తితో యూపిరి పీల్చుకొనగలిగెను ఏలనన ఢిల్లీసుల్తాను యెపుడు తనపై దండెత్తి వచ్చునో యన్న భీతి అప్పటి వరకు అతనికుండెను అతడు సాగర్‌లో నుండగనే తుఘ్లక్ పక్షపాతియు ముథోల్‌నకు అధిపతియు నగు నారాయణ్ హసన్‌షాకు వ్యతిరేకముగా విప్లవమును లేవదీసెను అందుచే హసన్‌షా ముథోల్‌కు వెళ్ళి విప్లవము నణచి నారాయణ్‌ను డి కప్పముమగొని తిరిగి రాజధానికి వచ్చెను

హసన్‌షా చివరి రోజులలో అతని సైన్యాధిపతులలో నొకడైన క్విర్ ఖాన్ కల్యాణిలో తిరుగుబాటుచేసెను అందుచే హసన్‌షా స్వయముగా కల్యాణికి వెళ్ళి కొంత సైన్యమును సికదర్‌నకు ఇచ్చి క్విర్ ఖాన్‌ను ఎదుర్కొనుటకు బంపెను వీరదు సమీపములో సికందర్ విప్లవకారుల నెదుర్కొని వారి నోడించి క్విర్ ఖాన్‌ను బంధించి తెచ్చి హసన్‌షా ముందుంచెను. ఇట్లు గొనిరాబడిన క్విర్ ఖాన్ యొక్క శిరమును హసన్‌షా తక్షణమే ఛేదించి వేసెను అంతవరకు అనేకమంది తిరుగుబాటుదార్లను క్షమించి వదలి వేసినన హసన్‌షా యిట్లు నిర్దయతో ప్రవర్తించుటకు కారణము క్విర్ ఖాన్ సేనాధిపతియైయుండి తనకే ద్రోహమును తలపెట్టుట నతడు క్షమింపలేకపోవుటయే క్విర్ ఖాన్‌ను కూడ క్షమించి వదలివేసినచో సైనికాధికారులలో ప్రభువు యెడల నిర్లక్ష్యభావము కల్గునని తలంచియు అతడట్లు చేసెను

హసనషా తాను స్థాపించి విస్తరింపజేసిన రాజ్యమును నాల్గు తరఫులుగా విభజించి వానిని పాలించుటకై ప్రతితరఫునకు ఒకగవర్నరునియమించెను ఈవిభజననిజముగా హసన్‌షా చేసినదిగాదు గతములోనే దక్కను తుఘ్లక్ చే నాల్గుషిక్‌లుగా విభజింపబడినది బహమన్‌షా ఆప్రాంతముఅకున్న షిక్ అను దొలగించి తరఫు అని పెట్టినాడు బహమన్‌షా దేశపాలనావిషయములలో శ్రద్ధ వహించుటకు వలసిన సమయము లేకుండెను తను స్థాపించిన రాజ్య మప్పటికి కను బాలారిష్టముల గడచి యుండక పోవుటచే అతడు నిరంతరము దానిసంరక్షణకు దాని వృద్ధికి పాటు బడ వలసివచ్చినది ఇతడు మరణించు నాటికి బహమనీ రాజ్యము మాండుమండి రాయచూర్ వరకు భోనగిరిను డి గోదావరకు విస్తరించి ది ఇతడు గుల్బర్గాను తన రాజధానిగ చేసికొని దాని నెంతగనో అభివృద్ధి పరచెను దానికి హసనాబాదు యని పేరు పెట్టినది కూడ ఇతడే రాజ్యకాంక్షాపరుడైనప్పటికిని హసన్‌షా దయార్ద్రహృదయుడని చెప్పవచ్చును ఇతడు క్రీ శ 1858 సం లో మరణించెను

ఆ వెం

## అల్లాడనాథదేవరాజు

అల్లాడనాథదేవరాజు పరిచ్ఛేది వంశమున బుట్టిన క్షత్రియుడు పరిచ్ఛేది వంశజులలో వెలనాటి దుర్జయులను తెగవారు కలరని శాసనము ద్వారా తెలియుటవలన ఇతడు దుర్జయులను తెగకు చెందినవాడు వీరిది వసిష్ఠగోత్రము

ఇతని తండ్రి పేరు గొంకరాజు తల్లి కామ (ల) దేవమ్మ తమ్ముడు భీమరాజు ఈ ఇద్దరన్నదమ్ములు కలసి కొల్లిపాక విజయవాటికా పురసీమలను శా శ 1205 (క్రీ శ 1283) ప్రాంతమున స్వేచ్ఛగా పరిపాలించినట్లు శాసనాధారము కలదు

కృష్ణా జిల్లాలోని శ్రీకాకుళేశ్వరాలయపు శిలాఫలకము మీద అల్లాడనాథదేవరాజు వ్రాయించిన రెండు శాసనములు లభ్యమగుచున్నవి ఈరెండు శాసనము (ద హిం IV నెం 985 986) లేగాక కర్నూలు జిల్లాలోని త్రిపురాంతకేశ్వరుని దేవళమునందు భీమరాజుచే వ్రాయించబడిన శాసనము (ద హి నెం X 480) కూడ అల్లాడనాథదేవరాజు చరిత్రమును సంపూర్ణముగా వ్యక్తముచేయగలవు

శ్రీకాకుళేశ్వరాలయపు శాసనము (ద హిం IV నెం 985) ద్వారా ఈక్రింది విషయము వ్యక్తమగుచున్నది

శ్రీమన్మహామండలేశ్వర పరిచ్ఛేద అల్లాడనాథదేవ దేవరాజులు తమ తండ్రి గొంకరాజునకు తల్లి కామలదేవమ్మ గారికి ధర్మసిద్ధి కొరకు శకవర్షములు 1205 (క్రీ శ 1283) స్వభాను సంవత్సర చైత్రశుద్ధ పంచమి ఆదివారమునాడు

శ్రీకాకోలను శ్రీవల్లభదేవునకు అఖండ దీపారాధనకై 25 మోదాలను (మొదవులను) సమర్పించిరి వానిని గ్రహించి ఉప్పల బ్రహ్మనబోయడు తన పుత్రపౌత్రికముగ నిత్యము మానెడు (నెయ్యి) దేవరకు సమర్పించుచు ఆచంద్రార్కముగా నడపగలడు

భీమరాజు వ్రాయించిన శాసనము (ద హి X నెం 480) నందు తండ్రి పేరొక్కటే వ్రాయబడి ఉండుటవలన భీమరాజు వ్రాయించిన శాసనమునాటికి తండ్రి (గొంకరాజు) ఒకడే మృతుడయ్యెనని తల్లి మాత్రము నాటికింకా బ్రతికి యుండెనని ఊహించవచ్చును తరువాత దేవరాజు తన శాసనమునందు తల్లిని కూడ పేర్కొనుటవలన దేవరాజు వ్రాయించిన శాసన సమయమునకు తల్లికూడ మృతిపొందెనని తెలియగలదు కావున భీమరాజు వ్రాయించినశాసనసమయము దేవరాజు శాసనసమయము కంటె మూడు నాలుగు సంవత్సరములు పూర్వమని తెలిసికొనుట అంత కష్టము కాదు

శ్రీకాకుళేశ్వర ఆలయమునందే అల్లాడనాథదేవరాజు వ్రాయించిన రెండవ శాసనము (ద హిం IV నెం 986) కలదు ఇది దానశాసనము కాదు ఇందెవ్వరికిని దాన మిచ్చినట్లు గానీ పుచ్చుకొన్నట్లు గానీ లేదు కాని శాసనమునందు ఉపయుక్తము గు విశేషణములను బట్టి దేవరాజునకు శౌర్యాది గుణము లు బిరుదము లెన్నియో ఉన్నట్లు తెలియగలవు

భీమరాజు వ్రాయించిన శాసనమునందు "కొల్లిపాక పురవరాధీశ్వర విజయవాటికా పురవరాధీశ్వర అను వాక్యములద్వారా అల్లాడనాథదేవరాజు కృష్ణానదీ దక్షిణ ప్రాంతమందలి ఆరువేల గ్రామాల పరిమితి గల కొలనుపాక సీమను విజయవా (టిక) డ సీమను పరిపాలించినట్లు తెలిసినది అదిగాక దేవరాజు వ్రాయించిన శాసనమునందలి" విర (జా) పురవరేశ్వర" అనువాక్యము కూడ కేవలము ఔపచారికము కావచ్చును వీరి పూర్వుల కెన్నడో విరజాపురము తో సంబంధ ముండి యు డును తెలుగు చోళులకు ఒరయూరుతో సంబంధము లేకున్నను ఒరయూరు పురవరాధీశ్వర అని వ్రాయించుకొను ఆచారము ఇట్టిదే

భీమరాజు వ్రాయించిన శాసనమునందు "షట్సహస్ర గ్రామావనీవల్లభ" అనియుండగా దేవరాజు వ్రాయించిన ప్రస్తుత శాసనమునందు దానితోపాటు సప్త సహస్రా నీ వల్లభ" అని వ్రాయబడి ఉన్నది అనగా భీమరాజు శాసనము ప్రస్తుత శాసనము కంటే నాలుగైదు సవత్సరములు పూర్వమనుకొన్నచో ఈనాలుగైదు సంవత్సరాలకాలంలో అల్లాడనాథదేవరాజు విర (జా)పుర సీమను సాధించియు డవచ్చును అది వేయి గ్రామాల పరిమితి గలదైనచో "సప్త సహస్రావనీ వల్లభ" అను విశేషణము విర (జా) పుర వరేశ్వర అను విశేషణమును సార్థకము కాగలదు ఇది కేవలము ఊహ మాత్రమే

శాసనమునందు మల్లికా వల్లభ అను వాక్యమున్నది అనగా అల్లాడనాథదేవరాజు సతీమణి పేరు మల్లిక కావచ్చును

"చోడకటక వజ్రప్రాకార రట్టకటక రక్షపాలక చాళుక్య రాజ్య మూల స్తంభ" అను శాసనవాక్యములను గూర్చి భీమరాజు శాసనసందర్భమున విపులముగా చర్చింపబడినది

అల్లాడ నాథదేవరాజు మహామండలేశ్వర సమధిగత పంచమహాశబ్ద పతిమెచ్చుగండ మొదలగు ఎన్నో బిరుదములను ధరించినవాడని అతడు వ్రాయించిన రెండు శాసనముల లోను భీమరాజు వ్రాయించిన శాసనములోను కాననగును దేవరాజు శూరమాన్యుడని రణరంగభైరవ మొదలగు శాసన వాక్యముల ద్వారా తెలియుచున్నది

పరమ మాహేశ్వరాది విశేషణములు శాసనమునందు వాడబడి యుండుట వలన అల్లాడనాథదేవరాజు మాహేశ్వరాచార వ్రతము పూనినవాడని తెలియగలదు కాని దానశాసనమున శ్రీకాకుళాంధ్రవిష్ణువునకు అఖండ దీపారాధనకై 25 మోదాలను సమర్పించినట్లుండుటవలన ఈతడు శైవ వైష్ణవములను జీర్ణము చేసికొన్న క్షత్రియోత్తముడనుట సహజమే కాగలదు ఒకవేళ అతడు కేవలము మహేశ్వర పూజా వ్రతుడైనచో శ్రీకాకుళాంధ్రవిష్ణువు నెట్లు పేర్కొనును?

కావున మహామండలేశ్వరాది బిరుదములను వహించి మల్లమాంబా మనోహరుడైన అల్లాడనాథదేవరాజు శా శ 1205 (క్రీ శ 1283) ప్రాంతమున కొల్లిపాక (కొలనుపాక)ను రాజధానిగా చేసుకొని విజయవాటిక విరజాపురములను తన యధీనమునందే ఉంచుకొని బహుశః తన తమ్ముడైన భీమరాజును విజయవాటికను పాలించుటకై రాష్ట్రపాలునిగా నియమించి యుండవచ్చును సమాజ శ్రేయస్సును దృష్టి యందిడికొని దేవరాజు ఒక శాసనమునందు విష్ణువును పేర్కొనగా మరియొక శాసనమందు భీమరాజు మహేశ్వరుని దలచెను శివకేశవులు అభిన్నులను సత్యము తెలుపుటయే వీరి పరమాశయము కావచ్చును

శే గో రా

## అల్లాడనాథ భీమరాజు

నరసారావుపేట తాలూకాలోని చేజెర్ల గ్రామమునుండి ఓకార అను నది ప్రవహించుచు బగాళాఖాతమునందు కలయుచున్నది దానికి ఓగేరు అను పేరు కూడ కలదు ప్రస్తుతము దానిని ఓగేరు అని పిలుచుచున్నారు ఆ నదీరు ప్రక్కల నున్న ప్రదేశమునకు "ఓంగేరుమార్గము" అను వ్యవహారము కలదు శాసనాధారములను బట్టి "ఓగేరుమార్గము"ను పరిచ్ఛేది వంశమునకు చెందినరాజులు పరిపాలించిరని తెలియుచున్నది

అల్లాడనాథదేవరాజు భీమరాజు వీరిద్దరు అన్నదమ్ములు వీరు పరిచ్ఛేద వంశీయులు ఓంగేరుమార్గ సీమను పరిపాలించినవారును వీరే కృష్ణానదికి దక్షిణదిక్కున ఉన్న కొల్లిపాక పురమును రాజధానిగా చేసికొని ఇంచుమించు ఆరువేల గ్రామాల పరిమితిగల సీమను వీరు పరిపాలించినారు శాసనము (ద హి X శా న 480) లోని కృష్ణవేణ్యా నదీ దక్షిణ షట్సహస్ర గ్రామావనీ వల్లభ" అను వాక్యమువలన పై విషయము ధృవపడుచున్నది కొల్లిపాక అను గ్రామమునే నేడు కొలనుపాక అని వ్యవహరించుచున్నారు అది నల్లగొండ జిల్లాలో నున్నది ఇది కల్యాణీచాళుక్యుల ఉపరాజధానిగా నుండెను అదియే పిదప పరిచ్ఛేది వంశీయుల స్వాధీన మైనది వీరు కొల్లిపాక పురము నేలినట్లు ద హి X నెం 480 లో లిఖింపబడి యున్నది

పై శాసనమును భీమరాజు కర్నూలు జిల్లాలోని త్రిపురాంతకేశ్వరుని దేవళములో చెక్కించెను ఈశాసనము త్రిపురాంతకమునందలి త్రిపురాంతకేశ్వర ఆలయమునందు చెక్కబడి యున్నది ఇది శాశ 1192 (క్రీశ 270) సంవత్సరములో వ్రాయబడినది

ఆశాసనమును బట్టి ఈ క్రిందివిషయము స్పష్టమగును శ్రీమన్మహామండలేశ్వర సమధిగతపంచమహాశబ్ద మొదలగు ఎన్నో బిరుదములను వహించిన అల్లాడనాథ దేవరాజు తమ్ముడు భీమరాజు తనతండ్రియైన గోంకరాజునకు ధర్మప్రాప్తిసిద్ధి చుట కొరకు ఈశాసనమును చెక్కించెను ఇందు ప్రమాది సంవత్సర పుష్యబహుళ సప్తమి గురువారమునాడు ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున శ్రీమత్త్రిపురాంతక మహాదేవరకు అఖండ దీపమునకై పెట్టిన ౫౦ మోదాలను గ్రహించి [illegible]కోయుండు పుత్రా మపౌత్రికముగా తప్పెడు నెయ్యి నిత్యము పోసి దేవళమును నడుపగలవాడని క్లుప్తముగా తెలియును

శాసనమును బట్టి భీమరాజు తండ్రి గోకరాజని తెలియుచున్నది తల్లి పేరు యీశాసనమునందు లేకున్నను దేవరాజు వ్రాయించిన శాసనము (ద హిం IV నెం 985) నందు వీరితల్లి కామ(ల) దేవమ్మగారని విశదమగును దీనిని భీమరాజే వ్రాయించినను అతని అన్న అల్లాడదేవరాజు గుణగణము లెన్నియో ఈశాసనమువలన తెలియుచున్నవి

"విలాస విద్యాధర భోగ పురందర వీర మురారి" మున్నగు బిరుదము లాతనికి కలవు

విజయవాటికా పురవరాధీశ్వర కొల్లిపాక పురవరాధీశ్వరచోడకటక వజ్ర ప్రాకార రట్టకటక రక్షపాల" అను వాక్యములచేత అల్లాడనాథదేవరాజు కేవలము కొల్లిపాకపురమునేగాక విజయవాడసీమను కూడ పాలించినట్లు తెలియును

మహామండలేశ్వర సమధిగతపంచమహాశబ్ద పతిమెచ్చు గండ మొదలగు ఎన్నో బిరుదములు అల్లాడనాథదేవరాజున కున్నట్లు శాసనము నాధారించి తెలియగలదు దేవరాజు చరిత్రమునకు సంబంధించిన విషయములే ఇందు ఎక్కువగా ముచ్చటించుటవలన పరిపాలన మొదలగు రాజకీయ వ్యవహారము లన్నియు దేవరాజే చూచుకొనునట్లు విదితమగును అదిగాక ఈశాసనమును భీమరాజు వ్రాయించెను ఇతడు వ్రాయించిన శాసనమునందే అన్న అల్లాడనాథదేవరాజు ప్రసక్తి ఉండుటవలన ఆవిధముగా రాజ్య వ్యవహారములు అన్నగారే చూచుకొనవలయునని భీమరాజు అకాంక్ష గావచ్చును ఇది వారి అన్యోన్యతను చాటుచున్నది మరియు ఉభయులు కలిసి రాజ్యము నేలినట్లు తెలియుచున్నది

వీరిది పరిచ్ఛేదవంశము ఈ విషయము "పరిచ్ఛేద అల్లాడనాథ" దేవరాజు" అను వాక్యమువలన ధృవపడుచున్నది ఇకఅల్లాడనాథ అనునది వీరిఇంటిపేరు కావచ్చును లేదాఅల్లాడనాథుడను దేవుని పేరు పచ్ఛేదులు తమపేర్ల ముందు గౌరవ భక్తి సూచకముగా ధరించి యుండవచ్చును ఒక్కొక్కసారి గ్రామనామములు కూడ ఇంటి పేర్లుగా సంఘటనలు కలవు కావున పరిచ్ఛేదులు పూర్వము అల్లాడ యందు నివసించి యుండవచ్చును వీరు దానిని ఇంటి పేరుగా ధరించి యుండవచ్చును

"దుర్జయకుల కులాచల మృగేంద్ర అను శాసనస్థమైన

వాక్యముద్వారా వారు వెలనాటి దుర్జయ కులమునకు చెందిన వారనియును తెలియుచున్నది. అనగా పరిచ్ఛేద వంశీయులలో వెలనాటి దుర్జయులను తెగవారుకూడ కలరని పై వాక్యమును బట్టి ఊహింపవచ్చును.

వీరు వ్రాయించిన శాసనములలో తమగోత్రమును వీరు ఎచటను చెప్పినట్లు కానరాదు. కాని "శ్రీమన్మహా పరిచ్ఛేది కర్ణాటక కోట కాకతి వంశ పాటవమున నెగడు వసిష్ఠ కౌండిన్య ధనుంజయ కాశ్యప గోత్రముల్ గణన మీరు" అను పద్యము నాధారించి పరిచ్ఛేద వంశీయుల గోత్రము వసిష్ఠ గోత్రమైనట్లు తెలియుచున్నది.

భీమరాజు శాసనమునందు కల్పించు "చోడకటక వజ్ర ప్రాకార రట్టకటక రక్షపాలక చాళుక్య రాజ్య మూలస్తంభ" అను బిరుదులు ప్రస్తుతపు రాజులకు సంబంధించినవిగా కన్పించవు. అవి వారికి వంశపరంపరాగత బిరుదములని భావించవలెను. ఏలనన అల్లాడనాథదేవరాజు భీమరాజుల కాలమునకు చోళులు కాని రట్టకులు కాని చాళుక్యులు కాని వర్తమానులై లేరు. ఇందు రట్టకులనగా రాష్ట్రకూటులు. వారి కటకము లేక ముఖ్యపట్టణము మాన్యఖేటము. రాష్ట్రకూట సామ్రాజ్యము క్రీ. శ. 973 నందే అస్తమించినది. పరిచ్ఛేద వంశీయులు రట్టకటక రక్షపాలకు లనగా వీరి పూర్వీకులు మూడు శతాబ్దముల వెనుక రాష్ట్రకూటులను సేవించిరని మాత్రమే చెప్పదగియున్నది.

వీరి చాళుక్య రాజ్య మూలస్తంభ బిరుదమును అట్టిదే. ఇచ్చటి చాళుక్యులనగా పశ్చిమ చాళుక్యులు. వీరి ముఖ్య పట్టణము కల్యాణినగరము. ఈ సామ్రాజ్యము కూడ క్రీ. శ. 1160 ప్రాంతమున అస్తమించినది. కాకతి రెండవ ప్రోలరాజు కడపటి చాళుక్యచక్రవర్తిని ధిక్కరించి స్వతంత్రుడయ్యెను. చాళుక్యులు వైభవమును అనుభవించిన కాలములో పరిచ్ఛేదివంశీయులు వారి విశ్వాసపాత్రులైన ఉద్యోగులై యుందురు.

పరిచ్ఛేద సోదరుల చోడకటక ప్రాకార బిరుదమును వంశపరంపరాగతమే అని చెప్పదగి యున్నది. ఎట్లన చోడుల వైభవమును గతప్రాయమే అయినది. వీరి ముఖ్యపట్టణము కాంచీపురము. ఇది యిప్పుడు అనగా క్రీ. శ. 1270 ప్రాంతమున కాకతీయులకును పాండ్యులకును వివాద కేంద్రముగా ఉన్నది. ఇది రుద్రమదేవి కాలము. కావున పరిచ్ఛేదసోదరులు శాసనకాలమునకు కాకతీయ సామంతులనియే నిర్ణయింపదగును. అయినను వీరిది కడుపురాతనమైన వీరవంశమని చెప్పుటకు ఎట్టి అక్షేపణయు ఉండదు. వీరు చాళుక్యరాజ్య మూలస్తంభులని చెప్పబడుటచే రెండు మూడు శతాబ్దుల నుండియైన కృష్ణానదీ దక్షిణదేశమున వర్ధిల్లియుందురు. వారి నుండియే కొలనుపాక పురము పరిచ్ఛేదులకు సంక్రమించి యుండును.

పరిచ్ఛేద సోదరులు శివభక్తులు. వీరమాహేశ్వరాచార వ్రతులు. త్రిపురాంతక దేవుని పూజించువారు.

వీరు ఎన్నడో గడచిపోయిన చోళ రట్టక చాళుక్యులను పేర్కొనియు తమకు ఏలికలైన కాకతీయులను ప్రశంస చేయకపోవుట వింతగనే యున్నది. దీని కొక కారణము ఊహింపవచ్చును. బహుశః వీరు కాకతి రుద్రమదేవిని ధిక్కరించి ముప్పది సంవత్సరములు మీర్జువాడి ప్రాంతము నేలిన నిరంకుశుడైన కాయస్థ అంబదేవుని మిత్రవర్గము వారు కావచ్చును. అందుచేత సమకాలిక రాజ్ఞియైన రుద్రమదేవికి ప్రత్యర్థులు అయి యుందురు.

శే. గో. రా.

## అల్లాడనాయకుడు

ఈ నాయకుని ప్రశంస పల్నాడు తాలూకా ఎన్నలి గ్రామమందలి రామలింగేశ్వర ఆలయ ధ్వజస్తంభ సమీపమున నెలకొల్పబడిన ఒక శిలాఫలకముమీది శాసనములో లభించుచున్న (ద. హిం. X. నెం. 549) శాసనకాలము శక 1263 (క్రీ. శ. 1341) వృష సంవత్సర మార్గశిర బహుళము. అల్లాడనాయకుని తండ్రి పెబ్బినాయకుడు. తన తండ్రికిన్ని తోడంబుట్టిన వారికిన్ని ధర్మముగా అల్లాడనాయకుడు పింగలి రామనాథస్వామివారి శిఖర ప్రతిష్ఠాన సందర్భమున బంగారపుకుండ (పహిండికుండ)ను ప్రతిష్ఠించెనని తెలియుచున్నది.

ఈశాసనము అక్కడక్కడ చాలా శిథిలమైపోవుటచే ముఖ్యవిషయము లెన్నియో తెలుసుకొనవలసినవి అవగతముగుటలేదు. అల్లాడనాయకుడు త్రిపురాంతకదేవ దివ్యశ్రీపాదపద్మారాధకుడు. అయినను విష్ణుభక్తివర్జితుడు కాడు. రామనాథస్వామికి శిఖర మెత్తించుటయే దీనికి తార్కాణము. అల్లాడనాయకుని వంశమును గూర్చి కొన్ని సూచనలు శాసనమునందు కలవు. కాని అవి అస్పష్టముగా ఉన్నవి. ఇతడు తెలుగుచోడ కుటుంబములకు చెందినవాడేమో యనిపించును.

కరికాలచోడ నరవర ప్రసాదాసాదిత సామ్రాజ్యలక్ష్మి కలవాడట మట్లూరి సుధాకర ఆలుకుంటల పురవరాధీశ్వర అనునవి ఈతని బిరుదులు మనుమ కుల మాంధాత- అనుటచే మనుమ ద్దుల వంశమువాడా యని స దేహము కలుగును అయినచో ఈతడు నెల్లూరుచోడుల వంగడమునకు చెందినవాడగును రాజే ద్రచోడరాయ స్థాపనాచార్య- అనునది ఈతనికి ముఖక్రమాగతమైన విశేషణము కావచ్చును ఎ దుకనగా అల్లాడ నాయకుడు ప్రతిష్ఠి పగల రాజే ద్రచోడుడు ఎవ్వరును ఈ కాలమున లేరు ఈరాజే ద్రచోడుడు కాంచీపుర చోడుడో లేక వెలనాటిరాజేంద్రచోడుడో తెలియదు నెల్లూరు చోడ తిక్క భూపతికి చోడ తిక్క భూపతికి చోళస్థాపనాచార్య బిరుదము కలదు క్రీ శ పదమూడవ శతాబ్ది విషయము

అల్లాడ నాయకుడు చేసినవిజయములును అస్పష్టముగానే ఉన్నవి నుమదేవశిరచ్ఛేదన తొ డనగజకేసరి ఉదయని హ ఆశ్వాద్యులన్నియు శాస శిల శిథిలమగుటచే గు ర్తింపరానివిగ ఉన్నవి ఈతనికి పీకశంఖము కాహళము మున్నగుమహాశబ్దముల కధికారము ఉన్నట్లు శాసనము చెప్పుచున్నది ఐనను అల్లాడనాయకుడు స్వతంత్ర ప్రభువని చెప్పుటకు అవకాశము లేదు క్రీ శ 1341 నాటికి కృష్ణ దక్షిణదేశము శ్రీశైలము వరకును రెడ్డిరాజ్య స్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డిఛత్రము క్రింద ఉ డెది పల్నాడు కూడ దానిలోని భాగమే ఎఱ్ఱ నాయకుని కుమారుడైన అల్లాడనాయకుడు రెడ్డి రాజ్య మండలి చిన్న సామ త ప్రభువు కావచ్చును చోడస శియుడగుటచే పూర్వపు ప్రాభవము చూపు పెక్కు బిరుదులను దాల్చినాడు అల్లాడకిత్తి ఇ గువ కట్టినవస్త్రము

శే గో రా

## అల్లాడ పెమ్మయ మహరాజు

ఆ ధ్రదేశమును క్ష త్రియ వ శములేగాక పెక్కు బ్రాహ్మణ వంశములు కూడ పరిపాలి చినవి అందు శాతవాహనులు విష్ణు కు డినులు శాలంకాయనులు పల్లవులు మొదలగు వారిని పేర్కొనవచ్చును ఈవిధముగానే పల్లవ వ శమునకు చెందినవాడు అల్లాడ పెమ్మయమహారాజు భారద్వాజ గోత్రుడు కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకాలోని త్రిపురా తక మందున్న త్రిపురాంతకీశ్వర దేవళమునందలి కుడ్యముపై ఈయన శాసనము (ద హిం శా- నెం 862) కనిపించుచున్నది

శాసన పాఠము ఈక్రి దివిధముగా వ్రాయబడియున్నది -

"స్వస్తి శ్రీ అనేక మహీమండల రాజాధిరాజ రాజ పరమేశ్వర పల్లవకులతిలక భారద్వాజగోత్ర లలితార్ధ్వ ప్రఖట్వా గధ్వజందు వాయుపతిఘోషణ వృషభలాంఛన వెంగళనాథ కా చీపురవ- రాధీశ్వర కామాక్ష్యా విశా లబ్ధ వరప్రసాద భూలోక చాతుర్వర్ణ (ధామ) ముక్క టికాడు వెట్టి వ శావతారులైన శ్రీమతు మ డలేశ్వర ఇ మడి బసవ సంకర జగదగోపాల అల్లాడ పెమ్మయదేవమహారాజులు స్వస్తి శకవర్షంబులు 1181 అగు నే టి సిద్ధార్థి స వత్సర చైత్ర శుద్ధ ౧౫ నాంటి దవనపర్వనిమిత్తమున శ్రీమత్త్రిపురా తక శ్రీమహాదేవర అఖండదీపాన కిచ్చిన| మోదాలు ౨౫"

ఈ శాసనమువలన అల్లాడపెమ్మయమహారాజు వంశీయులైన పూర్వ పల్లవుల చరిత్రము కొంచెము స్పష్టము కాగలదు దక్షిణాపథమునందు పల్లవుల సామ్రాజ్యము అతివిశాలమైనది వారు క్రీ శ మూడవ శతాబ్దమును డి తొమ్మిదవ శతాబ్దాంతము వరకును కాంచీపురమును రాజధానిగా చేసుకొని అవిచ్ఛిన్నముగా పాలించిరి పల్లవులలో చాలా మంది వైష్ణవమును సేవి చిన వారు కలరు కొందరు పరమ మహేశ్వరులు కూడ కలరు అట్టి పల్లవులు భారద్వాజగోత్రజులైన బ్రాహ్మణులు వృషభలా ఛనులు ఈవిషయము శాసనము ద్వారా విశదమగుచున్నది

శాసనమునందు ముఖ్యముగా "శ్రీపర్వత పూర్వదిశా స త్తశాగ్రహార ముక్కంటికాడువెట్టి వంశావతారులైన" అను వాక్యము కలదు ఇది చర్చి చవలసిన విషయము క్రీ శ ఐదవశతాబ్దా తమున స్కందవర్మ యని చక్రవర్తి యుండెను ఆయనయే త్రిలోచన పల్లవుడని Early Dynasties of Andhradesa అను గ్ర థమున విశదము గావించబడినది ఆయననే ముక్కంటికాడువెట్టి అను మరియొక పేరు కూడ కలదు త్రిలోచనపల్లవుడు క్రీ శ 4వ శతాబ్దాంతమున ఉ డెను కరికాలచోళు తో యుద్ధముచేసినవా డాతడే యనియు కొందరు చారిత్రకులు భావించిరి

ముక్కంటికాడువెట్టి చేసిన ప్రజోపయోగి కార్యము శ్రీశైలమునకు పూర్వదిశనున్న అరణ్యములను కొట్టించి ఆప్రాంతమును జనావాసమునకు అనుకూలముగా చేయుట కాడువెట్టి అనగా అడవులను నిర్మూలించినవాడు ఈమహారాజు శ్రీశైలమునకు తూర్పు దిశయందు 700 బ్రాహ్మణా

గ్రహారములను స్థాపించి వేదాది విద్యలకు గొప్ప ప్రోత్సాహము కల్పించెను

అల్లాడపెమ్మయమహారాజు తాను ముక్కంటికాడువెట్టి వంశమువాడనని చెప్పుకొనినను పల్లవుల ప్రాభవము అతనికి కొన్ని శతాబ్దములముందే అస్తమించెను

అల్లాడపెమ్మయ దేవరాజు క్రీ శ 1259 సంవత్సర ప్రాంతమునందు ఉన్నవాడు అది కాకతీయ చక్రవర్తి యగు గణపతిదేవుని కాలము ఆ సమయమునందు కాకతీయులు ఆ ప్రదేశమునందు అంతటను సార్వభౌమాధిపత్యము గానేలిన వారు పెమ్మయమహారాజు ఏప్రాంతమున పాలించెనో నిశ్చయించుటకు ఆధారములు లేవు శ్రీశైలమునకు తూర్పున ఈతడు అధికారము వహించి యుండును కాకతీయులను తన శాసనములలో ఈతడు పేర్కొనకపోయినను పెమ్మయ మహారాజుగణపతిదేవుని సామంతుడనియే భావింపవలెను క్రీ శ 1259 సంవత్సర ప్రాంతమున కాకతీయ సామ్రాజ్యమునందు కొంత అలజడికి కారణము కలిగెను గణపతిదేవుడు వృద్ధుడయ్యెను ఆయన కుమార్తె రుద్రమదేవి అధికారమును స్త్రీయగుటచే కొందరు సామంతులు ధిక్కరింపజొచ్చిరి సామ్రాజ్య దక్షిణభాగమున జటావర్మసుందరపాండ్య చక్రవర్తి నుండి ప్రమాద మేర్పడుచుండెను కోప్పెరుంజింగడను పల్లవ వీరుడు సుందరపాండ్యుని ప్రేరణచే కాకతీయ సామ్రాజ్యముపై దాడి చేసి ద్రాక్షారామము వరకు చొచ్చుకొని పోయెను ఈకల్లోల పరిస్థితులు చూసి పల్లవ వంశీయుడైన అల్లాడ పెమ్మయదేవమహారాజు కూడా స్వతంత్రప్రతిపత్తికై తిరుగుబాటు చేసెనేమో? తెలియదు

ఇచ్చట మరియొక సూచన చేయతగి యున్నది పెమ్మయమహారాజు రాజ్యమునకు సరిహద్దున వెలనాడు కలదు వెలనాటిచోళుల అనుయాయులైన ఆఘుచర్లవారు ఒక పల్లవరాజును జయించివారి బిరుదములు గైకొన్నట్లు తెలియుచున్నది ఈపల్లవుడు కోప్పెరుంజింగడు కావచ్చునని ఇదివరలో ఊహ చేసితిమి వెలనాటి రాజ్యముపై దండెత్తి వచ్చి ఆఘుచర్లవారిచే పరాజితుడైన పల్లవరాజు మన పెమ్మయదేవమహారాజు కూడ కావచ్చును ఈఅంశమును నిర్ధరించుటకు ఇంకను సాక్ష్యము వలయును

ఇంతేగాక అల్లాడపెమ్మయదేవమహారాజు విప్పర్తి అను గ్రామమునందు కూడ శా శ 1117 (క్రీ శ 1195) సంవత్సర ప్రాంతమున ఒక శాసనము వేయించెను ఆశాసనము (ద హిం VI సె 598) నందు మహామండలేశ్వరుడైన ముక్కంటికాడువెట్టి వంశావతారుడైన అల్లాడపెమ్మయదేవమహారాజు శ్రీమన్మహామల్లేశ్వర మహాదేవర అంగరంగభోగములకు పెదవిపట్ల అను గ్రామమును దానము చేసినట్లు కలదు ఈశాసనమునందు కూడ ముక్కంటికాడువెట్టి ప్రశంస కలదు త్రిపురాంతకమునందు వేయించిన శాసనమునకు విప్పర్తియందు వేయించిన శాసనమునకు దాదాపు 64 సంవత్సరముల వ్యవధి కలదు పెమ్మయమహారాజుపేరుగల రెండు శాసనములకును నడుమ 64 సంవత్సరములు వ్యవధియున్నది అనగా పెమ్మయ 64 సంవత్సరములు పాలించెనని సిద్ధించుచున్నది ఇది అసంభవము కాకపోయినను సులభముగా విశ్వసించుటకు వీలులేనిది విప్పర్తి శాసనమిచ్చిన పెమ్మయమహారాజు త్రిపురాంతక శాసనదాతయొక్క తాతయగునేమో! తాతగారి పేరును మనుమనికి పెట్టుట సంప్రదాయముగా నున్నది అల్లాడపెమ్మయదేవమహారాజు మహామండలేశ్వర ఇమ్మడిబసవసంకర జగదగోపాల మొదలగు ఎన్నియో బిరుదములను వహించినవాడు

పల్లవులు వృషభలాంఛనులు వృషభలాంఛనత్వము శాంకరులకే చెందును గదా! కావున పల్లవులు పరమమాహేశ్వరులు అల్లాడ పెమ్మయదేవమహారాజు కూడ మాహేశ్వరుడే అదియును గాక శాసనమునందు కామకోట్యంబికాలబ్ధ వరప్రసాద యని యుండుటను బట్టి వీరు శక్తిని కూడ ఆరాధించెడివారని చెప్పవచ్చును పల్లవులకు కాంచీపురము రాజధానియగుటచే వారు కామకోటిదేవిని ఆరాధించుటయు సహజము కావచ్చును

ఇక విప్పర్తి యను గ్రామము జాడ ఇప్పుడు తెలియరాకున్నది గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకాలో మాత్రము విప్పర్ల అను గ్రామమున్నది అల్లాడపెమ్మయ మహారాజు కర్నూలు జిల్లాలోని త్రిపురాంతక సమీపమునకు చెందిన శ్రీశైలాది సీమలకొన్నింటిని పాలించి యుండవచ్చును

శే గో రా

## అల్లాడ పెమ్మయదేవ మహారాజులు మమండలేశ్వర

చూ అల్లాడ పెమ్మయ మహారాజు

## అలాడ మంత్రి

ఈతడు మడికిసింగన పితామహుడు మడికి సింగన తన జ్ఞానవాశిష్ఠమున అల్లాడమంత్రిని గూర్చి ఈవిధముగా పేర్కొనెను

"అతఁడు తిక్కనసోమయాజుల పౌత్రుఁడై
కొమరారు గుంటూరు కొమ్మ విభుని
పుత్రి చిట్టాంబిక బు లోక కల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసారమగు కోటభూమి గృష్ణానదీ
దక్షిణ తటమున ధన్యలీల
పెలరు రావెల యను నగ్రహారము తన
కేక భోగ్యంబుగా నేలుచుండి
య దు గోవెలఁ గట్టి గోవిందునెన్న
గోపికానాథుని బ్రతిష్ఠ గోరి జేసి
యఖిల విభవములందును వతిశయిల్లె
మనుజ మ దారుఁ డల్లాడమంత్రి విభుఁడు (1 29)

ఈ పద్యము నను రి చి అల్లాడమంత్రి కృష్ణానదీ తీర మున దక్షిణమున కోటభూమి (ధరణికోట ప్రాంతము) య దు రావెల అనే గ్రామమును అగ్రహారముగా పాలించినట్లు తెలియ వచ్చుచున్నది పద్యములో పేర్కొన్న కొమ్మవిభుడు తిక్కన సోమయాజుల పుత్రుడే కాని పౌత్రుడు కాదు తిక్కన గారిపౌత్రుడు హరిహరామాత్యుడని శ్రీ చాగంటిశేషయ్య గారు వ్రాసిరి అందువలన పుత్రుడై అన్నదే సరియైన పాఠము కావలెను

అల్లాడమంత్రి కుమారుడు అయ్యలమంత్రి తొయ్యేటి అనపోతనాయకుని మంత్రిగా నుండినవాడు ఈతడు ముమ్మడికాపయనాయకునకు అష్ట వర్ణములోనివాడు అనపోతనాయకుడు రాజమహేంద్రవరమును క్రీశ 1345 67 దాకా పరిపాలించినవాడు అయ్యలమంత్రి ముమారుడు మడికి సింగనకవి చారిత్రికముగా అల్లాడమంత్రి పదునాల్గవశతాబ్దా రంభమున జీవించినవాడని పేర్కొనవచ్చును

ఈయన కాలములో గుంటూరుజిల్లాలోని రావెల గ్రామములో మన్నవీరు తరువాత గోదావరి జిల్లాలోని మడికి గ్రామమునకు తరలి వెళ్ళినారు ఆతరువాత కొంత కాలమునకు వీరి వ శీయులు మరి కొ తమ ది కరీంనగరం జిల్లాలోని రామగిరి దుర్గానికి తరలి వెళ్ళినారు

అల్లాడమంత్రి రావెల అగ్రహారమును ఏక భోగముగా పరిపాలించుటయే కాక దాన ధర్మములు చేసి కీర్తి ప్రతిష్ఠల నార్జించినవాడు తిక్కనగారి స బంధము పేర్కొనుటచేతను అగ్రహార ప్రభువగుటచేతను - ఈయన స్వయముగా విద్వా ను డగుటయే కాక విద్వద్వంశమునకు చెందినవాడనిచెప్పవచ్చును తన గ్రామములో ఈయన గోపికా వల్లభుడైన శ్రీకృష్ణునకు ఆలయము కట్టించిన పుణ్యమూర్తి మనుజమందారు డని ఈతనిని నాడుప్రజలు ప్రశంసించిరి ఈవిషయములను బట్టి ఈతడు ఎప్ప సంతానములను వెలకొల్పి యున్నవాడని యూహింపవచ్చును

డా కె ను

## అల్లాడరెడ్డి

తీరాంధ్రదేశమును పాలించిన రాజవ శములలో రెడ్డి రాజులు చిరస్మరణీయులు కాకతీయ సామ్రాజ్య మంతరించిన వెనుక హిందూధర్మమును కాపాడిన వీరుప్రథమముగా అద్దంకి తరువాత కొ డవీడు రాజమహేంద్రవరములు రాజధాను లుగా సుమారు 100 సంవత్సరముల కాలము మధ్యాంధ్రమును సుఖితమొనరించిరి వీరిలో ప్రఖ్యాత సేనాని పండితుడైన కాటయవేమారెడ్డికి కుడిభుజముగా నుండినవాడు అల్లాడరెడ్డి వాఙ్మయ శాసనాధారములను బట్టి అల్లాడరెడ్డి వంశవృత్త మీదిగువ పొసగబడినది




## వంశ వృత్తాంతము

### కోట

ఇతడు అల్లాడ రెడ్డి వంశమునకు మూలపురుషుడనియు దువ్వూరు ప్రభువు అనియు కొమ్మిచిక్కాల శాసనము (ఆంధ్రా హిస్టారికల్ రిసర్చి సొసైటీ జర్నల్ III పుటలు 227 231) వలన తెలియుచున్నది ఈ దువ్వూరు నెల్లూరు జిల్లాయందలి కొవ్వూరు తాలూకాలోని గ్రామము దీనికే దుర్వాస క్షేత్రమని పేరున్నట్లు తెలియుచున్నది ఇందు కోటేశ్వరాలయము కలదు వీరి వంశమున కోట నామము పలువురకు కన్పించుట కిదియే కారణమై యుండును దువ్వూరునకు సమీపముననే గండవరము కలదు పెరుమాండి లేక పెరుమాళ్లరెడ్డి ఇతడు కోటారెడ్డి కుమారుడు మృత్యుంజయుని కరుణచే నభివృద్ధి గాంచెను (కాశీ 1 28) ఇతని భార్య అన్నమాంబ వీరికి అల్లయ పెదకోట అన్నప్రోల దొడ్డయ చినకోట అను నైదుగురు కుమారులుద్భవించిరి శ్రీనాథుని కాశీఖండమున యితడే మూలపురుషుడుగా పేర్కొనబడినాడు

### దొడ్డారెడ్డి

పెరుమాళ్లరెడ్డి నాలుగవ కుమారుడైన దొడ్డయకు అన్నమాంబ వలన ముగ్గురు కుమారులు కలిగిరి ఈమెకే "చ(చె)న్నమాంబ" యను పేరున్నట్లు శివలీలావిలాసము (శివ 1 41) అల్లాడ వేమభూపవరము పినవళ్ళతామ్ర శాసనము (భారతి ఫిబ్రవరి 1967) వలన తెలియుచున్నది ప్రోల లేక అన్నప్రోల కోట అల్లాడ భూపతులు వీరి కుమారులు

### అల్లాడరెడ్డి

దొడ్డారెడ్డి కడపటి కుమారుడైన ఇతడు రాజమహేంద్రవర రాజ్య రాజకీయములందు ప్రముఖ స్థానమును వహించెను ఈతని భార్య వేమాంబిక రెడ్డి రాజ్యము తూర్పున సింహాద్రి పర్యంతము వ్యాపించుటకు ఇతడు మూలకారకుడు

ఇతనికి నలుగురు కుమారులు వేమ వీరభద్ర దొడ్డయ అన్నారెడ్లు వీరు తండ్రికి యుద్ధములందు అధిక సహాయ మొనరించిరి

అల్లాడరెడ్డి వంశమువారు కొండవీటిరెడ్డి రాజులకు బంధువులై వారి యాస్థానమందు ఉన్నత పదవుల నాక్రమించియుండిరి ప్రోలయవేమారెడ్డి కాలమున కొన్ని రెడ్డి కుటుంబములు రాజమహేంద్రవరమునకు వలస వచ్చి స్థిర నివాస మేర్పరచుకొనినవి ప్రోలయవేమారెడ్డి మధ్యాంధ్రదేశమును పాలించినట్లు ఎఱ్ఱాప్రెగడ తన హరివంశమున చెప్పియున్నాడు (హరి ఉత్తర 2 1) బహుశా ఆసమయముననే ఈరెడ్డి కుటుంబములు నెల్లూరునుండి రాజమహేంద్రవరమునకు వచ్చి యుండును అందు ప్రముఖమయినవారు కాటయ వేమారెడ్డి పితామహుడయిన కాటారెడ్డి అల్లాడరెడ్డి పితామహుడయిన పెరుమాడిరెడ్డి వీరు తీరాంధ్రమున రెడ్డి ప్రభ నెలకొనుటకు మూలకారకులు వీరు రాజమహేంద్రవరముననే యుండి కొండవీటి రెడ్లకు సామంతులై స్వామి భక్తి పరాయణులై యుండిరి

అనవేమారెడ్డి మరణానంతరము (క్రీ శ 1364 82) అనవోతారెడ్డి కుమారుడైన కుమారగిరి (క్రీ శ 1386 1402) కొండవీటి సింహాసన మధిష్ఠించెను ఈతని చెల్లెలు దొడ్డాంబిక ఈమెను కాటయవేమారెడ్డి వివాహమాడెను కుమారగిరి రాజ్యాభిషిక్తుడైన పిదప కాటయవేము డాతనికి మంత్రియై రాజ్యకార్యములు నెరవుచుండెను కాటయవేమునకు సైన్యాధ్యక్షుడును కుడిభుజమువంటివాడు దొడ్డారెడ్డి కుమారుడయిన అల్లాడరెడ్డి

ఎ హోద్రి పర్యంతము వ్యాపించిన రెడ్డి రాజ్యము క్రీ శ 1390నాటికి రాజమహేంద్రవరము రాజధానిగ స్థిరపడినది దీనికి కుమారగిరిరెడ్డి కుమారుడయిన రెండవ అనవోతుడు రాజ్య ప్రతినిధిగా నియమింపబడెను కాని ఈతడు స్వల్ప కాలముననే మరణించెను కుమారుని మరణానంతరము కుమారగిరి తన బావమరదియైన కాటయవేముని రాజమహేంద్రవరమునకు రాజ్యాధికారిగ నియమించెను క్రీ శ 1395 నాటికే ఈప్రదేశము కాటయవేముని యధీనమునందున్నట్లాతని గోపవరదాన శాసనమువలన ఆం హి రీ సొ జ వ XI పుట 211 ) తెలియుచున్నది కాటయవేముని [illegible]డు బంధువు అయిన అల్లాడరెడ్డి రాజమహేంద్రవరమున కాటయవేముడు లేనప్పుడు రాజకీయ వ్యవహారములను చూచుచుండెడివాడు

అల్లాడరెడ్డి అనవేమ మహీపాలుని పౌత్రిని వివాహమాడినట్లు కాశీఖండ పీఠికయందున్నవి "అనవేమ క్షితిపాలు పౌత్రియగు వేమాంబా మహాదేవి న్ ఘను డయ్యల్లడ భూమి పాలునకు (కాశీ 1 31) అని యుండగా అల్లయదొడ్డని కొంకుదురు శాసనమునం దీమె భక్తిరాజచోడుని కుమారుడు భీమదేవచోడుని కుమార్తె యని యున్నది

"శచీవ శత్రిస్య శివేవ శంభోః పద్మేవ పా పద్మవిలో
చనస్య వేమాంబికా చోడకులేందు భీమ భూపాత్మ
జా భూ న్మహితాస్య జాయా (అల్లయదొడ్డని కొం
కుదురు తామ్రశాసనము ఎపి ఇం V పుట 53 శ్లో 9 )

శివలీలావిలాసమునందును యీామె చోళ భక్త క్షితీశ్వరుని కుమారుడ భీమలింగని కుమార్తె అనియే యున్నది (శివ 1 45)

అల్లయవేముని ఎనపళ్ళ గ్రామ తామ్రశాసనమునందును ఈమె చోడవంశోద్భవుడైన భీమలింగరాజుని పుత్రి అనియే యున్నది

శ్లో చోడేశ వంశోదిత భీమలింగ నృపాల పుత్రీ చరితైః పవిత్రా వేమాంబికా సత్కులజా ప్రియా సీ దల్లాడ భూపస్య గుణార్ణవస్య (అల్లాడవేమ భూపవరము - వినపళ్ళ తామ్రశాసనము భారతి ఫిబ్రవరి 1967 పుట 28

దీనిని బట్టి భీమదేవచోడుడు అనవేమభూపాలుని కుమార్తెను వివాహమాడినట్లును ఆమె యందీ వేమాంబిక జన్మించినట్లును తెలియుచున్నది ఈఅనవేమ భూపాలుని కుమార్తె పేరెందును పేర్కొనబడలేదు

కుమారగిరి మరణానంతరము కొండవీటి సింహాసనమును అతని దాయాదియైన పెదకోమటి వేమారెడ్డి ఆక్రమించుకొనెను ఈఆక్రమణ సహించలేని కాటయవేముడు ఎదురుతిరిగి కుమారగిరి మరణపర్యంతము సామంతుడుగా నున్నవాడు స్వతంత్రుడయ్యెను అనాటినుండియు రాజమహేంద్రవర రాజ్యము స్వతంత్ర రాజ్యమయినది

కాటయవేమారెడ్డి పెదకోమటి వేమారెడ్డితో యుద్ధమునందు మునిగియున్న సమయమున భక్తిరాజచోడుని కుమారుడు అన్నదేవచోడుడు రాజమహేంద్రవరముపై దండెత్తి దానిని ఆక్రమించుకొన్నట్లాతని ద్రాక్షారామ శాసనము వలన తెలియుచున్నది ఇది క్రీ శ 1404వ సంవత్సరమునకు

చెందినది (ద హిం IV నెం 1347 1349) కాని యీ విజయ మెక్కువ కాలము నిలువకుండ కాటయవేముడు దీనిని తిగిన సాధించిన ట్లతని మధిరపూడి (మెకంజిమేన్యుస్క్రిప్ట్సు నెం 15 4 4 లోకల్ రికార్డ్సు II పుట 212) సర్పవరము తొట్టెకు అచ్యుతాపుర శాసనమువలన తెలియుచున్నది పై శాసనములు క్రీ శ 1405 1406 ప్రాంతమునకు చెందినవి అన్నదేవచోడుడు పెదకోమటి వేమారెడ్డితో చేతులు కలిపి గోదావరి పశ్చిమమున నున్న భాగమునంతను ఆక్రమించుకొనెను దీని వలన కాటయవేమ -అన్నదేవచోడుల మధ్య యుద్ధములు తరచు జరుగుచు వచ్చెను ఈయుద్ధములలో ఒక దానియందు కాటయవేముడు మరణించెను

కాటయవేముని మరణానంతరము అన్నదేవచోడుని రాజమహేంద్రవర రాజ్యాక్రమణ కాంక్షకు అల్లాడరెడ్డి అడ్డు తగిలెను కాటయవేముని మరణానంతరమాతని కుమారుడు రెండవ కుమారగిరి పిన వయస్సు వాడగుటచే అతని పట్టాభిషిక్తుని చేసి అతని పక్షమున అల్లాడరెడ్డి తానే రాజ్యము నేల సాగెను కాని స్వల్పకాలముననే కుమారగిరి మరణించెను ఈసమయమున అల్లకల్లోలమయిన పరిస్థితిని అల్లాడరెడ్డి ఎట్లు ఎదుర్కొనెనో అనితల్లి కలువచేరు శాసనమున (ఆం ప ప ప్రిమాది చైత్రము పుటలు 93 112) వివరముగా వర్ణింపబడినది అన్నదేవచోడు డీసమయముననే తూర్పు వైపు కొంత భాగము ఆక్రమించుకొనెను ఈఆక్రమణయందు స్వామిద్రోహపరాయణులైన కొందరు కాటయవేముని భృత్యులు సహాయ మొనరించిరి దీనిని గురించి అనితల్లి శాసనమున యిట్లున్నది

స్వామిద్రోహపరాయణకు నృపతి జలరాశిజలనిమగ్న
ధరాం

దొడ్డయ యల్లనరేంద్రో హరిరివ బాహుశక్త్యా
సముద్ధృతవాన్

(అనితల్లి కలువచేరు శాసనము శ్లో 45)

జలరాశియందు నిమగ్నమైన ధరను విష్ణుమూర్తివలె స్వామిద్రోహపరాయణులైన కున్నపతులనుండి దొడ్డయ అల్లనరేంద్రుడీరాజ్యము నుద్ధరించెనని దీని భావము అల్లాడరెడ్డి అన్నదేవచోడులకు జరిగిన యుద్ధములలో నొక దానియందు అన్నదేవచోడుడు మరణించెను మనకు లభించు అన్నదేవచోడుని చివరి శాసనము క్రీ శ 1414కు చెందిన పాలకొల్లు శాసనము (ద హిం V నెం 145) దీనిని బట్టి అతడప్పటికి బ్రతికి యున్నట్లు తెలియుచున్నది క్రీ శ 1416కు చెందిన పలివెల శాసనమందు (ద హిం V నె 113) అల్లాడరెడ్డి కాటయవేముని ద్రోహి కులమునంతను పరిమార్చి వారసురాలయిన అనితల్లిని సింహాసనాధిష్ఠితురాలిని గావించినట్లు తెలియుచున్నది ఇతని సైన్యాధిపతి అయిన నరహరినేని పాలకొల్లు శాసనమందు (ద హిం V నె 138) అల్లాడరెడ్డిని గూర్చి "శ్రీమద్దొడ్డ యాల్ల భూతలపతేః రాజ్య ప్రతిష్ఠాపకో" అని చెప్పబడినది దీనిని బట్టి క్రీ శ 1414 1416 మధ్య అన్నదేవచోడుడు మరణించి యుండును అన్నదేవచోడుని మరణానంతర మాతని కుమారుడు వీరభద్రుడు అల్లాడరెడ్డి నెదిర్చెను కాని అది ఫలవంతము కాలేదు

అన్నదేవచోడుని మరణానంతరము అల్లాడరెడ్డి ఎదుర్కొనవలసి వచ్చిన మరియొక బలవంతుడయిన శత్రువు పెదకోమటి వేమారెడ్డి ఈపరిస్థితులయందే గజపతిరాజు కర్ణాటరాజు రాజమహేంద్రవరమువరకు వచ్చినట్లు వేమారెడ్డి వేమవరము శాసనము (ఎ పి ఇం XIII పుట 287) వలన తెలియుచున్నది ఇందు గజపతినోడించి విజయనగరరాజుతో అల్లాడరెడ్డి స్నేహము చేసుకొనినట్లు తెలియుచున్నది ఈగజపతి తూర్పు గాంగరాజైన నాలుగవ భానుదేవుడు ఈతడల్లాడరెడ్డి చేతిలో ఓడి స్నేహము చేసుకొనెను మూడవ అనవోతుని కొమ్ముచిక్కాల శాసనమున అల్లాడరెడ్డి తూగాగరాజులపై విజయమును సాధించినట్లు చెప్పబడినది బహుశా ఆ తూర్పు గాంగరాజు భానుదేవుడే కావచ్చును

ఈవిధముగా అల్లాడరెడ్డి గజపతులతోను విజయనగర రాజులతోను గావించుకున్న స్నేహము అతడు పెదకోమటి వేమారెడ్డి నెదుర్కొనుటకు మరింత శక్తి నిచ్చినది ఆనాటి తెలుగు సాహిత్యముగూడ నీవిషయమును సమర్థించుచున్నది

అన్నదేవచోడుని మరణానంతరము పెదకోమటివేమారెడ్డి అల్లాడరెడ్డి అతని కుమారుల శక్తి సామర్థ్యముల నెరిగినవాడగుటచే బహమనీ సుల్తాను ఫిరోజ్‌షా సహాయ మర్థించెను సహాయార్థమై యతడు తన మంత్రియైన మామిడి సింగనను సుల్తాను ఆస్థానమున కంపగా సుల్తాను సహాయ మొనర్చుట కంగీకరించి తన సేనానాయకుడయిన నిజాముల్ ముల్కు నాయకత్వమున తెలిగాణాకు పెద్ద సైన్యమంపెను క్రీ శ 1417 కు చెందిన వాడపల్లి శాసనము

(ఎపిగ్రాఫికల్ కలెక్షన్సు 1924 నెం 306 307) అనాటికి ముస్లింల దాడి ప్రారంభమయినట్లు స్పష్టముగా చెప్పుచున్నది

ఈముట్టడి విఫల మయినట్లును సుల్తాను సేనలు రాజ మహేంద్రవరము ను ముట్టడి చకయే వెనుకకు మరలినట్లును ముస్లిం చరిత్రకారులైన అజీజుల్లాతబాతబా వ్రాతల వలన తెలియుచున్నది ఈముట్టడి విఫలమగుటకు ప్రధాన కారణ ములు రెండు అల్లాడరెడ్డికి సహాయముగా చనుదెంచిన మొదటి దేవరాయలు రేచర్లకొండవీటిరాజుల నెదిరించెను గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాయందలి దేవరాయల శాసనమును బట్టి ఇతడు కొండవీటి రాజ్యముగుండా ప్రయా ణించినట్లు తెలియుచున్నది రెండవ కారణము ముస్లిం-సేనలు అల్లాడరెడ్డి చేతిలో నెదుర్కొన్న ఘోర పరాజయము కొమ్మచిక్కాల శాసనముకూడ అల్లాడరెడ్డి యవనులపై విజయమును సాధించెనను విషయమును మర్థించుచున్నది

బహుమనీ సైన్యములు ఓడింప బడిన పిదప పెదకోమటి వేమారెడ్డి రామేశ్వరమువద్ద అల్లాడరెడ్డి చేతిలో ఓడిపోయి నట్లు వేమవర శాసన మందున్నది దీనియందు పెదకోమటి వేముడు అల్లాడరెడ్డి చేతిలో ఒకటి కంటే ఎక్కువ మారులు ఓడిపోయినట్లు చెప్పబడినది నిశ్శంకకొమ్మన శివలీలావిలాస మున అల్లాడరెడ్డి పెదకోమటివేమారెడ్డిని తరిమి సంపదలు గొనినట్లు వర్ణి పబడినది

"పెదకోమటి వేమ పృథివీశు వెనునూచి యతని సంపద లెల్ల నపహరించె" (శివ 1 42)

వేమవర శాసనమందు అల్లాడరెడ్డి అల్ఫాఖానును జయించినట్లు చెప్పబడినది కాశీఖండ శివలీలావిలాసములం దితడు ధారానగర సుల్తానుపై విజయమును సాధించినట్లు పేర్కొనబడినది ఈశత్రువు లిరువురును ఒకరే దిలావరుఖాను కుమారుడయిన అల్ఫాఖాను తండ్రి తరువాత సుల్తానుహూ షంగ్ బిరుదును ధరించి క్రి శ 1405లో మాల్వా ని హాసన మధిష్ఠించెను దీని రాజధాని ధార్ లేక ధారానగరము ఈ యుద్ధము బహుశా శక సం॥ 1341 (క్రి శ 1419)కి ముందే జరిగియు డును ఎందులకనగా అల్లాడరెడ్డి యుద్ధము ల గురించి తెలియజేయు చివరి పాలకొల్లు శాసన మీకాలమునకు చెందినదే

పాలకొల్లు శాసనమందు (ద హిం V నెం 185) అల్లాడరెడ్డి సేనాధిపతియైన వారభూపాలుడు (నరహరినేడు) ఫ్రిబవరి 1420 నందు తన ప్రభువైన అల్లాడరెడ్డి పేర ఈశ్వర లింగము ను ప్రతిష్ఠించి ట్లు చెప్పబడినది మధ్య యుగమందు జబ్బుపడ్డవారి పేరున ఈశ్వరలింగములు ప్రతిష్ఠించు నాచా రము కలదు ఈయాశ్వం లింగ ప్రతిష్ఠయు క్రి శ 1419 తరువాత అల్లాడరెడ్డిని గురించిన శాసనములు లభి పక పోవు టయు అవరిసరప్రాంతమందు అల్లాడరెడ్డి స్వర్గస్థుడయి యుం డుటను విషయమును సమర్థించుచున్నవి

అల్లాడరెడ్డి గొప్ప రాజనీతి చతురుడు స్వామి భక్తి పరాయణుడు ఇతని జీవిత కాలమంతయు యుద్ధముల తోనే పరిపోయినది ఈతని కీయుద్ధములందు కుమారులయిన వేమ వీరభద్ర దొడ్డ అన్నారెడ్లును మంత్రియైన అరియేటి లింగ మంత్రియు సేనాపతియైన పిన్నమనేని కుమారుడు నరహరి నేడు మొదలయినవారును అత్యంత సహాయ మొనర్చిరి

అల్లాడరెడ్డి సహాయకులలో అరియేటిలింగమంత్రి ప్రముఖుడు ఇతడు శ్రీనాథుని భీమేశ్వర పురాణమునకు కృతి కర్తయైన బెండపూడి అన్నమంత్రికి పూర్వుడు భీమఖండములో అరియేటి లింగమంత్రిని గూర్చి ఇట్లు చెప్పబడినది "లింగన మంత్రి ఝూదేశవన సప్తమాడియ కారహదొంతి వంతు నాడు మున్నగు ప్రదేశముల రాజులను గెల్చెను ఒడ్డాది ప్రభువును మత్స్య వంశీయుడును అగు ఉదయార్జునరాజు నోడించి వానినుండి కప్పము గొనెను దండకారణ్యము దలి రంభనాగ వంశీయులైన పుళింద రాజులకు అభయ మిచ్చెను సూర్యవంశ క్షత్రియులైన అన్నదేవ చోడవీరభద్రుల గర్వ మణచెను యవన కర్ణాటక కటక (గజపతులు) రాజులతో మైత్రి కావించి తన ఏలికయైన అల్లాడరెడ్డిచే తెలుగు దేశమును విజయవంతముగ యేలించెను అని కలదు (భీ 1 63) లింగనమంత్రికి ఆరోపింపబడిన విజయ పరంపర అల్లాడ రెడ్డి విజయములుగానే భావింపవలెను అల్లాడరెడ్డి కుమారులు వేమ వీరభద్ర దొడ్డయరెడ్లు కూడ ఈవిజయములందు భాగ స్వాములే ఈ ప్రదేశములను శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ గారు తమరెడ్డిరాజ్యచరిత్రలో గుర్తించి యున్నారు

ఝూదేశ వన మనగా ఇప్పటి బొబ్బిలి పార్వతీపురము తాలూకాలకు చెందిన భూభాగము ఈప్రాంతమును శిలా వంశీయులు పరిపాలించుచుండిరి అల్లాడరెడ్డి ప్రభృతులు ఈ శిలావంశపు రాజులను జయించిరి సప్తమాడియము లనగా గంజాం జిల్లా పశ్చిమ భాగమందలి పర్వతారణ్య ప్రదేశము

ఇది అట — య క్తి నిలయము. ఖారవాదొంతి అనగా ఒరిస్సా పశ్చిమ ప్రాంతము గలిసి న్నెండు సామంత రాజ్యముల గుపు వ తనాడు లేక జంతుర్నాడు ఇప్పటి విశాఖపట్నం జిల్లా శృంగారపు కోట తాలూకా ప్రాంతము ఇచ్చట మరళి వంశపు రాజులు పరిపాలించిరి. ఒడ్డాది మత్స్య వంశీయులు విశాఖపట్నం జిల్లా వీరవల్లి తాలూకా భాగము నేలుచుండిరి. రంభ యనగా నేటి తూర్పు గోదావరి జిల్లా మన్య ప్రాంతమయిన చోడవరము డివిజనులోను రంప యని ఎలువబడు గ్రామము. దీనిని నాగవంశీయులైన సామంతరాజులు ఏలిరి. అరివేటి లింగమంత్రి వీరి కథయ మిచ్చెను. మొత్తము మీద అల్లాడ రెడ్డియు అతని తనయులును మంత్రులును తమ విజయధాటిని వింధ్యపర్వత పాదముల వరకును సాగించి రాజమహేంద్రవరముయొక్క ప్రాభవమును కొంత కాలము నిలువ బెట్ట కలిగిరి.

కాటయవేముని మరణానంతరము కుమారగిరి మరణానంతరము అల్లాడ రెడ్డి సింహాసన మాక్రమించిరాజ్యపాలన మొనర్చినట్లు ఆనాటి సాహిత్యమందున్నను శాసనములు దీనిని సమర్థించుట లేదు. శాసనములం దీతడు కాటయ వేముని వారసులను సింహాసన మధిష్ఠింప జేసి రాజ్యపాలన వ్యవహారములను వారి పక్షమున తాను నిర్వహించుచుండెడి వాడని చెప్పబడినది. ఇతని కుమారులు భృత్యులు వేయించిన శాసనములే గాని ఇతడు స్వయముగ వేయించిన శాసనములు కానరాలేదు. ఈతని భృత్యుల శాసనములను బట్టి ఈతని వద్ద ఇరువురు కవులున్నట్లు తెలియుచున్నది. వారిలో ధూర్జటి గోపాలకవి పలివెల శాసనమునకును (ద హి V నెం 118) అక్కసార్యాన్నమాంబల కుమారుడయిన నాగనాఖ్యుడు పాలకొల్లు శాసనమునకును (ద హిం V నెం 135 కర్తలు.

ఇతడు మత్స్యవంశార్జునుని జయించినట్లు ఒడ్డాదికోటను జయించినట్లును కాశీఖండ భీమఖండ శివలీలావిలాసములందు వర్ణింపబడినది (కాశీ 1 29 శివ 1 42) గౌడాధిపతిని గెల్చి "గజపతిదళవిభాళన" (శివ 1 42) బిరుదు నందెను. తనరాజనీతి నిపుణతచే యవన కర్ణాట కటక భూధవులతో చెలిమి పాటించెను. బెండపూడి అన్నమంత్రి సహాయమున గుల్బర్గా సుల్తాను అహమ్మదుషాబహమనీతో స్నేహము చేసుకొనెను. తనవంశమందే రాజ్యపాలన యుండవలెనను ప్రజల కాంక్షచే తన జీవితమంతయు యుద్ధములతోనే గడిపి మరణించు నాటికి సుస్థిరమై సుభిక్షమై న పదల కాలవాలమైన రాజమహేంద్రవర రాజ్యమును వారసుల కప్పగించెను.

మా దీ

## అలాడరెడ్డి దొడ్డవరము

అల్లాడరెడ్డి మూడవ కుమారుడు దొడ్డారెడ్డి. ఈత డుత్తర దిగ్విజయము సాగించి ఒడ్డాది శృంగారంకోట లోతుగెడ్డలను జయించెను. ఇతడు నిపుణుడైన గొప్ప అశ్వికుడు. ఇతనికి కర్పూరవసంతరాయడు సంగ్రామభీముడు జగనొబ్బగండడు అను బిరుదులు కలవు. నిశ్శంకకొమ్మనకవి వలన శివలీలావిలాసమను కృతి పొందినవా డితడే.

ఈతడు అర్ధోదయ పుణ్య కాలమున గంగాతీరమున శివు నర్చించి భూరి దక్షిణ లొసగెను. ఆసమయమందే గుంపిణి యను గ్రామమును తన పేర అల్లాడరెడ్డి దొడ్డవరముగా మార్చి వివిధ గోత్రములకు చెందిన వివిధ వేదములందు నిష్ణాతులైన యేబదితొమ్మండుగురు బ్రాహ్మణులకు సాధారణ సం॥ పుష్య మాసమున అర్ధోదయ కాలమున శ క స ॥ 1352 నందు దాన మిచ్చెను. ఇది 14 జనవరి ఆదివారము క్రీ శ 1431కి సరిపోవుచున్నది. ఈ యంశములు దొడ్డారెడ్డి కొ కుదురు తామ్ర పట్టికల వలన తెలియుచున్నవి (ఎ పి ఇం V పుట 53)

ఈ అగ్రహారమందే ప్రసన్నవల్లభ విష్ణ్వాలయము కుమ బ్రహ్మనాగేశ్వర శివాలయమునకును గూడ భాగ మివ్వబడినది. గ్రామగ్రాసార్థమై ఈఅగ్రహారమునకు దొడ్డడు బొభకామాత్యుని కుమారుడు నారనమంత్రికి చెందిన భాగమును మినహాయించి అన్నవర గ్రామము నొసగెను.

ఈఅల్లాడరెడ్డి దొడ్డవరమునకు ఎల్లలుగా దేవరపల్లి పలివెల ముమ్మిడివరము ఈతకోట అన్నవపాడు కేతరాజపల్లి వెదురేశ్వరము ఉత్తరమున కాశేయ నది చెప్పబడినవి. గుంపిణి గ్రామము నేడు గుర్తింపబడలేదు. కాని దీని ఎల్లలుగా పేర్కొనబడిన కొన్ని గ్రామములు అమలాపురం తాలూకా యందు కలవు. అవి దేవరపల్లి భలవెల నేటి పలివెల ముమ్మిడివరము నేటి ముమ్మిడివరపాడు ఈన్థకోట నేటి ఈతకోట కేతరాజుపల్లి వెదురేశ్వరం నేటి వెదిరేశ్వర గ్రామములు. ఈ గ్రామమునకు ఉత్తరమున పేర్కొనబడిన కాంతేయనది బహుశః గౌతమీ నది గాని దాని దక్షిణ పాయ గాని

కావచ్చును వీలన పలివెల కీశాన్యముగా ఈనది ప్రవహించు చున్నది అగ్రహారమునందు వృత్తులు పొందిన బ్రాహ్మణోత్తముల పేర్లన్నియు కొన్ని ఇంటి పేరుతోను గోత్రముతోను వారు అధ్యయనము చేసిన వేదశాఖలోను లిఖింపబడుట ఈశాసనమునందలి ప్రత్యేకత వీరిలో 38 మంది కృష్ణ యజుర్వేదమును 7 గురు ఋగ్వేదమును 4 గురుశుక్ల యజుర్వేదమును ఒక్కరు మాత్రము సామవేదమును అధ్యయనము చేసినట్లు శాసన బద్ధమై యున్నది ఇప్పుడు మనకు పరిచితమగు ఇంటిపేర్లు—పన్నాల కజ్జా ఇగువ గుడిమెట్ల సరస్వతి (తుల) గుంటూరి వెల్దేవి అకునూరి బొదలపాటి మల్లెల వల్లూరు —మొదలగునవి ఆనాడును ఉండెను వీరిలో భారద్వాజ గోత్రులు 8 కాండిన్య 11 కాశ్యప 7 ఆత్రేయ 4 గౌతమ 8 హారిత 7 శ్రీవత్స 8 వాసిష్ఠ శౌనక యాస్క గోత్రకులును కలరు

మా రి

## అల్లాడి కృష్ణస్వామి

శ్రీ అల్లాడ కృష్ణస్వామి నెల్లూరు జిల్లాయందలి పుదూరు గ్రామములో జన్మించినారు వేదబ్రాహ్మణులైన ఏకామ్రశాస్త్రియను అతని తండ్రి వేద సాహిత్యమును క్షుణ్ణముగ అధ్యయన మొనరించినవాడు మద్రాసు రాష్ట్రమందలి తంజావూరు జిల్లాలోని కొన్ని ప్రాంతములనుండి సుమారు నాలుగైదు వందల సంవత్సరముల క్రిందట పుదూరు గ్రామమునకు వలస వెళ్ళిన వేద పండిత బృందమునకు ఈపుదూరు గ్రామమును ఆనాటి వెంకటగిరి రాజా శ్రోత్రియము ఈనాముగా దానము చేసెను క్రొత్త గ్రామమని అర్థము నిచ్చు పుదూరు శబ్దము తమిళ భాషా జన్యము ఇట్లు వలస వచ్చిన వేదపండితులు పుదూరు ద్రావిడు లనబడుచు వచ్చిరి ఈవిధముగ పిలువబడుటకు కారణము వారు దక్షిణావికి చెందిన మండలములనుండి వలస వెళ్ళుటయే అనంతరము ఈబ్రాహ్మణులు తత్సమీప మందలి ప్రాంతములకు విస్తరిల్లి ప్రధానముగా నెల్లూరు జిల్లాయందలి నెల్లూరు కావలి మున్నగు గ్రామములలోను చిత్తూరు జిల్లాయందలి కాళహస్తి తిరుపతి మొదలైన ప్రదేశములలోను స్థిర నివాసములను ఏర్పరచుకొనిరి

కాలక్రమేణ ఈపుదూరు ద్రావిడులు వారు స్థిరపడిన తెలుగు ప్రాంతపు ప్రజలలో లీనమై వారి ఆచార వ్యవహారములను అనుసరించజొచ్చిరి ఇండ్లయందు వారు పూర్వమువలె తమిళమునే మాట్లాడుచున్నను పాఠశాలల యందును కళాశాలలయందును తెలుగునే వాడుక భాషగా అనుసరించుచు వచ్చిరి ఈనాడు వారు మాటాడు తమిళములో పెక్కు తెలుగు శబ్దములు మిళితములై యున్నవి ఇంటియొద్ద కూడ తెలుగు మాటాడు పుదూరు ద్రావిడులు ఈనాడు అనేకులు కలరు చదువుటకు వ్రాయుటకు సంబంధించునంతవరకు ఇంచుమించు ప్రతి పుదూరు ద్రావిడవ్యక్తియు తెలుగు భాషలోనే వ్యవహరించుచున్నాడు తత్కారణముగా ఈనాడు వారిలో పెక్కురు తెలుగు సంస్కృత భాషలలో నిష్ణాతులైన పండితులుగా పరిణమించినారు ఈపుదూరు ద్రావిడవంగడము నుండి మహామహులైన శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి మహాదేవశాస్త్రి శేషగిరిశాస్త్రి వంటి పెక్కురు పండిత ప్రకాండులు ఉద్భవించుటలో ఆశ్చర్యములేదు ఆంధ్రదేశములో నేడు

చిత్రము—32



అల్లాడి కృష్ణస్వామి

అత్యంత గౌరవపాత్రులై వారిలో ఒకరైన శ్రీమామిడిపూడి వేంకటరంగయ్యగారు ఈపుదూరు ద్రావిడ వంశీయులే

అల్లాడి కృష్ణస్వామి తండ్రి యగు ఏకామ్రశాస్త్రి పురోహిత వృత్తిని చేపట్టుటకిచ్చగించక పడయ్యెను వేదాధ్యయనము కాని పురోహిత వృత్తి నీచస్థాయికి చెందినదని భావించిన వేదపండితులు దానిని చిన్నచూపుతో చూచెడివారు ఫలితముగా ఏకామ్రశాస్త్రి దుర్భర దారిద్ర్యముతో దైన్య స్థితి యందుండెడివాడు ఆయన నెలసరి సంపాదనము ఎన్నడును రెండు రూపాయలకు మించెడిదికాదు పిత్రార్జితమైన ఆయన ఆస్తి ఒక ఎకరము భూమి మాత్రమే ముగ్గురు సోదరులలో కృష్ణస్వామి కడపటివాడు కృష్ణస్వామి తల్లిదండ్రులు తమ బిడ్డలకు చదువు చెప్పించుట శక్తి లేమిచే 1891 వ సం॥ ప్రాంతమున మద్రాసునకు తరలిపోయిరి ఆనాటికి కృష్ణస్వామి వయస్సు ఎనిమిది సంవత్సరములు కొలది సంవత్సరముల ఎదప కృష్ణస్వామి తండ్రిగతించగా ఆయన తన అగ్ర సోదరుడైన సీతారామయ్య పోషణము క్రిందికి రావలసి వచ్చెను తన కుటుంబాదాయముతో సీతారామయ్య సోదరులకు చదువు చెప్పింప జాలక పోయెను తన చదువు యొక్క పురోగతియు అంతంత మాత్రముగనే యుండుటచేత తన చదువుకు స్వస్తి చెప్పి ఇద్దరు సోదరులకు మాత్రమే విద్య చెప్పించుటకు సీతారామయ్య నిశ్చయించెను

బాల్యదశయందు హితము కృష్ణస్వామికి విద్యాసనము పాఠ్య మునందు అభివృద్ధి చిహ్నములు స్ఫుటముగా గోచరించెను యవ్వన దశలో సుబ్రహ్మణ్య దేవర అను సత్పురుషుడు కృష్ణస్వామికి విశేషముగా సహాయపడినాడు ఆతడొసగిన సహాయమునకు కృష్ణస్వామి ఎల్లప్పుడును కృతజ్ఞత ప్రకటించు చుండెడివాడు కృష్ణస్వామి మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో విద్యనభ్యసించి అందుండియే 1903 వ సం॥ లో చరిత్రతో పట్టభద్రుడైనాడు ఆయనకు విశ్వవిద్యాలయములో ప్రథమ శ్రేణియందు ద్వితీయ స్థానము లభించెను ఎమ్మెట కళాశాలయందే ఆతడు ట్యూటర్ పదవిని అంగీకరించినాడు ట్యూటర్ పదవిని నిర్వహించుచునే ఆయన 1905లో న్యాయశాస్త్రములో పట్టమును గైకొనినాడు అనంతరము ట్యూటర్ ఉద్యోగమునకు రాజీనామా నొసగి పి ఆర్ సుందరయ్యరు అను ప్రముఖ న్యాయవాది యొద్ద అప్రెంటిస్ గా ప్రవేశించినాడు 1907 లో ఆయన న్యాయవాద వృత్తిని చేపట్టి తదాదిక్రమముగా అత్యంత ప్రతిభావంతులైన న్యాయవాదులలో ఒకడుగా ప్రఖ్యాతి గడించినారు ఆదినములలో మద్రాసు నందలి న్యాయవాద శ్రేష్ఠులైన సర్ వి భాష్యంఅయ్యంగారు ఎస్ కె శ్రీనివాసఅయ్యంగారు శ్రీ వి కృష్ణస్వామిఅయ్యరు ప్రభృతులు తమిళనాడుకు చెందినవారే కావేరి నదీ జలములను గ్రోలినవే గాని ఎవరైనను న్యాయవాద వృత్తియందు రాణింపజాలరని అభిప్రాయమావాడు మేధావులలో ప్రబలి యుండెడిదని కృష్ణస్వామి వ్యాఖ్యానించుచుండెడివాడు అట్టి వాతావరణములో కృష్ణస్వామి ఆవృత్తియందు ప్రవేశించినాడు ఒకటి రెండు సంవత్సరముల స్వల్పకాలములోనే శక్తి సామర్థ్యములుగల ప్రముఖ న్యాయవాదిగా ఆయన పేరు ప్రఖ్యాతులు గడించినాడు కృష్ణస్వామి అసాధారణ శక్త్యుత్సాహములను మేధాసంపత్తిని చూచి చకితులైన సీనియరు న్యాయవాదులెల్లరు ఆయనను తమ జూనియరుగా నియమించుకొని ఆయన సేవాభాగ్యమును బడయుటకు ఆతురత చెందుచుండిరి తన వద్ద జూనియరుగా కృష్ణస్వామి చేరిన స్వల్పకాలమునకే 1911లో సుందరయ్యరు హైకోర్టు న్యాయాధిపతి పదవి నధిష్ఠించెను కృష్ణస్వామి వి కృష్ణస్వామిఅయ్యరు కె శ్రీనివాసఅయ్యంగార్ల వంటి సీనియర్ న్యాయవాదుల వద్ద జూనియరుగా ప్రవేశించి కృషి సల్పెను అయితే జూనియరు అడ్వకేటుగా ఆయన వ్యవహరించిన కాలము అతిస్వల్పము పదెనిమిది సంవత్సరములలోనే ఆయనకు పుష్కలముగా కేసులు లభింపసాగినవి 1920 లో తన 37 సంవత్సరముల ప్రాయముననే కృష్ణస్వామి మద్రాసు న్యాయవాదులలో పేరెన్నికగన్న కొలది మందిలో ఒకడుగా పరిణతి గాంచెను పూర్వపు సంయుక్త మద్రాసు రాజధాని యందు ఉత్తరమున విజయనగరము నుండి దక్షిణమున కన్యాకుమారి అగ్రమువరకు గల దాదాపు అందరు జమీందారులకు ఆయన అత్యంత సమర్థుడైన న్యాయవాద సలహాదారుగా వ్యవహరించినాడు 1928 డిసెంబరులో కృష్ణస్వామి అడ్వకేటు జనరలుగా నియమితుడైనాడు 1931 లో ఆయన ఆంధ్రవిశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసము గావించినాడు 1930 1931 వ సం॥ లలో ఇండియన్ సేల్ ఆఫ్ గుడ్స్ ఆక్టు ఇండియన్ పార్ట్నర్‌షిప్ ఆక్టు లను రచించుటకు నియమింపబడిన నిపుణుల సంఘము లో ఆయన సభ్యుడుగా స్వీకరింపబడినాడు ఈ రెండు

చట్టములు అత్యంత ప్రతిభావ్యుత్పత్తులతో రచింపబడినవిగా ఉగ్గడింపబడినవి ఈవిధమున ఆయన ఆచరించిన సేవాఫలిత ముగా 1930 లో దివాన్‌బహదూర్ బిరుదమును 1932 లో నైట్‌హుడ్ (సర్) బిరుదమును ప్రభుత్వముచే ప్రసాదించ బడినవి నూతన భారత రాజ్యాంగచట్టము ఇట్టి బిరుద స్వీకారమును గుర్తింపక పోవుటచే వాటిని కృష్ణస్వామి ఆరాజ్యాంగ చట్టము అమలునకు వచ్చు తరుణమున పరిత్య జించినాడు

అడ్వకేట్ జనరల్ పదవీ బాధ్యతను పదునైదు సంవత్స రములకు పైగా కృష్ణస్వామి అత్యంత సామర్థ్యముతో నిర్వ హించినాడు వివిధ సమస్యలపై ప్రభుత్వవైఖరి ఎట్లుండినను దానితో నిమిత్తము లేకయే కేవలము ఆయాసమస్యలకు సంబంధించు న్యాయశాస్త్రముపై ఆధారపడి మాత్రమే ఆయన ప్రభుత్వమునకు సలహా నొసగెడివాడు శ్రీచక్రవర్తి రాజగోపాలాచారి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగానున్న తరుణములో దేవాలయ ప్రవేశ చట్టము మద్యనిషేధ చట్టము వ్యవసాయదారుల సహాయక చట్టము మున్నగు ప్రముఖవిషయములలో ఆయన విశేషముగా కృష్ణస్వామి సలహాపై ఆధార పడుచుండెడివాడు

న్యాయ స్థానములలో న్యాయధర్మము లపేక్షించు వ్యక్తులు సంస్థలేకాక వివిధ రాష్ట్రప్రభుత్వములు కూడ భారతదేశము నలుమూలలనుండి కృష్ణస్వామి సహాయమును అర్థించెడివారు ఫెడరల్‌కోర్టు సుప్రీంకోర్టులలో పెక్కు ముఖ్యమైన కేసులయందు ఆయన వాదించెడివాడు కృష్ణ స్వామి 60 వ జన్మదినోత్సవ సందర్భమున భారతదేశపు ప్రధాన న్యాయమూర్తియైన సర్ మారిస్‌గ్వైయర్ సందే శము పంపుచు పలికిన పలుకులివి "నిశితమైన తర్కశుద్ధి ప్రగాఢమైన పాండితీ పటిమతో మిళితమైన ఆయన ప్రచండ వాదనాసామర్థ్యము నాకెల్లప్పుడు స్ఫురణకు వచ్చుచుండును ఆయన తన కేసునకు పూనిన సంతరించుకొను విధానమును న్యాయశాస్త్ర ప్రవీణులు స్థాపించిన ప్రమాణములను ఎన్ను కొనుటలో ఆయన ప్రదర్శించిన నైపుణ్యమును అడంబరముగ కన్పించినను సందర్భశుద్ధి లేని అంశమును నిర్మొగమాటముగ త్రోసి వేయుటలో ఆయన చూపిన చిత్తస్థైర్యమును నేను ప్రశంసించుచుండెడివాడను ఫెడరల్‌కోర్టులో ఆయన వాదిం చిన కేసులు మౌలికమైన రాజ్యాంగ చట్టమునకు సంబంధించు సూత్రములు సిద్ధాంతములు ఇతర దేశముల న్యాయశాస్త్ర ములయందును న్యాయ నిర్వహణమునందును కృష్ణస్వామికి గల అపారపరిజ్ఞానము వలననే ఆయన ప్రదర్శించిన వాదనా కౌశల్యమునకు విశేషమైన బలము సిద్ధించినది "

న్యాయవాదవృత్తి యెడల కృష్ణస్వామికి గల అభి మానము ప్రగాఢమైనది కనుకనే తాను అవృత్తియందు ప్రవే శించిన తొలి సంవత్సరములలోనే ప్రభుత్వ మాయనను హైకోర్టున్యాయమూర్తిగ నిశ్చయించినపుడు ఆయన రెండు పర్యాయము లాపదవిని నిరాకరించినాడు భారత స్వాతం త్ర్యోదయ మానంతరము కూడ నెహ్రూ పండితు డాయనను గవర్నరు పదవికి నియమింప నుద్దేశింపగా తన వృత్తియం దాతడనుభవించు స్వేచ్ఛకు ఆపదవి వలన భంగము కల్గునను భావముతో అపదవిని గూడ కృష్ణస్వామి నిరాకరించినాడు

తాను అడ్వకేటుగా వ్యవహరించిన దీర్ఘకాలములో జూనియర్ లాయర్లకు పెక్కురకు ప్రోత్సాహము కల్పించి వారు ఉన్నత పదవుల నధిష్ఠించుటకు పలు విధముల సహాయ మొనర్చెను యువతరమునకు చెందిన పెక్కురు లాయర్లను తర్ఫీదు చేయుటలో కృష్ణస్వామి మహదానందము పొందెడి వాడు న్యాయవాద జీవితములో వారికి ఘటిల్లిన అభ్యుద యము తన అభ్యుదయముగనే భావించి సంతోషించుచుండెడి వాడు కృష్ణస్వామితో సన్నిహిత సాహచర్యము నెరపిన వారిలో భారతీయ ప్రధానన్యాయమూర్తిగా విలసిల్లిన స్వర్గీయ పతంజలిశాస్త్రియు సుప్రీ కోర్టున్యాయమూర్తులుగా వ్యవహరించిన స్వర్గీయ టి ఎల్ వెంకట్రామ అయ్యరు స్వర్గీయ శ్రీ ఎన్ చంద్రశేఖరఅయ్యరు శ్రీ ఎన్ రాజ గోపాలఅయ్యర్ గార్లును మద్రాసుహైకోర్టు న్యాయమూర్తు లైన స్వర్గీయ వి గోవిందరాజాచారి స్వర్గీయ చింతగుంట రాఘవరావు స్వర్గీయ వి సోమయ్యగారు స్వర్గీయ కె ఉమా మహేశ్వరం శ్రీ శేషాచలపతిగార్లును ముఖ్యులు న్యాయ వాద వృత్తిలో విజయము సాధించిన పెక్కురు ఇతరులును కలరు ఇందరు న్యాయవాది ప్రముఖుల ఘన విజయమునకు మూలకందమైన వ్యక్తిని శ్రీకృష్ణస్వామిని గాక ఇతరులను ఊహించుట చాల కష్టము

కృష్ణస్వామి ప్రముఖ న్యాయవాదిగనే గాక పేరెన్నిక గన్న ధర్మశాస్త్ర ప్రవీణుడుగ గూడ విజ్ఞులకు పరిచితుడై

నాడు న్యాయశాస్త్ర మాతనియందు మూర్తీభవించిన దన వచ్చును ఏదేశమదైనను మహోన్నత స్థితియందున్న ఎట్టి విశ్వవిద్యాలయము దైనను న్యాయ శాస్త్రాచార్య పీఠము నలంకరింప తగిన సమర్థుడాయన మరియెవరును సేకరింప జాలని న్యాయశాస్త్ర గ్రంథ సంచయముతో కృష్ణస్వామి గ్రంథాలయము కళకళలాడుచుండెడిది అందలి వేలాది గ్రంథములలోని ప్రతిపదమును తాను చదివి యుంటినని ఆయన సగర్వముగ చెప్పుకొనుచుండెడివాడు

1944 డిసెంబరులో ప్రమాద వశమున ఆయన తొడ ఎముక విరిగి నడచుట కశక్తుని చేయుటచే ఇతరుల సహాయము లేక కదలెడివాడు కాదు అట్టి స్థితిలో కూడ భారత రాజ్యాంగ పరిషత్తునందు సభ్యుడుగ సేవ చేయుటకు ఆయన మనఃపూర్వకముగా అంగీకరించినాడు సన్నిగిల్లిన తన ఆరోగ్యమునకీ నూతన బాధ్యత విశేష శ్రమ కల్గించినను సరకు గొనక రాజ్యాంగ పరిషత్సభ అమలులోనికి వచ్చిన మూడు సంవత్సరముల లోను (1946 డిసెంబరు 9 వ తేదీనుండి 1950 జనవరి 26 వ తేదీవరకు) జరిగిన దాదాపు అన్ని సమావేశములయందును ఆయన పాల్గొనినాడు ఇట్లాతడు రాజ్యాంగ పరిషత్సభకు సంబంధించిన ఐదు ఉపసంఘములలో సభ్యుడుగ విశేష శ్రమనోర్చి పాల్గొని తన సేవాధర్మమును నిర్వర్తించినాడు అత్యంత ప్రధానమైన రాజ్యాంగ రచనా సంఘములో సభ్యుడుగా ఆయన సల్పిన సేవ నెహ్రూ పండితుడు వల్లభాయి పటేలు వంటి అగ్రనాయకుల ప్రశంసల నందుకొన్నది కృష్ణస్వామియొక్క దేశభక్తియందును శక్తిసామర్థ్యములందును వారికి గల విశ్వాసము అంత ప్రగాఢమైనది రాజ్యాంగ చట్టమునందలి వేర్వేరు నిబంధనాంశములు రచింపబడు సమయమునను సభయందలి చర్చింపబడునపుడును కృష్ణస్వామి చేయుసలహాలనువారు తుచ తప్పక పాటించి నిశితమైనఆయన మేధాశక్తిని శ్లాఘించెడివారు భారతరాజ్యాంగచట్టమునరచించుటలో ఆయన దేశమునకు చేసిన సేవయు సాధించిన మహావిజయమును మరపునకు రాని సంఘటనములు న్యాయవాదులును తమ తమ వ్యవహారములలో న్యాయమపేక్షించు ప్రజలును కృష్ణస్వామిని భారతదేశమందొక అనన్య సామాన్యుడైన న్యాయవాదశ్రేష్ఠునిగా ఈనాటికిని ప్రశంసించగా ప్రముఖ భారత రాజ్యాంగనిర్మాతలలో ఒక్కనిగా ఆయనను యావద్భారతదేశము గుర్తించి గౌరవించి స్మృతిపథమునందుంచుకొనగలదు

1952 లో కృష్ణస్వామి భారతరాజ్యాంగ చట్టము నధికరించి శ్రీనివాస శాస్త్రి స్మృతిచిహ్నముగా ఉపన్యాసపరంపరనొకదాని కల్పించినాడు రాజ్యాంగ చట్టమునంతను ఆరు ఉపన్యాసములలో సమీక్షించుట కాయన ఉద్దేశించినను రెండు ఉపన్యాసములైనను పూర్తిచేయక పూర్వమే అస్వస్థుడై మరల కోలుకొన జాలకుండెను ఈ రెండుపన్యాసములును రాజ్యాంగ చట్టము ప్రాథమిక స్వత్వములు అను శీర్షికతో గ్రంథ రూపమున శ్రీనివాసశాస్త్రి ఇన్‌స్టిట్యూట్ అఫ్ పాలిటిక్స్" అను సంస్థవారిచే ప్రచురింపబడినది

న్యాయవాదిగ అలరారుచుండిన కాలమున కూడ కృష్ణస్వామి ఉన్నత విద్యా సమస్యలను గూర్చి అధ్యయన మొనర్చెడివాడు దాదాపు 11 సంవత్సరము లాయన మద్రాసు విశ్వవిద్యాలయ సెనేటు సభ్యుడుగను రెండు సంవత్సరములు సిండికేటు సభ్యుడుగను వ్యవహరించినాడు దీర్ఘకాల మాయన కాశీ హిందూ విశ్వవిద్యాలయ న్యాయస్థాన సభ్యుడుగ గూడ సేవ యొనర్చినాడు

కృష్ణస్వామి కరుణామయుడని జనవాక్యము వ్యక్తిగతముగ పేద విద్యార్థులకు ధన సహాయ మొసగియు ఆంధ్ర విశ్వవిద్యాలయము రామకృష్ణమఠము వంటి పెక్కు విద్యా సంస్థలకు భూరి విరాళముల నొసగియు తన ఉదారధాతృత్వము దేశమునకు చాటినాడు 1951 లో ఢిల్లీ విశ్వవిద్యాలయ మాయనకు న్యాయశాస్త్రములో డాక్టరేటు బిరుదమును ప్రసాదించి ఆ విశ్వవిద్యాలయమునందే స్నాతకోపన్యాసమొసగుమని అర్థించినది ఆంధ్ర విశ్వవిద్యాలయము కూడ కృష్ణస్వామికి సాహిత్యములో డాక్టరేటు బిరుదము నిచ్చి ఘనసన్మానము చేసినది

కృష్ణస్వామి అర్ధాంగియగు వెంకలక్ష్మమ్మ సాధ్వీ లక్షణములతో నొప్పు ఆదర్శవతియైన హైందవపత్నిగా ప్రశంసలు బడసినది దాతృత్వములో ఒక్కొక్క సందర్భమున ఆమె తన భర్తను గూడ మించి వర్తించుచుండెడిది పేదవారైన మిత్రులు ఆపన్నులైన బంధుజనము వారియింట అసంఖ్యాకములుగా చేరి సహాయమును వెనువెంటనే పొందెడివారు కృష్ణస్వామిఆరోగ్యము సన్నగిల్లినదగుటచే ఆయనవిషయమై భార్య విశేష శ్రద్ధ వహించి ప్రేమాదరములతో ఉపచారము లొనర్చుచుండెడిది కృష్ణస్వామి కుటుంబమునకు సన్నిహితు

లైనవారికి మాత్రమే ఘనమైన ఆయన జీవితరంగములో వెంకట లక్ష్మమ్మ వహించిన నిరాడంబరమగు పాత్రను గూర్చి అవగతము కాగలదు

కృష్ణస్వామి 1953 అక్టోబరు 3వ తేదీన స్వర్గస్థుడైనాడు ఆయనకు ముగ్గురు కుమారులును నలుగురు కుమార్తెలును ఉండిరి పెద్దకుమారుడైన కుప్పుస్వామి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తిగను రెండవ కుమారుడగు డా రామకృష్ణ మద్రాసునందలి గణిత విజ్ఞానశాస్త్ర సంస్థ (Institute of Mathematical Sciences) డైరెక్టరుగను మూడవకుమారుడైన ప్రభాకర్ హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సంబంధించిన టెలికమ్యూనికేషన్ ఇంజనీరింగుశాఖయందాచార్యుడుగను వ్యవహరించుచున్నారు

అ కు

## అల్లాడి మహాదేవశాస్త్రి

అల్లాడిమహాదేవశాస్త్రి సుప్రసిద్ధ శాస్త్రవడితుడైన రామబ్రహ్మశాస్త్రి కుమారుడు ఈయన క్రీ శ 1861 న పుదూరు గ్రామమున జన్మించెను పుదూరు గ్రామము నెల్లూరు మండలమున ఉన్నది

చిత్రము—33



అల్లాడి మహాదేవశాస్త్రి

మహాదేవశాస్త్రి గొప్ప మేధావి తనకు పదుమూడవ సంవత్సరము వయస్సు వచ్చు నాటికే ఈయన వేదము సంస్కృతాంధ్రములనుచక్కగా చదివెను అంతటితో ఈయనకు ఆకగ్లముపై అభిరుచి జనించెను తోడనే నాలుగున్నర కాలము శ్రద్ధాసక్తులతో అంగ్లభాషను అభ్యసించి మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను క్రీ శ 1879 లో ఈయన మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో చేరి అయిదు సవత్సరములపాటు చదివి పట్టభద్రుడయ్యెను వేలూరు నెల్లూరుల లోని ఉన్నత పాఠశాలలలో ఈయన కొంత కాలము అధ్యాపకుడుగా పనిచేసెను

ఈయన క్రీ శ 1891 న మైసూరు ప్రభుత్వము చే మైసూరులోని ప్రాచ్యగ్రంథభాండాగారమునకు క్యూరేటరుగా (గ్రంథములను జాగ్రత్త పరచువాడు) నియమితుడయ్యెను ఆనాటికి అగ్రంథాలయమునందు కొద్దిపాటి సంస్కృతా ధ్ర కర్ణాటక తాళపత్ర గ్రంథములు మాత్రమే ఉండెను ఈయన నిరంతర కృషి మూలమున అగ్రంథాలయము భారత దేశమునందలి ఉత్తమ గ్రంథాలయములలో ఒకటిగ ప్రసిద్ధిగనెను పది సంవత్సరముల కాలములోనే అది అన్ని విధములైన సంస్కృత గ్రంథములతోను తత్త్వశాస్త్రము పురాతత్త్వశాస్త్రములకు సంబంధించిన అంగ్ల గ్రంథములతోను కన్నడ వాఙ్మయ గ్రంథములతోను నిండి సర్వగ్రంథ సంపూర్ణమై యొప్పెను ఈభాండాగారము ఆనాడు సంస్కృత కర్ణాటక గ్రంథములను నిర్దుష్టముగ తయారుచేసి ప్రచురించుచుండెను ఈయన శంకర భాష్యము ఆధారముగా భగవద్గీతకు అంగ్లానువాద గ్రంథమును రచించి దానిని క్రీ శ 1897న ప్రకటించెను ఈగ్రంథము మిక్కిలి ఉత్తమముగ పరిగణింపబడినది ఈయన శంకర సురేశ్వరాచార్య సాయనాచార్యుల భాష్యములసాయమున తైత్తిరీయోపనిషత్తులకు అంగ్లానువాదరూపమున ఎనిమిదివందల పుటలు గల ఒక గ్రంథమును రూపొందించెను ఈయన కొంతకాలము మైసూరు మహారాజావారి సంస్కృత కళాశాలకు కార్యదర్శిగను మరి కొంతకాలము ప్రిన్సిపాలుగ నుండెను విద్యార్థులకు ఈయన వేదాంతశాస్త్రమును బోధించెడివాడు

ఈయన గొప్ప సంఘసంస్కార ప్రియుడు క్రీ శ 1907 న మైసూరులో నెలకొలుపబడిన ఆర్యధర్మోజ్జీవినిసభ ఈయన కృషి మూలమని చెప్పనొప్పును ఈయన రజస్వలానంతరవివాహ పద్ధతిని శాస్త్రీయ మని నిరూపించుచు బెంగుళూరు కళాశాలలో గొప్ప ఉపన్యాస మొసగెను అయుపన్యాస సారము ఒక గ్రంథరూపమున వెలువడెను ఆనాడు విదేశములకు పోవుట సముద్రయాన మొనర్చుట అనునవి నిషేధ కార్యములని కొందరి అభిప్రాయము ఈయన ఆ అభిప్రాయమునకు భిన్నముగా సముద్రయానము నిషేధము కాదని శ్రుతి స్మృత్యాదులతో సప్రమాణముగ నిరూపించెను సంఘ సంస్కరణములను ప్రతిపాదించుచు ఈయన వైదిక మతము వర్ణము అను నొక గ్రంథమును రచించెను

ఈయనలోని సంఘసంస్కారప్రియత్వము అన్ని దిక్కులు వ్యాపించెను సంస్కారప్రియుడగు బరోడా మహారాజు ఆహ్వానమును అందుకొని ఈయన క్రీ శ 1909 న బరోడాకు పోయెను అచ్చట సభలో వివాహమునకు సంబంధించిన

స స్కరణములను గురించియు బాల్యవివాహ నిషేధమును గూర్చి గొప్ప ఉపన్యాస మిచ్చెను అసాధారణమై సప్రమాణమైన ఈయన ఉపన్యాసమునకు సభ్యులు మిగుల హర్షించిరి బరోడామహారాజా వారి ఆజ్ఞను అనుసరించి ఈయన బరోడా సంస్కృత గ్రంథమాలలోని కొన్ని సంస్కృత గ్రంథములను పరిష్కరించెను

ఈయ ను క్రీ శ 1916 న అనిబిసెంటు మదరాసులోని అడయారు గ్రంథాలయమునకు దర్శకుడుగ (Director) నియమించెను ఈయన అవధవిలో మన్నపుడు అనేక సంస్కృత గ్రంథములను పరిష్కరించెను జీవితాంతము వరకును ఈయన అడయారులోనే నివసించెను ఈయన మొదటినుండియు తుదివరకు దివ్యజ్ఞానసమాజమునకు ఏభ్యుడుగ ను డి దానికి మిక్కిలి సేవచేసెను మరణి చుటకు రె డు స వత్సరములు ముందుగా ఈయన భారతసమాజశైవారాధనవిధానము అను గ్రంథమును వివాహ ప్రక్రియా విధానమును నిర్వచి చు ట్టి గ్రంథమును రచియించెను

ఇట్లు తన జీవితమ తయు భాషాసేవ సంఘసేవలకు అంకితము చేసి ఈయన క్రీ శ 1926 న పరమపద చెను

తం అం శా

అల్లాడిరాజు చూ అలచోళరాజు

అల్లాణరాజు

అల్లాణరాజు ప్రశ స పల్నాటివీరచరిత్రమున కనవచ్చు చున్నది ఈయన కల్యాణపురాధీశుడైన వీరసోముని పెద్ద తమ్ముడు వీ సోము కు అల్లాణరాజు కాక భల్లాణరాజు నంది సోముడు నాగసోముడు అను సోదరులు కలరు వీరందరును గొప్ప శూరులు వీరి తోడ్పాటుతో వీరసోముడు కల్యాణపురమును ధర్మ యుతముగ పాలి చుచు డెను వీరసోముడు శైవమతావలంబి ఈయన తన కుమార్తె అయిన సిరాదేవిని హైహయ వ శీయుడును అనుగురాజు కుమారుడును మాచెర్ల రాజ్యాధిపతియునగు మలిదేవున కిచ్చి వివాహమొనర్చెను

అల్లాణరాజు తన సోదరులతో నహా నలగామరాజునకు మలిదేవునకు రాజ్యభాగ విషయమున ఉత్పన్నమైన పలనాటి యుద్ధమున మలిదేవుని పక్షము వహించి శత్రువులతో పోరాడి వీరస్వర్గము నలంకరించిన మహావీరుడు ఈయుద్ధము క్రీ శ 1181-82 ల మధ్యన జరిగినట్లు తెలియుచున్నది పలనాటి వీరచరిత్రమ కవిసార్వభౌముడైన శ్రీనాథమహాకవి ద్విపద చ్ఛ దమున వ్రాసెను

తం అం శా

అల్లాదుర్గ

అల్లాదుర్గ మెదక్ జిల్లా అందోల్ తాలుకాలో ఉన్నది దీనికి 14 మైళ్ళలో సంగారెడ్డి ఉన్నది ఈ గ్రామమునకు సరిహద్దులుగా తూర్పున అప్పోచ్‌పల్లి పడమట రెడ్డిపల్లి ఉత్తరమున కాగితముపల్లి దక్షిణమున చిలివరా ఉన్నవి ఇది త్రిభుజాకారముగ ఉన్నది ఒక ఎకరము విస్తీర్ణము 45 అడుగుల ఎత్తుగల కాగిదమ్మగుట్ట సిద్దన్నగుట్ట ఇచటకలవు ఇవి చెట్లు చేమలతో నిండియున్నవి ఇవి రాతిమయములు

1961 సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ గ్రామములో 2683 మంది పురుషులు 3012 మంది స్త్రీలు 998 మంది బాలబాలికలు వెరసి 6683 మంది ఉండిరి వీరిలో ఆటవికులు 116 మంది మెడ్యాలు జాతులవారు 627 మ ది ఇచ్చట ఇండ్లు ఒకచోట గుంపుగాను ఒకచో పంక్తులుగాను వాడవాడలుగాను ఉన్నవి వీటిలో 800 పెంకు టిండ్లు ఒక కాంక్రీటు కప్పు ఇల్లు ఒక మేడకలవు గ్రామస్థులలో 50 శాతమువారు వరి అన్నమును 50 శాతమువారు జొన్న అన్నమును తిందురు వీరు బావినీటిని త్రాగుదురు ఇచ్చట పరిశుద్ధముచేయబడిన జలసౌకర్యముకలదు మంచినీటి ఎద్దడిలేదు

పశేలు చెరువు బట్టికుంట కోమటికుంట సిద్దన్నకుంట ఇవి ఈ గ్రామము దలి నీటి వనరులు వరి జొన్న తయిదలు చెరకు మొదలగుపంటలు ప డును పంట సరకులను లారీలపై హైదరాబాదునకు రవాణాచేయుదురు ఇచట 55 ఎకరముల విస్తీర్ణముగల మామిడితోట ఒకటి కలదు సూమారు 15000 మామిడికాయలురాలను వీటిని స్థానికులు ఉపయోగింతురు టొమాటో వంగ గోరుచిక్కుడు మిర్చి ఉల్లిగడ్డలు పండింతురు వీటనన్నిటిని గ్రామస్థులు ప్రక్క గ్రామస్థులు ఉపయోగింతురు

1966-67 సం॥లో ఈ గ్రామమున 815 గేదెలు 890 ఎద్దులు 472 ఆవులు రెండు ఆబోతులు 8 గుర్రములు 1072 మేకలు 2560 గొర్రెలు 95 పందులు 1000 కోళ్ళు ఉండెను సాలీనా 92000 లీటర్లపాలు 17200 కి గ్రా

మాంసము 790 కి గ్రా నెయ్యి స్థానికులు హోటళ్ళవారు ఉపయోగించిరి

ఈ గ్రామస్థుల ముఖ్యవృత్తులు వ్యవసాయము దుకాణములు చేనేత పరిశ్రమలు ఎద్దు బండ్లు తోలువారు కంసాలివారు వడ్రంగులు కమ్మరులు కుమ్మరులు తాపీ మేస్త్రీలు మంగలివారు చాకలివారు గొల్లవారు వడ్డెరవారు సాలెవారు కలరు ఒకవడ్లమర రెండు పిండిమరలు ఈ గ్రామమునఉన్నవి సాలీనా రు 55 000ల విలువగల బియ్యము రు 32 000ల విలువగలపిండి హైదరాబాదునకు రవాణాఅయెను చేనేత పరిశ్రమ కు డల తయారీకలవు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు కూలిరేటు దినమునకు పురుషునకు రు 2/లు స్త్రీకి రు 1 50/ లు

ఈ అల్లాదుర్గులో బేతాళస్వామి వీరభద్రస్వామి ఆంజనేయ స్వాముల దేవాలయములు కలవు ఎల్లమ్మ దుర్గమ్మ గుడులు మసీదు ఉన్నవి వీరభద్రస్వామి జాతర జరుగును గ్రామ దేవతయగు దుర్గమ్మ జాతర చైత్రశుద్ధ ద్వాదశినుండి చతుర్థి వరకు మూడు దినములు జరుగును

ఈ గ్రామమునకు 42 మైళ్ళ దూరములో శంకరంపేట రైల్వేస్టేషను ఉన్నది ఇది బస్సు మార్గముపైన ఉన్నది ప్రతి గ ంటకు గవర్నమెంటు బస్సులు నిజాంసాగర్ నుండి ఈ గ్రామము మీదుగా పోవును ఇచ్చట 8 కంకరరోడ్లు 4 మట్టి రోడ్లు కలవు ప్రయాణములకు 2 స్వంత మోటారు కార్లు 50 రెండెడ్ల బండ్లు 40 సైకిళ్ళు ఉన్నవి

అల్లాదుర్గులో సబ్ పోష్టాఫీసు జిల్లాపరిషత్తు హైస్కూలు ఉన్నవి రా పూర్ సీతానగరు కాయిదంపల్లి రెడ్డిపల్లి వెంకరావుపేట మొదలగు గ్రామముల నుండి ఇచటి హైస్కూలు చదువులకు విద్యార్థులు వత్తురు విద్యుచ్ఛక్తిని 200 ఇండ్లు వాడుకొనును ఇది పంచాయతీ పరిపాలన కల గ్రామము

ఈ పంచాయతీ సాలీనా ఆదాయము రు 7000/ లు గ్రామ పారిశుద్ధ్యమునకు ఏర్పాట్లున్నవి వెంకటేశ్వర గ్రంథాలయము సత్రములుకలవు ఈగ్రామమునపోలీసుస్టేషను కలదు మల్టీపర్పసునహకారసంఘము రు 8000/-లు గ్రామస్థులకు అప్పుగాఇచ్చినది ఇద్దరు ఇంగ్లీషు వైద్యులు ఒక ఆయుర్వేద వైద్యుడు ఒక హోమియోపతి వైద్యుడుకలరు ఇచట అవసరమగు సరకులు దొరకును వారమున కొకమారు సంత జరుగును దీనిలో కూరగాయలు మొదలగునవి దొరకును కిరాణా దుకాణములు సోడా కళ్ళీ ఎగరెట్టు దుకాణములు కూరగాయల అంగడి లా డ్రీలు మొదలగునవి కలవు

ఈ గ్రామమునకు 14 మైళ్ళలో ఉన్న జోగిపేటలో కోర్టులు సబ్‌రిజిష్ట్రారు ఆఫీసు తాలూకా కచేరి బ్లాకు అభివృద్ధి కేంద్రము పురుళ్ళ ఆసుపత్రి ఉన్నవి ఈ గ్రామపు విద్యార్థులు కళాశాల చదువులకు హైదరాబాదుకు పోవుదురు

మా శ్వే

## అల్లాదేవరమ్మ

గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకాలో కొండవీడు అను గ్రామము కలదు ప్రోలయవేముని మాచర్ల శాసనమునందు కుండిన నామ నగర ప్రాగ్భాగే అని వ్రాయబడి యుండుట వలన ఈగ్రామమునకు కుండినగరము అను పేరు కూడ కలదని తెలియుచున్నది మహమ్మదు కులీకుతుబుషా సేనానియైన ముర్తజాఖాన్ పేర ముర్తుజా నగరమని ఈ గ్రామమునకు పూర్వ వ్యవహారము కలదు కొండవీడునందలి ఒకానొక శాసనము (ద హిం IV నెం 694)ద్వారా అల్లాదేవరమ్మ ప్రశ స తెలియవచ్చుచున్నది ఈ వ్యక్తి కొట్టికలపూడి నాగరాజు తిప్పనింగారి తోడబుట్టువు శాసనము వ్రాయించినవాడుకూడ ఇతడే శాసన విషయ మిట్లున్నది –

"స్వస్తిశ్రీ శుభశకవర్షంబులు 1337 అగు నేంటి మన్మథ సంవత్సర ఫాల్గుణ శు 13 సో – కొండవీటి మూలస్థానము మైలారదేవర మధ్యరంగకంభం కొట్టికలపూండి నాగరాజు తిప్పనంగారు తమతోడబుట్టు అల్లా దేవరంమంగారికిన్ని ఆయన పెండ్లాము గౌరిసానికిని సుకృతముగాను చేయించిన మధ్యరంగ కంభము శ్రీ శ్రీ శ్రీ జేయున్ "

కొట్టికలపూడి నాగరాజు తిప్పనింగారు తోబుట్టువు అల్లాదేవరమ్మ భార్య గౌరసాని ధర్మార్థమై మైలారదేవ మధ్యర గస్తంభ స్థాపన సందర్భమున దీనిని వ్రాయించినారు కొట్టికలపూడి నాగరాజు తిప్పనింగారు బహుశః రెడ్డిరాజుల కొలువున ఒక ఉన్నతాధికారమును పొందియున్నవాడు కావచ్చును

నేడీశాసనము అచటి మసీదు స్తంభమున ఉండుటవలన దీని స్థానమున పూర్వము మైలారదేవుని ఆలయము ఉండి యుండవోపును మైలారదేవు డనగా వీరభద్రస్వామి ఈదేవుని ఉనికికి మూలస్థానముగా భావించి అచటి ప్రజలు భక్తితో

కొలుచుచు డిరి క్రీ శ 1476 న కొండవీడు మహమ్మదీయ రాజుల వశమైనది వారు ఎన్నియో హిందూ దేవళములను కూలద్రోసి వాని స్థానమున మసీదులను నిర్మింప చేయుటయే ఇందులకు కారణము

శాసనమునందు అల్లాదేవరమ్మను గూర్చి ఇంతకన్న ఎక్కువగా ఎమియు తెలియవచ్చుటలేదు శాసనము చూడగా ఈసందేహము బలపడుచున్నది ఇచ్చట వాడబడిన తోడ బుట్టు అల్లాదేవరమ్మ పదములు కొంత భ్రాంతిని కల్గించు చున్నవి తోడబుట్టవు తోబుట్టువు పదములు ఈకాల మున మనము సోదరీ పరముగ వాడుచున్నాము వాస్తవ మునకు అది ఉభయలింగమైనపదము పురుషుడైనను స్త్రీయై నను తోబుట్టువు కావచ్చును క్రీ శ 15 వ శతాబ్దపు తెలుగులో ఈశబ్దము ఉభయలింగముగా వాడబడెనని స్ఫురిం చును అయినచో అల్లాదేవరమ్మ (య్య) యు అయన భార్య గౌరసాని అనియు సిద్ధించును

లేదా కొట్టికలపూడి నాగరాజు తిప్పనంగారు త న సోదరియైన అల్లాదేవరమ్మకును తన భార్యయైన గౌరసాని కిని పుణ్యముగా మధ్యరంగకంబము (స్తంభము) చేయించెను అని అన్వయించవలెను

అల్లాదేవర అనునది అల్లామదేవర శబ్ద వికారమై యుండును అల్లామ ప్రభువు సుప్రసిద్ధశైవ మహాపురుషుడు దేవర అనునది శైవులు వాడు పూజా వాచకము కొట్టికల పూడి వంశమువారు శివభక్తులని యెంచవలెను మూలస్థాన దేవర ఆలయము మొదట నాదెండ్లలో వెలిసెను తరువాత ఇట్టి దేవాలయమునే కొండవీటియందును నెలకొల్పి యుందురు ఈ నూతనాలయమునకు భక్తులు మండప స్తంభ ములను దానము చేయుట జరిగెను ఈయంశమునే ద హిం IV సెం 694 95 96 శాసనములు రుజువు చేయుచున్నవి

శ్రీ గో రా

## అల్లాపల్లి

అనంతపురము జిల్లా కదిరి తాలూకాలో అల్లావల్లి గ్రామమున్నది దీనికి 18 మైళ్ళదూరములో కదిరి పట్టణము కలదు ఈ గ్రామమునకు తూర్పున నల్లామడ పడమట చెరువు ఉత్తరమున పొలములు దక్షిణమున రాజువల్లె పరి హద్దులు ఈగ్రామ వి స్తీర్ణము 8005 ఎకరములు

1961 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఈగ్రామములో 1642 మంది పురుషులు 1562 మంది స్త్రీలు వెరసి 3204 మంది ఉ డిరి ఈ సంఖ్యలో షెడ్యూల్డుజాతులు షెడ్యూల్డు తరగతులవారు 328 మంది 1931 సం॥లో 2463 మంది 1941 సం॥లో 2589 మ ది 1951సం॥లో 2916 మందిజనులు ఉండిరి 1951 సం నుండి 1961 సం॥ వరకు 288 మంది పెరిగిరి ఇది హెజవృద్ధి ఇచ్చట ఇండ్లు గుంపులుగా ఉన్నవి వీటిలో 3 పెంకుటి డ్లు 5 కాంక్రీటు కప్పుఇండ్లు 8 ఒక అంతస్తుమేడలు 2 పెక్కు అ తస్థుల భవనములు కలవు జనులు వరి రాగి జొన్న కొర్ర అన్నములను తి దురు బావినీటిని త్రాగుదురు

ఈగ్రామములో చెరువు బావులు ఉన్నవి వీటిక్రింద వరి జొన్న రాగి కొర్ర వేరుసెనగ క ది పెసర అలచంద మొదలగు పంటలు పండును ధాన్యమును గాదెలలో గరి సెలలో కంబములలో నిల్వచేయుదురు పంటదినుసులను లారీలపై అనంతపురం బళ్ళారీలకు రవాణాచేయుదురు ద్రాక్షతోటలున్నవి 1966–67 సం॥లో వీటిపై సాలుసరి ఆదాయము సుమారు మూడువేల రూపాయలు ద్రాక్షపండ్లను హైదరాబాదునకు ఎగుమతి చేసిరి 4584 ఎకరముల భూమి పంటలక్రింద ఉపయోగించబడినది చెరువు క్రింద 324 ఎకరములు బావులక్రింద 210 ఎకరములు సాగైనవి 18 ఆయిల్ ఇంజనులు 158 ఎకరములకును కపిలలు 52 ఎకరముల కును నీటిని సరఫరాచేసెను

అల్లాపల్లిలో గేదెలు ఎద్దులు అవులు ఆబోతులు వగైరాలు 2059 కలవు మేకలు 51 గొర్రెలు 608 కోళ్ళు 452 ఉన్నవి పాలు పాలపదార్థములు మాంసము గ్రుడ్లు విరివిగా లభించును బరువులను మోయుటకు 42 గాడిదలు కలవు

ఈగ్రామస్థుల ముఖ్యవృత్తులు వ్యవసాయము వ్యవ సాయకూలి ముగ్గురు దుకాణాదారులు ఇద్దరు క్రయవిక్రయ దారులు ఎద్దుబండ్లుతోలువారు వడ్రంగి కంసాలి తెలికల చాకలివారు కలరు వ్యవసాయదారులకు కూలీలు దొరుకుదురు ఇచ్చట 8 దేవాలయములు ఉన్నవి ఈ ఆలయములకు ఈనాంభూములు కలవు

అల్లాపల్లికి 18 మైళ్ళ దూరములో కదిరి రైల్వేస్టేషను ఉన్నది ఈగ్రామములో కంకరరోడ్లు మట్టిరోడ్లు కలవు

దీనిని నల్లామడ గ్రామముతో కంకరరోడ్డు కలుపుచున్నది. ఇచ్చట 3 ఒంటెద్దుబండ్లు 26 రెండెడ్ల బండ్లు 6 సైకిళ్ల ప్రయాణములకు ఉపయోగపడుచున్నవి.

ఈ గ్రామములో బ్రాంచి పోస్టాఫీసు, సమితి ఎలిమెంటరీ స్కూలు ఉన్నవి. ఇది పంచాయతీ పాలనలోని గ్రామము. పంచాయతీ ఆదాయము రు. 6945 లు. ఇచ్చట పంచాయతీ గ్రంథాలయము, ఒక సత్రము, రూరల్ ఆసుపత్రి, పశువుల ఆసుపత్రి కలవు. ఒక ఆయుర్వేద వైద్యుడు కలడు. 4 కిరాణా దుకాణములు, 3 కిళ్ళీ సిగరెట్టు, సోడాదుకాణములు, ఒక క్షౌరశాల కలవు.

తంతి కార్యాలయమునకు, జనరల్ ఆసుపత్రికి, సినిమా థియేటరుకు, కోర్టులకు, సబ్ రిజిస్ట్రారు ఆఫీసుకు, తాలూకా కచేరీకి, బ్లాకు అభివృద్ధి కేంద్రమునకు గ్రామస్థులు కదిరికి పోవలెను. ఈ గ్రామమునకు 7 మైళ్ళ దూరములో నున్న మరిగుబ్బలో పోలీసుస్టేషను, పురుళ్ళ ఆసుపత్రి ఉన్నవి. 6 మైళ్ళలోనున్న నల్లామడ వారపుసంతలో కూరగాయలు, బట్టలు, ధాన్యము మొదలయినవి లభించును.

మా. శ్వే.

## అల్లామా ఇబ్నెఖాతూన్

గోలకొండ సుల్తాను మహమ్మదుకుతుబుషా పరిపాలనా కాలమున (క్రీ. శ. 1612–1626) అరేబియా, పారసీక దేశముల నుండి విద్వాంసు లెందరో హైదరాబాదు విచ్చేసియుండిరి. అట్టివారిలో మౌలానాహుసేన్, అల్లమ షేక్ జాఫర్ అలీ, ముల్లా అబ్దుల్ హకీమ్ ఇబ్నెఖాతూన్ అనువారు ప్రముఖులుగానుండిరి.

ఇబ్నెఖాతూన్ శాస్త్ర విద్యలందు నిష్ణాతుడు. గొప్ప పండితుడు షేర్ బహాఉద్దీన్, మీర్ మహమ్మద్ మోమిన్ వంటి ప్రముఖ విద్వాంసు లీతని గురువులు. అల్లామా ఇబ్నెఖాతూన్ పరిపాలనా రంగమునందును కొంత అనుభవమును గడించెను. ఈతని వైదుష్యమును, రాజకీయ పరిజ్ఞానమును గోలకొండ సుల్తాను మెచ్చుకొని తన ఆస్థానములో సముచిత గౌరవ స్థానము నొసగియుండెను. ఆ పిదప క్రీ. శ. 1616 లో సుల్తాన్ మహమ్మద్ అల్లామాగారిని ఈరాన్ దేశమునకు రాయబారిగా పంపెను. ఇబ్నెఖాతూన్ ఆ పదవిని సమర్థతతో నిర్వహించెను. సుల్తాన్ మహమ్మద్ మరణానంతరము క్రీ. శ. 1626 లో గోలకొండకు తిరిగివచ్చెను.

నాటికి గోలకొండ రాజకీయములలో కొన్ని మార్పులు సంభవించెను. సుల్తాన్ మహమ్మదు మరణానంతరము అబ్దుల్లా కుతుబుషా సింహాసనాధీశుడయ్యెను. అతడు యుక్తవయస్కుడగువరకును సామ్రాజ్య పాలనమును హయాత్ బఖీ బేగమ్ తదితర ప్రముఖ అధికారులు నిర్వహించుచుండిరి. నాటి పరిపాలనా రంగమునందు స్థానికులగు అధికార వర్గమువారికిని విదేశములనుండి వచ్చి ఉన్నతోద్యోగములు సంపాదించుకొనిన వారికిని ప్రధానాధికార పదవులకూ పరస్పరము సంఘర్షణలు జరుగుచుండెను. అట్టి పరిస్థితులలో అల్లామా ఇబ్నెఖాతూన్ కూడ ప్రధానామాత్య పదవిని పొందుటకు స్వదేశీయుల అధికారవర్గముతో చేతులు కలిపెను.

అబ్దుల్లా పాలనములో (క్రీ. శ. 1626–1672) అల్లామా ఇబ్నెఖాతూన్ కృషి ఫలించినది. మొదట ఈరాను నుండి తిరిగి వచ్చిన అనంతరమే డిప్యూటీ పేష్వాగా నియమితుడై క్రమక్రమముగ బలమును సంపాదించుకొని క్రీ. శ. 1629 లో ప్రధాని పదవిని అలంకరించెను. షాహ్ మహమ్మదు పదవినుండి తొలగింపబడెను. అబ్దుల్లా కుతుబుషా ఈతని గౌరవస్థానమునే కాక నవాబు, అల్లామా వంటి బిరుదములను నొసంగి సత్కరించెను. అనతికాలముననే అల్లామా ఇబ్నెఖాతూన్ ప్రభుత్వములో మహోన్నతమైన స్థానమును పొందెను.

అత్యంత బాధ్యతాయుతమై ప్రధాని పదవిని నిర్వహించుచునే అల్లామా ఇబ్నెఖాతూన్ తనకు తత్త్వశాస్త్ర సాహిత్యములందు గల అభిరుచిని అనుసరించి విద్యావ్యాసంగములో ప్రముఖ పాత్రను నిర్వహించెను. గ్రంథపఠనమునందును విద్యాబోధనమునందును వీరికి ఆసక్తి మెండు. వీరి నివాస గృహము విద్యాకేంద్రముగ విలసిల్లియుండెను. ఉదయమునందును రాత్రి భోజనానంతరమును విద్వాంసులతో గోష్ఠి జరుపుచుండెను. ఎందరో ప్రతిష్ఠులైన విద్వాంసులీ సమావేశములందు పాల్గొనుచుండిరి. ఈ సందర్భములందు ప్రత్యేకముగ తఫ్సీరే హుసేన్ – ఫిక్హము – తర్కము మున్నగు శాస్త్రీయములపై చర్చలు జరుగుచుండెను.

కుతుబుషాహీల కాలమున రాష్ట్రమంతటను మంగళవారము సామాన్య సెలవు దినముగానుండెను. ఇబ్నెఖాతూన్ భవనములో నాడు కవి సమ్మేళనములు జరుగుచుండెను. తదితర శుభ దినములందును ప్రత్యేక సభలలోను హైదరాబాదు

పరిసర ప్రాంతము లందు గల సుందరోద్యాన వనములలో సారస్వత సమావేశము లు నిర్వహింప బడుచుండెను అట్టి సందర్భములందు స్థానిక కవి పండితులతో పాటు ఇతర రాజ్యములకు చెందిన రాయబారులు యాత్రికులు ప్రత్యేకముగ ఆహ్వానింప బడుచుండిరి

ఇబ్నెఖాతూన్‌గారి రచనలలో "శాబరశైన్ అను వాదము హీనయా జామియా అల్విసీ మున్నగునవి పేర్కొన దగియున్నవి

పరిపాలనా దక్షుడును పాండిత్యసంపన్నుడుగను పండిత పోషకుడుగను ఇబ్నెఖాతూన్ సుల్తాన్ మహమ్మదుకుతుబషా అబ్దులా కుతుబుషాల మన్ననలకు పాత్రుడై విశిష్ట స్థానము పొంది చిరస్మరణీయు డయ్యెను

కె గో కృ

## అలావుద్దీన్ - మౌలవీ

అల్లావుద్దీన్ (మౌల్వి) (స్వాతం—హై II 51) 1857 లోని ప్రప్రథమ భారతీయ స్వాతంత్ర్య సంగ్రామమందు పాల్గొని వెనుకబడి అంధకార బంధురమైన నిజాము సంస్థానములో మహోజ్జ్వలముగా ప్రకాశించిన నక్షత్రమని చెప్ప వచ్చును ఈయన హైదరాబాదునవాస స్ఫురద్రూపి ధార్మిక స్థాపకుడు స్వాతంత్ర్య సంగ్రామము నాటికి అతనికి నలుబది యైదు సంవత్సరాల ప్రాయము ఆనాటి వివిధాయుధము లను ప్రయోగించుటలో శిక్షణ పొందిన యోధుడు విశేషించి అసాధారణ ప్రజ్ఞా వంతుడు చక్కటి వక్త గొప్ప మేధావి స్వయముగా సూఫీ తత్వ ప్రచారకుడు అనాటి గొప్ప సూఫీ తత్వవేత్తయయిన "షుజావుద్దీన్" అను మహాపురుషుని దౌహిత్రుడు పవిత్ర ఖురాను అతనికి కంఠస్థముగానుండెను ఇస్లాములోని నిగూఢవిషయాలను కూలంకషముగా అవగతము చేసుకొనిన మనీషి అతనికి హైదరాబాదులో చాలా మంది అనుచరు లుండిరి తాతగారిద్వారా (షుజావుద్దీన్) పెద్ద పెద్ద నవాబులతో జాగీరుదారులతో పరిచయ మేర్పడెను వారిలో ముఖ్యముగా షమ్సులుమ్రామ ఖైరుల్ ముల్క్ బహదూర్ తోను అతని కుమారుడు నవాబుఖైరుల్ ముల్క్ బహదూరుతోను మౌల్వి సాహేబుకు సాన్నిహిత్య ముండెను

మౌల్వి అల్లావుద్దీన్ సాహేబు ఇల్లు చార్మినార్ ప్రాంతములో ఉండెను అతని తలితండ్రుల గ్రామము హైదరాబాదు జిల్లాలో మోజంజంగ్ బహదూరు జాగీరైన బంగులూరు

ఈయన అత్తవారిది మాతామహుల గ్రామము కూడ హైదరాబాదు జిల్లాలోని మక్తాఆదిబట్ల స్వాభావికముగ దేశభక్తి త్యాగదీక్ష గల ఆ మౌల్విసాహేబు ఉత్తర భారతదేశములోని అప్పటి స్వాతంత్ర్య సమర గాధలను ఆర్కాటుకు చెందిన ఖుతుబ్ ఖాను అను ఒక నేస్తం ద్వారా విని విప్లవ చైతన్యము ఆకళించుకొని యుండెను అప్పుడే చీతాఖాను ఉదంతము సంస్థాన మంతటను ప్రాకి ప్రజలను కలచి వైచెను చీతాఖాను బ్రిటిష్ వారి సైన్యములోని (సబ్సిడై రీఆర్మీ) ఒక జమేదారు నిజాము రాష్ట్ర సరిహద్దులలోని ఔరంగాబాదు జిల్లాలో నిలచి యున్న అశ్వికదళములో ఉద్యోగియైన ఆ జమేదారు తన పండ్రెండుగురు సహచరులతో బ్రిటిషు ఇండియాలోని స్వాతంత్ర్యసైనికులపై వ్యతిరేక చర్యలు తీసుకొనుటకు నిరాకరించి ఆంగ్ల సైనికాధిపతుల ఆజ్ఞలను ధిక్కరించి హైదరాబాదుకు వచ్చి నిజాము ప్రభుత్వమును ఆశ్రయము కోరెను అయితే హైదరాబాదు ప్రభుత్వపు దివాను సర్ సాలార్ జంగ్ ఆపదముగ్గురు సైనికులను అదుపులోనికి తీసుకొని బ్రిటిషు రెసిడెంటుకుఅప్పగిచెను ఒకవైపుభారతప్రజలను దాస్య శృంఖలాలలో ఇరికించి పరిపాలించుచూ రెండవవైపు స్వాతంత్ర్యము కోసము పోరాటము సాగించుచున్న ప్రజలపై స్వజాతివారైన తమనే ప్రయోగించే ఆంగ్ల ప్రభుత్వపు కుటిల రాజనీతిని వ్యతిరేకించుచు ఇంగ్లీషు సైనిక పటాలమునుండి చీలివచ్చి ఆశ్రయము కోరిన చీతాఖానును సహచరులతో సహా రెసిడెంటుకు పట్టి ఇచ్చిన నిజాం మంత్రి చర్యవలన సంస్థాన మంతయు అట్టుడికి పోయెను చీతాఖానును అతని సహచరులతో కూడ విడిపించుకొనవలెనను తహతహ ప్రజలలో ప్రబలి పోయెను ఉత్తరభారత దేశములో ముమ్మరముగా సాగుచున్న ఇంగ్లీషువారిని వెడలగొట్టే ఉద్యమము దక్షిణ భారతదేశములోనికి గూడా విస్తరింపచేయాలనే ఆకాంక్ష నానాటికి వృద్ధియయ్యెను ఈ సందర్భములోనే అప్పుడు విరివిగా రహస్య సమావేశములు బహిరంగ సమావేశములు జరిగెను అట్టి సమావేశములకు ముఖ్యముగా రాజకీయ చైతన్యముగల మౌల్వీలు విద్యార్థులు రోహిలాలు నౌకరులు బ్రిటిషువారు కూడా ఈవిషయము తెలుసుకొని తగినట్లుగా సమాయత్త మగుచుండిరి ఆసమయములోనే మౌల్విఇబ్రహీం మౌల్విఅబ్దుల్లా మీర్జామొహమ్మద్ చాంద్ మిన్ మజహర్ అను నలుగురు పెద్దమనుషులను రెసిడెన్సీ

క టోన్మెంటు ప్రాంతాలలో అశాంతిని రేకెత్తించేవారుగా నిజాము దివానున్ను రెసిడెంటున్ను సమోదు చేసుకొని యున్నారని మౌల్వీ అల్లావుద్దినకు తెలియవచ్చెను వారిని పట్టుకొనుటకు నిజాము నవాబు పర్మాను జారీ చేసినాడని అల్లావుద్దీను తనకు పరిచయస్థుడైన మధోల్ ఇనాముదారు ద్వారా వినెను దీని నిజానిజములు తెలుసుకొనుటకై నిజాము నవాబుకు సమీపస్థుడైన నవాబు ఖైదారుల్ ములక్ బహదూరు (షమ్సులుమ్రాకుమారుడు) ఆస్థానమునకు వెళ్ళి తాను వినిన విషయము మౌల్వీసాహెబు ప్రస్తావిచెను అందుకా నవాబు అదంతయు వట్టిపుకారు కావచ్చునని చెప్పి తాను కూడా ఆ విషయము ఎన్నానని హుజూరు నిజాముఫర్మానులో పై నలుగురి పేర్లే కాక మౌల్వీమహమ్మదు అక్బరు పేరు మౌల్వీఅల్లావుద్దీను పేరు కూడా ఉన్నట్లు తెలిసి దనితెల్పెను అయినను ఆవిషయముపై ఆ దోళన పడవలసిన అవసరము లేదని చెప్పెను కాని అల్లావుద్దీనుకు ఆ నవాబుసాహెబు ఇచ్చిన దిలాసాపై నమ్మకము కుదర లేదు ఏదో విధముగా సంతృప్తి పరచుటకు మాత్రము చెప్పుచున్నాడనుకొని తనకు భవిష్యత్తులో భయంకరాపాయము రానున్నదని గట్టిగా నిశ్చయించుకొనెను ఇది యిట్లుండగా 17-7-1857 నాటి శుక్రవారపు నమాజు తరువాత మక్కామసదులో బ్రహ్మాండమైన సమావేశము జరిగెను అందులో అల్లావుద్దీన్‌తో సహా చాలా మంది మౌల్వీలు ముస్లిము ప్రముఖులు పాల్గొనిరి రెసిడెంటు ఖైదులో ఉన్న చీతాఖానును అతని సహచరులను విడిపించుకొనవలెనని తీర్మానించబడెను అందుకొరకు మొట్టమొదట జాం (భుశాస్ని ర్థిం)చవలెననియు నిజాం ప్రభుత్వము నిస్సహాయస్థితిలో ఉన్నచో రెసిడెంటునే కోరవలెననియు ఒకవేళ రెసిడెంటు ఆసైనికులను విడచిపుచ్చుటకు నిరాకరించినచో బలవంతముగానైనా విడపించుకొనవలెననియు సమావేశములోని జనసమూహము ఐక్యకంఠముతో నిర్ణయము చేసెను అయితే అప్పటికప్పుడే సర్ సాలార్ జంగ్ ఒక అరబ్ బేడాను (అరబుపటాలాన్ని)పంపించి ఆసమావేశములో పాల్గొనినవారి నందరిని చెదరపోవునట్లు చేయించెను ఆనాటి సాయంత్రము మౌల్వీ అల్లావుద్దీన్ తన ఇంటియందు ఖత్మెఖురాను (ఖురాన్ పూర్తిపఠనము) చేయుచున్న సమయములో జాఫర్ ఖాన్ అను ఆఫ్ఘను పఠాను ఆ ఇంటిముందుకు వచ్చి గాలిలోకి తుపాకి పేల్చెను ఆశబ్దము

విని మౌల్వీగారు ఇవతలకి వచ్చునంతలోనే ఒక గుంపు తయారై ఉండెను అందుకు కారణము విచారించగా తనను (అల్లావుద్దీన్‌ను) పట్టుకొనుటకు ఒక సైనిక పటాలము బయలు దేరినదని దానిని ప్రతిఘటించవలసి యున్నదని ఆగుంపు నుండి తెలియవచ్చెను అదంతయు ఉత్తపదంతిఅని అల్లావుద్దీన్ ఎంత నచ్చచెప్పినను ఆగుంపు వినిపించుకొనలేదు పైగా ఆ పోరాటమునకు ఆధ్యాత్మిక నాయకుడుగా ఉండుటకు అల్లావుద్దీనును గట్టిగా కోరిరి ఇక ఆగుంపుతో చర్చించుట వలన లాభములేదని చివరకు ఆపోరాటాన్ని ప్రాణాలను బలిపెట్టవలసిన "జిహాదు"గా నిశ్చయించుకొని (జిహాదు అనగా ధార్మిక యుద్ధము) ఆయుధాలను ధరించి అల్లావుద్దీన్ గుంపులోకి వచ్చి చేరెను అక్కడ నుండి ఆగుంపు చార్మినార్ వైపుకు వచ్చెను అచ్చట జహాంగీరుఖాను కొంతమంది అనుయాయులతో నిలిచియుండెను (జహాంగీరుఖాను 15-3-1858 హుజూరు నిజాముదేవిడి ముందు పరస్పరము మాట్లాడుకొనుచున్న రెసిడెంటు - సర్ సాలార్ జంగ్‌లపై కత్తిదూసెను కానీ సాలార్ జంగ్‌గారి అంగరక్షకబలములో నొకని కత్తివ్రేటు వలన మరణించెను) అప్పుడాగుంపు అక్కడనే వున్న మౌల్వీ ఇబ్రహింసాహేబు ఇంటి ముందుకు వచ్చి తమతో వచ్చి చేరమని కోరెను కానీ ఇబ్రహింసాహేబు రాలేదు అందుకు అల్లావుద్దీన్ మనము విజయమో వినాశమో కోరుకొని వచ్చినాము కాబట్టి ఇందులో స్వచ్ఛందముగా వచ్చితేనే తప్ప ఎవరినీ బలవంతముగా చేర్చుకొనగుడదు అని ఉద్బోధించెను తరువాత అల్లావుద్దీన్ ముందు నడువగా ఆసమూహము చంపా దర్వాజా గుండా రెసిడెన్సీ వైపు సాగిపోయెను త్రోవలో బేగబజారు దగ్గర తుర్రెబాజ్‌ఖాను సుమారు 500 మంది రోహిలా భటులతో కలిసెను అక్కడ నుండి ఆగుంపుకు మౌల్వీఅల్లావుద్దీన్ తుర్రెబాజ్‌ఖాను ఇద్దరును నాయకత్వము వహించిరి ఆనాటి ప్రజావిప్లవము గురించి మొదలే తెలిసికొని మీదుమిక్కిలి సాలార్‌జంగ్‌చే హెచ్చరించబడిన రెసిడెంటు డేవిడ్‌సన్ తనభవనపు నలుమూలల గట్టి సైనిక బందోబస్తు ఏర్పాటు చేసుకొనెను వచ్చుచున్న ప్రజాసమూహముపైన గోడలపైనుండి ఫిరంగిగుండ్ల వర్షము కురిపించెను వెంటనే అందులో కొందరు నేలకొరిగిరి మిగతా జనమంతయు చెల్లాచెదరై పారిపోయిరి మౌల్వీ అల్లావుద్దీన్ తుర్రెబాజ్‌ఖాను ఆ సమీపములోనే యున్న అబ్బాస్

సాహేబు ఇంటిలో ప్రవేశించిరి ఆరాత్రి అంతయు భవిష్యత్కార్య క్రమముపై చర్చోపచర్చల తరువాత ఆయిద్దరు నాయకులు ప్రస్తుతమునకు ప్రభుత్వమునకు పట్టుబడకుండా తప్పించుకొనుటే కర్తవ్యమని నిర్ణయించుకొని తెలతెలవారుచున్నప్పుడే ఆయింటినుండి బయట పడిరి అప్పుడు అల్లావుద్దీన్ వెంట ఇద్దరు నౌకరులు ఒక విద్యార్థియు ఉండిరి ఆఇద్దరు నాయకులు తమతమ అనుయాయులతో బేగంబజారులో తుర్రెబాజ్ ఖాను యింటిదగ్గరకు వచ్చిరి అక్కడ తుర్రెబాజ్ ఖాను ఒక గుఱ్ఱమును తీసుకొని మౌల్వీఅల్లావుద్దీన్‌ను మేనాలో తన వెంట రమ్మనెను ఆసమయములో మేనాలో ప్రయాణము చేయుట ప్రమాదము కొనితెచ్చుకొనుట తప్ప వేరులేదని తుర్రెబాజ్ ఖానును వెళ్ళమని చెప్పి తాను (అల్లావుద్దీన్) కాలినడకను బయలుదేరి అనుఫ్‌నగరుకు సమీపము దున్న రజ్జారుఖాను పేటకు వచ్చి రహస్యముగా నిలచెను తన వెంటనున్న విద్యార్థిని భోజనము తెచ్చుటకు సమాచారము సేకరించుటకు పట్నమునకు పంపించెను అజ్ఞాతవాసములోనికి పోనున్నవాడు కావున ఎవరును తనను గుర్తించకుండా ఉండుటకు తన వేషమును మార్చుకొనెను ఇంతలో విద్యార్థి ఒక సనికత్తెచే భోజనము పట్టించుకొని వచ్చెను ఉదయమున (19 7 1857) మౌల్వీసాహేబు మూసీ నది వెంబడి ధూల్ పేట త్రోవన నడచి పట్టణము దాటి ఫతేదర్వాజా చేరుకొనెను అక్కడనే తన వెంటనున్న నౌకరులను విద్యార్థిని వదలి వేసి మౌల్వీ సాహెబు తానొక్కడే షంసాబాదువైపు వెళ్లెను అచ్చట నుండి కొచ్చెల గ్రామము చేరుకొని నమాజు భోజనము పూర్తిచేసుకొనెను ఆటుతరువాత సూర్యోండ ఫరూఖ్‌నగర్ ప్రాంతములలో నెలరోజులు గడిపి తన మేనమామ గ్రామము మఖ్తాఅదిచిట్లకు వెళ్లెను అక్కడినుండి బంగళూరులోని సయ్యదుఖిక్కు (సయ్యదులాల్ మహసూలుదారు కుమారుడు) పరిచయముచేసుకొనెను అతని ద్వారా తన తండ్రిని కలుసుకొని తాను రహస్యముగా ఉండుటకు ఒక యిల్లు కావలెనని కోరెను అందుకాయన (అల్లావుద్దీన్ తండ్రి) తాను నివసించు గ్రహమునసే ఉండుమని చెప్పెను కాని ఆయిల్లు సర్కారు వారిది కాబట్టి అక్కడ ఉండుట క్షేమముకాదనుకొని వేరే ఇంటి కొరకు ప్రయత్నించ ప్రారంభించెను బంగుళూరులోని మహమ్మదలీ హవాల్దారు ద్వారా అతని మేనమామ మంగలపల్లి నివాసియైన పీరు మహమ్మదుకు పరిచయము చేయించుకొని అతని ఇంట్లో రహస్యముగా నివసించసాగెను అపుడతడు ఆత్మ రక్షణ కొరకు ఒక నిలువు కత్తిని ఒకకైజారును ఒక పిస్తోలును ధరించెడివాడు

అట్లు మంగలపల్లి పీర్ మహమ్మదు ఇంట్లో ఆశ్రయము ఏర్పరచుకొని అల్లావుద్దీన్ సుమారు సంవత్సరార్ధముగడిపెను ఆతడక్కడ ఉన్నన్నాళ్ళు రెండు మూడు రోజుల కొకసారి మహమ్మదలీ సయ్యద్‌ఖిక్కు రాత్రులలో వచ్చి రహస్యముగా మాట్లాడి పోయెడివారు తన దగ్గర వున్న కొద్దిపాటి డబ్బు చాలా జాగ్రత్తగా వెచ్చించి ప్రొద్దులు పుచ్చుకొనుచుండెను అప్పుడప్పుడు అతని మేనత్త (ఆమె అతనికి కూతురు నిచ్చిన అత్తగారు) కొంచెము సహాయము చేయుచుండెడిది ఇట్లుండగా అల్లాఉద్దీన్ దగ్గర వున్న ఒక అపూర్వమైన బంగారు నాణెమును డబ్బు చేయుటకు జగ్గంపేటకు పీర్ మహమ్మదు తీసుకొని వెళ్లెను ఆనాణెముపై మహమ్మదుపాదుషా ముద్ర ఉండెను దానికి అరువదిరూపాయల ధర కట్టిరి కాని మార్చబడలేదు అప్పుడే మంగలపల్లిలో ఒక ఘోరమైన విషూచి వ్యాధి (మహామారి) వ్యాపించెను అయితే మౌల్వీ సాహేబు ఆవ్యాధిని కాపుటకు తావీజులు ఇచ్చుచుండెను ఈరెండు కారణాలచేత మౌల్వీ అల్లాఉద్దీన్ రహస్యము బయట పడినందు వలన ఒకనాటి రాత్రిసైనిక పటాలముచే పట్టుబడెను

అల్లావుద్దీన్ మౌల్వీకి తన యింటియందు రహస్యముగా ఆశ్రయ మిచ్చుటపై పీరుమహమ్మదు న్యాయమూర్తులముందు ఇట్లు వాఙ్మూలము ఇచ్చెను "తుర్రెబాజ్ ఖానును గాని మౌల్వీ అల్లావుద్దీనును గాని పట్టి ఇచ్చినవారికి ప్రభుత్వము నాలుగు వేల రూపాయల బహుమానము ప్రకటించిన విషయము నేను ఎరుగుదును మౌల్వీ అల్లావుద్దీనుగారు ప్రఖ్యాత సూఫీతత్వవేత్తయైన షుజావుద్దీనుగారి దౌహిత్రుడు స్వయముగా సాధు పుంగవుడు ఈయన నాయింట పట్టుబడిచో ప్రభుత్వమువారు నాపై చర్యతీసుకొందురని కూడ నేను ఎరుగుదును అయినప్పటికిని మౌల్వీసాహేబువంటి సజ్జనునకు ఆశ్రయ మిచ్చుట ధర్మకార్యమని నేను అట్లు చేసితిని"

మౌల్వీఅల్లావుద్దీనును ముగ్గురు న్యాయమూర్తులు విచారించి వారాతనికి ద్వీపాంతర వాస శిక్షవిధించిరి ఆతనిని 28 7-1859 నాడు హైదరాబాదునుండి అండమాను ద్వీపములకు పంపించిరి అక్కడనే ఆయన 1884 లో మరణించెను

పెం. వెం. రా

## అల్లావుద్దీన్ (సురధాను) II (బహమనీ)

అల్లావుద్దీన్ ప్రశంస వెలుగోటివారి వంశావళి పుట 49 యందు గలదు క్రీ శ 14 వ శతాబ్దమున దక్కనునందలి దేవగిరి వరంగల్ ప్రాంతములు ఢిల్లీలోని తుఘ్లకు వంశీయుల పాలనాధికారము క్రిందకు వచ్చినవి దక్కనునం ను ఒకే పాలన క్రింద సమైక్య పరచుటలో అల్లాఉద్దీన్ ఖల్జీ సేనానాయకుడగు మాలిక్ కపూరును మహమ్మద్ తుఘ్లక్ ను చాలవరకు ప్రయత్నించి సఫలులైరి కాని నిర్దిష్టమైన కట్టుబాట్లు లేనందున దక్కనున దలి అనేకమంది నాయకులు తమ స్వతంత్రతను ప్రకటించిరి క్రీ శ పదునాల్గవ శతాబ్దము పూర్వార్థమున బహమనీ వ శీయులు దక్కనునందలి గుల్బర్గా బీదరు పట్టణముల ను రాజధానులుగ చేసుకొని రమారమి 1½ శతాబ్దములవరకును దక్కనును పాలి చిరి ఇదివరలో ఉత్తరముననుండి దక్కను నాక్రమించిన విజేతలు దోపిడి చేసి ధన కనక వస్తు వాహనాదుల తరలించుటయ దే నిమగ్నులైరి కాని బహమనీపాలకు లట్లుగాక దక్కనులోనే స్థిరపడి తమ రాజ్యమును బీరారునుండి దక్షిణమున మైసూరు రాజ్యమువరకును పాశ్చిక్ పశ్చిమ సముద్ర మధ్యస్థ ప్రదేశముల వరకును విస్తరించి విజయవంతముగా పాలించిరి రాజ్య వ్యవస్థయందును సంస్కృతీ సభ్యతలయ దును బహమనీ రాజ్యము అత్యున్నత స్థాయినందుటలో పరాక్రమవంతులగు తాజుద్దీన్ ఫీరోజిషా (1397 1422) షము ద్దీనుమహమ్మదు (1463-82)ల వంటి బహమనీసుల్తానులును సైఫుద్దీన్ గోరీ మహమ్మదుగావన్ లవంటి మేధావులగు వజీర్లును కారకులనుటలో సందేహము లేదు ఇదే కోవకు చెందిన అల్లావుద్దీన్ సురధాను (సుల్తాన్) బహమనీరాజ్యము నేలిన సుల్తానులలో గణనీయుడు ఈయన రాజ్య పాలనకాలము (1435 1458) ఇతని తండ్రి షహాబుద్దీను అహమ్మదు మరణించుటకుముందు తన విశాల రాజ్యమును తన కుమారులలో మొదటివాడు అల్లావుద్దీనును రాజ్యాధిపతిగాను రెండవవాడైన మహ్మదు ఖానుకు బేరారుతోపాటు మాహూరు కుల్లమ్ రామగిరి దుర్గములను మూడవకుమారుడు దావూదునకు తెలంగాణమును పంచి యిచ్చెను అల్లావుద్దీను సింహాసనము నధిష్ఠించి నంతనే అనేక విషమ సమస్యల నతడు ఎదుర్కొన వలసి వచ్చెను అంతకు పూర్వమునుండియు వచ్చుచున్న వైదేశికులకు దక్కనీలకు మధ్యమందు విద్వేష వాతావరణము రాజకార్యములందును చొచ్చి భీకరరూపమును దాల్చినది వైదేశికులలో కొంత మంది రాజవంశమువారితో సంబంధ బాంధవ్యముల నెలకొల్పుకొనుట వలన వారి ప్రాబల్యము హెచ్చి రాజ్య వినాశనమునకు దారి తీసినది

అల్లావుద్దీన్ రాజ్యమునకు వచ్చిన వెంటనే అయిదేండ్ల నుండి కప్పము కట్టక ధిక్కరించిన విజయనగరాధిపతి రెండవ దేవరాయలను (1422) శిక్షించుటకు ద డు వెడలెనని మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిరి ఈయుద్ధమునందు ముఖ్య పాత్ర వహించినది అల్లావుద్దీన్ తమ్ముడగు మహమ్మదుఖాను అను రాకుమారుడు ఇతడు రాయలతో సంధి చేసికొని తిరిగి వచ్చు సమయమున దుర్బుద్ధి కలిగి అన్నపై తిరుగుబాటును ప్రకటించెను ఈ తిరుగుబాటునకు రాయల సహకారము గూడ లభించెను అల్లావుద్దీన్ సుల్తాను ఈవిప్లవమును అణచివైచి మహమ్మదుఖానుని తప్పిదమునుక్షమించి అతనిని రాజాచల్ (రాచకొండ) జాగీరునకు అధిపతిగా నియమించెను

మొదటినుండియు కొంకణము బహమనీ సుల్తానుల అధిపత్యమున నుండెడిది విజయనగరరాజగు రెండవ హరిహర రాయల (క్రీ శ 1379) కాలమున కొంకణమును విజయనగరాధీశులు జయించిరి అల్లావుద్దీన్ కొంకణమును తిరిగిరాబట్టుకొనుటకు గొప్ప ప్రయత్నము చేసి చివరకు గెలుపును పొ దెను కొంకణమందు చిన్న సంస్థానము లనేకములు కలవు అందు అరణ్యమధ్యమున మున్న సంగమేశ్వరాధీశుడు మాత్రము అల్లావుద్దీనుకు లొంగక స్వాతంత్ర్యమును ప్రకటించెను అతని నణచుటకు అల్లావుద్దీన్ దిలావరుఖాను అను సర్దారుని సైన్యము నిచ్చి పంపెను ఈపోరాటమున సంగమేశ్వరాధీశుడు ఓడి తనకుమార్తెను సుల్తానునకిచ్చి సంధి చేసికొనెను సుల్తాను ఈమెను వలచి పెద్దరాణిని ఉపేక్షించెను మహారాణి మాలికే-జహన్ ఆగా జేనబ్ నకు ఈమెపై ఈర్ష్య జనించి తన తండ్రిఅయిన నాసిర్ ఖానుఫరూక్ నకు తన భర్త తనను అవమాన పరచెనని కబురు పంపెను నాసిర్ ఖాన్ ఫరూకు ఖాందేశమునకు నవాబు తన కుమార్తె బాధను గమనించి నాసిర్ ఖాను గుజరాతుసుల్తాను గొండ్వాపాలకులగు హిందూ సర్దార్ల సాయముతో బహమనీ వశమందున్న బేరారును ఆక్రమించెను అల్లావుద్దీన్ ఈవిషయమును విని క్రుద్ధుడై

నాసిర్ ఖానును శిక్షించుటకు తన సైన్యాధ్యక్షుడగు ఖలీఫ్ హస్సన్ మల్లిక్ ఉత్ తుజ్జారును గొప్ప సైన్యముతో పంపెను తుజ్జార్ ఖాందేష్ తిరుగుబాటు సైన్యములను రోనేఖేర్ ఘాట్ నొద్దను లాలింగ్ అను చోటను ఎదుర్కొని వారల పూర్తిగా నోడించెను

రెండవ దేవరాయలు తన సైన్యములు తరచు బహమనీ లతో జరపు యుద్ధములందు ఓటమికి గల కారణముల అన్వేషింప సాగెను బహమనీ సైన్యముల విజయమునకు కారణము వారి సైన్యములయందలి మునల్మానులు ఆరితేరిన అశ్వికులగుటయు ధనుర్విద్యయందు ప్రవీణులౌట వలన గెలుపు వారికే చెందుచున్నదనియు తెలిసికొనెను అంతట దేవరాయలు తన సైన్యమునందు మునల్మానులను చేర్చుకొను టయే కాక వారలు ప్రార్థన చేయుటకు ఒక మసీదును కూడ నిర్మింప జేసెను ఖురాను గ్రంథమును తన సింహాసనమునకు ముందు ఉంచునట్లు ఆజ్ఞాపించెను ఇట్లు రాయలు చేయుట వలన మునల్మానులు సంకోచములేక ఖురాను నిమిత్తమైనను దర్బారు మర్యాదల పాటించెదరు అను అభిప్రాయము కలిగి యుండెను

రాయలు క్రొత్తగా సమకూర్చుకొనిన ఈ సైన్యముతో 1443 వ సం॥ న తుంగభద్రను దాటి రాయచూరు ముదుగల్లు కోటల నాక్రమించి కృష్ణను సమీపించెను బహమనీ సైన్యములు రాయల సైన్యముల అరికట్టినవి ముమ్మరముగా జరిగిన ఈ యుద్ధమునందు విజయము బహమనీలకే దక్కినట్లు మునల్మాను చారిత్రకులు వ్రాసిరి బహమనీ విజయనగర యుద్ధములందు ఎల్లప్పుడును విజయము మునల్మానులకే వరించెనని వ్రాయుట వీరికి పరిపాటి విజయనగర సైనికులు పెక్కురు ముద్గల్లు దుర్గమునందు తల దాచుకొనిరి తరువాత జరిగినసంధి షరతులననుసరించి రాయలు కృష్ణా తుంగభద్రల అంతర్వేదిని బహమనీ సుల్తానునకు వదలి ఇదివరకు తాను ఇయ్యవలసిన కప్పమును బకాయిలతో సహా సుల్తానునకు చెల్లించుటకు ఒప్పుకొనెను

తెలంగాణాకు పాలకుడుగా అల్లావుద్దీను తమ్ముడగు మహమ్మదుఖాను నియమితుడైనటుల ఇదివరలో చెప్పబడినది కాని సుల్తానుఅల్లావుద్దీను రాజ్య పాలన చివర కాలమునందు అనేక విద్వేష శక్తులు విజృంభించి తెలంగాణాలోని శాంతి భద్రతలకు ముప్పుతెచ్చినవి భోనగిరిజాగీరునకు పాలకుడుగా నియమితుడైన సంజరుఖాను నిరాయుధులైన హిందువులను హింసి పసాగెను బాలకొండను పాలించు సికిందరుఖాను లేవ దీసిన విప్లవమువలన తెలంగాణాలోని పరిస్థితులు అదుపు తప్పినవి సికిందరుఖాను అంతటితో ఊరుకొనక మాళవ దేశమును పాలించు మహమ్మదుఖిల్జీ సహాయముతో తెలంగాణము నంతను స్వాధీన పరచుకొన కోరెను సికిందరుఖానుకు చేదోడు వాదోడుగ అల్లావుద్దీను సోదరుడును రాచకొండ పాలకుడును అయిన మహమ్మదుఖాను గూడ విప్లవమున పాల్గొనినట్లు తెలియ వచ్చినది ఈతరుణమున అల్లావుద్దీను స్వయముగ తెలంగాణమునందలి అల్లరుల నణచుటకు 1455 ప్రాంతము తెలంగాణమును చేరెను అల్లావుద్దీను తన వజీరగు మహమ్మదుగావమని బాలకొండ దుర్గమును ముట్టడికి పంపెను ; తాను స్వయముగా మాళవ సుల్తాను సైన్యమును అరికట్టుటకు పూనెను మాళవ సుల్తానగు మహమూదుఖిల్జీ భయభ్రాంతుడై సుల్తాను సేనలనెదిరింప జాలక మాళవమునకు వెను దిరిగెను ఇట్టి పరిస్థితులలో తెలంగాణలోని వెలములు ఈ కుట్రయందు పాల్గొనక సుల్తానునకు విధేయులుగా నుండి తిరిగి తెలంగాణ మంతయు సుల్తానునకు లోబడునట్లు సహాయము చేసిరి అల్లావుద్దీనునకు దేవరకొండ ప్రభువగు లింగమనేడు సహచరుడుగా నుండి విజయ పరంపరల సమకూర్చుట వెలుగోటివారి వంశావళియందు ప్రశంసింప బడినది లింగమనేడును అతని అనుచరులగు వెలమవారును తిరుగుబాటుదారులను అణచివైచిరి సబ్బినాడు (కరీనగర ప్రాంతము)ను పాలించు సికిందరుఖానుకు విప్లవకారులతో కలిసియుండుట వలన అతనిని సబ్బినాడునుండి తరుమగొట్టిరి భోనగిరి దుర్గము సంజరుఖాను చేతులనుండి జారి విప్లవకారుల వశమైనది తిరిగి అదురమును ఎవరు పరచుకొను సమయమున "ధీరుడై యల్లావుద్దీను సురధానుతో నెమ్మిగా భువనాద్రి నెక్కినాడు" (వె వంశా పుట 49, అని లింగమనేడు ప్రశంసింపబడినాడు

ఒక పట్టున భువనగిరి దుర్గము విప్లవకారులనుండి వశము గొనుట దుర్ఘటమైనది దానిని సాధించు నిమిత్తము సుల్తాను స్వయముగా లింగమనేడును అతని అనుచరులును వెంటరాగా దుర్గమును ముట్టడించెను కోట గోడలను సుల్తానుతో కూడి లింగమనేడు అతని అనుచరులును ఎక్కి శత్రువులను తరిమి విజయము నొందిరి ఇంత సహాయము విశ్వాసములు లింగమనేడు ప్రదర్శించినప్పటికిని సుల్తానువలన అణుమాత్రము లాభ

ము ను ఇతడు పొందలేదు సుల్తాను అల్లావుద్దీను అదివరలో తగలిన గాయములకు తిరుగుటకు వీలులేక వ్రణముచే బాధపడి 8 ఏప్రిల్ 1458 సం॥న లోకాంతర గతుడయ్యెను

ఈ సుల్తానునకు స్వమతమునందు గాఢమైన భక్తి యుండెను దానికి తోడు అన్యమత ద్వేషము ఇతనియందు అధికము ఇతడు పెక్కు హిందూదేవాలయములను విధ్వంసము చేసెను మసీదులకు పెక్కు సౌకర్యములు కలించెను ఇతడు ఇస్లాము ధర్మ ప్రకారము ఆరంభమున మద్యపాన విముఖుడుగ ఉండియు తరువాత సురాపాన లోలుడయ్యెను ఇతడు చేసిన సత్కార్యములలో పేర్కొనదగినది వ్యాధి పీడితులకు చికిత్స చేయించుటకై ధర్మాసుపత్రిని నిర్మించుట ఈ సుల్తాను విదేశీ పక్షమువారిని అభిమానించెను

కొ వెం



# ముఖ్యనామ సూచిక

న



ప - ఫ

## వ



## శ

## హ





అనుబంధము ౨

# ACKNOWLEDGEMENTS


We desire to gratefully record our thanks to the following institutions and individuals who helped us in various ways in the compilation of this Volume

1 The Sangrah Andhra Vignana Kosa Samiti for lending the use of their Library and for supplying blocks etc

2 Andhra Pradesh Government – (Revenue) for issuing Circular to the District Collectors for helping in the enumeration of Villages

3 The Director Bureau of Statistics and Economics for issuing a Circular to the District Statistical Officers to help the enumerators

4 Andhra Pradesh Government (G A D) for issuing Circular to the District Public Relations Officers to undertake enumeration of Villages

5 The administrative Officer Singareni Collieries Co Ltd for his generous instructions to the General Managers of Kothagudem & Bellampalli to render all assistance to our enumerators

6 The General Managers of the State Bank of India Hyderabad and Andhra Bank Ltd Hyderabad for issuing suitable instructions to the branches to help enumerators in the collection of data

7 The State Central Library, Archeological Survey of India South Eastern Circle and the Osmania University Library for having given accessibility of reference to our Research Assistants

# ఆంధ్ర రచయితల సంఘ
# ప్రచురణములు

| | | |
|---|---|---|
| 1 | ఆంధ్రదేశ చరిత్ర — భూగోళ సర్వస్వము ముఖద్వారము | 10—00 |
| 2 | పండితరాజ పంచామృతము | 3—00 |
| 3 | రామాయణ విశేషములు | 4—00 |
| 4 | సిద్ధేశ్వర చరిత్రము | 6—00 |
| 5 | ప్రసన్న రాఘవ నాట్యప్రబంధము | 6—00 |
| 6 | అహోబల పండితీయము | 16—00 |
| 7 | సింహగిరి వచనములు | 5—00 |
| 8 | కావ్యానుశీలనము | 4—00 |

*For copies apply to :*

**PROF K LAKSHMIRANJANAM,** ***M A***
***PRESIDENT***
**ANDHRA WRITERS ASSOCIATION**
**VIDYANAGAR HYDERABAD-44 A P**